# 1. సూరహ్ అల్-ఫాతి'హా

سورة الفاتحة

ఈ సూరహ్‌తో దివ్య ఖుర్ఆన్ ప్రారంభమవుతుంది. కావున దీనికి **ఆరంభ సూరహ్** (ఫాతి'హతుల్-కితాబ్ ) అనే పేరు ఇవ్వబడింది. ఇది **మక్కా** సూరహ్. ఇందులో **7 ఆయతులు** ఉన్నాయి. నమా'జ్‌లోని ప్రతి రక'అత్ ప్రారంభంలో ఇది విధిగా పఠింపబడుతుంది, కాబట్టి ఇది తరచుగా పఠింపబడే **ఏడు ఆయతులు** (అస్-సబా' అల్-మసా'ని), అని కూడా అనబడుతుంది. దీనికి వేరే పేర్లు కూడా ఉన్నాయి దివ్యగ్రంథ సారం (ఉమ్ముల్-కితాబ్), ప్రశంసల సూరహ్ (సూరతుల్-'హమ్ద్), ఖుర్ఆన్ పునాది (అసా'స్' అల్-ఖుర్ఆన్), ఉత్తమమైన ఖుర్ఆన్ (అల్-ఖుర్ఆన్ అల్-'అ'జీమ్), స్వస్థత (అష్షిఫా'), ప్రార్థన (అ'స్సలాహ్) మొదలైనవి. సూరాహ్‌లకు ఇవ్వబడిన పేర్లు దివ్యఖుర్ఆన్ యొక్క భాగాలు కావు. ఇవి సూరాహ్‌లను గుర్తించటానికి ఇవ్వబడిన పేర్లు మాత్రమే.

దైవప్రవక్త ('స'అస) ప్రవక్తగా ఎన్నుకోబడిన తరువాత, మదీనా మునవ్వరాకు వలసపోక ముందు 13సంవత్సరాలలో అవతరింపజేయబడిన సూరాహ్‌లన్నీ మక్కా సూరాహ్‌లు మరియు వలస పోయిన తరువాత అవతరింపజేయబడిన సూరాహ్‌లన్నీ మదీనా సూరాహ్‌లు అనబడతాయి. అవి ఏ ప్రాంతంలో అవతరింపజేయబడినా సరే!

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ ١

**1.** అనంత కరుణామయుడు, అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్[1] పేరుతో.[2]

---

**1.** **అల్లాహ్** సుబ్'హానహు వ తా'ఆలా (సు.తా.): అనేది సర్వసృష్టికర్త, మహోన్నతుడు, సర్వపోషకుడు అయిన విశ్వప్రభువు యొక్క పేరు. ఈ పేరుతో ఆయనను తప్ప మరెవ్వరినీ పిలువరాదు. దీనికి సరిసమానమైన పదం వేరే భాషలలో లేదు, ఫార్సీ భాషలోని 'ఖుదా అనే పదం తప్ప. ఇది ఒక ప్రత్యేకమైన విశేషపదం. ఈ పదానికి బహువచనం గానీ, స్త్రీ లింగం గానీ లేవు. అల్లాహ్ (సు.తా.) యొక్క స్పష్టమైన నిర్వచనం కొరకు చూడండి, సూరహ్ అల్-ఇ'ఖ్లా'స్ (112).

**2.** చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయంలో, ఈ ఆయత్, సూరహ్ అల్-ఫాతి'హా యొక్క భాగం. సూరహ్ అన్-నమ్ల్ (27:30)లో ఇది ఒక ఆయత్ రూపంలో కూడా ఉంది. ప్రతి మంచి పనికి ముందు బిస్మిల్లా హిర్ర'హ్మా నిర్ర'హీమ్, చదవాలి. ఉదా: భోజనానికి ముందు, వ'దూ' చేసేటప్పుడు.

ఖుర్ఆన్ పఠించటం ప్రారంభించేటప్పుడు బిస్మిల్లా హిర్ర'హ్మా నిర్ర'హీమ్‌కు ముందు అ'ఊజు' బిల్లాహి మినష్షయ్'తా నిర్రజీమ్ - శపించ(బహిష్కరించ)బడిన షైతాన్ నుండి రక్షించబడటానికి నేను అల్లాహ్ (సు.తా.) శరణు వేడుకుంటున్నాను - తప్పక చదవాలి.

ٱلْحَمْدُ لِلَّهِ رَبِّ ٱلْعَٰلَمِينَ ۝٢

ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ ۝٣

مَٰلِكِ يَوْمِ ٱلدِّينِ ۝٤

2. సర్వలోకాలకు ప్రభువైన[1] అల్లాహ్ మాత్రమే సమస్త స్తోత్రాలకు అర్హుడు.[2]

3. అనంత కరుణామయుడు, అపార కరుణాప్రదాత.[3]

4. తీర్పు దినానికి[4] స్వామి.[5]

---

(చూడండి అల్లాహుతా'ఆలా ఆదేశం, 16:98). దివ్యఖుర్ఆన్ మానవులకు మార్గదర్శిని మరియు హృదయాలకు స్వస్థతనిచ్చేది. షై'తాన్ మార్గభ్రష్టత్వానికి మరియు దురాచారాలకు ప్రోత్సహిస్తాడు. కావున శపించ(బహిష్కరించ)బడిన షై'తాన్ మరియు అతడి అనుచర మూకలు రేకెత్తించే కలతల నుండి కాపాడుకోవటానికి అల్లాహుతా'ఆలా శరణు వేడుకోవాలి.

ఈ ఇస్తి'ఆజ'హ్ దివ్యఖుర్ఆన్ యొక్క భాగం కాదనటంలో ఇస్లామీయ శాస్త్రవేత్తలు అందరూ ఏకీభవిస్తున్నారు. కాబట్టి ఇది దివ్యఖుర్ఆన్‌లో వ్రాయబడలేదు.

1. రబ్బున్: ప్రభువు, అనే పదానికి తెలుగులో సరితూగే పదం లేదు. దీనికి సర్వలోకాల ఏకైక **ప్రభువు**, వాటి సృష్టికర్త, పోషకుడు, సంరక్షకుడు, యజమాని, సర్వవర ప్రదాత అనే అర్థాలున్నాయి. చాలా వరకు తెలుగు అనువాదాలలో వాడినట్లు ఈ అనవాదంలో కూడా ప్రభువు అనే పదమే వాడబడింది.

2. 'హదీస్'లో వచ్చింది: లా ఇలాహ ఇల్లల్లాహ్ - అల్లాహ్ (సు.తా.) తప్ప మరొక ఆరాధ్యదేవుడు లేడు. అతి ఉత్తమమైన జి'క్ర్ (Meditation), జ్ఞాపిక, స్మరణ, ధ్యానం మరియు అల్-'హమ్దులిల్లాహ్ - సమస్త స్తోత్రాలకు అర్హుడు అల్లాహుతా'ఆలా మాత్రమే, అతి ఉత్తమమైన దు'ఆ' - ప్రార్థన (తిర్మిజీ', నసాయీ' మొదలైన వారు).

3. **అర్-ర'హ్మాన్: అనంత కరుణామయుడు**, అంటే ఇహలోకంలో భేదభావాలు లేకుండా అందరికీ ఎల్లప్పుడు కరుణను పంచేవాడు. **అర్-రహీమ్:** అంటే పరలోకంలో కేవలం ఆయనను విశ్వసించిన వారికే **కరుణాప్రదాత**, అని కొందరు వ్యాఖ్యానించారు. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

4. యౌమద్దీన్: తీర్పుదినం, అంటే పునరుత్థానదినం. ఆ దినపు యజమాని కేవలం ఆ ఒకే ఒక్క ఆరాధ్య దేవుడు అల్లాహ్ (సు.తా.) మాత్రమే. ఆ రోజు ప్రతివానికి, తన కర్మలకు తగిన ప్రతిఫలం ఇవ్వబడుతుంది. ఎవ్వరికీ ఏ విధమైన అన్యాయం జరుగదు. ఆ రోజు, అల్లాహుతా'ఆలా అనుమతించిన వాడు తప్ప మరెవ్వరికీ మాట్లాడే హక్కు ఉండదు. వారు దైవదూతలు గానీ లేక ప్రవక్త ('అలైహిమ్ స.)లు గానీ కావచ్చు. వారు అల్లాహ్ (సు.తా.) అనుమతించిన వారి కొరకు మాత్రమే సిఫారసు చేస్తారు.

5. మాలిక్: Master, Owner, ప్రతిదాని నిజ **స్వామి**, యజమాని, కర్త, పెద్ద, నాయకుడు అనే అర్థాలున్నాయి. చూడండి, 20:114 వ్యాఖ్యానం 3.

إِيَّاكَ نَعۡبُدُ وَإِيَّاكَ نَسۡتَعِينُ ٥

5. మేము నిన్నే ఆరాధిస్తున్నాము మరియు నీ సహాయాన్నే అర్థిస్తున్నాము.[1]

ٱهۡدِنَا ٱلصِّرَٰطَ ٱلۡمُسۡتَقِيمَ ٦

6. మాకు ఋజుమార్గం[2] వైపునకు మార్గదర్శకత్వం చేయి.

---

1. 'ఇబాదతున్: ఆరాధన, అంటే ఒకరి ప్రసన్నత కొరకు అత్యంత వినయ విధేయత, నమ్రత, మరియు భీతిని ప్రదర్శించటం. ఇది కేవలం అల్లాహ్ (సు.తా.) కొరకు మాత్రమే తగినది. మానవుడు కేవలం ఆ ఒకే ఒక్క ఆరాధ్య దైవం అయిన అల్లాహుతా'ఆలాను మాత్రమే ఆరాధించాలి. మరియు ప్రతి విషయం, ప్రతి కార్యంలో కేవలం ఆయన సహాయాన్నే అర్థించాలి.

*తౌ'హీద్:* మూడు విధాలు.

*(1)* తౌ'హీద్ అర్-రుబూబియ్యహ్: ఏకైక ప్రభువు అల్లాహ్ (సు.తా.) అని విశ్వసించటం. సర్వాన్ని సృష్టించినవాడు, దాని అధిపతి, సర్వ వ్యవహారాలను నడిపించేవాడు మరియు పోషకుడు కేవలం ఆ ఏకైక ప్రభువు అయిన అల్లాహుతా'ఆలా మాత్రమే అని, విశ్వసించడం. కాని బహుదైవారాధకులు (ముష్రికులు) దీనిని నమ్మి కూడా ఆయనకు సాటి కల్పిస్తున్నారు. ఎంత తప్పుడు మార్గంలో పడి ఉన్నారు వారు! చూడండి, 10:31, 39:38, 23:84-89.

*(2)* తౌహీద్ అల్-'ఉలూహియ్యహ్: ప్రతి విధమైన ఆరాధనకు అర్హుడు కేవలం అల్లాహ్ (సు.తా.) మాత్రమే. ఆరాధన అంటే అల్లాహుతా'ఆలా ప్రీతి లేక భయం కొరకు చేసే ప్రతి కార్యం. కావున, నమా'జ్, ఉపవాసం, 'జకాత్ మొదలైనవి, ఆ గొప్ప శక్తి (అల్లాహుతా'ఆలా) ప్రీతి కొరకే చేయటం. ఆరాధనలన్నింటికీ అర్హుడు, కేవలం అల్లాహ్ (సు.తా.) అని విశ్వసించటం.

*(3)* తౌహీద్ అల్-అస్మా' వ స్సిఫాత్: అల్లాహుతా'ఆలా పేర్లు మరియు గుణవిశేషాల ఏకత్వం. ఖుర్ఆన్ మరియు 'హదీస్'లలో వివరించబడిన అల్లాహ్ (సు.తా.) పేర్లు మరియు గుణవిశేషాలను ఏ విధమైన మార్పు చేయకుండా విశ్వసించడం. అల్లాహుతా'ఆలా తప్ప ఇతరులను ఈ గుణవిశేషాలతో సంబోధించరాదు. అల్లాహ్ (సు.తా.) మరియు ఆయన ప్రవక్త ('స'అస) వివరించిన పేర్లు మరియు గుణవిశేషాలతో తప్ప ఇతర పేర్లతో ఆయనను సంబోధించరాదు.

2. ఋజుమార్గం అంటే, అంతులేని సర్వ సుఖసంతోషాలుగల శాశ్వత స్వర్గాన్ని పొందే మార్గం. దానిని పొందటానికి మానవుడు తన ఆరాధనను కేవలం అల్లాహ్(సు.తా.)కే ప్రత్యేకించుకొని, సత్కార్యాలు చేయాలి. అల్లాహుతా'ఆలాను తప్ప మరెవ్వరినీ ఆరాధ్యదైవాలుగా చేసుకోరాదు.

صِرَٰطَ ٱلَّذِينَ أَنۡعَمۡتَ عَلَيۡهِمۡ غَيۡرِ ٱلۡمَغۡضُوبِ عَلَيۡهِمۡ وَلَا ٱلضَّآلِّينَ ٧

7. నీవు అనుగ్రహించిన[1] వారి మార్గం మాత్రమే (చూపు); నీ ఆగ్రహానికి[2] గురి అయిన వారి (మార్గం కానీ) లేక మార్గభ్రష్టులైన వారి (మార్గం కానీ) కాదు!

*****

1. అల్లాహ్ (సు.తా.) అనుగ్రహించిన వారి మార్గం అంటే, దైవప్రవక్తల, వారిని అనుసరించిన సత్పురుషుల మరియు పుణ్యపురుషుల మార్గం. వారు సన్మార్గం పొంది, దానిపైననే నడిచారు. అదే అల్లాహుతా'ఆలాకు విధేయులవటం (ఇస్లాం). అదే స్వర్గానికి అర్హులు చేసే మార్గం. అల్లాహ్ (సు.తా.) ఆదేశం: "*మరియు ఎవరు అల్లాహుతా'ఆలాకు, మరియు ప్రవక్తకు విధేయులై ఉంటారో, అలాంటి వారు అల్లాహ్ (సు.తా.) అనుగ్రహం పొందిన ప్రవక్తలతోనూ, సత్యవంతులతోనూ, అల్లాహుతా'ఆలా ధర్మం కొరకు ప్రాణాలు కోల్పోయిన అమర వీరు(షహీద్)లతోనూ, సద్వర్తనులతోనూ చేరిఉంటారు. మరియు అలాంటి వారి సాంగత్యం ఎంతో మేలైనది.*" (4:69).

2. మ'గ్ధూబి 'అలైహిమ్: అల్లాహ్ (సు.తా.) ఆగ్రహానికి గురైనవారు అంటే - యూదులు. ఎందుకంటే వారు బుద్ధిపూర్వకంగా సన్మార్గాన్ని త్యజించారు. దివ్యసూచనలను మార్చారు. 'ఉ'జైర్ ('అ.స.)ను, అల్లాహుతా'ఆలా కుమారుడు అన్నారు. తమ విద్వాంసుల (అ'హ్బారు)లకు ధర్మసమ్మతం ('హలాల్) మరియు నిషిద్ధం ('హరామ్) చేసే హక్కు ఉందన్నారు.

'దాల్లీన్: మార్గభ్రష్టులైనవారు - అంటే క్రైస్తవులు. ఎందుకంటే వారు 'ఈసా మసీ'హ్ (ఏసూ క్రీస్తు 'అ.స.)ను అల్లాహ్ (సు.తా.) కుమారుడు అని కొందరు మరియు ముగ్గురు ఆరాధ్య దైవా (Trinity)లలో ఒకరు అని మరికొందరు అన్నారు, (ఫ'త్హ్ అల్-ఖదీర్).

**ఆమీన్:** ఓ అల్లాహ్ (సు.తా.)! మా దు'ఆ' (ప్రార్థన)ను అంగీకరించు. సూరహ్ అల్-ఫాతి'హా తరువాత ఆమీన్ అనటాన్ని దైవప్రవక్త ('స'అస) ఎంతో ప్రాధాన్యత నిచ్చారు మరియు ఎంతో ఉత్తమమైనదని అన్నారు. దీనిని ముందు నిలిచి నమా'జ్ చేయించే వాడు (ఇమామ్) మరియు ఇమామ్ వెనుక నమా'జ్ చేసేవారు (ముఖ్త'దీలు) అందరూ అనాలి. పెద్ద స్వరంతో చదివే నమా'జ్‌లలో పెద్ద స్వరంతో అనాలి (ఇబ్నె-మాజా, ఇబ్నె-కసీ'ర్).

## 2. సూరహ్ అల్-బఖరహ్

## سُورَةُ البَقَرَةِ

ఈ సూరహ్‌లో **ఆవు** యొక్క ప్రస్తావన **67-73 ఆయతులలో** వచ్చింది. కావున ఇది, **ఆవు** ప్రస్తావన ఉన్న సూరహ్ అని అనబడుతుంది. ఇది **మదీనాలో** మొదటి రెండు సంవత్సరాలలో అవతరింపజేయబడింది. ఇందులో **286 ఆయతులున్నాయి**. ఆయత్ 255, ఆయతుల్ కుర్సీ అనబడుతుంది, ఆయత్ 281, చిట్టచివర అవతరింపజేయబడింది. ఆయత్ 282, ఆయత్ అద్దేన్ అనబడుతుంది. ఇది అన్నిటికంటే పెద్ద ఆయత్. ఏ ఇంట్లో ఈ సూరహ్ ప్రతిరోజూ చదువబడుతుందో, ఆ ఇంట్లో నుండి షై'తాన్ పారిపోతాడు. ('స. ముస్లిం). కొందరు ధర్మవేత్తల అభిప్రాయంలో దీనిలో వేయి వార్తలు, వేయి ఆజ్ఞలు మరియు వేయి నిషేధాజ్ఞలు ఉన్నాయి, (ఇబ్నె-కసీ'ర్).

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1.** అలిఫ్-లామ్-మీమ్.[1]

الٓمٓ ﴿١﴾

**2.** ఇది (ఈ ఖుర్ఆన్) ఒక దివ్య గ్రంథం; ఇందులో ఏమాత్రం సందేహంలేదు. దైవభీతి[2] గలవారికి ఇది మార్గదర్శకత్వము.

ذَٰلِكَ ٱلۡكِتَٰبُ لَا رَيۡبَۛ فِيهِۛ هُدٗى لِّلۡمُتَّقِينَ ﴿٢﴾

**3.** (వారికి) ఎవరైతే అగోచర యథార్థాన్ని[3] విశ్వసిస్తారో, నమా'జ్‌ను స్థాపిస్తారో[4] మరియు మేము ప్రసాదించిన జీవనోపాధి నుండి (మా మార్గంలో) ఖర్చుచేస్తారో;[5]

ٱلَّذِينَ يُؤۡمِنُونَ بِٱلۡغَيۡبِ وَيُقِيمُونَ ٱلصَّلَوٰةَ وَمِمَّا رَزَقۡنَٰهُمۡ يُنفِقُونَ ﴿٣﴾

---

**1.** ఈ అక్షరాలను ముఖ'త్త'ఆత్ అంటారు. ఈ అక్షరాల సముదాయం దివ్యఖుర్ఆన్ అద్భుత సూచనలలో ఒకటి. వాటి అర్థం, ఉద్దేశ్యం అల్లాహ్(సు.తా.)కు తప్ప మరెవ్వరికీ తెలియదు.

**2.** అల్-ముత్తఖీన్: దైవభీతి గలవారు, అంటే అల్లాహుతా'ఆలా యందు భయభక్తులు కలిగి ఆయన ఆదేశాలను అనుసరించేవారు.

**3.** 'గైబున్: అగోచర యథార్థం, అంటే, మానవ ఇంద్రియాలకు మరియు జ్ఞానానికి గోప్యంగా ఉన్న సత్యాలు. అంటేఅల్లాహ్(సు.తా.)ను దైవదూతలను ఆయన గ్రంథాలను, ఆయన ప్రవక్తలను, పునరుత్థానదినాన్ని, స్వర్గనరకాలను మొదలైన వాటిని విశ్వసించటం.

**4.** నమా'జ్ స్థాపించడం అంటే, ప్రతిదినము ఐదుసార్లు నిర్ణీత సమయాలలో అల్లాహ్ (సు.తా.), దైవప్రవక్త ము'హమ్మద్('స'అస)కు నేర్పిన విధంగా నమా'జ్ చేయడం. ('స'హీ'హ్ బు'ఖారీ, పు-1, 'హదీస్' నం. 702, 703, 704, 723, 786, 787).

**5.** 'జకాతున్: అంటే, ఒక సంవత్సరం వరకు జమ ఉన్న, ధన సంపత్తుల నుండి ప్రతి సంవత్సరం,

وَٱلَّذِينَ يُؤۡمِنُونَ بِمَآ أُنزِلَ إِلَيۡكَ وَمَآ أُنزِلَ مِن قَبۡلِكَ وَبِٱلۡأٓخِرَةِ هُمۡ يُوقِنُونَ ٤

4. మరియు ఎవరైతే (ఓ ము'హమ్మద్!) నీపై అవతరింప జేయబడిన దానిని (ఈ ఖుర్ఆన్‌ను)[1] మరియు నీకు పూర్వం అవతరింప జేయబడిన వాటినీ (దివ్య గ్రంథాలను) విశ్వసిస్తారో మరియు పరలోక జీవితాన్ని దృఢంగా నమ్ముతారో!

أُوْلَٰٓئِكَ عَلَىٰ هُدٗى مِّن رَّبِّهِمۡۖ وَأُوْلَٰٓئِكَ هُمُ ٱلۡمُفۡلِحُونَ ٥

5. అలాంటి వారే తమ ప్రభువు (చూపిన) సన్మార్గంలో ఉన్నవారు; మరియు అలాంటి వారే సాఫల్యం పొందేవారు.

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ سَوَآءٌ عَلَيۡهِمۡ ءَأَنذَرۡتَهُمۡ أَمۡ لَمۡ تُنذِرۡهُمۡ لَا يُؤۡمِنُونَ ٦

6. నిశ్చయంగా, సత్యతిరస్కారులను (ఓ ము'హమ్మద్!) నీవు హెచ్చరించినా, హెచ్చరించక పోయినా ఒకటే, వారు విశ్వసించే వారు కారు.

خَتَمَ ٱللَّهُ عَلَىٰ قُلُوبِهِمۡ وَعَلَىٰ سَمۡعِهِمۡۖ وَعَلَىٰٓ أَبۡصَٰرِهِمۡ غِشَٰوَةٞۖ وَلَهُمۡ عَذَابٌ عَظِيمٞ ٧

7. అల్లాహ్ వారి హృదయాల మీద మరియు వారి చెవుల మీద ముద్రవేశాడు.[2] మరియు వారి కన్నుల మీద తెరపడి ఉన్నది. మరియు వారి కొరకు ఘోరమైన శిక్ష ఉంది.

---

ఒక ప్రత్యేక శాతం విధిగా ఇవ్వవలసిన దానం. ఇది ఇస్లాం ధర్మంలోని ఐదు విధులలో ఒకటి. 'జకాత్, ముస్లిం సమాజపు ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచటానికి, సమాజంలో ఎవ్వడు కూడా నిరాధారంగా లేకుండా ఉండటానికి నియమించబడిన, ఒక ఉత్తమమైన ధార్మిక మరియు సాంఘిక నియమం, ('స'హీ'హ్ బు'ఖారీ, పు. 2, అధ్యాయం-24).

1. 'అబ్దుల్లాహ్ ఇబ్నె-'ఉమర్ (ర'ది.'అ.) కథనం, మహాప్రవక్త ('స'అస) ప్రవచనం: ''ఇస్లాం ఈ ఐదు ప్రధాన సిద్ధాంతాలపై ఆధారపడి ఉంది. అవి: '1. అల్లాహ్ (సు.తా.) తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు మరియు ము'హమ్మద్ ('స'అస), అల్లాహుతా'ఆలా యొక్క ప్రవక్త అనే ధృఢవిశ్వాసం ప్రకటించటం, 2. రోజుకు ఐదుసార్లు విధిగా నమా'జ్ చేయటం, 3. విధిదానం ('జకాత్) చెల్లించటం, 4. రమ'దాన్ నెలలో ఉపవాసముండటం, 5. శారీరక మరియు ఆర్థిక స్తోమత ఉంటే జీవితంలో ఒకసారి 'హజ్జ్ చేయటం.' '' ('స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-1, 'హదీస్' నం.7).

2. ఇది వారి సత్యతిరస్కారానికి ఫలితంగా. అల్లాహ్ (సు.తా.) బలవంతంగా ఎవరిని కూడా తప్పుడు మార్గంలో పడవేయడు, (చూడండి, 2:26 వ్యాఖ్యానం 1).

وَمِنَ ٱلنَّاسِ مَن يَقُولُ ءَامَنَّا بِٱللَّهِ وَبِٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِ وَمَا هُم بِمُؤۡمِنِينَ ٨

**8**. మరియు ప్రజలలో కొందరు: "మేము అల్లాహ్‌నూ మరియు అంతిమ దినాన్నీ విశ్వసించాము." అని, అనే వారున్నారు. కానీ (వాస్తవానికి) వారు విశ్వసించేవారు కారు.

يُخَٰدِعُونَ ٱللَّهَ وَٱلَّذِينَ ءَامَنُواْ وَمَا يَخۡدَعُونَ إِلَّآ أَنفُسَهُمۡ وَمَا يَشۡعُرُونَ ٩

**9**. వారు తాము అల్లాహ్‌నూ మరియు విశ్వసించిన వారినీ మోసగిస్తున్నారని (అనుకుంటున్నారు); కానీ వారు తమను తాము తప్ప మరెవ్వరినీ మోసగించటం లేదు, కాని వారది గ్రహించటం లేదు!

فِي قُلُوبِهِم مَّرَضٞ فَزَادَهُمُ ٱللَّهُ مَرَضٗاۖ وَلَهُمۡ عَذَابٌ أَلِيمُۢ بِمَا كَانُواْ يَكۡذِبُونَ ١٠

**10**. వారి హృదయాలలో రోగముంది.[1] కాబట్టి అల్లాహ్ వారి రోగాన్ని మరింత అధికం చేశాడు. మరియు వారు అసత్యం పలుకుతూ ఉండటం వలన, వారికి బాధాకరమైన శిక్ష ఉంది.

وَإِذَا قِيلَ لَهُمۡ لَا تُفۡسِدُواْ فِي ٱلۡأَرۡضِ قَالُوٓاْ إِنَّمَا نَحۡنُ مُصۡلِحُونَ ١١

**11**. మరియు: "భువిలో కల్లోలం[2] రేకెత్తించకండి." అని వారితో అన్నప్పుడు, వారు: "మేము సంస్కర్తలము మాత్రమే!" అని అంటారు.

أَلَآ إِنَّهُمۡ هُمُ ٱلۡمُفۡسِدُونَ وَلَٰكِن لَّا يَشۡعُرُونَ ١٢

**12**. జాగ్రత్త! నిశ్చయంగా, (భువిలో) కల్లోలం రేకెత్తిస్తున్న వారు వీరే, కాని వారది గ్రహించటం లేదు.

وَإِذَا قِيلَ لَهُمۡ ءَامِنُواْ كَمَآ ءَامَنَ ٱلنَّاسُ قَالُوٓاْ أَنُؤۡمِنُ كَمَآ ءَامَنَ ٱلسُّفَهَآءُۗ أَلَآ إِنَّهُمۡ هُمُ ٱلسُّفَهَآءُ وَلَٰكِن لَّا يَعۡلَمُونَ ١٣

**13**. మరియు: "ఇతర జనులు విశ్వసించినట్లు మీరూ విశ్వసించండి." అని, వారితో అన్నప్పుడు, వారు: "మూర్ఖులు విశ్వసించినట్లు మేమూ విశ్వసించాలా?" అని జవాబిస్తారు. జాగ్రత్త! వాస్తవానికి వారే మూర్ఖులు, కాని వారికది తెలియదు.

---

**1**. అంటే సత్యాన్ని నమ్మలేకపోవటం మరియు దుర్బుద్ధి.

**2**. ఫసాద్: అంటే కల్లోలం, సంక్షోభం, ఉపద్రవం, అశాంతి, కలహాలు అనే అర్థాలున్నాయి.

**14**. మరియు విశ్వాసులను కలిసినపుడు, వారు: "మేము విశ్వసించాము." అని అంటారు. కానీ, తమ షైతానుల (దుష్ట నాయకుల) దగ్గర ఏకాంతంలో ఉన్నపుడు వారు: "నిశ్చయంగా, మేము మీతోనే ఉన్నాము కేవలం (వారి) ఎగతాళి చేస్తున్నాము." అని అంటారు.

**15**. అల్లాహ్ వారి ఎగతాళి చేస్తున్నాడు మరియు వారి తలబిరుసుతనాన్ని హెచ్చిస్తున్నాడు, (అందులో వారు) అంధులై తిరుగుతున్నారు;

**16**. ఇలాంటి వారే, సన్మార్గానికి బదులుగా దుర్మార్గాన్ని కొనుక్కున్న వారు; కాని వారి బేరం వారికి లాభదాయకం కాలేదు మరియు వారికి మార్గదర్శకత్వమూ దొరకలేదు.

**17**. వారి ఉపమానం[1] ఇలా ఉంది:[2] ఒక వ్యక్తి అగ్నిని వెలిగించగా, అది పరిసరాలను ప్రకాశింపజేసిన తరువాత అల్లాహ్ వారి వెలుగును తీసుకొని వారిని అంధకారంలో విడిచిపెట్టడం వల్ల వారు ఏమీ చూడలేక పోతారు.

وَإِذَا لَقُوا۟ ٱلَّذِينَ ءَامَنُوا۟ قَالُوٓا۟
ءَامَنَّا وَإِذَا خَلَوْا۟ إِلَىٰ شَيَـٰطِينِهِمْ
قَالُوٓا۟ إِنَّا مَعَكُمْ إِنَّمَا نَحْنُ
مُسْتَهْزِءُونَ ١٤
ٱللَّهُ يَسْتَهْزِئُ بِهِمْ وَيَمُدُّهُمْ فِى
طُغْيَـٰنِهِمْ يَعْمَهُونَ ١٥
أُو۟لَـٰٓئِكَ ٱلَّذِينَ ٱشْتَرَوُا۟ ٱلضَّلَـٰلَةَ
بِٱلْهُدَىٰ فَمَا رَبِحَت تِّجَـٰرَتُهُمْ وَمَا
كَانُوا۟ مُهْتَدِينَ ١٦
مَثَلُهُمْ كَمَثَلِ ٱلَّذِى ٱسْتَوْقَدَ نَارًا
فَلَمَّآ أَضَآءَتْ مَا حَوْلَهُۥ ذَهَبَ ٱللَّهُ
بِنُورِهِمْ وَتَرَكَهُمْ فِى ظُلُمَـٰتٍ لَّا
يُبْصِرُونَ ١٧

---

**1**. మస'లున్: అంటే ఉపమానం, పోలిక, సాదృశ్యం, దృష్టాంతం అనే అర్థాలున్నాయి.

**2**. 'అబ్దుల్లాహ్ బిన్-మస్'ఊద్ (ర'ది.'అ.) కథనం (ఫ'త్హ్ అల్-ఖదీర్): మహా ప్రవక్త ('స'అస), మదీనాకు వచ్చిన తరువాత విశ్వసించినవారిలో కొందరు కాపట్యానికి లోనవుతారు. అంటే వారు ఇస్లాం వెలుగును పొందిన తరువాత దానిని విడిచి మరల అంధకారంలో చిక్కుకుపోతారు. ఆ విషయం ఈ విధంగా బోధించబడింది. ఒక వ్యక్తి రాత్రిలో ఎడారిలో మంట వెలిగించి కాపుకుంటాడు. అది వారి పరిసరాలను వెలిగిస్తుంది. కాని ఆ అగ్ని ఆరిపోగానే వారు మళ్ళీ అంధకారంలో చిక్కుకుంటారు. ఏమీ చూడలేక పోతారు. అదేవిధంగా బాహ్యంగా మాత్రమే ఇస్లాం స్వీకరించిన వారి హృదయాలు అంధకారంలో ఉండిపోతాయి. వారు ఇస్లాం వెలుగును పొందిన తరువాత కూడా అంధకారంలోనే ఉండిపోతారు.

صُمُّۢ بُكۡمٌ عُمۡيٌ فَهُمۡ لَا يَرۡجِعُونَ ١٨
أَوۡ كَصَيِّبٖ مِّنَ ٱلسَّمَآءِ فِيهِ
ظُلُمَٰتٞ وَرَعۡدٞ وَبَرۡقٞ يَجۡعَلُونَ
أَصَٰبِعَهُمۡ فِيٓ ءَاذَانِهِم مِّنَ ٱلصَّوَٰعِقِ
حَذَرَ ٱلۡمَوۡتِۚ وَٱللَّهُ مُحِيطُۢ بِٱلۡكَٰفِرِينَ
١٩
يَكَادُ ٱلۡبَرۡقُ يَخۡطَفُ أَبۡصَٰرَهُمۡۖ كُلَّمَآ
أَضَآءَ لَهُم مَّشَوۡاْ فِيهِ وَإِذَآ أَظۡلَمَ عَلَيۡهِمۡ
قَامُواْۚ وَلَوۡ شَآءَ ٱللَّهُ لَذَهَبَ بِسَمۡعِهِمۡ
وَأَبۡصَٰرِهِمۡۚ إِنَّ ٱللَّهَ عَلَىٰ كُلِّ شَيۡءٖ
قَدِيرٞ ٢٠
يَٰٓأَيُّهَا ٱلنَّاسُ ٱعۡبُدُواْ رَبَّكُمُ ٱلَّذِي
خَلَقَكُمۡ وَٱلَّذِينَ مِن قَبۡلِكُمۡ لَعَلَّكُمۡ
تَتَّقُونَ ٢١

**18**. (వారు) చెవిటివారు, మూగవారు, గ్రుడ్డి వారు, ఇక వారు (ఋజుమార్గానికి) మరలి రాలేరు.

**19**. లేక, (మరొక ఉపమానం): ఆకాశం నుండి ఘోరంగా వర్షం కురుస్తున్నది; చిమ్మచీకట్లలో ఉరుములు, మెరుపులు మెరుస్తున్నాయి. ఆ ఉరుముల భీకరధ్వని విని, మృత్యుభయంచేత వారు తమ వ్రేళ్ళను చెవులలో దూర్చుకుంటున్నారు. మరియు అల్లాహ్ సత్యతిరస్కారులను అన్ని వైపుల నుండి ఆవరించి ఉన్నాడు.[1]

**20**. ఆ మెరుపు వారి దృష్టిని ఇంచుమించు ఎగురవేసుకు పోయినట్లుంటుంది. ప్రతిసారి అది మెరిసినప్పుడు, వారు ముందుకు నడుస్తారు మరియు వారిపై చీకటి క్రమ్ముకొనగానే వారు ఆగిపోతారు. మరియు అల్లాహ్ కోరితే వారి వినికిడినీ మరియు వారి చూపునూ తొలగించేవాడు.[2] నిశ్చయంగా, అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.[3]

**21**. ఓ మానవులారా! మిమ్మల్ని మరియు మీకు పూర్వం వారిని సృష్టించిన మీ ప్రభువు(అల్లాహ్)నే ఆరాధించండి, తద్వారా మీరు భక్తిపరులు కావచ్చు![4]

---

**1**. ము'హీ'తున్: One Who Encompasseth, Encloseth, Surroundeth. సర్వాన్ని పరివేష్టించి, ఆవరించి, చుట్టుముట్టి ఉన్నవాడు, ఆయన జ్ఞానపరిధికీ శక్తికీ వెలుపల ఏదీలేదు. చూడండి, 85:20.

**2**. అల్లాహ్ (సు.తా.) తలుచుకుంటే ఎప్పుడైనా తాను ప్రసాదించే అనుగ్రహాలను ఆపుకోవచ్చు! కావున మానవులు ఎల్లప్పుడు అల్లాహుతా'ఆలా యందే భయభక్తులు కలిగివుండి, ఆయన శిక్షకూ, ప్రతీకారానికీ భయపడుతూ ఉండాలి.

**3**. అలా కుల్లి షయ్ఇ'న్ ఖదీర్: ఈ వాక్యాన్ని కొందరు: ''అన్నింటిపై అధికారం (ఆధిపత్యం) గలవాడు.'' అని కూడా అనువదించారు.

**4**. ల'అల్లకుమ్ తత్తఖూన్: దీనికి ము'హమ్మద్ జూనాగఢి గారు ఇలా తాత్పర్యమిచ్చారు: ''తద్వారా మిమ్మల్ని మీరు కాపాడుకోవచ్చు.''

ٱلَّذِى جَعَلَ لَكُمُ ٱلْأَرْضَ فِرَٰشًا
وَٱلسَّمَآءَ بِنَآءً وَأَنزَلَ مِنَ ٱلسَّمَآءِ مَآءً
فَأَخْرَجَ بِهِۦ مِنَ ٱلثَّمَرَٰتِ رِزْقًا لَّكُمْ ۖ
فَلَا تَجْعَلُوا۟ لِلَّهِ أَندَادًا وَأَنتُمْ
تَعْلَمُونَ ﴿٢٢﴾
وَإِن كُنتُمْ فِى رَيْبٍ مِّمَّا نَزَّلْنَا عَلَىٰ
عَبْدِنَا فَأْتُوا۟ بِسُورَةٍ مِّن مِّثْلِهِۦ
وَٱدْعُوا۟ شُهَدَآءَكُم مِّن دُونِ ٱللَّهِ
إِن كُنتُمْ صَٰدِقِينَ ﴿٢٣﴾
فَإِن لَّمْ تَفْعَلُوا۟ وَلَن تَفْعَلُوا۟ فَٱتَّقُوا۟
ٱلنَّارَ ٱلَّتِى وَقُودُهَا ٱلنَّاسُ
وَٱلْحِجَارَةُ ۖ أُعِدَّتْ لِلْكَٰفِرِينَ ﴿٢٤﴾

**22**. ఆయన(అల్లాహ్)యే మీ కొరకు భూమిని పరుపుగాను మరియు ఆకాశాన్ని కప్పుగాను చేశాడు. మరియు ఆకాశం నుండి వర్షాన్ని కురిపించి, తద్వారా మీకు జీవనోపాధిగా ఫలాలను (పంటలను) ఉత్పత్తిచేశాడు! కావున ఇది తెలుసుకొని కూడా, మీరు ఇతరులను అల్లాహ్‌కు సాటిగా నిలబెట్టకండి.[1]

**23**. మరియు మేము మా దాసుడు (ము'హమ్మద్)పై అవతరింపజేసిన దానిని (ఈ ఖుర్ఆన్‌ను) గురించి, మీకు సందేహ ముంటే; దానివంటి ఒక్క సూరహ్‌నైనా మీరు (రచించి) తీసుకురండి.[2] మరియు అల్లాహ్ తప్ప మీకు ఉన్న సహాయకులను అందరినీ పిలుచుకోండి; మీరు సత్యవంతులేఅయితే (ఇది చేసిచూపండి).

**24**. కానీ, ఒకవేళ మీరు అలా చేయలేక పోతే - నిశ్చయంగా, మీరు అలాచేయలేరు - మానవులు మరియు రాళ్ళు ఇంధనమయ్యే ఆ నరకాగ్నికి భయపడండి.[3] అది సత్య తిరస్కారుల కొరకే తయారు చేయబడింది.

---

**1**. మిమ్మల్ని మరియు సర్వసృష్టిని సృష్టించినవాడు అల్లాహ్(సు.తా.)యే! మీకు జీవనోపాధిని సమకూర్చేవాడు కూడా ఆయనయే. అలాంటప్పుడు ఆయనను వదలి మీరు ఇతరులను ఎందుకు ఆరాధిస్తున్నారు? ఇతరులను ఆయనకు భాగస్వాములుగా ఎందుకు నిలబెడుతున్నారు? మీరు ఆయన శిక్ష నుండి తప్పించుకోవాలనుకుంటే! కేవలం ఆయననే ఆరాధించండి, ('స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-6, 'హ. నం.4).

**2**. ఈ విధమైన ఒక్క సూరహ్‌నైనా రచించి తెమ్మనే ప్రశ్న రెండు చోట్లలో ఇక్కడ మరియు 10:38లలో ఉంది. 11:13లో పది సూరాహ్‌లు రచించి తెమ్మనీ మరియు 17:88, 52:34లలో ఇట్టి గ్రంథాన్ని రచించి తెమ్మనీ ఉంది. ఈ దివ్యఖుర్ఆన్ అల్లాహ్ (సు.తా.) దగ్గరినుండి అవతరింపజేయబడింది, కాబట్టి ఎవ్వరుకూడా ఇంతవరకు ఈ ఛాలెంజీని ఎదుర్కోలేక పోయారు.

**3**. ఇబ్నె 'అబ్బాస్ (ర'ది.'అ.) కథనం: ''మీరు మరియు మీరు ఆరాధించే రాళ్ళదేవతలు నరకాగ్నికి ఇంధనం అవుతారు.'' చూడండి, 21:98.

وَبَشِّرِ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ أَنَّ لَهُمْ جَنَّٰتٍ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ ۖ كُلَّمَا رُزِقُواْ مِنْهَا مِن ثَمَرَةٍ رِّزْقًا ۙ قَالُواْ هَٰذَا ٱلَّذِى رُزِقْنَا مِن قَبْلُ ۖ وَأُتُواْ بِهِۦ مُتَشَٰبِهًا ۖ وَلَهُمْ فِيهَآ أَزْوَٰجٌ مُّطَهَّرَةٌ ۖ وَهُمْ فِيهَا خَٰلِدُونَ ﴿٢٥﴾

**25**. మరియు విశ్వసించి, సత్కార్యాలు చేసేవారి కొరకు నిశ్చయంగా, క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలు ఉంటాయనే శుభవార్తను వినిపించు. ప్రతిసారి వారికి తినటానికి ఫలాలు ఒసంగబడినపుడల్లా వారు: "ఇవి ఇంతకు ముందు మాకు ఇవ్వబడినవే!" అని అంటారు. ఎందుకంటే, వారికి ఇవ్వబడేవి వాటీ పోలిక గలవే. అక్కడ వారికి నిర్మల సహవాసులు (అ'జ్వాజ్) ఉంటారు. మరియు వారందులో శాశ్వతంగా ఉంటారు. (1/8)

۞ إِنَّ ٱللَّهَ لَا يَسْتَحْىِۦٓ أَن يَضْرِبَ مَثَلًا مَّا بَعُوضَةً فَمَا فَوْقَهَا ۚ فَأَمَّا ٱلَّذِينَ ءَامَنُواْ فَيَعْلَمُونَ أَنَّهُ ٱلْحَقُّ مِن رَّبِّهِمْ ۖ وَأَمَّا ٱلَّذِينَ كَفَرُواْ فَيَقُولُونَ مَاذَآ أَرَادَ ٱللَّهُ بِهَٰذَا مَثَلًا ۘ يُضِلُّ بِهِۦ كَثِيرًا وَيَهْدِى بِهِۦ كَثِيرًا ۚ وَمَا يُضِلُّ بِهِۦٓ إِلَّا ٱلْفَٰسِقِينَ ﴿٢٦﴾

**26**. * నిశ్చయంగా, అల్లాహ్ దోమ లేక దానికంటే చిన్నదాని దృష్టాంతం ఇవ్వటానికి సంకోచించడు. కావున విశ్వసించిన వారు, ఇది తమ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యమే అని గ్రహిస్తారు. కాని సత్య తిరస్కారులు, వాటిని విని: "ఈ ఉపమానాల ద్వారా అల్లాహ్ చెప్పదలుచుకున్నది ఏమిటి?" అని ప్రశ్నిస్తారు. ఈ విధంగా ఆయన ఎంతోమందిని మార్గభ్రష్టత్వంలో పడవేస్తాడు. మరియు ఎంతోమందికి సన్మార్గం కూడా చూపుతాడు. మరియు ఆయన కేవలం దుష్టులనే[1] మార్గభ్రష్టత్వంలో పడవేస్తాడు.

---

1. ఫాసిఖున్: అంటే దైవవిధేయతా హద్దులను అతిక్రమించిన వాడు (అవిధేయుడు), మార్గభ్రష్టుడు, దుష్టుడు, దుర్జనుడు, భక్తిలేనివాడు అనే అర్థాలున్నాయి. "ఎవడు ఏ వైపునకు పోదలచుకుంటాడో మేము అతనిని ఆ వైపునకే మరల్చుతాము." చూడండి, 4:115. అల్లాహ్ (సు.తా.) మానవులకు మరియు జిన్నాతులకు మంచి చెడులను తెలుసుకునే విచక్షణా శక్తీ, బుద్ధీ ఇచ్చాడు. కాబట్టి, వారికి పరలోక జీవితంలో, వారి కర్మల ప్రకారం, స్వర్గ/నరకాలు ఉన్నాయి. అల్లాహుతా'ఆలా ప్రవక్తల మరియు దివ్యగ్రంథాల ద్వారా వారికి సత్యాసత్యాలను, మంచి / చెడులను బోధించాడు. వాటిని అనుసరించటం వల్ల పొందే పరలోక ప్రతిఫలాలను (స్వర్గ / నరకాలను) కూడా విశదంచేశాడు. కావున వారిని మంచి/చెడు మార్గాలను అనుసరించటానికి బలవంతంచేయడు. వారిని వారి మార్గాలలో వదలిపెడతాడు. అల్లాహ్ (సు.తా.)కు జరిగిపోయింది, జరుగుతున్నది మరియు ముందు జరగబోయేది అంతా తెలుసు

ٱلَّذِينَ يَنقُضُونَ عَهْدَ ٱللَّهِ مِنۢ بَعْدِ مِيثَٰقِهِۦ وَيَقْطَعُونَ مَآ أَمَرَ ٱللَّهُ بِهِۦٓ أَن يُوصَلَ وَيُفْسِدُونَ فِى ٱلْأَرْضِ ۚ أُو۟لَٰٓئِكَ هُمُ ٱلْخَٰسِرُونَ ﴿٢٧﴾

**27**. ఎవరైతే అల్లాహ్‌తో స్థిరమైన ఒడంబడిక [1] చేసుకున్న పిదప దానిని భంగపరుస్తారో మరియు అల్లాహ్ స్థిరపరచమని ఆజ్ఞాపించిన దానిని త్రెంచుతారో మరియు భువిలో కల్లోలం రేకెత్తిస్తారో! ఇలాంటి వారే, వాస్తవంగా నష్టపడే వారు.

كَيْفَ تَكْفُرُونَ بِٱللَّهِ وَكُنتُمْ أَمْوَٰتًا فَأَحْيَٰكُمْ ۖ ثُمَّ يُمِيتُكُمْ ثُمَّ يُحْيِيكُمْ ثُمَّ إِلَيْهِ تُرْجَعُونَ ﴿٢٨﴾

**28**. మీరు అల్లాహ్ పట్ల తిరస్కార వైఖరిని ఎలా అవలంబించగలరు? మరియు వాస్తవానికి ఆయనే, నిర్జీవులుగా [2] ఉన్న మిమ్మల్ని సజీవులుగా చేశాడు కదా! తరువాత మీ ప్రాణాన్ని తీసి, తిరిగి మిమ్మల్ని సజీవులుగా చేసేది కూడా ఆయనే; చివరకు మీరంతా ఆయన వద్దకే మరలింపబడతారు.

هُوَ ٱلَّذِى خَلَقَ لَكُم مَّا فِى ٱلْأَرْضِ جَمِيعًا ثُمَّ ٱسْتَوَىٰٓ إِلَى ٱلسَّمَآءِ فَسَوَّىٰهُنَّ سَبْعَ سَمَٰوَٰتٍ ۚ وَهُوَ بِكُلِّ شَىْءٍ عَلِيمٌ ﴿٢٩﴾

**29**. ఆయనే భూమిలో నున్న సమస్తాన్నీ మీ కొరకు సృష్టించాడు; తరువాత తన దృష్టిని ఆకాశాల వైపునకు మరల్చి వాటిని సప్తాకాశాలుగా ఏర్పరిచాడు. మరియు ఆయనే ప్రతి విషయానికి సంబంధించిన జ్ఞానం గలవాడు.

---

కాబట్టి ఎవరు నరకవాసులు కానున్నారో మరియు ఎవరు స్వర్గవాసులు కానున్నారో కూడా తెలుసు. ఇదంతా గ్రంథంలో వ్రాయబడి ఉంది. కాబట్టి ఇక్కడ ఈ విధంగా పేర్కొనబడింది. అల్లాహ్ (సు.తా.) ఎవరిని కూడా బలవంతంగా నరకంలోకి త్రోయడు. వారి కర్మలే, వారిని దానికి అర్హులుగా చేస్తాయి. ఇలాంటి వాక్యం ఖుర్ఆన్‌లో అనేక సార్లు వచ్చింది. ప్రతిచోటా దీని తాత్పర్యం ఇదే.

**1**. 'అహ్‌దుల్లాహి: అంటే ఆదమ్('అ.స.)ను సృష్టించే సమయంలో సమస్త మానవజాతి నుంచి అల్లాహుతా'ఆలా తీసుకొన్న ప్రమాణం. అది ఏమిటంటే: అల్లాహ్ (సు.తా.) దాస్యమే చేయాలనీ, ఆయనకే విధేయులై ఉండాలనీ మరియు కేవలం ఆయననే ఆరాధించాలని.

**2**. అంటే మీరు ఏమీ లేకున్నపుడు మొదటిసారి సృష్టించబడ్డారు. ఆ తరువాత మీకు ఇవ్వబడిన గడువు పూర్తిఅయిన తరువాత మీరు మరణింపజేయబడి, పునరుత్థాన దినమున మళ్ళీ సజీవులుగా లేపబడతారు. అది మీ రెండవ జీవితం. దానికి అంతముండదు. అందు మీకు, మీరు భూలోకంలో చేసిన కర్మలకు తగిన ప్రతిఫలమివ్వబడుతుంది.

وَإِذۡ قَالَ رَبُّكَ لِلۡمَلَـٰٓئِكَةِ إِنِّي جَاعِلٞ فِي ٱلۡأَرۡضِ خَلِيفَةٗۖ قَالُوٓاْ أَتَجۡعَلُ فِيهَا مَن يُفۡسِدُ فِيهَا وَيَسۡفِكُ ٱلدِّمَآءَ وَنَحۡنُ نُسَبِّحُ بِحَمۡدِكَ وَنُقَدِّسُ لَكَۖ قَالَ إِنِّيٓ أَعۡلَمُ مَا لَا تَعۡلَمُونَ ٣٠

**30**. మరియు (జ్ఞాపకం చేసుకో!) నీ ప్రభువు దేవదూతలతో: "వాస్తవంగా నేను భూమిలో ఒక ఉత్తరాధికారిని[1] సృష్టించ బోతున్నాను!" అని చెప్పినపుడు, వారు: "ఏమీ? నీవు భూమిలో కల్లోలం రేకెత్తించే వానిని మరియు నెత్తురు చిందించే వానిని నియమించ బోతున్నావా? మేము నీ స్తోత్రంచేస్తూ, నీ పవిత్రతను కొనియాడుతూనే ఉన్నాము కదా! " అని విన్నవించుకున్నారు. దానికి ఆయన: "నిశ్చయంగా, మీకు తెలియనిది నాకు తెలుసు!" అని అన్నాడు.

وَعَلَّمَ ءَادَمَ ٱلۡأَسۡمَآءَ كُلَّهَا ثُمَّ عَرَضَهُمۡ عَلَى ٱلۡمَلَـٰٓئِكَةِ فَقَالَ أَنۢبِـُٔونِي بِأَسۡمَآءِ هَـٰٓؤُلَآءِ إِن كُنتُمۡ صَٰدِقِينَ ٣١

**31**. మరియు ఆయన (అల్లాహ్) ఆదమ్‌కు సకల వస్తువుల పేర్లను నేర్పాడు,[2] ఆ పిదప వాటిని దేవదూతల ఎదుట ఉంచి: "మీరు సత్యవంతులే అయితే, వీటి పేర్లను నాకు తెలుపండి." అని అన్నాడు.

قَالُواْ سُبۡحَٰنَكَ لَا عِلۡمَ لَنَآ إِلَّا مَا عَلَّمۡتَنَآۖ إِنَّكَ أَنتَ ٱلۡعَلِيمُ ٱلۡحَكِيمُ ٣٢

**32**. వారు (దేవదూతలు): "నీవు సర్వ లోపాలకు అతీతుడవు,[3] నీవు తెలిపినదే తప్ప మాకు మరేమీ తెలియదు. నిశ్చయంగా నీవే సర్వజ్ఞుడవు,[4] మహా వివేకవంతుడవు.[5]" అని అన్నారు.

---

1. 'ఖలీఫా: అంటే భూమిలో తరతరాలుగా వచ్చే జనపదం, **ఉత్తరాధికారి**. చూ.6:165,27:62, 35:39. మానవుడు భూమిలో అల్లాహ్ (సు.తా.) యొక్క ప్రతినిధి అనటం సరైనది కాదు.
2. చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-6, 'హ.నం. 3.
3. సుబ్'హానున్: Extolled be His absolute perfection. Hallowed, Exalted, Glorified, **సర్వలోపాలకు అతీతుడు,** పరిశుద్ధుడు, పరమపవిత్రుడు, పావనుడు, ప్రశంసనీయుడు, శ్లాఘింప, పొగడ, స్తుతింప దగినవాడు. చూడండి, 2:116, 12:108, 59:23.
4. **అల్-'అలీము:** The All -Knowing, The Omniscient. **సర్వజ్ఞుడు,** జ్ఞానసంపన్నుడు, సర్వం ఎరిగినవాడు, జ్ఞానంగల, నేర్పుగల, తన దాసుల ప్రతిమాటనూ, ప్రతిపనినీ, భావాన్నీ, అభిప్రాయాన్నీ, ప్రత్యక్షంగా ఎరిగినవాడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి. చూడండి, 2:127.
5. **అల్-హకీము:** All-Wise, Possessing Knowledge or Science, The Omniscient, **మహా వివేకవంతుడు,** వివేచనాపరుడు. ఈ పేరు దివ్యఖుర్ఆన్ కొరకుగూడా వాడబడుతుంది. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి. చూడండి, 59:24.

قَالَ يَٰٓـَٔادَمُ أَنۢبِئۡهُم بِأَسۡمَآئِهِمۡۖ فَلَمَّآ أَنۢبَأَهُم بِأَسۡمَآئِهِمۡ قَالَ أَلَمۡ أَقُل لَّكُمۡ إِنِّيٓ أَعۡلَمُ غَيۡبَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَأَعۡلَمُ مَا تُبۡدُونَ وَمَا كُنتُمۡ تَكۡتُمُونَ ٣٣

**33**. ఆయన (అల్లాహ్): "ఓ ఆదమ్! వీటి (ఈ వస్తువుల) పేర్లను వీరికి తెలుపు." అని అన్నాడు. ఎప్పుడైతే అతను (ఆదమ్) ఆ వస్తువుల పేర్లను వారికి తెలిపాడో; ఆయన అన్నాడు: "నిశ్చయంగా, నేను మాత్రమే భూమ్యాకాశాల అగోచర విషయాలను ఎరుగుదునని మీతో చెప్పలేదా? మరియు మీరు ఏది బహిర్గతం చేస్తారో మరియు ఏది దాస్తారో కూడా నాకు బాగా తెలుసు!"

وَإِذۡ قُلۡنَا لِلۡمَلَٰٓئِكَةِ ٱسۡجُدُواْ لِأٓدَمَ فَسَجَدُوٓاْ إِلَّآ إِبۡلِيسَ أَبَىٰ وَٱسۡتَكۡبَرَ وَكَانَ مِنَ ٱلۡكَٰفِرِينَ ٣٤

**34**. మరియు (జ్ఞాపకం చేసుకోండి) మేము దేవదూతలతో: "మీరందరూ ఆదమ్ ముందు సాష్టాంగం (సజ్దా) చేయండి." అని ఆదేశించినపుడు, ఒక ఇబ్లీస్[1] తప్ప, మిగతావారంతా సాష్టాంగం (సజ్దా) చేశారు;[2] అతడు నిరాకరించాడు మరియు దురహంకారానికి గురి అయ్యాడు మరియు సత్య తిరస్కారులలోని వాడయ్యాడు.

---

**1**. ఇబ్లీస్: అంటే, He Despaired, ఆశవదలుకొన్న, నిరాశ చెందిన వాడు. ఇది షైతాన్ పేరు. అతడు జిన్నాతులలోని వాడు.
షైతాన్: He was, or became, distant or remote (from the mercy of Allah) అంటే, అల్లాహ్ (సు.తా.), సానుభూతి, లేక దయ నుండి దూరమైపోయిన వాడు. Rebellious, తిరగబడిన, అవిధేయుడైన, ఎదురు తిరిగిన వాడు, అధికారాన్ని ప్రతిఘటించిన వాడు.

**2**. సజ్దా: నుదుటితో సహా ఎనిమిది అంగాలను భూమికి ఆనించటం (సాష్టాంగం చేయటం). దీనిలో నుదురు, ముక్కు, రెండు అరచేతులు, రెండు మోకాళ్ళు మరియు రెండు కాళ్ళ వ్రేళ్ళు భూమికి తగులుతూ ఉండాలి. ఇది కేవలం అల్లాహుతా'ఆలా కొరకే ప్రత్యేకించబడింది. ఇక్కడ దైవదూతలు అల్లాహ్ (సు.తా.) ఆదేశాన్ని శిరసావహించటానికే ఆదమ్('అస)కు సజ్దా చేశారు. ము'హమ్మద్ ('స'అస) షరీయత్‌లో, మానవుడు గౌరవార్థం కూడా ఎవ్వరికీ సజ్దా చేయగూడదు.

وَقُلْنَا يَٰٓـَٔادَمُ ٱسْكُنْ أَنتَ وَزَوْجُكَ ٱلْجَنَّةَ وَكُلَا مِنْهَا رَغَدًا حَيْثُ شِئْتُمَا وَلَا تَقْرَبَا هَٰذِهِ ٱلشَّجَرَةَ فَتَكُونَا مِنَ ٱلظَّٰلِمِينَ ٣٥

**35**. మరియు మేము (ఆదమ్‌తో) అన్నాము: "ఓ ఆదమ్! నీవూ మరియు నీ భార్యా ఈ స్వర్గంలో నివసించండి మరియు మీరిద్దరూ మీకు ఇష్టమైనది యథేచ్ఛగా తినండి, కానీ ఈ చెట్టు[1] దరిదాపులకు పోకండి, అలా చేస్తే మీరిద్దరూ దుర్మార్గులలో[2] చేరిన వారవుతారు!"

فَأَزَلَّهُمَا ٱلشَّيْطَٰنُ عَنْهَا فَأَخْرَجَهُمَا مِمَّا كَانَا فِيهِ ۖ وَقُلْنَا ٱهْبِطُوا۟ بَعْضُكُمْ لِبَعْضٍ عَدُوٌّ ۖ وَلَكُمْ فِى ٱلْأَرْضِ مُسْتَقَرٌّ وَمَتَٰعٌ إِلَىٰ حِينٍ ٣٦

**36**. ఆ పిదప షైతాన్ వారిద్దరినీ దాని (స్వర్గం) నుండి తప్పించి, వారిద్దరినీ వారున్న స్థితినుండి బయటికి తీశాడు. మరియు మేము (అల్లాహ్) అన్నాము: "మీరంతా ఇక్కడి నుండి దిగిపోండి; మీరు ఒకరికొకరు విరోధులు అవుతారు.[3] ఒక నియమిత కాలం వరకు మీరు భూమిలో ఉండి, అక్కడే జీవితం గడపవలసి ఉంటుంది."

فَتَلَقَّىٰٓ ءَادَمُ مِن رَّبِّهِۦ كَلِمَٰتٍ فَتَابَ عَلَيْهِ ۚ إِنَّهُۥ هُوَ ٱلتَّوَّابُ ٱلرَّحِيمُ ٣٧

**37**. తరువాత ఆదమ్, తన ప్రభువు నుండి కొన్ని మాటలు గ్రహించి,[4] (పశ్చాత్తాపపడి క్షమాభిక్ష కోరాడు) మరియు ఆయన (అల్లాహ్) అతని పశ్చాత్తాపాన్ని అంగీకరించాడు. నిశ్చయంగా, ఆయనే పశ్చాత్తాపాన్ని అంగీకరించేవాడు, అపార కరుణాప్రదాత.

---

**1**. ఆ చెట్టు ఏ రకమైనదో ఖుర్ఆన్ మరియు 'హదీస్'లలో పేర్కొనబడలేదు. కాబట్టి దానిని గురించి అనుమానాల పాలు కాగూడదు. ఇంకా చూడండి, 20:120.

**2**. "జుల్‌మున్: Wrong doing, Injustice, Oppression. ఈ పదానికి దుర్మార్గం, అన్యాయం, అధర్మం, అక్రమం, దోషం, అపచారం మొదలైన అర్థాలు ఉన్నాయి.

**3**. అంటే ఆదమ్ ('అ.స.) మరియు షైతాన్ కావచ్చు; లేక మానవులు పరస్పరం (ఒకరికొకరు) విరోధులవుతారని అర్థం కావచ్చు!

**4**. ఆదమ్ ('అ.స.) చేసిన దు'ఆ కొరకు చూడండి, 7:23.

**38**. మేము (అల్లాహ్) ఇలా అన్నాము: "మీరంతా ఇక్కడి నుండి దిగిపోండి." ఇక నా తరఫునుండి మీకు మార్గదర్శకత్వం తప్పక వస్తూ ఉంటుంది. అప్పుడు ఎవరైతే నా మార్గదర్శకత్వాన్ని అనుసరిస్తారో వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా!

**39**. కాని, ఎవరైతే (మార్గదర్శకత్వాన్ని) తిరస్కరిస్తారో మరియు మా సూచన (ఆయాత్)లను అసత్యాలని తిరస్కరిస్తారో, అలాంటి వారు నరకాగ్ని వాసులవుతారు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

**40**. ఓ ఇస్రాయీ'ల్ సంతతి వారలారా![1] నేను మీకు చేసిన ఉపకారాన్ని జ్ఞాపకం చేసుకోండి మరియు మీరు నాతో చేసిన వాగ్దానాన్ని నెరవేర్చండి, నేనూ మీతో చేసిన వాగ్దానాన్ని నెరవేర్చుతాను. మరియు మీరు నాకు మాత్రమే భయపడండి!

**41**. మరియు మీ వద్దనున్న వాటిని (తౌరాత్ / ఇంజీల్‌లను) ధృవీకరిస్తూ నేను అవతరింపజేసిన దానిని (ఈ దివ్య ఖుర్ఆన్‌ను) విశ్వసించండి. మరియు దీనిని తిరస్కరించే వారిలో మీరు మొట్టమొదటి వారు కాకండి. మరియు అల్ప లాభాలకు నా సూచన(ఆయాత్)లను[2] అమ్మకండి. కేవలం

قُلْنَا ٱهْبِطُوا۟ مِنْهَا جَمِيعًا ۖ فَإِمَّا
يَأْتِيَنَّكُم مِّنِّى هُدًى فَمَن تَبِعَ
هُدَاىَ فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ
يَحْزَنُونَ ﴿٣٨﴾
وَٱلَّذِينَ كَفَرُوا۟ وَكَذَّبُوا۟ بِـَٔايَٰتِنَآ
أُو۟لَٰٓئِكَ أَصْحَٰبُ ٱلنَّارِ ۖ هُمْ فِيهَا
خَٰلِدُونَ ﴿٣٩﴾
يَٰبَنِىٓ إِسْرَٰٓءِيلَ ٱذْكُرُوا۟ نِعْمَتِىَ ٱلَّتِىٓ
أَنْعَمْتُ عَلَيْكُمْ وَأَوْفُوا۟ بِعَهْدِىٓ أُوفِ
بِعَهْدِكُمْ وَإِيَّٰىَ فَٱرْهَبُونِ ﴿٤٠﴾
وَءَامِنُوا۟ بِمَآ أَنزَلْتُ مُصَدِّقًا
لِّمَا مَعَكُمْ وَلَا تَكُونُوٓا۟ أَوَّلَ كَافِرٍۭ
بِهِۦ ۖ وَلَا تَشْتَرُوا۟ بِـَٔايَٰتِى ثَمَنًا قَلِيلًا
وَإِيَّٰىَ فَٱتَّقُونِ ﴿٤١﴾

---

**1**. ఇస్రాయీ'ల్: హీబ్రూ భాష పదం. 'అరబ్బీలో దీని అర్థం 'అబ్దుల్లాహ్ (అల్లాహ్ దాసుడు). ఇది య'అఖూబ్ ('అ.స.) యొక్క బిరుదు. అతనికి 12 మంది కుమారులు. వారితో 12 తెగలుగా యూదుల సంతతి పెరిగింది. వారిని బనీ ఇస్రాయీ'ల్ (ఇస్రాయీ'ల్ సంతతి వారు) అని అంటారు. వారిలో చాలామంది ప్రవక్తలు వచ్చారు.

**2**. ఆయత్: Sign, అంటే సూచన, సూక్తి, చిహ్నం, సంకేతం. కొన్ని చోట్లలో అద్భుత సూచన, అద్భుత సంకేతం, అద్భుత నిదర్శనం అనే అర్థాలు వస్తాయి. ఈ అనువాదంలో చాలావరకు

وَلَا تَلۡبِسُواْ ٱلۡحَقَّ بِٱلۡبَٰطِلِ وَتَكۡتُمُواْ ٱلۡحَقَّ وَأَنتُمۡ تَعۡلَمُونَ ﴿٤٢﴾

నాయందే భయభక్తులు కలిగి ఉండండి.

42. మరియు సత్యాన్ని అసత్యంతో కలిపి తారుమారు చేయకండి మరియు మీకు తెలిసిఉండి కూడా సత్యాన్ని దాచకండి.[1]

وَأَقِيمُواْ ٱلصَّلَوٰةَ وَءَاتُواْ ٱلزَّكَوٰةَ وَٱرۡكَعُواْ مَعَ ٱلرَّٰكِعِينَ ﴿٤٣﴾

43. మరియు నమా'జ్‌ను స్థాపించండి మరియు విధిదానం ('జకాత్) ఇవ్వండి మరియు (నా సాన్నిధ్యంలో వినమ్రులై) వంగే[2] (రుకూ'ఉ చేసే) వారితో పాటు మీరూ (వినమ్రులై) వంగండి (రుకూ'ఉ చేయండి). (1/4)

۞ أَتَأۡمُرُونَ ٱلنَّاسَ بِٱلۡبِرِّ وَتَنسَوۡنَ أَنفُسَكُمۡ وَأَنتُمۡ تَتۡلُونَ ٱلۡكِتَٰبَۚ أَفَلَا تَعۡقِلُونَ ﴿٤٤﴾

44. * ఏమీ? మీరు ఇతరులనైతే నీతిపరు లవమని ఆజ్ఞాపిస్తున్నారు, కాని స్వయంగా మీరే దానిని అవలంబించడం మరచి పోతున్నారెందుకు?[3] మరియు మీరైతే గ్రంథాన్ని చదువుతున్నారు కదా! అయితే మీరెందుకు మీ బుద్ధిని ఉపయోగించరు?

وَٱسۡتَعِينُواْ بِٱلصَّبۡرِ وَٱلصَّلَوٰةِۚ وَإِنَّهَا لَكَبِيرَةٌ إِلَّا عَلَى ٱلۡخَٰشِعِينَ ﴿٤٥﴾

45. మరియు సహనం మరియు నమా'జ్ ద్వారా (అల్లాహ్) సహాయాన్ని అర్థించండి. నిశ్చయంగా, అది (అల్లాహ్‌కు) వినమ్రులైన వారికి తప్ప, ఇతరులకు ఎంతో కష్టతరమైనది.

---

సూచన అనే పదమే వాడబడింది. వీటిని వాక్యాలనటం సరికాదు. ఇవి అల్లాహుతా'ఆలా సూచనలు.

ఈ ఖుర్ఆన్‌లోని ఆయతుల సంఖ్య కూఫీ 'ఉలమాలు అనుసరించిన ఇమామ్ అ'ష్షాతబీ యొక్క నా''జిమతు'జ్జుహ్రలో వ్రాసినట్లు ఉంది. అంటే అబీ-'అబ్దుర్ర'హ్మాన్ 'అబ్దుల్లాహ్ ఇబ్నె 'హబీబ్ అస్సులమీ' అనుసరించిన, అలీ ఇబ్నె అబీ-'తాలిబ్ (ర'ది.'అ.) విధానం. దీని ప్రకారం ఈ ఖుర్ఆన్‌లోని ఆయతుల సంఖ్య 6236.

1. చూడండి, ఖుర్ఆన్, 2:76, 101. ఇంకా చూడండి: "అల్లాహ్ (సు.తా.) మీ సహోదరులలో నుండి ఒక ప్రవక్తను, తెస్తాడు, అప్పుడు మీరు అతనిని అనుసరించాలి." అని పూర్వ గ్రంథాలలో వ్రాయబడిన సత్యానికి, బైబిల్, ద్వితీయోపదేశ కాండము- (Deuteronomy), 18:15, 18.

2. రుకూ'ఉ: అంటే నమాజ్‌లో అరచేతులను మోకాళ్ళపై పెట్టి వంగడం.

3. 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-9, 'హ.నం. 218.

**46**. అలాంటి వారు తాము, తమ ప్రభువును నిశ్చయంగా, కలుసుకోవలసి ఉందనీ మరియు ఆయన వైపునకే మరలి పోవలసి ఉందనీ నమ్ముతారు.[1]

ٱلَّذِينَ يَظُنُّونَ أَنَّهُم مُّلَٰقُواْ رَبِّهِمْ وَأَنَّهُمْ إِلَيْهِ رَٰجِعُونَ ۝٤٦

**47**. ఓ ఇస్రాయీ'ల్ సంతతి వారలారా! నేను మీకు చేసిన మహోపకారాన్ని జ్ఞాపకం చేసుకోండి మరియు నేను నిశ్చయంగా, మిమ్మల్ని (మీ కాలంలో) సర్వలోకాల వారి కంటే అధికంగా ఆదరించాను!

يَٰبَنِىٓ إِسْرَٰٓءِيلَ ٱذْكُرُواْ نِعْمَتِىَ ٱلَّتِىٓ أَنْعَمْتُ عَلَيْكُمْ وَأَنِّى فَضَّلْتُكُمْ عَلَى ٱلْعَٰلَمِينَ ۝٤٧

**48**. మరియు ఆ (తీర్పు) దినమునకు భయపడండి, అప్పుడు ఒక వ్యక్తి మరొక వ్యక్తికి ఏ విధంగానూ ఉపయోగపడలేడు; మరియు అతని నుండి ఎట్టి సిఫారసూ అంగీకరించబడదు మరియు ఎలాంటి పరిహారం కూడా తీసుకోబడదు మరియు వారికెలాంటి సహాయం కూడా చేయబడదు.

وَٱتَّقُواْ يَوْمًا لَّا تَجْزِى نَفْسٌ عَن نَّفْسٍ شَيْـًٔا وَلَا يُقْبَلُ مِنْهَا شَفَٰعَةٌ وَلَا يُؤْخَذُ مِنْهَا عَدْلٌ وَلَا هُمْ يُنصَرُونَ ۝٤٨

**49**. మరియు ఫిర్'ఔన్ జాతివారి (బానిసత్వం) నుండి మేము మీకు విముక్తి కలిగించిన సందర్భాన్ని (జ్ఞాపకం చేసుకోండి). వారు మిమ్మల్ని ఘోరహింసకు గురిచేస్తూ ఉండేవారు; మీ కుమారులను వధించి, మీ స్త్రీలను సజీవులుగా విడిచి పెట్టేవారు. మరియు ఇందులో మీ ప్రభువు తరఫునుండి మీకు గొప్ప పరీక్ష ఉండింది.

وَإِذْ نَجَّيْنَٰكُم مِّنْ ءَالِ فِرْعَوْنَ يَسُومُونَكُمْ سُوٓءَ ٱلْعَذَابِ يُذَبِّحُونَ أَبْنَآءَكُمْ وَيَسْتَحْيُونَ نِسَآءَكُمْ ۚ وَفِى ذَٰلِكُم بَلَآءٌ مِّن رَّبِّكُمْ عَظِيمٌ ۝٤٩

**50**. మరియు మేము మీ కొరకు సముద్రాన్ని చీల్చి మిమ్మల్ని రక్షించినప్పుడు మీరు చూస్తూ ఉండగానే ఫిర్'ఔన్ జాతి వారిని ముంచి వేసిన సంఘటనను (గుర్తుకు తెచ్చుకోండి).[2]

وَإِذْ فَرَقْنَا بِكُمُ ٱلْبَحْرَ فَأَنجَيْنَٰكُمْ وَأَغْرَقْنَآ ءَالَ فِرْعَوْنَ وَأَنتُمْ تَنظُرُونَ ۝٥٠

---

1. ''జన్న: అంటే Imagined, thought, భావించాడు, ఊహించాడు, అనే అర్థాలు ఉన్నాయి. కాని కొన్నిసార్లు, believed, sure, నమ్మాడు, విశ్వసించాడు అనే అర్థాలు కూడా వస్తాయి.
2. చూడండి, 20:77-78 మరియు 26:63-66.

**51**. ఇంకా (జ్ఞాపకం చేసుకోండి), మేము మూసాను నలభై రాత్రుల వాగ్దానం చేసి (పిలిచినపుడు), మీరు అతను లేకపోవటం చూసి, ఆవుదూడను (ఆరాధ్య దైవంగా) చేసుకున్నారు.[1] మరియు మీరు దుర్మార్గు లయ్యారు.

**52**. అయినప్పటికీ మీరు కృతజ్ఞులు అవుతారేమోనని మేము మిమ్మల్ని మన్నించాము.[2]

**53**. మరియు (జ్ఞాపకం చేసుకోండి)! మీరు సన్మార్గులవుతారేమోనని మేము మూసాకు గ్రంథాన్ని మరియు (సత్యాసత్యాలను వేరుచేసే)[3] గీటురాయిని ప్రసాదించాము.

**54**. మరియు (జ్ఞాపకం చేసుకోండి!) మూసా తన జాతివారితో ఇలా అన్న విషయాన్ని: ''ఓ నా జాతి ప్రజలారా! నిశ్చయంగా, ఆవుదూడను (ఆరాధ్య దైవంగా) చేసుకొని మీకు మీరే అన్యాయం చేసుకున్నారు. కనుక పశ్చాత్తాపంతో క్షమాభిక్ష కొరకు మీ నిర్మాతను[4] (సృష్టికర్తను) వేడుకోండి. మీలోని (ఘోర పాతకులను)

وَإِذْ وَٰعَدْنَا مُوسَىٰٓ أَرْبَعِينَ لَيْلَةً ثُمَّ
ٱتَّخَذْتُمُ ٱلْعِجْلَ مِنۢ بَعْدِهِۦ وَأَنتُمْ
ظَٰلِمُونَ ٥١

ثُمَّ عَفَوْنَا عَنكُم مِّنۢ بَعْدِ ذَٰلِكَ
لَعَلَّكُمْ تَشْكُرُونَ ٥٢

وَإِذْ ءَاتَيْنَا مُوسَى ٱلْكِتَٰبَ
وَٱلْفُرْقَانَ لَعَلَّكُمْ تَهْتَدُونَ ٥٣

وَإِذْ قَالَ مُوسَىٰ لِقَوْمِهِۦ يَٰقَوْمِ
إِنَّكُمْ ظَلَمْتُمْ أَنفُسَكُم
بِٱتِّخَاذِكُمُ ٱلْعِجْلَ فَتُوبُوٓا۟ إِلَىٰ
بَارِئِكُمْ فَٱقْتُلُوٓا۟ أَنفُسَكُمْ ذَٰلِكُمْ خَيْرٌ
لَّكُمْ عِندَ بَارِئِكُمْ فَتَابَ عَلَيْكُمْ ۚ إِنَّهُۥ
هُوَ ٱلتَّوَّابُ ٱلرَّحِيمُ ٥٤

---

**1**. చూడండి, 7:142-148, 20:85.

**2**. ʽఅఫవ్‌నా (**అల్-ʽఅఫువ్వు**): Pardoning, Effacing, Erasing, Obliterating, Very Forgiving. **మన్నించే**, రద్దుచేసే, క్షమించే వాడు. చూడండి, 4:149. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

**3**. చూడండి, 8:29, 8:41.

**4**. **అల్-బారిఉ'**: The Maker, నిర్మాత, ఎట్టి పోలిక, సామ్యం లేకుండా ప్రతి దానిని **సృజించే** వాడు. లేమి నుండి ఉనికిలోకి తెచ్చే వాడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

సంహరించండి. ఇదే మీ కొరకు - మీ సృష్టికర్త దృష్టిలో - శ్రేష్ఠమైనది.'' ఆ తరువాత ఆయన (అల్లాహ్) మీ పశ్చాత్తాపాన్ని అంగీకరించాడు. నిశ్చయంగా, ఆయనే పశ్చాత్తాపాన్ని అంగీకరించేవాడు, అపార కరుణాప్రదాత.

55. మరియు అప్పుడు మీరు అతని (మూసా)తో అన్న మాటలు (జ్ఞప్తికి తెచ్చుకోండి): ''ఓ మూసా! మేము అల్లాహ్‌ను ప్రత్యక్షంగా చూడనంత వరకు నిన్ను ఏమాత్రం విశ్వసించము!'' అదే సమయంలో మీరు చూస్తూ ఉండగానే ఒక భయంకరమైన పిడుగు మీపై విరుచుకుపడింది (మీరు చనిపోయారు).

وَإِذْ قُلْتُمْ يَـٰمُوسَىٰ لَن نُّؤْمِنَ لَكَ حَتَّىٰ نَرَى ٱللَّهَ جَهْرَةً فَأَخَذَتْكُمُ ٱلصَّـٰعِقَةُ وَأَنتُمْ تَنظُرُونَ ﴿٥٥﴾

56. ఆ పిమ్మట, మీరు కృతజ్ఞులై ఉంటారేమోనని - మీరు చచ్చిన తరువాత - మిమ్మల్ని తిరిగి బ్రతికించాము.

ثُمَّ بَعَثْنَـٰكُم مِّنۢ بَعْدِ مَوْتِكُمْ لَعَلَّكُمْ تَشْكُرُونَ ﴿٥٦﴾

57. మరియు మేము మీపై మేఘాల ఛాయను కల్పించాము మరియు మన్న మరియు సల్వాలను మీ కొరకు ఆహారంగా దించాము:[1] ''మేము మీకు ప్రసాదించిన శుద్ధమయిన వస్తువులను తినండి.'' అని అన్నాము. (కాని వారు మా ఆజ్ఞలను ఉల్లంఘించారు), అయినా వారు మాకు అపకారమేమీ చేయలేదు, పైగా వారు తమకు తామే అపకారం చేసుకున్నారు.

وَظَلَّلْنَا عَلَيْكُمُ ٱلْغَمَامَ وَأَنزَلْنَا عَلَيْكُمُ ٱلْمَنَّ وَٱلسَّلْوَىٰ ۖ كُلُوا۟ مِن طَيِّبَـٰتِ مَا رَزَقْنَـٰكُمْ ۖ وَمَا ظَلَمُونَا وَلَـٰكِن كَانُوٓا۟ أَنفُسَهُمْ يَظْلِمُونَ ﴿٥٧﴾

1. 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-6, 'హ.నం. 5, మన్న - అనేది ఒక రకమైన జిగురు మిఠాయి (తీపిగల పదార్థము). సల్వా - ఒక రకమైన పక్షి. (ఫ'త్హ్ అల్-ఖదీర్).

وَإِذۡ قُلۡنَا ٱدۡخُلُواْ هَٰذِهِ ٱلۡقَرۡيَةَ فَكُلُواْ مِنۡهَا حَيۡثُ شِئۡتُمۡ رَغَدٗا وَٱدۡخُلُواْ ٱلۡبَابَ سُجَّدٗا وَقُولُواْ حِطَّةٞ نَّغۡفِرۡ لَكُمۡ خَطَٰيَٰكُمۡۚ وَسَنَزِيدُ ٱلۡمُحۡسِنِينَ ٥٨

**58**. మరియు మేము మీతో: "ఈ నగరం (జేరుసలం)లో ప్రవేశించండి మరియు అక్కడున్న వస్తువులను మీ ఇష్టానుసారంగా, కావలసినంత తినండి మరియు నగర ద్వారంలోకి వినమ్రులై తలవంచుతూ: "మమ్మల్ని క్షమించు" ('హి'త్తతున్), అంటూ ప్రవేశించండి; మేము మీ పాపాలను క్షమిస్తాము. మరియు మేము సజ్జనులను అత్యధికంగా కరుణిస్తాము." అని చెప్పిన (మాటలను జ్ఞప్తికి తెచ్చుకోండి)!

فَبَدَّلَ ٱلَّذِينَ ظَلَمُواْ قَوۡلًا غَيۡرَ ٱلَّذِي قِيلَ لَهُمۡ فَأَنزَلۡنَا عَلَى ٱلَّذِينَ ظَلَمُواْ رِجۡزٗا مِّنَ ٱلسَّمَآءِ بِمَا كَانُواْ يَفۡسُقُونَ ٥٩

**59**. కాని దుర్మార్గులైన వారు, వారికి చెప్పిన మాటను మరొక మాటతో మార్చారు.[1] కనుక, మేము దుర్మార్గం చేసిన వారిపై, వారి దౌష్ట్యాలకు ఫలితంగా, ఆకాశం నుండి ఆపదను దింపాము.[2] (3/8)

۞ وَإِذِ ٱسۡتَسۡقَىٰ مُوسَىٰ لِقَوۡمِهِۦ فَقُلۡنَا ٱضۡرِب بِّعَصَاكَ ٱلۡحَجَرَۖ فَٱنفَجَرَتۡ مِنۡهُ ٱثۡنَتَا عَشۡرَةَ عَيۡنٗاۖ قَدۡ عَلِمَ كُلُّ أُنَاسٖ مَّشۡرَبَهُمۡۖ كُلُواْ وَٱشۡرَبُواْ مِن رِّزۡقِ ٱللَّهِ وَلَا تَعۡثَوۡاْ فِي ٱلۡأَرۡضِ مُفۡسِدِينَ ٦٠

**60**. * మరియు (జ్ఞాపకం చేసుకోండి!) మూసా తన ప్రజలకు నీటి కొరకు ప్రార్థించినప్పుడు, మేము: "నీవు ఆ బండను నీ కర్రతో కొట్టు!" అని ఆదేశించాము. అప్పుడు దానినుండి పన్నెండు ఊటలు ప్రవహించ సాగాయి. ప్రతి తెగవారు తమ నీరు త్రాగే స్థలాన్ని కనుగొన్నారు. (అప్పుడు వారితో అన్నాము): "అల్లాహ్ మీకు ప్రసాదించిన ఆహారాన్ని తినండి త్రాగండి కానీ, భూమిలో కల్లోలం రేపుతూ దౌర్జన్యపరులుగా తిరగకండి!"

---

**1**. వారు 'హి'త్తతున్ అనే మాటకు బదులుగా - 'హబ్బ ఫీష 'అరతిన్ - అని అన్నారు. ('స'హీ'హ్ బు'ఖారీ మరియు 'స'హీ'హ్ ముస్లిం).

**2**. 'స'హీ'హ్ ముస్లిం, 'హ.నం. 2218, ఆ శిక్ష ఒక భయంకరమైన ప్లేగురోగం.

**61**. మరియు అప్పుడు మీరు: "ఓ మూసా! మేము ఒకే రకమైన ఆహారం తింటూ ఉండలేము. కావున భూమిలో ఉత్పత్తి అయ్యే ఆకుకూరలు, దోసకాయలు (కూరగాయలు), వెల్లుల్లి (గోదుమలు), ఉల్లిగడ్డలు, పప్పు దినుసులు మొదలైనవి మా కొరకు పండించమని నీ ప్రభువును ప్రార్థించు." అని అన్నారు. దానికతను: "ఏమీ? శ్రేష్ఠమైన దానికి బదులుగా అల్పమైన దానిని కోరుకుంటున్నారా? (అలాగయితే) మీరు ఏదైనా నగరానికి తిరిగిపొండి. నిశ్చయంగా, అక్కడ మీకు మీరు కోరేదంతా దొరుకుతుంది!" అని అన్నాడు. మరియు వారు, తీవ్ర అవమానం మరియు దారిద్ర్యానికి గురిఅయ్యారు. మరియు వారు అల్లాహ్ ఆగ్రహానికి గురిఅయ్యారు. అదంతా వాస్తవానికి వారు, అల్లాహ్ సూచన (ఆయాత్)లను తిరస్కరించిన దాని మరియు ప్రవక్తలను అన్యాయంగా చంపిన దాని ఫలితం.[1] ఇదంతా వారు చేసిన ఆజ్ఞోల్లంఘన మరియు హద్దులు మీరి ప్రవర్తించిన దాని పర్యవసానం.

**62**. నిశ్చయంగా, విశ్వసించిన వారు (ముస్లింలు) కానీ, (ఇస్లాంకు పూర్వపు) యూదులు కానీ, క్రైస్తవులు కానీ, సాబీయీలు[2]

وَإِذۡ قُلۡتُمۡ يَٰمُوسَىٰ لَن نَّصۡبِرَ عَلَىٰ
طَعَامٖ وَٰحِدٖ فَٱدۡعُ لَنَا رَبَّكَ
يُخۡرِجۡ لَنَا مِمَّا تُنۢبِتُ ٱلۡأَرۡضُ مِنۢ
بَقۡلِهَا وَقِثَّآئِهَا وَفُومِهَا وَعَدَسِهَا
وَبَصَلِهَاۖ قَالَ أَتَسۡتَبۡدِلُونَ ٱلَّذِي
هُوَ أَدۡنَىٰ بِٱلَّذِي هُوَ خَيۡرٌۚ ٱهۡبِطُواْ
مِصۡرٗا فَإِنَّ لَكُم مَّا سَأَلۡتُمۡۗ
وَضُرِبَتۡ عَلَيۡهِمُ ٱلذِّلَّةُ وَٱلۡمَسۡكَنَةُ
وَبَآءُو بِغَضَبٖ مِّنَ ٱللَّهِۗ ذَٰلِكَ بِأَنَّهُمۡ
كَانُواْ يَكۡفُرُونَ بِـَٔايَٰتِ ٱللَّهِ
وَيَقۡتُلُونَ ٱلنَّبِيِّـۧنَ بِغَيۡرِ ٱلۡحَقِّۗ ذَٰلِكَ بِمَا
عَصَواْ وَّكَانُواْ يَعۡتَدُونَ ٦١

إِنَّ ٱلَّذِينَ ءَامَنُواْ وَٱلَّذِينَ هَادُواْ
وَٱلنَّصَٰرَىٰ وَٱلصَّٰبِـِٔينَ مَنۡ ءَامَنَ

---

1. బైబిల్‌లో మత్తయి సువార్త-(Mathew), 23:34, 35, 37; లూకా-(Luke),11:51; I థెస్సలోనికయులు-(I Thessalonians), 2:15లు, 'జకరియ్యా మరియు ఇతర ప్రవక్తలను చంపిన సంఘటనకు సాక్ష్యమిస్తున్నాయి.
2. 'సాబీయూ'న్: ఒక గతించిన సమాజం. వారు ము'సల్('ఇరాఖ్)లో నివసించే వారు. "అల్లాహ్ (సు.తా.) తప్ప మరొక ఆరాధ్యుడు లేడు." అని నమ్మేవారు. వారు 'జబూర్ గ్రంథాన్ని చదివేవారని కొందరి అభిప్రాయం. వారు యూదులు గానీ, క్రైస్తవులు గానీ కారు. తరువాత వారి ధర్మంలో కూడా మార్పులు వచ్చాయి. వారు దైవదూతలను మరియు నక్షత్రాలను ఆరాధించసాగారు. వారు తరువాత ఏ ధర్మాన్ని కూడా అనుసరించకుండా ఉండసాగారు. వారు నాస్తికులు (Atheists) అయ్యారని కొందరి అభిప్రాయం.

بِٱللَّهِ وَٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِ وَعَمِلَ صَٰلِحٗا فَلَهُمۡ أَجۡرُهُمۡ عِندَ رَبِّهِمۡ وَلَا خَوۡفٌ عَلَيۡهِمۡ وَلَا هُمۡ يَحۡزَنُونَ ٦٢

కానీ (ఎవరైనా సరే)! అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని విశ్వసించి, సత్కార్యాలు చేసేవారికి, వారి ప్రభువు వద్ద మంచి ప్రతిఫలం ఉంటుంది మరియు వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా![1]

وَإِذۡ أَخَذۡنَا مِيثَٰقَكُمۡ وَرَفَعۡنَا فَوۡقَكُمُ ٱلطُّورَ خُذُواْ مَآ ءَاتَيۡنَٰكُم بِقُوَّةٖ وَٱذۡكُرُواْ مَا فِيهِ لَعَلَّكُمۡ تَتَّقُونَ ٦٣

**63**. మరియు (ఓ ఇస్రాయీ'ల్ సంతతి వారలారా!) మేము 'తూర్ పర్వతాన్ని ఎత్తి మీపై నిలిపి, మీచేత చేయించిన గట్టి వాగ్దానాన్ని (జ్ఞప్తికి తెచ్చుకోండి!) అప్పుడు మేము: "మీకు ప్రసాదిస్తున్న దానిని (గ్రంథాన్ని) దృఢంగా పట్టుకోండి, అందులో ఉన్నదంతా జ్ఞాపకం ఉంచుకోండి, బహుశా మీరు భయభక్తులు గలవారు కావచ్చు!" అని అన్నాము.

ثُمَّ تَوَلَّيۡتُم مِّنۢ بَعۡدِ ذَٰلِكَۖ فَلَوۡلَا فَضۡلُ ٱللَّهِ عَلَيۡكُمۡ وَرَحۡمَتُهُۥ لَكُنتُم مِّنَ ٱلۡخَٰسِرِينَ ٦٤

**64**. ఆ పిదప కూడా మీరు వెనుదిరిగి పోయారు. అయినప్పటికీ అల్లాహ్ యొక్క అనుగ్రహం మరియు ఆయన కరుణ మీపై లేకుంటే, మీరు నష్టానికి గురి అయిన వారిలో చేరేవారు.

وَلَقَدۡ عَلِمۡتُمُ ٱلَّذِينَ ٱعۡتَدَوۡاْ مِنكُمۡ فِي ٱلسَّبۡتِ فَقُلۡنَا لَهُمۡ كُونُواْ قِرَدَةً خَٰسِـِٔينَ ٦٥

**65**. మరియు శనివారం (సబ్త్) శాసనం ఉల్లంఘించిన మీ వారి గాథ మీకు బాగా తెలుసు.[2] మేము వారిని: "నీచులైన కోతులు కండి!" అని అన్నాము.

---

**1**. చూడండి, 5:69. ఇక్కడ యూదులు, క్రైస్తవులు మరియు 'సాబీయులు, అంటే తమ గ్రంథాలలో ఎట్టి మార్పులు చేయక, వాటి అవతరింపజేయబడిన నిజరూపంలో వాటిని అనుసరించిన వారని అర్థం. మహాప్రవక్త ('స'అస) ప్రవచనం: "ఎవరిచేతిలోనయితే నా ప్రాణం ఉందో ఆ పరమ పవిత్రుని సాక్షి, నా ఈ సమాజంలో నా మాట విన్న వ్యక్తి, వాడు యూదుడు గానీ, క్రైస్తవుడు గానీ నన్ను (నా ధర్మాన్ని) విశ్వసించకపోతే! అతడు నరకవాసి అవుతాడు." ('స'హీ'హ్ ముస్లిం). అంటే ము'హమ్మద్ ('స'అస) తరువాత, ఇస్లాం తప్ప మరొక ధర్మాన్ని అల్లాహ్ (సు.తా.) సమ్మతించడు. ఇక్కడ మరొక విషయం స్పష్టమయ్యేది ఏమిటంటే 'స'హీ'హ్ 'హదీసు'లను విడిచి ఖుర్ఆన్‌ను సరిగ్గా అర్థం చేసుకోవటం అసాధ్యం, ('తబరీ, పు-1, పేజీ-323). చూ. 3:19, 3:85.

**2**. యూదులకు శనివారం (సబ్త్) రోజున చేపలు పట్టటం నిషేధించబడింది. వారు ఆ శాసనాన్ని ఉల్లంఘించటం వలన: "నీచులైన కోతులు కండి." అని శపించబడ్డారు. చూ. 5:60, 7:166.

فَجَعَلْنَٰهَا نَكَٰلًا لِّمَا بَيْنَ يَدَيْهَا وَمَا خَلْفَهَا وَمَوْعِظَةً لِّلْمُتَّقِينَ ﴿٦٦﴾

**66**. ఈ విధంగా మేము, దానిని (వారి ముగింపును) ఆ కాలం వారికీ మరియు భావితరాల వారికీ ఒక గుణపాఠంగానూ, దైవభీతి గలవారికి ఒక హితోపదేశంగానూ చేశాము.

وَإِذْ قَالَ مُوسَىٰ لِقَوْمِهِۦٓ إِنَّ ٱللَّهَ يَأْمُرُكُمْ أَن تَذْبَحُوا۟ بَقَرَةً ۖ قَالُوٓا۟ أَتَتَّخِذُنَا هُزُوًا ۖ قَالَ أَعُوذُ بِٱللَّهِ أَنْ أَكُونَ مِنَ ٱلْجَٰهِلِينَ ﴿٦٧﴾

**67**. మరియు (జ్ఞాపకం చేసుకోండి) మూసా తన జాతి వారితో: "అల్లాహ్ మిమ్మల్ని: 'ఒక **ఆవు**ను బలి ఇవ్వండి!'[1] అని ఆజ్ఞా పిస్తున్నాడు." అని అన్నప్పుడు వారు: "ఏమీ? నీవు మాతో పరిహాసమాడు తున్నావా?" అని పలికారు. (అప్పుడు మూసా) అన్నాడు: "నేను అవివేకులతో కలిసి పోకుండా ఉండాలని, నేను అల్లాహ్ శరణు వేడుకుంటున్నాను."

قَالُوا۟ ٱدْعُ لَنَا رَبَّكَ يُبَيِّن لَّنَا مَا هِىَ ۚ قَالَ إِنَّهُۥ يَقُولُ إِنَّهَا بَقَرَةٌ لَّا فَارِضٌ وَلَا بِكْرٌ عَوَانٌۢ بَيْنَ ذَٰلِكَ ۖ فَٱفْعَلُوا۟ مَا تُؤْمَرُونَ ﴿٦٨﴾

**68**. వారు: "అది ఎలాంటిదై ఉండాలో మాకు స్పష్టంగా తెలుపమని నీ ప్రభువును ప్రార్థించు!" అని అన్నారు. (మూసా) అన్నాడు: " 'నిశ్చయంగా, ఆ ఆవు ముసలిది గానీ లేగదూడ గానీ కాకుండా, మధ్య వయస్సుగలదై ఉండాలి.' అని ఆయన అంటున్నాడు. కనుక ఆజ్ఞాపించిన విధంగా చేయండి."

قَالُوا۟ ٱدْعُ لَنَا رَبَّكَ يُبَيِّن لَّنَا مَا لَوْنُهَا ۚ قَالَ إِنَّهُۥ يَقُولُ إِنَّهَا بَقَرَةٌ صَفْرَآءُ فَاقِعٌ لَّوْنُهَا تَسُرُّ ٱلنَّٰظِرِينَ ﴿٦٩﴾

**69**. వారు: "దాని రంగు ఎలా ఉండాలో మాకు తెలుపమని నీ ప్రభువును వేడుకో!" అని అన్నారు. (దానికి అతను) అన్నాడు: " 'అది మెరిసే పసుపువన్నె కలిగి, చూసేవారికి మనోహరంగా కనిపించాలి.' అని ఆయన ఆజ్ఞ!"

---

**1**. ఇస్రాయీ'ల్ సంతతి వారిలో ఒక ధనవంతుడు - ఒకే ఒక్క వారసునిగా ఉన్న - అతని సోదరుని కుమారుణ్ణి హత్యచేసి, శవాన్ని ఇతరుని ఇంటిముందు వేస్తాడు. ఉదయం ఆ యిద్దరి మధ్య వాదులాట జరుగుతుంది. పరిష్కారానికి వారు మూసా ('అ.స.) దగ్గరికి వస్తారు. అతను వారిని ఒక ఆవును బలిఇచ్చి దాని మాంసపు ముక్కతో ఆ మృతుని శరీరాన్ని కొడితే, అతడు తన హతుణ్ణి చూపిస్తాడంటాడు. ఎంతో వాదులాడిన తరువాత వారు ఆ విధంగా చేస్తారు. ఆ మృతుడు లేచి హతుణ్ణి చూపించి తిరిగి మరణిస్తాడు (ఫ'త్హ్ అల్-ఖదీర్).

قَالُوا۟ ٱدْعُ لَنَا رَبَّكَ يُبَيِّن لَّنَا مَا هِىَ إِنَّ ٱلْبَقَرَ تَشَـٰبَهَ عَلَيْنَا وَإِنَّآ إِن شَآءَ ٱللَّهُ لَمُهْتَدُونَ ﴿٧٠﴾

70. వారు ఇలా అన్నారు: "అసలు ఏ విధమైన ఆవు కావాలో నీవు నీ ప్రభువును అడిగి మాకు స్పష్టంగా తెలుపు; దానిని నిర్ణయించడంలో మాకు సందేహం కలిగింది మరియు నిశ్చయంగా, అల్లాహ్ కోరితే మేము తప్పక అలాంటి ఆవును కనుగొంటాము (మార్గదర్శకత్వం పొందుతాము)."

قَالَ إِنَّهُۥ يَقُولُ إِنَّهَا بَقَرَةٌ لَّا ذَلُولٌ تُثِيرُ ٱلْأَرْضَ وَلَا تَسْقِى ٱلْحَرْثَ مُسَلَّمَةٌ لَّا شِيَةَ فِيهَا ۚ قَالُوا۟ ٱلْـَٔـٰنَ جِئْتَ بِٱلْحَقِّ ۚ فَذَبَحُوهَا وَمَا كَادُوا۟ يَفْعَلُونَ ﴿٧١﴾

71. అతను (మూసా) అన్నాడు: "ఆయన (అల్లాహ్) అంటున్నాడు: 'ఆ గోవు భూమిని దున్నటానికి గానీ, పొలాలకు నీళ్ళు తోడటానికి గానీ ఉపయోగించబడకుండా, ఆరోగ్యంగా ఎలాంటి లోపాలు లేకుండా ఉండాలి.' అని!" అప్పుడు వారన్నారు: "ఇప్పుడు నీవు సత్యం తెచ్చావు." తరువాత వారు దానిని బలి (జి"బ్హ్) చేశారు, లేకపోతే వారు అలా చేసేవారని అనిపించలేదు.[1]

وَإِذْ قَتَلْتُمْ نَفْسًا فَٱدَّٰرَٰٔتُمْ فِيهَا ۖ وَٱللَّهُ مُخْرِجٌ مَّا كُنتُمْ تَكْتُمُونَ ﴿٧٢﴾

72. మరియు (జ్ఞాపకం చేసుకోండి), మీరు ఒక వ్యక్తిని చంపి ఆ నిందను ఒకరిపై నొకరు మోపుకోసాగారు. కాని మీరు దాస్తున్న దానిని అల్లాహ్ బయటపెట్టాడు.[2]

---

1. వారికి మొదట ఒక ఆవును బలి చేయమని మాత్రమే ఆజ్ఞ ఇవ్వబడింది. కాబట్టి వారు ఏదో ఒక ఆవును బలిచేసి ఉంటే, అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞ నెరవేరేది. కానీ వారలా చేయక వివిధరకాల ప్రశ్నలడగసాగారు. కావున అల్లాహుతా'ఆలా వారి సమస్యలను పెంచాడు. దానితో వారికి ఆవును కనుగొనటంలో కష్టం కలిగింది. కావున ధర్మ విషయాలలో కఠిన విధానాన్ని అనుసరించటం నిషేధింపబడింది.
2. పైన పేర్కొన్న ఆవు బలి ఈ వ్యక్తి మరణం వల్లనే సంభవించింది. దీని భావం ఏమిటంటే, మంచీ, చెడూ ఏ కార్యమైనా అది బయట పడక తప్పదు. కావున ప్రతి ఒక్కడు ఎల్లప్పుడు మంచి కార్యాలే చేయాలి. చేసిన చెడు బయటపడితే అవమానం తప్పదు.

فَقُلْنَا ٱضْرِبُوهُ بِبَعْضِهَا ۚ كَذَٰلِكَ يُحْيِ ٱللَّهُ ٱلْمَوْتَىٰ وَيُرِيكُمْ ءَايَٰتِهِۦ لَعَلَّكُمْ تَعْقِلُونَ ﴿٧٣﴾

**73**. కనుక మేము: ''దానిని (ఆ శవాన్ని), ఆ ఆవు (మాంసపు) ఒక ముక్కతో కొట్టండి, (అతడు సజీవుడవుతాడు).'' అని ఆజ్ఞాపించాము. ఈ విధంగా అల్లాహ్ మృతులను బ్రతికించి, తన సూచనలను మీకు చూపుతున్నాడు, బహుశా మీరు అర్థం చేసుకుంటారేమోనని!

ثُمَّ قَسَتْ قُلُوبُكُم مِّنۢ بَعْدِ ذَٰلِكَ فَهِىَ كَٱلْحِجَارَةِ أَوْ أَشَدُّ قَسْوَةً ۚ وَإِنَّ مِنَ ٱلْحِجَارَةِ لَمَا يَتَفَجَّرُ مِنْهُ ٱلْأَنْهَٰرُ ۚ وَإِنَّ مِنْهَا لَمَا يَشَّقَّقُ فَيَخْرُجُ مِنْهُ ٱلْمَآءُ ۚ وَإِنَّ مِنْهَا لَمَا يَهْبِطُ مِنْ خَشْيَةِ ٱللَّهِ ۗ وَمَا ٱللَّهُ بِغَٰفِلٍ عَمَّا تَعْمَلُونَ ﴿٧٤﴾

**74**. కానీ దీని తరువాత కూడా మీ హృదయాలు కఠినమైపోయాయి, అవి రాళ్ళ మాదిరిగా! కాదు, వాటికంటే కూడా కఠినంగా అయిపోయాయి. ఎందుకంటే వాస్తవానికి రాళ్ళలో కొన్ని బ్రద్దలైనప్పుడు వాటినుండి సెలయేళ్ళు ప్రవహిస్తాయి. మరియు నిశ్చయంగా, వాటిలో కొన్ని చీలిపోయి వాటినుండి నీళ్ళు బయటికివస్తాయి.[1] మరియు వాస్తవానికి వాటిలో మరికొన్ని అల్లాహ్ భయంవల్ల పడిపోతాయి. మరియు అల్లాహ్ మీ కర్మల పట్ల నిర్లక్ష్యంగా లేడు. (1/2)

۞ أَفَتَطْمَعُونَ أَن يُؤْمِنُوا۟ لَكُمْ وَقَدْ كَانَ فَرِيقٌ مِّنْهُمْ يَسْمَعُونَ كَلَٰمَ ٱللَّهِ ثُمَّ يُحَرِّفُونَهُۥ مِنۢ بَعْدِ مَا عَقَلُوهُ وَهُمْ يَعْلَمُونَ ﴿٧٥﴾

**75**. * (ఓ విశ్వాసులారా!) వారు (యూదులు) మీ సందేశాన్ని విశ్వసిస్తారని ఆశిస్తున్నారా ఏమిటి? మరియు వాస్తవానికి వారిలో ఒకవర్గం వారు (ధర్మవేత్తలు) అల్లాహ్ ప్రవచనం (తౌరాత్) విని, అర్థంచేసుకొని కూడా, బుద్ధిపూర్వకంగా దానిని తారుమారు చేసేవారు కదా?

---

**1**. చూడండి, 57:16 మరియు 17:44.

وَإِذَا لَقُواْ ٱلَّذِينَ ءَامَنُواْ قَالُوٓاْ ءَامَنَّا وَإِذَا خَلَا بَعۡضُهُمۡ إِلَىٰ بَعۡضٖ قَالُوٓاْ أَتُحَدِّثُونَهُم بِمَا فَتَحَ ٱللَّهُ عَلَيۡكُمۡ لِيُحَآجُّوكُم بِهِۦ عِندَ رَبِّكُمۡۚ أَفَلَا تَعۡقِلُونَ ٧٦

76. మరియు వారు (యూదులు), విశ్వాసులను కలిసినప్పుడు: "మేము విశ్వసించాము!" అని అంటారు. కాని వారు ఏకాంతంలో (తమ తెగవారితో) ఒకరినొకరు కలుసుకున్నప్పుడు: "ఏమీ? అల్లాహ్ మీకు తెలిపింది వారికి (ముస్లింలకు) తెలుపుతారా?[1] దానితో వారు (ముస్లింలు) మీ ప్రభువు ముందు మీతో, వాదులాడటానికి! మీరిది అర్థం చేసుకోలేరా ఏమిటి?" అని అంటారు.

أَوَلَا يَعۡلَمُونَ أَنَّ ٱللَّهَ يَعۡلَمُ مَا يُسِرُّونَ وَمَا يُعۡلِنُونَ ٧٧

77. ఏమీ? వారికి తెలియదా? వారు (యూదులు) దాచేది మరియు వెలిబుచ్చేది, అంతా అల్లాహ్‌కు బాగా తెలుసని?

وَمِنۡهُمۡ أُمِّيُّونَ لَا يَعۡلَمُونَ ٱلۡكِتَٰبَ إِلَّآ أَمَانِيَّ وَإِنۡ هُمۡ إِلَّا يَظُنُّونَ ٧٨

78. మరియు వారి(యూదుల)లో కొందరు నిరక్షరాస్యులున్నారు, వారికి గ్రంథజ్ఞానం లేదు, వారు కేవలం మూఢ విశ్వాసాలను (నమ్ముతూ), ఊహలపై మాత్రమే ఆధారపడి ఉన్నారు.

فَوَيۡلٞ لِّلَّذِينَ يَكۡتُبُونَ ٱلۡكِتَٰبَ بِأَيۡدِيهِمۡ ثُمَّ يَقُولُونَ هَٰذَا مِنۡ عِندِ ٱللَّهِ لِيَشۡتَرُواْ بِهِۦ ثَمَنٗا قَلِيلٗاۖ فَوَيۡلٞ لَّهُم مِّمَّا كَتَبَتۡ أَيۡدِيهِمۡ وَوَيۡلٞ لَّهُم مِّمَّا يَكۡسِبُونَ ٧٩

79. కావున ఎవరైతే తమ చేతులారా ఒక పుస్తకాన్ని వ్రాసి - దానివల్ల తుచ్ఛమూల్యం పొందే నిమిత్తం - "ఇది అల్లాహ్ తరఫునుండి వచ్చింది." అని (ప్రజలకు) చెబుతారో, వారికి వినాశముంది. వారి చేతులు వ్రాసినందుకు, వారికి వినాశముంది మరియు వారు సంపాదించిన దానికి కూడా వారికి వినాశముంది!

---

1. 'అబ్దుల్లాహ్ బిన్-'అమ్ర్ బిన్ అల్-'అసాస్ (ర'ది.'అ.), కథనం ఆధారంగా - 'అతా బిన్-యాసర్ (ర'ది.'అ.) వివరించిన - వారి గ్రంథం(తౌరాత్)లో రాబోయే ప్రవక్త ము'హమ్మద్('స'అస)ను గురించి ఇవ్వబడిన లక్షణాల వివరాలకు చూడండి, 'స. బు'ఖారీ, పుస్తకం-3, 'హ. సం.335). ఇంకా చూడండి, 2:42, 101.

**80**. మరియు వారు (యూదులు) అంటారు: "మాకు నరకాగ్ని శిక్ష పడినా, అది కొన్ని రోజుల కొరకు మాత్రమే!" (ఓ ము'హమ్మద్!) నీవు వారిని అడుగు: "ఏమీ? మీరు అల్లాహ్ నుండి వాగ్దానం పొందారా? ఎందుకంటే, అల్లాహ్ తన వాగ్దానాన్ని ఎన్నడూ భంగం చేయడు. లేదా మీకు తెలియని విషయాన్ని మీరు అల్లాహ్‌కు అంటగడుతున్నారా?"

**81**. వాస్తవానికి, ఎవరు పాపం అర్జించారో మరియు తమ పాపం తమను చుట్టుముట్టివున్నదో, అలాంటి వారు నరకవాసులు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

**82**. మరియు ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తారో, అలాంటి వారు స్వర్గవాసులు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

**83**. మరియు మేము ఇస్రాయీ'లు సంతతి వారి నుండి ఇలా తీసుకున్న వాగ్దానం (జ్ఞప్తికి తెచ్చుకోండి): "మీరు అల్లాహ్‌ను తప్ప మరెవ్వరినీ ఆరాధించకూడదు. మరియు తల్లిదండ్రులను, బంధువులను, అనాథులను, యాచించని పేదవారిని[1] ఆదరించాలి. మరియు ప్రజలను సహృదయంతో పలకరించాలి, నమా'జ్‌ను స్థాపించాలి మరియు 'జకాత్ ఇవ్వాలి." అటుపిమ్మట మీలో కొందరు తప్ప, మిగతా వారంతా (తమ వాగ్దానం నుండి) తిరిగి పోయారు. మీరంతా విముఖులై పోయే వారే!

وَقَالُواْ لَن تَمَسَّنَا ٱلنَّارُ إِلَّآ أَيَّامًا مَّعۡدُودَةً ۚ قُلۡ أَتَّخَذۡتُمۡ عِندَ ٱللَّهِ عَهۡدًا فَلَن يُخۡلِفَ ٱللَّهُ عَهۡدَهُۥٓ ۖ أَمۡ تَقُولُونَ عَلَى ٱللَّهِ مَا لَا تَعۡلَمُونَ ﴿٨٠﴾

بَلَىٰ مَن كَسَبَ سَيِّئَةً وَأَحَٰطَتۡ بِهِۦ خَطِيٓـَٔتُهُۥ فَأُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ ٱلنَّارِ ۖ هُمۡ فِيهَا خَٰلِدُونَ ﴿٨١﴾

وَٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ أُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ ٱلۡجَنَّةِ ۖ هُمۡ فِيهَا خَٰلِدُونَ ﴿٨٢﴾

وَإِذۡ أَخَذۡنَا مِيثَٰقَ بَنِيٓ إِسۡرَٰٓءِيلَ لَا تَعۡبُدُونَ إِلَّا ٱللَّهَ وَبِٱلۡوَٰلِدَيۡنِ إِحۡسَانًا وَذِي ٱلۡقُرۡبَىٰ وَٱلۡيَتَٰمَىٰ وَٱلۡمَسَٰكِينِ وَقُولُواْ لِلنَّاسِ حُسۡنًا وَأَقِيمُواْ ٱلصَّلَوٰةَ وَءَاتُواْ ٱلزَّكَوٰةَ ثُمَّ تَوَلَّيۡتُمۡ إِلَّا قَلِيلًا مِّنكُمۡ وَأَنتُم مُّعۡرِضُونَ ﴿٨٣﴾

**1**. మిస్కీన్: నిత్యావసరాలకు తగినంత ఆదాయం లేకున్నా యాచించని పేదవాడు. ఫఖీర్: ఆదాయం లేనందుకు విధిలేక యాచించే నిరుపేదలు.

**84**. మరియు మేము మీ నుండి తీసుకున్న మరొక వాగ్దానాన్ని (జ్ఞాపకం చేసుకోండి); మీరు మీ (తోటి) వారి రక్తాన్ని చిందించగూడదని మరియు మీ వారిని, వారి ఇండ్లనుండి పారద్రోలగూడదని! అప్పుడు మీరు దానికి ఒప్పుకున్నారు. మరియు దానికి స్వయంగా మీరే సాక్షులు.

**85**. ఆ తరువాత మీరే ఒకరినొకరు చంపుకునేవారు. మరియు మీరు మీలోని ఒక వర్గం వారిని వారి ఇండ్లనుండి తరిమేవారు. మరియు వారికి అన్యాయం చేయటంలోనూ మరియు వారిపై దౌర్జన్యం చేయటంలోనూ, (వారి విరోధులకు) తోడ్పడే వారు. మరియు వారు (శత్రువుల చేతిలో) ఖైదీలై మీవద్దకు వచ్చినపుడు మీరు వారిని విమోచనా ధనం ఇచ్చి విడిపించే వారు. మరియు (వాస్తవానికి) వారిని తరమటం మీకు నిషిద్ధం చేయ బడింది. ఏమీ? మీరు గ్రంథంలోని కొన్ని విషయాలను విశ్వసించి మరికొన్నింటిని తిరస్కరిస్తారా?[1] మీలో ఇలా చేసేవారికి ఇహలోక జీవితంలో అవమానమూ

وَإِذْ أَخَذْنَا مِيثَٰقَكُمْ لَا تَسْفِكُونَ
دِمَآءَكُمْ وَلَا تُخْرِجُونَ أَنفُسَكُم
مِّن دِيَٰرِكُمْ ثُمَّ أَقْرَرْتُمْ وَأَنتُمْ
تَشْهَدُونَ ﴿٨٤﴾
ثُمَّ أَنتُمْ هَٰٓؤُلَآءِ تَقْتُلُونَ
أَنفُسَكُمْ وَتُخْرِجُونَ فَرِيقًا مِّنكُم
مِّن دِيَٰرِهِمْ تَظَٰهَرُونَ عَلَيْهِم
بِٱلْإِثْمِ وَٱلْعُدْوَٰنِ وَإِن يَأْتُوكُمْ
أُسَٰرَىٰ تُفَٰدُوهُمْ وَهُوَ مُحَرَّمٌ
عَلَيْكُمْ إِخْرَاجُهُمْ ۚ أَفَتُؤْمِنُونَ
بِبَعْضِ ٱلْكِتَٰبِ وَتَكْفُرُونَ
بِبَعْضٍ ۚ فَمَا جَزَآءُ مَن يَفْعَلُ
ذَٰلِكَ مِنكُمْ إِلَّا خِزْىٌ فِى

---

**1**. ఇస్లాంకు ముందు మదీనాలోని ముష్రిక్ అన్సార్లలో రెండు తెగలుండేవి: 1) 'ఔస్, 2) ఖ'జ్రజ్ మరియు యూదులలో మూడు: 1) బనూ-ఖైనుఖా'అ, 2) బనూ-న'దీర్, 3) బనూ-ఖురై''జహ్. 1. బనూ-ఖురై''జహ్ - 'ఔస్ వారి సమర్థీకు('హలీఫ్)లు. 2. బనూ-ఖైనుఖా'అ మరియు బనూ-న'దీర్ - ఖ'జ్రజ్ వారి సమర్థీకు('హలీఫ్)లు. వీరి మధ్య శత్రుత్వం వల్ల యుద్ధాలు జరిగినపుడు వీరు (యూదులు) తమ జాతి సోదరులైన యూదులను చంపే వారు. వారిని, వారి ఇండ్ల నుండి వెడల గొట్టేవారు. మరియు వారి సంపదలను దోచుకునే వారు. కాని వారు యుద్ధఖైదీలై, వీరి సమర్థీకు('హలీఫ్)ల దగ్గరికి వచ్చినప్పుడు, విమోచన ధనం ఇచ్చి వారిని విడిపించుకునే వారు. ఈ విధంగా వారు తమ గ్రంథంలోని కొన్ని చట్టాలను పాటించేవారు. మరి కొన్నింటిని ఉల్లంఘించేవారు.

ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَاۖ وَيَوۡمَ ٱلۡقِيَٰمَةِ
يُرَدُّونَ إِلَىٰٓ أَشَدِّ ٱلۡعَذَابِۗ وَمَا ٱللَّهُ
بِغَٰفِلٍ عَمَّا تَعۡمَلُونَ ٨٥

أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ ٱشۡتَرَوُاْ ٱلۡحَيَوٰةَ
ٱلدُّنۡيَا بِٱلۡأٓخِرَةِۖ فَلَا يُخَفَّفُ عَنۡهُمُ
ٱلۡعَذَابُ وَلَا هُمۡ يُنصَرُونَ ٨٦

وَلَقَدۡ ءَاتَيۡنَا مُوسَى ٱلۡكِتَٰبَ
وَقَفَّيۡنَا مِنۢ بَعۡدِهِۦ بِٱلرُّسُلِۖ
وَءَاتَيۡنَا عِيسَى ٱبۡنَ مَرۡيَمَ ٱلۡبَيِّنَٰتِ
وَأَيَّدۡنَٰهُ بِرُوحِ ٱلۡقُدُسِۗ أَفَكُلَّمَا
جَآءَكُمۡ رَسُولُۢ بِمَا لَا تَهۡوَىٰٓ أَنفُسُكُمُ
ٱسۡتَكۡبَرۡتُمۡ فَفَرِيقٗا كَذَّبۡتُمۡ وَفَرِيقٗا
تَقۡتُلُونَ ٨٧

మరియు పునరుత్థాన దినమున మిమ్మల్ని కఠిన శిక్షకు గురిచేయటం తప్ప మరెలాంటి ప్రతిఫలం ఉంటుంది? మరియు అల్లాహ్ మీ కర్మల విషయంలో నిర్లక్ష్యంగా లేడు.

**86**. ఇలాంటి వారే పరలోకానికి బదులుగా ఇహలోక జీవితాన్ని కొనే వారు! కావున వీరికి పడే శిక్ష తగ్గించబడదు మరియు వీరికి ఎలాంటి సహాయమూ లభించదు.

**87**. మరియు వాస్తవంగా మేము మూసాకు గ్రంథాన్ని (తౌరాత్‌ను) ప్రసాదించాము మరియు అతని తర్వాత వరుసగా ప్రవక్తలను పంపాము. మరియు మర్యమ్ కుమారుడైన 'ఈసాకు (ఏసుకు) స్పష్టమైన సూచనలను ఇచ్చాము[1] మరియు పరిశుద్ధాత్మతో (రూ'హుల్-ఖుదుస్‌తో) అతనిని బలపరిచాము.[2] ఏమీ? మీ మనోవాంఛలకు ప్రతికూలంగా ఉన్నదాన్ని తీసుకొని, ఏ ప్రవక్త అయినా మీ వద్దకు వస్తే, మీరు వారిపట్ల దురహంకారంతో ప్రవర్తించ లేదా? వారిలో కొందరిని మీరు అసత్యవాదులన్నారు, మరికొందరిని చంపారు.[3]

---

**1**. 'ఈసా('అ.స.)కు అల్లాహుతా'ఆలా ప్రసాదించిన అద్భుత సూచనలు: చచ్చిన వారిని బ్రతికించటం, కుష్ఠురోగులను బాగుచేయటం మరియు పుట్టుగ్రుడ్డి వారికి చూపునివ్వటం మొదలైనవి. చూడండి, 3:49.

**2**. పరిశుద్ధాత్మ అంటే జిబ్రీల్ ('అ.స.), (ఫ'త్హ్ అల్-బయాన్, ఇబ్నె-కసీ'ర్ - బు'ఖారీ, ముస్లిం, అబూ-దావూద్, తిర్మిజీ'). మహాప్రవక్త ('స'అస): కవి 'హస్సాన్(ర'ది.'అ.)కు రూ'హుల్-ఖుదుస్ (జిబ్రీల్ 'అ.స.) సమర్థన కొరకు అల్లాహ్ (సు.తా.)ను ప్రార్థించారు.

**3**. 'ఈసా ('అ.స.)ను అబద్ధీకుడన్నారు. 'జకరియ్యా మరియు య'హ్యా ('అలైహిమ్ స.)లను చంపారు, (ముహమ్మద్ జూనాగఢి). ఇంకా చూడండి, 2:61 వ్యాఖ్యానం 1.

وَقَالُواْ قُلُوبُنَا غُلۡفُۢۚ بَل لَّعَنَهُمُ ٱللَّهُ بِكُفۡرِهِمۡ فَقَلِيلٗا مَّا يُؤۡمِنُونَ ﴿٨٨﴾

**88**. మరియు వారు: ''మా హృదయాలు మూయబడి ఉన్నాయి.'' అని అంటారు. అలాకాదు (అది నిజం కాదు)! వారి సత్య తిరస్కారం వలన అల్లాహ్ వారిని శపించాడు (బహిష్కరించాడు).[1] ఎందుకంటే వారు విశ్వసించేది చాలా తక్కువ.

وَلَمَّا جَآءَهُمۡ كِتَٰبٞ مِّنۡ عِندِ ٱللَّهِ مُصَدِّقٞ لِّمَا مَعَهُمۡ وَكَانُواْ مِن قَبۡلُ يَسۡتَفۡتِحُونَ عَلَى ٱلَّذِينَ كَفَرُواْ فَلَمَّا جَآءَهُم مَّا عَرَفُواْ كَفَرُواْ بِهِۦۚ فَلَعۡنَةُ ٱللَّهِ عَلَى ٱلۡكَٰفِرِينَ ﴿٨٩﴾

**89**. మరియు ఇప్పుడు వారి వద్ద నున్న దానిని (తౌరాత్‌ను) ధృవీకరించే గ్రంథం (ఈ ఖుర్ఆన్) అల్లాహ్ తరఫునుండి వారి వద్దకు వచ్చింది. మరియు దీనికి ముందు వారు సత్యతిరస్కారులపై విజయం కొరకు ప్రార్థించే వారు. ఇప్పుడు సత్యమని గుర్తించబడినది (ఈ గ్రంథం) వచ్చినా, వారు దానిని తిరస్కరించారు. కాబట్టి, సత్య తిరస్కారులపై అల్లాహ్ అభిశాపం (బహిష్కారం) అవతరిస్తుంది.

بِئۡسَمَا ٱشۡتَرَوۡاْ بِهِۦٓ أَنفُسَهُمۡ أَن يَكۡفُرُواْ بِمَآ أَنزَلَ ٱللَّهُ بَغۡيًا أَن يُنَزِّلَ ٱللَّهُ مِن فَضۡلِهِۦ عَلَىٰ مَن يَشَآءُ مِنۡ عِبَادِهِۦۖ فَبَآءُو بِغَضَبٍ عَلَىٰ غَضَبٖۚ وَلِلۡكَٰفِرِينَ عَذَابٞ مُّهِينٞ ﴿٩٠﴾

**90**. అల్లాహ్ అవతరింపజేసిన సందేశాన్ని (ఖుర్ఆన్‌ను) తిరస్కరించి, వారు ఎంత నీచమైన మూల్యానికి తమను తాము అమ్ముకున్నారు! వారి (తిరస్కారం) అల్లాహ్! తన దాసులలో తాను కోరిన వారిపై, తన అనుగ్రహం (ఖుర్ఆన్ / ప్రవక్తృత్వం) అవతరింపజేశాడనే కక్ష వల్లనే! కనుక వారు (అల్లాహ్) క్రోధం మీద మరింత క్రోధానికి గురిఅయ్యారు. మరియు ఇలాంటి సత్యతిరస్కారులకు అవమానకరమైన శిక్ష ఉంది.

---

**1**. ల'అనతున్: Wrath, Banishment, Rejection, Deprivation అంటే అల్లాహ్ (సు.తా.) అనుగ్రహాల నుండి **బహిష్కరించ, శపించ**, నిషేధించ, త్రోసివేయ, దూషించ బడటం, మరియు అభిశాపం అనే అర్థాలున్నాయి.

وَإِذَا قِيلَ لَهُمْ ءَامِنُوا۟ بِمَآ أَنزَلَ
ٱللَّهُ قَالُوا۟ نُؤْمِنُ بِمَآ أُنزِلَ عَلَيْنَا
وَيَكْفُرُونَ بِمَا وَرَآءَهُۥ وَهُوَ
ٱلْحَقُّ مُصَدِّقًا لِّمَا مَعَهُمْ ۗ قُلْ فَلِمَ
تَقْتُلُونَ أَنۢبِيَآءَ ٱللَّهِ مِن قَبْلُ إِن
كُنتُم مُّؤْمِنِينَ ﴿٩١﴾

**91**. మరియు వారి(యూదుల)తో: "అల్లాహ్ అవతరింపజేసిన దానిని (ఈ ఖుర్ఆన్‌ను) విశ్వసించండి." అని అన్నప్పుడు, వారు: "మా (ఇస్రాయీ'ల్) వారిపై అవతరింపజేయబడిన దానిని (తౌరాత్‌ను) మాత్రమే మేము విశ్వసిస్తాము." అని అంటారు. మరియు దాని తరువాత వచ్చినది (ఈ ఖుర్ఆన్) సత్యమైనప్పటికీ మరియు వారివద్ద నున్న దానిని (తౌరాత్‌ను) ధృవపరుస్తున్నప్పటికీ, దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) తిరస్కరిస్తున్నారు. (ఓ ము'హమ్మద్) వారిని అడుగు: "మీరు (మీ వద్దనున్న గ్రంథాన్ని) విశ్వసించే వారే అయితే ఇంతకు పూర్వం వచ్చిన అల్లాహ్ ప్రవక్తలను ఎందుకు హత్య చేస్తూ వచ్చారు?"[1] (5/8)

۞ وَلَقَدْ جَآءَكُم مُّوسَىٰ
بِٱلْبَيِّنَٰتِ ثُمَّ ٱتَّخَذْتُمُ ٱلْعِجْلَ
مِنۢ بَعْدِهِۦ وَأَنتُمْ ظَٰلِمُونَ
﴿٩٢﴾

**92**. * మరియు వాస్తవానికి మూసా స్పష్టమైన సూచనలను తీసుకొని మీ వద్దకు వచ్చాడు. తరువాత అతను పోగానే, మీరు ఆవుదూడ (విగ్రహాన్ని) ఆరాధ్యదైవంగా చేసుకున్నారు. మరియు మీరు ఎంత దుర్మార్గులు!

وَإِذْ أَخَذْنَا مِيثَٰقَكُمْ وَرَفَعْنَا
فَوْقَكُمُ ٱلطُّورَ خُذُوا۟ مَآ
ءَاتَيْنَٰكُم بِقُوَّةٍ وَٱسْمَعُوا۟ ۖ
قَالُوا۟ سَمِعْنَا وَعَصَيْنَا وَأُشْرِبُوا۟ فِى
قُلُوبِهِمُ ٱلْعِجْلَ بِكُفْرِهِمْ ۚ

**93**. మరియు మేము తూర్‌పర్వతాన్ని ఎత్తి మీపై నిలిపి మీ నుంచి తీసుకున్న ప్రమాణాన్ని (జ్ఞాపకం చేసుకోండి): "మేము మీకు చేస్తున్న వాటిని (ఉపదేశాలను) స్థిరంగా పాటించండి మరియు జాగ్రత్తగా వినండి." అని చెప్పాము. వారు: "మేము విన్నాము కానీ, అతిక్రమిస్తున్నాము." అని అన్నారు, వారి సత్యతిరస్కారం వలన వారి హృదయాలలో ఆవుదూడ ప్రేమ

---

1. చూడండి, 2:61 మరియు 2:87.

قُلْ بِئْسَمَا يَأْمُرُكُم بِهِۦٓ إِيمَٰنُكُمْ إِن كُنتُم مُّؤْمِنِينَ ﴿٩٣﴾

నిండిపోయింది. వారితో అను: "మీరు విశ్వాసులే అయితే! ఈ చెడు చేష్టలను చేయమని మిమ్మల్ని ఆదేశించే మీ ఈ విశ్వాసం చాలా చెడ్డది."

قُلْ إِن كَانَتْ لَكُمُ ٱلدَّارُ ٱلْأَخِرَةُ عِندَ ٱللَّهِ خَالِصَةً مِّن دُونِ ٱلنَّاسِ فَتَمَنَّوُا۟ ٱلْمَوْتَ إِن كُنتُمْ صَٰدِقِينَ ﴿٩٤﴾

**94**. వారితో ఇలా అను: "ఒకవేళ అల్లాహ్ వద్ద నున్న పరలోక నివాసం మానవులందరికీ కాక కేవలం, మీకు మాత్రమే ప్రత్యేకించబడి ఉంటే[1] - మీరు మీ ఈ అభిప్రాయంలో సత్యవంతులే అయితే - మీరు మరణాన్ని కోరండి!"

وَلَن يَتَمَنَّوْهُ أَبَدًۢا بِمَا قَدَّمَتْ أَيْدِيهِمْ ۗ وَٱللَّهُ عَلِيمٌۢ بِٱلظَّٰلِمِينَ ﴿٩٥﴾

**95**. కాని వారు ఎన్నటికీ దానిని (మరణాన్ని) కోరరు. ఎందుకంటే, వారు తమ చేతులారా చేసి పంపినవి (తమ కర్మలు) వారికి బాగా తెలుసు. ఈ దుర్మార్గుల విషయం అల్లాహ్‌కు బాగా తెలుసు.

وَلَتَجِدَنَّهُمْ أَحْرَصَ ٱلنَّاسِ عَلَىٰ حَيَوٰةٍ وَمِنَ ٱلَّذِينَ أَشْرَكُوا۟ ۚ يَوَدُّ أَحَدُهُمْ لَوْ يُعَمَّرُ أَلْفَ سَنَةٍ وَمَا هُوَ بِمُزَحْزِحِهِۦ مِنَ ٱلْعَذَابِ أَن يُعَمَّرَ ۗ وَٱللَّهُ بَصِيرٌۢ بِمَا يَعْمَلُونَ ﴿٩٦﴾

**96**. మరియు నిశ్చయంగా, జీవితం పట్ల సర్వజనుల కంటే ఎక్కువ వ్యామోహం వారి (యూదుల)లోనే ఉందనే విషయం నీవు గ్రహిస్తావు. ఈ విషయంలో వారు ముష్రికులను కూడా మించిపోయారు. వారిలో ప్రతి ఒక్కడూ వేయి సంవత్సరాలు బ్రతకాలని కోరుతుంటాడు. కానీ, దీర్ఘాయుర్ధాయం వారిని శిక్ష నుండి తప్పించ లేదు. మరియు వారు చేసేదంతా అల్లాహ్ చూస్తున్నాడు.[2]

قُلْ مَن كَانَ عَدُوًّا لِّجِبْرِيلَ فَإِنَّهُۥ نَزَّلَهُۥ عَلَىٰ قَلْبِكَ بِإِذْنِ ٱللَّهِ

**97**. (ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను: "జిబ్రీల్ పట్ల విరోధమున్న ప్రతివాడూ ఈ యథార్థాన్ని గ్రహించాలి. అల్లాహ్

---

**1**. చూడండి, 2:111.

**2**. అల్-బ'సీరు: The All- Seeing. సర్వదృష్టికర్త, అంతా చూడ, గమనించ గలవాడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

مُصَدِّقًا لِّمَا بَيْنَ يَدَيْهِ
وَهُدًى وَبُشْرَىٰ لِلْمُؤْمِنِينَ
﴿٩٧﴾

ఆజ్ఞతోనే అతను ఈ ఖుర్ఆన్‌ను నీ హృదయంపై అవతరింపజేశాడు. పూర్వం వచ్చిన అన్ని దివ్య గ్రంథాలను ఇది ధృవీకరిస్తున్నది. మరియు విశ్వసించే వారికి ఇది సన్మార్గం చూపుతున్నది మరియు శుభవార్తను ఇస్తున్నది.[1]

مَن كَانَ عَدُوًّا لِّلَّهِ وَمَلَٰٓئِكَتِهِۦ
وَرُسُلِهِۦ وَجِبْرِيلَ وَمِيكَىٰلَ
فَإِنَّ ٱللَّهَ عَدُوٌّ لِّلْكَٰفِرِينَ ﴿٩٨﴾

**98**. "అల్లాహ్‌కు ఆయన దూతలకు, ఆయన ప్రవక్తలకు, జిబ్రీల్‌కు మరియు మీకాయీ'ల్‌కు ఎవరు శత్రువులో, నిశ్చయంగా అలాంటి సత్యతిరస్కారులకు అల్లాహ్ శత్రువు."[2]

وَلَقَدْ أَنزَلْنَآ إِلَيْكَ ءَايَٰتٍۭ
بَيِّنَٰتٍ ۖ وَمَا يَكْفُرُ بِهَآ إِلَّا
ٱلْفَٰسِقُونَ ﴿٩٩﴾

**99**. మరియు వాస్తవంగా, మేము నీపై స్పష్టమైన సూచనలు (ఆయాత్) అవతరింపజేశాము. మరియు అవిధేయులు తప్ప మరెవ్వరూ వాటిని తిరస్కరించరు.

أَوَكُلَّمَا عَٰهَدُوا۟ عَهْدًا نَّبَذَهُۥ
فَرِيقٌ مِّنْهُم ۚ بَلْ أَكْثَرُهُمْ لَا
يُؤْمِنُونَ ﴿١٠٠﴾

**100**. ఏమీ? వారు ఒడంబడిక చేసినపుడల్లా, వారిలో ఒక వర్గం వారు దానిని త్రోసిపుచ్చటం జరగలేదా? వాస్తవానికి వారిలో చాలా మంది విశ్వసించని వారున్నారు.

---

**1**. కొందరు యూద మతాచారులు మహాప్రవక్త ('స'అస) దగ్గరికి వచ్చి అన్నారు: "మీరు మా కొన్ని ప్రశ్నలకు సరైన జవాబులు ఇస్తే మేము ఇస్లాం స్వీకరిస్తాము. ఎందుకంటే ఒక ప్రవక్త తప్ప మరొకరు వీటికి జవాబివ్వలేరు." మహాప్రవక్త ('స'అస) వారి ప్రశ్నలన్నింటికీ జవాబిచ్చారు. వారు ఇలా అన్నారు: "మీ వద్దకు వ'హీ ఎవరు తెస్తారు?" అతను జవాబిచ్చారు: "జిబ్రీల్ ('అ.స.)." వారన్నారు: "జిబ్రీల్ ('అ.స.) మా శత్రువు, అతనే మాపై యుద్ధాలను మరియు శిక్షలను అవతరింపజేశాడు, కాబట్టి మేము మిమ్మల్ని ప్రవక్తగా నమ్మము." అని అంటూ వెళ్ళిపోయారు, (ఇబ్నె-కసీ'ర్ మరియు ఫ'త్హ్ అల్-ఖదీర్, ర.'అలైహిమ్).

**2**. యూదులు అంటారు: "మీకాయీ'ల్ ('అ.స.) మా స్నేహితుడు." అల్లాహ్ (సు.తా.) అంటాడు: "వీరంతా నాకు ప్రియమైన నా దాసులు. కావున ఏ వ్యక్తి అయినా వీరిలో ఏ ఒక్కరికీ శత్రువైనా వాడు నాకూ శత్రువే!"

**101**. మరియు వారి దగ్గర పూర్వం నుంచే ఉన్న దానిని (దివ్య గ్రంథాన్ని) ధృవపరుస్తూ - ఒక ప్రవక్త (ము'హమ్మద్) - అల్లాహ్ తరఫునుండి వారి వద్దకు వచ్చినప్పుడు, గ్రంథ ప్రజలలోని ఒక వర్గం వారు దానిని గురించి ఏమీ తెలియని వారిగా, అల్లాహ్ గ్రంథాన్ని తమ వీపుల వెనుకకు త్రోసివేశారు.[1]

**102**. మరియు వారు సులైమాన్ రాజ్యకాలమున, షైతానులు పఠించే దానిని (జాలవిద్యను) అనుసరించారు. సులైమాన్ సత్యతిరస్కారి కాలేదు; కానీ నిశ్చయంగా, షైతానులు సత్యాన్ని తిరస్కరించారు. వారు బాబీలోన్ నగరమందు, హారూత్, మారూత్, అనే ఇద్దరు దేవదూతల ద్వారా తేబడిన జాలవిద్యను ప్రజలకు నేర్పుచుండిరి. ఎవరికైనా ఆ విద్యను నేర్పేటప్పుడు, వారిద్దరు (దేవదూతలు) ఇలా చెప్పే వారు: "నిశ్చయంగా, మేము (మానవులకు) ఒక పరీక్ష! కాబట్టి మీరు (ఈ జాలవిద్యను నేర్చుకొని) సత్యతిరస్కారులు కాకండి." అయినప్పటికీ వారు (ప్రజలు), భార్యా భర్తలకు ఎడబాటు కలిగించే (జాలవిద్య) వారిద్దరి దగ్గర నేర్చుకునేవారు. మరియు అల్లాహ్ అనుమతి లేనిదే, దానిద్వారా ఎవరికీ ఏ మాత్రం హాని కలిగించలేరు. మరియు వారు నేర్చుకునేది, వారికి నష్టం

وَلَمَّا جَآءَهُمۡ رَسُولٞ مِّنۡ عِندِ
ٱللَّهِ مُصَدِّقٞ لِّمَا مَعَهُمۡ نَبَذَ
فَرِيقٞ مِّنَ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡكِتَٰبَ
كِتَٰبَ ٱللَّهِ وَرَآءَ ظُهُورِهِمۡ
كَأَنَّهُمۡ لَا يَعۡلَمُونَ ١٠١
وَٱتَّبَعُواْ مَا تَتۡلُواْ ٱلشَّيَٰطِينُ عَلَىٰ
مُلۡكِ سُلَيۡمَٰنَۖ وَمَا كَفَرَ
سُلَيۡمَٰنُ وَلَٰكِنَّ ٱلشَّيَٰطِينَ
كَفَرُواْ يُعَلِّمُونَ ٱلنَّاسَ ٱلسِّحۡرَ
وَمَآ أُنزِلَ عَلَى ٱلۡمَلَكَيۡنِ بِبَابِلَ
هَٰرُوتَ وَمَٰرُوتَۚ وَمَا يُعَلِّمَانِ مِنۡ
أَحَدٍ حَتَّىٰ يَقُولَآ إِنَّمَا نَحۡنُ فِتۡنَةٞ
فَلَا تَكۡفُرۡۖ فَيَتَعَلَّمُونَ مِنۡهُمَا مَا
يُفَرِّقُونَ بِهِۦ بَيۡنَ ٱلۡمَرۡءِ وَزَوۡجِهِۦۚ
وَمَا هُم بِضَآرِّينَ بِهِۦ مِنۡ أَحَدٍ
إِلَّا بِإِذۡنِ ٱللَّهِۚ وَيَتَعَلَّمُونَ مَا
يَضُرُّهُمۡ وَلَا يَنفَعُهُمۡۚ

---

**1**. యూదుల దివ్య గ్రంథం (తౌరాత్)లో: "అరేబియాలో ఒక ప్రవక్త వస్తాడు, మీరు అతనిని అనుసరించాలి." అని, ప్రస్తావన ఉన్నా, వారు లెక్కచేయకుండా దానిని (తౌరాత్‌ను) తమ వీపులవెనుకకు త్రోసివేశారు. చూడండి, 2:42, 76.

وَلَقَدْ عَلِمُوا۟ لَمَنِ ٱشْتَرَىٰهُ مَا لَهُۥ فِى ٱلْءَاخِرَةِ مِنْ خَلَٰقٍ ۚ وَلَبِئْسَ مَا شَرَوْا۟ بِهِۦٓ أَنفُسَهُمْ ۚ لَوْ كَانُوا۟ يَعْلَمُونَ ﴿١٠٢﴾

కలిగించేదే, కాని లాభం కలిగించేది ఎంత మాత్రం కాదు. మరియు వాస్తవానికి దానిని (జాలవిద్యను) స్వీకరించేవానికి పరలోక సౌఖ్యాలలో ఏ మాత్రమూ భాగం లేదని వారికి బాగా తెలుసు. మరియు వారు ఎంత తుచ్ఛమైన సొమ్ముకు బదులుగా తమను తాము అమ్ముకున్నారు! ఇది వారికి తెలిస్తే ఎంత బాగుండేది!

وَلَوْ أَنَّهُمْ ءَامَنُوا۟ وَٱتَّقَوْا۟ لَمَثُوبَةٌ مِّنْ عِندِ ٱللَّهِ خَيْرٌ ۖ لَّوْ كَانُوا۟ يَعْلَمُونَ ﴿١٠٣﴾

**103**. మరియు వారు విశ్వసించి, దైవభీతి కలిగిఉండినట్లయితే! నిశ్చయంగా, అల్లాహ్ తరఫునుండి వారికి ఎంతో శ్రేష్ఠమైన ప్రతిఫలం లభించి ఉండేది. దీనిని వారు గ్రహిస్తే ఎంత బాగుండేది!

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تَقُولُوا۟ رَٰعِنَا وَقُولُوا۟ ٱنظُرْنَا وَٱسْمَعُوا۟ ۗ وَلِلْكَٰفِرِينَ عَذَابٌ أَلِيمٌ ﴿١٠٤﴾

**104**. ఓ విశ్వాసులారా, (మీరు ప్రవక్తతో మాట్లాడేటప్పుడు) *రా'ఇనా!* అని అనకండి. ఉన్''జుర్నా! అని (గౌరవంతో) అనండి[1] మరియు (అతని మాటలను) శ్రద్ధతో వినండి. మరియు సత్యతిరస్కారులకు బాధాకరమైన శిక్ష గలదు.

مَّا يَوَدُّ ٱلَّذِينَ كَفَرُوا۟ مِنْ أَهْلِ ٱلْكِتَٰبِ وَلَا ٱلْمُشْرِكِينَ أَن يُنَزَّلَ عَلَيْكُم مِّنْ خَيْرٍ مِّن رَّبِّكُمْ ۗ

**105**. సత్యతిరస్కారులైన గ్రంథ ప్రజలకు గానీ మరియు బహుదైవారాధకు (ముష్రికు)లకు గానీ, మీ ప్రభువు నుండి మీకు ఏదైనా మేలు అవతరించడం ఎంత

**1**. *రా'ఇనా*: అంటే, Be careful; Listen to us, we listen to you. ఆగండి! మా మాట వినండి, మేము మీ మాట వింటాము, అని అర్థం. కాని యూదులు ఈ పదాన్ని తమ నాలుకలను త్రిప్పి, హీబ్రూ భాషలో, 'రా'ఈనా' - మా పశువుల కాపరి, లేక మూర్ఖుడు. అనే అర్థం ఇచ్చే దురుద్దేశంతో పలికి తమ కక్ష తీర్చుకునేవారు. కాబట్టి విశ్వాసులతో: మీరు 'ఉన్‌జుర్నా' అంటే 'మమ్మల్ని అర్థం చేసుకోనివ్వండి.' అని గౌరవంతో, అనమని ఆజ్ఞ ఇవ్వబడుతోంది. ఇదే విధంగా యూదులు 'అస్సలాము అలైకుమ్' (మీకు శాంతి కలుగు గాక)! అనే మాటను నాలుకలు త్రిప్పి 'అస్సాము అలైకుమ్' (మీకు చావు వచ్చు గాక)! అనే అర్థంలో వాడేవారు. ఇంకా చూడండి, ఖు. 4:46.

وَٱللَّهُ يَخۡتَصُّ بِرَحۡمَتِهِۦ مَن يَشَآءُۚ وَٱللَّهُ ذُو ٱلۡفَضۡلِ ٱلۡعَظِيمِ ١٠٥

మాత్రం ఇష్టంలేదు. కానీ అల్లాహ్ తాను కోరిన వారినే తన కరుణకు ప్రత్యేకించు కుంటాడు. మరియు అల్లాహ్ అనుగ్రహించటంలో సర్వోత్తముడు.[1] (3/4)

۞ مَا نَنسَخۡ مِنۡ ءَايَةٍ أَوۡ نُنسِهَا نَأۡتِ بِخَيۡرٖ مِّنۡهَآ أَوۡ مِثۡلِهَآۗ أَلَمۡ تَعۡلَمۡ أَنَّ ٱللَّهَ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٌ ١٠٦

**106.** * మేము మా ప్రవచనా (ఆయాత్)లలో ఒక దానిని రద్దుచేసినా లేక మరపింపజేసినా దాని స్థానంలో దాని కంటే శ్రేష్ఠమైన దానిని లేక కనీసం దానితో సమానమైన దానిని తీసుకు వస్తాము. ఏమీ? నిశ్చయంగా, అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడని నీకు తెలియదా?

أَلَمۡ تَعۡلَمۡ أَنَّ ٱللَّهَ لَهُۥ مُلۡكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۗ وَمَا لَكُم مِّن دُونِ ٱللَّهِ مِن وَلِيّٖ وَلَا نَصِيرٍ ١٠٧

**107.** ఏమీ? వాస్తవానికి, భూమ్యాకాశాల సామ్రాజ్యాధిపత్యం కేవలం అల్లాహ్‌కే చెందు తుందని, నీకు తెలియదా? మరియు అల్లాహ్ తప్ప మిమ్మల్ని రక్షించేవాడు[2] గానీ, సహాయం చేసేవాడు గానీ మరెవ్వడూ లేడు!

أَمۡ تُرِيدُونَ أَن تَسۡـَٔلُواْ رَسُولَكُمۡ كَمَا سُئِلَ مُوسَىٰ مِن قَبۡلُۗ وَمَن يَتَبَدَّلِ ٱلۡكُفۡرَ بِٱلۡإِيمَٰنِ فَقَدۡ ضَلَّ سَوَآءَ ٱلسَّبِيلِ ١٠٨

**108.** ఏమీ? పూర్వం (యూదులచే) మూసా ప్రశ్నించబడినట్లు, మీరు కూడా మీ ప్రవక్త(ముహమ్మద్)ను ప్రశ్నించ గోరుతున్నారా? మరియు ఎవడైతే, సత్యతిరస్కారాన్ని, విశ్వాసానికి బదులుగా స్వీకరిస్తాడో! నిశ్చయంగా, వాడే సరైనమార్గం నుండి తప్పిపోయిన వాడు.

---

1. **అల్-'అ''జీము:** అంటే అల్-కబీరు. The Greatest of all, The Supreme, The Incomparably Great. సర్వోత్తముడు, మహాత్ముడు, పరమశ్రేష్ఠుడు, సర్వోత్కృష్టుడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.
2. **అల్-వలియ్యు:** అంటే అస్-సయ్యిద్, Patron, Protector, Owner, Defender, Friend, సంరక్షకుడు, ఆరాధ్యుడు, స్నేహితుడు, సహాయకుడు, రక్షించువాడు, స్వామి, అండగా నిలుచువాడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి. చూడండి, 6:14.

**109**. గ్రంథ ప్రజలలోని పలువురు - వారి మనస్సులలో ఉన్న అసూయవల్ల - సత్యం వారికి సుస్పష్టం అయినప్పటికీ, మీరు విశ్వసించిన తరువాత, మిమ్మల్ని ఏదో ఒక విధంగా, దాని (విశ్వాసమార్గం) నుండి మరల్చి, మళ్ళీ సత్యతిరస్కారం వైపునకు తీసుకుపోదామని కోరుతుంటారు. అయితే (వారి పట్ల) అల్లాహ్ తన ఆదేశం ఇచ్చేవరకు, మీరు (వారిని) మన్నించండి, ఉపేక్షించండి. నిశ్చయంగా, అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

**110**. మరియు నమాజ్ స్థాపించండి.[1] విధిదానం (జకాత్) ఇవ్వండి. మీరు ముందుగా చేసి పంపిన మంచి కార్యాలను మీరు అల్లాహ్ దగ్గర పొందుతారు. నిశ్చయంగా, అల్లాహ్ మీరు చేసేదంతా చూస్తున్నాడు.

**111**. మరియు వారు: "యూదుడు లేదా క్రైస్తవుడు తప్ప, మరెవ్వడూ స్వర్గంలో ప్రవేశించ లేడు!" అని అంటారు. ఇవి వారి అభిలాషలు మాత్రమే. వారిని ఇలా అడుగు: "మీరు సత్యవంతులే అయితే దానికి మీ నిదర్శనాలు చూపండి!"

**112**. వాస్తవానికి ఎవడైతే అల్లాహ్‌కు విధేయుడై (ఇస్లాం స్వీకరించి) తన ముఖాన్ని (తనను తాను) అల్లాహ్‌కు అంకితం చేసుకొని, సజ్జనుడై ఉంటాడో! దానికి అతడు తన ప్రభువు వద్ద మంచి ప్రతిఫలం

وَدَّ كَثِيرٌ مِّنْ أَهْلِ ٱلْكِتَٰبِ
لَوْ يَرُدُّونَكُم مِّنۢ بَعْدِ إِيمَٰنِكُمْ
كُفَّارًا حَسَدًا مِّنْ عِندِ أَنفُسِهِم
مِّنۢ بَعْدِ مَا تَبَيَّنَ لَهُمُ ٱلْحَقُّ ۖ
فَٱعْفُوا۟ وَٱصْفَحُوا۟ حَتَّىٰ يَأْتِىَ ٱللَّهُ
بِأَمْرِهِۦٓ ۗ إِنَّ ٱللَّهَ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ
﴿١٠٩﴾

وَأَقِيمُوا۟ ٱلصَّلَوٰةَ وَءَاتُوا۟ ٱلزَّكَوٰةَ ۚ وَمَا
تُقَدِّمُوا۟ لِأَنفُسِكُم مِّنْ خَيْرٍ تَجِدُوهُ
عِندَ ٱللَّهِ ۗ إِنَّ ٱللَّهَ بِمَا تَعْمَلُونَ
بَصِيرٌ ﴿١١٠﴾

وَقَالُوا۟ لَن يَدْخُلَ ٱلْجَنَّةَ إِلَّا مَن
كَانَ هُودًا أَوْ نَصَٰرَىٰ ۗ تِلْكَ
أَمَانِيُّهُمْ ۗ قُلْ هَاتُوا۟ بُرْهَٰنَكُمْ
إِن كُنتُمْ صَٰدِقِينَ ﴿١١١﴾

بَلَىٰ مَنْ أَسْلَمَ وَجْهَهُۥ لِلَّهِ وَهُوَ
مُحْسِنٌ فَلَهُۥٓ أَجْرُهُۥ عِندَ رَبِّهِۦ وَلَا
خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ﴿١١٢﴾

---

1. అంటే నమాజ్‌లను వాటి సమయాలలో, సరిగ్గా దినానికి ఐదు సార్లు, పురుషులు జమా'అత్‌తో మరియు స్త్రీలు ఇండ్లలో పాటించాలి, అని అర్థం.

పొందుతాడు.[1] మరియు వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా!

**113**. మరియు యూదులు: "క్రైస్తవుల వద్ద (సత్యధర్మమనేది) ఏమీ లేదు!" అని అంటారు. మరియు క్రైస్తవులు: "యూదుల వద్ద (సత్యధర్మమనేది) ఏమీ లేదు." అని అంటారు. మరియు వారందరూ చదివేది దివ్యగ్రంథమే. ఇలాగే (దివ్యగ్రంథ) జ్ఞానం లేనివారు (బహుదైవారాధకులు) కూడా ఇదేవిధంగా పలుకుతుంటారు. కావున వీరందరిలో ఉన్న అభిప్రాయ భేదాలను గురించి, అల్లాహ్ పునరుత్థాన దినమున వారి మధ్య తీర్పుచేస్తాడు.

**114**. మరియు అల్లాహ్ మస్జిద్‌లలో ఆయన నామస్మరణం నిషేధించి వాటిని నాశనం చేయటానికి పాటుపడే వారి కంటే ఎక్కువ దుర్మార్గులెవరు? అలాంటి వారు వాటి(మస్జిద్‌ల)లో ప్రవేశించటానికి అర్హులు కారు; వారు (ఒకవేళ ప్రవేశించినా) భయపడుతూ ప్రవేశించాలి. వారికి ఇహలోకంలో పరాభవం ఉంటుంది మరియు పరలోకంలో ఘోర శిక్ష ఉంటుంది.

**115**. మరియు తూర్పు పడమరలు అల్లాహ్‌కే చెందినవి. కావున మీరు (మీ ముఖాలను) ఏ దిక్కుకు త్రిప్పినా మీకు అల్లాహ్ సముఖమే లభిస్తుంది. నిశ్చయంగా, అల్లాహ్, సర్వవ్యాపి,[2] సర్వజ్ఞుడు.

وَقَالَتِ ٱلۡيَهُودُ لَيۡسَتِ ٱلنَّصَٰرَىٰ عَلَىٰ
شَيۡءٖ وَقَالَتِ ٱلنَّصَٰرَىٰ لَيۡسَتِ ٱلۡيَهُودُ
عَلَىٰ شَيۡءٖ وَهُمۡ يَتۡلُونَ ٱلۡكِتَٰبَۗ
كَذَٰلِكَ قَالَ ٱلَّذِينَ لَا يَعۡلَمُونَ مِثۡلَ
قَوۡلِهِمۡۚ فَٱللَّهُ يَحۡكُمُ بَيۡنَهُمۡ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ
فِيمَا كَانُواْ فِيهِ يَخۡتَلِفُونَ ١١٣

وَمَنۡ أَظۡلَمُ مِمَّن مَّنَعَ مَسَٰجِدَ ٱللَّهِ أَن
يُذۡكَرَ فِيهَا ٱسۡمُهُۥ وَسَعَىٰ فِي خَرَابِهَآۚ
أُوْلَٰٓئِكَ مَا كَانَ لَهُمۡ أَن يَدۡخُلُوهَآ
إِلَّا خَآئِفِينَۚ لَهُمۡ فِي ٱلدُّنۡيَا
خِزۡيٞ وَلَهُمۡ فِي ٱلۡأٓخِرَةِ عَذَابٌ
عَظِيمٞ ١١٤

وَلِلَّهِ ٱلۡمَشۡرِقُ وَٱلۡمَغۡرِبُۚ فَأَيۡنَمَا تُوَلُّواْ
فَثَمَّ وَجۡهُ ٱللَّهِۚ إِنَّ ٱللَّهَ وَٰسِعٌ
عَلِيمٞ ١١٥

---

1. "అస్లమ వజ్‌హహు లిల్లాహ్." అంటే, కేవలం అల్లాహ్ (సు.తా.) ప్రసన్నత కొరకే ఏదైనా చేయాలి. "వహువ ము'హ్సినున్:" అంటే ఏ పనైనా హృదయపూర్వకంగా, మహాప్రవక్త ('స'అస) ఆదేశాల ప్రకారం చేయాలి. చేసిన కార్యాలకు మంచి ప్రతిఫలం పొందటానికి, ఈ రెండు విషయాలను దృష్టిలో ఉంచుకోవటం ఎంతో అవసరం. (ఇబ్నె-కసీ'ర్).

2. అల్-వాసి'ఉ: *The All-Embracing*, Infinite, Pervading, Bountiful, Comprehending

وَقَالُواْ ٱتَّخَذَ ٱللَّهُ وَلَدًاۗ سُبۡحَٰنَهُۥۖ بَل لَّهُۥ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۖ كُلّٞ لَّهُۥ قَٰنِتُونَ ١١٦

بَدِيعُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۖ وَإِذَا قَضَىٰٓ أَمۡرٗا فَإِنَّمَا يَقُولُ لَهُۥ كُن فَيَكُونُ ١١٧

وَقَالَ ٱلَّذِينَ لَا يَعۡلَمُونَ لَوۡلَا يُكَلِّمُنَا ٱللَّهُ أَوۡ تَأۡتِينَآ ءَايَةٞۗ كَذَٰلِكَ قَالَ ٱلَّذِينَ مِن

**116**. మరియు వారు: "అల్లాహ్ ఒక కుమారుణ్ణి కలిగి ఉన్నాడు (కన్నాడు)." అని అంటారు. ఆయన సర్వలోపాలకు అతీతుడు.[1] వాస్తవానికి భూమ్యాకాశాలలో ఉన్నవన్నీ ఆయనకు చెందినవే. అవన్నీ ఆయనకు విధేయులై ఉన్నాయి.[2]

**117**. ఆయనే ఆకాశాలనూ మరియు భూమినీ ఏ నమూనా లేకుండా ఆరంభించిన (సృష్టించిన) [3] వాడు. మరియు ఆయన ఏదైనా చేయాలని నిర్ణయించుకున్నప్పుడు దానికి కేవలం: "అయిపో!" అని ఆజ్ఞాపిస్తాడు. అంతే అది అయిపోతుంది.[4]

**118**. మరియు అజ్ఞానులు: "అల్లాహ్ మాతో ఎందుకు మాట్లాడడు? లేక మా వద్దకు ఏదైనా సూచన (ఆయత్) ఎందుకు రాదు?" అని అడుగుతారు. వారికి పూర్వం వారు కూడా ఇదే విధంగా అడిగేవారు.[5] వారందరి

---

all, *Having ample Power* or *ability*. Has full knowledge of all things, All-Sufficient, సర్వవ్యాప్తి, సర్వోపగతుడు, విస్తారుడు. అంతంలేనివాడు, అపారుడు, అత్యంత ఉదారుడు, సంపదలొసంగు వాడు, అల్లాహ్ జ్ఞానం ప్రతిదానిని ఆవరించు (ఇముడ్చు)కొని ఉంది. దివ్యఖుర్ఆన్‌లో, **వాసి'ఉన్ 'అలీమున్** అనే పదాలు ఇంకా 6 చోట్లలో వచ్చాయి, అవి: *2: 247*, 261, 268, 3:73, 5:54, 24:32. ఇంకా చూడండి, **వాసి'ఉన్** కొరకు, 4:130, *7:156, 53:32.*

**1**. సుబ్'హాన: **సర్వలోపాలకు అతీతుడు,** పరిశుద్ధుడు, పరమ పవిత్రుడు. చూడండి, 2:32.

**2**. ఇబ్నె-'అబ్బాస్ (ర'ది.'అ.) కథనం. ('స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-6, 'హదీస్' నం. 9).

**3**. బదీ'ఉ (**అల్-బదీ'ఉ**): Innovator. ఏ నమూనా లేకుండా ఆరంభించినవాడు (ఆరంభకుడు), ప్రారంభకుడు, మొదటిసారి క్రొత్తగా సృష్టించువాడు. **ప్రభవింపజేసేవాడు**. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి. చూడండి, 6:101.

**4**. అల్లాహ్ (సు.తా.) ఏదైనా చేయదలచుకుంటే దానిని కేవలం: "అయిపో!" అని ఆజ్ఞాపిస్తాడు. అంతే అది అయిపోతుంది. అలాంటప్పుడు ఆయనకు సంతానం కనే అవసరం ఎందుకుంటుంది. ఈ విధమైన వాక్యం "కున్ ఫ యకూన్" ఖుర్ఆన్‌లో 8 సార్లు వచ్చింది. చూడండి, 3:47, 59, 6:73, 16:40, 19:35, 36:82, 40:68 మరియు ఇక్కడ.

**5**. చూడండి, 17: 90-93.

قَبْلِهِم مِّثْلَ قَوْلِهِمْ ۘ تَشَٰبَهَتْ قُلُوبُهُمْ ۗ قَدْ بَيَّنَّا ٱلْءَايَٰتِ لِقَوْمٍ يُوقِنُونَ ﴿١١٨﴾

మనస్తత్వాలు (హృదయాలు) ఒకే విధమైనవి. వాస్తవానికి, దృఢనమ్మకం ఉన్నవారికి మేము మా సూచన (ఆయాత్)లను స్పష్టపరుస్తాము.

إِنَّآ أَرْسَلْنَٰكَ بِٱلْحَقِّ بَشِيرًا وَنَذِيرًا ۖ وَلَا تُسْـَٔلُ عَنْ أَصْحَٰبِ ٱلْجَحِيمِ ﴿١١٩﴾

**119**. నిశ్చయంగా, మేము నిన్ను (ఓ ము'హమ్మద్!) సత్యాన్ని ప్రసాదించి, శుభవార్త నిచ్చేవానిగా మరియు హెచ్చరిక చేసేవానిగా పంపాము. మరియు భగభగ మండే నరకాగ్నికి గురిఅయ్యే వారిని గురించి నీవు ప్రశ్నించబడవు.[1]

وَلَن تَرْضَىٰ عَنكَ ٱلْيَهُودُ وَلَا ٱلنَّصَٰرَىٰ حَتَّىٰ تَتَّبِعَ مِلَّتَهُمْ ۗ قُلْ إِنَّ هُدَى ٱللَّهِ هُوَ ٱلْهُدَىٰ ۗ وَلَئِنِ ٱتَّبَعْتَ أَهْوَآءَهُم بَعْدَ ٱلَّذِى جَآءَكَ مِنَ ٱلْعِلْمِ ۙ مَا لَكَ مِنَ ٱللَّهِ مِن وَلِىٍّ وَلَا نَصِيرٍ ﴿١٢٠﴾

**120**. మరియు యూదులైనా, క్రైస్తవులైనా నీవు వారి మతమును అనుసరించే వరకూ, వారు నీతో ప్రసన్నులు కారు. నీవు: "నిశ్చయంగా, అల్లాహ్ చూపిన మార్గమే సన్మార్గం." అని చెప్పు. మరియు నీకు జ్ఞానం లభించిన తరువాత కూడా, నీవు వారి కోరికలను అనుసరిస్తే, అల్లాహ్ (శిక్ష) నుండి నిన్ను రక్షించే వాడు గానీ, సహాయపడే వాడు గానీ ఎవ్వడూ ఉండడు.

ٱلَّذِينَ ءَاتَيْنَٰهُمُ ٱلْكِتَٰبَ يَتْلُونَهُۥ حَقَّ تِلَاوَتِهِۦٓ أُو۟لَٰٓئِكَ يُؤْمِنُونَ بِهِۦ ۗ وَمَن يَكْفُرْ بِهِۦ فَأُو۟لَٰٓئِكَ هُمُ ٱلْخَٰسِرُونَ ﴿١٢١﴾

**121**. మేము దివ్యగ్రంథాన్ని ప్రసాదించిన వారు (యూదులు మరియు క్రైస్తవులు), దానిని (తమ గ్రంథాన్ని) కర్తవ్యంతో పఠించవలసిన విధంగా పఠిస్తే, అలాంటి వారు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) విశ్వసిస్తారు. మరియు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) తిరస్కరించే వారే నష్టపడు వారు.[2]

---

**1**. చూడండి, 3:85.

**2**. ఇక్కడ పూర్వ గ్రంథప్రజలు, అంటే యూదులు మరియు క్రైస్తవులలోని కొందరు సత్పురుషుల విషయం తెలుపబడింది. ఉదాహరణకు: 'అబ్దుల్లాహ్ బిన్-సల్లామ్, సల్మాన్ ఫార్సీ (ర'ది.'అన్హుమ్)ల వంటివారు. వారు తమ గ్రంథాలలో పేర్కొనబడిన రాబోయే ప్రవక్త

يَٰبَنِيٓ إِسۡرَٰٓءِيلَ ٱذۡكُرُواْ نِعۡمَتِيَ ٱلَّتِيٓ أَنۡعَمۡتُ عَلَيۡكُمۡ وَأَنِّي فَضَّلۡتُكُمۡ عَلَى ٱلۡعَٰلَمِينَ ١٢٢

**122**. ఓ ఇస్రాయీ'ల్ సంతతివారలారా! నేను మీకు ప్రసాదించిన అనుగ్రహాన్ని జ్ఞాపకం చేసుకోండి మరియు నిశ్చయంగా, నేను మిమ్మల్ని (మీ కాలంలోని) సర్వలోకాల వారికంటే ఎక్కువగా ఆదరించాను.

وَٱتَّقُواْ يَوۡمٗا لَّا تَجۡزِي نَفۡسٌ عَن نَّفۡسٖ شَيۡـٔٗا وَلَا يُقۡبَلُ مِنۡهَا عَدۡلٞ وَلَا تَنفَعُهَا شَفَٰعَةٞ وَلَا هُمۡ يُنصَرُونَ ١٢٣

**123**. మరియు ఆ (పునరుత్థాన) దినాన్ని గురించి భయభీతి కలిగి ఉండండి, ఆ నాడు ఏ వ్యక్తి కూడా మరొక వ్యక్తికి ఏ మాత్రమూ ఉపయోగపడలేడు మరియు ఎవడి నుండీ ఎలాంటి పరిహారం స్వీకరించబడదు మరియు ఎవడికీ సిఫారసూ లాభదాయకం కాజాలదు మరియు వారి కెలాంటి సహాయమూ లభించదు. (7/8)

۞ وَإِذِ ٱبۡتَلَىٰٓ إِبۡرَٰهِـۧمَ رَبُّهُۥ بِكَلِمَٰتٖ فَأَتَمَّهُنَّۖ قَالَ إِنِّي جَاعِلُكَ لِلنَّاسِ إِمَامٗاۖ قَالَ وَمِن ذُرِّيَّتِيۖ قَالَ لَا يَنَالُ عَهۡدِي ٱلظَّٰلِمِينَ ١٢٤

**124**. * మరియు ఇబ్రాహీమ్‌ను అతని ప్రభువు (కొన్ని) ఉత్తరువులిచ్చి పరీక్షించిన విషయాన్ని (జ్ఞాపకం చేసుకోండి). వాటి అన్నింటిలో అతను నెగ్గాడు. అప్పుడు, ఆయన (అల్లాహ్): "నిశ్చయంగా, నేను నిన్ను మానవ జాతికి నాయకునిగా చేస్తున్నాను." అని అన్నాడు. (దానికి ఇబ్రాహీమ్): "మరి నా సంతతి వారు?" అని అడిగాడు.[1] (దానికి అల్లాహ్): "నా వాగ్దానం దుర్మార్గులైనవారికి వర్తించదు." అని జవాబిచ్చాడు.[2]

ము'హమ్మద్('స'అస)మే అన్న సత్యాన్ని గ్రహించి, విశ్వసించి సత్యధర్మమైన ఇస్లామ్‌ను స్వీకరించారు. ఏ ధర్మాన్నైతే దైవ ప్రవక్తలు ఆదమ్, నూ'హ్, ఇబ్రాహీమ్, మూసా మరియు 'ఈసా మొదలైనవారు ('అలైహిమ్. స.) ఆచరించి, బోధించారో!

1. అల్లాహ్ (సు.తా.) ఇబ్రాహీమ్ ('అ.స.) యొక్క ఈ విన్నపాన్ని పూర్తిచేశాడు. ఇది 29:27లో పేర్కొనబడింది.

2. "నా వాగ్దానం దుర్మార్గులైన వారికి వర్తించదు." అల్లాహ్ (సు.తా.) యొక్క ఈ ప్రవచనం

وَإِذْ جَعَلْنَا ٱلْبَيْتَ مَثَابَةً لِّلنَّاسِ وَأَمْنًا وَٱتَّخِذُوا۟ مِن مَّقَامِ إِبْرَٰهِـۧمَ مُصَلًّى ۖ وَعَهِدْنَآ إِلَىٰٓ إِبْرَٰهِـۧمَ وَإِسْمَٰعِيلَ أَن طَهِّرَا بَيْتِىَ لِلطَّآئِفِينَ وَٱلْعَٰكِفِينَ وَٱلرُّكَّعِ ٱلسُّجُودِ ﴿١٢٥﴾

**125**. మరియు ఈ (క'అబహ్) గృహాన్ని మేము మానవులకు తరచుగా సందర్శించే కేంద్రం(పుణ్యస్థలం)గా[1] మరియు శాంతినిలయంగా చేసి; ఇబ్రాహీమ్ నిలబడిన చోటును మీరు నమా'జ్ చేసే స్థలంగా చేసుకోండన్న,[2] విషయాన్ని (జ్ఞాపకం చేసుకోండి). మరియు మేము ఇబ్రాహీమ్ మరియు ఇస్మా'యీల్‌లకు: "నా ఈ గృహాన్ని ప్రదక్షిణ చేసేవారి కొరకూ, ఏకాంత ధ్యానం ('ఏతికాఫ్) పాటించే వారి కొరకూ, వంగే (రుకూ'ఉ చేసే) వారి కొరకూ మరియు సజ్దాలు చేసే వారి కొరకూ పరిశుద్ధంగా ఉంచండి." అని నిర్దేశించాము.

وَإِذْ قَالَ إِبْرَٰهِـۧمُ رَبِّ ٱجْعَلْ هَٰذَا بَلَدًا ءَامِنًا وَٱرْزُقْ أَهْلَهُۥ مِنَ ٱلثَّمَرَٰتِ مَنْ ءَامَنَ مِنْهُم بِٱللَّهِ وَٱلْيَوْمِ ٱلْءَاخِرِ ۖ

**126**. మరియు (జ్ఞాపకం చేసుకోండి) ఇబ్రాహీమ్: "ఓ నా ప్రభూ! ఈ నగరాన్ని (మక్కాను) శాంతియుతమైన నగరంగా చేసి, ఇందు నివసించే వారిలో, అల్లాహ్‌ను

---

ఎంతో ఆలోచింపదగినది. ఇక్కడ ఆయన విశదపరిచింది ఏమిటంటే: ఒక మంచి సత్పురుషుని లేక ప్రవక్త సంతతికి చెందినంత మాత్రానా - వారు అవిశ్వాసులై, సత్కార్యాలు చేయని వారైతే - వారి వంశకీర్తి, వారి పెద్దల ప్రవక్తృత్వం వారికి ఏ విధంగానూ పనికిరాదు. ప్రతి ఒక్కడూ తన స్వంత విశ్వాసం మరియు సత్కార్యాల ఆధారంగానే ప్రతిఫలం పొందుతాడు. మహా ప్రవక్త ('స'అస) 'హదీస్' ఇలా ఉంది: "ఏ వ్యక్తి వ్యవహారాలైతే అతనిని వెనుక విడిచాయో, అలాంటి వ్యక్తి పుట్టు పూర్వోత్తరాలు, వంశ ప్రతిష్ఠలు అతనిని ఏ మాత్రం ముందుకు తేలేవు." ('స'హీ'హ్ ముస్లిం).

1. మసా'బతల్లిన్నాస్: అంటే, ప్రజల కొరకు పుణ్యస్థలం. దీని మరొక అర్థం, మాటిమాటికీ సందర్శించే కేంద్రం. ఎందుకంటే ఒకసారి అల్లాహ్ (సు.తా.) గృహాన్ని సందర్శించిన వాడు, మళ్ళీ మళ్ళీ దానిని దర్శించాలని కోరుతూ ఉంటాడు. దీని మరొక మహత్త్వమేమిటంటే, ఇది శాంతి కేంద్రం. అంటే ఇక్కడ ఏ శత్రువు భయం ఉండదు. అందుకే అజ్ఞాన కాలంలో కూడా ముష్రిక్‌లు 'హరమ్ సరిహద్దులలో తమ శత్రువులతో పోరాడటం గానీ, హత్యలు గానీ చేసేవారు కాదు.

2. మఖామె ఇబ్రాహీమ్: అంటే ఇబ్రాహీమ్ ('అ.స.) నిలబడిన రాయి. అతను దానిపైన నిలబడి క'అబహ్ గృహాన్ని నిర్మించారు. అది 'హరమ్‌లో క'అబహ్ కు దగ్గరగా ఉంది. 'తవాఫ్ పూర్తిచేసిన వారు ప్రతి ఒక్కరూ, దాని దగ్గరలో రెండు రకా'అతులు నమా'జ్ చేస్తారు.

قَالَ وَمَن كَفَرَ فَأُمَتِّعُهُۥ قَلِيلًا ثُمَّ أَضْطَرُّهُۥٓ إِلَىٰ عَذَابِ ٱلنَّارِ ۖ وَبِئْسَ ٱلْمَصِيرُ ﴿١٢٦﴾

మరియు అంతిమ దినాన్ని విశ్వసించే వారికి అన్నిరకాల ఫలాలను జీవనోపాధిగా నొసంగు.'' అని ప్రార్థించినప్పుడు, (అల్లాహ్): ''మరియు ఎవడు సత్యతిరస్కారి అవుతాడో అతనికి నేను ఆనందించటానికి కొంతకాలం విడిచిపెడ్తాను. తరువాత అతనిని నరకాగ్నిలోకి బలవంతంగా త్రోసివేస్తాను. అది ఎంత దుర్భరమైన గమ్యస్థానం!'' అని అన్నాడు.

وَإِذْ يَرْفَعُ إِبْرَٰهِـۧمُ ٱلْقَوَاعِدَ مِنَ ٱلْبَيْتِ وَإِسْمَـٰعِيلُ رَبَّنَا تَقَبَّلْ مِنَّآ ۖ إِنَّكَ أَنتَ ٱلسَّمِيعُ ٱلْعَلِيمُ ﴿١٢٧﴾

**127**. మరియు (జ్ఞాపకం చేసుకోండి) ఇబ్రాహీమ్ మరియు ఇస్మా'యీల్ ఈ గృహపు (క'అబహ్) పునాదులను ఎత్తేటప్పుడు (ఈ విధంగా ప్రార్థించారు): ''ఓ మా ప్రభూ! మా ఈ సేవను స్వీకరించు. నిశ్చయంగా, నీవు మాత్రమే సర్వం వినేవాడవు,[1] సర్వజ్ఞుడవు.[2]

رَبَّنَا وَٱجْعَلْنَا مُسْلِمَيْنِ لَكَ وَمِن ذُرِّيَّتِنَآ أُمَّةً مُّسْلِمَةً لَّكَ وَأَرِنَا مَنَاسِكَنَا وَتُبْ عَلَيْنَآ ۖ إِنَّكَ أَنتَ ٱلتَّوَّابُ ٱلرَّحِيمُ ﴿١٢٨﴾

**128**. ''ఓ మా ప్రభూ! మమ్మల్ని నీకు విధేయు(ముస్లిం)లుగా చేయి మరియు మా సంతతి నుండి ఒక సంఘాన్ని నీకు విధేయు(ముస్లిం)లుగా ఉండునట్లు చేయి. మరియు మాకు, మా ఆరాధనా రీతు(మనాసిక్)లను తెలుపు మరియు మా పశ్చాత్తాపాన్ని అంగీకరించు. నిశ్చయంగా నీవే పశ్చాత్తాపాన్ని అంగీకరించేవాడవు, అపార కరుణాప్రదాతవు.

---

**1**. అస్-సమీ'ఉ: The All-Hearing. Who hears every thing. సర్వం వినేవాడు, సర్వశ్రవణ సమర్థుడు. అస్-సమీ'ఉన్ -'అలీము, ఈ ద్వంద పదం ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు వచ్చింది. 29 సార్లు. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

**2**. అల్-'అలీము: The All-Knowing, సర్వజ్ఞుడు, చూడండి, 2:32.

رَبَّنَا وَٱبۡعَثۡ فِيهِمۡ رَسُولٗا مِّنۡهُمۡ يَتۡلُواْ عَلَيۡهِمۡ ءَايَٰتِكَ وَيُعَلِّمُهُمُ ٱلۡكِتَٰبَ وَٱلۡحِكۡمَةَ وَيُزَكِّيهِمۡۚ إِنَّكَ أَنتَ ٱلۡعَزِيزُ ٱلۡحَكِيمُ ١٢٩

**129**. "ఓ మా ప్రభూ! వీరిలో నుండి నీ సందేశాలను చదివి వినిపించుటకునూ, నీ గ్రంథాన్ని నేర్పుటకునూ, దివ్యజ్ఞానాన్ని బోధించుటకునూ మరియు వారిని పరిశుద్ధులుగా మార్చుటకునూ ఒక సందేశహరుణ్ణి పంపు.[1] నిశ్చయంగా, నీవే సర్వశక్తిమంతుడవు,[2] మహా వివేకవంతుడవు."

وَمَن يَرۡغَبُ عَن مِّلَّةِ إِبۡرَٰهِـۧمَ إِلَّا مَن سَفِهَ نَفۡسَهُۥۚ وَلَقَدِ ٱصۡطَفَيۡنَٰهُ فِي ٱلدُّنۡيَاۖ وَإِنَّهُۥ فِي ٱلۡأٓخِرَةِ لَمِنَ ٱلصَّٰلِحِينَ ١٣٠

**130**. మరియు ఇబ్రాహీమ్ మతం నుండి విముఖుడయ్యే వాడెవడు, తనను తాను అవివేకిగా చేసుకొనువాడు తప్ప? వాస్తవానికి మేము అతనిని (ఇబ్రాహీమ్‌ను) ఈ లోకంలో ఎన్నుకున్నాము. మరియు నిశ్చయంగా అతను పరలోకంలో సద్వర్తనులతో పాటు ఉంటాడు.

إِذۡ قَالَ لَهُۥ رَبُّهُۥٓ أَسۡلِمۡۖ قَالَ أَسۡلَمۡتُ لِرَبِّ ٱلۡعَٰلَمِينَ ١٣١

**131**. అతని ప్రభువు అతనితో: "(మాకు) విధేయుడవు(ముస్లిం)గా ఉండు." అని అన్నప్పుడు అతను: "నేను సర్వలోకాల ప్రభువునకు విధేయుడ(ముస్లిం)ను అయిపోయాను." అని జవాబిచ్చాడు.

وَوَصَّىٰ بِهَآ إِبۡرَٰهِـۧمُ بَنِيهِ وَيَعۡقُوبُ يَٰبَنِيَّ إِنَّ ٱللَّهَ ٱصۡطَفَىٰ

**132**. మరియు ఇబ్రాహీమ్ తన సంతానాన్ని దీని(ఈ ఇస్లాం మార్గం)లోనే నడవండని బోధించాడు. మరియు య'అఖూబ్ కూడా తన (సంతానంతో

1. ఇది ఇబ్రాహీమ్ మరియు ఇస్మా'యీల్ ('అలైహిమ్. స.)ల యొక్క చివరి దు'ఆ. అల్లాహ్ (సు.తా.) దీనిని స్వీకరించి ఇస్మా'యీల్ ('అ.స.) సంతతి నుండి ము'హమ్మద్ ('స'అస)ను సందేశహరునిగా పంపాడు. కావున ము'హమ్మద్ ('స'అస) అన్నారు: 'నేను నా తండ్రి ఇబ్రాహీమ్ ('అ.స.) యొక్క దు'ఆను, 'ఈసా ('అ.స.) యొక్క శుభవార్తను మరియు నా తల్లి యొక్క కలను.' (ఫ'త్హ్ రబ్బాని).

2. **అల్-'అ'జీ'జ్:** సర్వశక్తిసంపన్నుడు, **సర్వశక్తిమంతుడు**, ఆయన అధికారం సర్వాన్ని పరివేష్టించి ఉన్నది, గౌరవానికి మూలాధారి. The Almighty.

لَكُمُ ٱلدِّينَ فَلَا تَمُوتُنَّ إِلَّا وَأَنتُم مُّسۡلِمُونَ ﴿١٣٢﴾

అన్నాడు): "నా బిడ్డలారా! నిశ్చయంగా, అల్లాహ్ మీ కొరకు ఈ ధర్మాన్నే నియమించి ఉన్నాడు. కావున మీరు అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు) కాకుండా మరణించకండి!"[1]

أَمۡ كُنتُمۡ شُهَدَآءَ إِذۡ حَضَرَ يَعۡقُوبَ ٱلۡمَوۡتُ إِذۡ قَالَ لِبَنِيهِ مَا تَعۡبُدُونَ مِنۢ بَعۡدِي قَالُواْ نَعۡبُدُ إِلَٰهَكَ وَإِلَٰهَ ءَابَآئِكَ إِبۡرَٰهِـۧمَ وَإِسۡمَٰعِيلَ وَإِسۡحَٰقَ إِلَٰهًا وَٰحِدًا وَنَحۡنُ لَهُۥ مُسۡلِمُونَ ﴿١٣٣﴾

**133**. ఏమీ? య'అఖూబ్‌కు మరణం సమీపించినప్పుడు, మీరు అక్కడ ఉన్నారా?[2] అప్పుడతను తన కుమారులతో: "నా తరువాత మీరు ఎవరిని ఆరాధిస్తారు?" అని అడిగినప్పుడు వారన్నారు: "నీ ఆరాధ్య దైవం మరియు నీ పూర్వీకులగు ఇబ్రాహీమ్, ఇస్మా'యీల్ మరియు ఇస్'హాఖ్‌ల ఆరాధ్య దైవమైన ఆ ఏకైక[3] దేవుణ్ణి (అల్లాహ్‌నే), మేము ఆరాధిస్తాము మరియు మేము ఆయనకే విధేయు(ముస్లిం)లమై ఉంటాము."

تِلۡكَ أُمَّةٞ قَدۡ خَلَتۡۖ لَهَا مَا كَسَبَتۡ وَلَكُم مَّا كَسَبۡتُمۡۖ وَلَا تُسۡـَٔلُونَ عَمَّا كَانُواْ يَعۡمَلُونَ ﴿١٣٤﴾

**134**. అది ఒక గతించిన సమాజం. దాని కర్మల ఫలితం దానికి మరియు మీ కర్మలది మీకు. మరియు వారు చేస్తూ ఉండిన కర్మలను గురించి మీరు ప్రశ్నించబడరు.

---

**1**. ఇబ్రాహీమ్ మరియు య'అఖూబ్ ('అలైహిమ్ స.)లు కూడా తమ సంతానాన్ని అనుసరించమని బోధించిన ధర్మం ఇస్లామ్ మాత్రమే. ఈ ఇస్లాం ధర్మమే, అంటే అల్లాహ్ (సు.తా.)కు మాత్రమే దాస్యం చేయటమే (విధేయులుగా ఉండటమే) ఆదమ్ ('అ.స.) నుండి చిట్టచివరి ప్రవక్త ము'హమ్మద్ ('స'అస) వరకూ ప్రవక్తలందరూ బోధించిన ధర్మం. (చూడండి, 3:19).

**2**. ఇక్కడ యూదులు ప్రశ్నింపబడుతున్నారు: "య'అఖూబ్ ('అ.స.) మరణించినప్పుడు మీరైతే అక్కడ లేరు కదా! అలాంటప్పుడు మీకెలాతెలుసు, అతను తన కుమారులకు బోధించిన ధర్మమేమిటో?" అతనే గాక ప్రతి ప్రవక్త బోధించిన ధర్మం ఇస్లాం మాత్రమే. ('స'హీ'హ్ బు'ఖారీ).

**3**. అల్-వా'హిద్: The One, The Sole. **అద్వితీయుడు**, ఒకే ఒక్కడు, ఏకైకడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి. చూడండి, 2:163, 12:39.
అ'హదున్: The One and Alone, **ఏకైకుడు**, ఒకే ఒక్కడు. చూడండి, 112:1, 4.

وَقَالُواْ كُونُواْ هُودًا أَوْ نَصَٰرَىٰ تَهۡتَدُواْۗ قُلۡ بَلۡ مِلَّةَ إِبۡرَٰهِـۧمَ حَنِيفًاۖ وَمَا كَانَ مِنَ ٱلۡمُشۡرِكِينَ ١٣٥

**135**. మరియు వారంటారు: "మీరు యూదులుగా లేదా క్రైస్తవులుగా ఉంటేనే మీకు మార్గదర్శకత్వం లభిస్తుంది!" వారితో అను: "వాస్తవానికి, మేము (అనుసరించేది) ఇబ్రాహీమ్ మతం, ఏకైక దైవ సిద్ధాంతం (హనీఫా). మరియు అతను బహుదైవారాధకుడు కాడు."[1]

قُولُوٓاْ ءَامَنَّا بِٱللَّهِ وَمَآ أُنزِلَ إِلَيۡنَا وَمَآ أُنزِلَ إِلَىٰٓ إِبۡرَٰهِـۧمَ وَإِسۡمَٰعِيلَ وَإِسۡحَٰقَ وَيَعۡقُوبَ وَٱلۡأَسۡبَاطِ وَمَآ أُوتِيَ مُوسَىٰ وَعِيسَىٰ وَمَآ أُوتِيَ ٱلنَّبِيُّونَ مِن رَّبِّهِمۡ لَا نُفَرِّقُ بَيۡنَ أَحَدٖ مِّنۡهُمۡ وَنَحۡنُ لَهُۥ مُسۡلِمُونَ ١٣٦

**136**. (ఓ ముస్లింలారా!) మీరు ఇలా అనండి: "మేము అల్లాహ్‌ను మరియు ఆయన మా కొరకు అవతరింపజేసిన సందేశాలను మరియు ఇబ్రాహీమ్, ఇస్మా'యీల్, ఇస్'హాఖ్, య'అఖూబ్ మరియు అతని సంతతి వారికి ఇవ్వబడిన వాటినీ; మరియు మూసా, 'ఈసా మరియు ఇతర ప్రవక్తలందరికీ వారి ప్రభువు తరఫునుండి ఇవ్వబడిన వాటినీ (సందేశాలను) విశ్వసిస్తాము. వారిలో ఏ ఒక్కరి పట్లా మేము భేదభావం చూపము. మేము ఆయనకు విధేయుల (ముస్లింల) మయ్యాము."

فَإِنۡ ءَامَنُواْ بِمِثۡلِ مَآ ءَامَنتُم بِهِۦ فَقَدِ ٱهۡتَدَواْۖ وَّإِن تَوَلَّوۡاْ فَإِنَّمَا هُمۡ فِي شِقَاقٖۖ فَسَيَكۡفِيكَهُمُ ٱللَّهُۚ وَهُوَ ٱلسَّمِيعُ ٱلۡعَلِيمُ ١٣٧

**137**. వారు కూడా మీరు విశ్వసించినట్లు విశ్వసిస్తే, వారు సన్మార్గం పొందిన వారు అవుతారు. ఒకవేళ వారు తిరిగిపోతే, విరోధం వహించిన వారవుతారు. (వారి నుండి రక్షించటానికి) మీకు అల్లాహ్ చాలు. ఆయనే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

صِبۡغَةَ ٱللَّهِ وَمَنۡ أَحۡسَنُ مِنَ ٱللَّهِ صِبۡغَةٗۖ وَنَحۡنُ لَهُۥ عَٰبِدُونَ ١٣٨

**138**. (వారితో ఇలా అను): "(మీరు) అల్లాహ్ రంగును (ధర్మాన్ని) స్వీకరించండి. మరియు అల్లాహ్ కంటే మంచి రంగు (ధర్మం) ఎవరిది? మరియు మేము ఆయనను మాత్రమే ఆరాధించేవారము."[2]

---

**1**. చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-5, 'హదీస్' నం. 169.

**2**. దీని మరొక తాత్పర్యం ఇలా ఉంది: "అల్లాహ్ రంగును (ధర్మాన్ని) ఎంచుకోండి. మరియు

قُلْ أَتُحَآجُّونَنَا فِى ٱللَّهِ وَهُوَ رَبُّنَا
وَرَبُّكُمْ وَلَنَآ أَعْمَـٰلُنَا وَلَكُمْ
أَعْمَـٰلُكُمْ وَنَحْنُ لَهُۥ مُخْلِصُونَ ﴿١٣٩﴾

**139**. (ఓ ము'హమ్మద్) వారితో అను: "ఏమీ? అల్లాహ్ విషయంలో మీరు మాతో వాదిస్తారా? (వాస్తవానికి) ఆయన మా ప్రభువు మరియు మీ ప్రభువు కూడాను. మా కర్మలు మాకు మరియు మీ కర్మలు మీకు. మరియు మేము ఆయనకు మాత్రమే మనఃపూర్వకంగా (విధేయుల మయ్యాము)."

أَمْ تَقُولُونَ إِنَّ إِبْرَٰهِـۧمَ وَإِسْمَـٰعِيلَ
وَإِسْحَـٰقَ وَيَعْقُوبَ
وَٱلْأَسْبَاطَ كَانُوا۟ هُودًا أَوْ
نَصَـٰرَىٰ ۗ قُلْ ءَأَنتُمْ أَعْلَمُ أَمِ ٱللَّهُ ۗ وَمَنْ
أَظْلَمُ مِمَّن كَتَمَ شَهَـٰدَةً عِندَهُۥ
مِنَ ٱللَّهِ ۗ وَمَا ٱللَّهُ بِغَـٰفِلٍ عَمَّا
تَعْمَلُونَ ﴿١٤٠﴾

**140**. లేక, మీరు: "నిశ్చయంగా ఇబ్రాహీమ్, ఇస్మా'యీల్, ఇస్'హాఖ్, య'అఖూబ్ మరియు వారి సంతతి వారంతా యూదులు మరియు క్రైస్తవులు." అని అంటారా? ఇంకా ఇలా అను: "ఏమీ మీకు బాగా తెలుసా? లేక అల్లాహ్‌కు (బాగా తెలుసా)? అల్లాహ్‌వద్ద నుండి తనవద్దకు వచ్చిన సాక్ష్యాన్ని దాచే వాని కంటే ఎక్కువ దుర్మార్గుడెవడు? మరియు మీ కర్మలనుండి, అల్లాహ్ నిర్లక్ష్యంగా లేడు!

تِلْكَ أُمَّةٌ قَدْ خَلَتْ ۖ لَهَا مَا كَسَبَتْ
وَلَكُم مَّا كَسَبْتُمْ ۖ وَلَا تُسْـَٔلُونَ
عَمَّا كَانُوا۟ يَعْمَلُونَ ﴿١٤١﴾

**141**. "ఇప్పుడు ఆ సంఘం గతించి పోయింది. అది చేసింది దానికి మరియు మీరు చేసింది మీకు. వారు చేస్తూ ఉండిన కర్మలను గురించి మీరు ప్రశ్నించబడరు."[1]

---

అల్లాహ్ రంగు (ధర్మం) కంటే ఉత్తమమైన రంగు (ధర్మం) ఎవరిది? మరియు మేము ఆయనను మాత్రమే ఆరాధించే వారము."

క్రైస్తవులు ఒక పసుపురంగు చేసి ఉంచుతారు. బిడ్డ పుట్టినా లేక ఎవడైనా క్రైస్తవ మతం అవలంబించినా! వారు, అతనిని ఆ రంగులో ముంచి: "పవిత్రమైన క్రైస్తవుడయ్యాడు." అని అంటారు. దీనిని బాప్టిసం (Baptism) అంటారు. ఈ ఆచారాన్ని ఖండిస్తూ: అల్లాహ్ (సు.తా.) రంగు (ధర్మం) అంటే ఇస్లాం ధర్మమే, అంటే అల్లాహ్ (సు.తా.) కు విధేయులై కేవలం ఆయననే ఆరాధించడం. ఇదే ప్రవక్తలందరూ బోధించిన ధర్మం, అని విశదపరచబడింది.

1. చూడండి, 35:18 మరియు 53:39.

۞ سَيَقُولُ ٱلسُّفَهَآءُ مِنَ ٱلنَّاسِ مَا
وَلَّىٰهُمۡ عَن قِبۡلَتِهِمُ ٱلَّتِي كَانُواْ عَلَيۡهَاۚ
قُل لِّلَّهِ ٱلۡمَشۡرِقُ وَٱلۡمَغۡرِبُۚ يَهۡدِي
مَن يَشَآءُ إِلَىٰ صِرَٰطٖ مُّسۡتَقِيمٖ ﴿١٤٢﴾

**142**. (*) ప్రజలలోని కొందరు మూఢ జనులు ఇలా అంటారు: "వీరిని (ముస్లింలను) ఇంతవరకు వీరు అనుసరిస్తూ వచ్చిన, ఖిబ్లా నుండి త్రిప్పింది ఏమిటీ?"[1] వారితో ఇలా అను: "తూర్పు మరియు పడమరలు అల్లాహ్‌కే చెందినవి. ఆయన తాను కోరిన వారికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తాడు."

وَكَذَٰلِكَ جَعَلۡنَٰكُمۡ أُمَّةٗ وَسَطٗا
لِّتَكُونُواْ شُهَدَآءَ عَلَى ٱلنَّاسِ
وَيَكُونَ ٱلرَّسُولُ عَلَيۡكُمۡ شَهِيدٗاۗ
وَمَا جَعَلۡنَا ٱلۡقِبۡلَةَ ٱلَّتِي كُنتَ عَلَيۡهَآ
إِلَّا لِنَعۡلَمَ مَن يَتَّبِعُ ٱلرَّسُولَ مِمَّن
يَنقَلِبُ عَلَىٰ عَقِبَيۡهِۚ

**143**. మరియు మీరు ప్రజలకు సాక్షులుగా ఉండటానికి మరియు సందేశహరుడు (ము'హమ్మద్) మీకు సాక్షిగా ఉండటానికి[2] మేము, మిమ్మల్ని ఒక మధ్యస్థ (ఉత్తమ మరియు న్యాయశీలమైన) సమాజంగా చేశాము. మరియు ఎవరు సందేశహరుణ్ణి అనుసరిస్తారో మరియు ఎవరు తమ మడమల మీద వెనుదిరిగిపోతారో అనేది పరిశీలించడానికి, నీవు పూర్వం అనుసరించే ఖిబ్లా (బైతుల్-మఖ్దిస్)ను, ఖిబ్లాగా చేసి ఉన్నాము. మరియు ఇది వాస్తవానికి అల్లాహ్

---

**1**. మ'హాప్రవక్త ('స'అస) మదీనాకు వలసపోయిన తరువాత 16,17 నెలలు బైతుల్ మఖ్దిస్ వైపునకు ముఖం చేసి నమా'జ్ చేసేవారు. కాని అతని కోరిక క'అబహ్ (మక్కా) వైపుకు మాత్రమే ముఖం చేసి నమా'జ్ చేయాలని ఉండేది. ఇదే ఇబ్రాహీమ్ ('అ.స.) యొక్క ఖిబ్లా కూడాను. మహాప్రవక్త ('స'అస) దీనికై ఎన్నోసార్లు అల్లాహ్(సు.తా.)ను ప్రార్థించారు. చివరకు అల్లాహుతా'ఆలా ఖిబ్లాను మార్చమని మహాప్రవక్త('స'అస)కు ఆజ్ఞ ఇచ్చాడు. అప్పుడు అవిశ్వాసులు ఈ విధంగా అన్నారు.

**2**. చూడండి, 22:78 మరియు 'స.బు'ఖారీ, పుస్తకం-6, 'హదీస్' నం.14. మధ్యస్థ సమాజం అంటే, ఇస్లాంకు ముందున్న మతస్థులలో కొందరు ఆత్మశుద్ధిని వదలి దేహాన్నే పోషించుకుంటూ పశుప్రాయులై ఉండేవారు. వారు యూదులు మొదలైన వారు. మరి కొందరు దేహాన్ని హింసించుకుంటూ అనేక బాధలుపడి, సంసారాన్ని వదలి అడవులలో నివసిస్తూ ఆత్మశుద్ధిని గురించి కృషి చేసేవారు. ఈ రెండు మార్గాలకు మధ్య ఇహ-పరాలను, దేహాన్ని-ఆత్మశుద్ధిని అనుసరించేవారు శ్రేష్ఠులు. ఇదే ఇస్లాం బోధన, ఉత్తమమైన మధ్యస్థ మార్గము.

మార్గదర్శకత్వం చూపిన వారికి తప్ప, ఇతరులకు భారమైనది. మరియు అల్లాహ్ మీ విశ్వాసాన్ని (బైతుల్-మఖ్దిస్ వైపునకు చేసిన నమా'జ్‌లను) ఎన్నడూ వృథాచేయడు.[1] నిశ్చయంగా అల్లాహ్ ప్రజల పట్ల కనికరుడు, అపార కరుణాప్రదాత.

**144**. (ఓ ప్రవక్తా!) వాస్తవానికి మేము, నీవు పలుమార్లు నీ ముఖాన్ని ఆకాశం వైపునకు ఎత్తడం చూశాము. కావున మేము నిన్ను నీవుకోరిన ఖిబ్లా వైపునకు త్రిప్పుతున్నాము. కావున, నీవు మస్జిద్ అల్ - హరామ్ వైపునకు నీ ముఖాన్ని త్రిప్పుకో! ఇకపై మీరంతా ఎక్కడ ఉన్నా సరే (నమా'జ్ చేసేటప్పుడు), మీ ముఖాలను ఆ వైపునకే త్రిప్పుకోండి. మరియు నిశ్చయంగా, గ్రంథం గలవారికి ఇది తమ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యమని బాగా తెలుసు.[2] మరియు అల్లాహ్ వారి కర్మల గురించి నిర్లక్ష్యంగా లేడు.

**145**. మరియు నీవు గ్రంథప్రజలకు ఎన్ని సూచనలు (ఆయతులు) చూపినా, వారు నీ ఖిబ్లాను అనుసరించరు. మరియు నీవు కూడా వారి ఖిబ్లాను అనుసరించలేవు. మరియు వారిలో ఒక వర్గంవారు, మరొక వర్గంవారి ఖిబ్లాను అనుసరించరు.[3] మరియు నీవు ఈ

وَإِن كَانَتۡ لَكَبِيرَةً إِلَّا عَلَى ٱلَّذِينَ هَدَى ٱللَّهُۗ وَمَا كَانَ ٱللَّهُ لِيُضِيعَ إِيمَٰنَكُمۡۚ إِنَّ ٱللَّهَ بِٱلنَّاسِ لَرَءُوفٞ رَّحِيمٞ ١٤٣

قَدۡ نَرَىٰ تَقَلُّبَ وَجۡهِكَ فِي ٱلسَّمَآءِۖ فَلَنُوَلِّيَنَّكَ قِبۡلَةٗ تَرۡضَىٰهَاۚ فَوَلِّ وَجۡهَكَ شَطۡرَ ٱلۡمَسۡجِدِ ٱلۡحَرَامِۚ وَحَيۡثُ مَا كُنتُمۡ فَوَلُّواْ وُجُوهَكُمۡ شَطۡرَهُۥۗ وَإِنَّ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡكِتَٰبَ لَيَعۡلَمُونَ أَنَّهُ ٱلۡحَقُّ مِن رَّبِّهِمۡۗ وَمَا ٱللَّهُ بِغَٰفِلٍ عَمَّا يَعۡمَلُونَ ١٤٤

وَلَئِنۡ أَتَيۡتَ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡكِتَٰبَ بِكُلِّ ءَايَةٖ مَّا تَبِعُواْ قِبۡلَتَكَۚ وَمَآ أَنتَ بِتَابِعٖ قِبۡلَتَهُمۡۚ وَمَا بَعۡضُهُم بِتَابِعٖ قِبۡلَةَ بَعۡضٖۚ وَلَئِنِ ٱتَّبَعۡتَ

---

**1**. ఇక్కడ దీని అర్థం: ఇంతవరకు ము'హమ్మద్ ('స'అస) మరియు అతని అనుచరులు (ర'ది.'అన్హుమ్) బైతుల్ మఖ్దిస్ వైపునకు ముఖంచేసి, చేసిన నమాజులు వ్యర్థం కావు. వాటి ప్రతిఫలం పూర్తిగా ఇవ్వబడుతుంది.

**2**. పూర్వ గ్రంథాలలో మక్కాలోని కాబాయే చివరి ప్రవక్త యొక్క ఖిబ్లా కాగలదని పేర్కొనబడింది. వారికిది తెలిసికూడా అసూయవల్ల వారిలా ముస్లింలతో వాదులాడారు.

**3**. యూదుల ఖిబ్లా బైతుల్-మఖ్దిస్‌కు పడమర దిక్కులో ఉన్న 'బండ' మరియు క్రైస్తవుల ఖిబ్లా బైతుల్-మఖ్దిస్‌కు తూర్పు దిక్కులో ఉంది. చూడండి, 2:115, 142, 177.

أَهْوَآءَهُم مِّنۢ بَعْدِ مَا جَآءَكَ مِنَ
ٱلْعِلْمِ ۙ إِنَّكَ إِذًا لَّمِنَ ٱلظَّـٰلِمِينَ ﴿١٤٥﴾
ٱلَّذِينَ ءَاتَيْنَـٰهُمُ ٱلْكِتَـٰبَ يَعْرِفُونَهُۥ
كَمَا يَعْرِفُونَ أَبْنَآءَهُمْ ۖ وَإِنَّ فَرِيقًا مِّنْهُمْ
لَيَكْتُمُونَ ٱلْحَقَّ وَهُمْ يَعْلَمُونَ ﴿١٤٦﴾

ٱلْحَقُّ مِن رَّبِّكَ ۖ فَلَا تَكُونَنَّ مِنَ
ٱلْمُمْتَرِينَ ﴿١٤٧﴾
وَلِكُلٍّ وِجْهَةٌ هُوَ مُوَلِّيهَا ۖ فَٱسْتَبِقُوا۟
ٱلْخَيْرَٰتِ ۚ أَيْنَ مَا تَكُونُوا۟ يَأْتِ
بِكُمُ ٱللَّهُ جَمِيعًا ۚ إِنَّ ٱللَّهَ عَلَىٰ كُلِّ
شَىْءٍ قَدِيرٌ ﴿١٤٨﴾
وَمِنْ حَيْثُ خَرَجْتَ فَوَلِّ
وَجْهَكَ شَطْرَ ٱلْمَسْجِدِ ٱلْحَرَامِ ۖ
وَإِنَّهُۥ لَلْحَقُّ مِن رَّبِّكَ ۗ وَمَا ٱللَّهُ
بِغَـٰفِلٍ عَمَّا تَعْمَلُونَ ﴿١٤٩﴾

జ్ఞానం పొందిన తరువాత కూడా వారి మనోవాంఛలను అనుసరిస్తే! నిశ్చయంగా, నీవు దుర్మార్గులలో చేరినవాడవవుతావు.

**146**. మేము గ్రంథాన్ని ప్రసాదించిన వారు తమ కుమారులను ఏ విధంగా గుర్తిస్తారో ఇతనిని (ము'హమ్మద్‌ను) కూడా ఆవిధంగా గుర్తిస్తారు. మరియు వాస్తవానికి వారిలోని ఒక వర్గం వారు తెలిసి కూడా సత్యాన్ని దాస్తున్నారు.[1]

**147**. (నిస్సందేహంగా!) ఇది నీ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యం. కావున నీవు సందేహించేవారిలో ఏమాత్రం చేరకు!

**148**. మరియు ప్రతి ఒక (సంఘం) ఒకదిశ వైపునకు ముఖం త్రిప్పుతుంది.[2] కావున మీరు మంచిపనులు చేయటానికి త్వరపడండి. మీరెక్కడున్నా సరే, అల్లాహ్ మీ అందరినీ (తీర్పుదినం నాడు తన సన్నిధిలోకి) రప్పిస్తాడు. నిశ్చయంగా! అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

**149**. మరియు నీవు ఎక్కడికి బయలుదేరినా సరే! నీ ముఖాన్ని (నమా'జ్‌లో) మస్జిద్ అల్-'హరామ్ వైపునకే త్రిప్పుకో. మరియు నిశ్చయంగా, ఇది నీ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యం. మరియు అల్లాహ్ మీ కర్మల పట్ల నిర్లక్ష్యంగా లేడు.

---

**1**. మక్కాలోని క'అబహ్, ఇబ్రాహీమ్ ('అ.స.) యొక్క ఖిబ్లాగా ఉండేది. చూడండి, ఖు. 61:6.

**2**. చూడండి, 5:48. అల్లాహ్ (సు.తా.) మానవులకు మంచిచెడులను సూచించి, వాటి వ్యత్యాసాన్ని చూపి, వాటి ఫలితాలను కూడా స్పష్టంచేశాడు. కావున ప్రతివాడు తాను ఎన్నుకున్న మార్గానికి బాధ్యత వహించి దానికి తగిన ఫలితాన్ని అనుభవిస్తాడు. వారికి ఎలాంటి అన్యాయం జరగదు.

**150**. మరియు నీవు ఎక్కడికి బయలుదేరినా సరే! నీ ముఖాన్ని (నమా'జ్‌లో) మస్జిద్ అల్-'హరామ్ వైపునకే త్రిప్పుకో. మరియు మీరెక్కడున్నా సరే, మీ ముఖాలను దాని వైపునకే త్రిప్పుకోండి. దీనివల్ల మీకు వ్యతిరేకంగా వాదించటానికి ప్రజలకు అవకాశం దొరుకదు. కాని వారిలో దుర్మార్గులైన వారు (ఎలాంటి పరిస్థితులలోనూ ఊరుకోరు) అందుకని వారికి భయపడకండి, నాకే భయపడండి! మరియు ఈ విధంగా నేను మీపై నా అనుగ్రహాన్ని పూర్తిచేయటానికి మరియు బహుశా, ఈ విధంగానైనా మీరు మార్గదర్శకత్వం పొందవచ్చు!

**151**. ఈ విధంగా మేము మీ వారిలో నుండియే - మా సూచనలను మీ ఎదుట వినిపించటానికి మరియు మిమ్మల్ని సంస్కరించటానికి మరియు మీకు గ్రంథాన్ని మరియు వివేకాన్ని బోధించటానికి మరియు మీకు తెలియని విషయాలు నేర్పటానికి - ఒక ప్రవక్త (ము'హమ్మద్)ను మీ వద్దకు పంపాము.

**152**. కావున మీరు నన్నే స్మరించండి, నేను కూడా మిమ్మల్ని జ్ఞాపకం ఉంచుకుంటాను. మరియు నాకు కృతజ్ఞులై[1] ఉండండి మరియు నాకు కృతఘ్నులు కాకండి.

**153**. ఓ విశ్వాసులారా! సహనం మరియు నమా'జ్ ద్వారా సహాయం అర్థించండి. నిశ్చయంగా అల్లాహ్ సహనం గల వారితో ఉంటాడు.[2]

وَمِنْ حَيْثُ خَرَجْتَ فَوَلِّ وَجْهَكَ
شَطْرَ ٱلْمَسْجِدِ ٱلْحَرَامِ ۚ وَحَيْثُ مَا
كُنتُمْ فَوَلُّوا۟ وُجُوهَكُمْ شَطْرَهُۥ
لِئَلَّا يَكُونَ لِلنَّاسِ عَلَيْكُمْ حُجَّةٌ إِلَّا
ٱلَّذِينَ ظَلَمُوا۟ مِنْهُمْ فَلَا تَخْشَوْهُمْ
وَٱخْشَوْنِى وَلِأُتِمَّ نِعْمَتِى عَلَيْكُمْ
وَلَعَلَّكُمْ تَهْتَدُونَ ﴿١٥٠﴾
كَمَآ أَرْسَلْنَا فِيكُمْ رَسُولًا
مِّنكُمْ يَتْلُوا۟ عَلَيْكُمْ ءَايَٰتِنَا
وَيُزَكِّيكُمْ وَيُعَلِّمُكُمُ
ٱلْكِتَٰبَ وَٱلْحِكْمَةَ وَيُعَلِّمُكُم مَّا
لَمْ تَكُونُوا۟ تَعْلَمُونَ ﴿١٥١﴾
فَٱذْكُرُونِىٓ أَذْكُرْكُمْ وَٱشْكُرُوا۟ لِى
وَلَا تَكْفُرُونِ ﴿١٥٢﴾
يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ ٱسْتَعِينُوا۟
بِٱلصَّبْرِ وَٱلصَّلَوٰةِ ۚ إِنَّ ٱللَّهَ مَعَ
ٱلصَّٰبِرِينَ ﴿١٥٣﴾

---

**1**. చూడండి, ఖు.14:7. 'స.బు'ఖారీ, పుస్తకం-8, 'హదీస్' నం.415; పుస్తకం-9, 'హదీస్' నం.502.
**2**. మంచి విశ్వాసి సంతోషం కలిగినపుడు అల్లాహుతా'ఆలాకు కృతజ్ఞుడై ఉంటాడు మరియు బాధలో ఉన్నప్పుడు సహనం వహిస్తాడు. ('స'హీ'హ్ ముస్లిం, 'హ.నం. 2999).

وَلَا تَقُولُوا۟ لِمَن يُقْتَلُ فِى سَبِيلِ ٱللَّهِ أَمْوَٰتٌۢ ۚ بَلْ أَحْيَآءٌ وَلَـٰكِن لَّا تَشْعُرُونَ ﴿١٥٤﴾

154. మరియు అల్లాహ్ మార్గంలో చంపబడిన వారిని 'మృతులు' అనకండి![1] వాస్తవానికి వారు సజీవులు. కాని మీరది గ్రహించజాలరు.

وَلَنَبْلُوَنَّكُم بِشَىْءٍ مِّنَ ٱلْخَوْفِ وَٱلْجُوعِ وَنَقْصٍ مِّنَ ٱلْأَمْوَٰلِ وَٱلْأَنفُسِ وَٱلثَّمَرَٰتِ ۗ وَبَشِّرِ ٱلصَّـٰبِرِينَ ﴿١٥٥﴾

155. మరియు నిశ్చయంగా మేము, మిమ్మల్ని భయ ప్రమాదాలకు, ఆకలి బాధలకు, ధన, ప్రాణ, ఫల (ఆదాయాల) నష్టానికీ గురిచేసి పరీక్షిస్తాము. మరియు (ఇలాంటి పరిస్థితులలో) మనఃస్థైర్యంతో ఉండేవారికి శుభవార్త నివ్వు.

ٱلَّذِينَ إِذَآ أَصَـٰبَتْهُم مُّصِيبَةٌ قَالُوٓا۟ إِنَّا لِلَّهِ وَإِنَّآ إِلَيْهِ رَٰجِعُونَ ﴿١٥٦﴾

156. ఎవరైతే విపత్కరమైన పరిస్థితి ఏర్పడినప్పుడు: "నిశ్చయంగా మేము అల్లాహ్ కే చెందినవారము! మరియు మేము ఆయన వైపునకే మరలిపోతాము!" అని అంటారో;

أُو۟لَـٰٓئِكَ عَلَيْهِمْ صَلَوَٰتٌ مِّن رَّبِّهِمْ وَرَحْمَةٌ ۖ وَأُو۟لَـٰٓئِكَ هُمُ ٱلْمُهْتَدُونَ ﴿١٥٧﴾

157. అలాంటి వారికి వారి ప్రభువునుండి అనుగ్రహాలు[2] మరియు కరుణ ఉంటాయి. మరియు వారే సన్మార్గం పొందినవారు.[3] (1/8)

۞ إِنَّ ٱلصَّفَا وَٱلْمَرْوَةَ مِن شَعَآئِرِ ٱللَّهِ ۖ

158. * నిశ్చయంగా, 'సఫా మరియు మర్వాలు అల్లాహ్ చూపిన చిహ్నాలు.[4] కావున

1. అల్లాహ్ (సు.తా.) మార్గంలో జిహాద్ (ధర్మపోరాటం) చేసి చంపబడిన వారు మృతులు కారు. వారు అల్లాహుతా'ఆలా సన్నిధిలో సజీవులుగా ఉంటారు. చూడండి, 3:169.
2. 'సలవాతున్: అంటే blessings, benedictions, అనుగ్రహాలు, ఆశీర్వాదాలు, దీవెనలు, వరాలు మరియు శుభాకాంక్షలు అనే అర్థాలున్నాయి.
3. నష్టం కలిగినపుడు: "ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజి'ఊన్." మరియు, "అల్లాహుమ్మ అజుర్నీ ఫీ ము'సీబతీ, వ అ'ఖ్లిఫ్లీ 'ఖైరమ్మిన్హా." చదవాలి, ('స. ముస్లిం, 'హదీస్' నం. 918).
4. 'సఫా-మర్వాలు మక్కాలోక'అబహ్ కు కొంతదూరంలో ఉన్న చిన్న గుట్టలు. 'హజ్జ్ లేక 'ఉమ్రా చేసేవారు క'అబహ్ చుట్టు ఏడు ప్రదక్షిణలు ('తవాఫ్) చేసిన తరువాత 'సఫా-మర్వా గుట్టల మధ్య ఏడు సార్లు పచార్లు (స'యీ) చేయాలి. ఇది తప్పకుండా చేయాలి (వాజిబ్). ఇబ్రాహీమ్ ('అ.స.) భార్య - ఇస్మా'యీల్ ('అ.స.) యొక్క తల్లి - అయిన సయ్యిదా హాజర్, ఇస్మా'యీల్ ('అ.స.)ను కాబా దగ్గర పరుండబెట్టి, నీటి కొరకు ఈ రెండు గుట్టల మధ్య పరుగెత్తుతూ,

فَمَنْ حَجَّ ٱلْبَيْتَ أَوِ ٱعْتَمَرَ فَلَا جُنَاحَ عَلَيْهِ أَن يَطَّوَّفَ بِهِمَا ۚ وَمَن تَطَوَّعَ خَيْرًا فَإِنَّ ٱللَّهَ شَاكِرٌ عَلِيمٌ ﴿١٥٨﴾

ఎవడు (క'అబహ్) గృహానికి 'హజ్జ్ లేక 'ఉమ్రా కొరకు పోతాడో,[1] అతడు ఈ రెంటి మధ్య పచార్లు (స'యీ) చేస్తే, అతనికి ఎట్టి దోషం లేదు. మరియు ఎవడైనా స్వేచ్ఛాపూర్వకంగా మంచి కార్యం చేస్తే! నిశ్చయంగా, అల్లాహ్ కృతజ్ఞతలను ఆమోదించేవాడు,[2] సర్వజ్ఞుడు.

إِنَّ ٱلَّذِينَ يَكْتُمُونَ مَآ أَنزَلْنَا مِنَ ٱلْبَيِّنَٰتِ وَٱلْهُدَىٰ مِنۢ بَعْدِ مَا بَيَّنَّٰهُ لِلنَّاسِ فِى ٱلْكِتَٰبِ ۙ أُو۟لَٰٓئِكَ

**159**. నిశ్చయంగా, ఎవరైతే మేము అవతరింపజేసిన స్పష్టమైన బోధనలను, మార్గదర్శకత్వాలను - ప్రజల కొరకు దివ్య గ్రంథంలో స్పష్టపరచిన పిదప కూడా - దాచుతారో! వారిని అల్లాహ్ తప్పక

తన కుమారుణ్ణి ఈ గుట్టలెక్కి చూసేది. అదే కార్యాన్ని అల్లాహ్ (సు.తా.) ముస్లింలకు 'హజ్జ్ లేక 'ఉమ్రా చేసేటప్పుడు, ఆచరించమని ఆజ్ఞాపించాడు. ఇవే కాకుండా 'హజ్జ్ చేసే వారి కొరకు ఇతర ఆచారాలు అంటే బలి (ఖుర్బానీ) ఇవ్వటం, మీనాలోని మూడు జమరాత్‌లమీద ప్రతిదానిపై ఏడేసి గులక రాళ్ళు రువ్వటం, మొదలైనవి ఉన్నాయి. సయ్యిదా హాజర్ యొక్క ప్రార్థనను అంగీకరించి అల్లాహ్ (సు.తా.) ఇస్మా'యీల్ (అ.స.) కాళ్ళ దగ్గర 'జమ్'జమ్ నీటి బుగ్గను పుట్టించాడు. అందులో ఈ నాటి వరకు నీళ్ళు పుష్కలంగా ఉన్నాయి. బైతుల్లాహ్‌ను సందర్శించే వారు ఈ నీటిని త్రాగి, అల్లాహుతా'ఆలాకు కృతజ్ఞతలు తెలియజేస్తారు. ఇంకా అక్కడ తమ కోరికల పూర్తికై, పాపవిమోచనకై, ఉత్తమ ప్రతిఫలాలకై అల్లాహ్(సు.తా.)ను ప్రార్థిస్తారు.

1. 'హజ్జ్ అంటే జుల్-'హజ్జ్ నెలలో 8-13 తేదీల వరకు క'అబహ్, మినా, 'అరఫాత్ మరియు ము'జ్దలిఫాలను సందర్శించటం.
'ఉమ్రా అంటే ఈ తేదీలలో కాక ఇతర కాలంలో ఎప్పుడైనా క'అబహ్‌ను దర్శించటం. (చూడండి, 14:37). 'ఉమ్రా చేయదలుచుకున్న వారు: 'హరమ్ సరిహద్దుల బయటినుండి (మీఖాత్ బయట ఉండేవారు మీఖాత్ నుండి) 'ఉమ్రా దీక్ష(నియ్యత్)తో, ఇ'హ్రామ్ ధరించి, క'అబహ్ చుట్టు ఏడు ప్రదక్షిణలు చేసి, తరువాత 'సఫా-మర్వాల మధ్య ఏడు సార్లు పచార్లు చేసి, ఆ తరువాత శిరోముండనం చేయించుకొని, ఇ'హ్రామ్ విడుస్తారు. మీఖాత్ మరియు 'హరమ్ సరిహద్దులను మహా ప్రవక్త ('స'అస) సూచించారు.

2. షాకిరున్ (**అష్-షకూరు**): One who approves or Rewards or Forgives much or largely. అంటే **కృతజ్ఞతలను ఆమోదించే**, అంగీకరించే, ఆదరించే, విలువనిచ్చే వాడు. తన దాసుల మంచి కార్యాలకు అమితంగా ప్రతిఫలమిచ్చే వాడు. All-Appreciative, యోగ్యతను గుర్తించే, పరిగణించే వాడు. **అష్-షకూరు**కు చూడండి, 4:147. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

يَلۡعَنُهُمُ ٱللَّهُ وَيَلۡعَنُهُمُ ٱللَّٰعِنُونَ ﴿١٥٩﴾

శపిస్తాడు (బహిష్కరిస్తాడు). మరియు శపించగలవారు కూడా వారిని శపిస్తారు.[1]

إِلَّا ٱلَّذِينَ تَابُواْ وَأَصۡلَحُواْ وَبَيَّنُواْ فَأُوْلَٰٓئِكَ أَتُوبُ عَلَيۡهِمۡۚ وَأَنَا ٱلتَّوَّابُ ٱلرَّحِيمُ ﴿١٦٠﴾

**160**. కాని ఎవరైతే పశ్చాత్తాపపడతారో మరియు తమ నడవడికను సంస్కరించు కుంటారో మరియు సత్యాన్ని వెల్లడిస్తారో, అలాంటి వారి పశ్చాత్తాపాన్ని నేను అంగీకరిస్తాను. మరియు నేను మాత్రమే పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడను,[2] అపార కరుణాప్రదాతను.

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ وَمَاتُواْ وَهُمۡ كُفَّارٌ أُوْلَٰٓئِكَ عَلَيۡهِمۡ لَعۡنَةُ ٱللَّهِ وَٱلۡمَلَٰٓئِكَةِ وَٱلنَّاسِ أَجۡمَعِينَ ﴿١٦١﴾

**161**. నిశ్చయంగా ఎవరైతే సత్య తిరస్కారులై, ఆ తిరస్కారంలోనే మృతి చెందుతారో, అలాంటి వారిపై అల్లాహ్ యొక్క శాపం (బహిష్కారం) ఉంటుంది మరియు దేవదూతల మరియు సర్వ మానవుల యొక్క శాపముంటుంది.

خَٰلِدِينَ فِيهَاۖ لَا يُخَفَّفُ عَنۡهُمُ ٱلۡعَذَابُ وَلَا هُمۡ يُنظَرُونَ ﴿١٦٢﴾

**162**. ఆ (శాపగ్రస్త స్థితిలోనే నరకంలో) వారు శాశ్వతంగా ఉంటారు. వారి శిక్షను తగ్గించటం కానీ మరియు వారికి మళ్ళీ వ్యవధి ఇవ్వటం కానీ జరుగదు.

وَإِلَٰهُكُمۡ إِلَٰهٞ وَٰحِدٞۖ لَّآ إِلَٰهَ إِلَّا هُوَ ٱلرَّحۡمَٰنُ ٱلرَّحِيمُ ﴿١٦٣﴾

**163**. మరియు మీ ఆరాధ్య దైవం కేవలం ఆ అద్వితీయుడు[3] (అల్లాహ్) మాత్రమే. ఆయన తప్ప! మరొక ఆరాధ్య దేవుడు లేడు, అనంత కరుణామయుడు, అపార కరుణాప్రదాత.

---

**1**. ఇబ్నె 'అబ్బాస్ (ర'ది.'అ.) కథనం: ఈ ఆయత్‌లో- తౌరాత్ గ్రంథంలో దైవప్రవక్త ('స'అస) గురించి వచ్చిన స్పష్టమైన సూచనలను - యూదులు మరియు క్రైస్తవులు దాచిన విషయం గురించి చెప్పబడింది. (అబూ-దావూద్, మరియు సునన్ తిర్మిజీ', 'హదీస్' నం. 651).

**2**. **అత్-తవ్వాబు:** Oft-Returning. తన దాసుని పశ్చాత్తాపాన్ని అంగీకరించే, స్వీకరించే, కటాక్షించే, మన్నించే వాడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

**3**. **అల్-వా'హిద్:** The One, The Sole. **అద్వితీయుడు**, ఒకే ఒక్కడు. చూడండి, 2:133, 12:39.

إِنَّ فِي خَلْقِ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَٱخْتِلَٰفِ ٱلَّيْلِ وَٱلنَّهَارِ وَٱلْفُلْكِ ٱلَّتِي تَجْرِي فِي ٱلْبَحْرِ بِمَا يَنفَعُ ٱلنَّاسَ وَمَآ أَنزَلَ ٱللَّهُ مِنَ ٱلسَّمَآءِ مِن مَّآءٍ فَأَحْيَا بِهِ ٱلْأَرْضَ بَعْدَ مَوْتِهَا وَبَثَّ فِيهَا مِن كُلِّ دَآبَّةٍ وَتَصْرِيفِ ٱلرِّيَٰحِ وَٱلسَّحَابِ ٱلْمُسَخَّرِ بَيْنَ ٱلسَّمَآءِ وَٱلْأَرْضِ لَءَايَٰتٍ لِّقَوْمٍ يَعْقِلُونَ ﴿١٦٤﴾

وَمِنَ ٱلنَّاسِ مَن يَتَّخِذُ مِن دُونِ ٱللَّهِ أَندَادًا يُحِبُّونَهُمْ كَحُبِّ ٱللَّهِ ۖ وَٱلَّذِينَ ءَامَنُوٓا۟ أَشَدُّ حُبًّا لِّلَّهِ ۗ وَلَوْ يَرَى ٱلَّذِينَ ظَلَمُوٓا۟ إِذْ يَرَوْنَ ٱلْعَذَابَ أَنَّ ٱلْقُوَّةَ لِلَّهِ جَمِيعًا وَأَنَّ ٱللَّهَ شَدِيدُ ٱلْعَذَابِ ﴿١٦٥﴾

**164**. నిశ్చయంగా, భూమ్యాకాశాల సృష్టిలోనూ, రేయింబవళ్ళ మార్పు లోనూ, ప్రజలకు ఉపయోగ కరమైనవాటిని తీసుకొని, సముద్రంలో పయనించే ఓడలలోనూ మరియు అల్లాహ్ ఆకాశం నుండి వర్షాన్ని కురిపించి దాని ద్వారా నిర్జీవమైన భూమికి ప్రాణం పోసి, అందులో వివిధ రకాల జీవరాసులను వర్ధిల్లజేయటంలోనూ మరియు వాయువులు మరియు మేఘాలు, భూమ్యాకాశాల మధ్య నియమబద్ధంగా చేసే సంచారాల మార్పులలోనూ, బుద్ధిమంతులకు ఎన్నో సంకేతాలున్నాయి.[1]

**165**. అయినా ఈ మానవులలో కొందరు ఇతరులను, అల్లాహ్‌కు సాటిగా కల్పించుకుని, అల్లాహ్‌ను ప్రేమించవలసిన విధంగా వారిని ప్రేమిస్తారు. కాని విశ్వాసులు అందరి కంటే అత్యధికంగా అల్లాహ్‌నే ప్రేమిస్తారు. మరియు ఈ దుర్మార్గం చేస్తున్నవారు ప్రత్యక్షంగా చూడగలిగితే! ఆ శిక్షను చూసినప్పుడు, వారు నిశ్చయంగా, సర్వశక్తి కేవలం అల్లాహ్‌కే చెందుతుంది మరియు నిశ్చయంగా, అల్లాహ్ చాలా కఠినంగా శిక్షించే వాడు, (అని తెలుసుకునే వారు).[2]

---

1. ఈ ఆయత్‌లో అల్లాహ్ (సు.తా.) సృష్టించి, నడిపిస్తున్న ప్రకృతి నియమాలను గురించి వివరించడమైనది. 1) భూమ్యాకాశాల సృష్టి, 2) రాత్రింబవళ్ళు ఒకదాని తరువాత ఒకటి రావటం మరియు వాటి కాలాలలో హెచ్చుతగ్గులు, 3) సముద్రాలలో నావలు ఎంతో భారాన్ని తీసుకొని పయనించటం, 4) వర్షం కురిసి జీవంలేని భూమికి జీవమివ్వటం, 5) వివిధ రకాల జీవరాసుల సృష్టి, 6) చల్లని, వెచ్చని వివిధ దిక్కుల నుండి వీచే గాలి, 7) అల్లాహుతా'ఆలా తాను కోరినచోట వర్షం కురిపించటానికి, తనకు నియమబద్ధులుగా సృష్టించిన మేఘాలు; వీటన్నిటిలో బుద్ధిమంతులకు ఎన్నో సూచనలున్నాయి. ఈ కార్యాలలో ఆయనకు మరెవ్వరూ భాగస్వాములు లేరనేది కూడా వ్యక్తమౌతోంది. ఎందుకంటే ఎవరైనా ఆయనకు భాగస్వాములుంటే ఈ సృష్టిలో అల్లకల్లోలం చెలరేగి ఉండేది.
2. చూడండి, 39:45, 29:65, 17:67 మరియు 'స.బు'ఖారీ, పుస్తకం-6, 'హదీస్' నం.24.

إِذْ تَبَرَّأَ ٱلَّذِينَ ٱتُّبِعُواْ مِنَ
ٱلَّذِينَ ٱتَّبَعُواْ وَرَأَوُاْ ٱلْعَذَابَ
وَتَقَطَّعَتْ بِهِمُ ٱلْأَسْبَابُ ﴿١٦٦﴾

**166**. అప్పుడు (ఆ రోజు) వారు (ఆ సాటిగా కల్పించబడిన వారు) తమను అనుసరించిన వారితో తమకు ఎలాంటి సంబంధం లేదంటారు. మరియు వారంతా తమ శిక్షను చూసుకుంటారు. మరియు వారి మధ్య ఉన్న సంబంధాలన్నీ తెగిపోతాయి.

وَقَالَ ٱلَّذِينَ ٱتَّبَعُواْ لَوْ أَنَّ لَنَا
كَرَّةً فَنَتَبَرَّأَ مِنْهُمْ كَمَا تَبَرَّءُواْ
مِنَّا ۗ كَذَٰلِكَ يُرِيهِمُ ٱللَّهُ
أَعْمَٰلَهُمْ حَسَرَٰتٍ عَلَيْهِمْ ۖ وَمَا
هُم بِخَٰرِجِينَ مِنَ ٱلنَّارِ ﴿١٦٧﴾

**167**. మరియు ఆ అనుసరించిన వారు అంటారు: ''మాకు ప్రపంచ జీవితంలోకి మళ్ళీ తిరిగిపోయే అవకాశంలభిస్తే - వీరు ఈ రోజు మమ్మల్ని త్యజించినట్లు - మేము కూడా వీరిని త్యజిస్తాము!'' ఈ విధంగా (ప్రపంచంలో) వారు చేసిన కర్మలను అల్లాహ్ వారికి చూపించినప్పుడు, అది వారికి ఎంతో బాధాకరంగా ఉంటుంది. కాని వారు నరకాగ్ని నుండి ఏ విధంగానూ బయటపడలేరు.

يَٰٓأَيُّهَا ٱلنَّاسُ كُلُواْ مِمَّا فِى
ٱلْأَرْضِ حَلَٰلًا طَيِّبًا وَلَا تَتَّبِعُواْ
خُطُوَٰتِ ٱلشَّيْطَٰنِ ۚ إِنَّهُۥ لَكُمْ
عَدُوٌّ مُّبِينٌ ﴿١٦٨﴾

**168**. ఓ ప్రజలారా! భూమిలో నున్న ధర్మసమ్మతమైన పరిశుద్ధమైన వాటినే తినండి. మరియు షైతాన్ అడుగు జాడలను అనుసరించకండి. నిశ్చయంగా, అతడు మీకు బహిరంగ శత్రువు.

إِنَّمَا يَأْمُرُكُم بِٱلسُّوٓءِ وَٱلْفَحْشَآءِ
وَأَن تَقُولُواْ عَلَى ٱللَّهِ مَا لَا تَعْلَمُونَ
﴿١٦٩﴾

**169**. నిశ్చయంగా, అతడు (షైతాన్) మిమ్మల్ని దుష్కార్యాలు మరియు అశ్లీలమైన పనులు చేయటానికి మరియు అల్లాహ్‌ను గురించి మీకు తెలియని మాటలు పలుకటానికి ప్రేరేపిస్తుంటాడు.

وَإِذَا قِيلَ لَهُمُ ٱتَّبِعُواْ مَآ أَنزَلَ ٱللَّهُ قَالُواْ بَلْ نَتَّبِعُ مَآ أَلْفَيْنَا عَلَيْهِ ءَابَآءَنَآۗ أَوَلَوْ كَانَ ءَابَآؤُهُمْ لَا يَعْقِلُونَ شَيْـًٔا وَلَا يَهْتَدُونَ ﴿١٧٠﴾

**170**. మరియు వారితో: "అల్లాహ్ అవతరింపజేసిన వాటిని (ఆదేశాలను) అనుసరించండి!" అని అన్నప్పుడు. వారు: "అలాకాదు, మేము మా తండ్రి తాతలు అవలంబిస్తూ వచ్చిన పద్ధతినే అనుసరిస్తాము." అని సమాధానమిస్తారు. ఏమీ? వారి తండ్రితాతలు ఎలాంటి జ్ఞానంలేని వారైనప్పటికినీ మరియు సన్మార్గం పొందనివారు అయినప్పటికినీ, (వీరు, వారినే అనుసరిస్తారా)?

وَمَثَلُ ٱلَّذِينَ كَفَرُواْ كَمَثَلِ ٱلَّذِى يَنْعِقُ بِمَا لَا يَسْمَعُ إِلَّا دُعَآءً وَنِدَآءًۚ صُمٌّۢ بُكْمٌ عُمْىٌ فَهُمْ لَا يَعْقِلُونَ ﴿١٧١﴾

**171**. మరియు సత్యతిరస్కారుల ఉపమానం, ఆ (పశువుల) వలే ఉంది; అవి అతని (కాపరి) అరుపులు వింటాయే (కానీ ఏమీ అర్థం చేసుకోలేవు), అరుపులు మరియు కేకలు వినడం తప్ప. వారు చెవిటి వారు, మూగవారు మరియు గ్రుడ్డివారు, కాబట్టి వారు ఏమీ అర్థం చేసుకోలేరు![1]

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ كُلُواْ مِن طَيِّبَٰتِ مَا رَزَقْنَٰكُمْ وَٱشْكُرُواْ لِلَّهِ إِن كُنتُمْ إِيَّاهُ تَعْبُدُونَ ﴿١٧٢﴾

**172**. ఓ విశ్వాసులారా! మీరు నిజంగానే కేవలం ఆయన(అల్లాహ్)నే ఆరాధించే వారు అయితే; మేము మీకు జీవనోపాధిగా ఇచ్చిన పరిశుద్ధ (ధర్మసమ్మత)మైన వస్తువులనే తినండి మరియు అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపండి.[2]

إِنَّمَا حَرَّمَ عَلَيْكُمُ ٱلْمَيْتَةَ وَٱلدَّمَ وَلَحْمَ ٱلْخِنزِيرِ وَمَآ أُهِلَّ

**173**. నిశ్చయంగా, ఆయన మీ కొరకు చచ్చిన జంతువు, రక్తం, పంది మాంసం మరియు అల్లాహ్ తప్ప ఇతరుల కొరకు జి'బ్'హ్ చేయబడిన దానిని (తినటాన్ని)

---

**1**. అంటే ఈ సత్యతిరస్కారులు, సత్యధర్మం యొక్క పిలుపు విన్నా దానిని అర్థంచేసుకోలేక పోతున్నారు. ఏవిధంగానైతే పశువులు - వాటి కాపరి యొక్క కేకలను - అర్థం చేసుకోలేవో!

**2**. 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-1, 'హదీస్' నం. 49.

بِهِۦ لِغَيۡرِ ٱللَّهِۖ فَمَنِ ٱضۡطُرَّ غَيۡرَ بَاغٖ وَلَا عَادٖ فَلَآ إِثۡمَ عَلَيۡهِۚ إِنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٌ ١٧٣

నిషేధించి ఉన్నాడు.[1] కాని ఎవరైనా గత్యంతరంలేక, దుర్నీతితో కాకుండా, హద్దు మీరకుండా (తిన్నట్లైతే) అట్టివానిపై ఎలాంటి దోషంలేదు![2] నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు,[3] అపార కరుణాప్రదాత.

إِنَّ ٱلَّذِينَ يَكۡتُمُونَ مَآ أَنزَلَ ٱللَّهُ مِنَ ٱلۡكِتَٰبِ وَيَشۡتَرُونَ بِهِۦ ثَمَنٗا قَلِيلًاۙ أُوْلَٰٓئِكَ مَا يَأۡكُلُونَ فِي بُطُونِهِمۡ إِلَّا ٱلنَّارَ وَلَا يُكَلِّمُهُمُ ٱللَّهُ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ وَلَا يُزَكِّيهِمۡ وَلَهُمۡ عَذَابٌ أَلِيمٌ ١٧٤

**174.** నిశ్చయంగా, ఎవరైతే అల్లాహ్ గ్రంథంలో అవతరింపజేసిన సందేశాలను దాచి, దానికి బదులుగా అల్ప లాభం పొందుతారో, అలాంటి వారు తమ కడుపులను కేవలం అగ్నితో నింపుకుంటున్నారు మరియు అల్లాహ్ పునరుత్థానదినమున వారితో మాట్లాడడు మరియు వారిని శుద్ధపరచడు మరియు వారికి భాధాకరమైన శిక్ష ఉంటుంది.

أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ ٱشۡتَرَوُاْ ٱلضَّلَٰلَةَ بِٱلۡهُدَىٰ وَٱلۡعَذَابَ بِٱلۡمَغۡفِرَةِۚ فَمَآ أَصۡبَرَهُمۡ عَلَى ٱلنَّارِ ١٧٥

**175.** ఇలాంటి వారే సన్మార్గానికి బదులుగా దుర్మార్గాన్ని మరియు క్షమాపణకు బదులుగా శిక్షను ఎన్నుకున్నవారు. ఎంత సహనముంది వీరికి, నరకాగ్ని శిక్షను భరించటానికి!

---

**1**. ఈ 'హరాం చేయబడిన విషయాలు ఇంకా మూడు చోట్లలో పేర్కొనబడ్డాయి. చూడండి, 5:3, 6:145, 16:115.

**2**. ఈ నాలుగు గాక 'హదీస్'లో 'హరామ్‌గా పేర్కొనబడినవి ఇవి: 1) గోళ్ళతో వేటాడి చంపే మృగాలు, 2) తమగోళ్ళతో వేటాడే పక్షులు, 3) గాడిద, కుక్క మొదలైనవి. ఇంకా వివరాలకు చూడండి, 5:3. 'హదీస్'లో మరణించిన చేప 'హలాల్‌గా పరిగణించబడింది. అల్లాహుతా'ఆలా తప్ప, ఇతరులను సంతృప్తి పరచటానికి వారిపేరున ఒక పశువును జి'బ్'హ్ చేయటం - జి'బ్'హ్ చేసేటప్పుడు అల్లాహ్ (సు.తా.) పేరు తీసుకున్నా - వారి సంకల్పం (నియ్యత్) అల్లాహ్ (సు.తా.) కాక, ప్రత్యేకమైన వేరే ఇతరుణ్ణి సంతోషింపజేయటానికైతే, అలాంటి దానిని తినటం కూడా 'హరామ్. అంతేగాక అల్లాహ్‌యేతరులకు అర్పించబడినది. (నజ'ర్, నియా'జ్, చఢావా చేసింది) ఏదైనా తినటం కూడా 'హరామ్. ('స'హీ'హ్ అల్ - జామె, అస్స'గీర్ వ జ్యాదతహు, అల్‌బానీ పుస్తకం-2 పేజీ-1024).

**3**. అల్-'గఫూరు: Oft-Forgiving, Most Forgiving. క్షమించేవాడు, పాపాలను ఎక్కువగా క్షమించేవాడు. అల్-'గప్ఫారు: క్షమాశీలుడు, చూడండి, 20:82. అల్-'గప్ఫారు మరియు అల్-'గఫూరు అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు. అల్-'గాఫిర్: క్షమాగుణ పరిపూర్ణుడు, చూడండి, 40:3.

ذَٰلِكَ بِأَنَّ ٱللَّهَ نَزَّلَ ٱلْكِتَٰبَ
بِٱلْحَقِّ ۗ وَإِنَّ ٱلَّذِينَ ٱخْتَلَفُوا۟ فِى
ٱلْكِتَٰبِ لَفِى شِقَاقٍۭ بَعِيدٍ ﴿١٧٦﴾
۞ لَّيْسَ ٱلْبِرَّ أَن تُوَلُّوا۟ وُجُوهَكُمْ قِبَلَ
ٱلْمَشْرِقِ وَٱلْمَغْرِبِ وَلَٰكِنَّ ٱلْبِرَّ مَنْ
ءَامَنَ بِٱللَّهِ وَٱلْيَوْمِ ٱلْءَاخِرِ
وَٱلْمَلَٰٓئِكَةِ وَٱلْكِتَٰبِ وَٱلنَّبِيِّۦنَ
وَءَاتَى ٱلْمَالَ عَلَىٰ حُبِّهِۦ ذَوِى
ٱلْقُرْبَىٰ وَٱلْيَتَٰمَىٰ وَٱلْمَسَٰكِينَ
وَٱبْنَ ٱلسَّبِيلِ وَٱلسَّآئِلِينَ وَفِى
ٱلرِّقَابِ وَأَقَامَ ٱلصَّلَوٰةَ وَءَاتَى

**176.** ఇదంతా ఎందుకంటే! నిశ్చయంగా అల్లాహ్ ఈ గ్రంథాన్ని సత్యంతో అవతరింపజేశాడు. మరియు నిశ్చయంగా, ఈ గ్రంథం (ఖుర్ఆన్) గురించి భిన్నాభిప్రాయాలు గలవారు, ఘోర అంతఃకలహంలో ఉన్నారు![1] (1/4)

**177.** * వినయవిధేయత (ధర్మనిష్ఠాపరత్వం)[2] అంటే మీరు మీ ముఖాలను తూర్పు దిక్కునకో, లేక పడమర దిక్కునకో చేయటం కాదు;[3] కాని వినయవిధేయత (ధర్మనిష్ఠాపరత్వం) అంటే, అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని, దేవదూతలను, ప్రతి దివ్యగ్రంథాన్ని మరియు ప్రవక్తలను హృదయపూర్వకంగా విశ్వసించడం మరియు ధనంపై ప్రేమ కలిగివుండి కూడా, దానిని బంధువుల కొరకు అనాథుల కొరకు, యాచించని పేదల[4] కొరకు, బాటసారుల కొరకు, యాచకుల కొరకు మరియు బానిసలను[5] విడిపించడానికి వ్యయపరచడం.

---

**1.** వంకర అక్షరాలలో ఉన్నదాని తాత్పర్యం ఈ విధంగా కూడా ఉంది: 'తమ విరోధంలో సత్యం నుండి చాలా దూరం వెళ్ళిపోయారు.'

**2.** అల్-బిర్రు: piety, to act well, virtue, అంటే ధర్మ ఆచరణ, ధర్మనిష్ఠాపరత్వం, దైవభక్తి, నీతిపరత్వం, పుణ్యం అనే అర్థాలున్నాయి.

**3.** చూడండి, అల్-బఖర 2:145 వ్యాఖ్యానం 3. దీని ఉద్దేశ్యం ఏమిటంటే, అల్లాహ్ (సు.తా.) ఆదేశాన్ని శిరసావహించి, విశ్వాసులందరూ, వారు ప్రపంచంలో ఎక్కడున్నా, ఎల్లపుడూ ఒకే ఒక్క ఖిబ్లా (క'అబహ్) అయిన మక్కా ముకర్రమా వైపునకు మాత్రమే అభిముఖులై నమా'జ్ చేయాలి.

**4.** మసాకీన్, మిస్కీన్ (ఏ.వ.): అంటే, ఆదాయం ఉన్నా అది వారి నిత్యావసరాలకు సరిపోనివారు. ఇలాంటి వారు తమ ఆత్మాభిమానంవల్ల యాచించటానికి ఇష్టపడరు. ఫుఖరా - అంటే ఏమీ ఆదాయం లేక గత్యంతరం లేక భిక్షమడిగే వారు.

**5.** ఖుర్ఆన్ అవతరింపజేయబడే కాలంలో బానిసత్వం, బానిసలను కొనటం, అమ్మటం ఎంతో ఎక్కువగా ఉండేది. ఇస్లాం ధర్మం యొక్క ముఖ్య లక్ష్యాలలో ఒకటి ఇలాంటి

ٱلزَّكَوٰةَ وَٱلۡمُوفُونَ بِعَهۡدِهِمۡ
إِذَا عَٰهَدُواْۖ وَٱلصَّٰبِرِينَ فِي ٱلۡبَأۡسَآءِ
وَٱلضَّرَّآءِ وَحِينَ ٱلۡبَأۡسِۗ أُوْلَٰٓئِكَ
ٱلَّذِينَ صَدَقُواْۖ وَأُوْلَٰٓئِكَ هُمُ
ٱلۡمُتَّقُونَ ١٧٧

మరియు నమా'జ్‌ను స్థాపించడం, 'జకాత్ ఇవ్వడం మరియు వాగ్దానం చేసినప్పుడు తమ వాగ్దానాన్ని పూర్తిచేయడం. మరియు దురవస్థలో మరియు ఆపత్కాలాలలో మరియు యుద్ధ సమయాలలో స్థైర్యం కలిగి ఉండటం. ఇలాంటి వారే సత్యవంతులు మరియు ఇలాంటి వారే దైవభీతి గలవారు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ كُتِبَ عَلَيۡكُمُ
ٱلۡقِصَاصُ فِي ٱلۡقَتۡلَىۖ ٱلۡحُرُّ بِٱلۡحُرِّ
وَٱلۡعَبۡدُ بِٱلۡعَبۡدِ وَٱلۡأُنثَىٰ بِٱلۡأُنثَىٰۚ
فَمَنۡ عُفِيَ لَهُۥ مِنۡ أَخِيهِ شَيۡءٞ
فَٱتِّبَاعُۢ بِٱلۡمَعۡرُوفِ وَأَدَآءٌ إِلَيۡهِ
بِإِحۡسَٰنٖۗ ذَٰلِكَ تَخۡفِيفٞ مِّن رَّبِّكُمۡ
وَرَحۡمَةٞۗ فَمَنِ ٱعۡتَدَىٰ بَعۡدَ ذَٰلِكَ
فَلَهُۥ عَذَابٌ أَلِيمٞ ١٧٨

**178.** ఓ విశ్వాసులారా! హత్య విషయంలో మీ కొరకు న్యాయ ప్రతీకారం (ఖి'సా'స్) నిర్ణయించబడింది. ఆ హత్య చేసినవాడు, స్వేచ్ఛగలవాడైతే ఆ స్వేచ్ఛాపరుణ్ణి, బానిస అయితే ఆ బానిసను, స్త్రీ అయితే ఆ స్త్రీని (వధించాలి).[1] ఒకవేళ హతుని సోదరులు (కుటుంబీకులు) హంతకుణ్ణి కనికరించ దలిస్తే, ధర్మయుక్తంగా రక్తశుల్క నిర్ణయం జరగాలి.[2] హంతకుడు రక్తధనాన్ని, ఉత్తమరీతిలో అతనికి చెల్లించాలి. ఇది మీ ప్రభువు తరఫునుండి మీకు లభించే సౌకర్యం, కారుణ్యం. దీని తర్వాత కూడా ఈ హద్దులను అతిక్రమించే వానికి బాధాకరమైన శిక్ష ఉంటుంది.

---

బానిసత్వాన్ని రూపుమాపటం. కేవలం ధర్మయుద్ధ ఖైదీలను మాత్రమే ఇస్లాం చట్టం ప్రకారం బానిసలుగా ఉంచుకోవచ్చు. చూడండి, 8:67. ఖుర్ఆన్‌లో బానిసలను విడిపించటం పుణ్యకార్యమని ఎన్నోచోట్లలో పేర్కొనబడింది. చూడండి, 4:92, 5:89, 58:3.

**1.** ఇది ఇస్లాంకు ముందు 'అరబ్బులలో ఉన్న దురాచారాన్ని ఖండిస్తోంది. వారు ఒక మగ హంతకునికి బదులుగా - అతని కుటుంబంలో అనేకమంది మగవారిని; ఒక స్త్రీ హంతకురాలికి బదులుగా ఆమె కుటుంబంలోని పురుషుణ్ణి; లేక ఒక బానిస హంతకునికి బదులుగా ఒక స్వతంత్ర పురుషుణ్ణి - హత్యచేసే వారు.

**2.** చూడండి, 55:60.

وَلَكُمْ فِي ٱلْقِصَاصِ حَيَوٰةٌ يَٰٓأُو۟لِى
ٱلْأَلْبَٰبِ لَعَلَّكُمْ تَتَّقُونَ ﴿١٧٩﴾

**179**. ఓ బుద్ధిమంతులారా! న్యాయ ప్రతీకారం (ఖి'సా'స్)లో మీకు ప్రాణ (రక్షణ) ఉంది, దీనివల్ల మీరు దైవభీతి గలవారు అవుతారు.[1]

كُتِبَ عَلَيْكُمْ إِذَا حَضَرَ أَحَدَكُمُ
ٱلْمَوْتُ إِن تَرَكَ خَيْرًا ٱلْوَصِيَّةُ
لِلْوَٰلِدَيْنِ وَٱلْأَقْرَبِينَ بِٱلْمَعْرُوفِ ۖ
حَقًّا عَلَى ٱلْمُتَّقِينَ ﴿١٨٠﴾

**180**. మీలో ఎవరికైనా మరణకాలం సమీపించినప్పుడు అతడు, ఆస్తిపాస్తులు గలవాడైతే, అతడు తన తల్లిదండ్రులకొరకు మరియు సమీపబంధువులకొరకు ధర్మ సమ్మతమైన మరణశాసనం (వీలునామా) వ్రాయాలి.[2] ఇది దైవభీతి గలవారి విద్యుక్త ధర్మం.

فَمَنۢ بَدَّلَهُۥ بَعْدَ مَا سَمِعَهُۥ فَإِنَّمَآ
إِثْمُهُۥ عَلَى ٱلَّذِينَ يُبَدِّلُونَهُۥٓ ۚ إِنَّ ٱللَّهَ
سَمِيعٌ عَلِيمٌ ﴿١٨١﴾

**181**. ఇక దానిని (వీలునామాను) విన్నవారు, తరువాత ఒక వేళ దానిని మార్చితే, దాని పాపమంతా నిశ్చయంగా, ఆ మార్చిన వారి పైననే ఉంటుంది. నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.[3]

---

**1**. హత్యచేయగోరేవానికి మొదటినుంచే వాడుకూడా మరణశిక్షకు గురిఅయ్యే శాసనముందని తెలిస్తే! వాడు ఎన్నడూ హత్యకు పూనుకోడు. ఈ విధమైన న్యాయప్రతీకారం వల్ల రాజ్యంలో శాంతి సుఖాలు వర్ధిల్లుతాయి. ఉదా: ఇప్పుడు స'ఊదీ 'అరేబియాలో ఉన్న స్థితి.

**2**. ఆస్తుల పంపక విషయానికై చూడండి, 4:11-12, ఈ ఆయత్ వాటికంటే ముందు అవతరింపబడింది. వీలునామా కేవలం 1/3 భాగపు ఆస్తికొరకు మాత్రమే చేయవచ్చు. 2/3 భాగపు ఆస్తి మృతుని ప్రథమ శ్రేణి బంధువుల (వారసుల) హక్కు. ఆస్తికి హక్కుదారులైన ప్రథమ శ్రేణి బంధువులు (వారసులు) వీలునామాకు హక్కుదారులు కారు. ఈ 1/3 భాగం ఆస్తిపరుడు తన వీలునామాలో ఆస్తికి హక్కుదారులు కానటువంటి దూరబంధువులకు, స్నేహితులకు లేక ధర్మకార్యాలకు ఇవ్వవచ్చు. 1/3 భాగం కంటే ఎక్కువ భాగానికి వీలునామా వ్రాయటం ధర్మసమ్మతం కాదు. ('స. బు'ఖారీ, కితాబుల్ ఫరాయ'ద్, బాబ్ మీరాస్' అల్-బనాత్). ఆస్తి తక్కువ ఉంటే - కేవలం పేరు ప్రతిష్ఠల కొరకు - హక్కుదారులను పేదరికంలో వదలి, ధర్మకార్యాలకు లేక హక్కులేని వారి కొరకు - 1/3 భాగానికి కూడా - వీలునామా వ్రాయటం సమ్మతించదగినది కాదు. ఒక విశ్వాసి-ఒక అవిశ్వాసి, ఉభయులూ ఒకరికొకరు వారసులు కాలేరు. కాని వీలునామా (వ'సియ్యత్) ద్వారా వారికి ధనసహాయం చేయవచ్చు.

**3**. **సమీ'ఉన్-అలీమున్:** సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు. చూడండి, 2:127.

فَمَنۡ خَافَ مِن مُّوصٖ جَنَفًا أَوۡ إِثۡمٗا فَأَصۡلَحَ بَيۡنَهُمۡ فَلَآ إِثۡمَ عَلَيۡهِۚ إِنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٞ ﴿١٨٢﴾

**182**. కాని వీలునామా చేసిన వ్యక్తి పక్షపాతమో, లేదా అన్యాయమో చేశాడనే భయం ఎవనికైనా ఉంటే అతడు ఈ వ్యవహారంతో సంబంధం ఉన్న వారందరి మధ్య రాజీ కుదిరిస్తే అందులోఎలాంటి దోషం లేదు. నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ كُتِبَ عَلَيۡكُمُ ٱلصِّيَامُ كَمَا كُتِبَ عَلَى ٱلَّذِينَ مِن قَبۡلِكُمۡ لَعَلَّكُمۡ تَتَّقُونَ ﴿١٨٣﴾

**183**. ఓ విశ్వాసులారా! ఉపవాసం మీకు విధిగా నిర్ణయించబడింది[1] - ఏ విధంగానైతే మీ పూర్వీకులకు విధిగా నిర్ణయించబడి ఉండెనో - బహుశా మీరు దైవభీతిపరులై ఉంటారని!

أَيَّامٗا مَّعۡدُودَٰتٖۚ فَمَن كَانَ مِنكُم مَّرِيضًا أَوۡ عَلَىٰ سَفَرٖ فَعِدَّةٞ مِّنۡ أَيَّامٍ أُخَرَۚ وَعَلَى ٱلَّذِينَ يُطِيقُونَهُۥ فِدۡيَةٞ طَعَامُ مِسۡكِينٖۖ فَمَن تَطَوَّعَ خَيۡرٗا فَهُوَ خَيۡرٞ لَّهُۥۚ وَأَن تَصُومُواْ خَيۡرٞ لَّكُمۡۖ إِن كُنتُمۡ تَعۡلَمُونَ ﴿١٨٤﴾

**184**. ఇది (ఈ ఉపవాసం) నిర్ణయించబడిన రోజులకు మాత్రమే. కానీ, మీలో ఎవరైనా వ్యాధిగ్రస్తులై ఉంటే, లేక ప్రయాణంలో ఉంటే, వేరేదినాలలో (ఆ ఉపవాసాలు) పూర్తిచేయాలి. కాని దానిని పూర్తిచేయటం దుర్భరమైన వారు పరిహారంగా, ఒక పేదవానికి భోజనం పెట్టాలి.[2] కాని ఎవరైనా సహృదయంతో ఇంకా ఎక్కువ మేలు చేయదలిస్తే, అది అతని మేలుకే! కాని మీరు తెలుసుకో గలిగితే, ఉపవాసం ఉండటమే, మీకు ఎంతో ఉత్తమమైనది.

---

1. అ'స్-'సౌమ్: ఉపవాసం అంటే, మానుకోవటం. ప్రాతఃకాలం నుండి సూర్యాస్తమయం వరకు ఏమీ తినకుండా త్రాగకుండా మరియు భార్యలతో రతిక్రీడలు జరపకుండా ఉండటమే గాక, తమ పంచేంద్రియాలను, చూపులను, నాలుకలను, చెవులను, ఆలోచనలను మరియు చేష్టలను మొదలైన వాటిని కూడా అదుపులో ఉంచుకొని చెడుకు దూరంగా ఉండటం.
2. అతివృద్ధులు, దీర్ఘవ్యాధితో పీడితులైనవారు, గర్భవతులైన స్త్రీలు, బిడ్డలకు పాలిచ్చే స్త్రీలు మొదలైనవారు, ఉపవాసముండటం వారికి అతి కష్టతరమైతే, పరిహారంగా ప్రతిరోజూ ఒకపేదవానికి భోజనం పెట్టాలి. కాని గర్భవతులైన స్త్రీలు, పిల్లలకు పాలిచ్చే స్త్రీలు మరియు కొద్దికాలాని మాత్రమే వ్యాధి గ్రస్థులైనవారు మాత్రం విడిచిన ఉపవాసాలను తరువాత పూర్తి చేసుకోవాలి.

شَهۡرُ رَمَضَانَ ٱلَّذِيٓ أُنزِلَ فِيهِ ٱلۡقُرۡءَانُ هُدٗى لِّلنَّاسِ وَبَيِّنَٰتٖ مِّنَ ٱلۡهُدَىٰ وَٱلۡفُرۡقَانِۚ فَمَن شَهِدَ مِنكُمُ ٱلشَّهۡرَ فَلۡيَصُمۡهُۖ وَمَن كَانَ مَرِيضًا أَوۡ عَلَىٰ سَفَرٖ فَعِدَّةٞ مِّنۡ أَيَّامٍ أُخَرَۗ يُرِيدُ ٱللَّهُ بِكُمُ ٱلۡيُسۡرَ وَلَا يُرِيدُ بِكُمُ ٱلۡعُسۡرَ وَلِتُكۡمِلُواْ ٱلۡعِدَّةَ وَلِتُكَبِّرُواْ ٱللَّهَ عَلَىٰ مَا هَدَىٰكُمۡ وَلَعَلَّكُمۡ تَشۡكُرُونَ ١٨٥

**185**. రమ'దాన్ నెల! అందులో దివ్య ఖుర్ఆన్ మానవులకు మార్గదర్శకత్వంగా, అవతరింపజేయబడింది![1] మరియు అందులో సన్మార్గం చూపే మరియు సత్యాసత్యాలను వేర్పరచే, స్పష్టమైన ఉపదేశాలున్నాయి. కావున మీలో ఆ నెలను పొందిన వ్యక్తి ఆ నెలంతా (విధిగా) ఉపవాసముండాలి. కాని వ్యాధిగ్రస్తుడైన వాడు, లేక ప్రయాణంలో ఉన్నవాడు, (ఆ ఉపవాసాలను) వేరే దినాలలో పూర్తిచేయాలి. అల్లాహ్ మీకు సౌలభ్యం చేయగోరుతున్నాడే కానీ, మిమ్మల్ని కష్టపెట్టదలచుకోలేదు. ఇది మీరు ఉపవాసదినాల సంఖ్యను పూర్తిచేయ గలగటానికి మరియు మీకు సన్మార్గం చూపినందుకు, మీరు అల్లాహ్ మహనీయతను (ఘనతను) కొనియాడటానికి మరియు మీరు కృతజ్ఞతలు తెలుపుకోవటానికి!

---

**1**. ఖుర్ఆన్, లైలతుల్ ఖద్ర్‌లో లౌ'హె మ'హ్ఫూ''జ్ నుండి ఈ ప్రపంచపు ఆకాశం మీద దింపబడింది. అక్కడ బైతుల్-ఇ'జ్జత్‌లో పెట్టబడింది. అక్కడి నుంచి 23 సంవత్సరాలలో క్రమక్రమంగా అవసరాన్ని బట్టి మహాప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై అవతరింపజేయబడింది, (ఇబ్నె-కసీ'ర్). మొట్టమొదటి వ'హీ 'హిరా గుహలో రమ'దాన్ నెలలో అవతరింపజేయబడింది. మరియు దైవప్రవక్త ('స'అస), తమ మరణానికి ముందు రమ'దాన్ నెలలోనే ఖుర్ఆన్‌ను జిబ్రీల్ ('అ.స.) సమక్షంలో, రెండు సార్లు పూర్తిగా చదివి వినిపించారు. మరియు దైవప్రవక్త ('స'అస), అదే రమ'దాన్ నెలలో 23,25,27రాత్రులలో, స'హాబీలకు తరావీ'హ్ నమా'జ్ (ఖియామ్ అల్లైల్) కూడా జమా'అతో చేయించారు. ('స. తిర్మిజీ', 'స.ఇబ్నె-మాజా, అల్బానీ ప్రమాణీకం). ఆ తరావీ'హ్ నమా'జ్ ఎనిమిది రకాతులు, వి'తర్‌తోపాటు పదకొండు రకాతులు, అని జాబిర్ (ర'ది.'అ.) మరియు సయ్యిదా 'ఆయిషహ్ (ర. 'అన్హా)ల, ఉల్లేఖనా (రివాయతు)లు ఉన్నాయి. ('స. బు'ఖారీ).

**186**. మరియు నా దాసులు, నన్ను గురించి నిన్ను అడిగితే: "నేను (వారికి) అతి సమీపంలోనే ఉన్నాను. పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు నేను అతని పిలుపును విని, జవాబిస్తాను.[1] కాబట్టి వారు సరైనమార్గం పొందటానికి, నా ఆజ్ఞలను అనుసరించాలి మరియు నాయందు విశ్వాసం కలిగిఉండాలి." అని, చెప్పు.[2]

**187**. ఉపవాసపు రాత్రులందు మీకు మీ భార్యలతో రతిక్రీడ (రఫస్') ధర్మసమ్మతం చేయబడింది. వారు మీ వస్త్రాలు, మీరు వారి వస్త్రాలు. వాస్తవానికి మీరు రహస్యంగా ఆత్మద్రోహానికి పాల్పడుతున్నారనే విషయం అల్లాహ్‌కు తెలుసు. కావున ఆయన మీ పశ్చాత్తాపాన్ని స్వీకరించాడు మరియు మిమ్మల్ని మన్నించాడు. ఇకనుండి మీరు మీ భార్యలతో సంభోగం (బాషిర్) చేయండి మరియు అల్లాహ్ మీ కొరకు వ్రాసిన దానిని కోరండి. మరియు ఉదయకాలపు తెల్లని రేఖలు రాత్రి నల్లచారల నుండి స్పష్టపడే వరకు, మీరు తినండి, త్రాగండి. ఆ తరువాత చీకటిపడే వరకు మీ ఉపవాసాన్ని పూర్తిచెయ్యండి. కాని మస్జిద్‌లలో 'ఏతెకాఫ్ పాటించేటప్పుడు, మీరు మీ స్త్రీలతో సంభోగించకండి.[3] ఇవి అల్లాహ్ (ఏర్పరచిన) హద్దులు, కావున ఉల్లంఘించే (ఉద్దేశంతో)

وَإِذَا سَأَلَكَ عِبَادِى عَنِّى فَإِنِّى قَرِيبٌ ۖ أُجِيبُ دَعْوَةَ ٱلدَّاعِ إِذَا دَعَانِ ۖ فَلْيَسْتَجِيبُوا۟ لِى وَلْيُؤْمِنُوا۟ بِى لَعَلَّهُمْ يَرْشُدُونَ ﴿١٨٦﴾

أُحِلَّ لَكُمْ لَيْلَةَ ٱلصِّيَامِ ٱلرَّفَثُ إِلَىٰ نِسَآئِكُمْ ۚ هُنَّ لِبَاسٌ لَّكُمْ وَأَنتُمْ لِبَاسٌ لَّهُنَّ ۗ عَلِمَ ٱللَّهُ أَنَّكُمْ كُنتُمْ تَخْتَانُونَ أَنفُسَكُمْ فَتَابَ عَلَيْكُمْ وَعَفَا عَنكُمْ ۖ فَٱلْـَٔـٰنَ بَـٰشِرُوهُنَّ وَٱبْتَغُوا۟ مَا كَتَبَ ٱللَّهُ لَكُمْ ۚ وَكُلُوا۟ وَٱشْرَبُوا۟ حَتَّىٰ يَتَبَيَّنَ لَكُمُ ٱلْخَيْطُ ٱلْأَبْيَضُ مِنَ ٱلْخَيْطِ ٱلْأَسْوَدِ مِنَ ٱلْفَجْرِ ۖ ثُمَّ أَتِمُّوا۟ ٱلصِّيَامَ إِلَى ٱلَّيْلِ ۚ وَلَا تُبَـٰشِرُوهُنَّ وَأَنتُمْ عَـٰكِفُونَ فِى ٱلْمَسَـٰجِدِ ۗ تِلْكَ حُدُودُ ٱللَّهِ فَلَا

1. ఉపవాసం విరమించే వేళలో చేసే ప్రార్థన (దు'ఆ) అంగీకరించబడుతుంది. (ముస్నద్ అ'హ్మద్, తిర్మిజీ', నసాయీ', ఇబ్నె-మాజా - ఇబ్నె-కసీ'ర్ వ్యాఖ్యానం).
2. చూడండి, 'స. బు'ఖారీ, పుస్తకం-8, 'హదీస్' నం. 509.
3. చూడండి, 7:189. 'ఏతెకాఫ్: అంటే మస్జిద్‌లో అల్లాహ్ (సు.తా.)ను ధ్యానిస్తూ ఏకాంతంగా గడపటం. 'ఏతెకాఫ్ పాటించే వారు స్త్రీలతో సంభోగించరాదు. కాలకృత్యాలకు తప్ప, మస్జిద్ విడిచి బయటికి పోరాదు. తోటివారితో అనవసరమైన సంభాషణలలో పడరాదు.

تَقْرَبُوهَا ۗ كَذَٰلِكَ يُبَيِّنُ ٱللَّهُ ءَايَٰتِهِۦ لِلنَّاسِ لَعَلَّهُمْ يَتَّقُونَ ﴿١٨٧﴾

వీటిని సమీపించకండి. ఈ విధంగా అల్లాహ్ తన ఆజ్ఞలను ప్రజలకు స్పష్టం చేస్తున్నాడు. బహుశా వారు భయభక్తులు కలిగి ఉంటారని!

وَلَا تَأْكُلُوٓا۟ أَمْوَٰلَكُم بَيْنَكُم بِٱلْبَٰطِلِ وَتُدْلُوا۟ بِهَآ إِلَى ٱلْحُكَّامِ لِتَأْكُلُوا۟ فَرِيقًا مِّنْ أَمْوَٰلِ ٱلنَّاسِ بِٱلْإِثْمِ وَأَنتُمْ تَعْلَمُونَ ﴿١٨٨﴾

**188**. మరియు మీరు ఒకరి సొమ్మును మరొకరు అన్యాయంగా కబళించకండి మరియు బుద్ధిపూర్వకంగా, అక్రమమైనరీతిలో, ఇతరుల ఆస్తిలో కొంతభాగం తినే దురుద్దేశంతో, న్యాయాధికారులకు లంచాలు ఇవ్వకండి. (3/8)

۞ يَسْـَٔلُونَكَ عَنِ ٱلْأَهِلَّةِ ۖ قُلْ هِىَ مَوَٰقِيتُ لِلنَّاسِ وَٱلْحَجِّ ۗ وَلَيْسَ ٱلْبِرُّ بِأَن تَأْتُوا۟ ٱلْبُيُوتَ مِن ظُهُورِهَا وَلَٰكِنَّ ٱلْبِرَّ مَنِ ٱتَّقَىٰ ۗ وَأْتُوا۟ ٱلْبُيُوتَ مِنْ أَبْوَٰبِهَا ۚ وَٱتَّقُوا۟ ٱللَّهَ لَعَلَّكُمْ تُفْلِحُونَ ﴿١٨٩﴾

**189**. * (ఓ ప్రవక్తా!) వారు నిన్ను మారే చంద్రుని (రూపాలను) గురించి అడుగుతున్నారు. నీవు వారితో ఇలా అను: "అవి ప్రజలకు కాలగణనను మరియు 'హజ్జ్ దినాలను తెలియజేస్తాయి." మీరు మీ ఇళ్ళలోకి వాటి వెనుక భాగంనుండి ప్రవేశించడం ఋజువర్తన (బిర్ర్) కాదు, దైవభీతి కలిగి ఉండటమే ఋజువర్తన (బిర్ర్). కనుక మీరు ఇండ్లలో వాటి ద్వారాల నుండియే ప్రవేశించండి. మరియు మీరు సాఫల్యం పొందటానికి అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి.

وَقَٰتِلُوا۟ فِى سَبِيلِ ٱللَّهِ ٱلَّذِينَ يُقَٰتِلُونَكُمْ وَلَا تَعْتَدُوٓا۟ ۚ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ ٱلْمُعْتَدِينَ ﴿١٩٠﴾

**190**. మరియు మీతో, పోరాడేవారితో, మీరు అల్లాహ్ మార్గంలో పోరాడండి, కాని హద్దులను అతిక్రమించకండి. నిశ్చయంగా, అల్లాహ్ హద్దులను అతిక్రమించే వారిని ప్రేమించడు.[1]

---

**1**. ఈ ఆయత్‌లో జిహాద్: ధర్మపోరాటం, అంటే ఎవరైతే మీతో పోరాడుతారో, అలాంటి వారితో మీరు పోరాడండని అనుమతి ఇవ్వబడింది. చూడండి 22:39. ఆ ఆయత్ జిహాద్‌ను గురించి మొదటి సారిగా అవతరింపబడిందని చాలా మంది 'హదీస్' వేత్తలు వ్రాశారు, ('తబరీ, ఇబ్నె-కసీ'ర్). హద్దులను అతిక్రమించకూడదు అంటే, స్త్రీల, పిల్లల, వృద్ధుల హత్య

وَٱقْتُلُوهُمْ حَيْثُ ثَقِفْتُمُوهُمْ وَأَخْرِجُوهُم مِّنْ حَيْثُ أَخْرَجُوكُمْ ۚ وَٱلْفِتْنَةُ أَشَدُّ مِنَ ٱلْقَتْلِ ۚ وَلَا تُقَٰتِلُوهُمْ عِندَ ٱلْمَسْجِدِ ٱلْحَرَامِ حَتَّىٰ يُقَٰتِلُوكُمْ فِيهِ ۖ فَإِن قَٰتَلُوكُمْ فَٱقْتُلُوهُمْ ۗ كَذَٰلِكَ جَزَآءُ ٱلْكَٰفِرِينَ ﴿١٩١﴾

**191**. వారు, మీకు ఎక్కడ ఎదురైతే అక్కడనే వారిని చంపండి. మరియు వారు మిమ్మల్ని ఎచ్చటినుండి తరిమివేశారో, మీరు కూడా వారిని అచ్చటినుండి తరిమివేయండి. మరియు సత్యధర్మానికి అడ్డుగా నిలవటం (ఫిత్నా),[1] చంపటం కంటే ఘోరమైనది. మస్జిద్ అల్-'హరామ్ వద్ద వారు మీతో యుద్ధం చేయనంతవరకు మీరు వారితో అక్కడ యుద్ధం చేయకండి.[2] ఒకవేళ వారే మీతో (ఆ పవిత్ర స్థలంలో) యుద్ధంచేస్తే వారిని వధించండి. ఇదే సత్యతిరస్కారులకు తగిన శిక్ష.

فَإِنِ ٱنتَهَوْا۟ فَإِنَّ ٱللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴿١٩٢﴾

**192**. కానీ, వారు (యుద్ధం చేయటం) మానుకుంటే (మీరు కూడా మానుకోండి). ఎందుకంటే నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు అపార కరుణాప్రదాత.

وَقَٰتِلُوهُمْ حَتَّىٰ لَا تَكُونَ فِتْنَةٌ وَيَكُونَ ٱلدِّينُ لِلَّهِ ۖ فَإِنِ ٱنتَهَوْا۟ فَلَا عُدْوَٰنَ إِلَّا عَلَى ٱلظَّٰلِمِينَ ﴿١٩٣﴾

**193**. మరియు ఫిత్నా[3] ముగిసిపోయే వరకు మరియు అల్లాహ్ ధర్మం మాత్రమే స్థాపించబడేవరకు మీరు వారితో యుద్ధంచేస్తూ ఉండండి. ఒకవేళ వారు మానుకుంటే, దుర్మార్గులతో తప్ప ఇతరులతో పోరాడకండి.[4]

---

చేయకూడదు. ఎవరైతే మీతో పోరాడుతారో, వారినే వధించాలి. ఇదేవిధంగా పంటపొలాలను, చెట్లుచేమలను, పశువులను, అనవసరంగా పాడు చేయరాదు. జిహాద్ గురించి 4:91, 60:8 మరియు 'స. బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం. 4 చూడండి.

**1**. ఇక్కడ ఫిత్నా - అంటే సత్యతిరస్కారం, షిర్క్, సత్యధర్మానికి అడ్డుగా నిలవటం. సత్యాన్ని స్వీకరించినవారిని హింసా, దౌర్జన్యాలకు గురిచేయడం. చూడండి, 'స. బు'ఖారీ, పుస్తకం-2, 'హదీస్' నం.797. ఫిత్నతున్: యొక్క ఇతర అర్థాలు పీడన, ఉపద్రవం, పరీక్ష, ప్రేరేపించటం, కలతలు రేకెత్తించటం, శోధన, పురికొల్పటం మరియు దుష్కృత్యం మొదలైనవి ఉన్నాయి.

**2**. మస్జిద్ అల్-'హరామ్ సరిహద్దులలో యుద్ధం చేయటం నిషేధించబడింది. అది శాంతి నిలయం, కాని ఎవరైనా దానిని లెక్క చేయక మీపై దాడిచేసి మిమ్మల్ని చంపగోరితే, అలాంటి వారితో మీరు అక్కడ యుద్ధంచేసి వారిని చంపవచ్చు!

**3**. చూడండి, 2:191 వ్యాఖ్యానం 1.

**4**. చూడండి, 'స. బు'ఖారీ, పుస్తకం-1, 'హదీస్' నం. 24.

ٱلشَّهۡرُ ٱلۡحَرَامُ بِٱلشَّهۡرِ ٱلۡحَرَامِ وَٱلۡحُرُمَٰتُ قِصَاصٞۚ فَمَنِ ٱعۡتَدَىٰ عَلَيۡكُمۡ فَٱعۡتَدُواْ عَلَيۡهِ بِمِثۡلِ مَا ٱعۡتَدَىٰ عَلَيۡكُمۡۚ وَٱتَّقُواْ ٱللَّهَ وَٱعۡلَمُوٓاْ أَنَّ ٱللَّهَ مَعَ ٱلۡمُتَّقِينَ ١٩٤

**194**. నిషిద్ధ మాసానికి బదులు నిషిద్ధ మాసమే మరియు నిషిద్ధ స్థలాలలో న్యాయ ప్రతీకారం (ఖి'సా'స్) తీసుకోవచ్చు.[1] కాబట్టి మీపై ఎవరైనా దాడిచేస్తే, మీరు కూడా వారిపై అదేవిధంగా దాడిచేయండి. మరియు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు నిశ్చయంగా, అల్లాహ్ భయభక్తులు గలవారికి తోడుగా ఉంటాడని తెలుసుకోండి.

وَأَنفِقُواْ فِي سَبِيلِ ٱللَّهِ وَلَا تُلۡقُواْ بِأَيۡدِيكُمۡ إِلَى ٱلتَّهۡلُكَةِ وَأَحۡسِنُوٓاْۚ إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلۡمُحۡسِنِينَ ١٩٥

**195**. మరియు అల్లాహ్ మార్గంలో ఖర్చు పెట్టండి. మరియు మీ చేతులారా మిమ్మల్ని మీరు వినాశంలో పడవేసుకోకండి; మేలు చేయండి; నిశ్చయంగా, అల్లాహ్ మేలు చేసేవారిని ప్రేమిస్తాడు.

وَأَتِمُّواْ ٱلۡحَجَّ وَٱلۡعُمۡرَةَ لِلَّهِۚ فَإِنۡ أُحۡصِرۡتُمۡ فَمَا ٱسۡتَيۡسَرَ مِنَ ٱلۡهَدۡيِۖ

**196**. మరియు అల్లాహ్ (ప్రసన్నత) కొరకు 'హజ్జ్ మరియు 'ఉమ్రా పూర్తి చేయండి.[2] మీకు (వాటిని పూర్తిచేయటానికి) ఆటంకం కలిగినట్లైతే, మీరు

1. నిషిద్ధమాసాలు: జు'ల్-ఖాఇదహ్, జు'ల్-'హిజ్జహ్, ము'హర్రం మరియు రజబ్ (హిజ్రీ శకపు 11,12,1, 7 మాసాలు). ఈ మాసాలలో యుద్ధంచేయటం ఇస్లాంకు పూర్వం నుండి కూడా అరేబియా వాసులలో నిషేధించబడి ఉండింది. చూడండి, 2:217. ఈ నిషేధాలను అందరూ గౌరవించాలి. ఎదుటి వారు వాటిని గౌరవించని పక్షంలో వారితో పోరాడి ప్రతీకారం తీర్చుకోవచ్చు.
2. 'ఉమ్రా: 'హజ్జ్ సమయంలో కాకుండా వేరే దినాలలో కూడా 'ఉమ్రా చేయవచ్చు. 'ఉమ్రా చేయగోరే వారు 'హరమ్ సరిహద్దుల నుండి, (మీఖాత్ సరిహద్దుల బయటనుండి వచ్చే వారు మీఖాత్ నుండి) ఇ'హ్రామ్ ధరించి, (అంటే పురుషులు, ఒక తెల్లని లుంగీ కట్టుకొని మరొక తెల్లని దుప్పటిని శరీరంపై కప్పుకోవటం. స్త్రీలకు, వారు ధరించిన బట్టలే ఇ'హ్రామ్; మగవారివలే వారికి ప్రత్యేకమైన ఇ'హ్రామ్ దుస్తులు లేవు). 'హరమ్‌కు వచ్చి క'అబహ్ చుట్టు ఏడు ప్రదక్షిణలు ('తవాఫ్) చేసి, రెండు రకాతులు నమా'జ్ చేసి, తరువాత 'సఫా, మర్వాల మధ్య ఏడుసార్లు పచార్లు (స'యీ) చేసి ఆ తరువాత (స్త్రీలు) తల వెంట్రుకలను కొంతమట్టుకు కత్తిరించుకోవాలి. పురుషులు శిరోముండనం చేయించుకొని లేక తల వెంట్రుకలను కొంతమట్టుకు కత్తిరించుకొని ఇ'హ్రామ్ విడిచిపెట్టాలి. మీఖాత్ మరియు 'హరమ్ సరిహద్దులను మహా ప్రవక్త ('స'అస) సూచించారు.

وَلَا تَحۡلِقُواْ رُءُوسَكُمۡ حَتَّىٰ يَبۡلُغَ ٱلۡهَدۡيُ
مَحِلَّهُۥۚ فَمَن كَانَ مِنكُم مَّرِيضًا أَوۡ بِهِۦٓ
أَذٗى مِّن رَّأۡسِهِۦ فَفِدۡيَةٞ مِّن صِيَامٍ أَوۡ
صَدَقَةٍ أَوۡ نُسُكٖۚ فَإِذَآ أَمِنتُمۡ فَمَن
تَمَتَّعَ بِٱلۡعُمۡرَةِ إِلَى ٱلۡحَجِّ فَمَا ٱسۡتَيۡسَرَ
مِنَ ٱلۡهَدۡيِۚ فَمَن لَّمۡ يَجِدۡ فَصِيَامُ ثَلَٰثَةِ
أَيَّامٖ فِي ٱلۡحَجِّ وَسَبۡعَةٍ إِذَا رَجَعۡتُمۡۗ
تِلۡكَ عَشَرَةٞ كَامِلَةٞۗ ذَٰلِكَ لِمَن لَّمۡ

ఇవ్వదలుచుకున్న బలి (ఖుర్బానీ) ఇవ్వండి.[1] బలి జంతువు దాని గమ్యస్థానానికి చేరనంత వరకు మీరు శిరోముండనం చేసుకోకండి.[2] కానీ, మీలో ఎవడైనా వ్యాధిగ్రస్తుడై ఉంటే లేదా అతని తలకు బాధ ఉంటే (శిరోముండనం చేసుకొని) దానికి పరిహారంగా (మూడు రోజులు) ఉపవాసం ఉండాలి. లేదా దానధర్మాలు చేయాలి (ఆరుగురు నిరుపేదలకు భోజనంపెట్టాలి), లేదా బలి ఇవ్వాలి. కాని శాంతి భద్రతలు ఉన్న సమయాలలో ఎవడైనా 'హజ్జె తమత్తు'[3] చేయదలచుకుంటే, అతడు తనశక్తి మేరకు బలి[4] ఇవ్వాలి. కాని ఎవడైతే ఖుర్బానీ ఇవ్వలేడో 'హజ్జ్ కాలంలో మూడు దినాలు మరియు (ఇంటికి) తిరిగి వచ్చిన

---

1. దైవప్రవక్త ('స'అస) 6వ హిజ్రీలో 'ఉమ్రా కొరకు వచ్చినప్పుడు 'హుదైబియహ్ దగ్గర ఆగారు. అప్పుడు మక్కాలోని ముష్రిక్ ఖురైషులు వారిని మక్కాలో ప్రవేశించి 'ఉమ్రా చేయటానికి అనుమతి ఇవ్వలేదు. వారు ముష్రిక్ ఖురైషులతో సంధి చేసుకున్నారు. 'హుదైబియహ్‌లోనే తమ బలి (ఖుర్బానీ) చేసి తమ శిరోముండనాలు చేయించుకొని ఇ'హ్రాం వదిలారు. తరువాత 7వ హిజ్రీలో వచ్చి 'ఉమ్రా చేశారు.
2. శాంతి సమయాలలో 'హజ్జ్ యొక్క అన్ని మనాసిక్‌లు పూర్తిచేయనంతవరకు శిరోముండనం చేయించుకోగూడదు అంటే, ఇ'హ్రామ్ విడువగూడదు.
3. తమత్తు' - అంటే 'హజ్జ్ కాలంలో 'ఉమ్రా కొరకు ఇ'హ్రామ్ ధరించి 'ఉమ్రా చేసి శిరోముండనం చేసి, ఇ'హ్రామ్ విడవాలి. మరల 8వ జి'ల్-'హజ్జ్ రోజున 'హజ్జ్ కొరకు ఇ'హ్రామ్ ధరించాలి. దీనికి బలి ఇవ్వవలసి ఉంటుంది. బలి ఇవ్వలేని వారు 10 రోజులు ('హజ్జ్ కాలంలో 3 రోజులు 'హజ్జ్ తరువాత 7 రోజులు), ఉపవాసాలుండాలి. 'హజ్జ్ 3 రకాలుగా చేయవచ్చు: అవి 1) ఇఫ్రాద్: అంటే 'హజ్జ్ సంకల్పంతో ఇ'హ్రాం ధరించి కేవలం 'హజ్జ్ మాత్రమే చేయటం. దీనికి బలి అవసరం లేదు. ఇది 'హరమ్ ప్రాంతంలో నివసించే వారు చేసే 'హజ్జ్, 2) తమత్తు': పైన వివరించిన విధం. 'హజ్జె తమత్తు'కు బలి (ఖుర్బానీ) ఇవ్వటం వాజిబ్. 3) ఖిరన్: ఒకే ఇ'హ్రామ్‌తో 'ఉమ్రా మరియు 'హజ్జ్ నెరవేర్చటం. 'ఉమ్రా చేసిన తరువాత తలవెంట్రుకలు కత్తిరించుకోకుండా 'హజ్జ్ వరకు ఇ'హ్రాంలోనే ఉండి 'హజ్జ్ విధులు నెరవేర్చిన పిదప ఇ'హ్రామ్ విడవటం. 'హజ్జె ఖిరన్‌కు కూడా బలి (ఖుర్బానీ) ఇవ్వటం వాజిబ్.
4. హద్‌యున్: బలి (ఖుర్బానీ): ఒక వ్యక్తికి ఒక మేక లేక గొర్రె; లేక ఏడుగురు కలిసి ఒక ఆవు, ఎద్దు, లేక ఒంటె బలి చేయవచ్చు.

పిమ్మట ఏడు దినాలు ఉపవాసం ఉండాలి, ఈ విధంగా మొత్తం పది దినాలు ఉపవాసాలు ఉండాలి. ఇది మస్జిద్ అల్-'హరామ్ దగ్గర నివసించని వారికి మాత్రమే. మరియు అల్లాహ్ యెడల భయభక్తులు కలిగి ఉండండి. మరియు నిశ్చయంగా, అల్లాహ్ శిక్ష విధించటంలో చాలా కఠినుడు, అని తెలుసుకోండి.

**197**. 'హజ్జ్ నియమిత నెలలలోనే జరుగుతుంది. ఈ నిర్ణీత మాసాలలో 'హజ్జ్ చేయటానికి సంకల్పించిన వ్యక్తి 'హజ్జ్ (ఇ'హ్రామ్‌లో వున్న) సమయంలో (భార్యతో) రతిక్రీడ (రఫస్')కు, దుష్టకార్యాలకు మరియు కలహాలకు దూరంగా ఉండాలి. మీరు చేసే మంచి పనులన్నీ అల్లాహ్‌కు తెలుసు. ('హజ్జ్ యాత్రకు) కావలసిన వస్తు సామాగ్రిని తీసుకువెళ్ళండి. దైవభీతియే నిశ్చయంగా, అన్నిటికంటే ఉత్తమమైన సామగ్రి. కనుక ఓ బుద్ధిమంతులారా! కేవలం నాయందే భయభక్తులు కలిగి ఉండండి.

**198**. ('హజ్జ్ యాత్రలో) మీరు మీ ప్రభువు అనుగ్రహాలు అన్వేషిస్తే[1] అందులో దోషం లేదు. 'అరఫాత్[2] నుండి

يَكُنْ أَهْلُهُۥ حَاضِرِي ٱلْمَسْجِدِ
ٱلْحَرَامِۚ وَٱتَّقُوا۟ ٱللَّهَ وَٱعْلَمُوٓا۟ أَنَّ ٱللَّهَ
شَدِيدُ ٱلْعِقَابِ ﴿١٩٦﴾

ٱلْحَجُّ أَشْهُرٌ مَّعْلُومَٰتٌۚ فَمَن
فَرَضَ فِيهِنَّ ٱلْحَجَّ فَلَا رَفَثَ وَلَا
فُسُوقَ وَلَا جِدَالَ فِى ٱلْحَجِّۗ
وَمَا تَفْعَلُوا۟ مِنْ خَيْرٍ يَعْلَمْهُ ٱللَّهُۗ
وَتَزَوَّدُوا۟ فَإِنَّ خَيْرَ ٱلزَّادِ
ٱلتَّقْوَىٰۚ وَٱتَّقُونِ يَٰٓأُو۟لِى ٱلْأَلْبَٰبِ
﴿١٩٧﴾

لَيْسَ عَلَيْكُمْ جُنَاحٌ أَن
تَبْتَغُوا۟ فَضْلًا مِّن رَّبِّكُمْۚ
فَإِذَآ أَفَضْتُم مِّنْ عَرَفَٰتٍ

**1**. అనుగ్రహాలు అంటే 'హజ్జ్ యాత్రలో వ్యాపారం మొదలైనవి చేయటం ధర్మసమ్మతమే.

**2**. 'అరఫాత్: మక్కా నుండి దాదాపు 12 కి.మీ. దూరంలో 'హరమ్ సరిహద్దులకు బయటనున్న ఒక మైదానం. అందులో ఒకచిన్న కొండ ఉంది దాని పేరు జబలె-ర'హ్మా. దైవప్రవక్త ('స'అస) 'హజ్జ్ చేసినప్పుడు దాని దగ్గర నించొని 'హజ్జ్ ఉపన్యాసం (ఖు'త్బా) ఇచ్చారు. 'హజ్జ్ చేయాలని సంకల్పించిన వారు జు'ల్-'హిజ్జహ్ 9వ తేదీన మధ్యాహ్నం నుండి 10వ తేదీ ఫ'జ్ర్ అ'జాన్ సమయం వరకు 'హజ్జ్ నియ్యత్‌తో ఇ'హ్రాం ధరించి కొంత సమయం ఈ మైదానంలో గడపడం మరియు అల్లాహ్ (సు.తా.)ను ప్రార్థించడం విధి. 'హదీస్' ప్రకారం 'అరఫాత్‌లో ఆగడమే 'హజ్జ్. 'అరఫాత్ మైదానం 'హరం సరిహద్దుల బయట ఉంది.

فَاذْكُرُوا اللَّهَ عِندَ الْمَشْعَرِ الْحَرَامِ ۖ وَاذْكُرُوهُ كَمَا هَدَاكُمْ وَإِن كُنتُم مِّن قَبْلِهِ لَمِنَ الضَّالِّينَ ﴿١٩٨﴾

బయలుదేరిన తరువాత మష్'అరిల్ 'హరామ్ (ముజ్'దలిఫా)[1] వద్ద (ఆగి) అల్లాహ్‌ను స్మరించండి. మరియు ఆయన మీకు బోధించిన విధంగా ఆయనను స్మరించండి, వాస్తవానికి మీరు పూర్వం మార్గభ్రష్టులుగా ఉండేవారు.

ثُمَّ أَفِيضُوا مِنْ حَيْثُ أَفَاضَ النَّاسُ وَاسْتَغْفِرُوا اللَّهَ ۚ إِنَّ اللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴿١٩٩﴾

**199**. తరువాత ప్రజలంతా ఎక్కడినుండి వెళ్తారో అక్కడినుండి మీరూ వెళ్ళండి. అల్లాహ్‌తో క్షమాభిక్ష వేడుకోండి. నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

فَإِذَا قَضَيْتُم مَّنَاسِكَكُمْ فَاذْكُرُوا اللَّهَ كَذِكْرِكُمْ آبَاءَكُمْ أَوْ أَشَدَّ ذِكْرًا ۗ فَمِنَ النَّاسِ مَن يَقُولُ رَبَّنَا آتِنَا فِي الدُّنْيَا وَمَا لَهُ فِي الْآخِرَةِ مِنْ خَلَاقٍ ﴿٢٠٠﴾

**200**. ఇక మీ ('హజ్జ్) విధులను[2] పూర్తిచేసిన తరువాత, మీరు మీ తండ్రి తాతలను (పూర్వం) స్మరించే విధంగా, ఇంకా దానికంటే అధికంగా అల్లాహ్‌ను స్మరించండి. కాని వారిలో కొందరు: "ఓ మా ప్రభూ! మాకు ఈ లోకంలో (అన్నీ) ప్రసాదించు!" అని ప్రార్థిస్తారు. అలాంటి వారికి పరలోకంలో ఎలాంటి భాగం ఉండదు.

---

**1**. మస్జిద్ మష్అరిల్-'హరామ్ ము'జ్దలిఫాలో ఉంది. జు'ల్-'హిజ్జహ్ 9వ తేదీన 'హాజీలు 'అరఫాత్ మైదానంలో కొంతకాలం గడిపిన తరువాత ఇక్కడకు చేరుకొని, మ'గ్రిబ్ మరియు 'ఇషా నమా'జ్‌లు కలిపి చేయడం మసూ్నన్. వారు రాత్రి ఇక్కడ గడిపి,10వ తేదీ ఫ'జ్ర్ నమా'జ్ తరువాత మీనాకు చేరుకుంటారు. ఇక్కడి నుండి జమరాత్‌లపై విసరటానికి, చిన్నచిన్న కంకర రాళ్ళు ఏరుకుంటారు. ము'జ్దలిఫా 'హరమ్ సరిహద్దులలోనే ఉంది.

**2**. మిగిలిన 'హజ్జ్ విధులు 10.11.12మరియు (13) జిల్'హజ్జ్ తేదీలలో పూర్తిచేయాలి. ఈ రోజులలో ఇ'హ్రామ్ లేకుండానే మక్కాకు పోయి తవాఫె 'జియారహ్ మరియు స'యీ అల్-'హజ్జ్ పూర్తిచేసుకోవాలి. ఈ మూడు రోజులు మీనాలోనే ఉండి, అల్లాహ్(సు.తా.)ను ప్రార్థించాలి. 10వ తేదీన సూర్యోదయం తరువాత కేవలం చివరి షై'తాన్(జమరతుల్ -'అఖబహ్)పై - ఏదైతే మక్కా వైపుకు ఉందో 7 చిన్నచిన్న కంకర రాళ్ళు రువ్వాలి. 11మరియు 12 తేదీలలో 'జుహ్ర్ నమా'జ్ తరువాత మూడు జమరాత్‌ల పైననూ ఒక్కొక్క దానిపై 7 చొప్పున కంకర రాళ్ళు రువ్వాలి.

జమరాత్: అంటే. ఇస్మా'ఈల్ ('అ.స.)ను అతని తండ్రి ఇబ్రాహీమ్ ('అ.స.), అల్లాహుతా'ఆలా ఆజ్ఞతో జి'బ్హ్ చేయటానికి తీసుకొనిపోయేటప్పుడు, షై'తాన్ వారిని, అల్లాహుతా'ఆలా ఆజ్ఞను ఉల్లంఘించటానికి, ప్రేరేపించిన మూడు చోట్లలో నియమించిన గుర్తులు.

وَمِنْهُم مَّن يَقُولُ رَبَّنَآ ءَاتِنَا
فِي ٱلدُّنْيَا حَسَنَةً وَفِي ٱلْأَخِرَةِ
حَسَنَةً وَقِنَا عَذَابَ ٱلنَّارِ ﴿٢٠١﴾
أُوْلَٰٓئِكَ لَهُمْ نَصِيبٌ مِّمَّا كَسَبُواْۚ
وَٱللَّهُ سَرِيعُ ٱلْحِسَابِ ﴿٢٠٢﴾

۞ وَٱذْكُرُواْ ٱللَّهَ فِيٓ أَيَّامٍ
مَّعْدُودَٰتٍۚ فَمَن تَعَجَّلَ فِي يَوْمَيْنِ
فَلَآ إِثْمَ عَلَيْهِ وَمَن تَأَخَّرَ فَلَآ
إِثْمَ عَلَيْهِۖ لِمَنِ ٱتَّقَىٰۗ وَٱتَّقُواْ ٱللَّهَ
وَٱعْلَمُوٓاْ أَنَّكُمْ إِلَيْهِ تُحْشَرُونَ
﴿٢٠٣﴾
وَمِنَ ٱلنَّاسِ مَن يُعْجِبُكَ قَوْلُهُۥ فِي
ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَيُشْهِدُ ٱللَّهَ عَلَىٰ مَا
فِي قَلْبِهِۦ وَهُوَ أَلَدُّ ٱلْخِصَامِ ﴿٢٠٤﴾

**201**. వారిలో మరికొందరు: "ఓ మా ప్రభూ! మాకు ఇహలోకంలో మంచిని మరియు పరలోకంలో కూడా మంచిని ప్రసాదించు మరియు మమ్మల్ని నరకాగ్ని నుండి కాపాడు!" అని ప్రార్థిస్తారు.

**202**. అలాంటి వారు తమ సంపాదనకు అనుగుణంగా (ఉభయలోకాలలో) తమ వాటాను పొందుతారు. మరియు అల్లాహ్ లెక్క తీసుకోవటంలో అతి శీఘ్రుడు. (1/2)

**203**. * మరియు నియమిత రోజులలో అల్లాహ్‌ను స్మరించండి.[1] ఎవడైనా త్వరగా రెండు రోజులలోనే వెళ్ళిపోయినా, అతనిపై ఎలాంటి దోషంలేదు. మరెవడైనా నిదానించి (పదమూడవ తేదీవరకు) నిలిచి పోయినా, అతనిపై ఎలాంటి దోషంలేదు,[2] వాడికి, ఎవడైతే దైవభీతిని కలిగి ఉంటాడో! మరియు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు నిశ్చయంగా, మీరంతా ఆయన సన్నిధిలో హాజరు చేయబడుతారనేది తెలుసుకోండి.

**204**. మరియు ప్రజలలోనుండి ఒక వ్యక్తి మాటలు ఇహలోక జీవితంలో నీకు సంతోషం కలుగజేయవచ్చు మరియు తన సంకల్ప శుద్ధిని తెలుపడానికి అతడు అల్లాహ్‌ను సాక్షిగా నిలబెట్టవచ్చు! కాని, వాస్తవానికి అతడు ఘోరమైన జగడాలమారి కావచ్చు![3]

---

**1**. జు'ల్-'హిజ్జహ్ 11,12,13 తేదీలలో ఫ'ర్ద్ నమా'జ్‌ల తరువాత తక్బీర్ చదవాలి: "అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్, లా ఇలాహ ఇల్లల్లాహ్, వల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్ వ లిల్లాహిల్ హమ్ద్." కంకర రాళ్ళు విసురునపుడు ప్రతి కంకరరాయి విసిరిన తర్వాత ఈ తక్బీర్ చదవటం సున్నత్. (నీల్ అల్ అవ్‌తార్ పుస్తకం-5, పేజీ-86).

**2**. మూడు జమరాత్‌లపై 11 మరియు 12 జు'ల్-'హిజ్జహ్ తేదీలలో కంకర రాళ్ళను రువ్వాలి. 12వ తేదీన మ'గ్రిబ్‌కు ముందు మీనా విడువలేక పోతే,13వ తేదీన కూడా "జుహ్ర్ నమా'జ్ తరువాత మూడు జమరాత్‌లపై కంకరరాళ్ళను విసిరి మునాను విడవాలి.

**3**. 'స. బు'ఖారీ, పుస్తకం-3, 'హదీస్' నం. 637. ఇలాంటి వారి ఉదాహరణకు చూడండి, 2:8-12.

**205**. మరియు (ఓ ము'హమ్మద్) అతడు (నీ వద్దనుండి) తిరిగిపోయి లోకంలో కల్లోలం రేకెత్తించటానికి, పంటపొలాలను మరియు పశువులను నాశనం చేయటానికి పాటుపడవచ్చు. మరియు అల్లాహ్ కల్లోలాన్ని ఏ మాత్రం ప్రేమించడు.

**206**. మరియు: "అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండు." అని అతనితో అన్నప్పుడు, అహంభావం అతనిని మరింత పాపానికే ప్రేరేపిస్తుంది. కావున నరకమే అలాంటి వానికి తగిన స్థలం. మరియు అది ఎంత చెడ్డ విరామస్థలం!

**207**. మరియు మానవులలోనే, అల్లాహ్ సంతోషం పొందటానికి తనపూర్తి జీవితాన్ని అంకితం చేసేవాడూ ఉన్నాడు. మరియు అల్లాహ్ తన దాసుల యెడల చాల కనికరుడు.[1]

**208**. ఓ విశ్వాసులారా! అల్లాహ్ విధేయతలో (ఇస్లాంలో) సంపూర్ణంగా ప్రవేశించండి. మరియు షై'తాను అడుగు జాడలను అనుసరించకండి. నిశ్చయంగా, అతడు మీకు బహిరంగ శత్రువు!

**209**. మీ వద్దకు స్పష్టమైన హితోపదేశాలు వచ్చిన పిదప కూడా, మీరు తప్పటడుగు వేస్తే! నిశ్చయంగా, అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు అని తెలుసుకోండి.

وَإِذَا تَوَلَّىٰ سَعَىٰ فِي ٱلۡأَرۡضِ لِيُفۡسِدَ فِيهَا وَيُهۡلِكَ ٱلۡحَرۡثَ وَٱلنَّسۡلَۚ وَٱللَّهُ لَا يُحِبُّ ٱلۡفَسَادَ ﴿٢٠٥﴾

وَإِذَا قِيلَ لَهُ ٱتَّقِ ٱللَّهَ أَخَذَتۡهُ ٱلۡعِزَّةُ بِٱلۡإِثۡمِۚ فَحَسۡبُهُۥ جَهَنَّمُۖ وَلَبِئۡسَ ٱلۡمِهَادُ ﴿٢٠٦﴾

وَمِنَ ٱلنَّاسِ مَن يَشۡرِي نَفۡسَهُ ٱبۡتِغَآءَ مَرۡضَاتِ ٱللَّهِۚ وَٱللَّهُ رَءُوفُۢ بِٱلۡعِبَادِ ﴿٢٠٧﴾

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ ٱدۡخُلُواْ فِي ٱلسِّلۡمِ كَآفَّةٗ وَلَا تَتَّبِعُواْ خُطُوَٰتِ ٱلشَّيۡطَٰنِۚ إِنَّهُۥ لَكُمۡ عَدُوّٞ مُّبِينٞ ﴿٢٠٨﴾

فَإِن زَلَلۡتُم مِّنۢ بَعۡدِ مَا جَآءَتۡكُمُ ٱلۡبَيِّنَٰتُ فَٱعۡلَمُوٓاْ أَنَّ ٱللَّهَ عَزِيزٌ حَكِيمٌ ﴿٢٠٩﴾

---

1. అర్-రవూ'ఫు: = అర్-ర'హీము, Compassionate, Kind, Merciful. చాల కనికరుడు. ఇవి రెండూ అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

هَلۡ يَنظُرُونَ إِلَّآ أَن يَأۡتِيَهُمُ ٱللَّهُ فِي ظُلَلٖ مِّنَ ٱلۡغَمَامِ وَٱلۡمَلَٰٓئِكَةُ وَقُضِيَ ٱلۡأَمۡرُۚ وَإِلَى ٱللَّهِ تُرۡجَعُ ٱلۡأُمُورُ ﴿٢١٠﴾

**210**. ఏమీ? అల్లాహ్ స్వయంగా దేవ దూతలతో పాటు, మేఘాల ఛాయలలో ప్రత్యక్షం కావాలని వారు నిరీక్షిస్తున్నారా? కానీ, అప్పటికే ప్రతి విషయపు తీర్పు జరిగి ఉంటుంది. మరియు సమస్త విషయాలు (తీర్పు కొరకు) అల్లాహ్ దగ్గరికే మరలింపబడతాయి!

سَلۡ بَنِيٓ إِسۡرَٰٓءِيلَ كَمۡ ءَاتَيۡنَٰهُم مِّنۡ ءَايَةِۭ بَيِّنَةٖۗ وَمَن يُبَدِّلۡ نِعۡمَةَ ٱللَّهِ مِنۢ بَعۡدِ مَا جَآءَتۡهُ فَإِنَّ ٱللَّهَ شَدِيدُ ٱلۡعِقَابِ ﴿٢١١﴾

**211**. మేము ఎన్ని స్పష్టమైన సూచన (ఆయతు)లను వారికి చూపించామో ఇస్రాయీ'ల్ సంతతి వారిని అడగండి![1] మరియు ఎవడు అల్లాహ్ యొక్క అనుగ్రహాలను పొందిన తరువాత, వాటిని తారుమారు చేస్తాడో! నిశ్చయంగా, అల్లాహ్ అలాంటి వారిని శిక్షించటంలో ఎంతో కఠినుడు.

زُيِّنَ لِلَّذِينَ كَفَرُواْ ٱلۡحَيَوٰةُ ٱلدُّنۡيَا وَيَسۡخَرُونَ مِنَ ٱلَّذِينَ ءَامَنُواْۘ وَٱلَّذِينَ ٱتَّقَوۡاْ فَوۡقَهُمۡ يَوۡمَ ٱلۡقِيَٰمَةِۗ وَٱللَّهُ يَرۡزُقُ مَن يَشَآءُ بِغَيۡرِ حِسَابٖ ﴿٢١٢﴾

**212**. సత్యతిరస్కారులకు ఇహలోక జీవితం మనోహరమైనదిగా చేయబడింది. కావున వారు విశ్వాసులతో పరిహాసాలాడు తుంటారు, కానీ పునరుత్థానదినమున, దైవభీతి గలవారే వారికంటే ఉన్నత స్థానంలో ఉంటారు. మరియు అల్లాహ్ తానుకోరిన వారికి లెక్కలేనంత జీవనోపాధిని ప్రసాదిస్తాడు.

**1**. ఈ సూచనలు ఉదాహరణకు: కర్ర, మాంత్రికులను ఓడించింది, సముద్రంలో త్రోవచేసింది, బండ నుండి 12 ఊటలను ప్రవహింపజేసింది, మేఘాల ఛాయలు ఏర్పరచింది, మన్న మరియు 'సల్వాలను దింపింది మొదలైనవి. ఇవన్నీ అల్లాహ్ (సు.తా.) మహిమను మరియు దైవప్రవక్త నిజాయితీలను తెలుపుతున్నాయి. అయినా సత్యతిరస్కారులు విశ్వసించలేదు.

كَانَ ٱلنَّاسُ أُمَّةً وَٰحِدَةً فَبَعَثَ ٱللَّهُ ٱلنَّبِيِّـۧنَ مُبَشِّرِينَ وَمُنذِرِينَ وَأَنزَلَ مَعَهُمُ ٱلْكِتَـٰبَ بِٱلْحَقِّ لِيَحْكُمَ بَيْنَ ٱلنَّاسِ فِيمَا ٱخْتَلَفُواْ فِيهِ ۚ وَمَا ٱخْتَلَفَ فِيهِ إِلَّا ٱلَّذِينَ أُوتُوهُ مِنۢ بَعْدِ مَا جَآءَتْهُمُ ٱلْبَيِّنَـٰتُ بَغْيًۢا بَيْنَهُمْ ۖ فَهَدَى ٱللَّهُ ٱلَّذِينَ ءَامَنُواْ لِمَا ٱخْتَلَفُواْ فِيهِ مِنَ ٱلْحَقِّ بِإِذْنِهِۦ ۗ وَٱللَّهُ يَهْدِى مَن يَشَآءُ إِلَىٰ صِرَٰطٍ مُّسْتَقِيمٍ ﴿٢١٣﴾

**213**. పూర్వం, మానవులంతా ఒకే ఒక సమాజంగా ఉండేవారు.[1] అప్పుడు అల్లాహ్ వారికి శుభవార్తలు ఇవ్వటానికి మరియు హెచ్చరికలు చేయటానికి ప్రవక్తలను పంపాడు. మరియు మానవులలో ఏర్పడిన భేదాలను పరిష్కరించటానికి, ఆయన గ్రంథాన్ని సత్యంతో వారి ద్వారా అవతరింప జేశాడు. మరియు అది (దివ్యగ్రంథం) ఇవ్వబడిన వారు, స్పష్టమైన హితోపదేశాలు పొందిన తరువాత కూడా, పరస్పర ద్వేషాల వల్ల భేదాభిప్రాయాలు పుట్టించుకున్నారు. కాని అల్లాహ్ తన ఆజ్ఞతో, విశ్వాసులకు వారు వివాదాలాడుతున్న విషయంలో సత్యమార్గాన్ని చూపాడు. మరియు అల్లాహ్ తాను కోరిన వారికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తాడు.

أَمْ حَسِبْتُمْ أَن تَدْخُلُواْ ٱلْجَنَّةَ وَلَمَّا يَأْتِكُم مَّثَلُ ٱلَّذِينَ خَلَوْاْ مِن قَبْلِكُم ۖ مَّسَّتْهُمُ ٱلْبَأْسَآءُ وَٱلضَّرَّآءُ وَزُلْزِلُواْ حَتَّىٰ يَقُولَ ٱلرَّسُولُ وَٱلَّذِينَ ءَامَنُواْ مَعَهُۥ مَتَىٰ نَصْرُ ٱللَّهِ ۗ أَلَآ إِنَّ نَصْرَ ٱللَّهِ قَرِيبٌ ﴿٢١٤﴾

**214**. ఏమీ? మీరు (సులభంగా) స్వర్గంలో ప్రవేశించగలమని భావిస్తున్నారా? మీ పూర్వీకులు సహించినటువంటి (కష్టాలు) మీరూ సహించనిదే! వారిపై దురవస్థలు, రోగ బాధలు విరుచుకుపడ్డాయి మరియు వారు కుదిపివేయ బడ్డారు, చివరకు అప్పటి సందేశహరుడు మరియు విశ్వాసులైన అతని సహచరులు: "అల్లాహ్ సహాయం ఇంకా ఎప్పుడొస్తుంది?" అని వాపోయారు. అదిగో! నిశ్చయంగా, అల్లాహ్ సహాయం సమీపంలోనే ఉంది![2]

---

**1**. అంటే తౌ'హీద్: ఏకదైవ సిద్ధాంతంపై ఉండటం. ఆదమ్ ('అ.స.) నుండి నూ'హ్ ('అ.స.) వరకు ప్రజలంతా ఏకదైవ సిద్ధాంతంపై, తమ ప్రవక్తలను అనుసరిస్తూ వచ్చారు. ఆ తరువాత షై'తాన్ కలతలు రేకెత్తించటంవలన వారిమధ్య భేదాభిప్రాయాలు వచ్చాయి. సత్యతిరస్కారం మరియు షిర్క్ వ్యాపించాయి. ఆ తరువాత అల్లాహ్ (సు.తా.) ప్రవక్తలను దివ్యగ్రంథాలతో - వారి భేదాభిప్రాయాలను దూరంచేయటానికి - పంపాడు (ఇబ్నె-కసీ'ర్).

**2**. విశ్వాసులకు అల్లాహ్ (సు.తా.) సహాయం తప్పక లభిస్తుంది.

يَسْـَٔلُونَكَ مَاذَا يُنفِقُونَۖ قُلْ مَآ أَنفَقْتُم مِّنْ خَيْرٍ فَلِلْوَٰلِدَيْنِ وَٱلْأَقْرَبِينَ وَٱلْيَتَٰمَىٰ وَٱلْمَسَٰكِينِ وَٱبْنِ ٱلسَّبِيلِۗ وَمَا تَفْعَلُوا۟ مِنْ خَيْرٍ فَإِنَّ ٱللَّهَ بِهِۦ عَلِيمٌ ﴿٢١٥﴾

**215**. (ఓ ము'హమ్మద్!) వారు (ప్రజలు) నిన్ను అడుగుతున్నారు: "మేము ఏమి ఖర్చుచేయాలి?" అని. వారితో అను: "మీరు మంచిది ఏది ఖర్చుచేసినా సరే, అది మీ తల్లిదండ్రుల, బంధువుల, అనాథుల, యాచించని పేదల (మసాకీన్) మరియు బాటసారుల కొరకు ఖర్చుచేయాలి. మరియు మీరు ఏ మంచిపని చేసినా అది అల్లాహ్‌కు తప్పక తెలుస్తుంది."[1]

كُتِبَ عَلَيْكُمُ ٱلْقِتَالُ وَهُوَ كُرْهٌ لَّكُمْۖ وَعَسَىٰٓ أَن تَكْرَهُوا۟ شَيْـًٔا وَهُوَ خَيْرٌ لَّكُمْۖ وَعَسَىٰٓ أَن تُحِبُّوا۟ شَيْـًٔا وَهُوَ شَرٌّ لَّكُمْۗ وَٱللَّهُ يَعْلَمُ وَأَنتُمْ لَا تَعْلَمُونَ ﴿٢١٦﴾

**216**. మీకు అసహ్యాకరమైనా! (ధర్మ) యుద్ధం చేయటం మీకు విధిగా నిర్ణయించబడింది.[2] మరియు మీకు నచ్చని విషయమే మీకు మేలైనది కావచ్చు మరియు మీకు నచ్చే విషయమే మీకు హానికరమైనది కావచ్చు! మరియు అల్లాహ్‌కు అంతా తెలుసు, కాని మీకు ఏమీ తెలియదు.

يَسْـَٔلُونَكَ عَنِ ٱلشَّهْرِ ٱلْحَرَامِ قِتَالٍ فِيهِۖ قُلْ قِتَالٌ فِيهِ كَبِيرٌۖ

**217**. వారు నిషిద్ధ మాసాలలో యుద్ధం చేయటాన్ని గురించి నిన్ను అడుగుతున్నారు.[3] వారితో ఇలా అను: "వాటిలో

---

**1**. ఈ ఖర్చు, నఫ్ల్ సదఖాత్ గురించి ఉంది. విధిగా ఇవ్వవలసిన 'జకాత్ కాదు. ఎందుకంటే, తల్లిదండ్రులకు 'జకాత్ చెల్లదు. వారిని పోషించటం కుమారుల బాధ్యత. మైమూన్ బిన్ మహ్రాన్ అన్నారు: "గమనించవలసిన విషయం ఏమిటంటే ఈ ఖర్చు చేయటంలో, ఇంట్లో పెట్టే డ్రాయింగ్స్ గానీ, లేక సంగీత సాధనాలు గానీ, లేక ఇంటి అలంకరణకు వేసే పర్దాలు గానీ లేవు." అంటే ఇలాంటి వస్తువుల మీద ఖర్చు చేయటం అవాంఛనీయమైన వ్యర్థపు ఖర్చే.

**2**. చూడండి, 2:190-193, 22:39.

**3**. నిషిద్ధ మాసాలు హి'జ్రీ శకపు 1,7,11 మరియు 12వ నెలలు, వివరాలకు చూడండి, 2:194 మరియు దాని వ్యాఖ్యానం 1. పైన పేర్కొన్న నిషిద్ధ మాసాలలో యుద్ధం చేయటం ఇస్లాంకు ముందు కూడా అరేబియాలో నిషిద్ధంగా ఉండేది. ఈ ఆయత్ అవతరణను గురించి ఇలా ఉంది: ఒక 'స'హాబీల దళం రజబ్ నెలలో ఒక సత్యతిరస్కారిని చంపి మరి కొందరిని ఖైదీలుగా తీసుకుంటారు. అప్పుడు ఆ 'స'హాబీలకు రజబ్ నెల ప్రారంభమైనది తెలియదు. అప్పుడు సత్యతిరస్కారులు: "ఈ ముస్లింలు నిషిద్ధ మాసాలను కూడా లెక్కచేయడం లేదు." అని నిందిస్తారు. ఆ సందర్భంలో ఈ ఆయత్ అవతరింపజేయబడింది.

وَصَدٌّ عَن سَبِيلِ ٱللَّهِ وَكُفْرٌۢ بِهِۦ وَٱلْمَسْجِدِ ٱلْحَرَامِ وَإِخْرَاجُ أَهْلِهِۦ مِنْهُ أَكْبَرُ عِندَ ٱللَّهِ ۚ وَٱلْفِتْنَةُ أَكْبَرُ مِنَ ٱلْقَتْلِ ۗ وَلَا يَزَالُونَ يُقَٰتِلُونَكُمْ حَتَّىٰ يَرُدُّوكُمْ عَن دِينِكُمْ إِنِ ٱسْتَطَٰعُوا۟ ۚ وَمَن يَرْتَدِدْ مِنكُمْ عَن دِينِهِۦ فَيَمُتْ وَهُوَ كَافِرٌ فَأُو۟لَٰٓئِكَ حَبِطَتْ أَعْمَٰلُهُمْ فِى ٱلدُّنْيَا وَٱلْءَاخِرَةِ ۖ وَأُو۟لَٰٓئِكَ أَصْحَٰبُ ٱلنَّارِ ۖ هُمْ فِيهَا خَٰلِدُونَ ﴿٢١٧﴾

యుద్ధం చేయటం మహా అపరాధం. కానీ (ప్రజలను) అల్లాహ్ మార్గాన్ని అవలంబించటం నుండి అవరోధాలు కలిగించటం మరియు ఆయన (అల్లాహ్)ను తిరస్కరించటం మరియు (ప్రజలను) మస్జిద్ అల్-'హరామ్‌ను దర్శించకుండా ఆటంకపరచటం మరియు అక్కడి వారిని దానినుండి వెడలగొట్టడం అల్లాహ్ దృష్టిలో అంత కంటే మహా అపరాధం. పీడన (ఫిత్నా), రక్తపాతం కంటే ఘోరమైనది.[1] వారికి సాధ్యమే అయితే మిమ్మల్ని మీ ధర్మం నుండి మళ్ళించగలిగే వరకూ వారు మీతో యుద్ధం చేయడం మానరు. మరియు మీలో ఎవరైనా మతభ్రష్టులై సత్యతిరస్కారులుగా మరణిస్తే, అలాంటి వారి మంచిపనులన్నీ ఇహపర లోకాలలో రెండింటిలోనూ వృథా అవుతాయి. మరియు అలాంటి వారు నరకాగ్ని వాసులవుతారు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.''

إِنَّ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَٱلَّذِينَ هَاجَرُوا۟ وَجَٰهَدُوا۟ فِى سَبِيلِ ٱللَّهِ أُو۟لَٰٓئِكَ يَرْجُونَ رَحْمَتَ ٱللَّهِ ۚ وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴿٢١٨﴾

**218**. నిశ్చయంగా, విశ్వసించిన వారు మరియు (అల్లాహ్ మార్గంలో తమ జన్మభూమిని విడిచి) వలస పోయేవారు మరియు అల్లాహ్ మార్గంలో ధర్మపోరాటం చేసేవారు; ఇలాంటి వారే! అల్లాహ్ కారుణ్యం ఆశించటానికి అర్హులు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత. (5/8)

---

**1**. చూడండి, 2:191 వ్యాఖ్యానం 2.

۞ يَسْـَٔلُونَكَ عَنِ ٱلْخَمْرِ وَٱلْمَيْسِرِ ۖ قُلْ فِيهِمَآ إِثْمٌ كَبِيرٌ وَمَنَٰفِعُ لِلنَّاسِ وَإِثْمُهُمَآ أَكْبَرُ مِن نَّفْعِهِمَا ۗ وَيَسْـَٔلُونَكَ مَاذَا يُنفِقُونَ قُلِ ٱلْعَفْوَ ۗ كَذَٰلِكَ يُبَيِّنُ ٱللَّهُ لَكُمُ ٱلْـَٔايَٰتِ لَعَلَّكُمْ تَتَفَكَّرُونَ ﴿٢١٩﴾

فِى ٱلدُّنْيَا وَٱلْـَٔاخِرَةِ ۗ وَيَسْـَٔلُونَكَ عَنِ ٱلْيَتَٰمَىٰ ۖ قُلْ إِصْلَاحٌ لَّهُمْ خَيْرٌ ۖ وَإِن تُخَالِطُوهُمْ فَإِخْوَٰنُكُمْ ۚ وَٱللَّهُ يَعْلَمُ ٱلْمُفْسِدَ مِنَ ٱلْمُصْلِحِ ۚ وَلَوْ شَآءَ ٱللَّهُ لَأَعْنَتَكُمْ ۚ إِنَّ ٱللَّهَ عَزِيزٌ حَكِيمٌ ﴿٢٢٠﴾

**219**. * (ఓ ప్రవక్తా!) వారు, మద్యపానాన్ని మరియు జూదాన్ని గురించి నిన్ను ప్రశ్నిస్తున్నారు.[1] నీవు ఈ విధంగా సమాధానం ఇవ్వు: "ఈ రెండింటిలోనూ ఎంతో హాని (పాపం) ఉంది. వాటిలో ప్రజలకు కొన్ని లాభాలు కూడా ఉన్నాయి, కాని వాటి హాని (పాపం) వాటి లాభాలకంటే ఎంతో అధికమైనది." మరియు వారిలా అడుగుతున్నారు: "మేము (అల్లాహ్ మార్గంలో) ఏమి ఖర్చుపెట్టాలి?" నీవు ఇలా సమాధానం ఇవ్వు: "మీ (నిత్యావసరాలకు పోగా) మిగిలేది."[2] మీరు ఆలోచించటానికి, అల్లాహ్ ఈ విధంగా తన సూచన (ఆయాత్)లను మీకు విశదీకరిస్తున్నాడు -

**220**. ఇహలోకంలోనూ మరియు పరలోకం లోనూ. మరియు అనాథులను గురించి వారు నిన్ను అడుగుతున్నారు. నీవు ఇలా సమాధానం ఇవ్వు: "వారి సంక్షేమానికి తోడ్పడటమే మేలైనది." మరియు మీరు వారితో కలిసి మెలిసి[3] ఉంటే (తప్పులేదు), వారు మీ సోదరులే! మరియు చెరచేవాడెవడో, సవరించేవాడెవడో అల్లాహ్‌కు బాగా తెలుసు. మరియు అల్లాహ్ కోరితే మిమ్మల్ని కష్టపెట్టి ఉండేవాడు. నిశ్చయంగా, అల్లాహ్ సర్వ శక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

---

**1**. చూడండి, 4: 43, 5:90-91. 'స. బు'ఖారీ, పుస్తకం-6, 'హదీస్' నం. 383, 'స. బు'ఖారీ, పుస్తకం-7, 'హదీస్' నం. 481, 483, 484.

**2**. అంటే తమ పోషణలో ఉన్నవారి అవసరాలను పూర్తిచేసిన తరువాత. ఉన్నదంతా ఖర్చుపెట్టి, తరువాత అవసరంపడితే ఇతరులముందు చేయిచాపవలసిన పరిస్థితి కూడా తెచ్చుకోరాదు.

**3**. తు'ఖాలి'తూహుమ్: వారితో కలిసి మెలిసి ఉండండి. అంటే ఆదాయాలు మరియు ఖర్చులలో, వ్యాపారంలో మొదలైన వాటిలో కలిసి మెలిసి ఉంటే, ఫర్వాలేదు, కాని వారి సంపదలను కబళించుకోవటానికి ప్రయత్నించరాదు. వారి మేలును మీ మేలుగా పరిగణించాలి.

وَلَا تَنكِحُواْ ٱلْمُشْرِكَٰتِ حَتَّىٰ يُؤْمِنَّ ۚ وَلَأَمَةٌ مُّؤْمِنَةٌ خَيْرٌ مِّن مُّشْرِكَةٍ وَلَوْ أَعْجَبَتْكُمْ ۗ وَلَا تُنكِحُواْ ٱلْمُشْرِكِينَ حَتَّىٰ يُؤْمِنُواْ ۚ وَلَعَبْدٌ مُّؤْمِنٌ خَيْرٌ مِّن مُّشْرِكٍ وَلَوْ أَعْجَبَكُمْ ۗ أُوْلَٰٓئِكَ يَدْعُونَ إِلَى ٱلنَّارِ ۖ وَٱللَّهُ يَدْعُوٓاْ إِلَى ٱلْجَنَّةِ وَٱلْمَغْفِرَةِ بِإِذْنِهِۦ ۖ وَيُبَيِّنُ ءَايَٰتِهِۦ لِلنَّاسِ لَعَلَّهُمْ يَتَذَكَّرُونَ ﴿٢٢١﴾

**221**. మరియు ముష్రిక్ స్త్రీలు, విశ్వసించనంత వరకు, మీరు వారిని వివాహమాడకండి, ముష్రిక్ స్త్రీ మీకు ఎంతనచ్చినా, ఆమె కంటే విశ్వాసురాలైన ఒక బానిస స్త్రీ ఎంతోమేలైనది.[1] మరియు ముష్రిక్ పురుషులు విశ్వసించనంతవరకు మీ స్త్రీలతో వారి వివాహం చేయించకండి. మరియు ముష్రిక్ పురుషుడు మీకు ఎంతనచ్చినా, అతడి కంటే విశ్వాసి అయిన ఒక బానిస ఎంతో మేలైనవాడు. ఇలాంటి వారు (ముష్రికులు) మిమ్మల్ని అగ్ని వైపునకు ఆహ్వానిస్తున్నారు. కాని అల్లాహ్! తన అనుమతితో, మిమ్మల్ని స్వర్గం వైపునకు మరియు క్షమాభిక్ష పొందటానికి పిలుస్తున్నాడు. మరియు ఈవిధంగా ఆయన తన సూచనలను ప్రజలకు - బహుశా వారు గుణపాఠం నేర్చుకుంటారని - స్పష్టంగా తెలుపుతున్నాడు.

وَيَسْـَٔلُونَكَ عَنِ ٱلْمَحِيضِ ۖ قُلْ هُوَ أَذًى فَٱعْتَزِلُواْ ٱلنِّسَآءَ فِى ٱلْمَحِيضِ ۖ وَلَا تَقْرَبُوهُنَّ حَتَّىٰ يَطْهُرْنَ ۖ

**222**. మరియు వారు నిన్ను స్త్రీల ఋతుకాలం గురించి అడుగుతున్నారు. నీవు వారికి ఇలా తెలుపు: "అదొక అపరిశుద్ధ (హానికరమైన) స్థితి. కనుక ఋతుకాలంలో స్త్రీలతో (సంభోగానికి) దూరంగా ఉండండి.[2]

---

**1**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "స్త్రీని వివాహమాడటానికి నాలుగు విషయాలను గమనించాలి. అవి: 1) ఆస్తిపాస్తులు, 2) పుట్టుపూర్వోత్తరాలు, వంశం, 3) అందం, ఆకర్షణీయత మరియు 4) ధర్మపరాయణత." మీరు ధర్మపరాణురాలైన స్త్రీనే ఎంచుకోండి. ('స. బు'ఖారీ, కితాబ్ అన్నికా'హ్, 'స. ముస్లిం, కితాబ్ అర్ర'దా'అ).

**2**. స్త్రీల ఋతుకాలం: ప్రతి చంద్ర మాసంలో 4-5 రోజుల వరకు రక్తం ప్రసరించే కాలం. యూదులు మరియు ఇతర జాతుల వారు ఋతుకాలంలో స్త్రీలను వేరే గదులలో దూరంగా ఉంచేవారు. వారిని వంటింటిలోకి కూడా పోనిచ్చేవారు కాదు. కావున ఈ విషయం గురించి, 'స'హాబీలు ప్రవక్త ('స'అస) గారిని ప్రశ్నించగా, ఈ ఆయత్ అవతరింపజేయబడింది. ఇందులో స్త్రీలతో ఋతుకాలంలో సంభోగం మాత్రమే నిషేధించబడింది. వారు వంటచేయటం, ఒకే గదిలో భర్తతో కలిసి ఒకే మంచంపై పరుండటం నిషేధించబడలేదు.

فَإِذَا تَطَهَّرْنَ فَأْتُوهُنَّ مِنْ حَيْثُ أَمَرَكُمُ ٱللَّهُۚ إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلتَّوَّٰبِينَ وَيُحِبُّ ٱلْمُتَطَهِّرِينَ ﴿٢٢٢﴾

వారు పరిశుద్ధులు కానంతవరకు వారివద్దకు పోకండి. వారు పరిశుద్దులు అయిన తరువాత అల్లాహ్ ఆదేశించిన చోటునుండి మీరు వారివద్దకు పోవచ్చు."[1] నిశ్చయంగా అల్లాహ్ పశ్చాత్తాపపడేవారిని ప్రేమిస్తాడు మరియు పరిశుద్ధులుగా ఉండేవారిని ప్రేమిస్తాడు.

نِسَآؤُكُمْ حَرْثٌ لَّكُمْ فَأْتُوا۟ حَرْثَكُمْ أَنَّىٰ شِئْتُمْۖ وَقَدِّمُوا۟ لِأَنفُسِكُمْۚ وَٱتَّقُوا۟ ٱللَّهَ وَٱعْلَمُوٓا۟ أَنَّكُم مُّلَٰقُوهُۗ وَبَشِّرِ ٱلْمُؤْمِنِينَ ﴿٢٢٣﴾

**223**. మీ భార్యలు మీకు పంటపొలాల వంటి వారు, కావున మీ పొలాలకు మీరు కోరిన విధంగా పోవచ్చు.[2] మరియు మీ స్వయం కొరకు (సత్కార్యాలు) చేసి పంపండి (మీకు మంచి సంతానం కొరకు ప్రార్థించండి). మరియు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు మీరు నిశ్చయంగా, ఆయనను కలుసుకోవలసి ఉందని తెలుసుకోండి. మరియు విశ్వాసులకు శుభవార్తలను వినిపించు.

وَلَا تَجْعَلُوا۟ ٱللَّهَ عُرْضَةً لِّأَيْمَٰنِكُمْ أَن تَبَرُّوا۟ وَتَتَّقُوا۟ وَتُصْلِحُوا۟ بَيْنَ ٱلنَّاسِۗ وَٱللَّهُ سَمِيعٌ عَلِيمٌ ﴿٢٢٤﴾

**224**. మరియు మీరు అల్లాహ్ (పేరుతో) చేసే ప్రమాణాలు మిమ్మల్ని సన్మార్గం నుండి, దైవభీతి నుండి మరియు ప్రజలలో శాంతి స్థాపించటం నుండి ఆటంక పరిచేవిగా కానివ్వకండి.[3] మరియు అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

---

**1**. అల్లాహ్ (సు.తా.) ఆదేశించిన చోటునుండి అంటే సంతానం పుట్టే చోటు నుండి మాత్రమే. ఇతర ఏ చోట్ల నుండి కూడా కాదు. దీనితో విశదమయ్యేది ఏమిటంటే, భార్యతో కూడా మలమార్గం ద్వారా సంభోగం చేయటం నిషిద్ధం ('హరాం).

**2**. ఇక్కడ పంటపొలం అంటే సంతానం ఇచ్చేవారు, ఏ విధంగానైతే పొలం నుండి ఫలం లభిస్తుందో అదేవిధంగా స్త్రీలనుండి సంతతి ఫలిస్తుంది. ఇక్కడ కూడా మీరు కోరిన పద్ధతిలో పంటపొలంలోకి మాత్రమే పొండి, కాని ఇతర చోట్లనుండి పోకండి అంటే స్త్రీ మర్మాంగం నుండే సంభోగం చేయండి. ఇతర మార్గాల ద్వారా చేయకండి అని భావం. (ఇబ్నె-కసీ'ర్).

**3** . మీరు కోపంలో ఉన్నప్పుడు కూడా ఫలానా వ్యక్తికి ఉపకారం చేయనని అల్లాహుతా'ఆలా పేరుతో ప్రమాణం చేయకండి. దీని కఫ్ఫారా 5:89లో విశదీకరించబడింది. చూడండి, 'స.బు'ఖారీ, పుస్తకం-8, 'హదీస్' నం. 621.

لَّا يُؤَاخِذُكُمُ ٱللَّهُ بِٱللَّغْوِ فِيٓ أَيْمَٰنِكُمْ وَلَٰكِن يُؤَاخِذُكُم بِمَا كَسَبَتْ قُلُوبُكُمْ ۗ وَٱللَّهُ غَفُورٌ حَلِيمٌ ﴿٢٢٥﴾

**225**. మీరు అనాలోచితంగా చేసే ప్రమాణాలను గురించి అల్లాహ్ మిమ్మల్ని పట్టుకోడు. కాని మీరు హృదయపూర్వకంగా చేసే ప్రమాణాలను గురించి ఆయన తప్ప కుండా మిమ్మల్ని పట్టుకుంటాడు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, సహనశీలుడు.[1]

لِّلَّذِينَ يُؤْلُونَ مِن نِّسَآئِهِمْ تَرَبُّصُ أَرْبَعَةِ أَشْهُرٍ ۖ فَإِن فَآءُو فَإِنَّ ٱللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴿٢٢٦﴾

**226**. ఎవరైతే తమ భార్యలతో (సంభోగించమని) ప్రమాణం చేస్తారో, వారికి నాలుగు నెలల వ్యవధి ఉంది.[2] కాని వారు తమ దాంపత్య జీవితాన్ని మళ్ళీ ప్రారంభిస్తే! నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

وَإِنْ عَزَمُوا۟ ٱلطَّلَٰقَ فَإِنَّ ٱللَّهَ سَمِيعٌ عَلِيمٌ ﴿٢٢٧﴾

**227**. కాని వారు విడాకులకే నిర్ణయించు కుంటే! నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.[3]

وَٱلْمُطَلَّقَٰتُ يَتَرَبَّصْنَ بِأَنفُسِهِنَّ ثَلَٰثَةَ قُرُوٓءٍ ۚ

**228**. మరియు విడాకులివ్వబడిన స్త్రీలు మూడు ఋతువుల వరకు (మరొకనితో పెండ్లి చేసుకోకుండా) వేచి ఉండాలి.[4] మరియు

---

1. 'హలీమున్: The Fore-Bearing, Clement. సహనశీలుడు, ఓర్పు గలవాడు, సౌమ్యుడు, విశాలహృదయుడు, శిక్షించటంలో తొందరపడనివాడు. **అల్-'హలీము, అర్-రషీదు.** ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు. చూడండి, 11:87.
2. *ఈలా:* అంటే శపథం. ఏ వ్యక్తి అయినా తన భార్యతో ఇన్ని నెలలు కలువనని శపథంచేసి ఆ గడువు పూర్తి కాకముందే ఆమెతో కలిస్తే కఫ్ఫారా చేయాలి. ఒకవేళ ఆ గడువు 4 నెలలకంటే ఎక్కువ ఉంటే - అతడు ఆమెను 4 నెలల కంటే ఎక్కువ కాలం వ్రేలాడ నివ్వలేడు కావున - నాలుగు నెలల తరువాత ఆమెతో ఆదరంగా దాంపత్య జీవితం సాగించాలి. లేదా ఆదరంగా సాగనంపాలి, (ఇబ్నె-కసీ'ర్).
3. నాలుగు నెలల గడువు తరువాత పై విషయంలో విడాకులు దానంతట అవే పూర్తికావు. ఆ వ్యక్తి ఆమెను స్వీకరించాలి, లేదా విడాకులివ్వాలి. లేనిచో న్యాయస్థానం వారికి విడాకులైనా ఇప్పించాలి, లేదా వారిరువురిని కలపాలి (ఇబ్నె-కసీ'ర్).
4. ఈ శాసనం గర్భవతి అయిన స్త్రీకి వర్తించదు. వారి వేచియుండే సమయం ('ఇద్దత్) కాన్పు వరకు ఉంటుంది. మరియు నికా'హ్ తరువాత సంభోగం కాని స్త్రీకి కూడా వర్తించదు. ఆమెకు 'ఇద్దత్ గడువు ఉండదు. మరియు ఋతుస్రావం ప్రారంభం కాని స్త్రీ మరియు ఋతుస్రావం

وَلَا يَحِلُّ لَهُنَّ أَن يَكْتُمْنَ مَا خَلَقَ ٱللَّهُ فِىٓ أَرْحَامِهِنَّ إِن كُنَّ يُؤْمِنَّ بِٱللَّهِ وَٱلْيَوْمِ ٱلْءَاخِرِ ۚ وَبُعُولَتُهُنَّ أَحَقُّ بِرَدِّهِنَّ فِى ذَٰلِكَ إِنْ أَرَادُوٓا۟ إِصْلَٰحًا ۚ وَلَهُنَّ مِثْلُ ٱلَّذِى عَلَيْهِنَّ بِٱلْمَعْرُوفِ ۚ وَلِلرِّجَالِ عَلَيْهِنَّ دَرَجَةٌ ۗ وَٱللَّهُ عَزِيزٌ حَكِيمٌ ﴿٢٢٨﴾

వారు అల్లాహ్‌యందు మరియు అంతిమ దినమునందు విశ్వాసమున్నవారే అయితే, అల్లాహ్ వారి గర్భాలలో సృష్టించిన దానిని దాచటం వారికి ధర్మసమ్మతం కాదు.[1] మరియు వారి భర్తలు దాంపత్య సంబంధాలను సరిదిద్దుకోవటానికి సిద్ధంగా ఉంటే! ఈ నిరీక్షణ కాలంలో వారిని తమ భార్యలుగా తిరిగి స్వీకరించే హక్కు వారికి ఉంది. మరియు వారికి (స్త్రీలకు) వారి (భర్తల)పై ధర్మసమ్మతమైన హక్కు లున్నాయి, ఏ విధంగానైతే వారి (భర్తలకు) వారిపై ఉన్నాయో. కాని పురుషులకు స్త్రీలపై (కర్తవ్య) ఆధిక్యత ఉంది.[2] మరియు అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

ٱلطَّلَٰقُ مَرَّتَانِ ۖ فَإِمْسَاكٌۢ بِمَعْرُوفٍ أَوْ تَسْرِيحٌۢ بِإِحْسَٰنٍ ۗ

**229**. విడాకులు రెండు సార్లే! ఆ తర్వాత (భార్యను) సహృదయంతో తమవద్ద ఉండనివ్వాలి, లేదా ఆమెను మంచితనంతో సాగనంపాలి.[3] మరియు

---

ఆగిన స్త్రీకి కూడా వర్తించదు. వారి గడువు మూడు మాసాలు, (ఇబ్నె-కసీ'ర్). చూడండి, 65:1-7. ఇతర స్త్రీలు భర్త మరణించిన తరువాత నాలుగు మాసాల పదిరోజులు వేచి ఉండాలి (2:234).

**1**. ఇక్కడ గర్భం మరియు ఋతుస్రావం రెండింటిని కూడా దాచవద్దని అర్థం.

**2**. మగ వారికి ఉన్న ఆధిక్యత, వారి శారీరక బలం, వారికున్న జిహాద్ అనుమతి, వారసత్వంలో ఆధిక్యత మరియు భార్యాపిల్లలను మరియు కుటుంబం వారిని పోషించే బాధ్యత మొదలైనవి.

**3**. భర్త తన భార్యను 'ఇద్దత్ గడువులోపల కేవలం రెండుసార్లు మాత్రమే తిరిగి స్వీకరించవచ్చు. అంటే మొదటిసారి ఇచ్చిన విడాకుల తరువాత మరియు రెండవసారి ఇచ్చిన విడాకుల తరువాత. మూడవసారి విడాకులిచ్చిన తరువాత 'ఇద్దత్ గడువులోపల భార్యను తిరిగిస్వీకరించే అనుమతి లేదు.

అ'త్తలాఖు మర్రతాన్ దీనిఅర్థం ఏమిటంటే ఒకేసారి మూడు విడాకులు పూర్తికావు. **అంటే ఒకే సమయంలో తలాఖ్ అని ఎన్నిసార్లు పలికినా అది ఒకే 'తలాఖ్‌గా పరిగణించబడాలి.**

وَلَا يَحِلُّ لَكُمْ أَن تَأْخُذُوا۟ مِمَّآ ءَاتَيْتُمُوهُنَّ شَيْـًٔا إِلَّآ أَن يَخَافَآ أَلَّا يُقِيمَا حُدُودَ ٱللَّهِ ۖ فَإِنْ خِفْتُمْ أَلَّا يُقِيمَا حُدُودَ ٱللَّهِ فَلَا جُنَاحَ عَلَيْهِمَا فِيمَا ٱفْتَدَتْ بِهِۦ ۗ تِلْكَ حُدُودُ ٱللَّهِ فَلَا تَعْتَدُوهَا ۚ وَمَن يَتَعَدَّ حُدُودَ ٱللَّهِ فَأُو۟لَٰٓئِكَ هُمُ ٱلظَّٰلِمُونَ ﴿٢٢٩﴾

సాగనంపేటప్పుడు మీరు వారికి ఇచ్చిన వాటినుండి ఏమైనా తిరిగి తీసుకోవడం ధర్మసమ్మతం కాదు. అల్లాహ్ విధించిన హద్దులకు కట్టుబడి ఉండలేము అనే భయం ఆ ఇద్దరికీ ఉంటే తప్ప! కాని అల్లాహ్ విధించిన హద్దులకు కట్టుబడి ఉండలేమనే భయం ఆ దంపతులకు ఉంటే స్త్రీ పరిహారమిచ్చి (విడాకులు / ఖులా' తీసుకుంటే) అందులో వారికి ఎలాంటి దోషంలేదు.[1] ఇవి అల్లాహ్ విధించిన హద్దులు, కావున వీటిని అతిక్రమించకండి. మరియు ఎవరైతే అల్లాహ్ విధించిన హద్దులను అతిక్రమిస్తారో, అలాంటి వారే దుర్మార్గులు.[2]

فَإِن طَلَّقَهَا فَلَا تَحِلُّ لَهُۥ مِنۢ بَعْدُ حَتَّىٰ تَنكِحَ زَوْجًا غَيْرَهُۥ ۗ فَإِن طَلَّقَهَا فَلَا جُنَاحَ عَلَيْهِمَآ أَن يَتَرَاجَعَآ إِن ظَنَّآ أَن يُقِيمَا حُدُودَ ٱللَّهِ ۗ وَتِلْكَ حُدُودُ ٱللَّهِ يُبَيِّنُهَا لِقَوْمٍ يَعْلَمُونَ ﴿٢٣٠﴾

**230**. ఒకవేళ అతడు (మూడవ సారి) విడాకులిస్తే, ఆ తర్వాత ఆ స్త్రీ అతనికి ధర్మసమ్మతం కాదు, ఆమె వివాహం వేరే పురుషునితో జరిగితే తప్ప! ఒకవేళ అతడు (రెండవ భర్త) ఆమెకు విడాకులిస్తే! అప్పుడు ఉభయులూ (మొదటి భర్త, ఈ స్త్రీ) తాము అల్లాహ్ హద్దులకు లోబడి ఉండగలమని భావిస్తే, వారు పునర్వివాహం చేసుకోవటంలో దోషం లేదు. మరియు ఇవి అల్లాహ్ నియమించిన హద్దులు, వీటిని ఆయన గ్రహించేవారికి స్పష్టపరుస్తున్నాడు.

---

**1** . స్త్రీ విడాకులు కోరితే, సమంజసమైన కారణం చూపి, పరిహారమిచ్చి లేక మహ్ర్ వాపసు ఇచ్చి, ఖుల'అ తీసుకోవచ్చు. న్యాయస్థానం ఈ విషయంలో ఆమెకు తోడ్పడుతుంది. పురుషుడు అంగీకరించని పక్షంలో న్యాయాధికారి స్త్రీ చూపిన కారణాలతో ఏకీభవిస్తే, వారి వివాహబంధాన్ని రద్దు చేయవచ్చు (అబూ-దావూద్, తిర్మిజీ', నసాయీ' - ఫత్హ్ అల్-ఖదీర్).

**2**. 'స. బు'ఖారీ, పుస్తకం-7, 'హదీస్' నం.197.

وَإِذَا طَلَّقۡتُمُ ٱلنِّسَآءَ فَبَلَغۡنَ أَجَلَهُنَّ
فَأَمۡسِكُوهُنَّ بِمَعۡرُوفٍ أَوۡ
سَرِّحُوهُنَّ بِمَعۡرُوفٖۚ وَلَا تُمۡسِكُوهُنَّ
ضِرَارٗا لِّتَعۡتَدُواْۚ وَمَن يَفۡعَلۡ ذَٰلِكَ
فَقَدۡ ظَلَمَ نَفۡسَهُۥۚ وَلَا تَتَّخِذُوٓاْ
ءَايَٰتِ ٱللَّهِ هُزُوٗاۚ وَٱذۡكُرُواْ نِعۡمَتَ
ٱللَّهِ عَلَيۡكُمۡ وَمَآ أَنزَلَ عَلَيۡكُم مِّنَ
ٱلۡكِتَٰبِ وَٱلۡحِكۡمَةِ يَعِظُكُم بِهِۦۚ
وَٱتَّقُواْ ٱللَّهَ وَٱعۡلَمُوٓاْ أَنَّ ٱللَّهَ بِكُلِّ
شَيۡءٍ عَلِيمٞ ٢٣١

**231**. మరియు మీరు స్త్రీలకు విడాకులిచ్చినప్పుడు, వారి కొరకు నిర్ణయింపబడిన గడువు ('ఇద్దత్) సమీపిస్తే వారిని సహృదయంతో మీవద్ద ఉంచుకోండి, లేదా సహృదయంతో విడిచిపెట్టండి. కేవలం వారికి బాధకలిగించే మరియు పీడించే ఉద్దేశ్యంతో వారిని ఉంచుకోకండి. మరియు ఆవిధంగా చేసేవాడు వాస్తవానికి తనకు తానే అన్యాయం చేసుకున్నట్లు. మరియు అల్లాహ్ ఆదేశా(ఆయత్)లను పరిహాసంగా తీసుకోకండి. మరియు అల్లాహ్ మీకు చేసిన అనుగ్రహాన్ని మరియు మీపై అవతరింపజేసిన గ్రంథాన్ని మరియు వివేకాన్ని జ్ఞాపకం చేసుకోండి. ఆయన (అల్లాహ్) మీకు ఈవిధంగా బోధిస్తున్నాడు. మరియు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నిశ్చయంగా, అల్లాహ్‌కు ప్రతి విషయం గురించి బాగా తెలుసని తెలుసుకోండి.

وَإِذَا طَلَّقۡتُمُ ٱلنِّسَآءَ فَبَلَغۡنَ أَجَلَهُنَّ
فَلَا تَعۡضُلُوهُنَّ أَن يَنكِحۡنَ
أَزۡوَٰجَهُنَّ إِذَا تَرَٰضَوۡاْ بَيۡنَهُم
بِٱلۡمَعۡرُوفِۗ ذَٰلِكَ يُوعَظُ بِهِۦ مَن كَانَ
مِنكُمۡ يُؤۡمِنُ بِٱللَّهِ وَٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِۗ
ذَٰلِكُمۡ أَزۡكَىٰ لَكُمۡ وَأَطۡهَرُۗ وَٱللَّهُ يَعۡلَمُ
وَأَنتُمۡ لَا تَعۡلَمُونَ ٢٣٢

**232**. మరియు మీరు మీ స్త్రీలకు (మొదటి సారి లేక రెండవసారి) విడాకులిస్తే, వారు తమ నిరీక్షణా వ్యవధిని ('ఇద్దత్‌ను) పూర్తిచేసిన తరువాత, తమ (మొదటి) భర్తలను ధర్మసమ్మతంగా పరస్పరం ఇష్టపడి వివాహం చేసుకోదలిస్తే, మీరు వారిని ఆటంకపరచకండి. మీలో ఎవరికి అల్లాహ్‌యందు మరియు అంతిమ దినము నందు విశ్వాసముందో, వారికి ఈ బోధన చేయబడుతోంది. ఇది మీకు నిష్కళంకమైనది మరియు నిర్మలమైనది. మరియు అల్లాహ్‌కు అంతా తెలుసు, కాని మీకు ఏమీ తెలియదు. (3/4)

۞ وَٱلْوَٰلِدَٰتُ يُرْضِعْنَ أَوْلَٰدَهُنَّ حَوْلَيْنِ كَامِلَيْنِ ۖ لِمَنْ أَرَادَ أَن يُتِمَّ ٱلرَّضَاعَةَ ۚ وَعَلَى ٱلْمَوْلُودِ لَهُۥ رِزْقُهُنَّ وَكِسْوَتُهُنَّ بِٱلْمَعْرُوفِ ۚ لَا تُكَلَّفُ نَفْسٌ إِلَّا وُسْعَهَا ۚ لَا تُضَآرَّ وَٰلِدَةٌۢ بِوَلَدِهَا وَلَا مَوْلُودٌ لَّهُۥ بِوَلَدِهِۦ ۚ وَعَلَى ٱلْوَارِثِ مِثْلُ ذَٰلِكَ ۗ فَإِنْ أَرَادَا فِصَالًا عَن تَرَاضٍ مِّنْهُمَا وَتَشَاوُرٍ فَلَا جُنَاحَ عَلَيْهِمَا ۗ وَإِنْ أَرَدتُّمْ أَن تَسْتَرْضِعُوٓا۟ أَوْلَٰدَكُمْ فَلَا جُنَاحَ عَلَيْكُمْ إِذَا سَلَّمْتُم مَّآ ءَاتَيْتُم بِٱلْمَعْرُوفِ ۗ وَٱتَّقُوا۟ ٱللَّهَ وَٱعْلَمُوٓا۟ أَنَّ ٱللَّهَ بِمَا تَعْمَلُونَ بَصِيرٌ ﴿٢٣٣﴾

**233.** * (విడాకుల తరువాత) పూర్తి రెండు సంవత్సరాల పాల గడువు పూర్తి చేయ వలెనని (తల్లిదండ్రులు) కోరినట్లయితే, తల్లులు తమ పిల్లలకు పాలివ్వాలి. బిడ్డ తండ్రిపై, వారికి తగురీతిగా భోజనం మరియు వస్త్రాలిచ్చి పోషించవలసిన బాధ్యత ఉంటుంది. శక్తికి మించిన భారం ఏ వ్యక్తిపై కూడా మోపబడదు. తల్లి తన బిడ్డ వలన కష్టాలకు గురికాకూడదు. మరియు తండ్రి కూడా తన బిడ్డవలన (కష్టాలకు గురి కాకూడదు). (పాలిచ్చే తల్లిని పోషించే బాధ్యత తండ్రిపై ఉన్నట్లు తండ్రి చనిపోతే) అతని వారసులపై కూడా ఉంటుంది. మరియు (తల్లిదండ్రులు) ఇరువురు సంప్రదించు కొని పరస్పర అంగీకారంతో (రెండు సంవత్సరాలు పూర్తికాక ముందే) బిడ్డచేత పాలు విడిపిస్తే, వారిరువురికి ఎలాంటి దోషంలేదు. మరియు మీరు మీ బిడ్డలకు వేరే స్త్రీద్వారా పాలు ఇప్పించే ఏర్పాటు చేయదలిస్తే, మీపై ఎలాంటి దోషంలేదు. కాని మీరు ఆమెకు (తల్లికి) ఇవ్వ వలసింది ధర్మసమ్మతంగా చెల్లించాలి. అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు మీరు చేసేదంతా నిశ్చయంగా, అల్లాహ్ చూస్తున్నాడని తెలుసుకోండి.

وَٱلَّذِينَ يُتَوَفَّوْنَ مِنكُمْ وَيَذَرُونَ أَزْوَٰجًا يَتَرَبَّصْنَ بِأَنفُسِهِنَّ أَرْبَعَةَ أَشْهُرٍ وَعَشْرًا ۖ فَإِذَا بَلَغْنَ أَجَلَهُنَّ

**234.** మరియు మీలో ఎవరైనా మరణించి, భార్యలను వదలిపోయినట్లైతే! (అలాంటి విధవలు) నాలుగునెలల పదిరోజులు (రెండవ పెండ్లి చేసుకోకుండా) వేచిఉండాలి.[1] వారి

**1.** ఈ 'ఇద్దత్ గడువు ప్రతి స్త్రీకి వర్తిస్తుంది. సంభోగం కాని స్త్రీ అయినా లేక ముసలిది అయినా సరే! కాని గర్భవతి అయిన స్త్రీ మాత్రం కాన్పువరకు వేచిఉండాలి, (65:4). ఈ గడువు కాలంలో వారు తమ మృత భర్త ఇంటిలోనే ఉండాలి. (ఇబ్నె-కసీ'ర్).

فَلَا جُنَاحَ عَلَيْكُمْ فِيمَا فَعَلْنَ فِيٓ أَنفُسِهِنَّ بِٱلْمَعْرُوفِ ۗ وَٱللَّهُ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ ﴿٢٣٤﴾

గడువు పూర్తిఅయిన తరువాత వారు తమకు ఉచితమైనది, ధర్మసమ్మతంగా చేసు కుంటే మీపై దోషం లేదు. మరియు మీరు చేసేదంతా అల్లాహ్ బాగా ఎరుగును.

وَلَا جُنَاحَ عَلَيْكُمْ فِيمَا عَرَّضْتُم بِهِۦ مِنْ خِطْبَةِ ٱلنِّسَآءِ أَوْ أَكْنَنتُمْ فِيٓ أَنفُسِكُمْ ۚ عَلِمَ ٱللَّهُ أَنَّكُمْ سَتَذْكُرُونَهُنَّ وَلَٰكِن لَّا تُوَاعِدُوهُنَّ سِرًّا إِلَّآ أَن تَقُولُوا۟ قَوْلًا مَّعْرُوفًا ۚ وَلَا تَعْزِمُوا۟ عُقْدَةَ ٱلنِّكَاحِ حَتَّىٰ يَبْلُغَ ٱلْكِتَٰبُ أَجَلَهُۥ ۚ وَٱعْلَمُوٓا۟ أَنَّ ٱللَّهَ يَعْلَمُ مَا فِيٓ أَنفُسِكُمْ فَٱحْذَرُوهُ ۚ وَٱعْلَمُوٓا۟ أَنَّ ٱللَّهَ غَفُورٌ حَلِيمٌ ﴿٢٣٥﴾

**235**. మరియు మీరు (వితంతువు లేక మూడు విడాకులు పొందిన స్త్రీలతో) వివాహం చేసుకోవాలనే సంకల్పాన్ని (వారి నిరీక్షణాకాలంలో) పరోక్షంగా తెలిపినా లేక దానిని మీ మనస్సులలో గోప్యంగా ఉంచినా మీపై దోషంలేదు. మీరు వారితో (వివాహమాడటం గురించి) ఆలోచిస్తున్నారని అల్లాహ్‌కు తెలుసు, కానీ వారితో రహస్యంగా ఎలాంటి ఒప్పందం చేసుకోకండి. అయితే మీరేదైనా మాట్లాడ దలచుకుంటే, ధర్మసమ్మతమైన రీతిలో మాట్లాడుకోండి. మరియు నిరీక్షణా వ్యవధి పూర్తి అయ్యేంత వరకు వివాహం చేసుకోకండి. నిశ్చయంగా మీ మనస్సులలో ఉన్నదంతా అల్లాహ్‌కు తెలుసని తెలుసుకొని, ఆయనకు భయపడండి. మరియు నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, శాంతస్వభావుడు (సహనశీలుడు) అని తెలుసుకోండి.

لَّا جُنَاحَ عَلَيْكُمْ إِن طَلَّقْتُمُ ٱلنِّسَآءَ مَا لَمْ تَمَسُّوهُنَّ أَوْ تَفْرِضُوا۟ لَهُنَّ فَرِيضَةً ۚ وَمَتِّعُوهُنَّ عَلَى ٱلْمُوسِعِ قَدَرُهُۥ وَعَلَى ٱلْمُقْتِرِ قَدَرُهُۥ مَتَٰعًۢا بِٱلْمَعْرُوفِ ۖ حَقًّا عَلَى ٱلْمُحْسِنِينَ ﴿٢٣٦﴾

**236**. మీరు మీ స్త్రీలను ముట్టుకోక ముందే, లేక వారి మహ్ర్ నిర్ణయం కాక పూర్వమే, వారికి విడాకులిస్తే, అది పాపం కాదు. మరియు వారికి కొంత పారితోషికంగా తప్పకుండా ఇవ్వండి. మరియు ధనవంతుడు తన శక్తి మేరకు, పేదవాడు తన స్థితిని బట్టి ధర్మసమ్మతమైన విధంగా పారితోషికం ఇవ్వాలి. ఇది సజ్జనులైన వారి విద్యుక్త ధర్మం.

وَإِن طَلَّقْتُمُوهُنَّ مِن قَبْلِ أَن تَمَسُّوهُنَّ وَقَدْ فَرَضْتُمْ لَهُنَّ فَرِيضَةً فَنِصْفُ مَا فَرَضْتُمْ إِلَّآ أَن يَعْفُونَ أَوْ يَعْفُوَاْ ٱلَّذِى بِيَدِهِۦ عُقْدَةُ ٱلنِّكَاحِ ۚ وَأَن تَعْفُوٓاْ أَقْرَبُ لِلتَّقْوَىٰ ۚ وَلَا تَنسَوُاْ ٱلْفَضْلَ بَيْنَكُمْ ۚ إِنَّ ٱللَّهَ بِمَا تَعْمَلُونَ بَصِيرٌ ﴿٢٣٧﴾

**237**. మరియు మీరు తాకక పూర్వమే మీ స్త్రీలకు విడాకులిస్తే మరియు వాస్తవానికి అప్పటికే వారి కన్యాశుల్కం (మహ్ర్) నిర్ణయించబడి ఉంటే, సగం మహ్ర్ చెల్లించండి, కానీ స్త్రీ క్షమించి విడిచిపెడ్తే, లేదా వివాహసంబంధ అధికారం ఎవని చేతిలో ఉందో అతడు (భర్త) గానీ క్షమించి విడిచిపెట్టగోరితే తప్పు![1] మరియు క్షమించటమే దైవభీతికి సన్నిహితమైనది. మరియు మీరు పరస్పర వ్యవహారాలలో ఔదార్యం చూపటం మరచిపోవద్దు. నిశ్చయంగా, అల్లాహ్ మీరు చేసేదంతా చూస్తున్నాడు.

حَٰفِظُواْ عَلَى ٱلصَّلَوَٰتِ وَٱلصَّلَوٰةِ ٱلْوُسْطَىٰ وَقُومُواْ لِلَّهِ قَٰنِتِينَ ﴿٢٣٨﴾

**238**. మీరు మీ నమాజ్‌లను కాపాడు కోండి మరియు (ముఖ్యంగా) మధ్య నమాజ్‌ను[2] మరియు అల్లాహ్ సన్నిధానంలో వినయ విధేయతలతో నిలబడండి.

فَإِنْ خِفْتُمْ فَرِجَالًا أَوْ رُكْبَانًا ۖ فَإِذَآ أَمِنتُمْ فَٱذْكُرُواْ ٱللَّهَ كَمَا عَلَّمَكُم مَّا لَمْ تَكُونُواْ تَعْلَمُونَ ﴿٢٣٩﴾

**239**. మీరు ప్రమాదస్థితిలో ఉన్నప్పుడు నడుస్తూ గానీ, స్వారీ చేస్తూ గానీ, నమాజ్ చేయవచ్చు.[3] కాని మీకు శాంతిభద్రతలు లభించినప్పుడు, ఆయన మీకు నేర్పినట్లు అల్లాహ్‌ను స్మరించండి. ఎందుకంటే ఈ పద్ధతి ఇంతకు పూర్వం మీకు తెలియదు.

---

**1**. అంటే భర్త, ఎందుకంటే వివాహబంధాన్ని త్రెంచటం అతని అధికారంలో ఉంది. కావున అతడు స్త్రీకి మహ్ర్ చెల్లించి ఉంటే, ఆమెను తాకక పూర్వమే విడాకులిస్తే అందులో నుండి ధర్మసమ్మతంగా సగం తీసుకోవచ్చు, లేదా పూర్తిగా విడిచిపెట్టవచ్చు.

**2**. అంటే 'అ'స్ర్ నమా'జ్, దైవప్రవక్త ('స'అస) కందక యుద్ధ దినమున 'అ'స్ర్ నమా'జ్‌ను మధ్య నమా'జ్‌గా పేర్కొన్నారు. 'స. బు'ఖారీ, పుస్తకం-1, 'హదీస్' నం. 527, 528.

**3**. చూడండి, 'స. బు'ఖారీ, పుస్తకం-5, 'హదీస్' నం. 451. అంటే శత్రుభయం ఉంటే.

وَٱلَّذِينَ يُتَوَفَّوۡنَ مِنكُمۡ وَيَذَرُونَ أَزۡوَٰجٗا وَصِيَّةٗ لِّأَزۡوَٰجِهِم مَّتَٰعًا إِلَى ٱلۡحَوۡلِ غَيۡرَ إِخۡرَاجٖۚ فَإِنۡ خَرَجۡنَ فَلَا جُنَاحَ عَلَيۡكُمۡ فِي مَا فَعَلۡنَ فِيٓ أَنفُسِهِنَّ مِن مَّعۡرُوفٖۗ وَٱللَّهُ عَزِيزٌ حَكِيمٞ ٢٤٠

**240**. మరియు మీలో మరణించిన వారు భార్యలను వదలిపోతే, వారు తమ భార్యలకు ఒక సంవత్సరపు భరణపు ఖర్చులు ఇవ్వాలనీ, వారిని ఇంటినుండి వెడల గొట్టవద్దనీ వీలునామా వ్రాయాలి.[1] కానీ వారు తమంతట తామే వెళ్ళిపోయి, తమ విషయంలో ధర్మ సమ్మతంగా ఏమి చేసినా మీపై పాపం లేదు. మరియు అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

وَلِلۡمُطَلَّقَٰتِ مَتَٰعُۢ بِٱلۡمَعۡرُوفِۖ حَقًّا عَلَى ٱلۡمُتَّقِينَ ٢٤١

**241**. మరియు విడాకులివ్వబడిన స్త్రీలకు ధర్మ ప్రకారంగా భరణపు ఖర్చులు ఇవ్వాలి. ఇది దైవభీతి గలవారి విధి.

كَذَٰلِكَ يُبَيِّنُ ٱللَّهُ لَكُمۡ ءَايَٰتِهِۦ لَعَلَّكُمۡ تَعۡقِلُونَ ٢٤٢

**242**. ఈ విధంగా అల్లాహ్ తన ఆజ్ఞ (ఆయత్)లను మీకు స్పష్టంగా తెలుపుతున్నాడు. బహుశా మీరు అర్థం చేసుకుంటారని. (7/8)

۞ أَلَمۡ تَرَ إِلَى ٱلَّذِينَ خَرَجُواْ مِن دِيَٰرِهِمۡ وَهُمۡ أُلُوفٌ حَذَرَ ٱلۡمَوۡتِ فَقَالَ لَهُمُ ٱللَّهُ مُوتُواْ ثُمَّ أَحۡيَٰهُمۡۚ إِنَّ ٱللَّهَ لَذُو فَضۡلٍ عَلَى ٱلنَّاسِ وَلَٰكِنَّ أَكۡثَرَ ٱلنَّاسِ لَا يَشۡكُرُونَ ٢٤٣

**243**. * ఏమీ? మృత్యుభయంతో, వేలసంఖ్యలో ప్రజలు తమ ఇండ్లను వదలి పోయింది నీకు తెలియదా? అప్పుడు అల్లాహ్ వారితో: "మరణించండి!" అని అన్నాడు కాని, తరువాత వారిని బ్రతికించాడు.[2] నిశ్చయంగా, అల్లాహ్ మానవుల పట్ల అత్యంత అనుగ్రహం గలవాడు, కాని చాలామంది కృతజ్ఞతలు చూపరు.

---

**1**. భర్త మరణిస్తే 'ఇద్దత్ గడువు 4 నెలల 10 రోజులు. చూడండి. 4:12వ ఆయత్‌లో భర్త ఆస్తిలో భార్యకు విధిగా భాగం నిర్ణయించబడి ఉంది. కాబట్టి వీలునామా వ్రాసే అవసరం లేదు.

**2**. ఇది ఒక ప్రాచీన సమాజపు కథ, దీనిని గురించి ఏ 'హదీస్' లేదు. కొందరు దీనిని ఇస్రాయీ'ల్ సంతతి వారిలోని ఒక ప్రవక్త కాలపు కథ, కావచ్చని అంటారు. బహుశా, హిజ్కీల్ ('అ.స.) కాలపు విషయమై ఉండవచ్చు.

وَقَٰتِلُواْ فِي سَبِيلِ ٱللَّهِ وَٱعۡلَمُوٓاْ أَنَّ
ٱللَّهَ سَمِيعٌ عَلِيمٞ ﴿٢٤٤﴾
مَّن ذَا ٱلَّذِي يُقۡرِضُ ٱللَّهَ قَرۡضًا
حَسَنٗا فَيُضَٰعِفَهُۥ لَهُۥٓ أَضۡعَافٗا
كَثِيرَةٗۚ وَٱللَّهُ يَقۡبِضُ وَيَبۡصُۜطُ
وَإِلَيۡهِ تُرۡجَعُونَ ﴿٢٤٥﴾
أَلَمۡ تَرَ إِلَى ٱلۡمَلَإِ مِنۢ بَنِيٓ إِسۡرَٰٓءِيلَ مِنۢ
بَعۡدِ مُوسَىٰٓ إِذۡ قَالُواْ لِنَبِيّٖ لَّهُمُ ٱبۡعَثۡ
لَنَا مَلِكٗا نُّقَٰتِلۡ فِي سَبِيلِ ٱللَّهِۖ
قَالَ هَلۡ عَسَيۡتُمۡ إِن كُتِبَ
عَلَيۡكُمُ ٱلۡقِتَالُ أَلَّا تُقَٰتِلُواْۖ قَالُواْ
وَمَا لَنَآ أَلَّا نُقَٰتِلَ فِي سَبِيلِ ٱللَّهِ
وَقَدۡ أُخۡرِجۡنَا مِن دِيَٰرِنَا وَأَبۡنَآئِنَاۖ
فَلَمَّا كُتِبَ عَلَيۡهِمُ ٱلۡقِتَالُ تَوَلَّوۡاْ
إِلَّا قَلِيلٗا مِّنۡهُمۡۚ وَٱللَّهُ عَلِيمُۢ
بِٱلظَّٰلِمِينَ ﴿٢٤٦﴾

**244**. మరియు మీరు అల్లాహ్ మార్గంలో యుద్ధంచేయండి మరియు నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు, అని తెలుసుకోండి.

**245**. అల్లాహ్‌కు మంచి రుణం ఇచ్చే వాడు, మీలో ఎవడు?[1] ఎందుకంటే ఆయన దానిని ఎన్నోరెట్లు అధికంచేసి తిరిగి ఇస్తాడు. అల్లాహ్ మాత్రమే (సంపదలను) తగ్గించే వాడూ మరియు హెచ్చించే వాడునూ మరియు మీరంతా ఆయన వైపునకే మరలి పోవలసి ఉంది.

**246**. ఏమీ? మూసా (నిర్యాణం) తరువాత ఇస్రాయీ'లు సంతతి నాయకులు, తమ ఒక ప్రవక్తతో: "నీవు మాకొరకు ఒక రాజును నియమించు, మేము అల్లాహ్ మార్గంలో యుద్ధం (జిహాద్) చేస్తాము." అని పలికిన సంగతి నీకు తెలియదా?[2] దానికి అతను: "ఒకవేళ యుద్ధం చేయమని ఆదేశిస్తే, మీరు యుద్ధం చేయటానికి నిరాకరించరు కదా?" అని అన్నాడు. దానికి వారు: "మేము మరియు మా సంతానం, మా ఇండ్ల నుండి గెంటివేయబడ్డాము కదా! అలాంటప్పుడు మేము అల్లాహ్ మార్గంలో ఎందుకు యుద్ధం చేయము?" అని జవాబిచ్చారు. కాని యుద్ధం చేయండని ఆజ్ఞాపించగానే, వారిలో కొందరు తప్ప, అందరూ వెన్నుచూపారు. మరియు అల్లాహ్‌కు ఈ దుర్మార్గులను గురించి బాగా తెలుసు.

---

**1**. అంటే అల్లాహ్ (సు.తా.) మార్గంలో మరియు జిహాద్ కొరకు ధనాన్ని ఖర్చుచేయడం.

**2**. ఇక్కడ ప్రవక్త ఉండగా; బనీ ఇస్రాయీ'ల్ వారు, తమ ప్రవక్త సామ్యూల్ (అ.స.) తో: "మాకొక రాజును నియమించు." అని అడగటం, అల్లాహుతా'ఆలాకు అంగీకారమైనదే కాబట్టి ఖుర్ఆన్‌లో పేర్కొన బడింది. కాని అట్టి రాజు దైవభీతి గలవాడు, న్యాయవంతుడు అయితే, అది ధర్మసమ్మతమే కాక, వాంఛనీయం కూడాను. చూడండి, 5:20.

وَقَالَ لَهُمْ نَبِيُّهُمْ إِنَّ ٱللَّهَ قَدْ بَعَثَ لَكُمْ طَالُوتَ مَلِكًا ۚ قَالُوٓا۟ أَنَّىٰ يَكُونُ لَهُ ٱلْمُلْكُ عَلَيْنَا وَنَحْنُ أَحَقُّ بِٱلْمُلْكِ مِنْهُ وَلَمْ يُؤْتَ سَعَةً مِّنَ ٱلْمَالِ ۚ قَالَ إِنَّ ٱللَّهَ ٱصْطَفَىٰهُ عَلَيْكُمْ وَزَادَهُۥ بَسْطَةً فِى ٱلْعِلْمِ وَٱلْجِسْمِ ۖ وَٱللَّهُ يُؤْتِى مُلْكَهُۥ مَن يَشَآءُ ۚ وَٱللَّهُ وَٰسِعٌ عَلِيمٌ ﴿٢٤٧﴾

**247**. మరియు వారి ప్రవక్త (సామ్యూల్) వారితో: "నిశ్చయంగా, అల్లాహ్ మీ కొరకు 'తాలూత్(సౌల్)ను రాజుగా నియమించాడు." అని అన్నాడు. దానికి వారు అన్నారు: "మాపై రాజ్యంచేసే హక్కు అతనికి ఎలా సంక్రమిస్తుంది? వాస్తవానికి, రాజ్యం చేసే హక్కు, అతని కంటే ఎక్కువ, మాకే ఉంది. మరియు అతను అత్యధిక ధనసంపత్తులున్న వాడునూ కాడు." (దానికి వారి ప్రవక్త) అన్నాడు: "నిశ్చయంగా, అల్లాహ్ మీలో అతనిని ఎన్నుకొని అతనికి బుద్ధి బలాన్నీ, శారీరక బలాన్నీ సమృద్ధిగా ప్రసాదించాడు. మరియు అల్లాహ్ తాను కోరినవారికి తన రాజ్యాన్ని ప్రసాదిస్తాడు. మరియు అల్లాహ్ సర్వవ్యాప్తి,[1] సర్వజ్ఞుడు."

وَقَالَ لَهُمْ نَبِيُّهُمْ إِنَّ ءَايَةَ مُلْكِهِۦٓ أَن يَأْتِيَكُمُ ٱلتَّابُوتُ فِيهِ سَكِينَةٌ مِّن رَّبِّكُمْ وَبَقِيَّةٌ مِّمَّا تَرَكَ ءَالُ مُوسَىٰ وَءَالُ هَٰرُونَ تَحْمِلُهُ ٱلْمَلَٰٓئِكَةُ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَءَايَةً لَّكُمْ إِن كُنتُم مُّؤْمِنِينَ ﴿٢٤٨﴾

**248**. మరియు వారితో వారి ప్రవక్త (సామ్యూల్) ఇలా అన్నాడు: "నిశ్చయంగా, అతని ఆధిపత్యానికి లక్షణం ఏమిటంటే, అతని ప్రభుత్వ కాలంలో ఆ పెట్టె (తాబూత్) మీకు తిరిగి లభిస్తుంది. అందులో మీకు మీ ప్రభువు తరఫునుండి, మనశ్శాంతి లభిస్తుంది. మరియు అందులో మూసా సంతతి మరియు హారూన్ సంతతి వారు వదలివెళ్ళిన పవిత్ర అవశేషాలు, దేవదూతల ద్వారా మీకు లభిస్తాయి. మీరు విశ్వసించిన వారే అయితే! నిశ్చయంగా, ఇందులో మీకు ఒక గొప్ప సూచన ఉంది."

1. చూడండి 2:115 వ్యాఖ్యానం 1.

فَلَمَّا فَصَلَ طَالُوتُ بِٱلْجُنُودِ قَالَ إِنَّ ٱللَّهَ مُبْتَلِيكُم بِنَهَرٍ فَمَن شَرِبَ مِنْهُ فَلَيْسَ مِنِّي وَمَن لَّمْ يَطْعَمْهُ فَإِنَّهُۥ مِنِّيٓ إِلَّا مَنِ ٱغْتَرَفَ غُرْفَةًۢ بِيَدِهِۦ ۚ فَشَرِبُوا۟ مِنْهُ إِلَّا قَلِيلًا مِّنْهُمْ ۚ فَلَمَّا جَاوَزَهُۥ هُوَ وَٱلَّذِينَ ءَامَنُوا۟ مَعَهُۥ قَالُوا۟ لَا طَاقَةَ لَنَا ٱلْيَوْمَ بِجَالُوتَ وَجُنُودِهِۦ ۚ قَالَ ٱلَّذِينَ يَظُنُّونَ أَنَّهُم مُّلَٰقُوا۟ ٱللَّهِ كَم مِّن فِئَةٍ قَلِيلَةٍ غَلَبَتْ فِئَةً كَثِيرَةًۢ بِإِذْنِ ٱللَّهِ ۗ وَٱللَّهُ مَعَ ٱلصَّٰبِرِينَ ﴿٢٤٩﴾

**249**. ఆ పిదప 'తాలూత్ (సౌల్) తన సైన్యంతో బయలుదేరుతూ అన్నాడు: "నిశ్చయంగా, అల్లాహ్ ఒక నది[1] ద్వారా మిమ్మల్ని పరీక్షించబోతున్నాడు. దాని నుండి నీరు త్రాగినవాడు నావాడు కాడు. మరియు నది నీటిని రుచిచూడని వాడు నిశ్చయంగా నావాడు, కాని చేతితో గుక్కెడు త్రాగితే ఫర్వాలేదు." అయితే వారిలో కొందరు తప్ప అందరూ దాని నుండి (కడుపునిండా నీరు) త్రాగారు. అతను మరియు అతని వెంట విశ్వాసులు ఆ నదిని దాటిన తరువాత వారన్నారు: "జాలూత్‌తో మరియు అతని సైన్యంతో పోరాడే శక్తి ఈ రోజు మాలో లేదు." (కానీ ఒక రోజున) అల్లాహ్‌ను కలవడం తప్పదని భావించిన వారన్నారు: "అల్లాహ్ అనుమతితో, ఒక చిన్న వర్గం ఒక పెద్ద వర్గాన్ని జయించటం ఎన్నోసార్లు జరిగింది. మరియు అల్లాహ్ స్థైర్యం గలవారితోనే ఉంటాడు."

وَلَمَّا بَرَزُوا۟ لِجَالُوتَ وَجُنُودِهِۦ قَالُوا۟ رَبَّنَآ أَفْرِغْ عَلَيْنَا صَبْرًا وَثَبِّتْ أَقْدَامَنَا وَٱنصُرْنَا عَلَى ٱلْقَوْمِ ٱلْكَٰفِرِينَ ﴿٢٥٠﴾

**250**. జాలూత్ (గోలియత్) మరియు అతని సైన్యాన్ని ఎదుర్కోవటానికి బయలుదేరి వారు: "ఓ మా ప్రభూ! మాకు (ధైర్య) స్థైర్యాలను ప్రసాదించు, మా పాదాలను స్థిరంగా నిలుపు. మరియు సత్యతిరస్కారులకు విరుద్ధంగా (పోరాడటానికి) మాకు సహాయపడు." అని ప్రార్థించారు.

---

1. ఈ నది జోర్డాన్ మరియు ఫల'స్తీన్‌ల మధ్య ఉంది.

فَهَزَمُوهُم بِإِذۡنِ ٱللَّهِ وَقَتَلَ دَاوُۥدُ جَالُوتَ وَءَاتَىٰهُ ٱللَّهُ ٱلۡمُلۡكَ وَٱلۡحِكۡمَةَ وَعَلَّمَهُۥ مِمَّا يَشَآءُۗ وَلَوۡلَا دَفۡعُ ٱللَّهِ ٱلنَّاسَ بَعۡضَهُم بِبَعۡضٍ لَّفَسَدَتِ ٱلۡأَرۡضُ وَلَٰكِنَّ ٱللَّهَ ذُو فَضۡلٍ عَلَى ٱلۡعَٰلَمِينَ ﴿٢٥١﴾

**251**. ఆ తరువాత వారు, అల్లాహ్ అనుమతితో వారిని (సత్యతిరస్కారులను) ఓడించారు మరియు దావూద్, జాలూతును సంహరించాడు.[1] మరియు అల్లాహ్ అతనికి (దావూద్‌కు) రాజ్యాధికారం మరియు జ్ఞానం ప్రసాదించి, తాను కోరిన విషయాలను అతనికి బోధించాడు. ఈ విధంగా అల్లాహ్ ప్రజలను, ఒకరినుండి మరొకరిని కాపాడకుంటే, భూమిలో కల్లోలం వ్యాపించి ఉండేది, కానీ అల్లాహ్ సమస్తలోకాల మీద ఎంతో అనుగ్రహం గలవాడు.[2]

تِلۡكَ ءَايَٰتُ ٱللَّهِ نَتۡلُوهَا عَلَيۡكَ بِٱلۡحَقِّۚ وَإِنَّكَ لَمِنَ ٱلۡمُرۡسَلِينَ ﴿٢٥٢﴾

**252**. ఇవన్నీ అల్లాహ్ సందేశాలు వాటిని మేము యథాతథంగా నీకు వినిపిస్తున్నాము. మరియు (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా, నీవు (మా) సందేశహరులలో ఒకడవు.[3]

---

**1**. దావూద్ ('అ.స.) 'తాలూత్ సైన్యంలో ఒక సిపాయి. అతను జాలూత్‌ను సంహరించారు.

**2**. ఇందులో అల్లాహ్ (సు.తా.) యొక్క ఒక సంప్రదాయం (సున్నత్) ఉన్నది. ఆయన మానవులలోని ఒక వర్గం ద్వారా, అధికారం మరియు దుర్మార్గం మీద ఉన్న, మరొక వర్గాన్ని అంతమొందిస్తాడు. చూడండి, 22:38-40.

**3**. చూడండి, 'స. బు'ఖారీ, పుస్తకం-1, 'హదీస్' నం. 331; 'స. బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం. 735.

۞ تِلْكَ ٱلرُّسُلُ فَضَّلْنَا بَعْضَهُمْ عَلَىٰ بَعْضٍۘ مِّنْهُم مَّن كَلَّمَ ٱللَّهُۖ وَرَفَعَ بَعْضَهُمْ دَرَجَٰتٍۚ وَءَاتَيْنَا عِيسَى ٱبْنَ مَرْيَمَ ٱلْبَيِّنَٰتِ وَأَيَّدْنَٰهُ بِرُوحِ ٱلْقُدُسِۗ وَلَوْ شَآءَ ٱللَّهُ مَا ٱقْتَتَلَ ٱلَّذِينَ مِنۢ بَعْدِهِم مِّنۢ بَعْدِ مَا جَآءَتْهُمُ ٱلْبَيِّنَٰتُ وَلَٰكِنِ ٱخْتَلَفُوا۟ فَمِنْهُم مَّنْ ءَامَنَ وَمِنْهُم مَّن كَفَرَۚ وَلَوْ شَآءَ ٱللَّهُ مَا ٱقْتَتَلُوا۟ وَلَٰكِنَّ ٱللَّهَ يَفْعَلُ مَا يُرِيدُ ﴿٢٥٣﴾

**253.** (*) ఆ సందేశహరులు! మేము వారిలో కొందరికి మరికొందరిపై ఆధిక్యతనిచ్చాము.[1] వారిలో కొందరితో అల్లాహ్ (నేరుగా) మాట్లాడాడు.[2] మరికొందరిని (గౌరవనీయమైన) ఉన్నత స్థానాలకు ఎత్తాడు. మరియు మర్యమ్ కుమారుడు 'ఈసా (ఏసు)కు మేము స్పష్టమైన సూచనలు ప్రసాదించి, అతనిని పరిశుద్ధాత్మ (జిబ్రీల్) సహాయంతో బలపరిచాము. మరియు అల్లాహ్ తలుచుకుంటే ఈ ప్రవక్తల తరువాత వచ్చిన ప్రజలు వారికి స్పష్టమైన సూచనలు వచ్చిన తరువాత కూడా పరస్పరం కలహించుకునే వారు కాదు. కానీ, వారు పరస్పర విభేదాలకు లోనయ్యారు, కావున వారిలో కొందరు విశ్వాసులు అయ్యారు మరికొందరు సత్యతిరస్కారులు అయ్యారు. మరియు అల్లాహ్ తలుచుకుంటే వారు పరస్పరం కలహించుకునే వారు కాదు, కాని అల్లాహ్ తానుకోరిందే చేస్తాడు.[3]

---

1. చూడండి, 17:55.
2. మూసా ('అ.స.)తో అల్లాహ్ (సు.తా.) మాట్లాడిన దానికి చూడండి, 4:164. 'ఈసా ('అ.స.) సూచనల కొరకు చూడండి, 3:46,49.
3. ఈ విధమైన ఆయత్ ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు వచ్చింది. అల్లాహ్ (సు.తా.)కు తాను అవతరింపజేసిన ధర్మంలో భేదాభిప్రాయాలు కల్పించటం ఏ మాత్రం నచ్చదు. ప్రజలంతా ఆయన అవతరింపజేసిన ధర్మాన్నే అనుసరించి నరకాగ్ని నుండి రక్షింపబడాలనే అల్లాహుతా'ఆలా కోరిక. కావున ఆయన ప్రవక్తలను మానవుల నుండి ఎన్నుకొని వారిపై దివ్యగ్రంథాలను అవతరింపజేస్తాడు మరియు ము'హమ్మద్ ('స'అస)ను చివరి ప్రవక్తగా ఎన్నుకున్నాడు. అతని తరువాత ఖలీఫాలు మరియు ధర్మశాస్త్రవేత్తలు, ద'అవహ్‌తో అల్లాహ్ (సు.తా.) ధర్మం (ఇస్లాం)ను వ్యాపింపజేస్తున్నారు.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ أَنفِقُواْ مِمَّا
رَزَقْنَـٰكُم مِّن قَبْلِ أَن يَأْتِىَ يَوْمٌ لَّا بَيْعٌ
فِيهِ وَلَا خُلَّةٌ وَلَا شَفَـٰعَةٌ ۗ
وَٱلْكَـٰفِرُونَ هُمُ ٱلظَّـٰلِمُونَ ﴿٢٥٤﴾

**254**. ఓ విశ్వాసులారా! ఏ బేరం గానీ, స్నేహం గానీ, సిఫారసు గానీ పనికిరాని దినం రాకముందే,[1] మేము మీకు ప్రసాదించిన జీవనోపాధి నుండి (మా మార్గంలో) ఖర్చుపెట్టండి. మరియు సత్యతిరస్కారులు, వారే! దుర్మార్గులు.

ٱللَّهُ لَآ إِلَـٰهَ إِلَّا هُوَ ٱلْحَىُّ ٱلْقَيُّومُ ۚ لَا
تَأْخُذُهُۥ سِنَةٌ وَلَا نَوْمٌ ۚ لَّهُۥ مَا فِى
ٱلسَّمَـٰوَٰتِ وَمَا فِى ٱلْأَرْضِ ۗ مَن ذَا ٱلَّذِى
يَشْفَعُ عِندَهُۥٓ إِلَّا بِإِذْنِهِۦ ۚ يَعْلَمُ مَا بَيْنَ
أَيْدِيهِمْ وَمَا خَلْفَهُمْ ۖ وَلَا يُحِيطُونَ
بِشَىْءٍ مِّنْ عِلْمِهِۦٓ إِلَّا بِمَا شَآءَ ۚ وَسِعَ
كُرْسِيُّهُ ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضَ ۖ

**255**. అల్లాహ్! ఆయన తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు.[2] ఆయన సజీవుడు,[3] విశ్వవ్యవస్థకు ఆధారభూతుడు.[4] ఆయనకు కునుకురాదు మరియు నిదురరాదు. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ ఆయనకు చెందినదే. ఆయన సమ్ముఖంలో - ఆయన అనుజ్ఞ లేకుండా - సిఫారసు చేయగలవాడెవడు? వారి ముందున్నదీ మరియు వారి వెనుక నున్నదీ అన్నీ ఆయనకు బాగా తెలుసు.[5] మరియు ఆయన కోరితే తప్ప, ఆయన జ్ఞానవిశేషాలలో ఏ విషయమునూ

---

**1**. చూడండి, 21:28.

**2**. ఈ ఆయత్ ఆయతల్-కుర్సీ అనబడుతుంది. 'హదీస్'లలో దీని యొక్క ఎన్నో శుభాలు పేర్కొనబడ్డాయి. దీనిని రాత్రి నిద్రపోవటానికి ముందు చదువటం వలన రాత్రంతా షై'తాన్ నుండి రక్షణ దొరుకుతుంది. ప్రతి నమా'జ్ తర్వాత కూడా చదివితే ఎన్నో పుణ్యఫలాలు ఉన్నాయి. ఇందులో అల్లాహుతా'ఆలా యొక్క ఏకత్వం మరియు ఆయన మహిమలు చెప్పబడ్డాయి.

**3**. **అల్-'హయ్యు:** The Ever-Living. **సజీవుడు,** నిత్యుడు, నిత్యజీవుడు.

**4**. **అల్-ఖయ్యూమ్:** By whom all things subsist. విశ్వవ్యవస్థకు ఆధారభూతుడు, **శాశ్వతుడు.**

**5**. తఫ్సీర్ అల్-ముయస్సర్‌లో దీని తాత్పర్యం ఈ విధంగా ఇవ్వబడింది: ''వారికి ముందు సంభవించనున్నది మరియు ఇంతకు ముందు సంభవించిందీ అన్నీ అల్లాహ్ (సు.తా.)కు బాగా తెలుసు.'' దీని మరొక తాత్పర్యం ఇలా ఉంది: ''వారికి ముందు (పరలోకంలో) సంభవించనున్నది మరియు వెనక (ఇహలోకంలో) సంభవించిందీ, అన్నీ అల్లాహుతా'ఆలాకు బాగా తెలుసు.''

وَلَا يَـُٔودُهُۥ حِفْظُهُمَاۚ وَهُوَ ٱلْعَلِىُّ ٱلْعَظِيمُ ﴿٢٥٥﴾

వారు గ్రహించజాలరు. ఆయన కుర్సీ[1] ఆకాశాలనూ మరియు భూమినీ పరివేష్టించి ఉన్నది. వాటి సంరక్షణ ఆయనకు ఏ మాత్రం అలసట కలిగించదు. మరియు ఆయన అత్యున్నతుడు,[2] సర్వోత్తముడు.

لَآ إِكْرَاهَ فِى ٱلدِّينِۖ قَد تَّبَيَّنَ ٱلرُّشْدُ مِنَ ٱلْغَىِّۚ فَمَن يَكْفُرْ بِٱلطَّٰغُوتِ وَيُؤْمِنۢ بِٱللَّهِ فَقَدِ ٱسْتَمْسَكَ بِٱلْعُرْوَةِ ٱلْوُثْقَىٰ لَا ٱنفِصَامَ لَهَاۗ وَٱللَّهُ سَمِيعٌ عَلِيمٌ ﴿٢٥٦﴾

**256**. ధర్మం విషయంలో బలవంతం లేదు.[3] వాస్తవానికి సన్మార్గం (రుష్ద్), దుర్మార్గం నుండి సుస్పష్టం చేయబడింది. కావున కల్పితదైవాన్ని ('తా'గూత్‌ను)[4] తిరస్కరించి, అల్లాహ్‌ను విశ్వసించిన వాడు, సుస్థిరమైన, ఎన్నటికీ విడిపోని ఆధారాన్ని పట్టుకున్నట్లే. మరియు అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

---

**1**. కుర్సీ: కొందరు వ్యాఖ్యాతలు దీనిని, పాదాలుపెట్టే చోటన్నారు. కొందరు జ్ఞానం, మరికొందరు విశ్వసామ్రాజ్యాధిపత్యం, మరి కొందరు సింహాసనం ('అర్ష్) అన్నారు. కాని అల్లాహ్ (సు.తా.) యొక్క 'సిఫాత్‌లను దివ్యఖుర్ఆన్ మరియు 'స'హీ'హ్ 'హదీస్'లలో బోధించినట్లుగా, వాటికి ఏవిధమైన తాత్పర్యాలు ఇవ్వకుండా వాటిని విశ్వసించాలి. అంటే ఇది ఒక కుర్సీ, 'అర్ష్ కాదు, మరొకటి. అది ఎలా ఉంటుంది, దానిపై అల్లాహుతా'ఆలా ఎలా కూర్చుంటాడు మేము వివరించలేము, ఎందుకంటే ఆ వాస్తవం మనకు తెలియదు.

**2**. **అల్-'అలియ్యు**: The Most High, He above whom is nothing. **అత్యున్నతుడు**, చూడండి, 6:100. ఇంకా చూడండి, **అల్-ముత'ఆలి**,13:9, **మహోన్నతుడు**. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు. ఇంకా చూడండి, అల్-అ'అలా, 87:1.

**3**. ఇస్లాం ధర్మం స్వీకరించమని ఎవ్వరినీ బలవంతం చేయరాదు. ఎందుకంటే అల్లాహుతా'ఆలా మంచీ-చెడూ, అనే రెండు మార్గాలను చూపి, వాటిని అనుసరించటం వల్ల లభించే ప్రతిఫలాలను కూడా స్పష్టపరచాడు. కాని అల్లాహుతా'ఆలా మార్గాన్ని అనుసరిస్తూ దానిని ఇతరులకు బోధించటాన్ని విరోధించే వారి, అత్యాచారాన్ని నిర్మూలించటానికి ధర్మ పోరాటం (జిహాద్) చేయాలి. ఎందుకంటే ప్రతి వ్యక్తికి తనకు ఇష్టమైన ధర్మాన్ని అనుసరించే స్వాతంత్ర్యం ఉంది.

**4**. 'తా'గూత్‌కు ఎన్నో అర్థాలున్నాయి. ముఖ్యంగా అల్లాహ్ (సు.తా.)కు బదులుగా ఆరాధించే ప్రతి వస్తువు, అంటే షై'తాన్, విగ్రహం, రాయి, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, దైవదూతలు, మానవులు, జిన్నాతులు, గోరీలు, సాధు సన్యాసులు, సత్పురుషులు, మొదలైనవి.

ٱللَّهُ وَلِيُّ ٱلَّذِينَ ءَامَنُوا۟ يُخْرِجُهُم مِّنَ
ٱلظُّلُمَٰتِ إِلَى ٱلنُّورِ ۖ وَٱلَّذِينَ كَفَرُوٓا۟
أَوْلِيَآؤُهُمُ ٱلطَّٰغُوتُ يُخْرِجُونَهُم
مِّنَ ٱلنُّورِ إِلَى ٱلظُّلُمَٰتِ ۗ أُو۟لَٰٓئِكَ
أَصْحَٰبُ ٱلنَّارِ ۖ هُمْ فِيهَا
خَٰلِدُونَ ﴿٢٥٧﴾

**257**. అల్లాహ్ విశ్వసించిన వారి సంరక్షకుడు, ఆయన వారిని చీకటినుండి తీసి వెలుగులోకి తెస్తాడు. మరియు సత్యాన్ని తిరస్కరించిన వారి రక్షకులు కల్పిత దైవాలు ('తా'గూత్); అవి వారిని వెలుగునుండి తీసి చీకటిలోనికి తీసుకొనిపోతాయి. అలాంటి వారు నరకాగ్నివాసులు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

أَلَمْ تَرَ إِلَى ٱلَّذِى حَآجَّ إِبْرَٰهِۦمَ فِى
رَبِّهِۦٓ أَنْ ءَاتَىٰهُ ٱللَّهُ ٱلْمُلْكَ إِذْ قَالَ
إِبْرَٰهِۦمُ رَبِّىَ ٱلَّذِى يُحْىِۦ وَيُمِيتُ
قَالَ أَنَا۠ أُحْىِۦ وَأُمِيتُ ۖ قَالَ إِبْرَٰهِۦمُ
فَإِنَّ ٱللَّهَ يَأْتِى بِٱلشَّمْسِ مِنَ
ٱلْمَشْرِقِ فَأْتِ بِهَا مِنَ ٱلْمَغْرِبِ
فَبُهِتَ ٱلَّذِى كَفَرَ ۗ وَٱللَّهُ لَا يَهْدِى
ٱلْقَوْمَ ٱلظَّٰلِمِينَ ﴿٢٥٨﴾

**258**. ఏమీ? అల్లాహ్ (తన అను(గ్రహంతో) సా(మ్రాజ్యం ఇచ్చిన తరువాత, ఇ(బ్రాహీమ్‌తో అతని (ప్రభువు (అల్లాహ్)ను గురించి వాదించిన వ్యక్తి (నమ్‌రూద్) విషయం నీకు తెలియదా? ఇ(బ్రాహీమ్: "జీవన్మరణాలు ఎవరి ఆధీనంలో ఉన్నాయో! ఆయనే నా (ప్రభువు." అని అన్నప్పుడు. అతడు: "చావు (బ్రతుకులు రెండూ నా అధీనంలోనే ఉన్నాయి." అని అన్నాడు. అప్పుడు ఇ(బ్రాహీమ్: "సరే! అల్లాహ్ సూర్యుణ్ణి తూర్పునుండి ఉదయింపజేస్తాడు; అయితే నీవు (సూర్యుణ్ణి) పడమరనుండి ఉదయింపజెయ్యి." అని అన్నాడు. దానితో ఆ సత్యతిరస్కారి చికాకుపడ్డాడు. మరియు అల్లాహ్ దుర్మార్గం అవలంబించిన (ప్రజలకు సన్మార్గం చూపడు.

أَوْ كَٱلَّذِى مَرَّ عَلَىٰ قَرْيَةٍ وَهِىَ
خَاوِيَةٌ عَلَىٰ عُرُوشِهَا قَالَ أَنَّىٰ يُحْىِۦ
هَٰذِهِ ٱللَّهُ بَعْدَ مَوْتِهَا ۖ فَأَمَاتَهُ ٱللَّهُ مِا۟ئَةَ
عَامٍ ثُمَّ بَعَثَهُۥ ۖ قَالَ كَمْ لَبِثْتَ ۖ

**259**. లేక! ఒక వ్యక్తి[1] ఇండ్ల కప్పులన్నీ కూలిపోయి, పాడు (తల(క్రిందులై బోర్లా) పడిన నగరం మీదుగా పోతూ: "వాస్తవానికి! నశించిపోయిన ఈ నగరానికి అల్లాహ్ తిరిగి ఏ విధంగా జీవంపోయగలడు?" అని అన్నాడు.

---

**1**. ఈ వ్యక్తి 'ఉజైర్ ('అ.స.) అని కొందరు స'హాబీల మరియు తాబయిాన్‌ల అభి(ప్రాయం. నిజం అల్లాహ్ (సు.తా.)కే తెలుసు.

قَالَ لَبِثْتُ يَوْمًا أَوْ بَعْضَ يَوْمٍۖ قَالَ
بَل لَّبِثْتَ مِاْئَةَ عَامٍ فَٱنظُرْ
إِلَىٰ طَعَامِكَ وَشَرَابِكَ لَمْ
يَتَسَنَّهْۖ وَٱنظُرْ إِلَىٰ حِمَارِكَ
وَلِنَجْعَلَكَ ءَايَةً لِّلنَّاسِۖ
وَٱنظُرْ إِلَى ٱلْعِظَامِ كَيْفَ
نُنشِزُهَا ثُمَّ نَكْسُوهَا لَحْمًاۚ
فَلَمَّا تَبَيَّنَ لَهُۥ قَالَ أَعْلَمُ أَنَّ ٱللَّهَ
عَلَىٰ كُلِّ شَيْءٍ قَدِيرٌ ﴿٢٥٩﴾

అప్పుడు అల్లాహ్ అతనిని మరణింపజేసి నూరు సంవత్సరాల తరువాత తిరిగి బ్రతికింపజేసి: "ఈ స్థితిలో నీవు ఎంతకాలం ఉంటివి?" అని అడిగాడు. అతడు: "ఒక దినమో, లేక ఒక దినములో కొంత భాగమో!" అని అన్నాడు. దానికి ఆయన: "కాదు, నీవు ఇక్కడ, ఈ (మరణించిన) స్థితిలో, నూరు సంవత్సరాలు ఉంటివి. ఇక నీ అన్నపానీయాల వైపు చూడు, వాటిలో ఏ మార్పూ లేదు. ఇంకా నీవు నీ గాడిదను కూడా చూడు! మేము ప్రజల కొరకు నిన్ను దృష్టాంతంగా చేయదలిచాము. ఇక ఆ (గాడిద) ఎముకలను చూడు, ఏ విధంగా వాటిని ఉద్ధరించి తిరిగి వాటిపై మాంసం కప్పుతామో!" అని అన్నాడు. ఇవి అతనికి స్పష్టంగా తెలిసిన తరువాత అతడు: "నిశ్చయంగా, అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడని నాకు (ఇప్పుడు) తెలిసింది!" అని అన్నాడు.

وَإِذْ قَالَ إِبْرَٰهِـۧمُ رَبِّ أَرِنِى
كَيْفَ تُحْىِ ٱلْمَوْتَىٰۖ قَالَ أَوَلَمْ
تُؤْمِنۖ قَالَ بَلَىٰ وَلَـٰكِن لِّيَطْمَئِنَّ
قَلْبِىۖ قَالَ فَخُذْ أَرْبَعَةً مِّنَ ٱلطَّيْرِ
فَصُرْهُنَّ إِلَيْكَ ثُمَّ ٱجْعَلْ عَلَىٰ
كُلِّ جَبَلٍ مِّنْهُنَّ جُزْءًا ثُمَّ
ٱدْعُهُنَّ يَأْتِينَكَ سَعْيًاۚ وَٱعْلَمْ
أَنَّ ٱللَّهَ عَزِيزٌ حَكِيمٌ ﴿٢٦٠﴾

**260**. మరియు (జ్ఞాపకం చేసుకోండి) ఇబ్రాహీమ్: "ఓ నా ప్రభూ! నీవు మృతులను ఎలా సజీవులుగా చేస్తావో నాకు చూపు!" అని అన్నప్పుడు. (అల్లాహ్) అన్నాడు: "ఏమీ? నీకు విశ్వాసంలేదా?" దానికి (ఇబ్రాహీమ్): "ఉంది, కానీ నా మనస్సు తృప్తికొరకు అడుగుతున్నాను!" అని అన్నాడు. అపుడు (అల్లాహ్): "నాలుగు పక్షులను తీసుకో, వాటిని బాగా మచ్చిక చేసుకో! తరువాత (వాటిని కోసి) ఒక్కొక్క దాని ఒక్కొక్క భాగాన్ని, ఒక్కొక్క కొండపై పెట్టిరా, మళ్ళీ వాటిని రమ్మని పిలువు, అవి నీ వద్దకు ఎగురుకుంటూ వస్తాయి. కాబట్టి నిశ్చయంగా, అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు అని తెలుసుకో!" అని అన్నాడు.

مَّثَلُ ٱلَّذِينَ يُنفِقُونَ أَمْوَٰلَهُمْ فِي سَبِيلِ ٱللَّهِ كَمَثَلِ حَبَّةٍ أَنۢبَتَتْ سَبْعَ سَنَابِلَ فِي كُلِّ سُنۢبُلَةٍ مِّاْئَةُ حَبَّةٍۗ وَٱللَّهُ يُضَٰعِفُ لِمَن يَشَآءُۗ وَٱللَّهُ وَٰسِعٌ عَلِيمٌ ﴿٢٦١﴾

**261**. అల్లాహ్ మార్గంలో తమ ధనాన్ని ఖర్చుచేసే వారి ఉపమానం: ఆ విత్తనంవలే ఉంటుంది, దేనినుండి అయితే ఏడు వెన్నులు పుట్టి ప్రతి వెన్నులో నూరేసి గింజలు ఉంటాయో! మరియు అల్లాహ్ తాను కోరిన వారికి హెచ్చుగా నొసంగుతాడు. మరియు అల్లాహ్ సర్వవ్యాప్తి, సర్వజ్ఞుడు.

ٱلَّذِينَ يُنفِقُونَ أَمْوَٰلَهُمْ فِي سَبِيلِ ٱللَّهِ ثُمَّ لَا يُتْبِعُونَ مَآ أَنفَقُواْ مَنًّا وَلَآ أَذًىۙ لَّهُمْ أَجْرُهُمْ عِندَ رَبِّهِمْ وَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ﴿٢٦٢﴾

**262**. ఎవరైతే, అల్లాహ్ మార్గంలో తమ ధనాన్ని వ్యయంచేసి, ఆ తరువాత తాము చేసిన ఉపకారాన్ని చెప్పుకుంటూ మరియు వారిని బాధిస్తూ ఉండరో, అలాంటి వారి ప్రతిఫలం, వారి ప్రభువు వద్ద ఉంది.[1] మరియు వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా! (1/8)

۞ قَوْلٌ مَّعْرُوفٌ وَمَغْفِرَةٌ خَيْرٌ مِّن صَدَقَةٍ يَتْبَعُهَآ أَذًىۗ وَٱللَّهُ غَنِيٌّ حَلِيمٌ ﴿٢٦٣﴾

**263**. * మనస్సును గాయపరిచే దానంకంటే, మృదుభాషణ మరియు క్షమాగుణం ఎంతోమేలైనవి.[2] మరియు అల్లాహ్ స్వయంసమృద్ధుడు,[3] సహనశీలుడు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تُبْطِلُواْ صَدَقَٰتِكُم بِٱلْمَنِّ وَٱلْأَذَىٰ كَٱلَّذِي يُنفِقُ مَالَهُۥ رِئَآءَ ٱلنَّاسِ وَلَا يُؤْمِنُ

**264**. ఓ విశ్వాసులారా! (కేవలం) పరులకు చూపటానికి, తన ధనం ఖర్చుచేస్తూ అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించని వాని మాదిరిగా! మీరూ చేసిన మేలును చెప్పుకొని

---

**1**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "పునరుత్థానదినమున అల్లాహ్ (సు.తా.) మూడు రకాల వ్యక్తులతో మాట్లాడడు. వారిలో ఒకడు, తాను చేసిన మేలును మాటిమాటికి చెప్పుకునేవాడు." ('స. ముస్లిం).

**2**. మహా ప్రవక్త ('స'అస) ప్రవచనం: "*అల్ కలిమతు తయ్యిబ్ సదఖా!*" మంచి మాట పలుకటం కూడా దానమే, (*'స. ముస్లిం, కితాబ్ అ'జ్'జకాత్*).

**3**. *'గనియ్యున్* (అల్-*'గనియ్యు*): Self- Sufficient, Free from Want. స్వయంసమృద్ధుడు, నిరపేక్షాపరుడు, సర్వసంపన్నుడు. 6:133. **అల్-ముగ్ని**: (సేకరించబడిన పదం), **భాగ్యదాత**. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

بِٱللَّهِ وَٱلْيَوْمِ ٱلْـَٔاخِرِ ۖ فَمَثَلُهُۥ كَمَثَلِ صَفْوَانٍ عَلَيْهِ تُرَابٌ فَأَصَابَهُۥ وَابِلٌ فَتَرَكَهُۥ صَلْدًا ۖ لَّا يَقْدِرُونَ عَلَىٰ شَىْءٍ مِّمَّا كَسَبُوا۟ ۗ وَٱللَّهُ لَا يَهْدِى ٱلْقَوْمَ ٱلْكَٰفِرِينَ ﴿٢٦٤﴾

(ఉపకారం పొందిన వారిని) కష్టపెట్టి, మీ దానధర్మాలను వ్యర్థపరచుకోకండి. ఇలాంటి వాని పోలిక మట్టి కప్పుకున్న ఒక నున్నని బండపై భారీ వర్షం కురిసి (మట్టి కొట్టుకుపోగా) అది ఉత్తగా మిగిలిపోయినట్లుగా ఉంటుంది.[1] ఇలాంటి వారు తాము సంపాదించిన దానినుండి ఏమీ చేయలేరు. మరియు అల్లాహ్ సత్యతిరస్కారులకు సన్మార్గం చూపడు.

وَمَثَلُ ٱلَّذِينَ يُنفِقُونَ أَمْوَٰلَهُمُ ٱبْتِغَآءَ مَرْضَاتِ ٱللَّهِ وَتَثْبِيتًا مِّنْ أَنفُسِهِمْ كَمَثَلِ جَنَّةٍۭ بِرَبْوَةٍ أَصَابَهَا وَابِلٌ فَـَٔاتَتْ أُكُلَهَا ضِعْفَيْنِ فَإِن لَّمْ يُصِبْهَا وَابِلٌ فَطَلٌّ ۗ وَٱللَّهُ بِمَا تَعْمَلُونَ بَصِيرٌ ﴿٢٦٥﴾

**265**. మరియు అల్లాహ్ ప్రీతి పొందే ఉద్దేశంతో మరియు ఆత్మ స్థిరత్వంతో ధనాన్ని ఖర్చుచేసే వారి పోలిక: మెట్టభూమిపై నున్న ఒక తోటవలె ఉంటుంది. దానిపై భారీ వర్షం కురిసినపుడు అది రెండింతల ఫలమునిస్తుంది. భారీ వర్షం కాక చినుకులు (కురిసినా దానికి చాలు). మరియు అల్లాహ్ మీరు చేసేదంతా చూస్తున్నాడు.

أَيَوَدُّ أَحَدُكُمْ أَن تَكُونَ لَهُۥ جَنَّةٌ مِّن نَّخِيلٍ وَأَعْنَابٍ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ لَهُۥ فِيهَا مِن كُلِّ ٱلثَّمَرَٰتِ وَأَصَابَهُ ٱلْكِبَرُ وَلَهُۥ ذُرِّيَّةٌ ضُعَفَآءُ فَأَصَابَهَآ إِعْصَارٌ فِيهِ نَارٌ فَٱحْتَرَقَتْ ۗ كَذَٰلِكَ يُبَيِّنُ ٱللَّهُ لَكُمُ ٱلْـَٔايَٰتِ لَعَلَّكُمْ تَتَفَكَّرُونَ ﴿٢٦٦﴾

**266**. ఏమీ? మీలో ఎవరికైనా ఖర్జూరపు మరియు ద్రాక్ష వనాలుండి, వాటి క్రిందినుండి సెలయేళ్ళు ప్రవహిస్తూ, సర్వవిధాల ఫలాలు లభిస్తూవుండి, అతనికి ముసలితనం వచ్చి, బలహీనులైన పిల్లలున్న సంకట సమయంలో, ఆ తోట మంటలుగల సుడిగాలి వీచి కాలిపోవటం, ఎవరికైనా సమ్మతమేనా? మీరు ఆలోచించటానికి, ఈ విధంగా అల్లాహ్ తన సూచన(ఆయాత్)లను మీకు విశదీకరిస్తున్నాడు.[2]

---

**1**. దీని అర్థం: ఒకడు బండ మీద ఉన్న మట్టిలో విత్తనం నాటిన తరువాత పెద్ద వర్షం కురిసి ఆ మట్టి అంతా కొట్టుకొని పోతే, ఆ విత్తనం ఏ విధంగా ఫలించగలదు? అదే విధంగా దానధర్మాలు చేసేవారు తాముచేసిన మేలు పదేపదే చెప్పి, ఉపకారం పొందిన వ్యక్తిని బాధపెడితే వారికెట్టి ప్రతిఫలం దొరుకదు.

**2**. ఇబ్నె 'అబ్బాస్ మరియు 'ఉమర్ (ర'ది.'అన్హుమ్)ల కథనం: ''ఇది ఆ వ్యక్తి ఉదాహరణ, ఎవడైతే తన జీవితమంతా మంచికార్యాలు చేసి చివరి రోజులలో షైతాన్ వలలో చిక్కుకొని

**267**. ఓ విశ్వాసులారా! మీరు సంపాదించిన దాని నుండి మరియు మేము మీ కొరకు భూమినుండి ఉత్పత్తిచేసిన వాటినుండి, మేలైన వాటినే (అల్లాహ్ మార్గంలో) ఖర్చుపెట్టండి. ఏ వస్తువులనైతే మీరు కండ్లు మూసుకునే గానీ తీసుకోరో, అలాంటి చెడ్డ వస్తువులను (ఇతరులపై) ఖర్చు చేయటానికి ఉద్దేశించకండి. మరియు అల్లాహ్ స్వయంసమృద్ధుడు, ప్రశంసనీయుడని[1] తెలుసుకోండి.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ أَنفِقُواْ مِن طَيِّبَـٰتِ مَا كَسَبْتُمْ وَمِمَّآ أَخْرَجْنَا لَكُم مِّنَ ٱلْأَرْضِ ۖ وَلَا تَيَمَّمُواْ ٱلْخَبِيثَ مِنْهُ تُنفِقُونَ وَلَسْتُم بِـَٔاخِذِيهِ إِلَّآ أَن تُغْمِضُواْ فِيهِ ۚ وَٱعْلَمُوٓاْ أَنَّ ٱللَّهَ غَنِىٌّ حَمِيدٌ ﴿٢٦٧﴾

**268**. షైతాన్ దారిద్ర్య ప్రమాదం చూపి (భయపెట్టి), మిమ్మల్ని నీచకార్యాలు చేయటానికి ప్రేరేపిస్తుంటాడు. కాని అల్లాహ్ తనవైపు నుండి మిమ్మల్ని క్షమిస్తానని, అనుగ్రహిస్తానని వాగ్దానం చేస్తున్నాడు. మరియు అల్లాహ్ సర్వవ్యాప్తి,[2] సర్వజ్ఞుడు.

ٱلشَّيْطَـٰنُ يَعِدُكُمُ ٱلْفَقْرَ وَيَأْمُرُكُم بِٱلْفَحْشَآءِ ۖ وَٱللَّهُ يَعِدُكُم مَّغْفِرَةً مِّنْهُ وَفَضْلًا ۗ وَٱللَّهُ وَٰسِعٌ عَلِيمٌ ﴿٢٦٨﴾

**269**. ఆయన తాను కోరిన వారికి వివేకాన్ని ప్రసాదిస్తాడు.[3] మరియు వివేకం పొందిన వాడు, వాస్తవంగా సర్వసంపదలను పొందిన వాడే! కాని బుద్ధిమంతులు తప్ప వేరేవారు దీనిని గ్రహించలేరు.

يُؤْتِى ٱلْحِكْمَةَ مَن يَشَآءُ ۚ وَمَن يُؤْتَ ٱلْحِكْمَةَ فَقَدْ أُوتِىَ خَيْرًا كَثِيرًا ۗ وَمَا يَذَّكَّرُ إِلَّآ أُوْلُواْ ٱلْأَلْبَـٰبِ ﴿٢٦٩﴾

---

అల్లాహ్(సు.తా.)కు అవిధేయుడై పోతాడో! అలాంటి వాడు చేసిన పుణ్యకార్యాలన్నీ వ్యర్థమైపోతాయి.'' ('స.బు'ఖారీ, కితాబ్ అత్ తఫ్సీర్).

**1**. 'హమీదున్ (అల్-'హమీదు): చూడండి, 14:1. Praiseworthy. He who is Praised, in every case. ప్రశంసనీయుడు, ప్రశంసార్హుడు, సర్వస్తోత్రాలకు అర్హుడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమపేర్లలో ఒకటి.

**2**. వాసి'ఉన్: సర్వవ్యాప్తి, సర్వోపగతుడు, సర్వం తెలిసినవాడు, అపారుడు, ఉదారుడు. విస్తారుడు. చూడండి, 2:115.

**3**. 'హిక్మతున్: అంటే, వివేకం, తెలివి, జ్ఞానం, సూక్ష్మబుద్ధి, నేర్పు, ప్రపంచజ్ఞానం మొదలైనవి అని అర్థం. ఇక్కడ ఖుర్ఆన్ను మరియు దైవప్రవక్త ('స'అస) సంప్రదాయాలను అర్థం చేసుకొని, వాటి ప్రకారం నడచుకోవటం అని అర్థం. ఇద్దరు వ్యక్తులతో ఈర్ష్యపడవచ్చు. 1) అల్లాహ్ (సు.తా.) ధనం ప్రసాదించగా, అతడు దానిని అల్లాహుతా'ఆలా మార్గంలో ఖర్చుచేసే వాడు. 2) అల్లాహ్ (సు.తా.) వివేకం ప్రసాదించగా, అతడు దానితో న్యాయమైన తీర్పుచేసే వాడు మరియు ఇతరులకు దానిని బోధించే వాడు, ('స. బు'ఖారీ. కితాబ్ అల్ 'ఇల్మ్ వల్ 'హిక్మహ్).

وَمَآ أَنفَقْتُم مِّن نَّفَقَةٍ أَوْ نَذَرْتُم مِّن نَّذْرٍ فَإِنَّ ٱللَّهَ يَعْلَمُهُۥ ۗ وَمَا لِلظَّٰلِمِينَ مِنْ أَنصَارٍ ﴿٢٧٠﴾

**270**. మరియు, మీరు (ఇతరులపై) ఏమి ఖర్చుచేసినా, లేక ఏ మొక్కుబడి చేసుకున్నా, నిశ్చయంగా అల్లాహ్ కు అంతా తెలుస్తుంది.[1] మరియు దుర్మార్గులకు సహాయం చేసేవారు ఎవ్వరూ ఉండరు.

إِن تُبْدُوا۟ ٱلصَّدَقَٰتِ فَنِعِمَّا هِىَ ۖ وَإِن تُخْفُوهَا وَتُؤْتُوهَا ٱلْفُقَرَآءَ فَهُوَ خَيْرٌ لَّكُمْ ۚ وَيُكَفِّرُ عَنكُم مِّن سَيِّـَٔاتِكُمْ ۗ وَٱللَّهُ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ ﴿٢٧١﴾

**271**. మీరు బహిరంగంగా దానాలు చేయుటం మంచిదే! కాని, గుప్తంగా నిరుపేదలకు ఇస్తే! అది మీకు అంత కంటే మేలైనది. మరియు ఆయన మీ ఎన్నో పాపాలను (దీని వల్ల) రద్దుచేస్తాడు. మరియు మీరు చేసేదంతా అల్లాహ్ కు బాగా తెలుసు. (1/4)

۞ لَّيْسَ عَلَيْكَ هُدَىٰهُمْ وَلَٰكِنَّ ٱللَّهَ يَهْدِى مَن يَشَآءُ ۗ وَمَا تُنفِقُوا۟ مِنْ خَيْرٍ فَلِأَنفُسِكُمْ ۚ وَمَا تُنفِقُونَ إِلَّا ٱبْتِغَآءَ وَجْهِ ٱللَّهِ ۚ وَمَا تُنفِقُوا۟ مِنْ خَيْرٍ يُوَفَّ إِلَيْكُمْ وَأَنتُمْ لَا تُظْلَمُونَ ﴿٢٧٢﴾

**272**. * (ఓ ప్రవక్తా!) వారిని సన్మార్గాన్ని అవలంబించేటట్లు చేయుటం నీ బాధ్యత కాదు. కాని, అల్లాహ్ తానుకోరిన వారికి సన్మార్గం చూపుతాడు. మరియు మీరు మంచి మార్గంలో ఖర్చుచేసేది మీ (మేలు) కొరకే. మీరు ఖర్చుచేసేది అల్లాహ్ ప్రీతిని పొందటానికే అయిఉండాలి. మీరు మంచి మార్గంలో ఏమి ఖర్చుచేసినా, దాని ఫలితం మీకు పూర్తిగా లభిస్తుంది మరియు మీకు ఎలాంటి అన్యాయం జరుగదు.

---

**1**. ఏదైనా మంచి పనికి పూనుకొని అది పూర్తిఅయితే నేను అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఇంత ఖర్చుచేస్తాను, లేక సత్కార్యం చేస్తాను, అని మొక్కుబడి చేసుకుంటే! దానిని పూర్తిచేయాలి. అల్లాహుతా'ఆలా పేరట చేసే మొక్కుబడి కూడా, నమా'జ్ మరియు ఉపవాసం మాదిరిగా అల్లాహ్ (సు.తా.) ఆరాధనయే. కాబట్టి అల్లాహుతా'ఆలా తప్ప ఇతరులపేరట మొక్కుబడిచేయటం షిర్క్ అంటే అల్లాహ్ (సు.తా.) క్షమించని మహాపాపం.

**273**. అల్లాహ్ మార్గంలో నిమగ్నులైన కారణంగా (తమ జీవనోపాధి కొరకు) భూమిలో తిరిగే అవకాశం లేక లేమికి గురిఅయ్యే పేదవారు (ధన సహాయానికి అర్హులు). ఎరుగని మనిషి వారి అడగక పోవటాన్ని చూసి, వారు ధనవంతులని భావించవచ్చు! (కాని) వారి ముఖ చిహ్నాలు చూసి నీవు వారిని గుర్తించగలవు. వారు ప్రజలను పట్టుబట్టి అడిగేవారు కారు. మరియు మీరు మంచి కొరకు ఏమి ఖర్చుచేసినా అది అల్లాహ్‌కు తప్పక తెలుస్తుంది.

**274**. ఎవరైతే తమ సంపదను (అల్లాహ్ మార్గంలో) రేయింబవళ్ళు బహిరంగంగానూ మరియు రహస్యంగానూ ఖర్చుచేస్తారో, వారు తమ ప్రతిఫలాన్ని తమ ప్రభువువద్ద పొందుతారు. మరియు వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా![1]

**275**. ఎవరైతే వడ్డీ తింటారో![2] వారి స్థితి (పునరుత్థాన దినమున) షైతాన్ తాకడం వల్ల భ్రమపరచబడిన వ్యక్తి స్థితివలె ఉంటుంది. ఇది ఎందుకంటే! వారు: "వ్యాపారం కూడా వడ్డీలాంటిదే!"

لِلْفُقَرَآءِ ٱلَّذِينَ أُحْصِرُوا۟ فِى سَبِيلِ ٱللَّهِ لَا يَسْتَطِيعُونَ ضَرْبًا فِى ٱلْأَرْضِ يَحْسَبُهُمُ ٱلْجَاهِلُ أَغْنِيَآءَ مِنَ ٱلتَّعَفُّفِ تَعْرِفُهُم بِسِيمَٰهُمْ لَا يَسْـَٔلُونَ ٱلنَّاسَ إِلْحَافًا ۗ وَمَا تُنفِقُوا۟ مِنْ خَيْرٍ فَإِنَّ ٱللَّهَ بِهِۦ عَلِيمٌ ﴿٢٧٣﴾

ٱلَّذِينَ يُنفِقُونَ أَمْوَٰلَهُم بِٱلَّيْلِ وَٱلنَّهَارِ سِرًّا وَعَلَانِيَةً فَلَهُمْ أَجْرُهُمْ عِندَ رَبِّهِمْ وَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ﴿٢٧٤﴾

ٱلَّذِينَ يَأْكُلُونَ ٱلرِّبَوٰا۟ لَا يَقُومُونَ إِلَّا كَمَا يَقُومُ ٱلَّذِى يَتَخَبَّطُهُ ٱلشَّيْطَٰنُ مِنَ ٱلْمَسِّ ۚ

---

**1**. చూడండి, 'స. బు'ఖారీ, పుస్తకం-2, 'హదీస్' నం. 504.

**2**. రిబా': వడ్డీ, అంటే ఎక్కువ తీసుకోవటం. ఒకనికి అప్పు ఇచ్చి, స్వంత ఉపయోగానికైనా సరే లేక వ్యాపారానికైనా సరే - ఇచ్చిన దానికంటే ఎక్కువ తీసుకోవటమే - వడ్డీ. అది 'హరామ్. అది డబ్బు అయినా సరే, లేక ఏ వస్తువు అయినా సరే. చూడండి, 30:39.

ذَٰلِكَ بِأَنَّهُمْ قَالُوٓاْ إِنَّمَا ٱلْبَيْعُ مِثْلُ ٱلرِّبَوٰاْۗ وَأَحَلَّ ٱللَّهُ ٱلْبَيْعَ وَحَرَّمَ ٱلرِّبَوٰاْۚ فَمَن جَآءَهُۥ مَوْعِظَةٌ مِّن رَّبِّهِۦ فَٱنتَهَىٰ فَلَهُۥ مَا سَلَفَ وَأَمْرُهُۥٓ إِلَى ٱللَّهِۖ وَمَنْ عَادَ فَأُوْلَٰٓئِكَ أَصْحَٰبُ ٱلنَّارِۖ هُمْ فِيهَا خَٰلِدُونَ ﴿٢٧٥﴾

అని చెప్పడం. కాని అల్లాహ్ వ్యాపారాన్ని ధర్మసమ్మతం ('హలాల్) చేశాడు మరియు వడ్డీని నిషిద్ధం ('హరామ్) చేశాడు. కనుక తన ప్రభువు చేసిన ఈ హితబోధ అందిన వ్యక్తి ముమ్మందు వడ్డీ తినటం త్యజిస్తే, అతడు పూర్వం తిన్నదేదో తిన్నాడు. అతని వ్యవహారమంతా అల్లాహ్‌కే చెందుతుంది. (ఈ ఆదేశం తరువాత ఈ దుర్వ్యవహారానికి) పాల్పడే వారు నరక వాసులవుతారు, అక్కడ వారు శాశ్వతంగా ఉంటారు.

يَمْحَقُ ٱللَّهُ ٱلرِّبَوٰاْ وَيُرْبِي ٱلصَّدَقَٰتِۗ وَٱللَّهُ لَا يُحِبُّ كُلَّ كَفَّارٍ أَثِيمٍ ﴿٢٧٦﴾

**276.** అల్లాహ్ వడ్డీ (ఆదాయాన్ని) నశింపజేస్తాడు మరియు దానధర్మాలు (చేసేవారికి) వృద్ధినొసంగుతాడు. మరియు సత్యతిరస్కారుడు (కృతఘ్నుడు), పాపిష్ఠుడు అయిన వ్యక్తిని అల్లాహ్ ప్రేమించడు.

إِنَّ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ وَأَقَامُواْ ٱلصَّلَوٰةَ وَءَاتَوُاْ ٱلزَّكَوٰةَ لَهُمْ أَجْرُهُمْ عِندَ رَبِّهِمْ وَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ﴿٢٧٧﴾

**277.** నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసే వారికీ మరియు నమా'జ్ స్థాపించే వారికీ, 'జకాత్ ఇచ్చేవారికీ, తమ ప్రభువువద్ద తగిన ప్రతిఫలం లభిస్తుంది మరియు వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా!

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ ٱتَّقُواْ ٱللَّهَ وَذَرُواْ مَا بَقِيَ مِنَ ٱلرِّبَوٰٓاْ إِن كُنتُم مُّؤْمِنِينَ ﴿٢٧٨﴾

**278.** ఓ విశ్వాసులారా! అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు మీరు (నిజంగా) విశ్వాసులే అయితే, మీకు రావలసిన వడ్డీని విడిచిపెట్టండి.[1]

**1.** 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-3, 'హదీస్' నం. 299. మరియు 'స. బు'ఖారీ పుస్తకం-7, 'హ. నం. 845.

**279**. కాని, ఒకవేళ మీరు అలా చేయకపోతే! అల్లాహ్ మరియు ఆయన సందేశహరుని తరఫు నుండి యుద్ధ ప్రకటన ఉందని తెలుసుకోండి.[1] కాని మీరు పశ్చాత్తాపపడితే (వడ్డీ వదలు కుంటే), మీ అసలు సొమ్ము మీకు లభిస్తుంది. మీరు (ఇతరులకు) అన్యాయం చేయకండి మరియు మీకూ అన్యాయం జరుగదు.

**280**. మరియు (మీ బాకీదారుడు ఆర్థిక) ఇబ్బందులలో ఉంటే, అతని పరిస్థితి, కుదిరేవరకూ గడువునివ్వండి. ఒకవేళ మీరు దానమని వదిలిపెడితే అది మీకు ఎంతో మేలైనది, ఇది మీకు తెలిస్తే (ఎంత బాగుండేది)![2]

**281**. మరియు మీరు తిరిగి అల్లాహ్ సమక్షానికి చేరుకోబోయే ఆ దినానికి భయపడండి. అప్పుడు ప్రతి వ్యక్తికి తన కర్మల ప్రతిఫలం ఇవ్వబడుతుంది. వారికెలాంటి అన్యాయం జరుగదు.[3]

**282**. ఓ విశ్వాసులారా! మీరు పరస్పరం ఒక నిర్ణీతకాలం కొరకు అప్పు తీసుకున్నప్పుడు, దానిని వ్రాసి పెట్టుకోండి.[4] మరియు మీలో పత్రం

فَإِن لَّمْ تَفْعَلُوا۟ فَأْذَنُوا۟ بِحَرْبٍ مِّنَ ٱللَّهِ
وَرَسُولِهِۦ ۖ وَإِن تُبْتُمْ فَلَكُمْ
رُءُوسُ أَمْوَٰلِكُمْ لَا تَظْلِمُونَ
وَلَا تُظْلَمُونَ ﴿٢٧٩﴾

وَإِن كَانَ ذُو عُسْرَةٍ فَنَظِرَةٌ
إِلَىٰ مَيْسَرَةٍ ۚ وَأَن تَصَدَّقُوا۟ خَيْرٌ
لَّكُمْ ۖ إِن كُنتُمْ تَعْلَمُونَ
﴿٢٨٠﴾

وَٱتَّقُوا۟ يَوْمًا تُرْجَعُونَ فِيهِ إِلَى ٱللَّهِ ۖ
ثُمَّ تُوَفَّىٰ كُلُّ نَفْسٍ مَّا كَسَبَتْ
وَهُمْ لَا يُظْلَمُونَ ﴿٢٨١﴾

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِذَا تَدَايَنتُم
بِدَيْنٍ إِلَىٰٓ أَجَلٍ مُّسَمًّى فَٱكْتُبُوهُ ۚ

---

**1**. 'స. బు'ఖారీ, పుస్తకం-3, 'హదీస్' నం. 506 మరియు 'స. బు'ఖారీ, పుస్తకం-9, 'హదీస్' నం.171.

**2**. 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం. 687.

**3**. ఇబ్నె 'అబ్బాస్ (ర'ది.'అ.) కథనం: 'ఇది దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై అవతరింపజేయబడిన చివరి ఆయత్ ('స. బు'ఖారీ మరియు ఫ'త్హ్ అల్-బారీ).

**4**. ఈ ఆయత్ ఖుర్ఆన్‌లోని అన్ని ఆయత్‌ల కంటే పెద్దది. దీనిని ఆయతే దైన్ అంటారు. అప్పు ఇచ్చి పుచ్చుకోవడం ఎంతో ముఖ్య విషయం. 'హదీస్'లలో: వడ్డీ దొరకదని అప్పు ఇవ్వడం మానుకోకూడదని మరియు అప్పు ఇచ్చేవానికి ఎంతో పుణ్యముందని పేర్కొనబడింది. కాని,

వَلْيَكْتُب بَّيْنَكُمْ كَاتِبٌۢ بِٱلْعَدْلِ ۚ وَلَا يَأْبَ كَاتِبٌ أَن يَكْتُبَ كَمَا عَلَّمَهُ ٱللَّهُ ۚ فَلْيَكْتُبْ وَلْيُمْلِلِ ٱلَّذِى عَلَيْهِ ٱلْحَقُّ وَلْيَتَّقِ ٱللَّهَ رَبَّهُۥ وَلَا يَبْخَسْ مِنْهُ شَيْـًٔا ۚ فَإِن كَانَ ٱلَّذِى عَلَيْهِ ٱلْحَقُّ سَفِيهًا أَوْ ضَعِيفًا أَوْ لَا يَسْتَطِيعُ أَن يُمِلَّ هُوَ فَلْيُمْلِلْ وَلِيُّهُۥ بِٱلْعَدْلِ ۚ وَٱسْتَشْهِدُوا۟ شَهِيدَيْنِ مِن رِّجَالِكُمْ ۖ فَإِن لَّمْ يَكُونَا رَجُلَيْنِ فَرَجُلٌ وَٱمْرَأَتَانِ مِمَّن تَرْضَوْنَ مِنَ ٱلشُّهَدَآءِ أَن تَضِلَّ إِحْدَىٰهُمَا فَتُذَكِّرَ إِحْدَىٰهُمَا ٱلْأُخْرَىٰ ۚ وَلَا يَأْبَ ٱلشُّهَدَآءُ إِذَا مَا دُعُوا۟ ۚ وَلَا تَسْـَٔمُوٓا۟ أَن تَكْتُبُوهُ صَغِيرًا أَوْ كَبِيرًا إِلَىٰٓ أَجَلِهِۦ ۚ ذَٰلِكُمْ أَقْسَطُ عِندَ ٱللَّهِ وَأَقْوَمُ لِلشَّهَٰدَةِ وَأَدْنَىٰٓ أَلَّا تَرْتَابُوٓا۟ ۖ إِلَّآ أَن تَكُونَ تِجَٰرَةً حَاضِرَةً تُدِيرُونَهَا بَيْنَكُمْ فَلَيْسَ عَلَيْكُمْ

వ్రాసేవాడు, న్యాయంగా వ్రాయాలి. మరియు వ్రాసేవాడు నిరాకరించకుండా, అల్లాహ్ నేర్పినట్లు వ్రాయాలి. ఋణగ్రహీత అల్లాహ్‌కు భయపడి, నిర్ణీత షరతులను తగ్గించకుండా, చెప్పి వ్రాయించాలి. ఋణగ్రహీత అల్పజ్ఞాని లేక సామర్థ్యం లేనివాడు లేక బలహీనుడు మరియు తాను చెప్పి వ్రాయించలేనివాడైతే, అతని సంరక్షకుడు న్యాయంగా వ్రాయించాలి. మరియు మీలో ఇద్దరు మగవారిని సాక్ష్యమివ్వటానికి సాక్షులుగా ఉంచుకోండి. ఇద్దరు పురుషులు దొరకని పక్షమున ఒక పురుషుడు మరియు మీకు సమ్మతమైన ఇద్దరు స్త్రీలను సాక్షులుగా తీసుకోండి. (ఎందుకంటే) వారిలో ఒకామె మరచిపోతే, రెండవ స్త్రీ ఆమెకు జ్ఞాపకం చేయించవచ్చు. మరియు పిలువబడినప్పుడు సాక్షులు, సాక్ష్య మివ్వటానికి నిరాకరించకూడదు. మరియు వ్యవహారం చిన్నదైనా పెద్దదైనా దానిని గడువు నిర్ణయంతోపాటు వ్రాసిపెట్టటానికి అశ్రద్ధ చూపకూడదు. అల్లాహ్ దృష్టిలో ఇది న్యాయసమ్మతమైనది మరియు స్థిరమైన సాక్ష్యంగా తోడ్పడుతుంది మరియు ఏ విధమైన సందేహాలకు అవకాశం లేకుండా చేస్తుంది. కాని, మీరు అప్పటికప్పుడు ఇచ్చి పుచ్చుకొనే

ఇచ్చేవానికి అతని సొమ్ము తిరిగి రాగలదనే నమ్మకం కూడా ఉండాలి. దానికి మూడు విషయాలు సూచించబడ్డాయి. 1) దాని గడువు నిర్ణయించుకోవాలి. 2) దానిని వ్రాయించుకోవాలి. 3) ఇద్దరు ముస్లిం పురుషులు లేక ఒక ముస్లిం పురుషుడు మరియు ఇద్దరు ముస్లిం స్త్రీలను సాక్షులుగా పెట్టుకోవాలి.

جُنَاحٌ أَلَّا تَكۡتُبُوهَاۗ وَأَشۡهِدُوٓاْ
إِذَا تَبَايَعۡتُمۡۚ وَلَا يُضَآرَّ كَاتِبٞ
وَلَا شَهِيدٞۚ وَإِن تَفۡعَلُواْ فَإِنَّهُۥ
فُسُوقُۢ بِكُمۡۗ وَٱتَّقُواْ ٱللَّهَۖ
وَيُعَلِّمُكُمُ ٱللَّهُۗ وَٱللَّهُ بِكُلِّ
شَيۡءٍ عَلِيمٞ ٢٨٢

۞ وَإِن كُنتُمۡ عَلَىٰ سَفَرٖ وَلَمۡ
تَجِدُواْ كَاتِبٗا فَرِهَٰنٞ مَّقۡبُوضَةٞۖ
فَإِنۡ أَمِنَ بَعۡضُكُم بَعۡضٗا فَلۡيُؤَدِّ
ٱلَّذِي ٱؤۡتُمِنَ أَمَٰنَتَهُۥ وَلۡيَتَّقِ ٱللَّهَ
رَبَّهُۥۗ وَلَا تَكۡتُمُواْ ٱلشَّهَٰدَةَۚ
وَمَن يَكۡتُمۡهَا فَإِنَّهُۥٓ ءَاثِمٞ
قَلۡبُهُۥۗ وَٱللَّهُ بِمَا تَعۡمَلُونَ عَلِيمٞ
٢٨٣

(సాధారణ) లావాదేవీలు చేస్తున్నపుడు వ్రాయకున్నా దోషంలేదు. కాని, వ్యాపార వ్యవహారాలు నిర్ణయించేటప్పుడు సాక్షులను పెట్టుకోండి. కాని వ్రాసేవానికి గానీ, సాక్షులకు గానీ ఏ విధమైన హాని జరుగకూడదు. ఒకవేళ అలా జరిగితే! నిశ్చయంగా, అది మీకు పాపం. మరియు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు ఇది అల్లాహ్ మీకు నేర్పుతున్నాడు. మరియు అల్లాహ్‌కు ప్రతిదాని జ్ఞానం ఉంది. (3/8)

**283.** * మరియు మీరు ప్రయాణంలో ఉన్నప్పుడు, (పత్రం) వ్రాసే వాడు దొరకని పక్షంలో సొమ్మును కుదువ పెట్టుకోవచ్చు.[1] మీకు ఒకరిపై ఒకరికి నమ్మకం ఉంటే నమ్మకంగా ఇచ్చిన దానిని (అప్పును) తిరిగి అతడు వాపసుచేయాలి. మరియు తన ప్రభువైన అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండాలి. మరియు మీరు సాక్ష్యాన్ని (ఎన్నడూ) దాచకండి. మరియు (సాక్ష్యాన్ని) దాచేవాని హృదయం పాపభరితమైనది. మరియు మీరు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

1. తాకట్టు యొక్క ఉద్దేశం, కేవలం అప్పు ఇచ్చేవాడి సొమ్ము తిరిగి అతనికి దొరుకుతుందనే యథార్థానికే! అతనికి తాకట్టు పెట్టుకొన్న వస్తువును ఉపయోగించుకునే హక్కు లేదు. అది వడ్డీ అవుతుంది. కాని తాకట్టు పెట్టుకున్న వస్తువుపై ఆదాయం వస్తే దానినుండి దాని ఖర్చుతీసి మిగిలింది దాని యజమానికి ఇవ్వాలి. చూడండి, 'స. బు'ఖారీ, పుస్తకం-3, 'హ. నం. 685.

لِّلَّهِ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَمَا فِى ٱلْأَرْضِ ۗ وَإِن تُبْدُوا۟ مَا فِىٓ أَنفُسِكُمْ أَوْ تُخْفُوهُ يُحَاسِبْكُم بِهِ ٱللَّهُ ۖ فَيَغْفِرُ لِمَن يَشَآءُ وَيُعَذِّبُ مَن يَشَآءُ ۗ وَٱللَّهُ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ ﴿٢٨٤﴾

**284**. ఆకాశాలలో మరియు భూమిలో ఉన్నదంతా అల్లాహ్ దే! మీరు మీ మనస్సులలో ఉన్నది, వెలుబుచ్చినా లేక దాచినా అల్లాహ్ మీ నుంచి దాని లెక్క తీసుకుంటాడు.[1] మరియు ఆయన తాను కోరినవానిని క్షమిస్తాడు మరియు తాను కోరినవానిని శిక్షిస్తాడు. మరియు అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

ءَامَنَ ٱلرَّسُولُ بِمَآ أُنزِلَ إِلَيْهِ مِن رَّبِّهِۦ وَٱلْمُؤْمِنُونَ ۚ كُلٌّ ءَامَنَ بِٱللَّهِ وَمَلَٰٓئِكَتِهِۦ وَكُتُبِهِۦ وَرُسُلِهِۦ لَا نُفَرِّقُ بَيْنَ أَحَدٍ مِّن رُّسُلِهِۦ ۚ

**285**. ఈ ప్రవక్త తన ప్రభువు తరఫునుండి, తనపై అవతరింప జేయబడిన దానిని విశ్వసించాడు[2] మరియు (అదేవిధంగా) విశ్వాసులు కూడా (విశ్వసించారు). వారంతా అల్లాహ్‌ను, ఆయన దూతలను, ఆయన గ్రంథాలను మరియు ఆయన ప్రవక్తలను విశ్వసించారు.

---

**1**. ఈ ఆయత్ అవతరింపజేయబడినపుడు స'హాబీలు దైవప్రవక్త ('స'అస) దగ్గర హాజరై ఇలా విన్నవించుకున్నారు: ''ఓ ప్రవక్తా ('స'అస)! నమా'జ్ ఉపవాసం, 'జకాత్ మరియు జిహాద్ మా శక్తికి మించినవి కావు. కాని మనస్సులో పుట్టే ఆలోచనలపై మాకు అదుపులేదు కదా! అయినా అల్లాహుతా'ఆలా వాటి లెక్క తీసుకుంటానని అంటున్నాడు కదా!'' అప్పుడు దైవప్రవక్త ('స'అస) ఇలా సెలవిచ్చారు: ''మీరిప్పుడు కేవలం విన్నాము మరియు విధేయుల మయ్యాము.'' అని మాత్రమే అనండి. అప్పుడు అల్లాహ్ (సు.తా.) ఈ ఆయత్ అవతరింపజేశాడు: ''అల్లాహ్ ఏ ప్రాణిపైననూ దానిశక్తికి మించిన భారంవేయడు.'' (ఇబ్నె-కసీ'ర్, ఫ'త్హ్ అల్-ఖదీర్). దీనిని గురించి ఇంకా ఈ 'హదీస్' కూడా ఉంది: ''అల్లాహుతా'ఆలా నా ఉమ్మత్ వారి మనస్సులలో వచ్చిన విషయాలను క్షమిస్తాడు. కాని నాలుకతో పలికిన దానిని మరియు అమలుపరచిన దానిని లెక్కలోకి తీసుకుంటాడు.'' (బు'ఖారీ, ముస్లిం).
ఇమామ్ ఇబ్నె-జరీర్ 'తబరీ (రహ్మ) ఈ విధంగా అన్నారు: ''అల్లాహ్ (సు.తా.) లెక్క పెట్టిన ప్రతి దానికి శిక్షించనవసరంలేదు. ఆయన తానుకోరిన వారిని క్షమిస్తాడు కూడాను.''

**2**. ఈ చివరి రెండు ఆయత్‌లు ఎంతో ఘనత గలవి. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: ఎవరైనా రాత్రి ఈ రెండు ఆయత్‌లను చదివితే చాలు. ('స. బు'ఖారీ, పుస్తకం-5, 'హదీస్' నం. 345). అంటే అల్లాహ్ (సు.తా.) అతనిని రక్షిస్తాడు. మరొక 'హదీస్'లో మేరాజ్ రాత్రిలో దైవప్రవక్త ('స'అస)కు దొరికిన మూడు విషయాలలో ఒకటి, ఈ రెండు ఆయతులు. ('స.ముస్లిం).

وَقَالُوا۟ سَمِعْنَا وَأَطَعْنَا ۖ غُفْرَانَكَ رَبَّنَا وَإِلَيْكَ ٱلْمَصِيرُ ﴿٢٨٥﴾

లా యుకల్లిఫుల్లాహు నఫ్సన్ ఇల్లా

لَا يُكَلِّفُ ٱللَّهُ نَفْسًا إِلَّا وُسْعَهَا ۚ لَهَا مَا كَسَبَتْ وَعَلَيْهَا مَا ٱكْتَسَبَتْ ۗ رَبَّنَا لَا تُؤَاخِذْنَآ إِن نَّسِينَآ أَوْ أَخْطَأْنَا ۚ رَبَّنَا وَلَا تَحْمِلْ عَلَيْنَآ إِصْرًا كَمَا حَمَلْتَهُۥ عَلَى ٱلَّذِينَ مِن قَبْلِنَا ۚ رَبَّنَا وَلَا تُحَمِّلْنَا مَا لَا طَاقَةَ لَنَا بِهِۦ ۖ وَٱعْفُ عَنَّا وَٱغْفِرْ لَنَا وَٱرْحَمْنَآ ۚ أَنتَ مَوْلَىٰنَا فَٱنصُرْنَا عَلَى ٱلْقَوْمِ ٱلْكَـٰفِرِينَ ﴿٢٨٦﴾

వారంటారు: ''మేము ఆయన ప్రవక్తల మధ్య ఎలాంటి భేదభావాలను చూపము. మరియు మేము (ఆదేశం) విన్నాము మరియు దానిని శిరసావహించాము, నీ క్షమాభిక్షను అర్థిస్తున్నాము, ఓ మా ప్రభూ! మా గమ్యస్థానం నీ వైపుకే ఉంది.

**286**. ''అల్లాహ్, ఏ ప్రాణి పైననూ దాని శక్తికి మించిన భారం వేయడు. తాను సంపాదించిన దానికి (పుణ్యఫలితం) లభిస్తుంది మరియు తాను చేసిన దుష్కర్మల శిక్ష అది అనుభవిస్తుంది. ఓ మా ప్రభూ! మేము మరచినా లేక తప్పు చేసినా మమ్మల్ని పట్టకు! ఓ మా ప్రభూ! పూర్వం వారిపై మోపినట్టి భారం మాపై మోపకు. ఓ మా ప్రభూ! మేము సహించలేని భారం మాపై వేయకు. మమ్మల్ని మన్నించు, మమ్మల్ని క్షమించు మరియు మమ్మల్ని కరుణించు. నీవే మా సంరక్షకుడవు, కావున సత్య తిరస్కారులకు విరుద్ధంగా మాకు విజయం (సహాయం) నొసంగు.

*****

## 3. సూరహ్ ఆల-'ఇమ్రాన్

## سُورَةُ آلِ عِمْرَانَ

ఆల 'ఇమ్రాన్: **ఇమ్రాన్ పరివారం.** ఈ విషయాలు (**33-35**) ఆయత్‌లలో ఉన్నాయి. ఇది మదీనాలో అవతరింపజేయబడిన రెండవ లేక మూడవ సూరహ్. ఇందులో **200 ఆయతులు**న్నాయి. దీని మొదటి 83 ఆయత్‌లలో నజ్రాన్ నుండి 9వ హిజ్రీలో వచ్చిన క్రైస్తవ రాయబారులతో జరిగిన వాదోపవాదాల వివరాలున్నాయి. ఇందులో 2వ హి. రమ'దాన్ నెలలో జరిగిన బద్ర్ యుద్ధం (121-148) మరియు 3వ హి. షవ్వాల్ నెలలో జరిగిన ఉ'హుద్ యుద్ధం యొక్క విషయాలు (149-180), కూడా ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓمٓ ﴿١﴾

**1.** అలిఫ్-లామ్-మీమ్.

ٱللَّهُ لَآ إِلَٰهَ إِلَّا هُوَ ٱلْحَىُّ ٱلْقَيُّومُ ﴿٢﴾

**2.** అల్లాహ్! ఆయన తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు. ఆయన నిత్యుడు, విశ్వవ్యవస్థకు ఆధారభూతుడు.[1]

نَزَّلَ عَلَيْكَ ٱلْكِتَٰبَ بِٱلْحَقِّ مُصَدِّقًا لِّمَا بَيْنَ يَدَيْهِ وَأَنزَلَ ٱلتَّوْرَىٰةَ وَٱلْإِنجِيلَ ﴿٣﴾

**3.** ఆయన, సత్యమైన ఈ దివ్యగ్రంథాన్ని (ఓ ము'హమ్మద్!) నీపై అవతరింపజేశాడు. ఇది పూర్వం అవతరింపజేయబడిన గ్రంథాలలో నుండి (మిగిలివున్న సత్యాన్ని) ధృవపరుస్తోంది.[2] మరియు ఆయనే తౌరాత్‌ను మరియు ఇంజీలును[3] అవతరింపజేశాడు -

---

**1.** చూడండి, 2:255.

**2.** చూడండి, 5:46, 48. 61:6.

**3.** ఇక్కడ (ఖుర్ఆన్‌లో) పేర్కొనబడిన ఇంజీల్ మరియు తౌరాత్ గ్రంథాలు అంటే 'ఈసా('అ.స.) మరియు మూసా('అ.స.)లపై అవతరింపజేయబడిన దివ్యగ్రంథాలు అని అర్థం. ఆ అసలు దివ్యగ్రంథాలు ఇప్పుడు ప్రపంచంలో లేవు. ఇప్పుడు ప్రపంచంలో ఉన్న అత్యంత ప్రాచీన బైబిల్‌గ్రంథాలు, గ్రీక్‌భాషలో ఉన్న బ్రిటిష్ మ్యూజియంలోని Codex Sinaiticus, Codex Alexandrinus మరియు రోమ్‌లోని వాటికాన్ లైబ్రరీలో ఉన్న Codex Vaticanus. ఇవి 'ఈసా ('అ.స.) పైకి సజీవులుగా ఎత్తుకోబడిన దాదాపు నాలుగు వందల సంవత్సరాల తరువాత, గ్రీక్ భాషలో వ్రాయబడ్డాయి. మూసా మరియు 'ఈసా ('అలైహిమ్. స.)లపై అవతరింపజేయబడిన తౌరాత్ మరియు ఇంజీల్ గ్రంథాల భాష గ్రీకు కాదు. వారి మతాచారులు / విద్వాంసులు,

4. దీనికి ముందు - ప్రజలకు సన్మార్గం చూపటానికి. మరియు (సత్యాసత్యాలను విశదీకరించే) ఈ గీటురాయిని కూడా అవతరింపజేశాడు.[1] నిశ్చయంగా, ఎవరైతే అల్లాహ్ ఆజ్ఞలను తిరస్కరిస్తారో వారికి కఠినశిక్ష ఉంటుంది. మరియు అల్లాహ్ సర్వశక్తిమంతుడు, ప్రతీకారం తీర్చుకోగల వాడు.

مِن قَبْلُ هُدًى لِّلنَّاسِ وَأَنزَلَ ٱلْفُرْقَانَ ۗ إِنَّ ٱلَّذِينَ كَفَرُوا۟ بِـَٔايَـٰتِ ٱللَّهِ لَهُمْ عَذَابٌ شَدِيدٌ ۗ وَٱللَّهُ عَزِيزٌ ذُو ٱنتِقَامٍ ﴿٤﴾

5. నిశ్చయంగా, భూమిలో గానీ మరియు ఆకాశాలలో గానీ, అల్లాహ్‌కు గోప్యంగా ఉన్నది ఏదీలేదు.

إِنَّ ٱللَّهَ لَا يَخْفَىٰ عَلَيْهِ شَىْءٌ فِى ٱلْأَرْضِ وَلَا فِى ٱلسَّمَآءِ ﴿٥﴾

6. ఆయన తన ఇష్టానుసారంగా మిమ్మల్ని (మాతృ) గర్భాలలో తీర్చిదిద్దుతాడు.[2] ఆయన తప్ప మరొక ఆరాధ్యదేవుడు లేడు. ఆయన సర్వ శక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

هُوَ ٱلَّذِى يُصَوِّرُكُمْ فِى ٱلْأَرْحَامِ كَيْفَ يَشَآءُ ۚ لَآ إِلَـٰهَ إِلَّا هُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿٦﴾

7. ఆయన (అల్లాహ్)యే నీపై (ఓ ముʼహమ్మద్!) ఈ గ్రంథాన్ని (ఖుర్ఆన్‌ను) అవతరింపజేశాడు, ఇందులో కొన్ని స్పష్టమైన అర్థమిచ్చే ఆయతులు (ముʼహ్కమాత్) ఉన్నాయి. అవి ఈ గ్రంథానికి మూలాలు. మరికొన్ని అస్పష్టమైనవి (ముతషాబిహాత్)

هُوَ ٱلَّذِىٓ أَنزَلَ عَلَيْكَ ٱلْكِتَـٰبَ مِنْهُ ءَايَـٰتٌ مُّحْكَمَـٰتٌ هُنَّ أُمُّ ٱلْكِتَـٰبِ وَأُخَرُ مُتَشَـٰبِهَـٰتٌ ۖ فَأَمَّا ٱلَّذِينَ فِى قُلُوبِهِمْ زَيْغٌ فَيَتَّبِعُونَ مَا تَشَـٰبَهَ مِنْهُ ٱبْتِغَآءَ

---

వాటిలో ఇంత వరకు, ఎన్నో సార్లు, ఎన్నో మార్పులు చేస్తూ వచ్చారు. ఈ రోజు వాడుకలో ఉన్న బైబిల్‌లలో, ఆ ప్రవక్తల కొన్ని ప్రవచనాలు మరియు అసలు దివ్య ఆవిష్కృతులైన కొన్ని అంశాలు - వారి మతాచారులు / విద్వాంసులు వ్రాసిన రూపంలో - ఉన్నాయి. కాబట్టి దివ్య ఖుర్ఆన్ సూచించేది ఆ ప్రవకలపై అవతరింపజేయబడిన ప్రవచనాలను మాత్రమే కానీ ఈ రోజు వాడుకలో ఉన్న బైబిల్ (Revised) Authorized King James Versionను కాదు. చూడండి, 4:136, 5:47.

1. చూడండి, 2:53.

2. ముʼసవ్విరు (అల్-ముʼసవ్విరు): The Fashioner. రూపమిచ్చేవాడు. తాను కోరిన విధంగా తన సృష్టి రూపాన్ని తీర్చిదిద్దేవాడు. చూడండి, 59:24. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

ٱلۡفِتۡنَةِ وَٱبۡتِغَآءَ تَأۡوِيلِهِۦۗ وَمَا يَعۡلَمُ تَأۡوِيلَهُۥٓ إِلَّا ٱللَّهُۗ وَٱلرَّٰسِخُونَ فِي ٱلۡعِلۡمِ يَقُولُونَ ءَامَنَّا بِهِۦ كُلّٞ مِّنۡ عِندِ رَبِّنَاۗ وَمَا يَذَّكَّرُ إِلَّآ أُوْلُواْ ٱلۡأَلۡبَٰبِ ٧

ఉన్నాయి.[1] కావున తమ హృదయాలలో వక్రత ఉన్నవారు, సంక్షోభాన్ని రేకెత్తించటానికి మరియు గూఢార్థాలను అపేక్షించి ఎల్లప్పుడూ అస్పష్టమైన వాటి వెంటపడతారు. వాటి అసలు అర్థం అల్లాహ్‌కు తప్ప మరెవ్వరికీ తెలియదు. కానీ, పరిపక్వ జ్ఞానం గలవారు: "మేము దీనిని విశ్వసించాము, ప్రతి ఒక్కటీ మా ప్రభువువద్ద నుండి వచ్చినదే!" అని అంటారు. జ్ఞాన వంతులు తప్ప ఇతరులు వీటిని గ్రహించలేరు.

رَبَّنَا لَا تُزِغۡ قُلُوبَنَا بَعۡدَ إِذۡ هَدَيۡتَنَا وَهَبۡ لَنَا مِن لَّدُنكَ رَحۡمَةًۚ إِنَّكَ أَنتَ ٱلۡوَهَّابُ ٨

**8.** (వారు ఇలా అంటారు): "ఓ మా ప్రభూ! మాకు సన్మార్గం చూపిన తరువాత మా హృదయాలను వక్రమార్గం వైపునకు పోనివ్వకు. మరియు మాపై నీ కారుణ్యాన్ని ప్రసాదించు. నిశ్చయంగా, నీవే సర్వవర ప్రదాతవు.[2]

رَبَّنَآ إِنَّكَ جَامِعُ ٱلنَّاسِ لِيَوۡمٖ لَّا رَيۡبَ فِيهِۚ إِنَّ ٱللَّهَ لَا يُخۡلِفُ ٱلۡمِيعَادَ ٩

**9.** "ఓ మా ప్రభూ! నిశ్చయంగా నీవే మానవులందరినీ, నిస్సందేహంగా రాబోయే, ఆ దినమున సమావేశ పరచేవాడవు.[3] నిశ్చయంగా, అల్లాహ్ తన వాగ్దానాన్ని భంగంచేయడు."

---

**1**. ము'హ్‌కమాతున్: అంటే,అల్లాహుతా'ఆలా ఆజ్ఞలను, ఆయన నిషేధించిన వాటిని, 'హలాల్ చేసిన వాటిని, కథలను మొదలైనవాటిని స్పష్టంగా తెలియజేసే ఆయతులు. ఈ ఆయతుల భావం స్పష్టంగా ఉంటుంది. ఇవి దివ్యగ్రంథ పునాదులు. వీటిని ఉమ్ముల్-కితాబ్ అని అంటారు. ఏ ఆయతుల అర్థంలో సంశయానికి తావుఉంటుందో వాటిని ముతషాబిహాతున్ అంటారు. ఏ విషయాలైతే మానవ ఇంద్రియాలకు అతీతంగా ఉన్నాయో వాటిని వివరించటానికి, వాటికి దగ్గరగా పోలికవున్న, గోచర విషయాలకు మానవభాషలో లభించే పదాలు ఉపయోగించబడిన ఆయతులు. ఉదా: స్వర్గం, నరకం మొదలైనవి. కావున మానవుడు ముతషాబిహాత్‌లను చదివేటప్పుడు వాటిని ము'హ్‌కమాత్‌ల వెలుగులో అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాలి. ఎందుకంటే ఖుర్ఆన్ వాటిని ఉమ్ముల్ కితాబ్ - గ్రంథమూలాలు, అన్నది.

**2.** **అల్-వహ్హాబ్:** Bestower. సర్వవరప్రదాత, సర్వప్రదుడు, పరమదాత, ఉదారంగా దానంచేసేవాడు.

**3**. జామి'ఉ (**అల్-జామి'ఉ**): The collector of the created beings for the Day of Reckoning. సమావేశపరచేవాడు, ప్రోగుచేసేవాడు, కూడబెట్టేవాడు. పై రెండు అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు. ఇంకా చూడండి, 4:140, 24:62.

**10**. నిశ్చయంగా, సత్యతిరస్కారులైన వారికి వారి ధనం గానీ, వారి సంతానం గానీ, అల్లాహ్‌కు ప్రతికూలంగా ఏ మాత్రం పనికిరావు. మరియు ఇలాంటి వారే నరకాగ్నికి ఇంధనమయ్యేవారు.

**11**. వారి ముగింపు ఫిర్‌ఔను జాతి మరియు వారికి ముందున్న వారివలే ఉంటుంది. వారు మా సూచన(ఆజ్ఞ)లను తిరస్కరించారు, కాబట్టి అల్లాహ్ వారి పాపాల ఫలితంగా, వారిని పట్టుకున్నాడు. మరియు అల్లాహ్ శిక్ష విధించటంలో చాలా కఠినుడు.

**12**. (ఓ ప్రవక్తా!) సత్యాన్ని తిరస్కరించిన వారితో అను: "మీరు త్వరలోనే లొంగదీయబడి నరకంలో జమచేయబడతారు. మరియు అది అతిచెడ్డ విరామస్థలము!"

**13**. వాస్తవానికి (బద్ర్ యుద్ధరంగంలో) మార్కొనిన ఆ రెండు వర్గాలలో మీకు ఒక సూచన ఉంది. ఒక వర్గం అల్లాహ్ మార్గంలో పోరాడేది మరియు రెండవది సత్యతిరస్కారులది. వారు (విశ్వాసులు) వారిని (సత్యతిరస్కారులను) రెట్టింపు సంఖ్యలో ఉన్నట్లు తమ కళ్ళారా చూశారు. మరియు అల్లాహ్ తాను కోరిన వారిని తన సహాయం(విజయం)తో బలపరుస్తాడు. నిశ్చయంగా, దూరదృష్టి గలవారికి ఇందులో ఒక గుణపాఠముంది.[1]

إِنَّ ٱلَّذِينَ كَفَرُوا۟ لَن تُغْنِىَ
عَنْهُمْ أَمْوَٰلُهُمْ وَلَآ أَوْلَٰدُهُم مِّنَ ٱللَّهِ
شَيْـًٔا ۖ وَأُو۟لَٰٓئِكَ هُمْ وَقُودُ ٱلنَّارِ ﴿١٠﴾
كَدَأْبِ ءَالِ فِرْعَوْنَ وَٱلَّذِينَ مِن
قَبْلِهِمْ ۚ كَذَّبُوا۟ بِـَٔايَٰتِنَا فَأَخَذَهُمُ ٱللَّهُ
بِذُنُوبِهِمْ ۗ وَٱللَّهُ شَدِيدُ ٱلْعِقَابِ ﴿١١﴾
قُل لِّلَّذِينَ كَفَرُوا۟ سَتُغْلَبُونَ
وَتُحْشَرُونَ إِلَىٰ جَهَنَّمَ ۚ وَبِئْسَ
ٱلْمِهَادُ ﴿١٢﴾
قَدْ كَانَ لَكُمْ ءَايَةٌ فِى فِئَتَيْنِ
ٱلْتَقَتَا ۖ فِئَةٌ تُقَٰتِلُ فِى سَبِيلِ
ٱللَّهِ وَأُخْرَىٰ كَافِرَةٌ يَرَوْنَهُم
مِّثْلَيْهِمْ رَأْىَ ٱلْعَيْنِ ۚ وَٱللَّهُ يُؤَيِّدُ
بِنَصْرِهِۦ مَن يَشَآءُ ۗ إِنَّ فِى ذَٰلِكَ
لَعِبْرَةً لِّأُو۟لِى ٱلْأَبْصَٰرِ ﴿١٣﴾

---

**1**. చూడండి, 8:44. ఇది 2వ హిజ్రీ శకంలో రమ'దాన్ నెలలో జరిగిన బద్ర్ యుద్ధ విషయం. ఆ యుద్ధంలో ముస్లింలు దాదాపు 313 మంది ఉన్నారు. మరియు మక్కా ముష్రికులు వేయి మంది ఉన్నారు. ఇది ముస్లింల మరియు ముష్రిక్ ఖురైషుల మధ్య జరిగిన మొదటి యుద్ధం. ఖురైషులు ఎంతో యుద్ధ సామగ్రి తీసుకొని వచ్చారు. ముస్లింలు పోరాటకు సిద్ధపడి రాకపోయినప్పటికీ, వారికి అల్లాహ్ (సు.తా.) సహాయం లభించి, గెలుపొందారు.

زُيِّنَ لِلنَّاسِ حُبُّ ٱلشَّهَوَٰتِ مِنَ ٱلنِّسَآءِ وَٱلۡبَنِينَ وَٱلۡقَنَٰطِيرِ ٱلۡمُقَنطَرَةِ مِنَ ٱلذَّهَبِ وَٱلۡفِضَّةِ وَٱلۡخَيۡلِ ٱلۡمُسَوَّمَةِ وَٱلۡأَنۡعَٰمِ وَٱلۡحَرۡثِۗ ذَٰلِكَ مَتَٰعُ ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَاۖ وَٱللَّهُ عِندَهُۥ حُسۡنُ ٱلۡمَـَٔابِ ﴿١٤﴾

**14**. స్త్రీలు, సంతానం మరియు కూర్చి పెట్టిన వెండి బంగారు రాసులు, మేలు జాతి గుఱ్ఱాలు, పశువులు, పొలాలు మొదలైన మనోహరమైన వస్తువుల ప్రేమ ప్రజలకు ఆకర్షణీయంగా చేయబడింది.[1] ఇదంతా ఇహలోక జీవనభోగం. కానీ, అసలైన గమ్యస్థానం అల్లాహ్ వద్దనే ఉంది. (1/2)

۞ قُلۡ أَؤُنَبِّئُكُم بِخَيۡرٖ مِّن ذَٰلِكُمۡۚ لِلَّذِينَ ٱتَّقَوۡاْ عِندَ رَبِّهِمۡ جَنَّٰتٞ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُ خَٰلِدِينَ فِيهَا وَأَزۡوَٰجٞ مُّطَهَّرَةٞ وَرِضۡوَٰنٞ مِّنَ ٱللَّهِۗ وَٱللَّهُ بَصِيرُۢ بِٱلۡعِبَادِ ﴿١٥﴾

**15**. * ఇలా చెప్పు: "ఏమీ? వాటి కంటే ఉత్తమమైన వాటిని నేను మీకు తెలుపనా? దైవభీతి గలవారికి, వారి ప్రభువు వద్ద స్వర్గవనాలుంటాయి. వాటి క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి, అక్కడ వారు శాశ్వతంగా ఉంటారు మరియు వారికి అక్కడ పవిత్ర సహవాసులు (అ'జ్వాజ్) ఉంటారు మరియు వారికి అల్లాహ్ ప్రసన్నత లభిస్తుంది." మరియు అల్లాహ్ తన దాసులను కనిపెట్టుకొని ఉంటాడు.

ٱلَّذِينَ يَقُولُونَ رَبَّنَآ إِنَّنَآ ءَامَنَّا فَٱغۡفِرۡ لَنَا ذُنُوبَنَا وَقِنَا عَذَابَ ٱلنَّارِ ﴿١٦﴾

**16**. ఎవరైతే: "ఓ మా ప్రభూ! మేము నిశ్చయంగా విశ్వసించాము, కావున మా తప్పులను క్షమించు మరియు నరకాగ్ని నుండి మమ్మల్ని తప్పించు." అని పలుకుతారో!

ٱلصَّٰبِرِينَ وَٱلصَّٰدِقِينَ وَٱلۡقَٰنِتِينَ وَٱلۡمُنفِقِينَ وَٱلۡمُسۡتَغۡفِرِينَ بِٱلۡأَسۡحَارِ ﴿١٧﴾

**17**. (అలాంటి వారే!) సహనశీలురు, సత్యవంతులు మరియు వినయవిధేయతలు గలవారు, దానపరులు మరియు వేకువజామున[2] తమ పాపాలకు క్షమాపణ వేడుకునే వారు.

**1**. చూడండి, 18:7.
**2**. చూడండి, 51:18.

**18**. నిశ్చయంగా, ఆయన తప్ప మరొక ఆరాధ్యనీయుడు లేడని, అల్లాహ్, దేవదూతలు మరియు జ్ఞానవంతులు సాక్ష్యమిచ్చారు; ఆయనే న్యాయ పరిరక్షకుడు.[1] ఆయన తప్ప మరొక ఆరాధ్యనీయుడు లేడు! ఆయన సర్వ శక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

**19**. నిశ్చయంగా, అల్లాహ్‌కు సమ్మతమైన ధర్మం కేవలం అల్లాహ్‌కు విధేయులవటం (ఇస్లాం) మాత్రమే.[2] కాని పూర్వ గ్రంథప్రజలు పరస్పర ఈర్ష్యతో, వారికి జ్ఞానం లభించిన తరువాతనే భేదాభిప్రాయాలకు లోనయ్యారు. మరియు ఎవరైతే అల్లాహ్ సూచనలను తిరస్కరిస్తారో! వారు నిశ్చయంగా, అల్లాహ్ లెక్కతీసుకోవటంలో అతి శీఘ్రుడు (అని తెలుసుకోవాలి).

**20**. (ఓ ప్రవక్తా!) వారు నీతో వివాద మాడితే ఇట్లను: "నేనూ మరియు నా అనుచరులు అల్లాహ్ ప్రీతి పొందటానికి ఆయనకు సంపూర్ణంగా విధేయు (ముస్లిము)లమయ్యాము." మరియు గ్రంథప్రజలతో మరియు నిరక్షరాస్యులతో (చదువురాని 'అరబ్బులతో): "ఏమీ? మీరు కూడా విధేయులయ్యారా?" అని అడుగు. వారు విధేయులైతే సన్మార్గం పొందిన వారవుతారు. కాని ఒకవేళ వారు

شَهِدَ ٱللَّهُ أَنَّهُۥ لَآ إِلَٰهَ إِلَّا هُوَ
وَٱلْمَلَٰٓئِكَةُ وَأُو۟لُوا۟ ٱلْعِلْمِ قَآئِمًۢا
بِٱلْقِسْطِ ۚ لَآ إِلَٰهَ إِلَّا هُوَ ٱلْعَزِيزُ
ٱلْحَكِيمُ ﴿١٨﴾
إِنَّ ٱلدِّينَ عِندَ ٱللَّهِ ٱلْإِسْلَٰمُ ۗ
وَمَا ٱخْتَلَفَ ٱلَّذِينَ أُوتُوا۟
ٱلْكِتَٰبَ إِلَّا مِنۢ بَعْدِ مَا جَآءَهُمُ
ٱلْعِلْمُ بَغْيًۢا بَيْنَهُمْ ۗ وَمَن يَكْفُرْ
بِـَٔايَٰتِ ٱللَّهِ فَإِنَّ ٱللَّهَ سَرِيعُ
ٱلْحِسَابِ ﴿١٩﴾
فَإِنْ حَآجُّوكَ فَقُلْ أَسْلَمْتُ وَجْهِىَ لِلَّهِ
وَمَنِ ٱتَّبَعَنِ ۗ وَقُل لِّلَّذِينَ أُوتُوا۟
ٱلْكِتَٰبَ وَٱلْأُمِّيِّۦنَ ءَأَسْلَمْتُمْ ۚ فَإِنْ
أَسْلَمُوا۟ فَقَدِ ٱهْتَدَوا۟ ۖ وَّإِن تَوَلَّوْا۟
فَإِنَّمَا عَلَيْكَ ٱلْبَلَٰغُ ۗ وَٱللَّهُ بَصِيرٌۢ
بِٱلْعِبَادِ ﴿٢٠﴾

---

**1**. ఖాయిమన్ బిల్‌ఖి'స్తి: Maintains His creation in justice. న్యాయ పరిరక్షకుడు, అల్-ముఖ్సి'త్: (సేకరించబడిన పదం) The Equitable, Justly. నిష్పక్షపాతుడు, న్యాయవంతుడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

**2**. చూడండి, 3:85 మరియు 7:158, 25:1.

వెనుదిరిగితే, నీ బాధ్యత కేవలం సందేశాన్ని అందజేయటం మాత్రమే! మరియు అల్లాహ్ తన దాసులను కనిపెట్టుకొని ఉంటాడు.[1]

إِنَّ ٱلَّذِينَ يَكۡفُرُونَ بِـَٔايَٰتِ ٱللَّهِ وَيَقۡتُلُونَ ٱلنَّبِيِّـۧنَ بِغَيۡرِ حَقّٖ وَيَقۡتُلُونَ ٱلَّذِينَ يَأۡمُرُونَ بِٱلۡقِسۡطِ مِنَ ٱلنَّاسِ فَبَشِّرۡهُم بِعَذَابٍ أَلِيمٍ ٢١

**21**. నిశ్చయంగా, అల్లాహ్ ఆదేశా (ఆయత్)లను తిరస్కరించే వారికి మరియు ఆయన ప్రవక్తలను అన్యాయంగా చంపే వారికి మరియు న్యాయసమ్మతంగా వ్యవహరించమని బోధించే ప్రజలను చంపే వారికి, బాధాకరమైన శిక్ష ఉన్నదని తెలియజెయ్యి.

أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ حَبِطَتۡ أَعۡمَٰلُهُمۡ فِي ٱلدُّنۡيَا وَٱلۡأٓخِرَةِ وَمَا لَهُم مِّن نَّٰصِرِينَ ٢٢

**22**. అలాంటి వారి కర్మలు ఇహలోక మందును మరియు పరలోక మందును వృథా అవుతాయి. మరియు వారికి సహాయకులు ఎవ్వరూ ఉండరు.

أَلَمۡ تَرَ إِلَى ٱلَّذِينَ أُوتُواْ نَصِيبٗا مِّنَ ٱلۡكِتَٰبِ يُدۡعَوۡنَ إِلَىٰ كِتَٰبِ ٱللَّهِ لِيَحۡكُمَ بَيۡنَهُمۡ ثُمَّ يَتَوَلَّىٰ فَرِيقٞ مِّنۡهُمۡ وَهُم مُّعۡرِضُونَ ٢٣

**23**. ఏమీ? గ్రంథంలోని కొంతభాగం పొందినవారి పరిస్థితి ఎలాఉందో నీవు గమనించలేదా? వారి మధ్య తీర్పు చేయటానికి, అల్లాహ్ గ్రంథం వైపునకు రండి అని, వారిని ఆహ్వానించినపుడు, వారిలోని ఒక వర్గంవారు విముఖులై, వెనుదిరిగిపోతారు.

ذَٰلِكَ بِأَنَّهُمۡ قَالُواْ لَن تَمَسَّنَا ٱلنَّارُ إِلَّآ أَيَّامٗا مَّعۡدُودَٰتٖۖ وَغَرَّهُمۡ فِي دِينِهِم مَّا كَانُواْ يَفۡتَرُونَ ٢٤

**24**. వారు అలా చేయటానికి కారణం వారు: "నరకాగ్ని కొన్ని దినాలు మాత్రమే మమ్మల్ని తాకుతుంది." అని అనటం. మరియు వారు కల్పించుకున్న అపోహాయే వారిని తమ ధర్మ విషయంలో మోసపుచ్చింది.[2]

---

**1**. చూడండి, 2:96, 3:85.
**2**. చూడండి, 2:80.

25. నిస్సందేహంగా, రాబోయే ఆ (పునరుత్థాన) దినమున, మేము వారిని సమావేశపరిచినప్పుడు, వారిస్థితి ఎలా ఉంటుందో (ఆలోచించారా?) మరియు ప్రతి జీవికి తానుచేసిన కర్మల ఫలితం పూర్తిగా నొసంగబడుతుంది. మరియు వారికెలాంటి అన్యాయం జరుగదు.

فَكَيْفَ إِذَا جَمَعْنَٰهُمْ لِيَوْمٍ لَّا رَيْبَ فِيهِ وَوُفِّيَتْ كُلُّ نَفْسٍ مَّا كَسَبَتْ وَهُمْ لَا يُظْلَمُونَ ﴿٢٥﴾

26. ఇలా అను: "ఓ అల్లాహ్, విశ్వ సామ్రాజ్యాధిపతి![1] నీవు ఇష్టపడిన వారికి రాజ్యాధికారాన్ని ప్రసాదిస్తావు మరియు నీవు కోరిన వారిని రాజ్యాధికారం నుండి తొలగిస్తావు మరియు నీవు ఇష్టపడిన వారికి గౌరవాన్ని (శక్తిని) ప్రసాదిస్తావు మరియు నీవు కోరిన వారిని పరాభవం పాలు చేస్తావు. నీ చేతిలోనే[2] మేలున్నది. నిశ్చయంగా, నీవు ప్రతిదీ చేయగల సమర్థుడవు.

قُلِ ٱللَّهُمَّ مَٰلِكَ ٱلْمُلْكِ تُؤْتِي ٱلْمُلْكَ مَن تَشَآءُ وَتَنزِعُ ٱلْمُلْكَ مِمَّن تَشَآءُ وَتُعِزُّ مَن تَشَآءُ وَتُذِلُّ مَن تَشَآءُ ۖ بِيَدِكَ ٱلْخَيْرُ ۖ إِنَّكَ عَلَىٰ كُلِّ شَيْءٍ قَدِيرٌ ﴿٢٦﴾

27. "నీవు రాత్రిని పగటిలోకి ప్రవేశింప జేస్తావు మరియు పగటిని రాత్రిలోకి ప్రవేశింపజేస్తావు. మరియు నీవు సజీవులను నిర్జీవుల నుండి తీస్తావు మరియు నిర్జీవులను సజీవుల నుండి తీస్తావు. మరియు నీవు కోరిన వారికి లెక్కలేనంత జీవనోపాధిని ప్రసాదిస్తావు."

تُولِجُ ٱلَّيْلَ فِي ٱلنَّهَارِ وَتُولِجُ ٱلنَّهَارَ فِي ٱلَّيْلِ ۖ وَتُخْرِجُ ٱلْحَيَّ مِنَ ٱلْمَيِّتِ وَتُخْرِجُ ٱلْمَيِّتَ مِنَ ٱلْحَيِّ ۖ وَتَرْزُقُ مَن تَشَآءُ بِغَيْرِ حِسَابٍ ﴿٢٧﴾

28. విశ్వాసులు - తమ తోటి విశ్వాసులను విడిచి - సత్యతిరస్కారులను స్నేహితులుగా చేసుకోరాదు. అలా చేసే వారికి అల్లాహ్‌తో ఏ విధమైన

لَّا يَتَّخِذِ ٱلْمُؤْمِنُونَ ٱلْكَٰفِرِينَ أَوْلِيَآءَ مِن دُونِ ٱلْمُؤْمِنِينَ ۖ وَمَن يَفْعَلْ ذَٰلِكَ فَلَيْسَ مِنَ ٱللَّهِ فِي

1. మాలిక్ అల్-ముల్క్: Sovereign of the Universe, విశ్వ సామ్రాట్టు, విశ్వసామ్రాజ్యాధిపతి. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి. చూడండి, 20:114 వ్యాఖ్యానం 3.
2. చూడండి, 3:73.

شَىۡءٍ إِلَّآ أَن تَتَّقُواْ مِنۡهُمۡ تُقَىٰةًۗ وَيُحَذِّرُكُمُ ٱللَّهُ نَفۡسَهُۥۗ وَإِلَى ٱللَّهِ ٱلۡمَصِيرُ ٢٨

సంబంధంలేదు. కాని, వారి దౌర్జన్యానికి భీతిపరులైతే తప్ప! అల్లాహ్ (ఆయనకే భీతిపరులై ఉండమని) మిమ్మల్ని స్వయంగా హెచ్చరిస్తున్నాడు.[1] మరియు అల్లాహ్ వైపుకే మీ మరలింపు ఉంది.

قُلۡ إِن تُخۡفُواْ مَا فِي صُدُورِكُمۡ أَوۡ تُبۡدُوهُ يَعۡلَمۡهُ ٱللَّهُۗ وَيَعۡلَمُ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِۗ وَٱللَّهُ عَلَىٰ كُلِّ شَىۡءٍ قَدِيرٌ ٢٩

**29**. వారితో ఇలా అను: "మీరు మీ హృదయాలలో ఉన్నది దాచినా వెలిబుచ్చినా, అది అల్లాహ్‌కు తెలుస్తుంది. మరియు భూమ్యాకాశాలలో ఉన్నదంతా ఆయనకు తెలుసు. మరియు అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు."

يَوۡمَ تَجِدُ كُلُّ نَفۡسٍ مَّا عَمِلَتۡ مِنۡ خَيۡرٍ مُّحۡضَرًا وَمَا عَمِلَتۡ مِن سُوٓءٍ تَوَدُّ لَوۡ أَنَّ بَيۡنَهَا وَبَيۡنَهُۥٓ أَمَدَۢا بَعِيدًاۗ وَيُحَذِّرُكُمُ ٱللَّهُ نَفۡسَهُۥۗ وَٱللَّهُ رَءُوفُۢ بِٱلۡعِبَادِ ٣٠

**30**. ఆ రోజు ప్రతి ప్రాణి తాను చేసిన మంచిని మరియు తాను చేసిన చెడును ప్రత్యక్షంగా చూసుకున్నప్పుడు, తనకు మరియు దానికి మధ్య దూరం ఉంటే, ఎంత బాగుండేదని ఆశిస్తుంది. మరియు అల్లాహ్ (తనకే భీతిపరులై ఉండమని) మిమ్మల్ని స్వయంగా హెచ్చరిస్తున్నాడు. మరియు అల్లాహ్ తన దాసుల ఎడల ఎంతో కనికరుడు.

قُلۡ إِن كُنتُمۡ تُحِبُّونَ ٱللَّهَ فَٱتَّبِعُونِي يُحۡبِبۡكُمُ ٱللَّهُ وَيَغۡفِرۡ لَكُمۡ ذُنُوبَكُمۡۚ وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ٣١

**31**. (ఓ ప్రవక్తా!) ఇలా అను: "మీకు (నిజంగా) అల్లాహ్ పట్ల ప్రేమ ఉంటే మీరు నన్ను అనుసరించండి. (అప్పుడు) అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు మరియు మీ పాపాలను క్షమిస్తాడు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత."

---

**1**. 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-9, 'హదీస్' నం. 500. ఇంకా చూడండి, 2:257, 54:139. అల్లాహ్ (సు.తా.) విశ్వాసుల ఆప్తస్నేహితుడు. ఈ ఆయత్ యొక్క ఉద్దేశం, వారితో స్నేహభావంతో కలిసి మెలసి ఉండగూడదని కాదు. ఎవరైతే మీతో మంచిగా ఉంటారో వారితో సహృదయంతో మెలుగుతూ వారితో ఇచ్చిపుచ్చుకోవడాలు, వ్యాపారాలు కూడా చేయవచ్చు.

قُلۡ أَطِيعُواْ ٱللَّهَ وَٱلرَّسُولَۖ فَإِن تَوَلَّوۡاْ فَإِنَّ ٱللَّهَ لَا يُحِبُّ ٱلۡكَٰفِرِينَ ٣٢

۞ إِنَّ ٱللَّهَ ٱصۡطَفَىٰٓ ءَادَمَ وَنُوحٗا وَءَالَ إِبۡرَٰهِيمَ وَءَالَ عِمۡرَٰنَ عَلَى ٱلۡعَٰلَمِينَ ٣٣

ذُرِّيَّةَۢ بَعۡضُهَا مِنۢ بَعۡضٖۗ وَٱللَّهُ سَمِيعٌ عَلِيمٌ ٣٤

إِذۡ قَالَتِ ٱمۡرَأَتُ عِمۡرَٰنَ رَبِّ إِنِّي نَذَرۡتُ لَكَ مَا فِي بَطۡنِي مُحَرَّرٗا فَتَقَبَّلۡ مِنِّيٓۖ إِنَّكَ أَنتَ ٱلسَّمِيعُ ٱلۡعَلِيمُ ٣٥

فَلَمَّا وَضَعَتۡهَا قَالَتۡ رَبِّ إِنِّي وَضَعۡتُهَآ أُنثَىٰ وَٱللَّهُ أَعۡلَمُ بِمَا

**32.** (ఇంకా) ఇలా అను: "అల్లాహ్‌కు మరియు సందేశహరునికి విధేయులై ఉండండి." వారు కాదంటే! నిశ్చయంగా, అల్లాహ్ సత్య తిరస్కారులను ప్రేమించడు, (అని తెలుసుకోవాలి).[1] (5/8)

**33.** * నిశ్చయంగా, అల్లాహ్ ఆదమ్‌ను, నూ'హ్‌ను, ఇబ్రాహీమ్ సంతతి వారిని మరియు 'ఇమ్రాన్ సంతతి వారిని, (ఆ కాలపు) సర్వలోకాల (ప్రజలపై ప్రాధాన్యత నిచ్చి) ఎన్నుకున్నాడు.[2]

**34.** వారంతా ఒకే పరంపరకు చెందిన వారు. మరియు అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

**35.** ఇమ్రాన్ భార్య ప్రార్థించింది (జ్ఞాపకం చేసుకోండి): "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, నేను నా గర్భమునందున్న శిశువును నీ సేవకు[3] అంకితం చేయటానికి మొక్కుకున్నాను, కావున నా నుండి దీనిని తప్పక స్వీకరించు. నిశ్చయంగా, నీవే సర్వం వినేవాడవు, సర్వజ్ఞుడవు."

**36.** తరువాత ఆమె ఆడ శిశువు (మర్యమ్)ను ప్రసవించినప్పుడు, ఆమె ఇలా విన్నవించుకున్నది: "ఓ నా ప్రభూ! నేను ఆడశిశువును ప్రసవించాను" - ఆమె

---

**1.** పై ఆయత్‌లో మరియు ఈ ఆయత్‌లో అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞాపాలనతో బాటు ము'హమ్మద్ ('స'అస)ను అనుసరించటం వల్లనే మోక్షం దొరుకుతుందని వ్యక్తపరచబడింది. దీనిని తిరస్కరించేవారిని అల్లాహుతా'ఆలా ఎన్నడూ ప్రేమించడు. చూడండి, 3:85.

**2.** ప్రవక్తల సంతతిలో ఇద్దరు 'ఇమ్రాన్‌లు పేర్కొనబడ్డారు: 1) మూసా మరియు హారూన్ ('అలైహిమ్ స.)ల తండ్రి 'ఇమ్రాన్ మరియు 2) మర్యమ్ తండ్రి 'ఇమ్రాన్. ఇక్కడ పేర్కొనబడ్డ 'ఇమ్రాన్ గారు, మర్యమ్ ('అ.స.) తండ్రి అని, వ్యాఖ్యాతల అభిప్రాయం. (ఖు'ర్తుబీ, ఇబ్నె-కసీ'ర్).

**3.** ము'హర్రరన్: అంటే నీ ఆలయసేవకు అంకితం చేస్తున్నాను అని అర్థం.

وَضَعَتۡ وَلَيۡسَ ٱلذَّكَرُ كَٱلۡأُنثَىٰۖ وَإِنِّي سَمَّيۡتُهَا مَرۡيَمَ وَإِنِّيٓ أُعِيذُهَا بِكَ وَذُرِّيَّتَهَا مِنَ ٱلشَّيۡطَٰنِ ٱلرَّجِيمِ ٣٦

ప్రసవించినదేమిటో అల్లాహ్‌కు బాగా తెలుసు మరియు బాలుడు బాలిక వంటి వాడు కాడు - "మరియు నేను ఈమెకు మర్యమ్ అని పేరు పెట్టాను.[1] మరియు నేను ఈమెను మరియు ఈమె సంతానాన్ని శపించ(బహిష్కరించ)బడిన షైతాన్ నుండి రక్షించటానికి, నీ శరణు వేడుకుంటున్నాను!"[2]

فَتَقَبَّلَهَا رَبُّهَا بِقَبُولٍ حَسَنٖ وَأَنۢبَتَهَا نَبَاتًا حَسَنٗا وَكَفَّلَهَا زَكَرِيَّاۖ كُلَّمَا دَخَلَ عَلَيۡهَا زَكَرِيَّا ٱلۡمِحۡرَابَ وَجَدَ عِندَهَا رِزۡقٗاۖ قَالَ يَٰمَرۡيَمُ أَنَّىٰ لَكِ هَٰذَاۖ قَالَتۡ هُوَ مِنۡ عِندِ ٱللَّهِۖ إِنَّ ٱللَّهَ يَرۡزُقُ مَن يَشَآءُ بِغَيۡرِ حِسَابٍ ٣٧

**37.** ఆ తరువాత ఆ బాలికను, ఆమె ప్రభువు ఆదరంతో స్వీకరించి, ఆమెను ఒక మంచి స్త్రీగా పెంచాడు మరియు ఆమెను 'జకరియ్యా సంరక్షణలో ఉంచాడు.[3] 'జకరియ్యా ఆమె గదికి పోయినప్పుడల్లా, ఆమెవద్ద (ఏవో కొన్ని) భోజన పదార్థాలను చూసి, ఆమెను ఇలా అడిగేవాడు: "ఓ మర్యమ్, ఇది నీ వద్దకు ఎక్కడి నుండి వచ్చింది?" ఆమె ఇలా జవాబిచ్చేది: "ఇది అల్లాహ్ వద్ద నుండి వచ్చింది." నిశ్చయంగా, అల్లాహ్ తాను కోరిన వారికి లెక్కలేనంత జీవనోపాధిని ప్రసాదిస్తాడు.

---

**1.** 'హాఫి'జ్ ఇబ్నె ఖయ్యిమ్, ఎన్నో హదీసులను పరిశీలించి క్రొత్తగా పుట్టిన బిడ్డపేరు మొదటిరోజు, లేక మూడవరోజు లేక ఏడవరోజు పెట్టటం మంచిదని అన్నారు.

**2.** క్రొత్తగా పుట్టిన ప్రతి బిడ్డను షై'తాన్ తాకుతాడు దానితో ఆ బిడ్డ ఏడుస్తోంది. కాని అల్లాహ్ (సు.తా.) ఈ షై'తాన్ తాకటం నుండి మర్యమ్ మరియు 'ఈసా('అ.స.)లను ఇద్దరినీ రక్షించాడు. ('స.బు'ఖారీ, కితాబ్ అత్ తఫ్సీర్; ముస్లిం, కితాబ్ అల్ ఫ'దాయిల్).

**3.** 'జకరియ్యా ('అ.స.) **మర్యమ్** తల్లి సోదరి అయిన ఎలిసబెత్ భర్త. వారి తండ్రి పేరు హారూన్. కావున ఆమె (మర్యమ్)ను హారూన్ సోదరీ అని ఖుర్ఆన్(19:28)లో పేర్కొనబడింది. మర్యమ్ మరియు యహ్యా ('అలైహిమ్ స.లు) ఇద్దరూ అక్కా, చెల్లెళ్ళ బిడ్డలు అని కొందరు వ్యాఖ్యాతలు అంటారు. చూడండి,19:8 వ్యాఖ్యానం 2.
మర్యమ్ ('అ.స.) తండ్రి పేరు 'ఇమ్రాన్. మూసా మరియు హారూన్('అలైహిమ్ స.)ల తండ్రి పేరు కూడా 'ఇమ్రాన్ (Amran). హారూన్ ('అ.స.) సంతతిలో చాలామంది మతగురువులు (Priests) వచ్చారు. చూడండి,19:28 వ్యాఖ్యానం 1.

هُنَالِكَ دَعَا زَكَرِيَّا رَبَّهُۥۖ قَالَ رَبِّ هَبْ لِي مِن لَّدُنكَ ذُرِّيَّةً طَيِّبَةًۖ إِنَّكَ سَمِيعُ ٱلدُّعَآءِ ﴿٣٨﴾

**38**. అప్పుడు 'జకరియ్యా తన ప్రభువును ప్రార్థించాడు. అతను ఇలా విన్నవించుకున్నాడు: "ఓ నా ప్రభూ! నీ కనికరంతో నాకు కూడా ఒక మంచి సంతానాన్ని ప్రసాదించు. నిశ్చయంగా నీవే ప్రార్థనలను వినేవాడవు."

فَنَادَتْهُ ٱلْمَلَٰٓئِكَةُ وَهُوَ قَآئِمٌ يُصَلِّي فِي ٱلْمِحْرَابِ أَنَّ ٱللَّهَ يُبَشِّرُكَ بِيَحْيَىٰ مُصَدِّقًۢا بِكَلِمَةٍ مِّنَ ٱللَّهِ وَسَيِّدًا وَحَصُورًا وَنَبِيًّا مِّنَ ٱلصَّٰلِحِينَ ﴿٣٩﴾

**39**. తరువాత అతను ('జకరియ్యా) తన గదిలో నిలబడి నమా'జ్ చేస్తున్నప్పుడు దేవదూతలు: "నిశ్చయంగా, అల్లాహ్ నీకు య'హ్యా యొక్క శుభవార్తను ఇస్తున్నాడు. అతను, అల్లాహ్ వాక్కును ధృవపరుస్తాడు.[1] అతను మంచి నాయకుడు మరియు మనోనిగ్రహం గల ప్రవక్త అయి సద్వర్తనులలో చేరిన వాడవుతాడు." అని వినిపించారు.

قَالَ رَبِّ أَنَّىٰ يَكُونُ لِي غُلَٰمٌ وَقَدْ بَلَغَنِيَ ٱلْكِبَرُ وَٱمْرَأَتِي عَاقِرٌۖ قَالَ كَذَٰلِكَ ٱللَّهُ يَفْعَلُ مَا يَشَآءُ ﴿٤٠﴾

**40**. అతను ('జకరియ్యా) ఇలా అన్నాడు: "ఓ నా ప్రభూ! నాకు కుమారుడు ఎలా కలుగుతాడు, నాకు ముసలితనం వచ్చింది మరియు నా భార్యనేమో గొడ్రాలు!" ఆయన అన్నాడు: "అలాగే జరుగుతుంది. అల్లాహ్ తాను కోరింది చేస్తాడు."[2]

قَالَ رَبِّ ٱجْعَل لِّيٓ ءَايَةًۖ قَالَ ءَايَتُكَ أَلَّا تُكَلِّمَ ٱلنَّاسَ ثَلَٰثَةَ

**41**. అతను ('జకరియ్యా) ఇలా మనవి చేసుకున్నాడు: "ఓ నా ప్రభూ! నా కొరకు ఏదైనా సూచన నియమించు." ఆయన

---

1. అల్లాహ్ (సు.తా.) వాక్కును ధృవపరుస్తాడు - అంటే 'ఈసా ('అ.స.)ను, ప్రవక్త అని మరియు అతనిపై ఇంజీల్ అవతరింపజేయబడిందని ధృవపరుస్తాడు అని అర్థం. య'హ్యా' అ.స.-(John), 'ఈసా ('అ. స.) కంటే పెద్దవారు. వీరిద్దరు ఒకరినొకరు బలపరచుకున్నారు.
2. య'హ్యా ('అ.స.), 'ఈసా ('అ.స.) కంటే పెద్దవారని ఈ ఆయత్ వల్ల స్పష్టమౌతోంది. 'ఈసా ('అ.స.) ప్రస్తావన ముందు వస్తుంది.

أَيَّامٍ إِلَّا رَمْزًا ۗ وَاذْكُر رَّبَّكَ
كَثِيرًا وَسَبِّحْ بِالْعَشِيِّ
وَالْإِبْكَارِ ﴿٤١﴾
وَإِذْ قَالَتِ الْمَلَائِكَةُ يَا مَرْيَمُ
إِنَّ اللَّهَ اصْطَفَاكِ وَطَهَّرَكِ
وَاصْطَفَاكِ عَلَىٰ نِسَاءِ
الْعَالَمِينَ ﴿٤٢﴾
يَا مَرْيَمُ اقْنُتِي لِرَبِّكِ وَاسْجُدِي
وَارْكَعِي مَعَ الرَّاكِعِينَ ﴿٤٣﴾

ذَٰلِكَ مِنْ أَنبَاءِ الْغَيْبِ نُوحِيهِ
إِلَيْكَ ۚ وَمَا كُنتَ لَدَيْهِمْ إِذْ
يُلْقُونَ أَقْلَامَهُمْ أَيُّهُمْ يَكْفُلُ
مَرْيَمَ وَمَا كُنتَ لَدَيْهِمْ إِذْ
يَخْتَصِمُونَ ﴿٤٤﴾

జవాబిచ్చాడు: "నీకు సూచన ఏమిటంటే, నీవు మూడురోజుల వరకు సైగలతో తప్ప ప్రజలతో మాట్లాడలేవు. నీవు ఎక్కువగా నీ ప్రభువును స్మరించు. మరియు సాయం కాలము నందును మరియు ఉదయము నందును ఆయన పవిత్రతను కొనియాడు."

**42**. మరియు దేవదూతలు: "ఓ మర్యమ్! నిశ్చయంగా, అల్లాహ్ నిన్ను ఎన్నుకున్నాడు. మరియు నిన్ను పరిశుద్ధపరిచాడు. మరియు (నీ కాలపు) సర్వలోకాలలోని స్త్రీలలో నిన్ను ఎన్నుకున్నాడు." అని అన్న విషయం (జ్ఞాపకం చేసుకోండి).

**43**. (వారింకా ఇలా అన్నారు): "ఓ మర్యమ్! నీవు నీ ప్రభువుకు విధేయురాలుగా ఉండు. (ఆయన సాన్నిధ్యంలో) సాష్టాంగం (సజ్దా) చెయ్యి. మరియు వంగే (రుకూ'ఉ చేసే) [1] వారితో కలిసి వంగు (రుకూ'ఉ చెయ్యి)."

**44**. (ఓ ప్రవక్తా!) ఇవన్నీ అగోచరమైన వార్తలు. వాటిని మేము నీకు దివ్యజ్ఞానం (వహీ) ద్వారా తెలుపుతున్నాము. మర్యమ్ సంరక్షకుడు ఎవరు కావాలని, వారు (ఆలయ సేవకులు) తమ కలములను విసిరినపుడు, నీవు వారిదగ్గర లేవు మరియు వారు వాదించుకున్నపుడు కూడా నీవు వారిదగ్గర లేవు.[2]

---

**1**. చూడండి, 2:43 వ్యాఖ్యానం 2.

**2**. ము'హమ్మద్('స'అస)కు అగోచరజ్ఞానం లేదు, అని ఈ ఆయత్ ద్వారా స్పష్టంగా తెలుస్తుంది. ఏ ప్రవక్తకు కూడా అల్లాహ్ (సు.తా.) అన్ని విషయాల అగోచర జ్ఞానం ఇవ్వలేదు. అల్లాహుతా'ఆలా తెలపాలనుకున్నంత మట్టుకే వారికి తెలిపాడు.

إِذۡ قَالَتِ ٱلۡمَلَٰٓئِكَةُ يَٰمَرۡيَمُ إِنَّ ٱللَّهَ يُبَشِّرُكِ بِكَلِمَةٖ مِّنۡهُ ٱسۡمُهُ ٱلۡمَسِيحُ عِيسَى ٱبۡنُ مَرۡيَمَ وَجِيهٗا فِي ٱلدُّنۡيَا وَٱلۡأٓخِرَةِ وَمِنَ ٱلۡمُقَرَّبِينَ ٤٥

**45.** దేవదూతలు ఇలా అన్నది (జ్ఞాపకం చేసుకోండి): "ఓ మర్యమ్! నిశ్చయంగా, అల్లాహ్! నీకు తన వాక్కును గురించి శుభవార్తను ఇస్తున్నాడు.[1] అతని పేరు: 'మసీ'హ్ 'ఈసా ఇబ్నె మర్యమ్.' అతను ఇహలోకంలోనూ మరియు పరలోకంలోనూ గౌరవనీయుడైన వాడై మరియు (అల్లాహ్) సామీప్యం పొందిన వారిలో ఒకడై ఉంటాడు.

وَيُكَلِّمُ ٱلنَّاسَ فِي ٱلۡمَهۡدِ وَكَهۡلٗا وَمِنَ ٱلصَّٰلِحِينَ ٤٦

**46.** "మరియు అతను ప్రజలతో ఉయ్యాలలో ఉండగానే మాట్లాడుతాడు మరియు పెద్దవాడైన తరువాత కూడా (మాట్లాడుతాడు) మరియు సత్పురుషులలో ఒకడై ఉంటాడు."[2]

قَالَتۡ رَبِّ أَنَّىٰ يَكُونُ لِي وَلَدٞ وَلَمۡ يَمۡسَسۡنِي بَشَرٞۖ قَالَ كَذَٰلِكِ ٱللَّهُ يَخۡلُقُ مَا يَشَآءُۚ إِذَا قَضَىٰٓ أَمۡرٗا فَإِنَّمَا يَقُولُ لَهُۥ كُن فَيَكُونُ ٤٧

**47.** ఆమె (మర్యమ్) ఇలా అన్నది: "ఓ నా ప్రభూ! నాకు కుమారుడు ఎలా కలుగుతాడు? ఏ పురుషుడు కూడా నన్ను ముట్టలేదే?" ఇలా సమాధాన మిచ్చాడు: "అల్లాహ్ తాను కోరింది ఇదే విధంగా సృష్టిస్తాడు. ఆయన ఒక పని చేయాలని నిర్ణయించినపుడు కేవలం దానిని: 'అయిపో!' అని అంటాడు, అంతే అది అయిపోతుంది."

---

**1**. ఈ ఆయత్‌లో కలిమతుల్లాహ్, అల్లాహ్ (సు.తా.) వాక్కు అని 'ఈసా ('అ.స.) సంబోధించబడ్డారు. అంటే అతను తండ్రి లేకుండా కేవలం అల్లాహుతా'ఆలా వాక్కు ద్వారా: "అయిపో." అని అనగానే, (తన తల్లి - మర్యమ్ గర్భంలో) అయిపోయారు; ఏ విధంగానైతే ఆదమ్('అ.స.)ను అల్లాహ్ (సు.తా.) తల్లి - దండ్రి లేనిదే మరియు 'హవ్వాను తల్లి లేనిదే సృష్టించాడో! చూడండి, 3:59.

**2.** చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం. 645.

وَيُعَلِّمُهُ ٱلْكِتَٰبَ وَٱلْحِكْمَةَ
وَٱلتَّوْرَىٰةَ وَٱلْإِنجِيلَ ﴿٤٨﴾
وَرَسُولًا إِلَىٰ بَنِىٓ إِسْرَٰٓءِيلَ أَنِّى قَدْ
جِئْتُكُم بِـَٔايَةٍ مِّن رَّبِّكُمْ ۖ أَنِّىٓ
أَخْلُقُ لَكُم مِّنَ ٱلطِّينِ كَهَيْـَٔةِ
ٱلطَّيْرِ فَأَنفُخُ فِيهِ فَيَكُونُ طَيْرًۢا
بِإِذْنِ ٱللَّهِ ۖ وَأُبْرِئُ ٱلْأَكْمَهَ
وَٱلْأَبْرَصَ وَأُحْىِ ٱلْمَوْتَىٰ بِإِذْنِ ٱللَّهِ ۖ
وَأُنَبِّئُكُم بِمَا تَأْكُلُونَ وَمَا تَدَّخِرُونَ
فِى بُيُوتِكُمْ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَءَايَةً لَّكُمْ
إِن كُنتُم مُّؤْمِنِينَ ﴿٤٩﴾
وَمُصَدِّقًا لِّمَا بَيْنَ يَدَىَّ مِنَ
ٱلتَّوْرَىٰةِ وَلِأُحِلَّ لَكُم بَعْضَ
ٱلَّذِى حُرِّمَ عَلَيْكُمْ ۚ وَجِئْتُكُم
بِـَٔايَةٍ مِّن رَّبِّكُمْ فَٱتَّقُوا۟ ٱللَّهَ
وَأَطِيعُونِ ﴿٥٠﴾

**48**. మరియు ఆయన (అల్లాహ్) అతనికి గ్రంథాన్ని మరియు వివేకాన్ని మరియు తౌరాతును మరియు ఇంజీలును నేర్పుతాడు.

**49**. మరియు అతనిని ఇస్రాయీ'ల్ సంతతి వారి వైపుకు సందేశహరునిగా పంపుతాడు. (అతను ఇలా అంటాడు): "నిశ్చయంగా, నేను మీ ప్రభువు తరఫునుండి మీ వద్దకు సూచన (ఆయత్) తీసుకొని వచ్చాను. నిశ్చయంగా, నేను మీ కొరకు మట్టితో పక్షి ఆకారంలో ఒక బొమ్మను తయారుచేసి దానిలో శ్వాసను ఊదుతాను! అప్పుడది అల్లాహ్ ఆజ్ఞతో పక్షి అవుతుంది. మరియు నేను అల్లాహ్ ఆజ్ఞతో పుట్టుగ్రుడ్డిని,[1] కుష్ఠురోగిని బాగు చేస్తాను మరియు మృతుణ్ణి బ్రతికిస్తాను. మరియు మీరు తినేది, ఇండ్లలో కూడబెట్టేది మీకు తెలుపుతాను. మీరు విశ్వాసులే అయితే! నిశ్చయంగా, ఇందులో మీకు ఒక గొప్ప సూచన (ఆయత్) ఉంది.

**50**. "మరియు నేను, ప్రస్తుతం తౌరాత్‌లో (మిగిలి ఉన్న సత్యాన్ని) ధృవపరచటానికి మరియు పూర్వం మీకు నిషేధింపబడిన ('హరామ్ చేయబడిన) కొన్ని వస్తువులను ధర్మసమ్మతం ('హలాల్) చేయటానికి (వచ్చాను).[2] మరియు నేను మీ ప్రభువు తరఫునుండి మీ వద్దకు అద్భుత సూచనలు (ఆయాత్) తీసుకొని వచ్చాను, కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి!

---

**1**. ఇక్కడ "అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞతో" అని రెండుసార్లు పలకడంతో, 'ఈసా ('అ.స.) తనకు స్వయంగా ఏ విధమైన దివ్యశక్తులు లేవనీ మరియు అతను ఏది చేసినా అల్లాహుతా'ఆలా ఆజ్ఞతో మాత్రమే చేశారనీ, స్పష్టమవుతోంది.

**2**. ఇవి అల్లాహ్ (సు.తా.) శిక్షగా ఇస్రాయీ'లు సంతతి వారికి 'హరామ్ చేసినవి కావచ్చు. లేక వారి మతగురువులు 'హరామ్ చేసినవి కావచ్చు.

إِنَّ ٱللَّهَ رَبِّى وَرَبُّكُمْ فَٱعْبُدُوهُ هَٰذَا صِرَٰطٌ مُّسْتَقِيمٌ ﴿٥١﴾

51. "నిశ్చయంగా అల్లాహ్ నా ప్రభువు మరియు మీ ప్రభువు కూడాను, కావున మీరు ఆయననే ఆరాధించండి. ఇదే ఋజుమార్గము." (3/4)

۞ فَلَمَّآ أَحَسَّ عِيسَىٰ مِنْهُمُ ٱلْكُفْرَ قَالَ مَنْ أَنصَارِىٓ إِلَى ٱللَّهِ قَالَ ٱلْحَوَارِيُّونَ نَحْنُ أَنصَارُ ٱللَّهِ ءَامَنَّا بِٱللَّهِ وَٱشْهَدْ بِأَنَّا مُسْلِمُونَ ﴿٥٢﴾

52. * 'ఈసా వారిలో సత్యతిరస్కారాన్ని కనుగొని ఇలా ప్రశ్నించాడు: "అల్లాహ్ మార్గంలో నాకు సహాయకులుగా ఎవరు ఉంటారు?" (అప్పుడతని) శిష్యులు[1] ఇలా జవాబిచ్చారు: "మేము నీకు అల్లాహ్ మార్గంలో సహాయకులముగా ఉంటాము. మేము అల్లాహ్‌ను విశ్వసించాము మరియు మేము అల్లాహ్‌కు విధేయులము (ముస్లింలము) అయ్యామని, నీవు మాకు సాక్షిగా ఉండు.

رَبَّنَآ ءَامَنَّا بِمَآ أَنزَلْتَ وَٱتَّبَعْنَا ٱلرَّسُولَ فَٱكْتُبْنَا مَعَ ٱلشَّٰهِدِينَ ﴿٥٣﴾

53. "ఓ మా ప్రభూ! నీవు అవతరింపజేసిన సందేశాన్ని మేము విశ్వసించాము మరియు మేము ఈ సందేశహరుణ్ణి అనుసరించాము. కావున మమ్మల్ని సాక్షులలో వ్రాసుకో!"

وَمَكَرُوا۟ وَمَكَرَ ٱللَّهُ ۖ وَٱللَّهُ خَيْرُ ٱلْمَٰكِرِينَ ﴿٥٤﴾

54. మరియు వారు (ఇస్రాయీ'ల్ సంతతిలోని అవిశ్వాసులు, 'ఈసాకు విరుద్ధంగా) కుట్రలు చేశారు. మరియు అల్లాహ్ (వారి కుట్రలకు విరుద్ధంగా) పన్నాగాలు పన్నాడు. ఎత్తులు వేయటంలో అల్లాహ్ అత్యుత్తముడు!

إِذْ قَالَ ٱللَّهُ يَٰعِيسَىٰٓ إِنِّى مُتَوَفِّيكَ وَرَافِعُكَ إِلَىَّ وَمُطَهِّرُكَ مِنَ ٱلَّذِينَ

55. (జ్ఞాపకం చేసుకోండి) అప్పుడు అల్లాహ్ ఇలా అన్నాడు: "ఓ 'ఈసా! నేను నిన్ను తీసుకుంటాను మరియు నిన్ను

1. 'హవారియ్యూన్: 'హవారి యొక్క బహువచనం. అంటే సహాయకులు అని అర్థం. ('స. బు'ఖారీ).

كَفَرُواْ وَجَاعِلُ ٱلَّذِينَ ٱتَّبَعُوكَ فَوْقَ
ٱلَّذِينَ كَفَرُوٓاْ إِلَىٰ يَوْمِ ٱلْقِيَٰمَةِۖ ثُمَّ
إِلَيَّ مَرْجِعُكُمْ فَأَحْكُمُ بَيْنَكُمْ
فِيمَا كُنتُمْ فِيهِ تَخْتَلِفُونَ ٥٥
فَأَمَّا ٱلَّذِينَ كَفَرُواْ فَأُعَذِّبُهُمْ عَذَابًا
شَدِيدًا فِي ٱلدُّنْيَا وَٱلْءَاخِرَةِ وَمَا
لَهُم مِّن نَّٰصِرِينَ ٥٦
وَأَمَّا ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ
ٱلصَّٰلِحَٰتِ فَيُوَفِّيهِمْ أُجُورَهُمْۗ وَٱللَّهُ
لَا يُحِبُّ ٱلظَّٰلِمِينَ ٥٧
ذَٰلِكَ نَتْلُوهُ عَلَيْكَ مِنَ ٱلْءَايَٰتِ
وَٱلذِّكْرِ ٱلْحَكِيمِ ٥٨
إِنَّ مَثَلَ عِيسَىٰ عِندَ ٱللَّهِ كَمَثَلِ
ءَادَمَۖ خَلَقَهُۥ مِن تُرَابٍ ثُمَّ قَالَ لَهُۥ
كُن فَيَكُونُ ٥٩
ٱلْحَقُّ مِن رَّبِّكَ فَلَا تَكُن مِّنَ ٱلْمُمْتَرِينَ
٦٠

నావైపునకు ఎత్తుకుంటాను మరియు సత్యతిరస్కారుల నుండి నిన్ను శుద్ధపరుస్తాను మరియు నిన్ను అనుసరించిన వారిని, పునరుత్థానదినం వరకు సత్య తిరస్కారులకు పైచేయిగా ఉండేట్లు చేస్తాను.[1] చివరకు మీరంతా నా వద్దకే మరలి రావలసి ఉంది. అప్పుడు నేను మీ మధ్య తలెత్తిన విబేధాలను గురించి తీర్పు చేస్తాను.

**56**. “ఇక సత్యతిరస్కారులకు ఇహలోకంలో మరియు పరలోకంలోనూ కఠినమైన శిక్ష విధిస్తాను. మరియు వారికి సహాయం చేసేవారు ఎవ్వరూ ఉండరు.”

**57**. మరియు విశ్వసించి సత్కార్యాలు చేసేవారికి (అల్లాహ్) పరిపూర్ణ ప్రతిఫలం ప్రసాదిస్తాడు. మరియు అల్లాహ్ దుర్మార్గులు అంటే ఇష్టపడడు.

**58**. (ఓ ము'హమ్మద్!) మేము నీకు ఈ సూచన(ఆయాత్)లను వినిపిస్తున్నాము. మరియు ఇవి వివేకంతో నిండిన ఉపదేశాలు.

**59**. నిశ్చయంగా, అల్లాహ్ దృష్టిలో 'ఈసా ఉపమానం, ఆదమ్ ఉపమానం, వంటిదే. ఆయన (ఆదమ్‌ను) మట్టితో సృజించి: “అయిపో!” అని అన్నాడు. అంతే అతను అయిపోయాడు.[2]

**60**. ఈ సత్యం నీ ప్రభువు తరఫు నుండి వచ్చింది, కావున నీవు శంకించేవారిలో చేరిన వాడవు కావద్దు.

**1**. చూడండి, 4:159 మరియు 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం. 657 మరియు 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, అధ్యాయం-21.

**2**. ఆదం ('అ.స.) మట్టితో సృష్టించబడ్డారు. చూడండి, 18:37, 22:5, 30:20, 35:11, 40:67.

61. ఈ జ్ఞానం నీకు అందిన తర్వాత కూడా ఎవడైనా నీతో అతనిని ('ఈసాను) గురించి వివాదానికి దిగితే ఇలా అను: "రండి! మేము మరియు మీరు కలిసి, మా కుమారులను మరియు మీ కుమారులను, మా స్త్రీలను మరియు మీ స్త్రీలను పిలుచుకొని, అందరమూ కలిసి: 'అసత్యం పలికే వారిపై అల్లాహ్ శాపం (బహిష్కారం) పడుగాక!' అని హృదయ పూర్వకంగా ప్రార్థిద్దాము."[1]

فَمَنۡ حَآجَّكَ فِيهِ مِنۢ بَعۡدِ مَا جَآءَكَ مِنَ ٱلۡعِلۡمِ فَقُلۡ تَعَالَوۡاْ نَدۡعُ أَبۡنَآءَنَا وَأَبۡنَآءَكُمۡ وَنِسَآءَنَا وَنِسَآءَكُمۡ وَأَنفُسَنَا وَأَنفُسَكُمۡ ثُمَّ نَبۡتَهِلۡ فَنَجۡعَل لَّعۡنَتَ ٱللَّهِ عَلَى ٱلۡكَٰذِبِينَ ٦١

62. నిశ్చయంగా, ఇదే ('ఈసాను గురించిన) సత్యగాథ. మరియు అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యనీయుడు లేడు. మరియు నిశ్చయంగా అల్లాహ్ మాత్రమే సర్వ శక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

إِنَّ هَٰذَا لَهُوَ ٱلۡقَصَصُ ٱلۡحَقُّۚ وَمَا مِنۡ إِلَٰهٍ إِلَّا ٱللَّهُۚ وَإِنَّ ٱللَّهَ لَهُوَ ٱلۡعَزِيزُ ٱلۡحَكِيمُ ٦٢

63. ఒకవేళ వారు వెనుదిరిగితే! నిశ్చయంగా, అల్లాహ్‌కు కల్లోలం రేకెత్తించే వారిని గురించి బాగా తెలుసు.

فَإِن تَوَلَّوۡاْ فَإِنَّ ٱللَّهَ عَلِيمُۢ بِٱلۡمُفۡسِدِينَ ٦٣

64. ఇలా అను: "ఓ గ్రంథ ప్రజలారా! మాకూ మరియు మీకూ మధ్య ఉమ్మడిగా ఉన్న ధర్మవిషయం (ఉత్తరువు) వైపునకు రండి, అది ఏమిటంటే: మనం అల్లాహ్ తప్ప మరెవ్వరినీ ఆరాధించకూడదు, ఆయనకు భాగస్వాములను ఎవ్వరినీ నిలబెట్టకూడదు మరియు అల్లాహ్ తప్ప, మన వారిలో నుండి ఎవ్వరినీ ప్రభువులుగా

قُلۡ يَٰٓأَهۡلَ ٱلۡكِتَٰبِ تَعَالَوۡاْ إِلَىٰ كَلِمَةٖ سَوَآءِۭ بَيۡنَنَا وَبَيۡنَكُمۡ أَلَّا نَعۡبُدَ إِلَّا ٱللَّهَ وَلَا نُشۡرِكَ بِهِۦ شَيۡـٔٗا وَلَا يَتَّخِذَ بَعۡضُنَا بَعۡضًا

---

1. ఇది 9వ హి'జ్రీ విషయం. న'జ్రాన్ నుండి క్రైస్తవ బృందం ఒకటి దైవప్రవక్త ('స'అస)తో కలవటానికి మదీనాకు వస్తుంది. వారికి 'ఈసా ('అ.స.) గురించి ఉన్న మూఢ విశ్వాసాలను గురించి వాదవివాదాలు జరిగిన తరువాత, దైవప్రవక్త ('స'అస) శపథం (ముబాహలహ్) కొరకు సిద్ధపడ్డారు. ముబాహలహ్ అంటే, తమ తమ కుమారులను మరియు స్త్రీలను ఒకచోట చేర్చి: "ఎవరు అసత్యం పలుకుతున్నారో వారు అల్లాహ్ (సు.తా.) శాపానికి పాత్రులై నశించిపోవు గాక!" అని అల్లాహుతా'ఆలా పేరుతో శపథం చేయటం. శపథం చేయటానికి భయపడి, ఆ క్రైస్తవ నాయకులు జి'జ్‌యా ఇవ్వటానికి అంగీకరిస్తారు.

అర్బాబన్ ... 

أَرْبَابًا مِّن دُونِ ٱللَّهِ ۚ فَإِن تَوَلَّوْا۟ فَقُولُوا۟ ٱشْهَدُوا۟ بِأَنَّا مُسْلِمُونَ ﴿٦٤﴾

يَٰٓأَهْلَ ٱلْكِتَٰبِ لِمَ تُحَآجُّونَ فِىٓ إِبْرَٰهِيمَ وَمَآ أُنزِلَتِ ٱلتَّوْرَىٰةُ وَٱلْإِنجِيلُ إِلَّا مِنۢ بَعْدِهِۦٓ ۚ أَفَلَا تَعْقِلُونَ ﴿٦٥﴾

هَٰٓأَنتُمْ هَٰٓؤُلَآءِ حَٰجَجْتُمْ فِيمَا لَكُم بِهِۦ عِلْمٌ فَلِمَ تُحَآجُّونَ فِيمَا لَيْسَ لَكُم بِهِۦ عِلْمٌ ۚ وَٱللَّهُ يَعْلَمُ وَأَنتُمْ لَا تَعْلَمُونَ ﴿٦٦﴾

مَا كَانَ إِبْرَٰهِيمُ يَهُودِيًّا وَلَا نَصْرَانِيًّا وَلَٰكِن كَانَ حَنِيفًا مُّسْلِمًا وَمَا كَانَ مِنَ ٱلْمُشْرِكِينَ ﴿٦٧﴾

إِنَّ أَوْلَى ٱلنَّاسِ بِإِبْرَٰهِيمَ لَلَّذِينَ ٱتَّبَعُوهُ وَهَٰذَا ٱلنَّبِىُّ وَٱلَّذِينَ ءَامَنُوا۟ ۗ وَٱللَّهُ وَلِىُّ ٱلْمُؤْمِنِينَ ﴿٦٨﴾

చేసుకోరాదు."[1] వారు (సమ్మతించకస) తిరిగిపోతే: "మేము నిశ్చయంగా అల్లాహ్‌కు విధేయులము (ముస్లింలము), దీనికి మీరు సాక్షులుగా ఉండండి." అని పలుకు.[2]

**65**. ఓ గ్రంథప్రజలారా! ఇబ్రాహీమ్ (ధర్మాన్ని) గురించి మీరు ఎందుకు వాదులాడు తున్నారు? తౌరాతు మరియు ఇంజీలు అతని తరువాతనే అవత రించాయి కదా! ఇది మీరు అర్థం చేసుకోలేరా?

**66**. అవును, మీరే వారు! తెలిసివున్న విషయాలను గురించి వాదులాడినవారు. అయితే మీకేమీ తెలియని విషయాలను గురించి ఎందుకు వాదులాడుతున్నారు? మరియు అల్లాహ్‌కు అంతా తెలుసు, కానీ మీకు ఏమీ తెలియదు.

**67**. ఇబ్రాహీమ్ యూదుడూ కాడు మరియు క్రైస్తవుడూ కాడు! కాని అతను ఏకదైవ సిద్ధాంతంపై ఉన్నవాడు ('హనీఫ్), అల్లాహ్‌కు విధేయుడు (ముస్లిం) మరియు అతడు ఏ మాత్రం (అల్లాహ్‌కు) సాటి కల్పించేవాడు (ముష్రిక్) కాడు.[3]

**68**. నిశ్చయంగా, ఇబ్రాహీమ్‌తో దగ్గరి సంబంధం గలవారంటే అతనిని అనుసరించే వారు మరియు ఈ ప్రవక్త (ము'హమ్మద్) మరియు (ఇతనిని) విశ్వసించిన వారు. మరియు అల్లాహ్‌యే విశ్వాసుల సంరక్షకుడు.[4]

---

**1**. యూదులు 'ఉ'జైర్ ('అ.స.)ను అల్లాహ్ (సు.తా.) కుమారుడని మరియు క్రైస్తవులు 'ఈసా ('అ.స.)ను అల్లాహుతా'ఆలా కుమారుడని అంటారు. ఇలాంటి వాదాలతో ప్రవక్తలను అల్లాహ్ (సు.తా.)కు భాగస్వాములుగా చేస్తున్నారు. చూడండి, 9:30-31.

**2**. చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-6, 'హదీస్' నం. 75.

**3**. చూడండి, 2:135.

**4**. చూడండి, 16:123.

**69**. గ్రంథ ప్రజలలోని ఒక వర్గం వారు, మిమ్మల్ని మార్గభ్రష్టులు చేయాలని కోరుతున్నారు. కాని వారు తమను తాము తప్ప మరెవ్వరినీ మార్గభ్రష్టులు చేయటం లేదు, కాని వారది గ్రహించటం లేదు.

**70**. "ఓ గ్రంథ ప్రజలారా! మీరు అల్లాహ్ సూచన(ఆయాత్)లను ఎందుకు తిరస్కరిస్తున్నారు? మరియు వాటికి మీరే సాక్షులుగా ఉన్నారు కదా!"

**71**. "ఓ గ్రంథ ప్రజలారా! తెలిసి ఉండి కూడా మీరు సత్యాన్ని అసత్యంతో ఎందుకు కప్పిపుచ్చుతున్నారు? మరియు మీకు తెలిసిఉండి కూడా సత్యాన్ని ఎందుకు దాస్తున్నారు?"[1]

**72**. మరియు గ్రంథ ప్రజలలోని కొందరు (పరస్పరం ఇలా చెప్పుకుంటారు): "(ఈ ప్రవక్తను) విశ్వసించినవారి(ముస్లింల)పై అవతరింపజేయబడిన దానిని ఉదయం విశ్వసించండి మరియు సాయంత్రం తిరస్కరించండి. (ఇలా చేస్తే) బహుశా, వారు కూడా (తమ విశ్వాసం నుండి) తిరిగి పోతారేమో!"

**73**. మరియు (పరస్పరం ఇలా చెప్పుకుంటారు): "మీ ధర్మాన్ని అనుసరించే వారిని తప్ప మరెవ్వరినీ నమ్మకండి." (ఓ ప్రవక్తా!) నీవు వారితో అను: "నిశ్చయంగా అల్లాహ్ మార్గదర్శకత్వమే సరైన మార్గదర్శకత్వం." (వారు ఇంకా ఇలా అంటారు): "మీకు ఇవ్వబడి నటువంటిది

وَدَّت طَّآئِفَةٌ مِّنۡ أَهۡلِ ٱلۡكِتَٰبِ
لَوۡ يُضِلُّونَكُمۡ وَمَا يُضِلُّونَ إِلَّآ
أَنفُسَهُمۡ وَمَا يَشۡعُرُونَ ﴿٦٩﴾
يَٰٓأَهۡلَ ٱلۡكِتَٰبِ لِمَ تَكۡفُرُونَ
بِـَٔايَٰتِ ٱللَّهِ وَأَنتُمۡ تَشۡهَدُونَ ﴿٧٠﴾
يَٰٓأَهۡلَ ٱلۡكِتَٰبِ لِمَ تَلۡبِسُونَ ٱلۡحَقَّ
بِٱلۡبَٰطِلِ وَتَكۡتُمُونَ ٱلۡحَقَّ وَأَنتُمۡ
تَعۡلَمُونَ ﴿٧١﴾
وَقَالَت طَّآئِفَةٌ مِّنۡ أَهۡلِ ٱلۡكِتَٰبِ
ءَامِنُواْ بِٱلَّذِيٓ أُنزِلَ عَلَى ٱلَّذِينَ
ءَامَنُواْ وَجۡهَ ٱلنَّهَارِ وَٱكۡفُرُوٓاْ ءَاخِرَهُۥ
لَعَلَّهُمۡ يَرۡجِعُونَ ﴿٧٢﴾
وَلَا تُؤۡمِنُوٓاْ إِلَّا لِمَن تَبِعَ دِينَكُمۡ قُلۡ
إِنَّ ٱلۡهُدَىٰ هُدَى ٱللَّهِ أَن يُؤۡتَىٰٓ
أَحَدٞ مِّثۡلَ مَآ أُوتِيتُمۡ أَوۡ يُحَآجُّوكُمۡ
عِندَ رَبِّكُمۡۗ قُلۡ إِنَّ ٱلۡفَضۡلَ بِيَدِ ٱللَّهِ

---

1. చూడండి, 2:42.

يُؤۡتِيهِ مَن يَشَآءُۗ وَٱللَّهُ وَٰسِعٌ عَلِيمٌ ٧٣

ఇంకెవరికైనా ఇవ్వబడుతుందని, లేక వారు మీ ప్రభువు సమక్షంలో మీతో వాదిస్తారని, (నమ్మకండి)." వారితో అను: "నిశ్చయంగా, అనుగ్రహం అల్లాహ్ చేతిలోనే ఉంది; ఆయన దానిని తాను కోరిన వారికి ప్రసాదిస్తాడు. మరియు అల్లాహ్ సర్వవ్యాప్తి, సర్వజ్ఞుడు."[1]

يَخۡتَصُّ بِرَحۡمَتِهِۦ مَن يَشَآءُۗ وَٱللَّهُ ذُو ٱلۡفَضۡلِ ٱلۡعَظِيمِ ٧٤

**74.** ఆయన తానుకోరిన వారిని తన కారుణ్యం కొరకు ప్రత్యేకించుకుంటాడు. మరియు అల్లాహ్ దాతృత్వంలో సర్వోత్తముడు. (7/8)

۞ وَمِنۡ أَهۡلِ ٱلۡكِتَٰبِ مَنۡ إِن تَأۡمَنۡهُ بِقِنطَارٖ يُؤَدِّهِۦٓ إِلَيۡكَ وَمِنۡهُم مَّنۡ إِن تَأۡمَنۡهُ بِدِينَارٖ لَّا يُؤَدِّهِۦٓ إِلَيۡكَ إِلَّا مَا دُمۡتَ عَلَيۡهِ قَآئِمٗاۗ ذَٰلِكَ بِأَنَّهُمۡ قَالُواْ لَيۡسَ عَلَيۡنَا فِي ٱلۡأُمِّيِّـۧنَ سَبِيلٞ وَيَقُولُونَ عَلَى ٱللَّهِ ٱلۡكَذِبَ وَهُمۡ يَعۡلَمُونَ ٧٥

**75.** * మరియు గ్రంథప్రజలలో ఎలాంటి వాడున్నాడంటే: నీవు అతనికి ధనరాసులు ఇచ్చినా అతడు వాటిని నమ్మకంగా నీకు తిరిగి అప్పగిస్తాడు. మరొకడు వారిలో ఎలాంటి వాడంటే: నీవతన్ని నమ్మి ఒక్క దీనారు ఇచ్చినా అతడు దానిని - నీవతని వెంటబడితేనే కానీ - నీకు తిరిగి ఇవ్వడు. ఇలాంటి వారు ఏమంటారంటే: "నిరక్షరాస్యుల (యూదులు కాని వారి) పట్ల ఎలా వ్యవహరించినా మాపై ఎలాంటి దోషంలేదు." మరియు వారు తెలిసిఉండి కూడా అల్లాహ్‌ను గురించి అబద్ధాలాడు తున్నారు.[2]

---

**1.** ఈ వాక్యపు తాత్పర్యం ఈ విధంగా కూడా ఉంది: "ఆయన మీకు (ఒకప్పుడు) ఇచ్చినట్టి దానిని (దివ్య జ్ఞానాన్ని) మరొకనికి కూడా ఇచ్చారని (భయపడుతున్నారా?) లేదా వారు మీ ప్రభువు సమక్షంలో మీతో వాదిస్తారని (భయపడుతున్నారా)?" వారితో అను: "నిశ్చయంగా, అనుగ్రహం అల్లాహ్ చేతిలోనే ఉంది; ఆయన దానిని తాను కోరిన వారికి ప్రసాదిస్తాడు. మరియు అల్లాహ్ అపారుడు, సర్వజ్ఞుడు."

**2.** ఉమ్మియ్యీన్: నిరక్షరాస్యులు, అవివేకులు. అంటే 'అరబ్బులు. "యూదులు కాని వారంతా నిరక్షరాస్యులు, అవివేకులు, కావున వారి పట్ల ఎలావ్యవహరించినా పాపం కాదు." అని యూదులు అంటారు. అల్లాహ్ (సు.తా.) వారి ఈ వాదాన్ని ఖండిస్తున్నాడు.

بَلَىٰ مَنْ أَوْفَىٰ بِعَهْدِهِۦ وَٱتَّقَىٰ فَإِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلْمُتَّقِينَ ﴿٧٦﴾

**76**. వాస్తవానికి, ఎవడు తన ఒప్పందాన్ని పూర్తిచేసి దైవభీతి కలిగి ఉంటాడో, అలాంటి దైవభీతి గలవారిని నిశ్చయంగా, అల్లాహ్ ప్రేమిస్తాడు.

إِنَّ ٱلَّذِينَ يَشْتَرُونَ بِعَهْدِ ٱللَّهِ وَأَيْمَٰنِهِمْ ثَمَنًا قَلِيلًا أُو۟لَٰٓئِكَ لَا خَلَٰقَ لَهُمْ فِى ٱلْءَاخِرَةِ وَلَا يُكَلِّمُهُمُ ٱللَّهُ وَلَا يَنظُرُ إِلَيْهِمْ يَوْمَ ٱلْقِيَٰمَةِ وَلَا يُزَكِّيهِمْ وَلَهُمْ عَذَابٌ أَلِيمٌ ﴿٧٧﴾

**77**. నిశ్చయంగా, ఎవరైతే తాము అల్లాహ్‌తో చేసిన ఒప్పందాన్ని మరియు తమ ప్రమాణాలను స్వల్ప లాభాలకు అమ్ముకుంటారో, అలాంటి వారికి పరలోక జీవితంలో ఎలాంటి భాగం ఉండదు మరియు పునరుత్థాన దినమున అల్లాహ్ వారితో మాట్లాడడు మరియు వారివైపు కూడా చూడడు మరియు వారిని పరిశుద్ధులుగా చేయడు మరియు వారికి బాధాకరమైన శిక్ష ఉంటుంది.

وَإِنَّ مِنْهُمْ لَفَرِيقًا يَلْوُۥنَ أَلْسِنَتَهُم بِٱلْكِتَٰبِ لِتَحْسَبُوهُ مِنَ ٱلْكِتَٰبِ وَمَا هُوَ مِنَ ٱلْكِتَٰبِ وَيَقُولُونَ هُوَ مِنْ عِندِ ٱللَّهِ وَمَا هُوَ مِنْ عِندِ ٱللَّهِ وَيَقُولُونَ عَلَى ٱللَّهِ ٱلْكَذِبَ وَهُمْ يَعْلَمُونَ ﴿٧٨﴾

**78**. మరియు మీరు అది గ్రంథంలోనిదని భావించాలని, వాస్తవానికి వారిలో కొందరు తమ నాలుకలను త్రిప్పి గ్రంథాన్ని చదువుతారు, కాని (నిజానికి) అది గ్రంథంలోనిది కాదు; మరియు వారు: "అది అల్లాహ్ దగ్గర నుండి వచ్చింది." అని అంటారు, కాని అది (నిజానికి) అల్లాహ్ దగ్గర నుండి వచ్చింది కాదు, మరియు వారు తెలిసి కూడా అల్లాహ్‌పై అబద్ధాలు పలుకుతున్నారు.

مَا كَانَ لِبَشَرٍ أَن يُؤْتِيَهُ ٱللَّهُ ٱلْكِتَٰبَ وَٱلْحُكْمَ وَٱلنُّبُوَّةَ ثُمَّ يَقُولَ لِلنَّاسِ كُونُوا۟ عِبَادًا لِّى

**79**. ఏ మానవునికైనా అల్లాహ్ అతనికి గ్రంథాన్ని, వివేకాన్ని మరియు ప్రవక్త పదవిని ప్రసాదించిన తర్వాత అతడు ప్రజలతో: "మీరు అల్లాహ్‌కు బదులుగా నన్ను ప్రార్థించండి." అని

مِن دُونِ ٱللَّهِ وَلَٰكِن كُونُواْ رَبَّٰنِيِّـۧنَ بِمَا كُنتُمۡ تُعَلِّمُونَ ٱلۡكِتَٰبَ وَبِمَا كُنتُمۡ تَدۡرُسُونَ ﴿٧٩﴾

అనటం తగినది కాదు,[1] కాని వారితో: "మీరు ఇతరులకు బోధించే మరియు మీరు చదివే గ్రంథాల అనుసారంగా ధర్మవేత్తలు (రబ్బానియ్యీన్) కండి." అని అనటం (భావింపదగినది);

وَلَا يَأۡمُرَكُمۡ أَن تَتَّخِذُواْ ٱلۡمَلَٰٓئِكَةَ وَٱلنَّبِيِّـۧنَ أَرۡبَابًاۗ أَيَأۡمُرُكُم بِٱلۡكُفۡرِ بَعۡدَ إِذۡ أَنتُم مُّسۡلِمُونَ ﴿٨٠﴾

**80**. మరియు మీరు దేవదూతలనో, లేదా ప్రవక్తలనో ప్రభువులుగా చేసుకోండని అతను మిమ్మల్ని ఎన్నడూ ఆజ్ఞాపించడు. అయితే! అలాంటప్పుడు మీరు అల్లాహ్‌కు విధేయు(ముస్లిం)లు అయిన తరువాత మిమ్మల్ని సత్యతిరస్కారులు కమ్మని ఆదేశించగలడా?[2]

وَإِذۡ أَخَذَ ٱللَّهُ مِيثَٰقَ ٱلنَّبِيِّـۧنَ لَمَآ ءَاتَيۡتُكُم مِّن كِتَٰبٖ وَحِكۡمَةٖ ثُمَّ جَآءَكُمۡ رَسُولٞ مُّصَدِّقٞ لِّمَا مَعَكُمۡ لَتُؤۡمِنُنَّ بِهِۦ وَلَتَنصُرُنَّهُۥۚ قَالَ ءَأَقۡرَرۡتُمۡ وَأَخَذۡتُمۡ عَلَىٰ ذَٰلِكُمۡ إِصۡرِيۖ

**81**. మరియు అల్లాహ్ ప్రవక్తల నుండి తీసుకున్న గట్టి ప్రమాణాన్ని[3] (జ్ఞాపకం చేసుకోండి): "నేను మీకు ఒక గ్రంథాన్ని మరియు వివేకాన్ని ప్రసాదించిన తరువాత, ఒక సందేశహరుడు (ము'హమ్మద్) వచ్చి (మీ గ్రంథాలలో నుండి మిగిలివున్న) సత్యాన్ని ధృవపరిస్తే, మీరు అతని (ధర్మాన్ని) విశ్వసించి, అతనికి సహాయం చేయవలసి ఉంటుంది." అని చెప్పి ఇలా

---

**1**. ఇక్కడ 'ఈసా('అ.స.)ను గురించి చెప్పబడింది.

**2**. సయ్యిద్‌నా 'ఉమర్ (ర'ది.'అ.) కథనం నేను దైవప్రవక్త('స'అస)ను, ఇలా అంటూ ఉండగా విన్నాను: "క్రైస్తవులు మర్యమ్ కుమారుడు 'ఈసా('అ.స.)ను పొగడినట్లు, మీరు నన్ను పొగడకండి. నేను కేవలం అల్లాహ్ (సు.తా.) దాసుణ్ణి, కావున నన్ను అల్లాహుతా'ఆలా దాసుడు మరియు ఆయన సందేశహరుడు." అని మాత్రమే అనండి. ('స.బు'ఖారీ, పుస్తకం-4, 'హ. నం. 654).

**3**. దీని అర్థమేమిటంటే, ప్రతి ప్రవక్త తన తరువాత వచ్చివ సందేశహరుణ్ణి అనుసరించాలి. ఒకవేళ వారిద్దరూ ఒకేసారి సజీవులై ఉన్నా సరే! ఉదాహరణకు యహ్యా ('అ.స.) తన తరువాత వచ్చిన 'ఈసా('అ.స.)ను అనుసరించారు. ప్రవక్తలు ప్రమాణం చేశారంటే వారిని అనుసరించే ప్రజలు కూడా తమ ప్రవక్తల ప్రమాణాన్ని శిరసావహించాలి.

ప్రశ్నించాడు: "ఏమి? మీరు దీనికి అంగీకరిస్తారా? మరియు నా ఈ ప్రమాణాన్ని స్వీకరిస్తారా?" వారన్నారు: "మేము అంగీకరిస్తాము." అప్పుడు ఆయన అన్నాడు: "అయితే, మీరు దీనికి సాక్షులుగా ఉండండి. మరియు నేను కూడా మీతో పాటు సాక్షిగా ఉంటాను.

قَالُوٓاْ أَقۡرَرۡنَاۚ قَالَ فَٱشۡهَدُواْ وَأَنَا۠ مَعَكُم مِّنَ ٱلشَّٰهِدِينَ ٨١

**82**. "ఇకపై ఎవరు తమ వాగ్దానం నుండి మరలుతారో, వారే దుష్టులు (ఫాసిఖూన్)."

فَمَن تَوَلَّىٰ بَعۡدَ ذَٰلِكَ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلۡفَٰسِقُونَ ٨٢

**83**. ఏమీ? వీరు అల్లాహ్ ధర్మం కాక వేరే ధర్మాన్ని అవలంబించగోరుతున్నారా? మరియు భూమ్యాకాశాలలో ఉన్నవన్నీ ఇష్టంఉన్నా, ఇష్టంలేకున్నా ఆయనకే విధేయు(ముస్లిం)లై ఉన్నాయి! మరియు ఆయన వైపునకే అందరూ మరలింపబడతారు.[1]

أَفَغَيۡرَ دِينِ ٱللَّهِ يَبۡغُونَ وَلَهُۥٓ أَسۡلَمَ مَن فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ طَوۡعٗا وَكَرۡهٗا وَإِلَيۡهِ يُرۡجَعُونَ ٨٣

**84**. (ఓ ప్రవక్తా!) ఇలా అను: "మేము అల్లాహ్‌ను విశ్వసించాము మరియు మాపై అవతరింపజేయబడిన దానిని మరియు ఇబ్రాహీమ్, ఇస్మా`యీల్, ఇస్`హాఖ్, య`అఖూబ్‌లపై మరియు అతని సంతానంపై అవతరింపజేయబడిన వాటిని కూడా (విశ్వసించాము). ఇంకా మూసా, `ఈసా మరియు ఇతర ప్రవక్తలపై వారి ప్రభువు తరఫునుండి (అవతరింప జేయబడిన వాటిని కూడా విశ్వసించాము). మేము వారి మధ్య ఎలాంటి విచక్షణ చేయము. మరియు మేము ఆయనకే విధేయు(ముస్లిం)లమై ఉన్నాము."

قُلۡ ءَامَنَّا بِٱللَّهِ وَمَآ أُنزِلَ عَلَيۡنَا وَمَآ أُنزِلَ عَلَىٰٓ إِبۡرَٰهِيمَ وَإِسۡمَٰعِيلَ وَإِسۡحَٰقَ وَيَعۡقُوبَ وَٱلۡأَسۡبَاطِ وَمَآ أُوتِيَ مُوسَىٰ وَعِيسَىٰ وَٱلنَّبِيُّونَ مِن رَّبِّهِمۡ لَا نُفَرِّقُ بَيۡنَ أَحَدٖ مِّنۡهُمۡ وَنَحۡنُ لَهُۥ مُسۡلِمُونَ ٨٤

1. చూడండి, 13:15.

وَمَن يَبۡتَغِ غَيۡرَ ٱلۡإِسۡلَٰمِ دِينٗا فَلَن يُقۡبَلَ مِنۡهُ وَهُوَ فِي ٱلۡأٓخِرَةِ مِنَ ٱلۡخَٰسِرِينَ ٨٥

**85**. మరియు ఎవడైనా అల్లాహ్‌కు విధేయత (ఇస్లాం) తప్ప ఇతర ధర్మాన్ని అవలంబించగోరితే అది ఏ మాత్రమూ స్వీకరించబడదు మరియు అతడు పరలోకంలో నష్టపడేవారిలో చేరుతాడు.[1]

كَيۡفَ يَهۡدِي ٱللَّهُ قَوۡمٗا كَفَرُواْ بَعۡدَ إِيمَٰنِهِمۡ وَشَهِدُوٓاْ أَنَّ ٱلرَّسُولَ حَقّٞ وَجَآءَهُمُ ٱلۡبَيِّنَٰتُۚ وَٱللَّهُ لَا يَهۡدِي ٱلۡقَوۡمَ ٱلظَّٰلِمِينَ ٨٦

**86**. అల్లాహ్ వారికి ఎలా సన్మార్గం చూపగలడు? ఏ జాతివారైతే, విశ్వాసం పొందిన తరువాత - మరియు నిశ్చయంగా, సందేశహరుడు సత్యవంతుడే, అని సాక్ష్యమిచ్చిన తరువాత మరియు వారి వద్దకు స్పష్టమైన సూచనలు వచ్చిన తరువాత కూడా - సత్యతిరస్కారం అవలంబించారో! మరియు అల్లాహ్ దుర్మార్గులైన వారికి సన్మార్గం చూపడు.

أُوْلَٰٓئِكَ جَزَآؤُهُمۡ أَنَّ عَلَيۡهِمۡ لَعۡنَةَ ٱللَّهِ وَٱلۡمَلَٰٓئِكَةِ وَٱلنَّاسِ أَجۡمَعِينَ ٨٧

**87**. అలాంటి వారి శిక్ష: నిశ్చయంగా, అల్లాహ్ మరియు దేవదూతల మరియు సర్వమానవుల శాపం వారిపై పడటమే!

خَٰلِدِينَ فِيهَا لَا يُخَفَّفُ عَنۡهُمُ ٱلۡعَذَابُ وَلَا هُمۡ يُنظَرُونَ ٨٨

**88**. అందు(నరకం)లో వారు శాశ్వతంగా ఉంటారు. వారి శిక్ష ఏమాత్రం తగ్గించబడదు మరియు వారికి వ్యవధి కూడా ఇవ్వబడదు.

إِلَّا ٱلَّذِينَ تَابُواْ مِنۢ بَعۡدِ ذَٰلِكَ وَأَصۡلَحُواْ فَإِنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٌ ٨٩

**89**. కానీ, ఇక మీదట ఎవరైతే పశ్చాత్తాపపడి, తమ నడవడికను సరిదిద్దు కుంటారో! అలాంటి వారి యెడల నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.[2]

---

**1**. చూ. 'స.ముస్లిం, పుస్తకం-1, అధ్యాయం-240, 'స.బు'ఖారీ, పుస్తకం-1, 'హ.నం.47,50, 87.

**2**. అన్సార్‌లలో నుండి ఒకడు ఇస్లాం స్వీకరించిన తరువాత 'ముర్తద్' అంటే ఇస్లాంను విడిచిపెట్టి, మళ్ళీ ముష్రిక్ అవుతాడు. కాని అతి త్వరలోనే అతనికి తన తప్పు అర్థమవుతుంది. అతడు ఇతరుల ద్వారా దైవప్రవక్త (సఅస) దగ్గరికి: ''ఏమీ? నా పశ్చాత్తాపం అంగీకరించబడునా?'' అనే విన్నపం పంపిస్తాడు. అప్పుడు ఈ ఆయత్‌లు అవతరింపజేయబడ్డాయి.

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ بَعْدَ إِيمَٰنِهِمْ ثُمَّ ٱزْدَادُواْ كُفْرًا لَّن تُقْبَلَ تَوْبَتُهُمْ وَأُوْلَٰٓئِكَ هُمُ ٱلضَّآلُّونَ ﴿٩٠﴾

**90**. (అయితే) నిశ్చయంగా విశ్వసించిన తరువాత ఎవరు సత్య తిరస్కార వైఖరిని అవలంబిస్తారో మరియు తమ సత్యతిరస్కార వైఖరిని పెంచుకుంటారో, వారి పశ్చాత్తాపం ఏ మాత్రం అంగీకరించబడదు మరియు అలాంటి వారే మార్గభ్రష్టులైన వారు.[1]

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ وَمَاتُواْ وَهُمْ كُفَّارٌ فَلَن يُقْبَلَ مِنْ أَحَدِهِم مِّلْءُ ٱلْأَرْضِ ذَهَبًا وَلَوِ ٱفْتَدَىٰ بِهِۦٓۗ أُوْلَٰٓئِكَ لَهُمْ عَذَابٌ أَلِيمٌ وَمَا لَهُم مِّن نَّٰصِرِينَ ﴿٩١﴾

**91**. నిశ్చయంగా, ఎవరైతే సత్య తిరస్కారులై, ఆ సత్యతిరస్కార స్థితిలోనే మృతి చెందుతారో! వారు భూగోళమంత బంగారం పాప పరిహారంగా ఇవ్వదలచినా అది అంగీకరించబడదు. అలాంటి వారికి బాధాకరమైన శిక్ష ఉంటుంది. మరియు వారికి సహాయం చేసేవారు ఎవ్వరూ ఉండరు.[2]

---

**1**. ఇక్కడి పశ్చాత్తాపం, మరణసమయం ఆసన్నమైనప్పుడు చేసే పశ్చాత్తాపం, అని అర్థం. ఎందుకంటే అల్లాహ్ (సు.తా.) తనదాసుల పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తానని దివ్యఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు అన్నాడు. ఉదాహరణకు 42:25, 9:104. కాని జీవితమంతా పాపాలు చేసి, మరణసమయం ఆసన్నమైనప్పుడు పశ్చాత్తాపపడితే వారి పశ్చాత్తాపాన్ని అంగీకరించనని 4:18లో వ్యక్తంచేశాడు.

**2**. చూడండి, 'స.బు'ఖారీ, పుస్తకం-8, 'హదీస్' నం. 546. ఇంకా చూడండి, 2:123, 14:31.

لَن تَنَالُواْ ٱلۡبِرَّ حَتَّىٰ تُنفِقُواْ مِمَّا تُحِبُّونَۚ وَمَا تُنفِقُواْ مِن شَيۡءٖ فَإِنَّ ٱللَّهَ بِهِۦ عَلِيمٞ ﴿٩٢﴾

92. మీకు అత్యంత ప్రీతికరమైన దానిని మీరు (అల్లాహ్ మార్గంలో) ఖర్చుపెట్టనంత వరకు మీరు పుణ్యాత్ము(ధర్మనిష్ఠాపరు)లు కాలేరు.[1] మరియు మీరు ఏమి ఖర్చుపెట్టినా అది అల్లాహ్‌కు తప్పక తెలుస్తుంది.

۞ كُلُّ ٱلطَّعَامِ كَانَ حِلّٗا لِّبَنِيٓ إِسۡرَٰٓءِيلَ إِلَّا مَا حَرَّمَ إِسۡرَٰٓءِيلُ عَلَىٰ نَفۡسِهِۦ مِن قَبۡلِ أَن تُنَزَّلَ ٱلتَّوۡرَىٰةُۗ قُلۡ فَأۡتُواْ بِٱلتَّوۡرَىٰةِ فَٱتۡلُوهَآ إِن كُنتُمۡ صَٰدِقِينَ ﴿٩٣﴾

93. (*) ఆహారపదార్థాలన్నీ ఇస్రాయీలు సంతతి వారికి ధర్మసమ్మతమైనవిగానే ఉండేవి. కాని, తౌరాతు అవతరణకు పూర్వం ఇస్రాయీ'ల్ (య'అఖూబ్) తనకు తాను కొన్ని వస్తువులను నిషేధించుకున్నాడు. వారితో ఇట్లను: "మీరు సత్యవంతులే అయితే, తౌరాత్‌ను తీసుకొనిరండి మరియు దానిని చదవండి."[2]

فَمَنِ ٱفۡتَرَىٰ عَلَى ٱللَّهِ ٱلۡكَذِبَ مِنۢ بَعۡدِ ذَٰلِكَ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلظَّٰلِمُونَ ﴿٩٤﴾

94. కావున దీని తర్వాత కూడా ఎవడైనా అబద్ధాన్ని కల్పించి దానిని అల్లాహ్‌కు ఆపాదిస్తే, అలాంటి వారు, వారే దుర్మార్గులు.

قُلۡ صَدَقَ ٱللَّهُۗ فَٱتَّبِعُواْ مِلَّةَ إِبۡرَٰهِيمَ حَنِيفٗا وَمَا كَانَ مِنَ ٱلۡمُشۡرِكِينَ ﴿٩٥﴾

95. ఇలా అను: "అల్లాహ్ సత్యం పలికాడు. కనుక మీరు ఏక దైవసిద్ధాంతం (సత్య ధర్మం) అయిన ఇబ్రాహీమ్ ధర్మాన్నే అనుసరించండి. మరియు అతను అల్లాహ్‌కు సాటి కల్పించేవాడు (ముష్రిక్) కాడు."

---

1. ఏ వస్తువు దానం చేసినా పుణ్యం దొరుకుతుంది. కాని తనకు నచ్చిన వస్తువులలో నుండి దానం చేస్తే దానికి ఎంతో గొప్పపుణ్యం లభిస్తుంది. దానానికి పేదవారైన దగ్గరి బంధువులు ఎవరినైతే పోషించడం విధి కాదో వారు ఎక్కువ హక్కుదారులు. ఇంకా చూడండి, 2:177.
2. ఇబ్రాహీమ్ ('అ.స.) ధర్మంలో ఒంటె మాంసం మరియు దాని పాలు 'హరాం కావు. కాని ఇస్రాయీ'ల్(య'అఖూబ్ 'అ.స.) తానే స్వయంగా వీటిని 'హరాం చేసుకున్నాడు. తౌరాత్ మూసా('అ.స.)పై అవతరింపజేయబడింది. అది య'అఖూబ్('అ.స.) గతించిన ఎన్నో సంవత్సరాల తర్వాత అవతరింపజేయబడింది. కావున ఇక్కడ అల్లాహ్ (సు.తా.) ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాడు. మరియు తౌరాత్‌లో 'హరాం చేయబడిన వస్తువులు, యూదులు చేసిన దుర్మార్గాలకు ఫలితంగా 'హరాం చేయబడ్డాయి. అవి ఇబ్రాహీం ('అ.స.) కాలంలో 'హరాం చేయబడలేదు. చూడండి, 4:160 మరియు 6:146, (ఐసర్ అత్-తఫాసీర్).

إِنَّ أَوَّلَ بَيْتٍ وُضِعَ لِلنَّاسِ لَلَّذِي بِبَكَّةَ مُبَارَكًا وَهُدًى لِّلْعَالَمِينَ ﴿٩٦﴾

فِيهِ ءَايَٰتٌۢ بَيِّنَٰتٌ مَّقَامُ إِبْرَٰهِيمَ وَمَن دَخَلَهُۥ كَانَ ءَامِنًا وَلِلَّهِ عَلَى ٱلنَّاسِ حِجُّ ٱلْبَيْتِ مَنِ ٱسْتَطَاعَ إِلَيْهِ سَبِيلًا وَمَن كَفَرَ فَإِنَّ ٱللَّهَ غَنِيٌّ عَنِ ٱلْعَٰلَمِينَ ﴿٩٧﴾

قُلْ يَٰٓأَهْلَ ٱلْكِتَٰبِ لِمَ تَكْفُرُونَ بِـَٔايَٰتِ ٱللَّهِ وَٱللَّهُ شَهِيدٌ عَلَىٰ مَا تَعْمَلُونَ ﴿٩٨﴾

**96**. నిశ్చయంగా, మానవజాతి కొరకు మొట్టమొదట నియమించబడిన (ఆరాధనా) గృహం బక్కా(మక్కా)లో ఉన్నదే, శుభాలతో నిండినది సమస్తలోకాల ప్రజలకు మార్గదర్శకత్వాన్ని ప్రసాదించేది.[1]

**97**. అందులో స్పష్టమైన సంకేతాలు ఉన్నాయి. ఇబ్రాహీమ్ నిలిచిన స్థలం ఉంది. మరియు దానిలో ప్రవేశించినవాడు అభయం (రక్షణ) పొందుతాడు.[2] మరియు అక్కడికి పోవటానికి, శక్తిగల వారికి ఆ గృహయాత్ర ('హిజ్జుల్ బైత్) అల్లాహ్ (ప్రసన్నత) కొరకు చేయటం, విధిగా చేయబడింది.[3] ఎవరు దీనిని తిరస్కరిస్తారో! వారు నిశ్చయంగా, అల్లాహ్ సమస్తలోకాల వారి అవసరంలేని స్వయంసమృద్ధుడు (అని తెలుసుకోవాలి).

**98**. ఇలా అను: "ఓ గ్రంథప్రజలారా! మీరు అల్లాహ్ సందేశాలను ఎందుకు తిరస్కరిస్తున్నారు? మరియు మీరు చేసే కర్మలన్నింటికీ అల్లాహ్ సాక్షిగా[4] ఉన్నాడు!"

---

**1**. చూడండి, 2:125. మక్కాలోని క'అబహ్ పవిత్ర గృహాన్ని ఇబ్రాహీమ్ ('అ.స.) - ఇస్మా'యీల్ ('అ.స.) సహాయంతో - అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞానుసారంగా నిర్మించారు. ఇది జెరూసలంలోని - సులైమాన్ ('అ.స.) నిర్మించిన - బైతుల్ మ'ఖ్దిస్ (పవిత్ర గృహం) కంటే ఎంతో ప్రాచీనమైన ఆరాధనా గృహం. కావున ము'హమ్మద్ ('స'అస) - అల్లాహుతా'ఆలా ఆజ్ఞతో - నమా'జ్ చేసేటప్పుడు తమ ముఖాన్ని క'అబహ్ ('హరమ్) వైపునకు చేయగోరారు. ఇది మానవజాతి కొరకు నిర్మించబడిన మొట్టమొదటి ఆరాధనాలయం.

**2**. 'హరమ్ సరిహద్దులలో యుద్ధం, హత్య, వేటాడటం మరియు చెట్లను కోయటం కూడా నిషేధింపబడ్డాయి. (స'హీ'హ్ బు'ఖారీ మరియు స'హీ'హ్ ముస్లిం).

**3**. ముస్లింలకు ఎవరైతే ఆరోగ్యవంతులైఉండి 'హజ్జ్ చేయటానికి కావలసిన ఖర్చులు భరించగలిగి వుండి, శాంతియుతంగా ఎలాంటి ధన, ప్రాణ హాని లేకుండా 'హజ్జ్ కు పోగలరో, వారి కొరకు వారి జీవితంలో ఒక్కసారి 'హజ్జ్ యాత్రకు పోవటం విధిగా చేయబడింది, (ఇబ్నె-కసీ'ర్). చూడండి, 'స.బు'ఖారీ, పుస్తకం-2, అధ్యాయం-1; 'స. ముస్లిం పుస్తకం-1, అధ్యాయం-52.

**4**. షహీదున్ (**అష్-షహీదు**): All-Witness, The Omniscient. He from whose knowledge nothing is hidden. సర్వసాక్షి, అన్నీ ఎరిగిన, తన జ్ఞానంతో ప్రతిచోట ఉండేవాడు. చూడండి, 5:117, 58:6.

قُلْ يَـٰٓأَهْلَ ٱلْكِتَـٰبِ لِمَ تَصُدُّونَ
عَن سَبِيلِ ٱللَّهِ مَنْ ءَامَنَ تَبْغُونَهَا
عِوَجًا وَأَنتُمْ شُهَدَآءُ ۗ وَمَا ٱللَّهُ
بِغَـٰفِلٍ عَمَّا تَعْمَلُونَ ﴿٩٩﴾

**99**. ఇంకా ఇలా అను: "ఓ గ్రంథ ప్రజలారా! మీరు దానికి (సత్యమార్గానికి) సాక్ష్యులుగా ఉండి కూడా అది వక్రమార్గమని చూపదలచి, విశ్వసించిన వారిని అల్లాహ్ మార్గంపై నడవకుండా ఎందుకు ఆటంకపరుస్తున్నారు?[1] మరియు అల్లాహ్ మీ కర్మల పట్ల నిర్లక్ష్యంగా లేడు."

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِن تُطِيعُوا۟
فَرِيقًا مِّنَ ٱلَّذِينَ أُوتُوا۟ ٱلْكِتَـٰبَ
يَرُدُّوكُم بَعْدَ إِيمَـٰنِكُمْ كَـٰفِرِينَ ﴿١٠٠﴾

**100**. ఓ విశ్వసించిన ప్రజలారా! మీరు గ్రంథ ప్రజలలో కొందరి (మాటలు విని) వారిని అనుసరిస్తే! వారు మిమ్మల్ని, విశ్వసించిన తరువాత కూడా సత్యతిరస్కారులుగా మార్చివేస్తారు.

وَكَيْفَ تَكْفُرُونَ وَأَنتُمْ تُتْلَىٰ
عَلَيْكُمْ ءَايَـٰتُ ٱللَّهِ وَفِيكُمْ
رَسُولُهُۥ ۗ وَمَن يَعْتَصِم بِٱللَّهِ فَقَدْ
هُدِىَ إِلَىٰ صِرَٰطٍ مُّسْتَقِيمٍ ﴿١٠١﴾

**101**. మరియు అల్లాహ్ సందేశాలు మీకు చదివి వినిపించబడుతూ ఉన్నప్పుడు మరియు ఆయన సందేశహరుడు మీలో ఉన్నప్పుడు; మీరు ఎలా సత్యతిరస్కారులు కాగలరు? మరియు మీలో ఎవడు స్థిరంగా అల్లాహ్‌ను ఆశ్రయిస్తాడో, అతడు నిశ్చయంగా, ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం పొందినవాడే!

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ ٱتَّقُوا۟ ٱللَّهَ حَقَّ
تُقَاتِهِۦ وَلَا تَمُوتُنَّ إِلَّا وَأَنتُم
مُّسْلِمُونَ ﴿١٠٢﴾

**102**. ఓ విశ్వసించిన ప్రజలారా! మీరు కర్తవ్యపాలనగా అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు మీరు అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు)గా ఉన్న స్థితిలో తప్ప మరణించకండి!

---

**1**. చూడండి, 2:42.

**103**. మీరందరూ కలసి అల్లాహ్ త్రాడు (ఖుర్ఆన్)ను గట్టిగా పట్టుకోండి. మరియు విభేదాలలో పడకండి.[1] అల్లాహ్ మీ యెడల చూపిన అనుగ్రహాలను జ్ఞాపకం చేసుకోండి; మీరు ఒకరికొకరు శత్రువులుగా ఉండేవారు, ఆయన మీ హృదయాలను కలిపాడు. ఆయన అనుగ్రహం వల్లనే మీరు పరస్పరం సోదరులయ్యారు. మరియు మీరు అగ్ని గుండం ఒడ్డున నిలబడినప్పుడు ఆయన మిమ్మల్ని దానినుండి రక్షించాడు. ఈ విధంగా అల్లాహ్ తన సూచనలను మీకు స్పష్టం చేస్తున్నాడు, బహుశా మీరు మార్గదర్శకత్వం పొందుతారని!

**104**. మీలో ఒక వర్గం, (ప్రజలను) మంచి మార్గం వైపునకు పిలిచేదిగా, ధర్మాన్ని (మంచిని) ఆదేశించే(బోధించే)దిగా మరియు అధర్మాన్ని (చెడును) నిషేధించే (నిరోధించే)దిగా ఉండాలి.[2] మరియు అలాంటి వారు, వారే సాఫల్యం పొందేవారు.

**105**. స్పష్టమైన ఉపదేశాలను పొందిన తరువాత కూడా ఎవరైతే, (వేర్వేరు తెగలుగా) చీలిపోయారో మరియు విభేదాలకు గురిఅయ్యారో, వారి మాదిరిగా మీరూ కావద్దు.[3] మరియు అలాంటి వారికి ఘోరశిక్ష ఉంటుంది.

وَٱعۡتَصِمُواْ بِحَبۡلِ ٱللَّهِ جَمِيعٗا
وَلَا تَفَرَّقُواْۚ وَٱذۡكُرُواْ نِعۡمَتَ ٱللَّهِ
عَلَيۡكُمۡ إِذۡ كُنتُمۡ أَعۡدَآءٗ فَأَلَّفَ بَيۡنَ
قُلُوبِكُمۡ فَأَصۡبَحۡتُم بِنِعۡمَتِهِۦٓ إِخۡوَٰنٗا
وَكُنتُمۡ عَلَىٰ شَفَا حُفۡرَةٖ مِّنَ ٱلنَّارِ
فَأَنقَذَكُم مِّنۡهَاۗ كَذَٰلِكَ يُبَيِّنُ ٱللَّهُ
لَكُمۡ ءَايَٰتِهِۦ لَعَلَّكُمۡ تَهۡتَدُونَ ١٠٣
وَلۡتَكُن مِّنكُمۡ أُمَّةٞ يَدۡعُونَ إِلَى
ٱلۡخَيۡرِ وَيَأۡمُرُونَ بِٱلۡمَعۡرُوفِ وَيَنۡهَوۡنَ
عَنِ ٱلۡمُنكَرِۚ وَأُوْلَٰٓئِكَ هُمُ
ٱلۡمُفۡلِحُونَ ١٠٤
وَلَا تَكُونُواْ كَٱلَّذِينَ تَفَرَّقُواْ
وَٱخۡتَلَفُواْ مِنۢ بَعۡدِ مَا جَآءَهُمُ ٱلۡبَيِّنَٰتُۚ
وَأُوْلَٰٓئِكَ لَهُمۡ عَذَابٌ عَظِيمٞ ١٠٥

---

**1**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "యూదులు 71 తెగలుగా, క్రైస్తవులు 72 తెగలుగా విభజింప బడ్డారు. కాని నా సమాజం వారు 73 తెగలుగా విభజింపబడతారు. వారిలో ఒక్క తెగ తప్ప అందరూ నరకంలో పడవేయబడతారు. ఆ ఒక్కతెగ ఎవరంటే, ఏ విధానంపై నేను మరియు నా 'స'హాబా (ర'ది.'అన్హుమ్) ఉన్నామో దానిని అనుసరించేవారు. అంటే ఖుర్ఆన్ మరియు దైవప్రవక్త ('స'అస) యొక్క సున్నత్‌పై అమలు చేసేవారు." (తిర్మిజీ', ఇబ్నె-మాజా, అబూ-దావూద్).

**2**. ఇటువంటి వాక్యానికి చూడండి, 3:110, 114, 9:71, 112 మరియు 22:41.

**3**. యూదులు మరియు క్రైస్తవుల మాదిరిగా చూడండి, 6:159.

**106**. ఆ (తీర్పు) దినమున కొందరి ముఖాలు (సంతోషంతో) ప్రకాశిస్తూ ఉంటాయి. మరికొందరి ముఖాలు (దుఃఖంతో) నల్లబడి ఉంటాయి. ఇక ఎవరి ముఖాలు నల్లబడి ఉంటాయో వారితో: "మీరు విశ్వసించిన తరువాత సత్యతిరస్కారులు అయ్యారు కదా? కాబట్టి మీరు సత్యాన్ని తిరస్కరించి నందుకు ఈ శిక్షను అనుభవించండి." (అని అనబడుతుంది).

يَوۡمَ تَبۡيَضُّ وُجُوهٞ وَتَسۡوَدُّ وُجُوهٞۚ فَأَمَّا ٱلَّذِينَ ٱسۡوَدَّتۡ وُجُوهُهُمۡ أَكَفَرۡتُم بَعۡدَ إِيمَٰنِكُمۡ فَذُوقُواْ ٱلۡعَذَابَ بِمَا كُنتُمۡ تَكۡفُرُونَ ١٠٦

**107**. ఇక ఎవరి ముఖాలు ప్రకాశిస్తూ ఉంటాయో, వారు అల్లాహ్ కారుణ్యం (స్వర్గం)లో ఉంటారు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

وَأَمَّا ٱلَّذِينَ ٱبۡيَضَّتۡ وُجُوهُهُمۡ فَفِي رَحۡمَةِ ٱللَّهِۖ هُمۡ فِيهَا خَٰلِدُونَ ١٠٧

**108**. (ఓ ప్రవక్తా!) ఇవి అల్లాహ్ సూక్తులు (ఆయాత్) మేము వాటిని యథాతథంగా నీకు వినిపిస్తున్నాము. మరియు అల్లాహ్ సర్వ లోకాల వారికి అన్యాయం చేయగోరడు.

تِلۡكَ ءَايَٰتُ ٱللَّهِ نَتۡلُوهَا عَلَيۡكَ بِٱلۡحَقِّۗ وَمَا ٱللَّهُ يُرِيدُ ظُلۡمٗا لِّلۡعَٰلَمِينَ ١٠٨

**109**. మరియు ఆకాశాలలో ఉన్నదంతా మరియు భూమిలో ఉన్నదంతా అల్లాహ్‌కే చెందుతుంది. మరియు వ్యవహారాలన్నీ (తీర్పుకొరకు) అల్లాహ్ వైపునకే మరలింపబడతాయి.

وَلِلَّهِ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِۚ وَإِلَى ٱللَّهِ تُرۡجَعُ ٱلۡأُمُورُ ١٠٩

**110**. మీరే (విశ్వాసులే) మానవజాతి (హితం) కొరకు నిలబెట్టబడిన ఉత్తమ సమాజం వారు. మీరు ధర్మాన్ని ఆదేశించే (బోధించే) వారు మరియు అధర్మాన్ని నిషేధించే (నిరోధించే) వారు మరియు మీరు అల్లాహ్ యందు విశ్వాసం కలిగి

كُنتُمۡ خَيۡرَ أُمَّةٍ أُخۡرِجَتۡ لِلنَّاسِ تَأۡمُرُونَ بِٱلۡمَعۡرُوفِ وَتَنۡهَوۡنَ عَنِ ٱلۡمُنكَرِ وَتُؤۡمِنُونَ بِٱللَّهِۗ وَلَوۡ ءَامَنَ أَهۡلُ ٱلۡكِتَٰبِ

لَكَانَ خَيْرًا لَّهُمۚ مِّنْهُمُ ٱلْمُؤْمِنُونَ وَأَكْثَرُهُمُ ٱلْفَٰسِقُونَ ﴿١١٠﴾ لَن يَضُرُّوكُمْ إِلَّآ أَذًىۖ وَإِن يُقَٰتِلُوكُمْ يُوَلُّوكُمُ ٱلْأَدْبَارَ ثُمَّ لَا يُنصَرُونَ ﴿١١١﴾ ضُرِبَتْ عَلَيْهِمُ ٱلذِّلَّةُ أَيْنَ مَا ثُقِفُوٓاْ إِلَّا بِحَبْلٍ مِّنَ ٱللَّهِ وَحَبْلٍ مِّنَ ٱلنَّاسِ وَبَآءُو بِغَضَبٍ مِّنَ ٱللَّهِ وَضُرِبَتْ عَلَيْهِمُ ٱلْمَسْكَنَةُۚ ذَٰلِكَ بِأَنَّهُمْ كَانُواْ يَكْفُرُونَ بِـَٔايَٰتِ ٱللَّهِ وَيَقْتُلُونَ ٱلْأَنۢبِيَآءَ بِغَيْرِ حَقٍّۚ ذَٰلِكَ بِمَا عَصَواْ وَّكَانُواْ يَعْتَدُونَ ﴿١١٢﴾ ۞ لَيْسُواْ سَوَآءًۗ مِّنْ أَهْلِ ٱلْكِتَٰبِ أُمَّةٌ قَآئِمَةٌ يَتْلُونَ ءَايَٰتِ ٱللَّهِ ءَانَآءَ ٱلَّيْلِ وَهُمْ يَسْجُدُونَ ﴿١١٣﴾

ఉన్నవారు.[1] మరియు ఒకవేళ గ్రంథ ప్రజలు విశ్వసిస్తే, వారికే మేలై ఉండేది. వారిలో కొందరు విశ్వాసులు కూడా ఉన్నారు.[2] కాని అత్యధికులు అవిధేయులే (ఫాసిఖూన్).

**111**. వారు మిమ్మల్ని కొంత వరకు బాధించటం తప్ప, మీకు ఏ విధమైన హాని కలిగించజాలరు. మరియు వారు మీతో యుద్ధం చేసినట్లయితే, మీకు వీపు చూపించి పారిపోతారు, తరువాత వారికెలాంటి సహాయం లభించదు.

**112**. వారు ఎక్కడున్నా అవమానానికే గురిచేయ బడతారు, అల్లాహ్ శరణులోనో లేక మానవుల అభయంలోనో ఉంటేనే తప్ప; వారు అల్లాహ్ ఆగ్రహానికి గురి అయ్యారు మరియు వారు అధోగతికి చేరారు. ఇది వారు అల్లాహ్ సూచనలను తిరస్కరించినందుకు మరియు అన్యాయంగా ప్రవక్తలను చంపినందుకు. ఇది వారి ఆజ్ఞోల్లంఘన మరియు హద్దులు మీరి ప్రవర్తించిన దాని పర్యవసానం.[3] (1/8)

**113**. * వారందరూ ఒకేరకమైన వారు కారు. గ్రంథ ప్రజలలో కొందరు సరైన మార్గంలో ఉన్నవారున్నారు; వారు రాత్రి వేళలందు అల్లాహ్ సూక్తు(ఆయాత్)లను పఠిస్తుంటారు మరియు సాష్టాంగం (సజ్దా) చేస్తుంటారు.

---

**1**. అబూహురైరా కథనం: "మీరే (సత్యధర్మమైన ఇస్లాంను మరియు దైవప్రవక్త 'స'అస సున్నతులను అనుసరించే వారే), ఉత్తమమైన మానవసమాజానికి చెందినవారు." ('స.బు'ఖారీ పుస్తకం-6, 'హదీస్' నం. 80).

**2**. 'అబ్దుల్లాహ్ బిన్-సల్లాం (ర'ది.'అ.) వంటి వారు.

**3**. ఇది యూదులను గురించి చెప్పబడింది.

114. వారు అల్లాహ్‌ను మరియు అంతిమ దినాన్ని విశ్వసిస్తారు. మరియు ధర్మాన్ని ఆదేశిస్తారు (బోధిస్తారు) మరియు అధర్మాన్ని నిషేధిస్తారు (నిరోధిస్తారు) మరియు మంచి పనులు చేయటంలో పోటీపడతారు మరియు ఇలాంటి వారే సత్పురుషులలోని వారు.

يُؤْمِنُونَ بِٱللَّهِ وَٱلْيَوْمِ ٱلْـَٔاخِرِ وَيَأْمُرُونَ بِٱلْمَعْرُوفِ وَيَنْهَوْنَ عَنِ ٱلْمُنكَرِ وَيُسَٰرِعُونَ فِى ٱلْخَيْرَٰتِ وَأُو۟لَٰٓئِكَ مِنَ ٱلصَّٰلِحِينَ ﴿١١٤﴾

115. మరియు వారు ఏ మంచిపని చేసినా అది వృథాచేయబడదు. మరియు దైవభీతి గలవారెవరో అల్లాహ్‌కు బాగా తెలుసు.[1]

وَمَا يَفْعَلُوا۟ مِنْ خَيْرٍ فَلَن يُكْفَرُوهُ ۗ وَٱللَّهُ عَلِيمٌۢ بِٱلْمُتَّقِينَ ﴿١١٥﴾

116. నిశ్చయంగా, సత్యతిరస్కారానికి పాల్పడిన వారికి, వారి సంపద గానీ, వారి సంతానం గానీ, అల్లాహ్ ముందు ఏమీ పనికిరావు. మరియు అలాంటి వారు నరకాగ్ని వాసులే. అందు వారు శాశ్వతంగా ఉంటారు.

إِنَّ ٱلَّذِينَ كَفَرُوا۟ لَن تُغْنِىَ عَنْهُمْ أَمْوَٰلُهُمْ وَلَآ أَوْلَٰدُهُم مِّنَ ٱللَّهِ شَيْـًٔا ۖ وَأُو۟لَٰٓئِكَ أَصْحَٰبُ ٱلنَّارِ ۚ هُمْ فِيهَا خَٰلِدُونَ ﴿١١٦﴾

117. వారు ఈ ఇహలోక జీవితంలో చేస్తున్న ధనవ్యయాన్ని, తమకు తాము అన్యాయం చేసుకున్న వారి పొలాలపై వీచి, వాటిని సమూలంగా నాశనం చేసే, మంచు గాలితో పోల్చవచ్చు. మరియు అల్లాహ్ వారికెలాంటి అన్యాయం చేయలేదు, కానీ వారే తమకుతాము అన్యాయం చేసుకున్నారు.[2]

مَثَلُ مَا يُنفِقُونَ فِى هَٰذِهِ ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا كَمَثَلِ رِيحٍ فِيهَا صِرٌّ أَصَابَتْ حَرْثَ قَوْمٍ ظَلَمُوٓا۟ أَنفُسَهُمْ فَأَهْلَكَتْهُ ۚ وَمَا ظَلَمَهُمُ ٱللَّهُ وَلَٰكِنْ أَنفُسَهُمْ يَظْلِمُونَ ﴿١١٧﴾

1. చూడండి, 3:199.
2. సత్యతిరస్కారుల దానధర్మాలు గానీ, పుణ్యకార్యాలు గానీ వారికి పరలోక జీవితంలో ఏ విధంగాను పనికిరావు ఎందుకంటే విశ్వాసంలేని దానాలు ఫలించవు. మోక్షానికి మూలం విశ్వాసమే. చూడండి, 3:85.

**118**. ఓ విశ్వాసులారా! మీరు మీ వారిని (విశ్వాసులను) తప్ప ఇతరులను మీ సన్నిహిత స్నేహితులుగా చేసుకోకండి. వారు మీకు హాని కలిగించే ఏ అవకాశాన్నైనా ఉపయోగించు కోవటానికి వెనుకాడరు. వారు మిమ్మల్ని ఇబ్బందిలో చూడగోరుతున్నారు. మరియు వారి ఈర్ష్య వారి నోళ్ళనుండి బయటపడుతున్నది, కాని వారి హృదయాలలో దాచుకున్నది దానికంటే తీవ్రమైనది. వాస్తవానికి మేము ఈ సూచనలను మీకు స్పష్టంచేశాము. మీరు అర్థం చేసుకోగలిగితే (ఎంత బాగుండేది)![1]

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تَتَّخِذُواْ بِطَانَةً مِّن دُونِكُمْ لَا يَأْلُونَكُمْ خَبَالًا وَدُّواْ مَا عَنِتُّمْ قَدْ بَدَتِ ٱلْبَغْضَآءُ مِنْ أَفْوَٰهِهِمْ وَمَا تُخْفِى صُدُورُهُمْ أَكْبَرُ قَدْ بَيَّنَّا لَكُمُ ٱلْءَايَٰتِ إِن كُنتُمْ تَعْقِلُونَ ﴿١١٨﴾

**119**. అవును! మీరైతే వారిని ప్రేమిస్తున్నారు. కాని వారు మిమ్మల్ని ప్రేమించటం లేదు. మరియు మీరు దివ్య గ్రంథాలన్నింటినీ విశ్వసిస్తున్నారు. వారు మీతో కలసినపుడు: "మేము విశ్వసించాము." అని అంటారు. కాని వేరుగా ఉన్నప్పుడు, మీ ఎడల ఉన్న క్రోధావేశం వల్ల తమ వ్రేళ్ళను కొరుక్కుంటారు. వారితో: "మీ క్రోధావేశంలో మీరే మాడి చావండి, నిశ్చయంగా, హృదయాలలో దాగి ఉన్నదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు." అని అను.

هَٰٓأَنتُمْ أُوْلَآءِ تُحِبُّونَهُمْ وَلَا يُحِبُّونَكُمْ وَتُؤْمِنُونَ بِٱلْكِتَٰبِ كُلِّهِۦ وَإِذَا لَقُوكُمْ قَالُوٓاْ ءَامَنَّا وَإِذَا خَلَوْاْ عَضُّواْ عَلَيْكُمُ ٱلْأَنَامِلَ مِنَ ٱلْغَيْظِ قُلْ مُوتُواْ بِغَيْظِكُمْ إِنَّ ٱللَّهَ عَلِيمٌۢ بِذَاتِ ٱلصُّدُورِ ﴿١١٩﴾

---

**1**. చూడండి, 60:8-9 ఎవరైతే మీ ధర్మం కారణంగా మిమ్మల్ని విరోధించక మీకు హాని చేయక, మిమ్మల్ని మీ ఇండ్లనుండి వెళ్ళగొట్టరో, అట్టి వారితో మీరు కరుణతో న్యాయంతో వ్యవహరించండి. కాని ఎవరైతే మీ ధర్మం కారణంగా మీతో పోరాడి మిమ్మల్ని మీ ఇండ్లనుండి వెళ్ళగొడతారో, అలాంటి వారు మీ స్నేహితులు కారు, వారితో ధర్మయుద్ధం (జిహాద్) చేయండి.

إِن تَمۡسَسۡكُمۡ حَسَنَةٞ تَسُؤۡهُمۡ وَإِن تُصِبۡكُمۡ سَيِّئَةٞ يَفۡرَحُواْ بِهَاۖ وَإِن تَصۡبِرُواْ وَتَتَّقُواْ لَا يَضُرُّكُمۡ كَيۡدُهُمۡ شَيۡـًٔاۗ إِنَّ ٱللَّهَ بِمَا يَعۡمَلُونَ مُحِيطٞ ١٢٠

**120**. మీకేదైనా మేలు కలిగితే వారికది దుఃఖం కలిగిస్తుంది మరియు మీకేదైనా కీడు కలిగితే వారికది సంతోషం కలిగిస్తుంది. మరియు మీరు సహనం వహించి దైవభీతి కలిగిఉంటే, వారికుట్ర మీకెలాంటి నష్టం కలిగించజాలదు. నిశ్చయంగా, అల్లాహ్ వారు చేసేదానినంతా పరివేష్టించి ఉన్నాడు.

وَإِذۡ غَدَوۡتَ مِنۡ أَهۡلِكَ تُبَوِّئُ ٱلۡمُؤۡمِنِينَ مَقَٰعِدَ لِلۡقِتَالِۗ وَٱللَّهُ سَمِيعٌ عَلِيمٌ ١٢١

**121**. మరియు (ఓ ప్రవక్తా! ఆ దినాన్ని జ్ఞాపకంచేసుకో) నీవు వేకువజామున నీ ఇంటి నుండి బయలుదేరి (ఉ'హుద్ క్షేత్రంలో) విశ్వాసులను వారి వారి యుద్ధ స్థానాలలో నియమించటానికి వెళ్ళావు. మరియు అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.[1]

---

**1**. ఈ ఆయత్ ఉ'హుద్ యుద్ధం గురించి తెలియజేస్తుందని ధర్మవేత్తలందరి అభిప్రాయం. అది 3వ హిజ్రీ, షవ్వాల్ నెలలో జరిగింది. 2వ హిజ్రీ రమ'దాన్ నెలలో జరిగిన బద్ర్ యుద్ధంలో మక్కా ముష్రికుల సంఖ్య దాదాపు 1000 ఉండింది. వారివద్ద మంచి యుద్ధ సామగ్రి ఉండింది. ముస్లింలు కేవలం 313 మంది మాత్రమే ఉన్నప్పటికీ, వారివద్ద సరియైన యుద్ధ సామగ్రి లేకపోయినప్పటికీ అల్లాహుతా'ఆలా సహాయంతో వారు ముష్రిక్కులను ఓడించి వారిలో 70 మందిని సంహరించి, 70 మందిని బందీలుగా చేసుకుంటారు. దాని ప్రతీకారం తీర్చుకొనేందుకు మక్కా ఖురైషులు 3వ హిజ్రీ షవ్వాల్ నెలలో దాదాపు 3000 మంది యుద్ధ వీరులతో మదీనాకు 3 మైళ్ళ దూరంలో ఉన్న ఉ'హుద్ పర్వతం వద్దకు చేరుకుంటారు. దైవప్రవక్త ('స'అస) ఇది తెలుసుకొని తమ సహాబీలతో సంప్రదిస్తారు. దైవప్రవక్త ('స'అస) ఉద్దేశం, మరికొందరి నాయకుల ఉద్దేశం, మదీనా నగరం లోపలనే ఉండి యుద్ధం చేయాలని. కపటవిశ్వాసు(మునాఫిఖ్)ల నాయకుడు, 'అబ్దుల్లాహ్ బిన్-ఉబై కూడా అదే కోరుతాడు. కాని అనేక మంది ముస్లింలు మదీనా నుండి బయటికి పోయి పోరాడాలని కోరుతారు. దైవప్రవక్త ('స'అస) వారి కోరికపై యుద్ధసామగ్రి ధరించి తన ఇంటినుండి బయటికివస్తారు. ఈ విధంగా దాదాపు 1000 మంది ముస్లింలతో యుద్ధానికి సిద్ధమై ఉ'హుద్ వైపుకు పోతూ ఉండగా, కపటవిశ్వాసుల నాయకుడు 'అబ్దుల్లాహ్ బిన్-ఉబై - తన మాటను గౌరవించలేదనే సాకుతో - తన 300 మంది అనుచరులతో యుద్ధంలో పాల్గొనకుండా, వెనుదిరిగి పోతాడు. 700 మంది విశ్వాసులు మాత్రమే దైవప్రవక్త('స'అస)తో పాటు ఉహుద్‌కు చేరుతారు. అక్కడ 50 మంది బాణాలను బాగా ప్రయోగించగలిగే, విలుకాండ్రను ఒక చిన్న కొండమీద ఉంచి మీరు ఎట్టి పరిస్థితిలోను మీ చోటు విడిచి యుద్ధమైదానంలోకి రావద్దని ఆజ్ఞాపిస్తారు. యుద్ధం ప్రారంభమై ముస్లిములు విజయం

إِذْ هَمَّت طَّآئِفَتَانِ مِنكُمْ أَن تَفْشَلَا وَٱللَّهُ وَلِيُّهُمَا ۗ وَعَلَى ٱللَّهِ فَلْيَتَوَكَّلِ ٱلْمُؤْمِنُونَ ﴿١٢٢﴾

122. అప్పుడు మీలోని రెండువర్గాల వారు పిరికితనం చూపబోయారు; మరియు అల్లాహ్ వారికి సంరక్షకుడుగా ఉన్నాడు.[1] మరియు విశ్వసించిన వారు అల్లాహ్ యందే నమ్మకం ఉంచుకోవాలి.

وَلَقَدْ نَصَرَكُمُ ٱللَّهُ بِبَدْرٍ وَأَنتُمْ أَذِلَّةٌ ۖ فَٱتَّقُوا۟ ٱللَّهَ لَعَلَّكُمْ تَشْكُرُونَ ﴿١٢٣﴾

123. బద్ర్ (యుద్ధం) నందు మీరు బలహీనులుగా ఉన్నప్పుడు అల్లాహ్ మీకు సహాయం (మిమ్మల్ని విజేతలుగా) చేశాడు. కాబట్టి మీరు కృతజ్ఞతాపరులై అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి!

إِذْ تَقُولُ لِلْمُؤْمِنِينَ أَلَن يَكْفِيَكُمْ أَن يُمِدَّكُمْ رَبُّكُم بِثَلَـٰثَةِ ءَالَـٰفٍ مِّنَ ٱلْمَلَـٰٓئِكَةِ مُنزَلِينَ ﴿١٢٤﴾

124. (ఓ ప్రవక్తా!) నీవు విశ్వాసులతో: "ఏమీ? మీ ప్రభువు, ఆకాశం నుండి మూడువేల దేవదూతలను దింపి మీకు సహాయం చేస్తున్నది చాలదా?" అని అడిగిన సందర్భాన్ని (జ్ఞాపకం చేసుకోండి!)

بَلَىٰٓ ۚ إِن تَصْبِرُوا۟ وَتَتَّقُوا۟ وَيَأْتُوكُم مِّن فَوْرِهِمْ هَـٰذَا يُمْدِدْكُمْ رَبُّكُم بِخَمْسَةِ ءَالَـٰفٍ مِّنَ ٱلْمَلَـٰٓئِكَةِ مُسَوِّمِينَ ﴿١٢٥﴾

125. అవును! ఒకవేళ మీరు సహనం వహించి దైవభీతి కలిగివుంటే, శత్రువు వచ్చి అకస్మాత్తుగా మీ పై పడినా, మీ ప్రభువు ఐదు వేల ప్రత్యేక చిహ్నాలుగల దేవదూతలను పంపి మీకు సహాయం చేయవచ్చు![2]

---

పొందుతారు, ముష్రిక్కులు పారిపోసాగుతారు. అది చూసి ఆ విలుకాండ్రు విజయ ధనం దోచుకోవటానికి తమ స్థానాలను విడిచి కొండదిగి వస్తారు. అది చూసి (అప్పుడు ముష్రిక్‌గా ఉన్న) 'ఖాలిద్ బిన్-వలీద్ ఒక బృందాన్ని తీసుకొని వెనుక నుండి ముస్లింలపై దాడి చేస్తాడు. అకస్మాత్తుగా సంభవించిన ఈ పరిణామంతో ముస్లింలు కలవరపడతారు, ఎంతో మంది తమ ప్రాణాలను కోల్పోతారు. మరియు దైవప్రవక్త ('స'అస) కూడా గాయపడి, క్రింద పడిపోతారు. దానితో ఆయన మరణించారని తలచి ముస్లింలు అటూ ఇటూ పారిపోసాగుతారు. కాని 'ఉమర్ మరియు త్ల్హా (ర'ది.'అన్హుమ్‌లు) ఇక దైవప్రవక్తయే లేకుంటే మనము బ్రతికి ప్రయోజనమేమిటని ప్రేరేపించటం వల్ల ముస్లింలు తిరిగి ఐకమత్యంతో పోరాడుతారు. దానితో ఖురైషీలు వెనుదిరిగి పారిపోతారు.

1. ఈ రెండు తెగలవారు 'ఔస్ మరియు 'ఖ'జ్‌రజ్ అనే అన్సార్ తెగలకు చెందిన, బనూ 'హారిసా' మరియూ బనూ-సల్మా వర్గాలకు చెందిన వారు. కాని అల్లాహ్ (సు.తా.) అనుగ్రహం వలన వారి హృదయాలు దృఢపడతాయి.

2. చూడండి, 8:9-10.

وَمَا جَعَلَهُ ٱللَّهُ إِلَّا بُشْرَىٰ لَكُمْ وَلِتَطْمَئِنَّ قُلُوبُكُم بِهِۦ ۗ وَمَا ٱلنَّصْرُ إِلَّا مِنْ عِندِ ٱللَّهِ ٱلْعَزِيزِ ٱلْحَكِيمِ ﴿١٢٦﴾

**126**. అల్లాహ్ మీకు ఈ విషయాన్ని తెలిపింది మీకు శుభవార్త ఇవ్వటానికి మరియు మీ హృదయాలకు తృప్తి కలుగజేయటానికి మాత్రమే. మరియు సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడైన అల్లాహ్ తప్ప, ఇతరుల నుండి సహాయం (విజయం) రాజాలదు కదా!

لِيَقْطَعَ طَرَفًا مِّنَ ٱلَّذِينَ كَفَرُوٓا۟ أَوْ يَكْبِتَهُمْ فَيَنقَلِبُوا۟ خَآئِبِينَ ﴿١٢٧﴾

**127**. ఆయన ఇదంతా సత్య తిరస్కారంపై నడిచే వారిని కొందరిని నశింపజేయటానికి, లేదా వారు ఘోర పరాజయం పొంది ఆశా భంగంతో వెనుదిరిగి పోవటానికి (చేశాడు).

لَيْسَ لَكَ مِنَ ٱلْأَمْرِ شَىْءٌ أَوْ يَتُوبَ عَلَيْهِمْ أَوْ يُعَذِّبَهُمْ فَإِنَّهُمْ ظَٰلِمُونَ ﴿١٢٨﴾

**128**. (ఓ ప్రవక్తా!) ఈ విషయము నందు నీకెలాంటి అధికారం లేదు.[1] ఆయన (అల్లాహ్) వారిని క్షమించవచ్చు, లేదా వారిని శిక్షించ వచ్చు. ఎందుకంటే నిశ్చయంగా, వారు దుర్మార్గులు.

وَلِلَّهِ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَمَا فِى ٱلْأَرْضِ ۚ يَغْفِرُ لِمَن يَشَآءُ وَيُعَذِّبُ مَن يَشَآءُ ۚ وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴿١٢٩﴾

**129**. మరియు ఆకాశాలలో ఉన్నదంతా మరియు భూమిలో ఉన్నదంతా అల్లాహ్‌కే చెందుతుంది. ఆయన తాను కోరిన వారిని క్షమిస్తాడు మరియు తాను కోరిన వారిని శిక్షిస్తాడు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تَأْكُلُوا۟ ٱلرِّبَوٰٓا۟ أَضْعَٰفًا مُّضَٰعَفَةً ۖ وَٱتَّقُوا۟ ٱللَّهَ لَعَلَّكُمْ تُفْلِحُونَ ﴿١٣٠﴾

**130**. ఓ విశ్వాసులారా! ఇబ్బడి ముబ్బడిగా పెరిగే ఈ వడ్డీని తినకండి. మరియు మీరు సాఫల్యం పొందటానికి అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి.[2]

---

**1**. అంటే ఈ సత్యతిరస్కారులను విశ్వాసం వైపునకు మరల్చటం గానీ, లేక వారి విషయంలోఎలాంటి నిర్ణయం తీసుకోవటం గానీ కేవలం అల్లాహ్ (సు.తా.) అధికారంలోనే ఉంది.

**2**. చూడండి, 2:278, అబూహురైరా (ర`ది.`అ.) కథనం, దైవప్రవక్త (`స`అస) ఇలా

**131**. మరియు సత్యతిరస్కారుల కొరకు సిద్ధంచేయబడిన నరకాగ్నికి భీతిపరులై ఉండండి.

**132**. మరియు మీరు కరుణింప బడటానికి అల్లాహ్‌కు మరియు సందేశహరునికి విధేయులై ఉండండి.[1] (1/4)

**133**. * మరియు మీ ప్రభువు క్షమాభిక్ష కొరకు మరియు స్వర్గవాసం కొరకు ఒకరితోనొకరు పోటీపడండి; అది భూమ్యాకాశాలంత విశాలమైనది; అది దైవభీతి గలవారికై సిద్ధపరచబడింది.

**134**. (వారి కొరకు) ఎవరైతే కలిమిలోనూ మరియు లేమిలోనూ (అల్లాహ్ మార్గంలో) ఖర్చుచేస్తారో మరియు తమ కోపాన్ని నిగ్రహించుకుంటారో మరియు ప్రజలను క్షమిస్తారో! అల్లాహ్ సజ్జనులను ప్రేమిస్తాడు.[2]

**135**. మరియు వారు, ఎవరైతే, అశ్లీల పనులు చేసినా, లేదా తమకు తాము అన్యాయం చేసుకున్నా, అల్లాహ్‌ను స్మరించి తమ పాపాలకు క్షమాపణ వేడుకుంటారో! మరియు అల్లాహ్ తప్ప,

وَٱتَّقُوا۟ ٱلنَّارَ ٱلَّتِىٓ أُعِدَّتْ لِلْكَـٰفِرِينَ
﴿١٣١﴾
وَأَطِيعُوا۟ ٱللَّهَ وَٱلرَّسُولَ لَعَلَّكُمْ
تُرْحَمُونَ ﴿١٣٢﴾
۞ وَسَارِعُوٓا۟ إِلَىٰ مَغْفِرَةٍ مِّن
رَّبِّكُمْ وَجَنَّةٍ عَرْضُهَا ٱلسَّمَـٰوَٰتُ
وَٱلْأَرْضُ أُعِدَّتْ لِلْمُتَّقِينَ ﴿١٣٣﴾
ٱلَّذِينَ يُنفِقُونَ فِى ٱلسَّرَّآءِ وَٱلضَّرَّآءِ
وَٱلْكَـٰظِمِينَ ٱلْغَيْظَ وَٱلْعَافِينَ
عَنِ ٱلنَّاسِ ۗ وَٱللَّهُ يُحِبُّ
ٱلْمُحْسِنِينَ ﴿١٣٤﴾
وَٱلَّذِينَ إِذَا فَعَلُوا۟ فَـٰحِشَةً أَوْ
ظَلَمُوٓا۟ أَنفُسَهُمْ ذَكَرُوا۟ ٱللَّهَ
فَٱسْتَغْفَرُوا۟ لِذُنُوبِهِمْ وَمَن يَغْفِرُ

---

సెలవిచ్చారు: "ఏడు మహా పాపాలనుండి దూరంగా ఉండండి." 'స'హాబా (ర'ది.'అన్హుమ్) అడిగారు: "ఓ ప్రవక్తా ('స'అస)! అవి ఏమిటి?" దైవప్రవక్త ('స'అస) ఇలా సమాధానమిచ్చారు: "అవి 1) ఆరాధనలో అల్లాహ్(సు.తా.)కు భాగస్వాములను కల్పించటం, 2) మంత్ర తంత్రాలు చేయటం, 3) అల్లాహుతా'ఆలా నిషేధించిన ప్రాణిని అన్యాయంగా చంపటం, 4) వడ్డీ తినటం, 5) అనాథుల ఆస్తిని కబళించటం, 6) యుద్ధరంగంలో పిరికితనంతో శత్రువుకు వెన్నుచూపి పారిపోవటం, 7) పతివ్రత స్త్రీలపై నిందలు మోపటం." ('స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం. 28).

1. చూడండి, 3:85.

2. 'స.బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం.141 మరియు 'స.బు'ఖారీ, పుస్తకం-8, 'హదీస్' నం.135.

ٱلذُّنُوبَ إِلَّا ٱللَّهُ وَلَمْ يُصِرُّواْ عَلَىٰ
مَا فَعَلُواْ وَهُمْ يَعْلَمُونَ ﴿١٣٥﴾
أُوْلَٰٓئِكَ جَزَآؤُهُم مَّغْفِرَةٌ مِّن
رَّبِّهِمْ وَجَنَّٰتٌ تَجْرِى مِن
تَحْتِهَا ٱلْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَا ۚ
وَنِعْمَ أَجْرُ ٱلْعَٰمِلِينَ ﴿١٣٦﴾
قَدْ خَلَتْ مِن قَبْلِكُمْ سُنَنٌ فَسِيرُواْ
فِى ٱلْأَرْضِ فَٱنظُرُواْ كَيْفَ كَانَ
عَٰقِبَةُ ٱلْمُكَذِّبِينَ ﴿١٣٧﴾
هَٰذَا بَيَانٌ لِّلنَّاسِ وَهُدًى
وَمَوْعِظَةٌ لِّلْمُتَّقِينَ ﴿١٣٨﴾
وَلَا تَهِنُواْ وَلَا تَحْزَنُواْ وَأَنتُمُ
ٱلْأَعْلَوْنَ إِن كُنتُم مُّؤْمِنِينَ ﴿١٣٩﴾
إِن يَمْسَسْكُمْ قَرْحٌ فَقَدْ مَسَّ
ٱلْقَوْمَ قَرْحٌ مِّثْلُهُۥ ۚ وَتِلْكَ
ٱلْأَيَّامُ نُدَاوِلُهَا بَيْنَ

పాపాలను క్షమించగలవారు ఇతరులు ఎవరున్నారు? మరియు వారు తాము చేసిన (తప్పులను), బుద్ధి పూర్వకంగా మూర్ఖపు పట్టుతో మళ్ళీ చేయరు![1]

**136**. ఇలాంటి వారి ప్రతిఫలం, వారి ప్రభువు నుండి క్షమాభిక్ష మరియు క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలు. వారక్కడ శాశ్వతంగా ఉంటారు. సత్కార్యాలు చేసే వారికి ఎంతశ్రేష్ఠమైన ప్రతిఫలం ఉంది!

**137**. మీకు పూర్వం ఇలాంటి ఎన్నో సంప్రదాయాలు (తరాలు) గడిచిపోయాయి. సత్యాన్ని తిరస్కరించిన వారి గతి ఏమయిందో మీరు భూమిలో సంచారం చేసి చూడండి.

**138**. ఇది (ఈ ఖుర్ఆన్) ప్రజల కొరకు ఒక స్పష్టమైన వ్యాఖ్యానం మరియు దైవభీతి గలవారికి మార్గదర్శకత్వం మరియు హితోపదేశం.

**139**. కాబట్టి మీరు బలహీనత కనబరచ కండి మరియు దుఃఖపడకండి మరియు మీరు విశ్వాసులే అయితే, మీరే తప్పక ప్రాబల్యం పొందుతారు.

**140**. ఒకవేళ ఇపుడు మీరు గాయపడితే, వాస్తవానికి ఆ జాతివారు (మీ విరోధులు) కూడా ఇదేవిధంగా గాయపడ్డారు.[2] మరియు మేము ఇలాంటి దినాలను ప్రజల మధ్య త్రిప్పుతూ ఉంటాము. మరియు అల్లాహ్, మీలో

**1**. చూడండి, 42:25.

**2**. ఇది ఉ`హుద్ యుద్ధాన్ని సూచిస్తుంది.

ٱلنَّاسِ وَلِيَعْلَمَ ٱللَّهُ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَيَتَّخِذَ مِنكُمْ شُهَدَآءَ ۗ وَٱللَّهُ لَا يُحِبُّ ٱلظَّـٰلِمِينَ ﴿١٤٠﴾

నిజమైన విశ్వాసులెవ్వరో తెలుసుకోవటానికీ మరియు (సత్యస్థాపనకు) తమ ప్రాణాలను త్యాగం చేయగల వారిని ఎన్నుకోవటానికీ ఇలా చేస్తూ ఉంటాడు. మరియు అల్లాహ్ దుర్మార్గులను ప్రేమించడు.

وَلِيُمَحِّصَ ٱللَّهُ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَيَمْحَقَ ٱلْكَـٰفِرِينَ ﴿١٤١﴾

**141**. మరియు అల్లాహ్ విశ్వాసులను పరిశుద్ధులుగా[1] చేయటానికీ మరియు సత్యతిరస్కారులను నామరూపాలు లేకుండా చేయటానికీ (ఈ విధంగా చేస్తాడు).

أَمْ حَسِبْتُمْ أَن تَدْخُلُوا۟ ٱلْجَنَّةَ وَلَمَّا يَعْلَمِ ٱللَّهُ ٱلَّذِينَ جَـٰهَدُوا۟ مِنكُمْ وَيَعْلَمَ ٱلصَّـٰبِرِينَ ﴿١٤٢﴾

**142**. ఏమీ? మీలో ఆయన మార్గంలో ప్రాణాలు తెగించి పోరాడేవారు (ధర్మ యోధులు) ఎవరో అల్లాహ్‌కు తెలియక ముందే మరియు సహనం చూపేవారు ఎవరో తెలియక ముందే, మీరు స్వర్గంలో ప్రవేశించగలరని భావిస్తున్నారా?[2]

وَلَقَدْ كُنتُمْ تَمَنَّوْنَ ٱلْمَوْتَ مِن قَبْلِ أَن تَلْقَوْهُ فَقَدْ رَأَيْتُمُوهُ وَأَنتُمْ تَنظُرُونَ ﴿١٤٣﴾

**143**. మరియు వాస్తవానికి, మీరు (అల్లాహ్ మార్గంలో) మరణించాలని కోరుచుంటిరి![3] అది, మీరు దానిని ప్రత్యక్షంగా చూడక ముందటి విషయం; కాని, మీరు దానిని ఎదురుచూస్తుండగానే, వాస్తవానికి ఇప్పుడు అది మీ ముందుకు వచ్చేసింది.

---

**1**. లియుమహ్హిస: ఈ పదానిక మూడు అర్థాలున్నాయి, 1) to test, పరీక్షించుటకు, 2) to purify, పరిశుద్ధపరచుటకు, 3) to get rid off , రద్దు చేయుటకు లేక తీసివేయుటకు. (తఫ్సీర్ అల్-ఖుర్తుబీ).

**2**. చూడండి, 2:214 మరియు 29:2.

**3**. మీరు మీ శత్రువులతో పోరాడటానికి ఆశించకండి. అల్లాహ్ (సు.తా.) శరణుకోరండి. కాని పరిస్థితులవల్ల యుద్ధం ఆవశ్యకమైతే ధైర్యస్థైర్యాలతో పోరాడండి. స్వర్గం కత్తుల ఛాయలో ఉందని తెలుసుకోండి. (సహీహ్ హైన్, ఇబ్నె-కసీర్).

وَمَا مُحَمَّدٌ إِلَّا رَسُولٌ قَدْ خَلَتْ مِن قَبْلِهِ ٱلرُّسُلُ ۚ أَفَإِيْن مَّاتَ أَوْ قُتِلَ ٱنقَلَبْتُمْ عَلَىٰٓ أَعْقَٰبِكُمْ ۚ وَمَن يَنقَلِبْ عَلَىٰ عَقِبَيْهِ فَلَن يَضُرَّ ٱللَّهَ شَيْـًٔا ۗ وَسَيَجْزِى ٱللَّهُ ٱلشَّٰكِرِينَ ﴿١٤٤﴾

**144**. మరియు ము'హమ్మద్[1] కేవలం ఒక సందేశహరుడు మాత్రమే! వాస్తవానికి అతనికి పూర్వం అనేక సందేశహరులు గడచిపోయారు.[2] ఏమీ? ఒకవేళ అతను మరణిస్తే, లేక హత్యచేయబడితే, మీరు వెనుకంజవేసి మరలిపోతారా? మరియు వెనుకంజవేసి మరలిపోయే వాడు అల్లాహ్‌కు ఏ మాత్రం నష్టం కలిగించ లేడు. మరియు కృతజ్ఞతాపరులైన వారికి అల్లాహ్ తగిన ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు.

وَمَا كَانَ لِنَفْسٍ أَن تَمُوتَ إِلَّا بِإِذْنِ ٱللَّهِ كِتَٰبًا مُّؤَجَّلًا ۗ وَمَن يُرِدْ ثَوَابَ ٱلدُّنْيَا نُؤْتِهِۦ مِنْهَا وَمَن يُرِدْ ثَوَابَ ٱلْـَٔاخِرَةِ نُؤْتِهِۦ مِنْهَا ۚ وَسَنَجْزِى ٱلشَّٰكِرِينَ ﴿١٤٥﴾

**145**. అల్లాహ్ అనుమతి లేనిదే, ఏ ప్రాణి కూడా మరణించజాలదు, దానికి ఒక నియమిత కాలం వ్రాయబడి ఉంది. మరియు ఎవడైతే ఈ ప్రపంచ సుఖాన్ని కోరుకుంటాడో, మేము అతనికది నొసంగుతాము మరియు ఎవడు పరలోక సుఖాన్ని కోరుకుంటాడో అతని కది నొసంగుతాము. మరియు మేము కృతజ్ఞులైన వారికి తగిన ప్రతిఫలాన్ని ప్రసాదించగలము.

---

**1**. ము'హమ్మద్ ('స'అస) పేరు ఖుర్ఆన్‌లో 4 సార్లు వచ్చింది. ఇంకా చూడండి, 33:40, 47:2 మరియు 48:29. అ'హ్మద్ ('స'అస) అని 61:6 లో వచ్చింది.

**2**. ఉహుద్ యుద్ధంలో ము'హమ్మద్ ('స'అస) మరణించారనే వార్త వ్యాపించగానే ముస్లింలు ధైర్యాన్ని కోల్పోయి, యుద్ధరంగం నుండి వెనుకంజ వేయసాగుతారు. అప్పుడు ఈ ఆయత్ అవతరింపజేయబడింది. ఇంతకు ముందు కూడా సందేశహరులు హత్యచేయబడ్డారు. మరి దైవప్రవక్త ('స'అస) హత్యచేయబడితే మీరెందుకు వెనుకంజవేయాలి? మీరు కూడా ధైర్యంతో, శత్రువులతో పోరాడి మరణిస్తే, స్వర్గానికి అర్హులవుతారు, విజయం పొందితే విజయధనానికి. కాని వెనుకంజ వేసి, మరణిస్తే, నరకం పాలవుతారు, లేదా యుద్ధఖైదీలై, బానిసలై మీ ఆత్మాభిమానాన్ని కోల్పోతారు. ఒక 'హదీస్': ము'హమ్మద్ ('స'అస) మరణించిన రోజు అబూబక్ర్ (ర'ది.'అ.) ఇలా అన్నారు: "ఎవరైతే ము'హమ్మద్ ('స'అస)ను ఆరాధిస్తారో, వారు ము'హమ్మద్ ('స'అస) గతించిపోయారని తెలుసుకోవాలి. కాని ఎవరైతే కేవలం అల్లాహ్ (సు.తా.)ను ఆరాధిస్తారో, ఆయన నిత్యుడు, సజీవుడు అని తెలుసుకోవాలి." ('స.బు'ఖారీ).

**146**. మరియు ఎందరో ప్రవక్తలు మరియు వారితో కలిసి ఎంతోమంది దైవభక్తులు (రిబ్బియ్యూన్) ధర్మయుద్ధాలు చేశారు, అల్లాహ్ మార్గంలో ఎదురైన కష్టాలకు వారు ధైర్యం విడువలేదు మరియు బలహీనత కనబరచలేదు మరియు వారికి (శత్రువులకు) లోబడనూ లేదు. మరియు అల్లాహ్ ఆపదలలో సహనం వహించే వారిని ప్రేమిస్తాడు.

**147**. మరియు వారి ప్రార్థన కేవలం: ''ఓ మా ప్రభూ! మా పాపాలను, మా వ్యవహారాలలో మేము మితిమీరి పోయిన వాటిని క్షమించు మరియు మా పాదాలకు స్థైర్యాన్ని ప్రసాదించు మరియు సత్య తిరస్కారులకు ప్రతికూలంగా మాకు విజయాన్ని ప్రసాదించు.'' అని పలకటం మాత్రమే!

**148**. కావున అల్లాహ్ వారికి ఇహ లోకంలో తగిన ఫలితాన్ని మరియు పరలోకంలో ఉత్తమ ప్రతిఫలాన్ని ప్రసాదించాడు. మరియు అల్లాహ్ సజ్జనులను ప్రేమిస్తాడు.

**149**. ఓ విశ్వాసులారా! మీరు సత్య తిరస్కారుల సలహాలను పాటిస్తే, వారు మిమ్మల్ని వెనుకకు (అవిశ్వాసం వైపునకు) మరలిస్తారు. అప్పుడు మీరే నష్టపడిన వారవుతారు.

**150**. వాస్తవానికి! అల్లాహ్ యే మీ సంరక్షకుడు. మరియు ఆయనే అత్యుత్తమ సహాయకుడు.

وَكَأَيِّن مِّن نَّبِيٍّ قَٰتَلَ مَعَهُۥ رِبِّيُّونَ
كَثِيرٌ فَمَا وَهَنُواْ لِمَآ أَصَابَهُمْ فِي
سَبِيلِ ٱللَّهِ وَمَا ضَعُفُواْ وَمَا ٱسْتَكَانُواْۗ
وَٱللَّهُ يُحِبُّ ٱلصَّٰبِرِينَ ﴿١٤٦﴾

وَمَا كَانَ قَوْلَهُمْ إِلَّآ أَن قَالُواْ
رَبَّنَا ٱغْفِرْ لَنَا ذُنُوبَنَا وَإِسْرَافَنَا فِيٓ
أَمْرِنَا وَثَبِّتْ أَقْدَامَنَا وَٱنصُرْنَا عَلَى
ٱلْقَوْمِ ٱلْكَٰفِرِينَ ﴿١٤٧﴾

فَـَٔاتَىٰهُمُ ٱللَّهُ ثَوَابَ ٱلدُّنْيَا وَحُسْنَ
ثَوَابِ ٱلْأٓخِرَةِۗ وَٱللَّهُ يُحِبُّ ٱلْمُحْسِنِينَ
﴿١٤٨﴾

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِن
تُطِيعُواْ ٱلَّذِينَ كَفَرُواْ
يَرُدُّوكُمْ عَلَىٰٓ أَعْقَٰبِكُمْ
فَتَنقَلِبُواْ خَٰسِرِينَ ﴿١٤٩﴾

بَلِ ٱللَّهُ مَوْلَىٰكُمْۖ وَهُوَ خَيْرُ
ٱلنَّٰصِرِينَ ﴿١٥٠﴾

سَنُلۡقِي فِي قُلُوبِ ٱلَّذِينَ كَفَرُواْ ٱلرُّعۡبَ بِمَآ أَشۡرَكُواْ بِٱللَّهِ مَا لَمۡ يُنَزِّلۡ بِهِۦ سُلۡطَٰنٗاۖ وَمَأۡوَىٰهُمُ ٱلنَّارُۚ وَبِئۡسَ مَثۡوَى ٱلظَّٰلِمِينَ ١٥١

**151**. ఆయన ఏ విధమైన ప్రమాణం అవతరింపజేయనిదే, అల్లాహ్‌కు సాటి కల్పించినందుకు, మేము సత్య తిరస్కారుల హృదయాలలో ఘోర భయాన్ని కల్పిస్తాము. వారి ఆశ్రయం నరకాగ్నియే! అది దుర్మార్గులకు లభించే, అతిచెడ్డ నివాసం.

وَلَقَدۡ صَدَقَكُمُ ٱللَّهُ وَعۡدَهُۥٓ إِذۡ تَحُسُّونَهُم بِإِذۡنِهِۦۖ حَتَّىٰٓ إِذَا فَشِلۡتُمۡ وَتَنَٰزَعۡتُمۡ فِي ٱلۡأَمۡرِ وَعَصَيۡتُم مِّنۢ بَعۡدِ مَآ أَرَىٰكُم مَّا تُحِبُّونَۚ مِنكُم مَّن يُرِيدُ ٱلدُّنۡيَا وَمِنكُم مَّن يُرِيدُ ٱلۡأٓخِرَةَۚ ثُمَّ صَرَفَكُمۡ عَنۡهُمۡ لِيَبۡتَلِيَكُمۡۖ وَلَقَدۡ عَفَا عَنكُمۡۗ وَٱللَّهُ ذُو فَضۡلٍ عَلَى ٱلۡمُؤۡمِنِينَ ١٥٢

**152**. మరియు వాస్తవానికి అల్లాహ్ మీకు చేసిన, తన వాగ్దానాన్ని సత్యపరచాడు, ఎప్పుడైతే మీరు ఆయన అనుమతితో, వారిని (సత్యతిరస్కారులను) చంపుతూ ఉన్నారో![1] తరువాత మీరు పిరికితనాన్ని ప్రదర్శించి, మీ కర్తవ్య విషయంలో పరస్పర విబేధాలకు గురి అయ్యి - ఆయన (అల్లాహ్) మీకు, మీరు వ్యామోహపడుతున్న దానిని చూపగానే - (మీ నాయకుని) ఆజ్ఞలను ఉల్లంఘించారు.[2] (ఎందుకంటే) మీలో కొందరు ఇహలోకాన్ని కోరేవారున్నారు, మరియు మీలో కొందరు పరలోకాన్ని కోరేవారున్నారు. తరువాత మిమ్మల్ని పరీక్షించటానికి ఆయన (అల్లాహ్) మీరు మీ విరోధులను ఓడించకుండా చేశాడు.[3] మరియు వాస్తవానికి ఇపుడు ఆయన మిమ్మల్ని క్షమించాడు. మరియు అల్లాహ్ విశ్వాసులపట్ల ఎంతో అనుగ్రహం గలవాడు. (3/8)

---

**1**. ఇది విశ్వాసులకు మొదట లభించిన విజయం.

**2**. ఇది ఉ'హుద్ యుద్ధంలో గుట్టమీద ఉంచబడిన 50 మంది విలుకాండ్ర విషయం.

**3**. శబ్దార్థ ప్రకారం: మీ విరోధుల యెదుట మిమ్మల్ని పారిపోయేటట్లు చేశాడు.

۞ إِذۡ تُصۡعِدُونَ وَلَا
تَلۡوُۥنَ عَلَىٰٓ أَحَدٖ وَٱلرَّسُولُ
يَدۡعُوكُمۡ فِيٓ أُخۡرَىٰكُمۡ
فَأَثَٰبَكُمۡ غَمَّۢا بِغَمّٖ لِّكَيۡلَا
تَحۡزَنُواْ عَلَىٰ مَا فَاتَكُمۡ وَلَا
مَآ أَصَٰبَكُمۡۗ وَٱللَّهُ خَبِيرُۢ بِمَا
تَعۡمَلُونَ ١٥٣
ثُمَّ أَنزَلَ عَلَيۡكُم مِّنۢ بَعۡدِ ٱلۡغَمِّ أَمَنَةٗ
نُّعَاسٗا يَغۡشَىٰ طَآئِفَةٗ مِّنكُمۡۖ
وَطَآئِفَةٞ قَدۡ أَهَمَّتۡهُمۡ أَنفُسُهُمۡ
يَظُنُّونَ بِٱللَّهِ غَيۡرَ ٱلۡحَقِّ ظَنَّ ٱلۡجَٰهِلِيَّةِۖ
يَقُولُونَ هَل لَّنَا مِنَ ٱلۡأَمۡرِ مِن شَيۡءٖۗ
قُلۡ إِنَّ ٱلۡأَمۡرَ كُلَّهُۥ لِلَّهِۗ يُخۡفُونَ فِيٓ
أَنفُسِهِم مَّا لَا يُبۡدُونَ لَكَۖ يَقُولُونَ لَوۡ
كَانَ لَنَا مِنَ ٱلۡأَمۡرِ شَيۡءٞ مَّا قُتِلۡنَا هَٰهُنَاۗ
قُل لَّوۡ كُنتُمۡ فِي بُيُوتِكُمۡ لَبَرَزَ ٱلَّذِينَ
كُتِبَ عَلَيۡهِمُ ٱلۡقَتۡلُ إِلَىٰ مَضَاجِعِهِمۡۖ
وَلِيَبۡتَلِيَ ٱللَّهُ مَا فِي صُدُورِكُمۡ
وَلِيُمَحِّصَ مَا فِي قُلُوبِكُمۡۚ وَٱللَّهُ عَلِيمُۢ
بِذَاتِ ٱلصُّدُورِ ١٥٤

**153.** * (జ్ఞాపకం చేసుకోండి!) ఎప్పుడైతే మీరు పారిపోతూ ఉన్నారో మరియు వెనుకకు కూడా తిరిగి ఎవరినీ చూడకుండా ఉన్నారో మరియు ప్రవక్త మీ వెనుకనుండి, మిమ్మల్ని పిలుస్తూ ఉన్నాడో! అప్పుడు (మీ ఈ వైఖరికి) ప్రతిఫలంగా (అల్లాహ్) మీకు దుఃఖం మీద దుఃఖం కలుగజేశాడు; మీరు ఏదైనా పోగొట్టుకున్నా, లేదా మీకు ఏదైనా ఆపద కలిగినా మీరు చింతించకుండా ఉండేందుకు. మరియు మీ కర్మలన్నింటినీ అల్లాహ్ బాగా ఎరుగును.

**154.** అప్పుడు ఈ దుఃఖం తరువాత ఆయన (అల్లాహ్) మీపై శాంతిభద్రతలను అవతరింపజేశాడు; దానివల్ల మీలో కొందరికి కునుకుపాటు ఆవరించింది. కాని మరికొందరు - కేవలం స్వంత ప్రాణాలకు ప్రాముఖ్యత నిచ్చేవారు, అల్లాహ్‌ను గురించి పామరుల వంటి తప్పుడు ఊహలు చేసేవారు - ఇలా అన్నారు: "ఏమి? ఈ వ్యవహారంలో మాకు ఏమైనా భాగముందా?" వారితో ఇలా అను: "నిశ్చయంగా, సమస్త వ్యవహారాలపై సర్వాధికారం అల్లాహ్ దే!" వారు తమ హృదయాలలో దాచుకున్న దానిని నీకు వ్యక్తం చేయటం లేదు. వారు ఇంకా ఇలా అంటారు: "మాకు అధికారమే ఉండివుంటే, మేము ఇక్కడ చంపబడి ఉండేవారం కాదు." వారికి ఇలా జవాబివ్వు: "ఒకవేళ మీరు మీ ఇళ్ళలోనే ఉండి వున్నప్పటికీ, మరణం వ్రాయబడి ఉన్నవారు స్వయంగా తమ వధ్య స్థానాలకు తరలివచ్చే వారు." మరియు అల్లాహ్ మీ గుండెలలో దాగివున్న దానిని పరీక్షించటానికి మరియు మీ హృదయాలను పరిశుద్ధపరచటానికి ఇలా చేశాడు. మరియు హృదయాలలో (దాగి) ఉన్నదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

إِنَّ ٱلَّذِينَ تَوَلَّوۡاْ مِنكُمۡ يَوۡمَ ٱلۡتَقَى ٱلۡجَمۡعَانِ إِنَّمَا ٱسۡتَزَلَّهُمُ ٱلشَّيۡطَٰنُ بِبَعۡضِ مَا كَسَبُواْۖ وَلَقَدۡ عَفَا ٱللَّهُ عَنۡهُمۡۗ إِنَّ ٱللَّهَ غَفُورٌ حَلِيمٌ ١٥٥

**155**. రెండు సైన్యాలు (ఉ'హుద్ యుద్ధానికి) తలబడిన దినమున, వాస్తవానికి మీలో వెన్నుచూపిన వారిని - వారు చేసుకున్న వాటికి (కర్మలకు) ఫలితంగా - షై'తాను వారి పాదాలను జార్చాడు. అయినా, వాస్తవానికి అల్లాహ్ వారిని క్షమించాడు. నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, సహనశీలుడు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تَكُونُواْ كَٱلَّذِينَ كَفَرُواْ وَقَالُواْ لِإِخۡوَٰنِهِمۡ إِذَا ضَرَبُواْ فِي ٱلۡأَرۡضِ أَوۡ كَانُواْ غُزًّى لَّوۡ كَانُواْ عِندَنَا مَا مَاتُواْ وَمَا قُتِلُواْ لِيَجۡعَلَ ٱللَّهُ ذَٰلِكَ حَسۡرَةً فِي قُلُوبِهِمۡۗ وَٱللَّهُ يُحۡيِۦ وَيُمِيتُۗ وَٱللَّهُ بِمَا تَعۡمَلُونَ بَصِيرٌ ١٥٦

**156**. ఓ విశ్వాసులారా! మీరు సత్య తిరస్కారుల మాదిరిగా ప్రవర్తించకండి; వారు తమ సోదరులు ఎప్పుడైనా ప్రయాణంలో ఉంటే, లేదా యుద్ధంలో ఉంటే, (అక్కడ వారు ఏదైనా ప్రమాదానికి గురిఅయితే) వారిని గురించి ఇలా అనేవారు: "ఒకవేళ వారు మాతోపాటు ఉండి వుంటే చనిపోయేవారు కాదు మరియు చంపబడే వారునూ కాదు!" వాటిని (ఈ విధమైన మాటలను) అల్లాహ్ వారి హృదయ ఆవేదనకు కారణాలుగా చేస్తాడు. మరియు అల్లాహ్‌యే జీవనమిచ్చే వాడు. మరియు మరణమిచ్చే వాడు మరియు మీరు చేస్తున్నదంతా అల్లాహ్ చూస్తున్నాడు.[1]

وَلَئِن قُتِلۡتُمۡ فِي سَبِيلِ ٱللَّهِ أَوۡ مُتُّمۡ لَمَغۡفِرَةٌ مِّنَ ٱللَّهِ وَرَحۡمَةٌ خَيۡرٌ مِّمَّا يَجۡمَعُونَ ١٥٧

**157**. మరియు మీరు అల్లాహ్ మార్గంలో చంపబడినా లేదా మరణించినా మీకు లభించే అల్లాహ్ క్షమాభిక్ష మరియు కారుణ్యం, నిశ్చయంగా మీరు కూడబెట్టే వాటి అన్నిటి కంటే ఎంతోఉత్తమమైనవి.

وَلَئِن مُّتُّمۡ أَوۡ قُتِلۡتُمۡ لَإِلَى ٱللَّهِ تُحۡشَرُونَ ١٥٨

**158**. మరియు మీరు మరణించినా లేదా చంపబడినా, మీరందరూ అల్లాహ్ సమక్షంలో సమావేశపరచబడతారు.

---

**1**. చూడండి, 4:78.

فَبِمَا رَحۡمَةٖ مِّنَ ٱللَّهِ لِنتَ لَهُمۡۖ وَلَوۡ كُنتَ فَظًّا غَلِيظَ ٱلۡقَلۡبِ لَٱنفَضُّواْ مِنۡ حَوۡلِكَۖ فَٱعۡفُ عَنۡهُمۡ وَٱسۡتَغۡفِرۡ لَهُمۡ وَشَاوِرۡهُمۡ فِي ٱلۡأَمۡرِۖ فَإِذَا عَزَمۡتَ فَتَوَكَّلۡ عَلَى ٱللَّهِۚ إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلۡمُتَوَكِّلِينَ ١٥٩

**159**. (ఓ ప్రవక్తా!) అల్లాహ్ యొక్క అపార కారుణ్యం వల్లనే నీవు వారిపట్ల మృదు హృదయుడవయ్యావు. నీవే గనక క్రూరుడవు, కఠినహృదయుడవు అయి వుంటే, వారందరూ నీ చుట్టుప్రక్కల నుండి దూరంగా పారిపోయే వారు. కావున నీవు వారిని మన్నించు, వారి క్షమాపణ కొరకు (అల్లాహ్‌ను) ప్రార్థించు మరియు వ్యవహారాలలో వారిని సంప్రదించు.[1] ఆ పిదప నీవు కార్యానికి సిద్ధమైనపుడు అల్లాహ్‌పై ఆధారపడు. నిశ్చయంగా, అల్లాహ్ తనపై ఆధారపడేవారిని ప్రేమిస్తాడు.

إِن يَنصُرۡكُمُ ٱللَّهُ فَلَا غَالِبَ لَكُمۡۖ وَإِن يَخۡذُلۡكُمۡ فَمَن ذَا ٱلَّذِي يَنصُرُكُم مِّنۢ بَعۡدِهِۦۗ وَعَلَى ٱللَّهِ فَلۡيَتَوَكَّلِ ٱلۡمُؤۡمِنُونَ ١٦٠

**160**. ఒకవేళ మీకు అల్లాహ్ సహాయమే ఉంటే, మరెవ్వరూ మీపై ఆధిక్యాన్ని పొంద జాలరు. మరియు ఆయనే మిమ్మల్ని త్యజిస్తే, ఆయన తప్ప మీకు సహాయం చేయగల వాడెవడు? మరియు విశ్వాసులు కేవలం అల్లాహ్ పైననే నమ్మకం ఉంచుకుంటారు!

وَمَا كَانَ لِنَبِيٍّ أَن يَغُلَّۚ وَمَن يَغۡلُلۡ يَأۡتِ بِمَا غَلَّ يَوۡمَ ٱلۡقِيَٰمَةِۚ ثُمَّ تُوَفَّىٰ كُلُّ نَفۡسٖ مَّا كَسَبَتۡ وَهُمۡ لَا يُظۡلَمُونَ ١٦١

**161**. మరియు ఏ ప్రవక్త కూడా విజయ ధనం (బూటీ) కొరకు నమ్మకద్రోహానికి పాల్పడడు. మరియు నమ్మకద్రోహానికి పాల్పడినవాడు పునరుత్థాన దినమున తన నమ్మక ద్రోహంతో పాటు హాజరవుతాడు. అప్పుడు ప్రతి ప్రాణికి తాను అర్జించిన దానికి పూర్తి ప్రతిఫలం ఇవ్వబడుతుంది మరియు వారికెలాంటి అన్యాయం జరుగదు.[2]

---

**1**. మీరు మీ వ్యవహారాలలో మీ తోటివారితో, మీ బంధువులతో, స్నేహితులతో సంప్రదింపులు చేయండి. కాని చివరకు నిర్ణయం తీసుకునేటప్పుడు అల్లాహ్(సు.తా.)పై ఆధారపడండి. మీకు మంచిది అనిపించిన నిర్ణయం తీసుకోండి.

**2**. ఉ'హుద్ యుద్ధం రోజు దైవప్రవక్త ('స'అస) విలుకాండ్రను: ఎట్టి పరిస్థితిలో కూడా వారు

أَفَمَنِ ٱتَّبَعَ رِضۡوَٰنَ ٱللَّهِ كَمَنۢ بَآءَ بِسَخَطٖ مِّنَ ٱللَّهِ وَمَأۡوَىٰهُ جَهَنَّمُۖ وَبِئۡسَ ٱلۡمَصِيرُ ١٦٢

**162**. ఏమీ? అల్లాహ్ అభీష్టం ప్రకారం నడిచే వ్యక్తి, అల్లాహ్ ఆగ్రహానికి గురిఅయ్యే వాడితో సమానుడవుతాడా? మరియు నరకమే వాని ఆశ్రయం. మరియు అది అతిచెడ్డ గమ్యస్థానం![1]

هُمۡ دَرَجَٰتٌ عِندَ ٱللَّهِۗ وَٱللَّهُ بَصِيرُۢ بِمَا يَعۡمَلُونَ ١٦٣

**163**. అల్లాహ్ దృష్టిలో వారు వేర్వేరు స్థానాలలో ఉన్నారు. మరియు వారు చేసేదంతా అల్లాహ్ చూస్తున్నాడు.

لَقَدۡ مَنَّ ٱللَّهُ عَلَى ٱلۡمُؤۡمِنِينَ إِذۡ بَعَثَ فِيهِمۡ رَسُولٗا مِّنۡ أَنفُسِهِمۡ يَتۡلُواْ عَلَيۡهِمۡ ءَايَٰتِهِۦ وَيُزَكِّيهِمۡ وَيُعَلِّمُهُمُ ٱلۡكِتَٰبَ وَٱلۡحِكۡمَةَ وَإِن كَانُواْ مِن قَبۡلُ لَفِي ضَلَٰلٖ مُّبِينٍ ١٦٤

**164**. వాస్తవానికి అల్లాహ్ విశ్వాసులకు మహోపకారం చేశాడు; వారినుండియే వారి మధ్య ఒక ప్రవక్త(ము'హమ్మద్)ను లేపాడు; అతను, ఆయన (అల్లాహ్) సందేశాలను (ఆయత్‌లను) వారికి వినిపిస్తున్నాడు.[2] మరియు వారి జీవితాలను సంస్కరించి పావనం చేస్తున్నాడు; మరియు వారికి గ్రంథాన్ని మరియు వివేకాన్ని బోధిస్తున్నాడు[3] మరియు వాస్తవానికి వారు ఇంతకు ముందు స్పష్టంగా మార్గభ్రష్టత్వంలో పడిఉన్నారు.

---

తమ స్థలాలను వదలరాదని, ఆదేశించారు. కాని వారు యుద్ధబూటీ వ్యామోహంలో తమ స్థానాలను వదలి యుద్ధబూటీ ప్రోగుచేయటానికి వెళ్ళారు. ఈ కార్యాన్నే ఖండిస్తూ, అల్లాహ్ (సు.తా.) అన్నాడు: "ఏ ప్రవక్త కూడా తన తోటివారికి అన్యాయం చేయడు." కాబట్టి వారు తమ ప్రవక్తయందు విశ్వాసముంచుకొని, బూటీలోని తమ హక్కు తమకు తప్పక దొరుకుతుందని, తమ చోట్లలో స్థిరంగా ఉండటమే వారి కర్తవ్యము. ఈ ఆయత్ ప్రతివ్యవహారానికి వర్తిస్తుంది.

**1**. చూడండి, 2:79 మరియు 3:78.

**2**. చూడండి, 12:109, 25:20 మరియు 41:6.

**3**. ఇక్కడ ప్రవక్త('అలైహిమ్ స.)ల మూడు ముఖ్య లక్ష్యాలు వివరించబడ్డాయి: 1) ఆయత్‌లను చదువటం మరియు వినిపించటం, 2) త'జ్కియా: అంటే మానవుల కర్మలను, విశ్వాసా('అఖాయద్)లను మరియు నడవడిక (అ'ఖ్లాఖ్)లను సరిదిద్దటం మరియు 3) గ్రంథాన్ని మరియు వివేకాన్ని బోధించటం.

أَوَلَمَّآ أَصَٰبَتۡكُم مُّصِيبَةٞ قَدۡ أَصَبۡتُم مِّثۡلَيۡهَا قُلۡتُمۡ أَنَّىٰ هَٰذَاۖ قُلۡ هُوَ مِنۡ عِندِ أَنفُسِكُمۡۗ إِنَّ ٱللَّهَ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٞ ١٦٥

**165**. ఏమయింది? మీ కొక చిన్న ఆపదే కదా కలిగింది! వాస్తవానికి మీరు, వారికి (మీ శత్రువులకు బద్ర్‌లో) ఇంతకు రెట్టింపు ఆపద కలిగించారు కదా![1] అయితే ఇప్పుడు: "ఇది ఎక్కడినుంచి వచ్చిందీ?" అని అంటున్నారా? వారితో ఇలా అను: "ఇది మీరు స్వయంగా తెచ్చుకున్నదే!"[2] నిశ్చయంగా అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

وَمَآ أَصَٰبَكُمۡ يَوۡمَ ٱلۡتَقَى ٱلۡجَمۡعَانِ فَبِإِذۡنِ ٱللَّهِ وَلِيَعۡلَمَ ٱلۡمُؤۡمِنِينَ ١٦٦

**166**. మరియు (ఉ'హుద్ యుద్ధ రంగంలో) రెండు సైన్యాలు ఎదుర్కొన్నప్పుడు, మీకు కలిగిన కష్టం, అల్లాహ్ అనుమతితోనే కలిగింది మరియు అది నిజమైన విశ్వాసులెవరో తెలుసు కోవటానికి -

وَلِيَعۡلَمَ ٱلَّذِينَ نَافَقُواْۚ وَقِيلَ لَهُمۡ تَعَالَوۡاْ قَٰتِلُواْ فِي سَبِيلِ ٱللَّهِ أَوِ ٱدۡفَعُواْۖ قَالُواْ لَوۡ نَعۡلَمُ قِتَالٗا لَّٱتَّبَعۡنَٰكُمۡۗ هُمۡ لِلۡكُفۡرِ يَوۡمَئِذٍ أَقۡرَبُ مِنۡهُمۡ لِلۡإِيمَٰنِۚ يَقُولُونَ بِأَفۡوَٰهِهِم مَّا لَيۡسَ فِي قُلُوبِهِمۡۚ

**167**. మరియు కపటవిశ్వాసులు ఎవరో తెలుసుకోవటానికి. మరియు వారితో (కపటవిశ్వాసులతో): "రండి అల్లాహ్ మార్గంలో యుద్ధంచేయండి, లేదా కనీసం మిమ్మల్ని మీరు రక్షించుకోండి!"[3] అని అన్నప్పుడు, వారు: "ఒకవేళ మాకు యుద్ధం జరుగుతుందని తెలిసివుంటే, మేము తప్పకుండా మీతోపాటు వచ్చి ఉండేవారం." అని జవాబిచ్చారు. ఆరోజు వారు విశ్వాసానికంటే

---

**1**. ఉ'హుద్‌లో 70 మంది ముస్లింలు మరణించారు, కానీ బద్ర్‌లో 70 మంది ముష్రికులు మరణించారు, మరియు 70 మంది బందీలయ్యారు కదా!

**2**. అంటే దైవప్రవక్త ('స'అస) యొక్క ఆజ్ఞను పాలించక 'స'హాబీలు బూటీ కొరకు గుట్టపై నుండి తమ స్థానాలు వదలిపోయినందుకు ఈ ఆపదకు గురిఅయ్యారు.

**3**. చూడండి, 2:190-194.

وَٱللَّهُ أَعۡلَمُ بِمَا يَكۡتُمُونَ ١٦٧

ٱلَّذِينَ قَالُواْ لِإِخۡوَٰنِهِمۡ وَقَعَدُواْ لَوۡ أَطَاعُونَا مَا قُتِلُواْۗ قُلۡ فَٱدۡرَءُواْ عَنۡ أَنفُسِكُمُ ٱلۡمَوۡتَ إِن كُنتُمۡ صَٰدِقِينَ ١٦٨

وَلَا تَحۡسَبَنَّ ٱلَّذِينَ قُتِلُواْ فِي سَبِيلِ ٱللَّهِ أَمۡوَٰتَۢاۚ بَلۡ أَحۡيَآءٌ عِندَ رَبِّهِمۡ يُرۡزَقُونَ ١٦٩

فَرِحِينَ بِمَآ ءَاتَىٰهُمُ ٱللَّهُ مِن فَضۡلِهِۦ وَيَسۡتَبۡشِرُونَ بِٱلَّذِينَ لَمۡ يَلۡحَقُواْ بِهِم مِّنۡ خَلۡفِهِمۡ أَلَّا خَوۡفٌ عَلَيۡهِمۡ وَلَا هُمۡ يَحۡزَنُونَ ١٧٠

అవిశ్వాసానికి దగ్గరగా ఉన్నారు.[1] మరియు వారు తమ హృదయాలలో లేని మాటలను తమ నోళ్ళతో పలుకుతూఉన్నారు. మరియు వారు దాస్తున్నది అల్లాహ్‌కు బాగాతెలుసు.

**168**. అలాంటి వారు తమ ఇండ్లలో కూర్చొని ఉండి (చంపబడిన) తమ సోదరులను గురించి ఇలా అన్నారు: "వారు గనక మా మాట విని ఉంటే చంపబడి ఉండేవారు కాదు!" నీవు వారితో: "మీరు సత్యవంతులే అయితే, మీకు మరణం రాకుండా మిమ్మల్ని మీరు తప్పించుకోండి!" అని చెప్పు.

**169**. మరియు అల్లాహ్ మార్గంలో చంపబడిన వారిని మృతులుగా భావించకండి. వాస్తవానికి వారు సజీవులై, తమ ప్రభువువద్ద జీవనోపాధి పొందుతున్నారు.[2]

**170**. అల్లాహ్ తన అనుగ్రహంతో ప్రసాదించిన దాని(ప్రాణత్యాగం)తో వారు సంతోషంతో ఉప్పొంగిపోతారు.[3] మరియు వారిని కలువక, వెనుక (బ్రతికి) ఉన్నవారి కొరకు (ఇవ్వబడిన శుభవార్తతో) వారు సంతోషపడుతూ ఉంటారు. ఎందుకంటే వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా! (1/2)

---

**1**. వారు 'అబ్దుల్లాహ్ ఇబ్నె-ఉబయ్ తోటివారైన దాదాపు 300 మంది మునాఫిఖులు. వారు ఉ'హుద్ యుద్ధానికి సిద్ధపడిన తరువాత శత్రువులు 3000 మంది ఉన్నారని తెలుసుకొని భయపడి వెనుదిరిగిపోతారు.

**2**. చూడండి, 2:154.

**3**. మరణించిన ఏ ప్రాణి కూడా అల్లాహ్ (సు.తా.) దగ్గర మంచిచోటు దొరికిన తరువాత భూలోకానికి తిరిగి రావటానికి ఇష్టపడడు. కానీ షహీద్ (అల్లాహుతా'ఆలా మార్గంలో చంపబడినవాడు) భూలోకానికి తిరిగిరావటానికి ఇష్టపడతాడు. ఎందుకంటే అతడు షహాదత్ యొక్క గొప్ప ప్రతిఫలాన్ని చూసిఉంటాడు. (ముస్నద్ అ'హ్మద్-3/126, 'స.ముస్లిం). కాని అది అసంభవం.

۞ يَسۡتَبۡشِرُونَ بِنِعۡمَةٖ مِّنَ ٱللَّهِ وَفَضۡلٖ وَأَنَّ ٱللَّهَ لَا يُضِيعُ أَجۡرَ ٱلۡمُؤۡمِنِينَ ١٧١

171. * వారు అల్లాహ్ అనుగ్రహానికి, దాతృత్వానికి సంతోషపడుతూ ఉంటారు మరియు నిశ్చయంగా, అల్లాహ్ విశ్వాసుల ప్రతిఫలాన్ని వ్యర్థం కానివ్వడు.

ٱلَّذِينَ ٱسۡتَجَابُواْ لِلَّهِ وَٱلرَّسُولِ مِنۢ بَعۡدِ مَآ أَصَابَهُمُ ٱلۡقَرۡحُۚ لِلَّذِينَ أَحۡسَنُواْ مِنۡهُمۡ وَٱتَّقَوۡاْ أَجۡرٌ عَظِيمٌ ١٧٢

172. ఎవరైతే గాయపడిన తరువాత కూడా అల్లాహ్ మరియు సందేశహరుని (ఆజ్ఞలను) పాటిస్తారో.[1] వారిలో ఎవరైతే, సత్కార్యాలు చేశారో మరియు దైవభీతి గలిగి ఉన్నారో వారికి గొప్ప ప్రతిఫలం ఉంది.

ٱلَّذِينَ قَالَ لَهُمُ ٱلنَّاسُ إِنَّ ٱلنَّاسَ قَدۡ جَمَعُواْ لَكُمۡ فَٱخۡشَوۡهُمۡ فَزَادَهُمۡ إِيمَٰنٗا وَقَالُواْ حَسۡبُنَا ٱللَّهُ وَنِعۡمَ ٱلۡوَكِيلُ ١٧٣

173. వారి (విశ్వాసుల)తో ప్రజలు: "వాస్తవానికి, మీకు వ్యతిరేకంగా పెద్ద జనసమూహాలు కూర్చబడిఉన్నాయి, కావున మీరు వారికి భయపడండి." అని అన్నప్పుడు, వారి విశ్వాసం మరింత అధికమే అయింది. మరియు వారు: "మాకు అల్లాహ్ యే చాలు మరియు ఆయనే సర్వోత్తమమైన కార్యసాధకుడు."[2] అని అన్నారు.[3]

1. మక్కా ముష్రికులు ఉ'హుద్ యుద్ధరంగం నుండి వెనుదిరిగి కొంతదూరం పోయిన తరువాత: "మేము భీతిపరులైన ముస్లిములను, పూర్తిగా అణచకుండానే తిరిగివచ్చి తప్పుచేశాము. 300 మైళ్ళ నుండి వచ్చికూడా యుద్ధఖైదీలను గానీ, విజయధనం గానీ, పొందకుండా తిరిగిపోతున్నాము. కావున తిరిగి మదీనాపై దాడి చేద్దామని, సమాలోచనలు చేస్తారు. కాని వారికి ధైర్యం చాలదు. దైవప్రవక్త ('స'అస) కూడా పారిపోయే శత్రువును వెంబడించి నశింపజేయాలని, 70 మంది వీరులను తీసుకొని - వారు గాయపడి ఉన్నా తయారయ్యి - వారిని వెంబడిస్తారు. వారు మదీనా నుండి 8 మైళ్ళ దూరంలో ఉన్న 'హమ్రా' అల్-అసద్ అనే ప్రాంతం వరకు పోతారు. శత్రువులను పొందక, వారిక మరలిరారని నిశ్చితులైనతరువాత తిరిగి వస్తారు.

2. అల్-వకీలు: అంటే Trustee, Overseer, Guardian, Disposer of affairs, కార్యకర్త, సంరక్షకుడు, కార్యనిర్వాహకుడు, కార్యసాధకుడు, సాక్షి, బాధ్యుడు, ధర్మకర్త, మొదలైన అర్థాలున్నాయి. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి. చూడండి, 4:109, 6:102, 11:12, 17:2.

3. చూడండి, 'స.బు'ఖారీ, పు. 6, 'హదీస్' నం. 86, 87.

فَٱنقَلَبُواْ بِنِعۡمَةٖ مِّنَ ٱللَّهِ وَفَضۡلٖ لَّمۡ يَمۡسَسۡهُمۡ سُوٓءٞ وَٱتَّبَعُواْ رِضۡوَٰنَ ٱللَّهِۗ وَٱللَّهُ ذُو فَضۡلٍ عَظِيمٍ ١٧٤

**174.** ఈ విధంగా వారు అల్లాహ్ ఉపకారాలు మరియు అనుగ్రహాలతో (యుద్ధ రంగం నుండి) తిరిగి వచ్చారు, వారికెలాంటి హాని కలుగలేదు మరియు వారు అల్లాహ్ అభీష్టాన్ని అనుసరించారు. మరియు అల్లాహ్ దాతృత్వంలో సర్వోత్తముడు.

إِنَّمَا ذَٰلِكُمُ ٱلشَّيۡطَٰنُ يُخَوِّفُ أَوۡلِيَآءَهُۥ فَلَا تَخَافُوهُمۡ وَخَافُونِ إِن كُنتُم مُّؤۡمِنِينَ ١٧٥

**175.** నిశ్చయంగా షైతానే తన మిత్రుల గురించి మీలో భయం పుట్టిస్తాడు. కావున మీరు వారికి భయపడకండి. మరియు మీరు విశ్వాసులే అయితే, కేవలం నాకే భయపడండి.

وَلَا يَحۡزُنكَ ٱلَّذِينَ يُسَٰرِعُونَ فِي ٱلۡكُفۡرِۚ إِنَّهُمۡ لَن يَضُرُّواْ ٱللَّهَ شَيۡـٔٗاۗ يُرِيدُ ٱللَّهُ أَلَّا يَجۡعَلَ لَهُمۡ حَظّٗا فِي ٱلۡأٓخِرَةِۖ وَلَهُمۡ عَذَابٌ عَظِيمٌ ١٧٦

**176.** మరియు సత్యతిరస్కారం కొరకు పోటీ చేసేవారు నిన్ను ఖేదానికి గురిచేయనివ్వరాదు. నిశ్చయంగా, వారు అల్లాహ్‌కు ఎలాంటి నష్టం కలిగించలేరు. పరలోక సుఖంలో అల్లాహ్, వారికెలాంటి భాగం ఇవ్వదలచుకోలేదు. మరియు వారికి ఘోరమైన శిక్ష ఉంటుంది.

إِنَّ ٱلَّذِينَ ٱشۡتَرَوُاْ ٱلۡكُفۡرَ بِٱلۡإِيمَٰنِ لَن يَضُرُّواْ ٱللَّهَ شَيۡـٔٗا وَلَهُمۡ عَذَابٌ أَلِيمٞ ١٧٧

**177.** నిశ్చయంగా విశ్వాసానికి బదులుగా సత్యతిరస్కారాన్ని కొనేవారు అల్లాహ్‌కు ఎలాంటి నష్టం కలిగించలేరు. మరియు వారికి బాధాకరమైన శిక్ష ఉంటుంది.

وَلَا يَحۡسَبَنَّ ٱلَّذِينَ كَفَرُوٓاْ أَنَّمَا نُمۡلِي لَهُمۡ خَيۡرٞ لِّأَنفُسِهِمۡۚ إِنَّمَا نُمۡلِي لَهُمۡ لِيَزۡدَادُوٓاْ إِثۡمٗاۚ وَلَهُمۡ عَذَابٞ مُّهِينٞ ١٧٨

**178.** మరియు వాస్తవానికి మేము ఇస్తున్న ఈ వ్యవధిని సత్యతిరస్కారులు తమకు మేలైనదిగా భావించకూడదు. మరియు వాస్తవానికి, మేము ఇస్తున్న ఈ వ్యవధి వారి పాపాలు అధికమవటానికే![1] మరియు వారికి అవమానకరమైన శిక్ష ఉంటుంది.

1. చూడండి, 23:55, 56.

مَّا كَانَ ٱللَّهُ لِيَذَرَ ٱلْمُؤْمِنِينَ عَلَىٰ مَآ أَنتُمْ عَلَيْهِ حَتَّىٰ يَمِيزَ ٱلْخَبِيثَ مِنَ ٱلطَّيِّبِ ۗ وَمَا كَانَ ٱللَّهُ لِيُطْلِعَكُمْ عَلَى ٱلْغَيْبِ وَلَٰكِنَّ ٱللَّهَ يَجْتَبِى مِن رُّسُلِهِۦ مَن يَشَآءُ ۖ فَـَٔامِنُوا۟ بِٱللَّهِ وَرُسُلِهِۦ ۚ وَإِن تُؤْمِنُوا۟ وَتَتَّقُوا۟ فَلَكُمْ أَجْرٌ عَظِيمٌ ﴿١٧٩﴾

**179**. అల్లాహ్ విశ్వాసులను, మీరు (సత్యతిరస్కారులు) ఇప్పుడు ఉన్న స్థితిలో, ఏ మాత్రమూ ఉండనివ్వడు. చివరకు ఆయన దుష్టులను సత్పురుషుల నుండి తప్పకుండా వేరుచేస్తాడు. మరియు అగోచర విషయాలను మీకు తెలపడం అల్లాహ్ విధానం కాదు కాని అల్లాహ్ తన ప్రవక్తలలో నుండి తానుకోరిన వారిని ఎన్నుకుంటాడు.[1] కావున మీరు అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తలను విశ్వసించండి. మరియు ఒకవేళ మీరు విశ్వసించి, దైవభీతి కలిగి ఉంటే, మీకు గొప్ప ప్రతిఫలం ఉంటుంది.

وَلَا يَحْسَبَنَّ ٱلَّذِينَ يَبْخَلُونَ بِمَآ ءَاتَىٰهُمُ ٱللَّهُ مِن فَضْلِهِۦ هُوَ خَيْرًا لَّهُم ۖ بَلْ هُوَ شَرٌّ لَّهُمْ ۖ سَيُطَوَّقُونَ مَا بَخِلُوا۟ بِهِۦ يَوْمَ ٱلْقِيَٰمَةِ ۗ وَلِلَّهِ مِيرَٰثُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۗ وَٱللَّهُ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ ﴿١٨٠﴾

**180**. అల్లాహ్ తన అనుగ్రహంతో ప్రసాదించిన దానిలో లోభం వహించే వారు, తమకది (లోభమే) మేలైనదని భావించరాదు, వాస్తవానికి అది వారికొరకు ఎంతో హానికరమైనది. వారు తమ లోభత్వంతో కూడబెట్టినదంతా, తీర్పు దినమున వారి మెడల చుట్టు కట్టబడుతుంది.[2] మరియు భూమ్యాకాశాల వారసత్వం అల్లాహ్‌కే చెందుతుంది. మరియు మీరు చేస్తున్నదంతా అల్లాహ్ ఎరుగును.

لَّقَدْ سَمِعَ ٱللَّهُ قَوْلَ ٱلَّذِينَ قَالُوٓا۟ إِنَّ ٱللَّهَ فَقِيرٌ وَنَحْنُ أَغْنِيَآءُ ۘ سَنَكْتُبُ مَا قَالُوا۟ وَقَتْلَهُمُ ٱلْأَنۢبِيَآءَ بِغَيْرِ

**181**. "నిశ్చయంగా, అల్లాహ్ పేదవాడు మరియు మేము ధనవంతులము."[3] అని చెప్పే వారి మాటలను వాస్తవంగా అల్లాహ్ విన్నాడు. వారు పలుకుతున్నది మరియు

---

**1**. చూడండి, 9:26,27, 101.

**2**. చూడండి, 'స.బు'ఖారీ, 'హ.నం. 4565.

**3**. చూడండి, 2:245.

حَقٍّ وَنَقُولُ ذُوقُواْ عَذَابَ
ٱلۡحَرِيقِ ﴿١٨١﴾

అన్యాయంగా ప్రవక్తలను వధించినది మేము వ్రాసిపెడుతున్నాము. మరియు (పునరుత్థాన దినమున) వారితో మేము ఇలా అంటాము: "దహించే అగ్ని శిక్షను రుచిచూడండి!"

ذَٰلِكَ بِمَا قَدَّمَتۡ أَيۡدِيكُمۡ وَأَنَّ
ٱللَّهَ لَيۡسَ بِظَلَّامٖ لِّلۡعَبِيدِ ﴿١٨٢﴾

**182**. ఇది మీ చేతులారా మీరు చేసి పంపుకున్న కర్మల ఫలితం. నిశ్చయంగా, అల్లాహ్ తన దాసులకు ఎలాంటి అన్యాయం చేసేవాడు కాడు!

ٱلَّذِينَ قَالُوٓاْ إِنَّ ٱللَّهَ عَهِدَ
إِلَيۡنَآ أَلَّا نُؤۡمِنَ لِرَسُولٍ حَتَّىٰ
يَأۡتِيَنَا بِقُرۡبَانٖ تَأۡكُلُهُ ٱلنَّارُۗ قُلۡ
قَدۡ جَآءَكُمۡ رُسُلٞ مِّن قَبۡلِي
بِٱلۡبَيِّنَٰتِ وَبِٱلَّذِي قُلۡتُمۡ فَلِمَ
قَتَلۡتُمُوهُمۡ إِن كُنتُمۡ
صَٰدِقِينَ ﴿١٨٣﴾

**183**. "అగ్ని (ఆకాశం నుండి దిగివచ్చి) బలి(ఖుర్బానీ)ని మా సమక్షంలో తిననంత వరకు మేము ఎవరినీ ప్రవక్తగా స్వీకరించగూడదని అల్లాహ్ మాతో వాగ్దానం తీసుకున్నాడు." అని పలికే వారి (యూదుల)తో ఇలా అను: "వాస్తవానికి నాకు పూర్వం మీవద్దకు చాలామంది ప్రవక్తలు స్పష్టమైన ఎన్నో నిదర్శనాలను తీసుకువచ్చారు; మరియు మీరు ప్రస్తావించే ఈ నిదర్శనాన్ని కూడా! మీరు సత్య వంతులే అయితే, మీరు వారిని ఎందుకు హత్యచేశారు?"[1]

فَإِن كَذَّبُوكَ فَقَدۡ كُذِّبَ رُسُلٞ
مِّن قَبۡلِكَ جَآءُو بِٱلۡبَيِّنَٰتِ وَٱلزُّبُرِ
وَٱلۡكِتَٰبِ ٱلۡمُنِيرِ ﴿١٨٤﴾

**184**. (ఓ ప్రవక్తా! ) ఒకవేళ వారు నిన్ను అసత్యవాదుడవని తిరస్కరిస్తే, నీవు (ఆశ్చర్యపడకు); వాస్తవానికి నీకు ముందు ప్రత్యక్ష నిదర్శనాలను, 'స'హీఫా ('జుబుర్)లను మరియు జ్యోతిని ప్రసాదించే గ్రంథాన్ని తీసుకువచ్చిన చాలా మంది ప్రవక్తలు కూడా అసత్యవాదులని తిరస్కరించబడ్డారు.

---

**1**. చూడండి, 2:61.

**185**. ప్రతి ప్రాణి చావును చవి చూస్తుంది. మరియు నిశ్చయంగా, తీర్పుదినమున మీ కర్మల ఫలితం మీకు పూర్తిగా ఇవ్వబడుతుంది. కావున ఎవడు నరకాగ్ని నుండి తప్పించబడి స్వర్గంలో ప్రవేశపెట్టబడతాడో! వాస్తవానికి, వాడే సఫలీకృతుడు. మరియు ఇహలోక జీవితం కేవలం మోసపుచ్చే సుఖానుభవం మాత్రమే! (5/8)

**186**. * నిశ్చయంగా మీరు, మీ ధన ప్రాణాలతో పరీక్షింపబడతారు మరియు నిశ్చయంగా, మీకు పూర్వం గ్రంథం ప్రసాదించబడిన వారి నుండి మరియు అల్లాహ్‌కు భాగస్వాములు (సాటి) కల్పించిన వారి నుండి, మీరు అనేక వేదన కలిగించే మాటలు వింటుంటారు. కానీ, ఒకవేళ మీరు ఓర్పు వహించి, దైవభీతి కలిగి ఉంటే! నిశ్చయంగా, అది ఎంతో సాహసంతో కూడిన కార్యం.[1]

**187**. మరియు అల్లాహ్, గ్రంథప్రజలతో: "దీనిని (దైవప్రవక్త ము'హమ్మద్ రానున్నాడు అనే సత్యాన్ని) ప్రజలకు తెలియజేయండి మరియు దానిని దాచకండి." అని, చేయించిన ప్రమాణాన్ని, (జ్ఞాపకం చేసుకోండి). కాని వారు దానిని తమ వీపుల వెనుక పడవేసి దానికి బదులుగా స్వల్ప మూల్యాన్ని పొందారు, వారి ఈ వ్యాపారం ఎంత నీచమైనది!

كُلُّ نَفْسٍ ذَآئِقَةُ ٱلْمَوْتِۗ وَإِنَّمَا تُوَفَّوْنَ أُجُورَكُمْ يَوْمَ ٱلْقِيَٰمَةِۖ فَمَن زُحْزِحَ عَنِ ٱلنَّارِ وَأُدْخِلَ ٱلْجَنَّةَ فَقَدْ فَازَۗ وَمَا ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَآ إِلَّا مَتَٰعُ ٱلْغُرُورِ ١٨٥

۞ لَتُبْلَوُنَّ فِيٓ أَمْوَٰلِكُمْ وَأَنفُسِكُمْ وَلَتَسْمَعُنَّ مِنَ ٱلَّذِينَ أُوتُوا۟ ٱلْكِتَٰبَ مِن قَبْلِكُمْ وَمِنَ ٱلَّذِينَ أَشْرَكُوٓا۟ أَذًى كَثِيرًاۚ وَإِن تَصْبِرُوا۟ وَتَتَّقُوا۟ فَإِنَّ ذَٰلِكَ مِنْ عَزْمِ ٱلْأُمُورِ ١٨٦

وَإِذْ أَخَذَ ٱللَّهُ مِيثَٰقَ ٱلَّذِينَ أُوتُوا۟ ٱلْكِتَٰبَ لَتُبَيِّنُنَّهُۥ لِلنَّاسِ وَلَا تَكْتُمُونَهُۥ فَنَبَذُوهُ وَرَآءَ ظُهُورِهِمْ وَٱشْتَرَوْا۟ بِهِۦ ثَمَنًا قَلِيلًاۖ فَبِئْسَ مَا يَشْتَرُونَ ١٨٧

1. చూడండి, 2:155 మరియు 'స.బు'ఖారీ - కితాబ్ అత్-తఫ్సీర్.

**188**. ఎవరైతే తాము చేసిన పనికి సంతోషపడుతూ, తాము చేయని పనికి ప్రశంసలు లభిస్తాయని కోరుతారో, వారు శిక్ష నుండి తప్పించుకోగలరని నీవు భావించకు. మరియు వారికి బాధాకరమైన శిక్ష ఉంటుంది.

**189**. మరియు భూమ్యాకాశాల సామ్రాజ్యాధిపత్యం కేవలం అల్లాహ్ కే చెందినది. మరియు అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

**190**. నిశ్చయంగా, భూమ్యాకాశాల సృష్టిలో మరియు రేయింబవళ్ళ అనుక్రమం (ఒకదాని తరువాత ఒకటి రావడం మరియు వాటి హెచ్చుతగ్గుల)లో, బుద్ధిమంతుల కొరకు ఎన్నో సూచన(ఆయతు)లు ఉన్నాయి;

**191**. ఎవరైతే నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా, అన్నివేళలా అల్లాహ్‌ను స్మరిస్తారో, భూమ్యాకాశాల నిర్మాణాన్ని గురించి ఆలోచిస్తారో! (వారు ఇలా ప్రార్థిస్తారు): "ఓ మా ప్రభూ! నీవు ఈ (విశ్వాన్ని) వ్యర్థంగా సృష్టించలేదు, నీవు సర్వలోపాలకు అతీతుడవు, మమ్మల్ని నరకాగ్ని శిక్షనుండి కాపాడు.[1]

**192**. "ఓ మా ప్రభూ! నీవు ఎవడిని నరకాగ్నిలో పడవేస్తావో వాస్తవంగా వానిని నీవు అవమానపరిచావు. మరియు దుర్మార్గులకు సహాయకులు ఎవ్వరూ ఉండరు.

**193**. "ఓ మా ప్రభూ! నిశ్చయంగా, మేము: 'మీ ప్రభువును విశ్వసించండి.' అని విశ్వాసం వైపుకు పిలిచే అతని (ము'హమ్మద్) యొక్క

لَا تَحْسَبَنَّ ٱلَّذِينَ يَفْرَحُونَ بِمَآ أَتَواْ
وَّيُحِبُّونَ أَن يُحْمَدُواْ بِمَا لَمْ يَفْعَلُواْ
فَلَا تَحْسَبَنَّهُم بِمَفَازَةٍ مِّنَ ٱلْعَذَابِ ۖ
وَلَهُمْ عَذَابٌ أَلِيمٌ ﴿١٨٨﴾
وَلِلَّهِ مُلْكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۗ وَٱللَّهُ
عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ ﴿١٨٩﴾
إِنَّ فِى خَلْقِ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ
وَٱخْتِلَٰفِ ٱلَّيْلِ وَٱلنَّهَارِ لَءَايَٰتٍ
لِّأُوْلِى ٱلْأَلْبَٰبِ ﴿١٩٠﴾
ٱلَّذِينَ يَذْكُرُونَ ٱللَّهَ قِيَٰمًا وَقُعُودًا
وَعَلَىٰ جُنُوبِهِمْ وَيَتَفَكَّرُونَ فِى
خَلْقِ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ رَبَّنَا مَا
خَلَقْتَ هَٰذَا بَٰطِلًا سُبْحَٰنَكَ فَقِنَا
عَذَابَ ٱلنَّارِ ﴿١٩١﴾
رَبَّنَآ إِنَّكَ مَن تُدْخِلِ ٱلنَّارَ فَقَدْ
أَخْزَيْتَهُۥ ۖ وَمَا لِلظَّٰلِمِينَ مِنْ أَنصَارٍ ﴿١٩٢﴾
رَّبَّنَآ إِنَّنَا سَمِعْنَا مُنَادِيًا يُنَادِى
لِلْإِيمَٰنِ أَنْ ءَامِنُواْ بِرَبِّكُمْ فَـَٔامَنَّا ۚ

1. చూడండి, 10:5.

رَبَّنَا فَٱغۡفِرۡ لَنَا ذُنُوبَنَا وَكَفِّرۡ عَنَّا سَيِّـَٔاتِنَا وَتَوَفَّنَا مَعَ ٱلۡأَبۡرَارِ ﴿١٩٣﴾

పిలుపు విని, విశ్వసించాము. ఓ మా ప్రభూ! మా పాపాలను క్షమించు మరియు మాలో ఉన్న చెడులను మానుండి తొలగించు మరియు పుణ్యాత్ము(ధర్మనిష్ఠాపరు)లతో మమ్మల్ని మరణింపజెయ్యి!

رَبَّنَا وَءَاتِنَا مَا وَعَدتَّنَا عَلَىٰ رُسُلِكَ وَلَا تُخۡزِنَا يَوۡمَ ٱلۡقِيَٰمَةِۗ إِنَّكَ لَا تُخۡلِفُ ٱلۡمِيعَادَ ﴿١٩٤﴾

**194.** "ఓ మా ప్రభూ! మరియు నీ ప్రవక్తల ద్వారా నీవు మాకు చేసిన వాగ్దానాలను పూర్తిచేయి మరియు తీర్పుదినమున మమ్మల్ని అవమానపరచకు. నిశ్చయంగా, నీవు నీ వాగ్దానాలను భంగంచేయవు."

فَٱسۡتَجَابَ لَهُمۡ رَبُّهُمۡ أَنِّي لَآ أُضِيعُ عَمَلَ عَٰمِلٖ مِّنكُم مِّن ذَكَرٍ أَوۡ أُنثَىٰۖ بَعۡضُكُم مِّنۢ بَعۡضٖۖ فَٱلَّذِينَ هَاجَرُواْ وَأُخۡرِجُواْ مِن دِيَٰرِهِمۡ وَأُوذُواْ فِي سَبِيلِي وَقَٰتَلُواْ وَقُتِلُواْ لَأُكَفِّرَنَّ عَنۡهُمۡ سَيِّـَٔاتِهِمۡ وَلَأُدۡخِلَنَّهُمۡ جَنَّٰتٖ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُ ثَوَابٗا مِّنۡ عِندِ ٱللَّهِۚ وَٱللَّهُ عِندَهُۥ حُسۡنُ ٱلثَّوَابِ ﴿١٩٥﴾

**195.** అప్పుడు సమాధానంగా వారి ప్రభువు, వారితో ఇలా అంటాడు: "మీలో పురుషులు గానీ, స్త్రీలు గానీ చేసిన కర్మలను నేను వ్యర్థం కానివ్వను. మీరందరూ ఒకరికొకరు (సమానులు).[1] కనుక నా కొరకు, తమ దేశాన్ని విడిచిపెట్టి వలసపోయిన వారు, తమ గృహాలనుండి తరిమివేయబడి (నిరాశ్రయులై, దేశ దిమ్మరులై), నా మార్గంలో పలుకష్టాలు పడినవారు మరియు నా కొరకు పోరాడిన వారు మరియు చంపబడిన వారు; నిశ్చయంగా, ఇలాంటి వారందరి చెడులను వారినుండి తుడిచివేస్తాను. మరియు నిశ్చయంగా, వారిని క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింప జేస్తాను; ఇది అల్లాహ్ వద్ద వారికి లభించే ప్రతిఫలం. మరియు అల్లాహ్! ఆయన వద్దనే ఉత్తమ ప్రతిఫలం ఉంది."

---

**1**. అంటే కర్మలకు ఫలితాలిచ్చే విషయంలో స్త్రీ పురుషుల మధ్య ఎలాంటి భేదభావం ఉండదు. ప్రతి ఒక్కరికి వారి కర్మలకు తగిన ప్రతిఫలమివ్వబడుతుంది. ఎవ్వరికీ రవ్వంత అన్యాయం కూడా జరుగదు.

لَا يَغُرَّنَّكَ تَقَلُّبُ ٱلَّذِينَ كَفَرُواْ فِي ٱلْبِلَٰدِ ﴿١٩٦﴾

**196**. (ఓ ప్రవక్తా!) ప్రపంచ దేశాలలో సత్యతిరస్కారుల సంచారం, నిన్ను మోసంలో పడవేయకూడదు![1]

مَتَٰعٌ قَلِيلٌ ثُمَّ مَأْوَىٰهُمْ جَهَنَّمُۖ وَبِئْسَ ٱلْمِهَادُ ﴿١٩٧﴾

**197**. ఇది వారికి కొద్దిపాటి సుఖం మాత్రమే! తరువాత వారి ఆశ్రయం నరకమే. మరియు అది అతి అధ్వాన్నమైన నివాసస్థలము.

لَٰكِنِ ٱلَّذِينَ ٱتَّقَوْاْ رَبَّهُمْ لَهُمْ جَنَّٰتٌ تَجْرِي مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَا نُزُلًا مِّنْ عِندِ ٱللَّهِۗ وَمَا عِندَ ٱللَّهِ خَيْرٌ لِّلْأَبْرَارِ ﴿١٩٨﴾

**198**. కాని ఎవరైతే తమ ప్రభువునందు భయభక్తులు కలిగి ఉంటారో, వారికి క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనా లుంటాయి. అందులో వారు అల్లాహ్ ఆతిథ్యం పొందుతూ శాశ్వతంగా ఉంటారు. మరియు పుణ్యాత్ము(ధర్మ నిష్ఠాపరు)లకు అల్లాహ్ దగ్గర ఉన్నదే ఎంతో శ్రేష్ఠమైనది!

وَإِنَّ مِنْ أَهْلِ ٱلْكِتَٰبِ لَمَن يُؤْمِنُ بِٱللَّهِ وَمَآ أُنزِلَ إِلَيْكُمْ وَمَآ أُنزِلَ إِلَيْهِمْ خَٰشِعِينَ لِلَّهِ لَا يَشْتَرُونَ بِـَٔايَٰتِ ٱللَّهِ ثَمَنًا قَلِيلًاۗ أُوْلَٰٓئِكَ لَهُمْ أَجْرُهُمْ عِندَ رَبِّهِمْۗ إِنَّ ٱللَّهَ سَرِيعُ ٱلْحِسَابِ ﴿١٩٩﴾

**199**. మరియు నిశ్చయంగా, గ్రంథ ప్రజలలో, కొందరు అల్లాహ్ ను విశ్వసిస్తారు. మరియు వారు మీకు అవతరింపజేయబడిన దానిని మరియు వారికి అవతరింప జేయబడిన దానిని (సందేశాన్ని) విశ్వసించి, అల్లాహ్‌కు వినమ్రులై, అల్లాహ్ సూక్తులను స్వల్పమైన మూల్యానికి అమ్ముకోరు.[2] అలాంటి వారికి వారి ప్రభువు వద్ద ప్రతిఫలం ఉంది. నిశ్చయంగా, అల్లాహ్ లెక్క తీసుకోవటంలో అతి శీఘ్రుడు.

---

**1**. చూడండి, 40:4, 10:69, 70 మరియు 31:24.

**2**. ఈ ఆయత్‌లో దైవప్రవక్త ము'హమ్మద్('స'అస)ను విశ్వసించిన పూర్వగ్రంథ ప్రజలను గురించి చెప్పబడింది. ఉదా: 'అబ్దుల్లాహ్ బిన్-సల్లామ్, మరియు సల్మాన్ ఫారసీ మొదలైనవారు (ర'ది.'అన్హుమ్). వారిలో దాదాపు 10 మంది మాత్రమే యూదులు, కాని క్రైస్తవులు అధిక సంఖ్యలో ఉండిరి. (ఇబ్నె-కసీ'ర్).

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ ٱصْبِرُوا۟ وَصَابِرُوا۟ وَرَابِطُوا۟ وَٱتَّقُوا۟ ٱللَّهَ لَعَلَّكُمْ تُفْلِحُونَ ﴿٢٠٠﴾

**200**. ఓ విశ్వాసులారా! సహనం వహించండి మరియు (మిథ్యావాదుల ముందు) స్థైర్యాన్ని చూపండి మరియు (మాటువేసి ఉండవలసినచోట) స్థిరంగా ఉండండి మరియు అల్లాహ్ పట్ల భయభక్తులు కలిగి ఉండండి, అప్పుడే మీరు సాఫల్యం పొందగలరని ఆశించవచ్చు![1] (3/4)

*****

**1**. ఈ ఆయత్ తాత్పర్యం ఈ విధంగా కూడా చేయబడింది: "ఓ విశ్వాసులారా (మీ శత్రువుల కంటే ఎక్కువ) సహనం వహించండి మరియు సాహసం చూపించండి మరియు యుద్ధ రంగంలో దృఢచిత్తులై (మీ సరిహద్దులను కాపాడుతూ) ఉండండి. మరియు అల్లాహ్‌యందు భయభక్తులు కలిగి ఉండండి, అప్పుడే మీరు సాఫల్యం పొందగలరని ఆశించవచ్చు!"

ఈ ఆయత్ తాత్పర్యం ము'హమ్మద్ జూనాగఢి (ర'హ్మ) గారు, ఈ విధంగా కూడా చేశారు: "ఓ విశ్వాసులారా! మీ పాదాలను తడబడనివ్వకండి మరియు ఒకరికొకరు సహాయపడండి. జిహాద్ కొరకు సిద్ధంగా ఉండండి మరియు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి, అప్పుడే మీరు సాఫల్యం పొందగలరని ఆశించవచ్చు!"

## 4. సూరహ్ అన్-నిసాఅ'

## سُورَةُ النِّسَاءِ

నిసాఉ'న్: స్త్రీలు. ఈ సూరహ్‌లో ఎన్నో ఆయతులు స్త్రీల హక్కులు, వారసత్వం, వివాహ సంబంధాలు మొదలైన వాటిని గురించి ఉన్నాయి. ఇది పూర్తిగా **మదీనాలో** అవతరింపజేయబడింది. ఇందులో **176** ఆయతులున్నాయి. దీని పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది ఉ'హుద్ యుద్ధం తరువాత అవతరింపజేయబడింది, బహుశా 4వ హిజ్రీలో, అల్-'అహ్'జాబ్ (33) మరియు అల్-ముమ్‌త'హినహ్ (60) సూరాహ్‌ల తరువాత. ఇందులో ఐదు ఆయతులు ఎంతో ఘనత గలవి ఉన్నాయి. అవి 31, 40, 48, 64 మరియు 110.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

يَٰٓأَيُّهَا ٱلنَّاسُ ٱتَّقُواْ رَبَّكُمُ ٱلَّذِي خَلَقَكُم مِّن نَّفْسٍ وَٰحِدَةٍ وَخَلَقَ مِنْهَا زَوْجَهَا وَبَثَّ مِنْهُمَا رِجَالًا كَثِيرًا وَنِسَآءً ۚ وَٱتَّقُواْ ٱللَّهَ ٱلَّذِي تَسَآءَلُونَ بِهِۦ وَٱلْأَرْحَامَ ۚ إِنَّ ٱللَّهَ كَانَ عَلَيْكُمْ رَقِيبًا ﴿١﴾

**1.** * ఓ మానవులారా! మీ ప్రభువు పట్ల భయభక్తులు కలిగి ఉండండి; ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి (ఆదమ్) నుండి సృష్టించాడు; మరియు ఆయనే దాని (ఆ ప్రాణి) నుండి దాని జంట('హవ్వా)ను సృష్టించాడు మరియు వారిద్దరి నుండి అనేక పురుషులను మరియు స్త్రీలను వ్యాపింపజేశాడు. మరియు ఆ అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి, ఎవరి ద్వారా(పేరుతో)నైతే మీరు మీ (పరస్పర హక్కులను) కోరుతారో; మరియు మీ బంధుత్వాలను గౌరవించండి (త్రెంచకండి).[1] నిశ్చయంగా, అల్లాహ్ మిమ్మల్ని సదా కనిపెట్టుకొని[2] ఉన్నాడు.

---

**1.** అల్-అర్'హాము, ర'హిమున్ యొక్క బహువచనం: అంటే గర్భకోశం. దాని నుండియే బంధుత్వాలు ఏర్పడుతాయి. కాబట్టి: ''బంధుత్వాలను గౌరవించండి (త్రెంచకండి) మరియు వారి (బంధువుల) హక్కులను చెల్లించండి.'' అని ఎన్నో హదీసులు ఉన్నాయి.

**2.** రఖీబున్ (**అర్-రఖీబు**): చూడండి, 5:117. The Watcher, Observer, Guardian, Keeper from whom nothing is hidden. పరిశీలకుడు, కనిపెట్టుకొని ఉండేవాడు, గమనించే వాడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

وَءَاتُواْ ٱلۡيَتَٰمَىٰٓ أَمۡوَٰلَهُمۡۖ وَلَا تَتَبَدَّلُواْ ٱلۡخَبِيثَ بِٱلطَّيِّبِۖ وَلَا تَأۡكُلُوٓاْ أَمۡوَٰلَهُمۡ إِلَىٰٓ أَمۡوَٰلِكُمۡۚ إِنَّهُۥ كَانَ حُوبٗا كَبِيرٗا ٢

2. మరియు అనాథుల ఆస్తిపాస్తులను వారికి తిరిగి ఇవ్వండి. మరియు (మీ) చెడ్డ వస్తువులను (వారి) మంచి వస్తువులతో మార్చకండి. మరియు వారి ఆస్తులను మీ ఆస్తులతో కలిపి తినివేయకండి. నిశ్చయంగా, ఇది గొప్పనేరం (పాపం).

وَإِنۡ خِفۡتُمۡ أَلَّا تُقۡسِطُواْ فِي ٱلۡيَتَٰمَىٰ فَٱنكِحُواْ مَا طَابَ لَكُم مِّنَ ٱلنِّسَآءِ مَثۡنَىٰ وَثُلَٰثَ وَرُبَٰعَۖ فَإِنۡ خِفۡتُمۡ أَلَّا تَعۡدِلُواْ فَوَٰحِدَةً أَوۡ مَا مَلَكَتۡ أَيۡمَٰنُكُمۡۚ ذَٰلِكَ أَدۡنَىٰٓ أَلَّا تَعُولُواْ ٣

3. మరియు అనాథ బాలికలకు న్యాయం చేయలేమనే భయం మీకు ఉంటే, మీకు నచ్చిన (ఇతర) స్త్రీలను ఇద్దరిని గానీ, ముగ్గురిని గానీ, నలుగురిని గానీ వివాహం చేసుకోండి. అయితే వారితో న్యాయంగా వ్యవహరించలేమనే భయం మీకు ఉంటే, ఒకామెను మాత్రమే;[1] లేదా మీ స్వాధీనంలో ఉన్న వారిని (బానిస స్త్రీలను దాంపత్యంలోకి) తీసుకోండి.[2] ఒకే వైపునకు మొగ్గకుండా (అన్యాయవర్తన నుండి దూరంగా ఉండటానికి) ఇదే సముచితమైన మార్గం.

---

1. ఇక్కడ స్పష్టంగా చెప్పబడింది: "మీరు వారి (స్త్రీల) మధ్య న్యాయం చేయలేమనే భయం ఉంటే ఒకామెను మాత్రమే వివాహమాడండి." అని. నలుగురికంటే ఎక్కువ వివాహమాడ కండని మరియు అంతకంటే ఎక్కువ భార్యలను ఏక కాలంలో ఉంచుకోరాదని, దివ్య ఖుర్ఆన్ తప్ప, ఇతర ఏ మత గ్రంథంలో కూడా వ్రాయబడ లేదు. అందుకే పూర్వకాలంలో చాలామంది భార్యలు ఉండటం అన్నిధర్మాల వారి ఆచారమై ఉండెను. ఇంకా ముందు దివ్య ఖుర్ఆన్‌లో ఇలా చెప్పబడింది: *"మీరు ఎంత ప్రయత్నంచేసినా వారి (భార్యల) మధ్య న్యాయం చేయటం చాలా కష్టం అట్టి సమయంలో ఒకామెను పూర్తిగా ఉపేక్షించకండి."* (చూడండి 4:129). ఈ విధంగా ఖుర్ఆన్‌లో స్త్రీలకు ఇవ్వబడినంత గౌరవం, రక్షణ, హక్కులు ఇతర మత గ్రంథాలలో పేర్కొనబడ లేదు. బానిసత్వాన్ని, బానిసత్వ వ్యాపారాన్ని నిర్మూలిస్తూ, కేవలం యుద్ధఖైదీలను తప్ప ఇతరులను బానిసలుగా ఉంచగూడదని కూడా ఖుర్ఆన్ 1400 సంవత్సరాల ముందు ఆదేశించింది. ముస్లింలు అయిన బానిస స్త్రీలతో వివాహమాడటాన్ని కూడా ప్రోత్సహించింది. చూడండి, 1400 సంవత్సరాలముందు ఇస్లాంలో మానవహక్కులు (Human Rights) మరియు స్త్రీల హక్కులు ఏవిధంగా రక్షింపబడ్డాయో!
2. చూడండి, 24:32.

وَءَاتُواْ ٱلنِّسَآءَ صَدُقَٰتِهِنَّ نِحۡلَةٗۚ فَإِن طِبۡنَ لَكُمۡ عَن شَيۡءٖ مِّنۡهُ نَفۡسٗا فَكُلُوهُ هَنِيٓـٔٗا مَّرِيٓـٔٗا ٤

**4**. మరియు స్త్రీలకు వారి స్త్రీశుల్కం (మ'హ్ర్) సహృదయంతో ఇవ్వండి. కాని వారు తమంతటతామే సంతోషంగా కొంత భాగాన్ని మీకు విడిచిపెడితే, దానిని సంతోషంగా, స్వేచ్ఛగా అనుభవించండి (తినండి).

وَلَا تُؤۡتُواْ ٱلسُّفَهَآءَ أَمۡوَٰلَكُمُ ٱلَّتِي جَعَلَ ٱللَّهُ لَكُمۡ قِيَٰمٗا وَٱرۡزُقُوهُمۡ فِيهَا وَٱكۡسُوهُمۡ وَقُولُواْ لَهُمۡ قَوۡلٗا مَّعۡرُوفٗا ٥

**5**. మరియు అల్లాహ్ మీకు నిర్వహించటానికి అప్పగించిన ఆస్తులను, అవివేకులుగా ఉన్నప్పుడు[1] (అనాథులకు) అప్పగించకండి. దానినుండి వారికి అన్నవస్త్రాలు ఇస్తూ ఉండండి. మరియు వారితో వాత్సల్యంతో మాట్లాడండి.

وَٱبۡتَلُواْ ٱلۡيَتَٰمَىٰ حَتَّىٰٓ إِذَا بَلَغُواْ ٱلنِّكَاحَ فَإِنۡ ءَانَسۡتُم مِّنۡهُمۡ رُشۡدٗا فَٱدۡفَعُوٓاْ إِلَيۡهِمۡ أَمۡوَٰلَهُمۡۖ وَلَا تَأۡكُلُوهَآ إِسۡرَافٗا وَبِدَارًا أَن يَكۡبَرُواْۚ وَمَن كَانَ غَنِيّٗا فَلۡيَسۡتَعۡفِفۡۖ وَمَن كَانَ فَقِيرٗا فَلۡيَأۡكُلۡ بِٱلۡمَعۡرُوفِۚ فَإِذَا دَفَعۡتُمۡ إِلَيۡهِمۡ أَمۡوَٰلَهُمۡ فَأَشۡهِدُواْ عَلَيۡهِمۡۚ وَكَفَىٰ بِٱللَّهِ حَسِيبٗا ٦

**6**. మరియు వివాహయోగ్యమైన వయస్సు వచ్చేవరకూ మీరు అనాథులను పరీక్షించండి, ఇక వారిలో మీకు యోగ్యత కనిపించినప్పుడు, వారి ఆస్తులను వారికి అప్పగించండి. మరియు వారు పెరిగి పెద్దవారు అవుతారనే తలంపుతో దానిని (వారి ఆస్తిని) త్వరపడి అపరిమితంగా తినకండి. మరియు అతడు (సంరక్షకుడు) సంపన్నుడైతే, వారి సొమ్ముకు దూరంగా ఉండాలి. కాని అతడు పేదవాడైతే, దాని నుండి ధర్మసమ్మతంగా తినాలి. ఇక వారి ఆస్తిని వారికి అప్పగించేటప్పుడు దానికి సాక్షులను పెట్టుకోండి. మరియు లెక్క తీసుకోవటానికి[2] అల్లాహ్ చాలు!

---

**1**. చూడండి, 'స.బు'ఖారీ, పు-3, 'హ. నం. 591.

**2**. **అల్-హసీబు:** Reckoner, Taker of Accounts, Sufficer, or giver of what is sufficient. లెక్కతీసుకునే, **పరిగణించేవాడు**. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి. చూడండి, 4:86.

لِّلرِّجَالِ نَصِيبٌ مِّمَّا تَرَكَ ٱلْوَٰلِدَانِ وَٱلْأَقْرَبُونَ وَلِلنِّسَآءِ نَصِيبٌ مِّمَّا تَرَكَ ٱلْوَٰلِدَانِ وَٱلْأَقْرَبُونَ مِمَّا قَلَّ مِنْهُ أَوْ كَثُرَ نَصِيبًا مَّفْرُوضًا ﴿٧﴾

**7**. పురుషులకు వారి తల్లిదండ్రులు మరియు దగ్గరి బంధువులు విడిచి పోయిన దానిలో (ఆస్తిలో) భాగం ఉంది మరియు స్త్రీలకు కూడా వారి తల్లిదండ్రులు మరియు దగ్గరి బంధువులు విడిచిపోయిన దానిలో భాగం ఉంది;[1] అది తక్కువైనా సరే, లేదా ఎక్కువైనా సరే. అది (అల్లాహ్) విధిగా నియమించిన భాగం.

وَإِذَا حَضَرَ ٱلْقِسْمَةَ أُوْلُواْ ٱلْقُرْبَىٰ وَٱلْيَتَٰمَىٰ وَٱلْمَسَٰكِينُ فَٱرْزُقُوهُم مِّنْهُ وَقُولُواْ لَهُمْ قَوْلًا مَّعْرُوفًا ﴿٨﴾

**8**. మరియు (ఆస్తి) పంపకం జరిగేటప్పుడు ఇతర బంధువులు గానీ, అనాథులు గానీ, పేదవారు గానీ ఉంటే దాని నుండి వారికి కూడా కొంత ఇవ్వండి[2] మరియు వారితో వాత్సల్యంగా మాట్లాడండి.

وَلْيَخْشَ ٱلَّذِينَ لَوْ تَرَكُواْ مِنْ خَلْفِهِمْ ذُرِّيَّةً ضِعَٰفًا خَافُواْ عَلَيْهِمْ فَلْيَتَّقُواْ ٱللَّهَ وَلْيَقُولُواْ قَوْلًا سَدِيدًا ﴿٩﴾

**9**. మరియు (పంపకం చేసేటప్పుడు, పంపకం చేసేవారు), ఒకవేళ తామే తమ పిల్లలను నిస్సహాయులుగా విడిచిపోతే, ఏవిధంగా వారిని గురించి భయపడతారో, అదేవిధంగా భయపడాలి. వారు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండి, యుక్తమైన మాటలనే పలకాలి.

---

**1**. ముందు వస్తుంది. స్త్రీలకు, పురుషులకు దొరికే బాగంలో సగంఆస్తి దొరుకుతుందని. దీనికి కారణం స్త్రీలపై ఎవ్వరినీ పెంచే బాధ్యతలేదు. ఆమె పోషణ, రక్షణ బాధ్యత, ఆమె తండ్రి, భర్త, సోదరుని లేక కుమారునిపై ఉంది. చివరకు వీరంతా ఎవ్వరూ లేనపుడు ఇస్లామీయ ప్రభుత్వంపై ఉంటుంది. కాబట్టి ఖుర్ఆన్ చేసిన ఈపంపకంలో స్త్రీలకు ఎలాంటి అన్యాయం జరుగలేదు. మరొక విషయమేమిటంటే, దగ్గరి బంధువులు ఉన్నప్పుడు, దూరపు బంధువులు వారసత్వపు ఆస్తికి హక్కుదారులు కారు. దగ్గరి బంధువులు అంటే ప్రథమ శ్రేణికి చెందిన బంధువులు. 1. సంతానం, 2. తల్లిదండ్రులు, 3. భర్త లేక భార్యలు.

**2**. ఇక్కడ ఇతర బంధువులు అంటే వారసత్వానికి హక్కుదారులు కాని వారు. వారికి కూడా కొంత ఇవ్వాలి. ఆస్తిపరుడు తలుచుకుంటే, తన జీవితకాలంలో, తన ఆస్తిలో మూడోభాగం, వీలు ద్వారా అతని ఆస్తికి హక్కుదారులు కాని, ఇతర బంధువులకు గానీ, పేదలకు గానీ, పుణ్యకార్యాలకు గానీ ఇవ్వవచ్చు. మూడో భాగం కంటే, ఎక్కువ వీలు ద్వారా ఇచ్చే హక్కు ఆస్తిపరునికి లేదు. ఆస్తికి హక్కుదారులైన వారికి ఆస్తి ఇవ్వకూడదని వీలు వ్రాసే అధికారం కూడా అతనికి షరీయత్‌లో లేదు. మూడవ భాగం ఆస్తి చాలా తక్కువ ఉంటే, ఇతరులకు ఇచ్చే అవసరం లేదు. తన ఆస్తిని పేరు కొరకు ఇతరులకు పంచి, హక్కుదారులైన తన దగ్గరి బంధువులను, పేదరికంలో ముంచటం తగినది కాదు (ఫ'త్హ్ అల్-ఖదీర్).

إِنَّ ٱلَّذِينَ يَأۡكُلُونَ أَمۡوَٰلَ ٱلۡيَتَٰمَىٰ
ظُلۡمًا إِنَّمَا يَأۡكُلُونَ فِي بُطُونِهِمۡ
نَارٗاۖ وَسَيَصۡلَوۡنَ سَعِيرٗا ١٠

10. నిశ్చయంగా, అన్యాయంగా అనాథుల ఆస్తులను, తినేవారు వాస్తవానికి తమ పొట్టలను అగ్నితో నింపుకుంటున్నారు. మరియు వారు సమీపంలోనే భగభగమండే నరకాగ్నిలో కాల్చబడతారు.

يُوصِيكُمُ ٱللَّهُ فِيٓ أَوۡلَٰدِكُمۡۖ
لِلذَّكَرِ مِثۡلُ حَظِّ ٱلۡأُنثَيَيۡنِۚ فَإِن
كُنَّ نِسَآءٗ فَوۡقَ ٱثۡنَتَيۡنِ فَلَهُنَّ
ثُلُثَا مَا تَرَكَۖ وَإِن كَانَتۡ وَٰحِدَةٗ
فَلَهَا ٱلنِّصۡفُۚ وَلِأَبَوَيۡهِ لِكُلِّ
وَٰحِدٖ مِّنۡهُمَا ٱلسُّدُسُ مِمَّا تَرَكَ إِن
كَانَ لَهُۥ وَلَدٞۚ فَإِن لَّمۡ يَكُن لَّهُۥ وَلَدٞ
وَوَرِثَهُۥٓ أَبَوَاهُ فَلِأُمِّهِ ٱلثُّلُثُۚ فَإِن كَانَ
لَهُۥٓ إِخۡوَةٞ فَلِأُمِّهِ ٱلسُّدُسُۚ مِنۢ
بَعۡدِ وَصِيَّةٖ يُوصِي بِهَآ أَوۡ دَيۡنٍۗ

11. మీ సంతాన వారసత్వాన్ని గురించి అల్లాహ్ మీకు ఈవిధంగా ఆదేశిస్తున్నాడు: ఒక పురుషుని (భాగం) ఇద్దరు స్త్రీల భాగాలకు సమానంగా ఉండాలి.[1] ఒకవేళ ఇద్దరు లేక అంతకంటే ఎక్కువ స్త్రీ (సంతానం మాత్రమే) ఉంటే, వారికి విడిచిన ఆస్తిలో మూడింట రెండు భాగాలు ఉంటాయి. మరియు ఒకవేళ ఒకే ఆడపిల్ల ఉంటే అర్ధ భాగానికి ఆమె హక్కుదారురాలు.[2] మరియు (మృతుడు) సంతానం కలవాడైతే, అతని తల్లిదండ్రులలో ప్రతి ఒక్కరికీ విడిచిన ఆస్తిలో ఆరోభాగం లభిస్తుంది. ఒకవేళ అతనికి సంతానం లేకుంటే, అతని తల్లిదండ్రులు మాత్రమే వారసులుగా ఉంటే, అప్పుడు తల్లికి మూడో భాగం.[3] మృతునికి సోదర సోదరీమణులు

1. చిన్నవారైనా పెద్దవారైనా సంతానం అంతా వారసత్వానికి హక్కుదారులు. గర్భంలో ఉన్న సంతానం కూడా వారసత్వానికి హక్కుదారులు. అవిశ్వాసులైన సంతానం వారసత్వానికి హక్కు దారులు కారు. ఆడ మగ సంతానం ఉన్న పక్షంలో తల్లి దండ్రులకు ప్రతి ఒక్కరికి 1/6. మిగతా 2/3 సంతానం కొరకు. భార్య లేక భర్త ఉంటే వారి హక్కు వారికిచ్చిన తరువాత మిగతాది సంతానం కొరకు.

2. ఒకవేళ ఒకే ఒక్క కుమారుడు ఉంటే, మొత్తం ఆస్తికి వారసుడు అవుతాడు. ఇతర వారసులు, అంటే తల్లి, తండ్రి, భార్య లేక భర్త ఉంటే, వారి హక్కు వారికిచ్చిన తరువాత మిగతా ఆస్తికి అతడు హక్కుదారుడు. మృతునికి ఒకే కుమార్తె ఉంటే, ఆమెకు 1/2 ఆస్తి, తల్లికి 1/6, తండ్రికి 2/6.

3. మృతునికి సంతానం లేకుండా మరియు కుమారుని(ల) ఆడమగ సంతానం కూడా లేకుండా

ءَابَآؤُكُمۡ وَأَبۡنَآؤُكُمۡ لَا تَدۡرُونَ أَيُّهُمۡ أَقۡرَبُ لَكُمۡ نَفۡعٗاۚ فَرِيضَةٗ مِّنَ ٱللَّهِۗ إِنَّ ٱللَّهَ كَانَ عَلِيمًا حَكِيمٗا ١١

ఉంటే, తల్లికి ఆరోభాగం.[1] (ఈ పంపకమంతా) మృతుని అప్పులు తీర్చి, అతని వీలునామాపై అమలు జరిపిన తరువాతనే జరగాలి. మీ తల్లిదండ్రులు మరియు మీ సంతానంలో ప్రయోజనం రీత్యా మీకు ఎవరు ఎక్కువ సన్నిహితులో, మీకు తెలియదు. ఇది అల్లాహ్ నియమించిన విధానం. నిశ్చయంగా, అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు. (7/8)

۞ وَلَكُمۡ نِصۡفُ مَا تَرَكَ أَزۡوَٰجُكُمۡ إِن لَّمۡ يَكُن لَّهُنَّ وَلَدٞۚ فَإِن كَانَ لَهُنَّ وَلَدٞ فَلَكُمُ ٱلرُّبُعُ مِمَّا تَرَكۡنَۚ مِنۢ بَعۡدِ وَصِيَّةٖ يُوصِينَ بِهَآ أَوۡ دَيۡنٖۚ

**12.** * మరియు మీ భార్యలకు సంతానం లేనిపక్షంలో,[2] వారు విడిచిపోయిన దానిలో మీకు అర్ధ భాగం. కాని ఒకవేళ వారికి సంతానం ఉంటే, వారు విడిచిపోయిన దానిలో నాలుగో భాగం మీది. (ఇదంతా) వారు వ్రాసిపోయిన వీలునామాపై అమలు జరిపి, వారి అప్పులు తీర్చిన తరువాత.[3]

---

తల్లిదండ్రులు తప్ప మరొక వారసుడు లేని పక్షంలో మూడింట రెండు వంతుల ఆస్తి (2/3) తండ్రికి లభిస్తుంది మరియు తల్లికి 1/3 భాగం. మృత స్త్రీకి భర్త ఉంటే, లేక మృత పురుషునికి భార్య ఉంటే వారి హక్కు వారికి ఇచ్చిన తరువాత మిగతా ఆస్తిలో తండ్రి 2/3 భాగానికి మరియు తల్లి 1/3 భాగానికి హక్కుదారులు.

**1.** మృతునికి తల్లి తండ్రి మరియు సోదర సోదరీలు, ఉన్న పక్షంలో తల్లికి 1/6 భాగం, తండ్రికి 5/6 భాగం ఇవ్వబడుతోంది ఎందుకంటే అతని భాధ్యతలు అధికమౌతాయి. మృతుని తండ్రి బ్రతికి ఉంటే అతని సోదర సోదరీమణులకు అతని ఆస్తిలో భాగంలేదు. సోదర సోదరీలు ఏ రకపు వారైనా సరే, అంటే: 1.సొంత - 'ఐని (ఒకే తండ్రి-తల్లి), 2. సవతి లేక మారు - 'అల్లాతి, (ఒకే తండ్రి, తల్లులు వేరు), 3. అర్ధ - అ'ఖ్యాఫి (ఒకే తల్లి, తండ్రులు వేరు). సంతానం మరియు తండ్రి లేని పక్షంలో, ఒకే సోదరుడు లేక ఒకే సోదరి మాత్రమే ఉంటే తల్లి భాగం 1/3. (ఇబ్నె-కసీ'ర్).

**2.** మృతునికి కొడుకు(లు) చనిపోయిన పక్షంలో, కొడుకు(ల)-సంతానం (మనుమళ్ళు, మనుమరాళ్ళు) వారసులుగా పరిగణించబడాలి, (ఇజ్మా'అ, ఇబ్నె-కసీ'ర్ మరియు ఫ'త్హ్ అల్-ఖదీర్).

**3.** మొదట అప్పులు తీర్చి, తరువాత వీలునామాపై అమలు పరచాలి. ఆ తరువాత మిగిలిన ఆస్తిని వారసులలో పంచాలి. వీలునామా మూడవవంతు కంటే ఎక్కువ ఆస్తికి చేయగూడదు. ('స. బు'ఖారీ మరియు 'స. ముస్లిం).

وَلَهُنَّ ٱلرُّبُعُ مِمَّا تَرَكۡتُمۡ إِن لَّمۡ يَكُن لَّكُمۡ وَلَدٌۚ فَإِن كَانَ لَكُمۡ وَلَدٌ فَلَهُنَّ ٱلثُّمُنُ مِمَّا تَرَكۡتُمۚ مِّنۢ بَعۡدِ وَصِيَّةٍ تُوصُونَ بِهَآ أَوۡ دَيۡنٍۗ وَإِن كَانَ رَجُلٌ يُورَثُ كَلَٰلَةً أَوِ ٱمۡرَأَةٌ وَلَهُۥٓ أَخٌ أَوۡ أُخۡتٌ فَلِكُلِّ وَٰحِدٍ مِّنۡهُمَا ٱلسُّدُسُۚ فَإِن كَانُوٓاْ أَكۡثَرَ مِن ذَٰلِكَ فَهُمۡ شُرَكَآءُ فِي ٱلثُّلُثِۚ مِنۢ بَعۡدِ وَصِيَّةٍ يُوصَىٰ بِهَآ أَوۡ دَيۡنٍ غَيۡرَ مُضَآرٍّۚ وَصِيَّةً مِّنَ ٱللَّهِۗ وَٱللَّهُ عَلِيمٌ حَلِيمٌ ﴿١٢﴾

మరియు మీకు సంతానం లేని పక్షంలో మీరు విడిచిపోయిన దానిలో వారికి (మీ భార్యలకు) నాలుగో భాగం. కాని ఒకవేళ మీకు సంతానం ఉంటే, మీరు విడిచినదానిలో వారికి ఎనిమిదో భాగం.[1] ఇదంతా మీరు వ్రాసిన వీలునామాపై అమలు జరిగి, మీ అప్పులు తీర్చిన తరువాత. మరియు ఒకవేళ మరణించిన పురుషుడు లేక స్త్రీ కలాల అయి (తండ్రి, కొడుకు లేక మనమడు లేకుండా) ఒక సోదరుడు మరియు ఒక సోదరి మాత్రమే ఉంటే, వారిలో ప్రతి ఒక్కరికీ ఆరోభాగం. కాని ఒకవేళ వారు (సోదర - సోదరీమణులు) ఇద్దరి కంటే ఎక్కువ ఉంటే, వారంతా మూడో భాగానికి వారసులవుతారు.[2] ఇదంతా మృతుడు వ్రాసిన వీలునామాపై అమలు జరిగి అప్పులు తీర్చిన తరువాత, ఎవ్వరికీ నష్టం కలుగజేయకుండా జరగాలి.[3] ఇది అల్లాహ్ నుండి వచ్చిన ఆదేశం. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, సహనశీలుడు (శాంతస్వభావుడు).

---

1. భార్య ఒక్కతే ఉన్నా! లేక ఒకరికంటే ఎక్కువమంది భార్యలు ఉన్నా, సంతానం ఉంటే, వారంతా కలిసి ఎనిమిదవ భాగానికి భాగస్వాములు. సంతానం లేకుంటే నాలుగవ భాగానికి. ఈ ఎనిమిదో భాగాన్ని లేక నాలుగవ భాగాన్ని భార్యలందరికీ సమానంగా పంచాలి. (ఇజ్మా'అ, ఫత్హ్ అల్-ఖదీర్).
2. ఇక్కడ ఇజ్మా'అ (ధర్మవేత్తల ఏకాభిప్రాయం) ఏమిటంటే, ఈ పంపకం కేవలం అర్ధ సోదర సోదరీమణులు అంటే, కేవలం తల్లి తరఫునుండి మృతునికి బంధువులైన అర్ధ సోదర సోదరీమణులకు - అంటే, ఒకేతల్లి వేర్వేరు తండ్రులున్న వారికి - వర్తిస్తుంది. ఇక సొంత సోదర సోదరీ మణులు మరియు సవతి సోదర సోదరీ మణులకు వర్తించే ఆజ్ఞ ఇదే సూరహ్‌లో చివరి ఆయత్ 4:176లో ఉంది. అంటే అక్కడ సోదరుని భాగం ఇద్దరు సోదరీమణుల భాగానికి సమానంగా ఉండాలి. తండ్రి బ్రతికి ఉంటే మృతుని సోదర సోదరీలు అతని ఆస్తికి హక్కుదారులు కారు. మరోవిశేషం ఏమిటంటే, అర్ధ సోదర సోదరీమణులు నస్ల్ కారు (అంటే ఒకే తల్లి, కానీ వేర్వేరు తండ్రులున్నవారు). కాబట్టి వారికి ఆడమగ అందరికీ సమాన భాగం ఇవ్వబడుతోంది. వివరాలకు ధర్మవేత్తలను సంప్రదించండి.
3. ఒకవేళ మృతుడు తన భార్యకు మహ్ర్ చెల్లించకుండానే మరణిస్తే, ఆ మహ్ర్ కూడా అప్పుగా భావించి చెల్లించాలి. భార్య, ఆస్తి హక్కు ఈ మహ్ర్, చెల్లించిన తర్వాతనే ఉంటుంది.

13. ఇవి అల్లాహ్ (విధించిన) హద్దులు. ఎవరైతే అల్లాహ్‌కు మరియు ఆయన ప్రవక్తకు విధేయులై ఉంటారో, వారిని ఆయన క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు. మరియు ఇదే గొప్ప సాఫల్యం (విజయం).

14. మరియు ఎవడైతే, అల్లాహ్‌కు మరియు ఆయన ప్రవక్తకు అవిధేయుడై, ఆయన నియమాలను ఉల్లంఘిస్తాడో! అలాంటి వాడు నరకాగ్నిలోకి త్రోయ బడతాడు, అందులో అతడు శాశ్వతంగా ఉంటాడు. మరియు అతనికి అవమాన కరమైన శిక్ష ఉంటుంది.

15. మరియు మీ స్త్రీలలో ఎవరైనా వ్యభిచారానికి పాల్పడితే, వారికి వ్యతిరేకంగా, మీలోనుండి నలుగురి సాక్ష్యం తీసుకోండి. వారు (నలుగురు) సాక్ష్యమిస్తే, వారు మరణించేవరకైనా, లేదా వారి కొరకు అల్లాహ్ ఏదైనా మార్గం చూపించేవరకైనా, వారిని ఇండ్లలో నిర్బంధించండి.[1]

16. మరియు మీలో ఏ ఇద్దరూ (స్త్రీలు గానీ, పురుషులు గానీ) దీనికి (వ్యభిచారానికి) పాల్పడితే వారిద్దరినీ శిక్షించండి. వారు పశ్చాత్తాపపడి తమ ప్రవర్తనను సవరించు కుంటే వారిని విడిచిపెట్టండి. నిశ్చయంగా, అల్లాహ్‌యే పశ్చాత్తాపాన్ని అంగీకరించేవాడు, అపార కరుణాప్రదాత.[2]

تِلْكَ حُدُودُ ٱللَّهِ ۚ وَمَن يُطِعِ
ٱللَّهَ وَرَسُولَهُۥ يُدْخِلْهُ جَنَّٰتٍ
تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ
خَٰلِدِينَ فِيهَا ۚ وَذَٰلِكَ ٱلْفَوْزُ
ٱلْعَظِيمُ ﴿١٣﴾
وَمَن يَعْصِ ٱللَّهَ وَرَسُولَهُۥ
وَيَتَعَدَّ حُدُودَهُۥ يُدْخِلْهُ نَارًا
خَٰلِدًا فِيهَا وَلَهُۥ عَذَابٌ
مُّهِينٌ ﴿١٤﴾
وَٱلَّٰتِى يَأْتِينَ ٱلْفَٰحِشَةَ مِن
نِّسَآئِكُمْ فَٱسْتَشْهِدُوا۟ عَلَيْهِنَّ أَرْبَعَةً
مِّنكُمْ ۖ فَإِن شَهِدُوا۟ فَأَمْسِكُوهُنَّ
فِى ٱلْبُيُوتِ حَتَّىٰ يَتَوَفَّىٰهُنَّ ٱلْمَوْتُ أَوْ
يَجْعَلَ ٱللَّهُ لَهُنَّ سَبِيلًا ﴿١٥﴾
وَٱلَّذَانِ يَأْتِيَٰنِهَا مِنكُمْ
فَـَٔاذُوهُمَا ۖ فَإِن تَابَا وَأَصْلَحَا
فَأَعْرِضُوا۟ عَنْهُمَآ ۗ إِنَّ ٱللَّهَ كَانَ
تَوَّابًا رَّحِيمًا ﴿١٦﴾

---

1. ఇది ము'హమ్మద్ ('స'అస), ప్రవక్తగా ఎన్నుకోబడిన మొదటి రోజులలో ఇవ్వబడిన అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞ. ఆ తరువాత సూరహ్ అన్నూర్ (24:2)లో, అల్లాహుతా'ఆలా తన ఆదేశాన్ని వివరంగా అవతరింపజేశాడు. ఇంకా చూడండి, 4:25.
2. ఇది వ్యభిచార నేరానికి సంబంధించిన తొలి ఆదేశం. చూడండి, 24:2 మరియు 4:25.

إِنَّمَا ٱلتَّوۡبَةُ عَلَى ٱللَّهِ لِلَّذِينَ
يَعۡمَلُونَ ٱلسُّوٓءَ بِجَهَٰلَةٖ ثُمَّ يَتُوبُونَ
مِن قَرِيبٖ فَأُوْلَٰٓئِكَ يَتُوبُ ٱللَّهُ عَلَيۡهِمۡۗ
وَكَانَ ٱللَّهُ عَلِيمًا حَكِيمٗا ١٧

**17**. నిశ్చయంగా పశ్చాత్తాపాన్ని అంగీకరించటం అల్లాహ్‌కే చెందినది. ఎవరైతే అజ్ఞానం వల్ల పాపంచేసి, వెను వెంటనే పశ్చాత్తాపపడతారో! అలాంటి వారి పశ్చాత్తాపాన్ని అల్లాహ్ స్వీకరిస్తాడు. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేచనాపరుడు.

وَلَيۡسَتِ ٱلتَّوۡبَةُ لِلَّذِينَ يَعۡمَلُونَ
ٱلسَّيِّـَٔاتِ حَتَّىٰٓ إِذَا حَضَرَ أَحَدَهُمُ
ٱلۡمَوۡتُ قَالَ إِنِّي تُبۡتُ ٱلۡـَٰٔنَ وَلَا ٱلَّذِينَ
يَمُوتُونَ وَهُمۡ كُفَّارٌۚ أُوْلَٰٓئِكَ
أَعۡتَدۡنَا لَهُمۡ عَذَابًا أَلِيمٗا ١٨

**18**. మరియు వారిలో ఒకడు, మరణం ఆసన్నమయ్యే వరకూ పాపకార్యాలు చేస్తూవుండి: "ఇప్పుడు నేను పశ్చాత్తాప పడుతున్నాను!" అని అంటే అలాంటి వారి పశ్చాత్తాపం మరియు మరణించే వరకు సత్యతిరస్కారులుగా ఉన్న వారి (పశ్చాత్తాపం) స్వీకరించబడవు.[1] అలాంటి వారి కొరకు మేము బాధాకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచాము.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا يَحِلُّ
لَكُمۡ أَن تَرِثُواْ ٱلنِّسَآءَ كَرۡهٗاۖ وَلَا
تَعۡضُلُوهُنَّ لِتَذۡهَبُواْ بِبَعۡضِ مَآ
ءَاتَيۡتُمُوهُنَّ إِلَّآ أَن يَأۡتِينَ بِفَٰحِشَةٖ
مُّبَيِّنَةٖۚ وَعَاشِرُوهُنَّ بِٱلۡمَعۡرُوفِۚ فَإِن
كَرِهۡتُمُوهُنَّ فَعَسَىٰٓ أَن تَكۡرَهُواْ
شَيۡـٔٗا وَيَجۡعَلَ ٱللَّهُ فِيهِ خَيۡرٗا
كَثِيرٗا ١٩

**19**. ఓ విశ్వాసులారా! మీరు బలవంతంగా స్త్రీలకు వారసులు కావటం మీకు ధర్మ సమ్మతం కాదు. మరియు మీరు వారికిచ్చిన దాని (మహ్ర్) నుండి కొంత తీసుకోవటానికి వారిని ఇబ్బందిలో పెట్టకండి, వారు నిస్సందేహంగా వ్యభిచారానికి పాల్పడితే తప్ప.[2] మరియు మీరు వారితో గౌరవంతో సహవాసం చేయండి. ఒకవేళ మీకు వారు నచ్చకపోతే! బహుశా మీకు ఒక విషయం నచ్చక పోవచ్చు, కాని అందులోనే అల్లాహ్ ఎంతో మేలు ఉంచి ఉండవచ్చు!

---

స్త్రీ-పురుషుల లైంగిక సంబంధాలే కాక, స్త్రీ-స్త్రీ, లేక పురుష-పురుష లైంగిక సంబంధాలు కూడా శిక్షింపదగినవే!

**1**. దీని అర్థం ఏమిటంటే, మరణసమయం ఆసన్నమైనప్పుడు చేసే పశ్చాత్తాపం మరియు అవిశ్వాసుని విశ్వాసం అంగీకరించబడవు. చూడండి, 3:90-91.

**2**. చూడండి, 2:229.

**20**. మరియు ఒకవేళ మీరు ఒక భార్యను విడనాడి వేరొకామెను పెండ్లి చేసుకోవాలని సంకల్పించుకుంటే! మరియు మీరు ఆమెకు ఒక పెద్ద ధనరాశిని ఇచ్చిఉన్నా సరే, దాని నుండి ఏ మాత్రం తిరిగి తీసుకోకండి. ఏమీ? ఆమెపై అపనింద మోపి, ఘోర పాపానికి పాల్పడి, దాన్ని తిరిగి తీసుకుంటారా?

**21**. మరియు మీరు పరస్పరం దాంపత్య సుఖం అనుభవించిన తరువాత, వారు మీ నుండి గట్టి వాగ్దానం తీసుకున్న తరువాత, మీరు దానిని (మహ్రను) ఎలా తిరిగి తీసుకోగలరు?

**22**. మీ తండ్రులు వివాహమాడిన స్త్రీలను మీరు వివాహమాడకండి. ఇంతకు పూర్వం జరిగిందేదో జరిగిపోయింది. నిశ్చయంగా, ఇది అసభ్యకరమైనది (సిగ్గుమాలినది), జుగుప్సాకరమైనది మరియు చెడు మార్గము.

**23**. మీకు ఈ స్త్రీలు నిషేధించబడ్డారు:[1]

وَإِنۡ أَرَدتُّمُ ٱسۡتِبۡدَالَ زَوۡجٖ مَّكَانَ زَوۡجٖ وَءَاتَيۡتُمۡ إِحۡدَىٰهُنَّ قِنطَارٗا فَلَا تَأۡخُذُواْ مِنۡهُ شَيۡـًٔاۚ أَتَأۡخُذُونَهُۥ بُهۡتَٰنٗا وَإِثۡمٗا مُّبِينٗا ٢٠

وَكَيۡفَ تَأۡخُذُونَهُۥ وَقَدۡ أَفۡضَىٰ بَعۡضُكُمۡ إِلَىٰ بَعۡضٖ وَأَخَذۡنَ مِنكُم مِّيثَٰقًا غَلِيظٗا ٢١

وَلَا تَنكِحُواْ مَا نَكَحَ ءَابَآؤُكُم مِّنَ ٱلنِّسَآءِ إِلَّا مَا قَدۡ سَلَفَۚ إِنَّهُۥ كَانَ فَٰحِشَةٗ وَمَقۡتٗا وَسَآءَ سَبِيلًا ٢٢

حُرِّمَتۡ عَلَيۡكُمۡ أُمَّهَٰتُكُمۡ

---

**1**. ఏ స్త్రీలతో వివాహం నిషిద్ధం ('హరామ్) ఉందో, వారి వివరాలు ఈ విధంగా ఉన్నాయి: అందులో ఏడుగురు రక్త సంబంధీకులు (నసబ్), ఏడుగురు పాలసంబంధీకులు (రదా'ఈ), మరియు నలుగురు వివాహ సంబంధీకులు. వీరే గాక, ఒక స్త్రీ మరియు ఆమె తండ్రి సోదరిని లేక ఆమె తల్లి సోదరిని ఒకే సారి నికాహ్‌లో ఉంచుకోరాదు.

1) రక్త సంబంధీకులు - **7**: తల్లులు, కుమార్తెలు, సోదరీమణులు, తండ్రి సోదరీమణులు, తల్లి సోదరీమణులు, సోదరుల కుమార్తెలు మరియు సోదరీమణుల కుమార్తెలు.

2) పాల సంబంధీకులు - **7**: పాలు త్రాగిన తల్లులు, పాల కుమార్తెలు, తోటిపాలు త్రాగిన సోదరీమణులు, పాలతండ్రి సోదరీమణులు, పాలతల్లి సోదరీమణులు, పాలసోదరుల కుమార్తెలు, పాలసోదరీమణుల కుమార్తెలు.

3) వివాహ సంబంధీకులు - **4**: భార్యతల్లి, సహవాసంచేసిన భార్య మునుపటి భర్తల కుమార్తెలు (రబాయిబ్), మునుపటి భర్తల కుమారుల భార్యలు మరియు ఇద్దరు సోదరీ మణులను ఒకేసారి వివాహబంధంలో తీసుకోవటం. ఇంతే గాక తండ్రి భార్యలు. 'హదీస్' ప్రకారం భార్య వివాహబంధంలో ఉన్నంత వరకు ఆమె తండ్రి సోదరీమణులు, ఆమె తల్లి సోదరీమణులు. సోదరుల కుమార్తెలు మరియు సోదరీమణుల కుమార్తెలు.

**I. మొదటి విభాగపు వివరాలు** / రక్త సంబంధీకుల నిషేధాలు:
(1) తల్లులు అంటే: తల్లులే గాక, తల్లుల తల్లులు (అమ్మమ్మలు), తల్లి నాయనమ్మలు మరియు తండ్రి తల్లులు, తాతతల్లులు, ముత్తాతతల్లులు మరియు వారి పూర్వీకులు.
(2) కుమార్తెలు అంటే: కుమార్తెలే గాక, కుమారులకుమార్తెలు, కుమార్తెలకుమార్తెలు మరియు వారి (కుమారుల మరియు కుమార్తెల) కుమార్తెలకుమార్తెలు మరియు వారి సంతానపుసంతానం కూడా. వ్యభిచారం ('జినా) వల్ల (వివాహబంధం లేకుండా) పుట్టిన ఆడపిల్ల "కూతురు" అని ఇమామ్ షాఫయి (ర'హ్మ.) తప్ప, ఇతర ముగ్గురు ఇమాములూ (ర.'అలైహిమ్) అంగీకరించారు కాబట్టి ఆమెతో వివాహం హరాం అన్నారు. "అతనికి - ఆమె షర'ఈ కూతురు కాదు కాబట్టి ఆస్తికి వారసురాలు కాజాలదు," అని ఇమామ్ షాఫ'ఈ (ర'హ్మ.) అంటారు, (ఇబ్నె-కసీ'ర్).
(3) సోదరీమణులు: అంటే , 1. సొంత (ఒకే తండ్రి-తల్లి), 2. సవతి (ఒకే తండ్రి), 3. అర్ధ (ఒకే తల్లి) నుండి గానీ కావచ్చు.
(4) తండ్రి సోదరీమణులు: తండ్రి యొక్క స్త్రీ సంబంధీకులు అంటే, తండ్రితండ్రి (తాత), మరియు తల్లితండ్రు (తాత)ల యొక్క మూడురకాల సోదరీమణులు కూడా అన్నమాట. మూడురకాలు అంటే - సొంత (ఒకే తండ్రి-తల్లి), సవతి (ఒకే తండ్రి), లేక అర్ధ (ఒకే తల్లి).
(5) తల్లి సోదరీమణులు: తల్లి యొక్క స్త్రీ సంబంధీకులు అంటే ఆమె తల్లితల్లి, ఆమె తండ్రితల్లి మరియు వారి మూడురకాల సోదరీమణులు అన్నమాట.
(6) సోదరుల కుమార్తెలలో - కూడా మూడు రకాల సోదరుల కుమార్తెలున్నారు.
(7) సోదరీమణుల కుమార్తెలలో - కూడ మూడు రకాల సోదరీమణుల కుమార్తెలున్నారు.

**II. రెండవ విభాగపు వివరాలు** /పాల సంబంధీకుల నిషేధాలు:
* పాలతల్లి - అంటే రెండు సంవత్సరాల వయస్సు లోపల నీవు పాలు త్రాగిన స్త్రీ.
* పాల సోదరి - అంటే ఆ స్త్రీ, ఎవరికైతే నీ స్వంతతల్లి, లేక పాలతల్లి, పాలు త్రాపిందో - పాలు త్రాపింది నీతోపాటు గానీ, నీకు ముందు గానీ, లేక తరువాత గానీ కావచ్చు! లేక ఏ స్త్రీయొక్క స్వంత లేక పాల తల్లి నీకు పాలిచ్చిందో, అది ఒకే సమయంలో కానీ లేక వేరే సమయాలలోగానీ కావచ్చు!
* పాలు త్రాగటం వలన కూడా రక్త సంబంధీకులలో ఏ ఏ సంబంధీకులు హరామ్ అవుతారో అలాంటి వారంతా హరాం. వివరాలు ఈ విధంగా ఉన్నాయి: పాలిచ్చిన తల్లియొక్క సొంత మరియు పాలుత్రాగిన పిల్లలందరూ పాలుత్రాగిన వాడియొక్క సోదరసోదరీలు. ఆమెభర్త వాడి తండ్రిలాంటివాడు, ఆమెభర్తసోదరీమణులు, ఆమె చెల్లెళ్ళు, ఆమెభర్తసోదరులు మొదలైనవారందరితో వాడి సంబంధం - వివాహ విషయంలో - రక్త సంబంధీకులతో మాదిరిగానే పరిగణించబడాలి.
* కానీ పాలు త్రాగిన శిశువు యొక్క రక్త సంబంధీకులైన సోదర సోదరీమణులు, పాలుత్రాపిన తల్లి రక్తసంబంధీకులకు - ఆ శిశువుకు పాలు త్రాపినందువల్ల - హరాం కారు.

**III . మూడవ విభాగపు వివరాలు** (వివాహ సంబంధీకులు): భార్య తల్లి, భార్య అమ్మమ్మ, భార్య నాయనమ్మ. ఒక స్త్రీతో నికాహ్ చేసుకొని, సంభోగించకుండా విడాకులిచ్చినా కూడా

وَبَنَاتُكُمْ وَأَخَوَاتُكُمْ وَعَمَّاتُكُمْ وَخَالَاتُكُمْ وَبَنَاتُ ٱلْأَخِ وَبَنَاتُ ٱلْأُخْتِ وَأُمَّهَاتُكُمُ ٱلَّاتِي أَرْضَعْنَكُمْ وَأَخَوَاتُكُم مِّنَ ٱلرَّضَاعَةِ وَأُمَّهَاتُ نِسَآئِكُمْ وَرَبَآئِبُكُمُ ٱلَّاتِي فِي حُجُورِكُم مِّن نِّسَآئِكُمُ ٱلَّاتِي دَخَلْتُم بِهِنَّ فَإِن لَّمْ تَكُونُواْ دَخَلْتُم بِهِنَّ فَلَا جُنَاحَ عَلَيْكُمْ وَحَلَآئِلُ أَبْنَآئِكُمُ ٱلَّذِينَ مِنْ أَصْلَابِكُمْ وَأَن تَجْمَعُواْ بَيْنَ ٱلْأُخْتَيْنِ إِلَّا مَا قَدْ سَلَفَ ۗ إِنَّ ٱللَّهَ كَانَ غَفُورًا رَّحِيمًا ﴿٢٣﴾

మీ తల్లులు, మీ కుమార్తెలు, మీ సోదరీమణులు, మీ మేనత్తలు, మీ తల్లి సోదరీమణులు (పినతల్లులు), మీ సోదరుల కుమార్తెలు, మీ సోదరీమణుల కుమార్తెలు, మీకు పాలిచ్చిన తల్లులు (దాదులు), మీతోపాటు పాలు త్రాగిన సోదరీమణులు, మీ భార్యల తల్లులు; మీ సంరక్షణలో ఉన్న మీ భార్యల కుమార్తెలు - ఏ భార్యలతోనైతే మీరు సంభోగించారో - కాని మీరు వారితో సంభోగించక ముందు (వారికి విడాకులిచ్చి వారి కూతుళ్ళను పెండ్లాడితే) తప్పులేదు; మీ వెన్నునుండి పుట్టిన మీ కుమారుల భార్యలు మరియు ఏక కాలంలో అక్కా చెల్లెళ్ళను ఇద్దరినీ చేర్చటం (భార్యలుగా చేసుకోవటం నిషిద్ధం); కాని ఇంతకు పూర్వం జరిగిందేదో జరిగిపోయింది. నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

---

ఆమె తల్లితో వివాహం నిషిద్ధం. కాని ఒక స్త్రీతో వివాహం చేసుకొని, ఆమెతో సంభోగం చేయకముందే విడాకులిస్తే, ఆమె కుమార్తెతో నికాహ్ చేసుకోవడం ధర్మసమ్మతమే, (ఫ'త్హ్ అల్-ఖదీర్).
ఇంకా వివరాలకు చూడండి, ఫ'త్హ్ అల్-ఖదీర్, లేదా షరీ'అత్ వేత్తలను సంప్రదించండి.

۞ وَٱلۡمُحۡصَنَٰتُ مِنَ ٱلنِّسَآءِ
إِلَّا مَا مَلَكَتۡ أَيۡمَٰنُكُمۡۖ كِتَٰبَ
ٱللَّهِ عَلَيۡكُمۡۚ وَأُحِلَّ لَكُم مَّا وَرَآءَ
ذَٰلِكُمۡ أَن تَبۡتَغُواْ بِأَمۡوَٰلِكُم
مُّحۡصِنِينَ غَيۡرَ مُسَٰفِحِينَۚ فَمَا
ٱسۡتَمۡتَعۡتُم بِهِۦ مِنۡهُنَّ فَـَٔاتُوهُنَّ
أُجُورَهُنَّ فَرِيضَةٗۚ وَلَا جُنَاحَ
عَلَيۡكُمۡ فِيمَا تَرَٰضَيۡتُم بِهِۦ مِنۢ
بَعۡدِ ٱلۡفَرِيضَةِۚ إِنَّ ٱللَّهَ كَانَ عَلِيمًا
حَكِيمٗا ٢٤

**24**. (*) మరియు ఇతరుల వివాహ బంధంలో ఉన్న స్త్రీలు - (ధర్మ యుద్ధంలో) మీ చేతికి చిక్కిన బానిస స్త్రీలు తప్ప - (మీరు వివాహమాడటానికి నిషేధించబడ్డారు). ఇది అల్లాహ్ మీకు విధించిన అనుశాసనం. మరియు వీరు తప్ప మిగతా స్త్రీలంతా మీకు వివాహమాడటానికి ధర్మసమ్మతం చేయబడ్డారు. మీరు వారికి తగిన స్త్రీశుల్కం (మహ్ర్) ఇచ్చి వ్యభిచారంగా గాకుండా వివాహబంధంలో తీసుకోవటానికి కోరవచ్చు. కావున మీరు దాంపత్య సుఖాన్ని అనుభవించాలనుకున్న వారికి, వారి స్త్రీ శుల్కం (మహ్ర్) విధిగా చెల్లించండి. కాని స్త్రీ శుల్కం (మహ్ర్) ఒప్పందం జరిగిన తరువాత పరస్పర అంగీకారంతో మీ మధ్య ఏమైనా రాజీ కుదిరితే, అందులో దోషంలేదు. నిశ్చయంగా అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

وَمَن لَّمۡ يَسۡتَطِعۡ مِنكُمۡ طَوۡلًا أَن
يَنكِحَ ٱلۡمُحۡصَنَٰتِ
ٱلۡمُؤۡمِنَٰتِ فَمِن مَّا مَلَكَتۡ
أَيۡمَٰنُكُم مِّن فَتَيَٰتِكُمُ ٱلۡمُؤۡمِنَٰتِۚ
وَٱللَّهُ أَعۡلَمُ بِإِيمَٰنِكُمۚ بَعۡضُكُم مِّنۢ
بَعۡضٖۚ فَٱنكِحُوهُنَّ بِإِذۡنِ أَهۡلِهِنَّ

**25**. మరియు మీలో ఎవరికైనా స్వతంత్రులైన ముస్లిం స్త్రీలను, వివాహం చేసుకునే స్తోమత లేకుంటే, అప్పుడు మీ స్వాధీనంలో ఉన్న ముస్లింలైనటువంటి బానిస స్త్రీలను వివాహమాడవచ్చు. మరియు అల్లాహ్‌కు మీ విశ్వాసం గురించి తెలుసు. మీరంతా ఒకే ఒక వర్గానికి చెందిన వారు[1] (ఒకరికొకరు సంబంధించిన వారు), అందువల్ల వారి సంరక్షకుల అనుమతితో వారితో వివాహం చేసుకొని, ధర్మ

**1**. చూడండి, 3:195.

وَءَاتُوهُنَّ أُجُورَهُنَّ بِٱلْمَعْرُوفِ مُحْصَنَٰتٍ غَيْرَ مُسَٰفِحَٰتٍ وَلَا مُتَّخِذَٰتِ أَخْدَانٍ فَإِذَآ أُحْصِنَّ فَإِنْ أَتَيْنَ بِفَٰحِشَةٍ فَعَلَيْهِنَّ نِصْفُ مَا عَلَى ٱلْمُحْصَنَٰتِ مِنَ ٱلْعَذَابِ ذَٰلِكَ لِمَنْ خَشِيَ ٱلْعَنَتَ مِنكُمْ وَأَن تَصْبِرُوا۟ خَيْرٌ لَّكُمْ وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴿٢٥﴾

ప్రకారంగా వారి స్త్రీశుల్కం (మహ్ర్) ఇవ్వండి. ఇది వారిని వివాహబంధంలో సురక్షితంగా ఉంచటానికి, స్వేచ్ఛా కామ క్రీడలకు దిగకుండా ఉంచటానికి మరియు దొంగచాటు సంబంధాలు ఏర్పరచు కోకుండా ఉంచటానికి (ఆదేశించబడింది). వారు (ఆ బానిస స్త్రీలు) వివాహబంధంలో రక్షణ పొందిన తరువాత కూడా వ్యభిచారానికి పాల్పడితే, స్వతంత్రులైన స్త్రీలకు విధించే శిక్షలోని సగం శిక్ష వారికి విధించండి.[1] ఇది మీలో పాపభీతి గలవారికి వర్తిస్తుంది. ఒకవేళ మీరు నిగ్రహం పాటిస్తే అది మీకే మంచిది. మరియు అల్లాహ్ క్షమాశీలుడు. అపార కరుణాప్రదాత.

يُرِيدُ ٱللَّهُ لِيُبَيِّنَ لَكُمْ وَيَهْدِيَكُمْ سُنَنَ ٱلَّذِينَ مِن قَبْلِكُمْ وَيَتُوبَ عَلَيْكُمْ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٌ ﴿٢٦﴾

**26**. అల్లాహ్ మీకు (ధర్మ-అధర్మాలను) స్పష్టం చేయాలనీ మరియు మీ కంటే పూర్వం ఉన్న (సత్పురుషుల) మార్గం వైపునకు, మీకు మార్గదర్శకత్వం చేయాలనీ మరియు మీ పశ్చాత్తాపాన్ని అంగీకరించాలనీ కోరుతున్నాడు. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

وَٱللَّهُ يُرِيدُ أَن يَتُوبَ عَلَيْكُمْ وَيُرِيدُ ٱلَّذِينَ يَتَّبِعُونَ ٱلشَّهَوَٰتِ أَن تَمِيلُوا۟ مَيْلًا عَظِيمًا ﴿٢٧﴾

**27**. మరియు అల్లాహ్ మీ పశ్చాత్తాపాన్ని అంగీకరించగోరుతున్నాడు. కాని తమ మనోవాంఛలను అనుసరిస్తున్న వారు, మీరు (సన్మార్గం నుండి) చాలా దూరంగా వైదొలగాలని కోరుతున్నారు.

يُرِيدُ ٱللَّهُ أَن يُخَفِّفَ عَنكُمْ وَخُلِقَ ٱلْإِنسَٰنُ ضَعِيفًا ﴿٢٨﴾

**28**. అల్లాహ్ మీ భారాన్ని తగ్గించ గోరుతున్నాడు. మరియు (ఎందుకంటే) మానవుడు బలహీనుడిగా సృష్టించబడ్డాడు.

---

**1**. అంటే, 50 కొరడా దెబ్బలు.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تَأْكُلُوٓا۟ أَمْوَٰلَكُم بَيْنَكُم بِٱلْبَـٰطِلِ إِلَّآ أَن تَكُونَ تِجَـٰرَةً عَن تَرَاضٍ مِّنكُمْ ۚ وَلَا تَقْتُلُوٓا۟ أَنفُسَكُمْ ۚ إِنَّ ٱللَّهَ كَانَ بِكُمْ رَحِيمًا ﴿٢٩﴾

**29**. ఓ విశ్వాసులారా! మీరు ఒకరి సొమ్ము నొకరు అన్యాయంగా తినకండి, పరస్పర అంగీకారంతో చేసే వ్యాపారం వల్ల వచ్చేది (లాభం) తప్ప.[1] మరియు మీరు ఒకరినొకరు చంపుకోకండి.[2] నిశ్చయంగా, అల్లాహ్ మీ యెడల అపార కరుణాప్రదాత.

وَمَن يَفْعَلْ ذَٰلِكَ عُدْوَٰنًا وَظُلْمًا فَسَوْفَ نُصْلِيهِ نَارًا ۚ وَكَانَ ذَٰلِكَ عَلَى ٱللَّهِ يَسِيرًا ﴿٣٠﴾

**30**. మరియు ఎవడు ద్వేషంతో మరియు దుర్మార్గంతో అలా చేస్తాడో, వానిని మేము నరకాగ్నిలో పడవేస్తాము. మరియు అది అల్లాహ్‌కు ఎంతో సులభం.

إِن تَجْتَنِبُوا۟ كَبَآئِرَ مَا تُنْهَوْنَ عَنْهُ نُكَفِّرْ عَنكُمْ سَيِّـَٔاتِكُمْ وَنُدْخِلْكُم مُّدْخَلًا كَرِيمًا ﴿٣١﴾

**31**. ఒకవేళ మీకు నిషేధించబడి నటువంటి మహా పాపాలకు మీరు దూరంగా ఉంటే, మేము మీ చిన్నచిన్న దోషాలను మన్నించి, మిమ్మల్ని గౌరవస్థానాల్లోకి ప్రవేశింపజేస్తాము.[3]

وَلَا تَتَمَنَّوْا۟ مَا فَضَّلَ ٱللَّهُ بِهِۦ بَعْضَكُمْ عَلَىٰ بَعْضٍ ۚ لِّلرِّجَالِ نَصِيبٌ مِّمَّا ٱكْتَسَبُوا۟ ۖ وَلِلنِّسَآءِ نَصِيبٌ مِّمَّا ٱكْتَسَبْنَ ۚ وَسْـَٔلُوا۟ ٱللَّهَ مِن فَضْلِهِۦٓ ۗ إِنَّ ٱللَّهَ كَانَ بِكُلِّ شَىْءٍ عَلِيمًا ﴿٣٢﴾

**32**. మరియు అల్లాహ్ మీలో కొందరికి మరికొందరిపై ఇచ్చిన ఘనతను మీరు ఆశించకండి. పురుషులకు తాము సంపాదించిన దానికి తగినట్లుగా ఫలితం ఉంటుంది. మరియు స్త్రీలకు తాము సంపాదించిన దానికి తగినట్లుగా ఫలితం ఉంటుంది. మరియు అల్లాహ్ అనుగ్రహం కొరకు ప్రార్థిస్తూ ఉండండి. నిశ్చయంగా, అల్లాహ్‌కు ప్రతిదాని పరిజ్ఞానం ఉంది.

---

**1**. నిషిద్ధ ('హరాం) వస్తువుల వ్యాపారం కూడా నిషిద్ధమే.

**2**. ఇందులో ఆత్మహత్య కూడా ఉంది. అది మహాపాపం.

**3**. అబూ హురైరా (ర'ది.'అ.) కథనం, దైవప్రవక్త ('స'అస) అన్నారు: "ఏడు మహా పాపాల నుండి దూరంగా ఉండండి. అవి: 1) ఆరాధనలో అల్లాహ్ (సు.తా.)కు సాటి కల్పించటం, 2) మంత్ర జాలం పాటించటం, 3) ఎవరినైనా హత్యచేయటం (న్యాయానికి తప్ప), 4) వడ్డీ తినటం, 5) అనాథుల ఆస్తిని కబళించటం, 6) యుద్ధరంగం నుండి వెన్నుచూపి పారిపోవటం మరియు 7) పతివ్రత స్త్రీలపై అపనింద మోపటం." ('స.బు'ఖారీ, పుస్తకం-8, 'హదీస్' నం. 840).

وَلِكُلٍّ جَعَلْنَا مَوَٰلِيَ مِمَّا تَرَكَ ٱلْوَٰلِدَانِ وَٱلْأَقْرَبُونَۚ وَٱلَّذِينَ عَقَدَتْ أَيْمَٰنُكُمْ فَـَٔاتُوهُمْ نَصِيبَهُمْۚ إِنَّ ٱللَّهَ كَانَ عَلَىٰ كُلِّ شَيْءٍ شَهِيدًا ﴿٣٣﴾

**33**. మరియు తల్లిదండ్రులు మరియు దగ్గరి బంధువులు, వదలిపోయిన ప్రతివ్యక్తి (ఆస్తి)కి మేము వారసులను నియమించి ఉన్నాము. మరియు మీరు ఎవరితో ప్రమాణ పూర్వక ఒప్పందాలు చేసుకొని ఉన్నారో! వారి భాగాన్ని వారికి ఇచ్చివేయండి. నిశ్చయంగా, అల్లాహ్ ప్రతిదానికి సాక్షిగా ఉంటాడు.[1]

ٱلرِّجَالُ قَوَّٰمُونَ عَلَى ٱلنِّسَآءِ بِمَا فَضَّلَ ٱللَّهُ بَعْضَهُمْ عَلَىٰ بَعْضٍ وَبِمَآ أَنفَقُواْ مِنْ أَمْوَٰلِهِمْۚ فَٱلصَّٰلِحَٰتُ قَٰنِتَٰتٌ حَٰفِظَٰتٌ لِّلْغَيْبِ بِمَا حَفِظَ ٱللَّهُۚ وَٱلَّٰتِي تَخَافُونَ نُشُوزَهُنَّ فَعِظُوهُنَّ وَٱهْجُرُوهُنَّ فِي ٱلْمَضَاجِعِ وَٱضْرِبُوهُنَّۖ فَإِنْ أَطَعْنَكُمْ فَلَا تَبْغُواْ عَلَيْهِنَّ سَبِيلًاۗ

**34**. పురుషులు స్త్రీలపై నిర్వాహకులు (ఖవ్వామూన్),[2] ఎందుకంటే అల్లాహ్ కొందరికి మరికొందరిపై ఘనతనిచ్చాడు మరియు వారు (పురుషులు) తమ సంపదలో నుండి వారి(స్త్రీల)పై ఖర్చు చేస్తారు. కావున సుగుణవంతులైన స్త్రీలు విధేయవతులై ఉండి, భర్తలు లేనప్పుడు, అల్లాహ్ కాపాడమని ఆజ్ఞాపించిన దానిని (శీలమును) కాపాడుకుంటారు. కానీ అవిధేయత చూపుతారని మీకు భయముంటే, వారికి (మొదట) నచ్చజెప్పండి, (తరువాత) పడకలో వేరుగా ఉంచండి, (ఆ తరువాత కూడా వారు విధేయులు కాకపోతే) వారిని (మెల్లగా) కొట్టండి.[3] కాని వారు మీకు

**1**. చూడండి, 'స.బు'ఖారీ, పుస్తకం-3, 'హదీస్' నం. 489.

**2**. ఖవ్వామూన్: ఖామా నుండి. అంటే నిలబడు, ఆధారమిచ్చే వారు, బాధ్యులు, అధికారులు, పోషకులు, రక్షకులు, నిర్వాహకులు, వ్యవహారకర్తలు అనే అర్థాలున్నాయి. ఇస్లాంలో స్త్రీల బాధ్యత ప్రతిదశలో పురుషులపై ఉంది. బాల్యం నుండి వివాహమయ్యే వరకు, తండ్రిపై, తరువాత భర్తపై, భర్త లేకుంటే సోదరునిపై, లేక కుమారునిపై, చివరకు దగ్గరి బంధువులు ఎవ్వరూ లేకుంటే, ఇస్లామియా ప్రభుత్వంపై ఉంటుంది.

**3**. ఎన్నో 'స'హీ'హ్ 'హదీస్'ల ప్రకారం, ఒకవేళ స్త్రీ అశ్లీలానికి పాల్పడితేనే, అది కూడా ఆమెకు ఎక్కువ బాధ కలిగించకుండా మెల్లగా మాత్రమే కొట్టాలని బోధింపబడింది. ('స'హా సిత్తా, అ'హ్మద్, ఇబ్నె-'హిబ్బాన్, 'హాకిం 'అబ్దుల్లాహ్-ఇబ్నె 'అబ్బాస్ ర'ది.'అ. కథనం; బై'హాఖీ, ఉమ్మె-కుల్సూ'మ్ ర.'అన్హా కథనం).

إِنَّ ٱللَّهَ كَانَ عَلِيًّا كَبِيرًا ﴿٣٤﴾

విధేయులై ఉంటే! వారిని నిందించటానికి మార్గం వెతకకండి. నిశ్చయంగా, అల్లాహ్ మహోన్నతుడు, మహనీయుడు.[1]

وَإِنْ خِفْتُمْ شِقَاقَ بَيْنِهِمَا فَٱبْعَثُوا۟ حَكَمًا مِّنْ أَهْلِهِۦ وَحَكَمًا مِّنْ أَهْلِهَآ إِن يُرِيدَآ إِصْلَٰحًا يُوَفِّقِ ٱللَّهُ بَيْنَهُمَآ ۗ إِنَّ ٱللَّهَ كَانَ عَلِيمًا خَبِيرًا ﴿٣٥﴾

**35.** మరియు వారిద్దరి (భార్యా-భర్తల) మధ్య సంబంధాలు తెగిపోతాయనే భయం మీకు కలిగితే, అతని (భర్త) బంధువులనుండి ఒక మధ్యవర్తిని మరియు ఆమె (భార్య) బంధువుల నుండి ఒక మధ్యవర్తిని నియమించండి. వారిద్దరూ సంధి చేసుకో గోరితే అల్లాహ్ వారి మధ్య ఐకమత్యం చేకూర్చవచ్చు! నిశ్చయంగా, అల్లాహ్ సర్వజ్ఞుడు, సర్వం తెలిసినవాడు. (1/8)

۞ وَٱعْبُدُوا۟ ٱللَّهَ وَلَا تُشْرِكُوا۟ بِهِۦ شَيْـًٔا ۖ وَبِٱلْوَٰلِدَيْنِ إِحْسَٰنًا وَبِذِى ٱلْقُرْبَىٰ وَٱلْيَتَٰمَىٰ وَٱلْمَسَٰكِينِ وَٱلْجَارِ ذِى ٱلْقُرْبَىٰ وَٱلْجَارِ ٱلْجُنُبِ وَٱلصَّاحِبِ بِٱلْجَنۢبِ وَٱبْنِ ٱلسَّبِيلِ وَمَا مَلَكَتْ أَيْمَٰنُكُمْ ۗ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ مَن كَانَ مُخْتَالًا فَخُورًا ﴿٣٦﴾

**36.** * మరియు మీరు అల్లాహ్‌నే ఆరాధించండి మరియు ఎవ్వరినీ ఆయనకు భాగస్వాములుగా సాటి కల్పించకండి. మరియు తల్లిదండ్రులతో, దగ్గరి బంధువులతో, అనాథులతో నిరుపేదలతో, బంధువులైన పొరుగు వారితో, అపరిచితులైన పొరుగువారితో,[2] ప్రక్కనున్న మిత్రులతో, బాటసారులతో మరియు మీ అధీనంలో ఉన్న బానిసలతో అందరితోనూ ఉదారస్వభావంతో వ్యవహరించండి.[3] నిశ్చయంగా, అల్లాహ్ గర్వితుణ్ణి, బడాయీలు చెప్పుకునే వాణ్ణి ప్రేమించడు.[4]

---

**1**. కబీరున్ (అల్-కబీరు): = **అల్-'అ'"జీము**, The Greatest, The most Magnified, **మహానీయుడు**, మహత్వం, ప్రభావం, ప్రతాపం గలవాడు, సర్వాధికుడు. చూడండి, 22:62, 31:30, 34:23, 40:12. **అల్-ముతకబ్బిరు**: The Incomparably Great, గొప్పవాడు, గొప్పదనానికి సరోవరం, 59:23. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

**2**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "అల్లాహ్ (సు.తా.) మరియు అంతిమదినాన్ని విశ్వసించేవాడు, తన పొరుగువాడికి మేలుచేయాలి." ('స'హీ'హ్ బు'ఖారీ, 'స. ముస్లిం).

**3**. బానిసలను విడిపించటం ఎంతో ఉత్తమమైన కార్యం చూడండి, 9:60 మరియు 2:177.

**4**. చూడండి,'స'హీ'హ్ ముస్లిం కితాబుల్ ఈమాన్, బాబె త'హ్రీమ్, 'హదీస్' నం. 91.

ٱلَّذِينَ يَبۡخَلُونَ وَيَأۡمُرُونَ ٱلنَّاسَ بِٱلۡبُخۡلِ وَيَكۡتُمُونَ مَآ ءَاتَىٰهُمُ ٱللَّهُ مِن فَضۡلِهِۦۗ وَأَعۡتَدۡنَا لِلۡكَٰفِرِينَ عَذَابٗا مُّهِينٗا ٣٧

37. ఎవరైతే తాము లోభులై, ఇతరులకు లోభం నేర్పుతారో వారినీ మరియు అల్లాహ్ తన అనుగ్రహంతో ఇచ్చిన దానిని దాచి పెట్టే వారినీ (అల్లాహ్ ప్రేమించడు).[1] మరియు మేము సత్యతిరస్కారుల కొరకు అవమానకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచాము.

وَٱلَّذِينَ يُنفِقُونَ أَمۡوَٰلَهُمۡ رِئَآءَ ٱلنَّاسِ وَلَا يُؤۡمِنُونَ بِٱللَّهِ وَلَا بِٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِۗ وَمَن يَكُنِ ٱلشَّيۡطَٰنُ لَهُۥ قَرِينٗا فَسَآءَ قَرِينٗا ٣٨

38. మరియు వారికి ఎవరైతే ప్రజలకు చూపటానికి తమ సంపదను ఖర్చు పెడతారో మరియు అల్లాహ్‌ను మరియు అంతిమదినాన్ని విశ్వసించరో! మరియు ఎవడైతే షైతానును తన స్నేహితునిగా (ఖరీనున్) చేసుకుంటాడో![2] అతడు ఎంత నీచమైన స్నేహితుడు.

وَمَاذَا عَلَيۡهِمۡ لَوۡ ءَامَنُواْ بِٱللَّهِ وَٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِ وَأَنفَقُواْ مِمَّا رَزَقَهُمُ ٱللَّهُۚ وَكَانَ ٱللَّهُ بِهِمۡ عَلِيمًا ٣٩

39. మరియు వారు ఒకవేళ అల్లాహ్‌ను మరియు అంతిమ దినాన్ని విశ్వసించి అల్లాహ్ వారికి ప్రసాదించిన జీవనోపాధి నుండి ఇతరులపై ఖర్చుచేసి ఉంటే వారికేమయ్యేది? మరియు అల్లాహ్‌కు, వారిని గురించి బాగా తెలుసు.

إِنَّ ٱللَّهَ لَا يَظۡلِمُ مِثۡقَالَ ذَرَّةٖۖ وَإِن تَكُ حَسَنَةٗ يُضَٰعِفۡهَا وَيُؤۡتِ مِن لَّدُنۡهُ أَجۡرًا عَظِيمٗا ٤٠

40. నిశ్చయంగా, అల్లాహ్ ఎవరికీ రవ్వంత (పరమాణువంత) అన్యాయం కూడా చేయడు.[3] ఒక సత్కార్యముంటే ఆయన దానిని రెండింతలు చేస్తాడు; మరియు తన తరఫునుండి గొప్ప ప్రతిఫలాన్ని కూడా ప్రసాదిస్తాడు.

1. 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-2, 'హదీస్' నం. 522.
2. చూడండి, 2:268 మరియు 41:25.
3. చూడండి,'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-6, 'హదీస్' నం.105.

**41**. మేము (ప్రతిఫల దినమున) ప్రతి సమాజం నుండి ఒక సాక్షిని తెచ్చి మరియు (ఓ ప్రవక్తా!) నిన్ను వీరికి సాక్షిగా నిలబెట్టినప్పుడు ఎలా ఉంటుంది?

**42**. ఆ (ప్రతిఫల) దినమున, ప్రవక్త మాటను తిరస్కరించి, అతనికి అవిధేయత చూపిన వారంతా; తాము భూమిలో పూడ్చబడితే ఎంత బాగుండేదని కోరుతారు! కానీ, వారు అల్లాహ్ ముందు ఏ విషయాన్ని దాచలేరు.[1]

**43**. ఓ విశ్వాసులారా! మీరు మత్తులో ఉంటే,[2] మీరు పలికేది గ్రహించనంత వరకు మరియు మీకు ఇంద్రియ స్ఖలనం (జునుబున్) అయిఉంటే - స్నానం చేయనంత వరకు - నమా'జ్ సమీపానికి వెళ్ళకండి; కాని నడుస్తూ (మస్జిద్) నుండి దాటవలసివస్తే తప్ప.[3] కాని ఒకవేళ మీరు రోగపీడితులై ఉంటే, లేదా ప్రయాణంలో ఉంటే, లేక మలమూత్ర విసర్జన చేసి ఉంటే, లేక స్త్రీలతో సంభోగం చేసి ఉంటే - మీకు నీళ్ళు దొరక్కపోతే - పరిశుద్ధమైన మట్టిని చేతులతో స్పర్శించి ఆ చేతులతో మీ ముఖాలను మరియు మీ చేతులను, తుడుచుకోండి (తయమ్మమ్ చేయండి).[4] నిశ్చయంగా అల్లాహ్ తప్పులను మన్నించే వాడు, క్షమించే వాడు.

فَكَيْفَ إِذَا جِئْنَا مِن كُلِّ أُمَّةٍ
بِشَهِيدٍ وَجِئْنَا بِكَ عَلَىٰ هَٰٓؤُلَآءِ
شَهِيدًا ﴿٤١﴾
يَوْمَئِذٍ يَوَدُّ ٱلَّذِينَ كَفَرُوا۟ وَعَصَوُا۟
ٱلرَّسُولَ لَوْ تُسَوَّىٰ بِهِمُ ٱلْأَرْضُ وَلَا
يَكْتُمُونَ ٱللَّهَ حَدِيثًا ﴿٤٢﴾
يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تَقْرَبُوا۟
ٱلصَّلَوٰةَ وَأَنتُمْ سُكَٰرَىٰ حَتَّىٰ تَعْلَمُوا۟
مَا تَقُولُونَ وَلَا جُنُبًا إِلَّا عَابِرِى
سَبِيلٍ حَتَّىٰ تَغْتَسِلُوا۟ ۚ وَإِن كُنتُم
مَّرْضَىٰٓ أَوْ عَلَىٰ سَفَرٍ أَوْ جَآءَ أَحَدٌ
مِّنكُم مِّنَ ٱلْغَآئِطِ أَوْ لَٰمَسْتُمُ ٱلنِّسَآءَ
فَلَمْ تَجِدُوا۟ مَآءً فَتَيَمَّمُوا۟ صَعِيدًا
طَيِّبًا فَٱمْسَحُوا۟ بِوُجُوهِكُمْ وَأَيْدِيكُمْ ۗ
إِنَّ ٱللَّهَ كَانَ عَفُوًّا غَفُورًا ﴿٤٣﴾

---

**1**. చూడండి, 3:85.

**2**. ఇది మద్యపానానికి సంబంధించిన రెండవ ఆజ్ఞ. మొదటి ఆజ్ఞ 2:219 లో వచ్చింది. ఈ ఆజ్ఞ వచ్చినప్పుడు, ఇంకా మద్యపానాన్ని హరాం చేసిన ఆయతు (5:90) అవతరించబడలేదు.

**3**. అంటే మస్జిద్ నుండి దాటిపోతే ఎలాంటి పాపం లేదు. (ఇబ్నె-కసీ'ర్). ప్రయాణీకులను గురించిన ఆజ్ఞ ముందు వస్తోంది.

**4**. తయమ్మమ్ విధానం: ఒకసారి మీ అరచేతులతో పరిశుద్ధ భూమి (మట్టి)ని తాకండి. వాటితో ముఖాన్ని తుడుచుకోండి, తరువాత మీ రెండుచేతులవెనుక భాగాలను మణికట్ల వరకు తుడుచుకోండి. (ముస్నద్ అ'హ్మద్ పుస్తకం-4, పేజీ-263. ఇంకా చూడండి, 5:6).

44. ఏమీ? గ్రంథజ్ఞానంలో కొంతభాగం ఇవ్వబడిన వారిని గురించి నీకు తెలియదా (చూడలేదా)? వారు మార్గభ్రష్టత్వాన్ని కొనుక్కుంటున్నారు మరియు మీరు కూడా సన్మార్గం నుండి తప్పిపోవాలని కోరుతున్నారు.

أَلَمْ تَرَ إِلَى ٱلَّذِينَ أُوتُوا۟ نَصِيبًا مِّنَ ٱلْكِتَٰبِ يَشْتَرُونَ ٱلضَّلَٰلَةَ وَيُرِيدُونَ أَن تَضِلُّوا۟ ٱلسَّبِيلَ ﴿٤٤﴾

45. మరియు అల్లాహ్ మీ శత్రువులను బాగా ఎరుగును. కావున మీ రక్షకుడుగా అల్లాహ్‌యే చాలు మరియు మీకు సహాయకుడుగా కూడా అల్లాహ్‌యే చాలు!

وَٱللَّهُ أَعْلَمُ بِأَعْدَآئِكُمْ ۚ وَكَفَىٰ بِٱللَّهِ وَلِيًّا وَكَفَىٰ بِٱللَّهِ نَصِيرًا ﴿٤٥﴾

46. యూదులలో కొందరు పదాలను వాటి సందర్భాల నుండి తారుమారు చేసి అంటారు: "మేము (నీ మాటలను) విన్నాము మరియు ఉల్లంఘించాము (సమి'అనా వ 'అ'సయ్‌నా)." అనీ; మరియు: "విను! నీ మాట వినకబోవు గాక! (వస్‌మ'అ గైర ముస్‌మ'ఇన్)."[1] అనీ; మరియు (ఓ ముహమ్మద్!) నీవు మా మాట విను. (రా'ఇనా) అనీ;[2] తమ నాలుకలను మెలిత్రిప్పి సత్యధర్మాన్ని ఎగతాళి చేసే ఉద్దేశ్యంతో అంటారు. కాని అలా కాకుండా: "విన్నాము, విధేయుల మయ్యాము. (సమి'అనా వ అ'త'అనా)." అనీ; మరియు: "మమ్మల్ని విను మరియు (మా దిక్కు చూడు) మాకు వ్యవధినివ్వు (వస్‌మ'అ

مِّنَ ٱلَّذِينَ هَادُوا۟ يُحَرِّفُونَ ٱلْكَلِمَ عَن مَّوَاضِعِهِۦ وَيَقُولُونَ سَمِعْنَا وَعَصَيْنَا وَٱسْمَعْ غَيْرَ مُسْمَعٍ وَرَٰعِنَا لَيًّۢا بِأَلْسِنَتِهِمْ وَطَعْنًا فِى ٱلدِّينِ ۚ وَلَوْ أَنَّهُمْ قَالُوا۟ سَمِعْنَا وَأَطَعْنَا وَٱسْمَعْ وَٱنظُرْنَا لَكَانَ خَيْرًا لَّهُمْ وَأَقْوَمَ وَلَٰكِن لَّعَنَهُمُ ٱللَّهُ بِكُفْرِهِمْ فَلَا يُؤْمِنُونَ إِلَّا قَلِيلًا ﴿٤٦﴾

1. యూదులు దైవప్రవక్త ('స'అస)ను వినినప్పుడు, ఎగతాళి చేస్తూ ఇలా అనేవారు: సమి'అనా వ 'అసయ్‌నా. "మేము నీ మాటను విన్నాము." అని బిగ్గరగా అని తరువాత ముఖం త్రిప్పుకొని గాని, లేక మెల్లగా గాని కొన్నిసార్లు ఎగతాళిగా గానీ అతని ('స'అస) ముఖం మీద కూడా "ఉల్లంఘించాము," అని అనేవారు. అదే విధంగా: వస్‌మ'అ గైర ముస్‌మ'ఇన్. అంటే - "విను! నీ మాట వినకుండాబోవు గాక!" లేక "నీ మాట అంగీకరించబడక పోవు గాక!" అని శపించేవారు. ఇంకా చూడండి, 2:93.
2. రా'ఇనా: కొరకు చూడండి 2:104.

వన్''జుర్నా),'' అనీ, అనిఉంటే వారికే మేలై ఉండేది మరియు ఉత్తమమైన పద్ధతిగా ఉండేది. కాని వారి సత్యతిరస్కార వైఖరివల్ల అల్లాహ్ వారిని శపించాడు (బహిష్కరించాడు). కావున వారిలో కొందరు మాత్రమే విశ్వసించే వారు ఉన్నారు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ أُوتُواْ ٱلۡكِتَٰبَ ءَامِنُواْ بِمَا نَزَّلۡنَا مُصَدِّقٗا لِّمَا مَعَكُم مِّن قَبۡلِ أَن نَّطۡمِسَ وُجُوهٗا فَنَرُدَّهَا عَلَىٰٓ أَدۡبَارِهَآ أَوۡ نَلۡعَنَهُمۡ كَمَا لَعَنَّآ أَصۡحَٰبَ ٱلسَّبۡتِۚ وَكَانَ أَمۡرُ ٱللَّهِ مَفۡعُولًا ﴿٤٧﴾

**47**. ఓ గ్రంథప్రజలారా! మీ వద్ద ఉన్న గ్రంథాన్ని ధృవపరుస్తూ, మేము అవతరింపజేసిన (ఈ ఖుర్ఆన్ను) విశ్వసించండి, మేము మీ ముఖాలను వికృతంచేసి వాటిని వెనక్కి త్రిప్పక ముందే (నాశనం చేయకముందే). లేక మేము సబ్త్ వారిని శపించి (బహిష్కరించి) నట్లుగా మిమ్మల్ని కూడా శపించక (బహిష్కరించక) ముందే (దీనిని విశ్వసించండి).[1] ఎందుకంటే! అల్లాహ్ ఆజ్ఞ తప్పకుండా నిర్వహించబడుతుంది.

إِنَّ ٱللَّهَ لَا يَغۡفِرُ أَن يُشۡرَكَ بِهِۦ وَيَغۡفِرُ مَا دُونَ ذَٰلِكَ لِمَن يَشَآءُۚ وَمَن يُشۡرِكۡ بِٱللَّهِ فَقَدِ ٱفۡتَرَىٰٓ إِثۡمًا عَظِيمًا ﴿٤٨﴾

**48**. నిశ్చయంగా, అల్లాహ్ తనకు భాగస్వామిని (సాటి) కల్పించటాన్ని ఏ మాత్రమూ క్షమించడు.[2] మరియు అది తప్ప దేనిని (ఏ పాపాన్ని) అయినా, ఆయన తానుకోరిన వారిని క్షమిస్తాడు. మరియు అల్లాహ్కు భాగస్వాములను కల్పించిన వాడే, వాస్తవానికి మహాపాపం చేసినవాడు!

---

**1**. చూడండి, 2:65, 7:163- 166. ఇంకా చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-1, అధ్యాయం - 240.

**2**. అల్లాహ్(సు.తా.)కు సాటి (భాగస్వాములను) కల్పించటం మహా దుర్మార్గం మరియు క్షమించరాని పాపం. కావున ఇది ఎంత మాత్రం క్షమించబడదు. ముష్రికులకు స్వర్గం నిషేధించబడింది. ఇంకా చూడండి, 31:13. నిశ్చయంగా, బహుదైవారాధన (షిర్క్) గొప్ప దుర్మార్గం, ('స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్', 551).

أَلَمْ تَرَ إِلَى ٱلَّذِينَ يُزَكُّونَ أَنفُسَهُمْ بَلِ ٱللَّهُ يُزَكِّي مَن يَشَآءُ وَلَا يُظْلَمُونَ فَتِيلًا ﴿٤٩﴾

ٱنظُرْ كَيْفَ يَفْتَرُونَ عَلَى ٱللَّهِ ٱلْكَذِبَ وَكَفَىٰ بِهِۦٓ إِثْمًا مُّبِينًا ﴿٥٠﴾

أَلَمْ تَرَ إِلَى ٱلَّذِينَ أُوتُوا۟ نَصِيبًا مِّنَ ٱلْكِتَٰبِ يُؤْمِنُونَ بِٱلْجِبْتِ وَٱلطَّٰغُوتِ وَيَقُولُونَ لِلَّذِينَ كَفَرُوا۟ هَٰٓؤُلَآءِ أَهْدَىٰ مِنَ ٱلَّذِينَ ءَامَنُوا۟ سَبِيلًا ﴿٥١﴾

أُو۟لَٰٓئِكَ ٱلَّذِينَ لَعَنَهُمُ ٱللَّهُ وَمَن يَلْعَنِ ٱللَّهُ فَلَن تَجِدَ لَهُۥ نَصِيرًا ﴿٥٢﴾

**49**. ఏమీ? తమను తాము పవిత్రులమని చెప్పుకునే వారిని (యూదులు మరియు క్రైస్తవులను) గురించి నీకు తెలియదా (చూడలేదా)?[1] వాస్తవానికి, అల్లాహ్ తాను కోరిన వారికి మాత్రమే పవిత్రతను ప్రసాదిస్తాడు.[2] మరియు వారికి ఖర్జూరబీజపు బెజ్జంలోని పొర అంత అన్యాయం కూడా చేయబడదు.[3]

**50**. చూడండి! వారు అల్లాహ్‌ను గురించి ఏ విధమైన అబద్ధాన్ని కల్పిస్తున్నారో? మరియు స్పష్టమైన పాపం, అని చెప్పటానికి ఇది చాలు.

**51**. ఏమీ? గ్రంథజ్ఞానంలో కొంతభాగం ఇవ్వబడిన వారిని గురించి నీకు తెలియదా? వారు జిబ్త్[4] మరియు 'తా'గూత్‌లలో[5] విశ్వాసముంచుతున్నారు. వారు సత్యతిరస్కారులను గురించి: "విశ్వాసుల కంటే, వీరే సరైన మార్గంలో ఉన్నారు." అని అంటారు.

**52**. ఇలాంటి వారే, అల్లాహ్ శాపానికి (బహిష్కారానికి) గురిఅయిన వారు. మరియు అల్లాహ్ శపించినవాడికి సహాయపడే వాడిని ఎవ్వడినీ నీవు పొందలేవు.

---

**1**. చూడండి, 9:31.

**2**. చూడండి, 53:32.

**3**. ఫతీల: ఖర్జూర బీజపు చీలికలోని పొర. సన్నని దారమంత లేక రవ్వంత అని అర్థం.

**4**. *జిబ్త్:* అంటే అసలు అర్థం అసత్యమైనది, ఆధారం లేనిది, నిరుపయోగమైనది. ఇస్లాం పరిభాషలో మంత్ర తంత్రాలు, జ్యోతిషం, భూతవైద్యం, శకునాలు, ముహూర్తాలు మరియు ఊహాపోహలకు సంబంధించిన అన్ని విషయాలను జిబ్త్‌తో పోల్చవచ్చు.

**5**. 'తా'గూత్: చూడండి, 2:256 వ్యాఖ్యానం 3. 'తా'గూత్ అంటే షై'తాన్ అనికూడ అర్థం. ఎందుకంటే కల్పిత దైవాలను ఆరాధించటం షై'తాన్‌ను అనుసరించటమే. కావున షై'తాన్ కూడా 'తా'గూత్‌లలో చేరుతాడు.

53. లేదా వారికి రాజ్యపాలనలో భాగం ఉందా? ఒకవేళ ఉండి ఉంటే, వారు ప్రజలకు ఖర్జూర బీజపు చీలిక[1] అంత భాగం కూడా ఇచ్చేవారు కాదు.

أَمۡ لَهُمۡ نَصِيبٞ مِّنَ ٱلۡمُلۡكِ فَإِذٗا لَّا يُؤۡتُونَ ٱلنَّاسَ نَقِيرًا ﴿٥٣﴾

54. లేదా! అల్లాహ్ తన అనుగ్రహంతో ప్రజలకు ప్రసాదించిన (సౌభాగ్యాన్ని) చూసి వారు ఈర్ష్య పడుతున్నారా? వాస్తవానికి (ఇంతకు ముందు) మేము ఇబ్రాహీమ్ కుటుంబం వారికి, గ్రంథాన్ని మరియు వివేకాన్ని ప్రసాదించాము. మరియు వారికి గొప్ప సామ్రాజ్యాన్ని కూడా ప్రదానం చేశాము.

أَمۡ يَحۡسُدُونَ ٱلنَّاسَ عَلَىٰ مَآ ءَاتَىٰهُمُ ٱللَّهُ مِن فَضۡلِهِۦۖ فَقَدۡ ءَاتَيۡنَآ ءَالَ إِبۡرَٰهِيمَ ٱلۡكِتَٰبَ وَٱلۡحِكۡمَةَ وَءَاتَيۡنَٰهُم مُّلۡكًا عَظِيمٗا ﴿٥٤﴾

55. కాని వారిలో కొందరు అతనిని (ప్రవక్తను) విశ్వసించిన వారున్నారు, మరి కొందరు అతని నుండి విముఖులైన వారూ ఉన్నారు. మరియు వారికి దహించే నరకాగ్నియే చాలు![2]

فَمِنۡهُم مَّنۡ ءَامَنَ بِهِۦ وَمِنۡهُم مَّن صَدَّ عَنۡهُۚ وَكَفَىٰ بِجَهَنَّمَ سَعِيرًا ﴿٥٥﴾

56. నిశ్చయంగా, ఎవరు మా సూచనలను తిరస్కరించారో! వారిని మేము ముందు నరకాగ్నిలో పడవేస్తాము. ప్రతిసారి వారి చర్మాలు కాలిపోయినపుడల్లా వాటికి బదులుగా - వారు బాధను బాగా రుచి చూడటానికి - వేరే చర్మాలతో మార్చుతాము. నిశ్చయంగా, అల్లాహ్ సర్వ శక్తిమంతుడు, మహా వివేచనాపరుడు.

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ بِـَٔايَٰتِنَا سَوۡفَ نُصۡلِيهِمۡ نَارٗا كُلَّمَا نَضِجَتۡ جُلُودُهُم بَدَّلۡنَٰهُمۡ جُلُودًا غَيۡرَهَا لِيَذُوقُواْ ٱلۡعَذَابَۗ إِنَّ ٱللَّهَ كَانَ عَزِيزًا حَكِيمٗا ﴿٥٦﴾

1. నఖీరా: ఖర్జూర బీజపు చీలిక.
2. చూడండి, 3:85.

57. మరియు ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తారో, వారిని మేము క్రింద కాలువలు ప్రవహించే వనాలలో ప్రవేశింప జేస్తాము; వారందులో, శాశ్వతంగా కలకాలం ఉంటారు. అందు వారికి పవిత్ర సహవాసులు (అ'జ్వాజ్) ఉంటారు. మరియు మేము వారిని దట్టమైన నీడలలో ప్రవేశింపజేస్తాము.[1] (1/4)

58. * పూచీ(అమానాత్)లను తప్పక వాటికి అర్హులైనవారికి అప్పగించండనీ మరియు ప్రజల మధ్య తీర్పు చేసేటప్పుడు న్యాయంగా తీర్పు చేయండనీ, అల్లాహ్ మిమ్మల్ని ఆజ్ఞాపిస్తున్నాడు. నిశ్చయంగా, అల్లాహ్ ఎంత ఉత్తమమైన హితబోధ చేస్తున్నాడు! నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వం చూసేవాడు.

59. ఓ విశ్వాసులారా! మీరు అల్లాహ్‌కు విధేయులై ఉండండి; మరియు ఆయన సందేశహరునికి విధేయులై ఉండండి మరియు మీలో అధికారం అప్పగించబడిన వారికి కూడా! మీ మధ్య ఏ విషయంలోనైనా అభిప్రాయభేదం కలిగితే - మీరు అల్లాహ్‌ను అంతిమదినాన్ని విశ్వసించే వారే అయితే - ఆ విషయాన్ని అల్లాహ్‌కు మరియు ప్రవక్తకు నివేదించండి.[2] ఇదే సరైన పద్ధతి మరియు ఫలితాన్ని బట్టి కూడా ఉత్తమమైనది.

وَٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ سَنُدۡخِلُهُمۡ جَنَّٰتٖ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُ خَٰلِدِينَ فِيهَآ أَبَدٗاۖ لَّهُمۡ فِيهَآ أَزۡوَٰجٞ مُّطَهَّرَةٞۖ وَنُدۡخِلُهُمۡ ظِلّٗا ظَلِيلًا ٥٧

۞ إِنَّ ٱللَّهَ يَأۡمُرُكُمۡ أَن تُؤَدُّواْ ٱلۡأَمَٰنَٰتِ إِلَىٰٓ أَهۡلِهَا وَإِذَا حَكَمۡتُم بَيۡنَ ٱلنَّاسِ أَن تَحۡكُمُواْ بِٱلۡعَدۡلِۚ إِنَّ ٱللَّهَ نِعِمَّا يَعِظُكُم بِهِۦٓۗ إِنَّ ٱللَّهَ كَانَ سَمِيعَۢا بَصِيرٗا ٥٨

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ أَطِيعُواْ ٱللَّهَ وَأَطِيعُواْ ٱلرَّسُولَ وَأُوْلِي ٱلۡأَمۡرِ مِنكُمۡۖ فَإِن تَنَٰزَعۡتُمۡ فِي شَيۡءٖ فَرُدُّوهُ إِلَى ٱللَّهِ وَٱلرَّسُولِ إِن كُنتُمۡ تُؤۡمِنُونَ بِٱللَّهِ وَٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِۚ ذَٰلِكَ خَيۡرٞ وَأَحۡسَنُ تَأۡوِيلًا ٥٩

---

1. చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం. 474.

2. అంటే ఖుర్ఆన్ మరియు ప్రవక్త సంప్రదాయా(సున్నత్)లు.చూడండి, 4:65, 7:54, 12:40, 4:80.

۞ لَّا يُحِبُّ ٱللَّهُ ٱلْجَهْرَ بِٱلسُّوٓءِ مِنَ ٱلْقَوْلِ إِلَّا مَن ظُلِمَ ۚ وَكَانَ ٱللَّهُ سَمِيعًا عَلِيمًا ﴿١٤٨﴾

148. (*) అన్యాయానికి గురి అయిన వాడు తప్ప! చెడును బహిరంగంగా పలుకటాన్ని అల్లాహ్ ఇష్టపడడు.[1] మరియు అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

إِن تُبْدُوا۟ خَيْرًا أَوْ تُخْفُوهُ أَوْ تَعْفُوا۟ عَن سُوٓءٍ فَإِنَّ ٱللَّهَ كَانَ عَفُوًّا قَدِيرًا ﴿١٤٩﴾

149. మీరు మేలును బహిరంగంగా చెప్పినా లేక దానిని దాచినా![2] లేక చెడును క్షమించినా! నిశ్చయంగా, అల్లాహ్ మన్నించే వాడు,[3] సర్వసమర్థుడు.

إِنَّ ٱلَّذِينَ يَكْفُرُونَ بِٱللَّهِ وَرُسُلِهِۦ وَيُرِيدُونَ أَن يُفَرِّقُوا۟ بَيْنَ ٱللَّهِ وَرُسُلِهِۦ وَيَقُولُونَ نُؤْمِنُ بِبَعْضٍ وَنَكْفُرُ بِبَعْضٍ وَيُرِيدُونَ أَن يَتَّخِذُوا۟ بَيْنَ ذَٰلِكَ سَبِيلًا ﴿١٥٠﴾

150. నిశ్చయంగా, అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తలను తిరస్కరించే వారూ మరియు అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తల మధ్య భేదభావం చూపగోరే వారూ (అంటే అల్లాహ్‌ను విశ్వసించి, ప్రవక్తలను తిరస్కరించే వారూ) మరియు: "మేము కొందరు ప్రవక్తలను విశ్వసిస్తాము, మరి కొందరిని తిరస్కరిస్తాము." అని అనే వారూ మరియు (విశ్వాస-అవిశ్వాసాలకు) మధ్య మార్గాన్ని కల్పించగోరే వారూ -

أُو۟لَٰٓئِكَ هُمُ ٱلْكَٰفِرُونَ حَقًّا ۚ وَأَعْتَدْنَا لِلْكَٰفِرِينَ عَذَابًا مُّهِينًا ﴿١٥١﴾

151. ఇలాంటి వారే - నిస్సందేహంగా సత్యతిరస్కారులు. మరియు సత్య తిరస్కారుల కొరకు మేము అవమానకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచాము.

---

1. మీరు మానవులలో ఏదైనా చెడును చూస్తే దానిని ఇతరులకు ప్రకటించకండి. కాని ఏకాంతంలో వారిని బోధించటానికి ప్రయత్నించండి.

2. ఒకడు చేసిన చెడు లేక కీడుకు - తనకు జరిగిన దానికి - సరిసమానంగా ప్రతీకారం తీసుకోవటానికి షరీయత్‌లో అనుమతి ఉంది. కానీ తనకు జరిగిన చెడు లేక కీడును క్షమించటం ఎక్కువగా ఆమోదించబడింది. ('స. ముస్లిం, 'హ.నం. 4587). చూడండి, 42:40.

3. అఫువ్వున్ (**అల్-అఫువ్వు**): Pardoning, **మన్నించే**, క్షమించే వాడు. చూడండి, 2:52 వ్యాఖ్యానం 2.

**152.** మరియు అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తలందరినీ విశ్వసిస్తూ, వారి (ప్రవక్తల) మధ్య భేదభావాలు చూపని వారికి ఆయన (అల్లాహ్) వారి ప్రతిఫలాన్ని తప్పక ప్రసాదించగలడు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

**153.** (ఓ ప్రవక్తా!) గ్రంథప్రజలు నిన్ను ఆకాశం నుండి వారిపై ఒక గ్రంథాన్ని అవతరింపజేయమని, అడుగుతున్నారని (ఆశ్చర్యపడకు). వాస్తవానికి, వారు మూసాను ఇంతకంటే దారుణమైన దానిని కోరుతూ: "అల్లాహ్‌ను మాకు ప్రత్యక్షంగా చూపించు!" అని అడిగారు. అప్పుడు వారి దుర్మార్గానికి ఫలితంగా వారిపై పిడుగు విరుచుకుపడింది.[1] స్పష్టమైన సూచనలు లభించిన తరువాతనే వారు ఆవుదూడను (ఆరాధ్య దైవంగా) చేసుకున్నారు. అయినా దానికి మేము వారిని క్షమించాము. మరియు మూసాకు మేము స్పష్టమైన అధికారమిచ్చాము.

**154.** మరియు మేము వారిపై 'తూర్ పర్వతాన్ని ఎత్తి ప్రమాణం తీసుకున్నాము. మేము వారితో: "సాష్టాంగపడుతూ (వంగుతూ) ద్వారంలో ప్రవేశించండి." అని అన్నాము.[2] మరియు: "శనివారపు (సబ్త్) శాసనాన్ని ఉల్లంఘించకండి." అని కూడా వారితో అన్నాము. మరియు మేము వారితో దృఢమైన ప్రమాణం కూడా తీసుకున్నాము.[3]

وَٱلَّذِينَ ءَامَنُواْ بِٱللَّهِ وَرُسُلِهِۦ وَلَمۡ
يُفَرِّقُواْ بَيۡنَ أَحَدٖ مِّنۡهُمۡ أُوْلَٰٓئِكَ
سَوۡفَ يُؤۡتِيهِمۡ أُجُورَهُمۡۗ وَكَانَ
ٱللَّهُ غَفُورٗا رَّحِيمٗا ١٥٢
يَسۡـَٔلُكَ أَهۡلُ ٱلۡكِتَٰبِ أَن تُنَزِّلَ
عَلَيۡهِمۡ كِتَٰبٗا مِّنَ ٱلسَّمَآءِۚ فَقَدۡ
سَأَلُواْ مُوسَىٰٓ أَكۡبَرَ مِن ذَٰلِكَ فَقَالُوٓاْ
أَرِنَا ٱللَّهَ جَهۡرَةٗ فَأَخَذَتۡهُمُ
ٱلصَّٰعِقَةُ بِظُلۡمِهِمۡۚ ثُمَّ ٱتَّخَذُواْ
ٱلۡعِجۡلَ مِنۢ بَعۡدِ مَا جَآءَتۡهُمُ
ٱلۡبَيِّنَٰتُ فَعَفَوۡنَا عَن ذَٰلِكَۚ وَءَاتَيۡنَا
مُوسَىٰ سُلۡطَٰنٗا مُّبِينٗا ١٥٣
وَرَفَعۡنَا فَوۡقَهُمُ ٱلطُّورَ بِمِيثَٰقِهِمۡ
وَقُلۡنَا لَهُمُ ٱدۡخُلُواْ ٱلۡبَابَ سُجَّدٗا وَقُلۡنَا
لَهُمۡ لَا تَعۡدُواْ فِي ٱلسَّبۡتِ وَأَخَذۡنَا
مِنۡهُم مِّيثَٰقًا غَلِيظٗا ١٥٤

---

**1.** చూడండి, 2:55.
**2.** చూడండి, 2:58-59.
**3.** చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం. 615.

**155**. కాని వారు తాము చేసిన ప్రమాణాలను భంగంచేయటం వలన మరియు అల్లాహ్ సూక్తులను తిరస్కరించటం వలన మరియు ప్రవక్తలను అన్యాయంగా చంపటం వలన! మరియు: "మా హృదయాలు పొరలతో కప్పబడి ఉన్నాయి."[1] అని అనటం వలన (మేము వారిని శిక్షించాము). అంతేకాదు, వారి సత్యతిరస్కారం వలన, అల్లాహ్ వారి హృదయాలపై ముద్రవేసి ఉన్నాడు; కాబట్టి వారు విశ్వసించినా కొంత మాత్రమే!

فَبِمَا نَقْضِهِم مِّيثَٰقَهُمْ وَكُفْرِهِم بِـَٔايَٰتِ ٱللَّهِ وَقَتْلِهِمُ ٱلْأَنۢبِيَآءَ بِغَيْرِ حَقٍّ وَقَوْلِهِمْ قُلُوبُنَا غُلْفٌۢ ۚ بَلْ طَبَعَ ٱللَّهُ عَلَيْهَا بِكُفْرِهِمْ فَلَا يُؤْمِنُونَ إِلَّا قَلِيلًا ﴿١٥٥﴾

**156**. మరియు వారి సత్యతిరస్కారం వలన మరియు వారు మర్యమ్పై మోపిన మహా అపనిందవలన;[2]

وَبِكُفْرِهِمْ وَقَوْلِهِمْ عَلَىٰ مَرْيَمَ بُهْتَٰنًا عَظِيمًا ﴿١٥٦﴾

**157**. మరియు వారు: "నిశ్చయంగా, మేము అల్లాహ్ యొక్క సందేశహరుడు, మర్యమ్ కుమారుడైన, 'ఈసా మసీ'హ్ను (ఏసుక్రీస్తును) చంపాము." అని అన్నందుకు.[3] మరియు వారు అతనిని చంపనూ లేదు మరియు శిలువపై ఎక్కించనూ లేదు, కాని, వారు భ్రమకు గురిచేయబడ్డారు.[4] నిశ్చయంగా ఈవిషయాన్ని గురించి అభిప్రాయ భేదం ఉన్న వారు దీనిని గురించి సంశయగ్రస్తులై ఉన్నారు. ఈ విషయం గురించి వారికి నిశ్చిత జ్ఞానంలేదు. వారు కేవలం ఊహనే అనుసరిస్తున్నారు. నిశ్చయంగా వారు అతనిని చంపలేదు.

وَقَوْلِهِمْ إِنَّا قَتَلْنَا ٱلْمَسِيحَ عِيسَى ٱبْنَ مَرْيَمَ رَسُولَ ٱللَّهِ وَمَا قَتَلُوهُ وَمَا صَلَبُوهُ وَلَٰكِن شُبِّهَ لَهُمْ ۚ وَإِنَّ ٱلَّذِينَ ٱخْتَلَفُوا۟ فِيهِ لَفِى شَكٍّ مِّنْهُ ۚ مَا لَهُم بِهِۦ مِنْ عِلْمٍ إِلَّا ٱتِّبَاعَ ٱلظَّنِّ ۚ وَمَا قَتَلُوهُ يَقِينًۢا ﴿١٥٧﴾

---

1. చూడండి, 2:88.
2. అంటే యూసుఫ్ నజ్జార్ అనే వ్యక్తితో ఆమె (మర్యమ్) సంబంధముందని యూదులు మోపిన అపనింద.
3. చూడండి, 3:55.
4. అంటే 'ఈసా మసీ'హ్(ఏసు క్రీస్తు)వలే కనిపించిన మరొక వ్యక్తిని సిలువపై ఎక్కించారు. (నోబుల్ ఖుర్ఆన్)

بَل رَّفَعَهُ ٱللَّهُ إِلَيۡهِۚ وَكَانَ ٱللَّهُ عَزِيزًا حَكِيمٗا ﴿١٥٨﴾

158. వాస్తవానికి, అల్లాహ్ అతనిని ('ఈసాను) తన వైపునకు ఎత్తుకున్నాడు.[1] మరియు అల్లాహ్ సర్వశక్తి సంపన్నుడు, మహా వివేకవంతుడు.

وَإِن مِّنۡ أَهۡلِ ٱلۡكِتَٰبِ إِلَّا لَيُؤۡمِنَنَّ بِهِۦ قَبۡلَ مَوۡتِهِۦۖ وَيَوۡمَ ٱلۡقِيَٰمَةِ يَكُونُ عَلَيۡهِمۡ شَهِيدٗا ﴿١٥٩﴾

159. మరియు గ్రంథ ప్రజల్లో ఎవడు కూడా అతనిని ('ఈసాను), అతని మరణానికి పూర్వం[2] (అతను, అల్లాహ్ యొక్క సందేశహరుడు మరియు ఒక మానవుడని), విశ్వసించకుండా ఉండడు. మరియు పునరుత్థానదినమున అతను ('ఈసా) వారిపై సాక్షిగా ఉంటాడు.[3]

---

1. చూడండి, 3:55. అల్లాహ్ (సు.తా.), 'ఈసా('అ.స.)ను సజీవునిగా, అతని శరీరంతో సహా, పైకి లేపుకున్నాడు. పునరుత్థానదినానికి దగ్గరి రోజులలో, 'ఈసా('అ.స.) దమిష్క్ (Damascus)లో తూర్పుదిక్కు మనారహ్ దగ్గర ఫ్రజ్ నమా'జ్ అఖామత్ సమయంలో ఆకాశం నుండి భూమిపైకి పంపబడుతారు. అతను పందిని చంపుతారు, సిలువను విరిచేస్తారు, జి'జ్యాను తొలగిస్తారు. ప్రజలందరూ ముస్లింలవుతారు. దజ్జాల్‌ను అతనే సంహరిస్తారు. యాజూజ్ మాజూజ్‌లు కూడా అతని ప్రార్థన వలననే చంపబడుతారు. ఈ పై విషయాలన్నీ ప్రముఖ 'హదీస్' ఉల్లేఖకులు చెప్పినవే. వారిలో అబూహురైరా, 'అబ్దుల్లాహ్ బిన్-మస్'ఊద్, 'ఉస్మాన్ బిన్-అబీ అల్-'ఆస్, అబూ ఉమామ, నవ్వాస్ బిన్-సమ్'ఆన్ మరియు అబ్దుల్లాహ్ బిన్-'ఉమ్‌రూ బిన్ అల్-'ఆస్ (ర'ది.'అన్హుమ్) మొదలైన వారున్నారు. వీటిని లిఖించినవారిలో బు'ఖారి, ముస్లిం మరియు ఇతర ఎంతో మంది 'హదీస్'వేత్తలు ఉన్నారు. (ఇబ్నె-కసీ'ర్)
2. ఇక్కడ 'ఈసా ('అ.స.) యొక్క మరణం అంటే, అతను మరల భూమి మీదికి పునరుత్థానదినానికి దగ్గరి రోజులలో పంపబడి, పైన వివరించిన విషయాలన్నీ జరిగి, అతని సహజ మరణానికి ముందు, అని అర్థం. (ము'హమ్మద్ జూనాగఢీ)

   దీని మరొక తాత్పర్యంలో: "ఆ యూదుని లేక క్రైస్తవుని మరణసమయంలో అంటే, ఆత్మ (ప్రాణం) తీసే దైవదూత వచ్చినప్పుడు అతడు (ఆ యూదుడు లేక క్రైస్తవుడు): 'ఈసా ('అ.స.), అల్లాహ్ (సు.తా.) యొక్క దాసుడు మరియు ఆయన సందేశహరుడు అని విశ్వసిస్తాడు. కానీ ఆ విశ్వాసం అతనికి ప్రయోజనకరం కాజాలదు." అని, వ్యాఖ్యానించారు.
3. ఈ సాక్ష్యం 'ఈసా ('అ.స.)ను, అల్లాహ్ (సు.తా.) సజీవునిగా తనవైపునకు లేపుకొనక ముందటి విషయాలగురించి ఉంటుంది. చూడండి, 5:117, (ము'హమ్మద్ జూనాగఢీ).

فَبِظُلۡمٖ مِّنَ ٱلَّذِينَ هَادُواْ حَرَّمۡنَا
عَلَيۡهِمۡ طَيِّبَٰتٍ أُحِلَّتۡ لَهُمۡ
وَبِصَدِّهِمۡ عَن سَبِيلِ ٱللَّهِ كَثِيرٗا
١٦٠

**160**. యూదులకు వారు చేసిన ఘోర దుర్మార్గాలకు ఫలితంగానూ మరియు వారు, అనేకులను అల్లాహ్ మార్గంపై నడువకుండా ఆటంకపరుస్తూ ఉన్నందు వలననూ, మేము ధర్మసమ్మతమైన అనేక పరిశుద్ధ వస్తువులను వారికి నిషేధించాము;[1]

وَأَخۡذِهِمُ ٱلرِّبَوٰاْ وَقَدۡ نُهُواْ عَنۡهُ
وَأَكۡلِهِمۡ أَمۡوَٰلَ ٱلنَّاسِ بِٱلۡبَٰطِلِۚ
وَأَعۡتَدۡنَا لِلۡكَٰفِرِينَ مِنۡهُمۡ عَذَابًا
أَلِيمٗا ١٦١

**161**. మరియు వాస్తవానికి, వారికి నిషేధింపబడినా; వారు వడ్డీని తీసుకోవటం వలననూ మరియు వారు అధర్మంగా ఇతరుల సొమ్మును తినటం వలననూ. మరియు వారిలో అవిశ్వాసులైన వారి కొరకు మేము బాధాకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచాము.

لَّٰكِنِ ٱلرَّٰسِخُونَ فِي ٱلۡعِلۡمِ مِنۡهُمۡ
وَٱلۡمُؤۡمِنُونَ يُؤۡمِنُونَ بِمَآ أُنزِلَ إِلَيۡكَ
وَمَآ أُنزِلَ مِن قَبۡلِكَۚ وَٱلۡمُقِيمِينَ
ٱلصَّلَوٰةَۚ وَٱلۡمُؤۡتُونَ ٱلزَّكَوٰةَ
وَٱلۡمُؤۡمِنُونَ بِٱللَّهِ وَٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِ
أُوْلَٰٓئِكَ سَنُؤۡتِيهِمۡ أَجۡرًا عَظِيمًا ١٦٢

**162**. కాని వారిలో పరిపూర్ణమైన జ్ఞానం గలవారు మరియు విశ్వాసులైన వారు,[2] నీపై అవతరింపజేయబడిన దానిని మరియు నీకు పూర్వం అవతరింపజేయబడిన వాటిని విశ్వసిస్తారు. వారు నమా'జ్ విధిగా సలుపుతారు, విధిదానం ('జకాత్) చెల్లిస్తారు మరియు అల్లాహ్ యందు మరియు అంతిమ దినమునందు విశ్వాసం కలిగి ఉంటారు; ఇలాంటి వారికి మేము గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాము. (1/8)

---

**1**. చూడండి, 6:146 మరియు 3: 93.

**2**. ఇక్కడ సూచించబడిన వారు 'అబ్దుల్లాహ్ బిన్-సల్లామ్ మరియు ఇతర యూదులు (ర'ది.'అన్హుమ్), ఎవరైతే ఇస్లాం స్వీకరించారో!

۞ إِنَّآ أَوۡحَيۡنَآ إِلَيۡكَ كَمَآ أَوۡحَيۡنَآ إِلَىٰ
نُوحٖ وَٱلنَّبِيِّـۧنَ مِنۢ بَعۡدِهِۦۚ وَأَوۡحَيۡنَآ
إِلَىٰٓ إِبۡرَٰهِيمَ وَإِسۡمَٰعِيلَ
وَإِسۡحَٰقَ وَيَعۡقُوبَ وَٱلۡأَسۡبَاطِ
وَعِيسَىٰ وَأَيُّوبَ وَيُونُسَ وَهَٰرُونَ
وَسُلَيۡمَٰنَۚ وَءَاتَيۡنَا دَاوُۥدَ زَبُورٗا ١٦٣

وَرُسُلٗا قَدۡ قَصَصۡنَٰهُمۡ عَلَيۡكَ
مِن قَبۡلُ وَرُسُلٗا لَّمۡ نَقۡصُصۡهُمۡ
عَلَيۡكَۚ وَكَلَّمَ ٱللَّهُ مُوسَىٰ
تَكۡلِيمٗا ١٦٤

**163.** * (ఓ ప్రవక్తా!) నిశ్చయంగా, మేము నూ'హ్‌కు మరియు అతని తర్వాత వచ్చిన ప్రవక్తలకు సందేశం (వ'హీ) పంపినట్లు, నీకు కూడా సందేశం పంపాము. మరియు మేము ఇబ్రాహీమ్, ఇస్మా'యీల్, ఇస్'హాఖ్, య'అఖూబ్‌లకు మరియు అతని సంతతి వారికి మరియు 'ఈసా, అయ్యూబ్, యూనుస్, హారూన్ మరియు సులైమాన్‌లకు కూడా దివ్యజ్ఞానం (వ'హీ) పంపాము.[1] మరియు మేము దావూద్‌కు 'జబూర్[2] గ్రంథాన్ని ప్రసాదించాము.

**164.** మరియు వాస్తవంగా, మేము పంపిన ప్రవక్తలలో కొందరి గాథలను నీకు తెలిపాము మరియు ఇతర ప్రవక్తలను గురించి మేము నీకు తెలుపలేదు.[3] మరియు అల్లాహ్ మూసాతో నేరుగా మాట్లాడాడు.

---

**1.** ఇబ్నె 'అబ్బాస్ (ర'ది.'అ.) కథనం: ''కొందరు (యూదులు) మూసా ('అ.స.) తరువాత ఎవరిపై కూడా దివ్యజ్ఞానం (వ'హీ) అవతరింపజేయబడలేదు.'' అని అన్నారు. దానికి సమాధానంగా ఈ ఆయత్ అవతరింపజేయబడింది. (ఇబ్నె-కసీ'ర్)

**2.** 'జబూర్ (కీర్తనలు / Psalms): దావూద్ ('అ.స.)కు ఇవ్వబడిన గ్రంథం.

**3.** ఖుర్ఆన్‌లో పేర్కొనబడిన ప్రవక్తలు కేవలం 25 మంది మాత్రమే. వారు:1) ఆదమ్, 2) ఇద్రీస్, 3) నూ'హ్, 4) హూద్, 5) 'సాలి'హ్, 6) ఇబ్రాహీమ్, 7) లూ'త్, 8) ఇస్మా'ఈల్, 9) ఇస్'హాఖ్, 10) య'అఖూబ్, 11) యూసుఫ్, 12) అయ్యూబ్, 13) యూనుస్, 14) షు'ఐబ్, 15) మూసా, 16) హారూన్, 17) ఇల్యాస్, 18) అల్-యస'అ, 19) జు'ల్-కిఫ్ల్, 20) దావూద్, 21) సులైమాన్, 22) జ'కరియ్యా, 23) య'హ్యా, 24) 'ఈసా మరియు 25) ము'హమ్మద్ 'సలవాతుల్లాహి వ సలాముహు 'అలైహి వ 'అలైహిమ్ అజ్మ'ఈన్. ఇక మొత్తం ఎంతమంది ప్రవక్తలు వచ్చారో అల్లాహుతా'ఆలాకే తెలుసు. ము'హమ్మద్ ('స'అస) తరువాత మాత్రం ఏ ప్రవక్త రాడు. ఎవడైనా తాను ప్రవక్తనని ప్రకటించుకున్నా, అతడూ, అతనిని అనుసరించే వారూ మరియు అలాంటి వానిని ప్రవక్త అని నమ్మేవారూ అందరూ అసత్యవాదులే! అలాంటి వారు ముస్లింలు కారు. ఉదా: బహాయీలు, మీర్జాయీలు, ఖాదియానీలు మొదలైనవారు.

**165**. (మేము) ప్రవక్తలను శుభవార్తలు ఇచ్చేవారిగా మరియు హెచ్చరికలు చేసే వారిగా పంపాము.[1] ప్రవక్తల (ఆగమనం) తరువాత, అల్లాహ్‌కు ప్రతికూలంగా వాదించటానికి, ప్రజలకు ఏ సాకూ మిగలకూడదని![2] మరియు అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేచనాపరుడు.

رُّسُلًا مُّبَشِّرِينَ وَمُنذِرِينَ لِئَلَّا يَكُونَ لِلنَّاسِ عَلَى ٱللَّهِ حُجَّةُۢ بَعۡدَ ٱلرُّسُلِۚ وَكَانَ ٱللَّهُ عَزِيزًا حَكِيمًا ﴿١٦٥﴾

**166**. కాని (ఓ ప్రవక్తా!) అల్లాహ్ నీపై అవతరింపజేసిన దానికి (ఖుర్ఆనుకు) సాక్ష్యమిస్తున్నాడు. ఆయన దానిని తన జ్ఞానంతో అవతరింపజేశాడు. మరియు దేవదూతలు కూడా దీనికి సాక్ష్య మిస్తున్నారు. మరియు ఉత్తమ సాక్షిగా అల్లాహ్‌యే చాలు.

لَّٰكِنِ ٱللَّهُ يَشۡهَدُ بِمَآ أَنزَلَ إِلَيۡكَۖ أَنزَلَهُۥ بِعِلۡمِهِۦۖ وَٱلۡمَلَٰٓئِكَةُ يَشۡهَدُونَۚ وَكَفَىٰ بِٱللَّهِ شَهِيدًا ﴿١٦٦﴾

**167**. నిశ్చయంగా, ఎవరైతే సత్య తిరస్కారులై, ఇతరులను అల్లాహ్ మార్గం వైపుకు రాకుండా నిరోధిస్తున్నారో వాస్తవానికి వారు మార్గభ్రష్టులై, మార్గ భ్రష్టత్వంలో చాలాదూరం వెళ్ళిపోయారు!

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ وَصَدُّواْ عَن سَبِيلِ ٱللَّهِ قَدۡ ضَلُّواْ ضَلَٰلَۢا بَعِيدًا ﴿١٦٧﴾

**168**. నిశ్చయంగా ఎవరైతే సత్య తిరస్కారులై, అక్రమానికి పాల్పడతారో, వారిని అల్లాహ్ ఏ మాత్రమూ క్షమించడూ మరియు వారికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వమూ చేయడు.

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ وَظَلَمُواْ لَمۡ يَكُنِ ٱللَّهُ لِيَغۡفِرَ لَهُمۡ وَلَا لِيَهۡدِيَهُمۡ طَرِيقًا ﴿١٦٨﴾

**169**. వారికి కేవలం నరకమార్గం మాత్రమే చూపుతాడు. అందులో వారు శాశ్వతంగా కలకాలం ఉంటారు. మరియు ఇది అల్లాహ్‌కు ఎంతో సులభం.

إِلَّا طَرِيقَ جَهَنَّمَ خَٰلِدِينَ فِيهَآ أَبَدًاۚ وَكَانَ ذَٰلِكَ عَلَى ٱللَّهِ يَسِيرًا ﴿١٦٩﴾

---

**1**. విశ్వాసులకు స్వర్గపు శుభవార్తనివ్వటానికి మరియు అవిశ్వాసులకు నరకాన్ని గురించి హెచ్చరించటానికి.

**2**. చూడండి, 20:134.

يَـٰٓأَيُّهَا ٱلنَّاسُ قَدْ جَآءَكُمُ ٱلرَّسُولُ بِٱلْحَقِّ مِن رَّبِّكُمْ فَـَٔامِنُوا۟ خَيْرًا لَّكُمْ ۚ وَإِن تَكْفُرُوا۟ فَإِنَّ لِلَّهِ مَا فِى ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ وَكَانَ ٱللَّهُ عَلِيمًا حَكِيمًا ﴿١٧٠﴾

**170**. ఓ మానవులారా! వాస్తవంగా మీ ప్రభువు తరఫునుండి, సత్యాన్ని తీసుకొని మీ వద్దకు ఈ సందేశహరుడు వచ్చి వున్నాడు, కావున అతని మీద విశ్వాసం కలిగి ఉండండి, ఇదే మీకు మేలైనది. మరియు మీరు గనక తిరస్కరిస్తే! నిశ్చయంగా భూమ్యాకాశాలలో ఉన్నదంతా అల్లాహ్ కే చెందినదని తెలుసుకోండి.[1] మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేచనాపరుడు.

يَـٰٓأَهْلَ ٱلْكِتَـٰبِ لَا تَغْلُوا۟ فِى دِينِكُمْ وَلَا تَقُولُوا۟ عَلَى ٱللَّهِ إِلَّا ٱلْحَقَّ ۚ إِنَّمَا ٱلْمَسِيحُ عِيسَى ٱبْنُ مَرْيَمَ رَسُولُ ٱللَّهِ وَكَلِمَتُهُۥٓ أَلْقَىٰهَآ إِلَىٰ مَرْيَمَ وَرُوحٌ مِّنْهُ ۖ فَـَٔامِنُوا۟ بِٱللَّهِ وَرُسُلِهِۦ ۖ وَلَا تَقُولُوا۟ ثَلَـٰثَةٌ ۚ ٱنتَهُوا۟ خَيْرًا لَّكُمْ ۚ إِنَّمَا ٱللَّهُ إِلَـٰهٌ وَٰحِدٌ ۖ

**171**. ఓ గ్రంథప్రజలారా! మీరు మీ ధర్మవిషయంలో హద్దులు మీరి ప్రవర్తించకండి.[2] మరియు అల్లాహ్ ను గురించి సత్యం తప్ప వేరేమాట పలుకకండి. నిశ్చయంగా మర్యమ్ కుమారుడైన 'ఈసా మసీ'హ్ (ఏసు క్రీస్తు), అల్లాహ్ యొక్క సందేశహరుడు మరియు ఆయన (అల్లాహ్) మర్యమ్ వైపునకు పంపిన, ఆయన (అల్లాహ్) యొక్క ఆజ్ఞ (కలిమ)[3] మరియు ఆయన (అల్లాహ్) తరఫునుండి వచ్చిన ఒక ఆత్మ (రూ'హ్). కావున మీరు అల్లాహ్ ను మరియు ఆయన ప్రవక్తలను విశ్వసించండి. మరియు (ఆరాధ్య

---

**1**. చూడండి, 14:8.

**2**. 'గులువ్వున్: అంటే అతిగా ప్రవర్తించటం. అంటే ఇక్కడ క్రైస్తవులు 'ఈసా('అ.స.)కు మరియు అతని తల్లికి అంటగట్టిన స్థానం. వారు ఆ ఇద్దరికి దైవత్వపు స్థానం అంటగట్టి వారిని ఆరాధించసాగారు. చూడండి, 9:31.

**3**. కలిమతుల్లాహ్: అల్లాహ్ (సు.తా.) యొక్క మాట, పదం, సంకేతం, ఉత్తరువు లేక ఆజ్ఞ. అంటే అల్లాహుతా'ఆలా ఏదైనా చేయదలుచుకుంటే దానిని: "అయిపో" (కున్)! అని ఆజ్ఞ ఇస్తాడు. అంతే అది అయిపోతుంది (ఫ యకూన్). చూడండి, 3:45.

سُبۡحَٰنَهُۥٓ أَن يَكُونَ لَهُۥ وَلَدٞۘ لَّهُۥ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِۗ وَكَفَىٰ بِٱللَّهِ وَكِيلٗا ١٧١

దైవాలు): ''ముగ్గురు!'' అని అనకండి.[1] అది మానుకోండి, మీకే మేలైనది! నిశ్చయంగా, అల్లాహ్ ఒక్కడే ఆరాధ్యదైవం. ఆయనకు కొడుకు ఉన్నాడనే విషయానికి ఆయన అతీతుడు. ఆకాశాలలో ఉన్నదంతా మరియు భూమిలో ఉన్నదంతా ఆయనకే చెందుతుంది. మరియు కార్యకర్తగా అల్లాహ్ మాత్రమే చాలు.

لَّن يَسۡتَنكِفَ ٱلۡمَسِيحُ أَن يَكُونَ عَبۡدٗا لِّلَّهِ وَلَا ٱلۡمَلَٰٓئِكَةُ ٱلۡمُقَرَّبُونَۚ وَمَن يَسۡتَنكِفۡ عَنۡ عِبَادَتِهِۦ وَيَسۡتَكۡبِرۡ فَسَيَحۡشُرُهُمۡ إِلَيۡهِ جَمِيعٗا ١٧٢

**172.** తాను, అల్లాహ్‌కు దాసుడననే విషయాన్ని మసీ'హ్ (క్రీస్తు) ఎన్నడూ ఉపేక్షించ లేదు. మరియు ఆయన (అల్లాహ్)కు సన్నిహితంగా ఉండే దేవదూతలు కూడాను. మరియు ఎవరు ఆయన (అల్లాహ్) దాస్యాన్ని ఉపేక్షించి, గర్వం ప్రదర్శిస్తారో వారందరినీ ఆయన తనముందు సమావేశపరుస్తాడు.

فَأَمَّا ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ فَيُوَفِّيهِمۡ أُجُورَهُمۡ وَيَزِيدُهُم مِّن فَضۡلِهِۦۖ وَأَمَّا ٱلَّذِينَ ٱسۡتَنكَفُواْ وَٱسۡتَكۡبَرُواْ فَيُعَذِّبُهُمۡ عَذَابًا أَلِيمٗا وَلَا يَجِدُونَ لَهُم مِّن دُونِ ٱللَّهِ وَلِيّٗا وَلَا نَصِيرٗا ١٧٣

**173.** కానీ, ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తారో, వారికి ఆయన వారి ప్రతిఫలాన్ని పూర్తిగా ప్రసాదిస్తాడు మరియు తన అనుగ్రహంతో మరింత అధికంగా ఇస్తాడు. ఇక ఆయనను నిరాకరించి, గర్వం వహించే వారికి బాధాకరమైన శిక్ష విధిస్తాడు[2] మరియు వారు తమకొరకు - అల్లాహ్ తప్ప - ఇతర రక్షించేవాడిని గానీ, సహాయపడే వాడిని గానీ పొందలేరు.

---

**1.** క్రైస్తవులలో కొందరు 'ఈసా('అ.స.) స్వయంగా దేవుడే అంటారు. మరికొందరు అతనిని దేవుని కుమారుడు అంటారు. ఇంకా కొందరు ముగ్గురు దైవాలున్నారంటారు. ఆ ముగ్గురు అల్లాహ్ (సు.తా.), జిబ్రీల్ మరియు 'ఈసా ('అలైహిమ్ స.) అని అంటారు. ఇది మానుకొనండని అల్లాహుతా'ఆలా ఆజ్ఞాపిస్తున్నాడు.

**2.** చూడండి, 40:60.

يَٰٓأَيُّهَا ٱلنَّاسُ قَدۡ جَآءَكُم بُرۡهَٰنٞ مِّن رَّبِّكُمۡ وَأَنزَلۡنَآ إِلَيۡكُمۡ نُورٗا مُّبِينٗا ﴿١٧٤﴾

**174**. ఓ మానవులారా! మీ ప్రభువు నుండి మీకు స్పష్టమైన నిదర్శనం వచ్చింది. మరియు మేము మీపై స్పష్టమైన జ్యోతిని (ఈ ఖుర్ఆన్‌ను) అవతరింపజేశాము.

فَأَمَّا ٱلَّذِينَ ءَامَنُواْ بِٱللَّهِ وَٱعۡتَصَمُواْ بِهِۦ فَسَيُدۡخِلُهُمۡ فِي رَحۡمَةٖ مِّنۡهُ وَفَضۡلٖ وَيَهۡدِيهِمۡ إِلَيۡهِ صِرَٰطٗا مُّسۡتَقِيمٗا ﴿١٧٥﴾

**175**. కావున ఎవరు అల్లాహ్‌ను విశ్వసించి, ఆయననే దృఢంగా నమ్ముకుంటారో, వారిని ఆయన తన కారుణ్యానికి మరియు అనుగ్రహానికి పాత్రులుగా చేసుకొని తనవద్దకు చేరే ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తాడు.

يَسۡتَفۡتُونَكَ قُلِ ٱللَّهُ يُفۡتِيكُمۡ فِي ٱلۡكَلَٰلَةِۚ إِنِ ٱمۡرُؤٌاْ هَلَكَ لَيۡسَ لَهُۥ وَلَدٞ وَلَهُۥٓ أُخۡتٞ فَلَهَا نِصۡفُ مَا تَرَكَۚ وَهُوَ يَرِثُهَآ إِن لَّمۡ يَكُن لَّهَا وَلَدٞۚ

**176**. వారు నిన్ను, (కలాలను) గురించి ధార్మిక శాసనం (ఫత్వా) అడుగుతున్నారు. అల్లాహ్ మీకు, కలాలను[1] గురించి, ఈ విధంగా ధార్మిక శాసనం ఇస్తున్నాడని చెప్పు: "ఒక పురుషుడు మరణించి, అతనికి సంతానం లేకుండా ఒక సోదరి[2]

---

1. కలాల అంటే సూటి (రక్త) సంబంధీకులు లేని మృతుడు అంటే తండ్రి గానీ, కుమారుడు గానీ లేని మృతుడు. కొడుకు లేని పక్షంలో కొడుకు కొడుకు(లు) సూటి వారసులుగా పరిగణింపబడతారు. (ఇజ్మా'అ, ఇబ్నె-కసీ'ర్).
కుమారుడు ఒక్కడే ఉన్నా పూర్తి ఆస్తికి వారసుడు. మరియు తండ్రి ఒక్కడే ఉన్నా అతను కూడా పూర్తి ఆస్తికి వారసుడు. అప్పుడు మృతుని సోదర సోదరీమణులకు హక్కు ఉండదు. కాని భార్య లేక భర్త మరియు తల్లి ఉంటే వారి భాగం వారికి ఇచ్చిన తరువాత.
కుమార్తె మరియు సోదరీ ఉంటే, కుమార్తెకు సగం, సోదరికి సగం.
సోదరుడు ఒక్కడే ఉంటే అతడు తన సోదరి పూర్తి ఆస్తికి వారసుడౌతాడు. కాని మృతురాలు భర్త ఉంటే అతని భాగం ఇచ్చి మిగతా ఆస్తికి సోదరుడు వారసుడౌతాడు.
2. సోదరీ అంటే ఇక్కడ సొంత అనగా, తల్లి-తండ్రి ఇరువురి నుండి, లేక కేవలం తండ్రి నుండి గానీ ఉంటే ఆమెకు అతను వదిలిన ఆస్తిలో సగం భాగం ఉంటుంది. ఇంకా చూడండి, 4:12, అక్కడ ఇజ్మా'అ, అభిప్రాయం ఏమిటంటే, అక్కడ కేవలం తల్లి వైపు నుండి (అర్థ) సోదర సోదరీమణుల విషయం చెప్పబడింది. ఎక్కువ వివరాలకొరకు ధర్మవేత్త(ఫుఖహా)లను సంప్రదించండి.

فَإِن كَانَتَا ٱثۡنَتَيۡنِ فَلَهُمَا ٱلثُّلُثَانِ مِمَّا تَرَكَۚ وَإِن كَانُوٓاْ إِخۡوَةٗ رِّجَالٗا وَنِسَآءٗ فَلِلذَّكَرِ مِثۡلُ حَظِّ ٱلۡأُنثَيَيۡنِۗ يُبَيِّنُ ٱللَّهُ لَكُمۡ أَن تَضِلُّواْۗ وَٱللَّهُ بِكُلِّ شَيۡءٍ عَلِيمُۢ ١٧٦

మాత్రమే ఉంటే, అతడు విడిచిన ఆస్తిలో ఆమెకు సగం వాటా లభిస్తుంది. పిల్లలు లేక చనిపోయిన సోదరి మొత్తం ఆస్తికి, అతడు (ఆమె నిజ సోదరుడు) వారసుడవుతాడు. అతనికి (మృతునికి) ఇద్దరు సోదరీమణులు ఉంటే, వారిద్దరికీ అతడు వదలిన ఆస్తిలో మూడింట రెండు వంతుల భాగం లభిస్తుంది. ఒకవేళ సోదర సోదరీమణులు (అనేకులుంటే) ప్రతి పురుషునికి ఇద్దరు స్త్రీల భాగానికి సమానంగా వాటా లభిస్తుంది. మీరు దారి తప్పకుండా ఉండటానికి అల్లాహ్ మీకు అంతా స్పష్టంగా తెలుపుతున్నాడు. మరియు అల్లాహ్‌కు ప్రతి విషయం గురించి బాగా తెలుసు.''(1/4)

*****

## 5. సూరహ్ అల్-మాఇ'దహ్ — سُورَةُ المَائِدَة

ఇది చివర అవతరింపజేయబడిన మదనీ సూరాహ్‌లలో ఒకటి. ఇందులో **120 ఆయతులు** ఉన్నాయి. ఈ సూరహ్ అల్-మాయి'దహ్ మూడవ ఆయత్‌లోని: "ఈ నాడు నేను మీ ధర్మాన్ని మీ కొరకు పరిపూర్ణం చేసి, మీపై నా అనుగ్రహాన్ని పూర్తిచేశాను మరియు మీ కొరకు అల్లాహ్‌కు విధేయులుగా ఉండటాన్నే (ఇస్లాంనే) ధర్మంగా సమ్మతించాను.''అనే భాగం10వ హిజ్రీలో 'హజ్జ్ రోజు అవతరింపజేయబడింది. ఇది ఈ సూరహ్‌లోని అతి ముఖ్య అంశం. హాబిల్(Abel)ను ఖాబిల్ (Cain) హత్యచేసింది, 27-43 ఆయత్‌లలో వివరించబడింది. 'ఈసా ('అ.స.) యొక్క అద్భుత క్రియలు 109-120 ఆయత్‌లలో ఉన్నాయి. దీనిపేరు అల్-మాఇ'దహ్ అంటే '**ఆహారంతో** నిండిన పళ్ళెం,' ఉర్దూలో '**దస్తర్‌ఖాన్**' అనబడుతోంది. ఇది **112వ ఆయత్‌లో** నుండి తీసుకోబడింది.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

యَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ أَوۡفُواْ
بِٱلۡعُقُودِۚ أُحِلَّتۡ لَكُم بَهِيمَةُ
ٱلۡأَنۡعَٰمِ إِلَّا مَا يُتۡلَىٰ عَلَيۡكُمۡ غَيۡرَ
مُحِلِّي ٱلصَّيۡدِ وَأَنتُمۡ حُرُمٌۗ إِنَّ ٱللَّهَ
يَحۡكُمُ مَا يُرِيدُ ١

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

**1.** * ఓ విశ్వాసులారా! ఒప్పందాలను పాటించండి.[1] మీ కొరకు పచ్చిక మేసే చతుష్పాద పశువులన్నీ[2] (తినటానికి) ధర్మ సమ్మతం ('హలాల్) చేయబడ్డాయి; మీకు తెలుపబడిన పశువులు తప్ప! మీరు ఇ'హ్రామ్ స్థితిలో ఉన్నప్పుడు వేటాడటం మీకు ధర్మ సమ్మతం కాదు.[3] నిశ్చయంగా, అల్లాహ్ తాను కోరింది శాసిస్తాడు.

---

**1.** 'అఖ్ద్: 'ఉఖూద్ (బ.వ), అంటే ముడి అని అర్థం. ఇవి ధర్మాచరణలో మూడురకాలు:1) అల్లాహ్-మానవుని మధ్య, 2) మానవుడు-తన ఆత్మతో, 3) మానవుడు-తన తోటివారితో చేసేవి. (రా'గిబ్).

**2.** బహీమః అంటే మేసేపశువు. అన్'ఆమున్: అంటే ఒంటెలు, ఆవులు, ఎడ్లు, గొర్రెలు, మేకల వంటి సాధు జంతువులు. చూడండి, 6:124. ఇవేకాక అడవి పశువులు, ఉదా: అడవి ఆవులు, జింకలు మొదలైనవి. ఇవి గడ్డి, చెట్లు తినేవి. వేటాడి ఇతర జంతువులను తిననివి. జూ'-నాబిన్: అంటే కోరపళ్ళుగల క్రూర మృగాలు మాంసాహారులైనవి. ఉదా: కుక్క, పులి. జూ'-మి'ఖ్లబిన్: అంటే, గోళ్ళుగల వేటాడే పక్షులు. ఏవైతే తమ వేట జంతువును తమ గోళ్ళతో పట్టుకుంటాయో, ఉదా: డేగ.

**3.** ఇ'హ్రామ్ స్థితిలో వేటాడే నిషిద్ధాలను గురించి చూడండి, 5:94-96.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تُحِلُّواْ
شَعَـٰٓئِرَ ٱللَّهِ وَلَا ٱلشَّهۡرَ ٱلۡحَرَامَ
وَلَا ٱلۡهَدۡيَ وَلَا ٱلۡقَلَـٰٓئِدَ وَلَآ
ءَآمِّينَ ٱلۡبَيۡتَ ٱلۡحَرَامَ يَبۡتَغُونَ
فَضۡلٗا مِّن رَّبِّهِمۡ وَرِضۡوَٰنٗاۚ وَإِذَا
حَلَلۡتُمۡ فَٱصۡطَادُواْۚ وَلَا يَجۡرِمَنَّكُمۡ
شَنَـَٔانُ قَوۡمٍ أَن صَدُّوكُمۡ
عَنِ ٱلۡمَسۡجِدِ ٱلۡحَرَامِ أَن
تَعۡتَدُواْۘ وَتَعَاوَنُواْ عَلَى ٱلۡبِرِّ
وَٱلتَّقۡوَىٰۖ وَلَا تَعَاوَنُواْ عَلَى ٱلۡإِثۡمِ
وَٱلۡعُدۡوَٰنِۚ وَٱتَّقُواْ ٱللَّهَۖ إِنَّ ٱللَّهَ
شَدِيدُ ٱلۡعِقَابِ ٢

**2**. ఓ విశ్వాసులారా! అల్లాహ్ (నియమించిన) చిహ్నాలను[1] మరియు నిషిద్ధమాసాన్ని[2] ఉల్లంఘించకండి. మరియు బలి పశువులకు మరియు మెడలలో పట్టీలు ఉన్న పశువులకు (హాని చేయకండి).[3] మరియు తమ ప్రభువు అనుగ్రహాన్ని మరియు ప్రీతిని కోరుతూ పవిత్ర గృహానికి (క'అబహ్‌కు) పోయే వారిని (ఆటంకపరచకండి). కానీ ఇ'హ్రామ్ స్థితి ముగిసిన తరువాత మీరు వేటాడవచ్చు. మిమ్మల్ని పవిత్ర మస్జిద్(మస్జిద్ అల్-'హరామ్)ను సందర్శించకుండా నిరోధించిన వారిపట్ల గల విరోధం వలన వారితో హద్దులుమీరి ప్రవర్తించకండి. మరియు పుణ్యకార్యాలు మరియు దైవభీతి విషయాలలో, ఒకరికొకరు తోడ్పడండి. మరియు పాపకార్యాలలో గానీ, దౌర్జన్యాలలో గానీ తోడ్పడకండి. అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. నిశ్చయంగా, అల్లాహ్ శిక్ష విధించటంలో చాల కఠినుడు.

---

**1**. ష'ఆయి'రల్లాహ్: అల్లాహ్ చిహ్నాలు. అంటే పవిత్రమైనవని సూచించిన నిదర్శనాలు, సంకేతాలు, ప్రత్యేక ధర్మవిధులను నిర్వహించటానికి చూపబడిన స్థానాలు. ఉదా: క'అబహ్, 'సఫా-మర్వాలు, మరియు ధర్మ ఆచారాలు, 'తవాఫ్, స'యీ మొదలైనవి.

**2**. నిషిద్ధ మాసాలు: రజబ్, జు'ల్-ఖాయిదహ్, జు'ల్-'హిజ్జహ్ మరియు ము'హర్రమ్ ('అరబ్బీ 7,11,12 మరియు 1వ నెలలు) ఈ మాసాలలో యుద్ధం చేయటం నిషిద్ధం.

**3**. 1) హద్‌యున్: అంటే 'హాజీ, 'హజ్జ్ కొరకు, 'హరంలో బలి (ఖుర్బాని) చేయటానికి తెచ్చే పశువు. 2) ఖలాయి'దతున్: 'హరమ్‌కు తీసుకునిపోవుటకు నిశ్చయించి, వాటి మెడలలో పట్టీలు వేసిన పశువు. 3) ఫిద్‌యతున్: ధర్మఆచారంలో అయిన తప్పులకు పరిహారంగా ఇచ్చే బలి (ఖుర్బాని). దీని మాంసం పూర్తిగా పేదవారిలో పంచాలి.

حُرِّمَتۡ عَلَيۡكُمُ ٱلۡمَيۡتَةُ وَٱلدَّمُ
وَلَحۡمُ ٱلۡخِنزِيرِ وَمَآ أُهِلَّ لِغَيۡرِ ٱللَّهِ
بِهِۦ وَٱلۡمُنۡخَنِقَةُ وَٱلۡمَوۡقُوذَةُ
وَٱلۡمُتَرَدِّيَةُ وَٱلنَّطِيحَةُ وَمَآ أَكَلَ
ٱلسَّبُعُ إِلَّا مَا ذَكَّيۡتُمۡ وَمَا ذُبِحَ عَلَى
ٱلنُّصُبِ وَأَن تَسۡتَقۡسِمُواْ
بِٱلۡأَزۡلَٰمِۚ ذَٰلِكُمۡ فِسۡقٌۗ ٱلۡيَوۡمَ يَئِسَ
ٱلَّذِينَ كَفَرُواْ مِن دِينِكُمۡ فَلَا
تَخۡشَوۡهُمۡ وَٱخۡشَوۡنِۚ ٱلۡيَوۡمَ
أَكۡمَلۡتُ لَكُمۡ دِينَكُمۡ وَأَتۡمَمۡتُ
عَلَيۡكُمۡ نِعۡمَتِي وَرَضِيتُ لَكُمُ
ٱلۡإِسۡلَٰمَ دِينٗاۚ فَمَنِ ٱضۡطُرَّ فِي
مَخۡمَصَةٍ غَيۡرَ مُتَجَانِفٖ لِّإِثۡمٖ
فَإِنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٞ ٣

**3.** (సహజంగా) మరణించింది, రక్తం, పందిమాంసం మరియు అల్లాహ్ తప్ప ఇతరుల కొరకు (ఇతరుల పేరుతో) వధింప (జి'బ్'హ్‌చేయ) బడినది, గొంతుపిసికి ఊపిరాడక, దెబ్బతగిలి, ఎత్తునుండి పడి, కొమ్ముతగిలి మరియు క్రూరమృగం నోటపడి చచ్చిన (పశువు/పక్షి) అన్నీ, మీకు తినటానికి నిషిద్ధం ('హరామ్) చేయబడ్డాయి. కాని (క్రూర మృగం నోటపడిన దానిని) చావక ముందే మీరు జి'బ్'హ్ చేసినట్లైతే అది నిషిద్ధం కాదు మరియు బలిపీఠం మీద వధించబడినది[1] మరియు బాణాల ద్వారా శకునం చూడటం నిషేధింపబడ్డాయి. ఇవన్నీ ఘోర పాపాలు (ఫిస్ఖున్). ఈనాడు సత్య తిరస్కారులు, మీ ధర్మం గురించి పూర్తిగా ఆశలు వదలుకున్నారు. కనుక మీరు వారికి భయపడకండి, నాకే భయపడండి. ఈ నాడు నేను మీ ధర్మాన్ని మీ కొరకు పరిపూర్ణం చేసి, మీపై నా అనుగ్రహాన్ని పూర్తిచేశాను మరియు మీ కొరకు అల్లాహ్‌కు విధేయులుగా ఉండటాన్నే (ఇస్లాంనే) ధర్మంగా సమ్మతించాను.[2] ఎవడైనా ఆకలికి ఓర్చు కోలేక, పాపానికి పూనుకోక,[3] (నిషిద్ధమైన వస్తువులను తిన్నట్లైతే)! నిశ్చయంగా అల్లాహ్ క్షమాశీలుడు అపార కరుణాప్రదాత.

---

**1.** న'సుబున్: అంటే ముష్రికులు తమ దేవతలకు, దైవదూతలకు జిన్నాతులకు, లేక తమ పూర్వీకులైన పుణ్యపురుషులకు, మొదలైన వారి కొరకు బలి ఇవ్వటానికి నియమించిన ప్రత్యేక ఆస్థానాలు. వాటిపై అల్లాహ్(సు.తా.) పేరుతో కూడా బలిచేసినా అది 'హరాం. అక్కడ బలి చేయబడిన పశు మాంసాన్ని తినటం కూడా 'హరాం (నిషిద్ధం).

**2.** ఈ భాగం 10వ హిజ్రీలో 9వ జి'ల్-హజ్జ్ రోజు, 'హజ్జ్ సమయంలో, 'అరఫాత్ మైదానంలో అవతరింపజేయబడింది. దైవప్రవక్త ('స'అస) అంతిమ కాలానికి దాదాపు 82 రోజులకు ముందు. దీని తరువాత న్యాయానికి సంబంధించిన ఏ ఆయత్ కూడా అవతరింపజేయబడలేదు.

**3.** చూడండి, 2:173.

يَسْـَٔلُونَكَ مَاذَآ أُحِلَّ لَهُمْۖ قُلۡ أُحِلَّ لَكُمُ ٱلطَّيِّبَٰتُ وَمَا عَلَّمۡتُم مِّنَ ٱلۡجَوَارِحِ مُكَلِّبِينَ تُعَلِّمُونَهُنَّ مِمَّا عَلَّمَكُمُ ٱللَّهُۖ فَكُلُواْ مِمَّآ أَمۡسَكۡنَ عَلَيۡكُمۡ وَٱذۡكُرُواْ ٱسۡمَ ٱللَّهِ عَلَيۡهِۖ وَٱتَّقُواْ ٱللَّهَۚ إِنَّ ٱللَّهَ سَرِيعُ ٱلۡحِسَابِ ﴿٤﴾

**4**. వారు (ప్రజలు) తమ కొరకు ఏది ధర్మసమ్మతం (హలాల్) అని నిన్ను అడుగుతున్నారు. నీవు ఇలా అను: "పరిశుద్ధ వస్తువులన్నీ మీ కొరకు ధర్మసమ్మతం ('హలాల్) చేయబడ్డాయి. మరియు మీకు, అల్లాహ్ నేర్పిన విధంగా మీరు వేట శిక్షణ ఇచ్చిన జంతువులు[1] మీ కొరకు పట్టినవి కూడా! కావున అవి మీ కొరకు పట్టుకున్న వాటిని మీరు తినండి కాని దానిపై అల్లాహ్ పేరును ఉచ్చరించండి.[2] అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. నిశ్చయంగా అల్లాహ్ లెక్కతీసుకోవటంలో అతి శీఘ్రుడు."

ٱلۡيَوۡمَ أُحِلَّ لَكُمُ ٱلطَّيِّبَٰتُۖ وَطَعَامُ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡكِتَٰبَ حِلّٞ لَّكُمۡ وَطَعَامُكُمۡ حِلّٞ لَّهُمۡۖ وَٱلۡمُحۡصَنَٰتُ مِنَ ٱلۡمُؤۡمِنَٰتِ وَٱلۡمُحۡصَنَٰتُ مِنَ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡكِتَٰبَ مِن قَبۡلِكُمۡ

**5**. ఈ నాడు మీ కొరకు పరిశుద్ధమైన వస్తువులన్నీ ధర్మసమ్మతం ('హలాల్) చేయబడ్డాయి. మరియు గ్రంథ ప్రజల ఆహారం[3] మీకు ధర్మసమ్మతమైనది. మరియు మీ ఆహారం వారికి ధర్మసమ్మత మైనది. మరియు సుశీలురు అయిన విశ్వాస (ముస్లిం) స్త్రీలు గానీ మరియు సుశీలురు అయిన పూర్వ గ్రంథ ప్రజల

**1**. వేట నేర్పి, వేటాడటానికి ఉపయోగపడే జంతువులు పక్షులు మొదలైనవి ఉదా: కుక్క, చిరుతపులి, డేగ మొదలైనవి.

**2**. ఇక్కడ రెండు షరతులున్నాయి. 1) వేట జంతువును విడుచునప్పుడు బిస్మిల్లా హిర్ర'హ్మా నిర్ర'హీమ్. అనాలి. 2) ఆ వేట జంతువు పట్టిన దానిని తన యజమాని కొరకు వదలాలి, దానిని అది తినగూడదు. అట్టి జంతువు పట్టిన దానిని చంపినా తన యజమాని వచ్చేవరకు దానిని తినగూడదు. అట్టి జంతువు చనిపోయినా, అది 'హలాల్. వేటలో యజమాని విడిచిన వేటజంతువు తప్ప, మరొక జంతువు పాల్గొనరాదు. ఇదే ఆజ్ఞ బాణానికి కూడా వర్తిస్తుంది. ('స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం).

**3**. గ్రంథప్రజల ఆహారం అంటే, ఏదైతే అల్లాహ్ పేరుతో జ'బ'హ్ చేయబడి రక్తం ప్రవహింపజేయబడిందో అదే. కాని మొదట మత్తుచేయబడి తరువాత గొంతు కోయబడినది కాదు. ఏ ఆహారపదార్థాలైతే ఇస్లాం ధర్మశాసనం ప్రకారం హరాం చేయబడ్డాయో వాటిని విడిచి.

إِذَآ ءَاتَيۡتُمُوهُنَّ أُجُورَهُنَّ
مُحۡصِنِينَ غَيۡرَ مُسَٰفِحِينَ وَلَا
مُتَّخِذِيٓ أَخۡدَانٖۗ وَمَن يَكۡفُرۡ
بِٱلۡإِيمَٰنِ فَقَدۡ حَبِطَ عَمَلُهُۥ وَهُوَ فِي
ٱلۡأٓخِرَةِ مِنَ ٱلۡخَٰسِرِينَ ٥
يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِذَا قُمۡتُمۡ
إِلَى ٱلصَّلَوٰةِ فَٱغۡسِلُواْ وُجُوهَكُمۡ
وَأَيۡدِيَكُمۡ إِلَى ٱلۡمَرَافِقِ وَٱمۡسَحُواْ
بِرُءُوسِكُمۡ وَأَرۡجُلَكُمۡ إِلَى
ٱلۡكَعۡبَيۡنِۚ وَإِن كُنتُمۡ جُنُبٗا
فَٱطَّهَّرُواْۚ وَإِن كُنتُم مَّرۡضَىٰٓ أَوۡ عَلَىٰ

స్త్రీలు గానీ,[1] మీరు వారికి వారి మ(హ్)ను చెల్లించి, న్యాయబద్ధంగా వారితో వివాహ జీవితం గడపండి. కాని వారితో స్వేచ్ఛా కామక్రీడలు గానీ, లేదా దొంగచాటు సంబంధాలు గానీ ఉంచుకోకండి. ఎవడు విశ్వాస మార్గాన్ని తిరస్కరిస్తాడో అతని కర్మలు వ్యర్థమవుతాయి. మరియు అతడు పరలోకంలో నష్టంపొందేవారిలో చేరుతాడు.

**6.** ఓ విశ్వాసులారా! మీరు నమా'జ్‌కు లేచినప్పుడు, మీ ముఖాలను, మరియు మీ చేతులను మోచేతులవరకు కడుక్కోండి. మరియు మీ తలలను (తడిచేతులతో) తుడుచుకోండి. మరియు మీ కాళ్ళను చీలమండల వరకు కడుక్కోండి.[2] మరియు మీకు ఇంద్రియ స్ఖలనం (జునుబ్) అయిఉంటే, స్నానం ('గుస్ల్) చేయండి. మరియు మీరు అస్వస్థులై ఉన్నా, లేక ప్రయాణంలో ఉన్నా, లేక మీలో ఎవరైనా

---

**1.** పూర్వగ్రంథప్రజల స్త్రీల విషయం: వారు ఆధునిక భావాలవారై, ఇప్పుడు పశ్చిమ దేశాలలో, నడుస్తున్న సాంఘిక విచారాలను సమర్థించేవారైతే గ్రంథ ప్రజలతో వివాహం ధర్మసమ్మతమైనా వారి నడకలు 'హరాం అయితే, అట్టి స్త్రీలతో వివాహం చేసుకోవటం ఏవిధంగా ధర్మసమ్మతం కాగలదో ఆలోచించవలసిన విషయం. ప్రస్తుత కాలంలో చాలామంది గ్రంథప్రజలు వారి ధర్మం క్రైస్తవధర్మం గానీ, యూదధర్మం గానీ, వారు దానినుండి చాలా దూరంలో ఉన్నారు. కావున మీరు ఏ స్త్రీతోనైనా వివాహమాడదలచుకున్నపుడు ఆమె సుశీలవతి అయిఉండి, విచ్చలవిడిగా తిరిగే స్త్రీ కాకుండా ఉండటం ఎంతో ముఖ్యం. ఇంకా మీరు మీ స్త్రీలకు గ్రంథప్రజలతో పెండ్లి చేయించకండి. ఎందుకంటే మీరు ముస్లింలు దైవప్రవక్తలను అందరినీ నమ్ముతారు, ఆదరిస్తారు. కాని వారు, ఉదాహరణకు యూదులు, 'ఈసా ('అ.స.)ను మరియు ము'హమ్మద్('స'అస)ను, ఇద్దరినీ దైవప్రవక్తలని నమ్మరు. మరియు క్రైస్తవులు ము'హమ్మద్('స'అస)ను దైవప్రవక్తని నమ్మరు. కాబట్టి ఒక ముస్లిం స్త్రీ యూదుణ్ణి, లేక క్రైస్తవుణ్ణి పెండ్లి చేసుకుంటే, ఆమె వారింట్లో ము'హమ్మద్ ('స'అస) పట్ల దూషణలు ఎలా వినగలదు?

**2.** చూడండి, 'స. బు'ఖారీ, పు-1, 'హ. నం. 138.

సَفَرٍ أَوۡ جَآءَ أَحَدٞ مِّنكُم مِّنَ ٱلۡغَآئِطِ
أَوۡ لَٰمَسۡتُمُ ٱلنِّسَآءَ فَلَمۡ تَجِدُواْ مَآءٗ
فَتَيَمَّمُواْ صَعِيدٗا طَيِّبٗا فَٱمۡسَحُواْ
بِوُجُوهِكُمۡ وَأَيۡدِيكُم مِّنۡهُۚ مَا
يُرِيدُ ٱللَّهُ لِيَجۡعَلَ عَلَيۡكُم مِّنۡ
حَرَجٖ وَلَٰكِن يُرِيدُ لِيُطَهِّرَكُمۡ وَلِيُتِمَّ
نِعۡمَتَهُۥ عَلَيۡكُمۡ لَعَلَّكُمۡ
تَشۡكُرُونَ ٦
وَٱذۡكُرُواْ نِعۡمَةَ ٱللَّهِ عَلَيۡكُمۡ
وَمِيثَٰقَهُ ٱلَّذِي وَاثَقَكُم بِهِۦٓ إِذۡ
قُلۡتُمۡ سَمِعۡنَا وَأَطَعۡنَاۖ وَٱتَّقُواْ ٱللَّهَۚ
إِنَّ ٱللَّهَ عَلِيمُۢ بِذَاتِ ٱلصُّدُورِ ٧
يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ كُونُواْ
قَوَّٰمِينَ لِلَّهِ شُهَدَآءَ بِٱلۡقِسۡطِۖ وَلَا
يَجۡرِمَنَّكُمۡ شَنَـَٔانُ قَوۡمٍ عَلَىٰٓ
أَلَّا تَعۡدِلُواْۚ ٱعۡدِلُواْ هُوَ أَقۡرَبُ
لِلتَّقۡوَىٰۖ وَٱتَّقُواْ ٱللَّهَۚ إِنَّ ٱللَّهَ
خَبِيرُۢ بِمَا تَعۡمَلُونَ ٨

కాలకృత్యాలు తీర్చుకొని ఉన్నా, లేక మీరు స్త్రీలతో కలిసి (సంభోగం చేసి) ఉన్నా అప్పుడు మీకు నీరు లభించనిపక్షంలో పరిశుభ్రమైన మట్టితో తయమ్మమ్ చేయండి. అంటే, మీ ముఖాలను మరియు మీ చేతులను, దానితో (పరిశుభ్రమైన మట్టిపై స్పర్శించిన చేతులతో) రుద్దుకోండి.[1] మిమ్మల్ని కష్టపెట్టాలనేది అల్లాహ్ అభిమతం కాదు. మీరు కృతజ్ఞులు కావాలని ఆయన, మిమ్మల్ని శుద్ధపరచి మీపై తన అనుగ్రహాన్ని పూర్తిచేయ గోరుతున్నాడు.

**7.** మరియు మీకు అల్లాహ్ చేసిన అనుగ్రహాన్ని మరియు ఆయన మీ నుండి తీసుకున్న దృఢమైన ప్రమాణాన్ని జ్ఞాపకం చేసుకోండి. అప్పుడు మీరు: "మేము విన్నాము మరియు విధేయులమయ్యాము." అని అన్నారు. మరియు అల్లాహ్‌యందు భయభక్తులు కలిగి ఉండండి. నిశ్చయంగా, హృదయాలలో ఉన్నదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

**8.** ఓ విశ్వాసులారా! మీరు అల్లాహ్ కొరకు న్యాయంగా సాక్ష్యమివ్వటానికి స్థిరంగా నిలబడండి.[2] ఇతరుల పట్ల మీకున్న ద్వేషానికిలోనై, మీరు న్యాయాన్ని త్యజించ కండి. న్యాయం చేయండి, అది దైవభక్తికి సమీపమైనది. మరియు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. నిశ్చయంగా, మీరు చేసేదంతా అల్లాహ్ ఎరుగును.

---

**1.** చూడండి, 4:43.
**2.** చూడండి, 4:135.

**9**. మరియు విశ్వసించి సత్కార్యాలు చేసేవారికి క్షమాపణ మరియు గొప్ప ప్రతి ఫలం ఉన్నాయని అల్లాహ్ వాగ్దానం చేశాడు.

**10**. మరియు ఎవరైతే సత్య తిరస్కారానికి పాల్పడి, మా సూచనలను అబద్ధాలని తిరస్కరిస్తారో! అలాంటి వారు భగభగమండే నరకాగ్ని వాసులవుతారు.

**11**. ఓ విశ్వాసులారా! ఒక జాతి వారు (మీకు హాని చేయ సంకల్పించి) తమ చేతులను మీ వైపునకు చాచినపుడు, అల్లాహ్ వారి చేతులను మీనుండి తొలగించి మీకు చేసిన అనుగ్రహాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి. అల్లాహ్‌యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు విశ్వాసులు అల్లాహ్ పైననే నమ్మక ముంచుకుంటారు.(3/8)

**12**. * మరియు వాస్తవానికి అల్లాహ్ ఇస్రాయీ'లు సంతతివారి నుండి దృఢమైన ప్రమాణాన్ని తీసుకున్నాడు. మరియు మేము వారిలో నుండి పన్నెండు మందిని (కనాన్‌కు) పోవటానికి నాయకులుగా నియమించాము.[1] మరియు అల్లాహ్ వారితో ఇలా అన్నాడు: "ఒకవేళ మీరు నమా'జ్ స్థిరంగా సలుపుతూ, విధిదానం ('జకాత్) చెల్లిస్తూ మరియు నా ప్రవక్తలను విశ్వసించి, వారికి తోడ్పడుతూ, అల్లాహ్‌కు మంచి రుణాన్ని ఇస్తూవుంటే! నిశ్చయంగా, నేను మీకు తోడుగా ఉంటాను. మరియు నిశ్చయంగా, నేను మీ నుండి

وَعَدَ ٱللَّهُ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ لَهُم مَّغْفِرَةٌ وَأَجْرٌ عَظِيمٌ ٩

وَٱلَّذِينَ كَفَرُواْ وَكَذَّبُواْ بِـَٔايَٰتِنَآ أُوْلَٰٓئِكَ أَصْحَٰبُ ٱلْجَحِيمِ ١٠

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ ٱذْكُرُواْ نِعْمَتَ ٱللَّهِ عَلَيْكُمْ إِذْ هَمَّ قَوْمٌ أَن يَبْسُطُوٓاْ إِلَيْكُمْ أَيْدِيَهُمْ فَكَفَّ أَيْدِيَهُمْ عَنكُمْ وَٱتَّقُواْ ٱللَّهَ وَعَلَى ٱللَّهِ فَلْيَتَوَكَّلِ ٱلْمُؤْمِنُونَ ١١

۞ وَلَقَدْ أَخَذَ ٱللَّهُ مِيثَٰقَ بَنِىٓ إِسْرَٰٓءِيلَ وَبَعَثْنَا مِنْهُمُ ٱثْنَىْ عَشَرَ نَقِيبًا وَقَالَ ٱللَّهُ إِنِّى مَعَكُمْ لَئِنْ أَقَمْتُمُ ٱلصَّلَوٰةَ وَءَاتَيْتُمُ ٱلزَّكَوٰةَ وَءَامَنتُم بِرُسُلِى وَعَزَّرْتُمُوهُمْ وَأَقْرَضْتُمُ ٱللَّهَ قَرْضًا حَسَنًا لَّأُكَفِّرَنَّ عَنكُمْ سَيِّـَٔاتِكُمْ وَلَأُدْخِلَنَّكُمْ

1. చూడండి, 5:20-26.

جَنَّٰتٖ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُۚ
فَمَن كَفَرَ بَعۡدَ ذَٰلِكَ
مِنكُمۡ فَقَدۡ ضَلَّ سَوَآءَ
ٱلسَّبِيلِ ١٢

فَبِمَا نَقۡضِهِم مِّيثَٰقَهُمۡ لَعَنَّٰهُمۡ
وَجَعَلۡنَا قُلُوبَهُمۡ قَٰسِيَةٗۖ
يُحَرِّفُونَ ٱلۡكَلِمَ عَن
مَّوَاضِعِهِۦ وَنَسُواْ حَظّٗا مِّمَّا ذُكِّرُواْ
بِهِۦۚ وَلَا تَزَالُ تَطَّلِعُ عَلَىٰ خَآئِنَةٖ مِّنۡهُمۡ
إِلَّا قَلِيلٗا مِّنۡهُمۡۖ فَٱعۡفُ عَنۡهُمۡ وَٱصۡفَحۡۚ
إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلۡمُحۡسِنِينَ ١٣

وَمِنَ ٱلَّذِينَ قَالُوٓاْ إِنَّا
نَصَٰرَىٰٓ أَخَذۡنَا مِيثَٰقَهُمۡ
فَنَسُواْ حَظّٗا مِّمَّا ذُكِّرُواْ بِهِۦ
فَأَغۡرَيۡنَا بَيۡنَهُمُ ٱلۡعَدَاوَةَ وَٱلۡبَغۡضَآءَ
إِلَىٰ يَوۡمِ ٱلۡقِيَٰمَةِۚ وَسَوۡفَ
يُنَبِّئُهُمُ ٱللَّهُ بِمَا كَانُواْ
يَصۡنَعُونَ ١٤

మీ పాపాలను తొలగిస్తాను మరియు నిశ్చయంగా, మిమ్మల్ని క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింప జేస్తాను. కానీ, దీని తరువాత మీలో ఎవడు సత్యతిరస్కార వైఖరిని అవలంబిస్తాడో! అతడు వాస్తవంగా, సరైనమార్గం నుండి తప్పిపోయిన వాడే!''

**13**. ఆ పిదప వారు తాము చేసిన ఒడంబడికను భంగం చేసినందుకు, మేము వారిని శపించాము (బహిష్కరించాము) మరియు వారి హృదయాలను కఠినం చేశాము. వారు పదాలను తారుమారు చేసి వాటి అర్థాన్ని, సందర్భాన్ని పూర్తిగా మార్చి వేసేవారు.[1] వారికి ఇవ్వబడిన బోధనలలో అధికభాగాన్ని మరచిపోయారు. అనుదినం వారిలో ఏ కొందరో తప్ప, పలువురు చేసే ద్రోహాన్ని గురించి నీకు తెలుస్తూనే ఉంది. కనుక వారిని మన్నించు మరియు వారి చేష్టలను ఉపేక్షించు. నిశ్చయంగా, అల్లాహ్ సజ్జనులను ప్రేమిస్తాడు.

**14**. ''మేము క్రైస్తవులము.'' అని అనే వారి నుంచి కూడా మేము దృఢమైన ప్రమాణం తీసుకున్నాము; కాని వారు తమకు ఇవ్వబడిన బోధనలలో అధిక భాగాన్ని మరచిపోయారు; కావున తీర్పు దినం వరకు వారి మధ్య విరోధాన్ని మరియు ద్వేషాన్ని కల్గించాము. మరియు త్వరలోనే అల్లాహ్ వారు చేస్తూవచ్చిన కర్మలను గురించి వారికి తెలియజేస్తాడు.

**1**. చూడండి, 4:46.

يَـٰٓأَهۡلَ ٱلۡكِتَٰبِ قَدۡ جَآءَكُمۡ
رَسُولُنَا يُبَيِّنُ لَكُمۡ كَثِيرٗا مِّمَّا
كُنتُمۡ تُخۡفُونَ مِنَ ٱلۡكِتَٰبِ
وَيَعۡفُواْ عَن كَثِيرٖۚ قَدۡ
جَآءَكُم مِّنَ ٱللَّهِ نُورٞ
وَكِتَٰبٞ مُّبِينٞ ١٥
يَهۡدِي بِهِ ٱللَّهُ مَنِ ٱتَّبَعَ
رِضۡوَٰنَهُۥ سُبُلَ ٱلسَّلَٰمِ
وَيُخۡرِجُهُم مِّنَ ٱلظُّلُمَٰتِ إِلَى
ٱلنُّورِ بِإِذۡنِهِۦ وَيَهۡدِيهِمۡ إِلَىٰ
صِرَٰطٖ مُّسۡتَقِيمٖ ١٦
لَّقَدۡ كَفَرَ ٱلَّذِينَ قَالُوٓاْ إِنَّ ٱللَّهَ
هُوَ ٱلۡمَسِيحُ ٱبۡنُ مَرۡيَمَۚ قُلۡ فَمَن
يَمۡلِكُ مِنَ ٱللَّهِ شَيۡـًٔا إِنۡ أَرَادَ أَن
يُهۡلِكَ ٱلۡمَسِيحَ ٱبۡنَ مَرۡيَمَ
وَأُمَّهُۥ وَمَن فِي ٱلۡأَرۡضِ جَمِيعٗاۗ
وَلِلَّهِ مُلۡكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ
وَمَا بَيۡنَهُمَاۚ يَخۡلُقُ مَا يَشَآءُۚ وَٱللَّهُ عَلَىٰ
كُلِّ شَيۡءٖ قَدِيرٞ ١٧

**15**. ఓ గ్రంథప్రజలారా! వాస్తవంగా మా ప్రవక్త (ము'హమ్మద్) మీ వద్దకు వచ్చివున్నాడు; మీరు కప్పిపుచ్చుతూ ఉండిన గ్రంథం(బైబిల్)లోని ఎన్నో విషయాలను అతను మీకు బహిర్గతం చేస్తున్నాడు మరియు ఎన్నో విషయాలను ఉపేక్షిస్తున్నాడు. వాస్తవంగా మీకొరకు అల్లాహ్ తరఫునుండి ఒక జ్యోతి మరియు స్పష్టమైన గ్రంథం (ఈ ఖుర్ఆన్) వచ్చివున్నది.[1]

**16**. దాని ద్వారా అల్లాహ్! తన ప్రీతిని పొందగోరే వారికి శాంతి పథాలను చూపుతాడు మరియు తన ఆజ్ఞతో వారిని అంధకారం నుండి వెలుగులోకి తెచ్చి వారికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తాడు.

**17**. "నిశ్చయంగా మర్యమ్ కుమారుడైన మసీ'హ్(క్రీస్తు)యే అల్లాహ్!" అని అనేవారు నిస్సందేహంగా! సత్యతిరస్కారులు. (ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను: "అల్లాహ్ గనక మర్యమ్ కుమారుడైన మసీ'హ్(క్రీస్తు)ను అతని తల్లిని మరియు భూమిపై ఉన్న వారినందరినీ, నాశనం చేయగోరితే, ఆయనను ఆపగల శక్తి ఎవరికి ఉంది? మరియు ఆకాశాలలోను, భూమిలోను మరియు వాటి మధ్య ఉన్న సమస్తం మీద ఆధిపత్యం అల్లాహ్‌దే. ఆయన తాను కోరినది సృష్టిస్తాడు. మరియు అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు."[2]

---

**1**. నూరున్ వ కితాబుమ్ముబీన్: ఇక్కడ ఈ రెండు పదాలు దివ్యఖుర్ఆన్‌ను సంభోధిస్తున్నాయి, అనే విషయం ముందు వచ్చే 16వ ఆయత్ నుండి విషదమవుతోంది.

**2**. చూడండి, 4:171.

وَقَالَتِ ٱلْيَهُودُ وَٱلنَّصَٰرَىٰ نَحْنُ أَبْنَٰٓؤُاْ ٱللَّهِ وَأَحِبَّٰٓؤُهُۥۚ قُلْ فَلِمَ يُعَذِّبُكُم بِذُنُوبِكُمۖ بَلْ أَنتُم بَشَرٌ مِّمَّنْ خَلَقَۚ يَغْفِرُ لِمَن يَشَآءُ وَيُعَذِّبُ مَن يَشَآءُۚ وَلِلَّهِ مُلْكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَمَا بَيْنَهُمَاۖ وَإِلَيْهِ ٱلْمَصِيرُ ﴿١٨﴾

**18**. మరియు యూదులు మరియు క్రైస్తవులు ఇలా అంటారు: "మేము అల్లాహ్ సంతానం మరియు ఆయనకు ప్రియమైన వారము."[1] (వారితో) ఇలా అను: "అయితే, ఆయన మీ పాపాలకు మిమ్మల్ని ఎందుకు శిక్షిస్తున్నాడు? అలాకాదు, మీరు కూడ ఆయన పుట్టించిన మానవులలో ఒకరు మాత్రమే! ఆయన తాను కోరినవారిని క్షమిస్తాడు మరియు తాను కోరినవారిని శిక్షిస్తాడు. మరియు ఆకాశాలలో, భూమిలో మరియు వాటి మధ్య ఉన్న సమస్తం మీద సామ్రాజ్యాధిపత్యం అల్లాహ్‌దే. మరియు ఆయన వైపునకే (అందరికీ) మరలి పోవలసి ఉంది."

يَٰٓأَهْلَ ٱلْكِتَٰبِ قَدْ جَآءَكُمْ رَسُولُنَا يُبَيِّنُ لَكُمْ عَلَىٰ فَتْرَةٍ مِّنَ ٱلرُّسُلِ أَن تَقُولُواْ مَا جَآءَنَا مِنۢ بَشِيرٍ وَلَا نَذِيرٍۖ فَقَدْ جَآءَكُم بَشِيرٌ وَنَذِيرٌۗ وَٱللَّهُ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ ﴿١٩﴾

**19**. ఓ గ్రంథప్రజలారా! ప్రవక్తలు రావటం, ఆగిపోయిన కొంతకాలం తరువాత, మీకు అంతా స్పష్టంగా తెలుపటానికి, వాస్తవంగా మా సందేశహరుడు (ము'హమ్మద్) మీ వద్దకు వచ్చాడు. మీరు: "మావద్దకు శుభవార్త వినిపించేవాడు మరియు హెచ్చరికలు చేసేవాడు ఎవ్వడూ రాలేదు." అని అనకూడదని. నిస్సందేహంగా ఇప్పుడు మీకు శుభవార్త వినిపించేవాడు మరియు హెచ్చరికలు చేసేవాడు వచ్చివున్నాడు. మరియు అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

---

**1**. యూదులు 'ఉజైర్ ('అ.స.)ను మరియు క్రైస్తవులు 'ఈసా ('అ.స.)ను అల్లాహ్; లేక అల్లాహుతా'ఆలా కుమారులు అంటారు. మరియు యూదులు తమనుతాము అల్లాహుతా'ఆలా సంతానంగా చెప్పుకుంటారు. ఈ ఆయత్ వారి ఈ వాదాన్ని ఖండిస్తోంది.

وَإِذۡ قَالَ مُوسَىٰ لِقَوۡمِهِۦ يَٰقَوۡمِ ٱذۡكُرُواْ نِعۡمَةَ ٱللَّهِ عَلَيۡكُمۡ إِذۡ جَعَلَ فِيكُمۡ أَنۢبِيَآءَ وَجَعَلَكُم مُّلُوكٗا وَءَاتَىٰكُم مَّا لَمۡ يُؤۡتِ أَحَدٗا مِّنَ ٱلۡعَٰلَمِينَ ﴿٢٠﴾

**20**. మరియు మూసా తన జాతి ప్రజలతో ఇలా అన్నది (జ్ఞాపకం చేసుకోండి): "నా జాతి ప్రజలారా! అల్లాహ్ మీకు చేసిన అనుగ్రహాలను జ్ఞాపకం చేసుకోండి; ఆయన మీలోనుండి ప్రవక్తలను ఆవిర్భవింపజేశాడు మరియు మిమ్మల్ని సార్వభౌములుగా చేశాడు.[1] మరియు (ఆ కాలంలో) ప్రపంచంలో ఎవ్వరికీ ప్రసాదించని వాటిని (అనుగ్రహాలను) మీకు ప్రసాదించాడు.

يَٰقَوۡمِ ٱدۡخُلُواْ ٱلۡأَرۡضَ ٱلۡمُقَدَّسَةَ ٱلَّتِي كَتَبَ ٱللَّهُ لَكُمۡ وَلَا تَرۡتَدُّواْ عَلَىٰٓ أَدۡبَارِكُمۡ فَتَنقَلِبُواْ خَٰسِرِينَ ﴿٢١﴾

**21**. "నా జాతి ప్రజలారా! అల్లాహ్ మీ కొరకు వ్రాసిఉంచిన పవిత్ర భూమి (ఫలస్తీన్)లో ప్రవేశించండి. వెనుకకు మరలి రాకండి, అలా చేస్తే నష్టపడి తిరిగి రాగలరు."

قَالُواْ يَٰمُوسَىٰٓ إِنَّ فِيهَا قَوۡمٗا جَبَّارِينَ وَإِنَّا لَن نَّدۡخُلَهَا حَتَّىٰ يَخۡرُجُواْ مِنۡهَا فَإِن يَخۡرُجُواْ مِنۡهَا فَإِنَّا دَٰخِلُونَ ﴿٢٢﴾

**22**. (అప్పుడు) వారన్నారు: "ఓ మూసా! నిశ్చయంగా, అందులో బలిష్ఠులైన ప్రజలు (అమాలేకీయులు) ఉన్నారు. మరియు వారు అక్కడి నుండి వెళ్ళిపోనంత వరకు, మేము అందులో ఏ మాత్రమూ ప్రవేశించము; ఒకవేళ వారు వెళ్ళిపోతే మేము తప్పక ప్రవేశిస్తాము."

قَالَ رَجُلَانِ مِنَ ٱلَّذِينَ يَخَافُونَ أَنۡعَمَ ٱللَّهُ عَلَيۡهِمَا ٱدۡخُلُواْ عَلَيۡهِمُ ٱلۡبَابَ فَإِذَا دَخَلۡتُمُوهُ فَإِنَّكُمۡ غَٰلِبُونَۚ وَعَلَى ٱللَّهِ فَتَوَكَّلُوٓاْ إِن كُنتُم مُّؤۡمِنِينَ ﴿٢٣﴾

**23**. (అప్పుడు) భయపడేవారిలో నుండి అల్లాహ్ అనుగ్రహంపొందిన ఇద్దరు వ్యక్తులు అన్నారు: "ద్వారంనుండి పోయి వారిపై దాడిచేయండి.[2] మీరు లోనికి ప్రవేశించారంటే నిశ్చయంగా, విజయం మీదే! మీరు వాస్తవానికి విశ్వసించిన వారే అయితే! అల్లాహ్ పైననే నమ్మకం ఉంచుకోండి."

---

**1**. ఉదాహరణకు సులైమాన్ ('అ.స.) ప్రవక్త మరియు సార్వభౌముడు (రాజు) కూడా దీనితో విశదమయ్యేదేమిటంటే అల్లాహ్ (సు.తా.)యే రాజులను కూడా ఎన్నుకుంటాడు.

**2**. ఆ ఇద్దరువ్యక్తులు యూషా బిన్-నూన్ మరియు కాలిబ్ బిన్-యూ'హన్నా (Joshua & Caleb). వీరు కాననన్ను పరిశీలించటానికి ఎన్నుకోబడిన పన్నెండు మందిలో నుండి ఇద్దరు.

24. వారన్నారు: "ఓ మూసా! వారు అందు ఉన్నంతవరకు మేము అందులో ఎన్నటికీ ప్రవేశించము. కావున నీవు మరియు నీ ప్రభువు పోయి పోరాడండి, మేము నిశ్చయంగా, ఇక్కడే కూర్చొని ఉంటాము."

قَالُواْ يَـٰمُوسَىٰٓ إِنَّا لَن نَّدۡخُلَهَآ أَبَدًا مَّا دَامُواْ فِيهَاۖ فَٱذۡهَبۡ أَنتَ وَرَبُّكَ فَقَـٰتِلَآ إِنَّا هَـٰهُنَا قَـٰعِدُونَ ﴿٢٤﴾

25. (దానికి మూసా) అన్నాడు: "ఓ నా ప్రభూ! నాకు, నాపై మరియు నా సోదరునిపై మాత్రమే అధికారం గలదు. కావున నీవు మా మధ్య మరియు ఈ అవిధేయుల మధ్య తీర్పుచేయి (మమ్మల్ని ఈ అవిధేయుల నుండి దూరం చేయి)."

قَالَ رَبِّ إِنِّي لَآ أَمۡلِكُ إِلَّا نَفۡسِي وَأَخِيۖ فَٱفۡرُقۡ بَيۡنَنَا وَبَيۡنَ ٱلۡقَوۡمِ ٱلۡفَـٰسِقِينَ ﴿٢٥﴾

26. (అల్లాహ్) అన్నాడు: "ఇక నిశ్చయంగా ఆ భూమి వారి కొరకు నలభై సంవత్సరాల వరకు నిషేధింపబడింది. వారు దేశదిమ్మరులై ఈ భూమిలో తిరుగుతూ ఉంటారు.[1] కావున అవిధేయులైన జనులను గురించి నీవు చింతించకు." (1/2)

قَالَ فَإِنَّهَا مُحَرَّمَةٌ عَلَيۡهِمۡۛ أَرۡبَعِينَ سَنَةٗۛ يَتِيهُونَ فِي ٱلۡأَرۡضِۚ فَلَا تَأۡسَ عَلَى ٱلۡقَوۡمِ ٱلۡفَـٰسِقِينَ ﴿٢٦﴾

1. ఆ భూమి పేరు 'తైహ్' మైదానం. నలభై సంవత్సరాల వరకు యూదులు ఆ మైదానంలో తిరుగుతూ ఉండి, చివరకు ఫలస్తీన్‌లోకి ప్రవేశించినప్పుడు మూసా ('అ.స.) అనుచరులలో కేవలం ఈ ఇద్దరు పెద్దలే మిగిలారు. యూషా బిన్-నూన్, మూసా ('అ.స.) తరువాత, అతని స్థానంలో 'ఖలీఫా అయ్యారు. కాలిబ్ బిన్-యూ'హన్నా అతనికి కుడిభుజం అయ్యారు.

۞ وَٱتْلُ عَلَيْهِمْ نَبَأَ ٱبْنَىْ ءَادَمَ بِٱلْحَقِّ إِذْ قَرَّبَا قُرْبَانًا فَتُقُبِّلَ مِنْ أَحَدِهِمَا وَلَمْ يُتَقَبَّلْ مِنَ ٱلْءَاخَرِ قَالَ لَأَقْتُلَنَّكَ قَالَ إِنَّمَا يَتَقَبَّلُ ٱللَّهُ مِنَ ٱلْمُتَّقِينَ ﴿٢٧﴾

27. * మరియు వారికి ఆదమ్ యొక్క ఇద్దరు కుమారుల[1] (హాబిల్ మరియు ఖాబిల్‌ల) యథార్థ కథను వినిపించు. వారిద్దరు (అల్లాహ్‌కు) బలి (ఖుర్బాని) ఇచ్చినప్పుడు ఒకని (హాబీల్) బలి (ఖుర్బాని) స్వీకరించబడింది మరియు రెండవ వాని (ఖాబీల్) బలి (ఖుర్బాని) స్వీకరించబడలేదు. (ఖాబీల్) అన్నాడు: "నిశ్చయంగా నేను నిన్ను చంపుతాను." (దానికి హాబీల్) అన్నాడు: "నిశ్చయంగా, అల్లాహ్ భయభక్తులు గలవారి (బలినే) స్వీకరిస్తాడు.

لَئِنۢ بَسَطتَ إِلَىَّ يَدَكَ لِتَقْتُلَنِى مَآ أَنَا۠ بِبَاسِطٍ يَدِىَ إِلَيْكَ لِأَقْتُلَكَ إِنِّىٓ أَخَافُ ٱللَّهَ رَبَّ ٱلْعَٰلَمِينَ ﴿٢٨﴾

28. ఒకవేళ నీవు నన్ను చంపటానికి నీ చేయి నా వైపుకు ఎత్తినా! నేను నిన్ను చంపటానికి నాచేయి నీ వైపుకు ఎత్తను. (ఎందుకంటే) నిశ్చయంగా, నేను సర్వలోకాలకు పోషకుడైన అల్లాహ్‌కు భయపడుతున్నాను.

إِنِّىٓ أُرِيدُ أَن تَبُوٓأَ بِإِثْمِى وَإِثْمِكَ فَتَكُونَ مِنْ أَصْحَٰبِ ٱلنَّارِ ۚ وَذَٰلِكَ جَزَٰٓؤُا۟ ٱلظَّٰلِمِينَ ﴿٢٩﴾

29. నీవు నీ పాపంతో సహా, నా పాపాన్ని కూడా భరించి నరకవాసులలో ఒకడవు కావాలని నాకోరిక. మరియు ఇదే దుర్మార్గుల ప్రతిఫలం."

فَطَوَّعَتْ لَهُۥ نَفْسُهُۥ قَتْلَ أَخِيهِ فَقَتَلَهُۥ فَأَصْبَحَ مِنَ ٱلْخَٰسِرِينَ ﴿٣٠﴾

30. చివరికి అతడి మనస్సు అతడిని (తన సోదరుని) హత్యకు పురికొల్పింది, కావున అతడు, తన సోదరుణ్ణి (హాబిల్‌ను) చంపి నష్టం పొందిన వారిలో చేరిపోయాడు.

---

1. హాబిల్ మరియు ఖాబిల్ ఆదమ్ ('అ.స.) యొక్క ఇద్దరు కుమారులు. బైబిల్‌లో వీరు ఏబిల్ (Abel) మరియు కేన్ (Cain)గా పేర్కొనబడ్డారు. హాబిల్ (Abel)ను ఖాబిల్ (Cain) చంపాడు.

**31**. అప్పుడు అల్లాహ్ ఒక కాకిని పంపాడు; అది నేలను త్రవ్వి అతని సోదరుని శవాన్ని ఎలాదాచాలో చూపించింది. అతడు (ఖాబిల్): "అయ్యో, నా పాడుగాను! నేను ఈ కాకి పాటి వాణ్ణి కూడా కాలేక పోయాను! నా సోదరుని శవాన్ని దాచే (ఉపాయం) వెతకలేక పోయాను కదా!" అని వాపోయాడు. అప్పుడతడు పశ్చాత్తాపపడే వారిలో చేరిపోయాడు.

**32**. ఈ కారణం వల్లనే మేము ఇస్రాయీ'ల్ సంతతి వారికి ఈ ఉత్తరువు ఇచ్చాము: "నిశ్చయంగా - ఒక వ్యక్తి (హత్యకు) బదులుగా గానీ లేదా భూమిలో కల్లోలం వ్యాపింపజేసినందుకు గానీ, గాక - ఎవడైనా ఒక వ్యక్తిని (అన్యాయంగా) చంపితే, అతడు సర్వమానవజాతిని చంపినట్లే మరియు ఎవడైనా ఒక మానవుని ప్రాణాన్ని కాపాడితే, అతడు సర్వమానవజాతి ప్రాణాలను కాపాడినట్లే!" మరియు వాస్తవానికి వారి వద్దకు స్పష్టమైన సూచనలు తీసుకొని మా ప్రవక్తలు వచ్చారు, అయినా వాస్తవానికి వారిలో పలువురు భూమిలో అక్రమాలు చేసేవారు.

**33**. నిశ్చయంగా, ఎవరైతే అల్లాహ్‌తో మరియు ఆయన ప్రవక్తతో పోరాడుతారో మరియు ధరణిలో కల్లోలం రేకెత్తించటానికి ప్రయత్నిస్తారో, అలాంటి వారికి మరణ శిక్ష విధించాలి; లేదా శిలువపై ఎక్కించాలి; లేదా వారి అభిముఖపక్షాల కాళ్ళు-చేతులను నరికించాలి; లేదా వారిని దేశ బహిష్కృతుల్ని చేయాలి. ఇది వారికి ఇహలోకంలో గల అవమానం. మరియు వారికి పరలోకంలో కూడా ఘోరశిక్ష ఉంటుంది -

فَبَعَثَ ٱللَّهُ غُرَابًا يَبۡحَثُ فِي ٱلۡأَرۡضِ
لِيُرِيَهُۥ كَيۡفَ يُوَٰرِي سَوۡءَةَ أَخِيهِۚ
قَالَ يَٰوَيۡلَتَىٰٓ أَعَجَزۡتُ أَنۡ أَكُونَ مِثۡلَ
هَٰذَا ٱلۡغُرَابِ فَأُوَٰرِيَ سَوۡءَةَ أَخِيۖ
فَأَصۡبَحَ مِنَ ٱلنَّٰدِمِينَ ﴿٣١﴾
مِنۡ أَجۡلِ ذَٰلِكَ كَتَبۡنَا عَلَىٰ بَنِيٓ
إِسۡرَٰٓءِيلَ أَنَّهُۥ مَن قَتَلَ نَفۡسَۢا بِغَيۡرِ
نَفۡسٍ أَوۡ فَسَادٖ فِي ٱلۡأَرۡضِ
فَكَأَنَّمَا قَتَلَ ٱلنَّاسَ جَمِيعٗا
وَمَنۡ أَحۡيَاهَا فَكَأَنَّمَآ أَحۡيَا
ٱلنَّاسَ جَمِيعٗاۚ وَلَقَدۡ جَآءَتۡهُمۡ
رُسُلُنَا بِٱلۡبَيِّنَٰتِ ثُمَّ إِنَّ كَثِيرٗا
مِّنۡهُم بَعۡدَ ذَٰلِكَ فِي ٱلۡأَرۡضِ
لَمُسۡرِفُونَ ﴿٣٢﴾
إِنَّمَا جَزَٰٓؤُاْ ٱلَّذِينَ يُحَارِبُونَ ٱللَّهَ
وَرَسُولَهُۥ وَيَسۡعَوۡنَ فِي ٱلۡأَرۡضِ فَسَادًا
أَن يُقَتَّلُوٓاْ أَوۡ يُصَلَّبُوٓاْ أَوۡ تُقَطَّعَ
أَيۡدِيهِمۡ وَأَرۡجُلُهُم مِّنۡ خِلَٰفٍ أَوۡ
يُنفَوۡاْ مِنَ ٱلۡأَرۡضِۚ ذَٰلِكَ لَهُمۡ
خِزۡيٞ فِي ٱلدُّنۡيَاۖ وَلَهُمۡ فِي ٱلۡأٓخِرَةِ
عَذَابٌ عَظِيمٌ ﴿٣٣﴾

إِلَّا ٱلَّذِينَ تَابُواْ مِن قَبۡلِ أَن
تَقۡدِرُواْ عَلَيۡهِمۡۖ فَٱعۡلَمُوٓاْ أَنَّ ٱللَّهَ
غَفُورٞ رَّحِيمٞ ٣٤

**34**. మీరు స్వాధీనపరచుకోక ముందు పశ్చాత్తాపపడే వారు తప్ప. కావున మీరు నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత అని తెలుసుకోండి.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ ٱتَّقُواْ
ٱللَّهَ وَٱبۡتَغُوٓاْ إِلَيۡهِ ٱلۡوَسِيلَةَ
وَجَٰهِدُواْ فِي سَبِيلِهِۦ لَعَلَّكُمۡ
تُفۡلِحُونَ ٣٥

**35**. ఓ విశ్వాసులారా! అల్లాహ్‌యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు ఆయన సాన్నిధ్యానికి చేరే మార్గాన్ని అన్వేషించండి.[1] మరియు ఆయన మార్గంలో నిరంతరం కృషిచెయ్యండి, అప్పుడు మీరు సాఫల్యం పొందవచ్చు![2]

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ لَوۡ أَنَّ لَهُم
مَّا فِي ٱلۡأَرۡضِ جَمِيعٗا وَمِثۡلَهُۥ
مَعَهُۥ لِيَفۡتَدُواْ بِهِۦ مِنۡ عَذَابِ يَوۡمِ
ٱلۡقِيَٰمَةِ مَا تُقُبِّلَ مِنۡهُمۡۖ وَلَهُمۡ عَذَابٌ
أَلِيمٞ ٣٦

**36**. నిశ్చయంగా, సత్యతిరస్కారులైన వారు తీర్పుదినాన గల శిక్ష నుండి తప్పించుకోవటానికి - వారివద్ద ఉంటే - భూమిలో ఉన్న సమస్తాన్ని దానితో పాటు మరి అంత (ధనాన్ని) కూడా, విమోచనా ధనంగా ఇవ్వగోరుతారు కాని అది స్వీకరించబడదు. మరియు వారికి అతి బాధాకరమైన శిక్ష ఉంటుంది.[3]

---

**1**. వసీల: మార్గం, అంటే తాను కోరిన దానిని పొందటానికి లేక దానికి సన్నిహితులవటానికి సహాయపడేది. అంటే దైవభీతి మరియు సద్వర్తన మరియు అల్లాహ్ (సు.తా.) 'హరాం చేసిన వాటినుండి దూరంగా ఉండటం. కాని మూర్ఖులు ఈ సత్యాన్ని విడిచి గోరీలలో ఉన్న వారిని తమకు వసీలాగా భావిస్తున్నారు. షరీ'అత్‌లో ఇలాంటి అపోహలకు ఎలాంటి స్థానంలేదు. ('స'హీ'హ్ బు'ఖారీ, కితాబ్ అల్-అ'జాన్ మరియు 'స'హీ'హ్ ముస్లిం, కితాబ్ అ'స్సలాహ్). అ'జాన్ తరువాత చదువవలసిన దు'ఆయే వసీలా అది: "అల్లాహుమ్మ రబ్బ హాజిహిద్ద'అవతి త్తామ్మతి, వ'స్సలాతిల్ ఖాయి'మతి, ఆతి ము'హమ్మదన్ వసీలత వల్-ఫ'దీలత, వబ్'అస్‌హు మఖామమ్ మ'హ్మూ దల్లజీ' వఅద్‌తహు." స్వర్గంలో నబీ ('స'అస)కు ప్రసాదింపబడిన మఖామె మ'హమూద్ కూడా వసీల అనబడుతుంది. కావున ఎవడైతే అ'జాన్ తరువాత పై దు'ఆ చేస్తాడో అతడు నా సిఫారస్‌కు యోగ్యుడవుతాడు అని మహాప్రవక్త ('స'అస) అన్నారు.
**2**. చూడండి, 2:186.
**3**. చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-8, 'హదీస్' నం. 546.

يُرِيدُونَ أَن يَخْرُجُواْ مِنَ ٱلنَّارِ وَمَا هُم بِخَٰرِجِينَ مِنْهَا ۖ وَلَهُمْ عَذَابٌ مُّقِيمٌ ﴿٣٧﴾

37. వారు నరకాగ్నినుండి బయటికి రాగోరుతారు, కాని వారు దానినుండి బయటికి రాజాలరు. మరియు వారికి ఎడతెగని శిక్ష ఉంటుంది.[1]

وَٱلسَّارِقُ وَٱلسَّارِقَةُ فَٱقْطَعُوٓاْ أَيْدِيَهُمَا جَزَآءًۢ بِمَا كَسَبَا نَكَٰلًا مِّنَ ٱللَّهِ ۗ وَٱللَّهُ عَزِيزٌ حَكِيمٌ ﴿٣٨﴾

38. మరియు పురుషుడు దొంగ అయినా, లేదా స్త్రీ దొంగ అయినా, వారి చేతులను నరికివేయండి. ఇది వారి కర్మలకు గుణపాఠంగా, అల్లాహ్ నిర్ణయించిన ప్రతిఫలం (శిక్ష).[2] మరియు అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేచనాపరుడు.

فَمَن تَابَ مِنۢ بَعْدِ ظُلْمِهِۦ وَأَصْلَحَ فَإِنَّ ٱللَّهَ يَتُوبُ عَلَيْهِ ۗ إِنَّ ٱللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴿٣٩﴾

39. ఎవడు నేరం చేసిన తరువాత పశ్చాత్తాపపడి తనను తాను సవరించుకుంటాడో! నిశ్చయంగా అల్లాహ్ అలాంటి వాని పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

أَلَمْ تَعْلَمْ أَنَّ ٱللَّهَ لَهُۥ مُلْكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ يُعَذِّبُ مَن يَشَآءُ وَيَغْفِرُ لِمَن يَشَآءُ ۗ وَٱللَّهُ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ ﴿٤٠﴾

40. ఏమీ? నిశ్చయంగా, భూమ్యాకాశాలపై ఆధిపత్యం అల్లాహ్‌దేనని నీకు తెలియదా? మరియు ఆయన తాను కోరిన వారిని శిక్షిస్తాడు మరియు తాను కోరిన వారిని క్షమిస్తాడు. మరియు అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు. (5/8)

---

1. ఈ ఆయత్ సత్యతిరస్కారులను గురించి ఉంది. ఎందుకంటే ము'అ'మిన్‌లను చివరకు నరకాగ్ని నుండి బయటకు తీయటం జరుగుతుంది. ఇది 'హదీస్'లలో పేర్కొనబడింది.
2. ఈ శిక్ష వివరాలను గురించి 'హదీస్', ఫిఖ్ మరియు తఫాసీర్ పుస్తకాలను చదవాలి. ఇస్లాంలో ఈ విధంగా కఠిన శిక్షలు ఉండటంవల్లనే ఇస్లామియా శాసనం పాటించే దేశాలలో - ఎక్కడైతే ఇంతవరకు షరీ'అత్ శాసనమే అమలులో ఉందో - ఉన్నంత శాంతి భద్రతలు, సుఖసంతోషాలు మరే ఇతర 'గైరు షరీ'అత్ శాసనాలు పాటించే దేశాలలో లేవు. ఉదా: స'ఊదీ 'అరేబియా.

۞ يَـٰٓأَيُّهَا ٱلرَّسُولُ لَا يَحۡزُنكَ ٱلَّذِينَ يُسَٰرِعُونَ فِي ٱلۡكُفۡرِ مِنَ ٱلَّذِينَ قَالُوٓاْ ءَامَنَّا بِأَفۡوَٰهِهِمۡ وَلَمۡ تُؤۡمِن قُلُوبُهُمۡۛ وَمِنَ ٱلَّذِينَ هَادُواْۛ سَمَّـٰعُونَ لِلۡكَذِبِ سَمَّـٰعُونَ لِقَوۡمٍ ءَاخَرِينَ لَمۡ يَأۡتُوكَۖ يُحَرِّفُونَ ٱلۡكَلِمَ مِنۢ بَعۡدِ مَوَاضِعِهِۦۖ يَقُولُونَ إِنۡ أُوتِيتُمۡ هَٰذَا فَخُذُوهُ وَإِن لَّمۡ تُؤۡتَوۡهُ فَٱحۡذَرُواْۚ وَمَن يُرِدِ ٱللَّهُ فِتۡنَتَهُۥ فَلَن تَمۡلِكَ لَهُۥ مِنَ ٱللَّهِ شَيۡـًٔاۚ أُوْلَـٰٓئِكَ ٱلَّذِينَ لَمۡ يُرِدِ ٱللَّهُ أَن يُطَهِّرَ قُلُوبَهُمۡۚ لَهُمۡ فِي ٱلدُّنۡيَا خِزۡيٞۖ وَلَهُمۡ فِي ٱلۡأٓخِرَةِ عَذَابٌ عَظِيمٞ ٤١

41. * ఓ ప్రవక్తా! సత్యతిరస్కారంలోకి పరుగులు తీసేవారివల్ల నీవు దుఃఖపడకు. అలాంటి వారు: "మేము విశ్వసించాము." అని తమ నోటితో మాత్రమే అంటారు, కాని వారి హృదయాలు విశ్వసించలేదు. మరియు యూదులలో కొందరు అసత్యాలను కుతూహలంతో వినే వారున్నారు మరియు నీ వద్దకు ఎన్నడూ రాని ఇతర ప్రజలకు (అందజేయటానికి) మీ మాటలు వినే వారు ఉన్నారు. వారు పదాల అర్థాలను మార్చి, వాటి సందర్భాలకు భిన్నంగా తీసుకుని ఇలా అంటారు: "మీకు ఈ విధమైన (సందేశం) ఇస్తేనే స్వీకరించండి మరియు ఇలాంటిది ఇవ్వక పోతే, జాగ్రత్త పడండి!" మరియు అల్లాహ్ ఎవరిని పరీక్షించ (తప్పుదారిలో వదల) దలచాడో వారిని అల్లాహ్ నుండి తప్పించటానికి నీవు ఏమీ చేయలేవు. ఎవరి హృదయాలను అల్లాహ్ పరిశుద్ధపరచ గోరలేదో అలాంటి వారు వీరే. వారికి ఇహలోకంలో అవమానం ఉంటుంది. మరియు వారికి పరలోకంలో ఘోర శిక్ష ఉంటుంది.

سَمَّـٰعُونَ لِلۡكَذِبِ أَكَّـٰلُونَ لِلسُّحۡتِۚ فَإِن جَآءُوكَ فَٱحۡكُم بَيۡنَهُمۡ أَوۡ أَعۡرِضۡ عَنۡهُمۡۖ وَإِن تُعۡرِضۡ عَنۡهُمۡ فَلَن يَضُرُّوكَ شَيۡـًٔاۖ وَإِنۡ حَكَمۡتَ فَٱحۡكُم بَيۡنَهُم بِٱلۡقِسۡطِۚ إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلۡمُقۡسِطِينَ ٤٢

42. వారు అబద్ధాన్ని వినేవారు మరియు నిషిద్ధమైన దానిని తినేవారు. కావున వారు నీ వద్దకు (న్యాయానికి) వస్తే, నీవు (ఇష్టపడితే) వారిమధ్య తీర్పుచేయి, లేదా ముఖం త్రిప్పుకో. నీవు వారి నుండి విముఖుడవైతే వారు నీకేమీ హాని చేయలేరు. నీవు వారి మధ్య తీర్పుచేస్తే, న్యాయంగా మాత్రమే తీర్పు చేయి. నిశ్చయంగా, అల్లాహ్ న్యాయ బద్ధులైన వారిని ప్రేమిస్తాడు.

وَكَيْفَ يُحَكِّمُونَكَ وَعِندَهُمُ ٱلتَّوْرَىٰةُ فِيهَا حُكْمُ ٱللَّهِ ثُمَّ يَتَوَلَّوْنَ مِنۢ بَعْدِ ذَٰلِكَ ۚ وَمَآ أُوْلَـٰٓئِكَ بِٱلْمُؤْمِنِينَ ﴿٤٣﴾

**43**. మరియు - అల్లాహ్ ఉత్తరువులు ఉన్న తౌరాత్ గ్రంథం వారివద్ద ఉన్నప్పటికీ - వారు తీర్పు కొరకు, నీ వద్దకు ఎందుకు వస్తున్నారు? ఆ తరువాత కూడా వారు దాని నుండి తిరిగి పోతున్నారు. మరియు ఇలాంటి వారు (నిజానికి) విశ్వసించిన వారు కారు.

إِنَّآ أَنزَلْنَا ٱلتَّوْرَىٰةَ فِيهَا هُدًى وَنُورٌ ۚ يَحْكُمُ بِهَا ٱلنَّبِيُّونَ ٱلَّذِينَ أَسْلَمُوا۟ لِلَّذِينَ هَادُوا۟ وَٱلرَّبَّـٰنِيُّونَ وَٱلْأَحْبَارُ بِمَا ٱسْتُحْفِظُوا۟ مِن كِتَـٰبِ ٱللَّهِ وَكَانُوا۟ عَلَيْهِ شُهَدَآءَ ۚ فَلَا تَخْشَوُا۟ ٱلنَّاسَ وَٱخْشَوْنِ وَلَا تَشْتَرُوا۟ بِـَٔايَـٰتِى ثَمَنًا قَلِيلًا ۚ وَمَن لَّمْ يَحْكُم بِمَآ أَنزَلَ ٱللَّهُ فَأُوْلَـٰٓئِكَ هُمُ ٱلْكَـٰفِرُونَ ﴿٤٤﴾

**44**. నిశ్చయంగా, మేము తౌరాతును (మూసాపై) అవతరింపజేశాము. అందులో మార్గదర్శకత్వం మరియు జ్యోతి ఉన్నాయి. అల్లాహ్‌కు విధేయు(ముస్లిం)లైన ప్రవక్తలు దానిని అనుసరించి, యూదుల మధ్య తీర్పు చేస్తూ ఉండే వారు.[1] అదేవిధంగా ధర్మవేత్తలు (రబ్బానియ్యూన్) మరియు యూద మతాచారు(అహ్‌బార్)లు కూడా (తీర్పు చేస్తూ ఉండేవారు). ఎందుకంటే వారు అల్లాహ్ గ్రంథానికి రక్షకులుగా మరియు దానికి సాక్షులుగా నియమింపబడి ఉండే వారు. కావున మీరు (యూదులారా) మానవులకు భయపడకండి. నాకే భయ పడండి. నా సూక్తు(ఆయాత్)లను స్వల్పలాభాలకు అమ్ముకోకండి. మరియు ఎవరు అల్లాహ్ అవతరింపజేసిన (శాసనం) ప్రకారం తీర్పుచేయరో, అలాంటి వారే సత్యతిరస్కారులు.

---

**1**. యూదుల ప్రవక్తలందరూ అల్లాహ్ (సు.తా.)కు విధేయులైన వారే అంటే ముస్లింలే. ఆ ఇస్లాం వైపునకే దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) పిలుస్తున్నారు. ఈ ఇస్లాం ధర్మమే ఆదమ్ ('అ.స.) నుండి ప్రతి ప్రవక్త బోధించిన ధర్మం. ఇక హిందూ ధర్మానికి మూలమైన వేదాలు మరియు భగవద్గీత కూడా ఏకైక పరమేశ్వరునికి అంటే అల్లాహుతా'ఆలాకు మాత్రమే విధేయులై ఉండి, కేవలం ఆయననే ఆరాధించాలని బోధిస్తున్నాయి. ఆ పరమేశ్వరుడు, సంతానం లేనివాడు అని కూడా వివరిస్తున్నాయి. అంతేగాక పామరులే కల్పిత దైవాలను, సృష్టించబడిన వాటిని ఆరాధిస్తారని కూడా బోధిస్తున్నాయి.

وَكَتَبْنَا عَلَيْهِمْ فِيهَآ أَنَّ ٱلنَّفْسَ بِٱلنَّفْسِ
وَٱلْعَيْنَ بِٱلْعَيْنِ وَٱلْأَنفَ بِٱلْأَنفِ
وَٱلْأُذُنَ بِٱلْأُذُنِ وَٱلسِّنَّ بِٱلسِّنِّ
وَٱلْجُرُوحَ قِصَاصٌ فَمَن تَصَدَّقَ
بِهِۦ فَهُوَ كَفَّارَةٌ لَّهُۥ وَمَن لَّمْ
يَحْكُم بِمَآ أَنزَلَ ٱللَّهُ فَأُو۟لَٰٓئِكَ هُمُ
ٱلظَّٰلِمُونَ ﴿٤٥﴾

**45.** మరియు ఆ గ్రంథం(తౌరాత్)లో వారికి మేము: "ప్రాణానికి బదులు ప్రాణం, కన్నుకు బదులు కన్ను, ముక్కుకు బదులు ముక్కు, చెవికి బదులు చెవి, పన్నుకు బదులు పన్ను మరియు గాయాలకు బదులుగా సరిసమానమైన ప్రతీకారం వ్రాశాము."[1] కాని ఎవరైనా దానిని క్షమిస్తే, అది అతనికి పాపపరిహారం (కఫ్ఫారా)! మరియు ఎవరు అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం తీర్పుచేయరో అలాంటి వారు! వారే దుర్మార్గులు.[2]

وَقَفَّيْنَا عَلَىٰٓ ءَاثَٰرِهِم بِعِيسَى ٱبْنِ مَرْيَمَ
مُصَدِّقًا لِّمَا بَيْنَ يَدَيْهِ مِنَ ٱلتَّوْرَىٰةِ
وَءَاتَيْنَٰهُ ٱلْإِنجِيلَ فِيهِ هُدًى وَنُورٌ

**46.** మరియు మేము వారి (ఆ ప్రవక్తల) అడుగుజాడలను (ఆసా'రిహిమ్) అనుసరించే వాడు మరియు తౌరాత్‌లో మిగిలి ఉన్న సత్యాన్ని ధృవపరచే వాడయిన, మర్యమ్ కుమారుడు 'ఈసా (ఏసు)ను పంపాము.[3] మేము అతనికి

---

**1.** ఈ శిక్షలకు చూడండి బైబిల్ (Old Testament), నిర్గమకాండం- (Exodus), 21:23-36.

**2.** పూర్వ గ్రంథప్రజలు తమ ధర్మగ్రంథానికి విరుద్ధంగా వ్యవహరిస్తున్నారు. అంటే అల్లాహ్ (సు.తా.) శాసనాన్ని అనుసరించటం లేదు. ఎవరైతే అల్లాహుతా'ఆలా శాసనాన్ని అనుసరించరో అలాంటి వారే "జాలిమూన్ - దుర్మార్గులు, ఫాసిఖూన్ - అవిధేయులు (దుష్టులు) మరియు కాఫిరూన్ - సత్యతిరస్కారులు అనబడతారు. అలాంటి వారే అల్లాహుతా'ఆలా ఆగ్రహానికి గురిఅయ్యే వారు.

**3.** మూసా ('అ.స.)పై అవతరింపజేయబడిన తౌరాత్ గ్రంథం తరువాత అల్లాహ్ (సు.తా.) 'ఈసా ('అ.స.)పై ఇంజీల్‌ను అవతరింపజేశాడు. అతను తౌరాత్‌లో మిగిలి ఉన్న సత్యాన్ని ధృవపరిచారు. 'ఈసా ('అ.స.): "ఇస్రాయీ'ల్ సంతతిలోని దారితప్పిన గొర్రెల వద్దకే తప్ప ఇతరులవద్దకు నేను పంపబడలేదు." అని అన్నారు. మత్తయి-(Mathew), 15:24. ఇక ము'హమ్మద్ ('స'అస) వచ్చారు. అతనిపై ఖుర్ఆన్ అవతరింపజేయబడింది. ఇది పూర్వగ్రంథాలలో మిగిలిఉన్న సత్యాన్ని ధృవీకరిస్తుంది. ఈ ఖుర్ఆన్ 1400 సంవత్సరాలలో, దానిలోని ఒక్క అక్షరమైనా మార్చబడకుండా, దాని అసలు రూపంలో భద్రపరచబడి ఉన్న ఏకైక, దివ్యగ్రంథం. ఎందుకంటే పునరుత్థానదినం వరకు నేను ఈ ఖుర్ఆన్‌ను దాని అసలు రూపంలో భద్రపరుస్తానని

وَمُصَدِّقًا لِّمَا بَيْنَ يَدَيْهِ مِنَ
ٱلتَّوْرَىٰةِ وَهُدًى وَمَوْعِظَةً
لِّلْمُتَّقِينَ ﴿٤٦﴾
وَلْيَحْكُمْ أَهْلُ ٱلْإِنجِيلِ بِمَآ أَنزَلَ
ٱللَّهُ فِيهِ ۚ وَمَن لَّمْ يَحْكُم بِمَآ
أَنزَلَ ٱللَّهُ فَأُو۟لَـٰٓئِكَ هُمُ
ٱلْفَـٰسِقُونَ ﴿٤٧﴾
وَأَنزَلْنَآ إِلَيْكَ ٱلْكِتَـٰبَ بِٱلْحَقِّ
مُصَدِّقًا لِّمَا بَيْنَ يَدَيْهِ مِنَ
ٱلْكِتَـٰبِ وَمُهَيْمِنًا عَلَيْهِ ۖ

ఇంజీల్ గ్రంథాన్ని ప్రసాదించాము. అందులో మార్గదర్శకత్వం మరియు జ్యోతి ఉన్నాయి మరియు అది తౌరాత్‌లో మిగిలిఉన్న సత్యాన్ని ధృవీకరిస్తుంది మరియు దైవభీతి గలవారికి మార్గ దర్శకత్వం మరియు హితోపదేశం కూడా!

**47.** మరియు ఇంజీల్ గ్రంథప్రజలను, అల్లాహ్! ఆ గ్రంథంలో అవతరింపజేసిన శాసనం ప్రకారం తీర్పుచేయమను. మరియు ఎవరు అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం తీర్పుచేయరో అలాంటి వారు, వారే అవిధేయులు (దుష్టులు).[1]

**48.** మరియు (ఓ ప్రవక్తా!) మేము ఈ గ్రంథాన్ని నీ పై సత్యంతో అవతరింప జేశాము. ఇది పూర్వగ్రంథాలలో మిగిలిఉన్న సత్యాన్ని ధృవపరుస్తుంది. మరియు వాటిలో ఉన్న సత్యాసత్యాలను పరిష్కరిస్తుంది.[2] కావున నీవు, అల్లాహ్

---

అల్లాహ్ (సు.తా.) వాగ్దానం చేశాడు. చూడండి, 15:9. ఇది ర'హ్మతుల్లిల్ 'ఆలమీన్ - అంటే సర్వలోకాల వారికి కారుణ్యం. ఇది సర్వలోకాల వారికొరకు అవతరింపజేయబడింది. ము'హమ్మద్ ('స'అస) చిట్ట చివరి ప్రవక్త. అతనిపై అవతరింపజేయబడిన ఈ దివ్యఖుర్ఆన్ చిట్ట చివరి దివ్యగ్రంథం.

1. ఎంతవరకైతే ఖుర్ఆన్ అవతరింపజేయబడలేదో, అంతవరకు బైబిల్ శాసనం అమలులో ఉండెను. కాని దైవప్రవక్త('స'అస)కు దివ్యఖుర్ఆన్ ప్రసాదింపబడిన తరువాత ఇది ఇంతకు ముందు అవతరింపజేయబడిన దివ్య గ్రంథాలను రద్దుచేస్తుంది. ఇది అల్లాహ్ (సు.తా.) శాసనం. మరొక విశేషం ఏమిటంటే అవి వాటి అసలు రూపంలో లేవు. వాటిని అనుసరించే వారు వాటిలో తమ ఇష్టానుసారంగా ఎన్నో సార్లు, ఎన్నో మార్పులు చేశారు. వాటిలో చివరి మార్పుగలది 1977 క్రీస్తు శకపు (Revised) Authorized KJV. అంతేగాక ఇప్పుడు ప్రపంచంలో ఎన్నో రకాలైన బైబిల్స్ చెలామణిలో ఉన్నాయి. చూడండి, 3:3 వ్యాఖ్యానం 2. కాని ఖుర్ఆన్ మాత్రమే, 1400 సంవత్సరాలలో ఏ విధమైన మార్పులు లేకుండా, దాని అసలు రూపంలో సురక్షితంగా ఉన్న ఏకైక దివ్య గ్రంథం.

2. ముహైమినన్ 'అలైహి: అంటే అది వాటిలో ఉన్న సత్యాన్ని ధృవపరుస్తుంది, వాటిలో చేర్చబడిన అసత్యాన్ని అసత్యమని నిరూపిస్తుంది మరియు స్పష్టపరుస్తుంది.

فَٱحۡكُم بَيۡنَهُم بِمَآ أَنزَلَ ٱللَّهُۖ وَلَا تَتَّبِعۡ أَهۡوَآءَهُمۡ عَمَّا جَآءَكَ مِنَ ٱلۡحَقِّۚ لِكُلّٖ جَعَلۡنَا مِنكُمۡ شِرۡعَةٗ وَمِنۡهَاجٗاۚ وَلَوۡ شَآءَ ٱللَّهُ لَجَعَلَكُمۡ أُمَّةٗ وَٰحِدَةٗ وَلَٰكِن لِّيَبۡلُوَكُمۡ فِي مَآ ءَاتَىٰكُمۡۖ فَٱسۡتَبِقُواْ ٱلۡخَيۡرَٰتِۚ إِلَى ٱللَّهِ مَرۡجِعُكُمۡ جَمِيعٗا فَيُنَبِّئُكُم بِمَا كُنتُمۡ فِيهِ تَخۡتَلِفُونَ ٤٨

అవతరింపజేసిన ఈ శాసనం ప్రకారం వారిమధ్య తీర్పు చెయ్యి. మరియు నీ వద్దకు వచ్చిన సత్యాన్ని విడిచి వారి కోరికలను అనుసరించకు.[1] మీలో ప్రతి ఒక్క సంఘానికి ఒక ధర్మశాసనాన్ని మరియు ఒక జీవన మార్గాన్ని నియమించి ఉన్నాము. ఒకవేళ అల్లాహ్ తలుచుకుంటే, మిమ్మల్ని అంతా ఒకే ఒక సంఘంగా రూపొందించి ఉండేవాడు. కాని మీకు ఇచ్చిన దానితో (ధర్మంతో) మిమ్మల్ని పరీక్షించటానికి (ఇలా చేశాడు). కావున మీరు మంచిపనులు చేయటంలో ఒకరితో నొకరు పోటీ పడండి. అల్లాహ్ వద్దకే మీరందరూ మరలి పోవలసి వుంది అప్పుడు ఆయన మీకున్న భేదాభిప్రాయాలను గురించి మీకు తెలియజేస్తాడు.

وَأَنِ ٱحۡكُم بَيۡنَهُم بِمَآ أَنزَلَ ٱللَّهُ وَلَا تَتَّبِعۡ أَهۡوَآءَهُمۡ وَٱحۡذَرۡهُمۡ أَن يَفۡتِنُوكَ عَنۢ بَعۡضِ مَآ أَنزَلَ ٱللَّهُ إِلَيۡكَۖ فَإِن تَوَلَّوۡاْ فَٱعۡلَمۡ أَنَّمَا يُرِيدُ ٱللَّهُ أَن يُصِيبَهُم بِبَعۡضِ ذُنُوبِهِمۡۗ وَإِنَّ كَثِيرٗا مِّنَ ٱلنَّاسِ لَفَٰسِقُونَ ٤٩

**49**. మరియు (ఓ ప్రవక్తా!) నీవు అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం వారి మధ్య తీర్పుచెయ్యి మరియు వారి వ్యర్థ కోరికలను అనుసరించకు. అల్లాహ్ నీపై అవతరింపజేసిన కొన్ని శాసనాల నుండి వారు నిన్ను తప్పించకుండా జాగ్రత్తగా ఉండు. ఒకవేళ వారు వెనుదిరిగిపోతే, అల్లాహ్ వారిని, వారి కొన్ని పాపాలకు శిక్షించదలచాడని తెలుసుకో. మరియు నిశ్చయంగా, ప్రజలలో అనేకులు అవిధేయతకు పాల్పడే వారున్నారు.

---

**1**. అంటే ముస్లిమేతరులు కూడా తీర్పుకొరకు వస్తే వారిమధ్య దివ్యఖుర్ఆన్ (అల్లాహుతా'ఆలా) ఆదేశానుసారంగా మాత్రమే తీర్పు చేయాలి; కానీ వారి ధర్మాన్ని అనుసరిస్తూ గానీ, లేక వారి కోరికలను అనుసరిస్తూ గానీ, తీర్పుచేయరాదు.

50. ఏమీ? వారు అజ్ఞానకాలపు తీర్పును కోరుతున్నారా? కాని ఆయన (అల్లాహ్) పై నమ్మకం గలవారికి అల్లాహ్ కంటే మంచి తీర్పు చేయగలవాడెవడు?[1] (3/4)

أَفَحُكْمَ ٱلْجَـٰهِلِيَّةِ يَبْغُونَ ۚ وَمَنْ أَحْسَنُ مِنَ ٱللَّهِ حُكْمًا لِّقَوْمٍ يُوقِنُونَ ﴿٥٠﴾

51. * ఓ విశ్వాసులారా! యూదులను మరియు క్రైస్తవులను మిత్రులుగా చేసుకోకండి. వారు ఒకరికొకరు స్నేహితులు.[2] మీలో ఎవడు వారితో స్నేహం చేస్తాడో వాస్తవానికి అతడు వారిలో చేరిన వాడవుతాడు. నిశ్చయంగా, అల్లాహ్ దుర్మార్గులకు మార్గదర్శకత్వం చేయడు.

۞ يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تَتَّخِذُوا۟ ٱلْيَهُودَ وَٱلنَّصَـٰرَىٰٓ أَوْلِيَآءَ ۘ بَعْضُهُمْ أَوْلِيَآءُ بَعْضٍ ۚ وَمَن يَتَوَلَّهُم مِّنكُمْ فَإِنَّهُۥ مِنْهُمْ ۗ إِنَّ ٱللَّهَ لَا يَهْدِى ٱلْقَوْمَ ٱلظَّـٰلِمِينَ ﴿٥١﴾

52. కావున ఎవరి హృదయాలలో రోగం (కాపట్యం) ఉందో వారు, వారి సాంగత్యం కొరకు పోటీ పడుతున్నది నీవు చూస్తున్నావు. వారు: "మాపై ఏదైనా ఆపద రాగలదని మేము భయపడుతున్నాము." అని అంటారు. బహుశా అల్లాహ్ (విశ్వాసులకు) విజయాన్ని గానీ, లేదా తనదిక్కు నుండి ఏదైనా అవకాశాన్ని గానీ కలిగించవచ్చు! అప్పుడు వారు తమ మనస్సులలో దాచి ఉంచిన దానికి పశ్చాత్తాపపడతారు.

فَتَرَى ٱلَّذِينَ فِى قُلُوبِهِم مَّرَضٌ يُسَـٰرِعُونَ فِيهِمْ يَقُولُونَ نَخْشَىٰٓ أَن تُصِيبَنَا دَآئِرَةٌ ۚ فَعَسَى ٱللَّهُ أَن يَأْتِىَ بِٱلْفَتْحِ أَوْ أَمْرٍ مِّنْ عِندِهِۦ فَيُصْبِحُوا۟ عَلَىٰ مَآ أَسَرُّوا۟ فِىٓ أَنفُسِهِمْ نَـٰدِمِينَ ﴿٥٢﴾

1. ఇస్లాం: అంటే అల్లాహ్ (సు.తా.)కు విధేయత, జాహిలియ్యహ్ - అంటే అజ్ఞానం. ఈ రెండు పదాలు ఒకదాని కొకటి వ్యతిరేకంగా వాడబడతాయి. ఎందుకంటే సర్వజ్ఞానాలకు మూలాధారి అల్లాహ్ (సు.తా.) కావున అల్లాహుతా'ఆలాను విశ్వసించని వారు అజ్ఞానులే! (ఫ'త్హ్ అల్-ఖదీర్). ఇంకా చూడండి. 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-9, 'హదీస్' నం. 21.

2. చూడండి, 3:28, 118. 4:139, 5:57, 8:73 మరియు 60:7-9.

وَيَقُولُ ٱلَّذِينَ ءَامَنُوٓاْ أَهَٰٓؤُلَآءِ ٱلَّذِينَ أَقۡسَمُواْ بِٱللَّهِ جَهۡدَ أَيۡمَٰنِهِمۡ إِنَّهُمۡ لَمَعَكُمۡۚ حَبِطَتۡ أَعۡمَٰلُهُمۡ فَأَصۡبَحُواْ خَٰسِرِينَ ٥٣

**53**. మరియు విశ్వాసులు (పరస్పరం ఇలా అనుకుంటారు): "ఏమీ? వాస్తవానికి మేము మీతోనే ఉన్నామని, అల్లాహ్ పేరుతో కఠోర ప్రమాణాలు చేసి, నమ్మకం కలిగించే వారు వీరేనా?" వారి (కపట విశ్వాసుల) కర్మలన్నీ వ్యర్థమై, వారు నష్టపడిన వారవుతారు!

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ مَن يَرۡتَدَّ مِنكُمۡ عَن دِينِهِۦ فَسَوۡفَ يَأۡتِي ٱللَّهُ بِقَوۡمٖ يُحِبُّهُمۡ وَيُحِبُّونَهُۥٓ أَذِلَّةٍ عَلَى ٱلۡمُؤۡمِنِينَ أَعِزَّةٍ عَلَى ٱلۡكَٰفِرِينَ يُجَٰهِدُونَ فِي سَبِيلِ ٱللَّهِ وَلَا يَخَافُونَ لَوۡمَةَ لَآئِمٖۚ ذَٰلِكَ فَضۡلُ ٱللَّهِ يُؤۡتِيهِ مَن يَشَآءُۚ وَٱللَّهُ وَٰسِعٌ عَلِيمٌ ٥٤

**54**. ఓ విశ్వాసులారా! మీలో ఎవడైనా తన ధర్మం (ఇస్లాం) నుండి వైదొలగితే, అల్లాహ్ త్వరలోనే ఇతర ప్రజలను తేగలడు. ఆయన వారిని ప్రేమిస్తాడు[1] మరియు వారు ఆయనను ప్రేమిస్తారు. వారు విశ్వాసులపట్ల మృదువుగా, సత్య తిరస్కారుల పట్ల కఠినంగా ప్రవర్తించే వారునూ, అల్లాహ్ మార్గంలో ధర్మపోరాటం చేసేవారునూ మరియు నిందించే వారి నిందలకు భయపడని వారునూ అయి ఉంటారు. ఇది అల్లాహ్ అనుగ్రహం, ఆయన దానిని తాను కోరిన వారికి ప్రసాదిస్తాడు. మరియు అల్లాహ్ సర్వోపగతుడు (సర్వవ్యాప్తి), సర్వజ్ఞుడు.

إِنَّمَا وَلِيُّكُمُ ٱللَّهُ وَرَسُولُهُۥ وَٱلَّذِينَ ءَامَنُواْ ٱلَّذِينَ يُقِيمُونَ ٱلصَّلَوٰةَ وَيُؤۡتُونَ ٱلزَّكَوٰةَ وَهُمۡ رَٰكِعُونَ ٥٥

**55**. నిశ్చయంగా, మీ స్నేహితులు, అల్లాహ్! ఆయన ప్రవక్త మరియు విశ్వసించిన వారు: ఎవరైతే నమా'జ్ స్థాపిస్తారో, విధిదానం ('జకాత్) ఇస్తూ ఉంటారో మరియు వారు (అల్లాహ్ ముందు) వంగుతూ (రుకూ'ఉ చేస్తూ) ఉంటారో;

---

**1**. అల్లాహ్ (సు.తా.)కు ప్రియులైన వారి నాలుగు లక్షణాలు ఇక్కడ పేర్కొనబడ్డాయి. 1) వారు అల్లాహ్‌కు ప్రియులై, అల్లాహ్ (సు.తా.)ను ప్రేమించే వారూ, 2) విశ్వాసులపట్ల మృదువుగానూ మరియు అవిశ్వాసులపట్ల కఠినంగానూ ఉండే వారూ, 3) అల్లాహ్ (సు.తా.) మార్గంలో ధర్మపోరాటం (జిహాద్) చేసేవారూ మరియు 4) నిందించేవారి నిందలకు భయపడని వారునూ, అయి ఉంటారు.

**56**. మరియు ఎవరు, అల్లాహ్ ఆయన ప్రవక్త మరియు విశ్వసించిన వారి వైపునకు మరలుతారో! నిశ్చయంగా, వారే అల్లాహ్ పక్షానికి చెందినవారు, వారే విజయం సాధించేవారు.[1]

وَمَن يَتَوَلَّ ٱللَّهَ وَرَسُولَهُۥ وَٱلَّذِينَ ءَامَنُواْ فَإِنَّ حِزۡبَ ٱللَّهِ هُمُ ٱلۡغَٰلِبُونَ ٥٦

**57**. ఓ విశ్వాసులారా! మీ ధర్మాన్ని ఎగతాళిగా నవ్వులాటగా పరిగణించే వారు పూర్వగ్రంథ ప్రజలైనా, లేదా సత్య తిరస్కారులైనా, వారిని మీ స్నేహితులుగా చేసుకోకండి. మరియు మీరు విశ్వాసులే అయితే అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تَتَّخِذُواْ ٱلَّذِينَ ٱتَّخَذُواْ دِينَكُمۡ هُزُوٗا وَلَعِبٗا مِّنَ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡكِتَٰبَ مِن قَبۡلِكُمۡ وَٱلۡكُفَّارَ أَوۡلِيَآءَۚ وَٱتَّقُواْ ٱللَّهَ إِن كُنتُم مُّؤۡمِنِينَ ٥٧

**58**. మరియు మీరు నమా'జ్ కొరకు పిలుపు ('అజాన్) ఇస్తే, వారు దానిని ఎగతాళిగా నవ్వులాటగా తీసుకుంటారు. అది ఎందుకంటే వాస్తవానికి వారు బుద్ధిహీనులైన జనులు![2]

وَإِذَا نَادَيۡتُمۡ إِلَى ٱلصَّلَوٰةِ ٱتَّخَذُوهَا هُزُوٗا وَلَعِبٗاۚ ذَٰلِكَ بِأَنَّهُمۡ قَوۡمٞ لَّا يَعۡقِلُونَ ٥٨

**59**. వారితో ఇలా అను: "ఓ గ్రంథ ప్రజలారా![3] ఏమీ? మేము అల్లాహ్‌ను మరియు ఆయన మాపై అవతరింపజేసిన మరియు మాకు పూర్వం అవతరింపజేసిన (గ్రంథాలను) విశ్వసించామనే, మీరు మమ్మల్ని పీడిస్తున్నారా? మరియు నిశ్చయంగా, మీలో చాలామంది అవిధేయులు (దుష్టులు) ఉన్నారు!"

قُلۡ يَٰٓأَهۡلَ ٱلۡكِتَٰبِ هَلۡ تَنقِمُونَ مِنَّآ إِلَّآ أَنۡ ءَامَنَّا بِٱللَّهِ وَمَآ أُنزِلَ إِلَيۡنَا وَمَآ أُنزِلَ مِن قَبۡلُ وَأَنَّ أَكۡثَرَكُمۡ فَٰسِقُونَ ٥٩

**60**. ఇలా అను: "ఏమీ? అల్లాహ్ తరఫు నుండి ఎవరికి, దీని కంటే, హీనమైన ప్రతిఫలం దొరుకుతుందో మీకు తెలుపనా?

قُلۡ هَلۡ أُنَبِّئُكُم بِشَرّٖ مِّن ذَٰلِكَ مَثُوبَةً عِندَ ٱللَّهِۚ مَن لَّعَنَهُ ٱللَّهُ

---

**1**. చూడండి, 58:22, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-1, 'హదీస్' నం.15, 25.
**2**. చూడండి, 62:9 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-1, 'హదీస్' నం. 577.
**3**. గ్రంథప్రజలు అంటే యూదులు మరియు క్రైస్తవులు.

వారే, ఎవరినైతే అల్లాహ్ శపించాడో (బహిష్కరించాడో) మరియు ఎవరైతే ఆయన ఆగ్రహానికి గురిఅయ్యారో! మరియు వారిలో కొందరు, ఎవరినైతే ఆయన కోతులుగా మరియు పందులుగా మార్చాడో![1] మరియు వారు ఎవరైతే కల్పితదైవాల ('తా'గూత్‌ల) దాస్యం చేస్తారో.[2] అలాంటి వారు (పునరుత్థాన దినమున) ఎంతో హీనస్థితిలో ఉంటారు మరియు వారు ఋజుమార్గం నుండి చాలా దూరం వెళ్ళి పోయిన వారే!"

وَغَضِبَ عَلَيْهِ وَجَعَلَ مِنْهُمُ ٱلْقِرَدَةَ وَٱلْخَنَازِيرَ وَعَبَدَ ٱلطَّٰغُوتَ ۚ أُوْلَٰٓئِكَ شَرٌّ مَّكَانًا وَأَضَلُّ عَن سَوَآءِ ٱلسَّبِيلِ ﴿٦٠﴾

**61**. మరియు వారు (కపట విశ్వాసులు) నీ వద్దకు వచ్చినపుడు: "మేము విశ్వసించాము." అని అంటారు. కాని వాస్తవానికి వారు సత్యతిరస్కారంతోనే వస్తారు మరియు దాని (సత్యతిరస్కారం) తోనే తిరిగిపోతారు కూడాను. మరియు వారు ఏమి దాస్తున్నారో అల్లాహ్‌కు బాగా తెలుసు.

وَإِذَا جَآءُوكُمْ قَالُوٓاْ ءَامَنَّا وَقَد دَّخَلُواْ بِٱلْكُفْرِ وَهُمْ قَدْ خَرَجُواْ بِهِۦ ۚ وَٱللَّهُ أَعْلَمُ بِمَا كَانُواْ يَكْتُمُونَ ﴿٦١﴾

**62**. మరియు వారిలో అనేకులను పాపం మరియు దౌర్జన్యం చేయటానికి మరియు నిషిద్ధమైనవి తినటానికి చురుకుగా పాల్గొనటాన్ని నీవు చూస్తావు. వారు చేస్తున్న పనులు ఎంత నీచమైనవి!

وَتَرَىٰ كَثِيرًا مِّنْهُمْ يُسَٰرِعُونَ فِى ٱلْإِثْمِ وَٱلْعُدْوَٰنِ وَأَكْلِهِمُ ٱلسُّحْتَ ۚ لَبِئْسَ مَا كَانُواْ يَعْمَلُونَ ﴿٦٢﴾

**63**. వారి ధర్మవేత్తలు (రబ్బానియ్యూన్) మరియు మతాచారులు (అహబార్‌లు) వారిని, పాపపు మాటలు పలకటం నుండి మరియు నిషిద్ధమైన వాటిని తినటం నుండి ఎందుకు వారించరు? వారు చేసే కార్యాలు ఎంత నీచమైనవి!

لَوْلَا يَنْهَىٰهُمُ ٱلرَّبَّٰنِيُّونَ وَٱلْأَحْبَارُ عَن قَوْلِهِمُ ٱلْإِثْمَ وَأَكْلِهِمُ ٱلسُّحْتَ ۚ لَبِئْسَ مَا كَانُواْ يَصْنَعُونَ ﴿٦٣﴾

**1**. చూడండి, 2:65, 7:166.
**2**. చూడండి, 2:256.

64. మరియు యూదులు: "అల్లాహ్ చేతులకు సంకెళ్ళు పడిఉన్నాయి." అని అంటారు.[1] వారి చేతులకే సంకెళ్ళు వేయబడు గాక! మరియు వారు పలికిన దానికి వారు శపించబడుదురు గాక! వాస్తవానికి ఆయన (అల్లాహ్) రెండు చేతులు విస్తరింపబడి ఉన్నాయి; ఆయన (తన అనుగ్రహాలను) తాను కోరినట్లు ఖర్చుచేస్తాడు. మరియు (ఓ ప్రవక్తా!) నీ ప్రభువు తరఫునుండి నీపై అవతరింపజేయబడిన (ఈ గ్రంథం) నిశ్చయంగా, వారిలో చాలామందికి తలబిరుసుతనం మరియు సత్య తిరస్కారాన్ని మాత్రమే పెంచుతున్నది. మరియు మేము వారిమధ్య విరోధాన్ని మరియు ద్వేషాన్ని, తీర్పుదినం వరకు ఉండేటట్లు చేశాము. వారు యుద్ధ జ్వాలలను ప్రజ్వలింప జేసినపుడల్లా, అల్లాహ్ దానిని చల్లార్చాడు. మరియు వారు భూమిలో కల్లోలం రేకెత్తించటానికి పాటుపడుతున్నారు. మరియు అల్లాహ్ కల్లోలం రేకెత్తించేవారిని ప్రేమించడు.

وَقَالَتِ ٱلۡيَهُودُ يَدُ ٱللَّهِ مَغۡلُولَةٌۚ غُلَّتۡ أَيۡدِيهِمۡ وَلُعِنُواْ بِمَا قَالُواْۘ بَلۡ يَدَاهُ مَبۡسُوطَتَانِ يُنفِقُ كَيۡفَ يَشَآءُۚ وَلَيَزِيدَنَّ كَثِيرٗا مِّنۡهُم مَّآ أُنزِلَ إِلَيۡكَ مِن رَّبِّكَ طُغۡيَٰنٗا وَكُفۡرٗاۚ وَأَلۡقَيۡنَا بَيۡنَهُمُ ٱلۡعَدَٰوَةَ وَٱلۡبَغۡضَآءَ إِلَىٰ يَوۡمِ ٱلۡقِيَٰمَةِۚ كُلَّمَآ أَوۡقَدُواْ نَارٗا لِّلۡحَرۡبِ أَطۡفَأَهَا ٱللَّهُۚ وَيَسۡعَوۡنَ فِي ٱلۡأَرۡضِ فَسَادٗاۚ وَٱللَّهُ لَا يُحِبُّ ٱلۡمُفۡسِدِينَ ٦٤

65. మరియు వాస్తవానికి గ్రంథప్రజలు విశ్వసించి, దైవభీతి కలిగివుంటే! నిశ్చయంగా, మేము వారి పాపాలను తొలగించి, వారిని శ్రేష్ఠమైన స్వర్గవనాలలో ప్రవేశింపజేసి ఉండేవారము.

وَلَوۡ أَنَّ أَهۡلَ ٱلۡكِتَٰبِ ءَامَنُواْ وَٱتَّقَوۡاْ لَكَفَّرۡنَا عَنۡهُمۡ سَيِّـَٔاتِهِمۡ وَلَأَدۡخَلۡنَٰهُمۡ جَنَّٰتِ ٱلنَّعِيمِ ٦٥

66. మరియు వాస్తవానికి వారు తౌరాతును, ఇంజీలును మరియు వారి ప్రభువు తరఫునుండి వారిపై (ఇప్పుడు)

وَلَوۡ أَنَّهُمۡ أَقَامُواْ ٱلتَّوۡرَىٰةَ وَٱلۡإِنجِيلَ وَمَآ أُنزِلَ إِلَيۡهِم مِّن رَّبِّهِمۡ

1. చూడండి, 3:181 మరియు 14:34.

لَأَكَلُواْ مِن فَوۡقِهِمۡ وَمِن
تَحۡتِ أَرۡجُلِهِمۚ مِّنۡهُمۡ أُمَّةٞ
مُّقۡتَصِدَةٞۖ وَكَثِيرٞ مِّنۡهُمۡ سَآءَ مَا
يَعۡمَلُونَ ٦٦

۞ يَٰٓأَيُّهَا ٱلرَّسُولُ بَلِّغۡ مَآ أُنزِلَ
إِلَيۡكَ مِن رَّبِّكَۖ وَإِن لَّمۡ تَفۡعَلۡ
فَمَا بَلَّغۡتَ رِسَالَتَهُۥۚ وَٱللَّهُ
يَعۡصِمُكَ مِنَ ٱلنَّاسِۗ إِنَّ ٱللَّهَ لَا
يَهۡدِي ٱلۡقَوۡمَ ٱلۡكَٰفِرِينَ ٦٧

قُلۡ يَٰٓأَهۡلَ ٱلۡكِتَٰبِ لَسۡتُمۡ عَلَىٰ
شَيۡءٍ حَتَّىٰ تُقِيمُواْ ٱلتَّوۡرَىٰةَ
وَٱلۡإِنجِيلَ وَمَآ أُنزِلَ إِلَيۡكُم مِّن
رَّبِّكُمۡۗ وَلَيَزِيدَنَّ كَثِيرٗا مِّنۡهُم مَّآ

అవతరింపజేయబడిన దానిని (ఈ ఖుర్ఆన్‌ను) ఆచరించి ఉండినట్లైతే, వారి కొరకు వారిపై (ఆకాశం) నుండి మరియు కాళ్ళ క్రింది (భూమి) నుండి జీవనోపాధి పొందేవారు.[1] వారిలో కొందరు సరైన మార్గాన్ని అవలంబించేవారున్నారు.[2] కాని వారిలో అనేకులు చేసేవి చెడు (పాప) కార్యాలే. (7/8)

**67.** * ఓ ప్రవక్తా! నీవు నీ ప్రభువు తరఫునుండి నీపై అవతరింపజేయబడిన దానిని తెలియజేయి.[3] మరియు నీవట్లు చేయకపోతే, ఆయన సందేశాన్ని పూర్తిగా తెలియజేయని వాడవవుతావు. మరియు అల్లాహ్ మానవుల నుండి నిన్ను కాపాడుతాడు. నిశ్చయంగా, అల్లాహ్ సత్య తిరస్కారులైన ప్రజలకు మార్గదర్శకత్వం చేయడు.

**68.** ఇలా అను: "ఓ గ్రంథప్రజలారా! మీరు తౌరాతును, ఇంజీలును మరియు మీ ప్రభువు తరఫునుండి మీ పై అవతరింప జేయబడిన దానిని (ఈ ఖుర్ఆన్‌ను) ఆచరించనంత వరకు మీరు అసలు దేని (ఏ సత్యమార్గం) మీద కూడా ఉండనట్లే!" మరియు నీ ప్రభువు తరఫునుండి నీపై అవతరింపజేయబడిన (ఈ గ్రంథం)

---

**1.** చూడండి, 7:96.

**2.** 'అబ్దుల్లాహ్ బిన్-సల్లాం మరికొందరు 8-9 మంది మదీనాలోని యూదులు మాత్రమే విశ్వసించారు.

**3.** 'ఆయి'షహ్ (ర. 'అన్హా) కథనం: "ఏ వ్యక్తి అయినా ము'హమ్మద్ ('స'అస) వ'హీ నుండి ఏమైనా దాచారు." అని సందేహపడితే ఆ వ్యక్తి నిశ్చయంగా, అసత్యం పలికాడు. ('స'హీ'హ్ బు'ఖారీ, 'హ. నం. 4855).

أُنزِلَ إِلَيۡكَ مِن رَّبِّكَ طُغۡيَٰنٗا وَكُفۡرٗاۖ فَلَا تَأۡسَ عَلَى ٱلۡقَوۡمِ ٱلۡكَٰفِرِينَ ٦٨

వాస్తవానికి వారిలోని అనేకుల తలబిరుసు తనాన్ని మరియు సత్యతిరస్కారాన్ని మాత్రమే పెంచుతుంది.[1] కావున నీవు సత్యతిరస్కార ప్రజలను గురించి విచారించకు.

إِنَّ ٱلَّذِينَ ءَامَنُواْ وَٱلَّذِينَ هَادُواْ وَٱلصَّٰبِـُٔونَ وَٱلنَّصَٰرَىٰ مَنۡ ءَامَنَ بِٱللَّهِ وَٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِ وَعَمِلَ صَٰلِحٗا فَلَا خَوۡفٌ عَلَيۡهِمۡ وَلَا هُمۡ يَحۡزَنُونَ ٦٩

**69**. నిశ్చయంగా, ఈ (గ్రంథాన్ని) విశ్వసించిన వారు (ముస్లింలు) మరియు యూదులు మరియు 'సాబియూ'లు మరియు క్రైస్తవులు, ఎవరైనా సరే! అల్లాహ్‌ను మరియు అంతిమదినాన్ని విశ్వసించి, సత్కార్యాలు చేస్తే వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా![2]

لَقَدۡ أَخَذۡنَا مِيثَٰقَ بَنِيٓ إِسۡرَٰٓءِيلَ وَأَرۡسَلۡنَآ إِلَيۡهِمۡ رُسُلٗاۖ كُلَّمَا جَآءَهُمۡ رَسُولُۢ بِمَا لَا تَهۡوَىٰٓ أَنفُسُهُمۡ فَرِيقٗا كَذَّبُواْ وَفَرِيقٗا يَقۡتُلُونَ ٧٠

**70**. వాస్తవానికి మేము ఇస్రాయీ'ల్ సంతతి వారినుండి ఒక గట్టి ప్రమాణాన్ని తీసుకున్నాము మరియు వారి వద్దకు ప్రవక్తలను పంపాము. కాని ఏ ప్రవక్త అయినా వారి మనోవాంఛలకు వ్యతిరేకమైన దానిని తెచ్చినపుడల్లా, వారు కొందరిని అసత్యవాదులని తిరస్కరించారు, మరి కొందరిని హత్యచేశారు.

وَحَسِبُوٓاْ أَلَّا تَكُونَ فِتۡنَةٞ فَعَمُواْ وَصَمُّواْ ثُمَّ تَابَ ٱللَّهُ عَلَيۡهِمۡ ثُمَّ عَمُواْ وَصَمُّواْ كَثِيرٞ مِّنۡهُمۡۚ وَٱللَّهُ بَصِيرُۢ بِمَا يَعۡمَلُونَ ٧١

**71**. మరియు తమకెలాంటి శిక్ష (ఫిత్నా) పడదని తలచి, వారు గ్రుడ్డి వారుగా, చెవిటి వారుగా అయిపోయారు. ఆ పిదప అల్లాహ్ వారి పశ్చాత్తాపాన్ని అంగీకరించాడు. ఆ తరువాత కూడ వారిలో అనేకులు తిరిగి గ్రుడ్డివారుగా, చెవిటివారుగా అయిపోయారు. మరియు వారు చేసేదంతా అల్లాహ్ చూస్తున్నాడు.

---

**1**. చూడండి, 41:44 మరియు 17:82.
**2**. చూడండి, 2:62 మరియు 3:85.

**72.** "నిశ్చయంగా, మర్యమ్ కుమారుడు మసీ'హ్(క్రీస్తు)యే అల్లాహ్!" అని పలికేవారు వాస్తవంగా సత్య తిరస్కారులు! మరియు మసీ'హ్ (క్రీస్తు) ఇలా అన్నాడు: "ఓ ఇస్రాయీ'ల్ సంతతి వారలారా! నా ప్రభువు మరియు మీ ప్రభువైన అల్లాహ్‌నే ఆరాధించండి."[1] వాస్తవానికి, ఇతరులను అల్లాహ్‌కు భాగ స్వాములుగా చేసే వారికి, నిశ్చయంగా, అల్లాహ్ స్వర్గాన్ని నిషేధించాడు. మరియు వారి ఆశ్రయం నరకాగ్నియే! మరియు దుర్మార్గులకు సహాయం చేసేవారు ఎవ్వరూ ఉండరు.

**73.** "నిశ్చయంగా, అల్లాహ్ ముగ్గురిలో మూడవ వాడు!" అని అనేవారు వాస్తవానికి సత్యతిరస్కారులే.[2] మరియు ఒకే ఒక్క ఆరాధ్య దేవుడు (అల్లాహ్) తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు. మరియు వారు తమ ఈ మాటలను మాను కోకపోతే, వారిలో సత్య తిరస్కారులైన వారికి బాధాకరమైన శిక్ష పడుతుంది.

**74.** వారెందుకు అల్లాహ్ వైపునకు పశ్చాత్తాపంతో మరలి ఆయనను క్షమాభిక్ష కొరకు వేడుకోరు? మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

**75.** మర్యమ్ కుమారుడు మసీ'హ్ (క్రీస్తు) కేవలం ఒక ప్రవక్త మాత్రమే. అతనికి పూర్వం కూడా అనేక ప్రవక్తలు గతించారు. మరియు

لَقَدۡ كَفَرَ ٱلَّذِينَ قَالُوٓاْ إِنَّ ٱللَّهَ
هُوَ ٱلۡمَسِيحُ ٱبۡنُ مَرۡيَمَۖ وَقَالَ ٱلۡمَسِيحُ
يَٰبَنِيٓ إِسۡرَٰٓءِيلَ ٱعۡبُدُواْ ٱللَّهَ رَبِّي
وَرَبَّكُمۡۖ إِنَّهُۥ مَن يُشۡرِكۡ بِٱللَّهِ فَقَدۡ
حَرَّمَ ٱللَّهُ عَلَيۡهِ ٱلۡجَنَّةَ وَمَأۡوَىٰهُ ٱلنَّارُۖ
وَمَا لِلظَّٰلِمِينَ مِنۡ أَنصَارٖ ٧٢

لَّقَدۡ كَفَرَ ٱلَّذِينَ قَالُوٓاْ إِنَّ
ٱللَّهَ ثَالِثُ ثَلَٰثَةٖۘ وَمَا مِنۡ إِلَٰهٍ إِلَّآ
إِلَٰهٞ وَٰحِدٞۚ وَإِن لَّمۡ يَنتَهُواْ عَمَّا
يَقُولُونَ لَيَمَسَّنَّ ٱلَّذِينَ كَفَرُواْ
مِنۡهُمۡ عَذَابٌ أَلِيمٌ ٧٣
أَفَلَا يَتُوبُونَ إِلَى ٱللَّهِ
وَيَسۡتَغۡفِرُونَهُۥۚ وَٱللَّهُ غَفُورٞ
رَّحِيمٞ ٧٤
مَّا ٱلۡمَسِيحُ ٱبۡنُ مَرۡيَمَ إِلَّا
رَسُولٞ قَدۡ خَلَتۡ مِن قَبۡلِهِ ٱلرُّسُلُ

---

**1.** ఇట్టి ఆజ్ఞలకు చూడండి, బైబిల్, మత్తయి-(Mathew), 4:10; లూకా-(Luke), 4:8. ఇంకా ఖుర్ఆన్‌లో చూడండి,19:30, 36 మరియు 3:51.

**2.** ఇది క్రైస్తవులలో ఒక తెగ వారి ప్రస్తావన. వారు అల్లాహ్ (సు.తా.), జిబ్రీల్ మరియు ఈసా('అలైహిమ్ స.) ముగ్గురు, దైవాలున్నారు అంటారు. చూ. 5:116 మరియు 5:75.

وَأُمُّهُۥ صِدِّيقَةٌۖ كَانَا يَأۡكُلَانِ ٱلطَّعَامَۗ ٱنظُرۡ كَيۡفَ نُبَيِّنُ لَهُمُ ٱلۡأٓيَٰتِ ثُمَّ ٱنظُرۡ أَنَّىٰ يُؤۡفَكُونَ ٧٥

అతని తల్లి సత్యవతి ('సిద్దీఖహ్). వారిద్దరూ ఆహారం తినేవారు.[1] చూడండి! మేము వారికి ఈ సూచనలను ఏ విధంగా స్పష్టపరిచామో! అయినా చూడండి![2] ఏ విధంగా వారు మోసగింప (సత్యం నుండిమరలింప) బడుతున్నారో!

قُلۡ أَتَعۡبُدُونَ مِن دُونِ ٱللَّهِ مَا لَا يَمۡلِكُ لَكُمۡ ضَرّٗا وَلَا نَفۡعٗاۚ وَٱللَّهُ هُوَ ٱلسَّمِيعُ ٱلۡعَلِيمُ ٧٦

**76**. ఇలా అను: "ఏమీ? మీరు అల్లాహ్‌ను వదిలి, మీకు నష్టం గానీ, లాభం గానీ చేసే అధికారంలేని దానిని ఆరాధిస్తారా? మరియు కేవలం అల్లాహ్ మాత్రమే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు."

قُلۡ يَٰٓأَهۡلَ ٱلۡكِتَٰبِ لَا تَغۡلُواْ فِي دِينِكُمۡ غَيۡرَ ٱلۡحَقِّ وَلَا تَتَّبِعُوٓاْ أَهۡوَآءَ قَوۡمٖ قَدۡ ضَلُّواْ مِن قَبۡلُ وَأَضَلُّواْ كَثِيرٗا وَضَلُّواْ عَن سَوَآءِ ٱلسَّبِيلِ ٧٧

**77**. (ఇంకా) ఇలా అను: "ఓ గ్రంథ ప్రజలారా! మీ ధర్మం విషయంలో మీరు అధర్మంగా హద్దులుమీరి ప్రవర్తించకండి.[3] మరియు ఇంతకు పూర్వం మార్గభ్రష్టులైన వారి కోరికలను అనుసరించకండి. వారు అనేక ఇతరులను కూడా మార్గభ్రష్టులుగా చేశారు మరియు వారు కూడ ఋజుమార్గం నుండి తప్పిపోయారు."

لُعِنَ ٱلَّذِينَ كَفَرُواْ مِنۢ بَنِيٓ إِسۡرَٰٓءِيلَ عَلَىٰ لِسَانِ دَاوُۥدَ وَعِيسَى ٱبۡنِ مَرۡيَمَۚ ذَٰلِكَ بِمَا عَصَواْ وَّكَانُواْ يَعۡتَدُونَ ٧٨

**78**. ఇస్రాయీ'ల్ సంతతి వారిలో అవిశ్వాస మార్గం అవలంబించిన వారు, దావూద్ మరియు మర్యమ్ కుమారుడు 'ఈసా (ఏసు) నాలుకతో (నోటితో) శపించబడ్డారు.[4] ఇది వారు అవిధేయులై, హద్దులుమీరి ప్రవర్తించిన దాని ఫలితం.

---

**1**. మర్యమ్ తాను అల్లాహ్‌తల్లినని ఎన్నడూ అనలేదు. 'ఈసా ('అ.స.) కేవలం ఒక ప్రవక్త మాత్రమే. అల్లాహుతా'ఆలా కుమారుడు గానీ, అల్లాహ్ గానీ కారు. చూడండి, 5:73.

**2**. మేము పంపిన ప్రవక్తలందరూ పురుషులే. 12:109.

**3**. చూడండి, 4:171, ఈ ఆయత్ క్రైస్తవులను సంభోదిస్తున్నది.

**4**. వారు శపించబడిన వాక్యాలకు చూడండి, బైబిల్, కీర్తనలు-(Psalms), 78:21-22, 31-33. మత్తయి-(Mathew), 12:34, 23:33-35.

كَانُواْ لَا يَتَنَاهَوْنَ عَن مُّنكَرٍ فَعَلُوهُۚ لَبِئۡسَ مَا كَانُواْ يَفۡعَلُونَ ٧٩

**79**. వారు, తాము చేసే, అసభ్యకరమైన కార్యాల నుండి ఒకరి నొకరు నిరోధించుకోలేదు. వారు చేసే పనులన్నీ ఎంతో నీచమైనవి.

تَرَىٰ كَثِيرًا مِّنۡهُمۡ يَتَوَلَّوۡنَ ٱلَّذِينَ كَفَرُواْۚ لَبِئۡسَ مَا قَدَّمَتۡ لَهُمۡ أَنفُسُهُمۡ أَن سَخِطَ ٱللَّهُ عَلَيۡهِمۡ وَفِي ٱلۡعَذَابِ هُمۡ خَٰلِدُونَ ٨٠

**80**. వారిలో అనేకులు సత్య తిరస్కారులతో మైత్రి చేసుకోవటాన్ని, నీవు చూస్తున్నావు. వారు తమకొరకు ముందుగా చేసి పంపుకున్న నీచకర్మల వలన అల్లాహ్‌కు వారిపై కోపం కలిగింది మరియు వారు నరకబాధలో శాశ్వతంగా ఉంటారు.

وَلَوۡ كَانُواْ يُؤۡمِنُونَ بِٱللَّهِ وَٱلنَّبِيِّ وَمَآ أُنزِلَ إِلَيۡهِ مَا ٱتَّخَذُوهُمۡ أَوۡلِيَآءَ وَلَٰكِنَّ كَثِيرًا مِّنۡهُمۡ فَٰسِقُونَ ٨١

**81**. ఒకవేళ వారు అల్లాహ్‌నూ, ప్రవక్తనూ మరియు అతనిపై అవతరింపజేయబడిన దానిని (నిజంగానే) విశ్వసించి ఉంటే! వారిని (సత్యతిరస్కారులను) తమ మిత్రులుగా చేసుకొని ఉండేవారు కాదు, కాని వారిలో అనేకులు అవిధేయులున్నారు.

۞ لَتَجِدَنَّ أَشَدَّ ٱلنَّاسِ عَدَٰوَةً لِّلَّذِينَ ءَامَنُواْ ٱلْيَهُودَ وَٱلَّذِينَ أَشْرَكُواْۖ وَلَتَجِدَنَّ أَقْرَبَهُم مَّوَدَّةً لِّلَّذِينَ ءَامَنُواْ ٱلَّذِينَ قَالُوٓاْ إِنَّا نَصَٰرَىٰۚ ذَٰلِكَ بِأَنَّ مِنْهُمْ قِسِّيسِينَ وَرُهْبَانًا وَأَنَّهُمْ لَا يَسْتَكْبِرُونَ ﴿٨٢﴾

82. (*) నిశ్చయంగా విశ్వాసు (ముస్లిం)ల పట్ల విరోధ విషయంలో నీవు యూదులను మరియు బహుదైవారాధ (ముష్రి)కులను, అందరికంటే కఠినులుగా కనుగొంటావు. మరియు విశ్వాసుల పట్ల మైత్రి విషయంలో: "నిశ్చయంగా, మేము క్రైస్తవులము." అని అన్న వారిని అత్యంత సన్నిహితులుగా పొందుతావు. ఇది ఎందుకంటే వారిలో మతగురువులు / విద్వాంసులు (ఖిస్సీసీన్) మరియు మునులు (రుహ్బాన్) ఉన్నారు మరియు నిశ్చయంగా, వారు గర్వించరు.

وَإِذَا سَمِعُواْ مَآ أُنزِلَ إِلَى ٱلرَّسُولِ تَرَىٰٓ أَعْيُنَهُمْ تَفِيضُ مِنَ ٱلدَّمْعِ مِمَّا عَرَفُواْ مِنَ ٱلْحَقِّۖ يَقُولُونَ رَبَّنَآ ءَامَنَّا فَٱكْتُبْنَا مَعَ ٱلشَّٰهِدِينَ ﴿٨٣﴾

83. మరియు వారు (కొందరు క్రైస్తవులు) ప్రవక్తపై అవతరింప జేయబడిన దానిని (ఈ గ్రంథాన్ని) విన్నప్పుడు సత్యాన్ని తెలుసుకున్నందుకు, వారి కళ్ళనుండి కన్నీళ్ళు కారటం నీవు చూస్తావు.[1] వారు ఇలా అంటారు: "ఓ మా ప్రభూ! మేము విశ్వసించాము. కావున మమ్మల్ని సాక్ష్యం ఇచ్చేవారిలో వ్రాసుకో!

وَمَا لَنَا لَا نُؤْمِنُ بِٱللَّهِ وَمَا جَآءَنَا مِنَ ٱلْحَقِّ وَنَطْمَعُ أَن يُدْخِلَنَا رَبُّنَا مَعَ ٱلْقَوْمِ ٱلصَّٰلِحِينَ ﴿٨٤﴾

84. "మరియు మేము అల్లాహ్‌ను మరియు మా వద్దకు వచ్చిన సత్యాన్ని విశ్వసించకుండా ఉండటానికి మాకేమయింది? మా ప్రభువు మమ్మల్ని సద్వర్తనులతో చేర్చాలని మేము కోరుకుంటున్నాము."

---

1. చూడండి, 3:199. ఇథియోపియా ('హబష) రాజు - జాఫర్ (ర'ది.'అ.) నుండి - సూరహ్ మర్యమ్ (19), విని కన్నీళ్ళుకార్చాడు. అతడు (ర'ది.'అ.) ఇస్లాం స్వీకరించాడు. దానికి ఈ 'హదీస్' సాక్ష్యం: 'హబష రాజు మరణించినపుడు దైవప్రవక్త ('స'అస) సహాబాలో తమ అనుచరులతో సహా 'గాయబానా నమా'జే-జనా'జా చేశారు. ('స. బు'ఖారీ, 'స. ముస్లిం).

**85**. కావున వారు పలికిన దానికి ఫలితంగా, అల్లాహ్ వారికి క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలను ప్రసాదించాడు. వారందులో శాశ్వతంగా ఉంటారు. మరియు సజ్జనులకు లభించే ప్రతిఫలం ఇదే!

**86**. మరియు ఎవరైతే సత్య తిరస్కారులై మా సూచన(ఆయాత్)లను అబద్ధాలన్నారో, అలాంటి వారు భగభగ మండే నరకాగ్ని వాసులవుతారు.

**87**. ఓ విశ్వాసులారా! అల్లాహ్ మీకు ధర్మసమ్మతం చేసిన పరిశుద్ధ వస్తువులను నిషిద్ధం చేసుకోకండి మరియు హద్దులు మీరకండి. నిశ్చయంగా అల్లాహ్ హద్దులు మీరిపోయే వారిని ప్రేమించడు.[1]

**88**. మరియు అల్లాహ్ మీకు జీవనోపాధిగా ప్రసాదించిన వాటిలో ధర్మసమ్మతమైన, పరిశుద్ధమైన పదార్థాలను తినండి. మీరు విశ్వసించిన అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి.

**89**. మీరు ఉద్దేశం లేకుండానే చేసిన ప్రమాణాలను గురించి అల్లాహ్ మిమ్మల్ని పట్టుకోడు. కాని మీరు బుద్ధిపూర్వకంగా చేసే ప్రమాణాలను గురించి ఆయన మిమ్మల్ని (తప్పకుండా) పట్టుకుంటాడు.

فَأَثَٰبَهُمُ ٱللَّهُ بِمَا قَالُوا۟ جَنَّٰتٍ تَجْرِى
مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَا ۚ
وَذَٰلِكَ جَزَآءُ ٱلْمُحْسِنِينَ ﴿٨٥﴾

وَٱلَّذِينَ كَفَرُوا۟ وَكَذَّبُوا۟ بِـَٔايَٰتِنَآ
أُو۟لَٰٓئِكَ أَصْحَٰبُ ٱلْجَحِيمِ ﴿٨٦﴾
يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تُحَرِّمُوا۟
طَيِّبَٰتِ مَآ أَحَلَّ ٱللَّهُ لَكُمْ وَلَا
تَعْتَدُوٓا۟ ۚ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ
ٱلْمُعْتَدِينَ ﴿٨٧﴾

وَكُلُوا۟ مِمَّا رَزَقَكُمُ ٱللَّهُ حَلَٰلًا
طَيِّبًا ۚ وَٱتَّقُوا۟ ٱللَّهَ ٱلَّذِىٓ أَنتُم بِهِۦ
مُؤْمِنُونَ ﴿٨٨﴾

لَا يُؤَاخِذُكُمُ ٱللَّهُ بِٱللَّغْوِ فِىٓ أَيْمَٰنِكُمْ
وَلَٰكِن يُؤَاخِذُكُم بِمَا عَقَّدتُّمُ
ٱلْأَيْمَٰنَ ۖ فَكَفَّٰرَتُهُۥٓ إِطْعَامُ عَشَرَةِ

1. ఒక 'స'హాబీ దైవప్రవక్త ('స'అస) దగ్గరికి హాజరై అన్నాడు: "ఓ దైవప్రవక్తా! నేను మాంసం తినటం వలన నా కామవాంఛలు పెరుగుతున్నాయి. కావున నేను మాంసాహారాన్ని నాపై నిషేధించుకున్నాను." అట్టి సందర్భంలో ఈ ఆయత్ అవతరింపజేయబడింది. (తిర్మిజీ').

مَسَٰكِينَ مِنْ أَوْسَطِ مَا تُطْعِمُونَ أَهْلِيكُمْ أَوْ كِسْوَتُهُمْ أَوْ تَحْرِيرُ رَقَبَةٍ ۖ فَمَن لَّمْ يَجِدْ فَصِيَامُ ثَلَٰثَةِ أَيَّامٍ ۚ ذَٰلِكَ كَفَّٰرَةُ أَيْمَٰنِكُمْ إِذَا حَلَفْتُمْ ۚ وَٱحْفَظُوٓا۟ أَيْمَٰنَكُمْ ۚ كَذَٰلِكَ يُبَيِّنُ ٱللَّهُ لَكُمْ ءَايَٰتِهِۦ لَعَلَّكُمْ تَشْكُرُونَ ﴿٨٩﴾

కావున దానికి (ఇలాంటి ప్రమాణ భంగానికి) పరిహారంగా మీరు మీ ఇంటి వారికి పెట్టే, మధ్య రకమైన ఆహారం పదిమంది పేదలకు పెట్టాలి. లేదా వారికి వస్త్రాలు ఇవ్వాలి. లేదా ఒక బానిసకు స్వాతంత్ర్యం ఇప్పించాలి. ఎవడికి ఈ శక్తి లేదో! అతడు మూడు దినాలు ఉపవాసం ఉండాలి. మీరు ప్రమాణం చేసి భంగపరిస్తే, ఇది దానికి పరిహారం (కఫ్ఫారా).[1] మీ ప్రమాణాలను కాపాడుకోండి. మీరు కృతజ్ఞులై ఉండటానికి అల్లాహ్ తన ఆజ్ఞలను ఈ విధంగా మీకు విశదపరుస్తున్నాడు.[2]

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِنَّمَا ٱلْخَمْرُ وَٱلْمَيْسِرُ وَٱلْأَنصَابُ وَٱلْأَزْلَٰمُ رِجْسٌ مِّنْ عَمَلِ ٱلشَّيْطَٰنِ فَٱجْتَنِبُوهُ لَعَلَّكُمْ تُفْلِحُونَ ﴿٩٠﴾

**90.** ఓ విశ్వాసులారా! నిశ్చయంగా మద్యపానం,[3] జూదం, బలిపీఠం మీద బలి ఇవ్వటం (అ'న్సాబ్[4]) మరియు శకునానికై బాణాల ప్రయోగం (అ'జ్లామ్) ఇవన్నీ కేవలం అసహ్యకరమైన షై'తాన్ చేష్టలు, కావున మీరు సాఫల్యం పొందాలంటే వీటిని త్యజించండి.

---

**1.** ప్రమాణం: ఇది 'అరబ్బీలో 'హలఫ్ లేక అయ్‌మాన్ అనబడుతుంది. ఇవి మూడు రకాలు: 1) **ల'గ్వున్:** ఇది మానవుడు మాటి మాటికి ఆలోచించకుండా చేసే ప్రమాణం. దీనికెట్టి పరిహారం (కఫ్ఫారా) లేదు. 2) **'గమూసున్:** మానవుడు ఇతరులను మోసపుచ్చ టానికి చేసే బూటక ప్రమాణం. ఇది మహాపాపం. దీనికెట్టి పరిహారం (కఫ్ఫారా) ఉపయోగకరం కాదు. 3) **ము'అఖ్ఖదతున్:** మానవుడు సహృదయంతో పూర్తి నిశ్చయంతో చేసే ప్రమాణం. దీనిని భంగపరిస్తే పరిహారం (కఫ్ఫారా) ఇవ్వాలి. అది ఈ ఆయత్‌లో పేర్కొనబడింది.

**2.** చూడండి, 2:224-225; 38:44.

**3.** మద్యపానం (సారాయి మొదలైన మత్తు పదార్థాలను తినటం, త్రాగటం, పీల్చుకోవటం) గురించి ఇది మూడవ ఆజ్ఞ. ఇక్కడ వీటిని గురించి నిషేధం వచ్చింది. ఇంతకు ముందు 2:219, 4:43లలో వీటిని గురించి ఆజ్ఞలు వచ్చాయి.

**4.** చూడండి, 5:3 వ్యాఖ్యానం 1.

**91**. నిశ్చయంగా, షైతాన్ మద్య పానం మరియు జూదం ద్వారా మీ మధ్య విరోధాలు మరియు విద్వేషాలు రేకెత్తించాలని మరియు మిమ్మల్ని అల్లాహ్ ధ్యానం నుండి మరియు నమా'జ్ నుండి తొలగించాలని కోరుతున్నాడు. అయితే మీరిప్పుడైనా మానుకోరా?

إِنَّمَا يُرِيدُ ٱلشَّيْطَٰنُ أَن يُوقِعَ بَيْنَكُمُ ٱلْعَدَٰوَةَ وَٱلْبَغْضَآءَ فِى ٱلْخَمْرِ وَٱلْمَيْسِرِ وَيَصُدَّكُمْ عَن ذِكْرِ ٱللَّهِ وَعَنِ ٱلصَّلَوٰةِ ۖ فَهَلْ أَنتُم مُّنتَهُونَ ﴿٩١﴾

**92**. మరియు మీరు అల్లాహ్‌కు విధేయులై ఉండండి మరియు ప్రవక్తను అనుసరించండి. జాగ్రత్త! మీరు ఒకవేళ తిరిగిపోతే! నిశ్చయంగా, మా ప్రవక్త బాధ్యత కేవలం (మా ఆజ్ఞలను) మీకు స్పష్టంగా అందజేయటం మాత్రమే అని తెలుసుకోండి.

وَأَطِيعُوا۟ ٱللَّهَ وَأَطِيعُوا۟ ٱلرَّسُولَ وَٱحْذَرُوا۟ ۚ فَإِن تَوَلَّيْتُمْ فَٱعْلَمُوٓا۟ أَنَّمَا عَلَىٰ رَسُولِنَا ٱلْبَلَٰغُ ٱلْمُبِينُ ﴿٩٢﴾

**93**. విశ్వసించి సత్కార్యాలు చేసే వారిపై, (ఇంతకు ముందు) వారు తిన్న (త్రాగిన) దాన్ని గురించి దోషంలేదు; ఒకవేళ వారు దైవభీతి కలిగి ఉండి, విశ్వసించి, సత్కార్యాలు చేస్తూ ఉంటే, ఇంకా దైవభీతి కలిగి ఉండి విశ్వాసులైతే, ఇంకా దైవభీతి కలిగి ఉండి సజ్జనులైతే! మరియు అల్లాహ్ సజ్జనులను ప్రేమిస్తాడు.

لَيْسَ عَلَى ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ جُنَاحٌ فِيمَا طَعِمُوٓا۟ إِذَا مَا ٱتَّقَوا۟ وَّءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ ثُمَّ ٱتَّقَوا۟ وَّءَامَنُوا۟ ثُمَّ ٱتَّقَوا۟ وَّأَحْسَنُوا۟ ۗ وَٱللَّهُ يُحِبُّ ٱلْمُحْسِنِينَ ﴿٩٣﴾

**94**. ఓ విశ్వాసులారా! (మీరు ఇ'హ్రామ్ స్థితిలో ఉన్నప్పుడు) - మీ ఇంద్రియాలకు అగోచరమైన అల్లాహ్‌కు ఎవరు భయ పడతారో చూడటానికి - అల్లాహ్ మీ చేతులకు మరియు మీ బల్లెములకు అందు బాటులో ఉన్న కొన్ని వేట (జంతువుల) ద్వారా మిమ్మల్ని పరీక్షకు గురిచేస్తాడు. కావున ఈ (హెచ్చరిక) తరువాత కూడా ఎవడు హద్దులను అతిక్రమిస్తాడో, వాడికి బాధాకరమైన శిక్ష ఉంటుంది.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَيَبْلُوَنَّكُمُ ٱللَّهُ بِشَىْءٍ مِّنَ ٱلصَّيْدِ تَنَالُهُۥٓ أَيْدِيكُمْ وَرِمَاحُكُمْ لِيَعْلَمَ ٱللَّهُ مَن يَخَافُهُۥ بِٱلْغَيْبِ ۚ فَمَنِ ٱعْتَدَىٰ بَعْدَ ذَٰلِكَ فَلَهُۥ عَذَابٌ أَلِيمٌ ﴿٩٤﴾

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تَقْتُلُواْ ٱلصَّيْدَ
وَأَنتُمْ حُرُمٌۚ وَمَن قَتَلَهُۥ مِنكُم مُّتَعَمِّدًا
فَجَزَآءٌ مِّثْلُ مَا قَتَلَ مِنَ ٱلنَّعَمِ
يَحْكُمُ بِهِۦ ذَوَا عَدْلٍ مِّنكُمْ هَدْيًۢا
بَـٰلِغَ ٱلْكَعْبَةِ أَوْ كَفَّـٰرَةٌ طَعَامُ
مَسَـٰكِينَ أَوْ عَدْلُ ذَٰلِكَ صِيَامًا
لِّيَذُوقَ وَبَالَ أَمْرِهِۦۗ عَفَا ٱللَّهُ عَمَّا
سَلَفَۚ وَمَنْ عَادَ فَيَنتَقِمُ ٱللَّهُ مِنْهُۗ
وَٱللَّهُ عَزِيزٌ ذُو ٱنتِقَامٍ ﴿٩٥﴾

أُحِلَّ لَكُمْ صَيْدُ ٱلْبَحْرِ
وَطَعَامُهُۥ مَتَـٰعًا لَّكُمْ وَلِلسَّيَّارَةِۖ
وَحُرِّمَ عَلَيْكُمْ صَيْدُ ٱلْبَرِّ مَا دُمْتُمْ
حُرُمًاۗ وَٱتَّقُواْ ٱللَّهَ ٱلَّذِىٓ إِلَيْهِ
تُحْشَرُونَ ﴿٩٦﴾

**95**. ఓ విశ్వాసులారా! మీరు ఇ'హ్రామ్ స్థితిలో ఉన్నప్పుడు వేటాడకండి.[1] మీలో ఎవరైనా బుద్ధిపూర్వకంగా వేటచేస్తే, అతడు చంపిన జంతువుతో సరితూగే ఒక పశువును పరిహారంగా సమర్పించుకోవాలి. దానిని (ఆ పశువును) మీలో న్యాయ వర్తులైన ఇద్దరు వ్యక్తులు నిర్ణయించాలి. పశువును ఖుర్బానీ కొరకు కాబా వద్దకు చేర్చాలి. లేదా దానికి పరిహారంగా కొందరు పేదలకు భోజనం పెట్టాలి, లేదా దానికి పరిహారంగా - తాను చేసిన దాని ప్రతిఫలాన్ని చవిచూడటానికి - ఉపవాసముండాలి. గడిచిపోయిన దానిని అల్లాహ్ మన్నించాడు. కాని ఇకముందు ఎవరైనా మళ్ళీ అలాచేస్తే అల్లాహ్ అతనికి ప్రతీకారం చేస్తాడు. మరియు అల్లాహ్ సర్వ శక్తిసంపన్నుడు, ప్రతీకారంచేయగలవాడు.

**96**. సముద్ర జంతువులను వేటాడటం మరియు వాటిని తినటం,[2] జీవనోపాధిగా మీకూ (స్థిర నివాసులకూ) మరియు ప్రయాణీకులకూ ధర్మసమ్మతం చేయ బడింది. కానీ, మీరు ఇ'హ్రామ్ స్థితిలో ఉన్నంత వరకూ భూమిపై వేటాడటం మీకు నిషేధింపబడింది. కావున మీరు (పునరుత్థానదినమున) ఎవరి ముందు అయితే సమావేశపరచబడతారో ఆ అల్లాహ్‌యందు భయభక్తులు కలిగి ఉండండి. (1/8)

---

**1**. మీకు హానికలిగించగల జంతువులను, ఇ'హ్రామ్‌స్థితిలో చంపవచ్చు. ఉదా: పాము, తేలు, పిచ్చికుక్క మొదలైనవి. పేదలకు భోజనంపెట్టడం మరియు ఉపవాస విషయాలలో ధర్మవేత్తలను సంప్రదించండి. ఇవి చంపబడిన జంతువును బట్టి వివిధ రకాలు ఉంటాయి.
**2**. నీటి జంతువు మరణించినది కూడా 'హలాలే. చూడండి, ఇబ్నె-కసీ'ర్.

﴿جَعَلَ ٱللَّهُ ٱلۡكَعۡبَةَ ٱلۡبَيۡتَ ٱلۡحَرَامَ قِيَٰمٗا لِّلنَّاسِ وَٱلشَّهۡرَ ٱلۡحَرَامَ وَٱلۡهَدۡيَ وَٱلۡقَلَٰٓئِدَۚ ذَٰلِكَ لِتَعۡلَمُوٓاْ أَنَّ ٱللَّهَ يَعۡلَمُ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِ وَأَنَّ ٱللَّهَ بِكُلِّ شَيۡءٍ عَلِيمٌ ٩٧

97. * అల్లాహ్ పవిత్ర గృహం అయిన క'అబహ్ను మానవజాతి కొరకు, సురక్షితమైన శాంతి నిలయంగా (బైతుల్ 'హరామ్గా) చేశాడు[1] మరియు పవిత్ర మాసాన్ని మరియు బలి (హద్య) పశువులను మరియు (మెడలలో పట్టాలు వేసి క'అబహ్కు ఖుర్బానీ కొరకు తేబడే పశువులు) ఖలాఇ'దలను కూడా (నియమించాడు). ఇది ఆకాశాలలోను మరియు భూమిలోను ఉన్నదంతా నిశ్చయంగా అల్లాహ్ ఎరుగునని, మీరు తెలుసుకోవాలని! మరియు నిశ్చయంగా అల్లాహ్కు ప్రతి ఒక్క విషయం గురించి బాగా తెలుసు.

ٱعۡلَمُوٓاْ أَنَّ ٱللَّهَ شَدِيدُ ٱلۡعِقَابِ وَأَنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٞ ٩٨

98. నిశ్చయంగా, అల్లాహ్ శిక్ష విధించటంలో కఠినుడని తెలుసుకోండి మరియు నిశ్చయంగా అల్లాహ్ క్షమాశీలుడు అపార కరుణాప్రదాత.

مَّا عَلَى ٱلرَّسُولِ إِلَّا ٱلۡبَلَٰغُۗ وَٱللَّهُ يَعۡلَمُ مَا تُبۡدُونَ وَمَا تَكۡتُمُونَ ٩٩

99. సందేశహరుని బాధ్యత కేవలం (అల్లాహ్ సందేశాలను) మీకు అందజేయుటమే! మరియు మీరు వెలిబుచ్చేది మరియు దాచేది అంతా అల్లాహ్కు బాగా తెలుసు.

قُل لَّا يَسۡتَوِي ٱلۡخَبِيثُ وَٱلطَّيِّبُ وَلَوۡ أَعۡجَبَكَ كَثۡرَةُ ٱلۡخَبِيثِۚ فَٱتَّقُواْ ٱللَّهَ يَٰٓأُوْلِي ٱلۡأَلۡبَٰبِ لَعَلَّكُمۡ تُفۡلِحُونَ ١٠٠

100. (ఓ ప్రవక్తా!) ఇలా అను: "చెడు వస్తువుల ఆధిక్యత నీకు ఎంత నచ్చినా! చెడు మరియు మంచి వస్తువులు సరిసమానం కాజాలవు.[2] కావున ఓ బుద్ధిమంతులారా! మీరు సాఫల్యం పొందాలంటే అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి."

---

1. క'అబహ్ ('హరమ్) సరిహద్దులలో ఇ'హ్రాంలో ఉన్నా, లేకున్నా, వేటాడటం, జంతువులను చంపటం, చెట్లను నరుకటం నిషేధింపబడ్డాయి. చూడండి, 2:125.
2. 'ఖబీస్': అంటే, అధర్మ, అపవిత్ర, చెడ్డ, నికృష్ట, అపరిశుద్ధ వస్తువులు, చేష్టలు, మాటలు, విషయాలు మొదలైనవి. 'తయ్యిబ్: అంటే ధర్మ, మంచి, పవిత్ర, ఉత్కృష్ట, శ్రేష్ఠ, పరిశుద్ధ వస్తువులు, చేష్టలు, మాటలు విషయాలు మొదలైనవి.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا
تَسْـَٔلُوا۟ عَنْ أَشْيَآءَ إِن تُبْدَ لَكُمْ
تَسُؤْكُمْ وَإِن تَسْـَٔلُوا۟ عَنْهَا حِينَ
يُنَزَّلُ ٱلْقُرْءَانُ تُبْدَ لَكُمْ عَفَا ٱللَّهُ
عَنْهَا ۗ وَٱللَّهُ غَفُورٌ حَلِيمٌ ﴿١٠١﴾
قَدْ سَأَلَهَا قَوْمٌ مِّن قَبْلِكُمْ
ثُمَّ أَصْبَحُوا۟ بِهَا كَـٰفِرِينَ ﴿١٠٢﴾
مَا جَعَلَ ٱللَّهُ مِنۢ بَحِيرَةٍ وَلَا سَآئِبَةٍ
وَلَا وَصِيلَةٍ وَلَا حَامٍ ۙ وَلَـٰكِنَّ ٱلَّذِينَ
كَفَرُوا۟ يَفْتَرُونَ عَلَى ٱللَّهِ ٱلْكَذِبَ ۖ
وَأَكْثَرُهُمْ لَا يَعْقِلُونَ ﴿١٠٣﴾

**101**. ఓ విశ్వాసులారా! వ్యక్తపరిస్తే మీకు బాధకలిగించెడు విషయాలను గురించి, మీరు ప్రశ్నించకండి; ఖుర్ఆన్ అవతరింపజేయబడేటప్పుడు, మీరు వాటిని గురించి ప్రశ్నిస్తే! అవి మీకు విశదపరచబడవచ్చు! వాటి (ఇంతవరకు మీరు చేసిన ప్రశ్నల) కొరకు అల్లాహ్ మిమ్మల్ని మన్నించాడు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, సహనశీలుడు.

**102**. వాస్తవానికి మీకు పూర్వం ఒక జాతి వారు ఇటువంటి ప్రశ్నలనే అడిగారు. తరువాత వాటి (ఆ ప్రశ్నల) కారణంగానే వారు సత్యతిరస్కారానికి గురిఅయ్యారు.[1]

**103**. అల్లాహ్ బ'హీరహ్ను గానీ, సాయి'బహ్ను గానీ, వ'సీలహ్ను గానీ లేక 'హామ్ను గానీ నియమించలేదు.[2] కాని సత్యతిరస్కారులు అల్లాహ్పై అబద్ధాలు కల్పిస్తున్నారు. మరియు వారిలో చాలా మంది బుద్ధిహీనులే!

---

**1**. అబూ హురైరా (ర'ది.'అ.) కథనం: దైవప్రవక్త ('స'అస) తమ ప్రవచనంలో ఇలా అన్నారు: " 'హజ్జ్ మీ కొరకు విధిగా నియమించబడింది." అపుడు ఒకతను (ర'ది.'అ.) ప్రశ్నించాడు: "ప్రతి సంవత్సరమా?" దైవప్రవక్త ('స'అస) మౌనం వహించారు. ఆవ్యక్తి మరీ రెండు సార్లు అదే ప్రశ్న అడిగాడు. దానికతను: "నేను అవును అంటే అది మీకు విధి అయ్యేది మరియు అది మీకు చేతనయ్యేది కాదు." ('స.ముస్లిం కితాబుల్ 'హజ్జ్ 'హదీస్' నం. 412, దీనినే అ'హ్మద్, అబూ-దావూద్, నసాయీ' మరియు ఇబ్నె-మాజా ఉల్లేఖించారు). కావున ఖుర్ఆన్లో ఉన్న ఆజ్ఞలను, ఉన్నవి ఉన్నట్లే పాటించాలి. ఏ విషయమైతే దానిలో పేర్కొనబడలేదో వాటిని గురించి మౌనం వహించటమే మేలు.

**2**. ఇవి ముష్రిక్ ఖురైషులు తమ ఆడ ఒంటెలకు ఇచ్చిన పేర్లు. వాటిని వారు తమ దేవతలకు అర్పితంచేసి, వాటిని పనులకు, సవారీలకు ఉపయోగించ కుండా, విచ్చల విడిగా మేస్తూ తిరుగటానికి వదిలేవారు. ఇంకా చూడండి, 6:138-139, 143-144.

**104**. మరియు వారితో: "అల్లాహ్ అవతరింపజేసినదాని (సందేశం) వైపునకు మరియు ప్రవక్త వైపునకు రండి." అని పిలిచినప్పుడు! వారు: "మా తండ్రితాతలు అవలంబిస్తూ ఉండగా మేము చూసిన (మార్గమే) మాకు చాలు!" అని జవాబిస్తారు. ఏమీ? వారి తండ్రితాతలకు ఏమీ తెలియకున్నా మరియు వారు సన్మార్గం మీద లేకున్నా (వారి మార్గాన్నే వీరు అనుసరిస్తారా)?

وَإِذَا قِيلَ لَهُمْ تَعَالَوْاْ إِلَىٰ مَآ أَنزَلَ ٱللَّهُ وَإِلَى ٱلرَّسُولِ قَالُواْ حَسْبُنَا مَا وَجَدْنَا عَلَيْهِ ءَابَآءَنَآ أَوَلَوْ كَانَ ءَابَآؤُهُمْ لَا يَعْلَمُونَ شَيْـًٔا وَلَا يَهْتَدُونَ ﴿١٠٤﴾

**105**. ఓ విశ్వాసులారా! మీ స్వయానికి మీరు బాధ్యత వహించండి. మీరు సన్మార్గంలో ఉంటే, మార్గభ్రష్టులైన వారు మీకు ఎలాంటి హాని చేయలేరు.[1] మీరంతా అల్లాహ్ వైపునకే మరలి పోవలసి వుంది. అప్పుడు ఆయన మీరేమేమి చేస్తూ ఉండేవారో మీకు తెలియజేస్తాడు.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ عَلَيْكُمْ أَنفُسَكُمْ ۖ لَا يَضُرُّكُم مَّن ضَلَّ إِذَا ٱهْتَدَيْتُمْ ۚ إِلَى ٱللَّهِ مَرْجِعُكُمْ جَمِيعًا فَيُنَبِّئُكُم بِمَا كُنتُمْ تَعْمَلُونَ ﴿١٠٥﴾

**106**. ఓ విశ్వాసులారా! మీలో ఎవరికైనా మరణ సమయం ఆసన్నమైతే, మీరు వీలునామా వ్రాసేటప్పుడు, మీలో న్యాయవర్తులైన ఇద్దరు వ్యక్తులను సాక్షులుగా తీసుకోండి. ఒకవేళ మీరు

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ شَهَـٰدَةُ بَيْنِكُمْ إِذَا حَضَرَ أَحَدَكُمُ ٱلْمَوْتُ حِينَ ٱلْوَصِيَّةِ ٱثْنَانِ ذَوَا عَدْلٍ مِّنكُمْ أَوْ

---

**1**. ప్రజలు ఈ ఆయత్‌ను సరిగ్గా అర్థం చేసుకోలేనందువలన అబూబక్ర్ సిద్దీఖ్ (ర'ది.'అ.) వారితో ఇలా అన్నారు: "ప్రజలారా! నేను దైవప్రవక్త('స'అస)ను ఇలా అంటుండగా విన్నాను: 'ప్రజలు చెడు జరుగుతుండగా చూసి, దానిని మార్చటానికి ప్రయత్నం చేయకుంటే త్వరలోనే అల్లాహ్ (సు.తా.) వారిని తన శిక్షకు గురిచేయవచ్చు!' " (ముస్నద్ అ'హ్మద్ పుస్తకము -1, పేజి-5. తిర్మిజీ', 'హదీస్' నం. 2178; అబూ-దావూద్, 'హదీస్' నం. 4338). ఈ ఆయత్ అర్థం ఏమిటంటే: మీరు సన్మార్గం మీద ఉండి, చెడు నుండి దూరంగా ఉంటూ, ప్రజలకు సన్మార్గం చూపుతూ దుర్మార్గం నుండి ఆపుతూ ఉంటే, వారు మీ మాటను లక్ష్యపెట్టనిచో మీ పని మీరు చేశారు. దానికి ప్రతిఫలం పొందుతారు. కాని మీ ప్రాణానికి హాని కలిగే భయం ఉంటే! మీరు: 'అమ్ర్ బిల్ మ'అరూఫ్ వ నహా 'అనిల్ మున్కర్.'ను ఉపేక్షించవచ్చు!

ءَاخَرَانِ مِنۡ غَيۡرِكُمۡ إِنۡ أَنتُمۡ
ضَرَبۡتُمۡ فِي ٱلۡأَرۡضِ فَأَصَٰبَتۡكُم
مُّصِيبَةُ ٱلۡمَوۡتِۚ تَحۡبِسُونَهُمَا مِنۢ
بَعۡدِ ٱلصَّلَوٰةِ فَيُقۡسِمَانِ بِٱللَّهِ إِنِ
ٱرۡتَبۡتُمۡ لَا نَشۡتَرِي بِهِۦ ثَمَنٗا وَلَوۡ
كَانَ ذَا قُرۡبَىٰ وَلَا نَكۡتُمُ شَهَٰدَةَ
ٱللَّهِ إِنَّآ إِذٗا لَّمِنَ ٱلۡأٓثِمِينَ ١٠٦

فَإِنۡ عُثِرَ عَلَىٰٓ أَنَّهُمَا ٱسۡتَحَقَّآ إِثۡمٗا
فَـَٔاخَرَانِ يَقُومَانِ مَقَامَهُمَا مِنَ
ٱلَّذِينَ ٱسۡتَحَقَّ عَلَيۡهِمُ ٱلۡأَوۡلَيَٰنِ
فَيُقۡسِمَانِ بِٱللَّهِ لَشَهَٰدَتُنَآ أَحَقُّ
مِن شَهَٰدَتِهِمَا وَمَا ٱعۡتَدَيۡنَآ إِنَّآ
إِذٗا لَّمِنَ ٱلظَّٰلِمِينَ ١٠٧

ذَٰلِكَ أَدۡنَىٰٓ أَن يَأۡتُواْ بِٱلشَّهَٰدَةِ عَلَىٰ
وَجۡهِهَآ أَوۡ يَخَافُوٓاْ أَن تُرَدَّ أَيۡمَٰنُۢ بَعۡدَ
أَيۡمَٰنِهِمۡۗ وَٱتَّقُواْ ٱللَّهَ وَٱسۡمَعُواْۗ وَٱللَّهُ
لَا يَهۡدِي ٱلۡقَوۡمَ ٱلۡفَٰسِقِينَ ١٠٨

ప్రయాణస్థితిలో ఉండి, అక్కడ మీకు మరణ ఆపద సంభవిస్తే, మీ వారు (ముస్లింలు లేకుంటే) ఇతరులను ఎవరినైనా ఇద్దరిని (సాక్షులుగా) తీసుకోవచ్చు. ఆ ఇద్దరినీ నమా'జ్ తరువాత ఆపుకోండి. మీకు సందేహముంటే, వారిద్దరూ అల్లాహ్‌పై ప్రమాణం చేసి ఇలా అనాలి: "మా దగ్గరి బంధువుకొరకైనా సరే మేము స్వార్థం కొరకు మా సాక్ష్యాన్ని అమ్మము. మేము అల్లాహ్ కొరకు ఇచ్చే సాక్ష్యాన్ని దాచము. మేము ఆ విధంగా చేస్తే నిశ్చయంగా, పాపాత్ములలో లెక్కింప బడుదుము గాక!"

**107**. కాని, ఆ తరువాత ఆ ఇద్దరు (సాక్షులు) పాపం చేశారని తెలిస్తే! అప్పుడు మొదటి ఇద్దరి (సాక్ష్యం) వలన హక్కును కోల్పోయిన వారి (బంధువులలో) నుండి ఇద్దరు, మొదటి వారిద్దరికి బదులుగా నిలబడి అల్లాహ్‌పై శపథంచేసి ఇలా అనాలి: "మా సాక్ష్యం వీరిరువురి సాక్ష్యంకంటే ఎక్కువ హక్కు గలది (సత్యమైనది). మరియు మేము ఏ విధమైన అక్రమానికి పాల్పడలేదు. మేము ఆవిధంగా చేస్తే నిశ్చయంగా, అన్యాయ పరులలో చేరిపోదుము గాక!"

**108**. ఇది (ఈ పద్ధతి) ప్రజలు నిజమైన సాక్ష్యం ఇవ్వటానికి లేదా వారి ప్రమాణాలను, తరువాత తీసుకొనబడే ప్రమాణాలు ఖండిస్తాయని వారిని భయ పెట్టటానికి ఉత్తమమైనది. అల్లాహ్‌యందు భయభక్తులు కలిగిఉండి, (ఆయన ఆదేశాలను) వినండి. మరియు అల్లాహ్ అవిధేయులకు సన్మార్గం చూపడు. (1/4)

۞ يَوۡمَ يَجۡمَعُ ٱللَّهُ ٱلرُّسُلَ فَيَقُولُ
مَاذَآ أُجِبۡتُمۡۖ قَالُواْ لَا عِلۡمَ لَنَآۖ إِنَّكَ
أَنتَ عَلَّٰمُ ٱلۡغُيُوبِ ١٠٩
إِذۡ قَالَ ٱللَّهُ يَٰعِيسَى ٱبۡنَ مَرۡيَمَ
ٱذۡكُرۡ نِعۡمَتِي عَلَيۡكَ وَعَلَىٰ
وَٰلِدَتِكَ إِذۡ أَيَّدتُّكَ بِرُوحِ
ٱلۡقُدُسِ تُكَلِّمُ ٱلنَّاسَ فِي ٱلۡمَهۡدِ
وَكَهۡلٗاۖ وَإِذۡ عَلَّمۡتُكَ
ٱلۡكِتَٰبَ وَٱلۡحِكۡمَةَ وَٱلتَّوۡرَىٰةَ
وَٱلۡإِنجِيلَۖ وَإِذۡ تَخۡلُقُ مِنَ ٱلطِّينِ
كَهَيۡـَٔةِ ٱلطَّيۡرِ بِإِذۡنِي فَتَنفُخُ فِيهَا
فَتَكُونُ طَيۡرَۢا بِإِذۡنِيۖ وَتُبۡرِئُ
ٱلۡأَكۡمَهَ وَٱلۡأَبۡرَصَ بِإِذۡنِيۖ
وَإِذۡ تُخۡرِجُ ٱلۡمَوۡتَىٰ بِإِذۡنِيۖ وَإِذۡ
كَفَفۡتُ بَنِيٓ إِسۡرَٰٓءِيلَ عَنكَ

**109.** * ఆ రోజు అల్లాహ్ ప్రవక్తలందరిని సమావేశపరచి: "మీకేమి జవాబు ఇవ్వబడింది?" అని అడిగితే! వారు: "మాకు యథార్థ జ్ఞానంలేదు! నిశ్చయంగా నీవు మాత్రమే సర్వ అగోచర విషయాల జ్ఞానం గలవాడవు." అని పలుకుతారు.[1]

**110.** (జ్ఞాపకముంచుకోండి!) అప్పుడు (పునరుత్థాన దినమున), అల్లాహ్: "ఓ మర్యమ్ కుమారుడా! 'ఈసా (ఏసు) నేను నీకు మరియు నీ తల్లికి ప్రసాదించిన అనుగ్రహాన్ని జ్ఞాపకంచేసుకో! నేను పరిశుద్ధాత్మ (రూ'హుల్ ఖుదుస్)[2] ద్వారా నిన్ను బలపరిచాను, నీవు ఉయ్యాలలోనూ మరియు యుక్త వయస్సులోనూ ప్రజలతో మాట్లాడేవాడివి. మరియు నేను గ్రంథాన్ని మరియు వివేకాన్ని, తౌరాతును మరియు ఇంజీలును నీకు నేర్పాను.[3] మరియు నీవు నా ఆజ్ఞతో పక్షి ఆకారంగల మట్టిబొమ్మను తయారుచేసి, దానిలో ఊదినపుడు, నా ఆజ్ఞతో అది పక్షిగా మారిపోయేది. మరియు నీవు పుట్టుగ్రుడ్డిని మరియు కుష్ఠురోగిని నా ఆజ్ఞతో బాగుచేసేవాడివి. మరియు నీవు నా ఆజ్ఞతో మృతులను లేపేవాడివి.[4] మరియు నీవు స్పష్టమైన సూచనలతో ఇస్రాయీలు సంతతి వారివద్దకు వచ్చినపుడు,[5] వారిలోని

1. ఇక్కడ ప్రవక్త ('అలైహిమ్ స.)లందరూ అంటున్నారు: "మాకు అగోచర జ్ఞానంలేదు. అది కేవలం అల్లాహ్ (సు.తా.)కు మాత్రమే ఉంది!"
2. చూడండి, 2:87.
3. చూడండి, 3:48.
4. చూడండి, 3:49.
5. చూడండి, 3:54.

إِذْ جِئْتَهُم بِٱلْبَيِّنَٰتِ فَقَالَ ٱلَّذِينَ
كَفَرُوا۟ مِنْهُمْ إِنْ هَٰذَآ إِلَّا سِحْرٌ
مُّبِينٌ ﴿١١٠﴾

సత్యతిరస్కారులు: 'ఇది స్పష్టమైన మాయాజాలం తప్ప మరేమీకాదు!'" అని అన్నారు; అప్పుడు నేను వారి కుట్ర నుండి నిన్ను కాపాడాను!

وَإِذْ أَوْحَيْتُ إِلَى ٱلْحَوَارِيِّۦنَ أَنْ
ءَامِنُوا۟ بِى وَبِرَسُولِى قَالُوٓا۟ ءَامَنَّا
وَٱشْهَدْ بِأَنَّنَا مُسْلِمُونَ ﴿١١١﴾

**111**. మరియు నేను, ('ఈసా) శిష్యు (హవారియ్యూన్)ల మనస్సులలో ఇలా మాట వేసినప్పుడు:[1] "నన్ను మరియు నా ప్రవక్తను విశ్వసించండి." వారన్నారు: "మేము విశ్వసించాము మరియు మేము ముస్లింలము అయ్యాము అనే మాటకు సాక్షిగా ఉండు!"

إِذْ قَالَ ٱلْحَوَارِيُّونَ يَٰعِيسَى ٱبْنَ
مَرْيَمَ هَلْ يَسْتَطِيعُ رَبُّكَ أَن
يُنَزِّلَ عَلَيْنَا مَآئِدَةً مِّنَ ٱلسَّمَآءِ ۖ قَالَ
ٱتَّقُوا۟ ٱللَّهَ إِن كُنتُم مُّؤْمِنِينَ ﴿١١٢﴾

**112**. (జ్ఞాపకం చేసుకోండి!) ఆ శిష్యు ('హవారియ్యూన్)లు: "ఓ మర్యమ్ కుమారుడవైన 'ఈసా (ఏసూ) ఏమీ? నీ ప్రభువు మా కొరకు ఆకాశం నుండి ఆహారంతో నిండిన ఒకపళ్ళెం దింప గలడా?" అని అడిగారు![2] దానికి ('ఈసా): "మీరు వాస్తవానికి విశ్వాసులే అయితే, అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి!" అని అన్నాడు.

قَالُوا۟ نُرِيدُ أَن نَّأْكُلَ مِنْهَا
وَتَطْمَئِنَّ قُلُوبُنَا وَنَعْلَمَ أَن قَدْ
صَدَقْتَنَا وَنَكُونَ عَلَيْهَا مِنَ
ٱلشَّٰهِدِينَ ﴿١١٣﴾

**113**. వారు: "వాస్తవానికి, మేము దాని నుండి తిని, మా హృదయాలను తృప్తిపరచు కోవటానికి మరియు నీవు మాతో సత్యం పలికావని తెలుసు కోవటానికి మరియు దానిని గురించి మేము సాక్షులుగా ఉండటానికి, మేమిలా కోరుతున్నాము!" అని అన్నారు.

---

**1**. ఇక్కడ అవ్'హయ్'త అంటే వ'హీ. కాని ఈ పదానికి ఇక్కడ శిష్యుల మనస్సులలో ఆలోచన వేయబడిందని అర్థం. ఇదే విధంగా 'ఈసా ('అ.స.) తల్లి మర్యమ్ ('అ.స.) మనస్సులో మరియు మూసా ('అ.స.) తల్లి మనస్సులో మాట వేయబడివుండెను. వ'హీ కేవలం ప్రవక్తల పైననే అవతరింపజేయబడుతుంది.

**2**. మాయి'దతున్: అంటే **ఆహారంతో నిండిన ఒక పళ్ళెం**. దీనిని ఉర్దూలో **దస్తర్'ఖాన్** అని అంటారు. ఎందుకంటే దస్తర్'ఖాన్ మీద కూడా ఆహారం పెట్టబడుతుంది.

**114**. దానికి మర్యమ్ కుమారుడు 'ఈసా (ఏసు): "ఓ అల్లాహ్! మా ప్రభూ! ఆకాశం నుండి ఆహారంతో నిండిన ఒక పళ్ళాన్ని మా కొరకు అవతరింపజేయి (దింపు); అది మాకు మొదటివాని నుండి చివరి వాని వరకు పండుగగా ఉండాలి; అది నీ తరఫు నుండి ఒక సూచనగా ఉండాలి. మాకు ఆహారాన్ని ప్రసాదించు; నీవే అత్యుత్తమమైన ఉపాధిప్రదాతవు!" అని ప్రార్థించాడు.

**115**. (అప్పుడు) అల్లాహ్: "నిశ్చయంగా, నేను దానిని మీపై అవతరింపజేస్తా (దింపుతా)ను. కాని, దాని తరువాత కూడా మీలో ఎవడైనా సత్య తిరస్కారానికి పాల్పడితే! నిశ్చయంగా వానికి నేను ఇంతవరకు సర్వలోకాలలో ఎవ్వడికీ విధించని శిక్షను విధిస్తాను!" అని అన్నాడు.

**116**. మరియు (జ్ఞాపకముంచుకోండి!) అప్పుడు (పునరుత్థాన దినమున), అల్లాహ్ ఇలా అంటాడు: "ఓ మర్యమ్ కుమారుడా! 'ఈసా (ఏసు) ఏమీ? నీవు ప్రజలతో: 'అల్లాహ్‌కు బదులుగా నన్నూ మరియు నా తల్లినీ ఆరాధ్యులుగా చేసుకోండి!' అని చెప్పావా?" అని ప్రశ్నించగా! దానికి అతను ('ఈసా) అంటాడు: "నీవు సర్వలోపాలకు అతీతుడవు. నాకు పలకటానికి అర్హత లేని మాటను నేను పలకటం తగినపని కాదు. ఒకవేళ నేను అలా చెప్పిఉంటే నీకు తప్పక తెలిసి ఉండేది. నా మనస్సులో ఉన్నది నీకు తెలుసు, కాని నీ మనస్సులో ఉన్నది నాకు తెలియదు. నిశ్చయంగా, నీవే సర్వ అగోచర విషయాలు తెలిసినవాడవు!

قَالَ عِيسَى ٱبۡنُ مَرۡيَمَ ٱللَّهُمَّ رَبَّنَآ
أَنزِلۡ عَلَيۡنَا مَآئِدَةٗ مِّنَ ٱلسَّمَآءِ
تَكُونُ لَنَا عِيدٗا لِّأَوَّلِنَا
وَءَاخِرِنَا وَءَايَةٗ مِّنكَۖ وَٱرۡزُقۡنَا
وَأَنتَ خَيۡرُ ٱلرَّٰزِقِينَ ١١٤

قَالَ ٱللَّهُ إِنِّي مُنَزِّلُهَا عَلَيۡكُمۡۖ فَمَن
يَكۡفُرۡ بَعۡدُ مِنكُمۡ فَإِنِّيٓ أُعَذِّبُهُۥ
عَذَابٗا لَّآ أُعَذِّبُهُۥٓ أَحَدٗا مِّنَ
ٱلۡعَٰلَمِينَ ١١٥

وَإِذۡ قَالَ ٱللَّهُ يَٰعِيسَى ٱبۡنَ مَرۡيَمَ
ءَأَنتَ قُلۡتَ لِلنَّاسِ ٱتَّخِذُونِي وَأُمِّيَ
إِلَٰهَيۡنِ مِن دُونِ ٱللَّهِۖ قَالَ
سُبۡحَٰنَكَ مَا يَكُونُ لِيٓ أَنۡ أَقُولَ
مَا لَيۡسَ لِي بِحَقٍّۚ إِن كُنتُ قُلۡتُهُۥ
فَقَدۡ عَلِمۡتَهُۥۚ تَعۡلَمُ مَا فِي نَفۡسِي
وَلَآ أَعۡلَمُ مَا فِي نَفۡسِكَۚ إِنَّكَ أَنتَ
عَلَّٰمُ ٱلۡغُيُوبِ ١١٦

117. "నీవు ఆదేశించింది తప్ప, నేను మరేమీ వారికి చెప్పలేదు, అంటే: 'నా ప్రభువు మరియు మీ ప్రభువు అయిన అల్లాహ్‌నే ఆరాధించండి.' అని. నేను వారి మధ్య ఉన్నంతవరకు వారికి సాక్షిగా ఉన్నాను. నీవు నన్ను పైకి లేపుకున్న తరువాత నీవే వారిని కనిపెట్టుకుని ఉన్నావు.[1] మరియు నీవే ప్రతి దానికి సాక్షివి![2]

118. "ఒకవేళ నీవు వారిని శిక్షించదలిస్తే వారు నీ దాసులే! మరియు నీవు వారిని క్షమించదలిస్తే! నీవు సర్వ శక్తిమంతుడవు మహా వివేచనాపరుడవు!"

119. అప్పుడు అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "ఈ రోజు సత్యవంతులకు వారి సత్యం లాభదాయకమవుతుంది. వారికి క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలు లభిస్తాయి. అక్కడ వారు శాశ్వతంగా కలకాలం ఉంటారు. అల్లాహ్ వారిపట్ల ప్రసన్నుడవుతాడు మరియు వారు ఆయనతో ప్రసన్నులవుతారు. ఇదే గొప్ప విజయం (సాఫల్యం)!"

120. ఆకాశాల పైననూ, భూమి పైననూ మరియు వాటిలో నున్న సమస్తం పైననూ, సామ్రాజ్యాధిపత్యం అల్లాహ్‌దే! మరియు ఆయనే ప్రతిదీ చేయగల సమర్థుడు.

*****

مَا قُلْتُ لَهُمْ إِلَّا مَآ أَمَرْتَنِى بِهِۦٓ أَنِ ٱعْبُدُوا۟ ٱللَّهَ رَبِّى وَرَبَّكُمْ ۚ وَكُنتُ عَلَيْهِمْ شَهِيدًا مَّا دُمْتُ فِيهِمْ ۖ فَلَمَّا تَوَفَّيْتَنِى كُنتَ أَنتَ ٱلرَّقِيبَ عَلَيْهِمْ ۚ وَأَنتَ عَلَىٰ كُلِّ شَىْءٍ شَهِيدٌ ﴿١١٧﴾

إِن تُعَذِّبْهُمْ فَإِنَّهُمْ عِبَادُكَ ۖ وَإِن تَغْفِرْ لَهُمْ فَإِنَّكَ أَنتَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿١١٨﴾

قَالَ ٱللَّهُ هَـٰذَا يَوْمُ يَنفَعُ ٱلصَّـٰدِقِينَ صِدْقُهُمْ ۚ لَهُمْ جَنَّـٰتٌ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَـٰرُ خَـٰلِدِينَ فِيهَآ أَبَدًا ۚ رَّضِىَ ٱللَّهُ عَنْهُمْ وَرَضُوا۟ عَنْهُ ۚ ذَٰلِكَ ٱلْفَوْزُ ٱلْعَظِيمُ ﴿١١٩﴾

لِلَّهِ مُلْكُ ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضِ وَمَا فِيهِنَّ ۚ وَهُوَ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌۢ ﴿١٢٠﴾

---

1. చూడండి, 3:55.

2. షహీదున్ (అష్-షహీదు): All-Witness, The Omniscient. సర్వసాక్షి, తన జ్ఞానంతో ప్రతిచోట ఉండేవాడు. చూడండి, 3:98, 58:6.

## 6. సూరహ్ అల్-అన్'ఆమ్

## سُورَةُ ألأَنْعَامِ

ఈ సూరహ్ చివరి మక్కా కాలంలో అవతరింపజేయబడింది. ఇందులో **165** ఆయతులున్నాయి. దీని పేరు **136** ఆయతునుండి తీసుకోబడింది. అన్'ఆమున్: **పశువులు.** 162-163వ ఆయతులలో ఉన్న ప్రార్థన ఎంతో మహత్త్వమైనది. 50వ ఆయత్ ఎంతో ముఖ్యమైనది: "(ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను: 'నా వద్ద అల్లాహ్ కోశాగారాలు ఉన్నాయని గానీ, లేదా నాకు అగోచరజ్ఞానమున్నదని గానీ, నేను మీతో అనడంలేదు. లేదా నేను దేవదూతనని కూడా అనడం లేదు. కాని నేను కేవలం నాపై అవతరింపజేయబడిన దివ్యజ్ఞానాన్ని (వహీని) మాత్రమే అనుసరిస్తున్నాను.' "

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

ٱلۡحَمۡدُ لِلَّهِ ٱلَّذِي خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ وَجَعَلَ ٱلظُّلُمَٰتِ وَٱلنُّورَۖ ثُمَّ ٱلَّذِينَ كَفَرُواْ بِرَبِّهِمۡ يَعۡدِلُونَ ﴿١﴾

**1.** ఆకాశాలను మరియు భూమిని సృష్టించి, చీకట్లను మరియు వెలుగును నెలకొలిపిన అల్లాహ్ మాత్రమే సర్వ స్తోత్రాలకు అర్హుడు. అయినా సత్యతిరస్కారులు (ఇతరులను) తమ ప్రభువుకు సమానులుగా పరిగణిస్తున్నారు.

هُوَ ٱلَّذِي خَلَقَكُم مِّن طِينٖ ثُمَّ قَضَىٰٓ أَجَلٗاۖ وَأَجَلٞ مُّسَمًّى عِندَهُۥۖ ثُمَّ أَنتُمۡ تَمۡتَرُونَ ﴿٢﴾

**2.** ఆయనే మిమ్మల్ని మట్టితో సృష్టించి, ఆ తరువాత మీకు ఒక గడువు నియమించాడు.[1] ఆయన దగ్గర మరొక నిర్ణీత గడువు కూడా ఉంది.[2] అయినా మీరు సంశయంలో పడిఉన్నారు.

وَهُوَ ٱللَّهُ فِي ٱلسَّمَٰوَٰتِ وَفِي ٱلۡأَرۡضِۖ يَعۡلَمُ سِرَّكُمۡ وَجَهۡرَكُمۡ وَيَعۡلَمُ مَا تَكۡسِبُونَ ﴿٣﴾

**3.** మరియు ఆయన! అల్లాహ్‌యే, ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ (ఆరాధ్యుడు). మీరు దాచేది మరియు వెలిబుచ్చేది, అంతా ఆయనకు తెలుసు మరియు మీరు అర్జించేది (మంచి-చెడు) అంతా ఆయనకు బాగా తెలుసు.[3]

---

**1.** అంటే మరణ సమయం.

**2.** అంటే పునరుత్థాన దినం.

**3.** అల్లాహ్ (సు.తా.) 'అర్ష్‌పై ఉంటాడు, ఆయన ఔన్నత్యానికి తగినట్లుగా. కానీ

وَمَا تَأْتِيهِم مِّنْ ءَايَةٍ مِّنْ ءَايَٰتِ رَبِّهِمْ إِلَّا كَانُوا۟ عَنْهَا مُعْرِضِينَ ﴿٤﴾

4. అయినా వారి ప్రభువు సూచనల నుండి వారి వద్దకు ఏ సూచన వచ్చినా దానికి వారు విముఖతే చూపేవారు!

فَقَدْ كَذَّبُوا۟ بِٱلْحَقِّ لَمَّا جَآءَهُمْ ۖ فَسَوْفَ يَأْتِيهِمْ أَنۢبَٰٓؤُا۟ مَا كَانُوا۟ بِهِۦ يَسْتَهْزِءُونَ ﴿٥﴾

5. వాస్తవానికి, ఇప్పుడు వారు తమ వద్దకు వచ్చిన సత్యాన్ని (ఈ దివ్య గ్రంథాన్ని) కూడా అసత్యమని తిరస్కరించారు.[1] కాబట్టి వారు పరిహసించే దాని (ప్రతిఫలాన్ని) గురించిన వార్త వారికి త్వరలోనే రానున్నది.

أَلَمْ يَرَوْا۟ كَمْ أَهْلَكْنَا مِن قَبْلِهِم مِّن قَرْنٍ مَّكَّنَّٰهُمْ فِى ٱلْأَرْضِ مَا لَمْ نُمَكِّن لَّكُمْ وَأَرْسَلْنَا ٱلسَّمَآءَ عَلَيْهِم مِّدْرَارًا وَجَعَلْنَا ٱلْأَنْهَٰرَ تَجْرِى مِن تَحْتِهِمْ فَأَهْلَكْنَٰهُم بِذُنُوبِهِمْ وَأَنشَأْنَا مِنۢ بَعْدِهِمْ قَرْنًا ءَاخَرِينَ ﴿٦﴾

6. ఏమీ? వారు చూడలేదా (వారికి తెలియదా)? వారికి పూర్వం ఎన్నోతరాలను మేము నాశనం చేశాము. మేము మీకు ఇవ్వని ఎన్నో బల సంపదల నిచ్చి వారిని భువిలో స్థిరపరిచాము; మరియు వారిపై మేము ఆకాశం నుండి ధారాపాతంగా వర్షాలు కురిపించాము; మరియు క్రింద నదులను ప్రవహింపజేశాము; చివరకు వారు చేసిన పాపాలకు ఫలితంగా వారిని సర్వనాశనం చేశాము; మరియు వారి స్థానంలో ఇతర తరాలవారిని లేపాము.

وَلَوْ نَزَّلْنَا عَلَيْكَ كِتَٰبًا فِى قِرْطَاسٍ فَلَمَسُوهُ بِأَيْدِيهِمْ لَقَالَ ٱلَّذِينَ كَفَرُوٓا۟ إِنْ هَٰذَآ إِلَّا سِحْرٌ مُّبِينٌ ﴿٧﴾

7. మరియు (ఓ ప్రవక్తా!) ఒకవేళ మేము చర్మపత్రం[2] పైన వ్రాయబడిన గ్రంథాన్ని నీపై అవతరింపజేసినా, అప్పుడు వారు దానిని తమ చేతులతో తాకి చూసినా! సత్యతిరస్కారులు: "ఇది స్పష్టమైన మాయాజాలం మాత్రమే!" అని అనే వారు.[3]

---

అల్లాహుతా'ఆలా తన జ్ఞానంతో ప్రతిచోట ఉంటాడు. అంటే ఏ విషయం కూడా అల్లాహ్ (సు.తా.) జ్ఞానపరిధి నుండి అగోచరంగాలేదు. ఇది అహ్లెసున్నత్, సలఫుల విశ్వాసం (అఖీదహ్). వివరాలకు చూడండి, 'తబరీ, ఇబ్నె-కసీ'ర్.

1. చూడండి, 'స. ముస్లిం, పుస్తకము-1, అధ్యాయం-240.
2. ఖిర్'తాసున్ (ఖరా'తీసు బ.వ.): Parchment, అంటే వ్రాయడానికి అనువయేటట్లు పదునుచేసిన తోలు, చర్మపత్రం, చర్మపత్ర రాతప్రతి.
3. చూడండి, 15:14-15 మరియు 52:44.

**8**. మరియు వారు: "ఇతని (ప్రవక్త) వద్దకు ఒక దైవదూత ఎందుకు దింపబడ లేదు?" అని అడుగుతారు. మరియు ఒకవేళ మేము దైవదూతనే పంపిఉంటే! వారి తీర్పు వెంటనే జరిగి ఉండేది. ఆ తరువాత వారికి ఎలాంటి వ్యవధి కూడా ఇవ్వబడి ఉండేది కాదు.[1]

وَقَالُواْ لَوۡلَآ أُنزِلَ عَلَيۡهِ مَلَكٞۖ وَلَوۡ أَنزَلۡنَا مَلَكٗا لَّقُضِيَ ٱلۡأَمۡرُ ثُمَّ لَا يُنظَرُونَ ٨

**9**. మరియు ఒకవేళ మేము దైవ దూతను అవతరింపజేసినా, అతనిని మేము మానవరూపంలోనే అవతరింపజేసి ఉండేవారం. మరియు వారు ఇపుడు ఏ సంశయంలో పడి ఉన్నారో! వారిని ఆ సంశయానికే గురిచేసి ఉండేవారం.

وَلَوۡ جَعَلۡنَٰهُ مَلَكٗا لَّجَعَلۡنَٰهُ رَجُلٗا وَلَلَبَسۡنَا عَلَيۡهِم مَّا يَلۡبِسُونَ ٩

**10**. మరియు వాస్తవానికి నీకు పూర్వం కూడా చాలామంది ప్రవక్తలను ఎగతాళి చేయటం జరిగింది, కావున పరిహసించే వారు దేనిని గురించి ఎగతాళి చేసేవారో అదే వారిని చుట్టుకున్నది.

وَلَقَدِ ٱسۡتُهۡزِئَ بِرُسُلٖ مِّن قَبۡلِكَ فَحَاقَ بِٱلَّذِينَ سَخِرُواْ مِنۡهُم مَّا كَانُواْ بِهِۦ يَسۡتَهۡزِءُونَ ١٠

**11**. ఇలా అను: "మీరు భూమిలో సంచారం చేసి, సత్యతిరస్కారుల ముగింపు ఎలా జరిగిందో చూడండి!"

قُلۡ سِيرُواْ فِي ٱلۡأَرۡضِ ثُمَّ ٱنظُرُواْ كَيۡفَ كَانَ عَٰقِبَةُ ٱلۡمُكَذِّبِينَ ١١

**12**. వారిని అడుగు: "ఆకాశాలలో మరియు భూమిలో ఉన్నదంతా ఎవరికి చెందినది?" అని. (నీవే) జవాబివ్వు: "(అంతా) అల్లాహ్‌దే!" ఆయన కరుణించటాన్ని, తనపై తాను (కర్తవ్యంగా) విధించుకున్నాడు.[2] నిశ్చయంగా, ఆయన

قُل لِّمَن مَّا فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۖ قُل لِّلَّهِۚ كَتَبَ عَلَىٰ نَفۡسِهِ ٱلرَّحۡمَةَۚ لَيَجۡمَعَنَّكُمۡ إِلَىٰ يَوۡمِ ٱلۡقِيَٰمَةِ

---

**1**. చూడండి, 3:164.

**2**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "అల్లాహ్ (సు.తా.) సందేశం: 'నిశ్చయంగా, నా కారుణ్యం నా ఆగ్రహానికంటే మించింది.' " ('స.బు'ఖారీ, మరియు 'స.ముస్లిం). చూడండి, 6:54, 7:156.

لَا رَيْبَ فِيهِۚ ٱلَّذِينَ خَسِرُوٓاْ أَنفُسَهُمۡ فَهُمۡ لَا يُؤۡمِنُونَ ١٢

పునరుత్థాన దినమున మీ అందరినీ సమావేశపరుస్తాడు. అందులో ఎలాంటి సందేహం లేదు. ఎవరైతే తమను తాము నష్టానికి గురిచేసుకున్నారో, అలాంటి వారే విశ్వసించరు! (3/8)

۞ وَلَهُۥ مَا سَكَنَ فِي ٱلَّيۡلِ وَٱلنَّهَارِۚ وَهُوَ ٱلسَّمِيعُ ٱلۡعَلِيمُ ١٣

**13.** * మరియు రేయింబవళ్ళలో ఉన్నదంతా ఆయనకు చెందినదే. మరియు ఆయనే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

قُلۡ أَغَيۡرَ ٱللَّهِ أَتَّخِذُ وَلِيّٗا فَاطِرِ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَهُوَ يُطۡعِمُ وَلَا يُطۡعَمُۗ قُلۡ إِنِّيٓ أُمِرۡتُ أَنۡ أَكُونَ أَوَّلَ مَنۡ أَسۡلَمَۖ وَلَا تَكُونَنَّ مِنَ ٱلۡمُشۡرِكِينَ ١٤

**14.** (ఓ ము'హమ్మద్!) ఇలా అను: "ఏమీ? ఆకాశాల మరియు భూమి సృష్టికి మూలాధారుడు[1] అయిన అల్లాహ్ను కాదని నేను మరెవరినైనా ఆరాధ్యునిగా[2] చేసు కోవాలా? మరియు ఆయనే అందరికి ఆహారమిస్తున్నాడు మరియు ఆయన కెవ్వడూ ఆహారమివ్వడు." (ఇంకా) ఇలా అను: "నిశ్చయంగా, అందరికంటే ముందు నేను ఆయనకు (అల్లాహ్కు) విధేయుడను (ముస్లిం) కావాలని మరియు ఆయనకు (అల్లాహ్కు) సాటికల్పించే వారిలో చేరకూడదనీ ఆదేశించబడ్డాను!"

قُلۡ إِنِّيٓ أَخَافُ إِنۡ عَصَيۡتُ رَبِّي عَذَابَ يَوۡمٍ عَظِيمٖ ١٥

**15.** (ఇంకా) ఇలా అను: "నిశ్చయంగా నేను నా ప్రభువుకు అవిధేయుడనైతే నిశ్చయంగా, రాబోయే ఆ గొప్పదినపు శిక్ష నుండి భయపడుతున్నాను!"

---

**1.** ఫాతిరున్: Originator. సృష్టికి **మూలాధారుడు**, ఉత్పత్తికి కారకుడు. సృష్టించేవాడు.

**2.** వలియ్యున్: అంటే ఇక్కడ ఆరాధ్యుడు అని అర్థం. సాధారణంగా దీని అర్థం: స్నేహితుడు, సహాయకుడు, **రక్షించువాడు**. Friend, Patron, Protector, Owner, Defender. **అల్-వలియ్యు**: సంరక్షకుడు, స్వామి. చూడండి, 2:107.

16. ఆ రోజు దాని (ఆ శిక్ష నుండి) తప్పించుకున్న వాడిని, వాస్తవంగా! ఆయన (అల్లాహ్) కరుణించినట్లే. మరియు అదే స్పష్టమైన విజయం.[1]

مَّن يُصۡرَفۡ عَنۡهُ يَوۡمَئِذٖ فَقَدۡ رَحِمَهُۥۚ وَذَٰلِكَ ٱلۡفَوۡزُ ٱلۡمُبِينُ ١٦

17. మరియు అల్లాహ్ నీకు ఏదైనా హాని కలిగిస్తే! ఆయన తప్ప మరెవ్వరూ దానిని తొలగించలేరు. మరియు ఆయన నీకు మేలుచేస్తే! ఆయనే ప్రతిదీ చేయగల సమర్థుడు.

وَإِن يَمۡسَسۡكَ ٱللَّهُ بِضُرّٖ فَلَا كَاشِفَ لَهُۥٓ إِلَّا هُوَۖ وَإِن يَمۡسَسۡكَ بِخَيۡرٖ فَهُوَ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٞ ١٧

18. మరియు ఆయన తన దాసులపై సంపూర్ణ అధికారం (ప్రాబల్యం)[2] గలవాడు. మరియు ఆయన మహా వివేచనాపరుడు, సర్వం తెలిసినవాడు.[3]

وَهُوَ ٱلۡقَاهِرُ فَوۡقَ عِبَادِهِۦۚ وَهُوَ ٱلۡحَكِيمُ ٱلۡخَبِيرُ ١٨

19. (ఓ ము'హమ్మద్! వారిని) అడుగు: "అన్నిటికంటే గొప్పసాక్ష్యం ఏది?" ఇలా అను: "నాకూ మరియు మీకూ మధ్య అల్లాహ్ సాక్షిగా ఉన్నాడు. మరియు మిమ్మల్ని మరియు ఇది (ఈ సందేశం) అందిన వారిని అందరినీ హెచ్చరించ టానికి, ఈ ఖుర్ఆన్ నాపై అవతరింప జేయబడింది." ఏమీ? వాస్తవానికి అల్లాహ్‌తో పాటు ఇంకా ఇతర ఆరాధ్య దైవాలు ఉన్నారని మీరు నిశ్చయంగా

قُلۡ أَيُّ شَيۡءٍ أَكۡبَرُ شَهَٰدَةٗۖ قُلِ ٱللَّهُۖ شَهِيدُۢ بَيۡنِي وَبَيۡنَكُمۡۚ وَأُوحِيَ إِلَيَّ هَٰذَا ٱلۡقُرۡءَانُ لِأُنذِرَكُم بِهِۦ وَمَنۢ بَلَغَۚ أَئِنَّكُمۡ لَتَشۡهَدُونَ أَنَّ مَعَ ٱللَّهِ ءَالِهَةً أُخۡرَىٰۚ قُلۡ لَّآ أَشۡهَدُۚ

1. చూడండి, 3:185.

2. అల్-ఖాహిరు: Subduer, Irresistible, Overcomer, Overpowerer, తన సృష్టిపై **సంపూర్ణ అధికారం**, ఆధిపత్యం, ఆధిక్యత, లోబరచుకో గలవాడు, స్వాధీనంలోకి తెచ్చుకోగల, వశంచేసు కోగల, జయించగల వాడు, **ప్రబలుడు**. చూడండి, 6:61.

**అల్-వాహిద్ అల్-ఖహ్హార్**లకు చూడండి.12:39. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

3. **అల్-ఖబీరు**: All-Aware, Well-Acquainted with all things. సర్వపరిచితుడు, **అంతా ఎరిగినవాడు**, అంతా తెలిసినవాడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి, చూడండి, 6:103, 34:1, 67:14.

قُلْ إِنَّمَا هُوَ إِلَٰهٌ وَٰحِدٌ وَإِنَّنِي بَرِيٓءٌ مِّمَّا تُشْرِكُونَ ١٩

సాక్ష్యమివ్వగలరా? ఇలా అను: "నేనైతే అలాంటి సాక్ష్యమివ్వను!" ఇంకా ఇలా అను: "నిశ్చయంగా, ఆయన (అల్లాహ్) ఒక్కడే ఆరాధ్య దేవుడు. మరియు నిశ్చయంగా, మీరు ఆయనకు సాటి కల్పిస్తున్న దాని నుండి నాకు ఎలాంటి సంబంధం లేదు!"

ٱلَّذِينَ ءَاتَيْنَٰهُمُ ٱلْكِتَٰبَ يَعْرِفُونَهُۥ كَمَا يَعْرِفُونَ أَبْنَآءَهُمُ ٱلَّذِينَ خَسِرُوٓا۟ أَنفُسَهُمْ فَهُمْ لَا يُؤْمِنُونَ ٢٠

**20**. ఎవరికైతే మేము గ్రంథాన్ని ప్రసాదించామో! వారు తమ పుత్రులను గుర్తించినట్లు, ఇతనిని (ము'హమ్మదును) కూడా గుర్తిస్తారు. ఎవరైతే, తమను తాము నష్టానికి గురిచేసుకుంటారో అలాంటి వారే విశ్వసించరు.

وَمَنْ أَظْلَمُ مِمَّنِ ٱفْتَرَىٰ عَلَى ٱللَّهِ كَذِبًا أَوْ كَذَّبَ بِـَٔايَٰتِهِۦٓ ۗ إِنَّهُۥ لَا يُفْلِحُ ٱلظَّٰلِمُونَ ٢١

**21**. మరియు అల్లాహ్‌పై అసత్యం కల్పించేవానికంటే! లేదా, అల్లాహ్ సూచనలను తిరస్కరించేవానికంటే, ఎక్కువ దుర్మార్గుడు ఎవడు? నిశ్చయంగా, దుర్మార్గులు ఎన్నటికీ సాఫల్యం పొందరు.

وَيَوْمَ نَحْشُرُهُمْ جَمِيعًا ثُمَّ نَقُولُ لِلَّذِينَ أَشْرَكُوٓا۟ أَيْنَ شُرَكَآؤُكُمُ ٱلَّذِينَ كُنتُمْ تَزْعُمُونَ ٢٢

**22**. మరియు ఆ రోజు మేము వారందరినీ సమావేశపరుస్తాము. ఆ తరువాత (అల్లాహ్‌కు) సాటికల్పించే (షిర్కు చేసే) వారితో: "మీరు (దైవాలుగా) భావించిన (అల్లాహ్‌కు సాటి కల్పించిన) ఆ భాగస్వాములు ఇప్పుడు ఎక్కడున్నారు?" అని అడుగుతాము.

ثُمَّ لَمْ تَكُن فِتْنَتُهُمْ إِلَّآ أَن قَالُوا۟ وَٱللَّهِ رَبِّنَا مَا كُنَّا مُشْرِكِينَ ٢٣

**23**. అప్పుడు వారికి: "మా ప్రభువైన అల్లాహ్ సాక్షిగా! మేము ఆయనకు (అల్లాహ్‌కు) సాటి కల్పించేవారం (ముష్రికీన్) కాదు!" అని చెప్పడం తప్ప మరొక సాకు దొరకదు.

**24**. చూడండి! వారు తమను గురించి తామే ఏవిధంగా అబద్ధాలు కల్పించుకున్నారో! మరియు ఏ విధంగా వారు కల్పించుకున్న బూటక (దైవాలు) మాయమైపోయాయో!

**25**. మరియు (ఓ ప్రవక్తా!) వారిలో కొందరు నీ (మాటలు) వింటున్నట్లు (నటించే) వారున్నారు. మరియు వారు దానిని అర్థం చేసుకోకుండా మేము వారి హృదయాలపై తెరలు వేసివున్నాము మరియు వారి చెవులకు చెవుడు పట్టించివున్నాము.[1] మరియు వారు ఏ అద్భుత సంకేతాన్ని చూసినా దానిని విశ్వసించరు. చివరకు వారు నీ వద్దకు వచ్చి నీతో వాదులాడేటప్పుడు, వారిలో సత్యాన్ని తిరస్కరించే వారు: "ఇవి కేవలం పూర్వీకుల కట్టుకథలు మాత్రమే!" అని అంటారు.

**26**. మరియు వారు ఇతరులను అతని (ప్రవక్త) నుండి ఆపుతారు. మరియు స్వయంగా తాము కూడా అతనికి దూరంగా ఉంటారు. మరియు ఈ విధంగా వారు తమకు తామే నాశనం చేసుకుంటున్నారు. కాని వారది గ్రహించటం లేదు!

**27**. మరియు వారిని నరకం ముందు నిలబెట్టబడినపుడు, నీవు చూడగలిగితే! వారు ఇలా అంటారు: "అయ్యో మా పాడుగాను! మేము తిరిగి (పూర్వ జీవితంలోకి) పంపబడితే, మా ప్రభువు సూచనలను, అసత్యాలని తిరస్కరించ కుండా విశ్వాసులలో చేరిపోయే వారం కదా!"[2]

ٱنظُرۡ كَيۡفَ كَذَبُواْ عَلَىٰٓ أَنفُسِهِمۡۚ وَضَلَّ عَنۡهُم مَّا كَانُواْ يَفۡتَرُونَ ٢٤

وَمِنۡهُم مَّن يَسۡتَمِعُ إِلَيۡكَۖ وَجَعَلۡنَا عَلَىٰ قُلُوبِهِمۡ أَكِنَّةً أَن يَفۡقَهُوهُ وَفِيٓ ءَاذَانِهِمۡ وَقۡرٗاۚ وَإِن يَرَوۡاْ كُلَّ ءَايَةٖ لَّا يُؤۡمِنُواْ بِهَاۚ حَتَّىٰٓ إِذَا جَآءُوكَ يُجَٰدِلُونَكَ يَقُولُ ٱلَّذِينَ كَفَرُوٓاْ إِنۡ هَٰذَآ إِلَّآ أَسَٰطِيرُ ٱلۡأَوَّلِينَ ٢٥

وَهُمۡ يَنۡهَوۡنَ عَنۡهُ وَيَنۡـَٔوۡنَ عَنۡهُۖ وَإِن يُهۡلِكُونَ إِلَّآ أَنفُسَهُمۡ وَمَا يَشۡعُرُونَ ٢٦

وَلَوۡ تَرَىٰٓ إِذۡ وُقِفُواْ عَلَى ٱلنَّارِ فَقَالُواْ يَٰلَيۡتَنَا نُرَدُّ وَلَا نُكَذِّبَ بِـَٔايَٰتِ رَبِّنَا وَنَكُونَ مِنَ ٱلۡمُؤۡمِنِينَ ٢٧

**1**. చూడండి, 2:7.

**2**. చూడండి, 23:107-108 మరియు 32:12.

بَلْ بَدَا لَهُم مَّا كَانُوا۟ يُخْفُونَ مِن
قَبْلُ ۖ وَلَوْ رُدُّوا۟ لَعَادُوا۟ لِمَا نُهُوا۟ عَنْهُ
وَإِنَّهُمْ لَكَـٰذِبُونَ ﴿٢٨﴾

وَقَالُوٓا۟ إِنْ هِىَ إِلَّا حَيَاتُنَا ٱلدُّنْيَا
وَمَا نَحْنُ بِمَبْعُوثِينَ ﴿٢٩﴾

وَلَوْ تَرَىٰٓ إِذْ وُقِفُوا۟ عَلَىٰ رَبِّهِمْ ۚ قَالَ
أَلَيْسَ هَـٰذَا بِٱلْحَقِّ ۚ قَالُوا۟ بَلَىٰ
وَرَبِّنَا ۚ قَالَ فَذُوقُوا۟ ٱلْعَذَابَ بِمَا
كُنتُمْ تَكْفُرُونَ ﴿٣٠﴾

قَدْ خَسِرَ ٱلَّذِينَ كَذَّبُوا۟ بِلِقَآءِ ٱللَّهِ ۖ
حَتَّىٰٓ إِذَا جَآءَتْهُمُ ٱلسَّاعَةُ بَغْتَةً
قَالُوا۟ يَـٰحَسْرَتَنَا عَلَىٰ مَا فَرَّطْنَا فِيهَا
وَهُمْ يَحْمِلُونَ أَوْزَارَهُمْ عَلَىٰ
ظُهُورِهِمْ ۚ أَلَا سَآءَ مَا يَزِرُونَ ﴿٣١﴾

**28**. (వారు ఇలా అనటానికి కారణం), వాస్తవానికి వారు ఇంతవరకు దాచినదంతా వారికి బహిర్గతం కావటమే! మరియు ఒకవేళ వారిని (గత జీవితంలోకి) తిరిగి పంపినా, వారికి నిషేధించబడిన వాటినే వారు తిరిగి చేస్తారు. నిశ్చయంగా, వారు అసత్యవాదులు!

**29**. మరియు వారు: "మాకు ఇహలోక జీవితం తప్ప మరొక (జీవితం) లేదు మరియు మేము తిరిగి లేపబడము (మాకు పునరుత్థానం లేదు)!" అని అంటారు.

**30**. మరియు ఒకవేళ వారిని, తమ ప్రభువు ముందు నిలబెట్టబడినప్పుడు, నీవు చూడగలిగితే! ఆయన (అల్లాహ్) అంటాడు: "ఏమీ? ఇది (పునరుత్థానం) నిజం కాదా?" వారు జవాబిస్తారు: "అవును (నిజమే) మా ప్రభువు సాక్షిగా!" అప్పుడు ఆయన: "అయితే మీరు మీ సత్యతిరస్కారానికి ఫలితంగా శిక్షను అనుభవించండి!" అని అంటాడు.

**31**. వాస్తవంగా, అల్లాహ్‌ను కలుసు కోవటాన్ని అబద్ధంగా పరిగణించే వారే నష్టానికి గురి అయిన వారు![1] చివరకు అకస్మాత్తుగా అంతిమ ఘడియ వారిపైకి వచ్చినపుడు వారు: "అయ్యో మా దౌర్భాగ్యం! దీని విషయంలో మేమెంత అశ్రద్ధవహించాము కదా! అని వాపోతారు. (ఎందుకంటే) వారు తమ (పాపాల) బరువును తమ వీపులపై మోసుకొని ఉంటారు. అయ్యో! వారు మోసేభారం ఎంత దుర్భరమైనది కదా!

**1**. చూడండి, 'స.బు'ఖారీ, పుస్తకము-8, 'హదీస్' నం. 515

وَمَا ٱلۡحَيَوٰةُ ٱلدُّنۡيَآ إِلَّا لَعِبٞ وَلَهۡوٞۖ
وَلَلدَّارُ ٱلۡأٓخِرَةُ خَيۡرٞ لِّلَّذِينَ يَتَّقُونَۚ
أَفَلَا تَعۡقِلُونَ ٣٢
قَدۡ نَعۡلَمُ إِنَّهُۥ لَيَحۡزُنُكَ ٱلَّذِي يَقُولُونَۖ
فَإِنَّهُمۡ لَا يُكَذِّبُونَكَ وَلَٰكِنَّ
ٱلظَّٰلِمِينَ بِـَٔايَٰتِ ٱللَّهِ يَجۡحَدُونَ ٣٣
وَلَقَدۡ كُذِّبَتۡ رُسُلٞ مِّن قَبۡلِكَ فَصَبَرُواْ
عَلَىٰ مَا كُذِّبُواْ وَأُوذُواْ حَتَّىٰٓ أَتَىٰهُمۡ نَصۡرُنَاۚ
وَلَا مُبَدِّلَ لِكَلِمَٰتِ ٱللَّهِۚ وَلَقَدۡ جَآءَكَ
مِن نَّبَإِيْ ٱلۡمُرۡسَلِينَ ٣٤
وَإِن كَانَ كَبُرَ عَلَيۡكَ إِعۡرَاضُهُمۡ
فَإِنِ ٱسۡتَطَعۡتَ أَن تَبۡتَغِيَ نَفَقٗا فِي
ٱلۡأَرۡضِ أَوۡ سُلَّمٗا فِي ٱلسَّمَآءِ
فَتَأۡتِيَهُم بِـَٔايَةٖۚ وَلَوۡ شَآءَ ٱللَّهُ
لَجَمَعَهُمۡ عَلَى ٱلۡهُدَىٰۚ فَلَا تَكُونَنَّ
مِنَ ٱلۡجَٰهِلِينَ ٣٥

**32**. మరియు ఇహలోకజీవితం ఒక ఆట మరియు ఒక కాలక్షేపము మాత్రమే! మరియు దైవభీతి గలవారికి పరలోక వాసమే అత్యంత శ్రేష్ఠమైనది. ఏమీ? మీరు అర్థం చేసుకోలేరా?

**33**. (ఓ ప్రవక్తా!) వాస్తవానికి వారు పలుకుతున్న మాటల వలన నీకు దుఃఖము కలుగుతున్నదని మాకు బాగా తెలుసు. కానీ నిశ్చయంగా, వారు అసత్యుడవని తిరస్కరించేది నిన్నుకాదు! వాస్తవానికి ఆ దుర్మార్గులు అల్లాహ్ సూచనలను (ఆయాత్) నిరాకరిస్తున్నారు.[1]

**34**. మరియు వాస్తవంగా, నీకు పూర్వం చాలామంది ప్రవక్తలు, అసత్యవాదులని తిరస్కరించబడ్డారు. కాని వారు ఆ తిరస్కారాన్ని మరియు తమకు కలిగిన హింసలను, వారికి మా సహాయం అందే వరకూ సహనం వహించారు.[2] మరియు అల్లాహ్ మాటలను ఎవ్వరూ మార్చలేరు. మరియు వాస్తవానికి, పూర్వపు ప్రవక్తల కొన్ని సమాచారాలు ఇదివరకే నీకు అందాయి.

**35**. మరియు (ఓ ము'హమ్మద్!) వారి విముఖత నీకు భరించనిదైతే నీలో శక్తి ఉంటే, భూమిలో ఒక సొరంగం వెదకి, లేదా ఆకాశంలో ఒక నిచ్చెన వేసి, వారి కొరకు ఏదైనా అద్భుత సూచన తీసుకురా! మరియు అల్లాహ్ కోరితే వారందరినీ సన్మార్గం వైపునకు తెచ్చి ఉండేవాడు! కావున నీవు అజ్ఞానులలో చేరకు. (1/2)

---

**1**. 'అలీ (ర'ది.'అ.) కథనం: ''ఒకసారి అబూ-జహల్ (దైవప్రవక్త 'స'అస. యొక్క శత్రువు) ఇలా అన్నాడు: 'ఓ ము'హమ్మద్! ('స'అస) నేను, నిన్ను అసత్యుడవని అనటం లేదు. కాని నీవు వినిపించే వాటిని మటుకు సత్యాలని నమ్మలేను.' '' (తిర్మిజీ').

**2**. చూడండి, 40:51, 58:21 మరియు 37:171-172.

۞ إِنَّمَا يَسۡتَجِيبُ ٱلَّذِينَ يَسۡمَعُونَۘ وَٱلۡمَوۡتَىٰ يَبۡعَثُهُمُ ٱللَّهُ ثُمَّ إِلَيۡهِ يُرۡجَعُونَ ٣٦

36. * నిశ్చయంగా, ఎవరైతే (శ్రద్ధతో) వింటారో, వారే (సత్యసందేశాన్ని) స్వీకరిస్తారు. ఇక మృతులు (సత్య తిరస్కారులు) - అల్లాహ్ వారిని పునరుత్థరింపజేసినప్పుడు - (ప్రతిఫలం కొరకు) ఆయన వద్దకే రప్పింపబడతారు.

وَقَالُواْ لَوۡلَا نُزِّلَ عَلَيۡهِ ءَايَةٞ مِّن رَّبِّهِۦۚ قُلۡ إِنَّ ٱللَّهَ قَادِرٌ عَلَىٰٓ أَن يُنَزِّلَ ءَايَةٗ وَلَٰكِنَّ أَكۡثَرَهُمۡ لَا يَعۡلَمُونَ ٣٧

37. మరియు వారు: "ఇతని(ప్రవక్త)పై ఇతని ప్రభువు తరఫునుండి ఏదైనా అద్భుత సూచన ఎందుకు అవతరింప జేయబడలేదు?" అని అంటారు. ఇలా అను: "నిశ్చయంగా, అల్లాహ్! ఎలాంటి అద్భుత సూచననైనా అవతరింపజేయగల శక్తి కలిగి ఉన్నాడు, కాని వారిలో అనేకులకు ఇది తెలియదు."

وَمَا مِن دَآبَّةٖ فِي ٱلۡأَرۡضِ وَلَا طَٰٓئِرٖ يَطِيرُ بِجَنَاحَيۡهِ إِلَّآ أُمَمٌ أَمۡثَالُكُمۚ مَّا فَرَّطۡنَا فِي ٱلۡكِتَٰبِ مِن شَيۡءٖۚ ثُمَّ إِلَىٰ رَبِّهِمۡ يُحۡشَرُونَ ٣٨

38. మరియు భూమిపై సంచరించే ఏ జంతువు గానీ, లేక తన రెండు రెక్కలతో ఎగిరే ఏ పక్షి గానీ, మీలాంటి సంఘ జీవులుగా లేకుండా లేవు! మేము గ్రంథంలో ఏ కొరతా చేయలేదు.[1] తరువాత వారందరూ తమ ప్రభువు వద్దకు మరలింపబడతారు.

وَٱلَّذِينَ كَذَّبُواْ بِـَٔايَٰتِنَا صُمّٞ وَبُكۡمٞ فِي ٱلظُّلُمَٰتِۗ مَن يَشَإِ ٱللَّهُ يُضۡلِلۡهُ وَمَن يَشَأۡ يَجۡعَلۡهُ عَلَىٰ صِرَٰطٖ مُّسۡتَقِيمٖ ٣٩

39. మా సూచనలను అబద్ధాలని తిరస్కరించే వారు, చెవిటి వారు మరియు మూగవారు, అంధకారంలో పడిపోయిన వారు! అల్లాహ్ తాను కోరిన వారిని మార్గ భ్రష్టులుగా చేస్తాడు మరియు తాను కోరిన వారిని ఋజుమార్గంలో ఉంచుతాడు.[2]

---

1. చూడండి, 16:89.
2. చూడండి, 2:26, 4:88,143 అల్లాహ్ (సు.తా.) వారినే మార్గభ్రష్టులు చేస్తాడు, ఎవరైతే - విచక్షణా శక్తి మరియు తెలివి ఉండి కూడా - సత్యాన్ని తెలుసుకుని దానిపై అమలు చేయటానికి ప్రయత్నం చేయరో! సత్యం తెలిసినా దానిని నమ్మరో! అల్లాహుతా'ఆలా ఎవ్వరినీ కూడా బలవంతంగా మార్గభ్రష్టత్వంలో పడవేయడు. కాని షై'తాన్ ఎల్లప్పుడూ మానవుణ్ణి మార్గభ్రష్టత్వం వైపుకు ఆహ్వానిస్తుంటాడు.

40. వారితో అను: "ఏమీ? మీరు సత్యవంతులే అయితే ఆలోచించి (చెప్పండి!) ఒకవేళ మీపై అల్లాహ్ శిక్ష వచ్చిపడినా, లేదా అంతిమ ఘడియ వచ్చినా! మీరు అల్లాహ్‌ను తప్ప ఇతరులను ఎవరినైనా పిలుస్తారా?

41. "అలా కానేరదు! మీరు ఆయన (అల్లాహ్)నే పిలుస్తారు. ఆయన కోరితే ఆ ఆపదను మీపై నుండి తొలగిస్తాడు. అప్పుడు మీరు ఆయనకు సాటికల్పించే వారిని మరచిపోతారు!"

42. మరియు వాస్తవానికి మేము, నీకు పూర్వం (ఓ ము'హమ్మద్!) అనేక జాతుల వారి వద్దకు ప్రవక్తలను పంపాము. ఆ పిదప వారు వినమ్రులవటానికి, మేము వారిపై ఇబ్బందులను మరియు కష్టాలను కలుగజేశాము.

43. పిదప మా తరఫునుండి వారిపై ఆపద వచ్చినపుడు కూడా వారెందుకు వినమ్రులు కాలేదు? కాని వారి హృదయాలు మరింత కఠినమయ్యాయి మరియు షై'తాన్ వారు చేసే కర్మలన్నింటినీ వారికి మంచివిగా కనబడేటట్లు చేశాడు.

44. ఆ పిదప వారికి చేయబడిన బోధనను వారు మరచిపోగా, మేము వారి కొరకు సకల (భోగభాగ్యాల) ద్వారాలను తెరిచాము, చివరకు వారు తమకు ప్రసాదించబడిన ఆనందాలలో నిమగ్నులై ఉండగా, మేము వారిని అకస్మాత్తుగా (శిక్షించటానికి) పట్టుకున్నాము, అప్పుడు వారు నిరాశులయ్యారు.

قُلْ أَرَءَيْتَكُمْ إِنْ أَتَىٰكُمْ عَذَابُ
ٱللَّهِ أَوْ أَتَتْكُمُ ٱلسَّاعَةُ أَغَيْرَ ٱللَّهِ
تَدْعُونَ إِن كُنتُمْ صَٰدِقِينَ ﴿٤٠﴾

بَلْ إِيَّاهُ تَدْعُونَ فَيَكْشِفُ مَا
تَدْعُونَ إِلَيْهِ إِن شَآءَ وَتَنسَوْنَ مَا
تُشْرِكُونَ ﴿٤١﴾

وَلَقَدْ أَرْسَلْنَآ إِلَىٰٓ أُمَمٍ مِّن قَبْلِكَ
فَأَخَذْنَٰهُم بِٱلْبَأْسَآءِ وَٱلضَّرَّآءِ لَعَلَّهُمْ
يَتَضَرَّعُونَ ﴿٤٢﴾

فَلَوْلَآ إِذْ جَآءَهُم بَأْسُنَا تَضَرَّعُواْ
وَلَٰكِن قَسَتْ قُلُوبُهُمْ وَزَيَّنَ لَهُمُ
ٱلشَّيْطَٰنُ مَا كَانُواْ يَعْمَلُونَ
﴿٤٣﴾

فَلَمَّا نَسُواْ مَا ذُكِّرُواْ بِهِۦ
فَتَحْنَا عَلَيْهِمْ أَبْوَٰبَ كُلِّ شَىْءٍ
حَتَّىٰٓ إِذَا فَرِحُواْ بِمَآ أُوتُوٓاْ أَخَذْنَٰهُم
بَغْتَةً فَإِذَا هُم مُّبْلِسُونَ ﴿٤٤﴾

فَقُطِعَ دَابِرُ ٱلْقَوْمِ ٱلَّذِينَ ظَلَمُوا۟ ۚ وَٱلْحَمْدُ لِلَّهِ رَبِّ ٱلْعَـٰلَمِينَ ﴿٤٥﴾

**45**. ఈ విధంగా దుర్మార్గానికి పాల్పడిన వారు సమూలంగా నిర్మూలించ బడ్డారు. మరియు సర్వ లోకాలకు పోషకుడైన అల్లాహ్ మాత్రమే సర్వ స్తోత్రాలకు అర్హుడు.

قُلْ أَرَءَيْتُمْ إِنْ أَخَذَ ٱللَّهُ سَمْعَكُمْ وَأَبْصَـٰرَكُمْ وَخَتَمَ عَلَىٰ قُلُوبِكُم مَّنْ إِلَـٰهٌ غَيْرُ ٱللَّهِ يَأْتِيكُم بِهِ ۗ ٱنظُرْ كَيْفَ نُصَرِّفُ ٱلْـَٔايَـٰتِ ثُمَّ هُمْ يَصْدِفُونَ ﴿٤٦﴾

**46**. ఇలా అను: "ఏమీ? మీరు ఆలోచించారా (చెప్పండి)? అల్లాహ్ మీ వినికిడినీ మరియు మీ చూపునూ పోగొట్టి, మీ హృదయాలపై ముద్రవేస్తే! అల్లాహ్ తప్ప ఏ దేవుడైనా వాటిని మీకు తిరిగి ఇవ్వగలడా?" చూడు! మేము ఏ విధంగా మా సూచనలను వారికి తెలుపు తున్నామో! అయినా వారు (వాటి నుండి) తప్పించుకొని పోతున్నారు.

قُلْ أَرَءَيْتَكُمْ إِنْ أَتَىٰكُمْ عَذَابُ ٱللَّهِ بَغْتَةً أَوْ جَهْرَةً هَلْ يُهْلَكُ إِلَّا ٱلْقَوْمُ ٱلظَّـٰلِمُونَ ﴿٤٧﴾

**47**. ఇలా అను: "ఏమీ? మీరు ఆలోచించారా (చెప్పండి)? అల్లాహ్ శిక్ష మీపై (రాత్రివేళ) అకస్మాత్తుగా గానీ, లేక (పగటివేళ) బహిరంగంగా గానీ వచ్చి పడితే, దుర్మార్గులు తప్ప ఇతరులు నాశనం చేయబడతారా?"[1]

وَمَا نُرْسِلُ ٱلْمُرْسَلِينَ إِلَّا مُبَشِّرِينَ وَمُنذِرِينَ ۖ فَمَنْ ءَامَنَ وَأَصْلَحَ فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ﴿٤٨﴾

**48**. మరియు మేము ప్రవక్తలను కేవలం శుభవార్తలు ఇచ్చేవారుగా మరియు హెచ్చరికలు చేసేవారుగా మాత్రమే పంపుతాము. కావున ఎవరైతే విశ్వసించి (తమ నడవడికను) సరిదిద్దు కుంటారో, అలాంటి వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా!

وَٱلَّذِينَ كَذَّبُوا۟ بِـَٔايَـٰتِنَا يَمَسُّهُمُ ٱلْعَذَابُ بِمَا كَانُوا۟ يَفْسُقُونَ ﴿٤٩﴾

**49**. కాని మా సూచనలను అబద్ధాలని తిరస్కరించే వారికి, తమ అవిధేయతకు ఫలితంగా తప్పకుండా శిక్ష పడుతుంది.[2]

---

**1**. చూడండి, 10:50.

**2**. చూడండి 'స.ముస్లిం, పు.1, అధ్యాయం-240. అబూ-హురైరా (ర'ది.'అ.) కథనం:

قُل لَّآ أَقُولُ لَكُمۡ عِندِي خَزَآئِنُ ٱللَّهِ وَلَآ أَعۡلَمُ ٱلۡغَيۡبَ وَلَآ أَقُولُ لَكُمۡ إِنِّي مَلَكٌۖ إِنۡ أَتَّبِعُ إِلَّا مَا يُوحَىٰٓ إِلَيَّۚ قُلۡ هَلۡ يَسۡتَوِي ٱلۡأَعۡمَىٰ وَٱلۡبَصِيرُۚ أَفَلَا تَتَفَكَّرُونَ ﴿٥٠﴾

**50**. (ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను: "నా వద్ద అల్లాహ్ కోశాగారాలు ఉన్నాయని గానీ, లేదా నాకు అగోచర జ్ఞానమున్నదని గానీ, నేను మీతో అనడంలేదు. లేదా నేను దేవదూతనని కూడా అనడం లేదు. కాని నేను కేవలం నాపై అవతరింపజేయబడిన దివ్యజ్ఞానాన్ని (వహీని) మాత్రమే అనుసరిస్తున్నాను."[1] వారిని ఇలా అడుగు: "ఏమీ? అంధుడూ మరియు దృష్టిగల వాడు సమానులా? అయితే మీరెందుకు ఆలోచించరు?"

وَأَنذِرۡ بِهِ ٱلَّذِينَ يَخَافُونَ أَن يُحۡشَرُوٓاْ إِلَىٰ رَبِّهِمۡ لَيۡسَ لَهُم مِّن دُونِهِۦ وَلِيّٞ وَلَا شَفِيعٞ لَّعَلَّهُمۡ يَتَّقُونَ ﴿٥١﴾

**51**. మరియు తమ ప్రభువు సన్నిధిలో సమావేశపరచబడతారని భయపడే వారికి ఆయన తప్ప వేరే రక్షించేవాడు గానీ, సిఫారసు చేసేవాడు గానీ ఉండడని, దీని (ఈ ఖుర్ఆన్) ద్వారా హెచ్చరించు, బహుశా వారు దైవభీతి గలవారు అవుతారేమో!

وَلَا تَطۡرُدِ ٱلَّذِينَ يَدۡعُونَ رَبَّهُم بِٱلۡغَدَوٰةِ وَٱلۡعَشِيِّ يُرِيدُونَ وَجۡهَهُۥۖ مَا عَلَيۡكَ مِنۡ حِسَابِهِم مِّن

**52**. మరియు ఎవరైతే తమ ప్రభువును ఉదయం మరియు సాయంత్రం ప్రార్థిస్తూ, ఆయన ముఖాన్ని[2] (చూడ)గోరుతున్నారో, వారిని నీవు దూరంచేయకు. వారిలెక్క కొరకు నీవు ఎంత మాత్రమూ జవాబు

---

"దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'ఎవరిచేతిలోనైతే నా ప్రాణముందో ఆ అల్లాహ్ (సు.తా.) సాక్షిగా! ఈ కాలపు యూదులు మరియు క్రైస్తవులలో ఎవరేగానీ నా గురించి విని నా సందేశాన్ని విశ్వసించకుండా మరణిస్తారో వారు నరకవాసులవుతారు.' "

**1**. చూడండి, 7:188.

**2**. ప్రళయదినాన విశ్వాసులకు లభించే అతి గొప్ప వరం అల్లాహ్ (సు.తా.) దర్శనం. అందుకే ఖుర్ఆన్‌లో అనేకచోట్లలో: "అల్లాహ్ ముఖాన్ని చూడగోరేవారు..." అని చెప్పబడింది: "ఓ ప్రవక్తా: 'ధనవంతులు, పేరు ప్రఖ్యాతులు గల అవిశ్వాసులైన ముష్రిక్‌ల మాటలలోపడి - ఇస్లాం స్వీకరించి తమ ప్రభువైన అల్లాహ్ (సు.తా.)ను ప్రార్థించే - పేదవారిని, బానిసలను దూరంచేయకు.' "

شَىۡءٍ وَمَا مِنۡ حِسَابِكَ عَلَيۡهِم مِّن شَىۡءٍ فَتَطۡرُدَهُمۡ فَتَكُونَ مِنَ ٱلظَّٰلِمِينَ ﴿٥٢﴾

దారుడవు కావు. మరియు నీ లెక్కకొరకు వారూ జవాబుదారులు కారు. కావున నీవు వారిని దూరంచేస్తే నీవు దుర్మార్గులలో చేరినవాడవవుతావు.

وَكَذَٰلِكَ فَتَنَّا بَعۡضَهُم بِبَعۡضٍ لِّيَقُولُوٓاْ أَهَٰٓؤُلَآءِ مَنَّ ٱللَّهُ عَلَيۡهِم مِّنۢ بَيۡنِنَآۗ أَلَيۡسَ ٱللَّهُ بِأَعۡلَمَ بِٱلشَّٰكِرِينَ ﴿٥٣﴾

53. మరియు ఈ విధంగా, మేము వారిలోని కొందరిని మరికొందరి ద్వారా పరీక్షకు గురిచేశాము. వారు (విశ్వాసులను చూసి): "ఏమీ? మా అందరిలో, వీరినేనా అల్లాహ్ అనుగ్రహించింది?"[1] అని అంటారు. ఏమీ? ఎవరు కృతజ్ఞులో అల్లాహ్‌కు తెలియదా?[2]

وَإِذَا جَآءَكَ ٱلَّذِينَ يُؤۡمِنُونَ بِـَٔايَٰتِنَا فَقُلۡ سَلَٰمٌ عَلَيۡكُمۡۖ كَتَبَ رَبُّكُمۡ عَلَىٰ نَفۡسِهِ ٱلرَّحۡمَةَۖ أَنَّهُۥ مَنۡ عَمِلَ مِنكُمۡ سُوٓءَۢا بِجَهَٰلَةٖ ثُمَّ تَابَ مِنۢ بَعۡدِهِۦ وَأَصۡلَحَ فَأَنَّهُۥ غَفُورٞ رَّحِيمٞ ﴿٥٤﴾

54. మరియు మా సూచనలను విశ్వసించిన వారు నీ వద్దకు వచ్చినపుడు నీవు వారితో ఇలా అను: "మీకు శాంతి కలుగు గాక (సలాం)! మీ ప్రభువు కరుణించటమే తనపై విధిగా నిర్ణయించుకున్నాడు. నిశ్చయంగా, మీలో ఎవరైనా అజ్ఞానం వల్ల తప్పుచేసి, ఆ తరువాత పశ్చాత్తాపపడి సరిదిద్దుకుంటే! నిశ్చయంగా, ఆయన క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత."

وَكَذَٰلِكَ نُفَصِّلُ ٱلۡأٓيَٰتِ وَلِتَسۡتَبِينَ سَبِيلُ ٱلۡمُجۡرِمِينَ ﴿٥٥﴾

55. మరియు పాపుల మార్గం స్పష్టపడటానికి, మేము ఈ విధంగా మా సూచనలను వివరంగా తెలుపుతున్నాము.

---

1. చూడండి, 46:11, ఈ మాటలు ధనవంతులు మరియు పేరు ప్రఖ్యాతులు గల అవిశ్వాసులైన ముష్రికులు మొట్టమొదటి కాలంలో ఇస్లాం స్వీకరించిన పేదవారినీ, బానిసలనూ చూసి అన్నారు.
2. "అల్లాహ్ (సు.తా.) మీ రూపురేఖలు చూడడు. ఆయన కేవలం మీ హృదయాలు మరియు మీ కర్మలు మాత్రమే చూస్తాడు." ('స. ముస్లిం, కితాబ్ అల్-బిర్ర్, బాబ్ అత్-త'హ్రీమ్).

قُلْ إِنِّي نُهِيتُ أَنْ أَعْبُدَ ٱلَّذِينَ تَدْعُونَ مِن دُونِ ٱللَّهِ ۚ قُل لَّآ أَتَّبِعُ أَهْوَآءَكُمْ ۙ قَدْ ضَلَلْتُ إِذًا وَمَآ أَنَا۠ مِنَ ٱلْمُهْتَدِينَ ﴿٥٦﴾

**56.** ఇలా అను: "నిశ్చయంగా అల్లాహ్‌ను వదిలి, మీరు ప్రార్థించే ఈ ఇతరులను (కల్పిత దైవాలను) ఆరాధించటం నుండి నేను వారించబడ్డాను." మరియు ఇలా అను: "నేను మీ కోరికలను అనుసరించను. (అలా చేస్తే!) వాస్తవానికి నేనూ మార్గభ్రష్టుడను అవుతాను. మరియు నేను సన్మార్గం చూపబడిన వారిలో ఉండను."

قُلْ إِنِّي عَلَىٰ بَيِّنَةٍ مِّن رَّبِّي وَكَذَّبْتُم بِهِۦ ۚ مَا عِندِي مَا تَسْتَعْجِلُونَ بِهِۦٓ ۚ إِنِ ٱلْحُكْمُ إِلَّا لِلَّهِ ۖ يَقُصُّ ٱلْحَقَّ ۖ وَهُوَ خَيْرُ ٱلْفَٰصِلِينَ ﴿٥٧﴾

**57.** ఇలా అను: "నిశ్చయంగా, నేను నా ప్రభువు తరఫునుండి లభించిన స్పష్టమైన ప్రమాణంపై ఉన్నాను. మీరు దానిని అబద్ధమని నిరాకరించారు. మీరు తొందరపెట్టే విషయం నా దగ్గరలేదు. నిర్ణయాధికారం కేవలం అల్లాహ్‌కే ఉంది. ఆయన సత్యాన్ని తెలుపుతున్నాడు. మరియు ఆయనే సర్వోత్తమమైన న్యాయాధికారి!"[1]

قُل لَّوْ أَنَّ عِندِي مَا تَسْتَعْجِلُونَ بِهِۦ لَقُضِيَ ٱلْأَمْرُ بَيْنِي وَبَيْنَكُمْ ۗ وَٱللَّهُ أَعْلَمُ بِٱلظَّٰلِمِينَ ﴿٥٨﴾

**58.** ఇలా అను: "ఒకవేళ వాస్తవానికి మీరు తొందరపెట్టే విషయం (శిక్ష) నా అధీనంలో ఉండినట్లయితే, నాకూ మీకూ మధ్య తీర్పు ఎప్పుడో జరిగిపోయి ఉండేది. మరియు అల్లాహ్‌కు దుర్మార్గులను గురించి బాగా తెలుసు." (5/8)

۞ وَعِندَهُۥ مَفَاتِحُ ٱلْغَيْبِ لَا يَعْلَمُهَآ إِلَّا هُوَ ۚ وَيَعْلَمُ مَا فِي ٱلْبَرِّ وَٱلْبَحْرِ ۚ وَمَا تَسْقُطُ مِن وَرَقَةٍ

**59.** * మరియు అగోచర విషయాల తాళపు చెవులు ఆయన (అల్లాహ్) వద్దనే ఉన్నాయి. వాటిని, ఆయన తప్ప మరెవ్వరూ ఎరుగరు. మరియు భూమిలోనూ, సముద్రంలోనూ ఉన్నదంతా

1. చూడండి, 8:32-33.

إِلَّا يَعۡلَمُهَا وَلَا حَبَّةٖ فِي ظُلُمَٰتِ ٱلۡأَرۡضِ وَلَا رَطۡبٖ وَلَا يَابِسٍ إِلَّا فِي كِتَٰبٖ مُّبِينٖ ٥٩

ఆయనకు తెలుసు. మరియు ఆయనకు తెలియకుండా ఏ చెట్టు ఆకు కూడా రాలదు. మరియు భూమిలోని చీకటి పొరలలో ఉన్న ప్రతి గింజ, అది పచ్చిది కానీ, ఎండినది కానీ, అంతా స్పష్టంగా ఒక గ్రంథంలో (వ్రాయబడి) ఉంది.[1]

وَهُوَ ٱلَّذِي يَتَوَفَّىٰكُم بِٱلَّيۡلِ وَيَعۡلَمُ مَا جَرَحۡتُم بِٱلنَّهَارِ ثُمَّ يَبۡعَثُكُمۡ فِيهِ لِيُقۡضَىٰٓ أَجَلٞ مُّسَمّٗىۖ ثُمَّ إِلَيۡهِ مَرۡجِعُكُمۡ ثُمَّ يُنَبِّئُكُم بِمَا كُنتُمۡ تَعۡمَلُونَ ٦٠

**60**. మరియు ఆయనే రాత్రివేళ (మీరు నిద్రపోయినపుడు) మీ ఆత్మలను తీసు (స్వాధీనపరచు)కుంటాడు[2] మరియు పగటివేళ మీరు చేసేదంతా ఆయనకు తెలుసు. ఆ పిదప నిర్ణీతగడువు, పూర్తి అయ్యేవరకు దానిలో (పగటివేళలో) మిమ్మల్ని తిరిగి లేపుతాడు. ఆ తరువాత ఆయన వైపునకే మీ మరలింపుఉంది, అప్పుడు (పునరుత్థాన దినమున) ఆయన మీరు చేస్తూ ఉన్న కర్మలన్నీ మీకు తెలుపుతాడు.[3]

وَهُوَ ٱلۡقَاهِرُ فَوۡقَ عِبَادِهِۦۖ وَيُرۡسِلُ عَلَيۡكُمۡ حَفَظَةً حَتَّىٰٓ إِذَا جَآءَ أَحَدَكُمُ ٱلۡمَوۡتُ تَوَفَّتۡهُ رُسُلُنَا وَهُمۡ لَا يُفَرِّطُونَ ٦١

**61**. ఆయన తన దాసులపై సంపూర్ణ అధికారం[4] కలిగిఉన్నాడు. మరియు ఆయన మీపై కనిపెట్టుకొని ఉండేవారిని పంపుతాడు. చివరకు మీలో ఒకరికి చావు సమయం వచ్చినపుడు, మేము పంపిన దూతలు అతనిని మరణింపజేస్తారు మరియు వారెప్పుడూ అశ్రద్ధ చూపరు.[5]

---

**1**. అగోచర విషయాల తాళపుచెవులు ఐదు ఉన్నాయి. 1) పునరుత్థాన దినపు జ్ఞానం, 2) వర్షం వచ్చే సమయం 3) తల్లి గర్భాశయంలో ఉన్న బిడ్డ విషయం, 4) రేపు సంభవించబోయే విషయం, 5) మరణం సంభవించే చోటు. (స'హీ'హ్ బు'ఖారీ, తఫ్సీర్ సూరహ్ అల్-అన్ఆమ్).

**2**. చూడండి, 39:42. చావును గురించి అవతరింపజేయబడిన మొదటి ఆయత్.

**3**. చూడండి, 78:9-11.

**4**. చూడండి అల్-ఖాహిరు, 6:18.

**5**. చూడండి, 32:11లో ఒక మరణదైవదూత పేర్కొనబడ్డాడు. కానీ, ఈ ఆయత్‌లో దైవదూతలు, అనిఉంది. ఇదేవిధంగా 4:97మరియు6:93లలో కూడా దైవదూతలు, అని

62. తరువాత వారు, వారి నిజమైన[1] సంరక్షకుడు, అల్లాహ్ సన్నిధిలోకి చేర్చబడతారు. తెలుసుకోండి! సర్వ న్యాయాధికారం ఆయనదే! మరియు లెక్క తీసుకోవటంలో ఆయన అతి శీఘ్రుడు!

ثُمَّ رُدُّوٓاْ إِلَى ٱللَّهِ مَوۡلَىٰهُمُ ٱلۡحَقِّۚ أَلَا لَهُ ٱلۡحُكۡمُ وَهُوَ أَسۡرَعُ ٱلۡحَٰسِبِينَ ٦٢

63. " 'మమ్మల్ని ఈ ఆపద నుండి కాపాడితే మేమెంతో కృతజ్ఞులమవుతాము.' అని మీరు వినమ్రులై రహస్యంగా వేడుకున్నపుడు! భూమి మరియు సముద్రాల చీకట్లనుండి మిమ్మల్ని కాపాడేది ఎవరు?" అని వారిని అడుగు.

قُلۡ مَن يُنَجِّيكُم مِّن ظُلُمَٰتِ ٱلۡبَرِّ وَٱلۡبَحۡرِ تَدۡعُونَهُۥ تَضَرُّعٗا وَخُفۡيَةٗ لَّئِنۡ أَنجَىٰنَا مِنۡ هَٰذِهِۦ لَنَكُونَنَّ مِنَ ٱلشَّٰكِرِينَ ٦٣

64. "అల్లాహ్ మాత్రమే మిమ్మల్ని దాని నుండి మరియు ప్రతి విపత్తునుండి కాపాడుతున్నాడు. అయినా మీరు ఆయనకు సాటి (భాగస్వాములు) కల్పిస్తున్నారు." అని వారికి చెప్పు.

قُلِ ٱللَّهُ يُنَجِّيكُم مِّنۡهَا وَمِن كُلِّ كَرۡبٖ ثُمَّ أَنتُمۡ تُشۡرِكُونَ ٦٤

65. ఇలా అను: "ఆయన మీ పైనుండి గానీ, లేదా మీ పాదాల క్రిందినుండి గానీ, మీపై ఆపద అవతరింపజేయగల సామర్థ్యం కలిగిఉన్నాడు; మరియు మిమ్మల్ని తెగలు తెగలుగా చేసి, పరస్పర కలహాల రుచి చూపగలిగే (శక్తి కూడా) కలిగి ఉన్నాడు."[2] చూడు!

قُلۡ هُوَ ٱلۡقَادِرُ عَلَىٰٓ أَن يَبۡعَثَ عَلَيۡكُمۡ عَذَابٗا مِّن فَوۡقِكُمۡ أَوۡ مِن تَحۡتِ أَرۡجُلِكُمۡ أَوۡ يَلۡبِسَكُمۡ شِيَعٗا وَيُذِيقَ بَعۡضَكُم بَأۡسَ بَعۡضٍۗ ٱنظُرۡ كَيۡفَ نُصَرِّفُ

ఉంది. దీనివల్ల స్పష్టమయ్యేదేమిటంటే మరణింపజేసేదైవదూత ఒక్కడే, కాని ఇతరులు అతని సహాయకులు. ఆ మరణింపజేసే దైవదూత పేరు 'ఇ'జ్రాయీ'ల్. (ఇబ్నె-కసీ'ర్).

1. అల్-హఖ్ఖ్: The Truth, The Really Existing, whose existence and divinity are proved to be True. పరమ సత్యం, నిజం, యథార్థం. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

2. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'నేను మూడు దువాలు చేశాను: 1) నా ఉమ్మత్ నీటిలో ముంచబడి నాశనంచేయబడగూడదని, 2) కరువుకు గురిఅయి నాశనం చేయబడగూడదని, 3) వారు పరస్పరం యుద్ధాలు చేసుకొనగూడదని. అల్లాహ్ (సు.తా.) మొదటి రెండు దువాలు అంగీకరించాడు. కాని మూడవ దువానుండి నన్ను ఆపాడు. ('స'హీ'హ్ ముస్లిం. 2216) ఇంకా చూడండి, 35:43.

ٱلۡأٓيَٰتِ لَعَلَّهُمۡ يَفۡقَهُونَ ۝٦٥

బహుశా వారు (సత్యాన్ని) గ్రహిస్తారేమోనని, మేము ఏ విధంగా మా సూచనలను వివిధ రూపాలలో వివరిస్తున్నామో!

وَكَذَّبَ بِهِۦ قَوۡمُكَ وَهُوَ ٱلۡحَقُّۚ قُل لَّسۡتُ عَلَيۡكُم بِوَكِيلٖ ۝٦٦

**66**. మరియు ఇది (ఈ ఖుర్ఆన్) సత్యమైనది అయినా నీ జాతివారు దీనిని అబద్ధమని నిరాకరించారు. వారితో ఇలా అను: "నేను మీ కొరకు బాధ్యుడను (రక్షకుడను) కాను!"[1]

لِّكُلِّ نَبَإٖ مُّسۡتَقَرّٞۚ وَسَوۡفَ تَعۡلَمُونَ ۝٦٧

**67**. ప్రతి వార్తకు (విషయానికి) ఒక గడువు నియమింపబడి ఉంది. మరియు త్వరలోనే మీరిది తెలుసుకోగలరు.

وَإِذَا رَأَيۡتَ ٱلَّذِينَ يَخُوضُونَ فِيٓ ءَايَٰتِنَا فَأَعۡرِضۡ عَنۡهُمۡ حَتَّىٰ يَخُوضُواْ فِي حَدِيثٍ غَيۡرِهِۦۚ وَإِمَّا يُنسِيَنَّكَ ٱلشَّيۡطَٰنُ فَلَا تَقۡعُدۡ بَعۡدَ ٱلذِّكۡرَىٰ مَعَ ٱلۡقَوۡمِ ٱلظَّٰلِمِينَ ۝٦٨

**68**. మరియు మా సూచన (ఆయతు)లను గురించి వారు వృథా మాటలు (దూషణలు) చేస్తూ ఉండటం నీవు చూస్తే, వారు తమ ప్రసంగం మార్చేవరకు నీవు వారినుండి దూరంగానే ఉండు. మరియు ఒకవేళ షైతాను నిన్ను మరపింపజేస్తే! జ్ఞప్తికి వచ్చిన తరువాత అలాంటి దుర్మార్గులైన వారితో కలసి కూర్చోకు.[2]

وَمَا عَلَى ٱلَّذِينَ يَتَّقُونَ مِنۡ حِسَابِهِم مِّن شَيۡءٖ وَلَٰكِن ذِكۡرَىٰ لَعَلَّهُمۡ يَتَّقُونَ ۝٦٩

**69**. మరియు దైవభీతి గలవారు, వారి (అవిశ్వాసుల) లెక్కకు ఏ మాత్రం బాధ్యులు కారు. కాని వారికి హితోపదేశం చేయటం, విశ్వాసుల (ధర్మం). బహుశా, వారు కూడా దైవభీతి గలవారు కావచ్చు!

---

**1**. అంటే అల్లాహ్ (సు.తా.) సందేశాన్ని మీకు యావత్తు అందజేయుటమే నా (స'అస) పని. కాని మిమ్మల్ని దానిపై అమలు చేసేటట్లు చేయడం నా పని కాదు. చూడండి. 18:29.

**2**. చూడండి, 4:140.

**70**. మరియు తమ ధర్మాన్ని ఒక ఆటగా మరియు కాలక్షేపంగా భావించే వారిని నీవు వదలిపెట్టు. మరియు ఇహలోక జీవితం వారిని మోసపుచ్చింది. ఏ వ్యక్తి గానీ తన కర్మల ఫలితంగా నాశనం చేయబడకుండా ఉండటానికి దీని (ఈ ఖుర్ఆన్) ద్వారా హితోపదేశం చెయ్యి. అల్లాహ్ తప్ప, అతనికి రక్షించే వాడు గానీ, సిఫారసు చేసేవాడు గానీ, ఎవ్వడూ ఉండడు. మరియు అతడు ఎలాంటి పరిహారం ఇవ్వదలచుకున్నా అది అంగీకరించబడదు. ఇలాంటి వారే తమకర్మల ఫలితంగా నాశనం చేయబడే వారు. వారికి తమ సత్యతిరస్కారానికి ఫలితంగా, త్రాగటానికి సలసలకాగే నీరు మరియు బాధాకరమైన శిక్ష గలవు.

**71**. (ఓ ముహమ్మద్!) వారితో అను: "ఏమీ? అల్లాహ్‌ను వదలి మాకు లాభం గానీ, నష్టంగానీ కలిగించలేని వారిని మేము ప్రార్థించాలా? మరియు అల్లాహ్ మార్గదర్శకత్వం దొరికిన తరువాత కూడా మా మడమలపై వెనుదిరిగిపోవాలా? అతనివలే ఎవడైతే తన సహచరులు సన్మార్గం వైపుకు పిలుస్తూ: 'మా వైపుకురా!' అంటున్నా - షైతాన్ మోసపుచ్చటం వలన - భూమిలో ఏమీ తోచకుండా, తిరుగుతాడో?"[1] వారితో అను: "నిశ్చయంగా అల్లాహ్ మార్గదర్శకత్వమే నిజమైన మార్గదర్శకత్వము.[2] మరియు మేము సర్వలోకాల ప్రభువుకు విధేయులంగా (ముస్లింలగా) ఉండాలని ఆజ్ఞాపించబడ్డాము;

وَذَرِ ٱلَّذِينَ ٱتَّخَذُواْ دِينَهُمۡ
لَعِبٗا وَلَهۡوٗا وَغَرَّتۡهُمُ ٱلۡحَيَوٰةُ
ٱلدُّنۡيَاۚ وَذَكِّرۡ بِهِۦٓ أَن تُبۡسَلَ
نَفۡسُۢ بِمَا كَسَبَتۡ لَيۡسَ لَهَا مِن
دُونِ ٱللَّهِ وَلِيّٞ وَلَا شَفِيعٞ وَإِن
تَعۡدِلۡ كُلَّ عَدۡلٖ لَّا يُؤۡخَذۡ مِنۡهَآۗ
أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ أُبۡسِلُواْ بِمَا كَسَبُواْۖ
لَهُمۡ شَرَابٞ مِّنۡ حَمِيمٖ وَعَذَابٌ
أَلِيمُۢ بِمَا كَانُواْ يَكۡفُرُونَ ٧٠
قُلۡ أَنَدۡعُواْ مِن دُونِ ٱللَّهِ مَا لَا
يَنفَعُنَا وَلَا يَضُرُّنَا وَنُرَدُّ عَلَىٰٓ
أَعۡقَابِنَا بَعۡدَ إِذۡ هَدَىٰنَا ٱللَّهُ كَٱلَّذِي
ٱسۡتَهۡوَتۡهُ ٱلشَّيَٰطِينُ فِي ٱلۡأَرۡضِ
حَيۡرَانَ لَهُۥٓ أَصۡحَٰبٞ يَدۡعُونَهُۥٓ إِلَى
ٱلۡهُدَى ٱئۡتِنَاۗ قُلۡ إِنَّ هُدَى ٱللَّهِ
هُوَ ٱلۡهُدَىٰۖ وَأُمِرۡنَا لِنُسۡلِمَ لِرَبِّ
ٱلۡعَٰلَمِينَ ٧١

1. చూడండి, 2:14, 14:22 మరియు 15:17.
2. చూడండి, 16:37.

وَأَنْ أَقِيمُواْ ٱلصَّلَوٰةَ وَٱتَّقُوهُۚ وَهُوَ ٱلَّذِيٓ إِلَيۡهِ تُحۡشَرُونَ ٧٢

72. "మరియు నమా'జ్‌ను స్థాపించమని మరియు ఆయన యందు భయభక్తులు కలిగి ఉండమని కూడా.[1] మరియు మీరంతా ఆయన (అల్లాహ్) సమక్షంలో జమచేయబడతారు."

وَهُوَ ٱلَّذِي خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ بِٱلۡحَقِّۖ وَيَوۡمَ يَقُولُ كُن فَيَكُونُۚ قَوۡلُهُ ٱلۡحَقُّۚ وَلَهُ ٱلۡمُلۡكُ يَوۡمَ يُنفَخُ فِي ٱلصُّورِۚ عَٰلِمُ ٱلۡغَيۡبِ وَٱلشَّهَٰدَةِۚ وَهُوَ ٱلۡحَكِيمُ ٱلۡخَبِيرُ ٧٣

73. మరియు ఆకాశాలను మరియు భూమిని నిజానికి[2] సృష్టించింది ఆయనే! మరియు ఆ రోజు ఆయన: "అయిపో!" అని అనగానే, అది అయిపోతుంది. ఆయన మాటే సత్యం! మరియు బాకా ('సూర్) ఊదబడే రోజు,[3] సార్వభౌమాధికారం ఆయనదే. ఆయనే అగోచర మరియు గోచర విషయాలన్నీ తెలిసినవాడు. మరియు ఆయన మహా వివేచనాపరుడు, సర్వం తెలిసినవాడు. (3/4)

۞ وَإِذۡ قَالَ إِبۡرَٰهِيمُ لِأَبِيهِ ءَازَرَ أَتَتَّخِذُ أَصۡنَامًا ءَالِهَةًۖ إِنِّيٓ أَرَىٰكَ وَقَوۡمَكَ فِي ضَلَٰلٖ مُّبِينٖ ٧٤

74. * (జ్ఞాపకం చేసుకోండి!) ఇబ్రాహీమ్ తన తండ్రి ఆ'జర్‌తో ఇలా అన్న విషయం: "ఏమీ? నీవు విగ్రహాలను ఆరాధ్య దైవాలుగా చేసుకుంటున్నావా? నిశ్చయంగా నేను, నిన్ను మరియు నీ జాతి వారిని స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో ఉన్నవారిగా చూస్తున్నాను!"[4]

---

1. చూడండి, 2: 45.

2. అంటే ఒక ఉద్దేశంతో.

3. 'హదీస్'లో ఇలా ఉంది: ఇస్రాఫీల్ ('అ.స.) కొమ్ము (బాకా)ను తన నోటిలో పెట్టుకొని, తలవంచి, దానిని ఊదటానికి అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞ కొరకు వేచి ఉంటారు. (ఇబ్నె-కసీ'ర్, అబూ-దావూద్, తిర్మిజీ', 'హదీస్' నం. 4742, 4030, 3244). 'సూరున్: Trumpet, బాకా, కొమ్ము, తుత్తార, శంఖం.

4. చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం. 569.

وَكَذَٰلِكَ نُرِيٓ إِبۡرَٰهِيمَ مَلَكُوتَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَلِيَكُونَ مِنَ ٱلۡمُوقِنِينَ ٧٥

75. మరియు ఈ విధంగా దృఢనమ్మకం ఉన్నవారిలో చేరాలని, మేము ఇబ్రాహీమ్‌కు భూమ్యాకాశాలపై ఉన్న మా సామ్రాజ్య వ్యవస్థను చూపించాము.

فَلَمَّا جَنَّ عَلَيۡهِ ٱلَّيۡلُ رَءَا كَوۡكَبٗاۖ قَالَ هَٰذَا رَبِّيۖ فَلَمَّآ أَفَلَ قَالَ لَآ أُحِبُّ ٱلۡأٓفِلِينَ ٧٦

76. ఆ పిదప రాత్రి చీకటి అతనిపై క్రమ్ముకున్నప్పుడు, అతను ఒక నక్షత్రాన్ని చూసి: "ఇది నా ప్రభువు!" అని అన్నాడు. కాని, అది అస్తమించగానే: "అస్తమించే వాటిని నేను ప్రేమించను!" అని అన్నాడు.

فَلَمَّا رَءَا ٱلۡقَمَرَ بَازِغٗا قَالَ هَٰذَا رَبِّيۖ فَلَمَّآ أَفَلَ قَالَ لَئِن لَّمۡ يَهۡدِنِي رَبِّي لَأَكُونَنَّ مِنَ ٱلۡقَوۡمِ ٱلضَّآلِّينَ ٧٧

77. ఆ తరువాత ఉదయించే చంద్రుణ్ణి చూసి: "ఇది నా ప్రభువు!" అని అన్నాడు. కాని అది అస్తమించగానే, ఒకవేళ నా ప్రభువు నాకు సన్మార్గం చూపకపోతే నేను నిశ్చయంగా, మార్గభ్రష్టులైన వారిలో చేరిపోయేవాడను!" అని అన్నాడు.

فَلَمَّا رَءَا ٱلشَّمۡسَ بَازِغَةٗ قَالَ هَٰذَا رَبِّي هَٰذَآ أَكۡبَرُۖ فَلَمَّآ أَفَلَتۡ قَالَ يَٰقَوۡمِ إِنِّي بَرِيٓءٞ مِّمَّا تُشۡرِكُونَ ٧٨

78. ఆ తరువాత ఉదయించే సూర్యుణ్ణి చూసి: "ఇది నా ప్రభువు, ఇది అన్నిటికంటే పెద్దగా ఉంది!" అని అన్నాడు. కాని అది కూడా అస్తమించగానే: "ఓ నాజాతి ప్రజలారా మీరు అల్లాహ్‌కు సాటి (భాగస్వామ్యము) కల్పించే దానితో వాస్తవంగా నాకెలాంటి సంబంధంలేదు!" అని అన్నాడు.

إِنِّي وَجَّهۡتُ وَجۡهِيَ لِلَّذِي فَطَرَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ حَنِيفٗاۖ وَمَآ أَنَا۠ مِنَ ٱلۡمُشۡرِكِينَ ٧٩

79. (ఇంకా ఇలా అన్నాడు): "నిశ్చయంగా నేను ఏక దైవసిద్ధాంతం (సత్యధర్మం) పాటించేవాడనై, నా ముఖాన్ని భూమ్యాకాశాల సృష్టికి మూలాధారి అయిన ఆయన (అల్లాహ్) వైపునకే త్రిప్పుకుంటున్నాను. మరియు నేను అల్లాహ్‌కు సాటి (భాగస్వాములు) కల్పించేవారిలో చేరినవాడను కాను."

**80**. మరియు అతని జాతివారు అతనితో వాదులాటకు దిగగా! అతను వారితో అన్నాడు: "ఏమీ? మీరు నాతో అల్లాహ్ విషయంలో వాదిస్తున్నారా? వాస్తవానికి ఆయనే నాకు సన్మార్గం చూపించాడు. మరియు మీరు ఆయనకు సాటి (భాగ స్వాములుగా) కల్పించిన వాటికి నేను భయపడను. నా ప్రభువు ఇచ్ఛలేనిది, ఏదీ సంభవించదు). నా ప్రభువు సకల వస్తువులను (తన) జ్ఞానంతో ఆవరించి వున్నాడు. ఏమీ? మీరిది గ్రహించలేరా?

**81**. "మరియు మీరు అల్లాహ్‌కు సాటి (భాగస్వాములు)గా కల్పించిన వాటికి నేనెలా భయపడాలి? వాస్తవానికి, ఆయన మీకు ఏ విధమైన ప్రమాణం ఇవ్వనిదే, మీరు అల్లాహ్‌కు సాటి (భాగస్వాములను) కల్పించి కూడా భయపడటం లేదే? కావున ఈ రెండు పక్షాల వారిలో ఎవరు శాంతి పొందటానికి అర్హులో! మీకు తెలిస్తే చెప్పండి?"

**82**. ఎవరైతే విశ్వసించి, తమ విశ్వాసాన్ని షిర్క్‌తో[1] కలుషితంచేయరో! అలాంటి వారికే శాంతి ఉంది. మరియు వారే సన్మార్గంలో ఉన్నవారు.

**83**. మరియు ఇదే మా వాదన, దానిని మేము ఇబ్రాహీమ్‌కు, తన జాతివారికి వ్యతిరేకంగా ఇచ్చాము. మేము కోరిన వారికి ఉన్నతస్థానాలను ప్రసాదిస్తాము.[2] నిశ్చయంగా నీ ప్రభువు మహా వివేచనా పరుడు, సర్వజ్ఞుడు (జ్ఞానసంపన్నుడు).

وَحَآجَّهُۥ قَوْمُهُۥۚ قَالَ أَتُحَٰٓجُّوٓنِّى فِى ٱللَّهِ وَقَدْ هَدَىٰنِۚ وَلَآ أَخَافُ مَا تُشْرِكُونَ بِهِۦٓ إِلَّآ أَن يَشَآءَ رَبِّى شَيْـًٔاۗ وَسِعَ رَبِّى كُلَّ شَىْءٍ عِلْمًاۗ أَفَلَا تَتَذَكَّرُونَ ﴿٨٠﴾

وَكَيْفَ أَخَافُ مَآ أَشْرَكْتُمْ وَلَا تَخَافُونَ أَنَّكُمْ أَشْرَكْتُم بِٱللَّهِ مَا لَمْ يُنَزِّلْ بِهِۦ عَلَيْكُمْ سُلْطَٰنًاۚ فَأَىُّ ٱلْفَرِيقَيْنِ أَحَقُّ بِٱلْأَمْنِۖ إِن كُنتُمْ تَعْلَمُونَ ﴿٨١﴾

ٱلَّذِينَ ءَامَنُوا۟ وَلَمْ يَلْبِسُوٓا۟ إِيمَٰنَهُم بِظُلْمٍ أُو۟لَٰٓئِكَ لَهُمُ ٱلْأَمْنُ وَهُم مُّهْتَدُونَ ﴿٨٢﴾

وَتِلْكَ حُجَّتُنَآ ءَاتَيْنَٰهَآ إِبْرَٰهِيمَ عَلَىٰ قَوْمِهِۦۚ نَرْفَعُ دَرَجَٰتٍ مَّن نَّشَآءُۗ إِنَّ رَبَّكَ حَكِيمٌ عَلِيمٌ ﴿٨٣﴾

---

**1**. ఇక్కడ 'జుల్మ్ - అంటే షిర్క్ అని అర్థం. చూడండి, 31:13 "నిశ్చయంగా, షిర్క్ (బహుదైవారాధన) గొప్ప దుర్మార్గం." ('స.బు'ఖారీ, తఫ్సీర్ సూరతుల్-అన్'ఆమ్).

**2**. చూడండి, 4:125.

وَوَهَبْنَا لَهُۥٓ إِسْحَٰقَ وَيَعْقُوبَ ۚ كُلًّا هَدَيْنَا ۚ وَنُوحًا هَدَيْنَا مِن قَبْلُ ۖ وَمِن ذُرِّيَّتِهِۦ دَاوُۥدَ وَسُلَيْمَٰنَ وَأَيُّوبَ وَيُوسُفَ وَمُوسَىٰ وَهَٰرُونَ ۚ وَكَذَٰلِكَ نَجْزِى ٱلْمُحْسِنِينَ ﴿٨٤﴾

**84**. మరియు మేము అతనికి (ఇబ్రాహీమ్‌కు) ఇస్'హాఖ్ మరియు య'అఖూబ్‌లను ప్రసాదించాము.[1] ప్రతి ఒక్కరికీ సన్మార్గం చూపాము. అంతకు పూర్వం నూ'హ్‌కు సన్మార్గం చూపాము. మరియు అతని సంతతిలోనివారైన దావూద్, సులైమాన్, అయ్యూబ్, యూసుఫ్, మూసా మరియు హారూన్‌లకు మేము (సన్మార్గం చూపాము). మరియు ఈ విధంగా మేము సజ్జనులకు తగిన ప్రతిఫలం ఇస్తాము.

وَزَكَرِيَّا وَيَحْيَىٰ وَعِيسَىٰ وَإِلْيَاسَ ۖ كُلٌّ مِّنَ ٱلصَّٰلِحِينَ ﴿٨٥﴾

**85**. మరియు 'జకరియ్యా, య'హ్యా, 'ఈసా మరియు ఇల్యాస్‌లకు[2] కూడా (సన్మార్గం చూపాము). వారిలో ప్రతి ఒక్కరూ సద్వర్తనులే!

وَإِسْمَٰعِيلَ وَٱلْيَسَعَ وَيُونُسَ وَلُوطًا ۚ وَكُلًّا فَضَّلْنَا عَلَى ٱلْعَٰلَمِينَ ﴿٨٦﴾

**86**. మరియు ఇస్మా'యీల్, అల్-యస'అ, యూనుస్ మరియు లూ'త్‌లకు[3] కూడా (సన్మార్గం చూపాము). ప్రతి ఒక్కరికీ (వారి కాలపు) సర్వలోకాల వాసులపై ఘనతను ప్రసాదించాము.

---

**1**. చూడండి, 11:71.

**2**. చూడండి, 37:123. ఇల్యాస్ (Elijah) ('అ.స.), హారూన్ ('అ.స.) సంతతికి చెందిన వారు. అతని నివాసం బఅల్‌బక్ నగరం. ఇల్యాస్ (ఏలియా) హిబ్రూ (యూదుల) ప్రవక్త. ఇతను ఫలస్తీన్ ఉత్తర భాగంలో అహబ్ మరియు అహాజియా రాజుల కాలంలో ఉన్నారు, (దాదాపు 9వ క్రీ. శకానికి ముందు). ఇతనితరువాత అల్-యస'అ (Elisha, 'అ.స.) ప్రవక్తగా వచ్చారు.

**3**. లూ'త్ ('అ.స.) ఇబ్రాహీమ్ ('అ.స.) సోదరుడైన హారాన బిన్-ఆజర్ కుమారుడు. ఇబ్రాహీం ('అ.స.), లూ'త్ ('అ.స.) యొక్క చిన్నాన్న. కాని అతను కూడా ఇబ్రాహీం ('అ.స.) యొక్క సంతతిలోని వారిగా పరిగణించబడ్డారు. ఖుర్ఆన్‌లో ఇటువంటి ఉదాహరణ మరొకటి ఉంది. ఇస్మా'యీల్ ('అ.స.) య'అఖూబ్ ('అ.స.) యొక్క తండ్రిగా పరిగణించబడ్డారు. వాస్తవానికి అతను, య'అఖూబ్ ('అ.స.) యొక్క పెద్దనాన్న (Uncle). ఇంకా చూడండి, 2:133.

وَمِنْ ءَابَآئِهِمْ وَذُرِّيَّٰتِهِمْ وَإِخْوَٰنِهِمْۖ وَٱجْتَبَيْنَٰهُمْ وَهَدَيْنَٰهُمْ إِلَىٰ صِرَٰطٍ مُّسْتَقِيمٍ ﴿٨٧﴾

87. మరియు వారిలోనుండి కొందరి తండ్రితాతలకు, వారి సంతానానికి మరియు వారి సోదరులకు కూడా మేము (సన్మార్గం చూపాము). మేము వారిని (మా సేవకొరకు) ఎన్నుకొని, వారికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేశాము.

ذَٰلِكَ هُدَى ٱللَّهِ يَهْدِى بِهِۦ مَن يَشَآءُ مِنْ عِبَادِهِۦۚ وَلَوْ أَشْرَكُوا۟ لَحَبِطَ عَنْهُم مَّا كَانُوا۟ يَعْمَلُونَ ﴿٨٨﴾

88. ఇదే అల్లాహ్ మార్గదర్శకత్వం. దీని ద్వారా ఆయన తన దాసులలో తానుకోరిన వారికి సన్మార్గం చూపుతాడు. ఒకవేళ వారు అల్లాహ్‌కు సాటి (భాగస్వాములను) కల్పిస్తే, వారు చేసిన సత్కార్యాలన్నీ వృథా అయిపోయేవి![1]

أُو۟لَٰٓئِكَ ٱلَّذِينَ ءَاتَيْنَٰهُمُ ٱلْكِتَٰبَ وَٱلْحُكْمَ وَٱلنُّبُوَّةَۚ فَإِن يَكْفُرْ بِهَا هَٰٓؤُلَآءِ فَقَدْ وَكَّلْنَا بِهَا قَوْمًا لَّيْسُوا۟ بِهَا بِكَٰفِرِينَ ﴿٨٩﴾

89. వీరే, మేము గ్రంథాన్ని, వివేకాన్ని మరియు ప్రవక్త పదవిని ప్రసాదించిన వారు. కాని వారు దీనిని (గ్రంథాన్ని / ప్రవక్త పదవిని) తిరస్కరించినందుకు, వాస్తవానికి! మేము దీనిని ఎన్నడూ తిరస్కరించని ఇతర ప్రజలను దీనికి కార్యకర్తలుగా నియమించాము.[2]

أُو۟لَٰٓئِكَ ٱلَّذِينَ هَدَى ٱللَّهُۖ فَبِهُدَىٰهُمُ ٱقْتَدِهْۗ قُل لَّآ أَسْـَٔلُكُمْ عَلَيْهِ أَجْرًاۖ إِنْ هُوَ إِلَّا ذِكْرَىٰ لِلْعَٰلَمِينَ ﴿٩٠﴾

90. ఇలాంటి వారే అల్లాహ్ మార్గదర్శకత్వం పొందినవారు. కావున నీవు వారి మార్గాన్నే అనుసరించు. వారితో ఇలా అను: "నేను దీనికి బదులుగా మీనుంచి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగను. ఇది కేవలం సర్వలోకాల (వారి) కొరకు ఒక హితోపదేశం మాత్రమే!"

---

1. ఇక్కడ అల్లాహ్ (సు.తా.), 18 మంది ప్రవక్తలను పేర్కొని: "వారు షిర్క్ చేసి ఉంటే వారి సత్కార్యాలు వృథాఅయిపోయేవి." అని అన్నాడు. ఇదేవిధంగా అల్లాహుతా'ఆలా ము'హమ్మద్('స'అస)ను సంబోధించి అన్నదానికి చూడండి, 39:65.
2. ఈ కార్యకర్తలు అంటే దైవప్రవక్త ('స'అస) యొక్క అనుచరు(ర'ది.'అన్హుమ్)లు మరియు తరువాత వచ్చే విశ్వాసులు అని వ్యాఖ్యాతలు అభిప్రాయపడ్డారు.

91. మరియు వారు: "అల్లాహ్, ఏ మానవుని పైననూ ఏమీ అవతరింప జేయలేదు."[1] అని పలికినప్పుడు, వారు (అవిశ్వాసులు) అల్లాహ్‌ను గురించి తగురీతిలో అంచనావేయలేదు. వారితో ఇలా అను: "అయితే! మానవులకు జ్యోతి మరియు మార్గదర్శిని అయిన గ్రంథాన్ని, మూసాపై ఎవరు అవతరింపజేశారు? దానిని మీరు (యూదులు) విడిపత్రాలుగా చేసి (దానిలోని కొంతభాగాన్ని) చూపుతున్నారు మరియు చాలా భాగాన్ని దాస్తున్నారు. మరియు దానినుండి మీకూ మరియు మీ తండ్రితాతలకూ తెలియని విషయాల జ్ఞానం ఇవ్వబడింది కదా?" ఇంకా ఇలా అను: "అల్లాహ్‌యే (దానిని అవతరింపజేశాడు)." ఆ పిదప వారిని, వారి పనికిమాలిన వివాదంలో పడి ఆడుకోనివ్వు!

وَمَا قَدَرُوا۟ ٱللَّهَ حَقَّ قَدْرِهِۦٓ إِذْ قَالُوا۟ مَآ أَنزَلَ ٱللَّهُ عَلَىٰ بَشَرٍ مِّن شَىْءٍ ۗ قُلْ مَنْ أَنزَلَ ٱلْكِتَٰبَ ٱلَّذِى جَآءَ بِهِۦ مُوسَىٰ نُورًا وَهُدًى لِّلنَّاسِ ۖ تَجْعَلُونَهُۥ قَرَاطِيسَ تُبْدُونَهَا وَتُخْفُونَ كَثِيرًا ۖ وَعُلِّمْتُم مَّا لَمْ تَعْلَمُوٓا۟ أَنتُمْ وَلَآ ءَابَآؤُكُمْ ۖ قُلِ ٱللَّهُ ۖ ثُمَّ ذَرْهُمْ فِى خَوْضِهِمْ يَلْعَبُونَ ﴿٩١﴾

92. మరియు మేము అవతరింపజేసిన ఈ గ్రంథం (ఖుర్ఆన్) ఎన్నో శుభాలు గలది. ఇది ఇంతకు పూర్వం వచ్చిన గ్రంథాలలో మిగిలిఉన్న సత్యాలను ధృవ పరుస్తోంది. మరియు ఇది ఉమ్ముల్ ఖురా (మక్కా)[2] మరియు దాని చుట్టుప్రక్కలలో ఉన్నవారిని హెచ్చరించటానికి అవతరింప జేయబడింది. మరియు పరలోకమునందు విశ్వాసమున్న వారు దీనిని (ఈ గ్రంథాన్ని) విశ్వసిస్తారు. మరియు వారు తమ నమా'జ్‌లను క్రమబద్ధంగా పాటిస్తారు.

وَهَٰذَا كِتَٰبٌ أَنزَلْنَٰهُ مُبَارَكٌ مُّصَدِّقُ ٱلَّذِى بَيْنَ يَدَيْهِ وَلِتُنذِرَ أُمَّ ٱلْقُرَىٰ وَمَنْ حَوْلَهَا ۚ وَٱلَّذِينَ يُؤْمِنُونَ بِٱلْءَاخِرَةِ يُؤْمِنُونَ بِهِۦ ۖ وَهُمْ عَلَىٰ صَلَاتِهِمْ يُحَافِظُونَ ﴿٩٢﴾

---

1. చూడండి, 10:2 మరియు 17:94.
2. అదే అల్లాహ్ (సు.తా.) ఆరాధన కొరకు మొట్టమొదట నిర్మించబడిన ఆలయం క'అబహ్. అదే ఖిబ్లా, అదే మక్కా. ('తబరీ - ఇబ్నె-'అబ్బాస్ ర'ది.'అ. కథనం ఆధారంగా). చూడండి, 3:96.

وَمَنْ أَظْلَمُ مِمَّنِ ٱفْتَرَىٰ عَلَى ٱللَّهِ كَذِبًا أَوْ قَالَ أُوحِىَ إِلَىَّ وَلَمْ يُوحَ إِلَيْهِ شَىْءٌ وَمَن قَالَ سَأُنزِلُ مِثْلَ مَآ أَنزَلَ ٱللَّهُ ۗ وَلَوْ تَرَىٰٓ إِذِ ٱلظَّٰلِمُونَ فِى غَمَرَٰتِ ٱلْمَوْتِ وَٱلْمَلَٰٓئِكَةُ بَاسِطُوٓا۟ أَيْدِيهِمْ أَخْرِجُوٓا۟ أَنفُسَكُمُ ۖ ٱلْيَوْمَ تُجْزَوْنَ عَذَابَ ٱلْهُونِ بِمَا كُنتُمْ تَقُولُونَ عَلَى ٱللَّهِ غَيْرَ ٱلْحَقِّ وَكُنتُمْ عَنْ ءَايَٰتِهِۦ تَسْتَكْبِرُونَ ﴿٩٣﴾

**93**. మరియు అల్లాహ్‌పై అబద్ధపు నింద మోపేవానికంటే, లేదా తనపై ఏ దివ్యజ్ఞానం (వ'హీ) అవతరించకపోయినప్పటికీ: "నాపై దివ్యజ్ఞానం అవతరింపజేయబడింది." అని చెప్పేవానికంటే, లేదా: "అల్లాహ్ అవతరింపజేసినటువంటి విషయాలను నేను కూడా అవతరింపజేయగలను." అని పలికే వాని కంటే, మించిన దుర్మార్గుడు ఎవడు? దుర్మార్గులు మరణవేదనలో ఉన్నప్పుడు దేవదూతలు తమ చేతులు చాచి: "మీ ప్రాణాలను వదలండి! అల్లాహ్‌పై అసత్యాలు పలుకుతూ ఉన్నందు వలన మరియు ఆయన సూచనల పట్ల అనాదరణ చూపటం వలన, ఈ రోజు మీకు అవమానకరమైన శిక్ష విధించ బడుతుంది!"[1] అని అంటూ ఉండే దృశ్యాన్ని నీవు చూడగలిగితే ఎంత బాగుండేది![2]

وَلَقَدْ جِئْتُمُونَا فُرَٰدَىٰ كَمَا خَلَقْنَٰكُمْ أَوَّلَ مَرَّةٍ وَتَرَكْتُم مَّا خَوَّلْنَٰكُمْ وَرَآءَ ظُهُورِكُمْ ۖ وَمَا نَرَىٰ مَعَكُمْ شُفَعَآءَكُمُ ٱلَّذِينَ زَعَمْتُمْ أَنَّهُمْ فِيكُمْ شُرَكَٰٓؤُا۟ ۚ لَقَد تَّقَطَّعَ بَيْنَكُمْ وَضَلَّ عَنكُم مَّا كُنتُمْ تَزْعُمُونَ ﴿٩٤﴾

**94**. మరియు వాస్తవంగా, మేము మొదటి సారి మిమ్మల్ని పుట్టించినట్లే, మీరిప్పుడు మా వద్దకు ఒంటరిగా వచ్చారు. మరియు మేము ఇచ్చినదంతా, మీరు మీ వీపుల వెనుక వదలివచ్చారు. మరియు మీరు అల్లాహ్‌కు సాటిగా (భాగస్వాములుగా) కల్పించిన మీ సిఫారసుదారులను, మేము మీతో పాటు చూడటంలేదే! వాస్తవంగా ఇప్పుడు మీ మధ్య ఉన్న సంబంధాలన్నీ తెగిపోయాయి మరియు మీ భ్రమలన్నీ మిమ్మల్ని త్యజించాయి. (7/8)

---

**1**. ఇక్కడ పేర్కొన్న శిక్ష చనిపోయిన తరువాత మరియు పునరుత్థానదినానికి ముందు ఉండే బ'ర్జఖ్ కాలంలో ఇవ్వబడే శిక్ష.

**2**. చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-2, 'హదీస్' నం. 450 మరియు 422.

۞ إِنَّ ٱللَّهَ فَالِقُ ٱلْحَبِّ وَٱلنَّوَىٰۖ يُخْرِجُ ٱلْحَيَّ مِنَ ٱلْمَيِّتِ وَمُخْرِجُ ٱلْمَيِّتِ مِنَ ٱلْحَيِّۚ ذَٰلِكُمُ ٱللَّهُۖ فَأَنَّىٰ تُؤْفَكُونَ ﴿٩٥﴾

95. * నిశ్చయంగా, ధాన్యమును మరియు ఖర్జూరపు బీజాన్ని చీల్చి (మొలకెత్త జేసేవాడు) అల్లాహ్ మాత్రమే. ఆయనే సజీవమైన దానిని, నిర్జీవమైనదాని నుండి తీస్తాడు, మరియు నిర్జీవమైన దానిని సజీవమైనదాని నుండి తీస్తాడు. ఆయనే, అల్లాహ్! అయితే మీరు ఎందుకు మోసగింప (సత్యం నుండి మరలింప) బడుతున్నారు?

فَالِقُ ٱلْإِصْبَاحِ وَجَعَلَ ٱلَّيْلَ سَكَنًا وَٱلشَّمْسَ وَٱلْقَمَرَ حُسْبَانًاۚ ذَٰلِكَ تَقْدِيرُ ٱلْعَزِيزِ ٱلْعَلِيمِ ﴿٩٦﴾

96. ఆయనే (రాత్రి చీకటిని) చీల్చి ఉదయాన్ని తెచ్చేవాడు. మరియు రాత్రిని విశ్రాంతి కొరకు చేసినవాడు మరియు సూర్యుణ్ణి మరియు చంద్రుణ్ణి (కాల) గణన కొరకు నియమించిన వాడు.[1] ఇవన్నీ ఆ సర్వ శక్తిమంతుని, సర్వజ్ఞుని, నియామకాలే!

وَهُوَ ٱلَّذِى جَعَلَ لَكُمُ ٱلنُّجُومَ لِتَهْتَدُوا۟ بِهَا فِى ظُلُمَٰتِ ٱلْبَرِّ وَٱلْبَحْرِۗ قَدْ فَصَّلْنَا ٱلْءَايَٰتِ لِقَوْمٍ يَعْلَمُونَ ﴿٩٧﴾

97. మరియు ఆయనే మీ కొరకు చీకట్లలో - భూమి మీద మరియు సముద్రంలో - మార్గాలను తెలుసు కోవటానికి, నక్షత్రాలను పుట్టించాడు.[2] వాస్తవానికి, ఈ విధంగా మేము జ్ఞానవంతుల కొరకు మా సూచనలను వివరించి తెలిపాము.

وَهُوَ ٱلَّذِىٓ أَنشَأَكُم مِّن نَّفْسٍ وَٰحِدَةٍ فَمُسْتَقَرٌّ وَمُسْتَوْدَعٌۗ قَدْ فَصَّلْنَا

98. మరియు ఆయనే మిమ్మల్ని ఒకే వ్యక్తి (ప్రాణి) నుండి పుట్టించి, తరువాత

---

1. చూడండి, 7:54, 10:5, 36:40.

2. నక్షత్రాలను గురించి అల్లాహ్ (సు.తా.) యొక్క మూడు ఆదేశాలను అబూ-ఖతాదా (ర'ది.'అ.) ఇలా వివరించారు: 1) దగ్గరి ఆకాశాన్ని మేము నక్షత్రాలతో అలంకరించాము (67:5), 2) షై'తానులను తరిమే కొరవిగా మరియు 3) ఈ ఆయత్‌లో చెప్పింది - చీకట్లలో మార్గాలు తెలుసుకోవటానికి. కావున నక్షత్రాలలో ఎవరైనా ఈ మూడు తప్ప ఇతర ఉపయోగాలను వెతికితే! వారు తప్పుదారిలో పడ్డవారే. ('స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4). ఇంకా చూడండి, అబూ-దావూద్ 'హదీస్' నం. 3905. కాబట్టి నక్షత్రాల ద్వారా భవిష్యత్తు చెప్పడం మొదలైనవి ఊహాగానాలే! అవి షరీయత్‌కు విరుద్ధమైనవి. కావున వీటిని మంత్రజాలపు ఒక భాగంగా పేర్కొనబడింది.

ٱلۡأٓيَٰتِ لِقَوۡمٖ يَفۡقَهُونَ ٩٨

వారికి ఈ విధంగా మేము మా సూచనలను వివరించాము.

నివాసం మరియు సేకరించబడే స్థలం[1] నియమించాడు. వాస్తవంగా, అర్థంచేసుకునే వారికి ఈ విధంగా మేము మా సూచనలను వివరించాము.

وَهُوَ ٱلَّذِيٓ أَنزَلَ مِنَ ٱلسَّمَآءِ مَآءٗ فَأَخۡرَجۡنَا بِهِۦ نَبَاتَ كُلِّ شَيۡءٖ فَأَخۡرَجۡنَا مِنۡهُ خَضِرٗا نُّخۡرِجُ مِنۡهُ حَبّٗا مُّتَرَاكِبٗا وَمِنَ ٱلنَّخۡلِ مِن طَلۡعِهَا قِنۡوَانٞ دَانِيَةٞ وَجَنَّٰتٖ مِّنۡ أَعۡنَابٖ وَٱلزَّيۡتُونَ وَٱلرُّمَّانَ مُشۡتَبِهٗا وَغَيۡرَ مُتَشَٰبِهٍۗ ٱنظُرُوٓاْ إِلَىٰ ثَمَرِهِۦٓ إِذَآ أَثۡمَرَ وَيَنۡعِهِۦٓۚ إِنَّ فِي ذَٰلِكُمۡ لَأٓيَٰتٖ لِّقَوۡمٖ يُؤۡمِنُونَ ٩٩

**99**. మరియు ఆయనే ఆకాశం నుండి వర్షాన్ని కురిపించాడు. తరువాత దాని ద్వారా మేము సర్వరకాల వృక్షకోటిని ఉద్భవింప జేశాము.[2] మరియు దానినుండి మేము పచ్చని పైరును పండించాము. వాటిలో దట్టమైన గింజలను పుట్టించాము. మరియు ఖర్జూరపు చెట్ల గెలల నుండి క్రిందికి వ్రేలాడుతున్న పండ్లగుత్తులను, ద్రాక్ష, జైతూన్ మరియు దానిమ్మ తోటలను (పుట్టించాము). వాటిలో కొన్ని ఒకదానినొకటి పోలిఉంటాయి, మరికొన్ని ఒకదాని నొకటి పోలిఉండవు.[3] ఫలించినప్పుడు వాటి ఫలాలను మరియు వాటి పరిపక్వాన్ని గమనించండి. నిశ్చయంగా, వీటిలో విశ్వసించే వారికి సూచనలున్నాయి.

وَجَعَلُواْ لِلَّهِ شُرَكَآءَ ٱلۡجِنَّ وَخَلَقَهُمۡۖ وَخَرَقُواْ لَهُۥ بَنِينَ وَبَنَٰتِۭ بِغَيۡرِ عِلۡمٖۚ سُبۡحَٰنَهُۥ وَتَعَٰلَىٰ عَمَّا يَصِفُونَ ١٠٠

**100**. మరియు వారు, ఆయన (అల్లాహ్) సృష్టించిన జిన్నాతులను, అల్లాహ్‌కే సాటిగా (భాగస్వాములుగా) కల్పిస్తున్నారు. మూఢత్వంతో ఆయనకు కుమారులు, కుమార్తెలు ఉన్నారని ఆరోపిస్తున్నారు.[4] ఆయన సర్వలోపాలకు అతీతుడు, వారి ఈ కల్పనలకు అత్యున్నతుడు.[5]

---

**1**. ముస్తఖ్రున్: నివాసం. ముస్తౌద'ఉన్: కూడబెట్టబడే స్థలం,కొట్టు,గిడ్డంగి లేక సేకరించబడే స్థలం. వ్యాఖ్యాతలు ముస్తఖ్రున్ అంటే తల్లి గర్భకోశం, లేక భూమి, అని మరియు ముస్తౌద'ఉన్ అంటే తండ్రి నడుము/రొండి, లేక గోరి/సమాధి. అని అభిప్రాయపడ్డారు.

**2**. ప్రతి జీవిని అల్లాహ్ (సు.తా.) నీటినుండి పుట్టించాడు. చూడండి, 21:30.

**3**. అంటే కొన్ని విషయాలలో అవి ఒకదానినొకటి పోలిఉన్నా, ఇతర విషయాలలో వారిమధ్య పోలికలుఉండవు. అంటే వాటి ఆకులు పోలి ఉండవచ్చు, కానివాటిఫలాల రుచి,రంగు,వాసన పరిమాణాల విషయంలో వేరుగా ఉండవచ్చు. ఉదా: వేర్వేరు రకాల మామిడి పండ్లు.

**4**. చూడండి, 19:92.

**5**. సుబ్'హాన: సర్వలోపాలకు అతీతుడు, చూడండి, 2:32, 42:11 మరియు 112:4.

بَدِيعُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۖ أَنَّىٰ
يَكُونُ لَهُۥ وَلَدٞ وَلَمۡ تَكُن لَّهُۥ صَٰحِبَةٞۖ
وَخَلَقَ كُلَّ شَيۡءٖۖ وَهُوَ بِكُلِّ شَيۡءٍ
عَلِيمٞ ١٠١

**101**. ఆయనే ఆకాశాలను మరియు భూమిని ఏ నమూనా లేకుండా ఆరంభించిన వాడు.[1] నిశ్చయంగా, ఆయనకు జీవన సహవాసియే (భార్యయే) లేనప్పుడు ఆయనకు కొడుకు ఎలా ఉండ గలడు?[2] మరియు ప్రతి దానిని ఆయనే సృష్టించాడు.[3] మరియు ఆయనే ప్రతి విషయం గురించి బాగా తెలిసినవాడు.

ذَٰلِكُمُ ٱللَّهُ رَبُّكُمۡۖ لَآ إِلَٰهَ إِلَّا هُوَۖ
خَٰلِقُ كُلِّ شَيۡءٖ فَٱعۡبُدُوهُۚ
وَهُوَ عَلَىٰ كُلِّ شَيۡءٖ وَكِيلٞ ١٠٢

**102**. ఆయనే, అల్లాహ్! మీ ప్రభువు. ఆయన తప్ప మరొక ఆరాధ్యదైవం లేడు. ఆయనే సర్వానికి సృష్టికర్త,[4] కావున మీరు ఆయననే ఆరాధించండి. మరియు ఆయనే ప్రతిదాని కార్యకర్త.[5]

لَّا تُدۡرِكُهُ ٱلۡأَبۡصَٰرُ وَهُوَ
يُدۡرِكُ ٱلۡأَبۡصَٰرَۖ وَهُوَ ٱللَّطِيفُ
ٱلۡخَبِيرُ ١٠٣

**103**. ఏ చూపులు కూడా ఆయనను అందుకోలేవు,[6] కాని ఆయన (అన్ని) చూపులను పరివేష్టించి ఉన్నాడు. మరియు ఆయన సూక్ష్మగ్రాహి, సర్వం తెలిసిన వాడు.[7]

---

**1**. బదీ'ఉ (**అల్-బదీ'ఉ**): **ఆరంభకుడు**, చూడండి, 2:117.

**2**. చూడండి, 2:116, మరియు 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-6, 'హదీస్' నం. 9.

**3**. చూడండి, 4:117, 19:44, 34:41, 36:60.

**4**. 'ఖాలిఖ్ (**అల్-'ఖాలిఖు**): The Greatest Creator, The Creater of all things. సృష్టికర్త. చూడండి, 59:24. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి. అల్-'ఖల్లాఖ్, సృష్టిక్రియలో పరిపూర్ణుడు, సముచిత రూపం శక్తిసామర్థ్యాలను ఇచ్చి తీర్చిదిద్ది అత్యుత్తమంగా సృష్టించేవాడు. చూడండి, 15:86.

**5**. వకీలున్ (**అల్-వకీలు**): **కార్యకర్త**, కార్యనిర్వాహకుడు, కార్యసాధకుడు, Trustee, Overseer, Guardian, సాక్షి, బాధ్యుడు, సంరక్షకుడు, ధర్మకర్త. చూడండి, 3:173.

**6**. ఇహలోక జీవితంలో ఎవ్వరూ కూడా ఆయనను చూడలేరు. కాని పునరుత్థానదినమున సత్పురుషులముఖాలు అల్లాహ్(సు.తా.)నుచూసి కళకళలాడుతుంటాయి, (75:22-23).

**7**. **అల్-ల'తీఫు**: Un-Fathomable, Subtle, Gentle. **సూక్ష్మగ్రాహి**, అతి సూక్ష్మ గ్రహణ శక్తిగల, సూక్ష్మబుద్ధిగల, విస్తారమైన తెలివి యుక్తి గల, అంటే అల్లాహ్ (సు.తా.) ప్రతి చిన్నదానిని తెలుసుకోగలడు. కాని ఆయనను ఎవ్వరూ తెలుసుకోలేరు.
**అల్-'ఖబీరు: సర్వపరిచితుడు, అంతా ఎరిగినవాడు**, All-Aware, చూడండి, 6:18.

قَدۡ جَآءَكُم بَصَآئِرُ مِن رَّبِّكُمۡۖ فَمَنۡ
أَبۡصَرَ فَلِنَفۡسِهِۦۖ وَمَنۡ عَمِيَ فَعَلَيۡهَاۚ
وَمَآ أَنَا۠ عَلَيۡكُم بِحَفِيظٖ ١٠٤

104. వాస్తవానికి ఇప్పుడు మీ ప్రభువు తరఫునుండి నిదర్శనాలు వచ్చాయి. కావున వాటిని ఎవడు గ్రహిస్తాడో తన మేలుకే గ్రహిస్తాడు! మరియు ఎవడు అంధుడిగా ఉంటాడో అతడే నష్టపోతాడు:[1] "మరియు నేను మీ రక్షకుడను కాను." (అని అను).

وَكَذَٰلِكَ نُصَرِّفُ ٱلۡأٓيَٰتِ
وَلِيَقُولُواْ دَرَسۡتَ وَلِنُبَيِّنَهُۥ لِقَوۡمٖ
يَعۡلَمُونَ ١٠٥

105. మరియు వారు (అవిశ్వాసులు): "నీవు ఎవరివద్దనో నేర్చుకున్నావు." అని అనాలనీ మరియు తెలివిగలవారికి (సత్యాన్ని) స్పష్టపరచుటకూను, మేము మా సూచనలను ఈ విధంగా వివరిస్తూ ఉంటాము.[2]

ٱتَّبِعۡ مَآ أُوحِيَ إِلَيۡكَ مِن رَّبِّكَۖ
لَآ إِلَٰهَ إِلَّا هُوَۖ وَأَعۡرِضۡ عَنِ
ٱلۡمُشۡرِكِينَ ١٠٦

106. నీవు నీ ప్రభువు తరఫునుండి అవతరింపజేయబడిన దివ్యజ్ఞానాన్ని (వ'హీని) అనుసరించు. ఆయన తప్ప మరొక ఆరాధ్యదైవం లేడు. మరియు అల్లాహ్‌కు సాటి (భాగస్వాములను) కల్పించే వారి నుండి విముఖుడవగు.

وَلَوۡ شَآءَ ٱللَّهُ مَآ أَشۡرَكُواْۗ وَمَا
جَعَلۡنَٰكَ عَلَيۡهِمۡ حَفِيظٗاۖ وَمَآ
أَنتَ عَلَيۡهِم بِوَكِيلٖ ١٠٧

107. మరియు అల్లాహ్ సంకల్పించి ఉంటే! వారు అల్లాహ్‌కు సాటి కల్పించి ఉండేవారు కాదు.[3] మరియు మేము నిన్ను వారిపై రక్షకునిగా నియమించలేదు. నీవు వారి కొరకు బాధ్యుడవు (కార్యకర్తవు) కావు.[4]

---

**అల్-ల'తీఫు, అల్-'ఖబీరు:** ఈ రెండుపదాలు ఖుర్ఆన్‌లో చాలామట్టుకు కలసి వచ్చాయి. ఇవి అల్లాహ్(సు.తా.) అత్యుత్తమ పేర్లు. ఇంకా చూడండి, 22:63, 31:16, 33:34 మరియు 67:14.

1. చూడండి, 17:15.
2. చూడండి, 25:4-5. ఇంకా చూడండి ఈ ఆయత్ యొక్క తాత్పర్యం కొరకు, నోబుల్ ఖుర్ఆన్ మరియు ముహమ్మద్ జూనాగఢీ, (మదీనహ్ మునవ్వరహ్ ప్రచురణలు).
3. చూడండి, 2:253 మరియు 6:35.
4. అంటే నీకు వారిపై ఎట్టి అధికారం లేదు. ఒకవేళ దైవప్రవక్త ('స'అస)కు అల్లాహ్ (సు.తా.) ఇతరులపై అధికారం ఇచ్చి ఉంటే, అతను తన పినతండ్రి అబూ-'తాలిబ్‌ను బలవంతంగా ముస్లిం చేసి ఉండేవారు. ఎందుకంటే దైవప్రవక్త ('స'అస) తండ్రి వంటి తన పోషకుణ్ణి తెలిసిఉండి కూడా నరకాగ్నిలోకి ఎలా పోనివ్వగలరు.

**108**. మరియు - అల్లాహ్‌ను వదలి వారు ప్రార్థిస్తున్న ఇతరులను (వారి దైవాలను) - మీరు దూషించకండి. ఎందుకంటే, వారు ద్వేషంతో, అజ్ఞానంతో అల్లాహ్‌ను దూషించ వచ్చు! ఈ విధంగా మేము ప్రతి జాతికి, వారి కర్మలు (ఆచారాలు) వారికి ఆకర్షణీయంగా కనబడేటట్లు చేశాము. తరువాత వారి ప్రభువు వైపునకు వారి మరలింపు ఉంటుంది; అప్పుడు వారికి వారి చేష్టలు తెలుపబడతాయి.

وَلَا تَسُبُّواْ ٱلَّذِينَ يَدۡعُونَ مِن دُونِ ٱللَّهِ فَيَسُبُّواْ ٱللَّهَ عَدۡوَۢا بِغَيۡرِ عِلۡمٖۗ كَذَٰلِكَ زَيَّنَّا لِكُلِّ أُمَّةٍ عَمَلَهُمۡ ثُمَّ إِلَىٰ رَبِّهِم مَّرۡجِعُهُمۡ فَيُنَبِّئُهُم بِمَا كَانُواْ يَعۡمَلُونَ ١٠٨

**109**. మరియు వారు: "ఒకవేళ మా వద్దకు అద్భుత సూచన (మహిమ) వస్తే, మేము తప్పక విశ్వసిస్తాము." అని అల్లాహ్ పేరుతో గట్టి ప్రమాణాలు చేస్తారు. వారితో అను: "నిశ్చయంగా, అద్భుత సూచనలు (మహిమలు) అల్లాహ్ వశంలోనే ఉన్నాయి.[1] ఒకవేళ అవి (అద్భుత సూచనలు) వచ్చినా, వారు విశ్వసించరని (ఓ ముస్లింలారా!) మీకు ఏవిధంగా గ్రహింపజేయాలి?"

وَأَقۡسَمُواْ بِٱللَّهِ جَهۡدَ أَيۡمَٰنِهِمۡ لَئِن جَآءَتۡهُمۡ ءَايَةٞ لَّيُؤۡمِنُنَّ بِهَاۚ قُلۡ إِنَّمَا ٱلۡأٓيَٰتُ عِندَ ٱللَّهِۖ وَمَا يُشۡعِرُكُمۡ أَنَّهَآ إِذَا جَآءَتۡ لَا يُؤۡمِنُونَ ١٠٩

**110**. మరియు వారు మొదటి సారి దీనిని ఎలా విశ్వసించలేదో, అదే విధంగా వారి హృదయాలను మరియు వారి కన్నులను మేము త్రిప్పివేస్తాము. మరియు మేము వారిని వారి తలబిరుసుతనంలో అంధులై తిరుగటానికి వదలిపెడతాము.

وَنُقَلِّبُ أَفۡـِٔدَتَهُمۡ وَأَبۡصَٰرَهُمۡ كَمَا لَمۡ يُؤۡمِنُواْ بِهِۦٓ أَوَّلَ مَرَّةٖ وَنَذَرُهُمۡ فِي طُغۡيَٰنِهِمۡ يَعۡمَهُونَ ١١٠

---

**1**. చూడండి, 17:59.

۞ وَلَوۡ أَنَّنَا نَزَّلۡنَآ إِلَيۡهِمُ ٱلۡمَلَٰٓئِكَةَ وَكَلَّمَهُمُ ٱلۡمَوۡتَىٰ وَحَشَرۡنَا عَلَيۡهِمۡ كُلَّ شَيۡءٖ قُبُلٗا مَّا كَانُواْ لِيُؤۡمِنُوٓاْ إِلَّآ أَن يَشَآءَ ٱللَّهُ وَلَٰكِنَّ أَكۡثَرَهُمۡ يَجۡهَلُونَ ١١١

**111**. (*) మరియు ఒకవేళ మేము వారి వైపుకు దైవదూతలను దింపినా మరియు మరణించిన వారు వారితో మాట్లాడినా మరియు మేము ప్రతి వస్తువును వారి కళ్ళముందు సమీకరించినా[1] - అల్లాహ్ సంకల్పంలేనిదే - వారు విశ్వసించేవారు కారు. ఎందుకంటే వాస్తవానికి వారిలో అనేకులు అజ్ఞానులున్నారు.

وَكَذَٰلِكَ جَعَلۡنَا لِكُلِّ نَبِيٍّ عَدُوّٗا شَيَٰطِينَ ٱلۡإِنسِ وَٱلۡجِنِّ يُوحِي بَعۡضُهُمۡ إِلَىٰ بَعۡضٖ زُخۡرُفَ ٱلۡقَوۡلِ غُرُورٗاۚ وَلَوۡ شَآءَ رَبُّكَ مَا فَعَلُوهُۖ فَذَرۡهُمۡ وَمَا يَفۡتَرُونَ ١١٢

**112**. మరియు ఈ విధంగా మేము మానవుల నుండి మరియు జిన్నాతుల నుండి, షైతానులను ప్రతి ప్రవక్తకు శత్రువులుగా చేశాము. వారు ఒకరినొకరు మోసపుచ్చుకోవటానికి ఇంపైన మాటలు చెప్పుకుంటారు. మరియు నీ ప్రభువు తలచుకుంటే వారిలా చేసేవారు కాదు. కావున వారిని వారి కల్పనలలో వదలిపెట్టు.[2]

وَلِتَصۡغَىٰٓ إِلَيۡهِ أَفۡـِٔدَةُ ٱلَّذِينَ لَا يُؤۡمِنُونَ بِٱلۡأٓخِرَةِ وَلِيَرۡضَوۡهُ وَلِيَقۡتَرِفُواْ مَا هُم مُّقۡتَرِفُونَ ١١٣

**113**. మరియు పరలోక జీవితాన్ని విశ్వసించని వారి హృదయాలు ఇలాంటి (మోసం) వైపుకు మొగ్గాలని మరియు వారు దానితో సంతోషపడుతూ ఉండాలని మరియు వారు అర్జించేవి (దుష్టఫలితాలు) అర్జిస్తూ ఉండాలనీను.

---

**1**. చూడండి, 10:96-97.

**2**. 'తబరీ (ర'హ్మ) వ్రాశారు ఎన్నో 'స'హీ'హ్ 'హదీస్'లు ఉన్నాయని. కొందరు దైవప్రవక్త ('స'అస)ను అడిగారు: "ఏమీ? మానవులలో కూడా షైతానులు ఉన్నారా?" అతను జవాబిచ్చారు: "అవును మరియు వారు జిన్నాతులలోని షైతానుల కంటే ఎక్కువ దుష్టులు." ఇంకా చూడండి, 25:30-31.

**114**. (వారితో ఇలా అను): "ఏమీ? నేను అల్లాహ్‌ను వదలి వేరే న్యాయాధిపతిని అన్వేషించాలా? మరియు ఆయనే మీపై స్పష్టమైన గ్రంథాన్ని అవతరింపజేశాడు కదా?" మరియు నిశ్చయంగా, ఇది (ఈ గ్రంథం) నీ ప్రభువు తరఫునుండి సత్యాధారంగా అవతరింపజేయబడిందని, పూర్వం గ్రంథమొసంగబడిన ప్రజలకు బాగా తెలుసు![1] కావున నీవు సందేహించే వారిలో చేరకు.

أَفَغَيْرَ ٱللَّهِ أَبْتَغِى حَكَمًا وَهُوَ ٱلَّذِىٓ أَنزَلَ إِلَيْكُمُ ٱلْكِتَٰبَ مُفَصَّلًا ۚ وَٱلَّذِينَ ءَاتَيْنَٰهُمُ ٱلْكِتَٰبَ يَعْلَمُونَ أَنَّهُۥ مُنَزَّلٌ مِّن رَّبِّكَ بِٱلْحَقِّ ۖ فَلَا تَكُونَنَّ مِنَ ٱلْمُمْتَرِينَ ﴿١١٤﴾

**115**. మరియు సత్యం రీత్యా మరియు న్యాయం రీత్యా నీ ప్రభువు వాక్కు పూర్తి అయ్యింది.[2] ఆయన వాక్కులను మార్చేవాడు ఎవ్వడూ లేడు. మరియు ఆయన సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

وَتَمَّتْ كَلِمَتُ رَبِّكَ صِدْقًا وَعَدْلًا ۚ لَّا مُبَدِّلَ لِكَلِمَٰتِهِۦ ۚ وَهُوَ ٱلسَّمِيعُ ٱلْعَلِيمُ ﴿١١٥﴾

**116**. మరియు భూమిలోని అధిక సంఖ్యాకులను నీవు అనుసరిస్తే వారు నిన్ను అల్లాహ్ మార్గం నుండి తప్పిస్తారు. వారు కేవలం ఊహలనే అనుసరిస్తున్నారు మరియు వారు కేవలం ఊహాగానాలు మాత్రమే చేస్తున్నారు.[3]

وَإِن تُطِعْ أَكْثَرَ مَن فِى ٱلْأَرْضِ يُضِلُّوكَ عَن سَبِيلِ ٱللَّهِ ۚ إِن يَتَّبِعُونَ إِلَّا ٱلظَّنَّ وَإِنْ هُمْ إِلَّا يَخْرُصُونَ ﴿١١٦﴾

---

**1**. చూడండి, 2:146.

**2**. కలిమ: అంటే వాగ్దానం. అల్లాహ్ (సు.తా.) చేసిన వాగ్దానం. "మూసా ('అ.స.) వంటి ఒక ప్రవక్తను అల్లాహుతా'ఆలా 'అరబ్బులలోనుండి లేపుతాడు." చూడండి ఖు. 2:42.

**3**. అధిక సంఖ్యాకులు అనుసరించే మార్గం సరైనమార్గం కాకపోవచ్చు! దీనికి ఈ 'హదీస్' ఒక నిదర్శనం. దైవప్రవక్త ప్రవచనం: "నా అనుచరులు 73 శాఖలలో విభజింపబడతారు. వారిలో కేవలం ఒక శాఖవారు మాత్రమే స్వర్గానికిపోతారు, మిగిలిన వారంతా నరకానికిపోతారు. స్వర్గానికి పోయేవారి గుర్తు ఏమిటంటే వారు నేనూ మరియు నా అనుచరులు అనుసరించిన మార్గాన్నే అనుసరిస్తారు." (సునన్ అబూ-దావూద్, 'హదీస్' నం. 4596, తిర్మిజీ').

**117**. నిశ్చయంగా, నీ ప్రభువు! ఆయనకు ఎవడు ఆయన మార్గంనుండి వైదొలగి ఉన్నాడో తెలుసు. మరియు ఎవడు సన్మార్గంలో ఉన్నాడనేది కూడా ఆయనకు బాగా తెలుసు.

**118**. కావున మీరు ఆయన సూచన (ఆయత్)లను విశ్వసించే వారే అయితే, అల్లాహ్ పేరు స్మరించబడిన దానినే తినండి.

**119**. మరియు మీకేమయింది? అల్లాహ్ పేరు స్మరించబడిన దానిని మీరెందుకు తినకూడదు? వాస్తవానికి - గత్యంతరం లేని సంకట పరిస్థితులలో తప్ప - ఏవేవి మీకు (తినటానికి) నిషేధింపబడ్డాయో, మీకు విశదీకరించ బడింది కదా? మరియు నిశ్చయంగా, చాలామంది అజ్ఞానంతో (ఇతరులను) తమ ఇష్టానుసారంగా మార్గభ్రష్టత్వానికి గురిచేస్తున్నారు. నిశ్చయంగా, నీ ప్రభువు, ఆయనకు హద్దులు మీరి ప్రవర్తించేవారి గురించి బాగా తెలుసు.

**120**. మరియు పాపాన్ని బహిరంగంగా గానీ, రహస్యంగా గానీ చేయటాన్ని మానుకోండి. నిశ్చయంగా, పాపం అర్జించిన వారు తాము చేసిన దుష్కృత్యాలకు తగిన ప్రతిఫలం పొందగలరు.

**121**. మరియు అల్లాహ్ పేరు స్మరించబడని దానిని తినకండి. మరియు అది (తినటం) నిశ్చయంగా పాపం. మరియు నిశ్చయంగా, మీతో

إِنَّ رَبَّكَ هُوَ أَعْلَمُ مَن يَضِلُّ عَن
سَبِيلِهِۦ ۖ وَهُوَ أَعْلَمُ بِٱلْمُهْتَدِينَ
١١٧

فَكُلُوا۟ مِمَّا ذُكِرَ ٱسْمُ ٱللَّهِ عَلَيْهِ
إِن كُنتُم بِـَٔايَٰتِهِۦ مُؤْمِنِينَ ١١٨

وَمَا لَكُمْ أَلَّا تَأْكُلُوا۟ مِمَّا ذُكِرَ
ٱسْمُ ٱللَّهِ عَلَيْهِ وَقَدْ فَصَّلَ لَكُم
مَّا حَرَّمَ عَلَيْكُمْ إِلَّا مَا ٱضْطُرِرْتُمْ
إِلَيْهِ ۗ وَإِنَّ كَثِيرًا لَّيُضِلُّونَ
بِأَهْوَآئِهِم بِغَيْرِ عِلْمٍ ۗ إِنَّ رَبَّكَ
هُوَ أَعْلَمُ بِٱلْمُعْتَدِينَ ١١٩

وَذَرُوا۟ ظَٰهِرَ ٱلْإِثْمِ وَبَاطِنَهُۥٓ ۚ
إِنَّ ٱلَّذِينَ يَكْسِبُونَ ٱلْإِثْمَ
سَيُجْزَوْنَ بِمَا كَانُوا۟ يَقْتَرِفُونَ ١٢٠

وَلَا تَأْكُلُوا۟ مِمَّا لَمْ يُذْكَرِ
ٱسْمُ ٱللَّهِ عَلَيْهِ وَإِنَّهُۥ لَفِسْقٌ ۗ

وَإِنَّ ٱلشَّيَٰطِينَ لَيُوحُونَ إِلَىٰٓ أَوۡلِيَآئِهِمۡ لِيُجَٰدِلُوكُمۡۖ وَإِنۡ أَطَعۡتُمُوهُمۡ إِنَّكُمۡ لَمُشۡرِكُونَ ١٢١

వాదులాడటానికి షైతానులు తమ స్నేహితులను (అవ్లియా') ప్రేరేపింప జేస్తారు.[1] ఒకవేళ మీరు వారిని అనుసరిస్తే! నిశ్చయంగా, మీరు కూడా అల్లాహ్‌కు సాటి (భాగస్వాములు) కల్పించిన వారవుతారు.

أَوَمَن كَانَ مَيۡتٗا فَأَحۡيَيۡنَٰهُ وَجَعَلۡنَا لَهُۥ نُورٗا يَمۡشِي بِهِۦ فِي ٱلنَّاسِ كَمَن مَّثَلُهُۥ فِي ٱلظُّلُمَٰتِ لَيۡسَ بِخَارِجٖ مِّنۡهَاۚ كَذَٰلِكَ زُيِّنَ لِلۡكَٰفِرِينَ مَا كَانُواْ يَعۡمَلُونَ ١٢٢

**122**. మరియు ఏమీ? ఒక మరణించిన వ్యక్తిని (అవిశ్వాసిని), మేము సజీవునిగా (విశ్వాసిగా) చేసి జ్యోతిని ప్రసాదించగా! దానితో ప్రజల మధ్య సంచరిస్తున్నవాడూ మరియు అంధకారంలో (అవిశ్వాసంలో) చిక్కుకొని, వాటి నుండి బయటకు రాజాలని వాడూ ఇద్దరూ సమానులా?[2] ఇదేవిధంగా సత్య తిరస్కారులకు, వారు చేస్తున్న కర్మలు, మనోహరమైనవిగా చేయబడ్డాయి.

وَكَذَٰلِكَ جَعَلۡنَا فِي كُلِّ قَرۡيَةٍ أَكَٰبِرَ مُجۡرِمِيهَا لِيَمۡكُرُواْ فِيهَاۖ وَمَا يَمۡكُرُونَ إِلَّا بِأَنفُسِهِمۡ وَمَا يَشۡعُرُونَ ١٢٣

**123**. మరియు ఇదే విధంగా మేము ప్రతి నగరంలో, దానిలోని నేరస్థులైన పెద్దవారిని, కుట్రలు పన్నేవారిగా చేశాము.[3] మరియు వారు చేసేకుట్రలు కేవలం వారికే ప్రతికూలమైనవి, కాని వారది గ్రహించడం లేదు.[4]

وَإِذَا جَآءَتۡهُمۡ ءَايَةٞ قَالُواْ لَن نُّؤۡمِنَ حَتَّىٰ نُؤۡتَىٰ مِثۡلَ مَآ أُوتِيَ رُسُلُ ٱللَّهِۘ

**124**. మరియు వారి వద్దకు ఏదైనా సూచన వచ్చినప్పుడు వారు: "అల్లాహ్ యొక్క సందేశహరులకు ఇవ్వబడినట్లు, మాకు కూడా (దివ్యజ్ఞానం)[5]

---

**1**. చూడండి, 2:14 మరియు 14:22.
**2**. ఈ ఆయత్‌లో అల్లాహ్ (సు.తా.) సత్యతిరస్కారులను మృతులతో మరియు విశ్వాసులను సజీవులతో పోల్చాడు. చూడండి, 2:257, 11:24 మరియు 35:19-22.
**3**. చూడండి, 34:31-33, 43:23 మరియు 71:22.
**4**. చూడండి, 16:25 మరియు 29:13.
**5**. అంటే ప్రవక్తృత్వం మరియు దివ్యజ్ఞానం (వ'హీ) అవతరింపజేయబడటం.

ఇవ్వబడనంత వరకు మేము విశ్వసించము." అని అంటారు. తన సందేశాన్ని ఎవరిపై అవతరింపజేయాలో అల్లాహ్‌కు బాగా తెలుసు. త్వరలోనే అపరాధులు అల్లాహ్ దగ్గర అవమానింప బడగలరు. మరియు వారి కుట్రల ఫలితంగా వారికి తీవ్రమైన శిక్ష విధించబడగలదు.

**125**. కావున అల్లాహ్ సన్మార్గం చూపదలచిన వ్యక్తి హృదయాన్ని ఇస్లాం కొరకు తెరుస్తాడు. మరియు ఎవరిని ఆయన మార్గభ్రష్టత్వంలో వదల గోరుతాడో అతని హృదయాన్ని (ఇస్లాం కొరకు) ఆకాశంపైకి ఎక్కేవానివలే, బిగుతుగా అణచివేయబడినట్లు చేస్తాడు. ఈ విధంగా, అల్లాహ్! విశ్వసించని వారిపై మాలిన్యాన్ని రుద్దుతాడు.

**126**. మరియు ఇది నీ ప్రభువు యొక్క ఋజుమార్గం. వాస్తవానికి యోచించే వారికి, మేము ఈ సూచనలను వివరించాము. (1/8)

**127**. * వారి కొరకు వారి ప్రభువు వద్ద శాంతినిలయం (స్వర్గం) ఉంటుంది. మరియు వారు (మంచి) కర్మలు చేస్తున్నందుకు ఆయన వారి సంరక్షకునిగా ఉంటాడు.

**128**. మరియు ఆయన వారందరినీ జమచేసిన రోజు వారితో ఇలా అంటాడు: "ఓ జిన్నాతుల వంశీయులారా! వాస్తవంగా మీరు మానవులలో నుండి చాలా మందిని వలలో వేసుకున్నారు."[1] అప్పుడు

ٱللَّهُ أَعۡلَمُ حَيۡثُ يَجۡعَلُ رِسَالَتَهُۥۗ
سَيُصِيبُ ٱلَّذِينَ أَجۡرَمُواْ صَغَارٌ
عِندَ ٱللَّهِ وَعَذَابٞ شَدِيدُۢ بِمَا
كَانُواْ يَمۡكُرُونَ ١٢٤
فَمَن يُرِدِ ٱللَّهُ أَن يَهۡدِيَهُۥ يَشۡرَحۡ
صَدۡرَهُۥ لِلۡإِسۡلَٰمِۖ وَمَن يُرِدۡ أَن
يُضِلَّهُۥ يَجۡعَلۡ صَدۡرَهُۥ ضَيِّقًا حَرَجٗا
كَأَنَّمَا يَصَّعَّدُ فِي ٱلسَّمَآءِۚ
كَذَٰلِكَ يَجۡعَلُ ٱللَّهُ ٱلرِّجۡسَ
عَلَى ٱلَّذِينَ لَا يُؤۡمِنُونَ ١٢٥
وَهَٰذَا صِرَٰطُ رَبِّكَ مُسۡتَقِيمٗاۗ قَدۡ
فَصَّلۡنَا ٱلۡأٓيَٰتِ لِقَوۡمٖ يَذَّكَّرُونَ ١٢٦
۞ لَهُمۡ دَارُ ٱلسَّلَٰمِ عِندَ رَبِّهِمۡۖ وَهُوَ
وَلِيُّهُم بِمَا كَانُواْ يَعۡمَلُونَ ١٢٧
وَيَوۡمَ يَحۡشُرُهُمۡ جَمِيعٗا يَٰمَعۡشَرَ
ٱلۡجِنِّ قَدِ ٱسۡتَكۡثَرۡتُم مِّنَ ٱلۡإِنسِۖ
وَقَالَ أَوۡلِيَآؤُهُم مِّنَ ٱلۡإِنسِ رَبَّنَا

---

1. చూడండి, 36:60-62.

ٱسْتَمْتَعَ بَعْضُنَا بِبَعْضٍ وَبَلَغْنَآ
أَجَلَنَا ٱلَّذِىٓ أَجَّلْتَ لَنَا ۚ قَالَ ٱلنَّارُ
مَثْوَىٰكُمْ خَٰلِدِينَ فِيهَآ إِلَّا مَا شَآءَ
ٱللَّهُ ۗ إِنَّ رَبَّكَ حَكِيمٌ عَلِيمٌ ﴿١٢٨﴾

మానవులలోని వారి స్నేహితులు (అవ్లియా') అంటారు: "ఓ మా ప్రభూ! మేము పరస్పరం బాగా సుఖసంతోషాలు పొందాము మరియు నీవు మా కొరకు నియమించిన గడువుకు మేమిప్పుడు చేరుకున్నాము." అప్పుడు అల్లాహ్ వారితో అంటాడు: "మీ నివాసం నరకాగ్నియే - అల్లాహ్ కోరితే తప్ప - మీరందు శాశ్వతంగా ఉంటారు![1] నిశ్చయంగా, నీ ప్రభువు మహా వివేచనాపరుడు, సర్వజ్ఞుడు."

وَكَذَٰلِكَ نُوَلِّى بَعْضَ ٱلظَّٰلِمِينَ
بَعْضًۢا بِمَا كَانُوا۟ يَكْسِبُونَ ﴿١٢٩﴾

**129**. ఈ విధంగా మేము దుర్మార్గులను - వారు అర్జించిన దానికి ఫలితంగా - పరస్పరం స్నేహితులు (అవ్లియా')గా ఉంచుతాము.

يَٰمَعْشَرَ ٱلْجِنِّ وَٱلْإِنسِ أَلَمْ
يَأْتِكُمْ رُسُلٌ مِّنكُمْ يَقُصُّونَ
عَلَيْكُمْ ءَايَٰتِى وَيُنذِرُونَكُمْ
لِقَآءَ يَوْمِكُمْ هَٰذَا ۚ قَالُوا۟ شَهِدْنَا
عَلَىٰٓ أَنفُسِنَا ۖ وَغَرَّتْهُمُ ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَا
وَشَهِدُوا۟ عَلَىٰٓ أَنفُسِهِمْ أَنَّهُمْ
كَانُوا۟ كَٰفِرِينَ ﴿١٣٠﴾

**130**. "ఓ జిన్నాతుల మరియు మానవుల వంశీయులారా! ఏమీ? నా సూచనలను మీకు వినిపించి, మీరు (నన్ను) కలుసుకునే ఈ దినమును గురించి హెచ్చరించే ప్రవక్తలు మీలోనుంచే మీ వద్దకు రాలేదా?" (అని అల్లాహ్ వారిని అడుగుతాడు). దానికి వారు: "(వచ్చారని!) మాకు వ్యతిరేకంగా స్వయంగా మేమే సాక్షులం." అని జవాబిస్తారు. మరియు వారిని ఈ ప్రాపంచిక జీవితం మోసపుచ్చింది. మరియు వారు వాస్తవానికి సత్య తిరస్కారులుగా ఉండేవారని స్వయంగా తమకు వ్యతిరేకంగా తామే సాక్ష్యమిస్తారు.

---

**1**. చూడండి, 40:12.

131. ఇదంతా ఎందుకంటే! నీప్రభువు నగరాలను - వాటిలోని ప్రజలు సత్యాన్ని ఎరుగకుండా ఉన్నప్పుడు - అన్యాయంగా నాశనంచేయడు.[1]

132. మరియు ప్రతి ఒక్కరికీ వారి కర్మల ప్రకారం స్థానాలు ఉంటాయి. మరియు నీ ప్రభువు వారి కర్మల పట్ల నిర్లక్ష్యంగా లేడు.

133. మరియు నీ ప్రభువు స్వయం సమృద్ధుడు,[2] కరుణించే స్వభావం గలవాడు. ఆయన కోరితే, ఇతర జాతివారి తరువాత మిమ్మల్ని పుట్టించినట్లు, మిమ్మల్ని తొలగించి మీకు బదులుగా మీ తర్వాత తాను కోరిన వారిని పుట్టించ గలడు.[3]

134. మీకు చేయబడిన వాగ్దానం తప్పక పూర్తిఅయి తీరుతుంది. మీరు దాని (శిక్ష) నుండి తప్పించుకోలేరు.

135. ఇలా అను: "ఓ నాజాతి (విశ్వసించని) ప్రజలారా! మీరు (సరి అను కున్నది) మీ శక్తి మేరకు చేయండి. మరియు నిశ్చయంగా (నేను సరి అను కున్నది) నేనూ చేస్తాను.[4] ఎవరి పరిణామం సఫలీకృతం కాగలదో! మీరు త్వరలోనే తెలుసుకుంటారు. నిశ్చయంగా, దుర్మార్గులు ఎన్నడూ సాఫల్యం పొందరు."

ذَٰلِكَ أَن لَّمْ يَكُن رَّبُّكَ مُهْلِكَ ٱلْقُرَىٰ بِظُلْمٍ وَأَهْلُهَا غَٰفِلُونَ ﴿١٣١﴾

وَلِكُلٍّ دَرَجَٰتٌ مِّمَّا عَمِلُوا۟ ۚ وَمَا رَبُّكَ بِغَٰفِلٍ عَمَّا يَعْمَلُونَ ﴿١٣٢﴾

وَرَبُّكَ ٱلْغَنِىُّ ذُو ٱلرَّحْمَةِ ۚ إِن يَشَأْ يُذْهِبْكُمْ وَيَسْتَخْلِفْ مِنۢ بَعْدِكُم مَّا يَشَآءُ كَمَآ أَنشَأَكُم مِّن ذُرِّيَّةِ قَوْمٍ ءَاخَرِينَ ﴿١٣٣﴾

إِنَّ مَا تُوعَدُونَ لَءَاتٍ ۖ وَمَآ أَنتُم بِمُعْجِزِينَ ﴿١٣٤﴾

قُلْ يَٰقَوْمِ ٱعْمَلُوا۟ عَلَىٰ مَكَانَتِكُمْ إِنِّى عَامِلٌ ۖ فَسَوْفَ تَعْلَمُونَ مَن تَكُونُ لَهُۥ عَٰقِبَةُ ٱلدَّارِ ۗ إِنَّهُۥ لَا يُفْلِحُ ٱلظَّٰلِمُونَ ﴿١٣٥﴾

---

1. చూడండి, 16:26, 17:15, 35:24 మరియు 67:8-9.
2. అల్-'గనియ్యు: Self-Sufficient, స్వయంసమృద్ధుడు, సర్వసంపన్నుడు, Free of Want, నిరపేక్షాపరుడు, ఏ అక్కరా లేనివాడు. చూడండి, 2:263.
3. చూడండి, 4:133, 14:19-20, 35:15-17 మరియు 47:38.
4. చూడండి, 11:121-122.

وَجَعَلُواْ لِلَّهِ مِمَّا ذَرَأَ مِنَ ٱلْحَرْثِ وَٱلْأَنْعَٰمِ نَصِيبًا فَقَالُواْ هَٰذَا لِلَّهِ بِزَعْمِهِمْ وَهَٰذَا لِشُرَكَآئِنَا ۖ فَمَا كَانَ لِشُرَكَآئِهِمْ فَلَا يَصِلُ إِلَى ٱللَّهِ ۖ وَمَا كَانَ لِلَّهِ فَهُوَ يَصِلُ إِلَىٰ شُرَكَآئِهِمْ ۗ سَآءَ مَا يَحْكُمُونَ ﴿١٣٦﴾

**136**. మరియు ఆయన (అల్లాహ్) పుట్టించిన పంటలనుండి మరియు పశువుల నుండి, వారు అల్లాహ్ కొరకు కొంతభాగాన్ని నియమించి: "ఇది అల్లాహ్ కొరకు మరియు ఇది మా దేవతల (అల్లాహ్‌కు వారు సాటి కల్పించిన వారి) కొరకు." అని తమఊహాలో చెబుతారు. వారి దేవతలకు చెందిన భాగం అల్లాహ్‌కు చేరదు. మరియు అల్లాహ్‌కు చెందిన భాగం వారి దేవతలకు చేరుతుంది. ఎలాంటి చెడు నిర్ణయాలు చేస్తున్నారు వీరు![1]

وَكَذَٰلِكَ زَيَّنَ لِكَثِيرٍ مِّنَ ٱلْمُشْرِكِينَ قَتْلَ أَوْلَٰدِهِمْ شُرَكَآؤُهُمْ لِيُرْدُوهُمْ وَلِيَلْبِسُواْ عَلَيْهِمْ دِينَهُمْ ۖ وَلَوْ شَآءَ ٱللَّهُ مَا فَعَلُوهُ ۖ فَذَرْهُمْ وَمَا يَفْتَرُونَ ﴿١٣٧﴾

**137**. మరియు ఇదే విధంగా చాలామంది బహుదైవారాధకులకు (ముష్రికులకు) తమ సంతాన హత్యను - వారు (అల్లాహ్‌కు సాటి కల్పించిన) భాగస్వాములు - సరైనవిగా కనిపించేటట్లు చేశారు. ఇది వారిని నాశనానికి గురి చేయటానికి మరియు వారి ధర్మం వారికి సంశయాస్పదమైనదిగా చేయటానికీ! అల్లాహ్ కోరితే వారు అలా చేసిఉండే వారు కాదు. కావున నీవు వారిని వారి కల్పనలోనే వదలిపెట్టు.[2]

---

**1**. ముష్రిక్ ఖురైషులు తమ సేద్యపు పంటలలో మరియు ఇతర ఆదాయాలలో కొంతభాగం అల్లాహ్ (సు.తా.) పేర, మరికొంత తమ కల్పిత దైవాల పేర నిర్ణయించే వారు. అల్లాహుతా'ఆలా పేర ఉన్నదానిని తమ దగ్గరి బంధువులపై, పేదవారిపై మరియు అతిథులపై ఖర్చుచేసేవారు. కల్పిత దైవాల పేర ఉన్న దానిని, వారి పూజారుల మీద. కల్పిత దైవాలపేర ఉన్నదానిలో పంట సరిగ్గా పండకుంటే అల్లాహ్ (సు.తా.) పేర ఉన్నదాని నుండి తీసుకొని పూజారులకు ఇచ్చేవారు, కాని అల్లాహుతా'ఆలా పేర ఉన్నదానిలో తగ్గింపు అయితే అల్లాహ్ (సు.తా.) స్వయంసమృద్ధుడు, ఏమీ అక్కర లేనివాడనేవారు. అంటే తమ దగ్గరిబంధువులకు, పేదవారికి మరియు అతిథులకు ఇచ్చేవారు కాదు.

**2**. అల్లాహ్ (సు.తా.) కోరితే, తాను కోరినట్లు చేయటానికి వారికి మార్గం చూపేవాడు. కాని అల్లాహుతా'ఆలా వారికి తెలివినిచ్చి, మంచి-చెడుల విచక్షణా శక్తినిచ్చి, వారికి తాము కోరిన మార్గాన్ని ఎన్నుకోవటానికి స్వాతంత్ర్యం ఇచ్చి, వారి కర్మల ప్రకారం వారి కొరకు స్వర్గ-నరకాలను, ఏర్పాటు చేశాడు మరియు తన ప్రవక్తల మరియు దివ్యగ్రంథాల ద్వారా, ఈ విషయం మానవులకు విశదం కూడా చేశాడు.

وَقَالُواْ هَٰذِهِۦٓ أَنۡعَٰمٞ وَحَرۡثٌ
حِجۡرٞ لَّا يَطۡعَمُهَآ إِلَّا مَن
نَّشَآءُ بِزَعۡمِهِمۡ وَأَنۡعَٰمٌ حُرِّمَتۡ
ظُهُورُهَا وَأَنۡعَٰمٞ لَّا يَذۡكُرُونَ ٱسۡمَ
ٱللَّهِ عَلَيۡهَا ٱفۡتِرَآءً عَلَيۡهِۚ
سَيَجۡزِيهِم بِمَا كَانُواْ
يَفۡتَرُونَ ١٣٨

**138**. మరియు వారు: "ఈ పశువులు మరియు ఈ పంటలు నిషిద్ధం చేయబడ్డాయి. మేము కోరినవారు తప్ప ఇతరులు వీటిని తినరాదు." అని అంటారు. కొన్ని జంతువుల వీపులపై బరువు వేయటాన్ని (స్వారీ చేయటాన్ని) నిషేధిస్తారు. మరికొన్ని జంతువులను (వధించేటప్పుడు) వాటి మీద అల్లాహ్ పేరు ఉచ్చరించరు.[1] ఇవన్నీ వారు ఆయనపై కల్పించిన (అబద్ధాలు) మాత్రమే. ఆయన త్వరలోనే వారికి, వారి (అసత్య) కల్పనలకు తగిన ప్రతిఫలం ఇవ్వగలడు.

وَقَالُواْ مَا فِي بُطُونِ هَٰذِهِ
ٱلۡأَنۡعَٰمِ خَالِصَةٞ لِّذُكُورِنَا
وَمُحَرَّمٌ عَلَىٰٓ أَزۡوَٰجِنَاۖ وَإِن
يَكُن مَّيۡتَةٗ فَهُمۡ فِيهِ
شُرَكَآءُۚ سَيَجۡزِيهِمۡ وَصۡفَهُمۡۚ
إِنَّهُۥ حَكِيمٌ عَلِيمٞ ١٣٩

**139**. ఇంకా వారు ఇలా అంటారు: "ఈ పశువుల గర్భాలలో ఉన్నది కేవలం మా పురుషులకే ప్రత్యేకించబడింది మరియు ఇది మా స్త్రీలకు నిషేధించబడింది. కాని ఒకవేళ అది మరణించినది అయితే వారు (స్త్రీలు) దానిలో భాగస్థులు." ఆయన వారి ఈ ఆరోపణలకు త్వరలోనే వారికి ప్రతీకారం చేస్తాడు. నిశ్చయంగా, ఆయన మహా వివేచనాపరుడు, సర్వజ్ఞుడు.

---

**1**. చూడండి, 5:103. దీని అర్థమేమిటంటే ముష్రిక్ 'అరబ్బులు అల్లాహ్ (సు.తా.)ను ఏకైక అత్యున్నత దైవంగా విశ్వసించి, కొన్ని పశువులను వధించేటప్పుడు అల్లాహుతా'ఆలా పేరు తీసుకునేవారు. కాని తాము కల్పించిన దైవాలకు బలిఇచ్చేటప్పుడు, ఆ దైవాల పేర్లే తీసుకునేవారు. ఇదే విధంగా ఈ నాటి హిందువు (ముష్రికు)లు, కూడా పరమేశ్వరుణ్ణి ఏకైక అత్యున్నత దైవంగా విశ్వసిస్తున్నారు. కాని అల్లాహ్ (సు.తా.)కు భాగస్వాములను, ప్రతి కార్యనిర్వాహణకు ఒక దైవాన్ని కల్పించుకున్నారు. అల్లాహుతా'ఆలా అన్నాడు: "నేను ప్రతి పాపాన్ని - నేను తలచుకుంటే - క్షమిస్తాను! ఒక్క షిర్క్ తప్ప!"

قَدْ خَسِرَ ٱلَّذِينَ قَتَلُوٓاْ أَوْلَٰدَهُمْ سَفَهًۢا بِغَيْرِ عِلْمٍ وَحَرَّمُواْ مَا رَزَقَهُمُ ٱللَّهُ ٱفْتِرَآءً عَلَى ٱللَّهِۚ قَدْ ضَلُّواْ وَمَا كَانُواْ مُهْتَدِينَ ﴿١٤٠﴾

140. మూఢత్వం మరియు అజ్ఞానం వల్ల తమ సంతానాన్ని హత్యచేసేవారునూ మరియు అల్లాహ్‌పై అసత్యాలు కల్పిస్తూ, తమకు అల్లాహ్ ఇచ్చిన జీవనోపాధిని నిషేధించుకున్నవారునూ, వాస్తవంగా నష్టానికి గురిఅయిన వారే! నిశ్చయంగా, వారు మార్గం తప్పారు. వారెన్నటికీ మార్గదర్శకత్వం పొందేవారు కారు. (1/4)

۞ وَهُوَ ٱلَّذِيٓ أَنشَأَ جَنَّٰتٍ مَّعْرُوشَٰتٍ وَغَيْرَ مَعْرُوشَٰتٍ وَٱلنَّخْلَ وَٱلزَّرْعَ مُخْتَلِفًا أُكُلُهُۥ وَٱلزَّيْتُونَ وَٱلرُّمَّانَ مُتَشَٰبِهًا وَغَيْرَ مُتَشَٰبِهٍۚ كُلُواْ مِن ثَمَرِهِۦٓ إِذَآ أَثْمَرَ وَءَاتُواْ حَقَّهُۥ يَوْمَ حَصَادِهِۦۖ وَلَا تُسْرِفُوٓاْۚ إِنَّهُۥ لَا يُحِبُّ ٱلْمُسْرِفِينَ ﴿١٤١﴾

141. * మరియు ఆయనే పందిళ్ళ మీద ప్రాకే (ఎక్కించబడే) తీగల మరియు పందిళ్ళమీద ప్రాకని (ఎక్కించబడని) చెట్ల తోటలు మరియు ఖర్జూరపు చెట్లు మరియు వివిధ రకాల రుచిగల పంటలు మరియు జైతూన్ (ఆలివు), దానిమ్మ చెట్లను పుట్టించాడు. అవి కొన్ని విషయాలలో ఒక దానితో ఒకటి పోలి ఉంటాయి, మరికొన్ని విషయాలలో ఒక దానితో ఒకటి పోలి ఉండవు.[1] వాటికి ఫలాలు వచ్చినపుడు వాటి ఫలాలను తినండి. కానీ వాటి కోతదినమున (ఫలకాలంలో) వాటి హక్కు (జకాత్) చెల్లించండి.[2] మరియు వృథాగా ఖర్చు చేయకండి. నిశ్చయంగా, ఆయన వృథా ఖర్చు చేసే వారంటే ఇష్టపడడు.

وَمِنَ ٱلْأَنْعَٰمِ حَمُولَةً وَفَرْشًاۚ كُلُواْ مِمَّا رَزَقَكُمُ ٱللَّهُ وَلَا تَتَّبِعُواْ خُطُوَٰتِ ٱلشَّيْطَٰنِۚ إِنَّهُۥ لَكُمْ عَدُوٌّ مُّبِينٌ ﴿١٤٢﴾

142. మరియు పశువులలో కొన్ని బరువు మోయటానికి, మరికొన్ని చిన్నవి (భారం మోయలేనివి) ఉన్నాయి. అల్లాహ్ మీకు జీవనోపాధికి ఇచ్చిన వాటిని తినండి. మరియు షైతాన్ అడుగుజాడలలో నడవకండి. నిశ్చయంగా, వాడు మీకు బహిరంగ శత్రువు!

1. చూడండి, 6:99 వ్యాఖ్యానం 2.
2. ఈ జకాత్ కొందరు ధర్మవేత్తల ప్రకారం 1/10. ఒకవేళ నీటిని కుంటల నుండి లేక నదులనుండి తీసుకుంటే! కాని ఒకవేళ బావినీరు, బోర్‌వెల్ నీరు తీసుకుంటే 1/20 వంతు.

ثَمَٰنِيَةَ أَزۡوَٰجٖۖ مِّنَ ٱلضَّأۡنِ ٱثۡنَيۡنِ وَمِنَ ٱلۡمَعۡزِ ٱثۡنَيۡنِۗ قُلۡ ءَآلذَّكَرَيۡنِ حَرَّمَ أَمِ ٱلۡأُنثَيَيۡنِ أَمَّا ٱشۡتَمَلَتۡ عَلَيۡهِ أَرۡحَامُ ٱلۡأُنثَيَيۡنِۖ نَبِّـُٔونِي بِعِلۡمٍ إِن كُنتُمۡ صَٰدِقِينَ ﴿١٤٣﴾

143. (పెంటి-పోతు కలిసి) ఎనిమిది రకాలు (జతలు).[1] అందులో గొర్రెలలో నుండి రెండు (పెంటి-పోతు) మరియు మేకలలో నుండి రెండు (పెంటి-పోతు). వారిని అడుగు: "ఏమీ? ఆయన నిషేధించింది, రెండు మగవాటినా? లేక రెండు ఆడవాటినా? లేక ఆ రెండు ఆడవాటి గర్భాలలో ఉన్న వాటినా?[2] మీరు సత్యవంతులే అయితే, నాకు సరైన జ్ఞానంతో తెలుపండి."

وَمِنَ ٱلۡإِبِلِ ٱثۡنَيۡنِ وَمِنَ ٱلۡبَقَرِ ٱثۡنَيۡنِۗ قُلۡ ءَآلذَّكَرَيۡنِ حَرَّمَ أَمِ ٱلۡأُنثَيَيۡنِ أَمَّا ٱشۡتَمَلَتۡ عَلَيۡهِ أَرۡحَامُ ٱلۡأُنثَيَيۡنِۖ أَمۡ كُنتُمۡ شُهَدَآءَ إِذۡ وَصَّىٰكُمُ ٱللَّهُ بِهَٰذَاۚ فَمَنۡ أَظۡلَمُ مِمَّنِ ٱفۡتَرَىٰ عَلَى ٱللَّهِ كَذِبٗا لِّيُضِلَّ ٱلنَّاسَ بِغَيۡرِ عِلۡمٍۗ إِنَّ ٱللَّهَ لَا يَهۡدِي ٱلۡقَوۡمَ ٱلظَّٰلِمِينَ ﴿١٤٤﴾

144. "మరియు ఒంటెలలో రెండు (పెంటి-పోతు) మరియు ఆవులలో రెండు (పెంటి-పోతు)."[3] వారిని అడుగు: "ఏమీ? ఆయన నిషేధించింది, రెండు మగ వాటినా లేక రెండు ఆడ వాటినా? లేక ఆ రెండింటి గర్భాలలో ఉన్న వాటినా? అల్లాహ్ ఈ విధంగా ఆజ్ఞాపించినపుడు, మీరు సాక్షులుగా ఉంటిరా? లేకపోతే! జ్ఞానం లేకుండా ప్రజలను పెడమార్గం పట్టించటానికి అల్లాహ్ పేరుతో అబద్ధాన్ని కల్పించే వ్యక్తి కంటే మించిన దుర్మార్గుడెవడు? నిశ్చయంగా, అల్లాహ్ దుర్మార్గులకు సన్మార్గం చూపడు."

---

1. అరబ్బీ భాషలో ఒకే రకమైన ఆడ-మగలను కలిపి జత (జౌజ్), అంటారు. ఆ రెండింటిలోని, ప్రతి ఒక్క దానిని కూడా జౌజ్, అని అంటారు. అంటే జతలో నుండి ఒకటి. ఎందుకంటే, ఒకటి మరొకదాని జతకారి. ఇక్కడ ఆ జతలో ప్రతి ఒక్కటి అనే అర్థంలో ఉపయోగించబడింది.
2. ముష్రికులు కొన్ని పశువులను తమంతట తామే నిషిద్ధం (హరాం) చేసుకొని ఉండిరి. కావున ఇక్కడ వారితో ఈ ప్రశ్న అడుగబడుతోంది. ఎందుకంటే, అల్లాహ్ (సు.తా.) వీటిలో దేనిని కూడా హరామ్ చేయలేదు.
3. ఈ నాలుగు జతలు కలిసి మొత్తం ఎనిమిది పశువులు అవుతాయి.

**145**. (ఓ ప్రవక్తా!) వారికి తెలుపు: "నాపై అవతరింపజేయబడిన దివ్యజ్ఞానంలో (వ'హీ): ఆహార పదార్థాలలో చచ్చిన జంతువు, కారిన రక్తం, పంది మాంసం - ఎందుకంటే అది అపరిశుద్ధమైనది (రిజ్స్); లేక అల్లాహ్‌కు అవిధేయతకు పాల్పడి - ఆయన పేరుతో గాక - ఇతరుల పేరుతో కోయబడిన జంతువు తప్ప, ఇతర వాటిని తినటాన్ని నిషేధించబడినట్లు నేను చూడలేదు. కాని ఎవడైనా గత్యంతరంలేని పరిస్థితులలో దుర్నీతికి ఒడిగట్టకుండా, ఆవశ్యకత వలన, హద్దులు మీరకుండా (తింటే)! నీ ప్రభువు నిశ్చయంగా, క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.[1]

قُل لَّآ أَجِدُ فِي مَآ أُوحِيَ إِلَيَّ مُحَرَّمًا عَلَىٰ طَاعِمٖ يَطۡعَمُهُۥٓ إِلَّآ أَن يَكُونَ مَيۡتَةً أَوۡ دَمٗا مَّسۡفُوحًا أَوۡ لَحۡمَ خِنزِيرٖ فَإِنَّهُۥ رِجۡسٌ أَوۡ فِسۡقًا أُهِلَّ لِغَيۡرِ ٱللَّهِ بِهِۦۚ فَمَنِ ٱضۡطُرَّ غَيۡرَ بَاغٖ وَلَا عَادٖ فَإِنَّ رَبَّكَ غَفُورٞ رَّحِيمٞ ١٤٥

**146**. మరియు యూదమతం అవలంబించిన వారికి మేము గోళ్ళు ఉన్న అన్ని జంతువులను నిషేధించాము.[2] మరియు వారికి ఆవు మరియు మేకలలో వాటి - వీపులకు లేదా ప్రేగులకు తగిలివున్న మరియు ఎముకలలో మిశ్రమమై ఉన్న క్రొవ్వు తప్ప - మిగతా (క్రొవ్వును) నిషేధించాము. ఇది వారి అక్రమాలకు విధించిన శిక్ష. మరియు నిశ్చయంగా, మేము సత్యవంతులము!"

وَعَلَى ٱلَّذِينَ هَادُواْ حَرَّمۡنَا كُلَّ ذِي ظُفُرٖۖ وَمِنَ ٱلۡبَقَرِ وَٱلۡغَنَمِ حَرَّمۡنَا عَلَيۡهِمۡ شُحُومَهُمَآ إِلَّا مَا حَمَلَتۡ ظُهُورُهُمَآ أَوِ ٱلۡحَوَايَآ أَوۡ مَا ٱخۡتَلَطَ بِعَظۡمٖۚ ذَٰلِكَ جَزَيۡنَٰهُم بِبَغۡيِهِمۡۖ وَإِنَّا لَصَٰدِقُونَ ١٤٦

1. చూడండి, 2:173 మరియు 5:3.
2. గోళ్ళు ఉన్న జంతువులు అంటే, వాటి వ్రేళ్ళు విడివిడిగా లేని జంతువులు ఉదా. ఒంటెలు, బాతులు, నిప్పుకోడి (ఉష్ట్రపక్షి), ఆవులు, మరియు మేకలు మొదలైనవి, యూదుల కొరకు 'హరామ్ చేయబడి ఉండెను. కేవలం వ్రేళ్లు విడిగా ఉన్న పశు పక్షులు మాత్రమే వారికి 'హలాల్ చేయబడి ఉండేవి.

**147**. (ఓ ముహమ్మద్!) ఒకవేళ వారు నిన్ను అసత్యుడవని తిరస్కరిస్తే![1] నీవు వారితో ఇలా అను: "మీ ప్రభువు కారుణ్య పరిధి సువిశాలమైనది, కాని ఆయన శిక్ష పాపిష్ఠి ప్రజలపై పడకుండా నివారించబడదు."

**148**. అల్లాహ్‌కు సాటి (భాగస్వాములు) కల్పించే వారు అంటారు: "ఒకవేళ అల్లాహ్ కోరితే మేము గానీ, మా తండ్రితాతలు గానీ ఆయనకు సాటి కల్పించే వారమూ కాము మరియు దేనినీ నిషేధించి ఉండేవారమూ కాము." వారికి పూర్వం వారు కూడా మా శిక్షను రుచి చూడనంత వరకు ఇదేవిధంగా తిరస్కరించారు. వారిని అడుగు: "మీ వద్ద ఏదైనా (రూఢి అయిన) జ్ఞానం ఉందా! ఉంటే మా ముందు పెట్టండి. మీరు కేవలం కల్పనలను అనుసరిస్తున్నారు. మరియు మీరు కేవలం ఊహాగానాలే చేస్తున్నారు."

**149**. ఇలా అను: "రూఢి అయిన ప్రమాణం అల్లాహ్ వద్దనే ఉంది. ఆయన గనక తలచుకుని ఉంటే మీ అందరికీ సన్మార్గం చూపి ఉండేవాడు."

**150**. (ఇంకా) ఇలా అను: "'నిశ్చయంగా, అల్లాహ్ ఈ వస్తువులను నిషేధించాడు.' అని సాక్ష్యమిచ్చే మీ సాక్షులను తీసుకొని రండి." ఒకవేళ వారు అలా సాక్ష్యమిస్తే, నీవు వారితో కలిసి సాక్ష్యమివ్వకు. మరియు మా సూచనలను

فَإِن كَذَّبُوكَ فَقُل رَّبُّكُمْ
ذُو رَحْمَةٍ وَاسِعَةٍ وَلَا يُرَدُّ بَأْسُهُۥ
عَنِ ٱلْقَوْمِ ٱلْمُجْرِمِينَ ﴿١٤٧﴾

سَيَقُولُ ٱلَّذِينَ أَشْرَكُوا۟ لَوْ شَآءَ ٱللَّهُ
مَآ أَشْرَكْنَا وَلَآ ءَابَآؤُنَا وَلَا
حَرَّمْنَا مِن شَىْءٍ ۚ كَذَٰلِكَ كَذَّبَ
ٱلَّذِينَ مِن قَبْلِهِمْ حَتَّىٰ ذَاقُوا۟
بَأْسَنَا ۗ قُلْ هَلْ عِندَكُم مِّنْ
عِلْمٍ فَتُخْرِجُوهُ لَنَآ ۖ إِن تَتَّبِعُونَ
إِلَّا ٱلظَّنَّ وَإِنْ أَنتُمْ إِلَّا تَخْرُصُونَ
﴿١٤٨﴾

قُلْ فَلِلَّهِ ٱلْحُجَّةُ ٱلْبَٰلِغَةُ ۖ فَلَوْ شَآءَ
لَهَدَىٰكُمْ أَجْمَعِينَ ﴿١٤٩﴾

قُلْ هَلُمَّ شُهَدَآءَكُمُ ٱلَّذِينَ
يَشْهَدُونَ أَنَّ ٱللَّهَ حَرَّمَ هَٰذَا ۖ
فَإِن شَهِدُوا۟ فَلَا تَشْهَدْ مَعَهُمْ ۚ

1. చూడండి, 3:93.

وَلَا تَتَّبِعْ أَهْوَآءَ ٱلَّذِينَ كَذَّبُواْ بِـَٔايَٰتِنَا وَٱلَّذِينَ لَا يُؤْمِنُونَ بِٱلْأَخِرَةِ وَهُم بِرَبِّهِمْ يَعْدِلُونَ ﴿١٥٠﴾

అసత్యాలని తిరస్కరించే వారి మరియు పరలోకమునందు విశ్వాసం లేని వారి మరియు ఇతరులను తమ ప్రభువుకు సమానులుగా నిలబెట్టే వారి మనోవాంఛలను నీవు ఏ మాత్రం అనుసరించకు!" (3/8)

۞ قُلْ تَعَالَوْاْ أَتْلُ مَا حَرَّمَ رَبُّكُمْ عَلَيْكُمْ ۖ أَلَّا تُشْرِكُواْ بِهِۦ شَيْـًٔا ۖ وَبِٱلْوَٰلِدَيْنِ إِحْسَٰنًا ۖ وَلَا تَقْتُلُوٓاْ أَوْلَٰدَكُم مِّنْ إِمْلَٰقٍ ۖ نَّحْنُ نَرْزُقُكُمْ وَإِيَّاهُمْ ۖ وَلَا تَقْرَبُواْ ٱلْفَوَٰحِشَ مَا ظَهَرَ مِنْهَا وَمَا بَطَنَ ۖ وَلَا تَقْتُلُواْ ٱلنَّفْسَ ٱلَّتِى حَرَّمَ ٱللَّهُ إِلَّا بِٱلْحَقِّ ۚ ذَٰلِكُمْ وَصَّىٰكُم بِهِۦ لَعَلَّكُمْ تَعْقِلُونَ ﴿١٥١﴾

**151.** * ఇలా అను: "రండి మీ ప్రభువు మీకు నిషేధించివున్న వాటిని మీకు వినిపిస్తాను: మీరు ఆయనకు ఎలాంటి సాటి (భాగస్వాములను) కల్పించకండి.[1] మరియు తల్లిదండ్రులతో మంచిగా ప్రవర్తించండి. మరియు పేదరికానికి భయపడి మీ సంతానాన్ని చంపకండి.[2] మేమే మీకూ మరియు వారికి కూడా జీవనోపాధిని ఇచ్చేవారము. మరియు బహిరంగంగా గానీ, లేదా దొంగచాటుగా గానీ అశ్లీలమైన (సిగ్గుమాలిన) పనులను సమీపించకండి. అల్లాహ్ నిషేధించిన ప్రాణిని, న్యాయం కొరకు తప్ప చంపకండి.[3] మీరు అర్థం చేసుకోవాలని, ఈ విషయాలను ఆయన మీకు ఆజ్ఞాపిస్తున్నాడు.

وَلَا تَقْرَبُواْ مَالَ ٱلْيَتِيمِ إِلَّا بِٱلَّتِى هِىَ أَحْسَنُ حَتَّىٰ يَبْلُغَ أَشُدَّهُۥ ۖ وَأَوْفُواْ ٱلْكَيْلَ وَٱلْمِيزَانَ بِٱلْقِسْطِ ۖ

**152.** మరియు అనాథుడు తన యుక్త వయస్సుకు చేరనంతవరకు అతని ఆస్తిని, బాగుపరచటానికి తప్ప ఇతర ఉద్దేశ్యంతో సమీపించకండి. కొలవటంలో మరియు తూచటంలో న్యాయాన్ని పాటించండి. ఏ

---

**1.** షిర్క్: ఇతరులను అల్లాహ్ (సు.తా.)కు సాటి (భాగస్వాములుగా) కల్పించటం. అది మహా పాపం. దాని కెట్టి పరిహారం లేదు. అది క్షమించబడని పాపం. షిర్కుచేసే వారికి స్వర్గం 'హరాం మరియు నరకం అనివార్యం చేయబడ్డాయి. ఈ విషయం దివ్యఖుర్ఆన్‌లో మాటిమాటికీ ఎన్నోసార్లు విశదీకరించబడింది.

**2.** అంటే ఫామిలీ ప్లానింగ్ కొరకు చేసే అబార్షన్లు మొదలైనవి.

**3.** చూడండి, 2:179.

لَا نُكَلِّفُ نَفْسًا إِلَّا وُسْعَهَا ۖ وَإِذَا
قُلْتُمْ فَاعْدِلُوا وَلَوْ كَانَ ذَا قُرْبَىٰ ۖ
وَبِعَهْدِ اللَّهِ أَوْفُوا ۚ ذَٰلِكُمْ
وَصَّاكُم بِهِ لَعَلَّكُمْ تَذَكَّرُونَ ﴿١٥٢﴾
وَأَنَّ هَٰذَا صِرَاطِي مُسْتَقِيمًا
فَاتَّبِعُوهُ ۖ وَلَا تَتَّبِعُوا السُّبُلَ فَتَفَرَّقَ
بِكُمْ عَن سَبِيلِهِ ۚ ذَٰلِكُمْ وَصَّاكُم
بِهِ لَعَلَّكُمْ تَتَّقُونَ ﴿١٥٣﴾
ثُمَّ آتَيْنَا مُوسَى الْكِتَابَ تَمَامًا
عَلَى الَّذِي أَحْسَنَ وَتَفْصِيلًا
لِّكُلِّ شَيْءٍ وَهُدًى وَرَحْمَةً لَّعَلَّهُم
بِلِقَاءِ رَبِّهِمْ يُؤْمِنُونَ ﴿١٥٤﴾
وَهَٰذَا كِتَابٌ أَنزَلْنَاهُ مُبَارَكٌ
فَاتَّبِعُوهُ وَاتَّقُوا لَعَلَّكُمْ تُرْحَمُونَ
﴿١٥٥﴾
أَن تَقُولُوا إِنَّمَا أُنزِلَ الْكِتَابُ عَلَىٰ
طَائِفَتَيْنِ مِن قَبْلِنَا وَإِن كُنَّا
عَن دِرَاسَتِهِمْ لَغَافِلِينَ ﴿١٥٦﴾

ప్రాణిపై గూడా మేము దాని శక్తికి మించిన భారాన్ని మోపము. పలికితే న్యాయమే పలకండి, అది మీ దగ్గరి బంధువుకు (ప్రతికూలమైనది) అయినా సరే! అల్లాహ్‌తో చేసిన ఒడంబడికను పూర్తి చేయండి. మీరు హితోపదేశం స్వీకరించాలని ఆయన మీకు ఈ విషయాలను ఆజ్ఞాపిస్తున్నాడు.

**153**. "మరియు నిశ్చయంగా, ఇదే ఋజుమార్గం, కావున మీరు దీనినే అనుసరించండి. ఇతర మార్గాలను అనుసరించకండి. అవి మిమ్మల్ని ఆయన మార్గం నుండి తప్పిస్తాయి. మీరు భయభక్తులు కలిగి ఉండాలని ఆయన మిమ్మల్ని ఈ విధంగా ఆజ్ఞాపిస్తున్నాడు."

**154**. ఇక మేము మూసాకు - సజ్జనులపై మా అనుగ్రహాన్ని పూర్తి చేయటానికి, ప్రతి విషయాన్ని వివరించ టానికి మరియు మార్గదర్శకత్వం మరియు కరుణను చూపటానికి మరియు వారు తమ ప్రభువును దర్శించవలసి ఉన్న దానిని విశ్వసించటానికి - గ్రంథాన్ని ప్రసాదించాము.

**155**. మరియు ఇదే విధంగా శుభప్రదమైన ఈ గ్రంథాన్ని (ఖుర్ఆన్‌ను) అవతరింపజేశాము. కావున దీనిని అనుసరించి, భయభక్తులు కలిగిఉంటే, మీరు కరుణింపబడవచ్చు!

**156**. ఇక మీరు (అరబ్బులు): "వాస్తవానికి మాకు పూర్వం ఉన్న రెండు వర్గాల వారికి (యూదులకు మరియు క్రైస్తవులకు) గ్రంథం అవతరింపజేయబడింది, కాని వారు చదివేదేమిటో మేము ఎరుగము." అని అనగూడదని!

أَوۡ تَقُولُواْ لَوۡ أَنَّآ أُنزِلَ عَلَيۡنَا ٱلۡكِتَٰبُ لَكُنَّآ أَهۡدَىٰ مِنۡهُمۡۚ فَقَدۡ جَآءَكُم بَيِّنَةٞ مِّن رَّبِّكُمۡ وَهُدٗى وَرَحۡمَةٞۚ فَمَنۡ أَظۡلَمُ مِمَّن كَذَّبَ بِـَٔايَٰتِ ٱللَّهِ وَصَدَفَ عَنۡهَاۗ سَنَجۡزِي ٱلَّذِينَ يَصۡدِفُونَ عَنۡ ءَايَٰتِنَا سُوٓءَ ٱلۡعَذَابِ بِمَا كَانُواْ يَصۡدِفُونَ ١٥٧

**157**. లేదా మీరు: "ఒకవేళ నిశ్చయంగా, మాపై గ్రంథం అవతరింపజేయబడి ఉంటే మేమూ వారికంటే ఉత్తమ రీతిలో సన్మార్గం మీద నడిచి ఉండేవారము." అని అనవచ్చని. కాబట్టి వాస్తవానికి ఇప్పుడు మీ ప్రభువు తరఫునుండి మీ వద్దకు ఒక స్పష్టమైన ప్రమాణం, మార్గదర్శకత్వం మరియు కారుణ్యం (ఈ ఖుర్ఆన్) వచ్చింది. ఇక అల్లాహ్ సూచనలను అసత్యాలని పలికే వాడికంటే, వాటిపట్ల వైముఖ్యం ప్రదర్శించే వాడికంటే, మించిన దుర్మార్గు డెవడు? కాబట్టి మా సూచనలపట్ల విముఖత చూపేవారికి, వారి ఈ వైముఖ్యానికి ఫలితంగా భయంకరమైన శిక్ష విధిస్తాము.

هَلۡ يَنظُرُونَ إِلَّآ أَن تَأۡتِيَهُمُ ٱلۡمَلَٰٓئِكَةُ أَوۡ يَأۡتِيَ رَبُّكَ أَوۡ يَأۡتِيَ بَعۡضُ ءَايَٰتِ رَبِّكَۗ يَوۡمَ يَأۡتِي بَعۡضُ ءَايَٰتِ رَبِّكَ لَا يَنفَعُ نَفۡسًا إِيمَٰنُهَا لَمۡ تَكُنۡ ءَامَنَتۡ مِن قَبۡلُ أَوۡ كَسَبَتۡ فِيٓ إِيمَٰنِهَا خَيۡرٗاۗ قُلِ ٱنتَظِرُوٓاْ إِنَّا مُنتَظِرُونَ ١٥٨

**158**. ఏమీ? వారు తమ వద్దకు దేవదూతలు రావాలని గానీ, లేక నీ ప్రభువు రావాలని గానీ, లేదా నీ ప్రభువు యొక్క కొన్ని (బహిరంగ) నిదర్శనాలు రావాలని గానీ ఎదురుచూస్తున్నారా? నీ ప్రభువు యొక్క కొన్ని (బహిరంగ) నిదర్శనాలు వచ్చేరోజున, పూర్వం విశ్వసించకుండా ఆ రోజున విశ్వసించిన వ్యక్తికీ, లేదా విశ్వసించి కూడా ఏ మంచినీ సంపాదించుకోని వ్యక్తికీ, తన విశ్వాసంవల్ల (ఆ రోజు) ఏ ప్రయోజనం చేకూరదు. వారితో ఇలా అను: "మీరు నిరీక్షించండి. నిశ్చయంగా, మేము కూడా నిరీక్షిస్తాము."[1]

**1**. చూడండి, 40:84-85 మరియు 47:18. ఇంకా చూడండి, 'స.బు'ఖారీ, పు. 6 'హ.నం.159 మరియు పు. 9 'హ.నం. 245.

إِنَّ ٱلَّذِينَ فَرَّقُواْ دِينَهُمْ وَكَانُواْ شِيَعًا لَّسْتَ مِنْهُمْ فِي شَيْءٍ إِنَّمَآ أَمْرُهُمْ إِلَى ٱللَّهِ ثُمَّ يُنَبِّئُهُم بِمَا كَانُواْ يَفْعَلُونَ ﴿١٥٩﴾

**159**. నిశ్చయంగా, ఎవరైతే తమ ధర్మంలో విభేదాలు కల్పించుకొని, వేర్వేరు తెగలుగా చీలిపోయారో, వారితో నీకు ఎలాంటి సంబంధం లేదు. నిశ్చయంగా, వారి వ్యవహారం అల్లాహ్ అధీనంలో ఉంది. తరువాత ఆయనే వారు చేస్తూవున్న కర్మలను గురించి వారికి తెలుపుతాడు.[1]

مَن جَآءَ بِٱلْحَسَنَةِ فَلَهُۥ عَشْرُ أَمْثَالِهَا وَمَن جَآءَ بِٱلسَّيِّئَةِ فَلَا يُجْزَىٰٓ إِلَّا مِثْلَهَا وَهُمْ لَا يُظْلَمُونَ ﴿١٦٠﴾

**160**. ఎవడు ఒక సత్కార్యం చేస్తాడో, అతనికి దానికి పదిరెట్లు ప్రతిఫలం ఉంటుంది. మరియు ఎవడు ఒక పాపకార్యం చేస్తాడో, అతనికి దానంతటి శిక్షయే ఉంటుంది. మరియు వారికెలాంటి అన్యాయం జరుగదు.[2]

قُلْ إِنَّنِي هَدَىٰنِي رَبِّيٓ إِلَىٰ صِرَٰطٍ مُّسْتَقِيمٍ دِينًا قِيَمًا مِّلَّةَ إِبْرَٰهِيمَ حَنِيفًا وَمَا كَانَ مِنَ ٱلْمُشْرِكِينَ ﴿١٦١﴾

**161**. వారితో ఇలా అను: "నిశ్చయంగా, నా ప్రభువు నాకు ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేశాడు. అదే సరైన ధర్మం. ఏక దైవసిద్ధాంతమైన ఇబ్రాహీమ్ ధర్మం. అతను అల్లాహ్‌కు సాటికల్పించే వారిలో చేరినవాడు కాడు!"

قُلْ إِنَّ صَلَاتِي وَنُسُكِي وَمَحْيَايَ وَمَمَاتِي لِلَّهِ رَبِّ ٱلْعَٰلَمِينَ ﴿١٦٢﴾

**162**. (ఇంకా) ఇలా అను: "నిశ్చయంగా, నా నమాజ్, నా బలి (ఖుర్బానీ),[3] నా జీవితం మరియు నా మరణం, సర్వలోకాలకు ప్రభువైన అల్లాహ్ కొరకే!

---

**1**. చూడండి, 3:105.

**2**. చూడండి, 6:12. ఇంకా చూడండి, స.బుఖారీ, పు.8, హ.నం. 498.

**3**. నుసుకున్: Ritual, బలి, ఉపహారం, అర్పణ, భక్తి మరియు ఆరాధన యొక్క ఇతర అన్నీ రూపాలకు కూడా వర్తిస్తుంది.

لَا شَرِيكَ لَهُۥۖ وَبِذَٰلِكَ أُمِرْتُ وَأَنَا۠ أَوَّلُ ٱلْمُسْلِمِينَ ﴿١٦٣﴾

**163**. "ఆయనకు ఎలాంటి భాగస్వామి (సాటి) లేడు. మరియు నేను ఇదేవిధంగా ఆదేశించబడ్డాను మరియు నేను అల్లాహ్‌కు విధేయుడ (ముస్లిం)ను అయిన వారిలో మొట్టమొదటి వాడను!"[1]

قُلْ أَغَيْرَ ٱللَّهِ أَبْغِى رَبًّا وَهُوَ رَبُّ كُلِّ شَىْءٍۚ وَلَا تَكْسِبُ كُلُّ نَفْسٍ إِلَّا عَلَيْهَاۚ وَلَا تَزِرُ وَازِرَةٌ وِزْرَ أُخْرَىٰۚ ثُمَّ إِلَىٰ رَبِّكُم مَّرْجِعُكُمْ فَيُنَبِّئُكُم بِمَا كُنتُمْ فِيهِ تَخْتَلِفُونَ ﴿١٦٤﴾

**164**. ఇలా అను: "ఏమీ? నేను అల్లాహ్‌ను వదలి ఇతరులను ప్రభువులుగా అర్థించాలా? ఆయనే ప్రతి దానికీ ప్రభువు! ప్రతివ్యక్తి తాను సంపాదించిందే అనుభవిస్తాడు. మరియు బరువు మోసేవాడు ఎవ్వడూ ఇతరుల బరువును మోయడు.[2] చివరకు మీరంతా మీ ప్రభువు వైపునకే మరలి పోవలసి ఉంది. అప్పుడు ఆయన మీరు ఏ విషయాలను గురించి భేదాభిప్రాయాలు కలిగి ఉండేవారో వాటిని మీకు తెలియజేస్తాడు."

---

**1**. ఈ విధంగా ఎంతో మంది ప్రవక్తలు అన్నారు. "మేము ఇలాంటి వ'హీ ప్రవక్తలందరికీ పంపాము." అని అల్లాహ్ (సు.తా.) అన్నాడు. చూడండి, 21:25; నూ'హ్ ('అ.స.) ఇదే ప్రకటించారు,10:72; ఇబ్రాహీమ్ ('అ.స.) కూడా ఇలాగే అన్నారు, 2:131; ఇబ్రాహీమ్ మరియు య'అఖూబ్ 'అలైహిముస్సలాములు కూడా తమ సంతానంతో ఇదే విధంగా అన్నారు, 2:132; యూసుఫ్ ('అ.స.) ఇలాగే ప్రార్థించారు, 12:101; మూసా ('అ.స.) ఇలాగే తన జాతి వారితో అన్నారు, 10:84; మరియు 'ఈసా ('అ.స.) కూడా 'హవారియ్యూలతో ఇలాగే అన్నారు, 5:111.

**2**. అల్లాహ్ (సు.తా.) ప్రతి ఒక్కనికి అతని కర్మలకు తగిన ప్రతిఫలమిస్తాడు. మంచి చేసిన వానికి మంచి ఫలితం మరియు చెడు చేసిన వానికి దానికి తగిన శిక్ష. అల్లాహుతా'ఆలా ఒకని పాపభారాన్ని మరొకనిపై మోపడు. ఏ వ్యక్తి కూడా ఇతరుల పాపభారాన్ని మోయడు. ఏవ్యక్తిపై కూడా - అతడు ప్రవక్త అయినా సరే - ఇతరుల పాపభారం మోపబడదని అల్లాహ్ (సు.తా.) ఈ ఆయత్‌లో స్పష్టంగా తెలుపుతున్నాడు. అంటే మానవుల పాప భారాలను మోయటానికి 'ఈసా ('అ.స.) సిలువపై ఎక్కారనే క్రైస్తవుల అపోహను ఈ ఆయత్ ఖండిస్తోంది.

وَهُوَ ٱلَّذِى جَعَلَكُمْ خَلَٰٓئِفَ ٱلْأَرْضِ وَرَفَعَ بَعْضَكُمْ فَوْقَ بَعْضٍ دَرَجَٰتٍ لِّيَبْلُوَكُمْ فِى مَآ ءَاتَىٰكُمْ ۗ إِنَّ رَبَّكَ سَرِيعُ ٱلْعِقَابِ وَإِنَّهُۥ لَغَفُورٌ رَّحِيمٌۢ ﴿١٦٥﴾

**165**. మరియు ఆయనే మిమ్మల్ని భూమిమీద ఉత్తరాధికారులుగా నియమించి[1] - మీకిచ్చిన దానితో మిమ్మల్ని పరీక్షించటానికి - మీలో కొందరికి మరికొందరిపై ఉన్నత స్థానాన్ని ఇచ్చాడు. నిశ్చయంగా, నీ ప్రభువు శిక్షవిధించటంలో అతిశీఘ్రుడు, మరియు నిశ్చయంగా, ఆయన క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత. (1/2)

*****

1. చూడండి, 2:30 వ్యాఖ్యానం 1.

## 7. సూరహ్ అల్-అ'అరాఫ్

## سُورَةُ الأَعْرَافِ

ఈ సూరహ్ **మక్కా** చివరి సంవత్సరంలో, సూరహ్ అల్-అన్'ఆమ్ (6) కంటే ముందు అవతరింపజేయబడింది. ఇందులో **206 ఆయతులు**న్నాయి. దీనిపేరు **46, 48 ఆయత్‌ల** నుండి తీసుకోబడింది. అల్-అ'అరాఫు, అంటే **ఎత్తైన ప్రదేశాలు** అని అర్థం. స్వర్గ-నరకాల మధ్య ఉన్న గోడ మీది స్థలాన్ని అల్-అ'అరాఫు అంటారు. ఈ సూరహ్‌లో ఆదమ్ మరియు అతని భార్య 'హవ్వా ('అలైహిమ్ స.)ల గాథ ఉంది (ఆయత్‌లు 19-25). నూ'హ్, హూద్, 'సాలి'హ్, లూ'త్ షు'ఐబ్ మరియు మూసా ('అలైహిమ్ స.)ల గాథలు కూడా ఉన్నాయి. మరియు చివరి ప్రవక్త ము'హమ్మద్ ('స'అస), కేవలం శుభవార్తలు ఇచ్చేవారు, హెచ్చరిక చేసేవారు, అల్లాహ్ (సు.తా.) యొక్క దాసులు మరియు అతనికి ('స'అస) ఏ విధమైన అగోచర జ్ఞానం గానీ, అప్రకృతిక, అద్భుత శక్తులు గానీ లేవు, అని ఆయత్ 188లో వివరించబడింది. ము'హమ్మద్ ('స'అస), అల్లాహుతా'ఆలాను మాత్రమే ఆరాధించటానికి ఎన్నడూ అహంభావం చూపలేదు, (ఆయత్ 206).

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓمٓصٓ ١

**1.** * అలిఫ్-లామ్-మీమ్-సాద్!

كِتَٰبٌ أُنزِلَ إِلَيْكَ فَلَا يَكُن فِى صَدْرِكَ حَرَجٌ مِّنْهُ لِتُنذِرَ بِهِۦ وَذِكْرَىٰ لِلْمُؤْمِنِينَ ٢

**2.** (ఓ ము'హమ్మద్!) ఈ గ్రంథం నీపై అవతరింపజేయబడింది. కావున దీనిని గురించి నీ హృదయంలో ఏవిధమైన సంకోచం ఉండనివ్వకు; ఇది నీవు (సన్మార్గం నుండి తప్పే వారికి) హెచ్చరిక చేయటానికి (అవతరింపజేయబడింది); మరియు ఇది విశ్వాసులకొక హితోపదేశం.

ٱتَّبِعُوا۟ مَآ أُنزِلَ إِلَيْكُم مِّن رَّبِّكُمْ وَلَا تَتَّبِعُوا۟ مِن دُونِهِۦٓ أَوْلِيَآءَ ۗ قَلِيلًا مَّا تَذَكَّرُونَ ٣

**3.** (ప్రజలారా!) మీ ప్రభువు తరఫు నుండి మీ కొరకు అవతరింపజేయబడిన దానిని (ఈ ఖుర్ఆన్‌ను) అనుసరించండి. మరియు ఆయనను (అల్లాహ్‌ను) కాదని ఇతర స్నేహితులను (సహాయకులను) అనుసరించకండి. మీరు ఎంతో తక్కువగా ఈ హితబోధను స్వీకరిస్తున్నారు!

وَكَم مِّن قَرْيَةٍ أَهْلَكْنَٰهَا فَجَآءَهَا
بَأْسُنَا بَيَٰتًا أَوْ هُمْ قَآئِلُونَ ﴿٤﴾

4. మరియు మేము ఎన్నో నగరాలను (వాటి నేరాలకు గాను) నాశనం చేశాము. వారిపై, మా శిక్ష (అకస్మాత్తుగా) రాత్రివేళలో గానీ, లేదా మధ్యాహ్నాం వారు విశ్రాంతి తీసుకునే సమయంలో గానీ వచ్చిపడింది.

فَمَا كَانَ دَعْوَىٰهُمْ إِذْ جَآءَهُم بَأْسُنَآ
إِلَّآ أَن قَالُوٓا۟ إِنَّا كُنَّا ظَٰلِمِينَ ﴿٥﴾

5. వారిపై మా శిక్ష పడినప్పుడు వారి రోదన: "నిశ్చయంగా, మేము అపరాధులుగా ఉండే వారం!" అని అనడం తప్ప మరేమీ లేకుండింది.[1]

فَلَنَسْـَٔلَنَّ ٱلَّذِينَ أُرْسِلَ إِلَيْهِمْ
وَلَنَسْـَٔلَنَّ ٱلْمُرْسَلِينَ ﴿٦﴾

6. కావున మేము ఎవరివద్దకు మా సందేశాన్ని (ప్రవక్తను) పంపామో, వారిని తప్పక ప్రశ్నిస్తాము. మరియు నిశ్చయంగా ప్రవక్తలను కూడా ప్రశ్నిస్తాము.[2]

فَلَنَقُصَّنَّ عَلَيْهِم بِعِلْمٍ ۖ وَمَا كُنَّا
غَآئِبِينَ ﴿٧﴾

7. అప్పుడు (జరిగిందంతా) వారికి పూర్తి జ్ఞానంతో వివరిస్తాము. ఎందుకంటే మేము (ఎక్కడనూ, ఎప్పుడునూ) లేకుండా లేము.[3]

وَٱلْوَزْنُ يَوْمَئِذٍ ٱلْحَقُّ ۚ فَمَن ثَقُلَتْ
مَوَٰزِينُهُۥ فَأُو۟لَٰٓئِكَ هُمُ
ٱلْمُفْلِحُونَ ﴿٨﴾

8. మరియు ఆ రోజు (కర్మల) తూకం న్యాయంగా జరుగుతుంది. కావున ఎవరి తూనికలు బరువుగా ఉంటాయో అలాంటి వారే సఫలీకృతులు.[4]

وَمَنْ خَفَّتْ مَوَٰزِينُهُۥ فَأُو۟لَٰٓئِكَ
ٱلَّذِينَ خَسِرُوٓا۟ أَنفُسَهُم بِمَا كَانُوا۟
بِـَٔايَٰتِنَا يَظْلِمُونَ ﴿٩﴾

9. మరియు ఎవరి తూనికలు తేలికగా ఉంటాయో, అలాంటి వారే తమను తాము నష్టానికి గురిచేసుకున్నవారు.[5] ఎందుకంటే, వారు మా సూచనలను దుర్మార్గంతో తిరస్కరిస్తూ ఉండేవారు.

---

1. కాని అప్పుడది వారికి ఏ విధంగాను పనికిరాదు. చూడండి, 40:85.
2. చూడండి, 5:109.
3. అంటే అల్లాహ్ (సు.తా.)కు ప్రతి ప్రత్యక్ష-పరోక్ష, గోచర-అగోచర, విషయాల జ్ఞానం ఉంది. అల్లాహుతా'ఆలా తన జ్ఞానంతో ప్రతిచోట ఉంటాడు.
4. చూడండి, 101:6-7 మరియు 'స. బు'ఖారీ, పు. 9, 'హ. 652.
5. చూడండి, 101:8-11.

**10**. మరియు వాస్తవానికి మేము మిమ్మల్ని భూమిలో స్థిరపరచాము మరియు అందులో మీకు జీవన వసతులను కల్పించాము. (అయినా) మీరు కృతజ్ఞత చూపేది చాలా తక్కువ.

**11**. మరియు వాస్తవానికి మేము మిమ్మల్ని సృష్టించాము, పిదప మీ రూపాన్ని తీర్చిదిద్దాము. ఆ పిదప దైవ దూతలను: "మీరు ఆదమ్‌కు సాష్టాంగం (సజ్దా) చేయండి!" అని ఆదేశించగా, ఒక్క ఇబ్లీస్ తప్ప అందరూ సాష్టాంగం (సజ్దా) చేశారు, అతడు సాష్టాంగం చేసేవారిలో చేరలేదు.[1]

**12**. (అప్పుడు అల్లాహ్) అన్నాడు: "(ఓ ఇబ్లీస్!) నేను ఆజ్ఞాపించినప్పటికీ, సాష్టాంగం చేయకుండా నిన్ను ఆపింది ఏమిటీ?" దానికి (ఇబ్లీస్): "నేను అతనికంటే శ్రేష్ఠుడను. నీవు నన్ను అగ్నితో సృష్టించావు మరియు అతనిని నీవు మట్టితో సృష్టించావు." అని జవాబిచ్చాడు.[2]

**13**. (అప్పుడు అల్లాహ్) ఆజ్ఞాపించాడు: "నీవిక్కడి నుండి దిగిపో! ఇక్కడ గర్వ పడటం నీకు తగదు, కావున వెళ్ళిపో! నిశ్చయంగా, నీవు నీచులలో చేరావు!"

**14**. (ఇబ్లీస్) ఇలా వేడుకున్నాడు: "వారు తిరిగి లేపబడే (పునరుత్థాన) దినం వరకు నాకు వ్యవధినివ్వు!"

**15**. (అల్లాహ్) సెలవిచ్చాడు: "నిశ్చయంగా నీకు వ్యవధి ఇవ్వబడుతోంది!"

وَلَقَدْ مَكَّنَّٰكُمْ فِى ٱلْأَرْضِ
وَجَعَلْنَا لَكُمْ فِيهَا مَعَٰيِشَ ۗ قَلِيلًا
مَّا تَشْكُرُونَ ﴿١٠﴾
وَلَقَدْ خَلَقْنَٰكُمْ ثُمَّ صَوَّرْنَٰكُمْ
ثُمَّ قُلْنَا لِلْمَلَٰٓئِكَةِ ٱسْجُدُوا۟ لِءَادَمَ
فَسَجَدُوٓا۟ إِلَّآ إِبْلِيسَ لَمْ يَكُن
مِّنَ ٱلسَّٰجِدِينَ ﴿١١﴾
قَالَ مَا مَنَعَكَ أَلَّا تَسْجُدَ إِذْ أَمَرْتُكَ ۖ
قَالَ أَنَا۠ خَيْرٌ مِّنْهُ خَلَقْتَنِى مِن نَّارٍ
وَخَلَقْتَهُۥ مِن طِينٍ ﴿١٢﴾
قَالَ فَٱهْبِطْ مِنْهَا فَمَا يَكُونُ لَكَ أَن
تَتَكَبَّرَ فِيهَا فَٱخْرُجْ إِنَّكَ مِنَ
ٱلصَّٰغِرِينَ ﴿١٣﴾
قَالَ أَنظِرْنِىٓ إِلَىٰ يَوْمِ يُبْعَثُونَ ﴿١٤﴾
قَالَ إِنَّكَ مِنَ ٱلْمُنظَرِينَ ﴿١٥﴾

**1**. చూడండి, 2:30-34.
**2**. చూడండి, 18:50, 38:76. అతడు (ఇబ్లీస్) జిన్నాతులలోని వాడు.

16. (దానికి ఇబ్లీస్) అన్నాడు: "నీవు నన్ను మార్గభ్రష్టత్వంలో వేసినట్లు, నేను కూడా వారి కొరకు నీ ఋజుమార్గంపై మాటువేసి కూర్చుంటాను!

17. "తరువాత నేను వారి ముందు నుండి, వారి వెనుక నుండి వారి కుడివైపు నుండి మరియు వారి ఎడమవైపు నుండి, వారి వైపుకు వస్తూ ఉంటాను. మరియు వారిలో అనేకులను నీవు కృతజ్ఞులుగా పొందవు!"[1]

18. (అల్లాహ్) జవాబిచ్చాడు: "నీవిక్కడి నుండి అవమానింపబడి, బహిష్కృతుడవై వెళ్ళిపో! వారిలో ఎవరైతే నిన్ను అనుసరిస్తారో! అలాంటి మీ వారి అందరితో నిశ్చయంగా, నేను నరకాన్ని నింపుతాను."

19. మరియు: "ఓ ఆదమ్! నీవు మరియు నీ భార్య ఈ స్వర్గంలో ఉండండి. మరియు మీరిద్దరూ మీ ఇచ్ఛానుసారంగా దీనిలో (ఫలాలను) తినండి, కాని ఈ వృక్షాన్ని సమీపించకండి![2] అలా చేస్తే మీరు దుర్మార్గులలో చేరిపోతారు."

20. ఆ పిదప షై'తాన్ వారిద్దరి చూపులకు మరుగుగా ఉన్న వారిద్దరి మర్మాంగాలను వారికి బహిర్గతం చేయటానికి, రహస్యంగా వారి చెవులలో అన్నాడు: "మీరిద్దరూ దైవదూతలు అయిపోతారని, లేదా మీరిద్దరూ శాశ్వత జీవితాన్ని పొందుతారని మీ ప్రభువు, మీ ఇద్దరినీ ఈ వృక్షం నుండి నివారించాడు!"[3]

قَالَ فَبِمَآ أَغْوَيْتَنِى لَأَقْعُدَنَّ لَهُمْ
صِرَٰطَكَ ٱلْمُسْتَقِيمَ ﴿١٦﴾
ثُمَّ لَءَاتِيَنَّهُم مِّنۢ بَيْنِ أَيْدِيهِمْ وَمِنْ
خَلْفِهِمْ وَعَنْ أَيْمَٰنِهِمْ وَعَن شَمَآئِلِهِمْ ۖ
وَلَا تَجِدُ أَكْثَرَهُمْ شَٰكِرِينَ ﴿١٧﴾
قَالَ ٱخْرُجْ مِنْهَا مَذْءُومًا مَّدْحُورًا ۖ
لَّمَن تَبِعَكَ مِنْهُمْ لَأَمْلَأَنَّ جَهَنَّمَ
مِنكُمْ أَجْمَعِينَ ﴿١٨﴾
وَيَٰٓـَٔادَمُ ٱسْكُنْ أَنتَ وَزَوْجُكَ ٱلْجَنَّةَ
فَكُلَا مِنْ حَيْثُ شِئْتُمَا وَلَا تَقْرَبَا هَٰذِهِ
ٱلشَّجَرَةَ فَتَكُونَا مِنَ ٱلظَّٰلِمِينَ ﴿١٩﴾
فَوَسْوَسَ لَهُمَا ٱلشَّيْطَٰنُ لِيُبْدِىَ
لَهُمَا مَا وُۥرِىَ عَنْهُمَا مِن سَوْءَٰتِهِمَا
وَقَالَ مَا نَهَىٰكُمَا رَبُّكُمَا عَنْ هَٰذِهِ
ٱلشَّجَرَةِ إِلَّآ أَن تَكُونَا مَلَكَيْنِ أَوْ
تَكُونَا مِنَ ٱلْخَٰلِدِينَ ﴿٢٠﴾

1. చూడండి, 34:20.
2. చూడండి, 2:35-36.
3. చూడండి, 20:120.

وَقَاسَمَهُمَآ إِنِّي لَكُمَا لَمِنَ
ٱلنَّٰصِحِينَ ٢١

**21**. మరియు (షై'తాన్) వారిద్దరితో ప్రమాణం చేస్తూ పలికాడు: "నిశ్చయంగా, నేను మీ ఇద్దరి శ్రేయోభిలాషిని!"

فَدَلَّىٰهُمَا بِغُرُورٖۚ فَلَمَّا ذَاقَا ٱلشَّجَرَةَ
بَدَتۡ لَهُمَا سَوۡءَٰتُهُمَا وَطَفِقَا
يَخۡصِفَانِ عَلَيۡهِمَا مِن وَرَقِ ٱلۡجَنَّةِۖ
وَنَادَىٰهُمَا رَبُّهُمَآ أَلَمۡ أَنۡهَكُمَا عَن
تِلۡكُمَا ٱلشَّجَرَةِ وَأَقُل لَّكُمَآ إِنَّ
ٱلشَّيۡطَٰنَ لَكُمَا عَدُوّٞ مُّبِينٞ ٢٢

**22**. ఈ విధంగా వారిద్దరిని మోసపుచ్చి, తన (పన్నుగడ) వైపునకు త్రిప్పుకున్నాడు. వారిద్దరూ ఆ వృక్షమును (ఫలమును) రుచి చూడగానే వారిద్దరి మర్మాంగాలు వారికి బహిర్గతమయ్యాయి. అప్పుడు వారు తమపై (శరీరాలపై) స్వర్గపు ఆకులను కప్పుకోసాగారు. మరియు వారి ప్రభువు వారిద్దరినీ పిలిచి అన్నాడు: "ఏమి? నేను మీ ఇద్దరినీ ఈ చెట్టువద్దకు పోవద్దని నివారించలేదా? మరియు నిశ్చయంగా, షై'తాన్ మీ ఇద్దరి యొక్క బహిరంగశత్రువని చెప్పలేదా?"

قَالَا رَبَّنَا ظَلَمۡنَآ أَنفُسَنَا وَإِن لَّمۡ
تَغۡفِرۡ لَنَا وَتَرۡحَمۡنَا لَنَكُونَنَّ مِنَ
ٱلۡخَٰسِرِينَ ٢٣

**23**. వారిద్దరూ ఇలా విన్నవించుకున్నారు: "ఓ మా ప్రభూ! మాకు మేము అన్యాయం చేసుకున్నాము. మరియు నీవు మమ్మల్ని కరుణించకపోతే! మమ్మల్ని క్షమించకపోతే! నిశ్చయంగా, మేము నాశనమైపోయే వారమవుతాము."[1]

قَالَ ٱهۡبِطُواْ بَعۡضُكُمۡ لِبَعۡضٍ
عَدُوّٞۖ وَلَكُمۡ فِي ٱلۡأَرۡضِ مُسۡتَقَرّٞ
وَمَتَٰعٌ إِلَىٰ حِينٖ ٢٤

**24**. (అల్లాహ్) అన్నాడు: "మీరందరు దిగిపొండి! మీరు ఒకరికొకరు శత్రువు లవుతారు. మరియు మీరందరికీ ఒక నిర్ణీతకాలం వరకు భూమిలో నివాసం మరియు జీవనోపాధి ఉంటాయి."

قَالَ فِيهَا تَحۡيَوۡنَ وَفِيهَا تَمُوتُونَ
وَمِنۡهَا تُخۡرَجُونَ ٢٥

**25**. ఇంకా ఇలా అన్నాడు: "మీరందరూ అందులోనే జీవిస్తారు మరియు అందులోనే మరణిస్తారు మరియు దానినుండే మరల లేప (పునరుత్థరింప) బడతారు."

---

**1**. చూడండి, 2:37.

يَـٰبَنِيٓ ءَادَمَ قَدۡ أَنزَلۡنَا عَلَيۡكُمۡ لِبَاسٗا
يُوَٰرِي سَوۡءَٰتِكُمۡ وَرِيشٗاۖ وَلِبَاسُ
ٱلتَّقۡوَىٰ ذَٰلِكَ خَيۡرٞۚ ذَٰلِكَ مِنۡ
ءَايَٰتِ ٱللَّهِ لَعَلَّهُمۡ يَذَّكَّرُونَ ٢٦

**26**. ఓ ఆదమ్ సంతానమా! వాస్తవానికి మేము మీ కొరకు వస్త్రాలను కల్పించాము, అవి మీ మర్మాంగాలను కప్పుతాయి మరియు మీకు అలంకారమిస్తాయి. మరియు దైవభీతియే అన్నిటికంటే శ్రేష్ఠమైన వస్త్రం. ఇవి అల్లాహ్ సూచనలలో కొన్ని; బహుశా గుణపాఠం నేర్చుకుంటారేమోనని, (వీటిని మీకు వినిపిస్తున్నాము).

يَـٰبَنِيٓ ءَادَمَ لَا يَفۡتِنَنَّكُمُ
ٱلشَّيۡطَٰنُ كَمَآ أَخۡرَجَ أَبَوَيۡكُم
مِّنَ ٱلۡجَنَّةِ يَنزِعُ عَنۡهُمَا لِبَاسَهُمَا
لِيُرِيَهُمَا سَوۡءَٰتِهِمَآۚ إِنَّهُۥ يَرَىٰكُمۡ
هُوَ وَقَبِيلُهُۥ مِنۡ حَيۡثُ لَا تَرَوۡنَهُمۡۗ
إِنَّا جَعَلۡنَا ٱلشَّيَٰطِينَ أَوۡلِيَآءَ لِلَّذِينَ
لَا يُؤۡمِنُونَ ٢٧

**27**. ఓ ఆదమ్ సంతానమా! షైతాను మీ తల్లిదండ్రులను (స్వర్గ) వస్త్రాలను తొలగించి, వారి మర్మాంగాలను వారికి కనబడేటట్లు చేసి, వారిని స్వర్గం నుండి వెడలగొట్టినట్లు మిమ్మల్ని కూడా ఆపదకు (ఫిత్న) గురిచేయకూడదు. నిశ్చయంగా, వాడు మరియు వాని సంతతి వారు మిమ్మల్ని కనిపెట్టుకొని ఉన్నారు. కాని, మీరు వారిని చూడలేరు. నిశ్చయంగా, మేము షై'తానులను, విశ్వసించని వారికి స్నేహితులుగా చేశాము.

وَإِذَا فَعَلُواْ فَٰحِشَةٗ قَالُواْ وَجَدۡنَا
عَلَيۡهَآ ءَابَآءَنَا وَٱللَّهُ أَمَرَنَا بِهَاۗ قُلۡ
إِنَّ ٱللَّهَ لَا يَأۡمُرُ بِٱلۡفَحۡشَآءِۖ
أَتَقُولُونَ عَلَى ٱللَّهِ مَا لَا تَعۡلَمُونَ
٢٨

**28**. మరియు వారు (అవిశ్వాసులు), ఏదైనా అశ్లీలమైన పని చేసినపుడు ఇలా అంటారు: "మేము మా తండ్రితాతలను ఈ పద్ధతినే అవలంబిస్తూ ఉండగా చూశాము. మరియు అలా చేయమని అల్లాహ్‌యే మమ్మల్ని ఆదేశించాడు." వారితో అను: "నిశ్చయంగా, అల్లాహ్ అశ్లీలమైన పనులు చేయమని ఎన్నడూ ఆదేశించడు. ఏమీ? మీకు తెలియని విషయాన్ని గురించి అల్లాహ్‌పై నిందలు వేస్తున్నారా?"

قُلْ أَمَرَ رَبِّي بِالْقِسْطِ ۖ وَأَقِيمُوا وُجُوهَكُمْ عِندَ كُلِّ مَسْجِدٍ وَادْعُوهُ مُخْلِصِينَ لَهُ الدِّينَ ۚ كَمَا بَدَأَكُمْ تَعُودُونَ ﴿٢٩﴾

**29**. (ఓ ము'హమ్మద్! వారితో) ఇలా అను: "నా ప్రభువు న్యాయాన్ని పాటించమని ఆదేశించాడు. మరియు మీరు ప్రతి మస్జిద్‌లో (నమా'జ్‌లో) మీ ముఖాలను సరిగ్గా (ఆయన వైపునకే)[1] మరల్చుకొని నమా'జ్‌ను పూర్తి శ్రద్ధతో నిర్వహించండి మరియు ధర్మాన్ని (దీన్‌ను) కేవలం ఆయన కొరకే ప్రత్యేకించుకొని ఆయనను మాత్రమే ప్రార్థించండి." ఆయన మిమ్మల్ని మొదట సృష్టించినట్లు మీరు తిరిగి సృష్టించబడతారు.

فَرِيقًا هَدَىٰ وَفَرِيقًا حَقَّ عَلَيْهِمُ الضَّلَالَةُ ۗ إِنَّهُمُ اتَّخَذُوا الشَّيَاطِينَ أَوْلِيَاءَ مِن دُونِ اللَّهِ وَيَحْسَبُونَ أَنَّهُم مُّهْتَدُونَ ﴿٣٠﴾

**30**. మీలో కొందరికి ఆయన సన్మార్గం చూపించాడు. మరికొందరు మార్గభ్రష్టత్వానికి గురయ్యారు. ఎందుకంటే వాస్తవానికి వారు అల్లాహ్‌ను వదలి షై'తానులను తమ స్నేహితులుగా చేసుకున్నారు మరియు నిశ్చయంగా, తామే సన్మార్గంపై ఉన్నామని భ్రమలో ఉన్నారు.(5/8)

۞ يَا بَنِي آدَمَ خُذُوا زِينَتَكُمْ عِندَ كُلِّ مَسْجِدٍ وَكُلُوا وَاشْرَبُوا وَلَا تُسْرِفُوا ۚ إِنَّهُ لَا يُحِبُّ الْمُسْرِفِينَ ﴿٣١﴾

**31**. * ఓ ఆదమ్ సంతానమా ప్రతి మస్జిద్‌లో (నమా'జ్‌లో) మీ వస్త్రాలంకరణ పట్ల శ్రద్ధవహించండి.[2] తినండి త్రాగండి, కాని మితిమీరకండి. నిశ్చయంగా, ఆయన (అల్లాహ్) మితిమీరే వారిని ప్రేమించడు.

---

**1**. అంటే మీరు మీ ముఖాలను ఖిబ్లా వైపునకే మరల్చి మీ ఆరాధనను కేవలం అల్లాహ్ (సు.తా.) కొరకే ప్రత్యేకించుకోండి.

**2**. నమా'జ్, 'తవాఫ్, చేసేటప్పుడు బట్టలు ధరించటం విధి. ఇంకా (చూడండి, స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం.1, 'హదీస్' నెం. 368) ఇస్లాంకు ముందు ముష్రికులు, క'అబహ్ 'తవాఫ్ బట్టలు ధరించకుండా చేసేవారు. ఇస్లాం దానిని నిషేధించింది. చూడండి, 'స.బు'ఖారీ, పు.1, 'హ.368.

32. ఇలా అను: "అల్లాహ్ తనదాసుల కొరకు సృష్టించిన వస్త్రాలంకరణను మరియు మంచి జీవనోపాధిని నిషేధించే వాడెవడు?" (ఇంకా) ఇలా అను: "ఇవి ఇహలోక జీవితంలో విశ్వాసుల కొరకే; పునరుత్థాన దినమున ప్రత్యేకంగా వారి కొరకు మాత్రమే గలవు.[1] ఈ విధంగా మేము మా సూచనలను జ్ఞానం గలవారికి స్పష్టంగా వివరిస్తున్నాము."

33. ఇలా అను: "నా ప్రభువు బహిరంగంగా గానీ, లేదా రహస్యంగా గానీ, అశ్లీల (అసహ్యకర)మైన కార్యాలను, పాప కార్యాలను చేయటాన్ని మరియు దౌర్జన్యం చేయటాన్ని మరియు ఆయన (అల్లాహ్) అవతరింపజేసిన ప్రమాణం ఏదీ లేనిదే ఇతరులను అల్లాహ్‌కు సాటి (భాగస్వాములుగా) కల్పించటాన్ని మరియు మీకు జ్ఞానం లేనిదే ఏ విషయాన్ని అయినా అల్లాహ్‌పై మోపటాన్ని నిషేధించివున్నాడు."

34. మరియు ప్రతి సమాజానికి ఒక గడువు నియమింపబడి ఉంది. కావున ఆ గడువు వచ్చినపుడు, వారు ఒక ఘడియ వెనుక గానీ మరియు ముందు గానీ కాలేరు.

35. ఓ ఆదమ్ సంతానమా! మీలో నుంచే మీ వద్దకు నా సూచనలను వినిపించే ప్రవక్తలు వచ్చినపుడు, ఎవరైతే దైవభీతి కలిగివుండి తమను తాము సరిదిద్దుకుంటారో, అలాంటి వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా!

قُلْ مَنْ حَرَّمَ زِينَةَ ٱللَّهِ ٱلَّتِىٓ أَخْرَجَ لِعِبَادِهِۦ وَٱلطَّيِّبَٰتِ مِنَ ٱلرِّزْقِ ۚ قُلْ هِىَ لِلَّذِينَ ءَامَنُوا۟ فِى ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا خَالِصَةً يَوْمَ ٱلْقِيَٰمَةِ ۗ كَذَٰلِكَ نُفَصِّلُ ٱلْءَايَٰتِ لِقَوْمٍ يَعْلَمُونَ ﴿٣٢﴾

قُلْ إِنَّمَا حَرَّمَ رَبِّىَ ٱلْفَوَٰحِشَ مَا ظَهَرَ مِنْهَا وَمَا بَطَنَ وَٱلْإِثْمَ وَٱلْبَغْىَ بِغَيْرِ ٱلْحَقِّ وَأَن تُشْرِكُوا۟ بِٱللَّهِ مَا لَمْ يُنَزِّلْ بِهِۦ سُلْطَٰنًا وَأَن تَقُولُوا۟ عَلَى ٱللَّهِ مَا لَا تَعْلَمُونَ ﴿٣٣﴾

وَلِكُلِّ أُمَّةٍ أَجَلٌ ۖ فَإِذَا جَآءَ أَجَلُهُمْ لَا يَسْتَأْخِرُونَ سَاعَةً ۖ وَلَا يَسْتَقْدِمُونَ ﴿٣٤﴾

يَٰبَنِىٓ ءَادَمَ إِمَّا يَأْتِيَنَّكُمْ رُسُلٌ مِّنكُمْ يَقُصُّونَ عَلَيْكُمْ ءَايَٰتِى ۙ فَمَنِ ٱتَّقَىٰ وَأَصْلَحَ فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ﴿٣٥﴾

1. చూడండి, 7:50-51.

وَٱلَّذِينَ كَذَّبُواْ بِـَٔايَٰتِنَا وَٱسۡتَكۡبَرُواْ عَنۡهَآ أُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ ٱلنَّارِۖ هُمۡ فِيهَا خَٰلِدُونَ ٣٦

**36**. కాని ఎవరైతే మా సూచనలను అసత్యాలని నిరాకరించి, వాటి యెడల దురహంకారం చూపుతారో, అలాంటి వారు నరకాగ్ని వాసులవుతారు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

فَمَنۡ أَظۡلَمُ مِمَّنِ ٱفۡتَرَىٰ عَلَى ٱللَّهِ كَذِبًا أَوۡ كَذَّبَ بِـَٔايَٰتِهِۦٓۚ أُوْلَٰٓئِكَ يَنَالُهُمۡ نَصِيبُهُم مِّنَ ٱلۡكِتَٰبِۖ حَتَّىٰٓ إِذَا جَآءَتۡهُمۡ رُسُلُنَا يَتَوَفَّوۡنَهُمۡ قَالُوٓاْ أَيۡنَ مَا كُنتُمۡ تَدۡعُونَ مِن دُونِ ٱللَّهِۖ قَالُواْ ضَلُّواْ عَنَّا وَشَهِدُواْ عَلَىٰٓ أَنفُسِهِمۡ أَنَّهُمۡ كَانُواْ كَٰفِرِينَ ٣٧

**37**. ఇక అల్లాహ్‌పై అసత్యాలు కల్పించే వానికంటే; లేదా ఆయన సూచనలను అసత్యాలని తిరస్కరించే వానికంటే మించిన దుర్మార్గుడెవడు? అలాంటి వారు తమ విధివ్రాత ప్రకారం తమ భాగ్యాన్ని పొందుతారు.[1] తుదకు మేము పంపే దైవదూతలు వారి ప్రాణాలు తీయటానికి వారి వద్దకు వచ్చి: "మీరు అల్లాహ్‌ను వదలి ప్రార్థించేవారు (ఆ దైవాలు) ఇపుడు ఎక్కడ ఉన్నారు?" అని అడుగుతారు. వారిలా జవాబిస్తారు: "వారు మమ్మల్ని వదిలి పోయారు." మరియు ఈ విధంగా వారు: "మేము నిజంగానే సత్యతిరస్కారులమై ఉండేవారము." అని, తమకు వ్యతిరేకంగా తామే సాక్ష్యమిచ్చుకుంటారు.

قَالَ ٱدۡخُلُواْ فِيٓ أُمَمٖ قَدۡ خَلَتۡ مِن قَبۡلِكُم مِّنَ ٱلۡجِنِّ وَٱلۡإِنسِ فِي ٱلنَّارِۖ كُلَّمَا دَخَلَتۡ أُمَّةٞ لَّعَنَتۡ أُخۡتَهَاۖ حَتَّىٰٓ إِذَا ٱدَّارَكُواْ فِيهَا جَمِيعٗا قَالَتۡ أُخۡرَىٰهُمۡ لِأُولَىٰهُمۡ

**38**. (అల్లాహ్) అంటాడు: "మీకు పూర్వం గతించిన జిన్నాతుల మరియు మానవుల సమాజాలు పోయి చేరిన ఆ నరకాగ్నిలోకి ప్రవేశించండి." ప్రతి సమాజం (నరకంలో) ప్రవేశించినపుడు తన పూర్వపు వారిని (సమాజాన్ని) శపిస్తుంది. తుదకు వారంతా అక్కడ చేరిన పిదప, తరువాత వచ్చిన వారు తమకంటే ముందు వచ్చిన వారిని గురించి: "ఓ మా ప్రభూ! వీరే మమ్మల్ని మార్గభ్రష్టులుగా

---

**1**. దీనిని వివిధరకాలుగా బోధించారు. ఒక అర్థం వయస్సు మరియు జీవనోపాధి ఉన్నాయి. దీనికి సంబంధించిన ఆయత్‌కు చూడండి, 10:69-70.

చేసినవారు, కావున వీరికి రెట్టింపు నరకాగ్ని శిక్ష విధించు!" అని అంటారు.[1] దానికి (అల్లాహ్): "ప్రతి వాడికి రెట్టింపు (శిక్ష) విధించబడుతుంది,[2] కాని మీరది తెలుసుకోలేరు!" అని అంటాడు.

**39**. మరియు అప్పుడు మొదటి వారు తరువాత వచ్చిన వారితో: "మీకు మాపై ఎలాంటి ఆధిక్యత లేదు కావున మీరు కూడా మీ కర్మలకు బదులుగా శిక్షను చవి చూడండి!" అని అంటారు.

**40**. నిశ్చయంగా, మా సూచనలను అబద్ధాలని తిరస్కరించిన వారి కొరకు మరియు వాటిపట్ల దురహంకారం చూపిన వారికొరకు, ఆకాశ ద్వారాలు ఏ మాత్రం తెరువబడవు. మరియు ఒంటె సూది బెజ్జంలో నుండి దూరిపోగలిగే వరకు వారు స్వర్గంలో ప్రవేశించజాలరు. మరియు ఈ విధంగా మేము అపరాధులకు ప్రతిఫలమిస్తాము.

**41**. నరకమే వారి పాన్పు మరియు వారి దుప్పటి అవుతుంది. మరియు ఈ విధంగా మేము దుర్మార్గులకు ప్రతిఫలమిస్తాము.

**42**. కాని, ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తారో! అలాంటి వ్యక్తికి, మేము అతని శక్తికి మించిన భారం వేయము. ఇటువంటి వారే స్వర్గవాసులు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

رَبَّنَا هَٰٓؤُلَآءِ أَضَلُّونَا فَـَٔاتِهِمْ عَذَابًا
ضِعْفًا مِّنَ ٱلنَّارِ ۖ قَالَ لِكُلٍّ ضِعْفٌ
وَلَٰكِن لَّا تَعْلَمُونَ ﴿٣٨﴾
وَقَالَتْ أُولَىٰهُمْ لِأُخْرَىٰهُمْ فَمَا كَانَ
لَكُمْ عَلَيْنَا مِن فَضْلٍ فَذُوقُوا۟ ٱلْعَذَابَ
بِمَا كُنتُمْ تَكْسِبُونَ ﴿٣٩﴾
إِنَّ ٱلَّذِينَ كَذَّبُوا۟ بِـَٔايَٰتِنَا
وَٱسْتَكْبَرُوا۟ عَنْهَا لَا تُفَتَّحُ لَهُمْ أَبْوَٰبُ
ٱلسَّمَآءِ وَلَا يَدْخُلُونَ ٱلْجَنَّةَ حَتَّىٰ يَلِجَ
ٱلْجَمَلُ فِى سَمِّ ٱلْخِيَاطِ ۚ وَكَذَٰلِكَ
نَجْزِى ٱلْمُجْرِمِينَ ﴿٤٠﴾
لَهُم مِّن جَهَنَّمَ مِهَادٌ وَمِن فَوْقِهِمْ
غَوَاشٍ ۚ وَكَذَٰلِكَ نَجْزِى ٱلظَّٰلِمِينَ ﴿٤١﴾
وَٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟
ٱلصَّٰلِحَٰتِ لَا نُكَلِّفُ نَفْسًا إِلَّا
وُسْعَهَآ أُو۟لَٰٓئِكَ أَصْحَٰبُ ٱلْجَنَّةِ ۖ هُمْ
فِيهَا خَٰلِدُونَ ﴿٤٢﴾

---

**1**. చూడండి, 33:67-68 మరియు 16:25.
**2**. చూడండి, 34:31-32.

**43.** మరియు మేము వారి హృదయాల నుండి పరస్పర ద్వేషభావాలను తొలగిస్తాము. వారి క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి. మరియు వారు ఇలా అంటారు: "మాకు ఇక్కడికి చేరటానికి సన్మార్గం చూపిన అల్లాహ్ యే సర్వస్తోత్రాలకు అర్హుడు. అల్లాహ్ మాకు ఈ సన్మార్గం చూపకపోతే మేము సన్మార్గం పొంది ఉండేవారం కాదు. మా ప్రభువు పంపిన ప్రవక్తలు వాస్తవంగా సత్యాన్నే తీసుకువచ్చారు!" అపుడు వారికి ఒక వాణి వినబడుతుంది: "మీరు చేస్తూ ఉండిన సత్కార్యాలకు ఫలితంగా, మీరు వారసులుగా చేయబడిన స్వర్గం ఇదే!"

**44.** మరియు స్వర్గవాసులు, నరకవాసులను ఉద్దేశించి ఇలా అంటారు: "మా ప్రభువు మాకు చేసిన వాగ్దానాన్ని మేము వాస్తవంగా, సత్యమైనదిగా పొందాము. ఏమీ? మీరు కూడా మీ ప్రభువు చేసిన వాగ్దానాన్ని సత్యమైనదిగా పొందారా?" వారు జవాబిస్తారు: "అవును!" అప్పుడు ప్రకటించే వాడొకడు వారి మధ్య ఇలా ప్రకటిస్తాడు: "దుర్మార్గులపై అల్లాహ్ శాపం (బహిష్కారం) ఉంది!"

**45.** ఎవరైతే (ప్రజలను) అల్లాహ్ మార్గం నుండి నిరోధిస్తారో మరియు అది తప్పు మార్గమని చూపగోరుతారో! అలాంటి వారే పరలోక జీవితాన్ని తిరస్కరించిన వారు.

وَنَزَعْنَا مَا فِى صُدُورِهِم مِّنْ غِلٍّ
تَجْرِى مِن تَحْتِهِمُ ٱلْأَنْهَٰرُ ۖ وَقَالُوا۟
ٱلْحَمْدُ لِلَّهِ ٱلَّذِى هَدَىٰنَا لِهَٰذَا
وَمَا كُنَّا لِنَهْتَدِىَ لَوْلَآ أَنْ هَدَىٰنَا
ٱللَّهُ ۖ لَقَدْ جَآءَتْ رُسُلُ رَبِّنَا بِٱلْحَقِّ ۖ
وَنُودُوٓا۟ أَن تِلْكُمُ ٱلْجَنَّةُ
أُورِثْتُمُوهَا بِمَا كُنتُمْ تَعْمَلُونَ
٤٣

وَنَادَىٰٓ أَصْحَٰبُ ٱلْجَنَّةِ أَصْحَٰبَ
ٱلنَّارِ أَن قَدْ وَجَدْنَا مَا وَعَدَنَا رَبُّنَا
حَقًّا فَهَلْ وَجَدتُّم مَّا وَعَدَ رَبُّكُمْ
حَقًّا ۖ قَالُوا۟ نَعَمْ ۚ فَأَذَّنَ مُؤَذِّنٌۢ بَيْنَهُمْ
أَن لَّعْنَةُ ٱللَّهِ عَلَى ٱلظَّٰلِمِينَ ٤٤

ٱلَّذِينَ يَصُدُّونَ عَن سَبِيلِ ٱللَّهِ
وَيَبْغُونَهَا عِوَجًا وَهُم بِٱلْءَاخِرَةِ
كَٰفِرُونَ ٤٥

وَبَيۡنَهُمَا حِجَابٞۚ وَعَلَى ٱلۡأَعۡرَافِ رِجَالٞ يَعۡرِفُونَ كُلَّۢا بِسِيمَىٰهُمۡۚ وَنَادَوۡاْ أَصۡحَٰبَ ٱلۡجَنَّةِ أَن سَلَٰمٌ عَلَيۡكُمۡۚ لَمۡ يَدۡخُلُوهَا وَهُمۡ يَطۡمَعُونَ ﴿٤٦﴾

**46**. మరియు ఆ ఉభయవర్గాల మధ్య ఒక అడ్డుతెర ఉంటుంది.[1] దాని ఎత్తైన ప్రదేశాల మీద కొందరు ప్రజలుంటారు.[2] వారు ప్రతి ఒక్కరినీ వారి గుర్తులను బట్టి తెలుసుకుంటారు. వారు స్వర్గవాసులను పిలిచి: "మీకు శాంతి కలుగుగాక (సలాం)!" అని అంటారు. వారు ఇంకా స్వర్గంలో ప్రవేశించ లేదు, కాని దానిని ఆశిస్తున్నారు. (3/4)

۞ وَإِذَا صُرِفَتۡ أَبۡصَٰرُهُمۡ تِلۡقَآءَ أَصۡحَٰبِ ٱلنَّارِ قَالُواْ رَبَّنَا لَا تَجۡعَلۡنَا مَعَ ٱلۡقَوۡمِ ٱلظَّٰلِمِينَ ﴿٤٧﴾

**47**. * మరియు వారి దృష్టి నరకవాసుల వైపునకు మళ్ళించబడినపుడు వారు ఇలా అంటారు: "ఓ మా ప్రభూ! మమ్మల్ని ఈ దుర్మార్గులతో చేర్చకు!"

وَنَادَىٰٓ أَصۡحَٰبُ ٱلۡأَعۡرَافِ رِجَالٗا يَعۡرِفُونَهُم بِسِيمَىٰهُمۡ قَالُواْ مَآ أَغۡنَىٰ عَنكُمۡ جَمۡعُكُمۡ وَمَا كُنتُمۡ تَسۡتَكۡبِرُونَ ﴿٤٨﴾

**48**. మరియు ఎత్తైన ప్రదేశాలపై ఉన్న వారు వారిని (నరకవాసులను) వారి గుర్తుల ద్వారా గుర్తించి వారితో అంటారు: "మీరు కూడబెట్టిన ఆస్తిపాస్తులు మరియు మీ దురహంకారాలు, మీకు ఏమైనా లాభం చేకూర్చాయా?

أَهَٰٓؤُلَآءِ ٱلَّذِينَ أَقۡسَمۡتُمۡ لَا يَنَالُهُمُ ٱللَّهُ بِرَحۡمَةٍۚ ٱدۡخُلُواْ ٱلۡجَنَّةَ لَا خَوۡفٌ عَلَيۡكُمۡ وَلَآ أَنتُمۡ تَحۡزَنُونَ ﴿٤٩﴾

**49**. " 'వీరికి, అల్లాహ్ తన కారుణ్యాన్ని ఏమాత్రం ప్రసాదించడు.' అని మీరు ప్రమాణాలు చేసి చెబుతూ ఉండేవారు, వీరే కదా? (చూడండి వారితో ఇలా అనబడింది): 'మీరు స్వర్గంలో ప్రవేశించండి, మీకు ఎలాంటి భయమూ ఉండదు మరియు మీరు దుఃఖపడరు కూడా!' "

---

**1**. చూడండి, 57:13.

**2**. అల్ అ'అరాఫు: ('అరఫున్, ఏ.వ.) ఇవి స్వర్గ నరకాల మధ్య ఉన్న గోడపైనున్న ఎత్తైన ప్రదేశాలు. అక్కడ కొందరు తమ గమ్యస్థానం (స్వర్గం/నరకం) కొరకు వేచి ఉంటారు.

وَنَادَىٰٓ أَصۡحَٰبُ ٱلنَّارِ أَصۡحَٰبَ ٱلۡجَنَّةِ أَنۡ أَفِيضُواْ عَلَيۡنَا مِنَ ٱلۡمَآءِ أَوۡ مِمَّا رَزَقَكُمُ ٱللَّهُۚ قَالُوٓاْ إِنَّ ٱللَّهَ حَرَّمَهُمَا عَلَى ٱلۡكَٰفِرِينَ ٥٠

50. మరియు నరకవాసులు స్వర్గ వాసులతో: "కొద్దినీళ్ళో లేక అల్లాహ్ మీకు ప్రసాదించిన ఆహారంలో నుండైనా కొంత మా వైపుకు విసరండి." అని అంటారు. (దానికి స్వర్గవాసులు): "నిశ్చయంగా అల్లాహ్! ఈ రెండింటినీ సత్య తిరస్కారులకు నిషేధించివున్నాడు."[1] అని అంటారు.

ٱلَّذِينَ ٱتَّخَذُواْ دِينَهُمۡ لَهۡوٗا وَلَعِبٗا وَغَرَّتۡهُمُ ٱلۡحَيَوٰةُ ٱلدُّنۡيَاۚ فَٱلۡيَوۡمَ نَنسَىٰهُمۡ كَمَا نَسُواْ لِقَآءَ يَوۡمِهِمۡ هَٰذَا وَمَا كَانُواْ بِـَٔايَٰتِنَا يَجۡحَدُونَ ٥١

51. వీరే వారు; ఎవరైతే తమ ధర్మాన్ని ఒక ఆటగా మరియు కాలక్షేపంగా చేసు కున్నారో! మరియు ఇహలోక జీవితం వారిని మోసానికి గురిచేసింది. (అల్లాహ్ ఇలా సెలవిస్తాడు): "వారు ఈ నాటి సమావేశాన్ని మరచి, మా సూచనలను తిరస్కరించినట్లు, ఈ నాడు మేమూ వారిని మరచిపోతాము!"

وَلَقَدۡ جِئۡنَٰهُم بِكِتَٰبٖ فَصَّلۡنَٰهُ عَلَىٰ عِلۡمٍ هُدٗى وَرَحۡمَةٗ لِّقَوۡمٖ يُؤۡمِنُونَ ٥٢

52. మరియు వాస్తవానికి మేము వారికి గ్రంథాన్ని ప్రసాదించి, దానిని జ్ఞాన పూర్వకంగా స్పష్టంగా వివరించి ఉన్నాము.[2] అది విశ్వసించే వారికి ఒక మార్గదర్శిని మరియు కారుణ్యం.

هَلۡ يَنظُرُونَ إِلَّا تَأۡوِيلَهُۥۚ يَوۡمَ يَأۡتِي تَأۡوِيلُهُۥ يَقُولُ ٱلَّذِينَ نَسُوهُ مِن قَبۡلُ قَدۡ جَآءَتۡ رُسُلُ رَبِّنَا بِٱلۡحَقِّ فَهَل لَّنَا مِن شُفَعَآءَ فَيَشۡفَعُواْ

53. ఏమీ? వారు (అవిశ్వాసులు) దాని తుదిఫలితం సంభవించాలని నిరీక్షిస్తున్నారా? దాని తుదిఫలితం సంభవించే దినమున, దానిని నిర్లక్ష్యం చేసిన వారు: "వాస్తవానికి మా ప్రభువు పంపిన ప్రవక్తలు సత్యం తెచ్చారు. అయితే ఏమీ? మా కొరకు సిఫారసు చేయటానికి, సిఫారసుదారులు ఎవరైనా ఉన్నారా? లేదా మేము మళ్ళీ తిరిగి

---

1. చూడండి, 7:32.
2. చూడండి, 17:15.

لَنَآ أَوۡ نُرَدُّ فَنَعۡمَلَ غَيۡرَ ٱلَّذِي كُنَّا
نَعۡمَلُۚ قَدۡ خَسِرُوٓاْ أَنفُسَهُمۡ وَضَلَّ
عَنۡهُم مَّا كَانُواْ يَفۡتَرُونَ ٥٣
إِنَّ رَبَّكُمُ ٱللَّهُ ٱلَّذِي خَلَقَ
ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ فِي سِتَّةِ أَيَّامٖ
ثُمَّ ٱسۡتَوَىٰ عَلَى ٱلۡعَرۡشِۖ يُغۡشِي ٱلَّيۡلَ
ٱلنَّهَارَ يَطۡلُبُهُۥ حَثِيثٗا وَٱلشَّمۡسَ
وَٱلۡقَمَرَ وَٱلنُّجُومَ مُسَخَّرَٰتِۭ بِأَمۡرِهِۦٓۗ
أَلَا لَهُ ٱلۡخَلۡقُ وَٱلۡأَمۡرُۗ تَبَارَكَ ٱللَّهُ
رَبُّ ٱلۡعَٰلَمِينَ ٥٤

(భూలోకంలోకి) పంపబడితే మేమింత వరకు చేసిన కర్మలకు విరుద్ధంగా చేసే వారం కదా?" అని పలుకుతారు. వాస్తవానికి వారు తమకు తాము నష్టం కలిగించుకున్నారు మరియు వారు కల్పించుకున్న (దైవాలన్నీ) వారిని త్యజించి ఉంటాయి.

**54**. నిశ్చయంగా, మీ ప్రభువైన అల్లాహ్‌యే ఆకాశాలను మరియు భూమిని ఆరుదినములలో (అయ్యామ్) సృష్టించాడు.[1] ఆ పిదప తన సింహాసనాన్ని ('అర్ష్‌ను) అధిష్ఠించాడు.[2] ఆయన రాత్రిని పగటి వెంట ఎడతెగకుండా అనుసరింపజేసి, దానిపై (పగటిపై) కప్పుతూ ఉంటాడు. మరియు సూర్య చంద్ర నక్షత్రాలు ఆయన ఆజ్ఞకు కట్టుబడి ఉన్నాయి. నిశ్చయంగా, సర్వసృష్టి ఆయనదే! మరియు ఆజ్ఞ నడిచేది ఆయనదే. అల్లాహ్ ఎంతో శుభదాయకుడు,[3] సర్వలోకాలకు పోషకుడు!

---

1. *యౌమున్*: దినం, మనం లెక్కిస్తున్న దినం (ఒక పగలు-రాత్రితో కూడుకున్నది), ఈ భూలోకానికే పరిమితమైనది. ఇది మన భూలోక వాసుల అనుకూలం కొరకు అల్లాహ్ (సు.తా.) నిర్ణయించిన దినం. దీని సంబంధం భూమి సంచారంతో ఉంది. అల్లాహుతా'ఆలా ఇక్కడ: "ఆకాశాలు మరియు భూమిని ఆరుదినాలలో సృష్టించాను." అని అంటున్నాడు. ఈ యౌమున్, అంటే యుగం, దశ లేక కాలం (Aeon, Epoch) కావచ్చు! నిజం అల్లాహ్‌కే తెలుసు.
2. అల్లాహ్ (సు.తా.) ఏవిధంగా తన 'అర్ష్‌ను (సింహాసనాన్ని/విశ్వాధికారపీఠాన్ని) అధిష్ఠించి ఉన్నాడో మనకు తెలియదు. మనం దానిని మానవ జ్ఞానపరిధి ప్రకారం ఉదాహరణలతో వివరించటం తగినదికాదు. మనము ఇలాంటి విషయాలను ఉన్నవి ఉన్నట్లుగా విశ్వసించటమే నిజమైన విశ్వాసం (ఇబ్నె-కసీ'ర్). ఇది ముతషాబిహాత్ - అస్పష్టమైన విషయాలలోనిది. ఈ శబ్దం ఖుర్ఆన్‌లోచాలా చోట్లలో వచ్చింది. చూడండి, 7:54, 9:129, 10:3, 11:7, 13:2, 20:5, 25:59, 32:4 మరియు 57:4.
3. *తబారక్*: Blessed, Exalted, శుభదాయకుడు, **శుభప్రదుడు**, శుభకరుడు, అనుగ్రహించు, ఆశీర్వదించు, వరాలను, శుభాలను ప్రసాదించు, ఘనతగల, మహిమగల వాడు.

**55.** మీ ప్రభువును వినయంతో మరియు రహస్యంగా (మౌనంగా) ప్రార్థించండి. నిశ్చయంగా, ఆయన హద్దులు మీరే వారిని ప్రేమించడు.

**56.** మరియు భూమిలో సంస్కరణ జరిగిన పిదప దానిలో కల్లోలాన్ని రేకెత్తించకండి మరియు భయంతో మరియు ఆశతో ఆయనను ప్రార్థించండి. నిశ్చయంగా, అల్లాహ్ కారుణ్యం సజ్జనులకు సమీపంలోనే ఉంది.[1]

**57.** మరియు ఆయనే తన కారుణ్యానికి ముందు శుభవార్తలు తెచ్చే వాయువులను పంపేవాడు. ఎప్పుడైతే అవి బరువైన మేఘాలను ఎత్తుకొని వస్తాయో మేము వాటిని నిర్జీవమైన నగరాల వైపునకు తీసుకొని పోయి వాటినుండి నీటిని కురిపిస్తాము. ఆ నీటి వలన పలువిధాలైన ఫలాలను ఉత్పత్తి చేస్తాము. ఇదేవిధంగా మేము మృతులను కూడా లేపుతాము, ఇకనైనా మీరు హితబోధ స్వీకరిస్తారని![2]

ٱدۡعُواْ رَبَّكُمۡ تَضَرُّعٗا وَخُفۡيَةًۚ إِنَّهُۥ لَا يُحِبُّ ٱلۡمُعۡتَدِينَ ٥٥

وَلَا تُفۡسِدُواْ فِي ٱلۡأَرۡضِ بَعۡدَ إِصۡلَٰحِهَا وَٱدۡعُوهُ خَوۡفٗا وَطَمَعًاۚ إِنَّ رَحۡمَتَ ٱللَّهِ قَرِيبٞ مِّنَ ٱلۡمُحۡسِنِينَ ٥٦

وَهُوَ ٱلَّذِي يُرۡسِلُ ٱلرِّيَٰحَ بُشۡرَۢا بَيۡنَ يَدَيۡ رَحۡمَتِهِۦۖ حَتَّىٰٓ إِذَآ أَقَلَّتۡ سَحَابٗا ثِقَالٗا سُقۡنَٰهُ لِبَلَدٖ مَّيِّتٖ فَأَنزَلۡنَا بِهِ ٱلۡمَآءَ فَأَخۡرَجۡنَا بِهِۦ مِن كُلِّ ٱلثَّمَرَٰتِۚ كَذَٰلِكَ نُخۡرِجُ ٱلۡمَوۡتَىٰ لَعَلَّكُمۡ تَذَكَّرُونَ ٥٧

---

**1.** ఈ రెండు ఆయత్‌లలో నాలుగు విషయాలు వివరించబడ్డాయి.
1) అల్లాహ్ (సు.తా.)ను వినయంతో, రహస్యంగా (మౌనంగా) ప్రార్థించాలి.
2) ప్రార్థనలో మన కోరికలు హద్దులు మీరి ఉండకూడదు.
3) సంస్కరణ తరువాత భూమిలో సంక్షోభాన్ని రేకెత్తించకూడదు.
4) హృదయాలలో అల్లాహ్ (సు.తా.) శిక్ష-భీతితో పాటూ, ఆయన కారుణ్యంపై ఆశ కూడా ఉండాలి.

**2.** ఏ విధంగానైతే అల్లాహ్ (సు.తా.) వర్షం కురిపించి మృత భూమి నుండి పంట, ఫలాలను ఉత్పత్తి చేస్తాడో! అదేవిధంగా, పునరుత్థాన దినమున మృతులను కూడా సజీవులుగా చేసి లేపుతాడు. అల్లాహుతా'ఆలా ప్రతిదీ చేయగల సమర్థుడు.

وَٱلْبَلَدُ ٱلطَّيِّبُ يَخْرُجُ نَبَاتُهُۥ بِإِذْنِ رَبِّهِۦ ۖ وَٱلَّذِى خَبُثَ لَا يَخْرُجُ إِلَّا نَكِدًا ۚ كَذَٰلِكَ نُصَرِّفُ ٱلْـَٔايَٰتِ لِقَوْمٍ يَشْكُرُونَ ﴿٥٨﴾

**58**. మరియు సారవంతమైన నేల తన ప్రభువు ఆదేశంతో పుష్కలంగా పంట నిస్తుంది. మరియు నిస్సారమైన దాని (నేల) నుండి నాసిరకం పంట తప్ప మరేమీ రాదు. ఈ విధంగా మేము కృతజ్ఞతలు చూపేవారికి మా సూచనలను వివరిస్తాము.[1]

لَقَدْ أَرْسَلْنَا نُوحًا إِلَىٰ قَوْمِهِۦ فَقَالَ يَٰقَوْمِ ٱعْبُدُوا۟ ٱللَّهَ مَا لَكُم مِّنْ إِلَٰهٍ غَيْرُهُۥٓ إِنِّىٓ أَخَافُ عَلَيْكُمْ عَذَابَ يَوْمٍ عَظِيمٍ ﴿٥٩﴾

**59**. వాస్తవంగా, మేము నూ'హ్‌ను అతని జాతివారి వద్దకు పంపాము.[2] అతను వారితో: "ప్రజలారా! అల్లాహ్‌నే ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక ఆరాధ్య దైవం లేడు. వాస్తవానికి నేను మీపై రాబోయే ఆ గొప్ప దినపు శిక్షను గురించి భయపడు తున్నాను." అని అన్నాడు.

قَالَ ٱلْمَلَأُ مِن قَوْمِهِۦٓ إِنَّا لَنَرَىٰكَ فِى ضَلَٰلٍ مُّبِينٍ ﴿٦٠﴾

**60**. అతని జాతి నాయకులు అన్నారు: "నిశ్చయంగా, మేము నిన్ను స్పష్టమైన తప్పుదారిలో చూస్తున్నాము!"

قَالَ يَٰقَوْمِ لَيْسَ بِى ضَلَٰلَةٌ وَلَٰكِنِّى رَسُولٌ مِّن رَّبِّ ٱلْعَٰلَمِينَ ﴿٦١﴾

**61**. దానికి (నూ'హ్) అన్నాడు: "నా జాతి ప్రజలారా! నాలో ఏ తప్పిదం లేదు. మరియు వాస్తవానికి నేను సర్వలోకాల ప్రభువు యొక్క ప్రవక్తను.

---

**1**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "అల్లాహ్ (సు.తా.) నాకు ఇచ్చి పంపిన జ్ఞానం మరియు మార్గదర్శకత్వపు ఉదాహరణ, ధారాళంగాకురిసే వర్షంలాంటిది. దానిని కొన్ని ప్రాంతాలలోని నేల పీల్చుకొని మంచి పంటలు, ఫలాలు పుష్కలంగా ఇస్తుంది. మరికొన్ని గట్టి ప్రాంతాలు నీటిని నిలబెట్టి తరవాత పండే పంటలకు, నీరు పారటానికి ఉపయోగపడతాయి. కాని ఏ రాళ్ళ నేల అయితే నీటిని పీల్చుకోలేదో, లేక దానిని ఆపలేదో, అది దానిని ఏ విధంగాను వినియోగించుకోలేదు. ఈ ఉదాహరణలు ఆ మానవుని వంటివి ఎవడైతే అల్లాహ్ ధర్మాన్ని అర్థం చేసుకుంటాడో మరియు అల్లాహుతా'ఆలా నాకు ఇచ్చి పంపిన దానితో మంచి ఫలితం పొందుతాడో! అతడు తాను కూడా జ్ఞానం పొందుతాడు మరియు ఇతరులకు కూడా బోధిస్తాడు. మరొక వ్యక్తి ఉదాహరణ కూడా ఇలా ఉంది: ఎవడైతే తాను స్వయంగా కూడా జ్ఞానం మరియు హితబోధ పొందడు, దేనితోనైతే నేను పంపబడ్డానో. ('స'హీ'హ్ బు'ఖారీ, కితాబ్ అల్-'ఇల్మ్, బాబ్ ఫ'ద్ల్ మినల్-'ఇల్మ్).

**2**. ఈ సూరహ్‌లోని 7:59-93 ఆయత్‌లలో ప్రవక్తల గాథలున్నాయి.

62. "నా ప్రభువు సందేశాలను మీకు అందజేస్తున్నాను మరియు (ధర్మ) బోధ చేస్తున్నాను. ఎందుకంటే! మీకు తెలియని విషయాలు అల్లాహ్ తరఫునుండి నాకు తెలుస్తున్నాయి.

63. "మీలోని ఒక పురుషుని ద్వారా - దైవభీతి కలిగిఉంటే, మీరు కరుణింపబడతారని - మిమ్మల్ని హెచ్చరించటానికి, మీ ప్రభువు తరఫునుండి జ్ఞాపిక మీవద్దకు వచ్చిందని మీరు ఆశ్చర్యపడుతున్నారా?"

64. అయినా, వారు అతనిని అసత్యవాదుడని తిరస్కరించారు. కావున మేము అతనిని మరియు అతనితో బాటు ఓడలో ఉన్నవారిని కాపాడాము. మరియు మా సూచనలను అసత్యాలని తిరస్కరించిన వారిని ముంచివేశాము. నిశ్చయంగా, వారు గుడ్డిగా ప్రవర్తించిన జనం. (7/8)

65. * ఇంకా మేము 'ఆద్ (జాతి) వద్దకు వారి సోదరుడైన హూద్‌ను పంపాము.[1] అతను: "ఓ నా జాతి సోదరులారా! మీరు అల్లాహ్‌నే ఆరాధించండి, ఆయన తప్ప మీకు మరొక ఆరాధ్య దేవుడు లేడు. ఏమీ? మీకు దైవభీతి లేదా?" అని అన్నాడు.

66. అతని జాతివారిలో సత్య తిరస్కారులైన నాయకులు ఇలా అన్నారు: "మేము, నిశ్చయంగా నిన్ను మూఢత్వంలో చూస్తున్నాము మరియు నిశ్చయంగా, నిన్ను అసత్యవాదిగా భావిస్తున్నాము!"

أُبَلِّغُكُمْ رِسَٰلَٰتِ رَبِّى وَأَنصَحُ لَكُمْ وَأَعْلَمُ مِنَ ٱللَّهِ مَا لَا تَعْلَمُونَ ﴿٦٢﴾

أَوَعَجِبْتُمْ أَن جَآءَكُمْ ذِكْرٌ مِّن رَّبِّكُمْ عَلَىٰ رَجُلٍ مِّنكُمْ لِيُنذِرَكُمْ وَلِتَتَّقُوا۟ وَلَعَلَّكُمْ تُرْحَمُونَ ﴿٦٣﴾

فَكَذَّبُوهُ فَأَنجَيْنَٰهُ وَٱلَّذِينَ مَعَهُۥ فِى ٱلْفُلْكِ وَأَغْرَقْنَا ٱلَّذِينَ كَذَّبُوا۟ بِـَٔايَٰتِنَآ ۚ إِنَّهُمْ كَانُوا۟ قَوْمًا عَمِينَ ﴿٦٤﴾

۞ وَإِلَىٰ عَادٍ أَخَاهُمْ هُودًا ۗ قَالَ يَٰقَوْمِ ٱعْبُدُوا۟ ٱللَّهَ مَا لَكُم مِّنْ إِلَٰهٍ غَيْرُهُۥٓ ۚ أَفَلَا تَتَّقُونَ ﴿٦٥﴾

قَالَ ٱلْمَلَأُ ٱلَّذِينَ كَفَرُوا۟ مِن قَوْمِهِۦٓ إِنَّا لَنَرَىٰكَ فِى سَفَاهَةٍ وَإِنَّا لَنَظُنُّكَ مِنَ ٱلْكَٰذِبِينَ ﴿٦٦﴾

1. ఈ జాతివారు యమన్ ప్రాంతంలో ఇసుక పర్వతాలలో ఉండేవారు. ఈ ప్రాంతపు పేరు అహ్'ఖాఫ్ అని పేర్కొనబడింది. ఈ ఎడారి 'ఉమాన్ మరియు హ'దరమౌత్ మధ్య ఉంది. హూద్ ('అ.స.) బహుశా మొదటి 'అరబ్బు ప్రవక్త. ఇంకా చూడండి, 89:8.

قَالَ يَٰقَوْمِ لَيْسَ بِى سَفَاهَةٌ وَلَٰكِنِّى رَسُولٌ مِّن رَّبِّ ٱلْعَٰلَمِينَ ﴿٦٧﴾

**67.** (హూద్) అన్నాడు: "నాజాతి వారలారా! నాలో ఏ మూఢత్వంలేదు. మరియు నిశ్చయంగా, నేను సర్వలోకాల ప్రభువు యొక్క సందేశహరుడను!

أُبَلِّغُكُمْ رِسَٰلَٰتِ رَبِّى وَأَنَا۠ لَكُمْ نَاصِحٌ أَمِينٌ ﴿٦٨﴾

**68.** "నేను మీకు నా ప్రభువు సందేశాలను అందజేస్తున్నాను మరియు నిశ్చయంగా, నేను మీకు, నమ్మదగిన ఉపదేశకుడను.

أَوَعَجِبْتُمْ أَن جَآءَكُمْ ذِكْرٌ مِّن رَّبِّكُمْ عَلَىٰ رَجُلٍ مِّنكُمْ لِيُنذِرَكُمْ ۚ وَٱذْكُرُوٓا۟ إِذْ جَعَلَكُمْ خُلَفَآءَ مِنۢ بَعْدِ قَوْمِ نُوحٍ وَزَادَكُمْ فِى ٱلْخَلْقِ بَصْۜطَةً ۖ فَٱذْكُرُوٓا۟ ءَالَآءَ ٱللَّهِ لَعَلَّكُمْ تُفْلِحُونَ ﴿٦٩﴾

**69.** "లేదా! మిమ్మల్ని హెచ్చరించటానికి - మీ ప్రభువు తరఫునుండి హితోపదేశం - మీలోని ఒక పురుషుని ద్వారా వచ్చిందని మీరు ఆశ్చర్యపడుతున్నారా? నూ'హ్ జాతి పిదప మిమ్మల్ని వారసులుగా చేసి, మీకు అపార బలాధిక్యతను ఇచ్చిన విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి.[1] ఈ విధంగా, అల్లాహ్ మీకు చేసిన అనుగ్రహాలను జ్ఞాపకం చేసుకుంటే మీరు సాఫల్యం పొందగలరని ఆశించవచ్చు!"

قَالُوٓا۟ أَجِئْتَنَا لِنَعْبُدَ ٱللَّهَ وَحْدَهُۥ وَنَذَرَ مَا كَانَ يَعْبُدُ ءَابَآؤُنَا ۖ فَأْتِنَا بِمَا تَعِدُنَآ إِن كُنتَ مِنَ ٱلصَّٰدِقِينَ ﴿٧٠﴾

**70.** వారన్నారు: "మేము అల్లాహ్‌ను ఒక్కణ్ణి మాత్రమే ఆరాధించి, మా తండ్రి తాతలు ఆరాధించేవాటిని వదలిపెట్టమని (చెప్పటానికి) నీవు మా వద్దకు వచ్చావా? ఒకవేళ నీవు సత్యవంతుడవే అయితే మమ్మల్ని భయపెట్టే దానిని (శిక్షను) తీసుకొనిరా!"[2]

---

**1**. చూడండి 89:8 మరియు 41:15.

**2**. చూడండి 8:32. ఇది ముష్రిక్ ఖురైషులు ము'హమ్మద్ ('స'అస) యొక్క ఇస్లాం ఆహ్వానానికి ఇచ్చిన జవాబు.

قَالَ قَدْ وَقَعَ عَلَيْكُم مِّن رَّبِّكُمْ
رِجْسٌ وَغَضَبٌۖ أَتُجَٰدِلُونَنِي فِيٓ
أَسْمَآءٖ سَمَّيْتُمُوهَآ أَنتُمْ وَءَابَآؤُكُم
مَّا نَزَّلَ ٱللَّهُ بِهَا مِن سُلْطَٰنٖۚ
فَٱنتَظِرُوٓاْ إِنِّي مَعَكُم مِّنَ
ٱلْمُنتَظِرِينَ ٧١

**71.** (హూద్) అన్నాడు: "వాస్తవానికి, మీపై మీ ప్రభువుయొక్క ఆగ్రహం మరియు శిక్ష విరుచుకుపడ్డాయి. అల్లాహ్ ఏ ప్రమాణం ఇవ్వకున్నా - మీరు మరియు మీ తండ్రి తాతలు పెట్టుకున్న (కల్పిత) పేర్ల విషయంలో - నాతో వాదులాడు తున్నారా? సరే, అయితే మీరు నిరీక్షించండి, మీతో పాటు నేనూ నిరీక్షిస్తాను!"

فَأَنجَيْنَٰهُ وَٱلَّذِينَ مَعَهُۥ بِرَحْمَةٖ مِّنَّا
وَقَطَعْنَا دَابِرَ ٱلَّذِينَ كَذَّبُواْ
بِـَٔايَٰتِنَاۖ وَمَا كَانُواْ مُؤْمِنِينَ ٧٢

**72.** కావున తుదకు మేము అతనిని (హూద్‌ను) మరియు అతని తోటివారిని మా అనుగ్రహంతో రక్షించాము మరియు మా సూచనలను అసత్యాలని తిరస్కరించిన వారిని నిర్మూలించాము.[1] ఎందుకంటే వారు విశ్వసించకుండా ఉన్నారు.

وَإِلَىٰ ثَمُودَ أَخَاهُمْ صَٰلِحٗاۗ قَالَ
يَٰقَوْمِ ٱعْبُدُواْ ٱللَّهَ مَا لَكُم
مِّنْ إِلَٰهٍ غَيْرُهُۥۖ قَدْ جَآءَتْكُم
بَيِّنَةٞ مِّن رَّبِّكُمْۖ هَٰذِهِۦ
نَاقَةُ ٱللَّهِ لَكُمْ ءَايَةٗۖ

**73.** ఇక స'మూద్ జాతి వారి వద్దకు వారి సోదరుడైన, 'సాలి'హ్‌ను పంపాము.[2] అతను వారితో: "నా జాతి సోదరులారా! అల్లాహ్‌నే ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక ఆరాధ్య దైవం లేడు. వాస్తవానికి, మీ వద్దకు మీ ప్రభువు తరఫునుండి ఒక స్పష్టమైన సూచన

---

**1.** వారిపై ఎనిమిది రోజులు, ఏడు రాత్రులు భయంకరమైన తుఫాను గాలి. విరుచుకు పడింది. వారు కోసిన ఖర్జూర చెట్లవలె మారిపోయారు. చూడండి, 69:6-8, 11:53-56, 46:24-25.

**2.** నబాతియన్ - తెగకు చెందిన స'మూద్ జాతివారు, 'ఆద్ జాతికి చెందిన వారు. కావున వారు రెండవ 'ఆద్‌జాతి వారిగా పిలువబడ్డారు. వారు 'హిజా'జ్ ఉత్తరభాగంలో ఉండే వారు. ఆ ప్రాంతం, వాది అల్-ఖురా అనబడుతోంది. వారు ఆ 'హిజ్ర్ ప్రాంతంలో గుట్టలను తొలిచి గృహాలను నిర్మించారు. వాటి పేరు మదాయన్ 'సాలి'హ్. ఈ రోజు కూడా అవి ఈ పేరుతోనే పిలువబడతాయి. మదాయన్ 'సాలి'హ్ మదీనా మునవ్వరా మరియు తబూక్‌ల మధ్య ఉన్నాయి. ఇప్పటికి కూడా అక్కడ స'మూద్ జాతివారు కొండలను తొలిచి నిర్మించిన కట్టడాలు ఉన్నాయి.

فَذَرُوهَا تَأْكُلْ فِيٓ أَرْضِ ٱللَّهِۖ وَلَا تَمَسُّوهَا بِسُوٓءٖ فَيَأْخُذَكُمْ عَذَابٌ أَلِيمٞ ٧٣

వచ్చింది. ఇది అల్లాహ్ మీకు ఒక అద్భుత సూచనగా పంపిన ఆడఒంటె కావున దీనిని అల్లాహ్ భూమిపై మేయటానికి వదలి పెట్టండి. మరియు హాని కలిగించే ఉద్దేశంతో దీనిని ముట్టుకోకండి. అలా చేస్తే మిమ్మల్ని బాధాకరమైన శిక్ష పట్టుకుంటుంది.[1]

وَٱذْكُرُوٓاْ إِذْ جَعَلَكُمْ خُلَفَآءَ مِنۢ بَعْدِ عَادٖ وَبَوَّأَكُمْ فِي ٱلْأَرْضِ تَتَّخِذُونَ مِن سُهُولِهَا قُصُورٗا وَتَنْحِتُونَ ٱلْجِبَالَ بُيُوتٗاۖ فَٱذْكُرُوٓاْ ءَالَآءَ ٱللَّهِ وَلَا تَعْثَوْاْ فِي ٱلْأَرْضِ مُفْسِدِينَ ٧٤

**74.** "మరియు ఆయన, 'ఆద్ జాతి వారి పిదప మిమ్మల్ని వారసులుగా చేసి మిమ్మల్ని భూమిపై స్థిరపరచిన విషయం జ్ఞాపకంచేసుకోండి. మీరు దాని మైదానాలలో కోటలను నిర్మించు కుంటున్నారు. మరియు కొండలను తొలచి గృహాలు నిర్మించుకుంటున్నారు. కావున అల్లాహ్ అనుగ్రహాన్ని జ్ఞాపకం చేసుకోండి. మరియు భూమిపై అనర్థాన్ని, కల్లోలాన్ని రేకెత్తించకండి!" అని అన్నాడు.

قَالَ ٱلْمَلَأُ ٱلَّذِينَ ٱسْتَكْبَرُواْ مِن قَوْمِهِۦ لِلَّذِينَ ٱسْتُضْعِفُواْ لِمَنْ ءَامَنَ مِنْهُمْ أَتَعْلَمُونَ أَنَّ صَٰلِحٗا مُّرْسَلٞ مِّن رَّبِّهِۦۚ قَالُوٓاْ إِنَّا بِمَآ أُرْسِلَ بِهِۦ مُؤْمِنُونَ ٧٥

**75.** ('సాలి'హ్) జాతి వారిలోని అహంకారులైన నాయకులు విశ్వసించిన బలహీనవర్గంవారితో అన్నారు: " 'సాలి'హ్ తన ప్రభువు పంపిన ప్రవక్త అని మీకు నిశ్చయంగా తెలుసా?" దానికి వారు: "మేము నిశ్చయంగా, అతని ద్వారా పంపబడిన సందేశాన్ని విశ్వసిస్తున్నాము." అని జవాబిచ్చారు.

قَالَ ٱلَّذِينَ ٱسْتَكْبَرُوٓاْ إِنَّا بِٱلَّذِيٓ ءَامَنتُم بِهِۦ كَٰفِرُونَ ٧٦

**76.** ఆ అహంకారులన్నారు: "మీరు విశ్వసించిన దానిని మేము నిశ్చయంగా, తిరస్కరిస్తున్నాము!"

---

**1.** చూడండి, 54:27.

فَعَقَرُواْ ٱلنَّاقَةَ وَعَتَوۡاْ عَنۡ أَمۡرِ رَبِّهِمۡ وَقَالُواْ يَٰصَٰلِحُ ٱئۡتِنَا بِمَا تَعِدُنَآ إِن كُنتَ مِنَ ٱلۡمُرۡسَلِينَ ﴿٧٧﴾

**77.** ఆ తరువాత వారు ఆ ఆడఒంటె వెనుకకాలి మోకాలి పెద్దనరం కోసి (చంపి), తమ ప్రభువు ఆజ్ఞను ఉల్లంఘించి, అతనితో అన్నారు: "ఓ 'సాలి'హ్! నీవు నిజంగానే సందేశహరుడవైతే నీవు మమ్మల్ని బెదిరించే ఆ శిక్షను తీసుకురా!"

فَأَخَذَتۡهُمُ ٱلرَّجۡفَةُ فَأَصۡبَحُواْ فِي دَارِهِمۡ جَٰثِمِينَ ﴿٧٨﴾

**78.** అప్పుడు వారిని భూకంపం పట్టుకున్నది.[1] వారు తమ ఇండ్లలోనే బోర్లా (శవాలుగా మారి) పడిపోయారు.

فَتَوَلَّىٰ عَنۡهُمۡ وَقَالَ يَٰقَوۡمِ لَقَدۡ أَبۡلَغۡتُكُمۡ رِسَالَةَ رَبِّي وَنَصَحۡتُ لَكُمۡ وَلَٰكِن لَّا تُحِبُّونَ ٱلنَّٰصِحِينَ ﴿٧٩﴾

**79.** పిదప అతను ('సాలి'హ్) వారినుండి తిరిగిపోతూ అన్నాడు: "ఓ నా జాతి ప్రజలారా! వాస్తవంగా, నేను నా ప్రభువు సందేశాన్ని మీకు అందజేశాను. మరియు మీకు మంచి సలహాలను ఇచ్చాను, కానీ మీరు మంచి సలహాలు ఇచ్చేవారంటే ఇష్టపడలేదు!"

وَلُوطًا إِذۡ قَالَ لِقَوۡمِهِۦٓ أَتَأۡتُونَ ٱلۡفَٰحِشَةَ مَا سَبَقَكُم بِهَا مِنۡ أَحَدٍ مِّنَ ٱلۡعَٰلَمِينَ ﴿٨٠﴾

**80.** ఇక లూ'త్![2] అతను తన జాతి వారితో: "ఏమీ? మీరు ఇంతకుపూర్వం ప్రపంచంలో ఎవ్వరూ చేయని అసహ్యకరమైన పనులు చేస్తారా?" అని అడిగిన విషయం జ్ఞప్తికి తెచ్చుకోండి.

---

**1.** ఇక్కడ *రజ్ఫతున్:* భూకంపం, అని ఉంది. మరొకచోట 54:31లో, 'సై'హతున్: భయంకర అరుపు (ధ్వని), అని వ్రాయబడి ఉంది. బహుశా ఈ రెండు ఒకేసారి వచ్చిఉంటాయి.

**2.** లూ'త్ ('అ.స.), ఇబ్రాహీమ్ ('అ.స.) యొక్క సోదరుని కుమారులు. అతని వృత్తాంతం, 11:69-83లలో వివరంగా ఉంది. ఇతను ఇబ్రాహీమ్ (అ.స.)ను విశ్వసించారు. ఈయన నివసించిన నగరం, 'సోడోమ్', జోర్డన్ మరియు బైతుల్ మఖ్దిస్ మధ్య మృత సముద్రం ప్రాంతంలో ఉంది. ఇతని జాతివారు చరిత్రలో మొదటిసారి పురుషులు-పురషులతో లైంగిక క్రియ (Sodomy) చేయసాగారు. స్త్రీలను వదలి, పురుషులు-పురషులతో తమ కామ ఇచ్ఛను పూర్తి చేసుకొనేవారు. ఇది మహాపాపం. కాని ఈ రోజు కొన్ని పశ్చిమ దేశాలలో ఇది నేరమూ కాదు, పాపమూ కాదు. ఇది వారి దగ్గర చట్టం రీత్యా ఆమోదించబడింది. షరీయత్‌లో దీని శిక్ష వ్యభిచారానికి ఇవ్వవలసిన శిక్షయే!

إِنَّكُمۡ لَتَأۡتُونَ ٱلرِّجَالَ شَهۡوَةٗ مِّن دُونِ ٱلنِّسَآءِۚ بَلۡ أَنتُمۡ قَوۡمٞ مُّسۡرِفُونَ ٨١

81. "వాస్తవానికి, మీరు స్త్రీలను వదలి కామంతో పురుషుల వద్దకు పోతున్నారు. వాస్తవంగా, మీరు మితిమీరి ప్రవర్తిస్తున్నారు.

وَمَا كَانَ جَوَابَ قَوۡمِهِۦٓ إِلَّآ أَن قَالُوٓاْ أَخۡرِجُوهُم مِّن قَرۡيَتِكُمۡۖ إِنَّهُمۡ أُنَاسٞ يَتَطَهَّرُونَ ٨٢

82. కాని అతని జాతి వారి జవాబు కేవలం ఇలాగే ఉండింది:[1] "వీరిని మీ నగరం నుండి వెళ్ళగొట్టండి. వాస్తవానికి వీరు తమను తాము మహా పవిత్రులనుకుంటున్నారు!"

فَأَنجَيۡنَٰهُ وَأَهۡلَهُۥٓ إِلَّا ٱمۡرَأَتَهُۥ كَانَتۡ مِنَ ٱلۡغَٰبِرِينَ ٨٣

83. ఆ పిదప మేము అతనినీ మరియు అతని ఇంటివారినీ - అతని భార్యను తప్ప - రక్షించాము. ఆమె వెనుక ఉండిపోయిన వారిలో చేరిపోయింది.[2]

وَأَمۡطَرۡنَا عَلَيۡهِم مَّطَرٗاۖ فَٱنظُرۡ كَيۡفَ كَانَ عَٰقِبَةُ ٱلۡمُجۡرِمِينَ ٨٤

84. మరియు మేము వారిపై (రాళ్ళ) వర్షాన్ని కురిపించాము.[3] చూడండి! ఆ అపరాధుల ముగింపు ఎలా జరిగిందో!

وَإِلَىٰ مَدۡيَنَ أَخَاهُمۡ شُعَيۡبٗاۚ قَالَ يَٰقَوۡمِ ٱعۡبُدُواْ ٱللَّهَ مَا لَكُم

85. మరియు మేము మద్‌యన్ జాతివారి వద్దకు వారి సహోదరుడు షు'ఐబ్‌ను (పంపాము).[4] అతను వారితో

---

1. చూడండి, 27:56.
2. చూడండి, 11:81 మరియు 66:10.
3. చూడండి, 11:82.
4. మద్‌యన్: ఒక తెగ మరియు నగరపు పేరు. వారి వద్దకు షు'ఐబ్ ('అ.స.) ప్రవక్తగా పంపబడ్డారు. దీని మరొక పేరు అయ్‌కహ్. అది ఇప్పటి 'అఖబా అగాధం (Gulf of Aqaba) నుండి పడమటివైపుకు సినాయి ద్వీపకల్పం (Sinai Peninsula) మరియు మో'ఆబ్ (Moab) పర్వతాల వరకు మరియు మృత సముద్రాని (Dead Sea)కి తూర్పు దిక్కున ఉంది. అక్కడ నివసించే వారు అమోరైట్ (Amorite) తెగకు చెందిన 'అరబ్బులు. షు'ఐబ్ ('అ.స.) మరొక పేరు ఎత్రో (Jethro), ఇతనే మూసా ('అ.స.) యొక్క భార్య తండ్రి అని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. ఇంకా చూడండి, 26:176.

مِّنْ إِلَٰهٍ غَيْرُهُۥ قَدْ جَآءَتْكُم بَيِّنَةٌ مِّن رَّبِّكُمْ فَأَوْفُوا۟ ٱلْكَيْلَ وَٱلْمِيزَانَ وَلَا تَبْخَسُوا۟ ٱلنَّاسَ أَشْيَآءَهُمْ وَلَا تُفْسِدُوا۟ فِى ٱلْأَرْضِ بَعْدَ إِصْلَٰحِهَا ۚ ذَٰلِكُمْ خَيْرٌ لَّكُمْ إِن كُنتُم مُّؤْمِنِينَ ﴿٨٥﴾

وَلَا تَقْعُدُوا۟ بِكُلِّ صِرَٰطٍ تُوعِدُونَ وَتَصُدُّونَ عَن سَبِيلِ ٱللَّهِ مَنْ ءَامَنَ بِهِۦ وَتَبْغُونَهَا عِوَجًا ۚ وَٱذْكُرُوٓا۟ إِذْ كُنتُمْ قَلِيلًا فَكَثَّرَكُمْ ۖ وَٱنظُرُوا۟ كَيْفَ كَانَ عَٰقِبَةُ ٱلْمُفْسِدِينَ ﴿٨٦﴾

وَإِن كَانَ طَآئِفَةٌ مِّنكُمْ ءَامَنُوا۟ بِٱلَّذِىٓ أُرْسِلْتُ بِهِۦ وَطَآئِفَةٌ لَّمْ يُؤْمِنُوا۟ فَٱصْبِرُوا۟ حَتَّىٰ يَحْكُمَ ٱللَّهُ بَيْنَنَا ۚ وَهُوَ خَيْرُ ٱلْحَٰكِمِينَ ﴿٨٧﴾

అన్నాడు: "నా జాతి ప్రజలారా! అల్లాహ్‌నే ఆరాధించండి, మీకు ఆయన తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు. వాస్తవంగా, మీ వద్దకు, మీ ప్రభువు దగ్గర నుండి స్పష్టమైన (మార్గదర్శకత్వం) వచ్చి వున్నది. కొలిచేటప్పుడు మరియు తూచేటప్పుడు పూర్తిగా ఇవ్వండి. ప్రజలకు వారి వస్తువులను తగ్గించి ఇవ్వకండి. భూమిపై సంస్కరణ జరిగిన తరువాత కల్లోలాన్ని రేకెత్తించకండి. మీరు విశ్వాసులే అయితే, ఇదే మీకు మేలైనది.

**86**. "మరియు ఆయనను విశ్వసించిన వారిని, అల్లాహ్ మార్గంనుండి నిరోధించటానికి వారిని బెదరిస్తూ, అది వక్రమైనదని చూపగోరి ప్రతి మార్గంలో కూర్చోకండి. మీరు అల్పసంఖ్యలో ఉన్నప్పుడు ఆయన మీ సంఖ్యను అధికం చేసిన విషయాన్ని జ్ఞాపకం చేసుకోండి. మరియు కల్లోలం రేకెత్తించిన వారి గతి ఏమయిందో చూడండి.

**87**. "మరియు నా ద్వారా పంపబడిన దానిని (సందేశాన్ని) మీలో ఒక వర్గం వారు విశ్వసించి, మరొక వర్గం వారు విశ్వసించక పోతే! అల్లాహ్ మన మధ్య తీర్పు చేసే వరకూ సహనం వహించండి. మరియు ఆయనే అత్యుత్తమమైన న్యాయాధిపతి!"[1]

---

**1**. చూడండి, 9:52. స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-9, 'హదీస్' నం. 252, 266, 267,పు.-2, 'హ. 539.

88. (*) దురహంకారులైన అతని జాతి నాయకులు అన్నారు: "ఓ షు'ఐబ్! మేము నిన్నూ మరియు నీతోబాటు విశ్వసించిన వారినీ, మా నగరం నుండి తప్పక వెడలగొడ్తాము. లేదా మీరు తిరిగి మా ధర్మంలోకి రండి!" అతను అన్నాడు: "మేము దానిని అసహ్యించుకున్నప్పటికీ (మీ ధర్మంలోకి చేరాలా)?"

89. (ఇంకా ఇలా అన్నాడు): "వాస్తవంగా, అల్లాహ్ మాకు (మీ ధర్మం నుండి) విముక్తి కలిగించిన తరువాత కూడా మేము తిరిగి మీ ధర్మంలోకి చేరితే! మేము అల్లాహ్‌పై అబద్ధం కల్పించిన వారమవుతాము. మా ప్రభువైన అల్లాహ్ కోరితే తప్ప! మేము తిరిగి దానిలో చేరలేము. మా ప్రభువు జ్ఞానం ప్రతి వస్తువునూ ఆవరించి ఉంది. మేము అల్లాహ్‌పైననే ఆధారపడి ఉన్నాము. 'ఓ మా ప్రభూ! మా మధ్య మరియు మా జాతి వారి మధ్య న్యాయంగా తీర్పుచేయి. మరియు నీవే సర్వోత్తమమైన న్యాయనిర్ణేతవు!' "

90. మరియు అతని జాతిలోని సత్య తిరస్కారులైన నాయకులు అన్నారు: "ఒకవేళ మీరు షు'ఐబ్‌ను అనుసరిస్తే! నిశ్చయంగా, మీరు నష్టంపొందిన వారవుతారు."

91. అప్పుడు వారిని ఒక భూకంపం పట్టుకున్నది[1] మరియు వారు తమ ఇండ్లలోనే బోర్లా (శవాలై) పడిపోయారు.

۞ قَالَ ٱلۡمَلَأُ ٱلَّذِينَ ٱسۡتَكۡبَرُواْ مِن قَوۡمِهِۦ لَنُخۡرِجَنَّكَ يَٰشُعَيۡبُ وَٱلَّذِينَ ءَامَنُواْ مَعَكَ مِن قَرۡيَتِنَآ أَوۡ لَتَعُودُنَّ فِي مِلَّتِنَاۚ قَالَ أَوَلَوۡ كُنَّا كَٰرِهِينَ ٨٨

قَدِ ٱفۡتَرَيۡنَا عَلَى ٱللَّهِ كَذِبًا إِنۡ عُدۡنَا فِي مِلَّتِكُم بَعۡدَ إِذۡ نَجَّىٰنَا ٱللَّهُ مِنۡهَاۚ وَمَا يَكُونُ لَنَآ أَن نَّعُودَ فِيهَآ إِلَّآ أَن يَشَآءَ ٱللَّهُ رَبُّنَاۚ وَسِعَ رَبُّنَا كُلَّ شَيۡءٍ عِلۡمًاۚ عَلَى ٱللَّهِ تَوَكَّلۡنَاۚ رَبَّنَا ٱفۡتَحۡ بَيۡنَنَا وَبَيۡنَ قَوۡمِنَا بِٱلۡحَقِّ وَأَنتَ خَيۡرُ ٱلۡفَٰتِحِينَ ٨٩

وَقَالَ ٱلۡمَلَأُ ٱلَّذِينَ كَفَرُواْ مِن قَوۡمِهِۦ لَئِنِ ٱتَّبَعۡتُمۡ شُعَيۡبًا إِنَّكُمۡ إِذٗا لَّخَٰسِرُونَ ٩٠

فَأَخَذَتۡهُمُ ٱلرَّجۡفَةُ فَأَصۡبَحُواْ فِي دَارِهِمۡ جَٰثِمِينَ ٩١

1. ఇక్కడ రజ్‌ఫతున్ - భూకంపం అని, 11:94లో 'సై'హతున్ - భయంకరమైన అరుపు (ధ్వని) అని, మరియు 26:189లో 'జుల్లతున్ - మేఘాలఛాయ అని ఉంది. అన్నీ ఒక దాని వెంట ఒకటి, ఒకేసారి వచ్చాయన్నమాట, (ఇబ్నె-కసీ'ర్).

ٱلَّذِينَ كَذَّبُوا۟ شُعَيْبًا كَأَن لَّمْ يَغْنَوْا۟
فِيهَا ۚ ٱلَّذِينَ كَذَّبُوا۟ شُعَيْبًا كَانُوا۟
هُمُ ٱلْخَـٰسِرِينَ ﴿٩٢﴾

**92**. షు'ఐబ్‌ను అబద్ధమాడుతున్నాడని తిరస్కరించిన వారు అక్కడ ఎన్నడూ నివసించి ఉండనే లేదన్నట్లుగా నశించి పోయారు. షు'ఐబ్‌ను అబద్ధమాడు తున్నాడని తిరస్కరించిన వారే వాస్తవానికి నష్టం పొందిన వారయ్యారు.

فَتَوَلَّىٰ عَنْهُمْ وَقَالَ يَـٰقَوْمِ لَقَدْ
أَبْلَغْتُكُمْ رِسَـٰلَـٰتِ رَبِّى
وَنَصَحْتُ لَكُمْ ۖ فَكَيْفَ ءَاسَىٰ
عَلَىٰ قَوْمٍ كَـٰفِرِينَ ﴿٩٣﴾

**93**. (షు'ఐబ్) ఇలా అంటూ వారి నుండి మరలిపోయాడు: "నా జాతి ప్రజలారా! వాస్తవంగా నేను నా ప్రభువు సందేశాలను మీకు అందజేశాను మరియు మీకు హితోపదేశం చేశాను. కావున ఇపుడు సత్యతిరస్కారులైన జాతి వారి కొరకు నేనెందుకు దుఃఖించాలి?"

وَمَآ أَرْسَلْنَا فِى قَرْيَةٍ مِّن نَّبِىٍّ إِلَّآ
أَخَذْنَآ أَهْلَهَا بِٱلْبَأْسَآءِ وَٱلضَّرَّآءِ
لَعَلَّهُمْ يَضَّرَّعُونَ ﴿٩٤﴾

**94**. మరియు మేము ఏ నగరానికి ప్రవక్తను పంపినా! దాని ప్రజలను ఆపదలకు మరియు దౌర్భాగ్యానికి గురి చేయకుండా ఉండలేదు, వారు ఇలాగైనా వినమ్రులు అవుతారేమోనని!

ثُمَّ بَدَّلْنَا مَكَانَ ٱلسَّيِّئَةِ ٱلْحَسَنَةَ
حَتَّىٰ عَفَوا۟ وَّقَالُوا۟ قَدْ مَسَّ ءَابَآءَنَا
ٱلضَّرَّآءُ وَٱلسَّرَّآءُ فَأَخَذْنَـٰهُم بَغْتَةً
وَهُمْ لَا يَشْعُرُونَ ﴿٩٥﴾

**95**. ఆ తరువాత వారి దుస్థితిని, సుస్థితిగా మార్చిన పిదప వారు హాయిగా ఉంటూ ఇలా అన్నారు: "వాస్తవానికి కష్టసుఖాలు మా పూర్వీకులకు కూడా సంభవించాయి." కావున మేము వారిని అకస్మాత్తుగా పట్టుకున్నాము మరియు వారు దానిని గ్రహించలేక పోయారు.[1]

وَلَوْ أَنَّ أَهْلَ ٱلْقُرَىٰٓ ءَامَنُوا۟
وَٱتَّقَوْا۟ لَفَتَحْنَا عَلَيْهِم بَرَكَـٰتٍ مِّنَ
ٱلسَّمَآءِ وَٱلْأَرْضِ وَلَـٰكِن كَذَّبُوا۟

**96**. మరియు ఒకవేళ ఆ నగరవాసులు విశ్వసించి, దైవభీతి కలిగిఉంటే - మేము వారిపై ఆకాశం నుండి మరియు భూమినుండి - సర్వశుభాల నొసంగి

**1**. చూడండి, 6:42-45.

فَأَخَذۡنَٰهُم بِمَا كَانُواْ يَكۡسِبُونَ ﴿٩٦﴾

ఉండేవారం. కాని వారు (ప్రవక్తలను) అసత్యవాదులని తిరస్కరించారు, కనుక వారు చేసిన కర్మలకు ఫలితంగా మేము వారిని శిక్షించాము.

أَفَأَمِنَ أَهۡلُ ٱلۡقُرَىٰٓ أَن يَأۡتِيَهُم بَأۡسُنَا بَيَٰتٗا وَهُمۡ نَآئِمُونَ ﴿٩٧﴾

**97.** ఏమీ? ఈ నగరాలవాసులు, తాము నిద్ర పోయేటప్పుడు రాత్రి సమయమున వచ్చే మా శిక్షనుండి సురక్షితంగా ఉన్నారా?

أَوَأَمِنَ أَهۡلُ ٱلۡقُرَىٰٓ أَن يَأۡتِيَهُم بَأۡسُنَا ضُحٗى وَهُمۡ يَلۡعَبُونَ ﴿٩٨﴾

**98.** లేదా ఈ నగరాలవాసులు, పట్టపగలు తాము కాలక్షేపంలో ఉన్నప్పుడు వచ్చే మా శిక్షనుండి సురక్షితంగా ఉన్నారా?

أَفَأَمِنُواْ مَكۡرَ ٱللَّهِۚ فَلَا يَأۡمَنُ مَكۡرَ ٱللَّهِ إِلَّا ٱلۡقَوۡمُ ٱلۡخَٰسِرُونَ ﴿٩٩﴾

**99.** ఏమీ? వారు అల్లాహ్ యుక్తి (శిక్ష) అంటే నిర్భయంగా ఉన్నారా? నాశనం కాబోయే వారు తప్ప, ఇతర జాతి వారెవ్వరూ అల్లాహ్ యుక్తి గురించి నిర్భయంగా ఉండజాలరు.[1]

أَوَلَمۡ يَهۡدِ لِلَّذِينَ يَرِثُونَ ٱلۡأَرۡضَ مِنۢ بَعۡدِ أَهۡلِهَآ أَن لَّوۡ نَشَآءُ أَصَبۡنَٰهُم بِذُنُوبِهِمۡۚ وَنَطۡبَعُ عَلَىٰ قُلُوبِهِمۡ فَهُمۡ لَا يَسۡمَعُونَ ﴿١٠٠﴾

**100.** ఏమీ? పూర్వపు భూలోకవాసుల తరువాత, భూమికి వారసులయిన వారికి, మేము కోరితే వారి పాపాల వలన వారికి కూడా శిక్ష విధించగలమని ఉపదేశం అందలేదా? మరియు మేము, వారి హృదయాలమీద ముద్రవేసి ఉన్నాము, దానివల్ల వారు (మా హితోపదేశాన్ని) వినలేకున్నారు.

تِلۡكَ ٱلۡقُرَىٰ نَقُصُّ عَلَيۡكَ مِنۡ أَنۢبَآئِهَاۚ وَلَقَدۡ جَآءَتۡهُمۡ رُسُلُهُم بِٱلۡبَيِّنَٰتِ فَمَا كَانُواْ لِيُؤۡمِنُواْ

**101.** ఈ నగరాల వృత్తాంతాలను కొన్నింటిని మేము నీకు వినిపిస్తున్నాము. మరియు వాస్తవానికి వారి వద్దకు వారి ప్రవక్తలు స్పష్టమైన (నిదర్శనాలు) తీసుకొని

**1.** చూడండి, 3:54, 33:62 మరియు 35:43.

بِمَا كَذَّبُوا۟ مِن قَبْلُ ۚ كَذَٰلِكَ يَطْبَعُ ٱللَّهُ عَلَىٰ قُلُوبِ ٱلْكَٰفِرِينَ ﴿١٠١﴾

వచ్చారు.[1] కాని వారు ముందు తిరస్కరించిన దానిని మరల విశ్వసించలేదు. ఈ విధంగా అల్లాహ్ సత్యతిరస్కారుల హృదయాలపై ముద్రవేస్తాడు.[2]

وَمَا وَجَدْنَا لِأَكْثَرِهِم مِّنْ عَهْدٍ ۖ وَإِن وَجَدْنَآ أَكْثَرَهُمْ لَفَٰسِقِينَ ﴿١٠٢﴾

**102**. మరియు మేము వారిలో చాలా మందిని తమ వాగ్దానాన్ని పాటించేవారిగా చూడలేదు. మరియు వాస్తవానికి వారిలో చాలామందిని దుష్టులుగానే (ఫాసిఖీన్) పొందాము (చూశాము).

ثُمَّ بَعَثْنَا مِنۢ بَعْدِهِم مُّوسَىٰ بِـَٔايَٰتِنَآ إِلَىٰ فِرْعَوْنَ وَمَلَإِي۟هِۦ فَظَلَمُوا۟ بِهَا ۖ فَٱنظُرْ كَيْفَ كَانَ عَٰقِبَةُ ٱلْمُفْسِدِينَ ﴿١٠٣﴾

**103**. ఆ తరువాత మేము మూసాను మా సూచనలతో ఫిర్'ఔన్ మరియు అతని నాయకుల వద్దకు పంపాము. వారు, వాటి (మా సూచనల) పట్ల దుర్మార్గంతో ప్రవర్తించారు. కావున చూడండి దౌర్జన్యపరుల గతి ఏమయిందో!

وَقَالَ مُوسَىٰ يَٰفِرْعَوْنُ إِنِّى رَسُولٌ مِّن رَّبِّ ٱلْعَٰلَمِينَ ﴿١٠٤﴾

**104**. మరియు మూసా అన్నాడు: "ఓ ఫిర్'ఔన్! నేను నిశ్చయంగా, సర్వలోకాల ప్రభువు యొక్క సందేశహరుడను!

حَقِيقٌ عَلَىٰٓ أَن لَّآ أَقُولَ عَلَى ٱللَّهِ إِلَّا ٱلْحَقَّ ۚ قَدْ جِئْتُكُم بِبَيِّنَةٍ مِّن رَّبِّكُمْ فَأَرْسِلْ مَعِىَ بَنِىٓ إِسْرَٰٓءِيلَ ﴿١٠٥﴾

**105**. "అల్లాహ్‌ను గురించి సత్యం తప్ప మరే విషయాన్ని పలకని బాధ్యత గలవాడను. వాస్తవానికి, నేను మీ వద్దకు, మీ ప్రభువు తరఫునుండి స్పష్టమైన సూచనలు తీసుకొని వచ్చాను, కావున ఇస్రాయీ'ల్ సంతతివారిని నావెంట పోనివ్వు."[3]

---

**1**. చూడండి, 17:15.

**2**. అల్లాహ్ (సు.తా.)కు ప్రతిదానిని గురించి, దాని భూతకాలపు, వర్తమానకాలపు మరియు భవిష్యత్తుకాలపు విషయాలన్నీ తెలుసు. ఇదంతా ఒక గ్రంథంలో వ్రాయబడి ఉంది. అల్లాహుతా'ఆలా సర్వవ్యాప్తి, సర్వపరిచితుడు. కాబట్టి, ఇక్కడ: "సత్యతిరస్కారుల హృదయాలమీద ముద్రవేయబడి ఉంది." అని చెప్పబడింది.('స.బు'ఖారీ, తఫ్సీర్ సూ. అల్లైల్).

**3**. ఇస్రాయీల్ సంతతి వారు అసలు సిరియా (షామ్) ప్రాంతపు వాసులు. యూసుఫ్

قَالَ إِن كُنتَ جِئْتَ بِـَٔايَةٍ فَأْتِ بِهَآ إِن كُنتَ مِنَ ٱلصَّـٰدِقِينَ ﴿١٠٦﴾

**106**. (ఫిర్'ఔన్) అన్నాడు: "నీవు ఏదైనా సూచనను తీసుకొనివచ్చిఉంటే - నీవు సత్యవంతుడవే అయితే - దానిని తీసుకొనిరా!"

فَأَلْقَىٰ عَصَاهُ فَإِذَا هِىَ ثُعْبَانٌ مُّبِينٌ ﴿١٠٧﴾

**107**. అప్పుడు (మూసా) తన చేతికర్రను విసిరాడు, అకస్మాత్తుగా అది ఒక స్పష్టమైన పెద్ద సర్పం (సు'అబాన్)గా మారిపోయింది.

وَنَزَعَ يَدَهُۥ فَإِذَا هِىَ بَيْضَآءُ لِلنَّـٰظِرِينَ ﴿١٠٨﴾

**108**. మరియు అతడు తనచేతిని బయటికితీశాడు. ఇక అది చూసే వారికి తెల్లగా మెరుస్తూ కనిపించింది.

قَالَ ٱلْمَلَأُ مِن قَوْمِ فِرْعَوْنَ إِنَّ هَـٰذَا لَسَـٰحِرٌ عَلِيمٌ ﴿١٠٩﴾

**109**. (ఇది చూసి), ఫిర్'ఔన్ జాతి నాయకులు అన్నారు: "నిశ్చయంగా, ఇతడు నేర్పుగల ఒక గొప్ప మాంత్రికుడు!"

يُرِيدُ أَن يُخْرِجَكُم مِّنْ أَرْضِكُمْ ۖ فَمَاذَا تَأْمُرُونَ ﴿١١٠﴾

**110**. (ఫిర్'ఔన్ అన్నాడు): "ఇతడు మిమ్మల్ని మీ భూమి నుండి వెడలగొట్ట గోరుతున్నాడు. అయితే! మీ సలహా ఏమిటి?"

قَالُوٓا۟ أَرْجِهْ وَأَخَاهُ وَأَرْسِلْ فِى ٱلْمَدَآئِنِ حَـٰشِرِينَ ﴿١١١﴾

**111**. వారన్నారు: "అతనికి (మూసాకు) మరియు అతని సోదరునికి కొంత వ్యవధి నిచ్చి, అన్ని నగరాలకు బంటులను పంపు.

يَأْتُوكَ بِكُلِّ سَـٰحِرٍ عَلِيمٍ ﴿١١٢﴾

**112**. "వారు నిపుణులైన ప్రతి మాంత్రికుణ్ణి నీవద్దకు తీసుకొని వస్తారు."[1]

---

('అ.స.) కాలంలో వారు ఈజిప్టులో స్థిరపడ్డారు. కాలచక్రంలో ఈజిప్టురాజులు మారిపోయారు. వారి ప్రాధాన్యత తగ్గి, వారు ఫిర్'ఔనుల రాజరికంలో బానిసలుగా మారిపోయారు. మరియు ఎన్నో కష్టాలకు అవమానాలకు గురిచేయబడ్డారు. వారికి స్వాతంత్ర్యం ఇప్పించటానికి అల్లాహ్ (సు.తా.) మూసా ('అ.స.)ను ప్రవక్తగా చేసి పంపాడు.

1. చూడండి, 20:57-59.

**113**. మరియు మాంత్రికులందరూ ఫిర్'ఔన్ వద్దకు వచ్చి: "ఒక వేళ మేము గెలిస్తే మాకు ప్రతిఫలం తప్పకుండా ఉంటుంది కదా!" అని అన్నారు.

**114**. (ఫిర్'ఔన్) అన్నాడు: "అవును, నిశ్చయంగా, మీరు నా సాన్నిధ్యాన్ని కూడా పొందుతారు."

**115**. వారన్నారు: "ఓ మూసా! (ముందు) నీవు విసురుతావా? లేక మేము విసరాలా?"

**116**. (మూసా) అన్నాడు: " (ముందు) మీరే విసరండి!" వారు (తమ కర్రలను) విసిరి, ప్రజల చూపులను మంత్రముగ్ధం చేస్తూ వారికి భయం కలిగించే ఒక అద్భుతమైన మాయా జాలాన్ని ప్రదర్శించారు. (1/8)

**117**. * మేము మూసాకు: "నీ చేతి కర్రను విసురు." అని ఆదేశమిచ్చాము. అప్పుడది వారి (మాంత్రికుల) బూటక (మాయాజాలాన్ని) మ్రింగివేసింది.

**118**. ఈ విధంగా సత్యం స్థాపితమయ్యింది మరియు వారు (మాంత్రికులు) చేసిందంతా విఫలమయ్యింది.

**119**. ఈ విధంగా వారక్కడ అపజయం పొంది అవమానంతో కృంగిపోయారు.

**120**. మరియు మాంత్రికులు సాష్టాంగ పడ్డారు.

**121**. (మాంత్రికులు) అన్నారు: "మేము సర్వలోకాల ప్రభువును విశ్వసించాము.

**122**. "మూసా మరియు హారూన్‌ల ప్రభువును."

وَجَآءَ ٱلسَّحَرَةُ فِرۡعَوۡنَ قَالُوٓاْ إِنَّ لَنَا لَأَجۡرًا إِن كُنَّا نَحۡنُ ٱلۡغَٰلِبِينَ ﴿١١٣﴾

قَالَ نَعَمۡ وَإِنَّكُمۡ لَمِنَ ٱلۡمُقَرَّبِينَ ﴿١١٤﴾

قَالُواْ يَٰمُوسَىٰٓ إِمَّآ أَن تُلۡقِيَ وَإِمَّآ أَن نَّكُونَ نَحۡنُ ٱلۡمُلۡقِينَ ﴿١١٥﴾

قَالَ أَلۡقُواْۖ فَلَمَّآ أَلۡقَوۡاْ سَحَرُوٓاْ أَعۡيُنَ ٱلنَّاسِ وَٱسۡتَرۡهَبُوهُمۡ وَجَآءُو بِسِحۡرٍ عَظِيمٖ ﴿١١٦﴾

۞ وَأَوۡحَيۡنَآ إِلَىٰ مُوسَىٰٓ أَنۡ أَلۡقِ عَصَاكَۖ فَإِذَا هِيَ تَلۡقَفُ مَا يَأۡفِكُونَ ﴿١١٧﴾

فَوَقَعَ ٱلۡحَقُّ وَبَطَلَ مَا كَانُواْ يَعۡمَلُونَ ﴿١١٨﴾

فَغُلِبُواْ هُنَالِكَ وَٱنقَلَبُواْ صَٰغِرِينَ ﴿١١٩﴾

وَأُلۡقِيَ ٱلسَّحَرَةُ سَٰجِدِينَ ﴿١٢٠﴾

قَالُوٓاْ ءَامَنَّا بِرَبِّ ٱلۡعَٰلَمِينَ ﴿١٢١﴾

رَبِّ مُوسَىٰ وَهَٰرُونَ ﴿١٢٢﴾

**123**. ఫిర'ఔన్ అన్నాడు: ''నేను అనుమతి ఇవ్వకముందే మీరు అతనిని విశ్వసించారా? నిశ్చయంగా, మీరందరూ కలిసి ఈ నగరం నుండి దాని వాసులను వెడలగొట్టటానికి పన్నిన పన్నాగమిది, (దీని పరిణామం) మీరిప్పుడే తెలుసుకోగలరు.

**124**. ''నేను తప్పక మీ ఒక ప్రక్క చేతులను మరొక ప్రక్క కాళ్ళను నరికిస్తాను. ఆ తరువాత మీరందరినీ సిలువపై ఎక్కిస్తాను.''

**125**. వారు ఇలా జవాబిచ్చారు: ''నిశ్చయంగా, మేము మా ప్రభువు వద్దకే కదా మరలిపోయేది!

**126**. ''మరియు మా ప్రభువు తరఫు నుండి మావద్దకు వచ్చిన సూచనలను, మేము విశ్వసించామనే కదా! నీవు మాతో పగతీర్చుకోదలచావు.'' (ఇలా ప్రార్థించారు): ''ఓ మా ప్రభూ! మాకు సహనమొసంగు. మేము నీకు విధేయులం (ముస్లిములు)గా మృతినొందేటట్లు చేయి!''

**127**. మరియు ఫిర'ఔన్ జాతి నాయకులు అతనితో అన్నారు: ''ఏమీ? భూమిలో కల్లోలం రేకెత్తించటానికి మరియు నిన్నూ నీ దేవతలను విడిచిపోవటానికి, నీవు మూసాను మరియు అతని జాతి వారిని వదలుతున్నావా?'' అతడు (ఫిర'ఔన్) జవాబిచ్చాడు: ''మేము తప్పక వారి కుమారులను చంపి వారి కుమార్తెలను బ్రతకనిస్తాము మరియు నిశ్చయంగా, మేము వారిపై ప్రాబల్యం కలిగిఉన్నాము.''

قَالَ فِرۡعَوۡنُ ءَامَنتُم بِهِۦ قَبۡلَ أَنۡ
ءَاذَنَ لَكُمۡۖ إِنَّ هَٰذَا لَمَكۡرٞ مَّكَرۡتُمُوهُ
فِي ٱلۡمَدِينَةِ لِتُخۡرِجُواْ مِنۡهَآ أَهۡلَهَاۖ
فَسَوۡفَ تَعۡلَمُونَ ١٢٣
لَأُقَطِّعَنَّ أَيۡدِيَكُمۡ وَأَرۡجُلَكُم مِّنۡ
خِلَٰفٖ ثُمَّ لَأُصَلِّبَنَّكُمۡ أَجۡمَعِينَ ١٢٤
قَالُوٓاْ إِنَّآ إِلَىٰ رَبِّنَا مُنقَلِبُونَ ١٢٥
وَمَا تَنقِمُ مِنَّآ إِلَّآ أَنۡ ءَامَنَّا
بِـَٔايَٰتِ رَبِّنَا لَمَّا جَآءَتۡنَاۚ رَبَّنَآ أَفۡرِغۡ
عَلَيۡنَا صَبۡرٗا وَتَوَفَّنَا مُسۡلِمِينَ ١٢٦
وَقَالَ ٱلۡمَلَأُ مِن قَوۡمِ فِرۡعَوۡنَ أَتَذَرُ
مُوسَىٰ وَقَوۡمَهُۥ لِيُفۡسِدُواْ فِي
ٱلۡأَرۡضِ وَيَذَرَكَ وَءَالِهَتَكَۚ قَالَ
سَنُقَتِّلُ أَبۡنَآءَهُمۡ وَنَسۡتَحۡيِۦ نِسَآءَهُمۡ
وَإِنَّا فَوۡقَهُمۡ قَٰهِرُونَ ١٢٧

قَالَ مُوسَىٰ لِقَوْمِهِ ٱسْتَعِينُواْ بِٱللَّهِ
وَٱصْبِرُوٓاْۖ إِنَّ ٱلْأَرْضَ لِلَّهِ
يُورِثُهَا مَن يَشَآءُ مِنْ عِبَادِهِۦۖ
وَٱلْعَٰقِبَةُ لِلْمُتَّقِينَ ﴿١٢٨﴾
قَالُوٓاْ أُوذِينَا مِن قَبْلِ أَن تَأْتِيَنَا
وَمِنۢ بَعْدِ مَا جِئْتَنَاۚ قَالَ عَسَىٰ
رَبُّكُمْ أَن يُهْلِكَ عَدُوَّكُمْ
وَيَسْتَخْلِفَكُمْ فِى ٱلْأَرْضِ
فَيَنظُرَ كَيْفَ تَعْمَلُونَ ﴿١٢٩﴾
وَلَقَدْ أَخَذْنَآ ءَالَ فِرْعَوْنَ بِٱلسِّنِينَ
وَنَقْصٍ مِّنَ ٱلثَّمَرَٰتِ لَعَلَّهُمْ
يَذَّكَّرُونَ ﴿١٣٠﴾
فَإِذَا جَآءَتْهُمُ ٱلْحَسَنَةُ قَالُواْ لَنَا
هَٰذِهِۦۖ وَإِن تُصِبْهُمْ سَيِّئَةٌ يَطَّيَّرُواْ
بِمُوسَىٰ وَمَن مَّعَهُۥٓۗ أَلَآ إِنَّمَا طَٰٓئِرُهُمْ
عِندَ ٱللَّهِ وَلَٰكِنَّ أَكْثَرَهُمْ لَا
يَعْلَمُونَ ﴿١٣١﴾

**128**. మూసా తనజాతి వారితో అన్నాడు: "అల్లాహ్ సహాయం కోరండి మరియు సహనం వహించండి. నిశ్చయంగా ఈ భూమి అల్లాహ్‌దే! ఆయన తన దాసులలో, తాను కోరిన వారిని దానికి వారసులుగా చేస్తాడు. మరియు అంతిమ (సాఫల్యం) దైవభీతి గలవారిదే!"

**129**. (మూసా జాతివారు) అన్నారు: "నీవు రాక పూర్వమూ మరియు నీవు వచ్చిన తర్వాతనూ మేము బాధించ బడ్డాము!" (మూసా) జవాబిచ్చాడు: "మీ ప్రభువు త్వరలోనే మీ శత్రువులను నాశనం చేసి మిమ్మల్ని భూమిలో 'ఖలీఫాలుగా[1] చేసినప్పుడు మీరు ఎలా ప్రవర్తిస్తారో ఆయన చూస్తాడు?"

**130**. మరియు వాస్తవానికి, మేము ఫిర్'ఔన్ జాతివారిని - బహుశా వారికి తెలివి వస్తుందేమోనని - ఎన్నో సంవత్సరాల వరకు కరువుకు, ఫలాల నష్టానికి గురిచేశాము.

**131**. ఆ పిదప వారికి మంచికాలం వచ్చినపుడు వారు: "మేము దీనికే అర్హులం!" అని అనేవారు. కాని వారికి కష్టకాలం దాపురించినపుడు, వారు మూసా మరియు అతనితో పాటు ఉన్నవారిని తమకు అపశకునంగా పరిగణించేవారు.[2] వాస్తవానికి వారి అపశకునాలన్నీ అల్లాహ్ చేతులలోనే ఉన్నాయి, కాని వారిలో చాలా మందికి తెలియదు.

---

**1**. యస్త'ఖ్లిఫకుమ్: అంటే మిమ్మల్ని ఉత్తరాధికారులుగా, వారసులుగా లేక నాయకులుగా చేస్తాడు.

**2**. 'తాఇ'రున్: ఎగురుట. 'తాఇ'రుహుమ్: అపశకునం. ప్రాచీన కాలంలో శుభ-అశుభ శకునాలను పక్షులను ఎగురవేసి అంచనా వేసేవారు. శకునాలు చూడటం ఇస్లాంలో 'హరాం. శకునాలను గురించి ఇంకా చూడండి, 3:49, 5:110, 17:13, 27:47 మరియు 36:18-19.

وَقَالُوا۟ مَهْمَا تَأْتِنَا بِهِۦ مِنْ ءَايَةٍ
لِّتَسْحَرَنَا بِهَا فَمَا نَحْنُ لَكَ
بِمُؤْمِنِينَ ﴿١٣٢﴾

**132**. మరియు వారు (మూసాతో) అన్నారు: "నీవు మమ్మల్ని భ్రమింపజేయటానికి ఏ సూచనను తెచ్చినా మేము నిన్ను నమ్మేవారం కాము!"

فَأَرْسَلْنَا عَلَيْهِمُ ٱلطُّوفَانَ وَٱلْجَرَادَ
وَٱلْقُمَّلَ وَٱلضَّفَادِعَ وَٱلدَّمَ ءَايَٰتٍ
مُّفَصَّلَٰتٍ فَٱسْتَكْبَرُوا۟ وَكَانُوا۟ قَوْمًا
مُّجْرِمِينَ ﴿١٣٣﴾

**133**. కావున మేము వారిపై జల ప్రళయం ('తూఫాన్), మిడుతల దండు, పేనులు, కప్పలు మరియు రక్తం మొదలైన స్పష్టమైన సూచనలను పంపాము.[1] అయినా వారు దురహంకారం చూపారు ఎందుకంటే వారు మహా అపరాధులై ఉండిరి.

وَلَمَّا وَقَعَ عَلَيْهِمُ ٱلرِّجْزُ قَالُوا۟
يَٰمُوسَى ٱدْعُ لَنَا رَبَّكَ بِمَا عَهِدَ
عِندَكَ ۖ لَئِن كَشَفْتَ عَنَّا ٱلرِّجْزَ
لَنُؤْمِنَنَّ لَكَ وَلَنُرْسِلَنَّ مَعَكَ
بَنِىٓ إِسْرَٰٓءِيلَ ﴿١٣٤﴾

**134**. మరియు వారిపైకి ఆపద వచ్చినపుడు వారనేవారు: "ఓ మూసా! నీ ప్రభువు నీకిచ్చిన వాగ్దానం ఆధారంగా నీవు మా కొరకు ప్రార్థించు! ఒకవేళ నీవు మా నుండి ఈ ఆపదను తొలగిస్తే మేము నిన్ను విశ్వసిస్తాము మరియు ఇస్రాయీ'ల్ సంతతివారిని తప్పక నీవెంట పంపుతాము."

فَلَمَّا كَشَفْنَا عَنْهُمُ ٱلرِّجْزَ إِلَىٰٓ
أَجَلٍ هُم بَٰلِغُوهُ إِذَا هُمْ يَنكُثُونَ ﴿١٣٥﴾

**135**. కానీ, ఒక నిర్ణీతకాలం వరకు వారి నుండి ఆపదను తొలగించగానే - ఆ కాలానికి వారు చేరుకోవలసినవారే కాబట్టి - వారు తమ వాగ్దానాన్ని భంగపరిచే వారు!

فَٱنتَقَمْنَا مِنْهُمْ فَأَغْرَقْنَٰهُمْ فِى
ٱلْيَمِّ بِأَنَّهُمْ كَذَّبُوا۟ بِـَٔايَٰتِنَا
وَكَانُوا۟ عَنْهَا غَٰفِلِينَ ﴿١٣٦﴾

**136**. కావున మేము వారికి ప్రతీకారం చేశాము మరియు వారిని సముద్రంలో ముంచివేశాము, ఎందుకంటే! వాస్తవానికి వారు మా సూచనలను అసత్యాలని తిరస్కరించారు మరియు వాటిని లక్ష్యపెట్టకుండా ఉన్నారు.

---

**1**. ఈ తొమ్మిది అద్భుత సూచనలు: 1) కర్ర, 2) చేయి తెల్లగా మారుట, 3) కరువు (ఫల, పంటల నష్టం), 4) జల ప్రళయం ('తూఫాన్), 5) మిడుతల దండు, 6) పేనులు, 7) కప్పలు, 8) రక్తం, 9) సముద్రంలో త్రోవ.

**137**. మరియు వారి స్థానంలో బలహీనులుగా ఎంచబడే వారిని మేము శుభాలతో నింపిన, ఆ దేశపు తూర్పు భాగాలకు మరియు పశ్చిమ భాగాలకు వారసులుగా చేశాము.[1] ఈ విధంగా నీ ప్రభువు ఇస్రాయీ`ల్ సంతతి వారికి చేసిన ఉత్తమమైన వాగ్దానం, వారు ఓర్పు వహించినందుకు పూర్తిఅయింది.[2] మరియు ఫిర`ఔన్ మరియు అతని జాతివారు ఉత్పత్తిచేసిన వాటిని మరియు ఎత్తిన (నిర్మించిన) కట్టడాలను నాశనం చేశాము.[3]

وَأَوْرَثْنَا ٱلْقَوْمَ ٱلَّذِينَ كَانُوا۟ يُسْتَضْعَفُونَ مَشَـٰرِقَ ٱلْأَرْضِ وَمَغَـٰرِبَهَا ٱلَّتِى بَـٰرَكْنَا فِيهَا ۖ وَتَمَّتْ كَلِمَتُ رَبِّكَ ٱلْحُسْنَىٰ عَلَىٰ بَنِىٓ إِسْرَٰٓءِيلَ بِمَا صَبَرُوا۟ ۖ وَدَمَّرْنَا مَا كَانَ يَصْنَعُ فِرْعَوْنُ وَقَوْمُهُۥ وَمَا كَانُوا۟ يَعْرِشُونَ ﴿١٣٧﴾

**138**. మరియు మేము ఇస్రాయీ`ల్ సంతతివారిని సముద్రం దాటించిన తరువాత వారు (నడుస్తూ) తమ విగ్రహాలను ఆరాధించేటటువంటి ఒక జాతివారి వద్దకు చేరారు.[4] వారన్నారు: "ఓ మూసా! వీరి ఆరాధ్యదైవాలవలే మాకు కూడ ఒక ఆరాధ్య దైవాన్ని నియమించు." (దానికి మూసా) జవాబిచ్చాడు: "నిశ్చయంగా, మీరు జ్ఞానహీనులైన జాతికి చెందిన వారు."

وَجَـٰوَزْنَا بِبَنِىٓ إِسْرَٰٓءِيلَ ٱلْبَحْرَ فَأَتَوْا۟ عَلَىٰ قَوْمٍ يَعْكُفُونَ عَلَىٰٓ أَصْنَامٍ لَّهُمْ ۚ قَالُوا۟ يَـٰمُوسَى ٱجْعَل لَّنَآ إِلَـٰهًا كَمَا لَهُمْ ءَالِهَةٌ ۚ قَالَ إِنَّكُمْ قَوْمٌ تَجْهَلُونَ ﴿١٣٨﴾

**139**. "నిశ్చయంగా, వీరు ఆచరిస్తున్నందుకు (విగ్రహారాధన చేస్తున్నందుకు) నాశనం చేయబడతారు. వీరు చేస్తున్నదంతా నిరర్థకమైనదే."

إِنَّ هَـٰٓؤُلَآءِ مُتَبَّرٌ مَّا هُمْ فِيهِ وَبَـٰطِلٌ مَّا كَانُوا۟ يَعْمَلُونَ ﴿١٣٩﴾

---

**1**. చూడండి, 3:26.

**2**. ఈ వాగ్దానం కొరకు చూడండి, 7:128-129 మరియు 28:5-6.

**3**. ఇస్రాయీ`ల్ సంతతివారు, బహుశా సూయుజ్ అగాధం (Gulf of Suez)ను దాటి సినాయి వైపుకు వెళ్ళారు. మరియు ఫిర`ఔను మరియు అతని సైన్యం అందులో మునిగిపోయారు.

**4**. ఈ ప్రజలు ఎవరో ఖుర్ఆన్‌లో లేదు. వారు అమాలేకీయ (Amalekites) తెగకు చెందిన `అరబ్బులు కావచ్చు! వీరు దక్షిణ ఫలస్తీన్‌లో మరియు సినాయి ద్వీపకల్పం (Peninsula)లో నివసించేవారు.

**140.** (మూసా ఇంకా) ఇలా అన్నాడు: "ఏమీ? నేను అల్లాహ్‌ను వదలి మరొక ఆరాధ్యదైవాన్ని మీకొరకు అన్వేషించాలా? వాస్తవానికి ఆయనే (మీకాలపు) సర్వలోకాల వారిపై మీకు ఘనతను ప్రసాదించాడు కదా!"

**141.** మరియు మేము మిమ్మల్ని ఫిర్'ఔన్ జాతివారి నుండి విముక్తి కలిగించిన సందర్భాన్ని (జ్ఞాపకం చేసుకోండి). వారు మిమ్మల్ని ఘోరబాధకు గురిచేస్తూ ఉన్నారు. మీ కుమారులను చంపి, మీ స్త్రీలను సజీవులుగా వదులుతూ ఉన్నారు. మరియు ఇందు మీ ప్రభువు తరఫునుండి మీకొక గొప్ప పరీక్ష ఉండింది. (1/4)

**142.** * మరియు మేము మూసా కొరకు (సినాయి కొండపై) ముప్పై రాత్రుల (గడువు) నిర్ణయించాము. తరువాత పది (రాత్రులు) పొడిగించాము. ఈ విధంగా అతని ప్రభువు నిర్ణయించిన నలభైరాత్రుల గడువు పూర్తిఅయ్యింది. మూసా తన సోదరుడగు హారూన్‌తో అన్నాడు: "నీవు నా జాతి ప్రజలలో నాకు ప్రాతినిధ్యం వహించు మరియు సంస్కరణకు పాటుపడు మరియు అరాచకాలు చేసేవారి మార్గాన్ని అనుసరించకు."

**143.** మరియు మూసా మేము నిర్ణయించిన సమయానికి (మా నిర్ణీత చోటుకు) వచ్చినపుడు, అతని ప్రభువు అతనితో మాట్లాడాడు. (మూసా) అన్నాడు:

قَالَ أَغَيْرَ ٱللَّهِ أَبْغِيكُمْ إِلَٰهًا
وَهُوَ فَضَّلَكُمْ عَلَى
ٱلْعَٰلَمِينَ ١٤٠

وَإِذْ أَنجَيْنَٰكُم مِّنْ ءَالِ
فِرْعَوْنَ يَسُومُونَكُمْ سُوٓءَ
ٱلْعَذَابِ ۖ يُقَتِّلُونَ أَبْنَآءَكُمْ
وَيَسْتَحْيُونَ نِسَآءَكُمْ ۚ وَفِى
ذَٰلِكُم بَلَآءٌ مِّن رَّبِّكُمْ
عَظِيمٌ ١٤١

۞ وَوَٰعَدْنَا مُوسَىٰ ثَلَٰثِينَ
لَيْلَةً وَأَتْمَمْنَٰهَا بِعَشْرٍ فَتَمَّ
مِيقَٰتُ رَبِّهِۦٓ أَرْبَعِينَ لَيْلَةً ۚ
وَقَالَ مُوسَىٰ لِأَخِيهِ هَٰرُونَ
ٱخْلُفْنِى فِى قَوْمِى وَأَصْلِحْ وَلَا تَتَّبِعْ
سَبِيلَ ٱلْمُفْسِدِينَ ١٤٢

وَلَمَّا جَآءَ مُوسَىٰ لِمِيقَٰتِنَا وَكَلَّمَهُۥ
رَبُّهُۥ قَالَ رَبِّ أَرِنِىٓ أَنظُرْ إِلَيْكَ ۚ

"ఓ నా ప్రభూ! నాకు నీ దర్శన భాగ్యమివ్వు (కనిపించు). నేను నిన్ను చూడదలచాను!" (అల్లాహ్) అన్నాడు: "నీవు నన్ను (ఏ మాత్రం) చూడ లేవు! కాని ఈ పర్వతంవైపుకు చూడు! ఒకవేళ అది తన స్థానంలో స్థిరంగా ఉండగలిగితే, అప్పుడు నీవు నన్ను చూడగలవనుకో!"[1] అతని ప్రభువు ఆ కొండపై తన తేజస్సును ప్రసరింపజేయగా అది భస్మ మై పోయింది మరియు మూసా స్పృహతప్పి పడిపోయాడు. తెలివి వచ్చిన తరువాత (మూసా) అన్నాడు: "నీవు సర్వలోపాలకు అతీతుడవు, నేను పశ్చాత్తాపంతో నీ వైపుకు మరలుతున్నాను మరియు నేను విశ్వసించేవారిలో మొట్టమొదటి వాడను."[2]

قَالَ لَن تَرَىٰنِي وَلَٰكِنِ ٱنظُرۡ إِلَى
ٱلۡجَبَلِ فَإِنِ ٱسۡتَقَرَّ مَكَانَهُۥ
فَسَوۡفَ تَرَىٰنِيۚ فَلَمَّا تَجَلَّىٰ رَبُّهُۥ
لِلۡجَبَلِ جَعَلَهُۥ دَكّٗا وَخَرَّ
مُوسَىٰ صَعِقٗاۚ فَلَمَّآ أَفَاقَ قَالَ
سُبۡحَٰنَكَ تُبۡتُ إِلَيۡكَ وَأَنَا۠
أَوَّلُ ٱلۡمُؤۡمِنِينَ ١٤٣

**144**. (అల్లాహ్) అన్నాడు: "ఓ మూసా - ప్రవక్త పదవికి మరియు సంభాషించటానికి - నిశ్చయంగా, నేను ప్రజలందరిలో, నిన్ను ఎన్నుకున్నాను. కావున నేను నీకిచ్చిన దానిని తీసుకొని, కృతజ్ఞులలో చేరు."

قَالَ يَٰمُوسَىٰٓ إِنِّي ٱصۡطَفَيۡتُكَ عَلَى
ٱلنَّاسِ بِرِسَٰلَٰتِي وَبِكَلَٰمِي فَخُذۡ مَآ
ءَاتَيۡتُكَ وَكُن مِّنَ ٱلشَّٰكِرِينَ
١٤٤

**145**. మరియు మేము అతని కొరకు, ఫలకాల మీద ప్రతివిధమైన ఉపదేశాన్ని ప్రతి వ్యవహారానికి సంబంధించిన

وَكَتَبۡنَا لَهُۥ فِي ٱلۡأَلۡوَاحِ مِن
كُلِّ شَيۡءٖ مَّوۡعِظَةٗ وَتَفۡصِيلٗا

---

**1**. స'హీ'హ్ 'హదీస్'ల ద్వారా విశదమయ్యేది ఏమిటంటే, ఇహలోక జీవితంలో ఏ మానవుడు కూడా అల్లాహ్ (సు.తా.)ను చూడలేడు. అహ్లె-సున్నత్ వారి అఖీదహ్ ఏమిటంటే పునరుత్థాన దినమున అహ్లె- ఈమాన్ (విశ్వాసు)లకు అల్లాహుతా'ఆలా దర్శనభాగ్యం లభిస్తుంది మరియు స్వర్గంలో కూడా వారికి అల్లాహ్ (సు.తా.) దర్శనం లభిస్తుంది.

**2**. ఇది రెండవసారి మూసా ('అ.స.) అల్లాహ్ (సు.తా.)తో మాట్లాడింది. మొదటి సారి అతను 'తువా వాదిలో వెలుగు చూసి దానినుండి కొరివి తీసుకురావటానికి పోయినప్పుడు, అల్లాహుతా'ఆలా అతనిని ప్రవక్తగా ఎన్నుకొని ఫిర్'ఔను జాతివారి వద్దకు అద్భుత చిహ్నాలతో పంపాడు.

لِّكُلِّ شَيْءٍ فَخُذْهَا بِقُوَّةٍ وَأْمُرْ قَوْمَكَ يَأْخُذُواْ بِأَحْسَنِهَاۚ سَأُوْرِيكُمْ دَارَ ٱلْفَٰسِقِينَ ﴿١٤٥﴾

వివరాలను వ్రాసి ఇచ్చి, అతని (మూసా)తో అన్నాము: "వీటిని గట్టిగా పట్టుకో! మరియు వీటి ఉత్తమ ఉపదేశాలను అనుసరించమని నీ జాతివారిని ఆజ్ఞాపించు. త్వరలోనే నేను అవిధేయు (ఫాసిఖూన్)ల నివాసాన్ని మీకు చూపుతాను."[1]

سَأَصْرِفُ عَنْ ءَايَٰتِيَ ٱلَّذِينَ يَتَكَبَّرُونَ فِي ٱلْأَرْضِ بِغَيْرِ ٱلْحَقِّ وَإِن يَرَوْاْ كُلَّ ءَايَةٍ لَّا يُؤْمِنُواْ بِهَا وَإِن يَرَوْاْ سَبِيلَ ٱلرُّشْدِ لَا يَتَّخِذُوهُ سَبِيلًا وَإِن يَرَوْاْ سَبِيلَ ٱلْغَيِّ يَتَّخِذُوهُ سَبِيلًاۚ ذَٰلِكَ بِأَنَّهُمْ كَذَّبُواْ بِـَٔايَٰتِنَا وَكَانُواْ عَنْهَا غَٰفِلِينَ ﴿١٤٦﴾

**146.** ఏ హక్కూ లేకుండా భూమిపై దురహంకారంతో వ్యవహరించే వారిని నేను నా సూచన(ఆయత్)ల నుండి దూరం చేస్తాను. మరియు వారు ఏ సూచన (ఆయత్)ను చూసినా దానిని విశ్వసించరు.[2] ఒకవేళ సన్మార్గమైన మార్గం వారి ముందుకు వచ్చినా, వారు దానిని అవలంబించరు. కాని వారు తప్పుదారిని చూస్తే దానిని అవలంబిస్తారు.[3] ఎందుకంటే వాస్తవానికి, వారు మా సూచన (ఆయత్)లను అబద్ధాలని తిరస్కరించారు మరియు వాటి నుండి నిర్లక్ష్యులై ఉండిరి.[4]

وَٱلَّذِينَ كَذَّبُواْ بِـَٔايَٰتِنَا وَلِقَآءِ ٱلْأٓخِرَةِ حَبِطَتْ أَعْمَٰلُهُمْۚ هَلْ يُجْزَوْنَ إِلَّا مَا كَانُواْ يَعْمَلُونَ ﴿١٤٧﴾

**147.** మరియు మా సూచన (ఆయత్)లను మరియు పరలోక దర్శనాన్ని (పునరుత్థాన దినాన్ని) అబద్ధాలని తిరస్కరించిన వారు చేసిన కర్మలన్నీ వ్యర్థమవుతాయి. ఏమీ? వారు కేవలం తమ కర్మలకు తగిన ప్రతిఫలం తప్ప మరేమైనా పొందగలరా?

---

**1.** ఇది అమాలేకీయుల షామ్ రాజ్యం కావచ్చు. వారు అల్లాహ్ (సు.తా.)కు అవిధేయులై ఉండిరి, (ఇబ్నె-కసీ'ర్).

**2.** చూడండి, 10:96-97.

**3.** ఈ విషయం ఈ కాలంలో గూడ జరుగుతోంది. ఈ కాలపు చాలామంది ముస్లింలు కూడా మంచి నుండి దూరమైపోతున్నారు మరియు చెడును అవలంబిస్తున్నారు.

**4.** చూడండి, 96:67.

وَٱتَّخَذَ قَوۡمُ مُوسَىٰ مِنۢ بَعۡدِهِۦ مِنۡ حُلِيِّهِمۡ عِجۡلٗا جَسَدٗا لَّهُۥ خُوَارٌۚ أَلَمۡ يَرَوۡاْ أَنَّهُۥ لَا يُكَلِّمُهُمۡ وَلَا يَهۡدِيهِمۡ سَبِيلًاۘ ٱتَّخَذُوهُ وَكَانُواْ ظَٰلِمِينَ ١٤٨

**148**. మరియు మూసా జాతివారు, అతను పోయిన పిదప తమ ఆభరణాలతో ఒక ఆవుదూడ విగ్రహాన్ని తయారు చేశారు. దానిలోనుండి (ఆవు అరుపువంటి) ధ్వనివచ్చేది. ఏమీ? అది వారితో మాట్లాడజాలదని మరియు వారికి ఏ విధమైన మార్గదర్శకత్వం చేయజాలదని వారికి తెలియదా? అయినా వారు దానిని (దైవంగా) చేసుకొని పరమ దుర్మార్గు లయ్యారు.[1]

وَلَمَّا سُقِطَ فِيٓ أَيۡدِيهِمۡ وَرَأَوۡاْ أَنَّهُمۡ قَدۡ ضَلُّواْ قَالُواْ لَئِن لَّمۡ يَرۡحَمۡنَا رَبُّنَا وَيَغۡفِرۡ لَنَا لَنَكُونَنَّ مِنَ ٱلۡخَٰسِرِينَ ١٤٩

**149**. మరియు వారు మార్గం తప్పామని తెలుసుకున్నప్పుడు పశ్చాత్తాపంతో మొత్తుకుంటూ అనే వారు: "మా ప్రభువు మమ్మల్ని కరుణించి, మమ్మల్ని క్షమించకపోతే మేము తప్పక నాశనం అయ్యేవారమే!"

وَلَمَّا رَجَعَ مُوسَىٰٓ إِلَىٰ قَوۡمِهِۦ غَضۡبَٰنَ أَسِفٗا قَالَ بِئۡسَمَا خَلَفۡتُمُونِي مِنۢ بَعۡدِيٓۖ أَعَجِلۡتُمۡ أَمۡرَ رَبِّكُمۡۖ وَأَلۡقَى ٱلۡأَلۡوَاحَ وَأَخَذَ بِرَأۡسِ

**150**. మరియు మూసా తన జాతివారి వద్దకు తిరిగివచ్చి క్రోధంతో విచారంతో అన్నాడు: "నేను వెళ్ళిన పిదప మీరు ఆచరించింది ఎంతచెడ్డది! ఏమీ? మీ ప్రభువు ఆజ్ఞ (రాకముందే) తొందరపడి (ఆయన ఆరాధనను వదిలారా)?"

---

**1**. మూసా ('అ.స.) 'తూర్ పర్వతంపైకి నలభై రాత్రుల కొరకు వెళ్ళినప్పుడు సామిరి ప్రజల ఆభరణాలతో ఒక ఆవుదూడ విగ్రహాన్ని తయారుచేస్తాడు. అందులోనుండి గాలి దూరినప్పుడు ఆవు అరుపువంటి అరుపు వచ్చేది. దానిని అతడు ఇదే మీ ఆరాధ్య దైవం అని అంటాడు. ప్రజలు మూఢత్వంలో అతనిని అనుసరించి దానిని పూజించ సాగుతారు. ఏ విధంగానైతే ఈ నాడు కూడా, ఈ విధమైన మూఢనమ్మకాలు గలవారి కొరత లేదో! అది వారికి లాభం గానీ, నష్టం గానీ చేయలేదని తెలిసి కూడా, ప్రజలు ఇటువంటి వాటిని ఆరాధించడం, ప్రాచీనకాలం నుండి వస్తున్న తప్పుడు ఆచారమే!

أَخِيهِ يَجُرُّهُۥٓ إِلَيۡهِۚ قَالَ ٱبۡنَ أُمَّ إِنَّ ٱلۡقَوۡمَ ٱسۡتَضۡعَفُونِي وَكَادُواْ يَقۡتُلُونَنِي فَلَا تُشۡمِتۡ بِيَ ٱلۡأَعۡدَآءَ وَلَا تَجۡعَلۡنِي مَعَ ٱلۡقَوۡمِ ٱلظَّٰلِمِينَ ١٥٠

తరువాత ఫలకాలను పడవేసి,[1] తన సోదరుని తల వెంట్రుకలను పట్టుకొని తన వైపునకు లాగాడు. (హారూన్) అన్నాడు: "నా సోదరుడా (తల్లి కుమారుడా)! వాస్తవానికి ఈ ప్రజలు బలహీనునిగా చూసి నన్ను చంపేవారే,[2] కావున నీవు (మన) శత్రువులకు, నన్ను చూసి సంతోషించే అవకాశం ఇవ్వకు మరియు నన్ను దుర్మార్గులలో లెక్కించకు!"

قَالَ رَبِّ ٱغۡفِرۡ لِي وَلِأَخِي وَأَدۡخِلۡنَا فِي رَحۡمَتِكَۖ وَأَنتَ أَرۡحَمُ ٱلرَّٰحِمِينَ ١٥١

**151**. (మూసా) అన్నాడు: "ఓ నా ప్రభూ! నన్నూ మరియు నా సోదరుణ్ణి క్షమించు. మరియు మా ఇద్దరినీ నీ కారుణ్యంలోకి చేర్చుకో. మరియు నీవే కరుణించేవారిలో అందరికంటే అధికంగా కరుణించేవాడవు!"

إِنَّ ٱلَّذِينَ ٱتَّخَذُواْ ٱلۡعِجۡلَ سَيَنَالُهُمۡ غَضَبٞ مِّن رَّبِّهِمۡ وَذِلَّةٞ فِي ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَاۚ وَكَذَٰلِكَ نَجۡزِي ٱلۡمُفۡتَرِينَ ١٥٢

**152**. ఆవుదూడను (దైవంగా) చేసుకున్న వారు తప్పకుండా తమ ప్రభువు ఆగ్రహానికి గురిఅవుతారు మరియు వారు ఇహలోక జీవితంలో అవమానం పాలు అవుతారు. మరియు అసత్యాలు కల్పించే వారిని మేము ఇదే విధంగా శిక్షిస్తాము.

وَٱلَّذِينَ عَمِلُواْ ٱلسَّيِّـَٔاتِ ثُمَّ تَابُواْ مِنۢ بَعۡدِهَا وَءَامَنُوٓاْ إِنَّ رَبَّكَ مِنۢ بَعۡدِهَا لَغَفُورٞ رَّحِيمٞ ١٥٣

**153**. మరియు ఎవరు దుష్కార్యాలు చేసినపిదప, పశ్చాత్తాపపడతారో మరియు విశ్వసిస్తారో! అలాంటి వారు నిశ్చయంగా, ఆ తరువాత నీ ప్రభువును క్షమించే వాడుగా, కరుణించేవాడుగా పొందుతారు.

---

**1**. మూసా ('అ.స.), తన జాతివారు అల్లాహ్ (సు.తా.)ను వదలి ఆవుదూడ విగ్రహాన్ని ఆరాధించటాన్ని చూసి, క్రోధావేశంలో ఏమీ తోచక - తన సోదరుణ్ణి పట్టుకొని శిక్షించటానికి, తన చేతులలో ఉన్న ఫలకాలను క్రింద పెట్టి - తన సోదరుని తలవెంట్రుకలను పట్టుకున్నారే గానీ, ఫలకాలకు అనాదరణ చేయటం అతని ఉద్దేశం కాదు. కోపం చల్లారిన తరువాత అతను వాటిని ఎత్తుకున్నారు. చూడండి ఆయత్, 154.
**2**. చూడండి, 20:92-94.

وَلَمَّا سَكَتَ عَن مُّوسَى ٱلۡغَضَبُ أَخَذَ ٱلۡأَلۡوَاحَۖ وَفِي نُسۡخَتِهَا هُدٗى وَرَحۡمَةٞ لِّلَّذِينَ هُمۡ لِرَبِّهِمۡ يَرۡهَبُونَ ﴿١٥٤﴾

**154**. మరియు మూసా కోపం చల్లారిన తరువాత ఆ ఫలకాలను ఎత్తుకున్నాడు.[1] మరియు తమ ప్రభువుకు భయపడేవారికి, వాటి వ్రాతలలో మార్గదర్శకత్వం మరియు కారుణ్యం ఉన్నాయి.

وَٱخۡتَارَ مُوسَىٰ قَوۡمَهُۥ سَبۡعِينَ رَجُلٗا لِّمِيقَٰتِنَاۖ فَلَمَّآ أَخَذَتۡهُمُ ٱلرَّجۡفَةُ قَالَ رَبِّ لَوۡ شِئۡتَ أَهۡلَكۡتَهُم مِّن قَبۡلُ وَإِيَّٰيَۖ أَتُهۡلِكُنَا بِمَا فَعَلَ ٱلسُّفَهَآءُ مِنَّآۖ إِنۡ هِيَ إِلَّا فِتۡنَتُكَ تُضِلُّ بِهَا مَن تَشَآءُ وَتَهۡدِي مَن تَشَآءُۖ أَنتَ وَلِيُّنَا فَٱغۡفِرۡ لَنَا وَٱرۡحَمۡنَاۖ وَأَنتَ خَيۡرُ ٱلۡغَٰفِرِينَ ﴿١٥٥﴾

**155**. మరియు మేము నిర్ణయించిన గడువు కొరకు, మూసా తనజాతి వారిలో నుండి డెబ్బై మందిని ఎన్నుకున్నాడు. ఆ పిదప వారిని భూకంపం ఆవరించగా[2] (మూసా) ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నీవు కోరితే, వీరిని మరియు నన్ను కూడా ఇంతకు పూర్వమే సంహరించి ఉండేవాడవు. ఏమీ? మాలో కొందరు మూఢులు చేసిన పనికి నీవు మమ్మల్ని నశింపజేస్తావా? ఇదంతా నీ పరీక్షయే! దీని ద్వారా నీవు కోరిన వారిని మార్గభ్రష్టత్వానికి గురిచేస్తావు మరియు నీవు కోరిన వారికి మార్గదర్శకత్వం చేస్తావు. మా సంరక్షకుడవు నీవే, కావున మమ్మల్ని క్షమించు, మమ్మల్ని కరుణించు. మరియు క్షమించే వారందరిలో నీవే అత్యుత్తముడవు! (3/8)

۞ وَٱكۡتُبۡ لَنَا فِي هَٰذِهِ ٱلدُّنۡيَا حَسَنَةٗ وَفِي ٱلۡأٓخِرَةِ إِنَّا هُدۡنَآ إِلَيۡكَۚ قَالَ عَذَابِيٓ أُصِيبُ بِهِۦ مَنۡ أَشَآءُۖ

**156**. * "మాకు ఇహలోకంలో మరియు పరలోకంలో కూడా మంచి స్థితినే వ్రాయి. నిశ్చయంగా, మేము నీ వైపునకే మరలాము." (అల్లాహ్) సమధానం

---

**1**. మూసా (అ.స.) ఫలకాలను క్రింద పెట్టారు. అవి ముక్కలు కాలేదు. కావున కోపం చల్లారిన తరువాత మూసా (అ.స.) ఆ ఫలకాలను తిరిగి తీసుకున్నారు.

**2**. చూడండి, 2:55 అక్కడ పిడుగు(`సా`యిఖతున్)పడి ఆ 70 మంది చనిపోయినట్లు ఉంది. బహుశా ఈ రెండు శిక్షలు వచ్చి ఉండవచ్చు. మూసా (అ.స.) ప్రార్థనవల్ల ఆ 70 మంది మళ్ళీ సజీవులయ్యారు.

وَرَحۡمَتِي وَسِعَتۡ كُلَّ شَيۡءٖۚ فَسَأَكۡتُبُهَا لِلَّذِينَ يَتَّقُونَ وَيُؤۡتُونَ ٱلزَّكَوٰةَ وَٱلَّذِينَ هُم بِـَٔايَٰتِنَا يُؤۡمِنُونَ ١٥٦

ఇచ్చాడు: "నేను కోరిన వారికి నా శిక్షను విధిస్తాను. నా కారుణ్యం ప్రతి దానిని ఆవరించిఉన్నది.[1] కనుక నేను దానిని దైవభీతి గలవారికీ, విధిదానం ('జకాత్) ఇచ్చే వారికీ మరియు నా సూచనలను విశ్వసించే వారికీ వ్రాస్తాను!

ٱلَّذِينَ يَتَّبِعُونَ ٱلرَّسُولَ ٱلنَّبِيَّ ٱلۡأُمِّيَّ ٱلَّذِي يَجِدُونَهُۥ مَكۡتُوبًا عِندَهُمۡ فِي ٱلتَّوۡرَىٰةِ وَٱلۡإِنجِيلِ يَأۡمُرُهُم بِٱلۡمَعۡرُوفِ وَيَنۡهَىٰهُمۡ عَنِ ٱلۡمُنكَرِ وَيُحِلُّ لَهُمُ ٱلطَّيِّبَٰتِ وَيُحَرِّمُ عَلَيۡهِمُ

**157.** "ఎవరైతే ఈ సందేశహరుణ్ణి నిరక్ష్యరాస్యుడైన[2] ఈ ప్రవక్తను అనుసరిస్తారో! ఎవరి ప్రస్తావన వారి వద్దవున్న తౌరాత్ మరియు ఇంజీల్ గ్రంథాలలో వ్రాయబడి ఉన్నదో,[3] అతను వారికి ధర్మమును ఆదేశిస్తాడు మరియు అధర్మము నుండి నిషేధిస్తాడు మరియు వారికొరకు పరిశుద్ధమైన వస్తువులను ధర్మ సమ్మతం చేసి అపరిశుద్ధమైన వాటిని నిషేధిస్తాడు. వారిపై మోపబడిన భారాలను

---

**1**. చూడండి, 6:12 మరియు 54.

**2**. అల్లాహ్ (సు.తా.) ఇక్కడ ము'హమ్మద్ ('స'అస)ను నిరక్షరాస్యుడైన ప్రవక్త అని విశదం చేస్తున్నాడు. అంటే అతను ఏమీ చదువనూ లేరు మరియు వ్రాయనూ లేరు. కాబట్టి అతను చెప్పే మాటలు ప్రాచీన గ్రంథాలలో నుండి చదివినవి కావు, అవి దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా అతనిపై అవతరింజేయబడినవి. కావున అతను వాటిని ప్రాచీన గ్రంథాలలో వ్రాయబడిన విధంగా గాకుండా నిజమైన వృత్తాంతాలను బోధించారు. ఎందుకంటే కొన్ని విషయాలు, ఈ నాటి తౌరాత్ మరియు ఇంజీల్‌లలో మార్చబడ్డాయి. వాటి నిజ వృత్తాంతం కేవలం అల్లాహుతా'ఆలాకే తెలుసు కాబట్టి 1400 సంవత్సరాలలో ఒక్క అక్షరపు మార్పు కూడా చెందని ఈ ఖుర్ఆన్‌లో, వచ్చిన అల్లాహుతా'ఆలా వ'హీయే పరమసత్యం. అల్లాహ్ (సు.తా.) స్వయంగా తీర్పుదినం వరకు ఈ ఖుర్ఆన్‌ను, అది ఉన్నది ఉన్నట్లుగా భద్రంగా ఉంచుతానని తన గ్రంథంలో విశదంచేశాడు. చూడండి, ఖుర్ఆన్, 2:42, 4:47, 57:28, 61:6.

**3**. ము'హమ్మద్ ('స'అస) అరబ్బులలో నుండి దైవప్రవక్తగా రాబోతున్నాడనే ప్రస్తావన కొరకు చూడండి, బైబిల్, ద్వితీయోపదేశ కాండము-(Deuteronomy), 18:15,18; కీర్తనలు-(Psalms), 118:22-23; యెషయా-(Isaiah), 42:1-13; హబక్కూకు-(Habakkuk), 3:3-4; మత్తయి-(Mathew), 21:42-43; యోహాను-(John), 14:16-17, 26-28, 16:7-14.

مرِيَّهُمْ  ٱلْخَبَٰٓئِثَ وَيَضَعُ عَنْهُمْ إِصْرَهُمْ
وَٱلْأَغْلَٰلَ ٱلَّتِى كَانَتْ عَلَيْهِمْ ۚ فَٱلَّذِينَ
ءَامَنُوا۟ بِهِۦ وَعَزَّرُوهُ وَنَصَرُوهُ وَٱتَّبَعُوا۟
ٱلنُّورَ ٱلَّذِىٓ أُنزِلَ مَعَهُۥٓ ۙ أُو۟لَٰٓئِكَ هُمُ
ٱلْمُفْلِحُونَ ﴿١٥٧﴾

మరియు వారి నిర్బంధాలను తొలగిస్తాడు. కావున అతనిని సమర్థించి, అతనితో సహకరించి, అతనిపై అవతరింప జేయబడిన జ్యోతిని అనుసరించేవారు మాత్రమే సాఫల్యం పొందేవారు.''

قُلْ يَٰٓأَيُّهَا ٱلنَّاسُ إِنِّى رَسُولُ ٱللَّهِ
إِلَيْكُمْ جَمِيعًا ٱلَّذِى لَهُۥ مُلْكُ
ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۖ لَآ إِلَٰهَ إِلَّا هُوَ
يُحْىِۦ وَيُمِيتُ ۖ فَـَٔامِنُوا۟ بِٱللَّهِ وَرَسُولِهِ
ٱلنَّبِىِّ ٱلْأُمِّىِّ ٱلَّذِى يُؤْمِنُ بِٱللَّهِ
وَكَلِمَٰتِهِۦ وَٱتَّبِعُوهُ لَعَلَّكُمْ
تَهْتَدُونَ ﴿١٥٨﴾

**158**. (ఓ ము'హమ్మద్!) వారితో ఇలా అను: ''మానవులారా! నిశ్చయంగా, నేను మీ అందరి వైపునకు (పంపబడిన) అల్లాహ్ యొక్క సందేశహరుడను.[1] భూమ్యాకాశాల సామ్రాజ్యాధిపత్యం ఆయనదే. ఆయన తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు; ఆయనే జీవన్మరణాలను ఇచ్చేవాడు. కావున అల్లాహ్‌ను మరియు ఆయన సందేశహరుడు నిరక్షరాస్యుడైన ఈ ప్రవక్తను విశ్వసించండి. అతను అల్లాహ్‌ను మరియు ఆయన సందేశాలను విశ్వసిస్తాడు. అతనినే అనుసరించండి, అప్పుడే మీరు మార్గదర్శకత్వం పొందుతారు!''[2]

---

**1**. పూర్వ ప్రవక్తలు ('అలైహిమ్ స.) తమ తమ జాతులవారి వద్దకే పంపబడివుండిరి. మూసా ('అ.స.) ఇస్రాయీ'ల్ సంతతివారి కొరకు వచ్చారని తౌరాత్ అంటుంది. 'ఈసా ('అ.స.): ''నేను దారి తప్పిన ఇస్రాయీ'ల్ సంతతి వారి కొరకు పంపబడ్డాను.'' అని అన్నారు. చూడండి, 5:46 వ్యాఖ్యానం 1. కాని ఇక్కడ అల్లాహ్ (సు.తా.) అంటున్నాడు: ''(ఓ ముహమ్మద్!) వారితో అను: 'మానవులారా! నిశ్చయంగా నేను మీ అందరివైపుకు పంపబడిన సందేశహరుడను, (ర'హ్మతల్ లిల్ 'ఆలమీన్, 21:107),' మరియు: 'ప్రవక్తలందరి ముద్రను ('ఖాతమన్నబియ్యీన్, 33:40).' ''

**2**. ఇక్కడ మరొకసారి నిరక్షరాస్యుడుగా, దైవప్రవక్తగా, ము'హమ్మద్ ('స'అస) పేర్కొనబడ్డారు. అంటే అతనికి ఏ మానవగురువు లేడు. అతను నేర్చుకున్నది, దైవదూత జిబ్రీల్ ('అ.స.) తెచ్చిన, అల్లాహ్ (సు.తా.) దివ్యజ్ఞానం (వ'హీ), ద్వారా మాత్రమే. చూశారా! అది ఎంత మహత్త్యమైనదో! ఈ నాటికి కూడా దానివంటి ఒక్క సూరహ్ కూడా ఎవ్వరూ రచించి తేలేకపోయారు. ఎందుకంటే ఇది (దివ్యఖుర్ఆన్) మానవరచన కాదు, అల్లాహుతా'ఆలా తరఫునుండి అవతరింపజేయబడిన దివ్యజ్ఞానం. ఇది అల్లాహ్ (సు.తా.) ద్వారానే పునరుత్థానదినం వరకు భద్రంగా ఉంచబడుతుందని అల్లాహుతా'ఆలా వ్యక్తం కూడా చేశాడు. చూడండి, 15:9.

**159**. మరియు మూసా జాతివారిలో సత్యం ప్రకారమే మార్గదర్శకత్వం చూపుతూ మరియు దాని (సత్యం) ప్రకారమే న్యాయం చేసే ఒక వర్గంవారు ఉన్నారు.[1]

**160**. మరియు మేము వారిని పన్నెండు తెగలు (వర్గాలు)గా విభజించాము.[2] మరియు మూసా జాతివారు అతనిని నీటి కొరకు అడిగినపుడు. మేము అతనిని: "నీ చేతి కర్రతో రాయిపైకొట్టు!" అని ఆజ్ఞాపించాము. అపుడు దానినుండి పన్నెండు ఊటలు ప్రవహించసాగాయి. అపుడు ప్రతి తెగవారు, తాము నీళ్ళు తీసుకునే స్థలాన్ని తెలుసుకున్నారు. మరియు మేము వారిపై మేఘాల ఛాయను కల్పించాము. మరియు వారి కొరకు మన్న మరియు సల్వాలను దింపాము:[3] "మేము మీకు ప్రసాదించిన పరిశుద్ధమైన పదార్థాలను తినండి." అని అన్నాము. మరియు వారు మాకు అన్యాయం చేయలేదు, కాని తమకు తామే అన్యాయం చేసుకున్నారు.

**161**. మరియు వారికి ఇలా ఆజ్ఞ ఇవ్వబడిన సందర్భాన్ని (జ్ఞాపకం చేసుకోండి!): "ఈ నగరంలో నివసించి, అందులో మీ ఇష్టప్రకారం తినండి మరియు: 'మా పాపాలను క్షమించు' ('హి'త్తతున్), అని అంటూ ఉండండి. మరియు సాష్టాంగపడుతూ దాని ద్వారంలో ప్రవేశించండి, మేము మీ పాపాలను క్షమిస్తాము. మేము సజ్జనులను అధికంగా (అనుగ్రహిస్తాము)."

وَمِن قَوۡمِ مُوسَىٰٓ أُمَّةٞ يَهۡدُونَ بِٱلۡحَقِّ وَبِهِۦ يَعۡدِلُونَ ١٥٩

وَقَطَّعۡنَٰهُمُ ٱثۡنَتَيۡ عَشۡرَةَ أَسۡبَاطًا أُمَمٗاۚ وَأَوۡحَيۡنَآ إِلَىٰ مُوسَىٰٓ إِذِ ٱسۡتَسۡقَىٰهُ قَوۡمُهُۥٓ أَنِ ٱضۡرِب بِّعَصَاكَ ٱلۡحَجَرَۖ فَٱنۢبَجَسَتۡ مِنۡهُ ٱثۡنَتَا عَشۡرَةَ عَيۡنٗاۖ قَدۡ عَلِمَ كُلُّ أُنَاسٖ مَّشۡرَبَهُمۡۚ وَظَلَّلۡنَا عَلَيۡهِمُ ٱلۡغَمَٰمَ وَأَنزَلۡنَا عَلَيۡهِمُ ٱلۡمَنَّ وَٱلسَّلۡوَىٰۖ كُلُواْ مِن طَيِّبَٰتِ مَا رَزَقۡنَٰكُمۡۚ وَمَا ظَلَمُونَا وَلَٰكِن كَانُوٓاْ أَنفُسَهُمۡ يَظۡلِمُونَ ١٦٠

وَإِذۡ قِيلَ لَهُمُ ٱسۡكُنُواْ هَٰذِهِ ٱلۡقَرۡيَةَ وَكُلُواْ مِنۡهَا حَيۡثُ شِئۡتُمۡ وَقُولُواْ حِطَّةٞ وَٱدۡخُلُواْ ٱلۡبَابَ سُجَّدٗا نَّغۡفِرۡ لَكُمۡ خَطِيٓـَٰٔتِكُمۡۚ سَنَزِيدُ ٱلۡمُحۡسِنِينَ ١٦١

---

**1**. చూడండి, 3:113-115. ఉదాహరణకు 'అబ్దుల్లాహ్ బిన్-సల్లామ్.
**2**. చూడండి, 5:12.
**3**. చూడండి, 2:57.

**162**. కాని వారిలో దుర్మార్గులైన వారు తమకు చెప్పబడిన మాటను మార్చి మరొక మాటను ఉచ్చరించారు; కావున వారు చేస్తున్న దుర్మార్గానికి ఫలితంగా మేము వారిపై ఆకాశం నుండి ఆపదను పంపాము.[1]

فَبَدَّلَ ٱلَّذِينَ ظَلَمُواْ مِنۡهُمۡ قَوۡلًا غَيۡرَ ٱلَّذِي قِيلَ لَهُمۡ فَأَرۡسَلۡنَا عَلَيۡهِمۡ رِجۡزٗا مِّنَ ٱلسَّمَآءِ بِمَا كَانُواْ يَظۡلِمُونَ ١٦٢

**163**. మరియు సముద్రతీరము నందున్న ఆ నగర (వాసులను) గురించి వారిని అడుగు; వారు శనివారపు (సబ్త్) ధర్మాన్ని ఉల్లంఘించేవారు! ఆ శనివారం (సబ్త్) రోజుననే చేపలు వారి ముందుకు ఎగిరెగిరి నీటిపైకి వచ్చేవి. మరియు శనివారపు (సబ్త్) ధర్మం పాటించని రోజు (చేపలు) వచ్చేవి కావు. వారి అవిధేయతకు కారణంగా మేము వారిని ఈ విధంగా పరీక్షకు గురిచేశాము.[2]

وَسۡـَٔلۡهُمۡ عَنِ ٱلۡقَرۡيَةِ ٱلَّتِي كَانَتۡ حَاضِرَةَ ٱلۡبَحۡرِ إِذۡ يَعۡدُونَ فِي ٱلسَّبۡتِ إِذۡ تَأۡتِيهِمۡ حِيتَانُهُمۡ يَوۡمَ سَبۡتِهِمۡ شُرَّعٗا وَيَوۡمَ لَا يَسۡبِتُونَ لَا تَأۡتِيهِمۡۚ كَذَٰلِكَ نَبۡلُوهُم بِمَا كَانُواْ يَفۡسُقُونَ ١٦٣

**164**. వారిలోని ఒకవర్గం వారు: "అల్లాహ్ ఎవరిని నశింపజేయనున్నాడో లేదా ఎవరికి కఠినశిక్ష విధించనున్నాడో! అలాంటి వారికి, మీరెందుకు ఉపదేశం చేస్తున్నారు?" అని అంటే అతను (ఉపదేశం చేసే వ్యక్తి) అన్నాడు: "మీ ప్రభువు ముందు, (హితబోధ ఎందుకు చేయలేదని), నాపై నింద ఉండకుండా మరియు వారు దైవభీతి గలవారు అవుతారేమోనని!"

وَإِذۡ قَالَتۡ أُمَّةٞ مِّنۡهُمۡ لِمَ تَعِظُونَ قَوۡمًا ٱللَّهُ مُهۡلِكُهُمۡ أَوۡ مُعَذِّبُهُمۡ عَذَابٗا شَدِيدٗاۖ قَالُواْ مَعۡذِرَةً إِلَىٰ رَبِّكُمۡ وَلَعَلَّهُمۡ يَتَّقُونَ ١٦٤

---

**1**. ఆయత్‌లు 160-162లలో వివరించబడిన విషయాలు సూరహ్ అల్-బఖరహ్ మొదటి భాగంలో కూడా ఉన్నాయి. (2:58-59).

**2**. చూడండి, బైబిల్ యిర్మియా-(Jeremia),17:21-27

**165**. తరువాత వారికి చేయబడిన హితబోధను వారు మరచినప్పుడు! దుష్కార్యాలనుంచి వారిస్తూ ఉన్న వారిని మేము రక్షించాము. మరియు దుర్మార్గులైన ఇతరులను, అవిధేయత చూపినందుకు కఠిన శిక్షకు గురిచేశాము.

**166**. కాని నిషేధించబడిన వాటినే వారు హద్దులు మీరి చేసినప్పుడు మేము వారితో: "మీరు నీచమైన కోతులుగా మారండి." అని అన్నాము.[1]

**167**. మరియు నీ ప్రభువు వారి (యూదుల)పై అంతిమ దినం వరకు దుఃఖకరమైన శిక్ష విధించే వారిని పంపుతూ ఉంటానని ప్రకటించిన విషయాన్ని (జ్ఞప్తికి తెచ్చుకోండి).[2] నిశ్చయంగా, నీ ప్రభువు శిక్ష విధించటంలో శీఘ్రుడు. మరియు నిశ్చయంగా ఆయన క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

**168**. మరియు మేము వారిని భువిలో వేర్వేరు తెగలుగా జేసి వ్యాపింపజేశాము. వారిలో కొందరు సన్మార్గులున్నారు, మరికొందరు దానికి దూరమైన వారున్నారు. బహుశా వారు (సన్మార్గానికి) మరలి వస్తారేమోనని, మేము వారిని మంచి చెడు స్థితులద్వారా పరీక్షించాము.

فَلَمَّا نَسُوا۟ مَا ذُكِّرُوا۟ بِهِۦٓ أَنجَيْنَا
ٱلَّذِينَ يَنْهَوْنَ عَنِ ٱلسُّوٓءِ وَأَخَذْنَا
ٱلَّذِينَ ظَلَمُوا۟ بِعَذَابٍۭ بَـِٔيسٍۭ بِمَا
كَانُوا۟ يَفْسُقُونَ ١٦٥

فَلَمَّا عَتَوْا۟ عَن مَّا نُهُوا۟ عَنْهُ قُلْنَا لَهُمْ
كُونُوا۟ قِرَدَةً خَـٰسِـِٔينَ ١٦٦

وَإِذْ تَأَذَّنَ رَبُّكَ لَيَبْعَثَنَّ عَلَيْهِمْ
إِلَىٰ يَوْمِ ٱلْقِيَـٰمَةِ مَن يَسُومُهُمْ
سُوٓءَ ٱلْعَذَابِ ۗ إِنَّ رَبَّكَ لَسَرِيعُ
ٱلْعِقَابِ ۖ وَإِنَّهُۥ لَغَفُورٌ رَّحِيمٌ ١٦٧

وَقَطَّعْنَـٰهُمْ فِى ٱلْأَرْضِ أُمَمًا ۖ
مِّنْهُمُ ٱلصَّـٰلِحُونَ وَمِنْهُمْ
دُونَ ذَٰلِكَ ۖ وَبَلَوْنَـٰهُم
بِٱلْحَسَنَـٰتِ وَٱلسَّيِّـَٔاتِ لَعَلَّهُمْ
يَرْجِعُونَ ١٦٨

---

**1**. చూడండి స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-8, 'హదీస్' నం. 481. ఇంకా చూడండి, 2:65, 5:60.

**2**. చూడండి, 3:112.

**169**. ఆ పిదప వారి తరువాత దుష్టులైన వారు, వారి స్థానంలో గ్రంథానికి వారసులై, తుచ్ఛమైన ప్రాపంచిక వస్తువుల లోభంలో పడుతూ: "మేము క్షమింపబడతాము." అని పలుకుతున్నారు. అయినా ఇటువంటి సొత్తు తిరిగి వారికి లభిస్తే దానిని తీసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు. "అల్లాహ్ విషయంలో సత్యం తప్ప మరేమీ పలుకరాదు." అని గ్రంథంలో వారితో వాగ్దానం తీసుకోబడలేదా ఏమిటి? అందులో (గ్రంథంలో) ఉన్నదంతా వారు చదివారు కదా! మరియు దైవభీతి గలవారి కొరకు పరలోక నివాసమే ఉత్తమమైనది. ఏమీ? మీరిది గ్రహించలేరా?

**170**. మరియు ఎవరైతే గ్రంథాన్ని స్థిరంగా అనుసరిస్తారో మరియు నమా'జ్‌ను స్థాపిస్తారో, అలాంటి సద్వర్తనుల ప్రతిఫలాన్ని నిశ్చయంగా, మేము వ్యర్థం చేయము. (1/2)

**171**. * మరియు (జ్ఞాపకం చేసుకోండి!) మేము ('తూర్) పర్వతాన్ని పైకెత్తి వారిపై కప్పుగా ఉంచితే! వాస్తవానికి, వారు అది తమపై పడుతుందేమోనని భావించినప్పుడు మేము వారితో అన్నాము: "మేము మీకు ఇచ్చిన దానిని (గ్రంథాన్ని) దృఢంగా పట్టుకోండి మరియు అందులో ఉన్న దానిని జ్ఞాపకం ఉంచుకోండి, దానితో మీరు దైవభీతి పరులు కావచ్చు!"

فَخَلَفَ مِنۢ بَعۡدِهِمۡ خَلۡفٞ وَرِثُواْ ٱلۡكِتَٰبَ يَأۡخُذُونَ عَرَضَ هَٰذَا ٱلۡأَدۡنَىٰ وَيَقُولُونَ سَيُغۡفَرُ لَنَا وَإِن يَأۡتِهِمۡ عَرَضٞ مِّثۡلُهُۥ يَأۡخُذُوهُۚ أَلَمۡ يُؤۡخَذۡ عَلَيۡهِم مِّيثَٰقُ ٱلۡكِتَٰبِ أَن لَّا يَقُولُواْ عَلَى ٱللَّهِ إِلَّا ٱلۡحَقَّ وَدَرَسُواْ مَا فِيهِۗ وَٱلدَّارُ ٱلۡأٓخِرَةُ خَيۡرٞ لِّلَّذِينَ يَتَّقُونَۚ أَفَلَا تَعۡقِلُونَ ١٦٩

وَٱلَّذِينَ يُمَسِّكُونَ بِٱلۡكِتَٰبِ وَأَقَامُواْ ٱلصَّلَوٰةَ إِنَّا لَا نُضِيعُ أَجۡرَ ٱلۡمُصۡلِحِينَ ١٧٠

۞ وَإِذۡ نَتَقۡنَا ٱلۡجَبَلَ فَوۡقَهُمۡ كَأَنَّهُۥ ظُلَّةٞ وَظَنُّوٓاْ أَنَّهُۥ وَاقِعُۢ بِهِمۡ خُذُواْ مَآ ءَاتَيۡنَٰكُم بِقُوَّةٖ وَٱذۡكُرُواْ مَا فِيهِ لَعَلَّكُمۡ تَتَّقُونَ ١٧١

**172**. మరియు (జ్ఞాపకం చేసుకోండి!) నీ ప్రభువు ఆదమ్ సంతతివారి వీపులనుండి వారి సంతానాన్ని తీసి, వారికి వారినే సాక్షులుగా నిలబెట్టి: "ఏమీ? నేను మీ ప్రభువును కానా?" అని అడుగగా! వారు: "అవును! (నీవే మా ప్రభువని) మేము సాక్ష్యమిస్తున్నాము." అని జవాబిచ్చారు.[1] తీర్పుదినమున మీరు: "నిశ్చయంగా, మేము దీనిని ఎరుగము." అని అనగూడదని.

وَإِذْ أَخَذَ رَبُّكَ مِنۢ بَنِىٓ ءَادَمَ مِن ظُهُورِهِمْ ذُرِّيَّتَهُمْ وَأَشْهَدَهُمْ عَلَىٰٓ أَنفُسِهِمْ أَلَسْتُ بِرَبِّكُمْ ۖ قَالُوا۟ بَلَىٰ ۛ شَهِدْنَآ ۛ أَن تَقُولُوا۟ يَوْمَ ٱلْقِيَـٰمَةِ إِنَّا كُنَّا عَنْ هَـٰذَا غَـٰفِلِينَ ﴿١٧٢﴾

**173**. లేక: "వాస్తవానికి ఇంతకు పూర్వం మా తాతముత్తాతలు అల్లాహ్‌కు సాటి (భాగస్వాములు) కల్పించారు. మేము వారి తరువాత వచ్చిన, వారి సంతతివారం (కాబట్టి వారిని అనుసరించాము). అయితే? ఆ అసత్యవాదులు చేసిన కర్మలకు నీవు మమ్మల్ని నశింపజేస్తావా?" అని అనగూడదని.

أَوْ تَقُولُوٓا۟ إِنَّمَآ أَشْرَكَ ءَابَآؤُنَا مِن قَبْلُ وَكُنَّا ذُرِّيَّةً مِّنۢ بَعْدِهِمْ ۖ أَفَتُهْلِكُنَا بِمَا فَعَلَ ٱلْمُبْطِلُونَ ﴿١٧٣﴾

**174**. మరియు ఈ విధంగానైనా వారు సన్మార్గానికి మరలుతారేమోనని మేము ఈ సూచనలను స్పష్టంగా తెలుపుతున్నాము.

وَكَذَٰلِكَ نُفَصِّلُ ٱلْـَٔايَـٰتِ وَلَعَلَّهُمْ يَرْجِعُونَ ﴿١٧٤﴾

**175**. మరియు మేము, మా సూచనలు (ఆయాత్) ప్రసాదించిన ఆ వ్యక్తి గాథ వారికి వినిపించు. అతడు వాటినుండి విముఖుడైనందుకు షై'తాన్ అతనిని వెంబడించాడు, కావున అతడు మార్గభ్రష్టులలో చేరిపోయాడు.

وَٱتْلُ عَلَيْهِمْ نَبَأَ ٱلَّذِىٓ ءَاتَيْنَـٰهُ ءَايَـٰتِنَا فَٱنسَلَخَ مِنْهَا فَأَتْبَعَهُ ٱلشَّيْطَـٰنُ فَكَانَ مِنَ ٱلْغَاوِينَ ﴿١٧٥﴾

---

**1**. చూడండి, స'హీ'హ్ బు'ఖారీ, కితాబుల్ జనాయ'జ్, మరియు ముస్లిం, కితాబుల్ ఖద్ర్: "ప్రతి బిడ్డ సహజ స్వభావంతో పుడ్తాడు, అంటే అల్లాహ్ (సు.తా.)కు విధేయత (ఇస్లాం)తో. కానీ, అతని తల్లిదండ్రులు అతనిని యూదుడు, క్రైస్తవుడు మజూసి లేక ఇతర ధర్మంవాడిగా మార్చుతారు."

**176**. మరియు మేము కోరుకుంటే వాటి (ఆ సూచనల) ద్వారా అతనికి ఔన్నత్యాన్ని ప్రసాదించేవారము. కాని అతడు భూమి వైపునకు వంగాడు, మరియు తన కోరికలను అనుసరించాడు. అతని దృష్టాంతం ఆ కుక్కవలె ఉంది: నీవు దానిని బెదిరించినా అది నాలుకను బయటికి వ్రేలాడదీస్తుంది, లేక వదలిపెట్టినా అది నాలుకను బయటికి వ్రేలాడదీస్తుంది. మా సూచన(ఆయాత్)లను అబద్ధాలని నిరాకరించే వారి దృష్టాంతం కూడా ఇదే! నీవు వారికి ఈ గాథలను వినిపిస్తూ ఉంటే, బహుశా వారు ఆలోచించవచ్చు!

**177**. మా సూచనలను అబద్ధాలని తిరస్కరించే వారి దృష్టాంతం చాలా చెడ్డది. ఎందుకంటే వారు తమకు తాము అన్యాయం చేసుకుంటున్నారు.

**178**. అల్లాహ్ మార్గదర్శకత్వం చేసిన వాడే సన్మార్గం పొందుతాడు. ఆయన మార్గభ్రష్టత్వంలో పడనిచ్చిన వారు! వారే నష్టపోయే వారు.

**179**. మరియు వాస్తవానికి మేము చాలా మంది జిన్నాతులను మరియు మానవులను నరకం కొరకు సృజించాము. ఎందుకంటే! వారికి హృదయాలున్నాయి కాని వాటితో వారు అర్థం చేసుకోలేరు మరియు వారికి కళ్ళున్నాయి కాని వాటితో వారు చూడలేరు మరియు వారికి చెవులున్నాయి కాని వాటితో వారు వినలేరు. ఇలాంటి వారు పశువుల వంటి వారు; కాదు! వాటి కంటే అధములు. ఇలాంటివారే నిర్లక్ష్యంలో మునిగి ఉన్నవారు.

وَلَوْ شِئْنَا لَرَفَعْنَٰهُ بِهَا وَلَٰكِنَّهُۥٓ
أَخْلَدَ إِلَى ٱلْأَرْضِ وَٱتَّبَعَ هَوَىٰهُۚ
فَمَثَلُهُۥ كَمَثَلِ ٱلْكَلْبِ إِن
تَحْمِلْ عَلَيْهِ يَلْهَثْ أَوْ
تَتْرُكْهُ يَلْهَثۚ ذَّٰلِكَ مَثَلُ
ٱلْقَوْمِ ٱلَّذِينَ كَذَّبُوا۟ بِـَٔايَٰتِنَاۚ
فَٱقْصُصِ ٱلْقَصَصَ لَعَلَّهُمْ
يَتَفَكَّرُونَ ١٧٦
سَآءَ مَثَلًا ٱلْقَوْمُ ٱلَّذِينَ كَذَّبُوا۟
بِـَٔايَٰتِنَا وَأَنفُسَهُمْ كَانُوا۟ يَظْلِمُونَ ١٧٧
مَن يَهْدِ ٱللَّهُ فَهُوَ ٱلْمُهْتَدِىۖ
وَمَن يُضْلِلْ فَأُو۟لَٰٓئِكَ هُمُ
ٱلْخَٰسِرُونَ ١٧٨
وَلَقَدْ ذَرَأْنَا لِجَهَنَّمَ كَثِيرًا
مِّنَ ٱلْجِنِّ وَٱلْإِنسِۖ لَهُمْ قُلُوبٌ لَّا
يَفْقَهُونَ بِهَا وَلَهُمْ أَعْيُنٌ لَّا يُبْصِرُونَ
بِهَا وَلَهُمْ ءَاذَانٌ لَّا يَسْمَعُونَ بِهَآۚ
أُو۟لَٰٓئِكَ كَٱلْأَنْعَٰمِ بَلْ هُمْ أَضَلُّۚ
أُو۟لَٰٓئِكَ هُمُ ٱلْغَٰفِلُونَ ١٧٩

وَلِلَّهِ ٱلۡأَسۡمَآءُ ٱلۡحُسۡنَىٰ فَٱدۡعُوهُ بِهَاۖ وَذَرُواْ ٱلَّذِينَ يُلۡحِدُونَ فِيٓ أَسۡمَٰٓئِهِۦۚ سَيُجۡزَوۡنَ مَا كَانُواْ يَعۡمَلُونَ ١٨٠

**180**. మరియు అల్లాహ్ పేర్లు! అన్నీ అత్యుత్తమమైనవే; కావున మీరు వాటితో ఆయనను ప్రార్థించండి.[1] మరియు ఆయన పేర్ల విషయంలో సత్యం నుండి వైదొలగిన వారిని విసర్జించండి. వారు తమ కర్మలకు ప్రతిఫలం పొందగలరు.

وَمِمَّنۡ خَلَقۡنَآ أُمَّةٞ يَهۡدُونَ بِٱلۡحَقِّ وَبِهِۦ يَعۡدِلُونَ ١٨١

**181**. మరియు మేము సృష్టించిన వారిలో ఒక వర్గంవారు సత్యం ప్రకారం మార్గదర్శకత్వం చేసేవారునూ మరియు దానిని అనుసరించియే న్యాయం చేసే వారునూ ఉన్నారు.

وَٱلَّذِينَ كَذَّبُواْ بِـَٔايَٰتِنَا سَنَسۡتَدۡرِجُهُم مِّنۡ حَيۡثُ لَا يَعۡلَمُونَ ١٨٢

**182**. మరియు మా సూచనలను అబద్ధాలని తిరస్కరించే వారిని, మేము వారికి తెలియకుండానే క్రమక్రమంగా (నాశనం వైపునకు) తీసుకుపోతాము.

وَأُمۡلِي لَهُمۡۚ إِنَّ كَيۡدِي مَتِينٌ ١٨٣

**183**. మరియు నేను వారికి వ్యవధి నిస్తున్నాను. నిశ్చయంగా, నా వ్యూహం బలమైనది.[2]

---

**1**. 'హదీస్'లలో అల్లాహ్ (సు.తా.) ఉత్తమ పేర్లు 99 ఉన్నాయని ఉంది. కాని ఇబ్నె-కసీ'ర్ మరియు ఫత్హ్ అల్-ఖదీర్‌లలో, ఇవి 99 కంటే ఎక్కువ ఉన్నాయని ఉంది. ఈ శబ్దం అల్-అస్మా ఉ'ల్ 'హుస్నా ఖుర్ఆన్‌లో నాల్గుసార్లు వచ్చింది. ఈ ఆయత్‌లో మరియు 17:110, 20:8 మరియు 59:24. ఈ శబ్దం అల్-అస్మా ఉ'ల్ 'హుస్నా ఖుర్ఆన్‌లో కేవలం అల్లాహ్ (సు.తా.) కొరకే వాడబడింది.

యు'ల్హిదూన: అంటే ఒకవైపుకు మొగ్గటం. వ్యంగార్థం తీయటం, మార్గభ్రష్టత్వంలో పడి పోవటం. Profanity, భక్తిహీనంగా ప్రవర్తించటం, అగౌరవపరచటం. అల్లాహ్ (సు.తా.) పేర్ల విషయంలో తప్పు త్రోవలో పోవుటలో మూడు రకాలు ఉన్నాయి: 1) అల్లాహుతా'ఆలా పేర్లలో మార్పులు చేయటం. ఉదా: మక్కా ముష్రికులు 'అ'జీ'జ్‌ను 'ఉ'జ్జాగా మార్చింది. 2) అల్లాహుతా'ఆలా పేర్లను హెచ్చించటం. 3) అల్లాహుతా'ఆలా పేర్లను తగ్గించటం. (ఫ'త్హ్ అల్-ఖదీర్).

**2**. చూడండి, 68:45. ఆ ఆయత్‌లో ఖుర్ఆన్ అవతరణలో మొదటిసారి కైద్ పదం వాడబడింది.

**184**. ఏమీ? తమ సహచరుడు పిచ్చి పట్టిన వాడు కాదని వారు గమనించలేదా? అతను కేవలం స్పష్టమైన హెచ్చరిక చేసేవాడు మాత్రమే!

أَوَلَمْ يَتَفَكَّرُوا۟ ۗ مَا بِصَاحِبِهِم مِّن جِنَّةٍ ۚ إِنْ هُوَ إِلَّا نَذِيرٌ مُّبِينٌ ﴿١٨٤﴾

**185**. ఏమీ? వారు భూమ్యాకాశాలపై గల (అల్లాహ్) ఆధిపత్యాన్ని మరియు అల్లాహ్ సృష్టించిన ప్రతివస్తువును గమనించి చూసి, బహుశా తమ గడువు కూడా సమీపించిందేమోనని అనుకోలేరా? దీని తరువాత వారు మరేవిధమైన సందేశాన్ని విశ్వసిస్తారు?

أَوَلَمْ يَنظُرُوا۟ فِى مَلَكُوتِ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَمَا خَلَقَ ٱللَّهُ مِن شَىْءٍ وَأَنْ عَسَىٰٓ أَن يَكُونَ قَدِ ٱقْتَرَبَ أَجَلُهُمْ ۖ فَبِأَىِّ حَدِيثٍۭ بَعْدَهُۥ يُؤْمِنُونَ ﴿١٨٥﴾

**186**. అల్లాహ్ మార్గభ్రష్టత్వంలో పడనిచ్చిన వానికి మార్గదర్శకుడెవ్వడూ లేడు![1] మరియు ఆయన వారిని తమ తలబిరుసుతనంలో త్రోవతప్పి తిరుగటానికి వదలిపెడుతున్నాడు.

مَن يُضْلِلِ ٱللَّهُ فَلَا هَادِىَ لَهُۥ ۚ وَيَذَرُهُمْ فِى طُغْيَٰنِهِمْ يَعْمَهُونَ ﴿١٨٦﴾

**187**. (ఓ ప్రవక్తా!) వారు నిన్ను ఆ అంతిమ ఘడియను గురించి: "అది ఎప్పుడు రానున్నది?" అని అడుగుతున్నారు. వారితో ఇలా అను: "నిస్సందేహంగా, దానిజ్ఞానం నా ప్రభువుకు మాత్రమే ఉంది.[2] కేవలం ఆయన

يَسْـَٔلُونَكَ عَنِ ٱلسَّاعَةِ أَيَّانَ مُرْسَىٰهَا ۖ قُلْ إِنَّمَا عِلْمُهَا عِندَ رَبِّى ۖ لَا يُجَلِّيهَا لِوَقْتِهَآ إِلَّا هُوَ ۚ ثَقُلَتْ فِى ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ

---

**1**. ఇక్కడ మరియు 178వ ఆయత్‌లో మరియు ఇంకా ఎన్నోచోట్లలో ఖుర్ఆన్‌లో చెప్పబడిన విధంగా ఇది సున్నతుల్లాహ్ అంటే ఎవడైతే తనను తాను సవరించుకోగోరక అల్లాహ్ (సు.తా.) ఆదేశాలను అసత్యాలని మరియు ఆయన ప్రవక్తలను అసత్యవాదులని తిరస్కరించి, మూఢత్వంతో మార్గభ్రష్టత్వంలో పడిపోతాడో, అలాంటి వానిని అల్లాహుతా'ఆలా మార్గభ్రష్టత్వంలో వదలుతాడు. అలాంటి వానికి మార్గదర్శకత్వం చేయడు, కానీ అల్లాహ్ (సు.తా.) అతనిని బలవంతంగా మార్గభ్రష్టత్వంలో పడవేయడు.

**2**. అంతిమ ఘడియ ఎప్పుడు రానున్నదో అల్లాహ్ (సు.తా.)కు తప్ప మరెవ్వరికీ తెలియదు. ఏ ప్రవక్తకు గానీ లేక దైవదూతకు గానీ అది వచ్చే సమయం గురించి తెలియదనే విషయం ఈ ఆయత్ ద్వారా స్పష్టమవుతోంది.

لَا تَأۡتِيكُمۡ إِلَّا بَغۡتَةٗۗ يَسۡـَٔلُونَكَ كَأَنَّكَ حَفِيٌّ عَنۡهَاۖ قُلۡ إِنَّمَا عِلۡمُهَا عِندَ ٱللَّهِ وَلَٰكِنَّ أَكۡثَرَ ٱلنَّاسِ لَا يَعۡلَمُونَ ١٨٧

స్వయంగా దానిని, దాని సమయంలో తెలియజేస్తాడు. అది భూమ్యాకాశాలకు ఎంతో దుర్భరమైనదిగా ఉంటుంది. అది మీపై అకస్మాత్తుగానే వచ్చిపడుతుంది.'' దానిని గురించి నీకు బాగా తెలిసిఉన్నట్లు భావించి, వారు నిన్ను దానిని గురించి అడుగుతున్నారు. నీవు ఇలా సమాధానం ఇవ్వు: ''నిస్సందేహంగా, దాని జ్ఞానం అల్లాహ్‌కు మాత్రమే ఉంది. కాని చాలామంది ఇది తెలుసుకోలేరు.''[1]

قُل لَّآ أَمۡلِكُ لِنَفۡسِي نَفۡعٗا وَلَا ضَرًّا إِلَّا مَا شَآءَ ٱللَّهُۚ وَلَوۡ كُنتُ أَعۡلَمُ ٱلۡغَيۡبَ لَٱسۡتَكۡثَرۡتُ مِنَ ٱلۡخَيۡرِ وَمَا مَسَّنِيَ ٱلسُّوٓءُۚ إِنۡ أَنَا۠ إِلَّا نَذِيرٞ وَبَشِيرٞ لِّقَوۡمٖ يُؤۡمِنُونَ ١٨٨

**188**. (ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను: ''అల్లాహ్ కోరితే తప్ప నా స్వయానికి నేను, లాభం[2] గానీ, నష్టం[3] గానీ చేసుకునే అధికారం నాకు లేదు. నాకు అగోచర విషయ జ్ఞానం ఉండి ఉన్నట్లైతే నేను లాభం కలిగించే విషయాలను నా కొరకు అధికంగా సమకూర్చుకునేవాడిని. మరియు నాకు ఎన్నడూ ఏ నష్టం కలిగేది కాదు. నేను విశ్వసించే వారికి కేవలం హెచ్చరిక చేసేవాడను మరియు శుభవార్త నిచ్చే వాడను మాత్రమే!''[4] (5/8)

**1**. చూడండి, 31:34.

**2**. నఫ్'అన్: అంటే లాభం, మేలు, ప్రయోజనం, ఉపయోగం అనే అర్థాలున్నాయి.

**3**. 'దర్రన్: అంటే నష్టం, కీడు, హాని, చెరుపు, అపాయం, దోషం, ఆపద, బాధ అనే అర్థాలున్నాయి.

**4**. దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)కు ఎట్టి అగోచరజ్ఞానం లేదు. అని ఇక్కడ స్పష్టంగా విశదమవుతుంది. అగోచర జ్ఞానం గలవాడు కేవలం అల్లాహ్ (సు.తా.) ఒక్కడు మాత్రమే! దీనికి నిదర్శనాలు: 1) ము'హమ్మద్ ('స'అస) యొక్క పన్ను 'ఉహుద్ యుద్ధరంగంలో విరిగి పోయింది. అతను గాయాలతో స్పృహతప్పి పడిపోయారు. ఏ విధంగానైతే ఒక సాధారణ మానవుడు బాధపడుతాడో అదే విధంగా అతను బాధపడ్డారు. 2) 'ఆయి'షహ్ (ర.'అన్హా)పై నింద మోపబడినప్పుడు, అల్లాహుతా'ఆలా వ'హీ వచ్చేంతవరకు, అతను సాధారణ వ్యక్తిగానే వ్యవహరించారు. ఒకవేళ అతనికి అగోచర జ్ఞానమే ఉంటే ఇదంతా అతనికి ముందుగా తెలిసి, బాధపడేవారు కాదు.

۞ هُوَ ٱلَّذِى خَلَقَكُم مِّن نَّفْسٍ وَٰحِدَةٍ وَجَعَلَ مِنْهَا زَوْجَهَا لِيَسْكُنَ إِلَيْهَا ۖ فَلَمَّا تَغَشَّىٰهَا حَمَلَتْ حَمْلًا خَفِيفًا فَمَرَّتْ بِهِۦ ۖ فَلَمَّآ أَثْقَلَت دَّعَوَا ٱللَّهَ رَبَّهُمَا لَئِنْ ءَاتَيْتَنَا صَٰلِحًا لَّنَكُونَنَّ مِنَ ٱلشَّٰكِرِينَ ﴿١٨٩﴾

**189**. * ఆయనే, మిమ్మల్ని ఒకే వ్యక్తి నుండి సృష్టించాడు మరియు అతని నుండియే జీవిత సౌఖ్యం పొందటానికి అతని భార్యను ('జౌజ) పుట్టించాడు.[1] అతను ఆమెను కలుసుకున్నపుడు, ఆమె ఒక తేలికైన భారాన్ని ధరించి దానిని మోస్తూ తిరుగుతూ ఉంటుంది. పిదప ఆమె గర్భ భారం అధికమైనప్పుడు, వారు ఉభయులూ కలిసి వారి ప్రభువైన అల్లాహ్‌ను ఇలా వేడుకుంటారు: "నీవు మాకు మంచి బిడ్డను ప్రసాదిస్తే మేము తప్పక నీకు కృతజ్ఞతలు తెలిపే వారమవుతాము!"

فَلَمَّآ ءَاتَىٰهُمَا صَٰلِحًا جَعَلَا لَهُۥ شُرَكَآءَ فِيمَآ ءَاتَىٰهُمَا ۚ فَتَعَٰلَى ٱللَّهُ عَمَّا يُشْرِكُونَ ﴿١٩٠﴾

**190**. ఆయన వారికి ఒక మంచి బిడ్డను ప్రసాదించిన పిదప వారు, ఆయన ప్రసాదించిన దాని విషయంలో ఆయనకు సాటి (భాగస్వాములను) కల్పించసాగుతారు. కాని వారు కల్పించే భాగస్వాముల కంటే అల్లాహ్ మహోన్నతుడు.

أَيُشْرِكُونَ مَا لَا يَخْلُقُ شَيْـًٔا وَهُمْ يُخْلَقُونَ ﴿١٩١﴾

**191**. ఏమీ? దేనినీ కూడ సృష్టించలేని మరియు (స్వయంగా) తామే సృష్టించబడిన వారిని, వారు ఆయనకు సాటి(భాగస్వాములు)గా కల్పిస్తారా?

وَلَا يَسْتَطِيعُونَ لَهُمْ نَصْرًا وَلَآ أَنفُسَهُمْ يَنصُرُونَ ﴿١٩٢﴾

**192**. మరియు వారు, వారికి ఎలాంటి సహాయం చేయలేరు. మరియు తమకు తాము కూడా సహాయం చేసుకోలేరు.

---

1. చూడండి, 4:1 మరియు 30:21.

وَإِن تَدْعُوهُمْ إِلَى ٱلْهُدَىٰ لَا يَتَّبِعُوكُمْ ۚ
سَوَآءٌ عَلَيْكُمْ أَدَعَوْتُمُوهُمْ أَمْ أَنتُمْ
صَٰمِتُونَ ﴿١٩٣﴾

**193**. మరియు మీరు వారిని సన్మార్గానికి పిలిచినా, వారు మిమ్మల్ని అనుసరించలేరు. మీరు వారిని పిలిచినా, లేక మౌనం వహించినా మీకు సమానమే!

إِنَّ ٱلَّذِينَ تَدْعُونَ مِن دُونِ ٱللَّهِ
عِبَادٌ أَمْثَالُكُمْ ۖ فَٱدْعُوهُمْ
فَلْيَسْتَجِيبُوا۟ لَكُمْ إِن كُنتُمْ
صَٰدِقِينَ ﴿١٩٤﴾

**194**. నిశ్చయంగా, మీరు అల్లాహ్‌ను విడిచి ఎవరినైతే పిలుస్తున్నారో, వారు కూడా మీలాంటి దాసులే! మీరు వారిని పిలువండి, మీరు సత్యవంతులే అయితే మీ పిలుపుకు వారు సమాధానమివ్వాలి.[1]

أَلَهُمْ أَرْجُلٌ يَمْشُونَ بِهَآ ۖ أَمْ لَهُمْ
أَيْدٍ يَبْطِشُونَ بِهَآ ۖ أَمْ لَهُمْ أَعْيُنٌ
يُبْصِرُونَ بِهَآ ۖ أَمْ لَهُمْ ءَاذَانٌ
يَسْمَعُونَ بِهَا ۗ قُلِ ٱدْعُوا۟ شُرَكَآءَكُمْ ثُمَّ
كِيدُونِ فَلَا تُنظِرُونِ ﴿١٩٥﴾

**195**. ఏమీ? వారికి కాళ్ళున్నాయా, వాటితో నడవటానికి? లేదా వారికి చేతులున్నాయా, వాటితో పట్టుకోవటానికి? లేదా వారికి కళ్ళున్నాయా, వాటితో చూడటానికి? లేదా వారికి చెవులున్నాయా, వాటితో వినటానికి? వారితో అను: "మీరు సాటి కల్పించిన వారిని (భాగస్వాములను) పిలువండి. తరువాత మీరంతా కలిసి నాకు వ్యతిరేకంగా కుట్రలు (వ్యూహాలు) పన్నండి, నాకు గడువు కూడా ఇవ్వకండి.

إِنَّ وَلِـِّۧىَ ٱللَّهُ ٱلَّذِى نَزَّلَ ٱلْكِتَٰبَ ۖ
وَهُوَ يَتَوَلَّى ٱلصَّٰلِحِينَ ﴿١٩٦﴾

**196**. "నిశ్చయంగా, ఈ గ్రంథాన్ని అవతరింపజేసిన అల్లాహ్‌యే నా సంరక్షకుడు, ఆయన సద్వర్తనులనే మిత్రులుగా చేసుకుంటాడు.

وَٱلَّذِينَ تَدْعُونَ مِن دُونِهِۦ لَا
يَسْتَطِيعُونَ نَصْرَكُمْ وَلَآ
أَنفُسَهُمْ يَنصُرُونَ ﴿١٩٧﴾

**197**. "మరియు ఆయనను విడిచి మీరు వేడుకునే వారు మీకు ఏ విధమైన సహాయం చేయలేరు. మరియు వారు తమకు తాము కూడా సహాయం చేసుకోలేరు.

---

**1**. ఇక్కడ ప్రజలు అల్లాహ్(సు.తా.)ను వదలి ఇతరుల దగ్గరకు తమకు సహాయపడమని, ఆరోగ్యం చేకూర్చమని, పిల్లల నివ్వమని, బిడ్డల పెళ్ళిళ్ళు చేయించమని, ఉద్యోగాలు ఇప్పించమని లేక పరలోక జీవితంలో సిఫారసు చేయమని, వగైరా వగైరా కొరకు, దర్గాల దగ్గర, సన్యాసుల దగ్గర, బాబాల దగ్గర లేక మూర్తుల దగ్గరకు పోయి వేడుకోవటం గురించి విమర్శించబడింది. ఇంకా వారేమి చేయలేరని కూడా విశదపరచబడింది.

**198**. "మరియు మీరు వారిని సన్మార్గానికి పిలిచినా వారు వినలేరు. మరియు వారు నీ వైపుకు చూస్తున్నట్లు నీవు భావిస్తావు, కాని వారు చూడలేరు."

وَإِن تَدۡعُوهُمۡ إِلَى ٱلۡهُدَىٰ لَا يَسۡمَعُواْۖ وَتَرَىٰهُمۡ يَنظُرُونَ إِلَيۡكَ وَهُمۡ لَا يُبۡصِرُونَ ١٩٨

**199**. మన్నింపు వైఖరిని అవలంబించు, ధర్మమును బోధించు మరియు మూర్ఖుల నుండి విముఖుడవగు.[1]

خُذِ ٱلۡعَفۡوَ وَأۡمُرۡ بِٱلۡعُرۡفِ وَأَعۡرِضۡ عَنِ ٱلۡجَٰهِلِينَ ١٩٩

**200**. మరియు ఒకవేళ షై'తాన్ నుండి నీకు ప్రేరేపణ కలిగితే! నీవు అల్లాహ్ శరణువేడుకో! నిశ్చయంగా, ఆయనే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

وَإِمَّا يَنزَغَنَّكَ مِنَ ٱلشَّيۡطَٰنِ نَزۡغٞ فَٱسۡتَعِذۡ بِٱللَّهِۚ إِنَّهُۥ سَمِيعٌ عَلِيمٌ ٢٠٠

**201**. వాస్తవానికి, దైవభీతి గలవారు తమకు షై'తాన్ నుండి కలత గలిగితే! వారు (అల్లాహ్‌ను) స్మరిస్తారు, అప్పుడు వారు అంతా సరిగ్గా చూస్తారు.

إِنَّ ٱلَّذِينَ ٱتَّقَوۡاْ إِذَا مَسَّهُمۡ طَٰٓئِفٞ مِّنَ ٱلشَّيۡطَٰنِ تَذَكَّرُواْ فَإِذَا هُم مُّبۡصِرُونَ ٢٠١

**202**. మరియు వారి (షై'తాన్) సహోదరులు వారిని తప్పుదారి వైపుకు లాక్కొని పోగోరుతారు మరియు వారు ఏ మాత్రం పట్టు వదలరు.

وَإِخۡوَٰنُهُمۡ يَمُدُّونَهُمۡ فِي ٱلۡغَيِّ ثُمَّ لَا يُقۡصِرُونَ ٢٠٢

**203**. మరియు (ఓ ప్రవక్తా!) నీవు వారికి ఏదైనా సూచనను తేలేక పోయి నప్పుడు వారు: "నీవే స్వయంగా దానిని ఎందుకు (కల్పించుకొని) తేలేదు?" అని అంటారు.

وَإِذَا لَمۡ تَأۡتِهِم بِـَٔايَةٖ قَالُواْ لَوۡلَا ٱجۡتَبَيۡتَهَاۚ قُلۡ إِنَّمَآ أَتَّبِعُ مَا

---

**1**. ఎందుకంటే మానవుడు బలహీనుడిగా పుట్టించబడ్డాడు. (చూడండి, 4:28). అల్లాహ్ (సు.తా.) ఏ మానవుడి పైననూ అతని శక్తికి మించిన భారం వేయడు. (చూడండి, 2:286, 6:152, 7:42, మరియు 23:62).

يُوحَىٰٓ إِلَيَّ مِن رَّبِّيۚ هَٰذَا بَصَآئِرُ مِن رَّبِّكُمۡ وَهُدٗى وَرَحۡمَةٞ لِّقَوۡمٖ يُؤۡمِنُونَ ٢٠٣

వారితో ఇలా అను: "నేను కేవలం నా ప్రభువు తరఫు నుండి నాకు పంపబడే సందేశాన్ని (వ'హీని) మాత్రమే అనుసరించే వాడను.[1] ఇందు (ఈ ఖుర్ఆన్)లో విశ్వసించే వారి కొరకు, మీ ప్రభువు తరఫు నుండి అనేక బోధనలు, మార్గదర్శకత్వం మరియు కారుణ్యమున్నాయి."[2]

وَإِذَا قُرِئَ ٱلۡقُرۡءَانُ فَٱسۡتَمِعُواْ لَهُۥ وَأَنصِتُواْ لَعَلَّكُمۡ تُرۡحَمُونَ ٢٠٤

**204**. మరియు ఖుర్ఆన్ పారాయణం జరిగేటప్పుడు దానిని శ్రద్ధగా వినండి మరియు నిశ్శబ్దంగా ఉండండి, అప్పుడు మీరు కరుణింపబడవచ్చు![3]

وَٱذۡكُر رَّبَّكَ فِي نَفۡسِكَ تَضَرُّعٗا وَخِيفَةٗ وَدُونَ ٱلۡجَهۡرِ مِنَ ٱلۡقَوۡلِ بِٱلۡغُدُوِّ وَٱلۡأٓصَالِ وَلَا تَكُن مِّنَ ٱلۡغَٰفِلِينَ ٢٠٥

**205**. మరియు నీవు నీ మనస్సులో వినయంతో, భయంతో మరియు ఎక్కువ శబ్దంతో గాక (తగ్గు స్వరంతో) ఉదయం మరియు సాయంత్రం నీ ప్రభువును స్మరించు. మరియు నిర్లక్ష్యం చేసేవారిలో చేరకు.[4]

إِنَّ ٱلَّذِينَ عِندَ رَبِّكَ لَا يَسۡتَكۡبِرُونَ عَنۡ عِبَادَتِهِۦ وَيُسَبِّحُونَهُۥ وَلَهُۥ يَسۡجُدُونَ ۩ ٢٠٦

**206**. నిశ్చయంగా, నీ ప్రభువుకు దగ్గరగా ఉన్నవారు (దైవదూతలు) తమ ప్రభువును ఆరాధించటానికి అహంభావం చూపరు మరియు ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉంటారు మరియు ఆయనకే సాష్టాంగం (సజ్దా) చేస్తూ ఉంటారు. ۩ (3/4)

*****

1. చూడండి, 6:37 మరియు 109.
2. చూడండి, 'స. బు'ఖారీ, పు. 4, 'హ. 831.
3. చూడండి, 41:26.
4. చూడండి, 13:28.

## 8. సూరహ్ అల్-అన్ఫాల్ سُورَةُ الأَنْفَالِ

అల్-అన్ఫాలు, నఫ్లున్ యొక్క బహువచనం. అంటే **అధికం**. ఇక్కడ ధర్మయుద్ధంలో దొరికే **విజయధనం**, లేక యుద్ధబూటి అని అర్థం. ఈ శబ్దం **మొదటి** ఆయతులోనే ఉంది. ఇది బద్ర్‌యుద్ధం (2వ హిజ్రీలో, 17వ రమ'దాన్), తరువాత అవతరింపజేయబడిన **మదనీ** సూరహ్. ఇందులో **75 ఆయతు**లున్నాయి. మొదటి ఏడు సూరాహ్‌లు కలసి ఖుర్ఆన్ యొక్క మూడవ (1/3) భాగం కంటే కొంత తక్కువ ఉన్నాయి. వీటిలో ప్రాచీనగాథలు మరియు మొట్టమొదటి ఇస్లామియా సమాజమును (ఉమ్మత్‌ను) గురించిన విషయాలు ఉన్నాయి. ఈ సూరహ్‌లో బద్ర్ యుద్ధం మరియు విజయధనం మొదలైన విషయాల ప్రస్తావన ఉంది. బూటీ నుండి ఐదవ (1/5) భాగం నాయకునకు మిగిలింది ఇతర యుద్ధానికి పోయినవారికి - నాయకుని ఆజ్ఞానుసారంగా - పంచబడతుంది. ఇందులో విశ్వాసులకు, ధర్మయుద్ధంలో అల్లాహ్ (సు.తా.) తరఫునుండి వచ్చిన సహాయం కూడా పేర్కొనబడింది.

ముష్రిక్ ఖురైషుల బాధలకు తాళలేక, వారి హత్యాపన్నుగడ నుండి తప్పించుకొని; ముహమ్మద్ ('స'అస) మరియు ఆ తరువాత ఇతర ముస్లింలూ - శాంతి, భద్రతలు కోరుతూ - మదీనాకు వలసపోతారు. వారికి ముష్రికులు దాడిచేయవచ్చనే భయం ఉంటుంది. కాబట్టి వారు ముష్రికులకు గుణపాఠం నేర్పటానికి - 313మంది, వీరులతో, 70 ఒంటెలతో, మరియు 2 గుఱ్ఱాలతో మాత్రమే - సిరియా నుండి మక్కాకు తిరిగి వచ్చే వాణిజ్య బిడారం (కార్‌వాన్) మీద దాడి చేయటానికి వెళ్ళుతారు. ఈ విషయం కార్‌వాన్ నాయకుడైన అబూ-సుఫియాన్‌కు తెలుస్తుంది, (అంతవరకు అతను ఇంకా ముష్రిక్‌గానే ఉంటాడు). అతను సహాయం కొరకు మక్కాకు వార్తాహరుణ్ణి పంపుతాడు. అబూ-సుఫియాన్ కార్‌వాన్‌లో, 1000 ఒంటెలు, 40 యుద్ధవీరులు మాత్రమే ఉంటారు. అతడు తన దారి మార్చి సముద్ర తట్టునుండి తన ప్రయాణం సాగిస్తాడు. మక్కా ముష్రిక్ ఖురైషులు 1000 మంది అస్త్రధారులు యుద్ధనిపుణులు అయిన వీరులను, 700 ఒంటెలను మరియు 100 గుర్రాలను తీసుకుని బయలుదేరి, బద్ర్ ప్రాంతంలో చేరుకుంటారు. కేవలం వ్యాపార బిడారం మీదపడి వారికి గుణపాఠం నేర్పాలని, మంచి యుద్ధసామాగ్రి లేకుండానే బయలుదేరిన, 313 మంది ముస్లింలకు, 1000 మంది నిపుణులైన అబూ-జహల్ సైన్యంతో పోరాడవలసి వస్తుంది. ము'హమ్మద్ ('స'అస), తమ అనుచరు(ర'ది.'అన్హుమ్)లతో సమాలోచనలు చేస్తారు. అందులో ఏ కొందరో తప్పా, అందరూ యుద్ధానికి సిద్ధమవుతారు.

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

**1.** * (ఓ ప్రవక్తా!) వారు నిన్ను **విజయధనం**(అన్ఫాల్)ను గురించి అడుగుతున్నారు. వారితో ఇలా అను: "విజయధనం అల్లాహ్‌ది మరియు ఆయన సందేశహరునిది." కనుక మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు మీ పరస్పర సంబంధాలను సరిదిద్దుకోండి. మీరు విశ్వాసులే అయితే, అల్లాహ్‌కు మరియు ఆయన ప్రవక్తకు విధేయులై ఉండండి.

**2.** నిశ్చయంగా, విశ్వాసులైన వారి హృదయాలు అల్లాహ్ ప్రస్తావన వచ్చినపుడు భయంతో వణకుతాయి. మరియు వారిముందు ఆయన సూచనలు (ఖుర్ఆన్) పఠింపబడినప్పుడు వారి విశ్వాసం మరింత అధికమే అవుతుంది. మరియు వారు తమ ప్రభువు మీదే దృఢ నమ్మకం కలిగిఉంటారు.

**3.** వారే నమాజ్‌ను స్థాపిస్తారు మరియు మేము వారికి ప్రసాదించిన జీవనోపాధి నుండి (ఇతరులపై) ఖర్చుచేస్తారు.

**4.** అలాంటి వారు, వారే! నిజమైన విశ్వాసులు. వారి ప్రభువువద్ద వారికి ఉన్నత స్థానాలు, క్షమాపణ మరియు గౌరవ నీయమైన జీవనోపాధి ఉన్నాయి.

**5.** (ఓ ప్రవక్తా) ఎప్పుడైతే! నీ ప్రభువు నిన్ను సత్యస్థాపన కొరకు నీ గృహంనుండి (యుద్ధానికి) బయటకు తీసుకొని వచ్చాడో! అప్పుడు నిశ్చయంగా, విశ్వాసులలో ఒక పక్షంవారు దానికి ఇష్టపడలేదు;

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

يَسۡـَٔلُونَكَ عَنِ ٱلۡأَنفَالِۖ قُلِ ٱلۡأَنفَالُ
لِلَّهِ وَٱلرَّسُولِۖ فَٱتَّقُواْ ٱللَّهَ
وَأَصۡلِحُواْ ذَاتَ بَيۡنِكُمۡۖ
وَأَطِيعُواْ ٱللَّهَ وَرَسُولَهُۥٓ إِن كُنتُم
مُّؤۡمِنِينَ ١
إِنَّمَا ٱلۡمُؤۡمِنُونَ ٱلَّذِينَ إِذَا ذُكِرَ
ٱللَّهُ وَجِلَتۡ قُلُوبُهُمۡ وَإِذَا تُلِيَتۡ
عَلَيۡهِمۡ ءَايَٰتُهُۥ زَادَتۡهُمۡ إِيمَٰنٗا وَعَلَىٰ
رَبِّهِمۡ يَتَوَكَّلُونَ ٢
ٱلَّذِينَ يُقِيمُونَ ٱلصَّلَوٰةَ وَمِمَّا
رَزَقۡنَٰهُمۡ يُنفِقُونَ ٣
أُوْلَٰٓئِكَ هُمُ ٱلۡمُؤۡمِنُونَ حَقّٗاۚ لَّهُمۡ
دَرَجَٰتٌ عِندَ رَبِّهِمۡ وَمَغۡفِرَةٞ
وَرِزۡقٞ كَرِيمٞ ٤
كَمَآ أَخۡرَجَكَ رَبُّكَ مِنۢ بَيۡتِكَ
بِٱلۡحَقِّ وَإِنَّ فَرِيقٗا مِّنَ ٱلۡمُؤۡمِنِينَ
لَكَٰرِهُونَ ٥

يُجَٰدِلُونَكَ فِي ٱلۡحَقِّ بَعۡدَ مَا تَبَيَّنَ
كَأَنَّمَا يُسَاقُونَ إِلَى ٱلۡمَوۡتِ وَهُمۡ
يَنظُرُونَ ٦

**6**. సత్యం బహిర్గతమైన తరువాత కూడా, వారు దానిని గురించి నీతో వాదులాడు తున్నారు. అప్పుడు (వారిస్థితి) వారు చావును కళ్ళారా చూస్తూ ఉండగా! దాని వైపునకు లాగబడే వారివలే ఉంది.

وَإِذۡ يَعِدُكُمُ ٱللَّهُ إِحۡدَى ٱلطَّآئِفَتَيۡنِ
أَنَّهَا لَكُمۡ وَتَوَدُّونَ أَنَّ غَيۡرَ
ذَاتِ ٱلشَّوۡكَةِ تَكُونُ لَكُمۡ
وَيُرِيدُ ٱللَّهُ أَن يُحِقَّ ٱلۡحَقَّ بِكَلِمَٰتِهِۦ
وَيَقۡطَعَ دَابِرَ ٱلۡكَٰفِرِينَ ٧

**7**. మరియు (జ్ఞాపకం చేసుకోండి) ఆ రెండు పక్షాలలో, ఒక పక్షం మీ చేతికి తప్పక చిక్కుతుందని అల్లాహ్ మీతో వాగ్దానం చేసినప్పుడు; ఆయుధాలులేని పక్షం మీకు దొరకాలని మీరు కోరుతూ ఉన్నారు. కాని అల్లాహ్ తాను ఇచ్చిన మాట ప్రకారం సత్యాన్ని సత్యంగా నిరూపించాలనీ మరియు అవిశ్వాసులను సమూలంగా నాశనం చేయాలనీ కోరాడు.

لِيُحِقَّ ٱلۡحَقَّ وَيُبۡطِلَ ٱلۡبَٰطِلَ وَلَوۡ
كَرِهَ ٱلۡمُجۡرِمُونَ ٨

**8**. అపరాధులు ఎంత అసహ్యించు కున్నా, సత్యాన్ని, సత్యంగా నిరూపించాలని (నెగ్గించాలని) మరియు అసత్యాన్ని అసత్యంగా నిరూపించాలని (విఫలం చేయాలని) ఆయన (ఇచ్ఛ).[1]

إِذۡ تَسۡتَغِيثُونَ رَبَّكُمۡ فَٱسۡتَجَابَ
لَكُمۡ أَنِّي مُمِدُّكُم بِأَلۡفٖ مِّنَ
ٱلۡمَلَٰٓئِكَةِ مُرۡدِفِينَ ٩

**9**. (జ్ఞాపకం చేసుకోండి!) మీరు మీ ప్రభువును సహాయం కొరకు ప్రార్థించి నపుడు ఆయన ఇలా జవాబిచ్చాడు: "నిశ్చయంగా, నేను వేయి దైవదూతలను ఒకరి తరువాత ఒకరిని పంపి మిమ్మల్ని బలపరుస్తాను."[2]

---

**1** . ముస్లింలు, మక్కా ముష్రికుల సైన్యంతో పోరాడి, వారిని ఓడించి, వారి హృదయాలలో భయభీతులు కలిగించాలని మరియు ముస్లింలకు ధైర్యస్థైర్యాలను ప్రసాదించాలని అల్లాహ్ (సు.తా.) కోరిక.

**2**. చూడండి, 3:124-125 అక్కడ ఉ'హుద్ యుద్ధంలో అల్లాహ్ (సు.తా.)3000 దైవదూతలను పంపి సహాయపడ్డాడు, అని ఉంది.

وَمَا جَعَلَهُ ٱللَّهُ إِلَّا بُشْرَىٰ وَلِتَطْمَئِنَّ بِهِۦ قُلُوبُكُمْۚ وَمَا ٱلنَّصْرُ إِلَّا مِنْ عِندِ ٱللَّهِۚ إِنَّ ٱللَّهَ عَزِيزٌ حَكِيمٌ ﴿١٠﴾

**10**. మరియు మీకు శుభవార్తనిచ్చి, మీ హృదయాలకు శాంతి కలుగజేయటానికే, ఈ విషయాన్ని అల్లాహ్ మీకు తెలిపాడు. మరియు వాస్తవానికి సహాయం (విజయం) కేవలం అల్లాహ్ నుంచే వస్తుంది. నిశ్చయంగా అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేచనాపరుడు.[1]

إِذْ يُغَشِّيكُمُ ٱلنُّعَاسَ أَمَنَةً مِّنْهُ وَيُنَزِّلُ عَلَيْكُم مِّنَ ٱلسَّمَآءِ مَآءً لِّيُطَهِّرَكُم بِهِۦ وَيُذْهِبَ عَنكُمْ رِجْزَ ٱلشَّيْطَٰنِ وَلِيَرْبِطَ عَلَىٰ قُلُوبِكُمْ وَيُثَبِّتَ بِهِ ٱلْأَقْدَامَ ﴿١١﴾

**11**. (జ్ఞాపకం చేసుకోండి!) ఆయన (అల్లాహ్), తన తరఫునుండి మీకు మనశ్శాంతి కలుగజేయటానికి మీకు నిద్రమత్తును కలిగించాడు మరియు మీపై ఆకాశం నుండి నీటిని కురిపించాడు, దాని ద్వారా మిమ్మల్ని పరిశుద్ధపరచటానికి మీ నుండి షైతాన్ మాలిన్యాన్ని దూరం చేయటానికి మరియు మీ హృదయాలను బలపరచటానికి మరియు మీ పాదాలను స్థిరపరచటానికీని!

إِذْ يُوحِى رَبُّكَ إِلَى ٱلْمَلَٰٓئِكَةِ أَنِّى مَعَكُمْ فَثَبِّتُوا۟ ٱلَّذِينَ ءَامَنُوا۟ۚ سَأُلْقِى فِى قُلُوبِ ٱلَّذِينَ كَفَرُوا۟ ٱلرُّعْبَ فَٱضْرِبُوا۟ فَوْقَ ٱلْأَعْنَاقِ وَٱضْرِبُوا۟ مِنْهُمْ كُلَّ بَنَانٍ ﴿١٢﴾

**12**. నీ ప్రభువు దైవదూతలకు ఇచ్చిన దివ్యజ్ఞానాన్ని (జ్ఞాపకం చేసుకో): "నేను నిశ్చయంగా, మీతో ఉన్నాను. కావున మీరు విశ్వాసులకు ఈ విధంగా ధైర్యస్థైర్యాలను కలిగించండి: 'నేను సత్యతిరస్కారులైన వారి హృదయాలలో భయాన్ని కలిగిస్తాను, అప్పుడు మీరు వారి మెడలపై కొట్టండి మరియు వారి వ్రేళ్ళకొనలను నరికి వేయండి.' "

---

**1**. ము'హమ్మద్ ('స'అస) ఇలా ప్రార్థించారు: "ఓ అల్లాహ్ (సు.తా.)! నీవు నాకు చేసిన వాగ్దానం పూర్తిచేయి. ఓ అల్లాహ్ (సు.తా.)! ఒకవేళ ఈ నాడు నీకు విధేయు (ముస్లిం)లు అయిన ఈ చిన్న సమూహం, నిర్మూలించబడితే! నిన్ను ప్రార్థించేవారు భూమిలో ఎవ్వరూ ఉండరు!" ('స. బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం, తిర్మిజీ', అబూ-దావూద్, అ'హ్మద్ మరియు ఇబ్నె-'హంబల్).

ذَٰلِكَ بِأَنَّهُمْ شَآقُّوا۟ ٱللَّهَ وَرَسُولَهُۥ ۚ وَمَن يُشَاقِقِ ٱللَّهَ وَرَسُولَهُۥ فَإِنَّ ٱللَّهَ شَدِيدُ ٱلْعِقَابِ ﴿١٣﴾

**13**. ఇది ఎందుకంటే! వాస్తవానికి వారు అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను వ్యతిరేకించారు. కాబట్టి ఎవడైతే అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తను వ్యతిరేకిస్తాడో! నిశ్చయంగా, అల్లాహ్ (అలాంటి వానికి) శిక్ష విధించటంలో ఎంతో కఠినుడు.

ذَٰلِكُمْ فَذُوقُوهُ وَأَنَّ لِلْكَٰفِرِينَ عَذَابَ ٱلنَّارِ ﴿١٤﴾

**14**. (ఓ సత్యతిరస్కారులారా!): "ఇదే (మీ శిక్ష), దీనిని మీరు చవిచూడండి! నిశ్చయంగా సత్యతిరస్కారులకు నరకాగ్ని శిక్ష ఉంటుంది."

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِذَا لَقِيتُمُ ٱلَّذِينَ كَفَرُوا۟ زَحْفًا فَلَا تُوَلُّوهُمُ ٱلْأَدْبَارَ ﴿١٥﴾

**15**. ఓ విశ్వసించిన ప్రజలారా! మీరు సత్యతిరస్కారుల సైన్యాలను యుద్ధ రంగంలో ఎదుర్కొన్నప్పుడు, వారికి మీ వీపులు చూపకండి (పారిపోకండి)!

وَمَن يُوَلِّهِمْ يَوْمَئِذٍ دُبُرَهُۥٓ إِلَّا مُتَحَرِّفًا لِّقِتَالٍ أَوْ مُتَحَيِّزًا إِلَىٰ فِئَةٍ فَقَدْ بَآءَ بِغَضَبٍ مِّنَ ٱللَّهِ وَمَأْوَىٰهُ جَهَنَّمُ ۖ وَبِئْسَ ٱلْمَصِيرُ ﴿١٦﴾

**16**. మరియు ఆ దినమున వారికి వీపు చూపినవాడు - యుద్ధతంత్రం కోసమో, లేక (తమవారి) మరొక సమూహంలో చేరటానికో (వెనుదిరిగితే తప్ప) - తప్పక అల్లాహ్ ఆగ్రహానికి పాత్రుడవుతాడు మరియు అతని ఆశ్రయం నరకమే. అది ఎంత చెడ్డ గమ్యస్థానం!

فَلَمْ تَقْتُلُوهُمْ وَلَٰكِنَّ ٱللَّهَ قَتَلَهُمْ ۚ وَمَا رَمَيْتَ إِذْ رَمَيْتَ وَلَٰكِنَّ ٱللَّهَ رَمَىٰ ۚ وَلِيُبْلِىَ ٱلْمُؤْمِنِينَ مِنْهُ بَلَآءً حَسَنًا ۚ إِنَّ ٱللَّهَ سَمِيعٌ عَلِيمٌ ﴿١٧﴾

**17**. మీరు వారిని చంపలేదు, కాని అల్లాహ్ వారిని చంపాడు. (ఓ ప్రవక్తా!) నీవు (దుమ్ము) విసిరినపుడు, నీవుకాదు విసిరింది,[1] కాని అల్లాహ్ విసిరాడు. మరియు విశ్వాసులను దీనితో పరీక్షించి, వారికి మంచి ఫలితాన్ని ఇవ్వటానికి ఆయన ఇలా చేశాడు. నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

---

**1**. బద్ర్ యుద్ధ రంగంలో దైవప్రవక్త ('స'అస) పిడికెడు దుమ్ము, అల్లాహ్ (సు.తా.) పేరుతో సత్యతిరస్కారులపై విసిరారు.

**18**. ఇదే (ఆయన ఇచ్ఛ!) మరియు నిశ్చయంగా, అల్లాహ్ సత్యతిరస్కారుల ఎత్తుగడలను బలహీనపరుస్తాడు.

**19**. (ఓ అవిశ్వాసులారా!) మీరు తీర్పు కోరితే, వాస్తవానికి మీకు తీర్పు లభించింది. ఇక మీద మీరు (దుర్మార్గాన్ని) మాను కుంటే అది మీకే మేలైనది. ఒకవేళ మీరు తిరిగి ఇలా చేస్తే మేము కూడా తిరిగి చేస్తాము. అప్పుడు మీ సైనికదళం ఎంత హెచ్చుగా ఉన్నా మీకెలాంటి లాభం చేకూర్చదు. మరియు నిశ్చయంగా, అల్లాహ్ విశ్వాసులతో ఉంటాడు.

**20**. ఓ విశ్వాసులారా! మీరు అల్లాహ్‌కు మరియు ఆయన ప్రవక్తకు విధేయులుగా ఉండండి. మరియు మీరు (అతని సందేశాలను) వింటూ కూడా, అతని (ప్రవక్త) నుండి మరలిపోకండి.

**21**. మరియు వాస్తవానికి వినకుండానే: ''మేము విన్నాము!'' అని అనేవారివలే కాకండి.[1] (7/8)

**22**. * తమ బుద్ధిని ఉపయోగించని చెవిటివారు, మూగవారు మాత్రమే, నిశ్చయంగా అల్లాహ్ దృష్టిలో నీచాతి నీచమైన పశుజాతికి చెందినవారు.[2]

**23**. మరియు అల్లాహ్ వారిలో కొంతైనా మంచితనాన్ని చూసిఉంటే, వారిని వినేటట్లు చేసిఉండేవాడు. (కాని వారిలో మంచితనం లేదు కాబట్టి), ఆయన వారిని వినేటట్లు చేసినా, వారు (తమ మూర్ఖత్వంలో) ముఖాలు త్రిప్పుకొని వెనుదిరిగి పోయేవారు.

ذَٰلِكُمْ وَأَنَّ ٱللَّهَ مُوهِنُ كَيْدِ
ٱلْكَٰفِرِينَ ﴿١٨﴾
إِن تَسْتَفْتِحُوا۟ فَقَدْ جَآءَكُمُ
ٱلْفَتْحُ ۖ وَإِن تَنتَهُوا۟ فَهُوَ خَيْرٌ
لَّكُمْ ۖ وَإِن تَعُودُوا۟ نَعُدْ وَلَن تُغْنِىَ
عَنكُمْ فِئَتُكُمْ شَيْـًٔا وَلَوْ كَثُرَتْ
وَأَنَّ ٱللَّهَ مَعَ ٱلْمُؤْمِنِينَ ﴿١٩﴾
يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ أَطِيعُوا۟ ٱللَّهَ
وَرَسُولَهُۥ وَلَا تَوَلَّوْا۟ عَنْهُ وَأَنتُمْ
تَسْمَعُونَ ﴿٢٠﴾
وَلَا تَكُونُوا۟ كَٱلَّذِينَ قَالُوا۟
سَمِعْنَا وَهُمْ لَا يَسْمَعُونَ ﴿٢١﴾
۞ إِنَّ شَرَّ ٱلدَّوَآبِّ عِندَ ٱللَّهِ ٱلصُّمُّ
ٱلْبُكْمُ ٱلَّذِينَ لَا يَعْقِلُونَ ﴿٢٢﴾
وَلَوْ عَلِمَ ٱللَّهُ فِيهِمْ خَيْرًا لَّأَسْمَعَهُمْ ۖ
وَلَوْ أَسْمَعَهُمْ لَتَوَلَّوا۟ وَّهُم
مُّعْرِضُونَ ﴿٢٣﴾

**1**. చూడండి, 2:93 మరియు 4:46.
**2**. చూడండి, 7:179.

**24**. ఓ విశ్వాసులారా! అల్లాహ్ మరియు ఆయన సందేశహరుడు మీకు జీవనమిచ్చే దానివైపునకు, మిమ్మల్ని పిలిచినప్పుడు దానికి జవాబు ఇవ్వండి.[1] మరియు నిశ్చయంగా అల్లాహ్ మానవునికి మరియు అతని హృదయకాంక్షలకు మధ్య ఉన్నాడనీ మరియు నిశ్చయంగా, మీరంతా ఆయన వద్దనే సమీకరించబడతారని తెలుసుకోండి.

**25**. మరియు మీలోని దుర్మార్గులకు మాత్రమే గాక (అందరికీ) సంభవించబోయే ఆ విపత్తు గురించి భీతిపరులై ఉండండి. మరియు అల్లాహ్ శిక్ష విధించటంలో చాలా కఠినుడని తెలుసుకోండి.

**26**. మరియు ఆ సమయాన్ని జ్ఞాపకం చేసుకోండి: అప్పుడు మీరు అల్ప సంఖ్యలో ఉన్నారు. భూమిపై మీరు బలహీనులుగా పరిగణించబడేవారు. ప్రజలు మిమ్మల్ని పారద్రోలుతా (హింసిస్తా)రని భయపడేవారు. అప్పుడు ఆయన మీకు ఆశ్రయమిచ్చి తన సహాయంతో మిమ్మల్ని బలపరచి, మీకు మంచి జీవనోపాధిని సమకూర్చాడు, బహుశా మీరు కృతజ్ఞులవుతారని!

**27**. ఓ విశ్వాసులారా! మీరు అల్లాహ్‌కు మరియు ఆయన ప్రవక్తకు నమ్మకద్రోహం చేయకండి మరియు తెలిసిఉండి కూడా మీ (పరస్పర) అమానతుల[2] విషయంలో నమ్మకద్రోహం చేయకండి.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ ٱسۡتَجِيبُواْ
لِلَّهِ وَلِلرَّسُولِ إِذَا دَعَاكُمۡ لِمَا
يُحۡيِيكُمۡۖ وَٱعۡلَمُوٓاْ أَنَّ ٱللَّهَ
يَحُولُ بَيۡنَ ٱلۡمَرۡءِ وَقَلۡبِهِۦ وَأَنَّهُۥٓ
إِلَيۡهِ تُحۡشَرُونَ ٢٤
وَٱتَّقُواْ فِتۡنَةٗ لَّا تُصِيبَنَّ ٱلَّذِينَ
ظَلَمُواْ مِنكُمۡ خَآصَّةٗۖ وَٱعۡلَمُوٓاْ
أَنَّ ٱللَّهَ شَدِيدُ ٱلۡعِقَابِ ٢٥
وَٱذۡكُرُوٓاْ إِذۡ أَنتُمۡ قَلِيلٞ
مُّسۡتَضۡعَفُونَ فِي ٱلۡأَرۡضِ تَخَافُونَ
أَن يَتَخَطَّفَكُمُ ٱلنَّاسُ فَـَٔاوَىٰكُمۡ
وَأَيَّدَكُم بِنَصۡرِهِۦ وَرَزَقَكُم مِّنَ
ٱلطَّيِّبَٰتِ لَعَلَّكُمۡ تَشۡكُرُونَ ٢٦
يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تَخُونُواْ
ٱللَّهَ وَٱلرَّسُولَ وَتَخُونُوٓاْ أَمَٰنَٰتِكُمۡ
وَأَنتُمۡ تَعۡلَمُونَ ٢٧

---

**1**. అంటే ఖుర్ఆన్ మరియు షరీ'అత్ వైపుకు మరియు జిహాద్‌కు. అంటే కేవలం అల్లాహ్ (సు.తా.) మరియు ఆయన ప్రవక్త ('స'అస) ఆజ్ఞలనే అనుసరించండి, అని అర్థం.

**2**. అమానతుల కొరకు చూడండి, 33:72.

28. మరియు వాస్తవానికి మీ ఆస్తిపాస్తులు, మీ సంతానం, పరీక్షా సాధనాలనీ మరియు నిశ్చయంగా, అల్లాహ్ వద్ద గొప్ప ప్రతిఫలం ఉన్నదనీ తెలుసుకోండి!

29. ఓ విశ్వాసులారా! మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగిఉంటే, ఆయన మీకు (మంచి చెడులను గుర్తించే) విచక్షణా శక్తిని ప్రసాదించి, మీ నుండి మీ పాపాలను తొలగించి, మిమ్మల్ని క్షమిస్తాడు. మరియు అల్లాహ్ దాతృత్వంలో సర్వోత్తముడు.

30. మరియు (ఓ ప్రవక్తా!) సత్య తిరస్కారులు, నిన్ను బంధించటానికి నిన్ను హతమార్చటానికి, లేదా నిన్ను వెడలగొట్టటానికి కుట్రలు పన్నుతున్న విషయాన్ని (జ్ఞప్తికి తెచ్చుకో)! వారు కుట్రలు పన్నుతూ ఉన్నారు మరియు అల్లాహ్ కూడా కుట్రలు పన్నుతూ ఉన్నాడు. మరియు వాస్తవానికి అల్లాహ్‌యే కుట్రలు పన్నటంలో అందరి కంటే ఉత్తముడు.[1]

31. మరియు మా సూచనలు (ఆయాత్) వారికి వినిపించబడినప్పుడు వారు: "వాస్తవానికి, మేము విన్నాము మేము కోరితే మేము కూడా ఇటువంటివి రచించ గలము (చెప్పగలము). ఇవి కేవలం పూర్వీకుల గాథలు మాత్రమే!" అని అంటారు.

وَٱعۡلَمُوٓاْ أَنَّمَآ أَمۡوَٰلُكُمۡ
وَأَوۡلَٰدُكُمۡ فِتۡنَةٞ وَأَنَّ ٱللَّهَ عِندَهُۥٓ
أَجۡرٌ عَظِيمٞ ٢٨
يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِن تَتَّقُواْ
ٱللَّهَ يَجۡعَل لَّكُمۡ فُرۡقَانٗا وَيُكَفِّرۡ
عَنكُمۡ سَيِّـَٔاتِكُمۡ وَيَغۡفِرۡ لَكُمۡۗ
وَٱللَّهُ ذُو ٱلۡفَضۡلِ ٱلۡعَظِيمِ ٢٩
وَإِذۡ يَمۡكُرُ بِكَ ٱلَّذِينَ كَفَرُواْ
لِيُثۡبِتُوكَ أَوۡ يَقۡتُلُوكَ أَوۡ
يُخۡرِجُوكَۚ وَيَمۡكُرُونَ وَيَمۡكُرُ ٱللَّهُۖ
وَٱللَّهُ خَيۡرُ ٱلۡمَٰكِرِينَ ٣٠
وَإِذَا تُتۡلَىٰ عَلَيۡهِمۡ ءَايَٰتُنَا قَالُواْ قَدۡ
سَمِعۡنَا لَوۡ نَشَآءُ لَقُلۡنَا مِثۡلَ
هَٰذَآ إِنۡ هَٰذَآ إِلَّآ أَسَٰطِيرُ
ٱلۡأَوَّلِينَ ٣١

1. ఇది మక్కా ముష్రిక్‌లు దారున్నద్వాలో ము'హమ్మద్ ('స'అస)ను హత్యచేయటానికి; ప్రతి తెగనుండి ఒక యువకుణ్ణి తయారుచేసిన కుట్ర. వారంతా దైవప్రవక్త ('స'అస), ఇంటిచుట్టు రాత్రివేళ గుమిగూడి, అతని రాకకు ఎదురు చూస్తూ ఉంటారు. అల్లాహ్ (సు.తా.), ఈ విషయం దైవప్రవక్త ('స'అస)కు తెలుపుతాడు. మరియు అతను ('స'అస) పిడికెడు దుమ్ము తీసుకొని, అల్లాహ్ (సు.తా.)ను ప్రార్థించి, వారిపై చల్లుతారు. దానితో వారు అతని వెళ్ళిపోవటాన్ని గమనించలేకపోతారు. అతను ('స'అస) అబూబక్ర్ (ర'ది. 'అ.)తో సహా 'గారె సూ'ర్‌లో చేరుకుంటారు.

وَإِذۡ قَالُواْ ٱللَّهُمَّ إِن كَانَ
هَٰذَا هُوَ ٱلۡحَقَّ مِنۡ عِندِكَ فَأَمۡطِرۡ
عَلَيۡنَا حِجَارَةٗ مِّنَ ٱلسَّمَآءِ أَوِ
ٱئۡتِنَا بِعَذَابٍ أَلِيمٖ ٣٢
وَمَا كَانَ ٱللَّهُ لِيُعَذِّبَهُمۡ
وَأَنتَ فِيهِمۡۚ وَمَا كَانَ ٱللَّهُ
مُعَذِّبَهُمۡ وَهُمۡ يَسۡتَغۡفِرُونَ ٣٣
وَمَا لَهُمۡ أَلَّا يُعَذِّبَهُمُ ٱللَّهُ وَهُمۡ
يَصُدُّونَ عَنِ ٱلۡمَسۡجِدِ ٱلۡحَرَامِ
وَمَا كَانُوٓاْ أَوۡلِيَآءَهُۥٓۚ إِنۡ أَوۡلِيَآؤُهُۥٓ
إِلَّا ٱلۡمُتَّقُونَ وَلَٰكِنَّ أَكۡثَرَهُمۡ لَا
يَعۡلَمُونَ ٣٤
وَمَا كَانَ صَلَاتُهُمۡ عِندَ ٱلۡبَيۡتِ
إِلَّا مُكَآءٗ وَتَصۡدِيَةٗۚ فَذُوقُواْ
ٱلۡعَذَابَ بِمَا كُنتُمۡ تَكۡفُرُونَ
٣٥

**32**. మరియు వారు: "ఓ అల్లాహ్! ఇది (ఈ ఖుర్ఆన్) నిజంగా నీ తరఫునుండి వచ్చిన సత్యమే అయితే! మాపై ఆకాశం నుండి రాళ్ళవర్షం కురిపించు! లేదా ఏదైనా బాధాకరమైన శిక్షను మా పైకి తీసుకొనిరా!" అని పలికిన మాట (జ్ఞాపకం చేసుకోండి).

**33**. కాని (ఓ ము'హమ్మద్!) నీవు వారి మధ్య ఉన్నంతవరకు అల్లాహ్ వారిని ఏ మాత్రం శిక్షించడు. మరియు వారు క్షమాభిక్ష కోరుతూ ఉన్నంతవరకు కూడా! అల్లాహ్ వారిని ఏమాత్రం శిక్షించడు.

**34**. వారి వాదమేమిటీ? అల్లాహ్ వారిని ఎందుకు శిక్షించకూడదు? వారు దాని ధర్మకర్తలు కాకున్నా, వారు ప్రజలను మస్జిద్ అల్-'హరామ్ నుండి ఆపుతున్నారు.[1] దాని ధర్మకర్తలు కేవలం దైవభీతి గలవారే కాగలరు. కాని వాస్తవానికి చాలామంది ఇది తెలుసుకోలేరు.

**35**. మరియు (అల్లాహ్) గృహం (క'అబహ్) వద్ద వారి ప్రార్థనలు, కేవలం ఈలలు వేయటం (ముకాఅ') మరియు చప్పట్లు కొట్టడం (త'స్దియహ్) తప్ప మరేమీ లేవు. కావున మీ సత్యతిరస్కారానికి బదులుగా ఈ శిక్షను రుచిచూడండి.[2]

---

**1**. ముష్రిక్ ఖురైషులు, ముస్లింలు అయిన వారిని క'అబహ్ లోకి ప్రవేశించకుండా ఆపేవారు.

**2**. ఇదే విధంగా ఈ కాలంలో కూడా మూఢులైన 'సూఫీలు, మస్జిద్‌లలో మరియు ఆస్థానాలలో డోలు కొట్టుతూ నాట్యంచేస్తూ కాలక్షేపం చేస్తూ ఉంటారు. ఈ విధంగానే మేము అల్లాహుతా'ఆలాను సంతోషపరుస్తాము, అని అంటారు. అల్లాహ్ (సు.తా.) విశ్వాసులను ఇలాంటి విషయాల నుండి కాపాడు గాక!

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ يُنفِقُونَ أَمْوَٰلَهُمْ لِيَصُدُّواْ عَن سَبِيلِ ٱللَّهِۚ فَسَيُنفِقُونَهَا ثُمَّ تَكُونُ عَلَيْهِمْ حَسْرَةً ثُمَّ يُغْلَبُونَۗ وَٱلَّذِينَ كَفَرُوٓاْ إِلَىٰ جَهَنَّمَ يُحْشَرُونَ ٣٦

36. నిశ్చయంగా సత్యతిరస్కారులు, ప్రజలను అల్లాహ్ మార్గం వైపునకు రాకుండా ఆపటానికి, తమ ధనం ఖర్చుచేస్తారు. వారు ఇలాగే ఖర్చుచేస్తూ ఉంటారు; చివరకు అది వారి వ్యసనా(దుఃఖా)నికి కారణమవుతుంది. తరువాత వారు పరాధీనులవుతారు. మరియు సత్యతిరస్కారులైన వారు నరకం వైపుకు సమీకరించబడతారు.

لِيَمِيزَ ٱللَّهُ ٱلْخَبِيثَ مِنَ ٱلطَّيِّبِ وَيَجْعَلَ ٱلْخَبِيثَ بَعْضَهُۥ عَلَىٰ بَعْضٍ فَيَرْكُمَهُۥ جَمِيعًا فَيَجْعَلَهُۥ فِى جَهَنَّمَۚ أُوْلَٰٓئِكَ هُمُ ٱلْخَٰسِرُونَ ٣٧

37. ఇదంతా అల్లాహ్, చెడును (దుష్టులను), మంచి (సత్పురుషుల) నుండి వేరుచేసి, దుష్టులందరినీ ఒకరితోపాటు మరొకరిని చేకూర్చి, ఒక గుంపుగా చేసి వారందరినీ నరకంలో పడవేయటానికి. ఇలాంటి వారు! వారే నష్టపోయే వారు.

قُل لِّلَّذِينَ كَفَرُوٓاْ إِن يَنتَهُواْ يُغْفَرْ لَهُم مَّا قَدْ سَلَفَ وَإِن يَعُودُواْ فَقَدْ مَضَتْ سُنَّتُ ٱلْأَوَّلِينَ ٣٨

38. సత్యతిరస్కారులతో ఇలా అను: ఒకవేళ వారు మానుకుంటే గడిచిపోయింది క్షమించబడుతుంది, కాని వారు (పూర్వ వైఖరినే) మళ్ళీ అవలంబిస్తే! వాస్తవానికి, (దుష్టులైన) పూర్వీకుల విషయంలో జరిగిందే, మరల వారికి సంభవిస్తుంది![1]

1. అంటే వారు సత్యతిరస్కారం మరియు దుష్టకర్మలలో మునిగి ఉంటే, వారిపై అల్లాహ్ (సు.తా.) శిక్ష తప్పక పడుతుందని తెలుసుకోవాలి.

وَقَٰتِلُوهُمْ حَتَّىٰ لَا تَكُونَ فِتْنَةٌ وَيَكُونَ ٱلدِّينُ كُلُّهُۥ لِلَّهِ ۚ فَإِنِ ٱنتَهَوْا۟ فَإِنَّ ٱللَّهَ بِمَا يَعْمَلُونَ بَصِيرٌ ﴿٣٩﴾

**39**. మరియు అధర్మం (ఫిత్న)[1] ఏ మాత్రం మిగలకుండా పోయేవరకు మరియు ఆరాధన (ధర్మం) కేవలం అల్లాహ్ కే ప్రత్యేకించబడనంతవరకు వారి(సత్యతిరస్కారుల)తో పోరాడుతూ ఉండండి. కాని వారు (పోరాడటం) మానుకుంటే! నిశ్చయంగా అల్లాహ్ వారి కర్మలను గమనిస్తున్నాడు.

وَإِن تَوَلَّوْا۟ فَٱعْلَمُوٓا۟ أَنَّ ٱللَّهَ مَوْلَىٰكُمْ ۚ نِعْمَ ٱلْمَوْلَىٰ وَنِعْمَ ٱلنَّصِيرُ ﴿٤٠﴾

**40**. మరియు ఒకవేళ వారు తిరిగిపోతే! నిశ్చయంగా, అల్లాహ్ మీ స్నేహితుడు (సంరక్షకుడు) అని తెలుసుకోండి. ఆయనే ఉత్తమ స్నేహితుడు (సంరక్షకుడు) మరియు ఉత్తమ సహాయకుడూను!

---

**1**. ఫిత్నతున్: అంటే ఇక్కడ సత్యతిరస్కారం మరియు అధర్మం అని అర్థం. చూడండి, 2:193. ఈ విధమైన ఆయతే అక్కడ కూడా ఉంది. ఇంకా చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-1, 'హదీస్' నం. 24 మరియు పుస్తకం-3, 'హదీస్' నం. 425.

۞ وَٱعۡلَمُوٓاْ أَنَّمَا غَنِمۡتُم مِّن شَيۡءٖ فَأَنَّ لِلَّهِ خُمُسَهُۥ وَلِلرَّسُولِ وَلِذِي ٱلۡقُرۡبَىٰ وَٱلۡيَتَٰمَىٰ وَٱلۡمَسَٰكِينِ وَٱبۡنِ ٱلسَّبِيلِ إِن كُنتُمۡ ءَامَنتُم بِٱللَّهِ وَمَآ أَنزَلۡنَا عَلَىٰ عَبۡدِنَا يَوۡمَ ٱلۡفُرۡقَانِ يَوۡمَ ٱلۡتَقَى ٱلۡجَمۡعَانِۗ وَٱللَّهُ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٌ ٤١ إِذۡ أَنتُم بِٱلۡعُدۡوَةِ ٱلدُّنۡيَا وَهُم بِٱلۡعُدۡوَةِ ٱلۡقُصۡوَىٰ وَٱلرَّكۡبُ أَسۡفَلَ مِنكُمۡۚ وَلَوۡ تَوَاعَدتُّمۡ

**41.** (*) మరియు మీ విజయధనంలో[1] నిశ్చయంగా అయిదవ భాగం, అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తకు మరియు (అతని) దగ్గరి బంధువులకు మరియు అనాథులకు మరియు యాచించని పేదవారికి[2] మరియు ప్రయాణీకులలకు ఉందని తెలుసుకోండి, ఒకవేళ మీరు - అల్లాహ్‌ను మరియు మేము సత్యా సత్యాల అంతరాన్ని విశదంచేసే దినమున, ఆ రెండు సైన్యాలు మార్కొనిన (బద్ర్‌యుద్ధ) దినమున మా దాసునిపై అవతరింపజేసిన దానిని - విశ్వసించే వారే అయితే! మరియు అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.[3]

**42.** (ఆ దినాన్ని గుర్తుకు తెచ్చుకోండి!) అప్పుడు మీరు లోయలో (మదీనాకు) సమీపంగా ఉన్న స్థలంలో ఉన్నారు మరియు వారు (ముష్రికులు) దూరంగా ఉన్న ఉన్న స్థలంలో ఉన్నారు.[4] మరియు బిడారం మీకు

---

**1.** 'గనీమతున్: విజయధనం, అంటే సత్యతిరస్కారులతో జరిగిన ధర్మయుద్ధంలో గెలుపు పొందిన తరువాత ముస్లింలకు దొరికేదంతా.

**2.** ఇక్కడ అల్-మిస్కీనున్, అనే శబ్దం ఉంది. ఇది అల్-ఫుఖరా కంటే భిన్నమైనది. ఫఖీరున్ - అంటే ఏమీ లేనందుకు ఇతరులనుండి యాచించే వాడు. మిస్కీన్ అంటే అతని దగ్గర కొంత ఆదాయం ఉంది, కాని అది అతని నిత్యావసరాలకు పూర్తికాదు. ఇట్టివారు తమస్వాభిమానం వల్ల ఇతరులను సహాయానికై యాచించరు.

**3.** బద్ర్ యుద్ధం - యుద్ధ సామాగ్రి తక్కువ తీసుకొని కేవలం వాణిజ్య బిడారాన్ని దోచుకోవటానికి వచ్చిన 313 ముస్లింలు మరియు వారిని పూర్తిగా నిర్మూలించాలనే ఉద్దేశంతో! అత్యధిక యుద్ధసామాగ్రితో వచ్చిన ముష్రిక్ ఖురైషుల మధ్య జరిగింది. అల్లాహ్ (సు.తా.) తాను పంపిన ప్రవక్త ము'హమ్మద్ ('స'అస) సత్యవంతుడు, సన్మార్గంపై ఉన్నాడు మరియు తాను పంపిన, జీవన మార్గమే (ఇస్లామే), మోక్షం (స్వర్గం) పొందటానికి సరైన మార్గమని నిరూపించదలచి, ఈ యుద్ధాన్ని చేయించి, ముస్లింలకు విజయాన్ని చేకూర్చి, సత్యాసత్యాల మధ్య భేదాన్ని నిరూపించాడు. చివరకు సత్యమే వర్ధిల్లుతుందని చూపాడు.

**4.** 'ఉద్‌వతిద్దునియా: సమీప స్థలం. అంటే బద్ర్ లోయలో, మదీనా నుండి సమీపంలోనున్న స్థలం. మరియు 'ఉద్‌వతిల్ ఖు'స్వా: అంటే, బద్ర్ లోయలో, మొదటి స్థలంతో పోల్చితే మదీనా నుండి దూరంగా ఉన్న స్థలం.

لَاخْتَلَفْتُمْ فِي الْمِيعَادِ ۙ وَلَٰكِن لِّيَقْضِيَ اللَّهُ أَمْرًا كَانَ مَفْعُولًا لِّيَهْلِكَ مَنْ هَلَكَ عَن بَيِّنَةٍ وَيَحْيَىٰ مَنْ حَيَّ عَن بَيِّنَةٍ ۗ وَإِنَّ اللَّهَ لَسَمِيعٌ عَلِيمٌ ﴿٤٢﴾

క్రింది (ఒడ్డు) వైపునకు ఉండింది. ఒకవేళ మీరు (ఇరువురు) యుద్ధం చేయాలని నిర్ణయించుకొని ఉంటే! మీరు మీ నిర్ణయాన్ని పాటించకుండా ఉండేవారు. కాని అల్లాహ్ తాను నిర్ణయించిన కార్యాన్ని పూర్తిచేయటానికి, నశించే వాడు స్పష్టమైన నిదర్శనం పొందిన తరువాత నశించాలని మరియు జీవించేవాడు స్పష్టమైన నిదర్శనం పొందిన తరువాత జీవించాలని అలా చేశాడు. మరియు నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

إِذْ يُرِيكَهُمُ اللَّهُ فِي مَنَامِكَ قَلِيلًا ۖ وَلَوْ أَرَاكَهُمْ كَثِيرًا لَّفَشِلْتُمْ وَلَتَنَازَعْتُمْ فِي الْأَمْرِ وَلَٰكِنَّ اللَّهَ سَلَّمَ ۗ إِنَّهُ عَلِيمٌ بِذَاتِ الصُّدُورِ ﴿٤٣﴾

**43**. (ఓ ప్రవక్తా!) అల్లాహ్ నీకు, నీ స్వప్నంలో వారిని కొద్దిమందిగా చూపింది (జ్ఞాపకం చేసుకో)! వారిని ఎక్కువ మందిగా నీకు చూపి ఉంటే, మీరు తప్పక ధైర్యాన్ని కోల్పోయి (యుద్ధ) విషయంలో వాదులాడే వారు. కాని వాస్తవానికి, అల్లాహ్ మిమ్మల్ని రక్షించాడు. నిశ్చయంగా, ఆయనకు హృదయాలలో ఉన్న విషయాలన్నీ బాగా తెలుసు.

وَإِذْ يُرِيكُمُوهُمْ إِذِ الْتَقَيْتُمْ فِي أَعْيُنِكُمْ قَلِيلًا وَيُقَلِّلُكُمْ فِي أَعْيُنِهِمْ لِيَقْضِيَ اللَّهُ أَمْرًا كَانَ مَفْعُولًا ۗ وَإِلَى اللَّهِ تُرْجَعُ الْأُمُورُ ﴿٤٤﴾

**44**. మరియు (జ్ఞాపకం చేసుకోండి) అల్లాహ్ నెరవేర్చవలసిన పనిని నెరవేర్చటానికి, మీరు (బద్ర్ యుద్ధ రంగంలో) మార్కొనినపుడు, వారి (అవిశ్వాసుల) సైన్యాన్ని మీ కన్నులకు కొద్దిగా చూపాడు మరియు మిమ్మల్ని కొద్దిమందిగా వారికి చూపాడు. మరియు అన్ని వ్యవహారాలూ (నిర్ణయానికి) అల్లాహ్ వైపునకే మరలింపబడతాయి.

**45**. ఓ విశ్వాసులారా! మీరు ఏ సైన్యాన్నైనా ఎదుర్కొనేటప్పుడు స్థైర్యంతో ఉండండి. మరియు అల్లాహ్‌ను అత్యధికంగా స్మరిస్తే, మీరు సాఫల్యం పొందవచ్చు!

**46**. మరియు అల్లాహ్‌కు మరియు ఆయన ప్రవక్తకు విధేయులై ఉండండి మరియు పరస్పర కలహాలకు గురికాకండి, అట్లుచేస్తే మీరు బలహీనులవుతారు మరియు మీ బలసాహసాలు తగ్గిపోతాయి. మరియు సహనం వహించండి. నిశ్చయంగా, అల్లాహ్ సహనం వహించేవారితో ఉంటాడు.

**47**. మరియు తమ గృహాలనుండి, ప్రజలకు చూపటానికి దురాభిమానంతో బయలుదేరి ఇతరులను అల్లాహ్ మార్గం నుండి ఆపేవారివలే కాకండి. మరియు వారు చేసే క్రియలన్నింటినీ అల్లాహ్ పరివేష్టించి ఉన్నాడు.

**48**. మరియు (జ్ఞాపకం చేసుకోండి అవిశ్వాసులకు) వారి కర్మలు ఉత్తమమైనవిగా చూపించి షైతాన్ వారితో అన్నాడు: "ఈ రోజు ప్రజలలో ఎవ్వడునూ మిమ్మల్ని జయించలేడు, (ఎందుకంటే) నేను మీకు తోడుగా ఉన్నాను." కాని ఆ రెండుపక్షాలు పరస్పరం ఎదురుపడినపుడు, అతడు తన మడమలపై వెనకకుమరలి అన్నాడు: "వాస్తవంగా, నాకు మీతో ఎలాంటి సంబంధం లేదు, మీరు చూడనిది నేను చూస్తున్నాను. నిశ్చయంగా, నేను అల్లాహ్‌కు భయపడు తున్నాను.[1] మరియు అల్లాహ్ శిక్ష విధించటంలో చాలా కఠినుడు."

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِذَا لَقِيتُمۡ
فِئَةٗ فَٱثۡبُتُواْ وَٱذۡكُرُواْ ٱللَّهَ
كَثِيرٗا لَّعَلَّكُمۡ تُفۡلِحُونَ ٤٥

وَأَطِيعُواْ ٱللَّهَ وَرَسُولَهُۥ وَلَا تَنَٰزَعُواْ
فَتَفۡشَلُواْ وَتَذۡهَبَ رِيحُكُمۡۖ وَٱصۡبِرُوٓاْۚ
إِنَّ ٱللَّهَ مَعَ ٱلصَّٰبِرِينَ ٤٦

وَلَا تَكُونُواْ كَٱلَّذِينَ خَرَجُواْ مِن
دِيَٰرِهِم بَطَرٗا وَرِئَآءَ ٱلنَّاسِ
وَيَصُدُّونَ عَن سَبِيلِ ٱللَّهِۚ وَٱللَّهُ
بِمَا يَعۡمَلُونَ مُحِيطٞ ٤٧

وَإِذۡ زَيَّنَ لَهُمُ ٱلشَّيۡطَٰنُ أَعۡمَٰلَهُمۡ
وَقَالَ لَا غَالِبَ لَكُمُ ٱلۡيَوۡمَ
مِنَ ٱلنَّاسِ وَإِنِّي جَارٞ لَّكُمۡۖ
فَلَمَّا تَرَآءَتِ ٱلۡفِئَتَانِ نَكَصَ عَلَىٰ
عَقِبَيۡهِ وَقَالَ إِنِّي بَرِيٓءٞ مِّنكُمۡ
إِنِّيٓ أَرَىٰ مَا لَا تَرَوۡنَ إِنِّيٓ أَخَافُ
ٱللَّهَۚ وَٱللَّهُ شَدِيدُ ٱلۡعِقَابِ ٤٨

---

1. చూడండి, 59:16.

إِذۡ يَقُولُ ٱلۡمُنَٰفِقُونَ وَٱلَّذِينَ فِي قُلُوبِهِم مَّرَضٌ غَرَّ هَٰٓؤُلَآءِ دِينُهُمۡۗ وَمَن يَتَوَكَّلۡ عَلَى ٱللَّهِ فَإِنَّ ٱللَّهَ عَزِيزٌ حَكِيمٞ ٤٩

**49**. కపటవిశ్వాసులు మరియు ఎవరి హృదయాలలో రోగముందో వారు: "వీరిని (ఈ విశ్వాసులను) వారి ధర్మం మోసపుచ్చింది." అని అంటారు, కాని అల్లాహ్‌యందు నమ్మకం గలవాని కొరకు, నిశ్చయంగా అల్లాహ్ సర్వ శక్తిమంతుడు మహా వివేచనాపరుడు.

وَلَوۡ تَرَىٰٓ إِذۡ يَتَوَفَّى ٱلَّذِينَ كَفَرُواْ ٱلۡمَلَٰٓئِكَةُ يَضۡرِبُونَ وُجُوهَهُمۡ وَأَدۡبَٰرَهُمۡ وَذُوقُواْ عَذَابَ ٱلۡحَرِيقِ ٥٠

**50**. మరియు సత్యతిరస్కారుల ప్రాణాలను దైవదూతలు తీసే దృశ్యాన్ని నీవు చూడగలిగితే (ఎంత బాగుండేది). వారు (దేవదూతలు) వారి ముఖాలపైనను మరియు వారి పిరుదులపైనను కొడుతూ ఇలా అంటారు: "భగభగ మండే ఈ నరకాగ్ని శిక్షను చవిచూడండి.[1]

ذَٰلِكَ بِمَا قَدَّمَتۡ أَيۡدِيكُمۡ وَأَنَّ ٱللَّهَ لَيۡسَ بِظَلَّٰمٖ لِّلۡعَبِيدِ ٥١

**51**. "ఇది మీరు స్వయంగా మీ చేతులారా చేసి పంపిన కర్మల ఫలితమే! మరియు నిశ్చయంగా, అల్లాహ్ తన దాసులకు ఏ మాత్రం అన్యాయం చేయడు."

كَدَأۡبِ ءَالِ فِرۡعَوۡنَ وَٱلَّذِينَ مِن قَبۡلِهِمۡۚ كَفَرُواْ بِـَٔايَٰتِ ٱللَّهِ فَأَخَذَهُمُ ٱللَّهُ بِذُنُوبِهِمۡۗ إِنَّ ٱللَّهَ قَوِيّٞ شَدِيدُ ٱلۡعِقَابِ ٥٢

**52**. ఫిర్'ఔన్ జాతివారి మరియు వారికి పూర్వం వారి మాదిరిగా, వీరు కూడా అల్లాహ్ సూచన(ఆయాత్)లను తిరస్కరించారు, కాబట్టి అల్లాహ్ వారి పాపాల ఫలితంగా వారిని శిక్షించాడు. నిశ్చయంగా అల్లాహ్ మహా బలవంతుడు, శిక్ష విధించటంలో చాలా కఠినుడు.[2]

---

**1**. చూడండి, 6:93.

**2**. షదీద్ అల్-'ఇఖాబ్: Severe in Chastising కఠినంగా శిక్షించేవాడు, పటిష్ఠంగా పట్టుకునేవాడు.

ذَٰلِكَ بِأَنَّ ٱللَّهَ لَمۡ يَكُ مُغَيِّرٗا نِّعۡمَةً أَنۡعَمَهَا عَلَىٰ قَوۡمٍ حَتَّىٰ يُغَيِّرُواْ مَا بِأَنفُسِهِمۡ وَأَنَّ ٱللَّهَ سَمِيعٌ عَلِيمٞ ٥٣

**53**. ఇది ఎందుకంటే! వాస్తవానికి, ఒక జాతివారు, తమ నడవడికను తాము మార్చుకోనంత వరకు, అల్లాహ్ వారికి ప్రసాదించిన తన అనుగ్రహాన్ని ఉపసంహరించుకోడు.[1] మరియు నిశ్చయంగా అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

كَدَأۡبِ ءَالِ فِرۡعَوۡنَ وَٱلَّذِينَ مِن قَبۡلِهِمۡۚ كَذَّبُواْ بِـَٔايَٰتِ رَبِّهِمۡ فَأَهۡلَكۡنَٰهُم بِذُنُوبِهِمۡ وَأَغۡرَقۡنَآ ءَالَ فِرۡعَوۡنَۚ وَكُلّٞ كَانُواْ ظَٰلِمِينَ ٥٤

**54**. ఫిర్ఔను జాతి వారు మరియు వారికి పూర్వం వారి మాదిరిగా! వీరు కూడా తమ ప్రభువు సూచన (ఆయాత్)లను అబద్ధాలని నిరాకరించారు. కాబట్టి వారి పాపాలకు ఫలితంగా వారిని నాశనంచేశాము. మరియు ఫిర్ఔను జాతివారిని ముంచివేశాము. మరియు వారందరూ దుర్మార్గులు.[2]

إِنَّ شَرَّ ٱلدَّوَآبِّ عِندَ ٱللَّهِ ٱلَّذِينَ كَفَرُواْ فَهُمۡ لَا يُؤۡمِنُونَ ٥٥

**55**. నిశ్చయంగా అల్లాహ్ దృష్టిలో సత్యాన్ని తిరస్కరించినవారు నీచాతి నీచమైన జీవులు, ఇక వారు విశ్వసించరు.[3]

ٱلَّذِينَ عَٰهَدتَّ مِنۡهُمۡ ثُمَّ يَنقُضُونَ عَهۡدَهُمۡ فِي كُلِّ مَرَّةٖ وَهُمۡ لَا يَتَّقُونَ ٥٦

**56**. వారిలో ఎవరితోనైతే నీవు ఒడంబడిక చేసుకున్నావో! వారు ప్రతిసారీ తమ ఒడంబడికను భంగపరుస్తున్నారు. మరియు వారికి దైవభీతిలేదు.[4]

---

**1**. చూడండి, 13:11.

**2**. అల్లాహ్ (సు.తా.) ఎవరికీ అన్యాయం చేయడు. చూడండి, 41:46.

**3**. సత్యతిరస్కారులు అల్లాహ్ (సు.తా.) దృష్టిలో మానవులలోనే కాదు, జంతువులలో కూడా నీచాతినీచ జాతికిచెందిన వారు అని అర్థం.

**4**. కొందరు వ్యాఖ్యాతలు, వీరు బనూ-ఖురైజహ్ అనే యూద తెగవారు అని అంటారు. కందక యుద్ధ కాలంలో వీరు సత్యతిరస్కారులకు సహాయపడమని దైవప్రవక్త ('స'అస)తో ఒడంబడిక చేసుకుంటారు. కాని వారు తమ ఒడంబడికకు కట్టుబడి ఉండరు. దీని మరొక భావం ఏమిటంటే ముస్లింలు, ఇతర ధర్మాల వారితో ఒప్పందాలు చేసుకొని వారితో శాంతియుతంగా నివసించడం, ధర్మ సమ్మతం మరియు యుక్తమైనది కూడాను. కాని వారు బహిరంగంగా విశ్వాసఘాతకానికి పూనుకుంటే వారితో పోరాడాలి.

فَإِمَّا تَثۡقَفَنَّهُمۡ فِي ٱلۡحَرۡبِ فَشَرِّدۡ بِهِم مَّنۡ خَلۡفَهُمۡ لَعَلَّهُمۡ يَذَّكَّرُونَ ٥٧

**57**. ఒకవేళ నీవు యుద్ధరంగంలో వారిపై ప్రాబల్యం పొందితే - వారి వెనుక ఉన్న వారు చెల్లాచెదరై పోయేటట్లుగా - వారిని శిక్షించు. బహుశా వారు గుణపాఠం నేర్చుకోవచ్చు!

وَإِمَّا تَخَافَنَّ مِن قَوۡمٍ خِيَانَةٗ فَٱنۢبِذۡ إِلَيۡهِمۡ عَلَىٰ سَوَآءٍۚ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ ٱلۡخَآئِنِينَ ٥٨

**58**. మరియు ఒకవేళ నీకు ఏ జాతివారి వల్లనైనా నమ్మకద్రోహం జరుగుతుందనే భయమే ఉంటే - మీరు ఇరుపక్షం వారు సరిసమానులని తెలుపటానికి[1] - (వారి ఒప్పందాన్ని) వారివైపుకు విసరివేయి. నిశ్చయంగా, అల్లాహ్ నమ్మకద్రోహులు అంటే ఇష్టపడడు.

وَلَا يَحۡسَبَنَّ ٱلَّذِينَ كَفَرُواْ سَبَقُوٓاْۚ إِنَّهُمۡ لَا يُعۡجِزُونَ ٥٩

**59**. మరియు సత్యతిరస్కారులు, తాము తప్పించుకున్నామని భావించ నవసరంలేదు. నిశ్చయంగా, వారు (అల్లాహ్ శిక్షనుండి) తప్పించుకోలేరు.

وَأَعِدُّواْ لَهُم مَّا ٱسۡتَطَعۡتُم مِّن قُوَّةٖ وَمِن رِّبَاطِ ٱلۡخَيۡلِ تُرۡهِبُونَ بِهِۦ عَدُوَّ ٱللَّهِ وَعَدُوَّكُمۡ وَءَاخَرِينَ مِن دُونِهِمۡ لَا تَعۡلَمُونَهُمُ ٱللَّهُ يَعۡلَمُهُمۡۚ وَمَا تُنفِقُواْ مِن شَيۡءٖ فِي سَبِيلِ ٱللَّهِ يُوَفَّ إِلَيۡكُمۡ وَأَنتُمۡ لَا تُظۡلَمُونَ ٦٠

**60**. మరియు మీరు మీశక్తి మేరకు బలసామాగ్రిని, యుద్ధపు గుర్రాలను సిద్ధపరచుకొని, దాని ద్వారా అల్లాహ్‌కు శత్రువులైన మీ శత్రువులను మరియు అల్లాహ్‌కు తెలిసి, మీకు తెలియని ఇతరులను కూడా భయకంపితులుగా చేయండి. మరియు అల్లాహ్ మార్గంలో మీరు ఏమి ఖర్చుచేసినా దాని ఫలితం మీకు పూర్తిగా చెల్లించబడుతుంది. మరియు మీకెలాంటి అన్యాయం జరుగదు. (1/8)

---

**1**. 'అలా సవాఇ'న్: అంటే సరిసమానులని తెలుపటానికి. అంటే మీరు ఒడంబడికను త్రెంపి నందుకు మేము కూడా ఆ ఒడంబడికను త్రెంపుతున్నాము. ఇక మీదట ప్రతి ఒక్కరు తమ రక్షణకు తామే బాధ్యులని, స్పష్టం చేయటం.

۞ وَإِن جَنَحُواْ لِلسَّلۡمِ فَٱجۡنَحۡ لَهَا وَتَوَكَّلۡ عَلَى ٱللَّهِۚ إِنَّهُۥ هُوَ ٱلسَّمِيعُ ٱلۡعَلِيمُ ﴿٦١﴾ وَإِن يُرِيدُوٓاْ أَن يَخۡدَعُوكَ فَإِنَّ حَسۡبَكَ ٱللَّهُۚ هُوَ ٱلَّذِيٓ أَيَّدَكَ بِنَصۡرِهِۦ وَبِٱلۡمُؤۡمِنِينَ ﴿٦٢﴾ وَأَلَّفَ بَيۡنَ قُلُوبِهِمۡۚ لَوۡ أَنفَقۡتَ مَا فِي ٱلۡأَرۡضِ جَمِيعٗا مَّآ أَلَّفۡتَ بَيۡنَ قُلُوبِهِمۡ وَلَٰكِنَّ ٱللَّهَ أَلَّفَ بَيۡنَهُمۡۚ إِنَّهُۥ عَزِيزٌ حَكِيمٞ ﴿٦٣﴾ يَٰٓأَيُّهَا ٱلنَّبِيُّ حَسۡبُكَ ٱللَّهُ وَمَنِ ٱتَّبَعَكَ مِنَ ٱلۡمُؤۡمِنِينَ ﴿٦٤﴾ يَٰٓأَيُّهَا ٱلنَّبِيُّ حَرِّضِ ٱلۡمُؤۡمِنِينَ عَلَى ٱلۡقِتَالِۚ إِن يَكُن مِّنكُمۡ عِشۡرُونَ صَٰبِرُونَ يَغۡلِبُواْ مِاْئَتَيۡنِۚ وَإِن يَكُن مِّنكُم مِّاْئَةٞ يَغۡلِبُوٓاْ أَلۡفٗا مِّنَ ٱلَّذِينَ كَفَرُواْ بِأَنَّهُمۡ قَوۡمٞ لَّا يَفۡقَهُونَ ﴿٦٥﴾

**61**. * కాని ఒకవేళ వారు శాంతివైపుకు మొగ్గితే నీవు కూడా దానికి దిగు మరియు అల్లాహ్‌పై ఆధారపడు.[1] నిశ్చయంగా ఆయన సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

**62**. కాని ఒకవేళ వారు నిన్ను మోసగించాలని సంకల్పిస్తే! నిశ్చయంగా, నీకు అల్లాహ్‌యే చాలు. ఆయనే తన సహాయం ద్వారా మరియు విశ్వాసుల ద్వారా నిన్ను బలపరిచాడు.

**63**. మరియు ఆయనే వారి (విశ్వాసుల) హృదయాలను కలిపాడు. ఒకవేళ నీవు భూమిలో ఉన్న సమస్తాన్ని ఖర్చుచేసినా, వారి హృదయాలను కలుపజాలవు. కాని అల్లాహ్‌యే వారిమధ్య ప్రేమను కలిగించాడు.[2] నిశ్చయంగా ఆయన సర్వశక్తి సంపన్నుడు, మహా వివేచనాపరుడు.

**64**. ఓ ప్రవక్తా! నీకూ మరియు నిన్ను అనుసరించే విశ్వాసులకు అల్లాహ్‌యే చాలు!

**65**. ఓ ప్రవక్తా! విశ్వాసులను యుద్ధానికి ప్రోత్సహించు. మీలో ఇరవై మంది స్థైర్యం గలవారుంటే వారు రెండువందల మందిని జయించగలరు. మరియు మీరు వందమంది ఉంటే వేయిమంది సత్యతిరస్కారులను జయించగలరు. ఎందుకంటే వారు (సత్యాన్ని) గ్రహించలేని జాతికి చెందినవారు.[3]

---

**1**. చూడండి, 47:35 మరియు 8:39.

**2**. చూడండి, 3:103. 'హునైన్ విజయధనం పంచేటప్పుడు ము'హమ్మద్ ('స'అస) మదీనా అన్సార్‌లను ఉద్దేశించి చేసిన ప్రసంగానికి చూడండి, ('స'హీ'హ్ బు'ఖారీ, కితాబ్ అల్-మ'గా'జీ, బాబ్ 'గ'జ్వత్ అ'త్తాయ'ఫ్, 'స. ముస్లిం కితాబ్ అ'జ్జకాత్, బాబ్ ఇ'అతా' అల్-ముఅ'ల్లఫత్ ఖులూబుహుమ్ 'అలా అల్-ఇస్లాం).

**3**. చూడండి, 6:25, 7:179, 9:87.

ٱلۡـَٔـٰنَ خَفَّفَ ٱللَّهُ عَنكُمۡ وَعَلِمَ
أَنَّ فِيكُمۡ ضَعۡفٗاۚ فَإِن يَكُن
مِّنكُم مِّاْئَةٞ صَابِرَةٞ يَغۡلِبُواْ
مِاْئَتَيۡنِۚ وَإِن يَكُن مِّنكُمۡ أَلۡفٞ
يَغۡلِبُوٓاْ أَلۡفَيۡنِ بِإِذۡنِ ٱللَّهِۗ وَٱللَّهُ مَعَ
ٱلصَّٰبِرِينَ ٦٦

**66**. ఇప్పుడు అల్లాహ్ మీ భారాన్ని తగ్గించాడు, ఎందుకంటే వాస్తవానికి, మీలో బలహీనత ఉన్నదని ఆయనకు తెలుసు. కాబట్టి మీలో వందమంది స్థైర్యం గలవారు ఉంటే వారు రెండువందల మందిని జయించగలరు. మరియు మీరు వేయిమంది ఉంటే, అల్లాహ్ సెలవుతో రెండువేల మందిని జయించగలరు. మరియు అల్లాహ్ సహనం గలవారితో ఉంటాడు.

مَا كَانَ لِنَبِيٍّ أَن يَكُونَ لَهُۥٓ
أَسۡرَىٰ حَتَّىٰ يُثۡخِنَ فِي ٱلۡأَرۡضِۚ
تُرِيدُونَ عَرَضَ ٱلدُّنۡيَا وَٱللَّهُ يُرِيدُ
ٱلۡأٓخِرَةَۗ وَٱللَّهُ عَزِيزٌ حَكِيمٞ ٦٧

**67**. (శత్రువులతో తీవ్రంగా పోరాడి, వారిని) పూర్తిగా అణచనంతవరకు, తన వద్ద యుద్ధఖైదీలను ఉంచుకోవటం ధరణిలో, ఏ ప్రవక్తకూ తగదు.[1] మీరు ప్రాపంచిక సామగ్రి కోరుతున్నారు. కాని అల్లాహ్ (మీ కొరకు) పరలోక (సుఖాన్ని) కోరుతున్నాడు. మరియు అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేచనాపరుడు.

لَّوۡلَا كِتَٰبٞ مِّنَ ٱللَّهِ سَبَقَ لَمَسَّكُمۡ
فِيمَآ أَخَذۡتُمۡ عَذَابٌ عَظِيمٞ ٦٨

**68**. ఒకవేళ అల్లాహ్ (ఫర్మానా) ముందే వ్రాయబడి ఉండకపోతే, మీరు తీసుకున్న దాని(నిర్ణయాని)కి మీకు ఘోరశిక్ష విధించబడి ఉండేది.[2]

---

**1**. చూడండి, 47:4. ఈ ఆయత్ సారాంశం ఏమిటంటే: ఎంతవరకైతే శత్రువులను హతమార్చి, వారిపై పూర్తిగా ప్రాబల్యాన్ని పొందరో, జయించరో! అంతవరకు, వారితో పోరాడి వారిని హతమార్చాలి వారి యుద్ధం చేయగల శక్తిని పూర్తిగా అంతమొందించాలి. ఆ తరువాతనే వారి యుద్ధఖైదీలను విమోచనాధనం తీసుకొని విడిచే విషయం గురించి ఆలోచించాలి, లేనిచో అవకాశం దొరకగానే వారు మిమ్మల్ని, నిర్మూలించటానికి ప్రయత్నించ వచ్చు!

**2**. ఈ ఆయత్ 67వ ఆయత్ తరువాత అవతరింపజేయబడింది. 'వ్రాయబడినమాట'ను గురించి వ్యాఖ్యాతలలో భేదాభిప్రాయాలున్నాయి. కొందరు ఇది విజయధనం అంటారు. అందుకే ఫిద్య తీసుకున్నా క్షమించబడ్డారు అంటారు. మరి కొందరు బద్ర్ యుద్ధంలో పాల్గొన్నవారి 'పాపాలన్నీ క్షమించబడిన' విషయం అంటారు. మరికొందరు, దైవప్రవక్త

فَكُلُواْ مِمَّا غَنِمْتُمْ حَلَٰلًا طَيِّبًاۚ وَٱتَّقُواْ ٱللَّهَۚ إِنَّ ٱللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴿٦٩﴾

**69**. కావున మీకు ధర్మసమ్మతంగా లభించిన ఉత్తమమైన విజయధనాన్ని అనుభవించండి. అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

يَٰٓأَيُّهَا ٱلنَّبِيُّ قُل لِّمَن فِيٓ أَيْدِيكُم مِّنَ ٱلْأَسْرَىٰٓ إِن يَعْلَمِ ٱللَّهُ فِي قُلُوبِكُمْ خَيْرًا يُؤْتِكُمْ خَيْرًا مِّمَّآ أُخِذَ مِنكُمْ وَيَغْفِرْ لَكُمْۗ وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴿٧٠﴾

**70**. ఓ ప్రవక్తా! నీ అధీనంలో ఉన్న యుద్ధ ఖైదీలతో ఇలా అను: "ఒకవేళ అల్లాహ్ మీ హృదయాలలో మంచితనం చూస్తే ఆయన మీ వద్దనుండి తీసుకున్న దాని కంటే ఎంతో ఉత్తమమైన దానిని మీకు ప్రసాదించి ఉంటాడు. మరియు మిమ్మల్ని క్షమించి ఉంటాడు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత."[1]

وَإِن يُرِيدُواْ خِيَانَتَكَ فَقَدْ خَانُواْ ٱللَّهَ مِن قَبْلُ فَأَمْكَنَ مِنْهُمْۗ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٌ ﴿٧١﴾

**71**. కాని ఒకవేళ వారు నీకు నమ్మకద్రోహం చేయాలని తలచుకుంటే, వారు ఇంతకు పూర్వం అల్లాహ్‌కు నమ్మకద్రోహం చేశారు, కావున వారిపై నీకు శక్తినిచ్చాడు. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేచనాపరుడు.

వారిమధ్య ఉండటమే క్షమాపణకు కారణం అంటారు. బద్ర్‌యుద్ధంలో ఖైదీలైన 70 మంది ముష్రిక్ ఖురైషులను విమోచనాధనం (ఫిద్య) తీసుకుని విడిచిన తరువాత ఈ ఆయత్ మరియు దీని మునుపటి మరియు దీని తరువాత ఆయత్‌లు అవతరింపజేయబడ్డాయి. వివరాలకు చూడండి, ఫత్హ్ అల్-ఖదీర్.

**1**. చూడండి, 47:4.

إِنَّ ٱلَّذِينَ ءَامَنُواْ وَهَاجَرُواْ
وَجَٰهَدُواْ بِأَمۡوَٰلِهِمۡ وَأَنفُسِهِمۡ
فِي سَبِيلِ ٱللَّهِ وَٱلَّذِينَ ءَاوَواْ
وَّنَصَرُوٓاْ أُوْلَٰٓئِكَ بَعۡضُهُمۡ أَوۡلِيَآءُ
بَعۡضٖۚ وَٱلَّذِينَ ءَامَنُواْ وَلَمۡ يُهَاجِرُواْ
مَا لَكُم مِّن وَلَٰيَتِهِم مِّن شَيۡءٍ
حَتَّىٰ يُهَاجِرُواْۚ وَإِنِ ٱسۡتَنصَرُوكُمۡ
فِي ٱلدِّينِ فَعَلَيۡكُمُ ٱلنَّصۡرُ إِلَّا
عَلَىٰ قَوۡمِۭ بَيۡنَكُمۡ وَبَيۡنَهُم مِّيثَٰقٞۗ
وَٱللَّهُ بِمَا تَعۡمَلُونَ بَصِيرٞ ٧٢

**72**. నిశ్చయంగా, విశ్వసించి వలసపోయే వారూ మరియు తమ సంపద మరియు ప్రాణాలతో అల్లాహ్ మార్గంలో పోరాడే వారూ,[1] వారికి ఆశ్రయమిచ్చే వారూ మరియు సహాయం చేసేవారూ,[2] అందరూ ఒకరికొకరు మిత్రులు.[3] మరియు ఎవరైతే విశ్వసించి వలస పోలేదో వారు, వలస పోనంతవరకు వారి మైత్రిత్వంతో మీకు ఎలాంటి సంబంధం లేదు. కాని వారు ధర్మం విషయంలో మీతో సహాయం కోరితే, వారికి సహాయం చేయుటం మీ కర్తవ్యం; కాని మీతో ఒడంబడిక ఉన్న జాతివారికి వ్యతిరేకంగా మాత్రం కాదు. మరియు అల్లాహ్ మీరు చేస్తున్నదంతా చూస్తున్నాడు.

وَٱلَّذِينَ كَفَرُواْ بَعۡضُهُمۡ أَوۡلِيَآءُ
بَعۡضٍۚ إِلَّا تَفۡعَلُوهُ تَكُن فِتۡنَةٞ
فِي ٱلۡأَرۡضِ وَفَسَادٞ كَبِيرٞ
٧٣

**73**. మరియు సత్యతిరస్కారులు ఒకరికొకరు స్నేహితులు. కావున (ఓ విశ్వాసులారా!) మీరు కూడా అలా చేయక (విశ్వాసుల మధ్య పరస్పర మైత్రిత్వాన్ని పెంచక) పోతే, భూమిలో ఉపద్రవం మరియు కల్లోలం చెలరేగుతాయి.

---

**1**. వీరు వలసపోయిన 'స'హాబీలు, మొదటి శ్రేణివారు.

**2**. వీరు మదీనా ముస్లింలు (అన్సారులు), రెండవ శ్రేణివారు.

**3**. మౌలా: అంటే మిత్రుడు, స్నేహితుడు, సమర్థుడు, సహాయకుడు, సహకారుడు, ఆశ్రయమిచ్చేవాడు, సన్నిహితుడు, సంరక్షకుడు, స్వామి, బంధువు, కార్యకర్త, వారసుడు.

وَٱلَّذِينَ ءَامَنُواْ وَهَاجَرُواْ
وَجَٰهَدُواْ فِي سَبِيلِ ٱللَّهِ وَٱلَّذِينَ
ءَاوَواْ وَّنَصَرُوٓاْ أُوْلَٰٓئِكَ هُمُ
ٱلْمُؤْمِنُونَ حَقًّاۚ لَّهُم مَّغْفِرَةٌ وَرِزْقٌ
كَرِيمٌ ٧٤

**74.** మరియు ఎవరైతే విశ్వసించి వలసపోయి అల్లాహ్ మార్గంలో పోరాడారో వారూ మరియు ఎవరైతే వారికి ఆశ్రయమిచ్చి సహాయపడ్డారో వారూ! ఇలాంటి వారే నిజమైన విశ్వాసులు. వారికి వారి (పాపాల) క్షమాపణ మరియు గౌరవప్రదమైన జీవనోపాధి ఉంటాయి.

وَٱلَّذِينَ ءَامَنُواْ مِنۢ بَعْدُ وَهَاجَرُواْ
وَجَٰهَدُواْ مَعَكُمْ فَأُوْلَٰٓئِكَ مِنكُمْۚ
وَأُوْلُواْ ٱلْأَرْحَامِ بَعْضُهُمْ أَوْلَىٰ
بِبَعْضٍ فِي كِتَٰبِ ٱللَّهِۗ إِنَّ ٱللَّهَ
بِكُلِّ شَيْءٍ عَلِيمٌ ٧٥

**75.** మరియు ఎవరైతే తరువాత విశ్వసించి మరియు వలసపోయి మరియు మీతోబాటు (అల్లాహ్ మార్గంలో) పోరాడారో, వారు కూడా మీ వారే! కాని అల్లాహ్ గ్రంథం ప్రకారం, రక్తసంబంధం గలవారు (వారసత్వ విషయంలో) ఒకరిపై నొకరు ఎక్కువ హక్కుదారులు.[1] నిశ్చయంగా అల్లాహ్ కు ప్రతివిషయం గురించి బాగాతెలుసు. (1/4)

*****

**1**. విశ్వాసులు (ముస్లింలందరు) ఒకరికొకరు సహోదరులు, 49:10. కాని వారసత్వపు విషయంలో ముస్లిం బంధువులే ఒకరికొకరు వారసులవుతారు. ఒక ముస్లిం అవిశ్వాసికి గానీ, లేక ఒక అవిశ్వాసి ముస్లింనకు గానీ వారసులు కాలేరు.

## 9. సూరహ్ అత్-తౌబహ్ سُورَةُ التَّوبَةِ

ఈ సూరహ్ ప్రారంభంలో, బిస్మిల్లా హిర్ర'హ్మా నిర్ర'హీం, లేదు. కొందరు దీనిని సూరహ్ అల్- అన్ఫాల్ యొక్క మిగతా భాగమని భావిస్తారు. ఇది మదీనాలో అవతరింపజేయబడింది. ఇందులో **129 ఆయతులు** ఉన్నాయి. ఖుర్ఆన్‌లోని సబ'అ 'తవాలు, ఏడు పెద్ద సూరాలలో ఇది ఏడవది. ఈ రెండు సూరాహ్‌లలో కూడా సత్యతిరస్కారులతో జరిగిన యుద్ధాల వివరాలు ఉన్నాయి. ఈ సూరహ్ 9వ హిజ్రీ తబూక్ దండయాత్ర కాలపు విషయాలను వివరిస్తోంది. దీని పేరు, తబూక్ దండయాత్రకు వెళ్ళని కొందరు సహాబీల పశ్చాత్తాపం (తౌబహ్) మరియు దాని అంగీకారాన్ని సంబోధించి ఇవ్వబడింది. ఈ పదం **104**వ **ఆయత్**‌లో ఉంది. ఇది సూరహ్ అల్-అన్ఫాల్ (8) అవతరణకు 7 సంవత్సరాల తరువాత అవతరింపజేయబడింది. ఇది సూరహ్ ***అల్-బరాఅ'***, అని కూడా అనబడుతుంది. ఈ పదం **మొదటి** ఆయత్‌లోనే ఉంది. బరాఅ'తున్ - అంటే విముక్తి, రాహిత్యం, సంబంధం లేకపోవటం. తబూక్ మదీనా నుండి 350 మైళ్ళ దూరంలో పశ్చిమోత్తర దిశలో ఉంది. బెజాన్‌టైన్ (Byzantine), క్రైస్తవ చక్రవర్తి హిరాక్లియస్ (Hiraclius), అబూ 'ఆమిర్, ప్రోత్సాహంవల్ల అరేబియాపై దాడి చేయటానికి సన్నాహాలు చేస్తున్నాడని తెలిసి, దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) వారిని తబూక్ దగ్గర ఎదుర్కోవాలని యుద్ధ సన్నాహాల చాటింపుచేయించి, అక్కడికి వెళ్ళుతారు.

بَرَآءَةٌ مِّنَ ٱللَّهِ وَرَسُولِهِۦٓ إِلَى ٱلَّذِينَ عَـٰهَدتُّم مِّنَ ٱلْمُشْرِكِينَ ﴿١﴾

**1.** * అల్లాహ్ తరఫునుండి మరియు ఆయన ప్రవక్త తరఫునుండి (ఓ విశ్వాసులారా!) మీరు ఒడంబడిక చేసుకున్న బహుదైవారాధకుల (ముష్రికుల)తో ఎలాంటి **సంబంధంలేదు** అని ప్రకటించబడుతోంది.[1]

---

**1.** బరాఅ'తున్: అంటే ఎట్టి సంబంధం లేదనటం. ఈ ఆయత్‌లు అవతరింపజేయబడినప్పుడు దైవప్రవక్త ('స'అస) 'అలీ (ర'ది.అ.ను) 9వ హిజ్రీ 'హజ్జ్ జనసమూహంలో ఈ విషయాలు ప్రకటించమని పంపారు: 1) ప్రజలు క'అబహ్ (బైతుల్లా) చుట్టూ దింగబరులై ప్రదక్షిణ ('తవాఫ్) చేయకూడదు. 2) ఈ సంవత్సరం (9 హిజ్రీ) తరువాత ఏ ముష్రిక్ కూడా బైతుల్లాహ్ ('హజ్జ్)కు రాకూడదు, 3) ఏ అవిశ్వాసులతోనైతే ఒడంబడిక ఉందో, వారి యెడల గడువు పూర్తి అయ్యేవరకు విశ్వాసపాత్రంతో వ్యవహరించడం జరుగుతుంది. ('స.బు'ఖారీ మరియు 'స.ముస్లిం). ఆ 9వ హిజ్రీ 'హజ్జ్‌కు అబూబక్ర్ 'సిద్దీఖ్ (ర'ది.అ.) అమీర్‌గా ఉండిరి.

فَسِيحُواْ فِى ٱلْأَرْضِ أَرْبَعَةَ أَشْهُرٍ وَٱعْلَمُوٓاْ أَنَّكُمْ غَيْرُ مُعْجِزِى ٱللَّهِ وَأَنَّ ٱللَّهَ مُخْزِى ٱلْكَٰفِرِينَ ﴿٢﴾

**2**. కావున (ఓ ముష్రికులారా!) మీరు నాలుగు నెలల వరకు ఈ దేశంలో స్వేచ్ఛగా తిరగండి.[1] కాని మీరు అల్లాహ్ (శిక్ష) నుండి తప్పించుకోలేరని తెలుసుకోండి. మరియు నిశ్చయంగా, అల్లాహ్! సత్యతిరస్కారులను అవమానంపాలు చేస్తాడు.

وَأَذَٰنٌ مِّنَ ٱللَّهِ وَرَسُولِهِۦٓ إِلَى ٱلنَّاسِ يَوْمَ ٱلْحَجِّ ٱلْأَكْبَرِ أَنَّ ٱللَّهَ بَرِىٓءٌ مِّنَ ٱلْمُشْرِكِينَ وَرَسُولُهُۥ فَإِن تُبْتُمْ فَهُوَ خَيْرٌ لَّكُمْ وَإِن تَوَلَّيْتُمْ فَٱعْلَمُوٓاْ أَنَّكُمْ غَيْرُ مُعْجِزِى ٱللَّهِ وَبَشِّرِ ٱلَّذِينَ كَفَرُواْ بِعَذَابٍ أَلِيمٍ ﴿٣﴾

**3**. మరియు అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త తరఫునుండి పెద్ద హజ్జ్[2] రోజున సర్వ మానవజాతికి ప్రకటన చేయబడుతోంది: "నిశ్చయంగా, అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తకు, బహుదైవారాధకులతో, ఎలాంటి సంబంధం లేదు. కావున మీరు (ఓ ముష్రికులారా!) పశ్చాత్తాపపడితే, అది మీ మేలుకే. కాని మీరు విముఖులైతే, మీరు అల్లాహ్ (శిక్ష) నుండి తప్పించుకోలేరని తెలుసుకోండి." మరియు సత్య తిరస్కారులకు బాధాకరమైన శిక్ష (విధించబడ) నున్నదనే వార్తను వినిపించు.

---

**1**. చూడండి, 8:58. ఈ ఆయత్, ముస్లింలతో చేసిన ఒడంబడికను, త్రెంపిన ముష్రికులను ఉద్దేశించి ఉంది.

**2**. యౌమల్ 'హజ్జిల్-అక్బర్: అంటే 10వ జు'ల్-'హజ్జ్ దినమని 'స'హీ'హ్ 'హదీసుల ద్వారా తెలుస్తుంది. ఎందుకంటే ఆ రోజు 'హాజీలకు చాలా మనాసిక్‌లను పూర్తిచేయవలసి ఉంటుంది. అది 'హజ్జె అ'స్‌గర్‌కు భిన్నపదం. అరేబియా వాసులు, 'ఉమ్‌రాను చిన్న హజ్జ్ ('హజ్జె అ'స్‌గర్) అనేవారు. దీనికి భిన్నంగా జు'ల్-'హజ్జ్ మాసంలో జరిగేది పెద్ద హజ్జ్ (హ'జ్జె అక్బర్). 9వ జు'ల్ 'హజ్జ్ శుక్రవారం రోజు వస్తే 'హజ్జె అక్బర్ అనే దానికి ఎలాంటి ఆధారం లేదు. ('స.బు'ఖారీ, నం. 4655, 'స.ముస్లిం, నం. 982 మరియు తిర్మిజీ', నం. 957.

إِلَّا ٱلَّذِينَ عَٰهَدتُّم مِّنَ ٱلۡمُشۡرِكِينَ ثُمَّ لَمۡ يَنقُصُوكُمۡ شَيۡـٔٗا وَلَمۡ يُظَٰهِرُواْ عَلَيۡكُمۡ أَحَدٗا فَأَتِمُّوٓاْ إِلَيۡهِمۡ عَهۡدَهُمۡ إِلَىٰ مُدَّتِهِمۡۚ إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلۡمُتَّقِينَ ٤

4. కాని ఏ బహుదైవా రాధకులతోనైతే మీరు ఒడంబడికలు చేసుకొని ఉన్నారో, వారు మీకు ఏ విషయంలోను లోపం చేయక, మీకు వ్యతిరేకంగా ఎవరికీ సహాయం చేయకుండా ఉంటే! వారి ఒడంబడికను దాని గడువు వరకు పూర్తిచెయ్యండి. నిశ్చయంగా, అల్లాహ్ దైవభీతి గలవారిని ప్రేమిస్తాడు.

فَإِذَا ٱنسَلَخَ ٱلۡأَشۡهُرُ ٱلۡحُرُمُ فَٱقۡتُلُواْ ٱلۡمُشۡرِكِينَ حَيۡثُ وَجَدتُّمُوهُمۡ وَخُذُوهُمۡ وَٱحۡصُرُوهُمۡ وَٱقۡعُدُواْ لَهُمۡ كُلَّ مَرۡصَدٖۚ فَإِن تَابُواْ وَأَقَامُواْ ٱلصَّلَوٰةَ وَءَاتَوُاْ ٱلزَّكَوٰةَ فَخَلُّواْ سَبِيلَهُمۡۚ إِنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٞ ٥

5. ఇక నిషిద్ధమాసాలు[1] గడిచిపోయిన తరువాత బహుదైవారాధకులను, ఎక్కడ దొరికితే అక్కడ వధించండి.[2] మరియు వారిని పట్టుకోండి[3] మరియు చుట్టుముట్టండి మరియు ప్రతి మాటువద్ద వారికై పొంచిఉండండి.[4] కాని వారు పశ్చాత్తాపపడి, నమా'జ్ స్థాపించి, 'జకాత్ ఇస్తే, వారిని వారి మార్గాన వదిలిపెట్టండి.[5] నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

---

1. హి'జ్రీ శకంలోని రజబ్, జు'ల్-ఖాయిదహ్, జు'ల్-'హిజ్జహ్ మరియు ము'హ'ర్రమ్ నెలలు నిషిద్ధ మాసాలు. ఈ మాసాలలో యుద్ధం నిషిద్ధం. ఇది 'అరబ్బులలో ఇస్లాంకు ముందునుండి వస్తూ ఉన్న ఆచారం. చూడండి, 2:194 మరియు 217. ఇబ్నె-కసీ'ర్ (ర'హ్మా) ఇక్కడ (ఈ ఆయత్‌లో) నిషిద్ధ మాసాలు అంటే ఈ ప్రకటనతరువాత నాలుగు నెలలు అంటే 10వ జు'ల్-'హిజ్జహ్ నుండి 10వ రబీ'అ-అల్తాని వరకు, అని అన్నారు.
2. 'హరమ్ సరిహద్దులలో కేవలం వారితోనే పోరాడాలి ఎవరైతే మీపై దాడిచేస్తారో! చూడండి, 2:190-194, (ఇబ్నె-కసీ'ర్). మీతో యుద్ధం చేసేవారితో అల్లాహ్ (సు.తా.) మార్గంలో పోరాడండి. ఎవరైతే మీతో విరోధాలు చేయరో, వారితో పోరాడవద్దు. జిహాద్ అంటే, మీరు ముస్లింలు అయిఉండి, ఇతరులకు శాంతియుతంగా ఏక దైవసిద్ధాంతం, సత్యధర్మం అయిన ఇస్లాంను బోధిస్తూ ఉంటే, మీ మార్గంలో ఆటంకాలు పెడుతూ, మీ ధన, మాన, ప్రాణాలకు హాని గలిగించగోరేవారితో, వారు మానుకునే వరకు, లేదా నిర్మూలించబడే వరకు చేసే ధర్మయుద్ధం. చూడండి, 4:91. అంటే ఆత్మ సంరక్షణ కొరకు చేసే పోరాటం జిహాద్. చూడండి, 60:8-9.
3. ఖైదీలుగా చేసుకొనండి.
4. వారి రాకపోకడలపై కాపలా పెట్టండి. మీ అనుమతి లేనిదే వారిని కదలనివ్వకండి. వారి నివాస స్థలాలను కాపెట్టుకొని ఉండండి.
5. చూడండి, 2:256. 'ధర్మ విషయంలో బలవంతం లేదు.' అంటే ఎవ్వరినీ కూడా ఇస్లాం స్వీకరించటానికి బలవంతం చేయకూడదు.

وَإِنْ أَحَدٌ مِّنَ ٱلْمُشْرِكِينَ ٱسْتَجَارَكَ فَأَجِرْهُ حَتَّىٰ يَسْمَعَ كَلَـٰمَ ٱللَّهِ ثُمَّ أَبْلِغْهُ مَأْمَنَهُۥ ۚ ذَٰلِكَ بِأَنَّهُمْ قَوْمٌ لَّا يَعْلَمُونَ ﴿٦﴾

6. మరియు బహుదైవారాధకు (ముష్రికు)లలో ఎవడైనా నీ శరణుకోరితే, అతడు అల్లాహ్ గ్రంథాన్ని (ఖుర్ఆన్‌ను) వినటానికి అతనికి శరణు ఇవ్వు. తరువాత అతనిని, అతని కొరకు సురక్షితమైన స్థలానికి చేర్చు. ఇది ఎందుకంటే! వాస్తవానికి, వారు (సత్యం) తెలియని ప్రజలు.[1]

كَيْفَ يَكُونُ لِلْمُشْرِكِينَ عَهْدٌ عِندَ ٱللَّهِ وَعِندَ رَسُولِهِۦٓ إِلَّا ٱلَّذِينَ عَـٰهَدتُّمْ عِندَ ٱلْمَسْجِدِ ٱلْحَرَامِ ۖ فَمَا ٱسْتَقَـٰمُوا۟ لَكُمْ فَٱسْتَقِيمُوا۟ لَهُمْ ۚ إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلْمُتَّقِينَ ﴿٧﴾

7. బహుదైవారాధ (ముష్రి)కులకు అల్లాహ్‌తో మరియు ఆయన ప్రవక్తతో ఒడంబడిక ఎలా సాధ్యం కాగలదు? మస్జిద్ అల్-'హరామ్ వద్ద మీరు ఒడంబడిక చేసుకున్న వారితో తప్ప! వారు తమ (ఒడంబడికపై) స్థిరంగా ఉన్నంత వరకు మీరు కూడా దానిపై స్థిరంగా ఉండండి. నిశ్చయంగా, అల్లాహ్ దైవభీతి గలవారిని ప్రేమిస్తాడు.

كَيْفَ وَإِن يَظْهَرُوا۟ عَلَيْكُمْ لَا يَرْقُبُوا۟ فِيكُمْ إِلًّا وَلَا ذِمَّةً ۚ يُرْضُونَكُم بِأَفْوَٰهِهِمْ وَتَأْبَىٰ قُلُوبُهُمْ وَأَكْثَرُهُمْ فَـٰسِقُونَ ﴿٨﴾

8. (వారితో ఒడంబడిక) ఎలా సాధ్యం కాగలదు? ఎందుకంటే వారు మీపై ప్రాబల్యం వహిస్తే, వారు మీ బంధుత్వాన్ని గానీ, ఒడంబడికను గానీ పాటించరు. వారు కేవలం నోటి మాటలతోనే మిమ్మల్ని సంతోష పరుస్తున్నారు, కాని వారి హృదయాలు మాత్రం మిమ్మల్ని అసహ్యించు కుంటున్నాయి మరియు వారిలో అనేకులు అవిధేయులు (ఫాసిఖూన్) ఉన్నారు.

1. పై ఆయత్ మీతో యుద్ధం చేస్తున్న సత్యతిరస్కారుల విషయంలో అవతరింపజేయబడింది. ఈ విరోధులైన సత్యతిరస్కారులలో ఎవడైనా మీ శరణు కోరితే అతనికి శరణు ఇవ్వండి. అతడు మీతో ఉండి మీ మంచితనాన్ని మరియు ఇస్లాంను దగ్గరనుండి చూసి ఖుర్ఆన్‌ను విని ముస్లిం కావచ్చు. అతడు ఖుర్ఆన్‌ను విన్నతరువాత కూడా ఇస్లాం స్వీకరించకుంటే అతనిని, అతనికి భద్రతనిచ్చే స్థలానికి పంపండి. అతడు ముస్లిం కాకున్నా సరే. మీరిచ్చిన శరణపు ప్రతిజ్ఞను పూర్తిచేసుకోండి. అతడు తన భద్రతాస్థలానికి చేరేంతవరకు వాని ప్రాణరక్షణ మీ బాధ్యత.

9. వారు అల్లాహ్ సూక్తు(ఆయాత్)లను అల్పధరకు విక్రయించి, ప్రజలను ఆయన మార్గం నుండి ఆటంకపరుస్తున్నారు. నిశ్చయంగా, వారు చేసే పనులు ఎంతో నీచమైనవి!

اشْتَرَوْا بِآيَاتِ اللَّهِ ثَمَنًا قَلِيلًا فَصَدُّوا عَن سَبِيلِهِ ۚ إِنَّهُمْ سَاءَ مَا كَانُوا يَعْمَلُونَ ﴿٩﴾

10. వారు ఏ విశ్వాసి విషయంలో కూడా బంధుత్వాన్ని గానీ, ఒడంబడికను గానీ పాటించరు! ఇటువంటివారే, హద్దులను అతిక్రమించినవారు.

لَا يَرْقُبُونَ فِي مُؤْمِنٍ إِلًّا وَلَا ذِمَّةً ۚ وَأُولَٰئِكَ هُمُ الْمُعْتَدُونَ ﴿١٠﴾

11. కావున వారు పశ్చాత్తాపపడి, నమా'జ్ స్థాపించి, 'జకాత్ ఇస్తే! వారు మీ ధార్మిక సోదరులు. మరియు తెలుసుకోగలవారికి, మేము మా సూచనలను, ఈ విధంగా స్పష్టపరుస్తున్నాము.

فَإِن تَابُوا وَأَقَامُوا الصَّلَاةَ وَآتَوُا الزَّكَاةَ فَإِخْوَانُكُمْ فِي الدِّينِ ۗ وَنُفَصِّلُ الْآيَاتِ لِقَوْمٍ يَعْلَمُونَ ﴿١١﴾

12. మరియు వారు ఒడంబడిక చేసిన తరువాత మళ్ళీ తమ ప్రమాణాలను భంగం చేస్తే! మరియు మీ ధర్మాన్ని అవమానపరిస్తే, అలాంటి సత్యతిరస్కారుల నాయకులతో మీరు యుద్ధంచేయండి. నిశ్చయంగా, వారి ప్రమాణాలు నమ్మదగినవి కావు. బహుశా ఈ విధంగానైనా వారు మానుకోవచ్చు![1]

وَإِن نَّكَثُوا أَيْمَانَهُم مِّن بَعْدِ عَهْدِهِمْ وَطَعَنُوا فِي دِينِكُمْ فَقَاتِلُوا أَئِمَّةَ الْكُفْرِ ۙ إِنَّهُمْ لَا أَيْمَانَ لَهُمْ لَعَلَّهُمْ يَنتَهُونَ ﴿١٢﴾

13. ఏమీ? ఎవరైతే తమ ప్రమాణాలను భంగంచేసి, సందేశహరుణ్ణి (మక్కా నుండి) వెడలగొట్టాలని నిర్ణయించారో! మరియు

أَلَا تُقَاتِلُونَ قَوْمًا نَّكَثُوا أَيْمَانَهُمْ وَهَمُّوا بِإِخْرَاجِ

1. ఎవరైతే ఒడంబడిక చేసిన తరువాత తమ ఒడంబడికలను భంగం చేస్తారో మరియు మీ ధర్మాన్ని అవమానపరుస్తారో, అలాంటి సత్యతిరస్కారులతో యుద్ధం చేయండి.

ٱلرَّسُولِ وَهُم بَدَءُوكُمْ أَوَّلَ مَرَّةٍۚ أَتَخْشَوْنَهُمْۚ فَٱللَّهُ أَحَقُّ أَن تَخْشَوْهُ إِن كُنتُم مُّؤْمِنِينَ ﴿١٣﴾

మొదట వారే, మీతో తగవు ఆరంభించారో,[1] అలాంటి వారితో మీరు యుద్ధం చేయరా? ఏమీ? మీరు వారికి భయపడుతున్నారా? వాస్తవానికి మీరు విశ్వాసులే అయితే, కేవలం అల్లాహ్‌కు మాత్రమే భయపడటం మీకర్తవ్యం.

قَٰتِلُوهُمْ يُعَذِّبْهُمُ ٱللَّهُ بِأَيْدِيكُمْ وَيُخْزِهِمْ وَيَنصُرْكُمْ عَلَيْهِمْ وَيَشْفِ صُدُورَ قَوْمٍ مُّؤْمِنِينَ ﴿١٤﴾

**14**. వారితో యుద్ధం చేయండి. అల్లాహ్ మీ చేతులద్వారా వారిని శిక్షిస్తాడు మరియు వారిని అవమానంపాలు చేస్తాడు. మరియు వారికి ప్రతికూలంగా మీకు సహాయం చేస్తాడు. మరియు విశ్వసించిన ప్రజల హృదయాలను చల్లబరుస్తాడు;

وَيُذْهِبْ غَيْظَ قُلُوبِهِمْۗ وَيَتُوبُ ٱللَّهُ عَلَىٰ مَن يَشَآءُۗ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٌ ﴿١٥﴾

**15**. మరియు వారి హృదయాలలోని క్రోధాన్ని దూరంచేస్తాడు. మరియు అల్లాహ్! తాను కోరిన వారి పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాడు. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేచనాపరుడు.

أَمْ حَسِبْتُمْ أَن تُتْرَكُوا۟ وَلَمَّا يَعْلَمِ ٱللَّهُ ٱلَّذِينَ جَٰهَدُوا۟ مِنكُمْ وَلَمْ يَتَّخِذُوا۟ مِن دُونِ ٱللَّهِ وَلَا رَسُولِهِۦ وَلَا ٱلْمُؤْمِنِينَ وَلِيجَةًۚ وَٱللَّهُ خَبِيرٌۢ بِمَا تَعْمَلُونَ ﴿١٦﴾

**16**. ఏమీ? అల్లాహ్ మీలోనుండి (తన మార్గంలో) పోరాడే వారెవరో మరియు - అల్లాహ్, ఆయన ప్రవక్త మరియు విశ్వాసులు తప్ప - ఇతరుల నెవ్వరినీ తమ ఆప్త మిత్రులుగా చేసుకోని వారెవరో, తెలుసుకోనిదే మిమ్మల్ని వదలి పెడతాడని అనుకుంటున్నారా? మరియు అల్లాహ్ మీరు చేస్తున్నదంతా బాగా ఎరుగును.

**1**. బహుశా ఇక్కడ ఖురైషులు తమ ఒడంబడికకు విరుద్ధంగా బనీ-ఖు'జా'అ వారిని చంపటానికి, బనీ-బక్ర్ వారికి తోడ్పడిన విషయం పేర్కొనబడింది. బనీ-ఖు'జా'అ - ముస్లింల హలీఫ్‌లు, మరియు బనీ-బక్ర్ - ఖురైషుల హలీఫ్‌లు. దైవప్రవక్త ('స'అస) మరియు మక్కా ముష్రిక్ ఖురైషుల మధ్య: 'పది సంవత్సరాల వరకు - వారి మధ్య మరియు వారి హలీఫ్‌లతో కూడా - యుద్ధం చేయకూడదు మరియు వారితో పోరాడే వారికి సహాయం కూడా చేయరాదు.' అనే, ఒడంబడిక ఉండెను. ఇది 6వ హిజ్రీలో హుదైబియాలోజరిగిన ఒడంబడిక.

مَا كَانَ لِلْمُشْرِكِينَ أَن يَعْمُرُوا۟
مَسَـٰجِدَ ٱللَّهِ شَـٰهِدِينَ عَلَىٰٓ أَنفُسِهِم
بِٱلْكُفْرِ ۚ أُو۟لَـٰٓئِكَ حَبِطَتْ أَعْمَـٰلُهُمْ
وَفِى ٱلنَّارِ هُمْ خَـٰلِدُونَ ﴿١٧﴾
إِنَّمَا يَعْمُرُ مَسَـٰجِدَ ٱللَّهِ مَنْ
ءَامَنَ بِٱللَّهِ وَٱلْيَوْمِ ٱلْـَٔاخِرِ
وَأَقَامَ ٱلصَّلَوٰةَ وَءَاتَى ٱلزَّكَوٰةَ
وَلَمْ يَخْشَ إِلَّا ٱللَّهَ ۖ فَعَسَىٰٓ أُو۟لَـٰٓئِكَ
أَن يَكُونُوا۟ مِنَ ٱلْمُهْتَدِينَ ﴿١٨﴾
۞ أَجَعَلْتُمْ سِقَايَةَ ٱلْحَآجِّ وَعِمَارَةَ
ٱلْمَسْجِدِ ٱلْحَرَامِ كَمَنْ ءَامَنَ بِٱللَّهِ
وَٱلْيَوْمِ ٱلْـَٔاخِرِ وَجَـٰهَدَ فِى سَبِيلِ ٱللَّهِ ۚ
لَا يَسْتَوُۥنَ عِندَ ٱللَّهِ ۗ وَٱللَّهُ لَا يَهْدِى
ٱلْقَوْمَ ٱلظَّـٰلِمِينَ ﴿١٩﴾

**17**. బహుదైవారాధకు (ముష్రికు)లు, తాము సత్యతిరస్కారులమని సాక్ష్యమిస్తూ, అల్లాహ్ మస్జిదులను నిర్వహించటానికి (సేవచేయటానికి) అర్హులుకారు. అలాంటి వారి కర్మలు వ్యర్థమైపోతాయి మరియు వారు నరకాగ్నిలో శాశ్వతంగా ఉంటారు.

**18**. నిశ్చయంగా అల్లాహ్‌ను అంతిమ దినాన్ని విశ్వసించేవారు, నమా'జ్‌ను స్థాపించే వారు, 'జకాత్ ఇచ్చే వారు, అల్లాహ్‌కు తప్ప మరెవ్వరికీ భయపడని వారు మాత్రమే అల్లాహ్ మస్జిద్‌లను నిర్వహించాలి. ఇలాంటి వారే మార్గదర్శకత్వం పొందిన వారని ఆశించవచ్చు![1] (3/8)

**19**. * ఏమీ? 'హజ్జ్ మరియు 'ఉమ్రా కొరకు వచ్చే వారికి నీరు త్రాపటాన్ని మరియు మస్జిద్ అల్-'హరామ్‌ను నిర్వహించటాన్ని, మీరు అల్లాహ్‌ను మరియు అంతిమదినాన్ని విశ్వసించి, అల్లాహ్ మార్గంలో పోరాడే దానికి సమానంగా భావిస్తున్నారా? అల్లాహ్ దగ్గర, వారు (ఈ రెండు పక్షాల వారు) సరిసమానులు కారు.[2]

**1**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'ఒకవేళ మీరు ఒక వ్యక్తిని సక్రమంగా మస్జిద్‌కు వస్తూ ఉండేది చూస్తే, అతని విశ్వాసానికి సాక్ష్యం ఇవ్వండి.' (తిర్మిజీ', తఫ్సీర్ 'సూ. అత్-తౌబహ్). ఖుర్ఆన్‌లో ఇక్కడ కూడా అల్లాహ్(సు.తా.)ను అంతిమదినాన్ని విశ్వసించిన తరువాత చేయ వలసిన పనులలో నమా'జ్, దాని తరువాత 'జకాత్ అని పేర్కొనబడ్డాయి. మరొక 'హదీస్' ముత్తఫఖ్ అలైహి ఉంది. అబూ-బక్ర్ 'సిద్దీఖ్ (ర'ది. 'అ.) అన్నారు: 'అల్లాహ్ తోడు, నేను అలాంటి వారితో తప్పక పోరాడుతాను, ఎవరైతే నమా'జ్ మరియు 'జకాత్‌ల మధ్య భేదం చూపుతారో!' అంటే నమా'జ్ చేస్తారు కాని 'జకాత్ ఇవ్వడానికి వెనుకంజవేస్తారో! (చూడండి, 9:5).

**2**. ఈ ఆయత్ అవతరింపజేయబడిన సందర్భాన్ని గురించి, 'స'హాబా (ర'ది.'అన్హుమ్)ల మధ్య మస్జిదె నబవీలో శుక్రవారం మింబర్ దగ్గర జరిగిన ఈ సంభాషణ కారణం అంటారు. ఒక 'సహాబీ (ర'ది.'అ.) అంటారు: ''నేను ఇస్లాం స్వీకరించిన తరువాత నా దృష్టిలో అన్నిటి

ٱلَّذِينَ ءَامَنُواْ وَهَاجَرُواْ وَجَٰهَدُواْ فِي سَبِيلِ ٱللَّهِ بِأَمۡوَٰلِهِمۡ وَأَنفُسِهِمۡ أَعۡظَمُ دَرَجَةً عِندَ ٱللَّهِۚ وَأُوْلَٰٓئِكَ هُمُ ٱلۡفَآئِزُونَ ﴿٢٠﴾ يُبَشِّرُهُمۡ رَبُّهُم بِرَحۡمَةٖ مِّنۡهُ وَرِضۡوَٰنٖ وَجَنَّٰتٖ لَّهُمۡ فِيهَا نَعِيمٞ مُّقِيمٌ ﴿٢١﴾ خَٰلِدِينَ فِيهَآ أَبَدًاۚ إِنَّ ٱللَّهَ عِندَهُۥٓ أَجۡرٌ عَظِيمٞ ﴿٢٢﴾ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تَتَّخِذُوٓاْ ءَابَآءَكُمۡ وَإِخۡوَٰنَكُمۡ أَوۡلِيَآءَ إِنِ ٱسۡتَحَبُّواْ ٱلۡكُفۡرَ عَلَى ٱلۡإِيمَٰنِۚ وَمَن يَتَوَلَّهُم مِّنكُمۡ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلظَّٰلِمُونَ ﴿٢٣﴾

మరియు అల్లాహ్ దుర్మార్గులైన ప్రజలకు సన్మార్గం చూపడు.

**20**. విశ్వసించి, అల్లాహ్ మార్గంలో వలస పోయిన వారికీ మరియు తమ ధనసంపత్తులను ప్రాణాలను వినియోగించి పోరాడిన వారికీ, అల్లాహ్ దగ్గర అత్యున్నత స్థానముంది. మరియు అలాంటి వారే సాఫల్యం (విజయం) పొందేవారు.[1]

**21**. వారి ప్రభువు వారికి, తన తరఫునుండి కారుణ్యాన్ని మరియు ప్రసన్నతను మరియు శాశ్వత సౌఖ్యాలుగల స్వర్గవనాల శుభవార్తను ఇస్తున్నాడు.

**22**. వారందులో శాశ్వతంగా కలకాలం ఉంటారు. నిశ్చయంగా అల్లాహ్ దగ్గర గొప్ప ప్రతిఫలముంది.

**23**. ఓ విశ్వాసులారా! మీ తండ్రితాతలు మరియు మీ సోదరులు సత్యతిరస్కారానికి విశ్వాసంపై ప్రాధాన్యతనిస్తే, మీరు వారిని స్నేహితులుగా చేసుకోకండి. మీలో వారివైపు మొగ్గేవారే (వారిని మీ స్నేహితులుగా చేసుకునే వారే) దుర్మార్గులు.[2]

---

కంటే ఉత్తమమైన కార్యం 'హాజీలకు 'జమ్'జమ్ త్రాపడం.'' రెండో అతను అంటారు: ''నా దగ్గర మస్జిద్ అల్-'హరాం సేవచేయడం.'' మూడవ అతను అంటారు: ''అల్లాహ్ (సు.తా.) మార్గంలో జిహాద్ చేయడం.'' ఈ 'హదీస్' కథకుడు నూమాన్ బిన్-బషీర్ (ర'ది.'అ.) నేను ఆరోజు జుమ'అహ్ నమా'జ్ తరువాత వెళ్ళి దైవప్రవక్త ('స'అస)కు ఈ విషయం తెలిపాను. అప్పుడు ఈ ఆయత్ అవతరింప జేయబడింది, ('స'హీ'హ్ ముస్లిం, కితాబ్ అల్ ఇమారహ్, బాబ్ ఫజ్లుష్షహాదహ్ ఫీ సబీలిల్లాహ్). అల్లాహ్ (సు.తా.)ను అంతిమదినాన్ని విశ్వసించిన తరువాతనే అల్లాహ్ (సు.తా.) మార్గంలో జిహాద్ స్వీకరించబడుతుంది. ఈమాన్ లేనిదే ఎంత గొప్ప కార్యం చేసినా దాని ఫలితం శూన్యమే. విశ్వాసుని జిహాద్ సర్వకార్యాలలో గొప్పది. ఈ విషయం దీని తరువాత ఉన్న ఆయత్‌లో స్పష్టంగా ఉంది.

**1**. చూడండి, 'స.బు'ఖారీ, పు-4, 'హ. 48, 54.

**2**. హిజ్రత్ మరియు జిహాద్ విషయంలో మీరు, మీ సోదరుల మరియు తండ్రుల ప్రేమను రానివ్వకండి. వారు మీ స్నేహితులు కాలేరు. వారు మీతో మంచిగా వ్యవహరిస్తే, మిమ్మల్ని

قُلْ إِن كَانَ ءَابَآؤُكُمْ وَأَبْنَآؤُكُمْ
وَإِخْوَٰنُكُمْ وَأَزْوَٰجُكُمْ وَعَشِيرَتُكُمْ وَأَمْوَٰلٌ
ٱقْتَرَفْتُمُوهَا وَتِجَـٰرَةٌ تَخْشَوْنَ كَسَادَهَا
وَمَسَـٰكِنُ تَرْضَوْنَهَآ أَحَبَّ إِلَيْكُم
مِّنَ ٱللَّهِ وَرَسُولِهِۦ وَجِهَادٍ فِى سَبِيلِهِۦ
فَتَرَبَّصُوا۟ حَتَّىٰ يَأْتِىَ ٱللَّهُ بِأَمْرِهِۦ ۗ وَٱللَّهُ
لَا يَهْدِى ٱلْقَوْمَ ٱلْفَـٰسِقِينَ ﴿٢٤﴾

**24**. వారితో ఇలా అను: "మీ తండ్రితాతలు, మీ కుమారులు, మీ సోదరులు, మీ సహవాసులు (అ'జ్వాజ్), మీ బంధువులు, మీరు సంపాదించిన ఆస్తిపాస్తులు, మందగిస్తాయేమోనని భయపడే మీ వ్యాపారాలు, మీకు ప్రీతికరమైన మీ భవనాలు - అల్లాహ్ కంటే, ఆయన ప్రవక్త కంటే మరియు ఆయన మార్గంలో పోరాడటం కంటే - మీకు ఎక్కువ ప్రియమైనవైతే, అల్లాహ్ తన తీర్పును బహిర్గతం చేసేవరకు నిరీక్షించండి. మరియు అల్లాహ్ అవిధేయులైన జాతి వారికి సన్మార్గం చూపడు."[1]

لَقَدْ نَصَرَكُمُ ٱللَّهُ فِى مَوَاطِنَ
كَثِيرَةٍ ۙ وَيَوْمَ حُنَيْنٍ ۙ إِذْ
أَعْجَبَتْكُمْ كَثْرَتُكُمْ فَلَمْ تُغْنِ
عَنكُمْ شَيْـًٔا وَضَاقَتْ
عَلَيْكُمُ ٱلْأَرْضُ بِمَا رَحُبَتْ
ثُمَّ وَلَّيْتُم مُّدْبِرِينَ ﴿٢٥﴾

**25**. వాస్తవానికి ఇదివరకు చాలా యుద్ధ రంగాలలో (మీరు కొద్దిమంది ఉన్నా) అల్లాహ్ మీకు విజయం చేకూర్చాడు. మరియు 'హునైన్ (యుద్ధం) రోజు మీ సంఖ్యాబలం మీకు గర్వ కారణమయింది. కాని, అది మీకు ఏ విధంగానూ పనికిరాలేదు. మరియు భూమి విశాలమైనది అయినప్పటికీ మీకు ఇరుకైపోయింది. తరువాత మీరు వెన్నుచూపి పారిపోయారు.[2]

---

మీ ఇస్లాం ధర్మాన్ని పాటించటంనుండి ఆపకుంటే, వారితో మంచిగా వ్యవహరించండి. కాని వారు మిమ్మల్ని ఇస్లాం కొరకే బాధిస్తే, వారిని మీ స్నేహితులుగా భావించకండి. (చూ. 3:28, 60:89).

**1**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "ఎవరిచేతిలోనైతే నా ప్రాణాలున్నాయో ఆ అల్లాహ్ (సు.తా.) తోడు. మీలో ఏ ఒక్కడు కూడా ముఅ'మిన్ కాజాలడు, ఎంత వరకైతే అతడు తన తండ్రి, తన సంతానం మరియు ఇతరులందరికంటే, నన్ను ('స'అస) ఎక్కువగా ప్రేమించడో!" ('స'హీ'హ్ బు'ఖారీ, కితాబ్ అల్ ఈమాన్, బాబ్ 'హుబ్బె రసూల్ ('స'అస) మినల్ ఈమాన్; 'స'హీ'హ్ ముస్లిం, కితాబ్ అల్-ఈమాన్).

**2**. 'హునైన్, మక్కా మరియు 'తాయఫ్‌ల మధ్య పర్వతాలలో ఉన్న ఒక లోయ (వాది). అక్కడ హవా'జిన్ మరియు స'ఖీఫ్ అనే రెండు తెగలవారు ఉండేవారు. వారు విలువిద్యలో నిపుణులు. వారు ముస్లింలకు విరుద్ధంగా పోరాడటానికి, యుద్ధ తయారీలు చేస్తున్నారని తెలుసుకొని దైవప్రవక్త ('స'అస), 12,000 సైనికులతో, మక్కా విజయపు

26. తరువాత అల్లాహ్ తన ప్రవక్తపై మరియు విశ్వాసులపై ప్రశాంత స్థితిని అవతరింపజేశాడు. మరియు మీకు కనిపించని (దైవదూతల) దళాలను దింపి సత్య తిరస్కారులను శిక్షించాడు.[1] మరియు ఇదే సత్యతిరస్కారులకు లభించే ప్రతిఫలం.

ثُمَّ أَنزَلَ ٱللَّهُ سَكِينَتَهُۥ عَلَىٰ رَسُولِهِۦ وَعَلَى ٱلْمُؤْمِنِينَ وَأَنزَلَ جُنُودًا لَّمْ تَرَوْهَا وَعَذَّبَ ٱلَّذِينَ كَفَرُوا۟ ۚ وَذَٰلِكَ جَزَآءُ ٱلْكَٰفِرِينَ ﴿٢٦﴾

27. ఆ తరువాత కూడా అల్లాహ్ తాను కోరినవారి పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాడు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

ثُمَّ يَتُوبُ ٱللَّهُ مِنۢ بَعْدِ ذَٰلِكَ عَلَىٰ مَن يَشَآءُ ۗ وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴿٢٧﴾

28. ఓ విశ్వాసులారా! నిశ్చయంగా, బహుదైవారాధ (ముష్రి)కులు అపరిశుద్ధులు (నజ్స్).[2] కనుక ఈ సంవత్సరం తరువాత వారు మస్జిద్ అల్-'హరామ్ సమీపానికి

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِنَّمَا ٱلْمُشْرِكُونَ نَجَسٌ فَلَا يَقْرَبُوا۟ ٱلْمَسْجِدَ ٱلْحَرَامَ بَعْدَ عَامِهِمْ هَٰذَا ۚ

---

18-19 దినాల తరువాత 8వ హిజ్రీ, షవ్వాల్ నెలలోవారిపై దాడిచేయడానికి వెళ్ళారు. ముస్లింలకు తమ సంఖ్యాబలం కొంతవరకు గర్వానికి కారణమవుతుంది. ఇది అల్లాహ్(సు.తా.)కు నచ్చదు. శత్రువులు దాదాపు 4,000 మంది ఉంటారు. శత్రువుల బాణాల దెబ్బలకు తాళుకోలేక ముస్లిం సైనికులు వెనుదిరిగి పారిపోసాగుతారు. కేవలం దైవప్రవక్త ('స'అస), కొందరు ముస్లింలతో బాటు మిగిలిపోతారు. దైవప్రవక్త ('స'అస) పారిపోయే వారిని ఆపటానికి కేకలువేస్తారు. తరువాత అతను ('స'అస) 'అబ్బాస్ (ర'ది.'అ.)తో వారిని పిలవమని అంటారు. అతను పెద్దపెద్ద కేకలు వేయుటంవల్ల, సిగ్గుపడి కొందరు తిరిగి వస్తారు. ఆ ఉన్న వారే ధైర్యస్థైర్యాలతో యుద్ధంచేసి అల్లాహ్ (సు.తా.) అనుగ్రహంతో విజయం పొందుతారు. శత్రువులు తమ ఆస్తిపాస్తులన్నీ విడిచి పారిపోతారు.

1. కనిపించనిదళాలను అంటే దైవదూతలను, అల్లాహ్ (సు.తా.) పంపాడు. ఏ విధంగానైతే ఉ'హుద్ యుద్ధంలో, (చూడండి, 3:124-125) మరియు బద్ర్ యుద్ధంలో (చూడండి, 8:9), పంపాడో!

2. నజసున్: అంటే అవిశ్వాసులు, అశుచులు, అశుభ్రులు, అపరిశుద్ధులు, మురికివారు, మాలిన్యులు, కల్మషులు అనే అర్థాలున్నాయి. ఈ అపరిశుద్ధత శారీరకంగా గానీ, లేక మానసికంగా గానీ, లేక రెండూ గానీ కావచ్చు. శారీరకంగా ఎందుకంటే వారు లైంగిక లేక కాలకృత్యాల అపరిశుద్ధత తరువాత విధిగా పరిశుద్ధత అవలంబిచక పోవడం. మానసికంగా, ఎందుకంటే వారు ఏకైక ఆరాధ్యుడు, సర్వసృష్టికర్త, సర్వపోషకుడు అయిన అల్లాహ్ (సు.తా.)ను వదలి ఇతరులను ఏమీ చేయలేని వారిని అల్లాహ్ (సు.తా.)కు సాటి కల్పించడం. ఈ శబ్దం ఖుర్ఆన్‌లో ఈ ఆయత్‌లోనే ఒకేసారి వచ్చింది.

وَإِنۡ خِفۡتُمۡ عَيۡلَةٗ فَسَوۡفَ يُغۡنِيكُمُ ٱللَّهُ مِن فَضۡلِهِۦٓ إِن شَآءَۚ إِنَّ ٱللَّهَ عَلِيمٌ حَكِيمٞ ٢٨

قَٰتِلُواْ ٱلَّذِينَ لَا يُؤۡمِنُونَ بِٱللَّهِ وَلَا بِٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِ وَلَا يُحَرِّمُونَ مَا حَرَّمَ ٱللَّهُ وَرَسُولُهُۥ وَلَا يَدِينُونَ دِينَ ٱلۡحَقِّ مِنَ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡكِتَٰبَ حَتَّىٰ يُعۡطُواْ ٱلۡجِزۡيَةَ عَن يَدٖ وَهُمۡ صَٰغِرُونَ ٢٩

وَقَالَتِ ٱلۡيَهُودُ عُزَيۡرٌ ٱبۡنُ ٱللَّهِ وَقَالَتِ ٱلنَّصَٰرَى ٱلۡمَسِيحُ ٱبۡنُ ٱللَّهِۖ

రాకూడదు.[1] మరియు ఒకవేళ మీరు లేమికి భయపడితే! అల్లాహ్ కోరితే, తన అనుగ్రహంతో మిమ్మల్ని సంపన్నులుగా చేయగలడు! నిశ్చయంగా, అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేచనాపరుడు.

**29**. అల్లాహ్‌ను మరియు అంతిమ దినాన్ని విశ్వసించని; అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త నిషేధించినవి, నిషిద్ధమని భావించని; సత్యధర్మాన్ని తమ ధర్మంగా స్వీకరించని గ్రంథప్రజలతో - వారు స్వయంగా తమ చేతులతో జి'జ్‌యా[2] ఇచ్చి లోబడి ఉండే వరకూ - పోరాడండి.[3]

**30**. మరియు యూదులు 'ఉ'జైర్ అల్లాహ్ కుమారుడని అంటారు.[4] మరియు

---

**1**. ముస్లిమేతరులు 'హరమ్ సరిహద్దులలోకి రాకూడదు. ఈ ఆజ్ఞ 9వ హిజ్రీలో వచ్చింది. కాని వారు ఇతర మస్జిద్‌లలో ప్రవేశించవచ్చు. ఉదాహరణకు దైవప్రవక్త ('స'అస) స'మామ బిన్-ఆసా'ల్ (ర'ది.'అ.)ను, అతడు ఇస్లాం స్వీకరించక ముందు మస్జిద్ అన్-నబవీలో ఒక స్తంభానికి ఖైదీగా కట్టి ఉంచారు.

**2**. జి'జ్‌యతున్: ఖుర్ఆన్‌లో ఇచ్చట ఒకేసారి వచ్చింది. జి'జ్‌యా అంటే, ముస్లిమే తరులతో ఇస్లామీయ ప్రభుత్వం వసూలుచేసే పన్ను. దీనికి కారణాలు: 1) వారు విధిగా 'జకాత్ చెల్లించరు, 2) వారికి ఇస్లామియా ప్రభుత్వంలో జిహాద్, అంటే ఇస్లాం ధర్మ రక్షణకొరకు పోరాడటం విధికాదు, 3) వారి ఆత్మరక్షణ ఖర్చుకొరకు.
ఈ క్రింద పేర్కొన్న వారికి జి'జ్‌యాలేదు. 1) స్త్రీలు, 2) యుక్తవయస్సుకు రాని పురుషులు, 3) వృద్ధులు, 4) వ్యాధిగ్రస్తులు మరియు వికలాంగులు, 5) ధర్మవేత్తలు, గురువులు, మునులు, 6) ఎవరైతే జిహాద్ (మిలటరీ డ్యూటీ) కొరకు సిద్దపడతారో వారు.

**3**. జిహాద్‌ను ఈ విధంగా కూడా వివరించారు: అల్లాహ్ (సు.తా.) మార్గంలో పోరాడటం, అంటే సత్యాన్ని మరియు దానిని అనుసరించే వారిని (ముస్లింలను) రక్షించటానికి చేసే ధర్మయుద్ధం. ఇది ప్రతి ముస్లిం యొక్క విధి. (చూడండి, 2:190-194).

**4**. బాబిలోనియన్‌లు (Babylonians) యూదులను, వెడలగొట్టిన తరువాత వారు (యూదులు) తౌరాత్‌ను కోల్పోయారు. అది ఈ రోజు ఉన్న స్థితిలోకి, దానిని తిరిగి తెచ్చినవారు 'ఉ'జైర్ 'అ.స. (Ezra). అతనే ఈ రోజు ఆచారంలో ఉన్న యూదమతాన్ని స్థాపించారు, (Encyclopedia Brittanica, 1963, vol-9, p.15). అతనినే యూదులు అల్లాహుతా'ఆలా కుమారుడంటారు.

ذَٰلِكَ قَوْلُهُم بِأَفْوَٰهِهِمْ يُضَٰهِـُٔونَ قَوْلَ ٱلَّذِينَ كَفَرُوا۟ مِن قَبْلُ ۚ قَٰتَلَهُمُ ٱللَّهُ ۚ أَنَّىٰ يُؤْفَكُونَ ﴿٣٠﴾

క్రైస్తవులు మసీహ్ (క్రీస్తు) అల్లాహ్ కుమారుడని. ఇవి వారు తమ నోటితో అనే మాటలే. ఇంతకు పూర్వపు సత్య తిరస్కారులు పలికిన మాటలనే వారు అనుకరిస్తున్నారు. అల్లాహ్ వారిని నశింపజేయుగాక! వారెంత మోసగింప (సత్యం నుండి మరలింప) బడుతున్నారు!

ٱتَّخَذُوٓا۟ أَحْبَارَهُمْ وَرُهْبَٰنَهُمْ أَرْبَابًا مِّن دُونِ ٱللَّهِ وَٱلْمَسِيحَ ٱبْنَ مَرْيَمَ وَمَآ أُمِرُوٓا۟ إِلَّا لِيَعْبُدُوٓا۟ إِلَٰهًا وَٰحِدًا ۖ لَّآ إِلَٰهَ إِلَّا هُوَ ۚ سُبْحَٰنَهُۥ عَمَّا يُشْرِكُونَ ﴿٣١﴾

**31.** వారు (యూదులు మరియు క్రైస్తవులు) అల్లాహ్‌ను వదలి తమ యూద మతాచారు(అ'హ్బారు)లను మరియు (క్రైస్తవ) సన్యాసు (రుహ్బాను)లను మరియు మర్యమ్ కుమారుడైన మసీహ్(క్రీస్తు)ను తమ ప్రభువులుగా చేసుకున్నారు.[1] వాస్తవానికి, వారు ఒకే ఒక్క దైవాన్ని మాత్రమే ఆరాధించాలని ఆజ్ఞాపించబడ్డారు. ఆయన (అల్లాహ్) తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు. ఆయన వారు సాటికల్పించే వాటికి అతీతుడు.

يُرِيدُونَ أَن يُطْفِـُٔوا۟ نُورَ ٱللَّهِ بِأَفْوَٰهِهِمْ وَيَأْبَى ٱللَّهُ إِلَّآ أَن يُتِمَّ نُورَهُۥ وَلَوْ كَرِهَ ٱلْكَٰفِرُونَ ﴿٣٢﴾

**32.** వారు అల్లాహ్ జ్యోతిని (ఇస్లాంను) తమ నోటితో (ఊది) ఆర్పగోరుతున్నారు, కాని అల్లాహ్ అలా కానివ్వడు; సత్యతిరస్కారులకు అది ఎంత అసహ్యాకరమైనా, ఆయన తన జ్యోతిని పూర్తిచేసితీరుతాడు.

هُوَ ٱلَّذِىٓ أَرْسَلَ رَسُولَهُۥ بِٱلْهُدَىٰ وَدِينِ ٱلْحَقِّ لِيُظْهِرَهُۥ عَلَى ٱلدِّينِ كُلِّهِۦ وَلَوْ كَرِهَ ٱلْمُشْرِكُونَ ﴿٣٣﴾

**33.** బహుదైవారాధ (ముష్రి)కులకు అది ఎంత అసహ్యాకరమైనా, తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్నీ మరియు సత్యధర్మాన్నీ ఇచ్చి పంపి, దానిని సకల ధర్మాల మీద ప్రబలింపజేసి (ఆధిక్యత నిచ్చి)నవాడు ఆయన (అల్లాహ్)యే![2] (1/2)

---

**1**. చూడండి, 3:64.

**2**. చూడండి, 3:19 మరియు 61:8-9.

۞ يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِنَّ كَثِيرًا مِّنَ ٱلۡأَحۡبَارِ وَٱلرُّهۡبَانِ لَيَأۡكُلُونَ أَمۡوَٰلَ ٱلنَّاسِ بِٱلۡبَٰطِلِ وَيَصُدُّونَ عَن سَبِيلِ ٱللَّهِۗ وَٱلَّذِينَ يَكۡنِزُونَ ٱلذَّهَبَ وَٱلۡفِضَّةَ وَلَا يُنفِقُونَهَا فِي سَبِيلِ ٱللَّهِ فَبَشِّرۡهُم بِعَذَابٍ أَلِيمٖ ٣٤

34. * ఓ విశ్వాసులారా! నిశ్చయంగా, చాలామంది యూద మతాచారు (అ'హ్‌బారు)లు మరియు క్రైస్తవ సన్యాసు (రుహ్‌బాను)లు ప్రజలసొత్తును అక్రమ పద్ధతులద్వారా తినివేస్తున్నారు మరియు వారిని అల్లాహ్ మార్గం నుండి ఆటంకపరుస్తున్నారు. మరియు ఎవరైతే వెండి బంగారాన్ని కూడబెట్టి, దానిని అల్లాహ్ మార్గంలో ఖర్చుపెట్టరో వారికి బాధాకరమైన శిక్ష గలదనే వార్తను వినిపించు.

يَوۡمَ يُحۡمَىٰ عَلَيۡهَا فِي نَارِ جَهَنَّمَ فَتُكۡوَىٰ بِهَا جِبَاهُهُمۡ وَجُنُوبُهُمۡ وَظُهُورُهُمۡۖ هَٰذَا مَا كَنَزۡتُمۡ لِأَنفُسِكُمۡ فَذُوقُواْ مَا كُنتُمۡ تَكۡنِزُونَ ٣٥

35. ఆ దినమున దానిని (ఆ వెండి బంగారాన్ని) నరకాగ్నిలో కాల్చి దానితో వారి నుదురుల మీద, ప్రక్కల మీద మరియు వీపుల మీద వాతలు వేయబడతాయి.[1] (అప్పుడు వారితో ఇలా అనబడుతుంది): "ఇదంతా మీరు మీ కొరకు కూడబెట్టుకున్నదే, కావున మీరు కూడబెట్టుకున్న దానిని చవిచూడండి."

إِنَّ عِدَّةَ ٱلشُّهُورِ عِندَ ٱللَّهِ ٱثۡنَا عَشَرَ شَهۡرٗا فِي كِتَٰبِ ٱللَّهِ يَوۡمَ خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ مِنۡهَآ أَرۡبَعَةٌ حُرُمٞۚ ذَٰلِكَ ٱلدِّينُ ٱلۡقَيِّمُۚ فَلَا تَظۡلِمُواْ فِيهِنَّ أَنفُسَكُمۡۚ

36. నిశ్చయంగా, నెలల సంఖ్య అల్లాహ్ దగ్గర పన్నెండు నెలలు మాత్రమే. ఇది భూమ్యాకాశాలు సృష్టించిన దినం నుండి అల్లాహ్ గ్రంథంలో వ్రాయబడి ఉంది. వాటిలో నాలుగు నిషిద్ధ (మాసాలు).[2] ఇదే సరైన ధర్మం. కావున వాటిలో (ఆ నాలుగు హి'జ్రీ మాసాలలో) మీకు మీరు అన్యాయం

---

1. చూడండి, 3:180 ఇంకా చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-2, 'హదీస్' నెం. 486.

2. నిషిద్ధమాసాలు హి'జ్రీ శకపు రజబ్, జు'ల్-ఖాయిదహ్, జు'ల్-'హిజ్జహ్ మరియు ము'హర్రమ్ (7,11,12 మరియు 1వ నెలలు).

وَقَـٰتِلُواْ ٱلۡمُشۡرِكِينَ كَآفَّةٗ كَمَا يُقَٰتِلُونَكُمۡ كَآفَّةٗۚ وَٱعۡلَمُوٓاْ أَنَّ ٱللَّهَ مَعَ ٱلۡمُتَّقِينَ ٣٦

చేసుకోకండి.[1] బహుదైవారాధ కులతో (ముష్రిక్) అందరూ కలిసి పోరాడండి. ఏ విధంగా అయితే వారందరూ కలిసి మీతో పోరాడుతున్నారో! మరియు నిశ్చయంగా, అల్లాహ్ దైవభీతి గలవారితోనే ఉంటాడని తెలుసుకోండి.[2]

إِنَّمَا ٱلنَّسِيٓءُ زِيَادَةٞ فِي ٱلۡكُفۡرِۖ يُضَلُّ بِهِ ٱلَّذِينَ كَفَرُواْ يُحِلُّونَهُۥ عَامٗا وَيُحَرِّمُونَهُۥ عَامٗا لِّيُوَاطِـُٔواْ عِدَّةَ مَا حَرَّمَ ٱللَّهُ فَيُحِلُّواْ مَا حَرَّمَ ٱللَّهُۚ زُيِّنَ لَهُمۡ سُوٓءُ أَعۡمَٰلِهِمۡۗ وَٱللَّهُ لَا يَهۡدِي ٱلۡقَوۡمَ ٱلۡكَٰفِرِينَ ٣٧

**37.** నిశ్చయంగా, నెలలను వెనుక ముందు చేయటం (నసీఉ') సత్యతిరస్కారంలో అదనపు చేష్టయే! దానివల్ల సత్యతిరస్కారులు మార్గభ్రష్టత్వానికి గురిచేయబడుతున్నారు. వారు దానిని ఒక సంవత్సరం ధర్మసమ్మతం చేసుకుంటారు మరొక సంవత్సరం నిషేధించుకుంటారు. ఈ విధంగా వారు అల్లాహ్ నిషేధించిన (నెలల) సంఖ్యను తమకు అనుగుణంగా మార్చుకొని అల్లాహ్ నిషేధించిన దానిని ధర్మసమ్మతం చేసుకుంటున్నారు. వారి దుష్కార్యాలు వారికి మనోహరమైనవిగా కనిపిస్తున్నాయి. మరియు అల్లాహ్ సత్యతిరస్కారులకు సన్మార్గం చూపడు.

---

**1.** హి'జ్రీ నెలల లెక్క చంద్రుని నెలప్రకారం ఉంది. అంటే హి'జ్రీ సంవత్సరం చాంద్రమాన సంవత్సరం. ఇవి ప్రకృతిసిద్ధమైన నెలలు మరియు సంవత్సరాలు. వీటిని అనుసరించటానికి లెక్కలు పెట్టే అవసరం లేదు. దీనివల్ల రమ'దాన్ ఉపవాసాలు మరియు 'హజ్జ్ వేరువేరు ఋతువులలో వస్తాయి. ప్రపంచంలో ఎక్కడ ఉన్నా, ప్రజలు ప్రతి ఋతువులో ఉపవాసాలు, పండుగలు చేసుకుంటారు. చాంద్రనెల 29.5 రోజులది మరియు చాంద్ర సంవత్సరం 354 రోజులది. సూర్యమాన సంవత్సరంతో ఇది 11.25 రోజులు తక్కువ. దీని వల్ల ప్రతి 34 చాంద్రమాన సంవత్సరాలకు అంటే 12,036 దినాలకు ఒకసారి 'హజ్జ్ అదే దినమున మళ్ళీ వస్తుంది. ముష్రిక్ అరబ్బులు, చాంద్రమాన సంవత్సరాన్ని సూర్యమాన సంవత్సరంతో సరిపెట్టటానికి అధికమాసాన్ని చేర్చేవారు. ఈ ఆయత్ తరువాత ఇస్లాం షరీయత్‌లో సూర్యమాన సంవత్సరం మరియు అలా సరిపెట్టటం రద్దు చేయబడ్డాయి.

**2.** చూడండి, 2:193, 8:73.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ مَا لَكُمۡ إِذَا قِيلَ لَكُمُ ٱنفِرُواْ فِي سَبِيلِ ٱللَّهِ ٱثَّاقَلۡتُمۡ إِلَى ٱلۡأَرۡضِۚ أَرَضِيتُم بِٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَا مِنَ ٱلۡأٓخِرَةِۚ فَمَا مَتَٰعُ ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَا فِي ٱلۡأٓخِرَةِ إِلَّا قَلِيلٌ ٣٨

**38**. ఓ విశ్వాసులారా! మీకేమయింది? మీతో: "అల్లాహ్‌మార్గంలో బయలుదేరండి." అని చెప్పినపుడు మీరు భూమికి అతుక్కొని పోతున్నారేమిటి? ఏమీ? మీరు పరలోకాన్ని వదలి, ఇహలోక జీవితంతోనే తృప్తి పడదలచుకున్నారా? కాని ఇహలోక జీవిత సుఖం, పరలోక (జీవిత సుఖాల ముందు) ఎంతో అల్పమైనది![1]

إِلَّا تَنفِرُواْ يُعَذِّبۡكُمۡ عَذَابًا أَلِيمٗا وَيَسۡتَبۡدِلۡ قَوۡمًا غَيۡرَكُمۡ وَلَا تَضُرُّوهُ شَيۡـٔٗاۗ وَٱللَّهُ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٌ ٣٩

**39**. మీరు బయలుదేరకపోతే, ఆయన మీకు బాధాకరమైన శిక్షను విధిస్తాడు. మరియు మీకు బదులుగా మరొక జాతిని మీ స్థానంలో తెస్తాడు. మరియు మీరు ఆయనకు ఎలాంటి నష్టం కలిగించలేరు.[2] మరియు అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

إِلَّا تَنصُرُوهُ فَقَدۡ نَصَرَهُ ٱللَّهُ إِذۡ أَخۡرَجَهُ ٱلَّذِينَ كَفَرُواْ ثَانِيَ ٱثۡنَيۡنِ إِذۡ هُمَا فِي ٱلۡغَارِ إِذۡ يَقُولُ لِصَٰحِبِهِۦ لَا تَحۡزَنۡ إِنَّ ٱللَّهَ مَعَنَاۖ فَأَنزَلَ ٱللَّهُ

**40**. ఒకవేళ మీరు అతనికి (ప్రవక్తకు) సహాయం చేయకపోతే ఏం ఫర్వాలేదు! (అల్లాహ్ అతనికి తప్పక సహాయం చేస్తాడు). ఏ విధంగానైతే, సత్యతిరస్కారులు అతనిని పారద్రోలినపుడు, అల్లాహ్ అతనికి సహాయం చేశాడో! అప్పుడు అతను ఇద్దరిలో రెండవ వాడిగా (సౌ'ర్) గుహలో ఉన్నప్పుడు అతను తన తోటివాని (అబూ-బక్ర్)తో: "నీవు దుఃఖపడకు, నిశ్చయంగా, అల్లాహ్ మనతో ఉన్నాడు!" అని

---

**1**. చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నెం. 53.

**2**. ఇక్కడ 9వ హిజ్రీ షవ్వాల్ నెలలో జరిగిన తబూక్ దండయాత్ర ప్రస్తావన ఉంది. బెజాంటైన్ (Byzantine) చక్రవర్తి, క్రైస్తవుడైన, హిరాక్లియస్, ముస్లింలకు విరుద్ధంగా యుద్ధసన్నాహాలు మొదలుపెట్టాడు. కావున ము'హమ్మద్ ('స'అస) కూడా యుద్ధసన్నాహాలు మొదలుపెట్టారు. అది కపటవిశ్వాసులకు ఎంతో బాధకరంగా ఉంటుంది. అప్పుడు ఈ ఆయత్ అవతరింపజేయబడింది. దైవప్రవక్త ('స'అస) ముస్లింలతో, క్రైస్తవులను ఎదుర్కొవటానికి తబూక్ వెళ్ళి, అక్కడ 20 రోజులుండి, క్రైస్తవులు యుద్ధానికి రానందుకు తిరిగి వచ్చేస్తారు.

అన్నాడు.[1] అప్పుడు అల్లాహ్! అతనిపై తన తరఫునుండి మనశ్శాంతిని అవతరింపజేశాడు. అతనిని మీకు కనిపించని (దైవదూతల) దళాలతో సహాయంచేసి సత్యతిరస్కారుల మాటను కించపరచాడు. మరియు అల్లాహ్ మాట సదా సర్వోన్నతమైనదే. మరియు అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేచనాపరుడు.

سَكِينَتَهُۥ عَلَيۡهِ وَأَيَّدَهُۥ بِجُنُودٖ لَّمۡ تَرَوۡهَا وَجَعَلَ كَلِمَةَ ٱلَّذِينَ كَفَرُواْ ٱلسُّفۡلَىٰۗ وَكَلِمَةُ ٱللَّهِ هِيَ ٱلۡعُلۡيَاۗ وَٱللَّهُ عَزِيزٌ حَكِيمٌ ٤٠

**41**. తేలికగానైనా సరే, లేక బరువుగానైనా సరే బయలుదేరండి. మరియు మీ సంపదలతో మరియు మీ ప్రాణాలతో అల్లాహ్ మార్గంలో పోరాడండి. ఒకవేళ మీరిది తెలుసు కోగలిగితే, ఇది మీకెంతో ఉత్తమమైనది.

ٱنفِرُواْ خِفَافٗا وَثِقَالٗا وَجَٰهِدُواْ بِأَمۡوَٰلِكُمۡ وَأَنفُسِكُمۡ فِي سَبِيلِ ٱللَّهِۚ ذَٰلِكُمۡ خَيۡرٞ لَّكُمۡ إِن كُنتُمۡ تَعۡلَمُونَ ٤١

**42**. అది తొందరగా దొరికే లాభం మరియు సులభమైన ప్రయాణం అయితే వారు తప్పక నీవెంట వెళ్ళేవారు. కాని వారికది (తబూక్) ప్రయాణం చాలా కష్టమైనదిగా (దూర మైనదిగా) అనిపించింది. కావున వారు అల్లాహ్‌పై ప్రమాణం చేస్తూ అంటున్నారు: "మేము రాగలస్థితిలో ఉంటే తప్పక మీవెంట వచ్చి ఉండేవారము." (ఈ విధంగా అబద్ధమాడి) వారు తమను తాము నాశనం చేసుకుంటున్నారు. మరియు వారు అబద్ధమాడుతున్నారని అల్లాహ్‌కు బాగా తెలుసు.[2]

لَوۡ كَانَ عَرَضٗا قَرِيبٗا وَسَفَرٗا قَاصِدٗا لَّٱتَّبَعُوكَ وَلَٰكِنۢ بَعُدَتۡ عَلَيۡهِمُ ٱلشُّقَّةُۚ وَسَيَحۡلِفُونَ بِٱللَّهِ لَوِ ٱسۡتَطَعۡنَا لَخَرَجۡنَا مَعَكُمۡ يُهۡلِكُونَ أَنفُسَهُمۡ وَٱللَّهُ يَعۡلَمُ إِنَّهُمۡ لَكَٰذِبُونَ ٤٢

---

**1**. క్రీ. శకం 622, (ప్రవక్త పదవి ప్రసాదించబడిన దాదాపు 13వ సంవత్సరం)లో, ము'హమ్మద్ ('స'అస)ను చంపటానికి, మక్కా ముష్రికులు అతని ఇంటి మీదికి, రాత్రివేళ ప్రతి తెగనుండి ఒక యువకుణ్ణి తయారుచేసి పంపుతారు. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞతో, దైవప్రవక్త ('స'అస) వారి మీద దుమ్ము విసరగా, వారికి కునుకు వస్తుంది. ఆ తరువాత అతను ('స'అస), అబూబక్ర్ (ర'ది.'అ.)తో సహా బయలుదేరి, సౌ'ర్ కొండ గుహలో మూడురోజులు దాగుతారు. ముష్రికులు వారిని వెతుక్కుంటూ గుహపై వరకు చేరుతారు. కాని ముష్రికులు వారిద్దరిని కనుగొనలేక పోతారు. అది వారిద్దరు గమనిస్తారు. ఆసందర్భంలో దైవప్రవక్త ('స'అస) అబూబక్ర్ (ర'ది.'అ.)తో ఈ మాటలు అంటారు, ('స'హీ'హ్ బు'ఖారీ).

**2**. ఎండకాలం, ఖర్జూర పంటకాలం, చాలా దూరపు ప్రయాణం కావటం వల్ల కపటవిశ్వాసులు,

عَفَا ٱللَّهُ عَنكَ لِمَ أَذِنتَ لَهُمۡ
حَتَّىٰ يَتَبَيَّنَ لَكَ ٱلَّذِينَ
صَدَقُواْ وَتَعۡلَمَ ٱلۡكَٰذِبِينَ ٤٣

**43**. (ఓ ప్రవక్తా!) అల్లాహ్ నిన్ను మన్నించుగాక! సత్యవంతులెవరో నీకు స్పష్టం కాకముందే మరియు అబద్ధమాడే వారెవరో నీకు తెలియక ముందే, వారిని (వెనుక ఉండటానికి) ఎందుకు అనుమతినిచ్చావు?[1]

لَا يَسۡتَـٔۡذِنُكَ ٱلَّذِينَ يُؤۡمِنُونَ
بِٱللَّهِ وَٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِ أَن
يُجَٰهِدُواْ بِأَمۡوَٰلِهِمۡ وَأَنفُسِهِمۡۗ
وَٱللَّهُ عَلِيمُۢ بِٱلۡمُتَّقِينَ ٤٤

**44**. అల్లాహ్‌ను మరియు అంతిమ దినాన్ని విశ్వసించేవారు, తమ సంపత్తి మరియు తమ ప్రాణాలను వినియోగించి (అల్లాహ్ మార్గంలో) పోరాడటం నుండి తప్పించుకోవటానికి ఎన్నడూ అనుమతి అడగరు. మరియు దైవభీతి గలవారు ఎవరో అల్లాహ్‌కు బాగా తెలుసు.

إِنَّمَا يَسۡتَـٔۡذِنُكَ ٱلَّذِينَ لَا
يُؤۡمِنُونَ بِٱللَّهِ وَٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِ
وَٱرۡتَابَتۡ قُلُوبُهُمۡ فَهُمۡ فِي
رَيۡبِهِمۡ يَتَرَدَّدُونَ ٤٥

**45**. నిస్సందేహంగా, అల్లాహ్‌ను మరియు అంతిమదినాన్ని విశ్వసించని వారే, వెనుక ఉండటానికి అనుమతి అడుగుతారు. మరియు వారి హృదయాలు సందేహంలో మునిగి ఉన్నాయి. కావున వారు తమ సందేహాలలో పడి ఊగిసలాడు తున్నారు.[2] (5/8)

---

బలహీన విశ్వాసం గలవారు, మరికొందరు ఎడారి వాసు(బద్దూ)లు, ఎన్నో బూటక సాకులు చెప్పి దైవప్రవక్త ('స'అస)ను, వెనుక ఉండి పోవటానికి అనుమతి అడుగుతారు. దైవప్రవక్త ('స'అస) అనుమతి కూడా ఇస్తారు. ఆ సందర్భంలో ఇది మరియు దీని తరువాత ఆయతులు అవతరింపజేయబడ్డాయి.

**1**. చూడండి, 24:62.

**2**. ఈ జిహాద్‌లో పాల్గొనే విషయంలో ముస్లింల నాలుగు వర్గాలు ఏర్పడ్డాయి: 1) సహృదయంతో వెంటనే జిహాద్‌కు సిద్ధపడ్డ వారు; 2) మొదట సంకోచించి వెంటనే సిద్దపడ్డవారు; 3) వృద్ధులు, రోగులు మరియు ప్రయాణపు ఖర్చులు లేనివారు - వీరిని అల్లాహ్ (సు.తా.) క్షమించాడు - చూడండి, 9:91-92; 4) కేవలం సోమరితనం వల్ల పాల్గొననివారు. వీరు పశ్చాత్తాపపడి క్షమాపణ కోరగా వారి క్షమాపణ తరువాత అంగీకరించబడుతుంది. వీరుగాక బూటక సాకులు చెప్పి వెనుకఉండిపోయిన కపట విశ్వాసులు కూడా ఉన్నారు.

۞ وَلَوْ أَرَادُوا۟ ٱلْخُرُوجَ
لَأَعَدُّوا۟ لَهُۥ عُدَّةً وَلَٰكِن كَرِهَ
ٱللَّهُ ٱنۢبِعَاثَهُمْ فَثَبَّطَهُمْ وَقِيلَ
ٱقْعُدُوا۟ مَعَ ٱلْقَٰعِدِينَ ﴿٤٦﴾

لَوْ خَرَجُوا۟ فِيكُم مَّا زَادُوكُمْ إِلَّا
خَبَالًا وَلَأَوْضَعُوا۟ خِلَٰلَكُمْ
يَبْغُونَكُمُ ٱلْفِتْنَةَ وَفِيكُمْ
سَمَّٰعُونَ لَهُمْ ۗ وَٱللَّهُ عَلِيمٌۢ
بِٱلظَّٰلِمِينَ ﴿٤٧﴾

لَقَدِ ٱبْتَغَوُا۟ ٱلْفِتْنَةَ مِن قَبْلُ
وَقَلَّبُوا۟ لَكَ ٱلْأُمُورَ حَتَّىٰ
جَآءَ ٱلْحَقُّ وَظَهَرَ أَمْرُ ٱللَّهِ
وَهُمْ كَٰرِهُونَ ﴿٤٨﴾

وَمِنْهُم مَّن يَقُولُ ٱئْذَن لِّى
وَلَا تَفْتِنِّىٓ ۚ أَلَا فِى ٱلْفِتْنَةِ
سَقَطُوا۟ ۗ وَإِنَّ جَهَنَّمَ
لَمُحِيطَةٌۢ بِٱلْكَٰفِرِينَ ﴿٤٩﴾

**46.** * మరియు ఒకవేళ వారు బయలు దేరాలని కోరిఉంటే తప్పక దానికై వారు యుద్ధసామగ్రిని సిద్ధపరచుకొని ఉండేవారు, కాని వారు బయలుదేరటం అల్లాహ్‌కు ఇష్టం లేదు, కావున వారిని నిలిపివేశాడు. మరియు వారితో: "కూర్చొని ఉన్నవారితో మీరు కూడా కూర్చొని ఉండండి!" అని చెప్పబడింది.

**47.** ఒకవేళ వారు మీతో కలిసి వెళ్ళినా మీలో కలతలు తప్ప మరేమీ అధికం చేసేవారు కాదు. మరియు మీ మధ్య ఉపద్రవం (ఫిత్న) రేకెత్తించటానికి తీవ్ర ప్రయత్నాలు చేసేవారు. మరియు మీలో కొందరు వారి (కపటవిశ్వాసుల) కొరకు, మాటలు వినేవారు (వారి గూఢా చారులు) ఉన్నారు. మరియు అల్లాహ్‌కు దుర్మార్గుల గురించి బాగా తెలుసు.

**48.** (ఓ ప్రవక్తా!) వాస్తవానికి వారు ఇంతకు ముందు కూడా కల్లోలాన్ని (ఫిత్నను) పుట్టించి, నీ కార్యాలను తలక్రిందులు చేయగోరారు. చివరకు సత్యం బహిర్గతమయింది. మరియు అల్లాహ్ నిర్ణయం స్పష్టమయ్యింది. మరియు వారు దీన్ని అసహ్యించుకున్నారు!

**49.** మరియు వారిలో: "నాకు (వెనుక ఉండటానికి) అనుమతినివ్వు! నన్ను ఏ మాత్రం పరీక్షకు గురిచేయకు!" అని అనే వారు కూడా ఉన్నారు. వాస్తవానికి, వారు (ఇలా అనుమతి కోరి) పరీక్షకు గురిఅయ్యారు! మరియు నిశ్చయంగా, సత్యతిరస్కారులను నరకాగ్ని చుట్టుకోనున్నది.

**50**. (ఓ ప్రవక్తా!) ఒకవేళ నీకు మేలు కలిగితే వారికి బాధ కలుగుతుంది. మరియు నీపై ఆపదవస్తే వారు: "మేము ముందుగానే జాగ్రత్తపడ్డాము!" అని అంటూ సంతోషపడుతూ మరలిపోతారు.

**51**. వారితో ఇలా అను: "అల్లాహ్ మా కొరకు వ్రాసింది తప్ప మరేమీ మాకు సంభవించదు. ఆయనే మా సంరక్షకుడు. మరియు విశ్వాసులు అల్లాహ్ మీదే నమ్మకం ఉంచుకోవాలి!"

**52**. ఇలా అను: "మీరు మా విషయంలో నిరీక్షిస్తున్నది రెండు మేలైన వాటిలో ఒకటి. అల్లాహ్ స్వయంగా మీకు శిక్ష విధిస్తాడా, లేదా మా చేతుల ద్వారానా? అని మేము నిరీక్షిస్తున్నాము. కావున మీరూ నిరీక్షించండి, నిశ్చయంగా మేము కూడా మీతోపాటు నిరీక్షిస్తున్నాము!"

**53**. ఇలా అను: "మీరు మీ (సంపదను) ఇష్టపూర్వకంగా ఖర్చుచేసినా, లేదా ఇష్టం లేకుండా ఖర్చుచేసినా అది మీ నుండి స్వీకరించబడదు.[1] నిశ్చయంగా, మీరు అవిధేయులు (ఫాసిఖూన్)."

**54**. మరియు వారి విరాళం (చందా) స్వీకరించబడకుండా పోవటానికి కారణం, వాస్తవానికి వారు అల్లాహ్‌ను మరియు ఆయన సందేశహరుణ్ణి తిరస్కరించడం మరియు నమా'జ్ కొరకు ఎంతో సోమరితనంతో తప్ప రాకపోవడం మరియు అయిష్టంతో (అల్లాహ్ మార్గంలో) ఖర్చుపెట్టడమే![2]

إِن تُصِبۡكَ حَسَنَةٞ تَسُؤۡهُمۡۖ
وَإِن تُصِبۡكَ مُصِيبَةٞ يَقُولُواْ قَدۡ
أَخَذۡنَآ أَمۡرَنَا مِن قَبۡلُ وَيَتَوَلَّواْ
وَّهُمۡ فَرِحُونَ ٥٠
قُل لَّن يُصِيبَنَآ إِلَّا مَا كَتَبَ ٱللَّهُ
لَنَا هُوَ مَوۡلَىٰنَاۚ وَعَلَى ٱللَّهِ فَلۡيَتَوَكَّلِ
ٱلۡمُؤۡمِنُونَ ٥١
قُلۡ هَلۡ تَرَبَّصُونَ بِنَآ إِلَّآ إِحۡدَى
ٱلۡحُسۡنَيَيۡنِۖ وَنَحۡنُ نَتَرَبَّصُ بِكُمۡ أَن
يُصِيبَكُمُ ٱللَّهُ بِعَذَابٖ مِّنۡ عِندِهِۦٓ
أَوۡ بِأَيۡدِينَاۖ فَتَرَبَّصُوٓاْ إِنَّا مَعَكُم
مُّتَرَبِّصُونَ ٥٢
قُلۡ أَنفِقُواْ طَوۡعًا أَوۡ كَرۡهٗا لَّن يُتَقَبَّلَ
مِنكُمۡ إِنَّكُمۡ كُنتُمۡ قَوۡمٗا
فَٰسِقِينَ ٥٣
وَمَا مَنَعَهُمۡ أَن تُقۡبَلَ مِنۡهُمۡ نَفَقَٰتُهُمۡ
إِلَّآ أَنَّهُمۡ كَفَرُواْ بِٱللَّهِ وَبِرَسُولِهِۦ وَلَا
يَأۡتُونَ ٱلصَّلَوٰةَ إِلَّا وَهُمۡ كُسَالَىٰ وَلَا
يُنفِقُونَ إِلَّا وَهُمۡ كَٰرِهُونَ ٥٤

1. చూడండి, 2:264, 4:38.

2. చూడండి, 'స.బు'ఖారీ, పు-1, 'హ. 626.

**55**. కావున వారి సిరిసంపదలుగానీ, వారి సంతానంగానీ, నిన్ను ఆశ్చర్యంలో పడనివ్వకూడదు![1] నిశ్చయంగా, అల్లాహ్ వాటివలన వారిని ఇహలోక జీవితంలో శిక్షించగోరుతున్నాడు. మరియు వారు సత్యతిరస్కార స్థితిలోనే తమ ప్రాణాలను కోల్పోతారు.

**56**. మరియు వారు నిశ్చయంగా, మేము మీతోనే ఉన్నామని అల్లాహ్‌పై ప్రమాణం చేస్తున్నారు. కాని వారు మీతో లేరు. వాస్తవానికి వారు మీకు భయపడుతున్నారు.

**57**. ఒకవేళ వారికి ఏదైనా ఆశ్రయంగానీ, గుహ గానీ లేదా తల దాచుకోవటానికి ఏకాంత స్థలం గానీ దొరికితే, వారు తొందరగా పరుగెత్తి అందులో దాక్కుంటారు.[2]

**58**. మరియు (ఓ ప్రవక్తా!) వారిలో కొందరు దానాలు (సదఖాత్) పంచే విషయంలో నీపై అపనిందలు మోపుతున్నారు.[3] దానినుండి వారికి కొంత ఇవ్వబడితే సంతోషిస్తారు. కాని దానినుండి వారికి ఇవ్వబడకపోతే కోపగించుకుంటారు!

**59**. మరియు ఒకవేళ అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త వారికి ఇచ్చిన దానితో వారు తృప్తిపడి: "అల్లాహ్‌యే మాకు చాలు! అల్లాహ్ తన అనుగ్రహంతో

فَلَا تُعۡجِبۡكَ أَمۡوَٰلُهُمۡ وَلَآ
أَوۡلَٰدُهُمۡۚ إِنَّمَا يُرِيدُ ٱللَّهُ لِيُعَذِّبَهُم
بِهَا فِي ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَا وَتَزۡهَقَ
أَنفُسُهُمۡ وَهُمۡ كَٰفِرُونَ ٥٥
وَيَحۡلِفُونَ بِٱللَّهِ إِنَّهُمۡ لَمِنكُمۡ
وَمَا هُم مِّنكُمۡ وَلَٰكِنَّهُمۡ قَوۡمٞ
يَفۡرَقُونَ ٥٦
لَوۡ يَجِدُونَ مَلۡجَـًٔا أَوۡ
مَغَٰرَٰتٍ أَوۡ مُدَّخَلٗا لَّوَلَّوۡاْ إِلَيۡهِ
وَهُمۡ يَجۡمَحُونَ ٥٧
وَمِنۡهُم مَّن يَلۡمِزُكَ فِي ٱلصَّدَقَٰتِ
فَإِنۡ أُعۡطُواْ مِنۡهَا رَضُواْ وَإِن لَّمۡ يُعۡطَوۡاْ
مِنۡهَآ إِذَا هُمۡ يَسۡخَطُونَ ٥٨
وَلَوۡ أَنَّهُمۡ رَضُواْ مَآ ءَاتَىٰهُمُ ٱللَّهُ
وَرَسُولُهُۥ وَقَالُواْ حَسۡبُنَا ٱللَّهُ

---

**1**. చూడండి, 20:131 మరియు 23:55-56. ఇంకా చూడండి, 3:178 మరియు 8:28.

**2**. ఈ ఆయత్ కపట విశ్వాసులను గురించి ఉంది. వారిని గురించి ఇంకా చూడండి, 4:142, 9:67 మరియు 29:11. (ఖుర్ఆన్ అవతరణాక్రమంలో ఇది బహుశా కపటవిశ్వాసులను గురించి వచ్చిన మొట్టమొదటి ఆయత్).

**3**. చూడండి, 2:263-264.

سَيُؤْتِينَا ٱللَّهُ مِن فَضْلِهِۦ وَرَسُولُهُۥٓ إِنَّآ إِلَى ٱللَّهِ رَٰغِبُونَ ﴿٥٩﴾

మాకు ఇంకా చాలా ఇస్తాడు మరియు ఆయన ప్రవక్త కూడా (ఇస్తాడు). నిశ్చయంగా, మేము అల్లాహ్‌నే వేడు కుంటాము!'' అని పలికి ఉంటే (అది వారికే బాగుండేది!) (3/4)

۞ إِنَّمَا ٱلصَّدَقَٰتُ لِلْفُقَرَآءِ وَٱلْمَسَٰكِينِ وَٱلْعَٰمِلِينَ عَلَيْهَا وَٱلْمُؤَلَّفَةِ قُلُوبُهُمْ وَفِى ٱلرِّقَابِ وَٱلْغَٰرِمِينَ وَفِى سَبِيلِ ٱللَّهِ وَٱبْنِ ٱلسَّبِيلِ ۖ فَرِيضَةً مِّنَ ٱللَّهِ ۗ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٌ ﴿٦٠﴾

**60.** * నిశ్చయంగా, దానాలు ('సదఖాత్)[1] కేవలం యాచించు నిరుపేదలకు మరియు యాచించని పేదవారికి,[2] ('జకాతు) వ్యవహారాలపై నియుక్తులైన వారికి మరియు ఎవరి హృదయాలనైతే (ఇస్లాం వైపుకు) ఆకర్షించవలసి ఉందో వారికి, బానిసల విముక్తి కొరకు, ఋణగ్రస్తులైన వారి కొరకు, అల్లాహ్ మార్గంలో (పోయేవారి) కొరకు మరియు బాటసారుల కొరకు. ఇది అల్లాహ్ నిర్ణయించిన ఒక విధి. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

وَمِنْهُمُ ٱلَّذِينَ يُؤْذُونَ ٱلنَّبِىَّ وَيَقُولُونَ هُوَ أُذُنٌ ۚ قُلْ أُذُنُ

**61.** మరియు వారిలో కొందరు ప్రవక్తను తమ మాటలతో బాధ కలిగించే వారున్నారు. వారంటారు: ''ఇతను (చెప్పుడు మాటలు)

---

**1.** ఇక్కడ సదఖాత్ అంటే 'జకాత్ అని అర్థం. ఎనిమిది (8) రకాల వారు వీటికి హక్కుదారులు: 1) ఫుఖరాకు; 2) మసాకీన్‌లకు; 3) 'జకాత్ ప్రోగుచేయటానికి నియుక్తులైన వారికి; 4) ఎవరి హృదయాలను ఇస్లాం వైపునకు ఆకర్షించవలసిఉందో వారికి; 5) ముస్లిం బానిసల విముక్తికి; 6) ఋణగ్రస్తులైన వారికి; 7) అల్లాహ్ మార్గంలో మరియు 8) బాటసారులకు - వారు పేదవారు కాకున్నా - ప్రయాణంలో ఉన్నప్పుడు లేమికి గురిఅయితే వారికి ఇవ్వాలి.

**2.** ఫఖీరున్: అంటే ఏమీ ఆదాయం లేనందుకు తన నిత్యావసరాలకు ఇతరులపై ఆధారపడి ఉండేవాడు. ఇట్టివారు విధిలేక యాచించవచ్చు.

మిస్కీనున్: కొంత ఆదాయం గలవాడు కాని అది అతని నిత్యావసరాలకు సరిపోదు. అతడు ఇతరులతో యాచించుటకు వెనుకంజవేస్తాడు. తన స్వాభిమానంలో ఉంటాడు. ఇట్టవాడికి వాడి లక్షణాలు చూసి ఇవ్వాలి. ('స'హీ'హ్ బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం).

خَيْرٍ لَّكُمْ يُؤْمِنُ بِٱللَّهِ وَيُؤْمِنُ
لِلْمُؤْمِنِينَ وَرَحْمَةٌ لِّلَّذِينَ
ءَامَنُوا۟ مِنكُمْ ۚ وَٱلَّذِينَ يُؤْذُونَ رَسُولَ
ٱللَّهِ لَهُمْ عَذَابٌ أَلِيمٌ ﴿٦١﴾
يَحْلِفُونَ بِٱللَّهِ لَكُمْ
لِيُرْضُوكُمْ وَٱللَّهُ وَرَسُولُهُۥٓ
أَحَقُّ أَن يُرْضُوهُ إِن كَانُوا۟
مُؤْمِنِينَ ﴿٦٢﴾
أَلَمْ يَعْلَمُوٓا۟ أَنَّهُۥ مَن يُحَادِدِ
ٱللَّهَ وَرَسُولَهُۥ فَأَنَّ لَهُۥ نَارَ
جَهَنَّمَ خَٰلِدًا فِيهَا ۚ ذَٰلِكَ
ٱلْخِزْىُ ٱلْعَظِيمُ ﴿٦٣﴾
يَحْذَرُ ٱلْمُنَٰفِقُونَ أَن تُنَزَّلَ
عَلَيْهِمْ سُورَةٌ تُنَبِّئُهُم بِمَا فِى
قُلُوبِهِمْ ۚ قُلِ ٱسْتَهْزِءُوٓا۟ إِنَّ ٱللَّهَ
مُخْرِجٌ مَّا تَحْذَرُونَ ﴿٦٤﴾

వినేవాడు."[1] ఇలా అను: "అతను వినేది మీ మేలుకే! అతను అల్లాహ్‌ను విశ్వసిస్తాడు మరియు విశ్వాసులను నమ్ముతాడు మరియు మీలో విశ్వసించిన వారికి అతను కారుణ్య మూర్తి." మరియు అల్లాహ్ సందేశహరునికి బాధ కలిగించే వారికి బాధాకరమైన శిక్ష ఉంటుంది.

**62**. (ఓ విశ్వాసులారా!) మిమ్మల్ని సంతోషపెట్టటానికి వారు మీ ముందు అల్లాహ్‌పై ప్రమాణాలు చేస్తున్నారు. వాస్తవానికి వారు విశ్వాసులే అయితే, అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను సంతోషపెట్టటమే వారి బాధ్యత.[2]

**63**. ఏమీ? అల్లాహ్‌ను మరియు ఆయన సందేశహరుణ్ణి విరోధించే వానికి, నిశ్చయంగా! భగభగ మండే నరకాగ్ని శిక్ష ఉందనీ, అదే అతని శాశ్వత నివాసమనీ, వారికి తెలియదా? ఇది ఎంత గొప్ప అవమానం!

**64**. తమ హృదయాలలో ఉన్న (రహస్యాలను) స్పష్టంగా తెలియజేసే టటువంటి సూరహ్ వారికి విరుద్ధంగా అవతరింపజేయబడుతుందేమోనని, ఈ కపటవిశ్వాసులు భయపడుతున్నారు. వారితో అను: "మీరు ఎగతాళి చెయ్యండి, మీరు (బయటపడుతుందని) భయపడు తున్న విషయాన్ని, అల్లాహ్ తప్పక బయటపెడ్తాడు."

---

**1**. చూడండి, 9:74.

**2**. చూడండి, 4:80 మరియు 3:31.

65. నీవు వారిని అడిగితే వారు తప్పక: “మేము కేవలం కాలక్షేపానికి మరియు పరిహాసానికి మాత్రమే ఇలా మాట్లాడు తున్నాము.” అని సమాధానమిస్తారు. వారితో అను: “ఏమీ మీరు అల్లాహ్‌తో మరియు ఆయన సూచనలతో (ఆయతులతో) మరియు ఆయన ప్రవక్తతో వేళాకోళం చేస్తున్నారా?

66. “ఇక మీరు సాకులు చెప్పకండి, వాస్తవానికి మీరు విశ్వసించిన తరువాత సత్యాన్ని తిరస్కరించారు.” మీలో కొందరిని మేము క్షమించినా ఇతరులను తప్పకుండా శిక్షిస్తాము, ఎందుకంటే వాస్తవానికి వారు అపరాధులు.[1]

67. కపట విశ్వాసులైన పురుషులు మరియు కపటవిశ్వాసులైన స్త్రీలు అందరూ ఒకే కోవకు చెందినవారు! వారు అధర్మాన్ని ఆదేశిస్తారు. మరియు ధర్మాన్ని నిషేధిస్తారు.[2] మరియు తమ చేతులను (మేలునుండి) ఆపుకుంటారు. వారు అల్లాహ్‌ను మరచిపోయారు, కావున ఆయన కూడా వారిని మరచిపోయాడు.[3] నిశ్చయంగా, ఈ కపటవిశ్వాసులే అవిధేయులు (ఫాసిఖూన్).

68. మరియు కపటవిశ్వాసులైన పురుషులకు మరియు కపటవిశ్వాసులైన స్త్రీలకు మరియు సత్యతిరస్కారులకు,

وَلَئِن سَأَلْتَهُمْ لَيَقُولُنَّ
إِنَّمَا كُنَّا نَخُوضُ وَنَلْعَبُ ۚ قُلْ
أَبِٱللَّهِ وَءَايَٰتِهِۦ وَرَسُولِهِۦ كُنتُمْ
تَسْتَهْزِءُونَ ﴿٦٥﴾
لَا تَعْتَذِرُوا۟ قَدْ كَفَرْتُم بَعْدَ
إِيمَٰنِكُمْ ۚ إِن نَّعْفُ عَن طَآئِفَةٍ
مِّنكُمْ نُعَذِّبْ طَآئِفَةًۢ بِأَنَّهُمْ
كَانُوا۟ مُجْرِمِينَ ﴿٦٦﴾
ٱلْمُنَٰفِقُونَ وَٱلْمُنَٰفِقَٰتُ بَعْضُهُم
مِّنۢ بَعْضٍ ۚ يَأْمُرُونَ بِٱلْمُنكَرِ
وَيَنْهَوْنَ عَنِ ٱلْمَعْرُوفِ
وَيَقْبِضُونَ أَيْدِيَهُمْ ۚ نَسُوا۟ ٱللَّهَ
فَنَسِيَهُمْ ۗ إِنَّ ٱلْمُنَٰفِقِينَ هُمُ
ٱلْفَٰسِقُونَ ﴿٦٧﴾
وَعَدَ ٱللَّهُ ٱلْمُنَٰفِقِينَ
وَٱلْمُنَٰفِقَٰتِ وَٱلْكُفَّارَ نَارَ جَهَنَّمَ

1. చూడండి, 4:98.
2. చూడండి, 3:104, 110, 114; 9:71, 112 మరియు 22:41.
3. చూడండి, 45:34.

خَٰلِدِينَ فِيهَاۚ هِيَ حَسْبُهُمْۚ وَلَعَنَهُمُ
ٱللَّهُۖ وَلَهُمْ عَذَابٌ مُّقِيمٌ ﴿٦٨﴾
كَٱلَّذِينَ مِن قَبْلِكُمْ كَانُوٓاْ
أَشَدَّ مِنكُمْ قُوَّةً وَأَكْثَرَ أَمْوَٰلًا
وَأَوْلَٰدًا فَٱسْتَمْتَعُواْ بِخَلَٰقِهِمْ
فَٱسْتَمْتَعْتُم بِخَلَٰقِكُمْ كَمَا
ٱسْتَمْتَعَ ٱلَّذِينَ مِن قَبْلِكُم
بِخَلَٰقِهِمْ وَخُضْتُمْ كَٱلَّذِي
خَاضُوٓاْۚ أُوْلَٰٓئِكَ حَبِطَتْ
أَعْمَٰلُهُمْ فِي ٱلدُّنْيَا وَٱلْأٓخِرَةِۖ
وَأُوْلَٰٓئِكَ هُمُ ٱلْخَٰسِرُونَ ﴿٦٩﴾
أَلَمْ يَأْتِهِمْ نَبَأُ ٱلَّذِينَ مِن
قَبْلِهِمْ قَوْمِ نُوحٖ وَعَادٖ وَثَمُودَ
وَقَوْمِ إِبْرَٰهِيمَ وَأَصْحَٰبِ
مَدْيَنَ وَٱلْمُؤْتَفِكَٰتِۚ
أَتَتْهُمْ رُسُلُهُم بِٱلْبَيِّنَٰتِۖ

అల్లాహ్ నరకాగ్ని వాగ్దానం చేశాడు. వారందులో శాశ్వతంగా ఉంటారు. అదే వారికి తగినది. మరియు అల్లాహ్ వారిని శపించాడు (బహిష్కరించాడు). మరియు వారికి ఎడతెగని శిక్ష ఉంటుంది.

**69**. (మీరు కూడా) గతించిన మీ పూర్వీకులవంటివారు. వారు మీ కంటే ఎక్కువ బలవంతులు, ధనవంతులు మరియు అధిక సంతానం గలవారు. వారు తమ భాగపు ఐహిక సుఖాలను అనుభవించారు. మీరు కూడా మీ పూర్వీకులు అనుభవించినట్లు మీ భాగపు ఐహికసుఖాలను అనుభవించారు. వారు పడినటువంటి వ్యర్థ వాదోపవాదాలలో మీరు కూడా పడ్డారు. ఇలాంటి వారి కర్మలు ఇహలోకంలోనూ మరియు పరలోకంలోనూ వ్యర్థమవుతాయి. మరియు ఇలాంటి వారు! వీరే నష్టానికి గురిఅయ్యే వారు.

**70**. ఏమీ? వారి పూర్వీకుల గాథ వారికి అందలేదా? నూ'హ్ జాతివారి, 'ఆద్, స'మూద్,[1] ఇబ్రాహీమ్ జాతివారి,[2] మద్‌యన్ (షు'ఐబ్) ప్రజల[3] మరియు తలక్రిందులు చేయబడిన పట్టణాల ('లూత్) వారి (గాథలు అందలేదా)?[4] వారి ప్రవక్తలు వారి వద్దకు స్పష్టమైన (సూచనలు) తీసుకొనివచ్చారు.

---

**1**. నూ'హ్, హూద్ మరియు 'సాలి'హ్ ('అలైహిమ్ స.)ల గాథల కొరకు చూడండి, 7:59-79.

**2**. ఇబ్రాహీమ్ ('అ.స.) జాతివారు, బాబిలోనియనులు.1100 సంవత్సరాలు క్రీస్తు శకానికి ముందు వారు అస్సీరియన్‌ల ద్వారా అపజయం పొంది నాశనం చేయబడ్డారు.

**3**. మద్‌యన్ ప్రజల గాథలకు చూడండి, 7:85-93.

**4**. సోడోమ్ మరియు గొమొర్రాహ్‌లు, లూ'త్ ('అ.స.) ప్రజల నగరాలు. చూడండి, 7:80-84, 11:69-83.

فَمَا كَانَ ٱللَّهُ لِيَظۡلِمَهُمۡ وَلَٰكِن
كَانُوٓاْ أَنفُسَهُمۡ يَظۡلِمُونَ ٧٠

అల్లాహ్ వారికి అన్యాయం చేయదలచు కోలేదు కాని, వారే తమకు తాము అన్యాయం చేసుకుంటూ ఉన్నారు.

وَٱلۡمُؤۡمِنُونَ وَٱلۡمُؤۡمِنَٰتُ بَعۡضُهُمۡ أَوۡلِيَآءُ
بَعۡضٖۚ يَأۡمُرُونَ بِٱلۡمَعۡرُوفِ
وَيَنۡهَوۡنَ عَنِ ٱلۡمُنكَرِ وَيُقِيمُونَ
ٱلصَّلَوٰةَ وَيُؤۡتُونَ ٱلزَّكَوٰةَ
وَيُطِيعُونَ ٱللَّهَ وَرَسُولَهُۥٓۚ أُوْلَٰٓئِكَ
سَيَرۡحَمُهُمُ ٱللَّهُۗ إِنَّ ٱللَّهَ عَزِيزٌ
حَكِيمٞ ٧١

**71.** మరియు విశ్వాసులైన పురుషులు మరియు విశ్వాసులైన స్త్రీలు ఒకరికొకరు స్నేహితులు. వారు ధర్మాన్ని ఆదేశిస్తారు (బోధిస్తారు) మరియు అధర్మం నుండి నిషేధిస్తారు (వారిస్తారు) మరియు నమా'జ్‌ను స్థాపిస్తారు మరియు విధిదానం ('జకాత్) చెల్లిస్తారు మరియు అల్లాహ్‌కు మరియు ఆయన ప్రవక్తకు విధేయులై ఉంటారు. ఇలాంటి వారినే అల్లాహ్ కరుణిస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేచనాపరుడు.

وَعَدَ ٱللَّهُ ٱلۡمُؤۡمِنِينَ وَٱلۡمُؤۡمِنَٰتِ
جَنَّٰتٖ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُ
خَٰلِدِينَ فِيهَا وَمَسَٰكِنَ طَيِّبَةٗ
فِي جَنَّٰتِ عَدۡنٖۚ وَرِضۡوَٰنٞ مِّنَ
ٱللَّهِ أَكۡبَرُۚ ذَٰلِكَ هُوَ ٱلۡفَوۡزُ
ٱلۡعَظِيمُ ٧٢

**72.** మరియు అల్లాహ్ విశ్వాసులైన పురుషులకు మరియు విశ్వాసులైన స్త్రీలకు క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాల వాగ్దానం చేశాడు. అక్కడ వారు శాశ్వతంగా ఉంటారు. మరియు శాశ్వతమైన సుఖాలున్న ఆ స్వర్గవనాలలో, వారి కొరకు పరిశుద్ధ నివాసాలు ఉంటాయి.[1] వాటన్నిటి కంటే మించింది వారికి లభించే అల్లాహ్ ప్రసన్నత. అదే ఆ గొప్ప సాఫల్యం (విజయం).

يَٰٓأَيُّهَا ٱلنَّبِيُّ جَٰهِدِ ٱلۡكُفَّارَ
وَٱلۡمُنَٰفِقِينَ وَٱغۡلُظۡ عَلَيۡهِمۡۚ وَمَأۡوَىٰهُمۡ
جَهَنَّمُۖ وَبِئۡسَ ٱلۡمَصِيرُ ٧٣

**73.** ఓ ప్రవక్తా! సత్యతిరస్కారులతో మరియు కపటవిశ్వాసులతో పోరాడు మరియు వారిపట్ల కఠినంగా వ్యవహరించు. మరియు వారి ఆశ్రయం నరకమే. మరియు అది అతిచెడ్డ గమ్యస్థానం.

---

**1.** చూడండి, 38:50. 'అద్న్: అవతరణ ప్రకారం ఈ శబ్దం మొట్టమొదట పై ఆయత్‌లో వచ్చింది. 'అద్న్, అంటే శాశ్వతమైన అని అర్థం.

**74.** ''మేము ఏమీ (చెడుమాట) అనలేదు!'' అని వారు అల్లాహ్‌పై ప్రమాణంచేసి అంటున్నారు. కాని వాస్తవానికి వారు సత్యతిరస్కారపు మాట అన్నారు. మరియు ఇస్లాంను స్వీకరించిన తరువాత దానిని తిరస్కరించారు. మరియు వారికి అసాధ్యమైన దానిని చేయదలచుకున్నారు. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త, (అల్లాహ్) అనుగ్రహంతో వారిని సంపన్నులుగా చేశారనే కదా! వారు ఈ విధంగా ప్రతీకారం చేస్తున్నారు. ఇప్పుడైనా వారు పశ్చాత్తాప పడితే అది వారికే మేలు. మరియు వారు మరలిపోతే, అల్లాహ్ వారికి ఇహలోకంలోనూ మరియు పరలోకంలోనూ, బాధాకరమైన శిక్ష విధిస్తాడు. మరియు భూమిలో వారికి ఏ రక్షకుడు గానీ సహాయకుడు గానీ ఉండడు.(7/8)

**75.** * మరియు వారిలో (కొందరు) ఈ విధంగా అల్లాహ్‌పై ప్రమాణం చేసేవారు కూడా ఉన్నారు: ''ఆయన (అల్లాహ్) తన అనుగ్రహంతో మాకేమి ప్రసాదించినా మేము తప్పక దానం చేస్తాము మరియు సద్వర్తనులమై ఉంటాము.''

**76.** కాని అల్లాహ్ తన అనుగ్రహం వల్ల వారికి (ధనం) ప్రసాదించినప్పుడు, వారు పిసినారితనం ప్రదర్శించి, తమ (వాగ్దానం) నుండి విముఖులై మరలిపోతారు.

**77.** ఆ పిదప వారు అల్లాహ్‌తో చేసిన వాగ్దానం పూర్తిచేయనందుకు, అసత్యం పలికి నందుకు, ఆయన్ను కలుసుకునే (పునరుత్థాన) దినం వరకు, ఆయన వారి హృదయాలలో కాపట్యం నాటుకునేటట్లు చేశాడు.

يَحۡلِفُونَ بِٱللَّهِ مَا قَالُواْ وَلَقَدۡ
قَالُواْ كَلِمَةَ ٱلۡكُفۡرِ وَكَفَرُواْ
بَعۡدَ إِسۡلَٰمِهِمۡ وَهَمُّواْ بِمَا لَمۡ
يَنَالُواْۚ وَمَا نَقَمُوٓاْ إِلَّآ أَنۡ
أَغۡنَىٰهُمُ ٱللَّهُ وَرَسُولُهُۥ مِن فَضۡلِهِۦۚ
فَإِن يَتُوبُواْ يَكُ خَيۡرٗا لَّهُمۡۖ وَإِن
يَتَوَلَّوۡاْ يُعَذِّبۡهُمُ ٱللَّهُ عَذَابًا أَلِيمٗا
فِي ٱلدُّنۡيَا وَٱلۡأٓخِرَةِۚ وَمَا لَهُمۡ فِي
ٱلۡأَرۡضِ مِن وَلِيّٖ وَلَا نَصِيرٖ ٧٤

۞ وَمِنۡهُم مَّنۡ عَٰهَدَ ٱللَّهَ لَئِنۡ
ءَاتَىٰنَا مِن فَضۡلِهِۦ لَنَصَّدَّقَنَّ
وَلَنَكُونَنَّ مِنَ ٱلصَّٰلِحِينَ ٧٥

فَلَمَّآ ءَاتَىٰهُم مِّن فَضۡلِهِۦ بَخِلُواْ
بِهِۦ وَتَوَلَّواْ وَّهُم مُّعۡرِضُونَ ٧٦

فَأَعۡقَبَهُمۡ نِفَاقٗا فِي قُلُوبِهِمۡ إِلَىٰ يَوۡمِ
يَلۡقَوۡنَهُۥ بِمَآ أَخۡلَفُواْ ٱللَّهَ مَا وَعَدُوهُ
وَبِمَا كَانُواْ يَكۡذِبُونَ ٧٧

أَلَمْ يَعْلَمُوٓا۟ أَنَّ ٱللَّهَ يَعْلَمُ سِرَّهُمْ وَنَجْوَىٰهُمْ وَأَنَّ ٱللَّهَ عَلَّـٰمُ ٱلْغُيُوبِ ﴿٧٨﴾

**78**. ఏమీ? వారి గుప్త రహస్యాలు మరియు వారి రహస్య సమాలోచనలు, అల్లాహ్‌కు తెలుసని వారికి తెలియదా? మరియు నిశ్చయంగా, అల్లాహ్ అగోచర విషయాలన్నీ తెలిసివున్నవాడు.

ٱلَّذِينَ يَلْمِزُونَ ٱلْمُطَّوِّعِينَ مِنَ ٱلْمُؤْمِنِينَ فِى ٱلصَّدَقَـٰتِ وَٱلَّذِينَ لَا يَجِدُونَ إِلَّا جُهْدَهُمْ فَيَسْخَرُونَ مِنْهُمْ ۙ سَخِرَ ٱللَّهُ مِنْهُمْ وَلَهُمْ عَذَابٌ أَلِيمٌ ﴿٧٩﴾

**79**. మనస్ఫూర్తిగా సంతోషంతో (అల్లాహ్ మార్గంలో) దానంచేసే విశ్వాసులను నిందించే వారినీ మరియు తమశ్రమ తప్ప మరేమి ఇవ్వటానికి లేనివారిని ఎగతాళి చేసేవారినీ, అల్లాహ్ ఎగతాళికి గురిచేస్తాడు. మరియు వారికి బాధాకరమైన శిక్ష ఉంది.

ٱسْتَغْفِرْ لَهُمْ أَوْ لَا تَسْتَغْفِرْ لَهُمْ إِن تَسْتَغْفِرْ لَهُمْ سَبْعِينَ مَرَّةً فَلَن يَغْفِرَ ٱللَّهُ لَهُمْ ۚ ذَٰلِكَ بِأَنَّهُمْ كَفَرُوا۟ بِٱللَّهِ وَرَسُولِهِۦ ۗ وَٱللَّهُ لَا يَهْدِى ٱلْقَوْمَ ٱلْفَـٰسِقِينَ ﴿٨٠﴾

**80**. (ఓ ప్రవక్తా!) నీవు వారి (కపట విశ్వాసుల) క్షమాపణకొరకు వేడుకున్నా, లేదా వారి క్షమాపణకొరకు వేడుకోక పోయినా ఒక్కటే - ఇంకా నీవు డెబ్బైసార్లు వారి క్షమాపణ కొరకు వేడుకున్నా - అల్లాహ్ వారిని క్షమించడు.[1] ఎందుకంటే వాస్తవానికి వారు అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను తిరస్కరించారు. మరియు అల్లాహ్ అవిధేయులైన ప్రజలకు సన్మార్గం చూపడు.[2]

فَرِحَ ٱلْمُخَلَّفُونَ بِمَقْعَدِهِمْ خِلَـٰفَ رَسُولِ ٱللَّهِ وَكَرِهُوٓا۟ أَن يُجَـٰهِدُوا۟ بِأَمْوَٰلِهِمْ وَأَنفُسِهِمْ فِى

**81**. (తబూక్ దండయాత్రకు పోకుండా) వెనుక ఆగిపోయిన వారు, తాము అల్లాహ్ సందేశహరుని వెంట వెళ్ళటాన్ని నిరోధించి (తమఇండ్లలో) కూర్చుండి నందుకు సంతోషపడ్డారు. మరియు వారు తమ ధనసంపత్తులతో మరియు తమప్రాణాలతో

---

**1**. దైవ ప్రవక్త ముహమ్మద్ ('స'అస) తన శత్రువులను క్షమించమని అల్లాహ్ (సు.తా.)ను ప్రార్థించినట్లు బు'ఖారీ, ముస్లిం మరియు ఇతరుల 'స'హీ'హ్ 'హదీస్'లద్వారా తెలుస్తుంది.

**2**. చూడండి, 76:3.

سَبِيلِ ٱللَّهِ وَقَالُوا۟ لَا تَنفِرُوا۟ فِى ٱلْحَرِّ ۗ قُلْ نَارُ جَهَنَّمَ أَشَدُّ حَرًّا ۚ لَّوْ كَانُوا۟ يَفْقَهُونَ ﴿٨١﴾

అల్లాహ్ మార్గంలో పోరాడటాన్ని అసహ్యించుకున్నారు. మరియు వారు ఇతరులతో: "ఈ తీవ్రమైనవేడిలో వెళ్ళకండి!" అని అన్నారు. వారితో అను: "భగభగ మండే నరకాగ్ని దీనికంటే ఎక్కువ వేడిగా ఉంటుంది." అది వారు అర్థంచేసుకుంటే ఎంత బాగుండేది!

فَلْيَضْحَكُوا۟ قَلِيلًا وَلْيَبْكُوا۟ كَثِيرًا جَزَآءًۢ بِمَا كَانُوا۟ يَكْسِبُونَ ﴿٨٢﴾

**82**. కావున ఇప్పుడు వారిని కొంత నవ్వనివ్వు మరియు వారి కర్మలకు ప్రతిఫలంగా (ముమ్ముందు) వారికి ఎంతో ఏడ్వవలసి ఉంది.

فَإِن رَّجَعَكَ ٱللَّهُ إِلَىٰ طَآئِفَةٍ مِّنْهُمْ فَٱسْتَـْٔذَنُوكَ لِلْخُرُوجِ فَقُل لَّن تَخْرُجُوا۟ مَعِىَ أَبَدًا وَلَن تُقَـٰتِلُوا۟ مَعِىَ عَدُوًّا ۖ إِنَّكُمْ رَضِيتُم بِٱلْقُعُودِ أَوَّلَ مَرَّةٍ فَٱقْعُدُوا۟ مَعَ ٱلْخَـٰلِفِينَ ﴿٨٣﴾

**83**. కావున (ఓ ప్రవక్తా!) ఒకవేళ అల్లాహ్ నిన్ను తిరిగి వారి (కపటవిశ్వాసుల)లో ఒక వర్గం వారి వద్దకు తీసుకొనిపోతే! మరియు వారు నిన్ను (మరొక దండయాత్రకు) పోవటానికి అనుమతి అడిగితే! వారితో అను: "మీరు నాతో ఏ మాత్రం బయలుదేరవద్దు! మరియు నా పక్షమున శత్రువులతో పోరాడనూ వద్దు! వాస్తవానికి మీరు మొదట కూర్చొని ఉండటానికి ఇష్టపడ్డారు, కాబట్టి మీరు వెనుక ఉండిపోయిన వారితో (ఇండ్లలోనే) కూర్చొని ఉండండి."

وَلَا تُصَلِّ عَلَىٰٓ أَحَدٍ مِّنْهُم مَّاتَ أَبَدًا وَلَا تَقُمْ عَلَىٰ قَبْرِهِۦٓ ۖ إِنَّهُمْ كَفَرُوا۟

**84**. మరియు వారి (కపట విశ్వాసుల)లో ఎవరైనా మరణిస్తే, అతడి నమా'జె జనా'జహ్ కూడా నీవు ఏ మాత్రం చేయకు మరియు అతని గోరీవద్ద కూడా నిలబడకు.[1] నిశ్చయంగా, వారు

---

**1**. ఈ ఆయత్ కపట విశ్వాసుల నాయకుడు 'అబ్దుల్లాహ్ బిన్-ఉబైను గురించి అవతరింపజేయబడింది. కాని ఈ ఆజ్ఞ కపటవిశ్వాసులందరికీ వర్తిస్తుంది. 'అబ్దుల్లాహ్ బిన్-ఉబై మరణించినపుడు అతని కుమారుడు 'అబ్దుల్లాహ్ (ర'ది.'అ.) దైవప్రవక్త ('స'అస) దగ్గరికి వచ్చి, అతని ('స'అస) అంగీని, తన తండ్రికి కఫన్‌గా తొడిగించటానికి అడుగుతారు మరియు అతని ('స'అస)తో, తన తండ్రి నమా'జె జనా'జహ్ చేయమని కూడా కోరుతారు.

بِٱللَّهِ وَرَسُولِهِۦ وَمَاتُواْ وَهُمۡ فَٰسِقُونَ ﴿٨٤﴾

అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను తిరస్కరించారు. మరియు వారు అవిధేయులు (ఫాసిఖూన్)గా ఉన్న స్థితిలోనే మరణించారు.

وَلَا تُعۡجِبۡكَ أَمۡوَٰلُهُمۡ وَأَوۡلَٰدُهُمۡۚ إِنَّمَا يُرِيدُ ٱللَّهُ أَن يُعَذِّبَهُم بِهَا فِي ٱلدُّنۡيَا وَتَزۡهَقَ أَنفُسُهُمۡ وَهُمۡ كَٰفِرُونَ ﴿٨٥﴾

**85**. మరియు వారి సిరిసంపదలు మరియు వారి సంతానం నిన్ను ఆశ్చర్యానికి గురిచేయ నివ్వకూడదు. నిశ్చయంగా, అల్లాహ్! వాటితో ఈ ప్రపంచంలో వారిని శిక్షించాలనీ మరియు వారు సత్యతిరస్కారులుగా ఉన్న స్థితిలోనే వారి ప్రాణాలను కోల్పోవాలనీ సంకల్పించాడు.[1]

وَإِذَآ أُنزِلَتۡ سُورَةٌ أَنۡ ءَامِنُواْ بِٱللَّهِ وَجَٰهِدُواْ مَعَ رَسُولِهِ ٱسۡتَـٔۡذَنَكَ أُوْلُواْ ٱلطَّوۡلِ مِنۡهُمۡ وَقَالُواْ ذَرۡنَا نَكُن مَّعَ ٱلۡقَٰعِدِينَ ﴿٨٦﴾

**86**. మరియు: "అల్లాహ్‌ను విశ్వసించండి. మరియు ఆయన ప్రవక్తతో కలసి (అల్లాహ్ మార్గంలో) పోరాడండి!" అని సూరహ్ అవతరింపజేయబడినపుడు,[2] వారిలోని ధనవంతులు నీతో: "వెనుక ఉండే వారితో కూర్చోవటానికి మమ్మల్ని విడిచిపెట్టు." అని అనుమతి కోరారు.

رَضُواْ بِأَن يَكُونُواْ مَعَ ٱلۡخَوَالِفِ وَطُبِعَ عَلَىٰ قُلُوبِهِمۡ فَهُمۡ لَا يَفۡقَهُونَ ﴿٨٧﴾

**87**. వారు, వెనక ఉండిపోయే వారితో ఉండటానికి ఇష్టపడ్డారు. వారి హృదయలమీద ముద్ర వేయబడివుంది, కావున వారు అర్థం చేసుకోలేరు.[3]

---

దైవప్రవక్త ('స'అస) తన అంగీని, ఇస్తారు. 'ఉమర్ (ర'ది.'అ.) ఆపినా, వినకుండా నమా'జే జనా'జహ్ కూడా చేస్తారు. ఆ తరువాత ఈ ఆయత్ అవతరింపజేయబడింది. ('స'హీ'హ్ బు'ఖారీ, తఫ్సీర్ సూరహ్ అత్-తౌబహ్ మరియు 'స'హీ'హ్ ముస్లిం, కితాబ్ సిఫాత్ అల్-మునాఫిఖీన్ వ అ'హ్కామహుమ్). ఇక్కడ మరొక విషయం విశదమయ్యే దేమిటంటే: ఎవడైతే నిజమైన విశ్వాసుడు కాడో అతని మోక్షం కొరకు ఎంత పెద్దవారు ప్రార్థన చేసినా అది అంగీకరించబడదు.

**1**. చూడండి, 9:55, 3:178 మరియు 8:28; ఈ ఆయత్ దాదాపు 9:55 మాదిరిగానే ఉంది.

**2**. చూడండి, 47:20.

**3**. చూడండి, 7:100-101.

لَـٰكِنِ ٱلرَّسُولُ وَٱلَّذِينَ ءَامَنُواْ
مَعَهُۥ جَـٰهَدُواْ بِأَمْوَٰلِهِمْ وَأَنفُسِهِمْۚ
وَأُوْلَـٰٓئِكَ لَهُمُ ٱلْخَيْرَٰتُۖ وَأُوْلَـٰٓئِكَ
هُمُ ٱلْمُفْلِحُونَ ٨٨

**88**. కాని, ప్రవక్త మరియు అతనితో పాటు విశ్వసించిన వారు తమ సిరిసంపదలతో మరియు తమ ప్రాణాలతో (అల్లాహ్ మార్గంలో) పోరాడారు. మరియు అలాంటి వారికి అన్ని మేళ్ళూ ఉన్నాయి. మరియు అలాంటి వారే సాఫల్యం పొందేవారు.

أَعَدَّ ٱللَّهُ لَهُمْ جَنَّـٰتٍ تَجْرِى مِن
تَحْتِهَا ٱلْأَنْهَـٰرُ خَـٰلِدِينَ فِيهَاۚ ذَٰلِكَ
ٱلْفَوْزُ ٱلْعَظِيمُ ٨٩

**89**. అల్లాహ్ వారికొరకు క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలు సిద్ధంచేసి ఉంచాడు, వారందులో శాశ్వతంగా ఉంటారు. అదే గొప్ప విజయం.

وَجَآءَ ٱلْمُعَذِّرُونَ مِنَ ٱلْأَعْرَابِ
لِيُؤْذَنَ لَهُمْ وَقَعَدَ ٱلَّذِينَ كَذَبُواْ
ٱللَّهَ وَرَسُولَهُۥۚ سَيُصِيبُ ٱلَّذِينَ
كَفَرُواْ مِنْهُمْ عَذَابٌ أَلِيمٌ ٩٠

**90**. మరియు సాకులు చెప్పే ఎడారి వాసు(బద్దూ)లు[1] కూడా వచ్చి వెనుక ఉండిపోవటానికి అనుమతి అడిగారు. మరియు ఈ విధంగా అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తకు అబద్ధాలు చెప్పినవారు కూర్చుండిపోయారు. త్వరలో సత్య తిరస్కారులకు బాధాకరమైన శిక్ష ఉండగలదు.

لَّيْسَ عَلَى ٱلضُّعَفَآءِ وَلَا عَلَى
ٱلْمَرْضَىٰ وَلَا عَلَى ٱلَّذِينَ لَا
يَجِدُونَ مَا يُنفِقُونَ حَرَجٌ إِذَا
نَصَحُواْ لِلَّهِ وَرَسُولِهِۦۚ مَا عَلَى
ٱلْمُحْسِنِينَ مِن سَبِيلٍۚ وَٱللَّهُ
غَفُورٌ رَّحِيمٌ ٩١

**91**. బలహీనులు మరియు వ్యాధిగ్రస్తులు మరియు ప్రయాణపు ఖర్చులు లేనివారు, ఒకవేళ అల్లాహ్‌కు మరియు ఆయన ప్రవక్తకు వాస్తవానికి విశ్వాసపాత్రులై ఉంటే వారిపై (జిహాద్‌కు వెళ్ళకుంటే) ఎలాంటి నిందలేదు. సజ్జనులపై కూడా ఎలాంటి నిందలేదు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

---

**1**. అల్-అ'అరాబు అంటే, ఎడారి వాసు(బద్దూ)లు. ఈ పదానికి ఇంకా చూడండి, 9:97, 98, 99, 101,120, 33:20, 48:11,16 మరియు 49:14.

وَلَا عَلَى ٱلَّذِينَ إِذَا مَآ أَتَوۡكَ
لِتَحۡمِلَهُمۡ قُلۡتَ لَآ أَجِدُ مَآ
أَحۡمِلُكُمۡ عَلَيۡهِ تَوَلَّواْ
وَّأَعۡيُنُهُمۡ تَفِيضُ مِنَ ٱلدَّمۡعِ
حَزَنًا أَلَّا يَجِدُواْ مَا يُنفِقُونَ ﴿٩٢﴾

**92**. మరియు ఎవరైతే నీవద్దకు వచ్చి వాహనాలు కోరినప్పుడు నీవు వారితో: "నా దగ్గర మీకివ్వటానికి ఏ వాహనం లేదు." అని పలికినప్పుడు, ఖర్చు చేయుటానికి తమ దగ్గర ఏమీ లేదు కదా! అనే చింతతో కన్నీరు కార్చుతూ తిరిగిపోయారో, అలాంటి వారిపై కూడా ఎలాంటి నిందలేదు.

__________

**93**. (*) కాని వాస్తవానికి ధనవంతులై కూడా, వెనుక కూర్చున్నవారితో ఉండటానికి ఇష్టపడి, నిన్ను అనుమతి అడిగేవారిపై తప్పక నిందగలదు. అల్లాహ్ వారి హృదయాల మీద ముద్ర వేసిఉన్నాడు, కావున (తాము పోగొట్టు కొనేదేమిటో) వారికి తెలియదు.[1]

**94**. మీరు (తబూక్ దండయాత్ర నుండి) మరలి వారి వద్దకు వచ్చిన తరువాత కూడా వారు (కపటవిశ్వాసులు) మీతో తమ సాకులు చెబుతున్నారు. వారితో అను: "మీరు సాకులు చెప్పకండి, మేము మీ మాటలను నమ్మము. అల్లాహ్ మాకు మీ వృత్తాంతం తెలిపివున్నాడు. మరియు అల్లాహ్ మరియు ఆయన సందేశహరుడు మీ ప్రవర్తనను కనిపెట్ట గలరు, తరువాత మీరు అగోచర మరియు గోచర విషయాలు ఎరుగునట్టి ఆయన (అల్లాహ్) వైపునకు మరలింప బడతారు, అప్పుడాయన మీరు చేస్తూఉన్న వాటిని గురించి మీకు తెలుపుతాడు."

**95**. (ఓ విశ్వాసులారా!) మీరు వారి వద్దకు మరలి వచ్చిన తరువాత వారిని వదలి పెట్టాలని (మీరు వారిపై చర్య తీసుకోగూడదని), వారు మీ ముందు అల్లాహ్ పేరుతో ప్రమాణాలు చేస్తారు. కావున మీరు వారి నుండి విముఖులు కండి. నిశ్చయంగా, వారు అశుచులు (మాలిన్యం వంటి వారు). వారి నివాసం నరకమే. అదే వారు ఆర్జించిన దాని ఫలితం.

۞ إِنَّمَا ٱلسَّبِيلُ عَلَى ٱلَّذِينَ
يَسْتَـْٔذِنُونَكَ وَهُمْ أَغْنِيَآءُ ۚ
رَضُوا۟ بِأَن يَكُونُوا۟ مَعَ ٱلْخَوَالِفِ
وَطَبَعَ ٱللَّهُ عَلَىٰ قُلُوبِهِمْ فَهُمْ لَا
يَعْلَمُونَ ﴿٩٣﴾

يَعْتَذِرُونَ إِلَيْكُمْ إِذَا رَجَعْتُمْ
إِلَيْهِمْ ۚ قُل لَّا تَعْتَذِرُوا۟ لَن نُّؤْمِنَ
لَكُمْ قَدْ نَبَّأَنَا ٱللَّهُ مِنْ
أَخْبَارِكُمْ ۚ وَسَيَرَى ٱللَّهُ
عَمَلَكُمْ وَرَسُولُهُۥ ثُمَّ تُرَدُّونَ
إِلَىٰ عَٰلِمِ ٱلْغَيْبِ وَٱلشَّهَٰدَةِ
فَيُنَبِّئُكُم بِمَا كُنتُمْ تَعْمَلُونَ ﴿٩٤﴾

سَيَحْلِفُونَ بِٱللَّهِ لَكُمْ إِذَا
ٱنقَلَبْتُمْ إِلَيْهِمْ لِتُعْرِضُوا۟ عَنْهُمْ ۖ
فَأَعْرِضُوا۟ عَنْهُمْ ۖ إِنَّهُمْ رِجْسٌ ۖ
وَمَأْوَىٰهُمْ جَهَنَّمُ جَزَآءًۢ بِمَا
كَانُوا۟ يَكْسِبُونَ ﴿٩٥﴾

---

1. వీరు ఆయత్ 86,87లలో పేర్కొనబడ్డ కపటవిశ్వాసులు.

**96**. మీరు వారితో రాజీపడాలని, వారు (కపట విశ్వాసులు) మీ ముందు ప్రమాణాలు చేస్తున్నారు. ఒకవేళ మీరు వారితో రాజీపడినా, నిశ్చయంగా, అల్లాహ్ అవిధేయులు (ఫాసిఖీన్) అయిన ప్రజలతో రాజీపడడు.[1]

يَحۡلِفُونَ لَكُمۡ لِتَرۡضَوۡاْ عَنۡهُمۡۖ
فَإِن تَرۡضَوۡاْ عَنۡهُمۡ فَإِنَّ ٱللَّهَ لَا
يَرۡضَىٰ عَنِ ٱلۡقَوۡمِ ٱلۡفَٰسِقِينَ ٩٦

**97**. ఎడారివాసు(బద్దూ)లు సత్య తిరస్కార మరియు కపట విశ్వాస విషయాలలో అతి కఠినులు. వారు అల్లాహ్ తన ప్రవక్తపై అవతరింపజేసిన (ధర్మ) నియమాలు అర్థం చేసుకునే యోగ్యత లేనివారు.[2] మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

ٱلۡأَعۡرَابُ أَشَدُّ كُفۡرٗا وَنِفَاقٗا
وَأَجۡدَرُ أَلَّا يَعۡلَمُواْ حُدُودَ مَآ أَنزَلَ
ٱللَّهُ عَلَىٰ رَسُولِهِۦۗ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٞ
٩٧

**98**. మరియు ఎడారివాసు(బద్దూ)లలో కొందరు తాము (అల్లాహ్ మార్గంలో) ఖర్చుచేసిన దానిని దండుగగా భావించే వారున్నారు. (ఓ విశ్వాసులారా!) మీరు ఆపదలలో చిక్కుకోవాలని వారు ఎదురు చూస్తున్నారు. (కాని) వారినే ఆపద చుట్టు కుంటుంది. మరియు అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.[3]

وَمِنَ ٱلۡأَعۡرَابِ مَن يَتَّخِذُ مَا يُنفِقُ
مَغۡرَمٗا وَيَتَرَبَّصُ بِكُمُ ٱلدَّوَآئِرَۚ
عَلَيۡهِمۡ دَآئِرَةُ ٱلسَّوۡءِۗ وَٱللَّهُ
سَمِيعٌ عَلِيمٞ ٩٨

**99**. మరియు ఎడారివాసు(బద్దూ)లలో కొందరు అల్లాహ్‌ను అంతిమదినాన్ని విశ్వసించే వారున్నారు.[4] వారు తాము (అల్లాహ్

وَمِنَ ٱلۡأَعۡرَابِ مَن يُؤۡمِنُ
بِٱللَّهِ وَٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِ وَيَتَّخِذُ

---

**1.** దైవప్రవక్త (స'అస) తబూక్ దండయాత్ర నుండి తిరిగి వచ్చిన తరువాత, వారంతా క్షేమంగా తిరిగి వచ్చింది చూసి కపటవిశ్వాసులు, తాము నమ్మకస్తులమని నిరూపించగోరారు. ఆ సమయంలో పై మూడు ఆయతులు (94-96) అవతరింపజేయబడ్డాయి.

**2**. ఎందుకంటే వారు నగరాల నుండి దూరప్రాంతాలలో ఉండటం వలన అల్లాహ్ (సు.తా.) మరియు ఆయన (సు.తా.), ప్రవక్త (స'అస) మాటలు వినలేరు.

**3.** వీరు మొదటి రకానికి చెందిన బద్దూలు.

**4.** వీరు రెండో రకానికి చెందిన మంచి విశ్వాసులు.

مَا يُنفِقُ قُرُبَٰتٍ عِندَ ٱللَّهِ
وَصَلَوَٰتِ ٱلرَّسُولِۚ أَلَآ إِنَّهَا قُرْبَةٌ
لَّهُمْۚ سَيُدْخِلُهُمُ ٱللَّهُ فِى رَحْمَتِهِۦٓۗ
إِنَّ ٱللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴿٩٩﴾
وَٱلسَّٰبِقُونَ ٱلْأَوَّلُونَ مِنَ
ٱلْمُهَٰجِرِينَ وَٱلْأَنصَارِ وَٱلَّذِينَ
ٱتَّبَعُوهُم بِإِحْسَٰنٍ رَّضِىَ ٱللَّهُ
عَنْهُمْ وَرَضُوا۟ عَنْهُ وَأَعَدَّ لَهُمْ
جَنَّٰتٍ تَجْرِى تَحْتَهَا ٱلْأَنْهَٰرُ
خَٰلِدِينَ فِيهَآ أَبَدًاۚ ذَٰلِكَ ٱلْفَوْزُ
ٱلْعَظِيمُ ﴿١٠٠﴾
وَمِمَّنْ حَوْلَكُم مِّنَ ٱلْأَعْرَابِ
مُنَٰفِقُونَۖ وَمِنْ أَهْلِ ٱلْمَدِينَةِۖ
مَرَدُوا۟ عَلَى ٱلنِّفَاقِ لَا تَعْلَمُهُمْۖ نَحْنُ
نَعْلَمُهُمْۚ سَنُعَذِّبُهُم مَّرَّتَيْنِ ثُمَّ

మార్గంలో) ఖర్చుచేసేది, తమకు అల్లాహ్ సాన్నిధ్యాన్ని మరియు ప్రవక్త ప్రార్థనలను చేకూర్చటానికి సాధనంగా చేసుకుంటున్నారు. వాస్తవానికి అది వారికి తప్పక సాన్నిధ్యాన్ని చేకూర్చుతుంది. అల్లాహ్ వారిని తన కారుణ్యంలోకి చేర్చుకోగలడు. నిశ్చయంగా! అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

**100**. మరియు వలస వచ్చిన ముహాజిర్‌లలో నుండి మరియు అన్సారు (మదీనా వాసు)లలో నుండి, ప్రప్రథమంగా ముందంజవేసిన (ఇస్లాంను స్వీకరించిన) వారితోనూ మరియు సహృదయంతో వారిని అనుసరించిన వారితోనూ, అల్లాహ్ సంతోషపడ్డాడు. మరియు వారు కూడా ఆయనతో సంతోషపడ్డారు. మరియు వారి కొరకు క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలను సిద్ధపరిచి ఉంచాడు. వారు వాటిలో శాశ్వతంగా కలకాలం ఉంటారు. అదే గొప్ప సాఫల్యం (విజయం).

**101**. మరియు మీ చుట్టు ప్రక్కల ఉండే ఎడారివాసు(బద్దూ)లలో కొందరు కపట విశ్వాసులున్నారు. మరియు (ప్రవక్త) నగరం (మదీనా మునవ్వరా)లో కూడా (కపట విశ్వాసులు) ఉన్నారు.[1] వారు తమ కాపట్యంలో నాటుకొని ఉన్నారు. కాని (ఓ ప్రవక్తా!) నీవు వారిని ఎరుగవు.[2] మేము

---

**1.** మదీనా మునవ్వరా మొదటి పేరు యస్‌'రిబ్. 622 క్రీస్తుశకంలో ము'హమ్మద్ ('స'అస) వలస వచ్చిన తరువాత అది మదీనతున్నబీ - ప్రవక్త నగరంగా, ఆ తరువాత మదీనా మునవ్వరాగా కూడా పిలువబడుతోంది.

**2.** ఇక్కడ స్పష్టమైన శబ్దాలతో దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)కు అగోచర జ్ఞానం లేదని విశదపరచబడింది.

يُرَدُّونَ إِلَىٰ عَذَابٍ عَظِيمٍ ﴿١٠١﴾

వారిని ఎరుగుతాము. మేము వారికి రెట్టింపు శిక్షను విధించగలము. తరువాత వారు ఘోరశిక్ష వైపుకు మరలింపబడతారు.

وَءَاخَرُونَ ٱعْتَرَفُواْ بِذُنُوبِهِمْ خَلَطُواْ عَمَلًا صَٰلِحًا وَءَاخَرَ سَيِّئًا عَسَى ٱللَّهُ أَن يَتُوبَ عَلَيْهِمْۚ إِنَّ ٱللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴿١٠٢﴾

**102**. మరియు ఇతరులు, తమ పాపాలను ఒప్పుకున్న వారున్నారు. వారు తమ సత్కార్యాన్ని ఇతర పాపకార్యంతో కలిపారు.[1] అల్లాహ్ వారిని తప్పక[2] క్షమిస్తాడు! నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

خُذْ مِنْ أَمْوَٰلِهِمْ صَدَقَةً تُطَهِّرُهُمْ وَتُزَكِّيهِم بِهَا وَصَلِّ عَلَيْهِمْۖ إِنَّ صَلَوٰتَكَ سَكَنٌ لَّهُمْۗ وَٱللَّهُ سَمِيعٌ عَلِيمٌ ﴿١٠٣﴾

**103**. (కావున ఓ ప్రవక్తా! ) నీవు వారి సంపదల నుండి దానం (సదఖహ్) తీసుకొని, దానితో వారి పాపవిమోచనం చెయ్యి మరియు వారిని సంస్కరించు. మరియు వారి కొరకు (అల్లాహ్)ను ప్రార్థించు. మరియు నిశ్చయంగా, నీ ప్రార్థనలు వారికి మనశ్శాంతిని కలిగిస్తాయి. అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

أَلَمْ يَعْلَمُوٓاْ أَنَّ ٱللَّهَ هُوَ يَقْبَلُ ٱلتَّوْبَةَ عَنْ عِبَادِهِۦ وَيَأْخُذُ ٱلصَّدَقَٰتِ وَأَنَّ ٱللَّهَ هُوَ ٱلتَّوَّابُ ٱلرَّحِيمُ ﴿١٠٤﴾

**104**. ఏమీ? వాస్తవానికి అల్లాహ్ తన దాసుల పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాడని మరియు వారి దానా(సదఖాత్)లను స్వీకరిస్తాడని వారికి తెలియదా? నిశ్చయంగా, అల్లాహ్! ఆయన మాత్రమే, పశ్చాత్తాపాన్ని అంగీకరించేవాడు, అపార కరుణాప్రదాత.

---

**1.** వీరు ఉచితమైన కారణం లేకుండానే వెనుక ఉండిపోయిన విశ్వాసులు. వీరు పోనందుకు తమవల్ల జరిగిన పాపాన్ని ఒప్పుకున్నారు. వీరి సత్కార్యాలంటే ఇంతకు ముందు జరిగిన యుద్ధాలలో పాల్గొనటం. వీరి పాపకార్యం అంటే తబూక్ యుద్ధానికి పోకుండా ఉండటం. ఇంకా చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పు.6, 'హ.196.

**2.** 'అసా: అన్న పదం అల్లాహ (సు.తా.)కు సంబంధించి వస్తే, Be hopeful with Allah, నమ్ము, ఆశించు అనే భావం ఇస్తుంది. ఒకవేళ మానవునికి సంబంధించి ఉంటే Be conscious or Be afraid, జాగ్రత్త, ఏమో, బహుశా అనే భావం ఇస్తుంది.

105. మరియు (ఓ ప్రవక్తా!) వారితో అను: "మీరు (మీపని) చేస్తూ ఉండండి, అల్లాహ్ ఆయన ప్రవక్త మరియు విశ్వాసులు మీరు చేస్తున్న పనులు చూస్తున్నారు. తరువాత మీరు తప్పక అగోచర మరియు గోచర విషయాలను ఎరుగు ఆయన (అల్లాహ్) వద్దకు తిరిగి పంపబడగలరు. అప్పుడాయన మీరు చేస్తూ వున్న కర్మలను గురించి మీకు తెలియజేస్తాడు."

وَقُلِ ٱعْمَلُواْ فَسَيَرَى ٱللَّهُ عَمَلَكُمْ وَرَسُولُهُۥ وَٱلْمُؤْمِنُونَ ۖ وَسَتُرَدُّونَ إِلَىٰ عَـٰلِمِ ٱلْغَيْبِ وَٱلشَّهَـٰدَةِ فَيُنَبِّئُكُم بِمَا كُنتُمْ تَعْمَلُونَ ﴿١٠٥﴾

106. మరికొందరు అల్లాహ్ ఆజ్ఞ (తీర్పు) కొరకు వేచి ఉన్నారు. ఆయన వారిని శిక్షించనూవచ్చు, లేదా క్షమించనూవచ్చు! మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

وَءَاخَرُونَ مُرْجَوْنَ لِأَمْرِ ٱللَّهِ إِمَّا يُعَذِّبُهُمْ وَإِمَّا يَتُوبُ عَلَيْهِمْ ۗ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٌ ﴿١٠٦﴾

107. మరియు (కపట విశ్వాసులలో) కొందరు (విశ్వాసులకు) హాని కలిగించ టానికి, సత్యతిరస్కార వైఖరిని (బలపరచ టానికి) మరియు విశ్వాసులను విడదీయ టానికి, అల్లాహ్ మరియు ఆయన సందేశ హరునితో ఇంతకు ముందు పోరాడిన వారు పొంచిఉండటానికి, ఒక మస్జిద్ నిర్మించారు. మరియు వారు: "మా ఉద్దేశం మేలు చేయటం తప్ప మరేమీ కాదు!" అని గట్టి ప్రమాణాలు కూడా చేస్తున్నారు.[1] కాని వారు వాస్తవంగా

وَٱلَّذِينَ ٱتَّخَذُواْ مَسْجِدًا ضِرَارًا وَكُفْرًا وَتَفْرِيقًۢا بَيْنَ ٱلْمُؤْمِنِينَ وَإِرْصَادًا لِّمَنْ حَارَبَ ٱللَّهَ وَرَسُولَهُۥ مِن قَبْلُ ۚ وَلَيَحْلِفُنَّ إِنْ أَرَدْنَآ إِلَّا ٱلْحُسْنَىٰ ۖ وَٱللَّهُ يَشْهَدُ إِنَّهُمْ لَكَـٰذِبُونَ ﴿١٠٧﴾

---

1. 'ఖ'జరజ్ తెగకు చెందిన ఒక మదీనా వాసుడు అబూ'ఆమిర్ క్రైస్తవుడవుతాడు. అతడు 3వ హిజ్రీలో జరిగిన ఉహుద్ యుద్ధంలో మక్కా ఖురైషులకు సహాయపడి, ఆ యుద్ధం తరువాత సిరియాకు పారిపోతాడు. అతడు బైజాన్టైన్ చక్రవర్తి హిరాక్లియస్‌ను మదీనాపై దండయాత్ర చేయటానికి ప్రోత్సహిస్తాడు. మదీనాపై వారు రాకూడదని దైవప్రవక్త ('స'అస), వారిని ఎదుర్కోవటానికి తబూక్‌కు బయలుదేరే సమయంలో అతడి అనుచరులు వచ్చి: "మేము మదీనా-ఖుబాల మధ్య ఒక మస్జిద్ నిర్మించాము.

అసత్యవాదులని అల్లాహ్ సాక్ష్య మిస్తున్నాడు.

**108**. నీ వెన్నడూ దానిలో (నమా'జ్‌కు) నిలబడకు. మొదటి రోజు నుండియే దైవభీతి ఆధారంగా స్థాపించబడిన మస్జిదే నీకు (నమా'జ్‌కు) నిలబడటానికి తగినది. అందులో పరిశుద్ధులు కాగోరే వారున్నారు. మరియు అల్లాహ్ పరిశుద్ధులు కాగోరే వారిని ప్రేమిస్తాడు.

**109**. ఏమీ? ఎవడైతే అల్లాహ్ యందు గల భయభక్తులు మరియు ఆయన ప్రీతి, పునాదుల మీద తన (మస్జిద్) కట్టడాన్ని కట్టాడో, అతడు శ్రేష్ఠుడా? లేక తన కట్టడపు పునాదులను, వరదలకు కూలిపోయి దాని క్రింది భాగం ఖాళీగా ఉన్న నది ఒడ్డున కట్టేవాడా? అది వానితో సహా నరకాగ్నిలోకి కొట్టుకొని పోతుంది. మరియు అల్లాహ్ దుర్మార్గులకు సన్మార్గం చూపడు.

**110**. వారి హృదయాలు ముక్కలై పోయి (వారు చనిపోయి) నంతవరకు, వారు కట్టిన కట్టడం వారి హృదయాలలో కలతలు పుట్టిస్తూ ఉంటుంది. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహావివేచనాపరుడు. (1/8)

لَا تَقُمۡ فِيهِ أَبَدٗاۚ لَّمَسۡجِدٌ أُسِّسَ عَلَى ٱلتَّقۡوَىٰ مِنۡ أَوَّلِ يَوۡمٍ أَحَقُّ أَن تَقُومَ فِيهِۚ فِيهِ رِجَالٞ يُحِبُّونَ أَن يَتَطَهَّرُواْۚ وَٱللَّهُ يُحِبُّ ٱلۡمُطَّهِّرِينَ ١٠٨

أَفَمَنۡ أَسَّسَ بُنۡيَٰنَهُۥ عَلَىٰ تَقۡوَىٰ مِنَ ٱللَّهِ وَرِضۡوَٰنٍ خَيۡرٌ أَم مَّنۡ أَسَّسَ بُنۡيَٰنَهُۥ عَلَىٰ شَفَا جُرُفٍ هَارٖ فَٱنۡهَارَ بِهِۦ فِي نَارِ جَهَنَّمَۗ وَٱللَّهُ لَا يَهۡدِي ٱلۡقَوۡمَ ٱلظَّٰلِمِينَ ١٠٩

لَا يَزَالُ بُنۡيَٰنُهُمُ ٱلَّذِي بَنَوۡاْ رِيبَةٗ فِي قُلُوبِهِمۡ إِلَّآ أَن تَقَطَّعَ قُلُوبُهُمۡۗ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٌ ١١٠

---

మీరు వచ్చి అందులో నమా'జ్ చేయించండి.'' అని కోరుతారు. దైవప్రవక్త ('స'అస): ''తబూక్ నుండి వచ్చిన తరువాత వస్తాను.'' అని అంటారు. ఆ సందర్భంలో తబూక్ నుండి తిరిగి వచ్చిన తరువాత ఈ ఆయత్‌లు అవతరింపజేయబడ్డాయి. దైవప్రవక్త ('స'అస) తరువాత దానిని పడగొట్టిస్తారు. ఎందుకంటే ఆ మస్జిద్ నిర్మాణ లక్ష్యం విశ్వాసుల మధ్య భేదభావాలు పుట్టించడమే ఉండెను.

111. * నిశ్చయంగా, అల్లాహ్ విశ్వాసుల నుండి వారి ప్రాణాలను వారి సంపదలను కొన్నాడు. కాబట్టి నిశ్చయంగా, వారికొరకు స్వర్గముంది. వారు అల్లాహ్ మార్గంలో పోరాడి (తమ శత్రువులను) చంపుతారు మరియు చంపబడతారు. మరియు ఇది తౌరాత్, ఇంజీల్ మరియు ఖుర్ఆన్‌లలో, ఆయన (అల్లాహ్) చేసిన వాగ్దానం, సత్యమైనది. మరియు తన వాగ్దానాన్ని నెరవేర్చటంలో అల్లాహ్‌ను మించినవాడు ఎవడు? కావున మీరు ఆయనతో చేసిన వ్యాపారానికి సంతోష పడండి. మరియు ఇదే ఆ గొప్ప విజయం.[1]

112. (వీరే అల్లాహ్ ముందు) పశ్చాత్తాప పడేవారు, ఆయనను ఆరాధించేవారు, స్తుతించే వారు, (అల్లాహ్ మార్గంలో) సంచరించే వారు (ఉపవాసాలు చేసేవారు).[2] ఆయన సన్నిధిలో వంగే(రుకూ'ఉ చేసే)వారు, సాష్టాంగం(సజ్దా) చేసేవారు, ధర్మమును ఆదేశించేవారు మరియు అధర్మమును నిషేధించేవారు[3] మరియు అల్లాహ్ విధించిన హద్దులను పాటించేవారు కూడాను మరియు విశ్వాసులకు శుభవార్త తెలుపు.

113. అల్లహ్‌కు సాటికల్పించే వారు (ముష్రికులు), దగ్గరి బంధువులైనా, వారు నరకవాసులని వ్యక్తమైన తరువాత కూడా, ప్రవక్తకు మరియు విశ్వాసులకు వారి క్షమాపణకై ప్రార్థించటం తగదు.[4]

۞ إِنَّ ٱللَّهَ ٱشۡتَرَىٰ مِنَ ٱلۡمُؤۡمِنِينَ
أَنفُسَهُمۡ وَأَمۡوَٰلَهُم بِأَنَّ لَهُمُ
ٱلۡجَنَّةَۚ يُقَٰتِلُونَ فِي سَبِيلِ ٱللَّهِ
فَيَقۡتُلُونَ وَيُقۡتَلُونَۖ وَعۡدًا عَلَيۡهِ حَقّٗا
فِي ٱلتَّوۡرَىٰةِ وَٱلۡإِنجِيلِ وَٱلۡقُرۡءَانِۚ
وَمَنۡ أَوۡفَىٰ بِعَهۡدِهِۦ مِنَ ٱللَّهِۚ
فَٱسۡتَبۡشِرُواْ بِبَيۡعِكُمُ ٱلَّذِي بَايَعۡتُم بِهِۦۚ
وَذَٰلِكَ هُوَ ٱلۡفَوۡزُ ٱلۡعَظِيمُ ١١١
ٱلتَّٰٓئِبُونَ ٱلۡعَٰبِدُونَ
ٱلۡحَٰمِدُونَ ٱلسَّٰٓئِحُونَ
ٱلرَّٰكِعُونَ ٱلسَّٰجِدُونَ
ٱلۡأٓمِرُونَ بِٱلۡمَعۡرُوفِ وَٱلنَّاهُونَ
عَنِ ٱلۡمُنكَرِ وَٱلۡحَٰفِظُونَ لِحُدُودِ
ٱللَّهِۗ وَبَشِّرِ ٱلۡمُؤۡمِنِينَ ١١٢
مَا كَانَ لِلنَّبِيِّ وَٱلَّذِينَ ءَامَنُوٓاْ أَن
يَسۡتَغۡفِرُواْ لِلۡمُشۡرِكِينَ وَلَوۡ كَانُوٓاْ
أُوْلِي قُرۡبَىٰ مِنۢ بَعۡدِ مَا تَبَيَّنَ لَهُمۡ
أَنَّهُمۡ أَصۡحَٰبُ ٱلۡجَحِيمِ ١١٣

---

1. చూడండి, 'స. బు'ఖారీ, పు.-4, 'హ. 352, పు-5, 'హ.377, మరియు పు-3, 'హ. 3462.
2. చాలామంది వ్యాఖ్యాతలు ఈ శబ్దం 'సాయి'హూన్'ను 'సాయిమూన్'గా బోధించారు. అంటే ఉపవాసాలు చేసేవారు అని.
3. ఇటువంటి వాక్యానికి చూడండి, 3:104, 110, 114; 9:71 మరియు 22:41.
4. చూడండి, 28:56.

**114**. మరియు ఇబ్రాహీమ్ తన తండ్రి క్షమాపణ కొరకు ప్రార్థించింది కేవలం అతను తన (తండ్రి)తో చేసిన వాగ్దానం వల్లనే.[1] కాని అతనికి, తన (తండ్రి) నిశ్చయంగా, అల్లాహ్‌కు శత్రువని స్పష్టమైనప్పుడు, అతను (ఇబ్రాహీమ్) అతనిని విడనాడాడు. వాస్తవానికి ఇబ్రాహీమ్ వినయవిధేయతలతో (అల్లాహ్‌ను) అర్థించేవాడు,[2] సహనశీలుడు.

وَمَا كَانَ ٱسۡتِغۡفَارُ إِبۡرَٰهِيمَ لِأَبِيهِ إِلَّا عَن مَّوۡعِدَةٖ وَعَدَهَآ إِيَّاهُ فَلَمَّا تَبَيَّنَ لَهُۥٓ أَنَّهُۥ عَدُوّٞ لِّلَّهِ تَبَرَّأَ مِنۡهُۚ إِنَّ إِبۡرَٰهِيمَ لَأَوَّٰهٌ حَلِيمٞ ﴿١١٤﴾

**115**. మరియు ఒక జాతికి సన్మార్గం చూపిన తరువాత వారు దూరంగా ఉండ వలసిన విషయాలను గురించి వారికి స్పష్టంగా తెలుపనంతవరకు, అల్లాహ్ వారిని మార్గభ్రష్టత్వంలో పడవేయడు. నిశ్చయంగా, అల్లాహ్‌కు ప్రతివిషయం గురించి బాగా తెలుసు.[3]

وَمَا كَانَ ٱللَّهُ لِيُضِلَّ قَوۡمَۢا بَعۡدَ إِذۡ هَدَىٰهُمۡ حَتَّىٰ يُبَيِّنَ لَهُم مَّا يَتَّقُونَۚ إِنَّ ٱللَّهَ بِكُلِّ شَيۡءٍ عَلِيمٌ ﴿١١٥﴾

**116**. నిశ్చయంగా, భూమ్యాకాశాల సామ్రాజ్యాధిపత్యం అల్లాహ్‌కే చెందుతుంది. ఆయనే జీవన్మరణాలను ఇచ్చేవాడు. మరియు అల్లాహ్ తప్ప మీకు వేరే రక్షకుడు గానీ సహాయకుడు గానీ ఎవ్వడూ లేడు.

إِنَّ ٱللَّهَ لَهُۥ مُلۡكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۖ يُحۡيِۦ وَيُمِيتُۚ وَمَا لَكُم مِّن دُونِ ٱللَّهِ مِن وَلِيّٖ وَلَا نَصِيرٖ ﴿١١٦﴾

**117**. వాస్తవానికి అల్లాహ్ ప్రవక్తను మరియు వలస వచ్చిన వారిని (ముహాజిర్‌లను) మరియు అ'న్సార్‌లను, ఎవరైతే బహు కష్టకాలంలో ప్రవక్త వెంట ఉన్నారో! అలాంటి వారి

لَّقَد تَّابَ ٱللَّهُ عَلَى ٱلنَّبِيِّ وَٱلۡمُهَٰجِرِينَ وَٱلۡأَنصَارِ ٱلَّذِينَ ٱتَّبَعُوهُ فِي سَاعَةِ

---

**1.** ఇబ్రహీమ్ ('అ.స.) యొక్క ఈ వాగ్దానం కొరకు చూడండి, 19:47-48 మరియు 60:4. అతని ప్రార్థన కొరకు చూడండి, 26:86-87. ఇంకా చూడండి 'స'హీ'హ్ బు'ఖారీ, పు-4, 'హ. 565.

**2.** అవ్వాహున్: మృదుహృదయుడు, వినయవిధేయతలతో (అల్లాహుతాలాను) అర్థించేవాడు.

**3.** చూడండి, 6:131-132. ఇంకా చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పు-9, 'హ.66.

ٱلۡعُسۡرَةِ مِنۢ بَعۡدِ مَا كَادَ يَزِيغُ قُلُوبُ فَرِيقٖ مِّنۡهُمۡ ثُمَّ تَابَ عَلَيۡهِمۡۚ إِنَّهُۥ بِهِمۡ رَءُوفٞ رَّحِيمٞ ١١٧

నందరినీ క్షమించాడు.[1] వారిలో ఒకపక్షం వారి హృదయాలు, దాదాపు వక్రత్వం వైపునకు మరలినప్పటికీ (ప్రవక్త వెంట వెళ్ళారు), అప్పుడు ఆయన వారి పశ్చాత్తాపాన్ని అంగీకరించాడు. నిశ్చయంగా ఆయన వారిపట్ల ఎంతో కనికరుడు, అపార కరుణా ప్రదాత.

وَعَلَى ٱلثَّلَٰثَةِ ٱلَّذِينَ خُلِّفُواْ حَتَّىٰٓ إِذَا ضَاقَتۡ عَلَيۡهِمُ ٱلۡأَرۡضُ بِمَا رَحُبَتۡ وَضَاقَتۡ عَلَيۡهِمۡ أَنفُسُهُمۡ وَظَنُّوٓاْ أَن لَّا مَلۡجَأَ مِنَ ٱللَّهِ إِلَّآ إِلَيۡهِ ثُمَّ تَابَ عَلَيۡهِمۡ لِيَتُوبُوٓاْۚ إِنَّ ٱللَّهَ هُوَ ٱلتَّوَّابُ ٱلرَّحِيمُ ١١٨

**118**. మరియు వెనుక ఉండిపోయిన ఆ ముగ్గురుని కూడా (ఆయన క్షమించాడు).[2] చివరకు విశాలంగా ఉన్న భూమి కూడా వారికి ఇరుకైపోయింది. మరియు వారి ప్రాణాలు కూడా వారికి భారమయ్యాయి. అల్లాహ్ నుండి (తమను కాపాడు కోవటానికి) ఆయన శరణం తప్ప మరొకటి లేదని వారు తెలుసుకున్నారు. అప్పుడు ఆయన వారి పశ్చాత్తాపాన్ని అంగీకరించాడు - వారు పశ్చాత్తాప పడాలని. నిశ్చయంగా, అల్లాహ్ మాత్రమే పశ్చాత్తాపాన్ని అంగీకరించే వాడు, అపార కరుణాప్రదాత.

---

**1.** తబూక్ దండయాత్ర కాలం బహు కష్టకాలంగా పేర్కొనబడింది. ఎందుకంటే అది తీవ్రమైన ఎండకాలం; ఖర్జూర ఫలాలు సిద్ధమయ్యిన కాలం; ఆ ప్రయాణం చాలా దూరప్రదేశానిది మరియు ప్రయాణ సౌకర్యాలు కూడా చాలా తక్కువ ఉండేవి.

**2.** తబూక్ దండయాత్రలో పాల్గొనని ఆ ముగ్గురు, క'అబ్ ఇబ్నెమాలిక్, మురారా ఇబ్నె రబీ మరియు హిలాల్ ఇబ్నె 'ఉమయ్యా (ర'ది. 'అన్హుమ్) అనే అన్సారులు. వీరు, పై ఆయత్ అవతరింపజేయబడేవరకు దైవప్రవక్త ('స'అస) మరియు అతని అనుచరులతో బహిష్కరింపబడి ఉండిరి. వీరి పశ్చాత్తాపం యాభై రోజుల తరువాత అంగీకరించ బడింది. వీరు విధేయులైన ముస్లింలు. ఇంతకు ముందు ప్రతి యుద్ధంలో పాల్గొన్నారు. తబూక్ దండయాత్రలో కేవలం సోమరితనం వల్లనే పాల్గొన లేక పోయారు. వారు కపటవిశ్వాసులవలే బూటక సాకులు చెప్పలేదు. (చూడండి 'స'హీ'హ్ బు'ఖారీ, కితాబ్ అల్ మ'గాజీ, బాబ్ 'గజ్వత్ అత్-తబూక్. ముస్లిం కితాబ్ అత్-తౌబాహ్, బాబ్ 'హదీస్ తౌబతు క'అబ్ బిన్ మాలిక్).

119. ఓ విశ్వాసులారా! అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు సత్యవంతులతో ఉండండి.[1]
120. మదీనా పురవాసులకు మరియు చుట్టుప్రక్కలలో ఉండే ఎడారివాసు (బద్దూ)లకు అల్లాహ్ ప్రవక్తను వదలి వెనుక ఉండి పోవటం మరియు తమ ప్రాణాలకు అతని (దైవప్రక్త) ప్రాణాలపై ఆధిక్యతనివ్వటం తగినపని కాదు. ఎందుకంటే అల్లాహ్ మార్గంలో వారు ఆకలి దప్పులు, (శారీరక) కష్టాలు సహిస్తే, శత్రువుల భూమిలోకి దూరి సత్యతిరస్కారుల కోపాన్ని రేకెత్తిస్తే మరియు శత్రువులనుండి ఏదైనా సాధిస్తే,[2] దానికి బదులుగా వారికి ఒక సత్కార్యం వ్రాయబడకుండా ఉండదు. నిశ్చయంగా అల్లాహ్ సజ్జనుల ఫలితాన్ని వ్యర్థపరచడు.
121. మరియు (అల్లాహ్ మార్గంలో) వారు ఖర్చుచేసే ధనం కొంచెమైనా లేదా అధికమైనా, లేక వారు (శ్రమపడి) కొండ లోయలను దాటే విషయమూ, అంతా వారి కొరకు వ్రాయబడకుండా ఉండదు; వారు చేస్తూ ఉండిన ఈ సత్కార్యాల కొరకు, అల్లాహ్ వారికి ప్రతిఫలాన్ని ప్రసాదించటానికి. (1/4)

122. * మరియు విశ్వాసులందరూ (పోరాటానికి) బయలుదేరటం సరికాదు. కావున వారిలో ప్రతితెగ నుండి కొందరు

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ ٱتَّقُواْ ٱللَّهَ
وَكُونُواْ مَعَ ٱلصَّٰدِقِينَ ﴿١١٩﴾
مَا كَانَ لِأَهۡلِ ٱلۡمَدِينَةِ وَمَنۡ حَوۡلَهُم
مِّنَ ٱلۡأَعۡرَابِ أَن يَتَخَلَّفُواْ عَن رَّسُولِ ٱللَّهِ
وَلَا يَرۡغَبُواْ بِأَنفُسِهِمۡ عَن نَّفۡسِهِۦۚ ذَٰلِكَ
بِأَنَّهُمۡ لَا يُصِيبُهُمۡ ظَمَأٞ وَلَا نَصَبٞ
وَلَا مَخۡمَصَةٞ فِي سَبِيلِ ٱللَّهِ وَلَا
يَطَـُٔونَ مَوۡطِئٗا يَغِيظُ ٱلۡكُفَّارَ
وَلَا يَنَالُونَ مِنۡ عَدُوّٖ نَّيۡلًا إِلَّا كُتِبَ
لَهُم بِهِۦ عَمَلٞ صَٰلِحٌۚ إِنَّ ٱللَّهَ لَا
يُضِيعُ أَجۡرَ ٱلۡمُحۡسِنِينَ ﴿١٢٠﴾
وَلَا يُنفِقُونَ نَفَقَةٗ صَغِيرَةٗ وَلَا
كَبِيرَةٗ وَلَا يَقۡطَعُونَ وَادِيًا إِلَّا
كُتِبَ لَهُمۡ لِيَجۡزِيَهُمُ ٱللَّهُ أَحۡسَنَ
مَا كَانُواْ يَعۡمَلُونَ ﴿١٢١﴾
۞ وَمَا كَانَ ٱلۡمُؤۡمِنُونَ لِيَنفِرُواْ
كَآفَّةٗۚ فَلَوۡلَا نَفَرَ مِن كُلِّ فِرۡقَةٖ

---

1. చూడండి, 'స. బు'ఖారీ, పు-8, 'హ. 116, 117, 118.
2. నైలన్: attainment, సిద్ధి లేక సాధించడం. ఇక్కడ ఈ వాక్యపు అర్థం, శత్రువుల నుండి ఏదైనా తీసుకోవటం, లేక వారికి హాని కలిగించటం అంటే వారిని సంహరించటం లేదా ఖైదీలుగా చేసుకోవటం లేదా ఓడించి విజయధనం పొందటం, లేక అమరగతి పొందటం.

مِّنۡهُمۡ طَآئِفَةٞ لِّيَتَفَقَّهُواْ فِي ٱلدِّينِ وَلِيُنذِرُواْ قَوۡمَهُمۡ إِذَا رَجَعُوٓاْ إِلَيۡهِمۡ لَعَلَّهُمۡ يَحۡذَرُونَ ١٢٢

ధర్మజ్ఞానాన్ని పెంపొందించుకోవటానికి పోయి వారు వారి వద్దకు తిరిగివచ్చినప్పుడు తమ జాతి (ప్రాంత) ప్రజలను హెచ్చరిస్తే! బహుశా వారు కూడా తమను తాము (దుర్మార్గం నుండి) కాపాడుకోగలరు.[1]

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ قَٰتِلُواْ ٱلَّذِينَ يَلُونَكُم مِّنَ ٱلۡكُفَّارِ وَلۡيَجِدُواْ فِيكُمۡ غِلۡظَةٗۚ وَٱعۡلَمُوٓاْ أَنَّ ٱللَّهَ مَعَ ٱلۡمُتَّقِينَ ١٢٣

**123**. ఓ విశ్వాసులారా! మీ దగ్గరనున్న సత్యతిరస్కారులతో పోరాడి, వారిని మీలోనున్న కాఠిన్యాన్ని గ్రహించనివ్వండి.[2] మరియు నిశ్చయంగా అల్లాహ్ దైవభీతి గల వారితో ఉంటాడని తెలుసుకోండి.

وَإِذَا مَآ أُنزِلَتۡ سُورَةٞ فَمِنۡهُم مَّن يَقُولُ أَيُّكُمۡ زَادَتۡهُ هَٰذِهِۦٓ إِيمَٰنٗاۚ فَأَمَّا ٱلَّذِينَ ءَامَنُواْ فَزَادَتۡهُمۡ إِيمَٰنٗا وَهُمۡ يَسۡتَبۡشِرُونَ ١٢٤

**124**. మరియు ఒక సూరహ్ అవతరింప జేయబడినప్పుడల్లా వారి(కపట విశ్వాసుల)లో కొందరు: "ఇది మీలో ఎవరి విశ్వాసాన్ని అధికంచేసింది?" అని అడుగుతారు. కాని వాస్తవానికి అది విశ్వసించిన వారందరి విశ్వాసాన్ని అధికం చేస్తుంది. మరియు వారు దానితో సంతోషపడతారు.[3]

وَأَمَّا ٱلَّذِينَ فِي قُلُوبِهِم مَّرَضٞ فَزَادَتۡهُمۡ رِجۡسًا إِلَىٰ رِجۡسِهِمۡ وَمَاتُواْ وَهُمۡ كَٰفِرُونَ ١٢٥

**125**. కాని ఎవరి హృదయాలలో రోగ ముందో, ఇది వారి మాలిన్యంలో మరింత మాలిన్యాన్ని అధికంచేస్తుంది. మరియు వారు సత్యతిరస్కారులుగానే మరణిస్తారు.[4]

---

**1**. తబూక్ దండయాత్ర కొరకు, ఆర్థిక మరియు భౌతిక స్తోమత గలవారంతా బయలుదేరాలని ప్రకటన చేయబడి ఉండెను. ఎందుకంటే అప్పుడు వారికి ఒక గొప్ప సామ్రాజ్యపు సేనతో యుద్ధం చేయవలసి ఉండెను, లేనిచో వారు మదీనాపై దాడి చేయటానికి యత్నాలు చేయుచుండిరి. కాని అన్ని యుద్ధాలలో, అందరూ పాల్గొనే అవసరముండదు. అలాంటప్పుడు కొందరు యుద్ధానికి పోకుండా ధర్మజ్ఞానం పెంపొందించుకోవటానికి పోయి, తిరిగి వచ్చి తమ ప్రాంతంలోని ప్రజలకు ధర్మజ్ఞానం బోధించాలి. దీనివల్ల ప్రజలలో దైవభీతి పెరుగుతుంది.

**2.** ఎందుకు జిహాద్ చేయాలో 2:190-194, 22:39, 60:8-9 ఆయత్‌లలో వచ్చింది. ఇక్కడ: 'మీ ఇరుగు పొరుగులో ఉన్నవారు మీకు హాని చేకూర్చదలిస్తే, మిమ్మల్ని, మీ ధర్మం అనుసరించటంలో ఆటంకపరిస్తే, అట్టివారితో మీరు కఠినత్వాన్ని వ్యక్తపరుస్తూ పోరాడండి.' అని ఆదేశమివ్వబడుతోంది. ఇంకా చూడండి, 48:29 మరియు 5:54.

**3**. చూడండి, 8:2.

**4**. చూడండి, 17:82.

أَوَلَا يَرَوْنَ أَنَّهُمْ يُفْتَنُونَ فِي كُلِّ عَامٍ مَّرَّةً أَوْ مَرَّتَيْنِ ثُمَّ لَا يَتُوبُونَ وَلَا هُمْ يَذَّكَّرُونَ ﴿١٢٦﴾

**126**. ఏమీ? వారు ప్రతి సంవత్సరం ఒకసారి లేక రెండుసార్లు (బాధలతో) పరీక్షింపబడటాన్ని గమనించటంలేదా? అయినా వారు పశ్చాత్తాపపడటంలేదు మరియు గుణపాఠంకూడా నేర్చుకోవటం లేదు.

وَإِذَا مَا أُنزِلَتْ سُورَةٌ نَّظَرَ بَعْضُهُمْ إِلَىٰ بَعْضٍ هَلْ يَرَاكُم مِّنْ أَحَدٍ ثُمَّ انصَرَفُوا ۚ صَرَفَ اللَّهُ قُلُوبَهُم بِأَنَّهُمْ قَوْمٌ لَّا يَفْقَهُونَ ﴿١٢٧﴾

**127**. మరియు ఏదైనా సూరహ్ అవతరించినపుడల్లా వారు ఒకరినొకరు చూసుకుంటూ (అంటారు): "ఎవడైనా మిమ్మల్ని చూస్తున్నాడా?" ఆ తరువాత అక్కడి నుండి మెల్లగా జారుకుంటారు. అల్లాహ్ వారిహృదయాలను (సన్మార్గం నుండి) మళ్ళించాడు. ఎందుకంటే నిశ్చయముగా, వారు అర్థం చేసుకోలేని జనులు.[1]

لَقَدْ جَاءَكُمْ رَسُولٌ مِّنْ أَنفُسِكُمْ عَزِيزٌ عَلَيْهِ مَا عَنِتُّمْ حَرِيصٌ عَلَيْكُم بِالْمُؤْمِنِينَ رَءُوفٌ رَّحِيمٌ ﴿١٢٨﴾

**128**. (ఓ ప్రజలారా!) వాస్తవానికి, మీ వద్దకు మీలోనుంచే ఒక సందేశహరుడు (ము'హమ్మద్) వచ్చి ఉన్నాడు;[2] మీరు ఆపదకు గురికావటం అతనికి కష్టం కలిగిస్తుంది; అతను మీ మేలు కోరేవాడు, విశ్వాసుల ఎడల కనికరుడు కరుణామయుడు.

فَإِن تَوَلَّوْا فَقُلْ حَسْبِيَ اللَّهُ لَا إِلَٰهَ إِلَّا هُوَ ۖ عَلَيْهِ تَوَكَّلْتُ ۖ وَهُوَ رَبُّ الْعَرْشِ الْعَظِيمِ ﴿١٢٩﴾

**129**. అయినా వారు విముఖులైతే, వారితో అను: "నాకు అల్లాహ్ చాలు! ఆయన తప్ప వేరే ఆరాధ్యనీయుడు లేడు! నేను ఆయననే నమ్ముకున్నాను. మరియు ఆయనే సర్వోత్తమ సింహాసనానికి ('అర్ష్‌కు) ప్రభువు."[3]

*****

**1**. చూడండి, 8:55.
**2**. చూడండి, 50:2.
**3**. చూడండి, ఖుర్ఆన్ 7:54 మరియు 'స'హీ'హ్ బు'ఖారీ, పు-9, 'హ. 86 మరియు పు-6, 'హ. 87.

## 10. సూరహ్ యూనుస్ سُورَةُ يُونُسَ

ఇది మక్కా సూరహ్. ఇందులో **109** ఆయత్‌లున్నాయి. కొందరు దీనిలోని రెండు, మూడు ఆయతులు మదీనాలో అవతరింపజేయబడ్డాయని అభిప్రాయపడ్డారు. ఇది మరియు దీని తరువాత వచ్చే **5** సూరాహ్‌లు అవతరణలో ఒకదానితో ఒకటి సంబంధించి ఉన్నాయి. ఇవి ఆఖరు మక్కా కాలంలో అవతరింపజేయబడ్డాయి.10-15 సూరాహ్‌లు ప్రతి ఒక్కటి అలిఫ్-లామ్-ర అక్షరాలతో ప్రారంభమవుతాయి. కాని 13వ సూరహ్ మాత్రం అలిఫ్-లామ్-మీమ్-ర అక్షరాలతో ప్రారంభమవుతోంది. దీని పేరు **98**వ ఆయత్‌లో ఉన్న దైవప్రవక్త **యూనుస్** (అ.స.) పేరుతో పెట్టబడింది.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓر ۚ تِلْكَ ءَايَٰتُ ٱلْكِتَٰبِ ٱلْحَكِيمِ ﴿١﴾

**1**. అలిఫ్-లామ్-ర. ఇవి వివేకంతో నిండి వున్న దివ్యగ్రంథం యొక్క ఆయతులు.

أَكَانَ لِلنَّاسِ عَجَبًا أَنْ أَوْحَيْنَآ إِلَىٰ رَجُلٍ مِّنْهُمْ أَنْ أَنذِرِ ٱلنَّاسَ وَبَشِّرِ ٱلَّذِينَ ءَامَنُوٓا۟ أَنَّ لَهُمْ قَدَمَ صِدْقٍ عِندَ رَبِّهِمْ ۗ قَالَ ٱلْكَٰفِرُونَ إِنَّ هَٰذَا لَسَٰحِرٌ مُّبِينٌ ﴿٢﴾

**2**. "ఏమీ? మానవులను హెచ్చరించటానికి మరియు విశ్వసించిన వారికి నిశ్చయంగా, తమ ప్రభువువద్ద, వారు చేసిపంపిన మంచి పనులకు తగిన స్థానం ఉంది." అనే శుభవార్త వినిపించటానికి, మేము వారిలోని ఒక మనిషి (ము'హమ్మద్)పై మా సందేశాన్ని అవతరింపజేయటం ప్రజలకు ఆశ్చర్యకరమైన విషయంగా ఉందా?[1] (ఎందుకంటే) సత్యతిరస్కారులు ఇలా అన్నారు: "నిశ్చయంగా ఇతను పచ్చి మాంత్రికుడు!"

إِنَّ رَبَّكُمُ ٱللَّهُ ٱلَّذِى خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ فِى سِتَّةِ أَيَّامٍ ثُمَّ ٱسْتَوَىٰ عَلَى ٱلْعَرْشِ ۖ يُدَبِّرُ ٱلْأَمْرَ ۖ

**3**. నిశ్చయంగా, మీ పోషకుడూ, ప్రభువూ అయిన అల్లాహ్, ఆకాశాలను మరియు భూమిని ఆరుదినము (అయ్యామ్)లలో సృష్టించి, తర్వాత తన సింహాసనాన్ని ('అర్ష్‌ను) అధిష్టించాడు.[2] ఆయనే (సర్వసృష్టి)

**1**. చూడండి, 9:128.
**2**. చూడండి, 7:54.

مَا مِن شَفِيعٍ إِلَّا مِنۢ بَعۡدِ إِذۡنِهِۦۚ ذَٰلِكُمُ ٱللَّهُ رَبُّكُمۡ فَٱعۡبُدُوهُۚ أَفَلَا تَذَكَّرُونَ ٣

వ్యవహారాలను నడుపుతున్నాడు. ఆయన అనుమతి లేకుండా, సిఫారసు చేయగలవాడు ఎవ్వడూ లేడు.[1] ఆయనే అల్లాహ్! మీ పోషకుడు (ప్రభువు), కావున మీరు ఆయననే ఆరాధించండి. ఏమీ? మీరు హితోపదేశం స్వీకరించరా?

إِلَيۡهِ مَرۡجِعُكُمۡ جَمِيعٗاۖ وَعۡدَ ٱللَّهِ حَقًّاۚ إِنَّهُۥ يَبۡدَؤُاْ ٱلۡخَلۡقَ ثُمَّ يُعِيدُهُۥ لِيَجۡزِيَ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ بِٱلۡقِسۡطِۚ وَٱلَّذِينَ كَفَرُواْ لَهُمۡ شَرَابٞ مِّنۡ حَمِيمٖ وَعَذَابٌ أَلِيمُۢ بِمَا كَانُواْ يَكۡفُرُونَ ٤

**4.** ఆయన వైపునకే మీరందరూ మరలి పోవలసి ఉంది. అల్లాహ్ వాగ్దానం నిజమైనది. నిశ్చయంగా, ఆయనే సృష్టిని మొదట సరిక్రొత్తగా ప్రారంభించాడు, మరల ఆయనే దానిని ఉనికిలోకి తెస్తాడు. ఇది విశ్వసించి సత్కార్యాలు చేసే వారికి న్యాయమైన ప్రతిఫలమివ్వటానికి. మరియు సత్యాన్ని తిరస్కరించిన వారికి - వారు సత్యాన్ని తిరస్కరిస్తూ ఉండినందుకు - త్రాగటానికి సలసల కాగేనీళ్ళు మరియు బాధాకరమైన శిక్ష ఉంటాయి.

هُوَ ٱلَّذِي جَعَلَ ٱلشَّمۡسَ ضِيَآءٗ وَٱلۡقَمَرَ نُورٗا وَقَدَّرَهُۥ مَنَازِلَ لِتَعۡلَمُواْ عَدَدَ ٱلسِّنِينَ وَٱلۡحِسَابَۚ

**5.** ఆయనే, సూర్యుణ్ణి (ప్రకాశించే) దీపంగానూ మరియు చంద్రుణ్ణి వెలుగును (ప్రతిబింబింపజేసే) దానిగానూ చేసి, దానికి (పెరిగే-తరిగే) దశలు నియమించాడు,[2] దాని ద్వారా మీరు సంవత్సరాల మరియు

---

**1.** అల్లాహ్ (సు.తా.) అనుమతి లేకుండా సిఫారసు చేయగలవాడు ఎవ్వడూ లేడు. అల్లాహ్ (సు.తా.) వారి కొరకే సిఫారసు చేయటానికి అనుమతినిస్తాడు, ఎవరికొరకైతే ఆయన (సు.తా.) ఇష్టపడతాడో; అంటే షిర్క్ చేయకుండా, విశ్వాసులై, అల్లాహ్ విధులను పాటిస్తూ అనుకొకుండా పాపాలు చేసిన వారి కొరకు మాత్రమే. ముష్రికీన్‌లు భావించినట్లు: 'వారు ఆరాధించేవి, తమను అల్లాహ్ (సు.తా.) శిక్ష నుండి తప్పించటానికి, అల్లాహ్ (సు.తా.) వద్ద, తమ సిఫారసు చేస్తాయి.' అనే తప్పుడు ఊహలను ఈ ఆయత్ మరియు ఇలాంటి ఎన్నో ఆయతులు ఖండిస్తున్నాయి. షిర్క్ (అల్లాహుతా'లాకు సాటి కల్పించడం) ఎన్నటికీ క్షమించబడని మహా పాపం. ముష్రికీన్‌ల గమ్యస్థానం - వారెన్ని పుణ్యకార్యాలు చేసినా - నరకం మాత్రమే. చూడండి, 2:255, 19:87, 20:109, 21:28, 34:23 మరియు 53:26.

**2.** సూర్యుని ప్రకాశం స్వంతమైనది, ఏ విధంగానైతే దీపపు వెలుగో. చంద్రుని వెలుగు ప్రతిబింబింపజేయబడిన సూర్యుని వెలుగు. చంద్రునిలో తన స్వంత వెలుగు లేదు.

مَا خَلَقَ ٱللَّهُ ذَٰلِكَ إِلَّا بِٱلْحَقِّ ۚ يُفَصِّلُ ٱلْـَٔايَـٰتِ لِقَوْمٍ يَعْلَمُونَ ﴿٥﴾ إِنَّ فِى ٱخْتِلَـٰفِ ٱلَّيْلِ وَٱلنَّهَارِ وَمَا خَلَقَ ٱللَّهُ فِى ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضِ لَـَٔايَـٰتٍ لِّقَوْمٍ يَتَّقُونَ ﴿٦﴾ إِنَّ ٱلَّذِينَ لَا يَرْجُونَ لِقَآءَنَا وَرَضُوا۟ بِٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَٱطْمَأَنُّوا۟ بِهَا وَٱلَّذِينَ هُمْ عَنْ ءَايَـٰتِنَا غَـٰفِلُونَ ﴿٧﴾ أُو۟لَـٰٓئِكَ مَأْوَىٰهُمُ ٱلنَّارُ بِمَا كَانُوا۟ يَكْسِبُونَ ﴿٨﴾ إِنَّ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّـٰلِحَـٰتِ يَهْدِيهِمْ رَبُّهُم بِإِيمَـٰنِهِمْ ۖ تَجْرِى مِن تَحْتِهِمُ ٱلْأَنْهَـٰرُ فِى جَنَّـٰتِ ٱلنَّعِيمِ ﴿٩﴾ دَعْوَىٰهُمْ فِيهَا سُبْحَـٰنَكَ ٱللَّهُمَّ وَتَحِيَّتُهُمْ فِيهَا سَلَـٰمٌ ۚ

(కాలపు) గణనను తెలుసుకోవాలని.[1] అల్లాహ్ ఇదంతా సత్యాధారంగా తప్ప సృష్టించలేదు. జ్ఞానంగల వారికి ఆయన తన సూచన (ఈ విధంగా) విశదీకరిస్తున్నాడు.

**6**. నిశ్చయంగా, రేయింబవళ్ళ నిరంతర మార్పులలోనూ మరియు భూమ్యాకాశాలలో, అల్లాహ్ సృష్టించిన ప్రతిదాని లోనూ, దైవభీతి గల ప్రజలకు సూచనలు ఉన్నాయి.

**7**. నిశ్చయంగా, ఎవరైతే మమ్మల్ని కలుసుకోవటాన్ని ఆశించక, ఇహలోక జీవితంతోనే సంతసించి, దానితోనే తృప్తి చెందుతారో మరియు మా సూచన (ఆయత్)లను గురించి నిర్లక్ష్య భావం కలిగి ఉంటారో!

**8**. అలాంటి వారి ఆశ్రయం - తమ కర్మలకు ఫలితంగా - నరకాగ్నియే!

**9**. నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసిన వారిని, వారి విశ్వాస ఫలితంగా, వారి ప్రభువు వారిని సన్మార్గం మీద నడిపిస్తాడు. వారి క్రింద పరమసుఖాలతో నిండిఉన్న స్వర్గవనాలలో, సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి.

**10**. అందులో వారి ప్రార్థన: "ఓ అల్లాహ్! నీవు సర్వలోపాలకు అతీతుడవు." అని మరియు వారి అభివందనం: "అస్సలాము

**1**. చంద్రునికి 28 దశలున్నాయి. వాటిలో చంద్రుడు చిన్నరేఖనుండి పూర్ణిమ రోజు పూర్తి చంద్రునిగా 14 రోజులలో మారుతాడు. ఆ తరువాత తిరిగి తగ్గుతూ 14 రోజులలో చిన్న రేఖగా మారుతాడు. తరువాత ఒకటి రెండు రోజులు కానరాకుండా పోతాడు. మళ్ళీ చిన్నరేఖగా మొదలవుతాడు. ఈ విధంగా చంద్రుని దిశలవల్ల దినాల, నెలల మరియు సంవత్సరాల గణనలు తెలుస్తాయి.

وَءَاخِرُ دَعْوَىٰهُمْ أَنِ ٱلْحَمْدُ لِلَّهِ
رَبِّ ٱلْعَٰلَمِينَ ﴿١٠﴾
۞ وَلَوْ يُعَجِّلُ ٱللَّهُ لِلنَّاسِ
ٱلشَّرَّ ٱسْتِعْجَالَهُم بِٱلْخَيْرِ
لَقُضِىَ إِلَيْهِمْ أَجَلُهُمْ ۖ فَنَذَرُ
ٱلَّذِينَ لَا يَرْجُونَ لِقَآءَنَا فِى
طُغْيَٰنِهِمْ يَعْمَهُونَ ﴿١١﴾
وَإِذَا مَسَّ ٱلْإِنسَٰنَ ٱلضُّرُّ دَعَانَا
لِجَنۢبِهِۦٓ أَوْ قَاعِدًا أَوْ قَآئِمًا فَلَمَّا
كَشَفْنَا عَنْهُ ضُرَّهُۥ مَرَّ كَأَن لَّمْ
يَدْعُنَآ إِلَىٰ ضُرٍّ مَّسَّهُۥ ۚ كَذَٰلِكَ
زُيِّنَ لِلْمُسْرِفِينَ مَا كَانُوا۟
يَعْمَلُونَ ﴿١٢﴾
وَلَقَدْ أَهْلَكْنَا ٱلْقُرُونَ مِن قَبْلِكُمْ
لَمَّا ظَلَمُوا۟ ۙ وَجَآءَتْهُمْ رُسُلُهُم
بِٱلْبَيِّنَٰتِ وَمَا كَانُوا۟ لِيُؤْمِنُوا۟ ۚ كَذَٰلِكَ
نَجْزِى ٱلْقَوْمَ ٱلْمُجْرِمِينَ ﴿١٣﴾

అలైకుమ్ (మీకు శాంతి కలుగు గాక)!" అని, మాత్రమే ఉంటాయి. మరియు వారు తమ ప్రార్థనలను: "సర్వస్తోత్రాలకు అర్హుడు, సమస్తలోకాల పోషకుడైన అల్లాహ్ మాత్రమే!" అని ముగించుకుంటారు. (3/8)

**11.** * మరియు ప్రజలు తమ మేలు కొరకు తొందరపడినట్లు అల్లాహ్ వారిపై (వారి చేష్టలకు) కీడును పంపటంలో తొందరపడి ఉంటే, వారి వ్యవధి ఎప్పుడో పూర్తిఅయి ఉండేది. అందువలన మేము, మమ్మల్ని కలుసుకునే నమ్మకం లేని వారిని, తమ తలబిరుసుతనంలో భ్రష్టులై తిరగటానికి వదలిపెడుతున్నాము.[1]

**12.** మరియు మానవునికి కష్టకాలం వచ్చినప్పుడు: అతడు పరుండినా, కూర్చుండినా లేక నిలుచుండినా, మమ్మల్ని ప్రార్థిస్తాడు. కాని మేము అతని ఆపదను తొలగించిన వెంటనే, అతడు తనకు కలిగిన కష్టానికి, ఎన్నడూ మమ్మల్ని ప్రార్థించనే లేదు అన్నట్లు ప్రవర్తిస్తాడు. ఈ విధంగా మితిమీరి ప్రవర్తించే వారికి, వారి చేష్టలు ఆకర్షణీయమైనవిగా చూపబడతాయి.

**13.** మరియు వాస్తవంగా మీకు పూర్వం ఎన్నో తరాలను మేము నాశనంచేశాము,[2] ఎందుకంటే వారు దుర్మార్గపు వైఖరిని అవలంబించారు మరియు వారి ప్రవక్తలు వారివద్దకు స్పష్టమైన నిదర్శనాలు తీసుకొని వచ్చినా, వారు విశ్వసించలేదు. ఈ విధంగా మేము అపరాధులకు ప్రతీకారం చేస్తాము.

---

**1**. చూడండి, 6:12.
**2**. చూడండి, 6:131-132 *ఖర్న్‌:* అంటే, ఒకే కాలానికి, లేక తరానికి చెందిన ప్రజలు.

ثُمَّ جَعَلْنَٰكُمْ خَلَٰٓئِفَ فِى ٱلْأَرْضِ مِنۢ
بَعْدِهِمْ لِنَنظُرَ كَيْفَ تَعْمَلُونَ ١٤
وَإِذَا تُتْلَىٰ عَلَيْهِمْ ءَايَاتُنَا بَيِّنَٰتٍ ۙ
قَالَ ٱلَّذِينَ لَا يَرْجُونَ لِقَآءَنَا
ٱئْتِ بِقُرْءَانٍ غَيْرِ هَٰذَآ أَوْ بَدِّلْهُ ۚ
قُلْ مَا يَكُونُ لِىٓ أَنْ أُبَدِّلَهُۥ مِن
تِلْقَآئِ نَفْسِىٓ ۖ إِنْ أَتَّبِعُ إِلَّا مَا يُوحَىٰٓ
إِلَىَّ ۖ إِنِّىٓ أَخَافُ إِنْ عَصَيْتُ رَبِّى
عَذَابَ يَوْمٍ عَظِيمٍ ١٥
قُل لَّوْ شَآءَ ٱللَّهُ مَا تَلَوْتُهُۥ
عَلَيْكُمْ وَلَآ أَدْرَىٰكُم بِهِۦ ۖ
فَقَدْ لَبِثْتُ فِيكُمْ عُمُرًا مِّن
قَبْلِهِۦٓ ۚ أَفَلَا تَعْقِلُونَ ١٦

**14**. వారి తరువాత - మీరు ఏ విధంగా ప్రవర్తిస్తారో చూడటానికి - మేము మిమ్మల్ని భూమికి వారసులుగా చేశాము.

**15**. మరియు మా స్పష్టమైన ఆయతులను వారికి చదివి వినిపించినప్పుడు - మమ్మల్ని కలుసుకునే నమ్మకం లేనివారు - అంటారు: "దీనికి బదులుగా మరొక ఖుర్ఆన్ తీసుకురా లేదా ఇందులో సవరణలు చెయ్యి." (ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను: "ఇందులో నా అంతట నేను మార్పులు చేయటం నాపని కాదు. నా వద్దకు పంపబడే దివ్యజ్ఞానాన్ని (వ'హీని) మాత్రమే నేను అనుసరిస్తాను. నిశ్చయంగా, నేను నా ప్రభువు ఆజ్ఞను ఉల్లంఘిస్తే, ఆ గొప్ప దినమున శిక్ష పడుతుందని భయపడుతున్నాను!"

**16**. (ఇంకా ఇలా) అను: "ఒకవేళ అల్లాహ్ కోరితే నేను దీనిని మీకు వినిపించి ఉండేవాడిని కాదు మరియు ఆయన కూడా దీనిని మీకు తెలిపి ఉండేవాడు కాదు. వాస్తవంగా నేను దీనికి (ఈ గ్రంథ అవతరణకు) పూర్వం మీతో నా వయస్సులోని దీర్ఘ కాలాన్ని గడిపాను కదా?[1] ఏమీ? మీరిది గ్రహించలేరా?"

---

**1**. దైవప్రవక్తగా ఎన్నుకొనబడక ముందు ము'హమ్మద్ (సఅస) 40 సంవత్సరాలు మక్కా వారితో నివసించారు. మరియు వారు అతనిని నమ్మకస్తునిగా (అల్-అమీన్ ) మరియు ఎన్నడూ అబద్ధమాడని వారి (అ'స్సాదిఖ్)గా సాక్ష్యమిచ్చేవారు. అతనికి ('స'అస) ఏ గురువు లేడు. అతను చదువటం వ్రాయటం ఎరుగరు. ఇది కూడా వారికి బాగా తెలుసు. అలాంటప్పుడు ఈ ఖుర్ఆన్ ఏదైతే ఎన్నో అద్భుత విషయాలను, విజ్ఞాన విషయాలను, నక్షత్రాల విషయాలను ప్రాచీన ప్రవక్తల గాథలను వివరిస్తుందో, అల్లాహ్ (సు.తా.) తరఫునుండి గాక మరెవరి తరఫునుండి రాగలదు. ఎందుకంటే ఇందులో వేయి కంటే ఎక్కువ విజ్ఞాన (Science) విషయాలు ఉన్నాయి. వాటిలో కొన్ని ఇప్పుడిప్పుడే వైజ్ఞానిక ప్రయోగాలద్వారా సత్యమని నిరూపించబడ్డాయి. ఇంకా ఎన్నో నిరూపించబడనున్నాయి. ఇంకొక విశేషమేమిటంటే దివ్యఖుర్ఆన్‌లో సూచించబడిన వైజ్ఞానిక విషయాలలో ఇంతవరకు ఒక్కటి కూడా తప్పని నిరూపించబడలేదు మరియు దివ్యఖుర్ఆన్‌లో సూచించబడిన ఇంకా ఎన్నో వైజ్ఞానిక విషయాలను మానవుడు ఇంతవరకు కూడా అర్థం చేసుకోలేకపోయాడు.

فَمَنۡ أَظۡلَمُ مِمَّنِ ٱفۡتَرَىٰ عَلَى ٱللَّهِ كَذِبًا أَوۡ كَذَّبَ بِـَٔايَٰتِهِۦٓۚ إِنَّهُۥ لَا يُفۡلِحُ ٱلۡمُجۡرِمُونَ ١٧

17. ఇక అబద్ధాన్ని కల్పించి, దానిని అల్లాహ్‌కు ఆపాదించే వాడికంటే, లేక ఆయన సూచన(ఆయతు)లను అబద్ధాలని తిరస్కరించే వాడికంటే, మహా దుర్మార్గుడెవడు? నిశ్చయంగా, పాపులు ఎన్నటికీ సాఫల్యం పొందలేరు!

وَيَعۡبُدُونَ مِن دُونِ ٱللَّهِ مَا لَا يَضُرُّهُمۡ وَلَا يَنفَعُهُمۡ وَيَقُولُونَ هَٰٓؤُلَآءِ شُفَعَٰٓؤُنَا عِندَ ٱللَّهِۚ قُلۡ أَتُنَبِّـُٔونَ ٱللَّهَ بِمَا لَا يَعۡلَمُ فِي ٱلسَّمَٰوَٰتِ وَلَا فِي ٱلۡأَرۡضِۚ سُبۡحَٰنَهُۥ وَتَعَٰلَىٰ عَمَّا يُشۡرِكُونَ ١٨

18. మరియు వారు అల్లాహ్‌ను కాదని తమకు నష్టం గానీ, లాభం గానీ కలిగించలేని వాటిని ఆరాధిస్తున్నారు. మరియు వారు ఇలా అంటున్నారు: "వీరు మాకు అల్లాహ్ వద్ద సిఫారసు చేసేవారు." వారిని అడుగు: "ఏమీ? ఆకాశాలలో గానీ, భూమిలో గానీ, అల్లాహ్ ఎరుగని విషయాన్ని, మీరు ఆయనకు తెలుపగోరు తున్నారా?" ఆయన సర్వలోపాలకు అతీతుడు, మీరు సాటి కల్పించే వాటికి ఆయన అత్యున్నతుడు.[1]

وَمَا كَانَ ٱلنَّاسُ إِلَّآ أُمَّةً وَٰحِدَةً فَٱخۡتَلَفُواْۚ وَلَوۡلَا كَلِمَةٌ سَبَقَتۡ مِن رَّبِّكَ لَقُضِيَ بَيۡنَهُمۡ فِيمَا فِيهِ يَخۡتَلِفُونَ ١٩

19. మరియు మానవులందరూ మొదట ఒకే సంఘంగా (ఒకే ధర్మం మీద) ఉండేవారు. కానీ, వారు తరువాత భిన్నాభిప్రాయాలకు లోనయ్యారు. మరియు నీ ప్రభువు తరఫునుండి ముందుగానే ఈ విషయం నిర్ణయించ బడకుండా ఉండి ఉన్నట్లయితే, వారిమధ్య ఉన్న ఈ విభేదాల తీర్పు ఎప్పుడో జరిగి వుండేది.[2]

---

1. విశ్వంలో అల్లాహ్ (సు.తా.)కు తెలియనిది ఏదీలేదు, అలాంటప్పుడు అల్లాహ్ (సు.తా.)కు తెలియని, ఈ సిఫారసుదారులను వీరు ఎక్కడినుండి కల్పించి తెచ్చారు?

2. చూడండి, 2:213, 253. అల్లాహ్ (సు.తా), పునరుత్థాన దినమున తీర్పు చేయాలనీ - మానవులకూ మరియు జిన్నాతులకూ - అంతవరకు వ్యవధినివ్వాలని నిర్ణయించి ఉండకపోతే! వీరి తీర్పు అప్పటికప్పుడే జరిగిఉండేది.

**20.** మరియు వారంటున్నారు: "అతనిపై, అతని ప్రభువు తరఫునుండి ఏదైనా (అద్భుత) సంకేతం ఎందుకు అవతరింపజేయ బడలేదు?" నీవిలా జవాబివ్వు: "నిశ్చయంగా అగోచర విషయ జ్ఞానం కేవలం అల్లాహ్ కే చెందుతుంది.[1] కావున వేచి ఉండండి! నిశ్చయంగా, నేను కూడా మీతోబాటు వేచి ఉంటాను."

وَيَقُولُونَ لَوۡلَآ أُنزِلَ عَلَيۡهِ
ءَايَةٞ مِّن رَّبِّهِۦۖ فَقُلۡ إِنَّمَا
ٱلۡغَيۡبُ لِلَّهِ فَٱنتَظِرُوٓاْ إِنِّي
مَعَكُم مِّنَ ٱلۡمُنتَظِرِينَ
٢٠

**21.** మరియు మానవులకు ఆపద కలిగిన పిదప, మేము వారికి కారుణ్యం రుచి చూపిస్తే, వెంటనే వారు మా సూచనలకు విరుద్ధంగా ఎత్తుగడలు వేయటం ప్రారంభిస్తారు.[2] వారితో అను: "ఎత్తుగడలు వేయటంలో అల్లాహ్ అతి శీఘ్రుడు!" నిశ్చయంగా, మా దూతలు మీరు చేసే ఎత్తుగడలన్నింటినీ వ్రాస్తున్నారు.

وَإِذَآ أَذَقۡنَا ٱلنَّاسَ رَحۡمَةٗ مِّنۢ بَعۡدِ
ضَرَّآءَ مَسَّتۡهُمۡ إِذَا لَهُم مَّكۡرٞ فِيٓ
ءَايَاتِنَاۚ قُلِ ٱللَّهُ أَسۡرَعُ مَكۡرًاۚ إِنَّ
رُسُلَنَا يَكۡتُبُونَ مَا تَمۡكُرُونَ
٢١

**22.** ఆయన(అల్లాహ్)యే! మిమ్మల్ని భూమిలోనూ మరియు సముద్రంలోనూ ప్రయాణింపజేయగలవాడు. ఇక మీరు ఓడలలో ఉన్నప్పుడు: అవి వారితో సహా, అనుకూలమైన గాలి వీస్తూ ఉండగా పోతూ ఉంటాయి మరియు దానితో వారు ఆనందిస్తూ ఉంటారు. (అకస్మాత్తుగా) వారిపైకి తీవ్రమైన తుఫాను గాలి వస్తుంది మరియు ప్రతి దిక్కు నుండి వారిమీదికి పెద్దపెద్ద అలలు వస్తాయి మరియు వారు

هُوَ ٱلَّذِي يُسَيِّرُكُمۡ فِي ٱلۡبَرِّ وَٱلۡبَحۡرِۖ
حَتَّىٰٓ إِذَا كُنتُمۡ فِي ٱلۡفُلۡكِ وَجَرَيۡنَ
بِهِم بِرِيحٖ طَيِّبَةٖ وَفَرِحُواْ بِهَا
جَآءَتۡهَا رِيحٌ عَاصِفٞ وَجَآءَهُمُ
ٱلۡمَوۡجُ مِن كُلِّ مَكَانٖ وَظَنُّوٓاْ أَنَّهُمۡ
أُحِيطَ بِهِمۡ دَعَوُاْ ٱللَّهَ مُخۡلِصِينَ

1. చూడండి, 2:105 మరియు 3:73-74.
2. వీరు ఆయత్‌లు 7,11,12,15,18 మరియు 20లలో పేర్కొనబడిన రెండురకాల మానవులు.

لَهُ ٱلدِّينَ لَئِنْ أَنجَيْتَنَا مِنْ هَٰذِهِۦ لَنَكُونَنَّ مِنَ ٱلشَّٰكِرِينَ ﴿٢٢﴾

వాటి వల్ల నిశ్చయంగా చుట్టుకోబడ్డామని భావించి, అల్లాహ్‌ను వేడుకుంటారు. తమ ధర్మం(ప్రార్థన)లో కేవలం ఆయననే ప్రత్యేకించుకొని ఇలా ప్రార్థిస్తారు: "ఒకవేళ నీవు మమ్మల్ని ఈ ఆపదనుండి కాపాడితే మేము నిశ్చయంగా కృతజ్ఞతలు చూపేవారమై ఉంటాము!"[1]

فَلَمَّآ أَنجَىٰهُمْ إِذَا هُمْ يَبْغُونَ فِى ٱلْأَرْضِ بِغَيْرِ ٱلْحَقِّ ۗ يَٰٓأَيُّهَا ٱلنَّاسُ إِنَّمَا بَغْيُكُمْ عَلَىٰٓ أَنفُسِكُم ۖ مَّتَٰعَ ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا ۖ ثُمَّ إِلَيْنَا مَرْجِعُكُمْ فَنُنَبِّئُكُم بِمَا كُنتُمْ تَعْمَلُونَ ﴿٢٣﴾

**23**. కాని ఆయన వారిని కాపాడిన వెంటనే, వారు భూమిలో అన్యాయంగా దౌర్జన్యం చేయసాగుతారు.[2] ఓ మానవులారా! నిశ్చయంగా, మీ దౌర్జన్యాలు మీకే హాని కలిగిస్తాయి. ఇహలోక జీవితం తాత్కాలిక ఆనందమే. చివరకు మీకు మా వైపునకే మరలి రావలసి ఉన్నది, అప్పుడు మేము, మీరు చేస్తూ ఉండిన కర్మలన్నీ మీకు తెలియజేస్తాము.

إِنَّمَا مَثَلُ ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا كَمَآءٍ أَنزَلْنَٰهُ مِنَ ٱلسَّمَآءِ فَٱخْتَلَطَ بِهِۦ نَبَاتُ ٱلْأَرْضِ مِمَّا يَأْكُلُ ٱلنَّاسُ

**24**. వాస్తవానికి ఈ ప్రాపంచిక జీవితాన్ని ఇలా పోల్చవచ్చు: మేము ఆకాశం నుండి నీటిని కురిపించగా దాని నుండి భూమిలో మానవులకు మరియు పశువులకు తినటానికి, వివిధరకాల చెట్లూచేమలూ పెరుగుతాయి. అప్పుడు భూమి

**1**. ఇక్రిమా బిన్-అబూ జహల్ (ర'ది.'అ.) మక్కా విజయం తరువాత మక్కాను విడిచి, ఒక నావలో కూర్చొని పోతూవుండగా, ఆ నావ తుఫానులో చిక్కుకుంటుంది. నావ నడిపించే వాడు: "ఇప్పుడు మమ్మల్ని రక్షించగలవాడు కేవలం ఆ ఏకైక ఆరాధ్యుడు అల్లాహ్ (సు.తా.) మాత్రమే! కావున మీరు ఆయనను ప్రార్థించండి." అని అంటాడు. అప్పుడు - ము'హమ్మద్ ('స'అస) అనే మాటలు నిజమేనని - ఇక్రిమా అర్థం చేసుకుంటాడు. "ఒకవేళ ఈ తుఫాను నుండి బ్రతికి బయటపడితే ఇస్లాం స్వీకరిస్తాను." అని అతడు నిర్ణయించుకుంటాడు. ఆ ఆపద దాటిన తరువాత అతడు దైవప్రవక్త ('స'అస) దగ్గరికివచ్చి ఇస్లాం స్వీకరిస్తాడు. (సునన్ నసాయీ', అబూ-దావూద్ నం. 2683, అల్బాని ప్రమాణీకం నం.1723).

**2**. ఇదే మానవుడి కృతఘ్నతా బుద్ధి. ఇది ఈ సూరహ్ 12వ ఆయత్‌లో మరియు ఖుర్ఆన్‌లో ఇతర ఎన్నో చోట్లలో పేర్కొనబడింది.

وَٱلۡأَنۡعَٰمُ حَتَّىٰٓ إِذَآ أَخَذَتِ ٱلۡأَرۡضُ
زُخۡرُفَهَا وَٱزَّيَّنَتۡ وَظَنَّ أَهۡلُهَآ
أَنَّهُمۡ قَٰدِرُونَ عَلَيۡهَآ أَتَىٰهَآ أَمۡرُنَا
لَيۡلًا أَوۡ نَهَارٗا فَجَعَلۡنَٰهَا حَصِيدٗا كَأَن
لَّمۡ تَغۡنَ بِٱلۡأَمۡسِۚ كَذَٰلِكَ نُفَصِّلُ
ٱلۡأٓيَٰتِ لِقَوۡمٖ يَتَفَكَّرُونَ ٢٤

وَٱللَّهُ يَدۡعُوٓاْ إِلَىٰ دَارِ ٱلسَّلَٰمِ وَيَهۡدِي
مَن يَشَآءُ إِلَىٰ صِرَٰطٖ مُّسۡتَقِيمٖ ٢٥

۞ لِّلَّذِينَ أَحۡسَنُواْ ٱلۡحُسۡنَىٰ وَزِيَادَةٞۖ
وَلَا يَرۡهَقُ وُجُوهَهُمۡ قَتَرٞ وَلَا ذِلَّةٌۚ
أُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ ٱلۡجَنَّةِۖ هُمۡ فِيهَا
خَٰلِدُونَ ٢٦

وَٱلَّذِينَ كَسَبُواْ ٱلسَّيِّـَٔاتِ جَزَآءُ سَيِّئَةِۭ
بِمِثۡلِهَا وَتَرۡهَقُهُمۡ ذِلَّةٞۖ مَّا لَهُم مِّنَ ٱللَّهِ
مِنۡ عَاصِمٖۖ كَأَنَّمَآ أُغۡشِيَتۡ وُجُوهُهُمۡ
قِطَعٗا مِّنَ ٱلَّيۡلِ مُظۡلِمًاۚ أُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ
ٱلنَّارِۖ هُمۡ فِيهَا خَٰلِدُونَ ٢٧

తన అలంకారంతో వర్ధిల్లుతూ ఉండగా, దాని యజమానులు నిశ్చయంగా, అది తమ వశంలో ఉందనుకుంటారు. అలాంటి సమయంలో అకస్మాత్తుగా రాత్రి పూటనో లేక పగటిపూటనో మా తీర్పు వస్తుంది. అప్పుడు మేము దానిని - నిన్నటి వరకు ఏమీ లేని - కోసివేసిన పంటపొలంగా మార్చివేస్తాము. ఈ విధంగా మేము మా సూచనలను ఆలోచించే ప్రజలకొరకు స్పష్టంగా వివరిస్తాము.

**25**. మరియు అల్లాహ్ మిమ్మల్ని శాంతి నిలయం (దారుస్సలాం) వైపునకు ఆహ్వానిస్తున్నాడు. మరియు ఆయన తాను కోరిన వానికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తాడు. (1/2)

**26**. * మంచి పనులు చేసిన వారికి, మంచి ఫలితం దొరుకుతుంది. మరియు ఇంకా ఎక్కువ లభిస్తుంది.[1] మరియు వారి ముఖాలు నల్లబడవు మరియు వారికి అవమానమూ జరుగదు. అలాంటి వారు స్వర్గవాసులు. వారందు శాశ్వతంగా ఉంటారు.

**27**. మరియు పాపకార్యాలు చేసిన వారికి, వారి పాపాలకు తగినట్టి ప్రతిఫలం లభిస్తుంది మరియు వారిని అవమానం క్రమ్ముకుంటుంది. అల్లాహ్ నుండి వారిని రక్షించేవాడెవ్వడూ ఉండడు. వారి ముఖాలు చీకటి రాత్రి యొక్క నల్లని తెరలవంటి వాటితో కప్పబడి ఉంటాయి.[2] అలాంటి వారు నరకాగ్ని వాసులు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

---

**1**. చూడండి, 6:160 మరియు 27:89.
**2**. చూడండి, 3:106 మరియు 80:38-41.

28. మరియు మేము వారందరినీ సమావేశ పరచిన రోజు,[1] సాటికల్పించిన (షిర్క్ చేసిన) వారితో ఇలా అంటాము: "మీరునూ మరియు మీరు అల్లాహ్‌కు సాటికల్పించిన వారునూ, మీ స్థానాలలోనే ఆగండి!" ఆ పిదప మేము వారిని వేరుచేస్తాము.[2] వారు అల్లాహ్‌కు భాగస్వాములుగా కల్పించిన, వారి (దైవాలు) ఇలా అంటారు: "మీరు ఆరాధిస్తూ ఉండేది మమ్మల్ని కాదు;[3]

وَيَوْمَ نَحْشُرُهُمْ جَمِيعًا ثُمَّ نَقُولُ لِلَّذِينَ أَشْرَكُوا۟ مَكَانَكُمْ أَنتُمْ وَشُرَكَآؤُكُمْ ۚ فَزَيَّلْنَا بَيْنَهُمْ ۖ وَقَالَ شُرَكَآؤُهُم مَّا كُنتُمْ إِيَّانَا تَعْبُدُونَ ﴿٢٨﴾

29. "ఇక మీకూ మరియు మాకూ మధ్య అల్లాహ్ సాక్ష్యం చాలు. నిశ్చయంగా, మీరు (చేస్తూవున్న) ఆరాధన గురించి మాకు ఏ మాత్రం తెలియదు!"[4]

فَكَفَىٰ بِٱللَّهِ شَهِيدًۢا بَيْنَنَا وَبَيْنَكُمْ إِن كُنَّا عَنْ عِبَادَتِكُمْ لَغَـٰفِلِينَ ﴿٢٩﴾

30. అక్కడ ప్రతి వ్యక్తి తాను ముందుగా చేసి పంపుకున్న కర్మలను తెలుసుకుంటాడు. అందరూ తమ వాస్తవయజమాని అయిన అల్లాహ్ వైపునకు మరలింపబడతారు. మరియు వారు కల్పించుకున్న (బూటక దైవాలన్నీ) వారిని వీడిపోతాయి.[5]

هُنَالِكَ تَبْلُوا۟ كُلُّ نَفْسٍ مَّآ أَسْلَفَتْ ۚ وَرُدُّوٓا۟ إِلَى ٱللَّهِ مَوْلَىٰهُمُ ٱلْحَقِّ ۖ وَضَلَّ عَنْهُم مَّا كَانُوا۟ يَفْتَرُونَ ﴿٣٠﴾

1. చూడండి, 18:47.
2. చూడండి, 36:59 మరియు 30:43.
3. చూడండి, 34:41.
4. చూడండి, 46:5-6 ఇక్కడ విశదపరచబడుతున్నది ఏమిటంటే, ఏ సాధూ సన్యాసులను, దర్గాలను, వలీలను, ప్రవక్తలను వీరు ఆరాధించేవారో వారు: "మాకు వీరితో ఎలాంటి సంబంధం లేదు, వీరి ఆరాధన గురించి మాకు ఏమీ తెలియదు." అని అంటారు. ఇంకా చూడండి, 5:116-117, 10:30, 11:21, 16:87 మరియు 28:75.
5. అంటే వారికి అక్కడ అల్లాహ్ (సు.తా.) తప్ప, వారి ఏ కల్పిత దైవం కూడా పనికిరాదు.

**31**. వారిని అడుగు: "ఆకాశం నుండి మరియు భూమి నుండి మీకు జీవనోపాధిని ఇచ్చేవాడు ఎవడు? వినే శక్తీ, చూసే శక్తీ ఎవడి ఆధీనంలో ఉన్నాయి? మరియు ప్రాణంలేని దాని నుండి ప్రాణమున్న దానిని మరియు ప్రాణమున్న దానినుండి ప్రాణంలేని దానిని తీసేవాడు ఎవడు? మరియు ఈ విశ్వ వ్యవస్థను నడుపుతున్నవాడు ఎవడు?" వారు: "అల్లాహ్!" అని తప్పకుండా అంటారు. అప్పుడను: "అయితే మీరు దైవభీతి కలిగి ఉండరా?"

قُلْ مَن يَرْزُقُكُم مِّنَ ٱلسَّمَآءِ
وَٱلْأَرْضِ أَمَّن يَمْلِكُ ٱلسَّمْعَ
وَٱلْأَبْصَـٰرَ وَمَن يُخْرِجُ ٱلْحَىَّ مِنَ
ٱلْمَيِّتِ وَيُخْرِجُ ٱلْمَيِّتَ مِنَ ٱلْحَىِّ
وَمَن يُدَبِّرُ ٱلْأَمْرَ ۚ فَسَيَقُولُونَ ٱللَّهُ ۚ فَقُلْ
أَفَلَا تَتَّقُونَ ﴿٣١﴾

**32**. ఆయనే అల్లాహ్! మీ నిజమైన ప్రభువు. అయితే సత్యం తరువాత, మార్గభ్రష్టత్వం తప్ప మిగిలేదేమిటి? అయితే మీరు ఎందుకు (సత్యంనుండి) తప్పించబడుతున్నారు?

فَذَٰلِكُمُ ٱللَّهُ رَبُّكُمُ ٱلْحَقُّ ۖ فَمَاذَا بَعْدَ
ٱلْحَقِّ إِلَّا ٱلضَّلَـٰلُ ۖ فَأَنَّىٰ تُصْرَفُونَ
﴿٣٢﴾

**33**. ఈ విధంగా దుష్టులైన వారి విషయంలో వారెన్నడూ విశ్వసించరని, నీ ప్రభువు అన్నమాట నిజమయింది.[1]

كَذَٰلِكَ حَقَّتْ كَلِمَتُ رَبِّكَ عَلَى
ٱلَّذِينَ فَسَقُوٓا۟ أَنَّهُمْ لَا يُؤْمِنُونَ ﴿٣٣﴾

**34**. వారిని అడుగు: "మీరు అల్లాహ్ కు సాటిగా కల్పించుకున్న వారిలో సృష్టిని మొదటిసారి ఆరంభించేవాడు, తరువాత దానిని తిరిగి ఉనికిలోకి తెచ్చేవాడు ఎవడైనా ఉన్నాడా?" ఇలా అను: "సృష్టిని ఆరంభించే వాడు, దానిని తిరిగి ఉనికిలోకి తెచ్చేవాడూ కేవలం అల్లాహ్ మాత్రమే! అయితే మీరు ఎందుకు మోసగింప (సత్యం నుండి మరలింప) బడుతున్నారు?"

قُلْ هَلْ مِن شُرَكَآئِكُم مَّن يَبْدَؤُا۟
ٱلْخَلْقَ ثُمَّ يُعِيدُهُۥ ۚ قُلِ ٱللَّهُ يَبْدَؤُا۟
ٱلْخَلْقَ ثُمَّ يُعِيدُهُۥ ۖ فَأَنَّىٰ تُؤْفَكُونَ ﴿٣٤﴾

1. చూడండి, 39:71.

قُلۡ هَلۡ مِن شُرَكَآئِكُم مَّن يَهۡدِيٓ إِلَى ٱلۡحَقِّۚ قُلِ ٱللَّهُ يَهۡدِي لِلۡحَقِّۗ أَفَمَن يَهۡدِيٓ إِلَى ٱلۡحَقِّ أَحَقُّ أَن يُتَّبَعَ أَمَّن لَّا يَهِدِّيٓ إِلَّآ أَن يُهۡدَىٰۖ فَمَا لَكُمۡ كَيۡفَ تَحۡكُمُونَ ٣٥

**35**. వారిని అడుగు: "మీరు అల్లాహ్‌కు సాటి కల్పించుకున్న వారిలో సత్యం వైపునకు మార్గదర్శకత్వం చేసేవాడు, ఎవడైనా ఉన్నాడా?" ఇంకా ఇలా అను: "కేవలం అల్లాహ్‌యే సత్యం వైపునకు మార్గదర్శకత్వం చేసేవాడు. ఏమీ? సత్యం వైపునకు మార్గదర్శకత్వం చేసేవాడు విధేయతకు ఎక్కువ అర్హుడా? లేక మార్గదర్శకత్వం చేయబడితేనే తప్ప స్వయంగా సన్మార్గం పొందలేని వాడా? అయితే మీ కేమయింది? మీరెలాంటి నిర్ణయాలు తీసుకుంటున్నారు?"

وَمَا يَتَّبِعُ أَكۡثَرُهُمۡ إِلَّا ظَنًّاۚ إِنَّ ٱلظَّنَّ لَا يُغۡنِي مِنَ ٱلۡحَقِّ شَيۡـًٔاۚ إِنَّ ٱللَّهَ عَلِيمُۢ بِمَا يَفۡعَلُونَ ٣٦

**36**. మరియు వారిలో చాలా మంది తమ ఊహలను మాత్రమే అనుసరించే వారున్నారు. నిశ్చయంగా ఊహ, సత్య (అవగాహనకు) ఏ మాత్రం పనికిరాదు.[1] నిశ్చయంగా, వారు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

وَمَا كَانَ هَٰذَا ٱلۡقُرۡءَانُ أَن يُفۡتَرَىٰ مِن دُونِ ٱللَّهِ وَلَٰكِن تَصۡدِيقَ ٱلَّذِي بَيۡنَ يَدَيۡهِ وَتَفۡصِيلَ ٱلۡكِتَٰبِ لَا رَيۡبَ فِيهِ مِن رَّبِّ ٱلۡعَٰلَمِينَ ٣٧

**37**. మరియు అల్లాహ్ తప్ప మరొకరి ద్వారా ఈ ఖుర్ఆన్ కల్పించబడటం సంభవంకాదు; వాస్తవానికి ఇది (పూర్వ గ్రంథాలలో) మిగిలి ఉన్న దానిని (సత్యాన్ని) ధృవపరుస్తోంది మరియు ఇది (ముఖ్య సూచనలను) వివరించే గ్రంథం; ఇది సమస్తలోకాల పోషకుడైన (అల్లాహ్) తరఫునుండి వచ్చిందనటంలో ఎలాంటి సందేహం లేదు!

---

**1**. చాలామంది ఊహలను, అంటే తమ కల్పనలను లేక భావనలను అనుసరించే వారున్నారు. కాని సత్యం ముందు ఊహలకు, భావనలకు, కల్పనలకు ఎలాంటి స్థానం లేదు. ఖుర్ఆన్‌లో 'జన్న్' అనే పదం ఊహ మరియు నిశ్చయం రెండూ అర్థాలలో వాడబడింది. ఈ సందర్భంలో ఊహ లేక కల్పన అనే అర్థంలో వాడబడింది, (ముహమ్మద్ జూనాగఢీ).

38. అయినా వారు: "అతనే (ము'హమ్మదే) దీనిని కల్పించాడు." అని అంటున్నారా? వారితో అను: "మీరు సత్యవంతులే అయితే - అల్లాహ్‌ను విడిచి మీరు పిలువగలిగే వారి నందరినీ (మీ సహాయానికి) పిలుచుకొని - దీనివంటి ఒక్క సూరహ్‌నైనా (రచించి) తీసుకురండి!"[1]

أَمْ يَقُولُونَ ٱفْتَرَىٰهُ ۖ قُلْ فَأْتُوا۟ بِسُورَةٍ مِّثْلِهِۦ وَٱدْعُوا۟ مَنِ ٱسْتَطَعْتُم مِّن دُونِ ٱللَّهِ إِن كُنتُمْ صَـٰدِقِينَ ﴿٣٨﴾

39. కాని వారు - దాని జ్ఞానాన్ని ఇముడ్చుకొనక ముందే మరియు దాని వ్యాఖ్యానం వారివద్దకు రాకముందే - దానిని అబద్ధమని తిరస్కరించారు. వీరికి పూర్వమున్న వారు కూడా ఈ విధంగానే అబద్ధమని తిరస్కరించారు. కావున, చూశారా, ఆ దుర్మార్గుల ముగింపు ఎలా జరిగిందో!

بَلْ كَذَّبُوا۟ بِمَا لَمْ يُحِيطُوا۟ بِعِلْمِهِۦ وَلَمَّا يَأْتِهِمْ تَأْوِيلُهُۥ ۚ كَذَٰلِكَ كَذَّبَ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ ۖ فَٱنظُرْ كَيْفَ كَانَ عَـٰقِبَةُ ٱلظَّـٰلِمِينَ ﴿٣٩﴾

40. మరియు వారిలో కొందరు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) నమ్మే వారున్నారు మరికొందరు దీనిని నమ్మని వారున్నారు. మరియు దౌర్జన్య పరులు ఎవరో నీ ప్రభువుకు బాగా తెలుసు.

وَمِنْهُم مَّن يُؤْمِنُ بِهِۦ وَمِنْهُم مَّن لَّا يُؤْمِنُ بِهِۦ ۚ وَرَبُّكَ أَعْلَمُ بِٱلْمُفْسِدِينَ ﴿٤٠﴾

41. మరియు ఒకవేళ వారు నిన్ను అసత్యుడవని తిరస్కరిస్తే, వారితో అను: "నా కర్మలు నాకు మరియు మీ కర్మలు మీకు. నా కర్మలకు మీరు బాధ్యులు కారు మరియు మీ కర్మలకు నేను బాధ్యుడను కాను."

وَإِن كَذَّبُوكَ فَقُل لِّى عَمَلِى وَلَكُمْ عَمَلُكُمْ ۖ أَنتُم بَرِيٓـُٔونَ مِمَّآ أَعْمَلُ وَأَنَا۠ بَرِىٓءٌ مِّمَّا تَعْمَلُونَ ﴿٤١﴾

42. మరియు వారిలో కొందరు నీ మాటలను వింటూ ఉంటారు! ఏమీ? నీవు చెవిటివారికి వినిపించగలవా? మరియు వారు ఏమీ అర్థం చేసుకోలేక పోయినప్పటికీ (వారికి వినిపించగలవా)?

وَمِنْهُم مَّن يَسْتَمِعُونَ إِلَيْكَ ۚ أَفَأَنتَ تُسْمِعُ ٱلصُّمَّ وَلَوْ كَانُوا۟ لَا يَعْقِلُونَ ﴿٤٢﴾

1. చూడండి, 2:23 వ్యాఖ్యానం 2, 11:13, 17:88 మరియు 52:34.

43. మరియు వారిలో కొందరు నీవైపుకు చూస్తూఉంటారు. ఏమీ? నీవు గ్రుడ్డివారికి సరైనమార్గం చూపించగలవా? మరియు వారికి ఏమీ కనిపించనప్పటికి కూడానా?

44. నిశ్చయంగా, అల్లాహ్ మానవులకు ఎలాంటి అన్యాయం చేయడు, కాని మానవులే తమకు తాము అన్యాయం చేసుకుంటారు.

45. మరియు ఆయన (అల్లాహ్) వారిని సమావేశపరచే రోజున, వారు ఒక దినపు ఒక ఘడియ కంటే ఎక్కువ కాలం (ఇహలోకంలో) గడిపినట్లు అనుకోరు.[1] వారు ఒకరినొకరు గుర్తుపడతారు.[2] వాస్తవానికి అల్లాహ్‌ను దర్శించవలసివున్న సత్యాన్ని నిరాకరించిన వారు, తీవ్రమైన నష్టానికి గురిఅవుతారు మరియు వారు మార్గదర్శకత్వాన్ని పొందలేక పోయారు.

46. మరియు (ఓ ము'హమ్మద్!) మేము వాస్తవానికి వారికి వాగ్దానం చేసిన (శిక్షలలో) కొన్నింటిని నీకు చూపినా, లేక (అంతకు ముందే) నిన్ను మరణింపజేసినా, వారు మా వైపుకే కదా మరలి రావలసివున్నది. చివరకు వారి కర్మలన్నింటికీ అల్లాహ్‌యే సాక్షి!

47. మరియు ప్రతి సమాజానికీ ఒక ప్రవక్త (పంపబడ్డాడు). ఎప్పుడైతే వారి ప్రవక్త వస్తాడో అప్పుడు వారిమధ్య (వ్యవహారాల) తీర్పు న్యాయంగా చేయబడుతుంది. మరియు వారి కెలాంటి అన్యాయం జరుగదు.[3]

وَمِنْهُم مَّن يَنظُرُ إِلَيْكَ ۚ أَفَأَنتَ تَهْدِي ٱلْعُمْىَ وَلَوْ كَانُوا۟ لَا يُبْصِرُونَ ﴿٤٣﴾

إِنَّ ٱللَّهَ لَا يَظْلِمُ ٱلنَّاسَ شَيْـًٔا وَلَٰكِنَّ ٱلنَّاسَ أَنفُسَهُمْ يَظْلِمُونَ ﴿٤٤﴾

وَيَوْمَ يَحْشُرُهُمْ كَأَن لَّمْ يَلْبَثُوٓا۟ إِلَّا سَاعَةً مِّنَ ٱلنَّهَارِ يَتَعَارَفُونَ بَيْنَهُمْ ۚ قَدْ خَسِرَ ٱلَّذِينَ كَذَّبُوا۟ بِلِقَآءِ ٱللَّهِ وَمَا كَانُوا۟ مُهْتَدِينَ ﴿٤٥﴾

وَإِمَّا نُرِيَنَّكَ بَعْضَ ٱلَّذِى نَعِدُهُمْ أَوْ نَتَوَفَّيَنَّكَ فَإِلَيْنَا مَرْجِعُهُمْ ثُمَّ ٱللَّهُ شَهِيدٌ عَلَىٰ مَا يَفْعَلُونَ ﴿٤٦﴾

وَلِكُلِّ أُمَّةٍ رَّسُولٌ ۖ فَإِذَا جَآءَ رَسُولُهُمْ قُضِىَ بَيْنَهُم بِٱلْقِسْطِ وَهُمْ لَا يُظْلَمُونَ ﴿٤٧﴾

1. చూడండి, 79:46.
2. చూడండి, 23:101.
3. చూడండి, 6:131-132, 17:15.

وَيَقُولُونَ مَتَىٰ هَٰذَا ٱلْوَعْدُ إِن كُنتُمْ صَٰدِقِينَ ﴿٤٨﴾

48. మరియు వారిలా అడుగుతున్నారు: "మీరు సత్యవంతులే అయితే ఈ వాగ్దానం ఎప్పుడు పూర్తి కానున్నది?"

قُل لَّآ أَمْلِكُ لِنَفْسِى ضَرًّا وَلَا نَفْعًا إِلَّا مَا شَآءَ ٱللَّهُ ۗ لِكُلِّ أُمَّةٍ أَجَلٌ ۚ إِذَا جَآءَ أَجَلُهُمْ فَلَا يَسْتَـْٔخِرُونَ سَاعَةً ۖ وَلَا يَسْتَقْدِمُونَ ﴿٤٩﴾

49. (ఓ ముహమ్మద్!) వారితో ఇలా అను: "అల్లాహ్ కోరితే తప్ప! నా కొరకు నేను కీడుగానీ, మేలుగానీ చేసుకోగలిగే శక్తి నాకు లేదు.[1] ప్రతి సమాజానికి ఒక గడువు నియమింపబడి ఉంది. వారి గడువు వచ్చినపుడు వారు ఒక ఘడియ వెనక గానీ లేక ముందు గానీ కాలేరు."[2]

قُلْ أَرَءَيْتُمْ إِنْ أَتَىٰكُمْ عَذَابُهُۥ بَيَٰتًا أَوْ نَهَارًا مَّاذَا يَسْتَعْجِلُ مِنْهُ ٱلْمُجْرِمُونَ ﴿٥٠﴾

50. వారితో అను: "ఏమీ? మీరు ఆలోచించారా (చూశారా)? ఒకవేళ ఆయన శిక్ష మీపై రాత్రి గానీ, లేక పగలు గానీ వచ్చి పడితే! మరి దేనికొరకు ఈ అపరాధులు తొందరపెడుతున్నారు?"[3]

أَثُمَّ إِذَا مَا وَقَعَ ءَامَنتُم بِهِۦٓ ۚ ءَآلْـَٰٔنَ وَقَدْ كُنتُم بِهِۦ تَسْتَعْجِلُونَ ﴿٥١﴾

51. ఏమి? అది (ఆ శిక్ష) మీపై వచ్చిపడిన తరువాతనే మీరు దానిని నమ్ముతారా? (ఆ రోజు మీరిలా అడగబడతారు): "ఇప్పుడా, (మీరు దానిని నమ్మేది)? వాస్తవానికి మీరు దానికొరకు తొందరపెడ్తూ ఉండేవారు కదా!"

ثُمَّ قِيلَ لِلَّذِينَ ظَلَمُوا۟ ذُوقُوا۟ عَذَابَ ٱلْخُلْدِ هَلْ تُجْزَوْنَ إِلَّا بِمَا كُنتُمْ تَكْسِبُونَ ﴿٥٢﴾

52. అప్పుడు దుర్మార్గులతో ఇలా అనబడుతుంది: "మీరు శాశ్వతమైన శిక్షను అనుభవించండి! మీకు - మీరు చేస్తూఉండిన కర్మల ప్రతిఫలం తప్ప - వేరే (శిక్ష) విధించబడునా?" (5/8)

---

1. ఇక్కడ అల్లాహుతా'ఆలా దైవప్రవక్త ('స'అస)తో: "అల్లాహ్ కోరనిదే నాకు నేను, కీడు గానీ, మేలు గానీ, చేసుకోలేను." అని చెప్పమంటున్నాడు. దైవప్రవక్త('స'అస)కే తన స్వంతానికి కీడుగానీ మేలుగానీ చేసుకునే శక్తి లేనప్పుడు, ఇతర వలీలకుగానీ లేక సద్పురుషులకు గానీ - జీవించి ఉన్నా లేక మరణించినా - ఇతరులకు కీడు గానీ మేలు గానీ చేయగల శక్తి ఎలా ఉండగలదు? వారిని అర్థించేవారు ఇది ఎందుకు అర్థంచేసుకోలేరు?
2. చూడండి, 7:34.
3. చూడండి, 6:57-58, 48:32.

۞ وَيَسْتَنۢبِـُٔونَكَ أَحَقٌّ هُوَ ۖ قُلْ إِى وَرَبِّىٓ إِنَّهُۥ لَحَقٌّ ۖ وَمَآ أَنتُم بِمُعْجِزِينَ ﴿٥٣﴾

53. * మరియు (ఓ ము'హమ్మద్!) వారు ఇంకా ఇలా అడుగుతున్నారు: "ఏమీ? ఇదంతా సత్యమేనా?"[1] వారితో అను: "అవును, నా ప్రభువు సాక్షిగా! ఇదంతా నిశ్చయంగా జరగబోయే సత్యమే! మరియు మీరు దానినుండి తప్పించుకోలేరు!"

وَلَوْ أَنَّ لِكُلِّ نَفْسٍ ظَلَمَتْ مَا فِى ٱلْأَرْضِ لَٱفْتَدَتْ بِهِۦ ۗ وَأَسَرُّوا۟ ٱلنَّدَامَةَ لَمَّا رَأَوُا۟ ٱلْعَذَابَ ۖ وَقُضِىَ بَيْنَهُم بِٱلْقِسْطِ ۚ وَهُمْ لَا يُظْلَمُونَ ﴿٥٤﴾

54. మరియు దుర్మార్గం చేసిన ప్రతివ్యక్తి వద్ద ఒకవేళ వాస్తవానికి భూమిలో ఉన్న ధనమంతా ఉన్నా, దానిని అంతా పరిహారంగా ఇవ్వటానికి సిద్ధపడతాడు,[2] (కాని అది స్వీకరించ బడదు). మరియు వారు ఆ శిక్షను చూసినప్పుడు లోలోపల పశ్చాత్తాప పడతారు. మరియు వారి మధ్య తీర్పు న్యాయంగా జరుగుతుంది. మరియు వారి కెలాంటి అన్యాయం జరుగదు.

أَلَآ إِنَّ لِلَّهِ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۗ أَلَآ إِنَّ وَعْدَ ٱللَّهِ حَقٌّ وَلَٰكِنَّ أَكْثَرَهُمْ لَا يَعْلَمُونَ ﴿٥٥﴾

55. వినండి! నిశ్చయంగా, ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ ఉన్న సమస్తమూ, అల్లాహ్ కే చెందినది. తెలుసుకోండి! నిశ్చయంగా, అల్లాహ్ వాగ్దానం సత్యం, కాని చాలామందికి ఇది తెలియదు.

هُوَ يُحْىِۦ وَيُمِيتُ وَإِلَيْهِ تُرْجَعُونَ ﴿٥٦﴾

56. ఆయనే జీవన్మరణాలను ఇచ్చే వాడు మరియు ఆయన వైపునకే మీరంతా మరలింపబడతారు.[3]

---

1. "మరణించి మట్టిగా మారిపోయిన తరువాత కూడా మళ్ళీ సజీవులుగా మునుపటి ఆకారంలో లేపబడతామా?" ఇలాంటి ప్రశ్నలు ఖుర్ఆన్‌లో ఇంకా రెండు చోట్లలో ఉన్నాయి. 34:3, 64:7.

2. చూడండి, 3:91 మరియు 5:36.

3. చూడండి, 11:123.

**57.** ఓ మానవులారా! వాస్తవంగా మీ ప్రభువు తరఫునుండి మీ వద్దకు హితోపదేశం (ఈ ఖుర్ఆన్) వచ్చింది మరియు ఇది మీ హృదయాల(రోగాల)కు స్వస్థతనిస్తుంది. మరియు విశ్వసించిన వారికి మార్గదర్శకత్వం మరియు కారుణ్యం (ప్రసాదిస్తుంది).[1]

يَـٰٓأَيُّهَا ٱلنَّاسُ قَدۡ جَآءَتۡكُم مَّوۡعِظَةٞ مِّن رَّبِّكُمۡ وَشِفَآءٞ لِّمَا فِي ٱلصُّدُورِ وَهُدٗى وَرَحۡمَةٞ لِّلۡمُؤۡمِنِينَ ٥٧

**58.** ఇలా అను: "ఇది అల్లాహ్ అనుగ్రహం వల్ల మరియు ఆయన కారుణ్యంవల్ల, కావున దీనితో వారిని ఆనందించమను. ఇది వారు కూడబెట్టే దానికంటే ఎంతో మేలైనది."

قُلۡ بِفَضۡلِ ٱللَّهِ وَبِرَحۡمَتِهِۦ فَبِذَٰلِكَ فَلۡيَفۡرَحُواْ هُوَ خَيۡرٞ مِّمَّا يَجۡمَعُونَ ٥٨

**59.** ఇలా అను: "మీరు ఆలోచించారా! అల్లాహ్ మీ కొరకు అవతరింపజేసిన జీవనోపాధిలో నుండి మీరు స్వయంగానే కొన్నింటిని ధర్మసమ్మతం మరి కొన్నింటిని నిషేధం చేసుకున్నారు."[2] ఇలా అడుగు: "ఏమీ అల్లాహ్ దీనికి అనుమతినిచ్చాడా? లేదా మీ బూటక కల్పనలను అల్లాహ్‌కు అంటగట్టు తున్నారా?"

قُلۡ أَرَءَيۡتُم مَّآ أَنزَلَ ٱللَّهُ لَكُم مِّن رِّزۡقٖ فَجَعَلۡتُم مِّنۡهُ حَرَامٗا وَحَلَٰلٗا قُلۡ ءَآللَّهُ أَذِنَ لَكُمۡۖ أَمۡ عَلَى ٱللَّهِ تَفۡتَرُونَ ٥٩

**60.** మరియు అల్లాహ్‌పై అబద్ధాలు కల్పించేవారు, తీర్పుదినమును గురించి ఏమనుకుంటున్నారు? నిశ్చయంగా, అల్లాహ్ మానవుల యెడల అత్యంత అనుగ్రహం కలవాడు, కాని చాలా మంది కృతజ్ఞతలు చూపరు.

وَمَا ظَنُّ ٱلَّذِينَ يَفۡتَرُونَ عَلَى ٱللَّهِ ٱلۡكَذِبَ يَوۡمَ ٱلۡقِيَٰمَةِۗ إِنَّ ٱللَّهَ لَذُو فَضۡلٍ عَلَى ٱلنَّاسِ وَلَٰكِنَّ أَكۡثَرَهُمۡ لَا يَشۡكُرُونَ ٦٠

---

1. చూడండి, 17:82 మరియు 41:44.
2. చూడండి, 5:101-102.

وَمَا تَكُونُ فِي شَأْنٍ وَمَا تَتْلُواْ مِنْهُ مِن قُرْءَانٍ وَلَا تَعْمَلُونَ مِنْ عَمَلٍ إِلَّا كُنَّا عَلَيْكُمْ شُهُودًا إِذْ تُفِيضُونَ فِيهِ ۚ وَمَا يَعْزُبُ عَن رَّبِّكَ مِن مِّثْقَالِ ذَرَّةٍ فِي ٱلْأَرْضِ وَلَا فِي ٱلسَّمَآءِ وَلَآ أَصْغَرَ مِن ذَٰلِكَ وَلَآ أَكْبَرَ إِلَّا فِي كِتَٰبٍ مُّبِينٍ ﴿٦١﴾

**61**. మరియు (ఓ ప్రవక్తా!) నీవు ఏ కార్యంలో ఉన్నా మరియు ఖుర్ఆన్ నుండి నీవు దేనిని పఠిస్తూ ఉన్నా మరియు (ఓ మానవులారా!) మీరు ఏమి చేస్తూ ఉన్నా! మీరు మీ పనులలో నిమగ్నులై ఉన్నప్పుడు, మేము మిమ్మల్ని కనిపెట్టుకునే ఉంటాము. భూమ్యాకాశాలలో ఉన్నటువంటి ఒక రవంత (పరమాణువంత) వస్తువైనా, దాని కంటే చిన్నదైనా లేదా పెద్దదైనా, నీ ప్రభువు దృష్టినుండి మరుగుగా లేదు. అదంతా ఒక స్పష్టమైన గ్రంథంలో వ్రాయబడి ఉంది.[1]

أَلَآ إِنَّ أَوْلِيَآءَ ٱللَّهِ لَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ﴿٦٢﴾

**62**. వినండి! నిశ్చయంగా, అల్లాహ్‌కు ప్రియులైనవారికి[2] ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా!

ٱلَّذِينَ ءَامَنُواْ وَكَانُواْ يَتَّقُونَ ﴿٦٣﴾

**63**. ఎవరైతే విశ్వసించారో మరియు దైవభీతి కలిగి ఉంటారో!

لَهُمُ ٱلْبُشْرَىٰ فِي ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَفِي ٱلْأَخِرَةِ ۚ لَا تَبْدِيلَ لِكَلِمَٰتِ ٱللَّهِ ۚ ذَٰلِكَ هُوَ ٱلْفَوْزُ ٱلْعَظِيمُ ﴿٦٤﴾

**64**. వారికి ఇహలోక జీవితంలోనూ మరియు పరలోకంలోనూ శుభవార్త ఉంటుంది. అల్లాహ్ పలుకులలో ఎలాంటి మార్పు ఉండదు. ఇదే ఆ గొప్ప సాఫల్యం (విజయం).

وَلَا يَحْزُنكَ قَوْلُهُمْ ۘ إِنَّ ٱلْعِزَّةَ لِلَّهِ جَمِيعًا ۚ هُوَ ٱلسَّمِيعُ ٱلْعَلِيمُ ﴿٦٥﴾

**65**. మరియు (ఓ ము'హమ్మద్!) వారి మాటలు నిన్ను దుఃఖింపజేయకూడదు. నిశ్చయంగా, శక్తి (గౌరవం)[3] అంతా అల్లాహ్‌కే చెందుతుంది. ఆయనే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

---

**1**. చూడండి, 6:59, 38, 11:6.

**2**. అవ్‌లియా', వలియ్యున్: (ఏక వ.) ఈ పదానికి, సహాయకుడు, రక్షించే వాడు, పోషించే వాడు, బంధువు, సన్నిహితుడు, ప్రియుడు, యజమాని, స్వామి, కర్త, స్నేహితుడు మొదలైన అర్థాలున్నాయి. చూడండి, 2:257 మరియు 3:68.

**3**. 'ఇ'జ్జతున్: అనేపదానికి శక్తి, గౌరవం, ఆదరం అనే అర్థాలున్నాయి.

أَلَآ إِنَّ لِلَّهِ مَن فِى ٱلسَّمَٰوَٰتِ وَمَن فِى ٱلْأَرْضِ ۗ وَمَا يَتَّبِعُ ٱلَّذِينَ يَدْعُونَ مِن دُونِ ٱللَّهِ شُرَكَآءَ ۚ إِن يَتَّبِعُونَ إِلَّا ٱلظَّنَّ وَإِنْ هُمْ إِلَّا يَخْرُصُونَ ﴿٦٦﴾

هُوَ ٱلَّذِى جَعَلَ لَكُمُ ٱلَّيْلَ لِتَسْكُنُوا۟ فِيهِ وَٱلنَّهَارَ مُبْصِرًا ۚ إِنَّ فِى ذَٰلِكَ لَءَايَٰتٍ لِّقَوْمٍ يَسْمَعُونَ ﴿٦٧﴾

قَالُوا۟ ٱتَّخَذَ ٱللَّهُ وَلَدًا ۗ سُبْحَٰنَهُۥ ۖ هُوَ ٱلْغَنِىُّ ۖ لَهُۥ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَمَا فِى ٱلْأَرْضِ ۚ إِنْ عِندَكُم مِّن سُلْطَٰنٍۭ بِهَٰذَآ ۚ أَتَقُولُونَ عَلَى ٱللَّهِ مَا لَا تَعْلَمُونَ ﴿٦٨﴾

**66**. వినండి! నిశ్చయంగా, ఆకాశాలలో ఉన్నదంతా మరియు భూమిలో ఉన్నదంతా అల్లాహ్ కే చెందుతుంది. మరియు అల్లాహ్‌ను కాదని ఆయనకు భాగస్వాములను కల్పించి వారిని ప్రార్థించేవారు, ఎవరిని అనుసరిస్తున్నారు? వారు అనుసరిస్తున్నది కేవలం తమ భ్రమలనే మరియు వారు కేవలం ఊహాగానాలు మాత్రమే చేస్తున్నారు.

**67**. ఆయనే మీ కొరకు రాత్రిని విశ్రాంతి పొందటానికి మరియు పగటిని (సంపాదించటానికి) ప్రకాశవంతంగా చేశాడు. నిశ్చయంగా శ్రద్ధగా వినేవారికి ఇందులో సూచనలున్నాయి.

**68**. "అల్లాహ్ (ఒకరిని) కొడుకుగా చేసుకున్నాడు."[1] అని వారు (యూదులు మరియు క్రైస్తవులు) అంటారు. ఆయన సర్వలోపాలకు అతీతుడు. ఆయన స్వయం సమృద్ధుడు. ఆకాశాలలోను మరియు భూమిలోనూ ఉన్నదంతా ఆయనకే చెందు తుంది! ఇలా అనటానికి మీ దగ్గర ఏదైనా నిదర్శనం ఉందా? ఏమీ? అల్లాహ్‌ను గురించి మీకు తెలియని మాటలు అంటారా?

---

**1**. యూదులు అంటారు: " 'ఉ'జైర్ ('అ.స.) అల్లాహ్ కొడుకు." అని. క్రైస్తవులు అంటారు: "ఏసు క్రీస్తు అల్లాహ్ కొడుకు." అని. కుమారుడు ఉండాలని, వారే కోరుతారు, ఎవరైతే తమ మరణం తరువాత తమ ఆస్తిపాస్తులకు వారసుడు ఉండాలని కోరుతారో! అల్లాహ్ (సు.తా.) నిత్యుడు, సజీవుడు, అంతా నశించిన తరువాత కూడా మిగిలి ఉండేవాడు. విశ్వంలో ఉన్న సమస్తమూ ఆయనకే చెందినది. ఆయనే సర్వానికి వారసుడు. అలాంటప్పుడు, ఆయనకు కొడుకు అవసరం ఎందుకుంటుంది. చూడండి, 2:116, 19:90-92 మరియు 6:100.

قُلْ إِنَّ ٱلَّذِينَ يَفْتَرُونَ عَلَى ٱللَّهِ
ٱلْكَذِبَ لَا يُفْلِحُونَ ﴿٦٩﴾
مَتَٰعٌ فِى ٱلدُّنْيَا ثُمَّ إِلَيْنَا
مَرْجِعُهُمْ ثُمَّ نُذِيقُهُمُ ٱلْعَذَابَ
ٱلشَّدِيدَ بِمَا كَانُوا۟ يَكْفُرُونَ
﴿٧٠﴾

۞ وَٱتْلُ عَلَيْهِمْ نَبَأَ نُوحٍ إِذْ قَالَ
لِقَوْمِهِۦ يَٰقَوْمِ إِن كَانَ كَبُرَ عَلَيْكُم
مَّقَامِى وَتَذْكِيرِى بِـَٔايَٰتِ ٱللَّهِ فَعَلَى
ٱللَّهِ تَوَكَّلْتُ فَأَجْمِعُوٓا۟ أَمْرَكُمْ
وَشُرَكَآءَكُمْ ثُمَّ لَا يَكُنْ أَمْرُكُمْ
عَلَيْكُمْ غُمَّةً ثُمَّ ٱقْضُوٓا۟ إِلَىَّ وَلَا
تُنظِرُونِ ﴿٧١﴾
فَإِن تَوَلَّيْتُمْ فَمَا سَأَلْتُكُم مِّنْ
أَجْرٍ ۖ إِنْ أَجْرِىَ إِلَّا عَلَى ٱللَّهِ ۖ
وَأُمِرْتُ أَنْ أَكُونَ مِنَ
ٱلْمُسْلِمِينَ ﴿٧٢﴾

**69**. ఇలా అను: "నిశ్చయంగా, అల్లాహ్‌కు అబద్ధం అంటగట్టే వారు ఎన్నటికీ సాఫల్యం పొందరు."

**70**. ఇహలోకంలో వారు కొంతకాలం సుఖాలు అనుభవించవచ్చు! కాని తరువాత మా వైపునకే, వారికి మరలి రావలసి ఉంది. అప్పుడు మేము వారి సత్యతిరస్కారానికి ఫలితంగా, వారికి కఠిన శిక్షను రుచి చూపుతాము. (3/4)

**71**. * మరియు వారికి నూహ్ గాథను వినిపించు.[1] అతను తన జాతివారితో ఇలా అన్నప్పుడు: "నా జాతి సోదరులారా! నేను మీతో ఉండటం మరియు అల్లాహ్ సూచనలను (ఆయాత్) బోధించటం, మీకు బాధాకరమైనదిగా ఉంటే! నేను మాత్రం అల్లాహ్‌నే నమ్ముకున్నాను. మీరూ మరియు మీరు అల్లాహ్‌కు సాటి కల్పించిన వారూ, అందరూ కలిసి ఒక (పన్నాగపు) నిర్ణయం తీసుకోండి, తరువాత మీ నిర్ణయంలో మీ కెలాంటి సందేహం లేకుండా చూసుకోండి. ఆ పిదప ఆ పన్నాగాన్ని నాకు వ్యతిరేకంగా ప్రయోగించండి; నాకు ఏమాత్రం వ్యవధి నివ్వకండి.

**72**. "కాని, ఒకవేళ మీరు వెనుదిరిగితే, నేను మాత్రం మీనుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు! నా ప్రతిఫలం కేవలం అల్లాహ్ దగ్గర ఉంది. మరియు నేను కేవలం అల్లాహ్‌కే విధేయుడను (ముస్లిం) అయి ఉండాలని ఆజ్ఞాపించబడ్డాను."[2]

---

**1**. నూ'హ్ ('అ.స.) వివరాలకు చూడండి, 11:36-48 మరియు 7:59-64.

**2**. నూ'హ్ ('అ.స.) యొక్క ఈ మాటల నుండి తెలిసేదేమిటంటే ప్రవక్తలందరూ, ఇస్లాం - అంటే, ఏకైక ఆరాధ్యుడు అల్లాహ్ (సు.తా.)కే విధేయులై ఉండాలని - బోధించారు. చూడండి, 27:91, 2:131-132, 12:101, 10:84, 7:126, 27:44, 5:111 మరియు 6:162-163.

73. కాని, వారు అతనిని అబద్ధీకుడని తిరస్కరించారు. కావున మేము అతనిని మరియు అతనితో పాటు ఓడలో ఉన్న వారిని రక్షించి, వారిని భూమికి వారసులుగా చేశాము. మరియు మా సూచనలను అబద్ధాలని తిరస్కరించిన వారిని ముంచివేశాము. కావున చూడండి, హెచ్చరిక చేయబడినా (విశ్వసించని) వారి గతి ఏమయిందో!

فَكَذَّبُوهُ فَنَجَّيْنَٰهُ وَمَن مَّعَهُۥ فِى ٱلْفُلْكِ وَجَعَلْنَٰهُمْ خَلَٰٓئِفَ وَأَغْرَقْنَا ٱلَّذِينَ كَذَّبُوا۟ بِـَٔايَٰتِنَا ۖ فَٱنظُرْ كَيْفَ كَانَ عَٰقِبَةُ ٱلْمُنذَرِينَ ﴿٧٣﴾

74. అతని (నూహ్) తరువాత ప్రవక్తలను వారి వారి జాతుల వారివద్దకు పంపాము. వారు, వారివద్దకు స్పష్టమైన నిదర్శనాలు తీసుకొని వచ్చినా! వారు మొదట అబద్ధమని తిరస్కరించిన విషయాన్ని మళ్ళీ విశ్వసించ లేక పోయారు. ఈ విధంగా మేము హద్దులు మీరి ప్రవర్తించే వారి హృదయాల మీద ముద్ర వేస్తాము.

ثُمَّ بَعَثْنَا مِنۢ بَعْدِهِۦ رُسُلًا إِلَىٰ قَوْمِهِمْ فَجَآءُوهُم بِٱلْبَيِّنَٰتِ فَمَا كَانُوا۟ لِيُؤْمِنُوا۟ بِمَا كَذَّبُوا۟ بِهِۦ مِن قَبْلُ ۚ كَذَٰلِكَ نَطْبَعُ عَلَىٰ قُلُوبِ ٱلْمُعْتَدِينَ ﴿٧٤﴾

75. ఇక వారి తరువాత, మూసా మరియు హారూన్‌లను మా సూచనలతో ఫిర్ఔన్ మరియు అతని నాయకుల వద్దకు పంపితే, వారు దురహంకారం చూపారు. వారు అపరాధులైన జనులు.

ثُمَّ بَعَثْنَا مِنۢ بَعْدِهِم مُّوسَىٰ وَهَٰرُونَ إِلَىٰ فِرْعَوْنَ وَمَلَإِي۟هِۦ بِـَٔايَٰتِنَا فَٱسْتَكْبَرُوا۟ وَكَانُوا۟ قَوْمًا مُّجْرِمِينَ ﴿٧٥﴾

76. కావున మా వద్దనుండి సత్యం వారి ముందుకు వచ్చినపుడు వారు: "నిశ్చయంగా, ఇది స్పష్టమైన మంత్రజాలమే!" అని అన్నారు.

فَلَمَّا جَآءَهُمُ ٱلْحَقُّ مِنْ عِندِنَا قَالُوٓا۟ إِنَّ هَٰذَا لَسِحْرٌ مُّبِينٌ ﴿٧٦﴾

77. మూసా అన్నాడు: "ఏమీ? సత్యం మీ ముందుకు వచ్చిన తరువాత కూడా ఇలా అంటారా? ఏమీ? ఇది మంత్రజాలమా? మరియు మాంత్రికులు ఎన్నడూ సాఫల్యం పొందరు కదా!"

78. వారన్నారు: "మా తండ్రితాతలు నడచిన మార్గం నుండి మమ్మల్ని మళ్ళించాలని మరియు మీ ఇద్దరి పెద్దరికాన్ని భూమిలో స్థాపించాలనా, మీరిద్దరూ వచ్చింది? మరియు మేము మీ ఇద్దరినీ ఏ మాత్రం విశ్వసించము!"

79. మరియు ఫిర్ఔన్ (తన వారితో) అన్నాడు: "నేర్పుగల ప్రతి మాంత్రికుణ్ణి నా వద్దకు తీసుకురండి!"

80. మాంత్రికులు వచ్చిన తరువాత మూసా వారితో: "మీరు విసరదలచుకున్న వాటిని విసరండి!" అని అన్నాడు.

81. వారు విసరగానే మూసా: "మీరు విసిరింది మంత్రజాలం. నిశ్చయంగా, అల్లాహ్ దానిని భంగపరుస్తాడు.[1] నిశ్చయంగా అల్లాహ్ దౌర్జన్యపరుల కార్యాలను చక్కబడనివ్వడు.

82. మరియు అల్లాహ్ తన ఆజ్ఞతో సత్యాన్ని సత్యంగా నిరూపిస్తాడు,[2] అది అపరాధులకు ఎంత అసహ్యకరమైనా సరే!"

قَالَ مُوسَىٰٓ أَتَقُولُونَ لِلْحَقِّ لَمَّا جَآءَكُمْۖ أَسِحْرٌ هَٰذَا وَلَا يُفْلِحُ ٱلسَّٰحِرُونَ ﴿٧٧﴾

قَالُوٓا۟ أَجِئْتَنَا لِتَلْفِتَنَا عَمَّا وَجَدْنَا عَلَيْهِ ءَابَآءَنَا وَتَكُونَ لَكُمَا ٱلْكِبْرِيَآءُ فِى ٱلْأَرْضِ وَمَا نَحْنُ لَكُمَا بِمُؤْمِنِينَ ﴿٧٨﴾

وَقَالَ فِرْعَوْنُ ٱئْتُونِى بِكُلِّ سَٰحِرٍ عَلِيمٍ ﴿٧٩﴾

فَلَمَّا جَآءَ ٱلسَّحَرَةُ قَالَ لَهُم مُّوسَىٰٓ أَلْقُوا۟ مَآ أَنتُم مُّلْقُونَ ﴿٨٠﴾

فَلَمَّآ أَلْقَوْا۟ قَالَ مُوسَىٰ مَا جِئْتُم بِهِ ٱلسِّحْرُۖ إِنَّ ٱللَّهَ سَيُبْطِلُهُۥٓۖ إِنَّ ٱللَّهَ لَا يُصْلِحُ عَمَلَ ٱلْمُفْسِدِينَ ﴿٨١﴾

وَيُحِقُّ ٱللَّهُ ٱلْحَقَّ بِكَلِمَٰتِهِۦ وَلَوْ كَرِهَ ٱلْمُجْرِمُونَ ﴿٨٢﴾

---

1. చూడండి, 7:116 మరియు 20:66.
2. చూడండి, 8:7 మరియు 42:24.

فَمَآ ءَامَنَ لِمُوسَىٰٓ إِلَّا ذُرِّيَّةٌ مِّن قَوْمِهِۦ عَلَىٰ خَوْفٍ مِّن فِرْعَوْنَ وَمَلَإِيْهِمْ أَن يَفْتِنَهُمْ ۚ وَإِنَّ فِرْعَوْنَ لَعَالٍ فِى ٱلْأَرْضِ وَإِنَّهُۥ لَمِنَ ٱلْمُسْرِفِينَ ﴿٨٣﴾

**83**. కాని ఫిర్'ఔన్ మరియు అతని నాయకులు తమను హింసిస్తారేమో అనే భయంతో! అతని జాతివారిలోని కొందరు ప్రజలు తప్ప ఇతరులు మూసాను విశ్వసించలేదు.[1] మరియు వాస్తవానికి, ఫిర్'ఔన్ దేశంలో ప్రాబల్యం వహించి ఉండేవాడు. మరియు నిశ్చయంగా, అతడు మితిమీరి ప్రవర్తించే వారిలో ఒకడుగా ఉండేవాడు.

وَقَالَ مُوسَىٰ يَٰقَوْمِ إِن كُنتُمْ ءَامَنتُم بِٱللَّهِ فَعَلَيْهِ تَوَكَّلُوٓا۟ إِن كُنتُم مُّسْلِمِينَ ﴿٨٤﴾

**84**. మరియు మూసా అన్నాడు: "నా జాతి ప్రజలారా! మీకు నిజంగానే అల్లాహ్ మీద విశ్వాసం ఉంటే మరియు మీరు నిజంగానే అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు) అయితే, మీరు ఆయన (అల్లాహ్) పైననే నమ్మకం ఉంచుకోండి."[2]

فَقَالُوا۟ عَلَى ٱللَّهِ تَوَكَّلْنَا رَبَّنَا لَا تَجْعَلْنَا فِتْنَةً لِّلْقَوْمِ ٱلظَّٰلِمِينَ ﴿٨٥﴾

**85**. అప్పుడు వారిలా జవాబిచ్చారు: "మేము అల్లాహ్‌నే నమ్ముకున్నాము. ఓ మా ప్రభూ! మమ్మల్ని దుర్మార్గులకు పరీక్షా సాధనంగా చేయకు;

وَنَجِّنَا بِرَحْمَتِكَ مِنَ ٱلْقَوْمِ ٱلْكَٰفِرِينَ ﴿٨٦﴾

**86**. "మరియు నీ కారుణ్యంతో మమ్మల్ని సత్యతిరస్కార ప్రజలనుండి కాపాడు."

وَأَوْحَيْنَآ إِلَىٰ مُوسَىٰ وَأَخِيهِ أَن تَبَوَّءَا لِقَوْمِكُمَا بِمِصْرَ بُيُوتًا وَٱجْعَلُوا۟ بُيُوتَكُمْ قِبْلَةً وَأَقِيمُوا۟ ٱلصَّلَوٰةَ ۗ وَبَشِّرِ ٱلْمُؤْمِنِينَ ﴿٨٧﴾

**87**. మరియు మేము మూసాకు మరియు అతని సోదరునికి ఇలా దివ్యజ్ఞానం (వ'హీ) పంపాము: "మీరు, మీ జాతి వారి కొరకు ఈజిప్టులో గృహాలను సమకూర్చుకోండి. మరియు మీ గృహాలను, ప్రార్థనా స్థలాలుగా చేసుకొని నమా'జ్‌లను స్థాపించండి.[3] మరియు విశ్వాసులకు శుభవార్తలు ఇవ్వు."

---

1. చూడండి, 7:120-126.
2. చూడండి, 7:128-129.
3. దీని అర్థం ఏమిటంటే ఫిర్'ఔన్ జాతివారి దౌర్జన్యాల నుండి తప్పించుకోవటానికి వారితో: "మీరు మీ ఇండ్లలోనే ప్రార్థనాస్థలాలు ఏర్పాటు చేసుకొని, బైతుల్ మఖ్దిస్ వైపునకు మరలి ప్రార్థనలు చేయండి." అని, ఆదేశమివ్వబడింది.

**88**. మూసా ఇలా ప్రార్థించాడు: "ఓ మా ప్రభూ! నిశ్చయంగా, నీవు ఫిర్ఔన్‌కు మరియు అతని నాయకులకు ఇహలోక జీవితంలో వైభవం మరియు సంపదలను ప్రసాదించావు. ఓ మా ప్రభూ! వారిని (ప్రజలను) నీ మార్గం నుండి తప్పించటానికా ఇవి? ఓ మా ప్రభూ! వారి సంపదలను ధ్వంసం చేయి, వారి హృదయాలపై కఠినావస్థను కలుగజేయి, ఎందుకంటే వారు కఠిన శిక్షను చూసేంతవరకు విశ్వసించరు!"[1]

**89**. (అల్లాహ్) సెలవిచ్చాడు: "మీ ఉభయుల ప్రార్థన అంగీకరించబడింది. మీరిద్దరూ (ఋజుమార్గంపై) స్థిరంగా ఉండండి. మీరిద్దరూ తెలివిలేని వారి మార్గాన్ని అనుసరించకండి." (7/8)

**90**. * మరియు మేము ఇస్రాయీ'ల్ సంతతి వారిని సముద్రం దాటించాము. ఆ పిదప ఫిర్'ఔన్ మరియు అతని సైనికులు దౌర్జన్యంతో మరియు శత్రుత్వంతో వారిని వెంబడించారు. చివరకు (ఫిర్'ఔన్) మునిగిపోతూ అన్నాడు:[2] "నిశ్చయంగా, ఇస్రాయీ'ల్ సంతతి వారు విశ్వసించిన దేవుడు తప్ప మరొక దేవుడు లేడని నేను విశ్వసించాను. నేను విధేయులలో (ముస్లింలలో) చేరాను!"

وَقَالَ مُوسَىٰ رَبَّنَآ إِنَّكَ ءَاتَيْتَ فِرْعَوْنَ وَمَلَأَهُۥ زِينَةً وَأَمْوَٰلًا فِى ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا رَبَّنَا لِيُضِلُّوا۟ عَن سَبِيلِكَ ۖ رَبَّنَا ٱطْمِسْ عَلَىٰٓ أَمْوَٰلِهِمْ وَٱشْدُدْ عَلَىٰ قُلُوبِهِمْ فَلَا يُؤْمِنُوا۟ حَتَّىٰ يَرَوُا۟ ٱلْعَذَابَ ٱلْأَلِيمَ ﴿٨٨﴾

قَالَ قَدْ أُجِيبَت دَّعْوَتُكُمَا فَٱسْتَقِيمَا وَلَا تَتَّبِعَآنِّ سَبِيلَ ٱلَّذِينَ لَا يَعْلَمُونَ ﴿٨٩﴾

۞ وَجَٰوَزْنَا بِبَنِىٓ إِسْرَٰٓءِيلَ ٱلْبَحْرَ فَأَتْبَعَهُمْ فِرْعَوْنُ وَجُنُودُهُۥ بَغْيًا وَعَدْوًا ۖ حَتَّىٰٓ إِذَآ أَدْرَكَهُ ٱلْغَرَقُ قَالَ ءَامَنتُ أَنَّهُۥ لَآ إِلَٰهَ إِلَّا ٱلَّذِىٓ ءَامَنَتْ بِهِۦ بَنُوٓا۟ إِسْرَٰٓءِيلَ وَأَنَا۠ مِنَ ٱلْمُسْلِمِينَ ﴿٩٠﴾

---

1. నూ'హ్ ('అ.స.) 950 సంవత్సరాల వరకు ధర్మ ప్రచారం చేసినా కూడా అతని జాతివారు, ఇస్లాం వైపుకు రాలేదు, వారు అతని ఆహ్వానాన్ని తిరస్కరించారు. ఆ తరువాత అతను సహించలేక చేసిన శాపాన్ని గురించి చూడండి, 71:26. అదేవిధంగా మూసా ('అ.స.) కూడా సహించుకోలేక వారి మీదకు ఆపదలను పంపమని అల్లాహ్ (సు.తా.)ను ప్రార్థించారు.
2. ఖుర్ఆన్‌లో పేర్కొనబడిన కథలు గుణపాఠం నేర్చుకోవటానికే ఉన్నాయి కానీ కథలు చెప్పాలనే ఉద్దేశ్యంతో కాదు. చూడండి ఖుర్ఆన్, 2:50 మరియు సూరహ్ అష్-షు'అరా.

**91**. (అతనికి ఇలా జవాబు ఇవ్వబడింది): "ఇప్పుడా,[1] (నీవు విశ్వసించేది)? మరియు వాస్తవానికి నీవు, ఇంతవరకు ఆజ్ఞోల్లంఘన చేస్తూ ఉన్నావు మరియు దౌర్జన్యపరులలో చేరి ఉన్నావు కదా!

**92**. "ఇక నీ తరువాత వచ్చేవారికి ఒక సూచనగా ఉండటానికి ఈ నాడు నీ శవాన్ని కాపాడుతాము." మరియు నిశ్చయంగా, చాలా మంది ప్రజలు మా సూచనల పట్ల నిర్లక్ష్యులై ఉన్నారు.

**93**. మరియు వాస్తవానికి మేము ఇస్రాయీల్ సంతతి వారికి ఉండటానికి మంచి స్థానాన్ని ఇచ్చి, వారికి ఉత్తమ జీవనోపాధిని ప్రసాదించాము. మరియు వారివద్దకు దివ్య జ్ఞానం వచ్చినంతవరకు వారి మధ్య భేదాభిప్రాయాలు రాలేదు. నిశ్చయంగా, నీ ప్రభువు పునరుత్థాన దినమున వారిమధ్య ఉన్న భేదాభిప్రాయాలను గురించి తీర్పుచేస్తాడు.

**94**. (ఓ ముహమ్మద్!) ఒకవేళ నీ వైపునకు అవతరింపజేయబడిన విషయాలను గురించి నీకేమైనా సందేహం ఉంటే నీకు పూర్వం వచ్చిన గ్రంథాన్ని చదువుతున్న వారిని అడుగు! వాస్తవంగా, నీ ప్రభువు తరఫునుండి నీ వద్దకు సత్యం వచ్చింది. కావున నీవు సందేహించే వారిలో చేరకు,

**95**. మరియు అల్లాహ్ సూచనలను అబద్ధాలని నిరాకరించిన వారిలో చేరకు. అలాచేస్తే నీవు కూడా తప్పక నష్టం పొందే వారిలో చేరిపోతావు.

ءَآلۡـَٰٔنَ وَقَدۡ عَصَيۡتَ قَبۡلُ
وَكُنتَ مِنَ ٱلۡمُفۡسِدِينَ ٩١

فَٱلۡيَوۡمَ نُنَجِّيكَ بِبَدَنِكَ لِتَكُونَ
لِمَنۡ خَلۡفَكَ ءَايَةٗۚ وَإِنَّ كَثِيرٗا مِّنَ
ٱلنَّاسِ عَنۡ ءَايَٰتِنَا لَغَٰفِلُونَ ٩٢

وَلَقَدۡ بَوَّأۡنَا بَنِيٓ إِسۡرَٰٓءِيلَ مُبَوَّأَ صِدۡقٖ
وَرَزَقۡنَٰهُم مِّنَ ٱلطَّيِّبَٰتِ فَمَا ٱخۡتَلَفُواْ
حَتَّىٰ جَآءَهُمُ ٱلۡعِلۡمُۚ إِنَّ رَبَّكَ يَقۡضِي
بَيۡنَهُمۡ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ فِيمَا كَانُواْ فِيهِ
يَخۡتَلِفُونَ ٩٣

فَإِن كُنتَ فِي شَكّٖ مِّمَّآ أَنزَلۡنَآ إِلَيۡكَ
فَسۡـَٔلِ ٱلَّذِينَ يَقۡرَءُونَ ٱلۡكِتَٰبَ
مِن قَبۡلِكَۚ لَقَدۡ جَآءَكَ ٱلۡحَقُّ مِن
رَّبِّكَ فَلَا تَكُونَنَّ مِنَ ٱلۡمُمۡتَرِينَ ٩٤

وَلَا تَكُونَنَّ مِنَ ٱلَّذِينَ كَذَّبُواْ
بِـَٔايَٰتِ ٱللَّهِ فَتَكُونَ مِنَ
ٱلۡخَٰسِرِينَ ٩٥

1. చూడండి, 4:18.

إِنَّ ٱلَّذِينَ حَقَّتۡ عَلَيۡهِمۡ كَلِمَتُ رَبِّكَ لَا يُؤۡمِنُونَ ﴿٩٦﴾

96. నిశ్చయంగా, ఎవరి విషయంలోనైతే నీ ప్రభువు వాక్కు సత్యమని నిరూపించబడిందో, వారు ఎన్నటికీ విశ్వసించరు.

وَلَوۡ جَآءَتۡهُمۡ كُلُّ ءَايَةٍ حَتَّىٰ يَرَوُاْ ٱلۡعَذَابَ ٱلۡأَلِيمَ ﴿٩٧﴾

97. మరియు ఒకవేళ వారి వద్దకు ఏ విధమైన అద్భుత సూచన వచ్చినా! వారు బాధాకరమైన శిక్షను చూడనంత వరకు (విశ్వసించరు).[1]

فَلَوۡلَا كَانَتۡ قَرۡيَةٌ ءَامَنَتۡ فَنَفَعَهَآ إِيمَٰنُهَآ إِلَّا قَوۡمَ يُونُسَ لَمَّآ ءَامَنُواْ كَشَفۡنَا عَنۡهُمۡ عَذَابَ ٱلۡخِزۡيِ فِي ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَا وَمَتَّعۡنَٰهُمۡ إِلَىٰ حِينٖ ﴿٩٨﴾

98. యూనుస్ జాతివారు తప్ప! ఇతర ఏ పురవాసులకు కూడా, (శిక్షను చూసిన తరువాత) విశ్వసించగా, వారి విశ్వాసం వారికి లాభదాయకం కాలేకపోయింది! (యూనుస్ జాతి) వారు విశ్వసించిన పిదప మేము వారి నుండి ఇహలోక జీవితపు అవమానకరమైన శిక్షను తొలగించాము. మరియు వారిని కొంతకాలం వరకు వారికి (ఇహలోక జీవితాన్ని) అనుభవించే అవకాశాన్ని ఇచ్చాము.[2]

وَلَوۡ شَآءَ رَبُّكَ لَأٓمَنَ مَن فِي ٱلۡأَرۡضِ كُلُّهُمۡ جَمِيعًاۚ أَفَأَنتَ تُكۡرِهُ ٱلنَّاسَ حَتَّىٰ يَكُونُواْ مُؤۡمِنِينَ ﴿٩٩﴾

99. మరియు నీ ప్రభువు కోరితే, భూమిలో ఉన్న వారందరూ విశ్వసించేవారు. ఏమీ? నీవు మానవులందరినీ విశ్వాసులయ్యే వరకు, వారిని బలవంతంచేస్తూ ఉంటావా?

---

1. మా శిక్ష చూసిన తరువాత విశ్వసిస్తే అది వారికి లాభదాయకం కాదు. చూడండి, 40:85.

2. యూనుస్ ('అ.స.), 'నైనవా' (Nineveh) వాసులకు ధర్మప్రచారం చేశారు. కాని వారతనిని తిరస్కరించారు. దానికి అతను కోపపడి ఉద్రేకంతో వారిని శపించి వెళ్ళిపోయారు. వారిపైకి శిక్షరావడం చూసి ప్రజలందరూ ఒక మైదానంలో చేరుకొని అల్లాహ్(సు.తా.)ను మన్నించమని ప్రార్థించారు. వారి క్షమాపణను అంగీకరించి అల్లాహ్ (సు.తా.) వారి శిక్షను తొలగించాడు. ఆ తరువాత వారు అల్లాహ్(సు.తా.)కు విధేయు(ముస్లిము)లు అయ్యారు. ఈ విధంగా శిక్షను చూసిన తరువాత క్షమాపణ అంగీకరించబడిన వారు కేవలం యూనుస్ ('అ.స.) జాతి ప్రజలు మాత్రమే. ఇంకా చూడండి, 21:87-88, 37:139-148, (ఫత్హ్ అల్-'ఖదీర్).

**100**. మరియు ఏ వ్యక్తి అయినాసరే అల్లాహ్ అనుమతి లేనిదే విశ్వసించజాలడు. జ్ఞానాన్ని ఉపయోగించని వారిపై ఆయన (అవిశ్వాసపు) మాలిన్యాన్ని రుద్దుతాడు.

**101**. ఇలా అను: "ఆకాశాలలోనూ, మరియు భూమిలోనూ, ఏమేమున్నాయో చూడండి!" మరియు విశ్వసించని ప్రజలకు సూచనలు గానీ, హెచ్చరికలు గానీ ఏవిధంగానూ పనికిరావు!

**102**. ఇప్పుడు వారు, తమకు పూర్వం గతించిన వారికి సంభవించిన దినాల కోసం తప్ప మరి దేనికోసం నిరీక్షిస్తున్నారు? వారితో అను: "మీరూ నిరీక్షించండి! నిశ్చయంగా, నేనుకూడా మీతోపాటు నిరీక్షిస్తాను!"

**103**. తరువాత మేము మా ప్రవక్తలను మరియు విశ్వసించిన వారిని కాపాడుతూ ఉంటాము. ఈ విధంగా విశ్వాసులను కాపాడటం మా విధి.

**104**. (ఓ ప్రవక్తా!) ఇలా అను: "ఓ మానవులారా! నా ధర్మాన్ని గురించి మీకు ఎలాంటి సందేహం ఉన్నా అల్లాహ్‌ను వదలి మీరు ఆరాధించే వారిని నేనెన్నడూ ఆరాధించను. అంతేకాదు, నేను అల్లాహ్‌నే ఆరాధిస్తాను. ఆయనే మిమ్మల్ని మరణింపజేస్తాడు. మరియు నేను విశ్వాసులలో ఒకడిగా ఉండాలని ఆదేశించబడ్డాను."

**105**. (నేను ఇలా ఆజ్ఞాపించబడ్డాను): "నీవు మాత్రం సత్యధర్మమైన ఏకదైవ సిద్ధాంతాన్నే అనుసరించు. మరియు ఎన్నటికీ అల్లాహ్‌కు సాటి కల్పించే (షిర్క్ చేసే) వారిలో చేరకు.

وَمَاكَانَ لِنَفْسٍ أَن تُؤْمِنَ إِلَّا
بِإِذْنِ ٱللَّهِۚ وَيَجْعَلُ ٱلرِّجْسَ عَلَى
ٱلَّذِينَ لَا يَعْقِلُونَ ﴿١٠٠﴾

قُلِ ٱنظُرُواْ مَاذَا فِي ٱلسَّمَٰوَٰتِ
وَٱلْأَرْضِۚ وَمَا تُغْنِي ٱلْأَيَٰتُ وَٱلنُّذُرُ عَن
قَوْمٍ لَّا يُؤْمِنُونَ ﴿١٠١﴾

فَهَلْ يَنتَظِرُونَ إِلَّا مِثْلَ أَيَّامِ
ٱلَّذِينَ خَلَوْاْ مِن قَبْلِهِمْۚ قُلْ فَٱنتَظِرُوٓاْ
إِنِّي مَعَكُم مِّنَ ٱلْمُنتَظِرِينَ ﴿١٠٢﴾

ثُمَّ نُنَجِّي رُسُلَنَا وَٱلَّذِينَ ءَامَنُواْۚ
كَذَٰلِكَ حَقًّا عَلَيْنَا نُنجِ ٱلْمُؤْمِنِينَ ﴿١٠٣﴾

قُلْ يَٰٓأَيُّهَا ٱلنَّاسُ إِن كُنتُمْ فِي شَكٍّ مِّن
دِينِي فَلَآ أَعْبُدُ ٱلَّذِينَ تَعْبُدُونَ مِن دُونِ
ٱللَّهِ وَلَٰكِنْ أَعْبُدُ ٱللَّهَ ٱلَّذِي يَتَوَفَّىٰكُمْۖ
وَأُمِرْتُ أَنْ أَكُونَ مِنَ ٱلْمُؤْمِنِينَ ﴿١٠٤﴾

وَأَنْ أَقِمْ وَجْهَكَ لِلدِّينِ حَنِيفًا
وَلَا تَكُونَنَّ مِنَ ٱلْمُشْرِكِينَ ﴿١٠٥﴾

وَلَا تَدۡعُ مِن دُونِ ٱللَّهِ مَا لَا يَنفَعُكَ وَلَا يَضُرُّكَۖ فَإِن فَعَلۡتَ فَإِنَّكَ إِذٗا مِّنَ ٱلظَّـٰلِمِينَ ١٠٦

106. "మరియు అల్లాహ్‌ను వదలి నీకు లాభం గానీ మరియు నష్టం గానీ కలిగించలేని దానిని నీవు ప్రార్థించకు. ఒకవేళ నీవు అలాచేస్తే! నిశ్చయంగా, నీవు దుర్మార్గులలో చేరిన వాడవవుతావు."

وَإِن يَمۡسَسۡكَ ٱللَّهُ بِضُرّٖ فَلَا كَاشِفَ لَهُۥٓ إِلَّا هُوَۖ وَإِن يُرِدۡكَ بِخَيۡرٖ فَلَا رَآدَّ لِفَضۡلِهِۦۚ يُصِيبُ بِهِۦ مَن يَشَآءُ مِنۡ عِبَادِهِۦۚ وَهُوَ ٱلۡغَفُورُ ٱلرَّحِيمُ ١٠٧

107. ఒకవేళ అల్లాహ్ నీకు ఏదైనా ఆపద కలిగించదలిస్తే ఆయన తప్ప మరెవ్వరూ దానిని తొలగించలేరు. మరియు ఆయన నీకు మేలు చేయదలిస్తే, ఆయన అనుగ్రహాన్ని ఎవ్వడూ మళ్ళించలేడు. ఆయన తన దాసులలో తాను కోరిన వారికి తన అనుగ్రహాన్ని ప్రసాదిస్తాడు. మరియు ఆయనే క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

قُلۡ يَـٰٓأَيُّهَا ٱلنَّاسُ قَدۡ جَآءَكُمُ ٱلۡحَقُّ مِن رَّبِّكُمۡۖ فَمَنِ ٱهۡتَدَىٰ فَإِنَّمَا يَهۡتَدِي لِنَفۡسِهِۦۖ وَمَن ضَلَّ فَإِنَّمَا يَضِلُّ عَلَيۡهَاۖ وَمَآ أَنَا۠ عَلَيۡكُم بِوَكِيلٖ ١٠٨

108. (ఓ ప్రవక్తా!) ఇలా అను: "ఓ మానవులారా! వాస్తవంగా, మీ ప్రభువు తరఫు నుండి మీ వద్దకు సత్యం వచ్చి ఉన్నది. ఇక ఎవడు సన్మార్గాన్ని అనుసరిస్తాడో! నిశ్చయంగా, అతడు తనమేలుకే సన్మార్గాన్ని అనుసరిస్తాడు. ఇక ఎవడు మార్గభ్రష్టుడవుతాడో నిశ్చయంగా తనకే నష్టం కలిగించుకుంటాడు. నేను మీ బాధ్యత వహించేవాడను కాను!"

وَٱتَّبِعۡ مَا يُوحَىٰٓ إِلَيۡكَ وَٱصۡبِرۡ حَتَّىٰ يَحۡكُمَ ٱللَّهُۚ وَهُوَ خَيۡرُ ٱلۡحَٰكِمِينَ ١٠٩

109. మరియు (ఓ ప్రవక్తా!) నీపై అవతరింపజేయబడిన సందేశాన్ని (వ'హీని) అనుసరించు. మరియు అల్లాహ్ తీర్పుచేసే వరకు నీవు ఓర్పువహించు. మరియు న్యాయాధిపతులలో ఆయనే అత్యుత్తముడు.

*****

## 11. సూరహ్ హూద్

## سُورَةُ هُودٍ

ఈ సూరహ్, సూరహ్ యూనుస్ తరువాత, అంతిమ మక్కా కాలంలో అవతరింపజేయబడింది. ఇందులో **123** ఆయతులున్నాయి. ఇందులో మానవుల పరస్పర వ్యవహారాలను గురించి చర్చ ఉంది. ముఖ్యంగా ఆయత్ 117: *''మరియు వాటిలో నివసించే ప్రజలు సద్వర్తనులై ఉన్నంతవరకు, అలాంటి నగరాలను నీ ప్రభువు అన్యాయంగా నాశనం చేసేవాడు కాడు!''* దీనిపేరు **50**వ **ఆయత్** నుండి గ్రహించబడింది. **హూద్** ('అ.స.) 'అరబ్బు ప్రవక్త. ఈ సూరహ్‌లో ఇంకా ఇద్దరు 'అరబ్బు ప్రవక్తల ప్రస్తావన వస్తుంది. వారు స'మూద్ జాతికి చెందిన 'సాలి'హ్ ('అ.స.) మరియు మద్‌యన్ ప్రాంతానికి చెందిన షు'ఐబ్ ('అ.స.).

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓر ۚ كِتَٰبٌ أُحْكِمَتْ ءَايَٰتُهُۥ ثُمَّ فُصِّلَتْ مِن لَّدُنْ حَكِيمٍ خَبِيرٍ ﴿١﴾

**1.** అలిఫ్-లామ్-ర. (ఇది) ఒక దివ్య గ్రంథం, దీని సూక్తు(ఆయాత్)లు నిర్దుష్టమైనవి మరియు మహా వివేచనాపరుడు, సర్వం తెలిసినవాడు అయిన (అల్లాహ్) తరఫు నుండి వివరించబడ్డాయి;

أَلَّا تَعْبُدُوٓا۟ إِلَّا ٱللَّهَ ۚ إِنَّنِى لَكُم مِّنْهُ نَذِيرٌ وَبَشِيرٌ ﴿٢﴾

**2.** మీరు అల్లాహ్‌ను తప్ప ఇతరులను ఆరాధించకూడదని. (ఓ ము'హమ్మద్ ఇలా అను): ''నిశ్చయంగా నేను, ఆయన (అల్లాహ్) తరఫునుండి మీకు హెచ్చరిక చేసేవాడిని మరియు శుభవార్తలు ఇచ్చేవాడిని మాత్రమే!

وَأَنِ ٱسْتَغْفِرُوا۟ رَبَّكُمْ ثُمَّ تُوبُوٓا۟ إِلَيْهِ يُمَتِّعْكُم مَّتَٰعًا حَسَنًا إِلَىٰٓ أَجَلٍ مُّسَمًّى وَيُؤْتِ كُلَّ ذِى فَضْلٍ فَضْلَهُۥ ۖ وَإِن تَوَلَّوْا۟ فَإِنِّىٓ أَخَافُ عَلَيْكُمْ عَذَابَ يَوْمٍ كَبِيرٍ ﴿٣﴾

**3.** ''మరియు మీరు మీ ప్రభువును క్షమాభిక్ష వేడుకుంటే, తరువాత ఆయన వైపుకు పశ్చాత్తాపంతో మరలితే, ఆయన మీకు నిర్ణయించిన గడువు వరకు మంచి సుఖసంతోషాలను ప్రసాదిస్తాడు. మరియు అనుగ్రహాలకు అర్హుడైన ప్రతి ఒక్కనికీ ఆయన తన అనుగ్రహాలను ప్రసాదిస్తాడు. కానీ మీరు వెనుదిరిగితే! నిశ్చయంగా, ఆ గొప్ప దినమున మీపై రాబోయే శిక్షకు నేను భయపడుతున్నాను!

إِلَى ٱللَّهِ مَرْجِعُكُمْ ۖ وَهُوَ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ ۝٤

4. ''అల్లాహ్ వైపునకే మీ మరలింపు ఉంది. మరియు ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు.''

أَلَآ إِنَّهُمْ يَثْنُونَ صُدُورَهُمْ لِيَسْتَخْفُوا۟ مِنْهُ ۚ أَلَا حِينَ يَسْتَغْشُونَ ثِيَابَهُمْ يَعْلَمُ مَا يُسِرُّونَ وَمَا يُعْلِنُونَ ۚ إِنَّهُۥ عَلِيمٌۢ بِذَاتِ ٱلصُّدُورِ ۝٥

5. వినండి! వాస్తవానికి వారు ఆయన నుండి దాక్కోవటానికి తమ వక్షాలను త్రిప్పుకుంటున్నారు. జాగ్రత్త! వారు తమ వస్త్రాలలో తమను తాము కప్పుకున్నప్పటికీ, ఆయన (అల్లాహ్)కు వారు దాచే విషయాలూ మరియు వెలిబుచ్చే విషయాలూ అన్నీ బాగా తెలుసు. నిశ్చయంగా, ఆయనకు హృదయాలలో ఉన్నవి (రహస్యాలు) కూడా బాగా తెలుసు.[1]

1. చూడండి, 8:55.

۞ وَمَا مِن دَآبَّةٍ فِى ٱلْأَرْضِ إِلَّا عَلَى ٱللَّهِ رِزْقُهَا وَيَعْلَمُ مُسْتَقَرَّهَا وَمُسْتَوْدَعَهَا ۚ كُلٌّ فِى كِتَٰبٍ مُّبِينٍ ﴿٦﴾

**6**. (*) మరియు భూమిపై సంచరించే ప్రతి ప్రాణి జీవనోపాధి (బాధ్యత) అల్లాహ్ పైననే ఉంది. ఆయనకు దాని నివాసం, నివాసకాలం మరియు దాని అంతిమ నివాసస్థలమూ తెలుసు.[1] అంతా ఒక స్పష్టమైన గ్రంథంలో (వ్రాయబడి) ఉంది.

وَهُوَ ٱلَّذِى خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ فِى سِتَّةِ أَيَّامٍ وَكَانَ عَرْشُهُۥ عَلَى ٱلْمَآءِ لِيَبْلُوَكُمْ أَيُّكُمْ أَحْسَنُ عَمَلًا ۗ وَلَئِن قُلْتَ إِنَّكُم مَّبْعُوثُونَ مِنۢ بَعْدِ ٱلْمَوْتِ لَيَقُولَنَّ ٱلَّذِينَ كَفَرُوٓا۟ إِنْ هَٰذَآ إِلَّا سِحْرٌ مُّبِينٌ ﴿٧﴾

**7**. మరియు ఆయనే ఆకాశాలను మరియు భూమిని ఆరు దినము (అయ్యామ్)లలో సృష్టించాడు మరియు ఆయన సింహాసనం ('అర్ష్) నీటిమీద ఉండేది. మీలో మంచి పనులు చేసేవాడు ఎవడో పరీక్షించటానికి (ఆయన ఇదంతా సృష్టించాడు). నీవు వారితో: "నిశ్చయంగా, మీరు మరణించిన తరువాత మరల లేపబడతారు." అని అన్నప్పుడు, సత్యతిరస్కారులు తప్పక అంటారు: "ఇది ఒక స్పష్టమైన మాయాజాలం మాత్రమే."

وَلَئِنْ أَخَّرْنَا عَنْهُمُ ٱلْعَذَابَ إِلَىٰٓ أُمَّةٍ مَّعْدُودَةٍ لَّيَقُولُنَّ مَا يَحْبِسُهُۥٓ ۗ أَلَا يَوْمَ يَأْتِيهِمْ لَيْسَ مَصْرُوفًا عَنْهُمْ وَحَاقَ بِهِم مَّا كَانُوا۟ بِهِۦ يَسْتَهْزِءُونَ ﴿٨﴾

**8**. మరియు ఒకవేళ మేము వారి శిక్షను ఒక నిర్ణీతకాలం[2] వరకు ఆపి ఉంచితే, వారు తప్పకుండా అంటారు: "దానిని ఆపుతున్నది ఏమిటీ?" వాస్తవానికి అది వచ్చిన రోజు, దానిని వారినుండి తొలగించగల వారెవ్వరూ ఉండరు. మరియు వారు ఎగతాళి చేస్తూ ఉన్నదే, వారిని క్రమ్ముకుంటుంది.

---

**1**. చూడండి, 6:98.

**2**. ఉమ్మతున్: ఇక్కడ కాలం, అనే అర్థంలో వాడబడింది. (ఫత్హ్ అల్-'ఖదీర్). ఏ విధంగానైతే 12:45లో వాడబడిందో. 16:120లో ఈ పదం ఇమామ్, నాయకుడనే అర్థంలో మరియు 43:23లో ధర్మం అనే అర్థంలో మరియు 28:23, 7:159, 10:47లలో సమాజం, సంఘం, తెగ అనే అర్థాలలో వాడబడింది (ఇబ్నె-కసీ'ర్).

9. మరియు ఒకవేళ మేము మానవునికి మా కారుణ్యాన్ని రుచిచూపించి, తరువాత అతనినుండి దానిని లాక్కుంటే! నిశ్చయంగా, అతడు నిరాశచెంది, కృతఘ్నుడవుతాడు.

وَلَئِنْ أَذَقْنَا ٱلْإِنسَـٰنَ مِنَّا رَحْمَةً ثُمَّ نَزَعْنَـٰهَا مِنْهُ إِنَّهُۥ لَيَـُٔوسٌ كَفُورٌ ﴿٩﴾

10. కాని ఒకవేళ మేము అతనికి ఆపద తరువాత, అనుగ్రహాన్ని రుచిచూపిస్తే: "నా ఆపదలన్నీ నా నుండి తొలగిపోయాయి!" అని అంటాడు. నిశ్చయంగా, అతడు ఆనందంతో, విర్రవీగుతాడు.

وَلَئِنْ أَذَقْنَـٰهُ نَعْمَآءَ بَعْدَ ضَرَّآءَ مَسَّتْهُ لَيَقُولَنَّ ذَهَبَ ٱلسَّيِّـَٔاتُ عَنِّىٓ ۚ إِنَّهُۥ لَفَرِحٌ فَخُورٌ ﴿١٠﴾

11. కాని ఎవరైతే సహనం వహించి, సత్కార్యాలు చేస్తూ ఉంటారో, అలాంటి వారికి క్షమాపణ మరియు గొప్ప ప్రతిఫలం ఉంటాయి.[1]

إِلَّا ٱلَّذِينَ صَبَرُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّـٰلِحَـٰتِ أُو۟لَـٰٓئِكَ لَهُم مَّغْفِرَةٌ وَأَجْرٌ كَبِيرٌ ﴿١١﴾

12. (ఓ ప్రవక్తా!) బహుశా నీవు, నీపై అవతరింపజేయబడిన దివ్యజ్ఞానం (వ'హీ)లోని కొంతభాగాన్ని విడిచిపెట్టి నున్నావేమో! మరియు దానితో నీ హృదయానికి ఇబ్బంది కలుగుతుందేమో! ఎందుకంటే, (సత్యతిరస్కారులు) ఇలా అంటున్నారని: "ఇతనిపై ఒక నిధి ఎందుకు దింపబడలేదు? లేదా ఇతనితో బాటు ఒక దేవదూత ఎందుకు రాలేదు?" నిశ్చయంగా, నీవైతే కేవలం హెచ్చరిక చేసేవాడవు మాత్రమే. మరియు అల్లాహ్ యే ప్రతిదాని కార్యసాధకుడు.[2]

فَلَعَلَّكَ تَارِكٌۢ بَعْضَ مَا يُوحَىٰٓ إِلَيْكَ وَضَآئِقٌۢ بِهِۦ صَدْرُكَ أَن يَقُولُوا۟ لَوْلَآ أُنزِلَ عَلَيْهِ كَنزٌ أَوْ جَآءَ مَعَهُۥ مَلَكٌ ۚ إِنَّمَآ أَنتَ نَذِيرٌ ۚ وَٱللَّهُ عَلَىٰ كُلِّ شَىْءٍ وَكِيلٌ ﴿١٢﴾

---

1. చూడండి, 70:19-22 మరియు ముస్నద్ అ'హ్మద్, పు-3, పే. 4.
2. చూడండి, 25:8, 6:8,17:90-93, 6:50.

أَمۡ يَقُولُونَ ٱفۡتَرَىٰهُۖ قُلۡ فَأۡتُواْ بِعَشۡرِ سُوَرٖ مِّثۡلِهِۦ مُفۡتَرَيَٰتٖ وَٱدۡعُواْ مَنِ ٱسۡتَطَعۡتُم مِّن دُونِ ٱللَّهِ إِن كُنتُمۡ صَٰدِقِينَ ١٣

13. లేదా వారు: "అతనే (ప్రవక్తయే) దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) కల్పించాడు." అని అంటున్నారా? వారితో అను: "మీరు సత్యవంతులే అయితే - అల్లాహ్ తప్ప, మీరు పిలుచుకోగల వారినందరినీ పిలుచుకొని - దీనివంటి పది సూరాహ్‌లను కల్పించి తీసుకురండి!"[1]

فَإِلَّمۡ يَسۡتَجِيبُواْ لَكُمۡ فَٱعۡلَمُوٓاْ أَنَّمَآ أُنزِلَ بِعِلۡمِ ٱللَّهِ وَأَن لَّآ إِلَٰهَ إِلَّا هُوَۖ فَهَلۡ أَنتُم مُّسۡلِمُونَ ١٤

14. ఒకవేళ (మీరు సాటి కల్పించిన) వారు మీకు సహాయం చేయలేక (సమాధాన మివ్వక)పోతే, నిశ్చయంగా ఇది అల్లాహ్ జ్ఞానంతోనే అవతరింపజేయబడిందని తెలుసుకోండి. మరియు ఆయన తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు. అయితే ఇప్పుడైనా మీరు అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు) అవుతారా?

مَن كَانَ يُرِيدُ ٱلۡحَيَوٰةَ ٱلدُّنۡيَا وَزِينَتَهَا نُوَفِّ إِلَيۡهِمۡ أَعۡمَٰلَهُمۡ فِيهَا وَهُمۡ فِيهَا لَا يُبۡخَسُونَ ١٥

15. ఎవరు ప్రాపంచిక జీవిత సౌకర్యాలు మరియు దాని అలంకరణ కోరుకుంటారో మేము వారి కర్మల ఫలితాన్ని, ఈ జీవితంలోనే పూర్తిగా చెల్లిస్తాము మరియు అందులో వారికెలాంటి లోపం జరుగదు.

أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ لَيۡسَ لَهُمۡ فِي ٱلۡأٓخِرَةِ إِلَّا ٱلنَّارُۖ وَحَبِطَ مَا صَنَعُواْ فِيهَا وَبَٰطِلٞ مَّا كَانُواْ يَعۡمَلُونَ ١٦

16. అలాంటి వారికి పరలోకంలో నరకాగ్ని తప్ప మరేమీ ఉండదు. వారు ఇందు(ఈలోకం)లో పాటుపడిందంతా వ్యర్థమయిపోతుంది మరియు వారు చేసిన కర్మలన్నీ విఫలమవుతాయి.[2]

---

1. చూడండి, 17:88, 52:34లలో మీరు సత్యవంతులే అయితే ఈ ఖుర్ఆన్ వంటి ఒక గ్రంథం రచించి తీసుకురండి అని, ఇక్కడ దీనివంటి **పది** సూరహ్‌లనైనా తీసుకురండి అని మరియు 2:23, 10:38 లలో ఒక్క సూరహ్‌నైనా రచించి తీసుకురండి అని సవాల్ చేయబడింది, కానీ ఈరోజు వరకు, ఖుర్ఆన్ విరోధులు, ఆ చాలెంజును పూర్తిచేయలేక పోయారు.
2. చూడండి, 17:18,21, 42:20.

أَفَمَن كَانَ عَلَىٰ بَيِّنَةٍ مِّن رَّبِّهِۦ وَيَتْلُوهُ شَاهِدٌ مِّنْهُ وَمِن قَبْلِهِۦ كِتَٰبُ مُوسَىٰٓ إِمَامًا وَرَحْمَةً ۚ أُو۟لَٰٓئِكَ يُؤْمِنُونَ بِهِۦ ۚ وَمَن يَكْفُرْ بِهِۦ مِنَ ٱلْأَحْزَابِ فَٱلنَّارُ مَوْعِدُهُۥ ۚ فَلَا تَكُ فِى مِرْيَةٍ مِّنْهُ ۚ إِنَّهُ ٱلْحَقُّ مِن رَّبِّكَ وَلَٰكِنَّ أَكْثَرَ ٱلنَّاسِ لَا يُؤْمِنُونَ ﴿١٧﴾

**17**. ఏ వ్యక్తి అయితే తన ప్రభువు తరఫు నుండి వచ్చిన స్పష్టమైన నిదర్శనంపై ఉన్నాడో! మరియు దానికి తోడుగా ఆయన (అల్లాహ్) సాక్ష్యం ఉందో![1] మరియు దీనికి ముందు మార్గదర్శిని మరియు కారుణ్యంగా వచ్చిన, మూసా గ్రంథం కూడా సాక్షిగా ఉందో! (అలాంటి వాడు సత్య తిరస్కారులతో సమానుడా)? అలాంటి వారు దీనిని (ఖుర్ఆన్‌ను) విశ్వసిస్తారు. మరియు దీనిని (ఖుర్ఆన్‌ను) తిరస్కరించే తెగలవారి[2] వాగ్దాన స్థలం నరకాగ్నియే! కావున దీనిని గురించి నీవు ఎలాంటి సందేహంలోపడకు. నిశ్చయంగా, ఇది నీ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యం. కాని చాలామంది ప్రజలు విశ్వసించరు.[3]

وَمَنْ أَظْلَمُ مِمَّنِ ٱفْتَرَىٰ عَلَى ٱللَّهِ كَذِبًا ۚ أُو۟لَٰٓئِكَ يُعْرَضُونَ عَلَىٰ رَبِّهِمْ وَيَقُولُ ٱلْأَشْهَٰدُ هَٰٓؤُلَآءِ ٱلَّذِينَ كَذَبُوا۟ عَلَىٰ رَبِّهِمْ ۚ أَلَا لَعْنَةُ ٱللَّهِ عَلَى ٱلظَّٰلِمِينَ ﴿١٨﴾

**18**. మరియు అల్లాహ్‌కు అబద్ధం అంటగట్టే వాడికంటే ఎక్కువ దుర్మార్గుడు ఎవడు? అలాంటి వారు తమ ప్రభువుముందు ప్రవేశపెట్టబడతారు. అప్పుడు: "వీరే, తమ ప్రభువుకు అబద్ధాన్ని అంటగట్టిన వారు." అని సాక్షులు పలుకుతారు. నిస్సందేహంగా, అల్లాహ్ శాపం (బహిష్కారం) దుర్మార్గులపై ఉంటుంది.[4]

---

**1**. ఇక్కడ సాక్షి అంటే జిబ్రీల్ ('అ.స.).

**2**. ఇక్కడ తెగలు అంటే అల్లాహుతా'ఆలాకు విధేయులు (ముస్లింలు) కాని జాతుల వారందరూ. దైవ ప్రవక్త ('స'అస) ప్రవచనం: "ఎవరి చేతిలో నా ప్రాణముందో ఆ పరమ పవిత్రుని సాక్షి, ఈ సమాజపు ఏ మతస్థుడైనా సరే, అతడు యూదుడు గానీ, క్రైస్తవుడు గానీ, లేక ఇతర మతస్థుడు గానీ, నేను ప్రవక్తనని విన్న తరువాత నన్ను విశ్వసించడో! అతడు నరకాగ్నివాసి." ('స'హీ'హ్ ముస్లిం). ఇంకా చూడండి, 2:62, 4:150-152.

**3**. చూడండి, 12:103, 34:20.

**4**. చూడండి, 16:84.

**19**. ఎవరు అల్లాహ్ మార్గం నుండి (ప్రజలను) అడ్డగిస్తారో మరియు దానిని వక్రమైనదిగా చూపుతారో అలాంటి వారు, వారే! పరలోక జీవితం ఉన్నదనే సత్యాన్ని తిరస్కరించే వారు.[1]

**20**. అలాంటి వారు భూమిలో (అల్లాహ్ శిక్షనుండి) తప్పించుకోలేరు. మరియు వారికి అల్లాహ్ తప్ప ఇతర సంరక్షకులు లేరు. వారి శిక్ష రెట్టింపు చేయబడుతుంది. (ఇహ లోకంలో వారు సత్యాన్ని) వినలేక పోయే వారు మరియు చూడలేక పోయేవారు.[2]

**21**. అలాంటి వారే తమను తాము నష్టానికి గురిచేసుకున్న వారు మరియు వారు కల్పించుకున్న (దైవాలన్నీ) వారిని వీడిపోతాయి.[3]

**22**. నిస్సందేహంగా పరలోక జీవితంలో వీరే అత్యధికంగా నష్టపోయే వారు.

**23**. నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసి, తమ ప్రభువుకే అంకితమై పోయేటటువంటి వారే స్వర్గవాసులవుతారు. వారు దానిలోనే శాశ్వతంగా ఉంటారు. (1/8)

**24**. * ఈ ఉభయపక్షాల వారిని, ఒక గ్రుడ్డి మరియు చెవిటి, మరొక చూడగల మరియు వినగల వారితో పోల్చవచ్చు! ఏమీ? పోలికలో వీరిరువురూ సమానులా? మీరు ఇకనైనా గుణపాఠం నేర్చుకోరా?[4]

ٱلَّذِينَ يَصُدُّونَ عَن سَبِيلِ ٱللَّهِ
وَيَبۡغُونَهَا عِوَجٗا وَهُم بِٱلۡأٓخِرَةِ هُمۡ كَٰفِرُونَ
١٩

أُوْلَٰٓئِكَ لَمۡ يَكُونُواْ مُعۡجِزِينَ فِي
ٱلۡأَرۡضِ وَمَا كَانَ لَهُم مِّن دُونِ ٱللَّهِ
مِنۡ أَوۡلِيَآءَۘ يُضَٰعَفُ لَهُمُ ٱلۡعَذَابُۚ مَا
كَانُواْ يَسۡتَطِيعُونَ ٱلسَّمۡعَ وَمَا كَانُواْ
يُبۡصِرُونَ ٢٠

أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ خَسِرُوٓاْ أَنفُسَهُمۡ وَضَلَّ
عَنۡهُم مَّا كَانُواْ يَفۡتَرُونَ ٢١

لَا جَرَمَ أَنَّهُمۡ فِي ٱلۡأٓخِرَةِ هُمُ
ٱلۡأَخۡسَرُونَ ٢٢

إِنَّ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ
وَأَخۡبَتُوٓاْ إِلَىٰ رَبِّهِمۡ أُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ
ٱلۡجَنَّةِۖ هُمۡ فِيهَا خَٰلِدُونَ ٢٣

۞ مَثَلُ ٱلۡفَرِيقَيۡنِ كَٱلۡأَعۡمَىٰ
وَٱلۡأَصَمِّ وَٱلۡبَصِيرِ وَٱلسَّمِيعِۚ هَلۡ
يَسۡتَوِيَانِ مَثَلًاۚ أَفَلَا تَذَكَّرُونَ ٢٤

---

**1**. ఇదేవిధమైన ఆయత్‌కు చూడండి, 7:45.
**2**. చూడండి, 2:7, 7:179, 46:26, 67:10.
**3**. చూడండి, 6:112, అంటే వారు కల్పించుకున్న బూటక దైవాలు, వారు ఆరాధించే పీర్లు, సన్యాసులు మొదలైనవారు.
**4**. చూడండి, 59:20, 35:19-20.

25. మరియు వాస్తవానికి మేము నూ'హ్‌ను అతని జాతివారి వద్దకు పంపాము. (అతను వారితో అన్నాడు): "నిశ్చయంగా, నేను మీకు స్పష్టమైన హెచ్చరిక చేసేవాడిని మాత్రమే!

26. "మీరు అల్లాహ్‌ను తప్ప మరెవ్వరినీ ఆరాధించకూడదని.[1] అలా చేస్తే నిశ్చయంగా ఆ బాధాకరమైన దినమున మీకు పడబోయే శిక్షకు నేను భయపడుతున్నాను."

27. అప్పుడు అతని జాతివారిలో సత్య తిరస్కారులైన నాయకులు: "నీవు కూడా మా మాదిరిగా ఒక సాధారణ మానవుడవే తప్ప, (నీలో మరే ప్రత్యేకతను మేము చూడటం లేదు).[2] మరియు వివేకంలేని నీచమైన వారు తప్ప ఇతరులు నిన్ను అనుసరిస్తున్నట్లు కూడా మేము చూడటం లేదు[3] మరియు మీలో మా కంటే ఎక్కువ ఘనత కూడా మాకు కనపడటం లేదు. అంతేగాక మీరు అసత్యవాదులని మేము భావిస్తున్నాము." అని అన్నారు.

28. అతను (నూ'హ్) అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! మీరు చూస్తున్నారు కదా? నేను నా ప్రభువు తరఫునుండి వచ్చిన స్పష్టమైన సూచనను అనుసరిస్తున్నాను. ఆయన తన కారుణ్యాన్ని

وَلَقَدْ أَرْسَلْنَا نُوحًا إِلَىٰ قَوْمِهِۦٓ إِنِّى لَكُمْ نَذِيرٌ مُّبِينٌ ﴿٢٥﴾

أَن لَّا تَعْبُدُوٓا۟ إِلَّا ٱللَّهَ ۖ إِنِّىٓ أَخَافُ عَلَيْكُمْ عَذَابَ يَوْمٍ أَلِيمٍ ﴿٢٦﴾

فَقَالَ ٱلْمَلَأُ ٱلَّذِينَ كَفَرُوا۟ مِن قَوْمِهِۦ مَا نَرَىٰكَ إِلَّا بَشَرًا مِّثْلَنَا وَمَا نَرَىٰكَ ٱتَّبَعَكَ إِلَّا ٱلَّذِينَ هُمْ أَرَاذِلُنَا بَادِىَ ٱلرَّأْىِ وَمَا نَرَىٰ لَكُمْ عَلَيْنَا مِن فَضْلٍۭ بَلْ نَظُنُّكُمْ كَٰذِبِينَ ﴿٢٧﴾

قَالَ يَٰقَوْمِ أَرَءَيْتُمْ إِن كُنتُ عَلَىٰ بَيِّنَةٍ مِّن رَّبِّى وَءَاتَىٰنِى رَحْمَةً مِّنْ عِندِهِۦ فَعُمِّيَتْ عَلَيْكُمْ أَنُلْزِمُكُمُوهَا

---

1. చూడండి, 21:25.
2. ఈ విషయం ఇంతకు ముందు కూడా విశదీకరించబడింది. సత్యతిరస్కారులకు మానవుడు దైవప్రవక్తగా పంపబడటం ఆశ్చర్యకరంగా ఉంది. ఈ రోజులలో కొందరు బిద్'అత్ చేసేవారికి కూడా ఈ విషయం ఆశ్చర్యకరంగా ఉంది, కావున వారు ము'హమ్మద్ ('స'అస)ను మానవునిగా అంగీకరించరు.
3. చూడండి, 43:23.

وَأَنتُمْ لَهَا كَٰرِهُونَ ﴿٢٨﴾

నాపై ప్రసాదించాడు, కాని అది మీకు కనబడటం లేదు. అలాంటప్పుడు మీరు దానిని అసహ్యించుకుంటున్నా, దానిని స్వీకరించమని మేము మిమ్మల్ని బలవంతం చేయగలమా?[1]

وَيَٰقَوْمِ لَآ أَسْـَٔلُكُمْ عَلَيْهِ مَالًا ۖ إِنْ أَجْرِىَ إِلَّا عَلَى ٱللَّهِ ۚ وَمَآ أَنَا۠ بِطَارِدِ ٱلَّذِينَ ءَامَنُوٓا۟ ۚ إِنَّهُم مُّلَٰقُوا۟ رَبِّهِمْ وَلَٰكِنِّىٓ أَرَىٰكُمْ قَوْمًا تَجْهَلُونَ ﴿٢٩﴾

**29**. "మరియు ఓ నాజాతి ప్రజలారా! నేను దానికోసం మీ నుండి ధనాన్ని అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం అల్లాహ్ దగ్గరనే ఉంది. మరియు నేను విశ్వసించిన వారిని త్రోసివేయలేను.[2] నిశ్చయంగా, వారైతే తమ ప్రభువును కలుసుకుంటారు, కాని నిశ్చయంగా నేను మిమ్మల్ని మూఢజనులుగా చూస్తున్నాను.

وَيَٰقَوْمِ مَن يَنصُرُنِى مِنَ ٱللَّهِ إِن طَرَدتُّهُمْ ۚ أَفَلَا تَذَكَّرُونَ ﴿٣٠﴾

**30**. "మరియు ఓ నాజాతి ప్రజలారా! ఒకవేళ నేను వారిని (విశ్వాసులను) గెంటివేస్తే నన్ను అల్లాహ్ (శిక్ష) నుండి, ఎవడు కాపాడగలడు? ఏమీ? మీరిది గ్రహించలేరా?

وَلَآ أَقُولُ لَكُمْ عِندِى خَزَآئِنُ ٱللَّهِ وَلَآ أَعْلَمُ ٱلْغَيْبَ وَلَآ أَقُولُ إِنِّى مَلَكٌ وَلَآ أَقُولُ لِلَّذِينَ تَزْدَرِىٓ أَعْيُنُكُمْ لَن يُؤْتِيَهُمُ ٱللَّهُ خَيْرًا ۖ ٱللَّهُ أَعْلَمُ بِمَا فِىٓ أَنفُسِهِمْ ۖ إِنِّىٓ إِذًا لَّمِنَ ٱلظَّٰلِمِينَ ﴿٣١﴾

**31**. "మరియు నా వద్ద అల్లాహ్ నిధులు ఉన్నాయని గానీ మరియు నాకు అగోచర జ్ఞానమున్నదని గానీ నేను మీతో అనటంలేదు; మరియు నేను దైవదూతనని కూడా అనటం లేదు[3] మరియు మీరు హీనంగా చూసే వారికి అల్లాహ్ మేలు చేయలేడని కూడా అనటం లేదు. వారి మనస్సులలో ఉన్నది అల్లాహ్‌కు బాగా తెలుసు. అలా అయితే! నిశ్చయంగా, నేను దుర్మార్గులలో చేరినవాడనే!"

---

**1**. చూడండి, 2:256.

**2**. చూడండి, 26:111 మరియు 6:52.

**3**. చూడండి, 6:50 మరియు 7:188.

**32**. వారు అన్నారు: "ఓ నూ'హ్! నీవు మాతో వాదించావు, చాలా వాదించావు,[1] ఇక నీవు సత్యవంతుడవే అయితే, నీవు భయపెట్టే దానిని (శిక్షను) మాపై దింపు!"

**33**. అతను (నూ'హ్) అన్నాడు: "అల్లాహ్ కోరితే నిశ్చయంగా, దానిని (ఆ శిక్షను) మీపైకి తెస్తాడు మరియు మీరు దాని నుండి తప్పించుకోలేరు!

**34**. "ఒకవేళ అల్లాహ్ మిమ్మల్ని తప్పు దారిలో విడిచిపెట్టాలని కోరితే, నేను మీకు మంచి సలహా ఇవ్వాలని ఎంత కోరినా, నా సలహా మీకు లాభదాయకం కాజాలదు. ఆయనే మీ ప్రభువు మరియు ఆయన వైపునకే మీరంతా మరలి పోవలసి ఉన్నది."

**35**. ఏమీ? వారు: "అతనే (ము'హమ్మదే) దీనిని కల్పించాడు." అని అంటున్నారా? వారితో ఇలా అను: "నేను దీనిని కల్పిస్తే దాని పాపం నాపై ఉంటుంది మరియు మీరు చేసే పాపాలతో నాకు ఎలాంటి సంబంధం లేదు."

**36**. మరియు నూ'హ్‌కు ఇలా సందేశం (వ'హీ) పంపబడింది: "నిశ్చయంగా, నీ జాతి వారిలో ఇంతవరకు విశ్వసించిన వారు తప్ప ఇతరులెవ్వరూ విశ్వసించరు, కావున వారు చేసే కార్యాలకు నీవు చింతించకు!

**37**. "మరియు నీవు మా సమక్షంలో, మా సందేశానుసారంగా, ఒక ఓడను నిర్మించు మరియు దుర్మార్గులను గురించి నన్ను అడుగకు. నిశ్చయంగా, వారు ముంచివేయబడతారు."

قَالُواْ يَـٰنُوحُ قَدْ جَـٰدَلْتَنَا فَأَكْثَرْتَ جِدَٰلَنَا فَأْتِنَا بِمَا تَعِدُنَآ إِن كُنتَ مِنَ ٱلصَّـٰدِقِينَ ﴿٣٢﴾

قَالَ إِنَّمَا يَأْتِيكُم بِهِ ٱللَّهُ إِن شَآءَ وَمَآ أَنتُم بِمُعْجِزِينَ ﴿٣٣﴾

وَلَا يَنفَعُكُمْ نُصْحِىٓ إِنْ أَرَدتُّ أَنْ أَنصَحَ لَكُمْ إِن كَانَ ٱللَّهُ يُرِيدُ أَن يُغْوِيَكُمْ ۚ هُوَ رَبُّكُمْ وَإِلَيْهِ تُرْجَعُونَ ﴿٣٤﴾

أَمْ يَقُولُونَ ٱفْتَرَىٰهُ ۖ قُلْ إِنِ ٱفْتَرَيْتُهُۥ فَعَلَىَّ إِجْرَامِى وَأَنَا۠ بَرِىٓءٌ مِّمَّا تُجْرِمُونَ ﴿٣٥﴾

وَأُوحِىَ إِلَىٰ نُوحٍ أَنَّهُۥ لَن يُؤْمِنَ مِن قَوْمِكَ إِلَّا مَن قَدْ ءَامَنَ فَلَا تَبْتَئِسْ بِمَا كَانُواْ يَفْعَلُونَ ﴿٣٦﴾

وَٱصْنَعِ ٱلْفُلْكَ بِأَعْيُنِنَا وَوَحْيِنَا وَلَا تُخَـٰطِبْنِى فِى ٱلَّذِينَ ظَلَمُوٓاْ ۚ إِنَّهُم مُّغْرَقُونَ ﴿٣٧﴾

---

**1**. చూడండి, 71:5-6 మరియు 10:71.

**38**. మరియు నూ'హ్ ఓడ నిర్మిస్తూ ఉన్నప్పుడు, ప్రతిసారి అతనిజాతి నాయకులు అతని ఎదుటనుండి పోయేటప్పుడు అతనితో పరిహాసాలాడే వారు. అతను (నూ'హ్) వారితో అనేవాడు: "ఇప్పుడు మీరు మాతో పరిహాసాలాడుతున్నారు, నిశ్చయంగా మీరు పరిహాసాలాడినట్లే, మేము కూడా మీతో పరిహాసాలాడుతాము.

**39**. "అవమానకరమైన శిక్ష ఎవరిపైకి వస్తుందో మరియు శాశ్వతమైన శిక్ష ఎవరిపై పడుతుందో త్వరలోనే మీరు తెలుసుకుంటారు."

**40**. చివరకు మా ఆజ్ఞ వచ్చింది మరియు పొయ్యి పొంగింది (జలప్రవాహాలు భూమిని చీల్చుకొని రాసాగాయి).[1] అప్పుడు మేము (నూ'హ్‌తో) అన్నాము: "ప్రతిజాతి (పశువుల) నుండి రెండు (ఆడ-మగ) జంటలను మరియు నీ కుటుంబం వారిని - ఇది వరకే సూచించ బడిన వారు తప్ప - మరియు విశ్వసించిన వారిని, అందరినీ దాని (నావ)లోకి ఎక్కించుకో!" అతనిని విశ్వసించినవారు కొందరు మాత్రమే. (1/4)

**41**. * మరియు (నూ'హ్) అన్నాడు: "ఇందులోకి ఎక్కండి అల్లాహ్ పేరుతో దీని పయనం మరియు దీని ఆగటం. నిశ్చయంగా నా ప్రభువు క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత."

وَيَصۡنَعُ ٱلۡفُلۡكَ وَكُلَّمَا مَرَّ
عَلَيۡهِ مَلَأٞ مِّن قَوۡمِهِۦ سَخِرُواْ مِنۡهُۚ
قَالَ إِن تَسۡخَرُواْ مِنَّا فَإِنَّا نَسۡخَرُ
مِنكُمۡ كَمَا تَسۡخَرُونَ ٣٨

فَسَوۡفَ تَعۡلَمُونَ مَن يَأۡتِيهِ
عَذَابٞ يُخۡزِيهِ وَيَحِلُّ عَلَيۡهِ عَذَابٞ
مُّقِيمٌ ٣٩

حَتَّىٰٓ إِذَا جَآءَ أَمۡرُنَا وَفَارَ ٱلتَّنُّورُ
قُلۡنَا ٱحۡمِلۡ فِيهَا مِن كُلّٖ زَوۡجَيۡنِ
ٱثۡنَيۡنِ وَأَهۡلَكَ إِلَّا مَن سَبَقَ عَلَيۡهِ
ٱلۡقَوۡلُ وَمَنۡ ءَامَنَۚ وَمَآ ءَامَنَ مَعَهُۥٓ
إِلَّا قَلِيلٞ ٤٠

۞ وَقَالَ ٱرۡكَبُواْ فِيهَا بِسۡمِ ٱللَّهِ
مَجۡر۪ىٰهَا وَمُرۡسَىٰهَآۚ إِنَّ رَبِّي لَغَفُورٞ
رَّحِيمٞ ٤١

---

**1**. ఇది ఇబ్నె-కసీ'ర్ తాత్పర్యం. చూడండి, 54:11-12. నూ'హ్ తుఫాన్ వచ్చినప్పుడే ఆఫ్రికా మరియు యూరోప్‌ల మధ్య ఉన్న కొండలోయలో నీరు వచ్చి మెడిటరేనియన్ సముద్రం ఏర్పడి ఉండవచ్చని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. నూ'హ్ కుటుంబంవారిలో అతని ముగ్గురు కుమారులు సామ్, హామ్, మురియు యాఫస్ మరియు వారి భార్యలుండిరి. (ఇబ్నె-కసీ'ర్). వారి ప్రార్థనల కొరకు చూడండి, 23:28-29.

وَهِيَ تَجۡرِي بِهِمۡ فِي مَوۡجٖ كَٱلۡجِبَالِ وَنَادَىٰ نُوحٌ ٱبۡنَهُۥ وَكَانَ فِي مَعۡزِلٖ يَٰبُنَيَّ ٱرۡكَب مَّعَنَا وَلَا تَكُن مَّعَ ٱلۡكَٰفِرِينَ ٤٢

42. మరియు అది వారిని పర్వతాలవలే ఎత్తైన అలలలోనికి తీసుకొని పోసాగింది. అప్పుడు నూ'హ్ (పడవనుండి) దూరంగా ఉన్న తన కుమారుణ్ణి పిలుస్తూ (అన్నాడు): "ఓ నా కుమారా! మాతోపాటు (ఓడలోకి) ఎక్కు అవిశ్వాసులలో కలిసిపోకు!"[1]

قَالَ سَـَٔاوِيٓ إِلَىٰ جَبَلٖ يَعۡصِمُنِي مِنَ ٱلۡمَآءِۚ قَالَ لَا عَاصِمَ ٱلۡيَوۡمَ مِنۡ أَمۡرِ ٱللَّهِ إِلَّا مَن رَّحِمَۚ وَحَالَ بَيۡنَهُمَا ٱلۡمَوۡجُ فَكَانَ مِنَ ٱلۡمُغۡرَقِينَ ٤٣

43. మరియు (అతని కుమారుడు) అన్నాడు: "నేను ఒక కొండపైకి ఎక్కి శరణు పొందుతాను, అది నన్ను నీళ్ళనుండి కాపాడుతుంది." (నూ'హ్) అన్నాడు: "ఈ రోజు అల్లాహ్ తీర్పుకు విరుద్ధంగా కాపాడే వాడు ఎవ్వడూ లేడు, ఆయన (అల్లాహ్)యే కరుణిస్తే తప్ప!" అప్పుడే వారి మధ్య ఒక కెరటం రాగా అతడు కూడా మునిగిపోయే వారిలో కలిసిపోయాడు.

وَقِيلَ يَٰٓأَرۡضُ ٱبۡلَعِي مَآءَكِ وَيَٰسَمَآءُ أَقۡلِعِي وَغِيضَ ٱلۡمَآءُ وَقُضِيَ ٱلۡأَمۡرُ وَٱسۡتَوَتۡ عَلَى ٱلۡجُودِيِّۖ وَقِيلَ بُعۡدٗا لِّلۡقَوۡمِ ٱلظَّٰلِمِينَ ٤٤

44. ఆ తరువాత ఆజ్ఞ వచ్చింది: "ఓ భూమీ! నీ నీళ్ళను మ్రింగివేయి. ఓ ఆకాశమా! (కురవటం) ఆపివేయి!" అప్పుడు నీరు (భూమిలోకి) ఇంకి పోయింది. (అల్లాహ్) తీర్పు నెరవేరింది. ఓడ జూదీ కొండ మీద ఆగింది.[2] మరియు అప్పుడు: "దుర్మార్గుల జాతివారు దూర(నాశన)మై పోయారు!" అని అనబడింది.

---

1. అతడు నూ'హ్ యొక్క నాలుగవ కుమారుడు. అతని పేరు **యామ్** మరియు అతని ఇంటి (వంశం) పేరు కనాన్‌గా పేర్కొనబడింది. అతడు సత్యతిరస్కారి కాబట్టి ఓడలో ఎక్కలేదు. కాని ముస్లిమైన అతని భార్య తన పిల్లలతో ఎక్కింది.
2. జూదీ కొండ కుర్దిస్తాన్‌లో, ఇబ్నె 'ఉమర్ ద్వీపానికి ఈశాన్య భాగంలో దాదాపు 25 మైళ్ళ దూరంలో ఉంది.

وَنَادَىٰ نُوحٌ رَّبَّهُۥ فَقَالَ رَبِّ إِنَّ ٱبۡنِي مِنۡ أَهۡلِي وَإِنَّ وَعۡدَكَ ٱلۡحَقُّ وَأَنتَ أَحۡكَمُ ٱلۡحَٰكِمِينَ ٤٥

**45**. మరియు నూ'హ్ తన ప్రభువును వేడుకుంటూ అన్నాడు: "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, నా కుమారుడు నా కుటుంబంలోని వాడు! నీ వాగ్దానం సత్యమైనది మరియు నీవే సర్వోత్తమ న్యాయాధికారివి."

قَالَ يَٰنُوحُ إِنَّهُۥ لَيۡسَ مِنۡ أَهۡلِكَۖ إِنَّهُۥ عَمَلٌ غَيۡرُ صَٰلِحٖۖ فَلَا تَسۡـَٔلۡنِ مَا لَيۡسَ لَكَ بِهِۦ عِلۡمٌۖ إِنِّيٓ أَعِظُكَ أَن تَكُونَ مِنَ ٱلۡجَٰهِلِينَ ٤٦

**46**. ఆయన (అల్లాహ్) జవాబిచ్చాడు: "ఓ నూ'హ్! అతడు నిశ్చయంగా, నీ కుటుంబంలోని వాడు కాడు.[1] నిశ్చయంగా, అతని పనులు మంచివి కావు.[2] కావున నీకు తెలియని విషయం గురించి నన్ను అడగకు. నీవు కూడా మూఢులలో చేరినవాడవు కావద్దు.[3] అని నేను నిన్ను ఉపదేశిస్తున్నాను."

قَالَ رَبِّ إِنِّيٓ أَعُوذُ بِكَ أَنۡ أَسۡـَٔلَكَ مَا لَيۡسَ لِي بِهِۦ عِلۡمٌۖ وَإِلَّا تَغۡفِرۡ لِي وَتَرۡحَمۡنِيٓ أَكُن مِّنَ ٱلۡخَٰسِرِينَ ٤٧

**47**. (నూ'హ్) ఇలా విన్నవించుకున్నాడు: "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, నాకు తెలియని విషయాన్ని గురించి నిన్ను అడిగినందుకు, నేను నీ శరణు వేడుకుంటున్నాను. మరియు నీవు నన్ను క్షమించకపోతే, నన్ను కరుణించక పోతే, నేను నష్టపోయిన వారిలో చేరుతాను."

---

**1**. ఎవరైతే విశ్వసించరో వారు ఒక ప్రవక్త ('అ.స.) యొక్క తండ్రి గానీ, కుమారుడు గానీ, లేక భార్య గానీ, అతని కుటుంబానికి చెందిన వారు కాజాలరు.

**2**. ఎవరైతే విశ్వసించి, సత్కార్యాలు చేయరో వారిని అల్లాహ్ (సు.తా.) శిక్షనుండి, దైవప్రవక్త కూడా రక్షించలేడు. అలాంటప్పుడు ఈ కాలంలో కొందరు ఏవిధంగానైతే అపోహాలలో పడి ఉన్నారో వారిని, వారి పీర్లు, సజ్జాదాలు, వలీలు రక్షిస్తారని అనేది ఎలా సంభవం కాగలదు?

**3**. దీనితో స్పష్టమయ్యేది ఏమిటంటే దైవప్రవక్తలకు అగోచరజ్ఞానం ఉండదు. అగోచరజ్ఞానం కేవలం అల్లాహుతా'ఆలాకు మాత్రమే ఉంది. ప్రవక్తలకు కేవలం అల్లాహుతా'ఆలా వహీ ద్వారా తెలపిన జ్ఞానం మాత్రమే ఉంటుంది.

**48**. ఇలా ఆజ్ఞ ఇవ్వబడింది: "ఓ నూ'హ్! నీవు మరియు నీతో ఉన్న నీజాతి వారు శాంతి మరియు మా ఆశీర్వాదాలతో (ఓడ / జూదీ పర్వతం నుండి) దిగండి. వారిలోని కొన్ని సంఘాలకు మేము కొంతకాలం వరకు సుఖసంతోషాలను ప్రసాదించగలము. ఆ తరువాత మా వద్దనుండి బాధాకరమైన శిక్ష వారిపై పడుతుంది."

قِيلَ يَٰنُوحُ ٱهۡبِطۡ بِسَلَٰمٖ مِّنَّا
وَبَرَكَٰتٍ عَلَيۡكَ وَعَلَىٰٓ أُمَمٖ مِّمَّن
مَّعَكَۚ وَأُمَمٞ سَنُمَتِّعُهُمۡ ثُمَّ
يَمَسُّهُم مِّنَّا عَذَابٌ أَلِيمٞ ٤٨

**49**. (ఓ ప్రవక్తా!) ఇవి అగోచర విషయాలు. వాటిని మేము నీకు మా సందేశం (వ'హీ) ద్వారా తెలుపుతున్నాము. వాటిని నీవుగానీ, నీ జాతివారుగానీ ఇంతకుపూర్వం ఎరుగరు, కనుక సహనంవహించు! నిశ్చయంగా, మంచిఫలితం దైవభీతి గలవారికే లభిస్తుంది.[1]

تِلۡكَ مِنۡ أَنۢبَآءِ ٱلۡغَيۡبِ نُوحِيهَآ
إِلَيۡكَۖ مَا كُنتَ تَعۡلَمُهَآ أَنتَ وَلَا
قَوۡمُكَ مِن قَبۡلِ هَٰذَاۖ فَٱصۡبِرۡۖ إِنَّ
ٱلۡعَٰقِبَةَ لِلۡمُتَّقِينَ ٤٩

**50**. మరియు 'ఆద్ జాతివారి దగ్గరికి వారి సహోదరుడు హూద్‌ను పంపాము. అతను ఇలా అన్నాడు: "నా జాతి ప్రజలారా! మీరు అల్లాహ్‌నే ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక ఆరాధ్య దైవం లేడు. మీరు కేవలం అబద్ధాలు కల్పిస్తున్నారు!

وَإِلَىٰ عَادٍ أَخَاهُمۡ هُودٗاۚ قَالَ يَٰقَوۡمِ
ٱعۡبُدُواْ ٱللَّهَ مَا لَكُم مِّنۡ إِلَٰهٍ
غَيۡرُهُۥٓۖ إِنۡ أَنتُمۡ إِلَّا مُفۡتَرُونَ
٥٠

**51**. "ఓ నాజాతి ప్రజలారా! (ఈ పనికి) నేను మీ నుంచి ఎలాంటి ప్రతిఫలం అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం నన్ను సృజించిన ఆయన వద్దనే ఉంది. ఏమీ? మీరు బుద్ధిని ఉపయోగించరా (అర్థం చేసుకోలేరా)?

يَٰقَوۡمِ لَآ أَسۡـَٔلُكُمۡ عَلَيۡهِ أَجۡرًاۖ إِنۡ
أَجۡرِيَ إِلَّا عَلَى ٱلَّذِي فَطَرَنِيٓۚ
أَفَلَا تَعۡقِلُونَ ٥١

---

**1**. చూడండి, 40:51 మరియు 37:171-173.

52. "మరియు ఓ నాజాతి ప్రజలారా! మీ ప్రభువు క్షమాభిక్షను వేడుకోండి, తరువాత ఆయన వైపుకు పశ్చాత్తాపంతో మరలండి, ఆయన మీ కొరకు ఆకాశం నుండి భారీవర్షాలు కురిపిస్తాడు మరియు మీకు, మీ శక్తిపై మరింత శక్తిని ఇస్తాడు,[1] కావున మీరు నేరస్థులై వెనుదిరగకండి!"

53. వారు అన్నారు: "ఓ హూద్! నీవు మా వద్దకు స్పష్టమైన సూచనను తీసుకొనిరాలేదు మరియు మేము కేవలం నీ మాటలు విని మా దేవతలను వదలిపెట్టలేము మరియు మేము నిన్ను విశ్వసించలేము.

54. "మా దైవాలలో నుండి కొందరు నీకు కీడు కలిగించారు (నిన్ను పిచ్చికి గురిచేశారు) అని మాత్రమే మేము అనగలము!" అతను (హూద్) జవాబిచ్చాడు: "ఆయన (అల్లాహ్) తప్ప![2] మీరు ఆయనకు సాటి కల్పించే వాటితో నిశ్చయంగా, నాకు ఎలాంటి సంబంధంలేదని, నేను అల్లాహ్‌ను సాక్షిగా పెడుతున్నాను మరియు మీరు కూడా సాక్షులుగా ఉండండి;

55. "ఇక మీరంతా కలసి నాకు వ్యతిరేకంగా కుట్రలు పన్నండి. నాకెలాంటి వ్యవధి ఇవ్వకండి.[3]

وَيَٰقَوۡمِ ٱسۡتَغۡفِرُواْ رَبَّكُمۡ ثُمَّ تُوبُوٓاْ
إِلَيۡهِ يُرۡسِلِ ٱلسَّمَآءَ عَلَيۡكُم
مِّدۡرَارٗا وَيَزِدۡكُمۡ قُوَّةً إِلَىٰ قُوَّتِكُمۡ
وَلَا تَتَوَلَّوۡاْ مُجۡرِمِينَ ٥٢

قَالُواْ يَٰهُودُ مَا جِئۡتَنَا بِبَيِّنَةٖ
وَمَا نَحۡنُ بِتَارِكِيٓ ءَالِهَتِنَا عَن
قَوۡلِكَ وَمَا نَحۡنُ لَكَ بِمُؤۡمِنِينَ
٥٣

إِن نَّقُولُ إِلَّا ٱعۡتَرَىٰكَ بَعۡضُ
ءَالِهَتِنَا بِسُوٓءٖۗ قَالَ إِنِّيٓ أُشۡهِدُ ٱللَّهَ
وَٱشۡهَدُوٓاْ أَنِّي بَرِيٓءٞ مِّمَّا
تُشۡرِكُونَ ٥٤

مِن دُونِهِۦۖ فَكِيدُونِي جَمِيعٗا ثُمَّ لَا
تُنظِرُونِ ٥٥

---

1. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "ఎవడైతే విధేయతతో క్షమాభిక్ష వేడుకుంటాడో, అల్లాహుతా'ఆలా అతని ప్రతి కష్టాన్ని దూరంచేసి, అతనికి, అతడు ఊహించని వైపునుండి జీవనోపాధిని సమకూర్చుతాడు." (అబూ-దావూద్ కితాబ్ అల్-విత్ర్, బాబ్ ఫిల్-ఇస్తె'గ్ఫార్ నం. 1518; ఇబ్నె-మాజా నం. 3819).
2. ఈ ఆయతులో వంకర అక్షరా (ఇటాలిక్స్)లలో ఉన్న ఈ భాగం, 55వ ఆయతు మొదటి వాక్యం. ఈ వాక్యాన్ని పూర్తిచేయటానికి ఇక్కడ కలుపబడింది.
3. చూడండి, 7:195.

56. “నిశ్చయంగా, నాకూ మరియు మీకూ ప్రభువైన అల్లాహ్‌నే నేను నమ్ముకున్నాను! ఏ ప్రాణి జుట్టు కూడా ఆయన చేతిలో లేకుండా లేదు.[1] నిశ్చయంగా, నా ప్రభువే ఋజుమార్గం (సత్యం)పై ఉన్నాడు.

57. “ఒకవేళ మీరు వెనుదిరిగితే (మీ ఇష్టం), వాస్తవానికి నేనైతే, నాకివ్వబడిన సందేశాన్ని మీకు అందజేశాను. మరియు నా ప్రభువు మీ స్థానంలో మరొక జాతిని మీకు వారసులుగా చేయగలడు మరియు మీరు ఆయనకు ఏ మాత్రం హాని చేయలేరు. నిశ్చయంగా నాప్రభువే ప్రతిదానికీ రక్షకుడు.”[2]

58. మరియు మా ఆదేశం జారీ అయినప్పుడు, మా కారుణ్యంతో హూద్‌ను మరియు అతనితో పాటు విశ్వసించిన వారిని రక్షించాము మరియు వారిని ఘోర శిక్షనుండి కాపాడాము![3]

59. మరియు వీరే 'ఆద్ జాతి వారు! వారు తమ ప్రభువు సూచన(ఆయత్)లను తిరస్కరించారు మరియు ఆయన ప్రవక్తలకు అవిధేయులయ్యారు మరియు క్రూరుడైన ప్రతి (సత్య) విరోధి ఆజ్ఞలను అనుసరించారు![4]

إِنِّي تَوَكَّلْتُ عَلَى ٱللَّهِ رَبِّي وَرَبِّكُمۚ مَّا
مِن دَآبَّةٍ إِلَّا هُوَ ءَاخِذُۢ بِنَاصِيَتِهَآۚ
إِنَّ رَبِّي عَلَىٰ صِرَٰطٍ مُّسْتَقِيمٍ ﴿٥٦﴾

فَإِن تَوَلَّوْاْ فَقَدْ أَبْلَغْتُكُم مَّآ
أُرْسِلْتُ بِهِۦٓ إِلَيْكُمْۚ وَيَسْتَخْلِفُ رَبِّي
قَوْمًا غَيْرَكُمْ وَلَا تَضُرُّونَهُۥ شَيْـًٔاۚ إِنَّ
رَبِّي عَلَىٰ كُلِّ شَيْءٍ حَفِيظٌ ﴿٥٧﴾

وَلَمَّا جَآءَ أَمْرُنَا نَجَّيْنَا هُودًا
وَٱلَّذِينَ ءَامَنُواْ مَعَهُۥ بِرَحْمَةٍ مِّنَّا
وَنَجَّيْنَٰهُم مِّنْ عَذَابٍ غَلِيظٍ ﴿٥٨﴾

وَتِلْكَ عَادٌۖ جَحَدُواْ بِـَٔايَٰتِ رَبِّهِمْ
وَعَصَوْاْ رُسُلَهُۥ وَٱتَّبَعُوٓاْ أَمْرَ كُلِّ
جَبَّارٍ عَنِيدٍ ﴿٥٩﴾

---

1. చూడండి, 96:15-16.
2. అల్-'హఫీ''జు: Protector, Keeper, Defender, Preserver, రక్షకుడు, పర్యవేక్షకుడు, కనిపెట్టుకొని, కాచుకొని, కావలి ఉండేవాడు. కాపాడే వాడు. చూడండి, 25:45. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.
3. అదొక తీవ్రమైన తుఫాను గాలి. వివరాలకు చూడండి, 54:19-21, 69:6-8, 7:71-72.
4. చూడండి, 7:66.

وَأُتۡبِعُواْ فِي هَٰذِهِ ٱلدُّنۡيَا لَعۡنَةٗ وَيَوۡمَ ٱلۡقِيَٰمَةِۗ أَلَآ إِنَّ عَادٗا كَفَرُواْ رَبَّهُمۡۗ أَلَا بُعۡدٗا لِّعَادٖ قَوۡمِ هُودٖ ٦٠

**60**. మరియు ఇహలోకంలో (అల్లాహ్) శాపం (బహిష్కారం) వారిని వెంబడింప జేయబడింది మరియు పునరుత్థానదినమున కూడా (అల్లాహ్ శాపం వారిని వెంబడించ గలదు).[1] వినండి! నిస్సందేహంగా, ఆద్ జాతివారు తమ ప్రభువును తిరస్కరించారు. కావున చూశారా! హూద్ జాతి వారైన ఆద్‌లు ఎలా (అల్లాహ్ కారుణ్యానికి) దూరమైపోయారో![2] (3/8)

۞ وَإِلَىٰ ثَمُودَ أَخَاهُمۡ صَٰلِحٗاۚ قَالَ يَٰقَوۡمِ ٱعۡبُدُواْ ٱللَّهَ مَا لَكُم مِّنۡ إِلَٰهٍ غَيۡرُهُۥۖ هُوَ أَنشَأَكُم مِّنَ ٱلۡأَرۡضِ وَٱسۡتَعۡمَرَكُمۡ فِيهَا فَٱسۡتَغۡفِرُوهُ ثُمَّ تُوبُوٓاْ إِلَيۡهِۚ إِنَّ رَبِّي قَرِيبٞ مُّجِيبٞ ٦١

**61**. * ఇక స'మూద్ వారి వద్దకు వారి సహోదరుడు 'సాలి'హ్‌ను పంపాము. అతను అన్నాడు: "నా జాతి ప్రజలారా! అల్లాహ్‌నే ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక ఆరాధ్యదేవుడు లేడు. ఆయనే మిమ్మల్ని భూమినుండి పుట్టించి,[3] దానిలో మిమ్మల్ని నివసింపజేశాడు.[4] కనుక మీరు ఆయన క్షమాభిక్ష వేడుకోండి, తరువాత ఆయన వైపునకే పశ్చాత్తాపంతో మరలండి. నిశ్చయంగా నా ప్రభువు దగ్గరలోనే ఉన్నాడు. (మీ ప్రార్థనలకు) జవాబిస్తాడు."[5]

---

**1**. ల'అనతున్: Wrath, Curse, Banishment, అల్లాహ్ (సు.తా.) అనుగ్రహం నుండి దూరం చేయబడటం, ప్రజల నుండి శపించబడటం, **బహిష్కారం**, దూషించ, గర్హించ, విసర్జించ బడటం పునరుత్థాన దినమున అవమానానికి మరియు అల్లాహ్ (సు.తా.) శిక్షకు గురిఅవటం.

**2**. బు'ఉద: అల్లాహ్ అనుగ్రహాన్ని కోల్పోవటం.

**3**. మానవుడిని భూమినుండి - మట్టినుండి - అంటే ఈ భూమిలో దొరికే మూలపదార్థా (Elements)లతో సృష్టించాడు. ఇంకా చూడండి, 3:59, 18:37, 22:5 మరియు 30:20.

**4**. చూడండి, 7:74.

**5**. **అల్-ముజీబు:** The Answerer of prayers, Responding, Replying. తన దాసుల ప్రార్థనలకు ప్రత్యుత్తరమిచ్చు, **జవాబిచ్చు**, సమాధానమిచ్చు, అంగీకరించు వాడు. చూడండి, 2:186.

62. వారన్నారు: "ఓ 'సాలి'హ్! ఇంతకు ముందు మేము నీపై ఆశలు పెట్టుకొని ఉన్నాము. ఏమీ? మా తండ్రితాతలు ఆరాధిస్తూవచ్చిన వాటిని (దైవాలను) ఆరాధించకుండా, మమ్మల్ని ఆపదలచుకున్నావా? నీవు మాకు బోధించే (ధర్మం) విషయం గురించి వాస్తవంగా మాకు చాలా సందేహం ఉంది."

قَالُواْ يَٰصَٰلِحُ قَدۡ كُنتَ فِينَا مَرۡجُوّٗا قَبۡلَ هَٰذَآۖ أَتَنۡهَىٰنَآ أَن نَّعۡبُدَ مَا يَعۡبُدُ ءَابَآؤُنَا وَإِنَّنَا لَفِي شَكّٖ مِّمَّا تَدۡعُونَآ إِلَيۡهِ مُرِيبٖ ٦٢

63. ('సాలి'హ్) అన్నాడు: "ఓ నా జాతి సోదరులారా! ఏమీ? మీరు చూడరా (ఆలోచించరా?) నేను నా ప్రభువు యొక్క స్పష్టమైన (నిదర్శనంపై) ఉన్నాను. మరియు ఆయన నాకు తన కారుణ్యాన్ని ప్రసాదించాడు. ఇక నేను ఆయన (అల్లాహ్) ఆజ్ఞను ఉల్లంఘిస్తే,[1] అల్లాహ్‌కు విరుద్ధంగా నాకు ఎవడు సహాయపడ గలడు? మీరు నాకు నష్టం తప్ప మరేమి అధికం చేయటం లేదు.

قَالَ يَٰقَوۡمِ أَرَءَيۡتُمۡ إِن كُنتُ عَلَىٰ بَيِّنَةٖ مِّن رَّبِّي وَءَاتَىٰنِي مِنۡهُ رَحۡمَةٗ فَمَن يَنصُرُنِي مِنَ ٱللَّهِ إِنۡ عَصَيۡتُهُۥۖ فَمَا تَزِيدُونَنِي غَيۡرَ تَخۡسِيرٖ ٦٣

64. "మరియు నాజాతి ప్రజలారా! అల్లాహ్ యొక్క ఈ ఆడ ఒంటె మీ కొరకు ఒక అద్భుత సూచన! కావున దీనిని అల్లాహ్ భూమిలో స్వేచ్ఛగా మేయటానికి వదలిపెట్టండి. దానికి ఎలాంటి కీడు కలిగించకండి, లేదా త్వరలోనే మిమ్మల్ని శిక్ష పట్టుకోగలదు."[2]

وَيَٰقَوۡمِ هَٰذِهِۦ نَاقَةُ ٱللَّهِ لَكُمۡ ءَايَةٗۖ فَذَرُوهَا تَأۡكُلۡ فِيٓ أَرۡضِ ٱللَّهِۖ وَلَا تَمَسُّوهَا بِسُوٓءٖ فَيَأۡخُذَكُمۡ عَذَابٞ قَرِيبٞ ٦٤

---

1. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞను ఉల్లంఘించటం, అంటే ఇక్కడ: "సత్యం వైపునకు మరియు ఏకైక ఆరాధ్యుడు, అల్లాహుతా'ఆలా వైపునకు పిలవటాన్ని మానుకోవటం." ఇదే కదా! సత్యతిరస్కారులు కోరుతున్నది. ఇంకా చూడండి, 4:48.
2. స'మూద్ జాతి ప్రజలు తమ ప్రవక్త 'సాలి'హ్ ('అ.స.)తో: "నీవు దైవప్రవక్తవే అయితే మాకొక అద్భుత సూచనగా ఈ బండరాయినుండి ఒక ఆడఒంటెను తీసుకురా?" అని గట్టిగా పట్టుపట్టి అడగ్గా వచ్చిన ఆడఒంటె అది.

**65**. అయినా వారు దానిని, వెనుక కాలి మోకాలినరం కోసి చంపారు. అప్పుడు అతను (సాలి'హ్) వారితో అన్నాడు: "మీరు మీ ఇండ్లలో మూడు రోజులు మాత్రమే హాయిగా గడపండి. ఇదొక వాగ్దానం, ఇది అబద్ధం కాబోదు."

فَعَقَرُوهَا فَقَالَ تَمَتَّعُواْ فِي دَارِكُمْ ثَلَٰثَةَ أَيَّامٍۖ ذَٰلِكَ وَعۡدٌ غَيۡرُ مَكۡذُوبٍ ٦٥

**66**. ఆ తరువాత మా ఆదేశం జారీ అయినప్పుడు, మేము సాలి'హ్‌ను మరియు అతనితో పాటు విశ్వసించిన వారిని మా కారుణ్యంతో రక్షించాము. వారిని ఆ దినపు అవమానంనుండి కాపాడాము. నిశ్చయంగా, నీ ప్రభువు! ఆయన మాత్రమే, మహా బలవంతుడు, సర్వశక్తి సంపన్నుడు.

فَلَمَّا جَآءَ أَمۡرُنَا نَجَّيۡنَا صَٰلِحٗا وَٱلَّذِينَ ءَامَنُواْ مَعَهُۥ بِرَحۡمَةٖ مِّنَّا وَمِنۡ خِزۡيِ يَوۡمِئِذٍۚ إِنَّ رَبَّكَ هُوَ ٱلۡقَوِيُّ ٱلۡعَزِيزُ ٦٦

**67**. మరియు దుర్మార్గానికి పాల్పడిన వారిపై ఒక పెద్ద అరుపు (ప్రేలుడు) పడి, వారు తమ ఇండ్లలోనే చలనంలేకుండా (చచ్చి) పడిపోయారు;[1]

وَأَخَذَ ٱلَّذِينَ ظَلَمُواْ ٱلصَّيۡحَةُ فَأَصۡبَحُواْ فِي دِيَٰرِهِمۡ جَٰثِمِينَ ٦٧

**68**. వారెన్నడూ అక్కడ నివసించనే లేదన్నట్లుగా. చూడండి! వాస్తవానికి, స'మూద్ జాతివారు తమ ప్రభువును తిరస్కరించారు. కాబట్టి చూశారా! స'మూద్ వారెలా దూరమై (నశించి) పోయారో!

كَأَن لَّمۡ يَغۡنَوۡاْ فِيهَآۗ أَلَآ إِنَّ ثَمُودَاْ كَفَرُواْ رَبَّهُمۡۗ أَلَا بُعۡدٗا لِّثَمُودَ ٦٨

**69**. మరియు వాస్తవానికి మా దూతలు శుభవార్త తీసుకొని ఇబ్రాహీమ్ వద్దకు వచ్చారు. వారు అన్నారు: "నీకు శాంతి కలుగు గాక (సలాం)!" అతను: "మీకూ శాంతి కలుగు గాక (సలాం)!" అని జవాబిచ్చాడు. తరువాత అతను అతి త్వరగా, వేపిన దూడను (వారి ఆతిథ్యానికి) తీసుకొని వచ్చాడు.

وَلَقَدۡ جَآءَتۡ رُسُلُنَآ إِبۡرَٰهِيمَ بِٱلۡبُشۡرَىٰ قَالُواْ سَلَٰمٗاۖ قَالَ سَلَٰمٞۖ فَمَا لَبِثَ أَن جَآءَ بِعِجۡلٍ حَنِيذٖ ٦٩

---

1. ఇక్కడ అరుపు (సై'హతున్) అని ఉంది మరియు 7:78 లో భూకంపం (రజ్‌ఫతున్) అని ఉంది. రెండూ వచ్చాయన్నమాట.

فَلَمَّا رَءَآ أَيْدِيَهُمْ لَا تَصِلُ إِلَيْهِ
نَكِرَهُمْ وَأَوْجَسَ مِنْهُمْ
خِيفَةً قَالُوا۟ لَا تَخَفْ إِنَّآ أُرْسِلْنَآ
إِلَىٰ قَوْمِ لُوطٍ ﴿٧٠﴾
وَٱمْرَأَتُهُۥ قَآئِمَةٌ فَضَحِكَتْ
فَبَشَّرْنَٰهَا بِإِسْحَٰقَ وَمِن وَرَآءِ
إِسْحَٰقَ يَعْقُوبَ ﴿٧١﴾
قَالَتْ يَٰوَيْلَتَىٰٓ ءَأَلِدُ وَأَنَا۠ عَجُوزٌ
وَهَٰذَا بَعْلِى شَيْخًا ۖ إِنَّ هَٰذَا
لَشَىْءٌ عَجِيبٌ ﴿٧٢﴾

**70**. కానీ వారి చేతులు దానివైపు పోక పోవటం చూసి[1] వారిని గురించి అనుమానంలో పడ్డాడు మరియు వారి నుండి అపాయం కలుగుతుందేమోనని భయపడ్డాడు! వారన్నారు: "భయపడకు! వాస్తవానికి మేము లూ'త్ జాతి వైపునకు పంపబడిన వారము (దూతలము)."[2]

**71**. అతని (ఇబ్రాహీమ్) భార్య (అక్కడే) నిలబడి ఉండెను; అప్పుడామె నవ్వింది; పిదప మేము ఆమెకు ఇస్'హాఖ్ యొక్క మరియు ఇస్'హాఖ్ తరువాత య'అఖూబ్ యొక్క శుభవార్తను ఇచ్చాము.[3]

**72**. ఆమె (ఆశ్చర్యంతో) అన్నది: "నా దౌర్భాగ్యం! నాకిప్పుడు బిడ్డ పుడుతాడా? నేను ముసలిదానిని మరియు నా ఈ భర్త కూడా వృద్ధుడు. (అలా అయితే) నిశ్చయంగా, ఇది చాలా విచిత్రమైన విషయమే!"

---

**1**. ఇబ్రాహీం ('అ.స.) అతిథులు అతను తెచ్చిన, వేచిన ఆవుదూడ మాంసం తిననందుకు, అతను వారు తనతో శత్రుత్వం వహిస్తారేమోనని భయపడ్డారు. దీనితో విషదమయ్యే మరొక విషయమేమిటంటే ప్రవక్తలకు అగోచరజ్ఞానముండదు. అతనికి అగోచరజ్ఞానముంటే వారు దైవదూతలని అతనికి తెలిసిఉండేది. అతను వారికొరకు వేపిన ఆవుదూడ తెచ్చేవారు కాదు.

**2**. లూ'త్ ('అ.స.) ఇబ్రహీమ్ ('అ.స.) సోదరుని కుమారులు. అతను జోర్డాన్‌కు తూర్పుదిక్కు ఈ నాడు లూ'త్ సముద్రం (Dead sea) అనే ప్రాంతంలో నివసించే వారు. ఇబ్రాహీం ('అ.స.) వలే, లూ'త్ ('అ.స.) కూడా, దక్షిణ బాబిలోనియా (Babylonia) లోని 'ఊర్' అనే ప్రాంతవాసులు. తన పిన్నాన్నతో సహా ఇక్కడికి వలసవచ్చారు. కావున లూ'త్ ('అ.స.) ప్రజలు అంటే అతని జాతివారు కాదు, కాని పైన పేర్కొన్న ప్రాంతంలోని సోదోమ్ మరియు గొమొర్రాహ్ అనే నగరాల వాసులు.

**3**. ఇబ్రాహీం ('అ.స.) భార్య సారా (అలైహా స.) నవ్వటానికి వ్యాఖ్యాతలు విభిన్న కారణాలు పేర్కొన్నారు: 1) ఆమెకు లూ'త్ ('అ.స.) జాతివారి దుష్చేష్టలు తెలుసు కావున వారి నాశనాన్ని గురించి విని, సంతోషంతో నవ్విందని. 2) వృద్ధాప్యంలో తనకు ఇవ్వబడిన సంతానపు వార్తవిని ఆశ్చర్యంతో నవ్విందని.

قَالُوٓاْ أَتَعۡجَبِينَ مِنۡ أَمۡرِ ٱللَّهِۖ
رَحۡمَتُ ٱللَّهِ وَبَرَكَٰتُهُۥ عَلَيۡكُمۡ أَهۡلَ
ٱلۡبَيۡتِۚ إِنَّهُۥ حَمِيدٞ مَّجِيدٞ ٧٣

73. వారన్నారు: "అల్లాహ్ ఉత్తరువు విషయంలో మీరు ఆశ్చర్యపడుతున్నారా? ఓ (ఇబ్రాహీమ్) గృహస్థులారా![1] మీపై అల్లాహ్ కారుణ్యం మరియు ఆయన శుభాశీస్సులు ఉన్నాయి! నిశ్చయంగా, ఆయనే సర్వ స్తోత్రాలకు అర్హుడు, మహత్త్వపూర్ణుడు."[2]

فَلَمَّا ذَهَبَ عَنۡ إِبۡرَٰهِيمَ ٱلرَّوۡعُ
وَجَآءَتۡهُ ٱلۡبُشۡرَىٰ يُجَٰدِلُنَا فِي
قَوۡمِ لُوطٍ ٧٤

74. అప్పుడు ఇబ్రాహీమ్ భయం దూరమై, అతనికి (సంతానపు) శుభవార్త అందిన తరువాత, అతను లూ'త్ జాతివారి కొరకు మాతో వాదించసాగాడు.[3]

إِنَّ إِبۡرَٰهِيمَ لَحَلِيمٌ أَوَّٰهٞ مُّنِيبٞ ٧٥

75. (ఎందుకంటే) వాస్తవానికి, ఇబ్రాహీమ్ సహనశీలుడు, మృదుహృదయుడు (నమ్రతతో అల్లాహ్ను అర్థించేవాడు) మరియు పశ్చాత్తాపంతో (అల్లాహ్ వైపుకు) మరలేవాడు!

يَٰٓإِبۡرَٰهِيمُ أَعۡرِضۡ عَنۡ هَٰذَآۖ إِنَّهُۥ قَدۡ
جَآءَ أَمۡرُ رَبِّكَۖ وَإِنَّهُمۡ ءَاتِيهِمۡ
عَذَابٌ غَيۡرُ مَرۡدُودٖ ٧٦

76. (వారన్నారు): "ఓ ఇబ్రాహీమ్! దీనిని (నీ మధ్యవర్తిత్వాన్ని) మానుకో! నిశ్చయంగా, నీ ప్రభువు ఆజ్ఞ వచ్చివున్నది. మరియు నిశ్చయంగా, వారిపై ఆ శిక్ష పడటం తప్పదు; అది నివారించబడదు."

---

1. అహ్లున్: Family, ఒక కుటుంబం / సంసారం / తెగ / వంశం వారు, ఒక (House) గృహ వాసులు, ఒక నగర వాసులు లేక ఒక దేశ వాసులు.
2. **అల్-మజీదు**: The Glorious, Great in Dignity, who gives liberally or bountifully. The Bountiful, Benificient, Exalted, Noble, Sublime. **మహత్త్వపూర్ణుడు. అల్-మాజిదు** (సేకరించబడిన పదం): వీటికి వైభవం గలవాడు, ప్రభావం, ప్రతాపం విశిష్టత, ఘనత గలవాడు, దివ్యుడు, **మహిమాన్వితుడు**, ఉత్కృష్టుడు, శ్రేష్ఠుడు, ఔదార్యుడు, ప్రశంసనీయుడు అనే అర్థాలున్నాయి. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు. చూడండి, 85:15. ఈ పదం **దివ్యఖుర్ఆన్** కొరకు గూడా వాడబడింది, Glorious, Noble, **దివ్యమైన**, ఉత్కృష్టమైన అనే అర్థాలలో, **అల్-కరీము** మాదిరిగా చూడండి, 50:1, 85:21.
3. ఇబ్రాహీం ('అ.స.) అన్నారు: "మీరు నాశనం చేయబోయే నగరంలో లూ'త్ ('అ.స.) కూడా ఉన్నాడు." దానికి దైవదూతలు జవాబిచ్చారు: "మాకు తెలుసు, మేము అతనిని మరియు అతనితోబాటు విశ్వసించినవారిని కాపాడుతాము. అతని భార్యతప్ప." చూడండి, 29:32.

77. మరియు మా దూతలు లూ'త్ వద్దకు వచ్చినపుడు, వారి రాకకు అతను, (వారిని కాపాడలేనని) దుఃఖితుడయ్యాడు. అతని హృదయం కృంగిపోయింది. అతను: "ఈ దినం చాలా ఆందోళనకరమైనది." అని వాపోయాడు.

78. మరియు అతని జాతిప్రజలు అతని వైపుకు పరిగెత్తుకుంటూ వచ్చారు. వారు మొదటి నుండి నీచపుపనులు చేస్తూ ఉండేవారు. అతను (లూ'త్) అన్నాడు: "నాజాతి ప్రజలారా! ఇదిగో నా ఈ కుమార్తెలు (నా జాతి స్త్రీలు) ఉన్నారు,[1] వీరు మీ కొరకు చాలా శ్రేష్ఠమైన వారు. అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నా అతిథుల విషయంలో నన్ను అవమానంపాలు చేయకండి. ఏమీ? మీలో ఒక్కడైనా నీతిపరుడు లేడా?"[2]

79. వారన్నారు: "నీ కూతుళ్ళు మాకు అవసరం లేదని నీకు బాగా తెలుసు కదా! మరియు నిశ్చయంగా, మేము కోరేది ఏమిటో కూడా నీకు బాగా తెలుసు!"

80. అతను (లూ'త్) అన్నాడు: "మిమ్మల్ని ఎదుర్కొనే బలం నాకుంటే, లేక శరణు పొందటానికి పటిష్ఠమైన ఆధారమైనా ఉండి ఉంటే ఎంత బాగుండేది?"[3]

وَلَمَّا جَآءَتۡ رُسُلُنَا لُوطٗا سِيٓءَ
بِهِمۡ وَضَاقَ بِهِمۡ ذَرۡعٗا وَقَالَ
هَٰذَا يَوۡمٌ عَصِيبٞ ٧٧

وَجَآءَهُۥ قَوۡمُهُۥ يُهۡرَعُونَ إِلَيۡهِ وَمِن
قَبۡلُ كَانُواْ يَعۡمَلُونَ ٱلسَّيِّـَٔاتِۚ
قَالَ يَٰقَوۡمِ هَٰٓؤُلَآءِ بَنَاتِي هُنَّ
أَطۡهَرُ لَكُمۡۖ فَٱتَّقُواْ ٱللَّهَ وَلَا
تُخۡزُونِ فِي ضَيۡفِيٓۖ أَلَيۡسَ مِنكُمۡ
رَجُلٞ رَّشِيدٞ ٧٨

قَالُواْ لَقَدۡ عَلِمۡتَ مَا لَنَا فِي بَنَاتِكَ
مِنۡ حَقّٖ وَإِنَّكَ لَتَعۡلَمُ مَا نُرِيدُ ٧٩

قَالَ لَوۡ أَنَّ لِي بِكُمۡ قُوَّةً أَوۡ ءَاوِيٓ
إِلَىٰ رُكۡنٖ شَدِيدٖ ٨٠

1. నా కుమార్తెలు, అంటే నా జాతి కుమార్తెలు (ఇబ్నె-కసీ'ర్).
2. లూ'త్ ('అ.స.) ఒక దైవప్రవక్త అయినప్పటికీ వచ్చిన అతిథులు దైవదూతలని గుర్తించలేక పోయారు. అంటే దైవప్రవక్తలకు అగోచరజ్ఞానం ఉండదని విశదమౌతోంది.
3. దీనితో అర్థమయ్యేదేమిటంటే దైవప్రవక్తలకు అగోచరజ్ఞానం ఉండదు. వారికి ప్రతిదీ చేయగల సామర్థ్యం కూడా ఉండదు. మరొక విషయం ఏమిటంటే దైవప్రవక్తలు కూడా, అల్లాహ్ (సు.తా.) కోరితే అంతా చేస్తాడని కూర్చొక తమకు సాధ్యమైనంతవరకు సమస్యలను తామే పరిష్కరించుకోడానికి ప్రయత్నిస్తారు.

**81**. వారు (దైవదూతలు) అన్నారు: "ఓ లూ'త్! నిశ్చయంగా, మేము నీ ప్రభువు తరఫునుండి వచ్చిన దూతలము! వారు ఏ మాత్రం నీ వద్దకు చేరలేరు. కావున కొంత రాత్రి మిగిలి ఉండగానే నీవు నీ ఇంటి వారిని తీసుకొని బయలుదేరు - నీ భార్య తప్ప - మీలో ఎవ్వరూ వెనుకకు తిరిగి చూడగూడదు. నిశ్చయంగా, వారికి ఏ ఆపద సంభవించనున్నదో అదే ఆమె (నీ భార్య)కూ సంభవిస్తుంది.[1] నిశ్చయంగా, వారి నిర్ణీతకాలం ఉదయపు సమయం. ఏమీ? ఉదయం సమీపంలోనే లేదా?"

**82**. మా తీర్పుసమయం వచ్చినపుడు మేము దానిని (సోడోంను) తలక్రిందులుగా జేసి, దాని మీద మట్టితోచేసి కాల్చిన గులక రాళ్ళను ఎడతెగకుండా కురిపించాము.[2]

**83**. అవి నీ ప్రభువు తరఫునుండి గుర్తువేయబడినవి. అది (ఆ శిక్ష) ఈ దుర్మార్గులకు ఎంతో దూరంలో లేదు. (1/2)

**84**. * ఇక మద్‌యన్ వారి వద్దకు వారి సహోదరుడైన షు'ఐబ్‌ను పంపాము.[3] అతను అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! మీరు అల్లాహ్‌నే ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక ఆరాధ్య దైవం లేడు. కొలతల్లో మరియు తూనికల్లో తగ్గించి ఇవ్వకండి. నేను నిశ్చయంగా, మిమ్మల్ని (ఇప్పుడు) మంచి స్థితిలో చూస్తున్నాను; కాని వాస్తవానికి మీపై ఆ రోజు చుట్టుముట్టబోయే శిక్షను గురించి నేను భయపడుతున్నాను.

قَالُواْ يَٰلُوطُ إِنَّا رُسُلُ رَبِّكَ لَن
يَصِلُوٓاْ إِلَيۡكَۖ فَأَسۡرِ بِأَهۡلِكَ بِقِطۡعٖ
مِّنَ ٱلَّيۡلِ وَلَا يَلۡتَفِتۡ مِنكُمۡ أَحَدٌ
إِلَّا ٱمۡرَأَتَكَۖ إِنَّهُۥ مُصِيبُهَا مَآ أَصَابَهُمۡۚ
إِنَّ مَوۡعِدَهُمُ ٱلصُّبۡحُۚ أَلَيۡسَ ٱلصُّبۡحُ
بِقَرِيبٖ ﴿٨١﴾

فَلَمَّا جَآءَ أَمۡرُنَا جَعَلۡنَا عَٰلِيَهَا
سَافِلَهَا وَأَمۡطَرۡنَا عَلَيۡهَا حِجَارَةٗ
مِّن سِجِّيلٖ مَّنضُودٖ ﴿٨٢﴾
مُّسَوَّمَةً عِندَ رَبِّكَۖ وَمَا هِيَ مِنَ
ٱلظَّٰلِمِينَ بِبَعِيدٖ ﴿٨٣﴾
۞ وَإِلَىٰ مَدۡيَنَ أَخَاهُمۡ شُعَيۡبٗاۚ قَالَ
يَٰقَوۡمِ ٱعۡبُدُواْ ٱللَّهَ مَا لَكُم
مِّنۡ إِلَٰهٍ غَيۡرُهُۥۖ وَلَا تَنقُصُواْ
ٱلۡمِكۡيَالَ وَٱلۡمِيزَانَۚ إِنِّيٓ
أَرَىٰكُم بِخَيۡرٖ وَإِنِّيٓ أَخَافُ
عَلَيۡكُمۡ عَذَابَ يَوۡمٖ مُّحِيطٖ ﴿٨٤﴾

---

1. చూడండి, 7:83 మరియు 66:10 లూ'త్ భార్య అవిశ్వాసి. ఆమె సోడోమ్ వాసి.
2. ఇటువంటి గులకరాళ్ళు 7:84 మరియు 105:4లలో కూడా పేర్కొనబడ్డాయి.
3. మద్‌యన్ వారి గాథ కొరకు చూడండి, 7:85.

وَيَٰقَوۡمِ أَوۡفُواْ ٱلۡمِكۡيَالَ وَٱلۡمِيزَانَ بِٱلۡقِسۡطِۖ وَلَا تَبۡخَسُواْ ٱلنَّاسَ أَشۡيَآءَهُمۡ وَلَا تَعۡثَوۡاْ فِي ٱلۡأَرۡضِ مُفۡسِدِينَ ٨٥

**85**. "మరియు ఓ నా జాతి ప్రజలారా! మీరు న్యాయంగా మరియు సరిగ్గా కొలవండి మరియు తూకంచేయండి. మరియు ప్రజలకు వారి వస్తువులను తక్కువజేసి ఇవ్వకండి.[1] మరియు భూమిలో అనర్థాన్ని, కల్లోలాన్ని వ్యాపింపజేయకండి.

بَقِيَّتُ ٱللَّهِ خَيۡرٞ لَّكُمۡ إِن كُنتُم مُّؤۡمِنِينَۚ وَمَآ أَنَا۠ عَلَيۡكُم بِحَفِيظٖ ٨٦

**86**. "మీరు విశ్వాసులే అయితే, (ప్రజలకు వారి హక్కు ఇచ్చిన తరువాత) అల్లాహ్ మీ కొరకు మిగిల్చినదే మీకు మేలైనది.[2] మరియు నేను మీ రక్షకుడను కాను."[3]

قَالُواْ يَٰشُعَيۡبُ أَصَلَوٰتُكَ تَأۡمُرُكَ أَن نَّتۡرُكَ مَا يَعۡبُدُ ءَابَآؤُنَآ أَوۡ أَن نَّفۡعَلَ فِيٓ أَمۡوَٰلِنَا مَا نَشَٰٓؤُاْۖ إِنَّكَ لَأَنتَ ٱلۡحَلِيمُ ٱلرَّشِيدُ ٨٧

**87**. వారు (వ్యంగంగా) అన్నారు: "ఓ షుఐబ్! ఏమీ? మా తండ్రితాతలు ఆరాధించే దేవతలను మేము వదలిపెట్టాలని, లేదా మా ధనాన్ని నీ ఇష్టప్రకారం ఖర్చు చేయాలని, నీకు నీ నమాజ్ నేర్పుతుందా?[4] (అయితే) నిశ్చయంగా, ఇక నీవే చాలా సహనం కలవాడవు, నీతిపరుడవు!"[5]

---

**1**. చూడండి, 83:1-3.

**2**. చూడండి, 18:46, 19:76 'అల్లాహ్ మీ కొరకు మిగిల్చేది,' అంటే మీరు న్యాయంగా నడుచుకొని మీ వ్యాపారాలలో సరిగ్గా కొలిచి, తూచి ఇచ్చిన తరువాత మిగిలే లాభం, అని అర్థం.

**3**. నేను మీకుచేసే ఉపదేశం కేవలం అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞప్రకారం చేస్తున్నాను. మిమ్మల్ని దుష్టకార్యాలనుండి ఆపటంగానీ లేక శిక్షించటంగానీ నాపనికాదు. అది కేవలం అల్లాహ్ (సు.తా.) పని మాత్రమే.

**4**. 'సలాతున్: అంటే ఇక్కడ ధర్మం, ఆరాధన అని అర్థం.

**5**. అర్-రషీద్: The Director to the Right Path, Leader. సన్మార్గం చూపువాడు. నీతిపరుడు, సన్మార్గగామిని, ఋజువర్తనుడు.

**88**. అప్పుడు అతను (షు'ఐబ్) అన్నాడు: "ఓ నా జాతి ప్రజలారా! ఏమీ? మీరు చూశారా (ఆలోచించారా)? ఒకవేళ నేను నా ప్రభువు తరఫునుండి స్పష్టమైన నిదర్శనాన్ని కలిగిఉండి మరియు ఆయన నాకు తన తరఫునుండి మంచి జీవనోపాధిని కూడా ప్రసాదించినపుడు (నేను ఇలా కాకుండా మరేమి అనగలను)? నేను మిమ్మల్ని నిషేధించిన దానికి వ్యతిరేకంగా చేయదలచు కోలేదు. నేను మాత్రం మిమ్మల్ని నాశక్తి మేరకు సంస్కరించదలచుకున్నాను. నా కార్యసిద్ధి కేవలం అల్లాహ్ పైననే ఆధారపడివుంది. నేను ఆయననే నమ్ముకున్నాను మరియు నేను ఆయన వైపునకే పశ్చాత్తాపంతో మరలుతాను.

**89**. "మరియు ఓ నాజాతి ప్రజలారా! నాతో ఉన్న భేదాభిప్రాయం మిమ్మల్ని నూ'హ్ జాతివారిపై, హూద్ జాతివారిపై లేక 'సాలి'హ్ జాతివారిపై పడినటువంటి శిక్షకు గురిచేయ కూడదు సుమా! మరియు లూ'త్ జాతివారు మీకు ఎంతోదూరం వారు కారు కదా![1]

**90**. "మరియు మీరు మీ ప్రభువు క్షమా భిక్షను కోరుకోండి. మరియు ఆయన వైపునకు పశ్చాత్తాపంతో మరలండి. నిశ్చయంగా, నా ప్రభువు అపార కరుణాప్రదాత వాత్సల్యుడు."[2]

قَالَ يَٰقَوۡمِ أَرَءَيۡتُمۡ إِن كُنتُ عَلَىٰ
بَيِّنَةٖ مِّن رَّبِّي وَرَزَقَنِي مِنۡهُ رِزۡقًا
حَسَنٗاۚ وَمَآ أُرِيدُ أَنۡ أُخَالِفَكُمۡ إِلَىٰ
مَآ أَنۡهَىٰكُمۡ عَنۡهُۚ إِنۡ أُرِيدُ
إِلَّا ٱلۡإِصۡلَٰحَ مَا ٱسۡتَطَعۡتُۚ وَمَا
تَوۡفِيقِيٓ إِلَّا بِٱللَّهِۚ عَلَيۡهِ تَوَكَّلۡتُ وَإِلَيۡهِ
أُنِيبُ ٨٨

وَيَٰقَوۡمِ لَا يَجۡرِمَنَّكُمۡ شِقَاقِيٓ أَن
يُصِيبَكُم مِّثۡلُ مَآ أَصَابَ قَوۡمَ نُوحٍ
أَوۡ قَوۡمَ هُودٍ أَوۡ قَوۡمَ صَٰلِحٖۚ وَمَا قَوۡمُ
لُوطٖ مِّنكُم بِبَعِيدٖ ٨٩
وَٱسۡتَغۡفِرُواْ رَبَّكُمۡ ثُمَّ تُوبُوٓاْ
إِلَيۡهِۚ إِنَّ رَبِّي رَحِيمٞ وَدُودٞ ٩٠

---

1. చూడండి, 7:85 షు'ఐబ్ ('అ.స.) మూసా ('అ.స.) యొక్క భార్య తండ్రి అని కొందరు వ్యాఖ్యాతలు అంటారు. మరికొందరు, ఇతను ఆ షు'ఐబ్ కారు అంటారు. అతడు ఉన్న ప్రాంతం ఈ నాటి అఖబా అఖాతం (Gulf of Aqabah) నుండి పడమటి వైపునకు సినాయి ద్వీపకల్పంలో మోబ్ (Moab) పర్వతం వరకు మరియు తూర్పు దిశలో మృత సముద్రం (Dead sea) వరకు ఉంది. దాని వాసులు అమోరైట్ తెగకు చెందిన అరబ్బులు. మృత సముద్రం (Dead sea) దగ్గరలోనే సోడోమ్ మరియు గొమర్రాహ్ నగరాలు కూడా ఉండేవి.
2. అల్-వదూదు: Affectionate, The Loving towards His servants. Or towards those who obey. తన దాసుల పట్ల **వాత్సల్యం**, ప్రేమ, ప్రీతి గలవాడు. చూడండి, 85:14. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

91. వారన్నారు: "ఓ షు'ఐబ్! నీవు చెప్పే మాటలు చాలావరకు మేము గ్రహించలేకపోతున్నాం.[1] మరియు నిశ్చయంగా నీవు మాలో బలహీనుడివిగా పరిగణించబడుతున్నావు. మరియు నీ కుటుంబం వారే గనక లేకుంటే! మేము నిశ్చయంగా, నిన్ను రాళ్ళు రువ్వి చంపేవారం. మరియు నీవు మాకంటే శక్తిశాలివి కావు."

92. అతడు అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! ఏమీ? నా కుటుంబం మీకు అల్లాహ్ కంటే, ఎక్కువ గౌరవనీయమైనదా? మరియు మీరు ఆయన (అల్లాహ్)ను మీ వీపుల వెనుకకు నెట్టుతారా? నిశ్చయంగా, నా ప్రభువు మీరు చేసే పనులను ఆవరించి ఉన్నాడు.

93. "మరియు ఓ నాజాతి ప్రజలారా! మీ శక్తిమేరకు మీరుచేసేది చేయండి, నిశ్చయంగా (నా శక్తి మేరకు) నేను కూడా చేస్తాను. అవమానకరమైన శిక్ష ఎవరికి పడుతుందో, అసత్యవాది ఎవడో, మీరు ముమ్ముందు తెలుసుకోగలరు. మరియు మీరు నిరీక్షించండి, నిశ్చయంగా, మీతోబాటు నేను కూడా నిరీక్షిస్తాను."

94. చివరకు మా ఆదేశం వచ్చినప్పుడు, మేము షు'ఐబ్‌ను మరియు అతనితో పాటు విశ్వసించినవారిని మా కారుణ్యంతో రక్షించాము మరియు దుర్మార్గులైన వారిపై ఒక తీవ్రమైన అరుపు (పేలుడు) విరుచుకుపడింది. కాబట్టి వారు తమ ఇండ్లలోనే చలనం లేకుండా (చచ్చి) పడిపోయారు;

قَالُواْ يَٰشُعَيۡبُ مَا نَفۡقَهُ كَثِيرٗا مِّمَّا
تَقُولُ وَإِنَّا لَنَرَىٰكَ فِينَا ضَعِيفٗاۖ
وَلَوۡلَا رَهۡطُكَ لَرَجَمۡنَٰكَۖ وَمَآ أَنتَ
عَلَيۡنَا بِعَزِيزٖ ٩١

قَالَ يَٰقَوۡمِ أَرَهۡطِيٓ أَعَزُّ
عَلَيۡكُم مِّنَ ٱللَّهِ وَٱتَّخَذۡتُمُوهُ
وَرَآءَكُمۡ ظِهۡرِيًّاۖ إِنَّ رَبِّي بِمَا
تَعۡمَلُونَ مُحِيطٞ ٩٢

وَيَٰقَوۡمِ ٱعۡمَلُواْ عَلَىٰ مَكَانَتِكُمۡ
إِنِّي عَٰمِلٞۖ سَوۡفَ تَعۡلَمُونَ مَن
يَأۡتِيهِ عَذَابٞ يُخۡزِيهِ وَمَنۡ هُوَ
كَٰذِبٞۖ وَٱرۡتَقِبُوٓاْ إِنِّي مَعَكُمۡ
رَقِيبٞ ٩٣

وَلَمَّا جَآءَ أَمۡرُنَا نَجَّيۡنَا شُعَيۡبٗا وَٱلَّذِينَ
ءَامَنُواْ مَعَهُۥ بِرَحۡمَةٖ مِّنَّا وَأَخَذَتِ
ٱلَّذِينَ ظَلَمُواْ ٱلصَّيۡحَةُ فَأَصۡبَحُواْ فِي
دِيَٰرِهِمۡ جَٰثِمِينَ ٩٤

1. చూడండి, 6:25.

كَأَن لَّمْ يَغْنَوْاْ فِيهَآ أَلَا بُعْدًا لِّمَدْيَنَ كَمَا بَعِدَتْ ثَمُودُ ﴿٩٥﴾

**95**. వారక్కడ ఎన్నడూ నివసించనే లేదన్నట్లుగా! ఈ విధంగా స'మూద్ జాతివారు లేకుండా పోయినట్లు, మద్'యన్ జాతివారు కూడా లేకుండా (నశించి) పోయారు![1]

وَلَقَدْ أَرْسَلْنَا مُوسَىٰ بِـَٔايَـٰتِنَا وَسُلْطَـٰنٍ مُّبِينٍ ﴿٩٦﴾

**96**. మరియు నిశ్చయంగా, మేము మూసాను కూడా మా సూచనలతో మరియు స్పష్టమైన ప్రమాణంతో పంపాము;

إِلَىٰ فِرْعَوْنَ وَمَلَإِيْهِۦ فَٱتَّبَعُوٓاْ أَمْرَ فِرْعَوْنَ ۖ وَمَآ أَمْرُ فِرْعَوْنَ بِرَشِيدٍ ﴿٩٧﴾

**97**. ఫిర్'ఔన్ మరియు అతని నాయకుల వద్దకు; కానీ వారు ఫిర్'ఔన్ ఆజ్ఞలనే అనుసరించారు. మరియు ఫిర్'ఔన్ ఆజ్ఞ సరైనది కాదు.

يَقْدُمُ قَوْمَهُۥ يَوْمَ ٱلْقِيَـٰمَةِ فَأَوْرَدَهُمُ ٱلنَّارَ ۖ وَبِئْسَ ٱلْوِرْدُ ٱلْمَوْرُودُ ﴿٩٨﴾

**98**. పునరుత్థానదినమున అతడు (ఫిర్'ఔన్) తన జాతి వారికి మున్ముందుగా ఉండి, వారిని నరకాగ్నిలోకి తీసుకొని పోతాడు. మరియు అది ప్రవేశించే వారికి ఎంతచెడ్డ గమ్యస్థానం.

وَأُتْبِعُواْ فِى هَـٰذِهِۦ لَعْنَةً وَيَوْمَ ٱلْقِيَـٰمَةِ ۚ بِئْسَ ٱلرِّفْدُ ٱلْمَرْفُودُ ﴿٩٩﴾

**99**. మరియు వారు ఈ లోకంలో శాపంతో వెంబడించబడ్డారు మరియు పునరుత్థానదినమున కూడా (బహిష్కరింప బడతారు). ఎంత చెడ్డ బహుమానం (వారికి) బహూకరించబడుతుంది.

ذَٰلِكَ مِنْ أَنۢبَآءِ ٱلْقُرَىٰ نَقُصُّهُۥ عَلَيْكَ ۖ مِنْهَا قَآئِمٌ وَحَصِيدٌ ﴿١٠٠﴾

**100**. ఇవి కొన్ని (ప్రాచీన) పట్టణాల గాథలు వీటిని మేము నీకు వినిపిస్తున్నాము. వాటిలో కొన్ని నిలిచి (మిగిలి) ఉన్నాయి మరికొన్ని పంటపొలాల మాదిరిగా కోయబడ్డాయి (నిర్మూలించబడ్డాయి).

---

1. అల్లాహుతా'ఆలా అనుగ్రహానికి దూరమై పోయారు.

**101**. మరియు మేము వారికెలాంటి అన్యాయం చేయలేదు. కాని వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు. నీ ప్రభువు ఆజ్ఞ వచ్చినప్పుడు - అల్లాహ్‌ను వదలి - వారు ఏ దేవతలనైతే ప్రార్థించేవారో! వారు, వారికి ఏ విధంగానూ సహాయపడలేక పోయారు. మరియు వారు, వారి వినాశం తప్ప మరేమీ అధికం చేయలేదు.

**102**. మరియు ఈ విధంగా నీ ప్రభువు దుర్మార్గులైన నగర (వాసులను) - పట్టుకొని (శిక్షించ) దలచితే - ఇలాగే పట్టుకొని (శిక్షిస్తాడు). నిశ్చయంగా ఆయన పట్టు చాలా బాధాకర మైనది, ఎంతో తీవ్రమైనది.

**103**. నిశ్చయంగా, ఇందులో పరలోక శిక్షకు భయపడే వారికి ఒక సూచనఉంది. అది సర్వమానవులను సమావేశపరిచే రోజు! ఆ దినమున అందరూ హాజరవుతారు.

**104**. మరియు మేము దానిని కేవలం ఒక నియమితకాలం వరకు మాత్రమే ఆపి ఉన్నాము.

**105**. ఆ దినం వచ్చినప్పుడు, ఆయన (అల్లాహ్) సెలవు లేనిదే, ఏ ప్రాణి కూడా మాట్లాడజాలదు. వారిలో కొందరు దౌర్భాగ్యులుంటారు మరికొందరు భాగ్యవంతులుంటారు.

**106**. దౌర్భాగ్యులైన వారు నరకాగ్నిలో చేరుతారు, అక్కడ వారు దుఃఖంవల్ల మూలుగుతూ ఉంటారు మరియు వెక్కివెక్కి ఏడుస్తూ ఉంటారు.

وَمَا ظَلَمْنَٰهُمْ وَلَٰكِن ظَلَمُوٓاْ
أَنفُسَهُمْۖ فَمَآ أَغْنَتْ عَنْهُمْ
ءَالِهَتُهُمُ ٱلَّتِي يَدْعُونَ مِن دُونِ
ٱللَّهِ مِن شَيْءٍ لَّمَّا جَآءَ أَمْرُ رَبِّكَۖ وَمَا
زَادُوهُمْ غَيْرَ تَتْبِيبٍ ١٠١
وَكَذَٰلِكَ أَخْذُ رَبِّكَ إِذَآ أَخَذَ
ٱلْقُرَىٰ وَهِيَ ظَٰلِمَةٌۚ إِنَّ أَخْذَهُۥٓ
أَلِيمٌ شَدِيدٌ ١٠٢
إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةً لِّمَنْ خَافَ عَذَابَ
ٱلْأٓخِرَةِۚ ذَٰلِكَ يَوْمٌ مَّجْمُوعٌ لَّهُ
ٱلنَّاسُ وَذَٰلِكَ يَوْمٌ مَّشْهُودٌ ١٠٣
وَمَا نُؤَخِّرُهُۥٓ إِلَّا لِأَجَلٍ مَّعْدُودٍ ١٠٤
يَوْمَ يَأْتِ لَا تَكَلَّمُ نَفْسٌ إِلَّا
بِإِذْنِهِۦۚ فَمِنْهُمْ شَقِيٌّ وَسَعِيدٌ ١٠٥
فَأَمَّا ٱلَّذِينَ شَقُواْ فَفِي ٱلنَّارِ لَهُمْ
فِيهَا زَفِيرٌ وَشَهِيقٌ ١٠٦

107. వారందులో శాశ్వతంగా, భూమ్యాకాశాలు ఉన్నంతవరకు ఉంటారు.[1] నీ ప్రభువు (మరొకటి) కోరితే తప్ప! నిశ్చయంగా, నీ ప్రభువు తానుకోరిందే చేసేవాడు. (5/8)

خَٰلِدِينَ فِيهَا مَا دَامَتِ ٱلسَّمَٰوَٰتُ وَٱلْأَرْضُ إِلَّا مَا شَآءَ رَبُّكَ ۚ إِنَّ رَبَّكَ فَعَّالٌ لِّمَا يُرِيدُ ﴿١٠٧﴾

108. * ఇక భాగ్యవంతులైన వారు, భూమ్యాకాశాలు ఉన్నంత వరకు స్వర్గంలో శాశ్వతంగా ఉంటారు. నీ ప్రభువు (మరొకటి) కోరితే తప్ప! ఇదొక ఎడతెగని బహుమానం.[2]

۞ وَأَمَّا ٱلَّذِينَ سُعِدُوا۟ فَفِى ٱلْجَنَّةِ خَٰلِدِينَ فِيهَا مَا دَامَتِ ٱلسَّمَٰوَٰتُ وَٱلْأَرْضُ إِلَّا مَا شَآءَ رَبُّكَ ۖ عَطَآءً غَيْرَ مَجْذُوذٍ ﴿١٠٨﴾

109. కావున (ఓ ప్రవక్తా!) వారు ఆరాధించే వాటిని గురించి నీవు సందేహంలో పడకు. పూర్వం నుండి వారి తాతముత్తాతలు ఆరాధించినట్లుగానే వారు కూడా (అంధులై) ఆరాధిస్తున్నారు. మరియు మేము నిశ్చయంగా, వారి భాగపు (శిక్షను) ఏ మాత్రం తగ్గించకుండా వారికి పూర్తిగా నొసంగుతాము.

فَلَا تَكُ فِى مِرْيَةٍ مِّمَّا يَعْبُدُ هَٰٓؤُلَآءِ ۚ مَا يَعْبُدُونَ إِلَّا كَمَا يَعْبُدُ ءَابَآؤُهُم مِّن قَبْلُ ۚ وَإِنَّا لَمُوَفُّوهُمْ نَصِيبَهُمْ غَيْرَ مَنقُوصٍ ﴿١٠٩﴾

110. మరియు వాస్తవంగా, మేము మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము. పిదప అందులో అభిప్రాయభేదాలు వచ్చాయి. నీ ప్రభువు మాట (ఆజ్ఞ) ముందుగానే నిర్ణయించబడి ఉండకుంటే, వారి తీర్పు ఎప్పుడో జరిగిఉండేది. మరియు నిశ్చయంగా, వారు దీనిని గురించి సంశయంలో, సందేహంలో పడివున్నారు.

وَلَقَدْ ءَاتَيْنَا مُوسَى ٱلْكِتَٰبَ فَٱخْتُلِفَ فِيهِ ۗ وَلَوْلَا كَلِمَةٌ سَبَقَتْ مِن رَّبِّكَ لَقُضِىَ بَيْنَهُمْ ۚ وَإِنَّهُمْ لَفِى شَكٍّ مِّنْهُ مُرِيبٍ ﴿١١٠﴾

---

1. చూడండి, 6:128, 14:48. 'ఈ భూమి మరొక భూమిగా మరియు ఆకాశాలు (మరొక ఆకాశాలుగా) మారే రోజు.' ఇక్కడ దీని అర్థం వారు శాశ్వతంగా ఎల్లప్పుడు నరకంలో ఉంటారని అర్థం (ఇబ్నె-కసీ'ర్).
2. చూడండి, పైన ఉన్న, 11:107 వ్యాఖ్యానం 1.

وَإِنَّ كُلًّا لَّمَّا لَيُوَفِّيَنَّهُمْ رَبُّكَ أَعْمَٰلَهُمْ ۚ إِنَّهُۥ بِمَا يَعْمَلُونَ خَبِيرٌ ﴿١١١﴾

**111**. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు ప్రతి ఒక్కరి కర్మల ప్రతిఫలాన్ని వారికి తప్పకుండా పూర్తిగా ఇచ్చివేస్తాడు. నిశ్చయంగా, ఆయన వారి కర్మలను బాగా ఎరుగును.

فَٱسْتَقِمْ كَمَآ أُمِرْتَ وَمَن تَابَ مَعَكَ وَلَا تَطْغَوْا۟ ۚ إِنَّهُۥ بِمَا تَعْمَلُونَ بَصِيرٌ ﴿١١٢﴾

**112**. కనుక (ఓ ప్రవక్తా!) నీవూ మరియు పశ్చాత్తాపపడి (ఆయన వైపుకు మరలిన) నీ సహచరులూ, నీకు ఆజ్ఞ ఇవ్వబడిన విధంగా ఋజుమార్గంపై స్థిరంగా ఉండండి, హద్దులు మీరకండి. నిశ్చయంగా, ఆయన మీ కర్మలన్నీ చూస్తున్నాడు.

وَلَا تَرْكَنُوٓا۟ إِلَى ٱلَّذِينَ ظَلَمُوا۟ فَتَمَسَّكُمُ ٱلنَّارُ وَمَا لَكُم مِّن دُونِ ٱللَّهِ مِنْ أَوْلِيَآءَ ثُمَّ لَا تُنصَرُونَ ﴿١١٣﴾

**113**. దుర్మార్గుల వైపునకు మీరు మొగ్గకండి, నరకాగ్నిలో చిక్కుకుంటారు. ఆ తరువాత అల్లాహ్ తప్ప మరెవ్వరూ మీకు సంరక్షకులూ ఉండరు. అప్పుడు మీకెవ్వరి సహాయమూ లభించదు.

وَأَقِمِ ٱلصَّلَوٰةَ طَرَفَىِ ٱلنَّهَارِ وَزُلَفًا مِّنَ ٱلَّيْلِ ۚ إِنَّ ٱلْحَسَنَٰتِ يُذْهِبْنَ ٱلسَّيِّـَٔاتِ ۚ ذَٰلِكَ ذِكْرَىٰ لِلذَّٰكِرِينَ ﴿١١٤﴾

**114**. మరియు దినపు చివరి రెండు భాగాల్లోనూ మరియు రాత్రిపూట కొంత భాగంలో కూడా నమా'జ్ సలపండి.[1] నిశ్చయంగా సత్కార్యాలు దుష్కార్యాలను దూరంచేస్తాయి. జ్ఞాపకంఉంచుకునే వారికి ఇది ఒక ఉపదేశం (జ్ఞాపిక).

وَٱصْبِرْ فَإِنَّ ٱللَّهَ لَا يُضِيعُ أَجْرَ ٱلْمُحْسِنِينَ ﴿١١٥﴾

**115**. మరియు సహనం వహించు; నిశ్చయంగా అల్లాహ్ సజ్జనుల ప్రతిఫలాన్ని వ్యర్థంచేయడు.

---

**1**. దైవప్రవక్త ('స'అస) తమ అనుచరు(ర'ది. 'అన్హుమ్)లతో ప్రశ్నిస్తారు. "మీలో ఒకరి ఇంటి ముందు ఒక పెద్దనది ప్రవహిస్తూ ఉండి, అతడు అందులో ప్రతిరోజు ఐదుసార్లు స్నానం చేస్తూ ఉంటే, అతని శరీరం మీద ఏమైన మలినం ఉండగలదా?" అనుచరులు అంటారు: "ఉండదు!" దైవప్రవక్త ('స'అస) అంటారు: "ఇదే విధంగా ఐదుసార్లు నమా'జ్ చేసేవారి, తప్పులు, పాపాలు కూడా అల్లాహ్ (సు.తా.) తుడిచివేస్తాడు." ('స'హీ'హ్ బు'ఖారీ, కితాబ్ మౌ'ఖీయత్, బాబ్ 'సలాత్ అల్-'ఖమ్స్).

**116**. మీకు పూర్వం గతించిన తరాల వారిలో, భూమిలో కల్లోలం రేకెత్తించకుండా నిషేధించే సజ్జనులు ఎందుకు లేరు? కాని అలాంటి వారు కొందరు మాత్రమే ఉండే వారు! వారిని మేము అలాంటి (దుర్మార్గుల) నుండి కాపాడాము. మరియు దుర్మార్గులైన వారు ఐహిక సుఖాలకు లోనయ్యారు మరియు వారు అపరాధులు.

**117**. మరియు వాటిలో నివసించే ప్రజలు సద్వర్తనులై ఉన్నంతవరకు, అలాంటి నగరాలను నీ ప్రభువు అన్యాయంగా నాశనం చేసేవాడు కాడు.

**118**. మరియు నీ ప్రభువు సంకల్పిస్తే, సర్వమానవులను (ఒకే ధర్మాన్ని అవలంబించే) ఒకే ఒక్క సంఘంగా చేసేవాడు. అయినా వారు అభిప్రాయబేధాలు లేకుండా ఉండలేక పోయేవారు;[1]

**119**. నీ ప్రభువు కరుణించినవాడు తప్ప.[2] మరియు దానికొరకే ఆయన వారిని సృష్టించాడు.[3] మరియు నీ ప్రభువు: "నేను జిన్నాతులు మరియు మానవులు అందరితో నరకాన్ని నింపుతాను!" అని అన్నమాట నెరవేరుతుంది.[4]

فَلَوۡلَا كَانَ مِنَ ٱلۡقُرُونِ مِن
قَبۡلِكُمۡ أُوْلُواْ بَقِيَّةٖ يَنۡهَوۡنَ عَنِ
ٱلۡفَسَادِ فِي ٱلۡأَرۡضِ إِلَّا قَلِيلٗا مِّمَّنۡ
أَنجَيۡنَا مِنۡهُمۡۗ وَٱتَّبَعَ ٱلَّذِينَ
ظَلَمُواْ مَآ أُتۡرِفُواْ فِيهِ وَكَانُواْ
مُجۡرِمِينَ ١١٦
وَمَا كَانَ رَبُّكَ لِيُهۡلِكَ
ٱلۡقُرَىٰ بِظُلۡمٖ وَأَهۡلُهَا
مُصۡلِحُونَ ١١٧
وَلَوۡ شَآءَ رَبُّكَ لَجَعَلَ ٱلنَّاسَ أُمَّةٗ
وَٰحِدَةٗۖ وَلَا يَزَالُونَ مُخۡتَلِفِينَ ١١٨
إِلَّا مَن رَّحِمَ رَبُّكَۚ وَلِذَٰلِكَ
خَلَقَهُمۡۗ وَتَمَّتۡ كَلِمَةُ رَبِّكَ
لَأَمۡلَأَنَّ جَهَنَّمَ مِنَ ٱلۡجِنَّةِ
وَٱلنَّاسِ أَجۡمَعِينَ ١١٩

---

**1**. చూడండి, 2:253 మరియు 5:48.
**2**. చూడండి, 7:172.
**3**. చూడండి, 2:30-34.
**4**. చూడండి, 7:18, 32:13.

**120**. మరియు (ఓ ప్రవక్తా!) నీ హృదయాన్ని స్థిరపరచటానికి, మేము ప్రవక్తల గాథలను నీకు వినిపిస్తున్నాము. మరియు ఇందులో (ఈ సూరహ్‌లో) నీకు సత్యం వచ్చింది మరియు విశ్వాసులకు హితబోధ మరియు జ్ఞాపిక.

وَكُلًّا نَّقُصُّ عَلَيْكَ مِنْ أَنۢبَآءِ ٱلرُّسُلِ مَا نُثَبِّتُ بِهِۦ فُؤَادَكَ ۚ وَجَآءَكَ فِى هَٰذِهِ ٱلْحَقُّ وَمَوْعِظَةٌ وَذِكْرَىٰ لِلْمُؤْمِنِينَ ﴿١٢٠﴾

**121**. మరియు విశ్వసించనివారితో ఇలా అను: "మీరు మీ శక్తిమేరకు మీ పనులు చేయండి. నిశ్చయంగా, మేము కూడా మా శక్తిమేరకు మా పనులు చేస్తాము.

وَقُل لِّلَّذِينَ لَا يُؤْمِنُونَ ٱعْمَلُوا۟ عَلَىٰ مَكَانَتِكُمْ إِنَّا عَٰمِلُونَ ﴿١٢١﴾

**122**. "మరియు మీరు వేచి ఉండండి, మేము కూడా వేచి ఉంటాము."

وَٱنتَظِرُوٓا۟ إِنَّا مُنتَظِرُونَ ﴿١٢٢﴾

**123**. మరియు ఆకాశాల యొక్క మరియు భూమియొక్క సర్వ అగోచర విషయాలు కేవలం అల్లాహ్ కే తెలుసు.[1] మరియు సర్వ విషయాలు ఆయన వద్దకే మరలింపబడతాయి కావున మీరు ఆయననే ఆరాధించండి మరియు ఆయననే నమ్ముకోండి. మరియు మీరు చేసే కర్మలు నీ ప్రభువు ఎరుగకుండా లేడు.

وَلِلَّهِ غَيْبُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَإِلَيْهِ يُرْجَعُ ٱلْأَمْرُ كُلُّهُۥ فَٱعْبُدْهُ وَتَوَكَّلْ عَلَيْهِ ۚ وَمَا رَبُّكَ بِغَٰفِلٍ عَمَّا تَعْمَلُونَ ﴿١٢٣﴾

*****

1. చూడండి, 2:3.

## 12. సూరహ్ యూసుఫ్ سُورَةُ يُوسُفَ

ఈ సూరహ్, 10 నుండి 15వ సూరాహ్‌ల సమూహంలో మూడవది. ఇది చివరి మక్కా కాలపు సూరహ్. ఇందులో **111** ఆయతులున్నాయి. ఇది ఒక ప్రవక్త యొక్క పూర్తి గాథను ఒకే చోట వివరించిన ఒకే ఒక్క సూరహ్. దీని ద్వారా కష్టాలలో సహనం వహించాలి, అల్లాహ్ (సు.తా.) కోరినదే జరుగుతుంది, సత్యానిదే అంతిమ విజయం మరియు ప్రవక్తల కలలు నిజమవుతాయి అనే విషయాలు తెలుస్తున్నాయి. ఇబ్రాహీం, ఇస్'హాఖ్, య'అఖూబ్ (ఇస్రాయీ'ల్) 'అలైహిమ్ అస్సలామ్‌ల తరువాత వచ్చిన ప్రవక్త **యూసుఫ్** ('అ.స.). ఇతని తరువాత కూడా ఇస్రాయీ'ల్ సంతతిలో చాలా మంది ప్రవక్తలు వచ్చారు. ఇది సూరహ్ హూద్ (11) తరువాత అవతరింపజేయబడింది. ఈ పేరు **4**వ ఆయత్‌లో మొదటిసారి వచ్చింది.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓر ۚ تِلْكَ ءَايَٰتُ ٱلْكِتَٰبِ ٱلْمُبِينِ ﴿١﴾

**1.** అలిఫ్-లామ్-ర. ఇవి స్పష్టమైన గ్రంథ ఆయతులు.

إِنَّآ أَنزَلْنَٰهُ قُرْءَٰنًا عَرَبِيًّا لَّعَلَّكُمْ تَعْقِلُونَ ﴿٢﴾

**2.** వాస్తవంగా, మీరు బాగా అర్థం చేసుకోవాలని, మేము ఈ ఖుర్ఆన్‌ను 'అరబ్బీ భాషలో అవతరింపజేశాము.[1]

نَحْنُ نَقُصُّ عَلَيْكَ أَحْسَنَ ٱلْقَصَصِ بِمَآ أَوْحَيْنَآ إِلَيْكَ هَٰذَا ٱلْقُرْءَانَ وَإِن كُنتَ مِن قَبْلِهِۦ لَمِنَ ٱلْغَٰفِلِينَ ﴿٣﴾

**3.** (ఓ ప్రవక్తా!) మేము ఈ ఖుర్ఆన్ ద్వారా అవతరింపజేసిన కథలలో ఉత్తమమైన గాథను నీకు వినిపించ బోతున్నాము మరియు ఇంతకు ముందు నీవు దీనిని ఎరుగవు.[2]

---

**1.** ప్రతి దివ్యగ్రంథం ఆ ప్రాంతపు ప్రజల భాషలోనే అవతరింపజేయబడింది. దివ్యగ్రంథాలు ప్రజల మార్గదర్శకత్వం కొరకే అవతరింపజేయబడతాయి. కావున అల్లాహ్ (సు.తా) ఈ ఉత్తమ దివ్యగ్రంథం (ఖుర్ఆన్), ఉత్తమ భాష 'అరబ్బీలో, ఉత్తమ ప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై, ఉత్తమమైన దైవదూత జిబ్రీల్ ('అ.స.) ద్వారా, ఉత్తమమైన నగరం మక్కాలో, ఉత్తమమైన నెల రమ'దాన్‌లో అవతరింపజేశాడు. చూడండి, 13:37, 14:4.

**2.** ప్రవక్తలకు అగోచర జ్ఞానం ఉండదని ఇక్కడ మరొకసారి విశదీకరించబడింది. చూడండి, 4:113 మరియు 43:52.

4. (జ్ఞాపకం చేసుకోండి) **యూసుఫ్** తన తండ్రితో: "ఓ నాన్నా! నేను వాస్తవంగా (కలలో) పదకొండు నక్షత్రాలను, సూర్యుణ్ణి మరియు చంద్రుణ్ణి చూశాను; వాటిని నా ముందు సాష్టాంగపడుతున్నట్లు చూశాను." అని అన్నప్పుడు!

إِذۡ قَالَ يُوسُفُ لِأَبِيهِ يَٰٓأَبَتِ إِنِّي
رَأَيۡتُ أَحَدَ عَشَرَ كَوۡكَبٗا وَٱلشَّمۡسَ
وَٱلۡقَمَرَ رَأَيۡتُهُمۡ لِي سَٰجِدِينَ ٤

5. (అతని తండ్రి) అన్నాడు: "ఓ నా చిన్న ప్రియ కుమారుడా! నీ స్వప్నాన్ని నీ సోదరులకు తెలుపకు. ఎందుకంటే వారు నీకు విరుద్ధంగా కుట్ర పన్నవచ్చు![1] నిశ్చయంగా, షై'తాన్ మానవునికి బహిరంగ శత్రువు.

قَالَ يَٰبُنَيَّ لَا تَقۡصُصۡ رُءۡيَاكَ عَلَىٰٓ
إِخۡوَتِكَ فَيَكِيدُواْ لَكَ كَيۡدًاۖ إِنَّ
ٱلشَّيۡطَٰنَ لِلۡإِنسَٰنِ عَدُوّٞ مُّبِينٞ
٥

6. "మరియు ఆ విధంగానే జరుగుతుంది! నీ ప్రభువు నిన్ను ఎన్నుకుంటాడు మరియు నీకు సంఘటనల (స్వప్నాల) గూడార్థ వివరణ కూడా నేర్పుతాడు మరియు నీ పూర్వీకులైన (తాతముత్తాతలైన), ఇబ్రాహీమ్ మరియు ఇస్'హాఖ్‌లకు ప్రసాదించినట్లు నీకూ మరియు య'అఖూబ్ సంతతి వారికి సంపూర్ణంగా తన అనుగ్రహాన్ని ప్రసాదిస్తాడు. నిశ్చయంగా, నీ ప్రభువు సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు." (3/4)

وَكَذَٰلِكَ يَجۡتَبِيكَ رَبُّكَ
وَيُعَلِّمُكَ مِن تَأۡوِيلِ ٱلۡأَحَادِيثِ
وَيُتِمُّ نِعۡمَتَهُۥ عَلَيۡكَ وَعَلَىٰٓ
ءَالِ يَعۡقُوبَ كَمَآ أَتَمَّهَا عَلَىٰٓ
أَبَوَيۡكَ مِن قَبۡلُ إِبۡرَٰهِيمَ وَإِسۡحَٰقَۚ إِنَّ
رَبَّكَ عَلِيمٌ حَكِيمٞ ٦

7. * వాస్తవానికి, యూసుఫ్ మరియు అతని సోదరుల (గాథలో) అడిగే వారికి ఎన్నో సూచనలు ఉన్నాయి.

۞ لَّقَدۡ كَانَ فِي يُوسُفَ وَإِخۡوَتِهِۦٓ
ءَايَٰتٞ لِّلسَّآئِلِينَ ٧

---

1. య'అఖూబ్ ('అ.స.) ఒక ప్రవక్త, కాబట్టి తన కుమారుని స్వప్నాన్ని వెంటనే అర్థంచేసుకున్నారు.

إِذۡ قَالُواْ لَيُوسُفُ وَأَخُوهُ أَحَبُّ إِلَىٰٓ أَبِينَا مِنَّا وَنَحۡنُ عُصۡبَةٌ إِنَّ أَبَانَا لَفِي ضَلَٰلٖ مُّبِينٍ ٨

**8**. అప్పుడు వారు (యూసుఫ్ సోదరులు పరస్పరం) ఇలా అనుకున్నారు: "మనది ఒక బలమైన వర్గం, అయినప్పటికీ యూసుఫ్ మరియు అతని సోదరుడు (బెన్యామీన్) అంటే మన తండ్రికి మనకంటే ఎక్కువ ప్రేమ.[1] నిశ్చయంగా మనతండ్రి స్పష్టమైన తప్పుడు అభిప్రాయంలో ఉన్నాడు."

ٱقۡتُلُواْ يُوسُفَ أَوِ ٱطۡرَحُوهُ أَرۡضٗا يَخۡلُ لَكُمۡ وَجۡهُ أَبِيكُمۡ وَتَكُونُواْ مِنۢ بَعۡدِهِۦ قَوۡمٗا صَٰلِحِينَ ٩

**9**. (వారిలో ఒకడు ఇలా అన్నాడు): "యూసుఫ్‌ను చంపండి, లేదా అతణ్ణి ఎక్కడైనా ఒంటరిగా వదలిపెట్టండి. ఇలా చేసినట్లయితే మీ తండ్రి ధ్యాస (ప్రేమ) కేవలం మీ వైపునకే మరలుతుంది. ఆ తరువాత మీరు (ప్రాయశ్చిత్తం చేసి) సద్వర్తనులుగా ప్రవర్తించండి."

قَالَ قَآئِلٞ مِّنۡهُمۡ لَا تَقۡتُلُواْ يُوسُفَ وَأَلۡقُوهُ فِي غَيَٰبَتِ ٱلۡجُبِّ يَلۡتَقِطۡهُ بَعۡضُ ٱلسَّيَّارَةِ إِن كُنتُمۡ فَٰعِلِينَ ١٠

**10**. వారిలో మరొకడు అన్నాడు: "యూసుఫ్‌ను చంపకండి. మీరు (ఏదైనా) చేయాలనే అనుకుంటే! అతనిని ఒకలోతైన బావిలో పడవేయండి,[2] ఎవరైనా బాటసారులు అతనిని తీసుకొని పోవచ్చు!"

قَالُواْ يَٰٓأَبَانَا مَا لَكَ لَا تَأۡمَ۬نَّا عَلَىٰ يُوسُفَ وَإِنَّا لَهُۥ لَنَٰصِحُونَ ١١

**11**. వారు అన్నారు: "నాన్నా నీవు యూసుఫ్ విషయంలో మమ్మల్ని ఎందుకు నమ్మవు? వాస్తవానికి మేము అతని శ్రేయోభిలాషులము!

---

**1**. బెన్యామీన్ మరియు యూసుఫ్ ('అలైహిమ్ స.లు); య'అఖూబ్ ('అ.స.) మరియు రాచెల్ (Rachel) కుమారులు. మిగతా 10 మంది సోదరుల తండ్రి య'అఖూబ్ ('అ.స.)కాని తల్లులు వేరు.

**2**. అల్-జుబ్బు: అంటే ఒక లోతైన బావి. దాని చుట్టు గోడ ఉండదు. మరియు నీళ్ళు కూడా చాలా లోతుగా ఉండవు.

أَرْسِلْهُ مَعَنَا غَدًا يَرْتَعْ وَيَلْعَبْ وَإِنَّا لَهُۥ لَحَٰفِظُونَ ﴿١٢﴾

**12**. ''రేపు అతనిని మావెంట పంపండి, అతడు అక్కడ ఆడుకొని సంతోషపడతాడు. మరియు మేము తప్పక అతనికి రక్షకులుగా ఉంటాము.''

قَالَ إِنِّي لَيَحْزُنُنِيٓ أَن تَذْهَبُواْ بِهِۦ وَأَخَافُ أَن يَأْكُلَهُ ٱلذِّئْبُ وَأَنتُمْ عَنْهُ غَٰفِلُونَ ﴿١٣﴾

**13**. (వారి తండ్రి య'అఖూబ్) అన్నాడు: ''మీరు అతనిని తీసుకొనిపోవటం నిశ్చయంగా, నన్ను చింతాక్రాంతునిగా చేస్తోంది. మీరు అతని విషయంలో ఏమరుపాటులో ఉన్నప్పుడు అతనిని ఏదైనా తోడేలు తినివేస్తుందేమోనని నేను భయపడుతున్నాను.''

قَالُواْ لَئِنْ أَكَلَهُ ٱلذِّئْبُ وَنَحْنُ عُصْبَةٌ إِنَّآ إِذًا لَّخَٰسِرُونَ ﴿١٤﴾

**14**. వారన్నారు: ''మేము ఇంత పెద్ద బలగం ఉన్నప్పటికీ అతనిని తోడేలు తినివేస్తే! నిశ్చయంగా, మేము పనికిరాని (చేతగాని) వారమే కదా!''

فَلَمَّا ذَهَبُواْ بِهِۦ وَأَجْمَعُوٓاْ أَن يَجْعَلُوهُ فِي غَيَٰبَتِ ٱلْجُبِّۚ وَأَوْحَيْنَآ إِلَيْهِ لَتُنَبِّئَنَّهُم بِأَمْرِهِمْ هَٰذَا وَهُمْ لَا يَشْعُرُونَ ﴿١٥﴾

**15**. ఆ పిదప వారు అతనిని తీసుకొనిపోయి ఒక లోతుబావిలో పడవేద్దామని నిర్ణయించుకున్నారు. అప్పుడు మేము అతనికి దివ్య జ్ఞానం (వ'హీ) ద్వారా ఇలా తెలిపాము: ''నీవు (ఒక రోజు) వారికి ఈ కార్యాన్ని జ్ఞప్తికితెచ్చే సమయం వస్తుంది, మరియు వారు నిన్ను గుర్తుపట్టలేరు.''[1]

وَجَآءُوٓ أَبَاهُمْ عِشَآءً يَبْكُونَ ﴿١٦﴾

**16**. మరియు 'ఇషా సమయంలో (చీకటి పడ్డ తరువాత) వారు తమ తండ్రి వద్దకు ఏడ్చుకుంటూవచ్చారు.

---

**1**. చూడండి, ఈ సూరహ్ యొక్క ఆయత్‌లు 89-90.

قَالُواْ يَـٰٓأَبَانَآ إِنَّا ذَهَبۡنَا نَسۡتَبِقُ وَتَرَكۡنَا يُوسُفَ عِندَ مَتَـٰعِنَا فَأَكَلَهُ ٱلذِّئۡبُۖ وَمَآ أَنتَ بِمُؤۡمِنٖ لَّنَا وَلَوۡ كُنَّا صَٰدِقِينَ ١٧

17. వారన్నారు: "ఓ నాన్నా! మేము పరుగుపందాలలో మునిగి పోయాము. మరియు యూసుఫ్‌ను మేము మా సామాగ్రి వద్ద విడిచివెళ్ళాము, అపుడు ఒకతోడేలు అతనిని తినిపోయింది. మరియు మేము సత్యం పలికినా నీవు మా మాట నమ్మక పోవచ్చు!"

وَجَآءُو عَلَىٰ قَمِيصِهِۦ بِدَمٖ كَذِبٖۚ قَالَ بَلۡ سَوَّلَتۡ لَكُمۡ أَنفُسُكُمۡ أَمۡرٗاۖ فَصَبۡرٞ جَمِيلٞۖ وَٱللَّهُ ٱلۡمُسۡتَعَانُ عَلَىٰ مَا تَصِفُونَ ١٨

18. వారు అతని అంగికి బూటకపు రక్తాన్ని పూసి తెచ్చారు. (వారి తండ్రి) అన్నాడు: "మీ ఆత్మ మిమ్మల్ని (ఒక ఘోర) కార్యాన్ని (విషయాన్ని), తేలికైనదిగా అనిపించేటట్లు చేసింది. ఇక (నా కొరకు) సహనమే మేలైనది. మరియు మీరు చెప్పే విషయంలో అల్లాహ్ సహాయమే నేను కోరేది!"

وَجَآءَتۡ سَيَّارَةٞ فَأَرۡسَلُواْ وَارِدَهُمۡ فَأَدۡلَىٰ دَلۡوَهُۥۖ قَالَ يَٰبُشۡرَىٰ هَٰذَا غُلَٰمٞۚ وَأَسَرُّوهُ بِضَٰعَةٗۚ وَٱللَّهُ عَلِيمُۢ بِمَا يَعۡمَلُونَ ١٩

19. మరియు అటువైపునకు ఒక బాటసారుల బృందం వచ్చింది. వారు తమ నీరు తెచ్చే మనిషిని పంపారు, అతడు (బావిలో) బొక్కెనను దింపాడు. (అతనికి బావిలో ఒక బాలుడు కనిపించగా) అన్నాడు: "ఇదిగో శుభవార్త! ఇక్కడ ఒక బాలుడున్నాడు." వారు అతనిని ఒక వ్యాపార సరుకుగా (బానిసగా) భావించి దాచుకున్నారు. మరియు వారు చేస్తున్నదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

وَشَرَوۡهُ بِثَمَنِۭ بَخۡسٖ دَرَٰهِمَ مَعۡدُودَةٖ وَكَانُواْ فِيهِ مِنَ ٱلزَّٰهِدِينَ ٢٠

20. మరియు వారు స్వల్పధరకు, కొన్ని దిర్హములకు మాత్రమే అతనిని అమ్ము కున్నారు.[1] మరియు అసలు వారు అతనికి ఎలాంటి ప్రాధాన్యత నివ్వలేదు.

---

1. ఈ అమ్ముకున్నవారు యూసుఫ్ ('అ.స.) సోదరులని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. ఇతరులు ఆ వ్యాపార బృందంవారని అంటారు.

**21**. మరియు అతనిని కొన్న ఈజిప్టు (మిస్ర్) వాసి తన భార్యతో [1] అన్నాడు: "ఇతనిని గౌరవంగా ఉంచుకో! బహుశా ఇతను మనకు లాభదాయకుడు కావచ్చు! లేదా మనం ఇతనిని కొడుకుగా చేసుకోవచ్చు!" మరియు ఈ విధంగా మేము యూసుఫ్‌ను భూమిపై స్థానమిచ్చి అతనికి సంఘటనల గూఢార్థాన్ని (స్వప్నాల భావాన్ని) తెలియజేసే (విద్యను) నేర్పాము. అల్లాహ్ తన కార్యాన్ని పూర్తిచేయగల శక్తి కలిగి ఉన్నాడు, కాని చాలా మందికి ఇది తెలియదు.

وَقَالَ ٱلَّذِى ٱشْتَرَىٰهُ مِن مِّصْرَ لِٱمْرَأَتِهِۦٓ أَكْرِمِى مَثْوَىٰهُ عَسَىٰٓ أَن يَنفَعَنَآ أَوْ نَتَّخِذَهُۥ وَلَدًاۚ وَكَذَٰلِكَ مَكَّنَّا لِيُوسُفَ فِى ٱلْأَرْضِ وَلِنُعَلِّمَهُۥ مِن تَأْوِيلِ ٱلْأَحَادِيثِۚ وَٱللَّهُ غَالِبٌ عَلَىٰٓ أَمْرِهِۦ وَلَٰكِنَّ أَكْثَرَ ٱلنَّاسِ لَا يَعْلَمُونَ ﴿٢١﴾

**22**. మరియు అతను తన నిండు యవ్వనానికి చేరుకున్నపుడు, మేము అతనికి వివేకాన్ని మరియు జ్ఞానాన్ని ప్రసాదించాము. మరియు ఈ విధంగా మేము సజ్జనులకు ప్రతిఫలము నొసంగుతాము.

وَلَمَّا بَلَغَ أَشُدَّهُۥٓ ءَاتَيْنَٰهُ حُكْمًا وَعِلْمًاۚ وَكَذَٰلِكَ نَجْزِى ٱلْمُحْسِنِينَ ﴿٢٢﴾

**23**. మరియు అతను నివసించే ఇంటి స్త్రీ అతనిని మోహించి అతని మనస్సును చలింపజేయగోరి తలుపులు మూసి, అతనితో: "(నా వద్దకు) రా!" అని పిలిచింది. అతను: "నేను అల్లాహ్ శరణుగోరుతున్నాను! నిశ్చయంగా, ఆయన! నా ప్రభువు, నాకు మంచి స్థానాన్ని ప్రసాదించాడు. నిశ్చయంగా, దుర్మార్గులు ఎన్నటికీ సాఫల్యం పొందలేరు." అని పలికాడు.

وَرَٰوَدَتْهُ ٱلَّتِى هُوَ فِى بَيْتِهَا عَن نَّفْسِهِۦ وَغَلَّقَتِ ٱلْأَبْوَٰبَ وَقَالَتْ هَيْتَ لَكَۚ قَالَ مَعَاذَ ٱللَّهِۖ إِنَّهُۥ رَبِّىٓ أَحْسَنَ مَثْوَاىَۖ إِنَّهُۥ لَا يُفْلِحُ ٱلظَّٰلِمُونَ ﴿٢٣﴾

---

1. ఆమె పేరు జులేఖా లేక రాయీల్. ఆమె భర్త ఆ దేశపు విత్తమంత్రి.

24. మరియు వాస్తవానికి, ఆమె అతనిని ఆశించింది. మరియు అతను కూడా ఆమె కోరికకు మొగ్గిఉండేవాడే! ఒకవేళ అతను తన ప్రభువు యొక్క నిదర్శనాన్ని చూసి ఉండకపోతే! ఈ విధంగా జరిగింది, మేము పాపం మరియు అశ్లీలతను అతనినుండి దూరంగా ఉంచటానికి. నిశ్చయంగా, అతను మేము ఎన్నుకున్న దాసులలో ఒకడు.

وَلَقَدْ هَمَّتْ بِهِۦ وَهَمَّ بِهَا لَوْلَآ أَن رَّءَا بُرْهَـٰنَ رَبِّهِۦ ۚ كَذَٰلِكَ لِنَصْرِفَ عَنْهُ ٱلسُّوٓءَ وَٱلْفَحْشَآءَ ۚ إِنَّهُۥ مِنْ عِبَادِنَا ٱلْمُخْلَصِينَ ﴿٢٤﴾

25. మరియు వారిద్దరు (ఒకరి వెనుక ఒకరు) తలుపు వైపుకు పరుగెత్తారు. ఆమె అతని అంగిని వెనుకనుండి లాగి చించింది. వారిద్దరు తలుపువద్ద ఆమె భర్తను చూశారు. ఆమె (తన భర్తతో) అన్నది: "నీ భార్యను చెరుపాలని తలచిన వానికి చెరసాలలో ఉంచటం, లేదా బాధాకరమైన శిక్ష విధించటం తప్ప, మరొక శిక్ష ఏముంటుంది?"

وَٱسْتَبَقَا ٱلْبَابَ وَقَدَّتْ قَمِيصَهُۥ مِن دُبُرٍ وَأَلْفَيَا سَيِّدَهَا لَدَا ٱلْبَابِ ۚ قَالَتْ مَا جَزَآءُ مَنْ أَرَادَ بِأَهْلِكَ سُوٓءًا إِلَّآ أَن يُسْجَنَ أَوْ عَذَابٌ أَلِيمٌ ﴿٢٥﴾

26. (యూసుఫ్) అన్నాడు: "ఈమెనే, నన్ను మోహింపజేయగోరింది!" ఆమె కుటుంబంవారిలో నుండి అక్కడ ఉన్న ఒకడు ఇలా సాక్ష్యమిచ్చాడు: "ఒకవేళ అతని అంగి, ముందునుండి చినిగిఉంటే ఆమె పలికేది సత్యం మరియు అతను అసత్యుడు!

قَالَ هِىَ رَٰوَدَتْنِى عَن نَّفْسِى ۚ وَشَهِدَ شَاهِدٌ مِّنْ أَهْلِهَآ إِن كَانَ قَمِيصُهُۥ قُدَّ مِن قُبُلٍ فَصَدَقَتْ وَهُوَ مِنَ ٱلْكَـٰذِبِينَ ﴿٢٦﴾

27. "కాని ఒకవేళ అతని అంగి వెనుక నుండి చినిగిఉంటే! ఆమె పలికేది అబద్ధం మరియు అతను సత్యవంతుడు!"

وَإِن كَانَ قَمِيصُهُۥ قُدَّ مِن دُبُرٍ فَكَذَبَتْ وَهُوَ مِنَ ٱلصَّـٰدِقِينَ ﴿٢٧﴾

28. అతని అంగి వెనుకనుండి చినిగి ఉండటాన్ని చూసి (ఆమె భర్త) ఇలా అన్నాడు: "నిశ్చయంగా, ఇది మీ స్త్రీల పన్నాగం. నిశ్చయంగా మీ పన్నాగం ఎంతో భయంకరమైనది!

فَلَمَّا رَءَا قَمِيصَهُۥ قُدَّ مِن دُبُرٍ قَالَ إِنَّهُۥ مِن كَيْدِكُنَّ ۖ إِنَّ كَيْدَكُنَّ عَظِيمٌ ﴿٢٨﴾

يُوسُفُ أَعۡرِضۡ عَنۡ هَٰذَاۚ
وَٱسۡتَغۡفِرِي لِذَنۢبِكِۖ إِنَّكِ
كُنتِ مِنَ ٱلۡخَاطِـِٔينَ ﴿٢٩﴾

۞ وَقَالَ نِسۡوَةٞ فِي ٱلۡمَدِينَةِ
ٱمۡرَأَتُ ٱلۡعَزِيزِ تُرَٰوِدُ فَتَىٰهَا عَن
نَّفۡسِهِۦۖ قَدۡ شَغَفَهَا حُبًّاۖ إِنَّا
لَنَرَىٰهَا فِي ضَلَٰلٖ مُّبِينٖ ﴿٣٠﴾

فَلَمَّا سَمِعَتۡ بِمَكۡرِهِنَّ أَرۡسَلَتۡ إِلَيۡهِنَّ
وَأَعۡتَدَتۡ لَهُنَّ مُتَّكَـٔٗا وَءَاتَتۡ كُلَّ
وَٰحِدَةٖ مِّنۡهُنَّ سِكِّينٗا وَقَالَتِ ٱخۡرُجۡ
عَلَيۡهِنَّۖ فَلَمَّا رَأَيۡنَهُۥٓ أَكۡبَرۡنَهُۥ وَقَطَّعۡنَ
أَيۡدِيَهُنَّ وَقُلۡنَ حَٰشَ لِلَّهِ مَا هَٰذَا
بَشَرًا إِنۡ هَٰذَآ إِلَّا مَلَكٞ كَرِيمٞ ﴿٣١﴾

قَالَتۡ فَذَٰلِكُنَّ ٱلَّذِي لُمۡتُنَّنِي فِيهِۖ
وَلَقَدۡ رَٰوَدتُّهُۥ عَن نَّفۡسِهِۦ فَٱسۡتَعۡصَمَۖ
وَلَئِن لَّمۡ يَفۡعَلۡ مَآ ءَامُرُهُۥ لَيُسۡجَنَنَّ
وَلَيَكُونٗا مِّنَ ٱلصَّٰغِرِينَ ﴿٣٢﴾

**29**. "ఓ యూసుఫ్! ఈ విషయాన్ని పోనివ్వు!" (తన భార్యతో అన్నాడు): "నీవు నీ పాపానికి క్షమాపణ కోరుకో, నిశ్చయంగా, నీవే తప్పుచేసిన దానవు." (7/8)

**30**. * మరియు నగర స్త్రీలు పరస్పరం ఇలా చర్చించుకోసాగారు: " 'అ'జీ'జ్ భార్య తన యువబానిసను మోహింప గోరింది. నిశ్చయంగా, ఆమె గాఢమైన ప్రేమలో పడిఉంది. నిశ్చయంగా, ఆమె స్పష్టమైన పొరపాటులో ఉన్నట్లు మేము చూస్తున్నాము."

**31**. ఆమె వారి నిందారోపణలు విని, వారికి ఆహ్వానం పంపింది. వారికి ఒక మంచి విందు ఏర్పాటు చేసి, ఒక్కొక్క స్త్రీకి ఒక్కొక్క కత్తి ఇచ్చి, (యూసుఫ్‌తో): "వారి ముందుకురా!" అని అన్నది. ఆ స్త్రీలు అతనిని చూడగానే నివ్వెర పోయారు మరియు (ఆశ్చర్యంతో చేతులలో ఉన్న కత్తులతో) తమ చేతులను కోసుకున్నారు. (అప్రయత్నంగా) అన్నారు: "అల్లాహ్ మహిమ! ('హాష లిల్లాహ్) ఇతను మానవుడు మాత్రం కాడు! ఇతను గొప్ప దేవదూతయే కాగలడు!"

**32**. ఆమె అన్నది: "ఇతనే ఆ మనిషి! ఇతనిని గురించే మీరు నాపై నిందలు మోపింది. వాస్తవానికి నేనే ఇతనిని మోహింపజేయటానికి ప్రయత్నించాను, కాని ఇతను తప్పించుకున్నాడు. కాని ఇతను ఇక నేను చెప్పింది చేయకుంటే తప్పక చెరసాల పాలు కాగలడు, లేదా తీవ్ర అవమానానికి గురి కాగలడు!"

33. (యూసుఫ్) అన్నాడు: "ఓ నా ప్రభూ! ఈ స్త్రీలు నన్ను పిలిచే విషయాని కంటే నాకు చెరసాలయే ప్రియమైనది. నీవు వారిఎత్తుగడల నుండి నన్ను తప్పించకపోతే, నేను వారి వలలో చిక్కిపోయే వాడిని మరియు అజ్ఞానులలో చేరిపోయే వాడిని."

34. అప్పుడు అతని ప్రభువు అతని ప్రార్థనను అంగీకరించి, అతనిని ఆ స్త్రీల పన్నాగాల నుండి తప్పించాడు. నిశ్చయంగా, ఆయనే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

35. ఆ తరువాత వారికి - (అతను నిర్దోషి అనే) సూచనలు కనిపించినా - అతనిని కొంత కాలం చెరసాలలో ఉంచాలని అనిపించింది.

36. మరియు అతనితోబాటు ఇద్దరు యువకులు కూడా చెరసాలలో ప్రవేశించారు. వారిలో ఒకడు అన్నాడు: "నేను సారాయి పిండుతూ ఉన్నట్లు కల చూశాను!" రెండోవాడు అన్నాడు: "నేను నా తలపై రొట్టెలు మోస్తున్నట్లు, వాటిని పక్షులు తింటున్నట్లు కలలో చూశాను." (ఇద్దరూ కలిసి అన్నారు): "మాకు దీని భావాన్ని తెలుపు. నిశ్చయంగా, మేము నిన్ను సజ్జనునిగా చూస్తున్నాము."

37. (యూసుఫ్) అన్నాడు: "మీరిద్దరికి తినటానికి ఇవ్వబడే భోజనం వస్తుంది కదా! అది రాకముందే నేను వీటి (మీ కలల) భావాన్ని మీ ఇద్దరికి తెలుపుతాను. ఇది నా ప్రభువు నేర్పిన విద్యలలోనిదే. నిశ్చయంగా నేను, అల్లాహ్‌ను విశ్వసించని వారి మరియు పరలోకాన్ని తిరస్కరించే వారి ధర్మాన్ని వదలిపెట్టాను.

قَالَ رَبِّ ٱلسِّجۡنُ أَحَبُّ إِلَيَّ مِمَّا يَدۡعُونَنِيٓ إِلَيۡهِۖ وَإِلَّا تَصۡرِفۡ عَنِّي كَيۡدَهُنَّ أَصۡبُ إِلَيۡهِنَّ وَأَكُن مِّنَ ٱلۡجَٰهِلِينَ ٣٣

فَٱسۡتَجَابَ لَهُۥ رَبُّهُۥ فَصَرَفَ عَنۡهُ كَيۡدَهُنَّۚ إِنَّهُۥ هُوَ ٱلسَّمِيعُ ٱلۡعَلِيمُ ٣٤

ثُمَّ بَدَا لَهُم مِّنۢ بَعۡدِ مَا رَأَوُاْ ٱلۡأٓيَٰتِ لَيَسۡجُنُنَّهُۥ حَتَّىٰ حِينٖ ٣٥

وَدَخَلَ مَعَهُ ٱلسِّجۡنَ فَتَيَانِۖ قَالَ أَحَدُهُمَآ إِنِّيٓ أَرَىٰنِيٓ أَعۡصِرُ خَمۡرٗاۖ وَقَالَ ٱلۡأٓخَرُ إِنِّيٓ أَرَىٰنِيٓ أَحۡمِلُ فَوۡقَ رَأۡسِي خُبۡزٗا تَأۡكُلُ ٱلطَّيۡرُ مِنۡهُۖ نَبِّئۡنَا بِتَأۡوِيلِهِۦٓۖ إِنَّا نَرَىٰكَ مِنَ ٱلۡمُحۡسِنِينَ ٣٦

قَالَ لَا يَأۡتِيكُمَا طَعَامٞ تُرۡزَقَانِهِۦٓ إِلَّا نَبَّأۡتُكُمَا بِتَأۡوِيلِهِۦ قَبۡلَ أَن يَأۡتِيَكُمَاۚ ذَٰلِكُمَا مِمَّا عَلَّمَنِي رَبِّيٓۚ إِنِّي تَرَكۡتُ مِلَّةَ قَوۡمٖ لَّا يُؤۡمِنُونَ بِٱللَّهِ وَهُم بِٱلۡأٓخِرَةِ هُمۡ كَٰفِرُونَ ٣٧

38. "మరియు నేను నా తండ్రితాతలైన ఇబ్రాహీమ్, ఇస్'హాఖ్ మరియు య'అఖూబ్‌ల యొక్క ధర్మాన్ని అవలంబించాను. అల్లాహ్‌కు ఎవడినైనా సాటి కల్పించటం మా విధానం కాదు. వాస్తవానికి ఇది మాపై మరియు సర్వమానవులపై ఉన్న అల్లాహ్ యొక్క అనుగ్రహం. కాని చాలామంది ప్రజలు కృతజ్ఞతలు చూపరు.

وَٱتَّبَعۡتُ مِلَّةَ ءَابَآءِيٓ إِبۡرَٰهِيمَ وَإِسۡحَٰقَ وَيَعۡقُوبَۚ مَا كَانَ لَنَآ أَن نُّشۡرِكَ بِٱللَّهِ مِن شَيۡءٖۚ ذَٰلِكَ مِن فَضۡلِ ٱللَّهِ عَلَيۡنَا وَعَلَى ٱلنَّاسِ وَلَٰكِنَّ أَكۡثَرَ ٱلنَّاسِ لَا يَشۡكُرُونَ ٣٨

39. "ఓ నా ఇద్దరు చెరసాల సహచరులారా! ఏమీ? చాలామంది విభిన్న ప్రభువులు మేలా? లేక, తన సృష్టిపై సంపూర్ణాధికారం గల అద్వితీయుడైన[1] అల్లాహ్ మేలా?

يَٰصَٰحِبَيِ ٱلسِّجۡنِ ءَأَرۡبَابٞ مُّتَفَرِّقُونَ خَيۡرٌ أَمِ ٱللَّهُ ٱلۡوَٰحِدُ ٱلۡقَهَّارُ ٣٩

40. "ఆయన (అల్లాహ్)ను వదలి మీరు ఆరాధిస్తున్నవి - మీరు మరియు మీ తండ్రి తాతలు కల్పించుకున్న - పేర్లు మాత్రమే! దాని కొరకు అల్లాహ్ ఎలాంటి ప్రమాణాన్ని అవతరింపజేయలేదు. నిశ్చయంగా, ఆజ్ఞాపించే అధికారం కేవలం అల్లాహ్‌కే చెందుతుంది. ఆయనను తప్ప మరొకరిని ఆరాధించరాదని ఆయన ఆజ్ఞాపించాడు. ఇదే సరైన ధర్మం, కానీ చాలామందికి ఇది తెలియదు.[2]

مَا تَعۡبُدُونَ مِن دُونِهِۦٓ إِلَّآ أَسۡمَآءٗ سَمَّيۡتُمُوهَآ أَنتُمۡ وَءَابَآؤُكُم مَّآ أَنزَلَ ٱللَّهُ بِهَا مِن سُلۡطَٰنٍۚ إِنِ ٱلۡحُكۡمُ إِلَّا لِلَّهِۚ أَمَرَ أَلَّا تَعۡبُدُوٓاْ إِلَّآ إِيَّاهُۚ ذَٰلِكَ ٱلدِّينُ ٱلۡقَيِّمُ وَلَٰكِنَّ أَكۡثَرَ ٱلنَّاسِ لَا يَعۡلَمُونَ ٤٠

---

1. **అల్-వాహిద్:** The One, The Sole. **అద్వితీయుడు**, ఒకే ఒక్కడు. చూడండి, 2:163.
**అల్-ఖహ్హారు:** Subduer, Irrestible, Overpowerer, తన సృష్టిమీద సంపూర్ణ **అధికారం**, ఆధిపత్యం, ఆధిక్యత గలవాడు, **లోబరచుకొను**, స్వాధీనంలోకి తెచ్చుకొను, వశంచేసుకొను, జయించ గలవాడు. తన సృష్టిమీద **ప్రబలుడు**. అల్-ఖాహిరుకు చూడండి, 6:18, 61.
**అల్ వాహిద్, అల్ ఖహ్హార్**‌లకు చూడండి,13:16, 14:48, 38:65, 39:4, 40:16. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.
2. చూడండి, 30:30, 12:103 మరియు 106.

**41.** "ఓ నా ఇద్దరు, చెరసాల సహచరులారా! మీలో ఒకడు తన యజమానికి మద్య పానం (సారాయి) త్రాగిస్తూ ఉంటాడు. ఇక రెండవవాడు సిలువపై ఎక్కించబడతాడు మరియు అతడి నెత్తిపై నుండి పక్షులు తింటూ ఉంటాయి. మీరు అడుగుతున్న (కలల) విషయం గురించి ఈ విధమైన తీర్పు ఇవ్వబడుతోంది!"

**42.** మరియు వారిద్దరిలో విడుదల పొందుతాడని భావించిన వాడితో (యూసుఫ్) అన్నాడు: "నీ స్వామి దగ్గర నా ప్రస్తావన చెయ్యి." కాని అతనిని, తన స్వామి దగ్గర ప్రస్తావన చేయటాన్ని షైతాన్ మరపింపజేశాడు, కావున (యూసుఫ్) చెరసాలలో మరికొన్ని సంవత్సరాలు ఉండిపోయాడు.[1]

**43.** (ఒక రోజు) రాజు అన్నాడు:[2] "వాస్తవానికి నేను (కలలో) ఏడు బలిసిన ఆవులను, ఏడు బక్కచిక్కిన (ఆవులు) తినివేస్తున్నట్లు మరియు ఏడు పచ్చి వెన్నులను మరొక ఏడు ఎండి పోయిన వాటిని చూశాను. ఓ సభాసదులారా! మీకు స్వప్నాల భావం తెలిస్తే నా స్వప్నపు భావాన్ని తెలుపండి!"

يَـٰصَـٰحِبَىِ ٱلسِّجْنِ أَمَّآ أَحَدُكُمَا
فَيَسْقِى رَبَّهُۥ خَمْرًا ۖ وَأَمَّا ٱلْـَٔاخَرُ
فَيُصْلَبُ فَتَأْكُلُ ٱلطَّيْرُ مِن
رَّأْسِهِۦ ۚ قُضِىَ ٱلْأَمْرُ ٱلَّذِى فِيهِ
تَسْتَفْتِيَانِ ﴿٤١﴾

وَقَالَ لِلَّذِى ظَنَّ أَنَّهُۥ نَاجٍ مِّنْهُمَا
ٱذْكُرْنِى عِندَ رَبِّكَ فَأَنسَىٰهُ
ٱلشَّيْطَـٰنُ ذِكْرَ رَبِّهِۦ فَلَبِثَ فِى
ٱلسِّجْنِ بِضْعَ سِنِينَ ﴿٤٢﴾

وَقَالَ ٱلْمَلِكُ إِنِّىٓ أَرَىٰ سَبْعَ بَقَرَٰتٍ
سِمَانٍ يَأْكُلُهُنَّ سَبْعٌ عِجَافٌ
وَسَبْعَ سُنۢبُلَـٰتٍ خُضْرٍ وَأُخَرَ
يَابِسَـٰتٍ ۖ يَـٰٓأَيُّهَا ٱلْمَلَأُ أَفْتُونِى فِى رُءْيَـٰىَ
إِن كُنتُمْ لِلرُّءْيَا تَعْبُرُونَ ﴿٤٣﴾

---

1. బి'ద్'ఉన్: అనే పదం, 3నుండి 9 సంఖ్యల కొరకు వాడబడుతోంది.

2. ఈ రాజు హిక్సోస్ (Hyksos) జాతికి చెందిన ఆరుగురు రాజులలో ఒకడు కావచ్చు. వారు 1700-1580 క్రీ. శ. ముందు కాలంలో ఈజిప్టు పరిపాలకులు. వారు అరబ్బులు. వారు గొల్లవారు (గొర్ల కాపరులు). తరువాత పాలకులయ్యారు. వారు సిరియాలో స్థిరపడివుండిరి. సినాయి ద్వారా ఈజిప్ట్‌లోకి ప్రవేశించారు. వీరు అరేబియా నుండి మెసోపోటామియాకు పోయి తరువాత సిరియాకు వచ్చారు. వారి భాష హీబ్రూ భాషవంటిదే. అది ప్రాచీన అరబ్బుల భాష.

قَالُوٓاْ أَضۡغَٰثُ أَحۡلَٰمٖۖ وَمَا نَحۡنُ بِتَأۡوِيلِ ٱلۡأَحۡلَٰمِ بِعَٰلِمِينَ ٤٤

44. వారన్నారు: "ఇవి పీడకలలు. మరియు మాకు కలల గూఢార్థం తెలుసుకునే నైపుణ్యం లేదు!"

وَقَالَ ٱلَّذِي نَجَا مِنۡهُمَا وَٱدَّكَرَ بَعۡدَ أُمَّةٍ أَنَا۠ أُنَبِّئُكُم بِتَأۡوِيلِهِۦ فَأَرۡسِلُونِ ٤٥

45. ఆ ఇద్దరు బందీలలో నుండి విడుదల పొందిన వ్యక్తికి చాలకాలం తరువాత ఇప్పుడా విషయం గుర్తుకు వచ్చింది.[1] అతడు అన్నాడు: "నేను దీని గూఢార్థాన్ని మీకు తెలుపుతాను, దానికి నన్ను (యూసుఫ్ వద్దకు) పంపండి."

يُوسُفُ أَيُّهَا ٱلصِّدِّيقُ أَفۡتِنَا فِي سَبۡعِ بَقَرَٰتٖ سِمَانٖ يَأۡكُلُهُنَّ سَبۡعٌ عِجَافٞ وَسَبۡعِ سُنۢبُلَٰتٍ خُضۡرٖ وَأُخَرَ يَابِسَٰتٖ لَّعَلِّيٓ أَرۡجِعُ إِلَى ٱلنَّاسِ لَعَلَّهُمۡ يَعۡلَمُونَ ٤٦

46. (అతడు అన్నాడు): "యూసుఫ్! సత్యవంతుడా! నాకు - ఏడు బలిసిన ఆవులను, ఏడు బక్కచిక్కిన ఆవులు తినివేయటాన్ని మరియు ఏడు పచ్చివెన్నుల మరి ఏడు ఎండిపోయిన (వెన్నుల) - గూఢార్థ మేమిటో చెప్పు. నేను (రాజ సభలోని) ప్రజల వద్దకుపోయి (చెబుతాను), వారు దానిని తెలుసు కుంటారు."

قَالَ تَزۡرَعُونَ سَبۡعَ سِنِينَ دَأَبٗا فَمَا حَصَدتُّمۡ فَذَرُوهُ فِي سُنۢبُلِهِۦٓ إِلَّا قَلِيلٗا مِّمَّا تَأۡكُلُونَ ٤٧

47. (యూసుఫ్) అన్నాడు: "మీరు యథాప్రకారంగా ఏడు సంవత్సరాలు సేద్యం చేస్తూ ఉంటారు, కాని మీరు కోసిన పంటలో కొంత భాగాన్ని మాత్రమే తినటానికి ఉపయోగించుకొని మిగిలిందంతా, వెన్నులతోనే కొట్లలో ఉంచి (భద్రపరచండి).

1. ఉమ్మతున్: అనే శబ్దానికి విద్వాంసులందరీ ఏకైక అభిప్రాయం ఇక్కడ 'కాలం' అనే ఉంది.

48. "ఆ తరువాత చాలా కఠినమైన ఏడు సంవత్సరాలు వస్తాయి, వాటిలో మీరు ముందే నిలువచేసి ఉంచిన దానిని తింటారు. మీరు (విత్తనానికోసం) భద్రంగా ఉంచుకున్న కొంత భాగం తప్ప![1]

ثُمَّ يَأْتِي مِنۢ بَعْدِ ذَٰلِكَ سَبْعٌ شِدَادٌ يَأْكُلْنَ مَا قَدَّمْتُمْ لَهُنَّ إِلَّا قَلِيلًا مِّمَّا تُحْصِنُونَ ﴿٤٨﴾

49. "ఆ తరువాత ఒక సంవత్సరం వస్తుంది. అందులో ప్రజలకు పుష్కలమైన వర్షాలు కురుస్తాయి. అందులో వారు (రసం / నూనె) తీస్తారు (పిండుతారు)."

ثُمَّ يَأْتِي مِنۢ بَعْدِ ذَٰلِكَ عَامٌ فِيهِ يُغَاثُ ٱلنَّاسُ وَفِيهِ يَعْصِرُونَ ﴿٤٩﴾

50. రాజు ఇలా అన్నాడు: "అతనిని నావద్దకు తీసుకురండి!" రాజదూత అతని వద్దకు వచ్చినపుడు (యూసుఫ్) అన్నాడు: "నీవు తిరిగిపోయి నీ స్వామిని అడుగు: 'తమ చేతులు కోసుకున్న స్త్రీల వాస్తవ విషయం ఏమిటి?'[2] నిశ్చయంగా, నా ప్రభువుకు వారి కుట్ర గురించి బాగా తెలుసు."

وَقَالَ ٱلْمَلِكُ ٱئْتُونِي بِهِۦ ۖ فَلَمَّا جَآءَهُ ٱلرَّسُولُ قَالَ ٱرْجِعْ إِلَىٰ رَبِّكَ فَسْـَٔلْهُ مَا بَالُ ٱلنِّسْوَةِ ٱلَّٰتِي قَطَّعْنَ أَيْدِيَهُنَّ ۚ إِنَّ رَبِّي بِكَيْدِهِنَّ عَلِيمٌ ﴿٥٠﴾

---

1. మిమ్మా తు'హ్'సినూన్: అంటే విత్తనాల కొరకు భద్రపరచిన ధాన్యం.
2. యూ'సు'ఫ్ ('అ.స.) నిందితుడిగానే, కేవలం రాజు కనికరం వల్లనే కారాగారం నుండి విముక్తి పొందదలచుకోలేదు. అతను తనపై మోపబడిన నిందలనుండి పవిత్రుడనని, నిరూపించదలచుకున్నారు. కాబట్టి జవాబిచ్చారు: "అయితే తమ చేతులు కోసుకున్న స్త్రీల వాస్తవ విషయమేమిటని." ఇదే సత్యవంతులు పవిత్రులు అయిన అల్లాహ్ (సు.తా.) దా'ఈల విధానం.

قَالَ مَا خَطْبُكُنَّ إِذْ رَٰوَدتُّنَّ يُوسُفَ عَن نَّفْسِهِۦۚ قُلْنَ حَٰشَ لِلَّهِ مَا عَلِمْنَا عَلَيْهِ مِن سُوٓءٍۚ قَالَتِ ٱمْرَأَتُ ٱلْعَزِيزِ ٱلْـَٰٔنَ حَصْحَصَ ٱلْحَقُّ أَنَا۠ رَٰوَدتُّهُۥ عَن نَّفْسِهِۦ وَإِنَّهُۥ لَمِنَ ٱلصَّٰدِقِينَ ﴿٥١﴾

**51**. (రాజు స్త్రీలను) విచారించాడు: "మీరు యూసుఫ్‌ను మోహింపజేయటానికి ప్రయత్నించిన విషయమేమిటి?" వారందరూ (ఒకేసారిగా) అన్నారు: "అల్లాహ్ రక్షించుగాక! మేము అతనిలో ఏ పాపాన్ని చూడలేదు! 'అ'జీ'జ్ భార్య ఇలా అన్నది: "ఇప్పుడు సత్యం బయటపడింది. నేనే అతనిని మోహింపజేయటానికి ప్రయత్నించాను. మరియు నిశ్చయంగా, అతను సత్యవంతుడు."

ذَٰلِكَ لِيَعْلَمَ أَنِّى لَمْ أَخُنْهُ بِٱلْغَيْبِ وَأَنَّ ٱللَّهَ لَا يَهْدِى كَيْدَ ٱلْخَآئِنِينَ ﴿٥٢﴾

**52**. (అప్పుడు యూసుఫ్) అన్నాడు: "నేను ఇదంతా చేసింది నిశ్చయంగా, నేను ('అ'జీ'జ్‌కు) గోప్యంగా ఎలాంటి నమ్మకద్రోహం చేయలేదని తెలుపటానికే మరియు నిశ్చయంగా, అల్లాహ్ నమ్మకద్రోహుల కుట్రలను సాగనివ్వడు.

۞ وَمَآ أُبَرِّئُ نَفۡسِيٓۚ إِنَّ ٱلنَّفۡسَ لَأَمَّارَةُۢ بِٱلسُّوٓءِ إِلَّا مَا رَحِمَ رَبِّيٓۚ إِنَّ رَبِّي غَفُورٞ رَّحِيمٞ ٥٣

53. (*) "మరియు నన్ను నేను (ఈ నిందనుండి) విముక్తి చేసుకోవడం లేదు.[1] వాస్తవానికి మానవ ఆత్మ చెడు చేయటానికి పురికొల్పుతూ ఉంటుంది - నా ప్రభువు కరుణించిన వాడు తప్ప! నిశ్చయంగా, నా ప్రభువు క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత."

وَقَالَ ٱلۡمَلِكُ ٱئۡتُونِي بِهِۦٓ أَسۡتَخۡلِصۡهُ لِنَفۡسِيۖ فَلَمَّا كَلَّمَهُۥ قَالَ إِنَّكَ ٱلۡيَوۡمَ لَدَيۡنَا مَكِينٌ أَمِينٞ ٥٤

54. మరియు రాజు[2] అన్నాడు: "అతనిని నా వద్దకు తీసుకొనిరండి నేను అతనిని ప్రత్యేకంగా నా కొరకు నియమించుకుంటాను." (యూసుఫ్) అతనితో మాట్లాడినప్పుడు (రాజు) అన్నాడు: "నిశ్చయంగా, నీవు ఈనాటి నుండి మా వద్ద ఉన్నత స్థానంలో నమ్మకంగల వ్యక్తిగా పరిగణింప బడతావు."

قَالَ ٱجۡعَلۡنِي عَلَىٰ خَزَآئِنِ ٱلۡأَرۡضِۖ إِنِّي حَفِيظٌ عَلِيمٞ ٥٥

55. (యూసుఫ్) అన్నాడు: "నన్ను దేశపు కోశాగారాధికారిగా నియమించండి. నిశ్చయంగా, నేను తెలివిగల మంచి రక్షకుడను."

وَكَذَٰلِكَ مَكَّنَّا لِيُوسُفَ فِي ٱلۡأَرۡضِ يَتَبَوَّأُ مِنۡهَا حَيۡثُ يَشَآءُۚ نُصِيبُ بِرَحۡمَتِنَا مَن نَّشَآءُۖ وَلَا نُضِيعُ أَجۡرَ ٱلۡمُحۡسِنِينَ ٥٦

56. మరియు ఈ విధంగా మేము యూసుఫ్‌కు భూమిపై అధికార మొసంగాము. దానితో అతను తన ఇష్ట ప్రకారం వ్యవహరించ గలిగాడు. మేము కోరిన వారిమీద మా కారుణ్యాన్ని ధారపోస్తాము. మరియు మేము సజ్జనుల ప్రతిఫలాన్ని వ్యర్థంచేయము.

---

1. ఈ వాక్యాన్ని కొందరు వ్యాఖ్యాతలు యూసుఫ్ ('అ.స.) ఉచ్చరించారని మరికొందరు (ఇబ్నె-కసీ'ర్) ఇది 'అ'జీ'జ్ యొక్క ప్రవచనమని అంటారు.
2. ఆ రాజు పేరు రయ్యాన్ బిన్-వలీద్ అంటారు.

وَلَأَجۡرُ ٱلۡأٓخِرَةِ خَيۡرٞ لِّلَّذِينَ ءَامَنُواْ وَكَانُواْ يَتَّقُونَ ٥٧

57. మరియు విశ్వసించి భయభక్తులు గలవారికి, పరలోక ప్రతిఫలమే ఎంతో ఉత్తమమైనది.

وَجَآءَ إِخۡوَةُ يُوسُفَ فَدَخَلُواْ عَلَيۡهِ فَعَرَفَهُمۡ وَهُمۡ لَهُۥ مُنكِرُونَ ٥٨

58. మరియు యూసుఫ్ (జోసెఫ్) సోదరులు వచ్చి అతని ముందు ప్రవేశించారు. అతను వారిని గుర్తించాడు కాని, వారు అతనిని గుర్తించలేక పోయారు.

وَلَمَّا جَهَّزَهُم بِجَهَازِهِمۡ قَالَ ٱئۡتُونِي بِأَخٖ لَّكُم مِّنۡ أَبِيكُمۡۚ أَلَا تَرَوۡنَ أَنِّيٓ أُوفِي ٱلۡكَيۡلَ وَأَنَا۠ خَيۡرُ ٱلۡمُنزِلِينَ ٥٩

59. మరియు అతను వారి సామాగ్రిని సిద్ధపరచిన తరువాత వారితో అన్నాడు: "మీ నాన్న కుమారుడైన మీ సోదరుణ్ణి[1] మీరు (మళ్ళీ వచ్చేటప్పుడు) నా వద్దకు తీసుకొనిరండి. ఏమీ? నేను ఏ విధంగా నిండుగా కొలిచి ఇస్తున్నానో మీరు చూడటంలేదా? నిశ్చయంగా ఆతిథ్యం చేసే వారిలో నేను ఉత్తముడను.

فَإِن لَّمۡ تَأۡتُونِي بِهِۦ فَلَا كَيۡلَ لَكُمۡ عِندِي وَلَا تَقۡرَبُونِ ٦٠

60. "కాని మీరు అతనిని నావద్దకు తీసుకొని రాకపోతే నావద్ద మీకు ఎలాంటి (ధాన్యం) దొరకదు, అలాంటప్పుడు మీరు నా దరిదాపులకు కూడా రాకండి!"

قَالُواْ سَنُرَٰوِدُ عَنۡهُ أَبَاهُ وَإِنَّا لَفَٰعِلُونَ ٦١

61. వారు ఇలా అన్నారు: "మేము అతనిని గురించి అతని తండ్రిని ఒప్పించటానికి ప్రయత్నిస్తాము మరియు మేము అలా తప్పకుండా చేస్తాము."

وَقَالَ لِفِتۡيَٰنِهِ ٱجۡعَلُواْ بِضَٰعَتَهُمۡ فِي رِحَالِهِمۡ لَعَلَّهُمۡ يَعۡرِفُونَهَآ إِذَا ٱنقَلَبُوٓاْ إِلَىٰٓ أَهۡلِهِمۡ لَعَلَّهُمۡ يَرۡجِعُونَ ٦٢

62. మరియు (యూసుఫ్) తన సేవకులతో: "వారు (ధాన్యాన్ని కొనటానికి) తెచ్చిన సామగ్రిని (తిరిగి) వారి సంచులలో పెట్టండి. వారు తిరిగి తమకుటుంబం వారి వద్దకు పోయిన తరువాత అది తెలుసుకొని బహుశా తిరిగి రావచ్చు!" అని అన్నాడు.

---

1. బెన్యామీన్ మరియు యూసుఫ్ ('అ.స.) ఇద్దరూ య'అఖూబ్ ('అ.స.) భార్య రాచెల్ (Rachel) కుమారులు. మిగతా పదిమంది యూసుఫ్ ('అ.స.) యొక్క సవతి సోదరులు.

فَلَمَّا رَجَعُوٓاْ إِلَىٰٓ أَبِيهِمۡ قَالُواْ
يَٰٓأَبَانَا مُنِعَ مِنَّا ٱلۡكَيۡلُ
فَأَرۡسِلۡ مَعَنَآ أَخَانَا نَكۡتَلۡ
وَإِنَّا لَهُۥ لَحَٰفِظُونَ ٦٣

**63**. వారు తమ తండ్రి దగ్గరకు తిరిగి వచ్చిన తరువాత అన్నారు: "నాన్నా! ఇక ముందు మనకు ధాన్యం ఇవ్వడానికి తిరస్కరించారు, కావున ధాన్యం తేవాలంటే! నీవు మా తమ్ముణ్ణి (బెన్యామీన్‌ను) మాతోబాటు పంపు మరియు నిశ్చయంగా, మేము అతనిని కాపాడుతాము."

قَالَ هَلۡ ءَامَنُكُمۡ عَلَيۡهِ إِلَّا
كَمَآ أَمِنتُكُمۡ عَلَىٰٓ أَخِيهِ
مِن قَبۡلُۖ فَٱللَّهُ خَيۡرٌ حَٰفِظٗاۖ وَهُوَ
أَرۡحَمُ ٱلرَّٰحِمِينَ ٦٤

**64**. (య'అఖూబ్) అన్నాడు: "ఏమీ? నేను మిమ్మల్ని అతని విషయంలో - ఇదివరకు అతని సోదరుని విషయంలో నమ్మినట్లు - నమ్మాలా? వాస్తవానికి, అల్లాహ్ యే ఉత్తమ రక్షకుడు. ఆయనే కరుణించేవారిలో అందరికంటే ఉత్తమమైన కారుణ్యమూర్తి."

وَلَمَّا فَتَحُواْ مَتَٰعَهُمۡ وَجَدُواْ
بِضَٰعَتَهُمۡ رُدَّتۡ إِلَيۡهِمۡۖ
قَالُواْ يَٰٓأَبَانَا مَا نَبۡغِيۖ هَٰذِهِۦ
بِضَٰعَتُنَا رُدَّتۡ إِلَيۡنَاۖ وَنَمِيرُ
أَهۡلَنَا وَنَحۡفَظُ أَخَانَا وَنَزۡدَادُ
كَيۡلَ بَعِيرٖۖ ذَٰلِكَ كَيۡلٞ
يَسِيرٞ ٦٥

**65**. మరియు వారు తమ మూటలను విప్పగా తమ సొమ్ము కూడా తమకు తిరిగి ఇవ్వబడటాన్ని చూసి తమ తండ్రితో అన్నారు: "నాన్నా! (చూడండి) ఇంకేం కావాలి? మన సొమ్ము కూడా మనకు తిరిగి ఇవ్వబడింది. మరియు మేము మన ఇంటివారి కొరకు మరింత ఎక్కువ ధాన్యం తేగలము. మేము మా తమ్ముణ్ణి కాపాడుకుంటాం. ఇంకా ఒక ఒంటె మోసేబరువు (ధాన్యం) కూడా ఎక్కువగా తీసుకొని రాగలము. ఇక అంత ధాన్యం కూడా (అదనంగా) సులభంగా లభిస్తుంది కదా!"

**66**. (య'అఖూబ్) అన్నాడు: "మీరు ముట్టడికి గురిఅయితే తప్ప, అతనిని నా వద్దకు తప్పక తీసుకురాగలమని అల్లాహ్ పేరుతో నా ముందు ప్రమాణం చేస్తేనే గానీ, నేను అతనిని మీవెంట పంపను." వారు ప్రమాణం చేసిన తరువాత, అతను అన్నాడు: "మన ఈ మాటలకు అల్లాహ్‌యే సాక్షి!"

**67**. (ఇంకా) ఇలా అన్నాడు: "ఓ నా కుమారులారా! మీరందరూ ఒకే ద్వారం గుండా ప్రవేశించకండి, మీరు వేర్వేరు ద్వారాల గుండా ప్రవేశించండి.[1] నేను మిమ్మల్ని అల్లాహ్ (సంకల్పం) నుండి ఏ విధంగానూ తప్పించలేను. అంతిమ తీర్పు కేవలం అల్లాహ్‌కే చెందుతుంది. నేను ఆయనను మాత్రమే నమ్ముకున్నాను. మరియు ఆయనను నమ్ముకున్నవారు కేవలం ఆయన పైననే ఆధారపడి ఉంటారు."

**68**. మరియు వారు తమ తండ్రి ఆజ్ఞ ప్రకారం (ఆ నగరంలో వేర్వేరు ద్వారాలగుండా) ప్రవేశించారు. అది కేవలం య'అఖూబ్ మనస్సులోని కోరికను పూర్తిచేయటానికి మాత్రమే, కాని అల్లాహ్

قَالَ لَنْ أُرْسِلَهُۥ مَعَكُمْ حَتَّىٰ تُؤْتُونِ مَوْثِقًا مِّنَ ٱللَّهِ لَتَأْتُنَّنِى بِهِۦٓ إِلَّآ أَن يُحَاطَ بِكُمْ ۖ فَلَمَّآ ءَاتَوْهُ مَوْثِقَهُمْ قَالَ ٱللَّهُ عَلَىٰ مَا نَقُولُ وَكِيلٌ ﴿٦٦﴾

وَقَالَ يَٰبَنِىَّ لَا تَدْخُلُوا۟ مِنۢ بَابٍ وَٰحِدٍ وَٱدْخُلُوا۟ مِنْ أَبْوَٰبٍ مُّتَفَرِّقَةٍ ۖ وَمَآ أُغْنِى عَنكُم مِّنَ ٱللَّهِ مِن شَىْءٍ ۖ إِنِ ٱلْحُكْمُ إِلَّا لِلَّهِ ۖ عَلَيْهِ تَوَكَّلْتُ ۖ وَعَلَيْهِ فَلْيَتَوَكَّلِ ٱلْمُتَوَكِّلُونَ ﴿٦٧﴾

وَلَمَّا دَخَلُوا۟ مِنْ حَيْثُ أَمَرَهُمْ أَبُوهُم مَّا كَانَ يُغْنِى عَنْهُم مِّنَ ٱللَّهِ مِن شَىْءٍ إِلَّا حَاجَةً فِى

1. ఒకవేళ వారు 11 మంది ఒకే ద్వారంనుండి ప్రవేశిస్తే, బహుశా వారికి దిష్టి తగులవచ్చుని వారి తండ్రి భావించారు. దైవప్రవక్త ('స'అస) ప్రవచించారు: 'అల్ 'ఐను 'హఖ్ఖు' ' అంటే దిష్టి తగలటం నిజమే! ('స'హీ'హ్ బు'ఖారీ, కితాబ్ తిబ్బ్, బాబ్ అల్-'ఐను 'హఖ్ఖు, మరియు 'స'హీ'హ్ ముస్లిం, కితాబ్ అస్-సలాం, బాబ్ అత్-'తిబ్బ్). అతను దానికి తోడుగా ఈ దువాలు కూడా తెలిపారు. మీకు ఏదైన వస్తువు నచ్చితే 'బారకల్లాహ్' అనండి. (మువ'త్తఅ' ఇమామ్ మాలిక్. అల్బానీ ప్రమాణీకం నం.1286) మాషా' అల్లాహ్ లా ఖువ్వత ఇల్లా బిల్లాహ్ (18:39) చదవండి. సూరహ్ అల్-ఫలఖ్ (113), సూరహ్ అన్-నాస్ (114) చదవండి. (జామె తిర్మిజీ', అబ్‌వాబ్ అ'త్-'తిబ్బ్).

نَفْسِ يَعْقُوبَ قَضَىٰهَا ۚ وَإِنَّهُۥ لَذُو عِلْمٍ لِّمَا عَلَّمْنَٰهُ وَلَٰكِنَّ أَكْثَرَ ٱلنَّاسِ لَا يَعْلَمُونَ ﴿٦٨﴾

సంకల్పం నుండి తప్పించుకోవటానికి, వారికి ఏ మాత్రమూ పనికిరాలేదు. మేము అతనికి నేర్పిన జ్ఞానం ప్రకారం అతను జ్ఞానవంతుడే, కాని చాలా మందికి తెలియదు.[1]

وَلَمَّا دَخَلُوا۟ عَلَىٰ يُوسُفَ ءَاوَىٰٓ إِلَيْهِ أَخَاهُ ۖ قَالَ إِنِّىٓ أَنَا۠ أَخُوكَ فَلَا تَبْتَئِسْ بِمَا كَانُوا۟ يَعْمَلُونَ ﴿٦٩﴾

**69**. మరియు వారు యూసుఫ్ వద్ద ప్రవేశించగా అతను తన సోదరుణ్ణి (బెన్యామీన్‌ను) తన దగ్గరికి తీసుకున్నాడు. అతనితో అన్నాడు: "వాస్తవానికి! నేనే నీ (తప్పిపోయిన) సోదరుడను, కావున వారు ఇంతవరకు చేస్తూవచ్చిన పనులకు నీవు దుఃఖపడకు."

فَلَمَّا جَهَّزَهُم بِجَهَازِهِمْ جَعَلَ ٱلسِّقَايَةَ فِى رَحْلِ أَخِيهِ ثُمَّ أَذَّنَ مُؤَذِّنٌ أَيَّتُهَا ٱلْعِيرُ إِنَّكُمْ لَسَٰرِقُونَ ﴿٧٠﴾

**70**. వారికి వారి సామగ్రి సిద్ధపరచిన తరువాత తన సోదరుని జీనుసంచిలో ఒక నీరుత్రాగే పాత్రను[2] పెట్టాడు. ఆ పిదప ఒక ప్రకటించేవాడు ఇలా ప్రకటించాడు: "ఓ బిడారువారలారా! మీరు నిశ్చయంగా దొంగలు!"

قَالُوا۟ وَأَقْبَلُوا۟ عَلَيْهِم مَّاذَا تَفْقِدُونَ ﴿٧١﴾

**71**. వారు (యూసుఫ్ సోదరులు) వారివైపు తిరిగి ఇలా అన్నారు: "మీ వస్తువు ఏదైనా పోయిందా?"

قَالُوا۟ نَفْقِدُ صُوَاعَ ٱلْمَلِكِ وَلِمَن جَآءَ بِهِۦ حِمْلُ بَعِيرٍ وَأَنَا۠ بِهِۦ زَعِيمٌ ﴿٧٢﴾

**72**. (కార్యకర్తలు) అన్నారు: "రాజు గారి పాత్ర పోయింది! మరియు ఎవడు దానిని తీసుకొనివస్తాడో అతనికి ఒక ఒంటె బరువు ధాన్యం (బహుమానంగా) ఇవ్వబడుతుంది మరియు నేను దానికి బాధ్యుణ్ణి."

---

**1**. ఆపదలనుండి తప్పించుకోవటానికి ప్రయత్నించటం మంచిదే, కాని ఎంత ప్రయత్నించినా విధివ్రాత నుండి తప్పించుకోవటం సాధ్యంకాని పని.

**2**. ఆ నీరుత్రాగే కప్పు వెండిది లేక బంగారుది.

قَالُواْ تَاللَّهِ لَقَدْ عَلِمْتُم مَّا جِئْنَا لِنُفْسِدَ فِي ٱلْأَرْضِ وَمَا كُنَّا سَٰرِقِينَ ﴿٧٣﴾

73. (యూసుఫ్ సోదరులు) అన్నారు: "అల్లాహ్ సాక్షి! మీకు బాగా తెలుసు, మేము మీ దేశంలో సంక్షోభం రేకెత్తించటానికిరాలేదు మరియు మేము దొంగలము కాము!"

قَالُواْ فَمَا جَزَٰٓؤُهُۥٓ إِن كُنتُمْ كَٰذِبِينَ ﴿٧٤﴾

74. (కార్యకర్తలు) అన్నారు: "మీరు అబద్ధమాడుతున్నారని తెలిస్తే దానికి శిక్ష ఏమిటి?"

قَالُواْ جَزَٰٓؤُهُۥ مَن وُجِدَ فِي رَحْلِهِۦ فَهُوَ جَزَٰٓؤُهُۥۚ كَذَٰلِكَ نَجْزِي ٱلظَّٰلِمِينَ ﴿٧٥﴾

75. వారు (యూసుఫ్ సోదరులు) జవాబిచ్చారు: "ఎవడి సంచిలో ఆ పాత్ర దొరుకుతుందో అతడు దానికి పరిహారంగా (బానిసగా) ఉండాలి. మేము ఇదే విధంగా దుర్మార్గులను శిక్షిస్తాము."[1]

فَبَدَأَ بِأَوْعِيَتِهِمْ قَبْلَ وِعَآءِ أَخِيهِ ثُمَّ ٱسْتَخْرَجَهَا مِن وِعَآءِ أَخِيهِۚ كَذَٰلِكَ كِدْنَا لِيُوسُفَۖ مَا كَانَ لِيَأْخُذَ أَخَاهُ فِي دِينِ ٱلْمَلِكِ إِلَّآ أَن يَشَآءَ ٱللَّهُۚ نَرْفَعُ دَرَجَٰتٍ مَّن نَّشَآءُۗ وَفَوْقَ كُلِّ ذِي عِلْمٍ عَلِيمٌ ﴿٧٦﴾

76. అప్పుడతడు తన సోదరుని మూట వెదికే ముందు, వారి (సవతి సోదరుల) మూటలను వెతకటం ప్రారంభించాడు. చివరకు తనసోదరుని మూటనుండి దానిని (పాత్రను) బయటికి తీశాడు. ఈ విధంగా మేము యూసుఫ్ కొరకు యుక్తి చూపాము. ఈ విధంగా - అల్లాహ్ ఇచ్ఛయే లేకుంటే - అతను తన సోదరుణ్ణి, రాజధర్మం ప్రకారం ఉంచుకోలేక పోయేవాడు.[2] మేము కోరిన వారి స్థానాలను పెంచుతాము. మరియు జ్ఞానులందరినీ మించిన జ్ఞాని ఒకడు (అల్లాహ్) ఉన్నాడు. (1/8)

---

1. య'అఖూబ్ ('అ.స.) షరీయత్‌లో, దొంగతనం చేసినవాడు, పట్టుబడిన తరువాత దొంగిలింపబడిన సరకు యజమాని దగ్గర బానిసగా ఉండాలి. కావున వారు కూడా ఆ శిక్షనే ప్రతిపాదించారు.
2. ఈజిప్టు రాజ్యధర్మం ప్రకారం యూసుఫ్ ('అ.స.) దొంగగా నిరూపించబడినా (బెన్యామీన్‌ను) పొందలేక పోయేవారు. కావున అతను, తన మారు సోదరులను మొదటనే ప్రశ్నించి దొంగతనం చేసినవారి విషయంలో వారి అభిప్రాయాన్ని తీసుకున్నారు.

77. * (అతని సోదరులు అన్నారు): "ఇతడు దొంగతనం చేసినా (ఆశ్చర్యంలేదు)! వాస్తవానికి ఇతని సోదరుడు కూడా ఇంతకుముందు దొంగతనం చేశాడు." ఇది విని యూసుఫ్ (కోపాన్ని) తన హృదయంలోనే దాచుకున్నాడు మరియు దానిని వారిపై వ్యక్తపరచలేదు. (తన మనస్సులో) అనుకున్నాడు: "మీరు చాల నీచమైన వారు. మరియు మీరు పలికేది అల్లాహ్‌కు బాగా తెలుసు!"

78. వారన్నారు: "ఓ సర్దార్ ('అ'జీ'జ్)! వాస్తవానికి, ఇతని తండ్రి చాలా ముసలి వాడు, కావున ఇతనికి బదులుగా నీవు మాలో ఒకనిని ఉంచుకో. వాస్తవానికి, మేము నిన్ను మేలు చేసేవానిగా చూస్తున్నాము."

79. అతను అన్నాడు: "అల్లాహ్ నన్ను రక్షించు గాక! మా సొమ్ము ఎవరివద్ద దొరికిందో అతనిని విడిచి, మరొకనిని మేమెలా పట్టుకోగలము. ఒకవేళ అలాచేస్తే నిశ్చయంగా మేము దుర్మార్గులం అవుతాము."

80. తరువాత వారు అతని పట్ల నిరాశులై, ఆలోచించటానికి ఏకాంతంలో చేరారు! వారిలో పెద్దవాడు అన్నాడు: "ఏమీ? మీ తండ్రి వాస్తవానికి మీతో అల్లాహ్‌పై ప్రమాణం తీసుకున్న విషయం మీకు గుర్తులేదా? మరియు ఇంతకు పూర్వం మీరు యూసుఫ్ విషయంలో కూడా మాట తప్పారు కదా? కావున నేను

۞ قَالُوٓاْ إِن يَسۡرِقۡ فَقَدۡ سَرَقَ أَخٞ لَّهُۥ مِن قَبۡلُۚ فَأَسَرَّهَا يُوسُفُ فِي نَفۡسِهِۦ وَلَمۡ يُبۡدِهَا لَهُمۡۚ قَالَ أَنتُمۡ شَرّٞ مَّكَانٗاۖ وَٱللَّهُ أَعۡلَمُ بِمَا تَصِفُونَ ٧٧

قَالُواْ يَٰٓأَيُّهَا ٱلۡعَزِيزُ إِنَّ لَهُۥٓ أَبٗا شَيۡخٗا كَبِيرٗا فَخُذۡ أَحَدَنَا مَكَانَهُۥٓۖ إِنَّا نَرَىٰكَ مِنَ ٱلۡمُحۡسِنِينَ ٧٨

قَالَ مَعَاذَ ٱللَّهِ أَن نَّأۡخُذَ إِلَّا مَن وَجَدۡنَا مَتَٰعَنَا عِندَهُۥٓ إِنَّآ إِذٗا لَّظَٰلِمُونَ ٧٩

فَلَمَّا ٱسۡتَيۡـَٔسُواْ مِنۡهُ خَلَصُواْ نَجِيّٗاۖ قَالَ كَبِيرُهُمۡ أَلَمۡ تَعۡلَمُوٓاْ أَنَّ أَبَاكُمۡ قَدۡ أَخَذَ عَلَيۡكُم مَّوۡثِقٗا مِّنَ ٱللَّهِ وَمِن قَبۡلُ مَا فَرَّطتُمۡ فِي يُوسُفَۖ فَلَنۡ أَبۡرَحَ

నా తండ్రి నాకు అనుమతి ఇవ్వనంత వరకు, లేదా అల్లాహ్ నా గురించి తీర్పు చెయ్యనంత వరకు, నేను ఈ దేశాన్ని వదలను. మరియు ఆయనే తీర్పుచేసే వారిలో అత్యుత్తముడు."

**81**. (ఇంకా ఇలా అన్నాడు): "మీరు మీ నాన్న దగ్గరికి పోయి అతనితో ఇలా చెప్పండి: 'నాన్నా! వాస్తవానికి నీ కుమారుడు దొంగతనం చేశాడు. మేము అతనిని (దొంగతనం చేస్తూఉండగా) చూడలేదు! మాకు తెలిసిందే (మేము చెబుతున్నాము). మరియు వాస్తవానికి రహస్యంగా జరిగే దానిని మేము చూడలేము కదా!

**82**. " 'మరియు మేము ఉన్న నగరవాసులను మరియు మేము కలిసి తిరిగివచ్చిన బిడారువారిని కూడా అడగండి. మరియు మేము నిశ్చయంగా, సత్యం పలుకుతున్నాము.' "

**83**. (య'అఖూబ్) అన్నాడు: "కానీ, మీ (దుష్ట) మనస్సులు మీ చేత మరొక ఘోర కార్యాన్ని తేలికగా చేయించాయి. ఇక నా కొరకు సహనమే మేలైనది. ఇక అల్లాహ్'యే! వారందరినీ నా వద్దకు తీసుకురావచ్చు! నిశ్చయంగా, ఆయనే సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు."

**84**. మరియు అతను వారినుండి ముఖం త్రిప్పుకొని అన్నాడు: "అయ్యో! యూసుఫ్." అతని కన్నులు, దుఃఖంవలన తెల్లబడ్డాయి (చూపు పోయింది). అయినా అతను దానిని (వెలిబుచ్చకుండా) అణచుకున్నాడు.

ٱلْأَرْضَ حَتَّىٰ يَأْذَنَ لِيٓ أَبِيٓ أَوْ يَحْكُمَ ٱللَّهُ لِيۖ وَهُوَ خَيْرُ ٱلْحَٰكِمِينَ ٨٠

ٱرْجِعُوٓاْ إِلَىٰٓ أَبِيكُمْ فَقُولُواْ يَٰٓأَبَانَآ إِنَّ ٱبْنَكَ سَرَقَ وَمَا شَهِدْنَآ إِلَّا بِمَا عَلِمْنَا وَمَا كُنَّا لِلْغَيْبِ حَٰفِظِينَ ٨١

وَسْـَٔلِ ٱلْقَرْيَةَ ٱلَّتِي كُنَّا فِيهَا وَٱلْعِيرَ ٱلَّتِيٓ أَقْبَلْنَا فِيهَاۖ وَإِنَّا لَصَٰدِقُونَ ٨٢

قَالَ بَلْ سَوَّلَتْ لَكُمْ أَنفُسُكُمْ أَمْرًاۖ فَصَبْرٌ جَمِيلٌۖ عَسَى ٱللَّهُ أَن يَأْتِيَنِي بِهِمْ جَمِيعًاۚ إِنَّهُۥ هُوَ ٱلْعَلِيمُ ٱلْحَكِيمُ ٨٣

وَتَوَلَّىٰ عَنْهُمْ وَقَالَ يَٰٓأَسَفَىٰ عَلَىٰ يُوسُفَ وَٱبْيَضَّتْ عَيْنَاهُ مِنَ ٱلْحُزْنِ فَهُوَ كَظِيمٌ ٨٤

قَالُواْ تَاللَّهِ تَفْتَؤُاْ تَذْكُرُ
يُوسُفَ حَتَّىٰ تَكُونَ حَرَضًا أَوْ
تَكُونَ مِنَ ٱلْهَٰلِكِينَ ﴿٨٥﴾

**85**. అతని (కుమారులు) అన్నారు: "అల్లాహ్ తోడు! నీవు వ్యాధితో కృశించి పోయేవరకో, లేదా నశించిపోయేవరకో యూసుఫ్‌ను జ్ఞాపకం చేసుకోవటం మానవు."

قَالَ إِنَّمَآ أَشْكُواْ بَثِّي وَحُزْنِيٓ
إِلَى ٱللَّهِ وَأَعْلَمُ مِنَ ٱللَّهِ مَا لَا
تَعْلَمُونَ ﴿٨٦﴾

**86**. (య'అఖూబ్) అన్నాడు: "వాస్తవానికి నా ఆవేదనను మరియు నా దుఃఖాన్ని నేను కేవలం అల్లాహ్‌తో మాత్రమే మొరపెట్టుకోగలను మరియు మీకు తెలియనిది నాకు అల్లాహ్ ద్వారా తెలుస్తుంది.

يَٰبَنِيَّ ٱذْهَبُواْ فَتَحَسَّسُواْ مِن
يُوسُفَ وَأَخِيهِ وَلَا تَاْيْـَٔسُواْ مِن
رَّوْحِ ٱللَّهِۖ إِنَّهُۥ لَا يَاْيْـَٔسُ مِن رَّوْحِ
ٱللَّهِ إِلَّا ٱلْقَوْمُ ٱلْكَٰفِرُونَ ﴿٨٧﴾

**87**. నా కుమారులారా! మీరు పోయి యూసుఫ్‌ను మరియు అతని సోదరుణ్ణి గురించి దర్యాప్తు చేయండి మరియు అల్లాహ్ అనుగ్రహం పట్ల నిరాశ చెందకండి. నిశ్చయంగా, సత్యతిరస్కార జాతికి చెందిన వారు తప్ప, ఇతరులు అల్లాహ్ అనుగ్రహం పట్ల నిరాశ చెందరు."[1]

فَلَمَّا دَخَلُواْ عَلَيْهِ قَالُواْ يَٰٓأَيُّهَا
ٱلْعَزِيزُ مَسَّنَا وَأَهْلَنَا ٱلضُّرُّ وَجِئْنَا
بِبِضَٰعَةٍ مُّزْجَىٰةٍ فَأَوْفِ لَنَا
ٱلْكَيْلَ وَتَصَدَّقْ عَلَيْنَآۖ إِنَّ ٱللَّهَ
يَجْزِي ٱلْمُتَصَدِّقِينَ ﴿٨٨﴾

**88**. వారు అతని (యూసుఫ్) దగ్గరకు (మరల) వచ్చి[2] అన్నారు: "ఓ సర్దార్ ('అ'జీ'జ్)! మేము మా కుటుంబంవారు చాలా ఇబ్బందులకు గురిఅయ్యాము. మరియు మేము చాలా తక్కువ సామాగ్రి తెచ్చాము, కాని మాకు పూర్తి సామగ్రిని (ధాన్యాన్ని) దానధర్మ రూపంలోనైనా సరే ఇవ్వండి. నిశ్చయంగా, అల్లాహ్ దానధర్మాలు చేసేవారికి మంచి ప్రతిఫలం ఇస్తాడు."

---

**1**. చూడండి, 15:56.
**2**. ధాన్యం కొరకు, ఇది వారి మూడవ ఈజిప్టు ప్రయాణం.

**89**. (యూసుఫ్) అడిగాడు: "అజ్ఞానంలోపడి మీరు యూసుఫ్ మరియు అతని సోదరునితో ఎలా వ్యవహరించారో మీకు గుర్తుందా?"

**90**. వారన్నారు: "ఏమిటి? వాస్తవానికి నీవే యూసుఫ్‌వా?" అతను జవాబిచ్చాడు: "నేనే యూసుఫ్‌ను మరియు ఇతడు (బెన్యామీన్) నా సోదరుడు. నిశ్చయంగా, అల్లాహ్ మమ్మల్ని అనుగ్రహించాడు. నిశ్చయంగా, ఎవరైతే దైవభీతి కలిగివుండి, సహనంతో ఉంటారో, అలాంటి సజ్జనుల ప్రతిఫలాన్ని అల్లాహ్ ఎన్నడూ వృథాచేయడు."

**91**. వారన్నారు: "అల్లాహ్ తోడు! వాస్తవంగా, అల్లాహ్ నీకు మాపై ఔన్నత్యాన్ని ప్రసాదించాడు మరియు నిశ్చయంగా, మేము అపరాధులము!"

**92**. (యూసుఫ్) అన్నాడు: "ఈ రోజు మీపై ఎలాంటి నిందలేదు.[1] అల్లాహ్ మిమ్మల్ని క్షమించు గాక! ఆయన కరుణించే వారిలో అందరికంటే ఉత్తమమైన కారుణ్యమూర్తి!

**93**. "మీరు నా ఈ చొక్కా తీసుకొనిపోయి దానిని నాతండ్రి ముఖంమీద వేయండి. అతనికి దృష్టివస్తుంది. మరియు మీరు మీ కుటుంబం వారినందరినీ నా వద్దకు తీసుకొనిరండి."

قَالَ هَلۡ عَلِمۡتُم مَّا فَعَلۡتُم بِيُوسُفَ
وَأَخِيهِ إِذۡ أَنتُمۡ جَٰهِلُونَ ﴿٨٩﴾
قَالُوٓاْ أَءِنَّكَ لَأَنتَ يُوسُفُۖ
قَالَ أَنَا۠ يُوسُفُ وَهَٰذَآ أَخِيۖ قَدۡ
مَنَّ ٱللَّهُ عَلَيۡنَآۖ إِنَّهُۥ مَن يَتَّقِ
وَيَصۡبِرۡ فَإِنَّ ٱللَّهَ لَا يُضِيعُ
أَجۡرَ ٱلۡمُحۡسِنِينَ ﴿٩٠﴾
قَالُواْ تَٱللَّهِ لَقَدۡ ءَاثَرَكَ ٱللَّهُ
عَلَيۡنَا وَإِن كُنَّا
لَخَٰطِـِٔينَ ﴿٩١﴾
قَالَ لَا تَثۡرِيبَ عَلَيۡكُمُ ٱلۡيَوۡمَۖ
يَغۡفِرُ ٱللَّهُ لَكُمۡۖ وَهُوَ أَرۡحَمُ
ٱلرَّٰحِمِينَ ﴿٩٢﴾
ٱذۡهَبُواْ بِقَمِيصِي هَٰذَا فَأَلۡقُوهُ
عَلَىٰ وَجۡهِ أَبِي يَأۡتِ بَصِيرٗا وَأۡتُونِي
بِأَهۡلِكُمۡ أَجۡمَعِينَ ﴿٩٣﴾

---

**1**. ఏవిధంగానైతే యూసుఫ్ ('అ.స.) తనను చంపగోరి బావిలో పడవేసిన తన సోదరులను క్షమించారో! అదే విధంగా మక్కా విజయం రోజు దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) తనను చంపగోరిన, తన తెగవారైన, మక్కా ఖురైషులను క్షమించారు.

وَلَمَّا فَصَلَتِ ٱلۡعِيرُ قَالَ أَبُوهُمۡ إِنِّي لَأَجِدُ رِيحَ يُوسُفَۖ لَوۡلَآ أَن تُفَنِّدُونِ ﴿٩٤﴾

**94**. ఆ బిడారం (ఈజిప్టు నుండి) బయలుదేరగానే వారితండ్రి అన్నాడు: "మీరు నన్ను బుద్ధినశించిన ముసలివాడు అనా్న! నిశ్చయంగా నాకు యూసుఫ్ సువాసన వస్తోంది."

قَالُواْ تَٱللَّهِ إِنَّكَ لَفِي ضَلَٰلِكَ ٱلۡقَدِيمِ ﴿٩٥﴾

**95**. (అతడి దగ్గర ఉన్నవారు) అన్నారు: "అల్లాహ్ తోడు! నిశ్చయంగా, నీవు నీ పూర్వపు పొరపాటులోనే పడిఉన్నావు."

فَلَمَّآ أَن جَآءَ ٱلۡبَشِيرُ أَلۡقَىٰهُ عَلَىٰ وَجۡهِهِۦ فَٱرۡتَدَّ بَصِيرٗاۖ قَالَ أَلَمۡ أَقُل لَّكُمۡ إِنِّيٓ أَعۡلَمُ مِنَ ٱللَّهِ مَا لَا تَعۡلَمُونَ ﴿٩٦﴾

**96**. ఆ తరువాత శుభవార్త తెలిపేవాడు వచ్చి (యూసుఫ్ చొక్కాను) అతని ముఖం మీద వేయగానే అతని దృష్టి తిరిగి వచ్చేసింది. (అప్పుడు) అతను అన్నాడు: "ఏమీ నేను మీతో అనలేదా? 'మీకు తెలియనిది నాకు అల్లాహ్ ద్వారా తెలుస్తుందని?' "

قَالُواْ يَٰٓأَبَانَا ٱسۡتَغۡفِرۡ لَنَا ذُنُوبَنَآ إِنَّا كُنَّا خَٰطِـِٔينَ ﴿٩٧﴾

**97**. వారన్నారు: "ఓ మా నాన్నా! మా పాపాల క్షమాపణకై (అల్లాహ్‌ను) ప్రార్థించు. నిశ్చయంగా, మేము అపరాధులము."

قَالَ سَوۡفَ أَسۡتَغۡفِرُ لَكُمۡ رَبِّيٓۖ إِنَّهُۥ هُوَ ٱلۡغَفُورُ ٱلرَّحِيمُ ﴿٩٨﴾

**98**. అతను అన్నాడు: "మిమ్మల్ని క్షమించమని నేను నా ప్రభువును ప్రార్థించగలను. నిశ్చయంగా, ఆయన క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత!"

فَلَمَّا دَخَلُواْ عَلَىٰ يُوسُفَ ءَاوَىٰٓ إِلَيۡهِ أَبَوَيۡهِ وَقَالَ ٱدۡخُلُواْ مِصۡرَ إِن شَآءَ ٱللَّهُ ءَامِنِينَ ﴿٩٩﴾

**99**. తరువాత వారందరూ యూసుఫ్ వద్దకు వెళ్ళినప్పుడు, అతను తన తల్లి దండ్రులకు[1] స్థానమిచ్చి అన్నాడు: "ఈజిప్టులో ప్రవేశించండి. అల్లాహ్ కోరితే, మీకు సుఖ శాంతులు దొరుకుతాయి."

---

**1**. యూసుఫ్ ('అ.స.) మరియు బెన్యామీన్ తల్లి రాచెల్ (Rachel), బెన్యామీన్ పుట్టిన తరువాత మరణించింది. కావున ఇక్కడ అతని తండ్రితో పాటు వచ్చిన ఆమె అతని తల్లి చెల్లెలు. తల్లి మరణించిన తరువాత య'అఖూబ్ ('అ.స.) ఆమె చెల్లెలును వివాహమాడారని, కొందరు వ్యాఖ్యాతలు అంటారు. (ఫ'త్హ్ అల్-ఖదీర్). కాని ఇమామ్ ఇబ్నె-జరీర్ 'తబరీ (ర'హ్మ) అభిప్రాయమేమిటంటే, యూసుఫ్ ('అ.స.) తల్లి బ్రతికి ఉండెను. ఆమె తన భర్త వెంట వచ్చింది, (ఇబ్నె-కసీ'ర్).

وَرَفَعَ أَبَوَيۡهِ عَلَى ٱلۡعَرۡشِ وَخَرُّواْ لَهُۥ سُجَّدٗاۖ وَقَالَ يَٰٓأَبَتِ هَٰذَا تَأۡوِيلُ رُءۡيَٰيَ مِن قَبۡلُ قَدۡ جَعَلَهَا رَبِّي حَقّٗاۖ وَقَدۡ أَحۡسَنَ بِيٓ إِذۡ أَخۡرَجَنِي مِنَ ٱلسِّجۡنِ وَجَآءَ بِكُم مِّنَ ٱلۡبَدۡوِ مِنۢ بَعۡدِ أَن نَّزَغَ ٱلشَّيۡطَٰنُ بَيۡنِي وَبَيۡنَ إِخۡوَتِيٓۚ إِنَّ رَبِّي لَطِيفٞ لِّمَا يَشَآءُۚ إِنَّهُۥ هُوَ ٱلۡعَلِيمُ ٱلۡحَكِيمُ ١٠٠

**100**. మరియు అతను తన తల్లి దండ్రులను సింహాసనం మీద కూర్చోబెట్టు కున్నాడు. మరియు వారందరూ అతని ముందు సాష్టాంగపడ్డారు.[1] మరియు (యూసుఫ్) అన్నాడు: "ఓ నా తండ్రీ! నేను పూర్వం కన్న కల యొక్క భావం ఇదే కదా! నా ప్రభువు వాస్తవంగా దానిని సత్యంచేసి చూపాడు. మరియు వాస్తవంగా నన్ను చెరసాల నుండి బయటికితీసి కూడా నాకు ఎంతో మేలుచేశాడు; నాకూ మరియు నా సోదరుల మధ్య షైతాను విరోధం కలిగించిన తరువాత (ఇప్పుడు) మిమ్మల్ని ఎడారి నుండి (ఇక్కడకు) తెచ్చాడు.[2] నిశ్చయంగా, నా ప్రభువు సూక్ష్మగ్రాహి, తాను కోరినది యుక్తితో నెరవేర్చుతాడు. నిశ్చయంగా, ఆయన సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు. (1/4)

۞ رَبِّ قَدۡ ءَاتَيۡتَنِي مِنَ ٱلۡمُلۡكِ وَعَلَّمۡتَنِي مِن تَأۡوِيلِ ٱلۡأَحَادِيثِۚ فَاطِرَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ أَنتَ وَلِيِّۦ فِي ٱلدُّنۡيَا وَٱلۡأٓخِرَةِۖ تَوَفَّنِي مُسۡلِمٗا وَأَلۡحِقۡنِي بِٱلصَّٰلِحِينَ ١٠١

**101**. * "ఓ నా ప్రభూ! నీవు నాకు వాస్తవంగా రాజ్యాధికారాన్ని ప్రసాదించావు మరియు నాకు స్వప్ననిర్వచన జ్ఞానాన్ని కూడా ప్రసాదించావు. నీవే భూమ్యా కాశాలకు మూలాధారుడవు. మరియు ఇహపర లోకాలలో నీవే నా సంరక్షకుడవు. నీకు విధేయునిగా (ముస్లింగా) ఉన్న స్థితిలోనే నన్ను మరణింపజేయి. మరియు నన్ను సద్వర్తనులలో కలుపు."

---

**1**. ఈ సాష్టాంగం కేవలం ఒకరి పట్ల ఉన్న గౌరవాన్ని చూపటానికి చేసింది. ఈ విధంగా గౌరవం చూపడం య'అఖూబ్ ('అ.స.) షరీయత్‌లో అనుమతింపబడివుండెను. కాని ము'హమ్మద్ ('స'అస) షరీయత్‌లో గౌరవార్థం కూడా ఎవరిముందైనా సాష్టాంగం చేయటం ధర్మసమ్మతం కాదు.

**2**. ఈజిప్టుతో పోల్చితే ఆకాలంలో కానాన్ ఒక ఎడారి మాదిరిగానే ఉండెను. అల్-బద్వు: ఎడారి, (చూ.12:100); అల్-బాదు: ఎడారి వాసుడు, (చూ.22:25); బాదూన్ బ.వ.: ఎడారి వాసులు (చూ.33:20). అల్ అ'అరాబ్, అంటే, కూడా ఎడారి వాసులు (బద్దూలు, చూ. 9:90).

ذَٰلِكَ مِنۡ أَنۢبَآءِ ٱلۡغَيۡبِ نُوحِيهِ إِلَيۡكَۖ وَمَا كُنتَ لَدَيۡهِمۡ إِذۡ أَجۡمَعُوٓاْ أَمۡرَهُمۡ وَهُمۡ يَمۡكُرُونَ ١٠٢

**102**. (ఓ ప్రవక్తా!) మేము నీకు దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా అవతరింపజేసిన ఈ గాథ అగోచర విషయాలలోనిది. ఎందుకంటే, వారందరూ కలసి కుట్రలుపన్ని, నిర్ణయాలు చేసినప్పుడు, నీవు అక్కడ వారితోబాటు లేకుంటివి![1]

وَمَآ أَكۡثَرُ ٱلنَّاسِ وَلَوۡ حَرَصۡتَ بِمُؤۡمِنِينَ ١٠٣

**103**. మరియు నీవు ఎంత కోరినా, వీరిలో చాలామంది విశ్వసించేవారు కారు.[2]

وَمَا تَسۡـَٔلُهُمۡ عَلَيۡهِ مِنۡ أَجۡرٍۚ إِنۡ هُوَ إِلَّا ذِكۡرٞ لِّلۡعَٰلَمِينَ ١٠٤

**104**. మరియు నీవు వారిని దీని (హితబోధ) కొరకు ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. ఇది సర్వలోకాల వారికి కేవలం ఒక హితబోధ మాత్రమే.

وَكَأَيِّن مِّنۡ ءَايَةٖ فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ يَمُرُّونَ عَلَيۡهَا وَهُمۡ عَنۡهَا مُعۡرِضُونَ ١٠٥

**105**. మరియు ఆకాశాలలో మరియు భూమిలో ఎన్ని సూచనలను వారు చూస్తూ ఉన్నారు. అయినా వారు (వాటిని గమనించలేక) వాటి నుండి ముఖం త్రిప్పుకుంటున్నారు.

---

1. ఇక్కడ అల్లాహ్ (సు.తా.) విశదీకరించేది ఏమిటంటే, కొందరు సత్యతిరస్కారులు నిందమోపినట్లు ఈ విషయాలు ము'హమ్మద్ ('స'అస) ఎవరితోనో విని నేర్చుకున్నవి కావు. ఎందుకంటే ఇవి క్రైస్తవుల మరియు యూదుల కథలకు భిన్నంగా ఉన్నాయి. ఇంకా అల్లాహ్ (సు.తా.) ఇక్కడ సాక్ష్యమిస్తున్నాడు: ''ఇవి దైవప్రవక్త ('స'అస)కు వ'హీద్వారా తెలుపుతున్నాను,'' అని. మరొక విషయం ఏమిటంటే ప్రవక్తలకు అల్లాహ్ (సు.తా.) తెలిపినది తప్ప, అగోచర విషయాల జ్ఞానం ఉండదు. ఇంకా ఇతర చోట్లలో కూడా అల్లాహ్ (సు.తా.) అన్నాడు: ''మేము తెలిపినది తప్ప ఓ ము'హమ్మద్('స'అస)! నీకు అగోచర విషయాల జ్ఞానం లేదు.'' (చూడండి, 3:17, 44; 28:45-46; 38:69-70).
2. అల్లాహ్ (సు.తా.) తన ప్రవక్తల ద్వారా, ప్రజలకు గడిచినవారి వృత్తాంతాలు తెలిపి గుణపాఠం నేర్చుకొని, సత్యధర్మం (ఇస్లాం) మీద ఉండాలని బోధించాడు. అయినా ప్రజలు వాటిని కేవలం కాలక్షేపానికి మాత్రమే విన్నట్లు వింటున్నారు. గుణపాఠం నేర్చుకొని సత్యధర్మాన్ని అవలంబించే వారు తక్కువే!

وَمَا يُؤْمِنُ أَكْثَرُهُم بِٱللَّهِ إِلَّا وَهُم مُّشْرِكُونَ ﴿١٠٦﴾

106. మరియు వారిలో చాలా మంది అల్లాహ్‌ను విశ్వసించి కూడా, ఆయనకు సాటి కల్పించే వారున్నారు.[1]

أَفَأَمِنُوٓاْ أَن تَأْتِيَهُمْ غَٰشِيَةٌ مِّنْ عَذَابِ ٱللَّهِ أَوْ تَأْتِيَهُمُ ٱلسَّاعَةُ بَغْتَةً وَهُمْ لَا يَشْعُرُونَ ﴿١٠٧﴾

107. ఏమిటి? అల్లాహ్ శిక్ష తమను క్రమ్ముకోకుండా, వారు సురక్షితంగా ఉండగలరని, వారు భావిస్తున్నారా? లేదా వారికి తెలియకుండానే అకస్మాత్తుగా (అంతిమ) ఘడియ రాదని వారు భావిస్తున్నారా?

قُلْ هَٰذِهِۦ سَبِيلِىٓ أَدْعُوٓاْ إِلَى ٱللَّهِ ۚ عَلَىٰ بَصِيرَةٍ أَنَا۠ وَمَنِ ٱتَّبَعَنِى ۖ وَسُبْحَٰنَ ٱللَّهِ وَمَآ أَنَا۠ مِنَ ٱلْمُشْرِكِينَ ﴿١٠٨﴾

108. (వారితో) అను: "ఇదే నా మార్గం. నేనూ మరియు నన్ను అనుసరించే వారూ, నిశ్చిత జ్ఞానంతో మిమ్మల్ని అల్లాహ్ వైపునకు పిలుస్తున్నాము. మరియు అల్లాహ్ సర్వలోపాలకు అతీతుడు మరియు నేను ఆయనకు సాటికల్పించే వారిలోని వాడను కాను!"

وَمَآ أَرْسَلْنَا مِن قَبْلِكَ إِلَّا رِجَالًا نُّوحِىٓ إِلَيْهِم مِّنْ أَهْلِ ٱلْقُرَىٰٓ ۗ أَفَلَمْ يَسِيرُواْ فِى ٱلْأَرْضِ فَيَنظُرُواْ كَيْفَ كَانَ عَٰقِبَةُ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ ۗ وَلَدَارُ ٱلْءَاخِرَةِ خَيْرٌ لِّلَّذِينَ ٱتَّقَوْاْ ۗ أَفَلَا تَعْقِلُونَ ﴿١٠٩﴾

109. మరియు మేము నీ కంటే పూర్వం దివ్యజ్ఞానం (వహీ) ఇచ్చి పంపిన వారందరూ పురుషులే,[2] వారూ నగర వాసులలోని వారే. ఏమీ? వీరు భూమిలో సంచారం చేయలేదా, తమ పూర్వీకుల గతి ఏమయిందో చూడటానికి? దైవభీతి గలవారికి పరలోకవాసమే ఎంతో మేలైనది. ఏమీ? మీరిది అర్థం చేసుకోలేరా?

---

1. చాలామంది ముష్రిక్‌లు భూమ్యాకాశాల సృష్టికర్త మరియు పోషకుడు, అల్లాహ్ (సు.తా.) మాత్రమే అని నమ్ముతారు. అయినా తమ ఆరాధనలలో ఆయనకు సాటి కల్పిస్తారు. దర్గాలకు పోయి మన్నతులు చేసేవారి విషయం కూడా ఇలాంటిదే.

2. ఇక్కడ, ప్రవక్తలందరూ పురుషులే, అని విశదీకరించబడింది. స్త్రీలకు ప్రవక్తృత్వం ఇవ్వబడలేదు. మరొక విషయం విశదమయ్యేదేమిటంటే, ప్రవక్తలందరూ అహ్‌లల్ ఖురా' పురవాసులే కానీ అహ్‌లల్ బాదియహ్ సహరా వాసులు (పల్లెటూరు వాసులు) కారు.

حَتَّىٰٓ إِذَا ٱسۡتَيۡـَٔسَ ٱلرُّسُلُ
وَظَنُّوٓاْ أَنَّهُمۡ قَدۡ كُذِبُواْ
جَآءَهُمۡ نَصۡرُنَا فَنُجِّيَ مَن نَّشَآءُۖ
وَلَا يُرَدُّ بَأۡسُنَا عَنِ ٱلۡقَوۡمِ
ٱلۡمُجۡرِمِينَ ١١٠

**110.** తుదకు ప్రవక్తలు నిరాశులయ్యారు మరియు వారు వాస్తవానికి (ప్రజలద్వారా) అబద్ధీకులని తిరస్కరించబడ్డారని భావించినప్పుడు వారికి (ప్రవక్తలకు) మా సహాయం లభించింది కాబట్టి మేము కోరినవాడు రక్షించబడ్డాడు. మరియు మా శిక్ష అపరాధులైన జాతి వారిపై నుండి తొలగింపబడదు.

لَقَدۡ كَانَ فِي قَصَصِهِمۡ عِبۡرَةٞ
لِّأُوْلِي ٱلۡأَلۡبَٰبِۗ مَا كَانَ حَدِيثٗا
يُفۡتَرَىٰ وَلَٰكِن تَصۡدِيقَ
ٱلَّذِي بَيۡنَ يَدَيۡهِ وَتَفۡصِيلَ
كُلِّ شَيۡءٖ وَهُدٗى وَرَحۡمَةٗ لِّقَوۡمٖ
يُؤۡمِنُونَ ١١١

**111.** వాస్తవానికి వారి గాథలలో బుద్ధి మంతులకు గుణపాఠం ఉంది. ఇది (ఈ ఖుర్ఆన్) కల్పిత గాథ కాదు. కాని ఇది ఇంతవరకు వచ్చిన గ్రంథాలలో మిగిలివున్న సత్యాన్ని ధృవీకరిస్తుంది మరియు ప్రతి విషయాన్ని వివరిస్తుంది మరియు ఇది విశ్వసించే వారికి మార్గదర్శిని మరియు కారుణ్యం కూడాను.

*****

## 13. సూరహ్ అర్-ర'అద్

## سُورَةُ الرَّعْدِ

ఈ సూరహ్ మదీనాలో అవతరింపజేయబడింది. ఇందులో **43 ఆయతులు** ఉన్నాయి. దీనిపేరు **13**వ **ఆయత్**నుండి తీసుకోబడింది. ర'అదున్, అంటే **ఉరుము**, మేఘగర్జన, లేక పిడుగు. అల్లాహ్ (సు.తా.) ఆదేశం: *"నిశ్చయంగా, ఒక జాతి వారు తమ స్థితిని తాము మార్చుకోనంత వరకు, అల్లాహ్ వారి స్థితిని మార్చడు!"* (ఆయత్-11).

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓمٓرۚ تِلۡكَ ءَايَٰتُ ٱلۡكِتَٰبِۗ وَٱلَّذِيٓ أُنزِلَ إِلَيۡكَ مِن رَّبِّكَ ٱلۡحَقُّ وَلَٰكِنَّ أَكۡثَرَ ٱلنَّاسِ لَا يُؤۡمِنُونَ ١

**1.** అలిఫ్-లామ్-మీమ్-ర. ఇవి ఈ గ్రంథ (ఖుర్ఆన్) ఆయతులు. మరియు ఇది నీ ప్రభువు తరఫునుండి, నీపై అవతరింపజేయబడిన సత్యం! కాని చాలా మంది, విశ్వసించటం లేదు.

ٱللَّهُ ٱلَّذِي رَفَعَ ٱلسَّمَٰوَٰتِ بِغَيۡرِ عَمَدٖ تَرَوۡنَهَاۖ ثُمَّ ٱسۡتَوَىٰ عَلَى ٱلۡعَرۡشِۖ وَسَخَّرَ ٱلشَّمۡسَ وَٱلۡقَمَرَۖ كُلّٞ يَجۡرِي لِأَجَلٖ مُّسَمّٗىۚ يُدَبِّرُ ٱلۡأَمۡرَ يُفَصِّلُ ٱلۡأٓيَٰتِ لَعَلَّكُم بِلِقَآءِ رَبِّكُمۡ تُوقِنُونَ ٢

**2.** మీరు చూస్తున్నారు కదా! ఆకాశాలను స్తంభాలు లేకుండా నిలిపిన ఆయన, అల్లాహ్ యే! ఆ తరువాత ఆయన, తన సింహాసనాన్ని ('అర్ష్ ను) అధిష్ఠించాడు. మరియు ఆయన సూర్యచంద్రులను తన నియమానికి బద్ధులుగా చేశాడు. ప్రతి ఒక్కటీ తన నిర్ణీత కాలంలో (తన పరిధిలో) పయనిస్తూ ఉంటుంది.[1] ఆయన అన్ని వ్యవహారాలను నడిపిస్తూ, తన సూచనలను వివరిస్తున్నాడు; బహుశా! (ఈ విధంగానైనా) మీరు మీ ప్రభువును కలుసుకోవలసి ఉందనే విషయాన్ని నమ్ముతారేమోనని!

---

**1.** చూడండి, 36:38, 39 మరియు 7:54.

وَهُوَ ٱلَّذِى مَدَّ ٱلْأَرْضَ وَجَعَلَ فِيهَا رَوَٰسِىَ وَأَنْهَٰرًا ۖ وَمِن كُلِّ ٱلثَّمَرَٰتِ جَعَلَ فِيهَا زَوْجَيْنِ ٱثْنَيْنِ ۖ يُغْشِى ٱلَّيْلَ ٱلنَّهَارَ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَءَايَٰتٍ لِّقَوْمٍ يَتَفَكَّرُونَ ﴿٣﴾

3. మరియు ఆయనే భూమిని విశాలంగా చేసి దానిలో స్థిరమైన పర్వతాలను మరియు నదులను నెలకొల్పాడు. అందులో ప్రతి రకమైన ఫలాన్ని, రెండేసి (ఆడ-మగ) జతలుగా చేశాడు.[1] ఆయనే రాత్రిని పగటి మీద కప్పుతాడు. నిశ్చయంగా వీటన్నిటిలో ఆలోచించే వారి కొరకు సూచనలు ఉన్నాయి.

وَفِى ٱلْأَرْضِ قِطَعٌ مُّتَجَٰوِرَٰتٌ وَجَنَّٰتٌ مِّنْ أَعْنَٰبٍ وَزَرْعٌ وَنَخِيلٌ صِنْوَانٌ وَغَيْرُ صِنْوَانٍ يُسْقَىٰ بِمَآءٍ وَٰحِدٍ وَنُفَضِّلُ بَعْضَهَا عَلَىٰ بَعْضٍ فِى ٱلْأُكُلِ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَءَايَٰتٍ لِّقَوْمٍ يَعْقِلُونَ ﴿٤﴾

4. మరియు భూమిలో వేర్వేరు రకాల (నేలలు) ఒకదాని కొకటి ప్రక్కప్రక్కన ఉన్నాయి మరియు ద్రాక్ష తోటలు, పంట పొలాలు మరియు ఖర్జూరపు చెట్లు, కొన్ని ఒక్కొక్కటి గానూ, మరికొన్ని గుచ్ఛలు గుచ్ఛలు(జతలు)గానూ ఉన్నాయి.[2] వాటన్నిటికీ ఒకే నీరు పారుతుంది, కాని తినటానికి వాటి రుచులు, ఒకటి మరొక దాని కంటే ఉత్తమమైననదిగా ఉన్నట్లు చేశాము. నిశ్చయంగా వీటన్నిటిలో అర్థం చేసుకోగల వారికొరకు ఎన్నో సూచనలు ఉన్నాయి.[3] (3/8)

۞ وَإِن تَعْجَبْ فَعَجَبٌ قَوْلُهُمْ أَءِذَا كُنَّا تُرَٰبًا أَءِنَّا لَفِى خَلْقٍ جَدِيدٍ ۗ أُو۟لَٰٓئِكَ ٱلَّذِينَ كَفَرُوا۟ بِرَبِّهِمْ ۖ

5. * ఇది నీకు ఆశ్చర్యకరంగా ఉంటే, వారి ఈ మాట అంతకంటే ఆశ్చర్యకరమైనది: "ఏమీ? మేము మట్టిగా మారిపోయిన తరువాత కూడా వాస్తవంగా

1. వృక్షకోటిలో కూడా ఆడ-మగ అంతరం ఉంది. సాధారణంగా ఆడ-మగ అంగాలు ఒకే పువ్వులో ఉంటాయి. ఉదా: మామిడి. కొన్ని ఒకే వృక్షం మీద వేర్వేరు పువ్వులలో ఉంటాయి. ఉదా: దోసతీగ. మరికొన్ని వేర్వేరు వృక్షాలపై ఉంటాయి. ఉదా: ఖర్జూరపుచెట్లు.
2. కొన్నిచెట్లు ఒకే కాండం గలవి. మరికొన్ని శాఖలు గలవి ఉన్నాయి.
3. చూడండి, 6:99 మరియు 141.

وَأُوْلَٰٓئِكَ ٱلۡأَغۡلَٰلُ فِيٓ أَعۡنَاقِهِمۡۖ وَأُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ ٱلنَّارِۖ هُمۡ فِيهَا خَٰلِدُونَ ٥

మరల క్రొత్తగా సృష్టించబడతామా?'' అలాంటి వారే తమ ప్రభువును తిరస్కరించిన వారు. అలాంటి వారి మెడలలో సంకెళ్ళు వేయబడిఉంటాయి.[1] మరియు అలాంటి వారే నరకవాసులు. అక్కడ వారు శాశ్వతంగా ఉంటారు.

وَيَسۡتَعۡجِلُونَكَ بِٱلسَّيِّئَةِ قَبۡلَ ٱلۡحَسَنَةِ وَقَدۡ خَلَتۡ مِن قَبۡلِهِمُ ٱلۡمَثُلَٰتُۗ وَإِنَّ رَبَّكَ لَذُو مَغۡفِرَةٖ لِّلنَّاسِ عَلَىٰ ظُلۡمِهِمۡۖ وَإِنَّ رَبَّكَ لَشَدِيدُ ٱلۡعِقَابِ ٦

**6**. మరియు వారు మేలుకు ముందు కీడును (తెమ్మని) నిన్ను తొందరపెడుతున్నారు.[2] మరియు వారికి పూర్వం అనేక ఉదాహరణలు గడిచాయి. మరియు వారు దుర్మార్గం చేసినప్పటికీ![3] నిశ్చయంగా, నీ ప్రభువు ప్రజల యెడల క్షమాశీలుడు. మరియు నిశ్చయంగా నీ ప్రభువు శిక్షించటంలో కూడా చాలా కఠినుడు.[4]

وَيَقُولُ ٱلَّذِينَ كَفَرُواْ لَوۡلَآ أُنزِلَ عَلَيۡهِ ءَايَةٞ مِّن رَّبِّهِۦٓۗ إِنَّمَآ أَنتَ مُنذِرٞۖ وَلِكُلِّ قَوۡمٍ هَادٍ ٧

**7**. మరియు సత్యతిరస్కారులు అంటున్నారు: ''అతనిపై అతని ప్రభువు తరఫునుండి ఏదైనా ఒక అద్భుత సంకేతం ఎందుకు అవతరింపజేయబడలేదు?''[5] వాస్తవానికి నీవు కేవలం హెచ్చరిక చేసేవాడవు మాత్రమే! మరియు ప్రతిజాతికి ఒక మార్గదర్శకుడు వచ్చి ఉన్నాడు.[6]

---

**1**. చూడండి, 34:33, 36:8.
**2**. చూడండి, 6:57-58; 8:32.
**3**. చూడండి, 35:45.
**4**. చూడండి, 6:47; 7:167; 15:49-50, 10:11.
**5**. చూడండి, 6:7,111; 10:96-97 మరియు 13:31.
**6**. చూడండి, 35:24, 6:131.

8. అల్లాహ్‌కు, ప్రతి స్త్రీ తన గర్భంలో దాల్చేది[1] మరియు గర్భకాలపు హెచ్చుతగ్గులు[2] కూడా బాగా తెలుసు. ప్రతిదానికి ఆయన దగ్గర ఒక పరిమాణం (నిర్ణయింపబడి) ఉంది.

9. ఆయన అగోచర మరియు గోచర విషయాలన్నింటినీ ఎరిగిన వాడు. మహనీయుడు,[3] మహోన్నతుడు.[4]

10. మీలో ఒకడు తన మాటను రహస్యంగా చెప్పినా, లేక దానిని బహిరంగంగా చెప్పినా; మరియు ఒకడు రాత్రి చీకటిలో దాగి ఉన్నా లేక పగటి వెలుగులో తిరుగుతూ ఉన్నా, (అల్లాహ్ దృష్టిలో) అంతా సమానమే (ఒకటే)![5]

11. ప్రతి వాని ముందూ వెనుకా ఆయన నియమించిన, ఒకరి వెంట ఒకరు వచ్చే[6] కావలివారు (దైవదూతలు) ఉన్నారు. వారు అల్లాహ్ ఆజ్ఞానుసారం అతనిని (మనిషిని) కాపాడుతూ ఉంటారు. నిశ్చయంగా, ఒక జాతివారు తమ స్థితిని తాము మార్చుకోనంత

ٱللَّهُ يَعْلَمُ مَا تَحْمِلُ كُلُّ أُنثَىٰ وَمَا
تَغِيضُ ٱلْأَرْحَامُ وَمَا تَزْدَادُ
وَكُلُّ شَيْءٍ عِندَهُۥ بِمِقْدَارٍ ﴿٨﴾
عَٰلِمُ ٱلْغَيْبِ وَٱلشَّهَٰدَةِ ٱلْكَبِيرُ
ٱلْمُتَعَالِ ﴿٩﴾
سَوَآءٌ مِّنكُم مَّنْ أَسَرَّ ٱلْقَوْلَ وَمَن
جَهَرَ بِهِۦ وَمَنْ هُوَ مُسْتَخْفٍۭ
بِٱلَّيْلِ وَسَارِبٌۢ بِٱلنَّهَارِ ﴿١٠﴾
لَهُۥ مُعَقِّبَٰتٌ مِّنۢ بَيْنِ يَدَيْهِ وَمِنْ خَلْفِهِۦ
يَحْفَظُونَهُۥ مِنْ أَمْرِ ٱللَّهِ ۗ إِنَّ ٱللَّهَ لَا
يُغَيِّرُ مَا بِقَوْمٍ حَتَّىٰ يُغَيِّرُوا۟ مَا بِأَنفُسِهِمْ ۗ

---

1. త'హ్మిలు: Bear, Carry, అంటే కలిగి ఉండు, సహించు, మోయు, వహించు, భరించు, పెట్టుకొను. ఇక్కడ స్త్రీ గర్భంలో ఉన్న శిశువు యొక్క స్వభావం, లక్షణాలు, అదృష్టం, వయస్సు అని అర్థం.
2. త'గీదుల్ అర్'హామ్: Fall short, Absorb, అంటే గర్భకాలపు హెచ్చుతగ్గులు.
3. **అల్-కబీర్:** = **అల్-అజీమ్** The Incomparably Great, The Greatest, **మహానీయుడు**, గొప్పవాడు, మహత్త్వం, ప్రభావం, ప్రతాపం గలవాడు, గొప్పదనానికి సరోవరం. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు. చూడండి, 22:62, 31:30, మొదలైనవి.
4. **అల్-ముత'ఆలి:** Most High, He who is higher than every (other) high one. **మహోన్నతుడు**, అందరికంటే అత్యున్నతుడు. ఖుర్ఆన్‌లో ఇక్కడ మాత్రమే ఒకేసారి వచ్చింది. **అల్-అలియ్యు**, చూడండి, 2:255. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.
5. ఈ తాత్పర్యం ముహమ్మద్ జూనాగఢీ గారి అనవాదాన్ని అనుసరించి ఉంది. అంటే అల్లాహ్ (సు.తా)కు అంతా తెలుస్తుంది. ఆయన నుండి దాగింది ఏదీ లేదు.
6. అంటే ఎడతెగకుండా ఒకరి తరువాత ఒకరు రాత్రింబవళ్ళు కాపలా ఉంటారు.

وَإِذَآ أَرَادَ ٱللَّهُ بِقَوۡمٖ سُوٓءٗا فَلَا مَرَدَّ
لَهُۥۚ وَمَا لَهُم مِّن دُونِهِۦ مِن وَالٍ ١١
هُوَ ٱلَّذِي يُرِيكُمُ ٱلۡبَرۡقَ
خَوۡفٗا وَطَمَعٗا وَيُنشِئُ
ٱلسَّحَابَ ٱلثِّقَالَ ١٢
وَيُسَبِّحُ ٱلرَّعۡدُ بِحَمۡدِهِۦ
وَٱلۡمَلَٰٓئِكَةُ مِنۡ خِيفَتِهِۦ وَيُرۡسِلُ
ٱلصَّوَٰعِقَ فَيُصِيبُ بِهَا مَن
يَشَآءُ وَهُمۡ يُجَٰدِلُونَ فِي ٱللَّهِ
وَهُوَ شَدِيدُ ٱلۡمِحَالِ ١٣
لَهُۥ دَعۡوَةُ ٱلۡحَقِّۖ وَٱلَّذِينَ يَدۡعُونَ مِن
دُونِهِۦ لَا يَسۡتَجِيبُونَ لَهُم بِشَيۡءٍ إِلَّا
كَبَٰسِطِ كَفَّيۡهِ إِلَى ٱلۡمَآءِ لِيَبۡلُغَ فَاهُ
وَمَا هُوَ بِبَٰلِغِهِۦۚ وَمَا دُعَآءُ ٱلۡكَٰفِرِينَ
إِلَّا فِي ضَلَٰلٖ ١٤

వరకు, అల్లాహ్ వారిస్థితిని మార్చడు.[1] అల్లాహ్ ఒక జాతివారికి కీడు చేయదలిస్తే దానిని ఎవ్వరూ తొలగించలేరు. మరియు వారికి ఆయన తప్ప మరొక స్నేహితుడు (ఆదుకునే వాడు) లేడు.

**12**. ఆయనే! మీకు భయం మరియు ఆశ కలిగించే మెరుపులను చూపుతున్నాడు. మరియు ఆయనే నీళ్ళతో బరువెక్కిన మేఘాలను పుట్టిస్తున్నాడు.

**13**. మరియు **ఉరుము** ఆయన పవిత్రతను కొనియాడుతుంది, ఆయన స్తోత్రం చేస్తుంది మరియు దైవదూతలు కూడా ఆయన భయంతో (ఆయన స్తోత్రం చేస్తూ ఉంటారు)![2] మరియు ఆయన ఫెళ ఫెళమనే ఉరుములను పంపి, వాటి ద్వారా తాను కోరిన వారిని శిక్షిస్తాడు. అయినా వీరు (సత్యతిరస్కారులు) అల్లాహ్‌ను గురించి వాదులాడుతున్నారు. మరియు ఆయన అద్భుత యుక్తిపరుడు.[3]

**14**. ఆయనను ప్రార్థించటమే విద్యుక్త ధర్మం. ఆయనను వదలి వారు ప్రార్థించేవి (ఇతర శక్తులు) వారికి ఏ విధమైన సమాధాన మివ్వ లేవు. అది (వాటిని వేడుకోవడం): ఒకడు తన రెండు చేతులు నీటి వైపుకు చాచి, అది (నీరు) నోటిదాకా రావాలని ఆశించటమే! కాని అది అతని (నోటివరకు) చేరదుకదా! (అలాగే) సత్యతిరస్కారుల ప్రార్థనలన్నీ వ్యర్థమైపోతాయి.

---

**1**. చూడండి, 8:53.
**2**. చూడండి, 17:44.
**3**. షదీదుల్-మి'హాల్: ఖుర్ఆన్‌లో ఈ వాక్యం కేవలం ఇక్కడే ఒకేసారి వచ్చింది. మి'హాల్: Contrivance, అంటే యుక్తి, కల్పన, తంత్రం, పన్నుగడ, కుట్ర, ఉపాయం మొదలైనవి. షదీద్: Severe, Strong, కఠిన, తీవ్ర, దృఢ, బల, అద్భుత, ఘన మైనది.

15. మరియు భూమ్యాకాశాలలో ఉన్న ప్రతి వస్తువు ఇష్టంగానో అయిష్టంగానో అల్లాహ్‌కు సాష్టాంగం (సజ్దా) చేస్తూ ఉంటుంది. మరియు వాటి నీడలు కూడా ఉదయం మరియు సాయంత్రం (సాష్టాంగం చేస్తూ ఉంటాయి).[1] ۩

16. ఇలా అడుగు: "భూమ్యాకాశాలకు ప్రభువు ఎవరు?" నీవే ఇలా జవాబివ్వు: "అల్లాహ్!" తరువాత ఇలా అను: "అయితే మీరు ఆయనను వదలి తమకు తాము మేలు గానీ, కీడు గానీ చేసుకోలేని వారిని, మీకు సహాయకులుగా (సంరక్షకులుగా) ఎన్నుకుంటారా?" ఇంకా ఇలా అడుగు: "ఏమీ? గ్రుడ్డివాడు మరియు చూడగలిగే వాడూ సమానులు కాగలరా? లేక అంధకారాలు మరియు వెలుగు సమానమేనా? లేక వారు (అల్లాహ్‌కు) సాటి కల్పించిన వారు కూడా అల్లాహ్ సృష్టించినట్లు ఏమైనా సృష్టించారా, అందువలన సృష్టి విషయంలో వారికి సందేహం కలిగిందా?" వారితో అను: "అల్లాహ్‌యే ప్రతి దానికి సృష్టికర్త[2] మరియు ఆయన అద్వితీయుడు, ప్రబలుడు (తన సృష్టిపై సంపూర్ణ అధికారం గలవాడు)."[3]

وَلِلَّهِ يَسۡجُدُ مَن فِي ٱلسَّمَٰوَٰتِ
وَٱلۡأَرۡضِ طَوۡعٗا وَكَرۡهٗا وَظِلَٰلُهُم
بِٱلۡغُدُوِّ وَٱلۡأٓصَالِ ۩ ﴿١٥﴾

قُلۡ مَن رَّبُّ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ قُلِ
ٱللَّهُۚ قُلۡ أَفَٱتَّخَذۡتُم مِّن دُونِهِۦٓ أَوۡلِيَآءَ
لَا يَمۡلِكُونَ لِأَنفُسِهِمۡ نَفۡعٗا وَلَا ضَرّٗاۚ
قُلۡ هَلۡ يَسۡتَوِي ٱلۡأَعۡمَىٰ وَٱلۡبَصِيرُ
أَمۡ هَلۡ تَسۡتَوِي ٱلظُّلُمَٰتُ وَٱلنُّورُۗ
أَمۡ جَعَلُواْ لِلَّهِ شُرَكَآءَ خَلَقُواْ كَخَلۡقِهِۦ
فَتَشَٰبَهَ ٱلۡخَلۡقُ عَلَيۡهِمۡۚ قُلِ ٱللَّهُ خَٰلِقُ
كُلِّ شَيۡءٖ وَهُوَ ٱلۡوَٰحِدُ ٱلۡقَهَّٰرُ ﴿١٦﴾

1. చూడండి, 16:48-49 మరియు 22:18. భూమి తన చుట్టూ తాను తిరిగటం వల్ల రాత్రింబవళ్ళు వస్తాయి. సూర్యచంద్రులు కూడా గమనంలో ఉన్నాయి. ఇదంతా అల్లాహ్ (సు.తా.) ఆదేశంతో జరుగు తోంది. కాబట్టి నీడలు కూడా ఉదయం మరియు సాయంత్రం పొడుగ్గా ఉండి మధ్యాహ్నం చిన్నదవటం కూడా అల్లాహ్ (సు.తా.) ఆదేశాలను అనుసరించటమే!

2. **అల్-ఖాలిఖు:** సృష్టికర్త, అల్లాహ్ (సు.తా.)యే ఏ నమూనా లేకుండా క్రొత్తగా సృష్టించే వాడు. ఆయన (సు.తా.) ఏదైనా చేయటానికి పూనుకున్నప్పుడు దానిని: 'అయిపో' అని ఆజ్ఞాపిస్తాడు. అంతే అది అయిపోతుంది. చూడండి, 6:102 మరియు 2:117.

3. **అల్-వాహిద్, అల్-ఖహ్హార్**లకు చూడండి,12:39.

أَنزَلَ مِنَ ٱلسَّمَآءِ مَآءً فَسَالَتْ أَوْدِيَةُۢ بِقَدَرِهَا فَٱحْتَمَلَ ٱلسَّيْلُ زَبَدًا رَّابِيًاۚ وَمِمَّا يُوقِدُونَ عَلَيْهِ فِى ٱلنَّارِ ٱبْتِغَآءَ حِلْيَةٍ أَوْ مَتَٰعٍ زَبَدٌ مِّثْلُهُۥۚ كَذَٰلِكَ يَضْرِبُ ٱللَّهُ ٱلْحَقَّ وَٱلْبَٰطِلَۚ فَأَمَّا ٱلزَّبَدُ فَيَذْهَبُ جُفَآءًۖ وَأَمَّا مَا يَنفَعُ ٱلنَّاسَ فَيَمْكُثُ فِى ٱلْأَرْضِۚ كَذَٰلِكَ يَضْرِبُ ٱللَّهُ ٱلْأَمْثَالَ ﴿١٧﴾

**17**. ఆయన (అల్లాహ్) ఆకాశం నుండి నీరు కురిపించగా (ఎండిపోయిన) సెలయేళ్ళు తమతమ పరిమాణాలకు సరిపడేలా[1] ప్రవహింపసాగుతాయి. అప్పుడు వరద (ఉపరితలం మీద) నురుగులు ఉబ్బివస్తాయి. మరియు అగ్నిని రగిలించి నగలు, పాత్రలు చేసేటప్పుడు కూడా కరిగించే లోహాల మీద కూడా అదేవిధంగా నురుగులు వస్తాయి.[2] ఈ విధంగా అల్లాహ్ సత్యమేదో అసత్యమేదో పోల్చి వివరిస్తున్నాడు. ఎందుకంటే నురుగంతా ఎగిరిపోతుంది, కాని మానవులకు లాభదాయకమైనది భూమిలో మిగులుతుంది. ఈ విధంగా అల్లాహ్ ఉదాహరణలను వివరిస్తున్నాడు.[3]

لِلَّذِينَ ٱسْتَجَابُوا۟ لِرَبِّهِمُ ٱلْحُسْنَىٰۚ وَٱلَّذِينَ لَمْ يَسْتَجِيبُوا۟ لَهُۥ لَوْ أَنَّ لَهُم مَّا فِى ٱلْأَرْضِ جَمِيعًا وَمِثْلَهُۥ مَعَهُۥ لَٱفْتَدَوْا۟ بِهِۦٓۚ أُو۟لَٰٓئِكَ لَهُمْ سُوٓءُ ٱلْحِسَابِ وَمَأْوَىٰهُمْ جَهَنَّمُۖ وَبِئْسَ ٱلْمِهَادُ ﴿١٨﴾

**18**. తమ ప్రభువు సందేశాన్ని స్వీకరించిన వారికి మంచి ప్రతిఫలం ఉంటుంది. మరియు ఆయన సందేశాన్ని స్వీకరించని వారి దగ్గర భూమిలో ఉన్నదంతా మరియు దానితోపాటు దానికి సమానంగా ఉన్నా, వారు అదంతా పరిహారంగా ఇవ్వదలచుకున్నా (అది స్వీకరించబడదు).[4] అలాంటి వారి లెక్క దారుణంగా ఉంటుంది. మరియు వారి ఆశ్రయం నరకమే. మరియు అది ఎంతో దుర్భరమైన విరామస్థలము. (1/2)

---

1. బి 'ఖద్‌రిహా: తమతమ పరిమాణాన్నిబట్టి పూర్తిగానిండి.
2. పారే నీటిపై వచ్చే నురుగు గానీ, వెండి, బంగారు కరిగించినపుడు వచ్చే నురుగు గానీ, మాలిన్యాలే. అవి ఎగిరిపోతాయి. మరియు అసలే క్రింద మిగిలిపోతుంది.
3. చూడండి, 24:39-40.
4. చూడండి, 3:91; 10:54.

19. * ఏమీ? నీ ప్రభువు నుండి నీపై అవతరింపజేయబడినది (ఈ సందేశం) సత్యమని తెలుసుకున్నవాడు, గ్రుడ్డివానితో సమానుడా? నిశ్చయంగా, బుద్ధిమంతులే ఇది గ్రహించగలరు.

20. వారే, ఎవరైతే అల్లాహ్‌తో చేసిన వాగ్దానం పూర్తిచేస్తారో మరియు తమ వాగ్దానాన్ని భంగపరచరో![1]

21. మరియు ఎవరైతే అల్లాహ్ కలుపమని ఆజ్ఞాపించిన వాటిని కలుపుతారో![2] మరియు తమ ప్రభువుకు భయపడుతారో మరియు దారుణంగా తీసుకోబడే లెక్కకు భయపడుతారో!

22. మరియు ఎవరైతే తమ ప్రభువు ప్రీతికొరకు సహనం వహించి[3] మరియు నమా'జ్‌ను స్థాపించి[4] మరియు మేము ప్రసాదించిన ఉపాధి నుండి రహస్యంగా మరియు బహిరంగంగా (అల్లాహ్ మార్గంలో) ఖర్చుచేస్తూ, చెడును మంచి ద్వారా పారద్రోలుతూ ఉంటారో![5] అలాంటి వారికే ఉత్తమ పరలోక గృహం ప్రతిఫలంగా ఉంటుంది.

۞ أَفَمَن يَعْلَمُ أَنَّمَآ أُنزِلَ إِلَيْكَ مِن رَّبِّكَ ٱلْحَقُّ كَمَنْ هُوَ أَعْمَىٰٓ ۚ إِنَّمَا يَتَذَكَّرُ أُو۟لُوا۟ ٱلْأَلْبَٰبِ ﴿١٩﴾

ٱلَّذِينَ يُوفُونَ بِعَهْدِ ٱللَّهِ وَلَا يَنقُضُونَ ٱلْمِيثَٰقَ ﴿٢٠﴾

وَٱلَّذِينَ يَصِلُونَ مَآ أَمَرَ ٱللَّهُ بِهِۦٓ أَن يُوصَلَ وَيَخْشَوْنَ رَبَّهُمْ وَيَخَافُونَ سُوٓءَ ٱلْحِسَابِ ﴿٢١﴾

وَٱلَّذِينَ صَبَرُوا۟ ٱبْتِغَآءَ وَجْهِ رَبِّهِمْ وَأَقَامُوا۟ ٱلصَّلَوٰةَ وَأَنفَقُوا۟ مِمَّا رَزَقْنَٰهُمْ سِرًّا وَعَلَانِيَةً وَيَدْرَءُونَ بِٱلْحَسَنَةِ ٱلسَّيِّئَةَ أُو۟لَٰٓئِكَ لَهُمْ عُقْبَى ٱلدَّارِ ﴿٢٢﴾

---

1. చూడండి, 5:1.
2. చూడండి, 8:75.
3. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞలను పాటించటం మరియు పాపాలనుండి తప్పించుకోవటం ఒక సహనం. మరియు బాధలలో, ఆపదలలో సహనం వహించటం రెండవది. సత్పురుషులు ఈ రెండు రకాల సహనాన్ని వహిస్తారు.
4. నమా'జ్ స్థాపించటం అంటే నమా'జ్‌ను దాని సమయంలో,భయభక్తులతో సరిగ్గా సలపటం.
5. వారు, ఎవరికైతే చెడు సంభవిస్తే దానికి బదులుగా మంచి చేస్తారో లేక మన్నించి సహనం వహిస్తారో. చూడండి, 41:34.

جَنَّٰتُ عَدۡنٖ يَدۡخُلُونَهَا وَمَن صَلَحَ مِنۡ ءَابَآئِهِمۡ وَأَزۡوَٰجِهِمۡ وَذُرِّيَّٰتِهِمۡۖ وَٱلۡمَلَٰٓئِكَةُ يَدۡخُلُونَ عَلَيۡهِم مِّن كُلِّ بَابٖ ٢٣

23. శాశ్వతంగా ఉండే ఉద్యాన వనాలలో[1] వారు మరియు వారితోపాటు సద్వర్తనులైన వారి తండ్రితాతలు, వారి సహవాసులు (అ'జ్వాజ్) మరియు వారి సంతానం కూడా ప్రవేశిస్తారు.[2] మరియు ప్రతిద్వారం నుండి దేవదూతలు వారి (స్వాగతం) కొరకు వస్తారు.

سَلَٰمٌ عَلَيۡكُم بِمَا صَبَرۡتُمۡۚ فَنِعۡمَ عُقۡبَى ٱلدَّارِ ٢٤

24. (దేవదూతలు అంటారు): "మీ సహనానికి, ఫలితంగా ఇప్పుడు మీకు శాంతి కలుగు గాక (సలాం)! ఇక ఈ అంతిమ (పరలోక) గృహం ఎంతో సౌఖ్యదాయక మైనది!"

وَٱلَّذِينَ يَنقُضُونَ عَهۡدَ ٱللَّهِ مِنۢ بَعۡدِ مِيثَٰقِهِۦ وَيَقۡطَعُونَ مَآ أَمَرَ ٱللَّهُ بِهِۦٓ أَن يُوصَلَ وَيُفۡسِدُونَ فِي ٱلۡأَرۡضِ أُوْلَٰٓئِكَ لَهُمُ ٱللَّعۡنَةُ وَلَهُمۡ سُوٓءُ ٱلدَّارِ ٢٥

25. మరియు అల్లాహ్‌తో ఒడంబడిక చేసుకున్న తరువాత తమ వాగ్దానాన్ని భంగం చేసేవారు మరియు అల్లాహ్ కలపండి అని ఆదేశించిన వాటిని త్రెంచేవారు మరియు భూమిలో కల్లోలం రేకెత్తించే వారు! ఇలాంటి వారందరికీ ఆయన శాపం (బహిష్కారం) ఉంటుంది మరియు వారికి (పరలోకంలో) బహుచెడ్డ నివాసముంటుంది.

ٱللَّهُ يَبۡسُطُ ٱلرِّزۡقَ لِمَن يَشَآءُ وَيَقۡدِرُۚ وَفَرِحُواْ بِٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَا وَمَا ٱلۡحَيَوٰةُ ٱلدُّنۡيَا فِي ٱلۡأٓخِرَةِ إِلَّا مَتَٰعٞ ٢٦

26. అల్లాహ్ తాను కోరిన వారికి జీవనోపాధి పుష్కలంగా ప్రసాదిస్తాడు మరియు (తాను కోరిన వారికి) పరిమితం చేస్తాడు.[3] మరియు వారు ఇహలోక జీవితంలో సంతోషంగా ఉన్నారు, కాని పరలోక జీవితం ముందు ఇహలోక జీవిత సుఖసంతోషాలు తాత్కాలిక (తుచ్ఛ) మైనవే!

1. 'అద్నున్: అంటే శాశ్వతమైన స్వర్గవనాలు.
2. చూడండి, 52:21.
3. అల్లాహ్ (సు.తా.) తాను కోరింది చేస్తాడు. ఇహలోకంలో పుష్కలంగా జీవనోపాధి ఉన్నవాడితో అల్లాహ్ (సు.తా.) సంతోషపడ్డాడని మరియు ఇహలోక జీవితంలో కష్టాలలో ఉన్న వాడితో అల్లాహ్ (సు.తా.) సంతోషపడలేదని, దీని అర్థం కాదు. ఎవరికైనా అత్యధికంగా ధనసంపత్తులు ఇవ్వటం కేవలం అతనిని పరీక్షించటానికే! సత్యధర్మం మీద ఉండి సత్కార్యాలు చేసేవారే సాఫల్యం పొందుతారు.

27. మరియు సత్యతిరస్కారులు: "అతని (ము'హమ్మద్)పై, అతని ప్రభువు తరఫునుండి ఏదైనా ఒక అద్భుత సంకేతం ఎందుకు అవతరింపజేయబడలేదు?"[1] అని అంటున్నారు. వారితో అను: "నిశ్చయంగా, అల్లాహ్ తానుకోరిన వారిని మార్గభ్రష్టులుగా వదలుతాడు మరియు పశ్చాత్తాపపడి ఆయన వైపునకు తిరిగేవారికి సన్మార్గం చూపుతాడు."

28. ఎవరైతే విశ్వసించారో, వారి హృదయాలు అల్లాహ్ ధ్యానంవలన తృప్తి పొందుతాయి. జాగ్రత్తగా వినండి! కేవలం అల్లాహ్ ధ్యానమే (స్మరణయే) హృదయాలకు తృప్తినిస్తుంది.

29. విశ్వసించి సత్కార్యాలు చేసే వారికి (ఇహలోకంలో) ఆనందం, సర్వసుఖాలు[2] మరియు (పరలోకంలో) మంచి గమ్యస్థానం ఉంటాయి.

30. అందుకే (ఓ ము'హమ్మద్!) మేము నిన్ను ఒక సమాజం వారి వద్దకు పంపాము - వాస్తవానికి వారికి పూర్వం ఎన్నో సమాజాలు గతించాయి - నీవు నీపై మేము అవతరింప జేసిన దివ్యజ్ఞానం వారికి వినిపించటానికి! ఎందుకంటే వారు తమ కరుణామయుణ్ణి తిరస్కరిస్తున్నారు.[3] వారితో అను: "ఆయనే

وَيَقُولُ ٱلَّذِينَ كَفَرُواْ لَوۡلَآ أُنزِلَ
عَلَيۡهِ ءَايَةٞ مِّن رَّبِّهِۦۗ قُلۡ إِنَّ
ٱللَّهَ يُضِلُّ مَن يَشَآءُ وَيَهۡدِيٓ
إِلَيۡهِ مَنۡ أَنَابَ ٢٧

ٱلَّذِينَ ءَامَنُواْ وَتَطۡمَئِنُّ قُلُوبُهُم
بِذِكۡرِ ٱللَّهِۗ أَلَا بِذِكۡرِ ٱللَّهِ
تَطۡمَئِنُّ ٱلۡقُلُوبُ ٢٨
ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ
ٱلصَّٰلِحَٰتِ طُوبَىٰ لَهُمۡ وَحُسۡنُ
مَـَٔابٖ ٢٩
كَذَٰلِكَ أَرۡسَلۡنَٰكَ فِيٓ أُمَّةٖ قَدۡ خَلَتۡ
مِن قَبۡلِهَآ أُمَمٞ لِّتَتۡلُوَاْ عَلَيۡهِمُ ٱلَّذِيٓ
أَوۡحَيۡنَآ إِلَيۡكَ وَهُمۡ يَكۡفُرُونَ
بِٱلرَّحۡمَٰنِۚ قُلۡ هُوَ رَبِّي لَآ إِلَٰهَ إِلَّا هُوَ

1. చూడండి, 6:109.
2. 'తూబా: అంటే స్వర్గంలో మంచి స్థానం మరియు దాని భోగభాగ్యాలు.
3. మక్కా ముష్రిక్‌లు రహ్మాన్ శబ్దాన్ని తిరస్కరించే వారు. కావున హుదైబియా ఒప్పందం రోజు దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస): "బిస్మిల్లా హిర్ర'హ్మా నిర్ర'హీమ్." అని ఒప్పందం వ్రాయించడం ప్రారంభించినప్పుడు, ఒప్పందం చేసుకోవడానికి వచ్చిన రాయబారి: "అర్-రహ్మాన్ మరియు అర్-రహీమ్‌ను" మేము ఎరుగము "బిస్మిక అల్లాహుమ్మ" అని వ్రాయాలి." అని పట్టుపట్టాడు. ఖతదా (ర'ది.'అ.) కథనం, 'స. బు'ఖారీ).

عَلَيۡهِ تَوَكَّلۡتُ وَإِلَيۡهِ مَتَابِ ٣٠

నా ప్రభువు! ఆయన తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు! నేను ఆయననే నమ్ముకున్నాను. మరియు ఆయన వైపునకే నేను పశ్చాత్తాపంతో మరలిపోవలసి ఉన్నది.''

وَلَوۡ أَنَّ قُرۡءَانٗا سُيِّرَتۡ بِهِ ٱلۡجِبَالُ أَوۡ قُطِّعَتۡ بِهِ ٱلۡأَرۡضُ أَوۡ كُلِّمَ بِهِ ٱلۡمَوۡتَىٰۗ بَل لِّلَّهِ ٱلۡأَمۡرُ جَمِيعًاۗ أَفَلَمۡ يَاْيۡـَٔسِ ٱلَّذِينَ ءَامَنُوٓاْ أَن لَّوۡ يَشَآءُ ٱللَّهُ لَهَدَى ٱلنَّاسَ جَمِيعٗاۗ وَلَا يَزَالُ ٱلَّذِينَ كَفَرُواْ تُصِيبُهُم بِمَا صَنَعُواْ قَارِعَةٌ أَوۡ تَحُلُّ قَرِيبٗا مِّن دَارِهِمۡ حَتَّىٰ يَأۡتِيَ وَعۡدُ ٱللَّهِۚ إِنَّ ٱللَّهَ لَا يُخۡلِفُ ٱلۡمِيعَادَ ٣١

**31**. మరియు నిశ్చయంగా, (ఖుర్ఆన్‌ను) పఠించటం వలన కొండలు కదలింపబడినా, లేదా దానివల్ల భూమి చీల్చబడినా, లేదా దానివల్ల మృతులు మాట్లాడేటట్లు చేయబడినా! (అవిశ్వాసులు దానిని విశ్వసించరు). వాస్తవానికి సర్వ నిర్ణయాల అధికారం కేవలం అల్లాహ్‌కే చెందుతుంది.[1] ఏమీ? ఒకవేళ అల్లాహ్ కోరితే సర్వమానవులకు సన్మార్గం చూపేవాడని తెలిసి కూడా విశ్వాసులు ఎందుకు ఆశ వదులుకుంటున్నారు?[2] మరియు అల్లాహ్ వాగ్దానం పూర్తిఅయ్యే వరకు సత్య తిరస్కారంలో మునిగిఉన్న వారిపై, వారి కర్మల ఫలితంగా, ఏదో ఒక ఆపద కలుగుతూనే ఉంటుంది. లేదా అది వారి ఇండ్ల సమీపంలో పడుతూ ఉంటుంది.[3] నిశ్చయంగా అల్లాహ్ తనవాగ్దానాన్ని భంగపరచడు.

---

**1**. ఇబ్నె-కసీ'ర్ (ర'హ్మ) అంటారు: 'ప్రతి దివ్యగ్రంథం ఖుర్ఆన్ అనబడుతోంది.' ఒక 'హదీస్'లో ఉంది: 'దావూద్ (అ.స.) పశువులను సిద్ధపరచమని ఆజ్ఞాపించి ఆ సమయంలో ఖుర్ఆన్ పఠనం పూర్తి చేసుకునేవారు.' ('స.బు'ఖారీ, కితాబ్ అల్-అంబియా, బాబె ఖౌల్ అల్లాహుతా'లా: 'వ ఆతైనా దావూద జబూరా.') ఇక్కడ ఖుర్ఆన్ అంటే జబూర్ అని అర్థం. ఈ వాక్యపు అర్థం ఏమిటంటే ఒకవేళ ఇంతకు పూర్వం దివ్యగ్రంథం చదువటం వలన కొండలు కదిలింపబడితే (పొడిపొడిగా మారిపోతే), లేక మృతులు మాట్లాడ గలిగితే, ఈ ఖుర్ఆన్‌లో కూడా అటువంటి లక్షణాలు ఉండేవి. మరికొందరి అభిప్రాయం ఏమిటంటే, ఈ ఖుర్ఆన్‌లో ఇటువంటి విశేషలక్షణాలు ఉండినా, ఈ సత్యతిరస్కారులు దీనిని ఏ మాత్రమూ విశ్వసించేవారు కారు. ఎందుకంటే వారిని విశ్వాసులుగా చేయటం అల్లాహ్ (సు.తా.) పనే. అల్లాహ్ (సు.తా.) ఎవ్వరినీ కూడా మార్చడు ఎంతవరకైతే వారు తమను తాము మార్చు కోవటానికి ప్రయత్నించరో!

**2**. చూడండి, 2:26-27 మరియు 6:149.

**3**. చూడండి, 5:33.

وَلَقَدِ ٱسْتُهْزِئَ بِرُسُلٍ مِّن قَبْلِكَ فَأَمْلَيْتُ لِلَّذِينَ كَفَرُوا۟ ثُمَّ أَخَذْتُهُمْ ۖ فَكَيْفَ كَانَ عِقَابِ ﴿٣٢﴾

32. మరియు (ఓ ము'హమ్మద్!) వాస్తవానికి నీకు పూర్వం కూడా చాలా మంది ప్రవక్తలు పరిహసించబడ్డారు! కావున (మొదట) నేను సత్యతిరస్కారులకు వ్యవధినిచ్చాను తరువాత వారిని పట్టుకున్నాను. (చూశారా!) నా ప్రతీకారం (శిక్ష) ఎలా ఉండిందో![1]

أَفَمَنْ هُوَ قَآئِمٌ عَلَىٰ كُلِّ نَفْسٍۭ بِمَا كَسَبَتْ ۗ وَجَعَلُوا۟ لِلَّهِ شُرَكَآءَ قُلْ سَمُّوهُمْ ۚ أَمْ تُنَبِّـُٔونَهُۥ بِمَا لَا يَعْلَمُ فِى ٱلْأَرْضِ أَم بِظَـٰهِرٍ مِّنَ ٱلْقَوْلِ ۗ بَلْ زُيِّنَ لِلَّذِينَ كَفَرُوا۟ مَكْرُهُمْ وَصُدُّوا۟ عَنِ ٱلسَّبِيلِ ۗ وَمَن يُضْلِلِ ٱللَّهُ فَمَا لَهُۥ مِنْ هَادٍ ﴿٣٣﴾

33. ఏమీ? ఆయన (అల్లాహ్), ప్రతి వ్యక్తి అర్జించే దానిని కనిపెట్టుకుని ఉండేవాడు (మరియు లాభనష్టాలు కలుగజేయలేని మీ బూటకపు దైవాలు సరిసమానులా)? అయినా వారు అల్లాహ్‌కు భాగస్వాములు (సాటి) కల్పిస్తారు. వారితో ఇలా అను: "(నిజంగానే వారు అల్లాహ్ స్వయంగా నియమించుకున్న భాగస్వాములే అయితే) వారి పేర్లను తెలుపండి! లేక భూమిలో ఉన్నట్లు ఆయనకు తెలియని విషయాన్ని మీరు ఆయనకు తెలుపుతున్నారా? లేక మీరు ఇట్లే నోటికి వచ్చినట్లు వాగుతున్నారా?"[2] వాస్తవానికి సత్యాన్ని తిరస్కరించిన వారికి, వారి కుట్ర ఆకర్షణీయంగా చేయబడుతోంది మరియు వారు ఋజుమార్గం నుండి నిరోధించ బడ్డారు. మరియు అల్లాహ్ మార్గ భ్రష్టత్వంలో వదలిన వానికి సన్మార్గం చూపేవాడు ఎవ్వడూ ఉండడు.[3]

---

1. 'హదీస్'లో కూడా ఉంది: 'అల్లాహ్ (సు.తా.) దుర్మార్గులకు వ్యవదినిస్తూ పోతాడు, చివరకు వారిని శిక్షించటానికి పట్టుకున్నప్పుడు ఏ మాత్రమూ వదలడు.' దైవప్రవక్త ('స'అస), ఇది వినిపించిన తరువాత, ఆయత్ 11:102ను చదివి వినిపించారు. ('స'హీ'హ్ బు'ఖారీ, 'స. ముస్లిం).
2. మీరు కేవలం ఊహాగానాలే చేస్తున్నారు. మీరు ఏ దేవతలనైతే ఆరాధిస్తున్నారో అవి మీకు కీడు గానీ, మేలు గానీ చేయలేవు. మీరు పిలిచేవి - వాటి పేర్లే. అవి మీరో లేక మీ తండ్రితాతలో ఇచ్చినవే. అవి మీ కల్పిత దైవాలే. చూడండి, 53:23, 7:71 మరియు12:40.
3. చూడండి, 5:41 మరియు 16:37.

لَهُمْ عَذَابٌ فِي الْحَيَوٰةِ الدُّنْيَا وَلَعَذَابُ الْآخِرَةِ أَشَقُّ وَمَا لَهُم مِّنَ اللَّهِ مِن وَاقٍ ﴿٣٤﴾

34. వారికి ఇహలోక జీవితంలో శిక్ష వుంది. మరియు వారి పరలోక జీవిత శిక్ష ఎంతో కఠిన మైనది. మరియు వారిని అల్లాహ్ (శిక్ష) నుండి రక్షించేవాడు ఎవ్వడూ ఉండడు.[1] (5/8)

۞ مَّثَلُ الْجَنَّةِ الَّتِي وُعِدَ الْمُتَّقُونَ تَجْرِي مِن تَحْتِهَا الْأَنْهَارُ أُكُلُهَا دَائِمٌ وَظِلُّهَا تِلْكَ عُقْبَى الَّذِينَ اتَّقَوا وَّعُقْبَى الْكَافِرِينَ النَّارُ ﴿٣٥﴾

35. * దైవభీతి గలవారికి వాగ్దానం చేయబడిన స్వర్గపు ఉదాహరణ ఇదే! దాని క్రింద సెలయేళ్ళు పారుతూ ఉంటాయి.[2] దాని ఫలాలు మరియు నీడ సదా ఉంటాయి.[3] దైవభీతి గలవారి అంతిమ ఫలితం ఇదే. మరియు సత్యతిరస్కారుల అంతిమ ఫలితం నరకాగ్నియే!

وَالَّذِينَ آتَيْنَاهُمُ الْكِتَابَ يَفْرَحُونَ بِمَا أُنزِلَ إِلَيْكَ وَمِنَ الْأَحْزَابِ مَن يُنكِرُ بَعْضَهُ قُلْ إِنَّمَا أُمِرْتُ أَنْ أَعْبُدَ اللَّهَ وَلَا أُشْرِكَ بِهِ إِلَيْهِ أَدْعُو وَإِلَيْهِ مَآبِ ﴿٣٦﴾

36. మరియు (ఓ ప్రవక్తా!) ఎవరికైతే మేము (ముందు) గ్రంథాన్ని ఇచ్చామో! వారు నీపై అవతరింపజేయబడిన దాని (ఈ గ్రంథం) వలన సంతోషపడుతున్నారు.[4] మరియు వారిలోని కొన్ని వర్గాలవారు దానిలోని కొన్ని విషయాలను తిరస్కరించే వారు కూడా ఉన్నారు.[5] వారితో ఇలా అను: "నిశ్చయంగా, నేను అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించాలని మరియు ఆయనకు సాటి (భాగస్వాములను) కల్పించరాదని ఆజ్ఞాపించబడ్డాను. నేను మిమ్మల్ని ఆయన వైపునకే ఆహ్వానిస్తున్నాను మరియు గమ్యస్థానం గూడా ఆయన వద్దనే ఉంది!"

---

1. ఈ ప్రపంచ శిక్ష (అ'జాబ్) పరలోక శిక్ష కంటే చాలా తేలికైనది. ఈ ప్రపంచ శిక్ష తాత్కాలికమైనది. పరలోక శిక్ష శాశ్వతమైనది. నరకాగ్ని భూలోక అగ్నికంటే 69 రెట్లు అధిక తీవ్రత గలది. ('స'హీ'హ్ ముస్లిం).
2. స్వర్గనరకాలు మానవుల జ్ఞానపరిధికి అగోచర విషయాలు. కావున వాటిని మానవులకు తెలిసిన ఉద్యానవనాలు మరియు అగ్నితో పోల్చి చెప్పబడుతోంది. చూడండి, 47:15.
3. "జిల్లున్: అర్థం కొరకు చూడండి, 4:57 చివరి భాగం.
4. వీరు ముస్లింలు.
5. వీరు క్రైస్తవులు, యూదులు మరియు ముష్రిక్‌లు.

وَكَذَٰلِكَ أَنزَلۡنَٰهُ حُكۡمًا عَرَبِيّٗاۚ وَلَئِنِ
ٱتَّبَعۡتَ أَهۡوَآءَهُم بَعۡدَمَا جَآءَكَ مِنَ
ٱلۡعِلۡمِ مَا لَكَ مِنَ ٱللَّهِ مِن وَلِيّٖ وَلَا
وَاقٖ ٣٧
وَلَقَدۡ أَرۡسَلۡنَا رُسُلٗا مِّن قَبۡلِكَ
وَجَعَلۡنَا لَهُمۡ أَزۡوَٰجٗا وَذُرِّيَّةٗۚ وَمَا كَانَ
لِرَسُولٍ أَن يَأۡتِيَ بِـَٔايَةٍ إِلَّا بِإِذۡنِ ٱللَّهِۗ
لِكُلِّ أَجَلٖ كِتَابٞ ٣٨
يَمۡحُواْ ٱللَّهُ مَا يَشَآءُ وَيُثۡبِتُۖ
وَعِندَهُۥٓ أُمُّ ٱلۡكِتَٰبِ ٣٩

**37**. మరియు ఈ విధంగా మేము 'అరబ్బీ భాషలో మా శాసనాన్ని అవతరింపజేశాము.[1] ఇక నీవు ఈ జ్ఞానం వచ్చిన తరువాత కూడా వారి కోరికలను అనుసరిస్తే, అల్లాహ్ నుండి నిన్ను రక్షించేవాడు గానీ, కాపాడేవాడు గానీ ఎవ్వడూ ఉండడు.

**38**. మరియు (ఓ ము'హమ్మద్!) వాస్తవానికి మేము నీకు పూర్వం అనేక ప్రవక్తలను పంపాము మరియు వారికి భార్యాపిల్లలను ప్రసాదించాము.[2] అల్లాహ్ అనుమతి లేకుండా, ఏ అద్భుత సంకేతాన్ని (స్వయంగా) తెచ్చి చూపేశక్తి ఏప్రవక్తకూ లేదు.[3] ప్రతి వాగ్దానానికి (విషయానికి) వ్రాయబడిన ఒక ఆదేశం (శాసనం) ఉంది.[4]

**39**. అల్లాహ్ తాను కోరిన దానిని రద్దు చేస్తాడు మరియు (తాను కోరిన దానిని) స్థిరపరుస్తాడు.[5] మరియు మాతృ గ్రంథం (ఉమ్ముల్ కితాబ్)[6] ఆయన దగ్గరే ఉంది.

---

**1**. చూడండి, 14:4 మరియు 12:2 ప్రతి ప్రవక్తపై అతని ప్రజల కొరకు ఆ ప్రాంతపు భాషలోనే దివ్యగ్రంథం అవతరింపజేయబడింది, వారు దానిని సులభంగా అర్థం చేసుకోవాలని. ఈ ఖుర్ఆన్ దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై సర్వలోకాల వారి కొరకు, అవతరింపజేయబడిన అంతిమ దివ్యగ్రంథం. చూడండి, 7:158.

**2**. చూడండి, 25:7 దైవ ప్రవక్తలు అందరూ మానవులే. వారికి కుటుంబం ఉండేది. వారికి భార్యాబిడ్డలుండిరి. వారు సాధారణ మానవులవలే తినేవారు, త్రాగేవారు, ప్రజలతో కలిసిమెలిసి తిరిగే వారు. కాని వారిపై దివ్యజ్ఞానం (వ'హీ) వస్తూ ఉండేది. దానిని వారు ఉన్నది ఉన్నట్టుగా పూర్తిగా ప్రజలకు వినిపించి సత్యధర్మం వైపునకు ఆహ్వానించేవారు. ఒకవేళ వారు దైవదూతలైతే వారికెలా సంతానం మరియు కుటుంబం ఉంటాయి?

**3**. అద్భుత సంకేతాల శక్తి కేవలం అల్లాహ్ (సు.తా.)కే ఉంది. ఆయన అనుమతి లేనిదే ఏ ప్రవక్త కూడా వాటిని చూపలేడు. అల్లాహ్ (సు.తా.) తన ఇష్ట ప్రకారం తాను అవసరం అనుకున్నప్పుడు వాటిని చూపుతాడు. చూడండి, 6:109.

**4**. అల్లాహ్ (సు.తా.) యొక్క ప్రతి వాగ్దానానికి ఒక సమయం నియమింపబడి ఉంది. అల్లాహుతా'ఆలా ఆ సమయం వచ్చేవరకు ప్రజలకు వ్యవధినిస్తాడు. అది వచ్చిన తరువాత దానిని ఎవ్వరూ ఆపలేరు. అల్లాహ్ (సు.తా.) తన వాగ్దానం పూర్తిచేసి తీరుతాడు. దీని మరొక తాత్పర్యం: '*ప్రతి యుగానికి ఒక గ్రంథం ఉంది.*'

**5**. చూడండి, 2:106.

**6**. చూడండి, 43:4 మరియు 85:22. *ఉమ్ముల్ కితాబ్*, అంటేలౌ'హె మ'హ్ఫూ''జ్. సురక్షితమైన ఫలకం, మూల గ్రంథం. అంటే యథాస్థితిలో, భద్రంగా ఉంచబడిన గ్రంథం.

**40**. మరియు (ఓ ప్రవక్తా!) మేము వారికి చేసిన వాగ్దానాలలో కొన్నింటిని నీకు చూపినా, లేదా (వాటిని చూపకముందు) నిన్ను మరణింపజేసినా, నీ బాధ్యత కేవలం (మా సందేశాన్ని) అందజేయటమే! మరియు లెక్కతీసుకోవటం కేవలం మాపని.

وَإِن مَّا نُرِيَنَّكَ بَعۡضَ ٱلَّذِي نَعِدُهُمۡ أَوۡ نَتَوَفَّيَنَّكَ فَإِنَّمَا عَلَيۡكَ ٱلۡبَلَٰغُ وَعَلَيۡنَا ٱلۡحِسَابُ ﴿٤٠﴾

**41**. ఏమీ? వాస్తవానికి మేము భూమిని అన్ని వైపులనుండి తగ్గిస్తూ వస్తున్నామనేది వారు చూడటం లేదా?[1] మరియు అల్లాహ్‌యే ఆజ్ఞ ఇస్తాడు! ఆయన ఆజ్ఞను మార్చేవాడు ఎవ్వడూ లేడు. మరియు ఆయన లెక్క తీసుకోవటంలో అతి శీఘ్రుడు.

أَوَلَمۡ يَرَوۡاْ أَنَّا نَأۡتِي ٱلۡأَرۡضَ نَنقُصُهَا مِنۡ أَطۡرَافِهَاۚ وَٱللَّهُ يَحۡكُمُ لَا مُعَقِّبَ لِحُكۡمِهِۦۚ وَهُوَ سَرِيعُ ٱلۡحِسَابِ ﴿٤١﴾

**42**. మరియు వాస్తవానికి వారికి పూర్వం ఉన్నవారు కూడా కుట్రలు పన్నారు. కాని, కుట్రలన్నీ అల్లాహ్‌కే చెందినవి. ప్రతి ప్రాణి సంపాదించేది ఆయనకు తెలుసు. మరియు (మేలైన) అంతిమ (పరలోక) నివాసం ఎవరిదో సత్యతిరస్కారులు తెలుసుకుంటారు.

وَقَدۡ مَكَرَ ٱلَّذِينَ مِن قَبۡلِهِمۡ فَلِلَّهِ ٱلۡمَكۡرُ جَمِيعٗاۖ يَعۡلَمُ مَا تَكۡسِبُ كُلُّ نَفۡسٖۗ وَسَيَعۡلَمُ ٱلۡكُفَّٰرُ لِمَنۡ عُقۡبَى ٱلدَّارِ ﴿٤٢﴾

**43**. మరియు (ఓ ప్రవక్తా!) సత్య తిరస్కారులు నీతో అంటున్నారు: "నీవు సందేశహరుడవు కావు!" వారితో అను: "నాకూ-మీకూ మధ్య అల్లాహ్ సాక్ష్యమే చాలు! మరియు వారి (సాక్ష్యం), ఎవరికైతే గ్రంథ జ్ఞానం ఉందో!"[2]

وَيَقُولُ ٱلَّذِينَ كَفَرُواْ لَسۡتَ مُرۡسَلٗاۚ قُلۡ كَفَىٰ بِٱللَّهِ شَهِيدَۢا بَيۡنِي وَبَيۡنَكُمۡ وَمَنۡ عِندَهُۥ عِلۡمُ ٱلۡكِتَٰبِ ﴿٤٣﴾

*****

1. అంటే, 'అరేబియా భూభాగం, రోజు రోజుకు ముష్రికుల కొరకు తగ్గుతూ పోవడం మరియు ముస్లింలు దానిని ఆక్రమించుకోవడం వారు (ముష్రికులు) చూడటంలేదా?
2. అంటే, ఇస్లాం స్వీకరించిన 'అబ్దుల్లాహ్ బిన్-సల్లాం మరియు సల్మాన్ ఫారసీ (ర'ది.'అన్హుమ్)ల వంటి యూదుల మరియు క్రైస్తవుల సాక్ష్యం అన్నమాట!

## 14. సూరహ్ ఇబ్రాహీమ్

## سُورَةُ إِبْرَاهِيمَ

**ఇబ్రాహీమ్** ('అ.స.) **మక్కా** ముకర్రమా కొరకు చేసిన ప్రార్థన (**ఆయత్‌లు** 35-41), ఈ సూరహ్ యొక్క మూల భాగం. ఇది చివరి **మక్కా** కాలపు సూరాహ్‌లలో (10-15) ఐదవది. ఇందులో **52 అయతులు** ఉన్నాయి. ఇ'త్ఖాన్ ప్రకారం ఇది సూరహ్ నూ'హ్ (71) తరువాత అవతరింపజేయబడింది. దివ్యసందేశాలు ప్రజలను అంధకారాల నుండి వెలుగులోకి తీసుకురావటానికి అవతరింపజేయబడ్డాయి. ఇతర దివ్యగ్రంథాలు తమ ప్రవక్తలపై తమ కాలపు ప్రజలకొరకు వచ్చాయి, కాని దివ్యఖుర్ఆన్ సర్వలోకాల వారి కొరకు అవతరింపజేయబడిందని, అల్లాహ్ (సు.తా.) మొదటి మరియు 52వ ఆయత్‌లలో వ్యక్తంచేశాడు.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓرۚ كِتَٰبٌ أَنزَلۡنَٰهُ إِلَيۡكَ لِتُخۡرِجَ ٱلنَّاسَ مِنَ ٱلظُّلُمَٰتِ إِلَى ٱلنُّورِ بِإِذۡنِ رَبِّهِمۡ إِلَىٰ صِرَٰطِ ٱلۡعَزِيزِ ٱلۡحَمِيدِ ١

**1.** అలిఫ్-లామ్-ర. (ఇది) ఒక దివ్యగ్రంథం. దీనిని మేము, ప్రజలను - వారి ప్రభువు అనుమతితో - అంధకారాలనుండి వెలుతురులోకి,[1] సర్వశక్తిమంతుడు, సర్వ స్తోత్రాలకు అర్హుడైన (అల్లాహ్) మార్గం వైపునకు తీసుకురావటానికి, (ఓ ము'హమ్మద్!) నీపై అవతరింపజేశాము.

ٱللَّهِ ٱلَّذِي لَهُۥ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِۗ وَوَيۡلٌ لِّلۡكَٰفِرِينَ مِنۡ عَذَابٍ شَدِيدٍ ٢

**2.** ఆయనే అల్లాహ్! ఆకాశాలలో ఉన్నదీ మరియు భూమిలో ఉన్నదీ సర్వమూ ఆయనకే చెందుతుంది! మరియు సత్య తిరస్కారులకు కఠినశిక్ష వల్ల తీవ్రమైన దుఃఖం (వ్యథ) కలుగుతుంది.

ٱلَّذِينَ يَسۡتَحِبُّونَ ٱلۡحَيَوٰةَ ٱلدُّنۡيَا عَلَى ٱلۡأٓخِرَةِ وَيَصُدُّونَ عَن سَبِيلِ ٱللَّهِ وَيَبۡغُونَهَا عِوَجًاۚ أُوْلَٰٓئِكَ فِي ضَلَٰلِۢ بَعِيدٖ ٣

**3.** ఎవరైతే పరలోక జీవితంకంటే, ఇహలోక జీవితానికి అధిక ప్రాధాన్యతనిచ్చి, (ప్రజలను) అల్లాహ్ మార్గం నుండి ఆటంకపరుస్తూ, దానిని వక్రమైనదిగా చూపగోరుతారో! అలాంటి వారే మార్గ భ్రష్టత్వంలో చాలాదూరం వెళ్ళిపోయినవారు.

---

**1.** చూడండి, 57:9 మరియు 2:257.

وَمَآ أَرْسَلْنَا مِن رَّسُولٍ إِلَّا بِلِسَانِ قَوْمِهِۦ لِيُبَيِّنَ لَهُمْ ۖ فَيُضِلُّ ٱللَّهُ مَن يَشَآءُ وَيَهْدِى مَن يَشَآءُ ۚ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿٤﴾

4. మరియు మేము ప్రతి ప్రవక్తను, అతని జాతివారి భాషతోనే పంపాము, అతను వారికి స్పష్టంగా బోధించటానికి. మరియు అల్లాహ్ తాను కోరిన వారిని మార్గభ్రష్టత్వంలో వదలుతాడు మరియు తాను కోరిన వారికి మార్గదర్శకత్వం చేస్తాడు.[1] మరియు ఆయన సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

وَلَقَدْ أَرْسَلْنَا مُوسَىٰ بِـَٔايَـٰتِنَآ أَنْ أَخْرِجْ قَوْمَكَ مِنَ ٱلظُّلُمَـٰتِ إِلَى ٱلنُّورِ وَذَكِّرْهُم بِأَيَّىٰمِ ٱللَّهِ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَـَٔايَـٰتٍ لِّكُلِّ صَبَّارٍ شَكُورٍ ﴿٥﴾

5. మరియు వాస్తవానికి, మేము మూసాను మా సూచన(ఆయతు)లతో పంపి: "నీ జాతివారిని అంధకారాల నుండి వెలుతురు వైపునకు తెచ్చి, వారికి అల్లాహ్ దినాలను[2] జ్ఞాపకంచేయించు." అని అన్నాము. నిశ్చయంగా ఇందులో సహన శీలురకు, కృతజ్ఞులకు ఎన్నో సూచనలున్నాయి.[3]

وَإِذْ قَالَ مُوسَىٰ لِقَوْمِهِ ٱذْكُرُوا۟ نِعْمَةَ ٱللَّهِ عَلَيْكُمْ إِذْ أَنجَىٰكُم مِّنْ ءَالِ فِرْعَوْنَ يَسُومُونَكُمْ سُوٓءَ ٱلْعَذَابِ وَيُذَبِّحُونَ أَبْنَآءَكُمْ

6. మూసా తన జాతివారితో ఇలా అన్నాడు: "అల్లాహ్ మీకు చేసిన అనుగ్రహాలను జ్ఞాపకం చేసుకోండి. ఆయన మీకు ఫిర్'ఔన్ జాతివారి నుండి విముక్తి కలిగించాడు. వారు మిమ్మల్ని తీవ్రమైన

---

1. ఎవడు మార్గభ్రష్టుడవుతాడో మరియు ఎవడు సన్మార్గంపై ఉంటాడో అల్లాహ్ (సు.తా.)కు తెలుసు. కాబట్టి ఆయన వారిని వారి పరిస్థితులలో వదలుతాడు. అల్లాహుతా'ఆలా బలవంతంగా ఎవరినీ కూడా మార్గభ్రష్టులుగా గానీ, సన్మార్గులుగా గానీ చేయడు. ఇంకా చూడండి, 16:93.
2. అయ్యామిల్లాహ్: అంటే ఇస్రాయీ'ల్ సంతతివారిపై అల్లాహుతా'ఆలా చేసిన అనుగ్రహాలు మరియు వారిపై పడ్డ శిక్షలు.
3. సహనం వహించి కృతజ్ఞతలు తెలిపే వారికి చాలా లాభాలుంటాయి. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'అల్లాహ్ (సు.తా.) తన దాసుని కొరకు ఎట్టి పరిస్థితిని ఏర్పరచినా అది అతని మేలుకే! అతనికి కష్టాలు కలిగిస్తే, వాటిని అతడు సహించితే అతని మేలుకే! లేక అతనికి సుఖసంతోషాలు ప్రసాదిస్తే అతడు దానికి తన ప్రభువుకు కృతజ్ఞతలు చూపాలి.' ('స'హీ'హ్ ముస్లిం).

శిక్షలకు గురిచేస్తూ ఉండేవారు, మీ కుమారులను వధించి, మీ కుమార్తె (స్త్రీ)లను బ్రతుకనిచ్చే వారు.[1] మరియు అందులో మీకు, మీ ప్రభువు తరఫునుండి ఒక గొప్ప పరీక్ష ఉండింది.''

وَيَسْتَحْيُونَ نِسَآءَكُمْ ۚ وَفِى ذَٰلِكُم بَلَآءٌ مِّن رَّبِّكُمْ عَظِيمٌ ﴿٦﴾

7. మరియు మీ ప్రభువు ప్రకటించింది (జ్ఞాపకం చేసుకోండి): ''మీరు కృతజ్ఞులైతే! నేను మిమ్మల్ని ఎంతో అధికంగా అనుగ్రహిస్తాను.[2] కాని ఒకవేళ మీరు కృతఘ్నులైతే! నిశ్చయంగా, నా శిక్ష ఎంతో కఠినమైనది.''[3]

وَإِذْ تَأَذَّنَ رَبُّكُمْ لَئِن شَكَرْتُمْ لَأَزِيدَنَّكُمْ ۖ وَلَئِن كَفَرْتُمْ إِنَّ عَذَابِى لَشَدِيدٌ ﴿٧﴾

8. మరియు మూసా ఇలా అన్నాడు: ''ఒకవేళ మీరు మరియు భూమిలోనున్న వారందరూ సత్యతిరస్కారానికి పాల్పడితే! తెలుసుకోండి నిశ్చయంగా, అల్లాహ్ స్వయంసమృద్ధుడు, సర్వ స్తోత్రాలకు అర్హుడు.''

وَقَالَ مُوسَىٰٓ إِن تَكْفُرُوٓا۟ أَنتُمْ وَمَن فِى ٱلْأَرْضِ جَمِيعًا فَإِنَّ ٱللَّهَ لَغَنِىٌّ حَمِيدٌ ﴿٨﴾

9. ఏమీ? పూర్వం గతించిన, ప్రజల గాథలు మీకు చేరలేదా? నూ'హ్, ఆద్ మరియు స'మూద్ జాతివారి మరియు వారి తరువాత వచ్చిన వారి (గాథలు)? వారిని గురించి అల్లాహ్ తప్ప మరెవ్వరూ ఎరుగరు! వారి ప్రవక్తలు వారి వద్దకు స్పష్టమైన సూచనలు తీసుకొని వచ్చినపుడు, వారు తమ నోళ్ళలో తమ చేతులు పెట్టుకొని[4] ఇలా

أَلَمْ يَأْتِكُمْ نَبَؤُا۟ ٱلَّذِينَ مِن قَبْلِكُمْ قَوْمِ نُوحٍ وَعَادٍ وَثَمُودَ ۛ وَٱلَّذِينَ مِنۢ بَعْدِهِمْ ۛ لَا يَعْلَمُهُمْ إِلَّا ٱللَّهُ ۚ جَآءَتْهُمْ رُسُلُهُم بِٱلْبَيِّنَٰتِ فَرَدُّوٓا۟

1. చూడండి, 2:49.
2. అల్లాహుతా'ఆలా మీకు ప్రసాదించిన దానికి మీరు కృతజ్ఞులైతే ఆయన మరింత ప్రసాదిస్తాడు.
3. కృతఘ్నులను అల్లాహుతా'ఆలా కఠినంగా శిక్షిస్తాడు.
4. చూడండి, 3:119, కోపంతో తమ చేతులను కొరుక్కుంటూ అన్నారు. (ఇమాం షౌకాని, 'తబరీ, ర.'అలైహిమ్).

أَيْدِيَهُمْ فِيٓ أَفْوَٰهِهِمْ وَقَالُوٓاْ إِنَّا كَفَرْنَا بِمَآ أُرْسِلْتُم بِهِۦ وَإِنَّا لَفِي شَكٍّ مِّمَّا تَدْعُونَنَآ إِلَيْهِ مُرِيبٖ ٩

۞ قَالَتْ رُسُلُهُمْ أَفِي ٱللَّهِ شَكّٞ فَاطِرِ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِۖ يَدْعُوكُمْ لِيَغْفِرَ لَكُم مِّن ذُنُوبِكُمْ وَيُؤَخِّرَكُمْ إِلَىٰٓ أَجَلٖ مُّسَمّٗىۚ قَالُوٓاْ إِنْ أَنتُمْ إِلَّا بَشَرٞ مِّثْلُنَا تُرِيدُونَ أَن تَصُدُّونَا عَمَّا كَانَ يَعْبُدُ ءَابَآؤُنَا فَأْتُونَا بِسُلْطَٰنٖ مُّبِينٖ ١٠

قَالَتْ لَهُمْ رُسُلُهُمْ إِن نَّحْنُ إِلَّا بَشَرٞ مِّثْلُكُمْ وَلَٰكِنَّ ٱللَّهَ يَمُنُّ عَلَىٰ مَن يَشَآءُ مِنْ عِبَادِهِۦۖ وَمَا كَانَ لَنَآ أَن نَّأْتِيَكُم بِسُلْطَٰنٍ إِلَّا بِإِذْنِ ٱللَّهِۚ وَعَلَى ٱللَّهِ فَلْيَتَوَكَّلِ ٱلْمُؤْمِنُونَ ١١

అన్నారు: "నిశ్చయంగా, మేము మీతో పంపబడిన సందేశాన్ని తిరస్కరిస్తున్నాము. మరియు నిశ్చయంగా మీరు దేని వైపునకైతే మమ్మల్ని ఆహ్వానిస్తున్నారో, దానిని గురించి మేము ఆందోళన కలిగించేటంత సందేహంలో పడివున్నాము."[1] (3/4)

**10.** * వారి ప్రవక్తలు (వారితో) ఇలా అన్నారు: "ఏమీ? ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించిన, అల్లాహ్‌ను గురించి (మీకు) సందేహం ఉందా? ఆయన మీ పాపాలను క్షమించటానికి మరియు మీకు ఒక నిర్ణీతకాలం వరకు వ్యవధినివ్వటానికి మిమ్మల్ని పిలుస్తున్నాడు!"[2] వారన్నారు: "మీరు కూడా మా వంటి మానవులే, మీరు మా తండ్రితాతలు ఆరాధిస్తూ వచ్చిన (దైవాల ఆరాధన నుండి) మమ్మల్ని ఆపాలను కుంటున్నారా? అయితే స్పష్టమైన ప్రమాణం ఏదైనా తీసుకురండి."[3]

**11.** వారి ప్రవక్తలు వారితో (ఇంకా) ఇలా అన్నారు: "నిశ్చయంగా, మేము మీ వంటి మానవులం మాత్రమే! కాని అల్లాహ్ తన దాసులలో తాను కోరిన వారిని అనుగ్రహిస్తాడు. మరియు - అల్లాహ్ అనుమతిస్తేనే తప్ప - మీ కొరకు ప్రమాణం తీసుకురావటమనేది మా వశంలో లేదు. మరియు విశ్వాసులు కేవలం అల్లాహ్ మీదనే దృఢనమ్మకం ఉంచుకోవాలి.[4]

---

**1**. చూడండి, 11:62 ఇదే విధమైన ఆశ్చర్యం, 'సాలి'హ్ ('అ.స.) యొక్క ప్రజలు సూచించారు. ప్రతి కాలపు ప్రజలు అల్లాహ్ (సు.తా.)ను నిరాకరించారు లేదా ఆయనకు సిఫారసుదారులను లేక భాగస్వాములను కల్పించారు.

**2**. అద్భుత సూచనలైతే ప్రవక్తల ద్వారా చూపబడతాయి. కాని వారు, తాము కోరిన అద్భుత సూచనలు చూపమని కోరారు.

**3**. చూడండి, 13:31 చివరి భాగం.

**4**. చూడండి, 7:75 మరియు 13:43.

وَمَا لَنَآ أَلَّا نَتَوَكَّلَ عَلَى ٱللَّهِ
وَقَدْ هَدَىٰنَا سُبُلَنَا ۚ
وَلَنَصْبِرَنَّ عَلَىٰ مَآ ءَاذَيْتُمُونَا ۚ
وَعَلَى ٱللَّهِ فَلْيَتَوَكَّلِ ٱلْمُتَوَكِّلُونَ ﴿١٢﴾
وَقَالَ ٱلَّذِينَ كَفَرُوا۟ لِرُسُلِهِمْ
لَنُخْرِجَنَّكُم مِّنْ أَرْضِنَآ أَوْ
لَتَعُودُنَّ فِى مِلَّتِنَا ۖ فَأَوْحَىٰٓ إِلَيْهِمْ
رَبُّهُمْ لَنُهْلِكَنَّ ٱلظَّٰلِمِينَ ﴿١٣﴾
وَلَنُسْكِنَنَّكُمُ ٱلْأَرْضَ مِنۢ
بَعْدِهِمْ ۚ ذَٰلِكَ لِمَنْ خَافَ
مَقَامِى وَخَافَ وَعِيدِ ﴿١٤﴾
وَٱسْتَفْتَحُوا۟ وَخَابَ كُلُّ
جَبَّارٍ عَنِيدٍ ﴿١٥﴾

**12**. ''మరియు మేము అల్లాహ్ మీద నమ్మకం ఎందుకు ఉంచుకోరాదు? వాస్తవానికి ఆయనే మాకు సన్మార్గపు దారులను చూపాడు. మరియు మేము నిశ్చయంగా, మీరు పెట్టే బాధలను సహనంతో భరిస్తాము. మరియు నమ్మకం గలవారు, కేవలం అల్లాహ్‌మీదే దృఢ నమ్మకం ఉంచుకోవాలి!''

**13**. మరియు సత్యతిరస్కారులు తమ ప్రవక్తలతో అన్నారు: ''మీరు మా మతంలోకి తిరిగిరాకపోతే మేము తప్పకుండా మిమ్మల్ని మా దేశంనుండి వెళ్ళగొడ్తాము.''[1] అప్పుడు వారి ప్రభువు వారికి ఇలా దివ్యజ్ఞానం (వ'హీ) పంపాడు: ''మేము ఈ దుర్మార్గులను తప్పక నాశనం చేస్తాము.[2]

**14**. ''మరియు వారి తరువాత ఆ భూమి మీద మిమ్మల్ని నివసింపజేస్తాము.[3] ఇది, నా సాన్నిధ్యంలో నిలువటానికి (లెక్కచెప్పటానికి) భయపడే వానికి మరియు నా హెచ్చరిక (శిక్ష)కు భయపడేవానికి (నా వాగ్దానం).''[4]

**15**. మరియు వారు తీర్పుకోరారు[5] మరియు నిర్దయుడూ,[6] (సత్య) విరోధి అయిన ప్రతివాడూ నాశనమయ్యాడు.

---

1. చూడండి, 7:88-89 అక్కడ ఇదే ప్రశ్న షు'ఐబ్ ('అ.స.) ముందు పెట్టబడింది.
2. చూడండి, 37:171-173.
3. చూడండి, 21:105.
4. చూడండి, 79:40-41; మరియు 55:46.
5. ఈ కోరిక సత్యతిరస్కారులది కూడా కావచ్చు. చూడండి, 8:19,32. లేదా ప్రవక్తలది కూడా కావచ్చు. ఒకవేళ ఈ కోరిక ప్రవక్తలది అయితే: ''మరియు వారు (ప్రవక్తలు తమ ప్రభువు) సహాయాన్ని కోరారు. మరియు నిర్దయుడు....నాశనమయ్యాడు.'' అని చదవబడుతుంది.
6. జబ్బారున్: Insolent, Compeller, Ferocious, Irresistible, బలవంతం, లేక నిర్బంధం చేసేవాడు, నిరంకుశుడు, నిర్దయుడు, క్రూరుడు.

مِّن وَرَآئِهِۦ جَهَنَّمُ وَيُسْقَىٰ مِن مَّآءٍ صَدِيدٍ ﴿١٦﴾ يَتَجَرَّعُهُۥ وَلَا يَكَادُ يُسِيغُهُۥ وَيَأْتِيهِ ٱلْمَوْتُ مِن كُلِّ مَكَانٍ وَمَا هُوَ بِمَيِّتٍ ۖ وَمِن وَرَآئِهِۦ عَذَابٌ غَلِيظٌ ﴿١٧﴾ مَّثَلُ ٱلَّذِينَ كَفَرُوا۟ بِرَبِّهِمْ ۖ أَعْمَٰلُهُمْ كَرَمَادٍ ٱشْتَدَّتْ بِهِ ٱلرِّيحُ فِى يَوْمٍ عَاصِفٍ ۖ لَّا يَقْدِرُونَ مِمَّا كَسَبُوا۟ عَلَىٰ شَىْءٍ ۚ ذَٰلِكَ هُوَ ٱلضَّلَٰلُ ٱلْبَعِيدُ ﴿١٨﴾ أَلَمْ تَرَ أَنَّ ٱللَّهَ خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ بِٱلْحَقِّ ۚ إِن يَشَأْ يُذْهِبْكُمْ وَيَأْتِ بِخَلْقٍ جَدِيدٍ ﴿١٩﴾ وَمَا ذَٰلِكَ عَلَى ٱللَّهِ بِعَزِيزٍ ﴿٢٠﴾

**16**. అతని ముందు నరకం అతనికై వేచి ఉంటుంది మరియు అక్కడ సలసలకాగే చిక్కని చీములాంటి నీరు త్రాగటానికి ఇవ్వబడుతుంది.[1]

**17**. దానిని అతడు గుటకలు గుటకలుగా బలవంతంగా గొంతులోకి దింపటానికి ప్రయత్నిస్తాడు, కాని దానిని మ్రింగలేడు. అతనికి ప్రతివైపు నుండి మరణం ఆసన్నమవుతుంది, కాని అతడు మరణించలేడు. మరియు అతని ముందు భయంకరమైన శిక్ష వేచి ఉంటుంది.

**18**. తమ ప్రభువును తిరస్కరించిన వారి కర్మలను, తుఫాను దినమున పెనుగాలి ఎగురవేసే బూడిదతో పోల్చవచ్చు.[2] వారు తమ కర్మలకు ఎలాంటి ప్రతిఫలం పొందలేరు. ఇదే మార్గభ్రష్టత్వంలో చాలా దూరం పోవటం.[3]

**19**. ఏమీ? నిశ్చయంగా, అల్లాహ్ భూమ్యాకాశాలను సత్యంతో సృష్టించాడని నీకు తెలియదా?[4] ఆయన కోరితే మిమ్మల్ని నశింపజేసి, మరొక క్రొత్త సృష్టిని తేగలడు![5]

**20**. మరియు అలా చేయటం అల్లాహ్‌కు కష్టమైనపని కాదు.

---

**1**. చూడండి, 6:70.

**2**. సత్యతిరస్కారుల కర్మలు పునరుత్థానదినమున ఈ విధంగానే ఎగిరిపోతాయి వారికెలాంటి పుణ్యఫలితం దొరకదు.

**3**. చూడండి, 22:12 చివరి భాగంలో కూడా ఈ పలుకులే ఉన్నాయి.

**4**. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 10:5.

**5**. ఈ విషయమే ఎన్నోసార్లు విశదీకరించబడింది. చూడండి, 35:16-17, 47:38, 5:54, 4:133.

وَبَرَزُواْ لِلَّهِ جَمِيعًا فَقَالَ ٱلضُّعَفَٰٓؤُاْ لِلَّذِينَ ٱسۡتَكۡبَرُوٓاْ إِنَّا كُنَّا لَكُمۡ تَبَعًا فَهَلۡ أَنتُم مُّغۡنُونَ عَنَّا مِنۡ عَذَابِ ٱللَّهِ مِن شَيۡءٖۚ قَالُواْ لَوۡ هَدَىٰنَا ٱللَّهُ لَهَدَيۡنَٰكُمۡۖ سَوَآءٌ عَلَيۡنَآ أَجَزِعۡنَآ أَمۡ صَبَرۡنَا مَا لَنَا مِن مَّحِيصٖ ﴿٢١﴾

**21**. మరియు వారందరూ అల్లాహ్ ముందు హాజరుపరచబడినప్పుడు, (ఇహలోకంలో) బలహీనులుగా ఉన్నవారు గొప్పవారిగా ఉన్నవారితో అంటారు: "వాస్తవానికి ప్రపంచంలో మేము మిమ్మల్ని అనుసరించాము, ఇపుడు మీరు మమ్మల్ని అల్లాహ్ శిక్ష నుండి కాపాడటానికి ఏమైనా చేయగలరా?" వారంటారు: "అల్లాహ్ మాకు సన్మార్గం చూపి ఉంటే మేము మీకు కూడా (సన్మార్గం) చూపి ఉండేవారం. ఇపుడు మనం దుఃఖపడినా లేదా సహనం వహించినా అంతా ఒక్కటే! మనకిప్పుడు తప్పించుకునే మార్గం ఏదీ లేదు."[1]

وَقَالَ ٱلشَّيۡطَٰنُ لَمَّا قُضِيَ ٱلۡأَمۡرُ إِنَّ ٱللَّهَ وَعَدَكُمۡ وَعۡدَ ٱلۡحَقِّ وَوَعَدتُّكُمۡ فَأَخۡلَفۡتُكُمۡۖ وَمَا كَانَ لِيَ عَلَيۡكُم مِّن سُلۡطَٰنٍ إِلَّآ أَن دَعَوۡتُكُمۡ فَٱسۡتَجَبۡتُمۡ لِيۖ فَلَا تَلُومُونِي وَلُومُوٓاْ أَنفُسَكُمۖ مَّآ أَنَا۠ بِمُصۡرِخِكُمۡ وَمَآ أَنتُم بِمُصۡرِخِيَّۖ إِنِّي كَفَرۡتُ بِمَآ أَشۡرَكۡتُمُونِ مِن قَبۡلُۗ

**22**. మరియు తీర్పు జరిగిన తరువాత షైతాను (వారితో) అంటాడు: "నిశ్చయంగా, అల్లాహ్ మీకు చేసిన వాగ్దానమే సత్యమైన వాగ్దానం. మరియు నేను మీకు వాగ్దానం చేసి దానిని భంగంచేశాను. మరియు నాకు మీపై ఎలాంటి అధికారం ఉండేది కాదు; నేను కేవలం మిమ్మల్ని ఆహ్వానించాను, మీరు స్వీకరించారు.[2] కావున మీరు నన్ను నిందించకండి, మిమ్మల్ని మీరే నిందించుకోండి. నేను మీకు సహాయం చేయలేను మరియు మీరూ నాకు సహాయం చేయలేరు. ఇంతకు ముందు మీరు నన్ను (అల్లాహ్‌కు) సాటిగా కల్పించినదాన్ని నిశ్చయంగా, నేను

---

**1**. ఈ విధమైన ఆయతులకు చూడండి, 40:47-48, 7:38-39, 33:66, 68. నరకవాసులు ఒకరితోనొకరు వాదులాడుకునే దానికి, చూడండి, 34:31-33.

**2**. చూడండి, 4:120. షైతాన్ అంటాడు నేను మిమ్మల్ని బలవంతం చేయలేదు. కేవలం వాగ్దానం చేశాను.

إِنَّ ٱلظَّٰلِمِينَ لَهُمْ عَذَابٌ أَلِيمٌ ﴿٢٢﴾

తిరస్కరిస్తున్నాను."[1] నిశ్చయంగా, దుర్మార్గులకు బాధాకరమైన శిక్ష ఉంది.

وَأُدْخِلَ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ جَنَّٰتٍ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَا بِإِذْنِ رَبِّهِمْ ۖ تَحِيَّتُهُمْ فِيهَا سَلَٰمٌ ﴿٢٣﴾

23. మరియు విశ్వసించి, సత్కార్యాలు చేసేవారిని క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేయబడుతుంది. వారి ప్రభువు అనుమతితో వారక్కడ శాశ్వతంగా ఉంటారు. వారితో అక్కడ: "మీకు శాంతి కలుగు గాక (సలాం)!" అని అనబడుతుంది.[2]

أَلَمْ تَرَ كَيْفَ ضَرَبَ ٱللَّهُ مَثَلًا كَلِمَةً طَيِّبَةً كَشَجَرَةٍ طَيِّبَةٍ أَصْلُهَا ثَابِتٌ وَفَرْعُهَا فِى ٱلسَّمَآءِ ﴿٢٤﴾

24. మంచి మాట (కలిమయె తయ్యిబ్)ను, అల్లాహ్ దేనితో పోల్చాడో మీకు తెలియదా? ఒక మేలు జాతి చెట్టుతో! దాని వ్రేళ్ళు (భూమిలో) స్థిరంగా నాటుకొని ఉంటాయి మరియు దాని శాఖలు ఆకాశాన్ని (అంటుకొంటున్నట్లు) ఉంటాయి.

تُؤْتِىٓ أُكُلَهَا كُلَّ حِينٍۭ بِإِذْنِ رَبِّهَا ۗ وَيَضْرِبُ ٱللَّهُ ٱلْأَمْثَالَ لِلنَّاسِ لَعَلَّهُمْ يَتَذَكَّرُونَ ﴿٢٥﴾

25. తన ప్రభువు ఆజ్ఞతో, అది ఎల్లప్పుడూ ఫలాలను ఇస్తూ ఉంటుంది. మరియు ప్రజలు జ్ఞాపకముంచుకోవాలని అల్లాహ్ ఈ విధమైన ఉపమానాలు ఇస్తూ ఉంటాడు.[3]

وَمَثَلُ كَلِمَةٍ خَبِيثَةٍ كَشَجَرَةٍ خَبِيثَةٍ ٱجْتُثَّتْ مِن فَوْقِ ٱلْأَرْضِ مَا لَهَا مِن قَرَارٍ ﴿٢٦﴾

26. మరియు చెడ్డ మాటను, భూమి నుండి పెల్లగింపబడిన, స్థిరత్వంలేని, ఒక చెడ్డజాతి చెట్టుతో పోల్చవచ్చు!

1. షైతాను ఎన్నడూ తాను అల్లాహ్ (సు.తా.)కు సాటి అని అనలేదు. చూడండి, 7:20 మరియు 15:36, 39లలో షైతాన్ అన్నాడు: 'ఓ నా ప్రభూ!....' అని మరియు 8:48, 59:16లలో: 'నేను అల్లాహ్‌కు భయపడతాను....' అని. కాని ప్రజలకు వారి పాపకార్యాలను మంచివిగా కనిపించేటట్లు చేస్తాడు. చూడండి, 6:43, 8:48, 16:63, 27:24, 29:38 షైతాన్ ఎన్నడూ తనను తాను అల్లాహ్ (సు.తా.)కు సమానుడిగా చెప్పుకోలేదు.

2. చూడండి, 10:10.

3. చూడండి, 39:29.

يُثَبِّتُ ٱللَّهُ ٱلَّذِينَ ءَامَنُواْ بِٱلْقَوْلِ ٱلثَّابِتِ فِى ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَفِى ٱلْءَاخِرَةِ ۖ وَيُضِلُّ ٱللَّهُ ٱلظَّٰلِمِينَ ۚ وَيَفْعَلُ ٱللَّهُ مَا يَشَآءُ ﴿٢٧﴾

**27**. విశ్వసించి తమ మాటపై స్థిరంగా ఉన్నవారిని అల్లాహ్ ఇహలోకంలోనూ మరియు పరలోకంలోనూ స్థిరపరుస్తాడు. మరియు అల్లాహ్ దుర్మార్గులను మార్గభ్రష్టులుగా చేస్తాడు. మరియు అల్లాహ్ తాను కోరినది చేస్తాడు. (7/8)

۞ أَلَمْ تَرَ إِلَى ٱلَّذِينَ بَدَّلُواْ نِعْمَتَ ٱللَّهِ كُفْرًا وَأَحَلُّواْ قَوْمَهُمْ دَارَ ٱلْبَوَارِ ﴿٢٨﴾

**28**. * ఏమీ? నీవు చూడలేదా (ఎరుగవా)? అల్లాహ్ అనుగ్రహాలను సత్యతిరస్కారంగా మార్చిన వారిని మరియు తమ జాతి వారిని వినాశ గృహంలోకి త్రోసినవారిని -

جَهَنَّمَ يَصْلَوْنَهَا ۖ وَبِئْسَ ٱلْقَرَارُ ﴿٢٩﴾

**29**. (అంటే) నరకం! వారంతా అందులో ప్రవేశిస్తారు. మరియు అది ఎంత దుర్భరమైన నివాసము.

وَجَعَلُواْ لِلَّهِ أَندَادًا لِّيُضِلُّواْ عَن سَبِيلِهِۦ ۗ قُلْ تَمَتَّعُواْ فَإِنَّ مَصِيرَكُمْ إِلَى ٱلنَّارِ ﴿٣٠﴾

**30**. మరియు (ప్రజలను) ఆయన మార్గం నుండి తప్పించటానికి వారు అల్లాహ్‌కు సమాను(అందాదు)లను కల్పించారు. వారితో అను: "మీరు (తాత్కాలికంగా) సుఖసంతోషాలను అనుభవించండి. ఎందుకంటే! నిశ్చయంగా మీ గమ్యస్థానం నరకాగ్నియే!"

قُل لِّعِبَادِىَ ٱلَّذِينَ ءَامَنُواْ يُقِيمُواْ ٱلصَّلَوٰةَ وَيُنفِقُواْ مِمَّا رَزَقْنَٰهُمْ سِرًّا وَعَلَانِيَةً مِّن قَبْلِ أَن يَأْتِىَ يَوْمٌ لَّا بَيْعٌ فِيهِ وَلَا خِلَٰلٌ ﴿٣١﴾

**31**. నా దాసులలో విశ్వసించిన వారితో నమా'జ్ స్థాపించమని మరియు మేము వారికిచ్చిన ఉపాధినుండి రహస్యంగానో, బహిరంగంగానో - బేరం జరుగటం గానీ, మిత్రుల సహాయం పొందటం గానీ సాధ్యంకాని దినం రాకపూర్వమే - ఖర్చుపెట్టమని చెప్పు.[1]

**1**. ఈ విధమైన ఆయత్‌లకొరకు చూడండి, 3:91,5:36,10:54,13:18, 39:47, 70:11-15.

32. అల్లాహ్! ఆయనే భూమ్యాకాశాలను సృష్టించాడు మరియు ఆకాశం నుండి నీటిని కురిపించి, దానినుండి మీకొరకు ఆహారంగా ఫలాలను పుట్టించాడు. మరియు తన ఆజ్ఞతో, ఓడలను మీకు ఉపయుక్తంగా చేసి సముద్రంలో నడిపించాడు. మరియు నదులను కూడా మీకు ఉపయుక్తంగా చేశాడు.

ٱللَّهُ ٱلَّذِى خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ
وَأَنزَلَ مِنَ ٱلسَّمَآءِ مَآءً
فَأَخْرَجَ بِهِۦ مِنَ ٱلثَّمَرَٰتِ رِزْقًا
لَّكُمْ ۖ وَسَخَّرَ لَكُمُ ٱلْفُلْكَ
لِتَجْرِىَ فِى ٱلْبَحْرِ بِأَمْرِهِۦ ۖ وَسَخَّرَ
لَكُمُ ٱلْأَنْهَٰرَ ﴿٣٢﴾

33. మరియు ఎడతెగకుండా, నిరంతరం పయనించే సూర్య చంద్రులను మీకు ఉపయుక్తంగా, చేశాడు. మరియు రాత్రింబవళ్ళను కూడా మీకు ఉపయుక్తంగా ఉండేటట్లు చేశాడు.[1]

وَسَخَّرَ لَكُمُ ٱلشَّمْسَ وَٱلْقَمَرَ
دَآئِبَيْنِ ۖ وَسَخَّرَ لَكُمُ ٱلَّيْلَ
وَٱلنَّهَارَ ﴿٣٣﴾

34. మరియు మీరు అడిగినదంతా మీకు ఇచ్చాడు. మీరు అల్లాహ్ అనుగ్రహాలను లెక్కించదలచినా లెక్కించజాలరు. నిశ్చయంగా మానవుడు దుర్మార్గుడు, కృతఘ్నుడు.

وَءَاتَىٰكُم مِّن كُلِّ مَا
سَأَلْتُمُوهُ ۚ وَإِن تَعُدُّوا۟ نِعْمَتَ ٱللَّهِ
لَا تُحْصُوهَآ ۗ إِنَّ ٱلْإِنسَٰنَ
لَظَلُومٌ كَفَّارٌ ﴿٣٤﴾

35. మరియు ఇబ్రాహీమ్ ఇలా ప్రార్థించిన విషయం (జ్ఞాపకం చేసుకోండి)[2]: "ఓ నా ప్రభూ! ఈ నగరాన్ని (మక్కాను) శాంతి నిలయంగా ఉంచు మరియు నన్నూ నా సంతానాన్నీ విగ్రహారాధన నుండి తప్పించు!

وَإِذْ قَالَ إِبْرَٰهِيمُ رَبِّ ٱجْعَلْ
هَٰذَا ٱلْبَلَدَ ءَامِنًا وَٱجْنُبْنِى
وَبَنِىَّ أَن نَّعْبُدَ ٱلْأَصْنَامَ ﴿٣٥﴾

---

1. రాత్రింబవళ్ళను గురించి చూడండి, 10:67, 27:86 మరియు 40:61.
2. ఆయత్‌లు 35-41 ఈ సూరహ్ పేరును సూచిస్తున్నాయి. మరియు ఇబ్రాహీం ('అ.స.) ప్రార్థనను జ్ఞాపకం చేయిస్తున్నాయి.

36. "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, అవి అనేక మానవులను మార్గభ్రష్టులుగా చేశాయి. ఇక నా విధానాన్ని అనుసరించేవాడు, నిశ్చయంగా నా వాడు. మరియు ఎవడైనా నా విధానాన్ని ఉల్లంఘిస్తే! నిశ్చయంగా, నీవు క్షమాశీలుడవు, అపార కరుణాప్రదాతవు.

رَبِّ إِنَّهُنَّ أَضْلَلْنَ كَثِيرًا مِّنَ ٱلنَّاسِ ۖ فَمَن تَبِعَنِى فَإِنَّهُۥ مِنِّى ۖ وَمَنْ عَصَانِى فَإِنَّكَ غَفُورٌ رَّحِيمٌ ﴿٣٦﴾

37. "ఓ మా ప్రభూ! వాస్తవానికి నేను నా సంతానంలో కొందరిని నీ పవిత్ర గృహం (క'అబహ్) దగ్గర పైరు పండని, ఎండిపోయిన కొండలోయలో నివసింపజేశాను.[1] ఓ మా ప్రభూ! వారిని అక్కడ నమా'జ్ స్థాపించటానికి ఉంచాను. కనుక నీవు ప్రజల హృదయాలను, వారి వైపుకు ఆకర్షింపజేయి మరియు వారు కృతజ్ఞులై ఉండటానికి వారికి జీవనోపాధిగా ఫలాలను సమకూర్చు.

رَّبَّنَآ إِنِّىٓ أَسْكَنتُ مِن ذُرِّيَّتِى بِوَادٍ غَيْرِ ذِى زَرْعٍ عِندَ بَيْتِكَ ٱلْمُحَرَّمِ رَبَّنَا لِيُقِيمُوا۟ ٱلصَّلَوٰةَ فَٱجْعَلْ أَفْـِٔدَةً مِّنَ ٱلنَّاسِ تَهْوِىٓ إِلَيْهِمْ وَٱرْزُقْهُم مِّنَ ٱلثَّمَرَٰتِ لَعَلَّهُمْ يَشْكُرُونَ ﴿٣٧﴾

38. "ఓ మా ప్రభూ! నిశ్చయంగా, మేము దాచేదంతా మరియు వ్యక్త పరచేదంతా నీకు తెలుసు. మరియు భూమిలోగానీ, ఆకాశంలోగానీ అల్లాహ్ నుండి దాగిఉన్నది ఏదీ లేదు.

رَبَّنَآ إِنَّكَ تَعْلَمُ مَا نُخْفِى وَمَا نُعْلِنُ ۗ وَمَا يَخْفَىٰ عَلَى ٱللَّهِ مِن شَىْءٍ فِى ٱلْأَرْضِ وَلَا فِى ٱلسَّمَآءِ ﴿٣٨﴾

39. "సర్వస్తోత్రాలకు అర్హుడైన అల్లాహ్ నాకు వృద్ధాప్యంలో కూడా ఇస్మా'యీల్ మరియు ఇస్'హాఖ్‌లను ప్రసాదించాడు. నిశ్చయంగా, నా ప్రభువు ప్రార్థనలను వినేవాడు.

ٱلْحَمْدُ لِلَّهِ ٱلَّذِى وَهَبَ لِى عَلَى ٱلْكِبَرِ إِسْمَٰعِيلَ وَإِسْحَٰقَ ۚ إِنَّ رَبِّى لَسَمِيعُ ٱلدُّعَآءِ ﴿٣٩﴾

---

1. ఇస్మా'యీల్ ('అ.స.), అతని తల్లి హాజర్ ('అ.స.)లు మరియు వారి సంతతివారు.

رَبِّ ٱجْعَلْنِى مُقِيمَ ٱلصَّلَوٰةِ وَمِن ذُرِّيَّتِى ۚ رَبَّنَا وَتَقَبَّلْ دُعَآءِ ﴿٤٠﴾

**40**. "ఓ నా ప్రభూ! నన్ను మరియు నా సంతతి వారిని నమా'జ్ స్థాపించే వారిగా చేయి.[1] ఓ మా ప్రభూ! నా ప్రార్థనను స్వీకరించు.

رَبَّنَا ٱغْفِرْ لِى وَلِوَٰلِدَىَّ وَلِلْمُؤْمِنِينَ يَوْمَ يَقُومُ ٱلْحِسَابُ ﴿٤١﴾

**41**. "ఓ మా ప్రభూ! నన్నూ నా తల్లి దండ్రులను మరియు సమస్త విశ్వాసులను లెక్కల పరిష్కారం రోజు క్షమించు."

وَلَا تَحْسَبَنَّ ٱللَّهَ غَٰفِلًا عَمَّا يَعْمَلُ ٱلظَّٰلِمُونَ ۚ إِنَّمَا يُؤَخِّرُهُمْ لِيَوْمٍ تَشْخَصُ فِيهِ ٱلْأَبْصَٰرُ ﴿٤٢﴾

**42**. మరియు ఈ దుర్మార్గుల చేష్టల నుండి అల్లాహ్ నిర్లక్ష్యంగా ఉన్నాడని నీవు భావించకు.[2] నిశ్చయంగా, ఆయన వారిని - వారి కళ్ళు, రెప్పవేయకుండా ఉండిపోయే - ఆ రోజువరకు వ్యవధినిస్తున్నాడు.

مُهْطِعِينَ مُقْنِعِى رُءُوسِهِمْ لَا يَرْتَدُّ إِلَيْهِمْ طَرْفُهُمْ ۖ وَأَفْـِٔدَتُهُمْ هَوَآءٌ ﴿٤٣﴾

**43**. (ఆ రోజు) వారు తలలు పైకెత్తి, పరిగెత్తుతూ ఉంటారు, పై చూపులు పైనే నిలిచి ఉంటాయి. మరియు వారు శూన్యహృదయులై ఉంటారు.

وَأَنذِرِ ٱلنَّاسَ يَوْمَ يَأْتِيهِمُ ٱلْعَذَابُ فَيَقُولُ ٱلَّذِينَ ظَلَمُوا۟ رَبَّنَآ أَخِّرْنَآ إِلَىٰٓ أَجَلٍ قَرِيبٍ نُّجِبْ دَعْوَتَكَ وَنَتَّبِعِ ٱلرُّسُلَ ۗ أَوَلَمْ تَكُونُوٓا۟ أَقْسَمْتُم مِّن قَبْلُ مَا لَكُم مِّن زَوَالٍ ﴿٤٤﴾

**44**. మరియు (ఓ ము'హమ్మద్!) శిక్షపడే ఆ రోజు గురించి ప్రజలను నీవు హెచ్చరించు. ఆ రోజు దుర్మార్గం చేసిన వారు అంటారు: "ఓ మా ప్రభూ! నీ సందేశాన్ని స్వీకరించటానికి, ప్రవక్తలను అనుసరించటానికి, మాకు మరికొంత వ్యవధి నివ్వు!"[3] (వారికి ఇలాంటి సమాధాన మివ్వబడుతుంది): "ఏమీ? ఇంతకు ముందు 'మాకు వినాశం లేదు.' అని ప్రమాణం చేసి చెప్పినవారు మీరు కాదా?

---

1. ఇస్'హాఖ్ ('అ.స.) సంతతి వారిలో నుండి ఇస్రాయీల్ సంతతి (బనీ ఇస్రాయీల్) వారు వచ్చారు. మరియు ఇస్మా'యీల్ ('అ.స.) సంతతి వారిలో నుండి ఖురైషులు వచ్చారు. వారందరిలో కూడా అల్లాహ్ (సు.తా.)కు అవిధేయులైన వారుండిరి.
2. దుర్మార్గులంటే ఇక్కడ అల్లాహ్‌కు సాటి కల్పించిన వారు.
3. చూడండి, 6:27.

وَسَكَنتُمْ فِي مَسَٰكِنِ ٱلَّذِينَ ظَلَمُوٓاْ أَنفُسَهُمْ وَتَبَيَّنَ لَكُمْ كَيْفَ فَعَلْنَا بِهِمْ وَضَرَبْنَا لَكُمُ ٱلْأَمْثَالَ ﴿٤٥﴾

**45**. "మరియు తమకు తాము అన్యాయం చేసుకున్న వారి స్థలాలలో మీరు నివసించారు మరియు వారితో ఎలా వ్యవహరించామో మీకు బాగా తెలుసు మరియు మేము మీకు ఎన్నో ఉపమానాలు కూడా ఇచ్చాము."

وَقَدْ مَكَرُواْ مَكْرَهُمْ وَعِندَ ٱللَّهِ مَكْرُهُمْ وَإِن كَانَ مَكْرُهُمْ لِتَزُولَ مِنْهُ ٱلْجِبَالُ ﴿٤٦﴾

**46**. మరియు వాస్తవానికి వారు తమ కుట్ర పన్నారు మరియు వారి కుట్ర అల్లాహ్ కు బాగా తెలుసు. కాని వారి కుట్ర కొండలను తమ చోటునుండి కదిలింపగలిగేది కాదు.[1]

فَلَا تَحْسَبَنَّ ٱللَّهَ مُخْلِفَ وَعْدِهِۦ رُسُلَهُۥٓ إِنَّ ٱللَّهَ عَزِيزٌ ذُو ٱنتِقَامٍ ﴿٤٧﴾

**47**. కనుక అల్లాహ్ తన ప్రవక్తలకు చేసిన వాగ్దానాన్ని భంగపరుస్తాడని భావించకు. నిశ్చయంగా, అల్లాహ్! సర్వశక్తిమంతుడు, ప్రతీకారం తీర్చుకోగల వాడు.

يَوْمَ تُبَدَّلُ ٱلْأَرْضُ غَيْرَ ٱلْأَرْضِ وَٱلسَّمَٰوَٰتُ وَبَرَزُواْ لِلَّهِ ٱلْوَٰحِدِ ٱلْقَهَّارِ ﴿٤٨﴾

**48**. ఈ భూమి మరొక భూమిగా మరియు ఆకాశాలు (వేరే ఆకాశాలుగా) మారే రోజు;[2] ఆ అద్వితీయుడు, ప్రబలుడు అయిన అల్లాహ్ ముందు అందరూ హాజరు చేయబడతారు.

وَتَرَى ٱلْمُجْرِمِينَ يَوْمَئِذٍ مُّقَرَّنِينَ فِي ٱلْأَصْفَادِ ﴿٤٩﴾

**49**. మరియు ఆ రోజు అపరాధులను సంకెళ్ళలో, కూడబెట్టి, బంధించి ఉంచటాన్ని నీవు చూస్తావు.

---

**1**. చూడండి, 19:90-91. పై తాత్పర్యం ఇబ్నె-కసీ'ర్ (ర'హ్మా.)గారిది. కొందరు వ్యాఖ్యాతలు ఈ విధంగా కూడా బోధించారు: 'ముష్రిక్ ఖురైషులు దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)ను చంపటానికి పన్నాగాలు పన్నారు. కాని వారు తమ పన్నాగాలలో నెగ్గలేకపోయారు, విఫలులయ్యారు.'

**2**. చూడండి, 20:105-107.

سَرَابِيلُهُم مِّن قَطِرَانٍ وَتَغْشَىٰ
وُجُوهَهُمُ ٱلنَّارُ ﴿٥٠﴾

**50**. వారి వస్త్రాలు 'తారు' (నల్లని జిడ్డు ద్రవం)తో చేయబడి ఉంటాయి మరియు అగ్నిజ్వాలలు వారి ముఖాలను క్రమ్ముకొని ఉంటాయి;

لِيَجْزِيَ ٱللَّهُ كُلَّ نَفْسٍ مَّا
كَسَبَتْۚ إِنَّ ٱللَّهَ سَرِيعُ
ٱلْحِسَابِ ﴿٥١﴾

**51**. అల్లాహ్ ప్రతిప్రాణికి దాని కర్మల ప్రతిఫలం ఇవ్వటానికి. నిశ్చయంగా, అల్లాహ్ లెక్క తీసుకోవటంలో అతి శీఘ్రుడు.

هَٰذَا بَلَٰغٌ لِّلنَّاسِ وَلِيُنذَرُواْ بِهِۦ
وَلِيَعْلَمُوٓاْ أَنَّمَا هُوَ إِلَٰهٌ وَٰحِدٌ
وَلِيَذَّكَّرَ أُوْلُواْ ٱلْأَلْبَٰبِ ﴿٥٢﴾

**52**. ఇది (ఈ ఖుర్ఆన్) మానవులకు ఒక సందేశం. వారు దీనితో హెచ్చరించ బడటానికి మరియు నిశ్చయంగా, ఆయన (అల్లాహ్) ఒక్కడే ఆరాధ్యదైవమని వారు తెలుసుకోవడానికి మరియు బుద్ధిమంతులు గ్రహించడానికి ఇది పంపబడింది.

*****

## 15. సూరహ్ అల్-'హి'జ్ర్

## سُورَةُ الحِجْرِ

ఇది, సూరహ్ యూసుఫ్ (12) తరువాత అవతరింపజేయబడిందని సుయూతిగారు అభిప్రాయపడ్డారు. ''నిశ్చయంగా, మేమే ఈ ఖుర్ఆన్‌ను అవతరింపజేశాము మరియు నిశ్చయంగా మేమే దీనిని కాపాడువారము.'' (9వ ఆయత్). దీనిపేరు **80**వ **ఆయత్** నుండి తీసుకొనబడింది. ఇందులో **99 ఆయతులు** ఉన్నాయి. అల్-'హి'జ్ర్ (Rocky Tract), **గుట్టల ప్రాంతం**. ఇది ఒక ప్రాంతం పేరు. స'మూద్ జాతివారు ఇక్కడ నివసించారు. ఇది మక్కా-సిరియా మార్గంలో ఉంది. అక్కడ చాలా గుట్టలున్నాయి. ఇది చివరి 6 మక్కా సూరాహ్‌ల(10-15) సమూహంలో చివరిది.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓرۚ تِلۡكَ ءَايَٰتُ ٱلۡكِتَٰبِ وَقُرۡءَانٖ مُّبِينٖ ١

**1**. (*) అలిఫ్-లామ్-ర. ఇవి దివ్యగ్రంథ ఆయత్‌లు మరియు (ఇది) ఒక స్పష్టమైన ఖుర్ఆన్.[1]

رُّبَمَا يَوَدُّ ٱلَّذِينَ كَفَرُواْ لَوۡ كَانُواْ مُسۡلِمِينَ ٢

**2**. సత్యతిరస్కారులు: ''మేము అల్లాహ్‌కు విధేయు(ముస్లిము)లమైతే ఎంతబాగుండేది!'' అని (పునరుత్థాన దినమున) పలుమార్లు కోరుకుంటారు.

ذَرۡهُمۡ يَأۡكُلُواْ وَيَتَمَتَّعُواْ وَيُلۡهِهِمُ ٱلۡأَمَلُۖ فَسَوۡفَ يَعۡلَمُونَ ٣

**3**. వారిని తింటూ (త్రాగుతూ) సుఖ సంతోషాలను అనుభవిస్తూ, (వృథా) ఆశలలో ఉండటానికి విడిచిపెట్టు. తరువాత వారు (సత్యాన్ని) తెలుసుకుంటారు.

وَمَآ أَهۡلَكۡنَا مِن قَرۡيَةٍ إِلَّا وَلَهَا كِتَابٞ مَّعۡلُومٞ ٤

**4**. మరియు (దాని వ్యవధి) నిర్ణయించి వ్రాయబడి ఉండనిదే, మేము ఏ నగరాన్నీ కూడా నాశనం చేయలేదు.[2]

---

**1**. చూడండి, 5:15.

**2**. ఇంకా చూడండి, 26:208 మరియు 6:131.

مَّا تَسۡبِقُ مِنۡ أُمَّةٍ أَجَلَهَا وَمَا يَسۡتَـٔۡخِرُونَ ﴿٥﴾

5. ఏ సమాజం కూడా తన నిర్ణీత గడువుకు, ముందు గానీ మరియు వెనక గానీ కాజాలదు.[1]

وَقَالُواْ يَـٰٓأَيُّهَا ٱلَّذِي نُزِّلَ عَلَيۡهِ ٱلذِّكۡرُ إِنَّكَ لَمَجۡنُونٞ ﴿٦﴾

6. మరియు (సత్యతిరస్కారులు) అంటారు: ''ఓ హితబోధ (ఖుర్ఆన్) అవతరింప జేయబడిన వాడా (ము'హమ్మద్)! నిశ్చయంగా నీవు పిచ్చివాడవు.

لَّوۡ مَا تَأۡتِينَا بِٱلۡمَلَـٰٓئِكَةِ إِن كُنتَ مِنَ ٱلصَّـٰدِقِينَ ﴿٧﴾

7. ''నీవు సత్యవంతుడవే అయితే, మా వద్దకు దేవదూతలను ఎందుకు తీసుకొని రావు?''

مَا نُنَزِّلُ ٱلۡمَلَـٰٓئِكَةَ إِلَّا بِٱلۡحَقِّ وَمَا كَانُوٓاْ إِذٗا مُّنظَرِينَ ﴿٨﴾

8. మేము దేవదూతలను, సత్యంతో తప్ప పంపము మరియు వారు వచ్చినప్పుడు వీరికి ఏ మాత్రం వ్యవధి ఇవ్వబడదు.[2]

إِنَّا نَحۡنُ نَزَّلۡنَا ٱلذِّكۡرَ وَإِنَّا لَهُۥ لَحَـٰفِظُونَ ﴿٩﴾

9. నిశ్చయంగా, మేమే ఈ జ్ఞాపిక (ఖుర్ఆన్)ను అవతరింపజేశాము మరియు నిశ్చయంగా మేమే దీనిని కాపాడేవారము.[3]

وَلَقَدۡ أَرۡسَلۡنَا مِن قَبۡلِكَ فِي شِيَعِ ٱلۡأَوَّلِينَ ﴿١٠﴾

10. మరియు (ఓ ము'హమ్మద్!) వాస్తవానికి మేము, నీకు పూర్వం గతించిన తెగల వారి వద్దకు కూడా (ప్రవక్తలను పంపాము.

---

1. చూడండి, 7:34. ఏ నగరం కూడా దాని సత్యతిరస్కారం మరియు అత్యాచారాలకు వెంటనే నాశనం చేయబడదు. దానికి ఒక వ్యవధి, నియమిత కాలం అల్లాహుతా'ఆలా తరఫునుండి ఇవ్వబడుతోంది. ఇక ఆ నియమిత కాలం వచ్చిన తరువాత వారు దాని నుండి వెనుకా ముందు కాలేరు అంటే ఒక్క క్షణం కూడా వ్యవధి పొందలేరు.
2. చూడండి, 6:8-9.
3. 1400 సంవత్సరాలలో ఒక అక్షరంలో కూడా మార్పులేకుండా భద్రపరచబడిన దివ్యగ్రంథం కేవలం ఈ ఖుర్ఆన్ మాత్రమే. ఎందుకంటే అల్లాహుతా'ఆలా: ''*నిశ్చయంగా, మేమే ఈ ఖుర్ఆన్‌ను అవతరింపజేసినవారము మరియు నిశ్చయంగా, మేమే దీనిని కాపాడువారము.*'' అని అన్నాడు. ఇంకా చూడండి, 2:23 మరియు 85:22.

وَمَا يَأۡتِيهِم مِّن رَّسُولٍ إِلَّا كَانُواْ بِهِۦ يَسۡتَهۡزِءُونَ ١١

11. మరియు వారి వద్దకు వచ్చిన ఏ ప్రవక్తను కూడా, వారు పరిహసించకుండా ఉండలేదు.[1]

كَذَٰلِكَ نَسۡلُكُهُۥ فِي قُلُوبِ ٱلۡمُجۡرِمِينَ ١٢

12. ఈ విధంగా మేము దీనిని (సత్య తిరస్కారాన్ని) అపరాధుల హృదయాలలో ప్రవేశపెడ్తున్నాము.

لَا يُؤۡمِنُونَ بِهِۦۖ وَقَدۡ خَلَتۡ سُنَّةُ ٱلۡأَوَّلِينَ ١٣

13. వారు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) విశ్వసించడం లేదు. మరియు వాస్తవానికి (సత్యతిరస్కారులైన) వారి పూర్వీకుల విధానం కూడా ఇలాగే ఉండేది.

وَلَوۡ فَتَحۡنَا عَلَيۡهِم بَابًا مِّنَ ٱلسَّمَآءِ فَظَلُّواْ فِيهِ يَعۡرُجُونَ ١٤

14. మరియు ఒకవేళ మేము వారి కొరకు ఆకాశపు ఒక ద్వారాన్ని తెరిచినా, వారు దానిపైకి ఎక్కుతూ పోతూ!

لَقَالُوٓاْ إِنَّمَا سُكِّرَتۡ أَبۡصَٰرُنَا بَلۡ نَحۡنُ قَوۡمٞ مَّسۡحُورُونَ ١٥

15. ఇలా అనే వారు: "నిశ్చయంగా, మా చూపులు భ్రమింపజేయబడ్డాయి. అలాకాదు, మాపై మంత్రజాలం చేయబడింది."[2]

وَلَقَدۡ جَعَلۡنَا فِي ٱلسَّمَآءِ بُرُوجٗا وَزَيَّنَّٰهَا لِلنَّٰظِرِينَ ١٦

16. మరియు వాస్తవానికి, మేము ఆకాశంలో తారాగణాన్ని (నక్షత్ర రాశులను) సృష్టించి, దానిని చూపరులకు అలంకారమైనదిగా చేశాము.

وَحَفِظۡنَٰهَا مِن كُلِّ شَيۡطَٰنٖ رَّجِيمٍ ١٧

17. మరియు శపించ (బహిష్కరించ) బడిన ప్రతి షైతాను నుండి దానిని (ఆకాశాన్ని) సురక్షితంగా ఉంచాము.[3]

---

1. చూడండి, 6:10.
2. చూడండి, 6:7 మరియు 10:2
3. చూడండి, 2:14 మరియు 37:7.

إِلَّا مَنِ ٱسْتَرَقَ ٱلسَّمْعَ فَأَتْبَعَهُۥ شِهَابٌ مُّبِينٌ ﴿١٨﴾

**18**. కాని, ఎవడైనా (ఏ షైతానైనా) దొంగచాటుగా వినటానికి ప్రయత్నిస్తే, స్పష్టమైన కొరవి (అగ్నిజ్వాల) అతనిని వెంబడిస్తుంది.[1]

وَٱلْأَرْضَ مَدَدْنَٰهَا وَأَلْقَيْنَا فِيهَا رَوَٰسِىَ وَأَنۢبَتْنَا فِيهَا مِن كُلِّ شَىْءٍ مَّوْزُونٍ ﴿١٩﴾

**19**. మరియు మేము భూమిని వ్యాపింప జేశాము మరియు దానిలో స్థిరమైన పర్వతాలను నాటాము మరియు దానిలో ప్రతి వస్తువును తగిన పరిమాణంలో ఉత్పత్తి చేశాము.

وَجَعَلْنَا لَكُمْ فِيهَا مَعَٰيِشَ وَمَن لَّسْتُمْ لَهُۥ بِرَٰزِقِينَ ﴿٢٠﴾

**20**. మరియు అందులో మీకూ - మరియు మీరు పోషించని - వాటి (జీవరాసుల) కొరకూ, మేము జీవనోపాధిని కల్పించాము.[2]

وَإِن مِّن شَىْءٍ إِلَّا عِندَنَا خَزَآئِنُهُۥ وَمَا نُنَزِّلُهُۥٓ إِلَّا بِقَدَرٍ مَّعْلُومٍ ﴿٢١﴾

**21**. మరియు మా దగ్గర పుష్కలంగా నిలువలేని వస్తువు అంటూ ఏదీలేదు మరియు దానిని మేము ఒకనిర్ణీత పరిమాణంలో మాత్రమే పంపుతూ ఉంటాము.

وَأَرْسَلْنَا ٱلرِّيَٰحَ لَوَٰقِحَ فَأَنزَلْنَا مِنَ ٱلسَّمَآءِ مَآءً فَأَسْقَيْنَٰكُمُوهُ وَمَآ أَنتُمْ لَهُۥ بِخَٰزِنِينَ ﴿٢٢﴾

**22**. మరియు మేము (వృక్షకోటిని) ఫలవంతం చేయటానికి గాలులను పంపుతాము! తరువాత మేము ఆకాశం నుండి నీటిని కురిపించి దానిని మీకు త్రాగటానికి సమకూర్చుతాము మరియు దాని కోశాధికారులు మీరు మాత్రం కారు!

وَإِنَّا لَنَحْنُ نُحْىِۦ وَنُمِيتُ وَنَحْنُ ٱلْوَٰرِثُونَ ﴿٢٣﴾

**23**. మరియు నిశ్చయంగా, మేమే జీవన్మరణాలను ఇచ్చేవారము మరియు చివరకు మేమే వారసులుగా మిగిలేవారము.[3]

---

**1**. చూడండి, 37:10.
**2**. చూడండి, 11:6.
**3**. చూడండి, 3:180 మరియు 57:10.

24. మరియు వాస్తవానికి, మీకు ముందు గడిచిపోయిన వారి గురించి మాకు తెలుసు మరియు వాస్తవంగా మీ తరువాత వచ్చే వారి గురించి కూడా మాకు బాగా తెలుసు.[1]

وَلَقَدۡ عَلِمۡنَا ٱلۡمُسۡتَقۡدِمِينَ مِنكُمۡ وَلَقَدۡ عَلِمۡنَا ٱلۡمُسۡتَـٔۡخِرِينَ ﴿٢٤﴾

25. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు, ఆయనే! వారందరినీ సమావేశపరుస్తాడు. నిశ్చయంగా, ఆయన మహా వివేకవంతుడు, సర్వజ్ఞుడు.

وَإِنَّ رَبَّكَ هُوَ يَحۡشُرُهُمۡۚ إِنَّهُۥ حَكِيمٌ عَلِيمٌ ﴿٢٥﴾

26. మరియు వాస్తవంగా మేము మానవుణ్ణి మ్రోగే (ధ్వనిచేసే) మట్టి, రూపాంతరం చెందిన జిగట బురద (బంకమట్టి)తో సృష్టించాము.[2]

وَلَقَدۡ خَلَقۡنَا ٱلۡإِنسَٰنَ مِن صَلۡصَٰلٖ مِّنۡ حَمَإٖ مَّسۡنُونٖ ﴿٢٦﴾

27. మరియు దీనికి పూర్వం మేము జిన్నాతులను (పొగలేని) మండే అగ్ని జ్వాలతో సృష్టించాము.[3]

وَٱلۡجَآنَّ خَلَقۡنَٰهُ مِن قَبۡلُ مِن نَّارِ ٱلسَّمُومِ ﴿٢٧﴾

---

1. 'ఎవరైతే ముందుగా (మావద్దకు) వస్తారో మరియు ఎవరు వెనుక ఉండిపోతారో...తెలుసు.' ఈ రెండురకాల వ్యాఖ్యానాలు కూడా సరైనవే అని వ్యాఖ్యాతలు అంగీకరించారు.
మరొక వ్యాఖ్యానం: 'మరియు వాస్తవానికి, మీలో ముందుకు సాగిపోయే వారెవరో మాకు తెలుసు మరియు వాస్తవానికి, వెనుకంజ వేసేవారెవరో కూడా మాకు తెలుసు.' అని కూడా ఇవ్వబడింది.
2. మానవుడు మట్టితో సృష్టించబడ్డాడు. వేర్వేరు చోట్లలో ఆ మట్టి స్థితిని బట్టి వేర్వేరు పేర్లు ఇవ్వబడ్డాయి. 1) సాధారణంగా ఎండిపోయిన (తడి లేని) మట్టిని తురాబ్ - దుమ్ము అని, 2) దానిని నీళ్ళువేసి కలిపితే 'తీన్ - మట్టి అని, 3) అది చాలా నీళ్ళతో కలిపి వాసన వచ్చే బురదగా ఉంటె, 'హమఇన్ మస్నూన్ - జిగట బురద అని, 4) అది ఎండిపోయి శబ్దం చేస్తే,-'స'ల్సాల్ - అని, 5) దానిని కాల్చితే, ఫ'ఖ్ఖార్ - పెంకు, అని పేర్లు ఇవ్వబడ్డాయి. (చూడండి, 55:14).
3. అల్-జిన్ను, జిన్నతున్ (బ.వ.): అంటే మానవుల కండ్లకు కనబడనిది అని అర్థము. అందుకే వారిని ఈ పేరుతో పిలుస్తారు. వారికి తెలివి ఉంది, మంచి చెడుల విచక్షణా శక్తి ఉంది. పొగలేని అగ్నిజ్వాలతో సృష్టించబడ్డారు. వారు తింటారు, త్రాగుతారు. వారి సంతతి పెరుగుతుంది. వారికి మరణం ఉంది. వారి కర్మలను బట్టి వారికి, మానవులవలే స్వర్గ నరకాల ప్రతిఫలాలు కూడా ఉన్నాయి. ('అబ్దుల్-మజీద్ దర్యాబాది, ర'హ్మ.) చూడండి, 55:15 మరియు 6:100.

28. మరియు నీ ప్రభువు దేవదూతలతో ఇలా అన్న విషయం (జ్ఞాపకం చేసుకో!): "నిశ్చయంగా నేను మ్రోగే మట్టి, రూపాంతరం చెందిన జిగట బురదతో మానవుణ్ణి సృష్టించబోతున్నాను.

وَإِذْ قَالَ رَبُّكَ لِلْمَلَٰٓئِكَةِ إِنِّي خَٰلِقُۢ بَشَرًا مِّن صَلْصَٰلٖ مِّنْ حَمَإٖ مَّسْنُونٖ ﴿٢٨﴾

29. "ఇక నేను అతనికి పూర్తిగా ఆకారమిచ్చి (రూపమిచ్చి), అతని (ఆదమ్)లో నా (తరఫు నుండి) ప్రాణం (రూ'హ్) ఊదిన తరువాత, మీరంతా అతని ముందు సాష్టాంగం (సజ్దా) చేయాలి."[1]

فَإِذَا سَوَّيْتُهُۥ وَنَفَخْتُ فِيهِ مِن رُّوحِي فَقَعُواْ لَهُۥ سَٰجِدِينَ ﴿٢٩﴾

30. అప్పుడు దేవదూతలు, అందరూ కలిసి సాష్టాంగం (సజ్దా) చేశారు -

فَسَجَدَ ٱلْمَلَٰٓئِكَةُ كُلُّهُمْ أَجْمَعُونَ ﴿٣٠﴾

31. ఒక్క ఇబ్లీస్ తప్ప! అతడు సాష్టాంగం (సజ్దా) చేసేవారిలో చేరనని మొండికేశాడు.[2]

إِلَّآ إِبْلِيسَ أَبَىٰٓ أَن يَكُونَ مَعَ ٱلسَّٰجِدِينَ ﴿٣١﴾

32. (అల్లాహ్) ఇలా ప్రశ్నించాడు: "ఓ ఇబ్లీస్! నీకేమయింది, నీవు సాష్టాంగం (సజ్దా) చేసేవారిలో ఎందుకు చేరలేదు?"

قَالَ يَٰٓإِبْلِيسُ مَا لَكَ أَلَّا تَكُونَ مَعَ ٱلسَّٰجِدِينَ ﴿٣٢﴾

33. (ఇబ్లీస్) ఇలా జవాబిచ్చాడు: "మ్రోగే మట్టి, రూపాంతరం చెందిన జిగట బురదతో నీవు సృష్టించిన మానవునికి నేను సాష్టాంగం (సజ్దా) చేసేవాడను కాను."

قَالَ لَمْ أَكُن لِّأَسْجُدَ لِبَشَرٍ خَلَقْتَهُۥ مِن صَلْصَٰلٖ مِّنْ حَمَإٖ مَّسْنُونٖ ﴿٣٣﴾

---

1. ఈ సాష్టాంగం కేవలం అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞను శిరసావహించటానికి చేయబడిన గౌరవ ప్రదమైన సాష్టాంగం. ఇది ఆరాధనార్థం చేసింది కాదు. ము'హమ్మద్ ('స'అస) షరీఅత్‌లో గౌరవార్థం కూడా ఎవ్వరికైనను సాష్టాంగం చేయటం ధర్మసమ్మతం కాదు. ఇంకా చూడండి, 2:30-34 మరియు 7:11-18.

2. 'మానవుడు మట్టితో సృష్టించబడ్డాడు, కాని నేనైతే అగ్నితో సృష్టించబడ్డాను, కాబట్టి నేను మానవుని కంటే ఉత్తముడను, నేనెందుకు అతనికి సజ్దా చేయాలి.' అని ఇబ్లీస్ అన్నాడు. దైవప్రవక్తలందరూ మట్టితోనే సృష్టించబడ్డ మానవులేనని ఖుర్ఆన్ విశదీకరించింది. దీనిని విశ్వసించక పోవడం మరియు మట్టితో సృష్టించబడ్డవారు అధములని భావించడం షై'తాన్‌ను అనుసరించడమే! ఇంకా చూడండి, 7:11.

قَالَ فَٱخۡرُجۡ مِنۡهَا فَإِنَّكَ رَجِيمٞ ٣٤

34. (అల్లాహ్) అన్నాడు: "అయితే నీవు ఇక్కడినుండి వెళ్ళిపో! ఇక, నిశ్చయంగా, నీవు శపించ (బహిష్కరించ) బడ్డవాడవు!

وَإِنَّ عَلَيۡكَ ٱللَّعۡنَةَ إِلَىٰ يَوۡمِ ٱلدِّينِ ٣٥

35. "మరియు నిశ్చయంగా, తీర్పుదినము వరకు నీపై శాపం (బహిష్కారం) ఉంటుంది."

قَالَ رَبِّ فَأَنظِرۡنِيٓ إِلَىٰ يَوۡمِ يُبۡعَثُونَ ٣٦

36. (ఇబ్లీస్) వేడుకున్నాడు: "ఓ నా ప్రభూ! పునరుత్థానదినం వరకు నాకు వ్యవధి నివ్వు!"

قَالَ فَإِنَّكَ مِنَ ٱلۡمُنظَرِينَ ٣٧

37. (అల్లాహ్) జవాబిచ్చాడు: "ఇక నిశ్చయంగా, నీవు వ్యవధి ఇవ్వబడిన వారిలోని వాడవు!

إِلَىٰ يَوۡمِ ٱلۡوَقۡتِ ٱلۡمَعۡلُومِ ٣٨

38. "(నాకు మాత్రమే) తెలిసివున్న ఆ దినపు, ఆ సమయం వరకు!"

قَالَ رَبِّ بِمَآ أَغۡوَيۡتَنِي لَأُزَيِّنَنَّ لَهُمۡ فِي ٱلۡأَرۡضِ وَلَأُغۡوِيَنَّهُمۡ أَجۡمَعِينَ ٣٩

39. (ఇబ్లీస్) అన్నాడు: "ఓ నా ప్రభూ! నీవు నన్ను అపమార్గం పట్టించావు, కావున నేను వారికి, భూమిలో (వారి దుష్కర్మలన్నీ) మంచివిగా కనబడేటట్లు చేస్తాను మరియు నిశ్చయంగా వారందరినీ అపమార్గంలో పడవేస్తాను.

إِلَّا عِبَادَكَ مِنۡهُمُ ٱلۡمُخۡلَصِينَ ٤٠

40. "వారిలో నీవు ఎన్నుకున్న (నీ ఆజ్ఞాను వర్తనులైన) నీ దాసులు తప్ప!"

قَالَ هَٰذَا صِرَٰطٌ عَلَيَّ مُسۡتَقِيمٌ ٤١

41. (అల్లాహ్) అన్నాడు: "ఇదే నా దగ్గరకు తెచ్చే ఋజుమార్గం.[1]

1. బహిష్కరించబడిన ఇబ్లీస్, అల్లాహుతా'ఆలా ఇచ్ఛనే నెరవేరుస్తున్నాడు. అల్లాహ్ (సు.తా.) మానవునికి మంచి చెడును అర్థంచేసుకునే జ్ఞానాన్ని ప్రసాదించి, ఎవడు చెడు (షై'తాన్ ప్రేరణ)లో పడిపోతాడో చూస్తాడు. ఈ విధంగా షై'తాన్ అల్లాహ్ (సు.తా.) ఇచ్ఛ నిర్వహణలో ఒక పాత్ర నిర్వహిస్తున్నాడు. కావున షై'తాన్ వలనుండి తప్పించుకునే వాడు ఋజుమార్గం మీద ఉండగలడు. ఇంకా చూడండి, 19:83 మరియు 7:24.

إِنَّ عِبَادِى لَيْسَ لَكَ عَلَيْهِمْ سُلْطَـٰنٌ إِلَّا مَنِ ٱتَّبَعَكَ مِنَ ٱلْغَاوِينَ ﴿٤٢﴾

42. "నిశ్చయంగా, నా దాసులపై నీ అధికారం సాగదు! కేవలం మార్గభ్రష్టులై నిన్ను అనుసరించే వారిమీద తప్ప![1]

وَإِنَّ جَهَنَّمَ لَمَوْعِدُهُمْ أَجْمَعِينَ ﴿٤٣﴾

43. "మరియు నిశ్చయంగా, వారందరి కొరకు వాగ్దానం చేయబడిన (నివాసం) నరకమే!

لَهَا سَبْعَةُ أَبْوَٰبٍ لِّكُلِّ بَابٍ مِّنْهُمْ جُزْءٌ مَّقْسُومٌ ﴿٤٤﴾

44. "దానికి (నరకానికి) ఏడు ద్వారాలు ఉన్నాయి.[2] వాటిలో ఒక్కొక్క ద్వారానికి ఒక్కొక్క వర్గం వారు ప్రత్యేకించబడి ఉన్నారు.

إِنَّ ٱلْمُتَّقِينَ فِى جَنَّـٰتٍ وَعُيُونٍ ﴿٤٥﴾

45. "నిశ్చయంగా, దైవభీతి గలవారు స్వర్గవనాలలో చెలమల మధ్య ఉంటారు.

ٱدْخُلُوهَا بِسَلَـٰمٍ ءَامِنِينَ ﴿٤٦﴾

46. " (వారు): 'శాంతితో సురక్షితంగా ప్రవేశించండి!' అని ఆహ్వానించబడతారు.

وَنَزَعْنَا مَا فِى صُدُورِهِم مِّنْ غِلٍّ إِخْوَٰنًا عَلَىٰ سُرُرٍ مُّتَقَـٰبِلِينَ ﴿٤٧﴾

47. "వారి హృదయాలలో మిగిలివున్న కాపట్యాన్ని (మాలిన్యాన్ని) మేము తొలగిస్తాము. వారు సోదరులవలే ఎదురెదురుగా పీఠాలపై కూర్చొని ఉంటారు.[3]

لَا يَمَسُّهُمْ فِيهَا نَصَبٌ وَمَا هُم مِّنْهَا بِمُخْرَجِينَ ﴿٤٨﴾

48. "అక్కడ వారికి అలసట ఉండదు. మరియు అక్కడినుండి వారు ఎన్నడూ వెడలగొట్టబడరు." (1/8)

۞ نَبِّئْ عِبَادِىٓ أَنِّىٓ أَنَا ٱلْغَفُورُ ٱلرَّحِيمُ ﴿٤٩﴾

49. * నా దాసులకు ఇలా తెలియజెయ్యి: నిశ్చయంగా నేను, కేవలం నేనే! క్షమించేవాడను, కరుణించేవాడను.[4]

---

1. చూడండి, 14:22 మరియు 7:11-18.
2. నరకానికి ఏడు అంతస్తులు లేక శ్రేణులున్నాయి. 1) జహన్నమ్, 2) ల''జ్జా, 3) 'హు'త్మ, 4) స'యీర్, 5) సఖర్, 6) జ'హీమ్, 7) హావియహ్. ఇది అన్నిటి కంటే క్రింది అంతస్తు, ఇందులో మునాఫిఖులు (కపటవిశ్వాసులు) ఉంటారు. (ఫత్హ అల్-ఖదీర్). చూడండి, 74:27 వ్యాఖ్యానం 2
3. చూడండి, 56:15 మరియు 88:13.
4. చూడండి, 6:12 మరియు 6:54.

وَأَنَّ عَذَابِي هُوَ ٱلْعَذَابُ ٱلْأَلِيمُ ٥٠

50. మరియు నిశ్చయంగా, నా శిక్షయే అతి బాధాకరమైన శిక్ష!

وَنَبِّئْهُمْ عَن ضَيْفِ إِبْرَٰهِيمَ ٥١

51. మరియు వారికి ఇబ్రాహీమ్ అతిథులను గురించి తెలుపు.[1]

إِذْ دَخَلُوا۟ عَلَيْهِ فَقَالُوا۟ سَلَـٰمًا قَالَ إِنَّا مِنكُمْ وَجِلُونَ ٥٢

52. వారు అతని వద్దకు వచ్చి: "నీకు శాంతి కలుగు గాక (సలాం)!" అని అన్నారు. అతను అన్నాడు: "నిశ్చయంగా, మాకు మీ వలన భయం కలుగుతున్నది."[2]

قَالُوا۟ لَا تَوْجَلْ إِنَّا نُبَشِّرُكَ بِغُلَـٰمٍ عَلِيمٍ ٥٣

53. వారు జవాబిచ్చారు: "నీవు భయపడకు! నిశ్చయంగా, మేము జ్ఞానవంతుడైన ఒక కుమారుని శుభవార్తను నీకు ఇస్తున్నాము."

قَالَ أَبَشَّرْتُمُونِي عَلَىٰٓ أَن مَّسَّنِيَ ٱلْكِبَرُ فَبِمَ تُبَشِّرُونَ ٥٤

54. (ఇబ్రాహీమ్) అన్నాడు: "మీరు ఈ ముసలితనంలో నాకు (కుమారుడు కలుగుననే) శుభవార్తను ఇస్తున్నారా? మీరు ఎలాంటి (అసాధ్యమైన) శుభవార్తను ఇస్తున్నారు?"

قَالُوا۟ بَشَّرْنَـٰكَ بِٱلْحَقِّ فَلَا تَكُن مِّنَ ٱلْقَـٰنِطِينَ ٥٥

55. వారన్నారు: "మేము నీకు సత్యమైన శుభవార్తను ఇచ్చాము. కనుక నీవు నిరాశచెందకు."

قَالَ وَمَن يَقْنَطُ مِن رَّحْمَةِ رَبِّهِۦٓ إِلَّا ٱلضَّآلُّونَ ٥٦

56. (ఇబ్రాహీమ్) అన్నాడు: "తన ప్రభువు కారుణ్యంపట్ల నిరాశ చెందేవారు మార్గభ్రష్టులు తప్ప మరెవరు?"

1. ఇబ్రాహీమ్ (అ.స.) యొక్క వివరమైన గాథ కొరకు చూడండి, 11:69-76 దీనికి కొంత కాలం ముందే అవతరింపజేయబడిన సూరహ్.

2. వారి భయానికి కారణం కొరకు చూడండి, 11:70 దీని ద్వారా తెలిసేదేమిటంటే ఇబ్రాహీమ్ (అ.స.) ఒక దైవప్రవక్త అయినా, వచ్చిన అతిథులు దైవదూతలని వారు చెప్పేంతవరకు తెలుసుకోలేక పోయారు. అంటే దైవప్రవక్తలకు అగోచరజ్ఞానం ఉండదు. అల్లాహ్ (సు.తా.) వారికి తెలిపినది మాత్రమే వారికి తెలుస్తుంది.

قَالَ فَمَا خَطْبُكُمْ أَيُّهَا ٱلْمُرْسَلُونَ ﴿٥٧﴾

57. (ఇంకా) ఇలా అన్నాడు: "ఓ దైవదూతలారా! మరి మీరు వచ్చిన కారణమేమిటి?"

قَالُوٓا۟ إِنَّآ أُرْسِلْنَآ إِلَىٰ قَوْمٍ مُّجْرِمِينَ ﴿٥٨﴾

58. వారన్నారు: "వాస్తవానికి మేము అపరాధులైన జాతివారి వైపునకు పంపబడ్డాము,[1]

إِلَّآ ءَالَ لُوطٍ إِنَّا لَمُنَجُّوهُمْ أَجْمَعِينَ ﴿٥٩﴾

59. "లూత్ ఇంటి వారు[2] తప్ప; నిశ్చయంగా వారందరినీ రక్షిస్తాము -

إِلَّا ٱمْرَأَتَهُۥ قَدَّرْنَآ ۙ إِنَّهَا لَمِنَ ٱلْغَٰبِرِينَ ﴿٦٠﴾

60. "అతని భార్య తప్ప! (ఆమెను గురించి అల్లాహ్ అన్నాడు): 'నిశ్చయంగా, ఆమె వెనుక ఉండిపోయే వారిలో చేరుతుందని మేము నిర్ణయించాము.' "[3]

فَلَمَّا جَآءَ ءَالَ لُوطٍ ٱلْمُرْسَلُونَ ﴿٦١﴾

61. తరువాత ఆ దేవదూతలు లూత్ ఇంటి వారి వద్దకు వచ్చినపుడు;

قَالَ إِنَّكُمْ قَوْمٌ مُّنكَرُونَ ﴿٦٢﴾

62. (లూత్) అన్నాడు: "నిశ్చయంగా, మీరు (నాకు) పరాయి వారిగా కన్పిస్తున్నారు."[4]

قَالُوا۟ بَلْ جِئْنَٰكَ بِمَا كَانُوا۟ فِيهِ يَمْتَرُونَ ﴿٦٣﴾

63. వారన్నారు: "కాదు! వాస్తవానికి వారు (దుర్మార్గులు) దేనిని గురించి సందేహంలో పడి ఉన్నారో, దానిని (ఆ శిక్షను) తీసుకొని నీవద్దకు వచ్చాము.[5]

وَأَتَيْنَٰكَ بِٱلْحَقِّ وَإِنَّا لَصَٰدِقُونَ ﴿٦٤﴾

64. "మరియు మేము నీవద్దకు సత్యాన్ని తెచ్చాము. మరియు మేము నిశ్చయంగా, సత్యం పలుకుతున్నాము.

---

1. సొడోమ్ మరియు గొమొర్రాహ్ ప్రజల గాథ కొరకు చూడండి, 7:80-84 మరియు 11:77-83.
2. ఆల: అంటే ఇంటివారే కాక అనుచరులందరూ కూడా అన్నమాట.
3. చూడండి, 7:83, 11:81 మరియు 66:10.
4. ఆ దేవదూతలు యువకుల ఆకారంలో వచ్చారు. చూడండి, 11:77.
5. చూడండి, 6:57-58, 8:32, 11:8.

65. "కావున నీవు కొంత రాత్రి మిగిలి ఉండగానే, నీ ఇంటి వారిని తీసుకొని బయలుదేరు, నీవు వారి వెనుక పో! మీలో ఎవ్వరూ కూడా వెనుదిరిగి చూడరాదు; మరియు మీరు, మీకు ఆజ్ఞాపించిన వైపునకే, పోతూ ఉండండి."

فَأَسْرِ بِأَهْلِكَ بِقِطْعٍ مِّنَ ٱلَّيْلِ وَٱتَّبِعْ أَدْبَٰرَهُمْ وَلَا يَلْتَفِتْ مِنكُمْ أَحَدٌ وَٱمْضُوا۟ حَيْثُ تُؤْمَرُونَ ﴿٦٥﴾

66. మరియు (మా దూతల ద్వారా) మా ఆదేశాన్ని అతనికి ఇలా తెలియజేశాము: "నిశ్చయంగా, తెల్లవారే సరికి వారందరూ సమూలంగా నిర్మూలించబడతారు."

وَقَضَيْنَآ إِلَيْهِ ذَٰلِكَ ٱلْأَمْرَ أَنَّ دَابِرَ هَٰٓؤُلَآءِ مَقْطُوعٌ مُّصْبِحِينَ ﴿٦٦﴾

67. మరియు నగరవాసులు ఉల్లాసంతో అక్కడికి వచ్చారు.

وَجَآءَ أَهْلُ ٱلْمَدِينَةِ يَسْتَبْشِرُونَ ﴿٦٧﴾

68. (లూ'త్) అన్నాడు: "వాస్తవానికి, వీరు నా అతిథులు, కావున నన్ను అవమానంపాలు చేయకండి.[1]

قَالَ إِنَّ هَٰٓؤُلَآءِ ضَيْفِى فَلَا تَفْضَحُونِ ﴿٦٨﴾

69. "మరియు అల్లాహ్‌పట్ల భయభక్తులు కలిగి ఉండండి మరియు నా గౌరవాన్ని పోగొట్టకండి."

وَٱتَّقُوا۟ ٱللَّهَ وَلَا تُخْزُونِ ﴿٦٩﴾

70. వారన్నారు: " 'ప్రపంచంలోని (ప్రతి వాణ్ణి) వెనకేసుకోకు!' అని మేము నిన్ను వారించలేదా?"[2]

قَالُوٓا۟ أَوَلَمْ نَنْهَكَ عَنِ ٱلْعَٰلَمِينَ ﴿٧٠﴾

71. (లూ'త్) అన్నాడు: "మీకు (ఏమైనా) చేయాలనే ఉంటే, నా కుమార్తెలు (జాతి స్త్రీలు) ఉన్నారు."[3]

قَالَ هَٰٓؤُلَآءِ بَنَاتِىٓ إِن كُنتُمْ فَٰعِلِينَ ﴿٧١﴾

---

1. చూడండి, 7:80-81, 11:77-79.
2. లూత్ ('అ.స.) సొడోమ్ ప్రాంతంలో విదేశీయుడు. ఎందుకంటే అతను మెసపొటోమియా నుండి వచ్చిన వాడు. చూడండి, 7:80-82.
3. లూ'త్ ('అ.స.) తన జాతి స్త్రీలను తన కుమార్తెలని సంబోధించారు.

72. "నీ ప్రాణం సాక్షి! నిశ్చయంగా, వారు తమ (కామ) మత్తులో త్రోవతప్పి తిరుగు తున్నారు."[1] (అని దేవదూతలు అన్నారు).

لَعَمۡرُكَ إِنَّهُمۡ لَفِي سَكۡرَتِهِمۡ يَعۡمَهُونَ ٧٢

73. ఆ పిదప సూర్యోదయ సమయమున ఒక భయంకరమైన అరుపు ('సయ్'హా) వారిని పట్టుకున్నది.

فَأَخَذَتۡهُمُ ٱلصَّيۡحَةُ مُشۡرِقِينَ ٧٣

74. తరువాత మేము ఆ నగరాన్ని తలక్రిందులుగా చేశాము మరియు వారిపై కాల్చినమట్టి గులకరాళ్ళను కురిపించాము.

فَجَعَلۡنَا عَٰلِيَهَا سَافِلَهَا وَأَمۡطَرۡنَا عَلَيۡهِمۡ حِجَارَةٗ مِّن سِجِّيلٍ ٧٤

75. నిశ్చయంగా, ఇందులో దూరదృష్టి గలవారికి ఎన్నో సూచనలున్నాయి.

إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَٰتٖ لِّلۡمُتَوَسِّمِينَ ٧٥

76. మరియు వాస్తవానికి ఆ ప్రాంతం ఒక రహదారి పైననే ఉన్నది.

وَإِنَّهَا لَبِسَبِيلٖ مُّقِيمٍ ٧٦

77. నిశ్చయంగా, ఇందులో విశ్వసించిన వారికి ఒక సూచన ఉంది.

إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةٗ لِّلۡمُؤۡمِنِينَ ٧٧

78. మరియు అయ్‌కహ్ (మద్‌యన్) వాసులు కూడా దుర్మార్గులుగానే ఉండే వారు.[2]

وَإِن كَانَ أَصۡحَٰبُ ٱلۡأَيۡكَةِ لَظَٰلِمِينَ ٧٨

79. కావున మేము వారి మీద కూడా ప్రతీకారం తీర్చుకున్నాము. మరియు ఆ రెండు (శిథిలాలు) కూడా ఒక స్పష్టమైన మార్గం మీద ఉన్నాయి.[3]

فَٱنتَقَمۡنَا مِنۡهُمۡ وَإِنَّهُمَا لَبِإِمَامٖ مُّبِينٖ ٧٩

---

1. కొందరు వ్యాఖ్యాతలు ఈ ఆయత్ లూ'త్ ('అ.స.)ను సంబోధిస్తున్నదని అంటారు. మరికొందరు దైవప్రవక్త ('స'అస)ను సంబోధిస్తున్నదని. అల్లాహుతా'ఆలా ఇక్కడ ము'హమ్మద్ ('స'అస) యొక్క ప్రాణ సాక్ష్యం ఇస్తున్నాడు. ఆయన (సు.తా.) తాను కోరిన దాని ప్రమాణం చేస్తాడు. కాని మానవులకు అల్లాహుతా'ఆలా తప్ప మరెవ్వరి ప్రమాణం చేయటం ధర్మసమ్మతం కాదు.

2. అయ్‌కహ్ వాసులు (దట్టమైన వనవాసులు) మద్‌యన్ ప్రజలు. వారు తమ ప్రవక్త షు'ఐబ్‌ను తిరస్కరించారు. వారు ఒక భూకంపం మరియు జ్వాలాముఖి సంభవించి నాశనమయ్యారు. చూడండి, 7:85-93 మరియు 11:84-95.

3. లూ'త్ ('అ.స.) ప్రజలు మరియు షు'ఐబ్ ('అ.స.) ప్రజలు దగ్గరి దగ్గరి ప్రాంతాలలో నివసించారు. వారు లూ'త్ ('అ.స.) మరణించిన కొన్ని సంవత్సరాల తరువాత వచ్చారు.

وَلَقَدۡ كَذَّبَ أَصۡحَٰبُ ٱلۡحِجۡرِ ٱلۡمُرۡسَلِينَ ٨٠

**80**. మరియు వాస్తవానికి 'హిజ్ర్ వాసులు కూడా ప్రవక్తలను అసత్యవాదులన్నారు.[1]

وَءَاتَيۡنَٰهُمۡ ءَايَٰتِنَا فَكَانُواْ عَنۡهَا مُعۡرِضِينَ ٨١

**81**. మరియు వారికి కూడా మేము అద్భుత సూచన(ఆయతు)లను ఇచ్చి ఉంటిమి. కాని వారు వాటినుండి విముఖులై ప్రవర్తించారు.[2]

وَكَانُواْ يَنۡحِتُونَ مِنَ ٱلۡجِبَالِ بُيُوتًا ءَامِنِينَ ٨٢

**82**. మరియు వారు కొండలను తొలచి గృహాలను నిర్మించుకునేవారు,[3] సురక్షితంగా (ఉండగలమని భావిస్తూ)!

فَأَخَذَتۡهُمُ ٱلصَّيۡحَةُ مُصۡبِحِينَ ٨٣

**83**. చివరకు ఒక ఉదయమున ఒక తీవ్రమైన గర్జన (ప్రేలుడు) వారిపై కూడా వచ్చి పడింది.

فَمَآ أَغۡنَىٰ عَنۡهُم مَّا كَانُواْ يَكۡسِبُونَ ٨٤

**84**. అప్పుడు వారు సంపాదించింది వారికి ఏ మాత్రం పనికిరాలేక పోయింది.

وَمَا خَلَقۡنَا ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ وَمَا بَيۡنَهُمَآ إِلَّا بِٱلۡحَقِّۗ وَإِنَّ ٱلسَّاعَةَ لَأٓتِيَةٞۖ فَٱصۡفَحِ ٱلصَّفۡحَ ٱلۡجَمِيلَ ٨٥

**85**. మరియు మేము ఆకాశాలనూ, భూమినీ మరియు వాటి మధ్యనున్న సర్వాన్ని కేవలం సత్యంతోనే[4] సృష్టించాము. మరియు నిశ్చయంగా, తీర్పుగడియ రానున్నది. కావున నీవు ఉదార భావంతో వారిని ఉపేక్షించు!

---

**1**. స'మూద్ జాతి మరియు వారి ప్రవక్త 'సాలి'హ్ ('అ.స.) నివసించే ప్రాంతం పేరు 'హిజ్ర్, కావున వారిని అస్'హాబ్ అల్-'హిజ్ర్ అంటారు. ఈ ప్రాంతం మదీనా-తబూక్‌ల మధ్య ఉంది. చూడండి, 7:73-79.

**2**. ఆ అద్భుత సూచనలలో ఆ ఆడఒంటె ఒకటి. కాని వారు దానిని చంపేశారు.

**3**. చూడండి, 7:74. 9వ హిజ్రీలో దైవప్రవక్త ('స'అస) తబూక్ దండయాత్రకు పోయేటప్పుడు, ఈ నగరం దారిలో వచ్చింది. అతను ('స'అస) తమ నెత్తిమీద బట్ట చుట్టుకున్నారు మరియు తమ ఒంటె గమనాన్ని తీవ్రం చేశారు. మరియు తమ సహాబీలతో ఇలా అన్నారు: 'ఏడుస్తూ, అల్లాహ్ (సు.తా.) శిక్షకు భయపడుతూ ఈ నగరం నుండి ప్రయాణించండి.' ('స'హీ'హ్ బు'ఖారీ, 433; 'స. ముస్లిం, 2285. ఇబ్నె-కసీ'ర్ వ్యాఖ్యానం).

**4**. చూడండి, 53:31.

إِنَّ رَبَّكَ هُوَ ٱلۡخَلَّٰقُ ٱلۡعَلِيمُ ﴿٨٦﴾

86. నిశ్చయంగా, నీ ప్రభువు సర్వ సృష్టికర్త,[1] సర్వజ్ఞుడు.[2]

وَلَقَدۡ ءَاتَيۡنَٰكَ سَبۡعٗا مِّنَ ٱلۡمَثَانِي وَٱلۡقُرۡءَانَ ٱلۡعَظِيمَ ﴿٨٧﴾

87. మరియు మేము నిశ్చయంగా, నీకు తరచుగా పఠింపబడే ఏడు (సూక్తులను)[3] మరియు సర్వోత్తమ ఖుర్ఆన్‌ను ప్రసాదించాము.

لَا تَمُدَّنَّ عَيۡنَيۡكَ إِلَىٰ مَا مَتَّعۡنَا بِهِۦٓ أَزۡوَٰجٗا مِّنۡهُمۡ وَلَا تَحۡزَنۡ عَلَيۡهِمۡ وَٱخۡفِضۡ جَنَاحَكَ لِلۡمُؤۡمِنِينَ ﴿٨٨﴾

88. వారిలో (అవిశ్వాసులలో) కొందరికి మేము ఒసంగిన ఐహిక సంపదలను నీవు కన్నెత్తి కూడా చూడకు మరియు వారి (అవిశ్వాస) వైఖరికి బాధపడకు మరియు విశ్వసించిన వారికి (ఆశ్రయమివ్వటానికి) నీ రెక్కలను విప్పు.[4]

وَقُلۡ إِنِّيٓ أَنَا ٱلنَّذِيرُ ٱلۡمُبِينُ ﴿٨٩﴾

89. మరియు (ఓ ము'హమ్మద్!) వారితో ఇలా అను: "నిశ్చయంగా, నేను స్పష్టమైన హెచ్చరిక చేసేవాడను మాత్రమే!"

كَمَآ أَنزَلۡنَا عَلَى ٱلۡمُقۡتَسِمِينَ ﴿٩٠﴾

90. ఏ విధంగానైతే మేము, (గ్రంథాన్ని) విభజించే వారిపై అవతరింపజేశామో![5]

---

1. అల్-'ఖల్లాఖ్: The Greatest Creator, The Creator of all things. సృష్టి క్రియలో పరిపూర్ణుడు, సృష్టికర్త. సముచిత రూపం శక్తిసామర్థ్యాలను ఇచ్చి తీర్చిదిద్ది అత్యుత్తమంగా సృష్టించేవాడు. చూడండి, **అల్-'ఖాలిఖు**: 7:102.
2. చూడండి, 7:199.
3. సబ్'అమ్మినల్‌మసా'ని. ఈ పేరు సురాహ్ అల్-ఫాతి'హాకు దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) స్వయంగా ఇచ్చారు. అది దివ్య ఖుర్ఆన్ సారం (ఉమ్ముల్-కితాబ్) అని కూడా అనబడుతుంది. ('స'హీ'హ్ బు'ఖారీ, కితాబ్ అత్తఫ్సీర్ సూరాహ్ అల్-'హిజ్ర్). చూడండి, సూరహ్ అల్-ఫాతి'హా (1).
4. విశ్వసించినవారితో సానుభూతితో, ప్రేమతో, కనికరంతో వ్యవహరించు. చూడండి, 17:24.
5. 1) కొందరు వ్యాఖ్యాతలు అ'న్జల్‌నా అవతరింపజేశాము. అంటే 'అజా'బ్ - శిక్ష అనే అర్థంలో తీసుకున్నారు. ఆ శిక్ష వారి (ఖురైషుల) కొరకు ఎవరైతే దివ్యగ్రంథాన్ని (ఈ ఖుర్ఆన్‌ను) వేర్వేరు ముక్కలుగా చేసి, కొంత భాగాన్ని కవిత అని, కొంత భాగాన్ని మంత్రజాలమని, మరికొంత భాగాన్ని ప్రాచీన గాథలని, పేర్లు పెట్టారో!

| | |
|---|---|
| 91. ఎవరైతే ఈ ఖుర్ఆన్‌ను (తమ తిరస్కారంతో) ముక్కలు ముక్కలుగా చేశారో! | ٱلَّذِينَ جَعَلُوا۟ ٱلْقُرْءَانَ عِضِينَ ﴿٩١﴾ |
| 92. నీ ప్రభువు సాక్షిగా! నిశ్చయంగా, మేము వారందరినీ ప్రశ్నిస్తాము; | فَوَرَبِّكَ لَنَسْـَٔلَنَّهُمْ أَجْمَعِينَ ﴿٩٢﴾ |
| 93. వారు చేస్తూ ఉండిన కర్మలను గురించి. | عَمَّا كَانُوا۟ يَعْمَلُونَ ﴿٩٣﴾ |
| 94. కావున నీకు ఆజ్ఞాపించబడిన దానిని బహిరంగంగా చాటించు.[1] మరియు అల్లాహ్‌కు సాటి కల్పించే వారి (ముష్రిక్‌ల) నుండి విముఖుడవగు. | فَٱصْدَعْ بِمَا تُؤْمَرُ وَأَعْرِضْ عَنِ ٱلْمُشْرِكِينَ ﴿٩٤﴾ |
| 95. నిశ్చయంగా, నీతో పరిహాసాలాడే వారి నుండి నిన్ను రక్షించటానికి మేమే చాలు! | إِنَّا كَفَيْنَٰكَ ٱلْمُسْتَهْزِءِينَ ﴿٩٥﴾ |
| 96. ఎవరైతే అల్లాహ్‌తో పాటు ఇతర దైవాలను కూడా (ఆరాధనకు) నియమించుకుంటున్నారో, వారు త్వరలోనే (సత్యాన్ని) తెలుసుకుంటారు. | ٱلَّذِينَ يَجْعَلُونَ مَعَ ٱللَّهِ إِلَٰهًا ءَاخَرَ ۚ فَسَوْفَ يَعْلَمُونَ ﴿٩٦﴾ |

2) మరికొందరు వ్యాఖ్యాతలు ముఖ్తసిమీన్ - అంటే పూర్వ గ్రంథ ప్రజలు (యూదులు, క్రైస్తవులు) అని అంటారు. మరియు ఖుర్ఆన్ అంటే తౌరాత్ / ఇంజీల్ అంటారు. వారు వీటిని విభిన్న భాగాలలోకి ముక్కలు ముక్కలుగా చేశారు.

3) ఇంకా కొందరు వ్యాఖ్యాతలు వీరు 'సాలి'హ్ ('అ.స.) యొక్క జాతివారు అంటారు. వారు 'సాలి'హ్ మరియు అతని కుటుంబం వారిని చంపి ముక్కలు చేయాలని కుట్రలు పన్నారు. చూడండి, 27:49.

4) మరొక వ్యాఖ్యానం ఏమిటంటే దివ్యగ్రంథపు కొంత భాగాన్ని నమ్మి ఇతరభాగాన్ని తిరస్కరించటం.

1. ఈ ఆయత్ అవతరించక ముందు దైవప్రవక్త ('స'అస) రహస్యంగా ప్రజలకు ధర్మబోధన (తబ్లీగ్ / దా'వా) చేసేవారు. ఇది అవతరింపజేయబడిన తరువాత బహిరంగంగా ధర్మబోధన (దా'వా) చేయటం ప్రారంభించారు. (ఫ'త్హ్ అల్-ఖదీర్).

وَلَقَدْ نَعْلَمُ أَنَّكَ يَضِيقُ صَدْرُكَ بِمَا يَقُولُونَ ﴿٩٧﴾

**97**. మరియు వాస్తవానికి వారు పలికే మాటల వలన నీ హృదయానికి తప్పక కష్టం కలుగుతుందని మాకు బాగా తెలుసు.

فَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ وَكُن مِّنَ ٱلسَّـٰجِدِينَ ﴿٩٨﴾

**98**. కావున నీవు నీ ప్రభువు పవిత్రతను కొనియాడుతూ స్తోత్రం చేస్తూ ఉండు మరియు సాష్టాంగం (సజ్దా) చేసేవారిలో చేరు.

وَٱعْبُدْ رَبَّكَ حَتَّىٰ يَأْتِيَكَ ٱلْيَقِينُ ﴿٩٩﴾

**99**. మరియు తప్పక రాబోయే ఆ అంతిమ ఘడియ (మరణం) వచ్చేవరకు, నీ ప్రభువును ఆరాధిస్తూ ఉండు.[1] (1/4)

*****

---

**1**. అల్-యఖీను: అంటే మరణం. ('స.బు'ఖారీ, కితాబ్ అత్తఫ్సీర్). ఇంకా చూడండి, 74:47.

## 16. సూరహ్ అన్-న'హ్ల్ سُورَةُ النَّحْلِ

ఈ సూరహ్ చివరి మక్కాకాలంలో అవతరింపజేయబడింది. ఇందులో **128 ఆయతులు** ఉన్నాయి. అన్-న'హ్లు, అంటే **తేనెటీగ.** విశ్వంలో ఉన్న ప్రతిదీ అల్లాహ్ (సు.తా.)ను స్తుతిస్తుంది. మానవునికి ప్రకృతి మీద ఆధిక్యత ఇవ్వబడింది. అతడు, అల్లాహ్ (సు.తా.) అద్వితీయతను మరియు సత్యాన్ని గుర్తించాలని దీని సారాంశం. దీని పేరు **68**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. అల్లాహ్ (సు.తా.) ప్రతి దానిని ఒక ఉద్దేశ్యంతో ఒక ప్రయోజనం కొరకు పుట్టించాడు. విశ్వసించి సత్కార్యాలు చేస్తూ ఉండాలి. తోటి వారితో న్యాయం మరియు ఉదారస్వభావంతో వర్తించాలి. అల్లాహ్ (సు.తా.) నిషేధించిన పాపం, చెడు, అసహ్యాకరమైన, అశ్లీలకరమైన పనులనుండి దూరంగా ఉండాలి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1.** * అల్లాహ్ ఆజ్ఞ (తీర్పు) వచ్చింది, కావున మీరు దాని కొరకు తొందరపెట్టకండి. ఆయన సర్వ లోపాలకు అతీతుడు మరియు వారు సాటి కల్పించే భాగస్వాములకు అత్యున్నతుడు.

أَتَىٰٓ أَمۡرُ ٱللَّهِ فَلَا تَسۡتَعۡجِلُوهُۚ سُبۡحَٰنَهُۥ وَتَعَٰلَىٰ عَمَّا يُشۡرِكُونَ ١

**2.** ఆయనే తన ఆజ్ఞతో, దేవదూతల ద్వారా, దివ్యజ్ఞానాన్ని (రూ'హ్)[1] తాను కోరిన, తన దాసులపై అవతరింపజేస్తాడు[2] వారిని (ప్రజలను) ఇలా హెచ్చరించటానికి: "నిశ్చయంగా, నేను తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు! కావున మీరు నాయందే భయభక్తులు కలిగి ఉండండి!"

يُنَزِّلُ ٱلۡمَلَٰٓئِكَةَ بِٱلرُّوحِ مِنۡ أَمۡرِهِۦ عَلَىٰ مَن يَشَآءُ مِنۡ عِبَادِهِۦٓ أَنۡ أَنذِرُوٓاْ أَنَّهُۥ لَآ إِلَٰهَ إِلَّآ أَنَا۠ فَٱتَّقُونِ ٢

---

**1.** అర్-రూ'హు: అంటే ఇక్కడ దివ్య జ్ఞానం (వ'హీ) అని అర్థం. చూడండి, 40:15, 42:52 అక్కడ కూడా రూ'హ్ అర్థం వ'హీ అని ఉంది. మూడు చోట్లలో ఖుర్ఆన్‌లో రూ'హ్, జిబ్రీల్ ('అ.స.) అనే అర్థంతో కూడా వాడబడింది,19:17, 78:38, 97:4. వివరాలకు చూడండి, 19:17 వ్యాఖ్యానం 1.

**2.** తన సందేశాన్ని ఎవరిపై అవతరింపజేయాలో అల్లాహ్(సు.తా.)కు బాగా తెలుసు. చూడండి, 6:124 మరియు 40:15.

| | |
|---|---|
| **3.** ఆయన ఆకాశాలను మరియు భూమిని సత్యంతో సృష్టించాడు. వారు, ఆయనకు సాటి కల్పించే భాగస్వాము (షరీక్)ల కంటే ఆయన అత్యున్నతుడు.[1] | خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ بِٱلۡحَقِّۚ تَعَٰلَىٰ عَمَّا يُشۡرِكُونَ ٣ |
| **4.** ఆయన మానవుణ్ణి వీర్య బిందువుతో సృష్టించాడు, తరువాత ఆ వ్యక్తియే ఒక బహిరంగ వివాదిగా మారిపోతాడు. | خَلَقَ ٱلۡإِنسَٰنَ مِن نُّطۡفَةٖ فَإِذَا هُوَ خَصِيمٞ مُّبِينٞ ٤ |
| **5.** మరియు ఆయన పశువులను సృష్టించాడు. వాటిలో మీ కొరకు వెచ్చని దుస్తులు మరియు అనేక లాభాలు కూడా ఉన్నాయి. మరియు వాటిలో కొన్నిటి (మాంసం) మీరు తింటారు. | وَٱلۡأَنۡعَٰمَ خَلَقَهَاۖ لَكُمۡ فِيهَا دِفۡءٞ وَمَنَٰفِعُ وَمِنۡهَا تَأۡكُلُونَ ٥ |
| **6.** మరియు వాటిని మీరు సాయంత్రం ఇండ్లకు తోలుకొని వచ్చేటప్పుడు మరియు ఉదయం మేపటానికి తోలుకొని పోయేటప్పుడు, వాటిలో మీకొక మనోహరమైన (దృశ్యం) ఉంది. | وَلَكُمۡ فِيهَا جَمَالٌ حِينَ تُرِيحُونَ وَحِينَ تَسۡرَحُونَ ٦ |
| **7.** మరియు అవి మీ బరువును మోసుకొని - మీరు ఎంతో శ్రమపడనిదే చేరుకోలేని ప్రాంతాలకు - తీసుకు పోతాయి. నిశ్చయంగా, మీ ప్రభువు మహా కనికరుడు, అపార కరుణాప్రదాత. | وَتَحۡمِلُ أَثۡقَالَكُمۡ إِلَىٰ بَلَدٖ لَّمۡ تَكُونُواْ بَٰلِغِيهِ إِلَّا بِشِقِّ ٱلۡأَنفُسِۚ إِنَّ رَبَّكُمۡ لَرَءُوفٞ رَّحِيمٞ ٧ |

1. చూడండి, 10:5.

وَٱلۡخَيۡلَ وَٱلۡبِغَالَ وَٱلۡحَمِيرَ لِتَرۡكَبُوهَا وَزِينَةٗۚ وَيَخۡلُقُ مَا لَا تَعۡلَمُونَ ۝٨

8. మరియు ఆయన గుర్రాలను,[1] కంచర గాడిదలను మరియు గాడిదలను, మీరు స్వారీ చేయటానికి మరియు మీ శోభను పెంచటానికి సృష్టించాడు. మరియు ఆయన, మీకు తెలియనివి (ఇతర అనేక సాధనాలను కూడా) సృష్టిస్తాడు.[2]

وَعَلَى ٱللَّهِ قَصۡدُ ٱلسَّبِيلِ وَمِنۡهَا جَآئِرٞۚ وَلَوۡ شَآءَ لَهَدَىٰكُمۡ أَجۡمَعِينَ ۝٩

9. మరియు సన్మార్గం చూపటమే అల్లాహ్ విధానం[3] మరియు అందు (లోకం)లో తప్పుడు (వక్ర) మార్గాలు కూడా ఉన్నాయి. ఆయన తలచుకొని ఉంటే మీరందరికీ సన్మార్గం చూపి ఉండేవాడు.[4]

هُوَ ٱلَّذِيٓ أَنزَلَ مِنَ ٱلسَّمَآءِ مَآءٗۖ لَّكُم مِّنۡهُ شَرَابٞ وَمِنۡهُ شَجَرٞ فِيهِ تُسِيمُونَ ۝١٠

10. ఆయనే, ఆకాశం నుండి మీ కొరకు నీళ్ళను కురిపిస్తాడు. దానినుండి మీకు త్రాగటానికి నీరు దొరుకుతుంది మరియు మీ పశువులను మేపటానికి పచ్చిక పెరుగుతుంది.

---

1. ఇక్కడ గుర్రాల విషయం స్వారీ చేయటానికి అని వచ్చింది. అవి స్వారీ కొరకు చాలా విలువైనవి కాబట్టి సాధారణంగా వాటిని, వాటి మాంసాన్ని తినటానికి ఉపయోగించరు. 'స.బు'ఖారీ, కితాబ్ అల్-'హజ్జ్, జు'బాయ'హ్, బాబ్ ల'హూమ్ అల్-'ఖైల్; మరియు స'హీ ముస్లిం, కితాబ్ అ'స్సైద్, బాబ్ ఫి అక్ల్ ల'హూమ్ అల్-'ఖైల్. జాబిర్ (ర'ది.'అ.) ఉల్లేఖనం ప్రకారం పై ఇద్దరు 'హదీస్'వేత్తలు పేర్కొన్నట్లు గుర్రాల మాంసము తినటానికి 'హలాలే. ఇంతేగాక దైవప్రవక్త ('స'అస) సమక్షంలో 'ఖైబర్ మరియు మదీనాలలో గుర్రాలను కోసి తిన్నట్లు ఉల్లేఖనా(రివాయత్)లు ఉన్నాయి. దైవప్రవక్త ('స'అస) వారిని నివారించలేదు. ('స.ముస్లిం, ముస్నద్ అ'హ్మద్, అబూ-దావూద్, ఇబ్నె-కసీ'ర్ వ్యాఖ్యానం).
2. వెంటనే అల్లాహ్ (సు.తా.) అంటున్నాడు: 'మీకు తెలియని ఇంకా ఎన్నో సాధనాలు కూడా సృష్టిస్తాను.' కాబట్టి ఈ ఆయత్ ఎల్లప్పటికి నిజమే. ఈ నాడు విమానాలు, రాకెట్లు వచ్చాయి. ఇంకా ముమ్ముందు ఏమేమి వస్తాయో అల్లాహుతా'ఆలాకే తెలుసు. చూడండి, 36:42.
3. అల్లాహ్ (సు.తా.) ప్రతిఒక్కరికీ ఎవరైతే వినగోరుతారో ఋజుమార్గం వైపునకే మార్గ దర్శకత్వం చేస్తాడు. చూడండి, 6:12, 54. అల్లాహ్ (సు.తా.) కరుణిస్తానని పూనుకున్నాడు.
4. అల్లాహుతా'ఆలా మానవునికి తెలివి, విచక్షణా శక్తిని ఇచ్చి, మంచి చెడులను తెలుపుతున్నాడు. మరియు మానవునికి వీటి మధ్య ఎన్నుకోవటానికి స్వాతంత్ర్యం ఇస్తున్నాడు. ఎవరిని కూడా సన్మార్గం మీద నడవటానికి గానీ, లేదా మార్గభ్రష్టత్వాన్ని అవలంబించటానికి గానీ బలవంతంచేయడు. చివరకు వారి విశ్వాసం మరియు కర్మలకు తగిన ప్రతిఫలం స్వర్గమో లేక నరకమో ఇస్తాడు. అల్లాహుతా'ఆలా తనకు సాటికల్పించిన వారిని ఎన్నటికీ క్షమించడు. ఆయన (సు.తా.)కు ఆరాధనలో సాటి కల్పించటం (షిర్క్) తప్ప మరే ఇతర పాపమైనా ఆయన (సు.తా.) తాను కోరిన వారిని క్షమిస్తానన్నాడు.

11. ఆయన దీని (నీటి) ద్వారా మీ కొరకు పంటలను, జైతూన్ మరియు ఖర్జూరపు వృక్షాలను, ద్రాక్ష మరియు ఇతర రకాల ఫలాలను పండింప జేస్తున్నాడు. నిశ్చయంగా ఆలోచించే వారికి ఇందులో ఒక సూచన (నిదర్శనం) ఉంది.

يُنۢبِتُ لَكُم بِهِ ٱلزَّرۡعَ وَٱلزَّيۡتُونَ وَٱلنَّخِيلَ وَٱلۡأَعۡنَٰبَ وَمِن كُلِّ ٱلثَّمَرَٰتِۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةٗ لِّقَوۡمٖ يَتَفَكَّرُونَ ١١

12. మరియు ఆయనే రేయింబవళ్ళను మరియు సూర్యచంద్రులను, మీకు ఉపయుక్తమైనవిగా చేశాడు. మరియు నక్షత్రాలు కూడా ఆయన ఆజ్ఞతోనే మీకు ఉపయుక్తమైనవిగా చేయబడ్డాయి.[1] నిశ్చయంగా, బుద్ధిని ఉపయోగించే వారికి వీటిలో సూచనలు (నిదర్శనాలు) ఉన్నాయి.

وَسَخَّرَ لَكُمُ ٱلَّيۡلَ وَٱلنَّهَارَ وَٱلشَّمۡسَ وَٱلۡقَمَرَۖ وَٱلنُّجُومُ مُسَخَّرَٰتُۢ بِأَمۡرِهِۦٓۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَٰتٖ لِّقَوۡمٖ يَعۡقِلُونَ ١٢

13. మరియు ఆయన మీ కొరకు భూమిలో వివిధ రంగుల వస్తువులను ఉత్పత్తి (వ్యాపింప) జేశాడు. నిశ్చయంగా, హితబోధ స్వీకరించే వారికి వీటిలో సూచన ఉంది.

وَمَا ذَرَأَ لَكُمۡ فِي ٱلۡأَرۡضِ مُخۡتَلِفًا أَلۡوَٰنُهُۥٓۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةٗ لِّقَوۡمٖ يَذَّكَّرُونَ ١٣

14. మరియు ఆయన సముద్రాన్ని తాజా మాంసము తినటానికి మరియు మీరు ధరించే ఆభరణాలు తీయటానికి మీకు ఉపయుక్తమైనదిగా చేశాడు. ఆయన అనుగ్రహాన్ని అన్వేషించటానికి (ప్రజలు), అందులో ఓడలమీద దాని నీటిని చీల్చుకొని పోవటాన్ని నీవు చూస్తున్నావు. మరియు బహుశా మీరు కృతజ్ఞులు అవుతారని ఆయన మీకు (ఇవన్నీ ప్రసాదించాడు).

وَهُوَ ٱلَّذِي سَخَّرَ ٱلۡبَحۡرَ لِتَأۡكُلُواْ مِنۡهُ لَحۡمٗا طَرِيّٗا وَتَسۡتَخۡرِجُواْ مِنۡهُ حِلۡيَةٗ تَلۡبَسُونَهَاۖ وَتَرَى ٱلۡفُلۡكَ مَوَاخِرَ فِيهِ وَلِتَبۡتَغُواْ مِن فَضۡلِهِۦ وَلَعَلَّكُمۡ تَشۡكُرُونَ ١٤

1. చూడండి, 14:33.

وَأَلۡقَىٰ فِي ٱلۡأَرۡضِ رَوَٰسِيَ أَن تَمِيدَ بِكُمۡ وَأَنۡهَٰرٗا وَسُبُلٗا لَّعَلَّكُمۡ تَهۡتَدُونَ ﴿١٥﴾

15. మరియు భూమి మీతో పాటు చలించకుండా ఉండటానికి, ఆయన దానిలో స్థిరమైన పర్వతాలను నాటాడు[1] మరియు అందులో నదులను ప్రవహింపజేశాడు. మరియు రహదారులను నిర్మించాడు, బహుశా మీరు మార్గం పొందుతారని!

وَعَلَٰمَٰتٖۚ وَبِٱلنَّجۡمِ هُمۡ يَهۡتَدُونَ ﴿١٦﴾

16. మరియు (భూమిలో మార్గం చూపే) సంకేతాలను పెట్టాడు. మరియు వారు (ప్రజలు) నక్షత్రాల ద్వారా కూడా తమ మార్గాలు తెలుసుకుంటారు.

أَفَمَن يَخۡلُقُ كَمَن لَّا يَخۡلُقُۚ أَفَلَا تَذَكَّرُونَ ﴿١٧﴾

17. సృష్టించేవాడూ, అసలు ఏమీ సృష్టించలేని వాడూ సమానులా? ఇది మీరెందుకు గమనించరు?

وَإِن تَعُدُّواْ نِعۡمَةَ ٱللَّهِ لَا تُحۡصُوهَآۗ إِنَّ ٱللَّهَ لَغَفُورٞ رَّحِيمٞ ﴿١٨﴾

18. మరియు మీరు అల్లాహ్ అనుగ్రహాలను లెక్కపెట్టదలచినా, మీరు వాటిని లెక్కపెట్ట లేరు. నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

وَٱللَّهُ يَعۡلَمُ مَا تُسِرُّونَ وَمَا تُعۡلِنُونَ ﴿١٩﴾

19. మరియు అల్లాహ్‌కు మీరు దాచేవి మరియు మీరు వెలిబుచ్చేవి అన్నీ తెలుసు.

وَٱلَّذِينَ يَدۡعُونَ مِن دُونِ ٱللَّهِ لَا يَخۡلُقُونَ شَيۡـٔٗا وَهُمۡ يُخۡلَقُونَ ﴿٢٠﴾

20. మరియు ఎవరినైతే వారు (ప్రజలు), అల్లాహ్‌ను వదలి ప్రార్థిస్తున్నారో, వారు ఏమీ సృష్టించలేరు మరియు స్వయంగా వారే సృష్టించబడి ఉన్నారు.

أَمۡوَٰتٌ غَيۡرُ أَحۡيَآءٖۖ وَمَا يَشۡعُرُونَ أَيَّانَ يُبۡعَثُونَ ﴿٢١﴾

21. వారు (ఆ దైవాలు) మృతులు, ప్రాణం లేనివారు.[2] మరియు వారికి, తాము తిరిగి ఎప్పుడు లేపబడతారో కూడా తెలియదు.

1. చూడండి, 78:7, 21:31 మరియు 31:10.

2. ఈ 'మృతులు' అంటే కేవలం విగ్రహాలు మాత్రమే కాదు. మరణించిన సాధులు మరియు వలీలు కూడా! తరువాత ప్రాణంలేని వారు అని మళ్ళీ నొక్కి చెప్పబడుతోంది. దీనితో దర్గాలను ఆరాధించే వారు చెప్పేమాటలు: 'మేము మృతులను కాదు ప్రార్థించేది, వారు తమ గోరీలలో సజీవులై ఉన్నారు.' అనేవి తప్పని విశదమౌతోంది. అంటే మరణించిన తరువాత వారికి ఈ లోకంతో ఎట్టి సంబంధం ఉండదు. వారు ఏమీ చేయలేరు. అయితే వారెలా మేలు గానీ, కీడు గానీ చేయగలరు? చూడండి, 7:191-194.

**22**. మీ ఆరాధ్య దైవం కేవలం (అల్లాహ్) ఒక్కడే! పరలోక జీవితాన్ని విశ్వసించని వారి హృదయాలు (ఈ సత్యాన్ని) తిరస్కరిస్తున్నాయి మరియు వారు దురహంకారంలో పడిఉన్నారు.[1]

إِلَٰهُكُمْ إِلَٰهٌ وَٰحِدٌ ۚ فَٱلَّذِينَ لَا يُؤْمِنُونَ بِٱلْـَٔاخِرَةِ قُلُوبُهُم مُّنكِرَةٌ وَهُم مُّسْتَكْبِرُونَ ﴿٢٢﴾

**23**. నిస్సందేహంగా, వారి రహస్య విషయాలు మరియు వారి బహిరంగ విషయాలు అన్నీ, నిశ్చయంగా అల్లాహ్‌కు తెలుసు. నిశ్చయంగా, దురహంకారులంటే[2] ఆయన ఇష్టపడడు.

لَا جَرَمَ أَنَّ ٱللَّهَ يَعْلَمُ مَا يُسِرُّونَ وَمَا يُعْلِنُونَ ۚ إِنَّهُۥ لَا يُحِبُّ ٱلْمُسْتَكْبِرِينَ ﴿٢٣﴾

**24**. మరియు: "మీ ప్రభువు ఏమి అవతరింపజేశాడు?" అని వారిని అడిగి నప్పుడు, వారు: "అవి పూర్వకాలపు కల్పిత గాథలు మాత్రమే!" అని జవాబిస్తారు.

وَإِذَا قِيلَ لَهُم مَّاذَآ أَنزَلَ رَبُّكُمْ ۙ قَالُوٓا۟ أَسَٰطِيرُ ٱلْأَوَّلِينَ ﴿٢٤﴾

**25**. కావున పునరుత్థానదినమున వారు తమ (పాపాల) భారాలను పూర్తిగా మరియు తాము మార్గం తప్పించిన అజ్ఞానుల భారాలలోని కొంతభాగాన్ని కూడా మోస్తారు.[3] వారు మోసే భారం ఎంత దుర్భరమైనదో చూడండి!

لِيَحْمِلُوٓا۟ أَوْزَارَهُمْ كَامِلَةً يَوْمَ ٱلْقِيَٰمَةِ ۙ وَمِنْ أَوْزَارِ ٱلَّذِينَ يُضِلُّونَهُم بِغَيْرِ عِلْمٍ ۗ أَلَا سَآءَ مَا يَزِرُونَ ﴿٢٥﴾

---

**1**. అంటే మీ ఆరాధ్య దైవం ఒక్కడే (అల్లాహ్)! అనే మాటను నమ్మటం సత్యతిరస్కారులకు ఆశ్చర్యదాయకమౌతోంది. చూడండి, 38:5 మరియు 39:45.

**2**. ఇస్తెక్బారున్: అంటే తనను తాను పెద్ద వాడిగా భావించి, సత్యాన్ని కూడా తిరస్కరించడం మరియు ముందు వారిని నీచులుగా, చిన్నవారిగా భావించడం. ఈ విధమైన గర్విష్ఠులు దురహంకారులంటే అల్లాహ్ (సు.తా.) ఇష్టపడడు. ('స'హీ'హ్ ముస్లిం, కితాబ్ అల్ ఈమాన్, బాబ్ త'హ్రీమ్ కిబ్ర్).

**3**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'ఎవరైతే ప్రజలను సన్మార్గం వైపునకు పిలుస్తారో, వారికి, వారందరి పుణ్యఫలితంలభిస్తుంది. ఎవరైతే ప్రజలను దుర్మార్గం వైపునకు పిలుస్తారో, వారు వారందరి పాపభారాలను కూడా మోస్తారు.' (అబూ-దావూద్, కితాబ్ సున్నహ్, బాబ్ ల'జూమ్ అస్సున్నహ్).

**26**. వాస్తవానికి, వారికంటే పూర్వం గతించినవారు కూడా (అల్లాహ్ సందేశాలకు వ్యతిరేకంగా) కుట్రలు పన్నారు. కాని అల్లాహ్ వారి (పన్నాగపు) కట్టడాలను వాటి పునాదులతో సహా పెకలించాడు. దానితో వాటి కప్పులు వారిమీద పడ్డాయి మరియు వారిపై, వారు ఊహించని వైపునుండి శిక్ష వచ్చి పడింది.

**27**. తరువాత పునరుత్థానదినమున ఆయన వారిని అవమానపరుస్తాడు మరియు వారిని అడుగుతాడు: "మీరు నాకు సాటి కల్పించిన వారు - ఎవరిని గురించి అయితే మీరు (విశ్వాసులతో) వాదులాడేవారో - ఇప్పుడు ఎక్కడున్నారు?" జ్ఞానం ప్రసాదించబడిన వారు అంటారు: "నిశ్చయంగా, ఈ రోజు అవమానం మరియు దుర్దశ సత్యతిరస్కారుల కొరకే!

**28**. "వారిపై, ఎవరైతే తమను తాము దుర్మార్గంలో ముంచుకొని ఉన్నప్పుడు, దేవదూతలు వారి ప్రాణాలు తీస్తారో!" అప్పుడు వారు (సత్యతిరస్కారులు) లొంగిపోయి: "మేము ఎలాంటి పాపం చేయలేదు."[1] అని అంటారు. (దేవదూతలు వారితో ఇలా అంటారు): "అలాకాదు! నిశ్చయంగా, మీరు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

**29**. "కావున నరక ద్వారాలలో ప్రవేశించండి. అక్కడ శాశ్వతంగా ఉండటానికి! గర్విష్ఠులకు లభించే నివాసం ఎంత చెడ్డది!" (3/8)

قَدْ مَكَرَ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ فَأَتَى ٱللَّهُ بُنْيَـٰنَهُم مِّنَ ٱلْقَوَاعِدِ فَخَرَّ عَلَيْهِمُ ٱلسَّقْفُ مِن فَوْقِهِمْ وَأَتَىٰهُمُ ٱلْعَذَابُ مِنْ حَيْثُ لَا يَشْعُرُونَ ٢٦

ثُمَّ يَوْمَ ٱلْقِيَـٰمَةِ يُخْزِيهِمْ وَيَقُولُ أَيْنَ شُرَكَآءِىَ ٱلَّذِينَ كُنتُمْ تُشَـٰٓقُّونَ فِيهِمْ ۚ قَالَ ٱلَّذِينَ أُوتُوا۟ ٱلْعِلْمَ إِنَّ ٱلْخِزْىَ ٱلْيَوْمَ وَٱلسُّوٓءَ عَلَى ٱلْكَـٰفِرِينَ ٢٧

ٱلَّذِينَ تَتَوَفَّىٰهُمُ ٱلْمَلَـٰٓئِكَةُ ظَالِمِىٓ أَنفُسِهِمْ ۖ فَأَلْقَوُا۟ ٱلسَّلَمَ مَا كُنَّا نَعْمَلُ مِن سُوٓءٍۭ ۚ بَلَىٰٓ إِنَّ ٱللَّهَ عَلِيمٌۢ بِمَا كُنتُمْ تَعْمَلُونَ ٢٨

فَٱدْخُلُوٓا۟ أَبْوَٰبَ جَهَنَّمَ خَـٰلِدِينَ فِيهَا ۖ فَلَبِئْسَ مَثْوَى ٱلْمُتَكَبِّرِينَ ٢٩

1. చూడండి, 6:23 మరియు 2:11

۞ وَقِيلَ لِلَّذِينَ ٱتَّقَوۡاْ مَاذَآ أَنزَلَ رَبُّكُمۡۚ قَالُواْ خَيۡرٗاۗ لِّلَّذِينَ أَحۡسَنُواْ فِي هَٰذِهِ ٱلدُّنۡيَا حَسَنَةٞۚ وَلَدَارُ ٱلۡأٓخِرَةِ خَيۡرٞۚ وَلَنِعۡمَ دَارُ ٱلۡمُتَّقِينَ ٣٠

30. * మరియు దైవభీతి గలవారితో: "మీ ప్రభువు ఏమి అవతరింపజేశాడు?" అని అడిగినప్పుడు, వారు: "అత్యుత్తమమైనది." అని జవాబిస్తారు. ఎవరైతే ఈ లోకంలో మేలు చేస్తారో వారికి మేలుంటుంది మరియు పరలోక గృహం దీనికంటే ఉత్తమమైనది. మరియు దైవభీతి గలవారి గృహం పరమానందకరమైనది.

جَنَّٰتُ عَدۡنٖ يَدۡخُلُونَهَا تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُۖ لَهُمۡ فِيهَا مَا يَشَآءُونَۚ كَذَٰلِكَ يَجۡزِي ٱللَّهُ ٱلۡمُتَّقِينَ ٣١

31. వారు ప్రవేశించే శాశ్వత స్వర్గవనాలలో క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి. అక్కడ వారికి వారు కోరేది దొరుకుతుంది. దైవభీతి గలవారికి అల్లాహ్ ఈ విధంగా ప్రతిఫలమిస్తాడు.

ٱلَّذِينَ تَتَوَفَّىٰهُمُ ٱلۡمَلَٰٓئِكَةُ طَيِّبِينَ يَقُولُونَ سَلَٰمٌ عَلَيۡكُمُ ٱدۡخُلُواْ ٱلۡجَنَّةَ بِمَا كُنتُمۡ تَعۡمَلُونَ ٣٢

32. ఎవరైతే, పరిశుద్ధులుగా ఉండగా దైవదూతలు వారి ప్రాణాలు తీస్తారో, వారితో: "మీకు శాంతి కలుగు గాక (సలాం)! మీరు చేసిన మంచి పనులకు ప్రతిఫలంగా స్వర్గంలో ప్రవేశించండి!" అని అంటారు.[1]

هَلۡ يَنظُرُونَ إِلَّآ أَن تَأۡتِيَهُمُ ٱلۡمَلَٰٓئِكَةُ أَوۡ يَأۡتِيَ أَمۡرُ رَبِّكَۚ كَذَٰلِكَ فَعَلَ ٱلَّذِينَ مِن قَبۡلِهِمۡۚ وَمَا ظَلَمَهُمُ ٱللَّهُ وَلَٰكِن كَانُوٓاْ أَنفُسَهُمۡ يَظۡلِمُونَ ٣٣

33. ఏమీ? వారు (సత్యతిరస్కారులు), తమ వద్దకు దేవదూతల రాక కోసం ఎదురు చూస్తున్నారా? లేక నీ ప్రభువు ఆజ్ఞ (తీర్పు) కోసం ఎదురు చూస్తున్నారా?[2] వారికి పూర్వం ఉన్నవారు కూడా ఈ విధంగానే ప్రవర్తించారు. మరియు అల్లాహ్ వారికి ఎలాంటి అన్యాయం చేయలేదు, కాని వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు.

---

1. అల్లాహ్ (సు.తా.) మీ సౌందర్యాన్ని చూడడూ మరియు మీ ధనసంపత్తులను చూడడూ, కాని మీ హృదయాలను మరియు మీ కర్మలను చూస్తాడు. ('స'హీ'హ్ ముస్లిం, కితాబ్ అల్-బిర్ర్, బాబ్ త'హ్రీమ్ 'జుల్మ్ అల్-ముస్లిం).
2. చూడండి, 6:158.

34. అప్పుడు వారి దుష్కర్మల ఫలితాలు వారిపై పడ్డాయి మరియు వారు దేనిని గురించి పరిహాసమాడుతూ ఉన్నారో, అదే వారిని క్రమ్ముకుంది.[1]

35. మరియు (అల్లాహ్‌కు) సాటి కల్పించే వారు అంటారు: "ఒకవేళ అల్లాహ్ కోరిఉంటే! మేము గానీ మా తండ్రితాతలు గానీ, ఆయన్ని తప్ప మరెవ్వరినీ ఆరాధించేవారం కాదు మరియు ఆయన ఆజ్ఞ లేనిదే మేము దేన్నికూడా నిషేధించే వారం కాదు."[2] వారికి పూర్వం వారు కూడా ఇలాగే చేశారు. అయితే ప్రవక్తల బాధ్యత (అల్లాహ్) సందేశాన్ని స్పష్టంగా అందజేయటం తప్ప ఇంకేమిటి?

36. మరియు వాస్తవానికి, మేము ప్రతి సమాజం వారి వద్దకు ఒక ప్రవక్తను పంపాము. (అతడన్నాడు): "మీరు అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించండి. మరియు మిథ్యదైవాల (తాగూత్‌ల) ఆరాధనను త్యజించండి." వారిలో కొందరికి అల్లాహ్ సన్మార్గం చూపాడు, మరికొందరి కొరకు మార్గభ్రష్టత్వం నిశ్చితమైపోయింది. కావున మీరు భూమిలో సంచారం చేసి చూడండి, ఆ సత్యతిరస్కారుల గతి ఏమయిందో!

37. ఇక (ఓ ముహమ్మద్!) నీవు వారిని సన్మార్గానికి తేవాలని ఎంత కోరుకున్నా! నిశ్చయంగా, అల్లాహ్ మార్గభ్రష్టతకు గురిచేసిన వానికి సన్మార్గం చూపడు.[3] వారికి సహాయపడే వారు ఎవ్వరూ ఉండరు.

فَأَصَابَهُمْ سَيِّـَٔاتُ مَا عَمِلُوا۟ وَحَاقَ
بِهِم مَّا كَانُوا۟ بِهِۦ يَسْتَهْزِءُونَ ﴿٣٤﴾
وَقَالَ ٱلَّذِينَ أَشْرَكُوا۟ لَوْ شَآءَ ٱللَّهُ مَا
عَبَدْنَا مِن دُونِهِۦ مِن شَىْءٍ نَّحْنُ
وَلَآ ءَابَآؤُنَا وَلَا حَرَّمْنَا مِن دُونِهِۦ
مِن شَىْءٍ ۚ كَذَٰلِكَ فَعَلَ ٱلَّذِينَ مِن
قَبْلِهِمْ ۚ فَهَلْ عَلَى ٱلرُّسُلِ إِلَّا ٱلْبَلَٰغُ
ٱلْمُبِينُ ﴿٣٥﴾
وَلَقَدْ بَعَثْنَا فِى كُلِّ أُمَّةٍ رَّسُولًا
أَنِ ٱعْبُدُوا۟ ٱللَّهَ وَٱجْتَنِبُوا۟
ٱلطَّٰغُوتَ ۖ فَمِنْهُم مَّنْ هَدَى ٱللَّهُ
وَمِنْهُم مَّنْ حَقَّتْ عَلَيْهِ ٱلضَّلَٰلَةُ ۚ
فَسِيرُوا۟ فِى ٱلْأَرْضِ فَٱنظُرُوا۟ كَيْفَ
كَانَ عَٰقِبَةُ ٱلْمُكَذِّبِينَ ﴿٣٦﴾
إِن تَحْرِصْ عَلَىٰ هُدَىٰهُمْ فَإِنَّ ٱللَّهَ لَا
يَهْدِى مَن يُضِلُّ ۖ وَمَا لَهُم مِّن
نَّٰصِرِينَ ﴿٣٧﴾

1. చూడండి, 6:10.
2. చూడండి, 6:148 మరియు 6:136-153.
3. చూడండి, 8:55.

وَأَقْسَمُواْ بِٱللَّهِ جَهْدَ أَيْمَٰنِهِمْ لَا يَبْعَثُ ٱللَّهُ مَن يَمُوتُ بَلَىٰ وَعْدًا عَلَيْهِ حَقًّا وَلَٰكِنَّ أَكْثَرَ ٱلنَّاسِ لَا يَعْلَمُونَ ﴿٣٨﴾

38. మరియు వారు అల్లాహ్ పేరుతో దృఢమైన శపథంచేసి ఇలా అంటారు: "మరణించిన వానిని అల్లాహ్ తిరిగి బ్రతికించి లేపడు!" ఎందుకు లేపడు! ఆయన చేసిన వాగ్దానం సత్యం! అయినా చాలా మంది ప్రజలకు ఇది తెలియదు (కాని అది జరిగి తీరుతుంది);

لِيُبَيِّنَ لَهُمُ ٱلَّذِى يَخْتَلِفُونَ فِيهِ وَلِيَعْلَمَ ٱلَّذِينَ كَفَرُوٓاْ أَنَّهُمْ كَانُواْ كَٰذِبِينَ ﴿٣٩﴾

39. వారు వాదిస్తూ ఉండిన దానిని గురించి వారికి తెలుపటానికి మరియు సత్యతిరస్కారులు తాము నిశ్చయంగా, అబద్ధమాడుతున్నారని తెలుసుకోవటానికి.

إِنَّمَا قَوْلُنَا لِشَىْءٍ إِذَآ أَرَدْنَٰهُ أَن نَّقُولَ لَهُۥ كُن فَيَكُونُ ﴿٤٠﴾

40. నిశ్చయంగా, మేము ఏదైనా వస్తువును ఉనికిలోనికి తీసుకురా దలచినపుడు దానిని మేము: "అయిపో!" అని ఆజ్ఞాపిస్తాము. అంతే! అది అయిపోతుంది.[1]

وَٱلَّذِينَ هَاجَرُواْ فِى ٱللَّهِ مِنۢ بَعْدِ مَا ظُلِمُواْ لَنُبَوِّئَنَّهُمْ فِى ٱلدُّنْيَا حَسَنَةً وَلَأَجْرُ ٱلْءَاخِرَةِ أَكْبَرُ لَوْ كَانُواْ يَعْلَمُونَ ﴿٤١﴾

41. మరియు దౌర్జన్యాన్ని సహించిన తరువాత, ఎవరైతే అల్లాహ్ కొరకు వలసపోతారో;[2] అలాంటి వారికి మేము ప్రపంచంలో తప్పకుండా మంచి స్థానాన్ని నొసంగుతాము. మరియు వారి పరలోక ప్రతిఫలం దానికంటే గొప్పగా ఉంటుంది. ఇది వారు తెలుసుకొని ఉంటే ఎంత బాగుండేది!

---

1. ఈ విధమైన వాక్యం 'కున్ ఫ యకూన్' ఖుర్ఆన్‌లో 8 సార్లు వచ్చింది. చూడండి, 2:117 వ్యాఖ్యానం 4. పునరుత్థానదినం కొరకు చూడండి, 16:77.

2. హిజ్రతున్: Migration, Exodus, వలసపోవటం, ప్రస్థానం, అంటే అల్లాహ్ ధర్మం కొరకు, అల్లాహ్ ప్రీతి కొరకు, తన దేశాన్ని బంధు స్నేహితులను విడిచి - అల్లాహ్ ధర్మం మీద ఉండటానికి ఆటంకాలు లేని - ఇతర దేశానికి వెళ్ళిపోవటం. ఈ ఆయత్‌లో ఇలాంటి ముహాజిర్‌ల ప్రస్తావన వచ్చింది. బహుశా ఈ ఆయత్ ఆ ముహాజిర్‌లను గురించి అవతరింపజేయబడి ఉండవచ్చు, ఎవరైతే మక్కా ముష్రికుల బాధలను సహించలేక 'హబషా (అబిసీనియా)కు వలసపోయారో! వారిలో 'ఉస్మాన్ (ర'ది.'అ.) మరియు అతని భార్య దైవప్రవక్త ('స'అస) కూతురు, రుఖయ్యా (ర. 'అన్హా) కూడా - ఇతర దాదాపు నూరుమంది వలసపోయిన వారితో సహా - ఉన్నారు.

**42**. అలాంటి వారే సహనం వహించిన వారు మరియు తమ ప్రభువును నమ్ముకున్న వారు.

**43**. మరియు (ఓ ము'హమ్మద్!) నీకు పూర్వం కూడా మేము పంపిన ప్రవక్తలందరూ పురుషులే (మానవులే)![1] మేము వారిపై దివ్యజ్ఞానాన్ని (వహీని) అవతరింపజేశాము. కావున ఇది మీకు తెలియకపోతే పూర్వగ్రంథ ప్రజలను అడగండి.

**44**. (పూర్వపు ప్రవక్తలను) మేము స్పష్టమైన నిదర్శనాలతో మరియు గ్రంథాలతో ('జుబుర్‌లతో) పంపాము. మరియు (ఓ ప్రవక్తా!) ఇప్పుడు ఈ జ్ఞాపికను (గ్రంథాన్ని) నీపై అవతరింపజేసింది, వారివద్దకు అవతరింపజేయబడిన దానిని వారికి నీవు స్పష్టంగా వివరించటానికి మరియు బహుశా వారు ఆలోచిస్తారేమోనని!

**45**. దుష్టపన్నాగాలు చేస్తున్నవారు - అల్లాహ్ తమను భూమిలోనికి దిగిపోయినట్లు చేయకుండా, లేదా తాము ఊహించని వైపు నుండి తమపై శిక్ష అవతరింపజేయకుండా - తాము సురక్షితంగా ఉన్నారనుకొంటున్నారా ఏమిటి?

**46**. లేదా వారు తిరుగాడుతున్నపుడు, అకస్మాత్తుగా ఆయన వారిని పట్టుకుంటే, వారు ఆయన (పట్టు) నుండి తప్పించుకోగలరా?

ٱلَّذِينَ صَبَرُواْ وَعَلَىٰ رَبِّهِمۡ
يَتَوَكَّلُونَ ٤٢
وَمَآ أَرۡسَلۡنَا مِن قَبۡلِكَ إِلَّا
رِجَالٗا نُّوحِيٓ إِلَيۡهِمۡۚ فَسۡـَٔلُوٓاْ أَهۡلَ
ٱلذِّكۡرِ إِن كُنتُمۡ لَا تَعۡلَمُونَ ٤٣
بِٱلۡبَيِّنَٰتِ وَٱلزُّبُرِۗ وَأَنزَلۡنَآ إِلَيۡكَ
ٱلذِّكۡرَ لِتُبَيِّنَ لِلنَّاسِ مَا نُزِّلَ
إِلَيۡهِمۡ وَلَعَلَّهُمۡ يَتَفَكَّرُونَ ٤٤
أَفَأَمِنَ ٱلَّذِينَ مَكَرُواْ ٱلسَّيِّـَٔاتِ أَن
يَخۡسِفَ ٱللَّهُ بِهِمُ ٱلۡأَرۡضَ أَوۡ يَأۡتِيَهُمُ
ٱلۡعَذَابُ مِنۡ حَيۡثُ لَا يَشۡعُرُونَ
٤٥
أَوۡ يَأۡخُذَهُمۡ فِي تَقَلُّبِهِمۡ فَمَا هُم
بِمُعۡجِزِينَ ٤٦

---

**1**. ఇక్కడ విశదమయ్యేదేమిటంటే ప్రతి సమాజంలో దైవప్రవక్త ('అ.స.)లు పంపబడ్డారు. వారందరూ మానవులే. అయితే ము'హమ్మద్ ('స'అస) మానవుడైతే ఇందులో ఆశ్చర్యమేముంది. ఏ ప్రవక్తకు కూడా అగోచర జ్ఞానం లేదు. మీకు తెలియనిచో పూర్వగ్రంథ ప్రజలను అడగండి. వారి ప్రవక్తలు కూడా మానవులే. ఇంకా చూడండి, 6:50, 7:188, 11:31.

أَوۡ يَأۡخُذَهُمۡ عَلَىٰ تَخَوُّفٖ فَإِنَّ رَبَّكُمۡ لَرَءُوفٞ رَّحِيمٌ ٤٧

أَوَلَمۡ يَرَوۡاْ إِلَىٰ مَا خَلَقَ ٱللَّهُ مِن شَيۡءٖ يَتَفَيَّؤُاْ ظِلَٰلُهُۥ عَنِ ٱلۡيَمِينِ وَٱلشَّمَآئِلِ سُجَّدٗا لِّلَّهِ وَهُمۡ دَٰخِرُونَ ٤٨

وَلِلَّهِ يَسۡجُدُۤ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِ مِن دَآبَّةٖ وَٱلۡمَلَٰٓئِكَةُ وَهُمۡ لَا يَسۡتَكۡبِرُونَ ٤٩

يَخَافُونَ رَبَّهُم مِّن فَوۡقِهِمۡ وَيَفۡعَلُونَ مَا يُؤۡمَرُونَ ۩ ٥٠

۞ وَقَالَ ٱللَّهُ لَا تَتَّخِذُوٓاْ إِلَٰهَيۡنِ ٱثۡنَيۡنِۖ إِنَّمَا هُوَ إِلَٰهٞ وَٰحِدٞ فَإِيَّٰيَ فَٱرۡهَبُونِ ٥١

وَلَهُۥ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَلَهُ ٱلدِّينُ وَاصِبًاۚ أَفَغَيۡرَ ٱللَّهِ تَتَّقُونَ ٥٢

**47**. లేదా వారిని భయకంపితులు జేసి పట్టుకోవచ్చు కదా! కాని నిశ్చయంగా నీ ప్రభువు మహా కనికరుడు, అపార కరుణాప్రదాత.

**48**. ఏమీ? వారు అల్లాహ్ సృష్టించిన ప్రతి వస్తువును గమనించటం (చూడటం) లేదా? వాటి నీడలు కుడివైపుకూ, ఎడమ వైపుకూ వంగుతూ ఉండి, అల్లాహ్‌కు సాష్టాంగం (సజ్దా) చేస్తూ, ఎలా వినమ్రత చూపుతున్నాయో?[1]

**49**. మరియు ఆకాశాలలోను మరియు భూమిలోను ఉన్న సమస్త ప్రాణులు మరియు దేవదూతలు అందరూ అల్లాహ్‌కు సాష్టాంగం (సజ్దా) చేస్తూ ఉంటారు. వారెన్నడూ (తమ ప్రభువు సన్నిధిలో) గర్వపడరు.

**50**. వారు తమపై నున్న ప్రభువునకు భయపడుతూ, తమకు ఆజ్ఞాపించిన విధంగా నడుచుకుంటారు. ۩ (1/2)

**51**. * మరియు అల్లాహ్ ఇలా ఆజ్ఞాపించాడు: "(ఓ మానవులారా!) ఇద్దరిని ఆరాధ్య దైవాలుగా చేసుకోకండి. నిశ్చయంగా, ఆరాధ్య దైవం ఆయన (అల్లాహ్) ఒక్కడే! కావున నాకే భీతిపరులై ఉండండి."[2]

**52**. మరియు ఆకాశాలలో మరియు భూమిలో ఉన్నదంతా ఆయనకు చెందినదే! మరియు నిరంతర విధేయతకు కేవలం ఆయనే అర్హుడు.[3] ఏమీ? మీరు అల్లాహ్‌ను కాదని ఇతరులకు భయభక్తులు చూపుతారా?

---

**1**. చూడండి, 13:15.

**2**. ఏకైక ఆరాధ్యుడు అల్లాహ్ (సు.తా.) తప్ప మరొక ఆరాధ్యనీయుడు లేడు. అలా ఉంటే విశ్వవ్యవస్థ ఈ విధంగా శాంతియుతంగా నడిచేదికాదు. అప్పుడు విశ్వంలో అల్లకల్లోలం రేకెత్తి ఉండేది. చూడండి, 21:22.

**3**. చూడండి, 39:2-3.

53. మరియు మీకు లభించిన అనుగ్రహాలన్నీ కేవలం అల్లాహ్ నుండి వచ్చినవే. అంతేగాక మీకు ఆపదలు వచ్చినపుడు కూడా మీరు సహాయం కొరకు ఆయననే మొరపెట్టుకుంటారు కదా![1]

وَمَا بِكُم مِّن نِّعۡمَةٖ فَمِنَ ٱللَّهِۖ ثُمَّ إِذَا مَسَّكُمُ ٱلضُّرُّ فَإِلَيۡهِ تَجۡـَٔرُونَ ٥٣

54. తరువాత ఆయన మీ ఆపదలు తొలగించినపుడు; మీలో కొందరు మీ ప్రభువుకు సాటి (షరీక్‌లను) కల్పించ సాగుతారు -

ثُمَّ إِذَا كَشَفَ ٱلضُّرَّ عَنكُمۡ إِذَا فَرِيقٞ مِّنكُم بِرَبِّهِمۡ يُشۡرِكُونَ ٥٤

55. మేము చేసిన ఉపకారానికి కృతఘ్నతగా! సరే (కొంతకాలం) సుఖాలను అనుభవించండి. తరువాత మీరు తెలుసుకుంటారు.[2]

لِيَكۡفُرُواْ بِمَآ ءَاتَيۡنَٰهُمۡۚ فَتَمَتَّعُواْۖ فَسَوۡفَ تَعۡلَمُونَ ٥٥

56. మరియు మేము వారికి ఇచ్చిన జీవనోపాధినుండి కొంత భాగాన్ని, తాము ఏమాత్రం ఎరుగని తమ (బూటక దైవాల) కొరకు నిర్ణయించుకుంటారు వారు.[3] అల్లాహ్ తోడు! మీరు కల్పిస్తున్న ఈ బూటక (కల్పిత) దైవాలను గురించి మీరు తప్పక ప్రశ్నింపబడతారు.

وَيَجۡعَلُونَ لِمَا لَا يَعۡلَمُونَ نَصِيبٗا مِّمَّا رَزَقۡنَٰهُمۡۗ تَٱللَّهِ لَتُسۡـَٔلُنَّ عَمَّا كُنتُمۡ تَفۡتَرُونَ ٥٦

57. మరియు వారు అల్లాహ్‌కేమో కుమార్తెలను అంటగడ్తారు - ఆయన సర్వలోపాలకు అతీతుడు - మరియు తమకేమో తాముకోరేది[4] (నిర్ణయించు కుంటారు).

وَيَجۡعَلُونَ لِلَّهِ ٱلۡبَنَٰتِ سُبۡحَٰنَهُۥ وَلَهُم مَّا يَشۡتَهُونَ ٥٧

---

1. అలాంటప్పుడు మీరు ఇతరులను అల్లాహ్ (సు.తా.)కు సాటిగా నిలబెట్టి, వారిని ఎందుకు ఆరాధిస్తున్నారు? చూడండి, 6:40-44.
2. చూడండి, 14:30.
3. చూడండి, 6:136.
4. చూడండి, 53:19-22, ముష్రిక్ 'అరబ్బులు లాత్, 'ఉ'జ్జ, మనాత్ అనే ఆడ దేవతలను పూజించేవారు. వారు వారిని దైవదూతలుగా అల్లాహుతా'ఆలా కుమార్తెలుగా పరిగణించేవారు.

وَإِذَا بُشِّرَ أَحَدُهُم بِٱلۡأُنثَىٰ ظَلَّ وَجۡهُهُۥ مُسۡوَدّٗا وَهُوَ كَظِيمٞ ٥٨

58. మరియు వారిలో ఎవడికైనా బాలిక (పుట్టిందనే) శుభవార్త అందజేస్తే; అతని ముఖం నల్లబడిపోతుంది మరియు అతడు తన క్రోధావేశాన్ని అణచుకోవటానికి ప్రయత్నిస్తాడు.

يَتَوَٰرَىٰ مِنَ ٱلۡقَوۡمِ مِن سُوٓءِ مَا بُشِّرَ بِهِۦٓۚ أَيُمۡسِكُهُۥ عَلَىٰ هُونٍ أَمۡ يَدُسُّهُۥ فِي ٱلتُّرَابِۗ أَلَا سَآءَ مَا يَحۡكُمُونَ ٥٩

59. తనకు ఇవ్వబడిన శుభవార్తను (అతడు) దుర్వార్తగా భావించి, తనజాతి వారి నుండి దాక్కుంటూ తిరుగుతాడు. అవమానాన్ని భరించి దానిని (ఆ బాలికను) ఉంచుకోవాలా? లేక, దానిని మట్టిలో పూడ్చివేయాలా? అని ఆలోచిస్తాడు. చూడండి! వారి నిర్ణయం ఎంత దారుణమైనదో![1]

لِلَّذِينَ لَا يُؤۡمِنُونَ بِٱلۡأٓخِرَةِ مَثَلُ ٱلسَّوۡءِۖ وَلِلَّهِ ٱلۡمَثَلُ ٱلۡأَعۡلَىٰۚ وَهُوَ ٱلۡعَزِيزُ ٱلۡحَكِيمُ ٦٠

60. ఎవరైతే పరలోకాన్ని విశ్వసించరో వారే దుష్టులుగా పరిగణింపబడే వారు. మరియు అల్లాహ్ మాత్రమే సర్వోన్నతుడిగా పరిగణింపబడే వాడు. మరియు ఆయన సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

وَلَوۡ يُؤَاخِذُ ٱللَّهُ ٱلنَّاسَ بِظُلۡمِهِم مَّا تَرَكَ عَلَيۡهَا مِن دَآبَّةٖ وَلَٰكِن يُؤَخِّرُهُمۡ إِلَىٰٓ أَجَلٖ مُّسَمّٗىۖ فَإِذَا جَآءَ أَجَلُهُمۡ لَا يَسۡتَـٔۡخِرُونَ سَاعَةٗ وَلَا يَسۡتَقۡدِمُونَ ٦١

61. మరియు ఒకవేళ అల్లాహ్ మానవులను - వారు చేసే దుర్మార్గానికి - పట్టుకోదలిస్తే, భూమిపై ఒక్క ప్రాణిని కూడ వదిలేవాడు కాదు.[2] కాని, ఆయన ఒక నిర్ణీత కాలం వరకు వారికి వ్యవధినిస్తున్నాడు. ఇక, వారికాలం వచ్చినప్పుడు వారు, ఒక ఘడియ వెనుక గానీ మరియు ముందు గానీ కాలేరు.[3]

---

1. ముష్రిక్ 'అరబ్బులు, ఇస్లాంకు పూర్వం ఆడబిడ్డ పుట్టుకను ఎంతో అవమానంగా భావించేవారు, కొందరు ఆ ఆడబిడ్డను సజీవంగా భూమిలో పాతేవారు. చూడండి, 81:8.

2. అల్లాహుతా'ఆలా ప్రజలను ప్రతి పాపానికి పట్టి శిక్షించడు. కాని పాపాత్ముల పాపాలు చాలా అయినప్పుడు అల్లాహ్ (సు.తా.) శిక్ష వచ్చి పడుతోంది. ఆ సమయంలో పుణ్యాత్ములు కూడా దాని నుండి తప్పించు కోలేరు. కాని వారు (పుణ్యాత్ములు) పరలోకంలో అల్లాహ్ (సు.తా.) సన్నిహితులలో ఉంటారు. ('స.బు'ఖారీ, 2118, 'స. ముస్లిం, 2206 మరియు 2210).

3. దీని మరొక తాత్పర్యం ఈ విధంగా ఉంది: 'ఇక వారి కాలం వచ్చినపుడు, వారు దానిని ఒక్కఘడియ ఆలస్యం చేయలేరు, లేక ఒక్కఘడియ ముందుగానూ తేలేరు.'

**62**. మరియు వారు తమకు ఇష్టంలేని దానిని అల్లాహ్ కొరకు నిర్ణయిస్తారు. "నిశ్చయంగా, వారికి ఉన్నదంతా శుభమే (మేలైనదే)." అని వారి నాలుకలు అబద్ధం పలుకుతున్నాయి. నిస్సందేహంగా, వారు నరకాగ్ని పాలవుతారు మరియు నిశ్చయంగా, వారందులోకి త్రోయబడి, వదలబడతారు.

وَيَجۡعَلُونَ لِلَّهِ مَا يَكۡرَهُونَ وَتَصِفُ أَلۡسِنَتُهُمُ ٱلۡكَذِبَ أَنَّ لَهُمُ ٱلۡحُسۡنَىٰۖ لَا جَرَمَ أَنَّ لَهُمُ ٱلنَّارَ وَأَنَّهُم مُّفۡرَطُونَ ٦٢

**63**. అల్లాహ్ తోడు, (ఓ ప్రవక్తా!) వాస్తవానికి, నీకు పూర్వమున్న సమాజాల వారివద్దకు, మేము ప్రవక్తలను పంపాము! కాని షై'తాన్ వారి (దుష్ట) కర్మలను వారికి మంచివిగా కనిపించేటట్లు చేశాడు. అదేవిధంగా ఈనాడు కూడా వాడు వారి స్నేహితుడిగా ఉన్నాడు[1] మరియు వారికి బాధాకరమైన శిక్ష ఉంటుంది.

تَٱللَّهِ لَقَدۡ أَرۡسَلۡنَآ إِلَىٰٓ أُمَمٖ مِّن قَبۡلِكَ فَزَيَّنَ لَهُمُ ٱلشَّيۡطَٰنُ أَعۡمَٰلَهُمۡ فَهُوَ وَلِيُّهُمُ ٱلۡيَوۡمَ وَلَهُمۡ عَذَابٌ أَلِيمٞ ٦٣

**64**. మరియు మేము ఈ గ్రంథాన్ని (ఖుర్ఆన్‌ను) నీపై అవతరింపజేసింది, వారు విభేదాలకు గురిఅయిన విషయాన్ని వారికి నీవు స్పష్టం చేయటానికీ మరియు విశ్వసించే జనుల కొరకు మార్గదర్శకత్వం గానూ మరియు కారుణ్యం గానూ ఉంచటానికి!

وَمَآ أَنزَلۡنَا عَلَيۡكَ ٱلۡكِتَٰبَ إِلَّا لِتُبَيِّنَ لَهُمُ ٱلَّذِي ٱخۡتَلَفُواْ فِيهِ وَهُدٗى وَرَحۡمَةٗ لِّقَوۡمٖ يُؤۡمِنُونَ ٦٤

**65**. మరియు అల్లాహ్ ఆకాశం నుండి నీటిని కురిపించి, దాని ద్వారా నిర్జీవంగా ఉన్న భూమిలో జీవంపోశాడు. నిశ్చయంగా, ఇందులో వినేవారికి సూచన ఉంది.

وَٱللَّهُ أَنزَلَ مِنَ ٱلسَّمَآءِ مَآءٗ فَأَحۡيَا بِهِ ٱلۡأَرۡضَ بَعۡدَ مَوۡتِهَآۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةٗ لِّقَوۡمٖ يَسۡمَعُونَ ٦٥

---

**1**. వలి, వలియ - నుండి వచ్చింది. వలియ దగ్గరివాడు, స్నేహితుడు, ప్రియుడు, మిత్రుడు, సహాయకుడు, ఆధారమిచ్చే, కాపాడే, ఆశ్రయమిచ్చే, పోషించే వాడు. అల్లాహ్ (సు.తా.) విశ్వాసుల వలి, అని 2:257 మరియు 3:68 లో పేర్కొనబడింది. అదేవిధంగా విశ్వాసుడు అల్లాహ్(సు.తా.)కు వలి అని 10:62లో ఉంది. మరియు తాగూత్ సత్యతిరస్కారుల అవ్‌లియా అని 2:257లో పేర్కొనబడింది.

وَإِنَّ لَكُمْ فِي ٱلْأَنْعَـٰمِ لَعِبْرَةً ۖ نُّسْقِيكُم مِّمَّا فِي بُطُونِهِۦ مِنۢ بَيْنِ فَرْثٍ وَدَمٍ لَّبَنًا خَالِصًا سَآئِغًا لِّلشَّـٰرِبِينَ ٦٦

**66**. మరియు నిశ్చయంగా, మీకు పశువులలో ఒక గుణపాఠం ఉంది. వాటి కడుపులలో ఉన్న దానిని (పాలను) మేము మీకు త్రాగటానికి ఇస్తున్నాము. అది మలం మరియు రక్తముల మధ్యనున్న నిర్మల(స్వచ్ఛ)మైన పాలు, త్రాగేవారికి ఎంతో రుచికరమైనది.

وَمِن ثَمَرَٰتِ ٱلنَّخِيلِ وَٱلْأَعْنَـٰبِ تَتَّخِذُونَ مِنْهُ سَكَرًا وَرِزْقًا حَسَنًا ۗ إِنَّ فِي ذَٰلِكَ لَـَٔايَةً لِّقَوْمٍ يَعْقِلُونَ ٦٧

**67**. మరియు ఖర్జూరపు మరియు ద్రాక్ష ఫలాలనుండి మీరు మత్తుపానీయం మరియు మంచి ఆహారం కూడా పొందుతారు.[1] నిశ్చయంగా, ఇందులో బుద్ధిమంతులకు సూచన ఉంది.

وَأَوْحَىٰ رَبُّكَ إِلَى ٱلنَّحْلِ أَنِ ٱتَّخِذِي مِنَ ٱلْجِبَالِ بُيُوتًا وَمِنَ ٱلشَّجَرِ وَمِمَّا يَعْرِشُونَ ٦٨

**68**. మరియు నీ ప్రభువు తేనెటీగకు ఈవిధంగా ఆదేశమిచ్చాడు:[2] "నీవు కొండలలో, చెట్లలో మరియు మానవుల కట్టడాలలో, నీ తెట్టెలను కట్టుకో!

ثُمَّ كُلِي مِن كُلِّ ٱلثَّمَرَٰتِ فَٱسْلُكِي سُبُلَ رَبِّكِ ذُلُلًا ۚ يَخْرُجُ مِنۢ بُطُونِهَا شَرَابٌ مُّخْتَلِفٌ أَلْوَٰنُهُۥ فِيهِ شِفَآءٌ لِّلنَّاسِ ۗ إِنَّ فِي ذَٰلِكَ لَـَٔايَةً لِّقَوْمٍ يَتَفَكَّرُونَ ٦٩

**69**. "తరువాత అన్నిరకాల ఫలాలను తిను. ఇలా నీ ప్రభువు మార్గాలపై నమ్రతతో నడువు." దాని కడుపు నుండి రంగురంగుల పానకం (తేనే) ప్రసవిస్తుంది. అందులో మానవులకు వ్యాధినివారణ ఉంది. నిశ్చయంగా, ఇందులో ఆలోచించే వారికి సూచన ఉంది.

---

**1**. ఈ ఆయత్ అవతరింపజేయబడిన 10 సంవత్సరాల తరువాత మద్యపానాన్ని నిషిద్ధం ('హరామ్)చేసే ఆయత్‌లు (5:90-91) అవతరింపజేయబడ్డాయి. ఇక్కడ మద్యపానాన్ని గురించి అయిష్టత పేర్కొనబడింది.

**2**. ఇక్కడ వ'హీ అంటే అల్లాహ్ (సు.తా.) దానికి ఇచ్చిన జ్ఞానం అని అర్థం.

70. మరియు అల్లాహ్‌యే మిమ్మల్ని సృష్టించాడు, తరువాత మిమ్మల్ని మరణింపజేస్తాడు. మరియు మీలో కొందరు అతి నికృష్టమైన (ముసలి) వయస్సుకు చేరుతారు. అప్పుడు అతడు అంతా తెలిసినా, ఏమీ తెలియని వాడిగా అయిపోతాడు. నిశ్చయంగా అల్లాహ్ సర్వజ్ఞుడు, సర్వసమర్థుడు.

وَٱللَّهُ خَلَقَكُمۡ ثُمَّ يَتَوَفَّىٰكُمۡۚ وَمِنكُم مَّن يُرَدُّ إِلَىٰٓ أَرۡذَلِ ٱلۡعُمُرِ لِكَيۡ لَا يَعۡلَمَ بَعۡدَ عِلۡمٖ شَيۡـًٔاۚ إِنَّ ٱللَّهَ عَلِيمٞ قَدِيرٞ ٧٠

71. మరియు అల్లాహ్ జీవనోపాధి విషయంలో మీలో కొందరికి మరి కొందరిపై ఆధిక్యతను ప్రసాదించాడు. కాని ఈ ఆధిక్యత ఇవ్వబడినవారు తమ జీవనోపాధిని తమ అధీనంలో ఉన్నవారికి (బానిసలకు) ఇవ్వటానికి ఇష్టపడరు; ఎందుకంటే వారు తమతో సమానులు అవుతారేమోనని! ఏమీ? వారు అల్లాహ్ అనుగ్రహాన్ని తిరస్కరిస్తున్నారా?

وَٱللَّهُ فَضَّلَ بَعۡضَكُمۡ عَلَىٰ بَعۡضٖ فِي ٱلرِّزۡقِۚ فَمَا ٱلَّذِينَ فُضِّلُواْ بِرَآدِّي رِزۡقِهِمۡ عَلَىٰ مَا مَلَكَتۡ أَيۡمَٰنُهُمۡ فَهُمۡ فِيهِ سَوَآءٌۚ أَفَبِنِعۡمَةِ ٱللَّهِ يَجۡحَدُونَ ٧١

72. మరియు అల్లాహ్ మీవంటి వారి నుండియే మీ సహవాసులను (అజ్వాజ్‌లను) పుట్టించాడు. మరియు మీ సహవాసుల నుండి మీకు పిల్లలను మరియు మనమళ్ళను ప్రసాదించి, మీకు ఉత్తమమైన జీవనోపాధులను కూడా సమకూర్చాడు. అయినా వారు (మానవులు) అసత్యమైన వాటిని (దైవాలుగా) విశ్వసించి, అల్లాహ్ అనుగ్రహాలను తిరస్కరిస్తారా?

وَٱللَّهُ جَعَلَ لَكُم مِّنۡ أَنفُسِكُمۡ أَزۡوَٰجٗا وَجَعَلَ لَكُم مِّنۡ أَزۡوَٰجِكُم بَنِينَ وَحَفَدَةٗ وَرَزَقَكُم مِّنَ ٱلطَّيِّبَٰتِۚ أَفَبِٱلۡبَٰطِلِ يُؤۡمِنُونَ وَبِنِعۡمَتِ ٱللَّهِ هُمۡ يَكۡفُرُونَ ٧٢

73. మరియు వారు అల్లాహ్‌ను వదలి, ఆకాశాలనుండి గానీ, భూమినుండి గానీ వారికి ఎలాంటి జీవనోపాధిని సమకూర్చలేని మరియు కనీసం (సమకూర్చే) సామర్థ్యం కూడా లేనివారిని ఆరాధిస్తున్నారు.

وَيَعۡبُدُونَ مِن دُونِ ٱللَّهِ مَا لَا يَمۡلِكُ لَهُمۡ رِزۡقٗا مِّنَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ شَيۡـٔٗا وَلَا يَسۡتَطِيعُونَ ٧٣

فَلَا تَضۡرِبُواْ لِلَّهِ ٱلۡأَمۡثَالَۚ إِنَّ ٱللَّهَ يَعۡلَمُ وَأَنتُمۡ لَا تَعۡلَمُونَ ٧٤

74. కావున అల్లాహ్‌కు పోలికలు కల్పించకండి.[1] నిశ్చయంగా, అల్లాహ్‌కు అంతా తెలుసు మరియు మీకేమీ తెలియదు. (5/8)

۞ ضَرَبَ ٱللَّهُ مَثَلًا عَبۡدًا مَّمۡلُوكًا لَّا يَقۡدِرُ عَلَىٰ شَيۡءٍ وَمَن رَّزَقۡنَٰهُ مِنَّا رِزۡقًا حَسَنًا فَهُوَ يُنفِقُ مِنۡهُ سِرًّا وَجَهۡرًاۖ هَلۡ يَسۡتَوُۥنَۚ ٱلۡحَمۡدُ لِلَّهِۚ بَلۡ أَكۡثَرُهُمۡ لَا يَعۡلَمُونَ ٧٥

75. * అల్లాహ్ ఒక ఉపమానం ఇచ్చాడు: ఒకడు బానిసగా ఇతరుని యజమాన్యంలో ఉన్నవాడు. అతడు ఏ విధమైన అధికారం లేనివాడు. మరొకడు మానుండి మంచి జీవనోపాధి పొందినవాడు. అతడు దానిలోనుండి రహస్యంగాను మరియు బహిరంగంగాను ఖర్చు చేయగలవాడు. ఏమీ? వీరిద్దరు సమానులవుతారా? సర్వస్తోత్రాలకు అర్హుడు కేవలం అల్లాహ్ మాత్రమే! కానీ, చాలా మందికి ఇది తెలియదు.

وَضَرَبَ ٱللَّهُ مَثَلًا رَّجُلَيۡنِ أَحَدُهُمَآ أَبۡكَمُ لَا يَقۡدِرُ عَلَىٰ شَيۡءٍ وَهُوَ كَلٌّ عَلَىٰ مَوۡلَىٰهُ أَيۡنَمَا يُوَجِّههُّ لَا يَأۡتِ بِخَيۡرٍۖ هَلۡ يَسۡتَوِي هُوَ وَمَن يَأۡمُرُ بِٱلۡعَدۡلِ وَهُوَ عَلَىٰ صِرَٰطٍ مُّسۡتَقِيمٍ ٧٦

76. అల్లాహ్ ఇద్దరు పురుషుల, మరొక ఉపమానం ఇచ్చాడు: వారిలో ఒకడు మూగ వాడు, అతడు ఏమీ చేయలేడు, అతడు తన యజమానికి భారమై ఉన్నాడు. అతనిని ఎక్కడికి పంపినా మేలైనపని చేయలేడు. ఏమీ? ఇటువంటి వాడు మరొకనితో - ఎవడైతే న్యాయాన్ని పాటిస్తూ, ఋజుమార్గంపై నడుస్తున్నాడో - సమానుడు కాగలడా?[2]

1. 'మీరు ఒకపెద్ద ఉద్యోగి దగ్గరికి పోవాలంటే మొదట అతని సెక్రేటరీ ద్వారా సమయం తీసుకోవలసి ఉంటుంది. అదేవిధంగా అల్లాహుతా'ఆలా వద్దకు చేరటానికి వలీల సిఫారసు కావాలి.' అని కొందరు, దర్గాల, వలీల, సాధు, సన్యాసుల దగ్గరకు పోయేవారు వాదిస్తారు. వారు తప్పుదారిలో ఉన్నారు. అల్లాహుతా'ఆలా ఏకైకుడు, సర్వసమర్థుడు అంతా ఎరుగువాడు. ఆయన ప్రసన్నతను పొందటానికి, ఆయన (సు.తా.) ప్రవక్తల ద్వారా చూపిన మార్గం (సత్యధర్మమైన ఇస్లాం) మీద నడిచి, సత్కార్యాలు చేయటమే చాలు. ఆయన తాను కోరిన వారి కొరకు మాత్రమే సిఫారసు చేయటానికి అనుమతినిస్తాడు. పునరుత్థానదినమున ఆయన (సు.తా.) అనుమతించిన వారి సిఫారసు అంటే దైవదూతల, ప్రవక్తల ('అలైహిమ్ స.) లేక సత్పురుషుల (ర.'అలైహిమ్) సిఫారసు - ఆయన కోరిన వారి కొరకు - మాత్రమే చెల్లుతుంది. వారు సత్యమే పలుకుతారు. చూడండి,10:3.

2. సమానుడు కాజాలడు అని అర్థం.

وَلِلَّهِ غَيۡبُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۚ
وَمَآ أَمۡرُ ٱلسَّاعَةِ إِلَّا كَلَمۡحِ
ٱلۡبَصَرِ أَوۡ هُوَ أَقۡرَبُۚ إِنَّ ٱللَّهَ
عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٞ ٧٧

**77**. మరియు ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ ఉన్న అగోచర విషయాల జ్ఞానం కేవలం అల్లాహ్‌కు మాత్రమే ఉంది. అంతిమ గడియ కేవలం రెప్పపాటు కాలంలో లేదా అంతకుముందే సంభవించవచ్చు! నిశ్చయంగా, అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

وَٱللَّهُ أَخۡرَجَكُم مِّنۢ بُطُونِ
أُمَّهَٰتِكُمۡ لَا تَعۡلَمُونَ شَيۡـٔٗا وَجَعَلَ
لَكُمُ ٱلسَّمۡعَ وَٱلۡأَبۡصَٰرَ وَٱلۡأَفۡـِٔدَةَ
لَعَلَّكُمۡ تَشۡكُرُونَ ٧٨

**78**. మరియు అల్లాహ్, మిమ్మల్ని మీ తల్లుల గర్భాలనుండి, బయటికి తీశాడు (పుట్టించాడు) అప్పుడు మీకేమీ తెలియదు. మరియు మీకు వినికిడినీ, దృష్టినీ మరియు హృదయాలను ప్రసాదించాడు. బహుశా మీరు కృతజ్ఞులై ఉంటారని.[1]

أَلَمۡ يَرَوۡاْ إِلَى ٱلطَّيۡرِ مُسَخَّرَٰتٖ
فِي جَوِّ ٱلسَّمَآءِ مَا يُمۡسِكُهُنَّ
إِلَّا ٱللَّهُۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَٰتٖ لِّقَوۡمٖ
يُؤۡمِنُونَ ٧٩

**79**. ఏమీ? వారు పక్షులను ఆకాశం మధ్యలో తాటస్థ్య స్థితిలో (పడిపోకుండా) ఎగురుతూ ఉండేది, గమనించడం లేదా? వాటిని అల్లాహ్ తప్ప ఇతరులెవ్వరూ (ఆకాశంలో) నిలుపలేరు. నిశ్చయంగా ఇందులో విశ్వసించే వారికి సూచనలు ఉన్నాయి.

---

**1**. నా దాసుడు నా సాన్నిహిత్యాన్ని పొందటానికి నేను అతనికి విధి ఫ'ర్దగా చేసిన వాటిపై అమలు చేస్తాడు. ఆ తరువాత నవాఫిల్ ద్వారా కూడా మరింత నా సాన్నిహిత్యాన్ని పొందటానికి ప్రయత్నిస్తాడు. మరియు నేను అతనిని ప్రేమిస్తాను. నేను అతనిని ప్రేమించినపుడు నేను అతని చెవి అవుతాను దానితో అతడు వింటాడు. అతని కన్ను అవుతాను దానితో అతడు చూస్తాడు, అతని చేయి అవుతాను దానితో అతడు పట్టుకుంటాడు, కాలు అవుతాను దానితో అతడు నడుస్తాడు మరియు అతడు నన్ను అడిగిన దానిని నేను అతనికి ఇస్తాను. నన్ను శరణు వేడుకుంటే, నేను శరణు ఇస్తాను. ('స.బు'ఖారీ, కితాబ్ అర్రిఖాఖ్). దీనిని తప్పుగా అర్థం చేసుకోరాదు. ఏ మానవుడైతే తన ఆరాధన మరియు విధేయతలో కేవలం అల్లాహ్(సు.తా.)నే ప్రత్యేకించుకుంటాడో అతడు అల్లాహ్ (సు.తా.)కు ఇష్టం లేనటువంటిది ఏదీ వినడు, చూడడు, చేయడు మరియు పలకడు. అతడు చేసే ప్రతికార్యం కేవలం అల్లాహ్ (సు.తా.) సంతుష్టి పొందడానికే ఉంటుంది.

**80.** మరియు అల్లాహ్ మీకు, మీ గృహాలలో నివాసం ఏర్పరిచాడు. మరియు పశువుల చర్మాలతో మీకు ఇండ్లు (గుడారాలు) నిర్మించాడు. అవి మీకు ప్రయాణంలో ఉన్నప్పుడు మరియు మీరు బసచేసినప్పుడు, చాలా తేలికగా ఉంటాయి. వాటి ఉన్నితో, బొచ్చుగల చర్మాలతో మరియు వెంట్రుకలతో గృహోపకరణ సామగ్రి మరియు కొంత కాలం సుఖంగా గడుపుకునే వస్తువులను (మీ కొరకు సృష్టించాడు).

وَٱللَّهُ جَعَلَ لَكُم مِّنۢ بُيُوتِكُمۡ سَكَنٗا وَجَعَلَ لَكُم مِّن جُلُودِ ٱلۡأَنۡعَٰمِ بُيُوتٗا تَسۡتَخِفُّونَهَا يَوۡمَ ظَعۡنِكُمۡ وَيَوۡمَ إِقَامَتِكُمۡ وَمِنۡ أَصۡوَافِهَا وَأَوۡبَارِهَا وَأَشۡعَارِهَآ أَثَٰثٗا وَمَتَٰعًا إِلَىٰ حِينٖ ٨٠

**81.** మరియు అల్లాహ్ తాను సృష్టించిన వస్తువులలో కొన్నింటిని నీడ కొరకు నియమించాడు మరియు పర్వతాలలో మీకు రక్షణా స్థలాలను ఏర్పరచాడు. మరియు మీరు వేడినుండి కాపాడుకోవటానికి వస్త్రాలను మరియు యుద్ధం నుండి కాపాడుకోవటానికి కవచాలను ఇచ్చాడు. మీరు ఆయనకు విధేయులై ఉండాలని, ఈ విధంగా ఆయన మీపై తన అనుగ్రహాలను పూర్తిచేస్తున్నాడు.

وَٱللَّهُ جَعَلَ لَكُم مِّمَّا خَلَقَ ظِلَٰلٗا وَجَعَلَ لَكُم مِّنَ ٱلۡجِبَالِ أَكۡنَٰنٗا وَجَعَلَ لَكُمۡ سَرَٰبِيلَ تَقِيكُمُ ٱلۡحَرَّ وَسَرَٰبِيلَ تَقِيكُم بَأۡسَكُمۡۚ كَذَٰلِكَ يُتِمُّ نِعۡمَتَهُۥ عَلَيۡكُمۡ لَعَلَّكُمۡ تُسۡلِمُونَ ٨١

**82.** (ఓ ప్రవక్తా!) ఒకవేళ వారు వెనుదిరిగితే, నీ కర్తవ్యం కేవలం సందేశాన్ని స్పష్టంగా అందజేయుటం మాత్రమే!

فَإِن تَوَلَّوۡاْ فَإِنَّمَا عَلَيۡكَ ٱلۡبَلَٰغُ ٱلۡمُبِينُ ٨٢

**83.** వారు అల్లాహ్ ఉపకారాన్ని గుర్తించిన తరువాత దానిని నిరాకరిస్తున్నారు మరియు వారిలో చాలా మంది సత్యతిరస్కారులే!

يَعۡرِفُونَ نِعۡمَتَ ٱللَّهِ ثُمَّ يُنكِرُونَهَا وَأَكۡثَرُهُمُ ٱلۡكَٰفِرُونَ ٨٣

وَيَوْمَ نَبْعَثُ مِن كُلِّ أُمَّةٍ شَهِيدًا ثُمَّ لَا يُؤْذَنُ لِلَّذِينَ كَفَرُوا۟ وَلَا هُمْ يُسْتَعْتَبُونَ ﴿٨٤﴾

**84**. మరియు (జ్ఞాపకం ఉంచుకోండి), ఆ రోజు మేము ప్రతి సమాజం నుండి ఒక సాక్షిని లేపి నిలబెడ్తాము. అప్పుడు సత్య తిరస్కారులకు ఏ విధమైన (సాకులు చెప్ప టానికి) అనుమతి ఇవ్వబడదు[1] మరియు వారికి పశ్చాత్తాపపడే అవకాశం కూడా ఇవ్వబడదు.

وَإِذَا رَءَا ٱلَّذِينَ ظَلَمُوا۟ ٱلْعَذَابَ فَلَا يُخَفَّفُ عَنْهُمْ وَلَا هُمْ يُنظَرُونَ ﴿٨٥﴾

**85**. మరియు దుర్మార్గులు ఆ శిక్షను చూసినప్పుడు, అది వారి కొరకు తగ్గించడం జరుగదు మరియు వారికి ఎలాంటి వ్యవధి కూడా ఇవ్వబడదు.[2]

وَإِذَا رَءَا ٱلَّذِينَ أَشْرَكُوا۟ شُرَكَآءَهُمْ قَالُوا۟ رَبَّنَا هَٰٓؤُلَآءِ شُرَكَآؤُنَا ٱلَّذِينَ كُنَّا نَدْعُوا۟ مِن دُونِكَ ۖ فَأَلْقَوْا۟ إِلَيْهِمُ ٱلْقَوْلَ إِنَّكُمْ لَكَٰذِبُونَ ﴿٨٦﴾

**86**. మరియు (అల్లాహ్‌కు) సాటి కల్పించిన వారు, తాము సాటిగా నిలిపిన వారిని చూసి అంటారు: "ఓ మా ప్రభూ! వీరే మేము నీకు సాటి కల్పించి, నీకు బదులుగా ఆరాధించిన వారు." కాని (సాటిగా నిలుపబడిన) వారు, సాటి కల్పించిన వారి మాటలను వారి వైపుకే విసురుతూ అంటారు: "నిశ్చయంగా, మీరు అసత్యవాదులు."[3]

وَأَلْقَوْا۟ إِلَى ٱللَّهِ يَوْمَئِذٍ ٱلسَّلَمَ ۖ وَضَلَّ عَنْهُم مَّا كَانُوا۟ يَفْتَرُونَ ﴿٨٧﴾

**87**. మరియు ఆరోజు (అందరూ) వినమ్రులై తమను తాము అల్లాహ్‌కు అప్పగించు కుంటారు. వారు కల్పించినవి (దైవాలు) వారిని త్యజించి ఉంటాయి.

---

**1**. చూడండి, 77:35-36 మరియు 16:89 వ్యాఖ్యానం 1.
**2**. పరలోక జీవితం ప్రతిఫల జీవితం. అక్కడ మంచి కర్మలు చేయటానికి గానీ లేక పశ్చాత్తాపపడటానికి గానీ వ్యవధి ఇవ్వబడదు.
**3**. సాటిగా నిలుపబడిన వారి జవాబుకు చూడండి, 10:29, 46:56, 19:81-82, 29:25, 18:52.

ٱلَّذِينَ كَفَرُواْ وَصَدُّواْ عَن سَبِيلِ ٱللَّهِ زِدۡنَٰهُمۡ عَذَابٗا فَوۡقَ ٱلۡعَذَابِ بِمَا كَانُواْ يُفۡسِدُونَ ﴿٨٨﴾

**88**. ఎవరైతే సత్యాన్ని తిరస్కరించి (ప్రజలను) అల్లాహ్ మార్గం నుండి నిరోధించారో వారికి, మేము వారు చేస్తూఉండిన దౌర్జన్యాలకు శిక్ష మీద శిక్ష విధిస్తాము.[1]

وَيَوۡمَ نَبۡعَثُ فِي كُلِّ أُمَّةٖ شَهِيدًا عَلَيۡهِم مِّنۡ أَنفُسِهِمۡۖ وَجِئۡنَا بِكَ شَهِيدًا عَلَىٰ هَٰٓؤُلَآءِۚ وَنَزَّلۡنَا عَلَيۡكَ ٱلۡكِتَٰبَ تِبۡيَٰنٗا لِّكُلِّ شَيۡءٖ وَهُدٗى وَرَحۡمَةٗ وَبُشۡرَىٰ لِلۡمُسۡلِمِينَ ﴿٨٩﴾

**89**. మరియు (జ్ఞాపకముంచుకోండి) ఆ రోజు మేము ప్రతి సమాజంలో నుండి వారికి వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చే వానిని (ప్రవక్తను) లేపి నిలబెడ్తాము. మరియు (ఓ ప్రవక్తా!) మేము నిన్ను వీరికి వ్యతిరేకంగా సాక్ష్యమివ్వటానికి తీసుకువస్తాము.[2] ప్రతి విషయాన్ని స్పష్టపరచటానికి నీపై ఈ దివ్యగ్రంథాన్ని అవతరింపజేశాము. మరియు ఇందులో అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు) అయిన వారికి మార్గదర్శకత్వం, కారుణ్యం మరియు శుభవార్తలూ ఉన్నాయి. (3/4)

۞ إِنَّ ٱللَّهَ يَأۡمُرُ بِٱلۡعَدۡلِ وَٱلۡإِحۡسَٰنِ وَإِيتَآيِٕ ذِي ٱلۡقُرۡبَىٰ وَيَنۡهَىٰ عَنِ ٱلۡفَحۡشَآءِ وَٱلۡمُنكَرِ وَٱلۡبَغۡيِۚ يَعِظُكُمۡ لَعَلَّكُمۡ تَذَكَّرُونَ ﴿٩٠﴾

**90**. * నిశ్చయంగా, అల్లాహ్ న్యాయం చేయమని మరియు (ఇతరులకు) మేలు చేయమని మరియు దగ్గరి బంధువులకు సహాయం చేయమని మరియు అశ్లీలత, అధర్మం మరియు దౌర్జన్యాలకు దూరంగా ఉండమని ఆజ్ఞాపిస్తున్నాడు.[3] ఆయన ఈ

---

**1**. తాము స్వయంగా మార్గభ్రష్టులైనదే కాక ఇతరులను, అల్లాహ్ (సు.తా.) మార్గం నుండి ఆపేవారికి రెట్టింపు శిక్ష విధించబడుతుంది.

**2**. ప్రతి ప్రవక్త తన జాతివారిలో సత్యాన్ని తిరస్కరించిన వారికి వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాడు. మరియు ము'హమ్మద్ ('స'అస) మరియు అతని అనుచరు(ర'ది.'అన్హుమ్)లు ప్రవక్త ('అలైహిమ్ స.)ల విషయంలో, వారు సత్యవాదులు మరియు వారు అల్లాహ్ (సు.తా.) సందేశాన్ని ప్రచారం చేశారని సాక్ష్యమిస్తారు. ('స.బు'ఖారీ, తఫ్సీర్ సూరహ్ అన్- నిసా').

**3**. అల్-'అద్లు: తనవారితోనే కాక ఇతరులతో కూడా న్యాయం చేయటం. ఎవరితోనైనా ఉన్న ప్రేమ లేక శత్రుత్వం, న్యాయానికి అడ్డు రాకూడదు. మరొక అర్థం న్యాయంలో హెచ్చుతగ్గులు చేయగూడదు. ధర్మవిషయంలో కూడా ఏ విధమైన అన్యాయం జరుగకూడదు.

విధంగా మీకు బోధిస్తున్నాడు, బహుశా మీరు హితబోధ గ్రహిస్తారని.

**91**. మరియు మీరు అల్లాహ్ పేరుతో వాగ్దానం చేస్తే మీ వాగ్దానాలను తప్పక నెర వేర్చండి. మరియు మీరు ప్రమాణాలను దృఢ పరచిన తర్వాత భంగపరచకండి.[1] (ఎందు కంటే) వాస్తవానికి, మీరు అల్లాహ్‌ను మీకు జామీనుదారుగా[2] చేసుకున్నారు. నిశ్చయంగా, మీరు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

**92**. మరియు మీరు ఆ స్త్రీవలె కాకండి, ఏ స్త్రీ అయితే స్వయంగా కష్టపడి నూలువడికి గట్టి దారాన్ని చేసిన తరువాత దాన్ని ముక్కలు ముక్కలుగా త్రెంచివేసిందో! ఒక వర్గం వారు మరొక వర్గం వారి కంటే అధికంగా ఉన్నారని, పరస్పరం మోసగించుకోవటానికి, మీ ప్రమాణాలను ఉపయోగించుకోకండి. నిశ్చయంగా, అల్లాహ్ మిమ్మల్ని వీటి (ఈ ప్రమాణాల) ద్వారా పరీక్షిస్తున్నాడు. మరియు నిశ్చయంగా, పునరుత్థాన దినమున ఆయన మీకు, మీరు వాదులాడే విషయాలను గురించి స్పష్టంగా తెలియజేస్తాడు.

وَأَوۡفُواْ بِعَهۡدِ ٱللَّهِ إِذَا عَٰهَدتُّمۡ
وَلَا تَنقُضُواْ ٱلۡأَيۡمَٰنَ بَعۡدَ
تَوۡكِيدِهَا وَقَدۡ جَعَلۡتُمُ ٱللَّهَ
عَلَيۡكُمۡ كَفِيلًاۚ إِنَّ ٱللَّهَ يَعۡلَمُ مَا
تَفۡعَلُونَ ﴿٩١﴾
وَلَا تَكُونُواْ كَٱلَّتِي نَقَضَتۡ
غَزۡلَهَا مِنۢ بَعۡدِ قُوَّةٍ أَنكَٰثٗا
تَتَّخِذُونَ أَيۡمَٰنَكُمۡ دَخَلَۢا بَيۡنَكُمۡ
أَن تَكُونَ أُمَّةٌ هِيَ أَرۡبَىٰ مِنۡ أُمَّةٍۚ
إِنَّمَا يَبۡلُوكُمُ ٱللَّهُ بِهِۦۚ وَلَيُبَيِّنَنَّ
لَكُمۡ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ مَا كُنتُمۡ فِيهِ
تَخۡتَلِفُونَ ﴿٩٢﴾

---

అల్-ఎ'హ్సాను: అంటే, **ఒకటి:** మంచినడవడిక మరియు క్షమాగుణం. **రెండోది:** న్యాయంగా ఇవ్వవలసిన దానికంటే ఎక్కువ ఇవ్వటం. ఉదా: నూరు రూపాయలు కూలి మాట్లాడుకున్న వానికి పని ముగిసిన తరువాత 110 రూపాయలు ఇవ్వటం. **మూడవది:** ఏ పని చేసినా కర్తవ్యంగా హృదయపూర్వకంగా చేయటం మరియు ఏకాగ్రచిత్తంతో అల్లాహ్ (సు.తా.)ను ఆరాధించటం. (అన్‌త'అబుదుల్లాహ్ క అన్నక తరాహు).
అల్-ఫ'హ్షా ఉ': అశ్లీలత, చెడునడత, అసభ్యకరమైన పని, సిగ్గుమాలిన నడవడిక. ఈ కాలంలో ఫ్యాషన్ పేరు మీద జరిగేవి. స్త్రీ పురుషులు సిగ్గు విడిచి, కలసిమెలసి తిరుగటం, డాన్సులు చేయటం, మొదలైనవి. అల్-మున్కరు: షరీయత్ నిషేధించిన పని.
అల్-బ'గీ: అందోళన, అక్రమము, దౌర్జన్యం.

**1**. దృఢంగా చేసిన ప్రమాణాలు. ఆలోచించకుండా చేసిన ప్రమాణాలకు చూడండి, 2:225. 'ఒకవ్యక్తి ప్రమాణం చేసిన తరువాత తాను చేసిన ప్రమాణం తప్పు అని తెలుసుకుంటే, తన ప్రమాణాన్ని తెంపి పరిహారం (కప్ఫారహ్) ఇవ్వాలి.' ('స.ముస్లిం, నం.1272).

**2**. కఫీలున్: అంటే జామీనుదారు, లేక హామీ ఇచ్చేవాడు అని అర్థం.

وَلَوۡ شَآءَ ٱللَّهُ لَجَعَلَكُمۡ أُمَّةٗ
وَٰحِدَةٗ وَلَٰكِن يُضِلُّ مَن يَشَآءُ
وَيَهۡدِي مَن يَشَآءُۚ وَلَتُسۡـَٔلُنَّ عَمَّا
كُنتُمۡ تَعۡمَلُونَ ﴿٩٣﴾

**93**. ఒకవేళ అల్లాహ్ కోరితే మిమ్మల్ని అందరినీ ఒకే సమాజంగా చేసి ఉండేవాడు. కాని ఆయన తాను కోరిన వారిని మార్గభ్రష్టత్వానికి గురిచేస్తాడు. మరియు తాను కోరిన వారికి సన్మార్గం చూపుతాడు.[1] మరియు నిశ్చయంగా, మీరు చేస్తున్న కర్మలను గురించి మీరు తప్పక ప్రశ్నించబడతారు.

وَلَا تَتَّخِذُوٓاْ أَيۡمَٰنَكُمۡ دَخَلَۢا
بَيۡنَكُمۡ فَتَزِلَّ قَدَمُۢ بَعۡدَ ثُبُوتِهَا
وَتَذُوقُواْ ٱلسُّوٓءَ بِمَا صَدَدتُّمۡ عَن
سَبِيلِ ٱللَّهِۖ وَلَكُمۡ عَذَابٌ عَظِيمٞ
﴿٩٤﴾

**94**. మరియు మీ ప్రమాణాలను పరస్పరం మోసగించుకోవటానికి ఉపయోగించుకోకండి. అలా చేస్తే స్థిరపడిన పాదాలు జారిపోవచ్చు మరియు మీరు అల్లాహ్ మార్గంనుండి ప్రజలను నిరోధించిన పాప ఫలితాన్ని రుచిచూడగలరు.[2] మరియు మీకు ఘోరమైన శిక్ష పడగలదు.

وَلَا تَشۡتَرُواْ بِعَهۡدِ ٱللَّهِ ثَمَنٗا قَلِيلًاۚ
إِنَّمَا عِندَ ٱللَّهِ هُوَ خَيۡرٞ لَّكُمۡ إِن
كُنتُمۡ تَعۡلَمُونَ ﴿٩٥﴾

**95**. మరియు మీరు అల్లాహ్‌తో చేసిన వాగ్దానాన్ని స్వల్పలాభానికి అమ్ముకోకండి. మీరు తెలుసుకోగలిగితే, నిశ్చయంగా, అల్లాహ్ వద్ద ఉన్నదే మీకు ఎంతో మేలైనది.

مَا عِندَكُمۡ يَنفَدُۖ وَمَا عِندَ ٱللَّهِ بَاقٖۗ
وَلَنَجۡزِيَنَّ ٱلَّذِينَ صَبَرُوٓاْ أَجۡرَهُم
بِأَحۡسَنِ مَا كَانُواْ يَعۡمَلُونَ ﴿٩٦﴾

**96**. మీ దగ్గర ఉన్నదంతా నశించేదే. మరియు అల్లాహ్ వద్ద ఉన్నదే (శాశ్వతంగా) మిగిలేది! మరియు మేము సహనం వహించేవారికి, వారు చేసిన సత్కార్యాలకు ఉత్తమ ప్రతిఫలం తప్పక ప్రసాదిస్తాము.

---

1. చూడండి,14:4 మరియు 2:26-27. అల్లాహుతా'ఆలాకు ప్రతివాని భవిష్యత్తు తెలుసు. కాబట్టి ఎవడైతే సన్మార్గానికి రాడని ఆయనకు తెలుసో అలాంటి వాడిని, మార్గభ్రష్టత్వంలో వదలిపెడతాడే కానీ, ఎవ్వడిని కూడా బలవంతంగా తప్పుదారిలో వేయడని దీని అర్థం.
2. ఈ విధంగా ప్రజలు తమ ప్రమాణాలను తెంపుకొని, ఇతరులను మోసగించటానికి పాల్పడితే సమాజంలో ఒకరిపై ఒకరికి ఏ విధమైన విశ్వాసం ఉండదు, అన్యాయం మరియు దౌర్జన్యం నెలకొంటాయి.

مَنْ عَمِلَ صَٰلِحًا مِّن ذَكَرٍ أَوْ أُنثَىٰ وَهُوَ مُؤْمِنٌ فَلَنُحْيِيَنَّهُۥ حَيَوٰةً طَيِّبَةً ۖ وَلَنَجْزِيَنَّهُمْ أَجْرَهُم بِأَحْسَنِ مَا كَانُوا۟ يَعْمَلُونَ ﴿٩٧﴾

**97**. ఏ పురుషుడూ గానీ, లేక స్త్రీ గానీ విశ్వాసులై, సత్కార్యాలు చేస్తే, అలాంటి వారిని మేము తప్పక (ఇహలోకంలో) మంచి జీవితం గడిపేలా చేస్తాము.[1] మరియు వారికి (పరలోకంలో) వారు చేసిన సత్కార్యాలకు ఉత్తమ ప్రతిఫలం తప్పక ప్రసాదిస్తాము.

فَإِذَا قَرَأْتَ ٱلْقُرْءَانَ فَٱسْتَعِذْ بِٱللَّهِ مِنَ ٱلشَّيْطَٰنِ ٱلرَّجِيمِ ﴿٩٨﴾

**98**. కావున నీవు ఖుర్ఆన్ పఠించబోయే టప్పుడు శపించ(బహిష్కరించ)బడిన షై'తాన్‌నుండి (రక్షణ పొందటానికి) అల్లాహ్ శరణు వేడుకో![2]

إِنَّهُۥ لَيْسَ لَهُۥ سُلْطَٰنٌ عَلَى ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَلَىٰ رَبِّهِمْ يَتَوَكَّلُونَ ﴿٩٩﴾

**99**. విశ్వసించి, తమ ప్రభువును నమ్ముకున్న వారిపై నిశ్చయంగా, వాడికి ఎలాంటి అధికారం ఉండదు.

إِنَّمَا سُلْطَٰنُهُۥ عَلَى ٱلَّذِينَ يَتَوَلَّوْنَهُۥ وَٱلَّذِينَ هُم بِهِۦ مُشْرِكُونَ ﴿١٠٠﴾

**100**. కాని! నిశ్చయంగా, వాడి (షై'తాన్) వైపుకు మరలి వాడిని అనుసరించే (స్నేహం చేసుకునే) వారిపై[3] మరియు ఆయన (అల్లాహ్)కు సాటికల్పించే వారిపై, వాడికి అధికారం ఉంటుంది.

وَإِذَا بَدَّلْنَآ ءَايَةً مَّكَانَ ءَايَةٍ ۙ وَٱللَّهُ أَعْلَمُ بِمَا يُنَزِّلُ قَالُوٓا۟ إِنَّمَآ أَنتَ مُفْتَرٍۭ ۚ بَلْ أَكْثَرُهُمْ لَا يَعْلَمُونَ ﴿١٠١﴾

**101**. మరియు మేము ఒక సందేశాన్ని (ఆయత్‌ను) మార్చి దాని స్థానంలో మరొక సందేశాన్ని అవతరింపజేసినప్పుడు;[4] తాను దేన్ని ఎప్పుడు అవతరింపజేశాడో అల్లాహ్‌కు బాగా తెలుసు. (అయినా) వారు (సత్యతిరస్కారులు) ఇలా అంటారు: "నిశ్చయంగా, నీవే (ఓ ము'హమ్మద్!) దీనిని కల్పించేవాడవు." అసలు వారిలో చాలా మంది (యథార్థం) తెలుసుకోలేరు.

1. చూడండి, 20:124.
2. ఈ ఆయత్ దైవప్రవక్త ('స'అస)ను సంబోధిస్తుంది. కాని ఇది విశ్వాసులందరి కొరకు ఉంది. కావున ప్రతివాడు ఖుర్ఆన్ చదవటం ప్రారంభించేటప్పుడు: 'బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్'కు ముందు, **'అ'ఊజుబిల్లాహి మినష్షైతా నిర్రజీమ్.'** తప్పక చదవాలి.
3. చూడండి, 14:22.
4. చూడండి, 2:106, 13:39, 41:42.

**102**. వారితో అను: "దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) నీ ప్రభువు వద్దనుండి సత్యంతో, విశ్వాసులను (విశ్వాసంలో) పటిష్ఠం చేయటానికి మరియు (అల్లాహ్‌కు) సంపూర్ణంగా విధేయులుగా ఉన్న వారికి (ముస్లింలకు) సన్మార్గం చూపటానికి మరియు శుభవార్త అందజేయటానికి, పరిశుద్ధాత్మ (జిబ్రీల్)[1] క్రమక్రమంగా ఉన్నది ఉన్నట్లుగా తీసుకొని వచ్చాడు."

قُلْ نَزَّلَهُۥ رُوحُ ٱلْقُدُسِ مِن رَّبِّكَ بِٱلْحَقِّ لِيُثَبِّتَ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَهُدًى وَبُشْرَىٰ لِلْمُسْلِمِينَ ﴿١٠٢﴾

**103**. మరియు: "నిశ్చయంగా, ఇతనికి ఒక మనిషి నేర్పుతున్నాడు."[2] అని, వారు అనే విషయం మాకు బాగా తెలుసు. వారు సూచించే (అపార్థం చేసే) వ్యక్తి భాష పరాయి భాష. కాని ఈ (ఖుర్ఆన్) భాష స్వచ్ఛమైన 'అరబ్బీ భాష.[3]

وَلَقَدْ نَعْلَمُ أَنَّهُمْ يَقُولُونَ إِنَّمَا يُعَلِّمُهُۥ بَشَرٌ ۗ لِّسَانُ ٱلَّذِى يُلْحِدُونَ إِلَيْهِ أَعْجَمِىٌّ وَهَٰذَا لِسَانٌ عَرَبِىٌّ مُّبِينٌ ﴿١٠٣﴾

**104**. నిశ్చయంగా, ఎవరైతే అల్లాహ్ సందేశాలను (ఆయాత్), విశ్వసించరో! వారికి అల్లాహ్ సన్మార్గం చూపడు మరియు వారికి బాధాకరమైన శిక్ష ఉంటుంది.

إِنَّ ٱلَّذِينَ لَا يُؤْمِنُونَ بِـَٔايَٰتِ ٱللَّهِ لَا يَهْدِيهِمُ ٱللَّهُ وَلَهُمْ عَذَابٌ أَلِيمٌ ﴿١٠٤﴾

**105**. నిశ్చయంగా, అల్లాహ్ సూచనలను (ఆయాత్) విశ్వసించని వారు, అబద్ధాలను కల్పిస్తున్నారు. మరియు అలాంటి వారు! వారే, అసత్యవాదులు.

إِنَّمَا يَفْتَرِى ٱلْكَذِبَ ٱلَّذِينَ لَا يُؤْمِنُونَ بِـَٔايَٰتِ ٱللَّهِ ۖ وَأُو۟لَٰٓئِكَ هُمُ ٱلْكَٰذِبُونَ ﴿١٠٥﴾

---

**1**. జిబ్రీల్ ('అ.స.)ను సంబోధిస్తూ, రూ'హుల్ ఖుద్స్, అని, ఖుర్ఆన్‌లో నాలుగు సార్లు వచ్చింది, ఇక్కడ మరియు 2:87, 253; 5:110లలో. రూ'హుల్ అమీన్, అని 26:193లో వచ్చింది. రూ'హ్, అని మూడు సార్లు, 78:38, 19:17, 97:4లలో వచ్చింది. కాని 16:2, 42:52లలో మాత్రం రూ'హ్, దివ్యజ్ఞానం అనే అర్థం ఇస్తుంది.

**2**. కొందరు బానిస యూదులు మరియు క్రైస్తవులు ముస్లింలు అయ్యారు. వారికి కొంత బైబిల్ జ్ఞానముండెను. మక్కా ముష్రిక్‌లు అనే వారు: 'వారి నుండియే ము'హమ్మద్ ('స'అస) ఖుర్ఆన్ నేర్చుకున్నారు.' అని.

**3**. దానికి అల్లాహ్ (సు.తా.) అంటున్నాడు: 'వారి 'అరబ్బీ భాషైతే స్వచ్ఛమైనది కాదు మరియు ఈ ఖుర్ఆన్ స్వచ్ఛమైన 'అరబ్బీ భాషలో ఉంది.' అని.

مَن كَفَرَ بِٱللَّهِ مِنۢ بَعۡدِ إِيمَٰنِهِۦٓ إِلَّا مَنۡ أُكۡرِهَ وَقَلۡبُهُۥ مُطۡمَئِنُّۢ بِٱلۡإِيمَٰنِ وَلَٰكِن مَّن شَرَحَ بِٱلۡكُفۡرِ صَدۡرٗا فَعَلَيۡهِمۡ غَضَبٞ مِّنَ ٱللَّهِ وَلَهُمۡ عَذَابٌ عَظِيمٞ ١٠٦

**106**. ఎవడైతే విశ్వసించిన తరువాత, అల్లాహ్‌ను తిరస్కరిస్తాడో - తన హృదయం సంతృప్తికరమైన విశ్వాసంతో నిండిఉండి, బలవంతంగా తిరస్కరించే వాడు తప్ప[1] - మరియు ఎవరైతే హృదయపూర్వకంగా సత్యతిరస్కారానికి పాల్పడుతారో! అలాంటి వారిపై అల్లాహ్ ఆగ్రహం (దూషణ) విరుచుకుపడుతుంది మరియు వారి కొరకు ఘోరమైన శిక్ష ఉంటుంది.

ذَٰلِكَ بِأَنَّهُمُ ٱسۡتَحَبُّواْ ٱلۡحَيَوٰةَ ٱلدُّنۡيَا عَلَى ٱلۡأٓخِرَةِ وَأَنَّ ٱللَّهَ لَا يَهۡدِي ٱلۡقَوۡمَ ٱلۡكَٰفِرِينَ ١٠٧

**107**. ఇది ఎందుకంటే! నిశ్చయంగా, వారు పరలోక జీవితం కంటే ఇహలోక జీవితాన్నే ఎక్కువగా ప్రేమించటం మరియు నిశ్చయంగా, అల్లాహ్ సత్యతిరస్కారులకు సన్మార్గం చూపడు.

أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ طَبَعَ ٱللَّهُ عَلَىٰ قُلُوبِهِمۡ وَسَمۡعِهِمۡ وَأَبۡصَٰرِهِمۡۖ وَأُوْلَٰٓئِكَ هُمُ ٱلۡغَٰفِلُونَ ١٠٨

**108**. ఇలాంటి వారి హృదయాల మీదా, చెవుల మీదా మరియు కన్నుల మీదా అల్లాహ్ ముద్రవేసి ఉన్నాడు.[2] మరియు ఇలాంటి వారే నిర్లక్ష్యంలో మునిగి ఉన్నవారు!

لَا جَرَمَ أَنَّهُمۡ فِي ٱلۡأٓخِرَةِ هُمُ ٱلۡخَٰسِرُونَ ١٠٩

**109**. నిశ్చయంగా పరలోకంలో నష్టానికి గురికాగలవారు వీరే, అని అనటంలో ఎలాంటి సందేహం లేదు.

---

**1**. తన హృదయంలో దృఢవిశ్వాసం ఉండి - కేవలం సత్యతిరస్కారుల శిక్షకు తాళలేక - తనను తాను సత్యతిరస్కారిగా చెప్పుకునే వాడిపై ఎట్టి నిందలేదు. ఇస్లాం కొరకు చంపబడటం ఎంతో గొప్ప పుణ్యకార్యం. అయినా ఖుర్ఆన్‌లో అనేక చోట్లలో: 'అల్లాహ్ (సు.తా.) మానవునిపై అతని శక్తికి మించిన భారం వేయడు.' అని చెప్పబడింది. చూడండి, 2:233, 286; 6:152, 7:42, 23:62 వగైరా. కావున ఈ విడుదల ఇవ్వబడింది.

**2**. చూడండి, 2:7, 6:25.

ثُمَّ إِنَّ رَبَّكَ لِلَّذِينَ هَاجَرُواْ مِنۢ بَعۡدِ مَا فُتِنُواْ ثُمَّ جَٰهَدُواْ وَصَبَرُوٓاْ إِنَّ رَبَّكَ مِنۢ بَعۡدِهَا لَغَفُورٞ رَّحِيمٞ ١١٠

110. ఇక నిశ్చయంగా, నీ ప్రభువు! వారి కొరకు, ఎవరైతే మొదట పరీక్షకు గురి చేయబడి, పిదప (తమ ఇల్లూ వాకిలి విడిచి) వలసపోయి, తరువాత ధర్మ పోరాటంలో పాల్గొంటారో మరియు సహనం వహిస్తారో![1] దాని తరువాత నిశ్చయంగా, అలాంటి వారి కొరకు నీ ప్రభువు! ఎంతో క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత. (7/8)

۞ يَوۡمَ تَأۡتِي كُلُّ نَفۡسٖ تُجَٰدِلُ عَن نَّفۡسِهَا وَتُوَفَّىٰ كُلُّ نَفۡسٖ مَّا عَمِلَتۡ وَهُمۡ لَا يُظۡلَمُونَ ١١١

111. * ఆ దినమును (జ్ఞాపక ముంచుకోండి), ఎప్పుడైతే ప్రతి ప్రాణి కేవలం తన స్వంతం కొరకే బ్రతిమాలు కొంటుందో![2] ప్రతిప్రాణికి దాని కర్మలకు తగిన ప్రతిఫలం ఇవ్వబడుతుంది మరియు వారికెలాంటి అన్యాయం జరుగదు.[3]

وَضَرَبَ ٱللَّهُ مَثَلٗا قَرۡيَةٗ كَانَتۡ ءَامِنَةٗ مُّطۡمَئِنَّةٗ يَأۡتِيهَا رِزۡقُهَا رَغَدٗا مِّن كُلِّ مَكَانٖ فَكَفَرَتۡ بِأَنۡعُمِ ٱللَّهِ فَأَذَٰقَهَا ٱللَّهُ لِبَاسَ ٱلۡجُوعِ وَٱلۡخَوۡفِ بِمَا كَانُواْ يَصۡنَعُونَ ١١٢

112. మరియు అల్లాహ్ ఒక నగరపు ఉపమానం ఇస్తున్నాడు: మొదట అది (ఆ నగరం) శాంతి భద్రతలతో నిండి ఉండేది. దానికి (ప్రజలకు) ప్రతి దిక్కునుండి జీవనోపాధి పుష్కలంగా లభిస్తూఉండేది. తరువాత (ఆ నగరపు) వారు అల్లాహ్ అనుగ్రహాలను తిరస్కరించారు (కృతఘ్ను లయ్యారు), కావున అల్లాహ్ వారి చర్యలకు బదులుగా వారికి ఆకలీ, భయమూ వంటి ఆపదల రుచి చూపించాడు.

---

1. ఇది మక్కాలో మున్ముందు ఇస్లాం స్వీకరించిన తరువాత, ముష్రికీన్ మక్కా యొక్క దౌర్జన్యాలను సహించలేక 'హబషా మరియు మదీనాకు వలసపోయిన వారి విషయం.
2. పునరుత్థాన దినమున, ఒకరు మరొకరిని గురించి పట్టించుకోరు. తల్లిదండ్రులు తమ సంతానాన్ని లెక్కచేయరు. మరియు సంతానం తమ తోబుట్టిన వారిని గానీ, తల్లిదండ్రులను గానీ పట్టించుకోరు. ఇంకా చూడండి, 80:37.
3. పుణ్యం చేసినవారికి, అల్లాహ్ (సు.తా.) కరుణిస్తే ఎన్నోరెట్లు అధికంగా పుణ్యఫలితం ప్రసాదిస్తాడు. కాని పాపం చేసిన వారికి దానంతట శిక్ష మాత్రమే విధిస్తాడు. శిక్షించుటలో ఎలాంటి అన్యాయం జరుగదు.

وَلَقَدۡ جَآءَهُمۡ رَسُولٞ مِّنۡهُمۡ فَكَذَّبُوهُ فَأَخَذَهُمُ ٱلۡعَذَابُ وَهُمۡ ظَٰلِمُونَ ١١٣

**113**. మరియు వాస్తవంగా వారివద్దకు వారి (జాతి) నుండి ఒక ప్రవక్త వచ్చి ఉన్నాడు, కాని వారు అతనిని అసత్యవాదుడవని తిరస్కరించారు. కావున వారు దుర్మార్గంలో మునిగి ఉన్నప్పుడు వారిని శిక్ష పట్టుకున్నది.

فَكُلُواْ مِمَّا رَزَقَكُمُ ٱللَّهُ حَلَٰلٗا طَيِّبٗا وَٱشۡكُرُواْ نِعۡمَتَ ٱللَّهِ إِن كُنتُمۡ إِيَّاهُ تَعۡبُدُونَ ١١٤

**114**. కావున మీరు అల్లాహ్‌నే ఆరాధించేవారైతే ఆయన మీ కొరకు ప్రసాదించిన ధర్మసమ్మతమైన, పరిశుద్ధమైన ఆహారాలనే తినండి మరియు అల్లాహ్ అనుగ్రహాలకు కృతజ్ఞతలు చూపండి.

إِنَّمَا حَرَّمَ عَلَيۡكُمُ ٱلۡمَيۡتَةَ وَٱلدَّمَ وَلَحۡمَ ٱلۡخِنزِيرِ وَمَآ أُهِلَّ لِغَيۡرِ ٱللَّهِ بِهِۦۖ فَمَنِ ٱضۡطُرَّ غَيۡرَ بَاغٖ وَلَا عَادٖ فَإِنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٞ ١١٥

**115**. నిశ్చయంగా, ఆయన మీ కొరకు (దానంతట అది) చచ్చిన పశువు, రక్తం, పందిమాంసం, అల్లాహ్ తప్ప ఇతరుల కొరకు జి'బహ్ చేయబడిన జంతువు (మాంసాన్ని) నిషేధించి ఉన్నాడు. కాని ఎవడైనా (అల్లాహ్) నియమాలను ఉల్లంఘించే ఉద్దేశంతో కాక, (ఆకలికి) తాళలేక, గత్యంతరంలేని పరిస్థితిలో (తింటే)! నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.[1]

وَلَا تَقُولُواْ لِمَا تَصِفُ أَلۡسِنَتُكُمُ ٱلۡكَذِبَ هَٰذَا حَلَٰلٞ وَهَٰذَا حَرَامٞ لِّتَفۡتَرُواْ عَلَى ٱللَّهِ ٱلۡكَذِبَۚ إِنَّ ٱلَّذِينَ يَفۡتَرُونَ عَلَى ٱللَّهِ ٱلۡكَذِبَ لَا يُفۡلِحُونَ ١١٦

**116**. అల్లాహ్ మీద అబద్ధాలు కల్పిస్తూ: "ఇది ధర్మసమ్మతం, ఇది నిషిద్ధం!" అని మీ నోటికొచ్చినట్లు (మనస్సులకు తోచినట్లు) అబద్ధాలు పలకకండి. నిశ్చయంగా, అల్లాహ్‌పై అబద్ధాలు కల్పించేవారు ఎన్నడూ సాఫల్యం పొందరు.

مَتَٰعٞ قَلِيلٞ وَلَهُمۡ عَذَابٌ أَلِيمٞ ١١٧

**117**. దీనితో కొంతవరకు సుఖ సంతోషాలు కలుగవచ్చు, కాని వారికి బాధాకరమైన శిక్ష ఉంటుంది.

---

1. ఈ రెండూ 114,115 ఆయతులు, 2:172,173 ఆయతులను పోలిఉన్నాయి. చూడండి, 6:145.

**118**. మరియు మేము నీకు ప్రస్తావించిన వాటిని, ఇంతకు ముందు యూదులకు నిషేధించాము. మరియు మేము వారికి అన్యాయం చేయలేదు, కాని వారే తమకు తాము అన్యాయం చేసుకుంటుండేవారు.[1]

وَعَلَى ٱلَّذِينَ هَادُواْ حَرَّمۡنَا مَا قَصَصۡنَا عَلَيۡكَ مِن قَبۡلُۖ وَمَا ظَلَمۡنَٰهُمۡ وَلَٰكِن كَانُوٓاْ أَنفُسَهُمۡ يَظۡلِمُونَ ﴿١١٨﴾

**119**. అయితే నిశ్చయంగా, నీ ప్రభువు - ఎవరైతే అజ్ఞానంలో పాపాలు చేసి, ఆ పిదప పశ్చాత్తాపపడి, సరిదిద్దుకుంటారో - దాని (ఆ పశ్చాత్తాపం) తరువాత (వారిని క్షమిస్తాడు); నిశ్చయంగా, నీ ప్రభువు క్షమించేవాడు, అపార కరుణాప్రదాత.

ثُمَّ إِنَّ رَبَّكَ لِلَّذِينَ عَمِلُواْ ٱلسُّوٓءَ بِجَهَٰلَةٖ ثُمَّ تَابُواْ مِنۢ بَعۡدِ ذَٰلِكَ وَأَصۡلَحُوٓاْ إِنَّ رَبَّكَ مِنۢ بَعۡدِهَا لَغَفُورٞ رَّحِيمٌ ﴿١١٩﴾

**120**. నిశ్చయంగా, ఇబ్రాహీమ్ (ఒక్కడే) అల్లాహ్‌కు భక్తిపరుడై, ఏకదైవ సిద్ధాంతాన్ని (సత్యధర్మాన్ని) స్థాపించటంలో తనకుతానే ఒక సమాజమై ఉండెను.[2] అతను అల్లాహ్‌కు సాటి కల్పించేవారిలో ఎన్నడూ చేరలేదు.

إِنَّ إِبۡرَٰهِيمَ كَانَ أُمَّةٗ قَانِتٗا لِّلَّهِ حَنِيفٗا وَلَمۡ يَكُ مِنَ ٱلۡمُشۡرِكِينَ ﴿١٢٠﴾

**121**. ఆయన (అల్లాహ్) యొక్క అనుగ్రహాలకు కృతజ్ఞుడై ఉండేవాడు. ఆయన (అల్లాహ్) అతనిని (తన స్నేహితునిగా) ఎన్నుకొని, అతనికి ఋజుమార్గం వైపుకు మార్గదర్శకత్వం చేశాడు.

شَاكِرٗا لِّأَنۡعُمِهِۚ ٱجۡتَبَٰهُ وَهَدَىٰهُ إِلَىٰ صِرَٰطٖ مُّسۡتَقِيمٖ ﴿١٢١﴾

**122**. మేము అతనికి ఇహలోకంలో మంచి స్థితిని ప్రసాదించాము. మరియు నిశ్చయంగా, అతను పరలోకంలో సద్వర్తనులతో పాటు ఉంటాడు.

وَءَاتَيۡنَٰهُ فِي ٱلدُّنۡيَا حَسَنَةٗۖ وَإِنَّهُۥ فِي ٱلۡأٓخِرَةِ لَمِنَ ٱلصَّٰلِحِينَ ﴿١٢٢﴾

---

**1**. యూదులకు విధించిన ఆహారపదార్థాల నిషేధాలు వారి అన్యాయ ప్రవర్తన కారణంగా ఉండెను. చూడండి, 3:93, 6:146, 4:160.

**2**. లేక ఒక నాయకుడై ఉండెను. ఇంకా చూడండి, 4:125.

ثُمَّ أَوۡحَيۡنَآ إِلَيۡكَ أَنِ ٱتَّبِعۡ مِلَّةَ إِبۡرَٰهِيمَ حَنِيفٗاۖ وَمَا كَانَ مِنَ ٱلۡمُشۡرِكِينَ ١٢٣

**123**. తరువాత మేము నీకు (ఓ ము'హమ్మద్!) ఈ సందేశాన్ని పంపాము: "నీవు ఇబ్రాహీమ్ అనుసరించిన, ఏకదైవ సిద్ధాంతాన్ని (సత్యధర్మాన్ని) అనుసరించు. అతను (ఇబ్రాహీమ్) అల్లాహ్‌కు సాటి కల్పించే వారిలోని వాడు కాడు."

إِنَّمَا جُعِلَ ٱلسَّبۡتُ عَلَى ٱلَّذِينَ ٱخۡتَلَفُواْ فِيهِۚ وَإِنَّ رَبَّكَ لَيَحۡكُمُ بَيۡنَهُمۡ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ فِيمَا كَانُواْ فِيهِ يَخۡتَلِفُونَ ١٢٤

**124**. వాస్తవానికి, శనివార శాసనం (సబ్త్) విషయంలో అభిప్రాయభేదాలు కలిగి ఉన్నవారికే అది విధించబడింది. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు! పునరుత్థాన దినమున వారి మధ్య ఉన్న భిన్నాభిప్రాయాలను గురించి తీర్పుచేస్తాడు.

ٱدۡعُ إِلَىٰ سَبِيلِ رَبِّكَ بِٱلۡحِكۡمَةِ وَٱلۡمَوۡعِظَةِ ٱلۡحَسَنَةِۖ وَجَٰدِلۡهُم بِٱلَّتِي هِيَ أَحۡسَنُۚ إِنَّ رَبَّكَ هُوَ أَعۡلَمُ بِمَن ضَلَّ عَن سَبِيلِهِۦ وَهُوَ أَعۡلَمُ بِٱلۡمُهۡتَدِينَ ١٢٥

**125**. (ప్రజలను) వివేకంతోనూ, మంచి ఉపదేశం(ప్రచారం)తోనూ నీ ప్రభువు మార్గం వైపునకు ఆహ్వానించు. మరియు వారితో ఉత్తమరీతిలో వాదించు.[1] నిశ్చయంగా, నీ ప్రభువుకు తన మార్గంనుండి భ్రష్టుడైనవాడెవడో తెలుసు. మరియు మార్గదర్శకత్వం పొందిన వాడెవడో కూడా ఆయనకు బాగా తెలుసు.

وَإِنۡ عَاقَبۡتُمۡ فَعَاقِبُواْ بِمِثۡلِ مَا عُوقِبۡتُم بِهِۦۖ وَلَئِن صَبَرۡتُمۡ لَهُوَ خَيۡرٞ لِّلصَّٰبِرِينَ ١٢٦

**126**. మరియు మీరు (మీ ప్రత్యర్థులను) శిక్షించదలచుకుంటే, మీకు జరిగిన దానికి (అన్యాయానికి) సమానమైన శిక్ష మాత్రమే ఇవ్వండి. కాని మీరు సహనం వహిస్తే నిశ్చయంగా, సహనం వహించేవారికి ఎంతో మేలు కలుగుతుంది.

---

**1**. ఇదే విధమైన ఆయత్‌కు చూడండి, 29:46. 'ధర్మం విషయంలో బలవంతం లేదు.' 2:256.

وَٱصۡبِرۡ وَمَا صَبۡرُكَ إِلَّا بِٱللَّهِۚ وَلَا تَحۡزَنۡ عَلَيۡهِمۡ وَلَا تَكُ فِي ضَيۡقٖ مِّمَّا يَمۡكُرُونَ ١٢٧

**127**. (ఓ ముహమ్మద్!) నీవు సహనం వహించు మరియు నీకు సహనమిచ్చే వాడు కేవలం అల్లాహ్ మాత్రమే. మరియు వారిని గురించి దుఃఖపడకు మరియు వారు పన్నే కుట్రలకు నీవు వ్యాకులపడకు.

إِنَّ ٱللَّهَ مَعَ ٱلَّذِينَ ٱتَّقَواْ وَّٱلَّذِينَ هُم مُّحۡسِنُونَ ١٢٨

**128**. నిశ్చయంగా, అల్లాహ్ భయభక్తులు గలవారితో మరియు సజ్జనులైనవారితో పాటు ఉంటాడు.

*****

## 17. సూరహ్ అల్-ఇస్రా'  سورَةُ الإِسْرَاءِ

ఇస్రాయీల్ సంతతివారి విషయం 2-8 మరియు 101-104 ఆయత్‌లలో వచ్చినందుకు కొందరు దీనిని **సూరహ్ బనీ ఇస్రాయీ'ల్** అని కూడా అంటారు. ఇస్రా' - **రాత్రి ప్రయాణం**, అంటే దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)ను మక్కా ముకర్రమా నుండి బైతుల్-మఖ్దిస్‌కు తీసుకుపోబడిన రాత్రి ప్రయాణం. ఈ పదం **మొదటి ఆయత్‌లో** ఉంది. 'స'హీ'హ్ బు'ఖారీలో, 'అబ్దుల్లాహ్ బిన్-మస్'ఊద్ (ర'ది.'అ.) కథనం ప్రకారం సూరాహ్‌లు అల్-కహఫ్ (18), మర్యమ్ (19) మరియు ఇస్రా'(17) మొట్టమొదట అవతరింపజేయబడిన **మక్కా** సూరాహ్‌లలోనివి. ఇందులో **111 ఆయతులు** ఉన్నాయి. 'ఆయి'షహ్ (ర.అన్హా) కథనం: 'దైవప్రవక్త ('స'అస) ఈ సూరహ్ మరియు సూరహ్ అజ్-'జుమర్(39)లను ప్రతిరాత్రి నమా'జ్‌లో చదివేవారు.' (తిర్మిజీ', 292, 3405; నసాయీ', ఇబ్నె-'హంబల్; అల్బానీ ప్రమాణీకం, పు. 2, 'హ.నం. 641).

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1.** (*) తన దాసుణ్ణి (ము'హమ్మద్‌ను), మస్జిద్ అల్-'హరామ్ (మక్కా ముకర్రమా) నుండి పరిసరాలను శుభవంతంచేసిన మస్జిద్ అల్-అ'ఖ్సా (బైతుల్-మఖ్దిస్) వరకు **రాత్రివేళ తీసుకొనిపోయిన** ఆయన (అల్లాహ్) సర్వలోపాలకు అతీతుడు. ఇది మేము అతనికి మా కొన్ని నిదర్శనా (ఆయతు)లను చూపటానికి చేశాము.[1]

سُبۡحَٰنَ ٱلَّذِيٓ أَسۡرَىٰ بِعَبۡدِهِۦ لَيۡلٗا مِّنَ ٱلۡمَسۡجِدِ ٱلۡحَرَامِ إِلَى ٱلۡمَسۡجِدِ ٱلۡأَقۡصَا ٱلَّذِي بَٰرَكۡنَا حَوۡلَهُۥ لِنُرِيَهُۥ مِنۡ ءَايَٰتِنَآۚ إِنَّهُۥ هُوَ ٱلسَّمِيعُ ٱلۡبَصِيرُ ١

---

**1**. '*ఈ ప్రయాణాన్ని మేము మా దాసునికి కొన్ని అద్భుత నిదర్శనాలు, సంకేతాలను చూపటానికి చేయించాము.*' ఇంత దూరప్రయాణం రాత్రిపూట స్వల్పకాలంలో పూర్తి చేయించడం కూడా ఒక అద్భుత సూచనయే. ఈ ప్రయాణం రెండు భాగాలలో ఉంది.

(**1**) మొదటి భాగం: ఇస్రా': జిబ్రీల్ ('అ.స.) తెచ్చిన బుర్రాఖ్ పై ఎక్కి అతనితో బాటు, మక్కా ముకర్రమా నుండి బైతుల్-మఖ్దిస్‌కు రాత్రి పూట పయనించడం. అక్కడ మహాప్రవక్త ('స'అస) సర్వ దైవప్రవక్త ('అలైహిమ్ స.)లకు ఇమాముగా నిలిచి) నమా'జ్ చేయించడం.

(**2**) రెండోభాగం, మే'రాజ్: అంటే పైకి ఎక్కించబడటం, లేక పైకి తీసుకుని పోబడటం. బైతుల్-మఖ్దిస్ నుండి ఆకాశాలలోనికి, చివరకు సిద్రతుల్-మున్‌తహా వరకు పోయిన ప్రయాణం. అది 'అర్ష్ క్రింద ఏడవ ఆకాశంపై ఉంది. అక్కడ అతనికి ('స'అస)

నిశ్చయంగా, ఆయన సర్వం వినేవాడు, సర్వం చూసేవాడు.

وَءَاتَيۡنَا مُوسَى ٱلۡكِتَٰبَ وَجَعَلۡنَٰهُ هُدٗى لِّبَنِيٓ إِسۡرَٰٓءِيلَ أَلَّا تَتَّخِذُواْ مِن دُونِي وَكِيلٗا ٢

2. మరియు మేము మూసాకు గ్రంథాన్ని ఇచ్చాము.[1] మరియు దానిని ఇస్రాయీ'ల్ సంతతి వారికి మార్గదర్శినిగా చేసి, దాని ద్వారా ఇలా ఆజ్ఞాపించాము: "నన్ను (అల్లాహ్‌ను) తప్ప మరెవ్వరినీ సంరక్షకునిగా (కార్యసాధకునిగా) చేసుకోవద్దు.

ذُرِّيَّةَ مَنۡ حَمَلۡنَا مَعَ نُوحٍۚ إِنَّهُۥ كَانَ عَبۡدٗا شَكُورٗا ٣

3. "మేము నూ'హ్‌తోబాటు ఓడలో ఎక్కించిన వారి సంతతి వారలారా! నిశ్చయంగా అతను (నూ'హ్) కృతజ్ఞుడైన దాసుడు."

وَقَضَيۡنَآ إِلَىٰ بَنِيٓ إِسۡرَٰٓءِيلَ فِي ٱلۡكِتَٰبِ لَتُفۡسِدُنَّ فِي ٱلۡأَرۡضِ مَرَّتَيۡنِ وَلَتَعۡلُنَّ عُلُوّٗا كَبِيرٗا ٤

4. మరియు మేము గ్రంథంలో ఇస్రాయీ'ల్ సంతతి వారిని ఇలా హెచ్చరించాము: "మీరు భువిలో రెండు సార్లు సంక్షోభాన్ని రేకెత్తిస్తారు, మరియు గొప్ప అహంకారాన్ని ప్రదర్శిస్తారు!"

---

అల్లాహుతా'ఆలా వ'హీ ద్వారా నమా'జ్ మరియు ఇతర ఆదేశాలు ఇచ్చాడు. ఆ విషయాలు 'స'హీ'హ్ 'హదీస్'లలో పేర్కొనబడ్డాయి. మే'రాజ్‌ను గురించి కొంతవరకు సూరహ్ అన్-నజ్మ్ (53)లో కూడ ఉంది. మే'రాజ్ సమయంలో దైవప్రవక్త ('స'అస), ఆకాశాలలో ఇతర ప్రవక్తలతో కలుసుకున్నారు. ఈ ప్రయాణం దైవప్రవక్త పూర్తిచేసింది కలలో కాదు. అతను శారీరకంగా మేల్కొని ఉండి, పూర్తి స్పృహలో ఉన్న స్థితిలో (Bodily, Fully awake and with Full Consciousness and orientation of Mind) చేశారు. ఈ ప్రయాణం అల్లాహుతా'ఆలా ఆజ్ఞతో జరిగింది. అల్లాహ్ (సు.తా.) తానుకోరినది చేస్తాడు. ఇది జరిగిన కాలం మరియు తేదీలలో భిన్నాభిప్రాయాలున్నాయి. కొందరు రబీ'అ అల్-అవ్వల్ 17 లేక 27వ తేదీలలో అని, మరికొందరు రజబ్ 27అని, మరి కొందరు ఇతర నెలలని కూడా అంటారు (ఫ'త్హ్ అల్-ఖదీర్).

1. అల్లాహుతా'ఆలా మూసా ('అ.స.)తో సూటిగా మాట్లాడినదానికి చూడండి, 4:164, 7:144.

فَإِذَا جَآءَ وَعۡدُ أُولَىٰهُمَا بَعَثۡنَا عَلَيۡكُمۡ عِبَادٗا لَّنَآ أُوْلِي بَأۡسٖ شَدِيدٖ فَجَاسُواْ خِلَٰلَ ٱلدِّيَارِۚ وَكَانَ وَعۡدٗا مَّفۡعُولٗا ٥

5. ఇక ఆ రెంటిలో మొదటి వాగ్దానం రాగా మేము మీపై ఘోర యుద్ధనిపుణులైన మా దాసులను పంపాము.[1] వారు మీ గృహాలలోకి దూసుకెళ్ళారు. మరియు ఈ విధంగా మా వాగ్దానం నెరవేర్చబడింది.

ثُمَّ رَدَدۡنَا لَكُمُ ٱلۡكَرَّةَ عَلَيۡهِمۡ وَأَمۡدَدۡنَٰكُم بِأَمۡوَٰلٖ وَبَنِينَ وَجَعَلۡنَٰكُمۡ أَكۡثَرَ نَفِيرًا ٦

6. ఆ తరువాత మేము మీకు వారిపై మరల ప్రాబల్యం వహించే అవకాశం కలిగించాము మరియు సంపదతోనూ మరియు సంతానంతోనూ మీకు సహాయం చేశాము మరియు మీ సంఖ్యాబలాన్ని కూడా పెంచాము.

إِنۡ أَحۡسَنتُمۡ أَحۡسَنتُمۡ لِأَنفُسِكُمۡۖ وَإِنۡ أَسَأۡتُمۡ فَلَهَاۚ فَإِذَا جَآءَ وَعۡدُ ٱلۡأٓخِرَةِ لِيَسُـُٔواْ وُجُوهَكُمۡ وَلِيَدۡخُلُواْ ٱلۡمَسۡجِدَ كَمَا دَخَلُوهُ أَوَّلَ مَرَّةٖ وَلِيُتَبِّرُواْ مَا عَلَوۡاْ تَتۡبِيرًا ٧

7. (మరియు మేము అన్నాము): "ఒకవేళ మీరు మేలుచేస్తే అది మీ స్వయంకొరకే మేలుచేసుకొన్నట్లు. మరియు ఒకవేళ మీరు కీడుచేస్తే అది మీ కొరకే!" పిదప రెండవ వాగ్దానం రాగా మీ ముఖాలను (మిమ్మల్ని) అవమానపరచటానికి, మొదటి సారి వారు మస్జిద్ అల్-అ'ఖ్సాలో దూరినట్లు, మరల దూరటానికి మరియు వారికి అందిన ప్రతి దానిని నాశనం చేయటానికి (మీ శత్రువులను మీపైకి పంపాము).[2]

---

1. మొదటి శిక్ష దాదాపు క్రీస్తు శక ఆరంభానికి 600 సంవత్సరాలకు ముందు వచ్చింది. ఇది బాబిలోనియన్ పాలకుడు బ'ఖ్త్ న'స్ర్ ఇస్రాయీ'ల్ సంతతివారిపై జెరూసలంలో చేసిన దౌర్జన్యం. అతడు ఎంతో మంది యూదులను చంపి మిగిలిన వారిని ఖైదీలుగా, బానిసలుగా చేసుకున్నాడు. ఈ శిక్ష వారు దైవప్రవక్తలను చంపినందుకు మరియు తౌరాత్ ఆజ్ఞలను ఉల్లంఘించినందుకు పడింది. కొందరి అభిప్రాయంలో ఈ రాజు జాలూత్. ఆ తరువాత 'తాలూత్ సైన్యాధిపత్యంలో ఉన్న దావూద్ ('అ.స.) జాలూత్‌ను సంహరించి వారికి విముక్తి కలిగించారు.
2. రెండవసారి యూదులు అత్యాచారాలు చేశారు. జ'కరియ్యా ('అ.స.)ను చంపారు. ఏసు క్రీస్తును సిలువపై ఎక్కించగోరారు కాని అల్లాహుతా'ఆలా అతనిని సజీవునిగా

عَسَىٰ رَبُّكُمْ أَن يَرْحَمَكُمْ ۚ وَإِنْ عُدتُّمْ عُدْنَا ۘ وَجَعَلْنَا جَهَنَّمَ لِلْكَافِرِينَ حَصِيرًا ﴿٨﴾

8. (మరియు తౌరాత్‌లో ఇలా అన్నాము): "బహుశా మీ ప్రభువు ఇప్పుడు మిమ్మల్ని కరుణించవచ్చు! కాని ఒకవేళ మీరు అలాగే ప్రవర్తిస్తే, మేము కూడా తిరిగి అలాగే చేస్తాము. మేము నరకాగ్నిని, సత్యతిరస్కారుల కొరకు చెరసాలగా చేసి ఉంచాము."

إِنَّ هَٰذَا الْقُرْآنَ يَهْدِي لِلَّتِي هِيَ أَقْوَمُ وَيُبَشِّرُ الْمُؤْمِنِينَ الَّذِينَ يَعْمَلُونَ الصَّالِحَاتِ أَنَّ لَهُمْ أَجْرًا كَبِيرًا ﴿٩﴾

9. నిశ్చయంగా, ఈ ఖుర్ఆన్ పూర్తిగా, సరిఅయిన (సవ్యమైన) మార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తుంది. మరియు సత్కార్యాలు చేస్తుండే విశ్వాసులకు తప్పక గొప్ప ప్రతిఫలం ఉందని శుభవార్తనూ అందజేస్తుంది;

وَأَنَّ الَّذِينَ لَا يُؤْمِنُونَ بِالْآخِرَةِ أَعْتَدْنَا لَهُمْ عَذَابًا أَلِيمًا ﴿١٠﴾

10. మరియు నిశ్చయంగా పరలోకాన్ని విశ్వసించని వారికి మేము బాధాకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచామని (తెలియజేస్తుంది).

وَيَدْعُ الْإِنسَانُ بِالشَّرِّ دُعَاءَهُ بِالْخَيْرِ ۖ وَكَانَ الْإِنسَانُ عَجُولًا ﴿١١﴾

11. మరియు మానవుడు (తెలియక తరచుగా) మేలుకొరకు ఎలా అర్థించాలో, కీడుకొరకు గూడా అలాగే అర్థిస్తాడు. మరియు మానవుడు చాలా తొందరపాటు గలవాడు (ఆత్రగాడు).

وَجَعَلْنَا اللَّيْلَ وَالنَّهَارَ آيَتَيْنِ ۖ فَمَحَوْنَا آيَةَ اللَّيْلِ وَجَعَلْنَا آيَةَ النَّهَارِ مُبْصِرَةً لِّتَبْتَغُوا فَضْلًا مِّن

12. మరియు మేము రాత్రింబవళ్ళను రెండు సూచనలుగా చేశాము. రాత్రి సూచనను మేము కాంతిహీనం చేశాము. మరియు పగటి సూచనను - మీరు మీ

ఆకాశాలలోకి ఎత్తుకున్నాడు. అప్పుడు అల్లాహుతా'ఆలా రోమన్ పాలకుడు టైటస్‌ను వారిపైకి పంపాడు. అతడు జేరూసలంపై దండయాత్ర చేసి యూదులను నాశనం చేశాడు. వారిని ఖైదీలుగా, బానిసలుగా చేసుకున్నాడు. హైకిలె సులేమాన్‌ను నాశనం చేశాడు. యూదులను బైతుల్ మ'ఖ్దిస్ నుండి వెళ్ళగొట్టాడు. ఇది దాదాపు క్రీ.శ. 70వ సంవత్సరంలో జరిగింది.

ప్రభువు అనుగ్రహాన్ని అన్వేషించటానికి మరియు సంవత్సరాల లెక్కపెట్టటానికి మరియు (కాలాన్ని) గణించటానికి - ప్రకాశవంతమైనదిగా చేశాము. మరియు మేము ప్రతివిషయాన్ని వివరించి స్పష్టంగా తెలిపాము.

**13**. మరియు మేము ప్రతి మానవుని మెడలో అతని కర్మలను[1] కట్టిఉంచాము. మరియు పునరుత్థానదినమున అతని (కర్మ) గ్రంథాన్ని అతని ముందు పెడ్తాము, దానిని అతడు స్పష్టమైనదిగా గ్రహిస్తాడు.

**14**. (అతనితో ఇలా అనబడుతుంది): "నీవు నీ కర్మపత్రాన్ని చదువుకో! ఈ రోజు నీ (కర్మల) లెక్క చూసుకోవటానికి స్వయంగా నీవే చాలు."[2]

**15**. ఎవడు సన్మార్గాన్ని అవలంబిస్తాడో అతడు నిశ్చయంగా, తన మేలుకే సన్మార్గాన్ని అవలంబిస్తాడు. మరియు ఎవడు మార్గభ్రష్టుడవుతాడో, అతడు నిశ్చయంగా, తన నష్టానికే మార్గభ్రష్టుడవుతాడు. మరియు బరువు మోసేవాడెవ్వడూ మరొకని బరువును మోయడు.[3] మరియు మేము ఒక ప్రవక్తను పంపనంతవరకు (ప్రజలకు) శిక్ష విధించేవారంకాము.

رَبِّكُمۡ وَلِتَعۡلَمُواْ عَدَدَ ٱلسِّنِينَ
وَٱلۡحِسَابَۚ وَكُلَّ شَيۡءٖ فَصَّلۡنَٰهُ
تَفۡصِيلٗا ١٢
وَكُلَّ إِنسَٰنٍ أَلۡزَمۡنَٰهُ طَٰٓئِرَهُۥ فِي
عُنُقِهِۦۖ وَنُخۡرِجُ لَهُۥ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ
كِتَٰبٗا يَلۡقَىٰهُ مَنشُورًا ١٣
ٱقۡرَأۡ كِتَٰبَكَ كَفَىٰ بِنَفۡسِكَ ٱلۡيَوۡمَ
عَلَيۡكَ حَسِيبٗا ١٤
مَّنِ ٱهۡتَدَىٰ فَإِنَّمَا يَهۡتَدِي لِنَفۡسِهِۦۖ
وَمَن ضَلَّ فَإِنَّمَا يَضِلُّ عَلَيۡهَاۚ وَلَا
تَزِرُ وَازِرَةٞ وِزۡرَ أُخۡرَىٰۗ وَمَا كُنَّا
مُعَذِّبِينَ حَتَّىٰ نَبۡعَثَ رَسُولٗا ١٥

---

**1**. చూడండి, స.బుఖారీ, పు. 9, హ.నం. 625. ఇమామ్ షౌకాని 'తాయిరతున్ - అంటే, మానవుని అదృష్టం లేక భవిష్యత్తు, అని అన్నారు. అల్లాహుతా'ఆలాకు జరుగబోయేది అంతా తెలుసు కాబట్టి ఆయన ప్రతివాని అదృష్టం వ్రాసి అతని వెంట ఉంచుతాడు. అందుకొరకే దాని ప్రకారం అతని కర్మలు (మంచి-చెడులు) ఉంటాయి. పునరుత్థాన దినమున వాటికి తగినట్టి ప్రతిఫలమే దొరుకుతుంది.

**2**. చూడండి, 50:22.

**3**. ఇలాంటి సందేశానికి చూడండి, 6:164, 35:18, 39:7 మరియు 53:38. దీని మరొక తాత్పర్యం: 'భారం మోసేవానిపై మరొకని భారం మోపబడదు.'

16. మరియు మేము ఒక నగరాన్ని నాశనం చేయదలచుకున్నప్పుడు (మొదట) అందులో ఉన్న స్థితిమంతులకు ఆజ్ఞ పంపుతాము; ఆ పిదప కూడా వారు భ్రష్టాచారానికి పాల్పడితే! అప్పుడు దానిపై (మా) ఆదేశం జారీ చేయబడుతుంది, అప్పుడు మేము దానిని సర్వనాశనం చేస్తాము.

وَإِذَآ أَرَدۡنَآ أَن نُّهۡلِكَ قَرۡيَةً أَمَرۡنَا مُتۡرَفِيهَا فَفَسَقُواْ فِيهَا فَحَقَّ عَلَيۡهَا ٱلۡقَوۡلُ فَدَمَّرۡنَٰهَا تَدۡمِيرٗا ١٦

17. మరియు మేము నూ'హ్ తర్వాత ఎన్నోతరాలవారిని ఈ విధంగా నాశనం చేశాము. మరియు తన దాసుల పాపాలను తెలుసుకోవటానికి, చూడటానికి నీ ప్రభువే చాలు!

وَكَمۡ أَهۡلَكۡنَا مِنَ ٱلۡقُرُونِ مِنۢ بَعۡدِ نُوحٖۗ وَكَفَىٰ بِرَبِّكَ بِذُنُوبِ عِبَادِهِۦ خَبِيرَۢا بَصِيرٗا ١٧

18. ఎవడు (ఇహలోక) తాత్కాలిక సుఖాలు కోరుకుంటాడో, మేము కోరిన వానికి, దానిలో మాకు ఇష్టం వచ్చినంత, ఒసంగుతాము. తరువాత అతని కొరకు నరకాన్ని నియమిస్తాము, దానిలో అతడు అవమానంతో బహిష్కరించబడినవాడై దహింపబడతాడు.

مَّن كَانَ يُرِيدُ ٱلۡعَاجِلَةَ عَجَّلۡنَا لَهُۥ فِيهَا مَا نَشَآءُ لِمَن نُّرِيدُ ثُمَّ جَعَلۡنَا لَهُۥ جَهَنَّمَ يَصۡلَىٰهَا مَذۡمُومٗا مَّدۡحُورٗا ١٨

19. మరియు ఎవడు విశ్వాసి అయి, పరలోక (సుఖాన్ని) కోరి దానికై కృషి చేయవలసిన విధంగా కృషిచేస్తాడో, అలాంటివారి కృషి స్వీకరించబడుతుంది.

وَمَنۡ أَرَادَ ٱلۡأٓخِرَةَ وَسَعَىٰ لَهَا سَعۡيَهَا وَهُوَ مُؤۡمِنٞ فَأُوْلَٰٓئِكَ كَانَ سَعۡيُهُم مَّشۡكُورٗا ١٩

20. నీ ప్రభువు యొక్క బహుమానాలు వీరికీ మరియు వారికీ అందరికీ స్వేచ్ఛగా ప్రసాదించబడతాయి. మరియు నీ ప్రభువు యొక్క బహుమానాలు (ఎవ్వరికీ) నిషేధించ బడలేదు.

كُلّٗا نُّمِدُّ هَٰٓؤُلَآءِ وَهَٰٓؤُلَآءِ مِنۡ عَطَآءِ رَبِّكَۚ وَمَا كَانَ عَطَآءُ رَبِّكَ مَحۡظُورًا ٢٠

ٱنظُرۡ كَيۡفَ فَضَّلۡنَا بَعۡضَهُمۡ عَلَىٰ
بَعۡضٖۚ وَلَلۡأٓخِرَةُ أَكۡبَرُ دَرَجَٰتٖ
وَأَكۡبَرُ تَفۡضِيلٗا ٢١

**21**. చూడండి! మేము కొందరికి మరి కొందరిపై ఏవిధంగా ఘనత నొసంగామో! కాని పరలోక(జీవితసుఖ)మే గొప్ప స్థానాలు గలది మరియు గొప్ప ఘనత గలది.

لَّا تَجۡعَلۡ مَعَ ٱللَّهِ إِلَٰهًا ءَاخَرَ
فَتَقۡعُدَ مَذۡمُومٗا مَّخۡذُولٗا ٢٢

**22**. (ఓ మానవుడా!) అల్లాహ్‌కు తోడుగా మరొక ఆరాధ్యదైవాన్ని కల్పించకు, అలాచేస్తే నీవు అవమానించబడి సహకారాలు పొందని (త్యజించబడిన) వాడవవుతావు. (1/8)

۞ وَقَضَىٰ رَبُّكَ أَلَّا تَعۡبُدُوٓاْ إِلَّآ
إِيَّاهُ وَبِٱلۡوَٰلِدَيۡنِ إِحۡسَٰنًاۚ إِمَّا
يَبۡلُغَنَّ عِندَكَ ٱلۡكِبَرَ
أَحَدُهُمَآ أَوۡ كِلَاهُمَا فَلَا تَقُل
لَّهُمَآ أُفّٖ وَلَا تَنۡهَرۡهُمَا وَقُل
لَّهُمَا قَوۡلٗا كَرِيمٗا ٢٣

**23**. * మరియు నీ ప్రభువు: తనను తప్ప ఇతరులను ఆరాధించకూడదనీ మరియు తల్లిదండ్రులతో మంచితనంతో వ్యవహరించాలనీ, ఆజ్ఞాపించి ఉన్నాడు.[1] ఒకవేళ వారిలో ఏ ఒక్కరు గానీ, లేదా వారిరువురు గానీ, ముసలివారైతే, వారితో విసుక్కుంటూ: "ఛీ! (ఉఫ్)" అని కూడా అనకు మరియు వారిని గద్దించకు మరియు వారితో మర్యాదగా మాట్లాడు.

وَٱخۡفِضۡ لَهُمَا جَنَاحَ ٱلذُّلِّ مِنَ
ٱلرَّحۡمَةِ وَقُل رَّبِّ ٱرۡحَمۡهُمَا كَمَا
رَبَّيَانِي صَغِيرٗا ٢٤

**24**. మరియు వారిమీద కరుణ మరియు వినయవిధేయతల రెక్కలను చాపు. మరియు వారికొరకు ఇలా ప్రార్థించు: "ఓ నా ప్రభూ! వారు ఏ విధంగా నన్ను బాల్యంలో పెంచారో అదేవిధంగా నీవు వారియెడల కరుణను చూపు!"

---

**1**. అల్లాహుతా'ఆలా ఈ ఆయత్‌లో తన ఆరాధన తరువాత, రెండో స్థానంలో, తమ తల్లిదండ్రులతో మంచిగా వ్యవహరించాలని ఆజ్ఞాపించాడు. దీనితో వారి ఆదరణ, ఆజ్ఞాపాలన మరియు వారికి వినయవిధేయతలు చూపటం ఎంత ముఖ్యమో తెలుస్తోంది.

**25**. మీ మనస్సులలో ఉన్నది మీ ప్రభువుకు బాగాతెలుసు. మీరు సన్మార్గులు అయితే, నిశ్చయంగా ఆయన వైపునకు (పశ్చాత్తాపంతో) పలుమార్లు మరలే వారిని ఆయన క్షమిస్తాడు.

**26**. మరియు బంధువులకు, పేదలకు మరియు బాటసారులకు, వారి హక్కు ఇవ్వు.[1] మరియు (నీ ధనాన్ని) వృథా ఖర్చులలో వ్యర్థంచేయకు.

**27**. నిశ్చయంగా, వ్యర్థమైన ఖర్చులు చేసేవారు షైతానుల సోదరులు. మరియు షైతాన్ తన ప్రభువుపట్ల కృతఘ్నుడైన వాడు.

**28**. మరియు నీవు ఆశించే, నీ ప్రభువు కారుణ్యాన్ని పొందటానికి - నీకు వారినుండి ముఖం త్రిప్పుకోవలసి వచ్చినా - వారితో మృదువుగా మాట్లాడు.[2]

**29**. మరియు నీవు (పిసినారితనంతో) నీ చేతిని నీ మెడకు కట్టుకోకు[3] మరియు దానిని పూర్తిగా స్వేచ్ఛగా కూడా వదలిపెట్టకు. అలా చేస్తే నిందలకు గురిఅవుతావు, దిక్కులేని వాడవై కూర్చుంటావు (విచారిస్తావు).

رَّبُّكُمۡ أَعۡلَمُ بِمَا فِي نُفُوسِكُمۡۚ إِن تَكُونُواْ صَٰلِحِينَ فَإِنَّهُۥ كَانَ لِلۡأَوَّٰبِينَ غَفُورٗا ٢٥

وَءَاتِ ذَا ٱلۡقُرۡبَىٰ حَقَّهُۥ وَٱلۡمِسۡكِينَ وَٱبۡنَ ٱلسَّبِيلِ وَلَا تُبَذِّرۡ تَبۡذِيرًا ٢٦

إِنَّ ٱلۡمُبَذِّرِينَ كَانُوٓاْ إِخۡوَٰنَ ٱلشَّيَٰطِينِۖ وَكَانَ ٱلشَّيۡطَٰنُ لِرَبِّهِۦ كَفُورٗا ٢٧

وَإِمَّا تُعۡرِضَنَّ عَنۡهُمُ ٱبۡتِغَآءَ رَحۡمَةٖ مِّن رَّبِّكَ تَرۡجُوهَا فَقُل لَّهُمۡ قَوۡلٗا مَّيۡسُورٗا ٢٨

وَلَا تَجۡعَلۡ يَدَكَ مَغۡلُولَةً إِلَىٰ عُنُقِكَ وَلَا تَبۡسُطۡهَا كُلَّ ٱلۡبَسۡطِ فَتَقۡعُدَ مَلُومٗا مَّحۡسُورًا ٢٩

---

**1**. ఇక్కడ విశదమయ్యేది ఏమిటంటే మన సంపత్తిలో దగ్గరిబంధువులకు, పేదలకు మరియు బాటసారులకు హక్కు ఉంది. కావున వారికి ఇవ్వటం, వారిని కనికరించటమని భావించరాదు. వారికి, వారి హక్కు ఇవ్వని వారు అల్లాహుతా'ఆలా దృష్టిలో నిందార్హులు. ఈ ఆయత్‌లో పేర్కొన్నట్లు ధన సహాయానికి మొట్టమొదటి హక్కుదార్లు, దగ్గరి బంధువులు, (ఎవరి పోషణైతే విధి కాదో ఆ బంధువులు) తరువాత పేద వారు ఆ తరువాత బాటసార్లు అని తెలుస్తోంది.

**2**. ఒకవేళ నీవు బంధువులకు, పేదలకు ఇవ్వలేని స్థితిలో ఉంటే, వారిని కసిరికొట్టే బదులు, నమ్రతతో, మృదువుగా నిరాకరించు.

**3**. ఇదే విధమైన వాక్యానికి చూడండి, 5:64.

30. నిశ్చయంగా, నీ ప్రభువు తాను కోరిన వారికి జీవనోపాధిని పుష్కలంగా ప్రసాదిస్తాడు మరియు తానుకోరిన వారికి తగ్గిస్తాడు. నిశ్చయంగా, ఆయనే తనదాసుల(స్థితుల)ను బాగా ఎరిగేవాడూ, చూసే వాడునూ!

إِنَّ رَبَّكَ يَبْسُطُ ٱلرِّزْقَ لِمَن يَشَآءُ وَيَقْدِرُ ۚ إِنَّهُۥ كَانَ بِعِبَادِهِۦ خَبِيرًۢا بَصِيرًا ﴿٣٠﴾

31. మరియు పేదరికానికి భయపడి మీరు మీ సంతానాన్ని చంపకండి. మేమే వారికీ మరియు మీకు కూడా జీవనోపాధిని సమకూర్చేవారము. నిశ్చయంగా, వారిని చంపటం గొప్ప నేరం.[1]

وَلَا تَقْتُلُوٓا۟ أَوْلَٰدَكُمْ خَشْيَةَ إِمْلَٰقٍ ۖ نَّحْنُ نَرْزُقُهُمْ وَإِيَّاكُمْ ۚ إِنَّ قَتْلَهُمْ كَانَ خِطْـًٔا كَبِيرًا ﴿٣١﴾

32. మరియు వ్యభిచారాన్ని సమీపించకండి. అది నిశ్చయంగా, అశ్లీలమైనది మరియు బహుచెడ్డ మార్గము.[2]

وَلَا تَقْرَبُوا۟ ٱلزِّنَىٰٓ ۖ إِنَّهُۥ كَانَ فَٰحِشَةً وَسَآءَ سَبِيلًا ﴿٣٢﴾

33. న్యాయానికి తప్ప, అల్లాహ్ నిషేధించిన ఏ ప్రాణిని కూడా చంపకండి.[3] ఎవడు అన్యాయంగా చంపబడతాడో, మేము అతని వారసునికి (ప్రతీకార) హక్కు ఇచ్చి ఉన్నాము.[4] కాని అతడు హత్య (ప్రతీకార) విషయంలో హద్దులను మీరకూడదు. నిశ్చయంగా, అతనికి (ధర్మ ప్రకారం) సహాయమొసంగబడుతుంది.

وَلَا تَقْتُلُوا۟ ٱلنَّفْسَ ٱلَّتِى حَرَّمَ ٱللَّهُ إِلَّا بِٱلْحَقِّ ۗ وَمَن قُتِلَ مَظْلُومًا فَقَدْ جَعَلْنَا لِوَلِيِّهِۦ سُلْطَٰنًا فَلَا يُسْرِف فِّى ٱلْقَتْلِ ۖ إِنَّهُۥ كَانَ مَنصُورًا ﴿٣٣﴾

---

1. చూడండి, 6:137, 6:151, 81:8-9లలో మరియు 'స'హీ'హ్ బు'ఖారీలో: 'షిర్క్ తరువాత ఘోర పాపం, పేదరికానికి భయపడి తన సంతానాన్ని హత్యచేయటం.' అని ఉంది. అంటే, ఫేమిలీప్లానింగ్ ఆపరేషన్లు చేయించుకోవటం, అబార్షన్లు చేయించుకోవటం.
2. వ్యభిచారం అంటే భార్యా-భర్త కాకుండా, ఏ ఇతర ఆడ-మగ, మగ-మగ లేక ఆడ-ఆడ వారి మధ్యఉండే లైంగికసంబంధం. వారిలో ఏ ఒక్కరూ లేక ఇద్దరూ వివాహితులైనా కాకపోయినా!
3. చూడండి, 2:190. అంటే, ధర్మయుద్ధంలో గానీ లేక న్యాయ ప్రతీకారానికి గానీ, లేక ఆత్మరక్షణకు గానీ కాకుండా, అన్యాయంగా ఏ ప్రాణిని కూడా చంపరాదు.
4. అల్-ఖి'సా'సు: న్యాయప్రతీకారం. చూడండి, 2:178. ఇక్కడ వలీ అంటే రక్తసంబంధీకుడైన దగ్గరి బంధువు అని అర్థం.

وَلَا تَقۡرَبُواْ مَالَ ٱلۡيَتِيمِ إِلَّا بِٱلَّتِي هِيَ أَحۡسَنُ حَتَّىٰ يَبۡلُغَ أَشُدَّهُۥۚ وَأَوۡفُواْ بِٱلۡعَهۡدِۖ إِنَّ ٱلۡعَهۡدَ كَانَ مَسۡـُٔولٗا ٣٤

**34**. మరియు అతడు యుక్త వయస్సుకు చేరనంతవరకు - సక్రమమైన పద్ధతిలో తప్ప - అనాథుని ఆస్తిని సమీపించకండి. మరియు చేసిన వాగ్దానాన్ని పూర్తిచేయండి. నిశ్చయంగా, వాగ్దానం గురించి ప్రశ్నించడం జరుగుతుంది.[1]

وَأَوۡفُواْ ٱلۡكَيۡلَ إِذَا كِلۡتُمۡ وَزِنُواْ بِٱلۡقِسۡطَاسِ ٱلۡمُسۡتَقِيمِۚ ذَٰلِكَ خَيۡرٞ وَأَحۡسَنُ تَأۡوِيلٗا ٣٥

**35**. మరియు మీరు కొలిచి ఇచ్చేటప్పుడు కొలతపాత్ర నిండుగా కొలిచి ఇవ్వండి. మరియు (తూచి ఇచ్చేటప్పుడు) త్రాసుతో సమానంగా తూకంచేయండి. ఇదే మంచి పద్ధతి మరియు (ఇదే) చివరకు మంచి ఫలితం ఇస్తుంది.

وَلَا تَقۡفُ مَا لَيۡسَ لَكَ بِهِۦ عِلۡمٌۚ إِنَّ ٱلسَّمۡعَ وَٱلۡبَصَرَ وَٱلۡفُؤَادَ كُلُّ أُوْلَٰٓئِكَ كَانَ عَنۡهُ مَسۡـُٔولٗا ٣٦

**36**. మరియు (ఓ మానవుడా!) నీకు తెలియని విషయం వెంటపడకు.[2] నిశ్చయంగా చూపులూ, వినికిడీ, హృదయమూ వీటన్నింటినీ గురించీ, (తీర్పు దినమున) ప్రశ్నించడం జరుగుతుంది.

وَلَا تَمۡشِ فِي ٱلۡأَرۡضِ مَرَحًاۖ إِنَّكَ لَن تَخۡرِقَ ٱلۡأَرۡضَ وَلَن تَبۡلُغَ ٱلۡجِبَالَ طُولٗا ٣٧

**37**. మరియు భూమిపై విర్రవీగుతూ నడవకు.[3] నిశ్చయంగా నీవు భూమిని చీల్చనూలేవు మరియు పర్వతాల ఎత్తుకు చేరనూలేవు!

---

**1**. మానవుడు అల్లాహ్ (సు.తా.)తో చేసుకున్న వాగ్దానమైనా, లేక తనతోటి మావవునితో చేసిన వాగ్దానమైనా దానిని తప్పక పూర్తిచేయాలి, లేకుంటే పునరుత్థానదినమున దానిని గురించి ప్రశ్నించడం జరుగుతుంది.

**2**. అంటే నీకు తెలియని దానిని గురించి ఇతరులపై అనుమానపడకు మరియు నీకు తెలియని దానిని అనుసరించకు.

**3**. విర్రవీగటం అల్లాహుతా'ఆలాకు ఎంతో అసహ్యాకరమైనది. ఖారూన్ విర్రవీగటం వల్లనే, తన ధనసంపత్తులతో సహా భూమిలోకి త్రొక్కివేయబడ్డాడు. చూడండి, 28:81.

كُلُّ ذَٰلِكَ كَانَ سَيِّئُهُۥ عِندَ رَبِّكَ مَكْرُوهًا ﴿٣٨﴾

38. ఇవన్నీ దుష్కార్యాలే, నీ ప్రభువు దృష్టిలో ఎంతో అసహ్యాకరమైనవి.

ذَٰلِكَ مِمَّآ أَوْحَىٰٓ إِلَيْكَ رَبُّكَ مِنَ ٱلْحِكْمَةِ ۗ وَلَا تَجْعَلْ مَعَ ٱللَّهِ إِلَٰهًا ءَاخَرَ فَتُلْقَىٰ فِى جَهَنَّمَ مَلُومًا مَّدْحُورًا ﴿٣٩﴾

39. ఇవి వివేకంతో నిండివున్న విషయాలు వాటిని నీ ప్రభువు నీకు దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా తెలియజేశాడు. మరియు అల్లాహ్‌తో పాటు మరొకరిని ఆరాధ్యదైవంగా చేసుకోకు. అలాచేస్తే అవమానానికి గురిఅయి, బహిష్కరించబడి, నరకంలో త్రోయబడతావు.

أَفَأَصْفَىٰكُمْ رَبُّكُم بِٱلْبَنِينَ وَٱتَّخَذَ مِنَ ٱلْمَلَٰٓئِكَةِ إِنَٰثًا ۚ إِنَّكُمْ لَتَقُولُونَ قَوْلًا عَظِيمًا ﴿٤٠﴾

40. ఏమీ? మీ ప్రభువు, మీకు ప్రత్యేకంగా కుమారులను ప్రసాదించి తనకొరకు దేవదూతలను కుమార్తెలుగా చేసుకున్నాడా? నిశ్చయంగా, మీరు పలికేది చాలా ఘోరమైన మాట.[1]

وَلَقَدْ صَرَّفْنَا فِى هَٰذَا ٱلْقُرْءَانِ لِيَذَّكَّرُوا۟ وَمَا يَزِيدُهُمْ إِلَّا نُفُورًا ﴿٤١﴾

41. మరియు వారు వాస్తవానికి హితబోధ పొందుతారని, మేము ఈ ఖుర్ఆన్‌లో అనేక విధాలుగా బోధించాము.[2] కాని అది వారి వ్యతిరేకతను మాత్రమే అధికంచేస్తున్నది.

قُل لَّوْ كَانَ مَعَهُۥٓ ءَالِهَةٌ كَمَا يَقُولُونَ إِذًا لَّٱبْتَغَوْا۟ إِلَىٰ ذِى ٱلْعَرْشِ سَبِيلًا ﴿٤٢﴾

42. వారితో అను: "ఒకవేళ వారన్నట్లు అల్లాహ్‌తోపాటు ఇతర ఆరాధ్యదైవాలే ఉన్నట్లైతే, వారు కూడా (అల్లాహ్) సింహాసనానికి ('అర్ష్‌కు) చేరే మార్గాన్ని వెతికే వారు కదా!"[3]

---

1. వారు అల్లాహ్(సు.తా.)కు కుమార్తెలను మరియు తమకేమో కుమారులను ఎన్ను కుంటున్నారు. చూడండి, 16:57-59.
2. ప్రతివిధంగా బోధించాము: అంటే పూర్వకాలపు ప్రజల కథలు చెప్పి, ఉదాహరణాలు, ఉపమానాలు ఇచ్చి, హితబోధలు చేసి, పర్యవసానాలు చూపి, అనేకవిధాలుగా అల్లాహ్ (సు.తా.) ఖుర్ఆన్‌లో బోధించాడు, భయపెట్టాడు. బహుశా మానవులు గుణపాఠం నేర్చుకొని, అతి స్వల్పకాలపు ఈ జీవితంలో విశ్వసించి, సత్కార్యాలు చేసి, రాబోయే శాశ్వత జీవితంలో ఎడతెగని సుఖసంతోషాలు పొందాలని. కాని చాలామంది దానిని అర్థం చేసుకోలేకపోతున్నారు. తమ భ్రష్టాచారాలను మరింత అధికం చేసుకుంటున్నారు.
3. ఈ ఆయత్‌ను వ్యాఖ్యాతలు రెండు విధాలుగా బోధించారు:

سُبۡحَٰنَهُۥ وَتَعَٰلَىٰ عَمَّا يَقُولُونَ عُلُوّٗا كَبِيرٗا ﴿٤٣﴾

**43**. ఆయన సర్వలోపాలకు అతీతుడు మరియు అత్యున్నతుడు, వారు అపాదించే మాటలకంటే మహోన్నతుడు మహానీయుడు (గొప్ప వాడు).

تُسَبِّحُ لَهُ ٱلسَّمَٰوَٰتُ ٱلسَّبۡعُ وَٱلۡأَرۡضُ وَمَن فِيهِنَّۚ وَإِن مِّن شَيۡءٍ إِلَّا يُسَبِّحُ بِحَمۡدِهِۦ وَلَٰكِن لَّا تَفۡقَهُونَ تَسۡبِيحَهُمۡۚ إِنَّهُۥ كَانَ حَلِيمًا غَفُورٗا ﴿٤٤﴾

**44**. సప్తాకాశాలు, భూమి మరియు వాటిలో ఉన్న సమస్తమూ ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉంటాయి. మరియు ఆయన పవిత్రతను కొనియాడనిది, ఆయన స్తోత్రం చేయనటువంటిది ఏదీ లేదు, కాని మీరు వాటి స్తుతిని అర్థం చేసుకోలేరు. నిశ్చయంగా, ఆయన ఎంతో సహనశీలుడు, క్షమాశీలుడు.

وَإِذَا قَرَأۡتَ ٱلۡقُرۡءَانَ جَعَلۡنَا بَيۡنَكَ وَبَيۡنَ ٱلَّذِينَ لَا يُؤۡمِنُونَ بِٱلۡأٓخِرَةِ حِجَابٗا مَّسۡتُورٗا ﴿٤٥﴾

**45**. మరియు నీవు ఖుర్ఆన్‌ను పఠించేటప్పుడు, నీకూ మరియు పరలోక జీవితాన్ని విశ్వసించని వారికీ, మధ్య కనబడని తెర వేసిఉన్నాము.

وَجَعَلۡنَا عَلَىٰ قُلُوبِهِمۡ أَكِنَّةً أَن يَفۡقَهُوهُ وَفِيٓ ءَاذَانِهِمۡ وَقۡرٗاۚ وَإِذَا ذَكَرۡتَ رَبَّكَ فِي ٱلۡقُرۡءَانِ وَحۡدَهُۥ وَلَّوۡاْ عَلَىٰٓ أَدۡبَٰرِهِمۡ نُفُورٗا ﴿٤٦﴾

**46**. మరియు వారు గ్రహించకుండా, వారి హృదయాల మీద తెరలు మరియు వారి చెవులలో చెవుడు వేసిఉన్నాము.[1] ఒకవేళ నీవు ఖుర్ఆన్(పారాయణం)తో నీ ప్రభువు యొక్క ఏకత్వాన్ని ప్రస్తావిస్తే వారు అసహ్యంతో వెనుదిరిగి మరలి పోతారు.

(1) ఇద్దరు లేక అంతకంటే ఎక్కువమంది రాజులు ఉంటే, వారిలో ప్రతి ఒక్కడు భూమిలో ప్రతిచోటా తన అధికారాన్నే నెలకొల్పటానికి పాటుపడతాడు. అదేవిధంగా ఈ ఇతర దేవతలు కూడా ప్రయత్నించేవారు, ఒకవేళ వారు ఉండి ఉంటే! అది ఇంతవరకు జరుగలేదు. అంటే అల్లాహ్ (సు.తా.) తప్ప మరొక విశ్వసామ్రాజ్యాధిపతి లేడు.
(2) ఏవిధంగానైతే ముష్రికులు భావిస్తున్నారో: వారు ఆరాధించే వారు ఇంతవరకు అల్లాహ్ (సు.తా.) సాన్నిహిత్యాన్ని పొంది ఉన్నారు మరియు తమను ఆరాధించే వారిని కూడా అల్లాహ్ (సు.తా.) దగ్గరకు తీసుకుపోవటానికి ప్రయత్నిస్తారు. ఇది సత్యం కాదు. ఈ విషయం అల్లాహుతా'ఆలా తన గ్రంథం (ఖుర్ఆన్)లో ఎన్నో సార్లు విశదం చేశాడు. చూడండి,17:57.
**1**. చూడండి, 6:25 మరియు 2:7.

نَّحۡنُ أَعۡلَمُ بِمَا يَسۡتَمِعُونَ بِهِۦٓ إِذۡ يَسۡتَمِعُونَ إِلَيۡكَ وَإِذۡ هُمۡ نَجۡوَىٰٓ إِذۡ يَقُولُ ٱلظَّٰلِمُونَ إِن تَتَّبِعُونَ إِلَّا رَجُلٗا مَّسۡحُورًا ﴿٤٧﴾

**47**. వారు నీ మాటలను వింటున్నప్పుడు, వారు ఏమి వింటున్నారో మాకు బాగా తెలుసు. ఈ దుర్మార్గులు ఏకాంతంలో ఉన్నప్పుడు పరస్పరం గుసగుసలాడుతూ ఇలా చెప్పుకుంటారు: "మీరు అనుసరిస్తున్న ఈ మనిషి కేవలం మంత్రజాలానికి గురిఅయిన వాడు మాత్రమే."

ٱنظُرۡ كَيۡفَ ضَرَبُواْ لَكَ ٱلۡأَمۡثَالَ فَضَلُّواْ فَلَا يَسۡتَطِيعُونَ سَبِيلٗا ﴿٤٨﴾

**48**. (ఓ ము'హమ్మద్!) చూడు! వారు నిన్ను ఎలాంటి ఉదాహరణలతో పోల్చుతున్నారో, ఎందుకంటే వారు మార్గం తప్పారు, కావున వారు (సరైన) మార్గం పొందలేరు.[1]

وَقَالُوٓاْ أَءِذَا كُنَّا عِظَٰمٗا وَرُفَٰتًا أَءِنَّا لَمَبۡعُوثُونَ خَلۡقٗا جَدِيدٗا ﴿٤٩﴾

**49**. మరియు వారు ఇలా అంటారు: "ఏమీ? మేము ఎముకలుగా మరియు దుమ్ము(పొడి)గా మారిపోయిన తరువాత కూడా తిరిగి క్రొత్త సృష్టిగా లేపబడతామా?" (1/4)

۞ قُلۡ كُونُواْ حِجَارَةً أَوۡ حَدِيدًا ﴿٥٠﴾

**50**. * వారితో అను: "మీరు రాళ్ళుగా గానీ, లేదా ఇనుముగా గానీ మారిపోయి ఉండినా సరే!"

أَوۡ خَلۡقٗا مِّمَّا يَكۡبُرُ فِي صُدُورِكُمۡۚ فَسَيَقُولُونَ مَن يُعِيدُنَاۖ قُلِ ٱلَّذِي فَطَرَكُمۡ أَوَّلَ مَرَّةٖۚ فَسَيُنۡغِضُونَ إِلَيۡكَ

**51**. "లేదా, తిరిగి సృష్టింపబడటానికి అసాధ్యమైనదని మీ హృదయాలు భావించేదానిగా ఉన్నాసరే! (తిరిగి లేపబడతారు)." వారు మళ్ళీ ఇలా అడుగుతారు: "మమ్మల్ని తిరిగి బ్రతికించి లేపగల వాడు ఎవడు?" వారితో అను: "ఆయనే, మిమ్మల్ని మొదటి సారి పుట్టించిన

1. వారు దైవప్రవక్త ('స'అస)ను మాంత్రికుడు, మంత్రజాలానికి గురిఅయినవాడు, పిచ్చివాడు, జ్యోతిష్యుడు అని తమ నోటికి వచ్చినట్లు ఆరోపించారు. ఎందుకంటే వారు మార్గభ్రష్టులైన వారు కాబట్టి వారెన్నడూ మార్గదర్శకత్వం పొందలేరు.

రءُوسَهُمْ وَيَقُولُونَ مَتَىٰ هُوَ ۖ
قُلْ عَسَىٰ أَن يَكُونَ قَرِيبًا ﴿٥١﴾

వాడు!" వారు ఎగతాళిగా తలలు ఊపుతూ అంటారు: "అయితే! అది ఎప్పుడు సంభవిస్తుంది?" వారితో అను: "బహుశా ఆ సమయం సమీపంలోనే ఉండవచ్చు!"

يَوْمَ يَدْعُوكُمْ فَتَسْتَجِيبُونَ
بِحَمْدِهِۦ وَتَظُنُّونَ إِن لَّبِثْتُمْ إِلَّا
قَلِيلًا ﴿٥٢﴾

**52.** ఆ దినమున ఆయన మిమ్మల్ని పిలిచినపుడు! మీరు ఆయన పిలుపుకు సమాధానంగా ఆయనను స్తుతిస్తూ వస్తారు. మరియు మీరు కేవలం కొంతకాలం మాత్రమే (భూమిలో) ఉండివున్నట్లు భావిస్తారు.[1]

وَقُل لِّعِبَادِى يَقُولُوا۟ ٱلَّتِى هِىَ
أَحْسَنُ ۚ إِنَّ ٱلشَّيْطَـٰنَ يَنزَغُ بَيْنَهُمْ ۚ إِنَّ
ٱلشَّيْطَـٰنَ كَانَ لِلْإِنسَـٰنِ عَدُوًّا
مُّبِينًا ﴿٥٣﴾

**53.** మరియు నా దాసులతో, వారు మాట్లాడేటప్పుడు మంచి మాటలనే పలకమని చెప్పు. (ఎందుకంటే) షై'తాన్ నిశ్చయంగా, వారి మధ్య విరోధాన్ని రేకెత్తించడానికి ప్రయత్నిస్తుంటాడు. నిశ్చయంగా, షై'తాన్ మానవుడికి బహిరంగ శత్రువు.[2]

رَّبُّكُمْ أَعْلَمُ بِكُمْ ۖ إِن يَشَأْ يَرْحَمْكُمْ
أَوْ إِن يَشَأْ يُعَذِّبْكُمْ ۚ وَمَآ أَرْسَلْنَـٰكَ
عَلَيْهِمْ وَكِيلًا ﴿٥٤﴾

**54.** మీ ప్రభువుకు మిమ్మల్ని గురించి బాగా తెలుసు. ఆయన కోరితే మిమ్మల్ని కరుణించవచ్చు, లేదా ఆయన కోరితే మిమ్మల్ని శిక్షించవచ్చు! మరియు (ఓ ము'హమ్మద్!) మేము నిన్ను వారి కార్యకర్తగా (రక్షకునిగా) నియమించి పంపలేదు.

---

**1.** పరలోకజీవితంతో పోల్చితే ఇహలోక జీవితకాలం ఎంతో చిన్నది. పరలోక జీవితం అంతంలేనిది. మానవుని కాలగణనం ఈ భూలోకానికి మాత్రమే వర్తిస్తుంది. ఎందుకంటే దాని గణన భూగోళపు తన చుట్టూ తాను మరియు సూర్యుని చుట్టూ చేసే పర్యటనకు బద్ధమై ఉంది. చూడండి, 79:46, 20:102, 104, 30:55, 23:112, 114.

**2.** ఇది ప్రతి ఒక్కడు ఇతరులతో మాట్లాడేటప్పుడు జ్ఞాపకముంచుకోవలసిన ఆయత్. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'మీలో ఎవ్వరు కూడా తన సోదరుని (ముస్లిం) వైపునకు ఆయుధాన్ని చూపకండి. ఎందుకంటే మీకు తెలియకుండానే షై'తాన్ ఆ ఆయుధాన్ని నడిపించి అతన్ని చంపించవచ్చు మరియు మీరు నరకాగ్నిలో పడిపోవచ్చు.' ('స.బు'ఖారీ, ముస్లిం). ఇంకా చూడండి, 16:125 మరియు 29:46.

وَرَبُّكَ أَعْلَمُ بِمَن فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۗ وَلَقَدْ فَضَّلْنَا بَعْضَ ٱلنَّبِيِّـۧنَ عَلَىٰ بَعْضٍ ۖ وَءَاتَيْنَا دَاوُۥدَ زَبُورًا ﴿٥٥﴾

**55**. మరియు భూమ్యాకాశాలలో ఉన్న వారినందరిని గురించి నీ ప్రభువుకు బాగా తెలుసు. మరియు వాస్తవానికి మేము కొందరు ప్రవక్తలకు మరికొందరిపై ఘనత నొసంగాము. మరియు మేము దావూద్‌కు 'జబూర్ [1] ఇచ్చాము.

قُلِ ٱدْعُوا۟ ٱلَّذِينَ زَعَمْتُم مِّن دُونِهِۦ فَلَا يَمْلِكُونَ كَشْفَ ٱلضُّرِّ عَنكُمْ وَلَا تَحْوِيلًا ﴿٥٦﴾

**56**. వారితో ఇట్లను: "ఆయన (అల్లాహ్)ను కాదని మీరెవరినైతే (ఆరాధ్యదైవాలుగా) భావించారో, వారిని అర్థించి చూడండి! మీ ఆపదను తొలగించటానికి గానీ, దానిని మార్చటానికి గానీ వారికి ఎలాంటి శక్తిలేదు."

أُو۟لَٰٓئِكَ ٱلَّذِينَ يَدْعُونَ يَبْتَغُونَ إِلَىٰ رَبِّهِمُ ٱلْوَسِيلَةَ أَيُّهُمْ أَقْرَبُ وَيَرْجُونَ رَحْمَتَهُۥ وَيَخَافُونَ عَذَابَهُۥٓ ۚ إِنَّ عَذَابَ رَبِّكَ كَانَ مَحْذُورًا ﴿٥٧﴾

**57**. వారు, ఎవరినైతే వీరు ప్రార్థిస్తూ ఉన్నారో, వారే తమ ప్రభువు సాన్నిధ్యాన్ని పొందటానికి మార్గాన్ని వెతుకుతున్నారు. మరియు వారిలో ఆయనకు ఎవరు ఎక్కువ సాన్నిధ్యం పొందుతారో అని ప్రయత్నిస్తున్నారు. మరియు ఆయన కారుణ్యాన్ని ఆశిస్తున్నారు మరియు ఆయన శిక్షకు భయపడుతున్నారు.[2] నిశ్చయంగా, నీ ప్రభువు శిక్ష, దానికి భయపడవలసిందే!

---

**1**. దావూద్ ('అ.స.)పై అవతరింపజేయబడిన దివ్యగ్రంథం 'జబూర్ (కీర్తనలు / Psalms).

**2**. వారు ఆ దైవాలు: అంటే, యూదులూ మరియు క్రైస్తవులు, దేవుళ్ళని భావించే 'ఉ'జైర్ ('అ.స.), లేక 'ఈసా ('అ.స.) గానీ; లేక ముష్రికులు ఆరాధించే జిన్నాతులు గానీ, దైవదూతలు గానీ, కల్పిత దైవాలుగానీ, విగ్రహాలు గానీ లేక పుణ్యవంతులైన ముస్లింలు గానీ, లేక ఇతర వలీలు గానీ కావచ్చు. వీరంతా తమ ప్రభువు సాన్నిధ్యాన్ని పొందే మార్గాన్ని వెతుకుతున్నారు. అలాంటప్పుడు వారు ఇతరులకు ఏవిధంగా సహాయపడగలరు. వీరిని ఆరాధించటం మరియు వీరి సహాయం కోరటం షిర్క్. అల్లాహ్ (సు.తా.) షిర్క్‌ను ఎన్నడూ క్షమించడు.

وَإِن مِّن قَرۡيَةٍ إِلَّا نَحۡنُ مُهۡلِكُوهَا قَبۡلَ يَوۡمِ ٱلۡقِيَٰمَةِ أَوۡ مُعَذِّبُوهَا عَذَابٗا شَدِيدٗاۚ كَانَ ذَٰلِكَ فِي ٱلۡكِتَٰبِ مَسۡطُورٗا ﴿٥٨﴾

58. మరియు పునరుత్థానదినానికి ముందు మేము నాశనంచేయని, లేదా కఠిన శిక్షకు గురిచేయని, నగరమనేది ఉండదు. ఈ విషయం గ్రంథంలో వ్రాయబడివుంది.

وَمَا مَنَعَنَآ أَن نُّرۡسِلَ بِٱلۡأٓيَٰتِ إِلَّآ أَن كَذَّبَ بِهَا ٱلۡأَوَّلُونَۚ وَءَاتَيۡنَا ثَمُودَ ٱلنَّاقَةَ مُبۡصِرَةٗ فَظَلَمُواْ بِهَاۚ وَمَا نُرۡسِلُ بِٱلۡأٓيَٰتِ إِلَّا تَخۡوِيفٗا ﴿٥٩﴾

59. మరియు నిదర్శనా(ఆయత్)లను పంపకుండా మమ్మల్ని ఏదీ ఆపలేదు. కాని పూర్వకాలపు ప్రజలు వాటిని తిరస్కరించడమే తప్ప![1] మరియు మేము స'మూదు జాతి వారికి ప్రత్యక్ష నిదర్శనంగా ఒక ఆడ ఒంటెను పంపాము, కాని వారు దానిపట్ల క్రూరంగా ప్రవర్తించారు.[2] మరియు మేము నిదర్శనా (ఆయత్)లను పంపుతున్నది, కేవలం ప్రజలు వాటిని చూసి భయపడటానికే!

وَإِذۡ قُلۡنَا لَكَ إِنَّ رَبَّكَ أَحَاطَ بِٱلنَّاسِۚ وَمَا جَعَلۡنَا ٱلرُّءۡيَا ٱلَّتِيٓ أَرَيۡنَٰكَ إِلَّا فِتۡنَةٗ لِّلنَّاسِ وَٱلشَّجَرَةَ

60. "నిశ్చయంగా, నీ ప్రభువు ప్రజలను పరివేష్టించి ఉన్నాడు." అని మేము నీతో చెప్పిన విషయం (జ్ఞాపకం చేసుకో)! మేము నీకు (ఇస్రా' రాత్రిలో) చూపిన దృశ్యం[3] - మరియు ఖుర్ఆన్‌లో

---

1. పూర్వకాలపు ప్రజలు తమ ప్రవక్తల నుండి నిదర్శనాలు (ఆయత్‌లు) కోరారు. ఆ నిదర్శనాలు వచ్చిన తరువాత కూడా వారు విశ్వాసులు కాలేదు. దాని ఫలితంగా వారిపై అల్లాహ్ (సు.తా.) శిక్షపడి వారు నాశనం చేయబడ్డారు. ఇదే విధంగా మక్కా ముష్రిక్‌లు కూడా దైవప్రవక్త ('స'అస) నుండి నిదర్శనాలు కోరారు. మక్కా పర్వతాలను బంగారంగా మార్చమన్నారు. పూర్వ జాతివారివలే వీరూ నిదర్శనాలు వచ్చిన తరువాత కూడా విశ్వసించరని మరియు వారంతా నాశనం చేయబడతారని అతను ('స'అస) నిదర్శనాలను కోరలేదు. (వివరాలకు చూడండి, ముస్నద్ అ'హ్మద్, పుస్తకం-1, పేజీ-258).
2. ఆ ఆడ ఒంటె నిదర్శనం కొరకు చూడండి, 7:73 మరియు 54:27.
3. దైవప్రవక్త ('స'అస) యొక్క రాత్రివేళ మస్జిదె 'హరాం నుండి మస్జిదె అ'ఖ్సా మరియు అక్కడ నుండి సప్తాకాశాలలోనికి పోవటం మరియు తమ ప్రయాణాలలో సాక్షాత్తుగా చూసిన దృశ్యాల వివరణ విశ్వాసులకు వారి విశ్వాసాన్ని అధికం చేసింది మరియు సత్యతిరస్కారులకు వారి తలబిరుసుతనాన్ని.

ٱلْمَلْعُونَةَ فِى ٱلْقُرْءَانِ ۚ وَنُخَوِّفُهُمْ فَمَا يَزِيدُهُمْ إِلَّا طُغْيَـٰنًا كَبِيرًا ﴿٦٠﴾

శపించబడిన (నరక) వృక్షం[1] - మేము వారికి ఒక పరీక్షగా చేశాము. కాని మా భయపెట్టడం, వారి తలబిరుసుతనాన్ని మాత్రమే మరింత అధికం చేస్తున్నది.

وَإِذْ قُلْنَا لِلْمَلَـٰٓئِكَةِ ٱسْجُدُوا۟ لِـَٔادَمَ فَسَجَدُوٓا۟ إِلَّآ إِبْلِيسَ قَالَ ءَأَسْجُدُ لِمَنْ خَلَقْتَ طِينًا ﴿٦١﴾

**61**. మరియు (జ్ఞాపకం చేసుకోండి!) మేము దేవదూతలతో: "ఆదమ్‌కు సాష్టాంగం (సజ్దా) చేయండి." అని చెప్పినపుడు; ఒక్క ఇబ్లీస్ తప్ప, అందరూ సాష్టాంగపడ్డారు.[2] అతడు అన్నాడు: "ఏమీ? నీవు మట్టితో సృష్టించిన వానికి నేను సాష్టాంగం (సజ్దా) చేయాలా?"

قَالَ أَرَءَيْتَكَ هَـٰذَا ٱلَّذِى كَرَّمْتَ عَلَىَّ لَئِنْ أَخَّرْتَنِ إِلَىٰ يَوْمِ ٱلْقِيَـٰمَةِ لَأَحْتَنِكَنَّ ذُرِّيَّتَهُۥٓ إِلَّا قَلِيلًا ﴿٦٢﴾

**62**. ఇంకా ఇలా అన్నాడు: "ఏమీ? నేను చూడటం లేదా? నీవు ఇతనికి నాపై ఆధిక్యతనిచ్చావు. కానీ ఒకవేళ నీవు నాకు పునరుత్థానదినం వరకు వ్యవధినిస్తే, నేను ఇతని సంతతివారిలో కొందరిని తప్ప అందరినీ వశపరచుకొని తప్పుదారి పట్టిస్తాను."[3]

قَالَ ٱذْهَبْ فَمَن تَبِعَكَ مِنْهُمْ فَإِنَّ جَهَنَّمَ جَزَآؤُكُمْ جَزَآءً مَّوْفُورًا ﴿٦٣﴾

**63**. ఆయన (అల్లాహ్) అన్నాడు: "సరే పో! వారిలో నిన్ను ఎవరు అనుసరిస్తారో! నిశ్చయంగా, మీరందరికీ నరకమే ప్రతిఫలమవుతుంది, పరిపూర్ణ ప్రతిఫలం!

---

1. ఆ నరకవృక్షఫలాలు, నరకవాసులకు ఆహారంగా ఇవ్వబడతాయి. దానిపేరు 'జఖ్ఖూమ్ (జెముడు వృక్షం). దాని వివరాలకు చూడండి, 37:62-66 మరియు 44:43-44.
2. ఆదమ్ ('అ.స.) వివరాల కొరకు చూడండి, 2:30-34, 7:11-18, 15:26-41 మరియు సూరాహ్‌లు 18, 20, 38 కూడా.
3. ఇబ్లీస్ మాటల కొరకు చూడండి, 7:16-17.

وَٱسۡتَفۡزِزۡ مَنِ ٱسۡتَطَعۡتَ مِنۡهُم بِصَوۡتِكَ وَأَجۡلِبۡ عَلَيۡهِم بِخَيۡلِكَ وَرَجِلِكَ وَشَارِكۡهُمۡ فِي ٱلۡأَمۡوَٰلِ وَٱلۡأَوۡلَٰدِ وَعِدۡهُمۡۚ وَمَا يَعِدُهُمُ ٱلشَّيۡطَٰنُ إِلَّا غُرُورًا ﴿٦٤﴾

64. "మరియు నీవు నీ ధ్వని (మాటల)తో వారిలో ఎవరెవరిని ఆశచూపి (ఆకర్షించగలవో) ఆకర్షించు.[1] మరియు నీ అశ్వికదళాలతో మరియు నీ పదాతి దళాలతో వారిమీదపడు.[2] మరియు వారికి సంపదలో, సంతానంలో భాగస్వామివికా![3] మరియు వారితో వాగ్దానాలు చెయ్యి.[4] మరియు షైతాన్ చేసే వాగ్దానాలు మోసపుచ్చటం తప్ప ఇంకేముంటాయి.[5]

إِنَّ عِبَادِي لَيۡسَ لَكَ عَلَيۡهِمۡ سُلۡطَٰنٞۚ وَكَفَىٰ بِرَبِّكَ وَكِيلٗا ﴿٦٥﴾

65. "నిశ్చయంగా, నా దాసులు! వారిపై నీకు ఏ విధమైన అధికారం లేదు.[6] మరియు వారికి కార్యకర్తగా (రక్షకునిగా) నీ ప్రభువే చాలు!"

رَّبُّكُمُ ٱلَّذِي يُزۡجِي لَكُمُ ٱلۡفُلۡكَ فِي ٱلۡبَحۡرِ لِتَبۡتَغُواْ مِن فَضۡلِهِۦٓۚ إِنَّهُۥ كَانَ بِكُمۡ رَحِيمٗا ﴿٦٦﴾

66. మీ ప్రభువు, ఆయనే - ఆయన అనుగ్రహాన్ని అన్వేషించటానికి - మీ కొరకు సముద్రంలో నావలను నడిపింపజేసేవాడు. నిశ్చయంగా, ఆయన మీ పట్ల అపార కరుణాప్రదాత.

---

1. 'సౌతిక: నీ ధ్వని అంటే-పాటలు, వాద్యాలు మరియు ఇతర మోసపుచ్చే మాటలు, అని అర్థం. వీటితో షైతాన్ మానవులను మోసపుచ్చుతాడు.
2. దళాలు అంటే - షైతాను అడుగుజాడలను అనుసరించే మానవులూ, జిన్నాతులూ.
3. అమ్వాల్ వ అవ్లాద్: అంటే సంపదలు మరియు సంతానం. అంటే నిషిద్ధ ('హరామ్) మార్గాలతో సంపాదించి, 'హరామ్ చేష్టలలో ఖర్చుచేసే ధనసంపత్తులు మరియు వ్యభిచారం వల్ల వచ్చే సంతానం.
4. షైతాన్ వాగ్దానాలు అంటే స్వర్గనరకాలు అనేవి ఏమీలేవు, మరణించిన తరువాత పునరుత్థానం అనేది లేదు. మన జీవితం ఈ భూలోక జీవితం మాత్రమే. కావున వీలైనంత వరకు దీని సుఖసంతోషాలను మీకు తోచినట్లు అనుభవించండి, అని ప్రజలను మోసపుచ్చటం.
5. చూడండి, 4:120.
6. నా దాసులు: అంటే అల్లాహ్(సు.తా.)ను నమ్ముకొని ఆయనపై ఆధారపడి, ఆయనచూపిన మార్గం మీదనే నడిచే సద్పురుషులు. అల్లాహ్ (సు.తా.) అలాంటి వారి, రక్షకుడు మరియు కార్యకర్త. షైతాన్‌కు అలాంటి వారిపై ఎలాంటి అధికారం ఉండదు. చూడండి, 14:22 మరియు 15:42.

وَإِذَا مَسَّكُمُ ٱلضُّرُّ فِي ٱلْبَحْرِ ضَلَّ مَن تَدْعُونَ إِلَّآ إِيَّاهُ فَلَمَّا نَجَّىٰكُمْ إِلَى ٱلْبَرِّ أَعْرَضْتُمْ وَكَانَ ٱلْإِنسَٰنُ كَفُورًا ﴿٦٧﴾

67. మరియు ఒకవేళ సముద్రంలో మీకు ఆపద వస్తే ఆయన (అల్లాహ్) తప్ప, మీరు పిలిచే వారందరూ మిమ్మల్ని త్యజిస్తారు. కాని, ఆయన మిమ్మల్ని రక్షించి, ఒడ్డుకు చేర్చినపుడు, మీరు ఆయన నుండి ముఖం త్రిప్పుకుంటారు. వాస్తవానికి మానవుడు ఎంతో కృతఘ్నుడు.

أَفَأَمِنتُمْ أَن يَخْسِفَ بِكُمْ جَانِبَ ٱلْبَرِّ أَوْ يُرْسِلَ عَلَيْكُمْ حَاصِبًا ثُمَّ لَا تَجِدُوا۟ لَكُمْ وَكِيلًا ﴿٦٨﴾

68. ఏమీ? ఆయన! నేల చీలిపోయి మిమ్మల్ని మ్రింగకుండా; లేదా తుఫాను మీపై రాకుండా; మిమ్మల్ని సురక్షితంగా ఉండనివ్వగలడని మీరు భావిస్తున్నారా?[1] అప్పుడు మీరు ఏ రక్షకుడినీ పొందలేరు.

أَمْ أَمِنتُمْ أَن يُعِيدَكُمْ فِيهِ تَارَةً أُخْرَىٰ فَيُرْسِلَ عَلَيْكُمْ قَاصِفًا مِّنَ ٱلرِّيحِ فَيُغْرِقَكُم بِمَا كَفَرْتُمْ ثُمَّ لَا تَجِدُوا۟ لَكُمْ عَلَيْنَا بِهِۦ تَبِيعًا ﴿٦٩﴾

69. లేదా! మరొకసారి ఆయన మిమ్మల్ని సముద్రంలోకి తీసుకొనిపోయి - మీ కృతఘ్నతకు ఫలితంగా - మీ మీద తీవ్రమైన తుఫాను గాలిని పంపి, మిమ్మల్ని ముంచివేయకుండా సురక్షితంగా ఉండనివ్వగలడని భావిస్తున్నారా? అప్పుడు మాకు విరుద్ధంగా[2] సహాయపడే వారినెవ్వరినీ మీరు పొందలేరు. (3/8)

---

1. ఏ విధంగానైతే అల్లాహ్ (సు.తా.)కు అవిధేయులైన, పూర్వ తరాలవారు శిక్షింపబడ్డారో, అలా మీరు కూడా శిక్షింపబడరని భావిస్తున్నారా?
2. తబీ'అన్: పగతీర్చుకునేవాడు, కక్ష తీర్చుకునేవాడు. అంటే ఒకసారి మిమ్మల్ని సముద్రంలో 'తుఫాన్ నుండి క్షేమంగా బయటపెట్టిన తర్వాత ఆయన (అల్లాహుతా'ఆలాయే) మీ అవిధేయతకు కారణంగా మీరు మరల సముద్రంలోకి పోయినపుడు మిమ్మల్ని ముంచివేయవచ్చని మీరు భయపడరా? అప్పుడు ఆయన (సు.తా.)కు విరుద్ధంగా మీకు, మీ కల్పిత దైవాలు ఎవ్వరూ సహాయపడలేరు.

**70.** * మరియు వాస్తవానికి మేము ఆదమ్ సంతతికి గౌరవము నొసంగాము.[1] మరియు వారికి నేలమీదనూ, సముద్రంలోనూ, ప్రయాణం కొరకు వాహనాలను ప్రసాదించాము. మరియు మేము వారికి పరిశుద్ధమైన వస్తువులను జీవనోపాధిగా సమకూర్చాము. మరియు మేము సృష్టించిన ఎన్నో ప్రాణులపై వారికి ప్రత్యేక ప్రాధాన్యత నిచ్చాము.

**71.** (జ్ఞాపకముంచుకోండి!) ఒక రోజు మేము మానవులందరినీ వారి వారి నాయకు(ఇమామ్)లతో సహా పిలుస్తాము.[2] అప్పుడు వారి కర్మపత్రాలు కుడిచేతిలో ఇవ్వబడిన వారు,[3] తమ కర్మపత్రాలను చదువుకుంటారు మరియు వారికి రవ్వంత (ఖర్జూర బీజపు చీలికలోని పొరంత) అన్యాయం కూడా జరుగదు.

**72.** మరియు ఎవడు ఇహలోకంలో అంధుడై మెలగుతాడో, అతడు పరలోకంలో కూడా అంధుడిగానే ఉంటాడు[4] మరియు సన్మార్గం నుండి భ్రష్టుడవుతాడు.

۞ وَلَقَدۡ كَرَّمۡنَا بَنِيٓ ءَادَمَ
وَحَمَلۡنَٰهُمۡ فِي ٱلۡبَرِّ وَٱلۡبَحۡرِ
وَرَزَقۡنَٰهُم مِّنَ ٱلطَّيِّبَٰتِ
وَفَضَّلۡنَٰهُمۡ عَلَىٰ كَثِيرٖ مِّمَّنۡ
خَلَقۡنَا تَفۡضِيلٗا ٧٠

يَوۡمَ نَدۡعُواْ كُلَّ أُنَاسِۭ بِإِمَٰمِهِمۡۖ
فَمَنۡ أُوتِيَ كِتَٰبَهُۥ بِيَمِينِهِۦ
فَأُوْلَٰٓئِكَ يَقۡرَءُونَ كِتَٰبَهُمۡ
وَلَا يُظۡلَمُونَ فَتِيلٗا ٧١

وَمَن كَانَ فِي هَٰذِهِۦٓ أَعۡمَىٰ فَهُوَ
فِي ٱلۡأٓخِرَةِ أَعۡمَىٰ وَأَضَلُّ سَبِيلٗا
٧٢

---

**1.** చూడండి 2:31, వారికి మంచిచెడును అర్థంచేసుకునే విచక్షణా శక్తినీ, బుద్ధినీ ప్రసాదించాము.

**2.** ఇమామ్: అంటే నాయకుడు ఇక్కడ వ్యాఖ్యాతలు దీనికి మూడు అర్థాలిచ్చారు. 1) దైవప్రవక్తలు, 2) దివ్యగ్రంథాలు, 3) కర్మపత్రాలు. ప్రతి ఒక్కరు తమ కాలపు దైవప్రవక్త లేక దివ్యగ్రంథం లేక కర్మపత్రంతో పిలువబడతారు. ఇబ్నె-కసీ'ర్ మరియు షౌకాని ఈ మూడవది అంటే కర్మపత్రమని భావిస్తున్నారు. చూడండి, 53:39.

**3.** చూడండి, 69:19 మరియు 84:7.

**4.** అంధుడు అంటే హృదయంతో అంధుడు లేక సత్యాసత్యాలను అర్థంచేసుకోలేని వాడు. ఇంకా చూడండి, 20:124-125.

وَإِن كَادُواْ لَيَفْتِنُونَكَ عَنِ ٱلَّذِيٓ أَوْحَيْنَآ إِلَيْكَ لِتَفْتَرِيَ عَلَيْنَا غَيْرَهُۥۖ وَإِذٗا لَّٱتَّخَذُوكَ خَلِيلٗا ٧٣

**73.** మరియు (ఓ ప్రవక్తా!) మేము నీపై అవతరింపజేసిన దివ్యజ్ఞానం (వ'హీ) నుండి నిన్ను మరలించి, నీవు అదికాక మా పేరుతో మరొక దానిని (సందేశాన్ని) కల్పించాలని నిన్ను పురికొల్పటానికి వారు ప్రయత్నిస్తున్నారు.[1] నీవు అలా చేసి ఉంటే వారు తప్పకుండా నిన్ను తమ ఆప్తమిత్రునిగా చేసుకునే వారు.

وَلَوْلَآ أَن ثَبَّتْنَٰكَ لَقَدْ كِدتَّ تَرْكَنُ إِلَيْهِمْ شَيْـٔٗا قَلِيلًا ٧٤

**74.** మరియు ఒకవేళ మేము నిన్ను స్థిరంగా ఉంచకపోతే నీవు వారి వైపుకు కొంతైనా మొగ్గి ఉండేవాడవు.

إِذٗا لَّأَذَقْنَٰكَ ضِعْفَ ٱلْحَيَوٰةِ وَضِعْفَ ٱلْمَمَاتِ ثُمَّ لَا تَجِدُ لَكَ عَلَيْنَا نَصِيرٗا ٧٥

**75.** అలాగైతే, మేము నీకు ఈ జీవితంలో రెట్టింపు శిక్షను మరియు చనిపోయిన తరువాత కూడా రెట్టింపు శిక్షను రుచిచూపి ఉండేవారం! అప్పుడు మాకు వ్యతిరేకంగా నీకు సహాయపడే వాడిని ఎవ్వడినీ నీవు పొందివుండే వాడవు కాదు.

وَإِن كَادُواْ لَيَسْتَفِزُّونَكَ مِنَ ٱلْأَرْضِ لِيُخْرِجُوكَ مِنْهَاۖ وَإِذٗا لَّا يَلْبَثُونَ خِلَٰفَكَ إِلَّا قَلِيلٗا ٧٦

**76.** మరియు వారు (అవిశ్వాసులు) నిన్ను ఈ భూమి నుండి వెడలగొట్టటానికి, నిన్ను కలవరపెట్ట గోరేవారు. కాని అలాంటప్పుడు, నీవు వెళ్ళిపోయిన తరువాత, వారుకూడా కొద్దికాలం మాత్రమే ఉండగలిగే వారు.[2]

---

**1.** ఇది ముష్రిక్ ఖురైషులు దైవప్రవక్త ('స'అస) ముందు పెట్టిన మరొక ప్రస్తావన. అంటే అతను వారి కల్పిత దైవాలను నిజమైన దైవాలని గుర్తిస్తే వారు కూడా అతనిని దైవప్రవక్తగా గుర్తిస్తామని పెట్టిన షరతు. దానిని అతను ('స'అస) నిరాకరించారు.

**2.** కావున కొద్దికాలం తరువాత 2వ హి.శ.లో బద్ర్‌లో మక్కా ఖురైషుల పలువురు నాయకులు చంపబడ్డారు. మరియు 8వ హిజ్రీలో ముస్లింలు మక్కాను జయించారు.

سُنَّةَ مَن قَدْ أَرْسَلْنَا قَبْلَكَ مِن رُّسُلِنَا ۖ وَلَا تَجِدُ لِسُنَّتِنَا تَحْوِيلًا ﴿٧٧﴾

77. (ఓ ము'హమ్మద్) ఇది వాస్తవానికి! మేము, నీకు పూర్వం పంపిన ప్రవక్తలందరికీ వర్తించిన సంప్రదాయమే! నీవు మా సాంప్రదాయంలో ఎలాంటి మార్పును పొందలేవు.

أَقِمِ الصَّلَوٰةَ لِدُلُوكِ الشَّمْسِ إِلَىٰ غَسَقِ الَّيْلِ وَقُرْءَانَ الْفَجْرِ ۖ إِنَّ قُرْءَانَ الْفَجْرِ كَانَ مَشْهُودًا ﴿٧٨﴾

78. మధ్యాహ్నం సూర్యుడు వాలినప్పటి నుండి, రాత్రి అయి చీకటి పడేవరకూ నమా'జ్‌లను సలుపు మరియు ప్రాతఃకాలపు (నమా'జ్‌లో ఖుర్ఆన్) పఠించు.[1] నిశ్చయంగా ప్రాతఃకాలపు (ఖుర్ఆన్) పఠనం (దేవదూతల ద్వారా) వీక్షింపబడుతుంది.[2]

وَمِنَ الَّيْلِ فَتَهَجَّدْ بِهِۦ نَافِلَةً لَّكَ عَسَىٰٓ أَن يَبْعَثَكَ رَبُّكَ مَقَامًا مَّحْمُودًا ﴿٧٩﴾

79. మరియు రాత్రి వేళలో జాగరణ (తహజ్జుద్) నమా'జ్ చెయ్యి;[3] ఇది నీ కొరకు అదనపు (నఫిల్) నమా'జ్. దీనితో నీ ప్రభువు నిన్ను (పునరుత్థాన దినమున) ప్రశంసనీయమైన స్థానము (మఖామమ్ మ'హ్మూద్) నొసంగవచ్చు!

1. ఈ ఆయత్‌లో ఐదు విధి (ఫ'ర్ద్)గా సలుపవలసిన నమా'జ్‌ల ప్రస్తావన వచ్చింది. సూర్యుడు వాలిన తరువాత జుహ్ర్, సూర్యాస్తమయానికి కొంత కాలం ముందు 'అ'స్ర్, సూర్యాస్తమయం కాగానే మ'గ్‌రిబ్, కొంత చీకటి పడ్డ తరువాత 'ఇషా మరియు ప్రాతఃకాలమున సూర్యోదయాని ముందు ఫజ్ర్ చేయాలని. ఫజ్ర్ నమాజ్‌లో ఖుర్ఆన్ పఠనం ఎక్కువగా చేయాలి. ఈ నమా'జ్‌లను గురించిన వివరాలు 'స'హీ'హ్ 'హదీస్'లలో ఉన్నాయి.
2. ప్రాతఃకాలపు ఫజ్ర్ నమా'జ్ సమయంలో పగటి మరియు రాత్రి దైవదూతలు కలుస్తారు. వారంతా ప్రజల నమా'జ్‌లను చూస్తారు. మరియు దానిని గురించి అల్లాహుతా'ఆలాకు తెలుపుతారు. అది అల్లాహ్(సు.తా.)కు అగోచరమైనది కాదు, కానీ ఆయన (సు.తా.) వారినుండి తనప్రజల ప్రశంసలు వినగోరుతాడు. ('స.బు'ఖారీ మరియు ముస్లిం).
3. తహజ్జుద్: అంటే నిద్రాభంగం. ఇది నఫీల్ నమా'జ్, అంటే అదనంగా చేసే నమా'జ్. దైవప్రవక్త ('స'అస) రాత్రి మొదటి భాగంలో నిద్ర తీసుకొని, చివరి భాగంలో నిద్రనుండి లేచి నమా'జ్ చేసేవారు, అదే తహజ్జుద్ నమా'జ్. 'స'హీ'హ్ 'హదీస్'లలో దీని వివరాలున్నాయి. ఇంకా చూడండి, 76:26.

80. మరియు ఇలా ప్రార్థించు: "ఓ నా ప్రభూ! నీవు నా ప్రతి ప్రవేశాన్ని, సత్య ప్రవేశంగా చేయి మరియు నా బహిర్గమనాన్ని కూడా సత్య బహిర్గమనంగా చేయి మరియు నీ వైపునుండి నాకు అధికారాన్నీ, సహాయాన్నీ ఒసంగు."[1]

وَقُل رَّبِّ أَدْخِلْنِي مُدْخَلَ صِدْقٍ وَأَخْرِجْنِي مُخْرَجَ صِدْقٍ وَاجْعَل لِّي مِن لَّدُنكَ سُلْطَانًا نَّصِيرًا ﴿٨٠﴾

81. మరియు ఇలా అను: "సత్యం వచ్చింది మరియు అసత్యం అంతరించింది. నిశ్చయంగా, అసత్యం అంతరించక తప్పదు."[2]

وَقُلْ جَاءَ الْحَقُّ وَزَهَقَ الْبَاطِلُ ۚ إِنَّ الْبَاطِلَ كَانَ زَهُوقًا ﴿٨١﴾

82. మరియు మేము ఈ ఖుర్ఆన్ ద్వారా విశ్వాసులకు స్వస్థతను మరియు కారుణ్యాన్ని క్రమక్రమంగా అవతరింప జేస్తాము, కాని దుర్మార్గులకు ఇది నష్టం తప్ప మరేమీ అధికం చేయదు.[3]

وَنُنَزِّلُ مِنَ الْقُرْآنِ مَا هُوَ شِفَاءٌ وَرَحْمَةٌ لِّلْمُؤْمِنِينَ ۙ وَلَا يَزِيدُ الظَّالِمِينَ إِلَّا خَسَارًا ﴿٨٢﴾

83. మరియు ఒకవేళ మేము మానవుణ్ణి అనుగ్రహిస్తే, అతడు ముఖం త్రిప్పుకొని (మానుండి) మరలిపోతాడు. కాని అతనికి కీడు కలిగితే నిరాశ చెందుతాడు.[4]

وَإِذَا أَنْعَمْنَا عَلَى الْإِنسَانِ أَعْرَضَ وَنَأَىٰ بِجَانِبِهِ ۖ وَإِذَا مَسَّهُ الشَّرُّ كَانَ يَئُوسًا ﴿٨٣﴾

---

1. కొందరు వ్యాఖ్యాతలు ఈ ఆయత్ ప్రస్థానం (హిజ్రత్) సమయంలో అవతరింపజేయ బడిందని అంటారు. అంటే యస్'రిబ్ (మదీనా మునవ్వరా) ప్రవేశాన్ని మరియు మక్కా ముకర్రమా బహిర్గమనాన్ని సత్యమైనవి చేయమని దైవప్రవక్త ('స'అస) ప్రార్థిస్తున్నారు. మరికొందరు అంటారు: నన్ను సత్యం మీద మరణింపజేయి మరియు సత్యంతో పునరుత్థరింపజేయి. ఇమామ్ షౌకాని అంటారు: ఈ అన్నీ అర్థాలు కూడా సమంజసమైనవే, ఎందుకంటే ఇది ఒక దు'ఆ.
2. మక్కా ముకర్రమా విజయం తరువాత, దైవప్రవక్త ('స'అస) కాబాలో ప్రవేశిస్తారు. అక్కడ 360 విగ్రహాలు ఉంటాయి. వాటిని ఒక చిన్న కట్టెతో కొట్టుతూ ఈ ఆయత్ చదువుతారు. ('స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం).
3. ఇటువంటి ఆయత్‌కు చూడండి,10:57.
4. మానవుడు సుఖసంతోషాలలో ఉన్నప్పుడు అల్లాహ్ (సు.తా.)ను మరచిపోతాడు మరియు కష్ట కాలంలో నిరాశ చెందుతాడు. కాని ఒక విశ్వాసి రెండు పరిస్థితులలోనూ తన ప్రభువు పవిత్రతను కొనియాడుతూ, ఆయన స్తోత్రం చేస్తూ ఉంటాడు. చూడండి, 11:9-11.

قُلۡ كُلّٞ يَعۡمَلُ عَلَىٰ شَاكِلَتِهِۦ فَرَبُّكُمۡ أَعۡلَمُ بِمَنۡ هُوَ أَهۡدَىٰ سَبِيلٗا ٨٤

**84**. వారితో ఇలా అను: "ప్రతి ఒక్కడు తనకు తోచినట్లే పనులు చేస్తాడు, కాని మీ ప్రభువుకు మాత్రం ఎవడు సన్మార్గం పొందేవాడో బాగా తెలుసు."[1]

وَيَسۡـَٔلُونَكَ عَنِ ٱلرُّوحِۖ قُلِ ٱلرُّوحُ مِنۡ أَمۡرِ رَبِّي وَمَآ أُوتِيتُم مِّنَ ٱلۡعِلۡمِ إِلَّا قَلِيلٗا ٨٥

**85**. మరియు వారు నిన్ను ఆత్మ (రూ'హ్)ను గురించి ప్రశ్నిస్తున్నారు. వారితో ఇలా అను: "ఆత్మ! నా ప్రభువు ఆజ్ఞ వలన ఉంది మరియు (దానిని గురించి) మీకు ఇవ్వబడిన జ్ఞానం అతి స్వల్పమైనది."[2]

وَلَئِن شِئۡنَا لَنَذۡهَبَنَّ بِٱلَّذِيٓ أَوۡحَيۡنَآ إِلَيۡكَ ثُمَّ لَا تَجِدُ لَكَ بِهِۦ عَلَيۡنَا وَكِيلًا ٨٦

**86**. మరియు ఒకవేళ మేము కోరినట్లయితే నీపై అవతరింపజేయబడిన సందేశాన్ని (ఖుర్ఆన్‌ను) లాగు(స్వాధీన పరచు)కోగలము; అప్పుడు దానిని గురించి, మాకు వ్యతిరేకంగా, నీవు ఏ సహాయకుడినీ పొందలేవు;

إِلَّا رَحۡمَةٗ مِّن رَّبِّكَۚ إِنَّ فَضۡلَهُۥ كَانَ عَلَيۡكَ كَبِيرٗا ٨٧

**87**. కేవలం నీ ప్రభువు కారుణ్యం తప్ప. నిశ్చయంగా, నీపై ఉన్న ఆయన (నీ ప్రభువు) అనుగ్రహం ఎంతో గొప్పది.

قُل لَّئِنِ ٱجۡتَمَعَتِ ٱلۡإِنسُ وَٱلۡجِنُّ عَلَىٰٓ أَن يَأۡتُواْ بِمِثۡلِ هَٰذَا ٱلۡقُرۡءَانِ لَا يَأۡتُونَ بِمِثۡلِهِۦ وَلَوۡ كَانَ بَعۡضُهُمۡ لِبَعۡضٖ ظَهِيرٗا ٨٨

**88**. ఇలా అను: "ఒకవేళ మానవులు మరియు జిన్నాతులు అందరూ కలిసి, ఈ ఖుర్ఆన్‌వంటి దానిని కల్పించి తీసుకు రావటానికి ప్రయత్నించినా - వారు ఒకరినొకరు తోడ్పడినప్పటికీ - ఇటువంటి దానిని కల్పించి తేలేరు."[3]

---

**1**. దీని సారాంశము, 11:121-122 ఆయత్‌ల మాదిరిగానే ఉంది.

**2**. అర్-రూ'హు: ఆత్మను గురించి కేవలం అల్లాహ్ (సు.తా.)కు మాత్రమే తెలుసు. దాని జ్ఞానం కేవలం నా ప్రభువు (సు.తా.)కు మాత్రమే ఉంది. దాని జ్ఞానం ఆయన, ప్రవక్తలకు కూడా ఇవ్వలేదు. అది ఆయన ఆజ్ఞతో వస్తుంది: 'కున్ ఫ యకూన్.'

**3**. చూడండి, 52:34.

وَلَقَدْ صَرَّفْنَا لِلنَّاسِ فِي هَٰذَا ٱلْقُرْءَانِ مِن كُلِّ مَثَلٍ فَأَبَىٰٓ أَكْثَرُ ٱلنَّاسِ إِلَّا كُفُورًا ﴿٨٩﴾

89. మరియు వాస్తవానికి, మేము ఈ ఖుర్ఆన్‌లో ప్రజలకు ప్రతి విధమైన ఉపమానాన్ని వివరించి బోధించి ఉన్నాము. అయినా చాలామంది ప్రజలు సత్యతిరస్కారులుగానే ఉండిపోయారు.

وَقَالُواْ لَن نُّؤْمِنَ لَكَ حَتَّىٰ تَفْجُرَ لَنَا مِنَ ٱلْأَرْضِ يَنۢبُوعًا ﴿٩٠﴾

90. మరియు వారు ఇలా అంటారు: "(ఓ ము'హమ్మద్!) నీవు భూమినుండి మా కొరకు ఒక చెలమను ఝల్లున ప్రవహింపజేయనంత వరకు మేము నిన్ను విశ్వసించము;[1]

أَوْ تَكُونَ لَكَ جَنَّةٌ مِّن نَّخِيلٍ وَعِنَبٍ فَتُفَجِّرَ ٱلْأَنْهَٰرَ خِلَٰلَهَا تَفْجِيرًا ﴿٩١﴾

91. "లేదా! నీ కొరకు ఖర్జూరపు మరియు ద్రాక్షతోట ఏర్పడి దాని మధ్య నుండి సెలయేళ్ళు పొంగి ప్రవహింప జేయనంత వరకు;

أَوْ تُسْقِطَ ٱلسَّمَآءَ كَمَا زَعَمْتَ عَلَيْنَا كِسَفًا أَوْ تَأْتِيَ بِٱللَّهِ وَٱلْمَلَٰٓئِكَةِ قَبِيلًا ﴿٩٢﴾

92. "లేదా, నీవు మమ్మల్ని భయపెట్టినట్లు,[2] ఆకాశం ముక్కలై మాపై పడవేయబడనంత వరకు; లేదా అల్లాహ్‌ను మరియు దేవదూతలను మా ముందు ప్రత్యక్ష పరచనంత వరకు;

أَوْ يَكُونَ لَكَ بَيْتٌ مِّن زُخْرُفٍ أَوْ تَرْقَىٰ فِي ٱلسَّمَآءِ وَلَن نُّؤْمِنَ لِرُقِيِّكَ حَتَّىٰ تُنَزِّلَ عَلَيْنَا كِتَٰبًا نَّقْرَؤُهُۥ ۗ قُلْ سُبْحَانَ رَبِّي هَلْ كُنتُ إِلَّا بَشَرًا رَّسُولًا ﴿٩٣﴾

93. "లేదా నీ కొరకు స్వర్ణగృహం ఏర్పడనంత వరకు; లేదా నీవు ఆకాశంలోకి ఎక్కిపోయినా నీవు, మేము చదువగలిగే ఒక గ్రంథాన్ని అవతరింపజేయనంతవరకు; నీవు ఆకాశంలోకి ఎక్కటాన్ని మేము నమ్మము." వారితో అను: "నా ప్రభువు సర్వలోపాలకు అతీతుడు, నేను కేవలం సందేశహరునిగా పంపబడిన మానవుడను మాత్రమే!"[3]

---

1. ఇది ముష్రిక్ ఖురైషులు ఇస్లాం స్వీకరించటానికి - మూసా('అ.స.) బండనుండి పన్నెండు ఊటలను ప్రవహింపజేసినట్లు, మీరు కూడా ప్రవహింపజేయండని - పెట్టిన షర్తు. చూ. 2:60.
2. భయపెట్టుటకు - ఇలాంటి ఆయత్‌కు చూడండి, 34:9.
3. అద్భుత సూచనలు కేవలం అల్లాహ్ (సు.తా.) చేతిలోనే ఉన్నాయి. ఆయన కోరితేనే వాటిని చూపుతాడు. చూడండి, 6:109.

94. మరియు ప్రజల ముందుకు మార్గదర్శకత్వం వచ్చినపుడు, దానిని విశ్వసించకుండా వారిని ఆపిందేమిటి? వారు (మూఢ విశ్వాసంలో మునిగి): "ఏమీ? అల్లాహ్ మానవుణ్ణి తన సందేశహరునిగా పంపాడా?" అని పలకడం తప్ప!

وَمَا مَنَعَ ٱلنَّاسَ أَن يُؤْمِنُوٓاْ إِذْ جَآءَهُمُ ٱلْهُدَىٰٓ إِلَّآ أَن قَالُوٓاْ أَبَعَثَ ٱللَّهُ بَشَرًا رَّسُولًا ﴿٩٤﴾

95. ఇలా అను: "ఒకవేళ భూమి మీద దేవదూతలు నివసిస్తూ నిశ్చింతగా తిరుగుతూ ఉండినట్లయితే, మేము వారి కొరకు దేవదూతనే సందేశహరునిగా పంపిఉండే వారము."

قُل لَّوْ كَانَ فِى ٱلْأَرْضِ مَلَٰٓئِكَةٌ يَمْشُونَ مُطْمَئِنِّينَ لَنَزَّلْنَا عَلَيْهِم مِّنَ ٱلسَّمَآءِ مَلَكًا رَّسُولًا ﴿٩٥﴾

96. ఇలా అను: "నాకూ మరియు మీకూ మధ్య అల్లాహ్‌యే సాక్షిగా చాలు. నిశ్చయంగా ఆయన తన దాసులను బాగా ఎరుగువాడు, సర్వదృష్టికర్త."

قُلْ كَفَىٰ بِٱللَّهِ شَهِيدًۢا بَيْنِى وَبَيْنَكُمْ ۚ إِنَّهُۥ كَانَ بِعِبَادِهِۦ خَبِيرًۢا بَصِيرًا ﴿٩٦﴾

97. మరియు ఎవడికి అల్లాహ్ మార్గదర్శకత్వం చేస్తాడో అతడే సన్మార్గం పొందుతాడు. మరియు ఎవడిని ఆయన మార్గభ్రష్టత్వంలో పడనిస్తాడో వాడికి, ఆయన తప్ప, ఇతరుల నెవ్వరినీ నీవు సంరక్షకులుగా పొందలేవు. మరియు వారిని మేము పునరుత్థానదినమున గ్రుడ్డివారుగా, మూగవారుగా మరియు చెవిటివారుగా చేసి, వారి ముఖాల మీద బోర్లాపడవేసి లాగుతూ ప్రోగుచేస్తాము. వారి ఆశ్రయం నరకమే! అది చల్లారినప్పుడల్లా మేము వారికై అగ్ని జ్వాలను తీవ్రం చేస్తాము.

وَمَن يَهْدِ ٱللَّهُ فَهُوَ ٱلْمُهْتَدِ ۖ وَمَن يُضْلِلْ فَلَن تَجِدَ لَهُمْ أَوْلِيَآءَ مِن دُونِهِۦ ۖ وَنَحْشُرُهُمْ يَوْمَ ٱلْقِيَٰمَةِ عَلَىٰ وُجُوهِهِمْ عُمْيًا وَبُكْمًا وَصُمًّا ۖ مَّأْوَىٰهُمْ جَهَنَّمُ ۖ كُلَّمَا خَبَتْ زِدْنَٰهُمْ سَعِيرًا ﴿٩٧﴾

ذَٰلِكَ جَزَآؤُهُم بِأَنَّهُمۡ كَفَرُواْ بِـَٔايَٰتِنَا وَقَالُوٓاْ أَءِذَا كُنَّا عِظَٰمٗا وَرُفَٰتًا أَءِنَّا لَمَبۡعُوثُونَ خَلۡقٗا جَدِيدًا ﴿٩٨﴾

98. అదే వారి ప్రతిఫలం ఎందుకంటే వాస్తవానికి వారు మా సూచనలను తిరస్కరించారు మరియు అన్నారు: "ఏమీ? మేము ఎముకలుగా, పొడిగా మారిపోయిన తరువాత కూడా, సరిక్రొత్త సృష్టిగా మళ్ళీ లేపబడతామా?"[1] (1/2)

۞ أَوَلَمۡ يَرَوۡاْ أَنَّ ٱللَّهَ ٱلَّذِي خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ قَادِرٌ عَلَىٰٓ أَن يَخۡلُقَ مِثۡلَهُمۡ وَجَعَلَ لَهُمۡ أَجَلٗا لَّا رَيۡبَ فِيهِ فَأَبَى ٱلظَّٰلِمُونَ إِلَّا كُفُورٗا ﴿٩٩﴾

99. * ఏమీ? వారు చూడటం లేదా (ఎరుగరా)? నిశ్చయంగా, అల్లాహ్ యే ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించిన వాడనీ[2] మరియు వారివంటి వారినీ సృష్టించగల సమర్థుడనీ మరియు ఆయనే వారికొరకు ఒక నిర్ణీత సమయాన్ని నియమించాడనీ,[3] దానిని (ఆ సమయాన్ని) గురించి ఎలాంటి సందేహం లేదనీ; అయినా ఈ దుర్మార్గులు మొండిగా సత్యాన్ని తిరస్కరించటానికే పూనుకున్నారు.

قُل لَّوۡ أَنتُمۡ تَمۡلِكُونَ خَزَآئِنَ رَحۡمَةِ رَبِّيٓ إِذٗا لَّأَمۡسَكۡتُمۡ خَشۡيَةَ ٱلۡإِنفَاقِۚ وَكَانَ ٱلۡإِنسَٰنُ قَتُورٗا ﴿١٠٠﴾

100. వారితో అను: "ఒకవేళ మీరు నా ప్రభువు యొక్క అనుగ్రహపు నిధులను పొందివున్నా, అవి ఖర్చయిపోతాయేమోననే భయంతో, వాటిని మీరు పట్టుకొని (ఖర్చుచేయకుండా) ఉండేవారు.[4] మరియు వాస్తవానికి మానవుడు ఎంతో లోభి!"

---

1. ఇటువంటి వాక్యానికి చూడండి, 17:49.
2. చూడండి, 40:57, 46:33 మరియు 36:81-82.
3. నిర్ణీత సమయం అంటే పునరుత్థానదినం.
4. ఇటువంటి వాక్యానికి చూడండి, 4:53.

وَلَقَدْ ءَاتَيْنَا مُوسَىٰ تِسْعَ ءَايَٰتٍۭ بَيِّنَٰتٍۖ فَسْـَٔلْ بَنِىٓ إِسْرَٰٓءِيلَ إِذْ جَآءَهُمْ فَقَالَ لَهُۥ فِرْعَوْنُ إِنِّى لَأَظُنُّكَ يَٰمُوسَىٰ مَسْحُورًا ﴿١٠١﴾

**101**. మరియు మేము వాస్తవానికి, మూసాకు స్పష్టమైన తొమ్మిది అద్భుత సూచనలను ప్రసాదించాము.[1] ఇస్రాయీ'లు సంతతివారిని అడుగు, అతను (మూసా) వారి వద్దకు వచ్చినపుడు ఫిర్'ఔన్ అతనితో అన్నాడు: "ఓ మూసా! నిశ్చయంగా, నీవు మంత్రజాలానికి గురి అయ్యావని నేను భావిస్తున్నాను."

قَالَ لَقَدْ عَلِمْتَ مَآ أَنزَلَ هَٰٓؤُلَآءِ إِلَّا رَبُّ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ بَصَآئِرَ وَإِنِّى لَأَظُنُّكَ يَٰفِرْعَوْنُ مَثْبُورًا ﴿١٠٢﴾

**102**. (మూసా) అన్నాడు: "నీకు బాగా తెలుసు, జ్ఞానవృద్ధి కలుగజేసే వాటిని (ఈ సూచనలను) భూమ్యాకాశాల ప్రభువు తప్ప మరెవ్వరూ అవతరింపజేయలేరని! ఓ ఫిర్'ఔన్ నీవు నిశ్చయంగా, నశింప నున్నావని నేను భావిస్తున్నాను."[2]

فَأَرَادَ أَن يَسْتَفِزَّهُم مِّنَ ٱلْأَرْضِ فَأَغْرَقْنَٰهُ وَمَن مَّعَهُۥ جَمِيعًا ﴿١٠٣﴾

**103**. అప్పుడు అతడు (ఫిర్'ఔన్) వారిని భూమి (ఈజిప్ట్) నుండి వెడలగొట్టాలని సంకల్పించుకున్నాడు; కావున మేము అతనిని (ఫిర్'ఔన్ను) మరియు అతనితో పాటు ఉన్న వారందరినీ ముంచివేశాము.

وَقُلْنَا مِنۢ بَعْدِهِۦ لِبَنِىٓ إِسْرَٰٓءِيلَ ٱسْكُنُوا۟ ٱلْأَرْضَ فَإِذَا جَآءَ وَعْدُ ٱلْـَٔاخِرَةِ جِئْنَا بِكُمْ لَفِيفًا ﴿١٠٤﴾

**104**. మరియు ఆ తరువాత, ఇస్రాయీ'ల్ సంతతివారితో మేము ఇలా అన్నాము: "మీరు ఈ భూమిలో స్వేచ్ఛగా నివసించండి. కానీ అంతిమ వాగ్దానం ఆసన్నమైనప్పుడు, మేము మీరందరినీ ఒకేచోట చేర్చుతాము."

---

**1**. మూసా ('అ.స.)కు ఇవ్వబడిన (ఫిర్'ఔన్ జాతి వారికి చూపిన) తొమ్మిది అద్భుత సూచనలు: 1) ప్రకాశించే చేయి, 2) సర్పంగా మారే చేతి కర్ర, 3) దుష్టులకు కలిగిన కరువు మరియు ఫల నష్టము, 4) 'తుఫాను, 5) మిడుతల దండు, 6) పేనులు, 7) కప్పలు, 8) రక్తం మరియు 9) సముద్రంలో ఏర్పడిన బాట. ఇవి సూరహ్ అల్-అ'అరాఫ్ (7)లో కూడా వివరించబడ్డాయి. ఇబ్నె 'అబ్బాస్, ముజాహిద్, ఇక్రిమా, షాబీ, ఖతద ర'ది.'అన్హుమ్‌ల వ్యాఖ్యానం, (ఇబ్నె-కసీ'ర్). ఇవేగాక బండనుండి తీసిన 12 ఊటలూ, మన్న మరియు సల్వాలు కూడా అద్భుత సూచనలే, కాని వీటిని ఫిర్'ఔన్ జాతివారు చూడలేదు.

**2**. మూసా ('అ.స.) యొక్క వివరాలకు చూడండి, 7:103-137 మరియు 20:49-79.

**105**. మరియు మేము దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) సత్యంతో అవతరింపజేశాము మరియు ఇది సత్యంతోనే అవతరించింది. (ఓ ప్రవక్తా!) మేము నిన్ను కేవలం శుభవార్త అందజేసేవానిగా మరియు హెచ్చరిక చేసేవానిగా మాత్రమే పంపాము!

وَبِٱلۡحَقِّ أَنزَلۡنَٰهُ وَبِٱلۡحَقِّ نَزَلَۗ وَمَآ أَرۡسَلۡنَٰكَ إِلَّا مُبَشِّرٗا وَنَذِيرٗا ﴿١٠٥﴾

**106**. మరియు నీవు ప్రజలకు నెమ్మది నెమ్మదిగా చదివి వినిపించాలని, మేము ఖుర్ఆన్‌ను విభజించి, క్రమక్రమంగా అవతరింపజేశాము.

وَقُرۡءَانٗا فَرَقۡنَٰهُ لِتَقۡرَأَهُۥ عَلَى ٱلنَّاسِ عَلَىٰ مُكۡثٖ وَنَزَّلۡنَٰهُ تَنزِيلٗا ﴿١٠٦﴾

**107**. వారితో అను: "మీరు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) నమ్మినా నమ్మక పోయినా; నిశ్చయంగా, ఇదివరకు జ్ఞానమొసంగబడిన వారికి దీనిని వినిపించినప్పుడు, వారు తమ ముఖాల మీద పడి సాష్టాంగం (సజ్దా) చేస్తారు."

قُلۡ ءَامِنُواْ بِهِۦٓ أَوۡ لَا تُؤۡمِنُوٓاْۚ إِنَّ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡعِلۡمَ مِن قَبۡلِهِۦٓ إِذَا يُتۡلَىٰ عَلَيۡهِمۡ يَخِرُّونَ لِلۡأَذۡقَانِۤ سُجَّدٗا ﴿١٠٧﴾

**108**. మరియు ఇలా అంటారు: "మా ప్రభువు సర్వలోపాలకు అతీతుడు, మా ప్రభువు వాగ్దానం పూర్తిఅయి తీరుతుంది."

وَيَقُولُونَ سُبۡحَٰنَ رَبِّنَآ إِن كَانَ وَعۡدُ رَبِّنَا لَمَفۡعُولٗا ﴿١٠٨﴾

**109**. మరియు వారు ఏడుస్తూ, తమ ముఖాలమీద పడిపోతారు. మరియు వారి వినమ్రత మరింత అధికమవుతుంది. ۩

وَيَخِرُّونَ لِلۡأَذۡقَانِ يَبۡكُونَ وَيَزِيدُهُمۡ خُشُوعٗا۩ ﴿١٠٩﴾

قُلِ ٱدْعُواْ ٱللَّهَ أَوِ ٱدْعُواْ ٱلرَّحْمَٰنَ ۖ أَيًّا مَّا تَدْعُواْ فَلَهُ ٱلْأَسْمَآءُ ٱلْحُسْنَىٰ ۚ وَلَا تَجْهَرْ بِصَلَاتِكَ وَلَا تُخَافِتْ بِهَا وَٱبْتَغِ بَيْنَ ذَٰلِكَ سَبِيلًا ﴿١١٠﴾

**110**. వారితో అను: "మీరు ఆయనను, అల్లాహ్! అని పిలవండీ, లేదా అనంత కరుణామయుడు (అర్ రహ్మాన్)! అని పిలువండీ, మీరు ఆయనను ఏ పేరుతోనైనా పిలవండీ, ఆయనకున్న పేర్లన్నీ అత్యుత్తమమైనవే! నీ నమాజ్‌లో నీవు చాలా గట్టిగా గానీ, చాలా మెల్లగా గానీ పఠించక, వాటి మధ్య మార్గాన్ని అవలంబించు."

وَقُلِ ٱلْحَمْدُ لِلَّهِ ٱلَّذِى لَمْ يَتَّخِذْ وَلَدًا وَلَمْ يَكُن لَّهُۥ شَرِيكٌ فِى ٱلْمُلْكِ وَلَمْ يَكُن لَّهُۥ وَلِىٌّ مِّنَ ٱلذُّلِّ ۖ وَكَبِّرْهُ تَكْبِيرًۢا ﴿١١١﴾

**111**. ఇంకా ఇలా అను: "సంతానం లేనటువంటి మరియు తన రాజరికంలో భాగస్వాములు లేనటువంటి మరియు తనలో ఎలాంటి లోపం లేనటువంటి మరియు సహాయకుడి అవసరం లేనటువంటి అల్లాహ్ యే సర్వ స్తోత్రాలకు అర్హుడు. మరియు మీరు ఆయన మహానీయతను గొప్పగా కొనియాడండి!"

*****

## 18. సూరహ్ అల్-కహఫ్

## سُورَةُ الكَهْفِ

ఈ సూరహ్ మొదటి మరియు చివరి 10 ఆయతులు చదువటం వల్ల దజ్జాల్ ఫిత్నా నుండి ముక్తి దొరకుతుంది. ('స. ముస్లిం). జుమ'అహ్ రోజు దీనిని చదివితే వచ్చే జుమ'అహ్ వరకు, అతని కొరకు ఒక ప్రత్యేక వెలుగు ఉంటుంది. (ముస్తద్రిక్ 'హాకిమ్-2/368, అల్బానీ ప్రమాణీకం-6470) ఇది సూరహ్ అన్-న'హ్ల్ (16) కంటే ముందు అవతరింపజేయబడింది. అంటే చివరి మక్కా కాలంలో. ఇందులో **110** ఆయతులు ఉన్నాయి. దీనిపేరు **10**వ ఆయత్ నుండి తీసుకోబడింది. కహఫున్: అంటే గుహ. ఇందులో గుహవారు ఎంతో కాలం అందు ఉన్నా ఒక్క రోజు మాత్రమే ఉంటిమి అని భావించిన కథ (10-27) ఆయత్‌లలో; అల్లాహ్ (సు.తా.) ప్రసాదించిన ధనసంపత్తులకు గర్వితుడై, తన తోటి వానిని హేళనచేసి అంతా పోగొట్టుకున్న వాని కథ (32-44) ఆయత్‌లలో; మూసా ('అ.స.), అల్-ఖి'ద్ర్ ('అ.స.) నుండి నేర్చుకున్న విషయాల గాథ (60-82) ఆయత్‌లలో మరియు జుల్-ఖర్నైన్ తూర్పు పడమరలకు ప్రయాణించి యాజూజ్-మాజూజ్‌లు రాకుండా లోహాలతో గోడ నిర్మించి అక్కడి ప్రజలను కాపాడిన కథ (83-98) ఆయత్‌లలో ఉన్నాయి. ఈ సూరహ్ సారాంశం **7**వ **ఆయత్‌**లో ఉంది: *'నిశ్చయంగా - ప్రజలలో మంచి పనులు చేసేవారు ఎవరో పరీక్షించటానికి - మేము భూమిపై ఉన్న వస్తువులను దానికి అలంకారంగా (ఆకర్షణీయమైనవిగా) చేశాము.'*

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

ٱلْحَمْدُ لِلَّهِ ٱلَّذِىٓ أَنزَلَ عَلَىٰ عَبْدِهِ ٱلْكِتَٰبَ وَلَمْ يَجْعَل لَّهُۥ عِوَجَا ۜ ﴿١﴾

قَيِّمًا لِّيُنذِرَ بَأْسًا شَدِيدًا مِّن لَّدُنْهُ وَيُبَشِّرَ ٱلْمُؤْمِنِينَ ٱلَّذِينَ يَعْمَلُونَ ٱلصَّٰلِحَٰتِ أَنَّ لَهُمْ أَجْرًا حَسَنًا ﴿٢﴾

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

**1.** తన దాసుని (ము'హమ్మద్)పై ఈ గ్రంథాన్ని (ఖుర్ఆన్‌ను) అవతరింపజేసిన అల్లాహ్‌యే సర్వస్తోత్రాలకు అర్హుడు మరియు ఆయన ఇందులో ఏ విధమైన వక్రత్వాన్ని ఉంచలేదు.[1]

**2.** ఇది సక్రమంగా స్థిరంగా ఉండి, ఆయన నుండి వచ్చే కఠినశిక్షను గురించి హెచ్చరిస్తుంది మరియు విశ్వసించి సత్కార్యాలు చేసేవారికి మంచి ప్రతిఫలం (స్వర్గం) తప్పక ఉంటుందనే శుభవార్తనూ ఇస్తుంది.

---

**1.** చూడండి, 4:82, ఈ గ్రంథం అల్లాహ్ (సు.తా.) తరఫునుండి కాక ఇతరుల దగ్గర నుండి వచ్చిఉంటే అందులో ఎన్నో లోపాలు ఉండేవి.

مَّٰكِثِينَ فِيهِ أَبَدًا ﴿٣﴾

وَيُنذِرَ ٱلَّذِينَ قَالُواْ ٱتَّخَذَ ٱللَّهُ وَلَدًا ﴿٤﴾

مَّا لَهُم بِهِۦ مِنْ عِلْمٍ وَلَا لِأٓبَآئِهِمْۚ كَبُرَتْ كَلِمَةً تَخْرُجُ مِنْ أَفْوَٰهِهِمْۚ إِن يَقُولُونَ إِلَّا كَذِبًا ﴿٥﴾

فَلَعَلَّكَ بَٰخِعٌ نَّفْسَكَ عَلَىٰٓ ءَاثَٰرِهِمْ إِن لَّمْ يُؤْمِنُواْ بِهَٰذَا ٱلْحَدِيثِ أَسَفًا ﴿٦﴾

إِنَّا جَعَلْنَا مَا عَلَى ٱلْأَرْضِ زِينَةً لَّهَا لِنَبْلُوَهُمْ أَيُّهُمْ أَحْسَنُ عَمَلًا ﴿٧﴾

وَإِنَّا لَجَٰعِلُونَ مَا عَلَيْهَا صَعِيدًا جُرُزًا ﴿٨﴾

أَمْ حَسِبْتَ أَنَّ أَصْحَٰبَ ٱلْكَهْفِ وَٱلرَّقِيمِ كَانُواْ مِنْ ءَايَٰتِنَا عَجَبًا ﴿٩﴾

**3**. అందులో వారు నిరంతరంగా కలకాలం ఉంటారు.

**4**. ఇంకా ఇది: "అల్లాహ్‌కు సంతానముంది!" అని, అనే వారిని హెచ్చరిస్తుంది.

**5**. ఈ విషయాన్ని గురించి వారికి గానీ, వారి తండ్రితాతలకు గానీ ఎలాంటి జ్ఞానం లేదు. వారి నోటినుండి వచ్చే ఈ మాట ఎంతో దారుణమైనది. వారు పలికేదంతా కేవలం అసత్యమే.

**6**. ఈ సందేశాన్ని విశ్వసించని వారి వైఖరి వల్ల దుఃఖపడి బహుశా నీవు నీ ప్రాణాన్నే కోల్పోతావేమో!

**7**. నిశ్చయంగా - ప్రజలలో మంచి పనులు చేసేవారు ఎవరో పరీక్షించటానికి - మేము భూమిపై ఉన్న వస్తువులను దానికి అలంకారంగా (ఆకర్షణీయమైనవిగా) చేశాము.

**8**. మరియు నిశ్చయంగా, మేమే దానిపై ఉన్న దాన్నంతటినీ చదునైన మైదానం (బంజరునేల)గా మార్చగలము.

**9**. ఏమీ? నిశ్చయంగా, ఆ గుహవాసులు మరియు ఆ శిలాఫలకం వారు, మా (ఇతర) సూచనలన్నింటిలో అద్భుతమైనవని నీవు భావించావా?[1]

---

**1**. అంటే ఇదొక్కటే అద్భుత సూచన కాదు. దీనికంటే అద్భుత సూచనలు ఇంకా చాలా ఉన్నాయి. సూర్య-చంద్రుల, నక్షత్రాల మరియు రేయింబవళ్ళ సృష్టి మొదలైనవి. అర్-రఖీము: కొందరు వ్యాఖ్యాతలు దీనిని ఆ గుహవాసుల నగరపు పేరని మరి కొందరు గుహ ఉన్న ఆ కొండ పేరని ఇంకా కొందరు ఆ సీసపు పలక దేనిపై నైతే వారి పేర్లు వ్రాయబడి ఉండెనో అది, అని అంటారు.

إِذۡ أَوَى ٱلۡفِتۡيَةُ إِلَى ٱلۡكَهۡفِ فَقَالُواْ رَبَّنَآ ءَاتِنَا مِن لَّدُنكَ رَحۡمَةٗ وَهَيِّئۡ لَنَا مِنۡ أَمۡرِنَا رَشَدٗا ۝١٠

10. (జ్ఞాపకం చేసుకోండి) ఎప్పుడైతే ఆ యువకులు ఆ గుహలో ఆశ్రయంపొందారో, ఇలా ప్రార్థించారు: "ఓ మా ప్రభూ! మాపై నీ కారుణ్యాన్ని ప్రసాదించు మరియు మా వ్యవహారంలో మేము నీతిపరులమై ఉండేటట్లు మమ్మల్ని సరిదిద్దు!"

فَضَرَبۡنَا عَلَىٰٓ ءَاذَانِهِمۡ فِي ٱلۡكَهۡفِ سِنِينَ عَدَدٗا ۝١١

11. కావున ఆ గుహలో, కొన్ని సంవత్సరాల వరకు మేము వారి చెవులను మూసివేశాము.[1]

ثُمَّ بَعَثۡنَٰهُمۡ لِنَعۡلَمَ أَيُّ ٱلۡحِزۡبَيۡنِ أَحۡصَىٰ لِمَا لَبِثُوٓاْ أَمَدٗا ۝١٢

12. ఆ తరువాత, ఆ రెండు పక్షాల వారిలో,[2] ఎవరు వారు (గుహలో) నివసించిన కాలాన్ని సరిగ్గా లెక్కపెడతారో చూద్దామని వారిని లేపాము.

نَّحۡنُ نَقُصُّ عَلَيۡكَ نَبَأَهُم بِٱلۡحَقِّۚ إِنَّهُمۡ فِتۡيَةٌ ءَامَنُواْ بِرَبِّهِمۡ وَزِدۡنَٰهُمۡ هُدٗى ۝١٣

13. మేము వారి యథార్థ గాథ నీకు వినిపిస్తున్నాము. నిశ్చయంగా, వారు తమ ప్రభువును విశ్వసించిన కొందరు యువకులు,[3] మేము వారి మార్గదర్శకత్వాన్ని అధికంచేశాము.

---

1. వారికి గాఢ నిద్రను కలిగించాము.
2. గుహలోనున్న వారిలోని రెండు పక్షాలు.
3. ఫిత్‌యతున్: అంటే 9 లేక దానికంటే తక్కువ అని అర్థం. ఆ యువకులు 'ఈసా ('అ.స.) కంటే ముందువారు కావచ్చని ఇబ్నె-కసీ'ర్ (ర'హ్మ) అభిప్రాయం. మరికొందరు వారు క్రైస్తవులని అంటారు. వారు ఎవరైనాసరే, ఏకదైవ సిద్ధాంతంపై ఉన్నవారూ మరియు కేవలం అల్లాహ్(సు.తా.)ను మాత్రమే ఆరాధించేవారై ఉండిరి. వారికాలపు నాయకులు మరియు ఇతర ప్రజలవలే అల్లాహ్(సు.తా.)ను విడిచి ఇతరులను ఆరాధించేవారు కారు. కాబట్టి ఆ సత్యతిరస్కారుల శిక్షకు భయపడి ఏకాంతపు కొండగుహలో శరణం తీసుకొని ఉండిరి.

**14.** మరియు మేము వారి హృదయాలకు దృఢత్వాన్ని ప్రసాదించాము. వారు లేచి నిలబడి నప్పుడు ఇలా అన్నారు: "భూమ్యాకాశాల ప్రభువే మా ప్రభువు! ఆయనను వదలి మేము వేరే దైవాన్ని ఎలాంటి స్థితిలోనూ ప్రార్థించము. వాస్తవానికి అలా చేస్తే దారుణంచేసిన వారమవుతాము!

**15.** "ఈ, మా జాతివారు ఆయనను విడిచి ఇతర దైవాలను నియమించు కున్నారు. అయితే, వారిని (ఆ దైవాలను) గురించి వారు స్పష్టమైన ప్రమాణాన్ని ఎందుకు తీసుకురారు? ఇక అల్లాహ్‌పై అబద్ధాలు కల్పించే వానికంటే మించిన దుర్మార్గుడు ఎవడు?"

**16.** (వారు పరస్పరం ఇలా అనుకున్నారు): "ఇపుడు మీరు వారిని మరియు అల్లాహ్‌ను కాదని వారు ఆరాధించే దైవాలను విడిచి, గుహలో శరణుతీసుకోండి. మీ ప్రభువు తన కారుణ్యాన్ని మీపై విస్తరింపజేస్తాడు మరియు మీ కార్యాలను సరిదిద్ది వాటిని మీకు సులభమైనట్లుగా చేస్తాడు." (5/8)

**17.** * మరియు వారు (ఆ గుహలోని) ఒక విశాలమైన భాగంలో (నిద్రిస్తూ) ఉన్నప్పుడు; సూర్యుడు ఉదయించే టప్పుడు, (ఎండ) వారి గుహనుండి కుడిప్రక్కకు వాలి పోవటాన్ని మరియు అస్తమించేటప్పుడు (ఎండ) ఎడమ ప్రక్కకు తొలగిపోవటాన్ని నీవు చూసి

وَرَبَطۡنَا عَلَىٰ قُلُوبِهِمۡ إِذۡ قَامُواْ
فَقَالُواْ رَبُّنَا رَبُّ ٱلسَّمَٰوَٰتِ
وَٱلۡأَرۡضِ لَن نَّدۡعُوَاْ مِن دُونِهِۦٓ
إِلَٰهٗاۖ لَّقَدۡ قُلۡنَآ إِذٗا شَطَطًا ﴿١٤﴾
هَٰٓؤُلَآءِ قَوۡمُنَا ٱتَّخَذُواْ مِن
دُونِهِۦٓ ءَالِهَةٗۖ لَّوۡلَا يَأۡتُونَ
عَلَيۡهِم بِسُلۡطَٰنِۭ بَيِّنٖۖ فَمَنۡ
أَظۡلَمُ مِمَّنِ ٱفۡتَرَىٰ عَلَى ٱللَّهِ كَذِبٗا
﴿١٥﴾
وَإِذِ ٱعۡتَزَلۡتُمُوهُمۡ وَمَا يَعۡبُدُونَ
إِلَّا ٱللَّهَ فَأۡوُۥٓاْ إِلَى ٱلۡكَهۡفِ يَنشُرۡ
لَكُمۡ رَبُّكُم مِّن رَّحۡمَتِهِۦ وَيُهَيِّئۡ
لَكُم مِّنۡ أَمۡرِكُم مِّرۡفَقٗا ﴿١٦﴾
۞ وَتَرَى ٱلشَّمۡسَ إِذَا طَلَعَت
تَّزَٰوَرُ عَن كَهۡفِهِمۡ ذَاتَ ٱلۡيَمِينِ
وَإِذَا غَرَبَت تَّقۡرِضُهُمۡ ذَاتَ
ٱلشِّمَالِ وَهُمۡ فِي فَجۡوَةٖ مِّنۡهُۚ

ذَٰلِكَ مِنْ ءَايَٰتِ ٱللَّهِ ۗ مَن يَهْدِ ٱللَّهُ
فَهُوَ ٱلْمُهْتَدِ ۖ وَمَن يُضْلِلْ فَلَن
تَجِدَ لَهُۥ وَلِيًّا مُّرْشِدًا ﴿١٧﴾

وَتَحْسَبُهُمْ أَيْقَاظًا وَهُمْ رُقُودٌ ۚ
وَنُقَلِّبُهُمْ ذَاتَ ٱلْيَمِينِ وَذَاتَ
ٱلشِّمَالِ ۖ وَكَلْبُهُم بَٰسِطٌ ذِرَاعَيْهِ
بِٱلْوَصِيدِ ۚ لَوِ ٱطَّلَعْتَ عَلَيْهِمْ
لَوَلَّيْتَ مِنْهُمْ فِرَارًا وَلَمُلِئْتَ
مِنْهُمْ رُعْبًا ﴿١٨﴾

وَكَذَٰلِكَ بَعَثْنَٰهُمْ
لِيَتَسَآءَلُوا۟ بَيْنَهُمْ ۚ قَالَ قَآئِلٌ مِّنْهُمْ
كَمْ لَبِثْتُمْ ۖ قَالُوا۟ لَبِثْنَا يَوْمًا أَوْ
بَعْضَ يَوْمٍ ۚ قَالُوا۟ رَبُّكُمْ أَعْلَمُ بِمَا
لَبِثْتُمْ فَٱبْعَثُوٓا۟ أَحَدَكُم
بِوَرِقِكُمْ هَٰذِهِۦٓ إِلَى ٱلْمَدِينَةِ

ఉంటావు. ఇది అల్లాహ్ సూచనలలో ఒకటి. అల్లాహ్ మార్గదర్శకత్వం చేసిన వాడే సన్మార్గం పొందుతాడు. ఆయన మార్గభ్రష్టత్వంలో వదలిన వాడికి సరైనమార్గం చూపే సంరక్షకుణ్ణి నీవు పొందలేవు.

**18**. మరియు వారు నిద్ర పోతున్నప్పటికీ, నీవు వారిని మేల్కొని ఉన్నారనే భావించి ఉంటావు! మరియు మేము వారిని కుడి ప్రక్కకు మరియు ఎడమప్రక్కకు మరలించేవారము. మరియు వారి కుక్క గుహ ద్వారం వద్ద తన ముందు కాళ్ళను చాచి పడి ఉండింది. ఒకవేళ నీవు వారిని తొంగి చూసి ఉంటే, నీవు తప్పక వెనుదిరిగి పారిపోయే వాడవు మరియు వారిని గురించి భయ కంపితుడవై పోయేవాడవు.

**19**. మరియు ఈ విధంగా (ఉన్న తరువాత), వారు ఒకరినొకరు ప్రశ్నించు కోవటానికి మేము వారిని (నిద్ర నుండి) లేపాము. వారిలో నుండి ఒకడు మాట్లాడుతూ ఇలా అన్నాడు: "మీరు ఈ స్థితిలో ఎంతకాలమున్నారు?" వారన్నారు: "మేము ఒక దినమో లేదా అంత కంటే తక్కువనో ఈస్థితిలో ఉన్నాము."[1] (మరికొందరు) ఇలా అన్నారు: "మీరెంత కాలమున్నారో మీ ప్రభువుకే తెలుసు!

---

**1**. చూడండి, 2:259. అక్కడ ఒకడు, మరణించి నూరు సంవత్సరాలు పడి ఉన్న తరువాత, అల్లాహ్ (సు.తా.) అతడిని మరల సజీవునిగా చేసినప్పుడు ఇలాగే భావిస్తాడు. అల్లాహుతా'ఆలా నిర్జీవుల నుండి సజీవులను మరియు సజీవుల నుండి నిర్జీవులను తేగలడు, అనే సత్యానికి ఇది ఉదాహరణం. ఇంకా చూడండి, 3:27, 6:95, 10:31, 30:19.

فَلْيَنظُرْ أَيُّهَآ أَزْكَىٰ طَعَامًا فَلْيَأْتِكُم بِرِزْقٍ مِّنْهُ وَلْيَتَلَطَّفْ وَلَا يُشْعِرَنَّ بِكُمْ أَحَدًا ﴿١٩﴾

మీలో ఒకనికి నాణ్యం (డబ్బు) ఇచ్చి పట్టణానికి పంపండి. అతడు అక్కడ శ్రేష్ఠమైన ఆహారాన్ని వెతికి, దానినే మీ కొరకు తినటానికి తెస్తాడు. అతడు జాగ్రత్తగా వ్యవహరించాలి మరియు మీ గురించి ఎవ్వడికీ తెలియనివ్వగూడదు.

إِنَّهُمْ إِن يَظْهَرُوا۟ عَلَيْكُمْ يَرْجُمُوكُمْ أَوْ يُعِيدُوكُمْ فِى مِلَّتِهِمْ وَلَن تُفْلِحُوٓا۟ إِذًا أَبَدًا ﴿٢٠﴾

**20**. "ఒకవేళ వారు మిమ్మల్ని గుర్తుపడితే, వారు తప్పక మిమ్మల్ని రాళ్ళురువ్వి చంపుతారు, లేదా (బలవంతంగా) మిమ్మల్ని వారి మతంలోకి త్రిప్పుకుంటారు, అలాంటప్పుడు మీరు ఎలాంటి సాఫల్యం పొందలేరు."

وَكَذَٰلِكَ أَعْثَرْنَا عَلَيْهِمْ لِيَعْلَمُوٓا۟ أَنَّ وَعْدَ ٱللَّهِ حَقٌّ وَأَنَّ ٱلسَّاعَةَ لَا رَيْبَ فِيهَآ إِذْ يَتَنَٰزَعُونَ بَيْنَهُمْ أَمْرَهُمْ ۖ فَقَالُوا۟ ٱبْنُوا۟ عَلَيْهِم بُنْيَٰنًا ۖ رَّبُّهُمْ أَعْلَمُ بِهِمْ ۚ قَالَ ٱلَّذِينَ غَلَبُوا۟ عَلَىٰٓ أَمْرِهِمْ لَنَتَّخِذَنَّ عَلَيْهِم مَّسْجِدًا ﴿٢١﴾

**21**. మరియు ఈ విధంగా అల్లాహ్ వాగ్దానం సత్యమని, చివరి గడియ నిశ్చయమని, అది రావటంలో ఎలాంటి సందేహంలేదని తెలుసుకోవటానికి, ఆ యువకుల విషయం ప్రజలకు తెలియజేశాము. అప్పుడు వారు (ప్రజలు) వారి (గుహవాసుల) విషయాన్ని తీసుకొని పరస్పరం వాదులాడుకున్న విషయం (జ్ఞాపకం చేసుకోండి!) వారిలో కొందరు అన్నారు: "వారి కొరకు ఒక స్మారక భవనం నిర్మించాలి." వారి విషయం వారి ప్రభువుకే తెలుసు. ఆ వ్యవహారంలో పైచేయి (ప్రాబల్యం) ఉన్న వారు: "వారి స్మారకంగా ఒక మస్జిద్‌ను నిర్మించాలి." అని అన్నారు.

سَيَقُولُونَ ثَلَٰثَةٌ رَّابِعُهُمْ كَلْبُهُمْ وَيَقُولُونَ خَمْسَةٌ سَادِسُهُمْ كَلْبُهُمْ رَجْمًا بِٱلْغَيْبِ ۖ وَيَقُولُونَ سَبْعَةٌ وَثَامِنُهُمْ كَلْبُهُمْ ۚ قُل رَّبِّىٓ أَعْلَمُ بِعِدَّتِهِم مَّا يَعْلَمُهُمْ إِلَّا قَلِيلٌ ۗ فَلَا تُمَارِ فِيهِمْ إِلَّا مِرَآءً ظَٰهِرًا وَلَا تَسْتَفْتِ فِيهِم مِّنْهُمْ أَحَدًا ﴿٢٢﴾

22. (వారి సంఖ్యను గురించి) కొందరంటారు: "వారు ముగ్గురు, నాలుగవది వారికుక్క." మరికొందరంటారు: "వారు అయిదుగురు, ఆరవది వారికుక్క." ఇవి వారి ఊహాగానాలే. ఇంకా కొందరంటారు: "వారు ఏడుగురు, ఎనిమిదవది వారి కుక్క." వారితో అను: "వారి సంఖ్య కేవలం నా ప్రభువుకే తెలుసు. వారిని గురించి కొందరికి మాత్రమే తెలుసు." కావున నిదర్శనం లేనిదే వారిని గురించి వాదించకు మరియు (గుహ) వారిని గురించి వీరిలో ఎవ్వరితోనూ విచారణ చేయకు.

وَلَا تَقُولَنَّ لِشَا۟ىْءٍ إِنِّى فَاعِلٌ ذَٰلِكَ غَدًا ﴿٢٣﴾

23. మరియు ఏ విషయాన్ని గురించి అయినా: "నేను ఈ పనిని రేపు చేస్తాను." అని అనకు -

إِلَّآ أَن يَشَآءَ ٱللَّهُ ۚ وَٱذْكُر رَّبَّكَ إِذَا نَسِيتَ وَقُلْ عَسَىٰٓ أَن يَهْدِيَنِ رَبِّى لِأَقْرَبَ مِنْ هَٰذَا رَشَدًا ﴿٢٤﴾

24. "అల్లాహ్ కోరితే తప్ప (ఇన్షా' అల్లాహ్)!"- అని, అననిదే.[1] మరియు నీ ప్రభువును స్మరించు, ఒకవేళ నీవు మరచిపోతే! ఇలా ప్రార్థించు: "బహుశా నా ప్రభువు నాకు సన్మార్గం వైపునకు దీనికంటే దగ్గరి త్రోవ చూపుతాడేమో!"

وَلَبِثُوا۟ فِى كَهْفِهِمْ ثَلَٰثَ مِا۟ئَةٍ سِنِينَ وَٱزْدَادُوا۟ تِسْعًا ﴿٢٥﴾

25. మరియు వారు తమ గుహలో మూడు వందల సంవత్సరాలు ఉన్నారు మరియు వాటిమీద తొమ్మిది సంవత్సరాలు అధికం.[2]

---

1. యూదులు దైవప్రవక్త ('స'అస)తో మూడు ప్రశ్నలు అడిగారు: 1) రూ'హ్-ఆత్మ అంటే ఏమిటి? 2) గుహవారి విషయం ఏమిటి? 3) జు'ల్-ఖర్నైన్ ఎవడు? దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'నేను రేపు మీకు జవాబిస్తాను.' కాని అతను ('స'అస): "అల్లాహ్ కోరితే," (ఇన్షా' అల్లాహ్)! అని అనలేదు. కావున 15 రోజుల వరకు ఏ వ'హీ రాలేదు. ఆ తరువాత వ'హీ వచ్చినపుడు: "ఇన్షా' అల్లాహ్," అని తప్పక అనాలని ఆజ్ఞ వచ్చింది.
2. చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం ప్రకారం ఇది అల్లాహ్ (సు.తా.) ప్రవచనం. అంటే వారు గుహలో 300 సూర్యమాన సంవత్సరాలు లేక 309 చాంద్రమాన సంవత్సరాలు ఉన్నారు.

قُلِ ٱللَّهُ أَعۡلَمُ بِمَا لَبِثُواْۖ لَهُۥ غَيۡبُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۖ أَبۡصِرۡ بِهِۦ وَأَسۡمِعۡۚ مَا لَهُم مِّن دُونِهِۦ مِن وَلِيّٖ وَلَا يُشۡرِكُ فِي حُكۡمِهِۦٓ أَحَدٗا ﴿٢٦﴾

**26**. వారితో అను: "వారెంతకాలం (గుహలో) ఉన్నారో అల్లాహ్‌కు మాత్రమే తెలుసు. ఆకాశాలలోను మరియు భూమిలోను ఉన్న సమస్త అగోచర విషయాలు కేవలం ఆయనకే తెలుసు. ఆయన అంతా చూడగలడు మరియు వినగలడు. వారికి ఆయన తప్ప మరొక సంరక్షకుడు లేడు మరియు ఆయన తన ఆధిపత్యంలో ఎవ్వడినీ భాగస్వామిగా చేర్చుకోడు."

وَٱتۡلُ مَآ أُوحِيَ إِلَيۡكَ مِن كِتَابِ رَبِّكَۖ لَا مُبَدِّلَ لِكَلِمَٰتِهِۦ وَلَن تَجِدَ مِن دُونِهِۦ مُلۡتَحَدٗا ﴿٢٧﴾

**27**. మరియు (ఓ ప్రవక్తా!) నీ ప్రభువు గ్రంథం నుండి నీపై అవతరింపజేయబడిన దివ్యజ్ఞానాన్ని (వ'హీని) చదివి వినిపించు.[1] ఆయన ప్రవచనాలను ఎవ్వడూ మార్చలేడు. మరియు ఆయన వద్ద తప్ప నీవు మరెక్కడా శరణు పొందలేవు.[2]

وَٱصۡبِرۡ نَفۡسَكَ مَعَ ٱلَّذِينَ يَدۡعُونَ رَبَّهُم بِٱلۡغَدَوٰةِ وَٱلۡعَشِيِّ يُرِيدُونَ وَجۡهَهُۥۖ وَلَا تَعۡدُ عَيۡنَاكَ عَنۡهُمۡ تُرِيدُ زِينَةَ ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَاۖ

**28**. మరియు (ఓ ప్రవక్తా!) ఎవరు ఆయన ముఖదర్శనం (ప్రసన్నతను) కోరుతూ, ఉదయం మరియు సాయంత్రం తమ ప్రభువును ప్రార్థిస్తున్నారో, వారి సహచర్యంలోనే, సహనం వహించి ఉండు. ఇహలోక ఆడంబరాలను అపేక్షించి నీ దృష్టిని వారి నుండి

---

**1**. గుహవారి కథ వినిపిస్తూ అల్లాహుతా'ఆలా అంటున్నాడు: 'ఇప్పుడు నిన్ను ప్రశ్నించేవారికి ఇది వినిపించు.' వాస్తవానికి దైవప్రవక్త ('స'అస) ఎల్లప్పుడు తనపై అవతరింపజేయబడిన దివ్య జ్ఞానాన్నంతా ప్రజలకు వినిపించారు. మరియు వారిని సన్మార్గంవైపునకు పిలిచారు. అది అతని ('స'అస) విద్యుక్త ధర్మం. అల్లాహ్ (సు.తా.) దానికొరకే ప్రవక్తలను ఎన్నుకుంటాడు.

**2**. అల్లాహ్ (సు.తా) ప్రవచనాలను ఉన్నవి ఉన్నట్లుగా ఎట్టి మార్పులు చేయకుండా వినిపించాలని ఆజ్ఞ ఇవ్వబడుతోంది, లేనిచో అల్లాహ్ (సు.తా.) శిక్షనుండి తప్పించేవాడు ఎవ్వడూ లేడు. ఈ ప్రవచనం దైవప్రవక్త('స'అస)తో చెప్పబడినా అది సర్వసమాజం వారికొరకు వర్తిస్తుంది.

وَلَا تُطِعْ مَنْ أَغْفَلْنَا قَلْبَهُۥ عَن ذِكْرِنَا وَٱتَّبَعَ هَوَىٰهُ وَكَانَ أَمْرُهُۥ فُرُطًا ﴿٢٨﴾

దాటనివ్వకు (వారిని ఉపేక్షించకు).[1] మరియు అలాంటి వానిని అనుసరించకు (మాటవినకు), ఎవడి హృదయాన్ని మా ధ్యానంనుండి తొలగించామో మరియు ఎవడు తన మనోవాంఛలను అనుసరిస్తున్నాడో మరియు ఎవడి వ్యవహారాలు (కర్మలు) వ్యర్థమయ్యాయో!

وَقُلِ ٱلْحَقُّ مِن رَّبِّكُمْ ۖ فَمَن شَآءَ فَلْيُؤْمِن وَمَن شَآءَ فَلْيَكْفُرْ ۚ إِنَّآ أَعْتَدْنَا لِلظَّٰلِمِينَ نَارًا أَحَاطَ بِهِمْ سُرَادِقُهَا ۚ وَإِن يَسْتَغِيثُوا۟ يُغَاثُوا۟ بِمَآءٍ كَٱلْمُهْلِ يَشْوِى ٱلْوُجُوهَ ۚ بِئْسَ ٱلشَّرَابُ وَسَآءَتْ مُرْتَفَقًا ﴿٢٩﴾

**29**. మరియు వారితో అను: "ఇది మీ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యం. కావున ఇష్టపడినవారు దీనిని విశ్వసించ వచ్చు మరియు ఇష్టపడనివారు దీనిని తిరస్కరించవచ్చు!" నిశ్చయంగా, మేము దుర్మార్గులకొరకు నరకాగ్నిని సిద్ధపరచి ఉంచాము, దాని జ్వాలలు వారిని చుట్టుకుంటాయి. అక్కడ వారు నీటి కొరకు మొరపెట్టుకున్నప్పుడు, వారికి ముఖాలను మాడ్చే (మరిగే) నూనెవంటి నీరు (అల్ముహ్లు) ఇవ్వబడుతుంది. అది ఎంత చెడ్డ పానీయం మరియు ఎంత చెడ్డ (దుర్భరమైన) విరామస్థలం!

إِنَّ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ إِنَّا لَا نُضِيعُ أَجْرَ مَنْ أَحْسَنَ عَمَلًا ﴿٣٠﴾

**30**. నిశ్చయంగా, ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేశారో, నిశ్చయంగా మేము అలాంటి వారి మంచిపనుల ప్రతిఫలాన్ని వృథా కానివ్వము.[2]

**1**. ఈ వాక్యం 6:52లో కూడా ఉంది. స'అద్ బిన్ అబీ-వఖ్ఖాస్ కథనం: ఒకసారి దైవప్రవక్త ('స'అస) స'అద్ బిన్ అబీ-వఖ్ఖా'స్, బిలాల్, ఇబ్నె-మసూ'ద్, ఒక 'హుజ'లీ మరి ఇద్దరు 'స'హాబీ (ర'ది.'అన్హుమ్)లతో కలిసి కూర్చొనిఉంటారు. అప్పుడు కొందరు ఖురైష్ నాయకులు వచ్చి, దైవప్రవక్త ('స'అస)తో: 'వీరిని మీ దగ్గరనుండి పంపండి. మేము మీతో మాట్లాడదలచాము.' అని అంటారు. అప్పుడు దైవప్రవక్త ('స'అస)కు తట్టుతుంది: 'బహుశా వీరు నా మాట వింటారేమో.' అని, కాని అల్లాహుతా'ఆలా అతనిని ('స'అస) నివారించాడు.' ('స.ముస్లిం).

**2**. ప్రజలలో స్వర్గాన్ని పొందే అభిలాష అధికం కావాలని ఇక్కడ నరకం తర్వాత స్వర్గపు సౌఖ్యాల ప్రస్తావన ఇవ్వబడింది.

أُوْلَٰٓئِكَ لَهُمۡ جَنَّٰتُ عَدۡنٖ تَجۡرِي مِن تَحۡتِهِمُ ٱلۡأَنۡهَٰرُ يُحَلَّوۡنَ فِيهَا مِنۡ أَسَاوِرَ مِن ذَهَبٖ وَيَلۡبَسُونَ ثِيَابًا خُضۡرٗا مِّن سُندُسٖ وَإِسۡتَبۡرَقٖ مُّتَّكِـِٔينَ فِيهَا عَلَى ٱلۡأَرَآئِكِۚ نِعۡمَ ٱلثَّوَابُ وَحَسُنَتۡ مُرۡتَفَقٗا ﴿٣١﴾

۞ وَٱضۡرِبۡ لَهُم مَّثَلٗا رَّجُلَيۡنِ جَعَلۡنَا لِأَحَدِهِمَا جَنَّتَيۡنِ مِنۡ أَعۡنَٰبٖ وَحَفَفۡنَٰهُمَا بِنَخۡلٖ وَجَعَلۡنَا بَيۡنَهُمَا زَرۡعٗا ﴿٣٢﴾

كِلۡتَا ٱلۡجَنَّتَيۡنِ ءَاتَتۡ أُكُلَهَا وَلَمۡ تَظۡلِم مِّنۡهُ شَيۡـٔٗاۚ وَفَجَّرۡنَا خِلَٰلَهُمَا نَهَرٗا ﴿٣٣﴾

وَكَانَ لَهُۥ ثَمَرٞ فَقَالَ لِصَٰحِبِهِۦ وَهُوَ يُحَاوِرُهُۥٓ أَنَا۠ أَكۡثَرُ مِنكَ مَالٗا وَأَعَزُّ نَفَرٗا ﴿٣٤﴾

**31**. అలాంటి వారు! వారికొరకు క్రింద సెలయేళ్ళు ప్రవహించే శాశ్వత స్వర్గ వనాలుంటాయి. అందు వారు బంగారు కంకణాలను మరియు ఆకుపచ్చని బంగారు జలతారుగల పట్టువస్త్రాలను ధరించి, ఎత్తైన ఆసనాలపై దిండ్లకు ఆనుకొని కూర్చొని ఉంటారు.[1] ఎంత మంచి ప్రతిఫలం మరియు ఎంత శ్రేష్ఠమైన విరామస్థలం! (3/4)

**32**. * మరియు వారికి ఆ ఇద్దరు మనుష్యుల ఉదాహరణ తెలుపు: వారిద్దరిలో ఒకనికి మేము రెండు ద్రాక్షతోటలను ప్రసాదించి, వాటి చుట్టు ఖర్జూరపు చెట్లను మరియు వాటి మధ్య పంట పొలాన్ని ఏర్పరచాము.

**33**. ఆ రెండు తోటలు, ఏ కొరతా లేకుండా (పుష్కలంగా) పంటలిచ్చేవి. మరియు వాటి మధ్య మేము ఒక సెలయేరును ప్రవహింపజేశాము.

**34**. మరియు అతనికి పుష్కలమైన ఫలాలు పండేవి (లాభాలు వచ్చేవి) మరియు అతడు తన పొరుగువాడితో మాట్లాడుతూ అన్నాడు: "నేను నీ కంటే ఎక్కువ ధనవంతుణ్ణి మరియు నా వద్ద బలవంతులైన మనుషులు కూడా ఉన్నారు."

---

**1**. రాజులు బంగారు కంకణాలు, ఆభరణాలు మరియు పట్టు వస్త్రాలు ధరిస్తారు. స్వర్గవాసులకు రాజులకు ఉండేటటువంటి సుఖసంతోషాలు ఉంటాయని చెప్పడానికి ఈ వివరాలు ఇవ్వబడ్డాయి. మరియు పురుషులకు ఇహలోకంలో హరాం చేయబడిన, బంగారు ఆభరణాలు మరియు పట్టు వస్త్రాలను వారు త్యజించుకుంటే వారికి స్వర్గంలో అవన్నీ లభిస్తాయి. అంతేగాక వారు కోరేవన్నీ దొరుకుతాయి. చూడండి, 22:23, 35:33, 76:21.

وَدَخَلَ جَنَّتَهُۥ وَهُوَ ظَالِمٌ
لِّنَفْسِهِۦ قَالَ مَآ أَظُنُّ أَن تَبِيدَ هَٰذِهِۦٓ
أَبَدًا ﴿٣٥﴾

35. మరియు ఈ విధంగా అతడు తనకు తాను అన్యాయం చేసుకునే వాడవుతూ, తన తోటలో ప్రవేశించి ఇలా అన్నాడు: "ఇది ఎన్నటికైనా నాశనమవుతుందని నేను భావించను!

وَمَآ أَظُنُّ ٱلسَّاعَةَ قَآئِمَةً
وَلَئِن رُّدِدتُّ إِلَىٰ رَبِّى لَأَجِدَنَّ خَيْرًا
مِّنْهَا مُنقَلَبًا ﴿٣٦﴾

36. "మరియు అంతిమ గడియ కూడా వస్తుందని నేను భావించను, ఒకవేళ నా ప్రభువు వద్దకు నేను తిరిగి మరలింపబడినా, అచ్చట నేను దీనికంటే మేలైన స్థానాన్నే పొందగలను."[1]

قَالَ لَهُۥ صَاحِبُهُۥ وَهُوَ يُحَاوِرُهُۥٓ
أَكَفَرْتَ بِٱلَّذِى خَلَقَكَ مِن تُرَابٍ
ثُمَّ مِن نُّطْفَةٍ ثُمَّ سَوَّىٰكَ رَجُلًا ﴿٣٧﴾

37. అతని పొరుగువాడు అతనితో మాట్లాడుతూ అన్నాడు: "నిన్ను మట్టితో,[2] తరువాత ఇంద్రియ బిందువుతో సృష్టించి, ఆ తరువాత నిన్ను (సంపూర్ణ) మానవునిగా తీర్చిదిద్దిన ఆయన (అల్లాహ్)ను నీవు తిరస్కరిస్తున్నావా?

لَّٰكِنَّا۠ هُوَ ٱللَّهُ رَبِّى وَلَآ أُشْرِكُ
بِرَبِّىٓ أَحَدًا ﴿٣٨﴾

38. "కాని నిశ్చయంగా, నా మట్టుకు మాత్రం, ఆయన! అల్లాహ్‌యే నా ప్రభువు మరియు నేను ఎవ్వడినీ నా ప్రభువుకు భాగస్వామి(సాటి)గా కల్పించను.

وَلَوْلَآ إِذْ دَخَلْتَ جَنَّتَكَ قُلْتَ مَا
شَآءَ ٱللَّهُ لَا قُوَّةَ إِلَّا بِٱللَّهِ ۚ إِن تَرَنِ
أَنَا۠ أَقَلَّ مِنكَ مَالًا وَوَلَدًا ﴿٣٩﴾

39. "మరియు ఒకవేళ నీవు, నన్ను సంపదలో మరియు సంతానంలో నీ కంటే తక్కువగా తలచినప్పటికీ, నీవు నీ తోటలో ప్రవేశించినపుడు: 'అల్లాహ్ కోరిందే అవుతుంది (మాషా' అల్లాహ్), సర్వశక్తికి ఆధారభూతుడు కేవలం అల్లాహ్‌యే (లా ఖువ్వత ఇల్లా బిల్లాహ్)!' అని, అనివుంటే ఎంత బాగుండేది.

---

1. ఇటువంటి వాక్యానికి చూడండి, 41:50 మరియు 19:77.
2. ఆదమ్ ('అ.స.)ను మట్టితో సృష్టించిన వివరాలకు చూడండి, 3:59, 23:12,11:61, 22:5 మరియు 30:20.

40. ''వాస్తవానికి నా ప్రభువు, నీ తోటకంటే ఉత్తమమైన దానిని నాకు ప్రసాదించి, దాని (నీ తోట) పైకి ఆకాశం నుండి ఒక పెద్ద ఆపదను పంపి, దానిని చదునైన మైదానంగా చేయవచ్చు!

فَعَسَىٰ رَبِّيٓ أَن يُؤْتِيَنِ خَيْرًا مِّن جَنَّتِكَ وَيُرْسِلَ عَلَيْهَا حُسْبَانًا مِّنَ ٱلسَّمَآءِ فَتُصْبِحَ صَعِيدًا زَلَقًا ﴿٤٠﴾

41. ''లేదా! దాని నీటిని భూమిలో ఇంకి పోయినట్లు చేస్తే, నీవు దానిని ఏ విధంగానూ, తిరిగి పొందలేవు!''

أَوْ يُصْبِحَ مَآؤُهَا غَوْرًا فَلَن تَسْتَطِيعَ لَهُۥ طَلَبًا ﴿٤١﴾

42. మరియు అతని పంటను (వినాశం) చుట్టుముట్టింది, అతడు తాను ఖర్చుచేసినదంతా నాశనమైనదని చేతులు నలుపుకుంటూ ఉండిపోయాడు మరియు అది దాని పందిరితో సహా నాశనమైపోయింది మరియు అతడు ఇలా వాపోయాడు: ''అయ్యో నాదౌర్భాగ్యం! నేను నా ప్రభువుకు భాగస్వాము (షరీక్)లను కల్పించకుండా ఉంటే ఎంత బాగుండేది!''

وَأُحِيطَ بِثَمَرِهِۦ فَأَصْبَحَ يُقَلِّبُ كَفَّيْهِ عَلَىٰ مَآ أَنفَقَ فِيهَا وَهِىَ خَاوِيَةٌ عَلَىٰ عُرُوشِهَا وَيَقُولُ يَٰلَيْتَنِى لَمْ أُشْرِكْ بِرَبِّيٓ أَحَدًا ﴿٤٢﴾

43. మరియు అల్లాహ్‌కు విరుద్ధంగా అతనికి సహాయపడే వారెవ్వరూ లేక పోయారు మరియు అతడు కూడా తనకు తాను సహాయం చేసుకోలేకపోయాడు.

وَلَمْ تَكُن لَّهُۥ فِئَةٌ يَنصُرُونَهُۥ مِن دُونِ ٱللَّهِ وَمَا كَانَ مُنتَصِرًا ﴿٤٣﴾

44. అక్కడ (ఆ తీర్పు దినంనాడు)[1] శరణు (రక్షణ) కేవలం అల్లాహ్, ఆ సత్యవంతునిదే! ఆయనే ప్రతిఫలం ఇవ్వటంలో ఉత్తముడు మరియు అత్యుత్తమ అంతిమ ఫలితం ఇచ్చేవాడు.

هُنَالِكَ ٱلْوَلَٰيَةُ لِلَّهِ ٱلْحَقِّ هُوَ خَيْرٌ ثَوَابًا وَخَيْرٌ عُقْبًا ﴿٤٤﴾

1. ఈ బ్రాకెట్ ఇబ్నెకసీర్‌లో ఇవ్వబడి ఉంది.

45. మరియు వారికి ఇహలోక జీవితాన్ని[1] ఈ ఉపమానం ద్వారా బోధించు: మేము ఆకాశంనుండి నీటిని కురిపించినపుడు, దానిని భూమిలోని చెట్టూచేమలు పీల్చుకొని (పచ్చగా పెరుగుతాయి). ఆ తరువాత అవి ఎండి పొట్టుగా మారిపోయినపుడు, గాలి వాటిని చెల్లాచెదురు చేస్తుంది. మరియు వాస్తవానికి అల్లాహ్‌యే ప్రతిదీ చేయగల సమర్థుడు.

وَٱضۡرِبۡ لَهُم مَّثَلَ ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَا
كَمَآءٍ أَنزَلۡنَٰهُ مِنَ ٱلسَّمَآءِ فَٱخۡتَلَطَ
بِهِۦ نَبَاتُ ٱلۡأَرۡضِ فَأَصۡبَحَ هَشِيمٗا
تَذۡرُوهُ ٱلرِّيَٰحُۗ وَكَانَ ٱللَّهُ عَلَىٰ كُلِّ شَيۡءٖ
مُّقۡتَدِرًا ﴿٤٥﴾

46. ఈ సంపదా మరియు ఈ సంతానం, కేవలం ఐహిక జీవితపు అలంకారాలు మాత్రమే. కాని శాశ్వతంగా నిలిచేవి సత్కార్యాలే! అవే నీ ప్రభువు దృష్టిలో ప్రతిఫలానికి ఉత్తమమైనవి మరియు దానిని ఆశించటానికి కూడా ఉత్తమమైనవి.[2]

ٱلۡمَالُ وَٱلۡبَنُونَ زِينَةُ ٱلۡحَيَوٰةِ
ٱلدُّنۡيَاۖ وَٱلۡبَٰقِيَٰتُ ٱلصَّٰلِحَٰتُ خَيۡرٌ
عِندَ رَبِّكَ ثَوَابٗا وَخَيۡرٌ أَمَلٗا ﴿٤٦﴾

47. మరియు (జ్ఞాపకముంచుకోండి!) ఆ రోజున మేము పర్వతాలను చలింపజేస్తాము.[3] మరియు నీవు భూమిని చదునైన మైదానంగా చూస్తావు. మరియు మేము ఒక్కడిని కూడా విడువకుండా అందరినీ సమావేశపరుస్తాము.

وَيَوۡمَ نُسَيِّرُ ٱلۡجِبَالَ وَتَرَى ٱلۡأَرۡضَ
بَارِزَةٗ وَحَشَرۡنَٰهُمۡ فَلَمۡ نُغَادِرۡ مِنۡهُمۡ
أَحَدٗا ﴿٤٧﴾

---

1. ఇహలోక జీవితం ఈ విధంగా బోధింపబడుతోంది: అల్లాహుతా'ఆలా! ఆ ఏకైక ఆరాధ్యుడు, సర్వశక్తిమంతుడు, కోరితే మనజీవితాలను, వర్షం కురిసినపుడు కళకళలాడే పంటపొలాల మాదిరిగా చేయగలడు. లేదా ఎండినపొట్టుగా మార్చి గాలికి ఎగురవేయగలడు. కేవలం అల్లాహ్ (సు.తా.)యే ప్రతిదీ చేయగల సమర్థుడు. ఇటువంటి వాక్యాలకు చూడండి, 10:24, 39:21, 57:20 మొదలైనవి.
2. సత్కార్యాలంటే మంచిపనులు; అల్లాహ్ (సు.తా.) నియమించిన విధు (ఫ'ర్ద్)లు వాజిబాత్‌లు, దైవప్రవక్త సంప్రదాయాలు (సునన్), అదనంగా చేసే మంచిపనులు (నవాఫిల్). ఇంతే గాకుండా నిషేధింపబడిన వాటి నుండి దూరంగా ఉండటం కూడా సత్కార్యాలలోనే లెక్కించబడుతుంది. ఇంకా ఇటువంటి వాక్యానికి చూడండి, 19:76.
3. పర్వతాలు ఏకిన దూదివలె మారి ఎగిరిపోతూ ఉంటాయి. చూడండి, 101:5, 52:9-10, 27:88, 20:105-107 మరియు భూమిపై ఉన్న భవనాలూ, చెట్టుచేమలూ అన్నీ నాశనమై పోయి భూమి ఒక చదునైన మైదానంగా మారిపోతుంది.

48. మరియు వారందరు నీ ప్రభువు సన్నిధిలో వరుసలలో ప్రవేశపెట్టబడతారు, (నీ ప్రభువు వారితో): "వాస్తవానికి మేము మొదటి సారి మిమ్మల్ని పుట్టించిన స్థితిలోనే[1] మీరు మా వద్దకు వచ్చారు! కాని మా ముందు హాజరయ్యే ఘడియను మేము నియమించలేదని మీరు భావించేవారు కదా!" అని పలుకుతాడు.

وَعُرِضُوا۟ عَلَىٰ رَبِّكَ صَفًّا لَّقَدْ جِئْتُمُونَا كَمَا خَلَقْنَٰكُمْ أَوَّلَ مَرَّةٍۭ ۚ بَلْ زَعَمْتُمْ أَلَّن نَّجْعَلَ لَكُم مَّوْعِدًا ﴿٤٨﴾

49. మరియు కర్మపత్రం వారి ముందు ఉంచబడినపుడు, ఆ అపరాధులు, అందులో ఉన్నదానిని చూసి భయపడటాన్ని నీవు చూస్తావు. వారు ఇలా అంటారు: "అయ్యో! మా దౌర్భాగ్యం ఇదేమి గ్రంథం! ఏ చిన్న విషయాన్ని గానీ, ఏ పెద్ద విషయాన్ని గానీ ఇది లెక్కపెట్టకుండా విడువలేదే!" తాము చేసిందంతా వారు తమ ఎదుట పొందుతారు. నీ ప్రభువు ఎవ్వరికీ అన్యాయం చేయడు.

وَوُضِعَ ٱلْكِتَٰبُ فَتَرَى ٱلْمُجْرِمِينَ مُشْفِقِينَ مِمَّا فِيهِ وَيَقُولُونَ يَٰوَيْلَتَنَا مَالِ هَٰذَا ٱلْكِتَٰبِ لَا يُغَادِرُ صَغِيرَةً وَلَا كَبِيرَةً إِلَّآ أَحْصَىٰهَا ۚ وَوَجَدُوا۟ مَا عَمِلُوا۟ حَاضِرًا ۗ وَلَا يَظْلِمُ رَبُّكَ أَحَدًا ﴿٤٩﴾

50. మరియు (జ్ఞాపకం చేసుకోండి) మేము దేవదూతలతో: "ఆదమ్‌కు సాష్టాంగ పడండి." అని చెప్పినపుడు, ఒక్క ఇబ్లీస్ తప్ప మిగతా వారందరూ సాష్టాంగపడ్డారు. అతడు జిన్నాతులలోని వాడు.[2] అప్పుడు అతడు తనప్రభువు ఆజ్ఞను ఉల్లంఘించాడు. ఏమీ? మీరు నన్ను కాదని అతనిని మరియు అతని సంతానాన్ని స్నేహితు(సంరక్షకు)లుగా చేసుకుంటారా? మరియు వారు మీ శత్రువులు కదా! దుర్మార్గులకు ఎంతచెడ్డ ఫలితముంది. (7/8)

وَإِذْ قُلْنَا لِلْمَلَٰٓئِكَةِ ٱسْجُدُوا۟ لِءَادَمَ فَسَجَدُوٓا۟ إِلَّآ إِبْلِيسَ كَانَ مِنَ ٱلْجِنِّ فَفَسَقَ عَنْ أَمْرِ رَبِّهِۦٓ ۗ أَفَتَتَّخِذُونَهُۥ وَذُرِّيَّتَهُۥٓ أَوْلِيَآءَ مِن دُونِى وَهُمْ لَكُمْ عَدُوٌّۢ ۚ بِئْسَ لِلظَّٰلِمِينَ بَدَلًا ﴿٥٠﴾

---

1. ఇట్టి వాక్యానికి చూడండి, 6:94.
2. ఇబ్లీస్ దైవదూత కాడు **జిన్నాతుడు** అని ఇక్కడ విశదమౌతోంది. ఇంకా చూడండి, 2:31-34.

51. * నేను ఆకాశాలను మరియు భూమిని సృష్టించినప్పుడు గానీ, లేదా స్వయంగా వారిని (షైతానులను) సృష్టించి నప్పుడు గానీ వారిని సాక్షులుగా పెట్టలేదు.[1] మార్గం తప్పించే వారిని నేను (అల్లాహ్) సహాయకులుగా చేసుకునేవాడను కాను.

۞ مَّآ أَشۡهَدتُّهُمۡ خَلۡقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَلَا خَلۡقَ أَنفُسِهِمۡ وَمَا كُنتُ مُتَّخِذَ ٱلۡمُضِلِّينَ عَضُدٗا ٥١

52. మరియు (జ్ఞాపకం ఉంచుకోండి!) ఆ దినమున ఆయన (అల్లాహ్) వారితో: "మీరు నా భాగస్వాములని భావించిన వారిని పిలవండి!" అని అన్నప్పుడు, వారు (భాగస్వాములుగా భావించిన) వారిని పిలుస్తారు, కాని వారు వారికి జవాబివ్వరు. మరియు మేము వారి మధ్య ఒక పెద్ద లోతైన వినాశగుండాన్ని నియమించి ఉంటాము.

وَيَوۡمَ يَقُولُ نَادُواْ شُرَكَآءِيَ ٱلَّذِينَ زَعَمۡتُمۡ فَدَعَوۡهُمۡ فَلَمۡ يَسۡتَجِيبُواْ لَهُمۡ وَجَعَلۡنَا بَيۡنَهُم مَّوۡبِقٗا ٥٢

53. మరియు ఆ అపరాధులు నరకాగ్నిని చూసి వారు తప్పక అందులో పడవలసి ఉన్నదని తెలుసుకుంటారు మరియు వారు దానినుండి తప్పించుకోవటానికి ఎలాంటి ఉపాయం పొందరు.

وَرَءَا ٱلۡمُجۡرِمُونَ ٱلنَّارَ فَظَنُّوٓاْ أَنَّهُم مُّوَاقِعُوهَا وَلَمۡ يَجِدُواْ عَنۡهَا مَصۡرِفٗا ٥٣

54. మరియు నిశ్చయంగా, మేము ఈ ఖుర్ఆన్‌లో, మానవులకు, ప్రతివిధమైన ఉపమానాన్ని వివరించాము. కాని మానవుడు పరమ జగడాలమారి!

وَلَقَدۡ صَرَّفۡنَا فِي هَٰذَا ٱلۡقُرۡءَانِ لِلنَّاسِ مِن كُلِّ مَثَلٖۚ وَكَانَ ٱلۡإِنسَٰنُ أَكۡثَرَ شَيۡءٖ جَدَلٗا ٥٤

---

1. అంటే భూమ్యాకాశాలను మరియు (వారిని) షైతానులను సృష్టించినప్పుడు, వారు (షైతానులు) ఉనికిలో లేరు. అల్లాహ్(సు.తా.)యే వారిని సృష్టించాడు.

وَمَا مَنَعَ ٱلنَّاسَ أَن يُؤۡمِنُوٓاْ إِذۡ جَآءَهُمُ ٱلۡهُدَىٰ وَيَسۡتَغۡفِرُواْ رَبَّهُمۡ إِلَّآ أَن تَأۡتِيَهُمۡ سُنَّةُ ٱلۡأَوَّلِينَ أَوۡ يَأۡتِيَهُمُ ٱلۡعَذَابُ قُبُلٗا ٥٥

**55**. మరియు వారి ముందుకు మార్గదర్శకత్వం వచ్చినప్పుడు, దానిని విశ్వసించకుండా మరియు తమ ప్రభువు సన్నిధిలో క్షమాభిక్ష కోరకుండా ఉండటానికి వారిని ఆటంక పరిచిందేమిటి? వారి పూర్వీకుల మీద పడిన (ఆపద) వారి మీద కూడా పడాలనో, లేదా ఆ శిక్ష ప్రత్యక్షంగా వారిపైకి రావాలనో వేచి ఉండటం తప్ప?

وَمَا نُرۡسِلُ ٱلۡمُرۡسَلِينَ إِلَّا مُبَشِّرِينَ وَمُنذِرِينَۚ وَيُجَٰدِلُ ٱلَّذِينَ كَفَرُواْ بِٱلۡبَٰطِلِ لِيُدۡحِضُواْ بِهِ ٱلۡحَقَّۖ وَٱتَّخَذُوٓاْ ءَايَٰتِي وَمَآ أُنذِرُواْ هُزُوٗا ٥٦

**56**. మరియు మేము సందేశహరులను కేవలం శుభవార్తలు అందజేసేవారిగా మరియు హెచ్చరికలు చేసే వారిగా మాత్రమే పంపుతాము. మరియు సత్య తిరస్కారులు, సత్యాన్ని ఖండించటానికి నిరర్థకమైన మాటలతో వాదులాడుతారు. మరియు నా సూచనలను మరియు హెచ్చరికలను హాస్యంగా తీసుకుంటారు.

وَمَنۡ أَظۡلَمُ مِمَّن ذُكِّرَ بِـَٔايَٰتِ رَبِّهِۦ فَأَعۡرَضَ عَنۡهَا وَنَسِيَ مَا قَدَّمَتۡ يَدَاهُۚ إِنَّا جَعَلۡنَا عَلَىٰ قُلُوبِهِمۡ أَكِنَّةً أَن يَفۡقَهُوهُ وَفِيٓ ءَاذَانِهِمۡ وَقۡرٗاۖ وَإِن تَدۡعُهُمۡ إِلَى ٱلۡهُدَىٰ فَلَن يَهۡتَدُوٓاْ إِذًا أَبَدٗا ٥٧

**57**. మరియు తన ప్రభువు సూచనలతో హితబోధ చేయబడినపుడు, వాటికి విముఖుడై తన చేతులారా చేసుకొని పంపిన దాన్ని (దుష్పరిణామాన్ని) మరచిపోయే వ్యక్తి కంటే, పరమ దుర్మార్గుడెవడు? వారు దానిని (ఖుర్ఆన్‌ను) అర్థం చేసుకోకుండా మేము వారి హృదయాల మీద తెరలు వేసి ఉన్నాము మరియు వారి చెవులకు చెవుడు కలిగించాము. కావున, నీవు వారిని సన్మార్గం వైపునకు పిలిచినా వారెన్నటికీ సన్మార్గం వైపునకు రాలేరు.

58. మరియు నీ ప్రభువు క్షమాశీలుడు, కారుణ్యమూర్తి. ఆయన వారి దుష్కర్మల ఫలితంగా వారిని పట్టుకోదలిస్తే, వారిపై తొందరగానే శిక్ష పంపిఉండేవాడు. కాని వారికొక నిర్ణీత సమయం నిర్ణయించబడి ఉంది, దానినుండి వారు ఏ విధంగానూ తప్పించుకోలేరు.[1]

وَرَبُّكَ ٱلْغَفُورُ ذُو ٱلرَّحْمَةِ ۖ لَوْ يُؤَاخِذُهُم بِمَا كَسَبُوا۟ لَعَجَّلَ لَهُمُ ٱلْعَذَابَ ۚ بَل لَّهُم مَّوْعِدٌ لَّن يَجِدُوا۟ مِن دُونِهِۦ مَوْئِلًا ﴿٥٨﴾

59. మరియు (ఆ నగరాల) వారు దుర్మార్గం చేసినందుకు మేము నాశనం చేసిన నగరాలు ఇవే! మరియు వారి నాశనం కొరకు కూడా మేము ఒక సమయాన్ని నిర్ణయించి ఉన్నాము.

وَتِلْكَ ٱلْقُرَىٰٓ أَهْلَكْنَٰهُمْ لَمَّا ظَلَمُوا۟ وَجَعَلْنَا لِمَهْلِكِهِم مَّوْعِدًا ﴿٥٩﴾

60. మరియు (జ్ఞాపకం చేసుకోండి) మూసా తన సేవకునితో[2] ఇలా అన్నది: "రెండు సముద్రాల సంగమ స్థలానికి చేరనంతవరకు నేను నా ప్రయాణాన్ని ఆపను.[3] నేను సంవత్సరాల తరబడి సంచరిస్తూ ఉండవలసినా సరే!"[4]

وَإِذْ قَالَ مُوسَىٰ لِفَتَىٰهُ لَآ أَبْرَحُ حَتَّىٰٓ أَبْلُغَ مَجْمَعَ ٱلْبَحْرَيْنِ أَوْ أَمْضِىَ حُقُبًا ﴿٦٠﴾

---

1. ఇటువంటి ఆయతులకు చూడండి, 16:61 మరియు 35:45.
2. ఈ యువకుడే యూషాఅ' బిన్-నూన్. మూసా ('అ.స.) తరువాత, అతను తనజాతి వారికి నాయకత్వాన్ని వహించారు.
3. ఈ సంగమ స్థానం అఖ్బా ఆఖాతం మరియు సూయుజ్ ఆఖాతం రెండు వచ్చి ఎర్ర సముద్రం (రెడ్‌సీ)లో కలిసే సంగమం కావచ్చని వ్యాఖ్యాతల అభిప్రాయం.
4. మూసా ('అ.స.) ఒకనితో ఒకసారి: 'నాకు మించిన జ్ఞానవంతుడు ఇప్పుడు ఎవ్వడూ లేడు!' అని అంటారు. అది అల్లాహ్(సు.తా.)కు నచ్చదు. అప్పుడు అల్లాహుతా'ఆలా అతనితో రెండు సముద్రాల సంగమంలో నీవు: 'నిన్ను మించిన జ్ఞానిని పొందగలవు.' అని దివ్యజ్ఞానం ద్వారా తెలుపుతాడు. అప్పుడతను ('అ.స.) ఆ జ్ఞాని అన్వేషణలో బయలుదేరుతారు.

فَلَمَّا بَلَغَا مَجْمَعَ بَيْنِهِمَا نَسِيَا حُوتَهُمَا فَٱتَّخَذَ سَبِيلَهُۥ فِى ٱلْبَحْرِ سَرَبًا ﴿٦١﴾

**61**. ఆ పిదప వారిద్దరు ఆ (రెండు సముద్రాల) సంగమ స్థలానికి చేరినప్పుడు, వారి చేపను గురించి మరచిపోయారు. అది వారినుండి తప్పించుకొని వేగంగా సముద్రంలోకి - *సొరంగం గుండా పోయినట్లు*[1] - దూసుకు పోయింది.

فَلَمَّا جَاوَزَا قَالَ لِفَتَىٰهُ ءَاتِنَا غَدَآءَنَا لَقَدْ لَقِينَا مِن سَفَرِنَا هَٰذَا نَصَبًا ﴿٦٢﴾

**62**. ఆ పిదప వారు మరికొంత ముందుకు పోయిన తరువాత, అతను (మూసా) తన సేవకునితో ఇలా అన్నాడు: "మన భోజనం తీసుకురా! వాస్తవానికి మనం ఈ ప్రయాణంలో చాలా అలసిపోయాము."

قَالَ أَرَءَيْتَ إِذْ أَوَيْنَآ إِلَى ٱلصَّخْرَةِ فَإِنِّى نَسِيتُ ٱلْحُوتَ وَمَآ أَنسَىٰنِيهُ إِلَّا ٱلشَّيْطَٰنُ أَنْ أَذْكُرَهُۥ ۚ وَٱتَّخَذَ سَبِيلَهُۥ فِى ٱلْبَحْرِ عَجَبًا ﴿٦٣﴾

**63**. (సేవకుడు) ఇలా అన్నాడు: "చూశారా! మనం ఆ బండ మీద విశ్రాంతి తీసుకోవటానికి ఆగినపుడు వాస్తవానికి నేను చేపను గురించి పూర్తిగా మరచిపోయాను. షైతాను తప్ప మరెవ్వడూ నన్ను దానిని గురించి మరపింపజేయలేదు. అది విచిత్రంగా సముద్రంలోకి దూసుకొని పోయింది!"

قَالَ ذَٰلِكَ مَا كُنَّا نَبْغِ ۚ فَٱرْتَدَّا عَلَىٰٓ ءَاثَارِهِمَا قَصَصًا ﴿٦٤﴾

**64**. (మూసా) అన్నాడు: "అదే కదా, మనం కోరుతున్నది (వెతుకుతున్న స్థానం)!" ఆ పిదప వారిరువురు తమ అడుగుజాడలను అనుసరిస్తూ వెనుకకు మరలిపోయారు.

---

**1** . "*తన త్రోవను సొరంగంగా* చేసుకుంటూ." (ఇది ముహమ్మద్ జూనాగఢి గారి తాత్పర్యం). పైన ఉన్నది నోబుల్ ఖుర్ఆన్ తాత్పర్యము.

فَوَجَدَا عَبۡدٗا مِّنۡ عِبَادِنَآ ءَاتَيۡنَٰهُ رَحۡمَةٗ مِّنۡ عِندِنَا وَعَلَّمۡنَٰهُ مِن لَّدُنَّا عِلۡمٗا ٦٥

65. అప్పుడు వారు మా దాసులలో ఒక దాసుణ్ణి (అచ్చట) చూశారు. మేము అతనికి మా అనుగ్రహాన్ని ప్రసాదించి,[1] అతనికి మా తరఫునుండి విశిష్ట జ్ఞానం నేర్పి ఉన్నాము.[2]

قَالَ لَهُۥ مُوسَىٰ هَلۡ أَتَّبِعُكَ عَلَىٰٓ أَن تُعَلِّمَنِ مِمَّا عُلِّمۡتَ رُشۡدٗا ٦٦

66. మూసా అతని ('ఖి'దర్)తో అన్నాడు: "నీకు నేర్పబడిన జ్ఞానాన్ని నీవు నాకు నేర్పుటకై నేను నిన్ను అనుసరించవచ్చునా?"

قَالَ إِنَّكَ لَن تَسۡتَطِيعَ مَعِيَ صَبۡرٗا ٦٧

67. అతను జవాబిచ్చాడు: "నీవు నాతోపాటు ఏ మాత్రం సహనం వహించలేవు!

وَكَيۡفَ تَصۡبِرُ عَلَىٰ مَا لَمۡ تُحِطۡ بِهِۦ خُبۡرٗا ٦٨

68. "అసలు నీకు తెలియని విషయాన్ని గురించి నీవెట్లు సహనం వహించగలవు?"

قَالَ سَتَجِدُنِيٓ إِن شَآءَ ٱللَّهُ صَابِرٗا وَلَآ أَعۡصِي لَكَ أَمۡرٗا ٦٩

69. (మూసా) అన్నాడు: "అల్లాహ్ కోరితే! నీవు నన్ను సహనశీలునిగా పొందగలవు. నేను నీ యొక్క ఏ ఆజ్ఞనూ ఉల్లంఘించను!"

قَالَ فَإِنِ ٱتَّبَعۡتَنِي فَلَا تَسۡـَٔلۡنِي عَن شَيۡءٍ حَتَّىٰٓ أُحۡدِثَ لَكَ مِنۡهُ ذِكۡرٗا ٧٠

70. అతను అన్నాడు: "ఒకవేళ నీవు నన్ను అనుసరించటానికే నిశ్చయించు కుంటే, స్వయంగా నేనే నీతో ప్రస్తావించ నంత వరకు నీవు నన్ను, ఏ విషయాన్ని గురించి కూడా ప్రశ్నించకూడదు."

---

1. ర'హ్మతున్: అంటే ఇక్కడ ప్రత్యేక అనుగ్రహాలు అని కొందరు వ్యాఖ్యాతలు అన్నారు. మరియు చాలా మంది వ్యాఖ్యాతలు దీనిని ప్రవక్త పదవిగా వ్యాఖ్యానించారు.
2. అల్లాహుతా'ఆలా 'ఖి'దర్ ('అ.స.)కు ప్రవక్తపదవినే గాక, తన వైపు నుండి విశిష్ట జ్ఞానం కూడా ప్రసాదించాడు.

فَٱنطَلَقَا حَتَّىٰٓ إِذَا رَكِبَا فِى ٱلسَّفِينَةِ خَرَقَهَا ۖ قَالَ أَخَرَقْتَهَا لِتُغْرِقَ أَهْلَهَا لَقَدْ جِئْتَ شَيْـًٔا إِمْرًا ﴿٧١﴾

**71.** ఆ పిదప వారిద్దరూ బయలుదేరారు. చివరికి వారిద్దరు పడవలో ఎక్కినపుడు అతను పడవకు రంధ్రం చేశాడు. (మూసా) అతనితో అన్నాడు: "ఏమీ? పడవలో ఉన్న వారిని ముంచివేయటానికా, నీవు దానిలో రంధ్రం చేశావు? వాస్తవానికి, నీవు ఒక దారుణమైన పని చేశావు!"

قَالَ أَلَمْ أَقُلْ إِنَّكَ لَن تَسْتَطِيعَ مَعِىَ صَبْرًا ﴿٧٢﴾

**72.** అతను అన్నాడు: "నేను నీతో అనలేదా? నీవు నాతోపాటు ఏ మాత్రం సహనం వహించలేవని?"

قَالَ لَا تُؤَاخِذْنِى بِمَا نَسِيتُ وَلَا تُرْهِقْنِى مِنْ أَمْرِى عُسْرًا ﴿٧٣﴾

**73.** (మూసా) అన్నాడు: "మరచిపోయి చేసిన దానికి నన్ను తప్పు పట్టకు. నేను చేసిన దానికి నా పట్ల కఠినంగా వ్యవహరించకు!"

فَٱنطَلَقَا حَتَّىٰٓ إِذَا لَقِيَا غُلَٰمًا فَقَتَلَهُۥ قَالَ أَقَتَلْتَ نَفْسًا زَكِيَّةًۢ بِغَيْرِ نَفْسٍ لَّقَدْ جِئْتَ شَيْـًٔا نُّكْرًا ﴿٧٤﴾

**74.** ఆ పిదప వారు తమ ప్రయాణం సాగించగా వారికి ఒక బాలుడు కలిశాడు. అతను వానిని (ఆ బాలుణ్ణి) చంపాడు. (అది చూసి) మూసా అన్నాడు: "ఏమీ? ఒక అమాయకుడిని చంపావా? అతడు ఎవ్వడినీ (చంపలేదే)! వాస్తవానికి నీవు ఒక ఘోరమైన పని చేశావు!"

۞ قَالَ أَلَمۡ أَقُل لَّكَ إِنَّكَ لَن تَسۡتَطِيعَ مَعِيَ صَبۡرٗا ﴿٧٥﴾

**75**. (*) అతను (ఖి'ద్ర్) అన్నాడు: "నేను నీతో అనలేదా, నిశ్చయంగా, నీవు నాతోపాటు ఏ మాత్రం సహనం వహించలేవని?"

قَالَ إِن سَأَلۡتُكَ عَن شَيۡءِۭ بَعۡدَهَا فَلَا تُصَٰحِبۡنِيۖ قَدۡ بَلَغۡتَ مِن لَّدُنِّي عُذۡرٗا ﴿٧٦﴾

**76**. (మూసా) అన్నాడు: "ఇక ముందు దేన్ని గురించి అయినా నిన్ను అడిగితే నన్ను నీతోపాటు ఉండనివ్వకు. వాస్తవానికి నీవు, నా తరఫునుండి ఇంతవరకు చాలినన్ని సాకులు స్వీకరించావు."

فَٱنطَلَقَا حَتَّىٰٓ إِذَآ أَتَيَآ أَهۡلَ قَرۡيَةٍ ٱسۡتَطۡعَمَآ أَهۡلَهَا فَأَبَوۡاْ أَن يُضَيِّفُوهُمَا فَوَجَدَا فِيهَا جِدَارٗا يُرِيدُ أَن يَنقَضَّ فَأَقَامَهُۥۖ قَالَ لَوۡ شِئۡتَ لَتَّخَذۡتَ عَلَيۡهِ أَجۡرٗا ﴿٧٧﴾

**77**. ఆపిదప వారిద్దరూ ముందుకు సాగిపోయి ఒక నగరం చేరుకొని ఆ నగరవాసులను భోజనమడిగారు. కాని వారు (ఆ నగరవాసులు) వారిద్దరికి ఆతిథ్యమివ్వటానికి నిరాకరించారు.[1] అప్పుడు వారక్కడ కూలిపోనున్న ఒక గోడను చూశారు. అతను (ఖి'ద్ర్) దానిని మళ్ళీ నిలబెట్టాడు. (మూసా) అన్నాడు: "నీవు కోరితే దానికి (ఆ శ్రమకు) ప్రతిఫలం (వేతనం) తీసుకొని ఉండవచ్చు కదా!"

قَالَ هَٰذَا فِرَاقُ بَيۡنِي وَبَيۡنِكَۚ سَأُنَبِّئُكَ بِتَأۡوِيلِ مَا لَمۡ تَسۡتَطِع عَّلَيۡهِ صَبۡرًا ﴿٧٨﴾

**78**. అతను (ఖి'ద్ర్) అన్నాడు: "ఇక నేనూ-నీవూ విడిపోవలసిన (సమయం) వచ్చింది. ఇక నీవు సహనం వహించలేకపోయిన విషయాల వాస్తవాలను (తత్త్వాలను) గురించి నీకు తెలుపుతాను.

1. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'అల్లాహుతా'ఆలాను మరియు పరలోకాన్ని విశ్వసించే వాడు, తన అతిథిని ఆదరించాలి, ఆతిథ్యమివ్వాలి.' (ఫై'ద్ అల్-ఖదీర్, ష'ర్హ్ అల్-జామె' అ'స్స'గీర్-5/209).

**79**. ''ఇక ఆ నావ విషయం: అది సముద్రంలో పనిచేసుకునే కొందరు పేద వారిది. కావున దానిలో లోపం కలిగించగోరాను; ఎందుకంటే వారి వెనుక ఒక క్రూరుడైన రాజు ఉన్నాడు. అతడు (లోపంలేని) ప్రతి నావను బలవంతంగా తీసుకుంటాడు.

**80**. ''ఇక ఆ బాలుని విషయం: అతని తల్లి దండ్రులు విశ్వాసులు. అతడు తన సత్య తిరస్కారం మరియు తలబిరుసుతనం వలన వారిని బాధిస్తాడని భయపడ్డాము.

**81**. ''కావున వారిద్దరి ప్రభువు వారికి అతనికి బదులుగా అతనికంటే ఎక్కువ నీతిమంతుడు మరియు కారుణ్యం గలవాడిని ఇవ్వాలని కోరాము.

**82**. ''ఇక ఆ గోడ విషయం: అది ఈ పట్టణంలోని ఇద్దరు అనాథ బాలురకు చెందినది. దానిక్రింద వారి ఒక నిధి (పాతబడి) ఉంది మరియు వారి తండ్రి పుణ్య పురుషుడు. ఆ ఇద్దరు బాలురు యుక్తవయస్కులైన పిదప - నీ ప్రభువు కారుణ్యంగా - తమ నిధిని, వారు త్రవ్వి తీసుకోవాలని, నీ ప్రభువు సంకల్పం. ఇదంతా నా అంతట నేను చేయలేదు. నీవు సహనం వహించలేని విషయాల వాస్తవం (తత్త్వం) ఇదే!''

**83**. మరియు వారు నిన్ను జు'ల్-ఖర్నైన్‌ను [1] గురించి అడుగుతున్నారు. వారితో అను: ''అతనిని గురించి జ్ఞాపకముంచుకోదగిన విషయాన్ని నేను మీకు వినిపిస్తాను.''

أَمَّا ٱلسَّفِينَةُ فَكَانَتۡ لِمَسَٰكِينَ
يَعۡمَلُونَ فِي ٱلۡبَحۡرِ فَأَرَدتُّ أَنۡ أَعِيبَهَا
وَكَانَ وَرَآءَهُم مَّلِكٞ يَأۡخُذُ كُلَّ سَفِينَةٍ
غَصۡبٗا ٧٩

وَأَمَّا ٱلۡغُلَٰمُ فَكَانَ أَبَوَاهُ مُؤۡمِنَيۡنِ
فَخَشِينَآ أَن يُرۡهِقَهُمَا طُغۡيَٰنٗا
وَكُفۡرٗا ٨٠

فَأَرَدۡنَآ أَن يُبۡدِلَهُمَا رَبُّهُمَا خَيۡرٗا مِّنۡهُ
زَكَوٰةٗ وَأَقۡرَبَ رُحۡمٗا ٨١

وَأَمَّا ٱلۡجِدَارُ فَكَانَ لِغُلَٰمَيۡنِ يَتِيمَيۡنِ
فِي ٱلۡمَدِينَةِ وَكَانَ تَحۡتَهُۥ كَنزٞ
لَّهُمَا وَكَانَ أَبُوهُمَا صَٰلِحٗا فَأَرَادَ
رَبُّكَ أَن يَبۡلُغَآ أَشُدَّهُمَا وَيَسۡتَخۡرِجَا
كَنزَهُمَا رَحۡمَةٗ مِّن رَّبِّكَۚ وَمَا فَعَلۡتُهُۥ
عَنۡ أَمۡرِيۚ ذَٰلِكَ تَأۡوِيلُ مَا لَمۡ تَسۡطِع
عَّلَيۡهِ صَبۡرٗا ٨٢

وَيَسۡـَٔلُونَكَ عَن ذِي ٱلۡقَرۡنَيۡنِۖ قُلۡ
سَأَتۡلُواْ عَلَيۡكُم مِّنۡهُ ذِكۡرًا ٨٣

---

1. జు'ల్- ఖర్నైన్ అంటే రెండు కొమ్ములున్నవాడు.

إِنَّا مَكَّنَّا لَهُۥ فِى ٱلْأَرْضِ وَءَاتَيْنَٰهُ مِن كُلِّ شَىْءٍ سَبَبًا ﴿٨٤﴾

**84**. నిశ్చయంగా మేము అతని (అధికారాన్ని) భూమిలో స్థాపించాము. మరియు అతనికి ప్రతి దానిని పొందే మార్గాన్ని చూపాము.[1]

فَأَتْبَعَ سَبَبًا ﴿٨٥﴾

**85**. అతను ఒక మార్గం మీద పోయాడు.

حَتَّىٰٓ إِذَا بَلَغَ مَغْرِبَ ٱلشَّمْسِ وَجَدَهَا تَغْرُبُ فِى عَيْنٍ حَمِئَةٍ وَوَجَدَ عِندَهَا قَوْمًا ۗ قُلْنَا يَٰذَا ٱلْقَرْنَيْنِ إِمَّآ أَن تُعَذِّبَ وَإِمَّآ أَن تَتَّخِذَ فِيهِمْ حُسْنًا ﴿٨٦﴾

**86**. చివరకు సూర్యుడు అస్తమించేటట్లు (కనబడే) స్థలానికి చేరాడు. దానిని (సూర్యుణ్ణి) నల్లటి బురదవంటి నీటిలో మునుగుతున్నట్లు చూశాడు.[2] మరియు అక్కడొక జాతి వారిని చూశాడు.[3] మేము అతనితో అన్నాము: "ఓ జు'ల్-ఖర్నైన్! నీవు వారిని శిక్షించవచ్చు, లేదా వారియెడల ఉదార వైఖరిని అవలంబించవచ్చు!"

قَالَ أَمَّا مَن ظَلَمَ فَسَوْفَ نُعَذِّبُهُۥ ثُمَّ يُرَدُّ إِلَىٰ رَبِّهِۦ فَيُعَذِّبُهُۥ عَذَابًا نُّكْرًا ﴿٨٧﴾

**87**. అతను అన్నాడు: "ఎవడైతే దుర్మార్గం చేస్తాడో మేము అతనిని శిక్షిస్తాము. ఆ పిదప అతడు తన ప్రభువు వైపునకు మరలింపబడతాడు. అప్పుడు ఆయన అతనికి ఘోరమైన శిక్ష విధిస్తాడు.

---

**1**. అస్-సబబు: అంటే త్రాడు. ఇక్కడ తాను కోరిన దానిని పొందే మార్గాన్ని అన్వేషించడమని అర్థం.

**2**. 'ఐనున్: సముద్రం లేక చెలిమ. 'హమిఅతిన్: బురద.
వజద: పొందాడు, చూశాడు, కనుగొన్నాడు. అతడు పూర్తి పశ్చిమ దిశకు పోయిన తరువాత అక్కడ ఒక సముద్రం లేక చెలిమను చూశాడు. దాని నీరు నల్లని బురదగా కనిపించింది, దాని తరువాత అతనికి ఏమీ కనిపించక అస్తమయ్యే సూర్యుడు మాత్రమే కనిపించాడు. సముద్రపు ఒడ్డున నిలబడి అస్తమించే సూర్యుణ్ణి చూస్తే, సూర్యుడు ఆ సముద్రంలో మునిగిపోతున్నట్లు కనబడటం మనం చూస్తున్న విషయమే! భూమి గుండ్రంగా ఉన్నదనటానికి ఇదొక నిదర్శనం.

**3**. ఖుల్నా: మేమన్నాము, అంటే అల్లాహుతా'ఆలా అతనికి వ'హీ ద్వారా తెలిపాడు. అంటే, అతడు ప్రవక్త కావచ్చని కొందరు భావిస్తారు. అతనిని ప్రవక్తగా పరిగణించని వారు; ఆ కాలపు ప్రవక్త ద్వారా అతనికి సందేశం ఇవ్వబడిందని అంటారు.

88. "ఇక ఎవడైతే! విశ్వసించి సత్కార్యాలు చేస్తాడో అతనికి మంచి ప్రతిఫలముంటుంది. మేము అతనిని ఆజ్ఞాపించినపుడు, సులభతరమైన ఆజ్ఞయే ఇస్తాము."

وَأَمَّا مَنْ ءَامَنَ وَعَمِلَ صَٰلِحًا فَلَهُۥ جَزَآءً ٱلْحُسْنَىٰ ۖ وَسَنَقُولُ لَهُۥ مِنْ أَمْرِنَا يُسْرًا ﴿٨٨﴾

89. తరువాత అతను మరొక మార్గం మీద పోయాడు.

ثُمَّ أَتْبَعَ سَبَبًا ﴿٨٩﴾

90. చివరకు సూర్యుడు ఉదయించేటట్లు (కనపడే) స్థలానికి చేరాడు. అక్కడ అతను దానిని (సూర్యుణ్ణి) ఒక జాతిపై ఉదయించడం చూశాడు. వారికి మేము దాని (సూర్యుని) నుండి కాపాడు కోవటానికి ఎలాంటి చాటు (రక్షణ) నివ్వలేదు.[1]

حَتَّىٰٓ إِذَا بَلَغَ مَطْلِعَ ٱلشَّمْسِ وَجَدَهَا تَطْلُعُ عَلَىٰ قَوْمٍ لَّمْ نَجْعَل لَّهُم مِّن دُونِهَا سِتْرًا ﴿٩٠﴾

91. ఈ విధంగా! వాస్తవానికి, అతనికి (జు'ల్-ఖర్నైన్)కు తెలిసిఉన్న విషయాలను గురించి మాకు బాగా తెలుసు.

كَذَٰلِكَ وَقَدْ أَحَطْنَا بِمَا لَدَيْهِ خُبْرًا ﴿٩١﴾

92. ఆ తరువాత అతను మరొక మార్గం మీద పోయాడు.

ثُمَّ أَتْبَعَ سَبَبًا ﴿٩٢﴾

93. చివరకు అతను రెండు పర్వతాల మధ్య చేరాడు. వాటి మధ్య ఒక జాతి వారిని చూశాడు. వారు అతని మాటలను అతి కష్టంతో అర్థం చేసుకోగలిగారు.[2]

حَتَّىٰٓ إِذَا بَلَغَ بَيْنَ ٱلسَّدَّيْنِ وَجَدَ مِن دُونِهِمَا قَوْمًا لَّا يَكَادُونَ يَفْقَهُونَ قَوْلًا ﴿٩٣﴾

1. ఆ జాతివారు ఇండ్లలో నివసించేవారు కాదు. మైదానాలలో నివసించేవారు. మరియు వారు బట్టలు కూడా ధరించకుండా నివసించే ఆదివాసులు.

2. ఆ జాతి వారు తమ భాష తప్ప ఇతరుల భాషను అర్థంచేసుకోలేరు. కావున వారు అతని మాటలను అర్థం చేసుకోలేక పోయారు.

قَالُواْ يَٰذَا ٱلْقَرْنَيْنِ إِنَّ يَأْجُوجَ وَمَأْجُوجَ مُفْسِدُونَ فِي ٱلْأَرْضِ فَهَلْ نَجْعَلُ لَكَ خَرْجًا عَلَىٰٓ أَن تَجْعَلَ بَيْنَنَا وَبَيْنَهُمْ سَدًّا ﴿٩٤﴾

**94**. వారన్నారు: "ఓ జు'ల్-ఖర్నైన్! వాస్తవానికి యా'జూజ్ మరియు మా'జూజ్‌లు,[1] ఈ భూభాగంలో కల్లోలం రేకెత్తిస్తున్నారు. అయితే నీవు మాకూ మరియు వారికీ మధ్య ఒక అడ్డుగోడను నిర్మించటానికి, మేము నీకేమైనా శుల్కం చెల్లించాలా?"

قَالَ مَا مَكَّنِّي فِيهِ رَبِّي خَيْرٌ فَأَعِينُونِي بِقُوَّةٍ أَجْعَلْ بَيْنَكُمْ وَبَيْنَهُمْ رَدْمًا ﴿٩٥﴾

**95**. అతను అన్నాడు: "నా ప్రభువు ఇచ్చిందే నాకు ఉత్తమమైనది. ఇక మీరు మీ శ్రమ ద్వారా మాత్రమే నాకు సహాయపడితే, నేను మీకూ మరియు వారికీ మధ్య అడ్డుగోడను నిర్మిస్తాను.

ءَاتُونِي زُبَرَ ٱلْحَدِيدِ ۖ حَتَّىٰٓ إِذَا سَاوَىٰ بَيْنَ ٱلصَّدَفَيْنِ قَالَ ٱنفُخُواْ ۖ حَتَّىٰٓ إِذَا جَعَلَهُۥ نَارًا قَالَ ءَاتُونِيٓ أُفْرِغْ عَلَيْهِ قِطْرًا ﴿٩٦﴾

**96**. "మీరు నాకు ఇనుప ముద్దలు తెచ్చి ఇవ్వండి." అతను ఆ రెండు కొండల మధ్య ఉన్న సందును మూసిన తరువాత వారితో అన్నాడు: "అగ్ని రగిలించండి." దానిని ఎర్రని నిప్పుగా మార్చిన తరువాత, అన్నాడు: "ఇక కరిగిన రాగిని తీసుకురండి, దీనిమీద పోయటానికి."

---

**1**. వీరి గాథ బైబిల్‌లో కూడా పేర్కొనబడింది. చూడండి, యెహెజ్కేలు-(Ezekiel), 38:2 మరియు 39:6. ఇంకా ఇతర చోట్లలోకూడా వీరి విషయం పేర్కొనబడింది. చూడండి, యోహాను ప్రకటన-(Revelation of St. John), 20:8.

చాలా మంది వ్యాఖ్యాతలు వీరిని మంగోలులు లేక టాటార్‌లు (Mongols or Tatars) కావచ్చని అంటారు. వీరు అసత్యవాదులు మరియు అంతిమ గడియకు ముందు భూమిలో కల్లోలం రేకెత్తించి మానవ నాగరికతను నాశనం చేస్తారు. ఇంకా చూడండి, 21:96-97. వాస్తవం అల్లాహ్(సు.తా.)కే తెలుసు. 'స'హీ'హ్ బు'ఖారీ మరియు ముస్లింలలో ఇలా ఉంది: 'యా'జూజ్ మా'జూజ్‌లు,' రెండు మానవ జాతులు. వారి సంఖ్య ఇతర మానవుల కంటే అధికముగా ఉంటుంది. మరియు వారితోనే నరకం అత్యధికంగా నిండుతుంది.

فَمَا ٱسْطَٰعُوٓاْ أَن يَظْهَرُوهُ وَمَا ٱسْتَطَٰعُواْ لَهُۥ نَقْبًا ﴿٩٧﴾

97. ఈ విధంగా వారు (యా'జూజ్ మరియు మా'జూజ్‌లు) దానిపై నుండి ఎక్కి రాలేకపోయారు. మరియు దానిలో కన్నం కూడా చేయలేక పోయారు.

قَالَ هَٰذَا رَحْمَةٌ مِّن رَّبِّي ۖ فَإِذَا جَآءَ وَعْدُ رَبِّي جَعَلَهُۥ دَكَّآءَ ۖ وَكَانَ وَعْدُ رَبِّي حَقًّا ﴿٩٨﴾

98. అతను (జు'ల్-ఖర్నైన్) అన్నాడు: "ఇది నా ప్రభువు యొక్క కారుణ్యం. కాని నా ప్రభువు వాగ్దానపు ఘడియ వచ్చినపుడు ఆయన దీనిని బూడిదగా మార్చివేస్తాడు. మరియు నా ప్రభువు వాగ్దానం నిజమైతీరుతుంది." (1/8)

۞ وَتَرَكْنَا بَعْضَهُمْ يَوْمَئِذٍ يَمُوجُ فِي بَعْضٍ ۖ وَنُفِخَ فِي ٱلصُّورِ فَجَمَعْنَٰهُمْ جَمْعًا ﴿٩٩﴾

99. * మరియు ఆ (యా'జూజ్ మరియు మా'జూజ్‌లు బయటికి వచ్చిన) రోజు, మేము వారిని అలలవలే ఒకరిమీద ఒకరు పడటానికి వదిలివేస్తాము. మరియు బాకా ('సూర్) ఊదబడినప్పుడు, వారందరినీ ఒకచోట సమావేశపరుస్తాము.

وَعَرَضْنَا جَهَنَّمَ يَوْمَئِذٍ لِّلْكَٰفِرِينَ عَرْضًا ﴿١٠٠﴾

100. మరియు ఆ రోజున మేము సత్యతిరస్కారులకు నరకాన్ని స్పష్టంగా చూసేందుకు వారి ముందుకు తెస్తాము.

ٱلَّذِينَ كَانَتْ أَعْيُنُهُمْ فِي غِطَآءٍ عَن ذِكْرِي وَكَانُواْ لَا يَسْتَطِيعُونَ سَمْعًا ﴿١٠١﴾

101. అలాంటి వారికి, ఎవరి కన్నులైతే, మా హితోపదేశం పట్ల కప్పబడి ఉండెనో మరియు వారికి, ఎవరైతే (దానిని) ఏ మాత్రమూ వినటానికి కూడా ఇష్టపడలేదో!

أَفَحَسِبَ ٱلَّذِينَ كَفَرُوٓاْ أَن يَتَّخِذُواْ عِبَادِي مِن دُونِيٓ أَوْلِيَآءَ ۚ إِنَّآ أَعْتَدْنَا جَهَنَّمَ لِلْكَٰفِرِينَ نُزُلًا ﴿١٠٢﴾

102. ఏమీ? ఈ సత్యతిరస్కారులు నన్ను వదలి, నా దాసులను తమ స్నేహితు(సంరక్షకు)లుగా చేసుకోగలరని భావించారా? నిశ్చయంగా, మేము సత్యతిరస్కారుల ఆతిథ్యం కొరకు నరకాన్ని సిద్ధపరచి ఉంచాము.

103. వారితో అను: "కర్మలను బట్టి అందరికంటే ఎక్కువ నష్టపడే వారు ఎవరో మీకు తెలుపాలా?

قُلْ هَلْ نُنَبِّئُكُم بِٱلْأَخْسَرِينَ أَعْمَٰلًا ﴿١٠٣﴾

104. "ఎవరైతే ఇహలోక జీవితంలో చేసే కర్మలన్నీ వ్యర్థమైనా, తాము చేసేవన్నీ సత్కార్యాలే అని భావిస్తారో!

ٱلَّذِينَ ضَلَّ سَعْيُهُمْ فِى ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَهُمْ يَحْسَبُونَ أَنَّهُمْ يُحْسِنُونَ صُنْعًا ﴿١٠٤﴾

105. "వీరే తమ ప్రభువు సూచనలను మరియు ఆయనను కలుసుకోవలసి వున్నదనే విషయాన్ని తిరస్కరించిన వారు. కావున వారి కర్మలన్నీ వ్యర్థమయ్యాయి. కాబట్టి మేము పునరుత్థాన దినమున వారి కర్మలకు ఎలాంటి విలువ (తూకము) నివ్వము.

أُو۟لَٰٓئِكَ ٱلَّذِينَ كَفَرُوا۟ بِـَٔايَٰتِ رَبِّهِمْ وَلِقَآئِهِۦ فَحَبِطَتْ أَعْمَٰلُهُمْ فَلَا نُقِيمُ لَهُمْ يَوْمَ ٱلْقِيَٰمَةِ وَزْنًا ﴿١٠٥﴾

106. "అదే వారి ప్రతిఫలం, నరకం! ఎందుకంటే వారు సత్యాన్ని తిరస్కరించారు మరియు నా సూచనలను మరియు నా సందేశహరులను పరిహసించారు.

ذَٰلِكَ جَزَآؤُهُمْ جَهَنَّمُ بِمَا كَفَرُوا۟ وَٱتَّخَذُوٓا۟ ءَايَٰتِى وَرُسُلِى هُزُوًا ﴿١٠٦﴾

107. "నిశ్చయంగా ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తారో! వారి ఆతిథ్యం కొరకు ఫిర్దౌస్ స్వర్గవనాలు ఉంటాయి.[1]

إِنَّ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ كَانَتْ لَهُمْ جَنَّٰتُ ٱلْفِرْدَوْسِ نُزُلًا ﴿١٠٧﴾

1. జన్నతుల్-ఫిర్దౌస్: ఇది అన్నిటి కంటే ఉత్తమమైన స్వర్గం. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'మీరు ఎల్లప్పుడు జన్నతుల్-ఫిర్దౌస్ కొరకే ప్రార్థించండి.' ('స'హీ'హ్ బు'ఖారీ).

خَٰلِدِينَ فِيهَا لَا يَبۡغُونَ عَنۡهَا حِوَلٗا ١٠٨

**108**. "వారందులో శాశ్వతంగా ఉంటారు, వారు అక్కడి నుండి వేరవటానికి ఇష్టపడరు."

قُل لَّوۡ كَانَ ٱلۡبَحۡرُ مِدَادٗا لِّكَلِمَٰتِ رَبِّي لَنَفِدَ ٱلۡبَحۡرُ قَبۡلَ أَن تَنفَدَ كَلِمَٰتُ رَبِّي وَلَوۡ جِئۡنَا بِمِثۡلِهِۦ مَدَدٗا ١٠٩

**109**. వారితో అను: "నా ప్రభువు మాటలను వ్రాయటానికి, సముద్రమంతా సిరాగా మారి పోయినా - నా ప్రభువు మాటలు పూర్తికాక ముందే - దానికి తోడుగా దానివంటి మరొక సముద్రాన్ని తెచ్చినా, అది కూడా తరిగి పోతుంది."[1]

قُلۡ إِنَّمَآ أَنَا۠ بَشَرٞ مِّثۡلُكُمۡ يُوحَىٰٓ إِلَيَّ أَنَّمَآ إِلَٰهُكُمۡ إِلَٰهٞ وَٰحِدٞۖ فَمَن كَانَ يَرۡجُواْ لِقَآءَ رَبِّهِۦ فَلۡيَعۡمَلۡ عَمَلٗا صَٰلِحٗا وَلَا يُشۡرِكۡ بِعِبَادَةِ رَبِّهِۦٓ أَحَدَۢا ١١٠

**110**. (ఓ ప్రవక్తా!) ఇంకా ఇలా అను: "నిశ్చయంగా, నేను కూడా మీలాంటి ఒక మానవుడనే! నాపై దివ్యజ్ఞానం (వ'హీ) అవతరింప జేయబడింది. నిశ్చయంగా, మీ ఆరాధ్య దేవుడు ఆ ఏకైక దైవం (అల్లాహ్) మాత్రమే! కావున తన ప్రభువును కలుసుకోవాలని ఆశించేవాడు సత్కార్యాలు చేయాలి మరియు ఆరాధనలో తన ప్రభువుతో పాటు మరెవ్వరినీ భాగస్వాములు(షరీక్‌లు)గా కల్పించుకోరాదు."

*****

1. చూడండి, 31:27.

## 19. సూరహ్ మర్యమ్

## سُورَةُ مَريَمَ

జ'అఫర్ బిన్ అబీ-'తాలిబ్ (ర'ది.'అ.) 'హబషా (Abyssinia)కు వలస పోయినప్పుడు, 'హబషా రాజు నజాషీ (Negus) సభలో సూరహ్ మర్యం మొదటి భాగం చదివి వినిపించారు. అప్పుడు వారందరి గడ్డాలు కన్నీరుతో నిండాయి. అప్పుడతడన్నాడు. ఖుర్ఆన్ మరియు 'ఈసా ('అ.స.) తెచ్చిన గ్రంథం రెండూ ఒకే జ్యోతి యొక్క కిరణాలు, (ఫ'త్హ్ అల్-ఖదీర్). దీని పేరు **16వ ఆయత్** నుండి తీసుకోబడింది. ఈ సూరహ్ హిజ్రత్‌కు దాదాపు 7-8 సంవత్సరాలకు ముందు **మక్కాలో** అవతరింపజేయబడింది. ఇందులో **98 ఆయతులు** ఉన్నాయి. ఇందులో సయ్యిదా **మర్యం** ('అ.స.) ఆమె కుమారులు 'ఈసా ('అ.స.) ఆమె పోషకులు 'జకరియ్యా ('అ.స.) మరియు అతని కుమారులు య'హ్యా ('అ.స.)ల గాథలు ఉన్నాయి.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

كٓهيعٓصٓ ﴿١﴾

**1.** కాఫ్-హా -యా-'ఐన్-'సాద్.

ذِكۡرُ رَحۡمَتِ رَبِّكَ عَبۡدَهُۥ زَكَرِيَّآ ﴿٢﴾

**2.** ఇది నీ ప్రభువు తన దాసుడైన 'జకరియ్యాపై చూపిన కారుణ్య ప్రస్తావన.

إِذۡ نَادَىٰ رَبَّهُۥ نِدَآءً خَفِيّٗا ﴿٣﴾

**3.** అతను తన ప్రభువును రహస్యంగా (ఏకాంతంలో) మొరపెట్టుకున్నప్పుడు,

قَالَ رَبِّ إِنِّي وَهَنَ ٱلۡعَظۡمُ مِنِّي وَٱشۡتَعَلَ ٱلرَّأۡسُ شَيۡبٗا وَلَمۡ أَكُنۢ بِدُعَآئِكَ رَبِّ شَقِيّٗا ﴿٤﴾

**4.** ఇలా ప్రార్థించాడు: "ఓ నాప్రభూ! నా ఎముకలు బలహీనమైపోయాయి మరియు నా తల (వెంట్రుకలు) ముసలితనం వల్ల తెల్లబడి మెరిసిపోతున్నాయి. మరియు ఓ నా ప్రభూ! నిన్ను వేడుకొని నేను ఎన్నడూ నిష్ఫలుడను కాలేదు!

وَإِنِّي خِفۡتُ ٱلۡمَوَٰلِيَ مِن وَرَآءِي وَكَانَتِ ٱمۡرَأَتِي عَاقِرٗا فَهَبۡ لِي مِن لَّدُنكَ وَلِيّٗا ﴿٥﴾

**5.** "మరియు వాస్తవానికి నా తరువాత నా బంధువులు (ఏమి చేస్తారోఅని) నేను భయపడుతున్నాను. నా భార్యనేమో గొడ్రాలు. కావున (నీ అనుగ్రహంతో) నాకు ఒక వారసుణ్ణి ప్రసాదించు.

يَرِثُنِي وَيَرِثُ مِنْ ءَالِ يَعْقُوبَ وَٱجْعَلْهُ رَبِّ رَضِيًّا ﴿٦﴾

6. "అతడు నాకు మరియు య'అఖూబ్ సంతతి వారికి వారసుడవుతాడు. మరియు ఓ నా ప్రభూ! అతనిని నీకు ప్రీతిపాత్రునిగా చేసుకో!"

يَٰزَكَرِيَّآ إِنَّا نُبَشِّرُكَ بِغُلَٰمٍ ٱسْمُهُۥ يَحْيَىٰ لَمْ نَجْعَل لَّهُۥ مِن قَبْلُ سَمِيًّا ﴿٧﴾

7. (అతనికి ఇలా జవాబివ్వబడింది): "ఓ 'జకరియ్యా! నిశ్చయంగా, మేము నీకు య'హ్యా అనే పేరుగల ఒక కుమారుని శుభవార్తను ఇస్తున్నాము.[1] ఇంతకు పూర్వం మేము ఈ పేరు ఎవ్వరికీ ఇవ్వలేదు."

قَالَ رَبِّ أَنَّىٰ يَكُونُ لِي غُلَٰمٌ وَكَانَتِ ٱمْرَأَتِي عَاقِرًا وَقَدْ بَلَغْتُ مِنَ ٱلْكِبَرِ عِتِيًّا ﴿٨﴾

8. ('జకరియ్యా) అన్నాడు: "ఓ నా ప్రభూ! నాకు కుమారుడు ఎలా కలుగుతాడు? నా భార్యనేమో గొడ్రాలు,[2] మరియు నేనేమో వృద్ధాప్యంతో క్షీణించి (దుర్బలుడనై) పోయాను?"

قَالَ كَذَٰلِكَ قَالَ رَبُّكَ هُوَ عَلَيَّ هَيِّنٌ وَقَدْ خَلَقْتُكَ مِن قَبْلُ وَلَمْ تَكُ شَيْـًٔا ﴿٩﴾

9. ఇలా జవాబిచ్చాడు: "అలాగే అవుతుంది నీ ప్రభువు ఇలా అంటున్నాడు: 'ఇది నాకు సులభం మరియు వాస్తవానికి ఇంతకు ముందు నీవు ఏమీ లేనప్పుడు, నేను నిన్ను సృష్టించాను కదా!' "

قَالَ رَبِّ ٱجْعَل لِّيٓ ءَايَةً قَالَ ءَايَتُكَ أَلَّا تُكَلِّمَ ٱلنَّاسَ ثَلَٰثَ لَيَالٍ سَوِيًّا ﴿١٠﴾

10. ('జకరియ్యా) అన్నాడు: "ఓ నా ప్రభూ! నాకొక గుర్తును నియమించు." ఇలా జవాబు ఇవ్వబడింది: "నీ గుర్తు ఏమిటంటే! నీవు స్వస్థతతో ఉండికూడా వరుసగా మూడు రాత్రు (దినము)లు ప్రజలతో మాట్లాడలేవు."[3]

---

1. చూడండి, 3:39.
2. 'జకరియ్యా ('అ.స.) భార్య, మర్యమ్ ('అ.స.) తల్లి యొక్క సోదరీమణి అని కొందరంటారు. చూడండి, 3:37 వ్యాఖ్యానం 3. మరికొందరు ఆమె మర్యమ్ ('అ.స.) తండ్రి 'ఇమ్రాన్ కూతురని అంటారు. అంటే య'హ్యా ('అ.స.) మరియు 'ఈసా ('అ.స.) అక్కాచెల్లెళ్ళ కుమారులు, అంటే కజిన్‌లు. ('స'హీ'హ్ అ'హాదీస్‌ల ఆధారంగా, ఫ'త్హ్ అల్-ఖదీర్).
3. చూడండి, 3:41.

فَخَرَجَ عَلَىٰ قَوْمِهِۦ مِنَ ٱلْمِحْرَابِ فَأَوْحَىٰٓ إِلَيْهِمْ أَن سَبِّحُوا۟ بُكْرَةً وَعَشِيًّا ﴿١١﴾

يَـٰيَحْيَىٰ خُذِ ٱلْكِتَـٰبَ بِقُوَّةٍ ۖ وَءَاتَيْنَـٰهُ ٱلْحُكْمَ صَبِيًّا ﴿١٢﴾

وَحَنَانًا مِّن لَّدُنَّا وَزَكَوٰةً ۖ وَكَانَ تَقِيًّا ﴿١٣﴾

وَبَرًّۢا بِوَٰلِدَيْهِ وَلَمْ يَكُن جَبَّارًا عَصِيًّا ﴿١٤﴾

وَسَلَـٰمٌ عَلَيْهِ يَوْمَ وُلِدَ وَيَوْمَ يَمُوتُ وَيَوْمَ يُبْعَثُ حَيًّا ﴿١٥﴾

وَٱذْكُرْ فِى ٱلْكِتَـٰبِ مَرْيَمَ إِذِ ٱنتَبَذَتْ مِنْ أَهْلِهَا مَكَانًا شَرْقِيًّا ﴿١٦﴾

**11**. ఆ పిదప అతను ('జకరియ్యా) తన ప్రార్థనాలయం నుండి బయటికి వచ్చి తన జాతివారికి, సైగలతో ఉదయమూ మరియు సాయంత్రమూ, ఆయన (ప్రభువు) పవిత్రతను కొనియాడండని సూచించాడు.

**12**. (అతని కుమారునితో ఇలా అనబడింది): "ఓ య'హ్యా! ఈ దివ్య గ్రంథాన్ని గట్టిగా పట్టుకో." మరియు మేము అతనికి బాల్యంలోనే వివేకాన్ని[1] ప్రసాదించాము.

**13**. మరియు మా తరఫునుండి కనికరాన్ని, పరిశుద్ధతను ఒసంగాము మరియు అతను దైవభీతి గలవాడు.

**14**. మరియు తన తల్లిదండ్రుల పట్ల కర్తవ్యపాలకుడు. మరియు అతను హింసాపరుడు గానీ మరియు అవిధేయుడు గానీ కాడు.

**15**. మరియు అతను పుట్టినరోజూ మరియు అతను మరణించేరోజూ మరియు అతను బ్రతికించి మరల లేపబడేరోజూ అతనికి శాంతి కలుగు గాక![2]

**16**. మరియు ఈ గ్రంథం (ఖుర్ఆన్)లో ఉన్న మర్యమ్ (గాథను) ప్రస్తావించు. ఆమె తన కుటుంబంవారిని విడిచి తూర్పుదిశలో ఒక స్థలానికి వెళ్ళిపోయింది.

---

1. అల్-'హుక్మ్: అంటే జ్ఞానం, తెలివి, నిర్ణయసామర్థ్యం, గ్రంథాన్ని అర్థంచేసుకునే శక్తి, మొదలైనవన్నీ అని ఇమామ్ షౌకాని అభిప్రాయం.
2. ఎందుకంటే ఈ మూడు దినాలు మానవుని కొరకు ఎంతో కష్టదాయకమైనవి మరియు భయంకరమైనవి.

17. అక్కడ ఆమె వారి నుండి ఏకాంతంలో ఒక అడ్డుతెర కట్టుకొని ఉండసాగింది. అప్పుడు మేము ఆమె వద్దకు మా దూత(జి్బ్రీల్)ను పంపాము.[1] అతను ఆమె ముందు సంపూర్ణ మానవ ఆకారం (రూపం)లో ప్రత్యక్షమయ్యాడు.

فَٱتَّخَذَتۡ مِن دُونِهِمۡ حِجَابٗا فَأَرۡسَلۡنَآ إِلَيۡهَا رُوحَنَا فَتَمَثَّلَ لَهَا بَشَرٗا سَوِيّٗا ١٧

18. (మర్యమ్) ఇలా అన్నది: "ఒకవేళ నీవు దైవభీతి గలవాడవే అయితే! నిశ్చయంగా, నేను నీ నుండి (రక్షించబడటానికి) అనంత కరుణామయుని శరణు వేడుకుంటున్నాను."

قَالَتۡ إِنِّيٓ أَعُوذُ بِٱلرَّحۡمَٰنِ مِنكَ إِن كُنتَ تَقِيّٗا ١٨

19. (దేవదూత ఇలా) జవాబిచ్చాడు: "నిశ్చయంగా, నేను నీ ప్రభువు యొక్క సందేశహరుడను! నీకు ఒక సుశీలుడైన కుమారుని (సందేశాన్ని) ఇవ్వటానికి పంపబడ్డాను."

قَالَ إِنَّمَآ أَنَا۠ رَسُولُ رَبِّكِ لِأَهَبَ لَكِ غُلَٰمٗا زَكِيّٗا ١٩

20. ఆమె ఇలా ప్రశ్నించింది: "నాకు కుమారుడు ఎలా కలుగుతాడు? నన్ను ఏ మానవుడునూ ముట్టుకోలేదే! మరియు నేను చెడు నడవడిక గలదానిని కూడా కాను!"

قَالَتۡ أَنَّىٰ يَكُونُ لِي غُلَٰمٞ وَلَمۡ يَمۡسَسۡنِي بَشَرٞ وَلَمۡ أَكُ بَغِيّٗا ٢٠

---

1. రూ'హున్: దివ్యజ్ఞానం (వ'హీ)గా లేక దానిని తెచ్చే దేవదూత జి్బ్రీల్ ('అ.స.)గా ఉపయోగించబడింది. ఇక్కడ దేవదూత జి్బ్రీల్ ('అ.స.)గా ఉపయోగించబడింది.
రూ'హుల్ ఖుద్స్: అని, 2:87, 253, 5:110 మరియు 16:102లలో జి్బ్రీల్ ('అ.స.) కొరకు నాలుగు చోట్లలో వాడబడింది.
రూ'హుల్ అమీన్: అని 26:193లో జి్బ్రీల్ ('అ.స.) కొరకు వాడబడింది.
అర్-రూ'హు: అని ఇక్కడ, 78:38 మరియు 97:4లలో జి్బ్రీల్ ('అ.స.) కొరకు మూడు చోట్లలో వాడబడింది, అవతరణలో మొదటిసారిగా 97:4లో వచ్చింది.
అర్-రూ'హు: అంటే దివ్యజ్ఞానం అని, 16:2, 40:15 మరియు 42:52లలో మూడు చోట్లలో వాడబడింది.

21. అతను అన్నాడు: "అలాగే అవుతుంది! నీ ప్రభువు అంటున్నాడు: 'అది నాకు సులభం! మేము అతనిని, మా నుండి ప్రజలకు ఒక సూచనగా మరియు కారుణ్యంగా పంపుతున్నాము.' మరియు (నీ ప్రభువు) ఆజ్ఞ నెరవేరి తీరుతుంది." (1/4)

22. * తరువాత మర్యమ్ ఆ బాలుణ్ణి గర్భంలో భరించి, అతనితో ఒక దూరమైన స్థలానికి వెళ్ళిపోయింది.

23. తరువాత ప్రసవ వేదనతో ఆమె ఒక ఖర్జూరపుచెట్టు మొదలు దగ్గరికి చేరుకొని ఇలా వాపోయింది: "అయ్యో! నా దౌర్భాగ్యం, దీనికి ముందే నేను చనిపోయి వుంటే! మరియు నామరూపాలు లేకుండా నశించిపోతే ఎంత బాగుండేది!"

24. అప్పుడు క్రింది నుండి ఒక ధ్వని వినిపించింది: "నీవు దుఃఖించకు! వాస్తవంగా, నీ ప్రభువు, నీ క్రింద (దగ్గరగా) ఒక సెలయేరు సృష్టించాడు;

25. "మరియు నీవు ఈ చెట్టు మొదలు పట్టి ఊపితే నీపై తాజా ఖర్జూరపండ్లు రాలుతాయి.

26. "కావున నీవు తిను త్రాగు, నీ కళ్ళను చల్లబరచుకో! ఇక ఏ మానవుణ్ణి చూసినా అతనితో (సైగలతో): 'నేను నా కరుణామయుని కొరకు ఉపవాసమున్నాను, కావున ఈ రోజు నేను ఏ మానవునితో మాట్లాడను.' అని చెప్పు."

قَالَ كَذَٰلِكِ قَالَ رَبُّكِ هُوَ عَلَيَّ هَيِّنٌ ۖ وَلِنَجْعَلَهُۥٓ ءَايَةً لِّلنَّاسِ وَرَحْمَةً مِّنَّا ۚ وَكَانَ أَمْرًا مَّقْضِيًّا ﴿٢١﴾

۞ فَحَمَلَتْهُ فَٱنتَبَذَتْ بِهِۦ مَكَانًا قَصِيًّا ﴿٢٢﴾

فَأَجَآءَهَا ٱلْمَخَاضُ إِلَىٰ جِذْعِ ٱلنَّخْلَةِ قَالَتْ يَٰلَيْتَنِى مِتُّ قَبْلَ هَٰذَا وَكُنتُ نَسْيًا مَّنسِيًّا ﴿٢٣﴾

فَنَادَىٰهَا مِن تَحْتِهَآ أَلَّا تَحْزَنِى قَدْ جَعَلَ رَبُّكِ تَحْتَكِ سَرِيًّا ﴿٢٤﴾

وَهُزِّىٓ إِلَيْكِ بِجِذْعِ ٱلنَّخْلَةِ تُسَٰقِطْ عَلَيْكِ رُطَبًا جَنِيًّا ﴿٢٥﴾

فَكُلِى وَٱشْرَبِى وَقَرِّى عَيْنًا ۖ فَإِمَّا تَرَيِنَّ مِنَ ٱلْبَشَرِ أَحَدًا فَقُولِىٓ إِنِّى نَذَرْتُ لِلرَّحْمَٰنِ صَوْمًا فَلَنْ أُكَلِّمَ ٱلْيَوْمَ إِنسِيًّا ﴿٢٦﴾

27. తరువాత ఆమె ఆ బాలుణ్ణి తీసుకొని తన జాతివారి వద్దకు రాగా! వారన్నారు: "ఓ మర్యమ్! వాస్తవానికి నీవు నింద్య(పాప) మైన పని చేశావు!

28. "ఓ హారూన్ సోదరీ![1] నీ తండ్రీ చెడ్డవాడు కాదు మరియు నీ తల్లి కూడా చెడునడత గలది కాదే!"

29. అప్పుడామె అతని (ఆ బాలుని) వైపు సైగ చేసింది. వారన్నారు: "తొట్టెలో వున్న ఈ బాలునితో మేమెలా మాట్లాడగలము?"

30. (ఆ బాలుడు) అన్నాడు: "నిశ్చయంగా, నేను అల్లాహ్ దాసుణ్ణి. ఆయన నాకు దివ్యగ్రంథాన్నిచ్చి, నన్ను ప్రవక్తగా నియమించాడు.

31. "మరియు నేనెక్కడ ఉన్నా సరే ఆయన నన్ను శుభవంతునిగా చేశాడు, నేను బ్రతికి వున్నంత కాలం నమా'జ్ చేయమని మరియు విధిదానం ('జకాత్) ఇవ్వమని నన్ను ఆదేశించాడు.

32. "మరియు నన్ను నా తల్లి యెడల కర్తవ్యపాలకునిగా చేశాడు. నన్ను దౌర్జన్యపరునిగా, దౌర్భాగ్యునిగా చేయలేదు.

33. "మరియు నేను పుట్టిన రోజూ మరియు నేను మరణించే రోజూ మరియు నేను సజీవుడనై మరల లేచే రోజూ, నాకు శాంతి కలుగు గాక!"

فَأَتَتْ بِهِۦ قَوْمَهَا تَحْمِلُهُۥ ۖ قَالُوا۟
يَـٰمَرْيَمُ لَقَدْ جِئْتِ شَيْـًٔا فَرِيًّا ﴿٢٧﴾
يَـٰٓأُخْتَ هَـٰرُونَ مَا كَانَ أَبُوكِ ٱمْرَأَ
سَوْءٍ وَمَا كَانَتْ أُمُّكِ بَغِيًّا ﴿٢٨﴾
فَأَشَارَتْ إِلَيْهِ ۖ قَالُوا۟ كَيْفَ نُكَلِّمُ
مَن كَانَ فِى ٱلْمَهْدِ صَبِيًّا ﴿٢٩﴾
قَالَ إِنِّى عَبْدُ ٱللَّهِ ءَاتَىٰنِىَ ٱلْكِتَـٰبَ
وَجَعَلَنِى نَبِيًّا ﴿٣٠﴾
وَجَعَلَنِى مُبَارَكًا أَيْنَ مَا كُنتُ
وَأَوْصَـٰنِى بِٱلصَّلَوٰةِ وَٱلزَّكَوٰةِ مَا
دُمْتُ حَيًّا ﴿٣١﴾
وَبَرًّۢا بِوَٰلِدَتِى وَلَمْ يَجْعَلْنِى جَبَّارًا
شَقِيًّا ﴿٣٢﴾
وَٱلسَّلَـٰمُ عَلَىَّ يَوْمَ وُلِدتُّ وَيَوْمَ
أَمُوتُ وَيَوْمَ أُبْعَثُ حَيًّا ﴿٣٣﴾

---

1. హారూన్ సోదరీ! అంటే ఆమెకు హారూన్ అనే సవతి (అర్ధ) సోదరుడు ఉండవచ్చు, లేదా మూసా ('అ.స.) సోదరుడు హారూన్‌తో సంబంధం ఉన్నందున అలా పిలువబడి ఉండవచ్చు! తమ వంశంలోని పెద్దవాని పేరుతో పిలువబడటం ఆచారమే. (ఇబ్నె-కసీ'ర్ మరియు ఐసర్ అత్-తఫాసీర్). చూడండి, 3:37 వ్యాఖ్యానం 3.

ذَٰلِكَ عِيسَى ٱبۡنُ مَرۡيَمَۖ قَوۡلَ ٱلۡحَقِّ ٱلَّذِي فِيهِ يَمۡتَرُونَ ﴿٣٤﴾

34. ఇతనే మర్యమ్ కుమారుడు 'ఈసా! ఇదే సత్యమైన మాట, దీనిని గురించే వారు వాదులాడుతున్నారు (సందేహంలో పడిఉన్నారు).

مَا كَانَ لِلَّهِ أَن يَتَّخِذَ مِن وَلَدٍۖ سُبۡحَٰنَهُۥٓۚ إِذَا قَضَىٰٓ أَمۡرًا فَإِنَّمَا يَقُولُ لَهُۥ كُن فَيَكُونُ ﴿٣٥﴾

35. ఎవరినైనా కుమారునిగా చేసుకోవటం అల్లాహ్‌కు తగినపని కాదు. ఆయన సర్వలోపాలకు అతీతుడు, ఆయన ఏదైనా చేయదలుచుకుంటే, దానిని కేవలం: "అయిపో!" అని అంటాడు, అంతే అది అయిపోతుంది.[1]

وَإِنَّ ٱللَّهَ رَبِّي وَرَبُّكُمۡ فَٱعۡبُدُوهُۚ هَٰذَا صِرَٰطٞ مُّسۡتَقِيمٞ ﴿٣٦﴾

36. ('ఈసా అన్నాడు): "నిశ్చయంగా అల్లాహ్‌యే నా ప్రభువు మరియు మీ ప్రభువు, కావున మీరు ఆయననే ఆరాధించండి. ఇదే ఋజుమార్గము."

فَٱخۡتَلَفَ ٱلۡأَحۡزَابُ مِنۢ بَيۡنِهِمۡۖ فَوَيۡلٞ لِّلَّذِينَ كَفَرُواْ مِن مَّشۡهَدِ يَوۡمٍ عَظِيمٍ ﴿٣٧﴾

37. తరువాత విభిన్న (క్రైస్తవ) వర్గాల వారు (ఈసాను గురించి) పరస్పర అభిప్రాయ బేధాలు నెలకొల్పుకున్నారు. కావున ఈ సత్యతిరస్కారులకు ఆ మహాదినపు దర్శనం వినాశాత్మకంగా ఉంటుంది.[2]

أَسۡمِعۡ بِهِمۡ وَأَبۡصِرۡ يَوۡمَ يَأۡتُونَنَاۖ لَٰكِنِ ٱلظَّٰلِمُونَ ٱلۡيَوۡمَ فِي ضَلَٰلٖ مُّبِينٖ ﴿٣٨﴾

38. వారు మాముందు హాజరయ్యే రోజున వారి చెవులు బాగానే వింటాయి మరియు వారి కండ్లు కూడా బాగానే చూస్తాయి. కాని ఈ నాడు ఈ దుర్మార్గులు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడిఉన్నారు.[3]

---

1. అల్లాహుతా'ఆలా ప్రతిదీ చేయగల సమర్థుడు. తాను చేయదలచుకున్న దానిని: 'అయిపో!' అని అనగానే, అది అయిపోతుంది. అలాంటప్పుడు ఆయన (సు.తా.)కు సంతానపు ఆవశ్యకత ఎలా ఉంటుంది. అల్లాహుతా'ఆలాకు సంతానముందని భావించేవారు ఆయన (సు.తా.) శక్తి సామర్థ్యాలను విశ్వసించనట్లే! అది సత్యతిరస్కారం.
2. యూదులు 'ఈసా ('అ.స.)ను మాంత్రికుడు, యూసుఫ్ నజ్జార్ కుమారుడు అన్నారు. ప్రొటెస్టెంట్ క్రైస్తవులు అతనిని అల్లాహ్ (సు.తా.) కుమారుడు అన్నారు. కేథోలిక్ తెగవారు అతను ముగ్గురు దైవాలలో, అంటే అల్లాహ్ (సు.తా.), జిబ్రీల్ ('అ.స.) మరియు 'ఈసా ('అ.స.) ముగ్గురిలో మూడవవారు అన్నారు. ఆర్థోడాక్స్ తెగవారు అతనిని స్వయం దేవుడు (God అల్లాహ్) అన్నారు. (ఫత్హ్ అల్-ఖదీర్ మరియు అయ్‌సర్ అత్-తఫాసీర్).
3. కాని వారి వినడం మరియు చూడడం పునరుత్థాన దినమున వారికి ఏమీ పనికిరావు.

39. మరియు వారిని (రాబోయే) ఆ పశ్చాత్తాపపడవలసిన దినాన్ని[1] గురించి హెచ్చరించు. అప్పుడు పరిణామం నిర్ణయించబడి ఉంటుంది.[2] (ఇప్పుడైతే) వారు ఏమరుపాటులో పడిఉన్నారు, కావున వారు విశ్వసించడం లేదు.

وَأَنذِرْهُمْ يَوْمَ ٱلْحَسْرَةِ إِذْ قُضِىَ ٱلْأَمْرُ وَهُمْ فِى غَفْلَةٍ وَهُمْ لَا يُؤْمِنُونَ ﴿٣٩﴾

40. నిశ్చయంగా! భూమికి మరియు దానిపై వున్న వారికి వారసులం మేమే! వారందరూ మా వైపునకే మరలింప బడతారు.

إِنَّا نَحْنُ نَرِثُ ٱلْأَرْضَ وَمَنْ عَلَيْهَا وَإِلَيْنَا يُرْجَعُونَ ﴿٤٠﴾

41. మరియు ఈ గ్రంథం(ఖుర్ఆన్)లో వున్న ఇబ్రాహీమ్ గాథను ప్రస్తావించు. నిశ్చయంగా అతను సత్యవంతుడైన దైవప్రవక్త.

وَٱذْكُرْ فِى ٱلْكِتَٰبِ إِبْرَٰهِيمَ ۚ إِنَّهُۥ كَانَ صِدِّيقًا نَّبِيًّا ﴿٤١﴾

42. అతను తన తండ్రితో ఇలా అన్నప్పుడు: "ఓ నాన్నా! వినలేని మరియు చూడలేని మరియు నీకు ఏ విధంగానూ సహాయపడలేని వాటిని, నీ వెందుకు ఆరాధిస్తున్నావు?

إِذْ قَالَ لِأَبِيهِ يَٰٓأَبَتِ لِمَ تَعْبُدُ مَا لَا يَسْمَعُ وَلَا يُبْصِرُ وَلَا يُغْنِى عَنكَ شَيْـًٔا ﴿٤٢﴾

43. "ఓ నాన్నా! వాస్తవానికి, నా వద్దకు వచ్చిన జ్ఞానం నీ వద్దకు రాలేదు, కావున నీవు నన్ను అనుసరిస్తే, నేను నీకు సరైనమార్గం చూపుతాను.

يَٰٓأَبَتِ إِنِّى قَدْ جَآءَنِى مِنَ ٱلْعِلْمِ مَا لَمْ يَأْتِكَ فَٱتَّبِعْنِىٓ أَهْدِكَ صِرَٰطًا سَوِيًّا ﴿٤٣﴾

---

1. యౌమల్-'హస్‌రతి: పశ్చాత్తాపపడే దినం అంటే పునరుత్థానదినము.
2. పునరుత్థానదినమున స్వర్గానికి అర్హులైనవారిని స్వర్గానికి మరియు నరకానికి అర్హులైన వారిని నరకానికి పంపిన తరువాత మరణం ఒక గొర్రె ఆకారంలో తేబడుతుంది. దానిని స్వర్గనరకాల మధ్య నిలబెట్టబడి, స్వర్గ-నరక వాసులతో: 'దీనిని ఎరుగుదురా?' అని ప్రశ్నించగా వారు: 'అవును, ఇది మరణం.' అని అంటారు. వారి సమక్షంలో అది వధింపబడుతుంది. అప్పుడు స్వర్గవాసులతో ఇలా అనబడుతుంది: 'స్వర్గవాసులారా! మీ కొరకు స్వర్గజీవితం కలకాలం ఉంటుంది.' మరియు నరకవాసులతో అనబడుతుంది: 'మీకు ఈ నరకశిక్ష ఎల్లప్పుడూ ఉంటుంది.' మరియు మీ కెవ్వరికీ ఇక చావురాదు. ('స'హీ'హ్ బు'ఖారీ).

يَٰٓأَبَتِ لَا تَعۡبُدِ ٱلشَّيۡطَٰنَۖ إِنَّ ٱلشَّيۡطَٰنَ كَانَ لِلرَّحۡمَٰنِ عَصِيّٗا ﴿٤٤﴾

**44.** "ఓ నాన్నా! నీవు షై'తాన్‌ను ఆరాధించకు, నిశ్చయంగా షై'తాన్ అనంత కరుణామయుణ్ణి ఉల్లంఘించాడు.

يَٰٓأَبَتِ إِنِّيٓ أَخَافُ أَن يَمَسَّكَ عَذَابٞ مِّنَ ٱلرَّحۡمَٰنِ فَتَكُونَ لِلشَّيۡطَٰنِ وَلِيّٗا ﴿٤٥﴾

**45.** "ఓ నాన్నా! నిశ్చయంగా, నీవు అనంత కరుణామయుని శిక్షకు గురిఅయ్యి, షై'తాను యొక్క స్నేహితుడవు (వలి) అయిపోతావేమోనని నేను భయపడు తున్నాను!"

قَالَ أَرَاغِبٌ أَنتَ عَنۡ ءَالِهَتِي يَٰٓإِبۡرَٰهِيمُۖ لَئِن لَّمۡ تَنتَهِ لَأَرۡجُمَنَّكَۖ وَٱهۡجُرۡنِي مَلِيّٗا ﴿٤٦﴾

**46.** (అతని తండ్రి) అన్నాడు: "ఓ ఇబ్రాహీమ్! ఏమీ? నీవు నా దేవుళ్ళకు విముఖత చూపుతున్నావా? ఒకవేళ నీవిది మానుకోకపోతే నేను నిన్ను రాళ్ళురువ్వి చంపివేస్తాను. కావున నీవు నానుండి చాలా దూరమైపో!"

قَالَ سَلَٰمٌ عَلَيۡكَۖ سَأَسۡتَغۡفِرُ لَكَ رَبِّيٓۖ إِنَّهُۥ كَانَ بِي حَفِيّٗا ﴿٤٧﴾

**47.** (ఇబ్రాహీమ్) అన్నాడు: "నీకు సలాం![1] నీ కొరకు నా ప్రభువు క్షమాపణను వేడుకుంటాను.[2] నిశ్చయంగా, ఆయన నా యెడల ఎంతో దయాళువు.

وَأَعۡتَزِلُكُمۡ وَمَا تَدۡعُونَ مِن دُونِ ٱللَّهِ وَأَدۡعُواْ رَبِّي عَسَىٰٓ أَلَّآ أَكُونَ بِدُعَآءِ رَبِّي شَقِيّٗا ﴿٤٨﴾

**48.** "మరియు నేను మిమ్మల్ని - మరియు అల్లాహ్‌కు బదులుగా మీరు ప్రార్థిస్తున్న వాటిని - అందరినీ వదలి పోతున్నాను. మరియు నేను నా ప్రభువును ప్రార్థిస్తాను. నేను నా ప్రభువును ప్రార్థించి విఫలుడను కానని, నమ్ముతున్నాను!"

---

**1**. ఈ సలాం ఇక నా సంభాషణ ముగిస్తాను, అనే భావంలో ఉంది. ఎందుకంటే దీని ముందు 'అల్' లేదు. ఇంకా ఇటువంటి సందర్భానికి చూడండి, 25:63.

**2**. ఈ దు'ఆ - ముష్రిక్‌ల కొరకు క్షమాపణ వేడుకోరాదని తెలియక - అల్లాహ్ (సు.తా.)ను, తన తండ్రిని క్షమించమని వేడుకున్నది. కాని ముష్రిక్ కొరకు క్షమాపణ వేడుకోరాదని, తెలిసిన తరువాత, అతని తండ్రి అల్లాహ్ (సు.తా.)కు విరోధుడని స్పష్టమైనప్పుడు, అతను ('అ.స.) తన తండ్రి నుండి దూరమయ్యాడు. అంటే అతని క్షమాపణ కొరకు ప్రార్థించడం మానుకున్నాడు. చూడండి, 9:114.

فَلَمَّا ٱعْتَزَلَهُمْ وَمَا يَعْبُدُونَ مِن دُونِ ٱللَّهِ وَهَبْنَا لَهُۥٓ إِسْحَٰقَ وَيَعْقُوبَ ۖ وَكُلًّا جَعَلْنَا نَبِيًّا ﴿٤٩﴾ وَوَهَبْنَا لَهُم مِّن رَّحْمَتِنَا وَجَعَلْنَا لَهُمْ لِسَانَ صِدْقٍ عَلِيًّا ﴿٥٠﴾ وَٱذْكُرْ فِى ٱلْكِتَٰبِ مُوسَىٰٓ ۚ إِنَّهُۥ كَانَ مُخْلَصًا وَكَانَ رَسُولًا نَّبِيًّا ﴿٥١﴾ وَنَٰدَيْنَٰهُ مِن جَانِبِ ٱلطُّورِ ٱلْأَيْمَنِ وَقَرَّبْنَٰهُ نَجِيًّا ﴿٥٢﴾ وَوَهَبْنَا لَهُۥ مِن رَّحْمَتِنَآ أَخَاهُ هَٰرُونَ نَبِيًّا ﴿٥٣﴾ وَٱذْكُرْ فِى ٱلْكِتَٰبِ إِسْمَٰعِيلَ ۚ إِنَّهُۥ كَانَ صَادِقَ ٱلْوَعْدِ وَكَانَ رَسُولًا نَّبِيًّا ﴿٥٤﴾

**49**. అతను (ఇబ్రాహీమ్) వారిని - మరియు అల్లాహ్‌ను వదలి వారు ఆరాధించే వాటిని - వదలిపోయిన తరువాత మేము అతనికి ఇస్'హాఖ్‌ను మరియు య'అఖూబ్‌ను ప్రసాదించాము. మరియు ప్రతి ఒక్కరినీ ప్రవక్తలుగా చేశాము.

**50**. మరియు వారికి మా కారుణ్యాన్ని ప్రసాదించాము. వారికి నిజమైన, ఉన్నతమైన కీర్తిప్రతిష్ఠలను కలుగజేశాము.

**51**. మరియు ఈ గ్రంథం(ఖుర్ఆన్)లో వచ్చిన మూసా గాథను ప్రస్తావించు. నిశ్చయంగా, అతను (అల్లాహ్) ఎన్నుకున్న ఒక సందేశహరుడు మరియు ఒక ప్రవక్త.[1]

**52**. మరియు మేము 'తూర్‌కొండ కుడివైపు నుండి అతనిని (మూసాను) పిలిచి,[2] అతనితో ఏకాంతంలో మాట్లాడటానికి మమ్మల్ని సమీపింపజేశాము.

**53**. మరియు మా కారుణ్యంతో, అతనికి తోడుగా అతని సోదరుడైన, హారూన్‌ను కూడా ప్రవక్తగా నియమించాము.

**54**. మరియు ఈ గ్రంథం(ఖుర్ఆన్)లో వచ్చిన ఇస్మా'యీల్ గాథను ప్రస్తావించు. నిశ్చయంగా, అతను వాగ్దానాలను సత్యం చేసే (నెరవేర్చే) వాడు మరియు ఒక సందేశహరుడు మరియు ఒక ప్రవక్త.

---

**1**. చూడండి, 22:52. రసూలున్: సందేశహరుడు - అంటే అల్లాహ్ (సు.తా.) తన సందేశం అవతరింపజేయటానికి ఎన్నుకున్న ప్రవక్త. సందేశహరునిపై దివ్యగ్రంథం అవతరింపజేయబడుతుంది, ఉదా. మూసా ('అ.స.). నబియ్యున్: ప్రవక్త - అంటే దివ్యగ్రంథ మివ్వబడక అతనికంటే ముందు వచ్చిఉన్న దివ్యగ్రంథపు సందేశాన్నే ప్రజలకు బోధించేవాడు. ఉదా. హారూన్ ('అ.స.) చూడండి, 19:53. సందేశహరులందరూ ప్రవక్తలే కాని ప్రవక్తలందరూ సందేశహరులు కారు.

**2**. వివరాల కొరకు చూడండి, 20:9 మరియు దాని తరువాత ఉన్న ఆయతులు.

وَكَانَ يَأْمُرُ أَهْلَهُۥ بِٱلصَّلَوٰةِ وَٱلزَّكَوٰةِ وَكَانَ عِندَ رَبِّهِۦ مَرْضِيًّا ﴿٥٥﴾

55. మరియు అతను తన కుటుంబం వారిని నమాజ్ మరియు విధిదానాన్ని (జకాత్‌ను) పాటించమని ఆజ్ఞాపించేవాడు మరియు తన ప్రభువుకు ప్రీతిపాత్రుడుగా ఉండేవాడు.

وَٱذْكُرْ فِى ٱلْكِتَـٰبِ إِدْرِيسَ ۚ إِنَّهُۥ كَانَ صِدِّيقًا نَّبِيًّا ﴿٥٦﴾

56. మరియు ఈ గ్రంథం(ఖుర్ఆన్)లో వచ్చిన ఇద్రీస్ గాథను ప్రస్తావించు. నిశ్చయంగా, అతను సత్యవంతుడైన ప్రవక్త.

وَرَفَعْنَـٰهُ مَكَانًا عَلِيًّا ﴿٥٧﴾

57. మరియు మేము అతనిని ఉన్నత స్థానానికి ఎత్తాము.[1]

أُو۟لَـٰٓئِكَ ٱلَّذِينَ أَنْعَمَ ٱللَّهُ عَلَيْهِم مِّنَ ٱلنَّبِيِّـۧنَ مِن ذُرِّيَّةِ ءَادَمَ وَمِمَّنْ حَمَلْنَا مَعَ نُوحٍ وَمِن ذُرِّيَّةِ إِبْرَٰهِيمَ وَإِسْرَٰٓءِيلَ وَمِمَّنْ هَدَيْنَا وَٱجْتَبَيْنَآ ۚ إِذَا تُتْلَىٰ عَلَيْهِمْ ءَايَـٰتُ ٱلرَّحْمَـٰنِ خَرُّوا۟ سُجَّدًا وَبُكِيًّا ۩ ﴿٥٨﴾

58. వారందరూ, అల్లాహ్ అనుగ్రహించిన ఆదమ్ సంతతి వారిలోని దైవప్రవక్తలలో కొందరు. మరియు వారిలో కొందరు మేము నూ'హ్ ఓడలో ఎక్కింపజేసిన వారు మరికొందరు ఇబ్రాహీమ్ మరియు ఇస్రాయీ'ల్ (య'అఖూబ్) సంతానానికి చెందిన వారున్నారు. మరియు వారిలో మేము ఎన్నుకొని సన్మార్గం చూపిన వారున్నారు. ఒకవేళ వారికి కరుణామయుని సూచన (ఆయత్)లు చదివి వినిపించినప్పుడు, వారు విలపిస్తూ సాష్టాంగం (సజ్దా)లో పడిపోయేవారు. ۩ (3/8)

1. ఇద్రీస్ ('అ.స.) ఆదమ్ ('అ.స.) తరువాత వచ్చిన మొదటి ప్రవక్త. ఇతను నూ'హ్ ('అ.స.) లేక అతని తండ్రి యొక్క తాత. ఇస్రాయీ'లీ గాథలలో అతను ఆకాశంలోకి లేపుకోబడ్డారు, అని ఉంది. కాని ఖుర్ఆన్ మరియు 'స'హీ'హ్ 'హదీస్'లు ఈ విషయాన్ని ధృవపరచలేదు. వాస్తవం అల్లాహ్(సు.తా.)కే తెలుసు. ఇంకా చూడండి, 21:85. ఇతను బైబిల్‌లో E'nochగా పేర్కొనబడ్డారు. చూడండి, ఆదికాండము - (Genesis), 5:18-19 మరియు 21-24.

۞ فَخَلَفَ مِنۢ بَعۡدِهِمۡ خَلۡفٌ أَضَاعُواْ ٱلصَّلَوٰةَ وَٱتَّبَعُواْ ٱلشَّهَوَٰتِۖ فَسَوۡفَ يَلۡقَوۡنَ غَيًّا ٥٩

59. * కాని వారి తరువాత వచ్చిన, వారి సంతతి వారు కొందరు, నమాజ్‌లను విడిచి పెట్టి, తమ (దుష్ట) మనోవాంఛలను అనుసరించారు. కావున త్వరలోనే వారు అధోగతి(నరకంలో)కి చేరగలరు.

إِلَّا مَن تَابَ وَءَامَنَ وَعَمِلَ صَٰلِحًا فَأُوْلَٰٓئِكَ يَدۡخُلُونَ ٱلۡجَنَّةَ وَلَا يُظۡلَمُونَ شَيۡـٔٗا ٦٠

60. కాని ఎవరైతే, పశ్చాత్తాపపడి మరియు విశ్వసించి సత్కార్యాలు చేస్తారో, అలాంటివారు స్వర్గంలో ప్రవేశిస్తారు - మరియు వారికెలాంటి అన్యాయం జరుగదు.

جَنَّٰتِ عَدۡنٍ ٱلَّتِي وَعَدَ ٱلرَّحۡمَٰنُ عِبَادَهُۥ بِٱلۡغَيۡبِۚ إِنَّهُۥ كَانَ وَعۡدُهُۥ مَأۡتِيّٗا ٦١

61. అనంత కరుణామయుడు, తన దాసులకు వాగ్దానం చేసిన, అగోచర జగత్తులోని శాశ్వతమైన స్వర్గవనాలు. నిశ్చయంగా, ఆయన వాగ్దానం పూర్తిఅయి తీరుతుంది.

لَّا يَسۡمَعُونَ فِيهَا لَغۡوًا إِلَّا سَلَٰمٗاۖ وَلَهُمۡ رِزۡقُهُمۡ فِيهَا بُكۡرَةٗ وَعَشِيّٗا ٦٢

62. వారందులో మీకు శాంతి కలుగు గాక (సలాం)! అనడం తప్ప ఇతర ఏ విధమైన వ్యర్థపు మాటలు వినరు. మరియు అందులో వారికి ఉదయం మరియు సాయంత్రం జీవనోపాధి లభిస్తూ ఉంటుంది.

تِلۡكَ ٱلۡجَنَّةُ ٱلَّتِي نُورِثُ مِنۡ عِبَادِنَا مَن كَانَ تَقِيّٗا ٦٣

63. మా దాసులలో దైవభీతి గలవారిని వారసులుగా చేసే స్వర్గం ఇదే!

وَمَا نَتَنَزَّلُ إِلَّا بِأَمۡرِ رَبِّكَۖ لَهُۥ مَا بَيۡنَ أَيۡدِينَا وَمَا خَلۡفَنَا وَمَا بَيۡنَ ذَٰلِكَۚ وَمَا كَانَ رَبُّكَ نَسِيّٗا ٦٤

64. (దేవదూతలు అంటారు): "మరియు మేము కేవలం నీ ప్రభువు ఆజ్ఞతో తప్ప క్రిందికి దిగిరాము. మా ముందున్నది, మా వెనుకనున్నది మరియు వాటి మధ్య నున్నదీ, సర్వం ఆయనకు చెందినదే![1] నీ ప్రభువు మరచి పోయేవాడు కాడు.

1. ఇటువంటి వాక్యం కొరకు చూడండి, 2:255.

رَّبُّ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَمَا بَيۡنَهُمَا فَٱعۡبُدۡهُ وَٱصۡطَبِرۡ لِعِبَٰدَتِهِۦۚ هَلۡ تَعۡلَمُ لَهُۥ سَمِيّٗا ٦٥

**65**. "ఆకాశాలకూ, భూమికీ మరియు వాటి మధ్యనున్న సమస్తానికీ ఆయనే ప్రభువు, కావున మీరు ఆయననే ఆరాధించండి మరియు ఆయన ఆరాధనలోనే స్థిరంగా వుండండి. ఆయనతో సమానమైన స్థాయిగల వానిని ఎవడినైనా మీరెరుగుదురా?"

وَيَقُولُ ٱلۡإِنسَٰنُ أَءِذَا مَا مِتُّ لَسَوۡفَ أُخۡرَجُ حَيًّا ٦٦

**66**. మరియు మానవుడు[1] ఇలా అంటూ ఉంటాడు: "ఏమీ? నేను చనిపోయిన తరువాత మళ్ళీ బ్రతికించబడి లేపబడతానా?"

أَوَلَا يَذۡكُرُ ٱلۡإِنسَٰنُ أَنَّا خَلَقۡنَٰهُ مِن قَبۡلُ وَلَمۡ يَكُ شَيۡـٔٗا ٦٧

**67**. ఏమీ? మునుపు, అతడి ఉనికే లేనప్పుడు, మేము అతనిని సృష్టించిన విషయం అతనికి జ్ఞాపకం రావటం లేదా?

فَوَرَبِّكَ لَنَحۡشُرَنَّهُمۡ وَٱلشَّيَٰطِينَ ثُمَّ لَنُحۡضِرَنَّهُمۡ حَوۡلَ جَهَنَّمَ جِثِيّٗا ٦٨

**68**. కావున నీ ప్రభువు సాక్షిగా! నిశ్చయంగా మేము వారందరినీ మరియు (వారితో పాటు) షైతానులను కూడా ప్రోగుచేసి, ఆ తరువాత నిశ్చయంగా, వారందరినీ నరకం చుట్టు మోకాళ్ళ మీద సమావేశపరుస్తాము.

ثُمَّ لَنَنزِعَنَّ مِن كُلِّ شِيعَةٍ أَيُّهُمۡ أَشَدُّ عَلَى ٱلرَّحۡمَٰنِ عِتِيّٗا ٦٩

**69**. ఆ తరువాత నిశ్చయంగా, ప్రతి తెగ వారిలోనుండి అనంత కరుణామయునికి ఎవరు ఎక్కువ అవిధేయులుగా ఉండేవారో, వారిని వేరు చేస్తాము.[2]

ثُمَّ لَنَحۡنُ أَعۡلَمُ بِٱلَّذِينَ هُمۡ أَوۡلَىٰ بِهَا صِلِيّٗا ٧٠

**70**. అప్పుడు వారిలో (నరకాగ్నిలో) కాలటానికి ఎక్కువ అర్హులెవరో, మాకు బాగా తెలుసు.

---

**1**. ఇక్కడ మానవుడు అంటే సత్యతిరస్కారుడు, చనిపోయిన తరువాత పునరుత్థానాన్ని మరియు పరలోక ప్రతిఫలాన్ని నమ్మని వాడు.

**2** . అంటే సత్యతిరస్కారుల నాయకులు, ఎవరైతే దురహంకారంతో సత్యాన్ని తిరస్కరించేవారో వారికి అధిక శిక్ష విధించబడుతుంది.

وَإِن مِّنكُمۡ إِلَّا وَارِدُهَاۚ كَانَ عَلَىٰ رَبِّكَ حَتۡمٗا مَّقۡضِيّٗا ۝٧١ ثُمَّ نُنَجِّي ٱلَّذِينَ ٱتَّقَواْ وَّنَذَرُ ٱلظَّٰلِمِينَ فِيهَا جِثِيّٗا ۝٧٢ وَإِذَا تُتۡلَىٰ عَلَيۡهِمۡ ءَايَٰتُنَا بَيِّنَٰتٖ قَالَ ٱلَّذِينَ كَفَرُواْ لِلَّذِينَ ءَامَنُوٓاْ أَيُّ ٱلۡفَرِيقَيۡنِ خَيۡرٞ مَّقَامٗا وَأَحۡسَنُ نَدِيّٗا ۝٧٣ وَكَمۡ أَهۡلَكۡنَا قَبۡلَهُم مِّن قَرۡنٍ هُمۡ أَحۡسَنُ أَثَٰثٗا وَرِءۡيٗا ۝٧٤

**71**. మరియు మీలో ఎవ్వడునూ దాని (నరకంపై గల వంతెన) మీద నుండి పోకుండా ఉండలేడు. ఇది తప్పించుకోలేని, నీ ప్రభువు యొక్క నిర్ణయం.[1]

**72**. ఆ పిదప మేము దైవభీతి గలవారిని రక్షిస్తాము. మరియు దుర్మార్గులను అందులో మోకాళ్ళ మీద పడి ఉండటానికి వదులుతాము.

**73**. మరియు స్పష్టమైన మా సూచనలను వారికి చదివి వినిపించినపుడు, సత్య తిరస్కారులు విశ్వాసులతో అంటారు: "మన రెండు వర్గాల వారిలో ఎవరి వర్గం మంచి స్థితిలో ఉంది మరియు ఎవరి సభ ఉత్తమమైనది?"[2]

**74**. మరియు వారికి ముందు మేము ఎన్నో తరాలను (వంశాలను) నాశనం చేశాము; వారు వీరి కంటే ఎక్కువ సిరిసంపదలు మరియు బాహ్య ఆడంబరాలు గలవారై ఉండిరి!

---

**1**. 'స'హీ'హ్ 'హదీస్'లో ఈ ఆయత్ వివరాలు ఈ విధంగా వచ్చాయి: నరకం మీద ఒక వంతెన ఉంది. ప్రతిఒక్కనికి దానిపై నుండి దాటవలసి ఉంటుంది. విశ్వాసులు తమతమ సత్కార్యాలను బట్టి త్వరత్వరగా లేక నెమ్మదిగా దానిపై నుండి దాటిపోతారు. కొందరు ఏ హాని కలుగకుండా దాటుతారు. మరికొందరు గాయాలు తగిలి చివరకు దానిని దాటుకుంటారు. మరికొందరు నరకంలో పడిపోతారు. కాని తరువాత సిఫారసు వల్ల దాని నుండి బయటపడి స్వర్గం చేరుకుంటారు. కాని సత్యతిరస్కారులు ఆ వంతెనను దాటలేరు. వారు నరకాగ్నిలో పడిపోతారు. మరొక హదీసు ఇలా ఉంది. ఏ విశ్వాసుల ముగ్గురు పిల్లలు యౌవ్వనానికి చేరకముందే మరణిస్తారో వారిని నరకాగ్ని కేవలం వారి ప్రమాణాలను పూర్తిచేయటానికే తాకుతుంది. ('స'హీ'హ్ బు'ఖారీ) చూడండి, ఇబ్నె-కసీ'ర్.

**2**. సత్యతిరస్కారులైన ఖురైషులు - పేద ముస్లింలు అయిన 'అమ్మార్, బిలాల్, 'సుహైబ్ (ర'ది.'అ.)లను మరియు వారి సమావేశ స్థలాలైన దారుష్షూరా' మరియు దారుల్-అ'ర్ఖమ్‌లను - అబూ-జహల్, న'దర్ బిన్ 'హారిస్, 'ఉత్బా, షైబా, వంటి ధనవంతుల మరియు వారి పెద్ద పెద్ద భవనాల మరియు వారు సమావేశాలు చేసే దారున్నద్వాలతో పోల్చి తమ భౌతిక ఉన్నతస్థాయికి గర్వించే వారు మరియు పునరుత్థానాన్ని తిరస్కరించే వారు. మనం జీవించేది ఈ భూలోక జీవితం మాత్రమేనని వాదులాడే వారు. కాని వారికి ముందున్నవారు, వారికంటే ఎక్కువ సిరిసంపదలున్నా నాశనంచేయబడ్డారనే విషయాన్ని మరచిపోయే వారు. చూడండి, 19:74.

قُلْ مَن كَانَ فِي ٱلضَّلَـٰلَةِ فَلْيَمْدُدْ لَهُ ٱلرَّحْمَـٰنُ مَدًّا ۚ حَتَّىٰٓ إِذَا رَأَوْا۟ مَا يُوعَدُونَ إِمَّا ٱلْعَذَابَ وَإِمَّا ٱلسَّاعَةَ فَسَيَعْلَمُونَ مَنْ هُوَ شَرٌّ مَّكَانًا وَأَضْعَفُ جُندًا ٧٥

**75**. వారితో అను: ''మార్గభ్రష్టత్వంలో పడివున్న వానికి, అనంత కరుణామయుడు ఒక సమయం వరకు వ్యవధినిస్తూ ఉంటాడు. తుదకు వారు తమకు వాగ్దానం చేయబడిన దానిని చూసినపుడు, అది (కఠినమైన) శిక్షనో కావచ్చు లేదా అంతిమ గడియనో కావచ్చు! హీనస్థితిలో ఉన్న వాడెవడో మరియు బలహీన వర్గం (సేన) ఎవరిదో వారికి తెలియగలదు!

وَيَزِيدُ ٱللَّهُ ٱلَّذِينَ ٱهْتَدَوْا۟ هُدًى ۗ وَٱلْبَـٰقِيَـٰتُ ٱلصَّـٰلِحَـٰتُ خَيْرٌ عِندَ رَبِّكَ ثَوَابًا وَخَيْرٌ مَّرَدًّا ٧٦

**76**. ''మరియు (దానికి ప్రతిగా) మార్గదర్శకత్వం పొందిన వారికి, అల్లాహ్ మార్గదర్శకత్వంలో వృద్ధిని ప్రసాదిస్తాడు. చిరస్థాయిగా ఉండిపోయే సత్కార్యాలే, నీ ప్రభువు దగ్గర ప్రతిఫలం రీత్యా ఉత్తమమైనవి మరియు పర్యవసానం దృష్ట్యా కూడా ఉత్తమమైనవి.''[1]

أَفَرَءَيْتَ ٱلَّذِى كَفَرَ بِـَٔايَـٰتِنَا وَقَالَ لَأُوتَيَنَّ مَالًا وَوَلَدًا ٧٧

**77**. ఏమీ? మా సూచనలను తిరస్కరించి: ''నిశ్చయంగా, నాకు ధనసంపదలూ మరియు సంతానం ఇవ్వబడుతూనే ఉంటాయి.'' అని పలికే వానిని నీవు చూశావా?

أَطَّلَعَ ٱلْغَيْبَ أَمِ ٱتَّخَذَ عِندَ ٱلرَّحْمَـٰنِ عَهْدًا ٧٨

**78**. ఏమీ? అతడు అగోచరాన్ని చూశాడా? లేదా అనంత కరుణామయుని వాగ్దానం పొందాడా?

كَلَّا ۚ سَنَكْتُبُ مَا يَقُولُ وَنَمُدُّ لَهُۥ مِنَ ٱلْعَذَابِ مَدًّا ٧٩

**79**. అలాకాదు! అతడు చెప్పేది, మేము వ్రాసి పెట్టగలము. మరియు అతడి శిక్షను మరింత పెంచగలము.

وَنَرِثُهُۥ مَا يَقُولُ وَيَأْتِينَا فَرْدًا ٨٠

**80**. మరియు అతడు చెప్పే వస్తువులకు మేమే వారసులమవుతాము మరియు అతడు ఒంటరిగానే మా వద్దకు వస్తాడు.

---

1. చూడండి, 18:46.

وَٱتَّخَذُواْ مِن دُونِ ٱللَّهِ ءَالِهَةً لِّيَكُونُواْ لَهُمْ عِزًّا ٨١

**81**. మరియు వారు అల్లాహ్‌ను వదిలి ఇతరులను ఆరాధ్య దైవాలుగా చేసుకున్నారు, వారు వీరికి అండగా ఉంటారనుకొని!

كَلَّا ۚ سَيَكْفُرُونَ بِعِبَادَتِهِمْ وَيَكُونُونَ عَلَيْهِمْ ضِدًّا ٨٢

**82**. అలాకాదు! వారు (ఆ దైవాలు) వీరి ఆరాధనను నిరాకరించటమే గాక, వీరికి విరోధులుగా ఉంటారు.

أَلَمْ تَرَ أَنَّآ أَرْسَلْنَا ٱلشَّيَٰطِينَ عَلَى ٱلْكَٰفِرِينَ تَؤُزُّهُمْ أَزًّا ٨٣

**83**. ఏమీ? నీకు తెలియదా? నిశ్చయంగా, మేము సత్యతిరస్కారులపై షైతానులను వదిలామని? అవి వారిని (సత్యాన్ని తిరస్కరించమని) అత్యధికంగా ప్రేరేపిస్తూ ఉంటాయని?[1]

فَلَا تَعْجَلْ عَلَيْهِمْ ۖ إِنَّمَا نَعُدُّ لَهُمْ عَدًّا ٨٤

**84**. కావున వారి మీద (శిక్షను) అవతరింపజేయమని నీవు తొందరపెట్టకు. నిశ్చయంగా, మేము (వారి దినాలను) ఖచ్చితంగా లెక్కపెడుతున్నాము.

يَوْمَ نَحْشُرُ ٱلْمُتَّقِينَ إِلَى ٱلرَّحْمَٰنِ وَفْدًا ٨٥

**85**. ఆ రోజు మేము దైవభీతి గలవారిని అనంత కరుణామయుని సన్నిధిలో అతిథులుగా ప్రవేశపెడతాము.

وَنَسُوقُ ٱلْمُجْرِمِينَ إِلَىٰ جَهَنَّمَ وِرْدًا ٨٦

**86**. మరియు అపరాధులను దప్పిక గొన్న వాటివలే (జంతువులవలే) నరకం వైపునకు తోలుకొనిపోతాము.

لَّا يَمْلِكُونَ ٱلشَّفَٰعَةَ إِلَّا مَنِ ٱتَّخَذَ عِندَ ٱلرَّحْمَٰنِ عَهْدًا ٨٧

**87**. (ఆనాడు) అనంత కరుణామయుని అనుమతి పొందినవాడు తప్ప మరెవ్వరికీ సిఫారసుచేసే అధికారం ఉండదు.[2]

---

**1**. షైతాన్ చివరకు ఎలాంటి బాధ్యత వహించడు. దానికి చూడండి, 14:22.
**2**. సిఫారసు చేసే అనుమతి అల్లాహుతా'లా తాను కోరిన వారికే ఇస్తాడు. చూడండి, 10:3, 21:28, 53:26.

88. వారిలా అంటున్నారు: "అనంత కరుణామయునికి కొడుకున్నాడు."[1]

وَقَالُواْ ٱتَّخَذَ ٱلرَّحۡمَٰنُ وَلَدٗا ٨٨

89. వాస్తవానికి, మీరు ఎంత పాపిష్ఠి విషయాన్ని కల్పించారు.

لَّقَدۡ جِئۡتُمۡ شَيۡـًٔا إِدّٗا ٨٩

90. దాని వలన ఆకాశాలు ప్రేలి పోవచ్చు! భూమి చీలిపోవచ్చు! మరియు పర్వతాలు ధ్వంసమై పోవచ్చు!

تَكَادُ ٱلسَّمَٰوَٰتُ يَتَفَطَّرۡنَ مِنۡهُ
وَتَنشَقُّ ٱلۡأَرۡضُ وَتَخِرُّ ٱلۡجِبَالُ هَدًّا ٩٠

91. ఎందుకంటే వారు అనంత కరుణామయునికి కొడుకున్నాడని ఆరోపించారు.

أَن دَعَوۡاْ لِلرَّحۡمَٰنِ وَلَدٗا ٩١

92. ఎవరినైనా కొడుకుగా చేసుకోవటం అనంత కరుణామయునికి తగినది కాదు.[2]

وَمَا يَنۢبَغِي لِلرَّحۡمَٰنِ أَن يَتَّخِذَ وَلَدًا ٩٢

93. ఎందుకంటే! భూమ్యాకాశాలలో నున్న వారందరూ కేవలం అనంత కరుణామయుని దాసులుగా మాత్రమే హాజరు కానున్నారు.[3]

إِن كُلُّ مَن فِي ٱلسَّمَٰوَٰتِ
وَٱلۡأَرۡضِ إِلَّآ ءَاتِي ٱلرَّحۡمَٰنِ عَبۡدٗا ٩٣

94. వాస్తవానికి, ఆయన అందరినీ పరివేష్టించి ఉన్నాడు మరియు వారిని సరిగ్గా లెక్క పెట్టి ఉన్నాడు.

لَّقَدۡ أَحۡصَىٰهُمۡ وَعَدَّهُمۡ عَدّٗا ٩٤

95. మరియు పునరుత్థానదినమున వారందరూ, ఒంటరిగా ఆయన ముందు హాజరవుతారు.[4]

وَكُلُّهُمۡ ءَاتِيهِ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ فَرۡدًا ٩٥

---

1. ప్రవక్తలకు దైవత్వం అంటగట్టడం అల్లాహ్(సు.తా.)తో సంబంధం తెంపుకోవటమే. మరియు ఇది క్షమింపబడని మహా పాపం. చూడండి, 4:48.

2. చూడండి, 42:11: 'ఆయనను పోలిన వస్తువు ఏదీలేదు.' అనే ఖుర్ఆన్ ఆయత్ అల్లాహ్ (సు.తా.)కు సంతానం లేదు అనే విషయాన్ని స్పష్టపరుస్తోంది. ఇంకా చూడండి, 112:4 మరియు 6:100: 'మరియు ఆయన(సు.తా.)తో పోల్చదగినది ఏదియూ లేదు.' సంతానమనేది ఇంద్రియ సంబంధమైనది. కావున దీనిని అల్లాహ్(సు.తా.)కు అంటగట్టడం ఘోరపాపం.

3. మానవులు కానీ, దేవదూతలు కానీ, జిన్నాతులు కానీ, అందరూ ఆయన (సు.తా.) సృష్టించిన వారే, కావున వారికి ఆయన దైవత్వంలో ఎలాంటి భాగం లేదు. వారంతా ఇష్టంతో గానీ అయిష్టంతో గానీ ఆయన ఇచ్ఛను శిరసావహించవలసిందే. చూడండి,13:15,16:48-49.

4. అక్కడ ధనసంపత్తులు గానీ, సంతానం గానీ ఏ విధంగానూ పనికిరావు. చూడండి, 26:88.

إِنَّ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ سَيَجۡعَلُ لَهُمُ ٱلرَّحۡمَٰنُ وُدّٗا ﴿٩٦﴾

**96**. నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసేవారి పట్ల అనంత కరుణామయుడు (ప్రజల హృదయాలలో) ప్రేమను (వాత్సల్యాన్ని) కలుగజేయగలడు.

فَإِنَّمَا يَسَّرۡنَٰهُ بِلِسَانِكَ لِتُبَشِّرَ بِهِ ٱلۡمُتَّقِينَ وَتُنذِرَ بِهِۦ قَوۡمٗا لُّدّٗا ﴿٩٧﴾

**97**. కావున నీవు (ఓ ప్రవక్తా!) దైవభీతి గలవారికి శుభవార్త నివ్వటానికీ మరియు వాదులాడే జాతివారిని హెచ్చరించటానికీ, మేము దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) సులభతరం చేసి, నీ భాషలో అవతరింపజేశాము.[1]

وَكَمۡ أَهۡلَكۡنَا قَبۡلَهُم مِّن قَرۡنٍ هَلۡ تُحِسُّ مِنۡهُم مِّنۡ أَحَدٍ أَوۡ تَسۡمَعُ لَهُمۡ رِكۡزَۢا ﴿٩٨﴾

**98**. మరియు వీరికి పూర్వం మేము ఎన్నితరాల వారిని నాశనం చేయలేదు! ఏమీ? నీవు ఇప్పుడు వారిలో ఏ ఒక్కరినైనా చూస్తున్నావా? లేక వారి మెల్లని శబ్దమైనా వింటున్నావా? (1/2)

*****

---

**1**. మానవుడు అల్లాహ్ (సు.తా.) మాటలను అర్థం చేసుకోవటానికి ఆయన దివ్యగ్రంథాలను ఆ ప్రాంతపు ప్రజల భాషలోనే అవతరింపజేశాడు, చూడండి, 14:4 మరియు ము'హమ్మద్ ('స'అస)పై ఈ ఖుర్ఆన్ అవతరణ కొరకు చూడండి, 2:97 మరియు 26:193-194.

## 20. సూరహ్ ’తా-హా

## سُورَةُ طه

’ఉమర్ (ర’ది.’అ.) ఇస్లాం స్వీకరించిన విధానాలు ఎన్నోవివరించబడ్డాయి. కొన్ని ఉల్లేఖనాలలో (రివాయాత్) ఇలా ఉంది: అతడు తన చెల్లెలు మరియు ఆమె భర్త ఇంట్లో - ఎవరైతే అతని కంటే ముందే ఇస్లాం స్వీకరించి ఉన్నారో - ఈ సూరహ్‌ను విని ప్రభావితుడై ఇస్లాం స్వీకరించారు. ఇది హిజ్రత్‌కు దాదాపు 7 సంవత్సరాలకు ముందు - అబీసీనియాకు ముస్లింలు వెళ్ళక ముందు - **మక్కా**లో అతరింపజేయబడింది. ఇందులో **135 ఆయతులు** ఉన్నాయి. ఈ సూరహ్‌లో మూసా (’అ.స.) వృత్తాంతం 9-98 ఆయత్‌లలో వివరంగా ఉంది.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

طه ﴿١﴾

**1.** * ’తా-హా!

مَآ أَنزَلۡنَا عَلَيۡكَ ٱلۡقُرۡءَانَ لِتَشۡقَىٰٓ ﴿٢﴾

**2.** మేము ఈ ఖుర్ఆన్‌ను నీపై అవతరింప జేసింది నిన్ను కష్టానికి గురిచేయటానికి కాదు.[1]

إِلَّا تَذۡكِرَةٗ لِّمَن يَخۡشَىٰ ﴿٣﴾

**3.** కేవలం (అల్లాహ్‌కు) భయపడే వారికి హితబోధచేయటానికే!

تَنزِيلٗا مِّمَّنۡ خَلَقَ ٱلۡأَرۡضَ وَٱلسَّمَٰوَٰتِ ٱلۡعُلَى ﴿٤﴾

**4.** ఇది (ఈ ఖుర్ఆన్) భూమినీ మరియు అత్యున్నతమైన ఆకాశాలనూ సృష్టించిన ఆయన (అల్లాహ్) తరఫునుండి క్రమ క్రమంగా అవతరింపజేయబడింది.

ٱلرَّحۡمَٰنُ عَلَى ٱلۡعَرۡشِ ٱسۡتَوَىٰ ﴿٥﴾

**5.** ఆ కరుణామయుడు, సింహాసనం (’అర్ష్)పై ఆసీనుడై ఉన్నాడు.[2]

لَهُۥ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِ وَمَا بَيۡنَهُمَا وَمَا تَحۡتَ ٱلثَّرَىٰ ﴿٦﴾

**6.** ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ మరియు ఆ రెండింటి మధ్యనూ ఇంకా నేల క్రిందనూ ఉన్న,[3] సమస్తమూ ఆయనకు చెందినదే!

---

**1**. చూడండి, 18:6.

**2**. తన గొప్పతనానికి అనుగుణంగా అల్లాహ్ (సు.తా.) ’అర్ష్ (విశ్వసామ్రాజ్యాధిపత్య పీఠం)పై అధిష్ఠుడై ఉన్నాడు. కాని ఎట్లు, ఏ విధంగా ఎవ్వరికీ తెలియదు.

**3**. అస్-స’రా: అంటే భూమిలోని లోతైన భాగంలో. అంటే సర్వం ఆయనకు చెందిందే!

7. మరియు నీవు బిగ్గరగా మాట్లాడితే (ఆయన వినవే వింటాడు); వాస్తవానికి, ఆయనకు రహస్యంగా (చెప్పుకునే మాటలే గాక), అతి గోప్యమైన మాటలు కూడా తెలుస్తాయి.[1]

وَإِن تَجْهَرْ بِٱلْقَوْلِ فَإِنَّهُۥ يَعْلَمُ ٱلسِّرَّ وَأَخْفَى ۝٧

8. అల్లాహ్! ఆయన తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు. ఆయనకు అత్యుత్తమమైన పేర్లు ఉన్నాయి.[2]

ٱللَّهُ لَآ إِلَٰهَ إِلَّا هُوَ لَهُ ٱلْأَسْمَآءُ ٱلْحُسْنَىٰ ۝٨

9. ఇక మూసా వృత్తాంతం నీకు అందిందా?[3]

وَهَلْ أَتَىٰكَ حَدِيثُ مُوسَىٰٓ ۝٩

10. అతను ఒక మంటను చూసినపుడు తన ఇంటి వారితో ఇలా అన్నాడు:[4] "ఆగండి! నిశ్చయంగా నాకొక మంట కనబడుతోంది; బహుశా నేను దానినుండి మీ కొరకు ఒక కొరివిని తీసుకొనివస్తాను లేదా ఆ మంట దగ్గర, నా కేదైనా మార్గదర్శకత్వం లభించవచ్చు!"

إِذْ رَءَا نَارًا فَقَالَ لِأَهْلِهِ ٱمْكُثُوٓا۟ إِنِّىٓ ءَانَسْتُ نَارًا لَّعَلِّىٓ ءَاتِيكُم مِّنْهَا بِقَبَسٍ أَوْ أَجِدُ عَلَى ٱلنَّارِ هُدًى ۝١٠

---

1. అల్లాహ్ (సు.తా.)ను పెద్ద స్వరంతో అర్థించే అవసరం లేదు. ఎందుకంటే ఆయన అతిరహస్య విషయాలను కూడా తెలుసుకుంటాడు. ఆయనకు మానవుల భవిష్యత్తు కూడా తెలుసు, అది ఆయన దగ్గర వ్రాయబడి ఉంది! ఆయనకు జరిగిపోయిందే గాక, జరుగుతున్నది మరియు ముందు జరుగబోయేది అన్నీ తెలుసు. అంటే పునరుత్థానదినం వరకు మరియు ఆ తరువాతకూడా ఎల్లప్పుడూ జరుగబోయే అన్ని విషయాల జ్ఞానం కేవలం అల్లాహ్(సు.తా.)కే ఉంది మరియు ఇతరులకు ఎవ్వరికీ లేదు. అంటే దైవప్రవక్తలు, దైవదూత('అలైహిమ్.స.)లకు మరియు జిన్నాతులకు కూడా లేదు.
2. "అల్లాహ్ (సు.తా.) యొక్క అత్యుత్తమ పేర్లు" (అల్-అస్మా ఉ'ల్-'హుస్నా). ఈ శబ్దం ఖుర్ఆన్‌లో నాల్గుసార్లు వచ్చింది. 7:180,17:110, 59:24 మరియు ఇక్కడ.
3. మూసా ('అ.స.) వృత్తాంతం, 7, 17, 18 మరియు 28 సూరాహ్‌లలో వచ్చింది. ఈ సూరహ్‌లో 9-98 ఆయత్‌లలో కొన్ని వివరాలున్నాయి.
4. మూసా ('అ.స.) కొన్ని సంవత్సరాలు అయ్‌కహ్‌లో గడిపిన తరువాత - తన భార్యా పిల్లలతో సహా - తన తల్లి, సోదరుడు హారూన్ ('అ.స.) మరియు తనజాతి వారి వద్దకు వెళ్ళటానికి బయలుదేరుతారు. సినాయి ద్వీపకల్పం దక్షిణ ప్రాంతం గుండా ప్రయాణం చేస్తున్నప్పుడు ఈ విషయం సంభవిస్తుంది. ఇంకా చూడండి, 27:78 మరియు 28:29.

فَلَمَّآ أَتَىٰهَا نُودِىَ يَٰمُوسَىٰٓ ﴿١١﴾

11. అతను దాని దగ్గరకు చేరినప్పుడు ఇలా పిలువబడ్డాడు:[1] "ఓ మూసా!

إِنِّيٓ أَنَا۠ رَبُّكَ فَٱخۡلَعۡ نَعۡلَيۡكَ إِنَّكَ بِٱلۡوَادِ ٱلۡمُقَدَّسِ طُوٗى ﴿١٢﴾

12. "నిశ్చయంగా, నేనే నీ ప్రభువును! కావున నీవు నీ చెప్పులను విడువు. వాస్తవానికి, నీవు పవిత్రమైన 'తువా[2] లోయలో ఉన్నావు.

وَأَنَا ٱخۡتَرۡتُكَ فَٱسۡتَمِعۡ لِمَا يُوحَىٰٓ ﴿١٣﴾

13. "మరియు నేను నిన్ను (ప్రవక్తగా) ఎన్నుకున్నాను. నేను నీ పై అవతరింపజేసే దివ్యజ్ఞానాన్ని (వ'హీని) జాగ్రత్తగా విను.

إِنَّنِيٓ أَنَا ٱللَّهُ لَآ إِلَٰهَ إِلَّآ أَنَا۠ فَٱعۡبُدۡنِي وَأَقِمِ ٱلصَّلَوٰةَ لِذِكۡرِيٓ ﴿١٤﴾

14. "నిశ్చయంగా, నేనే అల్లాహ్‌ను! నేను తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు! కావున నన్నే ఆరాధించు మరియు నన్ను స్మరించడానికి నమాజ్‌ను స్థాపించు.

إِنَّ ٱلسَّاعَةَ ءَاتِيَةٌ أَكَادُ أُخۡفِيهَا لِتُجۡزَىٰ كُلُّ نَفۡسِۭ بِمَا تَسۡعَىٰ ﴿١٥﴾

15. "నిశ్చయంగా, తీర్పుఘడియ రానున్నది - ప్రతివ్యక్తీ తాను చేసిన కర్మల ప్రకారం ప్రతిఫలం పొందటానికి - నేను దానిని గోప్యంగా ఉంచాలని నిర్ణయించాను.[3]

فَلَا يَصُدَّنَّكَ عَنۡهَا مَن لَّا يُؤۡمِنُ بِهَا وَٱتَّبَعَ هَوَىٰهُ فَتَرۡدَىٰ ﴿١٦﴾

16. "కావున దానిని విశ్వసించకుండా, తన మనోవాంఛలను అనుసరించే వాడు, నిన్ను దాని (ఆ ఘడియ చింత) నుండి మరలింపనివ్వరాదు; అలా అయితే నీవు నాశనానికి గురికాగలవు.

وَمَا تِلۡكَ بِيَمِينِكَ يَٰمُوسَىٰ ﴿١٧﴾

17. "మరియు ఓ మూసా! నీ కుడి చేతిలో ఉన్నది ఏమిటి?"

---

1. మూసా ('అ.స.) అక్కడికి చేరుకున్న తరువాత ఒక వృక్షం వెలుగుతో నిండి ఉంటుంది. దాని నుండి ఈ విధంగా పిలువబడతారు. చూడండి, 28:30.
2. 'తువా - ఆ లోయ పేరు.
3. చూడండి, 53:39.

قَالَ هِيَ عَصَايَ أَتَوَكَّؤُاْ عَلَيۡهَا وَأَهُشُّ بِهَا عَلَىٰ غَنَمِي وَلِيَ فِيهَا مَـَٔارِبُ أُخۡرَىٰ ﴿١٨﴾

**18**. (మూసా) అన్నాడు: "ఇది నా చేతి కర్ర, దీనిని ఆనుకొని నిలబడతాను మరియు దీనితో నా మేకల కొరకు ఆకులు రాల్చుతాను. మరియు దీని నుండి నాకు ఇంకా ఇతర ఉపయోగాలు కూడా ఉన్నాయి."

قَالَ أَلۡقِهَا يَٰمُوسَىٰ ﴿١٩﴾

**19**. (అల్లాహ్) అన్నాడు: "ఓ మూసా! దానిని భూమిమీద పడవేయి."

فَأَلۡقَىٰهَا فَإِذَا هِيَ حَيَّةٞ تَسۡعَىٰ ﴿٢٠﴾

**20**. అప్పుడు అతను దానిని పడవేశాడు. వెంటనే అది పాముగా [1] మారిపోయి చురుకుగా చలించసాగింది.

قَالَ خُذۡهَا وَلَا تَخَفۡۖ سَنُعِيدُهَا سِيرَتَهَا ٱلۡأُولَىٰ ﴿٢١﴾

**21**. (అల్లాహ్) ఆజ్ఞాపించాడు: "దానిని పట్టుకో, భయపడకు. మేము దానిని దాని పూర్వస్థితిలోకి మార్చుతాము.

وَٱضۡمُمۡ يَدَكَ إِلَىٰ جَنَاحِكَ تَخۡرُجۡ بَيۡضَآءَ مِنۡ غَيۡرِ سُوٓءٍ ءَايَةً أُخۡرَىٰ ﴿٢٢﴾

**22**. "మరియు నీ చేతిని చంకలో పెట్టి తీయి, దానికెలాంటి బాధ కలుగకుండా, అది తెల్లగా మెరుస్తూ బయటికి వస్తుంది,[2] ఇది రెండవ అద్భుత సూచన!

لِنُرِيَكَ مِنۡ ءَايَٰتِنَا ٱلۡكُبۡرَى ﴿٢٣﴾

**23**. "ఇదంతా మేము నీకు మా గొప్ప సూచనలను చూపటానికి!

ٱذۡهَبۡ إِلَىٰ فِرۡعَوۡنَ إِنَّهُۥ طَغَىٰ ﴿٢٤﴾

**24**. "నీవు ఫిర్'ఔన్ వద్దకుపో! నిశ్చయంగా, అతడు మితిమీరి పోయాడు."[3]

قَالَ رَبِّ ٱشۡرَحۡ لِي صَدۡرِي ﴿٢٥﴾

**25**. (మూసా) ఇలా మనవి చేసుకున్నాడు: "ఓ నా ప్రభూ! నా హృదయాన్ని వికసింపజేయి.

---

1. ఇక్కడ (20:20లో) 'హయ్యతున్ అని, 27:10, 28:31లలో జాన్నున్ అని, 7:107లో సు''అబానున్ అని ఉంది. సందర్భాన్ని బట్టి దానిని మార్చబడింది.
2. చూడండి, 7:108, 28:32.
3. ఫిర్'ఔన్ తనను తాను ఆరాధ్య దైవంగా చేసుకున్నాడు. చూడండి, 28:38 మరియు 79:24, 'నేనే మీ ప్రభువును.' అని అనేవాడు.

| | |
|---|---|
| 26. "మరియు నా వ్యవహారాన్ని నా కొరకు సులభంచేయి. | وَيَسِّرۡ لِيٓ أَمۡرِي ٢٦ |
| 27. "నా నాలుకలోని ముడిని (ఆటంకాన్ని) తొలగించు. | وَٱحۡلُلۡ عُقۡدَةٗ مِّن لِّسَانِي ٢٧ |
| 28. "(దానితో) వారు నా మాటలను సులభంగా అర్థం చేసుకోవటానికి. | يَفۡقَهُواْ قَوۡلِي ٢٨ |
| 29. "మరియు నా కొరకు నా కుటుంబం నుండి ఒక సహాయకుణ్ణి నియమించు.[1] | وَٱجۡعَل لِّي وَزِيرٗا مِّنۡ أَهۡلِي ٢٩ |
| 30. "నా సోదరుడైన హారూన్‌ను. | هَٰرُونَ أَخِي ٣٠ |
| 31. "అతని ద్వారా నా బలాన్ని దృఢపరచు. | ٱشۡدُدۡ بِهِۦٓ أَزۡرِي ٣١ |
| 32. "మరియు అతనిని నా వ్యవహారంలో సహాయకారిగా (భాగస్వామిగా) చేయి. | وَأَشۡرِكۡهُ فِيٓ أَمۡرِي ٣٢ |
| 33. "మేము నీ పవిత్రతను బాగా కొనియాడటానికి; | كَيۡ نُسَبِّحَكَ كَثِيرٗا ٣٣ |
| 34. "మరియు నిన్ను అత్యధికంగా స్మరించటానికి; | وَنَذۡكُرَكَ كَثِيرًا ٣٤ |
| 35. "నిశ్చయంగా, నీవు మమ్మల్ని ఎల్లప్పుడూ కనిపెట్టుకునే ఉంటావు!" | إِنَّكَ كُنتَ بِنَا بَصِيرٗا ٣٥ |
| 36. (అల్లాహ్) సెలవిచ్చాడు: "ఓ మూసా! వాస్తవంగా, నీవు కోరినదంతా నీకు ఇవ్వబడింది. | قَالَ قَدۡ أُوتِيتَ سُؤۡلَكَ يَٰمُوسَىٰ ٣٦ |
| 37. "మరియు వాస్తవానికి మేము నీకు మరొక సారి ఉపకారం చేశాము.[2] | وَلَقَدۡ مَنَنَّا عَلَيۡكَ مَرَّةً أُخۡرَىٰٓ ٣٧ |

1. వ'జీరున్: భారం మోసేవాడు, మంత్రి, రాజు యొక్క రాజకీయ భారాన్ని పంచుకునేవాడు.
2. ఈ వివరాలకు చూడండి, 28:3-21.

إِذۡ أَوۡحَيۡنَآ إِلَىٰٓ أُمِّكَ مَا يُوحَىٰٓ ٣٨

أَنِ ٱقۡذِفِيهِ فِي ٱلتَّابُوتِ فَٱقۡذِفِيهِ فِي ٱلۡيَمِّ فَلۡيُلۡقِهِ ٱلۡيَمُّ بِٱلسَّاحِلِ يَأۡخُذۡهُ عَدُوّٞ لِّي وَعَدُوّٞ لَّهُۥۚ وَأَلۡقَيۡتُ عَلَيۡكَ مَحَبَّةٗ مِّنِّي وَلِتُصۡنَعَ عَلَىٰ عَيۡنِيٓ ٣٩

إِذۡ تَمۡشِيٓ أُخۡتُكَ فَتَقُولُ هَلۡ أَدُلُّكُمۡ عَلَىٰ مَن يَكۡفُلُهُۥۖ فَرَجَعۡنَٰكَ إِلَىٰٓ أُمِّكَ كَيۡ تَقَرَّ عَيۡنُهَا وَلَا تَحۡزَنَۚ وَقَتَلۡتَ نَفۡسٗا فَنَجَّيۡنَٰكَ مِنَ ٱلۡغَمِّ وَفَتَنَّٰكَ فُتُونٗاۚ فَلَبِثۡتَ سِنِينَ فِيٓ أَهۡلِ مَدۡيَنَ ثُمَّ جِئۡتَ عَلَىٰ قَدَرٖ يَٰمُوسَىٰ ٤٠

وَٱصۡطَنَعۡتُكَ لِنَفۡسِي ٤١

**38**. "అప్పుడు మేము నీ తల్లికి ఇవ్వవలసిన ఆ సూచనను ఈ విధంగా సూచించాము:

**39**. 'ఇతనిని (ఈ బాలుణ్ణి) ఒక పెట్టెలో పెట్టి దానిని (ఆ పెట్టెను) నదిలో విడువు. నది దానిని ఒక ఒడ్డుకు చేర్చుతుంది, దానిని నాకు మరియు అతనికి శత్రువు అయిన వాడు తీసుకుంటాడు.' మరియు నేను నా తరఫు నుండి నీ మీద ప్రేమను కురిపించాను మరియు నిన్ను నా కంటి ముందు పోషింపబడేటట్లు చేశాను.[1]

**40**. "అప్పుడు నీ సోదరి (నిన్ను) అనుసరిస్తూ పోయి, వారితో ఇలా అన్నది: 'ఇతనిని పెంచి పోషించగల ఒకామెను నేను మీకు చూపనా?'[2] ఈ విధంగా మేము నిన్ను మళ్ళీ నీతల్లి దగ్గరకు చేర్చాము, ఆమె కళ్ళకు చల్లదనమివ్వటానికి, ఆమెను దుఃఖపడకుండా ఉంచటానికి.[3] మరియు నీవొక వ్యక్తిని చంపావు,[4] మేము ఆ ఆపద నుండి నీకు విముక్తి కలిగించాము. మేము నిన్ను అనేక విధాలుగా పరీక్షించాము.[5] ఆ తరువాత నీవు ఎన్నో సంవత్సరాలు మద్‌యన్ వారితో ఉంటివి.[6] ఓ మూసా! ఇప్పుడు నీవు (మా) నిర్ణయాను సారంగా (ఇక్కడికి) వచ్చావు.

**41**. "మరియు నేను నిన్ను నా (సేవ) కొరకు ఎన్నుకున్నాను.

---

**1**. చూడండి, 79:24 మరియు 28:9.
**2**. వివరాలకు చూడండి, 28:12.
**3**. చూడండి, 28:12-13.
**4**. చూడండి, 28:14.
**5**. చూడండి, 28:15-21.
**6**. చూడండి, 28:22-28.

ٱذۡهَبۡ أَنتَ وَأَخُوكَ بِـَٔايَٰتِي وَلَا تَنِيَا فِي ذِكۡرِي ﴿٤٢﴾

42. "నీవు మరియు నీ సోదరుడు నా సూచనలతో వెళ్ళండి. నన్ను స్మరించటంలో అశ్రద్ధ వహించకండి.[1]

ٱذۡهَبَآ إِلَىٰ فِرۡعَوۡنَ إِنَّهُۥ طَغَىٰ ﴿٤٣﴾

43. "మీరిద్దరు ఫిర్ఔన్ దగ్గరకు వెళ్ళండి. అతడు మితిమీరి ప్రవర్తిస్తున్నాడు.

فَقُولَا لَهُۥ قَوۡلٗا لَّيِّنٗا لَّعَلَّهُۥ يَتَذَكَّرُ أَوۡ يَخۡشَىٰ ﴿٤٤﴾

44. "కాని అతనితో మృదువుగా మాట్లాడండి. బహుశా అతడు హితబోధ స్వీకరిస్తాడేమో, లేదా భయపడతాడేమో!"[2]

قَالَا رَبَّنَآ إِنَّنَا نَخَافُ أَن يَفۡرُطَ عَلَيۡنَآ أَوۡ أَن يَطۡغَىٰ ﴿٤٥﴾

45. (మూసా మరియు హారూన్) ఇద్దరూ ఇలా అన్నారు: "ఓ మా ప్రభూ! వాస్తవానికి, అతడు మమ్మల్ని శిక్షిస్తాడేమోనని లేదా తలబిరుసుతనంతో ప్రవర్తిస్తాడేమోనని మేము భయపడు తున్నాము!"

قَالَ لَا تَخَافَآۖ إِنَّنِي مَعَكُمَآ أَسۡمَعُ وَأَرَىٰ ﴿٤٦﴾

46. (అల్లాహ్) సెలవిచ్చాడు: "మీరిద్దరు భయపడకండి, నిశ్చయంగా మీరిద్దరితో పాటు నేనూ ఉన్నాను. నేను అంతా వింటూ ఉంటాను మరియు అంతా చూస్తూ ఉంటాను.

فَأۡتِيَاهُ فَقُولَآ إِنَّا رَسُولَا رَبِّكَ فَأَرۡسِلۡ مَعَنَا بَنِيٓ إِسۡرَٰٓءِيلَ وَلَا تُعَذِّبۡهُمۡۖ

47. "కావున మీరిద్దరు అతనివద్దకు పోయి ఇలా అనండి: 'నిశ్చయంగా, మేమిద్దరం నీ ప్రభువు యొక్క సందేశహరులము. కావున ఇస్రాయీ'ల్

---

1. ఇక్కడ అల్లాహ్ (సు.తా.) వైపుకు ఆహ్వానించే దా'ఈలకు, ఎల్లప్పుడూ అల్లాహ్ (సు.తా.)ను స్మరిస్తూ ఉండాలనే సూచన ఉంది.
2. అల్లాహ్ (సు.తా.)కు తెలుసు అతడు హితబోధ స్వీకరించడని, కాని మూసా (అ.స.)కు ఏమీ తెలియదు. ఎందుకంటే ప్రవక్తలు కూడా మానవులే. వారికి అల్లాహ్ (సు.తా.) తెలిపేది తప్ప ఇతర అగోచర విషయాల జ్ఞానం ఉండదు. ఇదే అల్లాహ్ (సు.తా.) ఇచ్ఛ. దీనివల్ల ప్రవక్త ప్రతి వానిని: 'అల్లాహ్ (సు.తా.) మార్గం వైపునకు, సత్యమార్గం వైపునకు, మోక్షం పొందటానికి రండి.' అని ఆహ్వానిస్తుంటాడు. అదే ప్రవక్త బాధ్యత. ఇందులో దా'ఈలు మృదువుగా వ్యవహరించాలనే సూచన కూడా ఉంది.

قَدۡ جِئۡنَٰكَ بِـَٔايَةٖ مِّن رَّبِّكَۖ وَٱلسَّلَٰمُ عَلَىٰ مَنِ ٱتَّبَعَ ٱلۡهُدَىٰٓ ٤٧

సంతతివారిని మా వెంట పోనివ్వు.[1] మరియు వారిని బాధపెట్టకు. వాస్తవానికి మేము నీ వద్దకు నీ ప్రభువు తరఫునుండి సూచనలు తీసుకొనివచ్చాము. మరియు సన్మార్గాన్ని అనుసరించే వానిపై (అల్లాహ్ తరఫునుండి) శాంతి వర్ధిల్లుతుంది![2]

إِنَّا قَدۡ أُوحِيَ إِلَيۡنَآ أَنَّ ٱلۡعَذَابَ عَلَىٰ مَن كَذَّبَ وَتَوَلَّىٰ ٤٨

**48**. " 'నిశ్చయంగా, ఎవడైతే సత్యాన్ని తిరస్కరించి వెనుదిరిగిపోతాడో అతనికి కఠిన శిక్ష తప్పక ఉంటుంది.' అని వాస్తవానికి మాకు దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా తెలుపబడింది."

قَالَ فَمَن رَّبُّكُمَا يَٰمُوسَىٰ ٤٩

**49**. (ఫిర్'ఔన్) అన్నాడు: "ఓ మూసా! మీ ఇరువురి ప్రభువు ఎవరు?"

قَالَ رَبُّنَا ٱلَّذِيٓ أَعۡطَىٰ كُلَّ شَيۡءٍ خَلۡقَهُۥ ثُمَّ هَدَىٰ ٥٠

**50**. (మూసా) జవాబిచ్చాడు: "ప్రతి దానికి దాని రూపాన్నిచ్చి, తరువాత దానికి మార్గదర్శకత్వం చేసేవాడే మా ప్రభువు."

قَالَ فَمَا بَالُ ٱلۡقُرُونِ ٱلۡأُولَىٰ ٥١

**51**. (ఫిర్'ఔన్) అన్నాడు: "అయితే, పూర్వం గతించిన తరాలవారి సంగతి ఏమిటి?"

قَالَ عِلۡمُهَا عِندَ رَبِّي فِي كِتَٰبٖۖ لَّا يَضِلُّ رَبِّي وَلَا يَنسَى ٥٢

**52**. (మూసా) జవాబిచ్చాడు: "వాటి జ్ఞానం నా ప్రభువు వద్ద ఒక గ్రంథంలో (వ్రాయబడి) వుంది. నా ప్రభువు పొరపాటు చేయడు మరియు మరువడు కూడాను."

ٱلَّذِي جَعَلَ لَكُمُ ٱلۡأَرۡضَ مَهۡدٗا وَسَلَكَ لَكُمۡ فِيهَا سُبُلٗا وَأَنزَلَ مِنَ

**53**. ఆయనే మీ కొరకు భూమిని చదును (పరుపు)గా జేసి, అందులో మీకు (నడవటానికి) త్రోవలను ఏర్పరిచాడు. మరియు

---

**1**. వివరాలకు చూడండి, 2:49, 7:141,14:6.

**2**. వస్సలాము 'అలా మనిత్తబ'అల్‌హుదా! దైవప్రవక్త ('స'అస) రోమన్ చక్రవర్తికి వ్రాసిన ఉత్తరాన్ని ఈ పై వాక్యంతో ప్రారంభించారు, (ఇబ్నె-కసీ'ర్). దీనితో స్పష్టమయ్యేది ఏమిటంటే ముస్లిమేతరుల సభలో లేక ఉత్తరం ద్వారా సంభాషణ ప్రారంభించునప్పుడు ఈ శబ్దాలను వాడాలి.

ఆకాశం నుండి నీటిని కురిపించాడు; మేము దాని ద్వారా రకరకాల వృక్షకోటిని పుట్టించాము.[1]

**54**. మీరు వాటిని తినండి మరియు మీ పశువులకు మేపండి. నిశ్చయంగా, అర్థం చేసుకోగల వారికి ఇందులో అనేక సూచనలున్నాయి. (5/8)

**55**. * దాని (ఆ మట్టి)నుంచే మిమ్మల్ని సృష్టించాము, మరల మిమ్మల్ని దానిలోకే చేర్చుతాము మరియు దాని నుంచే మిమ్మల్ని మరొకసారి లేపుతాము.[2]

**56**. మరియు వాస్తవానికి, మేము అతనికి (ఫిర్'ఔన్‌కు) మా సూచనలన్నీ చూపాము, కాని అతడు వాటిని అబద్ధాలన్నాడు మరియు తిరస్కరించాడు.

**57**. (ఫిర్'ఔన్) ఇలా అన్నాడు: "ఓ మూసా! నీవు నీ మంత్రజాలంతో మమ్మల్ని మా దేశంనుండి వెడలగొట్టటానికి మా వద్దకు వచ్చావా?[3]

**58**. "సరే! మేము కూడా దానివంటి మంత్రజాలాన్ని నీకు పోటీగా తెస్తాము; కావున మా మధ్య నీ మధ్య (సమావేశానికి) ఒక సమయం మరియు స్థలాన్ని నిర్ణయించు, దాని నుండి మేము కానీ నీవు కానీ, వెనుకాడకూడదు. మరియు అదొక యుక్తమైన స్థలమై ఉండాలి."

ٱلسَّمَآءِ مَآءً فَأَخۡرَجۡنَا بِهِۦٓ أَزۡوَٰجًا مِّن نَّبَاتٍ شَتَّىٰ ﴿٥٣﴾

كُلُواْ وَٱرۡعَوۡاْ أَنۡعَٰمَكُمۡۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَٰتٍ لِّأُوْلِي ٱلنُّهَىٰ ﴿٥٤﴾

۞ مِنۡهَا خَلَقۡنَٰكُمۡ وَفِيهَا نُعِيدُكُمۡ وَمِنۡهَا نُخۡرِجُكُمۡ تَارَةً أُخۡرَىٰ ﴿٥٥﴾

وَلَقَدۡ أَرَيۡنَٰهُ ءَايَٰتِنَا كُلَّهَا فَكَذَّبَ وَأَبَىٰ ﴿٥٦﴾

قَالَ أَجِئۡتَنَا لِتُخۡرِجَنَا مِنۡ أَرۡضِنَا بِسِحۡرِكَ يَٰمُوسَىٰ ﴿٥٧﴾

فَلَنَأۡتِيَنَّكَ بِسِحۡرٍ مِّثۡلِهِۦ فَٱجۡعَلۡ بَيۡنَنَا وَبَيۡنَكَ مَوۡعِدًا لَّا نُخۡلِفُهُۥ نَحۡنُ وَلَآ أَنتَ مَكَانًا سُوًى ﴿٥٨﴾

---

**1**. అ'జ్వాజున్: ఇక్కడ దీని అర్థం వివిధరకాలు. ఇదే అర్థం13:3లో కూడా ఉంది.

**2**. మానవుణ్ణి మట్టినుండి సృష్టించాము. వివరాలకు చూడండి 3:59లో తురాబ్ మరియు 15:26లో 'స'ల్సాలిన్ 'హమఇన్ మస్నూన్. ఇబ్నెమాజా ఉల్లేఖనం: ఒక మృతుణ్ణి సమాధిలో పెట్టిన తరువాత రెండు చేతులతో మూడుసార్లు మట్టిపోయడం అభిలషణీయం (ముస్త'హబ్).

**3**. చూడండి, 7:110.

قَالَ مَوۡعِدُكُمۡ يَوۡمُ ٱلزِّينَةِ وَأَن يُحۡشَرَ ٱلنَّاسُ ضُحٗى ﴿٥٩﴾

فَتَوَلَّىٰ فِرۡعَوۡنُ فَجَمَعَ كَيۡدَهُۥ ثُمَّ أَتَىٰ ﴿٦٠﴾

قَالَ لَهُم مُّوسَىٰ وَيۡلَكُمۡ لَا تَفۡتَرُواْ عَلَى ٱللَّهِ كَذِبٗا فَيُسۡحِتَكُم بِعَذَابٖۖ وَقَدۡ خَابَ مَنِ ٱفۡتَرَىٰ ﴿٦١﴾

فَتَنَٰزَعُوٓاْ أَمۡرَهُم بَيۡنَهُمۡ وَأَسَرُّواْ ٱلنَّجۡوَىٰ ﴿٦٢﴾

قَالُوٓاْ إِنۡ هَٰذَٰنِ لَسَٰحِرَٰنِ يُرِيدَانِ أَن يُخۡرِجَاكُم مِّنۡ أَرۡضِكُم بِسِحۡرِهِمَا وَيَذۡهَبَا بِطَرِيقَتِكُمُ ٱلۡمُثۡلَىٰ ﴿٦٣﴾

فَأَجۡمِعُواْ كَيۡدَكُمۡ ثُمَّ ٱئۡتُواْ صَفّٗاۚ وَقَدۡ أَفۡلَحَ ٱلۡيَوۡمَ مَنِ ٱسۡتَعۡلَىٰ ﴿٦٤﴾

**59**. (మూసా) అన్నాడు: "మీతో సమావేశం, ఉత్సవ దినమున నియమించుకుందాము. ప్రొద్దెక్కేవరకు ప్రజలందరూ సమావేశమై ఉండాలి."

**60**. ఆ పిదప ఫిర్'ఔన్ వెళ్ళిపోయి తన తంత్ర సామాగ్రిని సమీకరించుకొని తిరిగి వచ్చాడు.[1]

**61**. మూసా వారితో అన్నాడు: "మీరు నాశనమవు గాక! అల్లాహ్‌పై అబద్ధాలు కల్పించకండి! అలా చేస్తే ఆయన కఠిన శిక్షతో మిమ్మల్ని నిర్మూలించవచ్చు! (అల్లాహ్‌పై) అబద్ధాలు కల్పించేవాడు తప్పక విఫలుడవుతాడు."

**62**. (ఇది విన్న) తరువాత వారు ఆ విషయాన్ని గురించి తర్కించుకున్నారు, కాని తమ చర్చను రహస్యంగానే సాగించారు.

**63**. (వారు పరస్పరం ఈ విధంగా) మాట్లాడుకున్నారు: "వాస్తవానికి వీరిద్దరూ మాంత్రికులే! వీరిద్దరు తమ మంత్ర జాలంతో మిమ్మల్ని మీ దేశంనుండి వెడలగొట్టి, మీ ఆదరణీయమైన విధానాన్ని అంతమొందించ గోరుతున్నారు.[2]

**64**. "కావున మీరు మీ యుక్తులను సమీకరించుకొని సమైక్యంగా (రంగంలోకి) దిగండి. ఈ నాడు ప్రాబల్యం పొందిన వాడే, వాస్తవానికి సాఫల్యం (గెలుపు) పొందిన వాడు."[3]

---

**1**. చూడండి, 7:111-114.

**2**. ఏ విధంగానైతే ఈ రోజు కూడా అసత్యమార్గం మీద, షిర్కులో మునిగి ఉన్నవారు కూడా తామే సరైన మార్గం మీద ఉన్నామని గర్విస్తారో అదేవిధంగా వారూ గర్వించారు. చూడండి, 30:32.

**3**. చూడండి, 7:113-114.

قَالُواْ يَٰمُوسَىٰٓ إِمَّآ أَن تُلۡقِيَ وَإِمَّآ أَن نَّكُونَ أَوَّلَ مَنۡ أَلۡقَىٰ ﴿٦٥﴾

**65**. వారు (మాంత్రికులు) ఇలా అన్నారు: "ఓ మూసా! నీవు విసురుతావా, లేదా మేము మొదట విసరాలా?"

قَالَ بَلۡ أَلۡقُواْۖ فَإِذَا حِبَالُهُمۡ وَعِصِيُّهُمۡ يُخَيَّلُ إِلَيۡهِ مِن سِحۡرِهِمۡ أَنَّهَا تَسۡعَىٰ ﴿٦٦﴾

**66**. (మూసా) అన్నాడు: "లేదు! మీరే (ముందు) విసరండి!" అప్పుడు అకస్మాత్తుగా వారి త్రాళ్ళు మరియు వారి కర్రలూ - వారి మంత్రజాలం వల్ల - అతనికి (మూసాకు) చలిస్తూ ఉన్నట్లు కనిపించాయి.[1]

فَأَوۡجَسَ فِي نَفۡسِهِۦ خِيفَةٗ مُّوسَىٰ ﴿٦٧﴾

**67**. దానితో మూసాకు, తన మనస్సులో కొంత భయం కలిగింది.[2]

قُلۡنَا لَا تَخَفۡ إِنَّكَ أَنتَ ٱلۡأَعۡلَىٰ ﴿٦٨﴾

**68**. మేము (అల్లాహ్) అన్నాము: "భయపడకు! నిశ్చయంగా, నీవే ప్రాబల్యం పొందుతావు.[3]

وَأَلۡقِ مَا فِي يَمِينِكَ تَلۡقَفۡ مَا صَنَعُوٓاْۖ إِنَّمَا صَنَعُواْ كَيۡدُ سَٰحِرٖۖ وَلَا يُفۡلِحُ ٱلسَّاحِرُ حَيۡثُ أَتَىٰ ﴿٦٩﴾

**69**. "నీ కుడిచేతిలో ఉన్నదానిని విసురు! అది వారు కల్పించిన వాటిని మ్రింగివేస్తుంది. వారు కల్పించింది నిశ్చయంగా మాంత్రికుని తంత్రమే! మరియు మాంత్రికుడు ఎన్నడూ సఫలుడు కానేరడు. వాడు ఎటునుంచి, ఎలా వచ్చినా సరే!"

---

**1**. ఇక్కడ: 'వారి త్రాళ్ళు మంత్రజాలం వల్ల చలిస్తున్నట్లు,' అని ఉంది. అంటే అవి పాములుగా కనిపించాయే, గానీ వాస్తవానికి పాములుగా మారలేదు. దీనితో విశదమయ్యేది ఏమిటంటే మంత్ర జాలం (మిస్మరిస్మ్), మంత్ర ప్రభావం వల్ల తాత్కాలికంగా ప్రజలకు అలా కనిపిస్తుందే కానీ నిజానికి ఏ మార్పూ రాదు.

**2**. చూడండి, 7:116.

**3**. మూసా ('అ.స.) భయపడటానికి కారణం అతను కూడా ఒక మానవుడే. ప్రవక్త ('అలైహిమ్ స.)లు అందరూ మానవులే కాని వారిపై దివ్యజ్ఞానం (వ'హీ) అవతరింపజేయబడుతుంది. అల్లాహ్ (సు.తా.) తెలిపినది తప్ప, వేరే అగోచరజ్ఞానం గానీ, భవిష్యత్తులో జరుగబోయే వాటి జ్ఞానం గానీ వారికి ఉండదు. అల్లాహ్ (సు.తా.): 'భయపడకు నీవే ఆధిక్యత వహిస్తావు.' అని అన్నప్పుడు అతనికి ధైర్యం వచ్చింది. అంటే అద్భుత సూచనలు చూపటం కూడా అల్లాహ్ (సు.తా.) చేతిలోనే ఉంది. ప్రవక్తలు ఏదైనా అద్భుత విషయం జరిగేవరకు, అది జరగనున్నదని ఎరగరు. అంటే వారికెలాంటి అగోచరజ్ఞానం ఉండదు.

70. అప్పుడు ఆ మాంత్రికులు సాష్టాంగం(సజ్దా)లో పడుతూ అన్నారు: "మేము హారూన్ మరియు మూసాల ప్రభువును విశ్వసించాము."[1]

71. (ఫిర్ఔన్) అన్నాడు: "నేను అనుమతించక ముందే, మీరు ఇతనిని విశ్వసించారా?[2] నిశ్చయంగా, ఇతనే మీకు మంత్రజాలం నేర్పిన గురువు! కావున ఇప్పుడు నేను మీ అందరి చేతులను మరియు కాళ్ళను, వ్యతిరేక పక్షాలనుండి నరికిస్తాను[3] మరియు మిమ్మల్ని అందరినీ, ఖర్జూరపు దూలాల మీద సిలువ (శూలారోహణ) చేయిస్తాను. అప్పుడు మా ఇద్దరిలో ఎవరి శిక్ష ఎక్కువ కఠినమైనదో మరియు దీర్ఘకాలికమైనదో మీకు తప్పక తెలియగలదు."

72. వారు (మాంత్రికులు) అన్నారు: "మావద్దకు వచ్చిన స్పష్టమైన సూచనలను మరియు మమ్మల్ని సృజించిన ప్రభువు (అల్లాహ్)ను వదలి, మేము నీకు ప్రాధాన్యత నివ్వము. నీవు చేయదలచుకున్నది చేసుకో! నీవు కేవలం ఐహిక జీవితాన్ని మాత్రమే అంతమొందించగలవు.[4]

فَأُلْقِيَ ٱلسَّحَرَةُ سُجَّدًا قَالُوٓاْ ءَامَنَّا
بِرَبِّ هَٰرُونَ وَمُوسَىٰ ﴿٧٠﴾
قَالَ ءَامَنتُمْ لَهُۥ قَبْلَ أَنْ ءَاذَنَ لَكُمْ ۖ
إِنَّهُۥ لَكَبِيرُكُمُ ٱلَّذِى عَلَّمَكُمُ
ٱلسِّحْرَ ۖ فَلَأُقَطِّعَنَّ أَيْدِيَكُمْ
وَأَرْجُلَكُم مِّنْ خِلَٰفٍ وَلَأُصَلِّبَنَّكُمْ
فِى جُذُوعِ ٱلنَّخْلِ وَلَتَعْلَمُنَّ أَيُّنَآ
أَشَدُّ عَذَابًا وَأَبْقَىٰ ﴿٧١﴾
قَالُواْ لَن نُّؤْثِرَكَ عَلَىٰ مَا جَآءَنَا
مِنَ ٱلْبَيِّنَٰتِ وَٱلَّذِى فَطَرَنَا ۖ
فَٱقْضِ مَآ أَنتَ قَاضٍ ۖ إِنَّمَا تَقْضِى
هَٰذِهِ ٱلْحَيَوٰةَ ٱلدُّنْيَآ ﴿٧٢﴾

---

1. చూడండి, 7:117-120.
2. చూడండి, 71:23.
3. అంటే కుడిచేయి ఎడమకాలు.
4. ఇక్కడ మాంత్రికులు అవిశ్వాసులుగా ఉన్నప్పుడు ఫిర్ఔన్ను సంతోషపరచటంలో నిమగ్నులై ఉండిరి. ప్రాపంచిక వ్యామోహంలో పడి ఉండిరి, కాబట్టి: 'మేము గెలిస్తే మాకు బహుమానం దొరుకుతుంది కదా?' అని అడిగారు. కాని వారికి మార్గ దర్శకత్వం దొరికి మూసా (అ.స.) ఆరాధించే ప్రభువే నిజమైన ప్రభువు అని తెలిసినపుడు, వారు అల్లాహ్ (సు.తా.) సాన్నిధ్యాన్ని పొందటానికి ఇహలోక భోగభాగ్యాలనే కాదు, తమ జీవితాలను కూడా కోల్పోవటానికి సిద్ధపడ్డారు. ఎంత గొప్ప దైవభీతిని (తఖ్వా) కనబరచారో చూడండి.

إِنَّآ ءَامَنَّا بِرَبِّنَا لِيَغۡفِرَ لَنَا خَطَٰيَٰنَا وَمَآ أَكۡرَهۡتَنَا عَلَيۡهِ مِنَ ٱلسِّحۡرِۗ وَٱللَّهُ خَيۡرٞ وَأَبۡقَىٰٓ ٧٣

73. "నిశ్చయంగా, మేము మా ప్రభువు నందే విశ్వాసముంచాము, ఆయన (అల్లాహ్)యే మా తప్పులను మరియు నీవు బలవంతంగా మాచేత చేయించిన మంత్ర తంత్రాలను క్షమించే వాడు. (ప్రతిఫల మివ్వటంలో) అల్లాహ్‌యే సర్వశ్రేష్ఠుడు మరియు శాశ్వతంగా ఉండేవాడు (నిత్యుడు)."[1]

إِنَّهُۥ مَن يَأۡتِ رَبَّهُۥ مُجۡرِمٗا فَإِنَّ لَهُۥ جَهَنَّمَ لَا يَمُوتُ فِيهَا وَلَا يَحۡيَىٰ ٧٤

74. నిశ్చయంగా, తన ప్రభువు ముందు పాపాత్ముడిగా హాజరయ్యేవాడికి తప్పక నరకం గలదు. అందులో వాడు చావనూ లేడు బ్రతకనూ లేడు!

وَمَن يَأۡتِهِۦ مُؤۡمِنٗا قَدۡ عَمِلَ ٱلصَّٰلِحَٰتِ فَأُوْلَٰٓئِكَ لَهُمُ ٱلدَّرَجَٰتُ ٱلۡعُلَىٰ ٧٥

75. ఎవడైతే విశ్వాసిగా హాజరవుతాడో, మరియు సత్కార్యాలు చేసిఉంటాడో,[2] అలాంటి వారికి ఉన్నత స్థానాలుంటాయి -

جَنَّٰتُ عَدۡنٖ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُ خَٰلِدِينَ فِيهَاۚ وَذَٰلِكَ جَزَآءُ مَن تَزَكَّىٰ ٧٦

76. శాశ్వతమైన స్వర్గవనాలు - వాటి క్రింద సెలయేళ్ళు పారుతూ ఉంటాయి; వారందులో శాశ్వతంగా ఉంటారు. మరియు ఇదే పుణ్యవంతులకు దొరికే ప్రతిఫలం.

وَلَقَدۡ أَوۡحَيۡنَآ إِلَىٰ مُوسَىٰٓ أَنۡ أَسۡرِ بِعِبَادِي فَٱضۡرِبۡ لَهُمۡ طَرِيقٗا فِي ٱلۡبَحۡرِ يَبَسٗا لَّا تَخَٰفُ دَرَكٗا وَلَا تَخۡشَىٰ ٧٧

77. మరియు వాస్తవానికి, మేము మూసాకు దివ్యజ్ఞానం (వహీ) ద్వారా ఇలా తెలిపాము[3]: "నా దాసులను రాత్రివేళ తీసుకొని బయలుదేరు మరియు వారికొరకు సముద్రం నుండి తడిలేని మార్గాన్ని ఏర్పరచు; వెంబడించి పట్టుబడతావేమోనని భయపడకు (సముద్రంలో మునిగి పోతావేమోనని కూడా) భీతిచెందకు."[4]

---

1. అబ్‌ఖా, అల్-బా'ఖి: The Ever-Lasting. He whose existence will have no end. నిత్యుడు, శాశ్వితుడు, చిరస్థాయిగా ఉండేవాడు. చూడండి, 55:26-27, (సేకరించబడిన పదం). ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.
2. సత్కార్యాలు చేయకుండా కేవలం విశ్వసించటం మాత్రమే పునరుత్థాన దినమున ఏ విధంగాను ఉపయోగకరం కాదు. చూడండి, 6:158.
3. చూడండి, 7:130.
4. చూడండి, 26:63-66.

**78**. ఆ పిదప ఫిర్'ఔన్ తన సేనలతో వారిని వెంబడించి (అక్కడికి) చేరగానే, సముద్రం వారిని హఠాత్తుగా అలుముకొని క్రమ్ముకున్నది.

فَأَتۡبَعَهُمۡ فِرۡعَوۡنُ بِجُنُودِهِۦ فَغَشِيَهُم مِّنَ ٱلۡيَمِّ مَا غَشِيَهُمۡ ٧٨

**79**. మరియు ఫిర్'ఔన్ తనజాతి ప్రజలను మార్గభ్రష్టులుగా చేశాడు మరియు వారికి సన్మార్గం చూపలేదు.

وَأَضَلَّ فِرۡعَوۡنُ قَوۡمَهُۥ وَمَا هَدَىٰ ٧٩

**80**. ఓ ఇస్రాయీ'ల్ సంతతివారలారా: "వాస్తవానికి మేము, మిమ్మల్ని మీ శత్రువు నుండి విముక్తి కలిగించి, 'తూర్ పర్వతపు కుడివైపున మీతో వాగ్దానంచేసి, మీపై మన్న మరియు సల్వాలను అవతరింపజేశాము."[1]

يَٰبَنِيٓ إِسۡرَٰٓءِيلَ قَدۡ أَنجَيۡنَٰكُم مِّنۡ عَدُوِّكُمۡ وَوَٰعَدۡنَٰكُمۡ جَانِبَ ٱلطُّورِ ٱلۡأَيۡمَنَ وَنَزَّلۡنَا عَلَيۡكُمُ ٱلۡمَنَّ وَٱلسَّلۡوَىٰ ٨٠

**81**. (ఇంకా ఇలా అన్నాము): "మేము మీకు ప్రసాదించిన మంచి ఆహారపదార్థాలను తినండి,[2] అందు తలబిరుసుతనం చేయకండి, అలా చేస్తే నా ఆగ్రహానికి గురికాగలరు. నా ఆగ్రహానికి గురిఅయిన వాడు తప్పక నాశనమవుతాడు.

كُلُواْ مِن طَيِّبَٰتِ مَا رَزَقۡنَٰكُمۡ وَلَا تَطۡغَوۡاْ فِيهِ فَيَحِلَّ عَلَيۡكُمۡ غَضَبِيۖ وَمَن يَحۡلِلۡ عَلَيۡهِ غَضَبِي فَقَدۡ هَوَىٰ ٨١

**82**. "అయితే, ఎవడైతే పశ్చాత్తాపపడి విశ్వసించి మరియు సత్కార్యాలు చేసి సన్మార్గంలో ఉంటాడో, అలాంటి వాని పట్ల నేను క్షమాశీలుడను."[3] (3/4)

وَإِنِّي لَغَفَّارٞ لِّمَن تَابَ وَءَامَنَ وَعَمِلَ صَٰلِحٗا ثُمَّ ٱهۡتَدَىٰ ٨٢

---

**1**. చూడండి, 19:52 మరియు 2:63.

**2**. మన్న మరియు సల్వాలను గురించి చూడండి, 2:57, 7:160. మన్న ఒక తియ్యని ఆహారపదార్థం. సల్వా ఒక రకమైన పక్షి (బుర్రపిట్ట, పూరెడుపిట్ట, కోలంకిపిట్ట లాంటిది).

**3**. అల్-'గప్ఫారు: Oft-Forgiving, Most Forgiving. క్షమాశీలుడు, పాపాలను క్షమించేవాడు, ఎక్కువగా క్షమించేవాడు. ఇంకా చూడండి. అల్-గాఫిర్: క్షమాగుణ పరిపూర్ణుడు, 40:3.

۞ وَمَآ أَعۡجَلَكَ عَن قَوۡمِكَ يَٰمُوسَىٰ ٨٣

83. * మరియు (మూసా 'తూర్ పర్వతం మీద ఉన్నప్పుడు[1] అల్లాహ్ అన్నాడు): "ఓ మూసా! నీవు నీ జాతి వారిని విడిచి శీఘ్రంగా (ఇక్కడికి) వచ్చిన కారణమేమిటి?"

قَالَ هُمۡ أُوْلَآءِ عَلَىٰٓ أَثَرِي وَعَجِلۡتُ إِلَيۡكَ رَبِّ لِتَرۡضَىٰ ٨٤

84. (మూసా) జవాబిచ్చాడు: "అదిగో! వారు నా వెనుక నా అడుగుజాడలలో వస్తూనే ఉన్నారు; నీవు నా పట్ల ప్రసన్నుడవు కావాలని, ఓ నా ప్రభూ! నేను త్వరత్వరగా నీ సాన్నిధ్యానికి వచ్చాను."[2]

قَالَ فَإِنَّا قَدۡ فَتَنَّا قَوۡمَكَ مِنۢ بَعۡدِكَ وَأَضَلَّهُمُ ٱلسَّامِرِيُّ ٨٥

85. (అల్లాహ్) అన్నాడు: "వాస్తవానికి! నీ వెనుక మేము, నీ జాతి వారిని పరీక్షకు గురిచేశాము మరియు సామిరి వారిని మార్గభ్రష్టులుగా చేశాడు."

فَرَجَعَ مُوسَىٰٓ إِلَىٰ قَوۡمِهِۦ غَضۡبَٰنَ أَسِفٗاۚ قَالَ يَٰقَوۡمِ أَلَمۡ يَعِدۡكُمۡ رَبُّكُمۡ وَعۡدًا حَسَنًاۚ أَفَطَالَ عَلَيۡكُمُ ٱلۡعَهۡدُ أَمۡ أَرَدتُّمۡ أَن يَحِلَّ عَلَيۡكُمۡ غَضَبٞ مِّن رَّبِّكُمۡ فَأَخۡلَفۡتُم مَّوۡعِدِي ٨٦

86. ఆ తరువాత మూసా కోపంతోనూ, విచారంతోనూ, తన జాతివారి వద్దకు తిరిగి వచ్చి అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! ఏమీ? మీ ప్రభువు మీకు మంచి వాగ్దానం చేయలేదా? ఏమీ? ఒడంబడిక పూర్తి కావటంలో ఏమైనా ఆలస్యమయిందా? లేదా! మీ ప్రభువు యొక్క ఆగ్రహం మీపై విరుచుకుపడాలని కోరుతున్నారా? అందుకేనా మీరు నాకు చేసిన వాగ్దానాన్ని భంగపరచారు?"

---

అల్-'గఫూరు: క్షమించేవాడు, 2:173, అల్-'గప్ఫారు మరియు అల్-'గఫూరు అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

1. చూడండి, 2:51 మరియు 7:142.

2. ఇక్కడ స్పష్టమయ్యేది ఏమిటంటే ఒకజాతి చాలా కాలంవరకు దాస్యంలో ఉండి అకస్మాత్తుగా దానికి స్వాతంత్ర్యం దొరికితే, అది తన భూతకాలపు క్రమశిక్షణలేని స్వభావాన్ని ఒకేసారి మార్చుకోలేదు. కాబట్టి ముందు తెలుపబడినట్లు, మూసా ('అ.స.) వెళ్ళిపోగానే, అతని జాతివారు, ఆవుదూడను ఆరాధ్య దైవంగా చేసుకున్నారు. ఎందుకంటే, అంతకు ముందు వారు ఈజిప్టులో విగ్రహారాధనకు అలవాటుపడి ఉండేవారు.

قَالُواْ مَآ أَخۡلَفۡنَا مَوۡعِدَكَ بِمَلۡكِنَا وَلَٰكِنَّا حُمِّلۡنَآ أَوۡزَارٗا مِّن زِينَةِ ٱلۡقَوۡمِ فَقَذَفۡنَٰهَا فَكَذَٰلِكَ أَلۡقَى ٱلسَّامِرِيُّ ﴿٨٧﴾

**87**. వారు అన్నారు: "మేము నీకు చేసిన వాగ్దానాన్ని మాకు మేమై భంగపరచలేదు. కాని మాపై ప్రజల ఆభరణాల భారం మోపబడి ఉండింది, దానిని (అగ్నిలోకి) విసిరాము, ఇదేవిధంగా సామిరి కూడా వేశాడు."

فَأَخۡرَجَ لَهُمۡ عِجۡلٗا جَسَدٗا لَّهُۥ خُوَارٞ فَقَالُواْ هَٰذَآ إِلَٰهُكُمۡ وَإِلَٰهُ مُوسَىٰ فَنَسِيَ ﴿٨٨﴾

**88**. తరువాత అతడు (సామిరి) వారికొరక ఆవుదూడ విగ్రహాన్ని తయారుచేశాడు. దాని నుండి ఆవుదూడ అరుపువంటి శబ్దం వచ్చేది.[1] పిదప వారన్నారు: "ఇదే మీ ఆరాధ్య దైవం మరియు మూసా యొక్క ఆరాధ్య దైవం కూడాను, కాని అతను దానిని మరచిపోయాడు."

أَفَلَا يَرَوۡنَ أَلَّا يَرۡجِعُ إِلَيۡهِمۡ قَوۡلٗا وَلَا يَمۡلِكُ لَهُمۡ ضَرّٗا وَلَا نَفۡعٗا ﴿٨٩﴾

**89**. ఏమీ? అది వారి కెలాంటి సమాధాన మివ్వజాలదనీ మరియు వారికెలాంటి కీడు గానీ, మేలు గానీ చేయజాలదని వారు చూడటం లేదా?[2]

وَلَقَدۡ قَالَ لَهُمۡ هَٰرُونُ مِن قَبۡلُ يَٰقَوۡمِ إِنَّمَا فُتِنتُم بِهِۦۖ وَإِنَّ رَبَّكُمُ ٱلرَّحۡمَٰنُ فَٱتَّبِعُونِي وَأَطِيعُوٓاْ أَمۡرِي ﴿٩٠﴾

**90**. మరియు వాస్తవానికి హారూన్ ఇంతకు ముందు వారితో చెప్పి ఉన్నాడు: "ఓ నా జాతి ప్రజలారా! దీని (ఈ విగ్రహం)తో మీరు పరీక్షింపబడుతున్నారు. మరియు నిశ్చయంగా ఆ అనంత కరుణామయుడే మీ ప్రభువు! కావున మీరు నన్నే అనుసరించండి మరియు నా ఆజ్ఞనే పాలించండి."

---

**1**. చూడండి, 7:148.

**2**. అల్లాహ్ (సు.తా.) వారి బుద్ధిహీనతను స్పష్టంచేస్తున్నాడు. ఆ ఆవుదూడ వారి ప్రశ్నకు సమాధాన మివ్వజాలదూ మరియు వారికెలాంటి లాభం గానీ నష్టం గానీ చేయజాలదూ, అని తెలిసికూడా వారు దానిని ఆరాధించడం, బుద్ధిహీనత కాక మరేమిటి? ఆరాధ్య దేవుడు అల్లాహ్ (సు.తా.) మాత్రమే, ఆయనే తన దాసుల మొర వింటాడు మరియు వారికి లాభం గానీ, నష్టం గానీ చేయగల శక్తిసామర్థ్యాలు కలిగి ఉన్నాడు.

91. వారన్నారు: "మూసా తిరిగి మావద్దకు వచ్చేవరకు, మేము దీనిని ఆరాధించకుండా ఉండలేము."

92. (మూసా, హారూన్‌తో) అన్నాడు: "ఓ హారూన్! నీవు వారిని మార్గభ్రష్టత్వంలో పడటం చూసినప్పుడు (వారిని వారించకుండా) నిన్ను ఎవరు ఆపారు?

93. "నీ వెందుకు నన్ను అనుసరించ లేదు? నీవు కూడా నా ఆజ్ఞను ఉల్లంఘించావా?"[1]

94. (హారూన్) అన్నాడు: "నా తల్లి కుమారుడా (సోదరుడా)! నా గడ్డాన్ని గానీ, నా తల వెంట్రుకలను గానీ పట్టి లాగకు. 'వాస్తవానికి ఇస్రాయీ'ల్ సంతతి వారిలో విభేదాలు కల్పించావు, నీవు నా మాటను లక్ష్యపెట్టలేదు.' అని, నీవు అంటావేమోనని నేను భయపడ్డాను."[2]

95. (మూసా) అన్నాడు: "ఓ సామిరీ! ఇక నీ సంగతేమిటీ?"

96. (సామిరీ) అన్నాడు: "వారు చూడని దానిని నేను చూశాను. ఆ తరువాత నేను సందేశహరుని (జిబ్రీల్)[3] పాదగుర్తుల నుండి ఒక పిడికెడు (మట్టిని) తీసుకొని దాని (ఆవుదూడ విగ్రహం) మీద వేశాను మరియు నా ఆత్మ నన్ను ఈ విధంగా ప్రేరేపించింది."

قَالُواْ لَن نَّبۡرَحَ عَلَيۡهِ عَٰكِفِينَ حَتَّىٰ
يَرۡجِعَ إِلَيۡنَا مُوسَىٰ ٩١
قَالَ يَٰهَٰرُونُ مَا مَنَعَكَ إِذۡ رَأَيۡتَهُمۡ
ضَلُّوٓاْ ٩٢
أَلَّا تَتَّبِعَنِۖ أَفَعَصَيۡتَ أَمۡرِي
٩٣
قَالَ يَبۡنَؤُمَّ لَا تَأۡخُذۡ بِلِحۡيَتِي وَلَا
بِرَأۡسِيٓۖ إِنِّي خَشِيتُ أَن تَقُولَ
فَرَّقۡتَ بَيۡنَ بَنِيٓ إِسۡرَٰٓءِيلَ وَلَمۡ
تَرۡقُبۡ قَوۡلِي ٩٤
قَالَ فَمَا خَطۡبُكَ يَٰسَٰمِرِيُّ ٩٥
قَالَ بَصُرۡتُ بِمَا لَمۡ يَبۡصُرُواْ بِهِۦ
فَقَبَضۡتُ قَبۡضَةٗ مِّنۡ أَثَرِ
ٱلرَّسُولِ فَنَبَذۡتُهَا وَكَذَٰلِكَ
سَوَّلَتۡ لِي نَفۡسِي ٩٦

1. చూడండి, 7:142.
2. దీని వివరాలకు చూడండి, 7:150.
3. చాలామంది వ్యాఖ్యాతలు రసూల్ అంటే ఇక్కడ జిబ్రీల్ ('అ.స.) అనే వ్యాఖ్యానించారు.

97. (మూసా) అన్నాడు: "సరే వెళ్ళిపో! నిశ్చయంగా, నీ శిక్ష ఏమిటంటే, నీవు జీవితాంతం 'నన్ను ముట్టవద్దు' (లా మిసాస) అని, అంటూ ఉంటావు. మరియు నిశ్చయంగా, నీకు (వచ్చే జీవితంలో శిక్ష) నిర్ణయించబడి ఉంది, దానినుండి నీవు తప్పించుకోలేవు. ఇక నీవు, భక్తుడవైన నీ ఆరాధ్యదైవాన్ని చూడు! మేము దానిని నిశ్చయంగా, కాల్చుతాము తరువాత దానిని భస్మంచేసి సముద్రంలో విసిరివేస్తాము."[1]

قَالَ فَٱذۡهَبۡ فَإِنَّ لَكَ فِي ٱلۡحَيَوٰةِ أَن تَقُولَ لَا مِسَاسَۖ وَإِنَّ لَكَ مَوۡعِدٗا لَّن تُخۡلَفَهُۥۖ وَٱنظُرۡ إِلَىٰٓ إِلَٰهِكَ ٱلَّذِي ظَلۡتَ عَلَيۡهِ عَاكِفٗاۖ لَّنُحَرِّقَنَّهُۥ ثُمَّ لَنَنسِفَنَّهُۥ فِي ٱلۡيَمِّ نَسۡفًا ٩٧

98. నిశ్చయంగా, మీ ఆరాధ్య దైవం అల్లాహ్ మాత్రమే. ఆయన తప్ప మరొక ఆరాధ్యుడు లేడు. ఆయన జ్ఞానం ప్రతిదానిని ఆవరించి ఉంది.

إِنَّمَآ إِلَٰهُكُمُ ٱللَّهُ ٱلَّذِي لَآ إِلَٰهَ إِلَّا هُوَۚ وَسِعَ كُلَّ شَيۡءٍ عِلۡمٗا ٩٨

99. (ఓ ము'హమ్మద్!) ఈ విధంగా మేము పూర్వం జరిగిన గాథలను నీకు వినిపిస్తున్నాము. మరియు వాస్తవంగా మేము, మా తరఫునుండి నీకు హితోపదేశాన్ని (ఈ ఖుర్ఆన్‌ను) ప్రసాదించాము.

كَذَٰلِكَ نَقُصُّ عَلَيۡكَ مِنۡ أَنۢبَآءِ مَا قَدۡ سَبَقَۚ وَقَدۡ ءَاتَيۡنَٰكَ مِن لَّدُنَّا ذِكۡرٗا ٩٩

100. దీని నుండి ముఖం త్రిప్పుకునే వాడు పునరుత్థాన దినమున (గొప్ప పాప) భారాన్ని భరిస్తాడు.

مَّنۡ أَعۡرَضَ عَنۡهُ فَإِنَّهُۥ يَحۡمِلُ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ وِزۡرًا ١٠٠

101. అదే స్థితిలో వారు శాశ్వతంగా ఉంటారు. పునరుత్థాన దినమున వారికాభారం ఎంతో దుర్భరమైనదిగా ఉంటుంది.

خَٰلِدِينَ فِيهِۖ وَسَآءَ لَهُمۡ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ حِمۡلٗا ١٠١

1. దీనితో విశదమయ్యేదేమిటంటే, షిర్క్ వైపుకు మరల్చే ప్రతిదానిని నాశనం చేయాలి. అది జిబ్రీల్ ('అ.స.) పాదగుర్తుల మట్టి అయినా సరే! దానిని ప్రసాదంగా బావించి ఆరాధిస్తే, అదికూడా షిర్కే.

102. ఆ దినమున బాకా ('సూర్) ఊదబడుతుంది.[1] మరియు మేము అపరాధులను ఒకచోట జమచేస్తాము. ఆ రోజు వారి కళ్ళు (భయంతో) నీలమై పోతాయి.

يَوْمَ يُنفَخُ فِي ٱلصُّورِ ۚ وَنَحْشُرُ ٱلْمُجْرِمِينَ يَوْمَئِذٍ زُرْقًا ﴿١٠٢﴾

103. వారు ఒకరితోనొకరు ఇలా గుసగుస లాడుకుంటారు: "మీరు (భూమిలో) పది (రోజుల) కంటే ఎక్కువ ఉండలేదు."[2]

يَتَخَٰفَتُونَ بَيْنَهُمْ إِن لَّبِثْتُمْ إِلَّا عَشْرًا ﴿١٠٣﴾

104. వారు ఏమి మాట్లాడుకుంటున్నారో మాకు బాగా తెలుసు. వారిలో మంచి తెలివి గలవారు: "మీరు కేవలం ఒక్కదినం మాత్రమే ఉన్నారు!" అని అంటారు.

نَّحْنُ أَعْلَمُ بِمَا يَقُولُونَ إِذْ يَقُولُ أَمْثَلُهُمْ طَرِيقَةً إِن لَّبِثْتُمْ إِلَّا يَوْمًا ﴿١٠٤﴾

105. మరియు వారు నిన్ను పర్వతాలను గురించి అడుగుతున్నారు. వారితో అను: "నా ప్రభువు వాటిని ధూళిగా మార్చి ఎగురవేస్తాడు.

وَيَسْـَٔلُونَكَ عَنِ ٱلْجِبَالِ فَقُلْ يَنسِفُهَا رَبِّى نَسْفًا ﴿١٠٥﴾

106. "ఆ తరువాత దానిని (భూమిని) చదునైన మైదానంగా చేసివేస్తాడు.

فَيَذَرُهَا قَاعًا صَفْصَفًا ﴿١٠٦﴾

107. "నీవు దానిలో ఎలాంటి పల్లం గానీ, మిట్ట గానీ చూడలేవు."[3]

لَّا تَرَىٰ فِيهَا عِوَجًا وَلَآ أَمْتًا ﴿١٠٧﴾

---

1. 'సూర్: అంటే ఖర్న్, బాకా. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞతో ఇస్రాఫీల్ ('అ.స.) దానిని ఊదుతారు. అప్పుడు పునరుత్థానం ఆవరిస్తుంది. (ముస్నద్ అ'హ్మద్, 2/191) దాదాపు ఇలాంటి 'హదీసే' తిర్మిజీ'లో కూడా ఉంది. మొదటి శబ్దంతో అందరూ మరణిస్తారు. రెండవసారి బాకా ఊదగానే అందరూ తిరిగి సజీవులుగా లేచి వస్తారు.
2. ఈ విధమైన ఆయత్ల కొరకు చూడండి, 2:259, 17:52, 18:19, 23:112-113, 30:55, 79:46.
3. చూడండి, 14:48.

يَوۡمَئِذٖ يَتَّبِعُونَ ٱلدَّاعِيَ لَا عِوَجَ لَهُۥۖ وَخَشَعَتِ ٱلۡأَصۡوَاتُ لِلرَّحۡمَٰنِ فَلَا تَسۡمَعُ إِلَّا هَمۡسٗا ١٠٨

108. ఆ రోజు అందరూ పిలిచే వానిని వెంబడిస్తారు, అతని నుండి తొలగిపోరు.[1] అనంత కరుణామయుని ముందు వారి కంఠస్వరాలన్నీ అణిగిపోయి ఉంటాయి, కావున నీవు గొణుగులు తప్పమరేమీ వినలేవు.

يَوۡمَئِذٖ لَّا تَنفَعُ ٱلشَّفَٰعَةُ إِلَّا مَنۡ أَذِنَ لَهُ ٱلرَّحۡمَٰنُ وَرَضِيَ لَهُۥ قَوۡلٗا ١٠٩

109. ఆ రోజు సిఫారసు ఏ మాత్రం పనికిరాదు. కానీ! అనంత కరుణామయుడు ఎవరికైనా అనుమతినిచ్చి, అతని మాట ఆయనకు సమ్మతమైనదైతేనే తప్ప![2]

يَعۡلَمُ مَا بَيۡنَ أَيۡدِيهِمۡ وَمَا خَلۡفَهُمۡ وَلَا يُحِيطُونَ بِهِۦ عِلۡمٗا ١١٠

110. (ఎందుకంటే!) ఆయనకు - వారికి ప్రత్యక్షంగా నున్నది మరియు పరోక్షంగా నున్నది - అంతా తెలుసు, కాని వారు తమ జ్ఞానంతో ఆయనను గ్రహించజాలరు.[3] (7/8)

۞ وَعَنَتِ ٱلۡوُجُوهُ لِلۡحَيِّ ٱلۡقَيُّومِۖ وَقَدۡ خَابَ مَنۡ حَمَلَ ظُلۡمٗا ١١١

111. * మరియు సజీవుడు విశ్వవ్యవస్థకు ఆధారభూతుడు (శాశ్వితుడు) అయిన, ఆయన (అల్లాహ్) ముందు అందరి ముఖాలు నమ్రతతో వంగిఉంటాయి. మరియు దుర్మార్గాన్ని అవలంబించిన వాడు, నిశ్చయంగా విఫలుడవుతాడు.[4]

---

1. ఆ పిలిచే వాని నుండి తప్పించుకొని అటూ ఇటూ పోకుండా అతనివెంబడే పోతారు.
2. ఈ విధమైన ఆయత్ ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు వచ్చింది. చూడండి, 53:26, 21:28, 34:23, 10:3, 78:38, 2:255, 19:87 మొదలైనవి.
3. అల్లాహ్ (సు.తా.)కు ప్రతి ఒక్కరి విషయం తెలుసు, కాబట్టి ఎవరు ఎక్కువ సత్పురుషులో ఆయనకు బాగా తెలుసు. అల్లాహ్ (సు.తా.) తప్ప మరెవ్వరూ అది ఎరుగరు. కావున సిఫారసు చేసే అర్హతగల వానిని ఆయనే ఎన్నుకుంటాడు.
4. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'ప్రతివానికి అతని హక్కు చెల్లించండి. లేకుంటే పునరుత్థాన దినమున ఇవ్వవలసి ఉంటుంది.' మరొక 'హదీస్'లో ఉంది: 'దుర్మార్గం నుండి దూరంగా ఉండండి, షిర్క్ మహా దుర్మార్గం (''జుల్మెఅ''జీమ్), అది క్షమించబడదు.' ('స. ముస్లిం).

112. మరియు సత్కార్యాలు చేస్తూ, విశ్వాసియై ఉన్నవానికి ఎలాంటి అన్యాయం గానీ, నష్టం గానీ జరుగునేమోనని భయపడే అవసరం ఉండదు.[1]

وَمَن يَعْمَلْ مِنَ ٱلصَّٰلِحَٰتِ وَهُوَ مُؤْمِنٌ فَلَا يَخَافُ ظُلْمًا وَلَا هَضْمًا ﴿١١٢﴾

113. మరియు ఈ విధంగా, మేము ఈ ఖుర్ఆన్‌ను 'అరబ్బీ భాషలో క్రమక్రమంగా అవతరింపజేశాము. మరియు ఇందులో పలురకాల హెచ్చరికలు చేశాము. బహుశా దానితో వారు దైవభీతి కలిగి ఉంటారేమోనని; లేదా! దానితో వారు ఉపదేశం గ్రహిస్తారేమోనని.[2]

وَكَذَٰلِكَ أَنزَلْنَٰهُ قُرْءَانًا عَرَبِيًّا وَصَرَّفْنَا فِيهِ مِنَ ٱلْوَعِيدِ لَعَلَّهُمْ يَتَّقُونَ أَوْ يُحْدِثُ لَهُمْ ذِكْرًا ﴿١١٣﴾

114. అల్లాహ్ అత్యున్నతుడు, సార్వభౌముడు,[3] పరమ సత్యుడు. (ఓ ము'హమ్మద్!) నీకు ఖుర్ఆన్ సందేశం (వ'హీ) పూర్తిగా అవతరింపజేయబడేవరకు దానిని గురించి తొందరపడకు. మరియు ఇలా ప్రార్థించు: "ఓ నా ప్రభూ! నా జ్ఞానాన్ని వృద్ధిపరచు!"[4]

فَتَعَٰلَى ٱللَّهُ ٱلْمَلِكُ ٱلْحَقُّ ۗ وَلَا تَعْجَلْ بِٱلْقُرْءَانِ مِن قَبْلِ أَن يُقْضَىٰٓ إِلَيْكَ وَحْيُهُۥ ۖ وَقُل رَّبِّ زِدْنِى عِلْمًا ﴿١١٤﴾

115. మరియు వాస్తవానికి, మేము ఇంతకు పూర్వం ఆదమ్‌తో ఒక వాగ్దానం చేయించి ఉన్నాము, కాని అతడు దానిని మరచిపోయాడు మరియు మేము అతనిలో స్థిరత్వాన్ని చూడలేదు.[5]

وَلَقَدْ عَهِدْنَآ إِلَىٰٓ ءَادَمَ مِن قَبْلُ فَنَسِىَ وَلَمْ نَجِدْ لَهُۥ عَزْمًا ﴿١١٥﴾

---

1. చూడండి, 16:96-97.

2. చూడండి, 12:2, 13:37, 14:4, 19:97.

3. అల్-మలికు: చూడండి, 23:116, 59:23, 62:1, Sovereign, సార్వభౌముడు, విశ్వాధిపతి. అల్-మలీక్: Mighty Emperor, చక్రవర్తి, సర్వాధికారి, 54:55. మాలికు: Master, Owner, ప్రతిదాని నిజ స్వామి, చూడండి, 1:4. మాలికుల్-ముల్క్: Sovereign, of the Universe, విశ్వ సామ్రాట్టు, విశ్వసామ్రాజ్యాధిపతి, చూడండి, 3:26.

4. 'ఖుర్ఆన్ అవతరణకు చూడండి, 75:16-19 మరియు 25:32.

5. ఆ వాగ్దానం ఏమిటంటే ఒక ప్రత్యేక వృక్షపు దరిదాపులకు పోగూడదని, అంటే ఆ వృక్షపు ఫలాలు తినకూడదని. కాని షైతాన్ అతనిని('అ.స.) మరియు అతని ('అ.స.) భార్యను తన

وَإِذْ قُلْنَا لِلْمَلَٰٓئِكَةِ ٱسْجُدُوا۟ لِءَادَمَ فَسَجَدُوٓا۟ إِلَّآ إِبْلِيسَ أَبَىٰ ﴿١١٦﴾

**116**. మరియు మేము దేవదూతలతో: "ఆదమ్‌కు[1] సాష్టాంగం (సజ్దా) చేయండి." అని ఆజ్ఞాపించినపుడు ఒక్క ఇబ్లీస్ తప్ప అందరూ సాష్టాంగం (సజ్దా) చేశారు. అతడు నిరాకరించాడు.

فَقُلْنَا يَٰٓـَٔادَمُ إِنَّ هَٰذَا عَدُوٌّ لَّكَ وَلِزَوْجِكَ فَلَا يُخْرِجَنَّكُمَا مِنَ ٱلْجَنَّةِ فَتَشْقَىٰٓ ﴿١١٧﴾

**117**. అప్పుడు అన్నాము: "ఓ ఆదమ్! నిశ్చయంగా, ఇతడు నీకు మరియు నీ భార్యకు శత్రువు, కాబట్టి ఇతడిని, మీ ఇద్దరిని స్వర్గంనుండి వెడలగొట్టనివ్వకండి అలా అయితే మీరు దురవస్థకు గురి కాగలరు.[2]

إِنَّ لَكَ أَلَّا تَجُوعَ فِيهَا وَلَا تَعْرَىٰ ﴿١١٨﴾

**118**. "నిశ్చయంగా, ఇక్కడ నీవు ఆకలి గొనవూ మరియు వస్త్రహీనుడవూ (దిగంబరుడవూ) కావు.[3]

وَأَنَّكَ لَا تَظْمَؤُا۟ فِيهَا وَلَا تَضْحَىٰ ﴿١١٩﴾

**119**. "మరియు నిశ్చయంగా ఇందులో నీకు దాహమూ కలుగదు మరియు ఎండకూడా తగలదు."

فَوَسْوَسَ إِلَيْهِ ٱلشَّيْطَٰنُ قَالَ يَٰٓـَٔادَمُ هَلْ أَدُلُّكَ عَلَىٰ شَجَرَةِ ٱلْخُلْدِ وَمُلْكٍ لَّا يَبْلَىٰ ﴿١٢٠﴾

**120**. అప్పుడు షైఀతాన్ అతని మనస్సులో కలతలు రేకెత్తిస్తూ అన్నాడు: "ఓ ఆదమ్! శాశ్వత జీవితాన్ని మరియు అంతంకాని సామ్రాజ్యాన్ని, ఇచ్చే వృక్షాన్ని నీకు చూపనా?"

---

వలలోకి తీసుకొని: 'ఆ వృక్షపు ఫలాలను తినటంవల్ల మీరు చిరంజీవులవుతారు.' అని చెప్పి, వారిచేత ఆ ఫలాన్ని తినిపించి, అల్లాహ్ (సు.తా.)తో చేసిన వాగ్దానాన్ని భంగం చేయించాడు.

1. ఆదమ్ (ఀఅ.స.) గాథ కొరకు చూడండి, 2:30-34, 15:28-34.

2. తష్ఖా: అంటే ప్రయాస, కష్టం, కఠినం. ఏమిటంటే, స్వర్గంలో మానవుని అత్యవసర వసతులు అంటే ఆహారపానీయాలు, వస్త్రాలు మరియు నివాసం అన్నీ కోరినవెంటనే లభిస్తాయి. వాటికొరకు కష్టపడే అవసరం వుండదు. కాని, ఇహలోకంలో వాటి కొరకు మానవుడు ప్రయాసపడుతూ వుంటాడు. అదే దీని అర్థం.

3. చూడండి, 7:20-22.

121. ఆ పిదప వారిద్దరు దాని నుండి (ఫలాన్ని) తినగానే వారిద్దరికి, వారి దిగంబరత్వం వ్యక్తం కాసాగింది.[1] మరియు వారిద్దరు స్వర్గపు ఆకులను తమ మీద కప్పుకోసాగారు. (ఈ విధంగా) ఆదమ్ తన ప్రభువు ఆజ్ఞను ఉల్లంఘించి, సన్మార్గం నుండి తప్పిపోయాడు.

فَأَكَلَا مِنْهَا فَبَدَتْ لَهُمَا سَوْءَٰتُهُمَا وَطَفِقَا يَخْصِفَانِ عَلَيْهِمَا مِن وَرَقِ ٱلْجَنَّةِ ۚ وَعَصَىٰٓ ءَادَمُ رَبَّهُۥ فَغَوَىٰ ﴿١٢١﴾

122. ఆ తరువాత అతని ప్రభువు, అతనిని (తన కారుణ్యానికి) ఎన్నుకొని, అతని పశ్చాత్తాపాన్ని స్వీకరించి, అతనికి మార్గదర్శకత్వం చేశాడు.

ثُمَّ ٱجْتَبَٰهُ رَبُّهُۥ فَتَابَ عَلَيْهِ وَهَدَىٰ ﴿١٢٢﴾

123. (అల్లాహ్) అన్నాడు: "మీరిద్దరూ కలసి ఇక్కడినుండి దిగిపోండి. మీరు ఒకరికొకరు శత్రువులై[2] ఉంటారు. కాని నా తరఫునుండి మీకు మార్గదర్శకత్వం తప్పక వస్తూ ఉంటుంది, కావున నా మార్గదర్శకత్వాన్ని అనుసరించే వాడు మార్గభ్రష్టుడూ కాడు మరియు దురవస్థకూ గురికాడు.

قَالَ ٱهْبِطَا مِنْهَا جَمِيعًۢا ۖ بَعْضُكُمْ لِبَعْضٍ عَدُوٌّ ۖ فَإِمَّا يَأْتِيَنَّكُم مِّنِّى هُدًى فَمَنِ ٱتَّبَعَ هُدَاىَ فَلَا يَضِلُّ وَلَا يَشْقَىٰ ﴿١٢٣﴾

124. "మరియు ఎవడైతే నా సందేశం నుండి విముఖుడవుతాడో నిశ్చయంగా, అతని జీవితం ఇరుకైపోతుంది మరియు పునరుత్థాన దినమున అతనిని అంధునిగా లేపుతాము."

وَمَنْ أَعْرَضَ عَن ذِكْرِى فَإِنَّ لَهُۥ مَعِيشَةً ضَنكًا وَنَحْشُرُهُۥ يَوْمَ ٱلْقِيَٰمَةِ أَعْمَىٰ ﴿١٢٤﴾

125. అప్పుడతడు అంటాడు: "ఓ నా ప్రభూ! నన్నెందుకు గ్రుడ్డివానిగా లేపావు, వాస్తవానికి నేను (ప్రపంచంలో) చూడ గలిగేవాణ్ణి కదా?"

قَالَ رَبِّ لِمَ حَشَرْتَنِىٓ أَعْمَىٰ وَقَدْ كُنتُ بَصِيرًا ﴿١٢٥﴾

---

1. వారి దిగంబరత్వం వ్యక్తం కాసాగింది. చూడండి, 7:26-27.
2. అంటే మానవుడు మరియు షైతాన్ చూడండి, 7:24 మరియు 2:36.

قَالَ كَذَٰلِكَ أَتَتۡكَ ءَايَٰتُنَا فَنَسِيتَهَاۖ وَكَذَٰلِكَ ٱلۡيَوۡمَ تُنسَىٰ ١٢٦

**126**. అప్పుడు (అల్లాహ్) అంటాడు: "మా సూచనలు నీ వద్దకు వచ్చినపుడు, నీవు వాటిని విస్మరించావు. మరియు అదేవిధంగా ఈ రోజు నీవు విస్మరించబడుతున్నావు."

وَكَذَٰلِكَ نَجۡزِي مَنۡ أَسۡرَفَ وَلَمۡ يُؤۡمِنۢ بِـَٔايَٰتِ رَبِّهِۦۚ وَلَعَذَابُ ٱلۡأٓخِرَةِ أَشَدُّ وَأَبۡقَىٰٓ ١٢٧

**127**. మరియు ఈ విధంగా, మేము మితిమీరి ప్రవర్తిస్తూ తనప్రభువు సూచనలను విశ్వసించని వానికి ప్రతీకారం చేస్తాము. మరియు పరలోక శిక్ష ఎంతో కఠినమైనది మరియు శాశ్వతమైనది.

أَفَلَمۡ يَهۡدِ لَهُمۡ كَمۡ أَهۡلَكۡنَا قَبۡلَهُم مِّنَ ٱلۡقُرُونِ يَمۡشُونَ فِي مَسَٰكِنِهِمۡۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَٰتٖ لِّأُوْلِي ٱلنُّهَىٰ ١٢٨

**128**. వీరికి పూర్వం గడిచిన ఎన్నోతరాలను మేము నాశనం చేసి ఉన్నాము. వీరు వారి నివాసస్థలాలలో తిరుగుతున్నారు. ఏమీ? దీని వలన కూడా వీరికి మార్గదర్శకత్వం లభించలేదా? నిశ్చయంగా, ఇందులో అర్థం చేసుకొనే వారికి ఎన్నో సూచనలున్నాయి.

وَلَوۡلَا كَلِمَةٞ سَبَقَتۡ مِن رَّبِّكَ لَكَانَ لِزَامٗا وَأَجَلٞ مُّسَمّٗى ١٢٩

**129**. మరియు నీ ప్రభువు నుండి మొదట్లోనే ఒక గడువు కాలం నిర్ణయించబడి ఉండకపోతే, వీరికి ఈ పాటికే (శిక్ష) తప్పక విధించబడి ఉండేది. కాని (వీరి) గడువు కాలం నిర్ణయించబడి ఉంది.[1]

---

**1**. అల్లాహ్ (సు.తా.) పాపం చేసేవారిని వెనువెంటనే శిక్షిస్తే ప్రపంచంలో ఒక్కడు కూడా శిక్షించబడకుండా ఉండడు. ఇది అల్లాహ్(సు.తా.)కు తెలుసు, కాబట్టి ఆయన (సు.తా.) ప్రతి ఒక్కరికి పశ్చాత్తాపపడటానికి గడువు ఇస్తాడు. ఇదే అల్లాహ్ (సు.తా.) విధానం (సాంప్రదాయం). ఇక ఆ సమయం వచ్చిన తరువాత ఆయన శిక్షనుండి తప్పించేవారు ఎవ్వరూ ఉండరు. అందుకే నీవు సత్యతిరస్కారులను భోగభాగ్యాలతో విర్రవీగుతూ ఉండటాన్ని చూస్తున్నావు. చూడండి,10:11,16:61,18:58.

فَٱصۡبِرۡ عَلَىٰ مَا يَقُولُونَ وَسَبِّحۡ بِحَمۡدِ رَبِّكَ قَبۡلَ طُلُوعِ ٱلشَّمۡسِ وَقَبۡلَ غُرُوبِهَاۖ وَمِنۡ ءَانَآيِٕ ٱلَّيۡلِ فَسَبِّحۡ وَأَطۡرَافَ ٱلنَّهَارِ لَعَلَّكَ تَرۡضَىٰ ﴿١٣٠﴾

**130**. కావున (ఓ ము'హమ్మద్!) వారు పలికే మాటలకు నీవు ఓర్పు వహించు. సూర్యుడు ఉదయించక ముందు మరియు అస్తమించక ముందు నీ ప్రభువు పవిత్రతను కొనియాడుతూ, ఆయన స్తోత్రం చెయ్యి. మరియు రాత్రి సమయాలలో మరియు పగటి వేళలలో కూడా ఆయన పవిత్రతను కొనియాడు.[1] అప్పుడు నీవు సంతుష్టుడవు అవుతావు!

وَلَا تَمُدَّنَّ عَيۡنَيۡكَ إِلَىٰ مَا مَتَّعۡنَا بِهِۦٓ أَزۡوَٰجٗا مِّنۡهُمۡ زَهۡرَةَ ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَا لِنَفۡتِنَهُمۡ فِيهِۚ وَرِزۡقُ رَبِّكَ خَيۡرٞ وَأَبۡقَىٰ ﴿١٣١﴾

**131**. మేము వారిలో చాలా మందికి - వాటితో వారిని పరీక్షించటానికి - వారు అనుభవించటానికి, ఇచ్చిన ఇహలోక జీవిత శోభను నీవు కళ్ళెత్తి చూడకు.[2] నీ ప్రభువు ఇచ్చే జీవనోపాధియే అత్యుత్తమమైనది మరియు చిరకాలముండేది.[3]

وَأۡمُرۡ أَهۡلَكَ بِٱلصَّلَوٰةِ وَٱصۡطَبِرۡ عَلَيۡهَاۖ لَا نَسۡـَٔلُكَ رِزۡقٗاۖ نَّحۡنُ نَرۡزُقُكَۗ وَٱلۡعَٰقِبَةُ لِلتَّقۡوَىٰ ﴿١٣٢﴾

**132**. మరియు నీ కుటుంబం వారిని నమా'జ్ చేయమని ఆజ్ఞాపించు మరియు స్వయంగా నీవు కూడా దానిని సహనంతో పాటించు. మేము నీ నుండి జీవనోపాధిని ఆశించము. మేమే నీకు జీవనోపాధిని ఇచ్చేవారము. చివరకు దైవభీతి గలవారిదే ఉత్తమ ముగింపు.

---

1. చూడండి, 11:114.
2. ఇలాంటి సందేశానికి చూడండి, 3:196-197,15:88 మరియు 18:7 మొదలైనవి.
3. ఒకసారి 'ఉమర్ (ర'ది.'అ.) దైవప్రవక్త ('స'అస) దగ్గరికి వచ్చారు. అతను ఒక చాపమీద పండుకొని ఉన్నది చూసి ఏడ్వసాగారు. అతని ఇంట్లో రెండు చర్మాల కంటే ఎక్కువ ఏమీ లేవు. దైవప్రవక్త ('స'అస) అతని ఏడ్పుకు కారణమడగగా, 'ఉమర్ (ర'ది.'అ.) ఇలా జవాబిచ్చారు: ' 'ఖైసర్ మరియు కిస్రాలు ఎన్నో భోగభాగ్యాలలో మునిగిఉన్నారు. మీరేమో అత్యుత్తమ సృష్టి అయికూడా ఈ స్థితిలో ఉన్నారు.' దానికి దైవప్రవక్త ('స'అస) అన్నారు: " 'ఉమర్ (ర'ది.'అ.) నీకు ఇంకా సందేహముందా? ఎవరికైతే కేవలం ఇహలోకంలోనే భోగభాగ్యాలు ఇవ్వబడ్డాయో వారే వీరు. వీరికి పరలోకంలో ఏమీ మిగలదు." ('స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం).

وَقَالُواْ لَوۡلَا يَأۡتِينَا بِـَٔايَةٖ مِّن رَّبِّهِۦٓۚ أَوَلَمۡ تَأۡتِهِم بَيِّنَةُ مَا فِي ٱلصُّحُفِ ٱلۡأُولَىٰ ١٣٣

**133**. మరియు వారంటారు: "ఇతను (ఈ ప్రవక్త) తన ప్రభువునుండి ఏదైనా ఒక అద్భుత సూచన (మహిమ) ఎందుకు తీసుకురాడు?" ఏమీ? పూర్వపు గ్రంథాలలో పేర్కొనబడిన స్పష్టమైన నిదర్శనం వారివద్దకు రాలేదా?[1]

وَلَوۡ أَنَّآ أَهۡلَكۡنَٰهُم بِعَذَابٖ مِّن قَبۡلِهِۦ لَقَالُواْ رَبَّنَا لَوۡلَآ أَرۡسَلۡتَ إِلَيۡنَا رَسُولٗا فَنَتَّبِعَ ءَايَٰتِكَ مِن قَبۡلِ أَن نَّذِلَّ وَنَخۡزَىٰ ١٣٤

**134**. ఒకవేళ మేము దీనిని (ఈ ఖుర్ఆన్‌ను / ము'హమ్మద్‌ను) పంపక ముందే వారిని శిక్షించి ఉంటే! వారు అనేవారు: "ఓ మా ప్రభూ! నీవు మా వద్దకు ఒక సందేశహరుణ్ణి ఎందుకు పంపలేదు? (అలా చేస్తే) నిశ్చయంగా, మేము - అవమానం పొంది, అగౌరవంపాలు కాక ముందే - నీ సూచనలను పాటించేవారం కదా?"[2]

قُلۡ كُلّٞ مُّتَرَبِّصٞ فَتَرَبَّصُواْۖ فَسَتَعۡلَمُونَ مَنۡ أَصۡحَٰبُ ٱلصِّرَٰطِ ٱلسَّوِيِّ وَمَنِ ٱهۡتَدَىٰ ١٣٥

**135**. వారితో ఇలా అను: "ప్రతి ఒక్కడు (తన అంతిమ ఫలితం కొరకు) వేచి ఉన్నాడు. కావున మీరు కూడా వేచిఉండండి. సరైన మార్గంలో ఉన్న వారెవరో మరియు మార్గదర్శకత్వం పొందినవారెవరో, మీరు త్వరలోనే తెలుసుకుంటారు."

*****

1. ఇంకా చూడండి, 2:42 మరియు 61:6.
2. అల్లాహ్ (సు.తా.) ఎవరిని కూడా అజ్ఞానంతో చేసే తప్పుల కొరకు - వారికి మార్గదర్శకత్వం చూపనంతవరకు - శిక్షించడు. అంటే సన్మార్గాన్ని చూసిన తరువాత కూడా దాన్ని తిరస్కరించి మార్గభ్రష్టులైన వారిని శిక్షిస్తాడు. ఇంకా చూడండి, 6:131,15:4 మరియు 26:208-209.

## 21. సూరహ్ అల్-అంబియా'

## سُورَةُ الأنبيَــاءِ

ఈ సూరహ్‌లో చాలామంది ప్రవక్తల వృత్తాంతాలున్నాయి కావున దీనికి సూరతుల్ అంబియా' అనే పేరు ఇవ్వబడింది. ఇది మక్కాలో అతరింపజేయబడింది. ఇందులో **112 ఆయతులు** ఉన్నాయి. విగ్రహారాధనకు విరుద్ధంగా ఇబ్రాహీం ('అ.స.) పాటుపడింది; అన్యాయానికి విరుద్ధంగా లూ'త్ ('అ.స.) పోరాటం; సహనం వహించిన అయ్యూబ్ ('అ.స.); ఇస్మా'యీల్, ఇద్రీస్ మరియు జు'ల్‌కిఫ్ల్ ('అలైహిమ్ స. ల) గాథలు ఉన్నాయి. క్రోధానికి విరుద్ధంగా యూనుస్ ('అ.స.) పడిన పాట్లు; 'జకరియ్యా ('అ.స.) మరియు సయ్యిదా మర్యమ్ ('అ.స.) మొదలైన వారి విషయాలూ కూడా ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

ٱقْتَرَبَ لِلنَّاسِ حِسَابُهُمْ وَهُمْ فِى غَفْلَةٍ مُّعْرِضُونَ ۝١

**1.** (*) మానవులతో లెక్క (తీసుకునే) సమయం సమీపించింది, అయినా వారు ఏమరుపాటులో పడి విముఖులై ఉన్నారు.[1]

مَا يَأْتِيهِم مِّن ذِكْرٍ مِّن رَّبِّهِم مُّحْدَثٍ إِلَّا ٱسْتَمَعُوهُ وَهُمْ يَلْعَبُونَ ۝٢

**2.** (కావున) వారి ప్రభువు తరఫునుండి వారి వద్దకు ఏ క్రొత్త సందేశం వచ్చినా, వారు దానిని పరిహసించకుండా వినలేరు.

لَاهِيَةً قُلُوبُهُمْ ۗ وَأَسَرُّوا۟ ٱلنَّجْوَى ٱلَّذِينَ ظَلَمُوا۟ هَلْ هَٰذَآ إِلَّا بَشَرٌ مِّثْلُكُمْ ۖ أَفَتَأْتُونَ ٱلسِّحْرَ وَأَنتُمْ تُبْصِرُونَ ۝٣

**3.** వారి హృదయాలు వినోద క్రీడలలో (అశ్రద్ధలో) మునిగి ఉన్నాయి. మరియు వారిలో దుర్మార్గానికి పాల్పడినవారు రహస్య సంప్రదింపులు చేసుకొని (ఇలా అంటారు): "ఏమీ? ఇతను (ము'హమ్మద్) మీలాంటి ఒక సాధారణ మానవుడు కాడా?[2] అయినా మీరు చూస్తూవుండి కూడా, ఇతని మంత్ర జాలంలో[3] చిక్కుకు పోతారా?"

**1.** అంటే పునరుత్థాన దినం.

**2.** అంటే ఆ కాలపు మక్కా ముష్రికులు, వారి తోటి మానవుడు ప్రవక్త కావడం నమ్మలేక పోయారు. కాని ఈ కాలంలో కొందరు ప్రవక్తలను దైవాలుగా చేసుకుంటున్నారు.

**3.** అస్-సి'హ్రు: మంత్రజాలం, జాలవిద్య, మాయాజాలం. ఈ పదం ఖుర్ఆన్ అవతరణ క్రమంలో మొదటి సారి 74:24లో వచ్చింది.

قَالَ رَبِّي يَعۡلَمُ ٱلۡقَوۡلَ فِي ٱلسَّمَآءِ وَٱلۡأَرۡضِۖ وَهُوَ ٱلسَّمِيعُ ٱلۡعَلِيمُ ٤

4. (ము'హమ్మద్) ఇలా అన్నాడు: "నా ప్రభువుకు ఆకాశంలోనూ మరియు భూమిలోనూ పలుకబడే ప్రతిమాట తెలుసు. మరియు ఆయన సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు."

بَلۡ قَالُوٓاْ أَضۡغَٰثُ أَحۡلَٰمِۭ بَلِ ٱفۡتَرَىٰهُ بَلۡ هُوَ شَاعِرٞ فَلۡيَأۡتِنَا بِـَٔايَةٖ كَمَآ أُرۡسِلَ ٱلۡأَوَّلُونَ ٥

5. అలాకాదు! వారన్నారు: "ఇవి (ఈ సందేశాలు) కేవలం పీడకలలు మాత్రమే; కాదుకాదు! ఇతడే దీనిని కల్పించాడు; అలాకాదు! ఇతడొక కవి! (ఇతడు ప్రవక్తయే అయితే) పూర్వం పంపబడిన సందేశహరుల మాదిరిగా, ఇతనిని కూడా మా కొరకు ఒక అద్భుత సూచన(ఆయత్)ను తెమ్మను!"

مَآ ءَامَنَتۡ قَبۡلَهُم مِّن قَرۡيَةٍ أَهۡلَكۡنَٰهَآۖ أَفَهُمۡ يُؤۡمِنُونَ ٦

6. మరియు వీరికి పూర్వం మేము నాశనం చేసిన ఏ పురవాసులు కూడా విశ్వసించి ఉండలేదు. అయితే! వీరు మాత్రం విశ్వసిస్తారా?

وَمَآ أَرۡسَلۡنَا قَبۡلَكَ إِلَّا رِجَالٗا نُّوحِيٓ إِلَيۡهِمۡۖ فَسۡـَٔلُوٓاْ أَهۡلَ ٱلذِّكۡرِ إِن كُنتُمۡ لَا تَعۡلَمُونَ ٧

7. మరియు నీకు పూర్వం కూడా (ఓ ము'హమ్మద్!) మేము పురుషులను మాత్రమే ప్రవక్తలుగాచేసి పంపి, వారిపై దివ్యజ్ఞానాన్ని (వ'హీని) అవతరింపజేశాము. కావున మీకిది తెలియకుంటే హితబోధ గలవారిని (గ్రంథ ప్రజలను) అడగండి.

وَمَا جَعَلۡنَٰهُمۡ جَسَدٗا لَّا يَأۡكُلُونَ ٱلطَّعَامَ وَمَا كَانُواْ خَٰلِدِينَ ٨

8. మరియు మేము వారికి (ఆ ప్రవక్తలకు) ఆహారం తినే అవసరంలేని శరీరాలను ఇవ్వలేదు. మరియు వారు చిరంజీవులు కూడా కాలేదు.[1]

---

1. అంటే ఏ ప్రవక్తకు కూడా అమానుషమైన యోగ్యతలు ప్రసాదించబడలేదు. వారు ('అలైహిమ్. స.) సాధారణ మానవుల్లాగానే ఉండేవారు, కాని వారిపై అల్లాహ్ (సు.తా.) దివ్యజ్ఞానం (వ'హీ) అవతరింపజేయబడుతూ ఉండేది. వారికి అల్లాహ్ (సు.తా.) తెలిపినది తప్ప మరే అగోచరజ్ఞానం లేదు. ఇంకా చూడండి, 5:75, 3:164, 13:38, 25:20.

**9**. ఆ పిదప మేము వారికి చేసిన వాగ్దానాలు పూర్తిచేశాము. కావున వారిని మరియు మేము కోరిన వారిని రక్షించాము. మరియు మితిమీరి ప్రవర్తించిన వారిని నాశనం చేశాము.

**10**. (ఓ మానవులారా!) వాస్తవంగా, మేము మీ కొరకు ఒక గ్రంథాన్ని (ఖుర్ఆన్‌ను) అవతరింపజేశాము. అందులో మీ కొరకు ఉపదేశముంది. ఏమీ? మీరిది అర్థం చేసుకోలేరా?

**11**. మరియు దుర్మార్గానికి పాల్పడిన ఎన్ని నగరాలను మేము నిర్మూలించలేదు! మరియు వారి తరువాత మరొక జాతి వారిని పుట్టించాము![1]

**12**. మా శిక్ష (రావటం) తెలుసుకున్నప్పుడు వారు దాని నుండి పారిపోవటానికి ప్రయత్నించే వారు.

**13**. (అప్పుడు వారితో ఇలా చెప్పబడింది): "పారిపోకండి! మరలిరండి - మీరు అనుభవిస్తున్న, మీ సుఖసంపదల వైపుకు మరియు మీ ఇళ్ళ వైపుకు - ఎందుకంటే! మిమ్మల్ని ప్రశ్నించవలసి ఉంది!"

**14**. వారన్నారు: "అయ్యో మా దౌర్భాగ్యం! నిస్సందేహంగా మేము దుర్మార్గులం."

**15**. ఆ పిదప మేము వారిని కోయబడిన పైరువలే, చల్లారిన అగ్నివలే, చేసినంత వరకు వారి అరుపు ఆగలేదు.

ثُمَّ صَدَقۡنَٰهُمُ ٱلۡوَعۡدَ فَأَنجَيۡنَٰهُمۡ وَمَن نَّشَآءُ وَأَهۡلَكۡنَا ٱلۡمُسۡرِفِينَ ٩

لَقَدۡ أَنزَلۡنَآ إِلَيۡكُمۡ كِتَٰبٗا فِيهِ ذِكۡرُكُمۡۚ أَفَلَا تَعۡقِلُونَ ١٠

وَكَمۡ قَصَمۡنَا مِن قَرۡيَةٖ كَانَتۡ ظَالِمَةٗ وَأَنشَأۡنَا بَعۡدَهَا قَوۡمًا ءَاخَرِينَ ١١

فَلَمَّآ أَحَسُّواْ بَأۡسَنَآ إِذَا هُم مِّنۡهَا يَرۡكُضُونَ ١٢

لَا تَرۡكُضُواْ وَٱرۡجِعُوٓاْ إِلَىٰ مَآ أُتۡرِفۡتُمۡ فِيهِ وَمَسَٰكِنِكُمۡ لَعَلَّكُمۡ تُسۡـَٔلُونَ ١٣

قَالُواْ يَٰوَيۡلَنَآ إِنَّا كُنَّا ظَٰلِمِينَ ١٤

فَمَا زَالَت تِّلۡكَ دَعۡوَىٰهُمۡ حَتَّىٰ جَعَلۡنَٰهُمۡ حَصِيدًا خَٰمِدِينَ ١٥

---

1. చూడండి, 17:17.

16. మరియు మేము ఈ ఆకాశాన్ని, భూమిని మరియు వాటి మధ్య ఉన్నదంతా కేవలం వినోదం కొరకు సృష్టించలేదు.[1]

وَمَا خَلَقْنَا ٱلسَّمَآءَ وَٱلْأَرْضَ وَمَا بَيْنَهُمَا لَـٰعِبِينَ ﴿١٦﴾

17. ఒకవేళ మేము కాలక్షేపమే చేయదలచుకుంటే, మేము మా వద్ద ఉన్న దానితోనే చేసుకునే వారం; వాస్తవానికి, ఇలా చేయడమే, మా ఉద్దేశ్యమై ఉంటే!

لَوْ أَرَدْنَآ أَن نَّتَّخِذَ لَهْوًا لَّٱتَّخَذْنَـٰهُ مِن لَّدُنَّآ إِن كُنَّا فَـٰعِلِينَ ﴿١٧﴾

18. అలా కాదు! మేము సత్యాన్ని అసత్యంపై విసురుతాము. అది దాని తలను పగులగొడుతుంది, అప్పుడు అది (అసత్యం) నశించిపోతుంది. మరియు మీరు కల్పించే కల్పనలకు, మీకు వినాశం తప్పదు.

بَلْ نَقْذِفُ بِٱلْحَقِّ عَلَى ٱلْبَـٰطِلِ فَيَدْمَغُهُۥ فَإِذَا هُوَ زَاهِقٌ ۚ وَلَكُمُ ٱلْوَيْلُ مِمَّا تَصِفُونَ ﴿١٨﴾

19. మరియు ఆకాశాలలో మరియు భూమిలో ఉన్న సమస్తమూ ఆయనకు చెందినదే. మరియు ఆయనకు దగ్గరగా ఉన్నవారు, ఆయనను ఆరాధిస్తూ ఉన్నామని గర్వించరు మరియు (ఆయన ఆరాధనలో) అలసట కూడా చూపరు.[2]

وَلَهُۥ مَن فِى ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ وَمَنْ عِندَهُۥ لَا يَسْتَكْبِرُونَ عَنْ عِبَادَتِهِۦ وَلَا يَسْتَحْسِرُونَ ﴿١٩﴾

20. వారు రేయింబవళ్ళు ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉంటారు, వారు ఎన్నడూ బలహీనత చూపరు.

يُسَبِّحُونَ ٱلَّيْلَ وَٱلنَّهَارَ لَا يَفْتُرُونَ ﴿٢٠﴾

21. ఏమీ? వారు భూలోకంనుండి ఆరాధ్యదైవాలను నియమించుకున్నారా? అవి (చనిపోయిన వారిని) మరల బ్రతికించి లేపగలవా?[3]

أَمِ ٱتَّخَذُوٓا۟ ءَالِهَةً مِّنَ ٱلْأَرْضِ هُمْ يُنشِرُونَ ﴿٢١﴾

---

1. చూడండి, 10:5.
2. చాలామంది వ్యాఖ్యాతలు వీరిని దైవదూతలుగా పరిగణిస్తారు.
3. అంటే అవి చనిపోయిన వారిని మరల బ్రతికించి లేపలేవు, అని అర్థం. అంటే వారికి ఎలాంటి శక్తిలేదు. అలాంటప్పుడు వారు ఆ కల్పిత దైవాలను ఎందుకు ఆరాధించాలి?

لَوۡ كَانَ فِيهِمَآ ءَالِهَةٌ إِلَّا ٱللَّهُ لَفَسَدَتَاۚ فَسُبۡحَٰنَ ٱللَّهِ رَبِّ ٱلۡعَرۡشِ عَمَّا يَصِفُونَ ٢٢

**22**. వాటిలో (భూమ్యాకాశాలలో) అల్లాహ్ తప్ప ఇతర ఆరాధ్యదైవాలు ఉంటే అవి రెండూ నాశనమైపోయేవే కదా! కావున సింహాసనానికి ('అర్ష్‌కు) ప్రభువైన అల్లాహ్! వారు కల్పించే కల్పనలకు అతీతుడు.[1]

لَا يُسۡـَٔلُ عَمَّا يَفۡعَلُ وَهُمۡ يُسۡـَٔلُونَ ٢٣

**23**. తాను చేసేదానిని గురించి ఆయన (అల్లాహ్) ప్రశ్నించబడడు, కాని వారు ప్రశ్నించబడతారు.

أَمِ ٱتَّخَذُواْ مِن دُونِهِۦٓ ءَالِهَةًۖ قُلۡ هَاتُواْ بُرۡهَٰنَكُمۡۖ هَٰذَا ذِكۡرُ مَن مَّعِيَ وَذِكۡرُ مَن قَبۡلِيۗ بَلۡ أَكۡثَرُهُمۡ لَا يَعۡلَمُونَ ٱلۡحَقَّۖ فَهُم مُّعۡرِضُونَ ٢٤

**24**. ఏమీ? వారు ఆయనను వదలి ఇతర ఆరాధ్యదైవాలను నియమించుకున్నారా? వారితో అను: "మీ నిదర్శనాన్ని తీసుకురండి!" ఇది (ఈ ఖుర్ఆన్) నాతోపాటు ఉన్నవారికి హితబోధ మరియు నా పూర్వీకులకు కూడా (ఇలాంటి) హితబోధలు (వచ్చాయి). కాని వారిలో చాలామంది సత్యాన్ని గ్రహించలేదు, కావున వారు విముఖులై పోతున్నారు.

وَمَآ أَرۡسَلۡنَا مِن قَبۡلِكَ مِن رَّسُولٍ إِلَّا نُوحِيٓ إِلَيۡهِ أَنَّهُۥ لَآ إِلَٰهَ إِلَّآ أَنَا۠ فَٱعۡبُدُونِ ٢٥

**25**. మరియు మేము, నీకు పూర్వం ఏ ప్రవక్తను పంపినా: "నిశ్చయంగా, నేను (అల్లాహ్) తప్ప మరొక ఆరాధ్యుడు లేడు! కావున మీరు నన్నే (అల్లాహ్‌నే) ఆరాధించండి." అని దివ్యజ్ఞానం (వ'హీ) ఇచ్చి పంపాము.

---

**1**. ఒకవేళ అల్లాహ్ (సు.తా.)కు సాటిగా మరొక దైవం ఉండి ఉంటే, ఇద్దరి ఆధిపత్యం నడిచేది. ప్రతి ఒక్కరూ తమ ఇచ్ఛానుసారంగా ప్రపంచాన్ని నడపగోరేవారు. దానివల్ల విశ్వంలో ఇంత శాంతి ఉండకపోయేది. అల్లకల్లోలం చెలరేగిపోయేది. మానవుల రాజ్యపాలన ఏదైతే భూమిలోని ఒక్కచిన్న భాగంమీద ఉందో, దానికి ఒకే ఒక్క ఉన్నత పాలకుడిని ప్రసిడెంట్, లేక రాజు, లేక ప్రైమ్ మినిష్టర్‌ను నియమించుకుంటాము. అలాంటప్పుడు విశ్వసామ్రాజ్య వ్యవస్థలో ఒకని కంటే ఎక్కువ పాలకులు ఉండి ఉంటే, అల్లాకల్లోలం చెలరేగదా? ఇంకా చూడండి, 6:100.

وَقَالُواْ ٱتَّخَذَ ٱلرَّحۡمَٰنُ وَلَدٗاۗ سُبۡحَٰنَهُۥۚ بَلۡ عِبَادٞ مُّكۡرَمُونَ ٢٦

26. వారంటున్నారు: "అనంత కరుణామయునికి సంతానముంది!" అని. ఆయన సర్వలోపాలకు అతీతుడు, (అల్లాహ్ సంతానంగా పరిగణించబడే) వారు కేవలం గౌరవనీయులైన (ఆయన) దాసులు మాత్రమే![1]

لَا يَسۡبِقُونَهُۥ بِٱلۡقَوۡلِ وَهُم بِأَمۡرِهِۦ يَعۡمَلُونَ ٢٧

27. వారు ఆయన (అనుమతించక) ముందు మాట్లాడలేరు. మరియు వారు (దేవదూతలు) ఆయన ఆజ్ఞలనే పాటిస్తూ ఉంటారు.[2]

يَعۡلَمُ مَا بَيۡنَ أَيۡدِيهِمۡ وَمَا خَلۡفَهُمۡ وَلَا يَشۡفَعُونَ إِلَّا لِمَنِ ٱرۡتَضَىٰ وَهُم مِّنۡ خَشۡيَتِهِۦ مُشۡفِقُونَ ٢٨

28. ఆయనకు, వారికి ప్రత్యక్షంగా (ముందు) ఉన్నదీ మరియు వారికి పరోక్షంగా (గోప్యంగా) ఉన్నదీ, అంతా తెలుసు. వారు, ఆయన సమ్మతించిన వారికి తప్ప ఇతరుల కొరకు సిఫారసు చేయలేరు.[3] వారు, ఆయన భీతివలన భయకంపితులై ఉంటారు. (1/8)

۞ وَمَن يَقُلۡ مِنۡهُمۡ إِنِّيٓ إِلَٰهٞ مِّن دُونِهِۦ فَذَٰلِكَ نَجۡزِيهِ جَهَنَّمَۚ كَذَٰلِكَ نَجۡزِي ٱلظَّٰلِمِينَ ٢٩

29. * వారి(దేవదూతల)లో ఎవరైనా: "నిశ్చయంగా, ఆయనే కాక, నేను కూడా ఒక ఆరాధ్య దైవాన్ని." అని అంటే, అలాంటి వానికి మేము నరకశిక్ష విధిస్తాము.[4] మేము దుర్మార్గులను ఇదేవిధంగా శిక్షిస్తాము.

---

1. చూడండి, 19:92.
2. ఈ ఆయత్ ముష్రికీన్‌లు దేవదూత('అ.స.)లను అల్లాహ్ (సు.తా.) బిడ్డలుగా పరిగణించే విషయాన్ని ఖండిస్తుంది. దేవదూత('అలైహిమ్ స.)లు అల్లాహ్ (సు.తా.) సృష్టించిన దాసులు మరియు ఆయన ఆజ్ఞలను పాటిస్తూ ఉంటారు.
3. చూడండి, 2:255 దీనితో వ్యక్తమయ్యేది ఏమిటంటే ప్రవక్తలు మరియు 'సాలెహీన్‌లే గాక దైవదూతలు కూడా, అల్లాహ్ (సు.తా.) అనుమతించిన వారికి మాత్రమే సిఫారసు చేయగలరు. ఇంకా చూడండి, 2:255, 10:3 19:87, 20:109, 53:26.
4. ఇది ఒక ఉదాహరణమే. ఇలా సంభవించనవసరం లేదు. అంటే దైవదూతలు ఎన్నడూ అలా చేయరు. ఒకవేళ వారు అలాచేస్తే, వారు ('అలైహిమ్. స.) కూడా శిక్షించబడతారు. ఈ విధమైన ఉదాహరణలకు చూడండి, 43:81 మరియు 39:65.

أَوَلَمْ يَرَ ٱلَّذِينَ كَفَرُوٓاْ أَنَّ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ كَانَتَا رَتْقًا فَفَتَقْنَٰهُمَا ۖ وَجَعَلْنَا مِنَ ٱلْمَآءِ كُلَّ شَىْءٍ حَىٍّ ۖ أَفَلَا يُؤْمِنُونَ ﴿٣٠﴾

**30.** ఏమీ? ఈ సత్యతిరస్కారులకు తెలియదా (వారు చూడలేదా)? వాస్తవానికి భూమ్యాకాశాలు (ఒకే ఒక్క భౌతికాంశంగా) కలుసుకొని ఉండేవనీ; అయితే! మేమే వాటిని పగులగొట్టి వేరు చేశామని?[1] మరియు మేము ప్రతి ప్రాణిని నీటినుండి పుట్టించాము.[2] అయినా వారు విశ్వసించరా?

وَجَعَلْنَا فِى ٱلْأَرْضِ رَوَٰسِىَ أَن تَمِيدَ بِهِمْ وَجَعَلْنَا فِيهَا فِجَاجًا سُبُلًا لَّعَلَّهُمْ يَهْتَدُونَ ﴿٣١﴾

**31.** మరియు భూమి వారితో పాటు కదలకుండా ఉండాలని మేము దానిలో స్థిరమైన పర్వతాలను (మేకులవలే) నాటాము.[3] మరియు వారు (ప్రజలు) మార్గదర్శకత్వం పొందాలని మేము దానిలో విశాలమైన మార్గాలను కూడా ఏర్పాటుచేశాము.

---

**1**. ఇదే సైంటిస్టులు పలికే Big Bang Theory. ఈ ఆయత్ అవతరింపజేయబడినప్పుడు అరేబియా వాసులకు ఏ విధమైన సైన్సు జ్ఞానం లేదు. ఈ Big Bang Theory ఇప్పుడిప్పుడే ఆవిష్కరించబడింది. ఈ ఖుర్ఆన్‌ను దైవప్రవక్త ('స'అస) వ్రాయలేదు, ఎందుకంటే అతను నిరక్షరాస్యుడని మక్కా ప్రజలందరికీ తెలుసు. ఆ కాలపు విద్వాంసులకు కూడా ఇలాంటి సైన్సు విషయాల జ్ఞానం ఉండేది కాదు. దీనితో ఈ ఖుర్ఆన్ దివ్యావిష్కృతి అని నిరూపించబడుతోంది. దాదాపు వేయి కంటే ఎక్కువ ఆయతులలో ఈ విధమైన సైన్సు విషయాలు పేర్కొనబడ్డాయి. వాటిలో కొన్ని ఇప్పుడిప్పుడే పరిశోధించబడి నిరూపించబడ్డాయి. వాటిలో ఏ ఒక్క ఆవిష్కారం కూడా ఖుర్ఆన్‌లో పేర్కొనబడ్డ విషయం తప్పని నిరూపించలేదు. ఇంకా ఎన్నో నిరూపించబడనున్నాయి.

ఈ కాలపు Modern Astrophysicists లందరి అభిప్రాయం ఏమిటంటే: ఈ విశ్వమంతా ఒకే ఒక మూల ద్రవ్యం హైడ్రోజన్ పరమాణువు నుండి సృష్టించబడింది. తరువాత ఆ హైడ్రోజన్ పరమాణువులు గురుత్వాకర్షణశక్తి వల్ల కలుపబడి అనేక పదార్థాల సముదాయం ఏర్పడి, తరువాత అది పగలగొట్టబడటం వల్ల Galaxies, Nebulae and Solar systems, అంటే నక్షత్ర సముదాయం ఏర్పడింది. ఇదంతా జరగటానికి ఎంతో శక్తి (Energy) కావాలి. కాబట్టి, ఇదంతా చేసే శక్తి గలవాడు, సర్వసృష్టికి ఆధారభూతుడైన అల్లాహ్ (సు.తా.) మాత్రమే. ఇంకా చూడండి, 51:47.

**2**. ఈ విషయం కూడా ఇప్పటి సైంటిస్టులందరూ అంగీకరిస్తారు. అంటే ప్రతిజీవి నీటినుండి పుట్టించబడిందని. జీవకణం(Cell)లోని అత్యధిక భాగం Protoplasm అందులో కూడా అత్యధికభాగం (దాదాపు 72%) నీరే.

**3**. చూడండి, 16:15.

**32**. మరియు మేము ఆకాశాన్ని సురక్షితమైన కప్పుగా చేశాము.[1] అయినా వారు అందులోని సూచన(ఆయత్)ల నుండి విముఖులవుతున్నారు.

**33**. మరియు రేయింబవళ్ళను మరియు సూర్యచంద్రులను సృష్టించిన వాడు ఆయనే. అవి తమ తమ కక్ష్యలలో తేలియాడుతూ (తిరుగుతూ) ఉన్నాయి.

**34**. మరియు (ఓ ప్రవక్తా!) నీకు పూర్వం మేము ఏ మానవునికి కూడా శాశ్వత జీవితాన్ని ప్రసాదించలేదు.[2] ఏమీ? ఒకవేళ నీవు మరణిస్తే! వారు మాత్రం శాశ్వతంగా సజీవులుగా (చిరంజీవులుగా) ఉంటారా?[3]

**35**. ప్రతి ప్రాణి మృత్యువును చవిచూస్తుంది. మరియు మేము మీ అందరినీ, మంచి మరియు చెడు స్థితులకు గురిచేసి పరీక్షిస్తాము.[4] మరియు మీరందరూ మా వైపునకే మరలింపబడతారు.

**36**. మరియు ఈ సత్యతిరస్కారులు నిన్ను చూసినప్పుడల్లా నీతో పరిహాస మాడే వైఖరిని మాత్రమే అవలంబిస్తూ (అంటారు):[5] "ఏమీ? మీ ఆరాధ్య దైవాలను గురించి (నిర్లక్ష్యంగా) మాట్లాడే వ్యక్తి ఇతనేనా?" ఇక వారేమో అనంత కరుణామయుని ప్రస్తావన వచ్చినపుడు! వారే, సత్యాన్ని తిరస్కరిస్తున్నారు.

وَجَعَلْنَا ٱلسَّمَآءَ سَقْفًا مَّحْفُوظًا ۖ وَهُمْ عَنْ ءَايَـٰتِهَا مُعْرِضُونَ ﴿٣٢﴾

وَهُوَ ٱلَّذِى خَلَقَ ٱلَّيْلَ وَٱلنَّهَارَ وَٱلشَّمْسَ وَٱلْقَمَرَ ۖ كُلٌّ فِى فَلَكٍ يَسْبَحُونَ ﴿٣٣﴾

وَمَا جَعَلْنَا لِبَشَرٍ مِّن قَبْلِكَ ٱلْخُلْدَ ۖ أَفَإِي۟ن مِّتَّ فَهُمُ ٱلْخَـٰلِدُونَ ﴿٣٤﴾

كُلُّ نَفْسٍ ذَآئِقَةُ ٱلْمَوْتِ ۗ وَنَبْلُوكُم بِٱلشَّرِّ وَٱلْخَيْرِ فِتْنَةً ۖ وَإِلَيْنَا تُرْجَعُونَ ﴿٣٥﴾

وَإِذَا رَءَاكَ ٱلَّذِينَ كَفَرُوٓا۟ إِن يَتَّخِذُونَكَ إِلَّا هُزُوًا أَهَـٰذَا ٱلَّذِى يَذْكُرُ ءَالِهَتَكُمْ وَهُم بِذِكْرِ ٱلرَّحْمَـٰنِ هُمْ كَـٰفِرُونَ ﴿٣٦﴾

---

**1**. చూడండి, 13:2.
**2**. చూడండి, 3:144.
**3**. చూడండి, 39:30.
**4**. మీలో ఎవరు కృతజ్ఞులో మరియు ఎవరు సహనం వహించని కృతఘ్నులో చూడటానికి. మంచి స్థితిలో అల్లాహ్(సు.తా.)కు కృతజ్ఞులవటం మరియు దురావస్థలో సహనం వహించటమే విశ్వాసుల లక్షణాలు.
**5**. చూడండి, 25:41.

**37**. మానవుడు ఆత్రగాడుగా (తొందర పాటు జీవిగా) పుట్టించబడ్డాడు.[1] త్వరలోనే నేను మీకు నా సూచనలు చూపుతాను, కావున నన్ను తొందరపెట్టకండి.[2]

**38**. మరియు వారంటున్నారు: "మీరు సత్యవంతులే అయితే ఈ వాగ్దానం (బెదిరింపు) ఎప్పుడు నెరవేరనున్నది?"[3]

**39**. ఒకవేళ, ఈ సత్యతిరస్కారులు, ఆ సమయాన్ని గురించి తెలుసుకొని ఉంటే ఎంత బాగుండేది! అప్పుడు వారు ఆ అగ్ని నుండి తమ ముఖాలను గానీ, తమ వీపులను గానీ కాపాడుకోలేరు. మరియు వారికెలాంటి సహాయం కూడా లభించదు.

**40**. వాస్తవంగా, అది వారిపై అకస్మాత్తుగా వచ్చిపడి వారిని కలవరపెడుతుంది.[4] వారు దానిని నివారించనూ లేరు మరియు వారికెలాంటి వ్యవధికూడా ఇవ్వబడదు.

**41**. మరియు (ఓ ము'హమ్మద్!) వాస్తవానికి, నీకు పూర్వం కూడా ప్రవక్తలు ఎగతాళి చేయబడ్డారు, కానీ ఆ వెక్కిరించిన వారిని, వారి ఎగతాళియే చుట్టుకున్నది.[5]

**42**. ఇలా అను: "రేయింబవళ్ళు మిమ్మల్ని అనంత కరుణామయుని (శిక్ష) నుండి ఎవడు కాపాడగలడు?" అయినా వారు తమప్రభువు స్మరణ నుండి విముఖులవుతున్నారు.

خُلِقَ ٱلۡإِنسَٰنُ مِنۡ عَجَلٖۚ سَأُوْرِيكُمۡ
ءَايَٰتِي فَلَا تَسۡتَعۡجِلُونِ ٣٧

وَيَقُولُونَ مَتَىٰ هَٰذَا ٱلۡوَعۡدُ إِن
كُنتُمۡ صَٰدِقِينَ ٣٨

لَوۡ يَعۡلَمُ ٱلَّذِينَ كَفَرُواْ حِينَ لَا
يَكُفُّونَ عَن وُجُوهِهِمُ ٱلنَّارَ وَلَا
عَن ظُهُورِهِمۡ وَلَا هُمۡ يُنصَرُونَ ٣٩

بَلۡ تَأۡتِيهِم بَغۡتَةٗ فَتَبۡهَتُهُمۡ فَلَا
يَسۡتَطِيعُونَ رَدَّهَا وَلَا هُمۡ يُنظَرُونَ
٤٠

وَلَقَدِ ٱسۡتُهۡزِئَ بِرُسُلٖ مِّن قَبۡلِكَ
فَحَاقَ بِٱلَّذِينَ سَخِرُواْ مِنۡهُم مَّا كَانُواْ
بِهِۦ يَسۡتَهۡزِءُونَ ٤١

قُلۡ مَن يَكۡلَؤُكُم بِٱلَّيۡلِ وَٱلنَّهَارِ مِنَ
ٱلرَّحۡمَٰنِۗ بَلۡ هُمۡ عَن ذِكۡرِ رَبِّهِم
مُّعۡرِضُونَ ٤٢

---

**1**. మానవునికి సహనం లేదు. చూడండి, 17:11.
**2**. చూడండి, 16:1, అంటే తీర్పుదినం రానున్నది.
**3**. దీని జవాబుకై చూడండి, 7:187.
**4**. తబ్'హతు: perplex, stupify, కలవరపెట్టు, చికాకుపరచు, తెలివితేటలను పోగొట్టు.
**5**. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 6:10.

**43**. లేక! వారిని మా (శిక్ష) నుండి కాపాడటానికి మేము తప్ప వేరేదైవాలు ఎవరైనా ఉన్నారా? వారు (ఆ దైవాలు) తమకు తామే సహాయం చేసుకోలేరు మరియు వారు మా నుండి కాపాడుకోనూ లేరు.

**44**. అయినా! మేము వారికి మరియు వారి తండ్రితాతలకు చాలా కాలం వరకు సుఖసంతోషాలను ఇస్తూ వచ్చాము. ఏమీ? అయితే! వారు చూడటం లేదా వాస్తవానికి, మేము భూమిని, దాని అన్ని వైపులనుండి తగ్గిస్తున్నామని?[1] అయినా! వారు ఆధిక్యత వహించగలరని భావిస్తున్నారా?

**45**. (ఓ ము'హమ్మద్!) వారితో అను: "నేను కేవలం దివ్యజ్ఞానం (వ'హీ) ఆధారం గానే మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను." కాని చెవిటివారిని, ఎంత హెచ్చరించినా, వారు పిలుపును వినలేరు కదా!

**46**. మరియు ఒకవేళ నీ ప్రభువు శిక్ష, కొంత వారికి పడితే వారు: "అయ్యో మా పాడుగాను! వాస్తవానికి, మేము దుర్మార్గులుగా ఉండేవారం." అని అంటారు.

**47**. మరియు పునరుత్థానదినమున మేము సరిగ్గా తూచే త్రాసులను ఏర్పాటు చేస్తాము, కావున ఏ వ్యక్తికి కూడా ఏ మాత్రం అన్యాయం జరుగదు. ఒకవేళ ఆవగింజంత కర్మ ఉన్నా మేము దానిని ముందుకు తెస్తాము. మరియు లెక్కచూడటానికి మేమే చాలు!

أَمْ لَهُمْ ءَالِهَةٌ تَمْنَعُهُم مِّن دُونِنَا ۚ
لَا يَسْتَطِيعُونَ نَصْرَ أَنفُسِهِمْ
وَلَا هُم مِّنَّا يُصْحَبُونَ ﴿٤٣﴾

بَلْ مَتَّعْنَا هَٰٓؤُلَآءِ وَءَابَآءَهُمْ حَتَّىٰ
طَالَ عَلَيْهِمُ ٱلْعُمُرُ ۗ أَفَلَا يَرَوْنَ أَنَّا
نَأْتِى ٱلْأَرْضَ نَنقُصُهَا مِنْ
أَطْرَافِهَآ ۚ أَفَهُمُ ٱلْغَٰلِبُونَ ﴿٤٤﴾

قُلْ إِنَّمَآ أُنذِرُكُم بِٱلْوَحْىِ ۚ وَلَا
يَسْمَعُ ٱلصُّمُّ ٱلدُّعَآءَ إِذَا مَا
يُنذَرُونَ ﴿٤٥﴾

وَلَئِن مَّسَّتْهُمْ نَفْحَةٌ مِّنْ عَذَابِ
رَبِّكَ لَيَقُولُنَّ يَٰوَيْلَنَآ إِنَّا كُنَّا
ظَٰلِمِينَ ﴿٤٦﴾

وَنَضَعُ ٱلْمَوَٰزِينَ ٱلْقِسْطَ لِيَوْمِ ٱلْقِيَٰمَةِ
فَلَا تُظْلَمُ نَفْسٌ شَيْـًٔا ۖ وَإِن كَانَ
مِثْقَالَ حَبَّةٍ مِّنْ خَرْدَلٍ أَتَيْنَا
بِهَا ۗ وَكَفَىٰ بِنَا حَٰسِبِينَ ﴿٤٧﴾

---

**1**. చూడండి, 13:41, అంటే విశ్వాసుల సంఖ్య క్రమక్రమంగా పెరగటం మరియు వారు 'అరబ్ దేశాన్ని ఆక్రమించటం మరియు ముష్రికుల సంఖ్య తగ్గిపోవటం మరియు వారి అధికారంలో నున్న భూమి దినదినానికి తగ్గిపోవటం.

وَلَقَدْ ءَاتَيْنَا مُوسَىٰ وَهَـٰرُونَ ٱلْفُرْقَانَ وَضِيَآءً وَذِكْرًا لِّلْمُتَّقِينَ ﴿٤٨﴾

**48**. మరియు వాస్తవానికి మేము, మూసా మరియు హారూన్‌లకు ఒక గీటురాయిని మరియు దివ్యజ్యోతిని (తౌరాతును) ప్రసాదించి ఉన్నాము మరియు దైవభీతిగల వారికి ఒక హితబోధను.[1]

ٱلَّذِينَ يَخْشَوْنَ رَبَّهُم بِٱلْغَيْبِ وَهُم مِّنَ ٱلسَّاعَةِ مُشْفِقُونَ ﴿٤٩﴾

**49**. వారికొరకు ఎవరైతే అగోచరుడైన తమ ప్రభువుకు భయపడతారో![2] మరియు అంతిమ ఘడియను గురించి భీతిపరులై ఉంటారో!

وَهَـٰذَا ذِكْرٌ مُّبَارَكٌ أَنزَلْنَـٰهُ ۚ أَفَأَنتُمْ لَهُۥ مُنكِرُونَ ﴿٥٠﴾

**50**. మరియు ఈ శుభప్రదమైన జ్ఞాపిక (దివ్యఖుర్ఆన్)ను మేము అవతరింపజేశాము. ఏమీ? మీరు దీనిని నిరాకరిస్తారా? (1/4)

۞ وَلَقَدْ ءَاتَيْنَآ إِبْرَٰهِيمَ رُشْدَهُۥ مِن قَبْلُ وَكُنَّا بِهِۦ عَـٰلِمِينَ ﴿٥١﴾

**51**. * మరియు వాస్తవానికి, మేము ఇంతకు పూర్వం ఇబ్రాహీమ్‌కు కూడా మార్గదర్శకత్వం చేశాము మరియు అతనిని గురించి మాకు బాగా తెలుసు.[3]

إِذْ قَالَ لِأَبِيهِ وَقَوْمِهِۦ مَا هَـٰذِهِ ٱلتَّمَاثِيلُ ٱلَّتِىٓ أَنتُمْ لَهَا عَـٰكِفُونَ ﴿٥٢﴾

**52**. అతను తన తండ్రి మరియు తన జాతి ప్రజలతో ఇలా అన్నప్పుడు: "మీరు భక్తితో ఆరాధిస్తున్న ఈ విగ్రహాలు ఏమిటి?"

قَالُوا۟ وَجَدْنَآ ءَابَآءَنَا لَهَا عَـٰبِدِينَ ﴿٥٣﴾

**53**. వారన్నారు: "మేము మా తండ్రి తాతలను, వీటినే ఆరాధిస్తూ ఉండగా చూశాము."

قَالَ لَقَدْ كُنتُمْ أَنتُمْ وَءَابَآؤُكُمْ فِى ضَلَـٰلٍ مُّبِينٍ ﴿٥٤﴾

**54**. (ఇబ్రాహీమ్) అన్నాడు: "వాస్తవానికి, మీరు మరియు మీ తండ్రితాతలు స్పష్టంగా మార్గభ్రష్టత్వంలో పడిఉన్నారు."

---

**1**. అంటే దివ్యజ్ఞానమే నీతి నిజాయితీలను పరీక్షించే గీటురాయి. కావున అల్లాహ్ (సు.తా) వరుసగా దివ్యగ్రంథాలను అవతరింపజేశాడు. చూడండి, 2:44 మరియు 2:53.

**2**. చూడండి, 2:3.

**3**. ఇబ్రాహీమ్ ('అ.స.) గాథకు చూడండి, 6:74-79 మరియు 83.

55. వారన్నారు: "ఏమీ? నీవు మా వద్దకు ఏదైనా సత్యాన్ని తెచ్చావా? లేదా నీవు మాతో పరిహాసమాడుతున్నావా?"

قَالُوٓاْ أَجِئۡتَنَا بِٱلۡحَقِّ أَمۡ أَنتَ مِنَ ٱللَّٰعِبِينَ ٥٥

56. (ఇబ్రాహీమ్) అన్నాడు: "అలా కాదు! భూమ్యాకాశాల ప్రభువే మీ ప్రభువు! ఆయనే వాటన్నింటినీ సృజించాడు. మరియు నేను ఈ విషయం గురించి మీ ముందు సాక్ష్యమిస్తున్నాను.

قَالَ بَل رَّبُّكُمۡ رَبُّ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ ٱلَّذِي فَطَرَهُنَّ وَأَنَا۠ عَلَىٰ ذَٰلِكُم مِّنَ ٱلشَّٰهِدِينَ ٥٦

57. "మరియు నేను అల్లాహ్‌పై ప్రమాణంచేసి చెబుతున్నాను; మీరు వెళ్ళి పోయిన తరువాత మీ విగ్రహాలకు విరుద్ధంగా తప్పక యుక్తి పన్నుతాను."

وَتَٱللَّهِ لَأَكِيدَنَّ أَصۡنَٰمَكُم بَعۡدَ أَن تُوَلُّواْ مُدۡبِرِينَ ٥٧

58. తరువాత అతను ఒక పెద్ద దానిని (విగ్రహాన్ని) తప్ప అన్నింటినీ ముక్కలు ముక్కలుగా చేశాడు; బహుశా వారు దాని వైపునకు మరలుతారని!

فَجَعَلَهُمۡ جُذَٰذًا إِلَّا كَبِيرًا لَّهُمۡ لَعَلَّهُمۡ إِلَيۡهِ يَرۡجِعُونَ ٥٨

59. వారన్నారు: "మా ఆరాధ్య దైవాలతో ఈ విధంగా ప్రవర్తించిన వాడెవడు? నిశ్చయంగా, వాడు దుర్మార్గుడు."

قَالُواْ مَن فَعَلَ هَٰذَا بِـَٔالِهَتِنَآ إِنَّهُۥ لَمِنَ ٱلظَّٰلِمِينَ ٥٩

60. (కొందరు) ఇలా అన్నారు: "ఇబ్రాహీమ్ అనే ఒక యువకుడు, వీటిని గురించి ప్రస్తావిస్తూ ఉండగా మేము విన్నాము."

قَالُواْ سَمِعۡنَا فَتًى يَذۡكُرُهُمۡ يُقَالُ لَهُۥٓ إِبۡرَٰهِيمُ ٦٠

61. (ఇతరులు) అన్నారు: "అయితే, అతనిని ప్రజల కళ్ళముందుకు తీసుకురండి; బహుశా వారు సాక్ష్య మిస్తారేమో!"

قَالُواْ فَأۡتُواْ بِهِۦ عَلَىٰٓ أَعۡيُنِ ٱلنَّاسِ لَعَلَّهُمۡ يَشۡهَدُونَ ٦١

62. (అతనిని తెచ్చిన తరువాత) వారు అడిగారు: "ఓ ఇబ్రాహీమ్! ఏమీ? నీవేనా మా ఆరాధ్యదైవాలతో ఇలా వ్యవహరించిన వాడవు?"

قَالُوٓاْ ءَأَنتَ فَعَلۡتَ هَٰذَا بِـَٔالِهَتِنَا يَٰٓإِبۡرَٰهِيمُ ٦٢

قَالَ بَلۡ فَعَلَهُۥ كَبِيرُهُمۡ هَٰذَا فَسۡـَٔلُوهُمۡ إِن كَانُواْ يَنطِقُونَ ٦٣

**63**. (ఇబ్రాహీమ్) జవాబిచ్చాడు: "కాదు కాదు! వారిలోని ఈ పెద్దవాడే ఇలా చేశాడు! అవి మాట్లాడగలిగితే వాటినే అడగండి!"

فَرَجَعُوٓاْ إِلَىٰٓ أَنفُسِهِمۡ فَقَالُوٓاْ إِنَّكُمۡ أَنتُمُ ٱلظَّٰلِمُونَ ٦٤

**64**. వారు తమలో తాము సమాలోచనలు చేసుకుంటూ ఇలా అనుకున్నారు: "నిశ్చయంగా స్వయంగా మీరే దుర్మార్గులు!"

ثُمَّ نُكِسُواْ عَلَىٰ رُءُوسِهِمۡ لَقَدۡ عَلِمۡتَ مَا هَٰٓؤُلَآءِ يَنطِقُونَ ٦٥

**65**. కాని తరువాత వారి బుద్ధి తలక్రిందులై వారు ఇలా అన్నారు: "వాస్తవానికి, నీకు తెలుసు కదా, ఇవి మాట్లాడలేవని!"

قَالَ أَفَتَعۡبُدُونَ مِن دُونِ ٱللَّهِ مَا لَا يَنفَعُكُمۡ شَيۡـٔٗا وَلَا يَضُرُّكُمۡ ٦٦

**66**. (ఇబ్రాహీమ్) ఇలా అన్నాడు: "అలా అయితే! మీరు అల్లాహ్‌ను వదలి, మీకెలాంటి లాభం గానీ, నష్టం గానీ చేకూర్చలేని వాటిని ఆరాధిస్తారా?

أُفّٖ لَّكُمۡ وَلِمَا تَعۡبُدُونَ مِن دُونِ ٱللَّهِۚ أَفَلَا تَعۡقِلُونَ ٦٧

**67**. "ధిక్కారం! మీపై మరియు అల్లాహ్‌ను వదలి మీరు ఆరాధించే వాటి (దైవాల)పై! ఏమీ? మీరు ఏ మాత్రమూ తెలివిని ఉపయోగించరా?"

قَالُواْ حَرِّقُوهُ وَٱنصُرُوٓاْ ءَالِهَتَكُمۡ إِن كُنتُمۡ فَٰعِلِينَ ٦٨

**68**. వారన్నారు: "మీరేమైనా చేయదలుచుకుంటే! ఇతనిని కాల్చివేయండి, మీ ఆరాధ్య దైవాలకు తోడ్పడండి."

قُلۡنَا يَٰنَارُ كُونِي بَرۡدٗا وَسَلَٰمًا عَلَىٰٓ إِبۡرَٰهِيمَ ٦٩

**69**. మేము (అల్లాహ్) ఆజ్ఞాపించాము: "ఓ అగ్నీ! నీవు ఇబ్రాహీమ్ కొరకు చల్లగా సురక్షితంగా అయిపో!"[1]

وَأَرَادُواْ بِهِۦ كَيۡدٗا فَجَعَلۡنَٰهُمُ ٱلۡأَخۡسَرِينَ ٧٠

**70**. మరియు వారు ఇబ్రాహీమ్‌కు కీడు తలపెట్ట గోరారు కాని మేము వారినే నష్టంలో పడవేశాము.

1. చూడండి, 29:24 మరియు 37:97.

وَنَجَّيْنَـٰهُ وَلُوطًا إِلَى ٱلْأَرْضِ ٱلَّتِي
بَـٰرَكْنَا فِيهَا لِلْعَـٰلَمِينَ ﴿٧١﴾

**71**. మరియు మేము అతనిని (ఇబ్రాహీమ్‌ను) మరియు లూ'త్‌ను రక్షించి, సర్వజనుల కొరకు శుభప్రదం చేసిన భూమి వైపునకు పంపాము.[1]

وَوَهَبْنَا لَهُۥٓ إِسْحَـٰقَ وَيَعْقُوبَ
نَافِلَةً ۖ وَكُلًّا جَعَلْنَا صَـٰلِحِينَ
﴿٧٢﴾

**72**. మరియు అతనికి (ఇబ్రాహీమ్‌కు), ఇస్'హా'ఖ్ మరియు య'అఖూబ్‌లను అదనపు కానుకగా ప్రసాదించాము.[2] మరియు మేము ప్రతి ఒక్కరినీ సద్వర్తనులుగా చేశాము.

وَجَعَلْنَـٰهُمْ أَئِمَّةً يَهْدُونَ بِأَمْرِنَا
وَأَوْحَيْنَآ إِلَيْهِمْ فِعْلَ ٱلْخَيْرَٰتِ
وَإِقَامَ ٱلصَّلَوٰةِ وَإِيتَآءَ
ٱلزَّكَوٰةِ ۖ وَكَانُوا۟ لَنَا عَـٰبِدِينَ
﴿٧٣﴾

**73**. మరియు మేము వారిని నాయకులుగా చేశాము. వారు ప్రజలకు మా ఆజ్ఞ ప్రకారం మార్గదర్శకత్వం చేస్తూ ఉండేవారు. మరియు మేము వారిపై - సత్కార్యాలు చేయాలని, నమా'జ్ స్థాపించాలని, విధిదానం ('జకాత్) ఇవ్వాలని దివ్యజ్ఞానం (వ'హీ) పంపాము. మరియు వారు (కేవలం) మమ్మల్నే ఆరాధించే వారు.

وَلُوطًا ءَاتَيْنَـٰهُ حُكْمًا وَعِلْمًا
وَنَجَّيْنَـٰهُ مِنَ ٱلْقَرْيَةِ ٱلَّتِي كَانَت
تَّعْمَلُ ٱلْخَبَـٰٓئِثَ ۗ إِنَّهُمْ كَانُوا۟ قَوْمَ
سَوْءٍ فَـٰسِقِينَ ﴿٧٤﴾

**74**. మరియు (జ్ఞాపకం చేసుకోండి) మేము లూ'త్‌కు[3] వివేకాన్ని మరియు జ్ఞానాన్ని ప్రసాదించాము మరియు మేము అతనిని అసహ్యకరమైన పనులు చేస్తున్నవారి నగరం నుండి కాపాడాము. నిశ్చయంగా వారు నీచులు, అవిధేయులు (ఫాసిఖీన్) అయిన ప్రజలు.

---

**1**. లూ'త్ ('అ.స.), ఇబ్రాహీమ్ ('అ.స.) యొక్క సోదరుని కుమారులు. అతను ఇస్లాం స్వీకరించి ఇబ్రాహీమ్ ('అ.స.)తో సహా తమ నగరం 'ఊర్ - ఏదైతే Mesopotamia (ఇరాఖ్) లో ఉందో - విడిచి ఫల'స్తీన్(సిరియా)కు వెళ్ళారు. అల్లాహ్ (సు.తా.) అతనిని కూడా ప్రవక్తగా ఎన్నుకున్నాడు. లూ'త్ ('అ.స.) సోడోమ్ మరియు గొమొర్రాహ్ ('అమూరహ్ , సదూమ్) ప్రాంతంలో నివసించారు. అవి ఈ నాటి మృత సముద్రం (Dead Sea) దగ్గర ఉండేవి.
**2**. మొదటి కుమారుడు ఇస్మా'యీలు ('అ.స.) కావున ఇస్'హా'ఖ్ ('అ.స.) 'అదనపు కానుకగా' అని ఇక్కడ పేర్కొనబడ్డారు.
**3**. లూ'త్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 7:80-84; 11:77-83, 15:58-76.

وَأَدْخَلْنَـٰهُ فِى رَحْمَتِنَآ ۖ إِنَّهُۥ مِنَ ٱلصَّـٰلِحِينَ ﴿٧٥﴾

75. మరియు మేము అతనిని మా కారుణ్యంలోకి ప్రవేశింపజేసుకున్నాము. నిశ్చయంగా, అతను సద్వర్తనులలోని వాడు.

وَنُوحًا إِذْ نَادَىٰ مِن قَبْلُ فَٱسْتَجَبْنَا لَهُۥ فَنَجَّيْنَـٰهُ وَأَهْلَهُۥ مِنَ ٱلْكَرْبِ ٱلْعَظِيمِ ﴿٧٦﴾

76. మరియు (జ్ఞాపకం చేసుకోండి) నూ'హ్[1] అంతకు ముందు, మమ్మల్ని వేడుకొనగా మేము అతని (ప్రార్థనను) అంగీకరించాము. కావున అతనికి మరియు అతనితోబాటు ఉన్నవారికి ఆ మహా విపత్తునుండి విముక్తి కలిగించాము.

وَنَصَرْنَـٰهُ مِنَ ٱلْقَوْمِ ٱلَّذِينَ كَذَّبُوا۟ بِـَٔايَـٰتِنَآ ۚ إِنَّهُمْ كَانُوا۟ قَوْمَ سَوْءٍ فَأَغْرَقْنَـٰهُمْ أَجْمَعِينَ ﴿٧٧﴾

77. మరియు మా సూచనలను అబద్ధాలని నిరాకరించిన వారికి వ్యతిరేకంగా మేము అతనికి సహాయం చేశాము. నిశ్చయంగా, వారు దుష్ట ప్రజలు. కావున మేము వారినందరినీ ముంచివేశాము.

وَدَاوُۥدَ وَسُلَيْمَـٰنَ إِذْ يَحْكُمَانِ فِى ٱلْحَرْثِ إِذْ نَفَشَتْ فِيهِ غَنَمُ ٱلْقَوْمِ وَكُنَّا لِحُكْمِهِمْ شَـٰهِدِينَ ﴿٧٨﴾

78. మరియు దావూద్ మరియు సులైమాన్ ఇద్దరూ ఒక చేను గురించి తీర్పుచేసిన విషయం (జ్ఞాపకం చేసుకోండి):[2] ఒక తెగవారి మేకలు (మరొక తెగవారి చేను) మేశాయి. అప్పుడు వాస్తవానికి, మేము వారి తీర్పుకు సాక్షులుగా ఉన్నాము.

---

1. నూ'హ్ ('అ.స.) గాథ ఖుర్ఆన్‌లోఎన్నోసార్లు వచ్చింది. ముఖ్యంగా చూడండి,11:25-48.
2. ఒకవ్యక్తి మేకలు ఒకరాత్రి మరొకవ్యక్తి పంటపొలాన్ని మేస్తాయి. అతడు, దావూద్ ('అ.స.) దగ్గరకు తీర్పుకొరకు వస్తాడు. ఆతను ('అ.స.) పంట నష్టానికి సమానమైన విలువగల మేకలను, పొలం వానికి ఇవ్వాలని తీర్పుచేస్తారు. ఇది విని అక్కడే ఉన్న అతని ('అ.స.) కుమారులు సులైమాన్ ('అ.స.) అంటారు: 'అలా కాదు! చేను మేకలవానికి ఇవ్వాలి అతడు సేద్యంచేసి దానిని మేకలు మేయక ముందు ఉన్న స్థితిలోకి పెంచి తీసుకురావాలి. ఈ కాలమంతా మేకలు చేనువాని దగ్గర ఉండాలి. అతడు వాటిపాలు, ఉన్ని మరియు పిల్లలతో లాభం పొందవచ్చు. ఎప్పుడైతే చేను మొదటి స్థితిలోకి వస్తుందో అప్పుడు చేనూ, మేకలూ, తమతమ యజమానులకు తిరిగి ఇవ్వాలి.' ఈ తీర్పు ఎక్కువ ఉచితమైనదైనందుకు. దానినే అమలుపరుస్తారు.

ففَهَّمْنَٰهَا سُلَيْمَٰنَۚ وَكُلًّا ءَاتَيْنَا
حُكْمًا وَعِلْمًاۚ وَسَخَّرْنَا مَعَ دَاوُۥدَ
ٱلْجِبَالَ يُسَبِّحْنَ وَٱلطَّيْرَۚ وَكُنَّا
فَٰعِلِينَ ﴿٧٩﴾
وَعَلَّمْنَٰهُ صَنْعَةَ لَبُوسٍ لَّكُمْ
لِتُحْصِنَكُم مِّنۢ بَأْسِكُمْۖ فَهَلْ أَنتُمْ
شَٰكِرُونَ ﴿٨٠﴾
وَلِسُلَيْمَٰنَ ٱلرِّيحَ عَاصِفَةً تَجْرِى بِأَمْرِهِۦٓ
إِلَى ٱلْأَرْضِ ٱلَّتِى بَٰرَكْنَا فِيهَاۚ
وَكُنَّا بِكُلِّ شَىْءٍ عَٰلِمِينَ ﴿٨١﴾
وَمِنَ ٱلشَّيَٰطِينِ مَن يَغُوصُونَ لَهُۥ
وَيَعْمَلُونَ عَمَلًا دُونَ ذَٰلِكَۖ
وَكُنَّا لَهُمْ حَٰفِظِينَ ﴿٨٢﴾
۞ وَأَيُّوبَ إِذْ نَادَىٰ رَبَّهُۥٓ أَنِّى
مَسَّنِىَ ٱلضُّرُّ وَأَنتَ أَرْحَمُ
ٱلرَّٰحِمِينَ ﴿٨٣﴾

**79**. అసలు సులైమాన్‌కు మేము (వాస్తవ విషయం) తెలియజేశాము. మరియు వారిద్దరికీ మేము వివేకాన్ని మరియు జ్ఞానాన్ని ప్రసాదించాము. మరియు మేము పర్వతాలను మరియు పక్షులను దావూద్‌తో బాటు మా స్తోత్రం చేయటానికి లోబరచాము.[1] మరియు నిశ్చయంగా, మేమే (ప్రతిదీ) చేయగలవారము.

**80**. మరియు మేము అతనికి, మీ యుద్ధాలలో, మీ రక్షణ కొరకు కవచాలు తయారుచేయడం నేర్పాము. అయితే! (ఇప్పుడైనా) మీరు కృతజ్ఞులవుతారా?

**81**. మరియు మేము తీవ్రంగా వీచేగాలిని సులైమాన్‌కు (వశపరచాము). అది, అతని ఆజ్ఞతో మేము శుభాలను ప్రసాదించిన (అనుగ్రహించిన) భూమి మీద వీచేది.[2] మరియు నిశ్చయంగా, మాకు ప్రతి విషయం గురించి బాగా తెలుసు.

**82**. మరియు షైతానులలో కొందరు అతని (సులైమాన్) కొరకు (సముద్రంలో) మునిగేవారు మరియు ఇతర పనులు కూడా చేసేవారు. మరియు నిశ్చయంగా, మేమే వారిని కనిపెట్టుకొని ఉండేవారం. (3/8)

**83**. * మరియు (జ్ఞాపకం చేసుకోండి), అయ్యూబ్ తన ప్రభువును వేడుకున్నప్పుడు (ఇలా అన్నాడు): "నిశ్చయంగా, నన్ను బాధ (వ్యాధి) చుట్టుకున్నది. మరియు నీవే కరుణామయులలో కెల్లా గొప్ప కరుణామయుడవు!"[3]

---

**1**. చూడండి, 17:44, 57:1 మరియు 13:13.
**2**. ఈ భూమి ఆ కాలపు షామ్, అంటే ఈ కాలపు ఫలస్తీన్, జోర్డాన్ మరియు సిరియాలు.
**3**. అయ్యూబ్ ('అ.స.) మొదట, సుఖసంతోషాలలో జీవితం గడిపారు. తరువాత అల్లాహ్ (సు.తా.)

فَٱسۡتَجَبۡنَا لَهُۥ فَكَشَفۡنَا مَا بِهِۦ مِن ضُرࣲّۖ وَءَاتَيۡنَٰهُ أَهۡلَهُۥ وَمِثۡلَهُم مَّعَهُمۡ رَحۡمَةࣰ مِّنۡ عِندِنَا وَذِكۡرَىٰ لِلۡعَٰبِدِينَ ٨٤

84. అప్పుడు మేము అతని (ప్రార్థనను) అంగీకరించి, అతని బాధనుండి అతనికి విముక్తి కలిగించాము. మరియు అతనికి, అతని కుటుంబవాసులను తిరిగి ఇవ్వటమే గాక వారితోబాటు ఇంకా అంతమందిని ఎక్కువగా ఇచ్చి, దానిని మా నుండి ఒక ప్రత్యేక కరుణగా మరియు మమ్మల్ని ఆరాధించే వారికి ఒక జ్ఞాపికగా చేశాము.

وَإِسۡمَٰعِيلَ وَإِدۡرِيسَ وَذَا ٱلۡكِفۡلِۖ كُلࣱّ مِّنَ ٱلصَّٰبِرِينَ ٨٥

85. మరియు (జ్ఞాపకం చేసుకోండి), ఇస్మా'యీల్, ఇద్రీస్ మరియు జు'ల్‌కిఫ్ల్.[1] వీరందరు కూడా సహనశీలురైన వారే!

وَأَدۡخَلۡنَٰهُمۡ فِي رَحۡمَتِنَآۖ إِنَّهُم مِّنَ ٱلصَّٰلِحِينَ ٨٦

86. మరియు మేము వారందరినీ మా కారుణ్యంలోకి తీసుకున్నాము. నిశ్చయంగా, వారందరూ సద్వర్తనులు.

وَذَا ٱلنُّونِ إِذ ذَّهَبَ مُغَٰضِبࣰا فَظَنَّ أَن لَّن نَّقۡدِرَ عَلَيۡهِ فَنَادَىٰ فِي ٱلظُّلُمَٰتِ أَن لَّآ إِلَٰهَ إِلَّآ أَنتَ

87. మరియు (జ్ఞాపకం చేసుకోండి) చేపవాడు (యూనుస్)[2] - ఉద్రేకంతో వెళ్ళిపోతూ - మేము అతనిని పట్టుకోలేమని అనుకున్నాడు! కాని ఆ తరువాత, అంధకారాలలో చిక్కుకొని పోయినప్పుడు,

---

అతనిని తీవ్రమైన కష్టాలతో, వ్యాధితో పరీక్షించాడు. అతను, ఆ కష్ట కాలంలో కూడా సహనం వహించారు. ఆ తరువాత అల్లాహ్ (సు.తా.) అతనిని అనుగ్రహించి మరల మొదటి కంటే మంచి స్థితికి తెచ్చాడు. చూడండి, 38:44.

1. జు'ల్‌కిఫ్ల్ ('అ.స.): ప్రవక్తేనా కాదా అనే విషయం గురించి వ్యాఖ్యాతలలో భేదాభిప్రాయాలు ఉన్నాయి. ఇబ్నె-కసీ'ర్ (ర'హ్మ) అంటారు: అతని పేరు ఇతర ప్రవక్త ('అలైహిమ్ స.)ల పేర్లతో పాటు వచ్చింది కాబట్టి అతను కూడా ప్రవక్తయే!

2. యూనుస్ ('అ.స.) తన ప్రజల సత్యతిరస్కారాన్ని ఓర్చుకోలేక అల్లాహ్ (సు.తా.) అనుమతించక ముందే వారిని విడిచి పారిపోయి పడవనెక్కారు. అతను చీటీలలో ఓడిపోయి, పడవను మునిగిపోకుండా కాపాడటానికి, సముద్రంలోకి దూకారు. అల్లాహ్ (సు.తా) ఆజ్ఞతో అతనిని ఒక పెద్ద చేప మ్రింగింది. అతను('అ.స.) ఆ చేప కడుపులో తమ ప్రభువు (అల్లాహుతా'లా)ను వేడుకున్నారు. అప్పుడు అల్లాహ్ (సు.తా) అతనిని తిరగి ఒడ్డు మీదికి చేర్చాడు. అతను('అ.స.) తిరిగి వెళ్ళి తన ప్రజలకు హితబోధ చేశారు. వివరాలకు చూడండి, 37:139-148 మరియు 10:98.

سُبۡحَٰنَكَ إِنِّي كُنتُ مِنَ ٱلظَّٰلِمِينَ ٨٧

ఇలా మొరపెట్టుకున్నాడు: "వాస్తవానికి నీవు (అల్లాహ్) తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు, నీవు సర్వలోపాలకు అతీతుడవు, నిశ్చయంగా నేనే అపరాధులలోని వాడను."

فَٱسۡتَجَبۡنَا لَهُۥ وَنَجَّيۡنَٰهُ مِنَ ٱلۡغَمِّۚ وَكَذَٰلِكَ نُـۨجِي ٱلۡمُؤۡمِنِينَ ٨٨

**88**. అప్పుడు మేము అతని (ప్రార్థనను) అంగీకరించి, అతనిని ఆ దుఃఖం నుండి విముక్తి కలిగించాము. మరియు విశ్వసించిన వారిని మేము ఇదేవిధంగా కాపాడుతూ ఉంటాము.

وَزَكَرِيَّآ إِذۡ نَادَىٰ رَبَّهُۥ رَبِّ لَا تَذَرۡنِي فَرۡدٗا وَأَنتَ خَيۡرُ ٱلۡوَٰرِثِينَ ٨٩

**89**. మరియు (జ్ఞాపకం చేసుకోండి), 'జకరియ్యా[1] తన ప్రభువును వేడుకున్నపుడు ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నన్ను ఒంటరివాని(సంతానహీనుని)గా వదలకు. నీవే సర్వశ్రేష్ఠమైన వారసుడవు!"

فَٱسۡتَجَبۡنَا لَهُۥ وَوَهَبۡنَا لَهُۥ يَحۡيَىٰ وَأَصۡلَحۡنَا لَهُۥ زَوۡجَهُۥٓۚ إِنَّهُمۡ كَانُواْ يُسَٰرِعُونَ فِي ٱلۡخَيۡرَٰتِ وَيَدۡعُونَنَا رَغَبٗا وَرَهَبٗاۖ وَكَانُواْ لَنَا خَٰشِعِينَ ٩٠

**90**. అప్పుడు మేము అతని ప్రార్థనను అంగీకరించి, అతని కొరకు అతని భార్యను (సంతానానికి) యోగ్యురాలుగా జేసి, అతనికి య'హ్యాను ప్రసాదించాము. వాస్తవానికి వారు సత్కార్యాలు చేయటానికి పోటీ పడేవారు. మరియు శ్రద్ధతో మరియు భీతితో మమ్మల్ని ఆరాధించేవారు. మరియు మా సమక్షంలో వినమ్రులై ఉండేవారు.

وَٱلَّتِيٓ أَحۡصَنَتۡ فَرۡجَهَا فَنَفَخۡنَا فِيهَا مِن رُّوحِنَا وَجَعَلۡنَٰهَا وَٱبۡنَهَآ ءَايَةٗ لِّلۡعَٰلَمِينَ ٩١

**91**. మరియు (జ్ఞాపకం చేసుకోండి), తన శీలాన్ని కాపాడుకున్న ఆ మహిళ (మర్యమ్)లో మా నుండి ప్రాణం (రూ'హ్) ఊది, ఆమెను మరియు ఆమె కొడుకును, సర్వలోకాల వారికి ఒక సూచనగా చేశాము.[2]

---

**1**. 'జకరియ్యా ('అ.స.) గాథకు చూడండి, 3:37, 19:2 మరియు సూరహ్ 'తా-హా (20).
**2**. చూడండి, 15:29, 38:72 మరియు 32:9.

إِنَّ هَٰذِهِۦٓ أُمَّتُكُمۡ أُمَّةٗ وَٰحِدَةٗ
وَأَنَا۠ رَبُّكُمۡ فَٱعۡبُدُونِ ٩٢

**92**. నిశ్చయంగా, మీ ఈ సమాజం ఒకే ఒక్క సమాజం[1] మరియు కేవలం నేనే మీ ప్రభువును, కావున మీరు నన్ను మాత్రమే ఆరాధించండి.

وَتَقَطَّعُوٓاْ أَمۡرَهُم بَيۡنَهُمۡۖ كُلٌّ
إِلَيۡنَا رَٰجِعُونَ ٩٣

**93**. కాని వారు (ప్రజలు) తమ ధర్మ విషయంలో తెగలు తెగలుగా చీలిపోయారు. వారందరూ మా వైపునకే మరలి రావలసివున్నది.

فَمَن يَعۡمَلۡ مِنَ ٱلصَّٰلِحَٰتِ وَهُوَ
مُؤۡمِنٞ فَلَا كُفۡرَانَ لِسَعۡيِهِۦ وَإِنَّا
لَهُۥ كَٰتِبُونَ ٩٤

**94**. సత్కార్యాలు చేసేవాడు విశ్వసించేవాడై ఉంటే, అతని శ్రమ నిరాదరించబడదు మరియు నిశ్చయంగా, మేము దానిని వ్రాసిపెడతాము.

وَحَرَٰمٌ عَلَىٰ قَرۡيَةٍ أَهۡلَكۡنَٰهَآ
أَنَّهُمۡ لَا يَرۡجِعُونَ ٩٥

**95**. మరియు మేము నాశనంచేసిన ప్రతి నగరం(వారి)పై, వారు (ఆ నగరవాసులు) మరలి రావటం నిషేధించబడింది.

حَتَّىٰٓ إِذَا فُتِحَتۡ يَأۡجُوجُ وَمَأۡجُوجُ
وَهُم مِّن كُلِّ حَدَبٖ يَنسِلُونَ ٩٦

**96**. ఎంతవరకైతే యఅ'జూజ్ మరియు మఅ'జూజ్‌లు వదలిపెట్టబడి ప్రతి మిట్టనుండి పరుగెడుతూరారో![2]

---

**1**. ఉమ్మతున్: అంటే ధర్మం లేక సమాజం. ఇక్కడ ఇస్లాం ధర్మం మరియు సమాజం. దీని వైపునకే ప్రవక్తలందరూ తమ ప్రజలను ఆహ్వానించారు. ప్రవక్తలందరి ధర్మం ఇస్లామే! దైవప్రవక్త ప్రవచనం: 'ప్రవక్తలందరి కుటుంబం ఒక్కటే, మా తండ్రి ఒక్కడు మరియు మా తల్లులు వేరువేరు. మా అందరి ధర్మం ఒక్కటే, ఇస్లాం.' (ఇబ్నె-కసీ'ర్).

**2**. చూడండి, 18:94-98. తీర్పుదినం దగ్గరికి వచ్చి 'ఈసా ('అ.స.) తిరిగి భూలోకంలోకి వచ్చినపుడు యఅ'జూజ్ మరియు మఅ'జూజ్‌లు ప్రపంచంలో ప్రతిచోట వ్యాపించి ఉంటారు. వారి హింసలు మరియు దౌర్జన్యాలకు విశ్వాసులు తాళలేకపోతారు. చివరకు 'ఈసా ('అ.స.) విశ్వాసులను తీసుకొని 'తూర్ పర్వతంపైకి ఎక్కుతారు. అతను యఅ'జూజ్ మరియు మఅ'జూజ్‌లను శిక్షించటానికి. అల్లాహ్ (సు.తా.)ను ప్రార్థిస్తారు. అప్పుడు వారంతా వధింపబడతారు. వారి శవాల దుర్వాసన అంతటా వ్యాపించిపోతుంది. అప్పుడు అల్లాహ్ (సు.తా.) పక్షులను పంపుతాడు. అవి ఆ శవాలను సముద్రంలోకి విసరుతాయి. ఆ తరువాత ఒక పెద్ద వర్షం కురుస్తుంది. దానితో భూమి శుభ్రపరచబడుతుంది. ('స'హీ'హ్ 'హదీస్'ల ఆధారంగా, ఇబ్నె-కసీ'ర్).

وَٱقۡتَرَبَ ٱلۡوَعۡدُ ٱلۡحَقُّ فَإِذَا هِيَ شَٰخِصَةٌ أَبۡصَٰرُ ٱلَّذِينَ كَفَرُواْ يَٰوَيۡلَنَا قَدۡ كُنَّا فِي غَفۡلَةٖ مِّنۡ هَٰذَا بَلۡ كُنَّا ظَٰلِمِينَ ٩٧

97. మరియు సత్య వాగ్దానం నెరవేరే సమయం దగ్గర పడినప్పుడు సత్యతిరస్కారుల కళ్ళు విచ్చుకుపోయి: "అయ్యో మా దౌర్భాగ్యం! వాస్తవానికి మేము దీనినుండి అశ్రద్ధకు గురిఅయ్యాము. కాదుకాదు! మేము దుర్మార్గులుగా ఉండేవారము." అని అంటారు.

إِنَّكُمۡ وَمَا تَعۡبُدُونَ مِن دُونِ ٱللَّهِ حَصَبُ جَهَنَّمَ أَنتُمۡ لَهَا وَٰرِدُونَ ٩٨

98. (వారితో ఇంకా ఇలా అనబడు తుంది): "నిశ్చయంగా, మీరూ మరియు అల్లాహ్‌ను వదలి మీరు ఆరాధించే వారూ, నరకాగ్నికి ఇంధనమవుతారు! (ఎందు కంటే) మీకు అక్కడికే పోవలసి ఉన్నది.[1]

لَوۡ كَانَ هَٰٓؤُلَآءِ ءَالِهَةٗ مَّا وَرَدُوهَاۖ وَكُلّٞ فِيهَا خَٰلِدُونَ ٩٩

99. ఒకవేళ ఇవన్నీ ఆరాధ్యదైవాలే అయివుంటే, ఇవి అందులో (నరకంలో) ప్రవేశించి ఉండేవి కావు! ఇక మీరంతా అందులోనే శాశ్వతంగా ఉంటారు!"

لَهُمۡ فِيهَا زَفِيرٞ وَهُمۡ فِيهَا لَا يَسۡمَعُونَ ١٠٠

100. అందులో వారు (దుఃఖంచేత) మూలుగుతూ ఉంటారు. అందులో వారేమీ వినలేరు.[2]

إِنَّ ٱلَّذِينَ سَبَقَتۡ لَهُم مِّنَّا ٱلۡحُسۡنَىٰٓ أُوْلَٰٓئِكَ عَنۡهَا مُبۡعَدُونَ ١٠١

101. నిశ్చయంగా, ఎవరి కొరకైతే, మా తరఫునుండి మేలు (స్వర్గం) నిర్ణయింపబడి ఉందో, అలాంటి వారు దాని (నరకం) నుండి దూరంగా ఉంచబడతారు.

1. ఒక 'హదీస్' ప్రకారం ఈ ఆయత్ విని ఒక ముష్రికుల నాయకుడు అన్నాడు: 'యూదులు మరియు క్రైస్తవులు ఆరాధించే 'ఉ'జైర్ ('అ.స.) మరియు 'ఈసా ('అ.స.)లు కూడా నరకానికి పోతారా?' దానికి దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'అల్లాహ్ (సు.తా)కు బదులుగా తనను ఆరాధించటాన్ని సమ్మతించిన ప్రతివ్యక్తి, తనను ఆరాధించిన వారితోపాటు నరకానికి పోతాడు.'

2. నరకంలో వారంతా బాధలవల్ల ఏడుస్తూ ఉంటారు. వారి రోధనల ధ్వనివల్ల వారందు ఏమీ వినలేక పోతారు.

لَا يَسْمَعُونَ حَسِيسَهَا ۖ وَهُمْ فِي مَا ٱشْتَهَتْ أَنفُسُهُمْ خَٰلِدُونَ ﴿١٠٢﴾

102. వారు దాని మెల్లని శబ్దం కూడా వినరు. వారు తాము కోరిన వాటిలో శాశ్వతంగా ఉంటారు.

لَا يَحْزُنُهُمُ ٱلْفَزَعُ ٱلْأَكْبَرُ وَتَتَلَقَّىٰهُمُ ٱلْمَلَٰٓئِكَةُ هَٰذَا يَوْمُكُمُ ٱلَّذِي كُنتُمْ تُوعَدُونَ ﴿١٠٣﴾

103. ఆ గొప్ప భీతి కూడా వారికి దుఃఖం కలిగించదు[1] మరియు దేవదూతలు వారిని ఆహ్వానిస్తూ వచ్చి: "మీకు వాగ్దానం చేయబడిన మీ దినం ఇదే!" అని అంటారు.

يَوْمَ نَطْوِي ٱلسَّمَآءَ كَطَيِّ ٱلسِّجِلِّ لِلْكُتُبِ ۚ كَمَا بَدَأْنَآ أَوَّلَ خَلْقٍ نُّعِيدُهُۥ ۚ وَعْدًا عَلَيْنَآ ۚ إِنَّا كُنَّا فَٰعِلِينَ ﴿١٠٤﴾

104. (జ్ఞాపకముంచుకోండి)! ఆ రోజు మేము ఆకాశాన్ని, చిట్టా కాగితాలను చుట్టినట్లు చుట్టివేస్తాము.[2] మేము ఏవిధంగా సృష్టిని మొదట ఆరంభించామో! అదేవిధంగా దానిని మరల ఉనికిలోకి తెస్తాము. ఇది (మాపై బాధ్యతగా) నున్న మా వాగ్దానం. మేము దానిని తప్పక పూర్తిచేస్తాము.

وَلَقَدْ كَتَبْنَا فِي ٱلزَّبُورِ مِنۢ بَعْدِ ٱلذِّكْرِ أَنَّ ٱلْأَرْضَ يَرِثُهَا عِبَادِيَ ٱلصَّٰلِحُونَ ﴿١٠٥﴾

105. వాస్తవానికి మేము 'జబూర్‌లో - మా హితబోధ తరువాత - నిశ్చయంగా ఈ భూమికి[3] సద్వర్తనులైన నా దాసులు వారసులవుతారని వ్రాసిఉన్నాము.

إِنَّ فِي هَٰذَا لَبَلَٰغًا لِّقَوْمٍ عَٰبِدِينَ ﴿١٠٦﴾

106. నిశ్చయంగా ఇందులో భక్తిపరులైన ప్రజలకు సందేశం ఉంది.[4]

---

1. ఆ గొప్ప భీతి అంటే ఇస్రాఫీల్ ('అ.స.) యొక్క 'సూర్, లేక స్వర్గ-నరకాలమధ్య 'చావు'ను వధించటం. అంటే స్వర్గానికి మరియు నరకానికి పోయే వారి తీర్పు ముగిసిన తరువాత 'చావు' ఒకగొర్రె ఆకారంలో తెచ్చి జి''బ్హ్ చేయడం. ఆ తరువాత ఎవ్వరికీ చావుఉండదు. చూడండి. 19:39.
2. చూడండి, 39:67.
3. ఇక్కడ భూమి అంటే స్వర్గమని అనేక వ్యాఖ్యాతల అభిప్రాయం.
4. దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై అవతరింపజేయబడిన ఈ ఖుర్ఆన్ సర్వమానవాళి కొరకు అవతరింపజేయబడిన దివ్యగ్రంథం. అల్లాహ్ (సు.తా) దీనిని తీర్పుదినం వరకు

**107**. మరియు మేము నిన్ను (ఓ ప్రవక్తా!) సర్వలోకాల వారి కొరకు కారుణ్యంగా మాత్రమే పంపాము.[1]

وَمَآ أَرۡسَلۡنَٰكَ إِلَّا رَحۡمَةٗ لِّلۡعَٰلَمِينَ ١٠٧

**108**. (ఓ ము'హమ్మద్) ఇలా అను: "నిశ్చయంగా, నాపై దివ్యజ్ఞానం (వ'హీ) అవతరింపజేయబడింది. వాస్తవంగా మీ ఆరాధ్యదైవం ఆ అద్వితీయ ఆరాధ్యుడే (అల్లాహ్‌యే)! ఇకనైనా మీరు అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు) అవుతారా?"

قُلۡ إِنَّمَا يُوحَىٰٓ إِلَيَّ أَنَّمَآ إِلَٰهُكُمۡ إِلَٰهٞ وَٰحِدٞۖ فَهَلۡ أَنتُم مُّسۡلِمُونَ ١٠٨

**109**. ఒకవేళ వారు వెనుదిరిగితే వారితో ఇలా అను: "నేను మీకు అందరికీ బహిరంగంగా ప్రకటిస్తున్నాను. మరియు మీతో చేయబడిన వాగ్దానం సమీపంలో ఉందో లేదా బహుదూరం ఉందో నాకు తెలియదు."

فَإِن تَوَلَّوۡاْ فَقُلۡ ءَاذَنتُكُمۡ عَلَىٰ سَوَآءٖۖ وَإِنۡ أَدۡرِيٓ أَقَرِيبٌ أَم بَعِيدٞ مَّا تُوعَدُونَ ١٠٩

**110**. నిశ్చయంగా ఆయన (అల్లాహ్)కు, మీరు బహిరంగంగా వ్యక్తపరిచేది మరియు దాచేది అంతా తెలుసు.

إِنَّهُۥ يَعۡلَمُ ٱلۡجَهۡرَ مِنَ ٱلۡقَوۡلِ وَيَعۡلَمُ مَا تَكۡتُمُونَ ١١٠

---

భద్రంగా ఉంచుతానని, అన్నాడు. (చూడండి, 15:9) ఇది రంగు రూపాల, పుట్టుపూర్వోత్తరాల, భేదభావాలు లేకుండా సర్వమానవులను ఆకర్షిస్తుంది. ఇది మానవుని హేతువాదానికి జవాబునిస్తుంది. మరొక విశేషమేమిటంటే 1400 సంవత్సరాలలో ఒక్క అక్షరం కూడా మార్చబడకుండా ఉన్న ఒకే ఒక్క దివ్యగ్రంథం, ఈ ఖుర్ఆన్ మాత్రమే మరియు ఇది అవతరింపజేయబడిన ప్రవక్త ము'హమ్మద్ ('స'అస) చివరి ప్రవక్త. చూడండి, 33:40.

1. దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) సర్వమానవజాతి కొరకు పంపబడిన దైవప్రవక్త చూడండి, 7:158. దైవప్రవక్త ('స'అస) ముష్రికులను శపించలేదు. ('స'హీ'హ్ ముస్లిం, 2006).

وَإِنۡ أَدۡرِي لَعَلَّهُۥ فِتۡنَةٞ لَّكُمۡ وَمَتَٰعٌ إِلَىٰ حِينٖ ١١١

**111**. మరియు బహుశా ఇది (ఈ ఆలస్యం) మీకు పరీక్ష కావచ్చు, లేదా మీకు కొంతకాలం సుఖసంతోషాలు అనుభవించటానికి ఇవ్వబడిన వ్యవధి కావచ్చు, అది నాకు తెలియదు!

قَٰلَ رَبِّ ٱحۡكُم بِٱلۡحَقِّۗ وَرَبُّنَا ٱلرَّحۡمَٰنُ ٱلۡمُسۡتَعَانُ عَلَىٰ مَا تَصِفُونَ ١١٢

**112**. అతను (ము'హమ్మద్) ఇలా అన్నాడు: "ఓ నా ప్రభూ! నీవు సత్యంతో తీర్పుచేయి! మరియు మీరు కల్పించే వాటికి (ఆరోపణలకు), ఆ అపార కరుణామయుడైన మా ప్రభువు సహాయమే కోరబడుతోంది!" (1/2)

*****

## 22. సూరహ్ అల్-'హజ్జ్

## سُورَةُ الحَجِّ

ఈ సూరహ్ మదీనాలో అవతరింపజేయబడింది. ఇందులో **78** ఆయతులున్నాయి. దీని పేరు **27-38** ఆయత్‌ల నుండి తీసుకోబడింది. దీనికంటే ముందున్న ఐదు (17-21) సూరాహ్‌లు ప్రవక్తల గాథలు తెలిపాయి. ఇది మరియు దీని తరువాత వచ్చే మూడు (22-25) సూరాహ్‌లు ధర్మ విషయాలను బోధిస్తున్నాయి.

బِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

يَٰٓأَيُّهَا ٱلنَّاسُ ٱتَّقُواْ رَبَّكُمْۚ إِنَّ زَلْزَلَةَ ٱلسَّاعَةِ شَىْءٌ عَظِيمٌ ١

**1**. * ఓ మానవులారా! మీ ప్రభువునందు భయభక్తులు కలిగి ఉండండి! నిశ్చయంగా, ఆ అంతిమ ఘడియ యొక్క భూకంపం ఎంతో భయంకరమైనది.

يَوْمَ تَرَوْنَهَا تَذْهَلُ كُلُّ مُرْضِعَةٍ عَمَّآ أَرْضَعَتْ وَتَضَعُ كُلُّ ذَاتِ حَمْلٍ حَمْلَهَا وَتَرَى ٱلنَّاسَ سُكَٰرَىٰ وَمَا هُم بِسُكَٰرَىٰ وَلَٰكِنَّ عَذَابَ ٱللَّهِ شَدِيدٌ ٢

**2**. ఆ రోజు ఆవరించినప్పుడు, పాలిచ్చే ప్రతి స్త్రీ తన చంటిబిడ్డను మరచిపోవటాన్ని, గర్భవతి అయిన ప్రతి స్త్రీ తన గర్భాన్ని కోల్పోవటాన్ని నీవు చూస్తావు. మరియు మానవులందరినీ మత్తులో ఉన్నట్లు నీవు చూస్తావు, కానీ (వాస్తవానికి) వారు త్రాగి (మత్తులో) ఉండరు. కాని అల్లాహ్ శిక్షయే అంత తీవ్రంగా ఉంటుంది.

وَمِنَ ٱلنَّاسِ مَن يُجَٰدِلُ فِى ٱللَّهِ بِغَيْرِ عِلْمٍ وَيَتَّبِعُ كُلَّ شَيْطَٰنٍ مَّرِيدٍ ٣

**3**. మరియు ప్రజలలో ఒకడుంటాడు, జ్ఞానంలేనిదే, అల్లాహ్‌ను గురించి వాదులాడేవాడు మరియు ధిక్కారి అయిన ప్రతి షై'తాన్‌ను అనుసరించేవాడు.

كُتِبَ عَلَيْهِ أَنَّهُۥ مَن تَوَلَّاهُ فَأَنَّهُۥ يُضِلُّهُۥ وَيَهْدِيهِ إِلَىٰ عَذَابِ ٱلسَّعِيرِ ٤

**4**. అతడిని (షై'తాన్‌ను) గురించి వ్రాయబడిందేమిటంటే, వాస్తవానికి ఎవడైతే అతడి వైపునకు మరలుతాడో, వాడిని నిశ్చయంగా, అతడు మార్గభ్రష్టునిగా చేస్తాడు మరియు వాడిని మండే నరకాగ్ని వైపునకు మార్గదర్శకత్వం చేస్తాడు.

يَٰٓأَيُّهَا ٱلنَّاسُ إِن كُنتُمۡ فِي رَيۡبٖ مِّنَ ٱلۡبَعۡثِ فَإِنَّا خَلَقۡنَٰكُم مِّن تُرَابٖ ثُمَّ مِن نُّطۡفَةٖ ثُمَّ مِنۡ عَلَقَةٖ ثُمَّ مِن مُّضۡغَةٖ مُّخَلَّقَةٖ وَغَيۡرِ مُخَلَّقَةٖ لِّنُبَيِّنَ لَكُمۡۚ وَنُقِرُّ فِي ٱلۡأَرۡحَامِ مَا نَشَآءُ إِلَىٰٓ أَجَلٖ مُّسَمّٗى ثُمَّ نُخۡرِجُكُمۡ طِفۡلٗا ثُمَّ لِتَبۡلُغُوٓاْ أَشُدَّكُمۡۖ وَمِنكُم مَّن يُتَوَفَّىٰ وَمِنكُم مَّن يُرَدُّ إِلَىٰٓ أَرۡذَلِ ٱلۡعُمُرِ لِكَيۡلَا يَعۡلَمَ مِنۢ بَعۡدِ عِلۡمٖ شَيۡـٔٗاۚ وَتَرَى ٱلۡأَرۡضَ هَامِدَةٗ فَإِذَآ أَنزَلۡنَا عَلَيۡهَا ٱلۡمَآءَ ٱهۡتَزَّتۡ وَرَبَتۡ وَأَنۢبَتَتۡ مِن كُلِّ زَوۡجِۭ بَهِيجٖ ٥

**5**. ఓ మానవులారా! ఒకవేళ (మరణించిన తరువాత) మరల సజీవులుగా లేపబడటాన్ని గురించి మీకు ఏదైనా సందేహముంటే! (జ్ఞాపకముంచుకోండి) నిశ్చయంగా, మేము మిమ్మల్ని మట్టితో[1] సృష్టించాము, తరువాత వీర్యబిందువుతో, ఆ తరువాత నెత్తురుగడ్డతో, ఆ పైన మాంసపు కండతో; అది పూర్తిగా రూపం పొందవచ్చు, లేక పూర్తిగా రూపం పొందక పోవచ్చు, ఇదంతా మేము మీకు (మా శక్తిని తెలుసుకోవటానికి) స్పష్టం చేస్తున్నాము. ఆ తరువాత మేము కోరిన వారిని ఒక నిర్ణీత కాలం వరకు గర్భకోశాలలో ఉంచుతాము. పిదప మిమ్మల్ని శిశువుల రూపంలో బయటికి తీస్తాము. ఆ తరువాత మిమ్మల్ని యవ్వన దశకు చేరనిస్తాము. మీలో ఒకడు (వృద్ధుడు కాక ముందే) చనిపోతాడు, మరొకడు నికృష్టమైన వృద్ధాప్యం వరకు చేర్చ బడతాడు;[2] అప్పుడతడు, మొదట అంతా తెలిసినవాడైనా ఏమీ తెలియనివాడిగా అయిపోతాడు. నీవు భూమిని ఫలింపలేని దానిగా చూస్తావు. కాని ఒకవేళ మేము దానిపై నీటిని (వర్షాన్ని) కురిపిస్తే, అది పులకరించి పొంగిపోయి అన్నిరకాల మనోహరమైన వృక్షకోటిని ఉత్పన్నం చేస్తుంది.

ذَٰلِكَ بِأَنَّ ٱللَّهَ هُوَ ٱلۡحَقُّ وَأَنَّهُۥ يُحۡيِ ٱلۡمَوۡتَىٰ وَأَنَّهُۥ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٞ ٦

**6**. ఇదంతా ఎందుకంటే! నిశ్చయంగా, అల్లాహ్! ఆయనే సత్యం. మరియు నిశ్చయంగా ఆయన మాత్రమే చచ్చిన వారిని తిరిగి బ్రతికించగలవాడు మరియు నిశ్చయంగా ఆయనే ప్రతిదీ చేయగల సమర్థుడు.

---

**1**. 'మట్టితో సృష్టించాము.' ఇటువంటి ఇతర ఆయతులకు చూడండి, 3:59, 11:61, 18:37, 30:20, 23:12.

**2**. చూడండి, 16:70.

وَأَنَّ ٱلسَّاعَةَ ءَاتِيَةٌ لَّا رَيْبَ فِيهَا وَأَنَّ ٱللَّهَ يَبْعَثُ مَن فِي ٱلْقُبُورِ ﴿٧﴾

7. మరియు అంతిమ ఘడియ నిశ్చయంగా రానున్నది. అందులోఎలాంటి సందేహం లేదు మరియు నిశ్చయంగా, అల్లాహ్ గోరీలలోనున్న వారిని మరల బ్రతికించి లేపుతాడు.

وَمِنَ ٱلنَّاسِ مَن يُجَٰدِلُ فِي ٱللَّهِ بِغَيْرِ عِلْمٍ وَلَا هُدًى وَلَا كِتَٰبٍ مُّنِيرٍ ﴿٨﴾

8. అయినా మానవులలో - జ్ఞానం లేనిదే మరియు మార్గదర్శకత్వం లేనిదే మరియు ప్రకాశవంతమైన గ్రంథం లేనిదే - అల్లాహ్‌ను గురించి వాదులాడేవాడు ఉన్నాడు.

ثَانِيَ عِطْفِهِۦ لِيُضِلَّ عَن سَبِيلِ ٱللَّهِ لَهُۥ فِي ٱلدُّنْيَا خِزْيٌ وَنُذِيقُهُۥ يَوْمَ ٱلْقِيَٰمَةِ عَذَابَ ٱلْحَرِيقِ ﴿٩﴾

9. (అలాంటి వాడు) గర్వంతో తన మెడను త్రిప్పుకుంటాడు. ఇతరులను అల్లాహ్ మార్గంనుండి తప్పింపజూస్తాడు.[1] వానికి ఈ లోకంలో అవమానముంటుంది. మరియు పునరుత్థాన దినమున అతనికి మేము దహించే అగ్నిశిక్షను రుచి చూపుతాము.

ذَٰلِكَ بِمَا قَدَّمَتْ يَدَاكَ وَأَنَّ ٱللَّهَ لَيْسَ بِظَلَّٰمٍ لِّلْعَبِيدِ ﴿١٠﴾

10. (అతనితో): "ఇది నీవు నీ చేతులారా చేసిపంపిన దాని (ఫలితం) మరియు నిశ్చయంగా, అల్లాహ్ తన దాసులకు ఎలాంటి అన్యాయం చేయడు!" (అని అనబడుతుంది).

وَمِنَ ٱلنَّاسِ مَن يَعْبُدُ ٱللَّهَ عَلَىٰ حَرْفٍ فَإِنْ أَصَابَهُۥ خَيْرٌ ٱطْمَأَنَّ بِهِۦ وَإِنْ أَصَابَتْهُ فِتْنَةٌ ٱنقَلَبَ عَلَىٰ وَجْهِهِۦ خَسِرَ ٱلدُّنْيَا وَٱلْءَاخِرَةَ ذَٰلِكَ هُوَ ٱلْخُسْرَانُ ٱلْمُبِينُ ﴿١١﴾

11. మరియు ప్రజలలో కొందరు అంచున[2] నిలచి (సందేహంతో) అల్లాహ్‌ను ఆరాధించే వారున్నారు. (అలాంటి వాడు) తనకు లాభం కలిగితే, ఎంతో తృప్తి పొందుతాడు. కాని ఆపదకు గురిఅయితే ముఖం త్రిప్పుకొని, ఇహమును మరియు పరమును కూడా కోల్పోతాడు. స్పష్టమైన నష్టమంటే ఇదే!

---

1. ఇక్కడ ఆ వ్యక్తిని గురించి చెప్పబడింది. ఎవనికైతే అల్లాహ్ (సు.తా.)ను గురించి ఎలాంటి జ్ఞానంలేదో! ఈ విధమైన వివరాలకు చూడండి, 31:7, 63:5 మరియు 17:83.
2. 'హర్ఫున్: అంచున నిలబడినవాడు. అంటే హృదయపూర్వకంగా పూర్తిగా ఇస్లాంలో చేరనివాడు. ఇస్లాం స్వీకరించిన తరువాత లాభం కనిపిస్తే మంచి ధర్మం అంటాడు, లేకుంటే మంచిది కాదు అంటాడు. కొందరు ఎడారి వాసులు (బద్దూలు) మొదట ఇస్లాం స్వీకరించినప్పుడు ఈ విధంగానే వ్యవహరించారు.

يَدْعُوا۟ مِن دُونِ ٱللَّهِ مَا لَا يَضُرُّهُۥ وَمَا لَا يَنفَعُهُۥ ۚ ذَٰلِكَ هُوَ ٱلضَّلَٰلُ ٱلْبَعِيدُ ﴿١٢﴾

يَدْعُوا۟ لَمَن ضَرُّهُۥٓ أَقْرَبُ مِن نَّفْعِهِۦ ۚ لَبِئْسَ ٱلْمَوْلَىٰ وَلَبِئْسَ ٱلْعَشِيرُ ﴿١٣﴾

إِنَّ ٱللَّهَ يُدْخِلُ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ جَنَّٰتٍ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ ۚ إِنَّ ٱللَّهَ يَفْعَلُ مَا يُرِيدُ ﴿١٤﴾

مَن كَانَ يَظُنُّ أَن لَّن يَنصُرَهُ ٱللَّهُ فِى ٱلدُّنْيَا وَٱلْءَاخِرَةِ فَلْيَمْدُدْ بِسَبَبٍ إِلَى ٱلسَّمَآءِ ثُمَّ لْيَقْطَعْ فَلْيَنظُرْ هَلْ يُذْهِبَنَّ كَيْدُهُۥ مَا يَغِيظُ ﴿١٥﴾

وَكَذَٰلِكَ أَنزَلْنَٰهُ ءَايَٰتٍۭ بَيِّنَٰتٍ وَأَنَّ ٱللَّهَ يَهْدِى مَن يُرِيدُ ﴿١٦﴾

**12**. అతడు అల్లాహ్‌ను వదలి తనకు నష్టం గానీ, లాభం గానీ చేకూర్చలేని వారిని ప్రార్థిస్తున్నాడు. ఇదే మార్గ భ్రష్టత్వంలో చాలాదూరం పోవటం.[1]

**13**. ఎవరివల్ల లాభం కంటే, నష్టమే ఎక్కువ రానున్నదో వారినే అతడు ప్రార్థిస్తున్నాడు. ఎంత నికృష్టుడైన సంరక్షకుడు మరియు ఎంత నికృష్టుడైన అనుచరుడు ('అషీరు).

**14**. విశ్వసించి సత్కార్యాలు చేసే వారిని, అల్లాహ్ నిశ్చయంగా, క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ తాను కోరింది చేస్తాడు.

**15**. ఎవడైతే - ఇహలోకంలో మరియు పరలోకంలో కూడా - అల్లాహ్, అతనికి (ప్రవక్తకు) సహాయపడడని భావిస్తాడో! (వాడికి సాధ్యమైతే) వానిని ఒక త్రాడు సహాయంతో ఆకాశంపైకి పోయి, తరువాత వాటిని (అంటే ప్రవక్తపై అవతరింపజేయబడే వ'హీ మరియు ఇతర సహాయాలను) త్రెంపమను, అతని ఈ యుక్తి అతని క్రోధావేశాన్ని దూరం చేయగలదేమో![2]

**16**. మరియు ఈ విధంగా మేము దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) స్పష్టమైన సందేశాలతో అవతరింపజేశాము. మరియు నిశ్చయంగా, అల్లాహ్ తానుకోరిన వారికి సన్మార్గం చూపుతాడు.[3]

---

**1**. చూడండి, 14:18.

**2**. పైది ఇమామ్ అష్-షౌకాని (ర'హ్మ.) గారి తాత్పర్యం. ఇమామ్ ఇబ్నె-కసీ'ర్ (ర'హ్మ.) గారి తాత్పర్యం ఇలా ఉంది: "ఎవడైతే - ఇహలోకంలో మరియు పరలోకంలో కూడా - అల్లాహ్, దైవప్రవక్తకు సహాయపడడని భావిస్తాడో! వానిని (తన ఇంటి) కప్పుకు ఒక త్రాడు వేసి దానితో ఉరివేసుకొని చూడమను. వాని ఈ యుక్తి తన క్రోధావేశాన్ని దూరం చేయగలదేమో!"

**3**. చూడండి,14:4.

إِنَّ ٱلَّذِينَ ءَامَنُواْ وَٱلَّذِينَ هَادُواْ
وَٱلصَّٰبِـِٔينَ وَٱلنَّصَٰرَىٰ وَٱلْمَجُوسَ
وَٱلَّذِينَ أَشْرَكُوٓاْ إِنَّ ٱللَّهَ يَفْصِلُ
بَيْنَهُمْ يَوْمَ ٱلْقِيَٰمَةِۚ إِنَّ ٱللَّهَ عَلَىٰ كُلِّ
شَىْءٍ شَهِيدٌ ﴿١٧﴾

**17.** నిశ్చయంగా, (ఈ ఖుర్ఆన్‌ను) విశ్వసించిన వారి మరియు యూదులు, 'సాబీయు'లు, క్రైస్తవులు, మజూసీలు[1] మరియు బహుదైవారాధకులు అయిన వారి మధ్య పునరుత్థానదినమున అల్లాహ్ తప్పక తీర్పుచేస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ ప్రతి దానికి సాక్షిగా ఉంటాడు.

أَلَمْ تَرَ أَنَّ ٱللَّهَ يَسْجُدُ لَهُۥ مَن فِى
ٱلسَّمَٰوَٰتِ وَمَن فِى ٱلْأَرْضِ وَٱلشَّمْسُ
وَٱلْقَمَرُ وَٱلنُّجُومُ وَٱلْجِبَالُ وَٱلشَّجَرُ
وَٱلدَّوَآبُّ وَكَثِيرٌ مِّنَ ٱلنَّاسِۖ وَكَثِيرٌ
حَقَّ عَلَيْهِ ٱلْعَذَابُۗ وَمَن يُهِنِ ٱللَّهُ فَمَا
لَهُۥ مِن مُّكْرِمٍۚ إِنَّ ٱللَّهَ يَفْعَلُ مَا يَشَآءُ ۩
﴿١٨﴾

**18.** ఏమీ? నీకు తెలియదా? నిశ్చయంగా ఆకాశాలలో ఉన్నవన్నీ మరియు భూమిలో ఉన్నవన్నీ మరియు సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, పర్వతాలు, సర్వవృక్షరాశి, సర్వ జీవరాశి మరియు ప్రజలలో చాలామంది, అల్లాహ్‌కు సాష్టాంగం (సజ్దా) చేస్తూ ఉంటారని?[2] మరియు చాలా మంది శిక్షకు కూడా గురి అవుతారు. మరియు అల్లాహ్ ఎవడినైతే అవమానంపాలు చేస్తాడో, అతడికి గౌరవమిప్పించగలవాడు ఎవ్వడూలేడు. నిశ్చయంగా అల్లాహ్ తానుకోరిందే చేస్తాడు. ۩ (5/8)

۞ هَٰذَانِ خَصْمَانِ ٱخْتَصَمُواْ فِى رَبِّهِمْۖ
فَٱلَّذِينَ كَفَرُواْ قُطِّعَتْ لَهُمْ ثِيَابٌ
مِّن نَّارٍ يُصَبُّ مِن فَوْقِ رُءُوسِهِمُ
ٱلْحَمِيمُ ﴿١٩﴾

**19.** * ఆ రెండు విపక్ష తెగలవారు తమ ప్రభువును గురించి వాదులాడారు, కావున వారిలో సత్యతిరస్కారులకు అగ్నివస్త్రాలు కత్తిరించ(కుట్టించ)బడి ఉంటాయి, వారి తలలమీద సలసలకాగే నీరు పోయబడుతుంది.[3]

---

1. అల్-మజూసు: (Magians / Zoroastrians) అంటే మజూసీలు. వారు Zerdusht అనే ఈరాన్ ప్రవక్తను అనుసరిస్తారు. వారి గ్రంథం పేరు, Zend - Avesta, వీరు రెండు ఆరాధ్య దైవాలున్నాయి అంటారు. ఒకటి చీకటి, రెండోది వెలుగు. వీరు ఈరాన్‌లో మరియు ఇండియా పాకిస్తాన్‌లలో ఉన్న పార్సీలు. వీరు అగ్నిని పూజిస్తారు. కాని అల్లాహ్ (సు.తా.) సర్వసృష్టికి మూలాధారుడు అని కూడా విశ్వసిస్తారు.
2. చూడండి,13:15, 16:48-49.
3. కొందరు వ్యాఖ్యాతలు వీరిని, విశ్వాసులు మరియు సత్యతిరస్కారులతో పోల్చారు. ఇతరులు

**20**. దానితో వారి కడుపులలో ఉన్నది మరియు వారి చర్మాలు కరిగిపోతాయి.

يُصۡهَرُ بِهِۦ مَا فِي بُطُونِهِمۡ وَٱلۡجُلُودُ ٢٠

**21**. మరియు వారిని (శిక్షించటానికి) ఇనుపగదలు ఉంటాయి.

وَلَهُم مَّقَٰمِعُ مِنۡ حَدِيدٖ ٢١

**22**. ప్రతిసారి వారు దాని (ఆ నరకం) నుండి, దాని బాధనుండి బయటపడటానికి ప్రయత్నించినప్పుడల్లా తిరిగి అందులోకే నెట్టబడతారు. మరియు వారితో: ''నరకాగ్నిని చవిచూడండి!'' (అని అనబడుతుంది).

كُلَّمَآ أَرَادُوٓاْ أَن يَخۡرُجُواْ مِنۡهَا مِنۡ
غَمٍّ أُعِيدُواْ فِيهَا وَذُوقُواْ عَذَابَ
ٱلۡحَرِيقِ ٢٢

**23**. నిశ్చయంగా విశ్వసించి సత్కార్యాలు చేసేవారిని అల్లాహ్ క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. అందులో వారికి బంగారం మరియు ముత్యాలతో చేయబడిన కంకణాలు తొడిగింపబడతాయి. అక్కడ వారికొరకు పట్టు వస్త్రాలు ఉంటాయి.[1]

ٱللَّهَ يُدۡخِلُ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ
ٱلصَّٰلِحَٰتِ جَنَّٰتٖ تَجۡرِي مِن
تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُ يُحَلَّوۡنَ فِيهَا
مِنۡ أَسَاوِرَ مِن ذَهَبٖ وَلُؤۡلُؤٗاۖ
وَلِبَاسُهُمۡ فِيهَا حَرِيرٞ ٢٣

**24**. ఎందుకంటే వారికి మంచి మాటల వైపునకు మార్గదర్శకత్వం చూపబడింది. మరియు వారు సర్వస్తోత్రాలకు అర్హుడైన (అల్లాహ్) యొక్క మార్గం వైపునకు మార్గదర్శకత్వం పొందారు.

وَهُدُوٓاْ إِلَى ٱلطَّيِّبِ مِنَ ٱلۡقَوۡلِ
وَهُدُوٓاْ إِلَىٰ صِرَٰطِ ٱلۡحَمِيدِ ٢٤

**25**. నిశ్చయంగా, ఎవరైతే సత్యాన్ని తిరస్కరిస్తూ (ప్రజలను) అల్లాహ్ మార్గంనుండి మరియు మస్జిద్ అల్-'హరామ్ నుండి ఆటంకపరుస్తారో[2]-

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ وَيَصُدُّونَ عَن
سَبِيلِ ٱللَّهِ وَٱلۡمَسۡجِدِ ٱلۡحَرَامِ ٱلَّذِي

---

బద్ర్ యుద్ధంలో పోరాడిన విశ్వాసులు మరియు ముష్రిక్‌లైన మక్కా ఖురైషులతో పోల్చారు. ఇబ్నె-కసీ'ర్ (ర'హ్మ) ఈ రెండు వ్యాఖ్యానాలు సరైనవే అంటారు.

**1**. చూడండి, 18:31.

**2**. ఈ ఆటంకపరచే వారు, మక్కా ముష్రికులు. వీరు 6వ హిజ్రీలో దైవప్రవక్త ('స'అస) మరియు అతని అనుచరు(ర'ది.'అన్హుమ్)లను మక్కాలో ప్రవేశించకుండా ఆపారు. మరియు వారు హుదైబియానుండి మరలిపోయారు.

దేనినైతే మేము అందరి కొరకు సమానంగా చేసి ఉన్నామో - వారు అక్కడ నివసించే వారైనా సరే, లేదా బయటనుండి వచ్చిన వారైనాసరే.[1] మరియు ఎవరైనా అందులో అపవిత్రత మరియు అన్యాయం చేయగోరుతారో, అలాంటి వారికి మేము బాధాకరమైన శిక్షను రుచిచూపుతాము.

**26**. మరియు మేము ఇబ్రాహీమ్‌కు ఈ గృహం (క'అబహ్) యొక్క స్థలాన్ని నిర్దేశించి (చూపుతూ)[2] అతనితో: "ఎవ్వరినీ నాకు సాటిగా (భాగస్వాములుగా) కల్పించకు. మరియు నా గృహాన్ని, ప్రదక్షిణ ('తవాఫ్) చేసేవారి కొరకు, నమా'జ్ చేసేవారి కొరకు, వంగే (రుకూ'உ) మరియు సాష్టాంగం (సజ్దా) చేసేవారి కొరకు, పరిశుద్ధంగా ఉంచు."[3] అని అన్నాము.

جَعَلْنَٰهُ لِلنَّاسِ سَوَآءً ٱلْعَٰكِفُ
فِيهِ وَٱلْبَادِ ۚ وَمَن يُرِدْ فِيهِ
بِإِلْحَادٍۭ بِظُلْمٍ نُّذِقْهُ مِنْ
عَذَابٍ أَلِيمٍ ﴿٢٥﴾

وَإِذْ بَوَّأْنَا لِإِبْرَٰهِيمَ مَكَانَ
ٱلْبَيْتِ أَن لَّا تُشْرِكْ بِى شَيْـًٔا
وَطَهِّرْ بَيْتِىَ لِلطَّآئِفِينَ
وَٱلْقَآئِمِينَ وَٱلرُّكَّعِ ٱلسُّجُودِ
﴿٢٦﴾

---

**1**. దీనిని ఈ విధంగా చాలామంది వ్యాఖ్యాతలు వివరించారు: మస్జిద్ అల్-'హరామ్ మీద అక్కడ నివసించే వారికి మరియు బయటి నుండి వచ్చే వారికి సరిసమానమైన హక్కులున్నాయి. అంటే ఏ ముస్లింకు అయినా ఏ సమయంలో గానీ రాత్రింబవళ్ళు, మస్జిద్ అల్-'హరాంలో ప్రవేశించి 'తవాఫ్, నమా'జ్, 'ఉమ్రా మొదలైనవి చేసే హక్కు ఉంది. అతనిని ఎవ్వరూ, తన ప్రార్థనలనుండి ఆపరాదు. ఇక 'హరమ్ హద్దులలో ఉన్న భూమిలో ఇండ్లు కట్టుకున్న వారు తమ ఇండ్ల యజమానులు కాని మినా, ము'జ్‌దలిఫా, 'అరఫాత్ ('హజ్జ్ ప్రాంతాలు) మాత్రం సర్వ ముస్లింల కొరకు ఉన్నాయి. వాటిపై ఎవ్వరీ యజమాన్యం లేదు. ఈ విషయంపై ధర్మవేత్తలందరూ ఏకీభవిస్తున్నారు. చూ. 2:125.

**2**. నూ'హ్ ('అ.స.) 'తుఫాన్ తరువాత, క'అబహ్‌గృహాన్ని నిర్మించిన వారు ఇబ్రాహీమ్ ('అ.స.) మరియు అతని కుమారుడు ఇస్మా'యీల్ ('అ.స.) ఆ తరువాత 40 సంవత్సరాల పిదప మస్జిద్ అల్-అ'ఖ్సా నిర్మించబడింది. (ముస్నద్ అ'హ్మద్ 5/150, 166, 167 మరియు ముస్లిం, కితాబుల్ మసాజిద్).

**3**. 'తవాఫ్ మరియు నమా'జ్ కేవలం ఈ కాబాకే ప్రత్యేకించబడ్డాయి. కావున అల్లాహ్ (సు.తా) ఆజ్ఞ ప్రకారం కేవలం కాబాకు మాత్రమే 'తవాఫ్ చేయాలి మరియు కేవలం ఈ క'అబహ్ వైపునకే ముఖం చేసి నమా'జ్ చేయాలి. ఈ క'అబహ్ ను విడిచి ఏ ఇతర దానికి 'తవాఫ్ చేయటం లేక దాని వైపునకు ముఖం చేసి నమా'జ్ చేయటం సత్యతిరస్కారం (కుఫ్ర్) అవుతుంది.

**27**. మరియు ప్రజలకు 'హజ్జ్ యాత్రను గురించి ప్రకటించు:[1] వారు పాదాచారులుగా మరియు ప్రతి బలహీనమైన ఒంటె (సవారీ) మీద, విశాల (దూర) ప్రాంతాల నుండి మరియు కనుమల నుండి నీ వైపుకు వస్తారు.

**28**. వారు, తమ కొరకు ఇక్కడ ఉన్న ప్రయోజనాలను అనుభవించటానికి మరియు ఆయన వారికి జీవనోపాధిగా ప్రసాదించిన పశువుల మీద, నిర్ణీత దినాలలో అల్లాహ్ పేరును స్మరించి (జి''బ్హ్ చేయటానికి). కావున దానిని (వాటి మాంసాన్ని) తినండి మరియు లేమికి గురిఅయిన నిరుపేదలకు తినిపించండి.[2]

**29**. తరువాత వారు 'హజ్జ్ ఆచారాలు[3] (తఫస్') మరియు మొక్కుబడులు (నుజు'ర్) పూర్తి చేసుకొనిన పిదప ఆ ప్రాచీన గృహం (క'అబహ్) యొక్క ప్రదక్షిణ చేయాలి.[4]

وَأَذِّن فِي ٱلنَّاسِ بِٱلۡحَجِّ يَأۡتُوكَ رِجَالٗا وَعَلَىٰ كُلِّ ضَامِرٖ يَأۡتِينَ مِن كُلِّ فَجٍّ عَمِيقٖ ﴿٢٧﴾

لِّيَشۡهَدُواْ مَنَٰفِعَ لَهُمۡ وَيَذۡكُرُواْ ٱسۡمَ ٱللَّهِ فِيٓ أَيَّامٖ مَّعۡلُومَٰتٍ عَلَىٰ مَا رَزَقَهُم مِّنۢ بَهِيمَةِ ٱلۡأَنۡعَٰمِۖ فَكُلُواْ مِنۡهَا وَأَطۡعِمُواْ ٱلۡبَآئِسَ ٱلۡفَقِيرَ ﴿٢٨﴾

ثُمَّ لۡيَقۡضُواْ تَفَثَهُمۡ وَلۡيُوفُواْ نُذُورَهُمۡ وَلۡيَطَّوَّفُواْ بِٱلۡبَيۡتِ ٱلۡعَتِيقِ ﴿٢٩﴾

---

1. 'హజ్జ్ వివరాలకు చూడండి, 2:196-203.
2. అయ్యామిమ్ మ'అలూమాత్: అంటే జి''బ్హ్ చేసే దినాలు, అంటే 10వ తేది మరియు దాని తరువాత మూడు దినాలు, అంటే 11, 12, 13 జు'ల్-'హజ్జ్ తేదీలు. దాని మూడోవంతు మాంసాన్ని నిరుపేదలకు పంచటం విధి. ఈ జి''బ్హ్ ఇస్మా'యీల్ ('అ.స.)ను, అతని తండ్రి ఇబ్రాహీమ్ ('అ.స.) - అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞతో - జి''బ్హ్ చేసిన సందర్భాన్ని జ్ఞాపకంచేసుకోవటానికే. అంటే అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞలను శిరసావహించటమే ప్రతి ముస్లిం విధి. చూడండి, 37:102-107.
3. అంటే 10వ జు'ల్-'హజ్జ్‌న చివరి షై'తాన్(జమరతుల్ 'అఖబహ్)కు - ఏదైతే మక్కా వైపు ఉందో - ఏడు రవ్వలు రువ్వి, ఖుర్బానీ చేసి, తలవెంట్రుకలను కత్తిరించుకుంటే, అది త'హ్లీలె అవ్వల్ లేక చిన్న 'హలాల్ అవుతుంది. అంటే ఇ'హ్రామ్ నిషేధాలన్నీ ముగిసిపోతాయి. కాని 'తవాఫ్ ఇఫాదా ('జ్యారహ్) చేసే వరకు భార్యతో సంభోగం చేయడం నిషిద్ధం.
4. 'తవాఫె 'జ్యారహ్: ఇది విధి, తప్పకచేయవలసింది. ఇది 'అరఫాత్ నుండి బయలుదేరి 9-10తేదీల మధ్య రాత్రి ము'జ్‌దలిఫాలో గడిపి 10వతేదీ ఉదయం చివరి షై'తాన్(జమరతుల్ 'అఖబహ్)కు ఏడురవ్వలు రువ్వి, 'ఖుర్బానీ ఇచ్చి తలవెంట్రుకలు కత్తిరించుకొని, ఇ'హ్రామ్ విడిచిన తరువాత మక్కాకు పోయి క'అబహ్ గృహం చుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణ చేయటం. ఇది

**30.** ఇదే ('హజ్జ్)! మరియు ఎవడైతే అల్లాహ్ విధించిన నిషేధా (పవిత్ర నియమా)లను ఆదరిస్తాడో, అది అతని కొరకు, అతని ప్రభువు వద్ద ఎంతో మేలైనది. మరియు మీ కొరకు ఇది వరకు మీకు (నిషిద్ధమని) చెప్పబడినవి తప్ప,[1] ఇతర పశువులన్నీ ధర్మసమ్మతం చేయబడ్డాయి. ఇక మీరు విగ్రహారాధన వంటి మాలిన్యం నుండి దూరంగా ఉండండి మరియు అబద్ధపు (బూటకపు) మాటలనుండి కూడా దూరంగా ఉండండి.

**31.** ఏకాగ్రచిత్తం (ఏక దైవసిద్ధాంతం)తో[2] అల్లాహ్ వైపునకే మరలండి, ఆయనకు సాటి (భాగస్వాములను) కల్పించకండి. అల్లాహ్‌కు సాటి కల్పించిన వాని గతి ఆకాశంనుండి క్రింద పడిపోయే దానివంటిదే! దానిని పక్షులైనా ఎత్తుకొని పోవచ్చు, లేదా గాలి అయినా దూరప్రదేశాలకు ఎగురగొట్టుకు పోవచ్చు!

**32.** ఇదే! మరియు ఎవడైతే, అల్లాహ్ నియమించిన చిహ్నాలను[3] గౌరవిస్తాడో, అది నిశ్చయంగా, హృదయాలలో ఉన్న దైవభీతి వల్లనే!

**33.** ఒక నిర్ణీత కాలం వరకు మీకు వాటిలో (ఈ పశువులలో) లాభాలున్నాయి.[4] ఆ తరువాత వాటి గమ్యస్థానం ప్రాచీన గృహమే (క'అబహ్‌యే)!

ذَٰلِكَ وَمَن يُعَظِّمۡ حُرُمَٰتِ ٱللَّهِ فَهُوَ خَيۡرٞ لَّهُۥ عِندَ رَبِّهِۦۗ وَأُحِلَّتۡ لَكُمُ ٱلۡأَنۡعَٰمُ إِلَّا مَا يُتۡلَىٰ عَلَيۡكُمۡۖ فَٱجۡتَنِبُواْ ٱلرِّجۡسَ مِنَ ٱلۡأَوۡثَٰنِ وَٱجۡتَنِبُواْ قَوۡلَ ٱلزُّورِ ٣٠

حُنَفَآءَ لِلَّهِ غَيۡرَ مُشۡرِكِينَ بِهِۦۚ وَمَن يُشۡرِكۡ بِٱللَّهِ فَكَأَنَّمَا خَرَّ مِنَ ٱلسَّمَآءِ فَتَخۡطَفُهُ ٱلطَّيۡرُ أَوۡ تَهۡوِي بِهِ ٱلرِّيحُ فِي مَكَانٖ سَحِيقٖ ٣١

ذَٰلِكَ وَمَن يُعَظِّمۡ شَعَٰٓئِرَ ٱللَّهِ فَإِنَّهَا مِن تَقۡوَى ٱلۡقُلُوبِ ٣٢

لَكُمۡ فِيهَا مَنَٰفِعُ إِلَىٰٓ أَجَلٖ مُّسَمّٗى ثُمَّ مَحِلُّهَآ إِلَى ٱلۡبَيۡتِ ٱلۡعَتِيقِ ٣٣

---

10,11,12 జు'ల్-'హజ్జ్ తేదీలలో పూర్తిచేయాలి. దీని తరువాత భార్యతో సంభోగం చేయవచ్చు. ఇది చివరి 'హలాల్. వివరాలకు చూడండి, 2:196-197.

**1**. చూడండి, 5:3.

**2**. 'హునఫా': అంటే ఒకే వైపుకు మొగ్గటం. అంటే ఏకదైవ సిద్ధాంతాన్ని పాటించటం. ఆరాధనలను కేవలం ఆ ఏకైక ఆరాధ్యుడు అల్లాహ్ (సు.తా.)కే ప్రత్యేకించుకోవటం. ఇంకా చూడండి, 2:135.

**3**. ష'ఆఇరల్లాహ్: అల్లాహ్ నియమించిన చిహ్నాలు అంటే 'సఫా-మర్వాలు మరియు ఖుర్బానీ పశువులు మొదలైనవి. ఇంకా చూడండి, 5:2.

**4**. అంటే ఖుర్బానీ పశువులను, జి''బ్హ్ చేయనంతవరకు వాటిని వినియోగించుకోవటం ధర్మ సమ్మతమే! అంటే ఒకవేళ అది ఒంటె ఉంటే దానిపై ఎక్కి 'హజ్జ్ కు పోవచ్చు. ('స'హీ'హ్ బు'ఖారీ).

**34**. మరియు ప్రతి సమాజానికి మేము ధర్మ ఆచారాలు (ఖుర్బానీ పద్ధతి)[1] నిర్ణయించి ఉన్నాము. మేము వారి జీవనోపాధి కొరకు ప్రసాదించిన పశువులను, వారు (వధించే టప్పుడు) అల్లాహ్ పేరును ఉచ్చరించాలి. ఎందుకంటే మీరందరి ఆరాధ్య దైవం ఆ ఏకైక దేవుడు (అల్లాహ్)! కావున మీరు ఆయనకు మాత్రమే విధేయులై (ముస్లింలై) ఉండండి. మరియు వినయ విధేయతలు గలవారికి శుభవార్త నివ్వు!

**35**. (వారికి) ఎవరి హృదయాలైతే, అల్లాహ్ పేరు ఉచ్చరించబడినప్పుడు భయంతో వణికిపోతాయో మరియు ఆపదలలో సహనం వహిస్తారోమరియు నమా'జ్ స్థాపిస్తారో మరియు వారికి ప్రసాదించిన జీవనోపాధి నుండి ఇతరులపై ఖర్చుచేస్తారో!

**36**. ఖుర్బానీ పశువులను,[2] మేము మీ కొరకు అల్లాహ్ చిహ్నాలుగా చేశాము; మీకు వాటిలో మేలున్నది. కావున వాటిని (ఖుర్బానీ కొరకు) నిలబెట్టి వాటిపై అల్లాహ్ పేరును ఉచ్చరించండి. అవి (ప్రాణం విడిచి) ప్రక్కల మీద పడిపోయిన తరువాత మీరు వాటిని తినండి[3] మరియు యాచించని పేదలకు

وَلِكُلِّ أُمَّةٍ جَعَلْنَا مَنسَكًا
لِّيَذْكُرُوا۟ ٱسْمَ ٱللَّهِ عَلَىٰ مَا رَزَقَهُم
مِّنۢ بَهِيمَةِ ٱلْأَنْعَـٰمِ ۗ فَإِلَـٰهُكُمْ
إِلَـٰهٌ وَٰحِدٌ فَلَهُۥٓ أَسْلِمُوا۟ ۗ وَبَشِّرِ
ٱلْمُخْبِتِينَ ﴿٣٤﴾

ٱلَّذِينَ إِذَا ذُكِرَ ٱللَّهُ وَجِلَتْ
قُلُوبُهُمْ وَٱلصَّـٰبِرِينَ عَلَىٰ مَآ
أَصَابَهُمْ وَٱلْمُقِيمِى ٱلصَّلَوٰةِ وَمِمَّا
رَزَقْنَـٰهُمْ يُنفِقُونَ ﴿٣٥﴾

وَٱلْبُدْنَ جَعَلْنَـٰهَا لَكُم مِّن
شَعَـٰٓئِرِ ٱللَّهِ لَكُمْ فِيهَا خَيْرٌ ۖ فَٱذْكُرُوا۟
ٱسْمَ ٱللَّهِ عَلَيْهَا صَوَآفَّ ۖ فَإِذَا وَجَبَتْ
جُنُوبُهَا فَكُلُوا۟ مِنْهَا وَأَطْعِمُوا۟

---

1. అల్-మనాసికు: అంటే, విధేయత లేక ఆరాధన అంటే అల్లాహ్ (సు.తా.) సాన్నిధ్యం పొందటానికి, అల్లాహ్ (సు.తా.) ప్రీతి కొరకు అల్లాహ్ (సు.తా) ఆజ్ఞాపించిన ఆచారాలను పూర్తిచేయటం. అల్లాయేతరుల పేరుతో ఖుర్బానీ చేయటం నిషిద్ధం ('హరాం). 'హజ్జ్ ఆచారాలు కూడా మనాసిక్ అనబడతాయి. దీని ఏకవచనం నుసుకున్.
2. బుద్నున్, బదనతున్ యొక్క బహువచనం. అంటే బాగా బలసిన పశువు. సాధారణంగా ఈ శబ్దం ఒంటెలకే వాడబడుతుంది. కానీ 'హదీస్'ల ప్రకారం, ఖుర్బానీ కొరకు తేబడిన ఆవులు ఎడ్లు మొదలైన వాటిని సూచిస్తుంది.
3. అంటే వాటి రక్తం పూర్తిగా పారిన తరువాత అవి పూర్తిగా కదలకుండా పడిపోయిన తరువాత వాటిని

ٱلْقَانِعَ وَٱلْمُعْتَرَّ كَذَٰلِكَ سَخَّرْنَٰهَا لَكُمْ لَعَلَّكُمْ تَشْكُرُونَ ﴿٣٦﴾

లَن يَنَالَ ٱللَّهَ لُحُومُهَا وَلَا دِمَآؤُهَا وَلَٰكِن يَنَالُهُ ٱلتَّقْوَىٰ مِنكُمْ كَذَٰلِكَ سَخَّرَهَا لَكُمْ لِتُكَبِّرُوا۟ ٱللَّهَ عَلَىٰ مَا هَدَىٰكُمْ وَبَشِّرِ ٱلْمُحْسِنِينَ ﴿٣٧﴾

۞ إِنَّ ٱللَّهَ يُدَٰفِعُ عَنِ ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ كُلَّ خَوَّانٍ كَفُورٍ ﴿٣٨﴾

أُذِنَ لِلَّذِينَ يُقَٰتَلُونَ بِأَنَّهُمْ ظُلِمُوا۟ وَإِنَّ ٱللَّهَ عَلَىٰ نَصْرِهِمْ لَقَدِيرٌ ﴿٣٩﴾

మరియు యాచించే పేదలకు కూడా తినిపించండి. ఈ విధంగా మేము వాటిని మీకు ఉపయుక్తంగా చేశాము; బహుశా మీరు కృతజ్ఞులవుతారేమోనని.

**37.** వాటి మాంసం గానీ, వాటి రక్తం గానీ అల్లాహ్‌కు చేరవు! కానీ మీ భయభక్తులే ఆయనకు చేరుతాయి. మీకు సన్మార్గం చూపినందుకు, మీరు అల్లాహ్ ఘనతను కొనియాడటానికి, ఈవిధంగా ఆయన వాటిని మీకు వశపరిచాడు. సజ్జనులకు శుభవార్తను వినిపించు! (3/4)

**38.** * నిశ్చయంగా అల్లాహ్ విశ్వసించిన వారిని కాపాడుతాడు. నిశ్చయంగా అల్లాహ్ ఏ విశ్వాసఘాతకుణ్ణి మరియు కృతఘ్నుణ్ణి ప్రేమించడు.

**39.** తమపై దాడి చేసిన వారితో యుద్ధం చేయటానికి అనుమతి ఇవ్వబడుతోంది.[1] ఎందుకంటే, వారు అన్యాయానికి గురిచేయబడ్డారు. నిశ్చయంగా, అల్లాహ్ వారికి సహాయం చేయగల సమర్థుడు.

---

తినండి. ఎందుకంటే సజీవిగా ఉన్న పశువు మాంసం తినటం నిషిద్ధం, (అబూ దావూద్, తిర్మిజీ'). 'ఖుర్బానీ పశువు మాంసం స్వయంగా తినటం కొందరు ధర్మవేత్తలు వాజిబ్‌గా మరికొందరు ముస్తహబ్‌గా ఖరారు చేశారు. 'ఖుర్బానీ మాంసాన్ని మూడు భాగాలు చేయాలి. ఒక భాగం స్వంతం మరియు తన కుటుంబం వారికి రెండోది బంధుమిత్రులకు మరియు మూడోది పేదవారి కొరకు, (ముస్లిం, బు'ఖారీ). 'ఖుర్బానీ, 'హజ్జ్ సమయంలోనే గాక, జు'ల్-'హజ్జ్ పండుగ కొరకు కూడా చేయాలి 108:2, అంటే ఎవరు 'హజ్జ్ యాత్రకుపోరో, వారు తమ ఇండ్లలో 10-12వ జు'ల్-'హజ్జ్ రోజులలో ఖుర్బానీ చేయాలి. ఇది 'ఈద్ నమాజ్ తరువాత చేయాలి, (స'హీ'హ్ బు'ఖారీ).

**1.** ఈ ఆయత్‌లో, ఖుర్ఆన్ అవతరణలో, మొదటిసారి ఆత్మరక్షణ కొరకు యుద్ధపరిమితి ఇవ్వబడింది. అబ్దుల్లాహ్ ఇబ్నె 'అబ్బాస్ (ర'ది.'అ.) కథనం ప్రకారం ఈ ఆయత్ దైవప్రవక్త (సఅస) మక్కానుండి మదీనా వలసపోయిన వెంటనే అవతరింపజేయబడింది, మొదటి హిజ్రీ మొదట్లో. దీని తరువాత రెండవ హిజ్రీలో ఆయత్‌లు 2:190-193 అవతరింపజేయబడ్డాయి. ఆ తరువాత 2:216, 224 అవతరింపజేయబడ్డాయి.

**40**. వారికి ఎవరైతే కేవలం: ''మా ప్రభువు అల్లాహ్!'' అని అన్నందుకు మాత్రమే, అన్యాయంగా తమ ఇండ్లనుండి తరిమివేయబడ్డారో! ఒకవేళ అల్లాహ్ ప్రజలను ఒకరి ద్వారా మరొకరిని తొలగిస్తూ ఉండకపోతే[1] క్రైస్తవ సన్యాసుల మఠాలు, చర్చిలు, యూదుల ప్రార్థనాలయాలు[2] మరియు మస్జిదులు, ఎక్కడైతే అల్లాహ్ పేరు అత్యధికంగా స్మరించబడుతుందో, అన్నీ ధ్వంసం చేయబడి ఉండేవి.[3] నిశ్చయంగా, తనకు తాను సహాయం చేసుకునే వానికి అల్లాహ్ తప్పకుండా సహాయం చేస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ మహా బలవంతుడు, సర్వశక్తిమంతుడు.

ٱلَّذِينَ أُخۡرِجُواْ مِن دِيَٰرِهِم بِغَيۡرِ
حَقٍّ إِلَّآ أَن يَقُولُواْ رَبُّنَا ٱللَّهُۗ
وَلَوۡلَا دَفۡعُ ٱللَّهِ ٱلنَّاسَ بَعۡضَهُم
بِبَعۡضٖ لَّهُدِّمَتۡ صَوَٰمِعُ وَبِيَعٞ
وَصَلَوَٰتٞ وَمَسَٰجِدُ يُذۡكَرُ
فِيهَا ٱسۡمُ ٱللَّهِ كَثِيرٗاۗ
وَلَيَنصُرَنَّ ٱللَّهُ مَن يَنصُرُهُۥٓۚ
إِنَّ ٱللَّهَ لَقَوِيٌّ عَزِيزٌ ٤٠

**41**. వారే! ఒకవేళ మేము వారికి భూమిపై అధికారాన్ని ప్రసాదిస్తే, వారు నమా'జ్ స్థాపిస్తారు, విధిదానం ('జకాత్) ఇస్తారు మరియు ధర్మమును (మంచిని) ఆదేశిస్తారు మరియు అధర్మము (చెడు) నుండి నిషేధిస్తారు.[4] సకల వ్యవహారాల అంతిమ నిర్ణయం అల్లాహ్ చేతిలోనే వుంది.

ٱلَّذِينَ إِن مَّكَّنَّٰهُمۡ فِي ٱلۡأَرۡضِ
أَقَامُواْ ٱلصَّلَوٰةَ وَءَاتَوُاْ
ٱلزَّكَوٰةَ وَأَمَرُواْ بِٱلۡمَعۡرُوفِ
وَنَهَوۡاْ عَنِ ٱلۡمُنكَرِۗ وَلِلَّهِ عَٰقِبَةُ
ٱلۡأُمُورِ ٤١

---

**1**. ఇటువంటి వాక్యానికి చూడండి, 2:251.

**2**. యూదుల మతాచారు (అ'హ్‌బార్)లు తమ మతధర్మాలను ఉపదేశించే స్థలాలు, లేక యూదుల ప్రార్థనాలయాలు (సైనగోజెస్/ Synagogues) అనబడతాయి.

**3**. ధర్మ స్వాతంత్ర్యం కొరకు ఆయుధాలు ఎత్తుకోవడం అత్యవసరమైనపని. చూ. 2:193.

**4**. ఈ ఆయత్‌లో ఇస్లామీయ రాజ్యం యొక్క మూల సూత్రాలు పేర్కొనబడ్డాయి. 1) నమా'జ్, 2) 'జకాత్, 3) మంచిని ఆదేశించడం లేక ప్రోత్సహించడం, 4) చెడును నిరోధించడం లేక నివారించడం మరియు 5) షరీయత్ ప్రకారం శిక్ష విధించడం మొదలైనవి. ఇటువంటి సూత్రాలు ఇప్పుడు స'ఊదీ 'అరేబియాలోనే అత్యధికంగా పాటించబడుతున్నాయి. కాబట్టి అక్కడ ప్రపంచంలో ఏ దేశంలో లేని శాంతిభద్రతలు ఉన్నాయి. అల్లాహ్ (సు.తా) దానిని భద్రపరచు గాక!

وَإِن يُكَذِّبُوكَ فَقَدْ كَذَّبَتْ
قَبْلَهُمْ قَوْمُ نُوحٍ وَعَادٌ وَثَمُودُ ﴿٤٢﴾

**42**. మరియు (ఓ ము'హమ్మద్!) వారు (సత్యతిరస్కారులు) ఒక వేళ నిన్ను అసత్యవాదుడవని తిరస్కరిస్తే (ఆశ్చర్యపడకు); వాస్తవానికి, వారికి పూర్వం నూ'హ్, 'ఆద్ మరియు స'మూద్ జాతులవారు కూడా (తమ ప్రవక్తలను) అసత్యవాదులని తిరస్కరించారు;

وَقَوْمُ إِبْرَٰهِيمَ وَقَوْمُ لُوطٍ ﴿٤٣﴾

**43**. మరియు ఇబ్రాహీమ్ జాతి వారు మరియు లూ'త్ జాతి వారు;

وَأَصْحَٰبُ مَدْيَنَ ۖ وَكُذِّبَ مُوسَىٰ
فَأَمْلَيْتُ لِلْكَٰفِرِينَ ثُمَّ أَخَذْتُهُمْ ۖ
فَكَيْفَ كَانَ نَكِيرِ ﴿٤٤﴾

**44**. మరియు మద్‌యన్ వాసులు కూడాను! అంతే కాదు మూసా కూడా అసత్యవాదుడవని తిరస్కరించబడ్డాడు. కావున నేను సత్యతిరస్కారులకు (మొదట) కొంత వ్యవధినిచ్చి, తరువాత పట్టుకుంటాను. (చూశారా!) నన్ను నిరాకరించడం వారికొరకు ఎంత ఘోరమైనదిగా ఉండెనో!

فَكَأَيِّن مِّن قَرْيَةٍ أَهْلَكْنَٰهَا
وَهِىَ ظَالِمَةٌ فَهِىَ خَاوِيَةٌ
عَلَىٰ عُرُوشِهَا وَبِئْرٍ مُّعَطَّلَةٍ
وَقَصْرٍ مَّشِيدٍ ﴿٤٥﴾

**45**. (ఈ విధంగా), మేము ఎన్నో పురాలను నాశనం చేశాము. ఎందుకంటే, వాటి (ప్రజలు) దుర్మార్గులై ఉండిరి. (ఈ నాడు) అవి నాశనమై, తమ కప్పులమీద తలక్రిందులై పడివున్నాయి, వారి బావులు మరియు వారి దృఢమైన కోటలు గూడా పాడుపడి ఉన్నాయి!

أَفَلَمْ يَسِيرُوا۟ فِى ٱلْأَرْضِ فَتَكُونَ
لَهُمْ قُلُوبٌ يَعْقِلُونَ بِهَآ أَوْ ءَاذَانٌ
يَسْمَعُونَ بِهَا ۖ فَإِنَّهَا لَا تَعْمَى
ٱلْأَبْصَٰرُ وَلَٰكِن تَعْمَى ٱلْقُلُوبُ
ٱلَّتِى فِى ٱلصُّدُورِ ﴿٤٦﴾

**46**. ఏమీ? వారు భూమిలో ప్రయాణం చేయరా? దానిని వారి హృదయాలు (మనస్సులు) అర్థం చేసుకోగలగటానికి మరియు వారి చెవులు దానిని వినటానికి? వాస్తవమేమిటంటే వారి కన్నులైతే గ్రుడ్డివి కావు, కాని ఎదలలో ఉన్న హృదయాలే గ్రుడ్డి వయిపోయాయి.

وَيَسْتَعْجِلُونَكَ بِالْعَذَابِ وَلَن
يُخْلِفَ اللَّهُ وَعْدَهُ وَإِنَّ يَوْمًا
عِندَ رَبِّكَ كَأَلْفِ سَنَةٍ مِّمَّا
تَعُدُّونَ ﴿٤٧﴾

**47**. మరియు (ఓ ము'హమ్మద్!) వారు నిన్ను శిక్ష కొరకు తొందర పెడుతున్నారు.[1] కాని, అల్లాహ్ తన వాగ్దానాన్ని భంగపరచడు. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు వద్ద ఒక్కదినం మీ లెక్కల ప్రకారం వేయి సంవత్సరాలకు సమానమైనది.[2]

وَكَأَيِّن مِّن قَرْيَةٍ أَمْلَيْتُ لَهَا
وَهِيَ ظَالِمَةٌ ثُمَّ أَخَذْتُهَا وَإِلَيَّ
الْمَصِيرُ ﴿٤٨﴾

**48**. మరియు దుర్మార్గంలో మునిగివున్న ఎన్నో నగరాలకు నేను వ్యవధినిచ్చాను! తరువాత వాటిని (శిక్షించటానికి) పట్టు కున్నాను. (వారి) గమ్యస్థానం నా వైపునకే కదా!''

قُلْ يَا أَيُّهَا النَّاسُ إِنَّمَا أَنَا لَكُمْ
نَذِيرٌ مُّبِينٌ ﴿٤٩﴾

**49**. (ఓ ము'హమ్మద్!) వారితో అను: ''ఓ మానవులారా! నేను కేవలం మీకు స్పష్టంగా హెచ్చరిక చేసేవాడను మాత్రమే!''

فَالَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ
لَهُم مَّغْفِرَةٌ وَرِزْقٌ كَرِيمٌ ﴿٥٠﴾

**50**. కావున ఎవరైతే, విశ్వసించి సత్కార్యాలు చేస్తారో, వారికి క్షమాపణ మరియు గౌరవప్రదమైన జీవనోపాధి ఉంటాయి.[3]

وَالَّذِينَ سَعَوْا فِي آيَاتِنَا مُعَاجِزِينَ
أُولَٰئِكَ أَصْحَابُ الْجَحِيمِ ﴿٥١﴾

**51**. కాని ఎవరైతే మా సూచనలను కించపరచటానికి ప్రయత్నిస్తారో అలాంటి వారు తప్పక భగభగ మండే నరకాగ్ని వాసులవుతారు.

---

**1**. చూడండి, 6:57, 8:32 మరియు 13:6.

**2**. మానవుల 'కాలగణనం' భూమి, సూర్య చంద్రుల సంచారంతో బంధింపబడివుంది. అల్లాహ్ (సు.తా.) కాలానికి పరిమితుడైనవాడు కాడు. ఆయన అంతర్యామి ఆయనకు మొదలు, ముగింపు అనేవి లేవు. ఏవైతే కాలానికి సంబంధించినవో! ఇంకా చూడండి, 70:4. అక్కడ ఒక దినం ఏబదివేల సంవత్సరాలతో సమానమనబడింది. దీనిని సమర్థించటానికి ఎన్నో 'స'హీ'హ్ 'హదీస్'లున్నాయి. అల్లాహ్ (సు.తా.) అన్నాడు: 'నేనే కాలాన్ని (అద్దహ్ర్).'

**3**. చూడండి, 8:4.

**52**. మరియు (ఓ ప్రవక్తా!) నీకు పూర్వం మేము పంపిన ఏ సందేశహరుడు గానీ, లేదా ప్రవక్త గానీ, (నా సందేశాన్ని ప్రజలకు) అందించగోరినపుడు, షై'తాన్ అతని కోరికలను ఆటంకపరచకుండా ఉండలేదు.[1] కాని షై'తాన్ కల్పించిన ఆటంకాలను అల్లాహ్ నిర్మూలించాడు. ఆ తరువాత అల్లాహ్ తన ఆయత్‌లను స్థిరపరచాడు.[2] మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేచనాపరుడు;

**53**. ఎవరి హృదయాలలో రోగముందో![3] మరియు ఎవరి హృదయాలు కఠినమైనవో, వారికి షై'తాన్ కల్పించేవి (సందేహాలు) ఒక పరీక్షగా చేయబడటానికి. మరియు నిశ్చయంగా ఈ దుర్మార్గులు విరోధంలో చాలా దూరం వెళ్ళిపోయారు.

**54**. మరియు జ్ఞానమొసంగబడిన వారు ఇది (ఈ ఖుర్ఆన్) నీ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యమని తెలుసుకొని దానిని విశ్వసించటానికి, వారి హృదయాలు దానికి అంకితం అవటానికి. మరియు నిశ్చయంగా, అల్లాహ్ విశ్వసించేవారికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం[4] చేస్తాడు.

**55**. మరియు సత్యతిరస్కారులు దీనిని (ఈ ఖుర్ఆన్) గురించి, అకస్మాత్తుగా అంతిమ ఘడియ వచ్చేవరకు లేదా ఆ ఏకైక దినపు శిక్ష అవతరించేవరకు సందేహంలో పడిఉంటారు.[5]

وَمَآ أَرۡسَلۡنَا مِن قَبۡلِكَ مِن رَّسُولٖ وَلَا نَبِيٍّ إِلَّآ إِذَا تَمَنَّىٰٓ أَلۡقَى ٱلشَّيۡطَٰنُ فِيٓ أُمۡنِيَّتِهِۦ فَيَنسَخُ ٱللَّهُ مَا يُلۡقِي ٱلشَّيۡطَٰنُ ثُمَّ يُحۡكِمُ ٱللَّهُ ءَايَٰتِهِۦۗ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٞ ٥٢

لِّيَجۡعَلَ مَا يُلۡقِي ٱلشَّيۡطَٰنُ فِتۡنَةٗ لِّلَّذِينَ فِي قُلُوبِهِم مَّرَضٞ وَٱلۡقَاسِيَةِ قُلُوبُهُمۡۗ وَإِنَّ ٱلظَّٰلِمِينَ لَفِي شِقَاقِۭ بَعِيدٖ ٥٣

وَلِيَعۡلَمَ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡعِلۡمَ أَنَّهُ ٱلۡحَقُّ مِن رَّبِّكَ فَيُؤۡمِنُواْ بِهِۦ فَتُخۡبِتَ لَهُۥ قُلُوبُهُمۡۗ وَإِنَّ ٱللَّهَ لَهَادِ ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِلَىٰ صِرَٰطٖ مُّسۡتَقِيمٖ ٥٤

وَلَا يَزَالُ ٱلَّذِينَ كَفَرُواْ فِي مِرۡيَةٖ مِّنۡهُ حَتَّىٰ تَأۡتِيَهُمُ ٱلسَّاعَةُ بَغۡتَةً أَوۡ يَأۡتِيَهُمۡ عَذَابُ يَوۡمٍ عَقِيمٍ ٥٥

---

**1**. చూడండి, 6:112.
**2**. చూడండి, 11:1.
**3**. చూడండి, 2:10.
**4**. **అల్-హాది:** సేకరించబడిన పదం. Guide, Leader. మార్గదర్శకుడు, సన్మార్గం చూపువాడు.
**5**. *యౌమిన్ 'అ'ఖీమ్:* అంటే గొడ్డుదినం. అంటే మళ్ళీరాని ఏకైకదినం, పునరుత్థానం. చూ. 51:41.

56. ఆ రోజు సర్వాధిపత్యం అల్లాహ్‌దే.[1] ఆయన వారి మధ్య తీర్పుచేస్తాడు. కావున విశ్వసించి సత్కార్యాలు చేసేవారు పరమానంద కరమైన స్వర్గవనాలలో ఉంటారు.

57. కాని, ఎవరైతే సత్యతిరస్కారులై, మా సూచనలను అబద్ధాలని తిరస్కరించారో, వారికి అవమానకరమైన శిక్ష ఉంటుంది.

58. ఎవరు అల్లాహ్ మార్గంలో తమ ఇండ్లను వదలి (వలస) పోయి, ఆ తరువాత చంపబడతారో లేదా మరణిస్తారో, వారికి అల్లాహ్ (పరలోకంలో) శ్రేష్ఠమైన ఉపాధిని ప్రసాదిస్తాడు.[2] నిశ్చయంగా అల్లాహ్ మాత్రమే ఉత్తమ ఉపాధి ప్రదాత.

59. ఆయన వారిని, వారు తృప్తిపడే స్థలంలో ప్రవేశింపజేస్తాడు.[3] మరియు నిశ్చయంగా, అల్లాహ్ సర్వజ్ఞుడు, సహనశీలుడు. (7/8)

60. * ఇదే (వారి పరిణామం!)[4] ఇక ఎవడైతే తనకు కలిగిన బాధకు సమానంగా మాత్రమే ప్రతీకారం తీసుకున్న[5] తరువాత, అతనిపై మరల దౌర్జన్యం జరిగితే! నిశ్చయంగా అల్లాహ్ అతనికి సహాయం

ٱلْمُلْكُ يَوْمَئِذٍ لِّلَّهِ يَحْكُمُ
بَيْنَهُمْ ۚ فَٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟
ٱلصَّٰلِحَٰتِ فِى جَنَّٰتِ ٱلنَّعِيمِ ﴿٥٦﴾
وَٱلَّذِينَ كَفَرُوا۟ وَكَذَّبُوا۟ بِـَٔايَٰتِنَا
فَأُو۟لَٰٓئِكَ لَهُمْ عَذَابٌ مُّهِينٌ ﴿٥٧﴾
وَٱلَّذِينَ هَاجَرُوا۟ فِى سَبِيلِ ٱللَّهِ
ثُمَّ قُتِلُوٓا۟ أَوْ مَاتُوا۟ لَيَرْزُقَنَّهُمُ
ٱللَّهُ رِزْقًا حَسَنًا ۚ وَإِنَّ ٱللَّهَ
لَهُوَ خَيْرُ ٱلرَّٰزِقِينَ ﴿٥٨﴾
لَيُدْخِلَنَّهُم مُّدْخَلًا يَرْضَوْنَهُۥ ۗ
وَإِنَّ ٱللَّهَ لَعَلِيمٌ حَلِيمٌ ﴿٥٩﴾
۞ ذَٰلِكَ وَمَنْ عَاقَبَ بِمِثْلِ مَا
عُوقِبَ بِهِۦ ثُمَّ بُغِىَ عَلَيْهِ
لَيَنصُرَنَّهُ ٱللَّهُ ۗ إِنَّ ٱللَّهَ لَعَفُوٌّ
غَفُورٌ ﴿٦٠﴾

1. చూడండి, 25:26 మరియు 40:16.
2. ఎవరైతే అల్లాహ్ (సు.తా) మార్గంలో వలసపోయి అక్కడ చంపబడతారో వారికి స్వర్గసుఖాలు లభిస్తాయి. ఇంకా చూడండి, 2:218 మరియు 4:95-96.
3. స్వర్గసుఖాలు ఎలాంటి వంటే వాటిని ఇంతవరకూ ఏ కన్నూ చూడలేదు, ఏ చెవీ వినలేదు మరియు ఏ మానవుడు కూడా ఊహించలేడు.
4. ఏ విశ్వాసులైతే వలసపోయి మరణిస్తారో!
5. చూడండి, 16:126 శత్రువు నుండి బాధ కలిగిన వానికి తనకు జరిగిన బాధకు సమానంగా ప్రతీకారం తీసుకునే హక్కు ఉంది. ఇలాంటి న్యాయ ప్రతీకారంలో అల్లాహ్ అతనికి సహాయపడతాడు.

చేస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ మన్నించేవాడు, క్షమించేవాడు.[1]

ذَٰلِكَ بِأَنَّ ٱللَّهَ يُولِجُ ٱلَّيْلَ فِى ٱلنَّهَارِ وَيُولِجُ ٱلنَّهَارَ فِى ٱلَّيْلِ وَأَنَّ ٱللَّهَ سَمِيعٌۢ بَصِيرٌ ﴿٦١﴾

**61**. ఇలాగే జరుగుతుంది! నిశ్చయంగా, అల్లాహ్‌యే రాత్రిని పగటిలోకి ప్రవేశింప జేసేవాడు మరియు పగటిని రాత్రిలోకి ప్రవేశింపజేసేవాడు మరియు నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు అంతా చూసేవాడు.[2]

ذَٰلِكَ بِأَنَّ ٱللَّهَ هُوَ ٱلْحَقُّ وَأَنَّ مَا يَدْعُونَ مِن دُونِهِۦ هُوَ ٱلْبَٰطِلُ وَأَنَّ ٱللَّهَ هُوَ ٱلْعَلِىُّ ٱلْكَبِيرُ ﴿٦٢﴾

**62**. ఇది ఎందుకంటే, నిశ్చయంగా అల్లాహ్! ఆయనే సత్యం![3] మరియు ఆయనకు బదులుగా వారు ఆరాధించేవన్నీ అసత్యాలే! మరియు నిశ్చయంగా అల్లాహ్ ఆయన మాత్రమే మహోన్నతుడు, మహానీయుడు (గొప్పవాడు).

أَلَمْ تَرَ أَنَّ ٱللَّهَ أَنزَلَ مِنَ ٱلسَّمَآءِ مَآءً فَتُصْبِحُ ٱلْأَرْضُ مُخْضَرَّةً ۗ إِنَّ ٱللَّهَ لَطِيفٌ خَبِيرٌ ﴿٦٣﴾

**63**. ఏమీ? నీకు తెలియదా? నిశ్చయంగా, అల్లాహ్‌యే ఆకాశంనుండి వర్షం కురిపించి, దానితో భూమిని పచ్చగా చేస్తాడని? నిశ్చయంగా, అల్లాహ్ సూక్ష్మగ్రాహి, సర్వం తెలిసిన వాడు.

لَّهُۥ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَمَا فِى ٱلْأَرْضِ ۗ وَإِنَّ ٱللَّهَ لَهُوَ ٱلْغَنِىُّ ٱلْحَمِيدُ ﴿٦٤﴾

**64**. ఆకాశాలలో ఉన్నది మరియు భూమిలో ఉన్నది అంతా ఆయనకు చెందినదే. మరియు నిశ్చయంగా, అల్లాహ్! ఆయన మాత్రమే స్వయంసమృద్ధుడు, ప్రశంసనీయుడు.

---

**1**. చూడండి, 2:190-193, ఒకవేళ క్షమిస్తే! అల్లాహ్ (సు.తా) కూడా చాలా క్షమించేవాడు.
**2**. చూడండి, 3:26-27 కాని అల్లాహ్ (సు.తా.) కోరితే దుర్మార్గులకు ప్రతీకారం కూడా చేయగలడు. అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.
**3**. ఎందుకంటే అల్లాహ (సు.తా.) ధర్మమే సత్యధర్మం, ఆయన ఆరాధనయే సత్య ఆరాధన, ఆయన వాగ్దానమే సత్యవాగ్దానం. ఆయన, తన స్నేహితులకు వారి శత్రువులకు విరుద్ధంగా సహాయపడటం కూడా సత్యమే! అల్లాహ్ (సు.తా.) తన ఉనికిలో తన కార్యసాధనలో, తన యోగ్యతలో సత్యవంతుడు.

أَلَمْ تَرَ أَنَّ ٱللَّهَ سَخَّرَ لَكُم مَّا فِى ٱلْأَرْضِ وَٱلْفُلْكَ تَجْرِى فِى ٱلْبَحْرِ بِأَمْرِهِۦ وَيُمْسِكُ ٱلسَّمَآءَ أَن تَقَعَ عَلَى ٱلْأَرْضِ إِلَّا بِإِذْنِهِۦٓ ۗ إِنَّ ٱللَّهَ بِٱلنَّاسِ لَرَءُوفٌ رَّحِيمٌ ﴿٦٥﴾

**65**. ఏమీ? నీకు తెలియదా? నిశ్చయంగా, అల్లాహ్ భూమిలో ఉన్న సమస్తాన్ని మీకు వశపరచాడు. మరియు సముద్రంలో పడవ ఆయన అనుమతితోనే నడుస్తుంది మరియు ఆయనే! తాను అనుమతించేవరకు ఆకాశాన్ని భూమిమీద పడకుండా నిలిపిఉంచాడు.[1] నిశ్చయంగా, అల్లాహ్ మానవులపట్ల ఎంతో కనికరుడు, అపార కరుణాప్రదాత.

وَهُوَ ٱلَّذِىٓ أَحْيَاكُمْ ثُمَّ يُمِيتُكُمْ ثُمَّ يُحْيِيكُمْ ۗ إِنَّ ٱلْإِنسَـٰنَ لَكَفُورٌ ﴿٦٦﴾

**66**. మరియు ఆయనే మీకు జీవితాన్ని ప్రసాదించాడు, తరువాత ఆయనే మిమ్మల్ని మరణింపజేస్తాడు. ఆ తరువాత ఆయనే మిమ్మల్ని మళ్ళీ బ్రతికిస్తాడు. నిశ్చయంగా మానవుడు ఎంతో కృతఘ్నుడు!

لِّكُلِّ أُمَّةٍ جَعَلْنَا مَنسَكًا هُمْ نَاسِكُوهُ ۖ فَلَا يُنَـٰزِعُنَّكَ فِى ٱلْأَمْرِ ۚ وَٱدْعُ إِلَىٰ رَبِّكَ ۖ إِنَّكَ لَعَلَىٰ هُدًى مُّسْتَقِيمٍ ﴿٦٧﴾

**67**. మేము ప్రతి సమాజం వారికి ఒక ఆరాధనారీతిని నియమించాము.[2] వారు దానినే అనుసరిస్తారు. కావున వారిని ఈ విషయంలో నీతో వాదులాడనివ్వకు. మరియు వారిని నీ ప్రభువు వైపుకు ఆహ్వానించు. నిశ్చయంగా నీవు సరైన మార్గదర్శకత్వంలో ఉన్నావు.

وَإِن جَـٰدَلُوكَ فَقُلِ ٱللَّهُ أَعْلَمُ بِمَا تَعْمَلُونَ ﴿٦٨﴾

**68**. ఒకవేళ వారు నీతో వాదులాటకు దిగితే, వారితో అను: "మీరు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.[3]

ٱللَّهُ يَحْكُمُ بَيْنَكُمْ يَوْمَ ٱلْقِيَـٰمَةِ فِيمَا كُنتُمْ فِيهِ تَخْتَلِفُونَ ﴿٦٩﴾

**69**. "అల్లాహ్ పునరుత్థానదినమున, మీరు పరస్పరం కలిగిఉన్న అభిప్రాయ బేధాలను గురించి తీర్పుచేస్తాడు."

---

**1**. అంటే నక్షత్రాలు మరియు గ్రహాలు పడిపోకుండా మరియు ఒకదానితో ఒకటి ఢీకొనకుండా ఉన్న గురుత్వాకర్షణ శక్తి (Gravitational Force) అల్లాహ్ (సు.తా.) ప్రసాదించినదే.

**2**. చూడండి, 5:48.

**3**. చూడండి, 10:41.

أَلَمۡ تَعۡلَمۡ أَنَّ ٱللَّهَ يَعۡلَمُ مَا فِي ٱلسَّمَآءِ وَٱلۡأَرۡضِۚ إِنَّ ذَٰلِكَ فِي كِتَٰبٍۚ إِنَّ ذَٰلِكَ عَلَى ٱللَّهِ يَسِيرٞ ٧٠

70. ఏమీ? నీకు తెలియదా? ఆకాశంలో మరియు భూమిలో ఉన్నదంతా అల్లాహ్‌కు బాగా తెలుసని! నిశ్చయంగా, ఇదంతా ఒక గ్రంథంలో (వ్రాయబడి) ఉంది. నిశ్చయంగా ఇదంతా అల్లాహ్‌కు చాలా సులభమైనది.[1]

وَيَعۡبُدُونَ مِن دُونِ ٱللَّهِ مَا لَمۡ يُنَزِّلۡ بِهِۦ سُلۡطَٰنٗا وَمَا لَيۡسَ لَهُم بِهِۦ عِلۡمٞۗ وَمَا لِلظَّٰلِمِينَ مِن نَّصِيرٖ ٧١

71. మరియు వారు అల్లాహ్‌ను వదలి ఇతరులను ఆరాధిస్తున్నారు. దాని కొరకు ఆయన ఎలాంటి నిదర్శనాన్ని అవతరింప జేయలేదు మరియు వారికి (సత్య తిరస్కారులకు) దానిని గురించి ఎలాంటి జ్ఞానం లేదు. మరియు దుర్మార్గులకు సహాయపడే వాడు ఎవ్వడూ ఉండడు.[2]

وَإِذَا تُتۡلَىٰ عَلَيۡهِمۡ ءَايَٰتُنَا بَيِّنَٰتٖ تَعۡرِفُ فِي وُجُوهِ ٱلَّذِينَ كَفَرُواْ ٱلۡمُنكَرَۖ يَكَادُونَ يَسۡطُونَ بِٱلَّذِينَ يَتۡلُونَ عَلَيۡهِمۡ ءَايَٰتِنَاۗ قُلۡ أَفَأُنَبِّئُكُم بِشَرّٖ مِّن ذَٰلِكُمُۗ ٱلنَّارُ وَعَدَهَا ٱللَّهُ ٱلَّذِينَ كَفَرُواْۖ وَبِئۡسَ ٱلۡمَصِيرُ ٧٢

72. మరియు మా స్పష్టమైన సూచనలు వారికి వినిపించబడినప్పుడు, సత్య తిరస్కారుల ముఖాల మీద తిరస్కారాన్ని నీవు గమనిస్తావు. ఇంకా వారు మా సూచనలను వినిపించే వారిపై దాదాపు విరుచుకుపడబోయే వారు. వారితో అను: "ఏమీ? నేను దీనికంటే ఘోరమైన విషయాన్ని గురించి మీకు తెలుపనా? అది నరకాగ్ని! అల్లాహ్ దానిని సత్య తిరస్కారులకు వాగ్దానం చేసి ఉన్నాడు. మరియు అది ఎంత అధ్వాన్నమైన గమ్యస్థానం."

---

1 . ప్రతివాడు ఏమి కాబోతున్నాడు అనేది అల్లాహ్‌కు తెలుసు కాబట్టి ఆయన సంభవించబోయేదంతా ఒక గ్రంథంలో వ్రాసిపెట్టాడు. ఇదే విధివ్రాత (ఖద్ర్). అంటే అల్లాహ్ (సు.తా.) ఎవరిని కూడా మంచి లేక చెడు మార్గాలను అవలంబించటానికి బలవంతం చేయడు. 'స'హీ'హ్ ముస్లింలో ఉంది: 'అల్లాహ్ భూమ్యాకాశాల సృష్టికి 50వేల సంవత్సరాలకు ముందు తన సృష్టి యొక్క విధి వ్రాసిపెట్టాడు. అప్పుడు ఆయన విశ్వసామ్రాజ్యాధిపత్య పీఠం ('అర్ష్) నీటిపై ఉండేది.'

2 . అంటే అల్లాహ్ (సు.తా.)ను విడిచి ఇతరులను ఆరాధించాలని, ఎలాంటి దివ్యజ్ఞానం గానీ, వివేచనాబుద్ధితో ఆలోచిస్తే అర్థమయ్యే నిదర్శనం గానీ, ఈ సత్యతిరస్కారుల దగ్గర ఏదీ లేదు.

يَٰٓأَيُّهَا ٱلنَّاسُ ضُرِبَ مَثَلٌ
فَٱسْتَمِعُوا۟ لَهُۥٓ ۚ إِنَّ ٱلَّذِينَ
تَدْعُونَ مِن دُونِ ٱللَّهِ لَن يَخْلُقُوا۟
ذُبَابًا وَلَوِ ٱجْتَمَعُوا۟ لَهُۥ ۖ وَإِن
يَسْلُبْهُمُ ٱلذُّبَابُ شَيْـًٔا لَّا
يَسْتَنقِذُوهُ مِنْهُ ۚ ضَعُفَ
ٱلطَّالِبُ وَٱلْمَطْلُوبُ ﴿٧٣﴾

**73.** ఓ మానవులారా! ఒక ఉదాహరణం ఇవ్వబడుతోంది, దానిని శ్రద్ధగా వినండి! నిశ్చయంగా, మీరు అల్లాహ్‌ను వదలి ఎవరినైతే ప్రార్థిస్తున్నారో, వారంతా కలిసి ఒక్క ఈగను కూడా సృష్టించలేరు. మరియు ఒకవేళ, ఆ ఈగ వారి నుండి ఏమైనా లాక్కొనిపోయినా, వారు దానిని, దాని (ఆ ఈగ) నుండి విడిపించుకోనూ లేరు.[1] ఎంత బలహీనులు, ఈ అర్థించేవారు మరియు అర్థించబడే వారు.

مَا قَدَرُوا۟ ٱللَّهَ حَقَّ قَدْرِهِۦٓ ۗ إِنَّ
ٱللَّهَ لَقَوِىٌّ عَزِيزٌ ﴿٧٤﴾

**74.** అల్లాహ్ ఘనతను వారు గుర్తించవలసిన విధంగా గుర్తించలేదు. వాస్తవానికి, అల్లాహ్ మహా బలవంతుడు, సర్వశక్తి మంతుడు.

ٱللَّهُ يَصْطَفِى مِنَ ٱلْمَلَٰٓئِكَةِ
رُسُلًا وَمِنَ ٱلنَّاسِ ۚ إِنَّ ٱللَّهَ
سَمِيعٌۢ بَصِيرٌ ﴿٧٥﴾

**75.** అల్లాహ్ దేవదూతల నుండి మరియు మానవుల నుండి తన సందేశహరులను ఎన్నుకుంటాడు. నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, అంతా చూసేవాడు.

يَعْلَمُ مَا بَيْنَ أَيْدِيهِمْ وَمَا
خَلْفَهُمْ ۗ وَإِلَى ٱللَّهِ تُرْجَعُ ٱلْأُمُورُ
﴿٧٦﴾

**76.** ఆయనకు, వారికి ప్రత్యక్షంగా ఉన్నది మరియు వారికి పరోక్షంగా ఉన్నది అంతా తెలుసు. మరియు అన్ని వ్యవహారాలు (పరిష్కారానికి) అల్లాహ్ వైపునకే మరలింపబడతాయి.

---

**1.** ఇక్కడ సత్యతిరస్కారులు అల్లాహ్ (సు.తా.)ను వదలి ఎవరినైతే ఆరాధిస్తున్నారో వారు. అంటే, మూర్తులు, దర్గాలు, సన్యాసులు, దైవ అవతారులుగా భావించబడే వారు, అల్లాహ్ కుమారులుగా భావించబడేవారు, దైవదూతలు, ప్రవక్తలు మొదలైనవారంతా.

**77.** ఓ విశ్వాసులారా! (మీ ప్రభువు సన్నిధిలో) వంగండి (రుకూ'ఉ చేయండి), సాష్టాంగం (సజ్దా) చేయండి మరియు మీ ప్రభువునే ఆరాధించండి మరియు మంచి పనులు చేయండి; అప్పుడే మీరు సాఫల్యం పొందుతారు. ۩

**78.** మరియు అల్లాహ్ మార్గంలో పోరాడవలసిన విధంగా ధర్మపోరాటం చేయండి.[1] ఆయన మిమ్మల్ని ఎన్నుకున్నాడు. మరియు ఆయన ధర్మ విషయంలో మీకు ఎలాంటి ఇబ్బంది కలిగించలేదు. ఇది మీ తండ్రి ఇబ్రాహీమ్ మతమే.[2] ఆయన మొదటి నుండి మీకు అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు) అని పేరు పెట్టాడు. దీనికై మీ సందేశహరుడు మీకు సాక్షిగా ఉండటానికి మరియు మీరు ప్రజలకు సాక్షులుగా ఉండటానికి.[3] కావున నమా'జ్ స్థాపించండి, విధిదానం ('జకాత్) ఇవ్వండి. మరియు అల్లాహ్‌తో గట్టి సంబంధం కలిగి ఉండండి, ఆయనే మీ సంరక్షకుడు. ఎంత శ్రేష్ఠమైన సంరక్షకుడు మరియు ఎంత ఉత్తమ సహాయకుడు!

*****

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟
ٱرْكَعُوا۟ وَٱسْجُدُوا۟ وَٱعْبُدُوا۟
رَبَّكُمْ وَٱفْعَلُوا۟ ٱلْخَيْرَ
لَعَلَّكُمْ تُفْلِحُونَ ۩ ﴿٧٧﴾
وَجَٰهِدُوا۟ فِى ٱللَّهِ حَقَّ جِهَادِهِۦ ۚ
هُوَ ٱجْتَبَىٰكُمْ وَمَا جَعَلَ عَلَيْكُمْ فِى
ٱلدِّينِ مِنْ حَرَجٍ ۚ مِّلَّةَ أَبِيكُمْ إِبْرَٰهِيمَ ۚ
هُوَ سَمَّىٰكُمُ ٱلْمُسْلِمِينَ مِن قَبْلُ
وَفِى هَٰذَا لِيَكُونَ ٱلرَّسُولُ شَهِيدًا
عَلَيْكُمْ وَتَكُونُوا۟ شُهَدَآءَ عَلَى ٱلنَّاسِ ۚ
فَأَقِيمُوا۟ ٱلصَّلَوٰةَ وَءَاتُوا۟ ٱلزَّكَوٰةَ
وَٱعْتَصِمُوا۟ بِٱللَّهِ هُوَ مَوْلَىٰكُمْ ۖ فَنِعْمَ
ٱلْمَوْلَىٰ وَنِعْمَ ٱلنَّصِيرُ ﴿٧٨﴾

---

**1**. అల్-జిహాదు*:* ధర్మపోరాటం అంటే: 1) అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞలను పాలించటానికి, తన ఆత్మతో, 2) షై'తాన్ రేకెత్తించే ప్రేరణలతో, 3) ఆత్మరక్షణకు మరియు తన ధర్మాన్ని స్వేచ్ఛగా పాటిస్తూ, శాంతితో, దానిని ఇతరులకు బోధిస్తూ ఉంటే, ఆటంకపరిచే వారితో, చేసే ధర్మ పోరాటం.

**2**. తండ్రి ఇబ్రాహీమ్, అంటే అతను దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) పూర్వీకుడే కాక, ఏక దైవసిద్ధాంతాన్ని అనుసరించే వారందరి తండ్రి కూడాను.

**3**. ఈ సాక్ష్యాలు తీర్పుదినమున జరుగుతాయి చూడండి, 2:143.

## 23. సూరహ్ అల్-ము'మినూన్ — سُورَةُ المُؤْمِنُونَ

ఈ సూరహ్ అంతిమ **మక్కా** కాలంలో అవతరింపజేయబడిందని చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం. ఇందులో **118 ఆయతులు** ఉన్నాయి. ఈ సూరహ్ సత్యధర్మాన్ని ఏకైక ఆరాధ్యుణ్ణి గురించి వ్యాఖ్యానిస్తుంది. మానవజాతి ఒకే ఒక సంఘం. (21:92-93) దీనిపేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

قَدْ أَفْلَحَ ٱلْمُؤْمِنُونَ ﴿١﴾

**1**. (*) వాస్తవానికి **విశ్వాసులు** సాఫల్యం పొందుతారు;

ٱلَّذِينَ هُمْ فِى صَلَاتِهِمْ خَٰشِعُونَ ﴿٢﴾

**2**. వారే! ఎవరైతే తమ నమా'జులో వినమ్రతను పాటిస్తారో;

وَٱلَّذِينَ هُمْ عَنِ ٱللَّغْوِ مُعْرِضُونَ ﴿٣﴾

**3**. మరియు ఎవరైతే వ్యర్థమైన మాటల నుండి దూరంగా ఉంటారో;

وَٱلَّذِينَ هُمْ لِلزَّكَوٰةِ فَٰعِلُونَ ﴿٤﴾

**4**. మరియు ఎవరైతే విధిదానం ('జకాత్) సక్రమంగా చెల్లిస్తారో;

وَٱلَّذِينَ هُمْ لِفُرُوجِهِمْ حَٰفِظُونَ ﴿٥﴾

**5**. మరియు ఎవరైతే తమ మర్మాంగాలను కాపాడుకుంటారో -

إِلَّا عَلَىٰٓ أَزْوَٰجِهِمْ أَوْ مَا مَلَكَتْ أَيْمَٰنُهُمْ فَإِنَّهُمْ غَيْرُ مَلُومِينَ ﴿٦﴾

**6**. తమ భార్య (అ'జ్వాజ్)లతో లేక తమ అధీనం(కుడిచేతి)లో ఉన్న బానిస స్త్రీలతో తప్ప![1] అలాంటప్పుడు వారు నిశ్చయంగా నిందార్హులు కారు.

فَمَنِ ٱبْتَغَىٰ وَرَآءَ ذَٰلِكَ فَأُو۟لَٰٓئِكَ هُمُ ٱلْعَادُونَ ﴿٧﴾

**7**. కాని ఎవరైతే, దీనిని మించి కోరుతారో! అలాంటి వారే వాస్తవంగా హద్దులను అతిక్రమించిన వారు.

---

**1**. ఈ కాలంలో వాస్తవమైన బానిసలు (అంటే యుద్ధంలో పట్టుబడటంవల్ల బానిసలైన వారు) లేరు. ఎందుకంటే ఒక ముస్లింకు మానవులను బానిసలుగా కొనటం, అమ్మటం నిషిద్ధం చేయబడింది. కేవలం ధర్మయుద్ధంలో చేజిక్కిన ఖైదీలే బానిసలు. వారు ఇస్లాం స్వీకరిస్తే వారికి స్వాతంత్ర్యం ఇవ్వాలి. బానిస స్త్రీతో సంతానమైతే వారు వారసత్వంలో హక్కుదారులు. ఈ విధంగా చూస్తే బానిస స్త్రీకి కూడా భార్య హక్కులే ఉంటాయి. కేవలం మహ్ర్ మాత్రమే చెల్లించబడదు. చూడండి, 4:3, 24, 25, 24:32.

**8**. మరియు వారు ఎవరైతే తమ పూచీలను (అమానతులను) మరియు తమ వాగ్దానాలను కాపాడుకుంటారో;[1]

وَٱلَّذِينَ هُمْ لِأَمَٰنَٰتِهِمْ وَعَهْدِهِمْ رَٰعُونَ ﴿٨﴾

**9**. మరియు వారు ఎవరైతే తమ నమా'జ్‌లను కాపాడుకుంటారో!

وَٱلَّذِينَ هُمْ عَلَىٰ صَلَوَٰتِهِمْ يُحَافِظُونَ ﴿٩﴾

**10**. అలాంటి వారే (స్వర్గానికి) వారసులు అవుతారు;

أُوْلَٰٓئِكَ هُمُ ٱلْوَٰرِثُونَ ﴿١٠﴾

**11**. వారే ఫిర్‌దౌస్ స్వర్గానికి వారసులై, అందులో వారు శాశ్వతంగా ఉంటారు.[2]

ٱلَّذِينَ يَرِثُونَ ٱلْفِرْدَوْسَ هُمْ فِيهَا خَٰلِدُونَ ﴿١١﴾

**12**. మరియు వాస్తవంగా, మేము మానవుణ్ణి మట్టి యొక్క సారంతో సృష్టించాము.[3]

وَلَقَدْ خَلَقْنَا ٱلْإِنسَٰنَ مِن سُلَٰلَةٍ مِّن طِينٍ ﴿١٢﴾

**13**. తరువాత అతనిని ఇంద్రియ బిందువుగా ఒక కోశంలో భద్రంగా ఉంచాము.[4]

ثُمَّ جَعَلْنَٰهُ نُطْفَةً فِى قَرَارٍ مَّكِينٍ ﴿١٣﴾

**14**. ఆ తరువాత ఆ ఇంద్రియ బిందువును రక్తపుముద్దగా (జలగగా) మార్చాము. ఆ పైన ఆ రక్తపుముద్ద (జలగ)ను మాంసపు ముద్దగా (జీవాణువుల పిండంగా) మార్చాము. ఆ జీవాణువుల పిండంలో ఎముకలను ఏర్పరచి, ఆ ఎముకలను మాంసంతో కప్పాము. ఆ

ثُمَّ خَلَقْنَا ٱلنُّطْفَةَ عَلَقَةً فَخَلَقْنَا ٱلْعَلَقَةَ مُضْغَةً فَخَلَقْنَا ٱلْمُضْغَةَ عِظَٰمًا فَكَسَوْنَا ٱلْعِظَٰمَ لَحْمًا ثُمَّ أَنشَأْنَٰهُ خَلْقًا ءَاخَرَ ج

---

**1**. అమానాత్: అంటే మనఃపూర్వకంగా, బాధ్యతతో విధేయతతో, డ్యూటీ చేయటం, రహస్య మాటలను, విషయాలను కాపాడటం. చేసిన వాగ్దానాలను పూర్తిచేయటం మొదలైనవి.

**2**. ఫిర్‌దౌస్ అనేది స్వర్గాలలో అత్యున్నతమైనది. అక్కడి నుండియే స్వర్గపు నదులు ప్రారంభమవుతాయి. ('స'హీ'హ్ బు'ఖారీ).

**3**. మట్టితో, అంటే మానవుని సృష్టి భూమిలో ఉన్న పదార్థాలతోనే చేయబడింది. ఈ విషయం మనకు ఈ నాడు సైన్సు ద్వారా తెలిసింది.

**4**. తల్లి గర్భకోశంలో.

فَتَبَارَكَ ٱللَّهُ أَحْسَنُ ٱلْخَٰلِقِينَ ﴿١٤﴾

తరువాత దానిని మరొక (భిన్న) సృష్టిగా చేశాము. కావున శుభకరుడు (శుభప్రదుడు)[1] అయిన అల్లాహ్‌యే అత్యుత్తమ సృష్టికర్త.

ثُمَّ إِنَّكُم بَعْدَ ذَٰلِكَ لَمَيِّتُونَ ﴿١٥﴾

**15**. ఆ తరువాత మీరు నిశ్చయంగా, మరణిస్తారు.

ثُمَّ إِنَّكُمْ يَوْمَ ٱلْقِيَٰمَةِ تُبْعَثُونَ ﴿١٦﴾

**16**. అటుపిమ్మట నిశ్చయంగా, మీరు పునరుత్థాన దినమున మరల లేపబడతారు.

وَلَقَدْ خَلَقْنَا فَوْقَكُمْ سَبْعَ طَرَآئِقَ
وَمَا كُنَّا عَنِ ٱلْخَلْقِ غَٰفِلِينَ ﴿١٧﴾

**17**. మరియు వాస్తవానికి మేము మీ పై ఏడు మార్గాలను (ఆకాశాలను) సృష్టించాము.[2] మరియు మేము సృష్టి విషయంలో ఏమాత్రం నిర్లక్ష్యంగాలేము.

وَأَنزَلْنَا مِنَ ٱلسَّمَآءِ مَآءًۢ بِقَدَرٍ
فَأَسْكَنَّٰهُ فِى ٱلْأَرْضِ ۖ وَإِنَّا عَلَىٰ ذَهَابٍۭ
بِهِۦ لَقَٰدِرُونَ ﴿١٨﴾

**18**. మరియు మేము ఆకాశంనుండి ఒక పరిమాణంతో వర్షాన్ని (నీటిని) కురిపించాము, పిదప దానిని భూమిలో నిలువజేశాము. మరియు నిశ్చయంగా, దానిని వెనక్కి తీసుకునే శక్తి మాకుంది.

فَأَنشَأْنَا لَكُم بِهِۦ جَنَّٰتٍ مِّن نَّخِيلٍ
وَأَعْنَٰبٍ لَّكُمْ فِيهَا فَوَٰكِهُ كَثِيرَةٌ
وَمِنْهَا تَأْكُلُونَ ﴿١٩﴾

**19**. తరువాత దాని ద్వారా మేము మీ కొరకు ఖర్జూరపు తోటలను ద్రాక్ష తోటలను ఉత్పత్తిచేశాము; అందులో మీకు ఎన్నో ఫలాలు దొరుకుతాయి. మరియు వాటి నుండి మీరు తింటారు.

وَشَجَرَةً تَخْرُجُ مِن طُورِ سَيْنَآءَ
تَنۢبُتُ بِٱلدُّهْنِ وَصِبْغٍ لِّلْءَاكِلِينَ ﴿٢٠﴾

**20**. మరియు సినాయి కొండ ప్రాంతంలో ఒక వృక్షం పెరుగుతున్నది, అది నూనె ఇస్తుంది మరియు (దాని ఫలం) తినేవారికి రుచికరమైన (కూరగా) ఉపయోగపడుతుంది.[3]

---

**1**. చూడండి, 7:54.
**2**. చూడండి 2:29.
**3**. ఇది 'జైతూన్ (ఆలివ్) వృక్షం.

وَإِنَّ لَكُمْ فِى ٱلْأَنْعَـٰمِ لَعِبْرَةً ۖ
نُّسْقِيكُم مِّمَّا فِى بُطُونِهَا وَلَكُمْ فِيهَا
مَنَـٰفِعُ كَثِيرَةٌ وَمِنْهَا تَأْكُلُونَ ﴿٢١﴾

**21**. మరియు నిశ్చయంగా, మీ పశువులలో మీకు ఒక గుణపాఠముంది. మేము వాటి కడుపులలో ఉన్నది (పాలు) మీకు త్రాపుతున్నాము. మరియు వాటిలో మీకు ఇంకా ఎన్నో ఇతరలాభాలు కూడా ఉన్నాయి. మరియు వాటి (మాంసం) మీరు తింటారు.

وَعَلَيْهَا وَعَلَى ٱلْفُلْكِ تُحْمَلُونَ ﴿٢٢﴾

**22**. మరియు వాటి మీద మరియు ఓడల మీద మీరు సవారిచేస్తారు.

وَلَقَدْ أَرْسَلْنَا نُوحًا إِلَىٰ قَوْمِهِۦ
فَقَالَ يَـٰقَوْمِ ٱعْبُدُوا۟ ٱللَّهَ مَا لَكُم مِّنْ
إِلَـٰهٍ غَيْرُهُۥٓ ۖ أَفَلَا تَتَّقُونَ ﴿٢٣﴾

**23**. మరియు వాస్తవానికి మేము నూ'హ్‌ను తన జాతి ప్రజల వద్దకు పంపాము. అతడు వారితో అన్నాడు: ''నా జాతి ప్రజలారా! అల్లాహ్‌నే ఆరాధించండి, మీకు ఆయన తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు! ఏమీ? మీరు ఆయన యందు భయభక్తులు కలిగి ఉండరా?''

فَقَالَ ٱلْمَلَؤُا۟ ٱلَّذِينَ كَفَرُوا۟ مِن قَوْمِهِۦ
مَا هَـٰذَآ إِلَّا بَشَرٌ مِّثْلُكُمْ يُرِيدُ أَن
يَتَفَضَّلَ عَلَيْكُمْ وَلَوْ شَآءَ ٱللَّهُ
لَأَنزَلَ مَلَـٰٓئِكَةً مَّا سَمِعْنَا بِهَـٰذَا فِىٓ
ءَابَآئِنَا ٱلْأَوَّلِينَ ﴿٢٤﴾

**24**. అతని జాతిలోని సత్య తిరస్కారులైన నాయకులు ఇలా అన్నారు: ''ఇతను మీవంటి ఒక సాధారణ మానవుడే తప్ప మరేమీ కాడు! మీపై ఆధిక్యత పొందగోరుతున్నాడు. మరియు అల్లాహ్ తలుచుకుంటే దైవదూతలను పంపిఉండే వాడు. ఇలాంటి విషయం పూర్వీకులైన మన తాతముత్తాతలలో కూడ జరిగినట్లు మేము వినలేదే![1]

إِنْ هُوَ إِلَّا رَجُلٌۢ بِهِۦ جِنَّةٌ
فَتَرَبَّصُوا۟ بِهِۦ حَتَّىٰ حِينٍ ﴿٢٥﴾

**25**. ''ఇతడు కేవలం పిచ్చిపట్టిన మనిషి, కావున కొంతకాలం ఇతనిని సహించండి.''

---

**1**. నూ'హ్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 11:25-48.

**26**. (నూ'హ్) అన్నాడు: "ఓ నా ప్రభూ! వీరు నన్ను అసత్యుడవని తిరస్కరిస్తున్నారు. కావున నాకు సహాయం చేయి."[1]

قَالَ رَبِّ ٱنصُرۡنِى بِمَا كَذَّبُونِ ﴿٢٦﴾

**27**. కావున మేము అతనికి ఈ విధంగా దివ్యజ్ఞానం (వ'హీ) పంపాము: "మా పర్యవేక్షణలో, మా దివ్యజ్ఞానం (వ'హీ) ప్రకారం ఒక ఓడను తయారుచెయ్యి. తరువాత మా ఆజ్ఞ వచ్చినపుడు మరియు పొయ్యినుండి నీరు ఉబికినప్పుడు (పొంగినప్పుడు),[2] ఆ నావలో ప్రతిరకపు జంతుజాతి నుండి ఒక్కొక్క జంటను మరియు నీ పరివారపు వారిని ఎక్కించుకో; ఎవరిని గురించి అయితే ముందుగానే నిర్ణయం జరిగిందో వారుతప్ప! ఇక దుర్మార్గుల కొరకు నాతో మనవి చేయకు. నిశ్చయంగా వారు ముంచివేయబడతారు.

فَأَوۡحَيۡنَآ إِلَيۡهِ أَنِ ٱصۡنَعِ ٱلۡفُلۡكَ بِأَعۡيُنِنَا وَوَحۡيِنَا فَإِذَا جَآءَ أَمۡرُنَا وَفَارَ ٱلتَّنُّورُ فَٱسۡلُكۡ فِيهَا مِن كُلٍّ زَوۡجَيۡنِ ٱثۡنَيۡنِ وَأَهۡلَكَ إِلَّا مَن سَبَقَ عَلَيۡهِ ٱلۡقَوۡلُ مِنۡهُمۡۖ وَلَا تُخَٰطِبۡنِى فِى ٱلَّذِينَ ظَلَمُوٓاْۖ إِنَّهُم مُّغۡرَقُونَ ﴿٢٧﴾

**28**. "ఆ తరువాత నీవు మరియు నీతో ఉన్నవారు నావలోకి ఎక్కిన పిదప ఇలా ప్రార్థించండి: 'సర్వస్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే, ఆయనే మమ్మల్ని దుర్మార్గులనుండి విమోచనం కలిగించాడు.'

فَإِذَا ٱسۡتَوَيۡتَ أَنتَ وَمَن مَّعَكَ عَلَى ٱلۡفُلۡكِ فَقُلِ ٱلۡحَمۡدُ لِلَّهِ ٱلَّذِى نَجَّىٰنَا مِنَ ٱلۡقَوۡمِ ٱلظَّٰلِمِينَ ﴿٢٨﴾

**29**. "ఇంకా ఇలా ప్రార్థించు: 'ఓ నా ప్రభూ! నన్ను శుభప్రదమైన గమ్యస్థానంలో దించు. గమ్యస్థానానికి చేర్పించే వారిలో నీవే సర్వోత్తముడవు!' "[3]

وَقُل رَّبِّ أَنزِلۡنِى مُنزَلًا مُّبَارَكًا وَأَنتَ خَيۡرُ ٱلۡمُنزِلِينَ ﴿٢٩﴾

---

**1**. చూడండి, 54:10.

**2**. ఫారత్తన్నూరు: కొందరు వ్యాఖ్యాతలు దీనిని భూమి ప్రతిభాగం నుండి నీటి ఊటలు ఉబికి రావటం, అని అన్నారు.

**3**. ప్రయాణం మొదలు పెట్టేటప్పుడు ఈ దు'ఆ చేయాలి. దైవప్రవక్త ('స'అస) తమ సవారిపై కూర్చుంటూ ఈ దు'ఆ చదివేవారు: 'అల్లాహుఅక్బర్. (3 సార్లు, తరువాత) సుబ'హానల్లజీ' స'ఖ్ఖరలనా హా'జా' వ మా కున్నా లహూ ముఖ్రినీన్. వ ఇన్నా ఇలా రబ్బినా లమున్ ఖలిబూన్.' (ఇవి ఆయతులు 43:13-14)

**30**. నిశ్చయంగా, ఇందులో (ఈ గాథలో) సూచనలున్నాయి. మరియు నిశ్చయంగా, మేము (ప్రజలను) పరీక్షకు గురిచేస్తూ ఉంటాము.

**31**. వారి తరువాత మేము మరొక తరాన్ని పుట్టించాము.[1]

**32**. మరియు వారి వద్దకు వారి నుండియే, ఒక సందేశహరుణ్ణి పంపినప్పుడు, (అతను): ''కేవలం అల్లాహ్‌నే ఆరాధించండి. మీకు ఆయన తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు. ఏమీ? మీకు దైవభీతి లేదా?'' అని అన్నాడు.

**33**. దానికి, అతని జాతివారిలోని - సత్యతిరస్కారులైనట్టి వారు, పరలోక సమావేశాన్ని అబద్ధమని నిరాకరించేవారు మరియు ఇహలోక జీవితంలో మేము భాగ్యవంతులుగా చేసినట్టి - నాయకులు ఇలా అన్నారు: ''ఇతను మీ వంటి సాధారణ మానవుడే తప్ప మరేమీకాడు, మీరు తినేదే ఇతనూ తింటున్నాడు మరియు మీరు త్రాగేదే ఇతనూ త్రాగుతున్నాడు.

**34**. ''మరియు ఒకవేళ మీరు మీ వంటి ఒక సాధారణ మానవుణ్ణి అనుసరించినట్లైతే! నిశ్చయంగా, మీరు నష్టపడిన వారవుతారు.

**35**. ''ఏమీ? మీరు మరణించి మట్టిగా ఎముకలుగా మారిపోయిన తరువాత కూడా తిరిగి లేపబడతారని ఇతను మీకు వాగ్దానం చేస్తున్నాడా? (1/8)

إِنَّ فِي ذَٰلِكَ لَآيَٰتٖ وَإِن كُنَّا لَمُبۡتَلِينَ ﴿٣٠﴾

ثُمَّ أَنشَأۡنَا مِنۢ بَعۡدِهِمۡ قَرۡنًا ءَاخَرِينَ ﴿٣١﴾

فَأَرۡسَلۡنَا فِيهِمۡ رَسُولٗا مِّنۡهُمۡ أَنِ ٱعۡبُدُواْ ٱللَّهَ مَا لَكُم مِّنۡ إِلَٰهٍ غَيۡرُهُۥٓۚ أَفَلَا تَتَّقُونَ ﴿٣٢﴾

وَقَالَ ٱلۡمَلَأُ مِن قَوۡمِهِ ٱلَّذِينَ كَفَرُواْ وَكَذَّبُواْ بِلِقَآءِ ٱلۡأٓخِرَةِ وَأَتۡرَفۡنَٰهُمۡ فِي ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَا مَا هَٰذَآ إِلَّا بَشَرٞ مِّثۡلُكُمۡ يَأۡكُلُ مِمَّا تَأۡكُلُونَ مِنۡهُ وَيَشۡرَبُ مِمَّا تَشۡرَبُونَ ﴿٣٣﴾

وَلَئِنۡ أَطَعۡتُم بَشَرٗا مِّثۡلَكُمۡ إِنَّكُمۡ إِذٗا لَّخَٰسِرُونَ ﴿٣٤﴾

أَيَعِدُكُمۡ أَنَّكُمۡ إِذَا مِتُّمۡ وَكُنتُمۡ تُرَابٗا وَعِظَٰمًا أَنَّكُم مُّخۡرَجُونَ ﴿٣٥﴾

---

1. ఈ జాతి హూద్ ('అ.స.) యొక్క 'ఆద్ జాతి అని చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం.

۞ هَيۡهَاتَ هَيۡهَاتَ لِمَا تُوعَدُونَ ﴿٣٦﴾

36. * "అసంభవం! మీకు చేయబడే ఈ వాగ్దానం నెరవేరటం అసంభవం.

إِنۡ هِيَ إِلَّا حَيَاتُنَا ٱلدُّنۡيَا نَمُوتُ وَنَحۡيَا وَمَا نَحۡنُ بِمَبۡعُوثِينَ ﴿٣٧﴾

37. "ఇక మన జీవితం ఈ ప్రాపంచిక జీవితం మాత్రమే! మనం మరణించేదీ జీవించేదీ ఇక్కడే! మనం ఏ మాత్రమూ తిరిగి సజీవులుగా లేపబడము!

إِنۡ هُوَ إِلَّا رَجُلٌ ٱفۡتَرَىٰ عَلَى ٱللَّهِ كَذِبًا وَمَا نَحۡنُ لَهُۥ بِمُؤۡمِنِينَ ﴿٣٨﴾

38. "ఇక ఇతను, ఈ వ్యక్తి అల్లాహ్ పేరుతో కేవలం అబద్ధాలు కల్పిస్తున్నాడు మరియు మేము ఇతనిని (ఇతని మాటలను) ఎన్నటికీ విశ్వసించలేము."

قَالَ رَبِّ ٱنصُرۡنِي بِمَا كَذَّبُونِ ﴿٣٩﴾

39. (ఆ ప్రవక్త) అన్నాడు: "ఓ నా ప్రభూ! వీరు చేసే నిందారోపణల నుండి నన్ను కాపాడు."

قَالَ عَمَّا قَلِيلٍ لَّيُصۡبِحُنَّ نَٰدِمِينَ ﴿٤٠﴾

40. (అల్లాహ్) ఇలా సెలవిచ్చాడు: "వీరు కొంత కాలంలోనే పశ్చాత్తాప పడతారు."

فَأَخَذَتۡهُمُ ٱلصَّيۡحَةُ بِٱلۡحَقِّ فَجَعَلۡنَٰهُمۡ غُثَآءً فَبُعۡدًا لِّلۡقَوۡمِ ٱلظَّٰلِمِينَ ﴿٤١﴾

41. ఆ తరువాత సత్య (వాగ్దాన) ప్రకారం ఒక భయంకరమైన గర్జన (పేలుడు) వారిని చుట్టుముట్టింది. మేము వారిని చెత్తా చెదారంగా మార్చివేశాము. ఇక దుర్మార్గులైన జాతి వారు ఈ విధంగానే దూరమైపోతారు (నాశనం చేయబడతారు)!

ثُمَّ أَنشَأۡنَا مِنۢ بَعۡدِهِمۡ قُرُونًا ءَاخَرِينَ ﴿٤٢﴾

42. వారి తరువాత ఇతర తరాల వారిని పుట్టించాము.[1]

---

1. వీరు 'సాలె'హ్, లూ'త్, మరియు షు'ఐబ్ ('అలైహిమ్. స.)లు కావచ్చు. ఎందుకంటే సూరహ్ అల్-అ'అరాఫ్ (7) మరియు సూరహ్ హూద్ (11)లలో ఇదే వరుసలో వారి వృత్తాంతం పేర్కొనబడింది.

**43**. ఏ సమాజం వారు కూడా తమకు (నియమింపబడిన) గడువుకు ముందు కాలేరు మరియు దానికి వెనుక కాలేరు.[1]

مَا تَسۡبِقُ مِنۡ أُمَّةٍ أَجَلَهَا وَمَا يَسۡتَـٔۡخِرُونَ ﴿٤٣﴾

**44**. ఆ తరువాత మేము మా సందేశహరులను ఒకరి తరువాత ఒకరిని పంపుతూ వచ్చాము. ప్రతిసారి ఒక సమాజం వద్దకు దాని సందేశహరుడు వచ్చినప్పుడు, వారు అతనిని అసత్యుడని తిరస్కరించారు. వారిని ఒకరి తరువాత ఒకరిని నశింపజేస్తూ వచ్చాము. చివరకు వారిని గాథలుగా చేసి వదిలాము. ఇక విశ్వసించని ప్రజలు ఈ విధంగా దూరమైపోవు (నాశనం చేయబడు) గాక!

ثُمَّ أَرۡسَلۡنَا رُسُلَنَا تَتۡرَاۖ كُلَّ مَا جَآءَ أُمَّةٗ رَّسُولُهَا كَذَّبُوهُۖ فَأَتۡبَعۡنَا بَعۡضَهُم بَعۡضٗا وَجَعَلۡنَٰهُمۡ أَحَادِيثَۚ فَبُعۡدٗا لِّقَوۡمٖ لَّا يُؤۡمِنُونَ ﴿٤٤﴾

**45**. ఆ తరువాత మూసా మరియు అతని సోదరుడు హారూన్‌లను మా సూచనలతో మరియు స్పష్టమైన ప్రమాణంతో పంపాము;

ثُمَّ أَرۡسَلۡنَا مُوسَىٰ وَأَخَاهُ هَٰرُونَ بِـَٔايَٰتِنَا وَسُلۡطَٰنٖ مُّبِينٍ ﴿٤٥﴾

**46**. ఫిర్'ఔన్ మరియు అతని నాయకుల వద్దకు. కాని వారు దురహంకారం చూపారు, వారు తమ అహంభావంలో మునిగి ఉండేవారు.

إِلَىٰ فِرۡعَوۡنَ وَمَلَإِيْهِۦ فَٱسۡتَكۡبَرُواْ وَكَانُواْ قَوۡمًا عَالِينَ ﴿٤٦﴾

**47**. అపుడు వారన్నారు: ''ఏమీ? మేము మా వంటి ఈ ఇద్దరు మానవులను విశ్వసించాలా? మరియు ఎవరి జాతి వారైతే మా బానిసలుగా ఉన్నారో!''

فَقَالُوٓاْ أَنُؤۡمِنُ لِبَشَرَيۡنِ مِثۡلِنَا وَقَوۡمُهُمَا لَنَا عَٰبِدُونَ ﴿٤٧﴾

**48**. కావున వారు, ఆ ఇరువురిని అసత్యవాదులని తిరస్కరించి, నాశనం చేయబడిన వారిలో చేరిపోయారు.

فَكَذَّبُوهُمَا فَكَانُواْ مِنَ ٱلۡمُهۡلَكِينَ ﴿٤٨﴾

---

**1**. ఇదే విధమైన వాక్యానికి చూడండి, 15:5 మరియు దాని వ్యాఖ్యానం 1. దీని మరొక తాత్పర్యం ఈ విధంగా కూడా ఉంది: ఏ సమాజం కూడా తన నిర్ణీత గడువుకు, ముందు గానీ మరియు వెనక గానీ కాజాలదు.

وَلَقَدْ ءَاتَيْنَا مُوسَى ٱلْكِتَٰبَ لَعَلَّهُمْ يَهْتَدُونَ ﴿٤٩﴾

**49**. మరియు వాస్తవానికి మేము మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము, బహుశా వారు మార్గదర్శకత్వం పొందుతారేమోనని!

وَجَعَلْنَا ٱبْنَ مَرْيَمَ وَأُمَّهُۥٓ ءَايَةً وَءَاوَيْنَٰهُمَآ إِلَىٰ رَبْوَةٍ ذَاتِ قَرَارٍ وَمَعِينٍ ﴿٥٠﴾

**50**. ఇక మర్యమ్ కుమారుణ్ణి మరియు అతని తల్లిని మేము (మా అనుగ్రహపు) సూచనగా చేశాము.[1] మరియు వారిద్దరికి ఉన్నతమైన, ప్రశాంతమైన నీడ, ప్రవహించే సెలయేళ్ళు మరియు చెలమలుగల స్థానంలో ఆశ్రయమిచ్చాము.

يَٰٓأَيُّهَا ٱلرُّسُلُ كُلُوا۟ مِنَ ٱلطَّيِّبَٰتِ وَٱعْمَلُوا۟ صَٰلِحًا ۖ إِنِّى بِمَا تَعْمَلُونَ عَلِيمٌ ﴿٥١﴾

**51**. ఓ సందేశహరులారా! పరిశుద్ధమైన వస్తువులనే తినండి మరియు సత్కార్యాలు చేయండి.[2] నిశ్చయంగా, మీరు చేసేదంతా నాకు బాగా తెలుసు.

وَإِنَّ هَٰذِهِۦٓ أُمَّتُكُمْ أُمَّةً وَٰحِدَةً وَأَنَا۠ رَبُّكُمْ فَٱتَّقُونِ ﴿٥٢﴾

**52**. మరియు నిశ్చయంగా, మీ ఈ సమాజం ఒకే ఒక్క సమాజం మరియు నేనే మీ ప్రభువును, కావున మీరు నాయందే భయభక్తులు కలిగి ఉండండి.[3]

---

**1**. ఎందుకంటే మేము 'ఈసాను తండ్రి లేనిదే పుట్టించాము. ఏ విధంగానైతే మేము ఆదమ్‌ను తల్లీ-తండ్రి లేనిదే మరియు 'హవ్వాను తల్లిలేనిదే ఆదమ్ నుండి పుట్టించామో!

**2**. అ'త్తయ్యిబాతు*:* అంటే పరిశుద్ధ వస్తువులు కొందరు వ్యాఖ్యాతలు వీటిని 'హలాల్ వస్తువులు అని అన్నారు. రెండూ సరైనవే. ఎందుకంటే ప్రతి పరిశుద్ధ వస్తువు 'హలాలే! అందుకే అల్లాహ్ (సు.తా.) అపరిశుద్ధ వస్తువులను 'హరాం చేశాడు. అ'అమాల్ 'సాలి'హ్: సత్కార్యాలు అంటే ఏ కార్యాలైతే ఖుర్ఆన్ మరియు 'స'హీ'హ్ 'హదీస్'ల ప్రకారం ఉంటాయో! ఈ రెంటి మధ్య గాఢమైన సంబంధముంది. కావున వీటిని గురించి ప్రవక్తలందరికీ బోధింపబడింది. అందుకే ప్రవక్తలందరూ తాము పనిచేసి సంపాదించిన సంపాదన నుండే తినేవారు. చాలామంది ప్రవక్తలు కొంతకాలం గొర్ల కాపరులుగా పనిచేశారు, (బు'ఖారీ). ప్రవక్తలందరూ పురుషులే!

**3**. ఉమ్మతున్: అంటే ఇక్కడ ధర్మం అని అర్థం. ప్రవక్తలందరి ధర్మం ఒక్కటే, 'ఇస్లాం' అంటే అల్లాహ్(సు.తా)కు విధేయులై ఉండి, ఆయన తప్ప మరొకరిని ఆరాధించకుండా ఉండటం. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 21:92.

**53**. కాని వారు, తమ (ధర్మం) విషయంలో పరస్పర భేదాభిప్రాయాలు కల్పించుకొని, విభిన్న తెగలుగా చీలిపోయారు.[1] ప్రతివర్గం వారు, తాము అనుసరించే దానితో సంతోష పడుతున్నారు.[2]

فَتَقَطَّعُوٓاْ أَمۡرَهُم بَيۡنَهُمۡ زُبُرٗاۖ كُلُّ حِزۡبِۭ بِمَا لَدَيۡهِمۡ فَرِحُونَ ٥٣

**54**. కావున వారిని కొంతకాలం వరకు వారి మూఢత్వంలోనే మునిగి ఉండనివ్వు.

فَذَرۡهُمۡ فِي غَمۡرَتِهِمۡ حَتَّىٰ حِينٍ ٥٤

**55**. ఏమీ? మేము వారికి సంపదలు మరియు సంతానం సమృద్ధిగా ఇస్తున్నాం అంటే!

أَيَحۡسَبُونَ أَنَّمَا نُمِدُّهُم بِهِۦ مِن مَّالٖ وَبَنِينَ ٥٥

**56**. మేము వారికి మేలు చేయటంలో తొందరపడుతున్నామని, వారు భావిస్తున్నారా?[3] అలా కాదు వారు గ్రహించటం లేదు!

نُسَارِعُ لَهُمۡ فِي ٱلۡخَيۡرَٰتِۚ بَل لَّا يَشۡعُرُونَ ٥٦

**57**. నిశ్చయంగా, ఎవరైతే, తమ ప్రభువు భయం వల్ల భీతిపరులై ఉంటారో;

إِنَّ ٱلَّذِينَ هُم مِّنۡ خَشۡيَةِ رَبِّهِم مُّشۡفِقُونَ ٥٧

**58**. మరియు ఎవరైతే, తమ ప్రభువు ఆయతులను విశ్వసిస్తారో;

وَٱلَّذِينَ هُم بِـَٔايَٰتِ رَبِّهِمۡ يُؤۡمِنُونَ ٥٨

**59**. మరియు ఎవరైతే తమ ప్రభువుకు ఎవ్వరినీ సాటిగా (భాగస్వాములుగా) కల్పించరో;

وَٱلَّذِينَ هُم بِرَبِّهِمۡ لَا يُشۡرِكُونَ ٥٩

---

**1**. చూడండి, 21:93.

**2**. చూడండి, 22:67. దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'యూదులు 71 తెగలుగా మరియు క్రైస్తవులు 72 తెగలుగా చీలిపోయారు. కాని నా సమాజం వారు 73 తెగలుగా చీలిపోతారు.' (ఇబ్నె 'హంబల్, అబూ-దావూద్, తిర్మిజీ', మరియు దారిమీ).

**3**. వాలు అక్షరాల (Italics)లో ఉన్న భాగం 55వ ఆయతుకు చెందినది. వాక్యాన్ని అర్థం చేసుకోవటంలో భేదం రాకుండా ఉండటానికి ఇక్కడ చేర్చబడింది.

**60**. మరియు ఎవరైతే, తాము ఇవ్వ వలసినది ('జకాత్) ఇచ్చేటప్పుడు, నిశ్చయంగా వారు తమ ప్రభువు వైపుకు మరలిపోవలసి ఉన్నదనే భయాన్ని తమ హృదయాలలో ఉంచుకొని ఇస్తారో;

**61**. ఇలాంటి వారే మంచి పనులు చేయటంలో పోటీపడే వారు. మరియు వారు వాటిని చేయటానికి అందరికంటే ముందు ఉండేవారు.

**62**. మరియు మేము ఏ ప్రాణిపై కూడా దాని శక్తికి మించిన భారం వేయము.[1] మరియు మావద్ద అంతా వ్రాయబడిన ఒక గ్రంథముంది, అది సత్యాన్ని పలుకుతుంది. మరియు వారికెలాంటి అన్యాయం జరుగదు.

**63**. అలా కాదు వారి హృదయాలు దీనిని గురించి అజ్ఞానంలో పడిఉన్నాయి ఇంతేగాక వారు చేసే (దుష్ట) కార్యాలు ఎన్నోఉన్నాయి వారు వాటిని చేస్తూనే ఉంటారు.[2]

**64**. చివరకు, వారిలోని ఇహలోక భోగభాగ్యాలలో మునిగి ఉన్న వారిని శిక్షించటానికి మేము పట్టుకున్నప్పుడు, వారు మొర పెట్టుకుంటారు.[3]

**65**. (అప్పుడు వారితో ఇలా అనబడుతుంది): "ఈ రోజు మీరు మొరపెట్టుకోకండి! నిశ్చయంగా, మా తరఫునుండి మీకు ఎలాంటి సహాయం లభించడం జరుగదు.

وَٱلَّذِينَ يُؤْتُونَ مَآ ءَاتَواْ وَّقُلُوبُهُمْ
وَجِلَةٌ أَنَّهُمْ إِلَىٰ رَبِّهِمْ رَٰجِعُونَ ٦٠
أُوْلَٰٓئِكَ يُسَٰرِعُونَ فِي ٱلْخَيْرَٰتِ
وَهُمْ لَهَا سَٰبِقُونَ ٦١
وَلَا نُكَلِّفُ نَفْسًا إِلَّا وُسْعَهَاۖ
وَلَدَيْنَا كِتَٰبٌ يَنطِقُ بِٱلْحَقِّۚ وَهُمْ لَا
يُظْلَمُونَ ٦٢
بَلْ قُلُوبُهُمْ فِي غَمْرَةٍ مِّنْ هَٰذَا
وَلَهُمْ أَعْمَٰلٌ مِّن دُونِ ذَٰلِكَ هُمْ
لَهَا عَٰمِلُونَ ٦٣
حَتَّىٰٓ إِذَآ أَخَذْنَا مُتْرَفِيهِم بِٱلْعَذَابِ
إِذَا هُمْ يَجْـَٔرُونَ ٦٤
لَا تَجْـَٔرُواْ ٱلْيَوْمَۖ إِنَّكُم مِّنَّا لَا
تُنصَرُونَ ٦٥

---

**1**. చూడండి, 2:286 మొదటి వాక్యం.
**2**. అంటే 'షిర్క్' కాక వేరే ఇతర పెద్ద పాపాలు.
**3**. చూడండి, 17:16.

**66**. ''వాస్తవానికి, నా సూచనలు మీకు వినిపించబడినప్పుడు, మీరు మీ మడమల మీద వెనుకకు తిరిగిపోయే వారు.

قَدۡ كَانَتۡ ءَايَٰتِي تُتۡلَىٰ عَلَيۡكُمۡ فَكُنتُمۡ
عَلَىٰٓ أَعۡقَٰبِكُمۡ تَنكِصُونَ ٦٦

**67**. ''దురహంకారంతో దానిని[1] గురించి వ్యర్థపు ప్రలాపాలలో రాత్రులు గడుపుతూ ఉండేవారు.''

مُسۡتَكۡبِرِينَ بِهِۦ سَٰمِرٗا تَهۡجُرُونَ ٦٧

**68**. ఏమీ? వారు ఈ (దైవ) వాక్కును[2] గురించి ఎన్నడూ ఆలోచించలేదా? లేక వారి పూర్వీకులైన, వారి తాతముత్తాతల వద్దకు ఎన్నడూ రానిది, వారి వద్దకు వచ్చిందనా?

أَفَلَمۡ يَدَّبَّرُواْ ٱلۡقَوۡلَ أَمۡ جَآءَهُم مَّا لَمۡ
يَأۡتِ ءَابَآءَهُمُ ٱلۡأَوَّلِينَ ٦٨

**69**. లేక వారు తమ సందేశహరుణ్ణి ఎరుగరా? అందుకే అతన్ని తిరస్కరిస్తున్నారా?

أَمۡ لَمۡ يَعۡرِفُواْ رَسُولَهُمۡ فَهُمۡ لَهُۥ
مُنكِرُونَ ٦٩

**70**. లేక: ''అతనికి పిచ్చిపట్టింది!'' అని అంటున్నారా? వాస్తవానికి, అతను వారి వద్దకు సత్యాన్ని తెచ్చాడు. కాని చాలామంది సత్యాన్ని అసహ్యించుకుంటున్నారు.

أَمۡ يَقُولُونَ بِهِۦ جِنَّةُۢۚ بَلۡ جَآءَهُم
بِٱلۡحَقِّ وَأَكۡثَرُهُمۡ لِلۡحَقِّ كَٰرِهُونَ ٧٠

**71**. మరియు ఒకవేళ సత్యమే[3] వారి కోరికలకు అనుగుణంగా ఉంటే భూమ్యాకాశాలు మరియు వాటిలో ఉన్నదంతా నాశనమైపోయేది. వాస్తవానికి మేము వారి వద్దకు హితబోధను పంపాము.[4] కాని వారు తమ హితబోధ నుండి ముఖం త్రిప్పు కుంటున్నారు.

وَلَوِ ٱتَّبَعَ ٱلۡحَقُّ أَهۡوَآءَهُمۡ لَفَسَدَتِ
ٱلسَّمَٰوَٰتُ وَٱلۡأَرۡضُ وَمَن فِيهِنَّۚ
بَلۡ أَتَيۡنَٰهُم بِذِكۡرِهِمۡ فَهُمۡ عَن
ذِكۡرِهِم مُّعۡرِضُونَ ٧١

---

**1**. బిహీ: దానిని గురించి అంటే, చాలామంది వ్యాఖ్యాతలు క'అబహ్ అని అంటారు. అంటే మక్కా. ముష్రిక్ ఖురైషులు తాము క'అబహ్ గృహపు కార్యకర్తలని దురహంకారంతో వ్యవహరిస్తూ ము'హమ్మద్('స'అస)పై అవతరింపజేయబడిన ఖుర్ఆన్‌ను గురించి వ్యర్థపుమాటలు పలికేవారు. ఇతర వ్యాఖ్యాతలు అంటారు: 'బిహీ - అంటే ఖుర్ఆన్. దానిని గురించి వ్యర్థపుమాటలాడుతూ రాత్రులు గడిపేవారు.' చూడండి, 31:6.

**2**. దైవవాక్కు అంటే ఖుర్ఆన్.

**3**. అల్-'హఖ్ఖు: అంటే ధర్మం మరియు షరీయత్. (ధర్మశాసనం).

**4**. అజ్-జి'క్ర్: అంటే దివ్యఖుర్ఆన్. చూడండి, 21:10.

**72**. లేక నీవు (ఓ ము'హమ్మద్!) వారిని ప్రతిఫలం ఏమైనా అడుగుతున్నావా? నీ ప్రభువు ఇచ్చే ప్రతిఫలమే ఎంతో మేలైనది. ఆయనే అందరికంటే శ్రేష్ఠుడైన ఉపాధిప్రదాత.

**73**. మరియు నిశ్చయంగా, నీవు వారిని ఋజుమార్గం వైపునకు పిలుస్తున్నావు.

**74**. మరియు నిశ్చయంగా పరలోకాన్ని నమ్మని వారు (ఋజు) మార్గం నుండి వైదొలగిన వారే! (1/4)

**75**. * ఒకవేళ మేము వారిని కరుణించి, (ఇహలోకంలో వారికున్న) ఆపదను తొలగించినా! వారు తలబిరుసుతనంతో పట్టువిడువకుండా త్రోవతప్పి సంచరిస్తూ ఉంటారు.

**76**. మరియు వాస్తవానికి, మేము వారిని శిక్షకు గురిచేశాము.[1] అయినా వారు తమ ప్రభువు ముందు వంగలేదు మరియు వారు వినమ్రులు కూడా కాలేదు.

**77**. చివరకు మేము వారికొరకు కఠిన శిక్షా ద్వారాన్ని తెరిచాము. అప్పుడు వారు నిరాశచెందిన వారయ్యారు.

**78**. మరియు ఆయనే, మీకు వినేశక్తినీ, చూసేశక్తినీ మరియు (అర్థం చేసుకోవటానికి) హృదయాలను సృజించిన వాడు! అయినా మీరెంత తక్కువగా కృతజ్ఞతలు తెలుపుతున్నారు!

أَمۡ تَسۡـَٔلُهُمۡ خَرۡجٗا فَخَرَاجُ رَبِّكَ خَيۡرٞۖ
وَهُوَ خَيۡرُ ٱلرَّٰزِقِينَ ٧٢

وَإِنَّكَ لَتَدۡعُوهُمۡ إِلَىٰ صِرَٰطٖ مُّسۡتَقِيمٖ
٧٣

وَإِنَّ ٱلَّذِينَ لَا يُؤۡمِنُونَ بِٱلۡأٓخِرَةِ
عَنِ ٱلصِّرَٰطِ لَنَٰكِبُونَ ٧٤

۞ وَلَوۡ رَحِمۡنَٰهُمۡ وَكَشَفۡنَا مَا بِهِم
مِّن ضُرّٖ لَّلَجُّواْ فِي طُغۡيَٰنِهِمۡ
يَعۡمَهُونَ ٧٥

وَلَقَدۡ أَخَذۡنَٰهُم بِٱلۡعَذَابِ فَمَا
ٱسۡتَكَانُواْ لِرَبِّهِمۡ وَمَا يَتَضَرَّعُونَ ٧٦

حَتَّىٰٓ إِذَا فَتَحۡنَا عَلَيۡهِم بَابٗا ذَا عَذَابٖ
شَدِيدٍ إِذَا هُمۡ فِيهِ مُبۡلِسُونَ ٧٧

وَهُوَ ٱلَّذِيٓ أَنشَأَ لَكُمُ ٱلسَّمۡعَ
وَٱلۡأَبۡصَٰرَ وَٱلۡأَفۡـِٔدَةَۚ قَلِيلٗا مَّا
تَشۡكُرُونَ ٧٨

---

**1**. ఇక్కడ శిక్ష అంటే బద్ర్ యుద్ధరంగంలో ముష్రికులకు సంభవించిన పరాభవం. లేక దైవ ప్రవక్త ('స'అస)ప్రార్థనవల్ల మక్కా ముష్రిక్‌లపై వచ్చిన కరువుకాలం కావచ్చు. (ఇబ్నె-కసీ'ర్).

وَهُوَ ٱلَّذِى ذَرَأَكُمْ فِى ٱلْأَرْضِ
وَإِلَيْهِ تُحْشَرُونَ ٧٩

**79**. మరియు మిమ్మల్ని భూమిపై వ్యాపింపజేసినవాడు ఆయనే. మరియు ఆయన వద్దనే మీరంతా సమావేశపరచబడతారు.

وَهُوَ ٱلَّذِى يُحْىِۦ وَيُمِيتُ وَلَهُ
ٱخْتِلَٰفُ ٱلَّيْلِ وَٱلنَّهَارِ ۚ أَفَلَا
تَعْقِلُونَ ٨٠

**80**. మరియు మీకు జీవితాన్ని ఇచ్చేవాడు మరియు మరణింపజేసేవాడు ఆయనే! మరియు రాత్రింబవళ్ళ మార్పు ఆయన అధీనంలోనే ఉంది. ఏమీ? మీరిది అర్థం చేసుకోలేరా?

بَلْ قَالُوا۟ مِثْلَ مَا قَالَ
ٱلْأَوَّلُونَ ٨١

**81**. కాని వారు తమ పూర్వీకులు పలికినట్లే పలుకుతున్నారు.

قَالُوٓا۟ أَءِذَا مِتْنَا وَكُنَّا تُرَابًا
وَعِظَٰمًا أَءِنَّا لَمَبْعُوثُونَ ٨٢

**82**. వారంటున్నారు: "ఏమీ? మేము మరణించి, మట్టిగా మరియు ఎముకలుగా మారిపోయిన తరువాత కూడా మళ్ళీ సజీవులుగా లేపబడతామా?

لَقَدْ وُعِدْنَا نَحْنُ وَءَابَآؤُنَا هَٰذَا مِن
قَبْلُ إِنْ هَٰذَآ إِلَّآ أَسَٰطِيرُ
ٱلْأَوَّلِينَ ٨٣

**83**. "వాస్తవానికి, ఇటువంటి వాగ్దానాలు మాకూ మరియు మాకు పూర్వం మా తాతముత్తాతలకు చేయబడినవే! వాస్తవానికి ఇవి కేవలం పూర్వకాలపు కట్టుకథలు మాత్రమే."[1]

قُل لِّمَنِ ٱلْأَرْضُ وَمَن فِيهَآ إِن
كُنتُمْ تَعْلَمُونَ ٨٤

**84**. వారిని ఇలా అడుగు: "ఈ భూమి మరియు ఇందులో ఉన్నదంతా ఎవరికి చెందినదో మీకు తెలిస్తే చెప్పండి?"

سَيَقُولُونَ لِلَّهِ ۚ قُلْ أَفَلَا تَذَكَّرُونَ
٨٥

**85**. వారంటారు: "అల్లాహ్‌కే!" వారితో అను: "అయినా మీరు హితోపదేశం స్వీకరించరా?"

---

**1**. అసా'తీరున్: అంటే పూర్వకాలంలో వ్రాసిపెట్టిన కట్టుకథలు. అంటే పునరుత్థానమని నీవు ('స'అస) అంటున్నది మేము ఎన్నో తరాలనుండి వింటున్న గాథయే! అది ఎప్పుడు రానున్నది? ఇది కేవలం ఒక కట్టుకథ!

**86**. వారిని అడుగు: "సప్తాకాశాల ప్రభువు మరియు సర్వోత్తమ సింహాసనానికి ('అర్ష్‌కు) ప్రభువు ఎవరు?"[1]

قُلْ مَن رَّبُّ ٱلسَّمَـٰوَٰتِ ٱلسَّبْعِ وَرَبُّ ٱلْعَرْشِ ٱلْعَظِيمِ ﴿٨٦﴾

**87**. వారంటారు: "అల్లాహ్ మాత్రమే!" అని. వారితో అను: "అయితే మీరెందుకు ఆయనపట్ల భయభక్తులు కలిగి ఉండరు?"

سَيَقُولُونَ لِلَّهِ ۚ قُلْ أَفَلَا تَتَّقُونَ ﴿٨٧﴾

**88**. వారిని ఇలా అడుగు: "మీకు తెలిస్తే చెప్పండి! ప్రతి దానిపై పాలనాధికారం ఎవరి చేతిలో ఉంది? మరియు ప్రతిదానికి శరణమిచ్చేవాడు ఆయనే మరియు ఆయనకు వ్యతిరేకంగా శరణమివ్వగల వాడెవ్వడూ లేనివాడు, ఎవరు?"

قُلْ مَنۢ بِيَدِهِۦ مَلَكُوتُ كُلِّ شَىْءٍ وَهُوَ يُجِيرُ وَلَا يُجَارُ عَلَيْهِ إِن كُنتُمْ تَعْلَمُونَ ﴿٨٨﴾

**89**. వారంటారు: "అల్లాహ్ మాత్రమే!" వారితో అను: "అయితే మీరెందుకు మాయాజాలానికి గురిఅవు (మోసగింపబడు) తున్నారు?"

سَيَقُولُونَ لِلَّهِ ۚ قُلْ فَأَنَّىٰ تُسْحَرُونَ ﴿٨٩﴾

**90**. అలాకాదు! మేము వారికి సత్యాన్ని అందజేశాము. మరియు నిశ్చయంగా, వారే అసత్యవాదులు!

بَلْ أَتَيْنَـٰهُم بِٱلْحَقِّ وَإِنَّهُمْ لَكَـٰذِبُونَ ﴿٩٠﴾

**91**. అల్లాహ్ ఎవ్వరినీ కూడా తనకు సంతానంగా చేసుకోలేదు మరియు ఆయనతో పాటు మరొక ఆరాధ్యదేవుడు లేడు. అలా అయితే ప్రతి దేవుడు తన సృష్టితో వేరైపోయేవాడు మరియు వారు ఒకరిపై నొకరు ప్రాబల్యం పొందగోరే వారు. అల్లాహ్! వారు కల్పించేవాటికి అతీతుడు.[2]

مَا ٱتَّخَذَ ٱللَّهُ مِن وَلَدٍ وَمَا كَانَ مَعَهُۥ مِنْ إِلَـٰهٍ ۚ إِذًا لَّذَهَبَ كُلُّ إِلَـٰهٍۭ بِمَا خَلَقَ وَلَعَلَا بَعْضُهُمْ عَلَىٰ بَعْضٍ ۚ سُبْحَـٰنَ ٱللَّهِ عَمَّا يَصِفُونَ ﴿٩١﴾

---

**1**. చూడండి, 2:29, 7:54 మరియు 9:129.
**2**. చూడండి, 6:100.

**92**. ఆయన అగోచర మరియు గోచర విషయాల జ్ఞానం గలవాడు; వారు సాటికల్పించే భాగస్వాముల కంటే, ఆయన అత్యున్నతుడు.

عَـٰلِمِ ٱلْغَيْبِ وَٱلشَّهَـٰدَةِ فَتَعَـٰلَىٰ عَمَّا يُشْرِكُونَ ﴿٩٢﴾

**93**. (ఓ ము'హమ్మద్!) ఇలా ప్రార్థించు: ''ఓ నా ప్రభూ! ఏ (శిక్ష అయితే) వారికి (అవిశ్వాసులకు) వాగ్దానం చేయబడి ఉన్నదో దానిని నీవు నాకు చూపనున్నచో!

قُل رَّبِّ إِمَّا تُرِيَنِّى مَا يُوعَدُونَ ﴿٩٣﴾

**94**. ''ఓ నా ప్రభూ! నన్ను ఈ దుర్మార్గ ప్రజలలో చేర్చకు.''[1]

رَبِّ فَلَا تَجْعَلْنِى فِى ٱلْقَوْمِ ٱلظَّـٰلِمِينَ ﴿٩٤﴾

**95**. మరియు నిశ్చయంగా, మేము, వారికి (అవిశ్వాసులకు) వాగ్దానము చేసింది (శిక్ష), నీకు చూపగల సమర్థులము.

وَإِنَّا عَلَىٰٓ أَن نُّرِيَكَ مَا نَعِدُهُمْ لَقَـٰدِرُونَ ﴿٩٥﴾

**96**. చెడును, మంచితనంతో నివారించు.[2] వారు ఆపాదించే విషయాలు మాకు బాగా తెలుసు.

ٱدْفَعْ بِٱلَّتِى هِىَ أَحْسَنُ ٱلسَّيِّئَةَ نَحْنُ أَعْلَمُ بِمَا يَصِفُونَ ﴿٩٦﴾

**97**. మరియు ఇలా ప్రార్థించు: ''ఓ నా ప్రభూ! షై'తానులు రేకెత్తించే కలతల నుండి (రక్షణ పొందటానికి) నేను నీ శరణు వేడుకుంటున్నాను.

وَقُل رَّبِّ أَعُوذُ بِكَ مِنْ هَمَزَٰتِ ٱلشَّيَـٰطِينِ ﴿٩٧﴾

**98**. ''మరియు ఓ నా ప్రభూ! అవి నావద్దకు రాకుండా ఉండాలని, నేను నీ శరణు వేడుకుంటున్నాను.''[3]

وَأَعُوذُ بِكَ رَبِّ أَن يَحْضُرُونِ ﴿٩٨﴾

---

**1**. దైవప్రవక్త ('స'అస) ఇలా ప్రార్థించారు: 'ఓ అల్లాహ్ (సు.తా.)! ఒకవేళ నీవు ఈ సమాజాన్ని పరీక్షించగోరితే, లేక శిక్షించగోరితే! అంతకు ముందే నన్ను ఈ ప్రపంచం నుండి లేపుకో!' (తిర్మి'జీ, అ'హ్మద్).

**2**. చూడండి, 13:22 చివరి వాక్యం మరియు 41:34-35.

**3**. కావున ప్రతి కార్యానికి ముందు: 'బిస్మిల్లా హిర్ర'హ్మా నిర్ర'హీమ్' చదవండి. అని దైవప్రవక్త ('స'అస) అన్నారు. దీనిని గురించి 'హదీస్'లలో, దు'ఆలు కూడా పేర్కొనబడ్డాయి. (ముస్నద్ అ'హ్మద్ 2/181, అబూ-దావూద్, తిర్మి'జీ).

حَتَّىٰٓ إِذَا جَآءَ أَحَدَهُمُ ٱلْمَوْتُ قَالَ رَبِّ ٱرْجِعُونِ ﴿٩٩﴾

99. చివరికి వారిలో ఒకడికి మరణం సమీపించినప్పుడు వాడిలా వేడుకుంటాడు: ''ఓ నా ప్రభూ! నన్ను తిరిగి (భూలోకానికి) పంపు;

لَعَلِّيٓ أَعْمَلُ صَٰلِحًا فِيمَا تَرَكْتُۚ كَلَّآۚ إِنَّهَا كَلِمَةٌ هُوَ قَآئِلُهَاۖ وَمِن وَرَآئِهِم بَرْزَخٌ إِلَىٰ يَوْمِ يُبْعَثُونَ ﴿١٠٠﴾

100. ''నేను చేయకుండా వచ్చిన సత్కార్యాలు చేయటానికి.''[1] అది కాని పని. నిశ్చయంగా, అది అతని నోటిమాట మాత్రమే![2] ఇక (ఈ మరణించిన) వారు తిరిగి లేపబడేదినం వరకు వారి ముందు ఒక అడ్డుతెర (బర్'జ'ఖ్) ఉంటుంది.[3]

فَإِذَا نُفِخَ فِي ٱلصُّورِ فَلَآ أَنسَابَ بَيْنَهُمْ يَوْمَئِذٍ وَلَا يَتَسَآءَلُونَ ﴿١٠١﴾

101. ఆ తరువాత బాకా ఊదబడిన దినమున వారి మధ్య ఎలాంటి సంబంధాలు ఉండవు. మరియు వారు ఒకరినొకరు పలుకరించుకోరు.

فَمَن ثَقُلَتْ مَوَٰزِينُهُۥ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلْمُفْلِحُونَ ﴿١٠٢﴾

102. ఇక ఎవరి (సత్కార్యాల) పళ్ళాలు బరువుగా ఉంటాయో, అలాంటి వారే సాఫల్యం పొందేవారు.

وَمَنْ خَفَّتْ مَوَٰزِينُهُۥ فَأُوْلَٰٓئِكَ ٱلَّذِينَ خَسِرُوٓاْ أَنفُسَهُمْ فِي جَهَنَّمَ خَٰلِدُونَ ﴿١٠٣﴾

103. మరియు ఎవరి పళ్ళాలు తేలికగా ఉంటాయో, అలాంటి వారే తమను తాము నష్టానికి గురిచేసుకున్నవారు; వారే నరకంలో శాశ్వతంగా ఉండేవారు.

تَلْفَحُ وُجُوهَهُمُ ٱلنَّارُ وَهُمْ فِيهَا كَٰلِحُونَ ﴿١٠٤﴾

104. అగ్ని వారి ముఖాలను కాల్చి వేస్తుంది.[4] వారి పెదవులు బిగించుకు పోయి పళ్ళు బయటపడతాయి.

---

1. ఈ దు'ఆ ప్రతి సత్యతిరస్కారి: 1) మరణం ఆసన్నమైనప్పుడు, 2) పునరుత్థానదినమున, అల్లాహ్ (సు.తా.) సమక్షంలో హాజరుచేయబడినప్పుడు మరియు 3) నరకంలోకి త్రోయబడి నప్పుడు చేస్తాడు. కాని సఫలుడు కాడు. ఈ వాక్యం ఖుర్ఆన్‌లో అనేకసార్లు వచ్చింది. చూడండి, 63:10-11, 14:44, 7:53, 32:12, 6:27-28, 40:11-12, 35:37 మొదలైనవి.
2. అది కానిపని, చూడండి, 6:28.
3. ఇహలోక మరియు పరలోక జీవితపు మధ్య కాలాన్ని బర్'జ'ఖ్ అంటారు.
4. ముఖం ఎందుకు పేర్కొనబడిందంటే మానవ ఉనికికి అన్నిటికంటే ముఖ్యమైన అంశం ముఖమే! నరకాగ్ని మాత్రం శరీరాన్నంతా కాల్చుతుంది.

أَلَمْ تَكُنْ ءَايَٰتِى تُتْلَىٰ عَلَيْكُمْ فَكُنتُم
بِهَا تُكَذِّبُونَ ﴿١٠٥﴾

**105**. (వారిని అల్లాహ్ ఇలా ప్రశ్నిస్తాడు): "ఏమీ? నా సూచనలు మీకు వినిపించబడ లేదా? అప్పుడు మీరు వాటిని అసత్యాలని తిరస్కరిస్తూ ఉండే వారు కదా?"

قَالُوا۟ رَبَّنَا غَلَبَتْ عَلَيْنَا شِقْوَتُنَا
وَكُنَّا قَوْمًا ضَآلِّينَ ﴿١٠٦﴾

**106**. వారిలా అంటారు: "ఓ మా ప్రభూ! మా దురదృష్టం మమ్మల్ని క్రమ్ముకొని ఉండింది. మేము మార్గభ్రష్టులమైన వారుగా ఉండేవారం!

رَبَّنَآ أَخْرِجْنَا مِنْهَا فَإِنْ عُدْنَا فَإِنَّا
ظَٰلِمُونَ ﴿١٠٧﴾

**107**. "ఓ మా ప్రభూ! మమ్మల్ని దీని (ఈ నరకం) నుండి బయటకు తీయి. ఒకవేళ మేము మరల (పాపాలు) చేస్తే, మేము నిశ్చయంగా, దుర్మార్గులమే!"

قَالَ ٱخْسَـُٔوا۟ فِيهَا وَلَا تُكَلِّمُونِ ﴿١٠٨﴾

**108**. ఆయన (అల్లాహ్) అంటాడు: "దానిలోనే పరాభవంతో పడిఉండండి మరియు నాతో మాట్లాడకండి!"

إِنَّهُۥ كَانَ فَرِيقٌ مِّنْ عِبَادِى
يَقُولُونَ رَبَّنَآ ءَامَنَّا فَٱغْفِرْ لَنَا
وَٱرْحَمْنَا وَأَنتَ خَيْرُ ٱلرَّٰحِمِينَ ﴿١٠٩﴾

**109**. నిశ్చయంగా, నా దాసులలో కొందరు ఇలా ప్రార్థించే వారున్నారు: "ఓ మా ప్రభూ! మేము విశ్వసించాము, మమ్మల్ని క్షమించు మరియు మమ్మల్ని కరుణించు మరియు కరుణించేవారిలో నీవే సర్వోత్తముడవు!"

فَٱتَّخَذْتُمُوهُمْ سِخْرِيًّا حَتَّىٰٓ أَنسَوْكُمْ
ذِكْرِى وَكُنتُم مِّنْهُمْ تَضْحَكُونَ ﴿١١٠﴾

**110**. కాని మీరు వారిని పరిహాసానికి గురిచేసే వారు, చివరకు (ఆ పరిహాసమే) మిమ్మల్ని నా ధ్యానంనుండి మరపింప జేసింది; మరియు మీరు వారిమీద నవ్వే వారు (ఎగతాళి చేసేవారు)!

إِنِّى جَزَيْتُهُمُ ٱلْيَوْمَ بِمَا صَبَرُوٓا۟ أَنَّهُمْ
هُمُ ٱلْفَآئِزُونَ ﴿١١١﴾

**111**. నిశ్చయంగా, ఈ రోజు నేను వారికి, వారి సహనానికి తగిన ప్రతిఫలాన్ని ఇచ్చాను. నిశ్చయంగా వారే విజయం పొందిన వారు!

قَٰلَ كَمْ لَبِثْتُمْ فِى ٱلْأَرْضِ عَدَدَ سِنِينَ
﴿١١٢﴾

**112**. (అల్లాహ్) ఇలా ప్రశ్నిస్తాడు: "మీరు భూమిలో ఎన్ని సంవత్సరాలు గడిపారు?"

قَالُواْ لَبِثۡنَا يَوۡمًا أَوۡ بَعۡضَ يَوۡمٖ فَسۡـَٔلِ ٱلۡعَآدِّينَ ١١٣

**113**. వారిలా జవాబు ఇస్తారు: "మేమక్కడ ఒక్కదినమో లేక దినపు కొంతభాగమో ఉంటిమి. లెక్కపెట్టినవారిని అడుగు!"[1]

قَٰلَ إِن لَّبِثۡتُمۡ إِلَّا قَلِيلٗاۖ لَّوۡ أَنَّكُمۡ كُنتُمۡ تَعۡلَمُونَ ١١٤

**114**. (అల్లాహ్) అంటాడు: "మీరక్కడ ఉన్నది కొంతకాలం మాత్రమే! ఒకవేళ ఇది మీరు తెలుసుకొని ఉంటే (ఎంత బాగుండేది)!

أَفَحَسِبۡتُمۡ أَنَّمَا خَلَقۡنَٰكُمۡ عَبَثٗا وَأَنَّكُمۡ إِلَيۡنَا لَا تُرۡجَعُونَ ١١٥

**115**. "ఏమీ? వాస్తవానికి మేము మిమ్మల్ని వృథాగానే పుట్టించామని మరియు మీరు మా వైపునకు ఎన్నడూ మరలిరారని భావించారా?"

فَتَعَٰلَى ٱللَّهُ ٱلۡمَلِكُ ٱلۡحَقُّۖ لَآ إِلَٰهَ إِلَّا هُوَ رَبُّ ٱلۡعَرۡشِ ٱلۡكَرِيمِ ١١٦

**116**. కావున (తెలుసుకోండి) అల్లాహ్ అత్యున్నతుడు, నిజమైన విశ్వసార్వభౌముడు,[2] ఆయన తప్ప మరొక ఆరాధ్యదేవుడు లేడు. ఆయనే గౌరవప్రదమైన సింహాసనానికి ('అర్ష్‌కు) ప్రభువు!

وَمَن يَدۡعُ مَعَ ٱللَّهِ إِلَٰهًا ءَاخَرَ لَا بُرۡهَٰنَ لَهُۥ بِهِۦ فَإِنَّمَا حِسَابُهُۥ عِندَ رَبِّهِۦٓۚ إِنَّهُۥ لَا يُفۡلِحُ ٱلۡكَٰفِرُونَ ١١٧

**117**. ఇక ఎవడైనా అల్లాహ్‌తో పాటు మరొక దైవాన్ని - తనవద్ద దాని కొరకు ఎలాంటి ఆధారం లేకుండానే - ప్రార్థిస్తాడో! నిశ్చయంగా, అతని లెక్క అతని ప్రభువు వద్ద ఉంది. నిశ్చయంగా, సత్యతిరస్కారులు సాఫల్యం పొందలేరు.[3]

وَقُل رَّبِّ ٱغۡفِرۡ وَٱرۡحَمۡ وَأَنتَ خَيۡرُ ٱلرَّٰحِمِينَ ١١٨

**118**. కావున నీవు ఇలా ప్రార్థించు: "ఓ నా ప్రభూ! నన్ను క్షమించు, నన్ను కరుణించు, కరుణించే వారిలో నీవే సర్వోత్తముడవు!" (3/8)

*****

**1**. ఈ లెక్కపెట్టే వారు దైవదూతలు.

**2**. చూడండి 20:114 వ్యాఖ్యానం 3.

**3**. నిజమైన సాఫల్యం, స్వర్గ నివాసమే కాని ఇహలోకంలోని ఆస్తిపాస్తులు, సంతానం హోదాలు, పేరు ప్రతిష్ఠలు మొదలైనవికావు.

## 24. సూరహ్ అన్-నూర్ سُورَةُ النُّورِ

అన్-నూరు: అంటే **జ్యోతి, ప్రకాశం, వెలుగు.** అన్-నిసా (4), అన్-నూర్ (24) మరియు అల్-అ'హ్'జాబ్(33) సూరాహ్‌లలో స్త్రీల యొక్క సమస్యలు మరియు వాటి పరిష్కారాలు పేర్కొనబడ్డాయి. ఈ సూరహ్ 5వ హిజ్రీ చివరి కాలంలో లేక 6వ హిజ్రీ మొదటి కాలంలో **మదీనాలో** అవతరింపజేయబడింది. ఇందులో **64 ఆయతులు** ఉన్నాయి. దీని పేరు **35**వ ఆయత్ నుండి తీసుకోబడింది. ఇందులో వ్యక్తిగత గౌరవపు ప్రాముఖ్యత తెలుపబడింది, ఆయత్‌లు 27-34 మరియు ఆయత్‌లు 11-20లలో బనూ-ము'స్'తలిఖ్ దండయాత్రలో సంభవించిన సంఘటనను గురించి ఉంది. ఆయత్‌లు 2-9లలో వ్యభిచారానికి గురించిన శాసనాలు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**1.** * ఇది ఒక సూరహ్! మేమే దీనిని అవతరింపజేశాము మరియు మేము దీనిని విధిగా జేశాము మరియు బహుశా మీరు గుణపాఠం నేర్చుకుంటారని, మేమిందులో స్పష్టమైన సూచనలను (ఆయాత్) అవతరింపజేశాము.

سُورَةٌ أَنزَلْنَٰهَا وَفَرَضْنَٰهَا وَأَنزَلْنَا فِيهَآ ءَايَٰتٍۭ بَيِّنَٰتٍ لَّعَلَّكُمْ تَذَكَّرُونَ ۝١

**2.** వ్యభిచారిణి మరియు వ్యభిచారుడు, ఈ ఇద్దరిలో ప్రతి ఒక్కరికి నూరేసి కొరడా దెబ్బలు కొట్టండి.[1] మరియు మీకు

ٱلزَّانِيَةُ وَٱلزَّانِى فَٱجْلِدُوا۟ كُلَّ وَٰحِدٍ مِّنْهُمَا مِا۟ئَةَ جَلْدَةٍ ۖ وَلَا تَأْخُذْكُم بِهِمَا

**1**. *'మరియు మీ స్త్రీలలో ఎవరైనా వ్యభిచారానికి పాల్పడితే, వారికి వ్యతిరేకంగా, మీలోనుండి నలుగురి సాక్ష్యం తీసుకోండి. వారు (నలుగురు) సాక్ష్యమిస్తే, వారు మరణించే వరకైనా, లేదా వారి కొరకు అల్లాహ్ ఏదైనా మార్గం చూపించేవరకైనా, వారిని ఇండ్లలో నిర్బంధించండి.'* అని 4:15లో వచ్చింది. ఇక్కడ: *'వ్యభిచారిణి మరియు వ్యభిచారుడు, ఈ ఇద్దరిలో ప్రతి ఒక్కరికి నూరేసి కొరడా దెబ్బలు కొట్టండి.'* అని వచ్చింది. ఈ శిక్ష పెండ్లికాని వారిది. ఇక పెండ్లి అయిన వారు వ్యభిచారం చేస్తే రాళ్ళు రువ్వి చంపండి. అని ముస్లిం, కితాబ్ అల్ 'హుదూద్, బాబ్ 'హద్ అ'జ్జానిలో ఉంది. ఇంకా ఎన్నో 'హదీసు'లు మరియు దైవ ప్రవక్త ('స'అస) మరియు 'స'హాబీలు అమలుపరచిన విధానాలు మరియు ముస్లిం సమాజంలోని ఏకాభిప్రాయాలు ఉన్నాయి. వీటినసురించి వివాహితులైన స్త్రీపురుషులు వ్యభిచారం చేస్తే వారికి రాళ్ళు రువ్వి

رَأْفَةٌ فِي دِينِ ٱللَّهِ إِن كُنتُمْ تُؤْمِنُونَ بِٱللَّهِ وَٱلْيَوْمِ ٱلْآخِرِ ۖ وَلْيَشْهَدْ عَذَابَهُمَا طَآئِفَةٌ مِّنَ ٱلْمُؤْمِنِينَ ﴿٢﴾

అల్లాహ్‌యందు మరియు అంతిమ దినమునందు విశ్వాసముంటే - అల్లాహ్ విధించిన ధర్మ విషయంలో - వారిద్దరి యెడల మీకు జాలి కలుగకూడదు. మరియు వారిద్దరి శిక్షను, విశ్వాసులలో కొందరు చూడాలి.

ٱلزَّانِي لَا يَنكِحُ إِلَّا زَانِيَةً أَوْ مُشْرِكَةً وَٱلزَّانِيَةُ لَا يَنكِحُهَآ إِلَّا زَانٍ أَوْ مُشْرِكٌ ۚ وَحُرِّمَ ذَٰلِكَ عَلَى ٱلْمُؤْمِنِينَ ﴿٣﴾

**3.** ఒక వ్యభిచారి, ఒక వ్యభిచారిణిని లేక బహుదైవారాధకురాలయిన (ముష్రిక్) స్త్రీని మాత్రమే వివాహమాడుతాడు; మరియు ఒక వ్యభిచారిణిని, ఒక వ్యభిచారుడో లేక ఒక బహుదైవారాధకుడో మాత్రమే వివాహమాడుతాడు. మరియు ఇలాంటి విషయం విశ్వాసుల కొరకు నిషేధించబడింది.[1]

وَٱلَّذِينَ يَرْمُونَ ٱلْمُحْصَنَٰتِ ثُمَّ لَمْ يَأْتُوا۟ بِأَرْبَعَةِ شُهَدَآءَ فَٱجْلِدُوهُمْ ثَمَٰنِينَ جَلْدَةً وَلَا تَقْبَلُوا۟ لَهُمْ شَهَٰدَةً أَبَدًا ۚ وَأُو۟لَٰٓئِكَ هُمُ ٱلْفَٰسِقُونَ ﴿٤﴾

**4.** మరియు ఎవరైనా శీలవతులైన స్త్రీలపై అపనిందమోపిన తరువాత నలుగురు సాక్షులను తీసుకొనిరాలేరో, వారికి ఎనభై కొరడా దెబ్బలు కొట్టండి మరియు వారి సాక్ష్యాన్ని ఎన్నటికీ స్వీకరించకండి. అలాంటి వారు పరమ దుష్టులు (ఫాసిఖూన్).[2]

---

చంపే శిక్ష (రజ్మ్) విధించబడుతుంది. కాని ఈ శిక్ష విధించటానికి, లైంగిక క్రియ జరుగుతూ ఉండగా ప్రత్యక్షంగా కళ్ళారా చూశామని, సత్యవంతులైన నలుగురు వ్యక్తులు అల్లాహ్ పేరుతో ప్రమాణం చేస్తూ సాక్ష్యం ఇవ్వాలి. కేవలం వృత్తాంతానుమేయ ప్రమాణం సరిపోదు. చూడండి, 24:4.

**1**. కొందరు 'స'హాబీ(ర'ది. 'అన్హుమ్)లు చరిత్రహీనులైన స్త్రీలతో వివాహమాడటానికి అనుమతి అడిగినప్పుడు ఈ ఆయత్ అవతరింపజేయబడిందని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. ఇక్కడ నికా'హ్: అంటే సాధారణ వివాహంకాదు, లైంగిక సంబంధం. ఒక వ్యభిచారియే ఒక వ్యభిచారిణితో లైంగిక సంబంధం ఉంచుకుంటాడు. అని కొందరు అభిప్రాయపడ్డారు. మరొక వ్యాఖ్యానం ఏమిటంటే: ప్రతివాడు తనవంటి వారినే తన సహవాసులుగా ఎన్నుకుంటాడు. ఇది ఇమామ్ అష్-షౌకాని వ్యాఖ్యానం.

**2**. ఇక్కడ వ్యభిచార నిర్ధారణకు నలుగురు సాక్షులను - ఎవరైతే లైంగిక క్రియ జరుగు

إِلَّا ٱلَّذِينَ تَابُواْ مِنۢ بَعۡدِ ذَٰلِكَ وَأَصۡلَحُواْ فَإِنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٞ ٥

5. కాని అటుపిమ్మట ఎవరైతే పశ్చాత్తాపపడి తమను తాము సవరించుకుంటారో! నిశ్చయంగా, అలాంటి వారిపట్ల అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

وَٱلَّذِينَ يَرۡمُونَ أَزۡوَٰجَهُمۡ وَلَمۡ يَكُن لَّهُمۡ شُهَدَآءُ إِلَّآ أَنفُسُهُمۡ فَشَهَٰدَةُ أَحَدِهِمۡ أَرۡبَعُ شَهَٰدَٰتِۭ بِٱللَّهِ إِنَّهُۥ لَمِنَ ٱلصَّٰدِقِينَ ٦

6. మరియు ఎవరైతే, తమ భార్యల మీద అపనిందమోపి, దానికి తాము స్వయమే తప్ప ఇతరులను సాక్షులుగా తేలేరో! వారు తమంతట తామే నాలుగు సార్లు అల్లాహ్‌పై ప్రమాణం చేసి సాక్ష్యమిస్తూ: నిశ్చయంగా, తాను సత్యం పలుకుతున్నాననీ;[1]

وَٱلۡخَٰمِسَةُ أَنَّ لَعۡنَتَ ٱللَّهِ عَلَيۡهِ إِن كَانَ مِنَ ٱلۡكَٰذِبِينَ ٧

7. మరియు ఐదవసారి అతడు ఒకవేళ అసత్యం పలుకుతున్నట్లయితే! నిశ్చయంగా, అల్లాహ్ ఆగ్రహం తనమీద విరుచుకుపడు గాక! అనీ అనాలి.

وَيَدۡرَؤُاْ عَنۡهَا ٱلۡعَذَابَ أَن تَشۡهَدَ أَرۡبَعَ شَهَٰدَٰتِۭ بِٱللَّهِ إِنَّهُۥ لَمِنَ ٱلۡكَٰذِبِينَ ٨

8. ఇక ఆమె (భార్య) శిక్షను తప్పించు కోవటానికి, నాలుగు సార్లు అల్లాహ్‌పై ప్రమాణం చేస్తూ: నిశ్చయంగా అతడు అబద్ధం చెబుతున్నాడనీ;

---

తున్నప్పుడు కళ్ళారా చూశారో - తేవాలి! అని స్పష్టంగా పేర్కొనబడింది. వృత్తాంతానుమేయ ప్రమాణం సరిపోదు. అంటే అక్కడ దొరికిన ఇతర ప్రమాణాలను బట్టి లైంగికక్రియ జరిగిఉండవచ్చు అని, అంచనావేయడం సరిపోదు. నలుగురు సాక్ష్యులు లైంగిక క్రియ జరుగుతూ ఉండగా కళ్ళారా చూశాము, అని సాక్ష్యమిస్తేనే ఈ శిక్ష విధించాలి, లేకుంటే అపనింద మోపిన వానికి 80 కొరడా దెబ్బలు కొట్టాలి మరియు వాని సాక్ష్యం ఎన్నటికీ స్వీకరించరాదు. అల్లాహ్ (సు.తా.) దృష్టిలో అసత్య సాక్ష్యమిచ్చిన వాడు పరమదుష్టుడు.
మరొక విశేషమేమిటంటే, అప్పులలో, హత్యలలో మరియు ఇతర విషయాలలో ఇద్దరు సాక్షులు చాలు. కానీ, శిక్ష గంభీరమైనది, కాబట్టి వ్యభిచార విషయంలో లైంగిక క్రియ జరిగేటప్పుడు, కళ్ళారా చూసినామని అల్లాహ్ పేరట ప్రమాణం చేసి, నలుగురు సాక్ష్యమిస్తేనే శిక్ష విధించాలి. చూడండి, 24:2.

1. అంటే ఇక్కడ నాల్గుసార్లు అల్లాహ్ పై ప్రమాణం చేసి అనడం, నాలుగు సాక్షులతో సమానం, అని అర్థం.

وَٱلۡخَٰمِسَةَ أَنَّ غَضَبَ ٱللَّهِ عَلَيۡهَآ إِن كَانَ مِنَ ٱلصَّٰدِقِينَ ٩

9. మరియు అయిదవసారి ఒకవేళ అతడు సత్యవంతుడైతే! నిశ్చయంగా తన మీద అల్లాహ్ ఆగ్రహం విరుచుకుపడు గాక! అనీ అనాలి.[1]

وَلَوۡلَا فَضۡلُ ٱللَّهِ عَلَيۡكُمۡ وَرَحۡمَتُهُۥ وَأَنَّ ٱللَّهَ تَوَّابٌ حَكِيمٌ ١٠

10. మరియు మీపై అల్లాహ్ అనుగ్రహం మరియు ఆయన కరుణయే లేకుంటే! (ఆయన మీ శిక్షను త్వరలోనే తెచ్చే వాడు) మరియు నిశ్చయంగా, అల్లాహ్ పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడు, మహా వివేకవంతుడు.[2]

إِنَّ ٱلَّذِينَ جَآءُو بِٱلۡإِفۡكِ عُصۡبَةٞ مِّنكُمۡۚ لَا تَحۡسَبُوهُ شَرّٗا لَّكُمۖ

11. నిశ్చయంగా, అపనింద మోపే వారు,[3] మీలోనుంచే కొందరున్నారు. అది

---

1. ఈ విధానం షరీయత్‌లో ల'అనున్ అనబడుతుంది. అంటే నిందారోపణను ఖండించటానికి చేసే ప్రమాణం. ఈ విధమైన సాక్ష్యాల తరువాత వారిద్దరి మధ్య విడాకులు జరుగుతాయి. దైవప్రవక్త ('స'అస) కాలంలో ఇటువంటి విషయాలు జరిగినందువల్లనే ఈ ఆయత్‌లు అవతరింపజేయబడ్డాయి.
2. ఇక్కడ అల్లాహ్ (సు.తా.) శిక్ష వెంటనే రాకపోవచ్చు. ఎందుకంటే అల్లాహ్ (సు.తా.) అనంతకరుణామయుడు, పశ్చాత్తాపాన్ని అంగీకరించేవాడు మరియు మహా వివేకవంతుడు.
3. బనూ-ము'స్'తలిఖ్ యుద్ధం నుండి 5వ హి్జ్రీలో తిరిగి మదీనాకు వస్తున్నప్పుడు దైవప్రవక్త ('స'అస) మరియు 'సహాబీలు (ర'ది.'అన్హుమ్) మదీనాకు కొంత దూరముండగా రాత్రి గడపటానికి ఆగారు. ఉదయం వారి ప్రయాణం మొదలు పెట్టినప్పుడు, 'ఆయి'షహ్ (ర.'అన్హా) యొక్క అంబారీ (హోదజ్) ఆమె లోపల ఉన్నారనుకొని - ఒంటె మీద పెట్టి ప్రయాణం మొదలు పెట్టారు. 'ఆయి'షహ్ (ర.'అన్హా) తమ హారం వెతకటానికి వెళ్ళి ఉంటుంది. ఆమె తిరిగివచ్చే వరకు ఎవ్వరూ లేనిది చూసి అక్కడే కూర్చుంటుంది. అంతలో వెనుక నుండి 'సఫ్వాన్ బిన్-మ'అ'తల్ సులమి (ర'ది.'అ.) వస్తారు. అతని పని, వెనుక ఉండి బిడారం వారు ఏమైనా మరచిపోతే దానిని తీసుకొనిరావడమే. అతడు 'ఆయి'షహ్ (ర.'అన్హా)ను చూసి గుర్తుపట్టి, ఆమెను తన ఒంటెమీద సవారీచేయించుకొని తాను దాని కళ్ళెం (లగాం) పట్టుకొని తీసుకొని వస్తారు. ఇది చూసి కపటవిశ్వాసుల నాయకుడు 'అబ్దుల్లాహ్ బిన్-ఉబై అపనిందమోపుతాడు. ఈ విషయం గురించి ఎన్నో 'స'హీ'హ్ 'హదీస్' లున్నాయి. ఆమెను అపనింద నుండి విముక్తి చేయటానికి, అల్లాహ్ (సు.తా.) ఈ ఆయతులను అవతరింపజేస్తాడు. కొంతమంది విధేయులైన ముస్లింలు కూడా మునాఫిఖుల ఈ అపనిందకు గురిఅవుతారు. వారిలో 'హస్సాన్, మి'స్'తహ్ బిన్-అసా'స'హ్ మరియు 'హమ్న బిన్త్-జ'హష్ (ర'ది.'అన్హుమ్)లు కూడా ఉంటారు. దాదాపు ఆ సంఘటన ఒక నెల తరువాత ఈ ఆయతులు (11-20) అవతరింపజేయబడ్డాయి.

بَلۡ هُوَ خَيۡرٞ لَّكُمۡۚ لِكُلِّ ٱمۡرِيٕٖ مِّنۡهُم
مَّا ٱكۡتَسَبَ مِنَ ٱلۡإِثۡمِۚ وَٱلَّذِي تَوَلَّىٰ
كِبۡرَهُۥ مِنۡهُمۡ لَهُۥ عَذَابٌ عَظِيمٞ ١١

మీకు హానికరమైనదని భావించకండి. వాస్తవానికి అది మీకు మేలైనదే. వారిలో ప్రతి ఒక్కనికి తాను చేసిన పాపానికి తగిన శిక్ష లభిస్తుంది. మరియు వారిలో (ఈ అపనింద మోపటంలో), పెద్ద బాధ్యత వహించిన వానికి ఘోరమైన శిక్ష పడుతుంది.

لَّوۡلَآ إِذۡ سَمِعۡتُمُوهُ ظَنَّ ٱلۡمُؤۡمِنُونَ
وَٱلۡمُؤۡمِنَٰتُ بِأَنفُسِهِمۡ خَيۡرٗا وَقَالُواْ
هَٰذَآ إِفۡكٞ مُّبِينٞ ١٢

**12.** విశ్వాసులైన పురుషులు మరియు విశ్వాసులైన స్త్రీలు దానిని వినినప్పుడు, తమను గురించి తాము మంచి తలంపు వహించి: "ఇది స్పష్టమైన అపనిందయే!" అని ఎందుకు అనలేదు?[1]

لَّوۡلَا جَآءُو عَلَيۡهِ بِأَرۡبَعَةِ شُهَدَآءَۚ
فَإِذۡ لَمۡ يَأۡتُواْ بِٱلشُّهَدَآءِ فَأُوْلَٰٓئِكَ
عِندَ ٱللَّهِ هُمُ ٱلۡكَٰذِبُونَ ١٣

**13.** మరియు వారు దీనికై నలుగురు సాక్షులను ఎందుకు తీసుకొనిరాలేదు? ఒక వేళ వారు సాక్షులను తీసుకొని రానప్పుడు, అల్లాహ్ వద్ద వారే అసత్యవాదులు.

وَلَوۡلَا فَضۡلُ ٱللَّهِ عَلَيۡكُمۡ وَرَحۡمَتُهُۥ فِي
ٱلدُّنۡيَا وَٱلۡأٓخِرَةِ لَمَسَّكُمۡ فِي مَآ
أَفَضۡتُمۡ فِيهِ عَذَابٌ عَظِيمٌ ١٤

**14.** మరియు ఒకవేళ మీపై అల్లాహ్ అనుగ్రహం మరియు ఆయన కరుణ, ఇహలోకంలో మరియు పరలోకంలో లేకుంటే - మీరు ఏ విషయాలలో పడిపోయారో, వాటి పర్యవసానంగా - మీపై ఘోరమైన శిక్ష పడి ఉండేది.

إِذۡ تَلَقَّوۡنَهُۥ بِأَلۡسِنَتِكُمۡ وَتَقُولُونَ
بِأَفۡوَاهِكُم مَّا لَيۡسَ لَكُم بِهِۦ عِلۡمٞ
وَتَحۡسَبُونَهُۥ هَيِّنٗا وَهُوَ عِندَ ٱللَّهِ
عَظِيمٞ ١٥

**15.** అప్పుడు మీరు దానిని (ఆ అపనిందను) మీ నాలుకలతో వ్యాపింపజేస్తూ పోయారు మరియు మీకు తెలియని దానిని మీ నోళ్ళతో పలుకసాగారు మరియు మీరు దానిని చిన్న విషయంగా భావించారు, కాని అల్లాహ్ దగ్గర (దృష్టిలో) అది ఎంతో గొప్ప విషయం (అపరాధం).

**1.** 'ఆయి'షహ్ (ర. 'అన్హా)ను గురించి లేపిన అపనింద కొరకుచూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-6 'హదీస్' నం. 274.

16. మరియు మీరు దానిని విన్నప్పుడు: "ఇలాంటి మాట పలకడం మాకు తగదు, (ఓ మా ప్రభూ!) నీవు సర్వలోపాలకు అతీతుడవు, ఇది గొప్ప నిందారోపణ!" అని ఎందుకు అనలేదు.[1]

17. మీరు విశ్వాసులే అయితే, ఇక మీదట ఎన్నటికీ ఇటువంటి చేష్టలు మరల చేయకూడదని అల్లాహ్ మిమ్మల్ని ఉపదేశిస్తున్నాడు.

18. మరియు అల్లాహ్ మీకు స్పష్టమైన ఆయత్‌లను చూపుతున్నాడు. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

19. నిశ్చయంగా, ఎవరైతే, విశ్వాస వర్గంలో అశ్లీలత[2] వ్యాపించాలని కోరుతారో, అలాంటి వారికి ఇహలోకంలో మరియు పరలోకంలో కూడా కఠిన శిక్ష పడుతుంది.[3] మరియు అల్లాహ్‌కు అంతా తెలుసు, కాని మీకు తెలియదు.

20. మరియు మీ యెడల అల్లాహ్ అనుగ్రహం మరియు ఆయన కరుణయే లేకుంటే (మీరు నాశనమైపోయే వారు); మరియు నిశ్చయంగా, అల్లాహ్ మహా కనికరుడు, అపార కరుణాప్రదాత. (1/2)

وَلَوْلَآ إِذْ سَمِعْتُمُوهُ قُلْتُم مَّا يَكُونُ لَنَآ أَن نَّتَكَلَّمَ بِهَٰذَا سُبْحَٰنَكَ هَٰذَا بُهْتَٰنٌ عَظِيمٌ ﴿١٦﴾

يَعِظُكُمُ ٱللَّهُ أَن تَعُودُوا۟ لِمِثْلِهِۦٓ أَبَدًا إِن كُنتُم مُّؤْمِنِينَ ﴿١٧﴾

وَيُبَيِّنُ ٱللَّهُ لَكُمُ ٱلْءَايَٰتِ ۚ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٌ ﴿١٨﴾

إِنَّ ٱلَّذِينَ يُحِبُّونَ أَن تَشِيعَ ٱلْفَٰحِشَةُ فِى ٱلَّذِينَ ءَامَنُوا۟ لَهُمْ عَذَابٌ أَلِيمٌ فِى ٱلدُّنْيَا وَٱلْءَاخِرَةِ ۚ وَٱللَّهُ يَعْلَمُ وَأَنتُمْ لَا تَعْلَمُونَ ﴿١٩﴾

وَلَوْلَا فَضْلُ ٱللَّهِ عَلَيْكُمْ وَرَحْمَتُهُۥ وَأَنَّ ٱللَّهَ رَءُوفٌ رَّحِيمٌ ﴿٢٠﴾

---

1. ఈ మాటలు వ్యాపింపజేసిన వారితో: 'మీరు నలుగురు సాక్షులను ఎందుకు తేలేదు.' అని విశ్వాసులు ఎందుకు ప్రశ్నించలేదు. వారు నలుగురు సాక్షులను తేకుంటే మీరు వారిని అసత్యవాదులని ఎందుకు అనలేదు? ఈ ఆయత్ అవతరింపజేయబడిన తరువాత 'హస్సాన్, మి'స్'తహ్ బిన్-అసా'స'హ్ మరియు 'హమ్నా బిన్త్-జ'హష్ (ర'ది.'అన్హుమ్)లు అపనింద మోపినందుకు శిక్షింపబడ్డారు, (అ'హ్మద్, తిర్మిజీ', అబూ-దావూద్, ఇబ్నె-మాజా).
2. అల్-ఫా'హిషహ్: దుర్నీతి, అశ్లీలత, చెడ్డనడత, నీచకార్యము, అపనింద మొదలైనవి.
3. అంటే 80 కొరడా దెబ్బలు చూడండి, ఆయత్ 24:4.

۞ يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تَتَّبِعُوا۟
خُطُوَٰتِ ٱلشَّيْطَـٰنِ ۚ وَمَن يَتَّبِعْ
خُطُوَٰتِ ٱلشَّيْطَـٰنِ فَإِنَّهُۥ يَأْمُرُ
بِٱلْفَحْشَآءِ وَٱلْمُنكَرِ ۚ وَلَوْلَا فَضْلُ ٱللَّهِ
عَلَيْكُمْ وَرَحْمَتُهُۥ مَا زَكَىٰ مِنكُم مِّنْ
أَحَدٍ أَبَدًا وَلَـٰكِنَّ ٱللَّهَ يُزَكِّى مَن يَشَآءُ ۗ
وَٱللَّهُ سَمِيعٌ عَلِيمٌ ﴿٢١﴾
وَلَا يَأْتَلِ أُو۟لُوا۟ ٱلْفَضْلِ مِنكُمْ
وَٱلسَّعَةِ أَن يُؤْتُوٓا۟ أُو۟لِى ٱلْقُرْبَىٰ
وَٱلْمَسَـٰكِينَ وَٱلْمُهَـٰجِرِينَ فِى
سَبِيلِ ٱللَّهِ ۖ وَلْيَعْفُوا۟ وَلْيَصْفَحُوٓا۟ ۗ أَلَا
تُحِبُّونَ أَن يَغْفِرَ ٱللَّهُ لَكُمْ ۗ وَٱللَّهُ
غَفُورٌ رَّحِيمٌ ﴿٢٢﴾

**21.** * ఓ విశ్వాసులారా! షై'తాన్ అడుగుజాడలలో నడవకండి. మరియు ఎవడు షై'తాన్ అడుగుజాడలలో నడుస్తాడో! నిశ్చయంగా షై'తాన్ అతనిని అశ్లీలమైన మరియు అసభ్యకరమైన పనులు చేయటానికి ప్రోత్సహిస్తాడు. మరియు మీ యెడల అల్లాహ్ అనుగ్రహం మరియు ఆయన కరుణయే లేకుంటే, మీలో ఒక్కడు కూడా నీతిమంతునిగా ఉండలేడు. కాని అల్లాహ్ తాను కోరిన వానిని నీతిమంతునిగా చేస్తాడు. మరియు అల్లాహ్ సర్వం వినేవాడు సర్వజ్ఞుడు.

**22.** మరియు మీలో (అల్లాహ్) అనుగ్రహం మరియు సమృద్ధిగా (సంపదలు) గలవారు, తమ బంధువులకు, పేదలకు,[1] అల్లాహ్ మార్గంలో వలస (హిజ్రత్) పోయేవారికి, సహాయం చేయమని ప్రతిజ్ఞ చేయరాదు.[2] వారిని మన్నించాలి, (వారి తప్పులను) ఉపేక్షించాలి. ఏమీ? అల్లాహ్ మీ తప్పులను క్షమించాలని మీరు కోరరా? వాస్తవానికి అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

---

**1.** మిస్కీనున్: తన ఆదాయం నిత్యావసరాలకు సరిపోకున్నా ఇతరులను యాచించనివాడు.

**2.** 'ఆయి'షహ్ (ర.'అన్హా) పై అపనింద మోపిన విశ్వాసులలో ఒకడు మి'స్'తహ్ (ర'ది.'అ.), అబూబక్ర్ (ర'ది.'అ.) యొక్క దగ్గరి బంధువు. అబూబక్ర్ (ర'ది.'అ.) అతనికి సహాయం చేసేవారు. 'ఆయి'షహ్ (ర.'అన్హా)ను అపనింద నుండి విముక్తి కలిగించే ఆయతులు అవతరింపజేయబడిన తరువాత అబూబక్ర్ (ర'ది.'అ.) మి'స్'తహ్ (ర'ది.'అ.)కు ఇక ఎలాంటి సహాయం చేయనని ప్రతిజ్ఞచేస్తారు. అది అల్లాహ్ (సు.తా.)కు నచ్చక ఈ ఆయత్ అవతరింపజేశాడు. అప్పుడు అబూబక్ర్ (ర'ది.'అ.) తన ప్రతిజ్ఞకు పరిహారం (కప్ఫారహ్) చెల్లించి మి'స్'తహ్ (ర'ది.'అ.)కు మరల ఆర్థిక సహాయం చేయసాగారు. (ఇబ్నె-కసీ'ర్, ఫ'త్హ్ అల్-ఖదీర్), చూడండి, 13:22.

**23.** నిశ్చయంగా, ఎవరైతే శీలవతులు, అమాయకులు అయిన విశ్వాస స్త్రీలపై అపనిందలు మోపుతారో, వారు ఈ లోకంలోనూ మరియు పరలోకంలోనూ శపించ(బహిష్కరింప)బడతారు మరియు వారికి ఘోరమైన శిక్ష ఉంటుంది.

**24.** వారి నాలుకలు, వారి చేతులు మరియు వారి కాళ్ళు - వారు చేస్తూఉండిన కర్మలను గురించి - వారికి విరుద్ధంగా సాక్ష్యమిచ్చేరోజు!

**25.** ఆ రోజు! అల్లాహ్ వారికి (వారి కర్మలకు) పూర్తి ప్రతిఫలం ఇస్తాడు. మరియు నిశ్చయంగా, అల్లాహ్! ఆయనే పరమ సత్యమని వారు తెలుసుకుంటారు.

**26.** నికృష్టులైన స్త్రీలు నికృష్టులైన పురుషులకు మరియు నికృష్టులైన పురుషులు నికృష్టులైన స్త్రీలకు తగినవారు. మరియు నిర్మల స్త్రీలు నిర్మల పురుషులకు మరియు నిర్మల పురుషులు నిర్మల స్త్రీలకు తగిన వారు. వారు (కపటవిశ్వాసులు) మోపే అపనిందలకు వీరు నిర్దోషులు. వీరికి క్షమాపణ మరియు గౌరవప్రదమైన జీవనోపాధి ఉంటాయి.

**27.** ఓ విశ్వాసులారా! మీ ఇండ్లు తప్ప, ఇతరుల ఇండ్లలోనికి వారి అనుమతిలేకుండా మరియు ఆ ఇంటివారికి సలామ్ చేయకుండా ప్రవేశించకండి.[1] ఈ పద్ధతే మీకు అతి ఉత్తమమైనది. మీరు ఈ హితోపదేశం జ్ఞాపకం ఉంచుకుంటారని ఆశింపబడుతోంది!

إِنَّ ٱلَّذِينَ يَرۡمُونَ ٱلۡمُحۡصَنَٰتِ
ٱلۡغَٰفِلَٰتِ ٱلۡمُؤۡمِنَٰتِ لُعِنُواْ فِي ٱلدُّنۡيَا
وَٱلۡأٓخِرَةِ وَلَهُمۡ عَذَابٌ عَظِيمٞ ٢٣
يَوۡمَ تَشۡهَدُ عَلَيۡهِمۡ أَلۡسِنَتُهُمۡ وَأَيۡدِيهِمۡ
وَأَرۡجُلُهُم بِمَا كَانُواْ يَعۡمَلُونَ ٢٤
يَوۡمَئِذٖ يُوَفِّيهِمُ ٱللَّهُ دِينَهُمُ ٱلۡحَقَّ
وَيَعۡلَمُونَ أَنَّ ٱللَّهَ هُوَ ٱلۡحَقُّ ٱلۡمُبِينُ ٢٥
ٱلۡخَبِيثَٰتُ لِلۡخَبِيثِينَ وَٱلۡخَبِيثُونَ
لِلۡخَبِيثَٰتِۖ وَٱلطَّيِّبَٰتُ لِلطَّيِّبِينَ
وَٱلطَّيِّبُونَ لِلطَّيِّبَٰتِۚ أُوْلَٰٓئِكَ
مُبَرَّءُونَ مِمَّا يَقُولُونَۖ لَهُم مَّغۡفِرَةٞ
وَرِزۡقٞ كَرِيمٞ ٢٦
يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تَدۡخُلُواْ بُيُوتًا
غَيۡرَ بُيُوتِكُمۡ حَتَّىٰ تَسۡتَأۡنِسُواْ
وَتُسَلِّمُواْ عَلَىٰٓ أَهۡلِهَاۚ ذَٰلِكُمۡ خَيۡرٞ لَّكُمۡ
لَعَلَّكُمۡ تَذَكَّرُونَ ٢٧

---

**1.** దైవప్రవక్త ('స'అస) ఏ ఇంటికి వెళ్ళినా మొదట సలాం చేసేవారు. తరువాత ప్రవేశించటానికి, ద్వారపు ఒకప్రక్కకు నిలబడి అనుమతి అడిగేవారు. మూడుసార్లు అనుమతి అడిగిన తరువాత కూడా జవాబు రాకుంటే మరలిపోయే వారు. ('స.బుఖా'రీ). 'ఎవరు?' అని లోపల ఉన్నవారు ప్రశ్నిస్తే బయట ఉన్నవారు తమపేరు తెలపాలి. ('స. బుఖా'రీ).

فَإِن لَّمْ تَجِدُوا۟ فِيهَآ أَحَدًا فَلَا تَدْخُلُوهَا حَتَّىٰ يُؤْذَنَ لَكُمْ ۖ وَإِن قِيلَ لَكُمُ ٱرْجِعُوا۟ فَٱرْجِعُوا۟ ۖ هُوَ أَزْكَىٰ لَكُمْ ۚ وَٱللَّهُ بِمَا تَعْمَلُونَ عَلِيمٌ ﴿٢٨﴾

**28**. మరియు ఒకవేళ మీకు దానిలో (ఆ ఇంటిలో) ఎవ్వరూ కనబడకపోయినా, మీకు అనుమతి ఇవ్వబడనంతవరకు అందులోకి ప్రవేశించకండి. మరియు (అనుమతి ఇవ్వక) మీతో తిరిగి పొమ్మని (ఆ ఇంటివారు) అంటే! తిరిగి వెళ్ళిపోండి. ఇదే మీ కొరకు శ్రేష్ఠమైన పద్ధతి. మరియు మీరు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

لَّيْسَ عَلَيْكُمْ جُنَاحٌ أَن تَدْخُلُوا۟ بُيُوتًا غَيْرَ مَسْكُونَةٍ فِيهَا مَتَٰعٌ لَّكُمْ ۚ وَٱللَّهُ يَعْلَمُ مَا تُبْدُونَ وَمَا تَكْتُمُونَ ﴿٢٩﴾

**29**. ఎవ్వరికీ నివాసస్థలం కాకుండా మీకు ప్రయోజనకరమైన వస్తువులున్న ఇండ్లలో ప్రవేశిస్తే, మీపై ఎట్టి దోషంలేదు. మరియు మీరు వ్యక్తపరిచేది మరియు మీరు దాచేది అంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

قُل لِّلْمُؤْمِنِينَ يَغُضُّوا۟ مِنْ أَبْصَٰرِهِمْ وَيَحْفَظُوا۟ فُرُوجَهُمْ ۚ ذَٰلِكَ أَزْكَىٰ لَهُمْ ۗ إِنَّ ٱللَّهَ خَبِيرٌۢ بِمَا يَصْنَعُونَ ﴿٣٠﴾

**30**. విశ్వసించిన పురుషులతో, వారి చూపులను క్రిందికి పెట్టుకోమని మరియు వారి మర్మాంగాలను కాపాడుకోమని చెప్పు.[1] ఇది వారికి ఎంతో శ్రేష్ఠమైనది. నిశ్చయంగా అల్లాహ్, వారి చేష్టలను బాగా ఎరుగును.

وَقُل لِّلْمُؤْمِنَٰتِ يَغْضُضْنَ مِنْ أَبْصَٰرِهِنَّ وَيَحْفَظْنَ فُرُوجَهُنَّ وَلَا يُبْدِينَ زِينَتَهُنَّ إِلَّا مَا ظَهَرَ مِنْهَا ۖ وَلْيَضْرِبْنَ بِخُمُرِهِنَّ عَلَىٰ جُيُوبِهِنَّ ۖ

**31**. మరియు విశ్వసించిన స్త్రీలతో కూడా వారి చూపులను క్రిందికి పెట్టుకోమని మరియు వారి మర్మాంగాలను కాపాడుకోమని చెప్పు. మరియు వారి అలంకరణను ప్రదర్శించవద్దని చెప్పు - (దానంతట

---

**1**. చూడండి, 23:5-6, అంటే పురుషులు తమ చూపులను అదుపులో ఉంచుకోవాలి. చూడదగని విషయాల నుండి చూపులను మరల్చుకోవాలి. అంటే పురుషులు అన్య స్త్రీలను చూడటం, ఇతరుల ఆచ్ఛాదనీయ అవయవాలను చూడటం, అసభ్య దృశ్యాలపై చూపును నిలపటం తగదు, అని అర్థం. ఇంకా చూడండి, మత్తయి-(Mathew), 5:27-29.

وَلَا يُبۡدِينَ زِينَتَهُنَّ إِلَّا
لِبُعُولَتِهِنَّ أَوۡ ءَابَآئِهِنَّ أَوۡ
ءَابَآءِ بُعُولَتِهِنَّ أَوۡ أَبۡنَآئِهِنَّ
أَوۡ أَبۡنَآءِ بُعُولَتِهِنَّ أَوۡ إِخۡوَٰنِهِنَّ أَوۡ
بَنِيٓ إِخۡوَٰنِهِنَّ أَوۡ بَنِيٓ أَخَوَٰتِهِنَّ أَوۡ
نِسَآئِهِنَّ أَوۡ مَا مَلَكَتۡ أَيۡمَٰنُهُنَّ أَوِ
ٱلتَّٰبِعِينَ غَيۡرِ أُوْلِي ٱلۡإِرۡبَةِ مِنَ
ٱلرِّجَالِ أَوِ ٱلطِّفۡلِ ٱلَّذِينَ لَمۡ يَظۡهَرُواْ
عَلَىٰ عَوۡرَٰتِ ٱلنِّسَآءِۖ وَلَا يَضۡرِبۡنَ
بِأَرۡجُلِهِنَّ لِيُعۡلَمَ مَا يُخۡفِينَ مِن
زِينَتِهِنَّۚ وَتُوبُوٓاْ إِلَى ٱللَّهِ جَمِيعًا أَيُّهَ
ٱلۡمُؤۡمِنُونَ لَعَلَّكُمۡ تُفۡلِحُونَ ٣١

అదే) ప్రదర్శనమయ్యేది తప్ప. వారిని, తమ తలమీది దుప్పటిని రొమ్ముల వరకు కప్పుకోమని చెప్పు. వారు తమ అలంకారాన్ని తమ భర్తలకు, తమ తండ్రులకు, తమ భర్తల తండ్రులకు, తమ కుమారులకు, తమ భర్తల కుమారులకు, తమ సోదరులకు, తమ సోదరుల కుమారులకు, తమ సోదరీమణుల కుమారులకు, తమ (తోటి) స్త్రీలకు, తమ బానిస స్త్రీలకు, లేక కామ ఇచ్ఛలేని మగ సేవకులకు, లేక స్త్రీల గుప్త అంగాలను గురించి తెలియని బాలురకు తప్ప, ఇతరుల ముందు ప్రదర్శించకూడదని మరియు కనబడకుండా ఉన్న తమ అలంకారం తెలియబడేటట్లుగా, వారు తమ పాదాలను నేలపై కొడుతూ నడవకూడదని చెప్పు. మరియు ఓ విశ్వాసులారా! మీరందరూ కలసి అల్లాహ్‌ను క్షమాపణకై వేడుకుంటే, మీరు సాఫల్యం పొందవచ్చు!

وَأَنكِحُواْ ٱلۡأَيَٰمَىٰ مِنكُمۡ وَٱلصَّٰلِحِينَ
مِنۡ عِبَادِكُمۡ وَإِمَآئِكُمۡۚ إِن يَكُونُواْ
فُقَرَآءَ يُغۡنِهِمُ ٱللَّهُ مِن فَضۡلِهِۦۗ وَٱللَّهُ
وَٰسِعٌ عَلِيمٞ ٣٢

**32**. మీలోని పెండ్లికాని వారికి మరియు శీలవతులైన మీ బానిస పురుషులు మరియు బానిస స్త్రీలకు వివాహాలు చేయించండి.[1] ఒకవేళ వారు పేదవారయితే, అల్లాహ్ తన అనుగ్రహంతో వారిని సంపన్నులుగా చేయవచ్చు! మరియు అల్లాహ్ సర్వవ్యాప్తి, సర్వజ్ఞుడు.

---

**1**. అల్-అ'యామా: అంటే, కన్య, విధవ, విడాకురాలు - మూడు రకాల స్త్రీలు మరియు భార్యలేని పురుషుడు కూడా, దైవప్రవక్త('స'అస) ప్రవచనం: "ఎవడైతే నా సున్నత్‌ను తిరస్కరిస్తాడో వాడు నావాడు కాడు!" ('స'హీ'హ్ బు'ఖారీ-5063, ముస్లిం-1023).

وَلۡيَسۡتَعۡفِفِ ٱلَّذِينَ لَا يَجِدُونَ نِكَاحًا حَتَّىٰ يُغۡنِيَهُمُ ٱللَّهُ مِن فَضۡلِهِۦۗ وَٱلَّذِينَ يَبۡتَغُونَ ٱلۡكِتَٰبَ مِمَّا مَلَكَتۡ أَيۡمَٰنُكُمۡ فَكَاتِبُوهُمۡ إِنۡ عَلِمۡتُمۡ فِيهِمۡ خَيۡرٗاۖ وَءَاتُوهُم مِّن مَّالِ ٱللَّهِ ٱلَّذِيٓ ءَاتَىٰكُمۡۚ وَلَا تُكۡرِهُواْ فَتَيَٰتِكُمۡ عَلَى ٱلۡبِغَآءِ إِنۡ أَرَدۡنَ تَحَصُّنٗا لِّتَبۡتَغُواْ عَرَضَ ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَاۚ وَمَن يُكۡرِههُّنَّ فَإِنَّ ٱللَّهَ مِنۢ بَعۡدِ إِكۡرَٰهِهِنَّ غَفُورٞ رَّحِيمٞ ٣٣

**33**. ఎవరికైతే, పెండ్లి చేసుకొనే శక్తిలేదో వారు, అల్లాహ్ తన అనుగ్రహంతో వారిని ధనవంతులుగా చేసేవరకు శీలశుద్ధతను పాటించాలి.[1] మరియు మీ బానిసలలో ఎవరైనా స్వేచ్ఛాపత్రం వ్రాయించుకో గోరితే వారియందు మీకు మంచితనం కనబడితే, వారికి స్వేచ్ఛాపత్రం వ్రాసి ఇవ్వండి.[2] అల్లాహ్ మీకు ఇచ్చిన ధనం నుండి వారికి గూడా కొంత ఇవ్వండి. మీరు ఇహలోక ప్రయోజనాల నిమిత్తం, మీ బానిస స్త్రీలు శీలవతులుగా ఉండగోరితే, వారిని వ్యభిచారానికి బలవంతపెట్టకండి.[3] ఎవరైనా వారిని బలవంతపెడితే! నిశ్చయంగా అల్లాహ్, వారిని (ఆ బానిస స్త్రీలను) బలాత్కారం తరువాత క్షమించేవాడు, అపార కరుణాప్రదాత.

وَلَقَدۡ أَنزَلۡنَآ إِلَيۡكُمۡ ءَايَٰتٖ مُّبَيِّنَٰتٖ وَمَثَلٗا مِّنَ ٱلَّذِينَ خَلَوۡاْ مِن قَبۡلِكُمۡ وَمَوۡعِظَةٗ لِّلۡمُتَّقِينَ ٣٤

**34**. మరియు వాస్తవానికి, మేము మీ వద్దకు స్పష్టమైన సూచనలను, మీకు పూర్వం గతించిన వారి ఉదాహరణలను మరియు దైవభీతి గలవారికి బోధనలను (ఉపదేశాలను) అవతరింపజేశాము. (5/8)

---

**1**. ఇలాంటి వారు నఫిల్ ఉపవాసాలు ఉండాలి. దానివల్ల వారు తమ మనస్సులను అదుపులో ఉంచుకోగలరు, ('స'హీ'హ్ బు'ఖారీ).

**2**. మీ బానిసలు స్వేచ్ఛగోరి - మీరు వారితో వారి స్వేచ్ఛకొరకు కుదుర్చుకున్న - మీ సొమ్మును కొంతకాలంలో ఇవ్వటానికి ఒప్పుకుంటే! దానిని ఒక పత్రం మీద వ్రాయించుకొని వారికి స్వేచ్ఛనివ్వండి. అంటే ఇస్లాం బానిసత్వాన్ని నిర్మూలించటానికి మొదట నుండియే పాటుపడుతున్నది. చూడండి, 9:60. 'జకాత్ డబ్బును, బానిసల స్వేచ్ఛకొరకు ఉపయోగించండని ఆజ్ఞ ఉంది.

**3**. ఇస్లాంకు పూర్వం, ప్రజలు తమ బానిస స్త్రీలతో వ్యభిచారం చేయించి ఆ సొమ్ము తినేవారు. ఇది ఇస్లాంలో నిషేధించబడింది.

۞ ٱللَّهُ نُورُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ مَثَلُ
نُورِهِۦ كَمِشْكَوٰةٍ فِيهَا مِصْبَاحٌ ۖ
ٱلْمِصْبَاحُ فِى زُجَاجَةٍ ۖ ٱلزُّجَاجَةُ كَأَنَّهَا
كَوْكَبٌ دُرِّىٌّ يُوقَدُ مِن شَجَرَةٍ مُّبَٰرَكَةٍ
زَيْتُونَةٍ لَّا شَرْقِيَّةٍ وَلَا غَرْبِيَّةٍ يَكَادُ زَيْتُهَا
يُضِىٓءُ وَلَوْ لَمْ تَمْسَسْهُ نَارٌ ۚ نُّورٌ عَلَىٰ
نُورٍ ۗ يَهْدِى ٱللَّهُ لِنُورِهِۦ مَن يَشَآءُ ۚ
وَيَضْرِبُ ٱللَّهُ ٱلْأَمْثَٰلَ لِلنَّاسِ ۗ وَٱللَّهُ
بِكُلِّ شَىْءٍ عَلِيمٌ ﴿٣٥﴾
فِى بُيُوتٍ أَذِنَ ٱللَّهُ أَن تُرْفَعَ وَيُذْكَرَ
فِيهَا ٱسْمُهُۥ يُسَبِّحُ لَهُۥ فِيهَا بِٱلْغُدُوِّ
وَٱلْءَاصَالِ ﴿٣٦﴾
رِجَالٌ لَّا تُلْهِيهِمْ تِجَٰرَةٌ وَلَا بَيْعٌ عَن ذِكْرِ
ٱللَّهِ وَإِقَامِ ٱلصَّلَوٰةِ وَإِيتَآءِ ٱلزَّكَوٰةِ ۙ يَخَافُونَ
يَوْمًا تَتَقَلَّبُ فِيهِ ٱلْقُلُوبُ
وَٱلْأَبْصَٰرُ ﴿٣٧﴾

**35.** * అల్లాహ్ ఆకాశాలకూ మరియు భూమికీ **జ్యోతి!**[1] ఆయన జ్యోతిని, గూటిలోని దీపంతో పోల్చవచ్చు! ఆ దీపం చుట్టూ గాజు ఉంది. ఆ గాజు ఒక నక్షత్రంవలే ప్రకాశిస్తున్నది. అదొక పావనమైన 'జైతూన్ వృక్షంతో (నూనెతో) వెలిగించబడుతున్నది, అది (ఆ వృక్షం) తూర్పుకు గానీ, పడమరకు గానీ చెందినది కాదు. దాని నూనె అగ్ని అంటకున్నా మండుతూనే ఉంటుంది. వెలుగు మీద వెలుగు! అల్లాహ్ తన వెలుగు వైపునకు తనకు ఇష్టమైన వారికి మార్గదర్శకత్వం చేస్తాడు. అల్లాహ్ ఉదాహరణల ద్వారా ప్రజలకు బోధిస్తాడు. మరియు అల్లాహ్‌కు ప్రతివిషయం గురించి బాగా తెలుసు.

**36.** అల్లాహ్ ఏ ఇండ్లను (మస్జిద్‌లను) లేపి, వాటిలో ఆయన నామాన్ని స్మరించమని సెలవిచ్చాడో, అందులో వారు, ఆయన పవిత్రతను ఉదయం మరియు సాయంత్రం స్తుతిస్తూ ఉంటారు.[2]

**37.** ప్రజలలో కొందరిని - వారి వ్యాపారం గానీ మరియు క్రయ విక్రయాలు గానీ - అల్లాహ్ స్మరణ నుండీ, నమా'జ్ స్థాపించడం నుండీ మరియు విధిదానం ('జకాత్) ఇవ్వడం నుండీ తప్పించలేవు. హృదయాలు మరియు కనుగ్రుడ్లు గిరగిర తిరిగిపోయే, ఆ దినమును గురించి, వారు భయపడుతూ ఉంటారు.[3]

---

**1**. అన్-నూరు: He, by whose light the obscure in perception sees, and by whose guidance the erring is directed aright. Or the Manifest by whom is every manifestation. the Light, **జ్యోతి**, కాంతికి నిలయమైనవాడు. ఆకాశాలలో మరియు భూమిలో నున్న వారికి మార్గదర్శకత్వం చేయగలవాడు, వెలుగు చూపగలవాడు కేవలం అల్లాహ్ (సు.తా.) మాత్రమే!

**2**. చూడండి, 72:18.

**3**. చూడండి, 40:18.

38. వారు ఇలా చేయటం, అల్లాహ్ వారికి వారి మంచి పనుల కొరకు ప్రతిఫల మివ్వటానికి మరియు తన అనుగ్రహాలను వారిపై అధికం చేయటానికి. మరియు అల్లాహ్ తాను కోరినవారికి లెక్కలేనంత జీవనోపాధిని ప్రసాదిస్తాడు.

39. ఇక సత్యాన్ని తిరస్కరించిన వారి కర్మలను ఎడారిలోని ఎండమావితో పోల్చవచ్చు. దప్పికగొన్న వాడు - దానిని నీరుగా భావించి దాని వద్దకు చేరి, చివరికి ఏమీ పొందలేక - అక్కడ అల్లాహ్‌ను పొందుతాడు. అప్పుడు ఆయన అతని లెక్కను పూర్తిగా తీర్చుతాడు. మరియు అల్లాహ్ లెక్కతీర్చటంలో అతిశీఘ్రుడు.[1]

40. లేక (సత్యతిరస్కారుల పరిస్థితి) చాల లోతుగల సముద్రంలోని చీకట్లవలె ఉంటుంది. దానిపై ఒక గొప్పఅల క్రమ్ముకొని ఉంటుంది. దానిపై మరొక గొప్పఅల, దానిపై మేఘాలు. చీకట్లు ఒకదానిపై నొకటి క్రమ్ముకొని ఉంటాయి. అపుడు ఎవడైనా తనచేతిని (చూడాలని) చాచితే, వాడు దానిని చూడలేడు. మరియు ఎవనికైతే అల్లాహ్ వెలుగు నివ్వడో, అతనికి ఏ మాత్రం వెలుగు దొరకదు.[2]

لِيَجۡزِيَهُمُ ٱللَّهُ أَحۡسَنَ مَا عَمِلُواْ
وَيَزِيدَهُم مِّن فَضۡلِهِۦۗ وَٱللَّهُ يَرۡزُقُ مَن
يَشَآءُ بِغَيۡرِ حِسَابٖ ﴿٣٨﴾

وَٱلَّذِينَ كَفَرُوٓاْ أَعۡمَٰلُهُمۡ كَسَرَابِۭ
بِقِيعَةٖ يَحۡسَبُهُ ٱلظَّمۡـَٔانُ مَآءً حَتَّىٰٓ
إِذَا جَآءَهُۥ لَمۡ يَجِدۡهُ شَيۡـٔٗا وَوَجَدَ
ٱللَّهَ عِندَهُۥ فَوَفَّىٰهُ حِسَابَهُۥۗ وَٱللَّهُ
سَرِيعُ ٱلۡحِسَابِ ﴿٣٩﴾

أَوۡ كَظُلُمَٰتٖ فِي بَحۡرٖ لُّجِّيّٖ
يَغۡشَىٰهُ مَوۡجٞ مِّن فَوۡقِهِۦ مَوۡجٞ مِّن
فَوۡقِهِۦ سَحَابٞۚ ظُلُمَٰتُۢ بَعۡضُهَا فَوۡقَ
بَعۡضٍ إِذَآ أَخۡرَجَ يَدَهُۥ لَمۡ يَكَدۡ
يَرَىٰهَاۗ وَمَن لَّمۡ يَجۡعَلِ ٱللَّهُ لَهُۥ نُورٗا فَمَا لَهُۥ
مِن نُّورٍ ﴿٤٠﴾

1. అంటే సత్యతిరస్కారుడు ఎన్ని మంచిపనులు, సత్కార్యాలు చేసినా అవి పరలోకంలో ఎండమావులుగా అదృశ్యమైపోతాయి. అంటే అతనికి వాటి నుండి ఎట్టి పుణ్యఫలితం లభించదు. అతడు నరకంలో చేరిపోతాడు.

2. సత్యతిరస్కారులను సముద్రపులోతులో చీకట్లలో ఉన్నవాటితో పోల్చబడింది. అంటే సత్యతిరస్కారుడు అంధకారంలో మునిగి ఉన్నాడు. అది వానిని విశ్వాసపు వెలుగులోనికి రానివ్వదు. పరలోకంలో కూడా వాడు నరకపు అంధకారంలో ఉంటాడు. వెలుగు సముద్రపు లోతులోకి చేరలేదు. ఎందుకంటే వెలుగులో ఇమిడి ఉన్న ఏడు

أَلَمْ تَرَ أَنَّ ٱللَّهَ يُسَبِّحُ لَهُۥ مَن فِى ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَٱلطَّيْرُ صَٰٓفَّٰتٍ ۖ كُلٌّ قَدْ عَلِمَ صَلَاتَهُۥ وَتَسْبِيحَهُۥ ۗ وَٱللَّهُ عَلِيمٌۢ بِمَا يَفْعَلُونَ ﴿٤١﴾

**41**. ఏమీ? నీకు తెలియదా (నీవు చూడటంలేదా)? నిశ్చయంగా, భూమ్యాకాశాలలో ఉన్న సర్వమూ మరియు రెక్కలు విప్పి ఎగిరే పక్షులు సైతం అల్లాహ్ పవిత్రతను కొనియాడుతూ ఉంటాయని? వాస్తవానికి ప్రతిదానికి తన నమాౙ్ మరియు స్తోత్రం చేసే పద్ధతి తెలుసు.[1] మరియు అవి చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.[2]

وَلِلَّهِ مُلْكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۖ وَإِلَى ٱللَّهِ ٱلْمَصِيرُ ﴿٤٢﴾

**42**. మరియు భూమ్యాకాశాల మీద సర్వాధిపత్యం అల్లాహ్‌దే! మరియు అల్లాహ్ వైపునకే (అందరికీ) మరలి పోవలసి ఉన్నది.

أَلَمْ تَرَ أَنَّ ٱللَّهَ يُزْجِى سَحَابًا ثُمَّ يُؤَلِّفُ بَيْنَهُۥ ثُمَّ يَجْعَلُهُۥ رُكَامًا فَتَرَى ٱلْوَدْقَ يَخْرُجُ مِنْ خِلَٰلِهِۦ وَيُنَزِّلُ مِنَ ٱلسَّمَآءِ مِن جِبَالٍ فِيهَا مِنۢ بَرَدٍ فَيُصِيبُ بِهِۦ مَن يَشَآءُ وَيَصْرِفُهُۥ عَن مَّن يَشَآءُ ۖ

**43**. ఏమీ? నీకు తెలియదా (నీవు చూడటంలేదా)? నిశ్చయంగా అల్లాహ్‌యే మేఘాలను మెల్లమెల్లగా నడుపుతూ, వాటిని ఒక దానితో ఒకటి కలుపుతాడని, ఆ తరువాత వాటిని ప్రోగుచేస్తాడని! ఆ పిదప వాటినుండి వర్షాన్ని కురిపించేది నీవు చూస్తున్నావు కదా! మరియు ఆయనే ఆకాశంలో ఉన్న కొండల వంటి (మేఘాల) నుండి వడగండ్ల చల్లని

---

రంగులు ఒకదాని తరువాత ఒకటి, సముద్రపు తలాలలోనికి వెలుగు పోయేటప్పుడు పీల్చుకోబడతాయి. కాబట్టి సముద్రపు లోపటి భాగంలో చీకటి ఉంటుందని సైంటిస్టులు ఇప్పుడిప్పుడే తెలుసుకున్నారు. కాని ఇది దివ్యఖుర్ఆన్‌లో 1400 వందల సంవత్సరాల ముందే వ్రాయబడిఉంది.

**1**. అంటే ప్రతి దానికి అల్లాహ్ (సు.తా.) యొక్క స్తోత్రం (ప్రార్థన) ఏ విధంగా చేయాలో తెలుసు. భూమ్యాకాశాలలో ఉన్న ప్రతివస్తువు అల్లాహ్ (సు.తా.) స్తోత్రం చేయడమనేది కూడా అల్లాహ్ (సు.తా.) ఘనతలలో ఒకటి. ఏవిధంగానైతే వాటిని సృష్టించడం కూడా కేవలం ఆయన ఘనతలలో ఒకటో! చూడండి, 17:44.

**2**. విచక్షణాశక్తి లేని ప్రతివస్తువు కూడా అల్లాహ్ (సు.తా.) స్తోత్రం చేస్తుంది. అలాంటప్పుడు ఈ విచక్షణాశక్తి గల జిన్నాతులు మరియు మానవులు అల్లాహ్ (సు.తా.) స్తోత్రం చేయకుంటే వారు ఆయన శిక్షకు అర్హులు కాగూడదా?

يَكَادُ سَنَا بَرْقِهِۦ يَذْهَبُ بِٱلْأَبْصَٰرِ ﴿٤٣﴾

(వర్షాన్ని) తాను కోరినవారిపై కురిపిస్తాడు. మరియు తానుకోరిన వారిని వాటినుండి తప్పిస్తాడు. వాటి పిడుగు యొక్క మెరుపు కంటి చూపులను దాదాపు హరించేలా ఉంటుంది.

يُقَلِّبُ ٱللَّهُ ٱلَّيْلَ وَٱلنَّهَارَ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَعِبْرَةً لِّأُو۟لِى ٱلْأَبْصَٰرِ ﴿٤٤﴾

**44.** అల్లాహ్‌యే రేయింబవళ్ళను మార్చుతున్నాడు. నిశ్చయంగా, కన్నులు గలవారికి ఇందులో గుణపాఠం ఉంది.

وَٱللَّهُ خَلَقَ كُلَّ دَآبَّةٍ مِّن مَّآءٍ ۖ فَمِنْهُم مَّن يَمْشِى عَلَىٰ بَطْنِهِۦ وَمِنْهُم مَّن يَمْشِى عَلَىٰ رِجْلَيْنِ وَمِنْهُم مَّن يَمْشِى عَلَىٰٓ أَرْبَعٍ ۚ يَخْلُقُ ٱللَّهُ مَا يَشَآءُ ۚ إِنَّ ٱللَّهَ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ ﴿٤٥﴾

**45.** మరియు అల్లాహ్ ప్రతి ప్రాణిని నీటి నుండియే సృష్టించాడు.[1] వాటిలో కొన్ని తమ కడుపుమీద ప్రాకేవి ఉన్నాయి మరియు వాటిలో కొన్ని రెండు కాళ్ళమీద నడిచేవి ఉన్నాయి మరియు వాటిలో మరికొన్ని నాలుగు (కాళ్ళ) మీద నడిచేవి ఉన్నాయి. అల్లాహ్ తానుకోరిన దానిని సృష్టిస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

لَّقَدْ أَنزَلْنَآ ءَايَٰتٍ مُّبَيِّنَٰتٍ ۚ وَٱللَّهُ يَهْدِى مَن يَشَآءُ إِلَىٰ صِرَٰطٍ مُّسْتَقِيمٍ ﴿٤٦﴾

**46.** వాస్తవంగా! మేము సుస్పష్టమైన సూచన(ఆయత్)లను అవతరింపజేశాము.[2] మరియు అల్లాహ్ తానుకోరిన వానికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తాడు.

وَيَقُولُونَ ءَامَنَّا بِٱللَّهِ وَبِٱلرَّسُولِ وَأَطَعْنَا ثُمَّ يَتَوَلَّىٰ فَرِيقٌ مِّنْهُم مِّنۢ بَعْدِ ذَٰلِكَ ۚ وَمَآ أُو۟لَٰٓئِكَ بِٱلْمُؤْمِنِينَ ﴿٤٧﴾

**47.** వారు (కపటవిశ్వాసులు) అంటారు: "మేము అల్లాహ్‌ను మరియు సందేశహరుణ్ణి విశ్వసించాము మరియు విధేయులమయ్యాము." కాని దాని తరువాత వారిలో ఒక వర్గం వారు వెనుదిరిగిపోతారు. మరియు అలాంటి వారు విశ్వసించినవారు కారు.

**1.** అంటే సర్వజీవరాసి, అంటే జీవం ఉండి చలించేది. చూడండి, 21:30.
**2.** అంటే ఖుర్ఆన్ చూడండి, 6:38.

**48**. మరియు వారి మధ్య తీర్పుచేయటానికి, వారిని అల్లాహ్ మరియు ఆయన సందేశహరుని వద్దకు పిలిచినప్పుడు, వారిలోని ఒక వర్గం వారు ముఖం త్రిప్పుకుంటారు.

وَإِذَا دُعُوٓاْ إِلَى ٱللَّهِ وَرَسُولِهِۦ لِيَحۡكُمَ بَيۡنَهُمۡ إِذَا فَرِيقٞ مِّنۡهُم مُّعۡرِضُونَ ٤٨

**49**. మరియు ఒకవేళ తీర్పు (సత్యం), వారికి అనుకూలమైనదిగా ఉంటే, వారు వినమ్రతతో దానిని స్వీకరిస్తారు.[1]

وَإِن يَكُن لَّهُمُ ٱلۡحَقُّ يَأۡتُوٓاْ إِلَيۡهِ مُذۡعِنِينَ ٤٩

**50**. ఏమీ? వారి హృదయాలలో రోగముందా? లేక వారు సందేహంలో పడిపోయారా? లేక అల్లాహ్ మరియు ఆయన సందేశహరుడు తమకు న్యాయం చేయరని వారికి భయమా? అలాకాదు! అసలు వారే అన్యాయపరులు.

أَفِي قُلُوبِهِم مَّرَضٌ أَمِ ٱرۡتَابُوٓاْ أَمۡ يَخَافُونَ أَن يَحِيفَ ٱللَّهُ عَلَيۡهِمۡ وَرَسُولُهُۥۚ بَلۡ أُوْلَٰٓئِكَ هُمُ ٱلظَّٰلِمُونَ ٥٠

**51**. కాని వాస్తవానికి ఒకవేళ విశ్వాసులను, వారి మధ్య తీర్పు చేయటానికి అల్లాహ్ మరియు ఆయన సందేశహరుని వద్దకు పిలిచినప్పుడు, వారి పలుకులు కేవలం ఇలాగే ఉంటాయి: "మేము విన్నాము మరియు విధేయత చూపాము." మరియు ఇలాంటి వారే సాఫల్యం పొందేవారు.

إِنَّمَا كَانَ قَوۡلَ ٱلۡمُؤۡمِنِينَ إِذَا دُعُوٓاْ إِلَى ٱللَّهِ وَرَسُولِهِۦ لِيَحۡكُمَ بَيۡنَهُمۡ أَن يَقُولُواْ سَمِعۡنَا وَأَطَعۡنَاۚ وَأُوْلَٰٓئِكَ هُمُ ٱلۡمُفۡلِحُونَ ٥١

**52**. మరియు అల్లాహ్‌కు మరియు ఆయన సందేశహరునికి విధేయత చూపేవారు మరియు అల్లాహ్‌కు భయపడి, ఆయన యందు భయభక్తులు కలిగి ఉండే వారు, ఇలాంటి వారే సాఫల్యం (విజయం) పొందేవారు. (3/4)

وَمَن يُطِعِ ٱللَّهَ وَرَسُولَهُۥ وَيَخۡشَ ٱللَّهَ وَيَتَّقۡهِ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلۡفَآئِزُونَ ٥٢

---

**1**. చూడండి, 4:60-61.

53. * మరియు నీవు ఒకవేళ ఆజ్ఞాపిస్తే, అంతా వదలి తప్పక బయలు దేరగలమని వారు (ఆ కపటవిశ్వాసులు) అల్లాహ్ పేరుతో గట్టి ప్రమాణాలు చేస్తారు. వారితో అను: "ప్రమాణాలు చేయకండి; మీ విధేయత తెలిసిందే. నిశ్చయంగా, మీరు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు!"

۞ وَأَقْسَمُوا۟ بِٱللَّهِ جَهْدَ أَيْمَـٰنِهِمْ لَئِنْ أَمَرْتَهُمْ لَيَخْرُجُنَّ ۖ قُل لَّا تُقْسِمُوا۟ ۖ طَاعَةٌ مَّعْرُوفَةٌ ۚ إِنَّ ٱللَّهَ خَبِيرٌۢ بِمَا تَعْمَلُونَ ﴿٥٣﴾

54. వారితో అను: "అల్లాహ్‌కు విధేయులై ఉండండి మరియు సందేశహరుణ్ణి అనుసరించండి. కాని ఒకవేళ మీరు మరలిపోతే, అతని (ప్రవక్త)పై విధించబడిన దాని బాధ్యత అతనిది[1] మరియు మీపై విధించబడిన దాని బాధ్యత మీది.[2] మీరు అతనిని (ప్రవక్తను) అనుసరిస్తే మార్గదర్శకత్వం పొందుతారు. మరియు సందేశహరుని బాధ్యత కేవలం స్పష్టంగా సందేశాన్ని అందజేయటం మాత్రమే."[3]

قُلْ أَطِيعُوا۟ ٱللَّهَ وَأَطِيعُوا۟ ٱلرَّسُولَ ۖ فَإِن تَوَلَّوْا۟ فَإِنَّمَا عَلَيْهِ مَا حُمِّلَ وَعَلَيْكُم مَّا حُمِّلْتُمْ ۖ وَإِن تُطِيعُوهُ تَهْتَدُوا۟ ۚ وَمَا عَلَى ٱلرَّسُولِ إِلَّا ٱلْبَلَـٰغُ ٱلْمُبِينُ ﴿٥٤﴾

55. మరియు మీలో విశ్వసించి సత్కార్యాలు చేసేవారితో: వారికి పూర్వం వారిని భూమికి ఉత్తరాధికారులుగా చేసినట్లు, వారిని కూడా ఉత్తరాధికారులుగా చేస్తానని మరియు వారి కొరకు తాను సమ్మతించిన ధర్మాన్ని (ఇస్లాంను) స్థిరపరుస్తానని మరియు వారి పూర్వపు భయస్థితిని వారికొరకు శాంతిస్థితిగా మార్చుతానని, అల్లాహ్ వాగ్దానం

وَعَدَ ٱللَّهُ ٱلَّذِينَ ءَامَنُوا۟ مِنكُمْ وَعَمِلُوا۟ ٱلصَّـٰلِحَـٰتِ لَيَسْتَخْلِفَنَّهُمْ فِى ٱلْأَرْضِ كَمَا ٱسْتَخْلَفَ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ وَلَيُمَكِّنَنَّ لَهُمْ دِينَهُمُ ٱلَّذِى ٱرْتَضَىٰ لَهُمْ وَلَيُبَدِّلَنَّهُم

1. అంటే, దఅవహ్ (తబ్లీగ్) చేయటం - ఇస్లాం వైపుకు ఆహ్వానించటం.
2. అతని ('స'అస) ఆహ్వానాన్ని అంగీకరించి అల్లాహ్ (సు.తా.) మరియు ఆయన ప్రవక్తలను విశ్వసించటం మరియు వారికి విధేయులవటం.
3. చూడండి, 13:40.

مِّنۢ بَعۡدِ خَوۡفِهِمۡ أَمۡنٗاۚ يَعۡبُدُونَنِي لَا يُشۡرِكُونَ بِي شَيۡـٔٗاۚ وَمَن كَفَرَ بَعۡدَ ذَٰلِكَ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلۡفَٰسِقُونَ ٥٥

చేశాడు.[1] (ఇదంతా) వారు నన్నే (అల్లాహ్‌నే) ఆరాధించాలని మరియు నాకు ఎవరినీ సాటి(భాగస్వాములు)గా కల్పించరాదని. మరియు దీని తరువాత కూడా ఎవరైనా సత్యతిరస్కారానికి పాల్పడితే అలాంటి వారు, వారే అవిధేయులు.

وَأَقِيمُواْ ٱلصَّلَوٰةَ وَءَاتُواْ ٱلزَّكَوٰةَ وَأَطِيعُواْ ٱلرَّسُولَ لَعَلَّكُمۡ تُرۡحَمُونَ ٥٦

**56**. మరియు మీరు కరుణించ బడాలంటే నమా'జ్‌ను స్థాపించండి, విధిదానం ('జకాత్) ఇవ్వండి మరియు సందేశహరునికి విధేయులై ఉండండి!

لَا تَحۡسَبَنَّ ٱلَّذِينَ كَفَرُواْ مُعۡجِزِينَ فِي ٱلۡأَرۡضِۚ وَمَأۡوَىٰهُمُ ٱلنَّارُۖ وَلَبِئۡسَ ٱلۡمَصِيرُ ٥٧

**57**. సత్యతిరస్కారులు భూమిలో తప్పించుకుంటారని భావించవద్దు. వారి నివాసం నరకాగ్నియే! అది ఎంత అధ్వాన్నమైన గమ్యస్థానం.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لِيَسۡتَـٔۡذِنكُمُ ٱلَّذِينَ مَلَكَتۡ أَيۡمَٰنُكُمۡ وَٱلَّذِينَ لَمۡ يَبۡلُغُواْ ٱلۡحُلُمَ مِنكُمۡ ثَلَٰثَ مَرَّٰتٖۚ مِّن قَبۡلِ صَلَوٰةِ ٱلۡفَجۡرِ وَحِينَ تَضَعُونَ ثِيَابَكُم مِّنَ ٱلظَّهِيرَةِ وَمِنۢ بَعۡدِ صَلَوٰةِ ٱلۡعِشَآءِۚ ثَلَٰثُ عَوۡرَٰتٖ لَّكُمۡۚ لَيۡسَ عَلَيۡكُمۡ وَلَا عَلَيۡهِمۡ جُنَاحُۢ بَعۡدَهُنَّۚ طَوَّٰفُونَ عَلَيۡكُم بَعۡضُكُمۡ عَلَىٰ بَعۡضٖۚ كَذَٰلِكَ يُبَيِّنُ ٱللَّهُ لَكُمُ ٱلۡأٓيَٰتِۗ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٞ ٥٨

**58**. ఓ విశ్వాసులారా! మీ బానిసలు మరియు యుక్తవయస్సుకు చేరని మీ పిల్లలు, మూడు సమయాలలో అనుమతి తీసుకొనే మీవద్దకు రావాలి. (అవి) ఉదయపు (ఫ'జ్ర్) నమా'జ్‌కు ముందు, మధ్యాహ్నం ('జుహ్ర్) తరువాత - మీరు మీ వస్త్రాలు విడిచి ఉన్నప్పుడు - మరియు రాత్రి ('ఇషా) నమా'జ్ తరువాత. ఈ మూడు, మీ కొరకు ఏకాంత (పరదా) సమయాలు. వీటి తరువాత వారు మరియు మీరు ఒకరి వద్దకు మరొకరు వచ్చి పోతూవుంటే, వారిపై గానీ, మీపై గానీ ఎలాంటి దోషం లేదు. ఈ విధంగా అల్లాహ్ మీకు తన ఆజ్ఞలను విశదీకరిస్తున్నాడు. అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

1. చూడండి, 5:3.

**59**. మరియు మీ పిల్లలు యుక్త వయస్సుకు చేరుకున్నప్పుడు; వారి కంటే పెద్ద (ముందు) వారు అనుమతి తీసుకున్నట్లు వారు కూడా అనుమతి తీసుకోవాలి. ఈ విధంగా అల్లాహ్ మీకు తన ఆజ్ఞలను విశదీకరిస్తున్నాడు. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

**60**. మరియు ఋతుస్రావం ఆగిపోయి, వివాహఉత్సాహంలేని స్త్రీలు - తమ సౌందర్యం బయటపడకుండా ఉండేటట్లుగా - తమపై వస్త్రాలను (దుప్పట్లను) తీసివేస్తే, వారిపై దోషంలేదు. కాని వారు అట్లు చేయకుండా ఉండటమే వారికి ఉత్తమమైనది.[1] మరియు అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

**61**. అంధుని మీద నిందలేదు మరియు కుంటివాని మీద నిందలేదు మరియు రోగిమీద నిందలేదు మరియు మీ మీద కూడా నిందలేదు: ఒకవేళ మీరు మీ ఇండ్లలో లేదా మీ తండ్రి తాతల ఇండ్లలో లేదా మీ తల్లి నాయనమ్మల ఇండ్లలో లేదా మీ సోదరుల ఇండ్లలో లేదా మీ సోదరీమణుల ఇండ్లలో లేదా పినతండ్రుల (తండ్రి సోదరుల) ఇండ్లలో లేదా మీ మేనత్తల (తండ్రి సోదరీ మణుల) ఇండ్లలో లేదా మీ మేనమామల (తల్లి సోదరుల) ఇండ్లలో లేదా మీ పిన్నమ్మల (తల్లి

وَإِذَا بَلَغَ ٱلۡأَطۡفَٰلُ مِنكُمُ ٱلۡحُلُمَ
فَلۡيَسۡتَـٔۡذِنُواْ كَمَا ٱسۡتَـٔۡذَنَ
ٱلَّذِينَ مِن قَبۡلِهِمۡۚ كَذَٰلِكَ يُبَيِّنُ
ٱللَّهُ لَكُمۡ ءَايَٰتِهِۦۗ وَٱللَّهُ عَلِيمٌ
حَكِيمٞ ٥٩
وَٱلۡقَوَٰعِدُ مِنَ ٱلنِّسَآءِ ٱلَّٰتِي لَا يَرۡجُونَ
نِكَاحٗا فَلَيۡسَ عَلَيۡهِنَّ جُنَاحٌ أَن
يَضَعۡنَ ثِيَابَهُنَّ غَيۡرَ
مُتَبَرِّجَٰتِۭ بِزِينَةٖۖ وَأَن يَسۡتَعۡفِفۡنَ
خَيۡرٞ لَّهُنَّۗ وَٱللَّهُ سَمِيعٌ عَلِيمٞ ٦٠
لَّيۡسَ عَلَى ٱلۡأَعۡمَىٰ حَرَجٞ وَلَا عَلَى
ٱلۡأَعۡرَجِ حَرَجٞ وَلَا عَلَى ٱلۡمَرِيضِ
حَرَجٞ وَلَا عَلَىٰٓ أَنفُسِكُمۡ أَن تَأۡكُلُواْ
مِنۢ بُيُوتِكُمۡ أَوۡ بُيُوتِ
ءَابَآئِكُمۡ أَوۡ بُيُوتِ أُمَّهَٰتِكُمۡ أَوۡ
بُيُوتِ إِخۡوَٰنِكُمۡ أَوۡ بُيُوتِ
أَخَوَٰتِكُمۡ أَوۡ بُيُوتِ
أَعۡمَٰمِكُمۡ أَوۡ بُيُوتِ

1. చూడండి, 33:59.

عَمَّـٰتِكُمۡ أَوۡ بُيُوتِ أَخۡوَٰلِكُمۡ أَوۡ
بُيُوتِ خَـٰلَـٰتِكُمۡ أَوۡ مَا
مَلَكۡتُم مَّفَاتِحَهُۥٓ أَوۡ
صَدِيقِكُمۡۚ لَيۡسَ عَلَيۡكُمۡ
جُنَاحٌ أَن تَأۡكُلُواْ جَمِيعًا أَوۡ
أَشۡتَاتٗاۚ فَإِذَا دَخَلۡتُم بُيُوتٗا فَسَلِّمُواْ عَلَىٰٓ
أَنفُسِكُمۡ تَحِيَّةٗ مِّنۡ عِندِ ٱللَّهِ
مُبَٰرَكَةٗ طَيِّبَةٗۚ كَذَٰلِكَ
يُبَيِّنُ ٱللَّهُ لَكُمُ ٱلۡأٓيَٰتِ
لَعَلَّكُمۡ تَعۡقِلُونَ ٦١

సోదరీమణుల) ఇండ్లలో లేదా మీ ఆధీనంలో తాళపు చెవులు ఉన్నవారి ఇండ్లలో లేదా మీ స్నేహితుల ఇండ్లలో తింటే! మీరు అందరితో కలిసి తిన్నా లేదా వేరుగా తిన్నా కూడా మీపై నిందలేదు. అయితే మీరు ఇండ్లలోనికి ప్రవేశించినపుడు, మీరు ఒకరికొకరు సలాం చేసుకోవాలి. ఇది అల్లాహ్ తరఫునుండి నిర్ణయించబడిన దీవన, శుభప్రదమైనది మేలైనది. ఈ విధంగా అల్లాహ్- మీరు అర్థం చేసుకుంటారని- తన ఆజ్ఞలను మీకు విశదీకరిస్తున్నాడు.

إِنَّمَا ٱلۡمُؤۡمِنُونَ ٱلَّذِينَ ءَامَنُواْ بِٱللَّهِ
وَرَسُولِهِۦ وَإِذَا كَانُواْ مَعَهُۥ عَلَىٰٓ أَمۡرٖ
جَامِعٖ لَّمۡ يَذۡهَبُواْ حَتَّىٰ يَسۡتَـٔۡذِنُوهُۚ إِنَّ
ٱلَّذِينَ يَسۡتَـٔۡذِنُونَكَ أُوْلَـٰٓئِكَ ٱلَّذِينَ
يُؤۡمِنُونَ بِٱللَّهِ وَرَسُولِهِۦۚ فَإِذَا
ٱسۡتَـٔۡذَنُوكَ لِبَعۡضِ شَأۡنِهِمۡ
فَأۡذَن لِّمَن شِئۡتَ مِنۡهُمۡ
وَٱسۡتَغۡفِرۡ لَهُمُ ٱللَّهَۚ إِنَّ ٱللَّهَ
غَفُورٞ رَّحِيمٞ ٦٢

**62**. అల్లాహ్‌ను ఆయన ప్రవక్తను హృదయపూర్వకంగా విశ్వసించిన వారే నిజమైన విశ్వాసులు మరియు వారు ఏదైనా సామూహిక కార్యం నిమిత్తం అతని(దైవప్రవక్త)తో ఉన్నప్పుడు, అతని అనుమతి లేనిదే వెళ్ళిపోకూడదు. నిశ్చయంగా, ఎవరైతే నీతో (ఓ ము'హమ్మద్)! అనుమతి అడుగుతారో అలాంటి వారే వాస్తవంగా! అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను విశ్వసించిన వారు. కనుక వారు తమ ఏ పని కొరకైనా అనుమతి అడిగితే, వారిలో నీవు కోరిన వారికి అనుమతినివ్వు. మరియు వారిని క్షమించమని అల్లాహ్‌ను ప్రార్థించు. నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

63. (ఓ విశ్వాసులారా!) సందేశహరుని పిలుపును మీరు, మీలో ఒకరినొకరు పిలుచుకునే పిలుపుగా భావించకండి. మీలో ఒకరి చాటున ఒకరు దాక్కొంటూ మెల్లగా జారిపోయే వారి గురించి అల్లాహ్‌కు బాగా తెలుసు.[1] దైవప్రవక్త ఆజ్ఞను ఉల్లంఘించే వారు, తాము ఏదైనా ఆపదలో చిక్కుకు పోతారేమోననీ లేదా బాధాకరమైన శిక్షకు గురిచేయు బడతారేమోనని భయపడాలి.

64. వినండి! నిశ్చయంగా ఆకాశాలలో మరియు భూమిలో నున్న సమస్తమూ అల్లాహ్‌దే! మీ స్థితి ఆయనకు బాగా తెలుసు మరియు అందరూ ఆయన వద్దకు మరలింపబడిన రోజు, వారు చేసివచ్చిన కర్మలన్నీ ఆయన వారికి తెలియజేస్తాడు. మరియు అల్లాహ్‌కు ప్రతి దానిని గురించి పూర్తి జ్ఞానముంది. (7/8)

*****

لَّا تَجۡعَلُواْ دُعَآءَ ٱلرَّسُولِ
بَيۡنَكُمۡ كَدُعَآءِ بَعۡضِكُم
بَعۡضٗاۚ قَدۡ يَعۡلَمُ ٱللَّهُ ٱلَّذِينَ
يَتَسَلَّلُونَ مِنكُمۡ لِوَاذٗاۚ
فَلۡيَحۡذَرِ ٱلَّذِينَ يُخَالِفُونَ عَنۡ
أَمۡرِهِۦٓ أَن تُصِيبَهُمۡ فِتۡنَةٌ أَوۡ
يُصِيبَهُمۡ عَذَابٌ أَلِيمٌ ٦٣

أَلَآ إِنَّ لِلَّهِ مَا فِي ٱلسَّمَٰوَٰتِ
وَٱلۡأَرۡضِۖ قَدۡ يَعۡلَمُ مَآ أَنتُمۡ
عَلَيۡهِ وَيَوۡمَ يُرۡجَعُونَ إِلَيۡهِ
فَيُنَبِّئُهُم بِمَا عَمِلُواْۗ وَٱللَّهُ بِكُلِّ
شَيۡءٍ عَلِيمُۢ ٦٤

1. మునాఫిఖులు దైవప్రవక్తతో సమాలోచనలు జరిగేటప్పుడు మెల్లగా జారుకునేవారు.

## 25. సూరహ్ అల్-ఫుర్ఖాన్ سُورَةُ الفُرْقَانِ

అల్-ఫుర్ఖాన్: **గీటురాయి,** ప్రమాణం. ఈ సూరహ్ పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది దైవప్రవక్త ('స'అస) ధర్మప్రచారం ఆరంభించిన 5-6 సంవత్సరాల తరువాత **మక్కా**లో అవతరింపజేయబడింది. ఇందులో **77 ఆయతులు** ఉన్నాయి. ప్రతి ప్రవక్త మానవుడే (ఆయత్ 20). అల్-ఫుర్ఖాన్ అంటే సత్యాసత్యాలను వేరుచేసే గీటురాయి లేక ప్రమాణం, అంటే ఈ ఖుర్ఆన్. ఇది సత్యాసత్యాలను, న్యాయ-అన్యాయాలను, ఏక-బహు దైవారాధనలను విశదీకరిస్తుంది.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

تَبَارَكَ ٱلَّذِي نَزَّلَ ٱلۡفُرۡقَانَ عَلَىٰ عَبۡدِهِۦ لِيَكُونَ لِلۡعَٰلَمِينَ نَذِيرًا ﴿١﴾

**1.** * సర్వలోకాలకు హెచ్చరిక చేసేదిగా, ఈ **గీటురాయిని (ఫుర్ఖాన్‌ను)** తన దాసునిపై క్రమక్రమంగా అవతరింపజేసిన ఆయన (అల్లాహ్) ఎంతో శుభదాయకుడు.[1]

ٱلَّذِي لَهُۥ مُلۡكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَلَمۡ يَتَّخِذۡ وَلَدٗا وَلَمۡ يَكُن لَّهُۥ شَرِيكٞ فِي ٱلۡمُلۡكِ وَخَلَقَ كُلَّ شَيۡءٖ فَقَدَّرَهُۥ تَقۡدِيرٗا ﴿٢﴾

**2.** భూమ్యాకాశాల విశ్వసామ్రాజ్యాధిపత్యం ఆయనకే చెందుతుంది. ఆయన ఎవ్వరినీ సంతానంగా చేసుకోలేదు.[2] విశ్వసామ్రాజ్యాధిపత్యంలో ఆయనకు భాగస్వాములెవ్వరూ లేరు. మరియు ఆయన ప్రతిదానిని సృష్టించి, దానికొక విధిని నిర్ణయించాడు.[3]

---

**1.** దీనితో తెలిసేదేమిటంటే ఈ ఖుర్ఆన్ - ఏదైతే దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై అవతరింపజేయబడిందో - సర్వలోకాల వారికి, అంటే మానవుల కొరకు మరియు జిన్నాతులకొరకు గూడా మార్గదర్శినిగా అవతరింపజేయబడింది. కావున దైవప్రవక్త ('స'అస) వారందరికీ సందేశహరుడు. అతను వారందరి కొరకు మార్గదర్శకునిగా పంపబడ్డారు. చూడండి 7:158. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "నేను ఎర్ర-నల్ల అందరివైపుకూ సందేశహరునిగా పంపబడ్డాను. పూర్వపు సందేశహరులు ('అలైహిమ్ స.) ఒకే జాతివారి వైపుకు పంపబడేవారు." ('స'హీ'హ్ బు'ఖారీ).

**2.** చూడండి, 17:111.

**3.** చూడండి, 87:3. అల్లాహ్ (సు.తా.) ప్రతిదాని విధిని, అంటే దాని జీవన విధానం మరియు దాని మరణం, మొదలైనవి అన్నీ మొదటనే వ్రాసిపెట్టి ఉన్నాడు. ఎందుకంటే ఆయనకు గడిచిపోయింది మరియు ముందు జరుగనున్నది అంతా తెలుసు.

3. అయినా వారు ఆయనకు బదులుగా, ఏమీ సృష్టించలేని మరియు తామే సృష్టింపబడిన వారిని ఆరాధ్య దైవాలుగా చేసుకున్నారు మరియు వారు తమకు తాము ఎట్టి నష్టం గానీ, లాభం గానీ చేసుకోజాలరు మరియు వారికి మరణంమీద గానీ, జీవితంమీద గానీ మరియు పునరుత్థానదినంమీద గానీ, ఎలాంటి అధికారం లేదు.

وَٱتَّخَذُواْ مِن دُونِهِۦٓ ءَالِهَةً لَّا يَخْلُقُونَ شَيْـًٔا وَهُمْ يُخْلَقُونَ وَلَا يَمْلِكُونَ لِأَنفُسِهِمْ ضَرًّا وَلَا نَفْعًا وَلَا يَمْلِكُونَ مَوْتًا وَلَا حَيَوٰةً وَلَا نُشُورًا ﴿٣﴾

4. మరియు సత్యతిరస్కారులు ఇలా అంటారు: "ఇది (ఈ ఖుర్ఆన్) కేవలం ఒక బూటక కల్పన; దీనిని ఇతనే కల్పించాడు మరియు ఇతర జాతివారు కొందరు, ఇతనికి ఈ పనిలో సహాయపడ్డారు.[1] కాని వాస్తవానికి వారు అన్యాయానికి మరియు అబద్ధానికి పూనుకున్నారు."

وَقَالَ ٱلَّذِينَ كَفَرُوٓاْ إِنْ هَٰذَآ إِلَّآ إِفْكٌ ٱفْتَرَىٰهُ وَأَعَانَهُۥ عَلَيْهِ قَوْمٌ ءَاخَرُونَ ۖ فَقَدْ جَآءُو ظُلْمًا وَزُورًا ﴿٤﴾

5. మరియు వారింకా ఇలా అంటారు: "ఇవి పూర్వీకుల గాథలు, వాటిని ఇతను వ్రాసుకున్నాడు, ఇవి ఇతనికి ఉదయం మరియు సాయంత్రం చెప్పి వ్రాయించబడుతున్నాయి."[2]

وَقَالُوٓاْ أَسَٰطِيرُ ٱلْأَوَّلِينَ ٱكْتَتَبَهَا فَهِىَ تُمْلَىٰ عَلَيْهِ بُكْرَةً وَأَصِيلًا ﴿٥﴾

6. వారితో ఇలా అను: "దీనిని (ఈ ఖుర్ఆన్ను) భూమ్యాకాశాల రహస్యాలు తెలిసినవాడు అవతరింపజేశాడు. నిశ్చయంగా ఆయన క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత."

قُلْ أَنزَلَهُ ٱلَّذِى يَعْلَمُ ٱلسِّرَّ فِى ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ إِنَّهُۥ كَانَ غَفُورًا رَّحِيمًا ﴿٦﴾

---

1. చూడండి, 16:103. దైవప్రవక్త ('స'అస) ఈ గ్రంథాన్ని, అబూ ఫకీహా యసార్, 'అదాస్ మరియు జబర్ మొదలైన యూద విద్వాంసుల నుండి నేర్చుకున్నారని సత్యతిరస్కారులు ఆరోపించారు.
2. సత్యతిరస్కారుల నుండి.

7. మరియు వారిలా అంటారు: "ఇతను ఎటువంటి సందేశహరుడు, (సాధారణ వ్యక్తివలే) ఇతనూ అన్నం తింటున్నాడు మరియు వీధులలో తిరుగుతున్నాడు? (ఇతను వాస్తవంగానే దైవప్రవక్త అయితే) ఇతనికి తోడుగా హెచ్చరిక చేసేవాడిగా, ఒక దేవదూత ఎందుకు అవతరింపజేయబడలేదు?[1]

وَقَالُواْ مَالِ هَٰذَا ٱلرَّسُولِ يَأۡكُلُ ٱلطَّعَامَ وَيَمۡشِي فِي ٱلۡأَسۡوَاقِ لَوۡلَآ أُنزِلَ إِلَيۡهِ مَلَكٞ فَيَكُونَ مَعَهُۥ نَذِيرًا ٧

8. "లేదా ఇతనికొక నిధి ఎందుకు ఇవ్వబడలేదు? లేదా ఇతనికొక తోట ఎందుకు ఇవ్వబడలేదు? ఇతను దానినుండి తినటానికి!" ఆ దుర్మార్గులు ఇంకా ఇలా అంటారు: "మీరు కేవలం ఒక మంత్రజాలానికి గురిఅయిన మానవుణ్ణి అనుసరిస్తున్నారు."

أَوۡ يُلۡقَىٰٓ إِلَيۡهِ كَنزٌ أَوۡ تَكُونُ لَهُۥ جَنَّةٞ يَأۡكُلُ مِنۡهَاۚ وَقَالَ ٱلظَّٰلِمُونَ إِن تَتَّبِعُونَ إِلَّا رَجُلٗا مَّسۡحُورًا ٨

9. (ఓ ప్రవక్తా!) చూడు వారు నిన్ను గురించి ఎటువంటి ఉదాహరణలు ఇస్తున్నారు! వారు మార్గభ్రష్టులై పోయారు, వారు ఋజుమార్గం పొందజాలరు.

ٱنظُرۡ كَيۡفَ ضَرَبُواْ لَكَ ٱلۡأَمۡثَٰلَ فَضَلُّواْ فَلَا يَسۡتَطِيعُونَ سَبِيلٗا ٩

---

1. సత్యతిరస్కారులు మొదట ఖుర్ఆన్‌ను అసత్యమని తిరస్కరించారు. దానిని పూర్వీకుల కట్టుకథ అన్నారు. ఆ తరువాత దైవప్రవక్త ('స'అస)ను ఒక సాధారణ వ్యక్తి ఎలా దైవప్రవక్త కాగలడు. ఇతడు ఒక మాంత్రికుడు లేదా మంత్రజాలానికి గురి అయినవాడు లేదా ఇతరుల నుండి పూర్వ గాథలను నేర్చుకొని మాకు వినిపిస్తున్నాడు, అన్నారు. వాస్తవమేమిటంటే అతను ('స'అస) నిరక్షరాస్యుడు మరియు ఆయన చెప్పే గాథలు పూర్వ గ్రంథ ప్రజల గాథల కంటే భిన్నంగా ఉన్నాయి. ఎందుకంటే వారి గాథలు, పూర్వ ప్రవక్తలు తెచ్చిన నిజ గ్రంథాల నుండి గాక తరువాత తరాలవారు వ్రాసిపెట్టినవి. వారు తమ గ్రంథాలలో ఎన్నో మార్పులు తెచ్చారు. ఖుర్ఆన్ అయితే అల్లాహ్ తరఫు నుండి వచ్చింది మరియు 1400ల సంవత్సరాలలో దానిలో ఒక్క అక్షరపు మార్పు కూడా రాలేదు. ఈ విషయాన్ని సత్యతిరస్కారులు కూడా ధృవీకరిస్తునారు.

تَبَارَكَ ٱلَّذِىٓ إِن شَآءَ جَعَلَ لَكَ خَيْرًا مِّن ذَٰلِكَ جَنَّٰتٍ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ وَيَجْعَل لَّكَ قُصُورًا ﴿١٠﴾

**10**. ఆ శుభదాయకుడు కోరితే, నీకు వాటి కంటే, ఉత్తమమైన వాటిని ప్రసాదించగలడు - స్వర్గవనాలు - వాటి క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి మరియు అక్కడ నీ కొరకు పెద్ద కోటలు కూడా ఉంటాయి.

بَلْ كَذَّبُوا۟ بِٱلسَّاعَةِ ۖ وَأَعْتَدْنَا لِمَن كَذَّبَ بِٱلسَّاعَةِ سَعِيرًا ﴿١١﴾

**11**. వాస్తవానికి వారు ఆ అంతిమ ఘడియను అబద్ధమని తిరస్కరించారు. మరియు ఆ అంతిమ ఘడియను అబద్ధమని తిరస్కరించేవారి కొరకు మేము జ్వలించే నరకాగ్నిని సిద్ధపరచి ఉంచాము.

إِذَا رَأَتْهُم مِّن مَّكَانٍۭ بَعِيدٍ سَمِعُوا۟ لَهَا تَغَيُّظًا وَزَفِيرًا ﴿١٢﴾

**12**. అది, దూరం నుండి వారిని చూసినప్పుడు వారు దాని ఆవేశ ధ్వనులను మరియు దాని బుసను వింటారు.[1]

وَإِذَآ أُلْقُوا۟ مِنْهَا مَكَانًا ضَيِّقًا مُّقَرَّنِينَ دَعَوْا۟ هُنَالِكَ ثُبُورًا ﴿١٣﴾

**13**. మరియు దానిలోని ఒక ఇరుకైన స్థలంలో, వారు బంధింపబడి, త్రోయబడినప్పుడు వారక్కడ తమ చావును పిలువడం ప్రారంభిస్తారు.[2]

لَّا تَدْعُوا۟ ٱلْيَوْمَ ثُبُورًا وَٰحِدًا وَٱدْعُوا۟ ثُبُورًا كَثِيرًا ﴿١٤﴾

**14**. (వారితో అనబడుతుంది): "ఈ రోజు మీరు ఒక్క చావును పిలువకండి, ఎన్నో చావులకొరకు అరవండి!"

قُلْ أَذَٰلِكَ خَيْرٌ أَمْ جَنَّةُ ٱلْخُلْدِ ٱلَّتِى وُعِدَ ٱلْمُتَّقُونَ ۚ كَانَتْ لَهُمْ جَزَآءً وَمَصِيرًا ﴿١٥﴾

**15**. వారితో అను: "ఏమీ? ఇది మంచిదా, లేక దైవభీతి గలవారికి వాగ్దానం చేయబడిన శాశ్వతమైన స్వర్గమా? అదే (దైవభీతి గల) వారి ప్రతిఫలం మరియు గమ్యస్థానం.

---

**1**. చూడండి, 67:7-8.
**2**. చూడండి, 14:49.

لَّهُمْ فِيهَا مَا يَشَآءُونَ خَٰلِدِينَ ۚ كَانَ عَلَىٰ رَبِّكَ وَعْدًا مَّسْـُٔولًا ﴿١٦﴾

16. అందులో వారికి వారు కోరింది లభిస్తుంది. వారందు శాశ్వతంగా వుంటారు. ఇది నీ ప్రభువు కర్తవ్యంతో పూర్తిచేయవలసిన వాగ్దానం.

وَيَوْمَ يَحْشُرُهُمْ وَمَا يَعْبُدُونَ مِن دُونِ ٱللَّهِ فَيَقُولُ ءَأَنتُمْ أَضْلَلْتُمْ عِبَادِى هَٰٓؤُلَآءِ أَمْ هُمْ ضَلُّوا۟ ٱلسَّبِيلَ ﴿١٧﴾

17. మరియు ఆయన (అల్లాహ్) వారిని (సత్యతిరస్కారులను) మరియు అల్లాహ్‌కు బదులుగా వారు ఆరాధించే వారిని, అందరినీ, ఆ రోజు సమావేశపరచి వారితో ఇలా అంటాడు: "ఏమీ? మీరేనా నా దాసులను మార్గం తప్పించిన వారు? లేక స్వయంగా వారే మార్గభ్రష్టులయ్యారా?"

قَالُوا۟ سُبْحَٰنَكَ مَا كَانَ يَنۢبَغِى لَنَآ أَن نَّتَّخِذَ مِن دُونِكَ مِنْ أَوْلِيَآءَ وَلَٰكِن مَّتَّعْتَهُمْ وَءَابَآءَهُمْ حَتَّىٰ نَسُوا۟ ٱلذِّكْرَ وَكَانُوا۟ قَوْمًۢا بُورًا ﴿١٨﴾

18. వారంటారు: "ఓ మా ప్రభూ! నీవు సర్వలోపాలకు అతీతుడవు! మేము నిన్ను వదలి ఇతరులను మా సంరక్షకులుగా చేసుకోవటం మాకు తగినది కాదు, కాని నీవు వారికి మరియు వారి తండ్రితాతలకు చాలా సుఖసంతోషాలను ప్రసాదించావు, చివరకు వారు నీ బోధననే మరచిపోయి నాశనానికి గురి అయిన వారయ్యారు."

فَقَدْ كَذَّبُوكُم بِمَا تَقُولُونَ فَمَا تَسْتَطِيعُونَ صَرْفًا وَلَا نَصْرًا ۚ وَمَن يَظْلِم مِّنكُمْ نُذِقْهُ عَذَابًا كَبِيرًا ﴿١٩﴾

19. (అప్పుడు అల్లాహ్ అంటాడు): "కాని ఇప్పుడైతే వారు, మీ మాటలను అసత్యాలని తిరస్కరిస్తున్నారు. ఇక మీరు మీ శిక్షనుండి తప్పించుకోలేరు మరియు ఎలాంటి సహాయమూ పొందలేరు. మరియు మీలో దుర్మార్గానికి పాల్పడిన వానికి మేము ఘోరశిక్ష రుచి చూపుతాము!"

**20**. మరియు (ఓ ముహమ్మద్!) మేము నీకు పూర్వం పంపిన సందేశహరులు అందరూ నిశ్చయంగా, ఆహారంతినే వారే, వీధులలో సంచరించే వారే. మరియు మేము మిమ్మల్ని ఒకరిని మరొకరి కొరకు పరీక్షా సాధనాలుగా చేశాము. ఏమీ? మీరు[1] సహనం వహిస్తారా? మరియు వాస్తవానికి, నీ ప్రభువు సర్వం చూసేవాడు.[2]

وَمَآ أَرۡسَلۡنَا قَبۡلَكَ مِنَ ٱلۡمُرۡسَلِينَ إِلَّآ إِنَّهُمۡ لَيَأۡكُلُونَ ٱلطَّعَامَ وَيَمۡشُونَ فِي ٱلۡأَسۡوَاقِۗ وَجَعَلۡنَا بَعۡضَكُمۡ لِبَعۡضٖ فِتۡنَةً أَتَصۡبِرُونَۗ وَكَانَ رَبُّكَ بَصِيرٗا ٢٠

---

1. మీరు అంటే విశ్వాసులు.
2. చూడండి, 6:124.

۞ وَقَالَ ٱلَّذِينَ لَا يَرْجُونَ لِقَآءَنَا لَوْلَآ أُنزِلَ عَلَيْنَا ٱلْمَلَٰٓئِكَةُ أَوْ نَرَىٰ رَبَّنَا ۗ لَقَدِ ٱسْتَكْبَرُوا۟ فِىٓ أَنفُسِهِمْ وَعَتَوْ عُتُوًّا كَبِيرًا ﴿٢١﴾

**21.** (*) మరియు మమ్మల్ని కలుసుకోవలసి ఉందని ఆశించని వారు ఇలా అన్నారు: "దేవదూతలు మా వద్దకు ఎందుకు పంపబడలేదు? లేదా మేము మా ప్రభువును ఎందుకు చూడలేము?" వాస్తవానికి, వారు తమను తాము చాలా గొప్ప వారిగా భావించారు మరియు వారు తలబిరుసుతనంలో చాలా మితిమీరి పోయారు.[1]

يَوْمَ يَرَوْنَ ٱلْمَلَٰٓئِكَةَ لَا بُشْرَىٰ يَوْمَئِذٍ لِّلْمُجْرِمِينَ وَيَقُولُونَ حِجْرًا مَّحْجُورًا ﴿٢٢﴾

**22.** ఆ రోజు[2] వారు దేవదూతలను చూస్తారు. ఆ రోజు అపరాధులకు ఎలాంటి శుభవార్తలు ఉండవు మరియు వారు (దేవదూతలు) ఇలా అంటారు: "మీకు శుభవార్తలన్నీ ఖచ్చితంగా నిషేధించబడ్డాయి."

وَقَدِمْنَآ إِلَىٰ مَا عَمِلُوا۟ مِنْ عَمَلٍ فَجَعَلْنَٰهُ هَبَآءً مَّنثُورًا ﴿٢٣﴾

**23.** మరియు మేము, వారు (అవిశ్వాసులు) చేసిన కార్యాల వైపుకు మరలుతాము, తరువాత వాటిని సూక్ష్మకణాల (ధూళి)వలే ఎగురవేస్తాము.[3]

---

**1**. అల్లాహ్ (సు.తా.), అగోచరాన్ని విశ్వసించే విషయంలో మానవులను పరీక్షిస్తున్నాడు. ఒకవేళ వారి ముందుకు దైవదూతలు లేక అల్లాహ్ (సు.తా.) స్వయంగా వచ్చి ప్రతి ఒక్కరితో తనను విశ్వసించండి అని చెప్పితే! ఈ పరీక్ష అవసరమే ఉండేది కాదు. అల్లాహ్ (సు.తా.) మానవుల ఇచ్ఛ ప్రకారం కాక తన ఇష్టానుసారం ప్రవర్తిస్తాడు.

**2**. ఆ రోజు అంటే, మరణదినం కానీ లేక పునరుత్థానదినం కానీ కావచ్చు (ఇబ్నె-కసీ'ర్). ఆ రోజు సత్యతిరస్కారుల పరిస్థితికి చూడండి, 8:50. విశ్వాసుల పరిస్థితికి చూడండి, 41:30-32.

**3**. హబాఅన్': అంటే చిన్న సందులోనుండి ఇంటిలోకి వచ్చే సూర్య కిరణాలలో కనబడే సూక్ష్మకణాలు. వాటిని చేతితో పట్టుకోవటం అసాధ్యం. సత్యతిరస్కారుల కర్మలు, ఇక్కడ సూక్ష్మ కణాలతో పోల్చబడ్డాయి. అవి ఇతర ఆయతులలో ఎండమావులతో, బూడిదతో లేక నున్నని బండతో పోల్చబడ్డాయి. చూడండి, 2:264, 14:18 మరియు 24:39.

أَصْحَٰبُ ٱلْجَنَّةِ يَوْمَئِذٍ خَيْرٌ مُّسْتَقَرًّا وَأَحْسَنُ مَقِيلًا ﴿٢٤﴾

**24.** ఆ దినమున స్వర్గానికి అర్హులైన వారు మంచి నివాసంలో మరియు ఉత్తమ విశ్రాంతి స్థలంలో ఉంటారు.

وَيَوْمَ تَشَقَّقُ ٱلسَّمَآءُ بِٱلْغَمَٰمِ وَنُزِّلَ ٱلْمَلَٰٓئِكَةُ تَنزِيلًا ﴿٢٥﴾

**25.** మరియు (జ్ఞాపకముంచుకోండి) ఆ రోజు ఆకాశం మేఘాలతో సహా బ్రద్దలు చేయబడుతుంది. మరియు దేవదూతలు వరుసగా దింపబడతారు.[1]

ٱلْمُلْكُ يَوْمَئِذٍ ٱلْحَقُّ لِلرَّحْمَٰنِ ۚ وَكَانَ يَوْمًا عَلَى ٱلْكَٰفِرِينَ عَسِيرًا ﴿٢٦﴾

**26.** ఆ రోజు వాస్తవమైన విశ్వ సామ్రాజ్యాధిపత్యం కేవలం ఆ అనంత కరుణామయునిదే! సత్యతిరస్కారులకు ఆ దినం ఎంతో కఠినమైనదిగా ఉంటుంది.

وَيَوْمَ يَعَضُّ ٱلظَّالِمُ عَلَىٰ يَدَيْهِ يَقُولُ يَٰلَيْتَنِى ٱتَّخَذْتُ مَعَ ٱلرَّسُولِ سَبِيلًا ﴿٢٧﴾

**27.** మరియు (జ్ఞాపకముంచుకోండి), ఆ దినమున దుర్మార్గుడు తన చేతులను కొరుక్కుంటూ ఇలా అంటాడు: "అయ్యో! నేను సందేశహరుని మార్గం అనుసరిస్తే, ఎంతబాగుండేది!

يَٰوَيْلَتَىٰ لَيْتَنِى لَمْ أَتَّخِذْ فُلَانًا خَلِيلًا ﴿٢٨﴾

**28.** "అయ్యో నా దౌర్భాగ్యం! నేను ఫలానా వానిని స్నేహితునిగా చేసుకోకుండా వుంటే ఎంత బాగుండేది![2]

لَّقَدْ أَضَلَّنِى عَنِ ٱلذِّكْرِ بَعْدَ إِذْ جَآءَنِى ۗ وَكَانَ ٱلشَّيْطَٰنُ لِلْإِنسَٰنِ خَذُولًا ﴿٢٩﴾

**29.** "వాస్తవానికి అతడే, హితబోధ (ఖుర్ఆన్) నా వద్దకు వచ్చిన తరువాత కూడా, నన్ను దానినుండి తప్పించాడు! వాస్తవానికి షైతాన్ మానవుని యెడల నమ్మకద్రోహి."[3]

---

**1.** చూడండి, 2:210.

**2.** దీనితో వ్యక్తమయ్యేది ఏమిటంటే మంచివారి సాంగత్యంలో మానవుడు మంచివాడౌతాడు, మరియు దుష్టుల సాంగత్యంలో దుష్టుడౌతాడు. (ముస్లిం).

**3.** చూడండి, 15:17 మరియు 14:22.

وَقَالَ ٱلرَّسُولُ يَٰرَبِّ إِنَّ قَوْمِى ٱتَّخَذُواْ هَٰذَا ٱلْقُرْءَانَ مَهْجُورًا ﴿٣٠﴾

**30**. అప్పుడు సందేశహరుడు ఇలా అంటాడు: "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, నా జాతివారు ఈ ఖుర్ఆన్‌ను పూర్తిగా వదలిపెట్టారు."[1]

وَكَذَٰلِكَ جَعَلْنَا لِكُلِّ نَبِىٍّ عَدُوًّا مِّنَ ٱلْمُجْرِمِينَ ۗ وَكَفَىٰ بِرَبِّكَ هَادِيًا وَنَصِيرًا ﴿٣١﴾

**31**. మరియు ఈ విధంగా మేము అపరాధుల నుండి ప్రతి ప్రవక్తకూ శత్రువులను నియమించాము.[2] మరియు నీ ప్రభువే, నీకు మార్గదర్శకుడిగా మరియు సహాయకుడిగా చాలు!

وَقَالَ ٱلَّذِينَ كَفَرُواْ لَوْلَا نُزِّلَ عَلَيْهِ ٱلْقُرْءَانُ جُمْلَةً وَٰحِدَةً ۚ كَذَٰلِكَ لِنُثَبِّتَ بِهِۦ فُؤَادَكَ ۖ وَرَتَّلْنَٰهُ تَرْتِيلًا ﴿٣٢﴾

**32**. మరియు సత్యతిరస్కారులు అంటారు: "ఇతని (ము'హమ్మద్) మీద ఈ ఖుర్ఆన్ పూర్తిగా ఒకేసారి ఎందుకు అవతరింపజేయబడలేదు?" మేము (ఈ ఖుర్ఆన్‌ను) ఈ విధంగా (భాగాలుగా పంపింది) నీ హృదయాన్ని దృఢపరచడానికి. మరియు మేము దీనిని క్రమక్రమంగా అవతరింపజేశాము.[3]

وَلَا يَأْتُونَكَ بِمَثَلٍ إِلَّا جِئْنَٰكَ بِٱلْحَقِّ وَأَحْسَنَ تَفْسِيرًا ﴿٣٣﴾

**33**. మరియు వారు నీ వద్దకు (నిన్ను వ్యతిరేకించటానికి) ఎలాంటి ఉపమానాన్ని తెచ్చినా! మేము నీకు దానికి సరైన జవాబు మరియు ఉత్తమమైన వ్యాఖ్యానం ఇవ్వకుండా ఉండము.[4]

---

**1**. హిజ్‌రున్: ఆటంకపరచటం, నిషేధించటం, ఆపటం మొదలైనవి. ముష్రికులు ఖుర్ఆన్ వినిపించేటప్పుడు, గొడవచేసేవారు ఇదే హిజ్‌రున్. ఖుర్ఆన్‌ను విశ్వసించకుండటం, దానిని అనుసరించకుండటం, అది నిషేధించిన దానిని విడువకుండటం మొదలైనవి కూడా ఈ అర్థంలోకి వస్తాయి.

**2**. ఇలాంటి ఆయత్‌కు చూడండి, 6:112.

**3**. అల్లాహ్ (సు.తా.) అంటున్నాడు మేము ఈ ఖుర్ఆన్‌ను 23 సంవత్సరాలలో క్రమక్రమంగా అవతరింపజేశాము. ఇంకా చూడండి, 17:106, 73:4.

**4**. సత్యతిరస్కారులు దైవప్రవక్త (సఅస)ను వ్యతిరేకించటానికి, ఎలాంటి ఉపమానాలు తెచ్చినా వాటికి తగిన సమాధానాలు ఇవ్వటానికి మేము క్రమక్రమంగా ఈ ఖుర్ఆన్‌ను అవతరింపజేశాము.

ٱلَّذِينَ يُحْشَرُونَ عَلَىٰ وُجُوهِهِمْ إِلَىٰ جَهَنَّمَ أُوْلَٰٓئِكَ شَرٌّ مَّكَانًا وَأَضَلُّ سَبِيلًا ﴿٣٤﴾

34. ఎవరైతే, వారి ముఖాల మీద (బోర్లా పడవేయబడి) లాగుతూ నరకంలో కూడబెట్టబడతారో, అలాంటి వారు ఎంతో దుస్థితిలో మరియు మార్గభ్రష్టత్వంలో పడిఉన్న వారు.[1]

وَلَقَدْ ءَاتَيْنَا مُوسَى ٱلْكِتَٰبَ وَجَعَلْنَا مَعَهُۥٓ أَخَاهُ هَٰرُونَ وَزِيرًا ﴿٣٥﴾

35. మరియు నిశ్చయంగా, మేము మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము మరియు అతని సోదరుడైన హారూన్‌ను అతనికి సహాయకునిగా చేశాము.[2]

فَقُلْنَا ٱذْهَبَآ إِلَى ٱلْقَوْمِ ٱلَّذِينَ كَذَّبُواْ بِـَٔايَٰتِنَا فَدَمَّرْنَٰهُمْ تَدْمِيرًا ﴿٣٦﴾

36. వారిద్దరితో ఇలా అన్నాము: "మీరిద్దరూ మా సూచనలను అసత్యాలని తిరస్కరించిన జాతివారి వద్దకు వెళ్ళండి." తరువాత మేము (ఆ జాతి) వారిని పూర్తిగా నాశనంచేశాము.

وَقَوْمَ نُوحٍ لَّمَّا كَذَّبُواْ ٱلرُّسُلَ أَغْرَقْنَٰهُمْ وَجَعَلْنَٰهُمْ لِلنَّاسِ ءَايَةً وَأَعْتَدْنَا لِلظَّٰلِمِينَ عَذَابًا أَلِيمًا ﴿٣٧﴾

37. ఇక నూ'హ్ జాతి వారు: ఎప్పుడైతే వారు ప్రవక్తలను అసత్యవాదులని తిరస్కరించారో, మేము వారిని ముంచివేసి, సర్వజనులకు వారిని ఒక సూచనగా చేశాము. మరియు దుర్మార్గుల కొరకు మేము వ్యధాభరితమైన శిక్షను సిద్ధపరిచి ఉంచాము.

وَعَادًا وَثَمُودَاْ وَأَصْحَٰبَ ٱلرَّسِّ وَقُرُونًۢا بَيْنَ ذَٰلِكَ كَثِيرًا ﴿٣٨﴾

38. మరియు ఇదే విధంగా 'ఆద్ మరియు స'మూద్ మరియు అర్‌రస్స్[3] ప్రజలు మరియు వారి మధ్య ఎన్నో తరాలవారిని[4] (నాశనం చేశాము).

---

1. అంటే సత్యతిరస్కారుడు ఎన్ని సత్కార్యాలు చేసినా అవి పరలోకంలో ఎండమావులుగా అదృశ్యమైపోతాయి. అంటే అతనికి వాటి నుండి ఎలాంటి పుణ్యఫలితం లభించదు. అతడు నరకంలో చేరిపోతాడు.
2. చూడండి, 20:29.
3. రస్సున్: అంటే బావి. ఇమామ్ ఇబ్నె-జరీర్ 'తబరీ: వీరే అ'స్హాబ్ అల్-ఉ'ఖ్దూద్ అని అన్నారు. చూడండి, 85:4 (ఇబ్నె-కసీ'ర్).
4. ఖర్నున్: అంటే ఒక యుగానికి లేక ఒకతరానికి చెందిన ప్రజలు. ప్రతి ప్రవక్త సమాజాన్ని ఒక ఖర్న్‌కు చెందినది అని అనవచ్చు. (ఇబ్నె-కసీ'ర్).

وَكُلًّا ضَرَبْنَا لَهُ ٱلْأَمْثَٰلَ ۖ
وَكُلًّا تَبَّرْنَا تَتْبِيرًا ﴿٣٩﴾

**39**. మరియు వారిలో ప్రతి ఒక్కరినీ మేము దృష్టాంతాలను ఇచ్చి నచ్చజెప్పాము. చివరకు ప్రతి ఒక్కరినీ పూర్తిగా నిర్మూలించాము.[1]

وَلَقَدْ أَتَوْا۟ عَلَى ٱلْقَرْيَةِ ٱلَّتِىٓ
أُمْطِرَتْ مَطَرَ ٱلسَّوْءِ ۚ أَفَلَمْ
يَكُونُوا۟ يَرَوْنَهَا ۚ بَلْ كَانُوا۟
لَا يَرْجُونَ نُشُورًا ﴿٤٠﴾

**40**. మరియు మేము దారుణమైన (రాళ్ళ) వర్షం కురిపించిన (లూ'త్) నగరం మీద నుండి వాస్తవానికి వారు (అవిశ్వాసులు) ప్రయాణం చేసి ఉంటారు. ఏమీ? వారు దానిని (దాని స్థితిని) చూడటం లేదా? వాస్తవానికి, వారు తిరిగి బ్రతికించి లేపబడతారని నమ్మలేదు.[2]

وَإِذَا رَأَوْكَ إِن يَتَّخِذُونَكَ إِلَّا
هُزُوًا أَهَٰذَا ٱلَّذِى بَعَثَ ٱللَّهُ
رَسُولًا ﴿٤١﴾

**41**. (ఓ ము'హమ్మద్!) వారు నిన్ను చూసినప్పుడల్లా నిన్ను పరిహాసానికి గురిచేస్తూ ఇలా అంటారు: "ఏమీ? ఇతనినేనా, అల్లాహ్ తన సందేశహరునిగా చేసి పంపింది?

إِن كَادَ لَيُضِلُّنَا عَنْ ءَالِهَتِنَا
لَوْلَآ أَن صَبَرْنَا عَلَيْهَا ۚ
وَسَوْفَ يَعْلَمُونَ حِينَ يَرَوْنَ
ٱلْعَذَابَ مَنْ أَضَلُّ سَبِيلًا ﴿٤٢﴾

**42**. "మేము వాటి (మా దేవతల) పట్ల (దృఢవిశ్వాసం మీద) స్థిరంగా ఉండకపోతే, ఇతను మమ్మల్ని మా దేవతల నుండి తప్పించి దూరం చేసే వాడే!" మరియు త్వరలోనే వారు మా శిక్షను చూసినప్పుడు ఎవరు మార్గం తప్పిఉన్నారో తెలుసు కుంటారు.[3]

أَرَءَيْتَ مَنِ ٱتَّخَذَ إِلَٰهَهُۥ هَوَىٰهُ
أَفَأَنتَ تَكُونُ عَلَيْهِ وَكِيلًا ﴿٤٣﴾

**43**. (ఓ ము'హమ్మద్!) ఎవడు తన మనోవాంఛలను తనకు దైవంగా చేసుకొని ఉన్నాడో, అలాంటి వానిని నీవు చూశావా? నీవు అలాంటి వానికి రక్షకుడవు కాగలవా?

---

**1**. చూడండి, 17:89.

**2**. చూడండి, 11:82.

**3**. చూడండి, 21:36.

44. లేక వారిలోని చాలా మంది వింటారని లేదా అర్థంచేసుకుంటారని నీవు భావిస్తున్నావా? అసలు వారు పశువుల వంటి వారు. అలా కాదు! వారు వాటి కంటే ఎక్కువ దారితప్పిన వారు.

أَمۡ تَحۡسَبُ أَنَّ أَكۡثَرَهُمۡ يَسۡمَعُونَ أَوۡ يَعۡقِلُونَۚ إِنۡ هُمۡ إِلَّا كَٱلۡأَنۡعَٰمِۖ بَلۡ هُمۡ أَضَلُّ سَبِيلًا ﴿٤٤﴾

45. ఏమీ? నీవు చూడటంలేదా? నీ ప్రభువు! ఏ విధంగా ఛాయను పొడిగిస్తాడో? ఒకవేళ ఆయన కోరితే, దానిని నిలిపివేసి ఉండేవాడు, కాని మేము సూర్యుణ్ణి దానికి మార్గదర్శిగా చేశాము.

أَلَمۡ تَرَ إِلَىٰ رَبِّكَ كَيۡفَ مَدَّ ٱلظِّلَّ وَلَوۡ شَآءَ لَجَعَلَهُۥ سَاكِنٗا ثُمَّ جَعَلۡنَا ٱلشَّمۡسَ عَلَيۡهِ دَلِيلٗا ﴿٤٥﴾

46. తరువాత మేము దానిని (ఆ నీడను) క్రమక్రమంగా మావైపునకు లాక్కుంటాము.

ثُمَّ قَبَضۡنَٰهُ إِلَيۡنَا قَبۡضٗا يَسِيرٗا ﴿٤٦﴾

47. మరియు ఆయన (అల్లాహ్)యే మీ కొరకు రాత్రిని వస్త్రం(తెర)గానూ, నిద్రను విశ్రాంతి స్థితిగానూ మరియు పగటిని తిరిగి బ్రతికించి లేపబడే (జీవనోపాధి) సమయంగానూ చేశాడు.

وَهُوَ ٱلَّذِي جَعَلَ لَكُمُ ٱلَّيۡلَ لِبَاسٗا وَٱلنَّوۡمَ سُبَاتٗا وَجَعَلَ ٱلنَّهَارَ نُشُورٗا ﴿٤٧﴾

48. మరియు ఆయనయే (అల్లాహ్‌యే) తన కారుణ్యానికి ముందు గాలులను శుభవార్తలుగా పంపేవాడు. మరియు మేమే ఆకాశం నుండి నిర్మలమైన నీటిని కురిపించే వారము.

وَهُوَ ٱلَّذِيٓ أَرۡسَلَ ٱلرِّيَٰحَ بُشۡرَۢا بَيۡنَ يَدَيۡ رَحۡمَتِهِۦۚ وَأَنزَلۡنَا مِنَ ٱلسَّمَآءِ مَآءٗ طَهُورٗا ﴿٤٨﴾

49. దాని ద్వారా ఒక మృత ప్రదేశానికి ప్రాణం పోయటానికి మరియు దానిని మేము సృష్టించిన ఎన్నో పశువులకు మరియు మానవులకు త్రాగటానికీ!

لِّنُحۡـِۧيَ بِهِۦ بَلۡدَةٗ مَّيۡتٗا وَنُسۡقِيَهُۥ مِمَّا خَلَقۡنَآ أَنۡعَٰمٗا وَأَنَاسِيَّ كَثِيرٗا ﴿٤٩﴾

**50**. మరియు వాస్తవానికి, మేము దానిని (నీటిని) వారి మధ్య పంచాము. వారు (మా అనుగ్రహాన్ని) జ్ఞాపకముంచు కోవాలని. కానీ మానవులలో చాలా మంది దీనిని తిర్కరించి, కృతఘ్నులవుతున్నారు.

وَلَقَدْ صَرَّفْنَٰهُ بَيْنَهُمْ لِيَذَّكَّرُوا۟ فَأَبَىٰٓ أَكْثَرُ ٱلنَّاسِ إِلَّا كُفُورًا ﴿٥٠﴾

**51**. మరియు మేము తలుచుకుంటే, ప్రతి నగరానికొక హెచ్చరిక చేసేవానిని (ప్రవక్తను) పంపి ఉండేవారము.

وَلَوْ شِئْنَا لَبَعَثْنَا فِى كُلِّ قَرْيَةٍ نَّذِيرًا ﴿٥١﴾

**52**. కావున నీవు (ఓ ప్రవక్తా!) సత్య తిరస్కారుల అభిప్రాయాన్ని లక్ష్యపెట్టకు మరియు దీని (ఈ ఖుర్ఆన్) సహాయంతో, (వారికి హితబోధ చేయటానికి) గట్టిగా పాటుపడు. (1/8)

فَلَا تُطِعِ ٱلْكَٰفِرِينَ وَجَٰهِدْهُم بِهِۦ جِهَادًا كَبِيرًا ﴿٥٢﴾

**53**. * మరియు రెండు సముద్రాలను కలిపి ఉంచిన వాడు ఆయనే! ఒకటేమో రుచికరమైనది, దాహం తీర్చునది, మరొకటేమో ఉప్పగనూ, చేదుగనూ ఉన్నది మరియు ఆయన ఆ రెండింటి మధ్య ఒక అడ్డుతెరను - అవి కలిసి పోకుండా - అవరోధంగా ఏర్పరచాడు.[1]

۞ وَهُوَ ٱلَّذِى مَرَجَ ٱلْبَحْرَيْنِ هَٰذَا عَذْبٌ فُرَاتٌ وَهَٰذَا مِلْحٌ أُجَاجٌ وَجَعَلَ بَيْنَهُمَا بَرْزَخًا وَحِجْرًا مَّحْجُورًا ﴿٥٣﴾

**54**. మరియు ఆయనే నీటితో మానవుణ్ణి సృష్టించాడు.[2] తరువాత అతనికి తన వంశబంధుత్వాన్ని మరియు వివాహబంధుత్వాన్ని ఏర్పరచాడు. మరియు వాస్తవానికి నీ ప్రభువు (ప్రతిదీ చేయగల) సమర్థుడు.

وَهُوَ ٱلَّذِى خَلَقَ مِنَ ٱلْمَآءِ بَشَرًا فَجَعَلَهُۥ نَسَبًا وَصِهْرًا ۗ وَكَانَ رَبُّكَ قَدِيرًا ﴿٥٤﴾

---

**1**. బావుల, నదుల, సరోవరాల మరియు సముద్రాల నీరు.

**2**. చూడండి, 21:30 మరియు 24:45.

وَيَعۡبُدُونَ مِن دُونِ ٱللَّهِ مَا لَا
يَنفَعُهُمۡ وَلَا يَضُرُّهُمۡۗ وَكَانَ ٱلۡكَافِرُ
عَلَىٰ رَبِّهِۦ ظَهِيرًا ﴿٥٥﴾

**55**. మరియు వారు అల్లాహ్‌ను వదలి తమకు లాభం గానీ, నష్టం గానీ, చేకూర్చలేని వారిని ఆరాధిస్తున్నారు. మరియు సత్యతిరస్కారుడు తన ప్రభువుకు విరుద్ధంగా, (షైతానుకు తోడుగా) ఉంటాడు.

وَمَآ أَرۡسَلۡنَٰكَ إِلَّا مُبَشِّرًا وَنَذِيرًا
﴿٥٦﴾

**56**. మరియు (ఓ ముహమ్మద్!) మేము నిన్ను ఒక శుభవార్తాహరునిగా మరియు హెచ్చరిక చేసేవానిగా మాత్రమే పంపాము.

قُلۡ مَآ أَسۡـَٔلُكُمۡ عَلَيۡهِ مِنۡ أَجۡرٍ
إِلَّا مَن شَآءَ أَن يَتَّخِذَ إِلَىٰ رَبِّهِۦ
سَبِيلٗا ﴿٥٧﴾

**57**. కావున నీవు వారితో అను: "నేను దీని (ఈ ప్రచారాని)కై మీతో ఎలాంటి ప్రతిఫలము నడగటంలేదు. కేవలం, తాను కోరిన వ్యక్తియే తన ప్రభువు మార్గాన్ని అవలంబించవచ్చు!"

وَتَوَكَّلۡ عَلَى ٱلۡحَيِّ ٱلَّذِي لَا يَمُوتُ
وَسَبِّحۡ بِحَمۡدِهِۦۚ وَكَفَىٰ بِهِۦ
بِذُنُوبِ عِبَادِهِۦ خَبِيرًا ﴿٥٨﴾

**58**. కావున ఎన్నడూ మరణించని, ఆ సజీవుని (నిత్యుని) పైననే ఆధారపడి ఉండు మరియు ఆయన స్తోత్రంతో పాటు ఆయన పవిత్రతను కొనియాడు. తన దాసుల పాపాలను ఎరుగుటకు ఆయనే చాలు!

ٱلَّذِي خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ
وَمَا بَيۡنَهُمَا فِي سِتَّةِ أَيَّامٖ ثُمَّ
ٱسۡتَوَىٰ عَلَى ٱلۡعَرۡشِۚ ٱلرَّحۡمَٰنُ
فَسۡـَٔلۡ بِهِۦ خَبِيرٗا ﴿٥٩﴾

**59**. ఆయనే ఆకాశాలను మరియు భూమిని మరియు వాటిమధ్య ఉన్న సమస్తాన్ని ఆరు దినము(అయ్యామ్)లలో సృష్టించి, తరువాత తన సింహాసనాన్ని ('అర్ష్‌ను) అధిష్ఠించాడు.[1] ఆయన అనంత కరుణామయుడు, ఆయన ఘనతను గురించి ఎరిగిన వాడిని అడుగు.

**1**. చూడండి, 7:54, 9:129, 10:9, 13:2.

وَإِذَا قِيلَ لَهُمُ ٱسْجُدُوا۟ لِلرَّحْمَـٰنِ قَالُوا۟ وَمَا ٱلرَّحْمَـٰنُ أَنَسْجُدُ لِمَا تَأْمُرُنَا وَزَادَهُمْ نُفُورًا ۩ ﴿٦٠﴾

**60**. మరియు వారితో: "ఆ కరుణామయునికి సాష్టాంగం (సజ్దా) చేయండి." అని అన్నప్పుడల్లా, వారంటారు: "ఆ కరుణామయుడెవడు? మీరు ఆజ్ఞాపించిన వానికి మేము సాష్టాంగం (సజ్దా) చేయాలా?" మరియు అది (నీ పిలుపు) వారి వ్యతిరేకతను మరింత అధికమే చేసింది.[1] ۩

تَبَارَكَ ٱلَّذِى جَعَلَ فِى ٱلسَّمَآءِ بُرُوجًا وَجَعَلَ فِيهَا سِرَٰجًا وَقَمَرًا مُّنِيرًا ﴿٦١﴾

**61**. ఆకాశంలో నక్షత్రరాసు (బురూజు)లను[2] నిర్మించి అందులో ఒక (ప్రకాశించే) సూర్యుణ్ణి[3] మరియు వెలుగునిచ్చే (ప్రతిబింబింపజేసే) చంద్రుణ్ణి నియమించిన ఆయన (అల్లాహ్) శుభదాయకుడు.

وَهُوَ ٱلَّذِى جَعَلَ ٱلَّيْلَ وَٱلنَّهَارَ خِلْفَةً لِّمَنْ أَرَادَ أَن يَذَّكَّرَ أَوْ أَرَادَ شُكُورًا ﴿٦٢﴾

**62**. మరియు ఆయనే, రేయింబవళ్ళను ఒక దాని వెంట ఒకటి అనుక్రమంగా వచ్చేటట్లు చేసేవాడు. ఇవన్నీ గమనించ గోరిన వారి కొరకు లేదా కృతజ్ఞత చూపగోరిన వారి కొరకు ఉన్నాయి.

---

**1**. 'హుదైబియహ్ ఒప్పందమప్పుడు 'బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్'తో, వ్రాయటం మొదలుపెడ్తే దానికి ముష్రిక్ ఖురైషీలు మేము రహ్మాన్, రహీంలను ఎరుగము: 'బి ఇస్మిక అల్లాహుమ్మ.' అని మొదలుపెట్టండన్నారు. (సీరత్ ఇబ్నె హిషామ్). చూడండి,17:110,13:30.

**2**. బురూజున్: మొట్టమొదటి వ్యాఖ్యాతలు బురూజున్, అంటే పెద్ద పెద్ద నక్షత్ర సముదాయాలన్నారు. తరువాత కాలపు వ్యాఖ్యాతలు పన్నెండు నక్షత్రరాసులు (సముదాయాలు) - మేషం, వృషభం, మిథునం, కర్కాటకం, సింహ, కన్య, తుల, వృశ్చిక, ధనస్సు, మకరం, కుంభం, మీనం - అనేవి అన్నారు. (అయ్సర్ అత్తఫాసీర్) ఇంకా చూడండి, 15:16.

**3**. చూడండి,10:5 ప్రకాశించే సూర్యుడు. సూర్యుని వెలుగును ప్రతిబింబింపజేసే చంద్రుడు.

63. మరియు వారే, అనంత కరుణామయుని దాసులు, ఎవరైతే భూమి మీద నమ్రతతో నడుస్తారో! మరియు మూర్ఖులు వారిని పలుకరించినప్పుడు: "మీకు సలాం!"[1] అని అంటారో!

وَعِبَادُ ٱلرَّحۡمَٰنِ ٱلَّذِينَ يَمۡشُونَ عَلَى ٱلۡأَرۡضِ هَوۡنٗا وَإِذَا خَاطَبَهُمُ ٱلۡجَٰهِلُونَ قَالُواْ سَلَٰمٗا ٦٣

64. మరియు ఎవరైతే, తమ ప్రభువు సన్నిధిలో సాష్టాంగం (సజ్దా) చేస్తూ మరియు (నమా'జ్‌లో) నిలబడుతూ రాత్రులు గడుపుతారో!

وَٱلَّذِينَ يَبِيتُونَ لِرَبِّهِمۡ سُجَّدٗا وَقِيَٰمٗا ٦٤

65. మరియు ఎవరైతే: "ఓ మా ప్రభూ! మా నుండి నరకపు శిక్షను తొలగించు. నిశ్చయంగా, దాని శిక్ష ఎడతెగని పీడన." అని అంటారో![2]

وَٱلَّذِينَ يَقُولُونَ رَبَّنَا ٱصۡرِفۡ عَنَّا عَذَابَ جَهَنَّمَۖ إِنَّ عَذَابَهَا كَانَ غَرَامًا ٦٥

66. నిశ్చయంగా, అది అతిచెడ్డ ఆశ్రయం మరియు నివాసస్థలం.

إِنَّهَا سَآءَتۡ مُسۡتَقَرّٗا وَمُقَامٗا ٦٦

67. మరియు ఎవరైతే, ఖర్చు చేసేటప్పుడు అనవసర ఖర్చు గానీ లేక లోభత్వం గానీ చేయకుండా, ఈ రెండింటి మధ్య మితంగా ఉంటారో!

وَٱلَّذِينَ إِذَآ أَنفَقُواْ لَمۡ يُسۡرِفُواْ وَلَمۡ يَقۡتُرُواْ وَكَانَ بَيۡنَ ذَٰلِكَ قَوَامٗا ٦٧

68. మరియు ఎవరైతే, అల్లాహ్‌తో పాటు ఇతర దైవాలను ఆరాధించరో! మరియు అల్లాహ్ నిషేధించిన ఏ ప్రాణిని కూడ న్యాయానికి తప్ప చంపరో![3]

وَٱلَّذِينَ لَا يَدۡعُونَ مَعَ ٱللَّهِ إِلَٰهًا ءَاخَرَ وَلَا يَقۡتُلُونَ ٱلنَّفۡسَ ٱلَّتِي

1. చూడండి, 28:55, 43:89.
2. వారే అనంతకరుణామయునికి ప్రియులైనవారు ఎవరైతే నమా'జ్ చేస్తారో, విధిదానం ('జకాత్) ఇస్తారో, సత్కార్యాలు చేస్తారో మరియు తమ ప్రభువును రేయింబవళ్ళు నరకపు శిక్షనుండి తొలగించమని ప్రార్థిస్తారో! అంటే అల్లాహ్ (సు.తా.) ఆరాధన చేస్తూ ఆయన ఆజ్ఞలను శిరసావహిస్తూ ఉండి కూడా, దానికై గర్వితులు కారో మరియు సదా తమ ప్రభువు శిక్షనుండి భీతిపరులై ఉంటారో, అలాంటి వారు! ఇంకా చూడండి, 23:60.
3. న్యాయానికి చంపే పరిస్థితులు మూడు: 1) ఇస్లాం స్వీకరించిన తరువాత మరల సత్యతిరస్కారి అవటం, 2) పెండ్లి అయినవాడు వ్యభిచారం చేయటం, 3) ఎవరినైనా చంపటం.

మరియు వ్యభిచారానికి పాల్పడరో.[1] మరియు ఈ విధంగా చేసేవాడు దాని ఫలితాన్ని తప్పక పొందుతాడు.

حَرَّمَ ٱللَّهُ إِلَّا بِٱلْحَقِّ وَلَا يَزْنُونَ ۚ وَمَن يَفْعَلْ ذَٰلِكَ يَلْقَ أَثَامًا ﴿٦٨﴾

**69**. పునరుత్థాన దినంనాడు, అతనికి రెట్టింపు శిక్షపడుతుంది మరియు అతడు అందులోనే అవమానంతో శాశ్వతంగా పడి ఉంటాడు.

يُضَٰعَفْ لَهُ ٱلْعَذَابُ يَوْمَ ٱلْقِيَٰمَةِ وَيَخْلُدْ فِيهِۦ مُهَانًا ﴿٦٩﴾

**70**. కాని, ఇక ఎవరైతే (తాము చేసిన పాపాలకు) పశ్చాత్తాపపడి, విశ్వసించి సత్కార్యాలు చేస్తారో! అలాంటి వారి పాపాలను అల్లాహ్ పుణ్యాలుగా మార్చుతాడు.[2] మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

إِلَّا مَن تَابَ وَءَامَنَ وَعَمِلَ عَمَلًا صَٰلِحًا فَأُو۟لَٰٓئِكَ يُبَدِّلُ ٱللَّهُ سَيِّـَٔاتِهِمْ حَسَنَٰتٍ ۗ وَكَانَ ٱللَّهُ غَفُورًا رَّحِيمًا ﴿٧٠﴾

**71**. మరియు ఎవడైతే, పశ్చాత్తాపపడి సత్కార్యాలు చేస్తాడో! నిశ్చయంగా అలాంటి వాడు హృదయపూర్వకంగా అల్లాహ్ వైపునకు పశ్చాత్తాపంతో మరలుతాడు!

وَمَن تَابَ وَعَمِلَ صَٰلِحًا فَإِنَّهُۥ يَتُوبُ إِلَى ٱللَّهِ مَتَابًا ﴿٧١﴾

---

**1**. ఒకడు దైవప్రవక్త('స'అస)తో ప్రశ్నించాడు: 'అన్నిటి కంటే మహాపాపం ఏమిటీ?' అతను ('స'అస) జవాబిచ్చారు: 'అల్లాహ్ (సు.తా.)కు ఎవరినైనా సాటికల్పించటం (షిర్క్). ఎందుకంటే ఆయనయే నిన్ను సృష్టించాడు.' అతడన్నాడు: 'దాని తరువాత ఏ పాపం పెద్దది?' దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'తన సంతానాన్ని జీవనోపాధికి భయపడి చంపటం.' అతడు మళ్ళీ అడిగాడు ఆ తరువాత అతను జవాబిచ్చారు: 'తన పొరుగు వాని భార్యతో వ్యభిచారం చేయటం!' ఆ తరువాత దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'ఈ మూడు విషయాలు ఈ ఆయత్‌తో విశదీకరింపబడుతున్నాయి.' అని ఈ ఆయత్‌ను చదివారు ('స. బు'ఖారీ, ముస్లిం).

**2**. ఎంత పెద్ద పాపం చేసినా మరణానికి ముందు దానికై సహృదయంతో పశ్చాత్తపపడితే అల్లాహ్ (సు.తా.) క్షమించవచ్చు, ఒక్క షిర్క్ తప్ప! చూడండి, 4:93 అతడు క్షమాపణ వేడుకొననిదే మరణిస్తే నరకం తప్పదు. ('స. ముస్లిం).

وَٱلَّذِينَ لَا يَشۡهَدُونَ ٱلزُّورَ
وَإِذَا مَرُّواْ بِٱللَّغۡوِ مَرُّواْ كِرَامٗا ٧٢

72. మరియు ఎవరైతే, అబద్ధమైన సాక్ష్యం ఇవ్వరో! మరియు వ్యర్థమైన పనుల వైపునుండి పోవటం జరిగితే, సంస్కారవంతులుగా అక్కడి నుండి దాటిపోతారో![1]

وَٱلَّذِينَ إِذَا ذُكِّرُواْ بِـَٔايَٰتِ
رَبِّهِمۡ لَمۡ يَخِرُّواْ عَلَيۡهَا صُمّٗا
وَعُمۡيَانٗا ٧٣

73. మరియు ఎవరైతే, తమ ప్రభువు సూచన (ఆయతు)ల హితబోధ చేసినపుడు, వారు దానికి చెవిటివారిగా మరియు గ్రుడ్డివారిగా ఉండిపోరో!

وَٱلَّذِينَ يَقُولُونَ رَبَّنَا هَبۡ لَنَا
مِنۡ أَزۡوَٰجِنَا وَذُرِّيَّٰتِنَا قُرَّةَ
أَعۡيُنٖ وَٱجۡعَلۡنَا لِلۡمُتَّقِينَ
إِمَامًا ٧٤

74. మరియు ఎవరైతే, ఇలా ప్రార్థిస్తారో: "ఓ మా ప్రభూ! మా సహవాసు(అ'జ్వాజ్)ల మరియు సంతానం ద్వారా మా కన్నులకు చల్లదనం ప్రసాదించు మరియు మమ్మల్ని దైవభీతి గల వారికి నాయకు(ఇమాము)లుగా చేయి."

أُوْلَٰٓئِكَ يُجۡزَوۡنَ ٱلۡغُرۡفَةَ
بِمَا صَبَرُواْ وَيُلَقَّوۡنَ فِيهَا
تَحِيَّةٗ وَسَلَٰمًا ٧٥

75. ఇలాంటి వారే తమ సహనశీలతకు ప్రతిఫలంగా (స్వర్గంలో) ఉన్నత స్థానాన్ని పొందేవారు. అక్కడ వారికి గౌరవమైన స్వాగతం మరియు శాంతి లభిస్తాయి.

خَٰلِدِينَ فِيهَاۚ حَسُنَتۡ
مُسۡتَقَرّٗا وَمُقَامٗا ٧٦

76. వారందు శాశ్వతంగా ఉంటారు. అది ఎంత మంచి నివాసం మరియు ఎంత మంచి స్థలం.

1. ల'గ్వున్: అంటే ఆ పని దేనికైతే షరీయత్లో ఎలాంటి స్థానం లేదో! ఇటువంటి చేష్టలు మరియు మాటలు జరిగేటప్పుడు, వారు అక్కడి నుండి మెల్లగా దాటిపోతారు.

قُلْ مَا يَعْبَؤُاْ بِكُمْ رَبِّي لَوْلَا دُعَآؤُكُمْۖ فَقَدْ كَذَّبْتُمْ فَسَوْفَ يَكُونُ لِزَامَۢا ﴿٧٧﴾

**77.** (ఓ ముహమ్మద్! (అవిశ్వాసులతో) ఇలా అను: "మీరు ఆయనను ప్రార్థిస్తున్నారు కాబట్టి నా ప్రభువు మిమ్మల్ని అలక్ష్యం చేయడం లేదు.[1] కాని వాస్తవానికి, ఇప్పుడు మీరు (ఆయనను) తిరస్కరించారు. కావున త్వరలోనే ఆయన శిక్ష మీ పై అనివార్య మవుతుంది." (1/4)

*****

**1**. అల్లాహ్ (సు.తా.) యందు భయభక్తులు కలిగివుండి కేవలం ఆయననే ఆరాధించే వారిని ఆయన (సు.తా.) లక్ష్యంచేస్తాడు. అల్లాహ్ (సు.తా.)ను తిరస్కరించిన వారికీ మరియు ఆయనకు సాటికల్పించిన వారికీ నరక శిక్ష తప్పదు.

## 26. సూరహ్ అష్-షు'అరా'

## سُورَةُ الشُّعَرَاءِ

అష్-షు'అరాఉ': **కవులు**. ఈ సూరహ్ పేరు **224** ఆయత్ నుండి తీసుకోబడింది. కవులు కేవలం ఊహాగానాలే చేస్తారు. వారు తాము పలికే మాటలను ఆచరించరు. ఈ సూరహ్ దైవప్రవక్త ('స'అస) యొక్క మదీనా ప్రస్థానానికి 6-7 సంవత్సరాలకు ముందు **మక్కాలో** అవతరింపజేయబడింది. ఇందులో **227 ఆయతులు** ఉన్నాయి. కాని దైవప్రవక్తలు('అలైహిమ్.స.) తమ మాటలను ఆచరణలో పెట్టి చూపుతారు. మార్గదర్శకత్వం చేస్తారు. వారు సత్యమే పలికారు. దైవప్రవక్తలు('అలైహిమ్.స.) అందరూ ఒకే విధమైన సందేశం తెచ్చారు. వారందరూ ఆరాధనను కేవలం అల్లాహ్ (సు.తా.)కు మాత్రమే ప్రత్యేకించుకొని, అల్లాహ్(సు.తా.)కు విధేయులై ఉండాలని (ఇస్లాం) మరియు ఆయనకు భాగస్వాములను కల్పించటం, ఎన్నడూ క్షమించబడని పాపమని బోధించారు. ఈ సూరహ్ నుండి క్రొత్త విధమైన నాలుగు సూరహ్‌లు వస్తున్నాయి. వాటి(26-29)లో దైవప్రవక్తల ద్వారా పంపబడిన దివ్యజ్యోతి మరియు దానికి వారి కాలపు ప్రజల ప్రతిక్రియలు వివరించబడ్డాయి. ఇందులో మూసా, ఇబ్రాహీమ్, నూ'హ్, హూద్, 'సాలి'హ్, లూ'త్ మరియు షు'ఐబ్ ('అలైహిమ్ అస్సలాముల) విషయాలున్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

طسٓمٓ ﴿١﴾

**1.** * 'త-సీన్-మీమ్.

تِلْكَ ءَايَٰتُ ٱلْكِتَٰبِ ٱلْمُبِينِ ﴿٢﴾

**2.** ఇవి స్పష్టమైన గ్రంథ సూచన (ఆయతు)లు.

لَعَلَّكَ بَٰخِعٌ نَّفْسَكَ أَلَّا يَكُونُوا۟ مُؤْمِنِينَ ﴿٣﴾

**3.** (ఓ ము'హమ్మద్) వారు విశ్వసించలేదనే బాధతో బహుశా నీవు నీ ప్రాణాలే కోల్పోతావేమో![1]

إِن نَّشَأْ نُنَزِّلْ عَلَيْهِم مِّنَ ٱلسَّمَآءِ ءَايَةً فَظَلَّتْ أَعْنَٰقُهُمْ لَهَا خَٰضِعِينَ ﴿٤﴾

**4.** మేము కోరితే ఆకాశం నుండి వారిపై ఒక అద్భుత సంకేతాన్ని (ఆయత్) అవతరింపజేసి, దానికి వారి మెడలను నమ్రతతో వంగిపోయేలా చేసేవారము.

**1.** ఇటువంటి ఆయత్‌కు చూడండి, 18:6.

5. మరియు వారి వద్దకు అనంత కరుణామయుని వద్దనుండి క్రొత్త సందేశం వచ్చినప్పుడల్లా, వారు దాని నుండి విముఖులు కాకుండా ఉండలేదు.

6. వాస్తవానికి, ఇప్పుడు వారు తిరస్కరించారు, కాని త్వరలోనే వారు ఎగతాళి చేస్తూవచ్చిన దాని యథార్థమేమిటో వారికి తెలిసిపోతుంది.[1]

7. ఏమీ? వారు భూమివైపు చూడలేదా? మేము దానిలో ఎంత పుష్కలంగా శ్రేష్ఠమైన రకరకాల వాటిని (జీవరాసుల్ని)[2] పుట్టించామో?

8. నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలామంది విశ్వసించడం లేదు.

9. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

10. మరియు నీ ప్రభువు మూసాను ఇలా ఆదేశించిన విషయాన్ని వారికి జ్ఞాపకం చేయించు: "దుర్మార్గులైన జాతి ప్రజల వద్దకు వెళ్ళు;[3]

11. "ఫిర్'ఔన్ జాతి వారి వద్దకు. ఏమీ? వారికి దైవభీతిలేదా?"

وَمَا يَأْتِيهِم مِّن ذِكْرٍ مِّنَ ٱلرَّحْمَٰنِ مُحْدَثٍ إِلَّا كَانُوا۟ عَنْهُ مُعْرِضِينَ ٥

فَقَدْ كَذَّبُوا۟ فَسَيَأْتِيهِمْ أَنۢبَٰٓؤُا۟ مَا كَانُوا۟ بِهِۦ يَسْتَهْزِءُونَ ٦

أَوَلَمْ يَرَوْا۟ إِلَى ٱلْأَرْضِ كَمْ أَنۢبَتْنَا فِيهَا مِن كُلِّ زَوْجٍ كَرِيمٍ ٧

إِنَّ فِى ذَٰلِكَ لَءَايَةً ۖ وَمَا كَانَ أَكْثَرُهُم مُّؤْمِنِينَ ٨

وَإِنَّ رَبَّكَ لَهُوَ ٱلْعَزِيزُ ٱلرَّحِيمُ ٩

وَإِذْ نَادَىٰ رَبُّكَ مُوسَىٰٓ أَنِ ٱئْتِ ٱلْقَوْمَ ٱلظَّٰلِمِينَ ١٠

قَوْمَ فِرْعَوْنَ ۚ أَلَا يَتَّقُونَ ١١

1. చూడండి, 6:4-5.
2. 'జౌజున్: అంటే ఇక్కడ వివిధరకాలు అని అర్థం.
3. మూసా ('అ.స.) తన పరివారంతో సహా తిరిగి ఈజిప్టుకు వస్తున్నప్పుడు అతనికి ఒక వెలుగు కనిపిస్తుంది. అతను దాని దగ్గరికి వెళ్ళినప్పుడు ఈ ఆదేశం వస్తుంది.

قَالَ رَبِّ إِنِّيٓ أَخَافُ أَن يُكَذِّبُونِ ١٢

12. (మూసా) అన్నాడు: "ఓ నా ప్రభూ! వారు నన్ను అసత్యుడవని తిరస్కరిస్తారేమోనని నేను భయపడు తున్నాను.[1]

وَيَضِيقُ صَدۡرِي وَلَا يَنطَلِقُ لِسَانِي فَأَرۡسِلۡ إِلَىٰ هَٰرُونَ ١٣

13. "నా హృదయం కుంచించుకు పోతోంది మరియు నా నాలుక తడబడుతోంది,[2] కావున నీవు హారూన్ వద్దకు కూడా (వ'హీ) పంపు.

وَلَهُمۡ عَلَيَّ ذَنۢبٞ فَأَخَافُ أَن يَقۡتُلُونِ ١٤

14. "మరియు వారి దగ్గర నా మీద ఒక నేరం మోపబడి ఉంది,[3] కావున వారు నన్ను చంపుతారేమోనని భయపడు తున్నాను."

قَالَ كَلَّاۖ فَٱذۡهَبَا بِـَٔايَٰتِنَآۖ إِنَّا مَعَكُم مُّسۡتَمِعُونَ ١٥

15. (అల్లాహ్) సెలవిచ్చాడు: "అట్లు కానేరదు! మీరిద్దరూ మా సూచనలతో వెళ్ళండి. నిశ్చయంగా, మేము కూడా మీతో పాటు ఉండి సర్వమూ వింటూ ఉంటాము.[4]

فَأۡتِيَا فِرۡعَوۡنَ فَقُولَآ إِنَّا رَسُولُ رَبِّ ٱلۡعَٰلَمِينَ ١٦

16. "కావున మీరిద్దరూ ఫిర్'ఔన్ వద్దకు వెళ్ళి అనండి: 'నిశ్చయంగా, మేము సర్వలోకాల పోషకుని సందేశహరులము.

---

1. దీనితో తెలిసేదేమిటంటే సాధారణ మానవులవలె, దైవప్రవక్తలకు కూడా సహజమైన భయం కలగవచ్చు.
2. దీనికి కారణం అతని నాలుకలో ఉన్న ముడి ('ఉఖ్దతున్) చూడండి, 20:25-34.
3. ఇది మూసా ('అ.స.) ఈజిప్టు నుండి వెళ్ళిపోకముందు అనుకోకుండా జరిగిన సంఘటన. ఒక ఫిర్'ఔన్ జాతివాడు, ఒక ఇస్రాయీ'ల్ జాతివానితో కలహిస్తూ ఉండగా - ఇస్రాయీ'లు వాని పిలుపు విని - మూసా ('అ.స.) అతనికి సహాయపడటానికి, ఫిర్'ఔన్ జాతి వానిని ఒక దెబ్బ కొట్టడం వల్ల, అతడు మరణిస్తాడు. ఆ నేరానికి వారు అతనిని చంపగోరుతారు. (వివరాలకు చూడండి, 28:15).
4. 'మీతోపాటు ఉండి.' అంటే అల్లాహ్ (సు.తా.) నేలపైకి ప్రతి మానవుని దగ్గరికి రాడు. ఆయన జ్ఞానం ప్రతి ఒక్కరితో ఉంటుంది. కాని అల్లాహ్ (సు.తా.) 'అర్ష్ పైననే కూర్చుని ఉంటాడు. అంటే విశ్వంలో జరిగేది ఏది కూడా అల్లాహ్ (సు.తా.)కు తెలియకుండా లేదు.

أَنۡ أَرۡسِلۡ مَعَنَا بَنِيٓ إِسۡرَٰٓءِيلَ ١٧

**17.** " 'కావున ఇస్రాయీ'ల్ సంతతి వారిని మావెంట పోనివ్వు.' "[1]

قَالَ أَلَمۡ نُرَبِّكَ فِينَا وَلِيدٗا وَلَبِثۡتَ فِينَا مِنۡ عُمُرِكَ سِنِينَ ١٨

**18.** (ఫిర్'ఔన్) అన్నాడు: "ఏమీ? మేము నిన్ను బాల్యంలో మాతోపాటు పోషించలేదా? మరియు నీవు నీ వయస్సులోని అనేక సంవత్సరాలు మాతోపాటు గడిపావు కదా!

وَفَعَلۡتَ فَعۡلَتَكَ ٱلَّتِي فَعَلۡتَ وَأَنتَ مِنَ ٱلۡكَٰفِرِينَ ١٩

**19.** "అయినా నీవు హీనమైన ఆ పని చేశావు, కావున నీవు కృతఘ్నులలోని వాడవు!"[2]

قَالَ فَعَلۡتُهَآ إِذٗا وَأَنَا۠ مِنَ ٱلضَّآلِّينَ ٢٠

**20.** (మూసా) అన్నాడు: "నేను పొరపాటుగా ఆ పని చేశాను!

فَفَرَرۡتُ مِنكُمۡ لَمَّا خِفۡتُكُمۡ فَوَهَبَ لِي رَبِّي حُكۡمٗا وَجَعَلَنِي مِنَ ٱلۡمُرۡسَلِينَ ٢١

**21.** "ఆ పిదప మీకు భయపడి పారిపోయాను. కాని ఆ తరువాత నా ప్రభువు నాకు వివేకాన్ని ప్రసాదించి, నన్ను సందేశహరులలో చేర్చుకున్నాడు.[3]

وَتِلۡكَ نِعۡمَةٞ تَمُنُّهَا عَلَيَّ أَنۡ عَبَّدتَّ بَنِيٓ إِسۡرَٰٓءِيلَ ٢٢

**22.** "ఇక నీవు నాకు చేసిన ఆ ఉపకారానికి నన్ను ఎత్తి పొడిస్తే! నీవు మాత్రం ఇస్రాయీ'ల్ సంతతి వారినంతా బానిసలుగా చేసుకున్నావు కదా!"[4]

قَالَ فِرۡعَوۡنُ وَمَا رَبُّ ٱلۡعَٰلَمِينَ ٢٣

**23.** (ఫిర్'ఔన్) అడిగాడు: "అయితే ఈ సర్వలోకాల ప్రభువు అంటే ఏమిటి?"[5]

---

**1**. ఎందుకంటే నీవు నాలుగు వందల సంవత్సరాలు వారిని బానిసలుగా చేసి ఉంచావు. ఇప్పుడు వారికి స్వేచ్ఛనివ్వు. నేను వారిని బైతుల్ మఖ్దిస్ వైపునకు తీసుకొని పోతాను.

**2**. చూడండి, 28:4-22, హీనమైన పని అంటే ఒక ఫిర్'ఔన్ జాతి వానిని దెబ్బకొట్టి చంపింది.

**3**. చూడండి, 28:15-16.

**4**. చూడండి, 28:4-5.

**5**. ఫిర్'ఔన్ తన దురహంకారంలో ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు. ఎందుకంటే ఈజిప్టు వాసులందరికీ అతడు, తానే దైవమని చెప్పి, తన ఆరాధ్యం చేయించుకునేవాడు. చూడండి, 28:38.

قَالَ رَبُّ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ
وَمَا بَيْنَهُمَآ إِن كُنتُم مُّوقِنِينَ ﴿٢٤﴾

**24**. (మూసా) జవాబిచ్చాడు: "మీరు నమ్మేవారే అయితే! ఆయనే ఆకాశాలకూ మరియు భూమికీ మరియు వాటి మధ్య ఉన్న సమస్తానికీ ప్రభువు!"

قَالَ لِمَنْ حَوْلَهُۥٓ أَلَا تَسْتَمِعُونَ ﴿٢٥﴾

**25**. (ఫిర్`ఔన్) తన చుట్టూ ఉన్న వారితో: "ఏమీ? మీరు వింటున్నారా?"[1] అని ప్రశ్నించాడు.

قَالَ رَبُّكُمْ وَرَبُّ ءَابَآئِكُمُ ٱلْأَوَّلِينَ
﴿٢٦﴾

**26**. (మూసా) అన్నాడు: "ఆయన (అల్లాహ్) మీ ప్రభువు మరియు మీ పూర్వీకులైన మీ తాతముత్తాతల ప్రభువు కూడానూ!"

قَالَ إِنَّ رَسُولَكُمُ ٱلَّذِىٓ أُرْسِلَ
إِلَيْكُمْ لَمَجْنُونٌ ﴿٢٧﴾

**27**. (ఫిర్`ఔన్) అన్నాడు: "మీ వద్దకు పంపబడిన మీ ఈ సందేశహరుడు నిశ్చయంగా, పిచ్చివాడే!"

قَالَ رَبُّ ٱلْمَشْرِقِ وَٱلْمَغْرِبِ وَمَا
بَيْنَهُمَآ إِن كُنتُمْ تَعْقِلُونَ ﴿٢٨﴾

**28**. (మూసా) అన్నాడు: "మీరు అర్థంచేసుకో గలిగితే! ఆయనే తూర్పు పడమరలకూ మరియు వాటి మధ్య ఉన్న సమస్తానికీ ప్రభువు."[2]

قَالَ لَئِنِ ٱتَّخَذْتَ إِلَٰهًا غَيْرِى
لَأَجْعَلَنَّكَ مِنَ ٱلْمَسْجُونِينَ ﴿٢٩﴾

**29**. (ఫిర్`ఔన్) అన్నాడు: "నీవు నన్ను కాదని మరెవరినైనా ఆరాధ్య దైవంగా చేసుకుంటే నేను నిన్ను చెరసాలలో ఉన్నవారితో చేర్చుతాను."

قَالَ أَوَلَوْ جِئْتُكَ بِشَىْءٍ مُّبِينٍ
﴿٣٠﴾

**30**. (మూసా) అన్నాడు: "ఏమీ? నేను నీ వద్దకు ఒక స్పష్టమైన విషయాన్ని (సత్యాన్ని) తీసుకు వచ్చిన తరువాత కూడానా?"[3]

---

**1**. నేను తప్ప మీకు మరొక ప్రభువు కూడా ఉన్నాడా?
**2**. చూడండి, 2:115.
**3**. చూడండి, 12:1.

31. (ఫిర్'ఔన్) అన్నాడు: "నీవు సత్యవంతుడవే అయితే దానిని (ఆ అద్భుత సూచనను) చూపు!"

32. అప్పుడు (మూసా) తన చేతి కర్రను పడవేయగానే, అది ఒక స్పష్టమైన పెద్ద సర్పంగా మారిపోయింది.[1]

33. తరువాత అతను (మూసా) తన చేతిని (చంకనుండి) వెలుపలికి తీయగానే, అది చూసేవారి యెదుట తెల్లగా ప్రకాశించసాగింది![2]

34. (ఫిర్'ఔన్) తన చుట్టూ ఉన్న నాయకులతో అన్నాడు: "నిశ్చయంగా, ఇతనొక నేర్పుగల మాంత్రికుడు.

35. "ఇతను తన మంత్రజాలంతో మిమ్మల్ని మీ దేశంనుండి తరుమ గోరుతున్నాడు! అయితే మీ సలహా ఏమిటి?"[3]

36. వారన్నారు: "అతనిని మరియు అతని సోదరుణ్ణి ఆపి ఉంచు మరియు (మంత్రగాళ్ళను) సమావేశపరచటానికి అన్ని నగరాలకు వార్తాహరులను పంపు;

37. "వారు నీ వద్దకు నేర్పుగల ప్రతి మాంత్రికుణ్ణి తెస్తారు."

38. ఈ విధంగా ఒక నియమిత రోజున ఒక నియమిత ప్రదేశంలో మాంత్రికులంతా సమావేశపరచబడ్డారు.[4]

قَالَ فَأْتِ بِهِۦٓ إِن كُنتَ مِنَ ٱلصَّٰدِقِينَ ﴿٣١﴾

فَأَلْقَىٰ عَصَاهُ فَإِذَا هِىَ ثُعْبَانٌ مُّبِينٌ ﴿٣٢﴾

وَنَزَعَ يَدَهُۥ فَإِذَا هِىَ بَيْضَآءُ لِلنَّٰظِرِينَ ﴿٣٣﴾

قَالَ لِلْمَلَإِ حَوْلَهُۥٓ إِنَّ هَٰذَا لَسَٰحِرٌ عَلِيمٌ ﴿٣٤﴾

يُرِيدُ أَن يُخْرِجَكُم مِّنْ أَرْضِكُم بِسِحْرِهِۦ فَمَاذَا تَأْمُرُونَ ﴿٣٥﴾

قَالُوٓا۟ أَرْجِهْ وَأَخَاهُ وَٱبْعَثْ فِى ٱلْمَدَآئِنِ حَٰشِرِينَ ﴿٣٦﴾

يَأْتُوكَ بِكُلِّ سَحَّارٍ عَلِيمٍ ﴿٣٧﴾

فَجُمِعَ ٱلسَّحَرَةُ لِمِيقَٰتِ يَوْمٍ مَّعْلُومٍ ﴿٣٨﴾

1. జాన్నున్ (27:10, 28:31) అంటే - చిన్న సర్పం. సు'అబా నున్ (7:107) అంటే - పెద్ద సర్పం. 'హయ్యాతున్(20:20) అంటే - చిన్నదీకావచ్చు పెద్దదీ కావచ్చు. (ఫ'త్హ్ అల్-ఖదీర్).
2. చూడండి, 7:107-108, 20:22, 27:12, 28:38.
3. చూడండి, 7:109-110.
4. ఇది అల్లాహ్ (సు.తా.) ఇచ్ఛయే! ప్రజలకు, మూసా ('అ.స.) సత్యుడని మరియు మాంత్రికులు చేసేదంతా బూటక కల్పనలని నిరూపించటానికి. చూడండి, 21:18.

وَقِيلَ لِلنَّاسِ هَلْ أَنتُم مُّجْتَمِعُونَ ٣٩

39. మరియు ప్రజలతో ఇలా ప్రశ్నించడం జరిగింది: "ఏమీ? మీరంతా సమావేశమయ్యారా?

لَعَلَّنَا نَتَّبِعُ ٱلسَّحَرَةَ إِن كَانُواْ هُمُ ٱلْغَٰلِبِينَ ٤٠

40. "ఒకవేళ మాంత్రికులు గెలుపొందితే మనమంతా వారిని అనుసరించాలి కదా!"

فَلَمَّا جَآءَ ٱلسَّحَرَةُ قَالُواْ لِفِرْعَوْنَ أَئِنَّ لَنَا لَأَجْرًا إِن كُنَّا نَحْنُ ٱلْغَٰلِبِينَ ٤١

41. మాంత్రికులు వచ్చిన తరువాత ఫిర్'ఔన్‌తో అన్నారు: "మేము గెలుపొందితే నిశ్చయంగా, మాకు బహుమానముంది కదా?"[1]

قَالَ نَعَمْ وَإِنَّكُمْ إِذًا لَّمِنَ ٱلْمُقَرَّبِينَ ٤٢

42. (ఫిర్'ఔన్) అన్నాడు: "అవును! నిశ్చయంగా, అప్పుడు మీరు నా సన్నిహితులలో చేరుతారు!"

قَالَ لَهُم مُّوسَىٰٓ أَلْقُواْ مَآ أَنتُم مُّلْقُونَ ٤٣

43. మూసా వారితో అన్నాడు: "మీరు విసరదలుచుకున్న దానిని విసరండి!"

فَأَلْقَوْاْ حِبَالَهُمْ وَعِصِيَّهُمْ وَقَالُواْ بِعِزَّةِ فِرْعَوْنَ إِنَّا لَنَحْنُ ٱلْغَٰلِبُونَ ٤٤

44. అప్పుడు వారు తమ త్రాళ్ళను మరియు తమ కర్రలను విసిరి ఇలా అన్నారు: "ఫిర్'ఔన్ శక్తి సాక్షిగా! నిశ్చయంగా, మేమే విజయం పొందుతాము."[2]

فَأَلْقَىٰ مُوسَىٰ عَصَاهُ فَإِذَا هِيَ تَلْقَفُ مَا يَأْفِكُونَ ٤٥

45. ఆ తరువాత మూసా తన కర్రను పడవేయగా, తక్షణమే అది వారి బూటకపు కల్పనలను మ్రింగివేసింది.[3]

فَأُلْقِيَ ٱلسَّحَرَةُ سَٰجِدِينَ ٤٦

46. అప్పుడు ఆ మాంత్రికులు సజ్దాలో పడ్డారు.

---

1. చూడండి, 7:113.
2. చూడండి, 7:116 మరియు 20:66-67.
3. చూడండి, 7:117.

قَالُوٓاْ ءَامَنَّا بِرَبِّ ٱلْعَٰلَمِينَ ﴿٤٧﴾

47. వారన్నారు: "మేము సర్వలోకాల ప్రభువును విశ్వసిస్తున్నాము.

رَبِّ مُوسَىٰ وَهَٰرُونَ ﴿٤٨﴾

48. "మూసా మరియు హారూన్‌ల ప్రభువును."

قَالَ ءَامَنتُمْ لَهُۥ قَبْلَ أَنْ ءَاذَنَ لَكُمْ ۖ إِنَّهُۥ لَكَبِيرُكُمُ ٱلَّذِى عَلَّمَكُمُ ٱلسِّحْرَ فَلَسَوْفَ تَعْلَمُونَ ۚ لَأُقَطِّعَنَّ أَيْدِيَكُمْ وَأَرْجُلَكُم مِّنْ خِلَٰفٍ وَلَأُصَلِّبَنَّكُمْ أَجْمَعِينَ ﴿٤٩﴾

49. (ఫిర్'ఔన్) అన్నాడు: "నేను మీకు అనుమతి ఇవ్వక ముందే మీరు ఇతనిని విశ్వసిస్తారా?[1] నిశ్చయంగా, ఇతడే మీ గురువు, మీకు జాలవిద్యను నేర్పినవాడు. సరే! ఇప్పుడే మీరు తెలుసుకుంటారు. నేను మీ వ్యతిరేక (ప్రతిపక్ష) దిశల చేతులను మరియు కాళ్ళను నరికిస్తాను మరియు మీరందరినీ సిలువపై ఎక్కిస్తాను."[2]

قَالُواْ لَا ضَيْرَ ۖ إِنَّآ إِلَىٰ رَبِّنَا مُنقَلِبُونَ ﴿٥٠﴾

50. (మాంత్రికులు) అన్నారు: "బాధలేదు! నిశ్చయంగా, మేము మా ప్రభువు వద్దకే కదా మరలిపోయేది!

إِنَّا نَطْمَعُ أَن يَغْفِرَ لَنَا رَبُّنَا خَطَٰيَٰنَآ أَن كُنَّآ أَوَّلَ ٱلْمُؤْمِنِينَ ﴿٥١﴾

51. "నిశ్చయంగా, మా ప్రభువు మా పాపాలను క్షమిస్తాడని మేము ఆశిస్తున్నాము, ఎందుకంటే వాస్తవానికి అందరికంటే ముందుగా విశ్వసించిన వారము మేమే!" (3/8)

۞ وَأَوْحَيْنَآ إِلَىٰ مُوسَىٰٓ أَنْ أَسْرِ بِعِبَادِىٓ إِنَّكُم مُّتَّبَعُونَ ﴿٥٢﴾

52. * మరియు మేము మూసాకు ఈ విధంగా దివ్యజ్ఞానం (వ'హీ) పంపాము: "నీవు నా దాసులను రాత్రివేళ తీసుకొని వెళ్ళిపో నిశ్చయంగా, మీరు వెంబడించ బడతారు."[3]

1. చూడండి, 7:123.
2. చూడండి, 5:33 మరియు 7:124.
3. చూడండి, 7:130.

53. తరువాత ఫిర్ఔన్ అన్ని పట్టణాలకు వార్తాహరులను పంపాడు.

فَأَرْسَلَ فِرْعَوْنُ فِي ٱلْمَدَآئِنِ حَٰشِرِينَ ﴿٥٣﴾

54. (ఇలా ప్రకటన చేయించాడు): "వాస్తవానికి (ఈ ఇస్రాయీ'ల్ సంతతివారు) ఒక చిన్న తెగవారు మాత్రమే.

إِنَّ هَٰٓؤُلَآءِ لَشِرْذِمَةٌ قَلِيلُونَ ﴿٥٤﴾

55. "మరియు నిశ్చయంగా, వారు మాకు చాలా కోపం తెప్పించారు;

وَإِنَّهُمْ لَنَا لَغَآئِظُونَ ﴿٥٥﴾

56. "మరియు నిశ్చయంగా, మనం ఐకమత్యంతో ఉండి జాగరూకత చూపేవారము;

وَإِنَّا لَجَمِيعٌ حَٰذِرُونَ ﴿٥٦﴾

57. "కావున మేము వారిని, తోటలనుండి మరియు చెలమల నుండి వెళ్ళగొట్టాము;

فَأَخْرَجْنَٰهُم مِّن جَنَّٰتٍ وَعُيُونٍ ﴿٥٧﴾

58. "మరియు కోశాగారాల నుండి మరియు ఉన్నతమైన స్థానాల నుండి కూడా."

وَكُنُوزٍ وَمَقَامٍ كَرِيمٍ ﴿٥٨﴾

59. అందువల్ల! తరువాత మేము ఇస్రాయీ'ల్ సంతతివారిని, వాటికి వారసులుగా చేశాము.[1]

كَذَٰلِكَ وَأَوْرَثْنَٰهَا بَنِيٓ إِسْرَٰٓءِيلَ ﴿٥٩﴾

60. ఇక (ఫిర్ఔన్ జాతి) వారు, సూర్యోదయ కాలమున (ఇస్రాయీ'ల్ సంతతి) వారిని వెంబడించసాగారు.

فَأَتْبَعُوهُم مُّشْرِقِينَ ﴿٦٠﴾

61. ఆ ఇరుపక్షాల వారు ఒకరినొకరు ఎదురు పడినప్పుడు, మూసా అనుచరులు అన్నారు: "నిశ్చయంగా మేము చిక్కిపోయాము!"

فَلَمَّا تَرَٰٓءَا ٱلْجَمْعَانِ قَالَ أَصْحَٰبُ
مُوسَىٰٓ إِنَّا لَمُدْرَكُونَ ﴿٦١﴾

---

1. చూడండి, 7:137.

62. (మూసా) అన్నాడు: "అట్లు కానేరదు! నిశ్చయంగా, నా ప్రభువు నాతో ఉన్నాడు. ఆయన నాకు మార్గదర్శకత్వం చేస్తాడు (మార్గము చూపుతాడు)."[1]

قَالَ كَلَّآ إِنَّ مَعِيَ رَبِّي سَيَهۡدِينِ ٦٢

63. అప్పుడు మేము మూసాకు: "నీ చేతి కర్రతో సముద్రాన్ని కొట్టు!" అని వ'హీ ద్వారా తెలిపాము. అప్పుడది హటాత్తుగా చీలిపోయింది, దాని ప్రతి భాగం ఒక మహా పర్వతం మాదిరిగా అయిపోయింది.[2]

فَأَوۡحَيۡنَآ إِلَىٰ مُوسَىٰٓ أَنِ ٱضۡرِب بِّعَصَاكَ ٱلۡبَحۡرَۖ فَٱنفَلَقَ فَكَانَ كُلُّ فِرۡقٖ كَٱلطَّوۡدِ ٱلۡعَظِيمِ ٦٣

64. మరియు అక్కడికి మేము రెండవ పక్షంవారిని సమీపింపజేశాము.

وَأَزۡلَفۡنَا ثَمَّ ٱلۡأٓخَرِينَ ٦٤

65. మరియు మూసాను మరియు అతనితో పాటు ఉన్నవారిని అందరినీ రక్షించాము.

وَأَنجَيۡنَا مُوسَىٰ وَمَن مَّعَهُۥٓ أَجۡمَعِينَ ٦٥

66. ఆ తరువాత మిగతా వారినందరినీ ముంచివేశాము.

ثُمَّ أَغۡرَقۡنَا ٱلۡأٓخَرِينَ ٦٦

67. నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలా మంది విశ్వసించడం లేదు.

إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةٗۖ وَمَا كَانَ أَكۡثَرُهُم مُّؤۡمِنِينَ ٦٧

68. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వశక్తి సంపన్నుడు, అపార కరుణాప్రదాత.

وَإِنَّ رَبَّكَ لَهُوَ ٱلۡعَزِيزُ ٱلرَّحِيمُ ٦٨

69. ఇక వారికి ఇబ్రాహీమ్ గాథను వినిపించు.

وَٱتۡلُ عَلَيۡهِمۡ نَبَأَ إِبۡرَٰهِيمَ ٦٩

70. అతను తన తండ్రితో మరియు తన జాతివారితో: "మీరెవరిని ఆరాధిస్తున్నారు?" అని అడిగినపుడు;

إِذۡ قَالَ لِأَبِيهِ وَقَوۡمِهِۦ مَا تَعۡبُدُونَ ٧٠

1. అంటే అల్లాహ్ (సు.తా.) సహాయం నాతో ఉంది.
2. చూడండి, 20:77.

**71**. వారన్నారు: "మేము విగ్రహాలను ఆరాధిస్తున్నాము మరియు మేము వాటికే ఎల్లప్పుడు భక్తులమై ఉంటాము."

قَالُواْ نَعۡبُدُ أَصۡنَامٗا فَنَظَلُّ لَهَا عَٰكِفِينَ ٧١

**72**. (ఇబ్రాహీమ్) అన్నాడు: "మీరు వీటిని పిలిచినప్పుడు ఇవి మీమొర ఆలకిస్తాయా?

قَالَ هَلۡ يَسۡمَعُونَكُمۡ إِذۡ تَدۡعُونَ ٧٢

**73**. "లేదా, మీ కేమైనా మేలు చేయగలవా? లేదా హాని చేయగలవా?"

أَوۡ يَنفَعُونَكُمۡ أَوۡ يَضُرُّونَ ٧٣

**74**. వారన్నారు: "అలాకాదు! మేము మా తండ్రితాతలను ఇలా చేస్తూఉండగా చూశాము."

قَالُواْ بَلۡ وَجَدۡنَآ ءَابَآءَنَا كَذَٰلِكَ يَفۡعَلُونَ ٧٤

**75**. అతను అన్నాడు: "ఏమీ? మీరు ఎప్పుడైనా ఆలోచించారా? మీరెవరిని ఆరాధిస్తున్నారో?

قَالَ أَفَرَءَيۡتُم مَّا كُنتُمۡ تَعۡبُدُونَ ٧٥

**76**. "మీరు గానీ మరియు మీ పూర్వీకులైన మీ తాతముత్తాతలు గానీ (ఆలోచించారా)?

أَنتُمۡ وَءَابَآؤُكُمُ ٱلۡأَقۡدَمُونَ ٧٦

**77**. "ఎందుకంటే! నిశ్చయంగా, ఇవన్నీ నా శత్రువులే! కేవలం ఆ సర్వలోకాల ప్రభువు తప్ప!

فَإِنَّهُمۡ عَدُوّٞ لِّيٓ إِلَّا رَبَّ ٱلۡعَٰلَمِينَ ٧٧

**78**. "ఆయనే నన్ను సృష్టించాడు. కాబట్టి ఆయనే నాకు మార్గదర్శకత్వం చేస్తాడు.

ٱلَّذِي خَلَقَنِي فَهُوَ يَهۡدِينِ ٧٨

**79**. "ఆయనే నాకు తినిపించే వాడు మరియు త్రాగించే వాడు.

وَٱلَّذِي هُوَ يُطۡعِمُنِي وَيَسۡقِينِ ٧٩

**80**. "మరియు నేను వ్యాధిగ్రస్తుడనైతే, ఆయనే నాకు స్వస్థత నిచ్చేవాడు.

وَإِذَا مَرِضۡتُ فَهُوَ يَشۡفِينِ ٨٠

**81**. "మరియు ఆయనే నన్ను మరణింపజేసేవాడు, తరువాత మళ్ళీ బ్రతికింపజేసేవాడు.

وَٱلَّذِي يُمِيتُنِي ثُمَّ يُحۡيِينِ ٨١

**82**. "మరియు ఆయనే తీర్పు దినమున నా తప్పులను క్షమిస్తాడని నేను ఆశిస్తున్నాను.

وَٱلَّذِىٓ أَطۡمَعُ أَن يَغۡفِرَ لِى خَطِيٓـَٔتِى يَوۡمَ ٱلدِّينِ ﴿٨٢﴾

**83**. "మరియు ఓ నా ప్రభూ! నాకు వివేకాన్ని ప్రసాదించు మరియు నన్ను సద్వర్తనులలో కలుపు.

رَبِّ هَبۡ لِى حُكۡمًا وَأَلۡحِقۡنِى بِٱلصَّـٰلِحِينَ ﴿٨٣﴾

**84**. "మరియు తరువాత వచ్చే తరాల వారిలో నాకు మంచి పేరును ప్రసాదించు.[1]

وَٱجۡعَل لِّى لِسَانَ صِدۡقٍ فِى ٱلۡأٓخِرِينَ ﴿٨٤﴾

**85**. "మరియు సర్వసుఖాల స్వర్గానికి వారసులయ్యే వారిలో నన్ను చేర్చు.

وَٱجۡعَلۡنِى مِن وَرَثَةِ جَنَّةِ ٱلنَّعِيمِ ﴿٨٥﴾

**86**. "మరియు నా తండ్రిని క్షమించు. నిశ్చయంగా, అతడు మార్గభ్రష్టులలోని వాడే![2]

وَٱغۡفِرۡ لِأَبِىٓ إِنَّهُۥ كَانَ مِنَ ٱلضَّآلِّينَ ﴿٨٦﴾

**87**. "మరియు అందరూ తిరిగి బ్రతికింపబడే రోజు నన్ను అవమానం పాలు చేయకు.

وَلَا تُخۡزِنِى يَوۡمَ يُبۡعَثُونَ ﴿٨٧﴾

**88**. "ఏ రోజునైతే ధనసంపత్తులు గానీ, సంతానం గానీ పనికిరావో!

يَوۡمَ لَا يَنفَعُ مَالٌ وَلَا بَنُونَ ﴿٨٨﴾

**89**. "కేవలం నిర్మలమైన హృదయంతో అల్లాహ్ సన్నిధిలో హాజరయ్యేవాడు తప్ప!"

إِلَّا مَنۡ أَتَى ٱللَّهَ بِقَلۡبٍ سَلِيمٍ ﴿٨٩﴾

**90**. మరియు (ఆ రోజు) స్వర్గం దైవభీతి గలవారి దగ్గరకు తీసుకు రాబడుతుంది.

وَأُزۡلِفَتِ ٱلۡجَنَّةُ لِلۡمُتَّقِينَ ﴿٩٠﴾

**91**. మరియు నరకం మార్గం తప్పిన వారిముందు పెట్టబడుతుంది.

وَبُرِّزَتِ ٱلۡجَحِيمُ لِلۡغَاوِينَ ﴿٩١﴾

---

**1**. చూడండి, 19:50.

**2**. చూడండి, 19:47-48 మరియు 9:114.

وَقِيلَ لَهُمْ أَيْنَ مَا كُنتُمْ تَعْبُدُونَ ﴿٩٢﴾

92. మరియు వారితో అనబడుతుంది: "మీరు ఆరాధించే వారు (ఆ దైవాలు) ఇప్పుడు ఎక్కడున్నారు?

مِن دُونِ ٱللَّهِ هَلْ يَنصُرُونَكُمْ أَوْ يَنتَصِرُونَ ﴿٩٣﴾

93. "అల్లాహ్‌ను వదలి (మీరు వాటిని ఆరాధించారు కదా)! ఏమీ? వారు మీకు సహాయం చేయగలరా? లేదా తమకు తామైనా సహాయం చేసుకోగలరా?"[1]

فَكُبْكِبُوا۟ فِيهَا هُمْ وَٱلْغَاوُۥنَ ﴿٩٤﴾

94. అపుడు వారు మరియు మార్గం తప్పించిన వారు, అందు(నరకం)లోకి విసిరి వేయబడతారు.

وَجُنُودُ إِبْلِيسَ أَجْمَعُونَ ﴿٩٥﴾

95. మరియు వారితో బాటు ఇ'బ్లీస్ సైనికులందరూ.[2]

قَالُوا۟ وَهُمْ فِيهَا يَخْتَصِمُونَ ﴿٩٦﴾

96. వారు పరస్పరం వాదించుకుంటూ ఇలా అంటారు:

تَٱللَّهِ إِن كُنَّا لَفِى ضَلَـٰلٍ مُّبِينٍ ﴿٩٧﴾

97. "అల్లాహ్ సాక్షిగా! మేము స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడిఉండే వారము.

إِذْ نُسَوِّيكُم بِرَبِّ ٱلْعَـٰلَمِينَ ﴿٩٨﴾

98. "ఎప్పుడైతే మేము మిమ్మల్ని సర్వలోకాల ప్రభువుతో సమానులుగా చేశామో!

وَمَآ أَضَلَّنَآ إِلَّا ٱلْمُجْرِمُونَ ﴿٩٩﴾

99. "మరియు మమ్మల్ని మార్గ భ్రష్టులుగా చేసింది కేవలం ఈ అపరాధులే.[3]

فَمَا لَنَا مِن شَـٰفِعِينَ ﴿١٠٠﴾

100. "మాకిప్పుడు సిఫారసు చేసే వారు ఎవ్వరూ లేరు.

1. అంటే దేవతలుగా భావించబడిన పుణ్యపురుషులు మరియు విగ్రహాలు లేక మానవుడు ఆరాధించే సంపత్తులు, హోదాలు ఉన్నత స్థానాలు మొదలైనవి. చూడండి, 10:28-29
2. చూడండి, 2:24 19:68 మరియు 19:83.
3. చూడండి, 7:38, 33:67-68 మరియు 38:60-61.

101. ''మరియు ఏ ప్రాణ స్నేహితుడు కూడా లేడు.

وَلَا صَدِيقٍ حَمِيمٍ ﴿١٠١﴾

102. ''ఒకవేళ మళ్ళీ మరలిపోయే అవకాశం మాకు దొరికిఉంటే, మేము తప్పకుండా విశ్వసించిన వారిలో చేరిపోయే వారము!''[1]

فَلَوْ أَنَّ لَنَا كَرَّةً فَنَكُونَ مِنَ ٱلْمُؤْمِنِينَ ﴿١٠٢﴾

103. నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలామంది విశ్వసించటం లేదు.

إِنَّ فِي ذَٰلِكَ لَءَايَةً ۖ وَمَا كَانَ أَكْثَرُهُم مُّؤْمِنِينَ ﴿١٠٣﴾

104. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

وَإِنَّ رَبَّكَ لَهُوَ ٱلْعَزِيزُ ٱلرَّحِيمُ ﴿١٠٤﴾

105. నూ'హ్ జాతి, సందేశహరులను అసత్యవాదులని తిరస్కరించింది.

كَذَّبَتْ قَوْمُ نُوحٍ ٱلْمُرْسَلِينَ ﴿١٠٥﴾

106. వారి సహోదరుడు నూ'హ్ వారితో ఇలా అన్నప్పుడు: ''ఏమీ? మీకు దైవభీతి లేదా?

إِذْ قَالَ لَهُمْ أَخُوهُمْ نُوحٌ أَلَا تَتَّقُونَ ﴿١٠٦﴾

107. ''నిశ్చయంగా, నేను మీ వద్దకు పంపబడిన, విశ్వసనీయుడనైన సందేశహరుడను.

إِنِّي لَكُمْ رَسُولٌ أَمِينٌ ﴿١٠٧﴾

108. ''కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి.

فَٱتَّقُوا ٱللَّهَ وَأَطِيعُونِ ﴿١٠٨﴾

109. ''నేను దాని కొరకు మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం సర్వలోకాల ప్రభువు వద్దనే ఉన్నది.

وَمَا أَسْـَٔلُكُمْ عَلَيْهِ مِنْ أَجْرٍ ۖ إِنْ أَجْرِيَ إِلَّا عَلَىٰ رَبِّ ٱلْعَٰلَمِينَ ﴿١٠٩﴾

1. చూడండి, 6:27-28.

110. "కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు నన్ను అనుసరించండి." (1/2)

فَٱتَّقُواْ ٱللَّهَ وَأَطِيعُونِ ١١٠

111. * వారన్నారు: "ఏమీ? మేము నిన్ను విశ్వసించాలా? నిన్ను కేవలం అధములైన[1] వారే కదా అనుసరిస్తున్నది?"

۞ قَالُوٓاْ أَنُؤۡمِنُ لَكَ وَٱتَّبَعَكَ ٱلۡأَرۡذَلُونَ ١١١

112. (నూ'హ్) అన్నాడు: "వారేమి (పనులు) చేస్తూ ఉండేవారో నాకేం తెలుసు?

قَالَ وَمَا عِلۡمِي بِمَا كَانُواْ يَعۡمَلُونَ ١١٢

113. "వారి లెక్క కేవలం నా ప్రభువు వద్ద ఉంది. మీరిది అర్థం చేసుకుంటే ఎంత బాగుండేది.[2]

إِنۡ حِسَابُهُمۡ إِلَّا عَلَىٰ رَبِّيۖ لَوۡ تَشۡعُرُونَ ١١٣

114. "మరియు, నేను విశ్వసించే వారిని ధిక్కరించేవాడను కాను.

وَمَآ أَنَا۠ بِطَارِدِ ٱلۡمُؤۡمِنِينَ ١١٤

115. "నేను కేవలం స్పష్టంగా హెచ్చరిక చేసేవాడను మాత్రమే!"

إِنۡ أَنَا۠ إِلَّا نَذِيرٞ مُّبِينٞ ١١٥

116. వారన్నారు: "ఓ నూ'హ్! నీవు దీనిని మానుకోకపోతే, నీవు తప్పక రాళ్ళురువ్వి చంపబడతావు."

قَالُواْ لَئِن لَّمۡ تَنتَهِ يَٰنُوحُ لَتَكُونَنَّ مِنَ ٱلۡمَرۡجُومِينَ ١١٦

117. (నూ'హ్) అన్నాడు: "ఓ నా ప్రభూ! నా జాతి ప్రజలు నన్ను అసత్యుడవని తిరస్కరిస్తున్నారు.

قَالَ رَبِّ إِنَّ قَوۡمِي كَذَّبُونِ ١١٧

---

1. అల్-అర్జ'లూన్: ధనసంపత్తులు లేనివారు. సమాజంలో తక్కువ శ్రేణికి చెందినవారిగా లెక్కింపబడేవారు. లేక అధమమైనవిగా భావించే వృత్తులు చేసేవారు. చూడండి, 11:27.
2. ఏ మానవుడు కూడా ఇతర మానవుడి హృదయంలో ఏముందో ఎరుగలేడు. కావున ఒకడు: 'నేను విశ్వాసుణ్ణి.' అని పలికి, తన ధర్మానికి విరుద్ధమైన చేష్టలు చేయడో, మాటలు పలుకడో, అట్టివాడు విశ్వాసుడిగానే పరిగణించబడాలి. మానవుని హృదయంలో ఉన్నది కేవలం అల్లాహ్ (సు.తా.)కే తెలుసు. కావున ఏ మానవునికి కూడా, ఇతర మానవుని విశ్వాసం గురించి అతని హృదయంలో ఉన్న ఆలోచనలను గురించి నిర్ణయం తీసుకునే హక్కు లేదు.

118. "కావున నీవే నాకూ మరియు వారికీ మధ్య తీర్పుచేయి. మరియు నన్నూ మరియు నాతో పాటు ఉన్న విశ్వాసులనూ కాపాడు."[1]

فَٱفۡتَحۡ بَيۡنِي وَبَيۡنَهُمۡ فَتۡحٗا وَنَجِّنِي وَمَن مَّعِيَ مِنَ ٱلۡمُؤۡمِنِينَ ١١٨

119. ఆ పిదప మేము అతనిని మరియు అతనితో పాటు నిండునావలో ఎక్కిఉన్న వారి నందరినీ కాపాడాము.

فَأَنجَيۡنَٰهُ وَمَن مَّعَهُۥ فِي ٱلۡفُلۡكِ ٱلۡمَشۡحُونِ ١١٩

120. ఆ తరువాత మిగతా వారినందరినీ ముంచివేశాము.[2]

ثُمَّ أَغۡرَقۡنَا بَعۡدُ ٱلۡبَاقِينَ ١٢٠

121. నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలామంది విశ్వసించడం లేదు.

إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةٗۖ وَمَا كَانَ أَكۡثَرُهُم مُّؤۡمِنِينَ ١٢١

122. నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

وَإِنَّ رَبَّكَ لَهُوَ ٱلۡعَزِيزُ ٱلرَّحِيمُ ١٢٢

123. 'ఆద్ జాతి, సందేశహరులను అసత్యవాదులని తిరస్కరించింది.

كَذَّبَتۡ عَادٌ ٱلۡمُرۡسَلِينَ ١٢٣

124. వారి సహోదరుడు[3] హూద్ వారితో ఇలా అన్నప్పుడు: "ఏమీ? మీకు దైవభీతి లేదా?

إِذۡ قَالَ لَهُمۡ أَخُوهُمۡ هُودٌ أَلَا تَتَّقُونَ ١٢٤

125. "నిశ్చయంగా, నేను మీ వద్దకు పంపబడిన, విశ్వసనీయుడనైన సందేశ హరుడను.

إِنِّي لَكُمۡ رَسُولٌ أَمِينٞ ١٢٥

---

1. చూడండి, 7:89.
2. నూ'హ్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 11:25-48. ముంచివేయబడిన వారిలో నూ'హ్ ('అ.స.) భార్య మరియు కుమారుడు కూడా ఉన్నారు. ఎందుకంటే వారు సత్యతిరస్కారులు.
3. సహోదరుడు అంటే జాతి సోదరుడు. అదే జాతికి చెందినవాడు. ఇంకా చూడండి, 7:65.

126. ''కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి.

فَٱتَّقُواْ ٱللَّهَ وَأَطِيعُونِ ١٢٦

127. ''నేను దాని కొరకు మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం సర్వలోకాల ప్రభువు వద్దనే ఉంది.

وَمَآ أَسۡـَٔلُكُمۡ عَلَيۡهِ مِنۡ أَجۡرٍۖ إِنۡ أَجۡرِيَ إِلَّا عَلَىٰ رَبِّ ٱلۡعَٰلَمِينَ ١٢٧

128. ''ఏమీ? మీరు కేవలం ఆడంబరానికి ప్రతి ఎత్తైన స్థలంమీద ఒక స్మారకాన్ని నిర్మిస్తారా?

أَتَبۡنُونَ بِكُلِّ رِيعٍ ءَايَةٗ تَعۡبَثُونَ ١٢٨

129. ''మరియు మీరు శాశ్వతంగా ఇక్కడే ఉండిపోతారన్నట్లు పెద్దపెద్ద కోటలు కడుతారా?

وَتَتَّخِذُونَ مَصَانِعَ لَعَلَّكُمۡ تَخۡلُدُونَ ١٢٩

130. ''మరియు మీరు ఎవరినైనా పట్టుకుంటే, అతి క్రూరులై పట్టుకుంటారా?

وَإِذَا بَطَشۡتُم بَطَشۡتُمۡ جَبَّارِينَ ١٣٠

131. ''ఇకనైన మీరు అల్లాహ్ యందు భయక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి.

فَٱتَّقُواْ ٱللَّهَ وَأَطِيعُونِ ١٣١

132. ''మరియు మీకు తెలిసివున్న (మంచి) వస్తువులను, మీకు విస్తారంగా ఇచ్చిన ఆయన (అల్లాహ్) యందు భయభక్తులు కలిగి ఉండండి.

وَٱتَّقُواْ ٱلَّذِيٓ أَمَدَّكُم بِمَا تَعۡلَمُونَ ١٣٢

133. ''ఆయన విస్తారంగా మీకు పశువులను మరియు సంతానాన్ని అనుగ్రహించాడు;

أَمَدَّكُم بِأَنۡعَٰمٖ وَبَنِينَ ١٣٣

134. ''మరియు తోటలను మరియు చెలమలను.

وَجَنَّٰتٖ وَعُيُونٍ ١٣٤

135. ''నిశ్చయంగా, మీపై ఒక మహా దినమున (పడబోయే) శిక్షకు నేను భయపడుతున్నాను!''

إِنِّيٓ أَخَافُ عَلَيۡكُمۡ عَذَابَ يَوۡمٍ عَظِيمٖ ١٣٥

قَالُواْ سَوَآءٌ عَلَيۡنَآ أَوَعَظۡتَ أَمۡ لَمۡ تَكُن مِّنَ ٱلۡوَٰعِظِينَ ١٣٦

136. వారన్నారు: "నీవు ఉపదేశించినా, ఉపదేశించక పోయినా మాకు అంతా సమానమే!

إِنۡ هَٰذَآ إِلَّا خُلُقُ ٱلۡأَوَّلِينَ ١٣٧

137. "ఇది మా పూర్వీకుల యొక్క ప్రాచీన ఆచారమే![1]

وَمَا نَحۡنُ بِمُعَذَّبِينَ ١٣٨

138. "మరియు మాకు ఎలాంటి శిక్ష విధించబడదు."

فَكَذَّبُوهُ فَأَهۡلَكۡنَٰهُمۡۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةٗۖ وَمَا كَانَ أَكۡثَرُهُم مُّؤۡمِنِينَ ١٣٩

139. ఈ విధంగా, వారు అతనిని అసత్యవాదుడని తిరస్కరించారు. కావున మేము వారిని నశింపజేశాము.[2] నిశ్చయంగా ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలామంది విశ్వసించటం లేదు.

وَإِنَّ رَبَّكَ لَهُوَ ٱلۡعَزِيزُ ٱلرَّحِيمُ ١٤٠

140. నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

كَذَّبَتۡ ثَمُودُ ٱلۡمُرۡسَلِينَ ١٤١

141. స'మూద్ జాతి, సందేశహరులను అసత్యవాదులని తిరస్కరించింది.[3]

إِذۡ قَالَ لَهُمۡ أَخُوهُمۡ صَٰلِحٌ أَلَا تَتَّقُونَ ١٤٢

142. వారి సహోదరుడు 'సాలి'హ్ వారితో ఇలా అన్నప్పుడు: "ఏమీ? మీకు దైవభీతి లేదా?[4]

---

1. కాబట్టి మేము దానిని విడువలేము.
2. 'ఆద్‌జాతి ఒక బలవంతమైన సమాజముండేది. చూడండి 89:8 మరియు 41:15. అయినా వారు సత్యాన్ని తిరస్కరించి, దౌర్జన్యాలు చేసినందుకు నాశనం చేయబడ్డారు.
3. స'మూద్ జాతి వారి నివాసం స'ఊది 'అరేబియాలో 'హి‌జ్ర్ అనే ప్రాంతంలో ఉండేది. ఆ ప్రాంతం మదాయన్ 'సాలి'హ్ అని కూడా అనబడుతుంది. వారు అరబ్బులు. దైవప్రవక్త ('స'అస) తబూక్ దండయాత్రకు పోయేటప్పుడు, ఈ ప్రాంతం గుండా ప్రయాణం చేశారు. అక్కడినుండి పోయేటప్పుడు తన ఒంటెను త్వరత్వరగా నడిపిస్తూ, తన అనుచరులతో అల్లాహ్ (సు.తా.)ను క్షమాపణ కోరుతూ త్వరత్వరగా ఈ ప్రాంతం నుండి సాగిపొండన్నారు.
4. చూడండి, 7:73 మరియు 11:61-68.

**143**. "నిశ్చయంగా, నేను మీ వద్దకు పంపబడిన విశ్వసనీయుడనైన సందేశహరుడను.

إِنِّي لَكُمْ رَسُولٌ أَمِينٌ ﴿١٤٣﴾

**144**. "కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి.

فَاتَّقُوا اللَّهَ وَأَطِيعُونِ ﴿١٤٤﴾

**145**. "నేను దానికొరకు మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం సర్వలోకాల ప్రభువు వద్దనే ఉంది.

وَمَا أَسْأَلُكُمْ عَلَيْهِ مِنْ أَجْرٍ إِنْ أَجْرِيَ إِلَّا عَلَىٰ رَبِّ الْعَالَمِينَ ﴿١٤٥﴾

**146**. "ఏమీ? మీరిప్పుడు ఇక్కడ ఉన్న స్థితిలోనే సుఖశాంతులలో ఎల్లపుడూ వదలి వేయబడతారని అనుకుంటున్నారా?

أَتُتْرَكُونَ فِي مَا هَاهُنَا آمِنِينَ ﴿١٤٦﴾

**147**. "తోటలలో మరియు చెలమలలో!

فِي جَنَّاتٍ وَعُيُونٍ ﴿١٤٧﴾

**148**. "మరియు ఈ పొలాలలో, మాగిన పండ్లగుత్తులు గల ఖర్జూరపు చెట్ల మధ్య;[1]

وَزُرُوعٍ وَنَخْلٍ طَلْعُهَا هَضِيمٌ ﴿١٤٨﴾

**149**. "మరియు మీరు కొండలను తొలిచి ఎంతో నేర్పుతో గృహాలను నిర్మిస్తూ ఉంటారనీ![2]

وَتَنْحِتُونَ مِنَ الْجِبَالِ بُيُوتًا فَارِهِينَ ﴿١٤٩﴾

**150**. "అలాకాదు, అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి.

فَاتَّقُوا اللَّهَ وَأَطِيعُونِ ﴿١٥٠﴾

**151**. "మరియు మితిమీరి ప్రవర్తించే వారి ఆజ్ఞలను అనుసరించకండి.

وَلَا تُطِيعُوا أَمْرَ الْمُسْرِفِينَ ﴿١٥١﴾

---

1. 'తల్'ఉన్: అంటే క్రొత్తగా పుట్టే ఖర్జూర ఫలం. కొద్దిగా పెద్దదైన తరువాత దానిని బల్'హున్, ఆతరువాత బస్రున్, ఆపిదప ర'త్బున్, చివరకు తమ్రున్. ఈ విధంగా వేర్వేరు స్థితులలో ఖర్జూరఫలం పిలువబడుతోంది.
2. చూడండి, 7:74.

ٱلَّذِينَ يُفۡسِدُونَ فِي ٱلۡأَرۡضِ وَلَا يُصۡلِحُونَ ﴿١٥٢﴾

152. "ఎవరైతే, భూమిలో కల్లోలం రేకెత్తిస్తున్నారో మరియు ఎన్నడూ సంస్కరణను చేపట్టరో!"

قَالُوٓاْ إِنَّمَآ أَنتَ مِنَ ٱلۡمُسَحَّرِينَ ﴿١٥٣﴾

153. వారన్నారు: "నిశ్చయంగా, నీవు మంత్రజాలంతో వశపరచుకోబడ్డావు!

مَآ أَنتَ إِلَّا بَشَرٞ مِّثۡلُنَا فَأۡتِ بِـَٔايَةٍ إِن كُنتَ مِنَ ٱلصَّٰدِقِينَ ﴿١٥٤﴾

154. "నీవు కేవలం మా వంటి ఒక మానవుడవు మాత్రమే! కావున నీవు సత్యవంతుడవే అయితే, ఏదైనా అద్భుత సూచన తీసుకురా!"

قَالَ هَٰذِهِۦ نَاقَةٞ لَّهَا شِرۡبٞ وَلَكُمۡ شِرۡبُ يَوۡمٖ مَّعۡلُومٖ ﴿١٥٥﴾

155. (సాలిహ్) అన్నాడు: "ఇదిగో ఈ ఆడఒంటె! ఇది నీరు త్రాగే (దినం) మరియు మీరు నీరుత్రాగే దినం నిర్ణయించబడ్డాయి.[1]

وَلَا تَمَسُّوهَا بِسُوٓءٖ فَيَأۡخُذَكُمۡ عَذَابُ يَوۡمٍ عَظِيمٖ ﴿١٥٦﴾

156. "దీనికి హాని కలిగించకండి. అలా చేస్తే ఒక మహా దినపు శిక్ష మిమ్మల్ని పట్టుకుంటుంది."

فَعَقَرُوهَا فَأَصۡبَحُواْ نَٰدِمِينَ ﴿١٥٧﴾

157. కాని వారు దాని వెనుకకాలి మోకాలి పెద్ద నరమును కోసి చంపారు, ఆ తరువాత వారు పశ్చాత్తాపపడుతూ ఉండిపోయారు.[2]

فَأَخَذَهُمُ ٱلۡعَذَابُۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةٗۖ وَمَا كَانَ أَكۡثَرُهُم مُّؤۡمِنِينَ ﴿١٥٨﴾

158. కావున, వారిని శిక్ష పట్టుకుంది. నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలా మంది విశ్వసించటం లేదు.

وَإِنَّ رَبَّكَ لَهُوَ ٱلۡعَزِيزُ ٱلرَّحِيمُ ﴿١٥٩﴾

159. నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే సర్వశక్తిమంతుడు, అపార కరుణా ప్రదాత.

---

1. ఒంటె వృత్తాంతానికి చూడండి, 7:73-77.
2. వారు ఆ ఒంటెను చంపిన తరువాత సాలిహ్ (అ.స.) అన్నారు. మీకు మూడు రోజుల వ్యవధి మాత్రమే ఉంది. నాలుగవ రోజు వారు అల్లాహ్ శిక్ష అవతరించడం చూసి పశ్చాత్తాపపడ్డారు. కాని శిక్ష వచ్చిన తరువాత పడే పశ్చాత్తాపం లాభదాయకం కాజాలదు.

كَذَّبَتْ قَوْمُ لُوطٍ ٱلْمُرْسَلِينَ ﴿١٦٠﴾

160. లూ'త్ జాతి, సందేశహరులను అసత్యవాదులని తిరస్కరించింది.[1]

إِذْ قَالَ لَهُمْ أَخُوهُمْ لُوطٌ أَلَا تَتَّقُونَ ﴿١٦١﴾

161. వారి సహోదరుడు లూ'త్ వారితో ఇలా అన్నప్పుడు: "ఏమీ? మీకు దైవభీతి లేదా?

إِنِّي لَكُمْ رَسُولٌ أَمِينٌ ﴿١٦٢﴾

162. "నిశ్చయంగా, నేను మీవద్దకు పంపబడిన విశ్వసనీయుడనైన సందేశహరుడను.

فَٱتَّقُوا۟ ٱللَّهَ وَأَطِيعُونِ ﴿١٦٣﴾

163. "కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి.

وَمَآ أَسْـَٔلُكُمْ عَلَيْهِ مِنْ أَجْرٍ ۖ إِنْ أَجْرِىَ إِلَّا عَلَىٰ رَبِّ ٱلْعَـٰلَمِينَ ﴿١٦٤﴾

164. "నేను దాని కొరకు మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం సర్వలోకాల ప్రభువు వద్దనే ఉన్నది.

أَتَأْتُونَ ٱلذُّكْرَانَ مِنَ ٱلْعَـٰلَمِينَ ﴿١٦٥﴾

165. "(ప్రకృతికి విరుద్ధంగా) సర్వ ప్రాణులలోకెల్లా మీరే పురుషుల వద్దకు పోతారేమిటీ?

وَتَذَرُونَ مَا خَلَقَ لَكُمْ رَبُّكُم مِّنْ أَزْوَٰجِكُم ۚ بَلْ أَنتُمْ قَوْمٌ عَادُونَ ﴿١٦٦﴾

166. "మీ ప్రభువు, మీ కొరకు సహవాసులు(అ'జ్వాజ్)గా పుట్టించిన వారిని విడిచిపెడుతున్నారేమిటి? అలా కాదు, మీరు హద్దులు మీరి ప్రవర్తించే జాతివారు!"[2]

1. లూ'త్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 11:69-83 లూ'త్ ('అ.స.) ఇబ్రాహీమ్ ('అ.స.) యొక్క సోదరుడైన హారాన్ బిన్-ఆ'జర్ కుమారుడు. అతను కూడా ఇబ్రాహీం ('అ.స.) జీవిత కాలంలోనే ప్రవక్తగా ఎన్నుకొనబడి, సోదోమ్ మరియు గొమొర్రాహ్ ప్రాంతాలకు పంపబడ్డారు. అవి జోర్డాన్‌లో మృతసముద్రం (Dead Sea), దగ్గర ఉన్నాయి.

2. మొదటిసారిగా చరిత్రలో స్త్రీలను విడిచి, పురుషులు - పురుషులతో రతిక్రీడ (సంభోగం) వీరే ప్రారంభించారంటారు. ఆ నగరంపేరట, ఆ క్రియ ఈనాటికీ సొడోమి (Sodomy) అనబడుతోంది. ఈ కాలపు పశ్చిమ దేశాలలో పరస్పర అంగీకారంతో చేసే సొడోమి, లిస్బనిస్మ (Lesbianism) మరియు స్త్రీ పురుషుల వ్యభిచారాలు చట్టప్రకారం నేరంకావు. ఈ సమాజం ఎటుపోతోంది?

قَالُواْ لَئِن لَّمْ تَنتَهِ يَٰلُوطُ لَتَكُونَنَّ مِنَ ٱلْمُخْرَجِينَ ﴿١٦٧﴾

**167**. (దానికి) వారన్నారు: "ఓ లూ'త్! ఇక నీవు మానుకోకపోతే నీవు దేశంనుండి బహిష్కరించబడిన వారిలో చేరుతావు!"

قَالَ إِنِّي لِعَمَلِكُم مِّنَ ٱلْقَالِينَ ﴿١٦٨﴾

**168**. (లూ'త్) అన్నాడు: "నిశ్చయంగా మీ ఈ చేష్టలను అసహ్యించుకునే వారిలో నేనూ ఉన్నాను."

رَبِّ نَجِّنِي وَأَهْلِي مِمَّا يَعْمَلُونَ ﴿١٦٩﴾

**169**. (ఇలా ప్రార్థించాడు): "ఓ నా ప్రభూ! నన్నూ మరియు నా కుటుంబం వారినీ వీరి చేష్టలనుండి కాపాడు."

فَنَجَّيْنَٰهُ وَأَهْلَهُۥٓ أَجْمَعِينَ ﴿١٧٠﴾

**170**. కావున మేము అతనిని మరియు అతని కుటుంబంవారి నందరినీ కాపాడాము -

إِلَّا عَجُوزًا فِي ٱلْغَٰبِرِينَ ﴿١٧١﴾

**171**. వెనుక ఉండిపోయిన వారిలో కలసి పోయిన ముసలామె తప్ప![1]

ثُمَّ دَمَّرْنَا ٱلْأٓخَرِينَ ﴿١٧٢﴾

**172**. ఆ తరువాత, మిగతా వారిని నిర్మూలించాము.

وَأَمْطَرْنَا عَلَيْهِم مَّطَرًا ۖ فَسَآءَ مَطَرُ ٱلْمُنذَرِينَ ﴿١٧٣﴾

**173**. వారిపై వర్షాన్ని కురిపించాము. అది (ముందు) హెచ్చరించబడిన వారిపై (కురిపించబడ్డ) అతి భయంకరమైన వర్షం.[2]

إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةً ۖ وَمَا كَانَ أَكْثَرُهُم مُّؤْمِنِينَ ﴿١٧٤﴾

**174**. నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలా మంది విశ్వసించడం లేదు.

وَإِنَّ رَبَّكَ لَهُوَ ٱلْعَزِيزُ ٱلرَّحِيمُ ﴿١٧٥﴾

**175**. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

---

**1**. ముసలామె అంటే లూ'త్ ('అ.స.) భార్య. ఆమె సత్యతిరస్కారి. ఆమె అదే ప్రాంతవాసి. చూడండి, 7:83, 11:81, 27:57, 29:32-33 మరియు 66:10.

**2**. చూడండి, 11:82-83.

176. వన (అ'య్‌కహ్) వాసులు సందేశహరులను అసత్యవాదులని తిరస్కరించారు.[1]

كَذَّبَ أَصۡحَٰبُ لۡـَٔيۡكَةِ ٱلۡمُرۡسَلِينَ ١٧٦

177. షు'ఐబ్ వారితో ఇలా అన్నాడు: "ఏమీ? మీకు దైవభీతి లేదా?[2]

إِذۡ قَالَ لَهُمۡ شُعَيۡبٌ أَلَا تَتَّقُونَ ١٧٧

178. "నిశ్చయంగా, నేను మీ వద్దకు పంపబడిన, విశ్వసనీయుడనైన సందేశహరుడను.

إِنِّي لَكُمۡ رَسُولٌ أَمِينٞ ١٧٨

179. "కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి!

فَٱتَّقُواْ ٱللَّهَ وَأَطِيعُونِ ١٧٩

180. "నేను దాని కొరకు మీ నుండి ఎలాంటి ప్రతిఫలం అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం సర్వలోకాల ప్రభువు వద్దనే ఉన్నది. (5/8)

وَمَآ أَسۡـَٔلُكُمۡ عَلَيۡهِ مِنۡ أَجۡرٍۖ إِنۡ أَجۡرِيَ إِلَّا عَلَىٰ رَبِّ ٱلۡعَٰلَمِينَ ١٨٠

181. * "మీరు (ఇచ్చినపుడు) సరిగ్గా కొలిచి ఇవ్వండి. నష్టపరిచే వారిలో చేరకండి!

۞ أَوۡفُواْ ٱلۡكَيۡلَ وَلَا تَكُونُواْ مِنَ ٱلۡمُخۡسِرِينَ ١٨١

182. "త్రాసుతో సరిసమానంగా తూచండి.

وَزِنُواْ بِٱلۡقِسۡطَاسِ ٱلۡمُسۡتَقِيمِ ١٨٢

183. "ప్రజలకు వారి వస్తువులను తగ్గించి ఇవ్వకండి. భూమిలో కల్లోలం రేకెత్తిస్తూ దౌర్జన్యపరులుగా ప్రవర్తించకండి.[3]

وَلَا تَبۡخَسُواْ ٱلنَّاسَ أَشۡيَآءَهُمۡ وَلَا تَعۡثَوۡاْ فِي ٱلۡأَرۡضِ مُفۡسِدِينَ ١٨٣

---

1. అ'య్‌కహ్ వాసులు అంటే, అడవివాసులు. మద్‌యన్‌కు కొంత దూరంలో ఉన్న అడవి ప్రాంతం అ'య్‌కహ్ అనబడుతుందని కొందరి అభిప్రాయం. మరికొందరి అభిప్రాయం ఇలా ఉంది: అ'య్‌కహ్ అంటే ఒకపెద్ద చెట్టు అది మద్‌యన్‌కు కొంత దూరంలో ఉండింది. దాని వాసులు ఆ చెట్టును ఆరాధించే వారు. షు'ఐబ్ ('అ.స.) మద్‌యన్ వాసులు. కావున అతను మద్‌యన్ వాసుల సోదరుడు అని పేర్కొనబడ్డారు. చూడండి, 7:85. వారు ఈ రెండు ప్రాంతాలలో ధర్మప్రచారం చేశారు. (ఇబ్నె-కసీ'ర్).
2. చూడండి-7:85 మరియు షు'ఐబ్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 11:84-95.
3. చూడండి, 7:86.

**184**. "మిమ్మల్ని మరియు మీకు పూర్వం గతించిన తరాల వారిని సృష్టించిన ఆయన (అల్లాహ్) యందు భయభక్తులు కలిగి ఉండండి."[1]

**185**. వారన్నారు: "నిశ్చయంగా, నీవు మంత్రజాలంతో వశపరచుకోబడ్డావు!

**186**. "నీవు కేవలం మా వంటి ఒక మానవుడవు మాత్రమే! నిశ్చయంగా, మేము నిన్ను అసత్యవాదులలో ఒకనిగా పరిగణిస్తున్నాము!

**187**. "నీవు సత్యవంతుడవే అయితే ఆకాశం యొక్క ఒక తునకను మాపై పడవేయి."

**188**. (షు'ఐబ్) అన్నాడు: "మీరు చేసేది నా ప్రభువుకు బాగా తెలుసు!"

**189**. కాని, వారు అతనిని అసత్యవాదుడని తిరస్కరించారు, కావున, వారిపై ఛాయాకృత ఉపద్రవం (మేఘాల శిక్ష) వచ్చిపడింది. నిశ్చయంగా, అదొక భయంకరమైన దినపు శిక్ష![2]

**190**. నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలామంది విశ్వసించటం లేదు.

**191**. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వ శక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.[3]

وَٱتَّقُواْ ٱلَّذِى خَلَقَكُمْ وَٱلْجِبِلَّةَ
ٱلْأَوَّلِينَ ﴿١٨٤﴾
قَالُوٓاْ إِنَّمَآ أَنتَ مِنَ ٱلْمُسَحَّرِينَ ﴿١٨٥﴾
وَمَآ أَنتَ إِلَّا بَشَرٌ مِّثْلُنَا وَإِن
نَّظُنُّكَ لَمِنَ ٱلْكَـٰذِبِينَ ﴿١٨٦﴾
فَأَسْقِطْ عَلَيْنَا كِسَفًا مِّنَ ٱلسَّمَآءِ
إِن كُنتَ مِنَ ٱلصَّـٰدِقِينَ ﴿١٨٧﴾
قَالَ رَبِّىٓ أَعْلَمُ بِمَا تَعْمَلُونَ ﴿١٨٨﴾
فَكَذَّبُوهُ فَأَخَذَهُمْ عَذَابُ يَوْمِ
ٱلظُّلَّةِ ۚ إِنَّهُۥ كَانَ عَذَابَ يَوْمٍ
عَظِيمٍ ﴿١٨٩﴾
إِنَّ فِى ذَٰلِكَ لَءَايَةً ۖ وَمَا كَانَ أَكْثَرُهُم
مُّؤْمِنِينَ ﴿١٩٠﴾
وَإِنَّ رَبَّكَ لَهُوَ ٱلْعَزِيزُ ٱلرَّحِيمُ ﴿١٩١﴾

---

**1**. జిబిలతున్: అంటే చాలామంది లేక పెద్ద వర్గం అని అర్థం.

**2**. షు'ఐబ్ ('అ.స.) తెగవారి మీద మూడు రకాల శిక్షలు వచ్చాయి. 7:91లో భూకంపం, 11:94లో భయంకర ధ్వని, మరియు ఇక్కడ మేఘాల, రాళ్ళవర్షపు శిక్ష అని పేర్కొనబడ్డాయి. అంటే మూడురకాల శిక్షలు ఒకేసారి వచ్చాయన్నమాట. (ఇబ్నె-కసీ'ర్).

**3**. దీనితో ఏడు గాథలు ముగుస్తున్నాయి. అన్నితరాల ప్రజలలో ఒకే విధమైన లక్షణాలు,

192. మరియు నిశ్చయంగా, ఇది సర్వలోకాల ప్రభువు అవతరింపజేసిన (గ్రంథం).
193. దీనిని నమ్మదగిన ఆత్మ (రూ'హుల్ అమీన్) అవతరింపజేశాడు;[1]
194. నీ హృదయం మీద, నీవు హెచ్చరిక చేసేవారిలో చేరిపోవాలని;
195. స్పష్టమైన అరబ్బీ భాషలో![2]
196. నిశ్చయంగా, దీని (ప్రస్తావన) పూర్వ దివ్యగ్రంథాలలో ఉంది.[3]

وَإِنَّهُۥ لَتَنزِيلُ رَبِّ ٱلْعَٰلَمِينَ ﴿١٩٢﴾
نَزَلَ بِهِ ٱلرُّوحُ ٱلْأَمِينُ ﴿١٩٣﴾
عَلَىٰ قَلْبِكَ لِتَكُونَ مِنَ ٱلْمُنذِرِينَ ﴿١٩٤﴾
بِلِسَانٍ عَرَبِيٍّ مُّبِينٍ ﴿١٩٥﴾
وَإِنَّهُۥ لَفِى زُبُرِ ٱلْأَوَّلِينَ ﴿١٩٦﴾

---

స్వభావాలు ఉన్నాయి. వారంతా తమ సందేశహరుల సత్యసందేశాన్ని తిరస్కరించి వారిపై దౌర్జన్యాలు చేశారు. తమ తండ్రితాతల ధర్మాలను అవలంబించారు. 'నీ ప్రభువు శిక్షను తీసుకురా,' అన్నారు. చివరకు వారిపై శిక్ష అవతరింపజేయబడి నాశనం చేయబడ్డారు. వారి పరలోక శిక్ష నరకమే. ప్రతికాలంలో కూడా చాలామట్టుకు పేదవారూ, తక్కువ ఆర్థిక, సామాజిక స్థానాలకు చెందిన వారే ప్రవక్తలను మొట్టమొదట అనుసరించారు. అందుకే స్వర్గంలో ఎక్కువగా ఇలాంటి వారే ఉంటారు.

1. ఏ విధంగానైతే పూర్వపు దైవప్రవక్తల మీద జిబ్రీల్ ('అ.స.) ద్వారా దివ్యజ్ఞానం అవతరింపజేయబడిందో, అదే విధంగా ము'హమ్మద్ ('స'అస) పైన కూడా ఈ ఖుర్ఆన్ అవతరింపజేయబడింది. అతను నిరక్షరాస్యుడయినా, పూర్వ ప్రవక్తల గాథలు వినిపించటమే ఖుర్ఆన్ దివ్యావతరణకు నిదర్శనం. *అర్ రూ'హుల్ అమీన్:* నమ్మదగిన ఆత్మ, అంటే జిబ్రీల్ ('అ.స.).

2. చూడండి 14:4 ఇతర 'అరబ్ ప్రవక్తలు ఇస్మా'యీల్, హూద్, 'సాలి'హ్ మరియు షు'ఐబ్ 'అలైహిముస్సలామ్‌లు. హీబ్రూ మరియు అరమాయిక్ ప్రాచీన 'అరబ్బీ భాషలే! ఇతర దివ్యగ్రంథాలు ఆయా సంఘాలవారి కొరకు అవతరింపజేయబడి ఉండెను. 'అరబ్బీ భాషలో ఉన్న ఈ ఖుర్ఆన్ చివరి దివ్యగ్రంథం మరియు ఆధునిక కాలంలో వచ్చింది. ఇప్పుడు భూగోళమంతా ఒక గ్లోబల్ విల్లేజ్‌గా మారిపోయింది, కాబట్టి ఈ ఖుర్ఆన్ సర్వలోకాల వారికి మార్గదర్శినిగా చివరి దివ్యగ్రంథంగా పంపబడింది. చూడండి, 7:158 మరియు 25:1. ఈ ఖుర్ఆన్ 14 వందల సంవత్సరాలు గడిచినా దాని అసలు రూపంలో ఉండి, అందులో ఏ ఒక్క అక్షరపు మార్పు కూడా లేకుండా భద్రపరచబడింది. ఇది అల్లాహ్ (సు.తా.) వాగ్దానం. అల్లాహ్ (సు.తా.) ఇష్టంతో ఇది ఇప్పుడు ప్రపంచంలోని వివిధ భాషలలో అనువాదం చేయబడుతోంది. అల్లాహ్ (సు.తా.) అనుగ్రహంతో సత్యాన్ని అర్థంచేసుకోగల వారు, దీనిని అర్థంచేసుకొని, సత్యధర్మాన్ని (ఇస్లాంను) స్వీకరించి శాశ్వతంగా స్వర్గవాసానికి అర్హులయ్యే మార్గాన్ని అవలంబిస్తున్నారు.

3. ఈ ప్రస్తావన కొరకు చూడండి, 2:42 మరియు ద్వితీయోపదేశ కాండము-(Deuteronony), 18:15,18 మరియు యోహాను-(John), 14:16.

**197**. ఇస్రాయీ'ల్ సంతతి వారిలోని విద్వాంసులు[1] ఈ విషయాన్ని ఒప్పుకోవటం వారికొక సూచనగా సరిపోదా?

أَوَلَمۡ يَكُن لَّهُمۡ ءَايَةً أَن يَعۡلَمَهُۥ عُلَمَـٰٓؤُاْ بَنِيٓ إِسۡرَـٰٓءِيلَ ١٩٧

**198**. ఒకవేళ మేము దీనిని 'అరబ్ కాని వానిపై అవతరింపజేసి ఉంటే!

وَلَوۡ نَزَّلۡنَـٰهُ عَلَىٰ بَعۡضِ ٱلۡأَعۡجَمِينَ ١٩٨

**199**. అతను దానిని వారికి చదివి వినిపించినా వారు దానిని విశ్వసించేవారు కారు.[2]

فَقَرَأَهُۥ عَلَيۡهِم مَّا كَانُواْ بِهِۦ مُؤۡمِنِينَ ١٩٩

**200**. ఈ విధంగా, మేము దీనిని (తిరస్కారాన్ని) అపరాధుల హృదయాల లోనికి దిగిపోయేలా చేశాము.

كَذَٰلِكَ سَلَكۡنَـٰهُ فِي قُلُوبِ ٱلۡمُجۡرِمِينَ ٢٠٠

**201**. కఠినశిక్షను చూడనంతవరకు వారు దీనిని విశ్వసించరు.

لَا يُؤۡمِنُونَ بِهِۦ حَتَّىٰ يَرَوُاْ ٱلۡعَذَابَ ٱلۡأَلِيمَ ٢٠١

**202**. అది వారికి తెలియకుండానే అకస్మాత్తుగా వచ్చి పడుతుంది.

فَيَأۡتِيَهُم بَغۡتَةً وَهُمۡ لَا يَشۡعُرُونَ ٢٠٢

**203**. అప్పుడు వారంటారు: "ఏమీ? మాకు కొంత వ్యవధి ఇవ్వబడుతుందా?"[3]

فَيَقُولُواْ هَلۡ نَحۡنُ مُنظَرُونَ ٢٠٣

**204**. ఏమీ? మా శిక్ష శీఘ్రంగా రావలెనని వారు కోరుతున్నారా?[4]

أَفَبِعَذَابِنَا يَسۡتَعۡجِلُونَ ٢٠٤

---

**1**. ఉదాహరణకు: 'అబ్దుల్లాహ్ ఇబ్నె-సల్లాం, కా'బ్ ఇబ్నె మాలిక్ మరియు ఇతర మదీనా యూద విద్వాంసులు ఈ విషయం తెలుసుకొని ఇస్లాం స్వీకరించారు. ఈ రోజు వరకు కూడా ఎంతోమంది యూద మరియు క్రైస్తవ విద్వాంసులు ఈ విషయం తెలుసుకొని ఇస్లాం స్వీకరిస్తున్నారు.

**2**. చూడండి, 41:44.

**3**. శిక్ష వచ్చిన తరువాత వ్యవధి ఇవ్వబడదు మరియు అప్పుడు చేసే పశ్చాత్తాపం కూడా అంగీకరించబడదు. చూడండి, 23:85.

**4**. ఈ శిక్ష కోరిన దానికి చూడండి, 6:57 మరియు 8:32.

205. చూశావా? మేము కొన్ని సంవత్సరాలు వారికి (ఈ జీవితంలో) సుఖ సంతోషాలతో గడిపే వ్యవధినిచ్చినా!

أَفَرَءَيْتَ إِن مَّتَّعْنَـٰهُمْ سِنِينَ ﴿٢٠٥﴾

206. తరువాత వాగ్దానం చేయబడినది (శిక్ష) వారిపైకి వచ్చినపుడు;

ثُمَّ جَآءَهُم مَّا كَانُوا۟ يُوعَدُونَ ﴿٢٠٦﴾

207. వారు అనుభవిస్తూ ఉండిన సుఖ సంతోషాలు వారికేమీ పనికిరావు.[1]

مَآ أَغْنَىٰ عَنْهُم مَّا كَانُوا۟ يُمَتَّعُونَ ﴿٢٠٧﴾

208. మరియు - హెచ్చరిక చేసే వారిని (ప్రవక్తలను) పంపనిదే - మేము ఏ నగరాన్ని కూడా నాశనం చేయలేదు!

وَمَآ أَهْلَكْنَا مِن قَرْيَةٍ إِلَّا لَهَا مُنذِرُونَ ﴿٢٠٨﴾

209. హితబోధ నివ్వటానికి; మేము ఎన్నడూ అన్యాయస్థులముగా ప్రవర్తించ లేదు.[2]

ذِكْرَىٰ وَمَا كُنَّا ظَـٰلِمِينَ ﴿٢٠٩﴾

210. మరియు దీనిని (ఈ దివ్యగ్రంథాన్ని) తీసుకొని క్రిందికి దిగిన వారు షై'తానులు కారు.

وَمَا تَنَزَّلَتْ بِهِ ٱلشَّيَـٰطِينُ ﴿٢١٠﴾

211. మరియు అది వారికి తగినది కాదు; వారది చేయలేరు.

وَمَا يَنۢبَغِى لَهُمْ وَمَا يَسْتَطِيعُونَ ﴿٢١١﴾

212. వాస్తవానికి, వారు దీనిని వినకుండా దూరంగా ఉంచబడ్డారు.

إِنَّهُمْ عَنِ ٱلسَّمْعِ لَمَعْزُولُونَ ﴿٢١٢﴾

213. కావున అల్లాహ్‌తో పాటు మరొక ఆరాధ్య దైవాన్ని వేడుకోకు, అలా చేస్తే నీవు కూడా శిక్షింపబడే వారిలో చేరిపోతావు.

فَلَا تَدْعُ مَعَ ٱللَّهِ إِلَـٰهًا ءَاخَرَ فَتَكُونَ مِنَ ٱلْمُعَذَّبِينَ ﴿٢١٣﴾

---

1. చూడండి, 2:96.
2. చూడండి, 6:131, 15:4, 20:134, 17:15, 28:59 అల్లాహ్ (సు.తా.), హెచ్చరిక చేయటానికి ప్రవక్తలను పంపనిదే ఏ సమాజాన్ని కూడా నాశనం చేయలేదు.

وَأَنذِرْ عَشِيرَتَكَ ٱلْأَقْرَبِينَ ﴿٢١٤﴾

214. మరియు నీ దగ్గరి బంధువులను హెచ్చరించు;

وَٱخْفِضْ جَنَاحَكَ لِمَنِ ٱتَّبَعَكَ مِنَ ٱلْمُؤْمِنِينَ ﴿٢١٥﴾

215. విశ్వాసులలో నిన్ను అనుసరించే వారిపై నీ కనికరపు రెక్కలను చాపు.[1]

فَإِنْ عَصَوْكَ فَقُلْ إِنِّى بَرِىٓءٌ مِّمَّا تَعْمَلُونَ ﴿٢١٦﴾

216. ఒకవేళ వారు నీ పట్ల అవిధేయత చూపితే వారితో అను: "మీరు చేసే కార్యాలకు నేను బాధ్యుడను కాను."

وَتَوَكَّلْ عَلَى ٱلْعَزِيزِ ٱلرَّحِيمِ ﴿٢١٧﴾

217. మరియు ఆ సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత మీద నమ్మకం ఉంచుకో!

ٱلَّذِى يَرَىٰكَ حِينَ تَقُومُ ﴿٢١٨﴾

218. ఆయన నీవు నిలిచినపుడు, నిన్ను చూస్తున్నాడు.[2]

وَتَقَلُّبَكَ فِى ٱلسَّٰجِدِينَ ﴿٢١٩﴾

219. మరియు సాష్టాంగం (సజ్దా) చేసే వారితో, నీ రాకపోకడలను కూడా!

إِنَّهُۥ هُوَ ٱلسَّمِيعُ ٱلْعَلِيمُ ﴿٢٢٠﴾

220. నిశ్చయంగా, ఆయనే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

هَلْ أُنَبِّئُكُمْ عَلَىٰ مَن تَنَزَّلُ ٱلشَّيَٰطِينُ ﴿٢٢١﴾

221. షై'తాన్‌లు ఎవరిపై దిగుతారో నేను మీకు తెలుపనా?

تَنَزَّلُ عَلَىٰ كُلِّ أَفَّاكٍ أَثِيمٍ ﴿٢٢٢﴾

222. వారు అసత్యవాదులైన పాపాత్ములపై దిగుతారు;

يُلْقُونَ ٱلسَّمْعَ وَأَكْثَرُهُمْ كَٰذِبُونَ ﴿٢٢٣﴾

223. గాలి వార్తలను చెవులలో ఊదుతారు;[3] మరియు వారిలో చాలామంది అసత్యవాదులే!

وَٱلشُّعَرَآءُ يَتَّبِعُهُمُ ٱلْغَاوُۥنَ ﴿٢٢٤﴾

224. మరియు మార్గభ్రష్టులే **కవులను** అనుసరిస్తారు.[4]

---

1. చూడండి, 17:24.
2. కొందరు వ్యాఖ్యాతలు: "నీవు నమా'జ్‌లో నిలిచినప్పుడు." అని అంటారు.
3. అంటే ఆ సైతానులు తమను వినేవారి చెవులలో వినీ వినని బూటకపు మాటలను ఊదుతారు.
4. చూడండి, 36:69. ఆ కాలపు కొందరు 'అరబ్బులు ఈ ఖుర్ఆన్‌ను ము'హమ్మద్

225. ఏమీ? నీకుతెలియదా? నిశ్చయంగా వారు (కవులు) తమ కవిత్వంలో ప్రతి విషయాన్ని ఉద్దేశరహితంగా (ప్రశంసిస్తూ) ఉంటారని,[1]

226. మరియు నిశ్చయంగా, వారు తాము ఆచరించని దానిని చెప్పుకుంటారని;

227. కాని, (వారిలో) విశ్వసించి, సత్కార్యాలు చేస్తూ, అల్లాహ్‌ను అమితంగా స్మరించే వారూ మరియు - తమకు అన్యాయం జరిగినప్పుడే - ప్రతీకార చర్య తీసుకునే వారు తప్ప![2] అన్యాయం చేసే వారు తమ పర్యవసానం ఏమిటో త్వరలో తెలుసుకోగలరు. (3/4)

*****

أَلَمْ تَرَ أَنَّهُمْ فِي كُلِّ وَادٍ يَهِيمُونَ ﴿٢٢٥﴾

وَأَنَّهُمْ يَقُولُونَ مَا لَا يَفْعَلُونَ ﴿٢٢٦﴾

إِلَّا ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ وَذَكَرُوا۟ ٱللَّهَ كَثِيرًا وَٱنتَصَرُوا۟ مِنۢ بَعْدِ مَا ظُلِمُوا۟ ۗ وَسَيَعْلَمُ ٱلَّذِينَ ظَلَمُوٓا۟ أَىَّ مُنقَلَبٍ يَنقَلِبُونَ ﴿٢٢٧﴾

('స'అస) రచించిన కవితగా అపోహపడ్డారు. అందుకే ఈ ఆయత్‌లో కవులను అనుసరించే వారు మార్గభ్రష్టులని అల్లాహ్ (సు.తా.) విశదీకరించాడు. ఈ ఖుర్ఆన్ దివ్యజ్ఞానం (వ'హీ) కాబట్టి ఖుర్ఆన్‌లో: "దీనివంటి ఒక్క సూరహ్ నయినా మీరంతాకలసి రచించితీసుకురండి." అని సవాలు (Challenge) చేయబడింది. కానీ ఇంతవరకు ఎవ్వరుకూడా దానిని పూర్తిచేయలేక పోయారు.

1. కవులు చాలామట్టుకు ఊహాగానాలే చేస్తుంటారు. కాబట్టి కవిత్వంలో స్వవిరుద్ధమైన వ్యాఖ్యానాలు ఉంటాయి. వారి వివరణ లక్ష్యంలేనిది, భ్రమింపజేసేది. కాని ఖుర్ఆన్ మానవులను సత్యమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేయటానికి అవతరింపజేయబడింది. అల్లాహ్ (సు.తా.), మానవుని సృష్టికర్త అవతరింపజేసిన మానవుని యొక్క నిర్దేశక గ్రంథమే (Operation Manual) ఈ ఖుర్ఆన్. ఇది మానవునికి మార్గదర్శిని.

2. ఇక్కడ ఆ కవులకే, కవిత్వం చేసే అనుమతి ఇవ్వబడింది, ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తారో మరియు అల్లాహ్(సు.తా.)ను అమితంగా ప్రార్థిస్తారో మరియు ఊహాగానాలు చేయక సత్యాధారంపై కవిత్వం చేస్తారో! ఉదాహరణకు: 'హస్సాన్ బిన్ సా'బిత్ (ర'ది.'అ.), తన కవిత్వంతో సత్యతిరస్కారుల కవిత్వానికి తగిన జవాబు ఇచ్చేవారు. దైవప్రవక్త ('స'అస) అతనితో అనేవారు: 'ఈ సత్యతిరస్కారులకు జవాబివ్వు, జిబ్రీల్ (అ.స.) నీకు తోడుగా ఉంటాడు!' ('స'హీ'హ్ బు'ఖారీ). దీనితో వ్యక్తమయ్యేది ఏమిటంటే సత్యతిరస్కారులకు జవాబివ్వటానికి, సత్యాధారంగా చేసే కవిత్వం మరియు సత్యాన్ని, తౌహీద్‌ను మరియు సున్నత్‌ను స్థాపించటానికి చేసే కవిత్వం ధర్మసమ్మతమైనదే!

## 27. సూరహ్ అన్-నమ్ల్ سُورَةُ النَّمْلِ

నమ్‌లున్: **చీమలు**. ఈ సూరహ్‌లో చీమల సంభాషణ పేర్కొనబడింది కావున దీనికి ఈ పేరు ఇవ్వబడింది. ఇది **18**వ **ఆయత్‌లో** ఉంది. దీని మరొకపేరు 'త-సీన్, అని కూడా ఉంది. ఇది **మొదటి ఆయత్**‌లో ఉంది. ఈ సూరహ్ 26వ సూరహ్ తరువాత మధ్య మక్కా కాలంలో అవతరింపజేయబడింది. ఇందులో **93 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

طسٓ تِلْكَ ءَايَٰتُ ٱلْقُرْءَانِ وَكِتَابٍ مُّبِينٍ ﴿١﴾

**1**. * 'త-సీన్. ఇవి దివ్యఖుర్ఆన్ ఆయతులు మరియు ఇది ఒక స్పష్టమైన గ్రంథము.[1]

هُدًى وَبُشْرَىٰ لِلْمُؤْمِنِينَ ﴿٢﴾

**2**. ఇవి విశ్వాసులకు మార్గదర్శకత్వం గానూ మరియు శుభవార్తలు ఇచ్చేవిగానూ ఉన్నాయి.

ٱلَّذِينَ يُقِيمُونَ ٱلصَّلَوٰةَ وَيُؤْتُونَ ٱلزَّكَوٰةَ وَهُم بِٱلْءَاخِرَةِ هُمْ يُوقِنُونَ ﴿٣﴾

**3**. ఎవరైతే నమా'జ్ స్థాపిస్తారో మరియు విధిదానం ('జకాత్) ఇస్తారో మరియు పరలోక జీవితాన్ని నమ్ముతారో!

إِنَّ ٱلَّذِينَ لَا يُؤْمِنُونَ بِٱلْءَاخِرَةِ زَيَّنَّا لَهُمْ أَعْمَٰلَهُمْ فَهُمْ يَعْمَهُونَ ﴿٤﴾

**4**. నిశ్చయంగా, ఎవరైతే పరలోక జీవితాన్ని విశ్వసించరో, వారికి మేము వారి చేష్టలను ఆకర్షణీయమైనవిగా చేశాము. అందువల్ల వారు అంధులవలే దారితప్పి తిరుగుతూ ఉంటారు.[2]

---

**1**. ఇటువంటి ఆయత్ కొరకు చూడండి, 12:1.

**2**. పరలోక జీవితాన్ని నమ్మని వారు తమ భౌతిక మరియు ఆర్థిక లాభాలకే ప్రాధాన్యత నిస్తారు. కాబట్టి వారికి వారి దుష్టచేష్టలు ఆకర్షణీయమైనవిగా కనిపిస్తాయి. దానివల్ల వారు మరింత మార్గభ్రష్టత్వంలో పడిపోతారు. జిన్నాతులకు మరియు మానవులకు, సత్యాసత్యాలనూ, మంచిచెడులనూ గుర్తించే విచక్షణా శక్తి ఇవ్వబడింది కాబట్టి వారు తమ కర్మలకు తామే భాధ్యులవుతారు. అల్లాహ్ (సు.తా.) తనను తాను సరిదిద్దుకోవటానికి ప్రయత్నించేవానికే సన్మార్గం చూపుతాడు. మరియు బుద్ధిపూర్వకంగా దుర్మార్గాన్ని అవలంభించేవాడిని, వాడి దుర్మార్గంలో వదలుతాడు. చూడండి, 2:7.

5. ఇలాంటి వారికి చెడ్డ శిక్ష ఉంది. మరియు చివరకు వారే అందరికంటే ఎక్కువగా నష్టపడేవారు.

6. మరియు (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా నీవు ఈ ఖుర్ఆన్‌ను, మహా వివేకవంతుడు, సర్వజ్ఞుడు అయిన (అల్లాహ్) నుండి పొందుతున్నావు.

7. (జ్ఞాపకం చేసుకోండి!) మూసా తన ఇంటి వారితో: "నిశ్చయంగా నాకు ఒక అగ్ని కనిపిస్తోంది.[1] నేను దానినుండి మీ వద్దకు ఏదైనా వార్తను తీసుకువస్తాను లేదా మీరు కాచుకోవడానికి మండే కొరివినైనా తీసుకువస్తాను." అని అన్నాడు.

8. కాని అతడు అక్కడికి చేరినప్పుడు ఒక ధ్వని ఇలా వినిపించింది: "ఈ అగ్నిలో ఉన్న వానికీ మరియు దాని పరిసరాలలో ఉన్న వానికీ శుభాలు కలుగు గాక! సర్వలోకాలకు ప్రభువైన అల్లాహ్ సర్వలోపాలకు అతీతుడు.

9. "ఓ మూసా! నిశ్చయంగా ఆయన, అల్లాహ్‌ను నేనే! సర్వశక్తిమంతుడను, మహా వివేకవంతుడను.

10. "నీ చేతికర్రను పడవేయి!" అతను దానిని (పడవేసి) చూశాడు. అది పామువలె కదలసాగింది.[2] అతడు వెనుదిరిగి చూడకుండా పరుగెత్తసాగాడు. (అల్లాహ్ అన్నాడు): "ఓ మూసా! భయపడకు[3] నిశ్చయంగా, నా సన్నిధిలో సందేశహరులకు ఎలాంటి భయం ఉండదు.

أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ لَهُمۡ سُوٓءُ ٱلۡعَذَابِ وَهُمۡ
فِي ٱلۡأٓخِرَةِ هُمُ ٱلۡأَخۡسَرُونَ ٥
وَإِنَّكَ لَتُلَقَّى ٱلۡقُرۡءَانَ مِن لَّدُنۡ
حَكِيمٍ عَلِيمٍ ٦
إِذۡ قَالَ مُوسَىٰ لِأَهۡلِهِۦٓ إِنِّيٓ ءَانَسۡتُ نَارٗا
سَـَٔاتِيكُم مِّنۡهَا بِخَبَرٍ أَوۡ ءَاتِيكُم بِشِهَابٖ
قَبَسٖ لَّعَلَّكُمۡ تَصۡطَلُونَ ٧
فَلَمَّا جَآءَهَا نُودِيَ أَنۢ بُورِكَ مَن فِي
ٱلنَّارِ وَمَنۡ حَوۡلَهَا وَسُبۡحَٰنَ ٱللَّهِ رَبِّ
ٱلۡعَٰلَمِينَ ٨
يَٰمُوسَىٰٓ إِنَّهُۥٓ أَنَا ٱللَّهُ ٱلۡعَزِيزُ ٱلۡحَكِيمُ ٩
وَأَلۡقِ عَصَاكَۚ فَلَمَّا رَءَاهَا تَهۡتَزُّ كَأَنَّهَا جَآنّٞ
وَلَّىٰ مُدۡبِرٗا وَلَمۡ يُعَقِّبۡۚ يَٰمُوسَىٰ لَا تَخَفۡ
إِنِّي لَا يَخَافُ لَدَيَّ ٱلۡمُرۡسَلُونَ ١٠

---

1. చూడండి, 20:10.
2. చూడండి, 20:17-21.
3. దీనితో తెలిసేదేమిటంటే ప్రవక్తలకు అగోచరజ్ఞానం ఉండదు. వారు కూడా సాధారణ మానవుల వలే భయపడవచ్చు!

إِلَّا مَن ظَلَمَ ثُمَّ بَدَّلَ حُسْنًا بَعْدَ سُوٓءٍ فَإِنِّي غَفُورٌ رَّحِيمٌ ۝١١

11. "కాని ఎవడైనా తప్పుచేస్తే తప్పు! ఆ తరువాత అతడు దానికి బదులుగా మంచి పనులు చేస్తే![1] నిశ్చయంగా, నేను క్షమించేవాడను, కరుణాప్రదాతను.

وَأَدْخِلْ يَدَكَ فِي جَيْبِكَ تَخْرُجْ بَيْضَآءَ مِنْ غَيْرِ سُوٓءٍ ۖ فِي تِسْعِ ءَايَٰتٍ إِلَىٰ فِرْعَوْنَ وَقَوْمِهِۦٓ ۚ إِنَّهُمْ كَانُوا۟ قَوْمًا فَٰسِقِينَ ۝١٢

12. "ఇక నీ చేతిని నీ చంకలో (జేబులో) పెట్టి (తీయి), అది ఎలాంటి లోపం లేకుండా తెల్లగా (ప్రకాశిస్తూ) బయటికి వస్తుంది.[2] ఈ తొమ్మిది అద్భుత సూచనలు (ఆయాత్) తీసుకొని నీవు ఫిర్'ఔన్ మరియు అతని జాతి వారి వద్దకు వెళ్ళు.[3] నిశ్చయంగా, వారు అవిధేయులై పోయారు!"

فَلَمَّا جَآءَتْهُمْ ءَايَٰتُنَا مُبْصِرَةً قَالُوا۟ هَٰذَا سِحْرٌ مُّبِينٌ ۝١٣

13. కాని వారి ముందుకు మా ప్రత్యక్ష సూచనలు వచ్చినపుడు వారు: "ఇది స్పష్టమైన మాయాజాలమే!" అని అన్నారు.[4]

وَجَحَدُوا۟ بِهَا وَٱسْتَيْقَنَتْهَآ أَنفُسُهُمْ ظُلْمًا وَعُلُوًّا ۚ فَٱنظُرْ كَيْفَ كَانَ عَٰقِبَةُ ٱلْمُفْسِدِينَ ۝١٤

14. మరియు వారి హృదయాలు వాటిని అంగీకరించినా వారు అన్యాయంగా, అహంకారంతో తిరస్కరించారు. ఇక చూడు ఆ దౌర్జన్యపరుల గతి ఏమయిపోయిందో!

وَلَقَدْ ءَاتَيْنَا دَاوُۥدَ وَسُلَيْمَٰنَ عِلْمًا ۖ وَقَالَا ٱلْحَمْدُ لِلَّهِ ٱلَّذِى فَضَّلَنَا عَلَىٰ كَثِيرٍ مِّنْ عِبَادِهِ ٱلْمُؤْمِنِينَ ۝١٥

15. మరియు వాస్తవంగా, మేము దావూద్ మరియు సులైమాన్‌లకు జ్ఞానాన్ని ప్రసాదించాము.[5] వారిద్దరు అన్నారు: "విశ్వాసులైన తన అనేక దాసులలో, మా ఇద్దరికి ఘనతను ప్రసాదించిన ఆ అల్లాహ్‌యే సర్వస్తోత్రాలకు అర్హుడు!"

---

1. ఒకడు పాపంచేసి, దాని తరువాత హృదయపూర్వకంగా పశ్చాత్తాపపడి క్షమాభిక్ష వేడుకుంటే అల్లాహ్ (సు.తా.) అతనిని క్షమించవచ్చు! బహుశా మూసా ('అ.స.) వల్ల అనుకోకుండా జరిగిన ఫిర్'ఔన్ జాతివాని హత్య గురించి ఈ ఆయత్ చెప్పుతోంది. చూడండి, 28:15-17.
2. చూడండి, 7:108.
3. ఆ తొమ్మిది అద్భుత సంకేతాల కొరకు చూడండి, 17:101.
4. చూడండి, 10:76.
5. జ్ఞానం: అల్లాహ్ (సు.తా.) తన ప్రవక్తలకు ప్రసాదించే గొప్ప బహుమానం.

16. మరియు సులైమాన్, దావూద్‌కు వారసుడయ్యాడు.[1] మరియు అతను (సులైమాన్) అన్నాడు: "ఓ ప్రజలారా! మాకు పక్షులభాష నేర్పబడింది. మరియు మాకు ప్రతివస్తువు ఒసంగబడింది. నిశ్చయంగా, ఇది ఒక స్పష్టమైన (అల్లాహ్) అనుగ్రహమే!"

17. మరియు సులైమాన్ కొరకు జిన్నాతుల,[2] మానవుల మరియు పక్షుల సైన్యాలు సమీకరింపబడి ఉండేవి. తరువాత వాటిని తమతమ స్థానాల ప్రకారం వరుసలలో పెట్టి (బయలుదేరారు)!

18. చివరకు వారు **చీమల** లోయ (కనుమ)కు చేరుకున్నప్పుడు ఒక చీమ ఇలా అన్నది: "ఓ చీమలారా! మీరు మీ ఇండ్లలోకి ప్రవేశించండి, లేకపోతే సులైమాన్ మరియు అతని సైనికులు - వారికి తెలియకుండానే - మిమ్మల్ని నలిపివేయవచ్చు!"[3]

19. (సులైమాన్) దాని మాటలకు చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు: "ఓ నా ప్రభూ! నీవు నన్ను - నాకూ మరియు నా తల్లిదండ్రులకు చూపిన అనుగ్రహాలకు - కృతజ్ఞత తెలిపేవానిగా[4] మరియు నీకు నచ్చే సత్కార్యాలు చేసేవానిగా, ప్రోత్సాహపరచు మరియు నన్ను నీ కారుణ్యంతో సద్వర్తనులైన నీ దాసులలో చేర్చుకో!"[5]

وَوَرِثَ سُلَيۡمَٰنُ دَاوُۥدَۖ وَقَالَ يَٰٓأَيُّهَا ٱلنَّاسُ عُلِّمۡنَا مَنطِقَ ٱلطَّيۡرِ وَأُوتِينَا مِن كُلِّ شَيۡءٍۖ إِنَّ هَٰذَا لَهُوَ ٱلۡفَضۡلُ ٱلۡمُبِينُ ١٦

وَحُشِرَ لِسُلَيۡمَٰنَ جُنُودُهُۥ مِنَ ٱلۡجِنِّ وَٱلۡإِنسِ وَٱلطَّيۡرِ فَهُمۡ يُوزَعُونَ ١٧

حَتَّىٰٓ إِذَآ أَتَوۡاْ عَلَىٰ وَادِ ٱلنَّمۡلِ قَالَتۡ نَمۡلَةٞ يَٰٓأَيُّهَا ٱلنَّمۡلُ ٱدۡخُلُواْ مَسَٰكِنَكُمۡ لَا يَحۡطِمَنَّكُمۡ سُلَيۡمَٰنُ وَجُنُودُهُۥ وَهُمۡ لَا يَشۡعُرُونَ ١٨

فَتَبَسَّمَ ضَاحِكٗا مِّن قَوۡلِهَا وَقَالَ رَبِّ أَوۡزِعۡنِيٓ أَنۡ أَشۡكُرَ نِعۡمَتَكَ ٱلَّتِيٓ أَنۡعَمۡتَ عَلَيَّ وَعَلَىٰ وَٰلِدَيَّ وَأَنۡ أَعۡمَلَ صَٰلِحٗا تَرۡضَىٰهُ وَأَدۡخِلۡنِي بِرَحۡمَتِكَ فِي عِبَادِكَ ٱلصَّٰلِحِينَ ١٩

---

1. అంటే ప్రవక్త పదవి యొక్క వారసత్వం. ఎందుకంటే దావూద్ ('అ.స.)కు ఇతరకుమారులుండిరి. కాని వారు ప్రవక్తలు కాలేదు. ప్రవక్త('అ.స.)లు వదలిపోయిన ధనసంపత్తులు 'సదఖ' అంటే దానాలుగా పరిగణింపబడతాయి. ('స'హీహ్ బు'ఖారీ).
2. ఖుర్ఆన్ అవతరణా క్రమంలో114:6లో మొదటిసారి జిన్నాతుల పేరు వచ్చింది.
3. దీనితో వ్యక్తమయ్యేది ఏమిటంటే సులైమాన్('అ.స.)కు పశుపక్షుల భాషలు అర్థమయ్యేవి. కాని అతనికి అగోచరజ్ఞానం లేదు. అల్లాహ్ (సు.తా.) తప్ప మరెవ్వరికీ అగోచరజ్ఞానం ఉండదు. ఈ విషయం ముందు రాబోయే వడ్రంగిపిట్ట కథవల్ల తెలుస్తోంది.
4. చూడండి, 38:31-33.
5. దీనితో వ్యక్తమయ్యేది ఏమిటంటే సద్వర్తనులైన విశ్వాసులకే స్వర్గం లభిస్తుంది.

وَتَفَقَّدَ ٱلطَّيْرَ فَقَالَ مَالِىَ لَآ أَرَى ٱلْهُدْهُدَ أَمْ كَانَ مِنَ ٱلْغَآئِبِينَ ﴿٢٠﴾

**20**. మరియు (ఒక రోజు) అతను పక్షులను పరిశీలిస్తూ ఇలా అన్నాడు: "ఏమిటీ నాకు వడ్రంగిపిట్ట (హుద్‌హుద్) కనిపించడం లేదే! అది ఎటు అదృశ్యమై పోయింది?

لَأُعَذِّبَنَّهُۥ عَذَابًا شَدِيدًا أَوْ لَأَا۟ذْبَحَنَّهُۥٓ أَوْ لَيَأْتِيَنِّى بِسُلْطَـٰنٍ مُّبِينٍ ﴿٢١﴾

**21**. "నేను దానిని కఠినంగా శిక్షిస్తాను. లేదా దానిని కోసివేస్తాను - అది నాకు సరైన కారణం చూపితేనే తప్ప!"

فَمَكَثَ غَيْرَ بَعِيدٍ فَقَالَ أَحَطتُ بِمَا لَمْ تُحِطْ بِهِۦ وَجِئْتُكَ مِن سَبَإٍۭ بِنَبَإٍ يَقِينٍ ﴿٢٢﴾

**22**. ఆ తరువాత ఎంతోసేపు గడవక ముందే అది వచ్చి ఇలా అన్నది: "నీకు తెలియని విషయమొకటి నేను తెలుసుకొని వచ్చాను. నేను సబా'ను గురించి ఒక నమ్మకమైన వార్తను నీకొరకు తెచ్చాను.[1]

إِنِّى وَجَدتُّ ٱمْرَأَةً تَمْلِكُهُمْ وَأُوتِيَتْ مِن كُلِّ شَىْءٍ وَلَهَا عَرْشٌ عَظِيمٌ ﴿٢٣﴾

**23**. "నిశ్చయంగా, నేను అక్కడ ఒక స్త్రీని చూశాను. ఆమె వారిపై (రాణిగా) పరిపాలన చేస్తుంది. ఆమెకు ప్రతివస్తువు ఒసంగబడి ఉంది. ఆమె దగ్గర ఒక గొప్ప సింహాసనం ఉంది.

---

మరియు ఎవడు కూడా అల్లాహ్ (సు.తా.) అనుగ్రహం లేనిదే స్వర్గంలో ప్రవేశించలేడు. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'మీరు సన్మార్గం మీద మరియు సత్యం మీద ఉండండి. మరియు జ్ఞాపకముంచుకోండి. ఏ వ్యక్తి కూడా కేవలం తన సత్కార్యాలవల్లనే స్వర్గాన్ని పొందలేడు.' అప్పుడు అనుచరు(ర'ది.'అన్హుమ్)లు అన్నారు: 'ఓ సందేశహరుడా ('స'అస)! మీరు కూడానా?' అతను జవాబిచ్చారు: 'అవును నేను కూడా! అల్లాహ్ (సు.తా.) కరుణించే వరకు నేను కూడా స్వర్గంలో ప్రవేశించలేను.' ('స. బు'ఖారీ, నం. 6467, 'స. ముస్లిం 217).

**1**. చూడండి, 34:15. సబా' ఒక ప్రఖ్యాత వ్యక్తి పేరు మీద, ఒక తెగ, ఒక పట్టణం మరియు దేశపుపేరు పెట్టబడింది. అది యమన్ ప్రాంతంలో ఉండేది. అది మ'అరిబే యమన్ అనే పేరుతో కూడా పిలువబడింది. ఆ సమయంలో దాని పాలకురాలు (రాణి) ఒక స్త్రీ. ఆమెపేరు బిల్ఖీస్ అని అంటారు. దాని రాజధాని మ'అరిబ్. వారు సూర్యుణ్ణి పూజించేవారు. (ఫ'త్హ్ అల్-ఖదీర్).

وَجَدتُّهَا وَقَوْمَهَا يَسْجُدُونَ لِلشَّمْسِ مِن دُونِ ٱللَّهِ وَزَيَّنَ لَهُمُ ٱلشَّيْطَـٰنُ أَعْمَـٰلَهُمْ فَصَدَّهُمْ عَنِ ٱلسَّبِيلِ فَهُمْ لَا يَهْتَدُونَ ﴿٢٤﴾

24. "మరియు నేను, ఆమెను మరియు ఆమె జాతివారిని అల్లాహ్‌ను వదలి సూర్యునికి సాష్టాంగం (సజ్దా) చేయటం చూశాను మరియు షైతాన్ వారి కర్మలను, వారికి మంచివిగా తోచేటట్లు చేశాడు. కావున వారిని సన్మార్గం నుండి నిరోధించాడు, కాబట్టి వారు సన్మార్గం పొందలేక పోయారు.

أَلَّا يَسْجُدُوا۟ لِلَّهِ ٱلَّذِى يُخْرِجُ ٱلْخَبْءَ فِى ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضِ وَيَعْلَمُ مَا تُخْفُونَ وَمَا تُعْلِنُونَ ﴿٢٥﴾

25. "అందుకే వారు - ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ దాగివున్న వాటిని బయటికి తీసేవాడూ మరియు మీరు దాచేవాటినీ మరియు వ్యక్తపరిచేవాటినీ ఎరుగువాడూ అయిన - అల్లాహ్‌కు సాష్టాంగం (సజ్దా) చేయటం లేదు.

ٱللَّهُ لَآ إِلَـٰهَ إِلَّا هُوَ رَبُّ ٱلْعَرْشِ ٱلْعَظِيمِ ۩ ﴿٢٦﴾

26. "అల్లాహ్! ఆయన తప్పమరొక ఆరాధ్య దైవం లేడు. ఆయనే సర్వోత్తమ సింహాసనానికి ('అర్ష్‌కు) ప్రభువు." ۩ (7/8)

۞ قَالَ سَنَنظُرُ أَصَدَقْتَ أَمْ كُنتَ مِنَ ٱلْكَـٰذِبِينَ ﴿٢٧﴾

27. * (సులైమాన్) అన్నాడు: "నీవు సత్యం పలుకుతున్నావో, లేదా అబద్ధాలాడే వారిలో చేరినవాడవో, మేము ఇప్పుడే చూస్తాము.

ٱذْهَب بِّكِتَـٰبِى هَـٰذَا فَأَلْقِهْ إِلَيْهِمْ ثُمَّ تَوَلَّ عَنْهُمْ فَٱنظُرْ مَاذَا يَرْجِعُونَ ﴿٢٨﴾

28. నా ఈ ఉత్తరం తీసుకొని పో! దీనిని వారివద్ద పడవేయి, తరువాత వారి నుండి ఒక వైపుకు తొలగిపోయి వారేమి సమాధానమిస్తారో చూడు."

قَالَتْ يَـٰٓأَيُّهَا ٱلْمَلَؤُا۟ إِنِّىٓ أُلْقِىَ إِلَىَّ كِتَـٰبٌ كَرِيمٌ ﴿٢٩﴾

29. (రాణి) అన్నది: "ఓ నా ఆస్థాన నాయకులారా! ఇదిగో నా వైపుకు ఒక విశేషమైన ఉత్తరం పంపబడింది.

إِنَّهُۥ مِن سُلَيْمَـٰنَ وَإِنَّهُۥ بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَـٰنِ ٱلرَّحِيمِ ﴿٣٠﴾

30. "నిశ్చయంగా, ఇది సులైమాన్ దగ్గర నుండి వచ్చింది. మరియు ఇది: 'అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో,' ప్రారంభించబడింది"

31. "(ఇందులో ఇలా వ్రాయబడి ఉంది): 'నా పై ఆధిక్యతను చూపకండి. నా సన్నిధిలోకి అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు) అయి రండి.' "[1]

أَلَّا تَعْلُواْ عَلَيَّ وَأْتُونِي مُسْلِمِينَ ٣١

32. (రాణి) అన్నది: "ఓ నాయకులారా! ఈ విషయంలో మీరు నాకు సలహా ఇవ్వండి. నేను ఏ విషయంలోనూ, మీరు లేనిదే ఎలాంటి నిర్ణయం తీసుకోనే!"

قَالَتْ يَٰٓأَيُّهَا ٱلْمَلَؤُاْ أَفْتُونِي فِيٓ أَمْرِي مَا كُنتُ قَاطِعَةً أَمْرًا حَتَّىٰ تَشْهَدُونِ ٣٢

33. వారిలా జవాబిచ్చారు: "మనం చాలా బలవంతులం. మరియు గొప్ప యుద్ధ నిపుణులం, కాని నిర్ణయం మాత్రం నీదే! కావున, నీవు ఏమి ఆజ్ఞాపించ దలచుకున్నావో ఆలోచించు!"

قَالُواْ نَحْنُ أُوْلُواْ قُوَّةٍ وَأُوْلُواْ بَأْسٍ شَدِيدٍ وَٱلْأَمْرُ إِلَيْكِ فَٱنظُرِي مَاذَا تَأْمُرِينَ ٣٣

34. (రాణి) అన్నది: "రాజులు ఏ దేశంలోనైనా జొరబడినప్పుడు, వారందులో కల్లోలం రేకెత్తిస్తారు మరియు అక్కడి గౌరవనీయులైన ప్రజలను అవమానపరుస్తారు. వీరు కూడా అదేవిధంగా చేయవచ్చు!

قَالَتْ إِنَّ ٱلْمُلُوكَ إِذَا دَخَلُواْ قَرْيَةً أَفْسَدُوهَا وَجَعَلُوٓاْ أَعِزَّةَ أَهْلِهَآ أَذِلَّةً ۖ وَكَذَٰلِكَ يَفْعَلُونَ ٣٤

35. "కావున నేను తప్పక, వారి వద్దకు ఒక కానుకను పంపుతాను. ఆ తరువాత నా దూతలు ఏమి జవాబు తెస్తారో చూస్తాను."

وَإِنِّي مُرْسِلَةٌ إِلَيْهِم بِهَدِيَّةٍ فَنَاظِرَةٌۢ بِمَ يَرْجِعُ ٱلْمُرْسَلُونَ ٣٥

---

1. సబా' వాసులు అల్లాహ్ (సు.తా.)ను వదలి సూర్యుణ్ణి పూజించేవారు. (ఆయత్‌లు 24-25) కావున సులైమాన్ ('అ.స.) ఒక ప్రవక్త కాబట్టి వారిని అల్లాహ్(సు.తా.)కు విధేయులవటానికి ఆహ్వానించారు. (చూడండి, 44:19) ఇదే విధంగా మహా ప్రవక్త ముహమ్మద్ ('స'అస) కూడా ఆయన కాలపు రాజులను ఇస్లాం స్వీకరించటానికి, ఆహ్వానపత్రాలు పంపారు.

**36.** (రాయబారులు) సులైమాన్ వద్దకు వచ్చినపుడు, అతను అన్నాడు: "ఏమీ? మీరు నాకు ధనసహాయం చేయదలచారా? అల్లాహ్ నాకు ఇచ్చింది, మీకు ఇచ్చిన దానికంటే ఎంతో ఉత్తమమైనది, ఇక మీ కానుకతో మీరే సంతోషపడండి!"

**37.** (సులైమాన్ అన్నాడు): "నీవు వారి వద్దకు తిరిగిపో, మేము వారిపైకి గొప్ప సేనలతో వస్తాము. వారు వాటిని ఎదిరించజాలరు. మేము వారిని పరాభవించి అచ్చటి నుండి వెడలగొడ్తాము. మరియు వారు అవమానితులై ఉండిపోతారు."

**38.** (తరువాత సులైమాన్) ఇలా అన్నాడు: "ఓ నాయకులారా! వారు అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు) అయి రాకముందే, ఆమె సింహాసనాన్ని నా దగ్గరకు మీలో ఎవరు తేగలరు?"

**39.** జిన్నాతులలో బలిష్ఠుడైన ఒకడు ఇలా అన్నాడు: "నీవు నీ స్థానం నుండి లేవకముందే నేను దానిని తీసుకువస్తాను. నిశ్చయంగా నేను ఇలాచేసే బలం గలవాడను, నమ్మదగిన వాడను!"

**40.** గ్రంథ జ్ఞానంగల ఒకతను ఇలా అన్నాడు: "నేను కనురెప్పపాటు కాలంలో దానిని నీ వద్దకు తేగలను!" ఆ తరువాత (సులైమాన్) దానిని వాస్తవంగా తన ముందు పెట్టబడి ఉండటాన్ని చూసి ఇలా అన్నాడు: "ఇది నా ప్రభువు అనుగ్రహం. నేను కృతజ్ఞతలు చూపుదునా లేక కృతఘ్నుడనవుదునా అని పరీక్షించటానికి ఇలా

فَلَمَّا جَآءَ سُلَيۡمَٰنَ قَالَ أَتُمِدُّونَنِ بِمَالٖ
فَمَآ ءَاتَىٰنِۦَ ٱللَّهُ خَيۡرٞ مِّمَّآ ءَاتَىٰكُم
بَلۡ أَنتُم بِهَدِيَّتِكُمۡ تَفۡرَحُونَ ٣٦

ٱرۡجِعۡ إِلَيۡهِمۡ فَلَنَأۡتِيَنَّهُم بِجُنُودٖ
لَّا قِبَلَ لَهُم بِهَا وَلَنُخۡرِجَنَّهُم مِّنۡهَآ أَذِلَّةٗ
وَهُمۡ صَٰغِرُونَ ٣٧

قَالَ يَٰٓأَيُّهَا ٱلۡمَلَؤُاْ أَيُّكُمۡ يَأۡتِينِي
بِعَرۡشِهَا قَبۡلَ أَن يَأۡتُونِي مُسۡلِمِينَ
٣٨

قَالَ عِفۡرِيتٞ مِّنَ ٱلۡجِنِّ أَنَا۠ ءَاتِيكَ
بِهِۦ قَبۡلَ أَن تَقُومَ مِن مَّقَامِكَۖ وَإِنِّي
عَلَيۡهِ لَقَوِيٌّ أَمِينٞ ٣٩

قَالَ ٱلَّذِي عِندَهُۥ عِلۡمٞ مِّنَ ٱلۡكِتَٰبِ أَنَا۠
ءَاتِيكَ بِهِۦ قَبۡلَ أَن يَرۡتَدَّ إِلَيۡكَ طَرۡفُكَۚ
فَلَمَّا رَءَاهُ مُسۡتَقِرًّا عِندَهُۥ قَالَ هَٰذَا مِن
فَضۡلِ رَبِّي لِيَبۡلُوَنِيٓ ءَأَشۡكُرُ أَمۡ أَكۡفُرُۖ

وَمَن شَكَرَ فَإِنَّمَا يَشۡكُرُ لِنَفۡسِهِۦۖ وَمَن كَفَرَ فَإِنَّ رَبِّي غَنِيّٞ كَرِيمٞ ٤٠

చేయబడింది. కృతజ్ఞతలు తెలిపేవాడు, నిశ్చయంగా తన మేలుకొరకే కృతజ్ఞతలు తెలుపుకుంటాడు. కాని ఎవడైనా కృతఘ్నతకు పాల్పడితే, నిశ్చయంగా, నా ప్రభువు స్వయంసమృద్ధుడు, పరమదాత[1] (అని తెలుసుకోవాలి)."

قَالَ نَكِّرُواْ لَهَا عَرۡشَهَا نَنظُرۡ أَتَهۡتَدِيٓ أَمۡ تَكُونُ مِنَ ٱلَّذِينَ لَا يَهۡتَدُونَ ٤١

**41**. (సులైమాన్) అన్నాడు: "ఆమె గుర్తించలేకుండా ఆమె సింహాసనపు రూపాన్ని మార్చివేయండి. మనం చూద్దాం! ఆమె మార్గదర్శకత్వం పొందుతుందా, లేక మార్గదర్శకత్వం పొందని వారిలో చేరిపోతుందా?"

فَلَمَّا جَآءَتۡ قِيلَ أَهَٰكَذَا عَرۡشُكِۖ قَالَتۡ كَأَنَّهُۥ هُوَۚ وَأُوتِينَا ٱلۡعِلۡمَ مِن قَبۡلِهَا وَكُنَّا مُسۡلِمِينَ ٤٢

**42**. ఆ తరువాత ఆమె అక్కడికి రాగానే: "ఏమీ? నీ సింహాసనం ఈ విధంగానే ఉంటుందా?" అని అడగ్గా, ఆమె: "నిశ్చయంగా, ఇది దాని మాదిరిగానే ఉంది!" అని అన్నది. మరియు (సులైమాన్ అన్నాడు): "మనకు ఈమె కంటే ముందు (దివ్య) జ్ఞానం ప్రసాదించబడింది కావున మనం అల్లాహ్‌కు విధేయు (ముస్లిం)ల మయ్యాము!"[2]

وَصَدَّهَا مَا كَانَت تَّعۡبُدُ مِن دُونِ ٱللَّهِۖ إِنَّهَا كَانَتۡ مِن قَوۡمٖ كَٰفِرِينَ ٤٣

**43**. మరియు అల్లాహ్‌ను వదలి ఆమె ఆరాధిస్తున్నది, ఆమెను (ఇస్లాం నుండి) తొలగించింది. అందుకే! ఆమె వాస్తవానికి, సత్యతిరస్కారులలో చేరి ఉండేది.

---

**1**. **అల్-కరీము:** Most Bounteous, Generous, Most Noble, Honourable, దాతృత్వుడు, దానశీలుడు, ఔదార్యుడు, ఉదారుడు, **పరమదాత**, గొప్పవాడు, అత్యంత ఆదరణీయుడు, దివ్యుడు (82:6, 96:3,) ఈ శబ్దము అల్లాహ్ (సు.తా.)కే గాక, దివ్య ఖుర్ఆన్ కొరకు గూడా వాడబడింది, అల్-మజీద్ మాదిరిగా. **అల్-ఇక్రామ్:** కొరకు చూడండి, 55:27,78.

**2**. ఇది సులైమాన్ ('అ.స.) వాక్యమని ఇబ్నె-కసీ'ర్ మరియు షౌకాని గారి అభిప్రాయం.

قِيلَ لَهَا ٱدْخُلِى ٱلصَّرْحَ فَلَمَّا رَأَتْهُ حَسِبَتْهُ لُجَّةً وَكَشَفَتْ عَن سَاقَيْهَا قَالَ إِنَّهُۥ صَرْحٌ مُّمَرَّدٌ مِّن قَوَارِيرَ قَالَتْ رَبِّ إِنِّى ظَلَمْتُ نَفْسِى وَأَسْلَمْتُ مَعَ سُلَيْمَٰنَ لِلَّهِ رَبِّ ٱلْعَٰلَمِينَ ﴿٤٤﴾

44. ఆమెతో: "రాజగృహంలో ప్రవేశించు!" అని చెప్పగా! ఆమె దానిని చూసి, అదొక నీటికొలనని భావించి (తన వస్త్రాలను) పైకెత్తగా ఆమె పిక్కలు కనబడ్డాయి. అప్పుడు (సులైమాన్): "ఇది గాజుతో నిర్మించబడిన నున్నని నేల మాత్రమే!" అని అన్నాడు. (రాణి) అన్నది: "ఓ నా ప్రభూ! నాకు నేను అన్యాయం చేసుకున్నాను. మరియు నేను సులైమాన్‌తో పాటు సర్వలోకాల ప్రభువైన అల్లాహ్‌కు విధేయతను (ఇస్లాంను) స్వీకరిస్తున్నాను."[1]

وَلَقَدْ أَرْسَلْنَآ إِلَىٰ ثَمُودَ أَخَاهُمْ صَٰلِحًا أَنِ ٱعْبُدُوا۟ ٱللَّهَ فَإِذَا هُمْ فَرِيقَانِ يَخْتَصِمُونَ ﴿٤٥﴾

45. మరియు వాస్తవంగా! మేము సమూద్ జాతివారి వద్దకు వారి సోదరుడైన 'సాలి'హ్‌ను: "మీరు అల్లాహ్‌నే ఆరాధించండి."[2] అనే (సందేశంతో) పంపాము. కాని వారు రెండు వర్గాలుగా చీలిపోయి పరస్పరం కలహించుకోసాగారు.

قَالَ يَٰقَوْمِ لِمَ تَسْتَعْجِلُونَ بِٱلسَّيِّئَةِ قَبْلَ ٱلْحَسَنَةِ لَوْلَا تَسْتَغْفِرُونَ ٱللَّهَ لَعَلَّكُمْ تُرْحَمُونَ ﴿٤٦﴾

46. ('సాలి'హ్) అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! మీరు సుస్థితికి ముందు దుస్థితి కొరకు ఎందుకు తొందరపెడుతున్నారు? మీరు అల్లాహ్‌ను మీ తప్పులను క్షమించమని ఎందుకు వేడుకోరు? బహుశా మీరు కరుణించబడవచ్చు!"

قَالُوا۟ ٱطَّيَّرْنَا بِكَ وَبِمَن مَّعَكَ قَالَ طَٰٓئِرُكُمْ عِندَ ٱللَّهِ بَلْ أَنتُمْ قَوْمٌ تُفْتَنُونَ ﴿٤٧﴾

47. వారన్నారు: "మేము నిన్నూ మరియు నీ అనుచరులను అపశకునపు సూచనలుగా పరిగణిస్తున్నాము!" ('సాలి'హ్) అన్నాడు: "మీ శకునం అల్లాహ్ వద్ద ఉంది. వాస్తవానికి, మీరు పరీక్షించబడుతున్నారు!"[3]

1. ఇస్లాం స్వీకరించిన తరువాత బిల్ఖీస్ వివాహం సులైమాన్('అ.స.)తో అయిందా లేదా అనే విషయం ఖుర్ఆన్ మరియు 'హదీస్'లలో పేర్కొనబడలేదు.
2. 'సాలి'హ్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 7:73.
3. చూడండి, 17:13.

وَكَانَ فِي ٱلۡمَدِينَةِ تِسۡعَةُ رَهۡطٖ يُفۡسِدُونَ فِي ٱلۡأَرۡضِ وَلَا يُصۡلِحُونَ ﴿٤٨﴾

**48**. మరియు ఆ నగరంలో తొమ్మిది మంది ఉండేవారు. వారు దేశంలో కల్లోలం రేకెత్తిస్తూ ఉండేవారు. మరియు ఎలాంటి సంస్కరణ చేసేవారు కాదు.

قَالُواْ تَقَاسَمُواْ بِٱللَّهِ لَنُبَيِّتَنَّهُۥ وَأَهۡلَهُۥ ثُمَّ لَنَقُولَنَّ لِوَلِيِّهِۦ مَا شَهِدۡنَا مَهۡلِكَ أَهۡلِهِۦ وَإِنَّا لَصَٰدِقُونَ ﴿٤٩﴾

**49**. వారు పరస్పరం ఇలా అనుకున్నారు: "అల్లాహ్ పై ప్రమాణంచేసి ఇలా ప్రతిజ్ఞ చేయండి.[1] మనం అతనిపై మరియు అతనితో పాటు ఉన్న వారిపై రాత్రివేళ దాడిచేద్దాము. తరువాత అతని వారసులతో: 'మీ సంబంధీకులను వధించింది మేము చూడనేలేదు. మేము నిశ్చయంగా, సత్యం పలుకుతున్నాము.' " అని అందాము.

وَمَكَرُواْ مَكۡرٗا وَمَكَرۡنَا مَكۡرٗا وَهُمۡ لَا يَشۡعُرُونَ ﴿٥٠﴾

**50**. మరియు ఈ విధంగా, వారు పన్నాగం పన్నారు మరియు మేము కూడా ఒక పన్నాగం పన్నాము. కాని వారికది తెలియదు.

فَٱنظُرۡ كَيۡفَ كَانَ عَٰقِبَةُ مَكۡرِهِمۡ أَنَّا دَمَّرۡنَٰهُمۡ وَقَوۡمَهُمۡ أَجۡمَعِينَ ﴿٥١﴾

**51**. ఇక చూడండి! వారి పన్నాగపు పర్యవసానం ఏమయిందో! వాస్తవానికి మేము వారిని మరియు వారి వంశంవారి నందరినీ సర్వనాశనం చేశాము.

فَتِلۡكَ بُيُوتُهُمۡ خَاوِيَةَۢ بِمَا ظَلَمُوٓاْۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةٗ لِّقَوۡمٖ يَعۡلَمُونَ ﴿٥٢﴾

**52**. అవిగో వారి గృహాలు! వారు చేసిన దుర్మార్గాలకు అవి ఎలా పాడుపడి పోయాయో చూడండి. నిశ్చయంగా ఇందులో తెలుసుకునే వారికి గొప్ప సూచన ఉంది.

وَأَنجَيۡنَا ٱلَّذِينَ ءَامَنُواْ وَكَانُواْ يَتَّقُونَ ﴿٥٣﴾

**53**. మరియు విశ్వసించి, దైవభీతి కలిగి ఉన్న వారిని మేము కాపాడాము.

---

**1**. అల్లాహ్ (సు.తా.) పై ప్రమాణం అంటే 'సమూద్ జాతివారు అల్లాహ్ (సు.తా.) ను విశ్వసించేవారు. కాని వారు పాటించే మతం వారిని ఏకైక ఆరాధ్యుడైన (అల్లాహుతా'ఆలా) ఆరాధననుండి తొలగించింది. (చూడండి, 7:73).

وَلُوطًا إِذْ قَالَ لِقَوْمِهِۦٓ أَتَأْتُونَ ٱلْفَٰحِشَةَ وَأَنتُمْ تُبْصِرُونَ ﴿٥٤﴾

**54**. మరియు లూ'త్‌ను (జ్ఞాపకం చేసుకోండి)! అతను తన జాతివారితో ఇలా అన్నప్పుడు: "ఏమీ? మీరు బహిరంగంగా అశ్లీలకార్యాలు చేస్తారా?"[1]

أَئِنَّكُمْ لَتَأْتُونَ ٱلرِّجَالَ شَهْوَةً مِّن دُونِ ٱلنِّسَآءِ ۚ بَلْ أَنتُمْ قَوْمٌ تَجْهَلُونَ ﴿٥٥﴾

**55**. "ఏమీ? మీరు స్త్రీలను వదలి పురుషుల వద్దకు, మీ కామఇచ్ఛను తీర్చు కోవటానికి పోతారా? వాస్తవానికి, మీరు మూఢజనులు!"

---

**1**. లూ'త్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 7:80-84, 11:69-83, 26:160-173.

۞ فَمَا كَانَ جَوَابَ قَوْمِهِۦٓ إِلَّآ أَن قَالُوٓاْ أَخْرِجُوٓاْ ءَالَ لُوطٍ مِّن قَرْيَتِكُمْۖ إِنَّهُمْ أُنَاسٌ يَتَطَهَّرُونَ ٥٦

فَأَنجَيْنَٰهُ وَأَهْلَهُۥٓ إِلَّا ٱمْرَأَتَهُۥ قَدَّرْنَٰهَا مِنَ ٱلْغَٰبِرِينَ ٥٧

وَأَمْطَرْنَا عَلَيْهِم مَّطَرًاۖ فَسَآءَ مَطَرُ ٱلْمُنذَرِينَ ٥٨

قُلِ ٱلْحَمْدُ لِلَّهِ وَسَلَٰمٌ عَلَىٰ عِبَادِهِ ٱلَّذِينَ ٱصْطَفَىٰٓۗ ءَآللَّهُ خَيْرٌ أَمَّا يُشْرِكُونَ ٥٩

أَمَّنْ خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ وَأَنزَلَ لَكُم مِّنَ ٱلسَّمَآءِ مَآءً فَأَنۢبَتْنَا بِهِۦ حَدَآئِقَ ذَاتَ

**56**. (*) కాని, అతని జాతి వారి జవాబు ఈ విధంగా మాత్రమే ఉండింది. వారు అన్నారు: "లూ'త్ కుటుంబాన్ని మీ పట్టణం నుండి వెళ్ళగొట్టండి. వాస్తవానికి, వారు తమను తాము చాలా పవిత్రులుగా పరిగణిస్తున్నారు."[1]

**57**. కావున మేము అతనిని మరియు అతని కుటుంబంవారిని కాపాడాము - అతని భార్యతప్ప - ఆమెను వెనుక ఉండిపోయేవారిలో చేర్చాలని నిర్ణయించాము.[2]

**58**. మరియు వారిపై (రాళ్ళ) వర్షాన్ని కురిపించాము. కాని అది, హెచ్చరించబడిన వారిపై కురిపించబడ్డ ఎంతో ఘోరమైన వర్షం.[3]

**59**. (ఓ ము'హమ్మద్!) ఇలా అను: "సర్వస్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే. ఆయన ఎన్నుకొన్న, ఆయన దాసులకు శాంతి కలుగు గాక (సలాం)! ఏమీ? అల్లాహ్ శ్రేష్ఠుడా? లేక వారు ఆయనకు సాటి కల్పించే భాగస్వాములా?"

**60**. ఏమీ ఆయనే కాడా? ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించిన వాడు మరియు మీ కొరకు ఆకాశం నుండి నీటిని కురిపించిన వాడు? దానితో మేము మనోహరమైన తోటలను పుట్టించాము.

---

**1**. చూడండి, 7:82.
**2**. చూడండి, 7:83, 11:81 మరియు 66:10.
**3**. చూడండి, 26:173.

వాటిలో ఒక్క చెట్టును కూడా మొలిపించటం మీకు సాధ్యమయ్యే పని కాదు కదా? ఏమీ? అల్లాహ్‌తో బాటు మరొక దేవుడు ఎవడైనా ఉన్నాడా? అలాకాదు! వారే (ఇతరులను) ఆయనకు సమానులుగా చేసే ప్రజలు!

**61**. ఏమీ ఆయనే కాడా? భూమిని నివాసస్థలంగా చేసి,[1] దాని మధ్య నదులను ఏర్పరచి, అది కదలకుండా దానిపై పర్వతాలను మేకులుగా నాటిన వాడు మరియు రెండు సముద్రాల మధ్య అడ్డుతెరను నిర్మించినవాడు?[2] ఏమీ? అల్లాహ్‌తో పాటు మరొక దేవుడు ఎవడైనా ఉన్నాడా? వాస్తవానికి చాలామంది ఇది తెలుసుకోలేరు.

**62**. ఏమీ ఆయనే కాడా? బాధితుడు వేడుకొన్నప్పుడు అతని మొరను ఆలకించి ఆపదను తొలగించే వాడు[3] మరియు భూమిలో మిమ్మల్ని ఉత్తరాధికారులుగా చేసిన వాడు?[4] ఏమీ? అల్లాహ్‌తో పాటు మరొక దేవుడు ఎవడైనా ఉన్నాడా? మీరు ఆలోచించేది చాలా తక్కువ.

**63**. ఏమీ ఆయనే కాడా? నేల మరియు సముద్రాల, అంధకారంలో మీకు మార్గదర్శకత్వం చేసేవాడు. మరియు తన కారుణ్యానికి ముందు గాలులను శుభవార్తలతో

بَهۡجَةٖ مَّا كَانَ لَكُمۡ أَن
تُنۢبِتُواْ شَجَرَهَآۗ أَءِلَٰهٞ مَّعَ ٱللَّهِۚ
بَلۡ هُمۡ قَوۡمٞ يَعۡدِلُونَ ٦٠

أَمَّن جَعَلَ ٱلۡأَرۡضَ قَرَارٗا وَجَعَلَ
خِلَٰلَهَآ أَنۡهَٰرٗا وَجَعَلَ لَهَا
رَوَٰسِيَ وَجَعَلَ بَيۡنَ
ٱلۡبَحۡرَيۡنِ حَاجِزًاۗ أَءِلَٰهٞ مَّعَ ٱللَّهِۚ بَلۡ
أَكۡثَرُهُمۡ لَا يَعۡلَمُونَ ٦١

أَمَّن يُجِيبُ ٱلۡمُضۡطَرَّ إِذَا دَعَاهُ
وَيَكۡشِفُ ٱلسُّوٓءَ وَيَجۡعَلُكُمۡ
خُلَفَآءَ ٱلۡأَرۡضِۗ أَءِلَٰهٞ مَّعَ ٱللَّهِۚ
قَلِيلٗا مَّا تَذَكَّرُونَ ٦٢

أَمَّن يَهۡدِيكُمۡ فِي ظُلُمَٰتِ ٱلۡبَرِّ
وَٱلۡبَحۡرِ وَمَن يُرۡسِلُ ٱلرِّيَٰحَ بُشۡرَۢا

**1**. చూడండి, 77:25-26.
**2**. చూడండి, 25:53.
**3**. చూడండి, 17:67 మరియు 27:53.
**4**. చూడండి, 2:30.

بَيْنَ يَدَيْ رَحْمَتِهِۦٓ ۗ أَءِلَٰهٌ مَّعَ ٱللَّهِ ۚ
تَعَٰلَى ٱللَّهُ عَمَّا يُشْرِكُونَ ﴿٦٣﴾

పంపేవాడు?[1] ఏమీ? అల్లాహ్‌తో పాటు మరొక దేవుడు ఎవడైనా ఉన్నాడా? వారు సాటిగా కల్పించే భాగస్వాములకంటే అల్లాహ్ అత్యున్నతుడు!

أَمَّن يَبْدَؤُا۟ ٱلْخَلْقَ ثُمَّ يُعِيدُهُۥ وَمَن
يَرْزُقُكُم مِّنَ ٱلسَّمَآءِ وَٱلْأَرْضِ ۗ أَءِلَٰهٌ
مَّعَ ٱللَّهِ ۚ قُلْ هَاتُوا۟ بُرْهَٰنَكُمْ إِن
كُنتُمْ صَٰدِقِينَ ﴿٦٤﴾

**64**. ఏమీ ఆయనే కాడా? సృష్టిని తొలిసారి ప్రారంభించి, తరువాత దానిని మరల ఉనికిలోకి తేగలవాడు మరియు మీకు ఆకాశం నుండి మరియు భూమి నుండి జీవనోపాధిని సమకూర్చే వాడు?[2] ఏమీ? అల్లాహ్‌తో పాటు మరొక దేవుడు ఎవడైనా ఉన్నాడా? వారితో అను: "మీరు సత్యవంతులే అయితే మీ నిదర్శనాన్ని తీసుకురండి!"

قُل لَّا يَعْلَمُ مَن فِى ٱلسَّمَٰوَٰتِ
وَٱلْأَرْضِ ٱلْغَيْبَ إِلَّا ٱللَّهُ ۚ وَمَا يَشْعُرُونَ
أَيَّانَ يُبْعَثُونَ ﴿٦٥﴾

**65**. వారితో అను: "ఆకాశాలలోను మరియు భూమిలోను ఉన్న అగోచర విషయ జ్ఞానం గలవాడు అల్లాహ్ తప్ప మరొకడు లేడు.[3] మరియు వారు తిరిగి ఎప్పుడు లేపబడతారో కూడా వారికి తెలియదు."

---

**1**. చూడండి, 7:57.

**2**. చూడండి, 10:31.

**3**. అగోచరజ్ఞానం అల్లాహ్ (సు.తా.)కు తప్ప మరెవ్వరికీ లేదు. ప్రవక్త('అలైహిమ్ స.)లకు అల్లాహ్ (సు.తా.) వ'హీ ద్వారా తెలిపిన జ్ఞానం మాత్రమే ఉంటుంది. 'ఆయి'షహ్ (ర.'అన్హా) కథనం: "ఎవడైతే ప్రవక్తకు రేపు కాబోయే విషయాల గురించి జ్ఞానముందని భావిస్తాడో, అతడు అల్లాహ్ (సు.తా.) మీద పెద్ద అపనింద మోపుతున్నాడు. ఎందుకంటే! అల్లాహ్ (సు.తా.) అంటున్నాడు: 'భూమ్యాకాశాలలో ఉన్న అగోచర విషయాల జ్ఞానం కేవలం అల్లాహ్(సు.తా.)కే ఉంది.' " ('స'హీ'హ్ బు'ఖారీ, నం. 4855, 'స'హీ'హ్ ముస్లిం, నం. 287, తిర్మిజీ' నం. 3068) ఖతదా (ర'ది.'అ.) అన్నారు: 'అల్లాహ్ (సు.తా.) నక్షత్రాలను మూడు విషయాల కొరకు పుట్టించాడు: 1) ఆకాశపు అలంకరణ కొరకు, 2) (రాత్రిలో) మార్గదర్శకానికి (దారి తెలుసుకోవటానికి), 3) షై'తాన్‌లను తరిమి కొట్టడానికి. కాని అల్లాహ్ (సు.తా.) ఆదేశాలను ఎరుగని వారు వాటి ద్వారా అగోచర జ్ఞానం (జ్యోతిష్యం) చెప్పుతామని ఇతరులను మోసగిస్తున్నారు. వారు పలికేవన్నీ మోసపు మాటలే, అబద్ధాలే. (ఇబ్నె-కసీ'ర్).

بَلِ ٱدَّٰرَكَ عِلۡمُهُمۡ فِي ٱلۡأٓخِرَةِۚ بَلۡ هُمۡ فِي شَكّٖ مِّنۡهَاۖ بَلۡ هُم مِّنۡهَا عَمُونَ ٦٦

**66**. వాస్తవానికి, పరలోక జీవితం గురించి వారి జ్ఞానం శూన్యమే. అలాకాదు! దానిని గురించి వారు సంశయంలో పడివున్నారు. అలాకాదు! దాని విషయంలో వారు అంధులై పోయారు.

وَقَالَ ٱلَّذِينَ كَفَرُوٓاْ أَءِذَا كُنَّا تُرَٰبٗا وَءَابَآؤُنَآ أَئِنَّا لَمُخۡرَجُونَ ٦٧

**67**. సత్యతిరస్కారులు అంటారు: "ఏమీ? మేమూ మరియు మా తండ్రి తాతలు మట్టిగా మారిపోయిన తరువాత కూడా వాస్తవానికి మరల (సజీవులుగా) వెలికి తీయబడతామా?

لَقَدۡ وُعِدۡنَا هَٰذَا نَحۡنُ وَءَابَآؤُنَا مِن قَبۡلُ إِنۡ هَٰذَآ إِلَّآ أَسَٰطِيرُ ٱلۡأَوَّلِينَ ٦٨

**68**. "వాస్తవానికి ఇంతకు పూర్వం కూడా మాకు మరియు మా తండ్రితాతలకు ఇదే విధంగా వాగ్దానం చేయబడింది. ఇవి కేవలం పూర్వకాలపు గాథలు మాత్రమే."

قُلۡ سِيرُواْ فِي ٱلۡأَرۡضِ فَٱنظُرُواْ كَيۡفَ كَانَ عَٰقِبَةُ ٱلۡمُجۡرِمِينَ ٦٩

**69**. వారితో అను: "భూమిలో ప్రయాణం చేసి చూడండి. అపరాధుల గతి ఏమయిందో!"

وَلَا تَحۡزَنۡ عَلَيۡهِمۡ وَلَا تَكُن فِي ضَيۡقٖ مِّمَّا يَمۡكُرُونَ ٧٠

**70**. మరియు నీవు వారి గురించి దుఃఖపడకు మరియు వారి కుట్రలకు బాధపడకు.

وَيَقُولُونَ مَتَىٰ هَٰذَا ٱلۡوَعۡدُ إِن كُنتُمۡ صَٰدِقِينَ ٧١

**71**. వారంటున్నారు: "మీరు సత్యవంతులే అయితే! ఈ వాగ్దానం ఎప్పుడు పూర్తికానున్నది?"

قُلۡ عَسَىٰٓ أَن يَكُونَ رَدِفَ لَكُم بَعۡضُ ٱلَّذِي تَسۡتَعۡجِلُونَ ٧٢

**72**. వారితో అను: "మీరు దేనిని (ఏ శిక్షను) గురించి తొందరపెడుతున్నారో? అందులోని కొంతభాగం బహుశా మీకు సమీపంలోనే ఉండవచ్చు![1]

---

1. ఇది బద్ర్ యుద్ధాన్ని సూచిస్తోంది.

73. "మరియు నిశ్చయంగా, నీ ప్రభువు మానవులపై ఎంతో అనుగ్రహం కలవాడు, కాని వారిలో చాలామంది కృతజ్ఞతలు చూపరు."

وَإِنَّ رَبَّكَ لَذُو فَضْلٍ عَلَى ٱلنَّاسِ وَلَٰكِنَّ أَكْثَرَهُمْ لَا يَشْكُرُونَ ﴿٧٣﴾

74. మరియు నిశ్చయంగా, వారి హృదయాలు ఏమి దాస్తున్నాయో మరియు ఏమి వ్యక్తపరుస్తున్నాయో, నీ ప్రభువుకు బాగా తెలుసు.

وَإِنَّ رَبَّكَ لَيَعْلَمُ مَا تُكِنُّ صُدُورُهُمْ وَمَا يُعْلِنُونَ ﴿٧٤﴾

75. మరియు, ఆకాశంలో మరియు భూమిలో అగోచరంగా ఉన్నది, ఏదీ కూడా, స్పష్టమైన ఒక గ్రంథంలో వ్రాయబడకుండా లేదు.[1]

وَمَا مِنْ غَآئِبَةٍ فِى ٱلسَّمَآءِ وَٱلْأَرْضِ إِلَّا فِى كِتَٰبٍ مُّبِينٍ ﴿٧٥﴾

76. నిశ్చయంగా, ఈ ఖుర్ఆన్ ఇస్రాయీల్ సంతతివారు విభేదిస్తూవున్న పెక్కు విషయాల వాస్తవాన్ని వారికి తెలుపుతున్నది.

إِنَّ هَٰذَا ٱلْقُرْءَانَ يَقُصُّ عَلَىٰ بَنِىٓ إِسْرَٰٓءِيلَ أَكْثَرَ ٱلَّذِى هُمْ فِيهِ يَخْتَلِفُونَ ﴿٧٦﴾

77. మరియు నిశ్చయంగా, ఇది విశ్వాసులకు మార్గదర్శిని మరియు కారుణ్యం.

وَإِنَّهُۥ لَهُدًى وَرَحْمَةٌ لِّلْمُؤْمِنِينَ ﴿٧٧﴾

78. నిశ్చయంగా, నీ ప్రభువు వారిమధ్య న్యాయంగా తీర్పుచేస్తాడు. ఆయన సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు.

إِنَّ رَبَّكَ يَقْضِى بَيْنَهُم بِحُكْمِهِۦ ۚ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْعَلِيمُ ﴿٧٨﴾

79. కావున నీవు అల్లాహ్‌పై ఆధారపడి ఉండు. నిశ్చయంగా, నీవు స్పష్టమైన సత్యంపై ఉన్నావు.

فَتَوَكَّلْ عَلَى ٱللَّهِ ۖ إِنَّكَ عَلَى ٱلْحَقِّ ٱلْمُبِينِ ﴿٧٩﴾

80. నిశ్చయంగా, నీవు మృతులకు వినిపింపజేయలేవు మరియు వీపుత్రిప్పి మరలిపోయే చెవిటి వారికి కూడా నీ పిలుపును వినిపింపజేయలేవు.[2]

إِنَّكَ لَا تُسْمِعُ ٱلْمَوْتَىٰ وَلَا تُسْمِعُ ٱلصُّمَّ ٱلدُّعَآءَ إِذَا وَلَّوْا۟ مُدْبِرِينَ ﴿٨٠﴾

---

1. దీని అర్థం: లౌహె మహ్ఫూజ్.
2. ఈ ఆయత్ సత్యతిరస్కారులను గురించి చెప్పుతోంది. వారి బుద్ధి సత్యాన్ని గ్రహించకున్నది కావున వారు మృతులుగా పేర్కొనబడ్డారు.

وَمَآ أَنتَ بِهَـٰدِى ٱلْعُمْىِ عَن ضَلَـٰلَتِهِمْ ۖ إِن تُسْمِعُ إِلَّا مَن يُؤْمِنُ بِـَٔايَـٰتِنَا فَهُم مُّسْلِمُونَ ﴿٨١﴾

**81**. మరియు నీవు అంధులను మార్గభ్రష్టత్వం నుండి తొలగించి, వారికి మార్గదర్శకత్వం చేయలేవు. మా సూచన(ఆయతు)లను విశ్వసించి, అల్లాహ్ కు విధేయు(ముస్లిం)లు అయ్యేవారికి మాత్రమే నీవు (నీ మాటలను) వినిపించగలవు. (1/8)

۞ وَإِذَا وَقَعَ ٱلْقَوْلُ عَلَيْهِمْ أَخْرَجْنَا لَهُمْ دَآبَّةً مِّنَ ٱلْأَرْضِ تُكَلِّمُهُمْ أَنَّ ٱلنَّاسَ كَانُوا۟ بِـَٔايَـٰتِنَا لَا يُوقِنُونَ ﴿٨٢﴾

**82**. * మరియు వారిని గురించిన (శిక్ష) వాగ్దానం పూర్తి కానున్నప్పుడు,[1] మేము వారి కొరకు భూమినుండి ఒక జంతువును బయటికి తీస్తాము.[2] అది వారితో నిశ్చయంగా, మానవులు మా సూచన(ఆయతు)లను నమ్మేవారు కాదని చెబుతుంది.

وَيَوْمَ نَحْشُرُ مِن كُلِّ أُمَّةٍ فَوْجًا مِّمَّن يُكَذِّبُ بِـَٔايَـٰتِنَا فَهُمْ يُوزَعُونَ ﴿٨٣﴾

**83**. మరియు (జ్ఞాపకముంచుకోండి) ఆ రోజు (పునరుత్థాన దినమున) మేము ప్రతి జాతివారిలో నుండి మా సూచనలను అసత్యాలని నిరాకరించిన జన సమూహాన్ని సమీకరిస్తాము. మరియు వారు (వారి పాపాల ప్రకారం) వివిధ వరుసలలో నిలబెట్టబడతారు.

---

**1**. ఎప్పుడైతే మంచిని ఆదేశించే వాడు మరియు చెడునుండి నిరోధించే వాడు ఎవ్వడూ ఉండడో!

**2**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'పునరుత్థాన దినం అంతవరకు రాదు, ఎంతవరకైతే మీరు పది సంకేతాలు చూడరో!' ఆ పది సంకేతాలలో ఈ జంతువు ఒకటి, ('స'హీ'హ్ ముస్లిం). మరొక 'హదీస్'లో ఉంది: అన్నిటి కంటే మొదటి సంకేతం, సూర్యుడు తూర్పునుండి గాక పడమరనుండి ఉదయించడం. ('స'హీ'హ్ ముస్లిం).

84. చివరకు అందరూ వచ్చిన తరువాత (వారి ప్రభువు) వారిని ప్రశ్నిస్తాడు: "ఏమీ? మీరు నా సూచనలను, మీ జ్ఞానంతో గ్రహించకుండానే వాటిని అసత్యాలని నిరాకరించారా? ఇదిగాక మీరు ఏమి చేస్తూ ఉండేవారు?"

حَتَّىٰٓ إِذَا جَآءُو قَالَ أَكَذَّبْتُم بِـَٔايَٰتِى وَلَمْ تُحِيطُوا۟ بِهَا عِلْمًا أَمَّاذَا كُنتُمْ تَعْمَلُونَ ﴿٨٤﴾

85. మరియు వారు చేసిన దుర్మార్గం వలన వారికి చేయబడిన వాగ్దానం (శిక్ష) పూర్తిఅవుతుంది, కావున వారేమీ మాట్లాడలేరు.

وَوَقَعَ ٱلْقَوْلُ عَلَيْهِم بِمَا ظَلَمُوا۟ فَهُمْ لَا يَنطِقُونَ ﴿٨٥﴾

86. ఏమీ? వారికి తెలియదా? మేము రాత్రిని వారు విశ్రాంతి పొందటానికి మరియు పగటిని (చూడగలగటానికి) ప్రకాశవంతంగా చేశామని?[1] నిశ్చయంగా, విశ్వసించేవారికి ఇందులో ఎన్నో సూచనలున్నాయి.

أَلَمْ يَرَوْا۟ أَنَّا جَعَلْنَا ٱلَّيْلَ لِيَسْكُنُوا۟ فِيهِ وَٱلنَّهَارَ مُبْصِرًا ۚ إِنَّ فِى ذَٰلِكَ لَـَٔايَٰتٍ لِّقَوْمٍ يُؤْمِنُونَ ﴿٨٦﴾

87. మరియు (జ్ఞాపకముంచుకోండి) బాకా ఊదబడే దినమున - అల్లాహ్ కోరిన వారు తప్ప[2]- ఆకాశాలలోను మరియు భూమిలోను ఉన్నవి అన్నీ (జీవరాసులు) భయంతో కంపించిపోతాయి.[3] మరియు అన్నీ అత్యంత వినమ్రతతో ఆయన ముందు హాజరవుతాయి.

وَيَوْمَ يُنفَخُ فِى ٱلصُّورِ فَفَزِعَ مَن فِى ٱلسَّمَٰوَٰتِ وَمَن فِى ٱلْأَرْضِ إِلَّا مَن شَآءَ ٱللَّهُ ۚ وَكُلٌّ أَتَوْهُ دَٰخِرِينَ ﴿٨٧﴾

---

1. చూడండి, 10:67 మరియు 40:61.
2. ఎవరా అల్లాహ్ (సు.తా.) కోరినవారు? ఇమామ్ షౌకాని ప్రకారం: వారు దేవదూతలు, దైవప్రవక్తలు, అమరవీరులు (షుహదా') మరియు విశ్వాసులందరూ!
3. 'సూర్: బాకా, లేక కొమ్ము, దానిని ఇస్రాఫీల్ ('అ.స.) అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞతో ఊదుతారు. ఇది రెండుసార్లు లేక అంతకంటే ఎక్కువ సార్లు ఊదబడుతుంది. మొదట ఊదబడినప్పుడు సమస్త (జీవరాసులు) భయంతో స్పృహ కోల్పోతారు. రెండవసారి ఊదబడినప్పుడు అందరూ చనిపోతారు. మూడవసారి ఊదినప్పుడు అందరూ తమ గోరీలనుండి లేచివస్తారు. మరికొందరి ప్రకారం నాలుగవసారి బాకా ఊదబడినప్పుడు అందరూ మైదానంలో సమీకరించబడతారు.

**88**. మరియు నీవు పర్వతాలను చూసి అవి స్థిరంగా ఉన్నాయని అనుకుంటున్నావు. కాని అవి అప్పుడు మేఘాలవలే ఎగురుతూ పోతుంటాయి. ఇది అల్లాహ్ కార్యం! ఆయన ప్రతి కార్యాన్ని నేర్పుతో చేస్తాడు. నిశ్చయంగా మీరు చేసేదంతా ఆయన ఎరుగును.[1]

وَتَرَى ٱلْجِبَالَ تَحْسَبُهَا جَامِدَةً وَهِىَ تَمُرُّ مَرَّ ٱلسَّحَابِ ۚ صُنْعَ ٱللَّهِ ٱلَّذِىٓ أَتْقَنَ كُلَّ شَىْءٍ ۚ إِنَّهُۥ خَبِيرٌۢ بِمَا تَفْعَلُونَ ﴿٨٨﴾

**89**. మంచి పనులు చేసి వచ్చిన వారికి, అంతకంటే మంచి (ప్రతిఫలం) ఉంటుంది. మరియు వారు ఆ దినపు మహా భీతినుండి సురక్షితంగా ఉంటారు.[2]

مَن جَآءَ بِٱلْحَسَنَةِ فَلَهُۥ خَيْرٌ مِّنْهَا وَهُم مِّن فَزَعٍ يَوْمَئِذٍ ءَامِنُونَ ﴿٨٩﴾

**90**. మరియు చెడుపనులు చేసి వచ్చిన వారు నరకాగ్నిలోకి బోర్లా త్రోయబడతారు. (వారితో అనబడుతుంది): "మీకు ఇవ్వబడే ప్రతిఫలం మీ కర్మలకు భిన్నంగా ఉండ గలదా?"

وَمَن جَآءَ بِٱلسَّيِّئَةِ فَكُبَّتْ وُجُوهُهُمْ فِى ٱلنَّارِ هَلْ تُجْزَوْنَ إِلَّا مَا كُنتُمْ تَعْمَلُونَ ﴿٩٠﴾

**91**. (ఓ ము'హమ్మద్! వారితో ఇలా అను): "నిశ్చయంగా, ఈ (మక్కా) నగరపు ప్రభువునే ఆరాధించాలని నాకు ఆజ్ఞ ఇవ్వబడింది. ఆయనే! దీనిని పవిత్రక్షేత్రంగా చేశాడు,[3] మరియు ప్రతి వస్తువు ఆయనకు చెందినదే! మరియు నేను ఆయనకు విధేయుడ(ముస్లిం)నై ఉండాలని నాకు ఆజ్ఞ ఇవ్వబడింది.

إِنَّمَآ أُمِرْتُ أَنْ أَعْبُدَ رَبَّ هَٰذِهِ ٱلْبَلْدَةِ ٱلَّذِى حَرَّمَهَا وَلَهُۥ كُلُّ شَىْءٍ ۖ وَأُمِرْتُ أَنْ أَكُونَ مِنَ ٱلْمُسْلِمِينَ ﴿٩١﴾

---

**1**. చూడండి, 14:48 మరియు 20:105-107.

**2**. చూడండి, 21:103.

**3**. చూడండి, 3:96 'హ్రమహ్: అంటే ఈ నగరంలో రక్తప్రసారం (హత్యచేయటం, ఇతరులపై దౌర్జన్యం, అన్యాయం చేయటం, వేటాడటం, చెట్లను నరకటం, ముల్లు కూడా తెంపటం నిషేధింపబడింది. ('స'హీ'హ్ బు'ఖారీ).

وَأَنْ أَتْلُوَاْ ٱلْقُرْءَانَ فَمَنِ ٱهْتَدَىٰ فَإِنَّمَا يَهْتَدِى لِنَفْسِهِۦ وَمَن ضَلَّ فَقُلْ إِنَّمَآ أَنَا۠ مِنَ ٱلْمُنذِرِينَ ﴿٩٢﴾

**92**. మరియు ఈ ఖుర్ఆన్‌ను చదివి వినిపించాలని కూడా (ఆజ్ఞ ఇవ్వబడింది). కావున మార్గదర్శకత్వం పొందినవాడు తన మేలుకే, మార్గదర్శకత్వం పొందుతాడు. మరియు మార్గభ్రష్టుడైన వాడితో అను: "నిశ్చయంగా, నేను హెచ్చరిక చేసేవాడను మాత్రమే!"

وَقُلِ ٱلْحَمْدُ لِلَّهِ سَيُرِيكُمْ ءَايَٰتِهِۦ فَتَعْرِفُونَهَا ۚ وَمَا رَبُّكَ بِغَٰفِلٍ عَمَّا تَعْمَلُونَ ﴿٩٣﴾

**93**. వారితో (ఇంకా) ఇలా అను: "సర్వస్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే! త్వరలోనే ఆయన మీకు తన సూచనలను చూపుతాడు, అప్పుడు మీకు తెలుస్తుంది.[1] మరియు మీరు చేస్తున్న కార్యాలను నీ ప్రభువు ఎరుగకుండా లేడు!"

*****

**1**. చూడండి, 41:53.

## 28. సూరహ్ అల్-ఖ'స'స్

## سُورَةُ القَصَصِ

అల్-ఖ'స'స్: **కథలు,** వృత్తాంతాలు. ఈ పేరు **25**వ **ఆయత్**లో ఉంది. ఈ సూరహ్‌లో చాలా మట్టుకు మూసా ('అ.స.) గాథ ఉంది. ఇది చివరి మక్కా కాలపు సూరాహ్‌లలో ఒకటి. ఇది సూరహ్ అల్-ఇ'స్రా(17)కు ముందు అవతరింపజేయబడింది. ఆయత్ 85 దైవప్రవక్త ('స'అస) యొక్క ప్రస్థాన సమయంలో జుహ్‌పాలో అవతరరింపజేయబడింది. అల్లాహ్ (సు.తా.) తప్ప మరొక ఆరాధ్యనీయుడు లేడు. ఆ నిత్యుడు, అల్లాహ్ (సు.తా.) తప్ప ప్రతిదీ నశింపనున్నది. ఇందులో **88 ఆయతులు**న్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1**. 'త-సీన్-మీమ్.

طسٓمٓ ﴿١﴾

**2**. ఇవి స్పష్టమైన గ్రంథ సూచన (ఆయత్)లు.[1]

تِلۡكَ ءَايَٰتُ ٱلۡكِتَٰبِ ٱلۡمُبِينِ ﴿٢﴾

**3**. విశ్వసించే ప్రజల కొరకు, మేము మూసా మరియు ఫిర్'ఔన్‌ల యొక్క నిజ వృత్తాంతాన్ని నీకు వినిపిస్తున్నాము.

نَتۡلُواْ عَلَيۡكَ مِن نَّبَإِ مُوسَىٰ وَفِرۡعَوۡنَ بِٱلۡحَقِّ لِقَوۡمٍ يُؤۡمِنُونَ ﴿٣﴾

**4**. నిశ్చయంగా, ఫిర్'ఔన్ భూమి మీద అహంకారంతో ప్రవర్తిస్తూ ఉండేవాడు. మరియు అందులోని ప్రజలను వర్గాలుగా విభజించి, వారిలోని ఒకతెగ వారిని నీచపరచి వారి పుత్రులను వధిస్తూ ఉండేవాడు[2] మరియు వారి స్త్రీలను బ్రతుకనిచ్చేవాడు. నిశ్చయంగా, అతడు దౌర్జన్యపరులలోని వాడిగా ఉండేవాడు.

إِنَّ فِرۡعَوۡنَ عَلَا فِي ٱلۡأَرۡضِ وَجَعَلَ أَهۡلَهَا شِيَعٗا يَسۡتَضۡعِفُ طَآئِفَةٗ مِّنۡهُمۡ يُذَبِّحُ أَبۡنَآءَهُمۡ وَيَسۡتَحۡيِۦ نِسَآءَهُمۡۚ إِنَّهُۥ كَانَ مِنَ ٱلۡمُفۡسِدِينَ ﴿٤﴾

---

**1**. చూడండి, 12:1.
**2**. వీరు ఇస్రాయీ'ల్ సంతతి వారు. ఫిర్'ఔన్ జాతి వారు వీరిని బానిసలుగా చేసి హింసించే వారు.

وَنُرِيدُ أَن نَّمُنَّ عَلَى ٱلَّذِينَ ٱسْتُضْعِفُوا۟ فِى ٱلْأَرْضِ وَنَجْعَلَهُمْ أَئِمَّةً وَنَجْعَلَهُمُ ٱلْوَٰرِثِينَ ﴿٥﴾

5. మరియు భూమి మీద అణచివేయ బడిన వారిని కనికరించాలని మరియు వారిని నాయకులుగా చేయాలని మరియు వారిని వారసులుగా చేయాలని మేము కోరాము.[1]

وَنُمَكِّنَ لَهُمْ فِى ٱلْأَرْضِ وَنُرِىَ فِرْعَوْنَ وَهَٰمَٰنَ وَجُنُودَهُمَا مِنْهُم مَّا كَانُوا۟ يَحْذَرُونَ ﴿٦﴾

6. మరియు (ఇస్రాయీ'ల్ సంతతి) వారికి భూమిలో అధికారం ఒసంగాలనీ[2] మరియు ఫిర్'ఔన్, హామాన్[3] మరియు వారి సైనికులకు - దేనిని గురించైతే (ఫిర్'ఔన్ జాతి) వారు భయపడుతూ ఉండేవారో[4] - అదే వారికి చూపాలని!

وَأَوْحَيْنَآ إِلَىٰٓ أُمِّ مُوسَىٰٓ أَنْ أَرْضِعِيهِ ۖ فَإِذَا خِفْتِ عَلَيْهِ فَأَلْقِيهِ فِى ٱلْيَمِّ وَلَا تَخَافِى وَلَا تَحْزَنِىٓ ۖ إِنَّا رَآدُّوهُ إِلَيْكِ وَجَاعِلُوهُ مِنَ ٱلْمُرْسَلِينَ ﴿٧﴾

7. మేము మూసా తల్లి మనస్సులో ఇలా[5] సూచించాము: "నీవు అతనికి (మూసాకు) పాలు ఇస్తూ ఉండు. కాని అతనికి ప్రమాదమున్నదని, నీవు భావిస్తే అతనిని నదిలో విడిచిపెట్టు.[6] మరియు నీవు భయపడకు మరియు దుఃఖించకు, నిశ్చయంగా మేము అతనిని నీ వద్దకు తిరిగి చేర్చుతాము. మరియు అతనిని (మా) సందేశహరులలో ఒకనిగా చేస్తాము!"

فَٱلْتَقَطَهُۥٓ ءَالُ فِرْعَوْنَ لِيَكُونَ لَهُمْ عَدُوًّا وَحَزَنًا ۗ إِنَّ فِرْعَوْنَ وَهَٰمَٰنَ وَجُنُودَهُمَا كَانُوا۟ خَٰطِـِٔينَ ﴿٨﴾

8. తరువాత ఫిర్'ఔన్ కుటుంబంవారు[7] - తమకు శత్రువై, దుఃఖకారణుడవటానికి - అతనిని ఎత్తుకున్నారు. నిశ్చయంగా ఫిర్'ఔన్, హామాన్ మరియు వారిసైనికులు పాపిష్ఠులు!

---

1. చూడండి, 7:137.
2. ఇక్కడ అ'ర్దున్, భూమి అంటే కనాన్ (షామ్).
3. హామాన్, ఫిర్'ఔన్ యొక్క ముఖ్య నాయకుడు. చూడండి, 40:36-37.
4. అంటే, ఇస్రాయీ'ల్ సంతతివారి ద్వారా తమ నాశనం కావచ్చనే ఏ భయంవల్లనైతే ఫిర్'ఔన్ జాతి వారు ఇస్రాయీ'ల్ సంతతివారి మగ సంతానాన్ని హత్య చేస్తూ ఉండేవారో - దానినే వారికి సత్యం చేసి చూపటానికి.
5. వ'హీ: అంటే ఇక్కడ ఆమె మనస్సులో ఆలోచన పుట్టించడం.
6. చూడండి, 20:39.
7. అంటే ఫిర్'ఔన్ భార్య. ఇంకా చూడండి, 66:11.

وَقَالَتِ ٱمۡرَأَتُ فِرۡعَوۡنَ قُرَّتُ عَيۡنٍ لِّي وَلَكَۖ لَا تَقۡتُلُوهُ عَسَىٰٓ أَن يَنفَعَنَآ أَوۡ نَتَّخِذَهُۥ وَلَدٗا وَهُمۡ لَا يَشۡعُرُونَ ٩

9. మరియు ఫిర్'ఔన్ భార్య (అతనితో) ఇలా అన్నది: "ఇతను నీకూ మరియు నాకూ కంటిచలువ! ఇతనిని చంపకు, బహుశా ఇతడు మనకు ఉపయోగకారి కావచ్చు! లేదా మనం ఇతనిని కుమారునిగా చేసుకోవచ్చు!"[1] కాని వారు (వాస్తవాన్ని) తెలుసుకోలేక పోయారు.

وَأَصۡبَحَ فُؤَادُ أُمِّ مُوسَىٰ فَٰرِغًاۖ إِن كَادَتۡ لَتُبۡدِي بِهِۦ لَوۡلَآ أَن رَّبَطۡنَا عَلَىٰ قَلۡبِهَا لِتَكُونَ مِنَ ٱلۡمُؤۡمِنِينَ ١٠

10. మరియు మూసా తల్లి హృదయం తల్లడిల్లిపోయింది. ఆమె విశ్వసించిన వారిలో ఉండటానికి మేము, ఆమె హృదయాన్ని దృఢపరచి ఉండకపోతే, ఆమె అతనిని (మూసాను) గురించి అంతా బట్టబయలు చేసి ఉండేది.

وَقَالَتۡ لِأُخۡتِهِۦ قُصِّيهِۖ فَبَصُرَتۡ بِهِۦ عَن جُنُبٖ وَهُمۡ لَا يَشۡعُرُونَ ١١

11. ఆమె, అతని (మూసా) సోదరితో[2] అన్నది: "అతని వెంటవెళ్ళు." కావున ఆమె దూరంనుండియే అతనిని గమనించసాగింది. కానీ, వారది గ్రహించలేక పోయారు. (1/4)

۞ وَحَرَّمۡنَا عَلَيۡهِ ٱلۡمَرَاضِعَ مِن قَبۡلُ فَقَالَتۡ هَلۡ أَدُلُّكُمۡ عَلَىٰٓ أَهۡلِ بَيۡتٖ يَكۡفُلُونَهُۥ لَكُمۡ وَهُمۡ لَهُۥ نَٰصِحُونَ ١٢

12. * మరియు మేము అతనిని (ఇతరుల) పాలు త్రాగకుండా మొదటనే నిషేధించి ఉన్నాము. (అతని సోదరి) వారితో అన్నది: "మీ కొరకు అతనిని, (పాలిచ్చి) పోషించగల ఒక కుటుంబం వారిని నేను మీకు చూపనా? మరియు వారు అతనిని మంచిగా చూసుకొనేవారై ఉంటారు."

---

1. వారికి సంతానం లేనందుకు ఆమె అతనిని ('అ.స.) కుమారునిగా చేసుకోదలచింది.
2. మూసా ('అ.స.) సోదరీమణి పేరు మర్యమ్ బిన్తె 'ఇమ్రాన్ మరియు 'ఈసా ('అ.స.) తల్లిపేరు కూడా మర్యమ్ బిన్తె 'ఇమ్రాన్.

**13**. ఈ విధంగా మేము అతనిని (మూసాను) - అతని తల్లి కళ్ళు చల్లబడటానికి, ఆమె దుఃఖించకుండా ఉండటానికి మరియు అల్లాహ్ వాగ్దానం సత్యమైనదని ఆమె తెలుసుకోవటానికి - తిరిగి ఆమెవద్దకు చేర్చాము. కాని వాస్తవానికి చాలామందికి ఇది తెలియదు.

**14**. మరియు అతను (మూసా) యుక్తవయస్సుకు చేరి పరిపూర్ణుడు అయినప్పుడు, మేము అతనికి వివేకాన్ని మరియు జ్ఞానాన్ని ప్రసాదించాము. మరియు ఈ విధంగా, మేము సజ్జనులకు ప్రతిఫలాన్ని ఇస్తూ ఉంటాము.[1]

**15**. మరియు (ఒక రోజు) నగరవాసులు ఏమరుపాటులో ఉన్నప్పుడు అతను నగరంలోకి ప్రవేశించాడు. అతను అక్కడ ఇద్దరు వ్యక్తులు పోట్లాడుకోవడం చూశాడు; వారిలో ఒకడు అతని జాతికి చెందినవాడు, మరొకడు విరోధి జాతికి చెందినవాడు. అతని జాతికి చెందినవాడు, విరోధిజాతి వానికి వ్యతిరేకంగా సహాయపడమని అతనిని (మూసాను) అర్థించాడు. మూసా అతనిని ఒక గుద్దు గుద్దాడు. అది అతనిని అంతమొందించింది. (అప్పుడు) అతను (మూసా) అన్నాడు: "ఇది షై'తాన్ పనే! నిశ్చయంగా, అతడు శత్రువు మరియు స్పష్టంగా దారి తప్పించేవాడు."[2]

فَرَدَدۡنَٰهُ إِلَىٰٓ أُمِّهِۦ كَيۡ تَقَرَّ
عَيۡنُهَا وَلَا تَحۡزَنَ وَلِتَعۡلَمَ
أَنَّ وَعۡدَ ٱللَّهِ حَقّٞ وَلَٰكِنَّ
أَكۡثَرَهُمۡ لَا يَعۡلَمُونَ ١٣

وَلَمَّا بَلَغَ أَشُدَّهُۥ وَٱسۡتَوَىٰٓ ءَاتَيۡنَٰهُ
حُكۡمٗا وَعِلۡمٗاۚ وَكَذَٰلِكَ نَجۡزِي
ٱلۡمُحۡسِنِينَ ١٤

وَدَخَلَ ٱلۡمَدِينَةَ عَلَىٰ حِينِ غَفۡلَةٖ
مِّنۡ أَهۡلِهَا فَوَجَدَ فِيهَا رَجُلَيۡنِ
يَقۡتَتِلَانِ هَٰذَا مِن شِيعَتِهِۦ وَهَٰذَا
مِنۡ عَدُوِّهِۦۖ فَٱسۡتَغَٰثَهُ ٱلَّذِي مِن
شِيعَتِهِۦ عَلَى ٱلَّذِي مِنۡ عَدُوِّهِۦ فَوَكَزَهُۥ
مُوسَىٰ فَقَضَىٰ عَلَيۡهِۖ قَالَ هَٰذَا مِنۡ عَمَلِ
ٱلشَّيۡطَٰنِۖ إِنَّهُۥ عَدُوّٞ مُّضِلّٞ مُّبِينٞ ١٥

---

**1**. చూడండి, 12:22.

**2**. దైవప్రవక్త ప్రవచనం: 'తెగలకొరకు, తెగలపేరట కృషిచేసేవాడూ మరియు తెగలకొరకు పోరాడేవాడూ మరియు తెగలకొరకు మరణించేవాడూ మాలోనివాడుకాడు!' (అబూ దావూద్ -'జుబైర్ ఇబ్నె ముత్'ఇమ్ - కథనం ఆధారంగా) దీని భావం అడుగగా అతను ('స'అస) అన్నారు: 'అన్యాయ విషయంలో తమ వారికి సహాయపడటం.'

**16.** (మూసా) ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నాకు నేను అన్యాయం చేసుకున్నాను. కావున నన్ను క్షమించు!" (అల్లాహ్) అతనిని క్షమించాడు. నిశ్చయంగా ఆయన క్షమాశీలుడు, అపారకరుణాప్రదాత.[1]

**17.** (మూసా) అన్నాడు: "ఓ నా ప్రభూ! నీవు నాకు మహోపకారం చేశావు. కావున నేను ఇక ఎన్నటికీ నేరస్తులకు సహాయపడను!"

**18.** మరుసటి రోజు ఉదయం అతను (మూసా) భయపడుతూ అతి జాగ్రత్తగా (ఇటూ అటూ చూస్తూ) నగరంలోకి వెళ్ళాడు. అప్పుడు అకస్మాత్తుగా అంతకు ముందు రోజు, అతనిని సహాయానికి పిలిచినవాడే, మళ్ళీ సహాయానికై అరవసాగాడు. మూసా వానితో అన్నాడు: "నిశ్చయంగా నీవు స్పష్టమైన తప్పుదారికి లాగేవాడవు!"[2]

**19.** ఆ తరువాత అతను తమ ఇద్దరికి విరోధి అయిన వానిని గట్టిగా పట్టుకోబోగా, అతడు అరిచాడు: "ఓ మూసా! ఏమీ? నీవు నిన్న ఒకవ్యక్తిని చంపినట్లు నన్నుకూడా చంపదలచుకున్నావా? నీవు ఈ దేశంలో క్రూరునిగా మారి ఉండదలుచుకున్నావా? సద్వర్తనునిగా ఉండదలుచుకోలేదా?"

قَالَ رَبِّ إِنِّي ظَلَمْتُ نَفْسِي فَٱغْفِرْ لِي فَغَفَرَ لَهُۥٓۚ إِنَّهُۥ هُوَ ٱلْغَفُورُ ٱلرَّحِيمُ ﴿١٦﴾

قَالَ رَبِّ بِمَآ أَنْعَمْتَ عَلَيَّ فَلَنْ أَكُونَ ظَهِيرًا لِّلْمُجْرِمِينَ ﴿١٧﴾

فَأَصْبَحَ فِي ٱلْمَدِينَةِ خَآئِفًا يَتَرَقَّبُ فَإِذَا ٱلَّذِي ٱسْتَنصَرَهُۥ بِٱلْأَمْسِ يَسْتَصْرِخُهُۥۚ قَالَ لَهُۥ مُوسَىٰٓ إِنَّكَ لَغَوِيٌّ مُّبِينٌ ﴿١٨﴾

فَلَمَّآ أَنْ أَرَادَ أَن يَبْطِشَ بِٱلَّذِي هُوَ عَدُوٌّ لَّهُمَا قَالَ يَٰمُوسَىٰٓ أَتُرِيدُ أَن تَقْتُلَنِي كَمَا قَتَلْتَ نَفْسًۢا بِٱلْأَمْسِۖ إِن تُرِيدُ إِلَّآ أَن تَكُونَ جَبَّارًا فِي ٱلْأَرْضِ وَمَا تُرِيدُ أَن تَكُونَ مِنَ ٱلْمُصْلِحِينَ ﴿١٩﴾

---

1. ఉద్దేశ్యపూర్వకంగా చంపకున్నా, ఒక మానవుని హత్యజరిగింది. దానికి మూసా ('అ.స.) పశ్చాత్తాపపడి క్షమాపణ వేడుకుంటే, అల్లాహ్ (సు.తా.) అతనిని క్షమించాడు.
2. ఇబ్నె 'అబ్బాస్ మరియు ముఖాతిల్(ర'ది.'అన్హుమ్)ల కథనం ప్రకారం ఆ ఇస్రాయీ'ల్ వంశీయుడు సత్యతిరస్కారి.

20. మరియు ఒక వ్యక్తి నగరపు ఒక వైపునుండి పరిగెత్తుకుంటూ వచ్చి ఇలా అన్నాడు: "ఓ మూసా! నాయకులందరూ కలిసి నిన్ను హత్యచేయాలని సంప్రదింపులు చేస్తున్నారు. కావున నీవు వెళ్ళిపో, నేను నిశ్చయంగా నీ శ్రేయోభిలాషిని!"

21. అప్పుడతను భయపడుతూ, అతి జాగ్రత్తగా అక్కడినుండి బయలుదేరాడు. అతను ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నన్ను దుర్మార్గులనుండి కాపాడు!"

22. ఆ తరువాత అతను మద్'యన్ వైపుకు బయలుదేరుతూ, ఇలా అనుకున్నాడు: "బహుశా, నా ప్రభువు నాకు సరైనమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తున్నాడు!"[1]

23. ఇక అతను మద్'యన్ లోని ఒక బావి వద్దకు చేరుకున్నప్పుడు; అక్కడ చాలా మంది ప్రజలు, తమ తమ పశువులకు నీరు త్రాగించటాన్ని మరియు వారికి దూరంగా ఒక ప్రక్కన ఇద్దరు స్త్రీలు తమ పశువులను ఆపుతూ ఉండటాన్ని చూశాడు. (మూసా) ఆ స్త్రీలను అడిగాడు: "మీరిద్దరి చిక్కు ఏమిటి?" వారిద్దరన్నారు: "ఈ పశువుల కాపరులంతా పోయేవరకు మేము (మా పశువులకు) నీరు త్రాపలేము. మరియు మా తండ్రి చాలావృద్ధుడు."

وَجَآءَ رَجُلٌ مِّنْ أَقْصَا ٱلْمَدِينَةِ يَسْعَىٰ
قَالَ يَـٰمُوسَىٰٓ إِنَّ ٱلْمَلَأَ
يَأْتَمِرُونَ بِكَ لِيَقْتُلُوكَ فَٱخْرُجْ إِنِّى
لَكَ مِنَ ٱلنَّـٰصِحِينَ ﴿٢٠﴾
فَخَرَجَ مِنْهَا خَآئِفًا يَتَرَقَّبُ ۖ قَالَ رَبِّ
نَجِّنِى مِنَ ٱلْقَوْمِ ٱلظَّـٰلِمِينَ ﴿٢١﴾
وَلَمَّا تَوَجَّهَ تِلْقَآءَ مَدْيَنَ قَالَ عَسَىٰ
رَبِّىٓ أَن يَهْدِيَنِى سَوَآءَ ٱلسَّبِيلِ ﴿٢٢﴾
وَلَمَّا وَرَدَ مَآءَ مَدْيَنَ وَجَدَ عَلَيْهِ
أُمَّةً مِّنَ ٱلنَّاسِ يَسْقُونَ
وَوَجَدَ مِن دُونِهِمُ ٱمْرَأَتَيْنِ
تَذُودَانِ ۖ قَالَ مَا خَطْبُكُمَا ۖ قَالَتَا لَا
نَسْقِى حَتَّىٰ يُصْدِرَ ٱلرِّعَآءُ ۖ وَأَبُونَا
شَيْخٌ كَبِيرٌ ﴿٢٣﴾

1. మద్'యన్ అక్కడ నివసించే ప్రజల తెగపేరు. వారు అమోరైట్ (Amorite) తెగకు చెందిన 'అరబ్బులు. యూదుల సంతతితో వారికి దగ్గరి సంబంధం ఉండెను. చూడండి, 7:85. ఇబ్రాహీమ్ ('అ.స.) కుమారుడైన ఇస్హాఖ్ ('అ.స.) యొక్క కుమారుడగు య'అఖూబ్ ('అ.స.), మరొక పేరు ఇస్రాయీ'ల్. ఆ పేరుతోనే పిలువబడే అతని పన్నెండుమంది కుమారుల సంతతి వారే ఇస్రాయీ'ల్ సంతతివారు (బనీ ఇస్రాయీ'ల్).

فَسَقَىٰ لَهُمَا ثُمَّ تَوَلَّىٰٓ إِلَى ٱلظِّلِّ فَقَالَ رَبِّ إِنِّي لِمَآ أَنزَلۡتَ إِلَيَّ مِنۡ خَيۡرٖ فَقِيرٞ ٢٤

**24.** అప్పుడు అతను వారిద్దరి పశువులకు నీరు త్రాపాడు. తరువాత నీడలోకి పోయి ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నీవు నాపై ఏ మేలును అవతరింపజేసినా, నేను దాని ఆవశ్యకత గలవాడనే!"

فَجَآءَتۡهُ إِحۡدَىٰهُمَا تَمۡشِي عَلَى ٱسۡتِحۡيَآءٖ قَالَتۡ إِنَّ أَبِي يَدۡعُوكَ لِيَجۡزِيَكَ أَجۡرَ مَا سَقَيۡتَ لَنَاۚ فَلَمَّا جَآءَهُۥ وَقَصَّ عَلَيۡهِ ٱلۡقَصَصَ قَالَ لَا تَخَفۡۖ نَجَوۡتَ مِنَ ٱلۡقَوۡمِ ٱلظَّٰلِمِينَ ٢٥

**25.** తరువాత ఆ ఇద్దరిలో ఒకామె సిగ్గుపడుతూ మెల్లగా అతని వద్దకు వచ్చి ఇలా అన్నది: "వాస్తవానికి, నా తండ్రి - నీవు మా కొరకు (మా పశువులకు) నీరు త్రాపించినందుకు - ప్రతిఫలమివ్వటానికి, నిన్ను పిలుస్తున్నాడు."[1] అతను, అతని వద్దకుపోయి తన వృత్తాంతాన్ని వినిపించాడు. అప్పుడతను అన్నాడు: "నీవు ఏ మాత్రం భయపడకు. నీవు దుర్మార్గ ప్రజలనుండి విముక్తి పొందావు."

قَالَتۡ إِحۡدَىٰهُمَا يَٰٓأَبَتِ ٱسۡتَـٔۡجِرۡهُۖ إِنَّ خَيۡرَ مَنِ ٱسۡتَـٔۡجَرۡتَ ٱلۡقَوِيُّ ٱلۡأَمِينُ ٢٦

**26.** వారిద్దరిలో ఒకామె ఇలా అన్నది: "నాన్నా! ఇతనిని పనికొరకు పెట్టుకో. నిశ్చయంగా, ఇలాంటి బలవంతుని మరియు నమ్మదగిన వానిని పనికొరకు పెట్టుకోవటం ఎంతో మేలైనది."

قَالَ إِنِّيٓ أُرِيدُ أَنۡ أُنكِحَكَ إِحۡدَى ٱبۡنَتَيَّ هَٰتَيۡنِ عَلَىٰٓ أَن تَأۡجُرَنِي ثَمَٰنِيَ حِجَجٖۖ فَإِنۡ أَتۡمَمۡتَ عَشۡرٗا فَمِنۡ عِندِكَۖ

**27.** (వారి తండ్రి) అన్నాడు: "నీవు నా వద్ద ఎనిమిది సంవత్సరాలు పనిచేస్తూ ఉండటానికి ఒప్పుకుంటే, నేను నా ఈ ఇద్దరు కుమార్తెలలో ఒకామెను నీకిచ్చి

---

**1.** ఆ ఇద్దరు స్త్రీల తండ్రి పేరు ఖుర్ఆన్ పేర్కొనలేదు. ఇమామ్ షౌకాని మరియు ఇతర చాలామంది వ్యాఖ్యాతలు అతని పేరు షు'ఐబ్ ('అ.స.) అని అన్నారు. ఎందుకంటే అతను మద్‌యన్ జాతి వారివైపునకే ప్రవక్తగా పంపబడి ఉండిరి. కాని ఇబ్నె-కసీ'ర్ అభిప్రాయం వేరుంది. అతను అంటారు: 'షు'ఐబ్ ('అ.స.) మరియు మూసా ('అ.స.) కాలాలలో చాల గడువు ఉంది. కాబట్టి ఇతను షు'ఐబ్ ('అ.స.) తెగకు చెందిన మరొక వ్యక్తి కావచ్చు.' అల్లాహు ఆలమ్.

وَمَآ أُرِيدُ أَنۡ أَشُقَّ عَلَيۡكَۚ
سَتَجِدُنِيٓ إِن شَآءَ ٱللَّهُ مِنَ
ٱلصَّٰلِحِينَ ﴿٢٧﴾
قَالَ ذَٰلِكَ بَيۡنِي وَبَيۡنَكَۖ أَيَّمَا
ٱلۡأَجَلَيۡنِ قَضَيۡتُ فَلَا عُدۡوَٰنَ
عَلَيَّۖ وَٱللَّهُ عَلَىٰ مَا نَقُولُ وَكِيلٞ
﴿٢٨﴾
۞ فَلَمَّا قَضَىٰ مُوسَى ٱلۡأَجَلَ وَسَارَ
بِأَهۡلِهِۦٓ ءَانَسَ مِن جَانِبِ ٱلطُّورِ
نَارٗاۖ قَالَ لِأَهۡلِهِ ٱمۡكُثُوٓاْ إِنِّيٓ
ءَانَسۡتُ نَارٗا لَّعَلِّيٓ ءَاتِيكُم مِّنۡهَا
بِخَبَرٍ أَوۡ جَذۡوَةٖ مِّنَ ٱلنَّارِ
لَعَلَّكُمۡ تَصۡطَلُونَ ﴿٢٩﴾

వివాహం చేయగోరుతున్నాను.[1] నీవు ఒకవేళ పది సంవత్సరాలు పూర్తిచేయదలిస్తే అది నీ ఇష్టం! నేను నీకు కష్టం కలిగించదలచుకోలేదు. అల్లాహ్ కోరితే, నీవు నన్ను సద్వర్తనునిగా చూస్తావు!''

**28.** (మూసా) అన్నాడు: ''ఈ విషయం నీకూ మరియు నాకూ మధ్య నిశ్చయమే! ఈ రెండు గడువులలో నేను దేనిని పూర్తిచేసినా, నా పై ఎలాంటి ఒత్తిడి ఉండకూడదు. మరియు మన, ఈ మాటలకు అల్లాహ్‌యే సాక్షి!'' (3/8)

**29.** * ఆ తరువాత మూసా తన గడువు[2] పూర్తిచేసి, తన కుటుంబం వారిని తీసుకొని పోతుండగా, 'తూర్ పర్వతపు దిక్కులో ఒక మంటను చూశాడు. (అప్పుడు) తన ఇంటివారితో అన్నాడు: ''ఆగండి! నేను ఒక మంటను చూశాను, బహుశా! నేను అక్కడి నుండి ఏదైనా మంచి వార్తను తీసుకొని రావచ్చు, లేదా ఒక అగ్ని కొరవినైనా! అప్పుడు మీరు దానితో చలి కాచుకోవచ్చు.''

---

**1**. మన సాంఘిక సంప్రదాయంలో ఆడబిడ్డ (వధువు) ఇంటివారు తమ బిడ్డకొరకు వరుని (పెండ్లి కుమారుని) వారితో వివాహసంబంధం గురించి మొదట మాట ప్రారంభించటం అనుచితమైన విషయంగా భావిస్తారు. కాని అల్లాహ్ (సు.తా.) షరీయత్‌లో ఇది అనుచితం కాదు. ఒకవేళ సద్వర్తనుడు, సుశీలుడు అయిన వరుడు ఉంటే అతనితో గానీ, లేక అతని కుటుంబంవారితో గానీ, వధువు ఇంటివారు మాట్లాడితే తప్పులేదు. దైవప్రవక్త ('స'అస) మరియు సహాబీల (ర'ది.'అన్హుమ్)లలో కూడా ఈ ఆచారం ఉండెను.

**2**. ఇబ్నె 'అబ్బాస్ (ర'ది.'అ.) కథనం ప్రకారం అతను ఈ గడువు పది సంవత్సరాలు పూర్తిచేశారు. ఎందుకంటే మూసా ('అ.స.) వృద్ధుడైన తన భార్య తండ్రికి సహాయపడగోరారు. చూడండి, 27:7-8.

فَلَمَّآ أَتَىٰهَا نُودِىَ مِن شَٰطِئِ ٱلْوَادِ ٱلْأَيْمَنِ فِى ٱلْبُقْعَةِ ٱلْمُبَٰرَكَةِ مِنَ ٱلشَّجَرَةِ أَن يَٰمُوسَىٰٓ إِنِّىٓ أَنَا ٱللَّهُ رَبُّ ٱلْعَٰلَمِينَ ﴿٣٠﴾

**30**. కాని అతను దాని (అగ్ని) వద్దకు చేరుకున్నప్పుడు,[1] ఆ లోయ కుడివైపు ఉన్న ఒక శుభవంతమైన స్థలములో ఉన్న ఒకచెట్టు నుండి: "ఓ మూసా! నిశ్చయంగా, నేనే అల్లాహ్‌ను! సర్వలోకాల ప్రభువును." అనే మాటలు వినిపించాయి.

وَأَنْ أَلْقِ عَصَاكَ ۖ فَلَمَّا رَءَاهَا تَهْتَزُّ كَأَنَّهَا جَآنٌّ وَلَّىٰ مُدْبِرًا وَلَمْ يُعَقِّبْ ۚ يَٰمُوسَىٰٓ أَقْبِلْ وَلَا تَخَفْ ۖ إِنَّكَ مِنَ ٱلْءَامِنِينَ ﴿٣١﴾

**31**. (ఇంకా ఇలా వినిపించింది): "నీ చేతి కర్రను పడవేయి!" అతను (మూసా) దానిని పామువలే కదలటం చూసి వెనక్కి మరలి పరుగెత్తాడు, తిరిగి కూడా చూడలేదు. (తరువాత ఇలా సెలవీయబడింది): "ఓ మూసా, ముందుకురా, భయపడకు! నిశ్చయంగా నీవు సురక్షితంగా ఉన్నావు!

ٱسْلُكْ يَدَكَ فِى جَيْبِكَ تَخْرُجْ بَيْضَآءَ مِنْ غَيْرِ سُوٓءٍ وَٱضْمُمْ إِلَيْكَ جَنَاحَكَ مِنَ ٱلرَّهْبِ ۖ فَذَٰنِكَ بُرْهَٰنَانِ مِن رَّبِّكَ إِلَىٰ فِرْعَوْنَ وَمَلَإِي۟هِۦٓ ۚ إِنَّهُمْ كَانُوا۟ قَوْمًا فَٰسِقِينَ ﴿٣٢﴾

**32**. "నీ చేతిని నీ చంకలోకి దూర్చుకో, అది ఎలాంటి లోపం లేకుండా ప్రకాశిస్తూ బయటికి వస్తుంది.[2] నీవు భయపడకుండా ఉండటానికి నీ చేతిని, నీ ప్రక్కకు అదుముకో! ఈ రెండు నీవు ఫిర్ఔన్ మరియు అతని నాయకులకు (చూపటానికి) నీ ప్రభువు ప్రసాదించిన నిదర్శనా(ఆయతు)లు. నిశ్చయంగా, వారు చాలా దుష్టులయిపోయారు!"

قَالَ رَبِّ إِنِّى قَتَلْتُ مِنْهُمْ نَفْسًا فَأَخَافُ أَن يَقْتُلُونِ ﴿٣٣﴾

**33**. (మూసా) అన్నాడు: "ఓ నా ప్రభూ! నేను వారి మనిషిని ఒకనిని చంపాను, కావున వారు నన్ను చంపుతారేమోనని భయపడు తున్నాను.

---

**1**. ఆ మంట వాస్తవానికి అల్లాహ్ (సు.తా.) దివ్యజ్యోతి. చూడండి, 19:52, 20:80.
**2**. చూడండి, 7:108.

34. "మరియు నా సోదరుడు హారూన్ మాట్లాడటంలో నాకంటే మంచి వాగ్ధాటి గలవాడు.[1] నన్ను సమర్థించటానికి అతనిని నాకు సహాయకునిగా నాతోపాటు పంపు. వాస్తవానికి వారు నన్ను అసత్యవాదివని తిరస్కరిస్తారేమోనని నేను భయపడు తున్నాను!"

وَأَخِى هَـٰرُونُ هُوَ أَفْصَحُ مِنِّى لِسَانًا فَأَرْسِلْهُ مَعِىَ رِدْءًا يُصَدِّقُنِىٓ ۖ إِنِّىٓ أَخَافُ أَن يُكَذِّبُونِ ﴿٣٤﴾

35. ఆయన (అల్లాహ్) అన్నాడు: "మేము నీ సోదరుని ద్వారా నీ చేతులను బలపరుస్తాము. మరియు మేము మీ ఇద్దరికి విశేషశక్తి నొసంగుతాము. వారు మీ ఇద్దరికి ఏ మాత్రం హాని చేయలేరు. మా సూచనల ద్వారా మీరిద్దరూ మరియు మిమ్మల్ని అనుసరించే వారు గెలుపొందుతారు."[2]

قَالَ سَنَشُدُّ عَضُدَكَ بِأَخِيكَ وَنَجْعَلُ لَكُمَا سُلْطَـٰنًا فَلَا يَصِلُونَ إِلَيْكُمَا ۚ بِـَٔايَـٰتِنَآ أَنتُمَا وَمَنِ ٱتَّبَعَكُمَا ٱلْغَـٰلِبُونَ ﴿٣٥﴾

36. ఆ తరువాత మూసా మా స్పష్టమైన సూచనలను తీసుకొని వారివద్దకు పోగా వారన్నారు: "ఇది కల్పితమైన మాయాజాలం మాత్రమే.[3] ఇలాంటిది పూర్వీకులైన మా తాతముత్తాతల కాలంలో కూడా జరిగినట్లు మేము వినలేదు."[4]

فَلَمَّا جَآءَهُم مُّوسَىٰ بِـَٔايَـٰتِنَا بَيِّنَـٰتٍ قَالُوا۟ مَا هَـٰذَآ إِلَّا سِحْرٌ مُّفْتَرًى وَمَا سَمِعْنَا بِهَـٰذَا فِىٓ ءَابَآئِنَا ٱلْأَوَّلِينَ ﴿٣٦﴾

37. ఇక మూసా అన్నాడు: "నా ప్రభువు తరఫునుండి ఎవడు మార్గదర్శకత్వం తీసుకొనివచ్చాడో మరియు చివరికి ఎవరి పర్యవసానం మంచిదవుతుందో ఆయనకు బాగా తెలుసు.[5] నిశ్చయంగా, దుర్మార్గులు ఎన్నడూ సాఫల్యం పొందలేరు."

وَقَالَ مُوسَىٰ رَبِّىٓ أَعْلَمُ بِمَن جَآءَ بِٱلْهُدَىٰ مِنْ عِندِهِۦ وَمَن تَكُونُ لَهُۥ عَـٰقِبَةُ ٱلدَّارِ ۖ إِنَّهُۥ لَا يُفْلِحُ ٱلظَّـٰلِمُونَ ﴿٣٧﴾

---

1. చూడండి, 20:27-28 మరియు 26:12-13.
2. ఈ వాక్యం ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు వచ్చింది. చూ. 5:67, 33:39,51:21, 40:51-52.
3. చూడండి, 74:24.
4. చూడండి, 38:5.
5. పరలోక సాఫల్యమే నిజమైన సాఫల్యం. సత్యతిరస్కారులు ఇహలోకంలో సాఫల్యం పొందవచ్చు. భూలోకంలో దొరికే సుఖసంతోషాలు తాత్కాలికమైనవే! వాస్తవానికి పరలోక సుఖసంతోషాలే చిరకాలముండేవి.

وَقَالَ فِرۡعَوۡنُ يَٰٓأَيُّهَا ٱلۡمَلَأُ مَا عَلِمۡتُ لَكُم مِّنۡ إِلَٰهٍ غَيۡرِي فَأَوۡقِدۡ لِي يَٰهَٰمَٰنُ عَلَى ٱلطِّينِ فَٱجۡعَل لِّي صَرۡحٗا لَّعَلِّيٓ أَطَّلِعُ إِلَىٰٓ إِلَٰهِ مُوسَىٰ وَإِنِّي لَأَظُنُّهُۥ مِنَ ٱلۡكَٰذِبِينَ ﴿٣٨﴾

**38**. మరియు ఫిర్'ఔన్ అన్నాడు: "ఓ నాయకులారా! నేను తప్ప మీకు మరొక ఆరాధ్య దేవుడు గలడని నాకు తెలియదు.[1] కావున ఓ హామాన్! కాల్చిన మట్టిఇటుకలతో నాకొక ఎత్తైన గోపురాన్ని నిర్మించు. దానిపై ఎక్కి నేను బహుశా, మూసా దేవుణ్ణి చూడగలనేమో! నిశ్చయంగా నేను ఇతనిని అసత్యవాదిగా భావిస్తున్నాను."

وَٱسۡتَكۡبَرَ هُوَ وَجُنُودُهُۥ فِي ٱلۡأَرۡضِ بِغَيۡرِ ٱلۡحَقِّ وَظَنُّوٓاْ أَنَّهُمۡ إِلَيۡنَا لَا يُرۡجَعُونَ ﴿٣٩﴾

**39**. మరియు, అతడు మరియు అతడి సైనికులు భూమిపై అన్యాయంగా అహంభావాన్ని ప్రదర్శించారు మరియు నిశ్చయంగా, మా వైపుకు తాము ఎన్నడూ మరలిరారని భావించారు.

فَأَخَذۡنَٰهُ وَجُنُودَهُۥ فَنَبَذۡنَٰهُمۡ فِي ٱلۡيَمِّۖ فَٱنظُرۡ كَيۡفَ كَانَ عَٰقِبَةُ ٱلظَّٰلِمِينَ ﴿٤٠﴾

**40**. కావున మేము అతనిని మరియు అతని సేనలను పట్టుకొని సముద్రంలోకి విసరివేశాము. ఇక చూడు! దుర్మార్గుల పర్యవసానం ఏమయిందో!

وَجَعَلۡنَٰهُمۡ أَئِمَّةٗ يَدۡعُونَ إِلَى ٱلنَّارِۖ وَيَوۡمَ ٱلۡقِيَٰمَةِ لَا يُنصَرُونَ ﴿٤١﴾

**41**. మరియు మేము వారిని నరకం వైపునకు పిలిచే నాయకులుగా చేశాము. మరియు పునరుత్థానదినమున వారికెలాంటి సహాయం దొరకదు.

وَأَتۡبَعۡنَٰهُمۡ فِي هَٰذِهِ ٱلدُّنۡيَا لَعۡنَةٗۖ وَيَوۡمَ ٱلۡقِيَٰمَةِ هُم مِّنَ ٱلۡمَقۡبُوحِينَ ﴿٤٢﴾

**42**. మరియు మేము ఈ లోకంలో కూడా అభిశాపం వారిని వెంటాడేటట్లు చేశాము. మరియు పునరుత్థాన దినమున వారు తృణీకరింపబడే వారిలో చేరుతారు.

1. చూడండి, 79:24.

43. మరియు వాస్తవానికి - పూర్వతరాల వారిని నాశనం చేసిన తరువాత - మేము మానవులకు జ్ఞానవృద్ధి చేయటానికి మరియు వారికి మార్గదర్శకత్వంగా కారుణ్యంగా ఉండటానికి, మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము. బహుశా వారు హితబోధ నేర్చుకుంటారని!

وَلَقَدۡ ءَاتَيۡنَا مُوسَى ٱلۡكِتَٰبَ مِنۢ بَعۡدِ مَآ أَهۡلَكۡنَا ٱلۡقُرُونَ ٱلۡأُولَىٰ بَصَآئِرَ لِلنَّاسِ وَهُدٗى وَرَحۡمَةٗ لَّعَلَّهُمۡ يَتَذَكَّرُونَ ٤٣

44. మరియు (ఓ ము'హమ్మద్!) మేము మూసాపై మా ఆదేశాన్ని (తౌరాత్‌ను) పూర్తిగా అవతరింప జేసినపుడు, నీవు ('తూర్ పర్వతపు) కుడివైపునా లేవు. మరియు నీవు అక్కడ ప్రత్యక్ష సాక్షులలో కూడా లేవు!

وَمَا كُنتَ بِجَانِبِ ٱلۡغَرۡبِيِّ إِذۡ قَضَيۡنَآ إِلَىٰ مُوسَى ٱلۡأَمۡرَ وَمَا كُنتَ مِنَ ٱلشَّٰهِدِينَ ٤٤

45. కాని నిశ్చయంగా, (ఆ తరువాత కూడా) మేము అనేక తరాలను ప్రభవింపజేశాము. వారి మీదుగా ఒక సుదీర్ఘకాలం గడిచిపోయింది. మా సూచనలను వినిపించటానికి నీవు మద్‌యన్ వాసులతో కూడా లేవు, కాని మేము (ఎల్లప్పుడూ) మా సందేశహరులను పంపుతూ వచ్చాము.

وَلَٰكِنَّآ أَنشَأۡنَا قُرُونٗا فَتَطَاوَلَ عَلَيۡهِمُ ٱلۡعُمُرُۚ وَمَا كُنتَ ثَاوِيٗا فِيٓ أَهۡلِ مَدۡيَنَ تَتۡلُواْ عَلَيۡهِمۡ ءَايَٰتِنَا وَلَٰكِنَّا كُنَّا مُرۡسِلِينَ ٤٥

46. మరియు మేము (మూసాను) పిలిచినపుడు, నీవు (ఓ ము'హమ్మద్!) 'తూర్ పర్వతం దగ్గర లేవు. కాని నీవు నీ ప్రభువు యొక్క కారుణ్యంతో, నీకు పూర్వం హెచ్చరిక చేసేవాడు రానటువంటి జాతి వారిని హెచ్చరించటానికి - బహుశా వారు హితబోధ నేర్చుకుంటారేమోనని - (పంపబడ్డావు).

وَمَا كُنتَ بِجَانِبِ ٱلطُّورِ إِذۡ نَادَيۡنَا وَلَٰكِن رَّحۡمَةٗ مِّن رَّبِّكَ لِتُنذِرَ قَوۡمٗا مَّآ أَتَىٰهُم مِّن نَّذِيرٖ مِّن قَبۡلِكَ لَعَلَّهُمۡ يَتَذَكَّرُونَ ٤٦

47. మరియు వారు తమ చేతులారా, చేసుకొని పంపిన కర్మల ఫలితంగా వారిపై ఆపద వచ్చిపడినపుడు, వారు: "ఓ మా ప్రభూ! నీవు మా వద్దకు ఒక సందేశహరుణ్ణి ఎందుకు పంపలేదు! అలా చేస్తే మేము నీ సూచనలను అనుసరిస్తూ, విశ్వాసులైన వారిలో చేరి ఉండేవారం కదా!" (అని తీర్పు దినమున అనకూడదని).

48. ఆ తర్వాత మా తరఫునుండి వారి వద్దకు సత్యం వచ్చినపుడు, వారిలా అన్నారు: "మూసాకు ఇవ్వబడి నటువంటిది, ఇతనికి ఎందుకు ఇవ్వబడలేదు!" ఏమీ? దీనికి పూర్వం మూసాకు ఇవ్వబడిన దానిని వారు తిరస్కరించలేదా? వారన్నారు: "రెండూ మాయాజాలాలే! అవి ఒకదానికొకటి సహాయపడుతున్నాయి." ఇంకా ఇలా అన్నారు: "నిశ్చయంగా, మేము వీటన్నింటినీ తిరస్కరిస్తున్నాము."

49. (ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను: "మీరు నిజాయితీపరులే అయితే, అల్లాహ్ దగ్గరనుండి ఈ రెండింటి కంటే ఉత్తమమైన మార్గం చూపే ఒక గ్రంథాన్ని తీసుకురండి. దానిని నేను అనుసరిస్తాను."

50. వారు నీకు ఎలాంటి సమాధానం ఇవ్వకపోతే, వారు కేవలం తమ కోరికలను అనుసరిస్తున్నారని తెలుసుకో! మరియు అల్లాహ్ మార్గదర్శకత్వాన్ని విడిచి కేవలం తన కోరికలను అనుసరించే వానికంటే ఎక్కువ మార్గభ్రష్టుడు ఎవడు? నిశ్చయంగా అల్లాహ్ దుర్మార్గులకు మార్గదర్శకత్వం చేయడు. (1/2)

وَلَوْلَآ أَن تُصِيبَهُم مُّصِيبَةٌۢ بِمَا
قَدَّمَتْ أَيْدِيهِمْ فَيَقُولُوا۟ رَبَّنَا لَوْلَآ
أَرْسَلْتَ إِلَيْنَا رَسُولًا فَنَتَّبِعَ
ءَايَـٰتِكَ وَنَكُونَ مِنَ ٱلْمُؤْمِنِينَ
﴿٤٧﴾

فَلَمَّا جَآءَهُمُ ٱلْحَقُّ مِنْ عِندِنَا قَالُوا۟
لَوْلَآ أُوتِىَ مِثْلَ مَآ أُوتِىَ مُوسَىٰٓ ۚ
أَوَلَمْ يَكْفُرُوا۟ بِمَآ أُوتِىَ مُوسَىٰ مِن
قَبْلُ ۖ قَالُوا۟ سِحْرَانِ تَظَـٰهَرَا وَقَالُوٓا۟ إِنَّا
بِكُلٍّ كَـٰفِرُونَ ﴿٤٨﴾

قُلْ فَأْتُوا۟ بِكِتَـٰبٍ مِّنْ عِندِ ٱللَّهِ
هُوَ أَهْدَىٰ مِنْهُمَآ أَتَّبِعْهُ إِن
كُنتُمْ صَـٰدِقِينَ ﴿٤٩﴾

فَإِن لَّمْ يَسْتَجِيبُوا۟ لَكَ فَٱعْلَمْ أَنَّمَا
يَتَّبِعُونَ أَهْوَآءَهُمْ ۚ وَمَنْ أَضَلُّ
مِمَّنِ ٱتَّبَعَ هَوَىٰهُ بِغَيْرِ هُدًى
مِّنَ ٱللَّهِ ۚ إِنَّ ٱللَّهَ لَا يَهْدِى
ٱلْقَوْمَ ٱلظَّـٰلِمِينَ ﴿٥٠﴾

۞ وَلَقَدْ وَصَّلْنَا لَهُمُ ٱلْقَوْلَ لَعَلَّهُمْ يَتَذَكَّرُونَ ﴿٥١﴾

51. * మరియు వారు హితబోధ పొందాలని, వాస్తవంగా మేము ఈ వచనాన్ని (ఖుర్ఆన్‌ను) క్రమక్రమంగా అందజేశాము.

ٱلَّذِينَ ءَاتَيْنَٰهُمُ ٱلْكِتَٰبَ مِن قَبْلِهِۦ هُم بِهِۦ يُؤْمِنُونَ ﴿٥٢﴾

52. ఎవరికైతే పూర్వం మేము గ్రంథాన్ని ఇచ్చామో వారు దీనిని (ఖుర్ఆన్‌ను) విశ్వసిస్తారు.[1]

وَإِذَا يُتْلَىٰ عَلَيْهِمْ قَالُوٓا۟ ءَامَنَّا بِهِۦٓ إِنَّهُ ٱلْحَقُّ مِن رَّبِّنَآ إِنَّا كُنَّا مِن قَبْلِهِۦ مُسْلِمِينَ ﴿٥٣﴾

53. మరియు వారికి ఇది వినిపించ బడినప్పుడు, వారు ఇలా అంటారు: "మేము దీనిని విశ్వసించాము, నిశ్చయంగా, ఇది మా ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యం. నిశ్చయంగా, మేము మొదటి నుండియే అల్లాహ్‌కు విధేయు(ముస్లిం)లమై ఉన్నాము."[2]

---

1. అంటే, యూదులలో 'అబ్దుల్లాహ్ బిన్-సల్లామ్ మరియు 'హబష నుండి వచ్చిన క్రైస్తవులు (ర'ది.'అన్హుమ్). చూడండి, 26:196-197.

2. ఈ విషయం ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు వచ్చింది. దైవప్రవక్తలందరూ ప్రచారంచేసిన ధర్మం ఇస్లాం మాత్రమే. అంటే ఏకైక ఆరాధ్యుడు అల్లాహ్(సు.తా.)కు తప్ప ఇతరులకు దాస్యం, ఆరాధన చేయరాదని. ప్రతికాలపు వారు తమతమ భాషలలో దానికి వివిధపేర్లు ఇచ్చారు. అంటే క్రైస్తవధర్మం, యూదధర్మం, మొదలైనవి. కాని వాస్తవానికి ప్రవక్తలందరి ధర్మం ఇస్లాం మాత్రమే. అంటే అల్లాహ్ (సు.తా.)కు విధేయులై కేవలం ఆయనకే దాస్యం, ఆరాధన చేయటం. కాని ఆ ప్రాచీన దివ్యగ్రథాలు ఆయా ప్రవక్తల ప్రచారానికి ఎన్నోవందల సంవత్సరాల తరువాత లిఖిత రూపంలోకి వచ్చాయి. దానివల్ల వాటిని లిఖించిన వారు, తమ ప్రవక్తలు వినిపించిన దివ్యసందేశాలను వాటి అసలు అవతరించిన రూపంలో వ్రాయలేకపోయారు. తరువాత తరాల ధర్మవేత్తలు మొదటి వారు వ్రాసిన వాటితో ఏకీభవించక వాటిలో మార్పులు చేస్తూ పోయారు. ఉదాహరణకు: ఈ రోజు ప్రపంచంలో అన్నిటికంటే ఎక్కువ ప్రామాణిక మైనదిగా పరిగణించబడే బైబిల్ - ఏదైతే తౌరాత్, 'జబూర్ మరియు ఇంజీల్ గ్రంథా(Old and New Testaments)ల సముదాయమో - అందులో కూడా ఎన్నో సార్లు మార్పులు చేయబడ్డాయి. చివరి మార్పులు గలది, ఈనాటి (Revised) Authorized K.J.V. అందుకే అసలు ఆ ప్రవక్తలు ప్రచారం చేసింది, ఏకైక ఆరాధ్యుడైన అల్లాహ్ (సు.తా.), ఆరాధన. అయినా ఈనాడు వాటిలో మానవులు

أُوْلَٰٓئِكَ يُؤْتَوْنَ أَجْرَهُم مَّرَّتَيْنِ بِمَا صَبَرُواْ وَيَدْرَءُونَ بِٱلْحَسَنَةِ ٱلسَّيِّئَةَ وَمِمَّا رَزَقْنَٰهُمْ يُنفِقُونَ ﴿٥٤﴾

54. వీరే, తమ సహనానికి ఫలితంగా రెండింతలు ప్రతిఫల మొసంగబడే వారు.[1] వీరే మంచితో చెడును నివారించే వారు. మరియు మేము వారికిచ్చిన జీవనోపాధి నుండి ఖర్చుచేసేవారు.

وَإِذَا سَمِعُواْ ٱللَّغْوَ أَعْرَضُواْ عَنْهُ وَقَالُواْ لَنَآ أَعْمَٰلُنَا وَلَكُمْ أَعْمَٰلُكُمْ سَلَٰمٌ عَلَيْكُمْ لَا نَبْتَغِى ٱلْجَٰهِلِينَ ﴿٥٥﴾

55. మరియు వారు వ్యర్థమైన మాటలు విన్నప్పుడు, ఇలా అంటూ దూరంగా తొలగిపోతారు: "మాకు మా కర్మలు మరియు మీకు మీ కర్మలు, మీకు సలాం![2] మాకు మూర్ఖులతో పనిలేదు."

إِنَّكَ لَا تَهْدِى مَنْ أَحْبَبْتَ وَلَٰكِنَّ ٱللَّهَ يَهْدِى مَن يَشَآءُ ۚ وَهُوَ أَعْلَمُ بِٱلْمُهْتَدِينَ ﴿٥٦﴾

56. (ఓ ప్రవక్తా!) నిశ్చయంగా నీవు, నీకు ఇష్టమైన వారికి మార్గదర్శకత్వం చేయలేవు, కాని అల్లాహ్ తాను కోరిన వారికి మార్గదర్శకత్వం చేస్తాడు. మరియు ఆయనకు మార్గదర్శకత్వం పొందే వారెవరో బాగా తెలుసు.[3]

---

మార్పులు చేయడం వల్ల, ఆ గ్రంథాలను అనుసరిస్తున్నవారు ఏకైక ఆరాధ్యుడైన అల్లాహ్ (సు.తా.) ఆరాధనను వదలి, బహుదైవారాధన, ప్రవక్తల విగ్రహాల ఆరాధన చేస్తున్నారు. కాని ఇస్లాం స్వీకరించిన యూదులు మరియు క్రైస్తవులు సత్యాన్ని తెలుసుకొని: 'మేము మొదటి నుండియే ముస్లింలముగా ఉన్నాము.' అని అన్నారు. ఏకైక ఆరాధ్యుడైన అల్లాహ్ (సు.తా.) ఆరాధనయే సత్యధర్మమని, ఇస్లాం ధర్మాన్ని స్వీకరించారు.

1. సహనం వహించటం అంటే, ఇక్కడ దైవప్రవక్తలను మరియు దివ్యగ్రంథాలను విశ్వసించి ఆ విశ్వాసంపై స్థిరంగా ఉండటం. మొదటి దివ్యగ్రంథం మీద స్థిరంగా ఉండి, రెండవ దివ్యగ్రంథం వస్తే దానిని అనుసరించటం. ఇలాంటి వారికి రెండింతలు ప్రతిఫలముంది. రెండింతలు ప్రతిఫలం పొందే ముగ్గురిలో వీరొకరు. ('స. బు'ఖారీ) చూ. 13:22.
2. ఈ సలాం అభివందనం కాదు. మేము మీవంటి మూర్ఖులతో వాదులాడమని తప్పించుకోవటానికి పలికేది. చూడండి, 25:63, 43:89.
3. ఈ ఆయత్ దైవప్రవక్త ('స'అస) పినతండ్రి అబూ'తాలిబ్ మరణించినప్పుడు అవతరింపజేయబడింది. అతని ఆఖరు ఘడియలలో దైవప్రవక్త ('స'అస) అతనితో అన్నారు: "ఇప్పుడైనా: 'లాఇలాహ ఇల్లల్లాహ్' అను. దానితో నేను పునరుత్థాన దినమున నీ క్షమాపణకొరకు అల్లాహ్ (సు.తా.)ను వేడుకోగలను." అక్కడున్న ఖురైష్ సర్దారులనుచూసి అతను అలా అనలేదు. ('స'హీ'హ్ బు'ఖారీ) ఇంకా చూ. 14:4.

**57**. వారు ఇలా అంటారు: "ఒకవేళ నీతోపాటు మేము కూడా ఈ మార్గదర్శకత్వాన్ని అవలంబిస్తే! మేము మా భూమినుండియే పారద్రోల బడతాము."[1] ఏమీ? మేము వారిని శాంతికి నిలయమైన ఒక పవిత్ర స్థలం (మక్కా)లో స్థిరనివాసము నొసంగి వారికి మా తరఫు నుండి జీవనోపాధిగా అన్నిరకాల ఫలాలను సమకూర్చలేదా? కాని, వాస్తవానికి వారిలో చాలామందికి ఇది తెలియదు.[2]

وَقَالُوٓاْ إِن نَّتَّبِعِ ٱلۡهُدَىٰ مَعَكَ نُتَخَطَّفۡ مِنۡ أَرۡضِنَآۚ أَوَلَمۡ نُمَكِّن لَّهُمۡ حَرَمًا ءَامِنٗا يُجۡبَىٰٓ إِلَيۡهِ ثَمَرَٰتُ كُلِّ شَيۡءٖ رِّزۡقٗا مِّن لَّدُنَّا وَلَٰكِنَّ أَكۡثَرَهُمۡ لَا يَعۡلَمُونَ ٥٧

**58**. మరియు మేము ఎన్నో నగరాలను, జీవన సుఖసంపదలతో ఉప్పొంగిపోతూ ఉండగా, వాటిని నాశనం చేయులేదా! అవిగో వారి నివాసాలు, వారి తరువాత వాటిలో నివసించిన వారు చాలా తక్కువ! మరియు నిశ్చయంగా, మేమే వాటికి వారసులమయ్యాము.[3]

وَكَمۡ أَهۡلَكۡنَا مِن قَرۡيَةِۭ بَطِرَتۡ مَعِيشَتَهَاۖ فَتِلۡكَ مَسَٰكِنُهُمۡ لَمۡ تُسۡكَن مِّنۢ بَعۡدِهِمۡ إِلَّا قَلِيلٗاۖ وَكُنَّا نَحۡنُ ٱلۡوَٰرِثِينَ ٥٨

**59**. మరియు నీ ప్రభువు నగరాలను ఏ మాత్రమూ నాశనం చేసేవాడు కాదు, ఎంతవరకైతే వాటి ముఖ్య నగరానికి మా సూచనలను (ఆయతులను) వినిపించే

وَمَا كَانَ رَبُّكَ مُهۡلِكَ ٱلۡقُرَىٰ حَتَّىٰ يَبۡعَثَ فِيٓ أُمِّهَا رَسُولٗا يَتۡلُواْ عَلَيۡهِمۡ ءَايَٰتِنَاۚ

---

**1**. దీనిని ఈ విధంగా బోధించారు: 1) ఆ కాలపు ఖురైషులు ఇస్లాం స్వీకరిస్తే, వారితోటి వారు, వారిని మతద్రోహులుగా పరిగణించి వారిని, వారి నగరం మక్కా నుండి పారద్రోలుతారని భయపడ్డారు. 2) అదే విధంగా ఈ కాలంలో కూడా చాలామంది ఇది సత్యధర్మమని తెలిసి కూడా తమ బంధువులనుండి మరియు తమ సమాజంనుండి విడదీయబడతామని భయపడి సత్యాన్ని అవలంబించరు. కాని రాబోయే పరలోక జీవితపు శాశ్వత సుఖాలముందు ఈ జీవిత సుఖం అతి స్వల్పమైనదనే సత్యాన్ని వారు అర్థం చేసుకుంటే ఎంత బాగుండేది!

**2**. చూడండి, 14:35-41, 2:126, 29:67. ఇబ్రాహీం ('అ.స.) మక్కాకొరకు చేసినప్రార్థన.

**3**. చూడండి, 15:23.

وَمَا كُنَّا مُهْلِكِي ٱلْقُرَىٰٓ إِلَّا وَأَهْلُهَا ظَٰلِمُونَ ﴿٥٩﴾

సందేశహరులను పంపమో! మేము నగరాలను వాటి ప్రజలు దుర్మార్గులైపోతే తప్ప, నాశనం చేసేవారం కాము.[1]

وَمَآ أُوتِيتُم مِّن شَيْءٍ فَمَتَٰعُ ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَزِينَتُهَا ۚ وَمَا عِندَ ٱللَّهِ خَيْرٌ وَأَبْقَىٰٓ ۚ أَفَلَا تَعْقِلُونَ ﴿٦٠﴾

**60**. మరియు మీకు ఇవ్వబడినవన్నీ ఈ ప్రాపంచిక జీవితపు సుఖసంతోషాల సామాగ్రి మరియు దాని అలంకరణలు మాత్రమే! కాని అల్లాహ్ వద్ద ఉన్నది దీనికంటే ఎంతో ఉత్తమమైనది మరియు నిత్యమైనది. ఏమీ? మీరిది అర్థం చేసుకోలేరా?[2]

أَفَمَن وَعَدْنَٰهُ وَعْدًا حَسَنًا فَهُوَ لَٰقِيهِ كَمَن مَّتَّعْنَٰهُ مَتَٰعَ ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا ثُمَّ هُوَ يَوْمَ ٱلْقِيَٰمَةِ مِنَ ٱلْمُحْضَرِينَ ﴿٦١﴾

**61**. ఏమీ? మేము చేసిన మంచి వాగ్దానాన్ని తప్పకుండా పొందేవాడు,[3] మేము ఒసంగిన ఈ ప్రాపంచిక సుఖసంతోషాలు పొంది, పునరుత్థాన దినమున మా ముందు (శిక్షకై) హాజరు చేయబడేవాడితో సమానుడు కాగలడా?

وَيَوْمَ يُنَادِيهِمْ فَيَقُولُ أَيْنَ شُرَكَآءِيَ ٱلَّذِينَ كُنتُمْ تَزْعُمُونَ ﴿٦٢﴾

**62**. మరియు (జ్ఞాపకముంచుకోండి!) ఆ రోజు ఆయన (అల్లాహ్) వారిని పిలిచి ఇలా ప్రశ్నిస్తాడు: "మీరు నా భాగస్వాములని నొక్కిచెప్పిన (భావించిన) వారు ఇప్పుడు ఎక్కడున్నారు?"[4]

---

**1**. సందేశహరులు ఎల్లప్పుడు పెద్దనగరాలలోనే పంపబడ్డారు. వారే దాని చుట్టూ ఉన్న చిన్న గ్రామాలవారికి కూడా ప్రచారం చేశారు. కేవలం సత్యతిరస్కారులుగా ఉన్నంత మాత్రాన, ఏ నగరవాసులు కూడా నాశనం చేయబడలేదు. సత్యతిరస్కారంతో బాటు వాటిలోని ప్రజలు దుర్మార్గానికి, విశ్వాసుల పట్ల దౌర్జన్యానికి పాల్పడినప్పుడే అవి నాశనం చేయబడ్డాయి. చూడండి, 11:117, 6:130-132, 28:59.

**2**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'అల్లాహ్ (సు.తా.) సాక్షి! ఈ ప్రాపంచిక జీవితం పరలోక జీవితం ముందు, ఒకడు తన వ్రేలును సముద్రంలో ముంచి బయటికి తీస్తే, దానికి అంటే నీటితో సమానమైనది.' ('స'హీ'హ్ ముస్లిం).

**3**. అల్లాహ్ (సు.తా.) మంచి వాగ్దానం చేసిన, సద్వర్తనులైన విశ్వాసులకు: 'ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా!' చూడండి, 2:38, 62, 112, 262, 274, 277, 3:170, 5:69, 6:48, 7:35, 49, 10:62, 46:13

**4**. చూడండి, 6:22-23.

63. ఎవరికైతే ఆ మాట (శిక్ష) వర్తిస్తుందో, వారిలా విన్నవించు కుంటారు: "ఓ మా ప్రభూ! మేము దారితప్పించిన వారు వీరే! మేము దారితప్పిన విధంగానే వీరినికూడా దారితప్పించాము. వీరితో మాకెలాంటి సంబంధంలేదని నీ ముందు ప్రకటిస్తున్నాము. అసలు వీరు మమ్మల్ని ఆరాధించనేలేదు."[1]

قَالَ ٱلَّذِينَ حَقَّ عَلَيۡهِمُ ٱلۡقَوۡلُ رَبَّنَا هَٰٓؤُلَآءِ ٱلَّذِينَ أَغۡوَيۡنَآ أَغۡوَيۡنَٰهُمۡ كَمَا غَوَيۡنَاۖ تَبَرَّأۡنَآ إِلَيۡكَۖ مَا كَانُوٓاْ إِيَّانَا يَعۡبُدُونَ ﴿٦٣﴾

64. మరియు వారితో ఇలా అనబడుతుంది: "మీరు సాటికల్పించిన మీ భాగస్వాములను పిలువండి!" అప్పుడు వారు వారిని (భాగస్వాములను) పిలుస్తారు, కాని వారు వారికి సమాధానమివ్వరు. మరియు వారు శిక్షను చూసి (అనుకుంటారు): "ఒకవేళ వాస్తవానికి తాము సన్మార్గాన్ని అవలంబించివుంటే ఎంత బాగుండేది!"[2] అని.

وَقِيلَ ٱدۡعُواْ شُرَكَآءَكُمۡ فَدَعَوۡهُمۡ فَلَمۡ يَسۡتَجِيبُواْ لَهُمۡ وَرَأَوُاْ ٱلۡعَذَابَۚ لَوۡ أَنَّهُمۡ كَانُواْ يَهۡتَدُونَ ﴿٦٤﴾

65. మరియు (జ్ఞాపకముంచుకోండి!) ఆయన (అల్లాహ్) వారిని పిలిచినరోజు ఇలా ప్రశ్నిస్తాడు: "మేము పంపిన సందేశహరులకు మీరు ఏవిధంగా సమాధానమిచ్చారు?"

وَيَوۡمَ يُنَادِيهِمۡ فَيَقُولُ مَاذَآ أَجَبۡتُمُ ٱلۡمُرۡسَلِينَ ﴿٦٥﴾

---

1. అసలు వీరు మమ్మల్ని ఆరాధించనే లేదు. ఈ వాక్యం ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు వచ్చింది. చూడండి, 6:49, 19:81, 82, 46:5-6, 10:28, 29:25, 2:166, 167 మొదలైనవి.

2. ఇంకా చూడండి, 18:52, 53.

فَعَمِيَتۡ عَلَيۡهِمُ ٱلۡأَنۢبَآءُ يَوۡمَئِذٖ فَهُمۡ لَا يَتَسَآءَلُونَ ٦٦

**66**. ఆ రోజు వారి సమాధానాలన్నీ (కారణాలన్నీ) అస్పష్టమైపోతాయి మరియు వారు ఒకరితో నొకరు సంప్రదించుకోనూ లేరు.

فَأَمَّا مَن تَابَ وَءَامَنَ وَعَمِلَ صَٰلِحٗا فَعَسَىٰٓ أَن يَكُونَ مِنَ ٱلۡمُفۡلِحِينَ ٦٧

**67**. కాని ఎవడైతే పశ్చాత్తాపపడి విశ్వసించి, సత్కార్యాలు చేస్తాడో! అతడు సాఫల్యం పొందేవారిలో చేరగలడని ఆశించవచ్చు!

وَرَبُّكَ يَخۡلُقُ مَا يَشَآءُ وَيَخۡتَارُۗ مَا كَانَ لَهُمُ ٱلۡخِيَرَةُۚ سُبۡحَٰنَ ٱللَّهِ وَتَعَٰلَىٰ عَمَّا يُشۡرِكُونَ ٦٨

**68**. మరియు నీ ప్రభువు తాను కోరిన దానిని సృష్టిస్తాడు మరియు ఎన్నుకుంటాడు. మరియు ఎన్నుకునే హక్కు వారికి ఏ మాత్రం లేదు. అల్లాహ్ సర్వలోపాలకు అతీతుడు, వారు సాటి కల్పించే భాగస్వాముల కంటే మహోన్నతుడు.

وَرَبُّكَ يَعۡلَمُ مَا تُكِنُّ صُدُورُهُمۡ وَمَا يُعۡلِنُونَ ٦٩

**69**. మరియు వారు తమ హృదయాలలో దాచుకున్నది మరియు బహిర్గతంచేసేది అంతా నీ ప్రభువుకు తెలుసు.

وَهُوَ ٱللَّهُ لَآ إِلَٰهَ إِلَّا هُوَۖ لَهُ ٱلۡحَمۡدُ فِي ٱلۡأُولَىٰ وَٱلۡأٓخِرَةِۖ وَلَهُ ٱلۡحُكۡمُ وَإِلَيۡهِ تُرۡجَعُونَ ٧٠

**70**. మరియు ఆయనే, అల్లాహ్! ఆయన తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు! మొదట (ఇహలోకంలో) మరియు చివరకు (పరలోకంలో) స్తుతింపదగిన వాడు కేవలం ఆయనే! మరియు విశ్వన్యాయాధిపత్యం ఆయనదే. మీరంతా ఆయన వైపునకే మరలింపబడతారు.

**71.** వారితో అను: "ఏమీ? మీరు ఆలోచించారా? ఒకవేళ అల్లాహ్ మీపైన పునరుత్థానదినం వరకు ఎడతెగకుండా రాత్రిని ఆవరింపజేస్తే, అల్లాహ్ తప్ప మరే దేవుడైనా, మీకు వెలుగును తేగలడా? అయితే మీరెందుకు వినరు?"

قُلْ أَرَءَيْتُمْ إِن جَعَلَ ٱللَّهُ عَلَيْكُمُ ٱلَّيْلَ سَرْمَدًا إِلَىٰ يَوْمِ ٱلْقِيَٰمَةِ مَنْ إِلَٰهٌ غَيْرُ ٱللَّهِ يَأْتِيكُم بِضِيَآءٍ ۖ أَفَلَا تَسْمَعُونَ ﴿٧١﴾

**72.** ఇంకా ఇలా అను: "ఏమీ? మీరు ఆలోచించారా? ఒకవేళ అల్లాహ్ మీపై పునరుత్థానదినమువరకు ఎడతెగకుండా పగటిని ఆవతరింపజేస్తే, అల్లాహ్ తప్ప మరే దేవుడైనా మీకు విశ్రాంతి పొందటానికి రాత్రిని తేగలడా? అయితే, మీరెందుకు చూడలేరు?"

قُلْ أَرَءَيْتُمْ إِن جَعَلَ ٱللَّهُ عَلَيْكُمُ ٱلنَّهَارَ سَرْمَدًا إِلَىٰ يَوْمِ ٱلْقِيَٰمَةِ مَنْ إِلَٰهٌ غَيْرُ ٱللَّهِ يَأْتِيكُم بِلَيْلٍ تَسْكُنُونَ فِيهِ ۖ أَفَلَا تُبْصِرُونَ ﴿٧٢﴾

**73.** ఆయన తన కారుణ్యంతో మీ కొరకు రాత్రిని మరియు పగటిని, విశ్రాంతి పొందటానికి మరియు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించటానికి చేశాడు, బహుశా మీరు కృతజ్ఞులౌతారేమోనని.[1]

وَمِن رَّحْمَتِهِۦ جَعَلَ لَكُمُ ٱلَّيْلَ وَٱلنَّهَارَ لِتَسْكُنُوا۟ فِيهِ وَلِتَبْتَغُوا۟ مِن فَضْلِهِۦ وَلَعَلَّكُمْ تَشْكُرُونَ ﴿٧٣﴾

**74.** మరియు (జ్ఞాపకముంచుకోండి) ఆయన (అల్లాహ్), వారిని ఆ రోజు పిలిచి ఇలా ప్రశ్నిస్తాడు: "మీరు నాకు భాగస్వాములని నొక్కిచెప్పిన (భావించిన) వారు ఇప్పుడు ఎక్కడున్నారు?"

وَيَوْمَ يُنَادِيهِمْ فَيَقُولُ أَيْنَ شُرَكَآءِىَ ٱلَّذِينَ كُنتُمْ تَزْعُمُونَ ﴿٧٤﴾

---

**1**. రాత్రి మరియు పగలు ఈ రెండూ అల్లాహ్ (సు.తా.) అనుగ్రహించిన వరాలు. ఒకవేళ రాత్రి లేకుంటే, ప్రజలందరూ ఒకేసారి విశ్రాంతి తీసుకోలేకపోయేవారు. ప్రతి ఒక్కడు తన ఇష్టానుసారం విశ్రాంతి తీసుకుంటే ప్రపంచకార్యక్రమాలు సరళంగా జరిగేవి కావు. మానవుల జీవితాలు పరస్పర సహయోగం, వల్లనే సరళంగా జరుగుతున్నాయి. దాని కొరకు రాత్రింబవళ్ళు ఎంతో ఉపయోగకరమైనవి.

75. మరియు మేము ప్రతి సమాజంనుండి ఒక సాక్షిని[1] నిలబెట్టి ఇలా అంటాము: "మీ నిదర్శనాన్ని తీసుకురండి!" అప్పుడు వారు సత్యం, నిశ్చయంగా అల్లాహ్‌వైపే ఉందని తెలుసుకుంటారు. మరియు వారు కల్పించు కున్నవన్నీ వారిని త్యజించి ఉంటాయి. (5/8)

وَنَزَعۡنَا مِن كُلِّ أُمَّةٖ شَهِيدٗا فَقُلۡنَا هَاتُواْ بُرۡهَٰنَكُمۡ فَعَلِمُوٓاْ أَنَّ ٱلۡحَقَّ لِلَّهِ وَضَلَّ عَنۡهُم مَّا كَانُواْ يَفۡتَرُونَ ٧٥

76. * వాస్తవానికి, ఖారూన్, మూసా జాతికి చెందినవాడే. కాని అతడు వారికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేశాడు.[2] మరియు మేము అతనికి ఎన్నో నిధులను ఇచ్చి ఉంటిమి. వాటి తాళపుచెవులను బలవంతులైన పదిమంది లేదా అంతకంటే ఎక్కువ మంది కూడా ఎంతో కష్టంతో మాత్రమే మోయగలిగే వారు. అతని జాతి వారు అతనితో అన్నారు: "నీవు విర్రవీగకు, నిశ్చయంగా అల్లాహ్ విర్రవీగే వారిని ప్రేమించడు!

۞ إِنَّ قَٰرُونَ كَانَ مِن قَوۡمِ مُوسَىٰ فَبَغَىٰ عَلَيۡهِمۡۖ وَءَاتَيۡنَٰهُ مِنَ ٱلۡكُنُوزِ مَآ إِنَّ مَفَاتِحَهُۥ لَتَنُوٓأُ بِٱلۡعُصۡبَةِ أُوْلِي ٱلۡقُوَّةِ إِذۡ قَالَ لَهُۥ قَوۡمُهُۥ لَا تَفۡرَحۡۖ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ ٱلۡفَرِحِينَ ٧٦

77. "మరియు అల్లాహ్ నీకు ఇచ్చిన సంపదతో పరలోక గృహాన్ని పొందటానికి ప్రయత్నించు. మరియు ఇహలోకం నుండి లభించే భాగాన్ని మరచిపోకు. నీకు అల్లాహ్ మేలు చేసినట్లు, నీవు కూడా (ప్రజలకు) మేలుచేయి.[3] భూమిపై కల్లోలం రేకెత్తించ టానికి ప్రయత్నించకు. నిశ్చయంగా అల్లాహ్ కల్లోలం రేకెత్తించే వారిని ప్రేమించడు!"

وَٱبۡتَغِ فِيمَآ ءَاتَىٰكَ ٱللَّهُ ٱلدَّارَ ٱلۡأٓخِرَةَۖ وَلَا تَنسَ نَصِيبَكَ مِنَ ٱلدُّنۡيَاۖ وَأَحۡسِن كَمَآ أَحۡسَنَ ٱللَّهُ إِلَيۡكَۖ وَلَا تَبۡغِ ٱلۡفَسَادَ فِي ٱلۡأَرۡضِۖ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ ٱلۡمُفۡسِدِينَ ٧٧

---

1. ఈ సాక్షులు ప్రవక్త('అలైహిమ్స.)లు. ప్రతిప్రవక్త తనకాలపు ప్రజలకు సాక్షిగాఉంటాడు.
2. ఎంత గొప్ప ప్రవక్తను అనుసరించినా, అహంభావం మరియు స్వాభిమానంతో ప్రవర్తించే వారిని అల్లాహ్ (సు.తా.) ప్రేమించడు. ఈ ఉదాహరణ ఇక్కడ మూసా ('అ.స.) జాతికి చెందిన ఖారూన్ అనే గొప్ప ధనవంతుడైన వ్యక్తి విషయంలో ఇవ్వబడింది. ఇంకా చూడండి, 29:39 మరియు 40:24.
3. ఏ విధంగానైతే నీ ప్రభువుకు నీపై హక్కు ఉందో, అదే విధంగా నీ ఆత్మకు, నీ భార్యా పిల్లలకు, నీ బంధువులకు మరియు నీ అతిథులు మొదలైన వారికి కూడా నీ మీద, నీ ఆదాయం మీద హక్కు ఉంది. కావున ప్రతి ఒక్కనికి వాని హక్కు చెల్లించు.

قَالَ إِنَّمَآ أُوتِيتُهُۥ عَلَىٰ عِلۡمٍ عِندِيٓۚ أَوَلَمۡ يَعۡلَمۡ أَنَّ ٱللَّهَ قَدۡ أَهۡلَكَ مِن قَبۡلِهِۦ مِنَ ٱلۡقُرُونِ مَنۡ هُوَ أَشَدُّ مِنۡهُ قُوَّةً وَأَكۡثَرُ جَمۡعٗاۚ وَلَا يُسۡـَٔلُ عَن ذُنُوبِهِمُ ٱلۡمُجۡرِمُونَ ٧٨

78. అతడు (ఖారూన్) అన్నాడు: "నిశ్చయంగా, ఇది (ఈ ధనం) నాకు నా జ్ఞానం వల్లనే ఇవ్వబడింది!"[1] ఏమీ? అతనికి తెలియదా? నిశ్చయంగా అల్లాహ్ అతనికి ముందు ఎన్నోతరాల వారిని - అతని కంటే ఎక్కువ బలం మరియు ఎక్కువ ధన సంపదలు గలవారిని కూడా - నాశనం చేశాడని? మరియు పాపాత్ములు వారి పాపాలను గురించి ప్రశ్నింపబడరు.

فَخَرَجَ عَلَىٰ قَوۡمِهِۦ فِي زِينَتِهِۦۖ قَالَ ٱلَّذِينَ يُرِيدُونَ ٱلۡحَيَوٰةَ ٱلدُّنۡيَا يَٰلَيۡتَ لَنَا مِثۡلَ مَآ أُوتِيَ قَٰرُونُ إِنَّهُۥ لَذُو حَظٍّ عَظِيمٖ ٧٩

79. తరువాత అతడు తన వైభవంతో తన జాతివారి ఎదుటకు వచ్చాడు. ఇహలోక జీవితపు సుఖాలు కోరేవారు ఇలా అన్నారు: "అయ్యో మా దౌర్భాగ్యం! ఖారూన్‌కు లభించినటువంటివి (ధనసంపత్తులు) మాకు కూడా లభించి ఉంటే ఎంత బాగుండేది? నిశ్చయంగా అతడు ఎంతో అదృష్టవంతుడు!"

وَقَالَ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡعِلۡمَ وَيۡلَكُمۡ ثَوَابُ ٱللَّهِ خَيۡرٞ لِّمَنۡ ءَامَنَ وَعَمِلَ صَٰلِحٗاۚ وَلَا يُلَقَّىٰهَآ إِلَّا ٱلصَّٰبِرُونَ ٨٠

80. కాని జ్ఞానసంపన్నులు అన్నారు: "మీ దౌర్భాగ్యం! అల్లాహ్ ఇచ్చే ప్రతిఫలమే, విశ్వసించి సత్కార్యాలు చేసేవారికి ఎంతో శ్రేష్ఠమైనది. మరియు ఈ మహా భాగ్యం, సహనం వహించే వారికి తప్ప ఇతరులకు లభించదు."[2]

---

1. ఇటువంటి వాక్యానికి చూడండి, 28:78 మరియు 41:50.

2. 'హదీస్' ఖుద్సీ: అల్లాహ్ (సు.తా.) అంటాడు: 'నేను నా సద్వర్తనులైన దాసులకొరకు సిద్ధపరచిన వస్తువులు ఎలాంటివంటే, వాటిని ఇంతవరకు ఏ కన్నూ చూడలేదు, ఏ చెవి వినలేదు మరియు ఏ ఆత్మ కూడా ఊహించలేదు!' (బు'ఖారీ, ముస్లిం)

فَخَسَفۡنَا بِهِۦ وَبِدَارِهِ ٱلۡأَرۡضَ فَمَا
كَانَ لَهُۥ مِن فِئَةٖ يَنصُرُونَهُۥ مِن
دُونِ ٱللَّهِ وَمَا كَانَ مِنَ
ٱلۡمُنتَصِرِينَ ٨١

**81**. ఆ పిదప మేము అతనిని అతని గృహంతో సహా భూమిలోకి అణగద్రొక్కాము. అతనిని, అల్లాహ్ (శిక్ష) నుండి తప్పించగల, అతని తెగవారు ఎవ్వరూ లేకపోయారు మరియు అతడు కూడా తనను తాను కాపాడుకోలేక పోయాడు.

وَأَصۡبَحَ ٱلَّذِينَ تَمَنَّوۡاْ مَكَانَهُۥ
بِٱلۡأَمۡسِ يَقُولُونَ وَيۡكَأَنَّ ٱللَّهَ
يَبۡسُطُ ٱلرِّزۡقَ لِمَن يَشَآءُ مِنۡ
عِبَادِهِۦ وَيَقۡدِرُۖ لَوۡلَآ أَن مَّنَّ ٱللَّهُ
عَلَيۡنَا لَخَسَفَ بِنَاۖ وَيۡكَأَنَّهُۥ لَا يُفۡلِحُ
ٱلۡكَٰفِرُونَ ٨٢

**82**. మరియు నిన్నటివరకు అతని (ఖారూన్) వలే కావలెనని ఎవరైతే కోరుతూ వచ్చారో, వారు ఇప్పుడు ఇలా పలుకసాగారు: "తెలుసుకోండి![1] అల్లాహ్ తన దాసులలో, తాను కోరిన వారికి జీవనోపాధిని విస్తరింపజేస్తాడు.[2] మరియు (తాను కోరిన వారికి) తగ్గిస్తాడు. ఒకవేళ అల్లాహ్ అనుగ్రహమే మాపై లేకుంటే ఆయన మమ్మల్ని కూడా భూమిలోకి అణగద్రొక్కి ఉండేవాడు. తెలుసుకోండి! సత్యతిరస్కారులు ఎన్నడూ సాఫల్యం పొందలేరు!"

تِلۡكَ ٱلدَّارُ ٱلۡأٓخِرَةُ نَجۡعَلُهَا
لِلَّذِينَ لَا يُرِيدُونَ عُلُوّٗا فِي ٱلۡأَرۡضِ
وَلَا فَسَادٗاۚ وَٱلۡعَٰقِبَةُ لِلۡمُتَّقِينَ ٨٣

**83**. ఆ పరలోక జీవితపు గృహాన్ని మేము భూమిలో పెద్దరికం చూపగోరని వారికొరకు మరియు కల్లోలం రేకెత్తించని వారికొరకు ప్రత్యేకిస్తాము. మరియు దైవభీతి గలవారికే (మేలైన) పర్యవసానం ఉంటుంది.

---

**1**. వయ్'క అన్న: ఈ శబ్దానికి, Woe unto thee, Oh, Ah, Know అనే అర్థాలిచ్చారు. అంటే, నీ పాడుగాను, అయ్యో, తెలుసుకో మొదలైనవి.

**2**. అల్లాహ్ (సు.తా.) ధన సంపత్తులు ప్రసాదించినంత మాత్రానా అల్లాహ్ (సు.తా.) వానితో సంతుష్టుడయ్యాడని మరియు అల్లాహ్ (సు.తా.) వాటిని ఇవ్వని వాని మీద కోపంతో ఉన్నాడని కాదు. శాశ్వత సుఖసంతోషాలు కేవలం విశ్వసించి సత్కార్యాలు చేసేవారికే లభిస్తాయి. భూలోక సుఖసంతోషాలు, పరలోక సుఖసంతోషాల ముందు అతి స్వల్పమైనవి.

مَن جَآءَ بِٱلْحَسَنَةِ فَلَهُۥ خَيْرٌ مِّنْهَا ۖ وَمَن جَآءَ بِٱلسَّيِّئَةِ فَلَا يُجْزَى ٱلَّذِينَ عَمِلُوا۟ ٱلسَّيِّـَٔاتِ إِلَّا مَا كَانُوا۟ يَعْمَلُونَ ﴿٨٤﴾

84. మంచి పనులు చేసివచ్చిన వారికి వాటికంటే ఉత్తమమైన (ప్రతిఫలం) లభిస్తుంది.[1] మరియు చెడ్డపనులు చేసి వచ్చిన వారికి, వారు చేస్తూ ఉండిన చెడ్డ పనులకు తగినంత ప్రతిఫలమే ఇవ్వబడుతుంది.

إِنَّ ٱلَّذِى فَرَضَ عَلَيْكَ ٱلْقُرْءَانَ لَرَآدُّكَ إِلَىٰ مَعَادٍ ۚ قُل رَّبِّىٓ أَعْلَمُ مَن جَآءَ بِٱلْهُدَىٰ وَمَنْ هُوَ فِى ضَلَـٰلٍ مُّبِينٍ ﴿٨٥﴾

85. (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా ఈ ఖుర్ఆన్‌ను నీకు విధిగా చేసినవాడు (అల్లాహ్) తప్పక నిన్ను నీ నిర్ణీత స్థానానికి తిరిగి తెస్తాడు.[2] వారితో ఇలా అను: "ఎవడు మార్గదర్శకత్వంలో ఉన్నాడో మరియు ఎవడు స్పష్టంగా మార్గభ్రష్టత్వంలో పడిఉన్నాడో, నా ప్రభువుకు బాగా తెలుసు."

وَمَا كُنتَ تَرْجُوٓا۟ أَن يُلْقَىٰٓ إِلَيْكَ ٱلْكِتَـٰبُ إِلَّا رَحْمَةً مِّن رَّبِّكَ ۖ فَلَا تَكُونَنَّ ظَهِيرًا لِّلْكَـٰفِرِينَ ﴿٨٦﴾

86. మరియు నీకు ఈ గ్రంథం (ఖుర్ఆన్) ఇవ్వబడుతుందని నీ వెన్నడూ ఆశించలేదు, ఇది కేవలం నీ ప్రభువు కారుణ్యం వల్లనే లభించింది. కావున నీవు ఎన్నటికీ సత్యతిరస్కారులకు తోడ్పడేవాడవు కావద్దు!

---

1. చూడండి, 27:89 ప్రతి మంచిపనికి పదివంతులు అధికంగా పుణ్యఫలితం ఇవ్వబడుతుంది. అల్లాహ్ (సు.తా.) కోరితే అంతకంటే ఎక్కువ పుణ్య ఫలితం ఇస్తాడు. కాని ప్రతి చెడ్డపనికి దానంత శిక్ష మాత్రమే విధించబడుతుంది. పునరుత్థానదినమున ఎవరికీ అన్యాయం జరుగదు. చూడండి, 6:160.

2. అంటే తప్పక తిరిగి మక్కాకు తెస్తాడు. కావున హిజ్రత్‌కు 8 సంవత్సరాల తరువాత దైవప్రవక్త ('స'అస) తిరిగి మక్కాకు విజేయులై వచ్చారు. (ఇబ్నె-'అబ్బాస్ ర'ది.'అ. కథనం, 'స'హీ'హ్ బు'ఖారీ).

وَلَا يَصُدُّنَّكَ عَنْ ءَايَٰتِ ٱللَّهِ بَعْدَ إِذْ أُنزِلَتْ إِلَيْكَ ۖ وَٱدْعُ إِلَىٰ رَبِّكَ ۖ وَلَا تَكُونَنَّ مِنَ ٱلْمُشْرِكِينَ ﴿٨٧﴾

**87**. మరియు అల్లాహ్ ఆయతులు, నీపై అవతరింపజేయబడిన తరువాత; వారు (సత్యతిరస్కారులు) వాటి (పఠనం / ప్రచారం) నుండి నిన్ను ఏ మాత్రం తొలగింపనివ్వరాదు. మరియు (ప్రజలను) నీ ప్రభువు వైపునకు ఆహ్వానించు. మరియు నీవు బహుదైవారాధకులలో చేరిపోకు.

وَلَا تَدْعُ مَعَ ٱللَّهِ إِلَٰهًا ءَاخَرَ ۘ لَآ إِلَٰهَ إِلَّا هُوَ ۚ كُلُّ شَيْءٍ هَالِكٌ إِلَّا وَجْهَهُۥ ۚ لَهُ ٱلْحُكْمُ وَإِلَيْهِ تُرْجَعُونَ ﴿٨٨﴾

**88**. మరియు అల్లాహ్‌తో పాటు ఏ ఇతర దైవాన్నీ ఆరాధించకు. ఆయన (అల్లాహ్) తప్ప మరొక ఆరాధ్యదైవం లేడు. కేవలం ఆయన ఉనికి (ముఖం) తప్ప ప్రతిదీ నశిస్తుంది.[1] సర్వ న్యాయాధిపత్యం కేవలం ఆయనదే మరియు ఆయన వైపునకే మీరంతా మరలింపబడతారు. (3/4)

*****

**1**. చూడండి, 55:26-27.

## 29. సూరహ్ అల్-'అన్‌కబూత్

## سُورَةُ العَنكَبُوت

'అన్‌కబూత్: సాలీడు పురుగు లేక సాలె పురుగు. దీనిపేరు **41**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. అసత్యాధారంపై ఉన్న ప్రతిదీ సత్యపు గాలికి ఒకరోజు ఎగిరిపోకుండా ఉండదు. ఇది చివరి మక్కా సూరహ్ అని చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం. ఈ సమూహపు (29-32) సూరాలలో ఇది మొదటిది. ఈ నాలుగు సూరాహ్‌లు అలీఫ్-లామ్-మీమ్, అక్షరాలతో ప్రారంభమవుతాయి. ఇందులో **69** **ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**1**. * అలిఫ్-లామ్-మీమ్.

الٓمٓ ﴿١﴾

**2**. ఏమీ? ప్రజలు: "మేము విశ్వసించాము!" అని అన్నంత మాత్రాన్నే తాము విడిచిపెట్టబడతారని మరియు తాము పరీక్షింపబడరని భావిస్తున్నారా?[1]

أَحَسِبَ ٱلنَّاسُ أَن يُتْرَكُوٓا۟ أَن يَقُولُوٓا۟ ءَامَنَّا وَهُمْ لَا يُفْتَنُونَ ﴿٢﴾

**3**. మరియు వాస్తవానికి, మేము వారికి పూర్వం గతించిన వారిని కూడా పరీక్షించి ఉన్నాము. కావున నిశ్చయంగా సత్యవంతులు ఎవరో మరియు అసత్యవంతులు ఎవరో అల్లాహ్ వ్యక్తపరుస్తాడు.

وَلَقَدْ فَتَنَّا ٱلَّذِينَ مِن قَبْلِهِمْ ۖ فَلَيَعْلَمَنَّ ٱللَّهُ ٱلَّذِينَ صَدَقُوا۟ وَلَيَعْلَمَنَّ ٱلْكَٰذِبِينَ ﴿٣﴾

**4**. లేక, చెడుపనులు చేస్తున్నవారు, మా (శిక్ష) నుండి తప్పించుకోగలరని భావిస్తున్నారా? ఎంత చెడ్డ నిర్ణయం వారిది!

أَمْ حَسِبَ ٱلَّذِينَ يَعْمَلُونَ ٱلسَّيِّـَٔاتِ أَن يَسْبِقُونَا ۚ سَآءَ مَا يَحْكُمُونَ ﴿٤﴾

**5**. అల్లాహ్‌ను కలుసుకునే కోరిక ఉన్న వాడు, అల్లాహ్ నిర్ణయించిన ఆ సమయం తప్పక రానున్నదని నమ్మాలి. మరియు ఆయన సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

مَن كَانَ يَرْجُوا۟ لِقَآءَ ٱللَّهِ فَإِنَّ أَجَلَ ٱللَّهِ لَءَاتٍ ۚ وَهُوَ ٱلسَّمِيعُ ٱلْعَلِيمُ ﴿٥﴾

---

**1**. మొట్టమొదట విశ్వాసం (ఇస్లాం) స్వీకరించిన 'ఆమ్మార్ అతని తల్లి-దండ్రులైన సుమయ్యా మరియు యాసర్, 'సుహేబ్ మరియు బిలాల్ మొదలైన వారు (ర'ది.'అన్హుమ్) ఎన్నో తీవ్రమైన పరీక్షలకు గురిచేయబడ్డారు.

وَمَن جَٰهَدَ فَإِنَّمَا يُجَٰهِدُ لِنَفۡسِهِۦٓۚ إِنَّ ٱللَّهَ لَغَنِيٌّ عَنِ ٱلۡعَٰلَمِينَ ٦

**6.** కావున (అల్లాహ్ మార్గంలో) పాటుపడే వాడు నిశ్చయంగా, తన (మేలు) కొరకే పాటుపడుతున్నాడని (తెలుసుకోవాలి).[1] నిశ్చయంగా, అల్లాహ్ సర్వలోకాల వారి అక్కర ఏ మాత్రం లేనివాడు.

وَٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ لَنُكَفِّرَنَّ عَنۡهُمۡ سَيِّـَٔاتِهِمۡ وَلَنَجۡزِيَنَّهُمۡ أَحۡسَنَ ٱلَّذِي كَانُواْ يَعۡمَلُونَ ٧

**7.** మరియు ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తారో, నిశ్చయంగా అలాంటి వారి (పూర్వపు) పాపాలను మేము తప్పక తొలగిస్తాము మరియు వారు చేసిన సత్కార్యాలకు ఉత్తమమైన ప్రతిఫలం ఇస్తాము.

وَوَصَّيۡنَا ٱلۡإِنسَٰنَ بِوَٰلِدَيۡهِ حُسۡنٗاۖ وَإِن جَٰهَدَاكَ لِتُشۡرِكَ بِي مَا لَيۡسَ لَكَ بِهِۦ عِلۡمٞ فَلَا تُطِعۡهُمَآۚ إِلَيَّ مَرۡجِعُكُمۡ فَأُنَبِّئُكُم بِمَا كُنتُمۡ تَعۡمَلُونَ ٨

**8.** మరియు మేము మానవునికి తన తల్లిదండ్రులతో మంచిగా వ్యవహరించమని ఆదేశించాము.[2] కాని వారిద్దరూ, నీవు ఎరుగని వానిని నాకు భాగస్వామిగా చేయమని బలవంతపెడితే, నీవు వారి ఆజ్ఞాపాలన చేయకు.[3] మీరందరూ నా వైపుకే మరలి రావలసి ఉన్నది, అప్పుడు నేను మీకు, మీరు ఏమి చేస్తూ ఉండేవారో తెలుపుతాను.

---

**1.** చూడండి, 45:15 జిహాదున్: అంటే - 1) తన సత్యధర్మాన్ని, తన స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను కాపాడుకోవటానికి దానిని అడ్డగించే వారితో; 2) సత్యం మీద మరియు సన్మార్గం మీద ఉండటానికి తన ఆత్మలోని అసత్యం, అధర్మంతో మరియు 3) దుష్టప్రేరణలతో - చేసే పోరాటం.

**2.** ఖుర్ఆన్‌లో కేవలం ఏకైక ఆరాధ్యుడు అల్లాహ్ (సు.తా.) ఆరాధనే చేయాలనీ మరియు తల్లిదండ్రులతో మంచిగా వ్యవహరించాలని అల్లాహ్ (సు.తా.) ఆదేశిస్తున్నాడు. తమ తల్లిదండ్రులను ఆదరించే వారే అల్లాహ్ (సు.తా.) యొక్క స్థానాన్ని అర్థం చేసుకో గలుగుతారు. చూడండి, 31:14-15.

**3.** స'అద్ బిన్ అబీ-వఖ్ఖా'స్ (ర'ది.'అ.) ఇస్లాం స్వీకరించినప్పుడు అతని తల్లి నీవు ఇస్లాం మరియు ము'హమ్మద్ (సఅస)ను వదలనంత వరకు నేను అన్న పానీయాలను ముట్టను అని మొండిపట్టు పట్టుతుంది. అప్పుడు ఈ ఆయత్ అవతరింపజేయబడింది. ('స. ముస్లిం, తిర్మిజీ').

9. మరియు ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తూ ఉంటారో, మేము వారిని తప్పక సద్వర్తనులతో చేర్చుతాము.

10. మరియు ప్రజలలో కొందరు (తమ నాలుకలతో): "మేము అల్లాహ్ ను విశ్వసించాము." అని అనే వ్యక్తులున్నారు. కాని వారు అల్లాహ్ మార్గంలో హింసించబడినప్పుడు, మానవులు పెట్టిన పరీక్షలను అల్లాహ్ యొక్క శిక్షగా భావిస్తారు మరియు ఒకవేళ నీ ప్రభువు నుండి సహాయం వస్తే వారు (కపట విశ్వాసులు) అంటారు: "నిశ్చయంగా, మేము మీతోనే ఉన్నాము."[1] సర్వలోకాల వారి హృదయాల స్థితి అల్లాహ్ కు తెలియదా ఏమిటి?

11. మరియు నిశ్చయంగా, అల్లాహ్ విశ్వసించిన వారిని స్పష్టపరుస్తాడు మరియు ఆయన కపటవిశ్వాసులను కూడా స్పష్టపరుస్తాడు.[2]

12. మరియు సత్యతిరస్కారులు, విశ్వాసులతో: "మీరు మా మార్గాన్ని అనుసరించండి. మేము మీ పాపాలను భరిస్తాము." అని అంటారు. వాస్తవానికి వారి పాపాలలో నుండి దేనిని కూడా వారు భరించరు. నిశ్చయంగా, వారు అసత్యవాదులు.[3]

وَٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ
لَنُدْخِلَنَّهُمْ فِى ٱلصَّٰلِحِينَ ﴿٩﴾

وَمِنَ ٱلنَّاسِ مَن يَقُولُ ءَامَنَّا بِٱللَّهِ
فَإِذَآ أُوذِىَ فِى ٱللَّهِ جَعَلَ فِتْنَةَ ٱلنَّاسِ
كَعَذَابِ ٱللَّهِ وَلَئِن جَآءَ نَصْرٌ مِّن
رَّبِّكَ لَيَقُولُنَّ إِنَّا كُنَّا مَعَكُمْ ۚ
أَوَلَيْسَ ٱللَّهُ بِأَعْلَمَ بِمَا فِى صُدُورِ
ٱلْعَٰلَمِينَ ﴿١٠﴾

وَلَيَعْلَمَنَّ ٱللَّهُ ٱلَّذِينَ ءَامَنُواْ
وَلَيَعْلَمَنَّ ٱلْمُنَٰفِقِينَ ﴿١١﴾

وَقَالَ ٱلَّذِينَ كَفَرُواْ لِلَّذِينَ
ءَامَنُواْ ٱتَّبِعُواْ سَبِيلَنَا وَلْنَحْمِلْ
خَطَٰيَٰكُمْ وَمَا هُم بِحَٰمِلِينَ مِنْ
خَطَٰيَٰهُم مِّن شَىْءٍ ۖ إِنَّهُمْ
لَكَٰذِبُونَ ﴿١٢﴾

1. ఇలాంటి భావమిచ్చే మరొక ఆయత్ కు చూడండి, 4:141.
2. అంటే అల్లాహ్ (సు.తా.), సుఖదుఃఖాలనిచ్చి విశ్వాసులెవరో మరియు కపట విశ్వాసులెవరో విశదంచేస్తాడు. ఎవరైతే ప్రతి స్థితిలో అల్లాహ్ (సు.తా.)కు కృతజ్ఞులై ఉంటారో వారే నిజమైన విశ్వాసులు. ఇంకా చూడండి, 47:31 మరియు 3:179, ఇది కపటవిశ్వాసు(మునాఫిఖు)లను గురించి వచ్చిన మొదటి ఆయత్.
3. సత్యతిరస్కారులు: 'మీరు మా మార్గాన్ని అనుసరిస్తే మేము మీ పాపాలను భరిస్తాము.'

وَلَيَحۡمِلُنَّ أَثۡقَالَهُمۡ وَأَثۡقَالٗا مَّعَ أَثۡقَالِهِمۡۖ وَلَيُسۡـَٔلُنَّ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ عَمَّا كَانُواْ يَفۡتَرُونَ ١٣

13. మరియు నిశ్చయంగా, వారు తమ బరువులను మోస్తారు. మరియు తమ బరువులతో పాటు ఇతరుల బరువులను కూడా మోస్తారు.[1] మరియు నిశ్చయంగా, వారు పునరుత్థానదినమున, తమ బూటక కల్పనలను గురించి ప్రశ్నింపబడతారు.

وَلَقَدۡ أَرۡسَلۡنَا نُوحًا إِلَىٰ قَوۡمِهِۦ فَلَبِثَ فِيهِمۡ أَلۡفَ سَنَةٍ إِلَّا خَمۡسِينَ عَامٗا فَأَخَذَهُمُ ٱلطُّوفَانُ وَهُمۡ ظَٰلِمُونَ ١٤

14. మరియు వాస్తవానికి, మేము నూ'హ్ ను అతని జాతివారి వద్దకు పంపాము. అతను వారిమధ్య యాభై తక్కువ వేయి సంవత్సరాల వరకు (వారిని అల్లాహ్ ధర్మం వైపుకు ఆహ్వానిస్తూ) నివసించాడు, చివరకు వారు దుర్మార్గాన్ని విడనాడనందుకు, వారిని తుఫాను పట్టుకున్నది.[2]

فَأَنجَيۡنَٰهُ وَأَصۡحَٰبَ ٱلسَّفِينَةِ وَجَعَلۡنَٰهَآ ءَايَةٗ لِّلۡعَٰلَمِينَ ١٥

15. తరువాత మేము అతనిని (నూ'హ్ ను) మరియు నావలో ఎక్కినవారిని రక్షించి, దానిని సర్వలోకాల వారికి ఒక సూచనగా చేశాము.

---

అని అనే మాటలు అబద్ధాలని ఇక్కడ విశదీకరింపబడింది. అల్లాహ్ (సు.తా.) అంటున్నాడు: "భారం మోసేవాడు, ఎవరి భారాన్ని మోయడు!" పునరుత్థాన దినమున స్నేహితుడు తన స్నేహితుని స్థితిని అడగడు, 70:10 మరియు దగ్గరి బంధువులు కూడా ఒకరినొకరు అడుగుకోరు, 35:18.

1. ఇటువంటి ఆయత్ కు చూడండి, 16:25. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "ఇతరులను సన్మార్గానికి పిలచిన వారికి, వారు సన్మార్గాన్ని అనుసరిస్తే పునరుత్థానదినం వరకు వారంతా చేసే సత్కార్యాల ఫలితాల పుణ్యం దొరుకుతుంది. దుర్మార్గాలకు, పాపకార్యాలకు, దుష్టకార్యాలకు ఆహ్వానించే వారు తమను అనుసరించిన వారి పాపభారాన్ని పునరుత్థాన దినం వరకు భరిస్తారు." ('స'హీ'హ్ బు'ఖారీ).

2. నూ'హ్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 11:25-48 ఇక్కడ దీని ఉద్దేశమేమిటంటే: ఒక ప్రవక్త ('అ.స.) కూడా తాను ప్రేమించేవారిని సన్మార్గానికి తేలేడు. ఇంకా చూడండి, 28:56 నూ'హ్ ('అ.స.) వారికి 950 సంవత్సరాలు ఇస్లాం ధర్మప్రచారం చేశారు. మార్గదర్శకత్వమంతా అల్లాహ్ (సు.తా.) మార్గదర్శకత్వమే. చూడండి, 3:73.

وَإِبْرَٰهِيمَ إِذْ قَالَ لِقَوْمِهِ ٱعْبُدُوا۟ ٱللَّهَ وَٱتَّقُوهُ ۖ ذَٰلِكُمْ خَيْرٌ لَّكُمْ إِن كُنتُمْ تَعْلَمُونَ ﴿١٦﴾

16. మరియు (జ్ఞాపకం చేసుకోండి!) ఇలాగే ఇబ్రాహీమ్ కూడా తన జాతివారితో: "కేవలం అల్లాహ్‌నే ఆరాధించండి మరియు ఆయనయందు భయభక్తులు కలిగి ఉండండి. మీరు అర్థంచేసుకోగలిగితే, ఇది మీకు ఎంతో మేలైనది.

إِنَّمَا تَعْبُدُونَ مِن دُونِ ٱللَّهِ أَوْثَٰنًا وَتَخْلُقُونَ إِفْكًا ۚ إِنَّ ٱلَّذِينَ تَعْبُدُونَ مِن دُونِ ٱللَّهِ لَا يَمْلِكُونَ لَكُمْ رِزْقًا فَٱبْتَغُوا۟ عِندَ ٱللَّهِ ٱلرِّزْقَ وَٱعْبُدُوهُ وَٱشْكُرُوا۟ لَهُۥٓ ۖ إِلَيْهِ تُرْجَعُونَ ﴿١٧﴾

17. "నిశ్చయంగా, మీరు అల్లాహ్‌ను వదలి విగ్రహాలను ఆరాధిస్తూ, ఒక అభూత కల్పన చేస్తున్నారు. నిశ్చయంగా అల్లాహ్‌ను వదలి మీరు ఎవరినైతే, ఆరాధిస్తున్నారో వారికి, మీకు జీవనోపాధిని సమకూర్చే యోగ్యత లేదు. కావున మీరు, మీ జీవనోపాధిని అల్లాహ్ నుండియే అపేక్షించండి మరియు ఆయననే ఆరాధించండి మరియు ఆయనకే కృతజ్ఞులై ఉండండి. మీరంతా ఆయన వైపునకే మరలింపబడతారు.

وَإِن تُكَذِّبُوا۟ فَقَدْ كَذَّبَ أُمَمٌ مِّن قَبْلِكُمْ ۖ وَمَا عَلَى ٱلرَّسُولِ إِلَّا ٱلْبَلَٰغُ ٱلْمُبِينُ ﴿١٨﴾

18. "ఒకవేళ మీరు (ఈ సందేశాన్ని) అబద్ధమని తిరస్కరిస్తే, (ఆశ్చర్యమేమీ లేదు) వాస్తవానికి మీకు పూర్వం ఎన్నో సమాజాలు తిరస్కరించాయి. మరియు సందేశహరుని బాధ్యత, స్పష్టంగా మీకు సందేశాన్ని అందజేయటం మాత్రమే!"

أَوَلَمْ يَرَوْا۟ كَيْفَ يُبْدِئُ ٱللَّهُ ٱلْخَلْقَ ثُمَّ يُعِيدُهُۥٓ ۚ إِنَّ ذَٰلِكَ عَلَى ٱللَّهِ يَسِيرٌ ﴿١٩﴾

19. అల్లాహ్ సృష్టిని ఏవిధంగా ప్రారంభిస్తున్నాడో, తరువాత దానిని ఏవిధంగా మరల ఉనికిలోకి తెస్తున్నాడో వారు గమనించడం లేదా? నిశ్చయంగా, ఇది అల్లాహ్‌కు ఎంతో సులభం!

**20**. వారితో అను: "మీరు భూమిలో సంచారం చేసి చూడండి: ఆయన సృష్టిని ఏవిధంగా ప్రారంభించాడో![1] తరువాత అల్లాహ్‌యే మరల (రెండవసారి) దానిని ఉనికిలోకి తెస్తున్నాడో! నిశ్చయంగా, అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు!"

**21**. ఆయన తాను కోరిన వారిని శిక్షిస్తాడు మరియు తాను కోరిన వారిని కరుణిస్తాడు. మరియు ఆయన వైపుకే మీరంతా మరలింపబడతారు.

**22**. మరియు మీరు భూమిలో గాని, ఆకాశంలో గాని ఆయన నుండి తప్పించుకోజాలరు. మరియు అల్లాహ్ తప్ప మీకు సంరక్షకుడు గానీ మరియు సహాయకుడు గానీ ఎవ్వడూ లేడు.

**23**. మరియు ఎవరైతే, అల్లాహ్ సూచనలను మరియు ఆయనతో కాబోయే సమావేశాన్ని తిరస్కరిస్తారో, అలాంటి వారు నా కరుణ పట్ల నిరాశచెందుతారు.[2] మరియు అలాంటి వారికి బాధాకరమైన శిక్ష పడుతుంది.

**24**. ఇక అతని (ఇబ్రాహీమ్) జాతివారి జవాబు ఈ విధంగా అనడం తప్ప మరొకటి లేక పోయింది: "ఇతనిని చంపండి లేదా కాల్చివేయండి." చివరకు అల్లాహ్ అతనిని అగ్నినుండి రక్షించాడు.[3] నిశ్చయంగా, ఇందులో విశ్వసించేవారికి సూచనలున్నాయి.

قُلۡ سِيرُواْ فِي ٱلۡأَرۡضِ فَٱنظُرُواْ
كَيۡفَ بَدَأَ ٱلۡخَلۡقَۚ ثُمَّ ٱللَّهُ يُنشِئُ
ٱلنَّشۡأَةَ ٱلۡأٓخِرَةَۚ إِنَّ ٱللَّهَ عَلَىٰ كُلِّ
شَيۡءٖ قَدِيرٞ ٢٠
يُعَذِّبُ مَن يَشَآءُ وَيَرۡحَمُ مَن يَشَآءُۖ
وَإِلَيۡهِ تُقۡلَبُونَ ٢١
وَمَآ أَنتُم بِمُعۡجِزِينَ فِي ٱلۡأَرۡضِ
وَلَا فِي ٱلسَّمَآءِۖ وَمَا لَكُم مِّن
دُونِ ٱللَّهِ مِن وَلِيّٖ وَلَا نَصِيرٖ ٢٢
وَٱلَّذِينَ كَفَرُواْ بِـَٔايَٰتِ ٱللَّهِ
وَلِقَآئِهِۦٓ أُوْلَٰٓئِكَ يَئِسُواْ مِن رَّحۡمَتِي
وَأُوْلَٰٓئِكَ لَهُمۡ عَذَابٌ أَلِيمٞ ٢٣
فَمَا كَانَ جَوَابَ قَوۡمِهِۦٓ إِلَّآ
أَن قَالُواْ ٱقۡتُلُوهُ أَوۡ حَرِّقُوهُ فَأَنجَىٰهُ
ٱللَّهُ مِنَ ٱلنَّارِۚ إِنَّ فِي ذَٰلِكَ
لَأٓيَٰتٖ لِّقَوۡمٖ يُؤۡمِنُونَ ٢٤

---

**1**. చూడండి, 23:12-14.
**2**. చూడండి, 8:156.
**3**. చూడండి, 21:69.

وَقَالَ إِنَّمَا ٱتَّخَذْتُم مِّن دُونِ ٱللَّهِ أَوْثَٰنًا مَّوَدَّةَ بَيْنِكُمْ فِى ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا ۖ ثُمَّ يَوْمَ ٱلْقِيَٰمَةِ يَكْفُرُ بَعْضُكُم بِبَعْضٍ وَيَلْعَنُ بَعْضُكُم بَعْضًا وَمَأْوَىٰكُمُ ٱلنَّارُ وَمَا لَكُم مِّن نَّٰصِرِينَ ﴿٢٥﴾

۞ فَـَٔامَنَ لَهُۥ لُوطٌ ۘ وَقَالَ إِنِّى مُهَاجِرٌ إِلَىٰ رَبِّىٓ ۖ إِنَّهُۥ هُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿٢٦﴾

وَوَهَبْنَا لَهُۥٓ إِسْحَٰقَ وَيَعْقُوبَ وَجَعَلْنَا فِى ذُرِّيَّتِهِ ٱلنُّبُوَّةَ وَٱلْكِتَٰبَ وَءَاتَيْنَٰهُ أَجْرَهُۥ فِى ٱلدُّنْيَا ۖ وَإِنَّهُۥ فِى ٱلْءَاخِرَةِ لَمِنَ ٱلصَّٰلِحِينَ ﴿٢٧﴾

**25**. మరియు (ఇబ్రాహీమ్) ఇలా అన్నాడు: "నిశ్చయంగా, మీరు ప్రాపంచిక జీవితంలో అల్లాహ్‌ను వదలి, విగ్రహారాధనను మీ మధ్య ప్రేమకు సాధనంగా చేసుకున్నారు. కాని పునరుత్థాన దినమున మీకు పరస్పరం సంబంధమే లేదంటారు మరియు పరస్పరం శపించుకుంటారు మరియు మీ ఆశ్రయం నరకాగ్నియే మరియు మీకు సహాయపడే వారు ఎవ్వరూ ఉండరు." (7/8)

**26**. * అప్పుడు లూత్ అతనిని విశ్వసించాడు. (ఇబ్రాహీమ్) ఇలా అన్నాడు: "నేను నా ప్రభువు వైపునకు వలసపోతాను.[1] నిశ్చయంగా, ఆయనే సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు."

**27**. మరియు మేము అతనికి (ఇబ్రాహీమ్‌కు) ఇస్'హాఖ్ మరియు య'అఖూబ్‌లను ప్రసాదించి, అతని సంతతిలో ప్రవక్త పదవినీ మరియు గ్రంథాన్ని ఉంచి, ప్రపంచంలో అతనికి, అతని ప్రతిఫలాన్ని ఇచ్చాము.[2] మరియు

---

**1**. ఇబ్రాహీమ్ ('అ.స.) తన భార్య సారహ్ మరియు తన సోదరుని కుమారుడు లూ'త్ ('అ.స.)లతో, తమ దేశం కూసీ అంటే - కూఫా ప్రాంతం లోని ఒక నగరం నుండి షామ్ వైపునకు ప్రస్థానం చేశారు. ఎందుకంటే ఆ దేశపు ప్రజలు - వారు ఇస్లాం అనుసరిస్తున్నందుకు - వారిపై దౌర్జన్యాలు చేశారు.

**2**. ఈ ప్రతిఫలమేమిటంటే అతను ఇబ్రాహీమ్ ('అ.స.) అబుల్-అంబియా అనబడ్డారు. అంటే ప్రవక్తల మూలపురుషుడు. ఎందుకంటే అతని సంతానం నుండి ఎంతోమంది ప్రవక్తలు వచ్చారు. అతని పెద్ద కుమారుడు, సయ్యిదా హాజర్ పుత్రుడైన ఇస్మా'యీల్ ('అ.స.) వంశం నుండి మహాప్రవక్త ము'హమ్మద్ ('స'అస) వచ్చారు. మరియు అతని రెండవ కుమారుడు ఇ'స్హాఖ్ ('అ.స.) యొక్క కుమారుడైన య'అఖూబ్ ('అ.స.) నుండి అతని కుమారుడైన యూసుఫ్ ('అ.స.) వచ్చారు. మరియు య'అఖూబ్ ('అ.స.) యొక్క పన్నెండు మంది కుమారులనుండి ఇంకా ఎంతో మంది ప్రవక్తలు వచ్చారు. దావూద్, సులైమాన్, మూసా మరియు 'ఈసా ('అలైహిమ్. స.)లు అందరూ య'అఖూబ్ ('అ.స.) సంతతి వారే, అంటే ఇబ్రాహీమ్ ('అ.స.) సంతతి వారే. అందుకే

وَلُوطًا إِذْ قَالَ لِقَوْمِهِۦٓ إِنَّكُمْ لَتَأْتُونَ ٱلْفَٰحِشَةَ مَا سَبَقَكُم بِهَا مِنْ أَحَدٍ مِّنَ ٱلْعَٰلَمِينَ ﴿٢٨﴾

أَئِنَّكُمْ لَتَأْتُونَ ٱلرِّجَالَ وَتَقْطَعُونَ ٱلسَّبِيلَ وَتَأْتُونَ فِى نَادِيكُمُ ٱلْمُنكَرَ ۖ فَمَا كَانَ جَوَابَ قَوْمِهِۦٓ إِلَّآ أَن قَالُوا۟ ٱئْتِنَا بِعَذَابِ ٱللَّهِ إِن كُنتَ مِنَ ٱلصَّٰدِقِينَ ﴿٢٩﴾

قَالَ رَبِّ ٱنصُرْنِى عَلَى ٱلْقَوْمِ ٱلْمُفْسِدِينَ ﴿٣٠﴾

وَلَمَّا جَآءَتْ رُسُلُنَآ إِبْرَٰهِيمَ بِٱلْبُشْرَىٰ قَالُوٓا۟ إِنَّا مُهْلِكُوٓا۟ أَهْلِ هَٰذِهِ ٱلْقَرْيَةِ ۖ إِنَّ أَهْلَهَا كَانُوا۟ ظَٰلِمِينَ ﴿٣١﴾

పరలోకంలో అతడు నిశ్చయంగా, సద్వర్తనులతో పాటు ఉంటాడు.[1]

**28**. మరియు (జ్ఞాపకం చేసుకోండి) లూ'త్ తన జాతి ప్రజలతో ఇలా అన్నప్పుడు: "నిశ్చయంగా, మీరు చాలా హేయమైన పని చేస్తున్నారు. మీకు పూర్వం, లోకంలో ఎవ్వడూ ఇలాంటి పని చేయలేదు.[2]

**29**. "వాస్తవానికి, మీరు (కామంతో) పురుషుల వద్దకు పోతున్నారు! మరియు దారికొడుతున్నారు (దోపిడి చేస్తున్నారు)! మరియు మీ సభలలో అసభ్యకరమైన పనులు చేస్తున్నారు!" అతని జాతివారి జవాబు కేవలం ఇలానే ఉండేది: "నీవు సత్యవంతుడవే అయితే అల్లాహ్ శిక్షను మా పైకి తీసుకురా!"

**30**. అపుడు లూ'త్ ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! దౌర్జన్యపరులపై నాకు విజయము నొసంగు."

**31**. మరియు మా దూతలు ఇబ్రాహీమ్ వద్దకు శుభవార్త తీసికొని వచ్చినపుడు వారన్నారు: "నిశ్చయంగా, మేము ఈ నగరవాసులను నాశనం చేయబోతున్నాము. ఎందుకంటే వాస్తవానికి దాని ప్రజలు దుర్మార్గులై పోయారు!"

---

యూదులు, క్రైస్తవులు, ముస్లిములే గాక ముష్రికులు కూడా ఇబ్రాహీమ్ ('అ.స.)ను ఆదరిస్తారు. ప్రతి ఒక్కరూ మేము ఇబ్రాహీమ్ ('అ.స.) ధర్మాన్నే ఆచరిస్తున్నాము అంటారు. కాని, వాస్తవానికి అతని ధర్మం, ఏకైక దైవసిద్ధాంతం (ఇస్లాం) మాత్రమే.

**1**. చూడండి, 16:122.

**2**. లూ'త్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 11:69-83.

32. (ఇబ్రాహీమ్) అన్నాడు: "వాస్తవానికి, అక్కడ లూత్ కూడా ఉన్నాడు కదా!" వారన్నారు: "అక్కడెవరున్నారో, మాకు బాగా తెలుసు. మేము అతనిని మరియు అతని కుటుంబంవారిని రక్షిస్తాము - అతని భార్య తప్ప - ఆమె వెనుక ఉండిపోయే వారిలో చేరిపోతుంది."[1]

قَالَ إِنَّ فِيهَا لُوطًاۚ قَالُواْ نَحۡنُ أَعۡلَمُ بِمَن فِيهَاۖ لَنُنَجِّيَنَّهُۥ وَأَهۡلَهُۥٓ إِلَّا ٱمۡرَأَتَهُۥ كَانَتۡ مِنَ ٱلۡغَٰبِرِينَ ٣٢

33. ఆ తరువాత మా దూతలు లూ'త్ వద్దకు రాగా అతను వారి నిమిత్తం చాలా చింతించాడు.[2] మరియు ఇబ్బందిలో పడిపోయాడు. వారిలా అన్నారు: "నీవు భయపడకు మరియు దుఃఖపడకు! నిశ్చయంగా, మేము నిన్ను మరియు నీ కుటుంబంవారిని రక్షిస్తాము - నీ భార్య తప్ప - ఆమె వెనుక ఉండిపోయే వారిలో చేరిపోతుంది!

وَلَمَّآ أَن جَآءَتۡ رُسُلُنَا لُوطٗا سِيٓءَ بِهِمۡ وَضَاقَ بِهِمۡ ذَرۡعٗا وَقَالُواْ لَا تَخَفۡ وَلَا تَحۡزَنۡۖ إِنَّا مُنَجُّوكَ وَأَهۡلَكَ إِلَّا ٱمۡرَأَتَكَ كَانَتۡ مِنَ ٱلۡغَٰبِرِينَ ٣٣

34. "నిశ్చయంగా, మేము ఈ నగర వాసుల మీద ఆకాశం నుండి ఘోరవిపత్తు అవతరింపజేయబోతున్నాము. ఎందుకంటే వారు అవిధేయులయ్యారు!"

إِنَّا مُنزِلُونَ عَلَىٰٓ أَهۡلِ هَٰذِهِ ٱلۡقَرۡيَةِ رِجۡزٗا مِّنَ ٱلسَّمَآءِ بِمَا كَانُواْ يَفۡسُقُونَ ٣٤

35. మరియు వాస్తవానికి, బుద్ధిమంతుల కొరకు మేము దీని ద్వారా ఒక స్పష్టమైన సూచనను[3] వదలిపెట్టాము.

وَلَقَد تَّرَكۡنَا مِنۡهَآ ءَايَةَۢ بَيِّنَةٗ لِّقَوۡمٖ يَعۡقِلُونَ ٣٥

---

1. చూడండి, 7:83 మరియు 11:81.
2. చూడండి, 11:77.
3. సోడోమ్ మరియు గొమొర్రాహ్ (లూ'త్ జాతి వారి) నగరాలు ఉండే చోట్లలో, ఈ రోజు మృత సముద్రం (Dead sea) ఉంది. దానిపేరు ఇలా ఎందుకు పడిందంటే అందులో గంధకం మరియు పొటాష్ (Sulphur and Potash), అత్యధికంగా ఉండటం వల్ల అందులో ఏ జీవరాశి గానీ వృక్షరాశి గానీ నివసించజాలదు.

وَإِلَىٰ مَدۡيَنَ أَخَاهُمۡ شُعَيۡبٗا فَقَالَ يَٰقَوۡمِ ٱعۡبُدُواْ ٱللَّهَ وَٱرۡجُواْ ٱلۡيَوۡمَ ٱلۡأٓخِرَ وَلَا تَعۡثَوۡاْ فِي ٱلۡأَرۡضِ مُفۡسِدِينَ ٣٦

**36**. మరియు మేము మద్‌యన్ వాసుల వద్దకు వారి సహోదరుడు షు'ఐబ్‌ను పంపాము.[1] అతను ఇలా అన్నాడు: "నా జాతి ప్రజలారా! కేవలం అల్లాహ్‌నే ఆరాధించండి మరియు అంతిమ దినం కొరకు నిరీక్షిస్తూ (భయపడుతూ) ఉండండి. మరియు దౌర్జన్యపరులుగా భూమిలో కల్లోలం రేకెత్తిస్తూ తిరగకండి!"

فَكَذَّبُوهُ فَأَخَذَتۡهُمُ ٱلرَّجۡفَةُ فَأَصۡبَحُواْ فِي دَارِهِمۡ جَٰثِمِينَ ٣٧

**37**. కాని వారు అతనిని అసత్యుడని తిరస్కరించారు, ఒక తీవ్రమైన భూకంపం వారిని పట్టుకున్నది, అప్పుడు వారు తమ ఇండ్లలోనే చలనంలేని శవాలుగా మారి పోయారు.

وَعَادٗا وَثَمُودَاْ وَقَد تَّبَيَّنَ لَكُم مِّن مَّسَٰكِنِهِمۡۖ وَزَيَّنَ لَهُمُ ٱلشَّيۡطَٰنُ أَعۡمَٰلَهُمۡ فَصَدَّهُمۡ عَنِ ٱلسَّبِيلِ وَكَانُواْ مُسۡتَبۡصِرِينَ ٣٨

**38**. మరియు వాస్తవంగా, 'ఆద్ మరియు స'మూద్ జాతులవారి (వినాశ) విషయం (మిగిలి పోయిన) వారి నివాసస్థలాల నుండి, మీకు స్పష్టంగా తెలుస్తున్నది.[2] వాస్తవానికి, వారు (సత్యాన్ని) గ్రహించే వారు అయినప్పటికీ, షై'తాన్ వారి కర్మలను వారికి మంచివిగా కనబడేటట్లు చేశాడు. ఆ తరువాత వారిని (ఋజు) మార్గం నుండి తొలగించాడు.

---

**1**. షు'ఐబ్ ('అ.స.) గాథకు చూడండి, 11:85-93.

**2**. 'ఆద్‌జాతి వారి నివాసం - అ'హ్‌ఖాఫ్ - యమన్, లోని హ'దరమౌత్ దగ్గర ఉంది. స'మూద్ జాతివారి నివాసం మదాయన్ 'సాలి'హ్, అనే ప్రాంతంలో మదీనా మునవ్వరా - తబూక్‌ల మధ్య స'ఊది 'అరేబియాలో ఉంది. ఇది 'హిజా'జ్ ఉత్తర ప్రాంతంలో ఉంది. చూడండి, 9:7.

وَقَـٰرُونَ وَفِرْعَوْنَ وَهَـٰمَـٰنَ ۖ
وَلَقَدْ جَآءَهُم مُّوسَىٰ بِٱلْبَيِّنَـٰتِ
فَٱسْتَكْبَرُوا۟ فِى ٱلْأَرْضِ وَمَا كَانُوا۟
سَـٰبِقِينَ ﴿٣٩﴾
فَكُلًّا أَخَذْنَا بِذَنۢبِهِۦ ۖ فَمِنْهُم مَّنْ أَرْسَلْنَا
عَلَيْهِ حَاصِبًا وَمِنْهُم مَّنْ أَخَذَتْهُ
ٱلصَّيْحَةُ وَمِنْهُم مَّنْ خَسَفْنَا بِهِ
ٱلْأَرْضَ وَمِنْهُم مَّنْ أَغْرَقْنَا ۚ وَمَا
كَانَ ٱللَّهُ لِيَظْلِمَهُمْ وَلَـٰكِن
كَانُوٓا۟ أَنفُسَهُمْ يَظْلِمُونَ ﴿٤٠﴾
مَثَلُ ٱلَّذِينَ ٱتَّخَذُوا۟ مِن دُونِ
ٱللَّهِ أَوْلِيَآءَ كَمَثَلِ ٱلْعَنكَبُوتِ
ٱتَّخَذَتْ بَيْتًا ۖ وَإِنَّ أَوْهَنَ ٱلْبُيُوتِ
لَبَيْتُ ٱلْعَنكَبُوتِ ۖ لَوْ كَانُوا۟
يَعْلَمُونَ ﴿٤١﴾

**39**. ఇక ఖారూన్,[1] ఫిర్'ఔన్ మరియు హామాన్‌లను[2] కూడా (మేము ఇదేవిధంగా నాశనం చేశాము)! వాస్తవానికి, మూసా వారి వద్దకు స్పష్టమైన సూచనలను తీసుకొని వచ్చాడు, కాని వారు భూమిలో అహంభావం చూపారు, కావున వారు (మా శిక్షనుండి) తప్పించుకోలేక పోయారు.

**40**. కావున ప్రతి ఒక్కరిని మేము అతని పాపానికి బదులుగా పట్టుకున్నాము. వారిలో కొందరిపైకి మేము తుఫాన్ గాలిని పంపాము.[3] మరి కొందరిని ఒక భయంకరమైన అరుపు (ప్రేలుడు) చిక్కించుకున్నది.[4] ఇంకా కొందరిని భూమిలోనికి అణగద్రొక్కాము,[5] ఇంకా ఇతరులను ముంచివేశాము.[6] మరియు అల్లాహ్ వారికెలాంటి అన్యాయం చేయలేదు, కాని వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు.

**41**. అల్లాహ్‌ను వదలి ఇతరులను సంరక్షకులుగా చేసుకున్న వారి ఉపమానాన్ని **సాలెపురుగు** నిర్మించే ఇంటితో పోల్చవచ్చు. నిశ్చయంగా, అన్నిటికంటే బలహీనమైన ఇల్లు సాలె పురుగు ఇల్లే! వారిది తెలుసుకుంటే ఎంతబాగుండేది![7]

---

**1**. ఖారూన్ గాథకు చూడండి, 28:76-82.
**2**. హామాన్ గాథకు చూడండి, 28:6.
**3**. తుఫాన్ గాలి 'ఆద్ జాతివారిపై వచ్చింది.
**4**. ఈ శిక్ష వచ్చిన వారు స'మూద్ జాతివారు.
**5**. ఇది ఖారూన్‌కు సంభవించిన శిక్ష.
**6**. ఇది ఫిర్'ఔన్ మరియు అతని సైనికులకు సంభవించిన శిక్ష.
**7**. ఏ విధంగానైతే సాలెపురుగు అల్లిన ఇల్లు బలహీనమైనదో! అదే విధంగా అల్లాహ్ (సు.తా.)ను వదలి ఇతరులను ఆరాధించే వారి ఆరాధన కూడా వ్యర్థమైనదే. ఎందుకంటే వారు (ఆ దేవతలు) తమను ఆరాధించే వారికి ఎలాంటి సహాయం చేయలేరు.

إِنَّ ٱللَّهَ يَعۡلَمُ مَا يَدۡعُونَ مِن دُونِهِۦ مِن شَيۡءٖۚ وَهُوَ ٱلۡعَزِيزُ ٱلۡحَكِيمُ ٤٢

**42**. వారు ఆయనను వదిలి దేనిని ప్రార్థిస్తున్నారో, అల్లాహ్ కు బాగా తెలుసు. మరియు ఆయన సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

وَتِلۡكَ ٱلۡأَمۡثَٰلُ نَضۡرِبُهَا لِلنَّاسِۖ وَمَا يَعۡقِلُهَآ إِلَّا ٱلۡعَٰلِمُونَ ٤٣

**43**. మరియు ఈ ఉదాహరణలను మేము ప్రజలకు (అర్థంచేసుకోవాలని) ఇస్తున్నాము. మరియు జ్ఞానం గలవారు తప్ప ఇతరులు వీటిని అర్థంచేసుకోలేరు.

خَلَقَ ٱللَّهُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ بِٱلۡحَقِّۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةٗ لِّلۡمُؤۡمِنِينَ ٤٤

**44**. అల్లాహ్ ఆకాశాలను మరియు భూమిని సత్యాధారంగా సృష్టించాడు. నిశ్చయంగా, విశ్వసించే వారికి ఇందులో సూచన ఉంది.

ٱتۡلُ مَآ أُوحِيَ إِلَيۡكَ مِنَ ٱلۡكِتَٰبِ وَأَقِمِ ٱلصَّلَوٰةَۖ إِنَّ ٱلصَّلَوٰةَ تَنۡهَىٰ عَنِ ٱلۡفَحۡشَآءِ وَٱلۡمُنكَرِۗ وَلَذِكۡرُ ٱللَّهِ أَكۡبَرُۗ وَٱللَّهُ يَعۡلَمُ مَا تَصۡنَعُونَ ٤٥

**45**. (ఓ ప్రవక్తా!) నీపై దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా అవతరింపజేయబడిన గ్రంథాన్ని చదివి వినిపించు మరియు నమా'జ్‌ను స్థాపించు. నిశ్చయంగా, నమా'జ్ అసహ్యకరమైన పనులనుండి మరియు అధర్మమైన పనులనుండి నిషేధిస్తుంది. మరియు అల్లాహ్ ధ్యానమే (అన్నిటికంటే) గొప్పది. మరియు మీరు చేసేదంతా అల్లాహ్ కు బాగా తెలుసు.

46. (*) మరియు నీవు గ్రంథప్రజలతో - దుర్మార్గాన్ని అవలంబించిన వారితో తప్ప - కేవలం ఉత్తమమైన రీతిలోనే వాదించు.[1] మరియు వారితో ఇలా అను: "మేము మా కొరకు అవతరింపజేయబడిన దానిని మరియు మీ కొరకు అవతరింప జేయబడిన దానిని విశ్వసించాము మరియు మా ఆరాధ్య దేవుడు మరియు మీ ఆరాధ్య దేవుడు ఒక్కడే (అల్లాహ్) మరియు మేము ఆయనకే విధేయు(ముస్లిం)లమై ఉన్నాము."

47. (ఓ ము'హమ్మద్!) ఈ విధంగా మేము నీపై ఈ గ్రంథాన్ని అవతరింపజేశాము. కావున మేము (ఇంతకు పూర్వం) గ్రంథాన్ని ఇచ్చినవారిలో కొందరు దీనిని విశ్వసిస్తారు.[2] మరియు ఇతర ప్రజలలో నుండి కూడా కొందరు దీనిని విశ్వసిస్తారు.[3] మరియు మా సూచనలను సత్యతిరస్కారులు తప్ప, మరెవ్వరూ తిరస్కరించరు.[4]

48. మరియు (ఓ ము'హమ్మద్!) ఇంతకు పూర్వం నీవు ఏ గ్రంథాన్ని కూడా చదువగలిగేవాడవు కావు మరియు దేనిని కూడా నీ కుడిచేతితో వ్రాయగలిగేవాడవూ కావు.[5] అలా జరిగివుంటే ఈ అసత్యవాదులు తప్పక అనుమానానికి గురిఅయి ఉండేవారు.

۞ وَلَا تُجَٰدِلُوٓاْ أَهۡلَ ٱلۡكِتَٰبِ إِلَّا بِٱلَّتِي هِيَ أَحۡسَنُ إِلَّا ٱلَّذِينَ ظَلَمُواْ مِنۡهُمۡۖ وَقُولُوٓاْ ءَامَنَّا بِٱلَّذِيٓ أُنزِلَ إِلَيۡنَا وَأُنزِلَ إِلَيۡكُمۡ وَإِلَٰهُنَا وَإِلَٰهُكُمۡ وَٰحِدٞ وَنَحۡنُ لَهُۥ مُسۡلِمُونَ ﴿٤٦﴾

وَكَذَٰلِكَ أَنزَلۡنَآ إِلَيۡكَ ٱلۡكِتَٰبَۚ فَٱلَّذِينَ ءَاتَيۡنَٰهُمُ ٱلۡكِتَٰبَ يُؤۡمِنُونَ بِهِۦۖ وَمِنۡ هَٰٓؤُلَآءِ مَن يُؤۡمِنُ بِهِۦۚ وَمَا يَجۡحَدُ بِـَٔايَٰتِنَآ إِلَّا ٱلۡكَٰفِرُونَ ﴿٤٧﴾

وَمَا كُنتَ تَتۡلُواْ مِن قَبۡلِهِۦ مِن كِتَٰبٖ وَلَا تَخُطُّهُۥ بِيَمِينِكَۖ إِذٗا لَّٱرۡتَابَ ٱلۡمُبۡطِلُونَ ﴿٤٨﴾

---

1. చూడండి, 16:125.
2. వీరు 'అబ్దుల్లాహ్ బిన్-సల్లాం మరియు ఇతరులు.
3. వీరు మక్కా ముష్రికులలో నుండి కొందరు.
4. జహాదున్: దీని అర్థానికి చూడండి, 31:32, 40:63 మరియు 41:28.
5. చూడండి, 7:157, 158.

بَلْ هُوَ ءَايَـٰتٌۢ بَيِّنَـٰتٌ فِى صُدُورِ ٱلَّذِينَ أُوتُوا۟ ٱلْعِلْمَ ۚ وَمَا يَجْحَدُ بِـَٔايَـٰتِنَآ إِلَّا ٱلظَّـٰلِمُونَ ﴿٤٩﴾

**49**. వాస్తవానికి ఇవి, స్పష్టమైన సూచనలు (ఖుర్ఆన్ ఆయత్‌లు), జ్ఞానమివ్వబడిన వారి హృదయాలలో (భద్రంగా) ఉంచబడ్డాయి. మరియు మా సూచన (ఆయత్)లను, దుర్మార్గులు తప్ప మరెవ్వరూ తిరస్కరించరు.

وَقَالُوا۟ لَوْلَآ أُنزِلَ عَلَيْهِ ءَايَـٰتٌ مِّن رَّبِّهِۦ ۖ قُلْ إِنَّمَا ٱلْـَٔايَـٰتُ عِندَ ٱللَّهِ وَإِنَّمَآ أَنَا۠ نَذِيرٌ مُّبِينٌ ﴿٥٠﴾

**50**. మరియు వారు ఇలా అంటారు: "ఇతని ప్రభువు తరఫు నుండి ఇతని మీద అద్భుత సంకేతాలు ఎందుకు అవతరింపజేయబడలేదు?" వారితో ఇలా అను: "నిశ్చయంగా, అద్భుత సంకేతాలన్నీ అల్లాహ్ దగ్గరనే ఉన్నాయి.[1] మరియు నేను కేవలం స్పష్టంగా హెచ్చరిక చేసేవాడను మాత్రమే!"

أَوَلَمْ يَكْفِهِمْ أَنَّآ أَنزَلْنَا عَلَيْكَ ٱلْكِتَـٰبَ يُتْلَىٰ عَلَيْهِمْ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَرَحْمَةً وَذِكْرَىٰ لِقَوْمٍ يُؤْمِنُونَ ﴿٥١﴾

**51**. ఏమీ? వాస్తవానికి మేము నీపై అవతరింపజేసిన ఈ గ్రంథం (ఖుర్ఆన్) వారికి వినిపించబడుతోంది కదా! ఇది వారికి చాలదా?[2] నిశ్చయంగా, ఇందులో విశ్వసించే ప్రజలకు కారుణ్యం మరియు హితబోధలున్నాయి.

قُلْ كَفَىٰ بِٱللَّهِ بَيْنِى وَبَيْنَكُمْ شَهِيدًا ۖ يَعْلَمُ مَا فِى ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضِ ۗ وَٱلَّذِينَ ءَامَنُوا۟ بِٱلْبَـٰطِلِ وَكَفَرُوا۟ بِٱللَّهِ أُو۟لَـٰٓئِكَ هُمُ ٱلْخَـٰسِرُونَ ﴿٥٢﴾

**52**. (ఓ ము'హమ్మద్!) వారితో ఇలా అను: "నాకూ మరియు మీకూ మధ్య సాక్షిగా అల్లాహ్‌యే చాలు! ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ ఉన్న సమస్తమూ ఆయనకు తెలుసు." మరియు ఎవరైతే, అసత్యాన్ని విశ్వసించి అల్లాహ్‌ను తిరస్కరిస్తారో, అలాంటి వారే నష్టపడే వారు.

---

**1**. చూడండి, 6:109.

**2**. ఖుర్ఆన్, అల్లాహ్ (సు.తా.) అద్భుత సంకేతాలలో ఒకటి. అందుకే ఖుర్ఆన్‌లో అల్లాహ్ (సు.తా.) దాని వంటి ఒక్క సూరహ్‌నైనా రచించి తెమ్మని సత్యతిరస్కారులతో సవాలు చేశాడు. కాని వారు ఈ నాటికీ దానిని పూర్తిచేయలేక పోయారు. ఇంతకంటే మంచి అద్భుతసంకేతం ఇంకేం కావాలి? విశ్వసించనివారు ఎన్ని అద్భుత సంకేతాలు చూసినా విశ్వసించరు. ఉదాహరణకు: ఫిర్'ఔన్ మరియు అతని జాతివారు.

53. మరియు వారు (అవిశ్వాసులు) శిక్షను త్వరగా తీసుకురమ్మని నిన్ను కోరుతున్నారు.[1] మరియు దానికై ఒక గడువు (అల్లాహ్ తరఫునుండి) నిర్ణయింపబడి ఉండకపోతే! ఆ శిక్ష వారిపై ఎప్పుడో వచ్చిపడి ఉండేది. మరియు నిశ్చయంగా, అది వారికి తెలియకుండానే అకస్మాత్తుగా వచ్చి వారిమీద పడనున్నది!

وَيَسْتَعْجِلُونَكَ بِٱلْعَذَابِ ۚ وَلَوْلَآ أَجَلٌ مُّسَمًّى لَّجَآءَهُمُ ٱلْعَذَابُ وَلَيَأْتِيَنَّهُم بَغْتَةً وَهُمْ لَا يَشْعُرُونَ ٥٣

54. వారు (అవిశ్వాసులు) శిక్షను త్వరగా తీసుకురమ్మని నిన్ను కోరుతున్నారు. మరియు నిశ్చయంగా, నరకాగ్ని సత్యతిరస్కారులను చుట్టుముట్టనున్నది.

يَسْتَعْجِلُونَكَ بِٱلْعَذَابِ وَإِنَّ جَهَنَّمَ لَمُحِيطَةٌۢ بِٱلْكَـٰفِرِينَ ٥٤

55. ఆ రోజు, శిక్ష వారి పైనుండి మరియు వారి పాదాల క్రిందినుండి వారిని క్రమ్ముకున్నప్పుడు, వారితో ఇలా అనబడుతుంది: "మీరు చేస్తూ ఉండిన కర్మల ఫలితాన్ని చవిచూడండి."

يَوْمَ يَغْشَىٰهُمُ ٱلْعَذَابُ مِن فَوْقِهِمْ وَمِن تَحْتِ أَرْجُلِهِمْ وَيَقُولُ ذُوقُوا۟ مَا كُنتُمْ تَعْمَلُونَ ٥٥

56. ఓ విశ్వసించిన నా దాసులారా! నిశ్చయంగా, నా భూమి ఎంతో విశాలమైనది; కావున మీరు కేవలం నన్నే ఆరాధించండి.[2]

يَـٰعِبَادِىَ ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِنَّ أَرْضِى وَٰسِعَةٌ فَإِيَّـٰىَ فَٱعْبُدُونِ ٥٦

57. ప్రతి ప్రాణి చావును చవిచూస్తుంది. ఆ తరువాత మీరందరూ మా వైపునకే మరలింపబడతారు.

كُلُّ نَفْسٍ ذَآئِقَةُ ٱلْمَوْتِ ۖ ثُمَّ إِلَيْنَا تُرْجَعُونَ ٥٧

1. చూడండి, 8:32.
2. ఏ స్థలంలోనైతే అల్లాహ్ (సు.తా.)ను ఆరాధించడం కష్టమయిపోతుందో మరియు ఇస్లాం ధర్మం మీద నిలువడం దుర్భరమవుతుందో అలాంటి చోటునుండి ప్రస్థానం (హిజ్రత్) చేయటానికి అనుమతి ఇవ్వబడింది. ఉదాహరణకు మొట్టమొదటి ముస్లింలు 'హబషాకు, ప్రస్థానం చేశారు, దాని తరువాత మదీనాకు.

وَٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ لَنُبَوِّئَنَّهُم مِّنَ ٱلْجَنَّةِ غُرَفًا تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَا ۚ نِعْمَ أَجْرُ ٱلْعَٰمِلِينَ ﴿٥٨﴾

**58**. ఇక ఎవరైతే విశ్వసించి, సత్కార్యాలు చేస్తారో! వారికి మేము స్వర్గంలో గొప్ప భవనాలలో స్థిరనివాసం ఇస్తాము. దాని క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి. అక్కడ వారు శాశ్వతంగా ఉంటారు. సత్కార్యాలు చేసిన వారి ప్రతిఫలం ఎంత శ్రేష్ఠమైనది!

ٱلَّذِينَ صَبَرُواْ وَعَلَىٰ رَبِّهِمْ يَتَوَكَّلُونَ ﴿٥٩﴾

**59**. (వారికే) ఎవరైతే సహనం వహించి తమ ప్రభువునే నమ్ముకొని ఉంటారో!

وَكَأَيِّن مِّن دَآبَّةٍ لَّا تَحْمِلُ رِزْقَهَا ٱللَّهُ يَرْزُقُهَا وَإِيَّاكُمْ ۚ وَهُوَ ٱلسَّمِيعُ ٱلْعَلِيمُ ﴿٦٠﴾

**60**. మరియు (ప్రపంచంలో) ఎన్నో ప్రాణులున్నాయి. అవి తమ జీవనోపాధిని తాము సాధించలేవు! అల్లాహ్‌యే వాటికీ మరియు మీకు కూడా జీవనోపాధిని సమకూర్చుతున్నాడు. మరియు ఆయనే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

وَلَئِن سَأَلْتَهُم مَّنْ خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ وَسَخَّرَ ٱلشَّمْسَ وَٱلْقَمَرَ لَيَقُولُنَّ ٱللَّهُ ۖ فَأَنَّىٰ يُؤْفَكُونَ ﴿٦١﴾

**61**. మరియు ఒకవేళ నీవు వారితో: "ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించి, సూర్యచంద్రులను ఉపయుక్తంగా చేసింది ఎవరు?" అని అడిగితే, వారు తప్పక: "అల్లాహ్!" అని అంటారు. అయినా వారు ఎందుకు మోసగింప (సత్యంనుండి మరలింప) బడుతున్నారు?

ٱللَّهُ يَبْسُطُ ٱلرِّزْقَ لِمَن يَشَآءُ مِنْ عِبَادِهِۦ وَيَقْدِرُ لَهُۥٓ ۚ إِنَّ ٱللَّهَ بِكُلِّ شَىْءٍ عَلِيمٌ ﴿٦٢﴾

**62**. అల్లాహ్ తన దాసులలో, తానుకోరిన వారికి జీవనోపాధిని పుష్కలంగా ప్రసాదిస్తాడు మరియు తాను కోరిన వారికి దానిని మితంగా ఇస్తాడు. నిశ్చయంగా అల్లాహ్‌కు ప్రతిదానిని గురించి బాగా తెలుసు.[1]

---

**1**. అల్లాహ్(సు.తా.) ఇహలోకంలో ప్రసాదించే ధనసంపత్తులకు విశ్వాసంతో, సత్కార్యాలతో సంబంధంలేదు. అల్లాహ్(సు.తా.) ధనసంపత్తులు, హోదాలు ఇచ్చేది లేక పేదవారిగాఉంచేది కూడా మానవులను పరీక్షించడానికే. ఇహలోకజీవితం అతి స్వల్పమైనది. కానీ శాశ్వతమైన

وَلَئِن سَأَلْتَهُم مَّن نَّزَّلَ مِنَ ٱلسَّمَآءِ مَآءً فَأَحْيَا بِهِ ٱلْأَرْضَ مِنۢ بَعْدِ مَوْتِهَا لَيَقُولُنَّ ٱللَّهُ ۚ قُلِ ٱلْحَمْدُ لِلَّهِ ۚ بَلْ أَكْثَرُهُمْ لَا يَعْقِلُونَ ﴿٦٣﴾

63. మరియు ఒకవేళ నీవు వారితో: "ఆకాశం నుండి నీటిని కురిపించి, దాని నుండి నిర్జీవంగా ఉన్న భూమికి జీవితాన్ని ఇచ్చింది ఎవరు?" అని అడిగితే వారు తప్పకుండా: "అల్లాహ్!" అని అంటారు. నీవు ఇలా అను: "సర్వస్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే!" కాని చాలా మంది అర్థం చేసుకోలేరు.[1]

وَمَا هَٰذِهِ ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَآ إِلَّا لَهْوٌ وَلَعِبٌ ۚ وَإِنَّ ٱلدَّارَ ٱلْـَٔاخِرَةَ لَهِىَ ٱلْحَيَوَانُ ۚ لَوْ كَانُوا۟ يَعْلَمُونَ ﴿٦٤﴾

64. మరియు ఈ ప్రాపంచిక జీవితం కేవలం వినోద కాలక్షేపం మరియు క్రీడ మాత్రమే. మరియు అసలు పరలోక గృహ జీవితమే వాస్తవమైన జీవితం. ఇది వారు తెలుసుకుంటే ఎంత బాగుండేది!

فَإِذَا رَكِبُوا۟ فِى ٱلْفُلْكِ دَعَوُا۟ ٱللَّهَ مُخْلِصِينَ لَهُ ٱلدِّينَ فَلَمَّا نَجَّىٰهُمْ إِلَى ٱلْبَرِّ إِذَا هُمْ يُشْرِكُونَ ﴿٦٥﴾

65. వారు నావలోకి ఎక్కినప్పుడు తమ భక్తిని కేవలం అల్లాహ్‌కు మాత్రమే ప్రత్యేకించుకొని, ఆయననే ప్రార్థిస్తారు; కాని ఆయన వారిని రక్షించి నేలమీదకు తీసుకురాగానే ఆయనకు సాటి కల్పించసాగుతారు.[2]

---

పరలోకజీవితంలో కేవలం విశ్వాసులై సత్కార్యాలు చేసి అల్లాహ్ (సు.తా.) అనుమతితో స్వర్గం పొందినవారికే ఎడతెగని శాశ్వత సుఖసంతోషాలు ఉంటాయి.

1. దీనిని అర్థం చేసుకోవటానికి వారు తమ తెలివిని ఉపయోగించరు. కావున వారు విగ్రహాలను, జిన్నాతులను, చచ్చిన వారిని, పుణ్యపురుషులను, దేవదూతలను మొదలైన వాటిని తమ ఆరాధ్య దైవాలుగా చేసుకుంటారు.

2. ఇక్రిమ (ర'ది.'అ.) మక్కా విజయం సమయంలో మక్కా విడిచి పారిపోతాడు. అతడు ఒక నావలోఎక్కి పోతూఉండగా అది ప్రమాదంలో చిక్కుకుంటుంది. దానిలో ఉన్నవారు పరస్పరం ఇలా చెప్పుకుంటారు: "అల్లాహ్(సు.తా.)ను వేడుకోండి. ఆయన తప్ప మమ్మల్ని మరెవ్వరూ కాపాడలేరు." అప్పుడు అతడు ఆలోచిస్తాడు: "సముద్రంలో అల్లాహ్ (సు.తా.) తప్ప మరొకరు కాపాడలేకుంటే నేలపై కూడా ఇతరులెవ్వరూ కాపాడలేరు. ఒకవేళ తాను ఇక్కడనుండి బ్రతికి బయటపడితే దైవప్రవక్త ('స'అస) సన్నిధిలోకి పోయి ఇస్లాం స్వీకరిస్తాను." అని అనుకుంటాడు. అదేవిధంగా జరుగుతుంది. అతడు (ర'ది.'అ.) ఇస్లాం స్వీకరించి ఇస్లాం ప్రచారంలో చాలా పాటుపడ్డాడు. (ఇబ్నె-కసీ'ర్).

**66**. ఈ విధంగా మేము వారికి ప్రసాదించిన వాటికి కృతఘ్నులై (ప్రాపంచిక) భోగభాగ్యాలలో మునిగివున్న (దాని ఫలితం), వారు మున్ముందు తెలుసుకుంటారు.

لِيَكۡفُرُواْ بِمَآ ءَاتَيۡنَٰهُمۡ
وَلِيَتَمَتَّعُواْۚ فَسَوۡفَ يَعۡلَمُونَ ٦٦

**67**. ఏమీ? వారికి తెలియదా? నిశ్చయంగా మేము 'హరమ్‌ను (మక్కాను) ఒక శాంతినిలయంగా నెలకొల్పామని![1] మరియు వారి చుట్టుప్రక్కల ఉన్న ప్రజలు వారినుండి లాక్కోబడుతున్నారని? అయినా వారు అసత్యాన్ని నమ్మి, అల్లాహ్ అనుగ్రహాన్ని తిరస్కరిస్తారా?

أَوَلَمۡ يَرَوۡاْ أَنَّا جَعَلۡنَا حَرَمًا
ءَامِنًا وَيُتَخَطَّفُ ٱلنَّاسُ مِنۡ
حَوۡلِهِمۡۚ أَفَبِٱلۡبَٰطِلِ يُؤۡمِنُونَ
وَبِنِعۡمَةِ ٱللَّهِ يَكۡفُرُونَ ٦٧

**68**. మరియు అల్లాహ్ మీద అబద్ధాలు కల్పించే వానికంటే, లేక తనవద్దకు సత్యం వచ్చినపుడు దానిని అబద్ధమని తిరస్కరించే వానికంటే, ఎక్కువ దుర్మార్గుడు ఎవడు? ఏమీ? ఇలాంటి సత్యతిరస్కారులకు నరకమే నివాసస్థలం కాదా?

وَمَنۡ أَظۡلَمُ مِمَّنِ ٱفۡتَرَىٰ عَلَى ٱللَّهِ
كَذِبًا أَوۡ كَذَّبَ بِٱلۡحَقِّ لَمَّا
جَآءَهُۥٓۚ أَلَيۡسَ فِي جَهَنَّمَ مَثۡوًى
لِّلۡكَٰفِرِينَ ٦٨

**69**. మరియు ఎవరైతే మా కొరకు హృదయపూర్వకంగా పాటుపడతారో, వారికి మేము మా మార్గాల వైపునకు మార్గదర్శకత్వం చేస్తాము. మరియు నిశ్చయంగా, అల్లాహ్ సజ్జనులకు తోడుగా ఉంటాడు. (1/8)

وَٱلَّذِينَ جَٰهَدُواْ فِينَا لَنَهۡدِيَنَّهُمۡ
سُبُلَنَاۚ وَإِنَّ ٱللَّهَ لَمَعَ ٱلۡمُحۡسِنِينَ
٦٩

*****

1. చూడండి, 28:57.

## 30. సూరహ్ అర్ రూమ్

## سُورَةُ الرُّومِ

అర్-రూమ్: బైజాంతీన్ (Eastern Roman Empire / The Byzantine / Constantinople) అంటే రోమన్ సామ్రాజ్యం. వీరు గ్రంథ ప్రజలు (క్రైస్తవులు). పర్షియన్‌లు అగ్ని పూజారులు. ఆ కాలంలో ఈ రెండే పెద్ద సామ్రాజ్యాలు ఉండేవి. ఈ సూరహ్ మధ్య మక్కా కాలంలో, ప్రస్థానం (హిజ్రత్) కంటే 6-7 సంవత్సరాలకు ముందు (క్రీ.శ. 615-616)లలో అవతరింపజేయబడింది. ఇందులో **60 ఆయతులు** ఉన్నాయి. ఇలాంటి నాలుగు సూరాహ్‌ల వరుసలో ఇది రెండవది. (29-32) ఈ నాలుగు సూరాహ్‌లు, అలీఫ్-లామ్-మీమ్ అక్షరాలతో ప్రారంభమవుతున్నాయి. క్రైస్తవ రాజులైన రోమన్‌లు, పర్షియన్‌లకు జేరూసలం మరియు ఇతర భాగాలు కోల్పోతారు. పర్షియన్‌లంటే ఇష్టపడే మక్కా ముష్రికులు దీనికి సంతోషపడి దైవప్రవక్త(స'అస)ను మరియు అతని తోటి ముస్లింలను ఎగతాళిచేస్తారు. అప్పుడు ఈ సూరహ్ అవతరింపజేయబడుతుంది. అల్లాహ్ (సు.తా.) వాగ్దానం ప్రకారం 7 సంవత్సారాలలోనే రోమన్‌లు తిరిగి జేరూసలంను తీసుకుంటారు. రోమన్ చక్రవర్తి హెరాకల్ (Heraclius) పర్షియన్‌లను ఓడించి వారిని ఏసియామైనర్ నుండి పారద్రోలుతాడు. చివరకు క్రీ. శకం 626లో పర్షియన్ సామ్రాజ్యం పూర్తిగా నిర్మూలించబడుతుంది. రోమన్‌ల ఈ విజయం ఖుర్ఆన్‌లో చెప్పబడిన దాన్ని సత్యపరుస్తుంది.

బِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

الٓمٓ ﴿١﴾

1. * అలిఫ్-లామ్-మీమ్.

غُلِبَتِ ٱلرُّومُ ﴿٢﴾

2. రోమన్‌లు పరాజితులయ్యారు;

فِيٓ أَدْنَى ٱلْأَرْضِ وَهُم مِّنۢ بَعْدِ غَلَبِهِمْ سَيَغْلِبُونَ ﴿٣﴾

3. తమ పొరుగు భూభాగంలోనే! మరియు వారు తమ ఈ పరాజయం తరువాత, తిరిగి విజేతలు కాగలరు[1] -

فِي بِضْعِ سِنِينَۗ لِلَّهِ ٱلْأَمْرُ مِن قَبْلُ وَمِنۢ بَعْدُۚ وَيَوْمَئِذٖ يَفْرَحُ ٱلْمُؤْمِنُونَ ﴿٤﴾

4. (రాబోయే) కొన్ని[2] సంవత్సరాలలోనే. మొదటనయినా, తరువాతనయినా నిర్ణయాధికారం కేవలం అల్లాహ్‌దే మరియు ఆరోజు విశ్వాసులు సంతోషపడతారు;

1. పొరుగు నేల అంటే షామ్ మరియు ఫలస్తీన్.
2. బి'ద్ఇన్: అంటే, 3 నుండి 10 అని అర్థం.

5. అల్లాహ్ ప్రసాదించిన సహాయానికి.[1] ఆయన తనకు ఇష్టమైన వారికి సహాయం చేస్తాడు. మరియు ఆయనే సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

6. మరియు (ఇది) అల్లాహ్ చేసిన వాగ్దానం అల్లాహ్ తన వాగ్దానాన్ని భంగపరచడు, కానీ వాస్తవానికి చాలామందికి ఇది తెలియదు.[2]

7. వారికి ఇహలోక జీవితపు బాహ్యారూపం మాత్రమే తెలుసు మరియు వారు పరలోకాన్ని గురించి ఏమరుపాటులో పడిఉన్నారు.

8. ఏమీ? వారు తమలోతాము (ఎన్నడూ) ఆలోచించలేదా? ఆకాశాలనూ, భూమినీ మరియు వాటిమధ్య ఉన్నదంతా, అల్లాహ్ సత్యంతో ఒక నిర్ణీతగడువు కొరకు మాత్రమే సృష్టించాడని? అయినా నిశ్చయంగా ప్రజలలో చాలా మంది తమ ప్రభువును దర్శించవలసివున్న వాస్తవాన్ని తిరస్కరిస్తున్నారు.

9. ఏమీ? వీరు భూమిపై ప్రయాణం చేయలేదా? వీరి పూర్వీకుల గతి ఏమయిందో చూడటానికి? వారు, వీరికంటే ఎక్కువ బలవంతులుగా ఉండేవారు మరియు వారు భూమిని బాగా దున్నే వారు, సేద్యం చేసే వారు

بِنَصۡرِ ٱللَّهِۚ يَنصُرُ مَن يَشَآءُۖ
وَهُوَ ٱلۡعَزِيزُ ٱلرَّحِيمُ ٥

وَعۡدَ ٱللَّهِۖ لَا يُخۡلِفُ ٱللَّهُ وَعۡدَهُۥ وَلَٰكِنَّ
أَكۡثَرَ ٱلنَّاسِ لَا يَعۡلَمُونَ ٦

يَعۡلَمُونَ ظَٰهِرٗا مِّنَ ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَا
وَهُمۡ عَنِ ٱلۡأٓخِرَةِ هُمۡ غَٰفِلُونَ ٧

أَوَلَمۡ يَتَفَكَّرُواْ فِيٓ أَنفُسِهِمۗ مَّا خَلَقَ
ٱللَّهُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ وَمَا بَيۡنَهُمَآ
إِلَّا بِٱلۡحَقِّ وَأَجَلٖ مُّسَمّٗىۗ وَإِنَّ
كَثِيرٗا مِّنَ ٱلنَّاسِ بِلِقَآيِٕ رَبِّهِمۡ
لَكَٰفِرُونَ ٨

أَوَلَمۡ يَسِيرُواْ فِي ٱلۡأَرۡضِ فَيَنظُرُواْ
كَيۡفَ كَانَ عَٰقِبَةُ ٱلَّذِينَ مِن
قَبۡلِهِمۡۚ كَانُوٓاْ أَشَدَّ مِنۡهُمۡ قُوَّةٗ

1. ఇది దాదాపు ఎనిమిది సంవత్సరాల తరువాత 2 హిజ్రీలో (622 క్రీస్తు శకంలో) కాబోయే బద్ర్ యుద్ధం గురించి చెప్పుతోంది.
2. ఇది రోమన్‌లు తిరిగి విజేతలౌతారన్న వాగ్దానం. అది పూర్తిఅయింది.

మరియు దానిపై, వీరి కట్టడాల కంటే ఎక్కువ కట్టడాలు కట్టారు[1] మరియు వారి వద్దకు వారి సందేశహరులు, స్పష్టమైన సూచనలు తీసుకొని వచ్చారు. అల్లాహ్ వారికెలాంటి అన్యాయం చేయలేదు, కాని వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు.

**10**. చివరకు చెడు కార్యాలు చేసిన వారి ముగింపు చెడుగానే జరిగింది. ఎందుకంటే, వారు అల్లాహ్ సూచనలను అబద్ధాలని నిరాకరించేవారు వాటిని గురించి ఎగతాళి చేసేవారు.

**11**. అల్లాహ్‌యే సృష్టిని ప్రారంభిస్తాడు, తరువాత దానిని తిరిగి ఉనికిలోకి (పూర్వస్థితిలోకి) తెస్తాడు, ఆ తరువాత మీరంతా ఆయన వైపునకే మరలింపబడతారు.

**12**. మరియు ఆ ఘడియ (పునరుత్థానం) ఆసన్నమైన రోజు, అపరాధులందరూ నిరాశచెందుతారు.

**13**. మరియు వారు అల్లాహ్‌కు భాగస్వాములుగా కల్పించిన వారెవ్వరూ వారి సిఫారసు చేయజాలరు మరియు వారు కల్పించుకున్న తమ భాగస్వాములను తిరస్కరిస్తారు.

**14**. మరియు ఆ ఘడియ (పునరుత్థానం) ఆసన్నమైన రోజు - ఆ రోజు వారు (ప్రజలు) - వేర్వేరు వర్గాలలో విభజింపబడతారు.

وَأَثَارُوا۟ ٱلْأَرْضَ وَعَمَرُوهَآ أَكْثَرَ
مِمَّا عَمَرُوهَا وَجَآءَتْهُمْ رُسُلُهُم
بِٱلْبَيِّنَٰتِ ۖ فَمَا كَانَ ٱللَّهُ
لِيَظْلِمَهُمْ وَلَٰكِن كَانُوٓا۟ أَنفُسَهُمْ
يَظْلِمُونَ ٩
ثُمَّ كَانَ عَٰقِبَةَ ٱلَّذِينَ أَسَٰٓـُٔوا۟
ٱلسُّوٓأَىٰٓ أَن كَذَّبُوا۟ بِـَٔايَٰتِ ٱللَّهِ
وَكَانُوا۟ بِهَا يَسْتَهْزِءُونَ ١٠
ٱللَّهُ يَبْدَؤُا۟ ٱلْخَلْقَ ثُمَّ يُعِيدُهُۥ ثُمَّ
إِلَيْهِ تُرْجَعُونَ ١١
وَيَوْمَ تَقُومُ ٱلسَّاعَةُ يُبْلِسُ
ٱلْمُجْرِمُونَ ١٢
وَلَمْ يَكُن لَّهُم مِّن شُرَكَآئِهِمْ
شُفَعَٰٓؤُا۟ وَكَانُوا۟ بِشُرَكَآئِهِمْ
كَٰفِرِينَ ١٣
وَيَوْمَ تَقُومُ ٱلسَّاعَةُ يَوْمَئِذٍ
يَتَفَرَّقُونَ ١٤

---

1. వంకర అక్షరాలలో ఉన్నవాక్యం నోబుల్ ఖుర్ఆన్‌లో ఈ విధంగా వ్యాఖ్యానించబడింది: ''వారు దానిని వీరికంటే ఎక్కువ సంఖ్యలో వసింపజేశారు.''

15. అప్పుడు ఎవరైతే, విశ్వసించి, సత్కార్యాలు చేసి ఉంటారో, వారు ఉద్యానవనంలో ఆనందంగా ఉంచబడతారు.

فَأَمَّا ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ فَهُمْ فِي رَوْضَةٖ يُحْبَرُونَ ﴿١٥﴾

16. మరియు ఎవరైతే సత్యతిరస్కారులై మా సూచనలను మరియు పరలోక సమావేశాన్ని తిరస్కరించారో, అలాంటి వారు శిక్షకొరకు హాజరు చేయబడతారు.[1]

وَأَمَّا ٱلَّذِينَ كَفَرُواْ وَكَذَّبُواْ بِـَٔايَٰتِنَا وَلِقَآيِٕ ٱلْأٓخِرَةِ فَأُوْلَٰٓئِكَ فِي ٱلْعَذَابِ مُحْضَرُونَ ﴿١٦﴾

17. కావున, మీరు సాయంత్రము వేళ మరియు ఉదయం పూట అల్లాహ్ పవిత్రతను కొనియాడండి.

فَسُبْحَٰنَ ٱللَّهِ حِينَ تُمْسُونَ وَحِينَ تُصْبِحُونَ ﴿١٧﴾

18. మరియు ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ సర్వస్తోత్రాలు ఆయన(అల్లాహ్)కే మరియు సంధ్యా కాలంలోనూ మరియు మధ్యాహ్న కాలంలోనూ (స్తోత్రాలు ఆయనకే)![2]

وَلَهُ ٱلْحَمْدُ فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَعَشِيّٗا وَحِينَ تُظْهِرُونَ ﴿١٨﴾

19. ఆయన సజీవిని నిర్జీవినుండి తీస్తాడు మరియు నిర్జీవిని సజీవినుండి తీస్తాడు మరియు ఆయన భూమి మృతిచెందిన తరువాత దానికి ప్రాణం పోస్తాడు. ఇదేవిధంగా మీరుకూడా (గోరీల నుండి) వెలికితీయబడతారు.

يُخْرِجُ ٱلْحَيَّ مِنَ ٱلْمَيِّتِ وَيُخْرِجُ ٱلْمَيِّتَ مِنَ ٱلْحَيِّ وَيُحْيِ ٱلْأَرْضَ بَعْدَ مَوْتِهَاۚ وَكَذَٰلِكَ تُخْرَجُونَ ﴿١٩﴾

---

1. చూడండి, 7:147.

2. ఈ రెండు ఆయతులలో ప్రతి దినపు ఐదు నమా'జుల ప్రస్తావన ఉంది. తుమ్సూన అంటే మ'గ్రిబ్ మరియు ఇషా నమా'జులు. తు'స్బి'హూన అంటే ఫ'జ్ర్ నమా'జు. మరియు 'అషియ్యాన్ - 'అ'స్ర్ నమా'జు, తు''జ్'హిరూన్ - ''జుహ్ర్ నమా'జు అని అర్థం (ఫ'త్'హ్ అల్-ఖదీర్). ఇంకా చూడండి, 11:114, 17:78 మరియు 20:130.

20. మరియు ఆయన సూచనలలో ఒకటి మిమ్మల్ని మట్టి నుండి సృష్టించడం.[1] ఆ తరువాత మీరు మానవులుగా (భూమిలో) వ్యాపిస్తున్నారు!

وَمِنْ ءَايَـٰتِهِۦٓ أَنْ خَلَقَكُم مِّن تُرَابٍ ثُمَّ إِذَآ أَنتُم بَشَرٌ تَنتَشِرُونَ ﴿٢٠﴾

21. మరియు ఆయన సూచనలలో: ఆయన మీ కొరకు మీ జాతి నుండియే - మీరు వారివద్ద సౌఖ్యం పొందటానికి - మీ సహవాసు(అజ్వాజ్)లను పుట్టించి, మీ మధ్య ప్రేమను మరియు కారుణ్యాన్ని కలిగించడం. నిశ్చయంగా, ఇందులో ఆలోచించే వారికి ఎన్నో సూచనలున్నాయి.

وَمِنْ ءَايَـٰتِهِۦٓ أَنْ خَلَقَ لَكُم مِّنْ أَنفُسِكُمْ أَزْوَٰجًا لِّتَسْكُنُوٓا۟ إِلَيْهَا وَجَعَلَ بَيْنَكُم مَّوَدَّةً وَرَحْمَةً ۚ إِنَّ فِى ذَٰلِكَ لَـَٔايَـٰتٍ لِّقَوْمٍ يَتَفَكَّرُونَ ﴿٢١﴾

22. మరియు ఆయన సూచనలలో ఆయన ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించడం మరియు మీ భాషలలో మరియు మీ రంగులలో ఉన్న విభేదాలు కూడా ఉన్నాయి. నిశ్చయంగా, ఇందులో జ్ఞానులకు ఎన్నో సూచనలున్నాయి.

وَمِنْ ءَايَـٰتِهِۦ خَلْقُ ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضِ وَٱخْتِلَـٰفُ أَلْسِنَتِكُمْ وَأَلْوَٰنِكُمْ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَـَٔايَـٰتٍ لِّلْعَـٰلِمِينَ ﴿٢٢﴾

23. మరియు ఆయన సూచనలలో, మీరు రాత్రిపూట మరియు పగటిపూట, నిద్ర పోవడం మరియు మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించడం కూడా ఉన్నాయి. నిశ్చయంగా, ఇందులో శ్రద్ధతో వినేవారికి ఎన్నో సూచనలున్నాయి.

وَمِنْ ءَايَـٰتِهِۦ مَنَامُكُم بِٱلَّيْلِ وَٱلنَّهَارِ وَٱبْتِغَآؤُكُم مِّن فَضْلِهِۦٓ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَـَٔايَـٰتٍ لِّقَوْمٍ يَسْمَعُونَ ﴿٢٣﴾

1. చూడండి, 3:59, 23:12 మరియు ఇతరచోట్లలో కూడా.

24. మరియు ఆయన సూచనలలో, ఆయన మీకు మెరుపును చూపించి, భయాన్ని మరియు ఆశను కలుగజేయడం;[1] మరియు ఆకాశం నుండి నీటిని కురిపించి దానితో నిర్జీవి అయిన భూమికి ప్రాణం పోయడం కూడా ఉన్నాయి. నిశ్చయంగా ఇందులో బుద్ధిమంతులకు ఎన్నో సూచనలు ఉన్నాయి.

25. మరియు ఆయన సూచనలలో, ఆయన ఆజ్ఞతో భూమ్యాకాశాలు నిలకడ కలిగి ఉండటం.[2] ఆ తరువాత ఆయన మిమ్మల్ని ఒక్క పిలుపు పిలువగానే మీరంతా భూమినుండి లేచి ఒకేసారి బయటికి రావటం కూడా ఉన్నాయి.

26. మరియు ఆకాశాలలో మరియు భూమిలో ఉన్న సమస్తమూ ఆయనదే. అన్నీ ఆయనకే ఆజ్ఞావర్తనులై ఉంటాయి.

27. మరియు ఆయనే సృష్టిని ఆరంభించిన వాడు; ఆ తరువాత దానిని తిరిగి ఉనికిలోకి తెచ్చేవాడు.[3] ఇది ఆయనకు ఎంతో సులభమైనది. భూమ్యాకాశాలలో ఆయన సామ్యమే సర్వోన్నతమైనది.[4] ఆయనే సర్వశక్తిమంతుడు, మహా వివేచనాపరుడు.

وَمِنۡ ءَايَٰتِهِۦ يُرِيكُمُ ٱلۡبَرۡقَ
خَوۡفٗا وَطَمَعٗا وَيُنَزِّلُ مِنَ ٱلسَّمَآءِ
مَآءٗ فَيُحۡيِۦ بِهِ ٱلۡأَرۡضَ بَعۡدَ
مَوۡتِهَآۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَٰتٖ
لِّقَوۡمٖ يَعۡقِلُونَ ٢٤

وَمِنۡ ءَايَٰتِهِۦٓ أَن تَقُومَ ٱلسَّمَآءُ
وَٱلۡأَرۡضُ بِأَمۡرِهِۦۚ ثُمَّ إِذَا دَعَاكُمۡ
دَعۡوَةٗ مِّنَ ٱلۡأَرۡضِ إِذَآ أَنتُمۡ تَخۡرُجُونَ
٢٥

وَلَهُۥ مَن فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۖ
كُلّٞ لَّهُۥ قَٰنِتُونَ ٢٦

وَهُوَ ٱلَّذِي يَبۡدَؤُاْ ٱلۡخَلۡقَ ثُمَّ
يُعِيدُهُۥ وَهُوَ أَهۡوَنُ عَلَيۡهِۚ وَلَهُ
ٱلۡمَثَلُ ٱلۡأَعۡلَىٰ فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۚ
وَهُوَ ٱلۡعَزِيزُ ٱلۡحَكِيمُ ٢٧

1. వర్షం కురువవచ్చునే ఆశ. చూడండి, 13:12.
2. చూడండి, 13:2.
3. చూడండి, 10:4.
4. చూడండి, 42:11.

ضَرَبَ لَكُم مَّثَلًا مِّنْ أَنفُسِكُمْ ۖ هَل لَّكُم مِّن مَّا مَلَكَتْ أَيْمَٰنُكُم مِّن شُرَكَآءَ فِى مَا رَزَقْنَٰكُمْ فَأَنتُمْ فِيهِ سَوَآءٌ تَخَافُونَهُمْ كَخِيفَتِكُمْ أَنفُسَكُمْ ۚ كَذَٰلِكَ نُفَصِّلُ ٱلْءَايَٰتِ لِقَوْمٍ يَعْقِلُونَ ﴿٢٨﴾

28. ఆయన, స్వయంగా మీకే చెందిన ఒక ఉపమానాన్ని మీకు తెలుపుతున్నాడు. ఏమీ? మేము మీకు జీవనోపాధిగా సమకూర్చిన దానిలో మీ బానిసలు మీతోపాటు సరిసమానులుగా, భాగస్వాములు కాగలరా? మీరు పరస్పరం ఒకరిపట్ల నొకరు భీతికలిగి ఉన్నట్లు వారిపట్ల కూడా భీతి కలిగి ఉంటారా? ఈ విధంగా మేము బుద్ధిమంతులకు మా సూచనలను వివరిస్తూ ఉంటాము.[1]

بَلِ ٱتَّبَعَ ٱلَّذِينَ ظَلَمُوٓا۟ أَهْوَآءَهُم بِغَيْرِ عِلْمٍ ۖ فَمَن يَهْدِى مَنْ أَضَلَّ ٱللَّهُ ۖ وَمَا لَهُم مِّن نَّٰصِرِينَ ﴿٢٩﴾

29. కాని దుర్మార్గులైనటువంటి వారు, తెలివిలేనిదే, తమ కోరికలను అనుసరిస్తారు. అల్లాహ్ మార్గభ్రష్టత్వంలో వదిలిన వ్యక్తికి మార్గదర్శకత్వం ఎవడు చేయగలడు?[2] మరియు వారికి సహాయపడే వారు ఎవ్వరూ ఉండరు.

---

1. చూడండి, 16:75-76. ఇటువంటి సామెతలకు. మానవులు, తమతోటి మానవులైన బానిసలను తమతో పాటు సమానులుగా స్వీకరించలేరు. అయితే అల్లాహ్ (సు.తా.) సర్వసృష్టికర్త తాను సృష్టించిన దానిని తనకు సమానంగా ఏ విధంగా స్వీకరించగలడు. ఆయన(సు.తా.)ను వదలి, ఆయన పుట్టించిన వాటిని ఆరాధించటం ఎలా క్షమించగలడు. అందుకే ఆయన ఖుర్ఆన్‌లో వ్యక్తం చేశాడు. షిర్క్ (అల్లాహ్‌కు సాటికల్పించడం) అల్లాహ్ (సు.తా.) ఎన్నటికీ క్షమించడు.
2. ఎందుకంటే అల్లాహ్ (సు.తా.) తరఫునుండి వారికే మార్గదర్శకత్వం లభిస్తుంది, ఎవరైతే మార్గదర్శకత్వాన్ని అపేక్షిస్తారో! ఇక ఎవరైతే హృదయపూర్వకంగా అల్లాహ్ (సు.తా.) మార్గదర్శకత్వాన్ని అపేక్షించరో ఆయన వారిని మార్గభ్రష్టత్వంలో వదలుతాడు. ఇదే సున్నతుల్లాహ్ - అల్లాహ్ (సు.తా.) సంప్రదాయం. ఈ విషయం ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు విశదీకరించబడింది. అల్లాహ్ (సు.తా.) మానవులకు మరియు జిన్నాతులకు మంచి చెడుల మధ్య విచక్షణా జ్ఞానాన్నొసంగి; విశ్వసించి, మంచి పనులు చేసేవారికి స్వర్గం మరియు చెడుదారి పట్టేవారికి నరకం, అని వ్యక్తంచేశాడు. మరియు ప్రతి యుగం వారికి, అల్లాహ్(సు.తా.)ను మాత్రమే ఆరాధించమని మరియు మంచిని చేయమని ఆదేశించటానికి, చెడునుండి నివారించటానికి మార్గదర్శకులుగా ప్రవక్తలను పంపి, వారి వద్దకు దివ్యజ్ఞానం (వ'హీ) పంపుతూ వచ్చాడు. చూడండి, 14:4 మరియు 2:7.

فَأَقِمْ وَجْهَكَ لِلدِّينِ حَنِيفًا ۚ فِطْرَتَ ٱللَّهِ ٱلَّتِى فَطَرَ ٱلنَّاسَ عَلَيْهَا ۚ لَا تَبْدِيلَ لِخَلْقِ ٱللَّهِ ۚ ذَٰلِكَ ٱلدِّينُ ٱلْقَيِّمُ وَلَٰكِنَّ أَكْثَرَ ٱلنَّاسِ لَا يَعْلَمُونَ ﴿٣٠﴾

**30**. కావున నీవు నీ ముఖాన్ని, ఏకాగ్రచిత్తంతో, సత్యధర్మం (ఇస్లాం) దిశలో స్థిరంగా నిలుపు. అల్లాహ్ మానవులను ఏ స్వభావంతో పుట్టించాడో, ఆ స్వభావం పైననే వారు ఉంటారు.[1] అల్లాహ్ సృష్టి స్వభావాన్ని (ఎవ్వరూ) మార్చలేరు. ఇదే సరైన ధర్మం, కాని చాలామంది ఇది ఎరుగరు. (1/4)

۞ مُنِيبِينَ إِلَيْهِ وَٱتَّقُوهُ وَأَقِيمُوا۟ ٱلصَّلَوٰةَ وَلَا تَكُونُوا۟ مِنَ ٱلْمُشْرِكِينَ ﴿٣١﴾

**31**. * (ఎల్లప్పుడు) మీరు ఆయన వైపునకే పశ్చాత్తాపంతో మరలుతూ ఉండండి మరియు ఆయన యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నమా'జ్‌ను స్థాపించండి మరియు ఆయన (అల్లాహ్)కు సాటి (భాగస్వాములు) కల్పించే వారిలో చేరిపోకండి;

مِنَ ٱلَّذِينَ فَرَّقُوا۟ دِينَهُمْ وَكَانُوا۟ شِيَعًا ۖ كُلُّ حِزْبٍۭ بِمَا لَدَيْهِمْ فَرِحُونَ ﴿٣٢﴾

**32**. వారిలో ఎవరైతే, తమ ధర్మాన్ని విభజించి వేర్వేరు తెగలుగా చేసుకున్నారో! ప్రతివర్గం వారు తమ వద్దనున్న దాని(సిద్ధాంతం)తోనే సంతోషపడుతున్నారు.[2]

---

**1**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'ప్రతివ్యక్తి పుట్టుకతో స్వాభావికంగా అల్లాహ్ (సు.తా.)కు విధేయుడు (ముస్లిం) అయి ఉంటాడు. కానీ ముస్లిమేతరులైన అతని తల్లిదండ్రులు అతనిని యూదుడు, క్రైస్తవుడు, మజూసీ (లేక ఇతర మతస్థుడి)గా చేస్తారు.' ('స'హీ'హ్ బు'ఖారీ మరియు 'స'హీ'హ్ ముస్లిం).

**2**. అంటే ప్రతి ధర్మం, తెగ లేక వర్గం వారు తాము అనుసరించే దానితోనే సంతుష్టులై ఉంటారు. మరియు వారివద్ద దానిని సమర్థించే వాదాలు కూడా ఉంటాయి. వాస్తవానికి సత్యం మీద ఒకే ఒక్క ధర్మం, తెగ ఉండగలదు. ఆ ధర్మమే - అల్లాహ్ (సు.తా.) మార్గదర్శకత్వం చేసిన, ప్రవక్తలందరూ మరియు చివరి ప్రవక్త ము'హమ్మద్ ('స'అస) కూడా అనుసరించి, బోధించిన ధర్మం - ఇస్లాం; మహాప్రవక్త ('స'అస) మరియు అతని అనుచరు(ర'ది.'అన్హుమ్)లు అనుసరించిన ధర్మం. ఇంకా చూడండి, 6:159, 21:92-93 మరియు 23:52-53.

33. మరియు మానవులకు ఆపద వచ్చినపుడు, వారు తమ ప్రభువు వైపునకు పశ్చాత్తాపంతో మరలి ఆయనను వేడుకుంటారు. ఆ తరువాత ఆయన కారుణ్యం నుండి కొంత వారికి రుచి చూపించినప్పుడు, వారిలో కొందరు తమ ప్రభువుకు సాటి (భాగస్వాములను) కల్పించసాగుతారు;[1]

وَإِذَا مَسَّ ٱلنَّاسَ ضُرٌّ دَعَوْا۟ رَبَّهُم مُّنِيبِينَ إِلَيْهِ ثُمَّ إِذَآ أَذَاقَهُم مِّنْهُ رَحْمَةً إِذَا فَرِيقٌ مِّنْهُم بِرَبِّهِمْ يُشْرِكُونَ ﴿٣٣﴾

34. మేము వారికి ప్రసాదించిన దానికి (అనుగ్రహాలకు) కృతఘ్నత చూపటానికి (వారు అలా చేస్తారు). సరే! మీరు కొంత కాలం సుఖసంతోషాలు అనుభవించండి, త్వరలోనే మీరు (మీ ముగింపును) తెలుసుకుంటారు.

لِيَكْفُرُوا۟ بِمَآ ءَاتَيْنَٰهُمْ ۚ فَتَمَتَّعُوا۟ فَسَوْفَ تَعْلَمُونَ ﴿٣٤﴾

35. లేక మేము వారిపై ఏదైనా ప్రమాణాన్ని[2] అవతరింపజేశామా, అది వారు ఆయనకు కల్పించే భాగస్వాములను గురించి పలుకటానికి?[3]

أَمْ أَنزَلْنَا عَلَيْهِمْ سُلْطَٰنًا فَهُوَ يَتَكَلَّمُ بِمَا كَانُوا۟ بِهِۦ يُشْرِكُونَ ﴿٣٥﴾

36. మరియు మేము మానవులకు కారుణ్యపు రుచి చూపించినప్పుడు వారు దానితో చాలా సంతోషపడతారు. కాని వారు తమ చేతులారా చేసుకున్న కర్మల ఫలితంగా[4] వారికేదైనా కీడుకలిగితే నిరాశచెందుతారు.

وَإِذَآ أَذَقْنَا ٱلنَّاسَ رَحْمَةً فَرِحُوا۟ بِهَا ۖ وَإِن تُصِبْهُمْ سَيِّئَةٌۢ بِمَا قَدَّمَتْ أَيْدِيهِمْ إِذَا هُمْ يَقْنَطُونَ ﴿٣٦﴾

1. చూడండి, 16:54.
2. సుల్తానున్: అంటే ఇక్కడ దివ్యజ్ఞానం వహీ అని అర్థం.
3. చూడండి, 35:40.
4. చూడండి, 4:79.

أَوَلَمْ يَرَوْاْ أَنَّ ٱللَّهَ يَبْسُطُ ٱلرِّزْقَ لِمَن يَشَآءُ وَيَقْدِرُۚ إِنَّ فِى ذَٰلِكَ لَأَيَٰتٍ لِّقَوْمٍ يُؤْمِنُونَ ﴿٣٧﴾ فَـَٔاتِ ذَا ٱلْقُرْبَىٰ حَقَّهُۥ وَٱلْمِسْكِينَ وَٱبْنَ ٱلسَّبِيلِۚ ذَٰلِكَ خَيْرٌ لِّلَّذِينَ يُرِيدُونَ وَجْهَ ٱللَّهِۖ وَأُوْلَٰٓئِكَ هُمُ ٱلْمُفْلِحُونَ ﴿٣٨﴾ وَمَآ ءَاتَيْتُم مِّن رِّبًا لِّيَرْبُوَاْ فِىٓ أَمْوَٰلِ ٱلنَّاسِ فَلَا يَرْبُواْ عِندَ ٱللَّهِۖ وَمَآ ءَاتَيْتُم مِّن زَكَوٰةٍ تُرِيدُونَ وَجْهَ ٱللَّهِ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلْمُضْعِفُونَ ﴿٣٩﴾

**37**. ఏమీ వారికి తెలియదా? అల్లాహ్ తాను కోరిన వారికి జీవనోపాధిని పుష్కలంగా ఇస్తాడని మరియు (తాను కోరిన వారికి) మితంగా ఇస్తాడని? నిశ్చయంగా, ఇందులో విశ్వసించేవారికి ఎన్నో సూచనలున్నాయి.

**38**. కావున నీవు నీ బంధువుకు అతని హక్కు ఇవ్వు మరియు యాచించని పేదవానికి మరియు బాటసారికి (కూడా).[1] ఇది అల్లాహ్ ప్రసన్నతను కోరే వారికి ఎంతో ఉత్తమమైనది. మరియు ఇలాంటి వారే సాఫల్యము పొందేవారు.

**39**. మరియు మీరు ప్రజలకు - రిబా'[2] (వడ్డీ మీద డబ్బు / కానుకలు) ఇచ్చి దాని ద్వార వారి సంపదనుండి వృద్ధిపొందాలని - ఇచ్చే ధనం, అల్లాహ్ దృష్టిలో ఏ మాత్రం వృద్ధిపొందదు. మరియు మీరు అల్లాహ్ ప్రసన్నతను పొందే ఉద్దేశంతో ఏదైనా దానం(జకాత్) చేస్తే అలాంటివారి (సంపద) ఎన్నోరెట్లు అధికమవుతుంది.

---

**1**. చూడండి, 17:26. బంధువులకు, పేదవారికి మరియు బాటసారులకు మీరు ఇచ్చేది వారిపై చేసిన అనుగ్రహం కాదు. మీరు వారిహక్కు చెల్లిస్తున్నారు. పేదవాడైన దగ్గరి బంధువుకు ఇవ్వటం వల్ల రెండింతలు పుణ్యం దొరుకుతుంది. ఒకటి నీవు నీ దగ్గరివానికి ఇచ్చినందుకు, రెండవది పేదవానికి ఇచ్చినందుకు ('స'హీ'హ్ 'హదీస్').

**2**. *రిబా':* వడ్డీ అనేపదం ఖుర్ఆన్ అవతరణా క్రమంలో ఈ ఆయత్‌లో మొదటిసారి వచ్చింది. దాని అర్థం: ఏదైనా ఇచ్చి - ఇచ్చిన దానికంటే - ఎక్కువ తీసుకోవటం. ఇబ్నె 'అబ్బాస్ మరియు చాలామంది ఇతర 'స'హాబీలు (ర'ది.'అన్హుమ్) ఈ ఆయత్‌లో వచ్చిన పదం రిబా' అంటే ఈ విధమైన వ్యాఖ్యానం కూడా ఇచ్చారు: ఒక పేదవాడు ఒక ధనవంతునికి లేక ఒక వ్యక్తి తన రాజుకు, లేక ఒక సేవకుడు తనను పెట్టుకున్న వానికి, తాను ఇచ్చిన దానికంటే ఎక్కువ తిరిగి వచ్చుననే ఆశతో, ఇచ్చే బహుమానం, అని. ఇచ్చేటప్పుడు, ఎక్కువ తిరిగి వస్తుంది అనే భావన ఉండటం వల్లనే, ఇది నిషిద్ధం చేయబడింది (ఇబ్నె-కసీ'ర్, అయ్‌సర్ అత్తఫాసీర్). చూడండి, 3:130 మరియు 2:275-281.

**40**. అల్లాహ్ యే మిమ్మల్ని పుట్టించాడు, తరువాత జీవనోపాధి నిచ్చాడు. తరువాత ఆయనే మిమ్మల్ని మరణింపజేస్తాడు. ఆ తరువాత మళ్ళీ బ్రతికిస్తాడు. అయితే? మీరు (అల్లాహ్ కు) సాటిగా (భాగస్వాములుగా) కల్పించిన వారిలో, ఎవడైనా వీటిలో నుండి ఏదైనా ఒక్క[1] పనిని చేయగలవాడు ఉన్నాడా! ఆయన సర్వలోపాలకు అతీతుడు, మీరు సాటి కల్పించే భాగస్వాములకంటే ఆయన మహోన్నతుడు.

ٱللَّهُ ٱلَّذِى خَلَقَكُمْ ثُمَّ رَزَقَكُمْ ثُمَّ يُمِيتُكُمْ ثُمَّ يُحْيِيكُمْ ۖ هَلْ مِن شُرَكَآئِكُم مَّن يَفْعَلُ مِن ذَٰلِكُم مِّن شَىْءٍ ۚ سُبْحَـٰنَهُۥ وَتَعَـٰلَىٰ عَمَّا يُشْرِكُونَ ﴿٤٠﴾

**41**. మానవులు తమ చేజేతులా సంపాదించుకున్న దాని ఫలితంగా భూమిలో మరియు సముద్రంలో కల్లోలం వ్యాపించింది. ఇది వారిలో కొందరు చేసిన దుష్కర్మల ఫలితాన్ని రుచి చూపటానికి, బహుశా ఇలాగైనా వారు (అల్లాహ్ వైపునకు) మరలుతారేమోనని!

ظَهَرَ ٱلْفَسَادُ فِى ٱلْبَرِّ وَٱلْبَحْرِ بِمَا كَسَبَتْ أَيْدِى ٱلنَّاسِ لِيُذِيقَهُم بَعْضَ ٱلَّذِى عَمِلُوا۟ لَعَلَّهُمْ يَرْجِعُونَ ﴿٤١﴾

**42**. వారితో ఇలా అను: "భూమిలో ప్రయాణం చేసి చూడండి, మీకు పూర్వం గతించిన వారి ముగింపు ఎలా జరిగిందో! వారిలో చాలామంది బహుదైవారాధకులుండిరి."

قُلْ سِيرُوا۟ فِى ٱلْأَرْضِ فَٱنظُرُوا۟ كَيْفَ كَانَ عَـٰقِبَةُ ٱلَّذِينَ مِن قَبْلُ ۚ كَانَ أَكْثَرُهُم مُّشْرِكِينَ ﴿٤٢﴾

---

**1**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'ఒక దుష్టుడు మరణిస్తే, కేవలం మానవులే గాక పశుపక్షులు, చెట్లు చేమలు కూడా వాని నుండి శాంతి పొందుతాయి.' ('స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం).

43. కావున నీవు నీ ముఖాన్ని సరైన ధర్మం (ఇస్లాం) వైపునకే స్థిరంగా నిలుపు,[1] అల్లాహ్ తరఫునుండి ఆ రోజు రాకముందే, దేనినైతే ఎవ్వడూ తొలగించలేడో! ఆ రోజు వారు పరస్పరం చెదిరిపోయి వేరవుతారు.[2]

فَأَقِمْ وَجْهَكَ لِلدِّينِ ٱلْقَيِّمِ مِن قَبْلِ أَن يَأْتِيَ يَوْمٌ لَّا مَرَدَّ لَهُۥ مِنَ ٱللَّهِ ۖ يَوْمَئِذٍ يَصَّدَّعُونَ ﴿٤٣﴾

44. సత్యాన్ని తిరస్కరించినవాడు, తన తిరస్కార ఫలితాన్ని అనుభవిస్తాడు. మరియు సత్కార్యాలు చేసినవారు, తమ కొరకే (సాఫల్య మార్గాన్ని) తయారుచేసుకుంటారు.

مَن كَفَرَ فَعَلَيْهِ كُفْرُهُۥ ۖ وَمَنْ عَمِلَ صَٰلِحًا فَلِأَنفُسِهِمْ يَمْهَدُونَ ﴿٤٤﴾

45. ఇది ఆయన (అల్లాహ్), తన అనుగ్రహంతో విశ్వసించి సత్కార్యాలు చేసేవారికి ప్రతిఫలమివ్వటానికి.[3] నిశ్చయంగా, ఆయన సత్య తిరస్కారులను ప్రేమించడు.

لِيَجْزِيَ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ مِن فَضْلِهِۦٓ ۚ إِنَّهُۥ لَا يُحِبُّ ٱلْكَٰفِرِينَ ﴿٤٥﴾

46. ఇక ఆయన సూచనలలో ఆయన గాలులను శుభవార్తలిచ్చేవిగా పంపి, మీకు తన కారుణ్యాన్ని రుచిచూపటం మరియు ఆయన ఆజ్ఞతో ఓడలను నడిపి, మిమ్మల్ని ఆయన అనుగ్రహాన్ని అన్వేషించనివ్వటం కూడా ఉన్నాయి. ఇవన్నీ, బహుశా మీరు కృతజ్ఞతలు చూపుతారేమోనని!

وَمِنْ ءَايَٰتِهِۦٓ أَن يُرْسِلَ ٱلرِّيَاحَ مُبَشِّرَٰتٍ وَلِيُذِيقَكُم مِّن رَّحْمَتِهِۦ وَلِتَجْرِيَ ٱلْفُلْكُ بِأَمْرِهِۦ وَلِتَبْتَغُوا۟ مِن فَضْلِهِۦ وَلَعَلَّكُمْ تَشْكُرُونَ ﴿٤٦﴾

---

1. అల్లాహ్ (సు.తా.) దృష్టిలో సత్యధర్మం: అంటే అల్లాహ్ (సు.తా.)కు దాస్యం - తనను తాను అల్లాహ్ (సు.తా.) అభీష్టానికి అప్పగించడం (ఇస్లాం) - మాత్రమే. చూడండి, 3:19.

2. ఒకటి విశ్వాసులది, రెండవది సత్యతిరస్కారులది.

3. స్వర్గం పొందటానికి కేవలం విశ్వసించి సత్కార్యాలు చేయటమే సరిపోదు. దానికి అల్లాహ్ (సు.తా.) అనుగ్రహం కూడా ఉండాలి. ఆయనయే సత్కార్యాల ప్రతిఫలాన్ని ఎన్నోరెట్లు అధికంచేసి ఇస్తాడు.

47. మరియు వాస్తవానికి మేము నీకు పూర్వం కూడా, సందేశహరులను తమ తమ జాతివారి వద్దకు పంపాము.[1] వారు, వారి వద్దకు స్పష్టమైన సూచనలను తీసుకొని వచ్చారు. ఆ తరువాత కూడా నేరం చేసిన వారికి తగిన ప్రతీకారం[2] చేశాము. మరియు విశ్వాసులకు సహాయం చేయటం మా కర్తవ్యం.

48. అల్లాహ్ యే గాలులను పంపే వాడు, కావున అవి మేఘాలను పైకి ఎత్తుతాయి, ఆ తరువాత ఆయన వాటిని తాను కోరినట్లు ఆకాశంలో వ్యాపింప జేస్తాడు. మరియు వాటిని ముక్కలు ముక్కలుగా చేసి, తరువాత వాటి మధ్య నుండి వర్షాన్ని కురిపిస్తాడు. ఆయన దానిని తన దాసులలో తాను కోరినవారిపై కురిపించగా వారు సంతోషపడతారు!

49. మరియు వాస్తవానికి, అది (వర్షం) కురువక ముందు వారు ఎంతో నిరాశచెంది ఉండేవారు.

50. కావున (ఓ మానవుడా!) అల్లాహ్ కారుణ్య చిహ్నాలను చూడు: ఆయన నిర్జీవంగా ఉన్న భూమిలో ఏ విధంగా ప్రాణం పోస్తాడో! నిశ్చయంగా, ఇదేవిధంగా ఆయన (మరణానంతరం) మృతులకు కూడా ప్రాణం పోస్తాడు! మరియు ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు.

وَلَقَدۡ أَرۡسَلۡنَا مِن قَبۡلِكَ رُسُلًا إِلَىٰ قَوۡمِهِمۡ فَجَآءُوهُم بِٱلۡبَيِّنَٰتِ فَٱنتَقَمۡنَا مِنَ ٱلَّذِينَ أَجۡرَمُواْۖ وَكَانَ حَقًّا عَلَيۡنَا نَصۡرُ ٱلۡمُؤۡمِنِينَ ٤٧

ٱللَّهُ ٱلَّذِي يُرۡسِلُ ٱلرِّيَٰحَ فَتُثِيرُ سَحَابًا فَيَبۡسُطُهُۥ فِي ٱلسَّمَآءِ كَيۡفَ يَشَآءُ وَيَجۡعَلُهُۥ كِسَفًا فَتَرَى ٱلۡوَدۡقَ يَخۡرُجُ مِنۡ خِلَٰلِهِۦۖ فَإِذَآ أَصَابَ بِهِۦ مَن يَشَآءُ مِنۡ عِبَادِهِۦٓ إِذَا هُمۡ يَسۡتَبۡشِرُونَ ٤٨

وَإِن كَانُواْ مِن قَبۡلِ أَن يُنَزَّلَ عَلَيۡهِم مِّن قَبۡلِهِۦ لَمُبۡلِسِينَ ٤٩

فَٱنظُرۡ إِلَىٰٓ ءَاثَٰرِ رَحۡمَتِ ٱللَّهِ كَيۡفَ يُحۡيِ ٱلۡأَرۡضَ بَعۡدَ مَوۡتِهَآۚ إِنَّ ذَٰلِكَ لَمُحۡيِ ٱلۡمَوۡتَىٰۖ وَهُوَ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٞ ٥٠

---

1. చూడండి, 10:74.

2. అల్-ముంతఖిమ్ (సేకరించబడిన పదం): Retributor, Avenger of evil, ప్రతీకారం తీర్చుకునే, ప్రతీకారం చేసే, దుష్టులను శిక్షించేవాడు. చూడండి, 32:22. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

51. మరియు మేము గాలినిపంపితే, దాని నుండి వారి పంటలను పసుపుపచ్చగా మారిపోవటాన్ని చూసిన తరువాత వారు కృతఘ్నతకు లోనవుతారు (సత్య తిరస్కారులవుతారు).

وَلَئِنْ أَرْسَلْنَا رِيحًا فَرَأَوْهُ مُصْفَرًّا لَّظَلُّوا۟ مِنۢ بَعْدِهِۦ يَكْفُرُونَ ﴿٥١﴾

52. నిశ్చయంగా, నీవు (ఓ ముహమ్మద్!) మృతులకు వినిపించలేవు. మరియు నీవు వెనుదిరిగి పోయే చెవిటివారికి కూడా సందేశాన్ని వినిపించలేవు.

فَإِنَّكَ لَا تُسْمِعُ ٱلْمَوْتَىٰ وَلَا تُسْمِعُ ٱلصُّمَّ ٱلدُّعَآءَ إِذَا وَلَّوْا۟ مُدْبِرِينَ ﴿٥٢﴾

53. మరియు నీవు అంధులను, వారి మార్గభ్రష్టత్వం నుండి తప్పించి, వారికి మార్గదర్శకత్వం చేయులేవు. నీవు కేవలం విశ్వసించి, అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు) అయిన వారికి మాత్రమే మా సూచనలు వినిపించగలవు.[1] (3/8)

وَمَآ أَنتَ بِهَٰدِ ٱلْعُمْىِ عَن ضَلَٰلَتِهِمْ ۖ إِن تُسْمِعُ إِلَّا مَن يُؤْمِنُ بِـَٔايَٰتِنَا فَهُم مُّسْلِمُونَ ﴿٥٣﴾

54. * అల్లాహ్‌యే మిమ్మల్ని బలహీనస్థితిలో పుట్టించినవాడు. మళ్ళీ ఆ బలహీనస్థితి, తరువాత మీకు బలాన్ని ఇచ్చాడు. ఆ బలం తరువాత మళ్ళీ మిమ్మల్ని బలహీనులుగా, ముసలివారిగా చేశాడు. ఆయన తాను కోరింది సృష్టిస్తాడు. మరియు కేవలం ఆయనే సర్వజ్ఞుడు, సర్వసమర్థుడు.

۞ ٱللَّهُ ٱلَّذِى خَلَقَكُم مِّن ضَعْفٍ ثُمَّ جَعَلَ مِنۢ بَعْدِ ضَعْفٍ قُوَّةً ثُمَّ جَعَلَ مِنۢ بَعْدِ قُوَّةٍ ضَعْفًا وَشَيْبَةً ۚ يَخْلُقُ مَا يَشَآءُ ۖ وَهُوَ ٱلْعَلِيمُ ٱلْقَدِيرُ ﴿٥٤﴾

---

1. ఇటువంటి ఆయత్‌లకు చూడండి, 27:80-81.

55. మరియు ఆ ఘడియ[1] సంభవించిన రోజు, అపరాధులు, ప్రమాణం చేస్తూ: "మేము ఒక ఘడియసేపు కంటే ఎక్కువ కాలం (ప్రపంచంలో) ఉండలేదు." అని అంటారు. ఇదేవిధంగా వారు (ప్రాపంచిక జీవితంలో) భ్రమలో ఉండేవారు.[2]

وَيَوْمَ تَقُومُ ٱلسَّاعَةُ يُقْسِمُ ٱلْمُجْرِمُونَ مَا لَبِثُوا۟ غَيْرَ سَاعَةٍ ۚ كَذَٰلِكَ كَانُوا۟ يُؤْفَكُونَ ﴿٥٥﴾

56. మరియు జ్ఞానం మరియు విశ్వాసం అనుగ్రహింపబడిన వారు ఇలా అంటారు: "వాస్తవానికి అల్లాహ్ మూలగ్రంథం[3] ప్రకారం మీరు పునరుత్థాన దినం వరకు (ఇహలోకంలో) ఉంటిరి. ఇక ఇదే ఆ పునరుత్థాన దినం, కాని నిశ్చయంగా! మీరిది తెలుసుకోలేక పోయారు."

وَقَالَ ٱلَّذِينَ أُوتُوا۟ ٱلْعِلْمَ وَٱلْإِيمَٰنَ لَقَدْ لَبِثْتُمْ فِى كِتَٰبِ ٱللَّهِ إِلَىٰ يَوْمِ ٱلْبَعْثِ ۖ فَهَٰذَا يَوْمُ ٱلْبَعْثِ وَلَٰكِنَّكُمْ كُنتُمْ لَا تَعْلَمُونَ ﴿٥٦﴾

57. కనుక ఆ రోజు దుర్మార్గులకు, వారి సాకులు ఏ మాత్రం ప్రయోజనకరం కావు మరియు వారికి తమను తాము సరిదిద్దుకొనే అవకాశం కూడా ఇవ్వబడదు.

فَيَوْمَئِذٍ لَّا يَنفَعُ ٱلَّذِينَ ظَلَمُوا۟ مَعْذِرَتُهُمْ وَلَا هُمْ يُسْتَعْتَبُونَ ﴿٥٧﴾

58. మరియు వాస్తవానికి, మేము ఈ ఖుర్ఆన్‌లో ప్రజలకు, ప్రతి ఒక్క విషయపు ఉపమానాన్ని బోధించాము.[4] అయినా నీవు వారి వద్దకు ఏ అద్భుత సూచన (ఆయత్) తెచ్చినా, వారిలో సత్యతిరస్కారులైన వారు ఇలా అంటారు: "మీరు కేవలం బూటకాలే పలుకుతున్నారు."

وَلَقَدْ ضَرَبْنَا لِلنَّاسِ فِى هَٰذَا ٱلْقُرْءَانِ مِن كُلِّ مَثَلٍ ۚ وَلَئِن جِئْتَهُم بِـَٔايَةٍ لَّيَقُولَنَّ ٱلَّذِينَ كَفَرُوٓا۟ إِنْ أَنتُمْ إِلَّا مُبْطِلُونَ ﴿٥٨﴾

---

1. ఆ ఘడియ అంటే పునరుత్థాన ఘడియ. అదే ఈ లోకపు అంతిమ ఘడియ.
2. చూడండి, 10:45, 17:52.
3. కితాబిల్లాహి: అంటే అల్లాహ్ వ్రాసి ఉంచిన లౌహె మ'హ్ఫూ''జ్, మూల గ్రంథం.
4. చూడండి, 39:27.

كَذَٰلِكَ يَطۡبَعُ ٱللَّهُ عَلَىٰ قُلُوبِ ٱلَّذِينَ لَا يَعۡلَمُونَ ۝٥٩

**59**. ఈ విధంగా, అల్లాహ్ జ్ఞానహీనుల హృదయాల మీద ముద్రవేస్తాడు.[1]

فَٱصۡبِرۡ إِنَّ وَعۡدَ ٱللَّهِ حَقّٞۖ وَلَا يَسۡتَخِفَّنَّكَ ٱلَّذِينَ لَا يُوقِنُونَ ۝٦٠

**60**. కావున నీవు సహనంవహించు! నిశ్చయంగా, అల్లాహ్ వాగ్దానం సత్యం! కావున విశ్వాసహీనులు నిన్ను వ్యాకులపరచరాదు సుమా!

*****

---

**1**. చూడండి, 2:7.

## 31. సూరహ్ లుఖ్మాన్ سُورِةُ لُقْمانَ

ఇంతకు ముందు సూరహ్‌వలే ఈ సూరహ్ కూడా మధ్య మక్కా కాలంలో, హి[జత్‌కు 6-7 సంవత్సరాలకు పూర్వం అవతరింపజేయబడింది. ఈ సమూహంలో ఇది మూడవది. ఇందులో **34 ఆయతులు** ఉన్నాయి. దీనిపేరు **12-19 ఆయత్**‌లలో నుండి తీసుకోబడింది. **లుఖ్మాన్** (అ.స.) ఒక మంచి జ్ఞానవంతుడు మరియు ప్రజ్ఞుడు.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓمٓ ١

**1.** అలిఫ్-లామ్-మీమ్.[1]

تِلْكَ ءَايَٰتُ ٱلْكِتَٰبِ ٱلْحَكِيمِ ٢

**2.** ఇవి వివేకంతో నిండిఉన్న గ్రంథ సూచన(ఆయత్)లు.

هُدًى وَرَحْمَةً لِّلْمُحْسِنِينَ ٣

**3.** (ఇందులో) సజ్జనులకు[2] మార్గదర్శకత్వమూ మరియు కారుణ్యమూ ఉన్నాయి.

ٱلَّذِينَ يُقِيمُونَ ٱلصَّلَوٰةَ وَيُؤْتُونَ ٱلزَّكَوٰةَ وَهُم بِٱلْـَٔاخِرَةِ هُمْ يُوقِنُونَ ٤

**4.** (వారికే) ఎవరైతే నమా'జ్‌ను స్థాపించి విధిదానం ('జకాత్) ఇస్తారో[3] మరియు పరలోక జీవితం మీద దృఢమైన నమ్మకం కలిగిఉంటారో;

أُوْلَٰٓئِكَ عَلَىٰ هُدًى مِّن رَّبِّهِمْ ۖ وَأُوْلَٰٓئِكَ هُمُ ٱلْمُفْلِحُونَ ٥

**5.** అలాంటి వారే, తమ ప్రభువు తరఫునుండి (వచ్చిన) మార్గదర్శకత్వం మీద ఉన్నవారు. మరియు అలాంటి వారే సాఫల్యం పొందే వారు.

---

**1.** ఈ అక్షరాలను ముఖ'త్త'ఆత్, అంటారు. వీటి అర్థం మరియు కొన్ని సూరాహ్‌ల ప్రారంభంలో ఇవి ఎందుకు వ్రాయబడ్డాయో కేవలం అల్లాహ్ (సు.తా.)కు మాత్రమే తెలుసు.

**2.** ము'హ్సినీన్, ము'హ్సిన్ (ఏ.వ.): దీనికి మూడు అర్థాలున్నాయి. 1) ఉపకారం చేసేవాడు; తన తల్లిదండ్రులకు, బంధువులకు, మొదలైనవారికి. 2) సత్కార్యాలు చేసేవాడు మరియు పాపాలనుండి దూరంగా ఉండేవాడు. 3) అల్లాహ్ (సు.తా.) యొక్క ఆరాధన - భక్తి, శ్రద్ధ, దైవభీతి మరియు ఏకాగ్రతతో - చేసేవాడు.

**3.** చూడండి, 2:2-4.

6. మరియు మానవులలో కొందరు - జ్ఞానం లేక, వ్యర్థ కాలక్షేపం చేసే మాటలను కొని[1] - ప్రజలను అల్లాహ్ మార్గం నుండి తప్పించే వారున్నారు మరియు వారు దానిని (అల్లాహ్ మార్గాన్ని) పరిహాసం చేస్తుంటారు. అలాంటి వారికి అవమానకరమైన శిక్ష పడుతుంది.

وَمِنَ ٱلنَّاسِ مَن يَشْتَرِى لَهْوَ ٱلْحَدِيثِ لِيُضِلَّ عَن سَبِيلِ ٱللَّهِ بِغَيْرِ عِلْمٍ وَيَتَّخِذَهَا هُزُوًا ۚ أُو۟لَٰٓئِكَ لَهُمْ عَذَابٌ مُّهِينٌ ﴿٦﴾

7. అలాంటి వానికి, మా ఆయత్‌లు వినిపింపజేసినప్పుడు, అతని రెండు చెవులలో చెవుడు ఉన్నట్లుగా, అతడు వాటిని విననే లేదన్నట్లుగా, అహంకారంతో మరలిపోతాడు.[2] వానికి అతి బాధాకరమైన శిక్ష పడుతుందనే వార్తను వినిపించు.

وَإِذَا تُتْلَىٰ عَلَيْهِ ءَايَٰتُنَا وَلَّىٰ مُسْتَكْبِرًا كَأَن لَّمْ يَسْمَعْهَا كَأَنَّ فِىٓ أُذُنَيْهِ وَقْرًا ۖ فَبَشِّرْهُ بِعَذَابٍ أَلِيمٍ ﴿٧﴾

8. నిశ్చయంగా, ఎవరైతే విశ్వసించి, సత్కార్యాలు చేస్తారో, వారి కొరకు పరమానందకరమైన స్వర్గవనాలు ఉంటాయి.

إِنَّ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ لَهُمْ جَنَّٰتُ ٱلنَّعِيمِ ﴿٨﴾

9. వారు, శాశ్వతంగా వాటిలో ఉంటారు. ఇది అల్లాహ్ యొక్క సత్య వాగ్దానం. మరియు ఆయన సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

خَٰلِدِينَ فِيهَا ۖ وَعْدَ ٱللَّهِ حَقًّا ۚ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿٩﴾

10. మీరు చూస్తున్నారు కదా! ఆయన ఆకాశాలను స్థంభాలు లేకుండానే సృష్టించాడు.[3] మరియు భూమిలో పర్వతాలను నాటాడు, అది మీతోపాటు కదలకుండా ఉండాలని;[4] మరియు దానిలో

خَلَقَ ٱلسَّمَٰوَٰتِ بِغَيْرِ عَمَدٍ تَرَوْنَهَا ۖ وَأَلْقَىٰ فِى ٱلْأَرْضِ رَوَٰسِىَ أَن تَمِيدَ بِكُمْ وَبَثَّ فِيهَا مِن كُلِّ دَآبَّةٍ ۚ

1. అంటే సంగీతం మరియు ఇతర వృథా మాటలలో, విషయాలలో కాలక్షేపం చేయడానికి వాడే వస్తువులు.
2. చూడండి, 23:66-67.
3. చూడండి, 13:2.
4. చూడండి, 16:15.

وَأَنزَلْنَا مِنَ ٱلسَّمَآءِ مَآءً فَأَنۢبَتْنَا فِيهَا مِن كُلِّ زَوْجٍ كَرِيمٍ ۝١٠

ప్రతి రకమైన ప్రాణిని నివసింపజేశాడు. మరియు మేము ఆకాశంనుండి నీటిని కురిపించి, దానిలో రకరకాల శ్రేష్ఠమైన (పదార్థాలను)[1] ఉత్పత్తిచేశాము.

هَٰذَا خَلْقُ ٱللَّهِ فَأَرُونِى مَاذَا خَلَقَ ٱلَّذِينَ مِن دُونِهِۦ ۚ بَلِ ٱلظَّٰلِمُونَ فِى ضَلَٰلٍ مُّبِينٍ ۝١١

**11**. ఇదంతా అల్లాహ్ సృష్టియే! ఇక ఆయన తప్ప ఇతరులు ఏమి సృష్టించారో నాకు చూపండి. అలాకాదు ఈ దుర్మార్గులు స్పష్టంగా మార్గభ్రష్టత్వంలో పడిఉన్నారు.

وَلَقَدْ ءَاتَيْنَا لُقْمَٰنَ ٱلْحِكْمَةَ أَنِ ٱشْكُرْ لِلَّهِ ۚ وَمَن يَشْكُرْ فَإِنَّمَا يَشْكُرُ لِنَفْسِهِۦ ۖ وَمَن كَفَرَ فَإِنَّ ٱللَّهَ غَنِىٌّ حَمِيدٌ ۝١٢

**12**. మరియు నిశ్చయంగా, మేము **లుఖ్మాన్**‌కు వివేకాన్ని ప్రసాదించాము,[2] అతను అల్లాహ్‌కు కృతజ్ఞుడుగా ఉండాలని. మరియు ఎవడైతే ఆయనకు కృతజ్ఞతలు తెలుపుతాడో, అతడు నిశ్చయంగా, తన మేలుకొరకే కృతజ్ఞతలు తెలుపుతాడు. మరియు కృతఘ్నతకు పాల్పడినవాడు, నిశ్చయంగా అల్లాహ్ స్వయంసమృద్ధుడు, సర్వస్తోత్రాలకు అర్హుడని (తెలుసుకోవాలి)!

وَإِذْ قَالَ لُقْمَٰنُ لِٱبْنِهِۦ وَهُوَ يَعِظُهُۥ يَٰبُنَىَّ لَا تُشْرِكْ بِٱللَّهِ ۖ إِنَّ ٱلشِّرْكَ لَظُلْمٌ عَظِيمٌ ۝١٣

**13**. మరియు (జ్ఞాపకం చేసుకోండి) లుఖ్మాన్ తన కుమారునికి హితబోధ చేస్తూ ఇలా అన్నాడు: "ఓ నా పుత్రుడా! అల్లాహ్‌కు సాటి (భాగస్వాములను) కల్పించకు. నిశ్చయంగా, అల్లాహ్‌కు భాగస్వాములను కల్పించటం (బహు దైవారాధన) మహా దుర్మార్గము.

---

**1**. 'జౌజిన్: అంటే ప్రతిరకమైన ధాన్యాలు మరియు ఫలాలు, (ము'హమ్మద్ జూనాగఢి). మరొక అర్థం: రకరకాల జీవరాశి, (నోబుల్ ఖుర్ఆన్). రెండూ సరైనవే. ఇంకా చూడండి, 26:7.

**2**. లుఖ్మాన్ ('అ.స.): ఒక మహా సత్పురుషుడు. అల్లాహ్ (సు.తా.) అతనికి ('అ.స.) మంచి జ్ఞానం, దూరదృష్టి, దైవభీతి మరియు వివేచనాశక్తిని ప్రసాదించాడు.

14. "మరియు (అల్లాహ్ ఇలా ఆదేశిస్తున్నాడు): 'మేము మానవునకు తన తల్లిదండ్రుల యెడల మంచితనంతో మెలగటం విధిగా జేశాము. అతని తల్లి అతనిని బలహీనతపై బలహీనతను సహిస్తూ (తన గర్భంలో) భరిస్తుంది. మరియు ఆ బిడ్డ చనుపాలు మాన్పించే గడువు రెండు సంవత్సరాలు. నీవు నాకు మరియు నీ తల్లిదండ్రులకు కృతజ్ఞుడవై ఉండు. నా వైపునకే నీవు మరలి రావలసి ఉన్నది.[1]

15. " 'మరియు ఒకవేళ వారిరువురు - నీవు ఎరగని దానిని - నాకు (అల్లాహ్‌కు) భాగస్వామిగా చేర్చమని, నిన్ను బలవంతం చేస్తే, వారి మాటను నీవు ఏమాత్రం వినకు.[2] మరియు ఇహలోక విషయాలలో ధర్మ సమ్మతమైన వాటిలో వారికి తోడుగా ఉండు. మరియు పశ్చాత్తాపంతో నా వైపుకు మరలేవాని మార్గాన్ని అనుసరించు. తరువాత మీరంతా నావైపునకే మరలి రావలసి ఉన్నది. అప్పుడు నేను మీరు చేసే కర్మలను గురించి మీకు తెలుపుతాను.'

16. "ఓ నా కుమారా! ఒక వేళ నీ కర్మ ఆవగింజంత ఉండి, అది ఒక పెద్ద రాతి బండలో గానీ, ఆకాశాలలో గానీ లేదా భూమిలో గానీ దాగివున్నా, అల్లాహ్ దానిని తప్పక (వెలుగులోకి) తెస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ ఎంతో సూక్ష్మగ్రాహి, సర్వం తెలిసిన వాడు.

وَوَصَّيْنَا ٱلْإِنسَـٰنَ بِوَٰلِدَيْهِ حَمَلَتْهُ أُمُّهُۥ وَهْنًا عَلَىٰ وَهْنٍ وَفِصَـٰلُهُۥ فِى عَامَيْنِ أَنِ ٱشْكُرْ لِى وَلِوَٰلِدَيْكَ إِلَىَّ ٱلْمَصِيرُ ١٤

وَإِن جَـٰهَدَاكَ عَلَىٰٓ أَن تُشْرِكَ بِى مَا لَيْسَ لَكَ بِهِۦ عِلْمٌ فَلَا تُطِعْهُمَا ۖ وَصَاحِبْهُمَا فِى ٱلدُّنْيَا مَعْرُوفًا ۖ وَٱتَّبِعْ سَبِيلَ مَنْ أَنَابَ إِلَىَّ ۚ ثُمَّ إِلَىَّ مَرْجِعُكُمْ فَأُنَبِّئُكُم بِمَا كُنتُمْ تَعْمَلُونَ ١٥

يَـٰبُنَىَّ إِنَّهَآ إِن تَكُ مِثْقَالَ حَبَّةٍ مِّنْ خَرْدَلٍ فَتَكُن فِى صَخْرَةٍ أَوْ فِى ٱلسَّمَـٰوَٰتِ أَوْ فِى ٱلْأَرْضِ يَأْتِ بِهَا ٱللَّهُ ۚ إِنَّ ٱللَّهَ لَطِيفٌ خَبِيرٌ ١٦

1. చూడండి, 17:23-24.

2. చూడండి, 29:8.

17. "ఓ నా కుమారా! నమాజ్‌ను స్థాపించు మరియు ధర్మాన్ని ఆదేశించు మరియు అధర్మాన్ని నిషేధించు, ఆపదలో సహనంవహించు. నిశ్చయంగా, ఇవి ఎంతో *గట్టిగా ఆజ్ఞాపించబడిన విషయాలు.*[1]

18. "మరియు నీ చెంపలను గర్వంతో, ప్రజల యెదుట ఉబ్బించకు.[2] మరియు భూమిపై అహంకారంతో నడవకు. నిశ్చయంగా, అల్లాహ్ డాంబికాలు చెప్పుకొని, విర్రవీగే వాడంటే ఇష్టపడడు.

19. "మరియు నీ నడకలలో వినమ్రత పాటించు.[3] మరియు నీ స్వరాన్ని తగ్గించు. నిశ్చయంగా, స్వరాలలో అన్నిటికంటే కరకైన (వినసొంపుకానిది) గాడిద స్వరమే!"

20. ఏమీ? ఆకాశాలలో మరియు భూమిలో ఉన్న సకల వస్తువులను వాస్తవానికి అల్లాహ్ మీకు ఉపయుక్తంగా చేశాడనీ[4] మరియు ఆయన బహిరంగం గానూ మరియు గోప్యం గానూ తన అనుగ్రహాలను, మీకు ప్రసాదించాడనీ, మీకు తెలియదా? మరియు ప్రజలలో కొందరు ఎలాంటి జ్ఞానం, మార్గదర్శకత్వం మరియు వెలుగు చూపే స్పష్టమైన గ్రంథం లేనిదే అల్లాహ్‌ను గురించి వాదులాడే వారున్నారు!

يَٰبُنَيَّ أَقِمِ ٱلصَّلَوٰةَ وَأۡمُرۡ
بِٱلۡمَعۡرُوفِ وَٱنۡهَ عَنِ ٱلۡمُنكَرِ
وَٱصۡبِرۡ عَلَىٰ مَآ أَصَابَكَۖ إِنَّ ذَٰلِكَ مِنۡ
عَزۡمِ ٱلۡأُمُورِ ١٧
وَلَا تُصَعِّرۡ خَدَّكَ لِلنَّاسِ وَلَا تَمۡشِ فِي
ٱلۡأَرۡضِ مَرَحًاۖ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ كُلَّ
مُخۡتَالٖ فَخُورٖ ١٨
وَٱقۡصِدۡ فِي مَشۡيِكَ وَٱغۡضُضۡ مِن
صَوۡتِكَۚ إِنَّ أَنكَرَ ٱلۡأَصۡوَٰتِ لَصَوۡتُ
ٱلۡحَمِيرِ ١٩
أَلَمۡ تَرَوۡاْ أَنَّ ٱللَّهَ سَخَّرَ لَكُم مَّا فِي
ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِ وَأَسۡبَغَ
عَلَيۡكُمۡ نِعَمَهُۥ ظَٰهِرَةٗ وَبَاطِنَةٗۗ وَمِنَ
ٱلنَّاسِ مَن يُجَٰدِلُ فِي ٱللَّهِ بِغَيۡرِ عِلۡمٖ
وَلَا هُدٗى وَلَا كِتَٰبٖ مُّنِيرٖ ٢٠

---

1. వంకర అక్షరా (*Italics*)లలో ఉన్నది నోబుల్ ఖుర్ఆన్‌లో ఉన్న తాత్పర్యం.
2. పైన ఉన్నది ముహమ్మద్ జూనాగఢీ గారి తాత్పర్యం. ఈ వాక్యపు తాత్పర్యం నోబుల్ ఖుర్ఆన్‌లో ఇలా ఉంది:"*ప్రజలతో ముఖం ప్రక్కకు త్రిప్పుకొని (చిట్లించుకొని) గర్వంతో మాట్లాడకు.*"
3. చూడండి, 25:63.
4. చూడండి, 14:32-33.

وَإِذَا قِيلَ لَهُمُ ٱتَّبِعُواْ مَآ أَنزَلَ ٱللَّهُ قَالُواْ بَلۡ نَتَّبِعُ مَا وَجَدۡنَا عَلَيۡهِ ءَابَآءَنَآۚ أَوَلَوۡ كَانَ ٱلشَّيۡطَٰنُ يَدۡعُوهُمۡ إِلَىٰ عَذَابِ ٱلسَّعِيرِ ﴿٢١﴾

21. మరియు వారితో: "అల్లాహ్ అవతరింపజేసిన దానిని అనుసరించండి!" అని అన్నప్పుడు, వారు: "కాదు మా తండ్రితాతలు నడిచిన మార్గాన్నే మేము అనుసరిస్తాము." అని అంటారు. ఏమీ? షైతాన్ వారిని భగభగమండే అగ్ని వైపునకు ఆహ్వానిస్తున్నప్పటికీ, (వారు అలాంటి మార్గాన్నే అనుసరిస్తారా)?[1] (1/2)

۞ وَمَن يُسۡلِمۡ وَجۡهَهُۥٓ إِلَى ٱللَّهِ وَهُوَ مُحۡسِنٞ فَقَدِ ٱسۡتَمۡسَكَ بِٱلۡعُرۡوَةِ ٱلۡوُثۡقَىٰۗ وَإِلَى ٱللَّهِ عَٰقِبَةُ ٱلۡأُمُورِ ﴿٢٢﴾

22. * ఎవడైతే, తన ముఖాన్ని (తనను తాను) అల్లాహ్‌కు సమర్పించుకొని[2] సజ్జనుడై ఉంటాడో, అలాంటి వాడు నిస్సందేహంగా దృఢమైన ఆధారాన్ని పట్టుకున్నవాడే! మరియు సకల వ్యవహారాల ముగింపు (తీర్పు) అల్లాహ్ వద్దనే ఉంది.

وَمَن كَفَرَ فَلَا يَحۡزُنكَ كُفۡرُهُۥٓۚ إِلَيۡنَا مَرۡجِعُهُمۡ فَنُنَبِّئُهُم بِمَا عَمِلُوٓاْۚ إِنَّ ٱللَّهَ عَلِيمُۢ بِذَاتِ ٱلصُّدُورِ ﴿٢٣﴾

23. మరియు సత్యాన్ని తిరస్కరించే వాని, తిరస్కారం నిన్ను దుఃఖానికి గురిచేయకూడదు. వారందరి మరలింపు మా వైపునకే ఉంది; అప్పుడు మేము వారు చేసిన కర్మలను వారికి తెలుపుతాము. నిశ్చయంగా, అల్లాహ్‌కు హృదయాలలో ఉన్న విషయాలు సైతం బాగా తెలుసు.

نُمَتِّعُهُمۡ قَلِيلٗا ثُمَّ نَضۡطَرُّهُمۡ إِلَىٰ عَذَابٍ غَلِيظٖ ﴿٢٤﴾

24. మేము వారిని కొంతకాలం సుఖాలను అనుభవించనిస్తాము. ఆ తరువాత మేము వారిని కఠినమైన శిక్ష వైపుకు త్రోస్తాము.

1. చూడండి, 2:14 మరియు 15:17.
2. చూడండి, 2:112.

**25**. ఒకవేళ మీరు వారిని: "ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించింది ఎవరు?" అని అడిగితే! వారు నిస్సంకోచంగా అంటారు: "అల్లాహ్!" అని. వారితో అను: "సర్వ స్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే!" కాని వారిలో చాలా మందికి ఇది తెలియదు.

**26**. ఆకాశాలలో మరియు భూమిలో నున్న సమస్తమూ అల్లాహ్‌కే చెందుతుంది. నిశ్చయంగా, అల్లాహ్! కేవలం ఆయనే సర్వసంపన్నుడు, సర్వస్తోత్రాలకు అర్హుడు.

**27**. ఒకవేళ వాస్తవానికి, భూమిలో ఉన్న వృక్షాలన్నీ కలములై ఈ సముద్రం మరియు దానితో పాటు అటువంటి ఏడు సముద్రాల (నీళ్ళంతా) సిరాగా ఉన్నా, అల్లాహ్ మాటలు (సూచనలు వ్రాయటానికి) పూర్తికావు. నిశ్చయంగా అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.[1]

**28**. మీ అందరినీ సృష్టించటం మరియు తిరిగి (సజీవులుగా) లేపటం ఆయనకు ఒక మానవుణ్ణి (సృష్టించి, తిరిగి లేపడం వంటిదే). నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వం చూసేవాడు.

**29**. ఏమీ? నీకు తెలియదా (నీవు చూడటంలేదా)? నిశ్చయంగా, అల్లాహ్ రాత్రిని పగటిలోనికి ప్రవేశింపజేస్తున్నాడని మరియు పగటిని రాత్రిలోకి ప్రవేశింప జేస్తున్నాడని.[2] మరియు సూర్యుణ్ణి మరియు

وَلَئِن سَأَلْتَهُم مَّنْ خَلَقَ
ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ لَيَقُولُنَّ ٱللَّهُ ۚ
قُلِ ٱلْحَمْدُ لِلَّهِ ۚ بَلْ أَكْثَرُهُمْ لَا
يَعْلَمُونَ ﴿٢٥﴾
لِلَّهِ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ إِنَّ
ٱللَّهَ هُوَ ٱلْغَنِىُّ ٱلْحَمِيدُ ﴿٢٦﴾
وَلَوْ أَنَّمَا فِى ٱلْأَرْضِ مِن شَجَرَةٍ
أَقْلَٰمٌ وَٱلْبَحْرُ يَمُدُّهُۥ مِنۢ بَعْدِهِۦ
سَبْعَةُ أَبْحُرٍ مَّا نَفِدَتْ كَلِمَٰتُ
ٱللَّهِ ۗ إِنَّ ٱللَّهَ عَزِيزٌ حَكِيمٌ ﴿٢٧﴾
مَّا خَلْقُكُمْ وَلَا بَعْثُكُمْ إِلَّا
كَنَفْسٍ وَٰحِدَةٍ ۗ إِنَّ ٱللَّهَ سَمِيعٌۢ
بَصِيرٌ ﴿٢٨﴾
أَلَمْ تَرَ أَنَّ ٱللَّهَ يُولِجُ ٱلَّيْلَ فِى ٱلنَّهَارِ
وَيُولِجُ ٱلنَّهَارَ فِى ٱلَّيْلِ وَسَخَّرَ
ٱلشَّمْسَ وَٱلْقَمَرَ كُلٌّ يَجْرِىٓ إِلَىٰٓ

---

**1**. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 18:109.

**2**. అంటే చలికాలంలో రాత్రి పెద్దదై పగలు చిన్నదవటం మరియు వేసవి కాలంలో పగలు పెద్దదయి రాత్రి చిన్నదవటం.

أَجَلٍ مُّسَمًّى وَأَنَّ ٱللَّهَ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ ﴿٢٩﴾

చంద్రుణ్ణి నియమబద్ధులుగా చేసి ఉంచాడనీ ప్రతి ఒక్కటీ ఒక నిర్ణీత కాలంలో మరియు (పరిధిలో) తిరుగుతూ ఉంటాయనీ[1] మరియు నిశ్చయంగా, మీరు చేసేదంతా అల్లాహ్ ఎరుగుననని?

ذَٰلِكَ بِأَنَّ ٱللَّهَ هُوَ ٱلْحَقُّ وَأَنَّ مَا يَدْعُونَ مِن دُونِهِ ٱلْبَٰطِلُ وَأَنَّ ٱللَّهَ هُوَ ٱلْعَلِيُّ ٱلْكَبِيرُ ﴿٣٠﴾

**30**. ఇదంతా ఎందుకంటే! నిశ్చయంగా అల్లాహ్, కేవలం ఆయనే సత్యం మరియు ఆయనను వదలి వారు ఆరాధించేవన్నీ అసత్యాలు మరియు నిశ్చయంగా అల్లాహ్! కేవలం ఆయనే సర్వోన్నతుడు, మహనీయుడు (గొప్పవాడు).

أَلَمْ تَرَ أَنَّ ٱلْفُلْكَ تَجْرِى فِى ٱلْبَحْرِ بِنِعْمَتِ ٱللَّهِ لِيُرِيَكُم مِّنْ ءَايَٰتِهِۦٓ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَءَايَٰتٍ لِّكُلِّ صَبَّارٍ شَكُورٍ ﴿٣١﴾

**31**. ఏమీ? నీకు తెలియదా? మీకు కొన్ని సూచనలను తెలుపటానికి, అల్లాహ్ అనుగ్రహంతో, ఓడ సముద్రంలో పయనం చేస్తున్నదనీ? నిశ్చయంగా, ఇందులో సహనం వహించే ప్రతివానికి, కృతజ్ఞునికి, ఎన్నో సూచనలున్నాయి.

وَإِذَا غَشِيَهُم مَّوْجٌ كَٱلظُّلَلِ دَعَوُا۟ ٱللَّهَ مُخْلِصِينَ لَهُ ٱلدِّينَ فَلَمَّا نَجَّىٰهُمْ إِلَى ٱلْبَرِّ فَمِنْهُم مُّقْتَصِدٌ ۚ وَمَا يَجْحَدُ بِـَٔايَٰتِنَآ إِلَّا كُلُّ خَتَّارٍ كَفُورٍ ﴿٣٢﴾

**32**. మరియు వారిని సముద్రపు అల, మేఘంగా క్రమ్ముకున్నపుడు, వారు పరిపూర్ణ భక్తితో అల్లాహ్‌నే వేడుకుంటారు. కాని ఆయన వారిని రక్షించి ఒడ్డుకు చేర్చిన తరువాత వారిలో కొందరు (విశ్వాస-అవిశ్వాసాల) మధ్య ఆగిపోతారు.[2] మరియు మా సూచనలను, కేవలం విశ్వాసఘాతకులు, కృతఘ్నులైన వారు మాత్రమే, తిరస్కరిస్తారు.

---

**1**. ఈ నిర్ణీతకాలం, పునరుత్థానదినం కావచ్చు లేక అవి తమ పరిధిలో ఒకసారి చుట్టు తిరిగి మరల మొదటి స్థానానికి వచ్చుటకు పట్టే కాలం కావచ్చు!

**2**. చూడండి, 17:67 మరియు 29:65.

يَـٰٓأَيُّهَا ٱلنَّاسُ ٱتَّقُوا۟ رَبَّكُمْ وَٱخْشَوْا۟ يَوْمًا لَّا يَجْزِى وَالِدٌ عَن وَلَدِهِۦ وَلَا مَوْلُودٌ هُوَ جَازٍ عَن وَالِدِهِۦ شَيْـًٔا ۚ إِنَّ وَعْدَ ٱللَّهِ حَقٌّ ۖ فَلَا تَغُرَّنَّكُمُ ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَا وَلَا يَغُرَّنَّكُم بِٱللَّهِ ٱلْغَرُورُ ﴿٣٣﴾

33. ఓ మానవులారా! మీ ప్రభువునందే భయభక్తులు కలిగి ఉండండి మరియు ఆ దినానికి భయపడండి, (ఏనాడైతే) తండ్రి తన కుమారునికి నష్టపరిహారం చెల్లించలేడో మరియు ఏ కుమారుడు కూడా తన తండ్రికి ఎలాంటి నష్టపరిహారం చెల్లించలేడో! నిశ్చయంగా, అల్లాహ్ వాగ్దానం సత్యం! కావున ఈ ప్రాపంచిక జీవితం మిమ్మల్ని మోసానికి గురిచేయనివ్వకూడదు. మరియు ఆ వంచకుణ్ణి (షై'తానును) మిమ్మల్ని అల్లాహ్ విషయంలో వంచనకు గురిచేయ నివ్వకూడదు సుమా!

إِنَّ ٱللَّهَ عِندَهُۥ عِلْمُ ٱلسَّاعَةِ وَيُنَزِّلُ ٱلْغَيْثَ وَيَعْلَمُ مَا فِى ٱلْأَرْحَامِ ۖ وَمَا تَدْرِى نَفْسٌ مَّاذَا تَكْسِبُ غَدًا ۖ وَمَا تَدْرِى نَفْسٌۢ بِأَىِّ أَرْضٍ تَمُوتُ ۚ إِنَّ ٱللَّهَ عَلِيمٌ خَبِيرٌۢ ﴿٣٤﴾

34. నిశ్చయంగా, ఆ (అంతిమ) ఘడియ జ్ఞానం, కేవలం అల్లాహ్‌కు మాత్రమే ఉంది మరియు ఆయనే వర్షం కురిపించేవాడు మరియు గర్భాలలో ఉన్నదాని విషయం తెలిసినవాడు. మరియు తాను రేపు ఏమి సంపాదిస్తాడో, ఏ మానవుడు కూడా ఎరుగడు. మరియు ఏ మానవుడు కూడా తాను ఏ భూభాగంలో మరణిస్తాడో కూడా ఎరుగడు.[1] నిశ్చయంగా, అల్లాహ్ మాత్రమే సర్వజ్ఞుడు, సమస్తం తెలిసిన వాడు (ఎరిగినవాడు).

*****

1. పై ఐదు అగోచర విషయాల జ్ఞానం కేవలం అల్లాహ్‌కే ఉంది అవి: 1) అంతిమ ఘడియ సమయం, 2) వర్షం వచ్చే సమయం, 3) మాతృ గర్భంలో ఉన్నదాని గతి, 4) రేపు సంభవించబోయే విషయం మరియు 5) మానవుని మరణ స్థానం ('స'హీ'హ్ బు'ఖారీ).

## 32. సూరహ్ అస్-సజ్దహ్ سُورَةُ السَّجْدَةِ

అస్ సజ్దా: **సాష్టాంగం**. ఇది చివరి **మక్కా** సూరాహ్‌లలోనిది. సూరహ్ అల్-ము'మినూన్ (23) తరువాత అవతరింపజేయబడింది. దీనిపేరు **15**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది సూరహ్ అల్-'అంకబూత్ (29)తో మొదలైన నాల్గు సూరాహ్‌లలో 4 వది, చివరిది. దైవప్రవక్త ('స'అస) జుము'అహ్ రోజు ఫ'జ్ర్ నమా'జులో మొదటి రక'అత్‌లో ఈ సూరహ్ మరియు రెండవ రక'అత్‌లో సూరహ్ అల్-ఇన్సాన్ (76), చదివేవారు, (బు'ఖారీ, ముస్లిం). దైవప్రవక్త ('స'అస) రాత్రి నిద్రపోయే ముందు ఈ సూరహ్ మరియు సూరహ్ అల్-ముల్క్ (67) చదివేవారు, (తిర్మి'జీ' 892; అ'హ్మద్ 3/340). ఇందులో **30 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓمٓ ﴿١﴾

**1**. అలిఫ్-లామ్-మీమ్.

تَنزِيلُ ٱلْكِتَٰبِ لَا رَيْبَ فِيهِ مِن رَّبِّ ٱلْعَٰلَمِينَ ﴿٢﴾

**2**. నిస్సంకోచంగా, ఈ గ్రంథ (ఖుర్ఆన్) అవతరణ సర్వలోకాల ప్రభువు తరఫు నుండియే ఉంది.

أَمْ يَقُولُونَ ٱفْتَرَىٰهُ ۚ بَلْ هُوَ ٱلْحَقُّ مِن رَّبِّكَ لِتُنذِرَ قَوْمًا مَّآ أَتَىٰهُم مِّن نَّذِيرٍ مِّن قَبْلِكَ لَعَلَّهُمْ يَهْتَدُونَ ﴿٣﴾

**3**. ఏమీ? వారు (అవిశ్వాసులు): "ఇతనే (ము'హమ్మదే) దీనిని కల్పించాడు." అని అంటున్నారా?[1] అలాకాదు! వాస్తవానికి ఇది నీ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యం. నీకు పూర్వం హెచ్చరించే వారెవ్వరూ రాని జాతి వారికి నీవు హెచ్చరిక చేయటానికి, బహుశా వారు మార్గదర్శకత్వం పొందుతారేమోనని!

---

**1**. అలాంటప్పుడు వారిని ఇలాంటి గ్రంథాన్ని రచించి తెమ్మను? అనే ప్రశ్నకు చూడండి, 17:88, 52:34. ఇలాంటి 10 సూరాహ్‌లనైనా రచించి తెమ్మను? అనే ప్రశ్నకు, 11:13. ఇలాంటి ఒక్క సూరహ్‌నైనా రచించి తెమ్మను? అనే ప్రశ్నకు, 2:23, 10:38.

ٱللَّهُ ٱلَّذِى خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ وَمَا بَيْنَهُمَا فِى سِتَّةِ أَيَّامٍ ثُمَّ ٱسْتَوَىٰ عَلَى ٱلْعَرْشِ ۖ مَا لَكُم مِّن دُونِهِۦ مِن وَلِىٍّ وَلَا شَفِيعٍ ۚ أَفَلَا تَتَذَكَّرُونَ ﴿٤﴾

4. అల్లాహ్, ఆయనే ఆకాశాలను భూమిని మరియు వాటి మధ్య ఉన్నదంతా ఆరు దినము(అయ్యామ్)లలో[1] సృష్టించాడు, ఆ తరువాత సింహాసనాన్ని ('అర్ష్‌ను) అధిష్టించాడు. ఆయన తప్ప మీకు మరొక సంరక్షకుడు గానీ, సిఫారసు చేసేవాడు గానీ ఎవ్వడూ లేడు, అయినా మీరు హితబోధ గ్రహించరా?

يُدَبِّرُ ٱلْأَمْرَ مِنَ ٱلسَّمَآءِ إِلَى ٱلْأَرْضِ ثُمَّ يَعْرُجُ إِلَيْهِ فِى يَوْمٍ كَانَ مِقْدَارُهُۥٓ أَلْفَ سَنَةٍ مِّمَّا تَعُدُّونَ ﴿٥﴾

5. ఆయనే ఆకాశంనుండి భూమివరకు ప్రతి వ్యవహారాన్ని నడిపిస్తున్నాడు; తరువాత అంతా ఒకే దినమున,[2] ఆయన వద్దకు పోయి చేరుతుంది; దాని (ఆ దినపు) పరిమాణం మీ లెక్క ప్రకారం వేయి సంవత్సరాలు.

ذَٰلِكَ عَٰلِمُ ٱلْغَيْبِ وَٱلشَّهَٰدَةِ ٱلْعَزِيزُ ٱلرَّحِيمُ ﴿٦﴾

6. ఆయన(అల్లాహ్)యే అగోచర మరియు గోచర విషయాల జ్ఞానం గలవాడు, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

ٱلَّذِىٓ أَحْسَنَ كُلَّ شَىْءٍ خَلَقَهُۥ ۖ وَبَدَأَ خَلْقَ ٱلْإِنسَٰنِ مِن طِينٍ ﴿٧﴾

7. ఆయన తాను సృష్టించిన ప్రతి దానిని ఉత్తమరీతిలో చేశాడు. మరియు మానవ సృష్టిని మట్టితో ప్రారంభించాడు.[3]

---

1. చూడండి, 7:54 వ్యాఖ్యానం 1.
2. అంటే ఇది పునరుత్థానదినం అని, కొందరు వ్యాఖ్యాతలు బోధించారు. అది చాలా కష్టతరమైన దినం కావటం వల్ల వేయి సంవత్సరాలవలే కనిపిస్తుంది. చూడండి, 22:47లో కూడా: "..మరియు నిశ్చయంగా, నీ ప్రభువు వద్ద ఒక్క దినం, మీ లెక్కల ప్రకారం వేయి సంవత్సరాలకు సమానమైనది." అని ఉంది. కాని 70:4లో:"యాభై వేల సంవత్సరాలకు సమానమైన (ప్రమాణం గల) ఒక రోజులో, దేవదూతలు మరియు ఆత్మ (జిబ్రీల్ 'అ.స.) ఆయన (సు.తా.) వద్దకు అధిరోహిస్తారు." అని, ఉంది. అంటే వారు అంత తీవ్రంగా ప్రయాణం చేస్తారన్నమాట.
3. చూడండి, 23:12.

ثُمَّ جَعَلَ نَسۡلَهُۥ مِن سُلَٰلَةٖ مِّن مَّآءٖ مَّهِينٖ ﴿٨﴾

8. తరువాత అతని సంతతిని ఒక అధమమైన ద్రవపదార్థపు సారం (వీర్యం)తో చేశాడు.

ثُمَّ سَوَّىٰهُ وَنَفَخَ فِيهِ مِن رُّوحِهِۦۖ وَجَعَلَ لَكُمُ ٱلسَّمۡعَ وَٱلۡأَبۡصَٰرَ وَٱلۡأَفۡـِٔدَةَۚ قَلِيلٗا مَّا تَشۡكُرُونَ ﴿٩﴾

9. ఆ తరువాత, అతనిని యుక్తమైన రూపంలో తీర్చిదిద్ది, అతనిలో తన (నుండి) ప్రాణం (ఆత్మ) ఊదాడు.[1] మరియు మీకు వినేశక్తిని, చూసేశక్తిని మరియు హృదయాలను (అర్థంచేసుకునే శక్తిని) ఇచ్చాడు. (అయినా) మీరు కృతజ్ఞతలు తెలుపుకునేది చాలా తక్కువ!

وَقَالُوٓاْ أَءِذَا ضَلَلۡنَا فِي ٱلۡأَرۡضِ أَءِنَّا لَفِي خَلۡقٖ جَدِيدِۭۚ بَلۡ هُم بِلِقَآءِ رَبِّهِمۡ كَٰفِرُونَ ﴿١٠﴾

10. మరియు వారు (అవిశ్వాసులు) అంటున్నారు: "ఏమీ? మేము నశించి, మట్టిలో కలిసిపోయినా, మేము మళ్ళీ క్రొత్తగా సృష్టించబడతామా?" అది కాదు! వారు తమ ప్రభువుతో కాబోయే సమావేశాన్ని తిరస్కరిస్తున్నారు.[2] (5/8)

۞ قُلۡ يَتَوَفَّىٰكُم مَّلَكُ ٱلۡمَوۡتِ ٱلَّذِي وُكِّلَ بِكُمۡ ثُمَّ إِلَىٰ رَبِّكُمۡ تُرۡجَعُونَ ﴿١١﴾

11. * వారితో ఇలా అను: "మీపై నియమించబడిన మృత్యుదూత మీ ప్రాణం తీస్తాడు. ఆ తరువాత మీరు మీ ప్రభువు వద్దకు మరలింపబడతారు."

وَلَوۡ تَرَىٰٓ إِذِ ٱلۡمُجۡرِمُونَ نَاكِسُواْ رُءُوسِهِمۡ عِندَ رَبِّهِمۡ رَبَّنَآ أَبۡصَرۡنَا وَسَمِعۡنَا فَٱرۡجِعۡنَا نَعۡمَلۡ صَٰلِحًا إِنَّا مُوقِنُونَ ﴿١٢﴾

12. మరియు (పునరుత్థాన దినమున) ఈ అపరాధులు, తమ ప్రభువు సమక్షంలో, ఏ విధంగా తమ తలలు వంచుకొని నిలబడి ఉంటారో, నీవు చూడగలిగితే! వారు: "ఓ మా ప్రభూ! మేమిప్పుడు చూశాము మరియు విన్నాము, కావున మమ్మల్ని తిరిగి (భూలోకానికి) పంపించు. మేము సత్కార్యాలు చేస్తాము, నిశ్చయంగా, మాకు ఇప్పుడు నమ్మకం కలిగింది." అని అంటారు.

---

1. చూడండి, 15:29, 38:72.
2. చూడండి, 13:5.

وَلَوْ شِئْنَا لَآتَيْنَا كُلَّ نَفْسٍ هُدَاهَا وَلَٰكِنْ حَقَّ الْقَوْلُ مِنِّي لَأَمْلَأَنَّ جَهَنَّمَ مِنَ الْجِنَّةِ وَالنَّاسِ أَجْمَعِينَ ﴿١٣﴾

13. మరియు, మేము కోరినట్లయితే, ప్రతి వ్యక్తికి (ఆత్మకు) దాని మార్గదర్శకత్వం చేసి ఉండేవారము.[1] కాని, నేను: "నిశ్చయంగా జిన్నాతులు మరియు మానవులందరితో నరకాన్ని నింపివేస్తాను." అని పలికిన, నా మాట సత్యమయ్యింది.[2]

فَذُوقُوا بِمَا نَسِيتُمْ لِقَاءَ يَوْمِكُمْ هَٰذَا إِنَّا نَسِينَاكُمْ ۖ وَذُوقُوا عَذَابَ الْخُلْدِ بِمَا كُنْتُمْ تَعْمَلُونَ ﴿١٤﴾

14. కావున మీరు మీయొక్క ఈనాటి సమావేశాన్ని మరచిపోయిన దాని ఫలితాన్ని రుచిచూడండి. నిశ్చయంగా, మేము కూడా మిమ్మల్ని మరచిపోయాము. మరియు మీరు మీకర్మల ఫలితమైన ఈ శాశ్వత శిక్షను రుచిచూడండి!

إِنَّمَا يُؤْمِنُ بِآيَاتِنَا الَّذِينَ إِذَا ذُكِّرُوا بِهَا خَرُّوا سُجَّدًا وَسَبَّحُوا بِحَمْدِ رَبِّهِمْ وَهُمْ لَا يَسْتَكْبِرُونَ ۩ ﴿١٥﴾

15. నిశ్చయంగా వారే, మా సూచన (ఆయతు)లు వారికి బోధించినప్పుడు, వాటిని విశ్వసించి **సాష్టాంగం(సజ్దా)**లో పడిపోతారు మరియు తమ ప్రభువు పవిత్రతను కొనియాడుతారు మరియు ఆయనను స్తుతిస్తారు మరియు వారెన్నడూ గర్వపడరు; ۩

تَتَجَافَىٰ جُنُوبُهُمْ عَنِ الْمَضَاجِعِ يَدْعُونَ رَبَّهُمْ خَوْفًا وَطَمَعًا وَمِمَّا رَزَقْنَاهُمْ يُنْفِقُونَ ﴿١٦﴾

16. వారు (రాత్రులలో) తమ ప్రక్కలను తమ పరుపులనుండి దూరంచేసి, తమ ప్రభువును భయంతో మరియు ఆశతో వేడుకుంటారు[3] మరియు మేము వారికి ప్రసాదించిన జీవనోపాధి నుండి ఖర్చుచేస్తారు.

فَلَا تَعْلَمُ نَفْسٌ مَا أُخْفِيَ لَهُمْ مِنْ قُرَّةِ أَعْيُنٍ جَزَاءً بِمَا كَانُوا يَعْمَلُونَ ﴿١٧﴾

17. కాని వారికి, వారి కర్మల ఫలితంగా వారి కొరకు (పరలోకంలో) కళ్ళకు చలువనిచ్చే ఎటువంటి సామాగ్రి దాచిపెట్టబడిఉందో ఏ ప్రాణికీ తెలియదు.[4]

---

1. చూడండి, 26:4. అల్లాహ్ (సు.తా.) ఎవ్వరినీ సన్మార్గం మీద ఉండటానికి బలవంతం చేయడు కాని మార్గదర్శకత్వం చేస్తాడు. దానిని అనుసరించనివాడు శిక్షకు గురి అవుతాడు.
2. ఇటువంటి వాక్యాలకు చూడండి, 7:18 మరియు 11:119.
3. రాత్రులలో లేచి తహజ్జుద్ (నఫిల్) నమాజులు చేస్తారు.
4. 'హదీస్' ఖుద్సీ: నేను నా పుణ్యాత్ములైన దాసులకొరకు స్వర్గంలో సిద్ధపరచి ఉంచిన

أَفَمَن كَانَ مُؤْمِنًا كَمَن كَانَ فَاسِقًاۚ لَّا يَسْتَوُۥنَ ۝١٨

**18**. ఏమీ? విశ్వాసి అయినవాడు (దైవభీతి లేని) అవిధేయునితో సమానుడా? (కాదు)! వారు సరిసమానులు కాలేరు.[1]

أَمَّا ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ فَلَهُمْ جَنَّٰتُ ٱلْمَأْوَىٰ نُزُلَۢا بِمَا كَانُواْ يَعْمَلُونَ ۝١٩

**19**. ఎవరైతే విశ్వసించి, సత్కార్యాలు చేస్తారో, వారికి వారి కర్మలకు ఫలితంగా, వారి ఆతిథ్యం కొరకు స్వర్గవనాలలో నివాసాలుంటాయి.

وَأَمَّا ٱلَّذِينَ فَسَقُواْ فَمَأْوَىٰهُمُ ٱلنَّارُۖ كُلَّمَآ أَرَادُوٓاْ أَن يَخْرُجُواْ مِنْهَآ أُعِيدُواْ فِيهَا وَقِيلَ لَهُمْ ذُوقُواْ عَذَابَ ٱلنَّارِ ٱلَّذِى كُنتُم بِهِۦ تُكَذِّبُونَ ۝٢٠

**20**. ఇక ఎవరైతే, విద్రోహ వైఖరి అవలంబిస్తారో, వారి నివాసం నరకాగ్నియే. ప్రతిసారి వారు దానినుండి బయటపడటానికి ప్రయత్నించినపుడల్లా, వారందులోకి తిరిగి నెట్టబడతారు. మరియు వారితో ఇలా అనబడుతుంది: "మీరు తిరస్కరిస్తూ ఉండిన నరకాగ్ని శిక్షను చవిచూడండి."

وَلَنُذِيقَنَّهُم مِّنَ ٱلْعَذَابِ ٱلْأَدْنَىٰ دُونَ ٱلْعَذَابِ ٱلْأَكْبَرِ لَعَلَّهُمْ يَرْجِعُونَ ۝٢١

**21**. మరియు ఆ పెద్ద శిక్షకు ముందు మేము (ఇహలోకంలో) వారికి సమీపశిక్షను రుచిచూపుతాము.[2] బహుశా, వారు (పశ్చాత్తాపపడి సత్కార్యాల వైపునకు) మరలి వస్తారేమోనని!

وَمَنْ أَظْلَمُ مِمَّن ذُكِّرَ بِـَٔايَٰتِ رَبِّهِۦ ثُمَّ أَعْرَضَ عَنْهَآۚ إِنَّا مِنَ ٱلْمُجْرِمِينَ مُنتَقِمُونَ ۝٢٢

**22**. మరియు తన ప్రభువు సూచన (ఆయత్)ల ద్వారా హితబోధ చేయబడిన తరువాత కూడా, వాటి నుండి విముఖుడయ్యే వానికంటే ఎక్కువ దుర్మార్గుడెవడు? నిశ్చయంగా, మేము అలాంటి అపరాధులకు ప్రతీకారం[3] చేసి తీరుతాము.

---

వాటిని ఇంతవరకు ఏ కన్నూ చూడలేదు, ఏచెవీ వినలేదు మరియు ఏ మానవుడు కూడా వాటిని గురించి ఆలోచించలేడు, (స'హీ'హ్ బు'ఖారీ మరియు స.ముస్లిం).

**1**. ఇటువంటి ఆయతులకు చూడండి, 45:21, 38:28, 59:20 మొదలైనవి.

**2**. చూడండి, 52:47.

**3**. **అల్-ముంతఖిమ్** (సేకరించబడిన పదం): ప్రతీకారం తీర్చుకునే, ప్రతీకారం చేసే, దుష్టులను శిక్షించే వాడు. చూడండి, 30:47.

23. మరియు వాస్తవంగా, మేము మూసాకు గ్రంథాన్ని ఇచ్చాము. కావున, (ఓ ప్రవక్తా) నీవు! అతనిని (ఇస్రా' రాత్రిలో) కలుసుకోబోయే విషయాన్ని గురించి సందేహంలోపడకు.[1] మరియు మేము దానిని (తౌరాత్‌ను) ఇస్రాయీ'ల్ సంతతి వారికి మార్గదర్శినిగా చేశాము.[2]

وَلَقَدۡ ءَاتَيۡنَا مُوسَى ٱلۡكِتَٰبَ فَلَا تَكُن فِي مِرۡيَةٖ مِّن لِّقَآئِهِۦۖ وَجَعَلۡنَٰهُ هُدٗى لِّبَنِيٓ إِسۡرَٰٓءِيلَ ٢٣

24. మరియు మేము (ఇస్రాయీ'ల్ సంతతివారి) వారిలో నుండి కొందరిని నాయకులుగా చేశాము - వారు, వారికి మా ఆజ్ఞానుసారంగా మార్గదర్శకత్వం చేస్తూ ఉన్నారు - ఎంతవరకైతే వారు సహనం వహించి ఉన్నారో మరియు వారు మా (ఆయాత్)సూచనలను నమ్ముతూ ఉన్నారో!

وَجَعَلۡنَا مِنۡهُمۡ أَئِمَّةٗ يَهۡدُونَ بِأَمۡرِنَا لَمَّا صَبَرُواْۖ وَكَانُواْ بِـَٔايَٰتِنَا يُوقِنُونَ ٢٤

25. నిశ్చయంగా, నీ ప్రభువు, పునరుత్థాన దినమున, వారికున్న భేదాభిప్రాయాలను గురించి వారిమధ్య తీర్పుచేస్తాడు.[3]

إِنَّ رَبَّكَ هُوَ يَفۡصِلُ بَيۡنَهُمۡ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ فِيمَا كَانُواْ فِيهِ يَخۡتَلِفُونَ ٢٥

26. ఏమీ? వీరికి పూర్వం అనేక తరాలను నాశనం చేసిన విషయం వీరికి మార్గదర్శకత్వం కాదా? వీరు, వారి నివాసస్థలాలలో తిరుగుతున్నారు కదా! నిశ్చయంగా ఇందులో ఎన్నో సూచనలున్నాయి. ఏమీ? వీరు వినటంలేదా?

أَوَلَمۡ يَهۡدِ لَهُمۡ كَمۡ أَهۡلَكۡنَا مِن قَبۡلِهِم مِّنَ ٱلۡقُرُونِ يَمۡشُونَ فِي مَسَٰكِنِهِمۡۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَٰتٍۚ أَفَلَا يَسۡمَعُونَ ٢٦

---

1. మహాప్రవక్త ('స'అస) మె'అరాజ్ రాత్రిలో మూసా ('అ.స.)ను కలుసుకున్నప్పుడు అతను, దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)కు, అల్లాహ్ (సు.తా.)ను వేడుకొని, నమా'జ్‌ల సంఖ్యను, తగ్గించుకోమని సలహా ఇచ్చిన విషయాన్ని ఈ ఆయత్ సూచిస్తుందని వ్యాఖ్యాతలు అభిప్రాయపడ్డారు.
2. ఇక్కడ సంబోధన మూసా ('అ.స.)కు కూడా కావచ్చు.
3. చూడండి, 22:67-69.

أَوَلَمْ يَرَوْاْ أَنَّا نَسُوقُ ٱلْمَآءَ إِلَى ٱلْأَرْضِ ٱلْجُرُزِ فَنُخْرِجُ بِهِۦ زَرْعًا تَأْكُلُ مِنْهُ أَنْعَٰمُهُمْ وَأَنفُسُهُمْ ۖ أَفَلَا يُبْصِرُونَ ﴿٢٧﴾

27. ఏమీ? వారు చూడటం లేదా? నిశ్చయంగా, మేము ఒక బంజరు భూమి వైపునకు నీళ్ళను (వర్షాన్ని) పంపి దాని నుండి పైరును ఉత్పత్తి చేస్తే, దానిని వారి పశువులు మరియు వారూ తింటున్నారని! ఏమీ? వారిది గమనించటం (చూడటం) లేదా?

وَيَقُولُونَ مَتَىٰ هَٰذَا ٱلْفَتْحُ إِن كُنتُمْ صَٰدِقِينَ ﴿٢٨﴾

28. ఇంకా ఇలా అంటున్నారు: "మీరు సత్యవంతులే అయితే, ఆ తీర్పు ఎప్పుడు వస్తుందో చెప్పండి!"[1]

قُلْ يَوْمَ ٱلْفَتْحِ لَا يَنفَعُ ٱلَّذِينَ كَفَرُوٓاْ إِيمَٰنُهُمْ وَلَا هُمْ يُنظَرُونَ ﴿٢٩﴾

29. ఇలా అను: "ఆ తీర్పుదినం నాడు[2] సత్యతిరస్కారులు విశ్వసించ గోరినా, అది వారికి ఏ విధంగానూ పనికిరాదు! మరియు వారికెలాంటి గడువు కూడా ఇవ్వబడదు."

فَأَعْرِضْ عَنْهُمْ وَٱنتَظِرْ إِنَّهُم مُّنتَظِرُونَ ﴿٣٠﴾

30. కావున నీవు వారితో విముఖుడవగు![3] మరియు వేచిఉండు, నిశ్చయంగా, వారు కూడా (ఆ దినం కొరకు) వేచిఉంటారు. (3/4)

*****

1. ఇక్కడ తీర్పు అంటే, ఆ తీర్పు దేనినైతే ముష్రిక్ ఖురైషులు తమ మీదికి తెమ్మని దైవప్రవక్త ('స'అస)ను హేళనతో అడిగేవారో. అంటే అల్లాహ్ (సు.తా.) శిక్ష.

2. ఇక్కడ తీర్పుదినం అంటే పునరుత్థాన దినం.

3. చూడండి, 6:106.

## 33. సూరహ్ అల్-అ'హ్'జాబ్ سُورَةُ الأَحْزَابِ

**మదీనాలో** అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **73 ఆయతులు** ఉన్నాయి. దీనిపేరు **20 (9-27) ఆయత్‌లలో** వివరించబడిన, షవ్వాల్ 5వ హి|జ్రీలో జరిగిన **తెగలవారి యుద్ధం** పేరుతో ఇవ్వబడింది. ఆ యుద్ధం మరొక పేరు కందక యుద్ధం. 4వ హి|జ్రీలో మదీనా నుండి వెళ్ళగొట్టబడిన బనూ-న'దీర్ తెగవారు ము|ష్రిక్ ఖురైషులను ప్రోత్సహించి, చుట్టు ప్రక్కల నున్న ము|ష్రిక్ తెగలైన బనూ-కినానా, బనూ-అసద్ మరియు బనూ-'గ'త్ఫాన్ వారినీ, ఇంకా ఇతరులను కలుపుకొని మదీనా నగరాన్నీ, అందులోఉన్న ఆ కాలపు చిన్న ముస్లిం సమాజాన్నీ పూర్తిగా రూపుమాపాలనే ఉద్దేశంతో దాదాపు 12,000 యుద్ధవీరులను తీసుకొని మదీనాపై దండయాత్ర చేస్తారు.

2వ హి|జ్రీ రమ'దాన్ నెలలో జరిగిన బద్ర్ యుద్ధంలో మక్కా ము|ష్రిక్‌లు ఓడి పారిపోతారు. 3వ హి|జ్రీ షవ్వాల్‌లో ఉహుద్ వద్ద వారు ముస్లిములపై చేసిన దండయాత్రలో ముస్లింలకు హాని కలుగజేసినా, మదీనా నగరం వారి దాడినుండి కాపాడబడుతుంది.

కాబట్టి ఈ సారి వారు ఏవిధంగానైనా మదీనా వాసులైన ముస్లింలను పూర్తిగా నిర్మూలించాలనే ఉద్దేశంతో ముస్లింలకు విరోధులైన అన్ని తెగలవారిని కలుపుకొని దాదాపు 12,000 యుద్ధవీరులతో, ఎంతో యుద్ధసామగ్రిని సిద్ధపరచుకొని వస్తారు. ఈ విషయం ముందుగానే తెలుసుకొని, దైవప్రవక్త ('స'అస) మదీనా నగరాన్ని ఏ విధంగానైనా కాపాడుకోదలుస్తారు. మదీనా చుట్టూ లావారాళ్ళు ఉన్నాయి. దక్షిణవైపు ఉన్న యూద తెగ, బనూ-ఖురై''జహ్ వారితో ముస్లింల ఒప్పందం ఉంటుంది. కాబట్టి వారు, ఆ దిక్కునుండి శత్రువులను రానివ్వమంటారు. ఇక ఒకవైపు నుండి మాత్రమే శత్రువులు వచ్చే అవకాశం ఉంటుంది. కాబట్టి దైవప్రవక్త ('స'అస) సల్మాన్ ఫార్సీ, (ర'ది.'అ.) సలహాతో ఆ వైపు ఒక పెద్ద కందకం త్రవ్విస్తారు. దాని వల్ల శత్రువులు మదీనాలోకి రాలేకపోతారు. కాని బనూ-న'దీర్ తెగవారి మాటలకు లోనై బనూ-ఖురై''జా తెగవారు ముస్లింలతో చేసుకున్న ఒప్పందం త్రెంపుకుంటారు. కాని అల్లాహ్ (సు.తా.) అనుగ్రహంతో బనూ-ఖురై''జా మరియు బనూ-న'దీర్ తెగల మధ్య భేదాభిప్రాయాలు రావటం వల్ల బనూ-ఖురై''జా తెగవారు ముస్లింల మీద దాడిచేయరు. ము|ష్రిక్ ఖురైషులు మరియు వారితోపాటు వచ్చినవారు, దాదాపు మూడు వారాలు కందకపు అటువైపు ఉండి, ఆ తరువాత ఎంతో చల్లని తూఫాన్ గాలి ఎడతెగకుండా వీచటంవల్ల, దానికి తట్టుకోలేక వెనుదిరిగి పోతారు. ఈ విధంగా ఆ చిన్న ఇస్లాం సమాజం మరియు మదీనా నగరం అల్లాహ్ (సు.తా.) అనుగ్రహంతో కాపాడబడతాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

يَٰٓأَيُّهَا ٱلنَّبِيُّ ٱتَّقِ ٱللَّهَ وَلَا تُطِعِ ٱلْكَٰفِرِينَ وَٱلْمُنَٰفِقِينَ ۗ إِنَّ ٱللَّهَ كَانَ عَلِيمًا حَكِيمًا ﴿١﴾

1. * ఓ ప్రవక్తా! అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండు మరియు సత్యతిరస్కారుల మరియు కపట విశ్వాసుల యొక్క అభిప్రాయాన్ని లక్ష్యపెట్టకు. నిశ్చయంగా, అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేచనాపరుడు.

وَٱتَّبِعْ مَا يُوحَىٰٓ إِلَيْكَ مِن رَّبِّكَ ۚ إِنَّ ٱللَّهَ كَانَ بِمَا تَعْمَلُونَ خَبِيرًا ﴿٢﴾

2. మరియు నీ ప్రభువు తరఫునుండి నీపై అవతరింపజేయబడిన దివ్యజ్ఞానం (వ'హీని) మాత్రమే అనుసరించు. నిశ్చయంగా, అల్లాహ్ మీరు చేసేదంతా ఎరుగును.

وَتَوَكَّلْ عَلَى ٱللَّهِ ۚ وَكَفَىٰ بِٱللَّهِ وَكِيلًا ﴿٣﴾

3. కావున అల్లాహ్‌పైననే నమ్మకం ఉంచుకో. మరియు కార్యసాధకుడుగా అల్లాహ్ చాలు.

مَّا جَعَلَ ٱللَّهُ لِرَجُلٍ مِّن قَلْبَيْنِ فِى جَوْفِهِۦ ۚ وَمَا جَعَلَ أَزْوَٰجَكُمُ ٱلَّٰٓـِٔى تُظَٰهِرُونَ مِنْهُنَّ أُمَّهَٰتِكُمْ ۚ وَمَا جَعَلَ أَدْعِيَآءَكُمْ أَبْنَآءَكُمْ ۚ ذَٰلِكُمْ قَوْلُكُم بِأَفْوَٰهِكُمْ ۖ وَٱللَّهُ يَقُولُ ٱلْحَقَّ وَهُوَ يَهْدِى ٱلسَّبِيلَ ﴿٤﴾

4. అల్లాహ్, ఏ వ్యక్తి ఎదలో కూడా రెండు హృదయాలు పెట్టలేదు. మరియు మీరు మీ భార్యలను, 'తల్లులు' అని పలికి, ''జిహార్[1] చేసినంతటనే వారిని మీకు తల్లులుగా చేయలేదు. మరియు మీరు దత్త తీసుకొన్న వారిని మీ (కన్న) కుమారులుగా చేయలేదు. ఇవన్నీ మీరు మీ నోటితో పలికే మాటలు మాత్రమే! మరియు అల్లాహ్ సత్యం పలుకుతాడు మరియు ఆయన (ఋజు) మార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తాడు.

1. ''జిహార్: అంటే భార్యను తల్లిగా ఎంచటం ఏ విధంగానైతే ఒక వక్షంలో రెండు హృదయాలు ఉండవో అదే విదంగా ఒక వ్యక్తికి ఇద్దరు తల్లులు ఉండరు. ఇద్దరు తండ్రులు కూడా ఉండరు. కావున ఇస్లాంకు ముందు, ముష్రికులు తమ భార్యను శిక్షించటానికి: ''ఈ నాటి నుండి నేను నిన్ను తల్లిగా భావిస్తున్నాను.'' అని చెప్పి, ఆమెకు విడాకులివ్వకుండా తన ఇంట్లోనే ఉంచుకొని బాధించేవారు. ఇస్లాం దానిని నిషేధించింది. దత్తకుమారులు, మీ కుమారులు కారు. కాబట్టి వారిని వారి వాస్తవ తండ్రి పేరుతోనే కలిపి పిలవాలి అనే శాసనం కూడా ఇచ్చింది.

ٱدْعُوهُمْ لِـَٔابَآئِهِمْ هُوَ أَقْسَطُ عِندَ ٱللَّهِ ۚ فَإِن لَّمْ تَعْلَمُوٓا۟ ءَابَآءَهُمْ فَإِخْوَٰنُكُمْ فِى ٱلدِّينِ وَمَوَٰلِيكُمْ ۚ وَلَيْسَ عَلَيْكُمْ جُنَاحٌ فِيمَآ أَخْطَأْتُم بِهِۦ وَلَـٰكِن مَّا تَعَمَّدَتْ قُلُوبُكُمْ ۚ وَكَانَ ٱللَّهُ غَفُورًا رَّحِيمًا ﴿٥﴾

5. వారిని (మీ దత్తపిల్లలను), వారి (వాస్తవ) తండ్రుల పేర్లతోనే కలిపి పిలవండి.[1] అల్లాహ్ దృష్టిలో ఇదే న్యాయమైనది. ఒక వేళ వారి తండ్రులెవరో మీకు తెలియకపోతే, అపుడు వారు మీధార్మిక సోదరులు మరియు మీ స్నేహితులు.[2] మీరు ఈ విషయంలో (ఇంతవరకు) చేసిన పొరపాటు గురించి మీ కెలాంటి పాపం లేదు, కాని ఇక ముందు మీరు ఉద్దేశ్యపూర్వకంగా చేస్తే (పాపం) అవుతుంది. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

ٱلنَّبِىُّ أَوْلَىٰ بِٱلْمُؤْمِنِينَ مِنْ أَنفُسِهِمْ ۖ وَأَزْوَٰجُهُۥٓ أُمَّهَـٰتُهُمْ ۗ وَأُو۟لُوا۟ ٱلْأَرْحَامِ بَعْضُهُمْ أَوْلَىٰ بِبَعْضٍ فِى كِتَـٰبِ ٱللَّهِ مِنَ ٱلْمُؤْمِنِينَ وَٱلْمُهَـٰجِرِينَ إِلَّآ

6. విశ్వాసులకు (ముస్లింలకు), దైవప్రవక్త స్వయంగా తమకంటే కూడా ముఖ్యుడు.[3] మరియు అతని భార్యలు వారికి తల్లులు.[4] అల్లాహ్ గ్రంథం ప్రకారం రక్త సంబంధీకులు - ఇతర విశ్వాసుల మరియు వలస వచ్చిన వారి (ముహాజిర్ల) కంటే - ఒకరికొకరు

---

1. అంటే వారు వారి వాస్తవతండ్రి పేరుతోనే పిలువబడాలి. దానితో వారి నిజ వ్యక్తిత్వం భద్రపరచబడుతుంది. వారిని మీ నిజ సంతానంగా పరిగణించకండి.
2. ఒకవేళ దత్తపుత్రుని వాస్తవతండ్రి పేరు తెలియకుంటే, వారు మీ ధార్మిక సోదరులు అట్టి పక్షంలో కూడా వారిని పోషించండి, కాని మీ పుత్రులుగా చేసుకొని, మీ పేరు ఇవ్వకండి.
3. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'నేను, మీకు మీ తండ్రులకంటే, మీ సంతానం కంటే మరియు సర్వమానవుల కంటే ఎక్కువ ప్రీతిపాత్రుడనయ్యేంత వరకు మీరు నిజమైన విశ్వాసులు కాజాలరు!' (బు'ఖారీ ముస్లిం) - అనస్ (ర'ది.'అ.) కథనం.
4. దైవప్రవక్త ('స'అస) భార్యలు (ర'ది. 'అన్హుమ్‌లు) ముస్లింల తల్లులవంటి వారు. కాబట్టి ఈ ఆయత్ శాసనం ప్రకారం దైవప్రవక్త మరణం తరువాత, వారిని ఎవ్వరూ వివాహమాడరాదు. ఇంకా చూడండి 8:75. అందులో విశ్వాసుల పరస్పర సహోదరత్వం తెలుపబడింది. మరియు ఈ ఆయత్‌లో ఒక విశ్వాసునికి, దైవప్రవక్త ('స'అస) మరియు అతని భార్యలు (ర'ది. 'అన్హుమ్‌లు), తల్లిదండ్రులవంటి వారు అని తెలుపబడింది.

أَن تَفۡعَلُوٓاْ إِلَىٰٓ أَوۡلِيَآئِكُم مَّعۡرُوفٗاۚ كَانَ ذَٰلِكَ فِي ٱلۡكِتَٰبِ مَسۡطُورٗا ٦

ఎక్కువగా పరస్పర సంబంధం (హక్కులు) గలవారు. కాని! మీరు మీ స్నేహితులకు మేలు చేయగోరితే (అది వేరే విషయం)![1] వాస్తవానికి ఇదంతా గ్రంథంలో వ్రాయబడి వుంది.

وَإِذۡ أَخَذۡنَا مِنَ ٱلنَّبِيِّـۧنَ مِيثَٰقَهُمۡ وَمِنكَ وَمِن نُّوحٖ وَإِبۡرَٰهِيمَ وَمُوسَىٰ وَعِيسَى ٱبۡنِ مَرۡيَمَۖ وَأَخَذۡنَا مِنۡهُم مِّيثَٰقًا غَلِيظٗا ٧

7. మరియు (జ్ఞాపకం ఉంచుకో) వాస్తవానికి మేము ప్రవక్తలందరి నుండి వాగ్దానం తీసుకున్నాము; మరియు నీతో (ఓ ము'హమ్మద్), నూ'హ్‌తో, ఇబ్రాహీమ్‌తో, మూసాతో మరియు మర్యమ్ కుమారుడైన 'ఈసాతో కూడా! మరియు మేము వారందరి నుండి గట్టి వాగ్దానం తీసుకున్నాము.[2]

لِّيَسۡـَٔلَ ٱلصَّٰدِقِينَ عَن صِدۡقِهِمۡۚ وَأَعَدَّ لِلۡكَٰفِرِينَ عَذَابًا أَلِيمٗا ٨

8. ఇది సత్యవంతులను, వారి సత్యాన్ని గురించి ప్రశ్నించడానికి. మరియు ఆయన సత్యతిరస్కారుల కొరకు బాధాకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచాడు.[3]

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ ٱذۡكُرُواْ نِعۡمَةَ ٱللَّهِ عَلَيۡكُمۡ إِذۡ جَآءَتۡكُمۡ جُنُودٞ فَأَرۡسَلۡنَا عَلَيۡهِمۡ رِيحٗا وَجُنُودٗا لَّمۡ تَرَوۡهَاۚ وَكَانَ ٱللَّهُ بِمَا تَعۡمَلُونَ بَصِيرًا ٩

9. ఓ విశ్వాసులారా! అల్లాహ్ మీకు చేసిన అనుగ్రహాన్ని జ్ఞాపకం చేసుకోండి. మీపైకి సైన్యాలు (దండెత్తి) వచ్చినపుడు, మేము వారిపైకి ఒక తుఫాను గాలిని మరియు మీకు కనబడని సైన్యాలను పంపాము.[4] మరియు అల్లాహ్ మీరు చేసేదంతా చూస్తున్నాడు.

---

1. చూడండి, 49:10 మరియు 8:75 దగ్గరిబంధువులు తప్ప ఇతరులు వారసులు కాలేరు.
2. చూడండి, 3:81, 42:13.
3. చూడండి, 5:109 మరియు 7:6.
4. ఈ సూరహ్ యొక్క 9-27 ఆయతులు కందక యుద్ధం ('గ'జ్వతుల్ అ'హ్జాబ్) గురించి ఉన్నాయి. ఇంకా చూడండి, 3:124-125.

إِذۡ جَآءُوكُم مِّن فَوۡقِكُمۡ وَمِنۡ أَسۡفَلَ
مِنكُمۡ وَإِذۡ زَاغَتِ ٱلۡأَبۡصَٰرُ
وَبَلَغَتِ ٱلۡقُلُوبُ ٱلۡحَنَاجِرَ
وَتَظُنُّونَ بِٱللَّهِ ٱلظُّنُونَا۠ ١٠
هُنَالِكَ ٱبۡتُلِيَ ٱلۡمُؤۡمِنُونَ وَزُلۡزِلُواْ
زِلۡزَالٗا شَدِيدٗا ١١
وَإِذۡ يَقُولُ ٱلۡمُنَٰفِقُونَ وَٱلَّذِينَ فِي
قُلُوبِهِم مَّرَضٞ مَّا وَعَدَنَا ٱللَّهُ وَرَسُولُهُۥٓ
إِلَّا غُرُورٗا ١٢
وَإِذۡ قَالَت طَّآئِفَةٞ مِّنۡهُمۡ يَٰٓأَهۡلَ
يَثۡرِبَ لَا مُقَامَ لَكُمۡ فَٱرۡجِعُواْۚ
وَيَسۡتَـٔۡذِنُ فَرِيقٞ مِّنۡهُمُ ٱلنَّبِيَّ
يَقُولُونَ إِنَّ بُيُوتَنَا عَوۡرَةٞ وَمَا هِيَ بِعَوۡرَةٍۖ
إِن يُرِيدُونَ إِلَّا فِرَارٗا ١٣

**10**. వారు (మీ శత్రువులు) మీ మీదకు పైనుండి మరియు క్రింది నుండి (దండెత్తి) వచ్చినపుడు[1] మరియు మీ కళ్ళు (భయంతో) తిరిగిపోయి, మీ గుండెలు గొంతులోనికి వచ్చినపుడు, మీరు అల్లాహ్‌ను గురించి పలువిధాలుగా ఊహించసాగారు.

**11**. అక్కడ (ఆ సమయంలో) విశ్వాసులు పరీక్షించబడ్డారు. మరియు దానితో వారు తీవ్రంగా కంపింపజేయబడ్డారు.

**12**. మరియు ఆ సమయంలో, కపట విశ్వాసులు మరియు తమ హృదయాలలో రోగమున్నవారు: "అల్లాహ్ మరియు ఆయన సందేశహరుడు మాతో చేసిన వాగ్దానాలన్నీ బూటకాలు మాత్రమే!" అని అనసాగారు.[2]

**13**. అప్పుడు వారిలోని ఒక పక్షంవారు: "ఓ యస్'రిబ్[3] (మదీనా మునవ్వరా) ప్రజలారా! ఇక మీరు వీరిని (శత్రువులను) ఎదిరించలేరు. కనుక వెనుదిరగండి!" అని, అన్నారు. మరియు వారిలో మరొక వర్గం వారు, ప్రవక్తతో ఈ విధంగా పలుకుతూ (వెనుదిరిగి) పోవటానికి అనుమతి అడగసాగారు: "మా ఇండ్లు భద్రంగాలేవు."[4] కాని వాస్తవానికి అవి భద్రంగానే ఉండెను. వారు కేవలం అక్కడి నుండి పారిపోదలచారు.

---

**1**. పైనుండి నజ్ద్, ఉత్తర తూర్పు నుండి వచ్చిన 'గ'త్ఫాన్, హవా'జిన్ మరియు ఇతర తెగల వారు; క్రింది నుండి ఖురైషులు; మరియు పడమర దిక్కునుండి ఇతర ముష్రికులు దాడి చేయటానికి వస్తారు.

**2**. ఈ విధమైన సందేశం వచ్చిన వారు దాదాపు డెబ్బై మంది మునాఫిఖులు.

**3**. ఆ కాలంలో ఆ ప్రాంతమంతా యస్'రిబ్ అనే పేరుతో పిలువబడేది. ఆప్రాంతంలోనే మదీనా మునవ్వరా ఉంది.

**4**. అంటే ఒడంబడిక త్రెంపిన బనూఖురైజా తెగవారు దక్షిణ దిక్కునుండి దాడి చేస్తారేమోననే భయం.

14. ఒకవేళ నగరపు చుట్టుప్రక్కల నుండి శత్రువులు లోపలికి దూరి, వారిని విద్రోహచర్యలకు పాల్పడమని పిలిస్తే, వారు వెంటనే సమ్మతించే వారు, మరియు వారు దానికోసం ఏ మాత్రం ఆలస్యం చేసేవారు కాదు.

وَلَوْ دُخِلَتْ عَلَيْهِم مِّنْ أَقْطَارِهَا ثُمَّ سُئِلُوا۟ ٱلْفِتْنَةَ لَـَٔاتَوْهَا وَمَا تَلَبَّثُوا۟ بِهَآ إِلَّا يَسِيرًا ﴿١٤﴾

15. వాస్తవానికి వారు ఇంతకు ముందు, తాము వెన్ను చూపి పారిపోమని, అల్లాహ్‌తో వాగ్దానం చేసి ఉన్నారు. మరియు అల్లాహ్‌తో చేసిన వాగ్దానం గురించి తప్పక ప్రశ్నించటం జరుగుతుంది.

وَلَقَدْ كَانُوا۟ عَـٰهَدُوا۟ ٱللَّهَ مِن قَبْلُ لَا يُوَلُّونَ ٱلْأَدْبَـٰرَ ۚ وَكَانَ عَهْدُ ٱللَّهِ مَسْـُٔولًا ﴿١٥﴾

16. వారితో ఇలా అను: "ఒకవేళ మీరు మరణం నుండి గానీ, లేదా హత్య నుండి గానీ, పారిపోదలచుకుంటే! ఆ పారిపోవటం మీకు ఏ మాత్రం లాభదాయకం కాదు. అప్పుడు మీరు కేవలం కొంతకాలం మాత్రమే సుఖసంతోషాలు అనుభవిస్తారు!"

قُل لَّن يَنفَعَكُمُ ٱلْفِرَارُ إِن فَرَرْتُم مِّنَ ٱلْمَوْتِ أَوِ ٱلْقَتْلِ وَإِذًا لَّا تُمَتَّعُونَ إِلَّا قَلِيلًا ﴿١٦﴾

17. వారితో ఇంకా ఇలా అను: "ఒకవేళ అల్లాహ్ మీకు కీడు చేయదలిస్తే! లేదా కరుణించదలిస్తే! ఆయన నుండి మిమ్మల్ని తప్పించేవాడెవడు?" మరియు వారు అల్లాహ్‌ను వదలి ఇతరుణ్ణి ఎవడినీ సంరక్షకునిగా గానీ లేక సహాయకునిగా గానీ పొందలేరు. (7/8)

قُلْ مَن ذَا ٱلَّذِى يَعْصِمُكُم مِّنَ ٱللَّهِ إِنْ أَرَادَ بِكُمْ سُوٓءًا أَوْ أَرَادَ بِكُمْ رَحْمَةً ۚ وَلَا يَجِدُونَ لَهُم مِّن دُونِ ٱللَّهِ وَلِيًّا وَلَا نَصِيرًا ﴿١٧﴾

18. * వాస్తవానికి మీలో ఎవరు ఇతరులను (యుద్ధం నుండి) ఆటంకపరుస్తూ ఉన్నారో మరియు తమ సోదరులతో: "మా వైపునకు రండి!" అని పలుకుతూ ఉన్నారో, అలాంటి వారందరి గురించి, అల్లాహ్‌కు బాగా తెలుసు. మరియు వారు మాత్రం యుద్ధంలో చాలా తక్కువగా పాల్గొనేవారు;

۞ قَدْ يَعْلَمُ ٱللَّهُ ٱلْمُعَوِّقِينَ مِنكُمْ وَٱلْقَآئِلِينَ لِإِخْوَٰنِهِمْ هَلُمَّ إِلَيْنَا ۖ وَلَا يَأْتُونَ ٱلْبَأْسَ إِلَّا قَلِيلًا ﴿١٨﴾

أَشِحَّةً عَلَيْكُمْ فَإِذَا جَآءَ ٱلْخَوْفُ رَأَيْتَهُمْ يَنظُرُونَ إِلَيْكَ تَدُورُ أَعْيُنُهُمْ كَٱلَّذِى يُغْشَىٰ عَلَيْهِ مِنَ ٱلْمَوْتِ فَإِذَا ذَهَبَ ٱلْخَوْفُ سَلَقُوكُم بِأَلْسِنَةٍ حِدَادٍ أَشِحَّةً عَلَى ٱلْخَيْرِ أُوْلَٰٓئِكَ لَمْ يُؤْمِنُوا۟ فَأَحْبَطَ ٱللَّهُ أَعْمَٰلَهُمْ وَكَانَ ذَٰلِكَ عَلَى ٱللَّهِ يَسِيرًا ﴿١٩﴾

**19**. (మీకు తోడ్పడే విషయంలో), వారు పరమ లోభులుగా ఉండేవారు. (ఓ ప్రవక్తా!) వారిపైకి ప్రమాదం వచ్చినపుడు వారు (నీ సహాయం కోరుతూ), మరణం ఆసన్నమైన వ్యక్తి కనుగ్రుడ్లు త్రిప్పే విధంగా నీ వైపుకు తిరిగి చూడటాన్ని, నీవు చూస్తావు. కాని ఆ ప్రమాదం తొలగిపోయిన వెంటనే, వారు లాభాలను పొందే ఉద్దేశంతో, కత్తెరవలే ఆడే నాలుకలతో మీతో బడాయిాలు చెప్పుకుంటారు. అలాంటి వారు ఏ మాత్రం విశ్వసించలేదు. కావున, అల్లాహ్ వారి కర్మలను నిరర్థకం చేశాడు. మరియు ఇది అల్లాహ్‌కు ఎంతో సులభం.

يَحْسَبُونَ ٱلْأَحْزَابَ لَمْ يَذْهَبُوا۟ وَإِن يَأْتِ ٱلْأَحْزَابُ يَوَدُّوا۟ لَوْ أَنَّهُم بَادُونَ فِى ٱلْأَعْرَابِ يَسْـَٔلُونَ عَنْ أَنۢبَآئِكُمْ وَلَوْ كَانُوا۟ فِيكُم مَّا قَٰتَلُوٓا۟ إِلَّا قَلِيلًا ﴿٢٠﴾

**20**. దాడి చేసిన వర్గాలు ఇంకా వెళ్ళిపోలేదు అనే వారు భావిస్తున్నారు. ఒకవేళ ఆ వర్గాలు తిరిగి మళ్ళీ దాడిచేస్తే! ఎడారివాసు(బద్దూ)లతో[1] కలిసి నివసించి, అక్కడి నుండి మీ వృత్తాంతాలను తెలుసుకుంటే బాగుండేది కదా! అని అనుకుంటారు. ఒకవేళ వారు మీతోపాటు ఉన్నా చాలా తక్కువగా యుద్ధంలో పాల్గొని ఉండేవారు.

لَّقَدْ كَانَ لَكُمْ فِى رَسُولِ ٱللَّهِ أُسْوَةٌ حَسَنَةٌ لِّمَن كَانَ يَرْجُوا۟ ٱللَّهَ وَٱلْيَوْمَ ٱلْءَاخِرَ وَذَكَرَ ٱللَّهَ كَثِيرًا ﴿٢١﴾

**21**. వాస్తవానికి, అల్లాహ్ యొక్క సందేశహరునిలో మీకు ఒక ఉత్తమమైన ఆదర్శం ఉంది; వారి కొరకు ఎవరైతే అల్లాహ్ మరియు అంతిమదినాన్ని ఆశిస్తారో మరియు అల్లాహ్‌ను అత్యధికంగా స్మరిస్తారో!

---

**1**. ఈ పదానికి ఇంకా చూడండి, 9:90, 97, 98, 99, 101,120, 48:11,16, 49:14.

22. మరియు విశ్వాసులు, దాడిచేసిన వర్గాలవారిని చూసినపుడు ఇలా పలికారు: "అల్లాహ్ మరియు ఆయన సందేశహరుడు సత్యం పలికారు." ఇది వారి విశ్వాసాన్ని మరియు అల్లాహ్ పట్ల వారి విధేయతను మరింత అధికమే చేసింది.

23. విశ్వాసులలో అల్లాహ్‌కు తాము చేసిన ఒప్పందం నిజంచేసి చూపిన వారు కూడా ఉన్నారు. వారిలో కొందరు తమ శపథాన్ని పూర్తిచేసుకున్న వారున్నారు, మరికొందరు దానిని పూర్తిచేసుకోవటానికి నిరీక్షిస్తున్నారు. మరియు వారు తమ వైఖరిని ఏ మాత్రం మార్చుకోలేదు.

24. అల్లాహ్, సత్యవంతులకు వారి సత్యానికి ప్రతిఫలం నొసంగటానికి మరియు కపటవిశ్వాసులకు తాను కోరితే శిక్ష విధించటానికి లేదా వారి పశ్చాత్తాపాన్ని స్వీకరించటానికి ఇలా చేశాడు.[1] నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

25. మరియు అల్లాహ్ అవిశ్వాసులను వారి క్రోధావేశంతోనే - వారికెలాంటి మేలు లభింపజేయకుండా - వెనుకకు మరలించాడు. యుద్ధరంగంలో విశ్వాసులకు అల్లాహ్‌యే (సహాయకునిగా) మిగిలాడు. వాస్తవంగా అల్లాహ్ మహా బలవంతుడు. సర్వ శక్తిమంతుడు.

وَلَمَّا رَءَا ٱلۡمُؤۡمِنُونَ ٱلۡأَحۡزَابَ قَالُواْ
هَٰذَا مَا وَعَدَنَا ٱللَّهُ وَرَسُولُهُۥ وَصَدَقَ
ٱللَّهُ وَرَسُولُهُۥۚ وَمَا زَادَهُمۡ إِلَّآ
إِيمَٰنٗا وَتَسۡلِيمٗا ﴿٢٢﴾

مِّنَ ٱلۡمُؤۡمِنِينَ رِجَالٞ صَدَقُواْ مَا
عَٰهَدُواْ ٱللَّهَ عَلَيۡهِۖ فَمِنۡهُم مَّن
قَضَىٰ نَحۡبَهُۥ وَمِنۡهُم مَّن يَنتَظِرُۖ وَمَا
بَدَّلُواْ تَبۡدِيلٗا ﴿٢٣﴾

لِّيَجۡزِيَ ٱللَّهُ ٱلصَّٰدِقِينَ
بِصِدۡقِهِمۡ وَيُعَذِّبَ ٱلۡمُنَٰفِقِينَ
إِن شَآءَ أَوۡ يَتُوبَ عَلَيۡهِمۡۚ إِنَّ ٱللَّهَ
كَانَ غَفُورٗا رَّحِيمٗا ﴿٢٤﴾

وَرَدَّ ٱللَّهُ ٱلَّذِينَ كَفَرُواْ بِغَيۡظِهِمۡ
لَمۡ يَنَالُواْ خَيۡرٗاۚ وَكَفَى ٱللَّهُ
ٱلۡمُؤۡمِنِينَ ٱلۡقِتَالَۚ وَكَانَ ٱللَّهُ
قَوِيًّا عَزِيزٗا ﴿٢٥﴾

1. చూడండి, 6:12.

وَأَنزَلَ ٱلَّذِينَ ظَٰهَرُوهُم مِّنۡ أَهۡلِ ٱلۡكِتَٰبِ مِن صَيَاصِيهِمۡ وَقَذَفَ فِي قُلُوبِهِمُ ٱلرُّعۡبَ فَرِيقٗا تَقۡتُلُونَ وَتَأۡسِرُونَ فَرِيقٗا ٢٦

26. మరియు గ్రంథప్రజలలో నుండి వారికి (అవిశ్వాసులకు యుద్ధంలో) తోడ్పడిన వారిని ఆయన (అల్లాహ్) వారి కోటలనుండి క్రిందికి తీసుకువచ్చాడు.[1] మరియు వారి హృదయాలలో భీతిని ప్రవేశింపజేశాడు. వారిలో కొందరిని మీరు చంపుతున్నారు మరికొందరిని ఖైదీలుగా చేసుకుంటున్నారు.

وَأَوۡرَثَكُمۡ أَرۡضَهُمۡ وَدِيَٰرَهُمۡ وَأَمۡوَٰلَهُمۡ وَأَرۡضٗا لَّمۡ تَطَـُٔوهَاۚ وَكَانَ ٱللَّهُ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٗا ٢٧

27. మరియు ఆయన (అల్లాహ్) వారి భూమికి, వారి ఇండ్లకు మరియు వారి ఆస్తులకు మిమ్మల్ని వారసులుగా చేశాడు. మరియు మీరు ఎన్నడూ అడుగుమోపని భూమికి గూడా (మిమ్మల్ని వారసులుగా చేశాడు).[2] మరియు వాస్తవంగా అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

يَٰٓأَيُّهَا ٱلنَّبِيُّ قُل لِّأَزۡوَٰجِكَ إِن كُنتُنَّ تُرِدۡنَ ٱلۡحَيَوٰةَ ٱلدُّنۡيَا وَزِينَتَهَا فَتَعَالَيۡنَ أُمَتِّعۡكُنَّ وَأُسَرِّحۡكُنَّ سَرَاحٗا جَمِيلٗا ٢٨

28. ఓ ప్రవక్తా! నీవు నీ భార్యలతో ఇలా అను: 'ఒకవేళ మీరు ప్రాపంచిక జీవితాన్ని మరియు దాని శోభను కోరుతున్నట్లైతే, రండి నేను మీకు తప్పక జీవనసామాగ్రి నిచ్చి, మిమ్మల్ని మంచి పద్ధతిలో విడిచిపెడతాను.[3]

---

1. అంటే యూదులైన బనూ-ఖురై''జా తెగవారు. వారు మొదట శత్రువులకు సహాయపడమని మదీనా ముస్లింలతో ఒప్పందం చేసుకుంటారు. కాని మదీనా నగరం నుండి వెడలగొట్టబడిన బనూ-న'దీర్ తెగవారి మాటలు విని, తమ ఒడంబడికను త్రెంపి శత్రువులకు సహాయపడటానికి పూనుకుంటారు. అందుకే శత్రువులు పారిపోయింది చూసి వారు తమ కోటలలో దాక్కుంటారు. ముస్లింలు వారిని 25 రోజులు ముట్టడించి ఉంచుతారు. చివరకు వారు - తమ విశ్వాసఘాతానికి - శిక్షకు గురి అవుతారు.
2. కొందరు వ్యాఖ్యాతలు ఇది 6వ హిజ్రీలో జరిగిన 'ఖైబర్ విజయమని అభిప్రాయపడ్డారు. మరి కొందరు రోమ్ మరియు పర్షియాల విజయాలని! (ఫ'త్హ్ అల్-ఖదీర్).
3. ఈ విజయాల వల్ల ముస్లింలకు ధన సంపత్తులు దొరకడం వల్ల, వారు మొదటి కంటే ఎంతో అధికంగా సుఖవంతమైన జీవితంగడుపసాగారు. ఇది చూసి దైవప్రవక్త భార్యలు

وَإِن كُنتُنَّ تُرِدْنَ ٱللَّهَ وَرَسُولَهُۥ وَٱلدَّارَ ٱلْـَٔاخِرَةَ فَإِنَّ ٱللَّهَ أَعَدَّ لِلْمُحْسِنَٰتِ مِنكُنَّ أَجْرًا عَظِيمًا ٢٩

29. "కాని ఒకవేళ మీరు అల్లాహ్‌ను మరియు ఆయన సందేశహరుణ్ణి మరియు పరలోక గృహాన్ని కోరుతున్నట్లైతే, నిశ్చయంగా అల్లాహ్ మీలో సజ్జనులైన వారికి గొప్ప ప్రతిఫలాన్ని సిద్ధపరచి ఉంచాడు."

يَٰنِسَآءَ ٱلنَّبِيِّ مَن يَأْتِ مِنكُنَّ بِفَٰحِشَةٍ مُّبَيِّنَةٍ يُضَٰعَفْ لَهَا ٱلْعَذَابُ ضِعْفَيْنِ ۚ وَكَانَ ذَٰلِكَ عَلَى ٱللَّهِ يَسِيرًا ٣٠

30. ఓ ప్రవక్త స్త్రీలారా! మీలో ఎవరైనా స్పష్టంగా అనుచితమైన పనికి పాల్పడితే ఆమెకు రెట్టింపు శిక్ష విధించబడుతుంది.[1] మరియు వాస్తవంగా, ఇది అల్లాహ్‌కు ఎంతో సులభం.

---

(ర'ది.'అన్హుమ్) కూడా ఆ సంపదలను తమకొరకు కోరారు. దానికి జవాబుగా ఈ ఆయత్ అవతరింపజేయబడింది. దీనితో అర్థమయ్యేదేమిటంటే, ఎన్నో సంపత్తులు ముస్లింలకు దొరికినా, దైవప్రవక్త ('స'అస) తన స్వంత వినియోగం కొరకు మొదటి వలెనే అతి తక్కువ జీవనోపాధిని ఉంచుకునే వారు. అంతా ముస్లింలకు పంచేవారు. దీని తరువాత ఉమ్మహాతుల్ మూమినీన్ (ర'ది.'అన్హుమ్)లు తమ పట్టు వదలుకున్నారు. ఆ కాలంలో దైవప్రవక్త ('స'అస) వివాహబంధంలో తొమ్మిది మంది భార్య (ర'ది.'అన్హుమ్)లు ఉన్నారు. ఐదుగురు ఖురైషులు 'ఆయిషహ్, 'హ'ఫ్సా, ఉమ్మ్-'హబీబా, 'సౌదా, మరియు ఉమ్మ్ సల్మా (ర'ది.'అన్హుమ్) మరియు నలుగురు ఇతరులు: 'సఫియ్యా, మైమూనా, 'జైనబ్ మరియు జువేరియా (ర'ది.'అన్హుమ్).

1. అల్‌ఫా'హిషహ్ అంటే ఖుర్‌ఆన్‌లో 'జినా' అంటే వ్యభిచారం, అనే అర్థంలో వాడబడింది. అల్- లేకుండా ఫా'హిషహ్ అని ఉంటే - ఇక్కడ ఉన్నట్లు - సభ్యతలేని పని, లేక అనుచితమైన పని అనే అర్థంలో వాడబడింది. పెద్దవారు చేసే చిన్నతప్పు కూడా పెద్దదే. కాబట్టి వారికి రెండింతలు శిక్ష ఉందని బోధింపబడింది.

31. (*) మరియు మీలో ఏ స్త్రీ అయితే అల్లాహ్‌కు మరియు ఆయన సందేశహరునికి విధేయురాలై ఉండి సత్కార్యాలు చేస్తుందో, ఆమెకు మేము రెట్టింపు ప్రతిఫలమిస్తాము మరియు ఆమె కొరకు గౌరవప్రదమైన జీవనోపాధిని సిద్ధపరచి ఉంచాము.[1]

32. ఓ ప్రవక్త భార్యలారా! మీరు సాధారణ స్త్రీల వంటివారు కారు. మీరు దైవభీతి గలవారైతే మీరు మెత్తని స్వరంతో మాట్లాడకండి. ఎందుకంటే! దానితో తన హృదయంలో రోగమున్నవానికి దుర్బుద్ధి పుట్టవచ్చు. కావున మీరు స్పష్టంగా, సూటిగానే మాట్లాడండి.

33. మరియు మీరు మీ ఇండ్లలోనే ఉండండి మరియు పూర్వపు అజ్ఞానకాలంలో అలంకరణను ప్రదర్శిస్తూ తిరిగినట్లు తిరగకండి.[2] మరియు నమా'జ్ స్థాపించండి మరియు విధిదానం ('జకాత్) ఇవ్వండి మరియు అల్లాహ్‌కు ఆయన సందేశహరునికి విధేయులై ఉండండి. (ఓ ప్రవక్త) గృహిణులారా![3] నిశ్చయంగా, అల్లాహ్ మీ నుండి మాలిన్యాన్ని తొలగించి, మిమ్మల్ని పరిశుద్ధులుగా చేయగోరుతున్నాడు.

۞ وَمَن يَقْنُتْ مِنكُنَّ لِلَّهِ وَرَسُولِهِۦ وَتَعْمَلْ صَٰلِحًا نُّؤْتِهَآ أَجْرَهَا مَرَّتَيْنِ وَأَعْتَدْنَا لَهَا رِزْقًا كَرِيمًا ﴿٣١﴾

يَٰنِسَآءَ ٱلنَّبِىِّ لَسْتُنَّ كَأَحَدٍ مِّنَ ٱلنِّسَآءِ ۚ إِنِ ٱتَّقَيْتُنَّ فَلَا تَخْضَعْنَ بِٱلْقَوْلِ فَيَطْمَعَ ٱلَّذِى فِى قَلْبِهِۦ مَرَضٌ وَقُلْنَ قَوْلًا مَّعْرُوفًا ﴿٣٢﴾

وَقَرْنَ فِى بُيُوتِكُنَّ وَلَا تَبَرَّجْنَ تَبَرُّجَ ٱلْجَٰهِلِيَّةِ ٱلْأُولَىٰ ۖ وَأَقِمْنَ ٱلصَّلَوٰةَ وَءَاتِينَ ٱلزَّكَوٰةَ وَأَطِعْنَ ٱللَّهَ وَرَسُولَهُۥٓ ۚ إِنَّمَا يُرِيدُ ٱللَّهُ لِيُذْهِبَ عَنكُمُ ٱلرِّجْسَ أَهْلَ ٱلْبَيْتِ وَيُطَهِّرَكُمْ تَطْهِيرًا ﴿٣٣﴾

1. చూడండి, 8:4.
2. చూడండి, 5:50.
3. అహ్లల్ -బైత్, శబ్దానికి ఈవిధంగా అర్థాలు ఇవ్వబడ్డాయి. ఈ ఆయత్‌లో ఖుర్ఆన్, దైవప్రవక్త ('స'అస) సతీమణు (ర'ది.'అన్హుమ్)లనే సంబోధిస్తోంది. ఖుర్ఆన్‌లో ఇతరచోట్లలో కూడా భార్యలను అహ్లల్-బైత్ అని, సంబోధించబడింది. ఉదాహరణకు 11:73. కొందరు 'అలీ, ఫాతిమా, 'హసన్ మరియు 'హుసైన్ (ర'ది.'అన్హుమ్)లను మాత్రమే అహ్లల్-బైత్‌గా భావిస్తున్నారు. వాస్తవమేమిటంటే, దైవప్రవక్త సతీమణులూ (ర'ది.'అన్హుమ్), దైవప్రవక్త ('స'అస) సంతానం (ర'ది.'అన్హుమ్) మరియు ఈ నలుగురూ (ర'ది.'అన్హుమ్), అందరూ అహ్లల్-బైత్ వారే! (ఫ'త్హ్ అల్-ఖదీర్, షౌకానీ).

**34**. మరియు మీ ఇండ్లలో వినిపించబడే అల్లాహ్ ఆయతులను మరియు జ్ఞాన విషయా('హదీస్)లను స్మరిస్తూ ఉండండి. నిశ్చయంగా అల్లాహ్ అత్యంత సూక్ష్మగ్రాహి, సర్వం తెలిసినవాడు.[1]

**35**. నిశ్చయంగా, ముస్లిం (అల్లాహ్‌కు విధేయులైన) పురుషులు మరియు ముస్లిం స్త్రీలు; విశ్వాసులైన (ము'మిన్) పురుషులు మరియు విశ్వాసులైన (ము'మిన్) స్త్రీలు; భక్తిపరులైన పురుషులు మరియు భక్తిపరులైన స్త్రీలు; సత్యవంతులైన పురుషులు మరియు సత్యవంతులైన స్త్రీలు; ఓర్పుగల పురుషులు మరియు ఓర్పుగల స్త్రీలు; వినమ్రతగల పురుషులు మరియు వినమ్రతగల స్త్రీలు; దానశీలురైన పురుషులు మరియు దానశీలురైన స్త్రీలు; ఉపవాసాలు[2] ఉండే పురుషులు మరియు ఉపవాసాలు ఉండే స్త్రీలు; తమ మర్మాంగాలను కాపాడుకునే పురుషులు మరియు (తమ మర్మాంగాలను) కాపాడుకునే స్త్రీలు;[3] మరియు అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించే పురుషులు మరియు అత్యధికంగా స్మరించే స్త్రీలు; ఇలాంటి వారి కొరకు అల్లాహ్ క్షమాభిక్ష మరియు గొప్ప ప్రతిఫలాన్ని సిద్ధపరచి ఉంచాడు.

وَٱذْكُرْنَ مَا يُتْلَىٰ فِى
بُيُوتِكُنَّ مِنْ ءَايَٰتِ ٱللَّهِ
وَٱلْحِكْمَةِ ۚ إِنَّ ٱللَّهَ كَانَ لَطِيفًا
خَبِيرًا ﴿٣٤﴾
إِنَّ ٱلْمُسْلِمِينَ وَٱلْمُسْلِمَٰتِ
وَٱلْمُؤْمِنِينَ وَٱلْمُؤْمِنَٰتِ وَٱلْقَٰنِتِينَ
وَٱلْقَٰنِتَٰتِ وَٱلصَّٰدِقِينَ
وَٱلصَّٰدِقَٰتِ وَٱلصَّٰبِرِينَ
وَٱلصَّٰبِرَٰتِ وَٱلْخَٰشِعِينَ
وَٱلْخَٰشِعَٰتِ وَٱلْمُتَصَدِّقِينَ
وَٱلْمُتَصَدِّقَٰتِ وَٱلصَّٰٓئِمِينَ
وَٱلصَّٰٓئِمَٰتِ وَٱلْحَٰفِظِينَ
فُرُوجَهُمْ وَٱلْحَٰفِظَٰتِ
وَٱلذَّٰكِرِينَ ٱللَّهَ كَثِيرًا
وَٱلذَّٰكِرَٰتِ أَعَدَّ ٱللَّهُ لَهُم
مَّغْفِرَةً وَأَجْرًا عَظِيمًا ﴿٣٥﴾

1. చూడండి, 6:103.
2. 'సౌముస్: కేవలం ఆహార పానీయాలే గాక ఇతర చెడువిషయాల నుండి కూడా దూరంగా ఉండటం. ఇంకా చూడండి, 19:26 అక్కడ ఈ శబ్దం మాట్లాడకుండా ఉండటాన్ని సూచిస్తుంది.
3. చూడండి, 24:30.

وَمَا كَانَ لِمُؤْمِنٍ وَلَا مُؤْمِنَةٍ إِذَا قَضَى ٱللَّهُ وَرَسُولُهُۥٓ أَمْرًا أَن يَكُونَ لَهُمُ ٱلْخِيَرَةُ مِنْ أَمْرِهِمْ ۗ وَمَن يَعْصِ ٱللَّهَ وَرَسُولَهُۥ فَقَدْ ضَلَّ ضَلَٰلًا مُّبِينًا ﴿٣٦﴾

**36**. మరియు అల్లాహ్ మరియు ఆయన సందేశహరుడు, ఒక విషయంలో నిర్ణయం తీసుకున్నప్పుడు, విశ్వసించిన పురుషునికి గానీ లేక విశ్వసించిన స్త్రీకి గానీ ఆ విషయంలో మరొక నిర్ణయం తీసుకునే హక్కు లేదు.[1] మరియు ఎవడైతే అల్లాహ్ మరియు ఆయన సందేశహరునికి అవిధేయుడవుతాడో, వాస్తవంగా అతడు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడి ఉన్నట్లే!

وَإِذْ تَقُولُ لِلَّذِىٓ أَنْعَمَ ٱللَّهُ عَلَيْهِ وَأَنْعَمْتَ عَلَيْهِ أَمْسِكْ عَلَيْكَ زَوْجَكَ وَٱتَّقِ ٱللَّهَ وَتُخْفِى فِى

**37**. మరియు (ఓ ప్రవక్తా జ్ఞాపకం చేసుకో!) అల్లాహ్ అనుగ్రహించిన మరియు నీవు అనుగ్రహించిన వ్యక్తితో ('జైద్ బిన్-'హారిసాతో) నీవు:[2] "నీ

**1**. ఈ ఆయత్ దైవప్రవక్త ('స'అస) మరియు 'జైనబ్ (ర.'అన్హా)ల వివాహం గురించి అవతరింపజేయబడింది.

**2**. ముహమ్మద్ ('స'అస) ప్రవక్తగా ఎన్నుకోబడక ముందు 'ఖదీజహ్ (ర.'అన్హా) అతనికి ('స'అస) ఒక బానిసను కానుకగా ఇస్తారు. అతని పేరు 'జైద్ బిన్-'హారిసా. అతడు ఉత్తర అరేబియాకు చెందిన బనూ-కల్బ్ తెగకు చెందిన 'అరబ్బ్. అతడు (ర'ది.'అ.) చిన్నతనంలోనే తెగల మధ్య జరిగే యుద్ధాలలో బందీఅయ్యి అమ్మివేయబడతారు. అతనిని (ర'ది.'అ.) 'ఖదీజహ్ (ర. 'అన్హా) కొని, తరువాత దైవప్రవక్త ('స'అస)కు ఇస్తారు. దైవప్రవక్త ('స'అస) అతనికి స్వేచ్ఛనిస్తారు. ఆ తరువాత అతనిని తమ దత్తకుమారునిగా చేసుకుంటారు. దైవప్రవక్త ('స'అస)పై వ'హీ అవతరించిన తరువాత మొట్టమొదట ఇస్లాం స్వీకరించిన వారిలో ఇతను (ర'ది.'అ.) కూడా ఒకరు. అతని (ర'ది.'అ.) వివాహం దైవప్రవక్త ('స'అస) తన మేనత్త కుమార్తె 'జైనబ్ బింతె-జ'హష్ (ర.'అన్హా)తో చేయిస్తారు. కాని మొదటి నుండియే ఆమె (ర. 'అన్హా)కు ఈ వివాహం నచ్చదు. వారి మధ్య మొదటి రోజు నుండియే కలహాలు ప్రారంభమవుతాయి. 'జైద్ (ర'ది.'అ.) కూడా తన మొదటి భార్య - స్వేచ్ఛ ఇవ్వబడిన బానిస - ఉమ్మె ఆయ్‌మన్ (ర. 'అన్హా), అతని కుమారుడు ఉసామహ్ (ర'ది.'అ.) యొక్క తల్లితో సంతోషంగా కాలం గడుపుతూ ఉంటారు. 'జైద్ బిన్- 'హారిస'హ్ మరియు 'జైనబ్ బింతె-జ'హష్ (ర'ది.'అన్హుమ్)ల మధ్య ఎల్లప్పుడూ కలహాలు జరుగుతూ ఉంటాయి. దానితో 'జైద్ (ర'ది.'అ.) 5వ హిజ్రీలో 'జైనబ్ బింతె-జ'హష్ (ర.'అన్హా)కు విడాకులు ఇస్తారు. తరువాత దైవప్రవక్త ('స'అస) అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞ ప్రకారం ఆమె (ర.'అన్హా)తో వివాహం చేసుకుంటారు. దత్తపుత్రుడు ఏ మాత్రం స్వంతపుత్రుడు కాజాలడు. కావున అతడు విడిచిన స్త్రీతో వివాహం చేసుకోవచ్చు అనే విషయం కూడా దీనితో స్పష్టమవుతుంది.

نَفۡسِكَ مَا ٱللَّهُ مُبۡدِيهِ وَتَخۡشَى ٱلنَّاسَ وَٱللَّهُ أَحَقُّ أَن تَخۡشَىٰهُۖ فَلَمَّا قَضَىٰ زَيۡدٞ مِّنۡهَا وَطَرٗا زَوَّجۡنَٰكَهَا لِكَيۡ لَا يَكُونَ عَلَى ٱلۡمُؤۡمِنِينَ حَرَجٞ فِيٓ أَزۡوَٰجِ أَدۡعِيَآئِهِمۡ إِذَا قَضَوۡاْ مِنۡهُنَّ وَطَرٗاۚ وَكَانَ أَمۡرُ ٱللَّهِ مَفۡعُولٗا ٣٧

భార్యను ఉంచుకో (విడిచిపెట్టకు) మరియు అల్లాహ్ యందు భయభక్తులు కలిగిఉండు.'' అని అన్నప్పుడు; నీవు అల్లాహ్ బయటపెట్టదలచిన విషయాన్ని, నీ మనస్సులో దాచి ఉంచావు. నీవు ప్రజలకు భయపడ్డావు, వాస్తవానికి నీవు అల్లాహ్‌కు భయపడటమే చాల ఉత్తమమైనది. 'జైద్, ఆమెతో తన సంబంధాన్ని తన ఇచ్ఛానుసారంగా త్రెంపుకున్న తరువాతనే, మేము ఆమె వివాహం నీతో జరిపించాము. విశ్వాసులకు తమ దత్తపుత్రుల భార్యలతో పెండ్లి చేసుకోవటంలో - వారు తమ భార్యల నుండి తమ ఇష్టానుసారంగా తమ సంబంధం త్రెంపుకొన్నప్పుడు - ఏ విధమైన దోషంలేదు. వాస్తవానికి అల్లాహ్ ఆదేశం తప్పక అమలులోకి రావలసిందే!

مَّا كَانَ عَلَى ٱلنَّبِيِّ مِنۡ حَرَجٖ فِيمَا فَرَضَ ٱللَّهُ لَهُۥۖ سُنَّةَ ٱللَّهِ فِي ٱلَّذِينَ خَلَوۡاْ مِن قَبۡلُۚ وَكَانَ أَمۡرُ ٱللَّهِ قَدَرٗا مَّقۡدُورًا ٣٨

**38**. అల్లాహ్ తన కొరకు ధర్మసమ్మతం చేసిన దానిని ప్రవక్త పూర్తిచేస్తే అతనిపై ఎలాంటి నిందలేదు, ఇంతకు పూర్వం గతించిన వారి విషయంలో కూడ అల్లాహ్ సంప్రదాయం ఇదే. మరియు అల్లాహ్ ఆజ్ఞ, నిర్దేశింపబడిన (తిరుగులేని) శాసనం;

ٱلَّذِينَ يُبَلِّغُونَ رِسَٰلَٰتِ ٱللَّهِ وَيَخۡشَوۡنَهُۥ وَلَا يَخۡشَوۡنَ أَحَدًا إِلَّا ٱللَّهَۗ وَكَفَىٰ بِٱللَّهِ حَسِيبٗا ٣٩

**39**. వారికి, ఎవరైతే అల్లాహ్ సందేశాలను అందజేస్తారో మరియు కేవలం ఆయనకే భయపడతారో మరియు అల్లాహ్ తప్ప మరెవ్వరికీ భయపడరో! మరియు లెక్క తీసుకోవటానికి కేవలం అల్లాహ్‌యే చాలు!

مَّا كَانَ مُحَمَّدٌ أَبَآ أَحَدٍ مِّن رِّجَالِكُمْ وَلَٰكِن رَّسُولَ ٱللَّهِ وَخَاتَمَ ٱلنَّبِيِّـۧنَ ۗ وَكَانَ ٱللَّهُ بِكُلِّ شَىْءٍ عَلِيمًا ﴿٤٠﴾

**40**. (ఓ మానవులారా!) ము'హమ్మద్ మీ పురుషుల్లో ఎవ్వడికీ తండ్రి కాడు.[1] కాని అతను అల్లాహ్ యొక్క సందేశహరుడు మరియు ప్రవక్తలలో చివరివాడు.[2] మరియు వాస్తవానికి అల్లాహ్ యే ప్రతివిషయపు జ్ఞానం గలవాడు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ ٱذْكُرُوا۟ ٱللَّهَ ذِكْرًا كَثِيرًا ﴿٤١﴾

**41**. ఓ విశ్వాసులారా! అల్లాహ్ ను (ఏకాగ్రచిత్తంతో) అత్యధికంగా స్మరించండి.

وَسَبِّحُوهُ بُكْرَةً وَأَصِيلًا ﴿٤٢﴾

**42**. మరియు ఉదయం మరియు సాయంత్రం ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉండండి.

---

**1**. అంటే అతను ('స'అస), 'జైద్ బిన్-'హారిసా (ర'ది.'అ.) యొక్క తండ్రి కారు. మరియు ఏ ఇతర పురుషుని తండ్రి కూడా కారు. ప్రతివాడు తన నిజతండ్రి పేరుతోనే పిలువబడాలి. దైవప్రవక్త ('స'అస)కు 'ఖదీజహ్ (ర.'అన్హా) నుండి ముగ్గురు కుమారులు: ఖాసిమ్, 'తయ్యిబ్ మరియు 'తాహిర్. మారియా ఖబ్తియా (ర. 'అన్హా) నుండి ఇబ్రాహీం. వారంతా బాల్యావస్థలోనే మరణించారు, (ఇబ్నె-కసీ'ర్, ము'హమ్మద్ జూనాగఢి). కొందరు వ్యాఖ్యాతలు 'ఖదీజహ్ (ర. 'అన్హా)కు ఇద్దరు కుమారులే అని అంటారు: ఖాసిమ్ మరియు అబ్దుల్లాహ్. 'తయ్యిబ్, 'తాహిర్ అనేవి అబ్దుల్లాహ్ యొక్క మారు పేర్లు అని వారంటారు.

**2**. 'ఖాతమున్: అంటే ముద్ర. ముద్రవేయటం చివరిపని, కావున దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) తరువాత ఇక ఏ ప్రవక్త కూడా రాడు. కాబట్టి అతను ప్రవక్తల ముద్ర (చివరివాడు), అని సంబోధించబడ్డారు. కావున అతని తరువాత తనను తాను ప్రవక్తగా పరిగణించేవాడు, అసత్యుడూ, దజ్జాల్ మాత్రమే! చివరికాలంలో దైవప్రవక్త 'ఈసా ('అ.స.) తిరిగివస్తారు. కానీ అతను ప్రవక్తగా గాక ము'హమ్మద్ ('స'అస) యొక్క ఉమ్మతి(అనుచరుని)గా వస్తారు. ఇదంతా స'హీ'హ్ 'హదీసులలో ఉంది. చాలా మంది ధర్మవేత్తల అభిప్రాయం ఇదే! అతను ('స'అస) చివరి ప్రవక్త కాబట్టి సమస్తలోకాలకు ప్రవక్తగా పంపబడ్డారు. చూడండి, 21:107.

هُوَ ٱلَّذِى يُصَلِّى عَلَيْكُمْ وَمَلَـٰٓئِكَتُهُۥ لِيُخْرِجَكُم مِّنَ ٱلظُّلُمَـٰتِ إِلَى ٱلنُّورِ ۚ وَكَانَ بِٱلْمُؤْمِنِينَ رَحِيمًا ﴿٤٣﴾

43. ఆయన మీపై ఆశీర్వాదాలు ('సలాత్) పంపుతూ ఉంటాడు మరియు ఆయన దూతలు మిమ్మల్ని అంధకారం నుండి వెలుగులోకి తీసుకురావటానికి (ఆయనను ప్రార్థిస్తూ ఉంటారు). మరియు ఆయన విశ్వాసుల పట్ల అపార కరుణాప్రదాత.

تَحِيَّتُهُمْ يَوْمَ يَلْقَوْنَهُۥ سَلَـٰمٌ ۚ وَأَعَدَّ لَهُمْ أَجْرًا كَرِيمًا ﴿٤٤﴾

44. వారు ఆయనను కలుసుకునే రోజున వారికి: "మీకు శాంతి కలుగుగాక (సలాం)!" అనే అభినందనలతో స్వాగతం లభిస్తుంది.[1] మరియు ఆయన వారి కొరకు గౌరవప్రదమైన ప్రతిఫలం సిద్ధపరచి ఉంచాడు.

يَـٰٓأَيُّهَا ٱلنَّبِىُّ إِنَّآ أَرْسَلْنَـٰكَ شَـٰهِدًا وَمُبَشِّرًا وَنَذِيرًا ﴿٤٥﴾

45. ఓ ప్రవక్తా! నిశ్చయంగా మేము, నిన్ను సాక్షిగా, శుభవార్త అందజేసేవానిగా మరియు హెచ్చరిక చేసేవానిగా పంపాము!

وَدَاعِيًا إِلَى ٱللَّهِ بِإِذْنِهِۦ وَسِرَاجًا مُّنِيرًا ﴿٤٦﴾

46. మరియు ఆయన అనుమతితో, అల్లాహ్ వైపునకు పిలిచేవానిగా మరియు ప్రకాశించే దీపంగానూ (చేసి పంపాము)!

وَبَشِّرِ ٱلْمُؤْمِنِينَ بِأَنَّ لَهُم مِّنَ ٱللَّهِ فَضْلًا كَبِيرًا ﴿٤٧﴾

47. మరియు నిశ్చయంగా, వారి మీద అల్లాహ్ యొక్క గొప్ప అనుగ్రహం ఉందనే శుభవార్తను విశ్వాసులకు ఇవ్వు.

وَلَا تُطِعِ ٱلْكَـٰفِرِينَ وَٱلْمُنَـٰفِقِينَ وَدَعْ أَذَىٰهُمْ وَتَوَكَّلْ عَلَى ٱللَّهِ ۚ وَكَفَىٰ بِٱللَّهِ وَكِيلًا ﴿٤٨﴾

48. మరియు నీవు సత్యతిరస్కారుల మరియు కపటవిశ్వాసుల మాటలకు లోబడకు మరియు వారి వేధింపులను లక్ష్యపెట్టకు మరియు కేవలం అల్లాహ్‌నే నమ్ముకో. మరియు కార్యకర్తగా కేవలం అల్లాహ్ యే చాలు!

1. స్వర్గవాసులు లేక దైవదూతలు దానిలోకి వచ్చేవారికి ఈ విధంగా స్వాగతం చేస్తారు.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِذَا نَكَحْتُمُ ٱلْمُؤْمِنَـٰتِ ثُمَّ طَلَّقْتُمُوهُنَّ مِن قَبْلِ أَن تَمَسُّوهُنَّ فَمَا لَكُمْ عَلَيْهِنَّ مِنْ عِدَّةٍ تَعْتَدُّونَهَا ۖ فَمَتِّعُوهُنَّ وَسَرِّحُوهُنَّ سَرَاحًا جَمِيلًا ﴿٤٩﴾

**49**. ఓ విశ్వాసులారా! మీరు విశ్వాసినులైన స్త్రీలను వివాహమాడి, తరువాత - మీరు వారిని తాకక పూర్వమే - వారికి విడాకులిచ్చినట్లయితే, మీ కొరకు వేచివుండే వ్యవధి ('ఇద్దత్) పూర్తిచేయమని అడిగే హక్కు మీకు వారిపై లేదు.[1] కనుక వారికి పారితోషికం ఇచ్చి, మంచితనంతో వారిని సాగనంపండి.[2]

يَـٰٓأَيُّهَا ٱلنَّبِىُّ إِنَّآ أَحْلَلْنَا لَكَ أَزْوَٰجَكَ ٱلَّـٰتِىٓ ءَاتَيْتَ أُجُورَهُنَّ وَمَا مَلَكَتْ يَمِينُكَ مِمَّآ أَفَآءَ ٱللَّهُ

**50**. ఓ ప్రవక్తా! నిశ్చయంగా, మేము నీకు: నీవు మహ్ర్ చెల్లించిన నీ భార్యలను[3] మరియు అల్లాహ్ ప్రసాదించిన (బానిస) స్త్రీల నుండి నీ ఆధీనంలోకి వచ్చిన వారిని (స్త్రీలను)[4]

---

**1**. వివాహం తరువాత స్త్రీతో సంభోగించి ఉంటే ఆమె వేచిఉండే గడువు ('ఇద్దత్) మూడు రుతుస్రావాలు. చూడండి, 2:228. కాని వివాహం తరువాత సంభోగించక ముందే విడాకులిస్తే ఆమె వేచిఉండక వెంటనే, మరొకనితో వివాహం చేసుకోవచ్చు. ఒకవేళ సంభోగం జరుగకముందే భర్త చనిపోతే 'ఇద్దత్ నాలుగు నెలల మీద పది రోజులు, (ఫ'త్హ్ అల్-ఖదీర్, ఇబ్నె-కసీ'ర్). నికా'హ్ జరిగిన తరువాతనే 'తలాఖ్, ఇవ్వవలసిన అవసరం ఉంటుంది. నికా'హ్‌యే కాకుంటే 'తలాఖ్ ఇవ్వవలసిన అవసరం ఎక్కడ ఉంటుంది! ''లా 'తలాఖ ఖబ్‌ల నికా'హ్.'' (ఇబ్నె-మాజా): ''లా 'తలాఖ లి ఇబ్ని ఆదమ్ ఫీమా లా యమ్‌లికు.'' (అబూ-దావూద్, తిర్మిజీ' మరియు అ'హ్మద్-2/189) అంటే పెండ్లి (నికా'హ్) కానిదే 'తలాఖ్ విషయమే రాదు.

**2**. అంటే వారి మహ్ర్ నిర్ణయించబడి ఉంటే సగం ఇవ్వండి. లేకపోతే మీకు తోచినది ఇచ్చి మంచివిధంగా సాగనంపండి.

**3**. దైవప్రవక్త('స'అస)కు కొన్ని ప్రత్యేకతలు ఇవ్వబడ్డాయి. ఉదాహరణకు అతని ('స'అస)పై తహజ్జుద్ నమా'జ్ విధిగా చేయబడింది. మరియు సదఖహ్ (దానం) అతని ('స'అస)పై హరాం చేయబడింది. ఇక్కడ ఎవరికైతే అతను ('స'అస) మహ్ర్ చెల్లించారో వారు అతనికి 'హలాల్ గావించబడ్డారు. వారికి మహ్ర్ ఇంత అని నియమించబడలేదు. ఉదాహరణకు: 'సఫియా మరియు జువేరియా (ర'ది.'అన్హుమ్)ల మహ్ర్. ఇతరులందరికీ దైవప్రవక్త ('స'అస) మహ్ర్ నగదు చెల్లించారు. కేవలం ఉమ్మె 'హబీబా (ర.'అన్హా) మహ్ర్ నజ్జాషీ (ర'ది.'అ.) చెల్లించారు.

**4**. జువేరియా మరియు చివరిభార్య 'సఫియా(ర'ది.'అన్హుమ్)లను ఇద్దరిని అతను ('స'అస) వారి స్వేచ్ఛనే మహ్ర్‌గాప్రసాదించి వివాహమాడారు. రె'హానా మరియు మారియాఖిబ్తియా(ర'ది.'అన్హుమ్)లు బానిసలుగానే ఉన్నారు. (ము'హమ్మద్ జూనాగఢి).

عَلَيْكَ وَبَنَاتِ عَمِّكَ وَبَنَاتِ عَمَّٰتِكَ وَبَنَاتِ خَالِكَ وَبَنَاتِ خَٰلَٰتِكَ ٱلَّٰتِي هَاجَرْنَ مَعَكَ وَٱمْرَأَةً مُّؤْمِنَةً إِن وَهَبَتْ نَفْسَهَا لِلنَّبِيِّ إِنْ أَرَادَ ٱلنَّبِيُّ أَن يَسْتَنكِحَهَا خَالِصَةً لَّكَ مِن دُونِ ٱلْمُؤْمِنِينَ ۗ قَدْ عَلِمْنَا مَا فَرَضْنَا عَلَيْهِمْ فِيٓ أَزْوَٰجِهِمْ وَمَا مَلَكَتْ أَيْمَٰنُهُمْ لِكَيْلَا يَكُونَ عَلَيْكَ حَرَجٌ ۗ وَكَانَ ٱللَّهُ غَفُورًا رَّحِيمًا ﴿٥٠﴾

۞ تُرْجِي مَن تَشَآءُ مِنْهُنَّ وَتُـْٔوِيٓ إِلَيْكَ مَن تَشَآءُ ۖ وَمَنِ ٱبْتَغَيْتَ مِمَّنْ عَزَلْتَ فَلَا جُنَاحَ عَلَيْكَ ۚ ذَٰلِكَ أَدْنَىٰٓ أَن تَقَرَّ أَعْيُنُهُنَّ وَلَا يَحْزَنَّ

మరియు నీతోపాటు వలస వచ్చిన నీ పిన తండ్రి (తండ్రి సోదరుల) కుమార్తెలను మరియు నీ మేనత్తల (తండ్రి సోదరీ మణుల) కుమార్తెలను మరియు నీ మేన మామల (తల్లి సోదరుల) కుమార్తెలను మరియు నీ పినతల్లుల (తల్లి సోదరీ మణుల) కుమార్తెలను మరియు తనను తాను ప్రవక్తకు సమర్పించుకున్న విశ్వాసిని అయిన స్త్రీని - ఒకవేళ ప్రవక్త ఆమెను వివాహం చేసుకోదలిస్తే ఇతర విశ్వాసుల కొరకు గాక ప్రత్యేకంగా నీ కొరకే - ధర్మసమ్మతం చేశాము. వాస్తవానికి వారి (ఇతర విశ్వాసుల) కొరకు వారి భార్యల విషయంలో మరియు వారి బానిసల విషయంలో, మేము విధించిన పరిమితులు మాకు బాగా తెలుసు.[1] ఇదంతా మేము నీకు ఏవిధమైన ఇబ్బంది కలుగకుండా ఉండాలని చేశాము. వాస్తవానికి అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత. (1/8)

**51.** * నీవు వారి(నీ భార్యల)లో నుండి, నీవు కోరిన ఆమెను నీ నుండి కొంతకాలం వేరుగా ఉంచవచ్చు. మరియు నీవు కోరిన ఆమెను నీతోపాటు ఉంచుకోవచ్చు. మరియు నీవు వేరుగా ఉంచిన వారిలో నుండి ఏ స్త్రీ నైనా నీవు తిరిగి పిలుచుకో గోరితే, నీపై ఎలాంటి దోషంలేదు. దీనితో వారి కళ్ళకు

---

**1**. ఇతర విశ్వాసులు ఒకేసారి నలుగురి కంటే ఎక్కువ మంది భార్యలను కలిగి ఉండరాదు. మరియు వారి నికా'హ్ కొరకు వలీ, సాక్షులు మరియు మ'హ్ర్ తప్పనిసరిగా ఉండాలి. ఈనాడు బానిసలు లేరు. ఎందుకంటే బానిసలు జిహాద్‌లో పట్టుబడిన వారు మాత్రమే. డబ్బిచ్చి బానిసను కొనడం ఇస్లాంలో 'హరామ్. చూడండి, 2:221, 4:3-4 మరియు 19:25.

وَيَرۡضَيۡنَ بِمَآ ءَاتَيۡتَهُنَّ كُلُّهُنَّۚ وَٱللَّهُ يَعۡلَمُ مَا فِي قُلُوبِكُمۡۚ وَكَانَ ٱللَّهُ عَلِيمًا حَلِيمٗا ٥١

చల్లదనం కలుగుతుందని, వారు దుఃఖపడరనీ నీవు వారికి ఏమి ఇచ్చినా, వారు సంతోషపడతారని ఆశించవచ్చు! వాస్తవానికి, మీ హృదయాలలో ఏముందో అల్లాహ్‌కు తెలుసు.[1] మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు శాంతస్వభావుడు (సహనశీలుడు).

لَّا يَحِلُّ لَكَ ٱلنِّسَآءُ مِنۢ بَعۡدُ وَلَآ أَن تَبَدَّلَ بِهِنَّ مِنۡ أَزۡوَٰجٖ وَلَوۡ أَعۡجَبَكَ حُسۡنُهُنَّ إِلَّا مَا مَلَكَتۡ يَمِينُكَۗ وَكَانَ ٱللَّهُ عَلَىٰ كُلِّ شَيۡءٖ رَّقِيبٗا ٥٢

**52.** వీరు గాక, ఇతరస్త్రీలు నీకు (వివాహమాడటానికి) ధర్మసమ్మతం కారు.[2] వీరికి బదులుగా కూడా మరెవ్వరినీ భార్యలుగా తీసుకునే అనుమతి కూడా నీకు లేదు - వారి సౌందర్యం నీకు ఎంత నచ్చినా - నీ ఆధీనంలో ఉన్న (బానిస) స్త్రీలు తప్ప![3] వాస్తవానికి అల్లాహ్ ప్రతి విషయాన్ని గమనిస్తున్నాడు.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تَدۡخُلُواْ بُيُوتَ ٱلنَّبِيِّ إِلَّآ أَن يُؤۡذَنَ لَكُمۡ إِلَىٰ طَعَامٍ غَيۡرَ نَٰظِرِينَ إِنَىٰهُ وَلَٰكِنۡ إِذَا دُعِيتُمۡ فَٱدۡخُلُواْ فَإِذَا طَعِمۡتُمۡ فَٱنتَشِرُواْ وَلَا مُسۡتَـٔۡنِسِينَ لِحَدِيثٍۚ

**53.** ఓ విశ్వాసులారా! ప్రవక్త యొక్క ఇండ్లలోకి అనుమతి లేకుండా ప్రవేశించకండి. భోజనార్థం (పిలువబడి నపుడు) ఆహారం సిద్ధపరిచే సమయం కొరకు వేచి ఉండకండి, కాని మీరు పిలువబడినప్పుడు తప్పకుండా వెళ్ళండి. అయితే భోజనం చేసిన వెంటనే

---

**1.** 'ఆయి'షహ్ (ర.'అన్హా) కథనం - దైవప్రవక్త ('స'అస) ఇలా ప్రార్థించే వారు: "ఓ అల్లాహ్! నేను నా మేరకు నా భార్యల మధ్య న్యాయంగా వ్యవహరిస్తున్నాను. ఇక నా వశంలో లేని దాని కొరకు నన్ను బాధ్యునిగా చేయకు! అది కేవలం నీ చేతిలో ఉంది." అంటే హృదయంలో ఉన్న ప్రేమ, అది ఒక భార్యకంటే మరొక భార్య కొరకు అధికంగా ఉండవచ్చు! (ఇబ్నె-'హంబల్).

**2.** అప్పుడు దైవప్రవక్త ('స'అస)కు తొమ్మిది మంది సతీమణులు (ర'ది.'అన్హుమ్) ఉండేవారు. ఐదుమంది ఖురైషులు 'ఆయిషహ్, 'హఫ్సా, ఉమ్మొ-'హబీబా, 'సౌదా, మరియు ఉమ్మొ-సల్మా. నలుగురు ఇతరులు: 'సఫియ్యా, మైమూనా, 'జైనబ్ మరియు జువేరియా. అతను ('స'అస) ఆ తరువాత ఎవ్వరితోనూ వివాహమాడలేదు.

**3.** బానిస స్త్రీల విషయంలో సంఖ్యాపరిమితి లేదు. వారిని గురించి 4:3, 23:6 మరియు 70:30 లలో కూడా శాసనం ఉంది.

إِنَّ ذَٰلِكُمْ كَانَ يُؤْذِى ٱلنَّبِىَّ
فَيَسْتَحْىِۦ مِنكُمْ ۖ وَٱللَّهُ لَا
يَسْتَحْىِۦ مِنَ ٱلْحَقِّ ۚ وَإِذَا
سَأَلْتُمُوهُنَّ مَتَٰعًا فَسْـَٔلُوهُنَّ مِن
وَرَآءِ حِجَابٍ ۚ ذَٰلِكُمْ أَطْهَرُ
لِقُلُوبِكُمْ وَقُلُوبِهِنَّ ۚ وَمَا كَانَ
لَكُمْ أَن تُؤْذُوا۟ رَسُولَ ٱللَّهِ
وَلَآ أَن تَنكِحُوٓا۟ أَزْوَٰجَهُۥ مِنۢ بَعْدِهِۦٓ
أَبَدًا ۚ إِنَّ ذَٰلِكُمْ كَانَ عِندَ ٱللَّهِ
عَظِيمًا ﴿٥٣﴾

إِن تُبْدُوا۟ شَيْـًٔا أَوْ تُخْفُوهُ فَإِنَّ ٱللَّهَ
كَانَ بِكُلِّ شَىْءٍ عَلِيمًا ﴿٥٤﴾

لَّا جُنَاحَ عَلَيْهِنَّ فِىٓ ءَابَآئِهِنَّ وَلَآ
أَبْنَآئِهِنَّ وَلَآ إِخْوَٰنِهِنَّ وَلَآ أَبْنَآءِ
إِخْوَٰنِهِنَّ وَلَآ أَبْنَآءِ أَخَوَٰتِهِنَّ وَلَا
نِسَآئِهِنَّ وَلَا مَا مَلَكَتْ أَيْمَٰنُهُنَّ ۗ

వెళ్ళిపోండి మరియు సాధారణ సంభాషణలో కాలక్షేపంచేస్తూ కూర్చోకండి. నిశ్చయంగా, దీని వలన ప్రవక్తకు కష్టం కలుగుతుంది; కాని అతను మిమ్మల్ని (పొమ్మనటానికి) సంకోచిస్తాడు. మరియు అల్లాహ్ సత్యం చెప్పటానికి సంకోచించడు (సిగ్గుపడడు).[1] మరియు మీరు ప్రవక్త భార్యలతో ఏదైనా అడగవలసి వచ్చినప్పుడు తెరచాటునుండి అడగండి. ఇది మీ హృదయాలను మరియు వారి హృదయాలను కూడా నిర్మలంగా ఉంచుతుంది. మరియు అల్లాహ్ సందేశహరునికి కష్టం కలిగించటం మీకు తగదు. మరియు అతని తరువాత అతని భార్యలతో మీరు ఎన్నటికీ వివాహం చేసుకోకండి. నిశ్చయంగా, ఇది అల్లాహ్ దృష్టిలో మహా అపరాధం.

**54**. ఒకవేళ మీరు ఏ విషయాన్నైనా వెలిబుచ్చినా లేదా దానిని దాచినా! నిశ్చయంగా, అల్లాహ్‌కు మాత్రం ప్రతి విషయం గురించి బాగా తెలుసు.

**55**. వారి (ప్రవక్త భార్యల)పై - తమ తండ్రుల, తమ కుమారుల, తమ సోదరుల, తమ సోదరుల కుమారుల, తమ సోదరీమణుల కుమారుల, తమ స్త్రీల లేదా తమ బానిస (స్త్రీల) - యెదుటకు వస్తే ఎలాంటి దోషంలేదు.[2]

---

**1**. దైవప్రవక్త ('స'అస) 'జైనబ్(ర.'అన్హా)తో వివాహమాడి ఇచ్చిన వలీమా భోజనం సందర్భంలో ఈ ఆయత్ అవతరింపజేయబడింది. ఆ రోజు కొందరు 'స'హాబీలు భోజనం తరువాత కూర్చొని కాలక్షేపం చేయసాగారు, ('స. బు'ఖారీ).

**2**. చూడండి, 24:31 అక్కడ కూడా ఈ శాసనం ఉంది.

وَٱتَّقِينَ ٱللَّهَۚ إِنَّ ٱللَّهَ كَانَ عَلَىٰ كُلِّ شَيْءٖ شَهِيدًا ﴿٥٥﴾

(ఓ స్త్రీలారా!) మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. నిశ్చయంగా, అల్లాహ్ ప్రతి దానికి సాక్షి.

إِنَّ ٱللَّهَ وَمَلَٰٓئِكَتَهُۥ يُصَلُّونَ عَلَى ٱلنَّبِيِّۚ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ صَلُّواْ عَلَيۡهِ وَسَلِّمُواْ تَسۡلِيمًا ﴿٥٦﴾

**56**. నిశ్చయంగా అల్లాహ్ మరియు ఆయన దూతలు ప్రవక్తపై దురూద్‌లు పంపుతూ ఉంటారు. ఓ విశ్వాసులారా! మీరు కూడా అతనిపై దురూద్‌లు మరియు మీ హృదయపూర్వక సలాంలు పంపుతూ ఉండండి.[1]

إِنَّ ٱلَّذِينَ يُؤۡذُونَ ٱللَّهَ وَرَسُولَهُۥ لَعَنَهُمُ ٱللَّهُ فِي ٱلدُّنۡيَا وَٱلۡأٓخِرَةِ وَأَعَدَّ لَهُمۡ عَذَابٗا مُّهِينٗا ﴿٥٧﴾

**57**. నిశ్చయంగా, ఎవరైతే అల్లాహ్ మరియు ఆయన సందేశహరునికి బాధ కలిగిస్తారో, వారిని అల్లాహ్ ఇహలోకంలో మరియు పరలోకంలో కూడా శపిస్తాడు (బహిష్కరిస్తాడు) మరియు ఆయన వారికై అవమానకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచాడు.[2]

---

**1**. అల్లాహ్ (సు.తా.) దైవదూతల ('అలైహిమ్. స.) ముందు దైవప్రవక్త ('స'అస)ను ప్రశంసిస్తాడు. మరియు అతనిపై తన కారుణ్యాలను అవతరింపజేస్తాడు. మరియు దైవదూత('అలైహిమ్.స.)లు అతని ('స'అస) ఔన్నత్యాలకు ప్రార్థనలు చేస్తారు.

సహాబీ (ర'ది.'అన్హుమ్)లు దైవప్రవక్తతో మేము ఏ విధంగా మీపై దురూద్ పంపాలి అని ప్రశ్నించగా, అతను('స'అస) నమాజ్‌లో చదివే దురూద్ ఇబ్రాహీమ్ వివరించారు, ('స.బు'ఖారీ).

**2**. అల్లాహ్(సు.తా.)ను ఎవ్వరూ బాధించలేరు. ఇక్కడ దీని అర్థం అల్లాహ్ (సు.తా.)కు ఇష్టం లేనిపని చేయడం. ఉదా: అల్లాహ్(సు.తా.)కు సంతానం అంటగట్టడం. అల్లాహ్ (సు.తా.) యొక్క సందేశహరునికి బాధ కలిగించడం అంటే, అతని ('స'అస)పై అసత్యవాదుడు, కవి, మాంత్రికుడు అని అపనిందలు మోపడం.

ల'అనతున్: అంటే అల్లాహ్ (సు.తా.) అనుగ్రహాల నుండి బహిష్కరించ, శపించ, నిషేధించ, త్రోసివేయ, దూషించ బడటం అనే అర్థాలున్నాయి. చూడండి, 2:88.

58. మరియు ఎవరైతే, ఏ తప్పూచేయని, విశ్వాసులైన పురుషులకు మరియు స్త్రీలకు బాధ కలిగిస్తారో, వాస్తవానికి వారు అపనిందను మరియు స్పష్టమైన పాప భారాన్ని తమమీద మోపుకున్నట్లే!

59. ఓ ప్రవక్తా! నీ భార్యలతో, నీ కుమార్తెలతో మరియు విశ్వాసినులైన స్త్రీలతోనూ తమ దుప్పట్లను తమ మీద పూర్తిగా కప్పుకోమని చెప్పు. ఇది వారు గుర్తించబడి బాధింపబడకుండా ఉండటానికి ఎంతో సముచితమైనది.[1] మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత. (1/4)

60. * ఒకవేళ ఈ కపట విశ్వాసులు మరియు తమ హృదయాలలో రోగం (కలుషితం) ఉన్నవారు మరియు మదీనాలో వదంతులు వ్యాపింపజేసే వారు. తమ (దుశ్చేష్టలను) మానుకోకపోతే, మేము తప్పక నీకు వారిపై ఆధిక్యత నొసంగుతాము. ఆ తరువాత వారు ఈ నగరంలో నీ పొరుగువారిగా కొన్నాళ్ళకంటే ఎక్కువ ఉండలేరు.

61. వారు శపించబడ్డ (బహిష్కరించబడ్డ) వారు. వారు ఎక్కడ కనబడితే అక్కడ పట్టుకోబడతారు మరియు వారు దారుణంగా చంపబడతారు.[2]

وَٱلَّذِينَ يُؤْذُونَ ٱلْمُؤْمِنِينَ
وَٱلْمُؤْمِنَٰتِ بِغَيْرِ مَا ٱكْتَسَبُوا۟
فَقَدِ ٱحْتَمَلُوا۟ بُهْتَٰنًا وَإِثْمًا مُّبِينًا
٥٨

يَٰٓأَيُّهَا ٱلنَّبِىُّ قُل لِّأَزْوَٰجِكَ وَبَنَاتِكَ
وَنِسَآءِ ٱلْمُؤْمِنِينَ يُدْنِينَ عَلَيْهِنَّ
مِن جَلَٰبِيبِهِنَّ ۚ ذَٰلِكَ أَدْنَىٰٓ أَن يُعْرَفْنَ
فَلَا يُؤْذَيْنَ ۗ وَكَانَ ٱللَّهُ غَفُورًا
رَّحِيمًا ٥٩

۞ لَّئِن لَّمْ يَنتَهِ ٱلْمُنَٰفِقُونَ وَٱلَّذِينَ
فِى قُلُوبِهِم مَّرَضٌ وَٱلْمُرْجِفُونَ
فِى ٱلْمَدِينَةِ لَنُغْرِيَنَّكَ بِهِمْ ثُمَّ لَا
يُجَاوِرُونَكَ فِيهَآ إِلَّا قَلِيلًا ٦٠

مَّلْعُونِينَ ۖ أَيْنَمَا ثُقِفُوٓا۟ أُخِذُوا۟
وَقُتِّلُوا۟ تَقْتِيلًا ٦١

---

1. చూడండి, 24:31, శరీరాన్ని పూర్తిగా కప్పుకొని, నెత్తిపై ఉన్న దుప్పటిని ముఖం మీదికి లాగుకొని కప్పుకోమని ఆజ్ఞ ఇవ్వబడింది.
2. చూడండి, 2:191.

62. ఇది ఇంతకు పూర్వం గడిచిన వారి విషయంలో జరుగుతున్న అల్లాహ్ సంప్రదాయమే! మరియు అల్లాహ్ సంప్రదాయంలో నీవు ఎలాంటి మార్పును చూడలేవు.[1]

سُنَّةَ ٱللَّهِ فِي ٱلَّذِينَ خَلَوۡاْ مِن قَبۡلُۖ وَلَن تَجِدَ لِسُنَّةِ ٱللَّهِ تَبۡدِيلٗا ﴿٦٢﴾

63. ప్రజలు నిన్ను అంతిమ ఘడియ (పునరుత్థానం)ను గురించి అడుగుతున్నారు. వారితో ఇలా అను: "దాని జ్ఞానం కేవలం అల్లాహ్‌కే ఉంది." మరియు నీకెలా తెలియగలదు? బహుశా, ఆ ఘడియ సమీపంలోనే ఉండవచ్చు![2]

يَسۡـَٔلُكَ ٱلنَّاسُ عَنِ ٱلسَّاعَةِۖ قُلۡ إِنَّمَا عِلۡمُهَا عِندَ ٱللَّهِۚ وَمَا يُدۡرِيكَ لَعَلَّ ٱلسَّاعَةَ تَكُونُ قَرِيبًا ﴿٦٣﴾

64. నిశ్చయంగా, అల్లాహ్ సత్య తిరస్కారులను శపించాడు (బహిష్కరించాడు) మరియు ఆయన వారి కొరకు మండే (నరక) అగ్నిని సిద్ధపరచి ఉంచాడు.

إِنَّ ٱللَّهَ لَعَنَ ٱلۡكَٰفِرِينَ وَأَعَدَّ لَهُمۡ سَعِيرًا ﴿٦٤﴾

65. వారందులో శాశ్వతంగా కలకాలం ఉంటారు. వారు ఎలాంటి సంరక్షకుణ్ణి గానీ సహాయకుణ్ణి గానీ పొందలేరు.

خَٰلِدِينَ فِيهَآ أَبَدٗاۖ لَّا يَجِدُونَ وَلِيّٗا وَلَا نَصِيرٗا ﴿٦٥﴾

66. వారి ముఖాలు నిప్పులపై బొర్లింపబడిన నాడు; వారు: "అయ్యో! మేము అల్లాహ్‌కు విధేయులమై ఉండి, సందేశహరుణ్ణి అనుసరించి ఉంటే ఎంత బాగుండేది?" అని వాపోతారు.

يَوۡمَ تُقَلَّبُ وُجُوهُهُمۡ فِي ٱلنَّارِ يَقُولُونَ يَٰلَيۡتَنَآ أَطَعۡنَا ٱللَّهَ وَأَطَعۡنَا ٱلرَّسُولَا۠ ﴿٦٦﴾

67. వారు ఇంకా ఇలా అంటారు: "ఓ మా ప్రభూ! నిశ్చయంగా, మేము మా నాయకులను మరియు మా పెద్దలను అనుసరించాము. కాని, వారే మమ్మల్ని (ఋజు) మార్గం నుండి తప్పించారు.

وَقَالُواْ رَبَّنَآ إِنَّآ أَطَعۡنَا سَادَتَنَا وَكُبَرَآءَنَا فَأَضَلُّونَا ٱلسَّبِيلَا۠ ﴿٦٧﴾

1. చూడండి, 35:42-44.
2. చూడండి, 7:187.

رَبَّنَآ ءَاتِهِمۡ ضِعۡفَيۡنِ مِنَ ٱلۡعَذَابِ وَٱلۡعَنۡهُمۡ لَعۡنٗا كَبِيرٗا ﴿٦٨﴾

68. ''ఓ మా ప్రభూ! వారికి రెట్టింపు శిక్ష విధించు మరియు వారిని పూర్తిగా శపించు (బహిష్కరించు)!''

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تَكُونُواْ كَٱلَّذِينَ ءَاذَوۡاْ مُوسَىٰ فَبَرَّأَهُ ٱللَّهُ مِمَّا قَالُواْۚ وَكَانَ عِندَ ٱللَّهِ وَجِيهٗا ﴿٦٩﴾

69. ఓ విశ్వాసులారా! మీరు మూసాను బాధించిన వారివలె అయిపోకండి.[1] తరువాత అల్లాహ్ వారు (కల్పించిన) ఆరోపణనుండి అతనికి విముక్తి కలిగించాడు. అతను (మూసా), అల్లాహ్ దృష్టిలో ఎంతో ఆదరణీయుడు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ ٱتَّقُواْ ٱللَّهَ وَقُولُواْ قَوۡلٗا سَدِيدٗا ﴿٧٠﴾

70. ఓ విశ్వాసులారా! అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు మీరు మాట్లాడినప్పుడు యుక్తమైన మాటనే పలకండి.

يُصۡلِحۡ لَكُمۡ أَعۡمَٰلَكُمۡ وَيَغۡفِرۡ لَكُمۡ ذُنُوبَكُمۡۗ وَمَن يُطِعِ ٱللَّهَ وَرَسُولَهُۥ فَقَدۡ فَازَ فَوۡزًا عَظِيمًا ﴿٧١﴾

71. ఆయన మీ కర్మలను సరిదిద్దుతాడు మరియు మీ పాపాలను క్షమిస్తాడు. మరియు ఎవడైతే అల్లాహ్‌కు విధేయుడై, సందేశహరుని ఆజ్ఞను పాలిస్తాడో! నిశ్చయంగా, అతడే గొప్ప విజయం పొందినవాడు!

إِنَّا عَرَضۡنَا ٱلۡأَمَانَةَ عَلَى ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَٱلۡجِبَالِ فَأَبَيۡنَ أَن يَحۡمِلۡنَهَا وَأَشۡفَقۡنَ مِنۡهَا وَحَمَلَهَا ٱلۡإِنسَٰنُۖ إِنَّهُۥ كَانَ ظَلُومٗا جَهُولٗا ﴿٧٢﴾

72. నిశ్చయంగా, మేము బాధ్యతను[2] ఆకాశాలకు, భూమికి మరియు పర్వతాలకు సమర్పించగోరాము, కాని అవి దానిని భరించటానికి సమ్మతించ లేదు మరియు దానికి భయపడ్డాయి, కాని మానవుడు దానిని తన మీద మోపుకున్నాడు. నిశ్చయంగా అతడు దుర్మార్గుడు, మూఢుడు కూడాను.

1. మూసా ('అ.స.)ను బాధించిన వివరాలకు చూడండి, 2:55, 5:24.

2. బాధ్యత అంటే, అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞ పాటించడం వల్ల కలిగే పుణ్యఫలాలు మరియు తిరస్కరించడంవల్ల కలిగే కష్టనష్టాలు. శిక్షలకు భయపడి, ఆకాశాలూ, భూమీ మరియు పర్వతాలు, దానిని భరించటానికి సమ్మతించలేదు. కాని మానవుడు తన మూఢత్వం వల్ల ఈ బాధ్యతను తనమీద మోపుకున్నాడు.
బాధ్యత అంటే ఖుర్ఆన్ కూడా కావచ్చు!

لِّيُعَذِّبَ ٱللَّهُ ٱلْمُنَٰفِقِينَ
وَٱلْمُنَٰفِقَٰتِ وَٱلْمُشْرِكِينَ
وَٱلْمُشْرِكَٰتِ وَيَتُوبَ ٱللَّهُ عَلَى
ٱلْمُؤْمِنِينَ وَٱلْمُؤْمِنَٰتِۗ وَكَانَ ٱللَّهُ
غَفُورًا رَّحِيمًا ﴿٧٣﴾

**73.** (దాని ఫలితంగా!) అల్లాహ్ కపట విశ్వాసులయిన పురుషులను మరియు కపట విశ్వాసులయిన స్త్రీలను మరియు అల్లాహ్‌కు సాటికల్పించే పురుషులను మరియు సాటికల్పించే స్త్రీలను శిక్షిస్తాడు; మరియు విశ్వాసులైన పురుషుల మరియు విశ్వాసులైన స్త్రీల పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాడు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

*****

## 34. సూరహ్ సబా'

## سُورَةُ سَبَإٍ

ఇక్కడి నుండి ఆరు సూరాహ్‌ల సమూహం ప్రారంభమవుతోంది (34-39). ఇది మధ్య మక్కా కాలపు సూరహ్. ఈ సూరహ్ బహుశా సూరహ్ అల్-ఇ'స్రా (17) కంటే ముందు అవతరింపజేయబడింది. దీనిపేరు **15-20 ఆయతులలో** ఉన్న విషయంతో తీసుకోబడింది. సబా' ఒక తెగవారి పేరు. వారు ఈ కాలపు యమన్‌లో ఉండేవారు. ధనసంపత్తులు, మానవ శక్తిసామర్థ్యాలు తాత్కాలికమైనవి. 'అవి ఎప్పుడైనా నశించిపోవచ్చు.' అనే విషయం ఈ గాథవల్ల తెలుస్తుంది. బైబిల్‌లో వారు షీబా అనే పేరుతో పిలువబడ్డారు. ఇందులో **54 ఆయతులు** ఉన్నాయి.

బِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

ٱلْحَمْدُ لِلَّهِ ٱلَّذِى لَهُۥ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَمَا فِى ٱلْأَرْضِ وَلَهُ ٱلْحَمْدُ فِى ٱلْءَاخِرَةِ ۚ وَهُوَ ٱلْحَكِيمُ ٱلْخَبِيرُ ﴿١﴾

**1.** సర్వస్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే! ఆకాశాలలో మరియు భూమిలో ఉన్నదంతా ఆయనకే చెందుతుంది. మరియు పరలోకంలో కూడ సర్వస్తోత్రాలకు అర్హుడు ఆయనే![1] మరియు ఆయన మహా వివేకవంతుడు, సర్వం తెలిసినవాడు.[2]

يَعْلَمُ مَا يَلِجُ فِى ٱلْأَرْضِ وَمَا يَخْرُجُ مِنْهَا وَمَا يَنزِلُ مِنَ ٱلسَّمَآءِ وَمَا يَعْرُجُ فِيهَا ۚ وَهُوَ ٱلرَّحِيمُ ٱلْغَفُورُ ﴿٢﴾

**2.** భూమిలోకి ప్రవేశించేది మరియు దానినుండి బయటికి వచ్చేది మరియు ఆకాశం నుండి దిగేది మరియు దానిలోకి పైకి ఎక్కిపోయేది, అంతా ఆయనకు బాగా తెలుసు. మరియు ఆయన అపార కరుణాప్రదాత, క్షమాశీలుడు.

---

**1**. ఈ స్తోత్రాలు పునరుత్థాన దినమున విశ్వాసులు చేస్తారు. చూడండి, 39:74, 7:43, 35:34.

**2**. చూడండి, 6:18.

وَقَالَ ٱلَّذِينَ كَفَرُواْ لَا تَأۡتِينَا ٱلسَّاعَةُۖ قُلۡ بَلَىٰ وَرَبِّي لَتَأۡتِيَنَّكُمۡ عَٰلِمِ ٱلۡغَيۡبِۖ لَا يَعۡزُبُ عَنۡهُ مِثۡقَالُ ذَرَّةٖ فِي ٱلسَّمَٰوَٰتِ وَلَا فِي ٱلۡأَرۡضِ وَلَآ أَصۡغَرُ مِن ذَٰلِكَ وَلَآ أَكۡبَرُ إِلَّا فِي كِتَٰبٖ مُّبِينٖ ٣

3. మరియు సత్యతిరస్కారులు ఇలా అంటారు: "అంతిమ ఘడియ (పునరుత్థానం) మాపై ఎన్నడూ రాదు!" వారితో ఇలా అను: "ఎందుకు రాదు! అగోచరవిషయ జ్ఞానంగల నా ప్రభువు సాక్షిగా! అది తప్పక మీ మీదకు వస్తుంది." ఆకాశాలలో మరియు భూమిలో ఉన్న రవ్వతో (పరమాణువుతో) సమానమైన వస్తువుగానీ, లేదా దాని కంటే చిన్నదిగానీ లేదా దాని కంటే పెద్దదిగానీ, ఒక స్పష్టమైన గ్రంథంలో (వ్రాయబడకుండా) ఆయనకు మరుగుగా లేదు.

لِّيَجۡزِيَ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِۚ أُوْلَٰٓئِكَ لَهُم مَّغۡفِرَةٞ وَرِزۡقٞ كَرِيمٞ ٤

4. అది (అంతిమ ఘడియ), విశ్వసించి సత్కార్యాలు చేసేవారికి ప్రతిఫలము నివ్వటానికి వస్తుంది. అలాంటి వారికి క్షమాపణ మరియు గౌరవప్రదమైన జీవనోపాధి (స్వర్గం) ఉంటాయి.[1]

وَٱلَّذِينَ سَعَوۡ فِيٓ ءَايَٰتِنَا مُعَٰجِزِينَ أُوْلَٰٓئِكَ لَهُمۡ عَذَابٞ مِّن رِّجۡزٍ أَلِيمٞ ٥

5. మరియు ఎవరైతే మా సూచన (ఆయాత్)లను విఫలం చేయటానికి ప్రయత్నిస్తారో, అలాంటి వారికి అధమమైన, బాధాకరమైన శిక్ష ఉంటుంది.

وَيَرَى ٱلَّذِينَ أُوتُواْ ٱلۡعِلۡمَ ٱلَّذِيٓ أُنزِلَ إِلَيۡكَ مِن رَّبِّكَ هُوَ ٱلۡحَقَّ وَيَهۡدِيٓ إِلَىٰ صِرَٰطِ ٱلۡعَزِيزِ ٱلۡحَمِيدِ ٦

6. మరియు ఎవరికైతే జ్ఞానం ఇవ్వబడిందో! వారు,[2] ఇది నీ ప్రభువు తరఫు నుండి నీపై అవతరింపజేయబడిన సత్యమనీ మరియు అది సర్వశక్తిమంతుడు ప్రశంసనీయుడు (అయిన అల్లాహ్) మార్గం వైపునకే మార్గదర్శకత్వం చేస్తుందనీ గ్రహిస్తారు.

---

1. చూడండి, 8:4.
2. జ్ఞానమివ్వబడిన వారు అంటే స'హాబా (ర'ది.'అన్హుమ్)లు, విశ్వాసులు మరియు గ్రంథజ్ఞానం గలవారు, అందరూ కావచ్చు!

7. మరియు సత్యతిరస్కారులు ఇలా అంటారు: "మీరు (చచ్చి) దుమ్ముగా మారి, చెల్లాచెదరైన తరువాత కూడా! నిశ్చయంగా, మళ్ళీ క్రొత్తగా సృష్టింపబడతారని తెలియజేసే వ్యక్తిని[1] మీకు చూపమంటారా?

8. "అతను అల్లాహ్‌పై అబద్ధం కల్పించాడో లేక! అతనికి పిచ్చిపట్టిందో తెలియటం లేదు!" అలాకాదు, ఎవరైతే పరలోకాన్ని నమ్మరో వారు శిక్షకు గురి అవుతారు. మరియు వారు మార్గభ్రష్టత్వంలో చాలాదూరం వెళ్ళిపోయారు.

9. ఏమిటి? వారు తమకు ముందున్న మరియు తమ వెనుకనున్న ఆకాశాన్ని మరియు భూమిని చూడటంలేదా? మేము కోరితే, వారిని భూమిలోకి అణగద్రొక్కే వారం, లేదా వారిపై ఆకాశంనుండి ఒక ముక్కను పడవేసే వారం. నిశ్చయంగా, ఇందులో పశ్చాత్తాపంతో (అల్లాహ్ వైపునకు) మరలే, ప్రతిదాసుని కొరకు ఒకసూచన ఉంది.[2] (3/8)

10. * మరియు వాస్తవంగా, మేము దావూద్‌కు మా తరఫునుండి గొప్ప అనుగ్రహాన్ని ప్రసాదించాము: "ఓ పర్వతాల్లారా! మరియు పక్షులలారా! అతనితో కలిసి (మా స్తోత్రాన్ని) ఉచ్చరించండి!"[3] (అని మేము ఆజ్ఞాపించాము). మేము అతని కొరకు ఇనుమును మెత్తదిగా చేశాము.

وَقَالَ ٱلَّذِينَ كَفَرُوا۟ هَلْ نَدُلُّكُمْ عَلَىٰ رَجُلٍ يُنَبِّئُكُمْ إِذَا مُزِّقْتُمْ كُلَّ مُمَزَّقٍ إِنَّكُمْ لَفِى خَلْقٍ جَدِيدٍ ٧

أَفْتَرَىٰ عَلَى ٱللَّهِ كَذِبًا أَم بِهِۦ جِنَّةٌۢ ۗ بَلِ ٱلَّذِينَ لَا يُؤْمِنُونَ بِٱلْـَٔاخِرَةِ فِى ٱلْعَذَابِ وَٱلضَّلَـٰلِ ٱلْبَعِيدِ ٨

أَفَلَمْ يَرَوْا۟ إِلَىٰ مَا بَيْنَ أَيْدِيهِمْ وَمَا خَلْفَهُم مِّنَ ٱلسَّمَآءِ وَٱلْأَرْضِ ۚ إِن نَّشَأْ نَخْسِفْ بِهِمُ ٱلْأَرْضَ أَوْ نُسْقِطْ عَلَيْهِمْ كِسَفًا مِّنَ ٱلسَّمَآءِ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَـَٔايَةً لِّكُلِّ عَبْدٍ مُّنِيبٍ ٩

۞ وَلَقَدْ ءَاتَيْنَا دَاوُۥدَ مِنَّا فَضْلًا ۖ يَـٰجِبَالُ أَوِّبِى مَعَهُۥ وَٱلطَّيْرَ ۖ وَأَلَنَّا لَهُ ٱلْحَدِيدَ ١٠

---

1. ఇది సత్యతిరస్కారులు దైవప్రవక్త ('స'అస) గురించి పలుకుతున్నారు.
2. చూడండి, 24:31 చివరి వాక్యం.
3. చూడండి, 21:79.

11. (అతనికి ఇలా ఆదేశమిచ్చాము): ''నీవు కవచాలు తయారుచేయి మరియు వాటి వలయా(కడియా)లను సరి సమానంగా కూర్చు!'' మరియు (ఓ మానవులారా!): ''మీరు సత్కార్యాలు చేయండి. నిశ్చయంగా, మీరు చేసేదంతా నేను చూస్తున్నాను.''

أَنِ ٱعْمَلْ سَٰبِغَٰتٍ وَقَدِّرْ فِى ٱلسَّرْدِ ۖ وَٱعْمَلُوا۟ صَٰلِحًا ۖ إِنِّى بِمَا تَعْمَلُونَ بَصِيرٌ ﴿١١﴾

12. మరియు మేము గాలిని సులైమాన్‌కు (వశపరచాము); దాని ఉదయపు గమనం ఒక నెల రోజుల పాటి ప్రయాణాన్ని పూర్తిచేసేది మరియు దాని సాయంకాలపు గమనం ఒకనెల.[1] మరియు మేము అతని కొరకు రాగి ఊటను ప్రవహింపజేశాము. మరియు అతని ప్రభువు ఆజ్ఞతో, అతని సన్నిధిలో పనిచేసే జిన్నాతులను అతనికి వశపరచాము. మరియు వారిలో మా ఆజ్ఞను ఉల్లంఘించిన వాడికి ప్రజ్వలించే నరకాగ్ని శిక్షను రుచి చూపుతూ ఉండేవారము.

وَلِسُلَيْمَٰنَ ٱلرِّيحَ غُدُوُّهَا شَهْرٌ وَرَوَاحُهَا شَهْرٌ ۖ وَأَسَلْنَا لَهُۥ عَيْنَ ٱلْقِطْرِ ۖ وَمِنَ ٱلْجِنِّ مَن يَعْمَلُ بَيْنَ يَدَيْهِ بِإِذْنِ رَبِّهِۦ ۖ وَمَن يَزِغْ مِنْهُمْ عَنْ أَمْرِنَا نُذِقْهُ مِنْ عَذَابِ ٱلسَّعِيرِ ﴿١٢﴾

13. వారు (జిన్నాతులు) అతనికి అతను కోరే, పెద్దపెద్ద కట్టడాలను, ప్రతిమలను, గుంటలవంటి పెద్దపెద్ద గంగాళాలను, (తమ స్థానము నుండి) కదిలింపలేని కళాయిాలను తయారు చేసేవారు. ''ఓ దావూద్ వంశీయులారా! మీరు కృతజ్ఞులై పనులు చేస్తూఉండండి.'' మరియు నా దాసులలో కృతజ్ఞతలు తెలిపేవారు చాలా తక్కువ.

يَعْمَلُونَ لَهُۥ مَا يَشَآءُ مِن مَّحَٰرِيبَ وَتَمَٰثِيلَ وَجِفَانٍ كَٱلْجَوَابِ وَقُدُورٍ رَّاسِيَٰتٍ ۚ ٱعْمَلُوٓا۟ ءَالَ دَاوُۥدَ شُكْرًا ۚ وَقَلِيلٌ مِّنْ عِبَادِىَ ٱلشَّكُورُ ﴿١٣﴾

1. చూడండి, 21:81-82.

فَلَمَّا قَضَيْنَا عَلَيْهِ ٱلْمَوْتَ مَا دَلَّهُمْ
عَلَىٰ مَوْتِهِۦٓ إِلَّا دَآبَّةُ ٱلْأَرْضِ
تَأْكُلُ مِنسَأَتَهُۥ ۖ فَلَمَّا خَرَّ تَبَيَّنَتِ
ٱلْجِنُّ أَن لَّوْ كَانُوا۟ يَعْلَمُونَ ٱلْغَيْبَ
مَا لَبِثُوا۟ فِى ٱلْعَذَابِ ٱلْمُهِينِ ﴿١٤﴾

**14**. మేము అతని (సులైమాన్)పై మృత్యువును విధించినప్పుడు, అతని చేతికర్రను తింటూ ఉన్న పురుగు తప్ప, మరెవ్వరూ అతని మరణవిషయం, వారికి (జిన్నాతులకు) తెలుపలేదు.[1] ఆ తరువాత అతను పడిపోగా జిన్నాతులు తమకు అగోచర విషయాలు తెలిసిఉంటే, తాము అవమానకరమైన ఈ బాధలో పడి ఉండేవారం కాముకదా అని తెలుసుకున్నారు.

لَقَدْ كَانَ لِسَبَإٍ فِى مَسْكَنِهِمْ
ءَايَةٌ ۖ جَنَّتَانِ عَن يَمِينٍ وَشِمَالٍ ۖ
كُلُوا۟ مِن رِّزْقِ رَبِّكُمْ وَٱشْكُرُوا۟
لَهُۥ ۚ بَلْدَةٌ طَيِّبَةٌ وَرَبٌّ غَفُورٌ ﴿١٥﴾

**15**. వాస్తవంగా, సబా' వారి కొరకు, వారి నివాసస్థలంలో ఒక సూచన ఉంది.[2] దాని కుడి మరియు ఎడమ ప్రక్కలలో రెండు తోటలు ఉండేవి (వారితో): "మీ ప్రభువు ప్రసాదించిన ఆహారం తిని ఆయనకు కృతజ్ఞతలు తెలుపండి!" (అని అనబడింది). ఇది చాలా మంచి దేశం మరియు మీ ప్రభువు క్షమాశీలుడు.

فَأَعْرَضُوا۟ فَأَرْسَلْنَا عَلَيْهِمْ سَيْلَ
ٱلْعَرِمِ وَبَدَّلْنَٰهُم بِجَنَّتَيْهِمْ جَنَّتَيْنِ
ذَوَاتَىْ أُكُلٍ خَمْطٍ وَأَثْلٍ وَشَىْءٍ
مِّن سِدْرٍ قَلِيلٍ ﴿١٦﴾

**16**. అయినా వారు విముఖులయ్యారు. కాబట్టి మేము వారిపైకి, కట్టను తెంచి వరదను పంపాము. మరియు వారి రెండు తోటలను చేదైన ఫలాలిచ్చే చెట్లు, ఝూవుక చెట్లు మరియు కొన్ని మాత్రమే రేగుచెట్లు ఉన్న తోటలుగా మార్చాము.[3]

---

**1**. దీనితో తెలిసేది ఏమిటంటే జిన్నాతులకు అగోచర విషయాల జ్ఞానం ఉండదు.

**2**. సబా': ఒక జాతి పేరు. బైబిల్‌లో వారు షీబా (Sheiba) అనే పేరుతో పిలువబడ్డారు. వారిపై ఒక స్త్రీ రాజ్యాధికారి. అది ఈ నాటి యమన్‌లోని 'హ'దరమోత్ ప్రాంతాలలో ఉండేది. ఆమె సులైమాన్ ('అ.స.)ను కలుసుకొనిన తరువాత ఇస్లాం స్వీకరించింది. అంతకు పూర్వం వారు సూర్యుణ్ణి పూజించేవారు. ఆ రాజ్యపు రాజధాని పేరు మ'ఆరిబ్. వారు డామ్‌లు నిర్మించారు. దానివల్ల వారు మంచి పంటలు పండించి సుఖసంతోషాలలో వర్ధిల్లుతూ ఉండేవారు.

**3**. అస్లి'న్, ఝూవుక చెట్లు (Tamarisk Trees) లేక వాటివంటి చెట్లు. దీని

ذَٰلِكَ جَزَيۡنَٰهُم بِمَا كَفَرُواْۖ وَهَلۡ نُجَٰزِيٓ إِلَّا ٱلۡكَفُورَ ١٧

**17**. ఇది వారి కృతఘ్నతకు (సత్యతిరస్కారానికి) బదులుగా వారికిచ్చిన ప్రతిఫలం. మరియు ఇలాంటి ప్రతిఫలం మేము కృతఘ్నులకు తప్ప, ఇతరులకు ఇవ్వము.

وَجَعَلۡنَا بَيۡنَهُمۡ وَبَيۡنَ ٱلۡقُرَى ٱلَّتِي بَٰرَكۡنَا فِيهَا قُرٗى ظَٰهِرَةٗ وَقَدَّرۡنَا فِيهَا ٱلسَّيۡرَۖ سِيرُواْ فِيهَا لَيَالِيَ وَأَيَّامًا ءَامِنِينَ ١٨

**18**. మరియు మేము వారి మధ్య మరియు మేము శుభాలు ప్రసాదించిన నగరాల మధ్య, స్పష్టంగా కనిపించే నగరాలను స్థాపించి: "వాటి మధ్య సురక్షితంగా రేయింబవళ్ళు ప్రయాణిస్తూ ఉండండి." (అని అన్నాము).

فَقَالُواْ رَبَّنَا بَٰعِدۡ بَيۡنَ أَسۡفَارِنَا وَظَلَمُوٓاْ أَنفُسَهُمۡ فَجَعَلۡنَٰهُمۡ أَحَادِيثَ وَمَزَّقۡنَٰهُمۡ كُلَّ مُمَزَّقٍۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَٰتٖ لِّكُلِّ صَبَّارٖ شَكُورٖ ١٩

**19**. కాని వారు: "ఓ మా ప్రభూ! మా ప్రయాణ దూరాలను పొడిగించు." అని వేడుకొని, తమకు తామే అన్యాయం చేసుకున్నారు. కావున మేము వారిని కథలుగా మిగిల్చి, వారిని పూర్తిగా చెల్లాచెదురు చేశాము.[1] నిశ్చయంగా, ఇందులో సహనశీలుడు, కృతజ్ఞుడు అయిన ప్రతివ్యక్తికి సూచనలున్నాయి.

---

తాత్పర్యమేమిటంటే, వారి అవిశ్వాస వైఖరి మరియు సత్యతిరస్కారం వల్ల, మొదట మంచి ఫలాలనిచ్చే ఆ రెండు తోటలు ఎక్కువగా చేదైన ఫలాలిచ్చే పెద్ద పెద్ద ముండ్లు గల చెట్లగా మారిపోయాయి. మరియు కొన్ని మాత్రమే మంచి ఫలాలిచ్చే రేగుచెట్లు (Lote-Trees)గా మిగిలి పోయాయి.

1. మ'ఆరిబ్ డామ్, తెగిన తరువాత అక్కడి ప్రజలు ఇటూ అటూ చెల్లాచెదరై పోయారు.

**20**. వాస్తవానికి ఇబ్లీస్ (షై'తాన్) వారి విషయంలో తాను ఊహించింది సత్యమయిందని నిరూపించాడు. ఎందుకంటే! విశ్వాసులలోని ఒక వర్గం వారు తప్ప, అందరూ వాడిని అనుసరించారు.

وَلَقَدْ صَدَّقَ عَلَيْهِمْ إِبْلِيسُ ظَنَّهُۥ فَٱتَّبَعُوهُ إِلَّا فَرِيقًا مِّنَ ٱلْمُؤْمِنِينَ ﴿٢٠﴾

**21**. మరియు వాడికి (షై'తాన్‌కు) వారిపై ఎలాంటి అధికారం లేదు.[1] కాని, పరలోకాన్ని విశ్వసించేవాడెవడో (మరియు) దానిని గురించి సంశయంలో పడ్డవాడెవడో, తెలుసుకోవటానికి మాత్రమే (మేమిలాచేశాము) మరియు నీ ప్రభువు ప్రతి విషయాన్ని కనిపెట్టుకొని ఉంటాడు.

وَمَا كَانَ لَهُۥ عَلَيْهِم مِّن سُلْطَـٰنٍ إِلَّا لِنَعْلَمَ مَن يُؤْمِنُ بِٱلْـَٔاخِرَةِ مِمَّنْ هُوَ مِنْهَا فِى شَكٍّ ۗ وَرَبُّكَ عَلَىٰ كُلِّ شَىْءٍ حَفِيظٌ ﴿٢١﴾

**22**. వారితో ఇలా అను: "అల్లాహ్‌ను వదలి మీరు ఎవరినైతే, (ఆరాధ్యదైవాలుగా) భావిస్తున్నారో, వారిని పిలిచి చూడండి!" ఆకాశాలలో గానీ మరియు భూమిలో గానీ రవ్వ(పరమాణువు) అంత వస్తువుపై కూడా వారికి అధికారం లేదు. మరియు వారికి ఆ రెండింటిలో ఎలాంటి భాగస్వామ్యమూ లేదు. మరియు ఆయనకు వారిలో నుండి ఎవ్వడూ సహాయకుడునూ కాడు.[2]

قُلِ ٱدْعُوا۟ ٱلَّذِينَ زَعَمْتُم مِّن دُونِ ٱللَّهِ ۖ لَا يَمْلِكُونَ مِثْقَالَ ذَرَّةٍ فِى ٱلسَّمَـٰوَٰتِ وَلَا فِى ٱلْأَرْضِ وَمَا لَهُمْ فِيهِمَا مِن شِرْكٍ وَمَا لَهُۥ مِنْهُم مِّن ظَهِيرٍ ﴿٢٢﴾

---

1. చూడండి, 14:22.

2. చూడండి, 17:56-57.

23. మరియు ఆయన దగ్గర ఏ విధమైన సిఫారసు పనికిరాదు, ఆయన అనుమతించిన వాడి (సిఫారసు తప్ప)![1] చివరకు వారి హృదయాల నుండి భయం తొలగిపోయినప్పుడు వారు (దేవదూతలు): "మీ ప్రభువు మీతో చెప్పిందేమిటీ?" అని అడుగుతారు. దానికి వారంటారు: "సత్యం మాత్రమే!" మరియు ఆయన మహోన్నతుడు, మహనీయుడు. (1/2)

وَلَا تَنفَعُ ٱلشَّفَٰعَةُ عِندَهُۥٓ إِلَّا لِمَنۡ أَذِنَ لَهُۥۚ حَتَّىٰٓ إِذَا فُزِّعَ عَن قُلُوبِهِمۡ قَالُواْ مَاذَا قَالَ رَبُّكُمۡۖ قَالُواْ ٱلۡحَقَّۖ وَهُوَ ٱلۡعَلِيُّ ٱلۡكَبِيرُ ٢٣

24. * వారిని ఇలా అడుగు: "మీకు ఆకాశాల నుండి మరియు భూమి నుండి జీవనోపాధిని సమకూర్చేవాడెవడు?" వారికి తెలుపు: "అల్లాహ్!" అయితే నిశ్చయంగా, మేమో లేక మీరో ఎవరో ఒకరు మాత్రమే సన్మార్గంలో ఉన్నాము లేదా స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో ఉన్నాము."

۞ قُلۡ مَن يَرۡزُقُكُم مِّنَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۖ قُلِ ٱللَّهُۖ وَإِنَّآ أَوۡ إِيَّاكُمۡ لَعَلَىٰ هُدًى أَوۡ فِي ضَلَٰلٖ مُّبِينٖ ٢٤

25. ఇంకా ఇలా అను: "మేము చేసిన పాపాలకు మీరు ప్రశ్నించబడరు మరియు మీ కర్మలను గురించి మేమూ ప్రశ్నించబడము."

قُل لَّا تُسۡـَٔلُونَ عَمَّآ أَجۡرَمۡنَا وَلَا نُسۡـَٔلُ عَمَّا تَعۡمَلُونَ ٢٥

26. వారితో ఇలా అను: "మన ప్రభువు మనందరినీ (పునరుత్థాన దినమున) ఒకేచోట సమకూర్చుతాడు. తరువాత న్యాయంగా మన మధ్య తీర్పుచేస్తాడు. ఆయనే సర్వోత్తమమైన తీర్పు చేసేవాడు,[2] సర్వజ్ఞుడు."

قُلۡ يَجۡمَعُ بَيۡنَنَا رَبُّنَا ثُمَّ يَفۡتَحُ بَيۡنَنَا بِٱلۡحَقِّ وَهُوَ ٱلۡفَتَّاحُ ٱلۡعَلِيمُ ٢٦

---

1. చూడండి, 10:3,19:87, 20:109.

2. అల్-ఫత్తా'హు: The Decider, The Judge, The Opener of the gates of sustenance and of mercy to His servants. తన దాసులకు జీవనోపాధి మరియు కారుణ్యపు ద్వారాలు తెరిచేవాడు. ఆపద్బాంధవుడు, న్యాయాధిపతి, తీర్పు చేసేవాడు, పరిష్కరించే వాడు.

قُلۡ أَرُونِيَ ٱلَّذِينَ أَلۡحَقۡتُم بِهِۦ شُرَكَآءَۖ كَلَّاۚ بَلۡ هُوَ ٱللَّهُ ٱلۡعَزِيزُ ٱلۡحَكِيمُ ٢٧

**27**. వారితో ఇలా అను: "మీరు ఆయనకు సాటిగా నిలబెట్టిన భాగస్వాములను నాకు చూపించండి. ఎవరూ లేరు! వాస్తవానికి ఆయన, అల్లాహ్ యే సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు."

وَمَآ أَرۡسَلۡنَٰكَ إِلَّا كَآفَّةٗ لِّلنَّاسِ بَشِيرٗا وَنَذِيرٗا وَلَٰكِنَّ أَكۡثَرَ ٱلنَّاسِ لَا يَعۡلَمُونَ ٢٨

**28**. మరియు (ఓ ము'హమ్మద్!) మేము నిన్ను సర్వ మానవులకు శుభవార్త నిచ్చేవానిగా మరియు హెచ్చరిక చేసేవానిగా మాత్రమే పంపాము.[1] కాని వాస్తవానికి చాలా మంది ప్రజలకు ఇది తెలియదు.[2]

وَيَقُولُونَ مَتَىٰ هَٰذَا ٱلۡوَعۡدُ إِن كُنتُمۡ صَٰدِقِينَ ٢٩

**29**. మరియు వారు: "మీరు సత్యవంతులే అయితే, ఆ వాగ్దానం ఎప్పుడు నెరవేరనున్నది?" అని అడుగుతున్నారు.[3]

قُل لَّكُم مِّيعَادُ يَوۡمٖ لَّا تَسۡتَـٔۡخِرُونَ عَنۡهُ سَاعَةٗ وَلَا تَسۡتَقۡدِمُونَ ٣٠

**30**. వారితో ఇలాఅను: "మీ కొరకు ఒక రోజు వ్యవధి నిర్ణయించబడి ఉంది; మీరు దాని రాకను (ఒక్క ఘడియ) వెనుకకూ చేయలేరు లేదా ఒక్క ఘడియ ముందుకూను చేయలేరు."[4]

---

**అల్-'హాకము**: The Supreme Judge, విశ్వన్యాయాధిపతి, ఏకైక శాసనుడు, శాసన నిర్మాత, (12:40), నిష్పక్షపాతంగా తీర్పుచేసే వాడు, (6:114).
**అల్-'అద్ లు**: న్యాయనిర్ణేత, సరైన తీర్పు మాత్రమే చేసేవాడు. He Whom desire does not cause to incline or decline, so that He should deviate from right course in Judgement. పైవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

**1**. చూడండి, 7:158, 25:1.
**2**. చూడండి, 12:103, 6:116.
**3**. చూడండి, 7:187.
**4**. చూడండి, 71:4. పైన ఇవ్వబడిన తాత్పర్యం నోబుల్ ఖుర్ఆన్ను అనుసరించి ఉంది. అంటే మీరు ఎవ్వరునూ ఆ నిర్ణీత వ్యవధిని ఒక్కఘడియ ముందుగానూ తీసుకురాలేరు లేదా దానిని ఒక్కఘడియ కూడా ఆలస్యమూ చేయలేరు. అది అల్లాహుతా'ఆలా నిర్ణయించిన ఘడియలోనే రానున్నది. దానిని మార్చే శక్తి ఇతరులకు ఎవ్వరికీ లేదు.

**31**. మరియు సత్యతిరస్కారులైన వారు ఇలా అంటారు: "మేము ఈ ఖుర్ఆన్‌ను మరియు దీనికి ముందువచ్చిన ఏ గ్రంథాన్ని కూడా నమ్మము." ఒకవేళ ఈ దుర్మార్గులను తమ ప్రభువు ఎదుట నిలబెట్టబడి నప్పుడు, వారు ఒకరిపై నొకరు, ఆరోపణలు చేసుకోవటం నీవు చూస్తే (ఎంత బాగుండును)! బలహీనవర్గం వారు దురహంకారులైన తమ నాయకులతో: "మీరే లేకుంటే మేము తప్పక విశ్వాసుల మయ్యేవారం!" అని అంటారు.

**32**. దురహంకారులైన నాయకులు బలహీనులైన వారితో ఇలా అంటారు: "ఏమీ? మీ వద్దకు మార్గదర్శకత్వం వచ్చినప్పుడు మేము మిమ్మల్ని దానినుండి నిరోధించామా? అలాకాదు, మీరే అపరాధానికి పాల్పడ్డారు!"

**33**. మరియు బలహీనులైన వారు దురహంకారులైన నాయకులతో ఇలా అంటారు: "అలాకాదు! ఇది మీరు రాత్రింబవళ్ళు పన్నిన కుట్ర.[1] మీరు మమ్మల్ని - అల్లాహ్‌ను తిరస్కరించి - ఇతరులను ఆయనకు సాటి కల్పించమని ఆజ్ఞాపిస్తూ ఉండేవారు." మరియు వారు శిక్షను చూసినప్పుడు, తమ పశ్చాత్తాపాన్ని దాస్తారు. మరియు మేము సత్యతిరస్కారుల మెడలలో సంకెళ్ళువేస్తాము.[2] వారు తమ కర్మలకు తగిన ప్రతిఫలం తప్ప మరేదైనా పొందగలరా?

وَقَالَ ٱلَّذِينَ كَفَرُوا۟ لَن نُّؤْمِنَ
بِهَٰذَا ٱلْقُرْءَانِ وَلَا بِٱلَّذِى بَيْنَ يَدَيْهِ ۗ
وَلَوْ تَرَىٰٓ إِذِ ٱلظَّٰلِمُونَ مَوْقُوفُونَ
عِندَ رَبِّهِمْ يَرْجِعُ بَعْضُهُمْ إِلَىٰ
بَعْضٍ ٱلْقَوْلَ يَقُولُ ٱلَّذِينَ
ٱسْتُضْعِفُوا۟ لِلَّذِينَ ٱسْتَكْبَرُوا۟ لَوْلَآ أَنتُمْ
لَكُنَّا مُؤْمِنِينَ ﴿٣١﴾
قَالَ ٱلَّذِينَ ٱسْتَكْبَرُوا۟ لِلَّذِينَ
ٱسْتُضْعِفُوٓا۟ أَنَحْنُ صَدَدْنَٰكُمْ عَنِ
ٱلْهُدَىٰ بَعْدَ إِذْ جَآءَكُم ۖ بَلْ كُنتُم
مُّجْرِمِينَ ﴿٣٢﴾
وَقَالَ ٱلَّذِينَ ٱسْتُضْعِفُوا۟ لِلَّذِينَ
ٱسْتَكْبَرُوا۟ بَلْ مَكْرُ ٱلَّيْلِ وَٱلنَّهَارِ
إِذْ تَأْمُرُونَنَآ أَن نَّكْفُرَ بِٱللَّهِ وَنَجْعَلَ لَهُۥٓ
أَندَادًا ۚ وَأَسَرُّوا۟ ٱلنَّدَامَةَ لَمَّا رَأَوُا۟
ٱلْعَذَابَ وَجَعَلْنَا ٱلْأَغْلَٰلَ فِىٓ أَعْنَاقِ
ٱلَّذِينَ كَفَرُوا۟ ۚ هَلْ يُجْزَوْنَ إِلَّا مَا كَانُوا۟
يَعْمَلُونَ ﴿٣٣﴾

---

1. చూడండి, 10:21, 35:43, 86:15.
2. చూడండి, 13:5, 36:8.

34. మరియు మేము హెచ్చరిక చేసే వానిని (ప్రవక్తను) ఏ నగరానికి పంపినా, దానిలోని ఐశ్వర్యవంతులు: "నిశ్చయంగా, మేము మీ వెంట పంపబడిన సందేశాన్ని తిరస్కరిస్తున్నాము." అని అనకుండా ఉండలేదు.[1]

35. వారు ఇంకా ఇలా అన్నారు: "మేము (నీ కంటే) ఎక్కువ సంపద మరియు సంతానం కలిగిఉన్నాము. మరియు మేము ఏ మాత్రం శిక్షింపబడము."

36. వారితో అను: "నిశ్చయంగా, నా ప్రభువు తానుకోరిన వారికి జీవనోపాధిని పుష్కలంగా ప్రసాదిస్తాడు మరియు (తాను కోరిన వారికి) మితంగా ఇస్తాడు. కాని చాలా మందికి ఇది తెలియదు."

37. మరియు, మీ సంపదగానీ మరియు మీ సంతానంగానీ మిమ్మల్ని మా దగ్గరికి తేలేవు; కాని విశ్వసించి సత్కార్యాలు చేసేవారు తప్ప! కావున అలాంటి వారికి తాము చేసిన దానికి రెట్టింపు ప్రతిఫలం లభిస్తుంది. మరియు వారు భవనాలలో సురక్షితంగా ఉంటారు.

38. మరియు ఎవరైతే మా సూచనలను భంగపరచటానికి ప్రయత్నిస్తారో, అలాంటి వారు కఠినశిక్షకు హాజరుచేయబడతారు.

وَمَآ أَرۡسَلۡنَا فِي قَرۡيَةٖ مِّن نَّذِيرٍ إِلَّا قَالَ مُتۡرَفُوهَآ إِنَّا بِمَآ أُرۡسِلۡتُم بِهِۦ كَٰفِرُونَ ٣٤

وَقَالُواْ نَحۡنُ أَكۡثَرُ أَمۡوَٰلٗا وَأَوۡلَٰدٗا وَمَا نَحۡنُ بِمُعَذَّبِينَ ٣٥

قُلۡ إِنَّ رَبِّي يَبۡسُطُ ٱلرِّزۡقَ لِمَن يَشَآءُ وَيَقۡدِرُ وَلَٰكِنَّ أَكۡثَرَ ٱلنَّاسِ لَا يَعۡلَمُونَ ٣٦

وَمَآ أَمۡوَٰلُكُمۡ وَلَآ أَوۡلَٰدُكُم بِٱلَّتِي تُقَرِّبُكُمۡ عِندَنَا زُلۡفَىٰٓ إِلَّا مَنۡ ءَامَنَ وَعَمِلَ صَٰلِحٗا فَأُوْلَٰٓئِكَ لَهُمۡ جَزَآءُ ٱلضِّعۡفِ بِمَا عَمِلُواْ وَهُمۡ فِي ٱلۡغُرُفَٰتِ ءَامِنُونَ ٣٧

وَٱلَّذِينَ يَسۡعَوۡنَ فِيٓ ءَايَٰتِنَا مُعَٰجِزِينَ أُوْلَٰٓئِكَ فِي ٱلۡعَذَابِ مُحۡضَرُونَ ٣٨

1. మొట్టమొదట కేవలం పేదవారు మరియు దిగువ సామాజిక తరగతుల వారు మాత్రమే ప్రవక్త ('అలైహిమ్ స.)లను అనుసరించారు. చూడండి, 26:111, 11:27, 7:75, 17:16.

**39**. వారితో అను: "నిశ్చయంగా, నా ప్రభువు తన దాసులలో తాను కోరినవారికి జీవనోపాధిని పుష్కలంగా ప్రసాదిస్తాడు మరియు (తాను కోరిన) వారికి మితంగా ఇస్తాడు. మరియు మీరు (ఆయన మార్గంలో) ఖర్చు పెట్టేదంతా ఆయన మీకు తిరిగి ఇస్తాడు. మరియు ఆయనే సర్వశ్రేష్ఠుడైన జీవనోపాధి ప్రదాత."

قُلْ إِنَّ رَبِّى يَبْسُطُ ٱلرِّزْقَ لِمَن يَشَآءُ مِنْ عِبَادِهِۦ وَيَقْدِرُ لَهُۥ ۚ وَمَآ أَنفَقْتُم مِّن شَىْءٍ فَهُوَ يُخْلِفُهُۥ ۖ وَهُوَ خَيْرُ ٱلرَّٰزِقِينَ ﴿٣٩﴾

**40**. మరియు (జ్ఞాపకముంచుకోండి) ఆ రోజు ఆయన వారందరిని సమీకరించిన తరువాత దేవదూతలతో ఇలా అడుగుతాడు: "ఏమీ? వీరేనా మిమ్మల్ని ఆరాధిస్తూ ఉండేవారు?"[1]

وَيَوْمَ يَحْشُرُهُمْ جَمِيعًا ثُمَّ يَقُولُ لِلْمَلَٰٓئِكَةِ أَهَٰٓؤُلَآءِ إِيَّاكُمْ كَانُوا۟ يَعْبُدُونَ ﴿٤٠﴾

**41**. వారు (దేవదూతలు) జవాబిస్తారు: "నీవు సర్వలోపాలకు అతీతుడవు! నీవే మా సంరక్షకుడవు, వీరు కారు. వాస్తవానికి, వీరు జిన్నాతులను ఆరాధించేవారు, వీరిలో చాలామంది, వారిని (జిన్నాతులను) విశ్వసించేవారు."[2]

قَالُوا۟ سُبْحَٰنَكَ أَنتَ وَلِيُّنَا مِن دُونِهِم ۖ بَلْ كَانُوا۟ يَعْبُدُونَ ٱلْجِنَّ ۖ أَكْثَرُهُم بِهِم مُّؤْمِنُونَ ﴿٤١﴾

**42**. (అప్పుడు వారితో ఇట్లనబడుతుంది): "అయితే ఈ రోజు మీరు ఒకరికొకరు లాభం గానీ, నష్టం గానీ చేకూర్చుకోలేరు." మరియు మేము దుర్మార్గులతో: "మీరు తిరస్కరిస్తూ ఉండిన నరకబాధను రుచి చూడండి!" అని పలుకుతాము.

فَٱلْيَوْمَ لَا يَمْلِكُ بَعْضُكُمْ لِبَعْضٍ نَّفْعًا وَلَا ضَرًّا وَنَقُولُ لِلَّذِينَ ظَلَمُوا۟ ذُوقُوا۟ عَذَابَ ٱلنَّارِ ٱلَّتِى كُنتُم بِهَا تُكَذِّبُونَ ﴿٤٢﴾

---

**1**. చూడండి, 25:17.
**2**. చూడండి, 4:117.

43. మరియు వారికి మా స్పష్టమైన సూచన(ఆయత్)లను వినిపింపజేసినప్పుడు వారు: "ఈ వ్యక్తి కేవలం మీ తండ్రితాతలు ఆరాధించే వాటినుండి మిమ్మల్ని నిరోధిస్తున్నాడు." అని అంటారు. వారింకా ఇలా అంటారు: "ఇది (ఈ ఖుర్ఆన్) కేవలం కల్పించబడిన బూటకం మాత్రమే." మరియు సత్యతిరస్కారులు, సత్యం వారి ముందుకు వచ్చినపుడు: "ఇది కేవలం స్పష్టమైన మంత్రజాలం మాత్రమే!"[1] అని అంటారు.

وَإِذَا تُتْلَىٰ عَلَيْهِمْ ءَايَٰتُنَا بَيِّنَٰتٍ قَالُوا۟ مَا هَٰذَآ إِلَّا رَجُلٌ يُرِيدُ أَن يَصُدَّكُمْ عَمَّا كَانَ يَعْبُدُ ءَابَآؤُكُمْ وَقَالُوا۟ مَا هَٰذَآ إِلَّآ إِفْكٌ مُّفْتَرًى ۚ وَقَالَ ٱلَّذِينَ كَفَرُوا۟ لِلْحَقِّ لَمَّا جَآءَهُمْ إِنْ هَٰذَآ إِلَّا سِحْرٌ مُّبِينٌ ﴿٤٣﴾

44. (ఓ ముహమ్మద్!) మేము, వారికి చదవటానికి ఎలాంటి గ్రంథాలు ఇవ్వలేదు.[2] మరియు మేము వారి వద్దకు నీకు పూర్వం హెచ్చరించే (సందేశహరుణ్ణి) కూడా పంపలేదు.

وَمَآ ءَاتَيْنَٰهُم مِّن كُتُبٍ يَدْرُسُونَهَا ۖ وَمَآ أَرْسَلْنَآ إِلَيْهِمْ قَبْلَكَ مِن نَّذِيرٍ ﴿٤٤﴾

45. మరియు వారికి పూర్వం గతించిన వారు కూడా (ఇదే విధంగా) తిరస్కరించారు. మేము (పూర్వం) వారికిచ్చిన దానిలో వీరు పదోవంతు కూడా పొందలేదు. అయినా వారు నా సందేశహరులను తిరస్కరించారు. చూశారా! నా శిక్ష ఎంత ఘోరంగా ఉండిందో![3] (5/8)

وَكَذَّبَ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ وَمَا بَلَغُوا۟ مِعْشَارَ مَآ ءَاتَيْنَٰهُمْ فَكَذَّبُوا۟ رُسُلِى ۖ فَكَيْفَ كَانَ نَكِيرِ ﴿٤٥﴾

1. చూడండి, 74:24.
2. చూడండి, 30:35.
3. చూడండి, 46:26.

46. * (ఓ ము'హమ్మద్!) వారితో ఇలా అను: "వాస్తవానికి, నేను మీకు ఒక విషయం బోధిస్తాను: 'మీరు అల్లాహ్ కొరకు ఇద్దరిద్దరిగా, ఒక్కొక్కరిగా నిలవండి. తరువాత బాగా ఆలోచించండి!' మీతో పాటు ఉన్న ఈ వ్యక్తికి (ప్రవక్తకు) పిచ్చి పట్టలేదు.[1] అతను కేవలం, మీపై ఒక ఘోరశిక్ష రాకముందే, దాని గురించి మిమ్మల్ని హెచ్చరించేవాడు మాత్రమే!"[2]

قُلۡ إِنَّمَآ أَعِظُكُم بِوَٰحِدَةٍۖ أَن تَقُومُواْ لِلَّهِ مَثۡنَىٰ وَفُرَٰدَىٰ ثُمَّ تَتَفَكَّرُواْۚ مَا بِصَاحِبِكُم مِّن جِنَّةٍۚ إِنۡ هُوَ إِلَّا نَذِيرٞ لَّكُم بَيۡنَ يَدَيۡ عَذَابٖ شَدِيدٖ ٤٦

47. ఇలా అను: "నేను మిమ్మల్ని ఏదైనా ప్రతిఫలం అడిగి ఉన్నట్లైతే, దానిని మీరే ఉంచుకోండి.[3] వాస్తవానికి, నా ప్రతిఫలం కేవలం అల్లాహ్‌వద్దనే ఉంది. మరియు ఆయనే ప్రతిదానికి సాక్షి!"

قُلۡ مَا سَأَلۡتُكُم مِّنۡ أَجۡرٖ فَهُوَ لَكُمۡۖ إِنۡ أَجۡرِيَ إِلَّا عَلَى ٱللَّهِۖ وَهُوَ عَلَىٰ كُلِّ شَيۡءٖ شَهِيدٞ ٤٧

48. ఇలాఅను: "నిశ్చయంగా, నా ప్రభువే సత్యాన్ని (అసత్యానికి విరుద్ధంగా) పంపేవాడు.[4] ఆయనే అగోచర యథార్థాలన్నీ తెలిసిఉన్న వాడు."

قُلۡ إِنَّ رَبِّي يَقۡذِفُ بِٱلۡحَقِّ عَلَّٰمُ ٱلۡغُيُوبِ ٤٨

1. చూడండి, 7:184.
2. ఒకరోజు దైవప్రవక్త ('స'అస) 'సఫా గుట్టమీద ఎక్కి అంటారు: "ఓ ప్రజలారా, వినండి!". ప్రజలందరూ అక్కడికి చేరుకుంటారు. "ఒకవేళ: 'ఉదయమో, సాయంత్రమో, శత్రువు మీపై దాడిచేయనున్నాడు.' అని అంటే మీరు నమ్ముతారా?" వారంటారు: "ఎందుకు నమ్మము." అప్పుడతను ('స'అస) అంటారు: "అయితే వినండి! నేను మిమ్మల్ని ఘోరశిక్ష రాకముందు విశ్వసించండని హెచ్చరిస్తున్నాను." దానికి అబూ-లహబ్ అంటాడు: "నీ పాడుగాను, దీనికా నీవు మమ్మల్ని ప్రోగుచేసింది?" అప్పుడు అల్లాహ్ (సు.తా.) సూరహ్ అల్-మసద్ (111) అవతరింపజేశాడు. ('స'హీ'హ్ బు'ఖారీ).
3. చూడండి, 25:57.
4. చూడండి, 21:18.

قُلْ جَآءَ ٱلْحَقُّ وَمَا يُبْدِئُ ٱلْبَٰطِلُ وَمَا يُعِيدُ ﴿٤٩﴾

**49**. ఇలా అను: "సత్యం వచ్చేసింది! మరియు అసత్యం (మిథ్యం) దేనినీ ఆరంభించేయజాలదు మరియు దానిని తిరిగి ఉనికిలోకి తేజాలదు."[1]

قُلْ إِن ضَلَلْتُ فَإِنَّمَآ أَضِلُّ عَلَىٰ نَفْسِى ۖ وَإِنِ ٱهْتَدَيْتُ فَبِمَا يُوحِىٓ إِلَىَّ رَبِّىٓ ۚ إِنَّهُۥ سَمِيعٌ قَرِيبٌ ﴿٥٠﴾

**50**. ఇలా అను: "ఒకవేళ నేను మార్గభ్రష్టుడనైతే! నిశ్చయంగా, అది నా స్వంత నాశనానికే! మరియు ఒకవేళ మార్గదర్శకత్వం పొందితే, అది కేవలం నా ప్రభువు నాపై అవతరింపజేసిన దివ్యజ్ఞానం (వ'హీ) వల్లనే! నిశ్చయంగా, ఆయన సర్వం వినేవాడు, దగ్గరలోనే ఉంటాడు (అతి సన్నిహితుడు)!"[2]

وَلَوْ تَرَىٰٓ إِذْ فَزِعُوا۟ فَلَا فَوْتَ وَأُخِذُوا۟ مِن مَّكَانٍ قَرِيبٍ ﴿٥١﴾

**51**. మరియు, వారు భయకంపితులై ఉండటాన్ని, నీవు చూడగలిగితే (ఎంత బాగుండేది), కాని వారికి తప్పించుకోవటానికి వీలుండదు. మరియు వారు చాలా సమీపం నుండి పట్టుకోబడతారు.[3]

وَقَالُوٓا۟ ءَامَنَّا بِهِۦ وَأَنَّىٰ لَهُمُ ٱلتَّنَاوُشُ مِن مَّكَانٍۭ بَعِيدٍ ﴿٥٢﴾

**52**. అప్పుడు (పరలోకంలో) వారంటారు: "మేము (ఇప్పుడు) దానిని (సత్యాన్ని) విశ్వసించాము!" వాస్తవానికి వారు చాలా దూరంనుండి దానిని (విశ్వాసాన్ని) ఎలా పొందగలరు?

---

1. ఇక్కడ 'హఖ్ఖ్ అంటే ఖుర్ఆన్, బా'తిల్ అంటే షై'తాన్ - కుఫ్ర్ మరియు షిర్క్. మక్కా విజయం రోజు, దైవప్రవక్త ('స'అస) కాబా గృహంలో ప్రవేశించారు. అందులో అన్ని వైపులా విగ్రహాలు ఉండేవి. అతను తన బాణపు కొనతో ఆ విగ్రహాలను కొట్టుతూ ఈ ఆయత్ మరియు 17:81, చదివారు: "వ ఖుల్ జా' అల్ 'హఖ్ఖు వ 'జహఖల్ బా'తిల్," ('స'హీ'హ్ బు'ఖారీ).
2. మీరు చెవిటి లేక అగోచర శక్తిని వేడుకోవడం లేదు. వాస్తవానికి మీకు దగ్గర ఉండి వినగల మరియు మీ ప్రార్థనలను అంగీకరించగల ఆయనను వేడుకుంటున్నారు.
3. చూడండి, 17:13, 13:5.

وَقَدْ كَفَرُوا۟ بِهِۦ مِن قَبْلُ ۖ وَيَقْذِفُونَ بِٱلْغَيْبِ مِن مَّكَانٍۭ بَعِيدٍ ﴿٥٣﴾

**53**. మరియు వాస్తవానికి వారు దానిని (సత్యాన్ని) ఇంతకు ముందు తిరస్కరించి ఉన్నారు. మరియు వారు తమకు అగోచరమైన విషయానికి దూరం నుండియే నిరసన చూపుతూ ఉండే వారు.

وَحِيلَ بَيْنَهُمْ وَبَيْنَ مَا يَشْتَهُونَ كَمَا فُعِلَ بِأَشْيَاعِهِم مِّن قَبْلُ ۚ إِنَّهُمْ كَانُوا۟ فِى شَكٍّ مُّرِيبٍۭ ﴿٥٤﴾

**54**. మరియు వారికి పూర్వం గడిచిన వారి విధంగానే, వారిమధ్య మరియు వారికోరికల మధ్య అడ్డు వేయబడుతుంది. నిశ్చయంగా, వారు సంశయంలో పడవేసే గొప్ప సందేహంలో పడిఉండే వారు.[1]

*****

**1**. శిక్షను చూసిన తరువాత విశ్వసించగోరితే, ఆ విశ్వాసం అంగీకరించబడదు. ఖతాదా (రజి.అ.) కథనం: "సందేహాల మరియు సంశయాల నుండి దూరంగా ఉండండి. ఎవడైతే సందేహావస్థలో మరణిస్తాడో! అదే స్థితిలో పునరుత్థరింపబడతాడు. మరియు ఎవడైతే విశ్వాసంతో మరణిస్తాడో ఆ రోజు విశ్వాసంతోనే లేపబడతాడు!" (ఇబ్నె-కసీ'ర్).

## 35. సూరహ్ ఫా'తిర్ — سُورَةُ فَاطِرٍ

ఫా'తిరున్: అంటే ఉత్పత్తికి కారకుడు, Originator, ఆరంభకుడు, ప్రభవింపజేసేవాడు ప్రతిదానిని పుట్టించేవాడు, సృష్టికి **మూలాధారి**. దీని మరొకపేరు **అల్-మలాయికహ్** అంటే దైవదూతలు. **మొదటి ఆయత్**‌లోనే ఈ రెండు పదాలున్నాయి. ఇది సూరహ్ అల్-ఫు'ర్ఖాన్ (25) మరియు సూరహ్ మర్యమ్(19)ల మధ్యకాలంలో అవతరింపజేయబడింది; అంటే హి'జ్రత్‌కు 7-8 సంవత్సరాలకు ముందు, మక్కాలో. ఇందులో **45 ఆయతులు** ఉన్నాయి.

అల్లాహ్ (సు.తా.)కు తాను కోరిన దానిని సృష్టించగల, దానిని మరల పునరుత్థరింపజేయగల శక్తి ఉంది. ఆయన తన సందేశాన్ని ప్రవక్తల ద్వారా అవతరింపజేస్తాడు. జ్ఞానవంతులే దైవభీతి కలిగి ఉంటారు. నిశ్చయంగా అల్లాహ్ (సు.తా.) సర్వశక్తిమంతుడు. క్షమాశీలుడు.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

ٱلۡحَمۡدُ لِلَّهِ فَاطِرِ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ جَاعِلِ ٱلۡمَلَٰٓئِكَةِ رُسُلًا أُوْلِيٓ أَجۡنِحَةٖ مَّثۡنَىٰ وَثُلَٰثَ وَرُبَٰعَۚ يَزِيدُ فِي ٱلۡخَلۡقِ مَا يَشَآءُۚ إِنَّ ٱللَّهَ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٞ ١

**1**. సర్వస్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే! ఆకాశాలు మరియు భూమియొక్క సృష్టికి **మూలాధారి**.[1] ఆయనే **దేవదూతలను** సందేశాలు అందజేసేవారిగా నియమించాడు. వారు రెండేసి, మూడేసి లేదా నాలుగేసి రెక్కలు గలవారు.[2] ఆయన తన సృష్టిలో తాను కోరిన దానిని అధికంచేస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

---

**1**. ఫా'తిర్: చూడండి, 6:14, 12:101.

**2**. ఈ దేవదూతలు జిబ్రీల్, మీకాయీ'ల్, ఇస్రాఫీల్ మరియు ఇ'జ్రాయీల్ ('అలైహిమ్. స.)లు. వారికి రెక్కలున్నాయి. మేరాజ్ రాత్రిలో దైవప్రవక్త ('స'అస) జిబ్రీల్ ('అ.స.)కు ఆరువందల రెక్కలు చూశారు, (బు'ఖారీ, ముస్లిం - ఇబ్నె మస్'ఊద్ (ర'ది.'అ.) కథనం.

مَّا يَفْتَحِ ٱللَّهُ لِلنَّاسِ مِن رَّحْمَةٍ فَلَا مُمْسِكَ لَهَا ۖ وَمَا يُمْسِكْ فَلَا مُرْسِلَ لَهُۥ مِنۢ بَعْدِهِۦ ۚ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿٢﴾

2. అల్లాహ్ ప్రజల కొరకు ఏ కారుణ్యాన్ని పంపినా దానిని ఆపేవాడు ఎవ్వడూ లేడు. మరియు ఏ (కారుణ్యాన్నైనా) ఆయన ఆపితే, ఆ తరువాత దానిని పంపగలవాడు కూడా ఎవ్వడూ లేడు. మరియు ఆయన సర్వశక్తిమంతుడు, మహా వివేచనాపరుడు.

يَٰٓأَيُّهَا ٱلنَّاسُ ٱذْكُرُوا۟ نِعْمَتَ ٱللَّهِ عَلَيْكُمْ ۚ هَلْ مِنْ خَٰلِقٍ غَيْرُ ٱللَّهِ يَرْزُقُكُم مِّنَ ٱلسَّمَآءِ وَٱلْأَرْضِ ۚ لَآ إِلَٰهَ إِلَّا هُوَ ۖ فَأَنَّىٰ تُؤْفَكُونَ ﴿٣﴾

3. ఓ మానవులారా! అల్లాహ్ మీకు చేసిన అనుగ్రహాలను జ్ఞాపకం చేసుకోండి! ఏమీ? భూమ్యాకాశాల నుండి మీకు జీవనోపాధి సమకూర్చే సృష్టికర్త అల్లాహ్ తప్ప మరొకడు ఉన్నాడా?[1] ఆయన తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు! అయితే మీరు ఎందుకు మోసగింప (సత్యం నుండి మరలింప) బడుతున్నారు?

وَإِن يُكَذِّبُوكَ فَقَدْ كُذِّبَتْ رُسُلٌ مِّن قَبْلِكَ ۚ وَإِلَى ٱللَّهِ تُرْجَعُ ٱلْأُمُورُ ﴿٤﴾

4. మరియు (ఓ ప్రవక్తా!) ఒకవేళ వారు నిన్ను అసత్యవాదుడవని తిరస్కరించినా (ఇది క్రొత్త విషయం కాదు), వాస్తవానికి నీకు పూర్వం పంపబడిన సందేశహరులు కూడా తిరస్కరింపబడ్డారు. మరియు వ్యవహారాలన్నీ (తీర్పుకొరకు) చివరకు అల్లాహ్ వద్దకే మరలింపబడతాయి.

يَٰٓأَيُّهَا ٱلنَّاسُ إِنَّ وَعْدَ ٱللَّهِ حَقٌّ ۖ فَلَا تَغُرَّنَّكُمُ ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَا ۖ وَلَا يَغُرَّنَّكُم بِٱللَّهِ ٱلْغَرُورُ ﴿٥﴾

5. ఓ మానవులారా! నిశ్చయంగా, అల్లాహ్ వాగ్దానం సత్యం! కావున ఈ ప్రాపంచిక జీవితం మిమ్మల్ని మోసగించరాదు. మరియు ఆ మహా వంచకుణ్ణి (షై'తాన్‌ను) కూడా మిమ్మల్ని అల్లాహ్ విషయంలో మోసగింపనివ్వకండి.[2]

1. చూడండి, 10:31.
2. చూడండి, 31:33.

إِنَّ ٱلشَّيۡطَٰنَ لَكُمۡ عَدُوّٞ فَٱتَّخِذُوهُ عَدُوًّاۚ إِنَّمَا يَدۡعُواْ حِزۡبَهُۥ لِيَكُونُواْ مِنۡ أَصۡحَٰبِ ٱلسَّعِيرِ ٦

6. నిశ్చయంగా, షై'తాన్ మీ శత్రువు, కావున మీరు కూడా వాడిని శత్రువుగానే భావించండి.[1] నిశ్చయంగా, వాడు తన అనుచరులను (భగభగ మండే) అగ్నివాసు లవటానికే ఆహ్వానిస్తుంటాడు.

ٱلَّذِينَ كَفَرُواْ لَهُمۡ عَذَابٞ شَدِيدٞۖ وَٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ لَهُم مَّغۡفِرَةٞ وَأَجۡرٞ كَبِيرٌ ٧

7. ఎవరైతే సత్యాన్ని తిరస్కరిస్తారో, వారికి కఠినమైన శిక్ష పడుతుంది. మరియు ఎవరైతే విశ్వసించి, సత్కార్యాలు చేస్తారో, వారికి క్షమాపణ మరియు గొప్ప ప్రతిఫలం (స్వర్గం) కూడా ఉంటాయి.

أَفَمَن زُيِّنَ لَهُۥ سُوٓءُ عَمَلِهِۦ فَرَءَاهُ حَسَنٗاۖ فَإِنَّ ٱللَّهَ يُضِلُّ مَن يَشَآءُ وَيَهۡدِي مَن يَشَآءُۖ فَلَا تَذۡهَبۡ نَفۡسُكَ عَلَيۡهِمۡ حَسَرَٰتٍۚ إِنَّ ٱللَّهَ عَلِيمُۢ بِمَا يَصۡنَعُونَ ٨

8. ఏమీ? తన దుష్కార్యాలు తనకు ఆకర్షణీయంగా కనబడేటట్లు చేయబడి నందుకు, ఎవడైతే వాటిని మంచి కార్యాలుగా భావిస్తాడో! (అతడు సన్మార్గంలో ఉన్నవాడితో సమానుడు కాగలడా)? నిశ్చయంగా, అల్లాహ్ తాను కోరిన వానిని మార్గభ్రష్టత్వంలో వదలుతాడు మరియు తానుకోరిన వానికి మార్గదర్శకత్వం చేస్తాడు. కావున నీవు వారి కొరకు చింతించి నిన్ను నీవు దుఃఖానికి గురిచేసుకోకు. నిశ్చయంగా, వారి కర్మలన్నీ అల్లాహ్‌కు బాగా తెలుసు.

وَٱللَّهُ ٱلَّذِيٓ أَرۡسَلَ ٱلرِّيَٰحَ فَتُثِيرُ سَحَابٗا فَسُقۡنَٰهُ إِلَىٰ بَلَدٖ مَّيِّتٖ فَأَحۡيَيۡنَا بِهِ ٱلۡأَرۡضَ بَعۡدَ مَوۡتِهَاۚ كَذَٰلِكَ ٱلنُّشُورُ ٩

9. మరియు అల్లాహ్‌యే! గాలులను పంపుతాడు. తరువాత అవి మేఘాలను ఎత్తుతాయి. ఆ తరువాత మేము వాటిని మృతప్రదేశం వైపునకు పంపి, దానితో ఆ నేలను మరణించిన తరువాత తిరిగి బ్రతికిస్తాము. ఇదేవిధంగా, (మానవుల) పునరుత్థానం కూడా జరుగుతుంది.

1. చూడండి, 18:50.

مَن كَانَ يُرِيدُ ٱلۡعِزَّةَ فَلِلَّهِ ٱلۡعِزَّةُ جَمِيعًاۚ إِلَيۡهِ يَصۡعَدُ ٱلۡكَلِمُ ٱلطَّيِّبُ وَٱلۡعَمَلُ ٱلصَّٰلِحُ يَرۡفَعُهُۥۚ وَٱلَّذِينَ يَمۡكُرُونَ ٱلسَّيِّـَٔاتِ لَهُمۡ عَذَابٞ شَدِيدٞۖ وَمَكۡرُ أُوْلَٰٓئِكَ هُوَ يَبُورُ ١٠

**10**. గౌరవాన్ని కాంక్షించు వాడు తెలుసుకోవాలి, గౌరవమంతా అల్లాహ్ కే చెందుతుందని! మంచి ప్రవచనాలన్నీ[1] ఆయన వైపునకు ఎక్కిపోతాయి. మరియు సత్కర్మ దానిని పైకి ఎత్తుతుంది. మరియు ఎవరైతే చెడుకుట్రలు పన్నుతారో![2] వారికి కఠిన శిక్ష ఉంటుంది. మరియు అలాంటి వారి కుట్ర, అదే! నశించిపోతుంది.

وَٱللَّهُ خَلَقَكُم مِّن تُرَابٖ ثُمَّ مِن نُّطۡفَةٖ ثُمَّ جَعَلَكُمۡ أَزۡوَٰجٗاۚ وَمَا تَحۡمِلُ مِنۡ أُنثَىٰ وَلَا تَضَعُ إِلَّا بِعِلۡمِهِۦۚ وَمَا يُعَمَّرُ مِن مُّعَمَّرٖ وَلَا يُنقَصُ مِنۡ عُمُرِهِۦٓ إِلَّا فِي كِتَٰبٍۚ إِنَّ ذَٰلِكَ عَلَى ٱللَّهِ يَسِيرٞ ١١

**11**. మరియు అల్లాహ్ మిమ్మల్ని మట్టితో సృష్టించాడు.[3] తరువాత ఇంద్రియ బిందువుతో, ఆ తరువాత మిమ్మల్ని (ఆడ-మగ) జంటలుగా చేశాడు. మరియు ఏ స్త్రీ కూడా ఆయనకు తెలియకుండా గర్భం దాల్చజాలదు మరియు ప్రసవించనూ జాలదు. గ్రంథంలో వ్రాయబడనిదే, పెరుగుతున్న వాడి వయస్సు పెరగనూ జాలదు మరియు ఎవని వయస్సు తరగనూ జాలదు. నిశ్చయంగా, ఇదంతా అల్లాహ్‌కు ఎంతో సులభం.

---

**1**. మంచి ప్రవచనాలు అంటే, తస్బీ'హ్, ఖుర్ఆన్ పఠించటం, మంచిని ఆదేశించి, చెడునుండి నిరోధించటం మొదలైనవి.

**2**. మక్ రున్: అంటే, Plot, కుట్ర, కపటోపాయం, తంత్రం, ఎత్తుగడ, రహస్యంగా ఇతరులకు హాని చేయటానికి పన్నే పన్నాగం. కుఫ్ర్ మరియు షిర్క్ కూడా మక్ర్ ఎందుకంటే, దానివల్ల అల్లాహ్ (సు.తా.) మార్గానికి హాని కలుగుతుంది. దైవప్రవక్త ('స'అస)ను చంపడానికి మక్కా ముష్రికులు చేసిన మక్ర్. ఇంకా చూడండి, 10:21, 34:33 మరియు 35:43.

**3**. అల్లాహ్(సు.తా.)తో మరుగైనది ఏదీలేదు. ఇంకా చూడండి, 6:59 భూమిలోపల మరియు తల్లిగర్భంలో ఉండే ప్రతిఒక్కదాని విషయం అల్లాహ్(సు.తా.)కు బాగా తెలుసు.

12. రెండు సముద్రాలు సరిసమానం కాజాలవు.[1] వాటిలోని ఒక దాని (నీరు) రుచికరమైనది, దాహం తీర్చేది మరియు త్రాగటానికి మధురమైనది. రెండో దాని (నీరు) ఉప్పుగానూ, చేదుగానూ ఉన్నది. అయినా వాటిలో ప్రతి ఒక్కదాని నుండి మీరు తాజా మాంసం తింటున్నారు మరియు ఆభరణాలు తీసి ధరిస్తున్నారు. మరియు నీవు చూస్తున్నావు ఓడలు వాటిని చీల్చుతూ పోవటాన్ని; (వాటిలో) మీరు, ఆయన అనుగ్రహాన్ని అన్వేషించటానికి మరియు మీరు ఆయనకు కృతజ్ఞులై ఉండటానికి!

وَمَا يَسْتَوِى ٱلْبَحْرَانِ هَٰذَا عَذْبٌ فُرَاتٌ سَآئِغٌ شَرَابُهُۥ وَهَٰذَا مِلْحٌ أُجَاجٌ ۖ وَمِن كُلٍّ تَأْكُلُونَ لَحْمًا طَرِيًّا وَتَسْتَخْرِجُونَ حِلْيَةً تَلْبَسُونَهَا ۖ وَتَرَى ٱلْفُلْكَ فِيهِ مَوَاخِرَ لِتَبْتَغُوا۟ مِن فَضْلِهِۦ وَلَعَلَّكُمْ تَشْكُرُونَ ﴿١٢﴾

13. ఆయనే రాత్రిని పగటిలోకి ప్రవేశింపజేస్తున్నాడు మరియు పగటిని రాత్రిలోకి ప్రవేశింపజేస్తున్నాడు మరియు సూర్య చంద్రులను నియమబద్ధులుగా చేసి ఉన్నాడు. అవి తమ తమ పరిధిలో, నిర్ణీత వ్యవధిలో తిరుగుతూ ఉన్నాయి. ఆయనే అల్లాహ్! మీ ప్రభువు, విశ్వసామ్రాజ్యాధి కారం ఆయనదే! మరియు ఆయనను వదలి మీరు వేడుకొనే వారు, ఖర్జూర బీజంపై నున్న పొరకు[2] కూడా యజమానులు కారు.

يُولِجُ ٱلَّيْلَ فِى ٱلنَّهَارِ وَيُولِجُ ٱلنَّهَارَ فِى ٱلَّيْلِ وَسَخَّرَ ٱلشَّمْسَ وَٱلْقَمَرَ كُلٌّ يَجْرِى لِأَجَلٍ مُّسَمًّى ۚ ذَٰلِكُمُ ٱللَّهُ رَبُّكُمْ لَهُ ٱلْمُلْكُ ۚ وَٱلَّذِينَ تَدْعُونَ مِن دُونِهِۦ مَا يَمْلِكُونَ مِن قِطْمِيرٍ ﴿١٣﴾

14. మీరు వారిని వేడుకొన్నప్పటికీ, వారు మీ ప్రార్థనలను వినలేరు, ఒకవేళ విన్నా, వారు మీకు జవాబివ్వలేరు. మరియు పునరుత్థాన దినమున మీరు కల్పించిన

إِن تَدْعُوهُمْ لَا يَسْمَعُوا۟ دُعَآءَكُمْ وَلَوْ سَمِعُوا۟ مَا ٱسْتَجَابُوا۟ لَكُمْ ۖ وَيَوْمَ ٱلْقِيَٰمَةِ يَكْفُرُونَ بِشِرْكِكُمْ ۚ

1. చూడండి, 25:53.
2. ఖిత్మీరున్: అంటే ఖర్జూర బీజముపై ఉండే సన్నని పొర. paltry, small, mean, contemptible thing. లేక పనికిమాలిన, అల్పమైన, నికృష్టమైన వస్తువు.

وَلَا يُنَبِّئُكَ مِثْلُ خَبِيرٍ ﴿١٤﴾

దైవత్వపు భాగస్వామ్యాన్ని వారు తిరస్కరిస్తారు.[1] మరియు (సత్యాన్ని) గురించి నీకు ఆ సర్వం తెలిసినవాడు తెలిపినట్లు మరెవ్వరూ తెలుపజాలరు. (3/4)

۞ يَٰٓأَيُّهَا ٱلنَّاسُ أَنتُمُ ٱلْفُقَرَآءُ إِلَى ٱللَّهِ ۖ وَٱللَّهُ هُوَ ٱلْغَنِىُّ ٱلْحَمِيدُ ﴿١٥﴾

**15.** * ఓ మానవులారా![2] అల్లాహ్ అక్కర గలవారు మీరే! వాస్తవానికి అల్లాహ్ స్వయంసమృద్ధుడు, సర్వస్తోత్రాలకు అర్హుడు.

إِن يَشَأْ يُذْهِبْكُمْ وَيَأْتِ بِخَلْقٍ جَدِيدٍ ﴿١٦﴾

**16.** ఆయన కోరితే మిమ్మల్ని నాశనం చేసి (మీ స్థానంలో) క్రొత్తసృష్టిని తేగలడు.[3]

وَمَا ذَٰلِكَ عَلَى ٱللَّهِ بِعَزِيزٍ ﴿١٧﴾

**17.** మరియు అలా చేయటం అల్లాహ్‌కు కష్టమైనది కాదు.

وَلَا تَزِرُ وَازِرَةٌ وِزْرَ أُخْرَىٰ ۚ وَإِن تَدْعُ مُثْقَلَةٌ إِلَىٰ حِمْلِهَا لَا يُحْمَلْ مِنْهُ شَىْءٌ وَلَوْ كَانَ ذَا قُرْبَىٰٓ ۗ إِنَّمَا تُنذِرُ ٱلَّذِينَ يَخْشَوْنَ رَبَّهُم

**18.** మరియు బరువు మోసే వాడెవ్వడూ మరొకని బరువును మోయడు.[4] మరియు ఒకవేళ బరువు మోసేవాడు, దానిని ఎత్తుకోవడానికి ఎవరినైనా పిలిచినా, దగ్గరి బంధువైనా దానినుండి కొంతైనా ఎత్తుకోడు. కాని నిశ్చయంగా, నీవు వారినే హెచ్చరించ గలవు ఎవరైతే తమకు అగోచరుడైన తమ

---

**1**. చూడండి, 10:28 మరియు 29. వారు అల్లాహ్ (సు.తా.)ను విడిచి, ఆరాధించే విగ్రహాలు, మూర్తులు, దైవదూతలు, జిన్నాతులు, షైతానులు మరియు సద్పురుషులు మొదలైనవన్నీ వారి ఆరాధనను పునరుత్థాన దినమున తిరస్కరిస్తాయి.

**2**. మానవులారా! అంటే మానవులూ, దైవప్రవక్తలూ సద్పురుషులూ అందరూ!

**3**. చూడండి, 14:19.

**4**. చూడండి, 6:164, 17:15, 29:13, 39:7, 53:38 కాని ఇతరులను సన్మార్గం నుండి నిరోధించేవాడు, లేక తప్పించేవాడు, తన పాపభారాలతో పాటు తాను తప్పించిన వారి పాపభారాలను కూడా భరిస్తాడు.

بِٱلۡغَيۡبِ وَأَقَامُواْ ٱلصَّلَوٰةَۚ وَمَن تَزَكَّىٰ فَإِنَّمَا يَتَزَكَّىٰ لِنَفۡسِهِۦۚ وَإِلَى ٱللَّهِ ٱلۡمَصِيرُ ١٨

ప్రభువుకు భయపడతారో![1] మరియు నమాజ్‌ను స్థాపిస్తారో. మరియు ఎవడైతే నీతిమంతుడవుతాడో అతడు తన స్వంత (లాభం) కొరకే నీతిమంతుడవుతాడు. మరియు (అందరికీ) అల్లాహ్ వైపునకే మరలిపోవలసి ఉన్నది.

وَمَا يَسۡتَوِي ٱلۡأَعۡمَىٰ وَٱلۡبَصِيرُ ١٩

**19**. మరియు గ్రుడ్డివాడు మరియు కళ్ళున్నవాడు సరిసమానులు కాజాలరు;

وَلَا ٱلظُّلُمَٰتُ وَلَا ٱلنُّورُ ٢٠

**20**. మరియు (అదే విధంగా) చీకట్లు (అవిశ్వాసం) మరియు వెలుగు (విశ్వాసం);

وَلَا ٱلظِّلُّ وَلَا ٱلۡحَرُورُ ٢١

**21**. మరియు నీడలు మరియు ఎండా;[2]

وَمَا يَسۡتَوِي ٱلۡأَحۡيَآءُ وَلَا ٱلۡأَمۡوَٰتُۚ إِنَّ ٱللَّهَ يُسۡمِعُ مَن يَشَآءُۖ وَمَآ أَنتَ بِمُسۡمِعٖ مَّن فِي ٱلۡقُبُورِ ٢٢

**22**. మరియు బ్రతికి ఉన్నవారు మరియు మరణించినవారు కూడా సరిసమానులు కాజాలరు.[3] నిశ్చయంగా, అల్లాహ్ తాను కోరిన వానికి (హితబోధ) వినేటట్లు చేస్తాడు. కాని నీవు గోరీలలో ఉన్నవారికి వినిపించజాలవు.[4]

إِنۡ أَنتَ إِلَّا نَذِيرٌ ٢٣

**23**. నీవు (ఓ ము'హమ్మద్)! కేవలం హెచ్చరిక చేసేవాడవు మాత్రమే.[5]

---

**1**. విశ్వాసం అంటే అగోచరుడైన అల్లాహ్ (సు.తా.)ను విశ్వసించటం. ఆయన శక్తి సామర్థ్యాలను గుర్తించి, కేవలం ఆయననే ప్రార్థించటం.

**2**. అంటే స్వర్గ నరకాలు.

**3**. అంటే విశ్వాసులు మరియు అవిశ్వాసులు.

**4**. ఏవిధంగానైతే మరణించి గోరీలలో ఉన్నవారు వినలేరో అదే విధంగా సత్యతిరస్కారం వల్ల, చనిపోయిన హృదయాలకు నీవు హితోపదేశాన్ని, సత్యాన్ని బోధించలేవు.

**5**. మరియు మార్గదర్శకత్వం చేయటం అల్లాహ్(సు.తా.)కే చెందినది. ఎంతవరకైతే ఒకడు, అల్లాహ్ (సు.తా.) అతనికి ప్రసాదించిన విచక్షణాబుద్ధిని ఉపయోగించి సత్యాన్ని అనుసరించటానికి ప్రయత్నించడో! అంతవరకు అల్లాహ్ (సు.తా.) అతనికి సన్మార్గం చూపడు. ఈ విషయం ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు వ్యక్తపరచబడింది.

إِنَّآ أَرْسَلْنَٰكَ بِٱلْحَقِّ بَشِيرًا وَنَذِيرًا ۚ وَإِن مِّنْ أُمَّةٍ إِلَّا خَلَا فِيهَا نَذِيرٌ ﴿٢٤﴾

24. నిశ్చయంగా, మేము, నిన్ను సత్యం ప్రసాదించి, శుభవార్త నిచ్చేవానిగా మరియు హెచ్చరిక చేసేవానిగా పంపాము. మరియు హెచ్చరిక చేసేవాడు వారి మధ్య లేకుండా, ఏ సమాజం కూడా గడచి పోలేదు!

وَإِن يُكَذِّبُوكَ فَقَدْ كَذَّبَ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ جَآءَتْهُمْ رُسُلُهُم بِٱلْبَيِّنَٰتِ وَبِٱلزُّبُرِ وَبِٱلْكِتَٰبِ ٱلْمُنِيرِ ﴿٢٥﴾

25. మరియు ఒకవేళ వీరు నిన్ను అసత్యవాదుడవని తిరస్కరిస్తున్నారంటే (ఆశ్చర్యమేమీ కాదు)! ఎందుకంటే, వీరికి పూర్వం గతించిన వారు కూడా (ఇదేవిధంగా తమ ప్రవక్తలను) అసత్యవాదులని తిరస్కరించారు. వారి సందేశహరులు, వారి వద్దకు స్పష్టమైన నిదర్శనాలను, శాసనాలను ('జుబుర్)[1] మరియు వెలుగునిచ్చే గ్రంథాన్ని తీసుకొని వచ్చారు.[2]

ثُمَّ أَخَذْتُ ٱلَّذِينَ كَفَرُوا۟ ۖ فَكَيْفَ كَانَ نَكِيرِ ﴿٢٦﴾

26. ఆ తరువాత సత్యతిరస్కారులను నేను (శిక్షకు) గురిచేశాను. (చూశారా) నా శిక్ష ఎంత కఠినమైనదో!

أَلَمْ تَرَ أَنَّ ٱللَّهَ أَنزَلَ مِنَ ٱلسَّمَآءِ مَآءً فَأَخْرَجْنَا بِهِۦ ثَمَرَٰتٍ مُّخْتَلِفًا أَلْوَٰنُهَا ۚ وَمِنَ ٱلْجِبَالِ جُدَدٌۢ بِيضٌ وَحُمْرٌ مُّخْتَلِفٌ أَلْوَٰنُهَا وَغَرَابِيبُ سُودٌ ﴿٢٧﴾

27. ఏమీ? నీవు చూడటం లేదా? నిశ్చయంగా, అల్లాహ్‌యే ఆకాశంనుండి వర్షం కురిపించేవాడని. తరువాత దానినుండి మేము రంగురంగుల ఫలాలను ఉత్పత్తి చేస్తామని! మరియు పర్వతాలలో తెల్లని, ఎర్రని వివిధరంగుల చారలను (కొన్నిటిని) మిక్కిలి నల్లాగా కూడా చేస్తామని.[3]

---

1. 'జుబురున్: అనే పదానికి, Scriptures, చిన్నచిన్న ముక్కలు లేక గ్రంథాలు, శాసనాలు, శృతులు మరియు కీర్తనలు అనే అర్థాలున్నాయి.
2. చూడండి, 13:7, మరియు 16:36 ప్రతి సమాజానికి ఒక హెచ్చరిక చేసేవాడు (ప్రవక్త) పంపబడ్డాడు.
3. ఈ వివిధ రకాల రంగులు అల్లాహ్ (సు.తా.) ప్రసాదించినవే! వాటిని చూసి అల్లాహ్ (సు.తా.) మహత్త్వాన్ని తెలుసుకుంటే ఎంత బాగుంటుంది.

وَمِنَ ٱلنَّاسِ وَٱلدَّوَآبِّ
وَٱلۡأَنۡعَٰمِ مُخۡتَلِفٌ أَلۡوَٰنُهُۥ كَذَٰلِكَۗ
إِنَّمَا يَخۡشَى ٱللَّهَ مِنۡ عِبَادِهِ ٱلۡعُلَمَٰٓؤُاْۗ
إِنَّ ٱللَّهَ عَزِيزٌ غَفُورٌ ٢٨

**28**. మరియు ఇదే విధంగా మానవుల, ఇతర ప్రాణుల మరియు పశువుల రంగులు కూడా వేర్వేరుగా ఉంటాయి.[1] నిశ్చయంగా, అల్లాహ్ దాసులలో జ్ఞానం గలవారు మాత్రమే ఆయనకు భయపడతారు. నిశ్చయంగా, అల్లాహ్ సర్వ శక్తిమంతుడు, క్షమాశీలుడు.

إِنَّ ٱلَّذِينَ يَتۡلُونَ كِتَٰبَ ٱللَّهِ
وَأَقَامُواْ ٱلصَّلَوٰةَ وَأَنفَقُواْ مِمَّا
رَزَقۡنَٰهُمۡ سِرّٗا وَعَلَانِيَةٗ
يَرۡجُونَ تِجَٰرَةٗ لَّن تَبُورَ ٢٩

**29**. నిశ్చయంగా, అల్లాహ్ గ్రంథాన్ని (ఖుర్ఆన్ను) పారాయణం చేసేవారు మరియు నమా'జ్ను స్థాపించేవారు మరియు తమకు ప్రసాదించబడిన జీవనోపాధి నుండి రహస్యంగా మరియు బహిరంగంగా ఖర్చు (దానం) చేసేవారు అందరూ![2] నష్టంలేని వ్యాపారాన్ని అపేక్షించేవారే!

لِيُوَفِّيَهُمۡ أُجُورَهُمۡ
وَيَزِيدَهُم مِّن فَضۡلِهِۦٓۚ إِنَّهُۥ
غَفُورٞ شَكُورٞ ٣٠

**30**. ఇదంతా అల్లాహ్ వారి ప్రతిఫలాన్ని పూర్తిగా వారికి ఇవ్వాలనీ మరియు తన అనుగ్రహంతో వారికి మరింత అధికంగా ఇవ్వాలనీ! నిశ్చయంగా, ఆయన క్షమించే వాడు, కృతజ్ఞతలను ఆమోదించేవాడు.

وَٱلَّذِيٓ أَوۡحَيۡنَآ إِلَيۡكَ مِنَ
ٱلۡكِتَٰبِ هُوَ ٱلۡحَقُّ مُصَدِّقٗا لِّمَا
بَيۡنَ يَدَيۡهِۗ إِنَّ ٱللَّهَ بِعِبَادِهِۦ لَخَبِيرُۢ
بَصِيرٞ ٣١

**31**. మరియు (ఓ ము'హమ్మద్!) మేము నీపై అవతరింపజేసిన గ్రంథమే నిజమైనది, దానికి పూర్వం వచ్చిన గ్రంథాలలో (మిగిలి ఉన్న సత్యాన్ని) ధృవపరిచేది. నిశ్చయంగా, అల్లాహ్ తన దాసులను బాగా ఎరిగేవాడు, సర్వదృష్టికర్త.

---

**1**. చూడండి, 16:13.

**2**. బహిరంగంగా ఖర్చుచేయటం అంటే విధి జకాత్ చెల్లించటం మరియు రహస్యంగా అంటే జకాత్ చెల్లించిన తరువాత అధికంగా దానం చేయటం.

ثُمَّ أَوْرَثْنَا ٱلْكِتَٰبَ ٱلَّذِينَ ٱصْطَفَيْنَا مِنْ عِبَادِنَا ۖ فَمِنْهُمْ ظَالِمٌ لِّنَفْسِهِۦ وَمِنْهُم مُّقْتَصِدٌ وَمِنْهُمْ سَابِقٌۢ بِٱلْخَيْرَٰتِ بِإِذْنِ ٱللَّهِ ۚ ذَٰلِكَ هُوَ ٱلْفَضْلُ ٱلْكَبِيرُ ﴿٣٢﴾

**32**. ఆ తరువాత మేము ఈ గ్రంథానికి, మా దాసులలోనుండి మేము ఎన్నుకున్న వారిని వారసులుగా చేశాము.[1] వారిలో కొందరు తమకు తాము అన్యాయం చేసుకున్న వారున్నారు,[2] మరికొందరు మధ్యస్థంగా ఉండే వారున్నారు,[3] ఇంకా కొందరు అల్లాహ్ సెలవుతో సత్కార్యాలలో మున్ముందు ఉండేవారూ ఉన్నారు.[4] ఇదే ఆ గొప్ప అనుగ్రహం.

جَنَّٰتُ عَدْنٍ يَدْخُلُونَهَا يُحَلَّوْنَ فِيهَا مِنْ أَسَاوِرَ مِن ذَهَبٍ وَلُؤْلُؤًا ۖ وَلِبَاسُهُمْ فِيهَا حَرِيرٌ ﴿٣٣﴾

**33**. శాశ్వతమైన స్వర్గవనాలలో వారు ప్రవేశిస్తారు. అందు వారు బంగారు కంకణాలు మరియు ముత్యాలతో అలంకరింపబడతారు. మరియు వారి వస్త్రాలు పట్టుతో చేయబడి ఉంటాయి.[5]

وَقَالُوا۟ ٱلْحَمْدُ لِلَّهِ ٱلَّذِىٓ أَذْهَبَ عَنَّا ٱلْحَزَنَ ۖ إِنَّ رَبَّنَا لَغَفُورٌ شَكُورٌ ﴿٣٤﴾

**34**. మరియు (అప్పుడు) వారు ఇలా అంటారు: "మా నుండి దుఃఖాన్ని తొలగించిన అల్లాహ్‌యే సర్వస్తోత్రాలకు అర్హుడు. నిశ్చయంగా, మా ప్రభువు క్షమాశీలుడు, కృతజ్ఞతలను ఆమోదించే వాడు.

---

**1**. గ్రంథం అంటే ఖుర్ఆన్, ఎన్నుకున్న వారు అంటే ము'హమ్మద్ ('స'అస)ను అనుసరించే వారు, ముస్లింలు అని అర్థం. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 2:143.

**2**. ము'హమ్మద్ ('స'అస) ఉమ్మత్‌లో మూడు రకాల వారున్నారు. వీరు **మొదటి రకానికి** చెందినవారు: తమకు తాము అన్యాయం చేసుకునే వారున్నారు. వీరు కొన్ని విధు (ఫరాయ'ద్)లను ఉపేక్షిస్తారు. మరియు కొన్ని 'హరామ్ - నిషిద్ధ విషయాల నుండి దూరంగా ఉండరు లేక మరి కొందరి అభిప్రాయం ప్రకారం చిన్న చిన్న పాపాల నుండి దూరంగా ఉండరు, కాబట్టి వీరిని తమకు తాము అన్యాయం చేసుకున్నవారు అన్నారు. వీరు తమకు తాము అన్యాయం చేసుకున్నందుకు ఇతర రెండు రకాల వారి స్థానాలకు చేరలేక పోతారు. చూడండి, 7:46.

**3**. వీరు **రెండో రకానికి** చెందినవారు మద్యస్థంగా ఉండేవారు. వీరు కొన్నిసార్లు ముస్త'హబ్ విషయాలను విడిచిపెడతారు. మరియు కొన్ని ము'హర్రమాత్‌లను పాటించరు.

**4**. వీరు **మూడో రకానికి** చెందిన వారు, మొదటపేర్కొన్న ఇద్దరికంటే ధర్మ విషయాలలో మున్ముందు ఉండేవారు.

**5**. "ఏ పురుషులైతే ఇహలోకంలో పట్టు, బంగారు ధరిస్తారో వారు పరలోకంలో వాటిని ధరించలేరు." ('స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం) స్వర్గపు వస్త్రాల కొరకు చూడండి, 18:31.

ٱلَّذِىٓ أَحَلَّنَا دَارَ ٱلْمُقَامَةِ مِن فَضْلِهِۦ لَا يَمَسُّنَا فِيهَا نَصَبٌ وَلَا يَمَسُّنَا فِيهَا لُغُوبٌ ﴿٣٥﴾

35. ఆయనే తన అనుగ్రహంతో మమ్మల్ని శాశ్వతమైన నివాసస్థలంలో దింపాడు. ఇందులో మాకు ఎలాంటి కష్టమూ లేదు మరియు ఇందులో ఎలాంటి అలసట కూడా లేదు.''

وَٱلَّذِينَ كَفَرُوا۟ لَهُمْ نَارُ جَهَنَّمَ لَا يُقْضَىٰ عَلَيْهِمْ فَيَمُوتُوا۟ وَلَا يُخَفَّفُ عَنْهُم مِّنْ عَذَابِهَا ۚ كَذَٰلِكَ نَجْزِى كُلَّ كَفُورٍ ﴿٣٦﴾

36. మరియు సత్యతిరస్కారులైన వారి కొరకు నరకాగ్ని ఉంటుంది. అందులో వారు చనిపోవాలనీ తీర్పు ఇవ్వబడదు లేదా వారికి దాని (నరకపు) శిక్ష కూడా తగ్గింపబడదు. ఈ విధంగా, మేము ప్రతి కృతఘ్నునికి (సత్యతిరస్కారునికి) ప్రతీకారం చేస్తాము.

وَهُمْ يَصْطَرِخُونَ فِيهَا رَبَّنَآ أَخْرِجْنَا نَعْمَلْ صَٰلِحًا غَيْرَ ٱلَّذِى كُنَّا نَعْمَلُ ۚ أَوَلَمْ نُعَمِّرْكُم مَّا يَتَذَكَّرُ فِيهِ مَن تَذَكَّرَ وَجَآءَكُمُ ٱلنَّذِيرُ ۖ فَذُوقُوا۟ فَمَا لِلظَّٰلِمِينَ مِن نَّصِيرٍ ﴿٣٧﴾

37. మరియు వారు దాని (నరకం)లో ఇలా మొరపెట్టుకుంటారు: ''ఓ మా ప్రభూ! మమ్మల్ని బయటికితీయి. మేము పూర్వం చేసిన కార్యాలకు భిన్నంగా సత్కార్యాలు చేస్తాము.'' (వారికిలా సమాధానం ఇవ్వబడుతుంది): ''ఏమీ? గుణపాఠం నేర్చుకోదలచిన వాడు గుణపాఠం నేర్చుకోవటానికి, మేము మీకు తగినంత వయస్సును ఇవ్వలేదా? మరియు మీ వద్దకు హెచ్చరిక చేసేవాడు కూడా వచ్చాడు కదా? కావున మీరు (శిక్షను) రుచి చూడండి. ఇక్కడ దుర్మార్గులకు సహాయపడేవాడు ఎవ్వడూ లేడు.''

إِنَّ ٱللَّهَ عَٰلِمُ غَيْبِ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ إِنَّهُۥ عَلِيمٌۢ بِذَاتِ ٱلصُّدُورِ ﴿٣٨﴾

38. నిశ్చయంగా, అల్లాహ్‌కు ఆకాశాలలో మరియు భూమిలో ఉన్న అగోచర విషయాలన్నీ తెలుసు. నిశ్చయంగా, ఆయనకు హృదయాలలో ఉన్న విషయాలు కూడా బాగా తెలుసు.[1]

1. అంటే మిమ్మల్ని మరల భూమిలోకి పంపినా మీరు సత్కార్యాలు చేయరని, అల్లాహ్ (సు.తా.)కు బాగా తెలుసు. ఇంకా చూడండి, 6:28.

هُوَ ٱلَّذِى جَعَلَكُمْ خَلَٰٓئِفَ فِى ٱلْأَرْضِ ۚ فَمَن كَفَرَ فَعَلَيْهِ كُفْرُهُۥ ۖ وَلَا يَزِيدُ ٱلْكَٰفِرِينَ كُفْرُهُمْ عِندَ رَبِّهِمْ إِلَّا مَقْتًا ۖ وَلَا يَزِيدُ ٱلْكَٰفِرِينَ كُفْرُهُمْ إِلَّا خَسَارًا ﴿٣٩﴾

قُلْ أَرَءَيْتُمْ شُرَكَآءَكُمُ ٱلَّذِينَ تَدْعُونَ مِن دُونِ ٱللَّهِ أَرُونِى مَاذَا خَلَقُوا۟ مِنَ ٱلْأَرْضِ أَمْ لَهُمْ شِرْكٌ فِى ٱلسَّمَٰوَٰتِ أَمْ ءَاتَيْنَٰهُمْ كِتَٰبًا فَهُمْ عَلَىٰ بَيِّنَتٍ مِّنْهُ ۚ بَلْ إِن يَعِدُ ٱلظَّٰلِمُونَ بَعْضُهُم بَعْضًا إِلَّا غُرُورًا ﴿٤٠﴾

۞ إِنَّ ٱللَّهَ يُمْسِكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ أَن تَزُولَا ۚ وَلَئِن زَالَتَآ إِنْ أَمْسَكَهُمَا مِنْ أَحَدٍ مِّنۢ بَعْدِهِۦٓ ۚ إِنَّهُۥ كَانَ حَلِيمًا غَفُورًا ﴿٤١﴾

**39.** ఆయనే మిమ్మల్ని భూమిపై ఉత్తరాధికారులుగా చేసినవాడు. కావున ఎవడు (సత్యాన్ని) తిరస్కరిస్తాడో అతని తిరస్కారం అతనిపైననే పడుతుంది. సత్యతిరస్కారులకు వారి తిరస్కారం వారి ప్రభువు వద్ద కేవలం వారియెడల అసహ్యాన్నే అధికంచేస్తుంది. మరియు సత్యతిరస్కారులకు వారి తిరస్కారం వారికి నష్టాన్నే అధికం చేస్తుంది.[1]

**40.** వారితో ఇలా అను: "అల్లాహ్‌ను వదలి మీరు ఆరాధించే ఈ భాగస్వాములను గురించి ఎప్పుడైనా ఆలోచించారా? వారు భూమిలో ఏమి సృష్టించారో నాకు చూపండి? లేదా వారికి ఆకాశాలలో ఏదైనా భాగస్వామ్యం ఉందా? లేదా మేము వారికి ఏదైనా గ్రంథాన్ని ఇచ్చామా? వారు దాని స్పష్టమైన ప్రమాణంపై ఉన్నారని అనటానికి? అదికాదు, అసలు ఈ దుర్మార్గులు పరస్పరం, కేవలం మోసపు మాటలను గురించి వాగ్దానం చేసుకుంటున్నారు." (7/8)

**41.** * నిశ్చయంగా, అల్లాహ్ భూమ్యాకాశాలను తమ స్థానాలనుండి విడిపోకుండా వాటిని నిలిపిఉంచాడు. ఒకవేళ అవి తొలగిపోతే, ఆయన తప్ప మరెవరైనా వాటిని నిలిపి ఉంచగలరా?[2] నిశ్చయంగా ఆయన సహనశీలుడు, క్షమాశీలుడు.

---

**1**. చూడండి, 2:30.

**2**. భూమ్యాకాశాలను విడిపోకుండా తమస్థానంలో ఉంచినవాడు అల్లాహ్ (సు.తా.) మాత్రమే! చూడండి, 19:90-91, 22:65, 30:25. అల్లాహ్ (సు.తా.) తప్ప మరెవ్వరూ వాటిని తమ స్థానాలలో ఉంచలేరు!

وَأَقْسَمُواْ بِٱللَّهِ جَهْدَ أَيْمَٰنِهِمْ لَئِن جَآءَهُمْ نَذِيرٌ لَّيَكُونُنَّ أَهْدَىٰ مِنْ إِحْدَى ٱلْأُمَمِۖ فَلَمَّا جَآءَهُمْ نَذِيرٌ مَّا زَادَهُمْ إِلَّا نُفُورًا ﴿٤٢﴾

ٱسْتِكْبَارًا فِى ٱلْأَرْضِ وَمَكْرَ ٱلسَّيِّئِۚ وَلَا يَحِيقُ ٱلْمَكْرُ ٱلسَّيِّئُ إِلَّا بِأَهْلِهِۦۚ فَهَلْ يَنظُرُونَ إِلَّا سُنَّتَ ٱلْأَوَّلِينَۚ فَلَن تَجِدَ لِسُنَّتِ ٱللَّهِ تَبْدِيلًاۖ وَلَن تَجِدَ لِسُنَّتِ ٱللَّهِ تَحْوِيلًا ﴿٤٣﴾

أَوَلَمْ يَسِيرُواْ فِى ٱلْأَرْضِ فَيَنظُرُواْ كَيْفَ كَانَ عَٰقِبَةُ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ وَكَانُوٓاْ أَشَدَّ مِنْهُمْ قُوَّةًۚ وَمَا كَانَ ٱللَّهُ لِيُعْجِزَهُۥ مِن شَىْءٍ فِى ٱلسَّمَٰوَٰتِ وَلَا فِى ٱلْأَرْضِۚ إِنَّهُۥ كَانَ عَلِيمًا قَدِيرًا ﴿٤٤﴾

**42**. మరియు, ఒకవేళ హెచ్చరిక చేసేవాడు వారి వద్దకు వస్తే! వారు తప్పక, ఇతర సమాజాల వారికంటే ఎక్కువగా సన్మార్గం మీద ఉండేవారని అల్లాహ్ సాక్షిగా గట్టి ప్రమాణాలు చేస్తారు.[1] కాని హెచ్చరిక చేసేవాడు, వారి వద్దకు వచ్చినపుడు మాత్రం (అతని రాక) వారి వ్యతిరేకతను తప్ప మరేమీ అధికం చేయలేకపోయింది;[2]

**43**. (ఇది) వారు భూమిలో మరింత దురహంకారంతో తిరుగుతూ, దుష్ట పన్నాగాలు పన్నినందుకు.[3] వాస్తవానికి దుష్ట పన్నాగాలు, వాటిని పన్నేవారికే హాని కలిగిస్తాయి. తమ పూర్వీకులపట్ల అవలం బించబడిన విధానమే (వారిపట్ల గూడా) అవలంబించబడాలని వారు నిరీక్షిస్తున్నారా ఏమిటి? కాని నీవు అల్లాహ్ విధానంలో ఎలాంటి మార్పును పొందలేవు. మరియు అల్లాహ్ సంప్రదాయంలో నీవు ఎలాంటి అతిక్రమాన్ని చూడలేవు.

**44**. వారు భూమిలో ఎన్నడూ సంచరించ లేదా ఏమిటి? వారికి పూర్వం గతించిన వారు వీరికంటే అత్యంత బలవంతులైనా, వారి పరిణామం ఏమయిందో వారు చూడలేదా? అల్లాహ్ నుండి తప్పించుకోగలిగేది ఆకాశాలలో గానీ మరియు భూమిలో గానీ ఏదీలేదు. నిశ్చయంగా, ఆయన సర్వజ్ఞుడు, సర్వసమర్థుడు.

---

**1**. ''హెచ్చరికచేసేవాడు వస్తే మేము తప్పక సన్మార్గంమీద ఉంటాము.'' అని ఈ ముష్రిక్‌లు గట్టిప్రమాణాలు చేశారు. కానీ, అతను వచ్చిన తరువాత అతనిని తిరస్కరించారు. ఇంకా చూడండి, 6:156-157, 37:168-170.

**2**. అంటే ము'హమ్మద్ ('స'అస) వచ్చిన తరువాత కూడా అతనిని తిరస్కరించారు.

**3**. చూడండి, 10:21 లేక 34:33.

وَلَوْ يُؤَاخِذُ ٱللَّهُ ٱلنَّاسَ بِمَا
كَسَبُوا۟ مَا تَرَكَ عَلَىٰ
ظَهْرِهَا مِن دَآبَّةٍ وَلَٰكِن
يُؤَخِّرُهُمْ إِلَىٰٓ أَجَلٍ مُّسَمًّى ۖ فَإِذَا
جَآءَ أَجَلُهُمْ فَإِنَّ ٱللَّهَ كَانَ
بِعِبَادِهِۦ بَصِيرًۢا ﴿٤٥﴾

**45.** ఒకవేళ అల్లాహ్ మానవులను వారు చేసిన కర్మలకు గానూ పట్టుకోదలిస్తే! (భూమి) మీద ఏ ఒక్క ప్రాణిని కూడా ఆయన వదిలిపెట్టి ఉండేవాడు కాదు! నిజానికి ఆయన వారికి ఒక నియమిత సమయం వరకు గడువునిస్తున్నాడు. కాని వారి గడువు పూర్తిఅయితే; అప్పుడు నిశ్చయంగా, అల్లాహ్ సదా తన దాసులను స్వయంగా చూసుకుంటాడు.

*****

## 36. సూరహ్ యా-సీన్ سُورَةُ يسٓ

ఈ సూరహ్ చదువటంవల్ల చాలా పుణ్యాలున్నాయని ఎన్నో దైవప్రవక్త ('స'అస) ప్రవచనాలున్నాయి. ఇది ఖుర్ఆన్ యొక్క **హృదయం**. మానవునికి మరణ సమయ మాసన్నమైనప్పుడు అతని దగ్గర ఈ సూరహ్ చదవాలని ఉల్లేఖనా (రివాయత్)లు ఉన్నాయి. కాని ఈ ఉల్లేఖనాలు పూర్తిగా ప్రామాణికమైనవి ('స'హీ'హ్) అని నిరూపించబడలేదు. ఈ సూరహ్‌లో మానవుని నైతిక బాధ్యతలు వివరించబడ్డాయి. ఇది మధ్య **మక్కా** కాలంలో అవతరింపజేయబడింది, బహుశా సూరహ్ అల్-ఫుర్ఖాన్(25)కు ముందు. ఇందులో **83 ఆయతులు** ఉన్నాయి.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

يسٓ ١

**1.** *యా-సీన్.*[1]

وَٱلۡقُرۡءَانِ ٱلۡحَكِيمِ ٢

**2.** వివేకంతో నిండిఉన్న ఖుర్ఆన్ సాక్షిగా!

إِنَّكَ لَمِنَ ٱلۡمُرۡسَلِينَ ٣

**3.** (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా, నీవు సందేశహరులలో ఒకడవు.[2]

عَلَىٰ صِرَٰطٖ مُّسۡتَقِيمٖ ٤

**4.** (నీవు) ఋజుమార్గంపై ఉన్నావు.

تَنزِيلَ ٱلۡعَزِيزِ ٱلرَّحِيمِ ٥

**5.** ఇది (ఈ ఖుర్ఆన్) సర్వ శక్తిమంతుడు, అపార కరుణాప్రదాత ద్వారానే అవతరింపజేయబడింది.[3]

لِتُنذِرَ قَوۡمٗا مَّآ أُنذِرَ ءَابَآؤُهُمۡ فَهُمۡ غَٰفِلُونَ ٦

**6.** ఏ జాతివారి తండ్రితాతలైతే హెచ్చరిక చేయబడక, నిర్లక్ష్యులై ఉన్నారో, వారిని హెచ్చరించటానికి.[4]

---

**1.** యా-సీన్, ఈ రెండక్షరాలు కూడా, ఇతర అక్షరాలవలె ముఖత్తఆత్‌లలోనివే! కావున వీటి నిజ అర్థం ఎవరికీ తెలియదు. కొందరు దీని అర్థం: 'ఓ మానవుడా!' అని అంటారు. మరికొందరు: 'ఇది దైవప్రవక్తను సంబోధిస్తుంది,' అని అంటారు.

**2.** మక్కా ముష్రికులు: 'నీవు దైవప్రవక్తవు కావు!' అని ము'హమ్మద్ ('స'అస)తో అనేవారు. చూడండి, 13:43 దానికి జవాబుగా ఈ ఆయత్ అవతరింపజేయబడింది.

**3.** చూడండి 34:50.

**4.** చూడండి, 6:131-132.

لَقَدۡ حَقَّ ٱلۡقَوۡلُ عَلَىٰٓ أَكۡثَرِهِمۡ فَهُمۡ لَا يُؤۡمِنُونَ ٧

**7**. వాస్తవానికి వారిలో అనేకులను గురించి మా వాక్కు నిజం కానున్నది, కావున వారు విశ్వసించరు.[1]

إِنَّا جَعَلۡنَا فِيٓ أَعۡنَٰقِهِمۡ أَغۡلَٰلٗا فَهِيَ إِلَى ٱلۡأَذۡقَانِ فَهُم مُّقۡمَحُونَ ٨

**8**. నిశ్చయంగా, మేము వారి మెడలలో పట్టాలు వేశాము.[2] అవి వారి గడ్డాలవరకు వున్నాయి. కావున వారి తలలు నిక్కివున్నాయి.

وَجَعَلۡنَا مِنۢ بَيۡنِ أَيۡدِيهِمۡ سَدّٗا وَمِنۡ خَلۡفِهِمۡ سَدّٗا فَأَغۡشَيۡنَٰهُمۡ فَهُمۡ لَا يُبۡصِرُونَ ٩

**9**. మరియు మేము వారి ముందు ఒక అడ్డు(తెర)ను మరియు వారి వెనుక ఒక అడ్డు(తెర)ను నిలబెట్టాము. మరియు మేము వారిని కప్పివేశాము అందువల్ల వారు ఏమీ చూడలేరు.

وَسَوَآءٌ عَلَيۡهِمۡ ءَأَنذَرۡتَهُمۡ أَمۡ لَمۡ تُنذِرۡهُمۡ لَا يُؤۡمِنُونَ ١٠

**10**. మరియు నీవు వారిని హెచ్చరించినా హెచ్చరించక పోయినా వారికి సమానమే, వారు విశ్వసించరు!

إِنَّمَا تُنذِرُ مَنِ ٱتَّبَعَ ٱلذِّكۡرَ وَخَشِيَ ٱلرَّحۡمَٰنَ بِٱلۡغَيۡبِۖ فَبَشِّرۡهُ بِمَغۡفِرَةٖ وَأَجۡرٖ كَرِيمٍ ١١

**11**. నిశ్చయంగా, ఎవడైతే హితబోధను అనుసరిస్తూ, అగోచరుడైన కరుణామయునికి భయపడతాడో! అతనిని మాత్రమే నీవు హెచ్చరించగలవు. అతనికి క్షమాభిక్ష మరియు మంచి ప్రతిఫలం (స్వర్గం) లభిస్తుందనే శుభవార్తను అందజేయి.

إِنَّا نَحۡنُ نُحۡيِ ٱلۡمَوۡتَىٰ وَنَكۡتُبُ مَا قَدَّمُواْ وَءَاثَٰرَهُمۡۚ وَكُلَّ شَيۡءٍ أَحۡصَيۡنَٰهُ فِيٓ إِمَامٖ مُّبِينٖ ١٢

**12**. నిశ్చయంగా, మేము మృతులను సజీవులుగా చేస్తాము. మరియు మేము వారు చేసిపంపిన మరియు తమ వెనుక విడిచిన చిహ్నాలను కూడా వ్రాసిపెడ్తున్నాము.[3] మరియు ప్రతి

---

**1**. 'నేను జిన్నాతులు మరియు మానవులతో నరకాన్ని నింపుతాను!' (32:13, 38:85).

**2**. చూడండి, 13:5 మరియు 34:33.

**3**. ఎవడైతే ఇస్లాంలో ఒక మంచి పనిని ప్రారంభిస్తాడో అతనికి దాని పుణ్యఫలితం లభిస్తుంది. అంతేగాక, అతని తరువాత ఇతరులు దానిపై నడిస్తే - ఆ అనుసరించే

విషయాన్ని మేము స్పష్టమైన గ్రంథంలో వ్రాసి పెడుతున్నాము.

13. వారికి సందేశహరులను పంపిన ఆ నగరవాసుల[1] గాథను వినిపించు;

14. మేము వారి వద్దకు ఇద్దరిని పంపగా వారు ఆ ఇద్దరినీ అబద్ధీకులని తిరస్కరించారు. అపుడు మేము వారిని మూడవ వానితో బలపరిచాము. అప్పుడు వారు, వారితో: "నిశ్చయంగా, మేము (మీ వద్దకు పంపబడిన) సందేశహరులము." అని అన్నారు.

15. (దానికి ఆ నగరవాసులు) ఇలా అన్నారు: "మీరు కేవలం మా వంటి మానవులే మరియు అనంత కరుణామయుడు మీపై ఏ (సందేశాన్నీ) అవతరింపజేయలేదు. మీరు కేవలం అబద్ధాలాడుతున్నారు?"[2]

16. (ఆ ప్రవక్తలు) అన్నారు: "మా ప్రభువుకు తెలుసు, నిశ్చయంగా మేము మీ వద్దకు పంపబడిన సందేశహరులము!

17. "మా బాధ్యత కేవలం మీకు స్పష్టంగా సందేశాన్ని అందజేయుటమే!"

وَٱضۡرِبۡ لَهُم مَّثَلًا أَصۡحَٰبَ ٱلۡقَرۡيَةِ
إِذۡ جَآءَهَا ٱلۡمُرۡسَلُونَ ١٣
إِذۡ أَرۡسَلۡنَآ إِلَيۡهِمُ ٱثۡنَيۡنِ فَكَذَّبُوهُمَا
فَعَزَّزۡنَا بِثَالِثٖ فَقَالُوٓاْ إِنَّآ إِلَيۡكُم
مُّرۡسَلُونَ ١٤
قَالُواْ مَآ أَنتُمۡ إِلَّا بَشَرٞ مِّثۡلُنَا وَمَآ
أَنزَلَ ٱلرَّحۡمَٰنُ مِن شَيۡءٍ إِنۡ أَنتُمۡ إِلَّا
تَكۡذِبُونَ ١٥
قَالُواْ رَبُّنَا يَعۡلَمُ إِنَّآ إِلَيۡكُمۡ
لَمُرۡسَلُونَ ١٦
وَمَا عَلَيۡنَآ إِلَّا ٱلۡبَلَٰغُ ٱلۡمُبِينُ ١٧

వారి పుణ్యంలో ఎట్టి తగ్గింపులేకుండా - ఆ పుణ్యం కూడా అతనికి లభిస్తూ ఉంటుంది. ఇక ఒకడు చెడ్డపని ప్రారంభిస్తే అతనికి దాని శిక్ష కాక, దానిపై నడిచే వారందరి పాపాల శిక్షకూడా విధించబడుతుంది (స'హీ'హ్ ముస్లిం). ఒక వ్యక్తి మరణించిన తరువాత అతని కర్మలు ఆగిపోతాయి. మూడు విషయాలు తప్ప. 1) జ్ఞానం - దేనితోనైతే ఇతరులు లాభం పొందుతూ ఉంటారో! 2) పుణ్యాత్ములైన సంతానం - ఎవరైతే చనిపోయిన తలిదండ్రుల కొరకు ప్రార్థిస్తూ ఉంటారో! 3) 'సద్‌ఖహ్ జారియహ్ - దేనితోనైతే అతడు మరణించిన తరువాత కూడా, ప్రజలు లాభం పొందుతూ ఉంటారో! (స'హీ'హ్ ముస్లిం).

1. ఈ నగరం అంటాకియా (Antakiya) కావచ్చని కొందరు వ్యాఖ్యాతలన్నారు.

2. చూడండి, 6:91 మరియు 34:31.

قَالُوٓاْ إِنَّا تَطَيَّرۡنَا بِكُمۡۖ لَئِن لَّمۡ
تَنتَهُواْ لَنَرۡجُمَنَّكُمۡ وَلَيَمَسَّنَّكُم
مِّنَّا عَذَابٌ أَلِيمٞ ١٨

**18**. (ఆ నగరవాసులు) అన్నారు: "నిశ్చయంగా, మేము మిమ్మల్ని ఒక దుశ్శకునంగా పరిగణిస్తున్నాము. మీరు దీనిని మానుకోకపోతే, మేము మిమ్మల్ని రాళ్ళతో కొట్టి చంపేస్తాము. మరియు మా నుండి మీకు బాధాకరమైన శిక్ష పడుతుంది."

قَالُواْ طَـٰٓئِرُكُم مَّعَكُمۡۚ أَئِن
ذُكِّرۡتُمۚ بَلۡ أَنتُمۡ قَوۡمٞ
مُّسۡرِفُونَ ١٩

**19**. (ఆ ప్రవక్తలు) అన్నారు: "మీ అపశకునం మీ వెంటనే ఉంది.[1] మీకు చేసే హితబోధను (మీరు అపశకునంగా పరిగణిస్తున్నారా)? అదికాదు, అసలు మీరు మితిమీరి పోయిన ప్రజలు."[2]

وَجَآءَ مِنۡ أَقۡصَا ٱلۡمَدِينَةِ رَجُلٞ
يَسۡعَىٰ قَالَ يَٰقَوۡمِ ٱتَّبِعُواْ
ٱلۡمُرۡسَلِينَ ٢٠

**20**. ఆ నగరపు దూరప్రాంతం నుండి ఒక వ్యక్తి పరిగెత్తుకుంటూ వచ్చి ఇలా అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! ఈ సందేశహరులను అనుసరించండి!

ٱتَّبِعُواْ مَن لَّا يَسۡـَٔلُكُمۡ أَجۡرٗا
وَهُم مُّهۡتَدُونَ ٢١

**21**. 'మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్నీ కోరని వారిని (ఈ సందేశహరులను) అనుసరించండి! వారు సన్మార్గంలో ఉన్నారు.

وَمَا لِيَ لَآ أَعۡبُدُ ٱلَّذِي فَطَرَنِي
وَإِلَيۡهِ تُرۡجَعُونَ ٢٢

**22**. "మరియు నన్ను సృష్టించిన ఆయనను నేనెందుకు ఆరాధించకూడదూ? మరియు మీరంతా ఆయన వైపునకే మరలింపబడతారు.

---

**1**. చూడండి, 17:13.
**2**. చూడండి, 10:12.

23. ''ఏమీ? ఆయనను వదలి నేను ఇతరులను ఆరాధ్య దైవాలుగా చేసుకోవాలా? ఒకవేళ ఆ కరుణామయుడు నాకు హాని చేయదలచుకుంటే, వారి సిఫారసు నాకు ఏ మాత్రం ఉపయోగపడదు మరియు వారు నన్ను కాపాడనూ లేరు.

ءَأَتَّخِذُ مِن دُونِهِۦٓ ءَالِهَةً إِن يُرِدۡنِ ٱلرَّحۡمَٰنُ بِضُرّٖ لَّا تُغۡنِ عَنِّي شَفَٰعَتُهُمۡ شَيۡـٔٗا وَلَا يُنقِذُونِ ٢٣

24. ''అలా చేస్తే నిశ్చయంగా, నేను స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడిపోయిన వాడిని అవుతాను.

إِنِّيٓ إِذٗا لَّفِي ضَلَٰلٖ مُّبِينٍ ٢٤

25. ''నిశ్చయంగా, నేను మీ ప్రభువును విశ్వసిస్తున్నాను, కావున మీరు నామాట వినండి!''

إِنِّيٓ ءَامَنتُ بِرَبِّكُمۡ فَٱسۡمَعُونِ ٢٥

26. (అతనిని వారు చంపిన తరువాత) అతనితో ఇలా అనబడింది: ''నీవు స్వర్గంలో ప్రవేశించు.'' అతడు ఇలా అన్నాడు: ''అయ్యో! నా జాతివారికి ఈ విషయం తెలిస్తే ఎంత బాగుండేది!

قِيلَ ٱدۡخُلِ ٱلۡجَنَّةَۖ قَالَ يَٰلَيۡتَ قَوۡمِي يَعۡلَمُونَ ٢٦

27. ''నా ప్రభువు నన్ను క్షమించాడు మరియు నన్ను గౌరవనీయులలోకి ప్రవేశింపజేశాడు!'' అనేది.

بِمَا غَفَرَ لِي رَبِّي وَجَعَلَنِي مِنَ ٱلۡمُكۡرَمِينَ ٢٧

__________

۞ وَمَآ أَنزَلۡنَا عَلَىٰ قَوۡمِهِۦ مِنۢ بَعۡدِهِۦ مِن جُندٖ مِّنَ ٱلسَّمَآءِ وَمَا كُنَّا مُنزِلِينَ ﴿٢٨﴾

28. (*) మరియు ఆ తరువాత అతని జాతివారి మీదకు, మేము ఆకాశం నుండి ఏ సైన్యాన్నీ పంపలేదు. అసలు మాకు సైన్యాన్ని పంపే అవసరమే ఉండదు!

إِن كَانَتۡ إِلَّا صَيۡحَةٗ وَٰحِدَةٗ فَإِذَا هُمۡ خَٰمِدُونَ ﴿٢٩﴾

29. అది కేవలం ఒక పెద్ద ధ్వని[1] మాత్రమే! అంతే! వారంతా (ఒకేసారి) అంతం చేయబడతారు.

يَٰحَسۡرَةً عَلَى ٱلۡعِبَادِۚ مَا يَأۡتِيهِم مِّن رَّسُولٍ إِلَّا كَانُواْ بِهِۦ يَسۡتَهۡزِءُونَ ﴿٣٠﴾

30. ఆ దాసుల గతి ఎంత శోచనీయమయినది! వారి వద్దకు ఏ సందేశహరుడు వచ్చినా, వారు అతనిని ఎగతాళి చేయకుండా ఉండలేదు.

أَلَمۡ يَرَوۡاْ كَمۡ أَهۡلَكۡنَا قَبۡلَهُم مِّنَ ٱلۡقُرُونِ أَنَّهُمۡ إِلَيۡهِمۡ لَا يَرۡجِعُونَ ﴿٣١﴾

31. ఏమీ? వారు చూడలేదా (వారికి తెలియదా)? వారికి ముందు మేము ఎన్నో తరాలను నాశనం చేశామని? నిశ్చయంగా, వారు (వారి పూర్వీకులు) ఎన్నటికీ వారి వద్దకు తిరిగిరాలేదు!

وَإِن كُلّٞ لَّمَّا جَمِيعٞ لَّدَيۡنَا مُحۡضَرُونَ ﴿٣٢﴾

32. కాని వారందరినీ కలిపి ఒకే సారి, మాముందు హాజరుపరచడం జరుగు తుంది.

وَءَايَةٞ لَّهُمُ ٱلۡأَرۡضُ ٱلۡمَيۡتَةُ أَحۡيَيۡنَٰهَا وَأَخۡرَجۡنَا مِنۡهَا حَبّٗا فَمِنۡهُ يَأۡكُلُونَ ﴿٣٣﴾

33. మరియు వారి కొరకు సూచనగా జీవంలేని ఈ భూమియే ఉంది. మేము దీనికి ప్రాణంపోసి, దీని నుండి ధాన్యం తీస్తాము, దాన్ని వారు తింటారు.

وَجَعَلۡنَا فِيهَا جَنَّٰتٖ مِّن نَّخِيلٖ وَأَعۡنَٰبٖ وَفَجَّرۡنَا فِيهَا مِنَ ٱلۡعُيُونِ ﴿٣٤﴾

34. మేము దీనిలో ఖర్జూరపు మరియు ద్రాక్ష వనాలను పెంచాము మరియు వాటిలో ఊటలను ప్రవహింపజేశాము.

---

[1]. పునరుత్థాన దినమున ఇస్రాఫీల్ ('అ.స.) ఊదే బాకా ధ్వని, అరుపు, గర్జన లేక శబ్దం. ఇంకా చూడండి, 36:49,53,38:15.

لِيَأْكُلُواْ مِن ثَمَرِهِۦ وَمَا عَمِلَتْهُ
أَيْدِيهِمْۚ أَفَلَا يَشْكُرُونَ ٣٥

35. వారు దీని ఫలాలను తినటానికి; మరియు ఇదంతా వారి చేతులు చేసింది కాదు. అయినా వారు కృతజ్ఞతలు తెలుపరా?

سُبْحَٰنَ ٱلَّذِى خَلَقَ ٱلْأَزْوَٰجَ
كُلَّهَا مِمَّا تُنۢبِتُ ٱلْأَرْضُ وَمِنْ
أَنفُسِهِمْ وَمِمَّا لَا يَعْلَمُونَ ٣٦

36. భూమినుండి ఉత్పత్తిఅయ్యే అన్ని వస్తువులలో, జీవులలో మరియు స్వయాన వారిలో (మానవులలో) ఇంకా వారికి తెలియని వాటిలోనూ (ఆడ-మగ) జతలను సృష్టించిన ఆయన (అల్లాహ్) సర్వలోపాలకు అతీతుడు.[1]

وَءَايَةٌ لَّهُمُ ٱلَّيْلُ نَسْلَخُ مِنْهُ
ٱلنَّهَارَ فَإِذَا هُم مُّظْلِمُونَ ٣٧

37. మరియు వారికొరకు మా సూచనలలో రాత్రి ఒకటి; మేము దానిపై నుండి పగటిని (వెలుగును) తొలగించి నప్పుడు, వారిని చీకటి ఆవరించుకుంటుంది.

وَٱلشَّمْسُ تَجْرِى لِمُسْتَقَرٍّ لَّهَاۚ
ذَٰلِكَ تَقْدِيرُ ٱلْعَزِيزِ ٱلْعَلِيمِ ٣٨

38. మరియు సూర్యుడు తన నిర్ణీత పరిధిలో, నిర్ణీత కాలంలో పయనిస్తూ ఉంటాడు. ఇది ఆ సర్వశక్తిమంతుని, సర్వజ్ఞుని నియమావళి.

وَٱلْقَمَرَ قَدَّرْنَٰهُ مَنَازِلَ حَتَّىٰ عَادَ
كَٱلْعُرْجُونِ ٱلْقَدِيمِ ٣٩

39. మరియు చంద్రుని కొరకు మేము దశలను నియమించాము, చివరకు అతడు ఎండిన ఖర్జూరపు మట్టవలే అయిపోతాడు.

لَا ٱلشَّمْسُ يَنۢبَغِى لَهَآ أَن تُدْرِكَ
ٱلْقَمَرَ وَلَا ٱلَّيْلُ سَابِقُ ٱلنَّهَارِۚ وَكُلٌّ
فِى فَلَكٍ يَسْبَحُونَ ٤٠

40. చంద్రుణ్ణి అందుకోవటం సూర్యుడి తరంకాదు. మరియు రాత్రి పగటిని అధిగమించజాలదు. మరియు అవన్నీ తమతమ కక్ష్యలలో సంచరిస్తూ ఉంటాయి.

---

1. సృష్టిలోనున్న ప్రతి వస్తువు జతలలో ఉన్నది. అవి జీవులు కానీ, నిర్జీవులు కానీ. జీవరాసులలో మరియు వృక్షరాసులలో ఆడ-మగ; చీకటి-వెలుగులు, చలి-వేడి, విద్యుచ్ఛక్తి మరియు అయస్కాంతాలలో ఉన్న ఆకర్షణా (+) మరియు వికర్షణా (-) శక్తులు, మొదలైనవి. కేవలం అల్లాహ్ (సు.తా.) మాత్రమే ఏకైకుడు.

**41**. వారికి మరొక సూచన ఏమిటంటే, నిశ్చయంగా మేము వారి సంతతిని (నూహ్ యొక్క) నిండు నావలోనికి ఎక్కించాము.

**42**. మరియు మేము వారు ఎక్కి ప్రయాణం చేయటానికి, ఇటువంటి వాటిని ఎన్నో సృష్టించాము.[1]

**43**. మరియు మేము కోరినట్లయితే, వారిని ముంచివేసే వారము; అప్పుడు వారి కేకలు వినే వాడెవడూ ఉండడు మరియు వారు రక్షింపబడనూలేరు -

**44**. మేము కరుణిస్తే తప్ప! మరియు మేము కొంతకాలం వరకు వారికి వ్యవధినిస్తే తప్ప!

**45**. మరియు వారితో: "మీరు, మీ ముందున్న దానికీ (ఇహలోక శిక్షకూ) మరియు మీ వెనుక రానున్న దానికీ (పరలోక శిక్షకూ) భీతిపరులై ఉండండి,[2] బహుశా మీరు కరుణింపబడవచ్చు!" అని అన్నప్పుడు, (వారు లక్ష్యంచేయటం లేదు).

**46**. మరియు వారి ప్రభువు సూచనలలో నుండి, వారి వద్దకు ఏ సూచన వచ్చినా, వారు దానినుండి ముఖం త్రిప్పుకోకుండా ఉండలేదు.

وَءَايَةٌ لَّهُمْ أَنَّا حَمَلْنَا ذُرِّيَّتَهُمْ فِى ٱلْفُلْكِ ٱلْمَشْحُونِ ﴿٤١﴾

وَخَلَقْنَا لَهُم مِّن مِّثْلِهِۦ مَا يَرْكَبُونَ ﴿٤٢﴾

وَإِن نَّشَأْ نُغْرِقْهُمْ فَلَا صَرِيخَ لَهُمْ وَلَا هُمْ يُنقَذُونَ ﴿٤٣﴾

إِلَّا رَحْمَةً مِّنَّا وَمَتَٰعًا إِلَىٰ حِينٍ ﴿٤٤﴾

وَإِذَا قِيلَ لَهُمُ ٱتَّقُوا۟ مَا بَيْنَ أَيْدِيكُمْ وَمَا خَلْفَكُمْ لَعَلَّكُمْ تُرْحَمُونَ ﴿٤٥﴾

وَمَا تَأْتِيهِم مِّنْ ءَايَةٍ مِّنْ ءَايَٰتِ رَبِّهِمْ إِلَّا كَانُوا۟ عَنْهَا مُعْرِضِينَ ﴿٤٦﴾

---

**1**. చూడండి, 16:8.

**2**. మా బైన అయ్‌దీకుమ్ వ మా 'ఖల్ఫకుమ్: పైన ఇచ్చిన తాత్పర్యం నోబుల్ ఖుర్ఆన్‌ను అనుసరించి ఉంది. ము'హమ్మద్ జూనాగఢి గారి తాత్పర్యం ఇలా ఉంది: 'మీ వెనుకా ముందు సంభవించే పాపాల నుండి కాపాడుకోండి.'

وَإِذَا قِيلَ لَهُمْ أَنفِقُواْ مِمَّا رَزَقَكُمُ ٱللَّهُ قَالَ ٱلَّذِينَ كَفَرُواْ لِلَّذِينَ ءَامَنُوٓاْ أَنُطْعِمُ مَن لَّوْ يَشَآءُ ٱللَّهُ أَطْعَمَهُۥٓ إِنْ أَنتُمْ إِلَّا فِى ضَلَٰلٍ مُّبِينٍ ﴿٤٧﴾

**47.** మరియు వారితో: ''అల్లాహ్ మీకు ప్రసాదించిన జీవనోపాధి నుండి ఖర్చుచేయండి.'' అని అన్నప్పుడు, సత్యతిరస్కారులు విశ్వాసులతో అంటారు: ''ఏమీ? అల్లాహ్ కోరితే, తానే తినిపించగల వారికి, మేము తినిపించాలా? మీరు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడిఉన్నారు.''

وَيَقُولُونَ مَتَىٰ هَٰذَا ٱلْوَعْدُ إِن كُنتُمْ صَٰدِقِينَ ﴿٤٨﴾

**48.** వారు ఇంకా ఇలా అంటారు: ''మీరు సత్యవంతులే అయితే, ఆ వాగ్దానం (పునరుత్థానం) ఎప్పుడు పూర్తికానున్నది?''

مَا يَنظُرُونَ إِلَّا صَيْحَةً وَٰحِدَةً تَأْخُذُهُمْ وَهُمْ يَخِصِّمُونَ ﴿٤٩﴾

**49.** వారు నిరీక్షిస్తున్నది కేవలం ఒక పెద్ద ధ్వని[1] కొరకే. మరియు వారు వాదులాడుకుంటూ ఉండగానే, అది వారిని చిక్కించుకుంటుంది.

فَلَا يَسْتَطِيعُونَ تَوْصِيَةً وَلَآ إِلَىٰٓ أَهْلِهِمْ يَرْجِعُونَ ﴿٥٠﴾

**50.** వారు ఏ విధమైన వీలునామా కూడా వ్రాయలేరు మరియు తమ కుటుంబంవారి వద్దకు కూడా తిరిగి పోలేరు.

وَنُفِخَ فِى ٱلصُّورِ فَإِذَا هُم مِّنَ ٱلْأَجْدَاثِ إِلَىٰ رَبِّهِمْ يَنسِلُونَ ﴿٥١﴾

**51.** మరియు (మరొకసారి) బాకా ఊదబడినప్పుడు, వారంతా గోరీలనుండి (లేచి) తమ ప్రభువు వైపునకు వేగంగా పరిగెత్తుకుంటూ వస్తారు.[2]

---

**1.** అంటే అకస్మాత్తుగా ఊదబడే పునరుత్థానదినపు బాకా (కొమ్ము) ధ్వని, అరుపు, గర్జన లేక శబ్దం. దీనిని మొదటిబాకా లేక నఫ్'ఖతుల్ ఫజ'అ అంటారు. దీని తరువాత రెండవబాకా ఊదబడుతుంది. దానిని నఫ్'ఖతు'స్స'అఖ్, అంటారు. అప్పుడు అల్లాహ్ (సు.తా.) తప్ప సర్వజీవరాసులు మరణిస్తారు. ఇంకా చూడండి, 36:29, 53; 38:15.

**2.** కొందరు వ్యాఖ్యాతలు దీనిని రెండవ బాకా అని, మరికొందరు దీనిని మూడవ బాకా అంటే నఫ్'ఖతుల్-బ'అసి' వన్నుషూర్ అని, అంటారు. ఇది ఊదబడగానే గోరీలలోని వారంతా లేచి వస్తారు. (ఇబ్నె-కసీ'ర్).

52. వారంటారు: "అయ్యో మా దౌర్భాగ్యం! మమ్మల్ని మా పడకలనుండి లేపి ఎవరు నిలబెట్టారు?" (వారితో అనబడు తుంది): "ఇదే ఆ కరుణామయుడు చేసిన వాగ్దానం. మరియు అతని సందేశహరులు సత్యమే పలికారు!"

قَالُواْ يَٰوَيۡلَنَا مَنۢ بَعَثَنَا مِن مَّرۡقَدِنَاۗۜ هَٰذَا مَا وَعَدَ ٱلرَّحۡمَٰنُ وَصَدَقَ ٱلۡمُرۡسَلُونَ ٥٢

53. అది కేవలం ఒక పెద్ద ధ్వని[1] మాత్రమే ఉంటుంది! వెంటనే వారంతా మాముందు హాజరు చేయబడతారు!

إِن كَانَتۡ إِلَّا صَيۡحَةٗ وَٰحِدَةٗ فَإِذَا هُمۡ جَمِيعٞ لَّدَيۡنَا مُحۡضَرُونَ ٥٣

54. ఆ రోజు ఎవ్వరికీ ఎలాంటి అన్యాయం జరుగదు. మరియు మీ కర్మలకు తగినది తప్ప, మరే ప్రతిఫల మివ్వబడదు.

فَٱلۡيَوۡمَ لَا تُظۡلَمُ نَفۡسٞ شَيۡـٔٗا وَلَا تُجۡزَوۡنَ إِلَّا مَا كُنتُمۡ تَعۡمَلُونَ ٥٤

55. నిశ్చయంగా, ఆ రోజు స్వర్గవాసులు, సుఖసంతోషాలలో నిమగ్నులై ఉంటారు.

إِنَّ أَصۡحَٰبَ ٱلۡجَنَّةِ ٱلۡيَوۡمَ فِي شُغُلٖ فَٰكِهُونَ ٥٥

56. వారు మరియు వారి సహవాసు (అజ్వాజ్)లు, చల్లని నీడలలో, ఆనుడు ఆసనాల మీద హాయిగా కూర్చొని ఉంటారు.[2]

هُمۡ وَأَزۡوَٰجُهُمۡ فِي ظِلَٰلٍ عَلَى ٱلۡأَرَآئِكِ مُتَّكِـُٔونَ ٥٦

57. అందులో వారికి ఫలాలు మరియు వారు కోరేవన్నీ ఉంటాయి.

لَهُمۡ فِيهَا فَٰكِهَةٞ وَلَهُم مَّا يَدَّعُونَ ٥٧

58. "మీకు శాంతి కలుగుగాక (సలాం)!" అనే పలుకులు అపార కరుణా ప్రదాత అయిన ప్రభువు తరఫునుండి వస్తాయి.[3]

سَلَٰمٞ قَوۡلٗا مِّن رَّبّٖ رَّحِيمٖ ٥٨

---

1. పునరుత్థాన దినమున ఇస్రాఫీల్ ('అ.స.) ఊదే బాకా ధ్వని, అరుపు, గర్జన లేక శబ్దం. ఇంకా చూడండి, 36:29,49,38:15.
2. చూడండి, 4:57, 18:31 మరియు 55:54.
3. చూడండి, 5:16.

وَٱمۡتَٰزُواْ ٱلۡيَوۡمَ أَيُّهَا ٱلۡمُجۡرِمُونَ ٥٩ ۞ أَلَمۡ أَعۡهَدۡ إِلَيۡكُمۡ يَٰبَنِيٓ ءَادَمَ أَن لَّا تَعۡبُدُواْ ٱلشَّيۡطَٰنَۖ إِنَّهُۥ لَكُمۡ عَدُوّٞ مُّبِينٞ ٦٠ وَأَنِ ٱعۡبُدُونِيۚ هَٰذَا صِرَٰطٞ مُّسۡتَقِيمٞ ٦١ وَلَقَدۡ أَضَلَّ مِنكُمۡ جِبِلّٗا كَثِيرًاۖ أَفَلَمۡ تَكُونُواْ تَعۡقِلُونَ ٦٢ هَٰذِهِۦ جَهَنَّمُ ٱلَّتِي كُنتُمۡ تُوعَدُونَ ٦٣ ٱصۡلَوۡهَا ٱلۡيَوۡمَ بِمَا كُنتُمۡ تَكۡفُرُونَ ٦٤ ٱلۡيَوۡمَ نَخۡتِمُ عَلَىٰٓ أَفۡوَٰهِهِمۡ وَتُكَلِّمُنَآ أَيۡدِيهِمۡ وَتَشۡهَدُ أَرۡجُلُهُم بِمَا كَانُواْ يَكۡسِبُونَ ٦٥ وَلَوۡ نَشَآءُ لَطَمَسۡنَا عَلَىٰٓ أَعۡيُنِهِمۡ فَٱسۡتَبَقُواْ ٱلصِّرَٰطَ فَأَنَّىٰ يُبۡصِرُونَ ٦٦

**59**. ఇంకా (ఇలా అన బడుతుంది): "ఓ అపరాధులారా! ఈనాడు మీరు వేరయిపొండి.[1] (1/8)

**60**. * "ఓ ఆదమ్ సంతతి వారలారా: 'షైతానును ఆరాధించకండి.' అని నేను మిమ్మల్ని ఆదేశించలేదా? నిశ్చయంగా, అతడు మీకు బహిరంగ శత్రువు![2]

**61**. "మరియు మీరు నన్నే ఆరాధించండి. ఇదే ఋజుమార్గమని!

**62**. "మరియు వాస్తవానికి వాడు (షైతాన్) మీలో పెద్ద సమూహాన్ని దారి తప్పించాడు. ఏమీ? మీకు తెలివి లేక పోయిందా?

**63**. "మీకు వాగ్దానం చేయబడిన ఆ నరకం ఇదే!

**64**. "మీరు సత్యాన్ని తిరస్కరిస్తూ ఉన్నందుకు, ఈ రోజు దీనిలో ప్రవేశించండి (కాలండి)."

**65**. ఆ రోజు మేము వారి నోళ్ళమీద ముద్ర వేస్తాము.[3] మరియు వారేమి అర్జించారో వారిచేతులు మాతో చెబుతాయి మరియు వారికాళ్ళు మాముందు సాక్ష్యమిస్తాయి.

**66**. మరియు మేము కోరినట్లయితే, వారి దృష్టిని నిర్మూలించేవారము, అప్పుడు వారు దారికొరకు పెనుగులాడే వారు, కాని వారు ఎలా చూడగలిగే వారు?[4]

---

**1**. చూడండి, 30:14, 43.
**2**. చూడండి, 19:44.
**3**. ఎందుకంటే మొదట వారు తాము చేసిన షిర్కును తిరస్కరిస్తారు. చూడండి, 6:23.
**4**. చూడండి, 2:20.

67. మరియు మేము కోరినట్లయితే వారిని, వారి స్థానంలోనే రూపాన్ని మార్చి ఉంచేవారం, అప్పుడు వారు ముందుకూ పోలేరు మరియు వెనుకకూ మరలలేరు.

وَلَوْ نَشَآءُ لَمَسَخْنَٰهُمْ عَلَىٰ مَكَانَتِهِمْ فَمَا ٱسْتَطَٰعُوا۟ مُضِيًّا وَلَا يَرْجِعُونَ ﴿٦٧﴾

68. మరియు మేము ఎవరికి దీర్ఘాయువు నొసంగుతామో, అతని శారీరక రూపాన్ని మార్చుతాము. ఏమీ? వారు ఇది కూడా గ్రహించలేరా?[1]

وَمَن نُّعَمِّرْهُ نُنَكِّسْهُ فِى ٱلْخَلْقِ ۖ أَفَلَا يَعْقِلُونَ ﴿٦٨﴾

69. మరియు మేము అతనికి (ము'హమ్మద్‌కు) కవిత్వం నేర్పలేదు.[2] మరియు అది అతనికి శోభించదు కూడా! ఇది కేవలం ఒక హితోపదేశం మరియు స్పష్టమైన పఠనగ్రంథం (ఖుర్ఆన్) మాత్రమే.[3]

وَمَا عَلَّمْنَٰهُ ٱلشِّعْرَ وَمَا يَنۢبَغِى لَهُۥٓ ۚ إِنْ هُوَ إِلَّا ذِكْرٌ وَقُرْءَانٌ مُّبِينٌ ﴿٦٩﴾

70. బ్రతికివున్న ప్రతి వానికి హెచ్చరిక చేయటానికి మరియు సత్యతిరస్కారుల ఎడల మా ఆదేశాన్ని నిరూపించటానికి!

لِّيُنذِرَ مَن كَانَ حَيًّا وَيَحِقَّ ٱلْقَوْلُ عَلَى ٱلْكَٰفِرِينَ ﴿٧٠﴾

71. ఏమి వారికి తెలియదా? నిశ్చయంగా మేము వారికొరకు మా చేతులతో పశువులను సృష్టించి, తరువాత వాటిపై వారికి యాజమాన్యం ఇచ్చామని?

أَوَلَمْ يَرَوْا۟ أَنَّا خَلَقْنَا لَهُم مِّمَّا عَمِلَتْ أَيْدِينَآ أَنْعَٰمًا فَهُمْ لَهَا مَٰلِكُونَ ﴿٧١﴾

---

1. చూడండి, 4:28.
2. మక్కా ముష్రికులు దైవప్రవక్త ('స'అస)ను వివిధ ఆరోపణలతో పీడించేవారు. వాటిలో ఒకటి ఇతను ('స'అస) కవిత్వం చెబుతున్నాడని. దానికి అల్లాహ్ (సు.తా.) ఇక్కడ జవాబిస్తున్నాడు: ఒకవేళ ఇది కవిత్వం అయితే మీరు దీనివంటి ఒక్క సూరహ్‌నైనా రచించి తీసుకురండని. కాని దానిని ఎవ్వరూ ఈ రోజు వరకు పూర్తిచేయలేక పోయారు. ఇంకా చూడండి, 26:224-226.
3. చూడండి, 15:1.

وَذَلَّلۡنَٰهَا لَهُمۡ فَمِنۡهَا رَكُوبُهُمۡ وَمِنۡهَا يَأۡكُلُونَ ٧٢

**72**. మరియు వాటిని, వారికి స్వాధీనపరిచాము. కావున వాటిలో కొన్నిటిపై వారు స్వారీచేస్తారు, మరికొన్నిటిని (వాటి మాంసాన్ని) వారు తింటారు.

وَلَهُمۡ فِيهَا مَنَٰفِعُ وَمَشَارِبُۚ أَفَلَا يَشۡكُرُونَ ٧٣

**73**. మరియు వాటిలో వారికి ఎన్నో ప్రయోజనాలు మరియు పానీయాలు (పాలు) ఉన్నాయి. అయినా, వారెందుకు కృతజ్ఞతలు చూపరు?

وَٱتَّخَذُواْ مِن دُونِ ٱللَّهِ ءَالِهَةً لَّعَلَّهُمۡ يُنصَرُونَ ٧٤

**74**. మరియు వారు అల్లాహ్‌ను వదలి, ఇతరులను ఆరాధ్య దైవాలుగా చేసుకున్నారు.[1] బహుశా వారి వలన తమకు సహాయం దొరుకుతుందేమోననే ఆశతో!

لَا يَسۡتَطِيعُونَ نَصۡرَهُمۡ وَهُمۡ لَهُمۡ جُندٞ مُّحۡضَرُونَ ٧٥

**75**. వారు (ఆ దైవాలు), తమకెలాంటి సహాయం చేయలేరు. అయినా! వీరు (సత్యతిరస్కారులు) వారి (ఆ దైవాల) కొరకు సైన్యం మాదిరిగా సర్వసన్నద్ధులై ఉన్నారు.[2]

فَلَا يَحۡزُنكَ قَوۡلُهُمۡۘ إِنَّا نَعۡلَمُ مَا يُسِرُّونَ وَمَا يُعۡلِنُونَ ٧٦

**76**. కావున (ఓ ము'హమ్మద్!) వారి మాటలు నిన్ను బాధింపనివ్వరాదు. వాస్తవానికి! మాకు, వారు దాచేవీ మరియు వెలిబుచ్చేవీ అన్నీ బాగా తెలుసు.

---

**1**. అంటే విగ్రహాలు, కల్పితదైవాలు, అవతారాలుగా భావించబడే మానవులు, సాధులు, సన్యాసులు, ప్రవక్తలు, షై'తాన్ మరియు దైవదూతలూ లేక ధనసంపత్తులు, బలం, శక్తి, అదృష్టం, శకునం మొదలైనవి. వీటినే వారు దైవాలుగా చేసుకొని ఆరాధిస్తున్నారు.

**2**. ఈ ఆయత్ యొక్క మరొక తాత్పర్యం ఈ విధంగా కూడా ఉంది: "వారు (ఆ దైవాలు), వీరికెలాంటి సహాయం చేయలేరు. కాని వారు (ఆ దైవాలు పునరుత్థాన దినమున తమను ఆరాధించిన వారికి) విరుద్ధ భటులుగా హాజరుచేయబడతారు." (ఇబ్నె-కసీ'ర్).

**77.** ఏమీ? మానవుడు ఎరుగడా? నిశ్చయంగా, మేము అతనిని వీర్యబిందువుతో సృష్టించామని? అయినా! అతడు బహిరంగ ప్రత్యర్థిగా తయారయ్యాడు?[1]

**78.** మరియు అతడు మాకు పోలికలు కల్పిస్తూ తన సృష్టినే మరచిపోయాడు. అతడు ఇలా అంటాడు: "కృశించి పోయిన ఈ ఎముకలను తిరిగి ఎవడు బ్రతికించగలడు?"

**79.** ఇలా అను: "మొదట వాటిని పుట్టించిన ఆయనే, మళ్ళీ వాటిని బ్రతికిస్తాడు. మరియు ఆయనకు, ప్రతి దానిని సృష్టించే జ్ఞానవుంది."

**80.** ఆయనే పచ్చని చెట్టునుండి మీ కొరకు అగ్నిని పుట్టించేవాడు, తరువాత మీరు దానినుండి మంటను వెలిగించుకుంటారు.

**81.** ఏమీ? ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించగలవాడు, వాటిలాంటి వాటిని మరల సృష్టించలేడా? ఎందుకు చేయలేడు! ఆయనే సర్వసృష్టికర్త, సర్వజ్ఞుడు.[2]

أَوَلَمْ يَرَ ٱلْإِنسَٰنُ أَنَّا خَلَقْنَٰهُ مِن نُّطْفَةٍ فَإِذَا هُوَ خَصِيمٌ مُّبِينٌ ﴿٧٧﴾

وَضَرَبَ لَنَا مَثَلًا وَنَسِىَ خَلْقَهُۥ ۖ قَالَ مَن يُحْىِ ٱلْعِظَٰمَ وَهِىَ رَمِيمٌ ﴿٧٨﴾

قُلْ يُحْيِيهَا ٱلَّذِىٓ أَنشَأَهَآ أَوَّلَ مَرَّةٍ ۖ وَهُوَ بِكُلِّ خَلْقٍ عَلِيمٌ ﴿٧٩﴾

ٱلَّذِى جَعَلَ لَكُم مِّنَ ٱلشَّجَرِ ٱلْأَخْضَرِ نَارًا فَإِذَآ أَنتُم مِّنْهُ تُوقِدُونَ ﴿٨٠﴾

أَوَلَيْسَ ٱلَّذِى خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ بِقَٰدِرٍ عَلَىٰٓ أَن يَخْلُقَ مِثْلَهُم ۚ بَلَىٰ وَهُوَ ٱلْخَلَّٰقُ ٱلْعَلِيمُ ﴿٨١﴾

---

1. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 16:4.
2. చూడండి, 40:57, 46:33 మరియు 17:99.

إِنَّمَآ أَمۡرُهُۥٓ إِذَآ أَرَادَ شَيۡـًٔا أَن يَقُولَ لَهُۥ كُن فَيَكُونُ ﴿٨٢﴾

**82**. నిశ్చయంగా, ఆయన విధానమేమిటంటే! ఆయన ఏదైనా చేయదలచుకున్నప్పుడు దానితో: "అయిపో!" అని అంటాడు, అంతే! అది అయిపోతుంది.

فَسُبۡحَٰنَ ٱلَّذِي بِيَدِهِۦ مَلَكُوتُ كُلِّ شَيۡءٖ وَإِلَيۡهِ تُرۡجَعُونَ ﴿٨٣﴾

**83**. ఎందుకంటే! సర్వలోపాలకు అతీతుడైన ఆయన (అల్లాహ్) చేతిలో ప్రతిదానికి సంబంధించిన సర్వాధికారాలు ఉన్నాయి మరియు మీరంతా ఆయన వైపునకే మరలింపబడతారు.

*****

## 37. సూరహ్ అస్-'సాఫ్ఫాత్

## سُورَةُ الصَّافَّاتِ

ఈ సూరహ్ మధ్య మక్కా కాలంలో అవతరింపజేయబడింది. అస్-'సాఫ్ఫాత్ అంటే వరుసలలో లేక పంక్తులలో నిలబడినవారు. ఈ సూరహ్ ఈ సమూహంలో నాలుగవది. ఇందులో నూహ్, ఇబ్రాహీమ్, మూసా, హారూన్, ఇల్యాస్, లూ'త్ మరియు యూనుస్ ('అలైహిమ్ స.)లు చెడుతో చేసిన పోరాటం మరియు వారికి లభించిన విజయాలు వివరించబడ్డాయి. ఇందులో **182** ఆయతులు ఉన్నాయి.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

وَٱلصَّٰٓفَّٰتِ صَفّٗا ١

فَٱلزَّٰجِرَٰتِ زَجۡرٗا ٢

فَٱلتَّٰلِيَٰتِ ذِكۡرًا ٣

إِنَّ إِلَٰهَكُمۡ لَوَٰحِدٞ ٤

رَّبُّ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَمَا بَيۡنَهُمَا وَرَبُّ ٱلۡمَشَٰرِقِ ٥

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

**1.** వరుసగా బారులు తీరి నిలుచున్న వారి (దైవదూతల) సాక్షిగా!

**2.** మేఘాలను నడిపించే వారి (దైవదూతల) సాక్షిగా![1]

**3.** ఈ ఉపదేశాన్ని(ఖుర్ఆన్)ను, (అల్లాహ్ దగ్గరి నుండి మానవులకు) తెచ్చే వారి (దైవదూతల) సాక్షిగా![2]

**4.** నిశ్చయంగా, మీ ఆరాధ్య దైవం కేవలం ఆయన (అల్లాహ్) ఒక్కడే![3]

**5.** ఆకాశాలు మరియు భూమి మరియు వాటి మధ్యనున్న వాటి ప్రభువు మరియు సూర్యోదయ (తూర్పు) స్థలాలకు ప్రభువు.[4]

---

**1**. ఈ ఆయత్ ఈ విధంగా కూడా వివరించబడింది. *'తరుమగొట్టే వారి సాక్షిగా!'*

**2**. ఈ ఆయత్: *'ఖుర్ఆన్ పఠించేవారి సాక్షిగా!'* అని కూడా వివరించబడింది.

**3**. పై మూడు ఆయతులలో దైవదూత ('అ.స.)ల వివిధ కార్యాలు వివరించబడ్డాయి. ప్రతిదీ అల్లాహ్ (సు.తా.) యొక్క సృష్టి మరియు ఆయనకు చెందినదే. కావున ఆయన తాను కోరిన దాని ప్రమాణం చేస్తాడు. కాని మానవులకు అల్లాహ్ (సు.తా.) తప్ప ఇతరుల ప్రమాణం చేయటం నిషిద్ధం ('హరాం) ఎందుకంటే ప్రమాణం తీసుకునే దానిని సాక్షిగా తీసుకోవలసి ఉంటుంది. మానవునికి అల్లాహ్ (సు.తా.) తప్ప మరొక ఉత్తమ సాక్షి లేడు. ఎందుకంటే కేవలం అల్లాహ్ (సు.తా.)యే సర్వసాక్షి.

**4**. చూడండి, 55:17. అక్కడ రెండు తూర్పులు మరియు రెండు పడమరలు అని ఉంది. అంటే చలికాలం మరియు వేసవి కాలంలో సూర్యోదయం మరియు సూర్యాస్తమయం అయ్యే రెండు చివరలు. వాస్తవానికి సంవత్సరపు ప్రతిరోజున సూర్యుడు ఒక క్రొత్త చోటునుండి ఉదయిస్తాడు మరియు ఒక క్రొత్త చోటులో అస్తమిస్తాడు (ఫ'త్హ్ అల్-ఖదీర్).

إِنَّا زَيَّنَّا ٱلسَّمَآءَ ٱلدُّنۡيَا بِزِينَةٍ ٱلۡكَوَاكِبِ ٦

6. నిశ్చయంగా, మేము భూలోకానికి దగ్గరి ఆకాశాన్ని నక్షత్ర సముదాయాలతో అలంకరించాము;

وَحِفۡظٗا مِّن كُلِّ شَيۡطَٰنٖ مَّارِدٖ ٧

7. మరియు ధిక్కారి అయిన ప్రతి షై'తాన్ నుండి కాపాడటానికి;[1]

لَّا يَسَّمَّعُونَ إِلَى ٱلۡمَلَإِ ٱلۡأَعۡلَىٰ وَيُقۡذَفُونَ مِن كُلِّ جَانِبٖ ٨

8. ఇక వారు (షై'తాన్‌లు), ఉన్నత స్థానాలలో ఉన్న నాయకుల (దైవదూతల) మాటలు వినలేరు మరియు వారు ప్రతి దిక్కు నుండి తరమబడుతూ ఉంటారు.

دُحُورٗاۖ وَلَهُمۡ عَذَابٞ وَاصِبٌ ٩

9. ఎందుకంటే) వారు (షై'తాన్‌లు) బహిష్కరించబడ్డారు. మరియు వారికి నిరంతరమైన శిక్ష ఉంది.

إِلَّا مَنۡ خَطِفَ ٱلۡخَطۡفَةَ فَأَتۡبَعَهُۥ شِهَابٞ ثَاقِبٞ ١٠

10. కాని, ఎవడైనా(ఏ షై'తానైనా), దేనినైనా ఎగురవేసుకొని పోతున్నట్లైతే, మండే అగ్నిజ్వాల అతనిని వెంబడిస్తుంది.[2]

فَٱسۡتَفۡتِهِمۡ أَهُمۡ أَشَدُّ خَلۡقًا أَم مَّنۡ خَلَقۡنَآۚ إِنَّا خَلَقۡنَٰهُم مِّن طِينٖ لَّازِبِۭ ١١

11. అయితే వారిని అడగండి: "ఏమీ? వారు (మానవులు) దృఢమైన సృష్టా! లేక, మేము సృష్టించింది (ఈ సృష్టి దృఢమైనదా)?" నిశ్చయంగా, మేము వారిని జిగట మట్టితో (తీనిల్లాజిబ్‌తో) సృష్టించాము.

بَلۡ عَجِبۡتَ وَيَسۡخَرُونَ ١٢

12. వాస్తవానికి, నీవైతే ఆశ్చర్యపడు తున్నావు, కాని వారు ఎగతాళి చేస్తున్నారు.

---

1. చూడండి, 15:17 నక్షత్రాల ఉనికికి మూడు కారణాలున్నాయి. 1) ఆకాశపు అలంకరణ. 2) షైతానులు ఆకాశాలలోకి పోయి దైవదూతల మాటలు వినటానికి ప్రయత్నిస్తే వాటిని తరుమటం. 3) రాత్రి చీకటిలో మానవులకు మార్గదర్శకత్వము చేయటం. ఈ మూడు తప్ప ఇతర ఉపయోగాలు పేర్కొనబడలేదు.
2. చూడండి, 15:18.

وَإِذَا ذُكِّرُواْ لَا يَذْكُرُونَ ﴿١٣﴾

**13**. మరియు వారికి ఉపదేశమిచ్చినపుడు, వారు దానిని స్వీకరించరు.

وَإِذَا رَأَوْاْ ءَايَةً يَسْتَسْخِرُونَ ﴿١٤﴾

**14**. మరియు వారొక సంకేతాన్ని చూసినప్పుడు, దానిని ఎగతాళిచేస్తారు.

وَقَالُوٓاْ إِنْ هَٰذَآ إِلَّا سِحْرٌ مُّبِينٌ ﴿١٥﴾

**15**. మరియు వారిలా అంటారు: "ఇది స్పష్టమైన మంత్రజాలం మాత్రమే!

أَءِذَا مِتْنَا وَكُنَّا تُرَابًا وَعِظَٰمًا أَءِنَّا لَمَبْعُوثُونَ ﴿١٦﴾

**16**. "ఏమిటి? మేము మరణించి మట్టిగా, ఎముకలుగా (అస్థిపంజరంగా) మారిపోయిన తరువాత కూడా మరల సజీవులుగా లేపబడతామా?

أَوَءَابَآؤُنَا ٱلْأَوَّلُونَ ﴿١٧﴾

**17**. "ఏమిటి? మరియు పూర్వీకులైన మా తాతముత్తాతలు కూడానా?"

قُلْ نَعَمْ وَأَنتُمْ دَٰخِرُونَ ﴿١٨﴾

**18**. వారితో ఇలా అను: "అవును! అప్పుడు మీరు అధమమైన వారు అవుతారు."[1]

فَإِنَّمَا هِىَ زَجْرَةٌ وَٰحِدَةٌ فَإِذَا هُمْ يَنظُرُونَ ﴿١٩﴾

**19**. నిశ్చయంగా, అది ఒక పెద్ద ధ్వని మాత్రమే (రెండవ బాకా), అప్పుడు వారు (లేచి) చూస్తూ ఉండిపోతారు.

وَقَالُواْ يَٰوَيْلَنَا هَٰذَا يَوْمُ ٱلدِّينِ ﴿٢٠﴾

**20**. మరియు వారు ఇలా అంటారు: "అయ్యో! మా దౌర్భాగ్యం! ఇదే ఆ తీర్పుదినం."

هَٰذَا يَوْمُ ٱلْفَصْلِ ٱلَّذِى كُنتُم بِهِۦ تُكَذِّبُونَ ﴿٢١﴾

**21**. (అప్పుడు వారితో ఇలా అనబడు తుంది): "మీరు అబద్ధమని తిరస్కరిస్తూ ఉండే న్యాయవిచారణ దినం ఇదే!"[2] (1/4)

---

**1**. చూడండి, 27:87 మరియు 40:60.

**2**. చూడండి, 77:13.

۞ ٱحْشُرُواْ ٱلَّذِينَ ظَلَمُواْ وَأَزْوَٰجَهُمْ وَمَا كَانُواْ يَعْبُدُونَ ﴿٢٢﴾

**22.** * (దైవదూతలతో ఇలా అనబడుతుంది): "ఆ దుర్మార్గులను సమావేశపరచండి! మరియు వారి సహచరులను మరియు వారు ఆరాధిస్తూ ఉన్న వారిని -

مِن دُونِ ٱللَّهِ فَٱهْدُوهُمْ إِلَىٰ صِرَٰطِ ٱلْجَحِيمِ ﴿٢٣﴾

**23.** "అల్లాహ్‌ను కాదని! తరువాత వారందరికీ ప్రజ్వలించే నరకాగ్ని మార్గాన్ని చూపండి;

وَقِفُوهُمْ ۖ إِنَّهُم مَّسْـُٔولُونَ ﴿٢٤﴾

**24.** "మరియు వారిని అక్కడ నిలబెట్టండి. వాస్తవానికి వారిని ప్రశ్నించవలసి ఉన్నది.

مَا لَكُمْ لَا تَنَاصَرُونَ ﴿٢٥﴾

**25.** "మీ కేమైంది? మీరు పరస్పరం ఎందుకు సహాయం చేసుకోవటం లేదు?"

بَلْ هُمُ ٱلْيَوْمَ مُسْتَسْلِمُونَ ﴿٢٦﴾

**26.** అలాకాదు! ఆ రోజు వారు తమను తాము అల్లాహ్‌కు అప్పగించుకుంటారు.

وَأَقْبَلَ بَعْضُهُمْ عَلَىٰ بَعْضٍ يَتَسَآءَلُونَ ﴿٢٧﴾

**27.** మరియు వారు ఒకరి వైపునకు మరొకరు మరలి ఇలా ప్రశ్నించుకుంటారు.

قَالُوٓاْ إِنَّكُمْ كُنتُمْ تَأْتُونَنَا عَنِ ٱلْيَمِينِ ﴿٢٨﴾

**28.** కొందరు అంటారు: "మీరు మా వద్దకు (మమ్మల్ని మోసగించటానికి) మా కుడివైపు నుండి వచ్చేవారు!"[1]

قَالُواْ بَل لَّمْ تَكُونُواْ مُؤْمِنِينَ ﴿٢٩﴾

**29.** ఇతరులు ఇలా జవాబిస్తారు: "అలా కాదు, మీ అంతట మీరే విశ్వసించేవారు కాదు.

وَمَا كَانَ لَنَا عَلَيْكُم مِّن سُلْطَٰنٍ ۖ بَلْ كُنتُمْ قَوْمًا طَٰغِينَ ﴿٣٠﴾

**30.** "మాకు మీపై ఎలాంటి అధికారం ఉండేది కాదు. అలాకాదు! మీరే తలబిరుసు తనం చూపేవారు.[2]

---

**1.** అంటే ధర్మం మరియు సత్యం పేరట వచ్చేవారు. అంటే వారు ఆచరించే ధర్మమే సత్యమైనదని!

**2.** ఇలాంటి ఆయత్‌లకు చూడండి, 14:21, 40:47-48, 34:31-32, 33:67-68, 7:38-39.

**31**. "కావున, ఇప్పుడు మన ప్రభువు వాక్కు మనపై పూర్తి అయ్యింది. నిశ్చయంగా మనమంతా (శిక్షను) రుచి చూడగలము.

فَحَقَّ عَلَيْنَا قَوْلُ رَبِّنَآ ۖ إِنَّا لَذَآئِقُونَ ﴿٣١﴾

**32**. "కావున మేము మిమ్మల్ని తప్పు దారిలో పడవేశాము, నిశ్చయంగా, మేము కూడా మార్గభ్రష్టులమై ఉంటిమి!"[1]

فَأَغْوَيْنَٰكُمْ إِنَّا كُنَّا غَٰوِينَ ﴿٣٢﴾

**33**. అప్పుడు నిశ్చయంగా వారందరూ ఆ రోజు, శిక్షలో భాగస్వాములవుతారు.

فَإِنَّهُمْ يَوْمَئِذٍ فِى ٱلْعَذَابِ مُشْتَرِكُونَ ﴿٣٣﴾

**34**. నిశ్చయంగా, మేము అపరాధులతో ఇదే విధంగా ప్రవర్తిస్తాము.

إِنَّا كَذَٰلِكَ نَفْعَلُ بِٱلْمُجْرِمِينَ ﴿٣٤﴾

**35**. వాస్తవానికి, వారితో: "అల్లాహ్ తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు." అని అన్నప్పుడు, వారు దురహంకారం చూపే వారు.

إِنَّهُمْ كَانُوٓا۟ إِذَا قِيلَ لَهُمْ لَآ إِلَٰهَ إِلَّا ٱللَّهُ يَسْتَكْبِرُونَ ﴿٣٥﴾

**36**. మరియు వారు ఇలా అనేవారు: "ఏమిటి? మేము ఒక పిచ్చికవి కొరకు మా ఆరాధ్య దైవాలను త్యజించాలా?"[2]

وَيَقُولُونَ أَئِنَّا لَتَارِكُوٓا۟ ءَالِهَتِنَا لِشَاعِرٍ مَّجْنُونٍۭ ﴿٣٦﴾

**37**. వాస్తవానికి, అతను (ము'హమ్మద్) సత్యాన్ని తీసుకొనివచ్చాడు. మరియు అతను (తనకు పూర్వం వచ్చిన) ప్రవక్తలను సత్యవంతులని ధృవపరచాడు.

بَلْ جَآءَ بِٱلْحَقِّ وَصَدَّقَ ٱلْمُرْسَلِينَ ﴿٣٧﴾

**38**. నిశ్చయంగా, మీరు బాధాకరమైన శిక్షను రుచిచూడ గలరు;

إِنَّكُمْ لَذَآئِقُوا۟ ٱلْعَذَابِ ٱلْأَلِيمِ ﴿٣٨﴾

---

**1**. చివరకు వారి నాయకులు ఒప్పుకుంటారు, వారు స్వయంగా తప్పుదారిలో ఉండి, తమ అనుచరులను కూడా తప్పుదారి పట్టించారని! షై'తాన్ మాటల కోసం చూడండి, 14:22.

**2**. వారు దైవప్రవక్త ('స'అస)ను పిచ్చికవి మరియు దివ్యఖుర్ఆన్‌ను కవిత్వం అని హేళన చేసేవారు. చూడండి, 36:69.

**39**. మరియు మీకు, మీరు చేస్తూ ఉండిన కర్మలకు తగిన ఫలితం తప్ప, మరేమీ ఇవ్వబడదు;

**40**. ఎన్నుకోబడిన అల్లాహ్ దాసులకు తప్ప![1]

**41**. అలాంటి వారి కొరకు వారికి తెలిసి ఉన్న జీవనోపాధి ఉంది;[2]

**42**. అన్నిరకాల ఫలాలు; మరియు వారు ఆదరించబడతారు;

**43**. పరమసుఖాలు గల స్వర్గవనాలలో;

**44**. ఆసనాల మీద ఒకరికొకరు ఎదురెదురుగా కూర్చొని ఉంటారు;[3]

**45**. వారి మధ్య ప్రవహించే చెలమల నుండి, పానీయపు (మధు) పాత్రలు త్రిప్పబడుతుంటాయి;

**46**. అది తెల్లగా (మెరిసిపోతూ) త్రాగే వారికి ఎంతో రుచికరమైనదిగా ఉంటుంది;

**47**. దానివల్ల వారికి ఎలాంటి బాధా కలుగదు మరియు వారు తమ తెలివినీ పోగొట్టుకోరు.

**48**. మరియు వారి దగ్గర, శీలవతులైన తమ చూపులను నిగ్రహించుకునే, అందమైన కళ్ళుగల స్త్రీలు ఉంటారు.[4]

وَمَا تُجْزَوْنَ إِلَّا مَا كُنتُمْ تَعْمَلُونَ ٣٩

إِلَّا عِبَادَ ٱللَّهِ ٱلْمُخْلَصِينَ ٤٠

أُو۟لَٰٓئِكَ لَهُمْ رِزْقٌ مَّعْلُومٌ ٤١

فَوَٰكِهُ ۖ وَهُم مُّكْرَمُونَ ٤٢

فِى جَنَّٰتِ ٱلنَّعِيمِ ٤٣

عَلَىٰ سُرُرٍ مُّتَقَٰبِلِينَ ٤٤

يُطَافُ عَلَيْهِم بِكَأْسٍ مِّن مَّعِينٍۭ ٤٥

بَيْضَآءَ لَذَّةٍ لِّلشَّٰرِبِينَ ٤٦

لَا فِيهَا غَوْلٌ وَلَا هُمْ عَنْهَا يُنزَفُونَ ٤٧

وَعِندَهُمْ قَٰصِرَٰتُ ٱلطَّرْفِ عِينٌ ٤٨

---

**1**. వారికి అంటే అల్లాహ్ (సు.తా.) ఎన్నుకొన్న దాసులకు పదిరెట్లు పుణ్యఫలితం లభిస్తుంది చూడండి, 6:160.

**2**. చూడండి, 2:25.

**3**. చూడండి, 15:47.

**4**. చూడండి, 38:52.

كَأَنَّهُنَّ بَيْضٌ مَّكْنُونٌ ﴿٤٩﴾

**49**. వారు దాచబడిన గ్రుడ్లవలే (కోమలంగా) ఉంటారు.[1]

فَأَقْبَلَ بَعْضُهُمْ عَلَىٰ بَعْضٍ يَتَسَاءَلُونَ ﴿٥٠﴾

**50**. అప్పుడు వారు ఒకరివైపుకొకరు మరలి, పరస్పరం ఇలా ప్రశ్నించుకుంటారు.

قَالَ قَائِلٌ مِّنْهُمْ إِنِّي كَانَ لِي قَرِينٌ ﴿٥١﴾

**51**. వారిలో ఒకడు అంటాడు: "వాస్తవానికి (భూలోకంలో) నాకొక స్నేహితుడు (ఖరీనున్) ఉండేవాడు;

يَقُولُ أَئِنَّكَ لَمِنَ الْمُصَدِّقِينَ ﴿٥٢﴾

**52**. "అతడు నన్ను ఇలా అడిగేవాడు: 'ఏమీ? నీవు కూడా (పునరుత్థానం) నిజమేనని నమ్మే వారిలో ఒకడివా?

أَئِذَا مِتْنَا وَكُنَّا تُرَابًا وَعِظَامًا أَئِنَّا لَمَدِينُونَ ﴿٥٣﴾

**53**. " 'ఏమీ? మనం చనిపోయి మట్టిగా ఎముకలుగా మారిపోయిన తరువాత కూడా నిశ్చయంగా, మనకు ప్రతిఫలమనేది ఉంటుందా?' "

قَالَ هَلْ أَنتُم مُّطَّلِعُونَ ﴿٥٤﴾

**54**. అతడు ఇంకా ఇలా అంటాడు: "ఏమీ? మీరు అతనిని చూడదలచుకున్నారా?"

فَاطَّلَعَ فَرَآهُ فِي سَوَاءِ الْجَحِيمِ ﴿٥٥﴾

**55**. తరువాత అతడు తొంగిచూసి, అతనిని (తన పూర్వ స్నేహితుణ్ణి) భగభగ మండే నరకాగ్ని మధ్యలో చూస్తాడు.

قَالَ تَاللَّهِ إِن كِدتَّ لَتُرْدِينِ ﴿٥٦﴾

**56**. అతనితో (ఆ స్నేహితునితో), అతడు అంటాడు: "అల్లాహ్ సాక్షిగా! నీవు నన్ను నాశనంచేసి ఉండేవాడివే!

وَلَوْلَا نِعْمَةُ رَبِّي لَكُنتُ مِنَ الْمُحْضَرِينَ ﴿٥٧﴾

**57**. "ఒకవేళ నా ప్రభువు అనుగ్రహమే లేకున్నట్లయితే! నేనుకూడా (నరకానికి) హాజరుచేయబడిన వారిలో చేరిపోయే వాడిని."

---

**1**. చూడండి, 56:34 ఉష్ట్రపక్షి (నిప్పుకోడి) తన గ్రుడ్లను భద్రంగా దాచినందుకు అవి ఎంత సౌందర్యంగా ఉంటాయో స్వర్గపు 'హూర్‌లు అలాగే ఉంటారు.

58. (తరువాత ఆ స్వర్గవాసి తన సహచరులతో అంటాడు): "ఏమీ? ఇక మనం మరల చనిపోము కదా?

أَفَمَا نَحْنُ بِمَيِّتِينَ ﴿٥٨﴾

59. "మన మొదటి (భూలోక) మరణం తప్ప! మనకు ఇక ఎలాంటి శిక్ష పడదు కదా?"

إِلَّا مَوْتَتَنَا ٱلْأُولَىٰ وَمَا نَحْنُ بِمُعَذَّبِينَ ﴿٥٩﴾

60. నిశ్చయంగా, ఇదే ఆ గొప్ప సాఫల్యం (విజయం).[1]

إِنَّ هَٰذَا لَهُوَ ٱلْفَوْزُ ٱلْعَظِيمُ ﴿٦٠﴾

61. ఇలాంటి (స్థానం) పొందటానికి పాటు పడేవారు పాటుపడాలి.

لِمِثْلِ هَٰذَا فَلْيَعْمَلِ ٱلْعَٰمِلُونَ ﴿٦١﴾

62. ఏమీ? ఇలాంటి ఆతిథ్యం మేలైనదా? లేక జముడు ఫలపు[2] ఆతిథ్యమా?

أَذَٰلِكَ خَيْرٌ نُّزُلًا أَمْ شَجَرَةُ ٱلزَّقُّومِ ﴿٦٢﴾

63. నిశ్చయంగా, మేము దానిని, దుర్మార్గుల కొరకు ఒక పరీక్షగా చేశాము.

إِنَّا جَعَلْنَٰهَا فِتْنَةً لِّلظَّٰلِمِينَ ﴿٦٣﴾

64. నిశ్చయంగా, అది నరకపు అడుగు భాగంనుండి మొలిచే ఒక చెట్టు;

إِنَّهَا شَجَرَةٌ تَخْرُجُ فِىٓ أَصْلِ ٱلْجَحِيمِ ﴿٦٤﴾

65. దాని మొగ్గలు షైతానుల తలలవలే ఉంటాయి.

طَلْعُهَا كَأَنَّهُۥ رُءُوسُ ٱلشَّيَٰطِينِ ﴿٦٥﴾

66. నిశ్చయంగా, వారు దానినుంచే తింటారు మరియు దానితోనే తమ కడుపులు నింపుకుంటారు.

فَإِنَّهُمْ لَءَاكِلُونَ مِنْهَا فَمَالِـُٔونَ مِنْهَا ٱلْبُطُونَ ﴿٦٦﴾

---

1. అంటే తీర్పు తరువాత స్వర్గవాసులు ఎల్లప్పుడు స్వర్గంలో మరియు నరకవాసులు శాశ్వతంగా నరకంలో ఉంటారు. అప్పుడు మరణాన్ని ఒక గొర్రె ఆకారంలో తెచ్చి స్వర్గనరకాల మధ్య జిబ్హ చేయడం జరుగుతుంది, ('హదీస్').

2. అజ్-'జఖ్ఖూము: జముడు చెట్టు ఫలం. ఇది అరబ్ తిహామహ్ ప్రాంతాలలో ఉన్నదేనని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. ఇది ఎంతో చేదైన దుర్వాసన గల ఫలం. ఇంకా చూడండి, 17:60, 44:43 మరియు 56:52.

ثُمَّ إِنَّ لَهُمْ عَلَيْهَا لَشَوْبًا مِّنْ حَمِيمٍ ﴿٦٧﴾

**67**. తరువాత నిశ్చయంగా, దాని మీద వారికి త్రాగటానికి సలసల కాగే పానీయం మాత్రమే ఉంటుంది.[1]

ثُمَّ إِنَّ مَرْجِعَهُمْ لَإِلَى الْجَحِيمِ ﴿٦٨﴾

**68**. ఆ తరువాత నిశ్చయంగా, వారి మరలింపు కేవలం భగభగ మండే నరకాగ్ని వైపునకే అవుతుంది.

إِنَّهُمْ أَلْفَوْا آبَاءَهُمْ ضَالِّينَ ﴿٦٩﴾

**69**. నిశ్చయంగా, అప్పుడు వారు తమ తండ్రితాతలు, మార్గభ్రష్టత్వంలో ఉండేవారని కనుగొంటారు!

فَهُمْ عَلَىٰ آثَارِهِمْ يُهْرَعُونَ ﴿٧٠﴾

**70**. మరియు తాము కూడా వారి అడుగుజాడలను అనుసరించటానికి త్వరపడుతూ ఉండేవారమని!

وَلَقَدْ ضَلَّ قَبْلَهُمْ أَكْثَرُ الْأَوَّلِينَ ﴿٧١﴾

**71**. మరియు వాస్తవానికి వారి పూర్వీకులు కూడా చాలామంది మార్గభ్రష్టులుగానే ఉండే వారు.

وَلَقَدْ أَرْسَلْنَا فِيهِم مُّنذِرِينَ ﴿٧٢﴾

**72**. మరియు వాస్తవానికి మేము వారి వద్దకు హెచ్చరిక చేయటానికి (సందేశ హరులను) పంపి ఉన్నాము.

فَانظُرْ كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُنذَرِينَ ﴿٧٣﴾

**73**. ఇక చూడండి! హెచ్చరిక చేయబడిన వారి పర్యవసానం ఎలా ఉండిందో!

إِلَّا عِبَادَ اللَّهِ الْمُخْلَصِينَ ﴿٧٤﴾

**74**. ఎన్నుకోబడిన అల్లాహ్ దాసులు తప్ప!

وَلَقَدْ نَادَانَا نُوحٌ فَلَنِعْمَ الْمُجِيبُونَ ﴿٧٥﴾

**75**. మరియు వాస్తవంగా, నూహ్[2] మమ్మల్ని వేడుకున్నాడు. ఎందుకంటే, మేము (ప్రార్థనలకు) ప్రత్యుత్తరమిచ్చే వారిలో సర్వోత్తములము.

---

**1**. చూడండి, 47:15.

**2**. నూహ్ (అ.స.) గాథ కోసం చూడండి, 11:25-48.

وَنَجَّيۡنَٰهُ وَأَهۡلَهُۥ مِنَ ٱلۡكَرۡبِ ٱلۡعَظِيمِ ﴿٧٦﴾

76. మరియు మేము అతనిని అతని కుటుంబంవారిని మహావిపత్తు (జల ప్రళయం) నుండి కాపాడాము.[1]

وَجَعَلۡنَا ذُرِّيَّتَهُۥ هُمُ ٱلۡبَاقِينَ ﴿٧٧﴾

77. మరియు అతని సంతతివారిని మాత్రమే మిగిలి ఉండేటట్లు చేశాము.[2]

وَتَرَكۡنَا عَلَيۡهِ فِي ٱلۡأٓخِرِينَ ﴿٧٨﴾

78. మరియు తరువాత వచ్చేవారిలో అతనికీర్తిని (పేరు ప్రతిష్ఠలను) నిలిపాము.

سَلَٰمٌ عَلَىٰ نُوحٖ فِي ٱلۡعَٰلَمِينَ ﴿٧٩﴾

79. సర్వ లోకాలలో నూ'హ్‌కు శాంతి కలుగు గాక (సలాం)!

إِنَّا كَذَٰلِكَ نَجۡزِي ٱلۡمُحۡسِنِينَ ﴿٨٠﴾

80. నిశ్చయంగా, మేము సజ్జనులకు ఈ విధంగా ప్రతిఫలం ఇస్తూ ఉంటాము.

إِنَّهُۥ مِنۡ عِبَادِنَا ٱلۡمُؤۡمِنِينَ ﴿٨١﴾

81. నిశ్చయంగా, అతను మా విశ్వాసులైన దాసులలోని వాడు.

ثُمَّ أَغۡرَقۡنَا ٱلۡأٓخَرِينَ ﴿٨٢﴾

82. తరువాత మేము ఇతరులను ముంచివేశాము. (3/8)

۞ وَإِنَّ مِن شِيعَتِهِۦ لَإِبۡرَٰهِيمَ ﴿٨٣﴾

83. * మరియు నిశ్చయంగా, అతనిని అనుసరించిన వారిలో ఇబ్రాహీమ్ ఒకడు.

إِذۡ جَآءَ رَبَّهُۥ بِقَلۡبٖ سَلِيمٍ ﴿٨٤﴾

84. అతను తన ప్రభువు సాన్నిధ్యానికి నిర్మల హృదయంతో వచ్చి;

إِذۡ قَالَ لِأَبِيهِ وَقَوۡمِهِۦ مَاذَا تَعۡبُدُونَ ﴿٨٥﴾

85. అతను తన తండ్రి మరియు తనజాతి వారితో ఇలా అన్నాడు: "మీరు దేనిని ఆరాధిస్తున్నారు?

---

1. అహ్లున్: అంటే అతని కుటుంబంవారే కాక అతనితో బాటు విశ్వసించిన అతని అనుచరులు కూడాను.

2. నూహ్ ('అ.స.) భార్య మరియు అతని ఒక కుమారుడు విశ్వసించలేదు. కాబట్టి వారు, మునిగిపోయారు. అతని కుమారులలో 'హామ్, సామ్, యాఫస్'లు నావలో ఉన్నారు. 1) సామ్ నుండి 'అరబ్బులు, పర్షియన్‌లు, యూరోపియన్‌లు మరియు యూదులు, 2) 'హామ్ సంతతి నుండి సూడాన్, ఇండియా, 'హబషా, ఖిబ్తీలు మరియు బర్‌బర్‌లు మరియు 3) యాఫస్' సంతతినుండి తుర్కీలు, ఖజర్, యఅ'జూజ్ మఅ'జూజ్ మొదలైన వారు పుట్టారని చెబుతారు. (ఫ'త్హ్ అల్-ఖదీర్).

**86**. "ఏమీ? మీరు అల్లాహ్‌ను వదలి మిథ్య (బూటక) దైవాలను (ఆరాధించ) గోరుతున్నారా?

أَئِفْكًا ءَالِهَةً دُونَ ٱللَّهِ تُرِيدُونَ ﴿٨٦﴾

**87**. "అయితే సర్వలోకాల ప్రభువును గురించి మీ అభిప్రాయమేమిటి?"

فَمَا ظَنُّكُم بِرَبِّ ٱلْعَالَمِينَ ﴿٨٧﴾

**88**. ఆ తరువాత, అతను నక్షత్రాల వైపుకు తన దృష్టిని సారించాడు;[1]

فَنَظَرَ نَظْرَةً فِى ٱلنُّجُومِ ﴿٨٨﴾

**89**. అప్పుడు అతను ఇలా అన్నాడు: "నిశ్చయంగా, నా ఆరోగ్యం బాగులేదు."[2]

فَقَالَ إِنِّى سَقِيمٌ ﴿٨٩﴾

**90**. కావున వారు అతనిని వదలిపెట్టి వెళ్ళిపోయారు.

فَتَوَلَّوْا۟ عَنْهُ مُدْبِرِينَ ﴿٩٠﴾

**91**. తరువాత అతను మెల్లగా వారి దేవతల (విగ్రహాల) దగ్గరికి వెళ్ళి ఇలా అన్నాడు: "మీరు తినటం లేదేమిటి?

فَرَاغَ إِلَىٰٓ ءَالِهَتِهِمْ فَقَالَ أَلَا تَأْكُلُونَ ﴿٩١﴾

**92**. "మీ కేమైంది? మీరెందుకు మాట్లాడరు?"

مَا لَكُمْ لَا تَنطِقُونَ ﴿٩٢﴾

**93**. తరువాత అతను వాటి వద్దకు వెళ్ళి తన కుడిచేతితో వాటిని పగులగొట్టాడు.[3]

فَرَاغَ عَلَيْهِمْ ضَرْبًۢا بِٱلْيَمِينِ ﴿٩٣﴾

**94**. అప్పుడు, వారు (ప్రజలు) అతని దగ్గరకు త్వరత్వరగా వచ్చారు.

فَأَقْبَلُوٓا۟ إِلَيْهِ يَزِفُّونَ ﴿٩٤﴾

**95**. అతను (ఇబ్రాహీమ్) వారితో అన్నాడు: "ఏమీ? మీరు చెక్కిన వాటినే మీరు ఆరాధిస్తారా?

قَالَ أَتَعْبُدُونَ مَا تَنْحِتُونَ ﴿٩٥﴾

---

**1**. చూడండి, 6:76-78.

**2**. చూడండి, 21:63.

**3**. వివరాలకు చూడండి, 21:58.

وَٱللَّهُ خَلَقَكُمْ وَمَا تَعْمَلُونَ ﴿٩٦﴾

**96**. "వాస్తవానికి, మిమ్మల్ని మరియు మీరు (చెక్కి) చేసిన వాటిని సృష్టించింది అల్లాహ్‌యే కదా!"[1]

قَالُوا۟ ٱبْنُوا۟ لَهُۥ بُنْيَٰنًا فَأَلْقُوهُ فِى ٱلْجَحِيمِ ﴿٩٧﴾

**97**. వారు (పరస్పరం ఇలా చెప్పు కున్నారు): "ఇతనికొరకు ఒక (అగ్ని) గుండం నిర్మించి, తరువాత అతనిని ఆ భగభగ మండే అగ్నిలో పడవేయండి!"

فَأَرَادُوا۟ بِهِۦ كَيْدًا فَجَعَلْنَٰهُمُ ٱلْأَسْفَلِينَ ﴿٩٨﴾

**98**. కావున, వారు అతనికి విరుద్ధంగా పన్నాగాలు పన్నారు, కాని మేము వారిని కించపరచాము.

وَقَالَ إِنِّى ذَاهِبٌ إِلَىٰ رَبِّى سَيَهْدِينِ ﴿٩٩﴾

**99**. మరియు అతను (ఇబ్రాహీమ్) అన్నాడు: "నిశ్చయంగా, నేను నా ప్రభువు (తీసుకొని వెళ్ళే) వైపునకు వెళ్ళిపోతాను. ఆయనే నాకు మార్గదర్శకత్వం చేస్తాడు."[2]

رَبِّ هَبْ لِى مِنَ ٱلصَّٰلِحِينَ ﴿١٠٠﴾

**100**. (అతను ఇలా ప్రార్థించాడు): "ఓ నా ప్రభూ! నాకు సద్వర్తనుడైన (కుమారుణ్ణి) ప్రసాదించు!"

فَبَشَّرْنَٰهُ بِغُلَٰمٍ حَلِيمٍ ﴿١٠١﴾

**101**. కావున మేము అతనికి సహన శీలుడైన కుమారుని శుభవార్తనిచ్చాము.[3]

فَلَمَّا بَلَغَ مَعَهُ ٱلسَّعْىَ قَالَ يَٰبُنَىَّ إِنِّىٓ أَرَىٰ فِى ٱلْمَنَامِ أَنِّىٓ أَذْبَحُكَ

**102**. ఆ బాలుడు అతనికి తోడుగా శ్రమ చేయగల వయస్సుకు చేరుకున్నపుడు, అతను (ఇబ్రాహీమ్) అన్నాడు: "ఓ నా కుమారా! వాస్తవానికి

---

**1**. సర్వసృష్టికి మూలాధారి అల్లాహ్ (సు.తా.) మాత్రమే! అంటే మానవులు చేసే పనులకు కారకుడు కూడా అల్లాహ్ (సు.తా.)యే! కావున ఆయనను ఆరాధించకుండా మీరు మీ చేతులతో తయారు చేసిన వాటిని ఎందుకు ఆరాధిస్తున్నారు.

**2**. ఇబ్రాహీమ్ (అ.స.) మొదట బాబుల్ అనే నగరంలో ఉండేవారు. అది ఇరాఖ్‌లో ఉంది. ఆ తరువాత అతను షామ్ వైపునకు వెళ్ళిపోయారు.

**3**. అతను ఇబ్రాహీమ్ (అ.స.) మొదటి కుమారుడు ఇస్మాయీల్ (అ.స.).

فَٱنظُرۡ مَاذَا تَرَىٰۚ قَالَ يَٰٓأَبَتِ ٱفۡعَلۡ مَا تُؤۡمَرُۖ سَتَجِدُنِيٓ إِن شَآءَ ٱللَّهُ مِنَ ٱلصَّٰبِرِينَ ﴿١٠٢﴾

నేను నిన్ను బలి (జి'బ్'హ్) చేస్తున్నట్లుగా కలలోచూశాను, ఇక నీ సలహా ఏమిటో చెప్పు!" అతను (ఇస్మా'యీ'ల్) అన్నాడు: "ఓ నాన్నా! నీకు ఇవ్వబడిన ఆజ్ఞను నెరవేర్చు. అల్లాహ్ కోరితే నీవు నన్ను సహనశీలునిగా పొందగలవు!"

فَلَمَّآ أَسۡلَمَا وَتَلَّهُۥ لِلۡجَبِينِ ﴿١٠٣﴾

**103**. ఆ తరువాత వారిద్దరూ ఆయన (అల్లాహ్) ఆజ్ఞను నెరవేర్చటానికి సిద్ధపడ్డారు. మరియు అతను (ఇబ్రాహీమ్) అతనిని (ఇస్మా'యీ'ల్‌ను) నుదుటిపై బోర్లా పరుండబెట్టాడు.

وَنَٰدَيۡنَٰهُ أَن يَٰٓإِبۡرَٰهِيمُ ﴿١٠٤﴾

**104**. మరియు మేము అతనిని పిలుస్తూ ఇలా అన్నాము: "ఓ ఇబ్రాహీమ్!

قَدۡ صَدَّقۡتَ ٱلرُّءۡيَآۚ إِنَّا كَذَٰلِكَ نَجۡزِي ٱلۡمُحۡسِنِينَ ﴿١٠٥﴾

**105**. "వాస్తవంగా, నీవు కలను నిజం చేసి చూపించావు!" నిశ్చయంగా, మేము సజ్జనులకు ఇలాంటి ప్రతిఫలమిస్తాము.

إِنَّ هَٰذَا لَهُوَ ٱلۡبَلَٰٓؤُاْ ٱلۡمُبِينُ ﴿١٠٦﴾

**106**. నిశ్చయంగా ఇదొక స్పష్టమైన (కఠిన) పరీక్ష.

وَفَدَيۡنَٰهُ بِذِبۡحٍ عَظِيمٖ ﴿١٠٧﴾

**107**. మరియు మేము అతనికి (ఇస్మా'యీ'ల్‌కు) బదులుగా ఒక గొప్ప బలిని పరిహారంగా ఇచ్చాము.[1]

وَتَرَكۡنَا عَلَيۡهِ فِي ٱلۡأٓخِرِينَ ﴿١٠٨﴾

**108**. మరియు తరువాత వచ్చే తరాలలో అతని కీర్తిని నిలిపాము.

سَلَٰمٌ عَلَىٰٓ إِبۡرَٰهِيمَ ﴿١٠٩﴾

**109**. "ఇబ్రాహీమ్‌కు శాంతి కలుగు గాక (సలాం)!"

كَذَٰلِكَ نَجۡزِي ٱلۡمُحۡسِنِينَ ﴿١١٠﴾

**110**. ఈ విధంగా మేము సజ్జనులకు ప్రతిఫలమిస్తాము.

---

**1**. ఈ బలి ఒక గొర్రె. అది ఇస్మా'యీ'ల్ ('అ.స.)కు బదులుగా పంపబడింది. అది బలి చేయబడింది. దీని జ్ఞాపకార్థమే ముస్లింలు ప్రతి సంవత్సరం జు'ల్-'హజ్జ్‌లో బలి (ఖుర్బానీ) ఇస్తారు. వివరాల కోసం చూడండి, 22:27-37 మరియు 2:196-203.

إِنَّهُۥ مِنۡ عِبَادِنَا ٱلۡمُؤۡمِنِينَ ١١١

111. నిశ్చయంగా, అతను (ఇబ్రాహీమ్) విశ్వసించిన మా దాసులలోని వాడు!

وَبَشَّرۡنَٰهُ بِإِسۡحَٰقَ نَبِيّٗا مِّنَ ٱلصَّٰلِحِينَ ١١٢

112. మరియు మేము అతనికి ఇస్'హాఖ్ యొక్క శుభవార్తను ఇచ్చాము, అతను ఒక సద్వ ర్తనుడైన ప్రవక్త.[1]

وَبَٰرَكۡنَا عَلَيۡهِ وَعَلَىٰٓ إِسۡحَٰقَۚ وَمِن ذُرِّيَّتِهِمَا مُحۡسِنٞ وَظَالِمٞ لِّنَفۡسِهِۦ مُبِينٞ ١١٣

113. మరియు మేము అతనిని (ఇబ్రాహీమ్‌ను) మరియు ఇస్'హాఖ్‌ను అనుగ్రహించాము. మరియు వారి సంతతిలో కొందరు సజ్జనులు ఉండేవారు మరికొందరు తమకు తాము స్పష్టంగా అన్యాయం చేసుకున్నవారు కూడా ఉన్నారు.[2]

وَلَقَدۡ مَنَنَّا عَلَىٰ مُوسَىٰ وَهَٰرُونَ ١١٤

114. మరియు వాస్తవానికి, మేము మూసా మరియు హారూన్‌లను అనుగ్రహించాము.

---

1. ఒక కుమారుణ్ణి జి'బ్'హ్ చేసిన గాథ తరువాత మరొక కుమారుని, ఇ'స్హాఖ్ ('అ.స.) యొక్క శుభవార్త ఇవ్వబడుతోంది. దీనితో స్పష్టమయ్యేది ఏమిటంటే జి'బ్'హ్ చేయబడిన కుమారుడు ఇస్మాయీల్ ('అ.స.) మాత్రమే. అప్పుడతని('అ.స.)ను ఇబ్రాహీమ్ ('అ.స.) యొక్క ఏకైక పుత్రుడు. (చూడండి, ఇబ్నె-కసీ'ర్ మరియు ఫ'త్హ్ అల్-ఖదీర్).

2. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞతో, ఇ'స్హాఖ్ ('అ.స.) పుట్టకముందే, ఇబ్రాహీమ్ ('అ.స.) తన రెండవ భార్య హాజర్ మరియు ఆమె కుమారుడు ఇస్మా'యీల్ ('అలైహిమ్ స.)లను మక్కాలో వదిలారు. ఇస్మా'యీల్ ('అ.స.) అక్కడ జుర్హుమ్ అనే 'అరబ్బ్ తెగ స్త్రీతో వివాహం చేసుకొని అక్కడేనివసిస్తూ 'అరబ్బులలో కలిసిపోయి 'అరబ్బ్ అయిపోయారు. అతని వంశంలో నుండి కేవలం ము'హమ్మద్ ('స'అస) మాత్రమే ప్రవక్తగా ఎన్నుకోబడ్డారు.
ఇక ఇ'స్హాఖ్ ('అ.స.) కుమారుడు య'అఖూబ్ ('అస). అతని మరొకపేరు ఇస్రాయీ'ల్. అదే పేరుతో అతని కుటుంబం వారు బనీ-ఇస్రాయీ'ల్ అనబడ్డారు. అతనికి 12 మంది కుమారులు ప్రతి కుమారుని సంతతి నుండి ఒక బనీ-ఇస్రాయీ'ల్ తెగ ఏర్పడింది. యూసుఫ్ ('అ.స.) ఆ పన్నెండు కుమారులలో ఒకరు. బనీ-ఇస్రాయీ'ల్ సంతతిలో నుండి చాలమంది ప్రవక్తలు వచ్చారు. మూసా మరియు 'ఈసా ('అలైహిమ్ స.)లు కూడా వారి సంతతిలోని వారే!
ఈ రెండు ప్రవక్తల సంతతిలో మంచివారు పుట్టారు. ముష్రికులు కూడా పుట్టారు. కావున కేవలం తండ్రి తాతలు పుణ్యపురుషులు అయినంత మాత్రాన సంతానంలో అందరూ పుణ్యవంతులవటం తప్పనిసరి కాదు!

115. మరియు మేము వారిద్దరిని మరియు వారి జాతి వారిని మహా విపత్తునుండి విముక్తి కలిగించాము.

وَنَجَّيۡنَٰهُمَا وَقَوۡمَهُمَا مِنَ ٱلۡكَرۡبِ ٱلۡعَظِيمِ ١١٥

116. మరియు మేము వారికి సహాయం చేశాము, కాబట్టి వారు విజయం పొందిన వారయ్యారు.

وَنَصَرۡنَٰهُمۡ فَكَانُواْ هُمُ ٱلۡغَٰلِبِينَ ١١٦

117. మరియు వారిద్దరికి (మంచి చెడులను) స్పష్టపరిచే గ్రంథాన్ని ప్రసాదించాము.[1]

وَءَاتَيۡنَٰهُمَا ٱلۡكِتَٰبَ ٱلۡمُسۡتَبِينَ ١١٧

118. మరియు వారిద్దరికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేశాము.

وَهَدَيۡنَٰهُمَا ٱلصِّرَٰطَ ٱلۡمُسۡتَقِيمَ ١١٨

119. మరియు తరువాత తరాలవారిలో వారిద్దరిని గురించి మంచి కీర్తిని నిలిపాము.

وَتَرَكۡنَا عَلَيۡهِمَا فِي ٱلۡأٓخِرِينَ ١١٩

120. "మూసా మరియు హారూన్‌లకు శాంతి కలుగుగాక (సలాం)!"

سَلَٰمٌ عَلَىٰ مُوسَىٰ وَهَٰرُونَ ١٢٠

121. నిశ్చయంగా, ఈ విధంగా మేము సజ్జనులకు ప్రతిఫలమిస్తాము.

إِنَّا كَذَٰلِكَ نَجۡزِي ٱلۡمُحۡسِنِينَ ١٢١

122. నిశ్చయంగా, వారిద్దరూ, విశ్వాసులైన మా దాసులలోని వారు.

إِنَّهُمَا مِنۡ عِبَادِنَا ٱلۡمُؤۡمِنِينَ ١٢٢

123. మరియు నిశ్చయంగా, ఇల్యాస్ కూడా మా సందేశహరులలో ఒకడు.[2]

وَإِنَّ إِلۡيَاسَ لَمِنَ ٱلۡمُرۡسَلِينَ ١٢٣

---

1. చూడండి, 5:44.

2. ఇల్యాస్ (Elijah) ('అ.స.) హారూన్ ('అ.స.) సంతతికి చెందిన వారు. అతని నివాసం బఅల్‌బక్ నగరం. ఇల్యాస్ (ఏలియా) హిబ్రూ (యూదుల) ప్రవక్త. ఇతను ఫలస్తీన్ ఉత్తర భాగంలో అహబ్ మరియు అహాజియా రాజుల కాలంలో ఉన్నారు, (దాదాపు క్రీ. శకానికి 9 సంవత్సరాలకు ముందు) ఇతని తరువాత అల్-యస'అ (Elisha, 'అ.స.) ప్రవక్తగా వచ్చారు.

إِذۡ قَالَ لِقَوۡمِهِۦٓ أَلَا تَتَّقُونَ ﴿١٢٤﴾

**124**. అతను తన జాతివారితో ఇలా అన్నప్పుడు: "ఏమీ? మీకు దైవభీతి లేదా?

أَتَدۡعُونَ بَعۡلٗا وَتَذَرُونَ أَحۡسَنَ ٱلۡخَٰلِقِينَ ﴿١٢٥﴾

**125**. "ఏమీ? మీరు బ'అల్[1] (అనే విగ్రహాన్ని) ఆరాధిస్తూ సర్వోత్తముడైన సృష్టికర్తను వదలిపెడుతున్నారా?

ٱللَّهَ رَبَّكُمۡ وَرَبَّ ءَابَآئِكُمُ ٱلۡأَوَّلِينَ ﴿١٢٦﴾

**126**. "అల్లాహ్‌యే మీ ప్రభువు! మరియు మీ పూర్వీకులైన మీ తాతముత్తాతల ప్రభువు కదా?"

فَكَذَّبُوهُ فَإِنَّهُمۡ لَمُحۡضَرُونَ ﴿١٢٧﴾

**127**. కాని వారు అతనిని (ఇల్యాస్‌ను) అసత్యవాదుడని తిరస్కరించారు, కాబట్టి వారు తప్పకుండా (శిక్ష కొరకు) హాజరు చేయబడతారు.

إِلَّا عِبَادَ ٱللَّهِ ٱلۡمُخۡلَصِينَ ﴿١٢٨﴾

**128**. ఎన్నుకోబడిన అల్లాహ్ దాసులు తప్ప!

وَتَرَكۡنَا عَلَيۡهِ فِي ٱلۡأٓخِرِينَ ﴿١٢٩﴾

**129**. తరువాత వచ్చే తరాలలో అతని కీర్తిని (పేరు ప్రతిష్ఠలను) నిలిపాము.

سَلَٰمٌ عَلَىٰٓ إِلۡ يَاسِينَ ﴿١٣٠﴾

**130**. " ఇల్-యాసీన్‌కు[2] శాంతి కలుగు గాక (సలాం)!"

إِنَّا كَذَٰلِكَ نَجۡزِي ٱلۡمُحۡسِنِينَ ﴿١٣١﴾

**131**. నిశ్చయంగా, సజ్జనులకు మేము ఈ విధంగా ప్రతిఫల మిస్తాము.

إِنَّهُۥ مِنۡ عِبَادِنَا ٱلۡمُؤۡمِنِينَ ﴿١٣٢﴾

**132**. నిశ్చయంగా అతను విశ్వాసులైన మా దాసులలోని వాడు.[3]

---

**1**. ఇల్యాస్ (Elijah 'అ.స.) కాలపు ముష్రికులు బ'అల్ అనే విగ్రహాన్ని పూజించేవారు.

**2**. ఇల్-యాసీన్ (Elias), ఇల్యాస్ (Elijah) 'అ.స. పేరు యొక్క మరొక విధమైన ఉచ్ఛరణ. ఏవిధంగానైతే తూర్-సీనా, యొక్క మరొక పేరు 'తూర్-సీనీన్ ఉందో!

**3**. ఖుర్ఆన్‌లో ఇతర ప్రవక్తల ప్రస్తావన వచ్చినపుడు, వారిని: 'విశ్వాసులు' అని పేర్కొనబడింది. దీని ద్వారా తెలిసేది ఏమిటంటే, ప్రవక్తల అందరి ధర్మం ఏకదైవ సిద్ధాంతం - ఇస్లాం. వారు అందరూ విశ్వాసం అంటే అల్లాహ్ (సు.తా.)కు విధేయులై ఉండాలనీ, అల్లాహ్ (సు.తా.) తప్ప ఇతరులను ఆరాధించరాదని బోధించారు.

وَإِنَّ لُوطٗا لَّمِنَ ٱلۡمُرۡسَلِينَ ١٣٣

**133**. మరియు నిశ్చయంగా, లూ'త్ కూడా మేము పంపిన సందేశహరులలో ఒకడు.[1]

إِذۡ نَجَّيۡنَٰهُ وَأَهۡلَهُۥٓ أَجۡمَعِينَ ١٣٤

**134**. ఎప్పుడైతే మేము అతనిని మరియు అతని కుటుంబం వారినందరిని రక్షించామో!

إِلَّا عَجُوزٗا فِي ٱلۡغَٰبِرِينَ ١٣٥

**135**. ముసలామె (అతని భార్య) తప్ప! ఆమె వెనుక ఉండిపోయే వారిలో చేరిపోయింది.[2]

ثُمَّ دَمَّرۡنَا ٱلۡأٓخَرِينَ ١٣٦

**136**. ఆ తరువాత మిగతా వారినందరినీ నిర్మూలించాము.

وَإِنَّكُمۡ لَتَمُرُّونَ عَلَيۡهِم مُّصۡبِحِينَ ١٣٧

**137**. మరియు వాస్తవానికి, మీరిప్పుడు వారి (శిథిల) ప్రాంతాల మీదుగా ఉదయపు వేళల్లో ప్రయాణిస్తూ ఉంటారు;[3]

وَبِٱلَّيۡلِۚ أَفَلَا تَعۡقِلُونَ ١٣٨

**138**. మరియు రాత్రులలో కూడా! అయినా మీరు అర్థం చేసుకోలేరా?

وَإِنَّ يُونُسَ لَمِنَ ٱلۡمُرۡسَلِينَ ١٣٩

**139**. మరియు నిశ్చయంగా, యూనుస్[4] కూడా మేము పంపిన సందేశహరులలోని వాడు.

إِذۡ أَبَقَ إِلَى ٱلۡفُلۡكِ ٱلۡمَشۡحُونِ ١٤٠

**140**. అతను నిండు పడవవైపుకు పరిగెత్తి నప్పుడు;[5]

---

**1**. లూ'త్ ('అ.స.) గాథ కొరకు, చూడండి, 7:80-84 మరియు 11:69-83.

**2**. ఆమె - లూ'త్ ('అ.స.) భార్య - అవిశ్వాసులలో చేరిపోయి వెనుక ఉండిపోయింది. చూడండి, 7:83 మరియు 11:81.

**3**. చూడండి, 15:76. మక్కా-సిరియా మార్గంలో ఈ నగరాలు (సోడోమ్ మరియు గొమ్రాహ్‌లు), ఇప్పటి మృతసముద్రం ప్రాంతంలో ఉండేవి.

**4**. యూనుస్ ('అ.స.) బైబిల్‌లో యోనా (Jonah)గా పేర్కొనబడ్డారు.

**5**. అబఖ: అంటే, to escape, ఒక బానిస తన స్వామిని విడిచి పారిపోవటం. యూనుస్ ('అ.స.) తన స్వామి, అల్లాహ్ (సు.తా.) అనుమతి లేనిదే తన ప్రజలను విడిచి పారిపోయారు.

فَسَاهَمَ فَكَانَ مِنَ ٱلْمُدْحَضِينَ ﴿١٤١﴾

**141**. అక్కడ చీటీలలో పాల్గొన్నాడు, కాని ఓడిపోయాడు.

فَٱلْتَقَمَهُ ٱلْحُوتُ وَهُوَ مُلِيمٌ ﴿١٤٢﴾

**142**. ఆ పిదప అతనిని ఒక పెద్దచేప మ్రింగింది; మరియు (ఎందుకంటే) అతను నిందార్హుడు.[1]

فَلَوْلَآ أَنَّهُۥ كَانَ مِنَ ٱلْمُسَبِّحِينَ ﴿١٤٣﴾

**143**. అప్పుడతను, (అల్లాహ్) పవిత్రతను కొనియాడే వారిలోని వాడు కాకపోయినట్లైతే![2]

لَلَبِثَ فِى بَطْنِهِۦٓ إِلَىٰ يَوْمِ يُبْعَثُونَ ﴿١٤٤﴾

**144**. దాని (చేప) కడుపులో పునరుత్థాన దినం వరకు ఉండిపోయే వాడు. (1/2)

۞ فَنَبَذْنَـٰهُ بِٱلْعَرَآءِ وَهُوَ سَقِيمٌ ﴿١٤٥﴾

**145**. * ఆ పిదప మేము అతనిని అనారోగ్యస్థితిలో, ఒక దిగంబర మైదానంలో పడవేశాము.

وَأَنۢبَتْنَا عَلَيْهِ شَجَرَةً مِّن يَقْطِينٍ ﴿١٤٦﴾

**146**. మరియు అతనిపై ఒక ఆనప జాతి తీగను మొలిపించాము.[3]

---

**1**. యూనుస్ ('అ.స.) ఇరాఖ్ ప్రాంతంలో నైనవా (ఇప్పటి మో'సల్) నగరానికి ప్రవక్తగా పంపబడ్డారు. అక్కడి రాజు ఒక లక్ష బనీ ఇస్రాయీల్ సంతతి వారిని బందీలుగా చేసుకున్నాడు. వారి మార్గదర్శకత్వానికి అల్లాహ్ (సు.తా.), యూనుస్ ('అ.స.)ను పంపాడు. కాని వారు అతనిని విశ్వసించలేదు. అతను వారిని అల్లాహ్(సు.తా.)శిక్ష రానున్నదనీ భయపెట్టారు. ఆ శిక్ష రాకముందే అల్లాహ్ (సు.తా.) అనుమతి లేకుండానే అతను అక్కడి నుండి పారిపోయి నావ ఎక్కారు. నావ బరువుతో మునిగి పోతుండగా, అక్కడ చీటీలు వేశారు. దానిలో అతని పేరు రాగా అతను సముద్రంలోకి దూకారు. అతనిని ఒక పెద్ద చేప మ్రింగింది. చేప కడుపులో అతను అల్లాహ్ (సు.తా.)ను వేడుకున్నారు. అప్పుడతను బయట వేయబడ్డారు. ఇంకా చూడండి, 68:48.

**2**. అతని (అ.స.) ప్రార్థన కోసం చూడండి, 21:87.

**3**. యఖ్'తీనున్: Gourd plant, ఆనపజాతి తీగ. అల్లాహ్ (సు.తా.) యూనుస్ ('అ.స.)ను ఏ చెట్టు చేమ లేని మైదానంలో పడవేసిన తరువాత అతని సహాయానికి ఒక ఆనప తీగను పుట్టించాడు. అదే విధంగా అల్లాహ్ (సు.తా.) కోరితే ఒక అవిశ్వాసిని విశ్వాసిగా మార్చవచ్చు! ఎప్పుడైతే అతడు హృదయపూర్వకంగా వేడుకుంటాడో!

وَأَرْسَلْنَٰهُ إِلَىٰ مِاْئَةِ أَلْفٍ أَوْ يَزِيدُونَ ﴿١٤٧﴾

**147**. మరియు అతనిని ఒక లక్ష లేదా అంతకంటే ఎక్కువ మంది (ప్రజల) వద్దకు పంపాము.

فَـَٔامَنُواْ فَمَتَّعْنَٰهُمْ إِلَىٰ حِينٍ ﴿١٤٨﴾

**148**. వారు విశ్వసించారు, కావున మేము ఒక నిర్ణీత కాలంవరకు వారిని సుఖసంతోషాలు అనుభవించనిచ్చాము.[1]

فَٱسْتَفْتِهِمْ أَلِرَبِّكَ ٱلْبَنَاتُ وَلَهُمُ ٱلْبَنُونَ ﴿١٤٩﴾

**149**. అయితే వారిని ఇలా అడుగు: "ఏమీ? నీ ప్రభువుకైతే కుమార్తెలు మరియు వారికొరకు కుమారులా?"[2]

أَمْ خَلَقْنَا ٱلْمَلَٰٓئِكَةَ إِنَٰثًا وَهُمْ شَٰهِدُونَ ﴿١٥٠﴾

**150**. "లేక మేము దేవదూతలను స్త్రీలుగా పుట్టించామా? మరియు వారు దానికి సాక్షులా?"[3]

أَلَآ إِنَّهُم مِّنْ إِفْكِهِمْ لَيَقُولُونَ ﴿١٥١﴾

**151**. అలాకాదు! నిశ్చయంగా, వారు (ఖురైషులు) తమ బూటకపు నమ్మకాల ఆధారంగా అంటున్నారు:

وَلَدَ ٱللَّهُ وَإِنَّهُمْ لَكَٰذِبُونَ ﴿١٥٢﴾

**152**. "అల్లాహ్‌కు సంతానముంది!" అని. మరియు వారు నిశ్చయంగా, అబద్ధాలాడుతున్నారు!

أَصْطَفَى ٱلْبَنَاتِ عَلَى ٱلْبَنِينَ ﴿١٥٣﴾

**153**. ఆయన (అల్లాహ్) కుమార్తెలను - కుమారులకు బదులుగా - ఎన్నుకున్నాడా?[4]

مَا لَكُمْ كَيْفَ تَحْكُمُونَ ﴿١٥٤﴾

**154**. మీ కేమయింది? మీరెలాంటి నిర్ణయాలు చేస్తున్నారు?

---

**1**. వారు విశ్వసించిన వివరాల కోసం చూడండి, 10:98.

**2**. చూడండి 16:57-59.

**3**. వారు దైవదూతలలో స్త్రీలలో ఉండే లక్షణాలు ఏవైనా చూశారా? లేక మేము దైవదూతలను పుట్టించినప్పుడు వీరు అక్కడ ఉన్నారా? వారిని స్త్రీలుగా పరిగణించటానికి?

**4**. చూడండి, 6:100, 17:40, 53:19-22.

أَفَلَا تَذَكَّرُونَ ﴿١٥٥﴾

**155**. ఏమీ? మీరు గ్రహించలేరా?

أَمۡ لَكُمۡ سُلۡطَٰنٞ مُّبِينٞ ﴿١٥٦﴾

**156**. లేక! మీవద్ద ఏదైనా స్పష్టమైన ప్రమాణం ఉందా?

فَأۡتُواْ بِكِتَٰبِكُمۡ إِن كُنتُمۡ صَٰدِقِينَ ﴿١٥٧﴾

**157**. మీరు సత్యవంతులే అయితే మీ గ్రంథాన్ని తీసుకురండి!

وَجَعَلُواْ بَيۡنَهُۥ وَبَيۡنَ ٱلۡجِنَّةِ نَسَبٗاۚ وَلَقَدۡ عَلِمَتِ ٱلۡجِنَّةُ إِنَّهُمۡ لَمُحۡضَرُونَ ﴿١٥٨﴾

**158**. మరియు వారు, ఆయన (అల్లాహ్) మరియు జిన్నాతుల మధ్య బంధుత్వం కల్పించారు.[1] కాని వాస్తవానికి జిన్నాతులకు తెలుసు, తాము ఆయన (అల్లాహ్) ముందు (లెక్కకొరకు) హాజరుచేయబడతామని!

سُبۡحَٰنَ ٱللَّهِ عَمَّا يَصِفُونَ ﴿١٥٩﴾

**159**. వారు కల్పించే విషయాలకు అల్లాహ్ సర్వ లోపాలకు అతీతుడు (పరమపవిత్రుడు)![2]

إِلَّا عِبَادَ ٱللَّهِ ٱلۡمُخۡلَصِينَ ﴿١٦٠﴾

**160**. ఎన్నుకోబడిన అల్లాహ్‌దాసులు తప్ప!

فَإِنَّكُمۡ وَمَا تَعۡبُدُونَ ﴿١٦١﴾

**161**. ఇక నిశ్చయంగా, మీరు మరియు మీ ఆరాధ్య దైవాలు (కలిసి);

مَآ أَنتُمۡ عَلَيۡهِ بِفَٰتِنِينَ ﴿١٦٢﴾

**162**. ఎవ్వడినీ కూడా, దుష్టకార్యాలు చేయటానికి పురికొలుపలేరు;

إِلَّا مَنۡ هُوَ صَالِ ٱلۡجَحِيمِ ﴿١٦٣﴾

**163**. భగభగ మండే నరకాగ్నిలో కాలి పోనున్నవాడిని తప్ప!

وَمَا مِنَّآ إِلَّا لَهُۥ مَقَامٞ مَّعۡلُومٞ ﴿١٦٤﴾

**164**. (దైవదూతలు ఇలా అంటారు): "మరియు మాలో ఒక్కడు కూడా తన స్థానం నియమింపబడకుండా లేడు.

---

**1**. ముష్రికుల కల్పన ఏమిటంటే అల్లాహ్ (సు.తా.) జిన్నాతులతో వివాహసంబంధం ఏర్పరచుకున్నాడు, దానితో ఆడపిల్లలు పుట్టారు, వారే దైవదూతలు అని, ఇది అసత్యం.

**జిన్నున్:** అంటే మానవ ఇంద్రియాలకు అగోచర ప్రాణి.

**2**. చూడండి, 2:32, 6:100.

وَإِنَّا لَنَحۡنُ ٱلصَّآفُّونَ ﴿١٦٥﴾

**165**. మరియు నిశ్చయంగా, మేము కూడా (ఆయనను ప్రార్థించటానికి) వరుసలుదీరి నిల్చుంటాము.

وَإِنَّا لَنَحۡنُ ٱلۡمُسَبِّحُونَ ﴿١٦٦﴾

**166**. మరియు నిశ్చయంగా, మేము కూడా ఆయన పవిత్రతను కొనియాడే వారమే![1]

وَإِن كَانُواْ لَيَقُولُونَ ﴿١٦٧﴾

**167**. మరియు (సత్యతిరస్కారులు) ఇలా అంటూ ఉండేవారు:

لَوۡ أَنَّ عِندَنَا ذِكۡرٗا مِّنَ ٱلۡأَوَّلِينَ ﴿١٦٨﴾

**168**. "ఒకవేళ మా పూర్వీకుల నుండి మాకు ఇలాంటి బోధన లభించిఉంటే!

لَكُنَّا عِبَادَ ٱللَّهِ ٱلۡمُخۡلَصِينَ ﴿١٦٩﴾

**169**. "మేము కూడా, అల్లాహ్ యొక్క ఎన్నుకున్న భక్తులమై ఉండే వారము!"

فَكَفَرُواْ بِهِۦۖ فَسَوۡفَ يَعۡلَمُونَ ﴿١٧٠﴾

**170**. కాని, వారిప్పుడు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) తిరస్కరిస్తున్నారు. ఇక త్వరలోనే వారు తెలుసుకుంటారు!

وَلَقَدۡ سَبَقَتۡ كَلِمَتُنَا لِعِبَادِنَا ٱلۡمُرۡسَلِينَ ﴿١٧١﴾

**171**. మరియు వాస్తవానికి మా దాసులైన, మేము పంపిన సందేశహరుల విషయంలో మా నిర్ణయం జరిగింది;

إِنَّهُمۡ لَهُمُ ٱلۡمَنصُورُونَ ﴿١٧٢﴾

**172**. నిశ్చయంగా, వారు సహాయం (విజయం) పొందుతారని!

وَإِنَّ جُندَنَا لَهُمُ ٱلۡغَٰلِبُونَ ﴿١٧٣﴾

**173**. మరియు నిశ్చయంగా, మా సైనికులే తప్పక విజయం పొందుతారని![2]

فَتَوَلَّ عَنۡهُمۡ حَتَّىٰ حِينٖ ﴿١٧٤﴾

**174**. కావున నీవు వారిని (సత్య తిరస్కారులను) కొంతకాలం వదలిపెట్టు.

---

**1**. అంటే దైవదూతలు కూడా అల్లాహ్(సు.తా.) సృష్టించిన ఆయన దాసులు. ఎల్లప్పుడు వారు కూడా అల్లాహ్ (సు.తా.)ను స్తుతిస్తూ ఉంటారు. ఆయన ఆజ్ఞాపాలన చేస్తూ ఉంటారు. ముష్రికులు భావించినట్లు వారు అల్లాహ్ (సు.తా.) కూతుళ్ళు కారు.

**2**. చూడండి, 37:179, 58:21.

وَأَبْصِرْهُمْ فَسَوْفَ يُبْصِرُونَ ﴿١٧٥﴾

**175**. మరియు వారిని చూస్తూ ఉండు. ఇక త్వరలోనే వారు కూడా (తమ పర్యవసానాన్ని) చూడగలరు!

أَفَبِعَذَابِنَا يَسْتَعْجِلُونَ ﴿١٧٦﴾

**176**. ఏమీ? వారు మా శిక్ష కొరకు తొందరపెడుతున్నారా?

فَإِذَا نَزَلَ بِسَاحَتِهِمْ فَسَاءَ صَبَاحُ ٱلْمُنذَرِينَ ﴿١٧٧﴾

**177**. కాని, అది వారి ఇంటి ప్రాంగణంలో దిగినప్పుడు, హెచ్చరించ బడినవారికి అది దుర్భరమైన ఉదయం కాగలదు!

وَتَوَلَّ عَنْهُمْ حَتَّىٰ حِينٍ ﴿١٧٨﴾

**178**. కావున నీవు ప్రస్తుతానికి వారిని వదలిపెట్టు,

وَأَبْصِرْ فَسَوْفَ يُبْصِرُونَ ﴿١٧٩﴾

**179**. మరియు చూస్తూఉండు. ఇక త్వరలోనే వారు కూడా (తమ పర్యవసానాన్ని) చూడగలరు!

سُبْحَٰنَ رَبِّكَ رَبِّ ٱلْعِزَّةِ عَمَّا يَصِفُونَ ﴿١٨٠﴾

**180**. నీ ప్రభువు సర్వలోపాలకు అతీతుడు; సర్వశక్తిమంతుడైన ప్రభువు, వారి కల్పనలకు అతీతుడు.

وَسَلَٰمٌ عَلَى ٱلْمُرْسَلِينَ ﴿١٨١﴾

**181**. మరియు సందేశహరులందరికి శాంతి కలుగు గాక (సలాం)!

وَٱلْحَمْدُ لِلَّهِ رَبِّ ٱلْعَٰلَمِينَ ﴿١٨٢﴾

**182**. మరియు సర్వస్తోత్రాలకు అర్హుడైన అల్లాహ్ యే సమస్తలోకాలకు ప్రభువు!

*****

## 38. సూరహ్ 'సాద్

## سُورَةُ صٓ

'సాద్: ఈ సూరహ్ పేరు **మొదటి** ఆయత్‌లోని **అక్షరంతో** పెట్టబడింది. ఈ సూరహ్ ప్రవక్తృత్వం లభించిన నాలుగైదు సంవత్సరాల తరువాత అవతరింపజేయబడింది. దైవమార్గదర్శకత్వం గురించి ఇందులో వివరించబడింది. ఈ అనుక్రమంలో ఇది ఐదవది. **మక్కా**లో అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **88 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1.** '*సాద్.* హితబోధతో నిండివున్న ఈ ఖుర్ఆన్ సాక్షిగా!

صٓۚ وَٱلۡقُرۡءَانِ ذِي ٱلذِّكۡرِ ١

**2.** వాస్తవానికి, సత్యాన్ని తిరస్కరించిన వారు అహంకారంలో మరియు విరోధంలో పడివున్నారు.

بَلِ ٱلَّذِينَ كَفَرُواْ فِي عِزَّةٖ وَشِقَاقٖ ٢

**3.** వారికి పూర్వం గతించిన ఎన్నో తరాలను మేము నాశనంచేశాము. అప్పుడు వారు మొరపెట్టుకోసాగారు, కాని అప్పుడు వారికి దానినుండి తప్పించుకునే సమయం లేక పోయింది!

كَمۡ أَهۡلَكۡنَا مِن قَبۡلِهِم مِّن قَرۡنٖ
فَنَادَواْ وَّلَاتَ حِينَ مَنَاصٖ ٣

**4.** మరియు వారిని హెచ్చరించేవాడు, తమలో నుంచే రావటం చూసి వారు ఆశ్చర్యపడ్డారు! మరియు సత్య తిరస్కారులు ఇలా అన్నారు: "ఇతడు మాంత్రికుడు, అసత్యవాది.

وَعَجِبُوٓاْ أَن جَآءَهُم مُّنذِرٞ مِّنۡهُمۡۖ وَقَالَ
ٱلۡكَٰفِرُونَ هَٰذَا سَٰحِرٞ كَذَّابٌ ٤

**5.** "ఏమీ? అతను (ప్రవక్త) దైవాలందరినీ, ఒకే ఆరాధ్య దైవంగా చేశాడా? నిశ్చయంగా ఇది ఎంతో విచిత్రమైన విషయం!"

أَجَعَلَ ٱلۡأٓلِهَةَ إِلَٰهٗا وَٰحِدًاۖ إِنَّ
هَٰذَا لَشَيۡءٌ عُجَابٞ ٥

6. మరియు వారి నాయకులు ఇలా అనసాగారు: "పదండి! మీరు మీ దైవాల (ఆరాధన) మీద స్థిరంగా ఉండండి." నిశ్చయంగా, ఇందులో (మీకు విరుద్ధంగా) ఏదో ఉద్దేశింపబడి ఉంది!

7. "ఇలాంటి విషయాన్ని మేము ఇటీవలి కాలపు మతంలో విని ఉండలేదు. ఇది కేవలం కల్పన మాత్రమే!

8. "ఏమీ? మా అందరిలోనూ, కేవలం ఇతనిపైననే, ఈ హితబోధ అవతరింపజేయబడిందా?"[1] వాస్తవానికి వారు నా హితబోధను గురించి సంశయంలో పడివున్నారు.[2] అలాకాదు, వారు ఇంకా (నా) శిక్షను రుచిచూడలేదు!

9. లేక వారి దగ్గర సర్వశక్తుడు, సర్వప్రదుడు[3] అయిన నీ ప్రభువు యొక్క కారుణ్యనిధులు ఉన్నాయా?

10. లేక! ఆకాశాలు మరియు భూమి మరియు వాటి మధ్య ఉన్న సమస్తం మీద వారికి సామ్రాజ్యాధిపత్యం ఉందా? అలా అయితే వారిని తమ సాధనాలతో పైకి (ఆకాశంలోకి) ఎక్కమను!

11. ఇంతకు ముందు ఓడించబడిన సైన్యాలవలే, ఒక వర్గం వీరిది కూడా ఉంటుంది!

وَٱنطَلَقَ ٱلۡمَلَأُ مِنۡهُمۡ أَنِ ٱمۡشُواْ
وَٱصۡبِرُواْ عَلَىٰٓ ءَالِهَتِكُمۡۖ إِنَّ هَٰذَا
لَشَيۡءٞ يُرَادُ ٦

مَا سَمِعۡنَا بِهَٰذَا فِي ٱلۡمِلَّةِ ٱلۡأٓخِرَةِ إِنۡ
هَٰذَآ إِلَّا ٱخۡتِلَٰقٌ ٧

أَءُنزِلَ عَلَيۡهِ ٱلذِّكۡرُ مِنۢ بَيۡنِنَاۚ بَلۡ هُمۡ
فِي شَكّٖ مِّن ذِكۡرِيۖ بَل لَّمَّا يَذُوقُواْ
عَذَابِ ٨

أَمۡ عِندَهُمۡ خَزَآئِنُ رَحۡمَةِ رَبِّكَ
ٱلۡعَزِيزِ ٱلۡوَهَّابِ ٩

أَمۡ لَهُم مُّلۡكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَمَا
بَيۡنَهُمَاۖ فَلۡيَرۡتَقُواْ فِي ٱلۡأَسۡبَٰبِ ١٠

جُندٞ مَّا هُنَالِكَ مَهۡزُومٞ مِّنَ
ٱلۡأَحۡزَابِ ١١

---

1. చూడండి, 43:31-32.

2. వారు సంశయంలో పడింది ము'హమ్మద్ ('స'అస) అసత్యవాది అని కాదు. అతను బోధించే ధర్మం వారి దైవాలను వదలి, అగోచరుడైన ఏకైక దైవం అల్లాహ్ (సు.తా.)ను ఆరాధించమని చెప్పడం.

3. అల్-వహ్హాబ్: Bestower. సర్వప్రదుడు, సర్వవర ప్రదాత, పరమదాత. చూడండి, 3:8.

كَذَّبَتۡ قَبۡلَهُمۡ قَوۡمُ نُوحٖ وَعَادٞ وَفِرۡعَوۡنُ ذُو ٱلۡأَوۡتَادِ ١٢

12. వీరికి పూర్వం నూ'హ్ మరియు 'ఆద్ (జాతి) వారు మరియు మేకుల ఫిర్'ఔన్ జాతులవారు సత్యాన్ని తిరస్కరించారు;

وَثَمُودُ وَقَوۡمُ لُوطٖ وَأَصۡحَٰبُ لۡـَٔيۡكَةِۚ أُوْلَٰٓئِكَ ٱلۡأَحۡزَابُ ١٣

13. మరియు, స'మూద్ మరియు లూ'త్ జాతుల వారు మరియు అ'య్కహ్ (మద్‌యన్)[1] వాసులు అందరూ ఇలాంటి వర్గాలకు చెందిన వారే.

إِن كُلٌّ إِلَّا كَذَّبَ ٱلرُّسُلَ فَحَقَّ عِقَابِ ١٤

14. ఇక వీరిలో ఏ ఒక్కరూ ప్రవక్తలను అసత్యవాదులని తిరస్కరించకుండా ఉండ లేదు, కావున నా శిక్ష అనివార్య మయ్యింది.

وَمَا يَنظُرُ هَٰٓؤُلَآءِ إِلَّا صَيۡحَةٗ وَٰحِدَةٗ مَّا لَهَا مِن فَوَاقٖ ١٥

15. మరియు వీరందరూ కేవలం ఒక ధ్వని[2] కొరకు మాత్రమే ఎదురు చూస్తున్నారు, దానికి ఎలాంటి నిలుపుదల ఉండదు.

وَقَالُواْ رَبَّنَا عَجِّل لَّنَا قِطَّنَا قَبۡلَ يَوۡمِ ٱلۡحِسَابِ ١٦

16. మరియు వారు: "ఓ మా ప్రభూ! లెక్కదినానికి ముందే మా భాగం మాకు తొందరగా ఇచ్చివెయ్యి."[3] అని అంటారు.

ٱصۡبِرۡ عَلَىٰ مَا يَقُولُونَ وَٱذۡكُرۡ عَبۡدَنَا دَاوُۥدَ ذَا ٱلۡأَيۡدِۖ إِنَّهُۥٓ أَوَّابٌ ١٧

17. (ఓ ము'హమ్మద్!) వారి మాటల యెడల నీవు సహనంవహించు మరియు బలవంతుడైన, మా దాసుడు దావూద్‌ను జ్ఞాపకం చేసుకో.[4] నిశ్చయంగా, అతను ఎల్లప్పుడూ పశ్చాత్తాపంతో (అల్లాహ్ వైపునకు) మరలుతూ ఉండేవాడు.

---

1. అ'య్కహ్ వాసుల గాథ కొరకు చూడండి, 26:176.
2. పునరుత్థాన దినమున ఇస్రాఫీల్ ('అ.స.) ఊదే బాకా ధ్వని, అరుపు, ప్రేలుడు గర్జన లేక శబ్దం. ఇంకా చూడండి, 36:29, 49, 53.
3. అంటే వారు పునరుత్థానదినం గురించి పరిహాసం చేస్తూ: 'ఆ దినం రాకముందే మా భాగపు శిక్ష మాకు ఇవ్వు.' అని అంటున్నారు. చూడండి, 8:32.
4. అల్లాహ్ (సు.తా.)కు ప్రియమైనవి దావూద్ ('అ.స.) నమా'జ్ మరియు అతని ఉపవాసం. అతను సగం రాత్రి నిద్రపోయే వారు, లేచి మూడోవంతు రాత్రి నమా'జ్ చేసేవారు. అతను రోజు విడిచి రోజు ఉపవాసం ఉండేవారు. అతను యుద్ధరంగాన్ని విడిచి ఎన్నడూ పారిపోలేదు ('స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం).

إِنَّا سَخَّرْنَا ٱلْجِبَالَ مَعَهُۥ يُسَبِّحْنَ بِٱلْعَشِيِّ وَٱلْإِشْرَاقِ ﴿١٨﴾

**18**. నిశ్చయంగా, మేము పర్వతాలను అతనితోబాటు సాయంత్రం మరియు ఉదయం మా పవిత్రతను కొనియాడుతూ ఉండేటట్లు చేశాము.

وَٱلطَّيْرَ مَحْشُورَةً ۖ كُلٌّ لَّهُۥٓ أَوَّابٌ ﴿١٩﴾

**19**. మరియు పక్షులు కూడా గుమికూడేవి. అంతా కలసి ఆయన (అల్లాహ్) వైపుకు మరలే వారు.

وَشَدَدْنَا مُلْكَهُۥ وَءَاتَيْنَٰهُ ٱلْحِكْمَةَ وَفَصْلَ ٱلْخِطَابِ ﴿٢٠﴾

**20**. మరియు మేము అతని సామ్రాజ్యాన్ని పటిష్ఠపరిచాము మరియు మేము అతనికి వివేకాన్ని మరియు తిరుగులేని తీర్పు చేయడంలో, నేర్పరితనాన్ని ప్రసాదించాము. (5/8)

۞ وَهَلْ أَتَىٰكَ نَبَؤُا۟ ٱلْخَصْمِ إِذْ تَسَوَّرُوا۟ ٱلْمِحْرَابَ ﴿٢١﴾

**21**. * మరియు తగవులాడుకొని వచ్చిన ఆ ఇద్దరి వార్త నీకు చేరిందా?[1] వారు గోడ ఎక్కి అతని ప్రార్థనా గదిలోకి వచ్చారు.

إِذْ دَخَلُوا۟ عَلَىٰ دَاوُۥدَ فَفَزِعَ مِنْهُمْ ۖ قَالُوا۟ لَا تَخَفْ ۖ خَصْمَانِ بَغَىٰ بَعْضُنَا عَلَىٰ بَعْضٍ فَٱحْكُم بَيْنَنَا بِٱلْحَقِّ وَلَا تُشْطِطْ وَٱهْدِنَآ إِلَىٰ سَوَآءِ ٱلصِّرَٰطِ ﴿٢٢﴾

**22**. వారు దావూద్ వద్దకు వచ్చినపుడు, అతను వారిని చూసి బెదిరిపోయాడు. వారన్నారు: "భయపడకు! మేమిద్దరం ప్రత్యర్థులం, మాలో ఒకడు మరొకనికి అన్యాయం చేశాడు. కావున నీవు మా మధ్య న్యాయంగా తీర్పుచెయ్యి. మరియు నీతిమీరి నడువకు, మాకు సరైనమార్గం వైపునకు మార్గదర్శకత్వం చెయ్యి.

إِنَّ هَٰذَآ أَخِى لَهُۥ تِسْعٌ وَتِسْعُونَ نَعْجَةً وَلِىَ نَعْجَةٌ وَٰحِدَةٌ فَقَالَ أَكْفِلْنِيهَا وَعَزَّنِى فِى ٱلْخِطَابِ ﴿٢٣﴾

**23**. "వాస్తవానికి, ఇతడు నా సోదరుడు, ఇతనివద్ద తొంభై తొమ్మిది ఆడ గొర్రెలున్నాయి మరియు నా దగ్గర కేవలం ఒకే ఒక్క ఆడగొర్రె ఉంది, అయినా ఇతడు అంటున్నాడు: 'దీనిని నాకివ్వు.' మరియు తన మాటల నేర్పుతో నన్ను వశపరచుకుంటున్నాడు."

---

**1**. చాలా మంది వ్యాఖ్యాతల ప్రకారం ఆ ఇద్దరు ప్రత్యర్థులు దైవదూతలు.

قَالَ لَقَدْ ظَلَمَكَ بِسُؤَالِ نَعْجَتِكَ إِلَىٰ نِعَاجِهِۦ ۖ وَإِنَّ كَثِيرًا مِّنَ ٱلْخُلَطَآءِ لَيَبْغِى بَعْضُهُمْ عَلَىٰ بَعْضٍ إِلَّا ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ وَقَلِيلٌ مَّا هُمْ ۗ وَظَنَّ دَاوُۥدُ أَنَّمَا فَتَنَّٰهُ فَٱسْتَغْفَرَ رَبَّهُۥ وَخَرَّ رَاكِعًا وَأَنَابَ ۩ ﴿٢٤﴾

24. (దావూద్) అన్నాడు: "వాస్తవంగా, నీ ఆడగొర్రెను తన గొర్రెలలో కలుపుకోవటానికి అడిగి, ఇతడు నీపై అన్యాయం చేస్తున్నాడు. మరియు వాస్తవానికి, చాలా మంది భాగస్థులు ఒకరికొకరు అన్యాయం చేసుకుంటూ ఉంటారు, విశ్వసించి సత్కార్యాలు చేసేవారు తప్ప! కాని అటువంటి వారు కొందరు మాత్రమే!" వాస్తవానికి మేము అతనిని (దావూద్‌ను) పరీక్షిస్తున్నామని అతను అర్థం చేసుకున్నాడు. కాబట్టి తన ప్రభువును క్షమాపణ వేడుకున్నాడు. మరియు సాష్టాంగం (సజ్దా)లో పడిపోయాడు. మరియు పశ్చాత్తాపంతో (అల్లాహ్‌వైపుకు) మరలాడు. ۩

فَغَفَرْنَا لَهُۥ ذَٰلِكَ ۖ وَإِنَّ لَهُۥ عِندَنَا لَزُلْفَىٰ وَحُسْنَ مَـَٔابٍ ﴿٢٥﴾

25. అప్పుడు మేము అతని ఆ (తప్పును) క్షమించాము. మరియు నిశ్చయంగా మా వద్ద అతనికి సాన్నిహిత్యం మరియు మంచి స్థానం కూడా ఉన్నాయి.

يَٰدَاوُۥدُ إِنَّا جَعَلْنَٰكَ خَلِيفَةً فِى ٱلْأَرْضِ فَٱحْكُم بَيْنَ ٱلنَّاسِ بِٱلْحَقِّ وَلَا تَتَّبِعِ ٱلْهَوَىٰ فَيُضِلَّكَ عَن سَبِيلِ ٱللَّهِ ۚ إِنَّ ٱلَّذِينَ يَضِلُّونَ عَن سَبِيلِ ٱللَّهِ لَهُمْ عَذَابٌ شَدِيدٌۢ بِمَا نَسُوا۟ يَوْمَ ٱلْحِسَابِ ﴿٢٦﴾

26. (మేము అతనితో ఇలా అన్నాము): "ఓ దావూద్! నిశ్చయంగా, మేము నిన్ను భూమిలో ఉత్తరాధికారిగా నియమించాము. కావున నీవు ప్రజల మధ్య న్యాయంగా తీర్పుచెయ్యి మరియు నీ మనోకాంక్షలను అనుసరించకు, ఎందుకంటే అవి నిన్ను అల్లాహ్ మార్గం నుండి తప్పిస్తాయి." నిశ్చయంగా, ఎవరైతే అల్లాహ్ మార్గం నుండి తప్పిపోతారో, వారికి లెక్క దినమును మరచిపోయిన దాని ఫలితంగా, కఠినమైన శిక్ష పడుతుంది.

وَمَا خَلَقْنَا ٱلسَّمَآءَ وَٱلْأَرْضَ وَمَا بَيْنَهُمَا بَٰطِلًا ۚ ذَٰلِكَ ظَنُّ ٱلَّذِينَ كَفَرُوا۟ ۚ فَوَيْلٌ لِّلَّذِينَ كَفَرُوا۟ مِنَ ٱلنَّارِ ﴿٢٧﴾

27. మరియు మేము ఈ ఆకాశాన్ని మరియు ఈ భూమిని మరియు వాటిమధ్య ఉన్నదాన్నంతా వృథాగా సృష్టించలేదు! ఇది సత్యాన్ని తిరస్కరించిన వారి భ్రమ మాత్రమే.[1] కావున అట్టి సత్యతిరస్కారులకు నరకాగ్ని బాధ పడనున్నది!

أَمْ نَجْعَلُ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ كَٱلْمُفْسِدِينَ فِى ٱلْأَرْضِ أَمْ نَجْعَلُ ٱلْمُتَّقِينَ كَٱلْفُجَّارِ ﴿٢٨﴾

28. ఏమీ? మేము విశ్వసించి, సత్కార్యాలు చేసేవారిని భూమిలో కల్లోలం రేకెత్తించే వారితో సమానులుగా చేస్తామా? లేక మేము దైవభీతి గలవారిని దుష్టులతో సమానులుగా చేస్తామా?[2]

كِتَٰبٌ أَنزَلْنَٰهُ إِلَيْكَ مُبَٰرَكٌ لِّيَدَّبَّرُوٓا۟ ءَايَٰتِهِۦ وَلِيَتَذَكَّرَ أُو۟لُوا۟ ٱلْأَلْبَٰبِ ﴿٢٩﴾

29. (ఓ ము'హమ్మద్!) మేము ఎంతో శుభవంతమైన ఈ గ్రంథాన్ని (ఖుర్ఆన్‌ను) నీపై అవతరింపజేశాము. ప్రజలు దీని సూచన(ఆయతు)లను గురించి యోచించాలని మరియు బుద్ధిమంతులు దీని నుండి హితబోధ గ్రహించాలని.

وَوَهَبْنَا لِدَاوُۥدَ سُلَيْمَٰنَ ۚ نِعْمَ ٱلْعَبْدُ ۖ إِنَّهُۥٓ أَوَّابٌ ﴿٣٠﴾

30. మరియు మేము దావూద్‌కు సులైమాన్‌ను ప్రసాదించాము. అతను ఉత్తమ దాసుడు! నిశ్చయంగా, అతను ఎల్లప్పుడు మా వైపునకు పశ్చాత్తాపంతో మరలుతూ ఉండేవాడు.

إِذْ عُرِضَ عَلَيْهِ بِٱلْعَشِىِّ ٱلصَّٰفِنَٰتُ ٱلْجِيَادُ ﴿٣١﴾

31. ఒకరోజు సాయంకాలం అతని ముందు మేలుజాతి, వడిగల గుర్రాలు ప్రవేశపెట్టబడినప్పుడు;

---

1. చూడండి, 3:191, 10:5.
2. ఇహలోకంలో కొందరు దుర్మార్గులు ఎన్నో సుఖసంతోషాలను అనుభవిస్తూ ఉండవచ్చు. మరియు దైవభీతిగల సద్పురుషులు ఆర్థిక మరియు భౌతిక కష్టాలకు గురికావచ్చు. దీని అర్థం మేమిటంటే అల్లాహ్ (సు.తా.) దగ్గర ప్రతిదాని లెక్క ఉంది కాబట్టి రాబోయే శాశ్వతమైన పరలోక జీవితంలో ప్రతివానికి తన కర్మలకు తగిన ప్రతిఫలం దొరుకుతుంది. ఎవ్వరికీ ఎలాంటి అన్యాయం జరుగదు. అల్లాహ్ (సు.తా.) ప్రతిదానికి ఒక గడువు నియమించిఉన్నాడు.

**32**. అతను అన్నాడు: "అయ్యో! వాస్తవంగా నేను నా ప్రభువు స్మరణకు బదులుగా ఈ సంపదను (గుర్రాలను) ప్రేమించాను." చివరకు (సూర్యుడు) కనుమరుగైపోయాడు.

**33**. (అతను ఇంకా ఇలా అన్నాడు): "వాటిని నా వద్దకు తిరిగి తీసుకురండి." తరువాత అతను వాటి పిక్కలను మరియు మెడలను నిమరసాగాడు.[1]

**34**. మరియు వాస్తవానికి మేము సులైమాన్‌ను పరీక్షకు గురిచేశాము మరియు అతని సింహాసనంపై ఒక కళేబరాన్ని[2] పడవేశాము, అప్పుడతను పశ్చాత్తాపంతో మా వైపునకు మరలాడు.

**35**. అతను ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నన్ను క్షమించు, నా తరువాత మరెవ్వరికీ లభించనటువంటి సామ్రాజ్యాన్ని నాకు ప్రసాదించు. నిశ్చయంగా, నీవే సర్వవర ప్రదాతవు!"

**36**. అప్పుడు మేము గాలిని అతనికి వశపరచాము. అది అతని ఆజ్ఞానుసారంగా, అతడు కోరినవైపునకు తగినట్లుగా మెల్లగా వీచేది.[3]

فَقَالَ إِنِّيٓ أَحۡبَبۡتُ حُبَّ ٱلۡخَيۡرِ عَن ذِكۡرِ رَبِّي حَتَّىٰ تَوَارَتۡ بِٱلۡحِجَابِ ٣٢

رُدُّوهَا عَلَيَّۖ فَطَفِقَ مَسۡحَۢا بِٱلسُّوقِ وَٱلۡأَعۡنَاقِ ٣٣

وَلَقَدۡ فَتَنَّا سُلَيۡمَٰنَ وَأَلۡقَيۡنَا عَلَىٰ كُرۡسِيِّهِۦ جَسَدٗا ثُمَّ أَنَابَ ٣٤

قَالَ رَبِّ ٱغۡفِرۡ لِي وَهَبۡ لِي مُلۡكٗا لَّا يَنۢبَغِي لِأَحَدٖ مِّنۢ بَعۡدِيٓۖ إِنَّكَ أَنتَ ٱلۡوَهَّابُ ٣٥

فَسَخَّرۡنَا لَهُ ٱلرِّيحَ تَجۡرِي بِأَمۡرِهِۦ رُخَآءً حَيۡثُ أَصَابَ ٣٦

---

1. ఆయత్‌లు 32 మరియు 33 యొక్క ఈ అనువాదం ఇమామ్ ఇబ్నె-జరీర్ 'తబరీ వ్యాఖ్యానాన్ని అనుసరించి ఉంది.

2. జసదన్: కళేబరం, దీనిని గురించిన వివరాలు, ఖుర్ఆన్ మరియు 'హదీస్'లలో లేవు. ఒక బు'ఖారీ (ర'హ్మ) 'హదీస్' ప్రకారం: అది వికలాంగుడిగా పుట్టిన అతని కుమారుని శరీరం. నోబుల్ ఖుర్ఆన్ ఈ శబ్దాన్ని షై'తాన్ అని వివరించింది. అల్లాహు ఆలమ్.

3. చూడండి, 21:81-82 అక్కడ తీవ్రమైన గాలి వీచినట్లు చెప్పబడింది. ఆ తీవ్రమైన గాలి కూడా అల్లాహ్ (సు.తా.) అనుమతితో సులైమాన్ ('అ.స.) ఇచ్ఛానుసారంగా వీచేది.

وَٱلشَّيَٰطِينَ كُلَّ بَنَّآءٖ وَغَوَّاصٖ ﴿٣٧﴾

**37**. మరియు షైతాను(జిన్నాతు)లలో నుండి కూడా రకరకాల కట్టడాలు నిర్మించే వాటినీ మరియు సముద్రంలో మునిగి (ముత్యాలు తీసే) వాటినీ (అతనికి వశపరచి ఉన్నాము).

وَءَاخَرِينَ مُقَرَّنِينَ فِي ٱلۡأَصۡفَادِ ﴿٣٨﴾

**38**. మరికొన్ని సంకెళ్ళతో బంధింపబడినవి కూడా ఉండేవి.

هَٰذَا عَطَآؤُنَا فَٱمۡنُنۡ أَوۡ أَمۡسِكۡ بِغَيۡرِ حِسَابٖ ﴿٣٩﴾

**39**. (అల్లాహ్ అతనితో అన్నాడు): "ఇది నీకు మా కానుక, కావున నీవు దీనిని (ఇతరులకు) ఇచ్చినా, లేక నీవే ఉంచుకున్నా, నీతో ఎలాంటి లెక్క తీసుకోబడదు."[1]

وَإِنَّ لَهُۥ عِندَنَا لَزُلۡفَىٰ وَحُسۡنَ مَـَٔابٖ ﴿٤٠﴾

**40**. మరియు నిశ్చయంగా, అతనికి మా సాన్నిహిత్యం మరియు ఉత్తమ గమ్యస్థానం ఉన్నాయి.

وَٱذۡكُرۡ عَبۡدَنَآ أَيُّوبَ إِذۡ نَادَىٰ رَبَّهُۥٓ أَنِّي مَسَّنِيَ ٱلشَّيۡطَٰنُ بِنُصۡبٖ وَعَذَابٍ ﴿٤١﴾

**41**. మరియు మా దాసుడు అయ్యూబ్‌ను గురించి ప్రస్తావించు; అతను తన ప్రభువుతో ఇలా మొరపెట్టుకున్నాడు: "నిశ్చయంగా, షైతాన్ నన్ను ఆపదకు మరియు శిక్షకు గురిచేశాడు."[2]

ٱرۡكُضۡ بِرِجۡلِكَۖ هَٰذَا مُغۡتَسَلُۢ بَارِدٞ وَشَرَابٞ ﴿٤٢﴾

**42**. (మేము అతనితో అన్నాము): "నీ కాలును నేలమీద కొట్టు. అదిగో చల్లని (నీటి చెలిమ)! నీవు స్నానం చేయటానికి మరియు త్రాగుటకూను."

---

**1**. సులైమాన్ (అ.స.) ప్రార్థన ప్రకారం అతనికి ఒకగొప్ప రాజ్యాధికారం మరియు అతని సంపత్తుల నుండి తన ఇష్టంవచ్చిన వారికి ఇవ్వవచ్చని అనుమతి కూడా ఇవ్వబడింది.

**2**. అయూబ్ (అ.స.) యొక్క పరీక్ష కూడా చాలా ప్రసిద్ధమైనది. అతను రోగంతో మరియు ధన, సంతాన నష్టంతో పరీక్షించబడ్డారు. అతనితోబాటు కేవలం అతని భార్య మాత్రమే మిగిలింది.

وَوَهَبْنَا لَهُۥٓ أَهْلَهُۥ وَمِثْلَهُم مَّعَهُمْ رَحْمَةً مِّنَّا وَذِكْرَىٰ لِأُوْلِى ٱلْأَلْبَٰبِ ﴿٤٣﴾

43. మరియు మేము అతని కుటుంబంవారిని మరియు వారితోబాటు, వారివంటి వారిని మా కరుణతో అతనికి తిరిగి ఇచ్చాము మరియు బుద్ధిమంతులకు ఇది ఒక హితబోధ.[1]

وَخُذْ بِيَدِكَ ضِغْثًا فَٱضْرِب بِّهِۦ وَلَا تَحْنَثْ ۗ إِنَّا وَجَدْنَٰهُ صَابِرًا ۚ نِّعْمَ ٱلْعَبْدُ ۖ إِنَّهُۥٓ أَوَّابٌ ﴿٤٤﴾

44. (అల్లాహ్ అతనితో అన్నాడు): ''ఒక పుల్లల కట్టను నీ చేతిలోకి తీసికొని దానితో (నీ భార్యను) కొట్టు మరియు నీ ఒట్టును భంగపరచుకోకు.''[2] వాస్తవానికి, మేము అతనిని ఎంతో సహనశీలునిగా పొందాము. అతను ఉత్తమ దాసుడు! నిశ్చయంగా, ఎల్లపుడు మా వైపునకు పశ్చాత్తాపంతో మరలుతూ ఉండేవాడు.

وَٱذْكُرْ عِبَٰدَنَآ إِبْرَٰهِيمَ وَإِسْحَٰقَ وَيَعْقُوبَ أُوْلِى ٱلْأَيْدِى وَٱلْأَبْصَٰرِ ﴿٤٥﴾

45. మరియు మా దాసులైన ఇబ్రాహీమ్, ఇస్'హాఖ్ మరియు య'అఖూబ్‌లను జ్ఞాపకంచేసుకో! వారు గొప్ప కార్యశీలురు మరియు దూరదృష్టి గలవారు.

---

1. అల్లాహ్ (సు.తా.) చివరకు అయ్యూబ్ ('అ.స.) ప్రార్థనను అంగీకరించి అతని రోగాన్ని దూరంచేశాడు. మరియు అతను కోల్పోయిన ధనాన్ని, సంతానాన్ని తిరిగి ఇచ్చాడు. అంతేగాక అతనికి రెండింతలు అధికంగా ప్రసాదించాడు.
2. రోగపీడుతుడుగా ఉన్న కాలంలో అయ్యూబ్ ('అ.స.) కోపంతో తన భార్యను - ఆమె తెలియకుండా చేసిన ఒక అపరాధానికి క్రోధితుడై - నూరు కొరడా దెబ్బలు కొడతానని ప్రమాణం చేస్తారు. ఆ ప్రమాణం పూర్తి చేయటానికి అల్లాహ్ (సు.తా.) అతనితో నూరు పుల్లల కట్టతో ఒకసారి నీ భార్యను కొట్టి నీ ప్రమాణం పూర్తిచేసుకో అని ఆదేశిస్తాడు. చూడండి, 5:89. ఈ ఆజ్ఞ కేవలం అయ్యూబ్ ('అ.స.) కొరకేనా, లేక అందరి కొరకా అనే విషయంలో వ్యాఖ్యాతల మధ్య భేదాభిప్రాయాలున్నాయి. కొందరు అంటారు: ఒకవేళ మొదట ప్రమాణం చేసినప్పుడు కఠినంగా శిక్షించదలిచే అభిప్రాయం లేకుంటే ఇలా చేయవచ్చు, (ఫ'త్హ్ అల్-ఖదీర్). ఒక 'హదీస్' ద్వారా తెలుస్తోంది: ఒకసారి దైవప్రవక్త ('స'అస) ఒక బలహీనుడైన వ్యభిచారికి, నూరు కొరడా దెబ్బలకు బదులుగా నూరు పుల్లలున్న చీపురు కట్టతో ఒకేసారి కొట్టి వదిలారు (ముస్నద్ అ'హ్మద్, 5/222, ఇబ్నె మాజా).

إِنَّآ أَخۡلَصۡنَٰهُم بِخَالِصَةٖ ذِكۡرَى ٱلدَّارِ ٤٦

46. నిశ్చయంగా, మేము వారిని ఒక విశిష్టగుణం కారణంగా ఎన్నుకున్నాము, అది వారి పరలోకచింతన.

وَإِنَّهُمۡ عِندَنَا لَمِنَ ٱلۡمُصۡطَفَيۡنَ ٱلۡأَخۡيَارِ ٤٧

47. మరియు నిశ్చయంగా, మా దృష్టిలో వారు ఎన్నుకొనబడిన ఉత్తమ (పుణ్య) పురుషులలోని వారు!

وَٱذۡكُرۡ إِسۡمَٰعِيلَ وَٱلۡيَسَعَ وَذَا ٱلۡكِفۡلِۖ وَكُلّٞ مِّنَ ٱلۡأَخۡيَارِ ٤٨

48. మరియు ఇస్మా'యీల్, అల్-యస'అ మరియు జు'ల్-కిఫ్లలను[1] కూడా జ్ఞాపకంచేసుకో. మరియు వారందరూ ఎన్నుకొనబడిన పురుషులలోని వారు.

هَٰذَا ذِكۡرٞۚ وَإِنَّ لِلۡمُتَّقِينَ لَحُسۡنَ مَـَٔابٖ ٤٩

49. ఇది ఒక ప్రస్తావన. మరియు నిశ్చయంగా! దైవభీతి గలవారికి ఉత్తమ గమ్యస్థానం ఉంది.

جَنَّٰتِ عَدۡنٖ مُّفَتَّحَةٗ لَّهُمُ ٱلۡأَبۡوَٰبُ ٥٠

50. శాశ్వతమైన స్వర్గవనాలు, వాటి ద్వారాలు వారి కొరకు తెరువబడి ఉంటాయి.

مُتَّكِـِٔينَ فِيهَا يَدۡعُونَ فِيهَا بِفَٰكِهَةٖ كَثِيرَةٖ وَشَرَابٖ ٥١

51. వారు అందులో దిండ్లను ఆనుకొని కూర్చొని, వారందులో అనేక ఫలాలను మరియు పానీయాలను అడుగుతూ ఉంటారు. (3/4)

۞ وَعِندَهُمۡ قَٰصِرَٰتُ ٱلطَّرۡفِ أَتۡرَابٌ ٥٢

52. * మరియు వారి దగ్గర సమవయస్కులు మరియు తమ చూపులను వారి కొరకే ప్రత్యేకించుకొనే శీలవతులైన స్త్రీలు ఉంటారు.[2]

---

1. అల్-యస'అ (Elisha 'అ.స.), ఇల్యాస్ (Elijah, 'అ.స.), తరువాత వచ్చిన ప్రవక్త. యస'అ, 'అరబ్బీ పదం కాదు. జు'ల్ కిఫ్ల్ కొరకు చూడండి, 21:85.
2. ఇలాంటి వివరణ ఖుర్ఆన్‌లో మూడుసార్లు వచ్చింది. ఇక్కడ, 37:48 మరియు 55:56లలో. ఇంకా చూడండి, 4:124, 16:97 మరియు 40:40, 9:72 విశ్వసించి సత్కార్యాలు చేసే వారంతా (పురుషులు, స్త్రీలు) స్వర్గవాసులవుతారు. కావున ప్రతి

هَٰذَا مَا تُوعَدُونَ لِيَوْمِ ٱلْحِسَابِ ﴿٥٣﴾

**53**. లెక్కదినం కొరకు మీ(దైవభీతి గలవారి)తో చేయబడిన వాగ్దానం ఇదే!

إِنَّ هَٰذَا لَرِزْقُنَا مَا لَهُۥ مِن نَّفَادٍ ﴿٥٤﴾

**54**. నిశ్చయంగా, ఇదే మేమిచ్చే జీవనోపాధి; దానికి తరుగులేదు!

هَٰذَا ۚ وَإِنَّ لِلطَّٰغِينَ لَشَرَّ مَـَٔابٍ ﴿٥٥﴾

**55**. ఇదే (విశ్వాసులకు లభించేది). మరియు నిశ్చయంగా, తలబిరుసుతనం గల దుష్టులకు అతిచెడ్డ గమ్యస్థానం ఉంటుంది -

جَهَنَّمَ يَصْلَوْنَهَا فَبِئْسَ ٱلْمِهَادُ ﴿٥٦﴾

**56**. నరకం! వారందులో కాల్చ బడతారు. ఎంత బాధాకరమైన విరామ(నివాస)స్థలము.

هَٰذَا فَلْيَذُوقُوهُ حَمِيمٌ وَغَسَّاقٌ ﴿٥٧﴾

**57**. ఇదే (దుష్టులకు లభించేది), కావున వారు దాని రుచిచూస్తారు; సలసలకాగే నీరు మరియు చీము.

وَءَاخَرُ مِن شَكْلِهِۦٓ أَزْوَٰجٌ ﴿٥٨﴾

**58**. ఇంకా ఇలాంటివే అనేకం ఉంటాయి!

هَٰذَا فَوْجٌ مُّقْتَحِمٌ مَّعَكُمْ ۖ لَا مَرْحَبًۢا بِهِمْ ۚ إِنَّهُمْ صَالُوا۟ ٱلنَّارِ ﴿٥٩﴾

**59**. "ఇదొక దళం, మీ వైపునకు త్రోయబడుతూ వస్తున్నది. వారికి ఎలాంటి స్వాగతం లేదు! నిశ్చయంగా, వారు నరకాగ్నిలో కాల్చబడతారు."

قَالُوا۟ بَلْ أَنتُمْ لَا مَرْحَبًۢا بِكُمْ ۖ أَنتُمْ قَدَّمْتُمُوهُ لَنَا ۖ فَبِئْسَ ٱلْقَرَارُ ﴿٦٠﴾

**60**. (సత్యతిరస్కారులు తమను మార్గం తప్పించిన వారితో) అంటారు: "అయితే మీకు కూడా స్వాగతం లేదు కదా! ఈ పర్యవసానాన్ని మా ముందుకు తెచ్చిన వారు మీరే కదా! ఎంత చెడ్డ నివాసస్థలము."

---

పురుషునికి శీలవతి, విశ్వాసురాలైన తన భార్య స్వర్గంలో సహవాసి ('జౌజ)గా ఉంటుంది. ఇంకా చూడండి, 36:56: 'వారు మరియు వారి సహవాసులు (అ'జ్వాజ్), చల్లని నీడలలో, ఆసనాలమీద ఆనుకొని హాయిగా కూర్చొని ఉంటారు.'

**61**. వారు ఇంకా ఇలా అంటారు: "ఓ మా ప్రభూ! మా యెదుట దీనిని (నరకాన్ని) తెచ్చిన వానికి రెట్టింపు నరకాగ్ని శిక్షను విధించు!"[1]

**62**. ఇంకా వారు ఇలా అంటారు: "మా కేమయింది? మనం చెడ్డవారిగా ఎంచిన వారు ఇక్కడ మనకు కనబడటం లేదేమిటి?

**63**. "మనం ఊరికే వారిని ఎగతాళి చేశామా? లేదా వారు మనకు కనుమరుగయ్యారా?"

**64**. నిశ్చయంగా, ఇదే నిజం! నరకవాసులు ఇలాగే వాదులాడుకుంటారు.

**65**. (ఓ ము'హమ్మద్!) వారితో ఇలా అను: "వాస్తవానికి నేను హెచ్చరించేవాడను మాత్రమే! అల్లాహ్ తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు! ఆయన అద్వితీయుడు తన సృష్టిమీద సంపూర్ణ అధికారం గలవాడు.[2]

**66**. "ఆకాశాలు, భూమి మరియు వాటి మధ్య ఉన్న సమస్తానికి ప్రభువు, సర్వశక్తిమంతుడు, క్షమాశీలుడు."

**67**. వారితో అను: "ఇది (ఈ ఖుర్ఆన్) ఒక గొప్ప సందేశం.

**68**. "దాని నుండి మీరు విముఖులవుతున్నారు!"

قَالُواْ رَبَّنَا مَن قَدَّمَ لَنَا هَٰذَا فَزِدۡهُ
عَذَابًا ضِعۡفًا فِي ٱلنَّارِ ٦١
وَقَالُواْ مَا لَنَا لَا نَرَىٰ رِجَالًا كُنَّا
نَعُدُّهُم مِّنَ ٱلۡأَشۡرَارِ ٦٢
أَتَّخَذۡنَٰهُمۡ سِخۡرِيًّا أَمۡ زَاغَتۡ عَنۡهُمُ
ٱلۡأَبۡصَٰرُ ٦٣
إِنَّ ذَٰلِكَ لَحَقّٞ تَخَاصُمُ أَهۡلِ ٱلنَّارِ ٦٤
قُلۡ إِنَّمَآ أَنَا۠ مُنذِرٞۖ وَمَا مِنۡ إِلَٰهٍ إِلَّا
ٱللَّهُ ٱلۡوَٰحِدُ ٱلۡقَهَّارُ ٦٥
رَبُّ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَمَا
بَيۡنَهُمَا ٱلۡعَزِيزُ ٱلۡغَفَّٰرُ ٦٦
قُلۡ هُوَ نَبَؤٌاْ عَظِيمٌ ٦٧
أَنتُمۡ عَنۡهُ مُعۡرِضُونَ ٦٨

---

**1**. చూడండి, 7:38 మరియు 33:67-68. అక్కడ కూడా ఇలాగే అంటారు.

**2**. **అల్-వాహిద్-అల్-ఖహ్హార్: అద్వితీయుడు-ప్రబలుడు**, చూడండి, 6:18 వ్యాఖ్యానం 2.

مَا كَانَ لِيَ مِنْ عِلْمٍ بِالْمَلَإِ الْأَعْلَىٰٓ إِذْ يَخْتَصِمُونَ ﴿٦٩﴾

**69**. (ఓ ము'హమ్మద్! ఇలా అను): "ఉన్నత స్థానాలలో ఉన్న ముఖ్యుల (దేవదూతల) మధ్య (ఆదమ్ సృష్టిని గురించి) ఒకప్పుడు జరిగిన వివాదం గురించి నాకు తెలియదు.[1]

إِن يُوحَىٰٓ إِلَيَّ إِلَّآ أَنَّمَآ أَنَا۠ نَذِيرٌ مُّبِينٌ ﴿٧٠﴾

**70**. "కాని అది నాకు దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారానే తెలుపబడింది. వాస్తవానికి, నేను స్పష్టంగా హెచ్చరిక చేసేవాణ్ణి మాత్రమే!"

إِذْ قَالَ رَبُّكَ لِلْمَلَٰٓئِكَةِ إِنِّي خَٰلِقٌۢ بَشَرًا مِّن طِينٍ ﴿٧١﴾

**71**. నీ ప్రభువు దేవదూతలతో ఇలా అన్న మాటను (జ్ఞాపకంచేసుకో): "నేను మట్టితో ఒక మనిషిని సృష్టించ బోతున్నాను.[2]

فَإِذَا سَوَّيْتُهُۥ وَنَفَخْتُ فِيهِ مِن رُّوحِي فَقَعُوا۟ لَهُۥ سَٰجِدِينَ ﴿٧٢﴾

**72**. "ఇక ఎప్పుడైతే, నేను అతని సృష్టిని పూర్తిచేసి అతనిలో నా (తరఫు నుండి) ఆత్మను (జీవాన్ని) ఊదుతానో అప్పుడు,[3] మీరు అతని ముందు సాష్టాంగం(సజ్దా)లో పడిపొండి."[4]

---

1. ఈ వివాదం గురించి చూడండి, 2:30-34. ఆదమ్('అ.స.)ను గురించి చూడండి, 7:11 -18, 15:26-44, 17:61-65, 18:50, 38:69-85. ఈ ఆయత్ వీటన్నింటి కంటే మొదట అవతరింపజేయబడింది.
2. బషరున్: అంటే ప్రదర్శన, ఇతరులకు కనిపించగలది.
జిన్నున్: అంటే కనబడనిది, ఇవి రెండు వ్యతిరేక భౌతికస్థితిగల జీవాలు.
3. రూహున్: ఆత్మ (ప్రాణం), దీని యజమాని కేవలం అల్లాహ్ (సు.తా.) మాత్రమే. ఆత్మ అనేది అల్లాహ్ (సు.తా.) తప్ప ఇతరుల ఆధీనంలో లేదు. అది (ఆత్మ) ఊదగానే మానవుడు చలనంలోకి వస్తాడు. మానవునిలో అల్లాహుతా'ఆలాయే ఆత్మను ఊదాడు. ఇది ఎంత గౌరవప్రదమైన విషయం.
4. ఈ సజ్దా గౌరవార్థం చేసిందే. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞను శిరసావహించటానికి. ఇది ఆరాధనగా చేసిన సజ్దా కాదు. దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) సున్నత్‌లో గౌరవార్థం చేసే సజ్దా కూడా హరాం చేయబడింది. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'ఒకవేళ ఇది అనుమతించబడి ఉంటే నేను స్త్రీకి తన భర్తకు సజ్దా చేసే అనుమతి ఇచ్చేవాడిని.' (తిర్మిజీ', అల్బానీ ప్రమాణీకం).

فَسَجَدَ ٱلۡمَلَٰٓئِكَةُ كُلُّهُمۡ أَجۡمَعُونَ ٧٣

73. అప్పుడు దేవదూతలందరూ కలసి అతనికి సజ్దా చేశారు[1] -

إِلَّآ إِبۡلِيسَ ٱسۡتَكۡبَرَ وَكَانَ مِنَ ٱلۡكَٰفِرِينَ ٧٤

74. ఒక్క ఇబ్లీస్ [2] తప్ప! అతడు గర్వితుడయ్యాడు మరియు సత్య తిరస్కారులలో కలిసిపోయాడు.

قَالَ يَٰٓإِبۡلِيسُ مَا مَنَعَكَ أَن تَسۡجُدَ لِمَا خَلَقۡتُ بِيَدَيَّۖ أَسۡتَكۡبَرۡتَ أَمۡ كُنتَ مِنَ ٱلۡعَالِينَ ٧٥

75. (అల్లాహ్) ఇలా అన్నాడు: "ఓ ఇబ్లీస్! నేను నా రెండు చేతులతో సృష్టించిన వానికి సాష్టాంగం (సజ్దా) చేయకుండా నిన్ను ఆపింది ఏమిటీ? నీవు గర్వితుడవై పోయావా! లేదా నిన్ను, నీవు ఉన్నతశ్రేణికి చెందిన వాడవనుకున్నావా?"

قَالَ أَنَا۠ خَيۡرٞ مِّنۡهُ خَلَقۡتَنِي مِن نَّارٖ وَخَلَقۡتَهُۥ مِن طِينٖ ٧٦

76. (ఇబ్లీస్) అన్నాడు: "నేను అతనికంటే శ్రేష్ఠుడను. నీవు నన్ను అగ్నితో సృష్టించావు మరియు అతనిని మట్టితో సృష్టించావు."

قَالَ فَٱخۡرُجۡ مِنۡهَا فَإِنَّكَ رَجِيمٞ ٧٧

77. (అల్లాహ్) అన్నాడు: "ఇక ఇక్కడి నుండి వెళ్ళిపో! నిశ్చయంగా, నీవు భ్రష్టుడవు.

وَإِنَّ عَلَيۡكَ لَعۡنَتِيٓ إِلَىٰ يَوۡمِ ٱلدِّينِ ٧٨

78. "మరియు నిశ్చయంగా, తీర్పుదినం వరకు నీపై నా శాపం (బహిష్కారం) ఉంటుంది."

قَالَ رَبِّ فَأَنظِرۡنِيٓ إِلَىٰ يَوۡمِ يُبۡعَثُونَ ٧٩

79. (అప్పుడు ఇబ్లీస్) ఇలా మనవి చేసుకున్నాడు: "ఓ నా ప్రభూ! మృతులు తిరిగి లేపబడే దినంవరకు నాకు వ్యవధి నివ్వు!"

---

1. దైవదూతలందరూ కలసి ఒకే సారి సజ్దా చేశారు.
2. ఇబ్లీస్ దైవదూత కాడు, అతడు జిన్, అగ్నితో సృష్టించబడ్డాడు. దైవదూత ('అలైహిమ్ స.)లు జ్యోతి(నూర్)తో సృష్టించబడ్డారు. ఆదమ్‌కు దైవదూతలు సజ్దా చేసినప్పుడు అతడు అక్కడ ఉండి కూడా అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞను శిరసావహించలేదు, కాబట్టి అల్లాహ్ (సు.తా.) అతన్ని శపించాడు (బహిష్కరించాడు).

قَالَ فَإِنَّكَ مِنَ ٱلْمُنظَرِينَ ﴿٨٠﴾

80. (అల్లాహ్) సెలవిచ్చాడు: "సరే! నీకు వ్యవధి ఇవ్వబడుతోంది!

إِلَىٰ يَوْمِ ٱلْوَقْتِ ٱلْمَعْلُومِ ﴿٨١﴾

81. "ఆ నియమితదినపు ఆ గడువు వచ్చే వరకు."

قَالَ فَبِعِزَّتِكَ لَأُغْوِيَنَّهُمْ أَجْمَعِينَ ﴿٨٢﴾

82. (ఇబ్లీస్) అన్నాడు: "నీ శక్తి సాక్షిగా నేను వారందరినీ తప్పుదారి పట్టిస్తాను;

إِلَّا عِبَادَكَ مِنْهُمُ ٱلْمُخْلَصِينَ ﴿٨٣﴾

83. "వారిలోనుండి నీవు ఎన్నుకున్న నీ దాసుల్ని తప్ప!"

قَالَ فَٱلْحَقُّ وَٱلْحَقَّ أَقُولُ ﴿٨٤﴾

84. (అల్లాహ్) అన్నాడు: "అయితే సత్యం ఇదే! మరియు నేను సత్యం పలుకుతున్నాను;

لَأَمْلَأَنَّ جَهَنَّمَ مِنكَ وَمِمَّن تَبِعَكَ مِنْهُمْ أَجْمَعِينَ ﴿٨٥﴾

85. "నీవు మరియు వారిలో నుండి నిన్ను అనుసరించే వారందరితో నేను నరకాన్ని నింపుతాను!"

قُلْ مَآ أَسْـَٔلُكُمْ عَلَيْهِ مِنْ أَجْرٍ وَمَآ أَنَا۠ مِنَ ٱلْمُتَكَلِّفِينَ ﴿٨٦﴾

86. (ఓ ప్రవక్తా!) వారితో అను: "నేను దీని (ఈ సందేశం) కొరకు మీ నుండి, ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటంలేదు మరియు నేను వంచకులలోని వాడను కాను.

إِنْ هُوَ إِلَّا ذِكْرٌ لِّلْعَٰلَمِينَ ﴿٨٧﴾

87. "ఇది (ఈ ఖుర్ఆన్) సమస్తలోకాల వారందరికీ కేవలం ఒక జ్ఞాపిక (హితబోధ)!

وَلَتَعْلَمُنَّ نَبَأَهُۥ بَعْدَ حِينٍۭ ﴿٨٨﴾

88. "మరియు అచిర కాలంలోనే దీని ఉద్దేశాన్ని (వార్తను) మీరు తప్పక తెలుసుకుంటారు."

*****

## 39. సూరహ్ అజ్-'జుమర్ سُورَةُ الزُّمَرِ

'జుమరున్: అంటే **గుంపులు**, సముదాయం, సమూహం లేక సైనికులు అని అర్థం. ఈ సూరహ్ మధ్య **మక్కా** కాలంలో అవతరింపజేయబడింది. ఇందులో **75 ఆయతులు** ఉన్నాయి. ఈ పదం **71-73 ఆయత్‌లలో** వచ్చింది. అల్లాహ్ (సు.తా.) ఉనికి మరియు ఆయన ఏకత్వం, సృష్టియొక్క ప్రతి దానిలో విశదమౌతోంది. ఎన్నో ఆయతులు అంతిమ ఘడియను గురించి కూడా వివరిస్తున్నాయి. దైవప్రవక్త ('స'అస) ప్రతి రాత్రి నమా'జ్‌లో సూరహ్ అల్-ఇస్రా (17) మరియు ఈ సూరహ్ చదివేవారు. (తిర్మి'జీ', అల్బానీ ప్రమాణీకం). ఈ అనుక్రమంలో ఇది చివరి (ఆరవ) సూరహ్.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

تَنزِيلُ ٱلۡكِتَٰبِ مِنَ ٱللَّهِ ٱلۡعَزِيزِ ٱلۡحَكِيمِ ١

**1.** ఈ గ్రంథ (ఖుర్ఆన్) అవతరణ సర్వ శక్తిమంతుడు, మహా వివేకవంతుడైన అల్లాహ్ తరఫునుండి జరిగింది.

إِنَّآ أَنزَلۡنَآ إِلَيۡكَ ٱلۡكِتَٰبَ بِٱلۡحَقِّ فَٱعۡبُدِ ٱللَّهَ مُخۡلِصٗا لَّهُ ٱلدِّينَ ٢

**2.** (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా మేము ఈ గ్రంథాన్ని, సత్యంతో నీపై అవతరింపజేశాము. కావున నీవు అల్లాహ్‌నే ఆరాధిస్తూ నీ భక్తిని కేవలం ఆయనకొరకే ప్రత్యేకించుకో!

أَلَا لِلَّهِ ٱلدِّينُ ٱلۡخَالِصُۚ وَٱلَّذِينَ ٱتَّخَذُواْ مِن دُونِهِۦٓ أَوۡلِيَآءَ مَا نَعۡبُدُهُمۡ إِلَّا لِيُقَرِّبُونَآ إِلَى ٱللَّهِ زُلۡفَىٰٓ إِنَّ ٱللَّهَ يَحۡكُمُ بَيۡنَهُمۡ فِي مَا

**3.** వినండి! భక్తి కేవలం అల్లాహ్ కొరకు మాత్రమే ప్రత్యేకించబడింది! ఇక ఆయనను వదలి ఇతరులను సంరక్షకులుగా చేసుకునే వారు (ఇలా అంటారు): "వారు మమ్మల్ని అల్లాహ్ సాన్నిధ్యానికి చేర్చుతారని మాత్రమే మేము వారిని ఆరాధిస్తున్నాము!"[1]

---

**1.** సిఫారస్: అల్లాహ్ (సు.తా.) దగ్గర ఎవరి సిఫారసూ చెల్లదు. ఆయన అనుమతించిన వారి సిఫారస్ తప్ప! వారు దైవదూతలు గానీ ప్రవక్తలు గానీ లేక సద్పురుషులు కావచ్చు. కాని ముఖ్య విషయమేమిటంటే, అల్లాహ్ (సు.తా.), తనకు తప్ప ఇతరులకు ఆరాధన / దాస్యం, చేయటాన్ని ఎన్నటికీ క్షమించడు. దైవత్వంలో ఆయనకు

هُمْ فِيهِ يَخْتَلِفُونَ ۗ إِنَّ ٱللَّهَ لَا يَهْدِى مَنْ هُوَ كَـٰذِبٌ كَفَّارٌ ﴿٣﴾

నిశ్చయంగా అల్లాహ్ వారిలో ఉన్న భేదాభిప్రాయాలకు తగినట్లుగా వారి మధ్య తీర్పుచేస్తాడు.[1] నిశ్చయంగా, అల్లాహ్ అసత్యవాదికి, కృతఘ్నునికి మార్గదర్శకత్వం చేయడు.[2]

لَّوْ أَرَادَ ٱللَّهُ أَن يَتَّخِذَ وَلَدًا لَّٱصْطَفَىٰ مِمَّا يَخْلُقُ مَا يَشَآءُ ۚ سُبْحَـٰنَهُۥ ۖ هُوَ ٱللَّهُ ٱلْوَٰحِدُ ٱلْقَهَّارُ ﴿٤﴾

**4**. ఒకవేళ అల్లాహ్ ఎవరినైనా కుమారునిగా చేసుకోదలిస్తే,[3] తన సృష్టిలో తాను కోరిన వానిని ఎన్నుకొని ఉండేవాడు. ఆయన సర్వలోపాలకు అతీతుడు. ఆయన, అల్లాహ్! అద్వితీయుడు, తనసృష్టి మీద సంపూర్ణ అధికారం గలవాడు.[4]

خَلَقَ ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضَ بِٱلْحَقِّ ۖ يُكَوِّرُ ٱلَّيْلَ عَلَى ٱلنَّهَارِ وَيُكَوِّرُ ٱلنَّهَارَ عَلَى ٱلَّيْلِ ۖ وَسَخَّرَ ٱلشَّمْسَ وَٱلْقَمَرَ ۖ كُلٌّ يَجْرِى لِأَجَلٍ مُّسَمًّى ۗ أَلَا هُوَ ٱلْعَزِيزُ ٱلْغَفَّـٰرُ ﴿٥﴾

**5**. ఆయన ఆకాశాలను మరియు భూమిని సత్యంతో సృష్టించాడు.[5] ఆయన రాత్రిని పగటిమీద చుట్టుతున్నాడు. మరియు పగటిని రాత్రిమీద చుట్టుతున్నాడు.[6] సూర్యుణ్ణి మరియు చంద్రుణ్ణి నియమబద్ధులుగా చేసి ఉంచాడు. వాటిలో ప్రతి ఒక్కటీ ఒక నిర్ణీత కాలంలో (నిర్ణీత పరిధిలో) పయనిస్తూ ఉన్నాయి. వినండి! ఆయన, సర్వశక్తిమంతుడు, క్షమించేవాడు.

---

భాగస్వాములను కల్పిస్తే, ఆయన (సు.తా.) దానిని ఎన్నటికీ క్షమించడు. అది తప్ప ఇతర ఏ పాపాన్నైనా, తానుకోరిన వారిని క్షమించవచ్చు!

**1**. అంటే ఆరాధించిన వారి మరియు ఆరాధించబడే వారి మధ్య తీర్పు చేస్తాడు. ఇంకా చూడండి, 34:31-33.

**2**. చూడండి, 6:22-24.

**3**. చూడండి, 6:100 అల్లాహ్ (సు.తా.) సంతానపు లోభానికి అతీతుడు. నిరపేక్షాపరుడు.

**4**. చూడండి, 6:18 వ్యాఖ్యానం 2.

**5**. చూడండి, 10:5.

**6**. చూడండి, 7:54.

خَلَقَكُم مِّن نَّفۡسٖ وَٰحِدَةٖ ثُمَّ جَعَلَ مِنۡهَا زَوۡجَهَا وَأَنزَلَ لَكُم مِّنَ ٱلۡأَنۡعَٰمِ ثَمَٰنِيَةَ أَزۡوَٰجٖۚ يَخۡلُقُكُمۡ فِي بُطُونِ أُمَّهَٰتِكُمۡ خَلۡقٗا مِّنۢ بَعۡدِ خَلۡقٖ فِي ظُلُمَٰتٖ ثَلَٰثٖۚ ذَٰلِكُمُ ٱللَّهُ رَبُّكُمۡ لَهُ ٱلۡمُلۡكُۖ لَآ إِلَٰهَ إِلَّا هُوَۖ فَأَنَّىٰ تُصۡرَفُونَ ٦

6. ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి (ఆదమ్) నుండి సృష్టించాడు. తరువాత అతని నుండి అతని జంట ('జౌజ/'హవ్వా)ను పుట్టించాడు.[1] మరియు మీ కొరకు ఎనిమిది జతల (ఆడ-మగ) పశువులను పుట్టించాడు.[2] ఆయన మిమ్మల్ని మీ తల్లుల గర్భాలలో మూడు చీకటి తెరలలో ఒక రూపం తరువాత మరొక రూపాన్ని ఇచ్చాడు.[3] ఆయనే అల్లాహ్! మీ ప్రభువు విశ్వాధిపత్యం ఆయనదే, ఆయన తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు. అలాంటప్పుడు మీరు ఎలా (సత్యంనుండి) తప్పించబడుతున్నారు?

إِن تَكۡفُرُواْ فَإِنَّ ٱللَّهَ غَنِيٌّ عَنكُمۡۖ وَلَا يَرۡضَىٰ لِعِبَادِهِ ٱلۡكُفۡرَۖ وَإِن تَشۡكُرُواْ يَرۡضَهُ لَكُمۡۗ وَلَا تَزِرُ وَازِرَةٞ وِزۡرَ أُخۡرَىٰۗ ثُمَّ إِلَىٰ رَبِّكُم مَّرۡجِعُكُمۡ فَيُنَبِّئُكُم بِمَا كُنتُمۡ تَعۡمَلُونَۚ إِنَّهُۥ عَلِيمُۢ بِذَاتِ ٱلصُّدُورِ ٧

7. ఒకవేళ మీరు సత్యాన్ని తిరస్కరిస్తే, నిశ్చయంగా, అల్లాహ్ మీ అక్కర లేని వాడు.[4] మరియు ఆయన తన దాసులు సత్యతిరస్కార వైఖరిని అవలంబించడాన్ని ఇష్టపడడు. మరియు మీరు కృతజ్ఞులై నట్లయితే ఆయన మీ పట్ల ఎంతో సంతోష పడతాడు. మరియు బరువు మోసేవాడు ఎవ్వడూ ఇతరుల బరువును మోయడు.[5] చివరకు మీరందరికీ, మీ ప్రభువు వైపునకే మరల వలసి ఉంది! అప్పుడు ఆయన,

---

1. చూడండి, 4:1. 'జౌజ: అంటే, జంట, జత, సహచరి, సహవాసి అనే అర్థాలున్నాయి.
2. అంటే గొర్రె, మేక, ఆవు మరియు ఒంటె. ఇవి ఆడ-మగ కలిసి ఎనిమిది అవుతాయి, వివరాలు 6:143-144లలో వచ్చాయి.
3. ఈ తెరలు: 1) తల్లి కడుపు (Abdominal Wall), 2) గర్భాశయం (Uterine Wall), 3) మావిపొర (Amniotic Membrane). ఇంకా చూడండి, 22:5, 23:12-14.
4. చూడండి, 14:8.
5. ఈ వాక్యం ఖుర్ఆన్‌లో ఐదుసార్లు వచ్చింది. ఇక్కడ మరియు 6:164, 17:15, 35:18, మరియు 53:38. ఇది: 'ఏసు క్రీస్తు, క్రైస్తవులందరి పాపభారాన్ని భరిస్తారు.' అని క్రైస్తవులు అనే సిద్ధాంతాన్ని ఖండిస్తోంది.

మీరు ఏమేమి చేస్తూ ఉండేవారో మీకు తెలియజేస్తాడు. నిశ్చయంగా, ఆయనకు హృదయాలలో ఉన్న విషయాలన్నీ బాగా తెలుసు. (7/8)

**8.** * మానవునికి ఏదైనా కష్టం కలిగినప్పుడు అతడు పశ్చాత్తాపంతో తన ప్రభువు వైపునకు మరలి ఆయనను వేడుకుంటాడు. తరువాత ఆయన (అల్లాహ్) అతనికి తన అనుగ్రహాన్ని ప్రసాదించినప్పుడు, అతడు పూర్వం దేనిని గురించి వేడుకుంటూ ఉండేవాడో దానిని మరచిపోతాడు మరియు అల్లాహ్‌కు సాటికల్పించి, (ఇతరులను) ఆయన మార్గం నుండి తప్పిస్తాడు.[1] (అలాంటివానితో) ఇలా అను: "నీవు, నీ సత్యతిరస్కార వైఖరితో కొంతకాలం సంతోషపడు. నిశ్చయంగా, నీవు నరకవాసుల్లోని వాడవవుతావు!"

۞ وَإِذَا مَسَّ ٱلْإِنسَـٰنَ ضُرٌّ دَعَا رَبَّهُۥ مُنِيبًا إِلَيْهِ ثُمَّ إِذَا خَوَّلَهُۥ نِعْمَةً مِّنْهُ نَسِىَ مَا كَانَ يَدْعُوٓا۟ إِلَيْهِ مِن قَبْلُ وَجَعَلَ لِلَّهِ أَندَادًا لِّيُضِلَّ عَن سَبِيلِهِۦ ۚ قُلْ تَمَتَّعْ بِكُفْرِكَ قَلِيلًا ۖ إِنَّكَ مِنْ أَصْحَـٰبِ ٱلنَّارِ ﴿٨﴾

**9.** ఏమీ? ఎవడైతే శ్రద్ధతో రాత్రి ఘడియలలో సాష్టాంగం (సజ్దా) చేస్తూ మరియు నిలిచి (నమా'జ్) చేస్తూ, పరలోక జీవితమును గురించి భయపడుతూ, తన ప్రభువు కారుణ్యాన్ని ఆశిస్తూ ఉంటాడో! (అలాంటి వాడు, అలా చేయనివాడితో సమానుడా)? వారిని అడుగు: "ఏమీ? విజ్ఞానులు మరియు అజ్ఞానులు సరిసమానులు కాగలరా? వాస్తవానికి బుద్ధిమంతులే హితబోధ స్వీకరిస్తారు.

أَمَّنْ هُوَ قَـٰنِتٌ ءَانَآءَ ٱلَّيْلِ سَاجِدًا وَقَآئِمًا يَحْذَرُ ٱلْـَٔاخِرَةَ وَيَرْجُوا۟ رَحْمَةَ رَبِّهِۦ ۗ قُلْ هَلْ يَسْتَوِى ٱلَّذِينَ يَعْلَمُونَ وَٱلَّذِينَ لَا يَعْلَمُونَ ۗ إِنَّمَا يَتَذَكَّرُ أُو۟لُوا۟ ٱلْأَلْبَـٰبِ ﴿٩﴾

1. చూడండి, 2:22.

قُلْ يَـٰعِبَادِ ٱلَّذِينَ ءَامَنُوا۟ ٱتَّقُوا۟ رَبَّكُمْ ۚ لِلَّذِينَ أَحْسَنُوا۟ فِى هَـٰذِهِ ٱلدُّنْيَا حَسَنَةٌ ۗ وَأَرْضُ ٱللَّهِ وَٰسِعَةٌ ۗ إِنَّمَا يُوَفَّى ٱلصَّـٰبِرُونَ أَجْرَهُم بِغَيْرِ حِسَابٍ ﴿١٠﴾

**10**. (ఓ ము'హమ్మద్! అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడని అను): "ఓ విశ్వసించిన నా దాసులారా! మీ ప్రభువునందు భయభక్తులు కలిగిఉండండి. ఎవరైతే ఈ లోకంలో సత్పురుషులై ఉంటారో (వారికి పరలోకంలో) మేలు జరుగుతుంది. మరియు అల్లాహ్ భూమి చాలా విశాలమైనది.[1] నిశ్చయంగా, సహనం వహించిన వారికి లెక్కలేనంత ప్రతిఫలం ఇవ్వబడుతుంది."

قُلْ إِنِّىٓ أُمِرْتُ أَنْ أَعْبُدَ ٱللَّهَ مُخْلِصًا لَّهُ ٱلدِّينَ ﴿١١﴾

**11**. (ఓ ము'హమ్మద్! ఇంకా) ఇలా అను: "నిశ్చయంగా, నేను అల్లాహ్‌ను మాత్రమే ఆరాధిస్తూ, నా భక్తిని కేవలం ఆయన కొరకే ప్రత్యేకించుకోవాలని ఆజ్ఞాపించబడ్డాను.

وَأُمِرْتُ لِأَنْ أَكُونَ أَوَّلَ ٱلْمُسْلِمِينَ ﴿١٢﴾

**12**. "మరియు నేను అందరికంటే ముందు (అల్లాహ్‌కు) విధేయుడను (ముస్లిం) అయిఉండాలి." అని కూడా ఆజ్ఞాపించబడ్డాను.

قُلْ إِنِّىٓ أَخَافُ إِنْ عَصَيْتُ رَبِّى عَذَابَ يَوْمٍ عَظِيمٍ ﴿١٣﴾

**13**. (ఇంకా) ఇలా అను: "ఒకవేళ నేను నా ప్రభువుకు అవిధేయుడనైతే ఆ మహాదినపు శిక్షకు గురిఅవుతానని భయపడుతున్నాను."

قُلِ ٱللَّهَ أَعْبُدُ مُخْلِصًا لَّهُۥ دِينِى ﴿١٤﴾

**14**. (ఇంకా) ఇలా అను: "నేను కేవలం అల్లాహ్‌నే ఆరాధిస్తూ నా భక్తిని (ఆరాధనను) కేవలం ఆయన కొరకే ప్రత్యేకించుకుంటాను;

---

1. పాపం మరియు సత్యతిరస్కారం నుండి - పుణ్యం, సత్యం మరియు అల్లాహ్ (సు.తా.) వైపునకు - మరలే అవకాశం ఎల్లప్పుడూ ఉంది. ఇదే వాస్తవమైన 'హిజ్‌రత్' వలసపోవటం. ఇంకా చూడండి, 4:97. ఒక వ్యక్తికి తన నివాసస్థలంలో ఉంటూ ఈమాన్‌పై ఉండటం దుర్భరమైతే! అతడు ఇతర చోట్లకు హిజ్‌రత్ చేసి తన ధర్మాన్ని కాపాడుకోవాలి.

15. "కావున మీరు ఆయనను వదలి మీకు ఇష్టమైన వారిని ఆరాధించండి!" ఇంకా ఇలా అను: "పునరుత్థానదినమున తమకు తాము మరియు తమ కుటుంబం వారికి నష్టం కలిగించుకున్న వారే, నిశ్చయంగా నష్టపడ్డవారు. వాస్తవానికి అదే స్పష్టమైన నష్టం!"

فَٱعۡبُدُواْ مَا شِئۡتُم مِّن دُونِهِۦۗ قُلۡ إِنَّ ٱلۡخَٰسِرِينَ ٱلَّذِينَ خَسِرُوٓاْ أَنفُسَهُمۡ وَأَهۡلِيهِمۡ يَوۡمَ ٱلۡقِيَٰمَةِۗ أَلَا ذَٰلِكَ هُوَ ٱلۡخُسۡرَانُ ٱلۡمُبِينُ ﴿١٥﴾

16. వారిని, వారిపై నుండి అగ్ని జ్వాలలు క్రమ్ముకుంటాయి మరియు వారి క్రింది నుండి (అగ్ని జ్వాలలు) క్రమ్ముకుంటాయి. ఈ విధంగా, అల్లాహ్ తన దాసులను భయపెడుతున్నాడు:[1] "ఓ నా దాసులారా! నా పట్ల మాత్రమే భయభక్తులు కలిగి ఉండండి."

لَهُم مِّن فَوۡقِهِمۡ ظُلَلٞ مِّنَ ٱلنَّارِ وَمِن تَحۡتِهِمۡ ظُلَلٞۚ ذَٰلِكَ يُخَوِّفُ ٱللَّهُ بِهِۦ عِبَادَهُۥۚ يَٰعِبَادِ فَٱتَّقُونِ ﴿١٦﴾

17. మరియు ఎవరైతే కల్పిత దైవా('తా'గూత్)లను త్యజించి, వాటిని ఆరాధించకుండా, పశ్చాత్తాపంతో అల్లాహ్ వైపునకు మరలుతారో! వారికి శుభవార్త ఉంది.[2] కావున నా దాసులకు ఈ శుభవార్తను ఇవ్వు!

وَٱلَّذِينَ ٱجۡتَنَبُواْ ٱلطَّٰغُوتَ أَن يَعۡبُدُوهَا وَأَنَابُوٓاْ إِلَى ٱللَّهِ لَهُمُ ٱلۡبُشۡرَىٰۚ فَبَشِّرۡ عِبَادِ ﴿١٧﴾

18. ఎవరైతే మాటను శ్రద్ధగా విని, అందులోని ఉత్తమమైన దానిని అనుసరిస్తారో! అలాంటి వారే, అల్లాహ్ మార్గదర్శకత్వం పొందిన వారు. మరియు అలాంటి వారే బుద్ధిమంతులు.

ٱلَّذِينَ يَسۡتَمِعُونَ ٱلۡقَوۡلَ فَيَتَّبِعُونَ أَحۡسَنَهُۥٓۚ أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ هَدَىٰهُمُ ٱللَّهُۖ وَأُوْلَٰٓئِكَ هُمۡ أُوْلُواْ ٱلۡأَلۡبَٰبِ ﴿١٨﴾

---

1. ఇక్కడ అల్లాహ్ (సు.తా.) తన దాసులను మరొకసారి: 'నరకాగ్ని నుండి మిమ్మల్ని మీరు కాపాడుకోండి.' అని హెచ్చరిస్తున్నాడు. ఈ విధమైన హెచ్చరిక ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు వచ్చింది. చూడండి, 74:35-36.
2. చూడండి, 10:62-64.

**19.** ఏమీ? ఎవడిని గురించి అయితే ఆయన (అల్లాహ్ తరఫు నుండి) శిక్ష నిర్ణయించబడి ఉందో, వానిని నీవు నరకాగ్నిలో నుండి బయటికి తీయగలవా?

**20.** కాని ఎవరైతే తమ ప్రభువు యెడల భయభక్తులు కలిగి ఉన్నారో! వారి కొరకు అంతస్తుపై అంతస్తుగా, కట్టబడిన ఎత్తైన భవనాలు ఉంటాయి. వాటి క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి. ఇది అల్లాహ్ వాగ్దానం. అల్లాహ్ తన వాగ్దానాన్ని ఎన్నడూ భంగపరచడు.

**21.** ఏమీ? నీకు తెలియదా? నిశ్చయంగా, అల్లాహ్ ఆకాశం నుండి నీటిని కురిపించి, తరువాత దానిని భూమిలో ఊటలుగా ప్రవహింపజేస్తున్నాడని? ఆ తరువాత దానివల్ల వివిధ రంగుల వృక్షకోటిని ఉత్పత్తిచేస్తాడు. ఆ తరువాత అది ఎండిపోయినపుడు, నీవు దానిని పసుపు రంగుగా మారి పోవటాన్ని చూస్తావు. చివరకు ఆయన దానిని పొట్టుగా మార్చివేస్తాడు. నిశ్చయంగా, ఇందులో బుద్ధిమంతులకు హితబోధ ఉంది.

**22.** ఏమీ? ఏ వ్యక్తి హృదయాన్నైతే అల్లాహ్ విధేయత (ఇస్లామ్) కొరకు తెరుస్తాడో, అతడు తన ప్రభువు చూపిన వెలుగులో నడుస్తూ ఉంటాడో (అలాంటి వాడు సత్యతిరస్కారితో సమానుడు కాగలడా?) ఎవరి హృదయాలైతే అల్లాహ్ హితోపదేశం పట్ల కఠినమై పోయాయో, అలాంటి వారికి వినాశం ఉంది. అలాంటి వారు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడి ఉన్నారు!

أَفَمَنْ حَقَّ عَلَيْهِ كَلِمَةُ ٱلْعَذَابِ
أَفَأَنتَ تُنقِذُ مَن فِى ٱلنَّارِ ﴿١٩﴾

لَـٰكِنِ ٱلَّذِينَ ٱتَّقَوْا۟ رَبَّهُمْ لَهُمْ غُرَفٌ
مِّن فَوْقِهَا غُرَفٌ مَّبْنِيَّةٌ تَجْرِى مِن
تَحْتِهَا ٱلْأَنْهَـٰرُ ۖ وَعْدَ ٱللَّهِ ۖ لَا يُخْلِفُ
ٱللَّهُ ٱلْمِيعَادَ ﴿٢٠﴾

أَلَمْ تَرَ أَنَّ ٱللَّهَ أَنزَلَ مِنَ ٱلسَّمَآءِ
مَآءً فَسَلَكَهُۥ يَنَـٰبِيعَ فِى ٱلْأَرْضِ
ثُمَّ يُخْرِجُ بِهِۦ زَرْعًا مُّخْتَلِفًا أَلْوَٰنُهُۥ
ثُمَّ يَهِيجُ فَتَرَىٰهُ مُصْفَرًّا ثُمَّ
يَجْعَلُهُۥ حُطَـٰمًا ۚ إِنَّ فِى ذَٰلِكَ
لَذِكْرَىٰ لِأُو۟لِى ٱلْأَلْبَـٰبِ ﴿٢١﴾

أَفَمَن شَرَحَ ٱللَّهُ صَدْرَهُۥ لِلْإِسْلَـٰمِ
فَهُوَ عَلَىٰ نُورٍ مِّن رَّبِّهِۦ ۚ فَوَيْلٌ
لِّلْقَـٰسِيَةِ قُلُوبُهُم مِّن ذِكْرِ ٱللَّهِ ۚ
أُو۟لَـٰٓئِكَ فِى ضَلَـٰلٍ مُّبِينٍ ﴿٢٢﴾

اللَّهُ نَزَّلَ أَحْسَنَ الْحَدِيثِ كِتَابًا
مُتَشَابِهًا مَثَانِيَ تَقْشَعِرُّ مِنْهُ جُلُودُ
الَّذِينَ يَخْشَوْنَ رَبَّهُمْ ثُمَّ تَلِينُ
جُلُودُهُمْ وَقُلُوبُهُمْ إِلَىٰ ذِكْرِ اللَّهِ ۚ
ذَٰلِكَ هُدَى اللَّهِ يَهْدِي بِهِ مَنْ
يَشَاءُ ۚ وَمَنْ يُضْلِلِ اللَّهُ فَمَا لَهُ
مِنْ هَادٍ ﴿٢٣﴾

**23**. అల్లాహ్ సర్వశ్రేష్ఠమైన బోధనను ఒక గ్రంథ రూపంలో అవతరింపజేశాడు. దానిలో ఒకే రకమైన వాటిని (వచనాలను) మాటి మాటికీ ఎన్నోవిధాలుగా (విశదీకరించాడు).[1] తమ ప్రభువుకు భయపడే వారి శరీరాలు (చర్మాలు) దానితో (ఆ పఠనంతో) గజగజ వణకుతాయి. కాని తరువాత వారి చర్మాలు మరియు వారి హృదయాలు అల్లాహ్ ధ్యానం వలన మెత్తబడతాయి. ఇది అల్లాహ్ మార్గదర్శకత్వం. ఆయన దీనితో తాను కోరిన వారికి మార్గదర్శకత్వం చేస్తాడు. మరియు ఏ వ్యక్తిని అల్లాహ్ మార్గభ్రష్టత్వంలో వదలుతాడో అతనికి మార్గదర్శకుడు ఎవ్వడూ ఉండడూ.[2]

أَفَمَنْ يَتَّقِي بِوَجْهِهِ سُوءَ
الْعَذَابِ يَوْمَ الْقِيَامَةِ ۚ وَقِيلَ
لِلظَّالِمِينَ ذُوقُوا مَا كُنْتُمْ تَكْسِبُونَ ﴿٢٤﴾

**24**. ఏమీ? పునరుత్థానదినపు కఠినమైన శిక్షను తన ముఖంతో కాపాడుకోవలసిన వాడు (స్వర్గంలో ప్రవేశించే వానితో సమానుడా)? మరియు (ఆ రోజు) దుర్మార్గులతో ఇలా అనబడుతుంది: "మీరు సంపాదించిన దానిని రుచిచూడండి."

كَذَّبَ الَّذِينَ مِنْ قَبْلِهِمْ فَأَتَاهُمُ
الْعَذَابُ مِنْ حَيْثُ لَا يَشْعُرُونَ ﴿٢٥﴾

**25**. వీరికి పూర్వమున్న వారు కూడా (అల్లాహ్ సందేశాలను) అబద్ధాలని తిరస్కరించారు, కాబట్టి వారు ఊహించలేని దిశనుండి వారిపై శిక్ష వచ్చిపడింది.

فَأَذَاقَهُمُ اللَّهُ الْخِزْيَ فِي الْحَيَاةِ
الدُّنْيَا ۖ وَلَعَذَابُ الْآخِرَةِ أَكْبَرُ ۚ لَوْ
كَانُوا يَعْلَمُونَ ﴿٢٦﴾

**26**. ఈ విధంగా, అల్లాహ్ వారికి ఇహలోక జీవితంలో కూడా అవమానాన్ని రుచి చూపాడు.[3] మరియు వారి పరలోక శిక్ష దీనికంటే ఎంతో ఘోరమైనదిగా ఉంటుంది. వారు ఇది గ్రహిస్తే ఎంత బాగుండేది!

---

**1**. చూడండి, 4:82 మరియు 25:32.
**2**. చూడండి, 14:4.
**3**. చూడండి, 16:26.

وَلَقَدۡ ضَرَبۡنَا لِلنَّاسِ فِي هَٰذَا ٱلۡقُرۡءَانِ مِن كُلِّ مَثَلٖ لَّعَلَّهُمۡ يَتَذَكَّرُونَ ٢٧

**27**. మరియు వాస్తవానికి మేము ఈ ఖుర్ఆన్‌లో ప్రజల కొరకు అనేకరకాల దృష్టాంతాలు పేర్కొన్నాము; బహుశా వారు గుణపాఠం నేర్చుకుంటారని;

قُرۡءَانًا عَرَبِيًّا غَيۡرَ ذِي عِوَجٖ لَّعَلَّهُمۡ يَتَّقُونَ ٢٨

**28**. అరబ్బీ భాషలో ఉన్న ఈ ఖుర్ఆన్‌ను,[1] ఏ విధమైన వక్రత లేకుండా అవతరింపజేశాము; బహుశా వారు దైవభీతి కలిగివుంటారని.

ضَرَبَ ٱللَّهُ مَثَلٗا رَّجُلٗا فِيهِ شُرَكَآءُ مُتَشَٰكِسُونَ وَرَجُلٗا سَلَمٗا لِّرَجُلٍ هَلۡ يَسۡتَوِيَانِ مَثَلًاۚ ٱلۡحَمۡدُ لِلَّهِۚ بَلۡ أَكۡثَرُهُمۡ لَا يَعۡلَمُونَ ٢٩

**29**. అల్లాహ్ ఒక దృష్టాంతం ఇస్తున్నాడు: ఒక మానవుడు (బానిస) పరస్పరం విరోధమున్న ఎంతోమంది యజమానులకు చెందినవాడు. మరొక మానవుడు (బానిస) పూర్తిగా ఒకే ఒక్క యజమానికి చెందిన వాడు. వారిద్దరి పరిస్థితి సమానంగా ఉంటుందా?[2] సర్వస్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే! కాని వారిలో చాలా మందికి ఇది తెలియదు.

إِنَّكَ مَيِّتٞ وَإِنَّهُم مَّيِّتُونَ ٣٠

**30**. (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా, (ఒక రోజు) నీవు మరణిస్తావు మరియు నిశ్చయంగా, వారు కూడా మరణిస్తారు.[3]

ثُمَّ إِنَّكُمۡ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ عِندَ رَبِّكُمۡ تَخۡتَصِمُونَ ٣١

**31**. ఆ తరువాత నిశ్చయంగా పునరుత్థాన దినమున మీరంతా మీ ప్రభువు సమక్షంలో, మీ వివాదాలను విన్నవించుకుంటారు.

---

**1**. చూడండి, 12:2, 13:37, 14:4, మరియు 41:44.

**2**. ఇదే విధంగా ఎంతోమంది దైవాలను ఆరాధించే వాడు, ఒకే అల్లాహ్ (సు.తా.)ను ఆరాధించే వాడితో సమానుడు కాలేడు. బహుదైవారాధకుడు ఎల్లప్పుడు వారి కలహాలలో మునిగిఉంటాడు.

**3**. చూడండి, 3:144 ఇతర మానవుల వలే దైవప్రవక్త('స'అస)కు కూడా మరణం వచ్చింది. పునరుత్థాన దినం వరకు అతను కూడా బర్'జఖ్‌లో ఉంటారు.

32. (*) ఇక అల్లాహ్‌ను గురించి అసత్యం కల్పించి, సత్యం తనముందుకు వచ్చినప్పుడు దానిని తిరస్కరించే వానికంటే పరమ దుర్మార్గుడెవడు? అందుకే! సత్యతిరస్కారులకు కేవలం నరకంలోనే కదా నివాసం ఉండేది?

33. మరియు సత్యాన్ని తెచ్చిన వాడూ మరియు దానిని హృదయపూర్వకంగా నమ్మిన వాడూ; ఇలాంటివారే దైవభీతి గలవారు.

34. వారికి తమ ప్రభువువద్ద వారు కోరిందంతా లభిస్తుంది. ఇదే సజ్జనులకు దొరికే ప్రతిఫలం.[1]

35. దానికి బదులుగా అల్లాహ్, వారు చేసిన ఘోర పాపకార్యాలను రద్దుచేయటానికి మరియు వారు చేస్తూవచ్చిన మంచి పనులకు అత్యుత్తమ ప్రతిఫలం ఇవ్వటానికి!

36. ఏమీ? అల్లాహ్ తన దాసునికి చాలడా? అయినా వారు ఆయన (అల్లాహ్)ను విడిచి, ఇతరులను గురించి నిన్ను భయపెడుతున్నారు మరియు అల్లాహ్ మార్గభ్రష్టత్వంలో పడనిచ్చిన వానికి మార్గదర్శకుడు ఎవ్వడూ ఉండడు.

۞ فَمَنْ أَظْلَمُ مِمَّن كَذَبَ عَلَى
ٱللَّهِ وَكَذَّبَ بِٱلصِّدْقِ إِذْ جَآءَهُۥٓۚ
أَلَيْسَ فِى جَهَنَّمَ مَثْوًى
لِّلْكَٰفِرِينَ ﴿٣٢﴾
وَٱلَّذِى جَآءَ بِٱلصِّدْقِ وَصَدَّقَ
بِهِۦٓۙ أُو۟لَٰٓئِكَ هُمُ ٱلْمُتَّقُونَ ﴿٣٣﴾
لَهُم مَّا يَشَآءُونَ عِندَ رَبِّهِمْۚ ذَٰلِكَ
جَزَآءُ ٱلْمُحْسِنِينَ ﴿٣٤﴾
لِيُكَفِّرَ ٱللَّهُ عَنْهُمْ أَسْوَأَ ٱلَّذِى
عَمِلُوا۟ وَيَجْزِيَهُمْ أَجْرَهُم بِأَحْسَنِ
ٱلَّذِى كَانُوا۟ يَعْمَلُونَ ﴿٣٥﴾
أَلَيْسَ ٱللَّهُ بِكَافٍ عَبْدَهُۥۖ
وَيُخَوِّفُونَكَ بِٱلَّذِينَ مِن
دُونِهِۦۚ وَمَن يُضْلِلِ ٱللَّهُ فَمَا لَهُۥ
مِنْ هَادٍ ﴿٣٦﴾

1. ము'హ్సినీన్: దీనికి సజ్జనులు, పుణ్యవంతులు, సత్పురుషులు మొదలైన అర్థాలున్నాయి. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'మీరు అల్లాహ్ (సు.తా.)ను ఆరాధించేటప్పుడు మీరు ఆయన (సు.తా.)ను చూస్తున్నారని భావించండి. అది సాధ్యం కాకపోతే కనీసం ఆయన (సు.తా.) మిమ్మల్నిచూస్తున్నాడని భావించండి. (అన్ త'అబుదల్లాహ్ క అన్నక తరాహు; ఫ ఇన్ లమ్ తకున్ తరాహు, ఫ ఇన్నహు యరాక).'

**37.** మరియు అల్లాహ్ మార్గదర్శకత్వం చేసిన వానిని, మార్గభ్రష్టుడు చేయగలవాడెవ్వడూ లేడు! ఏమీ? అల్లాహ్ సర్వశక్తిమంతుడు, ప్రతీకారం చేయగలవాడు కాడా?

**38.** మరియు ఒకవేళ నీవు వారితో: "భూమ్యాకాశాలను సృష్టించింది ఎవరు?" అని అడిగితే, వారు నిశ్చయంగా: "అల్లాహ్!" అని అంటారు.[1] వారిని ఇలా అడుగు: "ఏమీ? మీరు ఆలోచించరా? అల్లాహ్‌ను వదలి మీరు ఆరాధించేవి - అల్లాహ్ నాకు కీడు చేయదలచుకుంటే - ఆయన కీడునుండి, నన్ను తప్పించగలవా? లేక, ఆయన (అల్లాహ్) నన్ను కరుణించగోరితే ఇవి ఆయన కారుణ్యాన్ని ఆపగలవా?" వారితో ఇంకా ఇలా అను: "నాకు కేవలం అల్లాహ్ చాలు! ఆయన(అల్లాహ్)ను నమ్మేవారు (విశ్వాసులు), కేవలం ఆయన మీదే నమ్మకముంచుకుంటారు."

**39.** (ఓ ము'హమ్మద్!) వారితో ఇలా అను: "నా జాతి ప్రజలారా! మీరు మీ ఇష్ట ప్రకారం మీపని చేస్తూ ఉండండి; నిశ్చయంగా, నేనూ నాపని చేస్తూఉంటాను. తరువాత మీరు తెలుసుకోగలరు;

**40.** "(ఇహలోకంలో) ఎవరిమీద అవమానకరమైన శిక్ష వచ్చిపడుతుందో మరియు (పరలోక జీవితంలో) ఎవరిమీద శాశ్వతమైన శిక్ష పడనున్నదో!"

وَمَن يَهْدِ ٱللَّهُ فَمَا لَهُۥ مِن مُّضِلٍّ ۗ أَلَيْسَ ٱللَّهُ بِعَزِيزٍ ذِى ٱنتِقَامٍ ﴿٣٧﴾

وَلَئِن سَأَلْتَهُم مَّنْ خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ لَيَقُولُنَّ ٱللَّهُ ۚ قُلْ أَفَرَءَيْتُم مَّا تَدْعُونَ مِن دُونِ ٱللَّهِ إِنْ أَرَادَنِىَ ٱللَّهُ بِضُرٍّ هَلْ هُنَّ كَٰشِفَٰتُ ضُرِّهِۦٓ أَوْ أَرَادَنِى بِرَحْمَةٍ هَلْ هُنَّ مُمْسِكَٰتُ رَحْمَتِهِۦ ۚ قُلْ حَسْبِىَ ٱللَّهُ ۖ عَلَيْهِ يَتَوَكَّلُ ٱلْمُتَوَكِّلُونَ ﴿٣٨﴾

قُلْ يَٰقَوْمِ ٱعْمَلُوا۟ عَلَىٰ مَكَانَتِكُمْ إِنِّى عَٰمِلٌ ۖ فَسَوْفَ تَعْلَمُونَ ﴿٣٩﴾

مَن يَأْتِيهِ عَذَابٌ يُخْزِيهِ وَيَحِلُّ عَلَيْهِ عَذَابٌ مُّقِيمٌ ﴿٤٠﴾

1. ఇటువంటి వాక్యానికి చూడండి, 31:25.

إِنَّآ أَنزَلْنَا عَلَيْكَ ٱلْكِتَٰبَ لِلنَّاسِ بِٱلْحَقِّ ۖ فَمَنِ ٱهْتَدَىٰ فَلِنَفْسِهِۦ ۖ وَمَن ضَلَّ فَإِنَّمَا يَضِلُّ عَلَيْهَا ۖ وَمَآ أَنتَ عَلَيْهِم بِوَكِيلٍ ﴿٤١﴾

**41**. నిశ్చయంగా, మేము మానవులందరి కొరకు, ఈ గ్రంథాన్ని, సత్యంతో నీపై అవతరింపజేశాము. కావున సన్మార్గం పై నడిచేవాడు, తన మేలుకొరకే అలా చేస్తాడు. మరియు నిశ్చయంగా, మార్గభ్రష్టుడైనవాడు తన కీడుకొరకే మార్గభ్రష్టుడవుతాడు. మరియు నీవు వారికొరకు బాధ్యుడవుకావు.[1]

ٱللَّهُ يَتَوَفَّى ٱلْأَنفُسَ حِينَ مَوْتِهَا وَٱلَّتِى لَمْ تَمُتْ فِى مَنَامِهَا ۖ فَيُمْسِكُ ٱلَّتِى قَضَىٰ عَلَيْهَا ٱلْمَوْتَ وَيُرْسِلُ ٱلْأُخْرَىٰٓ إِلَىٰٓ أَجَلٍ مُّسَمًّى ۚ إِنَّ فِى ذَٰلِكَ لَءَايَٰتٍ لِّقَوْمٍ يَتَفَكَّرُونَ ﴿٤٢﴾

**42**. అల్లాహ్‌యే ఆత్మలను (ప్రాణాలను) మరణ కాలమున వశపరచుకునే వాడు మరియు మరణించని వాడి (ఆత్మలను) నిద్రావస్థలో (వశపరచుకునే వాడునూ). తరువాత దేనికైతే మరణం నిర్ణయింప బడుతుందో దానిని ఆపుకొని, మిగతా వారి (ఆత్మలను) ఒక నియమిత కాలం కొరకు తిరిగి పంపుతాడు.[2] నిశ్చయంగా, ఇందులో ఆలోచించే వారికి గొప్ప సూచన (ఆయతు)లు ఉన్నాయి.

أَمِ ٱتَّخَذُوا۟ مِن دُونِ ٱللَّهِ شُفَعَآءَ ۚ قُلْ أَوَلَوْ كَانُوا۟ لَا يَمْلِكُونَ شَيْـًٔا وَلَا يَعْقِلُونَ ﴿٤٣﴾

**43**. ఏమీ? వారు అల్లాహ్‌ను వదలి ఇతరులను సిఫారసుదారులుగా చేసుకున్నారా? వారిని ఇలా అడుగు: "ఏమీ? వారికెలాంటి అధికారం లేకున్నా మరియు వారికి బుద్ధి లేకున్నానా?"[3]

---

**1**. చూడండి, 17:2

**2**. చూడండి, 6:60-61.

**3**. చూడండి, 2:255 అల్లాహ్ (సు.తా.) అనుమతిచ్చిన వాడు తప్ప మరెవ్వరూ సిఫారసు చేయలేరు. ఇంకా చూడండి, 20:109, 21:28 లేక 34:23. పునరుత్థానదినమున అల్లాహ్ (సు.తా.) తన ప్రవక్తలకు సిఫారసు చేయటానికి అనుమతినిస్తాడు, అలాంటి వారి కొరకు ఎవరి పశ్చాత్తాపాన్నైతే అల్లాహ్ (సు.తా.) అంగీకరించాడో! చూడండి, 19:87. అల్లాహ్ (సు.తా.) దగ్గర ఎవ్వరి సిఫారసు అవసరం లేదు. ఆయన సర్వజ్ఞుడు. ఆయన తాను కోరినదే చేస్తాడు. అలాంటప్పుడు కేవలం ఆ ఏకైక ప్రభువు, అల్లాహ్ (సు.తా.) ఆరాధననే ఎందుకు చేయకూడదు? అప్పుడు ఎవ్వరి సిఫారసు అవసరముండదు.

قُل لِّلَّهِ ٱلشَّفَٰعَةُ جَمِيعًاۖ لَّهُۥ مُلْكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِۖ ثُمَّ إِلَيْهِ تُرْجَعُونَ ﴿٤٤﴾

**44**. ఇలా అను: "సిఫారసు కేవలం అల్లాహ్ అధీనంలోనే ఉంది. భూమ్యాకాశాల సామ్రాజ్యాధిపత్యం కేవలం ఆయనకే చెందుతుంది. తరువాత ఆయన వైపునకే మీరంతా మరలింపబడతారు."

وَإِذَا ذُكِرَ ٱللَّهُ وَحْدَهُ ٱشْمَأَزَّتْ قُلُوبُ ٱلَّذِينَ لَا يُؤْمِنُونَ بِٱلْءَاخِرَةِۖ وَإِذَا ذُكِرَ ٱلَّذِينَ مِن دُونِهِۦٓ إِذَا هُمْ يَسْتَبْشِرُونَ ﴿٤٥﴾

**45**. మరియు ఒకవేళ అద్వితీయుడైన అల్లాహ్‌ను గురించి ప్రస్తావన జరిగినపుడు, పరలోకాన్ని విశ్వసించని వారి హృదయాలు క్రుంగిపోతాయి. మరియు ఒకవేళ ఆయన తప్ప ఇతరుల ప్రస్తావన జరిగినపుడు వారు సంతోషంతో పొంగిపోతారు!

قُلِ ٱللَّهُمَّ فَاطِرَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ عَٰلِمَ ٱلْغَيْبِ وَٱلشَّهَٰدَةِ أَنتَ تَحْكُمُ بَيْنَ عِبَادِكَ فِى مَا كَانُوا۟ فِيهِ يَخْتَلِفُونَ ﴿٤٦﴾

**46**. ఇలా అను: "ఓ అల్లాహ్! భూమ్యాకాశాల సృష్టికి మూలాధారుడా! అగోచర, గోచరాలను ఎరిగిన వాడా! నీవే నీ దాసుల మధ్య ఉన్న భేదాభిప్రాయాలను గురించి తీర్పు చేసేవాడవు."

وَلَوْ أَنَّ لِلَّذِينَ ظَلَمُوا۟ مَا فِى ٱلْأَرْضِ جَمِيعًا وَمِثْلَهُۥ مَعَهُۥ لَٱفْتَدَوْا۟ بِهِۦ مِن سُوٓءِ ٱلْعَذَابِ يَوْمَ ٱلْقِيَٰمَةِۚ وَبَدَا لَهُم مِّنَ ٱللَّهِ مَا لَمْ يَكُونُوا۟ يَحْتَسِبُونَ ﴿٤٧﴾

**47**. మరియు ఒకవేళ వాస్తవానికి ఈ దుర్మార్గులవద్ద భూమిలో ఉన్న సమస్తమూ మరియు దానితోపాటు దానంత (రెట్టింపు) సంపదఉన్నా పునరుత్థానదినపు ఘోరశిక్ష నుండి తప్పించుకోవటానికి, వారు దానిని పరిహారంగా ఇవ్వగోరుతారు.[1] ఎందుకంటే! అల్లాహ్ తరఫునుండి వారిముందు, వారు ఎన్నడూ లెక్కించనిదంతా ప్రత్యక్ష మవుతుంది.

---

**1**. చూడండి, 3:91. కాని అది, స్వీకరించబడదు. దీనికి ఇంకా చూడండి, 2:48.

وَبَدَا لَهُمْ سَيِّـَٔاتُ مَا كَسَبُواْ وَحَاقَ بِهِم مَّا كَانُواْ بِهِۦ يَسْتَهْزِءُونَ ﴿٤٨﴾

48. మరియు వారు చేసివున్న దుష్టకార్యాలన్నీ స్పష్టంగా వారిముందుకు వస్తాయి మరియు వారు ఎగతాళి చేస్తూ వచ్చిందే వారిని చుట్టుకుంటుంది.

فَإِذَا مَسَّ ٱلْإِنسَـٰنَ ضُرٌّ دَعَانَا ثُمَّ إِذَا خَوَّلْنَـٰهُ نِعْمَةً مِّنَّا قَالَ إِنَّمَآ أُوتِيتُهُۥ عَلَىٰ عِلْمٍۭ ۚ بَلْ هِىَ فِتْنَةٌ وَلَـٰكِنَّ أَكْثَرَهُمْ لَا يَعْلَمُونَ ﴿٤٩﴾

49. ఒకవేళ మానవునికి ఆపద వస్తే అతడు మమ్మల్ని వేడుకుంటాడు. ఆ తరువాత మేము మా దిక్కునుండి అతనికి అనుగ్రహాన్ని ప్రసాదిస్తే అతడు: "నిశ్చయంగా ఇది నాకున్న తెలివివల్ల నాకు ఇవ్వబడింది!"[1] అని అంటాడు. వాస్తవానికి, అది ఒక పరీక్ష; కాని చాలా మంది ఇది తెలుసుకోలేరు.

قَدْ قَالَهَا ٱلَّذِينَ مِن قَبْلِهِمْ فَمَآ أَغْنَىٰ عَنْهُم مَّا كَانُواْ يَكْسِبُونَ ﴿٥٠﴾

50. వాస్తవానికి, వీరికి పూర్వం గతించిన వారు కూడా ఇలాగే అన్నారు, కాని వారు సంపాదించినదంతా వారికి ఏ విధంగానూ పనికి రాలేదు.

فَأَصَابَهُمْ سَيِّـَٔاتُ مَا كَسَبُواْ ۚ وَٱلَّذِينَ ظَلَمُواْ مِنْ هَـٰٓؤُلَآءِ سَيُصِيبُهُمْ سَيِّـَٔاتُ مَا كَسَبُواْ وَمَا هُم بِمُعْجِزِينَ ﴿٥١﴾

51. కావున, వారు చేసిన దుష్కార్యాల ఫలితాలు వారిపై పడ్డాయి. మరియు వారిలోని దుర్మార్గులు తాము చేసిన దుష్కార్యాల ఫలితాలను త్వరలోనే అనుభవించగలరు. మరియు వారు ఏవిధంగానూ తప్పించుకోలేరు.

أَوَلَمْ يَعْلَمُوٓاْ أَنَّ ٱللَّهَ يَبْسُطُ ٱلرِّزْقَ لِمَن يَشَآءُ وَيَقْدِرُ ۚ إِنَّ فِى ذَٰلِكَ لَـَٔايَـٰتٍ لِّقَوْمٍ يُؤْمِنُونَ ﴿٥٢﴾

52. ఏమీ? వారికి తెలియదా? నిశ్చయంగా, అల్లాహ్ తాను కోరిన వారికి జీవనోపాధిని పుష్కలంగా ప్రసాదిస్తాడని మరియు (తాను కోరినవారికి) మితంగా ఇస్తాడని? నిశ్చయంగా ఇందులో విశ్వసించే వారికి ఎన్నో సూచనలు (ఆయాత్) ఉన్నాయి. (1/8)

---

1. చూడండి, 28:78.

53. * ఇలా అను: "స్వయంగా మీకు (మీ ఆత్మలకు) మీరే అన్యాయం చేసుకున్న నా దాసులారా! అల్లాహ్ కారుణ్యం పట్ల నిరాశ చెందకండి. నిశ్చయంగా, అల్లాహ్ అన్ని పాపాలను క్షమిస్తాడు.[1] నిశ్చయంగా ఆయన! కేవలం ఆయనే క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

54. "మరియు మీరు పశ్చాత్తాపంతో మీ ప్రభువు వైపునకు మరలండి మరియు మీ పైకి శిక్ష రాకముందే, మీరు ఆయనకు విధేయులు (ముస్లింలు) అయి ఉండండి, తరువాత మీకు ఎలాంటి సహాయం లభించదు.[2]

55. "మరియు మీకు తెలియకుండానే అకస్మాత్తుగా, మీపైకి శిక్ష రాకముందే మీ ప్రభువు తరఫునుండి మీ కొరకు అవతరింపజేయబడిన శ్రేష్ఠమైన దానిని (ఈ ఖుర్ఆన్‌ను) అనుసరించండి."[3]

56. లేకపోతే మానవుడు: "నా పాడుగాను! నేను అల్లాహ్ విషయంలో ఇంత నిర్లక్ష్యంగా ఉండకపోతే మరియు ఎగతాళి చేసేవారిలో చేరి ఉండకపోతే ఎంత బాగుండేది!" అని పశ్చాత్తాపపడవచ్చు!

57. లేక, ఇలా అనవచ్చు: "ఒకవేళ అల్లాహ్ నాకు సన్మార్గం చూపివుంటే, నేను కూడా దైవభీతి గలవారిలో చేరిపోయే వాడిని కదా!"[4]

۞ قُلْ يَـٰعِبَادِىَ ٱلَّذِينَ أَسْرَفُوا۟ عَلَىٰٓ
أَنفُسِهِمْ لَا تَقْنَطُوا۟ مِن رَّحْمَةِ ٱللَّهِ ۚ
إِنَّ ٱللَّهَ يَغْفِرُ ٱلذُّنُوبَ جَمِيعًا ۚ إِنَّهُۥ
هُوَ ٱلْغَفُورُ ٱلرَّحِيمُ ﴿٥٣﴾
وَأَنِيبُوٓا۟ إِلَىٰ رَبِّكُمْ وَأَسْلِمُوا۟ لَهُۥ
مِن قَبْلِ أَن يَأْتِيَكُمُ ٱلْعَذَابُ
ثُمَّ لَا تُنصَرُونَ ﴿٥٤﴾
وَٱتَّبِعُوٓا۟ أَحْسَنَ مَآ أُنزِلَ إِلَيْكُم
مِّن رَّبِّكُم مِّن قَبْلِ أَن
يَأْتِيَكُمُ ٱلْعَذَابُ بَغْتَةً
وَأَنتُمْ لَا تَشْعُرُونَ ﴿٥٥﴾
أَن تَقُولَ نَفْسٌ يَـٰحَسْرَتَىٰ عَلَىٰ مَا
فَرَّطتُ فِى جَنۢبِ ٱللَّهِ وَإِن كُنتُ
لَمِنَ ٱلسَّـٰخِرِينَ ﴿٥٦﴾
أَوْ تَقُولَ لَوْ أَنَّ ٱللَّهَ هَدَىٰنِى
لَكُنتُ مِنَ ٱلْمُتَّقِينَ ﴿٥٧﴾

---

1. చూడండి, 6:54 మరియు 4:110.
2. మరణం ఆసన్నమైనప్పుడు చేసే పశ్చాత్తాపం అంగీకరించబడదు. చూడండి, 4:18.
3. ఈ శిక్ష ఇహలోకంలో వచ్చే ఆపదలు.
4. చూడండి, 6:148.

أَوۡ تَقُولَ حِينَ تَرَى ٱلۡعَذَابَ لَوۡ أَنَّ لِي كَرَّةٗ فَأَكُونَ مِنَ ٱلۡمُحۡسِنِينَ ٥٨

**58**. లేక, శిక్షను చూసి ఇలా అనవచ్చు: "ఒకవేళ నాకు మరల (ఇహలోకానికి) పోయే అవకాశం దొరికి ఉంటే నేను తప్పక సజ్జనులలో చేరిపోయే వాడిని కదా!"[1]

بَلَىٰ قَدۡ جَآءَتۡكَ ءَايَٰتِي فَكَذَّبۡتَ بِهَا وَٱسۡتَكۡبَرۡتَ وَكُنتَ مِنَ ٱلۡكَٰفِرِينَ ٥٩

**59**. (అప్పుడు అతనికి అల్లాహ్ ఇలా సెలవిస్తాడు): "అలా కాదు! వాస్తవానికి నా సూచన (ఆయతు)లు నీ వద్దకు వచ్చాయి. కాని నీవు వాటిని అబద్ధాలని తిరస్కరించావు మరియు గర్వానికి లోనయ్యావు మరియు నీవు సత్యతిరస్కారులలో చేరిపోయావు."

وَيَوۡمَ ٱلۡقِيَٰمَةِ تَرَى ٱلَّذِينَ كَذَبُواْ عَلَى ٱللَّهِ وُجُوهُهُم مُّسۡوَدَّةٌۚ أَلَيۡسَ فِي جَهَنَّمَ مَثۡوٗى لِّلۡمُتَكَبِّرِينَ ٦٠

**60**. మరియు పునరుత్థాన దినమున, అల్లాహ్‌పై అబద్ధాలు పలికిన వారి ముఖాలను, నల్లగా మారిపోవటాన్ని నీవు గమనిస్తావు. ఏమీ? ఈ గర్విష్ఠుల నివాసం నరకంలోనే ఉండదా?

وَيُنَجِّي ٱللَّهُ ٱلَّذِينَ ٱتَّقَوۡاْ بِمَفَازَتِهِمۡ لَا يَمَسُّهُمُ ٱلسُّوٓءُ وَلَا هُمۡ يَحۡزَنُونَ ٦١

**61**. మరియు అల్లాహ్, భయభక్తులు గలవారిని వారి సాఫల్యానికి బదులుగా వారికి ముక్తిని ప్రసాదిస్తాడు. ఎలాంటి బాధ వారిని ముట్టుకోదు మరియు వారు దుఃఖపడరు కూడా!

ٱللَّهُ خَٰلِقُ كُلِّ شَيۡءٖۖ وَهُوَ عَلَىٰ كُلِّ شَيۡءٖ وَكِيلٞ ٦٢

**62**. అల్లాహ్‌యే ప్రతిదాని సృష్టికర్త మరియు ఆయనే ప్రతిదానికీ కార్యకర్త.[2]

لَّهُۥ مَقَالِيدُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۗ وَٱلَّذِينَ كَفَرُواْ بِـَٔايَٰتِ ٱللَّهِ أُوْلَٰٓئِكَ هُمُ ٱلۡخَٰسِرُونَ ٦٣

**63**. ఆకాశాలలో మరియు భూమిలో ఉన్న నిక్షేపాల తాళపుచెవులు ఆయనవద్దనే ఉన్నాయి. మరియు ఎవరైతే అల్లాహ్‌సూచన (ఆయత్)లను తిరస్కరిస్తారో అలాంటివారు, వారే! నష్టానికి గురిఅయ్యే వారు.

---

**1**. చూడండి, 2:167, 26:102 మరియు 6:27-28.

**2**. **అల్-వకీలు:** కార్యకర్త. చూడండి, 3:173 వ్యాఖ్యానం 2.

## 73. సూరహ్ అల్-ము'జ్జమ్మిల్

## سُورَةُ المُزَّمِّلِ

అల్-ము'జ్జమ్మిల్: The Enwrapped One దుప్పటి కప్పుకున్నవాడు. ఈ సూరహ్ అవతరణాక్రమంలో నాలుగవది. మొదటి మక్కా కాలానికి చెందినది. దీనిపేరు **మొదటి ఆయత్‌లోనుండి** తీసుకోబడింది. ఇందులో **20** ఆయతులు ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

يَٰٓأَيُّهَا ٱلْمُزَّمِّلُ ۝١

**1**. ఓ దుప్పటి కప్పుకున్నవాడా![1]

قُمِ ٱلَّيْلَ إِلَّا قَلِيلًا ۝٢

**2**. రాత్రంతా (నమా'జ్‌లో) నిలబడు, కొంత భాగాన్ని విడిచి;

نِّصْفَهُۥٓ أَوِ ٱنقُصْ مِنْهُ قَلِيلًا ۝٣

**3**. దాని సగభాగంలో, లేదా దానికంటే కొంత తక్కువ;

أَوْ زِدْ عَلَيْهِ وَرَتِّلِ ٱلْقُرْءَانَ تَرْتِيلًا ۝٤

**4**. లేదా దానికంటే కొంత ఎక్కువ; మరియు ఖుర్ఆన్‌ను ఆగి-ఆగి, నెమ్మదిగా, స్పష్టంగా పఠించు.

إِنَّا سَنُلْقِى عَلَيْكَ قَوْلًا ثَقِيلًا ۝٥

**5**. నిశ్చయంగా, మేము నీపై భారమైన సందేశాన్ని అవతరింపజేయబోతున్నాము.

إِنَّ نَاشِئَةَ ٱلَّيْلِ هِىَ أَشَدُّ وَطْـًٔا وَأَقْوَمُ قِيلًا ۝٦

**6**. నిశ్చయంగా, రాత్రివేళ లేవటం (మనస్సును) అదుపులో ఉంచుకోవటానికి ఎంతో ఉపయుక్తమైనది మరియు (అల్లాహ్) ప్రవచనాలను (అర్థం చేసుకోవటానికి) కూడా ఎంతో అనుగుణమైనది.

إِنَّ لَكَ فِى ٱلنَّهَارِ سَبْحًا طَوِيلًا ۝٧

**7**. వాస్తవానికి, పగటివేళ నీకు చాలా పనులుంటాయి.

---

**1**. ఈ సూరహ్ అవతరింపజేయబడినప్పుడు దైవప్రవక్త ('స'అస) దుప్పటి కప్పుకొని పడుకొని ఉంటారు. అతనికి లేచి తహజ్జుద్ నమా'జ్ చేయమని ఆజ్ఞ ఇవ్వబడింది. తహజ్జుద్ అతని కొరకు వాజిబ్-తప్పనిసరి చేయబడి ఉండెను. (ఇబ్నె-కసీ'ర్).

**8**. మరియు నీవు నీ ప్రభువు నామాన్ని స్మరిస్తూ ఉండు. మరియు అత్యంత శ్రద్ధతో ఆయనవైపుకు మరలుతూ ఉండు.

**9**. ఆయనే తూర్పు పడమరల స్వామి, ఆయన తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు, కావున నీవు ఆయననే కార్యకర్తగా చేసుకో.

**10**. మరియు వారు పలికే మాటలకు సహనంవహించు మరియు మంచితనంతో వారినుండి తొలగిపో.

**11**. మరియు అసత్యవాదులైన ఈ సంపన్నులను, నాకు వదలిపెట్టు.[1] మరియు వారికి కొంత వ్యవధినివ్వు.

**12**. నిశ్చయంగా, మా వద్ద వారికొరకు సంకెళ్ళు మరియు భగభగమండే నరకాగ్ని ఉన్నాయి.

**13**. మరియు గొంతులో ఇరుక్కుపోయే ఆహారం మరియు బాధాకరమైన శిక్ష (ఉన్నాయి).

**14**. ఆ రోజు భూమి మరియు పర్వతాలు కంపించిపోతాయి మరియు పర్వతాలు ప్రవహించే ఇసుక దిబ్బలుగా మారిపోతాయి.[2]

**15**. మేము ఫిర్ఔన్ వద్దకు సందేశహరుణ్ణి పంపినట్లు, నిశ్చయంగా మీ వద్దకు కూడా ఒక సందేశహరుణ్ణి, మీకు సాక్షిగా ఉండటానికి పంపాము.

وَٱذۡكُرِ ٱسۡمَ رَبِّكَ وَتَبَتَّلۡ إِلَيۡهِ تَبۡتِيلٗا
٨
رَّبُّ ٱلۡمَشۡرِقِ وَٱلۡمَغۡرِبِ لَآ إِلَٰهَ إِلَّا
هُوَ فَٱتَّخِذۡهُ وَكِيلٗا ٩
وَٱصۡبِرۡ عَلَىٰ مَا يَقُولُونَ وَٱهۡجُرۡهُمۡ
هَجۡرٗا جَمِيلٗا ١٠
وَذَرۡنِي وَٱلۡمُكَذِّبِينَ أُوْلِي ٱلنَّعۡمَةِ
وَمَهِّلۡهُمۡ قَلِيلًا ١١
إِنَّ لَدَيۡنَآ أَنكَالٗا وَجَحِيمٗا ١٢
وَطَعَامٗا ذَا غُصَّةٖ وَعَذَابًا أَلِيمٗا ١٣
يَوۡمَ تَرۡجُفُ ٱلۡأَرۡضُ وَٱلۡجِبَالُ
وَكَانَتِ ٱلۡجِبَالُ كَثِيبٗا مَّهِيلًا ١٤
إِنَّآ أَرۡسَلۡنَآ إِلَيۡكُمۡ رَسُولٗا شَٰهِدًا
عَلَيۡكُمۡ كَمَآ أَرۡسَلۡنَآ إِلَىٰ فِرۡعَوۡنَ
رَسُولٗا ١٥

---

**1**. చూడండి, 74:11.
**2**. చూడండి, 14:48 మరియు 20:105-107.

فَعَصَىٰ فِرۡعَوۡنُ ٱلرَّسُولَ فَأَخَذۡنَٰهُ أَخۡذٗا وَبِيلٗا ١٦

16. కాని ఫిర్'ఔన్ ఆ సందేశహరునికి అవిధేయత చూపాడు. కావున మేము అతనిని తీవ్రమైన శిక్షకు గురిచేశాము.

فَكَيۡفَ تَتَّقُونَ إِن كَفَرۡتُمۡ يَوۡمٗا يَجۡعَلُ ٱلۡوِلۡدَٰنَ شِيبًا ١٧

17. ఒకవేళ మీరు సత్యాన్ని తిరస్కరిస్తే, బాలురను ముసలివారిగా చేసేటటువంటి ఆ దినపు శిక్షనుండి ఎలా తప్పించుకోగలరు?[1]

ٱلسَّمَآءُ مُنفَطِرُۢ بِهِۦۚ كَانَ وَعۡدُهُۥ مَفۡعُولًا ١٨

18. అప్పుడు ఆకాశం బ్రద్దలైపోతుంది. ఆయన యొక్క వాగ్దానం తప్పక నెరవేరి తీరుతుంది.

إِنَّ هَٰذِهِۦ تَذۡكِرَةٞۖ فَمَن شَآءَ ٱتَّخَذَ إِلَىٰ رَبِّهِۦ سَبِيلًا ١٩

19. నిశ్చయంగా, ఇదొక ఉపదేశం కావున ఇష్టమైన వాడు తన ప్రభువువద్దకు పోయే మార్గాన్ని అవలంబించవచ్చు! (5/8)

۞ إِنَّ رَبَّكَ يَعۡلَمُ أَنَّكَ تَقُومُ أَدۡنَىٰ مِن ثُلُثَيِ ٱلَّيۡلِ وَنِصۡفَهُۥ وَثُلُثَهُۥ وَطَآئِفَةٞ مِّنَ ٱلَّذِينَ مَعَكَۚ وَٱللَّهُ يُقَدِّرُ ٱلَّيۡلَ وَٱلنَّهَارَۚ عَلِمَ أَن لَّن تُحۡصُوهُ فَتَابَ عَلَيۡكُمۡۖ فَٱقۡرَءُواْ مَا تَيَسَّرَ مِنَ ٱلۡقُرۡءَانِۚ

20. * (ఓ ము'హమ్మద్!) నీవు, వాస్తవానికి దాదాపు మూడింట రెండువంతుల రాత్రి లేక సగం (రాత్రి) లేక మూడింట ఒక భాగం (నమా'జ్‌లో) నిలుస్తావనేది నీ ప్రభువుకు బాగా తెలుసు. మరియు నీతోపాటు ఉన్న వారిలో కొందరు కూడా! మరియు అల్లాహ్ రేయింబవళ్ళ పరిమాణాలను నిర్ణయిస్తాడు. మీరు ఖచ్చితంగా పూర్తి

---

1. పునరుత్థాన దినమున ఆదమ్ ('అ.స.)తో ఇలా అనబడుతుంది: "నీ సంతానం నుండి నరకం వారిని ఎన్నుకో." అతను ప్రశ్నిస్తారు: "ఓ అల్లాహ్ (సు.తా.)! ఏ విధంగా?" అల్లాహ్ (సు.తా.) అంటాడు: "ప్రతి వేయిమంది నుండి 999 మందిని, అప్పుడు గర్భవతులైన స్త్రీల పిండాలు పడిపోతాయి మరియు పిల్లలు వృద్ధులైపోతారు." ఈ విషయం విని అనుచరు(ర'ది.'అన్హుమ్)లు చాలా చింతలో పడిపోయారు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) అంటారు: "యాజూజ్ మాజూజ్ జాతివారి నుండి 999 ఉంటారు. మరియు మీలో నుండి ఒకడు; అల్లాహ్ (సు.తా.) కరుణపై నాకు విశ్వాసముంది. స్వర్గవాసులలోనుండి సగంమంది మీరుంటారు." ('స. బు'ఖారీ).

عَلِمَ أَن سَيَكُونُ مِنكُم مَّرْضَىٰ وَءَاخَرُونَ يَضْرِبُونَ فِي ٱلْأَرْضِ يَبْتَغُونَ مِن فَضْلِ ٱللَّهِ وَءَاخَرُونَ يُقَٰتِلُونَ فِي سَبِيلِ ٱللَّهِ فَٱقْرَءُواْ مَا تَيَسَّرَ مِنْهُ وَأَقِيمُواْ ٱلصَّلَوٰةَ وَءَاتُواْ ٱلزَّكَوٰةَ وَأَقْرِضُواْ ٱللَّهَ قَرْضًا حَسَنًا وَمَا تُقَدِّمُواْ لِأَنفُسِكُم مِّنْ خَيْرٍ تَجِدُوهُ عِندَ ٱللَّهِ هُوَ خَيْرًا وَأَعْظَمَ أَجْرًا وَٱسْتَغْفِرُواْ ٱللَّهَ إِنَّ ٱللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴿٢٠﴾

రాత్రి (ప్రార్థించ) లేరని ఆయనకు తెలుసు. కావున ఆయన మీ వైపునకు (కనికరంతో) మరలాడు. కావున ఖుర్ఆన్‌ను, మీరు సులభంగా పఠించగలిగినంతే పఠించండి. మీలో కొందరు వ్యాధిగ్రస్తులు కావచ్చు, మరికొందరు అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషిస్తూ భూమిలో ప్రయాణంలో ఉండవచ్చు, మరి కొందరు అల్లాహ్ మార్గంలో ధర్మయుద్ధం చేస్తూ ఉండవచ్చు, అని ఆయనకు బాగా తెలుసు. కావున మీకు దానిలో సులభమైనంత దానినే పఠించండి.[1] మరియు నమా'జ్‌ను స్థాపించండి,[2] విధిదానం ('జకాత్) ఇవ్వండి. మరియు అల్లాహ్‌కు మంచి అప్పును, అప్పుగా ఇస్తూ ఉండండి. మరియు మీరు, మీ కొరకు ముందుగా చేసి పంపుకున్న మంచి కార్యాలన్నింటినీ అల్లాహ్ దగ్గర పొందుతారు. అదే చాలా ఉత్తమమైనది. మరియు దాని ప్రతిఫలం చాలా గొప్పది. మరియు మీరు అల్లాహ్‌ను క్షమాభిక్ష అర్థిస్తూ ఉండండి. నిశ్చయంగా అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

*****

---

1. అల్లాహ్ (సు.తా.) మిమ్మల్ని కనికరించాడు కావున, తహజ్జుద్‌లో మీకు సులభమైనంతనే పఠించండి. రెండు రకాతులైనా సరే. దైవప్రవక్త చాలా మట్టుకు **ఎనిమిది** రకాతులు చేసేవారు. అతనినే అనుసరించినా ఎంతో మేలు. మీ తహజ్జుద్ నమాజ్‌లో వీలైనంత ఖుర్ఆన్ పఠనంచేయండి. నెమ్మదిగా స్పష్టంగా పఠించండి.
2. అంటే ఐదు సార్లు చేసే ఫ'ర్ద్ నమాజులు. చాలా మంది వ్యాఖ్యాతల అభిప్రాయంలో ఈ ఆయత్ మదీనాలో అవతరింపజేయబడింది.

## 74. సూరహ్ అల్-ముద్దస్సి'ర్

## سُورَةُ الْمُدَّثِّرِ

అల్-ముద్దస్సి'ర్: The Enfolded One, బట్టల (దుప్పటి)లో చుట్టుకున్నవాడు! మొదటి ఆయత్‌లోనే ఈ పదముంది. దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై సూరహ్ అల్-ఇఖ్‌రఅ' (96:1-5) మొదటి అయిదు ఆయతులు అవతరించిన తరువాత కొంతకాలం (6 నెలల నుండి 3 సంవత్సరాల) వరకు ఏ వ'హీ అవతరింపజేయబడలేదు. ఈ కాలాన్ని, ఫతరతుల్ వ'హీ అంటారు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) ఎంతో కలవరపడ్డారు. అప్పుడు అతని భార్య 'ఖదీజహ్ (ర.'అన్హా) అతనికి నైతిక ప్రోత్సాహాన్నిచ్చారు. ఆ తరువాత ఒకరోజు జిబ్రీల్ ('అ.స.) ఆకాశాలు మరియు భూమి మధ్య ప్రత్యక్షమయ్యారు. ఆ తరువాత ఈ సూరహ్ అవతరిపంజేయబడింది. ఆ తరువాత వ'హీ త్వరత్వరగా రావడం ఆరంభమయ్యింది, ('స. బు'ఖారీ, ముస్లిం). దీని కొన్ని ఆయతులు తరువాత అవతరింపజేయబడ్డాయి. **మక్కాలో** అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **56 ఆయతులు** ఉన్నాయి.

ఈ సూరహ్ ఇస్లాం విధులను, అల్లాహ్ ఏకత్వాన్ని పునరుత్థానాన్ని మరియు అంతిమ తీర్పును వివరిస్తోంది. మానవుడు బలహీనుడని, అల్లాహ్ (సు.తా.)పై అతడు ఆధారపడి ఉన్నాడని, ప్రతి మానవుడు తన కర్మలకు తానే బాధ్యుడని, అతడు వాటి ఫలితాన్ని అనుభవిస్తాడని మరియు అతని కర్మలను బట్టి స్వర్గనరకాలున్నాయని బోధిస్తోంది.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

يَٰٓأَيُّهَا ٱلْمُدَّثِّرُ ﴿١﴾

**1.** ఓ దుప్పటిలోచుట్టుకున్నవాడా!

قُمْ فَأَنذِرْ ﴿٢﴾

**2.** లే! ఇక హెచ్చరించు!

وَرَبَّكَ فَكَبِّرْ ﴿٣﴾

**3.** మరియు నీ ప్రభువు గొప్పతనాన్ని (ఘనతను) కొనియాడు!

وَثِيَابَكَ فَطَهِّرْ ﴿٤﴾

**4.** మరియు నీ వస్త్రాలను పరిశుభ్రంగా ఉంచుకో!

وَٱلرُّجْزَ فَٱهْجُرْ ﴿٥﴾

**5.** మరియు మాలిన్యానికి దూరంగా ఉండు!

وَلَا تَمْنُن تَسْتَكْثِرُ ﴿٦﴾

**6.** మరియు ఎక్కువ పొందాలనే ఆశతో ఇవ్వకు (ఉపకారం చేయకు)!

وَلِرَبِّكَ فَٱصۡبِرۡ ﴿٧﴾

**7.** మరియు నీ ప్రభువు కొరకు సహనం వహించు!

فَإِذَا نُقِرَ فِي ٱلنَّاقُورِ ﴿٨﴾

**8.** మరియు బాకా (నాఖూర్) ఊదబడి నప్పుడు;

فَذَٰلِكَ يَوۡمَئِذٖ يَوۡمٌ عَسِيرٌ ﴿٩﴾

**9.** ఆ దినం చాలా కఠినమైన దినమై ఉంటుంది;

عَلَى ٱلۡكَٰفِرِينَ غَيۡرُ يَسِيرٖ ﴿١٠﴾

**10.** సత్యతిరస్కారులకు అది సులభమైన (దినం) కాదు.[1]

ذَرۡنِي وَمَنۡ خَلَقۡتُ وَحِيدٗا ﴿١١﴾

**11.** వదలండి! నన్నూ మరియు నేను ఒంటరిగా పుట్టించిన వానినీ![2]

وَجَعَلۡتُ لَهُۥ مَالٗا مَّمۡدُودٗا ﴿١٢﴾

**12.** మరియు నేను అతనికి పుష్కలంగా సంపదనిచ్చాను.

وَبَنِينَ شُهُودٗا ﴿١٣﴾

**13.** మరియు అతనికి తోడుగా ఉండే కుమారులను!

وَمَهَّدتُّ لَهُۥ تَمۡهِيدٗا ﴿١٤﴾

**14.** మరియు అతని కొరకు అతని జీవన సౌకర్యాలను సులభం చేశాను.

ثُمَّ يَطۡمَعُ أَنۡ أَزِيدَ ﴿١٥﴾

**15.** అయినా నేను అతనికి ఇంకా ఇవ్వాలని అతడు ఆశిస్తూ ఉంటాడు.

كَلَّآۖ إِنَّهُۥ كَانَ لِأٓيَٰتِنَا عَنِيدٗا ﴿١٦﴾

**16.** అలాకాదు! వాస్తవానికి అతడు మా (అల్లాహ్) సూచన(ఆయాత్)ల పట్ల విరోధం కలిగివున్నాడు.

---

**1**. అల్-కాఫిరీన్: అంటే సత్యతిరస్కారులు. ఈ పదం ఇక్కడ ఖుర్ఆన్ అవతరణా క్రమంలో మొదటి సారి వచ్చింది. 57:20లో మాత్రం ఈ పదానికి భూమిని దున్నేవాడు అనే అర్థం ఉంది. మిగతా అన్నీ చోట్లలో ఈ పదం సత్యతిరస్కారులనే అర్థంలోనే వాడబడింది.

**2**. చూడండి, 6:94, 19:80, 95. కొందరు వ్యాఖ్యాతలు ఈ ఆయత్ వలీద్ బిన్ ము'గైరాను ఉద్దేశిస్తోంది అని అభిప్రాయపడ్డారు. అతడు సత్యతిరస్కారం మరియు దురహంకారంలో మితిమీరి పోయాడు. ఈ ఆయత్ ఇటువంటి ప్రతి సత్యతిరస్కారిని సూచిస్తుంది.

سَأُرْهِقُهُۥ صَعُودًا ﴿١٧﴾

**17**. నేను త్వరలోనే అతనిని దుర్గమమైన స్థానానికి (శిక్షకు) నెట్టుతాను!

إِنَّهُۥ فَكَّرَ وَقَدَّرَ ﴿١٨﴾

**18**. వాస్తవానికి అతడు ఆలోచించాడు మరియు మనస్సులో ప్రణాళిక చేసుకున్నాడు.

فَقُتِلَ كَيْفَ قَدَّرَ ﴿١٩﴾

**19**. కావున (అతనిని) తాను ప్రణాళిక చేసుకున్నట్లు నాశనానికి గురికానివ్వండి!

ثُمَّ قُتِلَ كَيْفَ قَدَّرَ ﴿٢٠﴾

**20**. అవును (అతనిని) తాను ప్రణాళిక చేసుకున్నట్లు, నాశనానికి గురికానివ్వండి!

ثُمَّ نَظَرَ ﴿٢١﴾

**21**. అప్పుడు అతడు ఆలోచించాడు.

ثُمَّ عَبَسَ وَبَسَرَ ﴿٢٢﴾

**22**. తరువాత అతడు నుదురు చిట్లించుకున్నాడు మరియు కోపంతో చూశాడు (ముఖం మాడ్చుకున్నాడు);

ثُمَّ أَدْبَرَ وَٱسْتَكْبَرَ ﴿٢٣﴾

**23**. తరువాత అతడు వెనుకకు మరలి దురహంకారం చూపాడు.[1]

فَقَالَ إِنْ هَٰذَآ إِلَّا سِحْرٌ يُؤْثَرُ ﴿٢٤﴾

**24**. అప్పుడు అతడు ఇలా అన్నాడు: "ఇది పూర్వం నుండి వస్తూవున్న ఒక మంత్రజాలం మాత్రమే!

إِنْ هَٰذَآ إِلَّا قَوْلُ ٱلْبَشَرِ ﴿٢٥﴾

**25**. "ఇది కేవలం ఒక మానవ వాక్కు మాత్రమే!"

سَأُصْلِيهِ سَقَرَ ﴿٢٦﴾

**26**. త్వరలోనే నేను అతనిని నరకాగ్నిలో కాల్చుతాను.

وَمَآ أَدْرَىٰكَ مَا سَقَرُ ﴿٢٧﴾

**27**. మరియు ఆ నరకాగ్ని అంటే నీవు ఏమనుకుంటున్నావు?[2]

---

**1**. చూడండి, 96:6-7.

**2**. సఖరున్: నరకానికి ఏడు అంతస్తులు లేక శ్రేణులున్నాయి. 1) జహన్నమ్ (నరకం), 2) ల'జ్జా (ధ్వంసం చేసే అగ్ని), 3) 'హు'త్మ (అణగ/చితకగొట్టే శిక్ష), 4) స'యీర్ (ప్రజ్వలించే అగ్ని), 5) సఖర్ (నరకాగ్ని), 6) జ'హీమ్ (మండే అగ్ని), 7) హావియహ్. ఇది అన్నిటి కంటే క్రింది అంతస్తు, ఇందులో మునాఫిఖులు (కపటవిశ్వాసులు) ఉంటారు. ఏడు ద్వారాలు అంటే ఏడు విధాలైన పాపుల దారులు. చూడండి, 15:44.

لَا تُبْقِي وَلَا تَذَرُ ﴿٢٨﴾

**28**. అది (ఎవరినీ) మిగల్చదు మరియు వదలిపెట్టదు.[1]

لَوَّاحَةٌ لِّلْبَشَرِ ﴿٢٩﴾

**29**. అది మానవుణ్ణి (అతడి చర్మాన్ని) దహించివేస్తుంది.[2]

عَلَيْهَا تِسْعَةَ عَشَرَ ﴿٣٠﴾

**30**. దానిపై పందొమ్మిది మంది (దేవదూతలు నియమించబడి) ఉన్నారు.

وَمَا جَعَلْنَآ أَصْحَٰبَ ٱلنَّارِ إِلَّا مَلَٰٓئِكَةً ۙ وَمَا جَعَلْنَا عِدَّتَهُمْ إِلَّا فِتْنَةً لِّلَّذِينَ كَفَرُوا۟ لِيَسْتَيْقِنَ ٱلَّذِينَ أُوتُوا۟ ٱلْكِتَٰبَ وَيَزْدَادَ ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِيمَٰنًا ۙ وَلَا يَرْتَابَ ٱلَّذِينَ أُوتُوا۟ ٱلْكِتَٰبَ وَٱلْمُؤْمِنُونَ ۙ وَلِيَقُولَ ٱلَّذِينَ فِى قُلُوبِهِم مَّرَضٌ وَٱلْكَٰفِرُونَ مَاذَآ أَرَادَ ٱللَّهُ بِهَٰذَا مَثَلًا ۚ كَذَٰلِكَ يُضِلُّ ٱللَّهُ مَن يَشَآءُ وَيَهْدِى مَن يَشَآءُ ۚ وَمَا يَعْلَمُ جُنُودَ رَبِّكَ إِلَّا هُوَ ۚ وَمَا هِىَ إِلَّا ذِكْرَىٰ لِلْبَشَرِ ﴿٣١﴾

**31**. మరియు మేము దేవదూతలను మాత్రమే నరకానికి రక్షకులుగా నియమించాము మరియు మేము వారి సంఖ్యను (పందొమ్మిదిని), సత్య తిరస్కారులకు ఒక పరీక్షగా, గ్రంథ ప్రజలకు నమ్మకం కలగటానికి, విశ్వాసుల విశ్వాసాన్ని అధికం చేయటానికి మరియు గ్రంథప్రజలు మరియు విశ్వాసులు సందేహంలో పడకుండా ఉండటానికి మరియు తమ హృదయాలలో రోగమున్న వారు మరియు సత్యతిరస్కారులు: "ఈ ఉపమానం ఇవ్వటంలో అల్లాహ్ ఉద్దేశమేమిటి?" అని పలుకటానికి! ఈ విధంగా అల్లాహ్ తానుకోరిన వారిని మార్గభ్రష్టత్వంలో వదులుతాడు మరియు తానుకోరిన వారికి మార్గదర్శకత్వం చేస్తాడు.[3] మరియు నీ ప్రభువు సైన్యాలను ఆయన తప్ప మరెవ్వరూ ఎరుగరు. మరియు ఇదంతా మానవునికి ఒక జ్ఞాపిక మాత్రమే.

---

1. అంటే అది నరకవాసులను బ్రతుకనివ్వదూ మరియు చావనివ్వదూ, వారి శరీరపు ప్రతి భాగాన్ని కాల్చుతుంది.
2. చూడండి, 87:12-13.
3. చూడండి, 2:26.

32. అలాకాదు! చంద్రుని సాక్షిగా!

كَلَّا وَٱلْقَمَرِ ﴿٣٢﴾

33. గడిచిపోయే రాత్రి సాక్షిగా!

وَٱلَّيْلِ إِذْ أَدْبَرَ ﴿٣٣﴾

34. ప్రకాశించే, ఉదయం సాక్షిగా!

وَٱلصُّبْحِ إِذَآ أَسْفَرَ ﴿٣٤﴾

35. నిశ్చయంగా, ఇది (ఈ నరకాగ్ని ప్రస్తావన) ఒక గొప్ప విషయం.

إِنَّهَا لَإِحْدَى ٱلْكُبَرِ ﴿٣٥﴾

36. మానవునికి ఒక హెచ్చరిక!

نَذِيرًا لِّلْبَشَرِ ﴿٣٦﴾

37. మీలో ముందుకు రావాలని కోరుకునే వానికి లేదా వెనుక ఉండిపోయే వానికి;

لِمَن شَآءَ مِنكُمْ أَن يَتَقَدَّمَ أَوْ يَتَأَخَّرَ ﴿٣٧﴾

38. ప్రతి మానవుడు తానుచేసిన కర్మలకు తాకట్టుగా ఉంటాడు.

كُلُّ نَفْسٍۭ بِمَا كَسَبَتْ رَهِينَةٌ ﴿٣٨﴾

39. కుడి పక్షం వారు తప్ప!

إِلَّآ أَصْحَٰبَ ٱلْيَمِينِ ﴿٣٩﴾

40. వారు స్వర్గాలలో ఉంటూ ఒకరినొకరు ఇలా ప్రశ్నించుకుంటారు!

فِى جَنَّٰتٍ يَتَسَآءَلُونَ ﴿٤٠﴾

41. అపరాధులను గురించి (మరియు వారితో అంటారు):

عَنِ ٱلْمُجْرِمِينَ ﴿٤١﴾

42. "మిమ్మల్ని ఏ విషయం నరకంలోకి ప్రవేశింపజేసింది?"

مَا سَلَكَكُمْ فِى سَقَرَ ﴿٤٢﴾

43. వారు (నరకవాసులు) ఇలా జవాబిస్తారు: "మేము నమా'జ్ చేసే వాళ్ళంకాము.

قَالُوا۟ لَمْ نَكُ مِنَ ٱلْمُصَلِّينَ ﴿٤٣﴾

44. "మరియు నిరుపేదకు ఆహారం పెట్టే వాళ్ళంకాము;

وَلَمْ نَكُ نُطْعِمُ ٱلْمِسْكِينَ ﴿٤٤﴾

45. "మరియు వృథా కాలక్షేపం చేసే వారితో కలిసి వ్యర్థ ప్రలాపాలు (ప్రసంగాలు) చేస్తూ ఉండేవాళ్ళము;

وَكُنَّا نَخُوضُ مَعَ ٱلْخَآئِضِينَ ﴿٤٥﴾

**46**. "మరియు తీర్పుదినాన్ని అబద్ధమని నిరాకరిస్తూ ఉండేవాళ్ళము;

وَكُنَّا نُكَذِّبُ بِيَوۡمِ ٱلدِّينِ ﴿٤٦﴾

**47**. "చివరకు ఆ అనివార్యమైన (ఘడియ) మాపై వచ్చిపడింది."[1]

حَتَّىٰٓ أَتَىٰنَا ٱلۡيَقِينُ ﴿٤٧﴾

**48**. అప్పుడు సిఫారసుచేసే వారి సిఫారసు, వారికి ఏమాత్రం ఉపయోగపడదు.[2]

فَمَا تَنفَعُهُمۡ شَفَٰعَةُ ٱلشَّٰفِعِينَ ﴿٤٨﴾

**49**. అయితే, వారికేమయింది? ఈ హితోపదేశం నుండి వారెందుకు ముఖం త్రిప్పుకుంటున్నారు.

فَمَا لَهُمۡ عَنِ ٱلتَّذۡكِرَةِ مُعۡرِضِينَ ﴿٤٩﴾

**50**. వారిస్థితి బెదిరిన అడవి గాడిదల మాదిరిగా ఉంది;

كَأَنَّهُمۡ حُمُرٞ مُّسۡتَنفِرَةٞ ﴿٥٠﴾

**51**. సింహం నుండి పారిపోయే (గాడిదల మాదిరిగా)![3]

فَرَّتۡ مِن قَسۡوَرَةِۭ ﴿٥١﴾

**52**. అలాకాదు! వారిలో ప్రతి ఒక్కవ్యక్తి తనకు విప్పబడిన గ్రంథాలు ఇవ్వబడాలని కోరుతున్నాడు.[4]

بَلۡ يُرِيدُ كُلُّ ٱمۡرِيٕٖ مِّنۡهُمۡ أَن يُؤۡتَىٰ صُحُفٗا مُّنَشَّرَةٗ ﴿٥٢﴾

---

**1**. చూడండి, 15:99.

**2**. సిఫారస్ కొరకు చూడండి, 10:3.

**3**. దీనిని వ్యాఖ్యాతలు - సింహం, పులి లేక వేటగాడి నుండి - పారిపోవటం, అని అన్నారు.

**4**. విప్పబడిన గ్రంథాలు అంటే: ముహమ్మద్ ('స'అస), అల్లాహ్ (సు.తా.) యొక్క ప్రవక్త అని వ్రాయబడిన గ్రంథం ప్రతి ఒక్కరికి ఇవ్వబడాలని లేక దైవగ్రంథం ప్రతిఒక్కరికి ఇవ్వబడాలని. చూడండి, 2:118 వారు ఇలా పలకడం వారి దురహంకారాన్ని సూచిస్తుంది.

كَلَّا بَل لَّا يَخَافُونَ ٱلۡأٓخِرَةَ ﴿٥٣﴾

**53.** కాదుకాదు! అసలు వారు పరలోక జీవితం గురించి భయపడటం లేదు.

كَلَّآ إِنَّهُۥ تَذۡكِرَةٞ ﴿٥٤﴾

**54.** అలాకాదు! నిశ్చయంగా, ఇది ఒక హితోపదేశం.

فَمَن شَآءَ ذَكَرَهُۥ ﴿٥٥﴾

**55.** కావున కోరినవాడు దీనినుండి హితబోధ గ్రహించవచ్చు.

وَمَا يَذۡكُرُونَ إِلَّآ أَن يَشَآءَ ٱللَّهُۚ هُوَ أَهۡلُ ٱلتَّقۡوَىٰ وَأَهۡلُ ٱلۡمَغۡفِرَةِ ﴿٥٦﴾

**56.** కాని అల్లాహ్ కోరితే తప్ప![1] వీరు దీనినుండి హితబోధ గ్రహించలేరు. ఆయనే (అల్లాహ్‌యే) భయభక్తులకు అర్హుడు మరియు ఆయనే క్షమించే అర్హతగలవాడు. (3/4)

*****

**1**. చూడండి, 81:28-29 మరియు 14:4.

## 75. సూరహ్ అల్-ఖియామహ్

## سُورَةُ القِيَامَةِ

అల్-ఖియామహ్: The Resurrection, పునరుత్థానం. ఈ సూరహ్ పేరు **మొదటి ఆయత్**లోనే ఉంది. ఇందులో పునరుత్థానదినం గురించి వివరాలున్నాయి. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఇందులో **40 ఆయతులు** ఉన్నాయి.

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**1.** * అలాకాదు! నేను **పునరుత్థానదినపు** శపథం చేస్తున్నాను.

لَآ أُقْسِمُ بِيَوْمِ ٱلْقِيَٰمَةِ ﴿١﴾

**2.** అలాకాదు! నేను తనను తాను నిందించుకునే అంతరాత్మ శపథం చేస్తున్నాను.

وَلَآ أُقْسِمُ بِٱلنَّفْسِ ٱللَّوَّامَةِ ﴿٢﴾

**3.** ఏమిటి? మేము అతని ఎముకలను ప్రోగుచేయలేమని మానవుడు భావిస్తున్నాడా?

أَيَحْسَبُ ٱلْإِنسَٰنُ أَلَّن نَّجْمَعَ عِظَامَهُۥ ﴿٣﴾

**4.** వాస్తవానికి! మేము అతని వ్రేళ్ళ కొనలను గూడా సరిగ్గా సవరించగల సమర్థులము.

بَلَىٰ قَٰدِرِينَ عَلَىٰٓ أَن نُّسَوِّىَ بَنَانَهُۥ ﴿٤﴾

**5.** అయినా, మానవుడు ఇక మీద కూడా దుష్కార్యాలు చేయగోరుతున్నాడు.

بَلْ يُرِيدُ ٱلْإِنسَٰنُ لِيَفْجُرَ أَمَامَهُۥ ﴿٥﴾

**6.** అతడు: "అయితే ఈ పునరుత్థానదినం ఎప్పుడు వస్తుంది?" అని అడుగుతున్నాడు.

يَسْـَٔلُ أَيَّانَ يَوْمُ ٱلْقِيَٰمَةِ ﴿٦﴾

**7.** కళ్ళు మిరుమిట్లు గొన్నప్పుడు;

فَإِذَا بَرِقَ ٱلْبَصَرُ ﴿٧﴾

**8.** మరియు చంద్రునికి గ్రహణం పట్టినప్పుడు;

وَخَسَفَ ٱلْقَمَرُ ﴿٨﴾

**9.** మరియు సూర్యచంద్రులు కలిపివేయబడినప్పుడు;

وَجُمِعَ ٱلشَّمْسُ وَٱلْقَمَرُ ﴿٩﴾

**10**. మానవుడు ఆ రోజు: "ఎక్కడికి పారిపోవాలి?" అని అంటాడు.

يَقُولُ ٱلْإِنسَٰنُ يَوْمَئِذٍ أَيْنَ ٱلْمَفَرُّ ﴿١٠﴾

**11**. అది కాదు! (అతనికి) ఎక్కడా శరణం ఉండదు!

كَلَّا لَا وَزَرَ ﴿١١﴾

**12**. ఆ రోజు నీ ప్రభువువద్దనే ఆశ్రయం ఉంటుంది.

إِلَىٰ رَبِّكَ يَوْمَئِذٍ ٱلْمُسْتَقَرُّ ﴿١٢﴾

**13**. ఆ రోజు మానవుడికి, తాను చేసి పంపింది మరియు వెనక వదలింది అంతా తెలుపబడుతుంది.[1]

يُنَبَّؤُا۟ ٱلْإِنسَٰنُ يَوْمَئِذٍۭ بِمَا قَدَّمَ وَأَخَّرَ ﴿١٣﴾

**14**. అలాకాదు! మానవుడు తనకు విరుద్ధంగా, తానే సాక్షి అవుతాడు;

بَلِ ٱلْإِنسَٰنُ عَلَىٰ نَفْسِهِۦ بَصِيرَةٌ ﴿١٤﴾

**15**. మరియు అతడు ఎన్ని సాకులు చెప్పినా సరే![2]

وَلَوْ أَلْقَىٰ مَعَاذِيرَهُۥ ﴿١٥﴾

**16**. నీవు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను గ్రహించటానికి) నీ నాలుకను త్వరత్వరగా కదిలించకు.[3]

لَا تُحَرِّكْ بِهِۦ لِسَانَكَ لِتَعْجَلَ بِهِۦٓ ﴿١٦﴾

**17**. నిశ్చయంగా, దీనిని సేకరించటం మరియు దీనిని చదివించటం మా భాధ్యతే!

إِنَّ عَلَيْنَا جَمْعَهُۥ وَقُرْءَانَهُۥ ﴿١٧﴾

**18**. కావున మేము దీనిని పఠించినప్పుడు నీవు ఆ పారాయణాన్ని శ్రద్ధగా అనుసరించు!

فَإِذَا قَرَأْنَٰهُ فَٱتَّبِعْ قُرْءَانَهُۥ ﴿١٨﴾

**19**. ఇక దాని భావాన్ని అర్థమయ్యేలా చేయటం మా బాధ్యతే![4]

ثُمَّ إِنَّ عَلَيْنَا بَيَانَهُۥ ﴿١٩﴾

---

**1**. చూడండి, 18:49.

**2**. చూడండి, 24:24, 36:25 లేక 41:20-22.

**3**. జిబ్రీల్('అ.స.) ఖుర్ఆన్ అవతరింపజేసేటప్పుడు, దైవప్రవక్త('స'అస) ఏపదాన్ని కూడా మరచిపోరాదని త్వరత్వరగా చదివేవారు. అల్లాహుతా'అలా త్వరత్వరగా చదువటం నుండి నివారించాడు. ('స.బు'ఖారీ) ఇటువంటి వాక్యానికై చూడండి, 20:114.

**4**. దైవప్రవక్త ('స'అస) ఖుర్ఆన్‌ను ప్రజలకు అర్థమవటానికి వివరించి చెప్పింది కూడా అల్లాహ్ (సు.తా.) తరఫునుండి, తనకు తెలుపబడిందే. ఈ వివరణలే 'హదీసులు!

كَلَّا بَلۡ تُحِبُّونَ ٱلۡعَاجِلَةَ ٢٠

**20**. అలాకాదు! వాస్తవానికి మీరు అనిశ్చితమైన (ఇహలోక జీవితం పట్ల) వ్యామోహం పెంచుకుంటున్నారు;

وَتَذَرُونَ ٱلۡأٓخِرَةَ ٢١

**21**. మరియు పరలోకజీవితాన్ని వదలిపెడ్తున్నారు![1]

وُجُوهٞ يَوۡمَئِذٖ نَّاضِرَةٌ ٢٢

**22**. ఆ రోజున కొన్ని ముఖాలు కళకళలాడుతూ ఉంటాయి;

إِلَىٰ رَبِّهَا نَاظِرَةٞ ٢٣

**23**. తమ ప్రభువు (అల్లాహ్) వైపునకు చూస్తూ ఉంటాయి;[2]

وَوُجُوهٞ يَوۡمَئِذِۭ بَاسِرَةٞ ٢٤

**24**. మరికొన్ని ముఖాలు ఆ రోజు, కాంతిహీనమై ఉంటాయి;[3]

تَظُنُّ أَن يُفۡعَلَ بِهَا فَاقِرَةٞ ٢٥

**25**. నడుమును విరిచే బాధ వారికి కలుగుతుందని భావించి.[4]

كَلَّآ إِذَا بَلَغَتِ ٱلتَّرَاقِيَ ٢٦

**26**. అలాకాదు! ప్రాణం గొంతులోకి వచ్చినపుడు;[5]

وَقِيلَ مَنۡۜ رَاقٖ ٢٧

**27**. మరియు: "ఎవడైనా ఉన్నాడా? అతనిని (మరణం నుండి) కాపాడటానికి?" అని అనబడుతుంది.[6]

وَظَنَّ أَنَّهُ ٱلۡفِرَاقُ ٢٨

**28**. మరియు అప్పుడు అతడు వాస్తవానికి తన ఎడబాటుకాలం వచ్చిందని గ్రహిస్తాడు;

---

**1**. అంటే పరలోక జీవితాన్ని నమ్మటంలేదు. మీరు మీ జీవితం కేవలం ఈ ఇహలోక జీవితం మాత్రమే అనే భ్రమలో పడిఉన్నారు. మీరు పునరుత్థరింపబడతారని నమ్మటంలేదు.

**2**. ఇవి విశ్వాసుల ముఖాలు.

**3**. ఇవి సత్యతిరస్కారుల ముఖాలు.

**4**. అంటే వారు నరకంలో వేయబడతారని తెలుసుకొని.

**5**. మరణం ఆసన్నమైనప్పుడు.

**6**. ఇటువంటి ఆయత్ కోసం చూడండి, 28:71-72.

29. మరియు ఒక పిక్క మరొక పిక్కతో కలిసిపోతుంది.[1]

وَٱلْتَفَّتِ ٱلسَّاقُ بِٱلسَّاقِ ﴿٢٩﴾

30. ఆ రోజు నీ ప్రభువు వైపునకు ప్రయాణం ఉంటుంది!

إِلَىٰ رَبِّكَ يَوْمَئِذٍ ٱلْمَسَاقُ ﴿٣٠﴾

31. కాని అతడు సత్యాన్ని నమ్మలేదు మరియు నమా'జ్ సలపనూ లేదు![2]

فَلَا صَدَّقَ وَلَا صَلَّىٰ ﴿٣١﴾

32. మరియు అతడు (ఈ సందేశాన్ని) అసత్యమన్నాడు మరియు దాని నుండి వెనుదిరిగాడు!

وَلَٰكِن كَذَّبَ وَتَوَلَّىٰ ﴿٣٢﴾

33. ఆ తరువాత నిక్కుతూ నీల్గుతూ తన ఇంటివారి వద్దకు పోయాడు!

ثُمَّ ذَهَبَ إِلَىٰٓ أَهْلِهِۦ يَتَمَطَّىٰٓ ﴿٣٣﴾

34. (ఓ సత్యతిరస్కారుడా!) నీకు నాశనం మీద నాశనం రానున్నది!

أَوْلَىٰ لَكَ فَأَوْلَىٰ ﴿٣٤﴾

35. అవును, నీకు నాశనం మీద నాశనం రానున్నది!

ثُمَّ أَوْلَىٰ لَكَ فَأَوْلَىٰٓ ﴿٣٥﴾

36. ఏమిటి? మానవుడు తనను విచ్చలవిడిగా వదలిపెట్టడం జరుగుతుందని భావిస్తున్నాడా?

أَيَحْسَبُ ٱلْإِنسَٰنُ أَن يُتْرَكَ سُدًى ﴿٣٦﴾

37. ఏమీ? అతడు ప్రసరింపజేయబడిన ఒక వీర్యబిందువు కాడా?

أَلَمْ يَكُ نُطْفَةً مِّن مَّنِىٍّ يُمْنَىٰ ﴿٣٧﴾

38. తరువాత ఒక రక్తకండగా (జలగగా) ఉండేవాడు కాదా? తరువాత ఆయన (అల్లాహ్) అతనిని సృష్టించి అతని రూపాన్ని తీర్చిదిద్దాడు.[3]

ثُمَّ كَانَ عَلَقَةً فَخَلَقَ فَسَوَّىٰ ﴿٣٨﴾

---

1. అంటే అతడు, తాను కష్టాలపాలవుతున్నానని తెలుసుకుంటాడు.
2. చూడండి, 4:17-18.
3. చూడండి, 87:2 మరియు 91:7.

فَجَعَلَ مِنْهُ ٱلزَّوْجَيْنِ ٱلذَّكَرَ وَٱلْأُنثَىٰٓ ٣٩

**39**. ఆ తరువాత అతని నుండి స్త్రీ పురుషుల రెండు రకాలను (జాతులను) ఏర్పరచాడు.

أَلَيْسَ ذَٰلِكَ بِقَٰدِرٍ عَلَىٰٓ أَن يُحْـِۧىَ ٱلْمَوْتَىٰ ٤٠

**40**. అలాంటప్పుడు ఆయనకు మరణించిన వారిని మళ్ళీ బ్రతికించే సామర్థ్యం లేదా?

*****

## 76. సూరహ్ అల్-ఇ'న్సాన్ سُورَةُ الإنسَانِ

అల్-ఇ'న్సాను: The Man, మానవుడు. దీనికి సూరహ్ అద్-దహ్ర్, The Time, కాలచక్రం, సమయం అనే పేరుకూడా ఉంది. ఈ రెండు పదాలు మొదటి ఆయత్‌లోనే ఉన్నాయి. దైవప్రవక్త ('స'అస) జుము'అహ్ రోజు ఫజ్ర్ నమాజులలో సూరహ్ అస్-సజ్దా (32) మరియు ఈ సూరహ్ (76) చదివేవారు ('స'హీ'హ్ ముస్లిం). చాలా మంది వ్యాఖ్యాతల అభిప్రాయంలో ఈ సూరహ్ మదీనాలో అవతరింపజేయబడింది. (ఫ'త్హ్ అల్-ఖదీర్) ఇందులో **31 ఆయతులు** ఉన్నాయి.

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్ — بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

هَلْ أَتَىٰ عَلَى ٱلْإِنسَٰنِ حِينٌ مِّنَ ٱلدَّهْرِ لَمْ يَكُن شَيْـًٔا مَّذْكُورًا ﴿١﴾

**1**. అనంత కాలచక్రంలో, మానవుడు తాను చెప్పుకోదగిన వస్తువు కాకుండా ఉన్న సమయం గడవలేదా?

إِنَّا خَلَقْنَا ٱلْإِنسَٰنَ مِن نُّطْفَةٍ أَمْشَاجٍ نَّبْتَلِيهِ فَجَعَلْنَٰهُ سَمِيعًۢا بَصِيرًا ﴿٢﴾

**2**. నిశ్చయంగా, మేము, మానవుణ్ణి ఒక మిశ్రమ వీర్య బిందువుతో సృష్టించాము.[1] అతనిని పరీక్షించటానికి, మేము అతనిని వినేవాడిగా, చూసేవాడిగా చేశాము.[2]

إِنَّا هَدَيْنَٰهُ ٱلسَّبِيلَ إِمَّا شَاكِرًا وَإِمَّا كَفُورًا ﴿٣﴾

**3**. నిశ్చయంగా, మేము అతనికి మార్గం చూపాము. ఇక అతడు కృతజ్ఞుడు కావచ్చు, లేదా కృతఘ్నుడూ కావచ్చు![3]

---

**1**. అంటే స్త్రీ పురుషుల వీర్యబిందువుల మిశ్రమంతో! అంటే పురుషుని రేతస్సు, లేక వీర్యబిందువు, లేక శుక్లం (Sperm), మరియు స్త్రీ బీజకణం (Ovum) చూడండి, 86:6-7.

**2**. పరీక్షించటం కోసం, చూడండి, 67:2.

**3**. ప్రతి మానవుడు తన ఆత్మను వ్యాపారంలో పెడ్తాడు. దానిని నష్టంలో పడవేస్తాడు లేక లాభంలో ('స. ముస్లిం). నష్టం అంటే నరకం, లాభం అంటే స్వర్గం. ఇంకా చూడండి, 90:10.

إِنَّآ أَعْتَدْنَا لِلْكَٰفِرِينَ سَلَٰسِلَا۟ وَأَغْلَٰلًا وَسَعِيرًا ﴿٤﴾

4. నిశ్చయంగా, మేము సత్య తిరస్కారుల కొరకు సంకెళ్ళను, మెడలో పట్టాలను మరియు భగభగమండే నరకాగ్నిని (స'ఈరా) సిద్ధపరచి ఉంచాము.[1]

إِنَّ ٱلْأَبْرَارَ يَشْرَبُونَ مِن كَأْسٍ كَانَ مِزَاجُهَا كَافُورًا ﴿٥﴾

5. నిశ్చయంగా, పుణ్యాత్ములు కాఫూర్ అనే ఒక చెలమనుండి ఒక గిన్నెలో తెచ్చిన (పానీయాన్ని) త్రాగుతారు.[2]

عَيْنًا يَشْرَبُ بِهَا عِبَادُ ٱللَّهِ يُفَجِّرُونَهَا تَفْجِيرًا ﴿٦﴾

6. ధారాళంగా పొంగి ప్రవహింప జేయబడే ఊటలనుండి, అల్లాహ్ దాసులు త్రాగుతూ ఉంటారు.[3]

يُوفُونَ بِٱلنَّذْرِ وَيَخَافُونَ يَوْمًا كَانَ شَرُّهُۥ مُسْتَطِيرًا ﴿٧﴾

7. వారు తమ మొక్కుబడులను పూర్తి చేసుకున్నవారై ఉంటారు.[4] మరియు దాని హాని అన్నివైపులా క్రమ్ముకొనే, ఆ దినమును గురించి భయపడుతూ ఉంటారు.

وَيُطْعِمُونَ ٱلطَّعَامَ عَلَىٰ حُبِّهِۦ مِسْكِينًا وَيَتِيمًا وَأَسِيرًا ﴿٨﴾

8. మరియు అది తమకు ప్రీతికరమైనప్పటికీ, వారు నిరుపేదలకు మరియు అనాథులకు మరియు ఖైదీలకు, ఆహారం పెట్టేవారై ఉంటారు.[5]

---

1. ఇది అల్లాహ్ (సు.తా.) ప్రసాదించిన స్వేచ్ఛను చెడు మార్గంలో వినియోగించటం వల్ల లభించే ప్రతిఫలం. ఇంకా చూడండి, 73:12-13.
2. చూడండి, 83:25-28.
3. అంటే అది ఎన్నటికీ తరిగిపోదు.
4. మొక్కుబడులు కేవలం అల్లాహ్(సు.తా.)కే చేస్తారు. మరియు వాటిని పూర్తిచేస్తారు. ''అల్లాహ్ (సు.తా.) పేరుతో మొక్కుబడిచేసుకుంటే దానిని పూర్తి చేసుకోవాలి.'' (స. బు'ఖారీ).
5. దైవప్రవక్త ('స'అస) ఆదేశానుసారం 'స'హాబీలు (ర'ది.'అన్హుమ్) బద్ర్‌యుద్ధ ఖైదీలకు మొదట అన్నంపెట్టి, తరువాత తాము తినేవారు, (ఇబ్నె-కసీ'ర్). మన అధీనంలో ఉన్న సేవకులతో కూడా మంచిగా వ్యవహరించాలి. దైవప్రవక్త ('స'అస) చివరి ఉపదేశం: ''నమా'జ్‌ను మరియు మీ సేవకులను ఆదరించండి.'' (ఇబ్నె-మాజా). ఇంకా చూడండి, 2:177 మరియు 90:14-16.

إِنَّمَا نُطۡعِمُكُمۡ لِوَجۡهِ ٱللَّهِ لَا نُرِيدُ مِنكُمۡ جَزَآءٗ وَلَا شُكُورًا ٩

**9**. వారు (వారితో ఇలా అంటారు): "వాస్తవానికి మేము అల్లాహ్ ప్రసన్నత కొరకే మీకు ఆహారం పెడుతున్నాము. మేము మీ నుండి ఎలాంటి ప్రతిఫలం గానీ, లేదా కృతజ్ఞతలు గానీ ఆశించటం లేదు.

إِنَّا نَخَافُ مِن رَّبِّنَا يَوۡمًا عَبُوسٗا قَمۡطَرِيرٗا ١٠

**10**. "నిశ్చయంగా, మేము మా ప్రభువునుండి వచ్చే ఉగ్రమైన, దుర్భరమైన, ఆ దినానికి భయపడుతున్నాము!"

فَوَقَىٰهُمُ ٱللَّهُ شَرَّ ذَٰلِكَ ٱلۡيَوۡمِ وَلَقَّىٰهُمۡ نَضۡرَةٗ وَسُرُورٗا ١١

**11**. కావున అల్లాహ్ వారిని ఆ దినపు కీడునుండి కాపాడాడు. మరియు వారికి ఉల్లాసాన్ని మరియు ఆనందాన్ని ప్రసాదించాడు.

وَجَزَىٰهُم بِمَا صَبَرُواْ جَنَّةٗ وَحَرِيرٗا ١٢

**12**. మరియు వారి సహనానికి[1] ప్రతిఫలంగా వారికి స్వర్గాన్ని మరియు పట్టువస్త్రాలను ఇచ్చాడు.[2]

مُّتَّكِـِٔينَ فِيهَا عَلَى ٱلۡأَرَآئِكِۖ لَا يَرَوۡنَ فِيهَا شَمۡسٗا وَلَا زَمۡهَرِيرٗا ١٣

**13**. అందులో, వారు ఎత్తైన పీఠాలమీద దిండ్లకు ఆనుకొని కూర్చొని ఉంటారు. అందులో వారు ఎండ (బాధ) గానీ, చలి తీవ్రతను గానీ చూడరు!

وَدَانِيَةً عَلَيۡهِمۡ ظِلَٰلُهَا وَذُلِّلَتۡ قُطُوفُهَا تَذۡلِيلٗا ١٤

**14**. మరియు అందులో వారిపై నీడలు పడుతుంటాయి.[3] దాని ఫలాల గుత్తులు వారికి అందుబాటులో ఉంటాయి.

---

**1**. సబరున్: సహనం, అంటే ధర్మమార్గంలో వచ్చే కష్టాలను భరించటం. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞాపాలన కొరకు తమ సుఖసంతోషాలను మరియు అపేక్షలను త్యాగం చేయటం. అల్లాహ్ (సు.తా.) అవిధేయతనుండి దూరంగా ఉండటం.

**2**. చూడండి, 18:31.

**3**. చూడండి, 4:57.

وَيُطَافُ عَلَيْهِم بِـَٔانِيَةٍ مِّن فِضَّةٍ وَأَكْوَابٍ كَانَتْ قَوَارِيرَا۠ ﴿١٥﴾

15. మరియు వారి మధ్య వెండి పాత్రలు మరియు గాజు గ్లాసులు త్రిప్పబడుతూ ఉంటాయి.

قَوَارِيرَا۠ مِن فِضَّةٍ قَدَّرُوهَا تَقْدِيرًا ﴿١٦﴾

16. ఆ గాజు గ్లాసులు స్ఫటికంవలే తెల్లనైన వెండితో చేయబడి ఉంటాయి. అవి నియమబద్ధంగా నింపబడి ఉంటాయి.

وَيُسْقَوْنَ فِيهَا كَأْسًا كَانَ مِزَاجُهَا زَنجَبِيلًا ﴿١٧﴾

17. మరియు వారికి సొంటి కలిపిన మధుపాత్రలు త్రాగటానికి ఇవ్వబడతాయి.[1]

عَيْنًا فِيهَا تُسَمَّىٰ سَلْسَبِيلًا ﴿١٨﴾

18. అది స్వర్గంలోని సల్‌సబీల్ అనే పేరు గల ఒక ఊట! (7/8)

۞ وَيَطُوفُ عَلَيْهِمْ وِلْدَانٌ مُّخَلَّدُونَ إِذَا رَأَيْتَهُمْ حَسِبْتَهُمْ لُؤْلُؤًا مَّنثُورًا ﴿١٩﴾

19. * మరియు వారి మధ్య శాశ్వతంగా, యవ్వనులుగా ఉండే బాలురు తిరుగుతూ ఉంటారు. మరియు నీవు వారిని చూస్తే, వారిని వెదజల్లిన ముత్యాలుగా భావిస్తావు.[2]

وَإِذَا رَأَيْتَ ثَمَّ رَأَيْتَ نَعِيمًا وَمُلْكًا كَبِيرًا ﴿٢٠﴾

20. మరియు నీవు అక్కడ (స్వర్గంలో) చూస్తే, ఎక్కడ చూసినా ఆనందమే పొందుతావు. మరియు ఒక మహత్తర సామ్రాజ్య వైభవం కనిపిస్తుంది.

عَٰلِيَهُمْ ثِيَابُ سُندُسٍ خُضْرٌ وَإِسْتَبْرَقٌ ۖ وَحُلُّوٓا۟ أَسَاوِرَ مِن فِضَّةٍ وَسَقَىٰهُمْ رَبُّهُمْ شَرَابًا طَهُورًا ﴿٢١﴾

21. వారి ఒంటి మీద సన్నని ఆకుపచ్చని శ్రేష్ఠమైన పట్టు వస్త్రాలు మరియు బంగారు జలతారు అల్లిన దుస్తులుంటాయి. మరియు వారికి వెండి కంకణాలు తొడిగించబడతాయి మరియు వారి ప్రభువు వారికి నిర్మలమైన పానీయాన్ని త్రాగటానికి ప్రసాదిస్తాడు.

1. చూడండి, 43:71.

2. వారు ఎల్లప్పుడూ బాలురుగానే ఉంటారు. వారు వృద్ధులు కారు. వారికి మరణం రాదు. ఇంకా చూడండి, 56:17-18 మరియు 52:24.

22. (వారితో ఇలా అనబడుతుంది): "నిశ్చయంగా, ఇది మీకు ఇవ్వబడే ప్రతిఫలం. ఎందుకంటే, మీ శ్రమ అంగీకరించబడింది."

إِنَّ هَٰذَا كَانَ لَكُمْ جَزَآءً وَكَانَ سَعْيُكُم مَّشْكُورًا ﴿٢٢﴾

23. నిశ్చయంగా, మేమే, ఈ ఖుర్ఆన్ను, నీ పై (ఓ ము'హమ్మద్!) క్రమక్రమంగా అవతరింపజేశాము.

إِنَّا نَحْنُ نَزَّلْنَا عَلَيْكَ ٱلْقُرْءَانَ تَنزِيلًا ﴿٢٣﴾

24. కావున నీవు నీ ప్రభువు యొక్క ఆజ్ఞపై స్థిరంగా ఉండు మరియు వీరిలోని ఏ పాపియొక్క లేదా సత్యతిరస్కారుని యొక్క మాటగాని వినకు.[1]

فَٱصْبِرْ لِحُكْمِ رَبِّكَ وَلَا تُطِعْ مِنْهُمْ ءَاثِمًا أَوْ كَفُورًا ﴿٢٤﴾

25. మరియు నీ ప్రభువు నామాన్ని ఉదయం మరియు సాయంత్రం స్మరిస్తూ ఉండు.[2]

وَٱذْكُرِ ٱسْمَ رَبِّكَ بُكْرَةً وَأَصِيلًا ﴿٢٥﴾

26. మరియు రాత్రివేళ ఆయన సన్నిధిలో సాష్టాంగం (సజ్దా) చేస్తూ ఉండు[3] మరియు రాత్రి వేళ సుదీర్ఘకాలం, ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉండు.

وَمِنَ ٱلَّيْلِ فَٱسْجُدْ لَهُۥ وَسَبِّحْهُ لَيْلًا طَوِيلًا ﴿٢٦﴾

27. నిశ్చయంగా, వీరు అనిశ్చితమైన ఈ ప్రాపంచిక జీవితంపట్ల మోహితులై వున్నారు. మరియు ముమ్మందు రానున్న భారమైన దినాన్ని విస్మరిస్తున్నారు.[4]

إِنَّ هَٰٓؤُلَآءِ يُحِبُّونَ ٱلْعَاجِلَةَ وَيَذَرُونَ وَرَآءَهُمْ يَوْمًا ثَقِيلًا ﴿٢٧﴾

---

1. మక్కా సత్యతిరస్కారులు దైవప్రవక్త ('స'అస)ను: అతని ధర్మప్రచారాన్ని ఆపమనే వారు. మరియు తమ దేవతలను ఆరాధించమనే వారు. దానికి బదులుగా వారు అతనికి కోరినంత ధనం, అధికారం, ఇస్తాం అనేవారు. మరియు అతనికి ఇష్టమైన స్త్రీతో వివాహం చేయిస్తాం అనేవారు. (ఫ'త్హ్ అల్-ఖదీర్).
2. అంటే అన్ని వేళలలో ఉదయం ఫజ్ర్, సాయంత్రం ''జుహ్ర్ మరియు 'అస్ర్ నమా'జ్‌లు.
3. రాత్రివేళలలో మ'గ్‌రిబ్ మరియు 'ఇషా నమా'జ్‌లు మరియు తహజ్జుద్ నమా'జ్‌లు.
4. భారమైన దినం అంటే పునరుత్థాన దినం.

نَّحۡنُ خَلَقۡنَٰهُمۡ وَشَدَدۡنَآ أَسۡرَهُمۡۖ وَإِذَا شِئۡنَا بَدَّلۡنَآ أَمۡثَٰلَهُمۡ تَبۡدِيلًا ٢٨

**28**. మేమే వీరిని సృష్టించిన వారం మరియు వీరి శరీరాన్ని దృఢపరిచిన వారం. మరియు మేము కోరినప్పుడు వీరికి బదులుగా వీరివంటి వారిని తేగలము.

إِنَّ هَٰذِهِۦ تَذۡكِرَةٞۖ فَمَن شَآءَ ٱتَّخَذَ إِلَىٰ رَبِّهِۦ سَبِيلًا ٢٩

**29**. నిశ్చయంగా, ఇదొక హితోపదేశం కావున ఇష్టపడిన వాడు తన ప్రభువు వైపునకు పోయే మార్గాన్ని అవలంబించవచ్చు!

وَمَا تَشَآءُونَ إِلَّآ أَن يَشَآءَ ٱللَّهُۚ إِنَّ ٱللَّهَ كَانَ عَلِيمًا حَكِيمًا ٣٠

**30**. మరియు అల్లాహ్ కోరకపోతే, మీరు కోరేది (జరగదు)! నిశ్చయంగా, అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

يُدۡخِلُ مَن يَشَآءُ فِي رَحۡمَتِهِۦۚ وَٱلظَّٰلِمِينَ أَعَدَّ لَهُمۡ عَذَابًا أَلِيمًا ٣١

**31**. ఆయన, తాను కోరిన వారిని తన కారుణ్యంలోకి తీసుకుంటాడు. మరియు దుర్మార్గుల కొరకు, ఆయన బాధాకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచాడు.

*****

## 77. సూరహ్ అల్-ముర్సలాత్ — سُورَةُ المُرْسَلاتِ

అల్-ముర్సలాతు: Those sent forth, పంపబడేవి. ఈ సూరహ్ ఆరంభ మక్కా కాలపు సూరాహ్‌లలో ఒకటి. ఈ సూరహ్ సత్యతిరస్కారులను రాబోయే జీవితపు శిక్ష గురించి హెచ్చరిస్తుంది. 'అబ్దుల్లాహ్ ఇబ్నె-మస్'ఊద్ (ర'ది.'అ.) కథనం: 'మేము మునాలోని ఒక గుహలో ఉండగా ఈ సూరహ్ అవతరింపజేయబడింది. దైవప్రవక్త ('స'అస) దీనిని చదువుతుండగా అకస్మాత్తుగా ఒక పాము వచ్చింది. దైవ ప్రవక్త ('స'అస) దానిని చంపమన్నారు. కాని అది త్వరగా వెళ్ళిపోయింది. అప్పుడు అతనన్నారు: 'నీవు దాని హానినుండి మరియు అది నీ హాని నుండి తప్పించుకున్నారు. ('స'హీ'హ్ బు'ఖారీ మరియు 'స'హీ'హ్ ముస్లిం) దైవప్రవక్త ('స'అస) కొన్ని సార్లు మ'గ్‌రిబ్ నమా'జ్‌లో ఈ సూరహ్ చదివే వారు ('స'హీ'హ్ బు'ఖారీ). ఇందులో **50 ఆయతులు** ఉన్నాయి.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

وَٱلۡمُرۡسَلَٰتِ عُرۡفٗا ١

**1**. ఒకదాని తరువాత ఒకటి, వరుసగా పంపబడే వాయువుల సాక్షిగా![1]

فَٱلۡعَٰصِفَٰتِ عَصۡفٗا ٢

**2**. మరియు తీవ్రమైన వేగంతో వీచే వాయువుల సాక్షిగా![2]

وَٱلنَّٰشِرَٰتِ نَشۡرٗا ٣

**3**. మరియు మేఘాలను దూర దూరంగా వ్యాపింపజేసే వాయువుల సాక్షిగా![3]

فَٱلۡفَٰرِقَٰتِ فَرۡقٗا ٤

**4**. మరియు మంచి చెడులను విశదపరచే (దైవదూతల) సాక్షిగా![4]

---

**1**. లేక దైవదూతల, లేక సందేశహరుల సాక్షిగా అని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. 'ఉర్ఫన్ - అంటే దివ్యజ్ఞానం (వ'హీ) లేక షరీయత్ ఆజ్ఞలని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం.

**2**. లేక దైవదూతల సాక్షిగా! ఎవరైతే తీవ్రంగా వీచే గాలులతో సహా పంపబడతారో!

**3**. లేక దైవదూతల సాక్షిగా! ఇబ్నె-కసీ'ర్, 'తబరీ మరియు ఇతర చాలా మంది వ్యాఖ్యాతలు కూడా (ర'హ్మా.) ఈ మూడు ఆయతులలో గాలుల ప్రస్తావన ఉందనే అభిప్రాయపడ్డారు.

**4**. లేక ఖుర్ఆన్ ఆయతుల లేక ప్రవక్తల సాక్షిగా.

فَٱلْمُلْقِيَٰتِ ذِكْرًا ﴿٥﴾

**5**. సందేశాలను ప్రవక్తల వద్దకు తెచ్చే (దైవదూత) సాక్షిగా![1]

عُذْرًا أَوْ نُذْرًا ﴿٦﴾

**6**. సాకుగా లేక హెచ్చరికగా![2]

إِنَّمَا تُوعَدُونَ لَوَٰقِعٌ ﴿٧﴾

**7**. నిశ్చయంగా, మీకు వాగ్దానం చేయబడినది, జరగవలసి ఉంది.

فَإِذَا ٱلنُّجُومُ طُمِسَتْ ﴿٨﴾

**8**. అప్పుడు ఎప్పుడైతే నక్షత్రాలు కాంతిహీనమై పోతాయో!

وَإِذَا ٱلسَّمَآءُ فُرِجَتْ ﴿٩﴾

**9**. మరియు ఆకాశం చీలిపోతుందో!

وَإِذَا ٱلْجِبَالُ نُسِفَتْ ﴿١٠﴾

**10**. మరియు పర్వతాలు పొడిగామారి, చెల్లాచెదురుగా చేయబడతాయో!

وَإِذَا ٱلرُّسُلُ أُقِّتَتْ ﴿١١﴾

**11**. మరియు ప్రవక్తలు తమ నిర్ణీత సమయంలో సమావేశపరచబడతారో![3]

لِأَىِّ يَوْمٍ أُجِّلَتْ ﴿١٢﴾

**12**. ఏ దినానికి గాను, (ఇవన్నీ) వాయిదా వేయబడ్డాయి?

لِيَوْمِ ٱلْفَصْلِ ﴿١٣﴾

**13**. ఆ తీర్పు దినం కొరకా![4]

وَمَآ أَدْرَىٰكَ مَا يَوْمُ ٱلْفَصْلِ ﴿١٤﴾

**14**. మరియు ఆ తీర్పుదినం అంటే ఏమిటో నీకెలా అర్థంకాగలదు?

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿١٥﴾

**15**. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

---

**1**. లేక అల్లాహ్ (సు.తా.) యొక్క వ'హీని ప్రజలకు అందజేసే ప్రవక్త ('అలైహిమ్ స.)ల సాక్షిగా! ఇమామ్ షౌకాని అభిప్రాయంలో - ముర్సలాత్, 'ఆ'సిఫాత్ మరియు నాషిరాత్ - గాలులను సంబోధిస్తున్నాయి మరియు ఫారిఖాత్, ముల్ఖియాత్ - దైవదూతలను. ఈ వ్యాఖ్యానంతో కూడా చాలామంది వ్యాఖ్యాతలు ఏకీభవిస్తున్నారు.

**2**. దీని మరొక తాత్పర్యం: "(మానవులకు) తెలియజేసే ఉద్దేశంతో గానీ, లేక హెచ్చరిక చేయటానికి గానీ."

**3**. చూడండి, 4:41-42, 5:109, 7:6 లేక 39:69.

**4**. యౌమల్ ఫ'స్ల్: పునరుత్థానదినం. ఖుర్ఆన్ అవతరణాక్రమంలో ఇక్కడ మొదటి సారి పేర్కొనబడింది. ఇంకా చూడండి, 37:21, 44:40, 78:17 మరియు 77:38.

أَلَمْ نُهْلِكِ ٱلْأَوَّلِينَ ﴿١٦﴾

16. ఏమీ? మేము పూర్వీకులను నాశనం చేయలేదా?

ثُمَّ نُتْبِعُهُمُ ٱلْآخِرِينَ ﴿١٧﴾

17. తరువాత రాబోయే వారిని కూడా, మేము వారి వెనక పంపుతాము.

كَذَٰلِكَ نَفْعَلُ بِٱلْمُجْرِمِينَ ﴿١٨﴾

18. ఈ విధంగా మేము నేరస్థుల పట్ల వ్యవహరిస్తాము.

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿١٩﴾

19. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

أَلَمْ نَخْلُقكُّم مِّن مَّآءٍ مَّهِينٍ ﴿٢٠﴾

20. ఏమీ? మేము మిమ్మల్ని తుచ్ఛమైన నీటితో (వీర్యబిందువుతో) సృష్టించలేదా?

فَجَعَلْنَٰهُ فِى قَرَارٍ مَّكِينٍ ﴿٢١﴾

21. తరువాత మేము దానిని ఒక భద్రమైన స్థానంలో ఉంచాము.

إِلَىٰ قَدَرٍ مَّعْلُومٍ ﴿٢٢﴾

22. ఒక నిర్ణీతకాలం వరకు.

فَقَدَرْنَا فَنِعْمَ ٱلْقَٰدِرُونَ ﴿٢٣﴾

23. ఈ విధంగా మేము నిర్ణయించాము; ఎందుకంటే మేమే ఉత్తమమైన నిర్ణయాలు తీసుకునేవారము.[1]

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿٢٤﴾

24. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

أَلَمْ نَجْعَلِ ٱلْأَرْضَ كِفَاتًا ﴿٢٥﴾

25. ఏమీ? మేము భూమిని ఒక సమీకరించే స్థానంగా చేయలేదా?

أَحْيَآءً وَأَمْوَٰتًا ﴿٢٦﴾

26. జీవులకూ మరియు మృతులకూను?

وَجَعَلْنَا فِيهَا رَوَٰسِىَ شَٰمِخَٰتٍ وَأَسْقَيْنَٰكُم مَّآءً فُرَاتًا ﴿٢٧﴾

27. మరియు దానిలో ఎత్తైన పర్వతాలను స్థిరంగా నిలుపలేదా? మరియు మీకు త్రాగటానికి మంచినీటిని ప్రసాదించలేదా?

---

1. చూడండి, 23:12-14.

وَيۡلٞ يَوۡمَئِذٖ لِّلۡمُكَذِّبِينَ ٢٨

**28**. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

ٱنطَلِقُوٓاْ إِلَىٰ مَا كُنتُم بِهِۦ تُكَذِّبُونَ ٢٩

**29**. (సత్యతిరస్కారులతో ఇలా అనబడు తుంది): ''మీరు తిరస్కరిస్తూ వచ్చిన దాని వైపునకు పొండి!''

ٱنطَلِقُوٓاْ إِلَىٰ ظِلّٖ ذِي ثَلَٰثِ شُعَبٖ ٣٠

**30**. (దాని పొగ) మూడు శాఖలుగా చీలిపోయే నీడ వైపునకు పొండి;

لَّا ظَلِيلٖ وَلَا يُغۡنِي مِنَ ٱللَّهَبِ ٣١

**31**. కాని అది ఏ విధమైన (చల్లని) నీడనూ ఇవ్వదూ మరియు (నరక) జ్వాలల నుండి కూడా కాపాడదు!

إِنَّهَا تَرۡمِي بِشَرَرٖ كَٱلۡقَصۡرِ ٣٢

**32**. వాస్తవానికి, అది పెద్దపెద్ద మొద్దుల వంటి అగ్నికణాలను విసురుతుంది.

كَأَنَّهُۥ جِمَٰلَتٞ صُفۡرٞ ٣٣

**33**. వాస్తవానికి ఆ అగ్నికణాలు పసుపు పచ్చని ఒంటెలవలే కనిపిస్తాయి.

وَيۡلٞ يَوۡمَئِذٖ لِّلۡمُكَذِّبِينَ ٣٤

**34**. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

هَٰذَا يَوۡمُ لَا يَنطِقُونَ ٣٥

**35**. ఆ దినాన వారు మాట్లాడలేరు.

وَلَا يُؤۡذَنُ لَهُمۡ فَيَعۡتَذِرُونَ ٣٦

**36**. మరియు వారికి సాకులు చెప్పుకునే అవకాశం కూడా ఇవ్వబడదు.

وَيۡلٞ يَوۡمَئِذٖ لِّلۡمُكَذِّبِينَ ٣٧

**37**. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

هَٰذَا يَوۡمُ ٱلۡفَصۡلِۖ جَمَعۡنَٰكُمۡ وَٱلۡأَوَّلِينَ ٣٨

**38**. అది తీర్పుదినమై ఉంటుంది! మేము మిమ్మల్ని మరియు మీ పూర్వీకులను సమావేశపరచి ఉంటాము!

فَإِن كَانَ لَكُمۡ كَيۡدٞ فَكِيدُونِ ٣٩

**39**. కావున మీవద్ద ఏదైనా పన్నాగముంటే దానిని పన్నండి.[1]

وَيۡلٞ يَوۡمَئِذٖ لِّلۡمُكَذِّبِينَ ٤٠

**40**. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

---

**1**. ఇటువంటి సందేశం గల ఆయత్ కోసం చూడండి, 55:33.

إِنَّ ٱلْمُتَّقِينَ فِى ظِلَٰلٍ وَعُيُونٍ ﴿٤١﴾

وَفَوَٰكِهَ مِمَّا يَشْتَهُونَ ﴿٤٢﴾

كُلُوا۟ وَٱشْرَبُوا۟ هَنِيٓـًٔۢا بِمَا كُنتُمْ تَعْمَلُونَ ﴿٤٣﴾

إِنَّا كَذَٰلِكَ نَجْزِى ٱلْمُحْسِنِينَ ﴿٤٤﴾

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿٤٥﴾

كُلُوا۟ وَتَمَتَّعُوا۟ قَلِيلًا إِنَّكُم مُّجْرِمُونَ ﴿٤٦﴾

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿٤٧﴾

وَإِذَا قِيلَ لَهُمُ ٱرْكَعُوا۟ لَا يَرْكَعُونَ ﴿٤٨﴾

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿٤٩﴾

فَبِأَىِّ حَدِيثٍۭ بَعْدَهُۥ يُؤْمِنُونَ ﴿٥٠﴾

**41**. నిశ్చయంగా భయభక్తులు గల వారు (ఆ రోజు చల్లని) నీడలలో చెలమల దగ్గర ఉంటారు.

**42**. మరియు వారికి, వారు కోరే ఫలాలు లభిస్తాయి.

**43**. (వారితో ఇలా అనబడుతుంది): "మీరు చేస్తూ ఉండిన కర్మలకు ఫలితంగా హాయిగా తినండి, త్రాగండి!"

**44**. నిశ్చయంగా, మేము సజ్జనులకు ఇలాంటి ప్రతిఫలమే ఇస్తాము.

**45**. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

**46**. (ఓ సత్యతిరస్కారులారా!) మీరు కొంతకాలం తినండి, సుఖాలు అనుభవించండి. నిశ్చయంగా, మీరు నేరస్థులు!

**47**. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

**48**. మరియు వారితో: "(అల్లాహ్ ముందు) వంగండి (రుకూ'ఉ చేయండి)." అని అన్నప్పుడు, వారు వంగలేదు.

**49**. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది![1]

**50**. దీని (ఈ ఖుర్ఆన్) తరువాత, ఇక వారు మరెలాంటి సందేశాన్ని విశ్వసిస్తారు?

*****

1. ఈ ఆయత్ ఈ సూరహ్‌లో పదిసార్లు వచ్చింది. ఏ విధంగానైతే: "అయితే మీరిరువురు (మానవులు మరియు జిన్నాతులు) మీ ప్రభువు యొక్క ఏ యే అనుగ్రహాలను నిరాకరిస్తారు?" అనే ఆయతు సూరహ్ అర్-రహ్మాన్(55)లో 31సార్లు, వచ్చిందో! అంటే, పునరుత్థానదినాన్ని తిరస్కరించే వారికి వినాశం తప్పదనే విషయాన్ని అల్లాహుతా'లా మాటిమాటికి విశదీకరిస్తున్నాడు.

## 78. సూరహ్ అన్-నబా'

## سُورَةُ ٱلنَّبَإِ

అన్-నబా': The Great News, The Tiding, వార్త, సమాచారం. ఈ పేరు రెండవ ఆయత్‌లో నుండి తీసుకోబడింది. ఇది చివరి మక్కా కాలపు సూరహ్. ఇది పునరుత్థానం మరియు అంతిమ తీర్పులను గురించి తెలుపుతోంది. ఇందులో **40** ఆయతులు ఉన్నాయి.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

عَمَّ يَتَسَآءَلُونَ ١

**1**. (*) ఏ విషయాన్ని గురించి వారు (ఒకరినొకరు) ప్రశ్నించుకుంటున్నారు?[1]

عَنِ ٱلنَّبَإِ ٱلۡعَظِيمِ ٢

**2**. ఆ మహా వార్తను గురించేనా?

ٱلَّذِي هُمۡ فِيهِ مُخۡتَلِفُونَ ٣

**3**. దేనిని గురించైతే వారు భేదాభిప్రాయాలను కలిగి ఉన్నారో!

كَلَّا سَيَعۡلَمُونَ ٤

**4**. అదికాదు! వారు త్వరలోనే దానిని తెలుసుకోగలరు.

ثُمَّ كَلَّا سَيَعۡلَمُونَ ٥

**5**. ఎంత మాత్రము కాదు! వారు త్వరలోనే దానిని తెలుసుకోగలరు.

أَلَمۡ نَجۡعَلِ ٱلۡأَرۡضَ مِهَٰدٗا ٦

**6**. ఏమీ? మేము భూమిని పరుపుగా చేయలేదా?

وَٱلۡجِبَالَ أَوۡتَادٗا ٧

**7**. మరియు పర్వతాలను మేకులుగా?[2]

وَخَلَقۡنَٰكُمۡ أَزۡوَٰجٗا ٨

**8**. మరియు మేము మిమ్మల్ని (స్త్రీ-పురుషుల) జంటలుగా సృష్టించాము.[3]

---

**1**. దైవప్రవక్త ('స'అస)పై అవతరింపజేయబడిన ఖుర్ఆన్‌ను మరియు అతనిని ప్రవక్తగా అల్లాహ్ (సు.తా.) ఎన్నుకున్న విషయాన్ని నమ్మలేక సత్యతిరస్కారులు ఒకరితో నొకరు ఈ విధంగా ప్రశ్నించుకున్నారు: "ఏమీ? పునరుత్థానం నిజమేనా? ఇతడు వాస్తవంగానే ప్రవక్తనా?" మొదలైనవి. దానికి అల్లాహ్ (సు.తా.) స్వయంగా జవాబిచ్చాడు.

**2**. చూడండి, 16:15.

**3**. మానవులలో, జంతువులలో మరియు ఇతర ప్రాణంలేని వస్తువులలో కూడా జంటలున్నాయి. ఉదా: రాత్రిం-బవళ్ళు, సూర్య-చంద్రులు, ఆకాశం-భూమి, నలుపు-తెలుపు మొదలైనవి. ఇంకా చూడండి, 36:36.

وَجَعَلْنَا نَوْمَكُمْ سُبَاتًا ٩

**9**. మరియు మేము నిద్రను, మీకు విశ్రాంతి నిచ్చేదిగా చేశాము.

وَجَعَلْنَا ٱلَّيْلَ لِبَاسًا ١٠

**10**. మరియు రాత్రిని ఆచ్ఛాదంగా చేశాము.

وَجَعَلْنَا ٱلنَّهَارَ مَعَاشًا ١١

**11**. మరియు పగటిని జీవనోపాధి సమయంగా చేశాము.

وَبَنَيْنَا فَوْقَكُمْ سَبْعًا شِدَادًا ١٢

**12**. మరియు మేము మీపైన పటిష్ఠమైన ఏడు (ఆకాశాలను) నిర్మించాము.

وَجَعَلْنَا سِرَاجًا وَهَّاجًا ١٣

**13**. మరియు (అందులో) ప్రకాశించే దీపాన్ని (సూర్యుణ్ణి) ఉంచాము.

وَأَنزَلْنَا مِنَ ٱلْمُعْصِرَٰتِ مَآءً ثَجَّاجًا ١٤

**14**. మరియు మేఘాల నుండి ధారాపాతంగా వర్షాన్ని కురిపించాము.[1]

لِّنُخْرِجَ بِهِۦ حَبًّا وَنَبَاتًا ١٥

**15**. దానితో మేము ధాన్యం మరియు పచ్చికను (చెట్లుచేమలను) పెరిగించటానికి!

وَجَنَّٰتٍ أَلْفَافًا ١٦

**16**. మరియు దట్టమైన తోటలను.

إِنَّ يَوْمَ ٱلْفَصْلِ كَانَ مِيقَٰتًا ١٧

**17**. నిశ్చయంగా, తీర్పుదినం ఒక నిర్ణీత సమయం.[2]

يَوْمَ يُنفَخُ فِى ٱلصُّورِ فَتَأْتُونَ أَفْوَاجًا ١٨

**18**. ఆ రోజు బాకా ఊదబడినప్పుడు! అప్పుడు మీరంతా గుంపులు గుంపులుగా లేచివస్తారు.

وَفُتِحَتِ ٱلسَّمَآءُ فَكَانَتْ أَبْوَٰبًا ١٩

**19**. మరియు ఆకాశం తెరువబడుతుంది, అందులో ద్వారాలు ఏర్పడుతాయి;

وَسُيِّرَتِ ٱلْجِبَالُ فَكَانَتْ سَرَابًا ٢٠

**20**. మరియు పర్వతాలు ఎండ మావులుగా అదృశ్యమైపోతాయి.[3]

---

**1**. ము'అ'సిరాత్: నీటితో నిండి ఉండి ఇంకా కురవని మేఘాలు.

**2**. చూడండి, 77:13.

**3**. చూడండి, 69:14, 14:48, 101:5, 70:9, 56:6, 20:105, మొదలైనవి.

**21**. నిశ్చయంగా, నరకం ఒక మాటు;

**22**. ధిక్కారుల గమ్యస్థానం;

**23**. అందులో వారు యుగాలతరబడి ఉంటారు.[1]

**24**. అందులో వారు ఎలాంటి చల్లదనాన్ని గానీ మరియు (చల్లని) పానీయాన్ని గానీ చవిచూడరు.

**25**. సలసల కాగే నీరు మరియు చీములాంటి మురికి (పానీయం) తప్ప![2]

**26**. (వారి కర్మలకు) తగిన పూర్తి ప్రతిఫలంగా!

**27**. వాస్తవానికి వారు లెక్క తీసుకోబడుతుందని ఆశించలేదు.

**28**. పైగా వారు మా సూచన(ఆయాత్)లను అసత్యాలని తిరస్కరించారు.

**29**. మరియు మేము (వారు చేసిన) ప్రతి దానిని ఒక పుస్తకంలో వ్రాసిపెట్టాము.[3]

**30**. కావున మీరు (మీ కర్మల ఫలితాన్ని) చవిచూడండి. ఎందుకంటే, మేము మీకు శిక్షతప్ప మరేమీ అధికం చేయము.[4]

**31**. నిశ్చయంగా, దైవభీతి గలవారికి సాఫల్యం (స్వర్గం) ఉంది;

**32**. ఉద్యానవనాలూ, ద్రాక్షతోటలూ!

إِنَّ جَهَنَّمَ كَانَتْ مِرْصَادًا ﴿٢١﴾

لِّلطَّٰغِينَ مَـَٔابًا ﴿٢٢﴾

لَّٰبِثِينَ فِيهَآ أَحْقَابًا ﴿٢٣﴾

لَّا يَذُوقُونَ فِيهَا بَرْدًا وَلَا شَرَابًا ﴿٢٤﴾

إِلَّا حَمِيمًا وَغَسَّاقًا ﴿٢٥﴾

جَزَآءً وِفَاقًا ﴿٢٦﴾

إِنَّهُمْ كَانُواْ لَا يَرْجُونَ حِسَابًا ﴿٢٧﴾

وَكَذَّبُواْ بِـَٔايَٰتِنَا كِذَّابًا ﴿٢٨﴾

وَكُلَّ شَىْءٍ أَحْصَيْنَٰهُ كِتَٰبًا ﴿٢٩﴾

فَذُوقُواْ فَلَن نَّزِيدَكُمْ إِلَّا عَذَابًا ﴿٣٠﴾

إِنَّ لِلْمُتَّقِينَ مَفَازًا ﴿٣١﴾

حَدَآئِقَ وَأَعْنَٰبًا ﴿٣٢﴾

---

**1**. చూడండి, 6:128 మరియు 11:107.
**2**. చూడండి, 38:57-58.
**3**. చూడండి, 36:12.
**4**. చూడండి, 4:56, 17:97.

33. మరియు ఈడూజోడూ గల (యవ్వన) సుందరకన్యలు;

وَكَوَاعِبَ أَتْرَابًا ﴿٣٣﴾

34. మరియు నిండి పొర్లే (మధు) పాత్ర.

وَكَأْسًا دِهَاقًا ﴿٣٤﴾

35. అందులో (స్వర్గంలో) వారు ఏలాంటి వ్యర్థపు మాటలు గానీ, అసత్యాలు గానీ వినరు.

لَّا يَسْمَعُونَ فِيهَا لَغْوًا وَلَا كِذَّٰبًا ﴿٣٥﴾

36. (ఇదంతా) నీ ప్రభువు తరఫునుండి లభించే ప్రతిఫలం, చాలినంత బహుమానం.

جَزَآءً مِّن رَّبِّكَ عَطَآءً حِسَابًا ﴿٣٦﴾

37. భూమ్యాకాశాలు మరియు వాటి మధ్య ఉన్న సమస్తానికీ ప్రభువైన అనంత కరుణామయుని (బహుమానం); ఆయన ముందు మాట్లాడే సాహసం ఎవ్వరికీ లేదు.

رَّبِّ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَمَا بَيْنَهُمَا ٱلرَّحْمَٰنِ ۖ لَا يَمْلِكُونَ مِنْهُ خِطَابًا ﴿٣٧﴾

38. ఏ రోజునయితే ఆత్మ (జిబ్రీల్)[1] మరియు దేవదూతలు వరుసలలో నిలిచి ఉంటారో! అప్పుడు ఆ అనంత కరుణామయుడు అనుమతించిన వాడు తప్ప, మరెవ్వరూ మాట్లాడలేరు; ఒకవేళ ఎవడైనా మాట్లాడినా అతడు సరైనమాటే మాట్లాడుతాడు.[2]

يَوْمَ يَقُومُ ٱلرُّوحُ وَٱلْمَلَٰٓئِكَةُ صَفًّا ۖ لَّا يَتَكَلَّمُونَ إِلَّا مَنْ أَذِنَ لَهُ ٱلرَّحْمَٰنُ وَقَالَ صَوَابًا ﴿٣٨﴾

39. అదే అంతిమ సత్యదినం. కావున ఇష్టమున్నవాడు, తన ప్రభువు వైపునకు చేరే మార్గాన్ని అవలంబించాలి![3]

ذَٰلِكَ ٱلْيَوْمُ ٱلْحَقُّ ۖ فَمَن شَآءَ ٱتَّخَذَ إِلَىٰ رَبِّهِۦ مَـَٔابًا ﴿٣٩﴾

---

1. చూడండి, 16:2 మరియు 97:4.

2. అల్లాహ్ (సు.తా.) దేవదూతలకు మరియు దైవప్రవక్తలకు ('అలైహిమ్ స.) మాట్లాడే అనుమతినిస్తాడు. వారు కేవలం సత్యమే పలుకుతారు. చూడండి, 10:3.

3. చూడండి, 69:1.

**40**. నిశ్చయంగా, మేము అతి సమీపంలో ఉన్న శిక్షను గురించి మిమ్మల్ని హెచ్చరించాము. ఆ రోజు ప్రతి మనిషి తన చేజేతులా చేసుకొని ముందు పంపుకున్నదంతా ప్రత్యక్షంగా చూసుకుంటాడు.[1] మరియు సత్యతిరస్కారి: "అయ్యో, నా పాడుగాను! నేను మట్టినయి ఉంటే ఎంతబాగుండేది!"[2] అని వాపోతాడు.

إِنَّآ أَنذَرۡنَٰكُمۡ عَذَابٗا قَرِيبٗا يَوۡمَ يَنظُرُ ٱلۡمَرۡءُ مَا قَدَّمَتۡ يَدَاهُ وَيَقُولُ ٱلۡكَافِرُ يَٰلَيۡتَنِي كُنتُ تُرَٰبَۢا ﴿٤٠﴾

*****

1. చూడండి, 18:49 మరియు 75:13.

2. చూడండి, 69:27.

## 79. సూరహ్ అన్-నా'జి'ఆత్ سُورَةُ النَّازِعَاتِ

అన్-నా'జి'ఆత్: Those Who Pull Out, బలవంతంగా **లాగు లేక ఈడ్చువారు**, లేక **కఠినంగా తీయువారు**. ఇది సూరహ్ అన్-నబా' (78) తరువాత అవతరింపజేయబడిన చివరి మక్కా కాలపు సూరహ్. ఇందులో **46 ఆయతులు** ఉన్నాయి.

బِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

وَٱلنَّـٰزِعَـٰتِ غَرْقًا ۝١

**1**. (అవిశ్వాసుల ప్రాణాలను) **కఠినంగా** లాగి తీసే వారి (దేవదూతల) సాక్షిగా![1]

وَٱلنَّـٰشِطَـٰتِ نَشْطًا ۝٢

**2**. (విశ్వాసుల ప్రాణాలను) నెమ్మదిగా తీసేవారి (దేవదూతల) సాక్షిగా![2]

وَٱلسَّـٰبِحَـٰتِ سَبْحًا ۝٣

**3**. (విశ్వంలో) తేలియాడుతూ పోయే వారి సాక్షిగా![3]

فَٱلسَّـٰبِقَـٰتِ سَبْقًا ۝٤

**4**. మరియు పందెంలో వలే (ఒకరితో నొకరు) పోటీపడే వారి సాక్షిగా!

فَٱلْمُدَبِّرَٰتِ أَمْرًا ۝٥

**5**. మరియు (తమ ప్రభువు) ఆజ్ఞానుసారం వ్యవహారాలు నిర్వహించే వారి (దేవదూతల) సాక్షిగా!

يَوْمَ تَرْجُفُ ٱلرَّاجِفَةُ ۝٦

**6**. ఆ రోజు (మొదటి) బాకా ధ్వని భూగోళాన్ని తీవ్రంగా కంపింపజేస్తుంది.[4]

تَتْبَعُهَا ٱلرَّادِفَةُ ۝٧

**7**. దాని తర్వాత రెండవసారి[5] బాకా ఊదబడుతుంది, (అప్పుడు అందరూ పునరుత్థరింపబడతారు).

---

**1**. నా'జి'ఆత్: బలవంతంగా, కఠినంగా లాగి తీయటం. 'గర్ఖన్: మునిగి. ఈ సూరహ్‌లోని 1-5 ఆయతుల తాత్పర్యంలో వ్యాఖ్యాతల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి.

**2**. నష్'తన్: ముడివిప్పటం - అంటే నెమ్మదిగా తీయటం.

**3**. సబ్'హన్: ఈదుట, తేలుతూపోవుట.

**4**. ఇది మొదటి బాకా ధ్వని. దీనిని నఫ్ఖయే ఫనా అంటారు. అప్పుడు ప్రతీది నశిస్తుంది.

**5**. ఈ రెండవ బాకా ధ్వనితో అందరూ బ్రతికి తమ గోరీలనుండి బయటికి లేచి వస్తారు.

قُلُوبٌ يَوْمَئِذٍ وَاجِفَةٌ ٨

**8**. ఆ రోజు (కొన్ని) హృదయాలు (భయంతో) దడదడలాడుతూ ఉంటాయి.

أَبْصَٰرُهَا خَٰشِعَةٌ ٩

**9**. వారి చూపులు క్రిందికి వాలి ఉంటాయి.

يَقُولُونَ أَءِنَّا لَمَرْدُودُونَ فِى ٱلْحَافِرَةِ ١٠

**10**. వారు ఇలా అంటున్నారు: "ఏమీ? మనం మన పూర్వస్థితిలోకి మళ్ళీ తీసుకురాబడతామా?

أَءِذَا كُنَّا عِظَٰمًا نَّخِرَةً ١١

**11**. "మనం శిథిలమైన ఎముకలుగా మారిపోయిన తరువాత కూడానా?"

قَالُوا۟ تِلْكَ إِذًا كَرَّةٌ خَاسِرَةٌ ١٢

**12**. వారు (ఇంకా ఇలా) అంటారు: "అయితే ఈ తిరిగి రావటమనేది చాల నష్టదాయకమైనదే!"

فَإِنَّمَا هِىَ زَجْرَةٌ وَٰحِدَةٌ ١٣

**13**. కాని అది వాస్తవానికి, ఒకే ఒక (తీవ్రమైన) ధ్వని.

فَإِذَا هُم بِٱلسَّاهِرَةِ ١٤

**14**. అప్పుడు వారందరూ, ఒకేసారి లేచి మైదానంలోకి వచ్చి ఉంటారు.

هَلْ أَتَىٰكَ حَدِيثُ مُوسَىٰٓ ١٥

**15**. ఏమీ? నీకు మూసా వృత్తాంతం అందిందా?[1]

إِذْ نَادَىٰهُ رَبُّهُۥ بِٱلْوَادِ ٱلْمُقَدَّسِ طُوًى ١٦

**16**. అతని ప్రభువు పవిత్ర 'తువా లోయలో అతనిని పిలిచినప్పుడు,[2]

ٱذْهَبْ إِلَىٰ فِرْعَوْنَ إِنَّهُۥ طَغَىٰ ١٧

**17**. (ఇలా అన్నాడు): "ఫిర్'ఔన్ వద్దకు వెళ్ళు, నిశ్చయంగా అతడు ధిక్కారుడయ్యాడు.

فَقُلْ هَل لَّكَ إِلَىٰٓ أَن تَزَكَّىٰ ١٨

**18**. "ఇక (అతనితో) ఇట్లను: 'ఏమీ? నీవు పాపరహితుడవటానికి ఇష్టపడతావా?

---

**1**. మూసా వృత్తాంతానికి చూడండి. 20:9-98.
**2**. అల్లాహ్ (సు.తా.) మూసా ('అ.స.)తో మాట్లాడాడు. అతనిని సందేశహరునిగా ఎన్నుకున్నాడు.

وَأَهْدِيَكَ إِلَىٰ رَبِّكَ فَتَخْشَىٰ ١٩

**19**. " 'మరియు నేను నీకు నీ ప్రభువు వైపునకు మార్గదర్శకత్వం చేస్తాను, మరి నీవు ఆయన పట్ల భీతికలిగి ఉంటావా?' "

فَأَرَىٰهُ ٱلْـَٔايَةَ ٱلْكُبْرَىٰ ٢٠

**20**. తరువాత అతను (మూసా) అతడికి (ఫిర్'ఔన్‌కు) గొప్ప అద్భుత నిదర్శనాన్ని చూపాడు.

فَكَذَّبَ وَعَصَىٰ ٢١

**21**. కాని అతడు (ఫిర్'ఔన్) దానిని అబద్ధమని తిరస్కరించాడు మరియు (అతని మాటను) ఉల్లంఘించాడు.

ثُمَّ أَدْبَرَ يَسْعَىٰ ٢٢

**22**. ఆ తర్వాత అతడు (ఫిర్'ఔన్) వెనక్కి మరలిపోయి, (కుట్రలు) పన్నసాగాడు.

فَحَشَرَ فَنَادَىٰ ٢٣

**23**. పిదప (ప్రజలను) సమావేశపరచి, ఎలుగెత్తి చాటుతూ;

فَقَالَ أَنَا۠ رَبُّكُمُ ٱلْأَعْلَىٰ ٢٤

**24**. ఇలా అన్నాడు: "నేనే మీ యొక్క మహోన్నత ప్రభువును!"[1]

فَأَخَذَهُ ٱللَّهُ نَكَالَ ٱلْـَٔاخِرَةِ وَٱلْأُولَىٰٓ ٢٥

**25**. కావున అల్లాహ్ అతనిని ఇహపరలోకాల శిక్షకు గురిచేశాడు.[2]

إِنَّ فِى ذَٰلِكَ لَعِبْرَةً لِّمَن يَخْشَىٰٓ ٢٦

**26**. నిశ్చయంగా ఇందులో (అల్లాహ్‌కు) భయపడే ప్రతివ్యక్తి కొరకు గుణపాఠముంది.

ءَأَنتُمْ أَشَدُّ خَلْقًا أَمِ ٱلسَّمَآءُ ۚ بَنَىٰهَا ٢٧

**27**. ఏమీ? మిమ్మల్ని సృష్టించటం కఠినమయిన పనా? లేక ఆకాశాన్నా? ఆయనే కదా దానిని నిర్మించింది![3]

رَفَعَ سَمْكَهَا فَسَوَّىٰهَا ٢٨

**28**. ఆయన దాని కప్పును (ఎత్తును) చాలాపైకి లేపాడు. తరువాత దానిని క్రమపరిచాడు;

---

**1**. చూడండి, 28:38, ఫిర్'ఔన్ తనను తాను దేవుడని చెప్పుకున్నాడు మరియు హద్దులు మీరి ప్రవర్తించాడు మరియు సత్యాన్ని తిరస్కరించాడు.

**2**. చూడండి, 7:137 అతని ఇహలోక శిక్షకు.

**3**. చూడండి, 2:29 మరియు 40:57.

وَأَغۡطَشَ لَيۡلَهَا وَأَخۡرَجَ ضُحَىٰهَا ﴿٢٩﴾

29. మరియు ఆయన దాని రాత్రిని చీకటిగా చేశాడు మరియు దాని పగటిని (వెలుగును) బహిర్గతం చేశాడు.

وَٱلۡأَرۡضَ بَعۡدَ ذَٰلِكَ دَحَىٰهَآ ﴿٣٠﴾

30. మరియు ఆ పిదప భూమిని పరచినట్లు చేశాడు.[1]

أَخۡرَجَ مِنۡهَا مَآءَهَا وَمَرۡعَىٰهَا ﴿٣١﴾

31. దాని నుండి దాని నీళ్ళను మరియు దాని పచ్చికను బయటికి తీశాడు;

وَٱلۡجِبَالَ أَرۡسَىٰهَا ﴿٣٢﴾

32. మరియు పర్వతాలను (దానిలో) స్థిరంగా నాటాడు;

مَتَٰعٗا لَّكُمۡ وَلِأَنۡعَٰمِكُمۡ ﴿٣٣﴾

33. మీకు మరియు మీ పశువులకు జీవన సామగ్రిగా![2]

فَإِذَا جَآءَتِ ٱلطَّآمَّةُ ٱلۡكُبۡرَىٰ ﴿٣٤﴾

34. ఇక ఆ గొప్ప దుర్ఘటన (పునరుత్థాన దినం) వచ్చినప్పుడు;

يَوۡمَ يَتَذَكَّرُ ٱلۡإِنسَٰنُ مَا سَعَىٰ ﴿٣٥﴾

35. ఆ రోజు మానవుడు తాను చేసిందంతా జ్ఞాపకం చేసుకుంటాడు;

وَبُرِّزَتِ ٱلۡجَحِيمُ لِمَن يَرَىٰ ﴿٣٦﴾

36. మరియు చూసేవారి యెదుటకు, నరకాగ్ని స్పష్టంగా కనబడేటట్లు తేబడుతుంది.[3]

فَأَمَّا مَن طَغَىٰ ﴿٣٧﴾

37. ఇక ధిక్కారంతో హద్దులు మీరి ప్రవర్తించిన వాడికి;

وَءَاثَرَ ٱلۡحَيَوٰةَ ٱلدُّنۡيَا ﴿٣٨﴾

38. మరియు ఐహిక జీవితానికి ప్రాధాన్యత నిచ్చిన వాడికి;

فَإِنَّ ٱلۡجَحِيمَ هِيَ ٱلۡمَأۡوَىٰ ﴿٣٩﴾

39. నిశ్చయంగా, నరకాగ్నియే, వాని నివాసస్థాన మవుతుంది!

---

1. ద'హాహున్: అంటే నిప్పుకోడి గ్రుడ్డు ఆకారం అని కొందరు వ్యాఖ్యానించారు. ఈ రోజు సైంటిస్టులు భూమి ఆకారం నిప్పుకోడి గ్రుడ్డు ఆకారంలో ఉందని నిరూపించారు.
2. చూడండి, 80:24-32.
3. చూడండి, 26:91.

وَأَمَّا مَنْ خَافَ مَقَامَ رَبِّهِۦ وَنَهَى ٱلنَّفْسَ عَنِ ٱلْهَوَىٰ ﴿٤٠﴾

40. మరియు తన ప్రభువు ముందు నిలబడ వలసి వుంటుందన్న భయంతో తన మనస్సును దుష్టవాంఛలకు దూరంగా ఉంచిన వ్యక్తికి;

فَإِنَّ ٱلْجَنَّةَ هِىَ ٱلْمَأْوَىٰ ﴿٤١﴾

41. నిశ్చయంగా, స్వర్గమే, అతని నివాసస్థాన మవుతుంది!

يَسْـَٔلُونَكَ عَنِ ٱلسَّاعَةِ أَيَّانَ مُرْسَىٰهَا ﴿٤٢﴾

42. (ఓ ము'హమ్మద్!) వీరు నిన్ను - ఆ ఘడియను గురించి: "అసలు అది ఎప్పుడొస్తుంది?" అని అడుగుతున్నారు.

فِيمَ أَنتَ مِن ذِكْرَىٰهَآ ﴿٤٣﴾

43. దాని గురించి చెప్పడానికి దాంతో నీకేమి సంబంధం?

إِلَىٰ رَبِّكَ مُنتَهَىٰهَآ ﴿٤٤﴾

44. దాని వాస్తవ జ్ఞానం నీ ప్రభువుకే ఉంది!

إِنَّمَآ أَنتَ مُنذِرُ مَن يَخْشَىٰهَا ﴿٤٥﴾

45. (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా, నీవు, దానికి భయపడే వారిని హెచ్చరించే వాడవు మాత్రమే!

كَأَنَّهُمْ يَوْمَ يَرَوْنَهَا لَمْ يَلْبَثُوٓا۟ إِلَّا عَشِيَّةً أَوْ ضُحَىٰهَا ﴿٤٦﴾

46. వారు దానిని చూసిన రోజు (తాము ప్రపంచంలో) కేవలం ఒక సాయంత్రమో లేక ఒక ఉదయమో గడిపినట్లు భావిస్తారు.[1] (1/8)

*****

1. మానవుడు చేసే భూమికి చెందిన కాల పరిమాణం పరలోకంలో ఉండదు. ఇంకా చూడండి, 2:259, 17:52, 18:19, 20:103-104, 23:112-113, 30:55. 'అషియ్యాతున్: అంటే "జు'హ్ర్ నుండి సూర్యాస్తమయం వరకు మరియు 'దుహా: అంటే సూర్యోదయం నుండి మధ్యాహ్నం వరకు.

## 80. సూరహ్ 'అబస

## سَورَةُ عَبَسَ

'అబస: He Frowned, కనుబొమలు ముడివేసుకున్నాడు, ముఖం చిట్లించుకున్నాడు, కోపముఖం చూపాడు. ఈ పదం మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఈ సూరహ్ మొదటి మక్కా కాలంలో అవతరింపజేయబడింది. ఒకసారి దైవప్రవక్త('స'అస) పెద్ద (అష్రాఫ్) ఖురైషులతో మాట్లాడుతూ ఉంటారు. అప్పుడు 'అబ్దుల్లాహ్ బిన్-ఉమ్మె మక్తూమ్(ర'ది.'అ.) వచ్చి కొన్ని ధర్మవిషయాలను గురించి ప్రశ్నిస్తారు. అతడు అంధుడు. అప్పుడు దైవప్రవక్త('స'అస) అయిష్టతతో ముఖం చిట్లించుకుంటారు. అప్పుడు ఈ ఆయత్‌లు అవతరింపజేయబడతాయి. (తిర్మిజీ', అల్బానీ ప్రమాణీకం) ఇందులో **42 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1.** * అతను (ప్రవక్త) **భృకుటి ముడివేసుకున్నాడు** మరియు ముఖం త్రిప్పుకున్నాడు;

عَبَسَ وَتَوَلَّىٰٓ ﴿١﴾

**2.** ఆ గ్రుడ్డివాడు తనవద్దకు వచ్చాడని!

أَن جَآءَهُ ٱلۡأَعۡمَىٰ ﴿٢﴾

**3.** కాని నీకేం తెలుసు? బహుశా అతడు తనను తాను సంస్కరించుకోవచ్చు!

وَمَا يُدۡرِيكَ لَعَلَّهُۥ يَزَّكَّىٰٓ ﴿٣﴾

**4.** లేదా అతడు హితబోధ పొందవచ్చు మరియు ఆ హితబోధ అతనికి ప్రయోజనకరం కావచ్చు!

أَوۡ يَذَّكَّرُ فَتَنفَعَهُ ٱلذِّكۡرَىٰٓ ﴿٤﴾

**5.** కాని అతడు, ఎవడైతే తనను తాను స్వయంసమృద్ధుడు, అనుకుంటున్నాడో!

أَمَّا مَنِ ٱسۡتَغۡنَىٰ ﴿٥﴾

**6.** అతని పట్ల నీవు ఆసక్తి చూపుతున్నావు.[1]

فَأَنتَ لَهُۥ تَصَدَّىٰ ﴿٦﴾

**7.** ఒకవేళ అతడు సంస్కరించుకోక పోతే నీపై బాధ్యత ఏముంది?[2]

وَمَا عَلَيۡكَ أَلَّا يَزَّكَّىٰ ﴿٧﴾

---

**1**. ఇక్కడ సూచించబడుతున్నది ఏమిటంటే విధేయులను ఉపేక్షించి, విముఖులయ్యే వారికి బోధన చేయటానికి, ఆసక్తి చూపనవసరం లేదు!

**2**. నీ బాధ్యత కేవలం సందేశాన్ని అందజేయటం మాత్రమే. నీవు వారి వెంటపడి బ్రతిమాలనవసరం లేదు.

وَأَمَّا مَن جَآءَكَ يَسۡعَىٰ ٨

**8**. కాని, ఎవడైతే తనంతట తాను, నీ వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చాడో!

وَهُوَ يَخۡشَىٰ ٩

**9**. మరియు (అల్లాహ్ యెడల) భీతిపరుడై ఉన్నాడో!

فَأَنتَ عَنۡهُ تَلَهَّىٰ ١٠

**10**. అతనిని నీవు నిర్లక్ష్యం చేస్తున్నావు.

كَلَّآ إِنَّهَا تَذۡكِرَةٞ ١١

**11**. అలాకాదు! నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) ఒక హితోపదేశం.[1]

فَمَن شَآءَ ذَكَرَهُۥ ١٢

**12**. కావున ఇష్టమున్న వారు దీనిని స్వీకరించవచ్చు!

فِي صُحُفٖ مُّكَرَّمَةٖ ١٣

**13**. ఇది ప్రతిష్ఠాత్మకమైన పుటలలో (వ్రాయబడి) ఉంది;

مَّرۡفُوعَةٖ مُّطَهَّرَةِۭ ١٤

**14**. మహోన్నతమైనది, పవిత్రమైనది;

بِأَيۡدِي سَفَرَةٖ ١٥

**15**. లేఖకుల (దేవదూతల) చేతులలో!

كِرَامِۭ بَرَرَةٖ ١٦

**16**. వారు గౌరవనీయులు, సత్పురుషులు (ఆజ్ఞానువర్తనులు).

قُتِلَ ٱلۡإِنسَٰنُ مَآ أَكۡفَرَهُۥ ١٧

**17**. మానవుడు నాశనం గాను! అతడు ఎంత కృతఘ్నుడు![2]

مِنۡ أَيِّ شَيۡءٍ خَلَقَهُۥ ١٨

**18**. ఆయన (అల్లాహ్) ఏ పదార్థంతో అతనిని సృష్టించాడు?

مِن نُّطۡفَةٍ خَلَقَهُۥ فَقَدَّرَهُۥ ١٩

**19**. అతనిని వీర్యబిందువుతో సృష్టించాడు తరువాత అతనిని తగిన విధంగా తీర్చిదిద్దాడు.

ثُمَّ ٱلسَّبِيلَ يَسَّرَهُۥ ٢٠

**20**. ఆ తరువాత, అతని మార్గాన్ని అతనికి సులభతరం చేశాడు;[3]

---

**1**. చూడండి, 7:172.

**2**. ఎట్టి ప్రమాణం లేకుండానే పునరుత్థానాన్ని తిరస్కరించే మానవుడికి ఈ శాపం!

**3**. అంటే అతనికి మంచీ-చెడుల మార్గాలు స్పష్టంగా తెలుపబడ్డాయి.

ثُمَّ أَمَاتَهُۥ فَأَقۡبَرَهُۥ ﴿٢١﴾

**21**. ఆపైన అతనిని మరణింపజేసి గోరీలోకి చేర్చాడు;

ثُمَّ إِذَا شَآءَ أَنشَرَهُۥ ﴿٢٢﴾

**22**. మళ్ళీ ఆయన (అల్లాహ్) కోరినపుడు అతనిని తిరిగి బ్రతికించి లేపాడు.

كَلَّا لَمَّا يَقۡضِ مَآ أَمَرَهُۥ ﴿٢٣﴾

**23**. అలాకాదు, ఆయన (అల్లాహ్) ఆదేశించిన దానిని (మానవుడు) నెరవేర్చలేదు.

فَلۡيَنظُرِ ٱلۡإِنسَٰنُ إِلَىٰ طَعَامِهِۦٓ ﴿٢٤﴾

**24**. ఇక, మానవుడు తన ఆహారాన్ని గమనించాలి!

أَنَّا صَبَبۡنَا ٱلۡمَآءَ صَبّٗا ﴿٢٥﴾

**25**. నిశ్చయంగా, మేము నీటిని (వర్షాన్ని) ఎంత పుష్కలంగా కురిపించాము.

ثُمَّ شَقَقۡنَا ٱلۡأَرۡضَ شَقّٗا ﴿٢٦﴾

**26**. ఆ తరువాత భూమిని (మొలిచే మొక్కలతో) చీల్చాము, ఒక అద్భుతమైన చీల్పుతో!

فَأَنۢبَتۡنَا فِيهَا حَبّٗا ﴿٢٧﴾

**27**. తరువాత దానిలో ధాన్యాన్ని పెంచాము;

وَعِنَبٗا وَقَضۡبٗا ﴿٢٨﴾

**28**. మరియు ద్రాక్షలను మరియు కూరగాయలను;

وَزَيۡتُونٗا وَنَخۡلٗا ﴿٢٩﴾

**29**. మరియు ఆలివ్ (జైతూన్) మరియు ఖర్జూరపు చెట్లను;

وَحَدَآئِقَ غُلۡبٗا ﴿٣٠﴾

**30**. మరియు దట్టమైన తోటలను;

وَفَٰكِهَةٗ وَأَبّٗا ﴿٣١﴾

**31**. మరియు (రకరకాల) పండ్లను మరియు పచ్చికలను;

مَّتَٰعٗا لَّكُمۡ وَلِأَنۡعَٰمِكُمۡ ﴿٣٢﴾

**32**. మీకు మరియు మీ పశువులకు జీవన సామగ్రిగా.

فَإِذَا جَآءَتِ ٱلصَّآخَّةُ ﴿٣٣﴾

**33**. ఎప్పుడైతే, చెవులను చెవిటిగా చేసే ఆ గొప్ప ధ్వని వస్తుందో!

يَوۡمَ يَفِرُّ ٱلۡمَرۡءُ مِنۡ أَخِيهِ ﴿٣٤﴾

**34**. ఆ రోజు, మానవుడు తన సోదరుని నుండి దూరంగా పారిపోతాడు;

وَأُمِّهِۦ وَأَبِيهِ ﴿٣٥﴾

**35**. మరియు తన తల్లి నుండి మరియు తండ్రి నుండి;

وَصَٰحِبَتِهِۦ وَبَنِيهِ ﴿٣٦﴾

**36**. మరియు తన భార్య (సా'హిబతి) నుండి మరియు తన సంతానం నుండి.

لِكُلِّ ٱمْرِيٍٕ مِّنْهُمْ يَوْمَئِذٍ شَأْنٌ يُغْنِيهِ ﴿٣٧﴾

**37**. ఆ రోజు వారిలో ప్రతి మానవునికి తనను గురించి మాత్రమే చాలినంత చింత ఉంటుంది.[1]

وُجُوهٌ يَوْمَئِذٍ مُّسْفِرَةٌ ﴿٣٨﴾

**38**. ఆ రోజు కొన్నిముఖాలు ఆనందంతో ప్రకాశిస్తూ ఉంటాయి;

ضَاحِكَةٌ مُّسْتَبْشِرَةٌ ﴿٣٩﴾

**39**. అవి చిరునవ్వులతో, ఆనందోత్సాహాలతో కళకళలాడుతుంటాయి.

وَوُجُوهٌ يَوْمَئِذٍ عَلَيْهَا غَبَرَةٌ ﴿٤٠﴾

**40**. మరికొన్ని ముఖాలు ఆ రోజు దుమ్ము కొట్టుకొని (ఎంతో వ్యాకులంతో) నిండి ఉంటాయి.

تَرْهَقُهَا قَتَرَةٌ ﴿٤١﴾

**41**. అవి నల్లగా మాడిపోయి ఉంటాయి;

أُوْلَٰٓئِكَ هُمُ ٱلْكَفَرَةُ ٱلْفَجَرَةُ ﴿٤٢﴾

**42**. అలాంటి వారు, వారే! సత్యతిరస్కారులైన దుష్టులు.

*****

1. అంటే ప్రతి మానవుడు తన వారిని నిర్లక్ష్యం చేస్తాడు. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "పునరుత్థాన దినమున మానవులందరూ నగ్నశరీరులై ఉంటారు మరియు వారి కాళ్ళలో మేజోళ్ళు ఉండవు మరియు వారు ఖత్నా చేయబడకుండా ఉంటారు." అప్పుడు 'ఆయి'షహ్ (ర.'అన్హా): "ఏమీ ఈ విధంగా మర్మాంగాల మీద దృష్టిపడదా?" అని అడుగుతారు. దైవప్రవక్త ('స'అస) దానికి సమాధానంగా ఈ ఆయత్ చదువుతారు. (తిర్మిజీ', నసాయీ').

## 81. సూరహ్ అత్-తక్వీర్ سُورَةُ التَّكْوِيرِ

అత్-తక్వీర్: Shrouding in Darkness, (అంధకారంలో) **చుట్టివేయబడటం, మూాయబడటం**, కాంతిని కోల్పోవటం. ఇది మొదటి **మక్కా** కాలపు సూరహ్ (బహుశా అవతరణలో ఏడవది). ఈ సూరహ్ పేరు **మొదటి ఆయత్**నుండి తీసుకోబడింది. ఇది అంతిమ ఘడియను సూచిస్తోంది. 8-9 ఆయత్‌లలో అజ్ఞానకాలపు ముష్రిక్ అరబ్బులు తమ ఆడ శిశువులను పుట్టిన వెంటనే సజీవంగా మట్టిలో పూడ్చివేసే దారుణమైన సామాజిక దురాచారం పేర్కొనబడింది. ఇందులో **29 ఆయతులు** ఉన్నాయి. ఈ సూరహ్‌లో పునరుత్థాన దినపు దృశ్యం చూపబడింది. అందుకే దైవప్రవక్త ('స'అస) అన్నారు: "ఎవనికైతే పునరుత్థాన దినపు దృశ్యాన్ని చూడాలని ఉందో అతడు సూరహ్ అత్-తక్వీర్(81), సూరహ్ అల్-ఇన్ఫితార్ (82) మరియు సూరహ్ అల్-ఇన్షిఖాఖ్(84)లు ధ్యానంతో చదవాలి." (తిర్మిజీ', ముస్నద్ అ'హ్మద్; అల్బానీ 'స'హీ'హ్ అని ప్రమాణీకరించారు).

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

إِذَا الشَّمْسُ كُوِّرَتْ ﴿١﴾

1. సూర్యుడు (అంధకారంలో) **చుట్టివేయబడి**, కాంతిహీనుడైనప్పుడు![1]

وَإِذَا النُّجُومُ انكَدَرَتْ ﴿٢﴾

2. మరియు నక్షత్రాలు (కాంతిని కోల్పోయి) రాలిపోవునప్పుడు!

وَإِذَا الْجِبَالُ سُيِّرَتْ ﴿٣﴾

3. మరియు పర్వతాలు కదిలించబడినప్పుడు![2]

وَإِذَا الْعِشَارُ عُطِّلَتْ ﴿٤﴾

4. మరియు నిండు సూడి ఒంటెలు, నిరపేక్షంగా వదిలివేయబడినప్పుడు!

وَإِذَا الْوُحُوشُ حُشِرَتْ ﴿٥﴾

5. మరియు క్రూరమృగాలన్నీ ఒకచోట సమకూర్చబడినప్పుడు![3]

---

1. పునరుత్థానదినమున సూర్యచంద్రులు చుట్టివేయబడతారు. ('స'హీ'హ్ బు'ఖారీ).

2. పర్వతాలు భూమి నుండి ఊడబెరికి ఏకిన దూదివలే గాలిలో ఎగురవేయబడతాయి. చూడండి, 20:105-107 మరియు 14:48.

3. చూడండి, 6:38.

وَإِذَا ٱلْبِحَارُ سُجِّرَتْ ﴿٦﴾

6. మరియు సముద్రాలు ఉప్పొంగి పోయినప్పుడు![1]

وَإِذَا ٱلنُّفُوسُ زُوِّجَتْ ﴿٧﴾

7. మరియు ఆత్మలు (శరీరాలతో) తిరిగి కలుపబడినప్పుడు![2]

وَإِذَا ٱلْمَوْءُۥدَةُ سُئِلَتْ ﴿٨﴾

8. మరియు సజీవంగా పాతిపెట్టబడిన బాలిక ప్రశ్నించబడినప్పుడు:

بِأَىِّ ذَنۢبٍ قُتِلَتْ ﴿٩﴾

9. ఏ అపరాధానికి తాను హత్యచేయ బడిందని?

وَإِذَا ٱلصُّحُفُ نُشِرَتْ ﴿١٠﴾

10. మరియు కర్మపత్రాలు తెరువబడి నప్పుడు![3]

وَإِذَا ٱلسَّمَآءُ كُشِطَتْ ﴿١١﴾

11. మరియు ఆకాశం ఒలిచివేయబడి నప్పుడు!

وَإِذَا ٱلْجَحِيمُ سُعِّرَتْ ﴿١٢﴾

12. మరియు నరకాగ్ని మండించబడి నప్పుడు!

وَإِذَا ٱلْجَنَّةُ أُزْلِفَتْ ﴿١٣﴾

13. మరియు స్వర్గం దగ్గరకు తీసుకు రాబడినప్పుడు!

عَلِمَتْ نَفْسٌ مَّآ أَحْضَرَتْ ﴿١٤﴾

14. ప్రతి ఆత్మ తాను చేసి తెచ్చిన కర్మలను తెలుసుకుంటుంది.

فَلَآ أُقْسِمُ بِٱلْخُنَّسِ ﴿١٥﴾

15. అలాకాదు! నేను తొలగిపోయే నక్షత్రాల సాక్షిగా చెబుతున్నాను;

---

1. ఈ ఆయత్‌కు ఈ విధంగా కూడా తాత్పర్యమివ్వబడింది: "లేక సముద్రాలలో అగ్ని జ్వాలలు చెలరేగినప్పుడు."

2. దీనిని ఎన్నోవిధాలుగా వ్యాఖ్యానించారు, ఎక్కువగా సమ్మతమైనది: "ఒకే ధర్మంవారు ఒక చోట జమచేయబడతారు. యూదులందరు ఒక చోట, క్రైస్తవులందరు ఒకచోట మరియు ముస్లింలందరు ఒకచోట."

3. కర్మపత్రాలు మరణించిన రోజు మూయబడి పునరుత్థాన దినమున మరల తెరువబడతాయి. అప్పుడు కర్మపత్రాలు పుణ్యాత్ములకు కుడిచేతులలో మరియు పాపాత్ములకు ఎడమ చేతులలో ఇవ్వబడతాయి.

ٱلْجَوَارِ ٱلْكُنَّسِ ﴿١٦﴾

16. (ఏవైతే) వేగంగా తిరుగుతూ కనుమరుగవుతున్నాయో![1]

وَٱلَّيْلِ إِذَا عَسْعَسَ ﴿١٧﴾

17. మరియు గడచి పోయే రాత్రి సాక్షిగా!

وَٱلصُّبْحِ إِذَا تَنَفَّسَ ﴿١٨﴾

18. మరియు ప్రకాశించే ఉదయం సాక్షిగా!

إِنَّهُۥ لَقَوْلُ رَسُولٍ كَرِيمٍ ﴿١٩﴾

19. నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) గౌరవనీయుడైన సందేశహరుడు (తెచ్చిన) వాక్కు![2]

ذِى قُوَّةٍ عِندَ ذِى ٱلْعَرْشِ مَكِينٍ ﴿٢٠﴾

20. అతను (జిబ్రీల్) మహా బలశాలి, సింహాసన (’అర్ష్)[3] అధిపతి సన్నిధిలో ఉన్నత స్థానం గలవాడు!

مُّطَاعٍ ثَمَّ أَمِينٍ ﴿٢١﴾

21. అతని ఆజ్ఞలు పాటింపబడతాయి మరియు (అతను) విశ్వసనీయుడు!

وَمَا صَاحِبُكُم بِمَجْنُونٍ ﴿٢٢﴾

22. మరియు (ఓ ప్రజలారా!) మీ సహచరుడు పిచ్చివాడు కాడు![4]

وَلَقَدْ رَءَاهُ بِٱلْأُفُقِ ٱلْمُبِينِ ﴿٢٣﴾

23. మరియు వాస్తవంగా, అతను ఆ సందేశహరుణ్ణి (జిబ్రీల్‌ను) ప్రకాశవంతమైన దిఙ్మండలంలో చూశాడు.[5]

وَمَا هُوَ عَلَى ٱلْغَيْبِ بِضَنِينٍ ﴿٢٤﴾

24. మరియు అతను (ము’హమ్మద్) అగోచర జ్ఞానాన్ని ప్రజలనుండి దాచేవాడు కాడు.

---

1. అల్‌జవారి: నడిచేది, తిరిగేది. అల్‌కున్నసి: దాక్కునేది, కనుమరుగయ్యేది.
2. అంటే జిబ్రీల్ (’అ.స.) తెచ్చిన వాక్కు.
3. అల్-’అర్షు: సింహాసనం లేక విశ్వాధికార పీఠం. ఈ పదం అవతరణలో ఇక్కడ మొదటిసారి వచ్చింది. వివరాలకు చూడండి, 7:54.
4. చూడండి, 7:184. ఈ వాక్యం మక్కా వాసులతో చెప్పబడింది. ఇంకా విశదమయ్యే విషయం ఏమిటంటే దైవప్రవక్త (’స’అస) ఒక మానవుడు మరియు అల్లాహ్ (సు.తా.) ఎన్నుకొన్న ప్రవక్త.
5 . చూడండి, 53:5 దైవప్రవక్త (’స’అస) జిబ్రీల్(’అ.స.)ను రెండుసార్లు అతని నిజరూపంలో చూశారు. మొదటిసారి ఇక్కడ, రెండవసారి మేరాజ్ రాత్రిలో.

وَمَا هُوَ بِقَوۡلِ شَيۡطَٰنٖ رَّجِيمٖ ﴿٢٥﴾

25. మరియు ఇది (ఈ ఖుర్ఆన్) శపించ (బహిష్కరించ)బడిన షైతాన్ వాక్కు కాదు.

فَأَيۡنَ تَذۡهَبُونَ ﴿٢٦﴾

26. మరి మీరు ఎటు పోతున్నారు?

إِنۡ هُوَ إِلَّا ذِكۡرٞ لِّلۡعَٰلَمِينَ ﴿٢٧﴾

27. ఇది (ఈ ఖుర్ఆన్) సర్వలోకాలకు ఒక హితోపదేశం.

لِمَن شَآءَ مِنكُمۡ أَن يَسۡتَقِيمَ ﴿٢٨﴾

28. మీలో, ఋజుమార్గంలో నడవ దలచుకున్న ప్రతివాని కొరకు.

وَمَا تَشَآءُونَ إِلَّآ أَن يَشَآءَ ٱللَّهُ رَبُّ ٱلۡعَٰلَمِينَ ﴿٢٩﴾

29. మరియు సర్వలోకాల ప్రభువైన అల్లాహ్ తలచనంత వరకు, మీరు తలచినంత మాత్రాన ఏమీ కాదు.[1] (1/4)

*****

1. ఇటువంటి మరో ఆయత్ కోసం చూడండి, 76:29-30.

## 82. సూరహ్ అల్-ఇన్ఫి'తార్

## سُورَةُ الانفِطَارِ

అల్-ఇన్ఫి'తార్: The Cleaving, **చీలిపోవుట**, బీటలువారుట, బ్రద్దలగుట, పెళ్ళుమనుట, ప్రేలుట, పగులుట. ఈ సూరహ్ పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. కొందరు దీనిని మొదటి మక్కా కాలపు సూరహ్ అని అంటారు, మరి కొందరు చివరి కాలపు సూరహ్ అంటారు. ఇందులో **19 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

إِذَا ٱلسَّمَآءُ ٱنفَطَرَتۡ ﴿١﴾

**1**. * ఆకాశం **చీల్చబడినప్పుడు**![1]

وَإِذَا ٱلۡكَوَاكِبُ ٱنتَثَرَتۡ ﴿٢﴾

**2**. మరియు నక్షత్రాలు చెదిరిపోయినప్పుడు!

وَإِذَا ٱلۡبِحَارُ فُجِّرَتۡ ﴿٣﴾

**3**. మరియు సముద్రాలు పొంగి పొరలి పోయినప్పుడు!

وَإِذَا ٱلۡقُبُورُ بُعۡثِرَتۡ ﴿٤﴾

**4**. మరియు సమాధులు పెళ్ళగింప (తెరువ)బడినప్పుడు!

عَلِمَتۡ نَفۡسٞ مَّا قَدَّمَتۡ وَأَخَّرَتۡ ﴿٥﴾

**5**. ప్రతి వ్యక్తికి తాను చేసి పంపుకున్నది మరియు వెనుక వదలిపెట్టింది అంతా తెలిసిపోతుంది.

يَٰٓأَيُّهَا ٱلۡإِنسَٰنُ مَا غَرَّكَ بِرَبِّكَ ٱلۡكَرِيمِ ﴿٦﴾

**6**. ఓ మానవుడా! పరమదాత అయిన నీ ప్రభువును గురించి, ఏ విషయం నిన్ను ఏమరుపాటుకు గురిచేసింది?

ٱلَّذِي خَلَقَكَ فَسَوَّىٰكَ فَعَدَلَكَ ﴿٧﴾

**7**. ఆయనే నిన్ను సృష్టించాడు, తరువాత ఎలాంటి లోపం లేకుండా నిన్ను తీర్చిదిద్దాడు మరియు నిన్ను తగిన ప్రమాణంలో రూపొందించాడు.

فِيٓ أَيِّ صُورَةٖ مَّا شَآءَ رَكَّبَكَ ﴿٨﴾

**8**. తాను తలచిన ఆకారంలో నిన్ను మలిచాడు.

---

**1**. ఇది పునరుత్థానదినపు సూచన.

كَلَّا بَلْ تُكَذِّبُونَ بِٱلدِّينِ ﴿٩﴾

9. అలాకాదు! వాస్తవానికి మీరు (పరలోక) తీర్పును అబద్ధమని తిరస్కరిస్తున్నారు!

وَإِنَّ عَلَيْكُمْ لَحَـٰفِظِينَ ﴿١٠﴾

10. మరియు, నిశ్చయంగా! మిమ్మల్ని కనిపెట్టుకొని ఉండేవారు (దేవదూతలు) ఉన్నారు.[1]

كِرَامًا كَـٰتِبِينَ ﴿١١﴾

11. వారు, గౌరవనీయులైన లేఖకులు;

يَعْلَمُونَ مَا تَفْعَلُونَ ﴿١٢﴾

12. మీరు చేసేదంతా తెలుసుకునేవారు!

إِنَّ ٱلْأَبْرَارَ لَفِى نَعِيمٍ ﴿١٣﴾

13. నిశ్చయంగా పుణ్యాత్ములు[2] సుఖ సంతోషాలలో తేలియాడుతూ ఉంటారు.

وَإِنَّ ٱلْفُجَّارَ لَفِى جَحِيمٍ ﴿١٤﴾

14. మరియు నిశ్చయంగా, దుష్టులు భగభగ మండే నరకాగ్నిలో ఉంటారు.[3]

يَصْلَوْنَهَا يَوْمَ ٱلدِّينِ ﴿١٥﴾

15. తీర్పు దినమున వారు అందులో ప్రవేశిస్తారు.

وَمَا هُمْ عَنْهَا بِغَآئِبِينَ ﴿١٦﴾

16. మరియు వారు దాని నుండి ఎంత మాత్రం తప్పించుకోలేరు.

وَمَآ أَدْرَىٰكَ مَا يَوْمُ ٱلدِّينِ ﴿١٧﴾

17. మరియు ఆ తీర్పు దినం అంటే ఏమిటో నీకెలా తెలుస్తుంది?

ثُمَّ مَآ أَدْرَىٰكَ مَا يَوْمُ ٱلدِّينِ ﴿١٨﴾

18. అవును మరి! ఆ తీర్పు దినం అంటే ఏమిటో నీకెలా తెలుస్తుంది?

يَوْمَ لَا تَمْلِكُ نَفْسٌ لِّنَفْسٍ شَيْـًٔا ۖ
وَٱلْأَمْرُ يَوْمَئِذٍ لِّلَّهِ ﴿١٩﴾

19. ఆ దినమున ఏ మానవునికి కూడా ఇతరునికి ఎలాంటి సహాయం చేసే అధికారం ఉండదు. మరియు ఆ రోజు నిర్ణయాధికారం కేవలం అల్లాహ్‌కే ఉంటుంది.[4]

*****

1. చూడండి, 50:17-18.

2. అబ్‌రార్: Pious, ధర్మనిష్ఠాపరులు, దైవభక్తిపరులు, Righteous, ఋజువర్తనులు, ధర్మశీలురు, న్యాయనిష్ఠ గలవారు.

3. చూడండి, 42:7.

4. చూడండి, 40:16.

## 83. సూరహ్ అల్-ము'తఫ్ఫిఫీన్ — سُورَةُ المُطَفِّفِينَ

అల్-ము'తప్ఫిఫీన్: Those Who Deal in Fraud, తగ్గించి ఇచ్చేవారు, లోభత్వం చూపేవారు, కొలతలలో తూనికలలో మోసం చేసే వారు. దీనిపేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. కొందరు దీనిని మక్కా చివరి కాలపు సూరహ్ అని అంటారు. మరికొందరు దైవప్రవక్త ('స'అస) మదీనా వచ్చినప్పుడు అక్కడి వారు కొలతలలో మరియు తూనికలలో తగ్గించే వారు. ఆ సందర్భంలో ఈ సూరహ్ అవతరింపజేయబడిందంటారు (ఇబ్నె-మాజా). సూరహ్ అల్-'అంకబూత్ (29) కూడా ఇదే విధంగా రెండు చోట్లలో అవతరింపజేయబడినట్లు భావింపబడుతోంది. ఇందులో **36 ఆయతులు** ఉన్నాయి.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

وَيۡلٞ لِّلۡمُطَفِّفِينَ ١

**1.** కొలతలలో, తూనికలలో తగ్గించి ఇచ్చేవారికి వినాశముంది.

ٱلَّذِينَ إِذَا ٱكۡتَالُواْ عَلَى ٱلنَّاسِ يَسۡتَوۡفُونَ ٢

**2.** వారు ప్రజలనుండి తీసుకునేటప్పుడు పూర్తిగా తీసుకుంటారు.

وَإِذَا كَالُوهُمۡ أَو وَّزَنُوهُمۡ يُخۡسِرُونَ ٣

**3.** మరియు తాము ప్రజలకు కొలిచి గానీ లేక తూచి గానీ ఇచ్చేటప్పుడు మాత్రం తగ్గించి ఇస్తారు.[1]

أَلَا يَظُنُّ أُوْلَٰٓئِكَ أَنَّهُم مَّبۡعُوثُونَ ٤

**4.** ఏమీ? ఇలాంటి వారు తిరిగి బ్రతికించి లేపబడరని భావిస్తున్నారా?

لِيَوۡمٍ عَظِيمٖ ٥

**5.** ఒక గొప్ప దినమున!

يَوۡمَ يَقُومُ ٱلنَّاسُ لِرَبِّ ٱلۡعَٰلَمِينَ ٦

**6.** సర్వలోకాల ప్రభువు సమక్షంలో ప్రజలు అందరూ నిలబడే రోజు.[2]

---

**1.** ఒక 'హదీస్'లో ఇలా ఉంది: "ఏ సమాజంవారైతే కొలతలలో మరియు తూనికలలో తగ్గిస్తారో! వారిపై కరువు మరియు పరిపాలకుల ఆగడాలు విరుచుకుపడతాయి." (ఇబ్నె-మాజా - అల్బానీ దీనిని 'స'హీ'హ్‌గా ప్రమాణీకరించారు). ఈ మూడు ఆయతులు అన్ని రకాల మోసాలను ఖండిస్తున్నాయి.

**2.** ఇది వారే చేస్తారు, ఎవరైతే, పునరుత్థాన దినమున అల్లాహ్ (సు.తా.) ముందు నిలబడవలసి ఉందని నమ్మరో! వారికి అల్లాహ్ (సు.తా.) భయంలేదు, ('స'హీ'హ్ బు'ఖారీ).

7. అలాకాదు! నిశ్చయంగా, దుష్టుల కర్మపత్రం సిజ్జీనులో ఉంది.

كَلَّآ إِنَّ كِتَٰبَ ٱلْفُجَّارِ لَفِى سِجِّينٍ ٧

8. ఆ సిజ్జీన్ అంటే నీవు ఏమను కుంటున్నావు?

وَمَآ أَدْرَىٰكَ مَا سِجِّينٌ ٨

9. వ్రాసి పెట్టబడిన (చెరగని) గ్రంథం.[1]

كِتَٰبٌ مَّرْقُومٌ ٩

10. సత్యాన్ని తిరస్కరించే వారికి ఆరోజు వినాశం ఉంది.

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ١٠

11. వారికే! ఎవరైతే తీర్పుదినాన్ని తిరస్కరిస్తారో!

ٱلَّذِينَ يُكَذِّبُونَ بِيَوْمِ ٱلدِّينِ ١١

12. మరియు మితిమీరి ప్రవర్తించే పాపిష్ఠుడు తప్ప మరెవ్వడూ దానిని (తీర్పుదినాన్ని) తిరస్కరించడు.

وَمَا يُكَذِّبُ بِهِۦٓ إِلَّا كُلُّ مُعْتَدٍ أَثِيمٍ ١٢

13. మా సూచనలు (ఆయాత్‌లు) అతడికి వినిపించబడినప్పుడు అతడు: "ఇవి పూర్వకాలపు కట్టుకథలే!" అని అంటాడు.

إِذَا تُتْلَىٰ عَلَيْهِ ءَايَٰتُنَا قَالَ أَسَٰطِيرُ ٱلْأَوَّلِينَ ١٣

14. అలా కాదు! వాస్తవానికి వారి హృదయాలకు వారి (దుష్ట) కార్యాల త్రుప్పు పట్టింది.[2]

كَلَّا ۖ بَلْ ۜ رَانَ عَلَىٰ قُلُوبِهِم مَّا كَانُوا۟ يَكْسِبُونَ ١٤

15. అంతే కాదు, ఆ రోజు నిశ్చయంగా, వారు తమ ప్రభువు కారుణ్యం నుండి నిరోధింపబడతారు.

كَلَّآ إِنَّهُمْ عَن رَّبِّهِمْ يَوْمَئِذٍ لَّمَحْجُوبُونَ ١٥

---

1. సిజ్జీన్, అంటే కారాగారం. ఇక్కడ చెరిగిపోకుండా నష్టంకాకుండా వ్రాసిపెట్టబడిన గ్రంథమని అర్థం.
2. రానా: అంటే పాపాల వల్ల హృదయం మీద ఏర్పడే ఒక నల్లని మచ్చ. 'హదీస్'లో ఇలా ఉంది: "మానవుడు పాపం చేసినపుడు అతని హృదయం మీద ఒక నల్లనిమచ్చ ఏర్పడుతుంది.
ఒకవేళ అతడు పశ్చాత్తాపపడి ఆ పాపం మరల చేయకుంటే అది దూరమైపోతుంది. ఒకవేళ అతడు పాపం మీద పాపం చేస్తూఉంటే ఆ నల్లమచ్చ పెరుగుతుంది. చివరకు అది అతని హృదయం మీద పూర్తిగా క్రమ్ముకొంటుంది. అదే 'రానా' అని పేర్కొనబడినది." (తిర్మిజీ', ఇబ్నె-మాజా, ముస్నద్ అ'హ్మద్).

ثُمَّ إِنَّهُمۡ لَصَالُواْ ٱلۡجَحِيمِ ١٦

**16**. తరువాత వారు నిశ్చయంగా, భగభగ మండే నరకాగ్నిలోకి పోతారు.

ثُمَّ يُقَالُ هَٰذَا ٱلَّذِي كُنتُم بِهِۦ تُكَذِّبُونَ ١٧

**17**. అప్పుడు వారితో: "దేనినైతే మీరు అసత్యమని తిరస్కరిస్తూ వచ్చారో, అది ఇదే!" అని చెప్పబడుతుంది.

كَلَّآ إِنَّ كِتَٰبَ ٱلۡأَبۡرَارِ لَفِي عِلِّيِّينَ ١٨

**18**. అలా కాదు! నిశ్చయంగా, ధర్మ నిష్ఠాపరుల (పుణ్యాత్ముల) కర్మపత్రం మహోన్నత గ్రంథం('ఇల్లియ్యీన్)లో ఉంది.[1]

وَمَآ أَدۡرَىٰكَ مَا عِلِّيُّونَ ١٩

**19**. మరి ఆ 'ఇల్లియ్యీన్ అంటే నీవు ఏమనుకుంటున్నావు?

كِتَٰبٞ مَّرۡقُومٞ ٢٠

**20**. అది వ్రాసిపెట్టబడిన ఒక గ్రంథం.

يَشۡهَدُهُ ٱلۡمُقَرَّبُونَ ٢١

**21**. దానికి, (అల్లాహ్‌కు) సన్నిహితులైన వారు (దేవదూతలు) సాక్ష్యంగా ఉంటారు.[2]

إِنَّ ٱلۡأَبۡرَارَ لَفِي نَعِيمٍ ٢٢

**22**. నిశ్చయంగా, పుణ్యాత్ములు సుఖసంతోషాలలో ఉంటారు.

عَلَى ٱلۡأَرَآئِكِ يَنظُرُونَ ٢٣

**23**. ఎత్తైన ఆసనాలపై కూర్చొని (స్వర్గ దృశ్యాలను) తిలకిస్తూ.[3]

تَعۡرِفُ فِي وُجُوهِهِمۡ نَضۡرَةَ ٱلنَّعِيمِ ٢٤

**24**. వారి ముఖాలు సుఖసంతోషాలతో కళకళలాడుతూ ఉండటం నీవు చూస్తావు.

يُسۡقَوۡنَ مِن رَّحِيقٖ مَّخۡتُومٍ ٢٥

**25**. సీలు చేయబడిన నాణ్యమైన మధువు వారికి త్రాగటానికి ఇవ్వబడుతుంది.[4]

---

**1**. 'ఇల్లియ్యీన్, 'ఉలువ్వీన్: ఎత్తైన స్థలం. ఇది సిజ్జీన్‌కు విరుద్ధపదం. ఇది ఆకాశాలలో, స్వర్గంలో సిద్‌రతుల్ మున్‌తహా, లేక 'అర్ష్ దగ్గర ఉన్నచోటు. అక్కడ పుణ్యాత్ముల కర్మపత్రాలు భద్రపరచబడిఉంటాయి.

**2**. యష్‌హదు: అంటే ఇక్కడ పర్యవేక్షిస్తుంటారు, అనే అర్థం కూడా వస్తుంది.

**3**. చూడండి, 75:23.

**4**. ర'హీఖున్: స్వచ్ఛమైన, తేటైన, ఉత్తమమైన, మధురమైనపానీయం, అందులో ఎట్టి కల్తీ ఉండదు. మ'ఖ్తూమున్: సీలుచేయబడినది. దాని స్వచ్ఛతకు హామీగా. కొందరు 'ఖితామున్ -

26. దాని చివరి చుక్కలోనూ కస్తూరి సువాసన ఉంటుంది. కాబట్టి దానిని పొంద టానికి అపేక్షించు వారంతా ప్రయాసపడాలి.

خِتَٰمُهُۥ مِسۡكٞۚ وَفِي ذَٰلِكَ فَلۡيَتَنَافَسِ ٱلۡمُتَنَٰفِسُونَ ٢٦

27. మరియు దానిలో (ఆ మధువులో) తస్నీమ్ కలుపబడి ఉంటుంది.[1]

وَمِزَاجُهُۥ مِن تَسۡنِيمٍ ٢٧

28. అదొక చెలమ, (అల్లాహ్) సాన్నిధ్యం పొందిన వారే దాని నుండి త్రాగుతారు.[2]

عَيۡنٗا يَشۡرَبُ بِهَا ٱلۡمُقَرَّبُونَ ٢٨

29. వాస్తవానికి (ప్రపంచంలో) అపరాధులు విశ్వసించిన వారిని హేళన చేసేవారు.

إِنَّ ٱلَّذِينَ أَجۡرَمُواْ كَانُواْ مِنَ ٱلَّذِينَ ءَامَنُواْ يَضۡحَكُونَ ٢٩

30. మరియు వీరు (విశ్వాసులు), వారి (అవిశ్వాసుల) యెదుట నుండి పోయినప్పుడు, వారు (అవిశ్వాసులు) పరస్పరం కనుసైగలు చేసుకునే వారు.

وَإِذَا مَرُّواْ بِهِمۡ يَتَغَامَزُونَ ٣٠

31. మరియు (అవిశ్వాసులు) తమ ఇంటి వారి దగ్గరికి పోయినప్పుడు (విశ్వాసులను గురించి) పరిహసిస్తూ మరలేవారు.

وَإِذَا ٱنقَلَبُوٓاْ إِلَىٰٓ أَهۡلِهِمُ ٱنقَلَبُواْ فَكِهِينَ ٣١

32. మరియు (విశ్వాసులను) చూసినపుడల్లా: "నిశ్చయంగా, వీరు దారితప్పిన వారు!" అని అనేవారు.

وَإِذَا رَأَوۡهُمۡ قَالُوٓاْ إِنَّ هَٰٓؤُلَآءِ لَضَآلُّونَ ٣٢

33. మరియు వారు (అవిశ్వాసులు) వీరి (విశ్వాసుల) మీద కాపలాదారులుగా పంపబడ లేదు!

وَمَآ أُرۡسِلُواْ عَلَيۡهِمۡ حَٰفِظِينَ ٣٣

---

అంటే సువాసన అంటారు. దాని సువాసన కస్తూరివలే ఉంటుంది. (ఇబ్నె-కసీ'ర్). 'హదీస్'లో ఉంది: "ఏ విశ్వాసుడైతే, దప్పికగొన్న విశ్వాసునికి నీరు త్రాపుతాడో పునరుత్థాన దినమున అల్లాహ్ (సు.తా.) అతనికి ర'హీఖ్ అల్-మ'ఖ్తూమ్ త్రాపుతాడు మరియు అన్నం పెట్టిన వాడికి స్వర్గపు ఫలాలు తినిపిస్తాడు. మరియు వస్త్రాలు లేని వానికి వస్త్రాలు ఇచ్చేవానికి స్వర్గపు వస్త్రాలు ప్రసాదిస్తాడు." (ముస్నద్ అ'హ్మద్, 3/13-14).

1. తస్నీమున్: ఎత్తైన స్థలం. ఆ పానీయం స్వర్గపు ఎత్తైన ప్రదేశం నుండి చెలమల ద్వారా వస్తుంది.

2. చూడండి, 76:5-6.

فَٱلۡيَوۡمَ ٱلَّذِينَ ءَامَنُواْ مِنَ ٱلۡكُفَّارِ يَضۡحَكُونَ ٣٤

**34**. కాని ఈ రోజు (పురుత్థానదినం నాడు) విశ్వసించిన వారు, సత్యతిరస్కారులను చూసి నవ్వుతారు.

عَلَى ٱلۡأَرَآئِكِ يَنظُرُونَ ٣٥

**35**. ఎత్తైన ఆసనాలపై కూర్చొని (స్వర్గ దృశ్యాలను) తిలకిస్తూ (ఇలా అంటారు):

هَلۡ ثُوِّبَ ٱلۡكُفَّارُ مَا كَانُواْ يَفۡعَلُونَ ٣٦

**36**. "ఇక! ఈ సత్యతిరస్కారులకు, వారి చేష్టలకు తగిన ప్రతిఫలం తప్ప మరేమైనా దొరుకునా?" (3/8)

*****

## 84. సూరహ్ అల్-ఇన్షిఖాఖ్

## سُورَةُ الإِنشِقَاق

అల్-ఇన్షిఖాఖ్: The Splitting asunder, బ్రద్దలవటం, ప్రేలిపోవటం, పగిలిపోవటం, ఖండన. దీనిపేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది సూరహ్ అల్-ఇన్ఫిఁతార్ (82) తరువాత అవతరింపజేయబడింది. ఇది చివరి మక్కా సూరాహ్‌లలో ఒకటి. ఇందులో **25 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

إِذَا ٱلسَّمَآءُ ٱنشَقَّتۡ ١

**1**. * ఆకాశం **బ్రద్దలయిపోయి** నప్పుడు![1]

وَأَذِنَتۡ لِرَبِّهَا وَحُقَّتۡ ٢

**2**. మరియు అది తన ప్రభువు ఆదేశపాలన చేసింది మరియు అదే దాని విధ్యుక్తధర్మం.[2]

وَإِذَا ٱلۡأَرۡضُ مُدَّتۡ ٣

**3**. మరియు భూమి విస్తరింపజేయబడి (చదునుగా చేయబడి) నప్పుడు;

وَأَلۡقَتۡ مَا فِيهَا وَتَخَلَّتۡ ٤

**4**. మరియు అది తన లోపల ఉన్నదంతా బయటికి విసరివేసి, ఖాళీ అయినప్పుడు;

وَأَذِنَتۡ لِرَبِّهَا وَحُقَّتۡ ٥

**5**. అది తన ప్రభువు ఆదేశపాలన చేసింది మరియు అదే దాని విధ్యుక్తధర్మం.

يَٰٓأَيُّهَا ٱلۡإِنسَٰنُ إِنَّكَ كَادِحٌ إِلَىٰ رَبِّكَ كَدۡحٗا فَمُلَٰقِيهِ ٦

**6**. ఓ మానవుడా! నిశ్చయంగా, నీవు నీ ప్రభువు వైపునకు, నీ (మంచి-చెడు) కర్మలను తీసుకొని మరలుతున్నావు, ఒక నిశ్చిత మరలుపు. అప్పుడు నీవు నీ (కర్మల ఫలితాన్ని) పొందుతావు.

فَأَمَّا مَنۡ أُوتِيَ كِتَٰبَهُۥ بِيَمِينِهِۦ ٧

**7**. అప్పుడు తన కర్మపత్రం కుడి చేతిలో ఇవ్వబడిన వాడి నుండి;[3]

---

**1**. అంటే పునరుత్థానదినము.
**2**. చూడండి, 20: 105-107.
**3**. చూడండి, 69:19.

8. అతని లెక్క అతి తేలికగా తీసుకొనబడగలదు.

فَسَوْفَ يُحَاسَبُ حِسَابًا يَسِيرًا ﴿٨﴾

9. మరియు అతడు సంతోషంగా తనవారి దగ్గరకు మరలిపోతాడు!

وَيَنقَلِبُ إِلَىٰٓ أَهْلِهِۦ مَسْرُورًا ﴿٩﴾

10. ఇక తన కర్మపత్రం వీపు వెనుక నుండి ఇవ్వబడిన వాడు;[1]

وَأَمَّا مَنْ أُوتِىَ كِتَٰبَهُۥ وَرَآءَ ظَهْرِهِۦ ﴿١٠﴾

11. అప్పుడతడు తన నాశనాన్నే కోరుకుంటాడు;

فَسَوْفَ يَدْعُوا۟ ثُبُورًا ﴿١١﴾

12. మరియు అతడు మండుతున్న నరకాగ్నిలో పడిపోతాడు.

وَيَصْلَىٰ سَعِيرًا ﴿١٢﴾

13. వాస్తవానికి, అతడు (ప్రపంచంలో) తనవారి మధ్య సుఖసంతోషాలలో మునిగి ఉండేవాడు.[2]

إِنَّهُۥ كَانَ فِىٓ أَهْلِهِۦ مَسْرُورًا ﴿١٣﴾

14. వాస్తవానికి, అతడు (మా వైపుకు) మరలిరాడని భావించేవాడు.

إِنَّهُۥ ظَنَّ أَن لَّن يَحُورَ ﴿١٤﴾

15. అలాకాదు! వాస్తవానికి, అతని ప్రభువు అతనిని గమనిస్తూ ఉండేవాడు.

بَلَىٰٓ إِنَّ رَبَّهُۥ كَانَ بِهِۦ بَصِيرًا ﴿١٥﴾

16. కనుక, నేను సంధ్య కాలపు ఎరుపు సాక్షిగా చెబుతున్నాను![3]

فَلَآ أُقْسِمُ بِٱلشَّفَقِ ﴿١٦﴾

17. రాత్రి సాక్షిగా, అది ప్రోగుచేసే వాటి సాక్షిగా!

وَٱلَّيْلِ وَمَا وَسَقَ ﴿١٧﴾

18. పూర్ణ చంద్రుని సాక్షిగా![4]

وَٱلْقَمَرِ إِذَا ٱتَّسَقَ ﴿١٨﴾

---

1. చూడండి, 69:25-26.
2. చూడండి, 75:33.
3. అష్-షఫఖు: సూర్యాస్తమయం తరువాత ఆకాశంలో కనబడే ఎరుపు, సంధ్యారుణిమ. అది 'ఇషా సమయం మొదలయ్యే వరకు ఉంటుంది.
4. అత్తసఖు: అంటే పౌర్ణిమనాటి చంద్రుడు.

لَتَرْكَبُنَّ طَبَقًا عَن طَبَقٍ ﴿١٩﴾

19. మీరందరూ తప్పనిసరిగా ఒక స్థితి నుండి మరొక స్థితికి క్రమక్రమంగా మారుతూ పోవలసి ఉంటుంది.[1]

فَمَا لَهُمْ لَا يُؤْمِنُونَ ﴿٢٠﴾

20. అయితే వీరికేమయింది? వీరు ఎందుకు విశ్వసించరు?

وَإِذَا قُرِئَ عَلَيْهِمُ الْقُرْآنُ لَا يَسْجُدُونَ ۩ ﴿٢١﴾

21. మరియు ఖుర్ఆన్ వీరి ముందు పఠింపబడినప్పుడు వీరెందుకు సాష్టాంగం (సజ్దా) చేయరు?[2] ۩

بَلِ الَّذِينَ كَفَرُوا يُكَذِّبُونَ ﴿٢٢﴾

22. అలా కాదు! ఈ సత్యతిరస్కారులు దీనిని అసత్యమంటున్నారు.

وَاللَّهُ أَعْلَمُ بِمَا يُوعُونَ ﴿٢٣﴾

23. మరియు వారు కూడబెట్టేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

فَبَشِّرْهُم بِعَذَابٍ أَلِيمٍ ﴿٢٤﴾

24. కాబట్టి వారికి (పరలోకంలో) లభించే వ్యధా భరితమైన శిక్ష యొక్క వార్తనివ్వు!

إِلَّا الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ لَهُمْ أَجْرٌ غَيْرُ مَمْنُونٍ ﴿٢٥﴾

25. విశ్వసించి సత్కార్యాలు చేసే వారికి తప్ప - వారికి ఎన్నటికీ అంతం గాని ప్రతిఫలం ఉంటుంది.

*****

1. 'తబఖున్: కఠినత. ఇక్కడ కఠినాలు అంటే ఒక స్థితి నుండి మరొక స్థితికి మారటం.

2. 'హదీస్'ల ద్వారా దైవప్రవక్త ('స'అస) మరియు 'స'హాబా(ర'ది.'అన్హుమ్)లు, ఇక్కడ సజ్దా చేశారని తెలుస్తుంది.

## 85. సూరహ్ అల్-బురూజ్ سُورَةُ البُرُوجِ

అల్-బురూజ్: బురుజులు, The Big Stars, The Great Constillations, **తారాగణం, నక్షత్రరాశులు, నక్షత్ర సముదాయం.** ఇది సూరహ్ అష్-షమ్స్ (91) తరువాత అవతరింపజేయబడిన **మక్కా** సూరహ్. దీనిపేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇందులో **22 ఆయతులు** ఉన్నాయి. దైవప్రవక్త ('స'అస) ''జు'హ్ర్ మరియు 'అస్ర్ నమాజులలో సూరహ్ అల్-బురూజ్ (85) మరియు సూరహ్ అత్-'తారిఖ్ (86) చదివేవారు. (తిర్మిజీ'). 4-7వ ఆయత్‌లలో, ప్రాచీన కాలంలో స'ఊదీ 'అరేబియాలో ఉన్న నజ్‌రాన్ యొక్క సత్యతిరస్కారులు విశ్వాసులను అగ్ని కందకంలో త్రోసిచంపిన దారుణసంఘటన పేర్కొనబడింది. ఈ విధమైన దౌర్జన్యాలు ఇతర చోట్లలో కూడా జరిగినట్లు పేర్కొనబడ్డాయి. వివరాలకు చూడండి ఇబ్నె-కసీ'ర్.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

وَٱلسَّمَآءِ ذَاتِ ٱلۡبُرُوجِ ١

**1**. విస్తారమైన **తారాగణం** గల ఆకాశం సాక్షిగా![1]

وَٱلۡيَوۡمِ ٱلۡمَوۡعُودِ ٢

**2**. వాగ్దానం చేయబడిన (పునరుత్థాన) దినం సాక్షిగా!

وَشَاهِدٖ وَمَشۡهُودٖ ٣

**3**. చూచే దినం మరియు చూడబడే దినం సాక్షిగా![2]

قُتِلَ أَصۡحَٰبُ ٱلۡأُخۡدُودِ ٤

**4**. అగ్ని కందకం (ఉ'ఖ్దూద్) వారు నాశనం చేయబడ్డారు.[3]

ٱلنَّارِ ذَاتِ ٱلۡوَقُودِ ٥

**5**. ఇంధనంతో తీవ్రంగా మండే అగ్నిని రాజేసే వారు.

---

**1**. చూడండి, 25:61.

**2**. ఈ ఆయత్ వ్యాఖ్యానంలో భేదాభిప్రాయాలున్నాయి. ఇమామ్ షౌకాని ఒక 'హదీస్' ఆధారంగా అన్నారు: షాహిదున్: అంటే జుము'అహ్ దినం. ఆ రోజు విశ్వాసి చేసిన పని, పునరుత్థాన దినమున దానికి సాక్ష్యమిస్తుంది. మష్‌హూదున్: అంటే 9వ జు'ల్ 'హజ్జ్, 'అరఫాత్ దినం. ఏ రోజైతే ముస్లింలు 'హజ్జ్ కొరకు సమావేశమవుతారో! మరొక తాత్పర్యం: ''అంతా చూసే ఆయన, అల్లాహుతా'ఆలా సాక్షిగా మరియు ఆయన సాక్షిగా నిలిపేవాని సాక్షిగా!''

**3**. పైన పేర్కొన్నట్లు నజ్‌రాన్‌లోని సత్యతిరస్కారులు, ఆ కాలపు విశ్వాసులను ఒక అగ్ని కందకంలో త్రోసి చంపేవారు.

إِذْ هُمْ عَلَيْهَا قُعُودٌ ﴿٦﴾

6. వారు దాని (ఆ కందకం) అంచుపై కూర్చొని ఉన్నప్పుడు![1]

وَهُمْ عَلَىٰ مَا يَفْعَلُونَ بِٱلْمُؤْمِنِينَ شُهُودٌ ﴿٧﴾

7. మరియు తాము విశ్వాసులపట్ల చేసే ఘోరకార్యాలను (సజీవ దహనాలను) తిలకించేవారు.

وَمَا نَقَمُوا۟ مِنْهُمْ إِلَّآ أَن يُؤْمِنُوا۟ بِٱللَّهِ ٱلْعَزِيزِ ٱلْحَمِيدِ ﴿٨﴾

8. మరియు వారు విశ్వాసులపట్ల కసి పెంచుకోవడానికి కారణం - వారు (విశ్వాసులు) సర్వశక్తిమంతుడు సర్వ స్తోత్రాలకు అర్హుడైన - అల్లాహ్‌ను విశ్వసించడం మాత్రమే!

ٱلَّذِى لَهُۥ مُلْكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ وَٱللَّهُ عَلَىٰ كُلِّ شَىْءٍ شَهِيدٌ ﴿٩﴾

9. ఆయనే! ఎవనికైతే భూమ్యాకాశాల ఆధిపత్యం ఉందో! మరియు అల్లాహ్‌యే ప్రతిదానికి సాక్షి.

إِنَّ ٱلَّذِينَ فَتَنُوا۟ ٱلْمُؤْمِنِينَ وَٱلْمُؤْمِنَٰتِ ثُمَّ لَمْ يَتُوبُوا۟ فَلَهُمْ عَذَابُ جَهَنَّمَ وَلَهُمْ عَذَابُ ٱلْحَرِيقِ ﴿١٠﴾

10. ఎవరైతే విశ్వాసులైన పురుషులను మరియు విశ్వాసులైన స్త్రీలను హింసిస్తారో, ఆ తరువాత పశ్చాత్తాపంతో క్షమాపణ కోరరో! నిశ్చయంగా, అలాంటి వారికి నరక శిక్ష ఉంటుంది. మరియు వారికి మండే నరకాగ్ని శిక్ష విధించబడుతుంది.

إِنَّ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ لَهُمْ جَنَّٰتٌ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ ۚ ذَٰلِكَ ٱلْفَوْزُ ٱلْكَبِيرُ ﴿١١﴾

11. నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసే వారి కొరకు క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలు ఉంటాయి.[2] అదే గొప్ప విజయం.

إِنَّ بَطْشَ رَبِّكَ لَشَدِيدٌ ﴿١٢﴾

12. నిశ్చయంగా, నీ ప్రభువు యొక్క పట్టు (శిక్ష) చాలా కఠినమైనది.[3]

---

1. విశ్వాసులను అగ్నిలో వేసి వారు (సత్యతిరస్కారులు) చూసి ఆనందించే వారు.
2. ఖుర్‌ఆన్ అవతరణా క్రమంలో స్వర్గవనాలను గురించి ఇక్కడ మొదటి సారి వచ్చింది.
3. ఆయన మొదట వ్యవధినిస్తాడు. ఇక శిక్షించటానికి పట్టుకొన్నప్పుడు, ఆయన పట్టునుండి ఎవ్వరూ తప్పించుకోలేరు మరియు ఎవ్వరూ తప్పించజాలరు కూడానూ!

إِنَّهُۥ هُوَ يُبْدِئُ وَيُعِيدُ ﴿١٣﴾

13. నిశ్చయంగా, ఆయనే (సృష్టిని) ఆరంభించే వాడు మరియు ఆయనే (దానిని) మరల ఉనికిలోకి తెచ్చేవాడు.

وَهُوَ ٱلْغَفُورُ ٱلْوَدُودُ ﴿١٤﴾

14. మరియు ఆయన క్షమాశీలుడు, అమిత వాత్సల్యుడు.

ذُو ٱلْعَرْشِ ٱلْمَجِيدُ ﴿١٥﴾

15. సింహాసనాన్ని ('అర్ష్ ను) అధిష్ఠించిన వాడు,[1] మహత్వపూర్ణుడు.[2]

فَعَّالٌ لِّمَا يُرِيدُ ﴿١٦﴾

16. తాను తలచింది చేయగలవాడు.

هَلْ أَتَىٰكَ حَدِيثُ ٱلْجُنُودِ ﴿١٧﴾

17. ఏమీ? సైన్యాల వారి సమాచారం నీకు అందిందా?

فِرْعَوْنَ وَثَمُودَ ﴿١٨﴾

18. ఫిర్'ఔన్ మరియు స'మూద్ వారి (సైన్యాల).

بَلِ ٱلَّذِينَ كَفَرُوا۟ فِى تَكْذِيبٍ ﴿١٩﴾

19. అలాకాదు, సత్యతిరస్కారులు (సత్యాన్ని) తిరస్కరించుటలో నిమగ్నులై వున్నారు.

وَٱللَّهُ مِن وَرَآئِهِم مُّحِيطٌۢ ﴿٢٠﴾

20. మరియు అల్లాహ్ వారిని వెనుక (ప్రతి దిక్కు) నుండి చుట్టుముట్టి ఉన్నాడు.

بَلْ هُوَ قُرْءَانٌ مَّجِيدٌ ﴿٢١﴾

21. వాస్తవానికి, ఇది ఒక దివ్యమైన[3] ఖుర్ఆన్;

فِى لَوْحٍ مَّحْفُوظٍۭ ﴿٢٢﴾

22. సురక్షితమైన ఫలకంలో (లౌ'హె మ'హ్ఫూ'జ్ లో)[4] (వ్రాయబడి) ఉన్నది.

*****

1. సింహాసనాధీశుడు, చూడండి, 7:54.

2. చూడండి, అల్లాహుతా'ఆలాను సంబోధించిన సందర్భానికి, 11:73. అల్-మజీదు: వైభవం గలవాడు, ప్రభావం, ప్రతాపం విశిష్టత, దివ్యుడు, మహిమాన్వితుడు, మహత్త్వపూర్ణుడు.

3. చూడండి, ఖుర్ఆన్ ను సంబోధించిన సందర్భానికి, 50:1.

4. చూడండి, 13:39 మరియు 43:4. ఉమ్ముల్-కితాబ్, అంటే లౌ'హె మ'హ్ఫూ'జ్. సురక్షితమైన ఫలకం, మూలగ్రంథం. అంటే యథాస్థితిలో, భద్రంగా ఉంచబడిన గ్రంథం.

## سُورَةُ الطَّارِقِ

## 86. సూరహ్ అత్-'తారిఖ్

అత్-'తారిఖ్: **రాత్రివేళ వచ్చేది**, The Night-Comer, కాంతివంతమైన నక్షత్రం. దీని పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది ఆరంభ మక్కా కాలంలో అవతరింపజేయబడింది. బహుశా 4వ సంవత్సరంలో. ఇందులో **17 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

وَٱلسَّمَآءِ وَٱلطَّارِقِ ١

**1**. ఆకాశం మరియు **రాత్రివేళ వచ్చే** నక్షత్రం (అత్-'తారిఖ్) సాక్షిగా!

وَمَآ أَدْرَىٰكَ مَا ٱلطَّارِقُ ٢

**2**. రాత్రి వేళ వచ్చేది (అత్-'తారిఖ్) అంటే ఏమిటో నీకు ఎలా తెలుస్తుంది?

ٱلنَّجْمُ ٱلثَّاقِبُ ٣

**3**. అదొక అత్యంత ప్రకాశవంతమైన నక్షత్రం.

إِن كُلُّ نَفْسٍ لَّمَّا عَلَيْهَا حَافِظٌ ٤

**4**. కనిపెట్టుకొని ఉండేవాడు (దేవదూత) లేకుండా ఏ వ్యక్తి కూడా లేడు.[1]

فَلْيَنظُرِ ٱلْإِنسَٰنُ مِمَّ خُلِقَ ٥

**5**. కావున మానవుడు తాను దేనితో సృష్టించబడ్డాడో గమనించాలి!

خُلِقَ مِن مَّآءٍ دَافِقٍ ٦

**6**. అతడు విసర్జించబడే (చిమ్ముకుంటూ వెలువడే) ద్రవపదార్థంతో సృష్టించబడ్డాడు.

يَخْرُجُ مِنۢ بَيْنِ ٱلصُّلْبِ وَٱلتَّرَآئِبِ ٧

**7**. అది వెన్ను మరియు రొమ్ము ఎముకల మధ్య భాగం నుండి బయటికి వస్తుంది.

إِنَّهُۥ عَلَىٰ رَجْعِهِۦ لَقَادِرٌ ٨

**8**. నిశ్చయంగా, ఆయన (సృష్టికర్త), అతనిని మరల బ్రతికించి తేగల సామర్థ్యం గలవాడు!

يَوْمَ تُبْلَى ٱلسَّرَآئِرُ ٩

**9**. ఏ రోజయితే రహస్య విషయాల విచారణ జరుగుతుందో!

---

**1**. చూడండి, 13:11 మరియు 82:10-12.

10. అప్పుడు అతనికి (మానవునికి) ఎలాంటి శక్తి ఉండదు మరియు ఏ సహాయకుడునూ ఉండడు.[1]

فَمَا لَهُۥ مِن قُوَّةٍ وَلَا نَاصِرٍ ١٠

11. వర్షం కురిపించే ఆకాశం సాక్షిగా![2]

وَٱلسَّمَآءِ ذَاتِ ٱلرَّجْعِ ١١

12. (చెట్లు మొలకెత్తేటప్పుడు) చీలి పోయే భూమి సాక్షిగా!

وَٱلْأَرْضِ ذَاتِ ٱلصَّدْعِ ١٢

13. నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్ సత్యాసత్యాలను) వేరుపరచే వాక్కు (గీటురాయి).

إِنَّهُۥ لَقَوْلٌ فَصْلٌ ١٣

14. మరియు ఇది వృథా కాలక్షేపానికి వచ్చినది కాదు.

وَمَا هُوَ بِٱلْهَزْلِ ١٤

15. (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా వారు (నీకు విరుద్ధంగా) కుట్రలు పన్నుతున్నారు.[3]

إِنَّهُمْ يَكِيدُونَ كَيْدًا ١٥

16. మరియు నేను కూడ పన్నాగం పన్ను తున్నాను.

وَأَكِيدُ كَيْدًا ١٦

17. కనుక నీవు సత్యతిరస్కారులకు కొంత వ్యవధినివ్వు![4] వారి పట్ల మృదువుగా వ్యవహరించు.(1/2)

فَمَهِّلِ ٱلْكَٰفِرِينَ أَمْهِلْهُمْ رُوَيْدًۢا ١٧

*****

1. అల్లాహ్ (సు.తా.) శిక్షనుండి తప్పించుకోవటానికి.

2. *అర్-రజ్'ఉ:* తిరిగి రావటం. వర్షం కూడా మళ్ళీమళ్ళీ వస్తుంది కాబట్టి ఈ పేరుతో పిలువబడుతుంది.

3. చూడండి, 34:33.

4. చూడండి, 7:182-183

## 87. సూరహ్ అల్-అ'అలా

## سُورَةُ الأعْلَى

అల్-అ'అలా: The Most High, మహోన్నతుడు. ఈ సూరహ్ పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ప్రారంభ **మక్కా** కాలపు, బహుశా సూరహ్ అల్-అన్ఫాల్ (8) లేక సూరహ్ అత్-తక్వీర్ (81) తరువాత అవతరింపజేయబడింది. దైవప్రవక్త ('స'అస) పండుగ ('ఈద్)ల నమా'జ్‌లలో మరియు జుము'అహ్ నమా'జ్‌లలో ఈ సూరహ్ (87)ను మరియు సూరహ్ అల్-'గాషియహ్(88)ను పఠించేవారు. వి'త్ర్ నమా'జ్ మొదటి రకాత్‌లో ఈ సూరహ్(87)ను, రెండవ రకాత్‌లో సూరహ్ అల్-కాఫిరూన్(109)ను మరియు మూడవ రకాత్‌లో సూరహ్ అల్-ఇ'ఖ్లా'స్(112)ను పఠించేవారు. ఇందులో **19 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**1.** * **మహోన్నతుడైన** నీ ప్రభువు నామాన్ని స్తుతించు!

سَبِّحِ ٱسْمَ رَبِّكَ ٱلْأَعْلَى ﴿١﴾

**2.** ఆయనే (ప్రతి దానిని) సృష్టించాడు మరియు తగిన ప్రమాణంలో రూపొందించాడు.[1]

ٱلَّذِى خَلَقَ فَسَوَّىٰ ﴿٢﴾

**3.** మరియు ఆయనే దాని ప్రకృతి లక్షణాలను నిర్ణయించాడు,[2] మరియు మార్గం చూపాడు!

وَٱلَّذِى قَدَّرَ فَهَدَىٰ ﴿٣﴾

**4.** మరియు ఆయనే పచ్చికను మొలిపింపజేశాడు!

وَٱلَّذِىٓ أَخْرَجَ ٱلْمَرْعَىٰ ﴿٤﴾

**5.** మరల దానిని నల్లని చెత్తా చెదారంగా చేశాడు.[3]

فَجَعَلَهُۥ غُثَآءً أَحْوَىٰ ﴿٥﴾

---

**1.** చూడండి, 82:7.

**2.** చూడండి, 25:2 మరియు 20:50.

**3.** 'గుసా'అన్: ఎండినగడ్డి. అ'హ్వా: నల్లని. అంటే పచ్చి గడ్డిని ఎండింపజేసి నల్లని చెత్తాచెదారంగా చేస్తాడు.

سَنُقۡرِئُكَ فَلَا تَنسَىٰٓ ٦

**6**. మేము నీ చేత (ఖుర్ఆన్‌ను) చదివింప జేస్తాము, తరువాత నీవు (దానిని) మరచిపోవు-

إِلَّا مَا شَآءَ ٱللَّهُۚ إِنَّهُۥ يَعۡلَمُ ٱلۡجَهۡرَ وَمَا يَخۡفَىٰ ٧

**7**. అల్లాహ్ కోరింది తప్ప![1] నిశ్చయంగా, బహిరంగంగా ఉన్నదీ మరియు గోప్యంగా ఉన్నదీ అన్నీ ఆయనకు బాగా తెలుసు.

وَنُيَسِّرُكَ لِلۡيُسۡرَىٰ ٨

**8**. మరియు మేము నీ మార్గాన్ని సులభం చేయడానికి నీకు సౌలభ్యాన్ని కలుగజేస్తాము.[2]

فَذَكِّرۡ إِن نَّفَعَتِ ٱلذِّكۡرَىٰ ٩

**9**. కావున నీవు హితోపదేశం చేస్తూఉండు; వారికి హితోపదేశం లాభదాయకం కావచ్చు![3]

سَيَذَّكَّرُ مَن يَخۡشَىٰ ١٠

**10**. (అల్లాహ్‌కు) భయపడే వాడు హితోపదేశాన్ని స్వీకరిస్తాడు.

وَيَتَجَنَّبُهَا ٱلۡأَشۡقَى ١١

**11**. మరియు దౌర్భాగ్యుడు దానికి దూరమైపోతాడు.

ٱلَّذِي يَصۡلَى ٱلنَّارَ ٱلۡكُبۡرَىٰ ١٢

**12**. అలాంటి వాడే ఘోరమైన నరకాగ్నిలో పడి కాలుతాడు.

ثُمَّ لَا يَمُوتُ فِيهَا وَلَا يَحۡيَىٰ ١٣

**13**. అప్పుడు, అతడు అందులో చావనూ లేడు, బ్రతకనూ లేడు.[4]

---

**1**. అంటే అల్లాహ్ (సు.తా.) రద్దు చేయదలచిన దానిని మరపింపజేస్తాడు.

**2**. వ'హీని జ్ఞాపకముంచుకోవటం మరియు దానిపై నడవటం నీకు సులభం చేస్తాము.

**3**. నీ పని హితోపదేశం చేయటం మాత్రమే! నీ హితోపదేశం వారికి లాభదాయకం కావచ్చు! వారు దానితో లాభం పొందకున్నా నీ పని కేవలం హితోపదేశం చేయటమే!

**4**. చూడండి, 74:28-29.

قَدۡ أَفۡلَحَ مَن تَزَكَّىٰ ﴿١٤﴾

**14**. సుశీలతను (పవిత్రతను) పాటించే వాడు తప్పక సాఫల్యం పొందుతాడు.

وَذَكَرَ ٱسۡمَ رَبِّهِۦ فَصَلَّىٰ ﴿١٥﴾

**15**. మరియు తన ప్రభువు నామాన్ని స్మరిస్తూ, నమా'జ్ చేస్తూ ఉండేవాడు.

بَلۡ تُؤۡثِرُونَ ٱلۡحَيَوٰةَ ٱلدُّنۡيَا ﴿١٦﴾

**16**. అలాకాదు! మీరు ఐహిక జీవితానికి ప్రాధాన్యత నిస్తున్నారు;

وَٱلۡأٓخِرَةُ خَيۡرٞ وَأَبۡقَىٰٓ ﴿١٧﴾

**17**. కాని పరలోక జీవితమే మేలైనది మరియు చిరకాలముండేది.

إِنَّ هَٰذَا لَفِي ٱلصُّحُفِ ٱلۡأُولَىٰ ﴿١٨﴾

**18**. నిశ్చయంగా, ఈ విషయం పూర్వ గ్రంథాలలో (వ్రాయబడి) ఉంది;

صُحُفِ إِبۡرَٰهِيمَ وَمُوسَىٰ ﴿١٩﴾

**19**. ఇబ్రాహీమ్ మరియు మూసాలపై (అవతరింపజేయబడిన)గ్రంథాలలో!

*****

## 88. సూరహ్ అల్-'గాషియహ్

## سُورَةُ الغَاشِيَةِ

అల్-'గాషియహ్ : The Overwhelming, క్రమ్ముకొనేది, హఠాత్తుగా ఆసన్నమయ్యేది, పునరుత్థానదినం, దాని విపత్తు సర్వసృష్టిని క్రమ్ముకొంటుంది. దీనిపేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది ఆరంభ మక్కా కాలపు సూరహ్. దైవప్రవక్త ('స'అస) జుము'అహ్ నమాజులలో సూరహ్ అల్-జుము'అహ్ (62) తరువాత దీనిని (88) పఠించేవారు (మువ'త్తఅ' ఇమామ్ మాలిక్). ఇందులో **26 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

هَلْ أَتَىٰكَ حَدِيثُ ٱلْغَـٰشِيَةِ ﴿١﴾

**1**. హఠాత్తుగా ఆసన్నమయ్యే ఆ విపత్తు (పునరుత్థానదినపు) సమాచారం నీకు అందిందా?

وُجُوهٌ يَوْمَئِذٍ خَـٰشِعَةٌ ﴿٢﴾

**2**. కొన్ని ముఖాలు ఆ రోజు వాలి (క్రుంగి) పోయి ఉంటాయి.

عَامِلَةٌ نَّاصِبَةٌ ﴿٣﴾

**3**. (ప్రపంచంలోని వృథా) శ్రమకు,[1] (పరలోకంలో జరిగే) అవమానానికి,

تَصْلَىٰ نَارًا حَامِيَةً ﴿٤﴾

**4**. వారు దహించే అగ్నిలో పడి కాలుతారు.

تُسْقَىٰ مِنْ عَيْنٍ ءَانِيَةٍ ﴿٥﴾

**5**. వారికి సలసల కాగే చెలమ నీరు త్రాగటానికి ఇవ్వబడుతుంది.

لَّيْسَ لَهُمْ طَعَامٌ إِلَّا مِن ضَرِيعٍ ﴿٦﴾

**6**. వారికి చేదు ముళ్ళ గడ్డ ('దరీ'అ) తప్ప మరొక ఆహారం ఉండదు.

لَّا يُسْمِنُ وَلَا يُغْنِى مِن جُوعٍ ﴿٧﴾

**7**. అది వారికి బలమూ నియ్యదు మరియు ఆకలీ తీర్చదు!

وُجُوهٌ يَوْمَئِذٍ نَّاعِمَةٌ ﴿٨﴾

**8**. ఆరోజున, మరికొన్ని ముఖాలు కళకళలాడుతూ ఉంటాయి;

---

**1**. నా'సిబతున్: శ్రమకు అలసిపోవటం.

لِّسَعْيِهَا رَاضِيَةٌ ﴿٩﴾

9. తాము చేసుకున్న సత్కార్యాలకు (ఫలితాలకు) వారు సంతోషపడుతూ ఉంటారు;

فِي جَنَّةٍ عَالِيَةٍ ﴿١٠﴾

10. అత్యున్నతమైన స్వర్గవనంలో;

لَّا تَسْمَعُ فِيهَا لَاغِيَةً ﴿١١﴾

11. అందులో వారు ఎలాంటి వృథా మాటలు వినరు;

فِيهَا عَيْنٌ جَارِيَةٌ ﴿١٢﴾

12. అందులో ప్రవహించే సెలయేళ్ళు ఉంటాయి;

فِيهَا سُرُرٌ مَّرْفُوعَةٌ ﴿١٣﴾

13. అందులో ఎత్తైన ఆసనాలు ఉంటాయి;[1]

وَأَكْوَابٌ مَّوْضُوعَةٌ ﴿١٤﴾

14. మరియు పేర్చబడిన (మధు) పాత్రలు;

وَنَمَارِقُ مَصْفُوفَةٌ ﴿١٥﴾

15. మరియు వరుసలుగా వేయబడిన, దిండ్లు;

وَزَرَابِيُّ مَبْثُوثَةٌ ﴿١٦﴾

16. మరియు పరచబడిన నాణ్యమైన తివాచీలు.

أَفَلَا يَنظُرُونَ إِلَى ٱلْإِبِلِ كَيْفَ خُلِقَتْ ﴿١٧﴾

17. ఏమిటీ? వారు ఒంటెలవైపు చూడరా? అవి ఎలా సృష్టించబడ్డాయో!

وَإِلَى ٱلسَّمَآءِ كَيْفَ رُفِعَتْ ﴿١٨﴾

18. మరియు ఆకాశంవైపుకు (చూడరా)? అది ఎలా పైకి ఎత్తబడి ఉందో!

وَإِلَى ٱلْجِبَالِ كَيْفَ نُصِبَتْ ﴿١٩﴾

19. మరియు కొండలవైపుకు చూడరా? అవి ఎలా గట్టిగా నాటబడి ఉన్నాయో!

وَإِلَى ٱلْأَرْضِ كَيْفَ سُطِحَتْ ﴿٢٠﴾

20. మరియు భూమివైపుకు (చూడరా)? అది ఎలా విశాలంగా పరచబడి ఉందో!

فَذَكِّرْ إِنَّمَآ أَنتَ مُذَكِّرٌ ﴿٢١﴾

21. కావున (ఓ ము'హమ్మద్!) నీవు హితోపదేశం చేస్తూవుండు, వాస్తవానికి నీవు కేవలం హితోపదేశం చేసేవాడవు మాత్రమే!

1. చూడండి, 15:47.

لَّسۡتَ عَلَيۡهِم بِمُصَيۡطِرٍ ٢٢

**22**. నీవు వారిని (విశ్వసించమని) బలవంతం చేసేవాడవు కావు.

إِلَّا مَن تَوَلَّىٰ وَكَفَرَ ٢٣

**23**. ఇక ఎవడైతే వెనుదిరుగుతాడో మరియు సత్యాన్ని తిరస్కరిస్తాడో!

فَيُعَذِّبُهُ ٱللَّهُ ٱلۡعَذَابَ ٱلۡأَكۡبَرَ ٢٤

**24**. అప్పుడు అతనికి అల్లాహ్ ఘోరశిక్ష విధిస్తాడు.

إِنَّ إِلَيۡنَآ إِيَابَهُمۡ ٢٥

**25**. నిశ్చయంగా, మా వైపునకే వారి మరలింపు ఉంది;

ثُمَّ إِنَّ عَلَيۡنَا حِسَابَهُم ٢٦

**26**. ఆ తర్వాత నిశ్చయంగా, వారి లెక్క తీసుకునేదీ మేమే!

*****

## 89. సూరహ్ అల్-ఫ'జ్ర్ سُورَةُ الفَجْرِ

అల్-ఫ'జ్ర్: The Dawn, The Day Break, ప్రాతఃకాలం, వేకువజాము. అవతరణాక్రమంలో ఇది 10వది. మక్కాలో అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **30 ఆయతులు** ఉన్నాయి.

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్ — بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

وَٱلْفَجْرِ ﴿١﴾

**1**. ప్రాతఃకాలం సాక్షిగా![1]

وَلَيَالٍ عَشْرٍ ﴿٢﴾

**2**. పది రాత్రుల సాక్షిగా![2]

وَٱلشَّفْعِ وَٱلْوَتْرِ ﴿٣﴾

**3**. సరి బేసీల సాక్షిగా!

وَٱلَّيْلِ إِذَا يَسْرِ ﴿٤﴾

**4**. గడచిపోయే రాత్రి సాక్షిగా!

هَلْ فِى ذَٰلِكَ قَسَمٌ لِّذِى حِجْرٍ ﴿٥﴾

**5**. వీటిలో బుద్ధిగల వాని కొరకు ఏ ప్రమాణమూ లేదా ఏమిటి?[3]

أَلَمْ تَرَ كَيْفَ فَعَلَ رَبُّكَ بِعَادٍ ﴿٦﴾

**6**. నీ ప్రభువు 'ఆద్ (జాతి) వారిపట్ల ఎలా వ్యవహరించాడో నీకు తెలియదా?[4]

إِرَمَ ذَاتِ ٱلْعِمَادِ ﴿٧﴾

**7**. ఎత్తైన స్తంభాల (భవనాలు గల) ఇరమ ప్రజల పట్ల?[5]

ٱلَّتِى لَمْ يُخْلَقْ مِثْلُهَا فِى ٱلْبِلَٰدِ ﴿٨﴾

**8**. వారిలాంటి జాతి భూమిలో ఎన్నడూ సృష్టించబడలేదు.[6]

---

**1**. అంటే ప్రతి ఉదయం. ఒక ప్రత్యేక ఉదయం కాదు.

**2**. అంటే జు'ల్-'హజ్జ్ యొక్క మొదటి పదిరాత్రులని చాలా మంది వ్యాఖ్యాతల అభిప్రాయం. వీటి ఘనత 'హదీసు'లలో ఉంది. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: ''జు'ల్-'హజ్జ్ మొదటి పది రోజులలో చేసే సత్కార్యాలు అల్లాహ్(సు.తా.)కు ఎంతో ఇష్టమైనవి - జిహాద్ కంటే కూడా - మానవుడు అమరగతి నొందిన జిహాద్ తప్ప! ('స'హీ'హ్ బు'ఖారీ).

**3**. అంటే వీటన్నిటి ప్రమాణం చేయటం, అల్లాహ్ (సు.తా.)ను విశ్వసించటానికి చాలదా! 'హిజ్‌రున్: ఆపటం, కాదనటం, బుద్ధికూడా మానవుడిని చెడు కర్మలనుండి ఆపుతుంది.

**4**. వారి ప్రవక్త హూద్ ('అ.స.). చూడండి, 69:7-10 మరియు 7:65-72.

**5**. ఇరమ: ఒక తెగ పేరు. దాని పూర్వోత్తరాలు ఇలా ఉన్నాయి: 'ఆద్ బిన్-'ఔస్ బిన్-ఇరమ బిన్ -సామ్ బిన్-నూ'హ్. (ఫత్హ్ అల్-ఖదీర్) వీరిని 'ఆద్ ఊలా, అని కూడా అంటారు. వీరిని ఎత్తైన స్తంభాల (భవనాల) వారని కూడా అంటారు.

**6**. 'ఆద్ జాతివారికి తమ బలసామర్థ్యాల మీద ఎంతో గర్వం ఉండేది. చూడండి, 41:15.

9. మరియు లోయలలోని కొండ రాళ్ళలో (భవనాలను) తొలిచిన స'మూద్ జాతి పట్ల?[1]

10. మరియు మేకుల వాడైన ఫిర్'ఔన్ పట్ల?[2]

11. వారంతా ఆయా దేశాలలో తలబిరుసుతనంతో ప్రవర్తించారు;

12. మరియు వాటిలో దౌర్జన్యాన్ని రేకెత్తించారు.

13. కాబట్టి నీ ప్రభువు వారిపైకి అనేక రకాల బాధాకరమైన శిక్షలను పంపాడు.

14. వాస్తవానికి, నీ ప్రభువు మాటువేసి ఉన్నాడు (అంతా కనిపెడ్తూ ఉంటాడు)!

15. అయితే మానవుడు ఎలాంటి వాడంటే: అతని ప్రభువు అతన్ని పరీక్షించటానికి, అతనికి గౌరవ ప్రతిష్టల నిచ్చి అనుగ్రహించినప్పుడు: "నా ప్రభువు నన్ను గౌరవించాడు." అని అంటాడు;[3]

16. కాని, అతన్ని పరీక్షించటానికి, అతని ఉపాధిని తగ్గించినప్పుడు: "నా ప్రభువు నన్ను అవమానించాడు." అని అంటాడు.[4]

وَثَمُودَ ٱلَّذِينَ جَابُواْ ٱلصَّخۡرَ بِٱلۡوَادِ ﴿٩﴾

وَفِرۡعَوۡنَ ذِي ٱلۡأَوۡتَادِ ﴿١٠﴾

ٱلَّذِينَ طَغَوۡاْ فِي ٱلۡبِلَٰدِ ﴿١١﴾

فَأَكۡثَرُواْ فِيهَا ٱلۡفَسَادَ ﴿١٢﴾

فَصَبَّ عَلَيۡهِمۡ رَبُّكَ سَوۡطَ عَذَابٍ ﴿١٣﴾

إِنَّ رَبَّكَ لَبِٱلۡمِرۡصَادِ ﴿١٤﴾

فَأَمَّا ٱلۡإِنسَٰنُ إِذَا مَا ٱبۡتَلَىٰهُ رَبُّهُۥ
فَأَكۡرَمَهُۥ وَنَعَّمَهُۥ فَيَقُولُ رَبِّيٓ
أَكۡرَمَنِ ﴿١٥﴾

وَأَمَّآ إِذَا مَا ٱبۡتَلَىٰهُ فَقَدَرَ عَلَيۡهِ رِزۡقَهُۥ
فَيَقُولُ رَبِّيٓ أَهَٰنَنِ ﴿١٦﴾

---

1. వీరి ప్రవక్త 'సాలి'హ్ ('అ.స.). చూడండి, 26:149.
2. అంటే పెద్దసైన్యం గలవాడు, లేక ప్రజలను మేకులతో నాటి శిక్షించేవాడు. (ఫత్హ్ అల్-ఖదీర్).
3. అల్లాహ్ (సు.తా.) ధనధాన్యాలు, సౌభాగ్యాలు ఇచ్చినా, పరీక్షించటానికే! మరియు పేదరికానికి గురిచేసినా, అదీ పరీక్షించటానికే!
4. అల్లాహ్ (సు.తా.) తన సద్వర్తనులైన దాసులకు భోగభాగ్యాలు, ధనధాన్యాలు ప్రసాదించవచ్చు! లేక పేదరికానికీ గురిచేసి పరీక్షించవచ్చు. అదే విధంగా సత్యతిరస్కారులకు కూడా ఐశ్వర్యాలివ్వవచ్చు లేక పేదరికంతో పరీక్షించవచ్చు! సద్వర్తనులైన విశ్వాసులు ఐశ్వర్యవంతులుగా ఉంటే అల్లాహ్ (సు.తా.)కు కృతజ్ఞులుగా ఉంటారు. పేదరికానికి గురిఅయితే సహనం వహిస్తారు.

17. అలా కాదు, వాస్తవానికి మీరు అనాథులను ఆదరించరు;[1]

كَلَّاۖ بَل لَّا تُكۡرِمُونَ ٱلۡيَتِيمَ ﴿١٧﴾

18. మరియు మీరు పేదలకు అన్నం పెట్టే విషయంలో ఒకరినొకరు ప్రోత్సహించుకోరు;[2]

وَلَا تَحَٰٓضُّونَ عَلَىٰ طَعَامِ ٱلۡمِسۡكِينِ ﴿١٨﴾

19. మరియు వారసత్వపు ఆస్తిని పేరాశతో అంతా మీరే తినేస్తారు.

وَتَأۡكُلُونَ ٱلتُّرَاثَ أَكۡلٗا لَّمّٗا ﴿١٩﴾

20. మరియు మీరు ధన వ్యామోహంలో దారుణంగా చిక్కుకు పోయారు![3]

وَتُحِبُّونَ ٱلۡمَالَ حُبّٗا جَمّٗا ﴿٢٠﴾

21. అలా కాదు, భూమి, దంచి పిండిపిండిగా చేయబడినపుడు;

كَلَّآ إِذَا دُكَّتِ ٱلۡأَرۡضُ دَكّٗا دَكّٗا ﴿٢١﴾

22. మరియు నీ ప్రభువు (స్వయంగా) వస్తాడు మరియు దేవదూతలు వరుసలలో వస్తారు.[4]

وَجَآءَ رَبُّكَ وَٱلۡمَلَكُ صَفّٗا صَفّٗا ﴿٢٢﴾

23. ఆ రోజు నరకం (ముందుకు) తీసుకురాబడుతుంది. ఆ రోజు మానవుడు (తన కర్మలన్నీ) జ్ఞప్తికి తెచ్చుకుంటాడు; కాని ఆ రోజు జ్ఞప్తికి తెచ్చుకోవడం వల్ల అతనికి కలిగే ప్రయోజనమేమిటి?

وَجِاْيٓءَ يَوۡمَئِذِۭ بِجَهَنَّمَۚ يَوۡمَئِذٖ يَتَذَكَّرُ ٱلۡإِنسَٰنُ وَأَنَّىٰ لَهُ ٱلذِّكۡرَىٰ ﴿٢٣﴾

1. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "అనాథులతో మంచిగా వ్యవహరించే వారు స్వర్గంలో నాతోపాటు - రెండు వ్రేళ్ళు తోడుగా ఉన్నట్లు - ఉంటారు." (అబూ-దావూద్) కావున అనాథులను పోషించడం, వారితో మంచిగా వ్యవహరించడం ఎంతో పుణ్యకార్యం.
2. చూడండి, 107:3.
3. జమ్మన్: కసీ'రన్, చాలా.
4. ఏడు ఆకాశాల దైవదూతలు ఏడు వరుసలలో నిలబడతారు.

24. అతడు: "అయ్యో! నా పాడుగాను! నా ఈ జీవితం కొరకు నేను (సత్కార్యాలు) చేసి పంపుకొని ఉంటే ఎంతబాగుండేది!" అని వాపోతాడు.

يَقُولُ يَٰلَيۡتَنِي قَدَّمۡتُ لِحَيَاتِي ﴿٢٤﴾

25. అయితే ఆ రోజు, ఆయన (అల్లాహ్) శిక్షించినట్లు, మరెవ్వడూ శిక్షించలేడు!

فَيَوۡمَئِذٖ لَّا يُعَذِّبُ عَذَابَهُۥٓ أَحَدٞ ﴿٢٥﴾

26. మరియు ఆయన (అల్లాహ్) బంధించినట్లు, మరెవ్వడూ బంధించలేడు.[1]

وَلَا يُوثِقُ وَثَاقَهُۥٓ أَحَدٞ ﴿٢٦﴾

27. (సన్మార్గునితో ఇలా అనబడుతుంది): "ఓ తృప్తిపొందిన ఆత్మా!

يَٰٓأَيَّتُهَا ٱلنَّفۡسُ ٱلۡمُطۡمَئِنَّةُ ﴿٢٧﴾

28. "నీ ప్రభువు సన్నిధికి మరలి రా! (నీకు లభించే సత్ఫలితానికి) ఆనందిస్తూ మరియు (నీ ప్రభువునకు) ప్రియమైన దానివై!

ٱرۡجِعِيٓ إِلَىٰ رَبِّكِ رَاضِيَةٗ مَّرۡضِيَّةٗ ﴿٢٨﴾

29. "నీవు (పుణ్యాత్ములైన) నా దాసులలో చేరిపో!

فَٱدۡخُلِي فِي عِبَٰدِي ﴿٢٩﴾

30. "మరియు నీవు నా స్వర్గంలో ప్రవేశించు!"(5/8)

وَٱدۡخُلِي جَنَّتِي ﴿٣٠﴾

*****

1. చూడండి, 73:12-13.

## 90. సూరహ్ అల్-బలద్

## سُورَةُ البَلَدِ

అల్-బలద్: నగరం, పురం, పట్నం, The City, The Land. ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఇందులో **20** ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1.** * కాదు, నేను ఈ నగరం (మక్కా) సాక్షిగా (అంటున్నాను)!

لَآ أُقۡسِمُ بِهَٰذَا ٱلۡبَلَدِ ١

**2.** మరియు నీకు ఈ నగరంలో (మక్కాలో) స్వేచ్ఛ ఉంది.

وَأَنتَ حِلُّۢ بِهَٰذَا ٱلۡبَلَدِ ٢

**3.** మరియు తండ్రి (మూల పురుషుడు) మరియు అతని సంతానం సాక్షిగా![1]

وَوَالِدٖ وَمَا وَلَدَ ٣

**4.** వాస్తవానికి, మేము మానవుణ్ణి శ్రమజీవిగా పుట్టించాము.

لَقَدۡ خَلَقۡنَا ٱلۡإِنسَٰنَ فِي كَبَدٍ ٤

**5.** ఏమిటి? తనను ఎవ్వడూ వశపరచుకోలేడని అతడు భావిస్తున్నాడా?

أَيَحۡسَبُ أَن لَّن يَقۡدِرَ عَلَيۡهِ أَحَدٞ ٥

**6.** అతడు: "నేను విపరీత ధనాన్ని ఖర్చుపెట్టాను!" అని అంటాడు.[2]

يَقُولُ أَهۡلَكۡتُ مَالٗا لُّبَدًا ٦

**7.** ఏమిటి? తనను ఎవ్వడూ చూడటంలేదని అతడు భావిస్తున్నాడా?[3]

أَيَحۡسَبُ أَن لَّمۡ يَرَهُۥٓ أَحَدٌ ٧

**8.** ఏమిటి? మేము అతనికి రెండు కళ్ళు ఇవ్వలేదా?

أَلَمۡ نَجۡعَل لَّهُۥ عَيۡنَيۡنِ ٨

**9.** మరియు నాలుకను మరియు రెండు పెదవులను.

وَلِسَانٗا وَشَفَتَيۡنِ ٩

**10.** మరియు అతనికి (మంచీ-చెడూ) అనే స్పష్టమైన రెండు మార్గాలను చూపాము.[4]

وَهَدَيۡنَٰهُ ٱلنَّجۡدَيۡنِ ١٠

---

**1.** కొందరు: "తండ్రి (మూలపురుషుడు) అంటే ఆదమ్ ('అ.స.) మరియు అతని సంతానం అంటే మానవజాతి." అన్నారు.

**2.** లుబదన్: కసీ'రన్, చాలా.

**3.** అంటే అతడు చేసే వృథాఖర్చును ఎవ్వరూ చూడటంలేదని భావిస్తున్నాడా? అల్లాహ్ (సు.తా.) అంతా చూస్తున్నాడు.

**4.** చూడండి, 76:3. అన్-నజ్ద్: అంటే ఎత్తైన స్థలం. అన్-నజ్దైన్: అంటే రెండు మార్గాలు.

فَلَا ٱقۡتَحَمَ ٱلۡعَقَبَةَ ﴿١١﴾

وَمَآ أَدۡرَىٰكَ مَا ٱلۡعَقَبَةُ ﴿١٢﴾

فَكُّ رَقَبَةٍ ﴿١٣﴾

أَوۡ إِطۡعَٰمٞ فِي يَوۡمٖ ذِي مَسۡغَبَةٖ ﴿١٤﴾

يَتِيمٗا ذَا مَقۡرَبَةٍ ﴿١٥﴾

أَوۡ مِسۡكِينٗا ذَا مَتۡرَبَةٖ ﴿١٦﴾

ثُمَّ كَانَ مِنَ ٱلَّذِينَ ءَامَنُواْ وَتَوَاصَوۡاْ بِٱلصَّبۡرِ وَتَوَاصَوۡاْ بِٱلۡمَرۡحَمَةِ ﴿١٧﴾

أُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ ٱلۡمَيۡمَنَةِ ﴿١٨﴾

وَٱلَّذِينَ كَفَرُواْ بِـَٔايَٰتِنَا هُمۡ أَصۡحَٰبُ ٱلۡمَشۡـَٔمَةِ ﴿١٩﴾

عَلَيۡهِمۡ نَارٞ مُّؤۡصَدَةُۢ ﴿٢٠﴾

**11**. కాని అతడు కష్టతరమైన ఊర్ధ్వగమనానికి సాహసించలేదు![1]

**12**. మరియు ఆ ఊర్ధ్వగమనం అంటే ఏమిటో నీకు తెలుసా?

**13**. అది ఒకని మెడను (బానిసత్వం నుండి) విడిపించడం.[2]

**14**. లేదా! (స్వయంగా) ఆకలిగొని[3] ఉన్న రోజు కూడా (ఇతరులకు) అన్నం పెట్టడం.

**15**. సమీప అనాథునికి గానీ;

**16**. లేక, దిక్కులేని నిరుపేదకు గానీ![4]

**17**. మరియు విశ్వసించి, సహనాన్ని బోధించే వారిలో![5] మరియు కరుణను ఒకరి కొకరు బోధించుకునే వారిలో చేరిపోవడం!

**18**. ఇలాంటి వారే కుడిపక్షం వారు.[6]

**19**. ఇక మా సందేశాలను తిరస్కరించిన వారు, ఎడమ పక్షానికి చెందిన వారు.

**20**. వారిని నరకాగ్ని చుట్టుకుంటుంది.[7]

*****

---

**1**. అల్-'అఖబహ్: కొండ శిఖరం (పైకి ఎక్కడం). కొందరు దీనికి కనుమ అనే అర్థం ఇచ్చారు. అంటే రెండు కొండల నడిమి తోవ, సందు. కఠినమైన కనుమ అంటే ఒక బానిసను బంధం నుండి విముక్తి చేయించడం, లేక తాను ఆకలితో ఉండి కూడా ఒక అనాథునికి అన్నం పెట్టడం.

**2**. చూడండి, 2:177.

**3**. మస్'గబతున్: ఆకలి.

**4**. జా'-మత్‌రబతున్: మట్టిపై పడిఉండే పేదవాడు. ఎవడికైతే ఇల్లు ఉండదో!

**5** .అతడు విశ్వాసి అయిఉంటేనే, చేసిన పుణ్యాల ఫలితం దొరుకుతుంది లేకపోతే పరలోకంలో అవి వృథా అయిపోతాయి.

**6**. చూడండి, 74:39 మరియు 56:8, 9, 27, 41.

**7**. ము'అ'సదతున్: ము'గ్‌లఖతున్, అంటే చుట్టుకుంటుంది. చూడండి, 104:6-8.

## 91. సూరహ్ అష్-షమ్స్ سُورَةُ الشَّمْسِ

అష్-షమ్స్: The Sun, సూర్యుడు. ఈ పదం **మొదటి ఆయత్‌లో** ఉంది. ఇది సూరహ్ అల్-ఖద్ర్ (97) తరువాత అవతరింపజేయబడింది. మొదటి **మక్కా** కాలపు సూరహ్. పరలోక జీవితానికి భయపడని వారికి భయంకరమైన పర్యవసానం ఉంటుందని ఈ సూరహ్ తెలుపుతుంది. ఇందులో **15 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

وَٱلشَّمْسِ وَضُحَىٰهَا ۝١

**1**. సూర్యుని మరియు దాని ఎండ సాక్షిగా![1]

وَٱلْقَمَرِ إِذَا تَلَىٰهَا ۝٢

**2**. దాని వెనుక వచ్చే, చంద్రుని సాక్షిగా!

وَٱلنَّهَارِ إِذَا جَلَّىٰهَا ۝٣

**3**. ప్రకాశించే పగటి సాక్షిగా!

وَٱلَّيْلِ إِذَا يَغْشَىٰهَا ۝٤

**4**. దానిని క్రమ్ముకొనే, రాత్రి సాక్షిగా!

وَٱلسَّمَآءِ وَمَا بَنَىٰهَا ۝٥

**5**. ఆకాశం మరియు దానిని నిర్మించిన ఆయన (అల్లాహ్) సాక్షిగా!

وَٱلْأَرْضِ وَمَا طَحَىٰهَا ۝٦

**6**. భూమి మరియు దానిని విస్తరింపజేసిన ఆయన సాక్షిగా!

وَنَفْسٍ وَمَا سَوَّىٰهَا ۝٧

**7**. మానవ ఆత్మ మరియు దానిని తీర్చిదిద్దిన ఆయన సాక్షిగా![2]

فَأَلْهَمَهَا فُجُورَهَا وَتَقْوَىٰهَا ۝٨

**8**. ఆ తరువాత ఆయనే దానికి దుష్టతనాన్ని మరియు దైవభీతిని తెలియజేశాడు.[3]

قَدْ أَفْلَحَ مَن زَكَّىٰهَا ۝٩

**9**. వాస్తవానికి తన ఆత్మను శుద్ధపరచుకున్న వాడే సఫలుడవుతాడు.

---

**1**. 'దు'హా'హా: సూర్యుని ప్రకాశవంతమైన వెలుగు.
**2**. చూడండి, 87:2.
**3**. ఫుజూరహా వ తఖ్వాహా: అంటే మంచిచెడులు, అనే అర్థం కూడా వస్తుంది, చూడండి, ఇబ్నె-కసీ'ర్.

وَقَدۡ خَابَ مَن دَسَّىٰهَا ﴿١٠﴾

10. మరియు వాస్తవానికి దానిని అణగద్రొక్కిన వాడే విఫలుడవుతాడు.[1]

كَذَّبَتۡ ثَمُودُ بِطَغۡوَىٰهَآ ﴿١١﴾

11. స'మూద్ జాతి తలబిరుసుతనంతో (ప్రవక్తను) అసత్యవాదుడని తిరస్కరించింది;[2]

إِذِ ٱنۢبَعَثَ أَشۡقَىٰهَا ﴿١٢﴾

12. తమలోని పరమదుష్టుడు (ఆ దుష్కార్యం చేయటానికి) లేచినప్పుడు.

فَقَالَ لَهُمۡ رَسُولُ ٱللَّهِ نَاقَةَ ٱللَّهِ وَسُقۡيَٰهَا ﴿١٣﴾

13. అల్లాహ్ సందేశహరుడు ('సాలి'హ్) వారితో: "ఈ ఆడ ఒంటె అల్లాహ్‌కు చెందింది. కాబట్టి దీనిని (నీళ్ళు) త్రాగనివ్వండి!" అని అన్నాడు.

فَكَذَّبُوهُ فَعَقَرُوهَا فَدَمۡدَمَ عَلَيۡهِمۡ رَبُّهُم بِذَنۢبِهِمۡ فَسَوَّىٰهَا ﴿١٤﴾

14. అయినా వారు అతని ('సాలి'హ్) మాటను అబద్ధమని తిరస్కరించారు. మరియు దాని (ఆ ఒంటె) వెనక మోకాలి నరాన్ని కోసి, కుంటిదాన్ని చేసి చంపారు.[3] కాబట్టి వారి ప్రభువు వారి పాపానికి పర్యవసానంగా వారి మీద మహా విపత్తును పంపి వారందరినీ నాశనంచేశాడు.

وَلَا يَخَافُ عُقۡبَٰهَا ﴿١٥﴾

15. మరియు ఆయన (అల్లాహ్) దాని పర్యవసానాన్ని గురించి భయపడలేదు![4]

*****

1. దస్స: దాచిపెట్టడం, అణగద్రొక్కటం ఎవడైతే తన ఆత్మను అణగద్రొక్కాడో!

2. 'తు'గ్‌యానన్: తలబిరుసుతనం. తలబిరుసుతనంలో వారు తమ ప్రవక్త అబద్ధీకుడని తిరస్కరించారు. స'మూద్ జాతి వారి గాథ కోసం చూడండి, 7:73-79.

3. దీని తాత్పర్యం ఏమిటంటే ఒక సమాజంలో ఏ ఒక్కడు గానీ, లేక కొందరు గానీ దుష్టపనులు చేస్తున్నప్పుడు ఇతరులు వారిని ఆపకుండా, దానిని సమ్మతిస్తే, ఆ సమాజం వారంతా దోషులే. వారందరూ శిక్షార్హులే! కాబట్టి వారందరూ నాశనం చేయబడ్డారు.

4. ఏదైన ఇతర గొప్ప శక్తి ప్రతీకారం తీసుకుంటుందేమోనన్న భయం అల్లాహ్ (సు.తా.)కు లేదు. ఆయనకు సరిసమానమైన, లేక ఆయన కంటే పెద్దశక్తి అనేది ఏదీ లేదు. ఆయన మీద ఎవ్వరూ ప్రతికారం తీర్చుకోలేరు.

## 92. సూరహ్ అల్-లైల్

## سُورَةُ اللَّيْلِ

అల్-లైల్: The Night, రాత్రి, దీనిపేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. అవతరణాక్రమంలో బహుశా ఇది తొమ్మిదవ మక్కా సూరహ్. ఇందులో **21** ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

وَٱلَّيْلِ إِذَا يَغْشَىٰ ﴿١﴾

**1**. క్రమ్ముకొనే రాత్రి సాక్షిగా!

وَٱلنَّهَارِ إِذَا تَجَلَّىٰ ﴿٢﴾

**2**. ప్రకాశించే పగటి సాక్షిగా!

وَمَا خَلَقَ ٱلذَّكَرَ وَٱلْأُنثَىٰٓ ﴿٣﴾

**3**. మరియు మగ మరియు ఆడ (జాతులను) సృష్టించిన ఆయన (ప్రభువు) సాక్షిగా!

إِنَّ سَعْيَكُمْ لَشَتَّىٰ ﴿٤﴾

**4**. వాస్తవానికి, మీ ప్రయత్నాలు నానావిధాలుగా ఉన్నాయి;[1]

فَأَمَّا مَنْ أَعْطَىٰ وَٱتَّقَىٰ ﴿٥﴾

**5**. కావున ఎవడైతే (దాన ధర్మాలు) చేస్తూ దైవభీతి కలిగి ఉంటాడో!

وَصَدَّقَ بِٱلْحُسْنَىٰ ﴿٦﴾

**6**. మరియు మంచిని నమ్ముతాడో![2]

فَسَنُيَسِّرُهُۥ لِلْيُسْرَىٰ ﴿٧﴾

**7**. అతనికి మేము మేలు కొరకు దారిని సులభం చేస్తాము.[3]

وَأَمَّا مَنۢ بَخِلَ وَٱسْتَغْنَىٰ ﴿٨﴾

**8**. కాని ఎవడైతే పిసినారితనం చేస్తూ, నిర్లక్ష్యవైఖరిని అవలంబిస్తాడో![4]

وَكَذَّبَ بِٱلْحُسْنَىٰ ﴿٩﴾

**9**. మరియు మంచిని అబద్ధమని తిరస్కరిస్తాడో!

---

**1**. చూడండి, 91:8.

**2**. వ్యాఖ్యాతల అభిప్రాయంలో ఈ ఆయత్ అబూబక్ర్ 'సిద్దీఖ్ (ర'ది.'అ.)ను గురించి అవతరింపజేయబడింది. అతను ఆరుమంది బానిసలకు స్వాతంత్ర్యం ఇప్పించారు. వారు తమ ముష్రిక్ నాయకుల విపరీత బాధలకు గురిఅయి ఉండిరి. (ఫత్హ్ అల్-ఖదీర్).

**3**. చూడండి, 87:8.

**4**. చూడండి, 96:6-7.

**10**. అతనికి మేము చెడుకొరకు దారిని సులభం చేస్తాము.

**11**. మరియు అతడు నశించిపోయి నప్పుడు, అతని ధనం అతనికి ఎలా ఉపయోగపడుతుంది!

**12**. నిశ్చయంగా, సన్మార్గం చూపడం మా పని!

**13**. మరియు నిశ్చయంగా, ఇహపరలోకాల (ఆధిపత్యం) మాకే చెందినది.

**14**. కాబట్టి నేను మిమ్మల్ని ప్రజ్వలించే నరకాగ్నిని గురించి హెచ్చరించాను.

**15**. పరమ దౌర్భాగ్యుడు తప్ప, మరెవ్వడూ అందులో కాలడు!

**16**. ఎవడైతే (సత్యాన్ని) తిరస్కరించి (దాని నుండి) విముఖుడవుతాడో!

**17**. కాని దైవభీతి గలవాడు దాని నుండి (ఆ నరకాగ్నినుండి) దూరంగా ఉంచబడతాడు!

**18**. అతడే! ఎవడైతే, పవిత్రుడవటానికి తన ధనం నుండి (ఇతరులకు) ఇస్తాడో!

**19**. కాని అది, వారు అతనికి చేసిన ఏ ఉపకారానికి బదులుగా గాక;

**20**. కేవలం మహోన్నతుడైన తన ప్రభువు ప్రసన్నతను పొందడానికి మాత్రమే అయితే!

**21**. మరియు అలాంటి వాడే తప్పక సంతోషిస్తాడు.[1]

*****

فَسَنُيَسِّرُهُۥ لِلْعُسْرَىٰ ﴿١٠﴾

وَمَا يُغْنِى عَنْهُ مَالُهُۥٓ إِذَا تَرَدَّىٰٓ ﴿١١﴾

إِنَّ عَلَيْنَا لَلْهُدَىٰ ﴿١٢﴾

وَإِنَّ لَنَا لَلْءَاخِرَةَ وَٱلْأُولَىٰ ﴿١٣﴾

فَأَنذَرْتُكُمْ نَارًا تَلَظَّىٰ ﴿١٤﴾

لَا يَصْلَىٰهَآ إِلَّا ٱلْأَشْقَى ﴿١٥﴾

ٱلَّذِى كَذَّبَ وَتَوَلَّىٰ ﴿١٦﴾

وَسَيُجَنَّبُهَا ٱلْأَتْقَى ﴿١٧﴾

ٱلَّذِى يُؤْتِى مَالَهُۥ يَتَزَكَّىٰ ﴿١٨﴾

وَمَا لِأَحَدٍ عِندَهُۥ مِن نِّعْمَةٍ تُجْزَىٰٓ ﴿١٩﴾

إِلَّا ٱبْتِغَآءَ وَجْهِ رَبِّهِ ٱلْأَعْلَىٰ ﴿٢٠﴾

وَلَسَوْفَ يَرْضَىٰ ﴿٢١﴾

1 . మరొక తాత్పర్యం: "మరియు త్వరలోనే అల్లాహ్ (సు.తా.) కూడా (అతనితో) సంతుష్టుడౌతాడు."

## 93. సూరహ్ అ'ద్-'దు'హా

## سُورَةُ الضُّحَى

అ'ద్-'దు'హా: **ఎండ, పగలు, పగటి కాంతి,** పూర్వాహ్ణం, The Forenoon, సూర్యోదయం తరువాత మధ్యాహ్నం వరకు ఉండే కాలం. సూరహ్ అల్-ఫ'జ్ర్ (89) తరువాత ఈ సూరహ్ అవతరింపజేయబడిందని వ్యాఖ్యాతలు అంటారు. దీని పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది మొదటి **మక్కా** కాలపు సూరహ్. ఇందులో **11 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1**. ప్రకాశవంతమైన ప్రొద్దుటి పూట (పూర్వాహ్ణం) సాక్షిగా!

وَٱلضُّحَىٰ ۝١

**2**. మరియు చీకటి పడ్డ రాత్రి సాక్షిగా![1]

وَٱلَّيۡلِ إِذَا سَجَىٰ ۝٢

**3**. (ఓ ము'హమ్మద్!) నీ ప్రభువు, నిన్ను త్యజించనూ లేదు మరియు నిన్ను ఉపేక్షించనూ లేదు.

مَا وَدَّعَكَ رَبُّكَ وَمَا قَلَىٰ ۝٣

**4**. మరియు రాబోయే కాలం (జీవితం) నీ కొరకు మొదటి కాలం (జీవితం) కంటే ఎంతో మేలైనది![2]

وَلَلۡأٓخِرَةُ خَيۡرٞ لَّكَ مِنَ ٱلۡأُولَىٰ ۝٤

**5**. మరియు త్వరలోనే నీ ప్రభువు నీకు (నీవు కోరేది) ప్రసాదిస్తాడు. దానితో నీవు సంతోషపడతావు.

وَلَسَوۡفَ يُعۡطِيكَ رَبُّكَ فَتَرۡضَىٰٓ ۝٥

**6**. (ఓ ము'హమ్మద్!) ఏమీ? నిన్ను అనాథునిగా[3] చూసి, ఆయన (అల్లాహ్) నీకు ఆశ్రయం కల్పించలేదా?

أَلَمۡ يَجِدۡكَ يَتِيمٗا فَـَٔاوَىٰ ۝٦

---

**1**. సజా: సకన, అంటే శాంతి నెలకొలినప్పుడు, అంటే పూర్తిగా చీకటి పడినప్పుడు. అప్పుడు నిశ్శబ్దం మరియు నెమ్మది ఉంటుంది.

**2**. అంటే పరలోక జీవితం, ఇహలోక జీవితం కంటే ఉత్తమమైనది.

**3**. దైవప్రవక్త ('స'అస) అనాథునిగా ఉంటే అల్లాహ్ (సు.తా.) అతనికి ఆశ్రయం కల్పించాడు. అతని తండ్రి అతని పుట్టుకకు కొన్ని మాసాల ముందు చనిపోయారు. తల్లి అతను 6 సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు చనిపోయింది.

وَوَجَدَكَ ضَآلًّا فَهَدَىٰ ﴿٧﴾

7. మరియు నీకు మార్గం తోచనప్పుడు, ఆయన నీకు మార్గదర్శకత్వం చేయలేదా?[1]

وَوَجَدَكَ عَآئِلًا فَأَغْنَىٰ ﴿٨﴾

8. మరియు ఆయన, పేదవానిగా చూసి, నిన్ను సంపన్నుడిగా చేయలేదా?

فَأَمَّا ٱلْيَتِيمَ فَلَا تَقْهَرْ ﴿٩﴾

9. కాబట్టి నీవు అనాథుల పట్ల కఠినంగా ప్రవర్తించకు;

وَأَمَّا ٱلسَّآئِلَ فَلَا تَنْهَرْ ﴿١٠﴾

10. మరియు యాచకుణ్ణి కసరుకోకు;

وَأَمَّا بِنِعْمَةِ رَبِّكَ فَحَدِّثْ ﴿١١﴾

11. మరియు నీ ప్రభువు అనుగ్రహాలను బహిరంగంగా ప్రకటిస్తూ ఉండు.[2] (3/4)

*****

1. ము'హమ్మద్ ('స'అస)ను ప్రవక్తగా ఎన్నుకొని అతనికి ఖుర్ఆన్ ప్రసాదించి, మార్గదర్శకత్వం చేశాడు.

2. అంటే అల్లాహ్ (సు.తా.) చేసిన అనుగ్రహాలను, ఇతరులతో చెప్పుకో - అది అల్లాహ్ (సు.తా.)కు ఇష్టమైనది - గర్వంతో కాక నమ్రతతో!

## 94. సూరహ్ అష్-షర్'హ్

## سُورَةُ الشَّرْحِ

అష్-షర్'హ్: The Opening Forth, విప్పటం, **తెరవటం**. సూరహ్ అ'ద్-'దు'హా (93) తరువాతనే ఇది కూడా అవతరింపజేయబడింది. దీని ఇతర పేర్లు సూరహ్ **అల్-ఇన్‌షిరా'హ్** మరియు సూరహ్ **అలమ్ నష్ర'హ్. మక్కా**లో అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **8 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

أَلَمْ نَشْرَحْ لَكَ صَدْرَكَ ﴿١﴾

**1**. * (ఓ ము'హమ్మద్!) ఏమీ? మేము నీ కొరకు నీ హృదయాన్ని **తెరువలేదా?**[1]

وَوَضَعْنَا عَنكَ وِزْرَكَ ﴿٢﴾

**2**. మరియు మేము నీ భారాన్ని నీ పై నుండి దించివేయ లేదా?

ٱلَّذِىٓ أَنقَضَ ظَهْرَكَ ﴿٣﴾

**3**. ఏదైతే నీ వెన్నును విరుస్తూ ఉండిందో?

وَرَفَعْنَا لَكَ ذِكْرَكَ ﴿٤﴾

**4**. మరియు నీ పేరు ప్రతిష్ఠలను పైకెత్తలేదా?[2]

---

**1**. గడచిన సూరహ్‌లో 3 **కానుకలు** పేర్కొనబడ్డాయి. ఈ సూరహ్‌లో 3 **అనుగ్రహాలు** పేర్కొనబడ్డాయి. ఎదను తెరవటం - అంటే సత్యాన్ని గ్రహించటం, జ్ఞాన జ్యోతి పొందడం. చూడండి, 6:125. అంటే మార్గదర్శకత్వాన్ని అర్థం చేసుకొని గ్రహించటం.

రెండు సార్లు దైవప్రవక్త ('స'అస) ఎద చీల్చబడిందని స. హదీసుల ద్వారా తెలుస్తుంది. ఒకసారి బాల్యంలో అప్పుడు అతని వయస్సు 4 సంవత్సరాలుంటుంది. అప్పుడు జిబ్రీల్ ('అ.స.) వచ్చి, అతని ఎదను చీల్చి అతని హృదయంలో నున్న షై'తానుకు చోటిచ్చే భాగాన్ని తీసి వేస్తారు, ('స. ముస్లిం). రెండవసారి మేరాజ్‌కు ముందు జిబ్రీల్ ('అ.స.) అతని ఎదను చీల్చి హృదయాన్ని బయటికి తీసి, 'జమ్'జమ్‌తో దానిని కడిగి పెడ్తారు. దానిని విశ్వాసం (ఈమాన్) మరియు వివేకంతో నింపుతారు. ('స'హీ'హైన్).

**2**. అంటే అల్లాహ్ (సు.తా.) పేరు వచ్చినప్పుడల్లా దైవప్రవక్త ('స'అస) పేరు వస్తుంది. ఉదా: అజా'న్‌లో, నమా'జ్‌లో వగైరా.

فَإِنَّ مَعَ ٱلْعُسْرِ يُسْرًا ﴿٥﴾

5. నిశ్చయంగా, ఎల్లప్పుడు కష్టంతో పాటు సుఖం కూడా ఉంటుంది;

إِنَّ مَعَ ٱلْعُسْرِ يُسْرًا ﴿٦﴾

6. నిశ్చయంగా కష్టంతో పాటు సుఖం కూడా ఉంటుంది.[1]

فَإِذَا فَرَغْتَ فَٱنصَبْ ﴿٧﴾

7. కావున నీకు తీరిక లభించినప్పుడు ఆరాధనలో నిమగ్నుడవైపో!

وَإِلَىٰ رَبِّكَ فَٱرْغَب ﴿٨﴾

8. మరియు నీ ప్రభువునందే ధ్యానం నిలుపు.

*****

1. కష్టాల తరువాత దైవప్రవక్త ('స'అస) మరియు 'స'హాబీలు (ర'ది.'అన్హుమ్)లకు సుఖసంతోషాలు ప్రాప్తమయ్యాయి.

## 95. సూరహ్ అత్-తీన్ سُورَةُ التِّينِ

అత్-తీన్: The Fig, అత్తి, **అంజూరం**, ఇది సూరహ్ అల్-బురూజ్ (85) తరువాత అవతరింపజేయ బడింది. **మొదటి ఆయత్** నుండి దీని పేరు తీసుకోబడింది. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్, ఇది సూరహ్ అల్-'అ'స్ర్(103)ను పోలి ఉంది. అత్తి మరియు 'జైతూన్ చెట్లు ఫలస్తీన్ మరియు సీరియాలలో చాలా ఉన్నాయి. ఇందులో **8 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1**. **అంజూరం (అత్తి)** మరియు 'జైతూన్ సాక్షిగా!

وَٱلتِّينِ وَٱلزَّيۡتُونِ ١

**2**. సీనాయ్ ('తూర్) కొండ సాక్షిగా![1]

وَطُورِ سِينِينَ ٢

**3**. ఈ శాంతి నగరం (మక్కా) సాక్షిగా![2]

وَهَٰذَا ٱلۡبَلَدِ ٱلۡأَمِينِ ٣

**4**. వాస్తవంగా! మేము మానవుడిని సర్వశ్రేష్ఠమైన ఆకారంలో సృష్టించాము.[3]

لَقَدۡ خَلَقۡنَا ٱلۡإِنسَٰنَ فِيٓ أَحۡسَنِ تَقۡوِيمٖ ٤

**5**. తరువాత మేము అతన్ని దిగజార్చి అధమాతి అధమమైన స్థితికి మార్చాము.

ثُمَّ رَدَدۡنَٰهُ أَسۡفَلَ سَٰفِلِينَ ٥

**6**. కాని విశ్వసించి, సత్కార్యాలు చేసేవారు తప్ప! ఎందుకంటే అలాంటి వారికి అంతులేని ప్రతిఫలం ఉంది.

إِلَّا ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ فَلَهُمۡ أَجۡرٌ غَيۡرُ مَمۡنُونٖ ٦

**7**. అయితే, (ఓ మానవుడా!) దీని తరువాత గూడా నీవు ఎందుకు ప్రతిఫలదినాన్ని తిరస్కరిస్తున్నావు?

فَمَا يُكَذِّبُكَ بَعۡدُ بِٱلدِّينِ ٧

**8**. ఏమీ? అల్లాహ్ న్యాయాధిపతులలో కెల్లా సర్వోత్తమ న్యాయాధిపతి కాడా?

أَلَيۡسَ ٱللَّهُ بِأَحۡكَمِ ٱلۡحَٰكِمِينَ ٨

---

**1**. ఈ తూర్ పర్వతం మీదనే అల్లాహ్ (సు.తా.) మూసా ('అ.స.)తో సంభాషించాడు.

**2**. ఈ శాంతి నగరం అంటే మక్కా ముకర్రమా చూడండి, 2:126. ఇందులో యుద్ధం చేయటం నిషేధించబడింది. ఇందులో ప్రవేశించిన వానికి శాంతి, భద్రతలు లభిస్తాయి. కొందరి అభిప్రాయం ప్రకారం ఇది మూడు చోట్లను సూచిస్తుంది. (1) 'తూర్ పర్వతం- మూసా ('అ.స.)ను ప్రవక్తగా ఎన్నుకోబడ్డ స్థలం, (2) బైతుల్ ముఖద్దస్-'ఈసా ('అ.స.) పుట్టి ప్రవక్తగా ఎన్నుకోబడ్డ స్థలం, (3) మక్కా ముకర్రమా - ము'హమ్మద్ ('స'అస) పుట్టి ప్రవక్తగా ఎన్నుకోబడ్డ స్థలం. (ఇబ్నె-కసీ'ర్). మక్కా ప్రస్తావనకు ఇంకా చూడండి, 48:24.

**3**. చూడండి, 91:7, 87:2 మరియు 75:38.

## 96. సూరహ్ అల్-'అలఖ్ سُورَةُ العَلَقِ

అల్-'అలఖ్: The Germ Cell, The Clot, పిండం, జీవకణం, **రక్తముద్ద**, జలగ, దీని మరొక పేరు సూరహ్ **అల్-ఇఖ్‌రఅ'**, **చదువు**, పఠించు, దీని మొదటి ఐదు ఆయత్‌లతో దివ్యజ్ఞాన (ఖుర్ఆన్) అవతరణ ప్రారంభమయ్యింది. ఇవి రమ'దాన్ నెల చివరి పది రోజులలో ప్రస్థానానికి (హిజ్రత్‌కు) 13 సంవత్సరాలకు ముందు, (610వ క్రీస్తు శకం)లో దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) 40 సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు, నూర్ పర్వతం మీద, 'హిరా గుహలో అవతరింపజేయబడ్డాయి. మిగతా ఆయత్‌లు (6-19), ఈ మొదటి వ'హీ అవతరింపజేయబడిన కొంత కాలం (ఫత్‌రతుల్ వ'హీ) తరువాత అవతరింప జేయబడ్డాయి. **19 ఆయతుల** ఈ సూరహ్ **మక్కాలో** అవతరింపజేయబడింది.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

اقْرَأْ بِاسْمِ رَبِّكَ الَّذِي خَلَقَ ﴿١﴾

**1**. చదువు! నీ ప్రభువు పేరుతో, ఆయనే (సర్వాన్ని) సృష్టించాడు![1]

خَلَقَ الْإِنسَانَ مِنْ عَلَقٍ ﴿٢﴾

**2**. ఆయనే మానవుణ్ణి రక్తముద్దతో (జీవకణంతో) సృష్టించాడు.[2]

اقْرَأْ وَرَبُّكَ الْأَكْرَمُ ﴿٣﴾

**3**. చదువు! మరియు నీ ప్రభువు పరమదాత.

---

**1**. దైవదూత జిబ్రీల్ ('అ.స.) దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) 'హిరా గుహలో దైవారాధనలో నిమగ్నులై ఉన్నప్పుడు వచ్చి అన్నారు: "చదువు!" అతను అన్నారు: "నాకు చదువురాదు!" అప్పుడు జిబ్రీలు ('అ.స.) అతనిని పట్టుకుని గట్టిగా అదిమి అన్నారు: "చదువు!" దైవప్రవక్త ('స'అస) తిరిగి అదే జవాబిచ్చారు. ఈ విధంగా అతను దైవప్రవక్త ('స'అస)ను మూడుసార్లు అదిమారు. వివరాలకు చూడండి, బద'అల్-వ'హీ, 'స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం, తిర్మిజీ', నసాయి'. ఆ తరువాత ఈ మొదటి ఐదు ఆయతులు చదివి వినిపించారు.

**2**. అల్-'అలఖతు: అంటే, The Clot of Blood, Leech like Substance, రక్తముద్ద, షిలగ, జలగ, పిండం, జీవకణం అనే అర్థాలున్నాయి.

ٱلَّذِى عَلَّمَ بِٱلْقَلَمِ ﴿٤﴾

4. ఆయన కలం ద్వారా నేర్పాడు.[1]

عَلَّمَ ٱلْإِنسَـٰنَ مَا لَمْ يَعْلَمْ ﴿٥﴾

5. మానవుడు ఎరుగని జ్ఞానాన్ని అతనికి బోధించాడు.

كَلَّآ إِنَّ ٱلْإِنسَـٰنَ لَيَطْغَىٰٓ ﴿٦﴾

6. అలాకాదు! వాస్తవానికి, మానవుడు తలబిరుసుతనంతో ప్రవర్తిస్తాడు.

أَن رَّءَاهُ ٱسْتَغْنَىٰٓ ﴿٧﴾

7. ఎందుకంటే, అతడు తనను తాను నిరపేక్షాపరుడిగా భావిస్తాడు.

إِنَّ إِلَىٰ رَبِّكَ ٱلرُّجْعَىٰٓ ﴿٨﴾

8. నిశ్చయంగా, నీ ప్రభువు వైపునకే (అందరికీ) మరలి పోవలసి ఉంది.

أَرَءَيْتَ ٱلَّذِى يَنْهَىٰ ﴿٩﴾

9. నీవు నిరోధించే వ్యక్తిని చూశావా?[2]

عَبْدًا إِذَا صَلَّىٰٓ ﴿١٠﴾

10. నమా'జ్ చేసే (అల్లాహ్) దాసుణ్ణి![3]

أَرَءَيْتَ إِن كَانَ عَلَى ٱلْهُدَىٰٓ ﴿١١﴾

11. ఒకవేళ అతను (ము'హమ్మద్!) సన్మార్గంపై ఉంటే నీ అభిప్రాయమేమిటి?

أَوْ أَمَرَ بِٱلتَّقْوَىٰٓ ﴿١٢﴾

12. ఇంకా, దైవభీతిని గురించి ఆదేశిస్తూ ఉంటే![4]

أَرَءَيْتَ إِن كَذَّبَ وَتَوَلَّىٰٓ ﴿١٣﴾

13. ఒకవేళ (ఆ నిరోధించే) వాడు[5] సత్యాన్ని తిరస్కరించే వాడు మరియు సన్మార్గం నుండి విముఖుడయ్యే వాడు అయితే!

---

1. ఖలమున్: కలం. అంటే చెక్కటం. మొదట కలమును చెక్కి తయారు చేసేవారు. మానవుని జ్ఞానంలో ఉన్నది - అతని వెంట వెళ్ళిపోతుంది. నోటితో పలికింది కూడా - దాచి పెట్టటానికి పనికి రాదు. కాని కలంతో వ్రాసి పెట్టింది చెడిపోకుండా భద్రంగా ఉంచితే చాలా కాలం వరకు ఉంటుంది. కలం వల్లనే ప్రాచీన జ్ఞానం భద్రపరచబడింది. కావున అల్లాహ్ (సు.తా.) మొట్టమొదట కలాన్ని సృష్టించి దానితో పునరుత్థానదినం వరకు సర్వసృష్టి యొక్క విధిని వ్రాయించాడు.
2. ఈ నిరోధించే వ్యక్తి అబూ-జహల్ అని చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం.
3. దాసుడు - ఇక్కడ దైవప్రవక్త ('స'అస).
4. తఖ్వా: దైవభీతి, భయభక్తి, ఖుర్ఆన్ అవతరణలో ఇక్కడ మొదటిసారి వచ్చింది. ఏక దైవత్వాన్ని దృఢంగా విశ్వసించటం, భక్తిని, ఆరాధనను కేవలం అల్లాహ్ (సు.తా.) కొరకే ప్రత్యేకించుకోవటం మరియు సత్కార్యాలు చేయటం.
5. ఈ నిరోధించే వ్యక్తి అబూ-జహల్ అని చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం.

أَلَمْ يَعْلَم بِأَنَّ ٱللَّهَ يَرَىٰ ﴿١٤﴾

14. వాస్తవానికి, అల్లాహ్ అంతా చూస్తున్నాడని అతనికి తెలియదా?

كَلَّا لَئِن لَّمْ يَنتَهِ لَنَسْفَعًۢا بِٱلنَّاصِيَةِ ﴿١٥﴾

15. అలా కాదు! ఒకవేళ అతడు మానుకోక పోతే, మేము అతడిని, నుదుటి జుట్టు వెంట్రుకలను పట్టి ఈడుస్తాము.[1]

نَاصِيَةٍ كَٰذِبَةٍ خَاطِئَةٍ ﴿١٦﴾

16. అది అబద్ధాలలో, అపరాధాలలో మునిగి వున్న నుదురు!

فَلْيَدْعُ نَادِيَهُۥ ﴿١٧﴾

17. అయితే, అతన్ని తన అనుచరులను పిలుచుకోమను!

سَنَدْعُ ٱلزَّبَانِيَةَ ﴿١٨﴾

18. మేము కూడా నరక దూతలను పిలుస్తాము!

كَلَّا لَا تُطِعْهُ وَٱسْجُدْ وَٱقْتَرِب ۩ ﴿١٩﴾

19. అలాకాదు! నీవు అతని మాట వినకు మరియు ఆయనకే (అల్లాహ్‌కే) సాష్టాంగం (సజ్దా) చెయ్యి మరియు ఆయన (అల్లాహ్) సాన్నిధ్యాన్ని పొందటానికి ప్రయత్నించు!۩

*****

1. చూడండి, 11:56.

## 97. సూరహ్ అల్-ఖద్ర్

## سُورَةُ القَدْرِ

అల్-ఖద్ర్: ఘనత, The Decree, Destiny, ఆదేశం, శాసనం, తీర్పు, భగవత్సంకల్పం, విధి, అదృష్టం, పర్యవసానం. ఈ సూరహ్ మొదటి **మక్కా** సూరహ్‌లలోనిది. దీనిపేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇందులో **5 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

إِنَّآ أَنزَلْنَٰهُ فِى لَيْلَةِ ٱلْقَدْرِ ﴿١﴾

**1**. నిశ్చయంగా, మేము దీనిని (ఈ ఖుర్ఆన్‌ను)[1] ఘనతగల ఆ రాత్రి (అల్-ఖద్ర్)లో అవతరింపజేశాము.[2]

وَمَآ أَدْرَىٰكَ مَا لَيْلَةُ ٱلْقَدْرِ ﴿٢﴾

**2**. మరియు ఆ ఘనతగల రాత్రి అంటే ఏమిటో నీకేంతెలుసు?

لَيْلَةُ ٱلْقَدْرِ خَيْرٌ مِّنْ أَلْفِ شَهْرٍ ﴿٣﴾

**3**. ఆ ఘనతగల రాత్రి వేయినెలల కంటే శ్రేష్ఠమైనది.[3]

تَنَزَّلُ ٱلْمَلَٰٓئِكَةُ وَٱلرُّوحُ فِيهَا بِإِذْنِ رَبِّهِم مِّن كُلِّ أَمْرٍ ﴿٤﴾

**4**. ఆ రాత్రిలో దేవదూతలు మరియు ఆత్మ(జిబ్రీల్),[4] తమ ప్రభువు అనుమతితో, ప్రతి (వ్యవహారానికి సంబంధించిన) ఆజ్ఞలు తీసుకుని దిగివస్తారు.

سَلَٰمٌ هِىَ حَتَّىٰ مَطْلَعِ ٱلْفَجْرِ ﴿٥﴾

**5**.ఆ రాత్రిలో తెల్లవారే వరకు శాంతి వర్ధిల్లుతుంది. *****

---

**1**. ఈ రాత్రి రమ'దాన్ నెలలోని చివరి 10 రోజుల బేసీ రాత్రులలో ఒకటని, చాలా 'హదీస్'లు ఉన్నాయి. ఈ రాత్రిలో పూర్తి సంవత్సరపు తీర్మానాలు తీసుకోబడతాయి. ఈ రాత్రిలో చాలా మంది దైవదూత('అలైహిమ్ స.)లు దిగుతారు. చూడండి, 2:185.

**2**. ఏడవ ఆకాశంపైన ఉండే లౌ'హె మ'హ్ఫూ''జ్ నుండి మొదటి ఆకాశంలో ఉండే బైతుల్ 'ఇ'జ్జహ్‌లో దివ్యఖుర్ఆన్ ఈ ఖద్ర్ రాత్రిలో అవతరింపజేయబడింది. (ఇబ్నె-కసీ'ర్).

**3**. ఈ రాత్రిలో చేసే ఆరాధన విలువ, వేయి నెలల ఆరాధన కంటే ఎక్కువ. అంటే 83 సంవత్సరాలు మరియు 4 నెలలు.

**4**. అర్-రూ'హు: ఖుర్ఆన్ అవతరణా క్రమంలో ఇక్కడ మొదటి సారి వచ్చింది. చూడండి, 19:17, మరియు 78:38. అర్-రూ'హు ఈ మూడు చోట్లలో జిబ్రీల్ ('అ.స.) కొరకు వాడబడింది. ఇంకా చూడండి, 19:17 వ్యాఖ్యానం 1.

## 98. సూరహ్ అల్-బయ్యినహ్

## سُورَةُ البَيِّنَةِ

అల్-బయ్యినహ్: The Clear Evidence, స్పష్టమయిన సూచన, స్పష్టమైన ప్రమాణం, నిదర్శనం. ఈ సూరహ్ పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది బహుశా మొదటి హి(జీలో అవతరింపజేయబడింది. దీని మరొక పేరు సూరహ్ **లమ్‌యకున్.** **మదీనాలో** అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **8 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

لَمْ يَكُنِ ٱلَّذِينَ كَفَرُوا۟ مِنْ أَهْلِ ٱلْكِتَٰبِ وَٱلْمُشْرِكِينَ مُنفَكِّينَ حَتَّىٰ تَأْتِيَهُمُ ٱلْبَيِّنَةُ ①

**1**. ఎంతవరకైతే స్పష్టమైన నిదర్శనం రాదో! అంతవరకు సత్యతిరస్కారులైన పూర్వ గ్రంథప్రజలు మరియు బహుదైవారాధకులు (తమ సత్య తిరస్కారాన్ని) మానుకునేవారు కారు![1]

رَسُولٌ مِّنَ ٱللَّهِ يَتْلُوا۟ صُحُفًا مُّطَهَّرَةً ②

**2**. అల్లాహ్ తరఫునుండి వచ్చిన సందేశహరుడు,[2] వారికి పవిత్ర గ్రంథ పుటలను వినిపిస్తున్నాడు.[3]

فِيهَا كُتُبٌ قَيِّمَةٌ ③

**3**. అందులో సమంజసమైన వ్రాతలు (సత్యోపదేశాలు) ఉన్నాయి.[4]

وَمَا تَفَرَّقَ ٱلَّذِينَ أُوتُوا۟ ٱلْكِتَٰبَ إِلَّا مِنۢ بَعْدِ مَا جَآءَتْهُمُ ٱلْبَيِّنَةُ ④

**4**. మరియు స్పష్టమైన సూచన వచ్చిన తర్వాతనే గ్రంథ ప్రజలు భేదాభిప్రాయాలలో పడ్డారు.[5]

---

**1**. అంటే అల్లాహ్ (సు.తా.) తరఫు నుండి ఒక సందేశహరుడు వచ్చి సరయిన, సమంజసమైన విషయాలు వ్రాయబడిన పరిశుద్ధ పుటలు చదివి విన్పించనంత వరకు వారు మానుకోరు.
**2**. ముహమ్మద్ (స'అస).
**3**. ఖుర్ఆన్.
**4**. ధర్మశాసనాలు.
**5**. దైవప్రవక్త (స'అస) రానున్నాడని వారి గ్రంథాలలో వ్రాయబడి ఉంది. ఆ ప్రవక్త (స'అస) అరబ్బులలో వచ్చాడని గ్రంథప్రజలు అసూయపడి అతనిని తిరస్కరించారు. చూడండి, 3:19.

5. మరియు వారికి ఇచ్చిన ఆదేశం: వారు అల్లాహ్‌నే ఆరాధించాలని, పూర్తి ఏకాగ్రచిత్తంతో[1] తమ ధర్మాన్ని (భక్తిని) కేవలం ఆయన కొరకే ప్రత్యేకించుకోవాలని, నమా'జ్‌ను స్థాపించాలని మరియు 'జకాత్ ఇవ్వాలని. ఇదే సరైన ధర్మము.

وَمَآ أُمِرُوٓاْ إِلَّا لِيَعۡبُدُواْ ٱللَّهَ مُخۡلِصِينَ لَهُ ٱلدِّينَ حُنَفَآءَ وَيُقِيمُواْ ٱلصَّلَوٰةَ وَيُؤۡتُواْ ٱلزَّكَوٰةَۚ وَذَٰلِكَ دِينُ ٱلۡقَيِّمَةِ ٥

6. నిశ్చయంగా, సత్యతిరస్కారులైన గ్రంథప్రజలు మరియు బహుదైవారాధకులు, నరకాగ్నిలోకి పోతారు. వారందులో శాశ్వతంగా ఉంటారు. ఇలాంటి వారే, సృష్టిలో అత్యంత నికృష్ట జీవులు.[2]

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ مِنۡ أَهۡلِ ٱلۡكِتَٰبِ وَٱلۡمُشۡرِكِينَ فِي نَارِ جَهَنَّمَ خَٰلِدِينَ فِيهَآۚ أُوْلَٰٓئِكَ هُمۡ شَرُّ ٱلۡبَرِيَّةِ ٦

7. నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసేవారు, వారే సృష్టిలో అత్యంత ఉత్కృష్ట జీవులు.

إِنَّ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ أُوْلَٰٓئِكَ هُمۡ خَيۡرُ ٱلۡبَرِيَّةِ ٧

8. వారికి తమ ప్రభువు నుండి లభించే ప్రతిఫలం శాశ్వతమైన స్వర్గవనాలు. వాటిలో క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి. వారు, వాటిలో శాశ్వతంగా కలకాలముంటారు. అల్లాహ్ వారితో ప్రసన్నుడవుతాడు[3] మరియు వారు ఆయనతో సంతుష్టులవుతారు. ఇదే తన ప్రభువుకు భయపడే వ్యక్తికి లభించే ప్రతిఫలం. *****

جَزَآؤُهُمۡ عِندَ رَبِّهِمۡ جَنَّٰتُ عَدۡنٖ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُ خَٰلِدِينَ فِيهَآ أَبَدٗاۖ رَّضِيَ ٱللَّهُ عَنۡهُمۡ وَرَضُواْ عَنۡهُۚ ذَٰلِكَ لِمَنۡ خَشِيَ رَبَّهُۥ ٨

---

1. 'హనీఫన్: వాలు, వంగు, మొగ్గు, ఒక వైపునకు మొగ్గటం ఏకాగ్రచిత్తం, ఏకదైవ సిద్ధాంతం. అంటే షిర్క్ నుండి తౌ'హీద్‌కు, బహుదైవారాధన నుండి ఏక దైవారాధన వైపునకు మరలటం. ఉదా: ఇబ్రాహీమ్ ('అ.స.) చేసినట్లు ఏకదైవారాధన మరియు సత్యధర్మాన్ని అనుసరించటం.

2. ఇది అల్లాహ్ (సు.తా.) ప్రవక్త ('అలైహిమ్ స.)లను మరియు ఆయన గ్రంథాలను తిరస్కరించే వారి గతి. వారు అతి అధమమైన జీవులుగా పేర్కొనబడ్డారు.

3. చూడండి 9:72.

## 99. సూరహ్ అ'జ్-'జల్'జలహ్ — سُورَةُ الزَّلْزَلَةِ

అ'జ్-'జల్'జలహ్: The Earthquake, భూకంపం, ఇది సూరహ్ అ'జ్-'జిల్'జాల్ అని కూడా అనబడుతుంది. ఇది మొదటి మదీనా కాలంలో అవతరింపజేయబడింది. ఇందులో **8** ఆయతులున్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

إِذَا زُلْزِلَتِ ٱلْأَرْضُ زِلْزَالَهَا ﴿١﴾

**1**. భూమి తన అతి తీవ్రమైన (అంతిమ) భూకంపంతో కంపింపజేయబడినప్పుడు![1]

وَأَخْرَجَتِ ٱلْأَرْضُ أَثْقَالَهَا ﴿٢﴾

**2**. మరియు భూమి తన భారాన్నంతా తీసి బయట పడవేసినప్పుడు![2]

وَقَالَ ٱلْإِنسَٰنُ مَا لَهَا ﴿٣﴾

**3**. మరియు మానవుడు: "దీనికి ఏమయింది?" అని అన్నప్పుడు.

يَوْمَئِذٍ تُحَدِّثُ أَخْبَارَهَا ﴿٤﴾

**4**. ఆ రోజు అది తన సమాచారాలను వివరిస్తుంది.[3]

بِأَنَّ رَبَّكَ أَوْحَىٰ لَهَا ﴿٥﴾

**5**. ఎందుకంటే, నీ ప్రభువు దానిని ఆదేశించి ఉంటాడు.

يَوْمَئِذٍ يَصْدُرُ ٱلنَّاسُ أَشْتَاتًا لِّيُرَوْا۟ أَعْمَٰلَهُمْ ﴿٦﴾

**6**. ఆరోజు ప్రజలు తమతమ కర్మలు చూపించబడటానికి వేర్వేరు గుంపులలో వెళ్తారు.

---

**1**. ఇది మొదటి సారి బాకా ఊదబడినప్పుడు సంభవిస్తుంది.

**2**. ఇది రెండవసారి బాకా ఊదబడినప్పుడు జరుగుతుంది. ఆ రోజు భూమి తనలో పాతబడిన వారినంతా బయటవేస్తుంది. వారంతా సజీవులై లేచి బయటికి వస్తారు.

**3**. దాని సమాచారాలు ఇలా ఉంటాయి, దైవప్రవక్త ('స'అస) అన్నారు: "ప్రతివ్యక్తి భూమిపై చేసిన కర్మలన్నింటికీ, అది సాక్ష్య మిస్తుంది: 'ఈ ఈ వ్యక్తి ఈ ఈ కర్మలు, ఈ ఈ రోజులలో చేశాడని, తెలుపుతుంది.' " (తిర్మిజీ', ముస్నద్ అ'హ్మద్-2/374).

فَمَن يَعۡمَلۡ مِثۡقَالَ ذَرَّةٍ خَيۡرٗا يَرَهُۥ ۝٧

7. అప్పుడు, ప్రతివాడు తాను రవ్వంత (పరమాణువంత) మంచిని చేసి ఉన్నా దానిని చూసుకుంటాడు.[1]

وَمَن يَعۡمَلۡ مِثۡقَالَ ذَرَّةٖ شَرّٗا يَرَهُۥ ۝٨

8. మరియు అలాగే, ప్రతివాడు తాను రవ్వంత (పరమాణువంత) చెడును చేసి ఉన్నా దానిని చూసుకుంటాడు.

*****

1. జ'ర్రతున్: దీనికి వేర్వేరు వ్యాఖ్యానాలు ఇవ్వబడ్డాయి. 1) చీమకంటే చిన్న వస్తువు - షౌకానీ. 2) మానవుడు భూమిపై చెయ్యికొట్టి పైకి లేపిన తరువాత దానికి అంటుకునే దుమ్ము. 3) ఒక రంధ్రం నుండి వచ్చే సూర్యకిరణాలలో తేలియాడుతూ కనిపించే ధూళి. 4) పరమాణువు.

## 100. సూరహ్ అల్-'ఆదియాత్

## سُورَةُ العَادِيَاتِ

అల్-'ఆదియాత్: **యుద్ధాశ్వాలు**, The Chargers, Those That Run, వడిగా **పరిగెత్తే గుర్రాలు**. ఇది సూరహ్ అల్-'అ'స్ర్ (103) తరువాత, మొదటి మక్కా కాలంలో అవతరింపజేయబడింది. ఇందులో **11 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

وَٱلْعَٰدِيَٰتِ ضَبْحًا ﴿١﴾

**1**. వగర్చుతూ **పరిగెత్తే గుర్రాల** సాక్షిగా![1]

فَٱلْمُورِيَٰتِ قَدْحًا ﴿٢﴾

**2**. తమ ఖురాల తట్టులతో అగ్నికణాలు లేపేవాటి;[2]

فَٱلْمُغِيرَٰتِ صُبْحًا ﴿٣﴾

**3**. తెల్లవారుఝాముగ దాడిచేసే వాటి;[3]

فَأَثَرْنَ بِهِۦ نَقْعًا ﴿٤﴾

**4**. (మేఘాల వంటి) దుమ్ము లేపుతూ,[4]

فَوَسَطْنَ بِهِۦ جَمْعًا ﴿٥﴾

**5**. (శత్రువుల) సమూహంలోకి దూరి పోయే వాటి.

إِنَّ ٱلْإِنسَٰنَ لِرَبِّهِۦ لَكَنُودٌ ﴿٦﴾

**6**. నిశ్చయంగా, మానవుడు తన ప్రభువు పట్ల ఎంతో కృతఘ్నుడు.[5]

وَإِنَّهُۥ عَلَىٰ ذَٰلِكَ لَشَهِيدٌ ﴿٧﴾

**7**. మరియు నిశ్చయంగా, దీనికి స్వయంగా అతడే సాక్షి.

---

**1**. 'దబ్'హన్: వగర్చుతూ.

**2**. అల్-మూరియాతు: అగ్నికణాలు లేపే! ఖద్'హున్: ఖురాల తట్టులు.

**3**. అల్-ము'గీరాతు: దాడి చేసేవాటి.

**4**. అసా'ర: లేపుట, నఖ్'అన్: దుమ్ము.

**5**. కనూదున్: అంటే కఫూరున్, కృతఘ్నుడు.

وَإِنَّهُۥ لِحُبِّ ٱلْخَيْرِ لَشَدِيدٌ ﴿٨﴾

8. మరియు నిశ్చయంగా, అతడు సిరిసంపదల వ్యామోహంలో పూర్తిగా మునిగిఉన్నాడు. (7/8)

۞ أَفَلَا يَعْلَمُ إِذَا بُعْثِرَ مَا فِى ٱلْقُبُورِ ﴿٩﴾

9. * ఏమిటి? అతనికి తెలియదా? గోరీలలో ఉన్నదంతా పెళ్ళగించి బయటికి తీయబడినప్పుడు;[1]

وَحُصِّلَ مَا فِى ٱلصُّدُورِ ﴿١٠﴾

10. మరియు (మానవుల) హృదయాలలోని విషయాలన్నీ వెల్లడి చేయబడినప్పుడు;

إِنَّ رَبَّهُم بِهِمْ يَوْمَئِذٍ لَّخَبِيرٌۢ ﴿١١﴾

11. నిశ్చయంగా, ఆ రోజున వారి ప్రభువు వారి గురించి అంతా తెలుసుకొని ఉంటాడని!

*****

1. అంటే గోరీలలో ఉన్న శవాలను సజీవులుగా చేసి లేపి సమావేశపరచబడినప్పుడు.

## 101. సూరహ్ అల్-ఖారి'అహ్

## سُورَةُ القَارِعَةِ

అల్-ఖారి'అహ్: ఉపద్రవం, The Sudden Calamity, The Striking Hour, దుర్ఘటన, విపత్తు. మొదటి మక్కా కాలపు ఈ సూరహ్. బహుశా సూరహ్ అత్-తీన్ (95) తరువాత అవతరింపజేయబడింది. ఇందులో **11 ఆయతులు** ఉన్నాయి.

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**1**. ఆ! అదరగొట్టే మహా ఉపద్రవం![1]

ٱلْقَارِعَةُ ﴿١﴾

**2**. ఏమిటా అదరగొట్టే మహా ఉపద్రవం?

مَا ٱلْقَارِعَةُ ﴿٢﴾

**3**. మరియు ఆ అదరగొట్టే మహా ఉపద్రవం, అంటేఏమిటో నీకేం తెలుసు!

وَمَآ أَدْرَىٰكَ مَا ٱلْقَارِعَةُ ﴿٣﴾

**4**. ఆ రోజు మానవులు చెల్లాచెదురైన చిమ్మెటలవలే అయిపోతారు.[2]

يَوْمَ يَكُونُ ٱلنَّاسُ كَٱلْفَرَاشِ ٱلْمَبْثُوثِ ﴿٤﴾

**5**. మరియు పర్వతాలు రంగురంగుల ఏకిన దూదివలే అయిపోతాయి.[3]

وَتَكُونُ ٱلْجِبَالُ كَٱلْعِهْنِ ٱلْمَنفُوشِ ﴿٥﴾

**6**. అప్పుడు ఎవడి త్రాసు పళ్ళాలు (సత్కార్యాలతో) బరువుగా ఉంటాయో![4]

فَأَمَّا مَن ثَقُلَتْ مَوَٰزِينُهُۥ ﴿٦﴾

---

**1**. అల్-ఖారి'అతు: అంటే హృదయాలను అదరగొట్టేది, పునరుత్థాన దినపు పేర్లలో ఒకటి. చూడండి. 14:48, 20:105-107. దాని ఇతర పేర్లు *(1) అల్-'హాఖ్ఖతు, (2) అత్తామ్మతు, (3) అస్సాఖ్ఖతు, (4) అల్-'గాషియతు, (5) అస్సా'అతు, (6) అల్-వాఖి'అతు, (7) అల్-ఖారి'అతు.*

**2**. అల్-ఫరాషు: Moth, *Lepidoptira,* రాత్రులలో తిరిగే చిన్న పురుగు, చిమ్మెట, దీపపు పురుగు.

**3**. అల్-'ఇహ్నున్: రంగురంగుల. అల్-మన్ఫూష్: ఏకిన దూది.

**4**. చూడండి, 7:8, 18:105, 21:47 సత్కార్యాల త్రాసుపళ్ళెం బరువైనదిగా ఉంటుంది.

فَهُوَ فِي عِيشَةٍ رَّاضِيَةٍ ۞٧

7. అతడు (స్వర్గంలో) సుఖవంతమైన జీవితం గడుపుతాడు.

وَأَمَّا مَنْ خَفَّتْ مَوَٰزِينُهُۥ ۞٨

8. మరియు ఎవడి (సత్కార్యాల) త్రాసు పళ్ళాలు తేలికగా ఉంటాయో![1]

فَأُمُّهُۥ هَاوِيَةٌ ۞٩

9. అతని నివాసం అధఃపాతాళమే![2]

وَمَآ أَدْرَىٰكَ مَا هِيَهْ ۞١٠

10. మరియు అది ఏమిటో నీకేం తెలుసు?

نَارٌ حَامِيَةٌۢ ۞١١

11. అదొక భగభగమండే అగ్ని (గుండం).[3]

*****

1. ఎవరి సత్కార్యాల పళ్ళెం తేలికగా మరియు పాపాల పళ్ళెం బరువుగా ఉంటుందో!

2. అల్-హావియహ్: నరకపు ఒకపేరు. ఉమ్మున్: తల్లి, శరణమిచ్చేది.

3. 'హామియతున్: నరకాగ్ని. మానవులు రగిల్చే అగ్ని కంటే నరకాగ్ని డెబ్భైరెట్లు అధికంగా మండుతూ ఉంటుంది, ('స. బు'ఖారీ, 'స. ముస్లిం).

## 102. సూరహ్ అత్-తకాసు'ర్

## سُورَةُ التَّكَاثُرِ

అత్-తకాసు'ర్: పేరాస, Greed for more, The Piling up. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఇది మానవుని ఎడతెగని పేరాసను ఖండిస్తోంది. ఇందులో **8 ఆయతులు** ఉన్నాయి.

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**1.** (ఇహలోక) పేరాస మిమ్మల్ని ఏమరుపాటులో పడవేసింది;[1]

أَلْهَىٰكُمُ ٱلتَّكَاثُرُ ﴿١﴾

**2.** మీరు గోరీలలోకి చేరేవరకు.[2]

حَتَّىٰ زُرْتُمُ ٱلْمَقَابِرَ ﴿٢﴾

**3.** అలాకాదు! త్వరలోనే మీరు తెలుసు కుంటారు!

كَلَّا سَوْفَ تَعْلَمُونَ ﴿٣﴾

**4.** మరొక సారి (వినండి)! వాస్తవంగా, మీరు అతిత్వరలోనే తెలుసుకుంటారు![3]

ثُمَّ كَلَّا سَوْفَ تَعْلَمُونَ ﴿٤﴾

**5.** ఎంత మాత్రము కాదు! ఒక వేళ మీరు నిశ్చిత జ్ఞానంతో తెలుసుకొని ఉంటే (మీ వైఖరి ఇలా ఉండేది కాదు).

كَلَّا لَوْ تَعْلَمُونَ عِلْمَ ٱلْيَقِينِ ﴿٥﴾

**6.** నిశ్చయంగా, మీరు భగభగ మండే నరకాగ్నిని చూడగలరు!

لَتَرَوُنَّ ٱلْجَحِيمَ ﴿٦﴾

**7.** మళ్ళీ అంటున్నాను! మీరు తప్పక దాని (నరకాగ్ని)ని నిస్సంకోచమైన దృష్టితో చూడ గలరు!

ثُمَّ لَتَرَوُنَّهَا عَيْنَ ٱلْيَقِينِ ﴿٧﴾

**8.** అప్పుడు, ఆ రోజు మీరు, (ఈ జీవితంలో అనుభవించిన) సౌఖ్యాలను గురించి తప్పక ప్రశ్నించబడతారు![4]

ثُمَّ لَتُسْـَٔلُنَّ يَوْمَئِذٍ عَنِ ٱلنَّعِيمِ ﴿٨﴾

---

**1.** అల్‌హా *(యుల్‌హీ):* ఏమరుపాటులో వేసింది. తకాసు'రున్*:* ఎక్కువ పొందాలనే పేరాస అంటే ధనధాన్యాల కొరకు, పిల్లల కొరకు, బలం, ప్రభుత్వం పేరు ప్రతిష్ఠల కొరకు చేసే పేరాస.

**2.** ఆ పేరాస కోసం ప్రయత్నిస్తూనే మీరు గోరీలలోకి చేరిపోతారు.

**3.** ఈ పేరాస మంచిది కాదని.

**4.** అప్పుడు అల్లాహ్ (సు.తా.) అనుగ్రహాలను ధనసంపత్తులను మంచి కొరకు ఉపయోగించిన వారు స్వర్గవాసులవుతారు. వాటిని దుష్టప్రయోజనాలకు వినియోగించిన వారు నరకాగ్ని పాలవుతారు.

## 103. సూరహ్ అల్-'అ'స్ర్

## سُورَةُ العَصْرِ

అల్-'అ'స్ర్: The Time, **కాలం.** దీనిపేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది మొదటి **మక్కా** కాలపు సూరహ్. చెడుకు పర్యవసానం చెడు. గడిచిపోయిన కాలం మళ్ళీ చేజిక్కదు. కావున విశ్వసించి, సత్కార్యాలు చేస్తూ, సత్యాన్ని మరియు సహనాన్ని పాటిస్తూ ఒకరి కొకరు బోధించుకునే వారే సాఫల్యం పొందుతారు. ఇది **3 ఆయతులు** ఉన్న 3 సూరహ్‌లలో ఒకటి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1.** కాలం ('అ'స్ర్) సాక్షిగా![1]

وَٱلۡعَصۡرِ ١

**2.** నిశ్చయంగా, మానవుడు నష్టంలో ఉన్నాడు![2]

إِنَّ ٱلۡإِنسَٰنَ لَفِي خُسۡرٍ ٢

**3.** కాని విశ్వసించి, సత్కార్యాలు చేసే వారు మరియు ఒకరికొకరు సత్యాన్ని బోధించుకునే వారు మరియు ఒకరికొకరు సహనాన్ని (స్థైర్యాన్ని) బోధించుకునేవారు తప్ప![3]

إِلَّا ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ وَتَوَاصَوۡاْ بِٱلۡحَقِّ وَتَوَاصَوۡاْ بِٱلصَّبۡرِ ٣

*****

1. అల్లాహ్ (సు.తా.) తాను కోరిన దాని సాక్ష్యం తీసుకుంటాడు. కాని మానవుడు అల్లాహ్ (సు.తా.) తప్ప మరెవ్వరి సాక్ష్యం తీసుకోరాదు.

2. ఆ మానవుడు, ఎవడైతే విశ్వసించడో మరియు సత్కార్యాలు చేయడో. తన కాలాన్ని వృథా కాలక్షేపంలో, నిషేధించిన పనులు చేయటంలో పేరాసతో గడుపుతాడో! అలాంటి వాడు పరలోకంలో నరకాగ్నికి ఇంధనం అవుతాడు.

3. ఇలాంటి నష్టం నుండి తప్పించుకోగల వారు ఎవరంటే: ఒకే ఒక్క ఆరాధ్యుడైన అల్లాహ్ (సు.తా.)ను విశ్వసించి సత్కార్యాలు చేసేవారు మరియు అల్లాహ్ (సు.తా.) ఆదేశాలను పాటించేవారు, అల్లాహ్ (సు.తా.) నిషేధించిన వాటినుండి దూరంగా ఉండేవారు, కష్టకాలంలో సహనం వహించి, సత్యధర్మ ప్రచారం చేస్తూ ఉండేవారు.

## 104. సూరహ్ అల్-హుమ'జహ్

## سُورَةُ الهُمَزَةِ

అల్-హుమ'జహ్: **అపనిందలు, అపవాదాలు** మోపేవాడు, The Slanderer. ఇది దైవప్రవక్త ('స'అస) ప్రవక్తగా ఎన్నుకోబడిన దాదాపు మూడు సంవత్సరాల తరువాత, సూరహ్ అల్-ఖియామహ్ (75) తరువాత **మక్కా**లో అవతరింపజేయబడింది. ఇందులో **9 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

وَيْلٌ لِّكُلِّ هُمَزَةٍ لُّمَزَةٍ ۝١

**1. అపనిందలు** మోపే, చాడీలు చెప్పే ప్రతి ఒక్కడికీ వినాశం తప్పదు.[1]

ٱلَّذِى جَمَعَ مَالًا وَعَدَّدَهُۥ ۝٢

**2.** ఎవడైతే ధనాన్ని కూడబెట్టి, మాటి మాటికి దాన్ని లెక్కబెడుతూ ఉంటాడో![2]

يَحْسَبُ أَنَّ مَالَهُۥٓ أَخْلَدَهُۥ ۝٣

**3.** తన ధనం, తనను శాశ్వతంగా ఉంచుతుందని అతడు భావిస్తున్నాడు![3]

كَلَّا ۖ لَيُنۢبَذَنَّ فِى ٱلْحُطَمَةِ ۝٤

**4.** ఎంతమాత్రం కాదు! అతడు (రాబోయే జీవితంలో) తప్పకుండా అణగద్రొక్కబడే నరకాగ్నిలో వేయబడతాడు.[4]

---

**1.** హుమ'జహ్ మరియు లుమ'జహ్ : కొందరి అభిప్రాయంలో ఒకే అర్థం గలవి. మరి కొందరు వాటి మధ్య భేదం చూపుతారు. హుమ'జహ్-అంటే ముఖం మీద అపనిందలు చేసేవారు. లుమ'జహ్ - అంటే వీపు వెనుక చాడీలు చెప్పేవారు. మరికొందరు హుమ'జహ్ - అంటే కండ్ల సైగలతో, చేతి సైగలతో దూషించటం మరియు లుమ'జహ్ - అంటే నోటి మాటలతో దూషించటం, అని అంటారు.

**2.** అంటే 'జకాత్ మరియు 'సదఖాత్ ఇవ్వకుండా ఉంటాడో!

**3.** అ'ఖ్లదహ్: అంటే అది అతనిని మరణించకుండా చేస్తుందని భావిస్తాడు.

**4.** అల్-'హు'తమతు: నరకాగ్ని పేర్లలో ఒకటి. చూడండి, 15:43-44. ముక్కలు ముక్కలుగా చేసేది.

وَمَآ أَدۡرَىٰكَ مَا ٱلۡحُطَمَةُ ٥

5. ఆ (అణగద్రొక్కబడే) నరకాగ్ని అంటే ఏమిటో నీకు తెలుసా?[1]

نَارُ ٱللَّهِ ٱلۡمُوقَدَةُ ٦

6. అల్లాహ్, తీవ్రంగా ప్రజ్వలింపజేసిన అగ్ని;

ٱلَّتِي تَطَّلِعُ عَلَى ٱلۡأَفۡـِٔدَةِ ٧

7. అది గుండెల దాకా చేరుకుంటుంది.

إِنَّهَا عَلَيۡهِم مُّؤۡصَدَةٞ ٨

8. నిశ్చయంగా, అది వారి మీద క్రమ్ముకొంటుంది;[2]

فِي عَمَدٖ مُّمَدَّدَةِۭ ٩

9. పొడుగాటి (అగ్ని) స్తంభాలవలె!

*****

1. ఆ అగ్ని ఎంతో భయంకరమైనది. దాని తీవ్రతను మీ బుద్ధి అర్థంచేసుకోజాలదు.

2. ముఅ''సదతున్: క్రమ్ముకొను. ఆ నరకపు ద్వారాలు మూయబడి ఉంటాయి. ఎవ్వరూ దాని నుండి బయటపడలేరు.

## 105. సూరహ్ అల్-ఫీల్

## سُورَةُ الفِيلِ

అల్-ఫీల్: The Elephant, ఏనుగు, దీనిపేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. యమన్ యొక్క అబిసీనియా రాజప్రతినిధి (Abyssinia's Viceroy of Yaman) అబ్రాహా (Abraha), క్రైస్తవ మతస్థుడు. అతడు 570 క్రీస్తు శకంలో మక్కాలోని కాబాను పడగొట్టే ఉద్దేశ్యంతో పెద్ద సైన్యం తీసుకొని, ఒక ఏనుగు పై ఎక్కి వస్తాడు. మక్కాకొంత దూరంలో ఉండగా అతని ఏనుగు మక్కా వైపు పోకుండా ఆగిపోతుంది. ఆ తరువాత ఒక పక్షుల దండు వచ్చి, చిన్నచిన్న మట్టితో చేసి కాల్చిన కంకర రాళ్ళను వారిపై కురిపిస్తుంది. దానితో చాలా మంది సైనికులు మరణిస్తారు. సైన్యమంతా చెల్లాచెదరై పోతుంది. అబ్రాహా వెనుదిరిగి పోతూ మధ్య మార్గంలోనే మరణిస్తాడు. ఆ కాలంలో అబ్దుల్ ము'త్తలిబ్ - దైవప్రవక్త ('స'అస) తాత - మక్కా ఖురైషుల నాయకులుగా ఉంటారు. అదే సంవత్సరంలో దైవప్రవక్త ('స'అస) జన్మిస్తారు. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఇందులో **5 ఆయతులు** ఉన్నాయి.

బِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

أَلَمْ تَرَ كَيْفَ فَعَلَ رَبُّكَ بِأَصْحَٰبِ ٱلْفِيلِ ﴿١﴾

**1**. ఏమీ? **ఏనుగు** వారి (సైన్యం)తో నీ ప్రభువు ఎలా వ్యవహరించాడో నీకు తెలియదా?

أَلَمْ يَجْعَلْ كَيْدَهُمْ فِى تَضْلِيلٍ ﴿٢﴾

**2**. ఏమీ? ఆయన వారి కుట్రను భంగం చేయలేదా?[1]

وَأَرْسَلَ عَلَيْهِمْ طَيْرًا أَبَابِيلَ ﴿٣﴾

**3**. మరియు ఆయన వారిపైకి పక్షుల గుంపులను పంపాడు;

تَرْمِيهِم بِحِجَارَةٍ مِّن سِجِّيلٍ ﴿٤﴾

**4**. అవి (ఆ పక్షులు) వారి మీద మట్టితో చేసి కాల్చిన కంకర రాళ్ళను (సిజ్జీల్)[2] విసురుతూ పోయాయి;

فَجَعَلَهُمْ كَعَصْفٍ مَّأْكُولٍۭ ﴿٥﴾

**5**. ఆ విధంగా ఆయన వారిని (పశువులు) తినివేసిన పొట్టుగా మార్చివేశాడు.

*****

---

**1**. అంటే కాబాను పడగొట్టాలనే వారి కుట్రను భంగం చేయలేదా? అని.

**2**. చూడండి, 11:82.

## 106. సూరహ్ ఖురైష్

## سُورَةُ قُرَيْشٍ

ఖురైష్: మక్కాలోని ఒక పెద్ద తెగ పేరు. దైవప్రవక్త (స'అస) ఈ తెగకే చెందినవారు. ఈ సూరహ్ మరొక పేరు సూరహ్ **అల్-ఈలాఫ్**. ఇది మొదటి **మక్కా** కాలపు సూరహ్. దీని పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. సూరహ్ అల్-ఫీల్ మరియు సూరహ్ ఖురైష్ ఒకే సూరహ్ అని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. ఇందులో **4 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

لِإِيلَٰفِ قُرَيْشٍ ١

**1**. (అల్లాహ్ రక్షణ మరియు ఆయన కరుణతో) **ఖురైషులు** (ప్రయాణాలకు) అలవాటుపడ్డారు.

إِۦلَٰفِهِمْ رِحْلَةَ ٱلشِّتَآءِ وَٱلصَّيْفِ ٢

**2**. (అల్లాహ్ కరుణ మరియు ఆయన రక్షణతో) వారు శీతకాలపు మరియు వేసవి కాలపు ప్రయాణాలు చేయగలుగుతున్నారు.[1]

فَلْيَعْبُدُوا۟ رَبَّ هَٰذَا ٱلْبَيْتِ ٣

**3**. కావున వారు ఈ ఆలయ (కా'బా) ప్రభువును (అల్లాహ్‌ను) మాత్రమే ఆరాధించాలి![2]

ٱلَّذِىٓ أَطْعَمَهُم مِّن جُوعٍ وَءَامَنَهُم مِّنْ خَوْفٍۭ ٤

**4**. వారు ఆకలితో ఉన్నప్పుడు ఆయనే వారికి ఆహారం ఇచ్చాడు మరియు ఆయనే వారిని భయం (ప్రమాదం) నుండి కాపాడాడు.[3]

*****

**1** . *ఈలాఫున్:* అలవాటుపడటం. ఖురైషుల ముఖ్య వృత్తి వ్యాపారం. వారు సీతాకాలంలో యమన్‌కు మరియు వేసవి కాలంలో సిరియాకు వ్యాపారానికి పోయేవారు. వారు కా'బా నిర్వాహకులు కావటంవల్ల వారి వాణిజ్య బృందాలు ఎలాంటి ఆటంకం, అపాయం లేకుండా ప్రయాణం చేయగలిగేవి.

**2**. చూడండి, 2:125. అంటే ఒకే ఒక్క ఆరాధ్యుడు అయిన అల్లాహ్ (సు.తా.) వారిని సురక్షితంగా వ్యాపారం చేయనిచ్చినందుకు వారు ఆయనను మాత్రమే ఆరాధించాలి, బహుదైవారాధనను త్యజించాలి.

**3**. వారిని ప్రమాదం నుండి కాపాడేవాడు మరియు వారిని పోషించేవాడు కేవలం అల్లాహ్ (సు.తా.) మాత్రమే కానీ - వారు పూజించే నిస్సహాయులైన - విగ్రహాలు గానీ, ఇతర కల్పిత దైవాలు గానీ కావు. కనుక వారు వాటి ఆరాధనను మానుకోవాలి. ఇంకా చూడండి, 2:126.

## 107. సూరహ్ అల్-మాʼఊన్

## سُورَةُ المَــاعُون

అల్-మాʼఊన్ : ఉపకారం, సహాయం, తోడ్పాటు, Assistance, మొదటి మక్కా కాలపు ఈ సూరహ్ పేరు **7**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. దీని ఇతర పేర్లు సూరహ్ **అద్-దీన్**, **అరఅʻయ్‌త** లేక **అల్-యతీమ్** (ఫ్ʼత్హ్ అల్-ఖదీర్). బహుశా ఇది సూరహ్ అత్-తకాసుʻర్(102) తరువాత అవతరింపజేయబడింది. ఇందులో**7 ఆయతులు**న్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1**. తీర్పుదినాన్ని తిరస్కరించే వ్యక్తిని నీవు చూశావా?[1]

أَرَءَيۡتَ ٱلَّذِي يُكَذِّبُ بِٱلدِّينِ ١

**2**. అతడే అనాథులను కసరికొట్టే వాడు;[2]

فَذَٰلِكَ ٱلَّذِي يَدُعُّ ٱلۡيَتِيمَ ٢

**3**. మరియు పేదవాళ్ళకు అన్నం పెట్టమని ప్రోత్సహించని వాడు.

وَلَا يَحُضُّ عَلَىٰ طَعَامِ ٱلۡمِسۡكِينِ ٣

**4**. కావున, నమాʼజ్ చేసే, (ఇటువంటి) వారికి వినాశం తప్పదు![3]

فَوَيۡلٞ لِّلۡمُصَلِّينَ ٤

**5**. ఎవరైతే తమ నమాʼజ్‌ల పట్ల అశ్రద్ధ వహిస్తారో![4]

ٱلَّذِينَ هُمۡ عَن صَلَاتِهِمۡ سَاهُونَ ٥

**6**. ఎవరైతే ప్రదర్శనా బుద్ధితో వ్యవహరిస్తారో (నమాʼజ్ సలుపుతారో)![5]

ٱلَّذِينَ هُمۡ يُرَآءُونَ ٦

**7**. మరియు (ప్రజలకు) **సామాన్య ఉపకారం** (సహాయం) కూడా నిరాకరిస్తారో![6] *****

وَيَمۡنَعُونَ ٱلۡمَاعُونَ ٧

---

**1**. ఈ ఆయత్ దైవప్రవక్త(ʼసʼఅస)ను సంబోధిస్తోంది. దీన్-అంటే పునరుత్థాన(తీర్పు)దినం. చూడండి, 109:6.

**2** . ఎందుకంటే అతడు పిసినారి, తీర్పుదినాన్ని విశ్వసించని వాడు మరియు ఇహలోకంలో చేసిన పుణ్యాలకు పరలోకంలో లభించే ప్రతిఫలాన్ని విశ్వసించని వాడు.

**3**. అనాథులను కసరి కొట్టే వారికి, ఆకలిగొన్న పేదలకు అన్నం పెట్టని వారికి, నమాʼజ్ చేయని వారికి ʻవైల్ʼ అనే నరకమే నివాసస్థల మవుతుంది. ఎందుకంటే వారు కపట విశ్వాసులు, హృదయపూర్వకంగా కాక ఇతరులకు చూపటానికే నమాʼజ్ చేసేవారు.

**4**. ఇలాంటి వారు అసలు నమాʼజ్ చేయరు. ఒకవేళ చేసినా అశ్రద్ధతో చేస్తారు, నిర్ణీత సమయంలో చేయరు. భయభక్తులతో నమాʼజ్ చేయరు. చూడండి, 4:142.

**5**. అంటే ఇతరులతో ఉన్నప్పుడు వారి మెప్పు పొందటానికి నమాʼజ్ చేస్తారు. ఏకాంతంలో ఉంటే నమాʼజ్‌ను వదలిపెడతారు.

**6**. మʼఅనున్*:* అంటే కొద్దిపాటి సామాన్య చిన్న చిన్న సహాయాలు. ఇంట్లోవాడే వస్తువులను ఒకరి కొకరు ఇచ్చుకోవటం. చిన్న చిన్న సహాయాలు చేసుకోవటం.

## 108. సూరహ్ అల్-కౌస'ర్

## سُورَةُ الكَوثَرِ

అల్-కౌస'ర్: అంటే అధికం, Good in Abundance, పుష్కలత్వం, సమృద్ధి. ఈ సూరహ్ మరొక పేరు సూరహ్ **అన్-న'హ్ర్.** చాలామంది ఇది మొదటి **మక్కా** కాలపు సూరహ్ అని అంటారు. దీనిపేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇందులో **3 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

إِنَّآ أَعْطَيْنَٰكَ ٱلْكَوْثَرَ ﴿١﴾

**1.** (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా, మేము నీకు కౌస'ర్[1] ప్రసాదించాము.

فَصَلِّ لِرَبِّكَ وَٱنْحَرْ ﴿٢﴾

**2.** కనుక, నీవు నీ ప్రభువు కొరకే నమా'జ్ చెయ్యి మరియు బలి (ఖుర్బానీ) కూడా (ఆయన కొరకే) ఇవ్వు![2]

إِنَّ شَانِئَكَ هُوَ ٱلْأَبْتَرُ ﴿٣﴾

**3.** నిశ్చయంగా నీ శత్రువు, వాడే! వేరు తెగినవాడిగా (వారసుడూ, పేరూ లేకుండా) అయిపోతాడు.[3]

*****

---

**1.** కౌస'రున్: అంటే అధికం. ఇబ్నె-కసీ'ర్ ఇక్కడ: 'ఖైరున్ కసీ'రున్ - అత్యధికమైన మేలు - అనే అర్థానికి ప్రాధాన్యత నిచ్చారు. 'స'హీ'హ్ 'హదీస్'లో - కౌస'ర్ - అనేది స్వర్గంలో దైవప్రవక్తకు ప్రసాదించబడే ఒక సెలయేరు, అని చెప్పబడింది. మరి కొందరు అదొక సరోవరం అన్నారు. 'ఖైరున్ కసీ'రున్ అనేపదం వీటన్నిటినీ సూచిస్తుందని ఇబ్నె-కసీ'ర్ అంటారు.

**2.** నమాజ్ మరియు బలి (ఖుర్బానీ) ఆ ఒకేఒక్క ఆరాధ్యుడు అల్లాహ్ (సు.తా.) కొరకే చేయాలి. న'హ్ర్ - అంటే ఒంటె మెడలో కత్తి పొడిచి దాని రక్తనాళం కోయటం. వేరే పశువులను భూమి మీద పడవేసి వాటి మెడ రక్తనాళాలను కోస్తారు. దీనిని - జిబ'హా - అంటారు. ఇక్కడ న'హ్ర్, బలి (ఖుర్బాని) అంటే 'హజ్జ్ లేక 'ఈద్-అ'ద్ధుహా సందర్భంగా లేక 'సదఖ - దానం - కొరకు చేసే జి'బ'హాలు కూడా.

**3.** అబ్‌తరు: అంటే, వారసుడు లేకుండా మరియు పేరు ప్రతిష్ఠలు లేకుండా అయిపోవటం. అతని వెంటనే అతని వంశం అంతమవటం లేక అతని పేరు తీసుకొనేవాడు ఎవ్వడూ లేకపోవటం. దైవప్రవక్త ('స'అస)కు మగ సంతానం బ్రతికి లేనందుకు అతని ('స'అస) విరోధులు అతనిని ('స'అసను) అబ్‌తర్ అని ఎత్తి పొడిచేవారు. అప్పుడు అల్లాహ్ (సు.తా.) ఈ ఆయత్ అవతరింపజేశాడు. మరియు అది నిజమని నిరూపించాడు.

## 109. సూరహ్ అల్-కాఫిరూన్

## سُورَةُ الكَافِرُونَ

అల్-కాఫిరూన్: **సత్యతిరస్కారులు**. Deniers of the Truth, The Disbelievers. ఈ సూరహ్ పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది, సూరహ్ అల్-మా'ఊన్ (107) తరువాత, మొదటి **మక్కా** కాలంలో అవతరింపజేయబడింది. సత్యధర్మ విషయంలో సమాధానపడటం / రాజీపడటం విశ్వాసులకు తగని పని. ధర్మ విషయంలో కొంతవరకు రాజీపడమని, మక్కా ముష్రికులు దైవప్రవక్త('స'అస)తో అన్నప్పుడు ఈ సూరహ్ అవతరింపజేయబడింది. 'స'హీ'హ్ 'హదీస్'ల ప్రకారం కా'బా 'తవాఫ్ తరువాత చేసే రెండు రక'ఆత్‌లలో, ఫ'జ్ర్ మరియు మ'గ్రిబ్ సున్నత్‌లలో దైవప్రవక్త ('స'అస) ఈ సూరహ్ (109), మరియు సూరహ్ అల్-ఇ'ఖ్లా'స్ (112) పఠించే వారు. అంతేకాదు అతను ('స'అస) తమ అనుచరులకు: "మీరు రాత్రి నిద్రపోయే ముందు ఈ సూరహ్ చదివితే షిర్క్‌నుండి దూరమవుతారు." అని, కూడా ప్రబోధించారు. (ముస్నద్ అ'హ్మద్-5/456, తిర్మిజీ'-3403, అబూ-దావూద్-5055 మొదలైనవి). ఇందులో **6 ఆయతులు** ఉన్నాయి.

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**1**. ఇలా అను: "ఓ సత్యతిరస్కారులారా!

قُلْ يَٰٓأَيُّهَا ٱلْكَٰفِرُونَ ١

**2**. "మీరు ఆరాధిస్తున్న వాటిని నేను ఆరాధించను.

لَآ أَعْبُدُ مَا تَعْبُدُونَ ٢

**3**. "మరియు నేను ఆరాధిస్తున్న ఆయనను (అల్లాహ్‌ను) మీరు ఆరాధించే వారు కారు.

وَلَآ أَنتُمْ عَٰبِدُونَ مَآ أَعْبُدُ ٣

**4**. "మరియు మీరు ఆరాధిస్తున్న వాటిని నేను ఆరాధించేవాణ్ణి కాను.

وَلَآ أَنَا۠ عَابِدٌ مَّا عَبَدتُّمْ ٤

**5**. "మరియు నేను ఆరాధిస్తున్న ఆయనను మీరు ఆరాధించే వారు కారు.

وَلَآ أَنتُمْ عَٰبِدُونَ مَآ أَعْبُدُ ٥

**6**. "మీ ధర్మం మీకూ మరియు నా ధర్మం నాకు!"[1]

لَكُمْ دِينُكُمْ وَلِىَ دِينِ ٦

*****

**1**. మీరు మీ ధర్మాన్ని వదలటానికి సిద్ధంగా లేనప్పుడు! నేను నా సత్యధర్మాన్ని ఎందుకు వదలాలి? చూడండి, 28:55.

## 110. సూరహ్ అన్-న'స్ర్

## سُورَةُ النِّصْرِ

అన్-న'స్ర్: Help, Succour, **సహాయం**, విజయం, తోడ్పాటు. ఈ సూరహ్ పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది దైవప్రవక్త నిర్యాణానికి కొన్ని వారాలముందు, చిట్టచివర అవతరింపజేయబడిన **మదీనా** సూరహ్. ఇది పదవ హిజ్రీలో అవతరింపజేయబడింది. ('స'హీ'హ్ ముస్లిం). ఇందులో **3 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

إِذَا جَآءَ نَصْرُ ٱللَّهِ وَٱلْفَتْحُ ۝١

**1.** (ఓ ము'హమ్మద్!) ఎప్పుడైతే అల్లాహ్ **సహాయం** వస్తుందో మరియు విజయం (లభిస్తుందో)!

وَرَأَيْتَ ٱلنَّاسَ يَدْخُلُونَ فِى دِينِ ٱللَّهِ أَفْوَاجًا ۝٢

**2.** మరియు నీవు ప్రజలను గుంపులు గుంపులుగా అల్లాహ్ ధర్మం (ఇస్లాం)లో ప్రవేశించడం చూస్తావో![1]

فَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ وَٱسْتَغْفِرْهُ ۚ إِنَّهُۥ كَانَ تَوَّابًۢا ۝٣

**3.** అప్పుడు నీవు నీ ప్రభువు స్తోత్రంతో పాటు ఆయన పవిత్రతను కొనియాడు మరియు ఆయన క్షమాభిక్షను అర్థించు. నిశ్చయంగా, ఆయనే పశ్చాత్తాపాన్ని అంగీకరించేవాడు.[2]

*****

**1.** చూడండి, 3:19.

**2.** అంటే నీ ధర్మ ప్రచారం ముగిసే సమయం వచ్చిందనుకో! కాబట్టి నీవు నీ ప్రభువు పవిత్రతను కొనియాడటంలో మరియు ఆయన స్తోత్రంచేయటంలో మునిగిఉండు. ప్రతివాడు తన జీవితపు చివరి దినాలలో, వృద్ధాప్యంలో వీలైనంతవరకు ప్రభువు ధ్యానంలో మునిగి ఉండటం ఉత్తమమని, దీని సందేశము.

## 111. సూరహ్ అల్-మసద్

## سُورَةُ المَسَدِ

అల్-మసద్: The Palm Fibre, ఖర్జూరపు నార, **5 ఆయతులు** గల ఈ సూరహ్ మొదటి **మక్కా** కాలానికి చెందింది. బహుశా అవతరణలో ఆరవది. దీనిపేరు **5**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. దీని ఇతర పేర్లు సూరహ్ **అల్-లహబ్** (అగ్ని జ్వాలలు) మరియు సూరహ్ **తబ్బత్** (నాశనమగుట). దీని అవతరణ గురించి ఈ 'హదీస్' ఉంది: దైవప్రవక్త ('స'అస)కు తన దగ్గరి వారికి ఇస్లాం ధర్మప్రచారం చేయటానికి ఆజ్ఞ దొరికిన తరువాత, అతను 'సఫా గుట్టపైకి ఎక్కి: "యా 'సబా'హా!" అంటారు. ఆ కాలంలో ఏదైన ఆపద వస్తే ఇలా అరిచేవారు. అప్పుడు అందరూ అక్కడ సమావేశమవుతారు. అప్పుడతను అంటారు: "ఓ మక్కా వాసులారా: 'ఈ గుట్ట వెనుక ఒక గుర్రాల సైన్యం మీపై దాడి చేయటానికి సిద్ధంగా ఉంది.' అని, నేను అంటే మీరు నమ్ముతారా?" దానికి వారంటారు: "ఎందుకు నమ్మము. నీవు సదా సత్యమే పలికావు!" అతను అంటారు: "అయితే వినండి! ఒకవేళ మీరు షిర్క్ మరియు కుఫ్ర్ విడువకుంటే మీపై ఘోరశిక్ష పడనున్నదని మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను." అది విని అబూ-లహబ్ అంటాడు: "నీవు నాశనమైపో (తబ్బన్‌లక)! దీనికేనా నీవు మమ్మల్ని ఇక్కడ జమచేసింది?" అప్పుడు ఈ సూరహ్ అవతరింపజేయబడుతుంది, ('స'హీ'హ్ బు'ఖారీ). అబూ-లహబ్ అసలు పేరు అబ్దుల్-ఉ'జ్జా! తన ఎర్రని రంగురూపుల వల్ల అబూ-లహబ్ అనే మారు పేరుతో పిలవబడ్డాడు. ఇతడు దైవప్రవక్త ('స'అస) పినాన్న. అతని భార్య పేరు ఉమ్మె-జమీల్ బిన్తె 'హర్బ్. వీరిద్దరు అతని ('స'అస) యొక్క క్రూరమైన విరోధులు.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

تَبَّتْ يَدَآ أَبِي لَهَبٍ وَتَبَّ ﴿١﴾

**1**. అబూ-లహబ్ రెండు చేతులూ నశించు గాక మరియు అతడు కూడా నశించిపోవు గాక![1]

مَآ أَغْنَىٰ عَنْهُ مَالُهُۥ وَمَا كَسَبَ ﴿٢﴾

**2**. అతని ధనం మరియు అతని సంపాదన (సంతానం) అతనికి ఏ మాత్రం పనికిరావు!

---

**1**. యదా: రెండు చేతులు. అంటే అతడు స్వయంగా! దైవప్రవక్త ('స'అస)ను దూషించినందుకు, అతడు ఈ శాపానికి గురిఅయ్యాడు. ఫలితంగా అతడు బద్ర్ యుద్ధం జరిగిన కొన్నాళ్ళకే భయంకరమైన వ్యాధికి గురిఅయ్యి చనిపోయాడు. అతని కుమారులు మూడు రోజుల తరువాత అతని శవాన్ని దూరం నుండియే మన్నుపోసి పాతారు.

سَيَصۡلَىٰ نَارٗا ذَاتَ لَهَبٖ ۝٣

3. అతడు ప్రజ్వలించే నరకాగ్నిలో కాల్చబడతాడు!

وَٱمۡرَأَتُهُۥ حَمَّالَةَ ٱلۡحَطَبِ ۝٤

4. మరియు అతని భార్య కూడా! కట్టెలు మోసే (చాడీలు చెప్పి కలహాలు రేకెత్తించే) స్త్రీ![1]

فِي جِيدِهَا حَبۡلٞ مِّن مَّسَدِۭ ۝٥

5. ఆమె మెడలో బాగా పేనిన ఖర్జూరపు నార త్రాడు (మసద్) ఉంటుంది.[2]

*****

1. ఆమె దైవప్రవక్త (స'అస) బాటలో ముండ్లు వేసేది. అతనికి విరుద్ధంగా చాడీలు చెప్పేది.

2. జీదున్: మెడ. మసదున్: బాగాపేనిన గట్టిత్రాడు.

## 112. సూరహ్ అల్-ఇ'ఖ్లా'స్ سُورَةُ الإِخْلَاصِ

అల్-ఇ'ఖ్లా'స్: The Purity, **దృఢ విశ్వాసం.** దీని మరో పేరు సూరహ్ **అత్-తౌ'హీద్** - Unity, **ఏక దైవత్వం.** దీనిపేరు దీని తాత్పర్యం నుండి తీసుకోబడింది. ఈ సూరహ్ ఖుర్ఆన్ యొక్క సారం అనబడుతుంది. దైవప్రవక్త ('స'అస) దీనిని 1/3 ఖుర్ఆన్ అన్నారు. ఈ సూరహ్‌ను రాత్రిపూట చదవమని ప్రోత్సహించారు. ('స'హీ'హ్ బు'ఖారీ). ముష్రికులు దైవప్రవక్త ('స'అస)ను నీ **ప్రభువు లక్షణాలు** చెప్పమని ప్రశ్నించినప్పుడు ఈ సూరహ్ అవతరింపజేయబడింది (ముస్నద్ అ'హ్మద్ 5/133-134). ఈ సూరహ్ మొదటి **మక్కా** కాలంలో అవతరింపజేయబడింది. కొందరు 'స'హాబీలు ప్రతి రక'అత్‌లో ఇతర సూరాహ్‌ల తరువాత ఈ సూరహ్‌ను చదివే వారు. దానికి దైవప్రవక్త ('స'అస) అన్నారు: "ఈ సూరహ్ పట్ల మీ ప్రేమ మిమ్మల్ని స్వర్గంలో ప్రవేశింపజేస్తుంది." (బు'ఖారీ, ముస్లిం). ఇందులో **4 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

قُلْ هُوَ ٱللَّهُ أَحَدٌ ﴿١﴾

**1.** ఇలా అను: "ఆయనే అల్లాహ్! ఏకైకుడు.[1]

ٱللَّهُ ٱلصَّمَدُ ﴿٢﴾

**2.** "అల్లాహ్! ఎవరి అక్కరా లేనివాడు.[2]

لَمْ يَلِدْ وَلَمْ يُولَدْ ﴿٣﴾

**3.** "ఆయనకు సంతానంలేదు (బిడ్డలను కనడు) మరియు ఆయన కూడా ఎవరి సంతానమూ (ఎవరికీ జన్మించిన వాడునూ) కాడు.

وَلَمْ يَكُن لَّهُۥ كُفُوًا أَحَدٌۢ ﴿٤﴾

**4.** "మరియు (సర్వలోకాలలో) ఆయనతో పోల్చదగినది ఏదీ లేదు."[3]

---

**1.** అ'హదున్: The One and Alone, ఏకైకుడు.

**2.** అ'స్సమదు: Absolute, Eternal, Besought of All, to Whom obedience is rendered. Without whom no affair is accomplished. సమస్త వ్యవహారాలు తన మీదనే ఆధారపడి ఉన్నవాడు, నిత్యుడు, శాశ్వితుడు, నిరంతరుడు. అందరూ ఆయనపై ఆధారపడి ఉన్నారు. ఆయనకు ఎవ్వరి అక్కర లేదు. ఆయన నిరపేక్షాపరుడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

**3.** లైస క మిస్'లిహీ షయ్'ఉన్' 42:11. ఒక 'హదీస్'ఖుద్సీ: "మానవుడు నన్ను దూషిస్తాడు, అంటే నాకు సంతానాన్నిఅంటగడతాడు. వాస్తవానికి నేను, ఒక్కడను, అద్వితీయుడను. ఎవరి అక్కరలేనివాడను, నేనెవ్వరినీ కనలేదు మరియు నేను కూడా ఎవ్వరికీ పుట్టలేదు. నాకు సరిసమానమైనవాడుగానీ నాతో పోల్చదగినవాడుగానీ ఎవ్వడూలేడు," ('స.బు'ఖారీ).

## 113. సూరహ్ అల్-ఫలఖ్

## سُورَةُ الفَلَقِ

అల్-ఫలఖ్: The Day Break, 'సుబ్'హున్, **ఉదయం**, ప్రభాతం, వేకువజాము, తెల్లవారుజాము **అరుణోదయం**. ఇది మొదటి **మక్కా** కాలపు సూరహ్. ఈ సూరహ్(113) మరియు దీని తరువాత సూరహ్ అన్-నాస్(114)ల యొక్క ఘనతలు ఎన్నో 'హదీస్'లలో పేర్కొనబడ్డాయి. దైవప్రవక్త ('స'అస) అన్నారు: "ఈ రాత్రి నాపై కొన్ని ఆయతులు అవతరింపజేయబడ్డాయి. ఇటువంటి వాటిని నేను ఎన్నడూ చూడలేదు." ఆ తరువాత అతను ఈ రెండు సూరాహ్‌లు పఠించారు ('స. ముస్లిం, తిర్మిజీ'). దైవప్రవక్త ('స'అస) మానవుల మరియు జిన్నాతుల దిష్టినుండి శరణుకోరేవారు. ఈ రెండు సూరాహ్‌లు అవతరింపజేయబడిన తరువాత అతను వీటిని నిత్యం చదివేవారు, (తిర్మిజీ', అల్బానీ - ప్రమాణీకం నం.2150). 'ఆయి'షహ్ (ర. 'అన్హా) కథనం: అతనికి ఏదైనా కష్టం కలిగితే, ము'ఊజ'తేన్ (అల్-ఫలఖ్, అన్-నాస్) సూరాహ్‌లు చదివి తమ దేహంపై ఊదుకునే వారు. అతని కష్టం అధికమైతే నేను ఈ సూరాహ్‌లు చదివి నా చేతులను అతని శరీరం మీద పోనిచ్చే దానిని. (బు'ఖారీ, ముస్లిం). ఇందులో **5 ఆయతులు** ఉన్నాయి.

దైవప్రవక్త ('స'అస)కు చేతబడి చేసినప్పుడు జిబ్రీల్ ('అ.స.) వచ్చి అతనితో ఈ రెండు సూరాహ్‌లు చదవమన్నారు. దానితో, ఆ చేతబడి ప్రభావం దూరమయ్యింది ('స.బు'ఖారీ, ముస్లిం). దైవప్రవక్త ('స'అస) ప్రతి రోజూ రాత్రి నిద్రపోక ముందు సూ. అల్-ఇ'ఖ్లా'స్ (112) మరియు ఈ రెండు సూరాహ్‌లు చదివి తమ అరచేతులపై ఊది, వాటితో పూర్తి శరీరం మీద పూసుకునేవారు. మొదట నెత్తి, తరువాత ముఖం, ఆ తరువాత శరీర భాగమంతా. ('స'హీ'హ్ బు'ఖారీ).

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

1. ఇలా అను: "నేను **ఉదయకాలపు** ప్రభువు అయిన (అల్లాహ్) శరణు వేడుకుంటున్నాను.

قُلْ أَعُوذُ بِرَبِّ ٱلْفَلَقِ ١

2. "ఆయన సృష్టించిన ప్రతిదాని కీడు నుండి;[1]

مِن شَرِّ مَا خَلَقَ ٢

---

**1**. ఇక్కడ ప్రతి రకపు కీడునుండి శరణు కోరబడుతోంది. షైతానుల నుండి, నరకం నుండి మరియు మానవునికి హాని కలిగించే ప్రతిదాని నుండి.

وَمِن شَرِّ غَاسِقٍ إِذَا وَقَبَ ٣

3. "మరియు చిమ్మ చీకటి కీడునుండి, ఎప్పుడైతే అది క్రమ్ముకుంటుందో![1]

وَمِن شَرِّ ٱلنَّفَّٰثَٰتِ فِى ٱلْعُقَدِ ٤

4."మరియు ముడుల మీద మంత్రించి ఊదే వారి కీడు నుండి;[2]

وَمِن شَرِّ حَاسِدٍ إِذَا حَسَدَ ٥

5. "మరియు అసూయపరుడి కీడు నుండి, ఎప్పుడైతే అతడు అసూయపడతాడో!"[3]

*****

1. ఎందుకంటే చీకటిలోనే హానికరమైన జంతువులు, పాములు, తేళ్ళు బయటికి వస్తాయి. నేరస్థులు రాత్రిలోనే నేరాలు చేస్తారు. ఇక్కడ ఈ విధమైన అన్ని కీడుల నుండి శరణు కోరబడుతోంది.

2. అన్-నఫ్ఫాసా'తి: అంటే ముడుల మీద మంత్రించి ఊదేవారి కీడు నుండి.

3. 'హాసిదిన్: అసూయపడే వాడి కీడునుండి కూడా శరణుకోరబడుతోంది.

## 114. సూరహ్ అన్-నాస్ سُورَةُ النَّاسِ

అన్-నాస్: Mankind, **మానవులు**, జనులు. సూరహ్ అల్-ఫలఖ్ (113)తో పాటు, ఈ సూరహ్ **మక్కాలో** అవతరింపజేయబడింది. మానవుని హృదయంలో ఉండే కీడు నుండి మరియు ఇతరుల హృదయాలలో ఉండే కీడు నుండి శరణుకోరుకోమని ప్రబోధించబడింది. దీని ఘనత ఇంతకు ముందు సూరహ్‌లో పేర్కొనబడింది. ఒకసారి దైవప్రవక్త ('స'అస) నమా'జ్ చేస్తూ ఉండగా అతనికి తేలు కుట్టింది. నమా'జ్ పూర్తి చేసిన తరువాత అతను నీటిలో ఉప్పు కలిపి గాయం మీద పూస్తూ అల్-కాఫిరూన్ (109), అల్-ఇ'ఖ్లా'స్ (112) మరియు అన్-నాస్ (114) సూరాహ్‌లు చదివారు. (ముజమ్మ'అ అ'జ్జవాయి'ద్, 5/111). ఇందులో **6 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**1**. ఇలా అను: "నేను **మానవుల ప్రభువు** (అల్లాహ్)ను శరణుకై వేడుకుంటున్నాను![1]

قُلْ أَعُوذُ بِرَبِّ ٱلنَّاسِ ١

**2**. "మానవుల సార్వభౌముడు,[2]

مَلِكِ ٱلنَّاسِ ٢

**3**. "మానవుల ఆరాధ్య దైవం (అయిన అల్లాహ్ యొక్క శరణు)!

إِلَٰهِ ٱلنَّاسِ ٣

**4**. "కలతలు రేకెత్తించి తొలగిపోయే వాని కీడు నుండి;

مِن شَرِّ ٱلْوَسْوَاسِ ٱلْخَنَّاسِ ٤

---

**1**. రబ్బున్: పర్‌వర్‌దిగార్ (ఉర్దూలో), పోషకుడు, చాలా మట్టుకు తెలుగు అనువాదాలలో ఈ పదానికి **ప్రభువు** అని అనువాదం చేశారు. మానవుడు తన తల్లి గర్భంలో ఉన్నప్పటి నుండి వానిని సరిదిద్ది పోషిస్తాడు. మరియు అతని అంతిమ ఘడియ వరకు పోషిస్తాడు. కేవలం మానవుడే కాక సమస్త సృష్టికి కూడా పోషకుడు ఆయనే!

**2**. ఇటువంటి పోషకుడే వారి సార్వభౌముడు.

ٱلَّذِى يُوَسۡوِسُ فِى صُدُورِ ٱلنَّاسِ ۝٥

5. "ఎవడైతే మానవుల హృదయాలలో కలతలు రేకెత్తిస్తాడో![1]

مِنَ ٱلۡجِنَّةِ وَٱلنَّاسِ ۝٦

6. "వాడు జిన్నాతులలోని వాడూ కావచ్చు లేదా మానవులలోని వాడూ కావచ్చు!"[2]

*****

1. అల్-వస్‌వాసు: అంటే మెల్లని ధ్వనితో మాట్లాడటం, గుసగుసలాడటం. షైతాన్ కూడా మానవునికి తెలియకుండానే అతని హృదయంలో చెడ్డ ఆలోచనలు రేకెత్తిస్తాడు, ఇదే వస్‌వస.

అల్-ఖన్నాస్: నెమ్మదిగా జారుకునే వాడు, అంటే షైతాన్.

2. ఈ వస్‌వస - చేసేవారు రెండు రకాల వారు. **ఒకరు** జిన్నాతులలోని షైతానులు. అల్లాహ్ (సు.తా.) వాటికి మానవులను, మార్గభ్రష్టత్వంవైపుకు ఆకర్షించే యుక్తిని ఇచ్చాడు. ప్రతి మానవుని వెంట ఒక షైతాన్ ఉంటాడు. వాడు అతన్ని మార్గభ్రష్టత్వంవైపుకు ఆకర్షిస్తూ ఉంటాడు. ఈ మాట విని ఒక సహాబీ (రది.అ.) ఇలా అడిగారు: "ఓ ప్రవక్తా (స'అస) ఏమీ? మీతో పాటు కూడా ఒక షైతాన్ ఉన్నాడా?" అతను జవాబిచ్చారు: "అవును! ఉన్నాడు కాని, అల్లాహ్ (సు.తా.) నాకు వాడిపై ఆధిక్యతనిచ్చాడు అందుకని వాడు నాకు విధేయుడిగా ఉంటాడు. వాడు, నాకు మేలు తప్ప మరొక విషయాన్ని ప్రోత్సహించడు." (సహీహ్ ముస్లిం).

**రెండవ** రకమైన షైతాన్‌లు మానవులలో ఉన్నారు. వారు, తాము మంచి ఉపదేశం ఇస్తున్నామని చెబుతూ మానవులను మార్గభ్రష్టత్వం వైపుకు ఆకర్షిస్తూ ఉంటారు.

షైతాన్ మానవులనే కాక జిన్నాతులను కూడా మార్గభ్రష్టత్వం వైపుకు ఆకర్షిస్తూ ఉంటాడని మరి కొందరి అభిప్రాయం.